ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow

@mohanpublications




- శ్రీ అబ్బరాజు సూర్యనారాయణ

# ఆంధ్ర మహాభారత నిఘంటువు

# ఆంధ్ర
# మహాభారత నిఘంటువు

రచన :

అబ్బరాజు సూర్యనారాయణ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

# ముందు మాట

ఆయా యుగాల భాషావ్యవస్థ అవగాహన చేసుకోవడానికి ఆయాకవుల గ్రంథాలే ముఖ్యంగా శరణ్యాలు. ఆ గ్రంథాలు అధ్యయనం చేసినంత మాత్రాన వారు ఉపయోగించిన పలుకుబడుల వైవిధ్యం, వాటి విపరిణామాలు మనస్సులో నిలువవు. ఏ కవి ఏ పదం- ఏ ప్రత్యయం ఏ కాలంలో ఎలా ఉపయోగించినాడో, వాటి స్వరూపస్వభావాలు, ఆయా పదాలు భిన్న భిన్న యుగాలలో పొందుతూ వచ్చిన పరిణామాలు అసందిగ్ధంగా కళ్లకు గట్టినట్లు కన్పించాలె. అప్పుడుగాని సమగ్ర నిఘంటు రచనకు దారి దొరకదు. ఏ పదమూ నిఘంటువులోకి ఎక్కకుండా తప్పిపోయే ఏమరుపాటూ ఉండదు. ఈ దృష్టితోనే ప్రసిద్ధ కవుల కావ్యాలకు పద ప్రయోగ సూచికలు తయారుచేసే కార్యక్రమం అకాడమీ చేపట్టింది. ఇప్పటికే నన్నయ, తిక్కన, శ్రీనాథ, నన్నెచోడ పద ప్రయోగకోశాలు ప్రకటింపబడ్డవి.

ఏ పలుకుబడికి గాని, ఏ ప్రయోగ వైశిష్ట్యానికిగాని భారతం పరమ ప్రామాణికంగా గ్రహింపబడడం అనూచానంగా వస్తున్న ఆచారం. పూర్వం ఉండే సాహిత్యంలో స్థిరపడ్డ రూపాలు గ్రహిస్తూనే సమకాలీన మాండలిక రూపాలను కూడా వాడుకోవడంలో నన్నయ్య కంటె తిక్కన ఘనుడనిపిస్తాడు. పాతబడ్డ మాటలతోనైనా కొత్త పదబంధాలు సృష్టించడం, సంస్కృతంలో మాత్రమే ఒదుగుతాయనే భావాలు తెలుగు నుడికారంతో ఉదాత్తంగా చెప్పగలగడం తిక్కన విశిష్టత.

ఈ దృష్టితోనే శ్రీ అబ్బరాజు సూర్యనారాయణగారు ప్రధానంగా తిక్కన ప్రయోగాలు ప్రాతిపదిక చేసుకుని ఈ భారత

నిఘంటువు సిద్ధపరిచినారు. అయితే తిక్కన వాడని కేవలం నన్నయ ప్రయోగాలు, తిక్కన, నన్నయ వాడకుండా కేవలం ఎఱ్ఱాప్రగడ ప్రయోగించిన పదాలుకూడా ఆరోపాలుగా గ్రహించడంవల్ల ఈ నిఘంటువుకు సమగ్రత ఏర్పడింది. పదప్రయోగ కోశాలలో దేశ్య వైకృత పదాలకు సంస్కృత సమానాలలో క్రియలకూ మాత్రమే ఆరోపాలు గ్రహింపబడ్డవి. ఈ భారత నిఘంటువులో దేశ్యాలు, తత్సమాలతోబాటు సంస్కృత పదాలుకూడా అంటే కవిత్రయం వారు భారతంలో ఉపయోగించిన అన్ని పదాలూ ఇంచుమించు ఆరోపాలుగా గ్రహింపబడ్డవి. ఆరోపాలకు వివిధార్థాలైన అర్థచ్ఛాయలు వివరించి వాటికి ఉదాహరణలు చూపబడ్డవి. పాఠ, పాఠాంతరాలు గ్రహించటంలో ఇప్పటికి ప్రచురితమైన భారత ప్రతులు, సంస్కృత మూల గ్రంథాలుకూడా పరిశీలించడం జరిగింది.

ఇంతటి బృహత్తరమైన సారస్వతకృషి చేపట్టి ఒంటిచేత కడముట్ట నిర్వహించిన శ్రీ అబ్బరాజు సూర్యనారాయణగారు అభినందనీయులు. ఈ సంపుటంలో అ నుంచి ఔ వరకు పదాలు చేర్చబడ్డవి. హల్లులకు సంబంధించిన తర్వాత సంపుటం త్వరలో ప్రకటింప బడగలదని ఆశిస్తున్నాము.

28, జనవరి 1979.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పరిచయము

తొలుదొల్త భారతనిఘంటు రచనోద్దేశమును రచనా విధానమును గుఱించి ఆంధ్ర ప్రపంచమున కెఱుక చేసికొనుట కొంత యుక్తమని తలఁచి తెలుపుకొనుచున్నాను. గతానుగతికముగా నా స్వవిషయమును కొంత యిందు రావచ్చును. పండితలోకము నన్ను మన్నింతురుగాక! జననకాల విశేషమేమోగాని నాకును నా రెండవ అన్నగారగు వీరరాఘవయ్యగారికిని ఎనలేని అనుబంధము ఏర్పడినది. నా కూహ తెలిసియు తెలియని పూర్వమునుంచి ఆయనను శ్రీరామచంద్రుఁడు వలెఁ జూచుకొనుచుండెడి వాఁడను. నన్ను ఆయన శ్రీరామచంద్రుఁడు లక్ష్మణుని జూచుకొనునట్లు చూచుకొనెడివాఁడు. నన్ను లక్ష్మణా అని పిలిచి కౌఁగిలించుకొనెడివాఁడు. ఆయనకు నేను నిత్యము పాదాభివందనముచేసి పాదధూళి నా శిరస్సునఁ ధాల్చెడివాఁడను. కవితా గోష్ఠియందు సాహిత్య పరిశ్రమయందు ఆశుకవిత్వావధాన నిర్వహణమునందు ఇరువరకు అత్యంత సాన్నిహిత్య మేర్పడినది. కాని ఎన్నఁడును ఆయన ఎదుట పుస్తకముపట్టి శిష్యత్వము వహించినవాఁడను గాను. ఆయనది సహజ పాండిత్యము. నాదియు సహజ పాండిత్యము కావలెననునదియే నా పట్టుదల.

అది 1936వ సంవత్సరము. మా అన్నగారు ఉభయభాషా ప్రవీణ బిరుదమంది బాపట్ల ఉన్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. నేనును ఉభయ భాషాప్రవీణ, ఆయుర్వేద వైద్య విద్వాన్, ఆయుర్వేద విశారద పరీక్షల యందుత్తీర్ణతనంది స్వగ్రామమైన ఆదిపూడిలో వైద్యవృత్తియందుంటిని. కుటుంబపుఁ జిక్కులకులోనై నేను ఆంధ్రోపాధ్యాయోద్యోగమునకై వెదకుచు ఒక సంవత్సరకాలము స్వగ్రామము వదలి యుండవలసి వచ్చినది. ఆ సంవత్సరము బాపట్లలో మా అన్నగారి సన్నిధియందుంటిని. ఒకనాఁడు మేమిర్వురము సాయంకాలము ఇంటి పంచలో గూర్చుండి సాహిత్యగోష్ఠి జరుపుచుండఁగా

సోదరుడు:- (నాతో) షేక్స్పియర్ డిక్షనరి అని ఒకటి యున్నది చూచినావా? అనెను.

నేను :- చూడలేదుగాని విన్నాను.

శోధ :- షేక్స్పియరు 20 వేల పదాలు వాడినాడట. అందువలన ఆయనను ప్రపంచ కవి (World Poet) అన్నారు.

నేను :- అట్లైన మన తిక్కనగారు 15 పర్వాలు వ్రాసినాడే ఎన్నిపదాలు వాడియుండవచ్చును?

శోధ : షేక్స్పియరుకన్న ఎక్కువయే వాడి యుండవచ్చును.

నేను :- నిస్సందేహము. లెక్కపెట్టెదము. మన ఆంధ్రకవి తిక్కన ప్రపంచకవియని నిర్ధారణ చేసెదము.

శోధ :- మంచిది. అట్లే చేసెదము.

అనుకొన్న పని నెరవేర్చుట నెఱవేర్చకపోవుట నిర్ణయించుకొనువఱకు నాకు నిద్రపట్టదు. నెరవేఱనిచో ఖేదపడుటయు లేదు. అప్పుడప్పుడే బజారునకు వెళ్లి తెల్లకాగితాలు తెచ్చి పుస్తకాలుకట్టి రూళ్లువేసినాఁడను. అప్పుడే పదము లేఱుట ఆరంభించినారము. కొన్ని పర్వాలు నేను తీసుకొన్నాను. కొన్ని పర్వాలు ఆయన తీసుకొన్నాఁడు. పదము లేఱినాము. తర్వాత ఒకరి పర్వాలొకరు మార్చుకొని మరల పదాలు ఏఱినాము. ఇర్వురి జాబితాలు దగ్గరుంచుకొని ఒక ప్రతి తయారు చేసినాము. ఇది రెండవచిత్తు. తిక్కనగారి పదాలు సుమారు 26 వేలకు తేలినవి. అంత మాకు ఉత్సాహము రెట్టించినది. ఇట్లు గాదనుకొని వానిని అక్షరాది క్రమములో కూర్చితిమి. ఇది మూఁడవచిత్తు. విశ్రాంతిగా నుండుటచే ఎక్కువ పని భారము నామీఁద బడెడిది. ఒకనాఁడు....

నేను :- భారత విమర్శనము చేసినవా రెవరేని తిక్కనగారు తెలుఁగు పదాలు ఎక్కువగా వాడినారు. నన్నయగారు సంస్కృతపదాలు ఎక్కువగా వాడినారు ఎఱ్ఱనగారు రెండు సమానముగా వాడినారని తోకటిపాట పాడుదురు. తిక్కనగారు వాడిన తెలుగు పదాలకు మించి నన్నయగారు వాడలేదా? నన్నయగారి సంస్కృత పదాలనుమించి తిక్కనగారు వాడలేదా? ఇరువురవి గాని పదాలు ఎఱ్ఱనగారు వాడలేదా?

సోద :- అట్లైన నన్నయ ఎఱ్ఱనగారి పదాలుకూడ ఏఱుదము. అప్పుడు భారతములోని మొత్తము పదాలుతేలును. అంతకుముందు తిక్కనగారి పదాలేమైన వదలినా మేమో మఱల భారతము చదివి రూఢి చేసికొందము.

నేను :- సరే అట్లే చేయుదము

అని బజారునకు వెళ్లి తెల్ల కాగితాలు తెచ్చి వాల్యూములుగాఁ గుట్టి గుడ్డబైండు చేసినాఁడను. ఎడమపుట రెండు కాలములుగా సగమునకు నిలువు గీతను కుడివైపు పుటకు అట్లే రెండు కాలములు మొత్తము నాల్గు కాలములు. రెండు పుటలకు ఒక్కొక్కటి రెండు అంగుళముల దూరములో గళ్ళుగా అడ్డ గీతలు గీచినాఁడను. ఇంతవఱకు ఏఱిన తిక్కన పదాలను మొదటి కాలములోను సరిచూచునపుడు తేలిన పెచ్చు పదాలను రెండవ కాలములోను నన్నయగారి పదాలు మూడవ కాలములోను ఎఱ్ఱనగారి పదాలు నాల్గవ కాలములోను గడి కొక పదము చొప్పున తీర్చినాఁడను. వాల్యూములో 1. అ.ఆ 2. ఇ ఔ 3. క-త 4. దధన 5. పఫ 6. బభమ 7. యరలవ 8. శషసహ. ఇది నాల్గవ చిత్తు. భారత నిఘంటువు అనుట తోడనే భారతమునకు ప్రత్యేకముగా నిఘంటువు ఎందుకు? తెలుఁగు పదాలకు తెలుగు నిఘంటువులు సంస్కృత పదాలకు సంస్కృత నిఘంటువులు సమగ్రముగా నున్నవి. అని ఎవరు పట్టినను చటుక్కున అనుట మొదలు పెట్టినారు. మేము ఏఱిన పదాలన్నియు నిఘంటువుల కెక్కిన వేమో చూచితిమి. కుప్పతిప్పలుగా తెలుగు పదాలు లేవు. సంస్కృత పదాలు లేవు. భారతార్థా లున్న వేమో చూచితిమి. అవియు పెక్కులు లేవు. ఇఁక ఏఱినపదాలకు అర్థాలు వ్రాయుట మంచిదని పోయినది. తిక్కన వాడని నన్నయ పదాలు నన్నయ తిక్కన వాడని ఎఱ్ఱన పదాలు అర్థాలు మాత్రమే గుర్తించుటవలన నిఘంటువునకు తిక్కనగారి పదాలు ప్రాతిపదిక యైనవి. ఇంతటిలో నిఘంటువునకు నిద్రావస్థ వచ్చినది. నా దోవన నేను బాపట్ల వదలి ఉద్యోగరీత్యా వేటపాలెము చేరితిని. ఇంతవఱకు గల చిత్తులన్ని మా అన్నగారియొద్దనే దాఁగియున్నవి. 1954 లో ఒక్కసారి యిర్వురము కలిసితిమి. నిఘంటువు ఇర్వురు కలసి వ్రాయుట అసంభవము. ఒక్కరు పూర్తిచేయగల్గుట అంతకంటె అసంభవము. కాన చెఱిసగము వేర్వేఱ ప్రయత్నింతము. తర్వాత ఇర్వురము కలిసి సరిచూచుకొందమని మా అన్నగారు 5 సంపుటములు నేను 3 సంపుటములు చివరిచిత్తు తీసికొంటిమి. కాని ఎవరము అందు గీత

జూపు భాగ్యము నాకు లేకయే ఈ లోకము వదిలిపోయినది. నా ఆత్మపత్ని వేంకట రాఘవమ్మ నన్ను ఎక్కువగా మీరు వ్రాయగలరు వ్రాయండి అని స్తుతి పాఠములతోఁ బ్రోత్సహించినది. ఆమెయు 1965లో పరమపదము చేరినది. కవిత్రయము వారి శబ్దముల ఛేదించి అర్థనిర్ణయము చేయఁజాలను అని నానాటికి బ్రువ పడుచు వచ్చినది. పని కొన్నినెలలు మూతపడినది, కాని నా పట్టుదల వదలలేదు. "ఆరంభింపరు నీచమానవులు" అను భర్తృహరి సూక్తి జ్ఞప్తికి వచ్చినది. నాచేత వ్రాయించునది భగవంతుఁడుగదా నాకేమి యని ధైర్యము దెచ్చుకొంటిని.

తే.గీ. శ్రీ రఘూత్తమ దివ్యపాదారవింద
వితత మకరంద మొకట కవిత్రయంపు
గావ్య పీయూష పూర మొక్కటను గ్రోలి
భవలతాలవిత్రంబును బడయఁగలను.

తే.గీ. అన్న నీ యాత్మబలమునా కందియిమ్ము
భారతనిఘంటు విరచనభారమునను
సాహసింతును నీ పదాబ్జముల కెరఁగి
వీర రాఘవాచార్య సుధీరవర్య।

అప్పటినుండి ప్రతిదినము పై విధమున ధ్యానము చేయనిది నిఘంటువు ముందు కూర్చుండను. వ్రాయ మొదలిడుట తోడనే కొన్ని సందేహాలు పుట్టినవి. ఉదా :- విందానువిందులు మూఁడు జతలున్నారు. అన్నిచోట్ల అన్నదమ్ములే-చచ్చి మరల వచ్చినారా ? అనిపించును. వికర్ణుఁడు దుర్యోధనుని తమ్ముఁడా ? కర్ణుని కొడుకా ? ఇవన్నియూ దేల్చనిది నిఘంటువు పరిపూర్తి కాదని తోఁచినది. నాపని మరల మొదటికి వచ్చినది ఈ యుద్దేశము పెట్టుకొని 18 పర్వాలు మరల ఒకసారి చదివి తోడవలసివచ్చినది. ఇంతలో అకాడమీవారి పదప్రయోగకోశాలు వచ్చినవి. అందలి పీఠికలో నిఘంటువు లెట్లుండ వలసినది ఏయే పదముల కేయే యర్థములు నిర్ణయింప వలసినది పండితులు వివరించిరి. తొలుత మా యుద్దేశము కాకులసంఖ్య వలె పదములసంఖ్య లెక్కపెట్టుటయే గదా. ఉదా :- పలుకు అను పదమున్నదను కొనుడు. ఆ పదము వచ్చినదా ? లేదా ? అనునదే మాకు కావలసినది. ఆ పదము విశేష్యముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు ? విశేషణముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు ? క్రియగా అర్థములు ఎన్ని అని గమనించు తలంపులేదు. మరల

పెట్టలేదు. ఎవరిని సంసారలంపటం అందు కలము దూర్చనీయలేదు. 1955 సంవత్సరము అది కాలప్రభావమో, గ్రహచారబలమో, దైవచిత్రమో కాని కంచుకోట వంటి మా అన్నదమ్ముల అనురాగమునకు విఘాత మేర్పడినది. మొత్తము నిఘంటు సంపుటములు తనయొద్దకుచేర్చి యుంచుకొనవలెనని మా అన్నగారికి అభిప్రాయము గల్గినది. నన్ను నిర్బంధించినాఁడు. నీ దగ్గఱ ఉన్నవానిని పూర్తి చేయుము తర్వాత నా దగ్గఱ నున్నవాని నిచ్చెదను అని నేను, అది నీ కనవసరము నేనేమి చేసికొన్న నీ కనవసరము. మొత్తము రికార్డు వ్రాసినను, వ్రాయకున్నను నా స్వాధీనములో ఉండవలసినదేనని ఆయన. నాల్గు దినములుకూడ ఒకరి నొకరు చూచుకొననిది నిల్చియుండలేనివారము నాల్గు సంవత్సరము లెడమొగము పెడమొగముతో గడపితిమి. ఈ లోపల నేను ఒంటరిగా నాయొద్ద లేని అక్షరాలకు పదాలను కూర్చుకొని మొత్తము 6 సంపుటములుగాఁ గూర్చుకొంటిని. అవి 1. అచ్చులు. 2. కచట వర్గములు. 3. త వర్గము. 4. ప వర్గము. 5. య ర ల వ. 6. శ ష స హ. ఈ సంపుటములే ఇప్పటి ముద్రితప్రతికి మాతృకలు. మా అన్నగారు మాత్రము తనయొద్దగల నిఘంటు సమాచారమునంతయు చెఱయం దుంచెను.

గీ. రామలక్ష్మణులవలె వేర్పఱుపరాక
తనరితిమి ఆదిపూడి సోదరకవు లన
రాఘవుఁ డతండు సూర్యనారాయణుండ
నేను, ఆశువధానాల నేర్పుగలదు.

అని చెప్పుకొన్న మాకు దాదాపు అయిదేండ్లు ఉత్తర దక్షిణ ధ్రువములకున్న దూరమయ్యెను. 1960 లో తిరిగి కలిసినారము. తఱచు కలిసినారము. పూర్వమువలె అన్యోన్యానురాగము కనఁబఱచు కొనుచున్నామేకాని ఒక్కనాఁడు భారతనిఘంటు ప్రసక్తి ఆయన తేలేదు. నేనును తేలేదు. నిష్కళంక సౌభ్రాతము జరుగుచునే వచ్చినది. 1962 సెప్టెంబరులో ఆయన పరమపదించినారు. నేను నిఘంటువులను చదలపాలు గాకుండఁ గాపాడ గల్గినాఁడనేగాని అక్షరము పెట్టలేకపోయితిని. కారణము కవిత్రయమువారి ప్రయోగములకు అర్థవివరణము చేయఁగల శక్తి నాకు లేదనియే నా దృఢ విశ్వాసము మా అమ్మగారు జానకమ్మగారు నన్ను 'భారత నిఘంటువు పూర్తిచేయరా అదేరా మనకు పేరు తెచ్చెడిది' అని పదే పదే హెచ్చరించెడిది. మౌనమే నేను దానికిచ్చు సమాధానము. ఆమెగారికి ఈ రూపమున దీనిని

జూపు భాగ్యము నాకు లేకయే ఈ లోకము వదలిపోయినది. నా ఆత్మపత్ని వేంకట రాఘవమ్మ నన్ను ఎక్కువగా మీరు వ్రాయగలరు వ్రాయండి అని స్తుతి పాఠములతోఁ బ్రోత్సహించినది. ఆమెయు 1965లో పరమపదము చేరినది. కవి త్రయము వారి శబ్దముల ఛేదించి అర్థనిర్ణయము చేయఁజాలను అని నానాటికి భయ పడుచు వచ్చినది. పని కొన్నినెలలు మూతపడినది. కాని నా పట్టుదల వదలలేదు. "అరంభింపరు నీచమానవులు" అను భర్తృహరి సూక్తి జ్ఞప్తికి వచ్చినది. నాచేత వ్రాయించునది భగవంతుఁడుగదా నాకేమి యని ధైర్యము దెచ్చుకొంటిని.

తే.గీ. శ్రీ రఘూత్తమ దివ్యపాదారవింద
వితత మకరంద మొకట కవిత్రయంపు
గావ్య పీయూష పూర మొక్కటను గ్రోలి
భవలతాలవిత్రంబును బడయఁగలను.

తే.గీ. అన్న నీ యాత్మబలమునా కందియిమ్ము
భారతనిఘంటు విరచనభారమునను
సాహసింతును నీ పదాబ్జముల కెరఁగి
వీర రాఘవాచార్య సుధీరవర్య!

అప్పటినుండి ప్రతిదినము పై విధమున ధ్యానము చేయనిది నిఘంటువు ముందు కూర్చుండను. వ్రాయ మొదలిడుట తోడనే కొన్ని సందేహాలు పుట్టినవి. ఉదా :- విందానువిందులు మూఁడు జతలున్నారు. అన్నిచోట్ల అన్నదమ్ములే-చచ్చి మఱల వచ్చినారా? అనిపించును. వికర్ణుఁడు దుర్యోధనుని తమ్ముఁడా? కర్ణుని కొడుకా? ఇవన్నియూ దేల్చనిది నిఘంటువు పరిపూర్తి కాదని తోఁచినది. నాపని మఱల మొదటికి వచ్చినది ఈ యుద్దేశము పెట్టుకొని 18 పర్వాలు మరల ఒకసారి చదివి తోడవలసివచ్చినది. ఇంతలో అకాడమీవారి పదప్రయోగకోశాలు వచ్చినవి. అందలి పీఠికలో నిఘంటువు లెట్లుండ వలసినది ఏయే పదముల కేయే యర్థములు నిర్ణయింప వలసినది పండితులు వివరించిరి. తొలుత మా యుద్దేశము కాకులసంఖ్య వలె పదములసంఖ్య లెక్కపెట్టుటయే గదా. ఉదా :- పలుకు అను పదమున్నదను కొనుడు. ఆ పదము వచ్చినదా? లేదా? అనునదే మాకు కావలసినది. ఆ పదము విశేష్యముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు? విశేషణముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు? క్రియగా అర్థములు ఎన్ని అని గమనించు తలంపులేదు. మఱల

పెట్టలేదు. ఎవరిని సంసారలంపటం అందు కలము దూర్చనీయలేదు. 1955 సంవత్సరము అది కాలప్రభావమో, గ్రహచారబలమో, దైవచిత్రమో కాని కంచుకోట వంటి మా అన్నదమ్ముల అనురాగమునకు విఘాత మేర్పడినది. మొత్తము నిఘంటు సంపుటములు తనయొద్దకుచేర్చి యుంచుకొనవలెనని మా అన్నగారికి అభిప్రాయము గల్గినది. నన్ను నిర్బంధించినాఁడు. నీ దగ్గఱ ఉన్నవానిని పూర్తి చేయుము తర్వాత నా దగ్గఱ నున్నవాని నిచ్చెదను అని నేను, అది నీ కనవసరము నేనేమి చేసికొన్న నీ కనవసరము. మొత్తము రికార్డు వ్రాసినను, వ్రాయకున్నను నా స్వాధీనములో ఉండవలసినదేనని ఆయన. నాల్గు దినములుకూడ ఒకరి నొకరు చూచుకొననిది నిల్చియుండలేనివారము నాల్గు సంవత్సరము లెడమొగము పెడమొగముతో గడపితిమి. ఈ లోపల నేను ఒంటరిగా నాయొద్ద లేని అక్షరాలకు పదాలను కూర్చుకొని మొత్తము 6 సంపుటములుగాఁ గూర్చుకొంటిని. అవి 1. అచ్చులు. 2. కచట వర్గములు. 3. త వర్గము. 4. ప వర్గము. 5. య ర ల వ. 6. శ ష స హ. ఈ సంపుటములే ఇప్పటి ముద్రితప్రతికి మాతృకలు. మా అన్నగారు మాత్రము తనయొద్దగల నిఘంటు సమాచారమునంతయు చెఱియం దుంచెను.

గీ. రామలక్ష్మణులవలె వేర్పఱుపరాక
తనరితిమి ఆదిపూడి సోదరకవు లన
రాఘవుఁ డతండు సూర్యనారాయణుండ
నేను, ఆశువధానాల నేర్పుగలదు.

అని చెప్పుకొన్న మాకు దాదాపు అయిదేండ్లు ఉత్తర దక్షిణ ధ్రువములకున్న దూరమయ్యెను. 1960 లో తిరిగి కలిసినారము. తఱచు కలిసినారము. పూర్వమువలె అన్యోన్యానురాగము కనఁబఱచు కొనుచున్నామేకాని ఒక్కనాఁడు భారతనిఘంటు ప్రసక్తి ఆయన తేలేదు. నేనును తేలేదు. నిష్కళంక సౌభ్రాతము జరుగుచునే వచ్చినది. 1962 సెప్టెంబరులో ఆయన పరమపదించినారు. నేను నిఘంటువులను ఛెదలపాలు గాకుండఁ గాపాడ గల్గినాఁడనేగాని అక్షరము పెట్టలేకపోయితిని. కారణము కవిత్రయమువారి ప్రయోగములకు అర్థవివరణము చేయఁగల శక్తి నాకు లేదనియే నా దృఢ విశ్వాసము మా అమ్మగారు జానకమ్మగారు నన్ను 'భారత నిఘంటువు పూర్తిచేయరా అదేరా మనకు పేరు తెచ్చెడిది' అని పదే పదే హెచ్చరించెడిది. మౌనమే నేను దానికిచ్చు సమాధానము. ఆమెగారికి ఈ రూపమున దీనిని

జూపు భాగ్యము నాకు లేకయే ఈ లోకము వదిలిపోయినది. నా ఆత్మపత్ని వేంకట రాఘవమ్మ నన్ను ఎక్కువగా మీరు వ్రాయగలరు వ్రాయండి అని స్తుతిపాఠములతోఁ బ్రోత్సహించినది. ఆమెయు 1965లో పరమపదము చేరినది. కవిత్రయము వారి శబ్దముల ఛేదించి అర్థనిర్ణయము చేయఁజాలను అని నానాటికి భయపడుచు వచ్చినది. పని కొన్నినెలలు మూతపడినది. కాని నా పట్టుదల వదలలేదు. "ఆరంభింపరు నీచమానవులు" అను భర్తృహరి సూక్తి జ్ఞప్తికి వచ్చినది. నాచేత వ్రాయించునది భగవంతుఁడుగదా నాకేమి యని ధైర్యము దెచ్చుకొంటిని.

తే.గీ. శ్రీ రఘూత్తమ దివ్యపాదారవింద
వితత మకరంద మొకట కవిత్రయంపు
గావ్య పీయూష పూర మొక్కటను గ్రోలి
భవలతాలవిత్రంబును బడయఁగలను.

తే.గీ. అన్న నీ యాత్మబలమునా కందియిమ్ము
భారతనిఘంటు విరచనభారమునను
సాహసింతును నీ పదాబ్జముల కెరఁగి
వీర రాఘవాచార్య సుధీరవర్య!

అప్పటినుండి ప్రతిదినము పై విధమున ధ్యానము చేయనిది నిఘంటువు ముందు కూర్చుండను. వ్రాయ మొదలిడుట తోడనే కొన్ని సందేహాలు పుట్టినవి. ఉదా :- విందానువిందులు మూఁడు జతలున్నారు. అన్నిచోట్ల అన్నదమ్ములే-చచ్చి మరల వచ్చినారా? అనిపించును. వికర్ణుఁడు దుర్యోధనుని తమ్ముఁడా? కర్ణుని కొడుకా? ఇవన్నియూ దేల్చనిది నిఘంటువు పరిపూర్తి కాదని తోఁచినది. నాపని మరల మొదటికి వచ్చినది ఈ యుద్దేశము పెట్టుకొని 18 పర్వాలు మరల ఒకసారి చదివి తోడవలసివచ్చినది. ఇంతలో అకాడమీవారి పదప్రయోగకోశాలు వచ్చినవి. అందలి పీఠికలో నిఘంటువు లెట్లుండ వలసినది ఏయే పదముల కేయే యర్థములు నిర్ణయింప వలసినది పండితులు వివరించిరి. తొలుత మా యుద్దేశము కాకులసంఖ్య వలె పదములసంఖ్య లెక్కపెట్టుటయే గదా. ఉదా :- పలుకు అను పదమున్నదను కొనుడు. ఆ పదము వచ్చినదా? లేదా? అనునదే మాకు కావలసినది. ఆ పదము విశేష్యముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు? విశేషణముగా ఎన్ని అర్థాలలో ప్రయోగించినారు? క్రియగా అర్థములు ఎన్ని అని గమనించు తలంపులేదు. మరల

నావని మొదటికి వచ్చినది. ఈ యుద్దేశముతో 18 పర్వాలు మఱొకసారి చదివి పదములు పదార్థములపై దృష్టితో గుర్తించవలసి వచ్చినది. ఇవన్ని కలసియే చివరి చిత్తు అయిదు సంపుటములైనవి. ఎట్లో పిక్కి 'అల్లిఁడు' అనుశబ్దము వఱకు అర్థ నిర్ణయము చేసినాఁడను. శబ్దవ్యుత్పత్తి శబ్దచరిత్ర ప్రకృతి వికృతి నిర్ణయము కొంతవఱకు వివరించినాఁడనుగాని అది బహు ప్రయాసకరము వివాదాంశము అసాధ్యము అని తోఁచుటచే దాని జోలికి బోనైతిని. అప్పటికి నేను కందుకూరి తాలూకా పెద్దపవనిలో ఉద్యోగరీత్యా ఉన్న నా నాలవ కుమారునియొద్ద నున్నాను. అంతటితో నా కృషి మరల అడుగునఁ బడినది. వేటపాలెమున చేరిన నాయనిపల్లి గ్రామ నివాసి చి. బందా వేంకట వీరరాఘవేంద్రరావు నాకు జాబు వ్రాసినాఁడు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు తిమ్మసముద్రము పోవుచు ది. 8-3-1974న వేటపాలెము సారస్వతనికేతనమునకు వత్తురనియు భారతనిఘంటుప్రతులు తీసుకొని రమ్మనియు వారికి చూపించెదమనియు వ్రాసెను. శ్రీ గోపాలరెడ్డిగారేమిటి? నాబోటి బడుగు అనామకపండితుని ఆదరించుట ఏమిటి? అని కొంచెము తటపటాయించితిమి. ఇది దైవాజ్ఞయేమో అనుకొని అక్కడనున్న పిల్లవాని తోడు తీసికొని వేటపాలెము ఆ దినమునకు జేరితిమి. శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావు పంతులుగారు నన్ను రెడ్డిగారికి పరిచయముచేసిరి. శ్రీరెడ్డిగారిముందు నానిఘంటువును బెట్టితిని. వారు సునిశితముగాఁ బరిశీలించి కొన్ని ప్రశ్నలు వేసిరి. అప్పటికి నాతోఁచిన సమాధానములు చెప్పితిని. వారు నాశ్రమను అభినందించి "మీరు అకాడమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మీ నిఘంటు రచనోద్దేశము దెల్పుచు వ్రాయండి. నాకుఁ జూపించినట్లు నేను వ్రాయమన్నట్లు వ్రాయండి" అని సెలవిచ్చిరి. తిరిగి పెద్దపవని చేరితిని. మఱల వ్రాత ప్రారంభించినాఁడను. నాడక్కు వదలలేదేమఱి! కవిత్రయము వారు గ్రహించిన సంస్కృతమూలము చిక్కించుకొనవలయునని పోయినది. నిర్ణయ సాగర్‌వారి ప్రతి సంపాదించితిని. పూనావారిప్రతి, దక్షిణాదివారి సంశోధితప్రతి, వావిళ్లవారి తెలుగులిపి ప్రతి సంపాదించితిని. అందేఒకటి కవిత్రయమువారి మూలముకానట్లు తోఁచినది. శ్రీపాదవా రెట్లు వ్రాసిరో అని శ్రీకృష్ణభారతమును వచన భారతములను గూడ ముందుంచుకొంటిని. ఒక్కొక్క ఘట్టమును ఈ అన్ని ప్రతులయందు చదువుచు అర్థనిర్ణయముచేయఁ బూనితిని. ఒక పెద్దకొండనుండి ఒక పెద్దబండను విడఁదీసి పిండికొట్టవచ్చునుగాని కవిత్రయమువారి శబ్దములు ఛేదించి అర్థ నిర్ణయముచేయుట కష్టమని తోఁచినది. కొన్ని నెలలుకూడ వంపుట

ములు మూఁతవేసి యుంచితిని. కాని నా పట్టుదల సడలలేదు. నాచేత వ్రాయించు నది భగవంతుడుగదా. నిఘంటువును వ్రాయలేకపోయినను భారతామృతమును గ్రోలిన ఫలితము ఎక్కడికిఁ బోవును ? అని తోఁచినది. ఇప్పట్టున మా అన్నగారు లేకపోయిరే అని విచారము కల్గినది. అప్పు డీక్రింది విధమునఁ జెప్పుకొంటిని.

తే.గీ. శ్రీ రఘూ త్తము దివ్య పాదారవింద
వితత మకరంద మొకటి కవిత్రయంబు
గావ్య పీయూషపూర మొక్కటను గ్రోలి
భవలతాలవిత్రంబును బడయఁగలను.

తే.గీ. అన్న నీ ఆత్మబలము నా కందిఁయిమ్ము
భారత నిఘంటు విరచన భారమునకు
సాహసింతును నీ పదాబ్జముల కెరఁగి
వీరరాఘవాచార్య సుధీరవర్య !

అప్పటినుండి ప్రతిదినము పై విధాన ధ్యానము చేయనిది నిఘంటువు ముందు కూర్చుండను. గౌ. గోపాలరెడ్డిగారి ఆదేశానుసారము అకాడమీవారికి వ్రాసినాఁడను. నాస్థితి

క. విను డెబ్బది యేండ్లగుదాఁ
కను మానవులకు గ్రహోపఘాతంబులు గ
ల్గ ననంతరంబ గ్రహముల
పని వలవదు ముదిమి యెల్లపనులకు వలయున్. భార. అర. 5-258

అన్నట్లున్నది. అయినను నే నూరకొనక గడియారము దగ్గఱ పెట్టుకొని దినమునకు 20గంటలు కృషిచేయుచునే యున్నాను. దయతో నా యీ గ్రంథమును స్వీకరించి ఈ ప్రథమ సంపుటము ముద్రించినందులకు ఆంధ్రప్రదేశ్ అకాడమి వారికి నా కృతజ్ఞతాపూర్వ కానేక నమోవాకము లర్పించుకొనుచున్నాను. ఇఁక ముందు గ్రంథ భవిష్యత్తు ఎట్లుండునో పక్షపాతవ్యాధి గ్రస్తుండనై ఇప్పటికి ఆఱు మాసాలపై కాలమునుండి మంచమునం దున్నాను.

నా శక్తి సామర్థ్యాలు తెలుపుకొన్నాను. ఒక మహాసంస్థ చేయఁదగిన పనికి భగవానుఁడు మందప్రజ్ఞుఁడనగు నన్ను సాహసింప జేసినాఁడు. ఇందుఁగల మెఱుఁగంతయు భగవంతునిది. లోపమంతయు నాయది. కాన విమర్శకులు విషయము గ్రహించి నన్ను శనికరించి సద్హృదయముతో దీనిని బరిశీలించి నన్ను

మన్నించి లోపములు తెల్పిన గ్రంథాంతమున అనుబంధ రూపమున దెల్పుకొనుచు కృతజ్ఞత దెల్పుకొందును.

ఇప్పటికి వచ్చిన నిఘంటువులలో సూర్యరాయాంధ్ర నిఘంటువులోని పదములు వారా పదములకిచ్చిన వేర్వేఱర్థములు భారతమునందు ఎత్తి చూపవలయుననుటయే నా ప్రధానోద్దేశము. కాన అర్థముల వరుసక్రమము సూర్యరాయాంధ్ర నిఘంటువు శబ్దరత్నాకరమును బోలి యుండును. ఆ రచయితలకుఁ గృతజ్ఞుఁడను.

ఈ రచనకు నన్నుఁ బ్రోత్సహించినవారిని చివరికొకసారి స్మరించి విరమింతును.

1. చి. బందా వేంకట వీరరాఘవేంద్రరావు. యమ్. ఏ. బి. యిడి. వేటపాలెము, బం బాపయ్య జూనియర్ కాలేజి ఆంధ్రోపన్యాసకులు. 2. బి. బూదరాజు రాధాకృ , యమ్. ఏ. పిహెచ్.డి. డిప్యూటీ డైరెక్టరు, తెలుఁగు అకాడమి, యూనివర్సిటీ డ్, హిమాయత్‌నగర్, హైదరాబాద్. 3. శ్రీ బొడ్డుపల్లి పురుషో ముగారు, నాగార్జున యూనివర్సిటీ ఆం ధభాషా శాఖలో ఆచార్యులు. 4. చి. గు నాగేశ్వరరావు వేటపాలెము, రావూరిపేట, గ్రామాధికారి. 5. శ్రీమాన్ బిరు రాజు రామరాజుగారు ఉస్మానియా యూనివర్సిటీ ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు.

చివరకు నే నీ గ్రంథమును ఇంతవఱకు నిర్విచారముగా వ్రాయుటకు నాకు గల సుకృతమునుగూడ దెల్పెదను. 1968 లో ఉన్నత పాఠశాల ప్రధానాంధ్రోపాధ్యాయ పదవినుండి విరమణ పొందితిని. అప్పటినుండి నాకొఱకుగాని నా కుటుంబము కొఱకుగాని నేను ప్రాకులాడ నవసరము లేకుండ నాకుమారులు సర్వభారము వహించిరి. వారికన్న మిన్నగ కోడండ్రు నన్ను అత్యంత గౌరవాదరాభిమానములతోఁ బరికించుచుండిరి. ఇఁక నాకు ఏ విషయమున విచారము లేకపోయినది. ఇంతవఱకు ప్రశాంతముగ రచనము కొనసాగింపఁ గలిగినాఁడను. 75 వ ఏట నున్నాను. వ్యాధిగ్రస్తుఁడను. ఇకముందు భగవదాజ్ఞ ఎట్లుండునో !

నా జీవితమున మూడు వంతులు వేటపాలెము గ్రామమున గడచినది. స్వగ్రామాభిమానము నాకు వేటపాలెము పైననే గలదు. నాఁడు నేఁడు వేటపాలెము పౌరులు నన్ను తోడిపౌరునిగనే భావించుచున్నారు. ఈ నిఘంటు రచనా గౌరవము వేటపాలెమునకే దక్కవలయునని నా అభిలాష.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇట్లు
బుధజన విధేయుఁడు
అబ్బరాజు సూర్యనారాయణ

వేటపాలెము }
జనవరి 1979 }

# ఆంధ్ర

# మహాభారత నిఘంటువు

## అ

**అ**[1] ఉభ, దేశ్యము

1. సమాస పూర్వపదముగా నున్న తచ్ఛబ్దార్థకమగు 'ఆ' అనుదానికి కొన్నిచోట్ల ఆదేశముగా వచ్చును.

   వ. అక్కవివరం బిట్లనియె. ఆది. 1-19

   వ. అవ్వలనుఁ గలయం గనుంగొనునప్పుడు విరా. 1-11

2. వ్యతిరేకార్థక ప్రత్యయపరమగునపుడు ధాతువుల తుది ఉకారమునకు ఆదేశముగా వచ్చును.

   క. పీనుఁగు నంటఁగ నగునే, భూనాథతనూజుఁడనక పుయిలోడకన న్నీనీచపుఁ బనిఁ బనుపం, గా నీకుం దగునె పాపకర్మము గాదే

   విరా 4-109

   వ. వెడంగులగుటం గార్య వచనంబు లెఱుంగరు. ఉద్యో. 3-285

3. ఔపవిభక్తికముల సప్తమికి ఆదేశముగా వచ్చును.

   ఆ.వె. అందు నకులుఁ డిట్టు లను దేవ తమ తమ, నేర్పువనుల వెంట నేఁగుదెంచి రిప్పు, వలయుఁ గాక నగరఁ దలను దప్పిన మెలం, కువల కొల్వు లియ్యకొనుట తగునె. విరా. 1-266

   (నగరఁ = నగరమునందు)

4. యుష్మదస్మద్విశేషణంబుల తుది ఉకారమునకు క్రమముగా "వు, రు, ను, ము" వర్ణంబులు పరమగునపుడు ఆదేశముగా వచ్చును.

   ఉ. ధర్మజు పాటిగా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైనయట్టి నీ పేర్మికి నీదె- విరా. 1-50

   గీ. ఏను వంటలవాఁడనై యా నరేంద్రుఁ గొలిచి విరా 1-25

5. అనంతర్యార్థమును దెలుపును.

సీ...అతఁడు మాణిభద్రుని ధనదభృత్యు, నియతిఁ దలంప సన్నిధి వేసె నయ్యతుడు శాంతి. 5-347

6. ఆక్షేపమును తెలుపును.

క. నహుషుండు పనుచు వాఁడటె, విహితానుష్ఠానపరులు వీరటె పో లోకహితంబటె మనకున్, మహనీయము కాక యెట్లు మానఁగ వచ్చున్. ఉద్యో. 1-159

7. అంగీకారమును సూచించును.

చ. అదియెల్ల నీ పలికి నట్టిద ధర్మువు లట్లయుండి బోధను లరయంగ వచ్చిన నధర్మములై చెడు ఉద్యో. 1-334

8. గూఢాభిప్రాయమును దెలుపును.

చ. అది సభయె ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని ఉద్యో. 2-20

ఆ[2] ప్ర.

విశేష్యరూపములు సిద్ధించుటకై కొన్ని ధాతువులపై వచ్చును.

ఆ. అధికరయము మెఱయ నది పెక్కుతునియలు, చేసె నంతరమున శితశరముల. విరా. 5-101

ఆ[3] అవ్య

1. అవధారణార్థకము

సీ. కామించియున్నఁ దత్కామరాగంబున యతిరేకమునఁజేసి యాతఁడంబ- గీ. తనకు శుక్లపాతంబైన ఆది. 5-195

చ...కలప్రయుక్తమగుచున్న సనాతన ధర్మ మిత్తె అంగ దహన కర్మమెల్ల మదిగా నిదిగా మును నిశ్చయించి విరా. 1-179

2. నిశ్చయమును దెలుపును.

క. తిరిగి తిరిగి లోకోత్తర, చరితుఁడు సుజనుండు మత్స్య జనవిభుఁడు యుధిష్ఠిరు నట్ల యనఁగ విను నినుఁ, గరమనురాగమునఁ గొలువఁగా నియ్యెడకున్. విరా. 1-269

3. మధ్యమపురుష 'ము, డుఙ్'లమీఁద వైకల్పికముగా ననుప్రయుక్తమగును.

సీ. జూదంబు కార్యంబె చెపుమ సభా. 2-157
తే... ఏకాగ్రచిత్తవృత్తి, వగుమ... అను. 4-847
సీ... ఆసవ్యసాచి, దన మేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని, చనియె
నాతని కది చనదె చెప్పఁడ ఆది. 8-208

4. స్వయముగా-పరాపేక్షలేమి తెలుపును.
క... అయ్యురగ దౌహిత్రుండు, డొక్కఁడ మన సైన్యంబు, ల్నక్కడఁ
చుచు నున్న వాఁ డలంబున కంటే భీష్మ.8-66

5. అవశ్యక మైనది, తప్పనిది యను నర్థము సూచించును.
తే...అమ్మహావిభుఁడు ధర్మవంతు డఁగుఁగాక చంపన వలయుఁ గృష్ణ
కర్ణ. 8-99

6. బొత్తుగ-ఎంతమాత్రము అను నర్థముఁ దెలుపును.
చ...పెక్కుభంగులఁ బురికొల్ప నెవ్వరును గోత్రుల సేయర యేమి
నెప్పుడున్ ద్రోణ. 2-59
(ఈ యర్థమున క్రియల వ్యతిరేకార్థక రూపములకే యనుప్రయుక్త
మగును)

7. ఏ వార్థకము.
వ. మత్పతి శైలూషుండ కాదు కితవుండును. వి. 2-168
(శైలూషుండు మాత్రమే కాదు. కితవుండునుగూడ నగును)

అ. సం. అవ్య.

1. వ్యతిరేకార్థమును సూచించును. అయ్యది నఞ్‌కు బదులుగా విశేష్య
ములకు, విశేషణములకు అవ్యయములకు క్రియలకు ముందుఁజేర్పఁ
బడును. ఇది అచ్చు ఆదియందు గల పదములు పరమగునపుడు 'అన్'
గా మాఱును. 'ఋ' కారము పర మైనపుడు 'అన్' వైకల్పికముగా
వచ్చును. నఞ్ అర్థము లాఱువిధములు—
"శ్లో. తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా,
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః"
(క) సాదృశ్యము (పోలిక)
అనార్యుఁడు - ఆర్యుడు కానివాఁడు; ఆర్యుఁడై యుండియు
ఆర్యుఁడుకానివాఁడు; ఆర్యుని బోలి యుండు వాఁడు.

ఉ...మా దెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా, ష్ట్రాగ్రజుఁడు
విరా. 5-15

(చ) అభావము (లేకపోవుట)

అజ్ఞానము (జ్ఞానము లేకపోవుట)

వ. పూర్వాచార్యులచేత నభినందితంబులగు మంత్రంబులు నిందించుట యజ్ఞానంబని వివాదంబు సేసిన నతండు కోపించి ఉద్యో. 1-201

(ట) భేదము (వేఱుపాటు)

అదాసి (దాసికంటె వేఱైనది)

ఆ. ధన్యులార! యే నదాసినే దాసినే, యెఱుఁగఁ జెప్పి పనుపుఁ డెల్లదాని
సభా. 2-244

(త) అల్పము (కొంచెము)

అదూరము (కొంచెము దూరము—సమీపము)

ఉదాహరణము మృగ్యము

(ప) అప్రాశస్త్యము (అయోగ్యత-అనర్హత)

అకాలము (అనర్హ కాలము)

వ. కలయంగొంపుసొంపు సంపాదించి యకాలసంధ్య నావహించిన
విరా. 5-60

అకార్యము (అయోగ్యమైన కార్యము—చేయరానిపని)

వ ఇతండు ధర్మాధర్మాదులకు గురుండు కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు
ఉద్యో. 1-335

అనర్హము (తగనిది)

తే. వినుము దుర్యోధనుండు సేసిన యనర్హ, మొక్కటియు లేదు
ఆశ్ర. 1-98

(గ) విరోధము (వ్యతిరేకము-విరుద్ధము)

అనీతి (నీతికి వ్యతిరేకమైనది—దుర్ణయము)

క. వినత గడున్ వేగిరపడి, యనీతి నొ యండ మవియ నడిచె నరేంద్రా
ను 1-16 కల్య 2-299

అసితము—
ద్రో 3-1 4 స్త్రీ 1-47

2. విశేషణములకు ముందు.

అశిష్టము- శిష్టమునకు వ్యతిరేకమైన క్రియ

సీ. ఆ॥ నిష్టంబు ద్రోవను నిష్టంబు దేశము నడుదుఁ గర్మాచరణం బొనర్చు. శాంతి. 4-172

8. అవ్యయములకు ముందు

అనంతరము (పిమ్మట)

వ. అని యిత్తెఱంగున నయ్యైయెడల వొండొరులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు విరా. 1-255

అచిరము (చిరముగానిది-అశాశ్వతమైనది-కొలఁది కాలముండునది)

క. రమణీవర్గ త్రయ ధర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము అచిరములే-. శాంతి. 5-223

**అంకతలము** సం. వి. అ. న.

అంకప్రదేశము.

వ. అప్పాలంతిం దన యంకతలంబున నునిచికొని. ఉద్యో. 4-288

**అంకము** సం. వి. అ. పుం.

1. చిహ్నము, గుఱుతు.

శా...వాహన పరిష్కారాంక సంభావ్య సం, వత్కల్యాణునిఁ జేసి...... విరా. 1-235.

2. పేరు.

క. కంకుఁడు ధర్మసుతుఁడు, వలలాంకుఁడు భీముండు విరా. 4-184

3. ఒడి, తొడ

ఆ. కొడుకుఁ గూఁతు నెత్తికొని నలుండు, హర్షపులకితంబులయిన నిజాంకంబులందు వారి నునిచి యాదరమున అర. 2-198

వ. అత్తపోధనుండు మదీయాంకతలంబున నొఱగి నిద్రించుచుండ కర్ణ. 2-189

4. బిరుదు.

క...వీ, రాంకోక్తులు నిస్సాణజ, ఢాంకృతులును గలసి యుద్భటంబుగఁ జెలఁగెన్ భీష్మ 2-133

5. వక్షము

క. నారాయణాంకతలమున, శ్రీ రాజిల్లంగఁ జూచి అను-1-288

ఈ అర్థము సూ. ఆ.ని. వారిచ్చిరిగాని యుదాహరణ మీయలేదు

శ. ర; అమరమునం దీ యర్థము కానరాదు. మూలమునందును "శ్లో. నారాయణస్యాంకగతాం జ్వలంతీం, దృష్ట్వా శ్రియం పద్మసమాన వర్ణామ్" అని అంకశబ్దమే కలదు.

పురుషోత్తమ కవీయము—వికృతిరూపచంద్రిక:

ప్రకృతి అంక; వికృతి అక్కు—టీక వక్షము.

విద్యార్థి కల్పతరువు:

వికృతి అక్కు; ప్రకృతి అఙ్కము; అర్థము వక్షస్థలము

శబ్దార్థ కల్పతరువు : అఙ్కః = భుజాంతరే-అక్కు,ఱొమ్ము.

నరసింహ పట్టాభిరామ రూపములందుఁ దప్ప నారాయణస్వరూపమునందు లక్ష్మి తొడపైనుండుట గానరాదు. వక్షస్థలమునందును వామభాగమునను ఒక్కపారిగనే ద్యోతిత యగుచుండును.

**అంకించు** దే. స. క్రి. ప్రే.

ఆడించు, జళిపించు

వ. మన యోధు లాయుధంబు లంకించుచు నొండొరులతో బిరుదులు పలుకుచు ద్రోణ. 8-81

**అంకితము** సం. విణ (అ.ఆ.అ)

1. చిహ్నితము చేయఁబడినది-గుర్తింపఁబడినది. గుఱుతిడఁబడినది.

వ. ఆ నూతనూనుందు నిజనామాంకితంబులగు నారాచంబుల విరా. 5-118

2. కలిగినది.

చ. అనిమిషనాథుఁడుం బ్రచలితాంగద తుంగ భుజాయుగంబునం, దనయునిఁ గౌఁగిలించుకొని తత్క్షణ జాత నితాంత సమ్మదం, బునఁ బులకాంకితాంగుఁడయి. అర-1-855

**అంకిలి** దే. వి.

కలఁత, సంక్షోభము

వ. అచ్చెలువయుం దన నిద్రించునెడకుం బోయి పర్యంకభాగంబునం దమవువైచి యంకిలిదేఱని డెందంబునఁ గొందలంబు తోడి నిశ్చ

- యంబు నిద్రంబోరయని శమధో యి మొగిడ్చియుండె
విరా. 2-285; స్త్రీ. 1-28 మౌస. 164.

**అంకిలి దేర్చు** దే. స. క్రి. ప్రే
కలఁతపాపు, ప్రసన్నత పొందించు.
వ. పుండరీకాక్షుండు శోకోపశమనవచనంబులు సెప్పి యంకిలిదేర్చి
శాంతి. 1-268

**అంకిలి దేఱు** దే. అ. క్రి
కలఁతవాయు, ప్రసన్నతనొందు, చిత్తస్వాస్థ్యముమ బడయు.
క. అనుచరులలోని భూసురు, లనునయవచనములఁ దేర్చ నతఁ
డంకిలిదే, అిన మతితో... మౌస. 168
వ...ధైర్యంబుచిక్కఁబట్టి యంకిలిదేఱిన యవ్విభు నాలోకించి
స్త్రీ. 1-23
క. అని యూఱడిలఁగఁ బలికిన, విని యంకిలి దేఱు చిత్తవృత్తి
గలుగ నం, గన యేడ్పుడిగెన్ ఉద్యో. 8-125
(అంకిలి అను వ్యస్తప్రయోగము గానరాదు)

**అంకురము** సం. వి. అ. న.
మొలక, మోసు.
క...ఘనత్వగాథ, యగు నవిద్య భూమిస్థయై బహుకర్మ బీజముం
కంకురాది శక్తులొసఁగు శాంతి. 4-844

**అంకురమెత్తు** అ. క్రి. సమ. ధా
తలచూపు-కలుగు
ఉ...బాంధవం, బంకురమెత్త మావలన నక్కటికం బొలయంగ
మమ్మునే, వంకకుఁ బోవనీక గరువంబు జగంబు ప్రశంస
సేయఁగన్ ఉద్యో. 1-326

**అంకురించు** సం. అ. క్రి (నామధా)
1. కలుగు-ఒదవు
వ. వేగుఁ బోకట నంకురించు మదంబున గెంపు గదురుట నిద్రలేమి.

నా శంకింపక యింపుసం గదియు విదగ్ధవిటజనంబుల మనంబులం
దిగుచు లలనాలోచనంబులును విరా. 2-240

2. మొలకెత్తు, కార్యోన్ముఖమగు

తే. ధార్తరాష్ట్రి గడంగి, మమ్ముఁ జఱచిన పాటులు మానసమున
...యంకురింపక చెడిపోయె. ఉద్యో. 3-76

**అంకుశము** సం. వి. అ. పుం. న

ఏనుఁగును వశపఱచుకొను ఆయుధము. దీనితో నేనుఁగు కుంభస్థలమునఁ బొడుచుదురు.

వ. అను పలుకు లంకుశంబున క్రియాం గుదియించిన. విరా. 3-209

(దీనిచేత ఏనుఁగునకు గుర్తుపడును గాన నిది అంకుశము' అనఁబడును. అంక్—లక్షణే)

**అంగకము** సం. వి. అ. న

1. అవయవము

సీ. కరచరణాద్యంగకంబు లేలకొ రత్న, భూషణ ప్రకరంబు పొందు
దొలఁగె. విరా. 1-186

2. శరీరము, దేహము

మ. ప్రవర్ధన దశావిర్భావసంభావితాంగకుఁడు విరా. 3-24

(వ్యు) అంగ మేవాంగకమ్—స్వార్థే కన్. అంగము-అంగకము సమానార్థములు.

**అంగజన్ముఁడు** సం. వి. అ. పుం.

మన్మథుఁడు (శరీరమునుండి పుట్టినవాడు)

ఆ. తెరువులన్నియును మూసి శిక్షించుమాయ కంగజన్మరిపుఁడు.
శాంతి. 5-472

**అంగజుఁడు** సం. వి. అ. పుం

మన్మథుఁడు (శరీరమునుండి పుట్టినవాడు)

శా....ఉద్వృత్తాంగజోన్మాదుఁడై. విరా. 2-380

**అంగడి**[1] వై. వి. (ప్రా. అంగ్గణము. అంగనము)

1 కొలువుకూటము-రచ్చ-సభ-న్యాయసభ.

క. పవనజు గదయును, నీ గాండీవమును నెటఁబోతొ నంగడిక౯

గాంచాలిఁ, దివిచికొనివచ్చునెడ. ఉద్యో. 4-199

**అంగడి**[2] దే. వి.

1. ఆపణము, దుకాణము

సీ. అందంబులగు మేటి యంగళ్ల నెల్ల వస్తువులును శోభిల్ల

శాంతి 2-382

చ...పచరిఁతు రంగడులఁ గోమటు లప్పరి సిద్ధరత్నముల్ ఆది.8-73

2. అంగడి వీథి-వీథి

సీ. మలయజ మృగమదావిల సలిలంబుల, నిమ్ముగా నార్ద్రీకృతంబు

లయిన-తే. యంగళులనొప్పెఁ గర్పూరరంగవల్లులు. ఆది. 6-148

శబ్దచరిత్రము :

ఈ శబ్దము శ.ర.లోఁ గేవల దేశ్యముగానే చెప్పబడినది. సూ. ఆ. ని. లోఁ గేవలము వికృతిగానే వ్రాయఁబడినది. శబ్దమును శబ్దార్థమును బరిశీలింప అంగడి[1]లో నియ్యది వైకృతముగాను, అంగడి[2]లో నియ్యది దేశ్యముగాను కనఁబడుచున్నది.

అమ్మెడు + గడి = అంగడి.

గడి = నాల్గుగీతలకు మధ్యగల స్థానము. సీమల మధ్యప్రదేశము-చదరంగపు టాటలయందు గళ్ల నుపయోగించుట గమనించునది. గళ్లచీర-గడి కదలనీయను-అను లోకమునందలి వాడుకలను విచారింపవలయును-కావున అమ్ముచోటు-అమ్మెడు + గడి-ఇచట లుప్తశేషంబునకు, బూర్ణబిందువు గలిగి అంగడియైనది. - అంగడిగలది అంగడివీథి - అంగడియైనది. అగసాలెవాని దుకాణము పందును వివిధ వస్తువుల విక్రయము నిలుచుట. గెలుపు గానే నదియ్యు అంగడి యనఁబడినది. 'దుకాణము' అను ప్రకృతి వ్యవహారము గూడ దానికి గలుగుట విశేషము.

**అంగణము** సం. వి. అ. న. (వై. అంగడి)

1. కొలువుకూటమందు జెట్టులు పోరాడు రంగము.

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలన్యంబున నంగ్రణంబు సొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు సేసి విరా. 2-14

2. (యుద్ధ)రంగము

ఉ. వేదండ ఘటావిపాటన విదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్.

విరా. 3-175

3. విశాలప్రదేశము

చ. బాణజాలసం, వృతగగనాంగణంబగు నవీన మహాహవ విభ్రమంబు నన్. విరా. 5-125

4. ముంగిలి, ముందు ప్రదేశము.

వ. ఒకప్పుడు సముద్రోపాంతమున నొక్క గిరిగహ్వరంబున యంగణంబున వైరోచనుండగు బలిం గని శాంతి. 4-422

5. చోటు, ప్రదేశము

వ. పుర బహిరంగణంబునఁ బటకుటీర ప్రకరంబుల వసియించి రట్టియెడ. ఆశ్ర. 2-169

**అంగత్రాణము** సం. వి. అ. న. సమ.

ఇనుపచొక్కాయ, కవచము, యుద్ధవీరులు యుద్ధమునందుఁ దొడిగికొను ఇనుపచొక్కాయ.

క. వారలు బహు ప్రకారాకారులు... కృష్ణారుణసితపీత ఘనతరాంగత్రాణుల్. ఆది. 2-89

**అంగద** దే. వి.

1. కోపము.

చ. ఇటు లద్భుత సంగరమైన చోట న, య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగద వృత్రుఁడు మ్రింగె. ఉద్యో. 1-128

శ్లో. తతో జగ్రాహ దేవేంద్రం వృత్రోవీరకృతశ్రతుమ్.
అపాకృత్యాతిసద్వక్త్రే శక్రం కోపసమన్వితః.

సం. భా. ఉద్యో. 8-63 (వావిళ్ల)

2. ఆఁకలి, తిండిమీఁది యపేక్ష

౧౬. ఉ. అంగదనాథు మ్రింగిన వృకావళి దన్ వెసముట్టి కొన్న సర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు మాచుచున్న సా, రంగియ పోలె ద్రో. 1-17

౩. ఉత్సాహము, కుతూహలము

సీ. ...అం, గదఁగొని మెదలు లగల్చుకొనుచు...ఉన్న సృగాలము లున్న స్త్రీ. 2-9

దీనికి మూలధాతువు 'అగలు' (వికలమగు, భేదిల్లుఁ దీనినుండి) 'అంగ-అంగద' అను రూపములేర్పడినవి. అంగలార్చు-అంగలార్పు అను శబ్దములం దిది రూఢిపడుచున్నది. అంగలార్చు-దుఃఖించు; అంగలార్పు-దుఃఖము 'వానికేమి అంగా? బెంగా?' అను లోకమునందలి వాడుక గమనింపవలసియున్నది. కెడ-కెడను; నెఱి-నెఱిక; వఱ్ఱు-వఱద లోవలె 'అంగ'పైన స్వార్థమున 'ద' చేరినది. ఈ పదమునకు దుఃఖము, మనోవ్యథ, ఉపద్రవము-అను నర్థము లితర కావ్యములందుఁ గలవు.

**అంగదము** సం. వి. అ. న.

కేయూరము, భుజకీర్తి

క. ...కిరీటకంకణ, కనదంగదములను దఱచుగా ధర, దొరఁగెన్.. భీష్మ. 2-184

సీ. ఉరగాత్మకములైన, యుపవీతములు హారములు నంగదంబులుఁ బొలుపు మిగుల. సాప్త. 1-95

**అంగదుఁడు** సం. వి. అ. పుం

వాలికి తార యను భార్యవలనఁ బుట్టినవాఁడు.

సీ. మధువనం బదె నేఁడు మన యంగదుఁడును, హనుమంతుఁడును మొదలైనవారు, బలువిడిఁ జూఱాడి ఫలములానెదరు.

అర. 7-9 చూ. అర. 7-60 పు. 67వ.

ధృతరాష్ట్రుని పుత్రులలో నొకఁడని మూ.భా.నిలో గలదు. కాని ఆంధ్ర సంస్కృత భారతముల ధృతరాష్ట్రుని పుత్రుల నామములు

చెప్పవట్ల ఈ పేరు గానరాదు. ఆది. 5-197
(సం. భా. ఆది. 118-2 మొ 15 శ్లో)
చూ. కురుకుమారుఁడు.

**అంగదేశము** సం. వి. అ. పుం.

భరతఖండములోని యొక దేశము. ఇది గిరివ్రజమునకుఁ దూర్పున మోదాగ్నికిఁ బశ్చిమమున నున్నది. (సం. భా సభా 31.17 మొ 22 శ్లో) వస్తుతముఁ బెంగాలు, అనఁగను వంగదేశములో భాగల్పూర పరిసర ప్రదేశమని యాధునికులు చెప్పుచున్నారు.

వ. కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట... జనపదంబులు.
చూ. అంగరాజు భీష్మ. 1-40.

**అంగన** సం. వి. అ. స్త్రీ.

ఆఁడుది.

చ. ...జనమాన్య అంగనా, సహితముగాఁగ విరా. 1-44

**అంగనాకారుఁడు** సం. వి. అ. పుం. సమ.

ఆఁడుదాని యాకారమువంటి యాకారము గలవాఁడు.

వ నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారు లను వధియింపకుండ వ్రతంబు పూనినవాఁడ. ఉద్యో: 4-400

**అంగనాపూర్వుఁడు** సం. వి. అ. పుం. సమ.

మొదట ఆఁడుదై తర్వాత మగవాఁడైనవాఁడు
చూ. అంగనాకారుఁడు. చూ. శిఖండి

**అంగనాభిధానుఁడు** సం. వి. అ. పుం. సమ

ఆఁడుదాని పేరుగలవాఁడు.
చూ. అంగనాకారుఁడు.
ఉదా:- అంకమ్మ, పేరంటాలు మొ.

**అంగము** సం. వి. అ. నపుం

1. అవయవము, శరీరమునందలి భాగము: కరచరణాదికము.

వ. సర్వాంగాలింగితము హితలంబగు నమస్కారంబు చేసిన.

విరా. 1-22

2. శరీరము.

సీ. కంచుక మంగంబు కాంతికి మాటుగా. విరా 1-228

క. అని చెప్పి గంటి నూపిన, ననిలతనూ భవుడు గనలి యా దుష్టా త్మ్మం, దనయాదంబంధునహితము, ననిచె వజము ప్రోలికని యె నం గము వ్రాంగన్. విరా 5-310

3. వేద భాగము - వేదాంగము - వేదము యొక్క యర్థమును దెలిసికొనుటకు సాధ్య మైనది.

ఉ. వేదములుం దదంగములు వింతలుగా నొక కొంత నేర్తు

ద్రోణ 1-73; శాంతి 5-188

అవి యాఱు 1) శిక్ష 2) కల్పము 3) వ్యాకరణము 4) నిరుక్తము 5) ఛందస్సు 6) జ్యోతిషము.

1. శిక్ష:- వేదము యొక్క స్పష్టోచ్చారణమును స్వరగతిని దెల్పు శాస్త్రము.

2. కల్పము:- వైదిక కర్మానుష్ఠాన విధిని దెల్పు శాస్త్రము.

3. వ్యాకరణము:- శబ్దముల నియమించు శాస్త్రము.

4. నిరుక్తము:- వ్యుత్పత్త్యర్థములలోఁ గఠినమైన వైదిక శబ్దములను నిర్వచించు శాస్త్రము.

5 ఛందస్సు:- లక్షణ శాస్త్రము.

6 జ్యోతిషము:- గ్రహ తారకా మండలమును గుఱించిన శాస్త్రము.

4 ప్రాంగములలో నొకటి.

సీ. ప్రాంగములయందుఁ జిత్తంబు మెలఁగుచుండ శాంతి. 6-200

ప్రాంగములు:- 1) స్వామి 2) అమాత్యుఁడు 3) సుహృత్తు 4) కోశము 5) రాష్ట్రము 6) దుర్గము 7) బలము.

5. అష్టాంగములలో నొకటి.

యమనియ మాద్యష్టాంగ, క్రమాభ్యాసన నిర్మథిత వికారసుచేతః, మలా మోక్షమయాత్మా. శాంతి. 2-448

అష్టాంగములు:- 1) యమము 2) నియమము 3) ప్రాణాయామము 4) ప్రత్యాహారము 5) ధ్యానము 6) ధారణము 7) మననము 8) సమాధి

6. చతురంగములలో నొకటి.

సీ. చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన- విరా. 4-62.

చతురంగములు:- 1) రథము 2) గజము 3) తురగము 4) కాల్బలము.

7. యజ్ఞషడంగములలో నొకటి

వ. షడంగ సమృద్ధంబయి...రాజసూయం బతిరమణీయంబయిన సభా. 1-294

రాజసూయ యజ్ఞాంగములు 6

1) సౌమాపౌష్ణము (ఏకాదశకపాలము) 2) ఇంద్రాపౌష్ణము (చరువు) 3) పౌష్ణము (చరువు) ఇవి మూఁడు శ్యామదక్షిణ యనబడును.

1) అగ్నావైష్ణవము (ఏకాదశకపాలము) ఇంద్రావైష్ణవము (చరువు) వైష్ణవము (త్రికపాలము)

8. మనస్సు

ఉ. సంగవిదూరితాకలిత శాంతరసస్ఫుట రోమదిద్ధ బో, ధాంగస మాశ్రితా కల్య. 1-403

9. (పుం) ఒకే దేశము.

ఆ. కురునరేశ్వరుండు పురికొల్పఁ బ్రాచ్యక. లింగదాక్షిణాత్యులంగ బలము, మ్లేచ్ఛతతియు బెరయ మెయికొని తాఁకిరి.

ద్రోణ. 3-97. చూ. అంగదేశము

**అంగరాగము** సం. వి. అ. పుం. సమ.

మేనికిసలఁదు[2] చందనాదికము, మైపూఁత-చందనాదుల మేనికిఁబూయుట.

వ...అంగరాగమాల్యాభరణంబుల నలంకృతులం జేసిన. విరా. 3-156

**అంగరాజు** సం. వి, అ. పుం.

1. అంగదేశమునకు రాజు, కర్ణుఁడు

వ. మన్ననగల మానిసియగుట నంగరాజునకు సంగరపాటవంబు

మాటలు దగుంగాక, మాన్యుల నధఃకరింపనగునే.

విరా, 4–220

2, బలియను రాజునకు భార్యయగు సుదేష్ణకు దీర్ఘతముని (మామతేయుని) వలనఁ బుట్టిన రాజర్షి

వ. అనిన నబ్బలి సంతానార్థి గావున వెండియు నమ్మునిం బ్రార్థించి తత్ప్రసాదంబు వడసి సుదేష్ణనియోగించిన దీర్ఘతముండును దాని యంగంబులెల్ల నంటి చూచి వంశకరుండును మహాసత్త్వుండును నయ్యెడు కొడుకు నీకుం బుట్టునని యనుగ్రహించిన దానికి నంగ రాజను రాజర్షి పుట్టెను. ఆది. 4–286

మూలమున వీరైదుగురు పుట్టినట్లు గలదు.

శ్లో. అంగో వంగః కళింగశ్చ పుండ్రః సుహ్మశ్చ తే సుతాః తేషాం దేశాః సమాఖ్యాతాః స్వనామకథితా భువి. సం. భా. ఆది 88–56

**అంగవంచనము** సం. వి. న. అ. స్త్రీ. సమ

శరీరభ్రమణము-దేహమును మెలకువతోఁ ద్రిప్పుటలు

వ. అలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబులను బ్రేటుపోటుల సవదరింపకుండం గాచికొని నోజ మెఱయుచుండు. ద్రోణ. 4–283

**అంగవిక్షేపము** సం. వి. అ. పుం. సమ.

అవయవములను విదుర్చుట - శరీరమును విదుర్చుట. అవయవచాలనము, శరీరచాలనము.

వ. నిదాఘసమయ మధ్యందిన దినకర మూర్తియుంబోలె దుర్నిరీక్ష్యయయి యంగవిక్షేపంబున నంగారవృష్టి గురియుచు.

ఆది. 7–106

**అంగవైకల్యము** సం. వి. అ. న. సమ,

అవయవలోపము-కుంటితనము, గ్రుడ్డితనము. మొ.

వ. బలంబుగలిగియు నంగవైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచింప నేరమింజేసి రాజ్యంబునకుం దగకున్న-

ఆది. 6–123

**అంగశోధనము** సం. వి. అ. న. సమ.

శరీరమును శుద్ధిచేసుకొనుట-దేహమును శుభ్రముచేయుట బాహ్య శౌచములలో నొకటి.

సీ. అభ్యంతరము విను మాహారశుద్ధియు, నంగశోధనము బాహ్యంబు. అను. 5-181

**అంగసంధి:-** సం. వి. ఇ. పుం. సమ..

కీలు, వెలను.

ఆ. అంగసంధి వికలమగుటయుఁ బోరుసా, లించి యతఁడు గారవించి. శాంతి. 1-38

**అంగసప్తకము:-** సం. వి. అ. న.సమ.

ఏడు అంగములు.

వ. అవధానంబుతో రాజ్యాంగ, సప్తకం బరయుం డని చెప్పి. శాంతి. 1-395

చూ. అంగము-సప్తాంగములు.

**అంగాదంగాత్సంభవసి-**

వ. పురుషుఁడు భార్యయందుఁ బ్రవేశించి గర్భమునఁ బుత్రుండై తాన యుద్భవిల్లు గావునఁ అఙ్గాదఙ్గాత్సంభవసిఁ యనునది యాదిగాఁ గల వేదవచనంబుల యందును జనకుండును బుత్రుం డును నను భేదంబు లేదు- ఆది. 4- 85

అంగాదంగాత్సంభవసి - హృదయాదధిజాయసే, ఆత్మావై పుత్రనామాసి సజీవశరదశ్శతమ్ - ఉపజిఘ్రన్తి పితరో మూర్ధని- సం. భా. ఆది. 98-56

"అంగాదంగాత్" అను వైమంత్రముచే, దండ్రి తనయుని మూర్ధము నాఘ్రాణించునని సంస్కృత భారతమునుండి తెలియుచున్నది.

సూ. ఉత్తరాభ్యామభిమన్త్రణం మూర్ధన్యవఘ్రాణం దక్షిణకర్ణే జాపః నక్షత్రనామ చ నిర్దిశతి-ఆపస్తంబ గృహ్యసూత్రము.

అను సూత్రమును ననుసరించి యభిమంత్రణ మూర్ధాఘ్రాణ జపములు మూఁడును రెండుమ [illegible] లతో జరగవలసియున్నది. కావున నాచార మునందు మంత్రద్వయాభిధానము [illegible] బడుచున్నది.

ఈ మంత్రములు జాతకర్మమందుఁ దండ్రి బిడ్డను అభిమంత్రించు నపుడు మూర్ధాఘ్రాణము చేయునపుడు దక్షిణ కర్ణమునందు జపించు నపుడు వినియోగపడుచున్నవి.

మంత్రములు:-

అంగాదంగా త్సంభవసి - హృదయా దధిజాయసే - ఆత్మా వై పుత్ర నామాసి సజీవ శరదశ్శతమ్.

అశ్మా భవ, పరశుర్భవ, హిరణ్యమస్తృతం భవ, పశూనాం త్వా హింకారేణాభిజిఘ్రామ్యసౌ.

మంత్రార్థములు:-

"అంగాదంగాత్ - అనుటచేఁ బ్రత్యవయవమునుండి యని యర్థము. స్త్రీ సంభోగమునందు బలవత్ప్రయత్నముచే సర్వాంగవ్యాప్త మగు రేతస్సు (శుక్రం సర్వశరీరగమ్ - అని సుశ్రుతుఁడు) విడువబడుచున్నది. హృదయము కామమున కధిష్ఠానము. అందునుండియుఁ బుట్టువు చెప్పఁ బడుచున్నది. కాన

"ఓపుత్ర ! నీవు నాయొక్క ప్రత్యవయవమునుండి జన్మించితివి. ఇట్టి నీవు పుత్రుఁడను పేరుగల నేనే యగుచున్నావు. నూఱేండ్లు జీవింపుము. "పాషాణమువలె స్థిరుఁడవు కమ్ము. పరశువలె దురాసదుఁడవు కమ్ము. అనాచ్ఛాదితమలమగు హిరణ్యము వలె రూపము గలవాఁడ వగుము. వాత్సల్యాతిశయముచే గోవు తన వత్సమును హింకారము చేయచు మూచూచునటుల నేనును నట్టి పశుహింకారముతో నీ మూర్ధము నాఘ్రాణించుచున్నాఁడను.'' సనూత్రైకాగ్నికాండమంత్ర భాష్యము, ద్వితీయ ప్రశ్నము. 11-12 ఖండములు.

పక్షాంతరమున నీ రెండు మంత్రములనే గాక దక్షిణకర్ణ జపమునకు నీ మంత్రముల పిమ్మటిదగు మూఁడవ మంత్ర జపమునుగూఁడ జేయుట గలదు.

**అంగారకారుఁడు** సం. వి. అ. పుం.

1. కుజుఁడు- నవగ్రహములలో నొకఁడు- ద్వాదశ రాసులలో మేష

వృశ్చికములకు అధిపతి.

వ. ఆచార్యుండు అశ్వత్థామ సహితుండై విముక్త జలద జాల వియన్మ ధ్యంబున నంగారక సహితుండైన యాదిత్యుండునుంబోలె
ఆది. 6-9

సంచరించువాఁడు, శరీరములను పీడించువాఁడు, అంగార (బొగ్గు) వర్ణము గలవాఁడు కాబట్టి అంగారకుఁ డను పేరు వచ్చెను.

2. సౌవీరకుమారులు పన్నిరువురలో నితఁడు మొదటివాఁడు.

వ. అంగారకుండును, గుంజరుండును ... బలాఢ్యుండును సౌవీర కుమారులు పన్నిరువురు. అర. 6-282

భారత కాలమున సింధుసౌవీరములు రెండు జయద్రధుని పాలనమున నుండెను. జయద్రధుఁడే సైంధవుఁడనియు సౌవీరుఁడనియుఁ బిలువఁ బడెను.

"సౌవీర కులప్రసూతులము" అర. 6-182 అని ద్రౌపదితో సైంధ వుఁడు పలుకుటంజేసి వారు జయద్రధుని జ్ఞాతులయి యుండనోపు. సోదరులనుటకు బలాహకానీక- విదారణాదు లతని తమ్ము లని కోటి కాస్యుఁడు ద్రౌపది కెఱిగించెను. ఈ పన్నిరువురు ద్రౌపదిని సైంధవుఁ డెత్తికొనిపోవునపుడు వెన్నాడిన పాండవులతోఁ బోరాడి యం దర్జుననిచే వధింపఁబడిరి.

**అంగారపర్ణత్వము** సం. వి. అ. న.

అంగారపర్ణుఁడుగా నుండుట.

మ...నా యంగారపర్ణత్వమిఁక,నమ దాల్పన్ మది నఱ నిప్పుడే నే.
ఆది. 7-60

**అంగారపర్ణము** సం. వి. అ. న.

1. అంగారపర్ణుని వనమునుండి ప్రవహించు భాగీరథీ తీరప్రాంతమునకుఁ గల నామము. దీనికి సోమశ్రవము అనియుఁ బేరు.

వ. ఇవ్వనంబును గంగాతీరంబును నంగారపర్ణంబులు నా జగద్విది తంబులు. ఆది. 7-89

2. భాగీరథీ తీరమునందుఁ గల అంగారపర్ణుని వనము. గంగానదియొక్క

సోమశ్రవ తీర్థ మింందే గలదు. ఇది ఏకచక్రపురమునుండి దక్షిణ పాంచాలమునకుఁ బోవు దోవలోఁ దగులును. ఇందలి చెట్లు ఆకులు అంగారముల వలె నుండును.

వ. ఇవ్వనంబును గంగాతీరంబును నంగారవర్ణంబులు నా జగద్విదితములు. ఆది. 7-39

**అంగారపర్ణుఁడు** సం. వి. అ. పుం.

గంగానదీ తీరమునఁ గల అంగారపర్ణము అను వనమునం దుండు గంధర్వుఁడు. కుబేరుని సఖుఁడు.

వ. అంగార పర్ణుండను గంధర్వుం డంగనా సహితంబు గంగకు నంత పొద్దు జలక్రీడార్థంబు ఆది 7-38

వ. ఏనంగారపర్ణుం డను గంధర్వుండఁ గుబేరు సఖుండ. ఆది. 7-38

వ. ఏకచక్రపురమునుండి సోదరులతో దక్షిణ పాంచాలమునకుఁ బోవు నర్జునునితో నోడిపోయి గంధర్వమాయచే చిత్రరథంబు నడసి చిత్రరథుఁ డను పేరుగలవాఁ డయ్యెను. ఆది. 7-51

**అంగారము** సం. వి. అ. పుం. న

1. బొగ్గు

ఆ...నదికి యంగారములు సేయు, భంగిరైన శాంతి.2-300

2. నిప్పు

వ. నందినియుఁ దన వత్సంబుఁ బట్టికొనవచ్చిన జనుల కలిగి చిందొల రేఁగి...యంగ విశేషంబున నంగారవృష్టిఁ గురియుచు ...

ఆది. 7-166

**అంగారవృష్టి** సం. వి. ఇ. స్త్రీ. సమ

నిప్పుల వాన.

వ. నందినియు... నంగారవృష్టి గురియుచు ఆది. 7-166; ఆది. 2-79

**అంగిరసుఁడు** సం. వి. స్. పుం.

1. సుధన్వుఁ డను బ్రాహ్మణ యువకుని తండ్రి.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దన కొడుకు విరోచనుండును నంగిరసుఁడను విప్రుకొడుకు సుధన్వుండును దమ తమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి తన్నడిగిన నితండుగోడు కింతడు లాఁతి యని తలం పక మధ్యస్థుండై సుధన్వ గెలిపించి యతనిచేత నిజతనయుని జీవి తంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించె. ఉద్యో. 2-68

చూ. వివరము. సభా. 2-239 నుండి 248 వరకు

2. ఒక ముని. బృహస్పతికి సంవర్తునకుఁ దండ్రి.

ద్రోణ. 5-116; అశ్వ. 1-42

3. త్రిపుర సంహారము సేయఁబోవు శంకరుని రథచక్ర రక్షకుఁడు.

కర్ణ. 1-292

4. బ్రహ్మమానసపుత్రుఁడు శాంతి. 4-206 శాంతి. 6—359 మొ 410; అర. 5. 170.

5. ఒక బ్రాహ్మణుఁడు అను, 3-68

అంగిరసుని నామము అంద అనేక విధములఁ బలుకు చున్నారు. ఆంగిరస, అంగీరస, అంగిరస, ఆంగీరస అను పేర్లతో విచక్షణలేకుండఁ బల్కుటచే నెవ రెవరో తెలియకున్నది. అందుచే మహర్షులు వివాహ విషయమున అంగిరస ఋషి కలిసినను వివాహము చేయవచ్చునని శాసించిరి.

**అంగీకరించు** సం. స. క్రి.

1. నియమించు, పనుచు, ఆజ్ఞాపించు.

వ. కాలోచితకృత్యంబు లాచరించి యొక్క సారథి నంగీకరించి యరదంబు పూన్పించి సన్నద్ధుండనై. ఉద్యో. 4—340

2. సమ్మతించు, ఒప్పుకొను.

వ. అమ్మానిని శాపక్లిష్టయై దన్ను నధర్మంబు పొందదను మాటను దన్ని యోగం బంగీకరించె. ద్రో. 2—175

3. పొందు, అనుభవించు.

క. గంగాతరంగశీకర, సంగత మగు మారుతమున సద్యస్స్పర్శం,
బంగీకరించు నెవ్వఁడు. అను. 2-109

4. స్వీకరించు, వహించు
వ. పావకుండు సకల భూతంబులుఁ జూచుచుండ నంబుధి వెలువడివచ్చి నిఖిల లోకహితార్థంబుగా నెప్పటియట్ల హవ్యవాహనత్వంబు నంగీకరించె. ఆర. 5-174
శ్లో. అహూతః సర్వభూతానాం హవ్యం వహతి సర్వదా.
సం. భా. ఆర. 221-21 (వావిళ్ళ)

**అంగీకారము** సం. వి. అ. పుం.

సమ్మతి, ఒప్పుదల.
తే...మర్దన మిది యని వీనిలోన,నొకటియందు నంగీకార మొలయదు. అశ్వ. 2-93

**అంగీకృతము** సం. విణ. అ. ఆ. అ.

1. అరపఁబడినది, కబళింపఁబడినది, తనలో నిముడ్చుకొనఁబడినది.
క...దేవదత్తం బంగీ, కృతసకలతూర్యనాదో, ద్గతియగుచుఁ జెలంగఁ గ్రీడి గడు నొప్పారెన్. భీష్మ.1-107
2. అవలంబింపఁబడినది.
వ...అను నీతివాక్యంబులు విందు నంగీకృత క్షత్రధర్మం డగువానికి నిట్టివి కర్తవ్యంబులు, సౌప్తి. 1-26 శాంతి. 2-159
3. కలిగింపఁబడినది. పొందఁబడినది.
వ. అంగీకృత పూర్వోత్తరపల్లవంబును. ఆది.6-4
4. స్వీకరింపఁబడినది, గ్రహింపఁబడినది. తన వశము చేసికొనఁబడినది.
వ. ఆ ట్లనాతశత్రుండు సమ్యగంగీకృతసామ్రాజ్యం డయి. అను. 5-449

**అంగుఁడు** సం. వి. అ. పుం

1. షోడశమహారాజులలో నొకఁడు. ద్రోణ. 2-199

షోడశమహారాజులు : 1) మరుత్తుఁడు 2) సుహోత్రుఁడు 3) అంగుఁడు 4) శిబి 5) శ్రీరాముఁడు 6) భగీరథుఁడు 7) దిలీపుఁడు 8) మాంధాతృఁడు 9) యయాతి 10) అంబరీషుఁడు 11) శశిబిందుఁడు 12) గయుఁడు 13) రంతిదేవుఁడు 14) భరతుఁడు 15) పృథుఁడు 16) జామదగ్న్యుఁడు.

2. దివిరథుని కొడుకైన దధివాహనుని కొడుకు.

వ. గంగా కూలమునను్న గౌతమాశ్రమముఁ జేరి యా మహర్షి చే రక్షింపఁబడి పరశురామునిచేఁ జావక నిలిచెను. శాంతి. 2-92

**అంగుటము** వై. వి. (సం. అంగుష్ఠః)

బొటనవ్రేలు, ఉంగటము.

వ. తన యంగుటంబు వ్రేలం గీటిన నందు భస్మంబుగాలిన- శల్య. 2-161

**అంగుష్ఠము** సం. వి. అ. పుం.

1. చేతి బొటనవ్రేలు.

వ. ఆ షట్పుణ్యాత్ముం డంగుష్ఠప్రమాణమూర్తి. అను. 1-318

2. కాలి బొటనవ్రేలు.

క. అంగుష్ఠ మొకటి మోపి మృకండుఁడు దూతేంద్ర చేసెఁ దపము. అను. 1-98

(సూ) అంగా సాణా ప్రాథాన్యేద తిష్ఠతి. అంగు- స్థా.
పాణిని అష్టాధ్యాయీ viii 3-97

అంగు = హస్తము. అని అంగుష్ఠశబ్దము వ్యుత్పత్తిని బట్టి హస్తము నందలి ప్రధానాంగుళిచే తెల్పుచుండఁ బ్రయోగమునఁ గాలి బొటనవ్రేలుగూడఁ దెల్పుచున్నది.

**అంగుళము; అంగులము** సం. వి. అ. పుం.

1. వ్రేలు

వ. అంగుళంబుల నల్లి నలకలు గబళించి కెమ్మోవియాని మొక్కించుక్కుఁ గాయ్వు. విరా. 2-310

2. ఎనిమిది యవోదరముల పరిమాణము. అంగుళంలో 12వ భాగము.

వ. జలజాక్షుఁడు గని పంచాశ్నాంగుళమాత్రము ధరము [illegible]
వదుముఁడున్. కర్ణ. 8-319

యవలనఁగా ఒక రకమైన ధాన్యము. బార్లీగింజ అని కొందఱు. దీనికిఁ బ్రత్యామ్నాయముగా ఆంధ్రదేశమున గోధుమలు వాడుచున్నారు. యవోదర మనఁగా యవగింజయొక్క నడిమివెడల్పు ప్రదేశము.

8 యవోదరములు = 1 అంగుళము: 12 అంగుళములు = 1 వితస్తి; 24 అంగుళములు లేక 2 వితస్తులు = ఒక హస్తము.

అంగే పాణౌ లీయత ఇతి అంగుళః - అని చేతివ్రేలికే వ్యుత్పత్తి పరిమితమైనను కాలివ్రేలికిని వ్యవహారము గలదు.

**అంగుళి** సం. వి. ఇ. ఈ. (స్త్రీ)

వ్రేలు

చ...కరాంగుళులం గపోల మిం, పుగఁ బుడుకుం. విరా.1-247

చూ. అంగుళము.

పుంలింగముగా కాళిదాసు ప్రయోగము గలదు.

సంవృతాధరోష్ఠమంగుళినేతి... శాకుంతలము

**అంగుళిత్రాణము** సం, వి. అ. న

అంగుళి కవచము. వింటినారి దెబ్బతగుల కుండుటకై ఉడుము తోలుతోఁ గుట్టి చేతికిఁ దొడిగికొను కవచము.

శా...దృఢహస్తుల్ బద్ధగోధాంగుళి, త్రాణుల్ [illegible]. 6-10

**అంగుళీయకము** సం. వి. అ. న.

ఉంగరము

వ. అంగుళీయకరుచు లడర నెఱిం జాఁగి పడియున్న బాహుదండంబుల
వలన. విరా. 3-286

**అంఘ్రి** సం. వి. ఇ. పుం

కాలు, పాదము

సీ. అఖిల లోక నమస్కృతాంఘ్రి సరోరుహ. కాం. 2-50

**అంఘ్రితలము** సం. వి. అ. పుం. నపుం

పాదము, పాదముయొక్క అడుగు భాగము.

సీ. నెత్తమ్మి రేకుల మెత్తదనము దెచ్చి యచ్చునఁబెట్టిన ట్లందమొంది యంఘ్రితలములు విరా. 2-52

**అంచత్** సం. శత్ర

ఒప్పుచున్న, ప్రకాశించుచున్న.

మాలిని...జనాంచద్భక్తి విక్రీతమూర్తీ విరా. 4-277

**అంచలము** సం. వి. అ. పుం. న

1. వస్త్రపుఁ జెఱఁగు, బట్టకొంగు.

వ. ఆందోళిత రక్తాంబరయుగళాంచలుండును, విరా. 5-78

2. కొన, చివర, తుద

ఉ...తేరితోర నలిపినుఁగు నీడచికొంచుఁ బాజె వేనాంచల భూమి కిం జెలుచ నత్తురగంబులు విహ్వలంబులై. ద్రో. 2-74

ఈ శబ్దము సూర్యరాయాంధ్ర నిఘంటువునందు నపుంసక లింగముగా జెప్పబడి యున్నది. వాచస్పత్య శబ్దరత్నాకరములందుఁ బుంలింగముగాఁ జెప్పఁబడినది. వామన శివరామ ఆప్టే సంస్కృత నిఘంటువునందుఁ బుం నపుంసక లింగముగాఁ జెప్పఁబడినది.

"వస్త్రస్యాంతో మతోంచలః" హలాయుధ నిఘంటువు

"ఊణాంచలమివ పీన స్తన జఘనాయాః" ఉద్భటుఁడు.

**అంచితము** సం. విణ (అ. ఆ. ఆ)

1. అందమైనది. విలాసవంతము.

గీ. పాండు, తనయ మహిషి యంచితగతిఁ జనఁగ రాజవీధి...

విరా. 1-294

2. పొదుగఁబడినది, కూర్పఁబడినది, ఖచితము

వ. అతనిం బాండవులు రాజయోగ్యంబులయి రత్నాంచితంబులగు

రత్నంబు లెక్క. ఆది. 7-238

**అంచితుఁడు** సం. విశే. అ. పుం

పూజింపఁబడినవాడు, గౌరవింపఁబడినవాఁడు.

క. అతఁ డతిప్రీతుండై, కాంచనమును రత్నంబులు, నంచితుఁగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్. శాంతి.3-487

**అంచ** వై. వి (సం. హంస)

హంస.

సీ. లలితంబులగు మట్టియలచవ్వ డింపార, నంచ కైవడి నడ నల్ల వచ్చి విరా. 2-68

**అంచపిండు** వై. వి

హంసల సమూహము

వ. ప్రోవులు గొనియున్న ప్రేవులపలల లావుగల యంచపిండు పేరాఁకలి నతిముఱిం జెఱికిన. విరా. 3-286

**అంచసిడము** మిశ్ర (వై + దే)

హంస చిహ్నముగల ధ్వజము.

చ. మదిఁ గొనియాడి యా రిపునిమర్దముఁ డంచసిడంబు ద్రుంచి అశ్వ. 4-59

**అంచు**[1] దే. వి

1. అగ్రము, కొన

సీ. ఎనిమిది యంచుల నెసఁగు మెఱుంగుల దారుణంబగు గదా దండ ముగ్ర-తే. రేఖ సారించి శల్య.1-168

2. ఇచట కాలావయవ రూపమైన ఋతువు చెప్పఁబడుచున్నది. బండి కంటి తొలి-చక్రనాభి. అంచు = బండికంటి యాకు అని యన్ని యాంధ్ర నిఘంటువులయందు గలదు, కాని యిచట నియ్యది యర్థభేదమును సూచించు చున్నది. వేలయన.

క. చిను మాటలంచులు బండ్రెం, డనుపమ ధారలమన్నై నిజాస్యము విశ్వంబును బొదువ దిరుగు కాలం బనుచక్రమ్ము .....
మది యడగు గుహన్. శాంతి. 5-152

శ్లో. అవర్తమాన మజరం వివర్తనం
షణ్ణాభికం ద్వాదశారం సువర్వ
యస్యేద మాస్యే౽పరి యాతి విశ్వం
తత్కాలచక్రం నిహితం గుహాయాం. సం. భా. శాంతి. 246-32

ఇచట తిక్కన సోమయాజి 'షణ్ణాభికం' అను పదమును 'అఱుంచులు' అని చెప్పి యుండుటచే 'నాభి' 'అంచు' సమానార్థకములగు చున్నవి. అప్పుడు,

అంచు = తొలి (రంధ్రము) ధార = బంతికంటి ..... చున్నవి.

వ. ద్వాదశారచక్రంబు బరివర్తింపుచున్నవారి వార్వురకుమారుల
ఆది. 1-108

"యదపి తచ్చక్రం ద్వాదశారం యద్వై కుమారాః పరివర్తయంతి తే౽పి షడృతవః సంవత్సరశ్చక్రమ్. సం. భా. ఆది. 3-166
అని యుండుటచే పన్నెండును బంతికంటి యాకు ..... లు చున్నది. నన్నయ మహాకవి యాచట ..... ప్రయోగించుటచే నర్థవిశేషము సాధింప వలనుపడినది కాదు.
కాని యిచ్చట కవిబ్రహ్మకును బమ్మెర పోతరాజు మహాకవికిని భాషాంతరీకరణమున భావభేదము గానవచ్చు చున్నది.

"వండ్రెం డంచులు నాఱు గమ్ములును మూఁడు దొలుతలుం గలిగి సంవత్సరాత్మకం బయి యేకచక్రం బయిన మార్తాండు రథము.
భాగ. 5-281

"యస్యైకంచక్రం ద్వాదశారం షణ్ణేమి త్రినాభి"
సం. భాగ. 5-21-11

అరము- అంచుగా నాంధ్రీకరింపఁబడినది.
నాభి- అంచుగాఁ జెప్పినవాఁడు తిక్కన.

గనుకని నిమ్న చిహ్న దిది గన్నులఁ జూచిన దాని నేసె వా,
మనసిజుఁడంచెఁ గోయిలలు మట్టి నలుల్ నవేయుంచెఁ దెమ్మెరల్''
కోయిలలు అంచునది ముక్కుతోఁ బొడుచుట మూలమునఁ గదా!
అప్పుడు పడునవి గాయములు—బెజ్జములు గదా! కాన,
అంచునకు తొలి-రంధ్రము అను నర్థములు తిక్కనకాలమున వ్యాప్తి
లో నుండి యుండవచ్చును. తరువాత ధాత్వర్థము నశించి
నది. కృదంతభావము మఱుఁగు పడినది. ఇంకను

అనుచు = పంపు, పోవునటులఁ జేయు ఉద్యో. 4-278
ఒకదాని లోనికి మఱొకదానిని చొప్పింప సాధనమైనది తొలి
(రంధ్రము) యే గదా! దీనిని బట్టియు తిక్కన కాలము నాఁటికి
అంచు = తొలి, రంధ్రము అనునర్థము సూపచారములో నుండి
యుండును.

**అంచు**[2] దే. స. క్రి. శత్ర

1. అనుచు, అని పలుకుచు (అను ధాతువుయొక్క శత్రర్థక రూపము)
చ. పాముజమున్ వెస నేయుఁ డంచు జోదులకును జేయివీచి.
భీష్మ. 2-250

2. అని తలఁచుచు. చూ. అను.
చ...ప తలఁపు వచ్చునో యాతని కంచుఁ జూడ్కి సు, రముగ.
రా. 1-129

**అంచు నందు** దే. వి. సమ

కొనయందలి ఎడము
వ. పట్టావృతనయన యగునప్పతివ్రతదృష్టి పట్టంబు నంచునం దునం జని
యజ్ఞనపతి నఖంబులం జెందిన నవి గందిన. స్త్రీ. 1-175

**అంజనపర్వుఁడు** సం. వి. అ. పుం

ఘటోత్కచుని కొడుకు. అశ్వత్థామచే సంహరింపఁబడెను.
వ. అర్జునుజతనయుం డంజనపర్వుం డశ్వత్థామం దలపడి. ద్రోణ.5-72

**అంజనము**[1] సం. వి. అ. పుం

పశ్చిమ దిగ్గజము (పడమటి దిక్కునందలి మగ ఏనుగు)

వ. అంజన వామనాది దిగ్గజంబు లెత్తెట్టివి యని.

భీష్మ. -246

**అంజనము**[2] సం. వి. అ. పుం

ఒక కొండ, కాటుకకొండ.

వ. అచ్యుతుం డడ్డము నొచ్చి దీర్ఘ వృత్త పీనంబు లగు బాహువుల హాలాయుధుఁ బట్టి కైలాసశైలంబు గదిసిన యంజనమహీధరంబు మాడ్కి.

శల్య. 2-297

**అంజనము**[3] సం. వి. అ. న

1. మాలిన్యము.

క...అంజన రహిత, త్త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు. అను.4-194

2. పాపము.

మ...దూరాంజనా. అను. 4-449

**అంజన రహితత్వము** సం. వి. అ. న

పాపము లేనితనము, నిర్మలత్వము.

క...అంజనరహిత, త్త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు. అను. 4-194

**అంజన రహితుఁడు** సం. విశే. అ. ఆ. అ.

పాపము లేనివాడు. నిర్మలుఁడు.

క...అంజన రహిత, త్త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు. అను. 4-194

**అంజలి** సం. వి. ఇ. పుం.

చేతులు జోడించుట, దోసిలి.

తే...నారద మునీంద్రుఁ డంజలి నమితమైన, మస్తకముఁ జేర్చి.

శాంతి. 4-209

**అంజలికము** సం. వి. అ. పుం.

1. ఒక విధమైన బాణము. దీనిని అభిమన్యుఁడు శత్రుసైన్యముపైఁ ప్రయోగించెను.

   వ. భల్లాంజలిక క్షురప్రకర్ణ సఖర ప్రభృతి బాణ వేణికా వితానంబుల వెగడుపఱచిన. ద్రోణ. 2-39

2. అర్జునుఁడు కర్ణునిపైఁ ప్రయోగించి తలద్రుంచిన స్వకీయాస్త్రము.

   మ...క్రూరంపు టొప్పారు నంజలికంబైన మహాస్త్రముం దొడి వికర్షం బుబ్బురం జేయుచున్. కర్ణ. 3-358

   సంస్కృత భారతమున దీనిని గురించి యిట్లు చెప్పబడినది.

   1) సూర్యుని కాంతివంటి కాంతి గలది. 2) మర్మముల భేదించునది. 3) రక్తమాంసముల దూసికొని పోవునది. 4) అగ్ని సూర్యులతో సమానమైనది. 5) అమూల్యమైనది. 6) నరాశ్వ నాగాసురుల హరించుటలో శ్రేష్ఠమైనది. 7) ఉగ్రవేగము గలది. 8) కులిశశక్తి గలది. 9) ఆఁకలిగొని తెఱచికొనివచ్చు కాలుని నోటివలె నతి ఘోరమైనది. 10) శివుని శూలముతోడను విష్ణువు చక్రముతోడను సమానమైనది. 11) భయంకరమైనది. 12) జీవకోట్లను నాశనము చేయునది. 12) దేవసంఘములకును దుర్నివార్యమైనది. 14) స్వకీయమైనది.

   సం. భా. కర్ణ. 92-41, 42, 43

**అంజలిపుటము** సం. వి. అ. పుం. న.

చేతులు రెండు కలిపి పట్టుటచే నేర్పడిన దోనె, దొప్పవంటి దోసిలి.

   వ. లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి విరా. 1-13

**అంజ** దే. వి.

అడుగు, పాదము.

   ఇది 'హజ్జ' పదమునకుఁ బాఠాంతరము.

   పే. పనెంగు హజ్జ ( అంజ) లో నెల్ల సత్వంబుల హజ్జలు నడఁగిన

యట్ల పోలె. శాంతి. 2-289

**అంజు** దే. అ. క్రి.

వెఱచు, భయపడు, వెనుకాడు. సందేహించు.

ఉ...ఇంతట సంతసింపరా, దెప్పుడు నంత కంజ నట యొక్కఁడుగోరినఁ జాలకుండదే. ఉద్యో. 1-271

శ్లో. రాజ్యే తాన్ స్థాపయిత్వాగ్రే మో పేక్షిర్వినశిష్యతః
సర్వమప్యేత దేశస్య కాలం సంజయ కస్యచిత్
తాత సంహృత్య జీవామో ద్విషతాం మావశంగమః
సం. భా. ఉద్యో. 30-67

స్థాపయిత్వాఽగ్రే నోపేక్ష్యస్య వినశ్యతః- (నిర్ణయ)

**అంతు** దే. వి.

అనుట.

ఉ. నీ విటు లంట వారు మ, మ్మిరసమెత్తి కిడ్పుఱచి యింతలు సేసిన దాన. ఉద్యో. 3-74

అను ధాతువుయొక్క కృదంతము. చూ. అను.

**అంతుంగట్టు; అంతుఁగట్టు** దే. స. క్రి. స. ధా.

1. ఆరోపించు, మోపు, నేరము నిలుపు

క...ఇ ట్లంటంగట్టం దగునే, యంటకు నని బోయ యిట్టు లనియె నరేంద్రా. అను. 1-28

2. కదలకుండు లాగున నొకదానితో నొకటి బంధించు.

క. ఆ పవనజు నతిఘనరతి, కాపాశావలుల నంటగట్టించి ఆది. 5-171

**అంటుండాఁకు; అంటుఁడాఁకు** దే. స. క్రి. స. ధా

మిక్కిలి వెంబడించు.

వ. ఆ సూతనందనుం డల్లేచి యార్చి యంటందాఁకి విశిఖములు నిగిడించుచు. కర్ణ. 8-15

ఉ. సుభగు లొక్క మొగిన్ వెస నంటదాఁకి. విరా. 5-38

**అంటఁగట్టించు** దే. స. క్రి. ప్రేర

కదలకుండునట్లాగున ఒకదానితోనొకటి బంధింపఁజేయు

క. ఆ పవనజు నతిఘనలతికాపాశావలుల నంటఁగట్టించి. ఆది. 5-171

**అంటుఁగబట్టు** దే. స. క్రి. స. ధా

కదలకుండ నుండునట్లును కదిసియుండునట్లును గట్టిగాఁ బట్టుకొను.

సీ. నట్టింట నైనను నలుమైన వెరవున, ముట్టెయుంటఁగఁబట్టి కట్టివిడువ. విరా. 1-101

**అంటుఁబట్టు** దే. స. క్రి. స. ధా.

గట్టిగా బంధించు

వ. అంతకు కింకరు లంటఁబట్టి కట్టి కొనిపోయి కోసియు. అను. 4-288

**అంటునార్చు** దే. అ. క్రి. స. ధా

బిగ్గఱగా నఱచు, బొబ్బలిడు

వ. పెక్కండ్రతోడం బెనంగు పుత్త్రుం గనుంగొని యర్జునుం డంటనార్చి యదరి యందఱుఁ గన్నిరూపులై. భీష్మ. 1-282; భీష్మ. 2-118

**అంటునిది** దే. విణ √ అంటు = స్పృశించు, తాఁకు.

తాఁకరానిది. ఋతుస్నానముచేయని స్త్రీ-ముట్టుత.

క...పతిత నంటనిదాని నగ్నఁ జూడం జనదు. అను. 4-115

శ్లో. న దివా మైథునం గచ్ఛే న్న కన్యాం న చ బంధకిమ్

న చాస్నాతాం స్త్రియం గచ్ఛేత్ తథాయుర్విందతే మహత్.

సం. భా. అను 161-118 (నిర్ణయ)

**అంటురానిది** దే. విణ

అంటనిది, ముట్టుత.

తే...సభ కట్టు పాంచాలి, నంటరానిదాని నొంటిచీర, తోన యున్న సాధ్వి కల్య. 2-288

అంటసిలఁబడు దే. కర్మణి √ అంటసిలు

నేలకఁ దగులునట్లు కూలఁబడు

క. గురుని రథచక్రము లం,క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁబడియె నృపా. ద్రోణ. 5-317

శ్లో. తస్య పూర్వరథం పృథ్వ్యాశ్చతురంగుళమున్నతః
బభూవైవం తు తేనోక్తే తస్య వాహోఽస్పృశన్ మహీమ్.
సం. భా. ద్రోణ. 191-58 (నిర్ణ)

అంటసిలు దే. స. క్రి.

నేలకుఁ దగులునట్లు తాఁకు.

చూ. అంటసిలఁబడు

అంటు[1] దే. స. క్రి.

1. తాఁకు, స్పృశించు, ముట్టుకొను.

క. పిన్నఁగు నంటఁగనగునే విరా. 4-109

వ. నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి. ఉద్యో. 2-121

చ. ఇంతకును మాన్యభవచ్చరణంబు లంటెదన్ శాంతి 3-359

2. ధరించు, వహించు, అమర్చు

చ. కటకట ! నా పరాక్రమము గానిగఁ జక్రముచేత నంటితే
భీష్మ. 2-161. చూ భీష్మ. 2-15

3. నీటితోఁ దాఁకు, నీటితోఁదుడుచు

సీ...నయనంబు లంటిన నళినహితుఁడు-తే-సమ్మదంబునఁ దేలు. అను. 2-285

4. భుజించు, కుడుచు ఆహరించు

చ. పగలును రేయుఁ గుడ్చి జలపానములోనుగఁ గుడ్చు నష్ట తుష్టిగ
నొనరించి మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మణి యెప్డు నంట కే
మిగతిని అను. 4-164

అంటు[2] దే. అ. క్రి.

1. హత్తు, తగులు, అతుకు, కలచుకొను

సీ. ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి, యుగ్మలి నీ కుర్లు లొప్ప గ-దె. విరా. 2-156

2. పట్టు, ఆక్రమించు

చ...ని, మ్మును జెద్ద ప్రంటువొక్కొ. మౌస. 157

3. ఒదవు, పొదవు, క్రమ్ము, అలముకొను.

క. మృణాళంబున నంటిన రొంపి జలంబుల్లం గడిగి నను బ్రెడ్డఁబాసిన క్రియ. శాంతి. 5-538

4. నశించు.

తే బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. ఉద్యో. 3-52

5. కలుగు.

సీ...అతఁడు దొడ్డ, నారసమున వాని నదరంట సేసిన

ద్రోణ. 2-76 (ఇది పాఠాంతరము)

దీని తుమున్నంతమునకు ఇతర ధాతువు అనుప్రయుక్తము అగునపుడు 1. బిగ్గఁగా (అంటనార్చు) 2. గట్టిగా (అంటఁబట్టు) 3. కదలనీయకుండ (అంటఁగట్టు) 4. మిక్కిలి (అంటఁదాఁకు) అను నర్థములు గలుగును.

అంటుట క్రి. వి. √ అంటు

1. తాఁకుట.

తే. నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ, గరుణ పెంపున నంటుట కారణముగఁ, బావనస్నాన మొనరింపఁ బోవునట్టు, లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు. కర్ణ. 8-369

2. రతి జరపుట

సీ. ఆధిప రజస్వల నంటుట కల్మష, మాచరితస్నాన యైన సతిఁ జతుర్థ దినంబున దోషానముయమునఁ జెందంగఁ దగు నంద్రు కొంద రార్యులు. అను. 4-128

**అంటేని** సమ. అవ్య.

అనిన యెడల

వ. ఇంతయేమిటి కంటేని ఉద్యో. 2-128

వ. అది యెట్లంటేనిఁ గృత్రిమకిరాతుండైన పశుపతి మెచ్చి ఉద్యో. 4-425

వ. అది యెట్లంటేని నాకర్ణింపుము ఆశ్వ. 4-88

**అండ** దే. వి.

ప్రాపు. ఆధారము, ఆశ్రయము.

చ. ఈతని నొక భంగి నండఁగొని తప్పదుఁ గావున కంచును. ఉద్యో. 4-208

**అండఁగొను** దే. స. క్రి. స. దా.

ప్రాపుచేసికొను, రక్షణము చేసికొను. ఆశ్రయించు, మఱుఁగు చేసికొను చూ. అండ. ఉద్యో. 4-208

**అండజము**[1] సం. వి. అ. పుం.

పక్షి.

వ. అండజంబులు పండిన వృక్షంబు నుపజీవించు చందంబున. ద్రోణ. 1-51

**అండజము**[2] సం. విశే (అ. ఆ. అ)

1. గ్రుడ్డునుండి పుట్టినది.

ఆ...అఖిలేంద్రియోపేత, మగు జరాయుజంబు నండజంబు నువిద పోఁకు, వెలుఁగు. అను. 5-144

2. బ్రహ్మాండాంతరావిర్భూతము.

తే. అవనిఁ బొందదు దివమున నప్రమేయ, మండజంబు హిరణ్మయ మండమధ్యమున వెలుంగు. శాంతి. 5-151

**అండము** సం. వి. అ. పుం. న

1. గ్రుడ్డు

వ. జరాయువు నండజంబును నుద్భిదంబును స్వేదంబును నను జనక విశేషంబుల జనియించి. శాంతి. 5-99; శాంతి. 5—224

2 హృదయము.

తే. అవని బొందదు దివమున నప్రమేయ, మండజంబు హిరణ్మయ మండమధ్యమున వెలుంగు నుజ్జ్వల పతుఘనత దాని, నెఱుగు సంతత యోగసమేతు డనఘ. శాంతి. 5-151

3. బ్రహ్మాండము-వాసనామయము.

సీ. ఉపధికల్పన మొనరించు దానికై, హైరణ్యమైన యండమున విధాత బుట్టించు. శాంతి. 6—82

**అండేని** పమ. అవ్య

అంటేని, అనిన యెడల.

క. ఎట్లండేని లింగములకు నఖండజ్ఞానప్రదత్వకలనము గలదే. శాంతి. 6-178

**అంత** దేశ్య. సర్వ. ఔప. అనౌప.

1. సమస్తము, ఆమూలాగ్రము.

చ...ఆ పరుమూడగు నేడు మత్పితామహులు చరించి రంతయు గ్రమంబున నాకెఱుగంగ జెప్పుమా విరా. 1—44

2. తచ్ఛబ్దార్థకము—కొన్ని విభక్తులలో మాత్రమే యుపయోగింపబడును.

క. అంతిపురము నుట్టటికం, బెంతయు గీ డంతకంటె నెగ్గు తదీయో, పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడి పొందు, కలిమి ఘటు వకున్, విరా. 1—181

కం...ఇంక నుద్ధురుండగు మద్రేశుం గూల్పు మంతతోడ దెగుం గురుపతిపని యయ్యంబు గొనుము కడంకన్. శల్య. 1-94

క...వివేకశూన్యులకరద మండెదు నంతకంటె గష్టముగలదే. ఆది. 8-149

చ...నా, యెఱిగిన యంతనుండి సతి సిట్టి లతాలలితాంగి జూచి యే నెఱుగ ఆది. 7-74

క. తన కిమ్మగు నంతకు దు,గ్గనుఁ డిఁప్పుడపోలె నుండి సర్వమపోలెం,
దన కిమ్మగుదును గలమను. ఆది. 6-118

తే. ..నీ తెగునంతకుఁ గలన నిలువ, నాయుధంబులు విడిచితి.
ఉద్యో. 2-289

3. పరిమాణార్థకము. ఉద్దేశించినంత.

క. నీ వెలుఁగకుండ గర్వమ్ముతో విజయుం డా సుభద్రఁ దోడ్కొని
బలిమిం బోవఁగ నంత సమర్థుఁడె. ఆది. 8-207

**అంత** ప్రు. అవ్య.

1. తర్వాత—అటుమీఁద.

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిసికొని పరివారంబును
దానును దదీయ సంభావనాతత్పరుండై యుండె నంత.
విరా. 1-210.

2. అప్పుడు, ఆసమయము.

క. ..దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చుచుండ నుగ్రాలి యంతన్
వ. తత్ప్రదేశంబునకుం జని. విరా. 2-114, 115

3. ఎక్కువగా, మిక్కిలిగా, అత్యధికము.

క. గొంతికి నంత వెలవ మీ, కంత వెలవ దైవతమునకు నంత వెలవ న,
త్యంతకలుషాత్మ విరటుని, కాంతకు నే వెలతుఁ బనులు గావించు
నెడన్. విరా. 2-185.

4. కాలము, సమయము.

ఆ. పుట్టినంతనుండి యిట్టివి యెన్నఁడుఁ గాన నెందు.
విరా. 5-112.

5. రెట్టింపు, రెట్టి, మడుఁగు.

వ... జంబూద్వీప విష్కంభంబు కొలఁది, యొకబదివేలు నాలునూఱు
యోజనంబులు దీని రెండంతలు దొడఁగి లవణేక్షురససురామృత
దధిక్షీరశుద్ధజలమయంబులు. భీష్మ 1-27.

6. వెంటవే, తక్షణము.

క. కౌరవులు సేయు నవమతి, కారణముగఁ గోపమెత్తుఁ గర్ణుని వదనాం, భోరుహముం గనుగొన శమ, మారున్ నా వశముగాక యంతన బుద్ధిన్‌॰ శాంతి. 1-18.

7. ఆత్మార్థకముతోఁ జేరి 'అన్యాపేక్షలేమి, స్వయముగా' అను నర్థములఁ దెల్పును.

వ॰ అట్టియెడ నాశ్రమపరిసరంబున నొక్కచోఁ దన యంతన లాఘు వాభ్యాసంబు సేయుచుండి. శాంతి. 1-20

8. ఆ కొలఁది, ఆపాటిది, అట్టి శక్తి కలది, అట్టి శక్తిగల,

ఆ...నయముమీఁక, మంబు నడపునంత మానిసిపై యుండి కుచ్చితంపుఁ బ్రదుకు కోరఁ దగునె. విరా. 1-282

ఉ...అట్లంతలు రాజులెల్ల సమయం గని॰ శల్య. 1-352

9. ఏకకాలికవ్యాపారములను దెలుపుటకు నుపయోగించును. సంస్కృతము నందలి 'సతి సప్తమి' ప్రయోగము వంటిది,

వ॰ విషవైద్యుల నొద్దఁ బెట్టుకొని పరీక్షితుం డుండు నంత నట తక్షకుండు విప్రవచనప్రబోధితుండయి పరీక్షితు నొద్దకు నెవ్విధంబునఁ బోవనగునో యని చింతించుచుండి॰ ఆది 2-183.

10 దీనికి బహువచన రూపమును గలదు.

ఉ... అట్లంతలు రాజులెల్ల... శల్య. 1-352.

సీ...అంతలు నేసిన యట్టివారి॰ ఉద్యో. 1.331

**అంతంత** ద్రు. అవ్య. ఔ. అనే.

1. కొంచెము దూరము, సమీపము: దాపు, దగ్గఱ॰

వ. అనుచు నంతంతం జేరి. విరా. 1-296

వ అప్సరపతి పరివారం బెల్లను గౌతుకంబునం జనుదెంచి యంతంతఁ ద్రొక్కుచుం జూచుచుండ॰ శాంతి. 6—268

2. దవు దవ్వుల, దూరముగా

తే॰ సమద వారణపతి గమనమున మత్స్య, ధరణి వల్లభు సభచేర నరు

గుటయును,

వ. ఆంతంతం గనుంగొని. విరా. 1-211, 212

**అంతంతకు** ద్రు: అవ్య. ఔ. అనె.

అప్పటికప్పటికి, క్రమక్రమముగా.

సీ. నెగసినకొనతేచి నింగి యంతంతకు, నవులంద్రోవంగ దనరారు దాని. విరా. 1—162

క. మృదుభాషణముల దుర్జను హృదయములు ప్రసన్నతా మహిమ్నఁ బొందునె యెల్లిదముగఁ గొని యంతంతకు మద మెక్కుంగాక దురభిమానము పెర్మిన్. ఉద్యో. 1—34

**అంతంతట** ద్రుత. అవ్య. ఔ. అనె.

దరిదాపు, సమీపము, అంతంత.

స్రగ్ధర. వీక్షింపంగ నుగ్రంబగు జలనిధి నంతటం గంటి మంతన్. అర. 7—16

**అంతంతియ** (అంత + అంతియ) కళ. అవ్య

ఆమాత్రమ్ము, అంతంత మాత్రము.

క ఎంతెంత మేలుసేసిన, నంతంతియు కులము నెక్కుడై సమకూరుం. అను 5—92

**అంతఃకరణ చతుష్టయము** సం. వి. అ. న. సమ.

అంతఃకరణముల యొక్క నాల్గింటి సముదాయము.

క. అంతఃకరణ చతుష్టయ, శాంతి సముద్యద్వివేక సంపద్వేద్యా. విరా. 4-276.

1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము అనునవి నాలుగు అంతఃకరణ చతుష్టయము.

**అంతఃకరణము** సం. వి. అ. న

లోపలి యింద్రియము. జ్ఞానసుఖాదిసాధన మైనది. ఒక్కటియైన అంతఃకరణము వృత్తిభేదమును బట్టి పైనఁ జెప్పిన 1) మనస్సు

2) బుద్ధి 3) చిత్తము 4) అహంకారము అను నాల్గు విధముల ద్యోతమానమగుచున్నది.

శ్లో. మనోబుద్ధిరహంకారశ్చిత్త మిత్యంతరాత్మకమ్
చతుర్ధా లక్ష్యతే భేదో వృత్త్యా లక్షణరూపయా.

సం. భాగ 3-26-15

సంకల్పరూపము మనస్సు, అధ్యవసాయరూపము బుద్ధి, అభిమానరూపము చిత్తము, చింతారూపము అహంకారము.

క. శంతన నందనుఁ డపరది,గంత[ప్రాప్త రవియట్టిఁడయ్యె నితఁడు
లో, కాంతరగతుఁ డగుటకు ము, న్నంతఃకరణముల సంశయము వాయంగన్.

వ. సకల ధర్మ[ప్రకారంబు నడిగి తెలిసి కొండనిన.

శాంతి. 2-140, 141

వ. తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్వ నిరతిశయానుభావానంద భరితాంతఃకరణుండ. విరా. 1-2

**అంతఃపద్మము** సం. వి. అ. న.

హృదయమను కమలము.

మాలిని. భరిత వికసనాంతః పద్మని[శ్రేణికా సం, చరణ

శల్య. 2-422.

(అంతః పద్మినీ [శ్రేణికా - అని పాఠాంతరము)

**అంతఃపరివారము** సం. వి. అ. పుం.

అభ్యంతర పరిజనము, పురస్సరజనము- ఎల్లప్పుడు రాజునకు ముందు నడచు పరిజనము.

వ. సైనికుల రానీకు మంతః పరివారంబు వచ్చు టుడుపుము.

శాంతి. 2-129.

శ్లో. న సైనికైశ్చ యాతవ్యం యస్యామో వయమేవహి,
నతపీడయితవ్యో మే భీష్మో ధర్మభృతాంవరః
అంతఃపురః సరశ్చాపి నివర్తంతు ధనంజయ.

సం. భా. శాం. 52-15,16.

**అంతఃపురకాంత** సం. వి. అ. స్త్రీ

అంతిపురము నందుండు స్త్రీ, రాజుభార్య మొ.

వ. వివేకహీనుండగు విరాటుండు నిన్నుం బోధించునప్పుడు నిజాంతఃపురకాంతలకు వినోదంబు సేయు వారల రావించిన నేనును సుదేష్ణతో నగుగుదెంచి చూచుచుండుదు. విరా. 2-198.

**అంతఃపురము** సం. వి. అ. న

రాణివాసపు స్త్రీలుండు చోటు, రాణివాసము.

క. బృహన్నల, యను నామముతోడఁ గన్యకాంతఃపురవర్తన మొనరించుచు. విరా. 1—89.

(వికృతి = అంతిపురము)

**అంతఃపురవర్తి** సం. విణ. న్. ఈ. న్.

అంతిపురమున సంచరించు పరిచారకుఁడు.

[(స్త్రీ) అంతఃపురవర్తిని]

వ. విరాటుఁ డంతఃపుర వర్తులం బిలిచి యంతయు సుదేష్ణ కెఱింగింపం బనిచి. విరా. 5-348

**అంతఃపురవర్తులు** సం. విణ. న్. బహు.

అంతిపురమున మెలఁగు స్త్రీలు, పురుషులు.

వ. విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణ కెఱింగింపం బనిచి. విరా. 5-343

**అంతఁబోక** దే. అవ్య. కళ

అంతటితో మానక, అంతటితో నూరకుండక, అంతమాత్రముతో విరమింపక.

క. అని పీడఁగఁ బల్కిన న, మ్మనుజాధముఁ డంతబోక మదనోన్మాదం, బునఁ దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియె విరా. 2-51

**అంతఁబోవక** దే. అవ్య. కళ

చూ. అంతఁ బోక.

తే. అంతఁ బోవక హేమమయత్వ, మహిత, యజ్ఞవాట భాండాది పదార్థములను, బ్రాహ్మణావళి కిచ్చెఁ. ఆశ్వ. 1-106

**అంతకంటె** దే. స. వం. విభ. ద్రు

అంతకు ముందు.

వ. మను బోంట్లెల్లఁ బోక పెనంగినం బోరు భరంబైనం బ్రాణంబుల పై వచ్చు నంతకంటెను బరమదయావరుండైన పాండవాగ్రజు మఱువు సొచ్చి బ్రదుకుం డనుము. ఉద్యో. 2-244

**అంతకంతకు** దే. అవ్య. ద్రుత

క్రమక్రమముగా.

తే. బెగ్గలం బంతకంతకు నగ్గలింప. విరా. 2-37

తే అడవి సొచ్చి యంత కంతకు నవులకు, నతికుతూహలమున నరిగి యరిగి, చూచుచుండునట్లు సూవె సంసార కాననమునందుఁ దిరుగు జనుల నడవు. శాంతి. 4-285

**అంతకము** సం. వి. అ. పుం

మృత్యువు.

వ. గార్గ్యి గౌతమ కాత్యాయనాదులు దీనఁజేసి దీప్తబోధు లయి వీతాంతకులును, విజ్వరులును, నిర్లేపులును, నిర్భయానందులు నై రని చెప్పి వెండియు నిట్లనియె. అను. 4-297

**అంతకహరుఁడు** సం. విశే. త్రి (అ.ఆ; ఈ.అ)

మృత్యువును జయించినవాఁడు. మృత్యుంజయుఁడు. శివుఁడు (యముని హరించిన వాఁడు)

వ. త్రిపురాంతకు నంతకహరుం బరమేశ్వరుం. సభా. 1-158

**అంతకాంతకుఁడు** సం. విశే. త్రి (అ.ఆ.ఈ.అ)

మృత్యువును నాశనము చేసినవాఁడు, మృత్యుంజయుఁడు. శివుఁడు

(యముని నాశనము చేసినవాఁడు)
సీ శంకరుని నంతకాంతకు. అశ్వ 1-62

**అంతకాలయము** సం. వి. అ. పుం
యముని మందిరము, యమునిస్థానము.
వ...జలసంధు నంతకాలయంబున కనిచి. భీష్మ. 2-236

**అంతకు** దే. ద్రు. అవ్య
1. అంతదనుక, అంతవఱకు.
వ. దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖంబగు దుష్ట లోకంబు నధోలోకంబున కనుచునంత మదీయాంతరంగంబు చింతాపరభుగ్నంబును.... వేగిరపడుచున్నయది. విరా. 2-265
2. క్రమముగా
క. కిరణంబు లడఁగి యంతకు, నరుణత్వము మెఱయఁ దరణి యపరాద్రి శిరః, స్ఫురణను నధికరణాలం, కరణం బొనరించుటయును గాంగేయుఁ డెడన్. భీష్మ. 2-389
3. అప్పటికి, ఆసమయమునకు
వ. విరాటుండును బనిచినం గాలరులు వేగునంతకు వీటికిం జని. విరా. 3-237

**అంతకుఁడు** సం. వి. అ. పుం.
యముడు
ఉ. అంతకవిక్రముండు మహిమాస్పదమూర్తి...కిరీటి తనూభవుండు మహోగ్రదంతంబు ధరించి, తిరుగు నొక్కొక చోటను దృశ్యుఁ డగుచు నంతకుం డిదె. మౌస. 17.
విశే. అ. ఆ. అ
నాశనము చేయుఁవాడు
చూ. అంతకాంతకుఁడు.

**అంతకుమున్న** దే. కళ. అవ్య. సమ
ఆసమయమునకుఁబూర్వము

వ. అంతకుమున్న తమ వెనుక నడవులం దిరుగుచు.

విరా. 1-46

**అంతట** దే. అవ్య. ద్రు.

1. ఆటుపిమ్మట

క. అని యంతట నిలువక విరా. 5-268

2. అప్పుడు, ఆసమయమునందు

వ. అప్పాంచాల వరుండు

తే. ఎగిరె నగ్గురు తేరిపై కేపుమెఱయ.

వ. అంతటం దెలిసి యాచార్యుండు

ద్రోణ. 4-100,101, 102

3. ఆపనితో, దానితో.

వ. పాండవులకు దిగులు పుట్టింత మంతటం దెగక యెత్తి వచ్చిరే

నియు నిగ్రహింపవచ్చు. ఉద్యో. 3-391

**అంతటన** అవ్య. (అంతటన్ + అ)

అంతమాత్రమున

క. కాలుండు ద్రేపేపంగ నిటు, ద్రేపిన యంతటన నిన్నుం బెద్దగం

దలంపం, బోలునె ఉద్యో. 2-270

**అంతటను** అవ్య. ద్రు.

ఎల్లను, సమస్తము

మ...దీప్తికలాపంబులు లోకమంతటను విస్తీర్ణంబులై

విరా. 5-42

**అంతటి** కళ

అమాత్రపు

తే. రిత్తవాంద్రను జంపు టరయ, మీరు గొనియాడు నంతటి

పౌరుషంబె స్వా. ప్రి. 1-204

ద్రు

సమస్తమును

చ. పాండుభూపసుతవర్గము నంతటినేర్చుఁగాని సౌప్తి. 2-78

**అంతటిలో** బ్రా. సర్వ.

మొత్తములో

చ. ఇది యొక పెద్దగట్టిమొన యీ మొన ముందట గోగణంబులో,
నదె యొక యల్పసైన్యమట యాళ్ల వేలొక కొంతసేన య,
ల్లదె యిటు పంచిపెట్టఁబను నంతటిలోన వృథాభిమానదు, ర్మదబహు
ళామిషయైన కురుర్లా కెచటం బనుచున్నవాఁడొకో విరా. 4-245

**అంతదాఁక** అవ్య. కళ.

అంతవఱకు, అంతదనుక

తే. అమరతటినీతనూజుపై యలుకఁజేసి, యనికిఁజొరవలె యట్టైన
నతఁడుసచ్చు, నంతదాఁకఁ బాండవులకై కొంత సమర, కేళి వేడుక
బలుపుట వోలదొక్కొ. భీష్మ. 1—16

**అంతనంత** అవ్య. ద్రు.

1. కొంచెము దూరము, సమీపము

చ. అనవుడు నంత నంత ద్రుపదాత్మజ సేరివినీతి నిల్చినన్.
విరా. 1-310

2. అక్కడక్కడ

తే. సభవారందఱు నంతనంత, నల్లనల్లన గుజగుజ లాడుచుండిరి.
విరా 1-148.

3. దూరదూరమున

తే ఆరుగుదెంచు బృహన్నల నంతనంతఁ, గని నృపాలసుతుం డను
గారవమున. విరా. 4-38

శ్లో. దూరాదేవ తు తాం ప్రేక్ష్య రాజపుత్రో౽భ్యభాషత.
సం. భా. విరా. 32-17.

(రూపాం) అంతంత.

**అంతమీఁద** ద్రు. అవ్య

1. తరువాత అటు తరువాత.

తే. నీ తెగునంతకుఁ గలన నిలువ, నాయుధంబులు విడిచితి నంత మీఁద, మెఱసి బల విక్రమంబులఁ జెఱుపునాఁడ. ఉద్యో. 2-289

**అంతము** సం. వి. అ. పుం. (నపుం. అనికూడ అమరకోశము)

1. మృత్యువు, మరణము.

క. ప్రణుతక్షయ నమో నారా, యణాయ య నఘరాశి నంత ప్రాప్తి, క్ష మునజిహ్వకుఁ దెచ్చిన ప్రణవాం బైన పదముఁ బడయుదు నరుల్. అను. 4-372

2. ఆదియు మధ్యము నంతము, నా దేవేశునకు లేమి నవ్యయుఁ డతఁడు శాంతి. 4-198

3. నాశము.

తే. ఆద్యంతగతులు నీవ, యొక్కడై వెలిఁగెదు. శాంతి. 2-10

4. స్వభావము.

తే. విషయములు నంత విరసతా వేక్షణమున. శాంతి. 5-370

5. అంచు, ఒడ్డు, పారము

వ. నిజాజ్ఞావిధేయ చతురంత మహీతల బ్రహ్మక్షత్త్రాది వర్ణముఖ్యుల నెల్ల రావించి ఆది. 3-195

6. మనస్సు.

మాలిని...భరిత వికసనాంతః పద్మనిశ్శ్రేణికాసం, చరణ శల్య. 2-422

**అంతర్** సం. అవ్య.

1. మధ్యము

శ. పారాశర్య ప్రముఖో, దారమునీంద్రాంతరంగ ధామాంత ర్వి, స్ఫార ప్రభాపటల వి,స్తారోజ్జ్వల దివరూపతా స్తవనీయా భీష్మ. 2-408

2. లోపల

ఇంద్రవజ్ర. అంతఃపరితాపము నార్పఁజాలున్. త్రి. 1-29
దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.

**అంతరంగము** సం. వి. అ. న

హృదయము, మనస్సు

వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంత సంతుష్టాంతరంగు జేసి.
విరా. 1-208

**అంతరము**[1] సం. వి. అ. న

1. భేదము. తారతమ్యము

క. నీ, కే వినిపించెదఁ దెలియంగా విను వారలకు నీకుఁగల యంతర
ముల్. ద్రోణ. 5-415

2. లోపలి ప్రదేశము.

మ. సింగంబాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి.
విరా. 4-65

3. భూమ్యాకాశములమధ్య ప్రదేశము.

చ. ఆ స్ఫురిత మహాయుధోగ్ర రుచిపుంజ విజృంభణ ఘోరమయ్యె
నంతరము సహస్రనేత్రముఖ దైవతమండల దుర్నిరీక్ష్యమై.
విరా. 5-16

4. నడుము. మధ్య

ఆ. సవ్యసాచియు ..., నధికరయము మెఱయనది పెక్కుదుని
యలు, చేసె నంతరమున శితశరముల విరా. 5-101

5. మనస్సు.

తే. ...ఇట్లంతరమున నొసర్చు, యాగమున వీతకల్మషుఁడై వెలుంగు.
శాంతి. 5-149

6. అవధి, మేర

తే. అంతరిక్షంబువలన దిగంతరములు, వెలుఁగ ఆది. 2-212

7. ఆకాశము, సమయము

వ. భీమున కపాయంబు సేయ సమకట్టి యంతరం బన్వేషించు

చున్నంత ఆది. 5-169

8. రంధ్రము, ఛిద్రము, దోషము.

వ...నలుండు నేయుచున్న యశ్వమేధాది కానేక భూరి దక్షిణమహాక్రతువులయు...గారణంబునం జోర నవసరంబు గానక యంతరం బన్వేషించుచు...పాద శౌచంబునేయ మఱచి సంధ్యోపాసనంబు నేసిన ఆర. 2-58

**అంతరము** సం. విణ. (అ. ఆ. అ)

అన్యము, వేఱైనది

ఈ యర్థమున నిది సమాసాంతమునఁ బ్రయోగింపఁబడును.

వ, చెలిమినేసి కొందఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జన. శాంతి. 2-478

**అంతరాత్మ** సం. వి. న్. పుం

1. జవుఁడు

తే...విషయములు నింద్రియములు మనసును గ్రమసాధనములు గాఁగ, నంతరాత్మప్రదర్శియై యనుభవించి, తత్కృతములగు మోద ఖేదములఁబొందు. శాంతి. 5-61

2. హృదయాంతర్వాసి

క. వినుము నివాతస్థానంబునఁ గంపనరహితదీపము వెలింగెడు చాడ్పున నంతరాత్మ వెలుగుచు, నునికి ప్రసాదంబు భంగి.

శాంతి. 5-256

3. ఆత్మకంటె భిన్నమైనది. (ఆత్మ-బుద్ధి)

చ. తన కుసుమంబులన్ ఫలవితానము మూర్కొన నాన ప్రమానునేరని క్రియఁగా ననేరదు పరంబగుతత్త్వము నైజభంగి విన్ననువున నంతరాత్మ గను నైష్ఠికతంగను మింతవట్టు. శాంతి. 5-188

శ్లో. ఏవ మాత్మా న జానీతే క్వ గమిష్యే కుత స్త్వహం
అన్యోహ్యస్త్రాంతరాత్మాఽ స్తి యః సర్వమనుపశ్యతి,

సం. భా. శాంతి. 250-9

**అంతరాత్ముఁడు** సం. వి. న్. పుం.

1. అంతరాత్మ.

క. వెలయు దీప్తి యగువాని నిరంజను నంతరాత్మునిం జాటెఁతున్.
శాంతి. 4-280

2. పురుషుఁడు, క్షేత్రజ్ఞుఁడు.

తే. పొందు సత్త్వరజస్తమంబులు విశుద్ధు, నంతరాత్ముఁ బొంసు ప్రవాత
మనిలుఁ జెందు,నట్లు శాంతి. 4-281

తే. తలఁచు మనమందు నిశ్చయదశ యొనర్చు, బుద్ధి సర్వైకసాక్షి
త్వమున వెలుఁగు, నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ డనఁగ వాని,
మెఱవు సత్త్వాది గుణములై మెఱయు వత్స శాంతి. 5-166

**అంతరాళము** సం. వి. అ. న.

మధ్యప్రదేశము.

ఉ...విభ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ.
ఆది. 1-161

ఉ...మౌర్వీరవ కంపిత సర్వదిగంతరాళుఁడై. అర. 7-399

**అంతరించు** సం. అ. క్రి. నామధాతువు

నశించు, చెడు

తరలము...వ్రననఘ కన్యకఁ గన్యకావ్రత మంతరించిన నెట్లు మజ్జనకు
నింటికిఁ బోవనేర్తు. ఆది. 3-40

**అంతరిక్షచరుఁడు** సం. విణ. అ. ఈ. అ.

ఆకాశమునందు సంచరించువాఁడు. యక్ష కిన్నర సిద్ధ సాధ్యాది జాతికిఁ
జెందినవాఁడు. రాక్షస కింకరుఁడు.

వ. (మయుండు) అపూర్వ సభాభవనంబుఁ బదునాల్గు నెలలు నిర్మించి
దాని నెనిమిది వేల రాక్షస కింకరుల మహాకాయుల మహాజవ
సత్త్వసంపన్నుల నంతరిక్షచరులం బనిచి మోపించుకొని వచ్చి
ధర్మజున కిచ్చి. సభా. 1-18

**అంతరిక్షము** సం. వి. అ. న

స్వర్గమునకు భూమికిని మధ్యనుండు ప్రదేశము — ఆకాశము, వాయు మండలము. (రూపాం) అంతరిక్షము.

వ. అయ్యిరువురుఁ బెల్లేయు సాయకంబు లంతరిక్షంబున దళంబై సంతమసంబు గలిగి యునికి. విరా. 5-133

అంతరా ద్యావాపృథివ్యోః క్షంతం అవస్థితం భవతి అంతరిక్షమ్.

**అంతరితము** సం. విణ. (అ. ఆ. అ.)

మఱుఁగుపడినది.

వ. ఒక్కబాణంబు తృణలతాంతరిత దేహుండైన మునివరు నొక్కరుం జూఁచిన. అర. 5-131

**అంతరితుఁడు** సం. విణ. అ. పుం (అ. ఆ. అ.)

1. చాటునకుఁ బోయినవాఁడు (అస్తమించినవాఁడు)

వ. అరుణ గభస్తి యస్తగిరి మస్తకాంతరితుం డయ్యె. భీ. 2-1?6

2. పొదలు మొదలగు వానిచే మాటువడినవాఁడు. కనబడకుండఁ బోయిన వాఁడు.

వ. ఆతండు గుల్మాంతరితుం డగుచుం దోఁచుచుఁ బోవంబోవ. ఆశ్ర. 2-?9

**అంతర్గత** సం. విణ. ఆ. (స్త్రీ)

లోపలిభాగమును బొందినది. లోపలనున్నది.

వ. దారువుల నగ్నియున్న చందంబున సర్వజంతువుల యందును నంతర్గతయై సిద్ధియున్నది. అశ్వ. 2-96

**అంతర్గతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మనస్సు

వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున విరా. 1-214

2. నడుమఁ జొచ్చినది, లోపలఁ జేరినది.

వ. అప్పాండ వాగ్రజుండు జలాంతర్గతుండై యున్న భవన్నందను నుద్దేశించి, కల్యా. 2-58

3. లోపల జిక్కుకొనినది.

వ. తత్కంఠపార్శ్వంబునందు శూలశేషం బంతర్గతంబై యుండె. ఆది. 5-267

**అంతర్గతుఁడు** సం. విశే. అ. పుం.

నడుమఁ జొచ్చినవాఁడు, లోపలఁ జేరినవాఁడు

వ. అప్పాండ వాగ్రజుండు జలాంతర్గతుండై యున్న భవన్నందను నుద్దేశించి, కల్యా. 2—58

**అంతర్గిరి** సం. అవ్య. ఇ.

పర్వతము లోపల నున్నది (రాష్ట్రము)

క. అతుల చతురంగ సేనా,యుతుఁ డంతర్గిరి బహిర్గిరోపగిరుల భూ,
పతుల ననినోర్చి... సభా. 1-234

(రూపాం) అంతర్గిరము

**అంతర్దళము** సం. వి అ. పుం. న.

లోపలరేకు, లోపలియాకు

సీ. అరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళలకు జిగి దళముకొల్పి ఉద్యో. 2-114

**అంతర్ద్వీపము** సం. వి. అ. పుం. నపుం.

లోపలనున్నలంక, సముద్రములోపలి లంక

వ. దివ్యపురుషుండు పురుషోత్తముండు...బలదేవాదు లెఱుంగకుండ సుభద్రార్జునుల వివాహంబుసేయ సమకట్టి తమ నిశ్చయం బయ్యురు పురకుం జెప్పి పశుపతి పూజావ్యాజంబున నఖిల యాదవభోజాంధక వృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుం జని. ఆది, 8-190

ద్వారక సమీపమున సముద్రములోనున్న యొకానొక ద్వీపము. దీనియందుఁ బర్వతములు, కాననములు పుష్కరిణులు గలవు.

విహారమున కనుకూలముగా నుండును. సుభద్రా వివాహ నిమిత్తమై బలరామున కాయుదంత మెఱుకపడనీయ కుండుటకై సమస్త యాదవులను మహేశ్వరీపూజా వ్యాజమునఁ గృష్ణుఁ డంత ర్ద్వీపమునకు వెడలించెను. ద్వారక నుండి పడవలపై పయనించి యీ ద్వీపమును జేరవలయును.

సం. భా. ఆది. 241 అధ్యా.

**అంతర్ధానము** సం. వి. అ. నపుం.

1. మఱుఁగుపడుట, కనఁబడకుండఁ బోవుట.

వ. కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి. విరా. 5—281

2. యోగులు పొందుమృతి,

చూ. అంతర్ధ్యానము.

**అంతర్ధ్యానము** సం. వి. అ. న.

మనోజపము, మనస్సునందు ధ్యానము చేయుట.

తే...శ్యామాశ్రమమున నొక్క, పక్షమున్న నంతర్ధ్యానఫలము గలుగు. అను. 2—80

ఇచట పాఠాంతరమగు "అంతర్ధానము" యుక్తము. ఆపాఠాంతరము నందును 'అంతర్ధాన పదము' అని గాక 'అంతర్ధాన ఫలము' అని యుండవలెను.

శ్యామాశ్రమమున నొక్క, పక్షమున్ననంతర్ధాన ఫలముగలుగు— అనునది సరియైన పాఠము.

"శ్యామా యస్త్వాశ్రమం గత్వా ఉషిత్వా చాభిషిచ్యత,
ఏక పక్షం నిరాహార స్త్వంతర్ధాన ఫలం లభేత్. సం. అను. 64-30

అప్పుడు 'యోగులు మృతినొంది పొందు ఫలము గలుగు' — అని యర్థము చెప్పవలయును.

**అంతర్నాడి** సం. వి. ఇ. పుం. ఈ. స్త్రీ.

మధ్యనాడి—ఇళ పింగళలకు నడుమ నున్నది, సుషుమ్న

క. విను మంతర్మాడిం జనఁ, బనుపడి పవనంబు బ్రహ్మపద మొందఁగ
శాంతి నిరూఢమైన చిత్తము. శాంతి. 4-128

**అంతర్మదము** సం. విణ. (అ. ఆ. అ.)

హృదయమునందలి పొగరు

ఉ. ఆ, ధర్మసుతుండు...యాతఁడెప్డు నం, తర్మద దుష్టుడు.
సౌప్తి. 1—221

**అంతర్యాగము** సం. వి. అ. పుం.

1. మానసిక యజ్ఞము

వ. ఇం దే విధంబున నేనియు జీవాత్మం దుపద్రష్టగా నంతర్యాగంబు నడపు యోగి జనంబులు జనన మరణ విముక్తు లగుదురు.
అశ్వ. 2—18 (చూ. వివరము)

2. మానసిక పూజ

మాలిని. అకలుషహృదయాంతర్యాగసంసిద్ధమూర్తీ. అను. 2—478

మానసికయజ్ఞము :— బాహ్యద్రవ్యములచేఁ గాక మనస్సుచేఁ గల్పించుకొనిన యజ్ఞపదార్థములతో మనస్సునందే చేయు యజ్ఞము. ఇందు బహిర్యజ్ఞము నందువలె "స్వాహా" శబ్దపూర్వకముగా మనస్సుచే హోమము స్మరింపఁబడు చుండును. జ్ఞానాగ్నియందు విశ్వహోమము చేసి శుద్ధజ్ఞానస్వరూపమును బొందుటయే దీని యుద్దేశము.

మానసికపూజ — ఇది ద్వివిధము.

1. బాహ్యపూజయందువలెనే పరమాత్మని తన హృదయపంకజమునందు నిల్పుకొని (అధోముఖమైన హృదయమును ఊర్ధ్వముఖముగా త్రిప్పి వికసింపఁ జేసికొని) సమస్త పూజా పదార్థంబులను మనస్సుచేఁ గల్పించుకొని సక్రమముగా నంతరాత్మ సన్నిధానమునఁ దాను గూర్చుండి షోడశోపచారములఁ బూజించు చున్నటుల భావించుకొనుట. యోగు లిట్లే యావజ్జీవమును గడుపుచుందురు. ప్రాణాయామమును సాధించి యాత్మావలోకన మొనరించువారును, భక్తులు

నిట్లే యభ్యసింతురు. మూర్తామూర్తంబని యియ్యది ద్వివిధంబగు.

2. అహింసాది విషయపుష్పములచేఁ బరమాత్ముని నారాధించుట.

అనఁగా అహింసాది విషయములను బొందిి విరుద్ధ వ్యాపారముల మజ్జగించి సంతత జ్ఞాననిష్ఠ యందుండుట.

అహింసాది విషయములు :

1. అసూయ 2. అనహంకారము 3. అరాగము 4. అగదము (మౌనము) 5. అమోహకము 6. అదంభము 7. అనింధన 8. అక్షోభము 9. అమాత్సర్యము 10. అలోభము 11. అహింస 12. ఇంద్రియనిగ్రహము 13. దయ 14. క్షమ 15. జ్ఞానము.

ఈ పదునైదు విషయము అను పుష్పములచేఁ బరమాత్ము నారాధింప వలెను. అనఁగా నీ గుణముల నలవఱచుకొని జితేంద్రియుండై సంతత ధ్యాన నిమగ్నుఁడు గావలయును.

బాహ్యపూజకంటె ఈ యంతర్యాగ మెన్నిమడుంగులో యెక్కువ యని శ్రీమతాచార్యుల యభిప్రాయము. అట్లని బాహ్యపూజ త్యాజ్య మెన్నటికిఁ గాదు.

**అంతర్వర్తి** సం. విశ. (న్. నీ. న్.)

లోపల మెలఁగునది. వెలుపలికిఁ బ్రసరింపనిది.

క. తన యెఱిఁగిన తెరువున నెమ్మన మంతర్వర్తిఁ జేసి మఱి బాహ్య గతిం, జననీకుండఁగ నది యొంతనువునఁబడు నిలుపవలయు నచ్చట దానిన్. అశ్వ. 1-214

**అంతర్హితము** సం. విశ. (అ. ఆ. అ.)

అదృశ్యమైనది. కనఁబడకుండఁ బోయినది.

తే. శార్దూలమై యుఱికి వారణేంద్ర సమయాను నమ్మానవేంద్ర తనయు వచ్చి యంతర్హితంబయ్యె. శాంతి. 1-269

**అంతర్హితుఁడు** సం. విశ. అ. పుం.

1. అదృశ్యమైనవాఁడు, కనఁబడకుండ పోయినవాఁడు.

క...దా, నచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి

యెల్లి టిలోనన్. విరా. 5-801

2. కనఁబడకుండ నుండువాఁడు, మఱుఁగుపడి యుండువాఁడు.

...శమునున్, బాఁతియుఁ గల జనములుగను, నతర్క్షితుఁగొలుతు జలశయను యోగాత్మున్. శాంతి. 2-29

**అంతలంతలు** దేశ్య. వి. బహు.

అంతటి ఘోరావమానములు—అట్టి బన్నములు.

చ. అలిగిన భీమ ఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు దంతలం, తలువడి వాని సీఁగవలదా? ఉద్యో. 3-201

తే. ధార్తరాష్ట్రు లున్మత్తులు దగిన పలుకు, లేల విని సంధిసేయుట కిచ్చగింతు రెదిరిఁ దమ్మును నెఱిఁగిరయేని వారు, లంతలంతలు సేయుదు రయ్య నాఁడు. ఉద్యో. 4-78

**అంతలంతలుదప్పులు** దే. సమ. వి. బహు.

అంతటి ఘోరమైన తప్పిదములు. మనస్సులో నుద్దేశించినంత పాటి దప్పిదములు.

వ. అంతలంతలు దప్పులు సేసితిమని తలంక వలవదు. ఉద్యో. 2-244

**అంతలంతలు మాటలు** దే. సమ. వి. బహు

మిక్కిలి హితమైన మాటలు, మనస్సులో నుద్దేశించినంత హితమైన పలుకులు.

వ. అట్లు హితార్థులై యంతలంతలు మాటలాడిరి. స్త్రీ 1-11

**అంతలంతలు మానసులు** దే. సమ. వి. బహు

అంతటి గొప్పవారైన మనుష్యులు. మనస్సులో నుద్దేశించినంత గొప్ప వారగు మనుష్యులు.

వ. అంతలంతలు మానుసులు మడిసిరి గాని పుడమి నిత్యులై యెలువం బడరు. ద్రోణ. 2-182

**అంతలంతలు మేటి మగలు**

ఇది 'ఇంతలింతలు' అను దానికిఁ బాఠాంతరము.

చూ. ఇంతలింతలు కర్ణ. 8-880

అంతలవారు దే. వి. సమ. బహు

సమానమైనవారు; సరితూగువారు

క. చెలిమియు, సంభాషణమును, బలిమి వివాదంబు ద్రోపుఁ బాడియుఁ
దమయం, తలవారితోన తగు. ఉద్యో. 3-46

అంతలు దే. వి. బహు

1. అంతటి ఘోర కార్యములు, అంతటి ఘోరాపరాధములు.

సీ. దుర్నయవృత్తి దుర్వ్యాళంబు పుట్టించి, యంతలు సేసిన యట్టివారి.
ఉద్యో. 1-381

ఉ. అంతలుసేసి పోనడఁచి యక్కట సంజయుచేతఁ జెప్పి పుత్తెంతురె.
ఉద్యో. 3-101

2. రెట్లు, మడుగులు

వ. దీని రెండంతలు దొడంగి భీష్మ. 1-27

3 సమానమైనవి

క. అని పలికి యిరుసులంతలు, సునిశిత బాణమ్ము వేయుచుం దలిమిర.
ద్రోణ. 5-78

4. అట్టి ఘోరావమానములు

ఉ...సతి నంతలు సేసి నను గృపారతిం, దక్కక తండ్రి పాలదిగె
ధర్మజుఁడు. శల్య. 2-321

౫. అట్టి పరిస్థితులు

తే. నేర్చి యలజడిఁబడిన వాణిజ్య విధులఁ,బడసి వైశ్యుఁ డన్నం బి
పడయు సుగతి, చచ్చు నంతలు పడి సిరిదెచ్చికొని చ,
లన్నంబు వెట్టి కాంతురు దివంబు. అను. 4-2

6. సమానములు

క. విను పృథివియును సరస్వతి,యును గోవును దానవిధికి నొక్కం
తలుగా, వినియుండుదు వీనింబో,లిన దాతవ్యములు నొండు లేవని
ఎంమన్. అను. 2-411

7. మనస్సులో నుద్దేశించినంత పరిపాటిగలది.

సీ...దురోధనాదుల దుష్కృతములు, నా మదిలో నిల్పనే మును

వారును, విధిమోహమునసైన విరసభావ, మావహిల్లినఁ బుట్టెడం
తలు పనులు. ఆ|శ. 1-34

**అంతలుసేయు** దే. క్రి. స. క

అంతటి ఘోర కార్యము లొనరించు

చూ. అంతలు

**అంతవంతము** సం. విశే. (త్. తి. త్.)

1. నాశము గలది, నశించునది

ఆ. అఖిల కర్మఫలము నంతవంతంబు మ,గ్నభక్తులకు ననంతపదము గలుగు. శాంతి- 4-254

2. తుది గలది, చివర గలది

వ. కర్మంబు లాద్యంతవంత బులు శరీరంబు గర్మబంధన కరంబు. ఆశ్వ. 2-96

**అంతవట్టు** దే. విశే (అంత+పట్టు)

1. ఆ పరిమాణము కలది. ఆ కొలఁదిది. (చేసికొన్న దానికి చేసికొన్నంత)

సీ. కురురాజుఁ జెలుపన తిరిగితి, నిఖల రాజులఁ దదనీకములను —
ఆ. నాము మదచి తెల్లభూములుఁ బాడయ్యె, నంతవట్టు ఫలము నను
భవింపు, మేపడంగ నిన్ను శాపానల జ్వాల, దగ్ధమూర్తిఁజేయు
దాన వినుము. స్త్రీ. 2-159

(ఈ క్రింది యర్థముల సముచ్చయ సహితమై కన్పట్టుచున్నది.)

2. అందఱు

వ తాను మున్ను త్రిగర్తేశు రథంబుకడ నిలువ నియోగించియున్న తమ్ములం గూర్చుకొని తమ యంతవట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. విరా. 3-219

3. అంతయు, సమస్తము

క. ఈ యెడ నిట్లమ్మహానీ, యాయుధములువెట్టి యెచటి కరిగిరి మన
కౌంతేయులు బృహన్నలా తగ, నీ యెఱిఁగన యంతవట్టు

నిక్కము సెప్పుమా. విరా. 4-128

4. ఎల్లరు

ఆ. సవ్యసాచి తనయు సరిగాఁగ, యమ్మహావీరు లంతవట్టు గాంగేయ నృపేంద్ర
భీష్మ. 2-181

5. అన్నియు

తే. ఆదరంబున నగ్గోవు లంతవట్టు, గూడి యట్లను బుద్ధికిఁ గురుపరేణ్య
అను. 3-116

శ్లో. సంమానన్య సహితాః సర్వాః శ్రియ మూచుర్నరాధిప
సం. అను. 228—33 (నిర్ణయ)

**అంతవట్టునుం గూడుకొను**
**అంతవట్టును గూడకొను** } దే. క్రి. సమ. ధా. అక.

ఎల్లరను గలిసికొను. అందఱతోఁ జేరు

వ. తమతమ యంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార్చఁ జాలి
రథంబులు దోలికొని చనుదెంచిరి. విరా. 3-155

వ. కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమ యంతవట్టునుం గూడుకొని
విరా. 8-211

**అంతవట్టువారు** దే. సర్వ. బహు.

ఎల్లరు

సీ...అవ్విరాటుండును నంతవట్టు
తే వారలకుఁ దత్తదుచిత ప్రకారములఁ బ్రియంబు దలకొన
సంవిధానంబు సేసె. విరా. 5-380

ఆ...తమ్ము, దాఁకిన, బెట్టుచంపె నంతవట్టు వారి. సౌప్తి. 2-8

'అంతవట్టు' శబ్దముపై 'వారు' అను సర్వనామ తచ్ఛబ్ద మను
ప్రయుక్తమయినది. ఈ యనుప్రయుక్తత నర్థవిశేషమును సాధింపఁ
గలుగుట లేదు. 'అంతవట్టు' అను శబ్దమునకే 'ఎల్లరు-అందఱు—
అన్నియు' అను నర్థములు గానవచ్చుచున్నవి చూ. అంతవట్టు.

**అంతవునంతకు** దే. జాతీయము.

1. ఆ గడువు పూర్తియగు వఱకు.

చ. అనిన నుదేష్ణ యిట్లనియె నంతవునంతకు మద్గృహాంబునం, దునికికి సమ్మతించితి. విరా. 3-67

2. ఆ కాలము గడచువఱకు.

క. అంతవునంతకు నీధ్వజు, కాంతారూపంబు నేను గైకొని యెద ని, శ్చింతమున మగుడఁ జనుమని, యింతికిఁ బురుషత్వమిచ్చె నెంతయు వేడ్కన్. ఉద్యో. 4-398

**అంతశ్చరము** సం. విణ (అ. ఆ. అ)

లోపల సంచరించునది.

క. అంతశ్చర మారుతములు, శాంతములుగఁ జేసి. శాంతి. 2-29

**అంతశ్శత్రువు** సం. వి. ఉ. పుం.

లోపలనున్న విరోధి—కామము, క్రోధము, లోభము, మోహము, మదము మాత్సర్యము—వీనినే అరిషడ్వర్గ మని పేర్కొందురు.

సీ...అంతశ్శత్రుకులమైన కామాది, వర్గంబుఁ దోర్చి. అను. 3-272

**అంతసేపు** దే. వి.

అంతకాలము. ఉద్దేశించి నంతకాలము.

వ. నాచేత నాయుధంబు లున్నంతసేపు నన్నుఁ జంప నెట్టివారికి నశక్యంబు. భీ. 1-191; ద్రో. 1-229

**అంతస్తాపము** సం. వి. అ. పుం

మనోవ్యథ, లోపలి పరితాపము.

వ. అంతఃపురమునకుం జని యంతస్తాపం బేర్పడకుండ నుండునంత. ఆది. 8-17

**అంతస్సన్నిధి** సం. వి. ఇ. పుం

హృదయమునందు నిలవుకొనుట—మనస్సు గోచరము చేసికొనుట-హృద

యమునందుఁ గనబడుట.

వ. ఏను విన్నవంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని. విరా. 1-37

**అంతస్సారము** సం. వి. అ. పుం.

లోపల సారము గలది.

క. నాదాంతస్సారకరణ నైష్ఠికచరణా ద్రో. 1-396

**అంతస్స్మితము** సం. వి. అ. న.

తనలోఁ దాను నవ్వుకొనుట, ముసిముసి నగవు

వ. బలసూదనసూను పలుకులు విని పాంచాలి యంతస్స్మిత కమనీయ కపోల యగుచు నిట్లనియె. విరా. 3-52

**అంతికము** సం. వి. అ. న

సమీపము, సామీప్యము, దగ్గఱ

క. దూరాంతిక దుర్గమ విస్తార సుగమ సన్నివేశతావదచలసర్వా రంభక. భీ. 1-306

**అంతిపురంబు నింతులు** వై. సమ

రాణివాసపు స్త్రీలు

వ. చిక్కని మల్లులులేని తఱి నంతిపురంబు నింతులు సూడ నయ్యావనీ కాంతుండు పోరింప శార్దూల శుండాలాదులతోడ నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు. విరా. 2-20

**అంతిపురము** వై. వి (సం. అంతఃపురము) (రూపాం)

అంతిపురి

1. అంతఃపురము, రాణివాసము, రాజు భార్యలుండు చోటు

ఆ. అంతిపురము చరిత కలవడ మెలఁగుచు, నుండె నవ్విరాటి యును ముదమున. విరా. 1-380

2. అంతఃపుర జనము

చూ. అంతిపురము చుట్టలికము.

**అంతిపురము చుట్టఱికము జాతీయము**

రాణివాసపు స్త్రీలతోడి సంబంధము, రాజుగారి భార్యలతో వ్యభిచరించుట

క. అంతిపురము చుట్టఱికం, బెంతయుఁ గీడంతకంటె నెగ్గు తదీయో-
పాంతచరకుబ్జ వామన, కాంతాదులతోడి పొందుకలిమి భటునకున్
విరా. 1–181

**అంతిపురి** వై. వి (రూపాం) అంతిపురము

అంతఃపురము, రాణివాసము

వ. అంతిపురి కోటకు లోనగు నొక్క సౌమ్యమందిరమున కమ్మనిం
గొనుచు...ఏగిరి. శాంతి. 6–266

**అంతిపురికోట** వై. వి.

అంతఃపురమునందలి కోట

చూ. అంతిపురి

**అంతిమము** సం. విణ (అ. ఆ. అ)

చివరదైయైనది, కడపటిది, చరమము

ఆ. అట్లుగాక పతుల యంతిమ సమయంబునందుఁ జింతదక్కి యను
మరణము, సేసి రేవి సుగతి సిద్ధించుఁ బతిసమేతలుగాఁగ నన్నితం
బినులకు- అను. 5–301

**అంతియ** దే. విణ

1. అంతే, ఆ మాత్రమే

ఆ. ఉన్నరూప పలుకు నన్నరులెక్కడఁ గలరు. తోఁచినట్లు పలుకు
పలుక నైన ఛల్లదమ్మయ్యో నంతియ కాకంత, వట్టుపట్టి చూడఁ
గలరె యెట్టివారు. విరా. 1–181

2. మాత్రము

వ. తాను నిజసహోదరులయట్లపోలె వేష్టాంతరంబుదాల్చిన యంతియ

కాక యూర్వశి యిచ్చిన శాపం బనుభవించుటకు శరీరాంతర పరి
గ్రహాంబు చేయుటంజేసి విరా. 3-52

3. దానితో సమానము—సమానము.

వ. నీ బలంబున నాలవ పాలుగొని మహీపాలుండు సత్వరంబుగా
ముందర పోవలయు, నంతియనేన తదనంతరంబు కదుపులంబోదివి
కొని చనవలయు. విరా. 4-237

అంతె దే

అంతియ, మాత్రము

తే. అంగములలోన మేలుత్తమాంగ మందు, నుత్తమంబులు గన్నులు
యుర్విజనుల, కట్టి కన్నులు లేవను టంతెకాక. ఆది. 5—11

అంతేవాసి సం. వి. న్. పుం. అలుక్సమాసము

శిష్యుఁడు

క...మార్కండేయుం డను మునినాథుం డంతేవాసిగణముతోఁ జను
దెంచెన్ అర. 1-202

అంత్యకాలము సం. వి. అ. పుం

ప్రలయసమయము

మ. గద సారించుచు, నంత్యకాల విచలత్కాలాకృతిన్ భీముడు.
ఉద్యో. 2-138

అంత్యజాతి సం. వి. ఇ. స్త్రీ

కడపటి కులము

క. శునకంబు రజస్వలయగు, వనిత పతితుఁ డంత్యజాతి వాఁ డాక్రియ
పట్టున కేశిరువులఁ జేరక,చనఁ జేయుటి నుగ్గడించి సంభావించెన్.
అను. 8—190

అంత్యజాతివాఁడు మిశ్ర. పుం.

కడపటి కులమువాఁడు.

చూ. అంత్యజాతి.

**అంత్యజుఁడు** సం. వి. అ. పుం. (స్త్రీ. అంత్యజా)

కడపటి కులమునఁ బుట్టినవాఁడు.

చ. అనుటయు నంత్యజుండు నగియట్టి విధంబధమంబు గాక.

శాంతి. 3-294

**అంత్యము** సం. విణ. (అ. ఆ. అ.)

కడపటిది. చివరది.

వ. ఆకాలంబున నీవు మండరూపంబునఁ బ్రచ్ఛన్నుండవై రాజకన్యలకు నృత్యంబు గఱపుచుండి తదంత్యంబున శాపమోక్షంబు వడయుము. ఆర. 1-368

**అందంద** దే. అవ్య (అందున్ + అందున్ + అ)

1. అక్కడక్కడ, అచ్చటచ్చట, అప్పుడప్పుడు

సీ. మట్టియ లొండొంటి బిట్టు దాఁకఁగఁ జేల, నందంద మువిగాళ్ళ నప్పళించు. విరా. 2-250

2. మిక్కలి, మిగుల, అత్యధికము.

సీ. అందంద కదిలెడు కొండలపాటుచేఁ దలఁకుచు నునికికి నిలుకడయును విరా. 2-315

3. వెంటనే, తత్క్షణము

సీ. పొడిచిన వెస బీఱువోవక యొండొరు, నందంద పొడుచుచు నవనిఁబెట్టి. విరా. 2-347

4. మఱిమఱి, మాటిమాటికి, తఱచుగా, వెంటవెంటనే.

ఉ. అందలి వారలెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగులం, దండ చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం, బందిన యట్టి మ్రోఁత విని. సౌప్తి. 1-5

క. అందంద మెడయుఁ దలయు న, మందాటోపమునఁ జెక్కుమాఱు లడిచి. శాంతి. 3-498

వ. ఇమ్మద్దియ...పాణితలంబున నందంద నెమ్మొగ మడిచికొనుచు స్త్రీ. 2-45

**అందని ద్రాక్షల పండ్లుగోయు** దే. జాతి

సాధ్యముగాని పదార్థములకుఁ బ్రయత్నముచేయు, అలవిగాని దాని నొనరింపఁ బూనుకొను.

క. చను చనదని చూడక యం,దని ద్రాకులపండ్లు గోయఁ దలఁచుట హిత వే, మును చెడిన రావణాదుల, విని యెఱుఁగవె యెన్నఁడుస వివేకవిహీనా... విశ్వా. 2-58

వాడుక—అందని పండ్ల కఱ్ఱులు చాచుట (ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః — కాళిదాసు)

**అందము**[1] వై. వి. (సం. అంతః=రమ్యము)

1. చక్కఁదనము, సౌందర్యము

సీ. హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి, యందంబు వింతగా నలపరింతు- విరా. 1-107

సీ. కాళ్ళయొప్పిద మాఁడుకట్ట నుజ్జ్వలము చే,యంగ సంకుం బాహు లంద మెడల. విరా. 1-228

2. విధము, రీతి

ఉ...పూర్ణశశి చెన్నునఁ బూర్వ మహీధరంబు కాం,తింగడచన్న యందము ప్రతీతమఁగాఁగ నటించు చాడ్పునన్. కర్ణ. 3-327

3. ఒప్పిదము, యుక్తమగు విధము

తే....ఖంద మొంద, నరసికుడువుఁడు కట్టుఁ డిచ్చానురూప, వస్తువులు గైకొన్నఁడు దురవస్థ దెలిపి, పాపికొనుఁడు. ఆశ్వ 4-176

**అందము**[2] దే. స. క్రి. అను ధాతువుయొక్క తద్ధర్మార్థకము.

(అను + దు + ము = అందుము, అందము)

అని పలుకుదము.

క...ఏమందము దో,స్సార నిశాంతోజ్జ్వలుఁ డగు, నా రాధేయుండు నచ్చె నర్జును చేతన్. కర్ణ. 1-28

**అందఱు** స. బహు

ఎల్లరు, ఎల్లవారు

వ. వారందఱు మహోద్భుతంబంద. విరా. 1-184

వ. భీష్ముని పలుకులు విని యందఱు సమ్మతించిరి. విరా. 1-374

క. అందఱు రథికులు పఱవఁగ, నిందేటికి మున్ను వచ్చి రిస్సీ యని సం క్రందనసుతు మార్కొనియె. విరా. 5-78

ఇది అంత శబ్దముయొక్క మహన్మహాత్యర్థకరూపము.

**అందలము** వై. వి (సం. ఆందోళము-ఆందోళిక)

1. శిబిక (మేనా), చుట్టును కప్పు లేక లోపల కుర్చీవలెఁ గూర్చుండుటకు వీలైనది. దీనిని పురుషులు ప్రయాణము చేయుట కుపయోగింతురు.

   ఆ...నీకు, సమ్మదయిలుగాఁగ సప్తర్షిగణము నా, యందలంబు మోవ నరుగు దెంతు ఉద్యో. 1-180

2. శిబిక (మేనా) చుట్టును కప్పుండి స్త్రీలు ప్రయాణము చేయుట కుపయోగించునది.

   వ. విదురుండు కుంతీ ప్రముఖ కురు స్త్రీజనంబుల నందలంబుల నిడికొని. శాంతి. 1-35

   క. సుందరులకు బాలురకును, నందలములు వేసడములు, నాయితములుగాఁ గందక కుందక చనువిధ,మొందఁగ సమకట్టుఁడు. మౌస.137

సామాన్యముగా నేఁటికాలమున 'పల్లకి' యనఁబడు వాహన విశేషమును వివాహకాలమునం దుపయోగించుట అక్కడక్కడ గలదేమో. పూర్వము బాల్యవివాహములు జరుగు సమయములందు ఈ పల్లకిని నూతనవధూవరు లెక్కి యూరేఁగెడివారు. ఇప్పుడు వీని స్థానము కారు లాక్రమించినవి. మున్ను పల్లకిని వివాహకాలమందే యుపయోగించెడివారు. మేనా యనునది ప్రక్కలు, తలుపులతో మూయఁబడి యుండును గాన దీనిని స్త్రీలే యెక్కు

వగాఁ ప్రయాణసాధనముగా నుపయోగించెడివారు. అందలములు పాడుకలోనుండి తొలఁగినవి. కాని యవి మేనాకంటె నెత్తుగా నుండి ప్రక్కలు తలుపులతో మూయఁబడక యొక రకము, మూయఁబడి యొక రకము రెండు విధములుగానుండి లోపలఁ గూర్చుండు ఒక కుర్చీవలె నేర్పాటు చేయఁబడి యుండును. ప్రస్తుతపు పల్లకిలే తిక్కన చెప్పియుండెననిన నట్టివాని యందు రాచస్త్రీలు పయనించుట యసంభవము. కావున మేనా వంటివే భారతకాలమునాఁటి యందలములు కావచ్చును. కనుక 'అందలము' అనిన 'మేనా' అనుట చెల్లునుగాని నేఁటికాలంపుల పల్లకీ మాత్రము చెల్లుట పొసఁగదు.

ప్రస్తుతపు జీపులవంటివి పురుషు లెక్కు అందలములు- కారుల వంటివి స్త్రీ లెక్కు అందలములు.

స్త్రీ లుపయోగించు అందలములలో భార్యాభర్తలు పయనించు టయు గలదు.

వ. పాండవాగ్రజుఁడు పాండురాజాగ్రజు నతని దేవిం బ్రభూతాం దోళికారూఢులంజేసి పురస్కరించుకొని. శాంతి. 1-౪50

అందలి దే. విశ (అందులనుండి యేర్పడిన విశేషణము) అందున్న

వ. అందలి విప్రు లెదురువచ్చి కాంచి. ఉద్యో. ౩—147

వ. ఇందలి యందలి బంధుమిత్త్రసహాయ జనంబులు గలసి.
ఉద్యో. 1—377

వ. గంధమాదనమందలి కొలనికిం జని ఆది. 1-38

అందాఁక దే. అవ్య.

అంతదనుక, అంతవఱకు

తే. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు, కీర్తి యందాఁక నతు యస్ఫూర్తి దాల్చి, శాంతి. 2-148

అందించు దే. క్రి. సక. ప్రేర

కలిగించు, కలుఁగఁజేయు

వ. ఇట్లు ప్రచండమూర్తియై మధ్యందిన మార్తాండుడుంబోలె వెలింగి
విప్వన్నుండు వియచ్చరుల కచ్చెరువందించె. ద్రోణ, 4-302

క. విను పౌరుషమును దైవము, నన రెండును గార్యఫలము నందిం
పంగ నెట్టన కారణములు గావున, జననాయక సద్విశములు విచా
రింపంగన్. అను. 1-142

అందిచ్చు దే. స. క్రి.

అందించు, పొందించు, చేర్చు, ఇచ్చు, అందఁజేయు.

క...జమ్మివెసం బ్రాఁకి విడిచి చావము నా కందిమ్మనుడు.
విరా. 4-112

అందియ వై. వి. (సం. అందుకః) (రూపాం) అందె

అందె, స్త్రీల కాలి నగ.

తే. అందియల మొరవంబున కెరగుదెంచి, ప్రోది రాయంచ రయ
మునఁ బోవు నవ్విధంబ విరా. 4-26

అందియిచ్చు దే. స. క్రి.

1. చేతికిచ్చు

వ. అప్పాలతి పార్థ ముఁబొందుచు నందియిచ్చు కాంచన చషకంబు
పుచ్చుకొని విరా. 2-102

2. తీసికొని చేతికిచ్చు

వ. అంబికేయుండు ప్రసన్నవదనుండగుచుం బ్రతిష్ఠితంబులయిన కల
శంబులలో నుజ్జ్వలంబగు నొక్కటి ధౌమ్యుండందియీ నెత్తి యా
భూపోత్తము నభిషేకించె. శాంతి. 1-375

అందు[1] అవ్య. ద్రు

1. దానియందు

ఉ. ఆదరణీయపార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి యష్టాదశ పర్వ
నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం, దాది దొడంగి
మూఁడు కృతులు. విరా. 1-6

౨. వానియందు

క. విను సుమతి విషయములం దుచితముగఁ గలిగినను బొందఁ డుదకం
బుల బొందని విసరుహపత్రము చాడ్పున. శాంతి. 5-527

3. వారియందు

వ. ఇరువురయందు భోగేచ్ఛసలిపి,
సీ...అయ్యిరువురయందు భోగేచ్ఛ సలిపి యం ధ పతత్వము వ
యుదు నని తలంచి. సభా. 1-135

4. వానిలో

సీ. విబుధుల పండ్రెండు వేలేండ్లు సనునంత, నాలుగుయుగములు నోలి
నడచు, గృతయుగంబున కందుఁ జతురంశకములు.
శాంతి 5—46

5. వారిలో

వ. నేన పెద్ద నేన పెద్ద నని తమలో నిద్దఱును వివాదంబు నేసి ప్రహ్లా
దుపాలికిం జని రందు సుధన్వుండు ప్రహ్లాదున కిట్లనియె.
సభా 2—289

6. ఆ ప్రదేశమునందు - అచ్చోట

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశ
మాత్ర మొక్క చోటి కల్గఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే,
యిమ్ములఁ జల్పి వేగుటయు విరా. 1-68

7. అక్కడకు, అచ్చోటికి

వ. అట్లు గాన కదా యే నందు రా నని పలికి మఱియును.
ఉద్యో. 4—51

8. దెస, వైపున, పక్షమున

వ. అప్పుడు నీయందుఁ జేయంగల సైనికులు సూచి తత్తేజోవిశేషం
బునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి. కర్ణ. 8-207

9. సప్తమీ విభక్తి ప్రత్యయము

వ॰ నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్నసంచరణమున వర్తించుట
యును. విరా. 1-54

10. వలన - పంచమీ విభక్తికి బదులు

వ...వాని యిచ్చు ధనంబుకంటె వాయం డధికధనంబు గొనిపొమ్ము.
ఆది. 2-192

11. చేత - హేత్వర్థమునం దృతీయకు బదులు

క. ఇందీవర లోచనస్త్రీయం దే నభినందితాత్ముణైనట్టులు, నందనుల
యందుం బౌత్రుల, యందును నభివంద్యవగుమ యని దీవించెన్.
ఆది. 8-6

12. ఒద్ద, సమీపమున

వ. ఇవ్వర్షాకాలంబు మాయందయుండి చాతుర్మాస్యంబు సేసి మమ్ముం
గృతార్థులం జేయుండు. ఆది. 8-180

వ. ఆ పర్ణాదులవలన నిన్నెఱింగిన వాడనై నిన్నిట రావించు నుపా
యంబు దలంచి యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరం బగునని
ఋతుపర్ణునందుం బ్రకాశింప సుదేవుం డను బ్రాహ్మణుం బుత్తెంచితి
అర. 2-213

13. నిర్ధారణ షష్ఠి—లో

మత్తకోకిలము...ఈతని బుద్ధి మీ, రేవగింపక చేకొనుం డిది యెల్ల
యందును ధర్మసద్భావ మొక్కని కేర్పరింపంగ బ్రహ్మకైనను
బోలునే. సభా. 2-236

14. తచ్ఛబ్దార్థకము

(అది - అవి - వాడు - వారు - ఆమె మొ. వానిని దెలుపును)
ఇది ఈ సందర్భమున సర్వనామముగానయి విభక్తి ప్రత్యయము
లను దీసికొనును.

క. అని భీష్ముండు వెండియు నిట్లను నా పన్నిరువురును ధరాధిప
యోగ్యత్వ నిరూఢులెల్ల కర్మంబున కౌరసుం డెండులోన ముఖ్యుం
డరయన్. అను. 2-255

15. క్రియాజన్య విశేషణ పూర్వకముగా నుండును.

క. దొరకొనని దానిఁ గోరక, దొరకొనినందును మమత్వతుష్ట హృదయతం, బొరయక- అను. 4-244

(దొరకొనినందు : లభించిన దానియందు)

క. వినఁ జూడంబడునం దెల్లను సమతం బరముఁ గనుచు. శాంతి. 6-285

(చూడంబడునందు : చూడఁబడుదానియందు)

అందు[2] దే. స. క్రి.

1. పొందు.

వ. వానియందు మీకుం జాడం బోలినయెడఁ దగిన చందంబున నిలుచువారముగాక యనినం బ్రియమంది ధర్మనందనుం డిట్లనియె, విరా. 1-62

2. అనుభవించు

సీ. చ్యవనుని వాంఛకు సంయాతినందన, యిడుమలఁ గుడవదె యడవిలోన, రాఘవుతోడ నరణ్యవాసము సేసి సంతాప మందదె జనకతనయ. విరా. 2-234

3. కలుగు, ఒదవు.

ఉ...అ సమి,త్కేళి వియచ్చర ప్రతతికిన్ వెఱఁగందఁగఁ జేసె నెంతయున్. విరా. 3-184

4. అంటు, తాఁకు, స్పృశించు.

మ. అటమిన్నందిన యట్టివాని పొడ వెంతన్నట్లు ఫాలాక్షు నె,క్కటికయ్యంబున. ఉద్యో. 2-174

అక. క్రి.

5. చేతికిఁజిక్కు, చేతికి నందుఁబాటులో నుండు.

క. చనఁ జనదని చూడక యం,దని మ్రాకుల పండ్లు గోయఁ దలఁచుట హితమే. విరా. 2-58

6. ప్రాప్తించు-లభించు-సిద్ధించు.

తే. వేదసారంబు సత్యంబు వినుఁడు సత్య,సారమూర్తి దమము దమ

సార మనఘు,లార మోక్ష మీ పరిపాటి గారవమున నాదరించు జనఁబుల కందు ముక్తి. శాంతి. 6-580
ఉ... లో,శానుగతిన్ విమోక్షపద మందదు సంగముకల్మి నెమ్మె యన్. శాంతి 6-580

7. గ్రహించు, తీసికొను, స్వీకరించు.

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ డర్థి నెయ్యది యిచ్చినే నందలేక, వారథోటి యగుచు నమస్కార సఖ్య నుతి నిరాకృతి రహితుఁడై యతి వెలుంగు. అశ్వ. 2-172

శ్లో. గ్రాసాదాచ్ఛాదనా దన్యన్న గృహ్ణీయాత్కథంచన.
యావదాహారయేత్తావ త్ప్రతిగృహ్ణీత నాధికమ్.
సం. భా. ఆశ్వ. 46-88 (నిర్ణయ)

**అందుల** దే. అవ్య.

1. అందు (సప్తమీ విభక్తి ప్రత్యయము)

2. ఆ చోటు

చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ నిట్లను నటులేనిఁ బోవలయు హస్తిపురంబున కిత్తెఱంగు సెప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పిపుచ్చు. అశ్వ. 3-4.

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి, దానవు మిన్నకయ యనుచితంబులు పలుకం,గా నేల యరుగు మంబురు,హానన, యెందుండివచ్చి తిందు. లకు వడిన్. ఆది. 4-76

**అందోఱు** సర్వ. బహు.

అందఱు

క.. భీమునకు నం,దోఱుఁ గీడ్పడఁదొడఁగి రుద్ధతులు రాజసుతుల్. ఆది. 5-164

సీ. కూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షులం దోఱును మనకు. అర. 1-269

ఆ. అన్యథాకరింప నలవియే యనిన నం,దొఱకు నిట్టు లనియె ద్రుపద
విభుఁడు, ఆది. 7-252

అంధకారము సం. వి. అ. పుం.

చీకటి

వ. అవులవులం బను నంధకారబు దూరంబులయందును లేకునికి.
విరా. 2-240

అంధకారాతి సం. వి. ఇ. పుం.

శివుఁడు. అంధకుఁడను రాక్షసునకు శత్రువైనవాఁడు.

వ. అంధకారాతి యిట్లనియె. అను. 5—161

అంధకారి సం. వి. ఇ. పుం.

శివుఁడు. అంధకుఁడను రాక్షసునకు శత్రువైనవాఁడు.

తే... వేఁట నెపంబున నంధకారి, గదలె. అర. 1-800

అంధకాసురుఁడు సం. వి. అ. పుం.

అంధకుఁడను పేరుగల రాక్షసుఁడు. చూ. అంధకుఁడు.

వ. అయ్యంధకాసురభంజను కతంబునం గడింది పగ అడంపుదురు.
ద్రో. 5-428

అంధకుఁడు1 సం. వి. అ. పుం.

ఒక యాదవుఁడు. ఇతని పేర అంధకవంశమని యొకానొక యాదవుల తెగకుఁ బేరు వచ్చినది.

వ. ఇతని వంపునంగాదె యదు భోజాంధక వృష్ణి సంజయ కేకయ ప్రభృతి భూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లు చున్న యది. ఉద్యో 1-886

ఇతఁడు యుధాజిత్తుపుత్రుఁడు. క్రోష్టునకుఁ బౌత్రుఁడు. అంధక వంశమునకు మూలపురుషుఁడని ఆవుని నిఘంటువునందును సూర్య రాయాంధ్ర నిఘంటువునందును గలదు.

భాగవత విష్ణుపురాణ హరివంశాదులను బట్టి చూడ క్రోష్టునకు యుధాజిత్తను తనయుఁ డున్నటుల, నతనికొడుకే అంధకుఁడైన టులఁ గానరాదు. పైఁగా క్రోష్టునకు అంధకునకు మధ్య నెన్నిహో తరములు గడచియుండ క్రోష్టుపౌత్రత్వ మంధకున కెట్లొసంగిరో తెలియదు. అంధకుని తండ్రి సత్త్వతుఁ డని పై సాత్త్వికపురాణ వచనముల వలన విశదమగుచున్నది.



అంధకుఁడు
కుకురుపు
భజమానుఁడు
(ఇతని కుటుంబము కృతవర్మకు సంబంధించినది)
శుచి
కంబళబర్హిషుడు
ధృష్టుడు
కపోతరోముఁడు
తైత్తిరుఁడు
పునర్వసుఁడు
అభిజిత్తు
ఆహుకుఁడు
(భార్య కాశీరాజాత్మజ)
ఆహుకి
(అవంతీశ్వరు భార్య)
దేవకుఁడు
ఉగ్రసేనుఁడు
ఈయేడ్వురు వసుదేవుని భార్యలు
ఈ యార్వురు వసుదేవుని తమ్ముని భార్యలు

అంధకుని నుండి యాహుకుని వఱకుఁ జెప్పఁబడినది సంక్షిప్త క్రమమని పురాణములు పలుకుటచే, పెక్కుతరములు గడచి యుండవచ్చును. ప్రధాన పురుషులనే పురాణములు పేర్కొనియుండవచ్చును.

**అంధకుఁడు**[2] సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు.

వ...అంధకారాతి యిట్లనియె. అను. 5-191

అంధుఁడు, ఆంధకుఁడు దైత్యులు, ఇంద్రునిచే నిర్జింపఁబడిన పుత్రులు గల దితి శోకసంలగ్నమానసయై కశ్యపుని దేవతలకు అవధ్యుండగు నొక తనయుని ప్రసాదింపుమని ప్రార్థించెను. అప్పుడు కశ్యపుఁడు దితికి నీతనయుఁడు రుద్రునిచేఁ దక్క తదితర దేవతలచేఁ జావఁడని వరమిచ్చెను. దితి యంగుళోదరదేశమునుండి పుత్రుఁడు ఉన్మించెను. అతనికి వేయిచేతులు వేయితలలు రెండువేలకన్నులు రెండు వేల పాదములు గలవు. గ్రుడ్డివాఁడు గాకుండినను గ్రుడ్డివానివలె నతఁడు నడుచుటచే అంధకుఁడని పిలువఁబడెను.

శ్లో- సుప్రవజ త్యాంధవద్యస్మా దనంధోఽపి హి భారత,
తమంధకోఽయం నామ్నేతి ప్రోచు స్తత్ర నివాసినః.

హరివంశము 145 అధ్యాయము.

ఎవ్వరిచేఁ జావనని గర్వముతో నెవ్వరిని లెక్కచేయక సుందరులగు స్త్రీ లెక్కడనున్న నక్కడనుండి పట్టి తెప్పించుచుండెను. ఇతరుల ధనమపహరించుచుండెను. అతఁడు స్వర్గమునుండి పారిజాత వృక్షమును హరించికొని పోవుచుండ శివుఁ డీతని జంపెను. మత్స్యపురాణమును బట్టి అంధకుఁడు కామాంధుఁడై భూమికే తెంచిన పార్వతి విహరింప బోఁగా శివుఁడు త్రిశూలముచేఁ జీల్చివైచెననియు మరణసమయమున నతఁడు శివునియెడఁ బ్రపత్తిచేయుటచే శివుఁ డాతనికి గణస్థాన మొసఁగె ననియుఁ దెలియుచున్నది.

**అంధత** సం. వి. ఆ. స్త్రీ

గ్రుడ్డితనము, కన్నులు గానరాకపోవుట.

క. ఆ ధృష్టద్యుమ్నాదులు, క్రోధాంధత నడరి. కర్ణ. 2-346

**అంధతమసము** సం. వి. అ. న

దట్టమైన చీఁకటి.

క. గంధర్వులను వెదఁకున, సంధతమసగూఢవృత్తి ననిల సుతుఁడు గ్ర- ర్వాంధమతి యైన సూతు స,బాంధవముగఁ జంపెఁగాక పరులకు వశమే! విరా. 3–116

**అంధము** సం. విశ. (అ. ఆ. అ)

1. గ్రుడ్డిది, కన్నులు కనఁబడకుండఁ జేయునది, వివేకము తొలఁగినది.

క. బంధు శతంబులు శౌర్యమ,దాంధము లై విరా. 1–325

శా. గర్వాంధప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ విరా. 2–55

సం. వి. అ. న.

క...అంధమయ్యె జగంబుల్ అర. 3–25

**అంధీభూతము**
**అంధీభూతుఁడు** } సం. విశ (అ.ఆ.ఆ)

గ్రుడ్డియైనవాఁడు, గ్రుడ్డితనముఁ బొందినవాఁడు.

శా...జం,తేపో తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులంజేయవే ఉద్యో. 1-321.

శా. త్రేతాద్వాపరసంధి మద్ధత మదాంధీభూత విద్వేషి జీ- మూతౌఘగర్జనుండు రాముఁ డలుకన్ ఆది. 1-28

**అంధుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

1. గ్రుడ్డివాఁడు

చ...అంధుఁడు దీనుఁడు వృద్ధు నైన యీ, నృపు నరయంగఁ బాండ వులు నీవును నుక్తులుగా రె యెమ్మెయిన్ శల్య. 2–323

విశ

2. వివేకము లేనివాఁడు, వివేకము లేనితనము గలది.

వ. పీ, డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండ నై యది మఱచితి కర్ణ. 2-214

ఉ. వచ్చు మదాంధవృత్తి ననివారణ వొక్కఁడు నాట్యశాలకుం.
విరా. 2—279

**అంధ్యము** సం. విణ (అ. ఆ. అ)

గ్రుడ్డియైనది. వివేకము కోల్పోయినది.

కం. వింధ్యాద్రి వోలె నాప్రతి,వింధ్యుఁ డవరితోగ్రమూర్తి వెలయ నిలిచి ద,ర్పాంధ్యమతి నడరి దీప్తాఁవంధ్యాస్త్రము లక్కుమారునకై బలువెన్ ద్రోణ. 5-170

వి. అ. న.

అంధత్వము. కన్నులు తెలియకుండుట

ఉ...కృష్ణ నీ,విక్కడ కేల వచ్చితివి హీనవివేకుఁడు దుర్మదాంధ్యముం, దక్కనె... సుయోధను డుర్వి యిచ్చునే కల్కి. 1-357

వ. చాపాచార్యనందనుండు మేనెత్తుట జొత్తిల్లి మోహాంధ్యం బుతోఁ గలసి యునికిం జేసి. సౌప్తి. 1-202

**అంపకోల** దేశ్య. వి. సమ. (అమ్ము+కోల=అంపకోల)

బాణ విశేషము అమ్మనీ నకును కోలకును ప్రత్యేకముగా బాణమను నర్థ మునఁ బ్రయోగములు గలవు.

అమ్ము : సీ. పల్వింట మం,టలు గ్రమ్మ నమ్మెయుటయున్
కర్ణ. 1-118

కోల: క...పదియుఁ బదేను నుచ్చిపోయెం గోలన్
విరా. 5—82.

అంపకోల విశేషమేమో విచారింపవలసి యున్నది.

కోల పొడవైనది (గడవలె)

పొడవై సునిశితమైన బాణము—అంపకోల యని చెప్పవచ్చును (కోలవంటి యమ్మ అని యర్థమిచ్చును)

క. అవ్విరుని వాలంపఱ, క్రొవ్వు నడఁచి తనదు నంపకోల లడ

రఁగా, నవ్వసుధాధిపుఁ డల్లని, నవ్వాలయఁగ మూఁకకొనె మృణా
రహితుండై కల్య. 1-248

ఇందున వాలంపములకుఁ బ్రతిగా నంపకోలలు చెప్పంబడినవి. కావున అంపకోల వాలమ్ము అనియే నిర్ధారింపఁదగినది.

అంపకాలువ దే. వి. సతు.

బాణముల ప్రవాహము

సీ...అన్నరుఁడు వాలంప కాలువ లోలి నడరించుటయు.

భీష్మ. 3-234

అంపతాఁకు దే. వి.

బాణము తగులుట

సీ...ఒక్క, యాఁబెయ్య యుటికి నా యజ్ఞానమున నంప, తాఁకునఁ
గూలుడు. కర్ణ. 2—90

అంపపాన్పు దే. వి. సమ.

బాణములతో నేర్పడిన శయ్య

క. రవిఁ గొల్చి యుత్తరాయణ, మవువంతకు నంపపాన్పునం దిట్లు
మహోత్సవ శీల నిలుతు. భీష్మ. 3-428

అంపవెట్టు దే. వి. సమ.

బాణముపోవునంత పరిమితిగల దూరము

వ...పతిత శేషఁబగు వబ్బలం బిరుగెలంకులం దొలఁగి యంపవెట్టు
నేం కవుల సని చూచుచుండె. ద్రోణ. 4—228

అంపపొది దే. వి. సమ.

1. అంబుల పొది — తూణీరము

ఆ. అంపపొదుల నిగుడు నంకు వితానంబు, దీప్రమరకతముల దీధితు
లుగ, దా టిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయ్య కోటి
తాద్రి వెడలి వెలిగె. భీష్మ. 1—106

2. బాణముల కట్ట

వ. జమదగ్ని మహాముని క్రీడార్థియై శరాసనంబు ధరించి రేణుకాదేవి బాణంబుల కట్టఁగొని తనతోడం జనదేర నివాసంబు వెడలి యొక్క బయల నయ్యంప పొది నిలువవైపించి దూరాపాతనం బాచరింప నక్కుసుమ కోమలి యమ్ము లేఱుకొని వచ్చి యిచ్చు చుండు. ఆను. 3-256

3. బాణముల సమూహము

తే. పలక పఱియలుగాఁ జేసి యలుఁగు దునిమి, యొడల వాలంపపొది నింప నొల్లఁబోక. భీష్మ. 3-28

**అంపబలువు** దే. వి. సమ.

బాణములయొక్క శక్తి — బాణాధిక్యము

సీ...అర్ధానవేంద్రుని యంపబలువు, చేత నతండు మూర్ఛిల్లి. ద్రోణ. 3-259

**అంపమూడమంచు** దే. వి. సమ.

బాణముల సమూహముచే నేర్పడిన దట్టమైన మంచు.

తే. అర్జునుఁడు గవియించిన యంపమూఁడమంచు దళముగఁ గప్పిన మార్గణాంశుజాలముల వెస విరియించె శాంతనవ పతంగుఁ డుద్ద్యోతమాన ప్రతాపలీల. విరా. 5-169

(మూడు మంచు — అని పాఠాం)

అంప మూడుమంచు - బాణములచే నేర్పడు (కలుగు) మంచు.

**అంపమొత్తము** దే. వి. సమ.

బాణముల సమూహము

మ...సత్వరుఁడై యేసి రథంబుగూడఁ బొదివెన్ వాలంపమొత్తం బునన్. భీష్మ. 3-254

**అంపఱ** దే. వి

బాణసమూహము

తే- భీష్మనంపఱ కోర్వక పెల్లగిల్లి భీష్మ. 1-287

క. గురుసుతు బెడిదపుటంపఱ, నరనారాయణులు నొచ్చినన్. భీష్మ. 2—305

"అంపఱయనంగ శరసమూహంబు దనరు"- ఆంధ్ర భాషార్ణవము. 2—218

**అంపవాన** దే. వి. సమ

**బాణ వర్షము**

ఆ. అతఁడు గాండివమున నడ్డసాళులు వైవ, దురుల నంపవాన గురి యుఁగాని విరా. 4—197

**అంపవెలి** దే. వి. సమ.

**బాణప్రవాహము**

క. కవిసినఁ గడంగి యేనును, గవియించితి నంపవెల్లిఁ గడుఁగ్రూరత ఉద్యో. 4—342.

**అంపవెల్లువ** దే. వి. సమ.

**బాణప్రవాహము.**

సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యు మూఁడునా,రసముల నేసియు గ్రంపుటంప, వెల్లువ వఱపిన, భీష్మ. 3—218

**అంపసెల** దే. వి. సమ

**బాణముల సెలయేఱు**

క. ఆతతబలుఁ డగు భీష్ముని, చేతిబలువు ద్రోణు నంపసెల లవియు టయు, జూతు రటు రండు. ఉద్యో. 4—192

**అంపసోన** దే. వి. సమ

**బాణవర్షము**

క. విజయుం డను శైలము గల,శజధారాధరము గప్పె శరవృష్టి మహా, ద్విజు నతఁ డేయక కడున,క్కజముగ నయ్యంపసోన గ్రక్కున మాన్పెన్ ద్రోణ. 3—76

**అంపు** దే. స క్రి.

వంపు - అనుచు - పనుచు - సాగనంపు

చ. అడవికి నేఁడు నాఁడు మము నంపఁగనెంతయు దవ్వు వచ్చిన,ప్పుడు
ఉద్యో. 3-185

**అంబ**[1] సం. వి. ఆ. స్త్రీ.

1. తల్లి, జనని

క. నాతోడి ప్రేముడిం గడు, నాతురయై యెదురుచూచు నంబకుఁ జేతు, ప్రీతిగఁ జని. విరా. 4-81

ఆ. వచ్చి పోయి చూచువాఁడుగా కిదుమలఁ, బడునె తల్లివోలెఁ బట్టి తోడ, దండ్రి చెప్పు నిట్లు ధర్మశాస్త్రంబులు, నంబ గౌరవమున నధికయగుట. శాంతి. 5-274

2. గౌరవార్థకమునందు స్త్రీ ప్రత్యయంబగు 'అమ్మ' పై నను ప్రయుక్తం బగు.

సీ. మజ్జనకుండు సమ్మాన్య గౌతమ గోత్ర, మహితుండు భాస్కర మంత్రి తనయుఁ, డన్నమాంబాపతి. విరా. 1-10

(అన్నమ్మ—అన్నమ + అంబ = అన్నమాంబ)

3. పార్వతి

ఉ...అం,బా దయితుండు దృఙ్మహిత ఫాలుఁడు లోలుఁడు భక్తి యుక్తిచేన్. ద్రోణ, 5-425

4. ఒక నది - మత్స్యదేశమునఁ బ్రవహించునది.

వ. (భాగీరథి శాపమువలన అంబ) ... ఒక్కవాఁడు నిజవ్రత ఫలంబులో సగంబున నంబయను పేర నదియై యమ్మండలంబునం బరఁగి
ఉద్యో. 4-364

**అంబ**[2] సం. వి. ఆ. స్త్రీ.

కాశీరాజు కూఁతులలోఁ బెద్దది. అంబిక, అంబాలిక ఈమె చెల్లెండ్రు. ఈ అంబా చరిత్రము సంస్కృతాంధ్ర భారతములలో రెండు తావులఁ గలదు. ఒకటి ఆదిపర్వమున భీష్ముఁడు తన సోదరునికి

వివాహముసేయు సందర్భమున — రెండవది యుద్యోగ పర్వమున కృష్ణ దౌత్యానంతరము శిఖండితోఁ దాను బోరకుండుటకుఁ గల కారణమును భీష్ముఁడు దుర్యోధనున కెఱింగించు పట్లను—

కాశీరాజు తన కూతురైన అంబ, అంబిక, అంబాలిక అను వారలకు స్వయంవరము చాటించుట, భీష్ముఁ డది యెఱింగి బలాత్కారముగా వారి మువ్వురను తోడితెచ్చుట — ఎదురైన సాళ్వాదుల నందఱ జయించుట — అంబ తాను సాళ్వుని వరించితినని చెప్ప భీష్ముఁ డామెను సాళ్వునియొద్దకుఁ బంపుట సాళ్వుఁ డామెను బరిగ్రహింప నిరాకరించుట. అంబ భీష్మునిపైఁ బగసాధింపఁ దలచి తపస్సుచేసి, శంకరుని వరప్రభావమువలన ద్రుపదునకు శిఖండియై పుట్టుట యను నవి రెంట భేదము లేని కథాంశములు.

తెలుఁగు భారతమున ఆదిపర్వమునందు అంబ కోరికపై భీష్ముఁ డంబను వదలివైచినంత వఱకే గలదు వావిళ్ళవారు వేసిన సంస్కృత భారత ప్రతియందును నంతమాత్రమే కలదు. బహుశః నన్నయగా రాంధ్రీకరించిన ప్రతి వావిళ్ళవారు వేసిన ప్రతిగాని దానివంటి ప్రతిగాని యైయుండునేమో. దాక్షిణాత్య ప్రతియని ముద్రింపఁబడిన సంస్కృత భారతప్రతిలో ఆదిపర్వమున ఉద్యోగపర్వ కథలో లేని విశేషాంశమున్నది. అది యేదన—

భీష్మునిచేఁ బంపఁబడిన యంబ సాళ్వుఁజేరి యతనిచే నిరాకరింపఁబడి విచిత్రవీర్యునకుఁ బెండ్లి సేయుమని భీష్ముని ప్రార్థింప మఱల వచ్చినది. భీష్ముఁ డామెకుఁ గాదని చెప్పి పంపెను. ఆమె మఱల సాళ్వునిజేరి గ్రహింపుమని ప్రార్థించెను. సాళ్వుఁడు మఱల నామెను దిరస్కరించి పంపెను. ఆమె మఱల వచ్చి భీష్మునే పెండ్లాడుమని ప్రార్థించెను. భీష్ముఁడు కూడదనెను. ఇట్లు తిరుగుటలో ఆఱు సంవత్సరములు గడచినవి.

అప్పటికి అంబకు విసుఁగు జనించి 'బాహుదా' నదీతీరమున ఘోర నిష్ఠతోఁ బదిరెండు సంవత్సరములు తపము చేసినది. అప్పుడు

కార్తికేయుఁడు (కుమారస్వామి) ప్రత్యక్షమయి యొక పుష్కర మాలికనొసఁగి 'అంబా! దీని ధరించినవారు భీష్ముని నిర్జింతురు. పొ' మ్మని పంపెను. అంత నామె 'యేనృపు డామాలిక ధరించి భీష్ముని వధించునో వాని భర్తగా వరింతు' నని యెల్లదేశము లైదు సంవత్సరములకాలము క్రుమ్మరి యెందును రక్షకునిగానక పాంచాల దేశమున కరిగి ద్రుపదుని శరణుఁ జొచ్చెనది. ద్రుపదుఁడును గాంగేయు భుజబలంబునకు వెఱచి యంబను రక్షింప నియ్యకొన కుండుటచే నామె యా మాలిక నాతని మందిరద్వారమున వైచి పరువెత్తఁబోగెను. ద్రుపదు డద్దానిగొని 'అమ్మా, తీసికొని పొమ్మీ మాలిక'నని వెంబడించెను. ఆమె 'ఇది తీసికొని పాఱవైచినను భీష్మని తోడి విరోధము తప్పదని కార్తికేయుని యాజ్ఞ' యని పలికి యెట కేనిం జనియెను. ద్రుపదుఁ డనివార్యమైన భీష్మ వైరమునకుఁ గుందుచు శంకరుఁ గూర్చి తపమునేసి భీష్మవధకు గారణుఁడగు శిఖండిని గనియెను.

ఈ కథాంశమంతయు ఆ భారతప్రతియందు నైతము ఉద్యోగ పర్వమునఁ గానరాదు.

అన్ని సంస్కృత భారత ప్రతులయందును ఉద్యోగ పర్వమునఁ గల విశేష కథాంశమేమన :— అంబ పరశురాముని శరణుఁ జొచ్చుట, భీష్మ పరశురాముల యుద్ధము—పరశురామ పరాజయము, వసువులు శాంతి గలిగించుట, అంబ తపోవనమునకు వెడలుట. తపస్సు చేయు నంబకు జాహ్నవి, యేఱయిపొమ్మని శపించుట.

(చూ. ఆంధ్రభార. ఉద్యో. 4-343, 368)

తన తపఃప్రభావమున సగమేఱయి యంబయను నదిపేర నంబ మత్స్య దేశమునఁ బ్రవహించుట, శివప్రసాదమున నంబ శిఖండియై జనించి భీష్మని జంప వరము పొందుట. అంబ దేహత్యాగము నేసికొనుట.

యథామూలముగాఁ దిక్కన యుద్యోగ పర్వాంతర్గత కథాంశము లను దెనిఁగించెను. నన్నయాంధ్రీకృతాది పర్వాంతర్గత కథాభాగమునఁ బైయంశము లేకపోవుటవలన ఉద్యోగపర్వమందుఁ జెప్పబడిన—

"అట్టియెడ ద్రుపదుఁ డనపత్యయగు తన మహిషి విషాదంబుల దీర్పం దిపురుటను గాంగేయుతోడి రోషంబునను శివుని నుద్దేశించి తపంబుచేసిన" — ఉద్యో. 4-369 – అను వచనంబున కాకరంబు తెలుఁగు భారతంబునఁ గానరాకున్నందున కేవల తెలుఁగు భారతము చదువువారికి ద్రుపదునకు భీష్మునిపై రోషమెందుకా యని సందేహము కల్గును.

తిక్కనగారు పుష్కరమాలికా వృత్తాంతము చూచి యుండరేమో చూచిన అంగీకరించి యుందువారే.

ఆది ఉద్యోగపర్వములఁ గల విరుద్ధాంశములు :—

1) ఉద్యోగపర్వమున "బిభేమి భీష్మాత్సుశ్రోణి త్వం చ భీష్మపరిగ్రహః". సం. భా. 145-24 (వావిళ్ళ) అనుదానిబట్టి సాళ్వుఁడు అంబను నిరాకరించుట భీష్మునివలన భయపడియా యని సంశయము గల్గుచున్నది. కాని ఆంధ్రమునఁ గాని, సంస్కృతమున నాదిపర్వమును బట్టిగాని యిది కానరాదు.

2) అంబ తమ్ము సాళ్వుఁడు వరించినట్లును అది తండ్రి కిష్టమైనట్లును ఆదిపర్వమునఁ గలదు.

ఆ. వరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ, దండ్రిచేత, బూర్వదత్తనైతి. ఆది. 4-213

శ్లో. మయా సాళ్వపతిః పూర్వం మనసా హి వృతః పతిః
తేన చాస్మి వృతా పూర్వ మేష కామశ్చ మే పితుః
మయా వరయితవ్యోఽ భూత్సాల్వ స్తస్మిన్ స్వయంవరే.
సం. భా. ఆది. 103—56, 57, 58 (వావిళ్ళ)

ఉద్యోగపర్వమున అంబ తన వరణము తండ్రియెఱుఁగక తనకు స్వయంవరము ప్రకటించెనని కలదు.

"మా తండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించిన కతంబున నింతపుట్టె. ఉద్యో. 4-281

శ్లో. మయా సాళ్వపతిః పూర్వం మనసాఽభివృతో వరః
తేన చాస్మి వృతా పూర్వం రహస్యవిదితే పితుః.
సం. భా. ఉద్యో. 174-6 (వావిళ్ళ)

అథవా పితరం మూఢం యోమేఽకార్షి
సం. భా. ఉద్యో

సంస్కృతమును బోల్చి చూడని విమర్శకులు స
తిక్కన చూచి యుండఁడని చెప్పుట కి విరుద్ధ
వచ్చునని యింతగా మూలములతో వ్రాయవల

సమన్వయము :— అంబ రహస్యముగానే సా
వచ్చును. వరించిన పిదప నామె తండ్రి కా
యుండవచ్చును. ఎటిఁగియు 'రహస్యవృత్త
కులపరంపరాగతమగు మర్యాదకు భంగములే
ననే వరింపవలయు'నని యాతఁ డామెకు స
యుండవచ్చును. సాల్వుని స్వయంవరమున కా
ఇయ్యది 'మయా వరయితవ్యః' అను మాటచేత
మూఢం' అను తండ్రి తెలివితక్కువదనమున
వరింపవలయునని పట్టుదల పట్టుటచే) నిందిం
తెలుఁగఁబడు చున్నది. కావున కాశీరాజు తెలి
దగు చున్నాఁడు.

అంబకము సం. వి. అ. న

1. కన్ను

స్రగ్ధర. క్ష్మాపాలశ్రేణీ విశాలాంబక కుముద
చంద్రశ్రీలీలా గాఢకాంతి స్మితవదన రుచిస్ఫీత

సీ...నా యంబకము-తే - నీవు మూయంగఁ జి
చయముఁ గప్పిన ఘాతముల్ భయముఁ బొందె.

2. బాణము

వ. ఇంద్రాగ్ని వాయు వరుణ దైవత్యంబులగు
దేసిన నరుండును దత్తద్దేవతాకంబులగు నంబ
ములు వేయును వచ్చె.

**అంబరచరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆకాశమునందు సంచరించువాఁడు.

వ. అనిమిషదానవాంబరచరాదికజాతులనెల్ల. విరా. 1-167

**అంబరతలము** సం. వి. అ. పుం. న

ఆకాశము, ఆకాశప్రదేశము

తే- వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశదభాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. విరా. 2-289

ఇక్కడ 'తలము' శబ్దార్థముచే సూచించును.

**అంబరమణి** సం. వి. ఇ. పుం

సూర్యుఁడు

వ. తదవసరంబున నంబరమణి యపరరత్నాకరంబు సొచ్చె. భీష్మ. 8-417

**అంబరము** సం. వి. అ. న

1. వస్త్రము

చ. అంబరమునఁ బుట్టినట్టి మలపంకము గారములోన నద్దఁగా, విరిసిన యట్లు నమ్మము. శాంతి. 8-364

2. ఆకాశము

వ. వాఁడునుం బనిపూని యంబరతలంబున నదృశ్యాకారుండై వచ్చి నిలిచె. (తలము స్వార్థమునఁ జేరి శబ్దార్థమునే సూచించును) విరా. 2-111

3 సున్న, శూన్యము (గణితము)

సీ. అంబర యుగ్మ వసు వార్ధి పరిమితములు. శాంతి. 5-46

4. జగత్కారణము (ఆకాశమువలె అసంగతమైనది కావున 'అంబరము' అనంబడును)

తే క్షమ యనఁగ నంబరం బనఁగా ధ్రువంబు, నావ నామయ మన నొప్పి లీనరూప, బుద్ధి నంప్రాప్యమగు తత్త్వమునకు వేద, మానిత బ్రాహ్మణులకు నమస్కరింతు.' శాంతి. 5-345

**అంబరయుగ్మవసువార్థులు** సం. వి. సమ. బహు

4820 అను సంఖ్యను దెల్పునది,

(అంబర = 0; యుగ్మ = 2; వసు = 8; వార్థి = 4 — కుడి నుండి ఎడమకు లెక్క) శాంతి. 5—46

**అంబరవర్తి** సం. విశ. న్ (న్. సీ. న్)

ఆకాశమున సంచరించువాఁడు

చ. అంబవర్తివైనఁ గని. విరా. 1—183

**అంబరీష గీతలు** సం. వి. అ. స్త్రీ. బహు

అంబరీషుఁడు చెప్పిన ధర్మసూక్తులు చూ. అశ్వ. 2—84, 85,86

**అంబరీషుఁడు** సం. వి అ. పుం

సూర్యవంశపు రాజులలో నొక్కఁడు. ఇతఁడు షోడశ మహారాజులలో నొక్కఁడుగా లెక్కింపఁబడుచున్నాఁడు.

మనువు తనయుఁడు నభగుఁడు నభగుని కొడుకు నాభాగుఁడు, నాభాగుని తనయుఁడు అంబరీషుఁడు.

ద్రోణ. 2-206; సం. భా. ద్రోణ. 6—4

**అంబష్ఠము** సం. వి. అ. న

దేశవిశేషము. ఇది ప్రస్తుతము లాహోరు జిల్లా గల ప్రాంతమునఁ బూర్వము గలదు. భారతకాలమున నిది యొక స్వతంత్ర దేశము. దీనిని కర్ణుఁడు జయించి కౌరవసామ్రాజ్యాంతర్గత మొనరించెను. అప్పటినుండి అంబష్ఠ దేశాధిపతి కౌరవ సామంతుఁడయి యుండెను.

ద్రోణ. 1-51

**అంబాజన్మము** సం. వి. అ. పుం. న. న్. న

ఇది యొక తీర్థప్రదేశము. నారదతీర్థ మని పిలువఁబడును. ఇందుఁ బ్రాణత్యాగము చేసినవారు స్వర్గలోకమును బడయుదురు.

అర. 2-268

**అంబాలిక** సం. వి. అ. స్త్రీ

కాశీరాజు మూఁడవ కూతురు

భీష్ముఁ డీమె స్వయంవరకాలమున నీమె సోదరులతోఁగూడ బలవంత
ముగాఁ దెచ్చి యీామెను యీామె యప్పయగు అంబికను దన
తమ్ముఁడైన విచిత్రవీర్యునకు వివాహము చేసెను. ఈమె గర్భమున
వ్యాసుని యనుగ్రహమువలన పాండురాజు జనించెను.

ఉద్యో. 4-274

**అంబిక** సం. వి. ఆ. (స్త్రీ)

1. కాశీరాజు రెండవ కూఁతురు. విచిత్రవీర్యుని భార్య. చూ. అంబాలిక
వ్యాసుని ప్రసాదమున ఈమె గర్భమున ధృతరాష్ట్రుఁడు జన్మించెను.
ఉద్యో. 4-274

2. పార్వతి
తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడ కర్ణ. 1-801

3. 'అంబ' అను పదమువలెనే స్త్రీప్రత్యయమగు 'అమ్మ' పైనిప్రయుక్త
మయి గౌరవము సూచించును.
సీ. సూర,నార్యునకును బోతమాంబికకును నంద,నుండు
(పోత + అమ్మ = పోత + అమ + అంబిక) ఆర. 7-468

**అంబుకశిక** సం. వి. ఆ. (స్త్రీ)

నీటిబొట్టు
సీ. తల్లిడం బొందినఁ దన్వికి నవయవం, బులనెల్ల ఘర్మాంబుకశిక
తెసఁగె. విరా. 2-106

**అంబుజగర్భుఁడు** సం. వి. అ. పుం

బ్రహ్మ (పద్మమునుండి యుద్భవించినవాఁడు)
చ. ఆతనికి వత్సలుండగుట నంబుజగర్భుఁడు వెన్నపై వయిన్, వితత
ముగాఁగ జిహ్వలకు ప్రేఁగగునట్లుగఁ జాలవైచినం. అను. 1-258

**అంబుజనాభుఁడు** సం. వి. అ. పుం

కృష్ణుఁడు. నాభియందుఁ గమలము గలవాఁడు, విష్ణువు
చ. అనుటయుఁ జిన్ననవ్వు నగి, యంబుజనాభుఁడు పల్కు
ఉద్యో. 8-52

**అంబుజము** సం. వి. అ. న.

పద్మము (నీటియందుఁ బుట్టినది)

మ...మన యర్జునద్వీపము క్రోధావేశ దుర్దాంత ద,ర్పవిలాసోద్భట భంగి నేపడరి కౌరవ్యాంబుజ శ్రేణి, జీ,ర్ణక్కవడంజేయదె.

విరా. 1-56

**అంబుజవదన** సం. వి. ఆ. స్త్రీ.

కమలమువంటి మోము గలది—స్త్రీ

క...సార,థ్యవిధం బొకఁడనఁగనేల యంబుజవదనా. విరా. 4-31

**అంబుజాక్షి** సం. వి. ఇ. స్త్రీ.

కమలములవంటి కన్నులు గలది—స్త్రీ

తే...ఎవ్వరుగానకుండు, నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి, యనిన నయ్యింతి యిట్లను నతని తోడ. విరా. 2-167

**అంబుజాక్షుఁడు** సం. వి. అ. పుం.

కృష్ణుడు

(విణ) కమలములవంటి కన్నులు గలవాఁడు.

తే. అంకురింపక చెడిపోయె నంబుజాక్ష. ఉద్యో. 3-76

**అంబుజానన** సం. వి. ఆ. స్త్రీ.

కమలము వంటి మోము గలది-స్త్రీ

చ. అని నడిప న్నయే త్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా.

విరా. 4-15

**అంబుజాప్తుఁడు** సం. వి. అ. పుం.

కమలములకు హితుఁడు—సూర్యుడు

సీ. సౌదామనీ చారుజలద మంబు,జాప్తుని తనువున కర్ధమైయుండి వా,తావాతంబై పాయునట్టు వోలెఁ కర్ణ. 2-188

**అంబుజాసనుఁడు** సం. వి. అ. పుం.

బ్రహ్మ. తామరగద్దియగాఁ గలవాఁడు.

వ. నాకుంగా లోకంబులం గరుణాలోకంబున నాదరింపుమనిన విని
యంబుజాసనుండు. [ద్రోణ. 2-163

**అంబుజోదరుఁడు** సం. వి. అ. పుం.

విష్ణువు, కృష్ణుఁడు. ఉదరమునందుఁ గమలము గలవాఁడు.

ఉ. బుద్ధి విహీనులు వానిఁ దక్కి నిస్నేహపుఁగూటి కియ్యకొని దీనతఁ
బొందుదు రంబుజోదరా. ఉద్యో. 4-14

**అంబుదము** సం. వి. అ. పుం

మేఘము.

విణ (అ. ఆ. అ)

నీటినిచ్చునది.

అర్జునాంబుదంబు విరా. 5-105

**అంబుధరము** సం. వి. అ. పుం.

మేఘము - నీటిని ధరించునది.

సీ ...ఇంద్రుపంచిన మహా, దారుణాంబుధరశతంబు చేత.
ఆది. 8—288

**అంబుధి** సం. వి. ఇ. పుం.

1. సముద్రము

ఉ. ప్రమదాంబుధి నోలలార్చెదన్. విరా. 1—298

**అంబునిధి** సం. వి. ఇ. పుం.

సముద్రము.

పశ్చిమాంబునిధి కర్ణ. 3-325

**అంబుపూరము** సం. వి. అ. పుం. సమ.

జలప్రవాహము.

ఉ. వీరరసాంబుపూరము...భీష్ముఁడను సాగరము. భీష్మ. 1—54

**అంబురాశి** సం. వి. ఇ. పుం.

సముద్రము, జలరాశి

అథవా పితరం మూఢం యో మేऽకార్షీత్స్వయంవరమ్
సం. భా. ఉద్యో. 175-39 (వావిళ్ళ)

సంస్కృతమును బోల్చి చూడని విమర్శకులు నన్నయ భారతమును తిక్కన చూచి యుండఁడని చెప్పుట కీ విరుద్ధకథనము నుదాహరింప వచ్చునని యింతగా మూలములతో వ్రాయవలసి వచ్చెను.

సమన్వయము :— అంబ రహస్యముగానే సాల్వుని వరించి యుండ వచ్చును. వరించిన పిదప నామె తండ్రి కా వృత్తాంత మెఱుకపడి యుండవచ్చును. ఎఱిఁగియు 'రహస్యవృత్తము నే నంగీకరింపను. కులపరంపరాగతమగు మర్యాదకు భంగములేకుండ స్వయంవరము ననే వరింపవలయు'నని యాతఁ డామెకు స్వయంవరము విధించి యుండవచ్చును. సాల్వుని స్వయంవరమున కాహ్వానించి యుండెను. ఇయ్యది 'మయా వరయితవ్యః' అను మాటచేతను 'అథవా పితరం మూఢం' అను తండ్రి తెలివితక్కువదనమున (స్వయంవరమునందే వరింపవలయునని పట్టుదల పట్టుటచే) నిందించు వాక్యములచేతను నెఱుఁగఁబడు చున్నది. కావున కాశీరాజు తెలిసియు తెలియనివాఁ డగు చున్నాఁడు.

**అంబకము** సం. వి. అ. న

1. కన్ను

స్రగ్ధర. ఖ్యాతపాలశ్రేణీ విశాలాంబక కుముదవనీ బాంధవాయత్త చంద్రశ్రీలీలా గాఢకాంతి స్మితవదన రుచిస్ఫీతు నాగేంద్రకేతున్.
విరా. 3-77

సీ...నా యంబకము-తే - నీపు మూయంగఁ దిమిరంబు నిఖిలలోక, చయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె. అను. 4-422

2. బాణము

వ. ఇంద్రాగ్ని వాయు వరుణ దైవత్యంబులగు శరంబులు గురుం డేసిన నరుండును దత్తద్దేవతాకంబులగు నంబకంబులఁ బ్రతిహతం బులు సేయును వచ్చె. విరా. 5-138

వ. మదీయ విద్యావిశేష సంస్తంభితాంభోదుర్గంబున నిర్భయుండనై యుండెద. శల్య. 2-46

**అంభోధరము** సం. వి. అ. పుం.

మేఘము (నీటిని ధరించునది)

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసరత్పాషాణవర్షంబు. విరా. 5—84

**అంభోధి** సం. వి. ఇ. పుం.

సముద్రము (నీటికి నిలువచోటు)

భక్తాంభోధి సుధాకర. ద్రోణ 2-1

**అంభోనిధి** సం. వి. ఇ. పుం.

సముద్రము (నీటికి నిలువచోటు)

తే. రెండు గడలు నంభోనిధి గదిసియుండు. భీష్మ. 1—31

**అంభోభృత్తు** సం. వి. త్. పుం.

మేఘము (నీటిని వహించునది)

శా. అపూర్ణంబయ్యెఁ దదీయబాణతతి నంభోభృత్పథంబెల్ల. ఆది. 7—196

**అంభోరాశి** సం. వి. ఇ. పుం.

సముద్రము (నీటికుప్ప)

క. గాంధార బలాంభోరాశిఁ దఱియఁజొచ్చిరి, వీరాగ్రణి సాత్యకి యును విజయసుతుండున్. భీష్మ. 2-106

**అంభోరుహము** సం. వి. అ. న.

తామర—(నీటియందుఁ బుట్టినది)

క...కుంతీ చరణాంభోరుహములకెఱఁగి వినయభూషణుఁ డగుచున్. ఉద్యో. 4—

**అంశకము** సం. వి. అ. పుం.

భాగము

సీ. కృతయుగంబున కందుఁ జతురంశకములు

శాంతి. 5-46; అను. 2-237

**అంశకృతి** సం. వి. ఇ. స్త్రీ.

భాగము నేర్పఱచుట, భాగము నిర్ణయించుట.

ఆ...ఏమిజాతులవారి, కయిన నిట్లు దెలియు మంశకృతులు.

అను. 2-237

**అంశము** సం. వి. అ. పుం.

1. భాగము, పాలు, వంతు.

వ. అనిమిషులు నహుషుని...ఇంద్ర పదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన నతడు దాను హీనబలుండనని శంకించినందమతమ తేజంబుల యంశంబు లతని కొసంగి శక్తిమంతుంగావించి యభిషిక్తుం జేసిన.

ఉద్యో. 1-194

తే. ఆ సుయోధనుతోడి పోరాట దక్కి, యనుభవింతుము మాయంశమగు ధరిత్రి

ఉద్యో. 3-7

2. ఖండము, ముక్క, తునుక.

క. వింశతి శరముల నేసె వి,వింశతి ననిలజుఁ డతండు వీఁక నగుచుఁ ద,త్త్రాణు ధనుర్దండము రెండంశములుగ నేసె వెడఁదయమ్మునఁ బెలుచన్.

ద్రోణ. 1-162

**అంశుఁడు** సం. వి. అ. పుం.

అదితి కశ్యపులకుఁ బుట్టినవాఁడు - ద్వాదశాదిత్యులలో నొకఁడు.

ఆది. 3-61

**అంశుకము** సం. వి. అ. న.

సన్నని వస్త్రము, వస్త్రము.

వ. సమీచీనాంశుక విరచిత స్తంభవేష్టనంబును ఆది. 7-21

**అంశుమంతుఁడు** సం. వి. త్. పుం.

1. సూర్యుఁడు.

వ. అంత నంశుమంతుండు శాంతుండగుచు వచ్చె. భీష్మ. 3-411

2. ఉష్మపులలో నొకఁడు. అను. 3-192

3. అసమంజసుని కొడుకు. దిలీపుని తండ్రి - భగీరథుని తాత.
చూ. అర. 3-67 మొ 72 వ.

**అంశుపు** సం. వి. ఉ. పుం.

1. కాంతి
మాలిని...రత్నాంశు వీచి,స్ఫురణ సుభగ పాదాంభోజ సంచారకేళీ
విరా. 2-365

చ. అనిలతనూభవుండు దవనాంశునిభంబగు తోమరంబు వైచిన
కర్ణ. 1-81

2. కిరణము
తే...సూర్యదత్తాహ్వాయుండు, సమదసైనిక నానాస్త్ర శస్త్ర బహుళ,
దీప్తి జాల క ప్రతిక పహత దినకరాంశు,రాజియై చను దెంచె
విరా. 3-147

**అంసము** సం. వి. అ. పుం.

మూఁపు, భుజశిరస్సు.
ఉ...పంకజనాభుని వైచె వాతఁ డా,ఖీలగదం దదంసమునఁ బెట్టిన
నూతన పుష్పమాలయుం, బోలి వెలింగె ద్రోణ 3-89

**అంహస్సు** సం. వి. స్. న.

పాపము
శా. అంహోమర్దనుఁ డా జనార్దనుడు భీష్మ. 2-156

**అకంటకము** సం. విణ. (అ. ఆ. అ)

1. శత్రువులు లేనిది.
ఉ. అనుపమానీయ చాపమున నర్జును దర్ప మడంచి నేఁడు సంగ్రామము నుజ్జగించెద నకంటక సుస్థితి గల్గ మేటినై భూమి యమర్చెదం గొనుము. కర్ణ. 1-284

2. ముండ్లు లేనిది.

ఆ. కంపు రూపు దెలుపు గలిగి యకంటక, భూరుహోదులందుఁ బుట్టినట్టి
పుష్పములఁ బ్రియంబుఁ బొంది కైకొంద్రు నిర్జరులు పూజనములఁ
గురుపరేణ్య! అను. 4-5

**అకంపనుఁడు** సం. వి. అ. పుం.

ఒకరాజు

ఈతని చరిత్రము భారతమున రెండు చోట్ల గలదు.

1. అభిమన్యుని మరణమునకు దుఃఖించు ధర్మరాజును వ్యాసుఁ డూరార్చుపట్ల ద్రోణ. 2-158

2 భీష్ముఁడు ధర్మరాజునకు మృత్యుదేవత తెఱం గెఱింగించుపట్ల శాంతి. 5-202

పైని ఒకటవ సందర్భములో నితని కొడుకు 'హరి'యని పాఠము నందును 'ధృతి' యని పాఠాంతరమునందును గలదు. 'హరి' యనునదియే సరియైన పాఠము.

శ్లో. పురా కృతయుగే తాత హ్యాసీ ద్రాజా హ్యకంపనః,
స శత్రువశమాపన్నో మధ్యే సంగ్రామమూర్ధని,
తస్య పుత్రో హరిర్నామ నారాయణసమో బలే.
సం. భా. ద్రోణ. 52-27-28

రెండవ సందర్భములో 'అకంపనుఁ' డని పాఠము నందును 'అను కంపకుం'డని పాఠాంతరమునందును గలదు. అకంపనుఁడే సరియైన పాఠము.

**అకంపితము** సం. విణ (అ. ఆ. అ)

చలింపఁబడనిది, స్థిరమైనది.

చ. గదఁగొని నన్ను నియ్యెడ నకంపితసుస్థితి నిల్వఁబంచి చెట్టిద
ముగఁ జొచ్చె నాహవపదిష్ఠుఁడు భీముఁడు వారి సైన్యమున్.
భీష్మ. 2-367

**అకంపితుఁడు**

చలింపఁబడనివాఁడు

చ...భీష్మునక్కజముగఁ దాఁకి యద్దెస నకంపితులై నడతెంచు

శల్య కుంభజ కురురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ
జేయుమీ. భీష్మ. 2-33

**అకంపుఁడు** సం. విశే. అ. పుం.

చలింపనివాఁడు

చ...దాఁ జలితంబుగాని వా,ర్ధిదశ నతం డకంపుఁడగు ధీపరివృత్తులు
గల్గె నేనియున్. శాంతి. 6-119

**అకట** దే. అవ్య

1- అయ్యో (సంతాపమును దెల్పును)

సీ. అకట మాతో మీరు నడవుల నిడుమలఁ బొందితిరి. విరా. 1-47

2. అహహా (ఆశ్చర్యమును దెలుపును)

చ. అకట యజాతశత్రుఁ డను నప్పలు కిప్పుడు నిక్కమయ్యె వా,నిక్కఁ
గురునాథ యిట్టు లతనిం దెగఁజూచుట కోర కాఁచిఁ బట్టికొనుట
గోరితి. ద్రోణ 1-109

చ. పలుకక వేగపొ మ్మకట పాఱుఁడు సంగడికాఁడె యెందునన్.
ఆది. 5-203

**అకటకట** దే. అవ్య (అకట+అకట)

అయ్యయ్యో

క. అకటకట యుత్తరుఁడు గొం,డుక కాంభోజుండునుం గడున్
బాలుఁడు వా,లిక కై దువులాడిన నేఁ,లకోఁ అగి యొప్పి రభిమన్యు
లక్ష్మణుల క్రియన్. స్త్రీ. 2-84

**అకటకటా** దే. అవ్య (అకట+అకటా)

అయ్యయ్యో

క. ప్రాయోపవేశమున, నిక్కాయంబు దొఁలంగు తలఁపు గదిరెడి
సంతా,పాయత్తచిత్తు నకటక,టా యని పోవిందు నను ధృఢ వ్రత
యుక్తిన్. శాంతి. 1-203, అను. 4-52

**అకటా** దే. అవ్య

అయ్యో

క. ఈ నరపతి యాస్థానము,లో నొక్కరుఁడైన...పలుకంగఁజాలఁ
డయ్యెడు నకటా ! విరా. 2-141

**అకరణీయము** సం. విణ. (అ. ఆ. అ)

చేయరానిది, చేయఁదగనిది

వ. మృతులయిన నరపతుల సుతులు శిశువులును శోకాక్రాంతులుఁ
గావున వారలవలన ధనాహరణం బత్యంతాకరణీయంబు.
అశ్వ. 1—14

**అకర్కరుఁడు** సం. వి. అ. పుం

కద్రువ కొడుకు, సర్పజాతివాఁడు. ఆది. 3-4

**అకర్త** సం. విణ. ఋ. పుం (స్త్రీ. అకర్త్రి)

క. హేతురహితుఁడ వకర్తవు, భూతస్రష్టవు...నీవ ముకుందా.
శాంతి. 4—241

**అకర్తవ్యము** సం. వి. (అ. ఆ. అ)

చేయఁదగనిది, చేయరానిది

వ. ఇది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు
గలండు. ఉద్యో. 1-335

**అకర్దమము** సం. విణ. (అ. ఆ. అ)

కర్దమము లేనిది, బురద (అడుసు) లేనిది

అ. నగములెల్లఁ బుణ్యనగములు నదులెల్లఁ, బుణ్యనదులు వినుము
భూసురాగ్రగణ్య యకలుషం బకర్దమ మనఁజాలు, నాత్మతీర్థ
మెలుఁగు నకలుషునకు శాంతి. 5—286

**అకలంకము** సం. విణ. (అ. ఆ. అ)

కలుషముకానిది, నిష్కలంకము

క...పురుషుఁ డుద్భ్రాజిష్ణు సత్యనిత్యావ్యాజ మహిమ వెలుఁగు-
చుండు నకలంకమతిన్. శాంతి. 5-468

**అకలంకుఁడు** సం. విణ. (అ. ఆ. అ)
కలంకము లేనివాడు, కలుషరహితుఁడు
క. అనఘా సుకృతముల నీవు దకలంకుఁ డగున్. శాంతి. 5-418
**అకలుషము** సం. విణ. (అ. ఆ. అ)
కలుషములేనిది, నిర్మలము
మాలిని. అకలుషహృదయాభివ్యక్తసర్వోపయుక్తా. సౌప్తి. 2-186
**అకలుషుఁడు** సం. వి. ఇ. పుం.
కలహము లేనివాడు, నిర్మలుఁడు.
ఆ. ఆశ్మతీర్థమెలుఁగు నకలుషునకు. శాంతి. 5-286
**అకల్మషము** సం. విణ. (అ. ఆ. అ)
కల్మషములేనిది, నిర్మలమైనది, పాపములేనిది
ఉ. కయ్యము సేయ నేనని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ,వియ్యెడఁ
దప్పితేని జగమేమను. భీష్మ. 3-268
**అకల్మషుఁడు** సం. విణ. అ. పుం
పాపరహితుఁడు, కల్మషము లేనివాఁడు
క...దీనిఁ బ్రయోగించుట, గలిగెనె మానవులపై నకల్మషులారా.
శాంతి. 2-65
**అకాండము** సం. విణ. (అ. ఆ. అ)
కాలమునకు ఉచితముగానిది
తే...అకాండ మృత్యు,ముఖము నుగ్రథావము దోఁచు మొనయు వీర్య
సమితిఁ దెగటార్చునప్పు డా కల్యనందు. కల్య. 1-232
2. జలములేనిది
వ. జనమేజయు సర్పయాగంబున సర్వభక్షకుండైన యగ్నియందు
సర్పంబులకెల్ల నకాండప్రళయంబైన దాని. ఆది. 1-128
(కాలముగాని కాలమున సంభవించిన ప్రళయమనియుఁ జెప్ప
వచ్చును).
3. ఆకస్మికము - ఆకస్మికముగాఁ గలిగినది - ఉన్నట్టుండి కలిగినది.
మ. పాండవకౌరవ్యగదావిఘట్టన మకాండప్రోద్ధమై. ఆది. 6-14

**అకామము** సం. విశే. (అ. ఆ. అ.)

నిష్కామము, కోరికలేనిది

ప. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లేక వేదక్రియా యోగ్యులై యకామఫలసంయోగంబునఁ బుణ్యలోకంబులు వడయుదురు.

ఆర. 3-333

**అకాముఁడు** సం. విశే. అ. పుం.

కోర్కెలేనివాఁడు, నిష్కాముఁడు

చ. ..గతశోకుఁ డకాముఁ డనన్యగతీలుఁ డాతని క్షవియెల్ల నేటికి.

శాంతి. 5-310

**అకారణము** సం. విశే. (అ. ఆ. అ.)

కారణములేనిది, తనంతటనే కలిగినది

వి. అ. న. పుం

కారణములేమి

క్రి. విశే.

కారణములేక, వ్యర్థముగా

ఉ. అకారణంబు మఱి నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పెఁగన్. ఉద్యో. 2-240

ఉ. అకట! కులం బకారణమ యంతయు నాశమునొందె.

శల్య. 2-368

ఆ. తల్లిఁ దండ్రిఁ బాయఁదగ దకారణమునఁ, దానెనేని నాఁడు పతితుఁడు.

శాంతి. 3-440

**అకార్యము** సం. విశే. (అ. ఆ. అ)

అయుక్తము, చేయరానిది

వి. న. పుం

చేయఁదగని పని, చెడ్డపని.

వ. ...వాసుదేవుండు గలండు...కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు.

ఉద్యో. 1-385

**అకాలకౌముది** సం. వి. ఈ. స్త్రీ

ఒకానొక యుత్సవము.

ఈ యుత్సవమునందు దేశమువం దంతట నిండుగునేసి దీపములతో వెలిగింతురు. ఈ యుత్సవమును జగద్విజయ కాంతుని సందర్శనమునందు లొనరించిరి. అది. 8-99

**అకాలము** సం. వి. అ. పుం.

అయుక్తకాలము, అనర్హమైన కాలము.

వ. కలయం గెంపునొంపు సంపాదించి యకాలసంధ్య నావహించిన విరా. 5-60

క. చెలులుం జుట్టలును సహాయులు విభవము పెంప కాలయుక్తి నవస్థం దొలంగించుట గలదె? శాంతి. 4-428

**అకించనభావము** సం. వి. అ. పుం.

ఏ కొంచెమైనను లేనితనము, తనకున్న సర్వస్వము భగవదర్పణముచేసి తనది యేమియు నెంతమాత్రము లేదని తలంచుట, దారిద్ర్యము.

చ. కినియమి సంగవర్జన మకించనభావము దాల్మి...యతిధర్మముల్. అను. 5-16

**అకించనుండు** సం. విశే. అ. పుం

ఏ కొంచెమైనను లేనివాఁడు, తనకున్న సర్వస్వము భగవదర్పణముచేసి తనది యేమియు నెంతమాత్రము లేదని తలంచువాఁడు – దరిద్రుఁడు.

చ. కినియమి సంగవర్జన మకించనభావము దాల్మి...యతిధర్మముల్. అను. 5-16

**అకిల్బిషము** సం. విశే (అ. ఆ. అ)

పాపములేనిది, పుణ్యమైనది.

క...వారల నెఱుఁగు దే యకిల్బిషచరితా. అను. 2-211

**అకుంఠితము** సం. విశే (అ. ఆ. అ)

అడ్డులేనిది, ప్రతిబంధము లేనిది.

చ...ఆ శిశు వకుంఠగతిం దన తేజిఁ దవ్వొప్పెడు ఘటితచక్రకముంగని
ద్రోణ. 2-112

**అకుంఠితము** సం. విణ. (అ. ఆ. అ)

1. అడ్డులేకుండఁ జేయఁబడినది, ప్రతిబంధలేనిది

చ...సుయోధనుం గని యకుంఠిత నిశ్చయమై యతండు ప్రాఁలిన దెస ప్రాలకుండిన, బలే! మముబోఁటులకుం బ్రియంబగున్.
ఉద్యో. 2-97

2. మొక్కవోవనిది, వ్యర్థముగావింపఁబడనిది.

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁదిఁ గడచివచ్చితిమి యకుంఠిత శౌర్యబలము నెఱపఁ దఱియయ్యెను. విరా. 4-93

**అకుంఠితుఁడు** సం. విణ. అ. పుం.

అనివార్యుఁడు, అడ్డగింపఁబడనివాఁడు.

చ. ఆ నృపాలుఁడు వకుంఠితుడై పదునాల్గుతూపుల, న్నరపతి మేన గ్రుచ్చి— శల్య. 1-186

**అకుటిలము** సం. విణ. (అ. ఆ. అ.)

వంకరగానిది, అవక్రమము, కపటములేనిది.

క. ఒక శక్తివైవ నలికితి, నకుటిలముగ శక్తిదళక మడరించిన గ్రుక్కక త్రుంచితి— ఉద్యో. 4-332

క. నకులుఁడు పశ్చిమదిక్కున, నకుటిలశౌర్యంబు మెఱయ నరిగి—
సభా. 1-264

**అకుప్యము** సం. వి. అ. న. పుం.

1. బంగారము, వెండి (కుప్యముగానిది. 'కుప్యము' అనగా వెండి బంగారములకంటె నితరమైన రాగి, కంచు మొదలైన లోహము)

చ...తెచ్చెఁ గురుముఖ్యుఁ డకుప్యధనమ్ము లిమ్ములన్. ఆది. 5-39

**అకూపారుఁడు** సం. వి. అ. పుం

ఇంద్రద్యుమ్నమను కొలనియందు నివసించుచున్న యొక తాఁబేలు.
అర. 4-364

**అకృత** సం. వి. ఆ. స్త్రీ.

అన్ని ప్రకృతులకును మొదటిదైన ప్రకృతి. ఇది పురుష రూపిణియై వికృతిఁబొందకుండును. శివప్రకృతి. అను. 1-311
ఇచట పాఠాంతరము 'ఆకృతి'యనునది యుక్తమైనదిగాదు.

శ్లో. నిత్యాం తు ప్రకృతీ మాహ యూసా ప్రసవధర్మిణీ
అరూపిణీ మనిర్దేశ్యా మకృతాం పురుషాతిగామ్.

సం. భా. అను 32—9

**అకృతకము** సం. విణ (అ. ఆ. అ)

కృత్రిమముగానిది - అపౌరుషేయము. మనుష్యులచేఁ జెప్పఁబడనిది.
మాలిని - అకృతకమధురోక్తివ్యాప్తసంతీప్తసారా. స్వర్గ. 1-97

**అకృతము** సం. విణ (అ. ఆ. అ.)

1. చేయఁబడనిది.
అకృత వివాహుండును. ద్రోణ. 2-322
2. శిక్షింపఁబడనిది.
సీ. వ్యామిశ్రమతి యగు నతనికి నకృతాత్ముఁడైనవానికి నవధాన రహిత,చేతస్కునకు నిధి సెప్పఁగాదు. ఆశ్వ. 1—226

**అకృతవ్రణుఁడు** సం. వి. అ. పుం.

ఒక మహాముని, ఇతఁడు పరశురాముని శిష్యుఁడు. పరశురామునితోఁ గూడ మహేంద్రపర్వతమున నివసించుచుండును. పురాణములను సూతునుండి గ్రహించెను. పరశురాముఁ డెక్కడ నుండువదియు నెప్పుడు దర్శనమిచ్చునదియు నితఁడెఱుఁగును. ఇతఁడు ధర్మరాజునకుఁ బరశురాముని చరిత్రము చెప్పెను. అర. 3-128; ఉద్యో. 4—292

**అకృతాత్ముఁడు** సం. విణ. (న్. ఆ. న్.)

1. శిక్షింపఁబడని బుద్ధిగలవాఁడు. 2. ప్రజ్ఞాహీనుఁడు 3. మూర్ఖుఁడు.
వ. అకృతాత్ములకుం గడవరానియట్టి లోకవాహిని సత్యతీర్థంబున నుత్తరించి. శాంతి. 5-184

**అకృతాస్త్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

అస్త్రవిద్యయందుఁ బరిశ్రమ చేయనివాఁడు.

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గాఁ, రణ్మక విద్యాప్రౌఢిమై నిరూఢు లయిన... యోధవీరుల కెదురే. విరా. 4-53

**అకృత్యము** సం. విణ. (అ. ఆ. అ)

1. చేయరానిది.

సీ. వధము ధర్మంబుగా బుధులు సెప్పుదు రని యనుశాసనము సేయు జనకుతోడ, సత్యవంతుఁడు హింస కృత్యకర్మంబగు నేని నకృత్య మింకేది యనుడు. శాంతి. 5-294

2. అకార్యము, దుష్కృతి.

వ. అకృత్యంబని యనుమానింపక భృత్యార్థనంబున నెల్లకంగులా నివ్విధం బనుష్ఠింపవలయు. ఉద్యో. 1-110

**అకృత్రిమము** సం. విణ. (అ. ఆ. అ)

1. కపటముగానిది. మనుష్యులచేఁ జేయఁబడనిది.

వ. అకృత్రిమసమరశీలి యగు నగ్గుణశాలిం గృత్రిమసమరంబునం గూర్చి క్రమ్మఱ నమ్మహాత్ము మొగంబు సూచి నామధర్మంబు లుపదేశింపవేయని యడుగ నేర్తునే. శాంతి. 1-344

2. యథార్థమైనది, సత్యమైనది.

క. ప్రకృతియనఁ బురుషుఁడనఁగా, వికృతులనం బరఁగుచున్న వీనికి నెల్లన్. సకలాత్మక నీవిభవము, యకృత్రిమాధారభూతమై యుండు శివా. ద్రోణ. 2-366

**అకృపుఁడు** సం. వి. అ. పుం.

దయలేనివాఁడు, నిర్దయుఁడు.

నే. నీ వింక కటా యెక్కడఁ జేరెదఁ, వకృపులు వచ్చెదరు చంప. అను. 3-85

**అకోపనుడు** సం. విణ. (అ. ఆ. అ.)

కోపములేనివాఁడు.

వ. నీవు గర్వంబువిడిచి యకోపనుండవై పరమ శాంతులైన రైభ్యు కొడుకులతోడ నిర్మత్సరుండవయి యుండుము. ఆర. 3-261

**అక్క** దే. వి.

అప్ప. తనకంటె ముందుఁబుట్టినది.

వ. నీవే కన్నులంజూచితే యక్కయొక్క దిదినల్లు. ఆది, 2-31

**అక్కజము** దే. విణ.

1. అధికము, హెచ్చైనది

చ. అక్కజమైన చెల్వమున నాత్మకు ప్రేఁగయి పొల్పు పొత్తివై విరా. 2-28

తే. భీమసేనుతిశైవ మన భీష్ముఁ డలుక,నదరె వక్కురుము ఖ్యుల యస్త్ర శస్త్ర కౌశలంబులుసూడ నక్కజములైన, నచ్చెరువునొంది సేనలు పిచ్చలింప. భీష్మ. 1-259

2. శక్తిమీఱినది, అశక్యము

సీ ..ఘోరబృంహిత బృహద్ఘోషణముల, నివి ఘనబృందంబు,లివి గజ యూధంబు,లని విచారింపంగఁ నక్కజంబు,లై లలితోత్తుంగశైల కుంజంబులఁ, ద్రిమ్మరు జలధరద్విరదతతుల. ఆర. 3-365

3. ఆశ్చర్యకరము

చ...భీతమ్మ గేతుణ భీముఁ డాయఁగాఁ,జని కడు నక్కజంబయిన చందమునం బడియున్న పీనుఁగున్.

విరా. 2-355; శాంతి. 2-155

(వి)

4. వింత, ఆశ్చర్యము

తే. సూర్యువలనన బీజంబు ధార్యమాణ,మగుఁ జరాచర ధారణియైన ధరణి,చేత నంతకు మిగులఁ జర్చింప నక్క,జంబు లెందునుగలవె నిష్ఠానిరూఢ. శాంతి. 6-601

**అక్కజుఁడు** దే. విణ

అధికుఁడు, మిక్కిలి బలవంతుఁడు

సీ. తంపె నాగాయుతసత్త్వు జరాసంధు, నెక్కటి యోర్చిన యక్క
జుండు. అర. 1-102

శ్లో. తం భీమ స్సమరశ్లాఘీ బలేన బలినాం వరః
సం. భా. అర. 10–24 (వావిళ్ళ)

**అక్కట** దే. అవ్య

అకట

క. లక్కయిలు గాలినది మొద, లక్కట మాతల్లి మాకునై నెవ్వగతోఁ,
బెక్కిడుమలఁ బడుచున్నది — (సంతాపము) ఉద్యో. 8–188

చ. అనవుడు భీష్ముఁ డిట్లనియె నక్కట భాగ్యముగాదె పాండునందను
లొక యాపదం బడక ధర్మగతిం దగ నందఱున్ సుహృజ్జనులను
గృష్ణునిం గలసి సమ్మదమొందుట (ఆశ్చర్యము). ఉద్యో. 1-242

**అక్కటకట** దే. అవ్య.

అకట

తే. పాండుసుతులు...వినుత శ్రద్ధ్యగాన కరిబృంహితముల మేల్కాంచు
నట్టివారు,..పులుఁగు మెకము, లఱవ మేల్కనుచుండిరే యక్క
టకట (సంతాపము) ఉద్యో. 8-188

తే. సకలధరణికి నాథుఁడై సంపదలకు, నెల్ల భాజనమగు కౌరవేంద్రుఁ
డనద, తనము దోఁపంగ గదఁ జేతఁగొని వినిశ్చయమునఁ దోఁకి
నమరెనే యక్కటకట (ఆశ్చర్యము). శల్య. 2-286

**అక్కటా** దే. అవ్య.

అకట

తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగియున్న, వాఁడొ భీముని పార్థుని
వర్తనంబు, వెయ్యెడల నేమిచందంబు లయ్యె నక్కటా విధా
తృండ కవలెందు డాఁగిరొకో (సంతాపము). విరా. 4-129

వ. అక్కటా! యీ భూపాలుం డింత బేలయగునే, యుధిష్ఠిరుం
డెవ్వరిఁగొని యెత్తి వచ్చువాఁడని యడుగుచున్నవాఁడు (ఆశ్చ
ర్యము). ఉద్యో. 2-169

వ. అక్కటా యిది యొక్క పువ్వయయ్యు నపూర్వంబై మనోనయ నానందకరంబైనది (ఆశ్చర్యము). అర. 3-311

**అక్కటికము** దే. వి. 

కనికరము, దయ

చ. అనుడు విరాటుఁ డుల్లమున నక్కటికంబొలయంగ నంగనం, గనుఁగొని. విరా. 2-144

ఉ...ఈదురాత్మకుం, డక్కటికంబు లేక సతి నంగలు సేసినను గృపా రతిం, దక్కక తండ్రిపా లడిగె ధర్మజుఁడు. శల్య. 2-321

**అక్కటికంపుఁజూపు** దే. వి.

జాలిగలిగిన చూపు, దయార్ద్రదృష్టి

సీ. తండ్రి,లేని యీ శిశువుపై మానితంబైన నీ, యక్కటికంపుఁజూ పడరఁజేయుము.  ఆశ్వ. 4-47

**అక్కడ** దే. వి. 

1. ఆవల, అటువైపు (వ్యతి) ఇక్కడ

వ. హిమవంతంబున నక్కడయు నిక్కడయు నోలిన కింపురుషవర్షం బును భారతవర్షంబును నసం బెంపారు. భీష్మ. 1-26

2. ఆవైపు - ఆచోటు (అ + కడ = అక్కడ)

వ...పాంచజన్యధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి గాండీవగుణ ఘోషంబు గర్ణగోచరంబు గామికి మనంబుగలంగ నెలుంగు గుత్తు కం డగుల సాత్యకితో నిట్లనియె. ద్రోణ. 3-278

వృత్తియం దియ్యది ఔపవిభక్తికముగా నగును.

అక్కడివారు.  ఉద్యో. 1-17

**అక్కఱ** దే. వి.

1. ఆవశ్యకమైన కార్యము, కావలసిన పని

వ. వారు నీ కింకరులు, నీకునైన యక్కఱ దీర్చుట వారి కర్త కృత్యంబు... అర. 6-30

2. కోరిక, అపేక్ష

మ...పుంకల్ సెల్వొంద నిన్ గ్రుచ్చి య,క్కఱదీఱం బోరి నక్క-
నం గరము మీఱ్రం జేర్ప నీ,కిమ్మెయిన్, వఱదం ద్రోవఁగఁజేసెనే
యకట దైవంబు ? ఆర. 7-343

3. కష్టము, ఇబ్బంది

చ. ఇది యొకఁ డేల నీవు మది నెయ్యదిగోరినఁ జేయువాఁడనా,
దదయత నూతసూతి సభ వాడిన మాటకుఁ జాలనొచ్చి మా,హృద
యములెల్ల నీవలన నెంతయుఁ బతుము సేయు నక్కటా, యది
యునుగాక మీపడిన యక్కఱ లెవ్వరి నొవ్వఁజేయనే.

ఉద్యో. 1—114

ఇచ్చట "అక్కఱ" అనునది పాఠాంతరము — 'మీ పడిన యాపద
లెవ్వరి నొవ్వఁజేయవే' అని పాఠము. పాఠము సరియైనదిగాని
పాఠాంతరము సరియైనది గాదు.

శ్లో. యచ్చాన్యదపి శక్ష్యామి తత్కరిష్యామి తే ప్రియమ్
యద్యద్దుఃఖం త్వయా ప్రాప్తం ద్యూతే వై కృష్ణయాసహా.

సం. భా. ఉద్యో. 7-50

**అక్కఱదీర్చు** దే. స క్రి.

కావలసిన కార్యము నెరవేర్చు

వ...కౌంతేయులు నీ దేశంబుననుండి నీ యాజ్ఞవలనం గృతారంభులై
యున్నవారగుటం జేసి వారు నీకింకరులు నీకునైన యక్కఱ
దీర్చుట వారి కర్తవ్యకృత్యము. అర. 6-80

**అక్కఱపడు** దే. అ. క్రి.

ఆశపడు, కావలయునని అపేక్షించు, పనివడు

చ...ఇట్టి నిన్నుఁ బ్రమగ నేను వేఁడుకొన యుక్తుఁడగాక మొఱంగి
నన్ను నక్కఱపడి నీవు వేఁడుటిది గర్జమె నిర్జితదైత్య చెప్పుమా.
ఆర. 7—367

**అక్కిలి** దే. వి.

ఇది పాఠాంతరమునఁ జూపఁబడిన అధికపదము—పాఠము. "ఒక కరంబు మలంచి కౌఁగిలించుకొని"—అనునదియే సరియైన పాఠము.

శ్లో. పితేవ పుత్రం గాంగేయః పరిరభ్యైకపాణినా. భీష్మ. 124-7

**అక్కు** వై. వి. (సం. అఙ్కము)

ఱొమ్ము, వక్షస్స్థలము

వ. వైచిత్రవీర్యుం డతనిఁ దిగిచికొని యక్కునం జేర్చుకొనియె. స్త్రీ. 1—150

క...అసుదతి మస్తకముం, దన యక్కునఁ జేర్చి. అశ్వ. 4—48

**అక్కుఁజేర్చు** వై. మిశ్ర. స. క్రి.

వక్షమునఁ గదియించు, కౌఁగిలించు

సీ...అద్దేవి వారలం నక్కుఁ జేర్చి దీవించె. ఆశ్ర. 2-148

**అక్కుసేర్చు** వై. మిశ్ర. స. క్రి.

కౌఁగిలించు, వక్షమున గదియించు

ఆ...ద్రోణతనయు నక్కు సేర్చి, కొంటినము. ఉద్యో. 1—866

**అక్కునఁజేర్చు, అక్కునంజేర్చు** వై. మిశ్ర. స. క్రి.

కౌఁగిలించు. వక్షమునఁ గదియించు

ఉ. చక్కఁగఁ జాగి మ్రొక్కుటయుఁ జయ్యనయెత్తి మనంబెలర్పఁగా, నక్కునఁజేర్చి యిట్లనియె. శాంతి. 5-858; స్త్రీ. 1—150

**అక్తము** సం. విణ. (అ. ఆ. అ)

పూయఁబడినది

క...సంగ్రామతలము రక్తాక్తం,బై మెఱయు. కర్ణ. 3-288

**అక్రమము** సం, వి. అ. పుం.

అధర్మము, అన్యాయము

ఉ. అక్రమవృత్తి గీడుతెరువై ఫలియింపదె ద్రోణసూతి దుర్వ్యక్రమ నింద కర్హుఁడె. సౌప్తి. 1—107

**అక్రియము** సం. విణ. (అ. ఆ. అ.)

వ్యవహార రహితమైనది, వ్యాపార శూన్యమైనది

ఆ...అయ్యవ్యక్తమణువు నిత్య మేక మక్రియం బహైతుకంబు చక్షు రాదుల కగ్రాహ్య, మది ప్రధానమనఁగ నతిశయిల్లు. అను. 5-245

**అక్రూరత** సం. వి. ఆ. (స్త్రీ).

క్రౌర్యములేమి, క్రూరత్వము లేకుండుట

స్రగ్ధర...తుచ్ఛా, రాతివ్యాపార దుర్వారతఁ దెగియెఁ గుమారవ్రజం బక్కటా ని, ర్ఘాతంద్రా వ్యాప్తి నక్రూరతఁ బొలసి భుజాప్రౌఢి వమ్మయ్యెఁ జుమ్మీ. సౌప్తి. 2-16

**అక్రూరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. క్రూరుఁడు కానివాఁడు, కఠినుఁడు కానివాఁడు, వాక్పారుష్యము దండపారుష్యము లేనివాఁడు.

సీ...కార్యజ్ఞుఁడును ధైర్యశౌర్యధనుఁడు, నక్రూరుఁడును విశుద్ధాత్ముండు...నైన విశాలబుద్ధి గావలయు మంత్రిముఖ్యుండు గౌరవేంద్ర. శాంతి 2-269

2. సం. వి. అ. పుం.

యదువీరుఁడు

వ. వాసుదేవుండు...రుక్మండును నక్రూరుండును — కొల్చిరా. విరా. 5—375

సీ—అక్రూరు భార్యల నాత్మజులను, వజ్రున్నకు నప్పగించె. మౌస. 188

ఇతఁడు హరివంశమునుబట్టి చూడ సాత్వత తనయుండగు మహాభోజుని వంశమునఁబుట్టిన శ్వఫల్గుని కుమారుఁడని తెలియుచున్నది. భాగవత విష్ణుపురాణములనుబట్టి వృష్ణివంశ సంజాతుఁడగు శ్వఫల్గుని తనయుఁడుగాఁ దెలియుచున్నది. ఈయన తల్లి కాశీరాజు కూతురు 'గాందిని' ఈతఁ డున్నచోట క్షామాది పీడలుండవు. ఇతఁడు శ్రీకృష్ణునియం

దధికశక్తిగలవాఁడు. ఇతనికి దేవలుఁడు, ఉపదేవుఁడు నను పుత్రులు గలరు.

**అక్రోధనుఁడు** సం. విణ. (త. ఆ. అ)

1. కోపములేనివాఁడు

మ...అక్రోధనుం, దరి నొవ్వంగొనఁడ ట్వొగడ్తఁ గను రాజత్వంతి దీప్తుండగున్. శాంతి. 2-296

సం. వి. అ. పుం.

ఒకరాజు

వ. అయుతానీకుండు పుట్టె వానికిం బృథుశ్రవసుని పుత్రియైన కామకు నక్రోధనుండు పుట్టె. ఆది. 4-2

**అక్రోధము** సం. వి. అ. పుం.

కోపములేకుండుట.

సీ. శౌచ మక్రోధంబు సంతోష మార్జవ, మనసూయ. ... తే. ఇంద్రియగ్రామజయ మివియెల్ల దమము నాకృతులు.

శాంతి. 4-364

**అక్లేశము** సం. విణ. (అ. ఆ. అ)

1. ఆయాసములేనిది

సీ. అక్లేశవృత్తి రాజ్యము చవిగొన్నవా, రేల యిత్తురు నీకుఁ జాలు సెపుమ. ఉద్యో. 3-35

2, సం వి. అ. పుం.

ఆయాసము లేకుండుట. అనాయాసము.

క. వాఁడు దురితం, బను దుర్గము నిస్తరించు నక్లేశమునన్.

శాంతి. 3-50

**అక్షజయము** సం. విణ. (అ. ఆ. అ)

ఇంద్రియములను జయించుట.

సీ. ఆర్జవ మక్షజయము సత్యంబును శమము శౌచ. మను నివి యెద నిల్పునది. ఆది. 3-206

**అక్షజ్ఞుఁడు** సం. విశే. (అ. ఆ. పు)

ద్యూతశాస్త్రము నెఱిఁగిన వాఁడు

క. జూదం, బునకుం బ్రియుఁడవు దక్షుఁడ, వన విద్యయందు నిపుణులైనట్టి
నక్షజ్ఞులచేన్. సభా. 2-164

**అక్షత** సం. వి. ఆ. (స్త్రీ)

కట్టుకొన్న భర్తవలన రతి ఎఱుఁగనిది.

తే. విభునిఁ దాను, దొఱంగిన వెలఁది విభుఁడు, విడచినట్టి సుమధ్యమ
విధవ యక్షతాత్వ దశ నెవ్వనికి గనుఁ దనయుఁ, డాతఁ డతనికి
కొడుక పౌనర్భవుండన్నఁగ, బరఁగు. అను. 2-252

**అక్షతము** సం. విశే. (అ. ఆ. అ)

1. విఱువఁబడనిది 2. నొప్పింపఁబడనిది 3. గాయపఱుపఁబడనిది.

తే. అక్షతధ్వజసూతహయత్వ లసద, ఫల్గురథవల్గనుండగు ఫల్గునుండు
విరా. 5-35

**అక్షతములు** సం. వి. అ. పుం. బ. (ఇది చరిత్రాదులలోఁ జేరినది)

1. అక్షతలు, అక్షింతలు, నీటితోఁ దడిపిన నడుము విఱుగని బియ్యము. ఇవి మూడు రకములు—1) శ్వేతాక్షతములు (శుభమున కెక్కువగా నుపయోగింతురు 2) హారిద్రాక్షతలు (పసుపు గలపిన బియ్యము) వీనిని పూజించునప్పుడును, ఆశీర్వదించునప్పుడును ఉపయోగింతురు. కొన్నిపట్ల బొట్లుగాఁగూడఁ బెట్టుకొందురు. 3) రక్తాక్షతలు (పసుపు సున్నము గలిపిన బియ్యము).

సీ. వివిధాన్నపాన, ములును నక్షత గంధములును బుష్పంబులు,
గావించుకొని. మాన. 29

క. లలితాక్షతములఁగు సుమం,బులఁ బూజితుఁజేసి యర్ఘ్యమును
గోవును న,క్కులపతికి నిచ్చె. శాంతి. 6-267

క. మౌక్తికవిమిశ్రలలితాక్షతవృ,ష్టిం గురిసిరి విప్రులఁ బుణ్యాంగ
నలును భద్రవాక్యయంబుల తోడన్. విరా. 5-268

2. శేసఁబ్రాలు - తలఁబ్రాలు

తే. ఒండొరుల దోయిళుల నిను పొందఁజేయు, నక్షత్రప్రకర్షంబు
లన్యోన్యమస్తకములఁ బోసిరి మందారకల్పలతలు, విరులగముల
నొండొంటిపైఁ గుర్సియుట్లు. విరా. 5-397

అక్షత్యుద్ధు పర్యవిణ. (అక్ష. ఆ. అ)
గాయపఱుపఁబడనివాఁడు.
చ. క్షతుఁడైన మద్భుజావితతధనుర్విముక్త శరవేగము పోర సహించి
యిట్టు లక్షతుఁడు, నమూర్ఛితుండు నయి కంపముఁబొందకయుండ
నేర్చునే. అర. 1-31[2]

అక్షమ సం. వి. ఆ. స్త్రీ.
1. ఓర్పులేకుండుట
క. పరితాప మనభితోషము, నరేశ్వరా శోచనము జనవ్యాపారా,
దర మక్షమ యనియెడునివి, యరయంగా రాజసంబులగు భావంబుల్
శాంతి. 4-351

అక్షము సం. వి. అ. పుం
1. పాచిక
[విభీతక (తాఁడి) వృక్షము యొక్క విత్తనములను పాచికలుగా
నుపయోగింతురు].
వ. అతండు (ధర్మరాజు) నానావిధంబులగు నక్షంబుల ముడి కక్షం
బున నిడుకొని చనిదైవయోగంబున విరాటుండు వెడలవచ్చి బయలి
కొలువిచ్చుటంజేసి తదాస్థానంబు సేరంబోవునప్పుడు.
విరా. 1-184

2. బండిచక్రము.
వ. బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును ప్రతికల్పిత తురం
గంబును...నైన రథం బెక్కి. విరా. 3-144

3. ఇరుసు
సీ. సామర్థ్యమొప్ప విశ్వంభరా చక్రంబు, రథముగఁజేసి చంద్రముని
నుష్ణకరునిఁ జక్రంబులుగాఁ బెట్టి వారిధి నక్ష మొనర్చి—
కర్ణ. 1-282

4. బండి కన్ను.

వ. యుగాక్షరథాంగకూబరంబులును. ద్రోణ. 1-341

5. ద్యూతము, సప్తవ్యసనములలో నొకటి

క. కామజంబులగు నక్ష మృగయా స్త్రీ పానార్థదూషణంబులును క్రోధజంబులగు వాక్పారుష్య దండపారుష్యంబులును నైన సప్తవ్యసనంబులం దగులక శాంతి. 2-285

6. ఆత్మ, ఆత్మజ్ఞానము

వ. నారాయణ ప్రణీతంబై యక్షప్రదర్శకంబైన యిత్తెఱంగుఁ జిత్తంబున నలవరింపుమని దేవవ్రతుండు ధర్మజుండనునకుం జెప్పె. శాంతి. 5-629

7. (నపుం)

ఇంద్రియము

తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది,విరహితంబు నిరంతరంబు విమల మవ్య,యంబు పుండరీకాక్ష మనక్షవిషయ, మచ్యుతము సఖస త్పరమైక్యభాపి...(న + అక్షము = అనక్షము) అను. 4-190

**అక్షముఁడు** సం. విణ. (అ. ఆ. అ)

ఓర్పులేనివాఁడు

క. వగపుఁ దేజోహీనుం, డగు, నాత్మహిత క్రియలకు నక్షముఁ డగు. అర. 5-142

**అక్షయము** సం. విణ. (అ. అ. అ)

1. క్షయములేనిది. తఱుగనిది, 2. నశింపనిది.

వ. తన తూణీరంబు లక్షయబాణంబు లగుటం జేసి. విరా. 5-144

క. అమరారిమర్దనుఁడు చ,క్రము గ్రక్కున నేయ రాహు కంఠము దెగి దే,హము ధరణిఁబడియెఁ దన్ముఖ, మమృత స్పర్శమున నక్షయంబై నిలచెన్. ఆది. 3-19

**అక్షయవటము** సం. వి. అ. పుం.

గయలోనున్న మఱ్ఱిచెట్టు

ఈ ప్రదేశమున హవ్యకవ్యంబు లొనరించినవారి పితృదేవతలు అక్షయసుఖంబు లనుభవింతురు.

వ. పాండవు లరిగి...గయయందు నక్షయవటంబున నార్షేయంబైన విధానంబునం జాతుర్మాస్యక్రతువులు సేసి... అర. 2-317

**అక్షయుఁడు** సం. విణ (అ. ఆ. అ)

నాశము పొందనివాఁడు

వ. ఇట్లు దుర్యోధను చేయు నపాయంబులవలనం గాయుచుఁ బాండవులు లాక్షాగృహదాహంబువలన నక్షయులై... ఆది. 8-15

**అక్షయ్యము** సం. విణ. (అ. ఆ. అ)

క్షయింపఁజేయుటకు శక్యముగానిది

వ. ప్రతిపక్షసంక్షయకరంబులయిన యక్షయ్యశరధులును...

అర్జునునకిచ్చి ఆది. 8-254

'అక్షయ్య'—అని ఆనందవారి పాఠము. ఇతర ప్రతులలో 'అక్షయ' అని పాఠము.

**అక్షరము** సం. విణ. (అ. ఆ. అ)

1. నశింపనిది

ఆ. క్షరములైన భూతసంఘంబులం దెల్ల, నక్షర స్వరూపుఁడై వెలుంగు. శాంతి. 2-49

వి. అ. న

2. అక్కరము, వర్ణన

వ. కురుపతి ... సాంత్వన స్వరంబున మధురాక్షర విన్యాసంబుగా నతనితో ... నా యభిప్రాయంబు వినుము.

3. బ్రహ్మము

తే. క్షరము నక్షరమును నీవ కర్తయును వి,కర్తయును నీవ యాద్యంత

గతులు నీవ, రొక్క,డై వెలిగెదు పురుషో త్తమూర్తి, ధాన వాచ్య
వినమ్రమ వాత్సల్యకల్య— శాంతి. 2—10

4. అవినాశిచైతన్యము

తే. క్షరము నక్షరమును నవఁ గలవు రెండు, మూర్తు లాత్మకళంభూత
ములను బూర్వ, మొలయు వ్యక్తమన దువమున నుండు నవ్యక్త,
మనఁగ నవరంబు రెంటిని గను బుధుండు. శాంతి. 5—111

5. హిరణ్యగర్భుఁడు, సూత్రాత్ముఁడు, సర్వైశ్వర్యసంపన్నుఁడు నైన
భగవత్తత్త్వము.

క. నయనముఖపాణిపాదము, లయమహిమా యెందుఁగలిగి యాద్యంత
పరిక్షయ వృద్ధిరహిత మై నిర్ద్వయమగు తత్త్వంబు నక్షరంబం్రడు
బుధుల్. శాంతి. 6-5

6. ఓంకారము

ఆ. వినుము దేవతలును మునులును బరమేష్ఠి, యొద్ద కరిగి మాకు
నెద్ది హిత మొ, యనిన నా విధాత యక్షరోపాసన, మనియె గాన
దుర్గమబల కడతు. అశ్వ. 2-58
చూ : క్షరము

**అక్షరశిక్ష** సం. వి. అ. స్త్రీ.

అక్షరాభ్యాసము

వ. ఇట్లు పుట్టిన బిడ్డకుఁ బుత్రప్రకారంబున జాతకర్మాదికృత్యంబులు
నిర్వర్తించి, శిఖండి యను పేరుపెట్టి...యక్షరశిక్షాదు లాచరించి.
ఉద్యో. 4—873

**అక్షరుఁడు** సం. విణ. అ. పుం

1. విష్ణువు 2. బ్రహ్మము

తే. పరము నక్షరు విష్ణునిఁ బ్రస్తుతించి, నారద మునీంద్రుఁడు.
శాంతి. 4-209; శాంతి. 4-216

విణ నాశనము లేనివాఁడు

సీ. గ్రహామక్షరుఁడు......తే...అధ్వరమయాత్ముఁడైన విష్ణుఁడు.
శాంతి. 8-110

అక్షరోపాసనము సం. వి. అ. న

ప్రణవోపాసనము

ఆ. వినుము దేవతలును మునులను బరమేష్ఠి,యొద్ద కరిగి మాకు నెద్ది హితమొ, యనిన వా విధాత్ర యక్షరోపాసన, మనియెఁ గాన దుర్గ మబల కదతు. అశ్వ. 2-53

అక్షరోపాస్తి సం. వి. ఇ. స్త్రీ

అక్షరోపాసనము

తే. అజుఁడు మొదలుగ నక్షరోపాస్తియందుఁ, జేయుదురు శాంతి నింద్రియ జిత్వమొంది. అశ్వ. 2-8

అక్షవతి సం. వి. ఈ. స్త్రీ

జూదము, పాచికలాట

సీ...మందాత్ముఁడా ధార్తరాష్ట్రుండు గాంధారరాజతనయుఁ వచనముల్ విని యక్షవతి నెపంబున వానిఁ గష్టుఁడై కొన సమకట్టి మనల, మగుడింపఁగా దుష్టమతిఁ జేసి విదురుఁ బుత్తెంచె. అర. 5—55

అక్షవిద్య సం. వి. ఆ. స్త్రీ

వ. అతఁ డక్షవిద్యా పాటవంబు దనకు మిగుల లేమింజేసియు— ఉద్యో. 1—22

అక్షశిల్పము సం. వి. అ. న

జూదమాడు విద్య

క. మృదుద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్షశిల్ప ప్రౌఢిన్. విరా. 1-71

అక్షశిక్ష సం. వి. ఆ. స్త్రీ

అక్షరశిల్పమునకు మాఱుగాఁ గొన్ని ప్రతులయందీపద ముపయోగింపఁ బడినది. అర్థమునకై చూ. అక్షరశిల్పము విరా. 1-71

**అక్షహృదయము** సం. వి. అ. న

అధికసంఖ్యాకములగు వస్తువులను లెక్కింపకయే చూచి మొత్తమును జెప్పు విద్య ఈ విద్యవలన జూదమునందలి రహస్యము నెఱుఁగవచ్చును.

మధ్యాక్కర—ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు మహీశుఁ డిక్ష్వాకు, కులజుండు ... అతనికి నశ్వహృదయ మనెడి విద్యయిచ్చి, వెలయ నతనిచేత నక్షహృదయమ న్విద్యఁ జేకొనుము.

అర. 2—128; అర. 2—176

**అక్షి** సం. వి. ఇ. న

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె, మ్మొగము మొగంబునన్ గదియ మోపు. విరా. 1-247

వ. ధర్మనందనునకుం దోఁచు దక్షిణాక్షిస్పందనాది శుభసూచకంబులకు మెఱుంగు వెట్టిన చందంబున. భీష్మ. 1-120

అక్షిశబ్దము అవ్యయీభావములోను బహువ్రీహిలోను ఉత్తరపదమైనపుడుఅకారాంతమగును.

ఉదా : సమక్షము ఆది. 4-169;కమలాక్షుఁడు కర్ణ 1-252; స్త్రీలింగమున కమలాక్షి విరా. 2—296

**అక్షిస్పందనము** సం. వి. అ. న. సమ

కన్ను అదరుట. చూ. అక్షి

**అక్షీణము** సం. విణ (అ. ఆ. అ)

అధికము, క్షీణముకానిది

తే. కలుగు నక్షీణపుణ్యదోహలుఁడు ధర్మసూనుఁ డున్న దేశంబున మానవులకు. విరా. 3-102

**అక్షుఁడు** సం. వి. అ. పుం

ఆత్మ

వ. నారాయణ ప్రణీతంబై యక్షప్రదర్శకంబైన యిత్తెఱంగుఁ జిత్తంబున నలవరింపుము. శాంతి. 5-269

**అక్షుద్రము** సం. విశ. (అ. ఆ. అ)

అధికము, తక్కువకానిది

వ. అతండు రుద్రవరానుభావంబునం జేసి యక్షుద్రబలుం డగుట నే మతని మిగులంజాలక చిక్కితిమి. ద్రోణ. 2-278

**అక్షుభితము** సం. విశ. (అ. ఆ. అ)

కలఁత పెట్టఁబడనిది, కలఁత నొందింపఁబడనిది

క. ఉభయ బలంబులుఁ బురికొని, యిభ రథ తురగ భట తతి మహిం గూలఁగ నక్షుభితములై పోరాడెం, బ్రభువులు వెనుదన్ని చూడఁ బార్థివముఖ్యా. ద్రోణ. 1—885

**అక్షుభితుఁడు** సం. విశ. అ. పుం.

కలఁత నొందింపఁబడనివాఁడు.

అక్షుభితుండగు వృషసేనుఁడు ద్రోణ 2—78

**అక్షోభ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

కలతపెట్టఁదగనివాఁడు; జయింపఁదగనివాఁడు.

శా. దేవా, యేను సమస్తదేవపితృదైతేయాహిగంధర్వరక్షోవిద్యాధర యక్షజాతుల కునక్షోభ్యుండఁగా...ఈవే నావుడు వాని కవ్వర మిట్లం డిచ్చెం గృపాలోయుఁడై. అర.6-280

**అక్షోహిణి** సం. వి. ఈ. (స్త్రీ)

అక్షౌహిణి — సేనా విశేషము.

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁడయిన సాత్యకి యు మహోగ్రాహవభూమి సహస్రాక్షోహిణు లట్లగుట మీరు నూడరె యోఁదున్. ఉద్యో. 1-285

మ...తా,నొక యక్షోహిణి తోడఁ బాండవ బలం బుల్లాసముంబొంద సాత్యకి...బాహాబల గర్వనిర్వహణ విద్యాప్రౌఢిసంరూఢుఁడై. ఉద్యో. 1-218

చూ. అక్షౌహిణి

**అక్షౌహిణి** సం. వి. ఈ. స్త్రీ.

ఆక్షోహిణి—సేనావిశేషము.

వ. దుర్యోధనుండు కృతవర్మపాలికిం జని యాతం డొక యక్షౌహిణి తోడం దన్నుం గలయవచ్చువాండయి యూఅడంబలికినం బ్రియంబంది. ఉద్యో 1-24, ఆది 1-81

ఈ "ఆక్షోహిణి," "అక్షౌహిణి" శబ్దములు ముద్రితప్రతులలో తాఱుమాఱుగాం (అనంగా ఒక ప్రతిలో ఆక్షోహిణి యున్నచోట నింకొక ప్రతిలో అక్షౌహిణిగా) గనంబడుచున్నవి.

1 రథము + 1 ఏనుంగు + 3 గుఱ్ఱములు + 5 కాల్బురు = 1పత్తి

3 పత్తులు = 1 సేనాముఖము; 3 సేనాముఖములు = 1 గుల్మము 3 గుల్మములు = 1 గణము; 3 గణములు = వాహిని; 3 వాహినులు = 1 పృతన; 3 పృతనలు = 1 చమువు; 3 చమువులు = 1 అనీకిని; 10 అనీకులు = 1 ఆక్షోహిణి లేక అక్షౌహిణి. 109350 కాల్బురు గలిసిన మొత్తము సేనకు అక్షోహిణి అని పేరు.

ఊహః సమూహః సంవికల్పజ్ఞానం వాస్యోఽస్త్యమస్తి ఇని అక్షాణాం రథానాం సర్వేషా మింద్రియాణాం వా ఊహినీ,ణత్వం వృద్ధిశ్చ (పాణిని 6–189 వార్తికము) (21870 రథములు; 21870 ఏనుంగులు; 65610 గుఱ్ఱములు; 109350 పదాతులు కలిగిన సేన అక్షౌహిణి.)

**అక్షౌహిణీకము** సం. వి. అ. పుం. న

అక్షౌహిణులు గలది.

సప్తసంఖ్యాక్షౌహిణీకమనీకము. ఆశ్వ 3-122

**అఖండము** సం. విణ. (అ. ఆ. అ)

1. అధికము—అవిచ్ఛిన్నము—ఎడతెగనిది.

క. పారాశర్యుని కృతియయి, భారతమను పేరఁబరఁగు పంచమవేదం.
బారాధ్యము జనులకుఁ దద్గౌరవమూహించి నీ వఖండితభక్తిన్
విరా. 1-16

2. అకుంఠితము, తక్కువపఱుపఁబడనిది.

క. కెలఁకులుఁ బిఱిందిదెసయుం, గలయంబరికించి తన యఖండిత
బాహా, బలగర్వము యిచ్చట ముం,గలిగా మదమత్త భద్రగజనదృశ
గతిన్. విరా. 2-326

**అఖర్వము** సం. విణ. (అ. ఆ. అ)

అధికము

క. సీఘమతి నన్ను నెవ్వఁడు, మాచిననా రాత్రిలోనఁ జూతురుదెగఁ
దా,రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము లఖర్వము
లైనన్. విరా. 1-324

**అఖిలము** సం. విణ. (అ. ఆ. అ)

1. సమస్తము, 2. సమగ్రము

క. వేదములకు నఖిలస్మృతి,వాదములకు విరా. 1-4

**అఖిలాండము** సం. వి. అ. పుం. న

బ్రహ్మాండము

క. అరయనచ్చెరువు గాదె యఖిలాండపతి విరా 1-20

**అగజ** సం. వి. అ. (స్త్రీ).

పార్వతి. హిమవంతునకుఁ బుట్టినది.

సీ...అగజయెవ్వుడు, మాయనివెలపట్టుదోయిని శల్య 2-184

**అగణితము** సం. విణ. (అ. ఆ. అ)

1. వర్ణింపనలవికానిది. ఊహింప శక్యముగానిది

క ... భ్యాగగనదిగంతరమతకయు, నగణిత మూర్తిభవన్మయంత్రా
తోచెన్. భీష్మ. 1-212

2. ఎంచ శక్యముగానిది; లెక్కించ శక్యముగానిది

క. తగవా కురువృద్ధునకు వొ,సఁగెనాఁటికి దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణితతపఃప్రభావం, బుగని యధికవిస్మయంబుఁ బొందఁగ
జనముల్. ఆ|శ్ర. 2-121

**అగణ్యము** సం. విశే. (అ. ఆ. అ)

1. లెక్కింపశక్యగానిది.

ఉ...పుణ్యు నగణ్యపరాక్రమున్ హరి,గేవలమర్త్యుఁగాఁ దలఁచి—
ఉద్యో. 3-198

2. అధికము, విస్తారము

క. పుణ్యాశ్రమదేశముల న,గణ్యంబగు తపము సేయఁగా—
ఉద్యో. 4-365

**అగణ్యుఁడు** సం. విశే. అ. పుం.

అధికుఁడు, లెక్కింప శక్యముగానివాఁడు.

మ...అవ్వీరుఁడు ...పవనతోఁదుల్యుం డగణ్యుండు సం,గరసంక్రీడం
యందు— కర్ణ. 3-29

**అగతి** దే. వి. ఇ. (స్త్రీ)

నరకలోకప్రాప్తి—పునర్జన్మమును బొందుట.

తే. అనఘ, యుత్తరదక్షిణాయనము లహ్న,హాత్మ్య లగ్నియు
ధూమంబు నంద్రు మఱియు, నిమము శుక్లంబుఁ గృష్ణంబు ననుట
గలుగు,సుగతిగతికి హేతువులగుటఁజేసి... శాంతి. 5-43

**అగదము** సం. వి. అ. పుం

ఔషధము, మందు.

తే...జలనిధి తార, మొదలుగాఁ,జార్ధకంబులు మూఁటు(నగద,కార్య
ఫలములు. అను.1-169

శ్లో. నక్షత్రే వారుణే కుర్వన్ భిషక్సిద్ధి మవాప్నుయాత్.
సం. భా. అను 186-12

(ఆయుర్వేదమున్న,విషచికిత్సను దెల్పుము—అగద తంత్రము)

అగపడు దే. అ. క్రి

1. తెలియవచ్చు, ఎఱుకపడు.

సీ. బంధులకగపడ్డఁబాయుననన్వయములు,కలకమైచెమటలు క్రమ్మదేఱు
విరా. 2—70

2. కనఁబడు, కంటికిఁగానవచ్చు.

వ. మాకుంజూడఁ బాండవులు పొడవడంగి లేకపోయిరిగాని యీ లోకంబున మసికి గలిగిన నగపడకుండనేర రది యిక్కార్యంబు నున్నరూపు—
విరా. 3-87

3. లభ్యమగు, ప్రాపించు.

క. అనవుడు ననిమిషపతి యే, యనువున నీశాంతి నీకు నగపడియె మహాజనపూజ్య చెప్పవే. శాంతి. 4—382; ద్రోణ. 1-287

శ్లో. యేనైషా లభ్యతే ప్రజ్ఞా యేన శాంతిరివాప్యతే ।
ప్రబ్రూహి తముపాయం మే సమ్యక్ ప్రహ్లాద పృచ్ఛతః
సంభా. శాంతి. 222-33

4. చిక్కువడు (వలలోఁబడుల్కొను)

సీ...సంజకడ నిత్యమును మృగంబుల కురులొడ్డిదేకువవచ్చి యొక్క మాలఁ డగపడ్డ వానిఁ గొంచరుగునొకప్పు డాపోరంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁబోయి. శాంతి. 3-203

5. అధీనమగు, వశమగు

వ. ఇట్లు బహుప్రకారంబులగు మన్మథవికారంబున కగపడి నైగడంతి
విరా. 2-302

అగ్గము + పడు = అగపడు— చూ. అగ్గము.

అగపాటు దే. వి.అగపడు

1. ఎఱుక పడుట-తెలియుట-వెల్లడియగుట

వ. మన శస్త్రాస్త్రంబులు దక్కిన యవి యొకతంగి పీటికని గాండీవముం, గొనిపోయితిమేని సుయోధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్.
విరా. 1-158

శ్లో. గాండీవం హి నరవ్యాఘ్ర త్రిషు లోకేషు విశ్రుతం,
కథం నావిష్కృతాస్యామో ధార్తరాష్ట్రస్య మారివ.
సం. భా. విరా. 47—3

2- చే. చిక్కుట, లోఁబడుట

వ. నాకు నొండు మెయి నెట్లునుం బగతు నగపాటు లేక తక్కెపే నవ్విధం బాచరింతు గాక. శల్య 2-278, విరా. 3-181

**అగమనము** సం. వి. అ. న.

అజ్ఞానము

గమనాగమన నిరసనా- కర్ణ 2-400, శాంతి. 4-248

**అగమనుఁడు** సం, వి. అ. పుం

భగవంతుఁడు (గమనము లేనివాఁడు)

క. అగమనునిం బాంధు నఖిల,జగద్భరణపరు నమూర్తి సాగరనిభ బోధగరిష్ఠు బంచకాల, జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వశోభితుఁ గొలుతున్. శాంతి. 4—224

**అగము** సం. వి. అ. పుం.

కొండ

ఆ. అగతనూజు వార్కఁ బొగడి. అను. 5—207

**అగమ్యత** సం. వి. ఆ. స్త్రీ.

తెలియమి, అజ్ఞానము

క. సౌమ్యు లసౌమ్యుల భంగి న,సౌమ్యులు సౌమ్యుల విధమున బన వర చిత్తా,గమ్యత దోఁతురు. శాంతి. 8—52

**అగమ్యము** సం. విశే. (అ. ఆ. అ)

1. పోరానిది

మ...విశ్వవ్యాప్తమై యున్న నీ కొలఁదో నెట్టు లగమ్యమయ్యె. ఉద్యో. 1-186

2. పొందశక్యముగానిది

క. శక్తిసుగమ మగమ్యం, బవ్యయము త్రిలోచన నీ, దివ్యమహిమ యోగమోపదేశము రుద్రా. ద్రోణ 2-387 శాంతి. 4-199

3. తెలియరానిది
వైకృతాగమ్యశీలా. శాంతి. 3-531

4. నడవశక్యము గానిది
ఆ. దానిఁ జూచి దండధరుఁడు నీవిల్లేల, వచ్చెదవు లతాంగి వలదు నిలువు, మింతి నీకగమ్య మిటమీఁది తెరువెల్ల ననిన నతనికిట్టు లనియెఁ బోలఁతి. అర. 8-230

అగరువు సం. వి. ఉ. న

1. పరిమళ ద్రవ్యము
సీ. అగరుకస్తూరికా,చందనాద్యనులేపశాలి యిపుడు. స్త్రీ. 2-69

2. పరిమళద్రవ్యము నిచ్చు చెట్టు, అగరుచెట్టు
లయగ్రాహి. చందనతమాల లతలందు నగరుద్రుమము లందుఁ గదళీవనములందు. ఆది. 6-13

అగలు దే. అ. క్రి.

1. వెల్లగిలు-ఉన్మూలమగు
క. వగ ముట్టికొనినఁ జిత్తము, వెగడొందఁగ మేను గలఁక తెమ్మెఁ దృతిపాత్రత గల నొకతీవ యిఁటికి, దగియుండెదు చంద్రకాంత తల్పము పేరెన్. విరా. 2-308

2. తగులు-భేదిల్లు
తే. అతపత్రంబు దునిమిన నతని మకుట, మతఁడు ఘనతోమరంబున వగలఁజేయు. ద్రోణ. 1-318

3. విఱుఁగు-తునియు
వ. ఒకవైరి చాపలించి తిరిగినం బెరిగిన యీరసంబున మల్లిసితుండై యా భూవల్లభుం డతని యెముక లగల వ్రేసిన. శల్య. 2-167

అగలు[2] దే. వి.

అగరు. పరిమళద్రవ్యము

గీ. పల్లకీజాతనిర్యాసమెల్ల దేవతలకు మేలంతశంబె గుగ్గిలము లెస్సఁ
యగలు గంధర్వ యక్షోరగాదులకుఁ బ్రియంబు ధూపదానము
నెడ నధిపవర్య. అను. 4-12

క. మలయజము నగలు మఱియుం, గలుగు సురభివస్తువులు.
అను. 4—12

అగల్చు దే. స. క్రి.

1. ఉన్మూలించు, పెఱుకు, పెల్లగించు

సీ. ప్రేవులు గండలు పెఱికి పేటాడి, యంగడదఁగొని మెదడు లగల్చి
కొనుచు. స్త్రీ. 2—9

2. పగులఁగొట్టు. భేదించు
సిల్లితల నగల్చి చంపె. శాంతి. 3-285 (పాఠాం)

అగస్తి సం. వి. ఇ. పుం

అగస్త్యుఁడు అను ఒకముని

ఉ. దీని నగస్తినాఁబరగు దివ్యమునీంద్రుఁడు. ఆది. 6-98

అగస్త్యవటము సం. వి. అ. పుం

ఒకానొక తీర్థప్రదేశము

ఇది హిమవత్పర్వత ప్రాంతమునఁ గలదు. ఈ తీర్థమున స్నానముచేసిన
వారికి అశ్వమేధఫలము దక్కును. దీనికిఁ దూర్పున భృగుశృంగము
హిరణ్యబిందువు అను తీర్థంబులు గలవు. ఆది. 8-185

అగస్త్యవరము సం. వి. న్. న

ఒకానొక తీర్థప్రదేశము. హిమవత్పర్వతప్రాంతమునఁ గలదు.
అర. 2—248

అగస్త్యాశ్రమము సం. వి. అ. పుం.

అగస్త్యమహాముని ఆశ్రమము. ఇది భారతకాలమున గయకు సమీపమ్మున
గలదు. అర. 2-319

**అగస్త్యుఁడు** సం. వి. అ. పుం.

అగస్త్యుఁడు అను పేరుగల ఒకముని.

ఈతని చరిత్రమునకై చూ. అర. 2-320 మొ అర. 3-46 వఱకు అను. 5-345

**అగాధము** సం. విశ (అ. ఆ. అ)

1. మిక్కిలి లోఁతుగలది

చ...కామమూ యిడుమ లందఁగఁజేయుదు నిందు చేమిటం, గలుగదు నీకు నీతెఱఁ గగాధరసాతలభంగి. శాంతి. 4-51

2. అధికము, దురవగాహము, తెలియరానిది

క. తగియెడు శిష్యుల కొసఁగెను, జగతీశ్వర యిట్టులది ప్రశస్తంబై యి,జ్జగములను గలిగె విను మ,య్యగాధ ధర్మంబు దుష్కృతా ప్రాప్యమగున్. శాంతి. 6-496

**అగారము** సం. వి. అ. న. పుం

1. మందిరము, ఇల్లు

క. ఉచిత విహార ప్రకార యోగ్యాగార,ప్రచయము సుందరగణికా, నిచయము చొప్పించువాఁడ నీకుం దరుణీ. విరా. 2-128

2. శాల

వ. అనర్తనాగారంబు ముఖ భాగస్థలంబు చేరి. విరా. 2-325

3. నివాసగృహము

వ. అప్పుడు కురువీరాగారంబులయందు హాహాకారంబు లెసంగె. స్త్రీ. 1-104

4. ప్రదేశము, స్థలము

మ. అవనీచక్రము పాదఘాదహతి నల్లాడంగ నత్యుగ్రభై,రవ హుంకారరవంబునన్ వియదగారంబెల్ల భేదిల్ల. ఆది. 6-14

**అగు** దే. అ. క్రి

1. ఏర్పడు

వ. ఈ యయిదింటన కాదె జగంబులు స్థావరంబులునైన యవి.
శాంతి. 4–87

2. కలిగియుండు

క. క్షమియింపు మనుడు నతఁ డుప,శమ మొందినఁ గర్ణుఁడుం బ్రకా
శుండై వి,క్రమ కేళిసలుపఁ బ్రతిసైన్యము వెల్లమొగమ్మయ్యెఁ బటు
గుణధ్వని సెలఁగన్. ద్రోణ. 5–112

3. బడవు = కలుగు

ఆ. విను మనుష్యలోకమున సిరియగునె యాఁ,కొని మునింగి దినినఁ
గ్రొవ్వులావుఁ, గలుగునయ్య. ఉద్యో. 3–333

క. ప్రస్తుత ఫణిసత్త్రి భయ,త్రస్తాత్ములమైన యస్మదాదులకెల్లన్
స్వస్తియొనర్పఁగ నవసర,మాస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా.
ఆది. 2-219

4. ప్రాప్తించు, సిద్ధించు

మ. నన్నుఁ గుటిలాలాపంబులన్ వెక్కిఁజేసిన నీకై నదియేమి
యనాశ్రిత గుణశ్రేష్ఠుడు వంచించునే. ద్రోణ. 1-388

వ. రణధర్మంబు దప్పక పెనంగినట్టి ధర్మాత్ముండైన దుర్యోధనునకు
నుత్తమలోకంబయ్యెడు మనుచు. శల్య 2-307

క. అరయఁగ విషయము లంతయు, దుర్గంతములు వానియందుఁ
దొడరినఁ జేటుం, బొరయుదురు దొడరకున్నం, బరమపదవి యమ్మ
హానుభావులకు నగున్. శాంతి. 4-310

5. (i) పొందు

సీ. అదితి గర్భంబున నవతారమై వామ,నాకారమున హరి యడగు
టయును. విరా. 1-54

(ii) కలవాఁడగు

క. ఆలును బిడ్డలు బంధులు, నై లీలఁ జరించుచును గృహస్థుఁడు
దత్త్ర,ల్లోలత్వరహిత చిత్తత, మేలుగనలవడుపవలయు మీఁదెఱిఁగి
నృపా. శాంతి [illegible]-327

6. శక్యపడు—అలవియగు

ఉ...తగం గురువర్గముతోడిసంధి మీ,కైన తెఱంగునన్ వంచినట్లుగా
చేయుఁడు నేర్పుతేర్పడన్. ఉద్యో. 3-105

7. నిజమగు, యథార్థమగు

క. అగునది యట్టిద దైవముఁ, దగనిచ్చిన యవ్వరంబు దప్పునె మన
కున్, విగతభయవాసయోగ్యం,బుగ నొక్కెడ చెప్పు డిపుడ
పోవఁగవలయున్. విరా. 1-64

క. అదియగు నైనను నమఁజెం, పొదవఁగ గాచికొని యిచటనుండుట
కంటెన్, మది నధికంబై తోఁచిన,యదినీ వర్జునునిపాలి కరుగుము
నాకున్. ద్రోణ. 3-296

8. తటస్థించు, సంభవించు

క. చనువానిచేయు కార్యం, బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగు
చుఁడా,నును బయిఁబూసికొనుటఁదన,ము ను మెలఁగిన మెలఁకువ
కును ముప్పగుఁ దిదపన్. విరా. 1-125

9. తగు, యుక్తమగు

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ నిట్లను
ధృతిఁ గొలువుచ్చెఁ గుసుమాయుధుఁడిట్టిదే విచార మిట్టులేఁపనగునె
యైన నీదయిన పంపెవఁగైకొని చేయువాఁడ... విరా 2-263

తే. అనిన సహదేవుఁ డిట్లను నధిప పుత్ర, పౌత్ర సోదరవంతుండు
బాహువీర్య, ఘనుఁడు మన కాశ్రయంబయి మనిచె మత్స్యదేశ
పతిగాడె సేనాపతిత్వమునకు. ఉద్యో 4-98

సీ. యొరుఁడు వెట్ట-అ-గుడువ నృపతిమాత్రకునకును గాదన్న,
గౌరవాన్వయాగ్రగణ్యుఁడైన, నీకుఁ దగునె విడువ శోకంబు
వజ్రజన, న్నిభము గాదె నృపుల నెమ్మనంబు. శాంతి. 1-112

10. ఉండు

క. గోవులకు వెనుకయై వెనఁబోవుచునున్నారు. విరా. 3-188

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజమగుమకడికలిమి నరి సేనఁ గరం

బుక్కఱఁ దంత్రీపాలుం, డొక్కఁడ పాలియించె.
విరా. 3-231; ఉద్యో. 1-287

11. పదువలె అనుప్రయుక్తమగు
క. ఇతఁడెవ్వఁడొక్కొ రూపు ని,రతిశయమై మనమునకు, బ్రియం
బొసఁగెడుఁ జూఁచితిరే చిత్తంబు ముదా,త్తత గానఁగనయ్యెడున్
వదనమున భంగిన్. విరా. 1-258

12. అమోఘమగు
వ. నేనగునని కైకొనిన యాఁబోతు సంచితంబు మూర్కొని నను
పైగాలి వీచినను గొడ్డున కైనం జాలు నిలుచు. విరా. 1-286

13. పనికివచ్చు, ఉపయోగపడు
వ. ఉంగిడి యదురుఁ ద్రిక్క యనువానికి నా పేరు సెప్పినం జాలు
మఱియును బపికివలయు తెఱంగులెల్ల నెఱుంగుదు వేఱొక్క
పనికిం గాను గాని యే నీ వెంట నీ మనసును వదయం జాలుదు.
విరా. 1-286

14. పరాభవము పొందు
ఉ. మీసుభటత్వమున్ బలము మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ,ట్లా సభ
లోన నన్ బఱిచెనంతియ కాక జయద్రథుండును,త్రాసభరంబు లేక
నుచితం బొనరించినఁ జెల్లిపోయె నేఁ, డీ సభికుల్ గనుంగొనఁగ
నిట్లయితిన్ వగ వాడు వింతయే. విరా. 2-176

15. ద్యోతమగు, స్ఫురించు, తోఁచు
సీ. పొడసూపినట్లైన వడిఁబట్టకట్టి, పరికించి కానక బిమ్మరించు, మెల
గిన యట్లైనఁ బలికింపఁదలఁచి ని,రూపించిలేమి న|కులు వహించుఁ,
గదిసిన యట్లైనఁ గౌఁగిలింపఁ గడంగి, యా రసి లొంకైన నలఁత
పొందు; నొడబడ్డ యట్లైన నదరిపైకొనఁజూచి, చెన్నది యగుట
నిశ్చేష్టఁబొరయు—తే— లలిత వివిధ విహారంబులకు లతాంగి
యెలసి పొలసి నట్లైన నెలమిఁగలసి, యభిమతక్రీడ సలుపంగ నప్ప
శించి, వెదకి రిత్తబయల్ గని విహ్వలించు. విరా. 2-301

16. అనుకూలపడు, పీలుకలుగు

ఉ. మానవకోటి నిట్టి విసుమానపుఁబీనుఁగులైనవారి నెం, తైనను
గంటిమే యకట యాఁఱడి వమ్మయిపోయె దుర్జయం, బైన
బలంబు గానితెరువై తన కీర్తికిఁ దోడుగాద యుక్కినిమనంబు
గీడుపరికించునె క్రొవ్విసఁ జేటుదప్పునే. విరా. 3-2.
(కాని = అనుకూలపడని)

క. అరయఁగ నయ్యేడు తెఱఁగుల, నరయుట కార్యంబు హరి నాల
స్యములే, కరయునది- విరా. 8-105

17. జరుగు-ఒదఁగూడు

వ. అతనిపయి నెత్తిపోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మ
తనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున
మనము సమయభంగంబు చెప్పి వారల గ్రమ్మఱం బండ్రెండు
వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తఁ మట్లైన నప్రతిహతం
బుగాఁ జతురంత భూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లు
దము, విరా. 8-117

చ. అనవుడు వాసుకి ప్రభృతు లక్కట ధర్మవు గాదు నీవు మా,
చిన తెరువట్టి గెల్పు శుభసిద్ధి యొనర్చునె యట్లుఁగాక య,వ్వని
తయుఁ దల్లిగాదె గరువంపుఁదనంబున జూద మాకు ని,ట్లనఁదగు
నమ్మ యెట్టయినఁ నయ్యేను పావము సేయవచ్చునే. అను 1-194

18. సంబంధించు

ఉ. భంగముతోడ నున్న ననుఁ బంపు విరాటునిమీఁద భూమికిం,
జెంగటనుండు నాదయిన జీతపుటాళ్లు సంతతంబు వా,నిం గడు
గానిసేయ నతనిం జెఱుపం దఱియయ్యెఁ. విరా. 8-119

నాదయిన = నాకు సంబంధించిన

19. కనఁబడు

చ. హయ రథ దంతి సంతతి నిరంతర దుర్దమలీలఁ జేర్చి నే,ల యేపెసి
మఱాఁగినట్లగు బలంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్.
విరా. 8-136

తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగియున్నవాఁడు. విరా. 4-129

సీ. నీచదశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగి యుండె. ఉద్యో. 1-142

7 పృథయగు - కొఱఁగాకుండు.

వ. అప్పులవలన నగ్నియు బ్రాహ్మణుల వలన క్షత్రియ జాతియు నశ్మంబుల వలన లోహంబును నుద్భవించె వాని వాడిమి యెల్ల యెడలనుం జెల్లుఁ దమ తమ జన్మస్థానంబులం దడంగుఁగావున. ఉద్యో. 1-185

8. నిర్జింపబడు, ఓడు.

క. సమరంబున నీ వోడుట, సముద్ర మింకుట జయించె సాత్యకి గురుఁ గ,య్యమున నని యొసఁగు జనవా,దము మేలుగఁ దలఁచి తొక్కొ ధనురాచార్యా.

క. ఈ భంగి నీవడంగుట, మా భాగ్యముగాక యిఁక మాటలు వల దీ, క్షోభం బెట్టఁలుడుగు జెవు,మా భవదీయ బలశౌర్య మతులకుఁ దగఁగాన్. ద్రోణ. 4-164, 165

9. నిస్తేజముగా నుండు, పరాక్రమాదులు ప్రకటింపకుండు, శాంతముతో నుండు, లొంగు, లోకువయగు.

తే. జ్ఞాతి నాశనమునఁగాదె సకల దేవతలు ప్రవర్ధన మొందుట ధనము లడిచి, పొడిచి యొప్పనివారిచేఁ బుచ్చికొనక, యడఁగి యుండంగఁ జేరునే యింద్రు బుధులు. శాంతి. 1-54

10. ఇముఁడు, అంతర్గతమగు, అంతర్భూతమగు.

సీ. ఏనుంగు పాజ్జలోనెల్ల సత్త్వంబుల పాజ్జలు నడఁగిన యట్లపోలె. శాంతి. 2-289

సీ. జంతు పదములెల్ల దంతిపదంబులో, నడఁగుక్రియ నహింసయందు సకల ధర్మములు నడంగు. శాంతి. 5-145

11. ఉండు.

క. విను మాఱంచులుఁ బంద్రెం, డనుపమ ధారలును నైదె నిజాస్యము విశ్వాం,బును బొదువఁ దిరుగు కాలం,బను చక్రము దురవబోధ

లమునం దా ధృతరాష్ట్రజాధములనెల్లం జంపి భూచక్రరాజ్యము
సేకొందుము కౌరవేంద్ర మురజిత్సఖ్య ప్రసాదంబునన్
అర. 1-394

(విజయుండు నేనును నయి = విజయుడు, నేను ఏకమయి)

ఉ. గాండివి నొవ్వఁ బల్కి తిటు గర్ణుని జంపక వచ్చితేని తమ్మున్పండవు
గావు నాకు నని మూర్ఖత సోదరఘాతినైనకన్నుఁడ మనంబనం
బెలుగు శోకము నెట్లు సహింతుఁ దప్పె నాతండును నేమునైన
విబుధపరికరంబును మాకు నడ్డమే. శాంతి. 1-14

25. ఆధారమగు, ప్రాపగు

ఉ. అధిక తాపతప్తమైనది నా చిత్తమొనర నతని తోడ నొకటనునికి
యెన్నఁడొక్కొ మనకు నిండఁ బగునాతఁ, డేల మనలనొక్కొ
యున్నియేండ్లు. అర. 3-290

"సర్వేషామాశ్రయోఽస్మాకం రణేఽరీణాం ప్రమర్దితా"
సం. భా. అర. 141-16 (వావిళ్ల)

26. జయించు

వ. ...అవినీతులైన నీ కొడుకులు పుడమి యెల్లను దార యేలు
తీపుఁజూచెదరుగాని తమ పాలిసిపోవటం గానరు. వీర లర్జునుతోడం
బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుంగాక సమ
బలులైననుం గయ్యంబునఁ గదా వీరౌదురు వారౌదు రనవచ్చు
నది యేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుఁ గర్తవ్యం
బనిన. ఉద్యో. 2-279

27. జీవించు

వ. తమకించుచుందుము. నీకు శాసయిచ్చి పెద్ద కాలంబయ్యె నేడు
రణభూమియందు నర్జునుండొండెఁ ద్రిగర్తులొండెం గావలయు
నేమతనిఁ బెద్దకయ్యంబులోనం జాపికొనిపోవుట నీచిత్తంబునకు
వచ్చునకాదె. ద్రోణ. 1-220

శ్లో. అద్యాస్త్వ న్వర్జునా భూమి స్త్రిగర్తాథ వా పునః,
సత్యం తే ప్రతిజానీమో నైతన్మిథ్యా భవిష్యతి
సం. భా. ద్రోణ. 17-16 (వావిళ్ల)

28. నిలువఁగలుగు

వ. అంతం బతంగుండు పశ్చిమాచలంబునవులకుం జనిన ... పాండవ బలంబు సమయ సముచితంబగు సమరవిరామంబునకు నున్ముఖం బగుట యెఱింగియు మున్ను సవ్యసాచి యురవడికింగాక తమ మొన దెరలుచునికిం జేసియు నదియమెయిగా నాచార్యుండ దొరలకుం జెప్పి సేనలఁ దివియ నియోగించెఁ బాండవసైన్యంబులును మరలె. ద్రోణ. 1-386

(ఉరవడికింగాక = ఉరవడికి నిలువఁజాలక)

29. చెల్లు

క. మనమున ఖేదము మోదముఁ, బెనఁగొనియెడు మద్బలంబుఁ బీడించెడునా, మనుమఁడైన విసికి నాతని, యని పని యటమీఁద నెట్టులయ్యెం జెపుమా. ద్రోణ. 2-40

30. సమీపించు

క. కాలంబై సం బోవక, యీ లోకమునందు నిలువ నెవ్వరికి వశమి, శ్లైల యవివేకజనముల, పోలిక శోకానలమునఁ బొగులుచు నుండన్. ద్రోణ. 2-327

31. తోడ్పడు

క. నాలో నగ మర్జునుఁడే, నాలమునం దతని కగుట యరుదే యెమ్మె, ప్రాలెదనో రిపు లెట్టులు, గూలెదరో చూడు నాకుఁ గురుబల మెదురే. ద్రోణ-2-350

32. అక్కఱపడు, వలయు

క. నరుఁడు దన తేరు వో యెడు, తెరువునకై నంత సేనఁ దివ్యాస్త్రములన్, ధరఁగూల్పఁగ నయ్యెడ న, య్యరదముఁ గృష్ణుండు వలవు ఉద్భుతమయ్యెన్. ద్రోణ. 8-141

సీ. గంధంబు ఘ్రాణంబు గాని తక్కినయట్టు, నధిగమింపఁగనోప
వధిగమించు, రసము జిహ్వయు యితరము లా పనికిఁగావు,
రూపంబు జక్షుస్సె యోపు నెఱుఁగ. ఆశ్వ. 2-29.

33. నెరవేఱు

వ. అట్టివి యద్దేవదేవుని దివ్యలీల లతండు కోపించిన భువనంబు
లస్వాస్థ్యంబును బ్రసన్నుండైన సుఖత్వంబును గను నా భూత
నాథుండు గురుసుతునకు సన్నిహితుఁడయ్యెఁ గావున నయ్యోధ
వరుం డొక్కరుండ శిబిరంబు బ్రవేశించి యిత్తెఱఁగు పరాక్రమం
బొనరించెఁగాని యివ్విశేషం బా రథికవరుని శక్తినైనది గాదది
చిత్తంబున నిడం బనిలేదు. సౌప్తి. 2-131

ఉ. కావనినట్లయుండి యవు గార్యములు. ఉద్యో. 3-23

34. పరిణమించు, మూఱు.

తే. ఓరి ధార్తరాష్ట్రు రాధమ క్రూరకర్మ, కపటధార్మిక యత్యంత కల్మ
షాత్మ,యుక్తి బోయిన రేయి మహోగ్రవృత్తిఁ, దగిలి తెంత వేగి
రమునఁ దపసివైతి. సౌప్తి. 2-52

35. (పెండ్లి) చేసికొను

శా. శాపప్రాప్తికి నోర్చి తానడిగి యాచంద్రాస్య నన్నారదుం, డా
పృథ్వీపతి యాఁ బ్రియంబున వివాహం బయ్యె. శాంతి. 1-254

వ. సవినయంబునఁ దన శక్తితో గురునకు దక్షిణ యిచ్చి యాతండ
నుపఁగా, సమావర్తనకార్యంబు నడపి వివాహమై.
శాంతి. 5-189

36. వర్తించు

ఆ. మనసు నింద్రియములఁ బనిగొని పురుషుండు, స్త్రీప్రచురశిక్ష లేని
రథ్యసమితి, నడపు గతిక మాడ్కి నడపడినవి యాడ్చి, నట్టులైన
నశుభ మావహిల్లు. శాంతి. 5-153

37. మేలగు

క. పలుకుపడి నతనిఁ బాంసుబులు విడుచు బలికిన నతనిఁ బొందును

దాపం,బులు నోరు పాపము దనపై, నోలయింపఁగ నేల నింద
యుడిగినఁగాదే. శాంతి. 5-568

38. రూపము ధరించు

వ. ఇట్లు లబ్ధవరుం డగుచు సత్యవతీసుతుం డగ్నికార్యపరుండై
యరణి పుచ్చుకొని మథింపందొడంగిన ఘృతాచియను నప్సరో
వనిత లోచనగోచరంబగుటయుఁ దానునుం గామగోచరత్వంబు
నొందిన నయ్యింందువవన యమ్ముని తెఱంగెఱింగి వంచనం జిలుక
యయి యుండె. శాంతి. 6-250

39. చేయఁబడు

క. పారావతములు శుకములు, శారికలును బుష్పలతలు జనవర
పసిఁడిం, దారమున నైన ముట్టులు, నారయ గృహమంగళంబు
లాదర్శములున్. అను. 4-118

40. జనించు, పుట్టు

వ. ఈశ్వరుండు వానికి వైదర్భియం దఱువదివేవురు గొడుకులు
శైబ్యయం దొక్క కొడుకుంగా వరంబిచ్చి...,యదృశ్యుండైన.
అర. 3-61

41. ఉదాహరణంబుగానగు

వ. గోదాన ఫలవిశేషం బింకను వినవలతుం జెప్పవే యనుటయు
ననిమిషనదీనందనుం డివ్విషయంబున నైనది యొక్క యితి
హాసంబు గలదు... అను. 2-445

42. సంఖ్యావాచకముల మీఁద పూరణార్థకమున వచ్చు 'అవ' కుఁ
దొల్లిటిరూపము.

చ. ...ఆ పదుమూఁడగు నేఁడు మత్పితామహులు చరించిరంతయుఁ
గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా. విరా. 1-44

చ. పుడమిధనంబు నాకము విభూతియుఁ జేరిన యేని నల్లన,వ్వెడు
నభిమన్యు నెమ్మొగము వేయగు పాలును బోలనేర్చునే.
ద్రోణ. 2-145

**43.** వ్యతిరేక క్రియలపై ననుప్రయుక్తంబై రూఢిని దెలియఁజేయును.

తే. దొరలు దలపడ్డ సాహవదోహలమున, నుభయబలములు దమ కించి యోర్వ్వలేక, కలయబెరసి భూరేణువు కతన రాత్రి, గాక య్మున్న యొండొరువులఁ గానరైరి. విరా. 8-190

**44.** వ్యతిరేకార్థమునందు నర్థము లేకయే యనుప్రయుక్తంబగు.

క. కేకయసాల్వులు దోడుగ, నాకీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం, జాకుండమున్న యొకపరి, నాకాతనితోడ ఖండనము లేదయ్యెన్. విరా. 3-118

వ. ...వారికెవ్వరికిని నాకలోకనివాసంబు లేక తక్కెనేని సోదర శహిత స్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు. స్వర్గా-15

**45.** వ్యవహితంబులగు విశేషణ విశేష్యంబులకు మధ్య చేరును.

క. ఖండనమున నిరుగేలను, గాండీవము దివియు నేర్పు గలిగిన నందు ద్దండమగు సవ్యకరము ప్రచండతఁ బరఁగుదును సవ్యసాచియ నంగన్. విరా. 4-145

క. గురుఁడవు గాక పగతుఁడవె, దురమునఁ గుపితుఁడగు నిన్నెదు ర్కొనినా క్కొక్కరునకు శక్యమె యాపురహరున కగుంగాక యనుచు నరుగుచునుండెన్. ద్రోణ. 3-23

**46.** పండు, ఫలించు

సీ. వలనేర్పడఁగదున్నఁ బొలములోనైన వర్షంబు లేకున్న ధాన్యంబు లగునె. సౌప్తి. 1-81

(వ్యవ—ఈ సంవత్సరము మీచేలో ధాన్యమెంత అయినది. మా చేలో ఈ సంవత్సరము చేరెడు గింజలు కాలేదు.)

**అగుఁగాక** / **అగుఁగాత** } దే. అవ్య (రూపాం) అవుఁగాక; అవుఁగాత

కానిమ్ము-సరియే. అంగీకారమును దెలుపును.

క. అగుఁగాక కర్మఫలములు, దగఁ గుడువక పోవపశమై.
ఆర. 5-338

వ. అద్దేవుం డట్లయగుంగాక యని యానతిచ్చి యంతర్హితుండయ్యె.
ద్రోణ. 4-275

క. ...గో,మహనీయ మూర్తిమన్మతి,సహిత యగుంగాత మకుట సంపద లొసఁగున్.
అను. 8-89

**అగుఁగామి** దే. వి.

అగుటయుఁ గాకుండుటయు

వ. ...అతండు ముక్తుం డగుఁగామి గని కొను తలంపున నిజాను భావంబున నతని చిత్తంబు ప్రవేశించి మారవికారంబు భావించి.
శాంతి. 6-171

**అగుఁబొమ్ము** దే. అవ్య. (రూపాం) అవ్వుఁబొమ్ము; సరే

క. అని చెప్పిన విని యగుఁ బొమ్మని కైకొని ధర్మతనయుఁ డందఱ మును ని,ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చయం బుగఁ బలికెన్.
విరా. 1-114

**అగుచువచ్చు** దే. అ. క్రి.

కానుండు, కావచ్చు

వ...మౌహూర్తికాది శిష్టజనులు పరివేష్టింప మండిలగ్నం బాసన్నం బగుచు వచ్చెనని ధర్మతనయుని కెఱింగింపంబనిచిన, విరా. 5-889

(కొన్ని ప్రతులయం దిది పాఠాంతరము)

**అగుకంటె** దే - ద్రు

అగుటకంటె (ట వర్ణము లోపించిన రూపము)

దుఃఖభారవహుఁ డగుటకంటెన్-
శాంతి. 3-464

**అగుట** దే - కృ

'అగు' అర్థములఁ గలిగియుండును. చూ. అగు

సీ. ఈ సుందరి సైరంధ్రియగుటెట్లొకో-
విరా. 2-146

**అగుణము** సం. వి. అ. పుం.

1. దోషము 2. చెడుగు, తప్పు

అపార గుణాగుణ దోషవర్జితా — ద్రోణ. 2-364

విశే (ఆ. ఆ. అ)

త్రిగుణములు లేనిది. గుణరహితము

క. అగుణంబయ్యును నిమ్మైయిఁ, బ్రగుణతఁ బ్రాపించు నతుర మహదహంకార, స్థగుణంబులాఁదిన విడచినఁ, దెగు నన్నియు నిర్వికార దీప్తంబునగున్- — శాంతి. 6-15

**అగుడెంచు** దే. అ. క్రి.

1. గళించు, కరచు

చ. తడ వగుడెంచె జమ్మికిఁ బ్రదక్షిణ వృత్తిగఁ దేరువోవనిమ్ము. — విరా. 4-171

మధ్యాక్కర. ఏనేడు లగుడెంచె నర్జునుం డేగి — అర. 4-3

2. అగు

వ. కణ్వమహామునియు నక్కుమారు నుదార తేజో రూప విక్రమ గుణంబులకు సంతసిల్లి వీఁ డఖిలభువన యౌవరాజ్యాభిషేకమ్మున కు సమర్థుం డగుడెంచెనని విచారించి యొక్కనాఁడు గూఁతున కిట్లనియె. — ఆది. 4-65

('అరుగుడెంచె' నని కొన్ని ప్రతులు)

**అగునగు** దే. అ. క్రి

బాగాను

చ. అగునగు మేలుమేలు మనుజాధిపుఁడున్ మహి యేలు — ద్రోణ. 5-99

**అగోచరము** సం. విశే (అ. ఆ. అ)

1. తెలియనిది

వ. వేదాంత వేద్యంబులగు నర్థంబులు నా కగోచరంబులు
ఉద్యో. 2-102

2. కనఁబడనిది

సీ. ఒకమరి దవ్వయ్యు నొకమరి దృష్టి కగోచరంబయ్యును
శాంతి. 3-151

3. ఇంద్రియములకు విషయము కానిది

ఆ. కనుట వినుట యాదిగాఁగల యింద్రియంబుల కగోచరంబు బుద్ధి దీప, రూపగాఁగఁ దోఁచు రూపశబ్దాది గుణత్వ రహితమైన తత్త్వ మనఘ.
శాంతి. 5-108

4 వశముగానిది

వ. అనుభవము ద్రుంగు శాంతిం, గనునది నిర్వేదసత్ప్రకాశంబది దా, విను తలఁపునకును బలుకునకు నగమ్యము గర్మముల కగోచర మనఘా.
శాంతి 4-199

5. అగమ్యము, పోరానిది, పొంద శక్యముగానిది.

ఆ. ఉన్నత ప్రతాప యుత్తరకురుభూము, లందు జనులు వీని నవని చరుల, కివి యగోచరంబు లిందు సాధించి యెద్దియును గొనఁగ లేదు-శివిరి నీకు.
సభా. 1-286

**అగోచరుఁడు** సం. విణ. అ. పుం.

కనబడనివాఁడు, అందనివాడు, వశము గానివాఁడు

క. యోగీంద్రచిత్తకమలాభోగ మధుపవిభుఁడు ప్రకృతి పురుషాత్ముఁడు నిర్భోగ స్వరూపుఁ డవ్యక్తాగోచరు, డధిక సులభుఁ డమలాత్ములకున్.
ద్రోణ. 5-426

**అగ్గము** దే - విణ.

1. అనుకూలము

ఆ. వినమె యిట్లు పడిన పగలు వదపడి, తమకు నగ్గమైన శక్తి జయింప, రెట్లు ప్రబలి రిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దిర్చికొనుము.
విరా. 1-54

2. వశము, అధీనము

అనుచు వలరాజు వారికి నగ్గమయ్యె   విరా. 2-86

క. నరసుతున కగ్గమయ్యెం, గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీ, రరుగుం డేయుం డడ్డము, చొరుడు వెరవు లావు నెఱయ శూరత మెఱయన్.   ద్రోణ. 2—21

3. అధికము

తే. జరయు మరణంబు మర్త్యుని జన్మమాది, గాఁగ వెనువెంటఁ దగులు నగ్గంబువేచి, యెల్లి సేసెద ననక మే లిప్పుడు చేయు, తనయ వార్చునే మృత్యువు జనులపనులు.   శాంతి. 6-234

(అంగంబు—అని పాఠాంతరము)

4. సమీపించునది, అందుపాటులో నున్నది.

సీ. హైహయుండు సుమిత్రుఁడను రాజు వేటవోయిన చోటఁ దన చేత నేటువడిన, మృగ మమ్ముతోఁ బాఱఁ దగిలె వెన్వెంటన, యది యున్న నొకమరి యగ్గమయ్యు, నొకమరి దవ్వయ్యు నొకమరి దృష్టి కగోచరంబయ్యెను ఖురపదంబు,   శాంతి. 3—151

5. దుర్భరము, దుస్సహము

క. ఈ యెడ ననుఁగని వారణ, సేయుఁడు నితఁ డగ్గమైన చిచ్చుబలె పిడుగై, పోయి పయిఁ బడుదు నీ వర, వాయించుకోలేక వఱపవలయు రథంబున్.   విరా. 5—14

(ఈయన ననుఁ గని సైరణ, నేయం డితఁ డగ్గమైన, చిచ్చే యపిడుగై— అని కొన్ని ప్రతులు)

(ఈ శబ్దమునకు మూలధాతువు 'అగు' అయియుండవచ్చును. 'అగు క్రింద 6,16,30 అర్థములఁ బరిశీలించునది)

అగ్గలము దే. విశ.

1. అధికమైనది, అతిశయించినది. ఎక్కువయైనది.

సీ. అనిలదయమ్మునఁ బ్రాణమగ్ర్యము ఛందముల గాయత్రి యగ్గలము పశువు, ఆశ్వ 2—161; స్త్రీ. 2—111

తే. ...... ఆత్మరతుకు నగ్గలంబు, ధర్మరతుయ యుత్తమ ధార్మికులకు. ఆది. 6-217

వి.

అధికము, ఆధిక్యము

సీ. కుంతీమహాదేవి కోడండ్రలోపల, నగ్గలంబునఁ గొనియాడఁబరఁగి. విరా. 2-216

క. విలువిద్య నొరులు నీ క,గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదునని ఆది. 5—289

క్రి. విశ

అధికముగా

క. పనుల యెడ మేలుగాంచిన, మనుగడ యగ్గలము చేసి మన్నింపుము. ఆశ్ర. 1-64

దీనికిని మూలధాతువు 'అగు'- అగ్గము- అగ్గలము. స్వార్థమున 'ల' వచ్చినది.

**అగ్గలించు :** దే. అ. క్రి. (నామధాతువు)√అగ్గలము,

1. విజృంభించు

తే. నేల నాలుగు చెఱఁగుల నృపుల కొలువు, లందు నేను వర్తించితి నవనినాథ, యగ్గలించి నా యెదుర బాహాస్ఫాలించి, కడఁగఁజాలెడు మల్లురఁ గాన నెందు. విరా. 2—7

2. ఉత్సహించు,

చ. అని యని యుగ్గడించు ధృతి యల్లల నాడిన దల్లడించుఁ బై, కొనుతలఁ పొరగించు మది గోర్కులు పేర్చిన నప్పళించు నె,ట్టన తెగ నగ్గలించు. విరా. 2-31

3. అధికమగు, ఎక్కువగు, అతిశయించు.

తే. వెగ్గలం బంతకంతకు నగ్గలింప. విరా. 2-87

తే. అనుచుఁ గొందఱు పడుకోర్కు లగ్గలించి. విరా. 2-85

అగ్గలిక దే. వి (రూపాం) అగ్గలికము

1. ఉత్సాహము, పూనిక

తే. జెట్టి తంతంబు తోడఁ జేపట్టి హొంతకారి విఱిచిన యట్టు లగ్గలిక విఱుచు. విరా. 1-81

సీ. దళము దళంబుతోఁ దాకి యగ్గలికమై, నీడఁ బోవక ప్రేటులాడు నెడలు. విరా. 5-165

2. ఆధిక్యము, పెంపు, అతిశయము.

ఉ. అబ్బెరువైన విక్రమము నగ్గలికన్ సమరంబు గోరి యీ, వచ్చుచు నున్నవాఁడు బలవద్రిపుభీషణబాహుఁడైన వి,వ్వచ్చుఁడ. విరా. 4-181

3. తలంపు, ఊహ, భావము

క. నను నెవ్వ రాశ్రయించిన, ధన మొనఁగుదు రాజ్యమిత్తుఁ దద్దురితములం, దునుముదు నను నగ్గలికలు, మనమున జనియింపఁ జొచ్చె మనుజాధీశా. శాంతి. 5-355

అగ్గలికము దే. వి.

1. విజృంభణము, అతిశయము

సీ. చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన, యగ్గలికమునకు బెగ్గడిలక విరా. 4-62

సీ. . . . . . ఫాల భాగంబున నాల్గు, తోమరములు నొనిపి నెత్తురులు వఱపి, యార్చినఁ బేర్చిన యగ్గలికంబున కర్ణ. 2-191

అగ్గలము, అగ్గలిక, అగ్గలికము- రూపాంతరములు.

అగ్గి వి. ప్రాకృతసమము (అగ్నిః - అగ్గీ - అగ్గి)

వ. వివిధ దేశాధీశులును నాతోడి సుఖదుఃఖముల కియ్యకొని యగ్గలికమై నగ్గినైన జలుకను సముద్రంబైన నీఁదను దెంపుసేసి. ఉద్యో. 2-214

అగ్గించు దే. స. క్రి. నామధాతువు√అగ్గము

స్తుతించు, పొగడు, కొనియాడు

సీ. తన బంటుతన మాఱఁ గనిన మార్తురకైనఁ బలుమాఱు నగ్గింప వలయువాఁడు. విరా. 2-208

అగ్ని సం. వి. ఇ. పుం.

1. నిప్పు

క. విను యోగయుక్తునకు శస్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై, చను నవ్వికారములు లేవనఘ యతఁడుగోరఁ డైంద్రమగు పదమైనన్ అశ్వ. 1-211

2. అగ్నిహోత్రము - నిప్పు (ఇది పవిత్రాగ్ని)

ఆ. అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలంబుగ నొనర్చి విరా. 1-146

3. ధ్యాపతన్మాత్రము

తే. అతని తలఁపునఁ బ్రతిఫలించె నాకసంబు, దానియందు జలంబు లుద్భవము నొందె, సలిలమువ నగ్ని మారుతజనన మొనరె, నల పవన యోగమున మేదిని జనించె. శాంతి. 4-82

దీనికి-తే. అతని తలఁపున బ్రభవించె నాకసంబు, వాని వలనను మారుతో ద్భవమునయ్యె, వానివలనను తేజంబు వానివలన, సలిల మాసలిలం బున నిల జనించె - అని పాఠాంతరము గలదు. ఈ పాఠము 'ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ'- అను ఉపనిషద్వాక్యానుసారముగానున్నది. కాని పై పద్యము మూలమున కనుగుణముగ నున్నది.

శ్లో॥ ఆకాశాదభవద్వారి సలిలాదగ్నిమారుతౌ । అగ్నిమారుతసంయో గాత్తతః సమభవన్మహీ॥ సం. భా. శాం. 183-14, 15 శ్లో- (వావిళ్ళ)

4. త్రేతాగ్నులు- (అగ్నిత్రయము, మూఁడగ్నులు)

1. ఆహవనీయము 2. దక్షిణాగ్ని 3. గార్హపత్యము శాంతి-8-48

"శ్లో. పితా వై గార్హపత్యోఽగ్ని ర్మాతాగ్ని ర్దక్షిణస్స్మృతః
గురురాహవనీయస్తు సాగ్ని త్రేతాగరీయసే-" మనుస్మృతి. 2-231

రూపత్రయాత్మకంబగు నీయగ్నిని బ్రాహ్మణుఁడు శాశ్వతముగాఁ గాపాడుచుండును. తండ్రి నుండి కుమారునకుఁ గుమారుని నుండి మనుమనికి నిట్లు వంశపారంపర్యముగా నీయగ్ని గృహస్థునిచే గృహమున రక్షింపఁబడి సంక్రమించుచుండును.

1. గార్హపత్యము :- వేదాధికారికి వివాహములో నీయగ్ని యేర్పడును. ఈ యగ్నియందు యజమానుఁడు పుంసవన సీమంత జాతకర్మ చౌలోపనయనాది కర్మములును దర్శపూర్ణిమా, స్థాలీపాకములును పితరుల కొనరించు ఔర్ధ్వదైహిక క్రియలను పొనరించును.

2. దక్షిణాగ్ని :- ఇది యజమానుఁడు చయనము చేసినప్పుడు గార్హపత్యము నుండి వేఱుసేయఁబడును. ఇందు సర్వాభిచారిక క్రియలు నిర్వర్తింపఁబడును.

(అభిచారిక క్రియలు = శత్రుహింసార్థము చేయు క్రియలు. పిశాచములను వదలించుకొనుటకై చేయు క్రియలు)

3. ఆహవనీయాగ్ని :- ఇదియు దక్షిణాగ్నివలె యజమానుఁడు చయనము చేసినపుడు గార్హపత్యము నుండి వేఱుసేయఁబడును. ఇష్టులు మొదలగు యాగక్రియలు నిర్వర్తింపఁబడును. చయనము చేసినవారిత్రేతాగ్నులను యావజ్జీవము గాపాడుచుందురు. కేవల గృహస్థులు గార్హపత్యాగ్నినే రక్షించుచుందురు.

భార్యలేనివాని కియగ్నులు లేవు.

5. పంచాగ్నులు

పంచాగ్ని మధ్యంబున నిల్చి యొక్కయేడు- ఆది. 8-201

మండు వేసవి పంచాగ్ని మధ్యమున- అర. 6-277

1. అన్వాహార్య వచనము లేక దక్షిణాగ్ని, 2. గార్హపత్యము, 3. ఆహవనీయము, 4. సభ్యము, 5. ఆవసథ్యము.

ఆవసథ్యము = లౌకికాగ్ని.

(పంచాగ్ని మధ్యమునఁ దపమొనరించె నను చోట నియ్యవియా ?– వేరుగలవా?– విచార్యము.)

సామాన్యాగ్ని భేదములు నాల్గు మాత్రమే గలవు.

1. అనలము = జఠరాగ్ని, 2. కుకూలము = కుమ్ముె నిప్పు, 3. శగలము = పిడుక నిప్పు, 4. వత్సలము = తృణాగ్ని.

6. శానుం డను వహ్నికి సోమపుత్రియైన బృహద్భానయందుఁబుట్టిన యాశ్వర్యలో నైదవవాఁడు– చూ. ఆర. 5–167

7. అపుఁడను వహ్నికి ముదితయను తరుణియందుఁబుట్టినవాఁడు. ఇతఁడే హవ్యవాహనుఁడు, చూ. ఆర. 5–167

ఈ యగ్ని బ్రహ్మమానసపుత్రుఁడు. బ్రహ్మచే నియమింపఁబడి లోకమున వెలుఁగుచుండును అని విష్ణుపురాణమునఁగలదు. ఈయన భార్య స్వాహాదేవి.

వ. అష్టవసువులలో నాఁలవవాఁడు - ప్రజాపతికిఁగల యేడ్వురు భార్యలలో నాఁలవ భార్యయగు శాండిలికి 'అగ్ని'యను నాతఁడు జనించెను. ఇతనికిఁ గుమారస్వామి పుత్రుఁడయ్యెను.

చూ. ఆది. 8–67

**అగ్నికార్యము** సం. వి. అ. న.

1. హోమము

వ. దేవార్చనంబు దీర్చి యగ్నికార్యంబు నిర్వర్తించి. ద్రోణ. 3–7

2. శరీరమును దహించుట. అగ్నిసంస్కారము. దహనక్రియ.

తే. పుత్రులకు బాంధవులకును మిత్రతతికి, నగ్నికార్యంబు వొగులుచు నాచరించి, యొక్కచోట నాసీనుఁడై యుండె ద్రుపద, తనయ వచ్చుట వార్చి నెమ్మనము దలర. సౌప్తి. 2–23

**అగ్నికుండము** సం. వి. అ. న.

1. అగ్ని నుంచుటకై యేర్పఱచిన కుండము (గుంట). హోమకుండము.

సీ. ...అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశ, మొనరించు దానికై యుద్భవించె. ఉద్యో. 4–101

2. ఒక నరకము.

నరకము లన్నింటి నైదు సమూహములుగా విభజించినపు డయ్యది నాల్గవ నరకసమూహ మగుచున్నది. నరక మైదు విధములుగ విభజించినటుల మహాభారతమునుండి తెలియుచున్నది. గ్రంథాంతరముల విభజింపఁబడిన నరక భేదములన్నియు నీ యైదింటిలోనే చేరును.

చూ. అను. 5-170.

**అగ్నికృత్యము** సం. వి. అ. న.

అగ్ని కార్యము.

క. తదనంతరంబ యప్పతి, విదుర శవము ప్రమానుసెంది వికృత రహితమై, నిదురమెయి నొదిగియున్న ప్రగిది నుండం జూచి యగ్నికృత్యము నడపన్- ఆశ్ర. 2-62

**అగ్నిచయనము** సం. వి. అ. పుం. (రూపాం) అగ్నిచయము

అగ్నినిఁ బ్రతిష్ఠించుట.

పక్షుల యాకారముతోఁ గుండముల నేర్పఱచి యందు మంత్రములతో నగ్నులను బ్రతిష్ఠించుటయే యగ్నిచయనం బొనరించుట యగును. చూ. అర. 5-163

**అగ్నితీర్థము** సం. వి. అ. న.

ఒక తీర్థప్రదేశము. శల్య. 2-194

**అగ్నిత్రయము** సం. వి. అ. న.

మూఁడగ్నులు. చూ. అగ్ని. శాంతి. 3-48

**అగ్నిదాహము** సం. వి. అ. పుం.

అగ్నివలన దహించుట, నిప్పువలనఁ దగులఁబడుట.

క. విను యోగయుక్తునకు శస్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై, చనున న్వికారములు లేవు... అశ్వ. 1-211

**అగ్నిదేవుఁడు** సం. వి. అ. పుం.

అగ్ని

వ. అగ్నిదేవుండు బృహస్పతి కిచ్చె. ఆది. 7-45

**అగ్నిదైవత్యము** సం. వి. అ. న.

కృత్తికా నక్షత్రము. అర. 5-245

**అగ్నిధార** సం. వి. ఆ. స్త్రీ.

ఒకనది. తీర్థప్రదేశము అర. 2-276

**అగ్నిప్రవేశము** సం. వి. అ. పుం.

నిప్పులోఁ బడుట. ప్రాణత్యాగము చేయ నిశ్చయించి యగ్నిఁ జొచ్చుట.

సీ. ఇప్పుడు నారదుం డెందున్న వాఁడని, యడిగిన యట్లైన నతఁడు
నాకుఁ,నిన్నెఱింగించి యగ్ని ప్రవేశముసేసె ననుము. అశ్వ. 1-46

**అగ్నిభట్టారకుఁడు** సం. వి. అ. పుం.

అగ్ని— ఇచ్చట భట్టారక శబ్దము పూజ్యవాచకము

వ. కందమూలఫలాశనుండై వన్యంబులయిన ఫలంబుల హవ్యకవ్యం
బుల నగ్నిభట్టారకుం బితృదేవతలం దనుపుచు. ఆది. 3-201

**అగ్నిభవుఁడు** సం. వి. అ. పుం.

కార్తికేయుఁడు, కుమారస్వామి

వ. అమ్మహాధ్వని విని కలుషించి యైరావత ప్రతీకంబులను దిగ్గజంబు
లయ్యగ్నిభవుమీఁదం బఱతెంచిన. అర. 5-207

**అగ్నిమాంద్యము** సం. వి. అ. న.

అజీర్ణము, ఆఁకలి మందగించుట

వ. నిరంతర ఘృతధారాకారణంబున నగ్నిదేవుండు తన కగ్ని
మాంద్యంబును దేజోహీనతయు దప్పియునైన. ఆది. 8-247

**అగ్నిముఖము** సం. వి. అ. న.

1. ప్రధానహోమములకుముందు నగ్నిని ప్రతిష్ఠించుకొనుట మొదలుగాఁ గల పూర్వమునందుఁ జేయబడు ఆంగిక కర్మసముదాయమునకు అగ్నిముఖ మనిపేరు. ఇయ్యది హోమమునకుఁ బూర్వాంగక్రియ. జయాది హోమము, ప్రధాన హోమము అయిన తదుపరి జరుపఁ బడునది గాన నయ్యది యుత్తరాంగిక క్రియ యగును. ఉద్దేశములను

బట్టి ప్రధాన హోమములు మాఱుచుండును. గాని పూర్వోత్తరాంగ కర్మలు మాత్ర మన్నింటికి నొకటే.

చ. ...... నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి వేలిమిం, దనయు
సృజించి లోకవిదితంబుగ వృత్తసమాఖ్య యిచ్చి ఉద్యో. 1-122

2. అగ్ని

తే. అప్పటికి వారు లేకున్న నగ్ర మగ్ని, ముఖమునం దైన నిడునది
సఖుల బంధుజనుల నతిథుల గురుల భోజన విధాన, తృప్తులుగం
జేసి బలివిధిం దీర్పవలయు. అను. 3-339

శ్లో. ఏవంకృత్వా బలిం సమ్యగ్దద్యాద్భిక్షాం ద్విజాయ వై ,
అలాభే బ్రహ్మణస్యాగ్నావగ్రముద్ధృత్య నిక్షిపేత్.
సం. భా అను. 154-15

3. అగ్నిద్వారకము

క. అతని యజ్ఞంబునం బురుహూతపురస్సరమరుద్గణోత్తము లధిక
ప్రీతిం జనుదెంచి హవ్యము, లాతత హస్తములం గొందు రగ్ని
ముఖమునన్. ఆది. 5-79

**అగ్నిముఖము సేసికొను** స. క్రి.

అగ్ని సంధానము (కూర్చుకొనుట) సేసికొను.

సీ. ...అభిరామమైన పాంచాలిం దద్వామపార్శ్వమున సహాన,
మాసీనం గావించి యగ్నిముఖము సేసికొని హోమతంత్రవర్తన
మొనర్చె. శాంతి. 1-374

**అగ్నియిచ్చు** స. క్రి.

1. నిప్పు ముట్టించు, దహించు

వ. అనాథవంతులైన భూకాంతు లనేకసహస్రసంఖ్యలం బ్రోవులుగాం
బెట్టించి సమగ్రదారుసముదయంబు లమర్చి యగ్ని యిచ్చిరి.
స్త్రీ 2-172

2. దహన సంస్కారముసేయు

క. పురపురం బొక్కుచు బకపతి, కరంకముం దేరం బనిచి గారవమున నె,
య్యురు, దాను నగ్ని యిచ్చి య,సురపతి యున్నంత వచ్చె
సురపతి నెమ్మిన్. శాంతి, 3-512

**అగ్నియేర్చు** స. క్రి.

అగ్ని సంస్కారము సేయు

ఉ. సూతులు దాని కియ్యకొనుచుం దన యన్నకు నగ్ని యేర్చు వా,రై. విరా. 3-11

**అగ్నిర్మిత్రో యోనిః**

దీని నెక్కినవారు వీర్యవంతు లగుదు రీ మంత్రంబున దీని నెక్కుండు, వెలనాఁడిది దాఁటిక సముద్రంబు సొచ్చునని "యగ్నిర్మిత్రో యోని" యనునివి యాదిగాఁ గల మంత్రంబు లుపదేశించిన, అర 3-122

"అగ్నిర్మిత్రో యోని రాపోఽథ దేవ్యో విష్ణోరేత స్త్వమృతస్య నాభిః" ఏవం బ్రువన్ పాండవస్సత్యవాక్యం నేదమిమాం త్వం తరసాధిరోహి. సం.భా. అర. 116-17 (నిర్ణయ)

మంత్రార్థము : ఓ విష్ణూ, నీకు అగ్ని మిత్రుఁడు. దేదీప్యమానము లైన జలములు నీకు స్థానము. నీవే మోక్షమునకుఁ గారణమైన వాఁడవు.

**అగ్నివక్త్రుఁడు** సం. వి. అ. పుం.

శంకరుఁడు (ముఖమునందు అగ్ని నేత్రముగాఁ గలవాఁడు)

సీ. శ్రీకంఠు రుద్రుని శివు... నజు నగ్నివక్త్రుని నభవు భవుని, భక్తిఁ బ్రస్తుతించి. అశ్వ. 1-69

**అగ్నివటము** సం. వి. అ. పుం.

ఒక తీర్థప్రదేశము. అర. 2-259

**అగ్నివేశ్యుఁడు** సం. వి. అ. పుం.

ఒకముని- ద్రోణుని ధనుర్విద్యాగురువు. ఆది. 5-197

**అగ్నిష్టోమము** సం.వి. అ పుం.

1. అగ్నిష్టోమ మనునది అగ్నిని గురించిన స్తోత్రము. అగ్నిష్టోమనామము చివరగాఁ గల యజ్ఞము అగ్నిష్టోమ మనబడును. దీనిని గుఱించి తాణ్డ్యమహాబ్రాహ్మణము ద్వాదశాధ్యాయమునందు విపులముగాఁ జెప్పబడినది. ద్వాదశ స్తోత్రాత్మక మైనది అగ్నిష్టోమము.

వసంతకాలమందుఁ జేయఁబడు నొక యాగము (ఇది జ్యోతిష్టోమ సంస్థలలో మొదటిది అని సూ. ఆ. ని.

సీ. ...అగ్నిష్టోమ, హయమేధవాజపేయాతిరాత్ర, పౌండరీకములనఁ బరఁగిన యధ్వరంబు లనేకములు సేసి... యయాతి నెగడె

ద్రోణ. 2 205

2. అగ్నులయొక్క సమూహము.

క. నీ మహిమ వొగడఁ గొలదియె, దామోదర విశ్వసంవిధాతవు భవదీయామలతేజము యగ్నిష్టోమము గాలాత్మకత్వశోభి కృష్ణా. అశ్వ. 3-7

శ్లో. త్వత్తేజ సంభవో నిత్యం హుతాశో మధుసూదన

సం. భా. అశ్వ. 52-9 (నిర్ణయ)

**అగ్నిసంభవుఁడు** సం. వి. అ. పుం.

కుమారస్వామి అను. 3-151

**అగ్ని సంస్కారము** సం. వి. అ. పుం.

1. దహనక్రియ, శవదహనక్రియ.

వ. అట్లగ్నిసంస్కారములుసేసి నీవు వచ్చిన యనంతరంబ తచ్చితా సమీపంబున. శాంతి. 3-516

వ. బంధుశవంబులకుఁ గాలోచితాచారసహితంబుగా నగ్నిసంస్కారంబు సేయుం డని పనిచి. స్త్రీ. 2-10

**అగ్నిసాక్షికము** సం. విశే. (అ. ఆ. అ)

అగ్ని యెదుట జరిగినది, అగ్నియే సాక్షిగాఁ గలది.

చ. అంబురుహానన యగ్నిసాక్షికంబునఁ బరిణీత యైన సతిఁ బొల్పుగ నొక్కతఁగాని యన్యలన్, మనమున నేనియుం దలఁప.

ఆది. 4-186

**అగ్నిసూక్తము** సం. వి. అ. న.

అగ్నిని గుఱించిన వేద మంత్రములతోఁ జేయు స్తోత్రము.

వ. ఖాండవదహనోద్యతుండై వచ్చుచున్న యగ్నిభట్టారకుం గని యగ్ని సూక్తంబుల స్తుతియించి యిట్లనియె. ఆది. 8-300

**అగ్నిహోత్రము** సం. వి. అ. పుం.

1. అగ్ని, ధార్యాగ్ని

వ. అంతకుమున్న తమ వెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రం బులం దోడనకొని వర్తిల్లు భూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండ. విరా. 1-46

2. నపుం.

హోమము-

ఆ. అగ్నిహోత్రపరులు నాజిం బిఱిందికి, నడుగుపెట్టక తెగి నడచు వారు...... దురితదుర్గముల్ నిస్తరింతురు. శాంతి. 3-48

**అగ్నిహోత్రి** సం. వి. న్. పుం.

అగ్నిహోత్రము గలవాఁడు, అగ్నిహోత్రమును జేయువాఁడు, ధార్యాగ్నిని గలవాఁడు

సీ. ఆహార ముడిగి మహాశ్రమంబున నగ్నిహోత్రియై యొక మాస ముండి. అను. 2-76

**అగ్నిషోములు** సం. వి. ద్వివ. (అగ్ని + సోముఁడు)

అగ్నియు సోముఁడును. వీరే సూర్యచంద్రమసులు పరమేశ్వరుని నేత్రములనుండి పుట్టినవారు

క. అగ్నిషోములు, చిత్త్రిస్థితి వెలుగుదురు ప్రసిద్ధాకృతులన్. శాంతి 6-427

**అగ్రగణ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

శ్రేష్ఠుఁడు- మొదటిదిగా నెన్నఁదగినవాఁడు- ముఖ్యుఁడు.

ఆ. అహికులాగ్రగణ్యుఁడైన వాసుకి. మౌస 76

**అగ్రజన్ముఁడు** సం. వి. న్. పుం.

1. అన్న.

క. ...దుశ్శాసనుఁ డేమియు సరకుగొనక సమదవిలాసా,నసుఁడై నిజాగ్రజన్మునిఁ, గనుఁగొని యిట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. విరా. 3-95

2, ముందు జనించినవాఁడు

తే. ...అత్తెఱంగు, ప్రస్ఫుటంబుగఁ జెప్పెదఁ బాండవాగ్రజన్మ- శాంతి. 6.8

3. బ్రాహ్మణుఁడు

ఆ. భూమిదానవిధులు భూవర యొకమాత్ర నంటిశాతనూజుఁ డాచరింప, నందఁబోక యూళు లగ్రజన్ములకు నీ, నతని బనిచెఁ బాండవాగ్రజుండు. ఆశ్ర. 1-136

**అగ్రజుఁడు** సం. విశ. అ. పుం.

1. ముందుఁ బుట్టినవాఁడు

వ. ఎక్కుడించినఁ బాండవాగ్రజుండు. విరా. 1-169

2. వి. అ. పుం.

అన్న (సోదరులలోఁ బెద్దవాఁడు)

తే. ...సమీరణపుత్రుఁ డగ్రజుండు వోయిన దెసఁ దప్పనొందు వలన, సమదవారణపతిగమనమున మత్స్యధరణివల్లభు సభచేర నరుగఁటయును. విరా. 1-211

**అగ్రణి** సం. విశ. (ఈ. ఈ. ఇ.)

1. ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు, సేనాపతి.

తే. మద్రవిభుఁ డగ్రణిగ నేచి మనము నడచి, కడిఁది పగఱ జయింతము. శల్య. 1-80

2. ముందువాఁడు, మొదటివాఁడు, అన్న.

ఆ. అప్పుడు శనివరుండు ననిలపుత్రుఁడుఁ జేదిబలము శల్యుఁ దీవ్రభంగిఁ దొడువ, నాతఁ డా ధనంజయాగ్రణిఁ బటుశర, పంచమార్గణముల నొంచె నధిప. శల్య 1-189

**అగ్రతలము** సం. వి. అ. పుం. న.

ముందు ప్రదేశము, ముందర, ఎదుట

క. ఒక్కయెడ నగ్నిదేశ్యం, డక్కౌరవవంశవరుల యగ్రతలమునన్. మౌస. 27

**అగ్రతీర్థుఁడు** సం.వి.అ.పుం.

క్రోధవశగణాంశ సంభవుఁడు, భారత యుద్ధమున దుర్యోధనుని పక్షమునఁ బోరి మరణించిన వీరుఁడు లేక, కృష్ణ విరోధులతోఁ జేరి పోరాడి చచ్చినవాఁడు. ఆది. 3-80

**అగ్రనందనుఁడు** సం. వి. అ. పుం.

పెద్దకొడుకు

ఉ. ...తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూవల్లభు నగ్రనందనుఁడు, విరా. 3-148

**అగ్రపుస్తకము** సం. వి. అ. న.

పెద్ద పుస్తకము

ఆ. అగ్రపుస్తకంబు లర్చించి చూచుచు. ద్రోణ. 2-345

భాగవతము, శ్రీమద్రామాయణము, మహాభారతము, శ్రీవిష్ణుపురాణము అనువానికి పెద్దపుస్తకములని ఆంధ్రదేశమున వాడుక గలదు. వీథిబడి (పల్లెకూటము) చదువులలో మా వానికి పెద్దపుస్తకము పట్టించినారము. పెద్దపుస్తకము పట్టించునప్పుడు పంతులుగారికి ధోవతుల చాపుపెట్టుట మామూలు. "అబ్బాయీ, నీవేమైన పెద్దపుస్తకము చదువఁగలవా?" అను వాడుక మాటలు నిన్న మొన్నటిదాఁక గలవు. పిల్లవానికి పిల్ల నిచ్చుచున్నప్పుడు వాని శక్తి పరీక్షించుటకై పెద్దపుస్తకము చదివించు నాచారముగూడ నుండెడిది. నేఁడు వీథిబడులన్నియు మార్పుఁ జెందిన పాఠ్యక్రమముగలవే యగుటచే ఆ విద్యాపద్ధతి నశించినది. గ్రంథమునకుఁ గల పూజ్యతనుబట్టియు గ్రంథ విస్తారమును బట్టియు నియ్యవి పెద్దపుస్తకములుఁగా ప్రసిద్ధి గాంచినవి. వీనిని నిత్య ముపాధ్యాయులు సాయంకాలము విద్యార్థులచేఁ జదివించెడివారు.

**అగ్రపుస్తకము లర్చించి చూచు** జాతీయము

పెద్దపుస్తకములగు శ్రీమద్భాగవత, శ్రీమద్రామాయణ, శ్రీమన్మహాభారతాదులను బూజించియు, ధ్యానించియు వాంఛితార్థము సిద్ధిం

చునా లేదా యని మనస్సులోఁ బ్రశ్నించుకొని యొక సన్నని పుడక దీసికొని మూసిన గ్రంథమునందలి పుటలలో నొక్కెడ దూర్చి గ్రంథమును దెఱచి యా పుడక స్పృశించిన పంక్తులను జదివికొని యందలి విషయమును బట్టి ఫలాఫలములు నిర్ణయించుకొను.

ఉ. అగ్రపుస్తకము లర్చించి చూచుచుఁ, బగమనియతిమై నుపశ్రుతులకుఁ, బోవుచు శకునంబు లావహించుటఁ గాంచి, చెలఁగి యొండొరులకు జెప్పికొనుచు. ద్రోణ. 2-345

ఈ యాచార మీ దేశమున నిప్పటికిని గలదు.

**అగ్రపూజ్యుఁడు** సం. విశే. అ. పుం.

మొదట పూజింపఁదగినవాఁడు

వ. అమ్మౌని వచనం బమోఘంబు గావున నీవు సర్వజ్ఞుండవయ్యు మాలో నగ్రపూజ్యుండవని యొసంగుటిచి. శల్య. 2-195

**అగ్రప్రదాయి** సం. విశే. న్. ఈ. న్.

అన్నము పెట్టువాఁడు, అన్నదాత

క. అగ్రప్రదాయి వర్ణ స్వమగ్రుఁడు బలయుతుఁడు బుద్ధిమంతుఁడు లోకానుగ్రహపాత్రము శాత్రవ, నిగ్రహశక్తుండుఁ దత్త్వనిష్ఠుఁడు నగున్. చూ. అగ్రము అను. 4-32

**అగ్రభాగము** సం. వి. అ. పుం.

ముందు ప్రదేశము

వ. కౌరవేశ్వరుడును నతని ముందటఁ గరిఘటాగ్ర భాగవర్తియై బహుల చతురంగంబులతోడ శకునియు నిలుచునట్లుగా నొనర్చె. శల్య. 1-113

**అగ్రభాసితము** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రథమమునఁ బ్రకాశింపఁబడినది.

తే. అనఘ బ్రహ్మంబు దేజోమయంబు శుక్ల, మగ్రభాసిత మెద్దాని యతులసార, రసము విశ్వంబు నది యపార్ధమహిత కాల, బుద్ధమై చేయు బహువిధభూతసృష్టి. శాంతి. 5-57

**అగ్రమహిషి** సం. వి. ఈ. స్త్రీ.

పెద్దరాణి - పట్టపుదేవి

క. పనిగొనునెడఁ బాంచాలిని యగ్రమహిషి కొంకుచుఁ, బనిగఱపెడు చందమునన పనుచు తెఱుఁగవే. విరా. 2-219

**అగ్రము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మొదటిది, ప్రథమము

చూ. అగ్రపూజ్యుఁడు కల్య. 2-195, అగ్రశాసితము శాంతి. 5-57

2. ప్రధానము, ముఖ్యము

ఇతఁడు మదీయాగ్రపురోహితుఁడు. ఉద్యో. 1-33

3. మిక్కుటము, అధికము

క. దేవతలకు నగ్రపురం,శావన మవహారమిచ్చి, పదపడి కుడువం, గావలయు. అను. 4-24

వి. అ. న.

1. కొన, చివర

క. అమలినతరదర్భన్యాసము లెందును దక్షిణంబు సాఁగ నిడిన య, గ్రములు గలిగియుండుట. అను. 3-188

2 పై భాగము

వ కరిమకరనికరాఘాతజాత వాతోద్ధూత తుంగతరంగాగ్ర సముచ్ఛల జ్జలకణాసారచ్ఛటాచ్ఛాదితగగనతలంబై నదాని .. ఆది. 2-27

3. పురోభాగము, ముందు

వ. ఇట్లు గనుంగొని మధ్య దక్షిణ వామాగ్ర పశ్చిమోత్తర భాగంబుల నిట్టట్టి వారలు నడచుచున్నారని సారథితో నేర్పడంబలికె. విరా. 4-250

4. శిఖరము (కొండ) కొన

క. నగాగ్రగతుఁడు మహావారలఁ జూచు తెఱంగున శాంతి. 5-186

5. ఉత్కర్షము

శా....ని, త్రైలోక్యత్వ నిరంజనాగ్ర విహృతి. శాంతి 5-360

6. అన్నము

ఆ. బలివిధానములకు బ్రాహ్మణాతిథులకు, నన్నకాంతులైన యర్థుగు
లకు, నగ్రమిందుఁబుచ్చి యాయగ్రశేషంబుఁ, జెలువ రెండుపాళ్లు
సేయుమెనగ. ఆది. 7-228

తే. అప్పటికి వారు లేకున్న నగ్ర మగ్నిముఖమునందైన నిడునది.
అను. 3-339

"అలాభే బ్రాహ్మణస్యాగ్నావగ్ర ముద్ధృత్య నిక్షిపేత్"
సం. భా. అను. 154-15 (ఉత్తర ప్రతి)

"అలాభే బ్రాహ్మణస్యాగ్నావగ్రముద్ధృత్య నిక్షిపేత్"
సం. భా. అను. 154-15 (నిర్ణయ)

నీలకంఠ వ్యాఖ్యలో అగ్రమునకు అన్నము అని చెప్పఁబడినది.
అగ్రము అన నాలుగు కబళముల భిక్షు అని సూ. ఆ. ని. నందును
"గ్రాసప్రమాణం భిక్షా స్యాదగ్రం గ్రాసచతుష్టయమ్." అని అమర
కోశమునందును గలదు. కాని ఆ యర్థము ఇక్కడ చాలదు.

సమాసంబుల నియ్యది ప్రథమ పదముగాఁజేరుచో సామాన్యముగా
ముందు భాగము. ముందు మొదటిది- అనియు చివర పదముగా
నున్నచో చివర భాగము, చివర యనియు నర్థము లిచ్చుచుండును.

**అగ్రయాయి** సం. వి. ఇ. పుం.

ధృతరాష్ట్రుని నూర్గురు కొడుకులలో ఒక్కడు. ఆది. 5-107

**అగ్రవర్ణుఁడు** సం. వి. అ. పుం.

బ్రాహ్మణుఁడు

సీ. అగ్రవర్ణులఁ గాంచి యాదరింపకయుండు కంటెను గీడొండు గలుగ
దరయ. అను. 1-161

**అగ్రసరము** సం. విణ. (అ. ఈ. అ.)

ముందు నడచునది

మ. పురుహూతాగ్రసరప్రభూత బలసంభూతాస్త్ర నిర్ఘాతమై
అర. 5-274

**అగ్రహారము** సం. వి. అ. పుం.

తే. గుళ్లుఁ జెఱువులుఁ గట్టించుఁ గోరి యూళ్లు, లగ్రహారముల్

గావించునాంబికేయుఁ, డధిప ధర్మతనూజుఁ డత్యంతహర్ష,
చిత్తవృత్తియై యనుమతి సేయుచుండ. ఆశ్ర. 1-7

పండిన ధాన్యాదికము నుండి బ్రాహ్మణుల భోజన నిమిత్తమై గురుకుల వాసులగు బ్రహ్మచారుల నిమిత్తమై కొంత భాగమును ముందుగా నెత్తి యుంచుచు వచ్చిరి ధాన్యాదికము నుండి యేటేట నిచ్చుట శ్రమముగాఁ దోఁచి కాఁబోలు కొంత భూమి యిచ్చుచు వచ్చిరి. ఆదరాతిశయముచే నొకయూరి పొలిమేరలో నున్న క్షేత్రమంతయు నొసఁగుచు వచ్చిరి. ఇట్లు సేయుటచే అగ్రహారమను శబ్దము పదార్థద్యోతకమై తరువాత భూపర్యాయమై తర్వాత గ్రామపర్యాయమయినది. రానురాను అగ్రహారమన నొకసామాన్య గ్రామమే అగుచున్నది.

"స కశ్చిదగ్రహారే కాలిం నామైకస్యైతి"- దశకుమార చరిత్ర-ఇప్పటికిని అగ్రహారమన ఒకప్పుడు బ్రాహ్మణులెక్కువగా నుండిన యూరని అర్థము.

**అగ్రాహ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తెలియఁదగనిది

క. లోకంబంతయు నెవ్వం, డేకాంశంబునన నిర్వహించుచు నగ్రా,
హ్యాకారుండై వెలుఁగు డ,యాకరు నప్పద్మనాభు నభివర్ణింతున్.
శాంతి. 4-227

2. తెలిసికొన శక్యముగానిది

ఆ. ...చక్షురాదుల కగ్రాహ్య, మది ప్రధానమనఁగ నతిశయిల్లు.
అను. 5-245

**అగ్రాహ్యుఁడు** సం. విణ. అ. పుం.

తెలిసికొన శక్యము గానివాఁడు — పరబ్రహ్మము.

క. తనుఁదనయంద నిలిపి పే, రనువున బుద్ధి కడ వెలుఁగు నచ్యుతుని సనా,తను నగ్రాహ్యునిఁ జిన్మయుఁ, ననుస్మరించునది యపునరావృత్తికినై శాంతి. 4-247

**అగ్రిమము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ముందటిది

క. సరుశల్లఁబుల నగ్రిమ, చరణఁబులు ద్రెస్సి మొగ్గు జవనాశ్వంబుల్
విరా. 5-51

1 మొదటిది (రూపాం) అగ్రియము

క. అరుదంతకఁబె గలదె యగ్రిమ వర్ణా. శాంతి. 6-602; సభా. 36.

**అగ్రియము** సం. విణ. (అ. ఆ. అ.)

1. చివరదైనది - కొన - అగ్రము - కొట్టకొనదైనది

మ. విలసద్ధర్మ విశుద్ధ వృత్తులు వయోవృద్ధుల్ కళాగ్రియబుద్ధులు
మధ్యస్థులు. (రూపాం) అగ్రియము అగ్రిమము ఆది. 8-35

**అగ్రేసరము** సం. విణ. (అ. ఈ. అ.)

1. ముందు నడచునది

క. ఆ వాక్యము లెల్ల వినుచు, భావమలర నర్జునుండు భాసురమగు న,
మ్మార్తనగ్రేసరముగ య, జ్ఞావాసఁబునకు వచ్చెనంచితలీలన్.
ఆశ్వ. 4-166

2. ముందుండునది

సీ. ఆ రాజు... అగ్నిహోత్రంబుగొని యాజకోత్కరం బగ్రేస, రం
బయిపో నిజాశ్రమము విడిచి. ఆశ్ర. 2-143

**అగ్రేసరుఁడు** సం. విణ. అ. పుం.

1. శ్రేష్ఠుఁడు

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు... విరా. 5-11

2. నాయకుఁడు

వ. పాండవులు మూఁడు మొగంబులుగా మోహరించిరి. ధృష్టద్యుమ్న
శిఖండి సాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రభాగంబున శోభిల్లి.
శల్య. 1-113

3. ముందు నడచువాఁడు

వ. పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని
ఆశ్వ. 1-188

**అగ్ర్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రధానమైనది, శ్రేష్ఠమైనది, మొదటిది

సీ. అనిలచయమ్మునఁ బ్రాణ మగ్ర్యము ఛందములకు గాయత్రి యగ్గలము — అశ్వ. 2-161

**అఘటమానము** సం. విణ. (అ. ఆ. అ.)

చేయుటకు నలవిగానిది - సంభవింప వీలుగానిది

వ. మన గూఢభావంబు మేరువు నిగూఢభావంబునుంబోలె నఘటమానంబు — అర. 1-266

**అఘమర్షణము** సం. వి. అ. న.

గురుతల్పగమన బ్రహ్మహత్యాది మహాపాప పరిహారార్థము జపించు మంత్రము.

అఘము నశింపఁజేయునది గాన అఘమర్షణమని చెప్పబడుచున్నది.

1 ద్రుపదాదివ ముంచతు, 2. ఋతం చ సత్యం చ, 3. ఆపోహిష్ఠా మయో భువః అను మూఁడును గలిసి అఘమర్షణమంత్ర మనఁబడును జలము లందుండి ప్రాణాయామ మొనరించి మునింగి యీ మంత్రము మున్మారు జపింపవలయు నని సకల స్మృతికర్తలు శాసించుచున్నారు. క్రతురాజంబైన అశ్వమేధంబువోలె సర్వపాప ప్రణాశన సమర్థంబైనది యీ యఘమర్షణ సూక్తము. ఇయ్యది ఋగ్వేదమున 190 వ సూక్తముగాఁ జెప్పఁబడుచున్నది. ఈ యఘమర్షణ మంత్రజపముతోఁ జేయఁబడు స్నాన మఘమర్షణస్నాన మనఁబడుచున్నది. "అఘమర్షణస్నాన మాచరించి" అని మనుచరిత్ర.

తే. కుల్యయందుఁ ద్రిరాత్రమ్ము గుడుపు దక్కి, శౌచియై యఘమర్షణ జపముచేసి. — అను. 2-87

**అఘము** సం. వి. అ. న.

పాపము

సీ. .. గురుతల్పగుం డనలప్రతప్తమైన - ఆ - ఆయసాంగనాంగ ఘాలింగనముసేసి, ష్టైనఁగోసి కరమునందు ఘేహ్యనము ధరించి

యంబరముఁ బూచు చరిగొడ్యోనియును జచ్చి యఘము నిస్త
రించు. శాంతి. 1-807

**అఘోషిణి** సం. విణ. (స్త్రీ. సీ. స్త్రీ)

శబ్దరహితమైన వాక్కు.

సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు, తెఱఁగులు గలిగి వాగ్దేవి
వరఁగు, నం దఘోషిణి గరీయసి. అశ్వ. 2-27

**అచపలత్వము** సం. వి. అ. న.

చాంచల్యము లేకుండుట, మనస్థిరత్వము - మనస్సు విషయములందుఁ జలింపకుండుట.

ఆ. హింస లేక యునికి యింద్రియజయము సైరాశ్య మచపలత్వ
మను గుణములు, వాల్గు గలుగునట్టి నరునకుఁ గరతలామలక మంత
రాత్మమహిమ యెల్ల. శాంతి. 6-815

**అచపలము** సం. వి. అ. న.

అచాపలము, చంచలత్వము లేకుండుట - మనస్స్థైర్యము.

సీ. శక్త్యనుగుణ దానశాలియు నచపలేంద్రియుఁడును శుచియు
మైత్రీపరుండు. అశ్వ. 2-169

**అచరము** సం. విణ. (అ. ఈ. అ.)

కదలనిది, స్థావరము

తే. అచరములును జరఁబులు నైన భూతసముదయంబులు

శాంతి. 4-210

**అచలత్వము** సం. వి. అ. న.

కదలకుండుట, కదలికలేమి - చలనము లేకుండుట.

వ. వివిధాయుధ వ్యాపార ఘోరవిచేష్టిత విగళిత రక్తసిక్తంబులగు
నంగంబుల యచలత్వంబున గైరికగిరిద్వయ బు చందంబున
నొప్పిరి. ద్రోణ. 5-207

**అచలము** సం విణ. (అ. ఆ. అ.)

1. చలింపనిది, స్థిరము, శాశ్వతము

తే. ఉడుగవలయు, వీనినై దీఁటి నచలావధానవృత్తి. శాంతి. 5-115

2. వి. అ. పుం.

కొండ

క. గురుముఖ ఐహూరథికశరో,త్కరములచేనైన క్రొత్తగంట్లను సుమనో,భరిత నవకర్ణికార స్ఫురితాచలయుగము భంగిఁ బొలిచిరి చూడన్. ద్రోణ. 8-177

వి. అ. న.

పురుషుఁడు, బ్రహ్మము

వ. విద్యావిద్యలు, వేద్యావేద్యంబులుం జలాచలంబులు ననునవి వేదోదితంబులు వానిం దేటపఱుపవే యని యడిగిన, శాంతి. 6-140

**అచలవ్యూహము** సం. వి. అ. పుం.

పర్వతాకారముగాఁ బన్నిన సైన్యసముదాయము.
చూ. వ్యూహము భీష్మ. 1-130

**అచలిత** సం. విణ. ఆ. (స్త్రీ).

భయము లేనిది, భయము లేని యాఁడుది

వ. వారుత్తమ క్షత్రియులు వారలు సమ్యక్పరిపాలనంబున నన్నరయు వారుగా నను గ్రహించిన నచలితనై యుండెన. శాంతి. 2-92

**అచలితము** సం. విణ. అ. న.

కదలనిది, జాఱనిది, తొలఁగనిది

చ. ఘనతర కోపవేగమునఁ గంపమునొందు నిజాంగకంబులం, దన ధృతి పెంపునొం పచలితంబులఁ జేయ.. . . విరా. 2-382

**అచలితుఁడు** సం. విణ. అ. పుం.

భయము తొలఁగినవాఁడు - స్థిరుఁడు, స్థైర్యము గలవాఁడు.

క. ...కుంతీ, తనయుఁడు వెఱవాపుటయు నతం డచలితుఁడై.
విరా. 4-117

**అచలుఁడు** సం. విణ. అ. పుం.

1. చలింపనివాఁడు, తొట్రుపాటు లేనివాఁడు, స్థిరుఁడు

వ. ఆ శినివంశవరుం డచలుండై యైంద్రాస్త్ర ప్రయోగంబున నమ్మాయ మాయించి. భీష్మ. 3-28

వి. అ. పుం.

1. పురుషోత్తముఁడు, నారాయణుఁడు.

తే. అచలు సూక్ష్ము శరణ్యు సహస్రశీర్షు, నభయకారి నశీర్షు నారాయణుని. శాంతి. 4-217

2. గాంధారదేశపు రాజకుమారుఁడు, ధృతరాష్ట్రుని బావమఱఁది- వృషకుని అన్న. ఉద్యో 4-233

కొన్ని ప్రతులలో వృతుండును నచలుండును- అనియున్నది. వృషుండు అన్న అచలుండు తమ్ముఁడు అని యా ప్రతులఁబట్టి తెలియుచున్నది. కాని

'అచలో వృషకశ్చైవ సహితౌ భ్రాతరావుభౌ' సం. భా. ఉద్యో. 167-1 యందు వృషకుఁడుగానే చెప్పఁబడినది. ఇంకను వీరిని గుఱించి సంస్కృత భారతమున-

అచలుఁడు వృషకుఁడు అనువారిద్ద అన్నదమ్ములు. వీరు ఒకరిని విడిచి ఒకరుండువారుగారు. దర్శనీయులైన తరుణ వయస్కులు. బాహుపరాక్రమము గలవారు. యుద్ధమునఁ బంతము పట్టుదలగలవారు. సమరథులు. మందిగలవారు. సం.భా. ఉద్యో. 167-1, 2, 3 శ్లో (వావిళ్ల)

**అచాపుఁడు** సం. విణ. అ. పుం.

చాపములేనివాఁడు.

కం. విరథుండు నచాపుఁడు వ్యర్మరహిత గాత్రుండు నైన మద్రవిభుఁడు. శల్య. 1-270

**అచింతనుఁడు** సం. విణ. అ. పుం.

చింత లేనివాఁడు, దుఃఖింపనివాఁడు

ఇంద్రవజ్ర. కీడుం, జింతింపఁ డార్యాత్ము దచింతనుఁడై, యంతః
పరితాపము నార్పఁజాలున్. త్రి. 1-29

**అచింత్యము** సం. విశ. (అ. ఆ. అ.)

విచారింప శక్యముగానిది, తలంపరానిది.

తే. పుత్ర వినుము నవద్వార పుణ్యపురము,నం దచింత్య సంవ్యాప
కుఁడై శయించు, నీ సమస్త భావంబుల నెనసియట్టు, లగుటఁ
బురుషుండు నాఁ జను నవ్విభుండు. శాంతి. 4-275

**అచిత్తము** సం. విశ. (అ. ఆ. అ.)

1. చిత్తములేనిది, మనస్సు లేనిది. 2. తెలివిలేనిది, వివేకశూన్యమయినది.

చ. పరమ తపంబు గాఢపరిపాకము నొందినఁ జిత్స్వభాత్మకా,క్షర
మున చిత్తభూత గుణజాలతనున్ క్షరమున్ వివేకితా, పరిణతిఁ
బాపి చూచి యనపాయసుఖస్థితి నూఁది పొల్లిం, బొరయక
త్రోపు హింసయను బుద్ధి విమూఢతగాక బోధమే. ఆశ్వ. 2-74

**అచిత్తు** సం. వి. త్. స్త్రీ.

1. ప్రకృతి, 2. అజ్ఞానము, 3. అనాత్మ.

చ. ...చిదచిద్ద్వయమున్ విభజించి దాన హింసనము నొకింతయుం
బొరయ జన్నము సేయుదు మేలు నొందుదున్. ఆశ్వ. 2-75

**అచిరకాలము** సం. వి. అ. పుం.

కొద్దికాలము

తే. అచిరకాలంబునన యమ్మహాత్ముఁ డిట్లు, యోగసిద్ధిఁ బ్రాపించునె.
శాంతి. 6-329

**అచిరము** సం. విశ. (అ. ఆ. అ.)

1. అప్పటికప్పు డగునది, త్వరితము, శీఘ్రమైనది.

క. చిరమో కార్యసమీక్ష య,చిరమో వలయునది కరుణఁ జెప్పు
మనవుడున్. శాంతి. 5-260

క. వినుమ చిర ప్రవృత్తిఁ జేసిన, పని కర్తకు నావహించుఁ బశ్చాత్తా
పంబు. శాంతి. 5-292

2. అశాశ్వతమైనది. కొలదికాల ముండునది.

క. రమణీ వర్గత్రయ ధర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరమున్. అను. 5-228

**అచేష్టత** సం. వి. అ. (స్త్రీ).

నిశ్చేష్టత.

చ. ...సుతున్ హతుఁడయ్యె ననంగ విన్నయం,తన యితఁ డాయుధంబు డిగ్గ|దావి యచేష్టతఁ బొందు. ద్రోణ. 5-305

**అచ్చెరుపడు** వై. అ. క్రి.

ఆశ్చర్యమును బొందు-

వ. ...విజయుండు ధనుష్సమీపంబున కరిగిన నాతని యుత్సాహంబున కచ్చెరువడి కొందఱు బ్రాహ్మణులు దమలో నిట్లనిరి. ఆది. 7-178

వ. కని దాని యపూర్వరామణీయకసమృద్ధి కచ్చెరుపడి. సభా.1-173

(ఈ రెండు తావుల 'అచ్చెరువడి' అని కొన్ని ప్రతులు)

(అర. 3-83 లో, పాఠాంతరము)

**అచ్చెరుపాటు** వై. వి.

ఆశ్చర్యము, వింత

చ. ...వీరవర్గమున్, నటికెరఁ జూచు ఖేచరగణంబుల కచ్చెరుపాటొనర్చెదన్. శల్య. 1-86

అచ్చెరువు + పాటు = అచ్చెరువుపాటు, అచ్చెరుపాటు— 'వు' వర్ణకంబునకు లోపము– పాటు స్వార్థమునందుఁ బ్రయోగము)

**అచ్చెరువందు** వై. అ. క్రి.

అచ్చెరువు పొందు, ఆశ్చర్యమునుబొందు.

సీ. సురసిద్ధ ఖేచరవరుల్ కావచ్చి య,చ్చెరువంది చూడంగ.

(అచ్చెరుపడి పాఠాం) అర. 3-88

**అచ్చెరువడు** వై. అ. క్రి.

అచ్చెరుపడు, ఆశ్చర్యమునుబొందు

క. ఇచ్చటి బంధులు నీవున, నచ్చెరువడి వినుచునుండ నయిదూళ్లును
మా, కిచ్చినను జాలునంటిని. ఉద్యో. 3-11; శాంతి. 3-361

**అచ్చెరువాటు** వై. వి.

అచ్చెరువునాటు, అచ్చెరువుపాటు, అచ్చెరుపాటు

క. ...ఉత్కటమగు న,చ్చెరువాటుఁ గౌతుకంబు న,డర నూరకయుండె
నయ్యేడం గురుసేనల్. విరా. 5-83

**అచ్చెరువు** వై. వి. (సం. ఆశ్చర్యము. ప్రా. అచ్ఛేరమ్)

ఆశ్చర్యము, వింత

క. అరయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ. విరా. 1-20

**అచ్చెరువుపాటు** వై. వి.

ఆశ్చర్యము

చ. భీష్మ న,కర్ణజముగఁదాఁకి యద్దెస నకంపితులై నడతెంచు శల్య
కుం,భజ కురురాజు లచ్చెరువుపాటు భయంబును బొంద జేయుమా.
భీష్మ. 2-38

**అచ్ఛము** సం. విణ. (అ. ఆ. అ.)

నిర్మలమైనది — స్వచ్ఛము

సీ. ...డి, గంబరుండును మలినాంగుండు నగువాఁడు, దోఁచె నచ్ఛ
జలంబు దొరఁగుచుండు, మేనితో. ఆశ్వ. 3-56

**అచ్ఛావాకుఁడు** సం. వి. అ. పుం.

సోమయాగమునందు హోతకు సహాయకారిగా నుండి శంసనకర్తగా
నుండు ఋత్విజుఁడు. సభా. 1-242

**అచ్ఛిద్రము** సం, విణ. (అ. ఆ. అ.)

1. సందులేనిది, ఎడములేనిది

మ. ...వీరులై తాఁకి యే,సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛిద్రంబుగా
నమ్ములన్. ఆది. 4-200

2. బెజ్జములు లేనిది

వ. ...కడుపు నిండ నీళ్లు ద్రావి యచ్ఛిద్రకమల వత్త్రి పుటికం నీళ్లు
గొని భీముండు గ్రమ్మఱి వచ్చునంత. ఆది. 6-173

**అచ్ఛిన్నము** సం. విశే. (అ. ఆ. అ.)

భేదింపఁబడనిది, ఛేదింపఁబడనిది

మాలిని- నిజతను విభవత్వోన్నిద్రం నాచ్ఛిన్న నాదా విరా. 3-239

**అచ్యుతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. స్థిరమయినది

క. అమృతం బచ్యుత మమలంబు...అవ్వేలుఁగు. శాంతి. 4-201

2. తొలఁగనిది, స్వస్వరూపమునుండి వేఱుపడనిది.

మ- ...అచ్యుత ధర్మజ్ఞ మహాత్మ... ఆది. 3-118

**అచ్యుతుఁడు** సం. వి. అ. పుం.

1. శ్రీమహావిష్ణువు

సీ. ...హృషీకేశ వరద నారాయణ...యచ్యుత యమృతరూప.
శాంతి. 2-50

2. కృష్ణుఁడు

శా. ...సరకుసేయం డచ్యుతున్ (సుయోధనుఁడు) ఉద్యో. 2-145

3. శాశ్వతుఁడు

ఆ. అమృతు నచ్యుతుని ననంతు. శాంతి. 4-216

4. చ్యుతము లేనివాఁడు, స్వస్వరూపము నుండి వేఱుపడనివాఁడు.
స్థిరుఁడు (అవతారములందును స్వస్వరూపముతో నుండువాఁడు)

తే. చ్యుతము లేకునికిఁ జేసి యచ్యుతుఁడ. శాంతి. 6-434

**అచటు** దే. నిర్దేశక స్థలవాచకావ్యయము

ఆ+చోటు – నిర్దేశక సర్వనామమగు 'ఆ' పై స్థలవాచకమగు 'చోటు' శబ్దము పరంబయి యనేక విధంబులగు రూపంబుల నొందుచున్నది.

అ+చోటు=ఆ చోటు, అచ్చోటు, అచోటు, అచ్చాటు, అచాటు, అచ్చటు, అచటు-

ద్విరుక్తంబగు హల్లుపరంబగునపుడును యాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వము వచ్చునమట నిత్యము గాదనియు అద్విరుక్తంబగు దీర్ఘంబునకు హ్రస్వము వచ్చుననియు నీరూపముల వలనఁ దెలిసికొననగును.

ఇది ఔపవిభక్తిక ప్రత్యయమైన ఇకారము తీసికొని దానిపై షష్ఠికిన్ పంచమి నుండి ప్రత్యయములు తీసికొనియు, సప్తమి అను ప్రత్యయము తీసికొనియు స్థలవాచక విశేషణముగను వాడఁబడును.

**అచటు** ఆ ప్రదేశము

అశ్వైనేశుఁ డచటు గడచి చనియెన్. ద్రోణ. 4-18

**అచట** (క్రియా) ఆ ప్రదేశమునందు

అచట దానికి మనసెట్టు నిలుచు. విరా. 2-297

**అచట నచట** విరా. 5-95; అచట నచ్చట మౌస-190

**అచట నుండి** శల్య. 2-202; అచటికి వి. 2-91

**అచటి బయలు** సౌప్తి. 1-16; అచోటు స్వర్గ. 1-19

**అచ్చట** విరా. 1-148; అచ్చటచ్చట- స్త్రీ-1-101;

**అచ్చట నుండి** కర్ణ. 2-61; అచ్చటికాకులు కర్ణ. 2-81;

**అచ్చటికి** ఉద్యో. 3-134; అచ్చటియందలు ద్రో. 5-306

**అచ్చటు** ద్రోణ. 4-76 అచ్చోటు విరా. 1-180

**అచ్చతెలుపు** వై. దే. మి. వి.

స్వచ్ఛమైన తెలుపు రంగు; నిర్మలమైన తెలుపురంగు

సీ. అచ్చ తెల్పునఁ గడు నభిరామమగు నొక్క యశ్వంబుఁ గాంచితిమి. అను. 1-198

అచ్ఛము + తెల్పు = అచ్ఛతెల్పు - అచ్ఛమునకు వృత్తియందు 'ము' వర్ణలోపము.

వ్యవ : (1) అచ్ఛతెలుఁగు, (2) ఈ దినము అచ్ఛపచ్చడితో భోజన మైనది.

**అచ్ఛము** వై. విశే. (సం. అచ్ఛమ్)

1, స్వచ్ఛమైనది, నిర్మలమైనది

ఉ. అచ్ఛపు భక్తికిన్ మతిఁ బ్రియంబున నొందిన ఫాలలోచనుం, డిచ్చిన — కల్య. 1-277

తే. ...పదంబు, లచ్ఛమైన తపంబున నచ్చుఁబడయ — ఆశ్వ. 2-203

2. కేవలము - మిశ్రముగానిది

చూ. అచ్ఛతెల్పు

**అచ్ఛర** వై. వి.

అప్సరస, దేవవేశ్య

సీ. ...అచ్ఛరతెఱవల మనములు గలఁచి యాడుదుగాక — స్త్రీ. 2-81

వ. పంచచూడ యను నచ్ఛరలేమ యొక్కెడఁ గాంచి — అను. 2-166

**అచ్ఛలము** దే. వి.

1. పూనిక, ప్రయత్నము

క. బలహీనులైనవారలు, బలవంతుల నోడుచునపుడు బహుమాయల నచ్ఛలమునఁ జేయుట యెందును, గలయదియ జయంబకాదె కర్తవ్యమిలన్. — సభా. 2-170

2. పట్టుదల

చ. అచ్ఛలమున నా సుయోధనుని చామన కోర్చుటగాదె యెంత యున్. — ఉద్యో 2-287

చ. ...అచ్ఛలమె ఫలంబొయింకయిన సంధియొనర్చుట మేలు వారితోన్ — కర్ణ. 3-270

అచ్చు దే. వి.

1. పోలిక, సాదృశ్యము, ఆదర్శము, దృష్టాంతము

కవిరాజ విరాజితము...సుదుస్తరమైన భవంబున కచ్చగు నీ యితి హాసము... త్రి. 1-51

శ్లో. ఉపమాన మిదం కాజన మోతువిద్భి రుదాహృతమ్ సం. భా. త్రి 6-4 శ్లో.

2. కరువు పోఁతపోయుటకు మొదట నేర్పఱచిన మృత్తికాది వికార రూపము.

సీ. నెత్తమ్మిఱేకుల మెత్తదనము దెచ్చి, యచ్చునఁ బెట్టిన ట్లుంద మొంది. విరా-2-52

3. ఒప్పిదము, ఒప్పు.

వ. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ వారు వేడకుండునది ఆది. 3-204

4. గుర్తు, చిహ్నము

సీ. ...దోషంబు సేయ నుదుట, నచ్చొత్తి వెడలంగ నడుచు విప్రుని నైన, భూవరుండిది మెచ్చు దేవకోటి. శాంతి. 1-94

ఈ అచ్చు శబ్దము దేశ్యముగాను వైకృతముగాను బూర్వనిఘంటు వుల యందుఁ జెప్పఁబడినది. కొన్ని యర్థములందు 'అక్ష' శబ్దభవము గాను మఱికొన్నిట 'అచ్ఛమ్' శబ్ద భవముగాను జెప్పుదురు. కాని యీ శబ్ద మన్ని యర్థములందును దేశ్యమనుట సమంజసము.

అచ్చు :- అ-క్రియ = అప్పువడు, ఋణపడు.

అచ్చు :- స-క్రియ = ఇచ్చు అనునర్థములు గలవు.

వీనినిబట్టి పై యర్థములు నిరూపింప వీలగును.

అచ్చుపడు దే. అ. క్రి.

1. సార్థకమగు

తే. ...అమరు లర్థి, ననిమిషత్వంబు దమకప్పు డచ్చుపడఁగ విరా, 5-165

2. మిక్కిలి ఫలించు

క. చిచ్చునకుఁదోడు కఱువలి, వచ్చుగతిన్ భీము దుర్నివార విహారం, బచ్చుపడఁగఁ బ్రాపై వివ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్. ఉద్యో. 2-191

3. అనుకూలపడు, సాధ్యమగు

ఉ. ...శత్రు సంతయము మేకొని చేసెదఁగాక వేఱొకం, డచ్చు పడంగ నేర్చునె దురాత్ములు కౌరవు లుర్వియిత్తురే. ఉద్యో. 3-120

4. తేటపడు, స్పష్టపడు

క. వచ్చినఁ గమఁగొని నీదెసఁ, బొచ్చెము లే దిట్లు మగిడి పొమ్మని విధి నీ, కిచ్చిన రూపని గుహ్యాకుఁ డచ్చుపడం బలికి... ఉద్యో. 4-397

4. సంభవించు, ఒదవు

తే. ముచ్చిమియకాదె యిది పాప మచ్చుపడియె, నృపతిచే దండితుండవై నీఁగికొనుము. శాంతి. 1-160

6. ప్రకాశించు

ఉ. వచ్చిన సంభ్రమంబు గరువంబు చెలర్చున నుల్లసిల్లి మే, నచ్చుపడంగఁజేయ. శాంతి. 6-574

7. ఏర్పడు, వర్తిల్లు

క. ...పోదిట్ల చ్చుపడ నేటికని వివ్వచ్చుఁడు గ్రేడించి యొండువలనికి నడచెన్. భీష్మ. 2-307

8. రూపొందు, మూర్తిభవించు

క. నెచ్చెలులు దన్నుఁగొలువఁగఁ, బచ్చవిలుతు కలిమియొల్లఁ బద్మాననయై, యచ్చుపడినట్లు మెఱయుచు, వచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్. అర. 7-174

అచ్చుపఱుచు దే. స. క్రి.

1. నియమించు, నియోగించు

క ...తగువాఁ, డిచ్చోట లేమి నాకం, డచ్చు పఱువఁడయ్యె నీ క్రియకు నొండొకనిన్. విరా. 4-28

2. ప్రాపింపఁజేయు, కలిగించు

క. విచ్చలవిడి నింద్రియములఁ, జెచ్చట కైనను జనంగనిచ్చిన నరకం, బిచ్చపఁజుచుఁ గుదియించినఁ, దెచ్చుసుగతి నరున కది సతీమౌళి మణీ. అను. 5-284

**అచ్చుపాటు** దే. వి.

స్పష్టత

క. ...అవ్విచిత్ర వీర్యనందనుండు

ఆ. అనఘ వశముగాదు మనసు గోడంద్ర మీ, వదినెఁ జుట్టములను సదనములకుఁ, బుచ్చుమనియెఁ బలుకు లచ్చుపాటడఁచు గృద్గదిక దైన్య మొసఁగ విదురుతోడ. శల్య. 1-11

**అచ్చువడు** దే. వి.

అచ్చుపడు.

తనమే నచ్చువడు భావనకుం... విరా. 1-292

**అచ్చొత్తు** దే. స. క్రి.

గుర్తుపెట్టు, ముద్రవేయు

సీ. ...దోషంబుసేయ నుదుట, నచ్చొత్తి వెడలంగ నడుచు విప్రుని నైన, భూవరుఁడిది మెచ్చు దేవకోటి. శాంతి. 1-94

**అచ్చొత్తినయట్లు** - జాతీయము

మిక్కిలి స్పష్టముగా, మచ్చునకు మచ్చుదీసి చూపించిన విధముగా (అచ్చు వేసినటుల మిక్కిలి స్పష్టముగాఁ గనఁబడుచో నచ్చొత్తినయట్లం దురు.)

ఉ. చిత్తముమెచ్చి వావలనఁ జిక్కఁగ వెండియు వాలకాఁగి యచ్చొత్తిన యట్లు నాకుఁ దన యల్లము తెల్లము సేయకున్కి. విరా. 2-84

**అచ్చోటు** దే. వి. ఆ ప్రదేశము

చూ. అచటు విరా. 1-180

**అచ్చో** దే. వి.

అచ్చోటు - ఆ చోటు

అచ్చోవెలవు దక్కి. కర్ణ. 8-54

**అజగరము** సం. వి. అ. పుం.

మేఁకల మ్రింగునది - కొండచిలువ, పెనుఁబాము

వ. ...ఇట్లరుగుచున్న దమయంతి నంతిక వ్యస్తచరణయైన దాని నాహారార్థియయి యొక్క యజగరంబు పట్టుకొనిన నకోక్కమలి మెదలనేరక. అర. 3-86

**అజగర వ్రతము** సం. వి. అ. పుం. న.

అయత్నముచేత జీవించు వ్రతము-అజగర స్వభావమును బురస్కరించుకొని దీనికి పేరు వచ్చియుండును.

సంచారమును మానవలయును. పుట్టువును జావును లెక్కచేయరాదు. ఆహారమునకై ప్రాఁకులాడువారి నవహసింపవలెను. కలిమిని లేమిని లెక్కింపరాదు. నిత్య సంతోషముతో నుండవలయును. విధి సమకూర్చిన ఆహార విహారములచే జీవితము గడుపవలయును. అత్మబోధాభారము మనస్సునందే మాత్రము పూనరాదు. నిత్యతృప్తి, శౌచము, శాన్తి, సమత్వము బొంది యాత్మజ్ఞానమునఁగలిగిన సుఖానుభవమును బ్రకటించుచుండవలయును. ఇవి అజగర వ్రత లక్షణములు. ఇట్టి యజగర వ్రతము నడుపు వారికి అరిషడ్వర్గ జయముఁగలిగి మోక్షము కరతలామలకమగును. శాంతి. 4-62, 63, 64

అజగరము ఎప్పుడు మేలుకొని యుండి యాహారమునకై వెదకికొనక తనదాఁపునకు వచ్చిన మేకలను మ్రింగి పొట్టనింపుకొనుచుండును ఆ స్వభావమును బురస్కరించుకొని ఈ వ్రతమునకు 'అజగర వ్రతము' అని పేరు వచ్చినది. అజం ఛాగం గిరతీత్యజగరః. గృ నిగరణే-(మేకను మ్రింగునది) నజాగర్తీత్యజగరః, జాగృ నిద్రాక్షయే (ఎప్పుడును మేలుకొనునది)

**అజగరుఁడు** సం. వి. అ. పుం.

ఒకానొక బ్రాహ్మణుఁడు, అజగర వ్రతముచే జీవించువాఁడు.
శాంతి. 4-54

**అజగవము** సం. వి. అ. న.

శివుని విల్లు – పినాకము
అజగవ శార్ఙ్గాలంకృత. విరా. 1-39

**అజనము** సం. విశ. (అ. ఆ. అ.)

జనులు లేనిది, విజనము
తే. ...శుచియు, నజనమును నగుచోట మృద్వ్యాసనమునఁ, గాయ
మున కార్జవము శంగిఁ గలుగ నుండి అను. 5-256

**అజపము** సం. వి. అ. పుం.

మంత్రావృత్తి లేనిది, జపము కానిది.
జపమున నొక మంత్రమును నిర్దిష్ట సంఖ్యతో జపించుట. అట్లు గాక అహరహము లెక్కయుఁ బరిమితియు లేకుండ జపించుట.
చ. ...నిర్జపా, జపమహి తవ్రతైక పరసంగ ధురాధిక లౌల్య.
అను. 3-345

**అజపాదుఁడు** సం. వి. అ. పుం.

ఏకాదశ రుద్రులలో నొకఁడు. అను. 8-58
చూ. ఏకాదశరుద్రులు.

**అజమీఢుఁడు** సం. వి. అ. పుం.

వికుంఠుని కొడుకు, భరత వంశజాతుఁడు. ఆది. 4-110, 111

**అజము** సం. వి. అ. పుం.

1. మేఁకపోఁతు, లేక గొఱ్ఱెపోఁతు.
అజశీర్యటః (అజాయనియు) అజగతి శేపణ యోః, తిరుగునది.
అజంబులకుఁ జిత్తభ్రమణంబు – (జ్వరము) శాంతి. 5-448
వ. అజంబుల వెనుకొను వృకంబు విధంబున. భీష్మ. 3-161

2. ఉపధి.

వ. వాకలోకంబున సురముని గోష్ఠియందు సుర లధ్వరంబుల నజంబుల విశసింపవలయునని పలికిన మును లజంబులన్నంతన యెల్ల యుగంబులను భాగంబులఁగాఁ గొనరాదు కృతయుగ విషయంబుగా వేదంబు లజంబు లోషధులని చెప్పెంగాన యనిరి. శాంతి. 6-372

(దీనిని ఉపరిచర వసువు పూర్వపక్షము చేసెను.)

క. భాగము విశసనయోగ్యము, యాగంబుల నెల్లయుగములందును ననియెం, దా గీర్వాణుల పక్షం, బై గెపలుది యపుడు వారి కగుటకు నధిపా. శాంతి. 6-373

3. పుట్టనిది, పుట్టువులేనిది, ప్రకృతి, పురుషుఁడు.

ఆ. అజముని ప్రణంబు లక్షయంబు లతీంద్రియములు ప్రకృతి పురుషులనఁగబరఁగు. శాంతి. 6-141

**అజయ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

జయింప శక్యముగానిది.

అజయ్య విక్రమోదగ్రుఁడు. విరా. 5-15

**అజయ్యుఁడు** సం. విణ. అ. పుం.

అజయ్యుఁడవు నీవ. ఉద్యో. 1-188

**అజరము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ముసలితనము లేనిది.

క. అమృతము, నభవము, నజరము, నమలమునగు తన్ను శాంతి. 6-18

2. కాలముచే మార్పునొందనిది.

క. ...పొందె శిష్యుం, డనామయుం బజర మమృతమనియెడు పదమున్. అశ్వ 2-220

3. శిథిలముగానిది.

వ. ...ఈయభేద్య కవచంబు నిచ్చి యజరంబయిన యగ్గోనయంబు గాండీవంబునం దానయోజించి. అర. 4-56

**అజరామరము** సం. విణ. (అ. ఆ. అ.)

1. చావుపుట్టుకలు లేనిది.

క. జననీజనకులచేనగు, జననం బాగతము తను విషయమని చెప్పన్,
వినుమాచార్యు వలననొం,దిన పుట్టు జరామరంబు దివ్యంబు నగున్
అను. 4-140

**అజరామరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

జరామరణములు లేనివాఁడు. (ముసలితనము, చావు లేనివాఁడు)

సీ. ...నారాయణుం డవ్యయుం డనంతుండు భూత,సృజనంబు దలఁచి
మున్ సృజియించెఁ దనదు సహస్రాంశకమున నవ్యక్తుఁడనఁగ, తే-
మనసున యజరామరు ననుపమాను... శాంతి. 4-81

**అజరుఁడు** సం. విణ. అ. పుం.

(శరీర ధర్మమగు) ముసలితనము లేనివాఁడు.

అమరుం డవ్యయుఁ డజరుండు. శాంతి. 4-276

**అజస్రము** సం. క్రి. విణ. అ. న.

ఎల్లప్పుడు, అనవరతము.

మరి నజస్రము నమ్మక శాంతి.3-269

సం. విణ. (అ. ఆ. అ.)

తెంపులేనిది, ఎడతెగనిది.

మ. జనులెల్లం గడు సంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన,ధ్వని శైల
ప్రకరంబుపైఁబడు మహోదంభోళి శబ్దంబయో, యన వీతెంచిన.
ఆది. 6-28

**అజహ్నుఁడు** సం. వి. అ. పుం.

జహ్నుని కొడుకు, కుశిక వంశమునకు మూలపురుషుఁడు.

జహ్నుని కొడుకు అజహ్నుడు, అతని సుతుఁడు పల్లవుడు, అతని
పుత్రుఁడు కుశికుఁడు, అతని తనయుఁడు గాధి. అతని కొడుకు
విశ్వామిత్రుఁడు. శాంతి. 2-68, 69

(సంస్కృత భారతమున భేదము గన్పించుచున్నది)

జహ్నుని కొడుకు అజుఁడు, అతని తనయుఁడు బలాకాశ్వుఁడు, అతని సుతుఁడు కుశికుఁడు, అతని కుమారుఁడు గాధి, అతని పుత్రుడు విశ్వామిత్రుఁడు.

శ్లో. జహ్నోరజస్తు తనయో బలాకాశ్వస్తు తత్సుతః
కుశికో నామ ధర్మజ్ఞ స్తస్య పుత్రో మహీపతే
గాధిర్నామా భవత్పుత్రః కౌశికః పాకశాసనః
... ... ... ...
విశ్వామిత్రం చ దాయాదం గాధిః కుశికనందనః
యం ప్రాప బ్రహ్మసమితం విశ్వైర్బ్రహ్మగుణై ర్యుతమ్.

సం. భా. శాంతి. 49 3, 6, 31 శ్లో.

(ఈ భేదము పుత్రులు అని చెప్పినవారు నేరుగా పుత్రులుగాక వారి వారి నడుమ కొన్ని యంతరములుండునేమో)

**అజాతము** సం. విణ (అ. ఆ. అ.)

పుట్టనిది.

తనయుల నజాతపశుల. ఆది. 8-309

**అజాతవైరి** సం. వి, న్. పుం.

యుధిష్ఠిరుఁడు, ధర్మరాజు, తనకు శత్రువులు లేనివాడు.

విరా. 1-91

**అజాతశత్రుఁడు** సం. వి. ఉ. పుం.

యుధిష్ఠిరుఁడు, తనకు విరోధులు లేనివాఁడు (ఎవ్వరియందున తాను శత్రుత్వము భావింపనివాఁడు. విరా. 1-178

**అజావికము** సం. వి. అ. న.

మేఁకల యొక్కయు, గొఱ్ఱెల యొక్కయు సమూహము.

సీ. ...ఊర్జిత శాంగక విలస దజావికంబులు గణనాతీతములు గన్య లప్రమేయలు. ద్రోణ. 2-199

**అజిత** సం. వి. ఆ. స్త్రీ.

ఒక స్త్రీ.

ఈమె శౌశీనరపతి కూఁతురు. వితంతుఁడను రాజర్షి కొడుకులైన (1) సార్వేయుఁడు, (2) శూరసేనుఁడు, (3) శ్రుతసేనుఁడు, (4) బిందుసారుఁడు, (5) అతిసారుఁడు అను నైదుగురకొక్కసారిగ స్వయంవరమున వివాహమాడెను. ఐదుగురకు వేర్వేఱ సంతానమును బడసెను. ఈమె ద్రౌపదికి పూర్వమందున్న స్త్రీ. ఆది. 7-277

**అజితము** సం. విణ. (అ. ఆ. అ.)

గెలువఁబడనిది, అనివారితము.

చ. ...అళికేళియం, దజితవిలాసమున్ మెఱయ విరా. 1-174

**అజితుఁడు** సం. విణ. అ. పుం.

గెలువఁబడనివాఁడు.

చ. ...జనమేజయుఁడన్ జనపాలుఁ డుత్తమ, స్తుతమతి దీర్ఘసత్త్ర
మజితుం డొనరించె శుభాళికాంక్షియై. ఆది. 1-82

**అజినము** సం. వి. అ. న.

లేఁడి మున్నగువాని చర్మము, తోలు.

సీ. ...బహువర్ణ, చిత్రితాజినము పైచీరగాఁగ. విరా. 1-211

**అజిహ్మము** సం. విణ. (అ. ఆ. అ.)

కపటము లేనిది.

క. ...బ్రహ్మక్షత్త్రము లొండొ యజిహ్మములై కృత్యములు విశి
ష్టత నడపన్. శాంతి. 2-212

**అజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ.

లంకయందున్న సీతాదేవికిఁ గాపుగాఁబెట్టఁబడిన రాక్షస స్త్రీలలో నొకతె. అర. 6-380

**అజీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

జీర్ణము కానిది, శిథిలముగానిది, చినుఁగనిది (ఆకు, వస్త్రము, దొప్ప, మొ.) ఆది. 3-28

**అజీర్ణి** సం. వి. ఇ. స్త్రీ.

అజీర్ణ రోగము, తినిన పదార్థము జీర్ణము కాని రోగము.

సీ. వారట్లు శాకని బోరన నరిగి వృద్ధ్మజునిఁగాంచి యజీర్ణదశయెఱింగ
తే. విన్నవించిన. అను. 3-198

**అజుఁడు** సం. వి. అ. పుం.

1. పాండవ పక్షమ్మున్న బోరుటకు వచ్చిన యొకరాజు.
అతఁడు భీష్మునిచే మహారథుఁడుగాఁ బేర్కొనఁబడెను. ఉద్యో. 4-264

2. బ్రహ్మ.
వ. అజుండు మెలవుతో మృత్యువ మృత్యువ యొటపోయెదని
ద్రో. 2-167

3. శంకరుఁడు.
అజుని శంకరుఁ ద్రినేత్రు సౌ. 1-111

4. భగవంతుఁడు, శ్రీమహావిష్ణువు.
(అర్జునితో శ్రీకృష్ణుఁడు)
తే. శాశ్వతకంబైన నాకు జాతత్వవికృతి, లేమి నజుఁడనియును
శాంతి. 6-432

5. ఏకాదశ రుద్రులలో నొకఁడు చూ. ఆది. 3-69
చూ. ఏకాదశరుద్రులు.

6. ఇక్ష్వాకు వంశపు రాజు, దశరథుని తండ్రి.
క. విను మిక్ష్వాకు కులంబున, జనియించె నజుండునాఁ బ్రశస్తచరి
తుఁ డాతని కొడుకు దశరథుఁడు అర. 6-268

**అజేయము** సం. విశే. (అ. ఆ. అ.)

గెలువఁదగనిది.

క. వృజినభయ మనుష్యలోకము, లజేయములు గావు. శాంతి. 4-66

**అజేయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

గెలువఁదగనివాఁడు, గెలువశక్యము గానివాఁడు.

ఆ. అమరులకు నజేయులగు కాలకేయుల, నొక్కరుండ కాఁడె
యొడిచెఁ గర్ణ. విరా, 4-210

సం. వి. అ. పుం.

ఒక సర్పశ్రేష్ఠుఁడు.

బలరాముఁడు దేహత్యాగము సేసినపుడు బలరాముని వదనము నుండి వెలువడి పాలసముద్రమునకు నరుగుచున్న మహాభుజంగమున కెదురు వచ్చిన సర్పశ్రేష్ఠులలో నొకఁడు. మౌస. 77

**అజ్జ** దే. వి.

సమయము, అదను.

తే. అజ్జ పాటించి మది వెఱ యుజ్జగించి, రయము మెఱయ నప్పాం
చాల రాజసుతుఁడు, గదిసి యెగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ,
గొండగూలిన ట్లక్కరి గూలె నధిప. కల్యా. 1-320

**అజ్ఞాతము** సం. విశే. (అ. ఆ. అ.)

తెలియఁబడనిది-

సీ. ధేను శరీర విలీనుఁడై యజ్ఞాత, చర్మ మార్తాండుండు సలుపుట
యును. విరా. 1-54

**అజ్ఞాతవాసము** సం. వి. అ. పుం.

ఇతరు లెఱుంగకుండ నుండుట.

వ. అజ్ఞాతవాస సమయమునకు భంగముగాకుండ. విరా. 1-46

**అజ్ఞానము** సం, వి. అ న.

1. అవివేకము, తెలివితేమి.

వ. పూర్వాచార్యులచేత నభినందితంబులగు మంత్రంబులు నిందించుట
యజ్ఞానంబు. ఉద్యో. 1-201

2. రోషము, శోకము, రాగము, ద్వేషము, అభిమానము, దర్పము,
వేగము, ఆలస్యము, ఆశ్లేషము అను వానియొక్క కూడిక.
శాంతి. 8-401

**అజ్ఞాని** సం. విశే. (న్-నీ-న్)

తెలియనివాఁడు, అవివేకి, అజ్ఞాని.

ఆ. అజ్ఞులైన మమ్ము నాపత్పయోనిధి, మునుఁగకుండఁ గాచి తనవు మూ ర్తి. కర్ణ. 8-106

అఁట దే. అవ్య.

( కవిత్రయము వారి ప్రయోగములందు ఈ 'అఁట' రూపము లేదనియే యూహింపఁదగియున్నది. వారు 'అటె' 'అట్టె' అనియే ప్రయోగించియున్నారు. ఈ 'అఁట'కు అవి మూలరూపములేమోయను టకు 'అటె' అను దానియందు బిందువు గానరాదు. తర్వాతి కవుల యందు 'అఁట' ప్రయోగము కనఁబడుచున్నది. పూర్వముద్రిత భారత ప్రతులందు 'అఁట' కనఁబడకున్నది. కాని యిటీవల ముద్రితములైన ప్రతులలో నాల్గుతావుల విరా. 4-20; ఉద్యో. 3-99 (ఇందు మూఁడు తావులు) అఁట కన్పించుచున్నది. ఈ తావుల పూర్వముద్రిత ప్రతుల 'అటె' కన్పించుచున్నది. కొన్నిచోట్ల పాఠాంతరముగఁ గన్పించు చున్నది. ఉద్యో. 1-240. నిర్వచనోత్తర రామాయణమున 'అఁట' ప్రయోగము నాల్గైదు తావులం దున్నటులఁ గానవచ్చుటచే ఏమనుటకు సాహసము చాలకున్నది, ఇది విచార్యము. 'అఁట' అనునది 'అనుట' 'అంట' నుండి యేర్పడినదై యుండవచ్చును.) చూ. అటె

అట దే. అవ్య. ద్రు.

1. అటు తరువాత, పిమ్మట, అనంతరము.

మ. నావారసాభ్యుదయోల్లాసి విరాటపర్వమట నుద్యోగాదులున్. విరా. 1-7

క. దేవవ్రతుండు గిర్వాణావాసంబునకుఁ జనినయట కురునికరం, బేవాని నడిగి తెలియునొకో విశ్రుత ధర్మసంప్రయోగ విధం బున్. స్త్రీ. 2-117

2. ఆవల, ఆ ప్రదేశము తరువాత.

సీ. హిమాచలమును నావల హేమకూటంబును నట నిషధంబు నొప్పు. భీష్మ. 1-21

3. మఱి.

చ. ....నరుఁడ కాఁడట వాసవుడైన నేమి నా, బలముఁ బలంబు నేరి మియు బంటుతనంబును నీవ చూడుమీ, విరా. 5-25

దే. వి. ఏక.

1. అప్పుడు, ఆ సమయము.

సీ. బెగ డంతకంతకు మిగిలిన నింతికిఁ, బదముల నట్టఁ దొట్రుపాటు

బెరసె. విరా. 2-106

2. తచ్ఛబ్దార్థకము,

ఉ. ...ఇంతట సంతసింపరా, దెప్పుడు నంతకంజ నట యెక్కుడు గోరినఁ

జాలకుండదే. ఉద్యో. 1-371

3. అర్థ విశేషము లేకయే కొన్నిపట్ల ప్రయోగింపఁబడును.

సీ. వినవయ్య నహుషుఁడన్ జనపతి నేను మీ,పూర్వజులకు నట పూర్వ

జుండ. అర. 4-119

చ. (కీచకుఁడు) సూడ న,చ్చెరువగు చావు సచ్చె నటు నేసిన వారట

యెట్టివీరులో. విరా. 3-70

(వారలె-అని ఆనందవారి ప్రతి)

4. అవలి వృత్తాంతము, పిమ్మటి విషయము.

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి...వీరెల్లను దమ్మెవ్వరైన

మనవార్త లడిగిరేని ద్వైతవనంబున మమ్ము విడిచిపోయి రట

యెఱుంగ మనం గలవారని చెప్పి. విరా. 1-115

అటుమీఁద అవ్య. ద్రు.

ఆ పిమ్మట, ఆ తరువాత.

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపుమని

యడిగిన. విరా. 1-382

వ. జనమేజయుం డటమీఁది వృత్తాంతం బెఱింగింపు మని యడుగు

టయు. శల్య. 2-419

అటుమును అవ్య.

అంతకుముందు.

క. ....వలి,దనుమానము సమయకాల మటమును కడచెన్.

విరా. 5-377

**అటమున్న** అవ్య.

అంతకుముందు, అటమును.

వ. పదంపడి పద్మినీ ప్రమోద సంపత్కరుండగు నరుణకిరణుం డద యించె నటమున్న పాంచాలి సచేలస్నానంబు సేసి. విరా. 3-35

**అటవి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

అటవి, అరణ్యము.

వ. ఘోరాటవీ భాగంబునుం బోలె. విరా. 2-325

**అటు** దే. అవ్య.

1. ఆ ప్రకారముగా.

చ. ....అది వినం బనిలే దటుగాక యున్న రూ, పెటిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స, విరా. 2-169

చ. ....అటుసేసిన వారట యెట్టి పీరులో. విరా. 3-70

2. ప్రక్కవైపుగా.

క. సారథి లేమిని సాత్యకి, తేరిట్టెఁ దురంగమములు వేరటువాఱన్, ఘోరముఁ ధర్మనందను, పారు వోదివి రంపగముల పడి గురు తనయున్, కర్ణ. 2-259

3. ఆ వైపుగా.

చ. ఒడలను ప్రాణమున్ గలుగ నూరక యుండుదురే త్రిగర్తు లి, ప్పుడ నుఱుమాడిపోద మటు పోవఁగ నిమ్ము రథమ్ము. ద్రోణ. 1-248

**అటుగాక** అవ్య.

ఆ విధముగాని యెడల.

క. అటుగా, కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. ఉద్యో. 2-59

క. నా వలపటుగాక తక్కనను వలదుసుమీ. విరా. 2-287

**అటుగావున** అవ్య. ద్రు. (అటు + అగును + కావున)

అందుచేత, కాబట్టి.

క. విను ధర్మంబున ధనమగు, ధనమున సిద్ధించుఁ గామ తంత్రం
బటుగా,వున మధ్యమంబు నధమము, ధనకామము లుత్తమంబు
ధర్మం బధిపా. శాంతి. 3–458

**అటులు** దే. అవ్య.

ఆ ప్రకారము.

చ. అని యుచితంబుగాఁబలికి యంగన హస్తముఁబట్టి తత్కరం,బున
గదియించి నీ గురువుఁ బొత్తి తగంగొనియాడు మెట్లుసె,ప్పెనటుల
భక్తిమై నడవు పెంపెసలారఁగఁ గూడుగూర చం,దన గుసుమాదు
లున్ నడపి తప్పక యారసి గారవింపుమీ. విరా. 1–252

**అటులుండగఁనిచ్చు** జాతీయము.

ఆ విషయప్రసక్తిని విడిచిపెట్టు.

ఉ. కావున నాకలోకపు సుఖం బటులుండఁగ నిమ్ము దేవ, నీ భావము
నిల్పు నాదెస.... మహా. 59

**అటులేని** అవ్య. ద్రు. క.

ఆ విధముగానైన యెడల.

చ. ....అటులేనిఁ బోదుమె దయాపరశైలముడిగ్గి. శాంతి. 6–800

**అటువోవు** దే. అ. క్రి.

ఆ ప్రకారముగా జరుగు.

చ. చెలుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయలేక ముందఱ
యటపోవనిచ్చితి. ఉద్యో. 3–361

**అటుసూచు** దే. స, క్రి.

1. విశ్వసించు, నమ్ము.

క. అమడు బృహన్నల యిట్లను, జనపాలక నందనుండు జయలక్ష్మిం
జేకొనునలె చీరెలు దెచ్చుట, పని యే యటుసూడుఁ డెల్లభం
గులఁదెత్తున్. విరా. 4–48

వ. నేను దపంబుపెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబుననైన
నుం జలంబు సాధ్యంబు సేయుదు నటుసూడు మని పలికి పోయె.
ఉద్యో. 4–360

2. విచారించు.

వ నీవు నిక్కం బలుగవుగాక నీవలిగిన వెవ్వ రెట్లయ్యెదరో యటు. సూడుము. ఉద్యో. 4-425

ఈ జాతీయ మెచ్చటనైనను మధ్యమ పురుషమునందే కానవచ్చుచున్నది. (అటుసూడు - అని)

అకొ దే. అవ్య.

1. ఆశ్చర్యమును సూచించును.

ఉ. ....కీచకుం డెందును నెట్టియంగనల నెవ్వరుఁజేయనియట్ల సేయఁగాఁ, గొందలమైన నిద్దు కృపఁ గొంద దఁటి గాదకొ యేమిసెప్పుదున్. విరా. 2-148

వ. ....పగవారి నడిగికొనం బోవుట యుచితంబకొ, కయ్యంబు కర్జంబుగాదకొ, భంగంబు నీఁగికొనం దగదకొ. ఉద్యో. 3-99

2. అతిశయమును సూచించును.

చ. కురుబల మేఁగుదెంచెనకొ గోవుల బిట్టలఁబట్ట. విరా. 4-20

3. సంతాపమును దెలుపును.

తే. నీవు సృజియించితకొ నన్ను దేవదేవ, యేను గ్రూరకర్మమునకు నెట్టులోర్తు. ద్రోణ. 2-168

సీ. భీమసేనుండును బీభత్సుఁడును దనకడుపునఁబుట్టిన కొడుకులట్టె-గీ, యెగ్గతంబునఁ దానుఁ గారగ్గిగాలె, నకొ యనాథయై దీనికి నంతరంగ,మలదురక తల్లడిల్లక యారటమున, నుడుక కలమటఁ బడక యెట్టుండుఁ జెపుమ. ఆశ్ర. 2-168

4 ఆక్షేపమును, పరిహాసమును సూచించును.

క. అనిన విని దరహసిత వదనుండగుచుఁ బురుహూత పురోహితుండు.

క. నహుషుండు పనుచువాఁడకొ, విహితానుష్ఠానపరులు వీరకొ లోకహితంబకొ యిది మనకున్ మహనీయముగాక యెట్లు మానఁగవచ్చున్. ఉద్యో. 1-159

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలకనందనుండు జయలక్ష్మిం జేకొనునకొ చీరెలు దెచ్చుట, పనియే యటుసూడుఁ డెల్లభంగులఁ దెత్తున్. విరా. 4-48

౬. ఇట్లు జరగెనని కథాంశమును దెల్పును.

క. మనుజేంద్ర దీని తీరంబున నృగుఁడను రాజు యజ్ఞములఁజేసిన నం, దనిమిషపతి తృప్తుండై, దనుజుల నోర్చెనట ఘోరతరశస్త్రములన్. ఆర. 3-172

అటెపో జాతీయము.

అని యనుకొనుము, తలఁపుము.

క. వారలు వేరటెపో పెఱ, వారలఁ దగు భంగి మనకు వశ్యులఁ జేయున్. విరా. 3-111

(వేరటపో - అని కొన్ని ప్రతులు)

అటే అవ్య.

నిశ్చయమును సూచించును.

చ. తండ్రి యముని చందమై తెగితటే కినివీరుఁడ యంచు నేయుఁ డున్. కర్ణ. 3-188

(ఇది పాఠాంతరము-"తెగితిరే కినివీరుఁడ యంచు పాఠము)

అట్టు దే. వి.

కబంధము, మొండెము. తల తెగి కొనప్రాణముతోనున్న శరీరము.

ఆ. అర్జునాస్త్ర ఖండితాతపత్రధ్వజ, చామరములు గాలిఁ జదలఁ దూలఁ, జిహ్నముల విభూతిఁ జెందంగ, గడు వొప్పె, నప్పు డాడుచున్న యట్ట లచట. విరా. 5-54

(ఆడుచున్నయట్టులు - అని కొన్ని ప్రతులు)

వ. ఇవ్విధంబున నాలుగు దివసంబులు నొక్కరాత్రియు నేనగు దివసంబులో నిరువది గడియలు నిరువదివే లట్టలాడ భండనంబు నేసి పాండవబలంబుల నుఱుమాడి (ద్రోణుఁడు)

ద్రోణ. 5-321; కర్ణ. 2-227; భీష్మ. 2-394

౨. మొండెము, తలక్రింది భాగము.

క. ...అతని తల, యట్టకుఁ బాయంగఁజేసి యార్చెం చున్.

ోణ. 5-204

3. ప్రాణము పూర్తిగాలేని మొండెము - చచ్చిపడియున్న మొండెము.
సీ. అట్టలకడ నుత్తమాంగముల్ గానక, యలమట నలుగడ లరయు వారు. స్త్రీ. 2-22

**అట్టకము** సం. వి. అ. పుం.

వాకిటి మండపము మీఁదఁగాని కొత్తళము మీఁదఁగాని యుద్ధముచేయువారు నిలిచి కూఁతలు పెట్టుచు నాయుధములు ప్రయోగించి శత్రువులను హింసించు స్థలము.

దీనిని బట్టియే 'అటక' అను పదము (నిఘంటువులలోఁ గానరాదు) వాడుకలోనికి వచ్చియుండును. "అటకమీఁదఁ బెట్టుకొని కావలసినప్పుడు తీసికొనవచ్చును." (వ్యవ) ఇంటి గోడలపైన నేర్పాటు చేసిన మంచె - మిద్దెపై భాగమునకును 'అటక' యని వాడుటగూడ కొన్నిచోట్ల గలదు నిఘంటుకారు లిచ్చిన మేడమీఁది గది, నగరు అను నర్థము లిక్కడ చాలవు.

మత్తకోకిలము : సమున్నమ, త్కూట తోరణ యంత్ర కేతన గోపురాట్టక సంహతుల్, వీటఁతాటమునేసి రక్కసివీరు లొక్కట మాత్రలోన్. అర. 7-66

**అట్టహాసము** సం. వి. అ. పుం.

పెద్ద నవ్వు.

సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో, నెట్టెట్టు భీముండె యీతఁడేమి, పుణ్యమో వీని నెప్పుడు సంపఁగాంతునో,యని యున్నచోఁ దాన యరుగుదెంచె. అర. 1-116

**అట్టాలకము** సం. వి. అ. పుం.

అట్టకము.

వ. వీరయోధారూఢ విశాలాట్టాలకంబులును. అర. 1-158

**అట్టి** దే. విశ.

1. పోలిక, సాదృశ్యము.

సీ. ....శృంగి యన్వాఁడు శాపించునట్టి, శాపంబు నీకిచ్చె. ఆది. 2-180

2. క్రియాజన్య విశేషణములకు నొకానొకప్పు డర్థవిశేషంబు లేకయే యనుప్రయుక్తంబగును. (అటువంటి)

సీ. ...బాలార్కబోధిత పద్మజాత, యైనట్టిదాన శ్రీయన లక్ష్మివా భూతి, యనఁగ వెలుంగుదు. శాంతిం. 5-8

వ. తన దివ్యచిత్తంబునంగల యక్కారుణ్యంబు తెలిం గెలుంగునట్టి శక్తిఁ బ్రసాదించి..., విరా. 1-11

3. వెనుక చెప్పిన దానిని సూచించును.

తే. కేవల మర్త్యుఁడె ధర్మసుతుఁడు.

ఉ. అట్టి మహాత్ముఁడొక్కనికి నాశ్రితుఁడై. విరా. 2-191, 192

వ. అట్టి సమయంబున. విరా. 3-161

**అట్టిండు** దే. సర్వ.

అట్టిఁడు.

క. ...బభ్రువాహనుఁ, డణుమాత్రముఁ గీడులేని యట్టిం డెందున్. అశ్వ. 4-149

**అట్టిఁడు** దే. సర్వ. (మహద్వాచకము)

(అట్టిరు మహన్మహతీవాచక బహువచనము)

1. అట్టివాఁడు, అటువంటివాఁడు.

క. నీ వట్టిఁడవగు టెఱుఁగవు. శాంతి. 6-289

క. ...ఆదివిజారి యట్టిఁడ. శాంతి. 4-409

చ. అమరనదీ తనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుడుం బరాక్రమ మహనీయు లాహవధురంధరు లట్టిర తక్కఁగల్గు భూరమణులు. శల్య 1-44

2. సదృశుఁడు, సమానుఁడు.

చ, ...గురునట్టిఁడ యీతఁ డనంగవచ్చు. సౌప్తి. 1-64

క. విమల తపో విభవంబునఁ, గమలజు నట్టిండ విగత కల్మషుఁ డాస్తీకమహాముని. ఆది. 2-219

సీ. ...శూరులెందు, నీయట్టిరే కురునృపవీర. సభా. 1-286

చ. ...లతాలలనల్ మృదు లానిలాపవర్తిత కుసుమాక్షతావళులు సేసలువెట్టిన యట్టిరైరి. ఆది. 4-17

**అట్టిచో** అవ్య. ద్రు.

ఆ సమయమునందు, అప్పుడు.

ఉ. బుద్ధులుసెప్పు వాక్యముఁల పోల వినం డననేం యట్టిచో, బుద్ధునిఁ జేయఁజూచెనముఁ బట్టి సుయోధనుఁడు. ఉద్యో. 4-88

వ. ఆహారంబులు దొరకొనని యట్టిచో ద్విజాతు లేమిశలంగిం ప్రాణంబులు రక్షించుకొనువారు. శాంతి. 3-278

**అట్టిట్టి** దే. విశే.

ఆ ఈ – అట్లు ఇట్లు (ఏదోయొక విధమున)

క. నియమింపుఁడు నగరిసరకు, లయినవి యట్టి భంగి నక్షిణములై, యొయిదంగల వారలఁ గని, పయనము తెలుఁగు సమకట్టు పని మఱవకుఁడీ. మాస. 186

(ఇట్టట్టు – అని కొన్ని ప్రతులు)

**అట్టిది** దే. సర్వ. (మహతి అమహద్వాచకముల ఏకవచనము. మహత్తు అట్టేఁడు.)

అటువంటిది.

ఆ. ...అస్త్రశస్త్ర సంచయంబుగాని, శవముగాదు మత్స్య జనపాల పుత్ర యే, నట్టి దైన్యఁ బనుతునయ్య నిన్ను. విరా. 4-111

వ. పగఱకు నీకడంక చీఁకటికి సూర్యునుదయం బెట్టిదయ్యెడుం గాక... కర్ణ. 1-54

**అట్టివి** దే. సర్వ. (అమహద్బహు)

అటువంటివి.

వ. తత్సమయఁబునఁ బుట్టినట్టి మాట లుగ్గడించునట్టివి గావు. ఉద్యో. 1-362

**అట్టియెడ** దే. సమ.

అప్పుడు.

వ. అనిన నిది కార్యంబని మధ్యమపాండవుం డా సువధ్య వొక్క శితల సికతాతలంబున డించెఁ దక్కినవారలు నట్ల చేయుదమని నిలిచి

20. వచ్చు

తే. దొరలు దలపడ్డ సాహవదోహలమున, నుభయబలములు దమకించి యోర్వలేక, కలయఁజెరసి భూరేణువు కతన రాత్రి, గాకమున్న యొండొరుఘలఁ గానరైరి. (రాత్రిగాకమున్న = రాత్రి వచ్చుటకుఁబూర్వము) విరా. 3-190

21. విధ్యర్థకము, వలయు

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరిగాఁగ నీ మదికిఁ బ్రియ మెసగం, గా నాకుఁ జేయనయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్స్యదము గైకొనవే. విరా. 3-222

22. ఒనరించు, చేయు

చ. మనుజవరేణ్య నావలని మన్నన యట్టిదకాదె శత్రుమ,ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవముల్లసిల్ల నీ. చనుటయు నాకుఁ దేజమును సంపదయున్ గరిమంబుగాక యి,ట్లనఁదగునయ్య యేనిచటనైనది యేటిది యింత యేటికిన్- విరా. 3-226

క. మానవ నాయక యగ్రజుఁ,డైనను ననుజన్ముఁడేని నన్యాయంబుం, బూని సహోదరులకుఁ గీ,డైన నతఁడు దండ్యుఁడందు రవనీపతికిన్. (కీడైన = కీడు చేసిన) అను. 4-186

23. చాలు, సమర్థమగు

వ. మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవ దహనంబునం బాండవమధ్యమునకు సారథియై యతని చిత్తంబువడసె మఱియుఁ బెక్కెడలం దదీయంబగు రథంబు గడపఁ దానైయుండు నేనెఱుంగుదు. విరా. 4-14

క. పరిచారకులై యుండుదు, రరివర్గ వ్యతికరమున కగుదురు వీరిన్, సరిఁదన కొడుకులు మెలఁగిన, తెరువున మెలఁగింపవలదె ధృతరాష్ట్రనకున్. ఉద్యో. 1-359

24. ఏకమగు, కూడు

మ. సమయాబ్దంబుల కంతె ముందర మహోత్సాహంబునన్ బాహువి, క్రమ మొప్పన్ విజయుండు నేను నయి సంగ్రామంబులో నేకకా,

య్యుల్లసిల్లు, నొక్కరుని కివి రొల్లను నిక్కమట్లె, యెందుఁగలుగునె
యర్జును నీడువాఁడు. విరా. 2-204

3. ఉత్కర్షమును దెలుపును.

చ. ...బాహు బలంబును జూపఁబూని ధ్యా నర్ధిగెదనట్లె- (చూ. అంట) విరా. 4-20

ఉ. వాసవుఁడట్లె నన్నడుగవచ్చుఁ బ్రియంపడి. అర. 7-290

4. విచారమును దెలుపును.

సీ. భీమసేనుండును బీభత్సుఁడును దన, కడుపునఁబుట్టిన కొడుకులట్లె.
-తే- యెగ్గతంబునఁ దానుఁగారగ్గిఁగా వెనవెం. ఆశ్ర. 2-168

5. వృత్తాంత కథనమును దెలుపును,

ఉ. వీఁడొక మంత్రసిద్ధుఁడగు విప్రుఁ డసాధ్యబలున్ బకాసురున్,
నేఁ డనిఁ జంపెనట్లె యతనిం జని చూతమ. ఆది. 6-309

6. ఆక్షేపమును దెలుపును.

ఉ. ఇమ్మదివెట్టి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొనియాడె ధర్మత,
త్వమ్ములు పాండవేయులును దానునుగాని యెఱుంగరట్లె.
సభా. 2-39

7. ప్రశ్నమును దెలుపును.

క. ఆడవులు నేఱులునవి నీవడసినయవియట్లె. ఆది. 7-40

అట్లుకాక జాతి.

1. సరియే, ఆ ప్రకారమేయగుఁగాక.

వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవలయును బరాక్రమ
ధుర్యుండగు నాచార్యు ప్రతిన యెఱుంగవే యనుటయు నట్ల
కాకయని యతండు ధర్మనందనుపాలికిం జనియె. ద్రోణ. 3-28

శ్లో. తథేత్యుక్త్వాఽగమత్తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః.
సం. భా. ద్రోణ. 84-36

అట్లపోలెన్ దే. ద్రు. అవ్య.

1. వలె, మాడ్కి.

వ. అనితాను నిజసహోదరుల యట్లపోలె వేషాంతరంబు దాల్చిన యంతియకాక. విరా. 3-52

**అట్లు** దే. అవ్య.

1. ఆ ప్రకారము, 2. వలె.

ఉ. ...అంఘ్రావలి మోదముం బొరయునట్లుగ. విరా. 1-30

సీ. తెవులు గొంటులునై వఁ దీర్చి సంకటమున, కోపి ముందటియట్ల రూపుసేయ. విరా. 1-101

క. ...మత్స్య జనవిభుఁడు యుధిష్ఠిరు నట్లయనఁగ విని వినుఁ, గర మనురాగమునఁ గొలువఁగా నియ్యకొనెడుకున్. విరా. 1-269

**అట్లుంగాక; అట్లుఁగాక** అవ్య.

అదియునుంగాక, మఱియు.

క. ద్యూతజ్ఞుల దేసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లుఁగాక పెద్దలరగు మీ, రే తెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు దగ వసింపుఁడు నెమ్మిన్. విరా. 1-207

వ. అట్లుంగాక. విరా. 1-52

**అట్లుండు** క్రి - జాతి

ఆ ప్రకారమగు.

వ. విరాటుఁటు పగతుండు గావునఁ దదీయ వ్యసనం బెఱింగింప వలయునని విన్నవించితి మదియట్లుండెఁ బాండవుల నన్వేషించు పని యిట మీఁదం జిత్తగించు తెఱం గానతిచ్చునది. విరా. 3-89

**అట్లుగాదిట్లు** జాతి.

ఆ దిక్కుగా దీ దిక్కు.

క. విను మనుచరు లాతనిమో, మునఁ దోఁచు విషాద భావముం గని వెగడొందిన కతన నట్లుగా ది,ట్లని చనియెడు వంకసాల రై రెఱిఁ గింపన్. మౌస. 1-159

**అట్లైన** ప్రు. క. అవ్య.

ఆ ప్రకారమైన యెడల

వ. అయ్యసురు లట్లేని మాకు ముప్పురకు మూఁడు పురంబులు.
కర్ణ. 1-261

**అడంకువ; అడఁకువ** దే. వి.

1. వినయము, విధేయత.

క. ...వేడ్కలు సలువంగ వలయు భటుఁ డడంకువతోడన్.
విరా. 1-140

తే. కౌరవాన్వయ జాతులై గారవముచఁ, బెరిగినట్టి మీ రొండొక
నరుని గొలిచి, మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి
యడఁకువతోడి యునికి యరిది. విరా. 1-118

2. పైకిఁ బొంగకుండుట.

క. మగ లడఁకువ నుండక తమ,తగులము పాటింతు రెట్టి తగులంబైనన్
మగువల యెడలన యడఁగుం, దగవు విడిచి యదచి పడరు
ధైర్యము పేర్మిన్. విరా. 2-261

3. మఱుఁగుపాటు, తెలియఁబడమి.

వ. ఒండు ముఖంబుననివ్వార్త నగరు నొరకుండునట్లుగా సంవిధానంబు
సేయవలయు. నీవు దుర్యోధను ప్రియాజనంబులను దద్రక్షకులను
డోబ్కొని భవదీయ మందిరంబునకుం జనుము. తక్కటి వారి
నంతంత నడఁకువతో నిలువ నియమింపవలయు. శల్య. 2-26

3. అదృశ్యము.

క. అనిన విని యొకటిసెప్పెద, వినుఁ డాతనితోడ నమర విభునకుఁ
దగఁ బొందొనరింపుఁ డొక్క సమయంబున నడఁకువఁ గులిశధారఁ
బొందెద నేనున్. ఉద్యో. 1-181

శ్లో. అదృశ్యశ్చ ప్రవేక్ష్యామి వజ్రే హ్యస్యాయుధోత్తమే,
సం. భా. ఉ. 9-13

అడఁగు (ధాతువు) అడఁకువ (కృదంతము)

**అడంగించు**
**అడఁగించు** దే. స. క్రి. ప్రే. అణంగించు, అణఁగించు

1. నివారింపఁజేయు.

క. విను పర్యాయంబున సుఖ,మును దుఃఖమున జెందు జనులఁ బురు షుఁడు ధైర్యం,బున గర్వంబు విషాదం,బు నడంగింపఁదగునం ద్రుు బుధు లది నిజమే. శాంతి. 4-428

2. అడఁచు, అణఁగించు.

చ. ...దేవి నీ వెడ,న్వగ్ర అడఁగింపనున్న భువనంబుల నింకిట యెవ్వ రోర్చువారు. ఉద్యో. 3-203

3. ఛేదించు, నరకు.

ఉ. సంధికి నేగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయున్ సుహృ, ద్బాంధవ సంఘయుక్తముగఁ బాండవకౌరవవీరు లష్టది, క్సింధుర కంధరంబు లడఁగించు బలంబుల వెల్లుతోడ గ,ర్వాంధత నాజి కెత్తు టయు నా బలభద్రుఁడు విన్కి వార్తుఁడై. ఉద్యో. 4-165

4. నశింపఁజేయు.

ఉ. ...ఇట్టిది భీష్మమహోగ్ర మెట్లుడం,గించెనొ కో శిఖండి యను కృత్రిమ వాయువు దాఁకి దైవమా. భీష్మ. 1-52

క. అనఘా! దుఃఖాత్మకమగు, నన్నృతం బడగించుటకుఁ బ్రయత్న మున సుధీ, జను లాచరిం తు రనిశం,బును మోహావిఘాతి నియమ ములు నిష్ఠమెయిన్. శాంతి. 4-102

5. నొప్పించు, స్రుక్కించు, నిర్జించు.

సీ. నకులుని నైదుసాయకముల స్రుక్కించి, సహదేవునేఁడింట సాధుఁ జేసి, నవవిశిఖముల మాత్స్యవరేణ్యు నడఁగించి, యేడింట సాత్యకి యేపుమాపి. ద్రోణ. 1-205

అడంగిపోవు దే. అ. క్రి.

రూపఱు, నశించు, అడంగు, నామరూపములు లేకుండఁబోవు.

వ. ధర్మతనయాది పాండవేయులును....నిఖిల దండనాయకులును నాహారింబడి మున్నీరు సొచ్చిన యేఱుల చందంబున నడంగి పోవుట యవధరించెదుగాక. ఉద్యో. 2-265

**అడంగు; అడఁగు** దే. అ. క్రి.

1. లేవకుండు, అణఁగు.

ఉ. దానినెఱింగి యెంతయు నుదగ్రత నాజకవైరి గ్రక్కునన్, వాని నడంగఁబట్టి పడవైచి మహోగ్రత నాక్రమించె. విరా. 2-350

2. తెలియఁబడకుండు.

సీ. అతిథి గర్భంబున నవతారమై వామ,నాకారమున హరియడఁగు. టయును. విరా. 1-54.

3. లోఁబడు, వశమగు.

ఉ. దానినెఱింగి యెంతయు నుదగ్రత నాజకవైరి గ్రక్కునన్ వాని నడంగఁబట్టి పడవైచి మహోగ్రత నాక్రమించె. విరా. 2-850

సీ. పగతు రథంపనుపై నెత్తి వచ్చి కయ్యముసేసి యాతని నడఁగఁబట్టి కొనుటయు. ద్రోణ. 2-154

4. ఇంకు, ఆఱిపోవు.

వ. ...చతురంగంబులును బెరయఁ బెరంగు నుల్లాసంబున శోణితకం. బడంగ మట్టివిసి రేణువు లెగసిన. కర్ణ. 2-227

సీ. ఎవ్వని వాకిట నిభమదపంకంబు, రాజభూషణ రజోరాజి నడఁగు. విరా. 2-191

5. నిరోధింపఁబడు, నిరుద్ధమగు, అడ్డగింపఁబడు.

క. మగ లడఁకువ నుండక తమ, తగులము పాటింతు రెట్టి తగులం బైనన్, మగువల యెడలన యడఁగుం, దగవు విడిచి యడిచిపడరు ధైర్యము పేర్మిన్. విరా. 2-261

క. రవిదీప్తులు సొరనేరమి, గవిసెం జీఁకట్లు పవను గమనం బడఁగెన్. విరా. 5-92

6. దాఁగు, మఱుఁగుపడు.

సీ. మన కీచకులకెల్ల మారియై పుట్టిన సుదతివో యెడు నని చూచు. వారు, నద్దిరా నీకుఁ గ్రొవ్వరుగదేఁ జూతుగా, కని తలసూపక యడఁగువారు. విరా. 8-36

రట్టి యెడం బాండవాగ్రజుందు గాండివి చేతి విల్లువలతించి.
విరా. 1-157

అట్టు అవ్య.

1. ప్రకారము, విధము, మాడ్కి.

తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంతకారి విఱిచినయట్టు నగ్గలిక విఱుతు. విరా. 1-81

2. అ ప్రకారము, అ విధము.

క. కుండలములుఁ గవచము నట్టుండఁగని మ్మరఘు వేఁడు మొందు ధనంబుల్. అర. 7-367

అట్టు దే. వి.

భక్ష్య విశేషము.

క. పులగమఁ బాయసమట్టులుఁ, బలలము నర్చనకుఁగాక పక్వము లయినం, గలుగు నభోజ్యత్వము విచ్చలవిడి వంటకము నేసి చనదు భుజింపన్. శాంతి. 1-824

అట్టులు అవ్య. (అట్టు)

1. అ ప్రకారము.

అనవుడు నట్టుల చేసెదము. విరా. 1-144

2. కొన్ని యెడల వీనిపై 'కై వడి, పోలె' మొదలగునవి అర్థ విశేషము లేకయె ప్రయుక్తమగును.

అ. అతని మేను కుంతియట్టుల కైవడి యరయ. శాంతి. 1-12
అదిలేని యట్టుల పోలెన్. శాంతి. 4-185

అట్టె దే. అవ్య (రూపాం) అటె

1. ఆశ్చర్యమును దెలుపును.

క. ...జను,అచ్చెరువును సందియంబు నడరెకు మతితో, నిచ్చెలువ కడుపు కూటికి, నెచ్చటనే నిలుచునట్టె యిది పలుకగునే.
విరా. 1-299

2. నిశ్చయమును దెలుపును.

తే. శౌర్యవైభవ ప్రాభవ శౌచములకు, నొరులకైనఁ గైవారమ్మె

మదియడఁగు గుహన్. శాంతి. 5-152

శ్లో. ఆవర్తమాన మజరం వివర్తనం, షణ్ణాభికం ద్వాదశారం సుపర్వ యస్యేదమాస్యోపరి యాతి విశ్వం, తత్కాల చక్రం నిహితం గుహాయామ్. సం. భా. శాం. 246-32 (వావిళ్ల)

12. అదృశ్యమగు, మాయమగు, అంతర్ధానమగు.

క. అదియు వ్యర్థమ్యైనఁ బార్థుఁడు, వదలక వృక్షముల రాలవైచెను రణదుర్మదు వనచరు నవి యెల్లం, దదంగముల నడఁగె నద్భుతం బగ నంతన్. అర. 1-317

13. నశించు, చెడు.

క. మన్నన కుబ్బక యవమతి, దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశు కడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము:లొదవు నాపద లడఁగున్. విరా. 1-183

సీ. అరు లడంగిరి యుధిష్ఠిరుఁ డాదియగు భవ,ద్భ్రాతలు నీ పరిపాలన మున, నుల్లసిల్లిరి. శల్య. 1-368

14. నీచత్వమును బొందు.

సీ. వారు ద్రోణ, భీష్ములు గలరని బిరుదులై యున్న వా,రగునె రాజన్యుల కడఁగి కుడువ. ఉద్యో. 3-37

15. (ప్రకృతియందు) లయించు, లీనమగు.

క. భూతము లన్నియు నడఁగిన, యాతఁడఁ దనుఁదాన కనుచు నంజన రహిత,త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు, నా శెలి వాతత్త్వమునకు నమరు మహేశా. అను. 4-194

అడంచు, అడఁచు దే. స. క్రి. ప్రేర.

1. మఱుఁగుపఱచు, బహిర్గతముగానీకుండు, దాఁచు, కప్పిపుచ్చు.

క. దేవతలకైన నొక్కొక, చో వలయునకాదె శత్రుసూదనవిధి కా, లావాప్తికి మును దమ స,ద్భావంబు లడంచి యడుగఁబడియుండం గన్. విరా. 1-53

క. నీవేమియు ననకుము సహ,దేవుని నేమఱక యరయు దినకరసుతు

నిన్, శాపమునఁ దలఁపు మేనా, దేవసముని పుట్టువడఁచితిం గపట
మునన్. ఆ|శ. 1-152

2. అణఁచు, వారించు.

వ. ...తత్కాల జనితంబయిన ఖేదంబునం దొరఁగ నుమకట్టు బాష్ప
జలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యంబవలం
బించి యిట్లనియె. విరా. 1-78

3. పోఁగొట్టు, నశింపఁజేయు, చెఱుచు, నాశనముచేయు.

ఉ. ...స్వప్తాంగముఁ జూఱఁదెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చె
దన్. విరా. 3-119

క. తలఁపునన వాసుదేవుఁడు, గలిగింపను నిలుప నడఁపఁగా నోపు
జగంబుల మఱియును క్రీడార్థము, పలువోకలఁ బుచ్చుచుండుఁ
గౌరవనాథా. ఉ. 2-316

4. త్రుంచు.

చ. విజయుఁడు వారినెల్ల నొకవ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక
వ్రజము నడంచియున్. విరా. 5-174

5. ఉపసంహరించు, ఉపశమింపఁజేయు.

చ. ...మహాత్మ యడంపుము క్రోధ మీతఁడుం, దనదు ప్రతిజ్ఞకై
రిపు గదాహతుఁ జేసె నధర్మమేలగున్. శల్య. 2-304

6. వెడలు, 'పో' మొదలగు వానితోఁజేరి ప్రేరణార్థమయి 'కొట్టు-
తఱుము' అను నర్థముల సూచించును.

క. కరుణంబుగ నేడ్చు తలోఁదరిఁ బోపామ్మిచట నింకఁ దరయకుమని
మందిరము వెడలంగ నడచిన, నరిగె నదియు నార్తచిత్తయై విఱుగ
గతిన్. ఉ. 4-282

7. నివారించు, ఉడుపు, మాన్చు.

ప్రహరణవృత్తము- ఇది యిటులగుట స్రుక్కిగి పలికెనా, విదురుఁడు
సభఁగోవిదులు వొగడఁగా, నది వినియును నేనడ్వపన దురితం,
బొదవెఁగలఁకనే టొలయ కుడుగునే. స్త్రీ. 1-185

8. ముడుచు, సంకోచించు.

క. అవయవములెట్లు కూర్మము,నివిడించుచు లోనికడచు నెఱి నట్టులు ఘూ,తవితతి ఘూతాత్ముండును, ప్రవర్తన నివర్తనముల పాల్పడఁ జేయున్. శాంతి. 5-162

శ్లో. ప్రసార్యేహ యథాంగాని కూర్మస్సంహరతే పునః. సం. భా శాం. 257-4

**అడఁగి మడఁగు** దే. జాతి.

మిక్కిలి అణఁకువతో మనోనిగ్రహము గలిగియుండు.

ఆ. ...ఈవత్సర, మకట యెట్టులయిన నడఁగి మడఁగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడవలయు. విరా. 1-148

ఇది పాఠాంతరము. చూ. ఒదిగి మడుగు.

వ్యవహారమునందు ఎక్కువగా "అడఁగి మడఁగి (అణఁగి మణఁగి) పడి యుండవలెను"- అనియే కన్పించుచున్నది. కాని 'ఒదిగి మడుగు' ప్రయోగమే ఇందు విరివిగాఁ గన్పించుచున్నది.

**అడఁచికొను** దే. స. క్రి.

అపహరించు.

సీ. క్రయ విక్రయంబులఁ గపటంబు దలఁచగుఁ, గడఁగి యిల్లడ సొమ్ము లడఁచికొంద్రు. అర. 4-294

**అడజడి** దే. వి.

శోకము, దుఃఖము, అలజడి, అడలడి,

చ. అడజడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోపది. శాంతి. 1-202

('అడలడి'కి పాఠాంతరము)

**అడరించు** దే. స. క్రి. ప్రేర.

1. కలిగించు.

సీ. గగనభాగంబెల్లఁ గప్పి క్రాలుచు శెగ, డడరించె నుగ్రవుఁబడగ పఱవు. విరా. 4-180

2. వ్యాపింపఁజేయు.

సీ. అరవిరి నెత్తావి నదరించు నున్నిద్ర,విట పీటి సౌరభవితతివోఁదల. ఉద్యో. 2-112

3. పరగించు, ప్రయోగించు.

ఆ. అంత తెలిసి రాముఁ డతికుపితాత్ముఁడై, యేఱువాఱు తెంచు నెనకమెనఁగ, నప్రమేయశరము లదరించె నవి సత్వ,రముగ నేను ప్రతిహతములు సేసి. ఉద్యో. 4-324

4. పుట్టించు, సృష్టించు.

వ. ...పోరిపోరి రాధేయుఁడొక్క దివ్యాస్త్రంబు ప్రయోగించిన నది భైమసేని ప్రత్యస్త్రంబున నడంచి మాయసైన్యం బదరించిన నమ్మాయా సైన్యంబు. ద్రోణ. 5-207

5. ప్రసారించు (చూపులోనగునవి)

సీ. చూడు మిమ్మద్దియ సుతుఁజూచి వదన మ,ల్లార్చుచుఁ బ్రాణేశు నాననంబు, పైఁజూడ్కి యదరించి పాణితలంబున, నందంద నెమ్మొగ మడచికొనుచు. స్త్రీ. 2-45

6. వర్తిలఁజేయు, విషయములందు వ్యాపింపఁజేయు.

సీ. అన్ని యింద్రియముల నదరింప మగుడఁ జే,యంగ మనసు సాలు నవియు నదియు. అను. 5-251

**అదరిపడు** దే. అ. క్రి.

విజృంభించు.

క. అదరిపడి రథ చతుష్కతి, పొడిసేసి పరాక్రమం బపూర్వంబై యో ర్పడ. విరా. 3-174

**అదరు** దే. అ. క్రి.

1. ఎదుర్కొను, మార్కొను, కవియు.

సీ. అప్పాటఁ బ్రబలు జటాసురు నదరి దం,డితుఁజేసి మనలఁబెట్టించు కొనియె. విరా. 1-74

2. కలుగు, పుట్టు.

క. వచ్చితి వనవుడు విని జను, లచ్చెరువును నందియుండు నడరెడు మదితో, నిచ్చెలువ కడుపు కూటికి, నెచ్చటనే నిలుచునట్టి యిది పలుకగునే. విరా. 1-293

ఉ. ఇంద్రపుత్రుండును చాల నొవ్వడరి తూగెను, భీష్మ. 2-147

క. అచ్చటి బలములుఁ బ్రభువులు, నచ్చెరువును భయము మనములం దడరంగా, విచ్చిన. ద్రోణ. 3-93

3. ప్రసరించు, వ్యాపించు, పర్వు, క్రమ్ము.

సీ. నానార్ధచంద్రబాణవ్రాత మడరినఁ, దునియలై మేదిని దొరఁగు కరులు. ద్రోణ. 3-168

సీ ఉరవడి నేనలు దెరలఁబై దోఁతెంచు, ధూళి పెల్లడిరినఁ దూలపోక. విరా. 4-62

సీ. అంగంబు ననుఁగాంతి యడరిన గోడలు, వేదులు మణిమయ విధమునొంద. విరా. 1-308

4. అతిశయించు.

తే. ...ఇంతి, నెమ్మొగంబున దృష్టులు నిలిపి తమక, మడర నిట్లను నా కీచకాధముండు. విరా. 2-116

సీ. అదట నవకరణావలి వెడవెడ యాదరించుట రాగమడరి, దొడరి. విరా. 2-238

5. వృద్ధిపొందు

క. ఇంతకు మూలము దృష్ణా, తంతులతయ వత్స వినుము దానికి నడరం, గాంతాజనంబు దొలుప్రాఁకింత యొటిఁగి తృష్ణదొలఁగు టిచ్చు విముక్తిన్. శాంతి. 4-298

6. విజృంభించు.

సీ. ప్రబల బిడాలంబు బాలశారికమీఁద, నడరి సత్వరముగ నరుగు మాడ్కి. విరా. 2-128

మ. మదిరాక్షుండు గడంగి...గర్ణదశోపాంతము వింతనేయ నడ రెన్ రౌద్రంబు శోభిల్లఁగన్. విరా. 3-178

7. లంఘించు.

సీ. పాసి క్రమ్మఱఁజేరు బలువిడివాడు పై,నడరిన జరగక యవని గ్రుంగి. విరా. 2-15

8. సంతోషించు, అలరు.

సీ. ఒడఁబడ్డ యట్లైన నడరి పైకొనఁజూచి, చెన్నటి యగుట నిశ్చేష్టఁ బొరయ విరా. 2-301

9 ప్రకాశించు, శోభిల్లు.

సీ. లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు, లడర మంకించిన నాఁగియూఁగి. విరా. 3-55

10. కైకొను, చేతఁదాల్చు, ధరించు.

సీ. రథ్యముల్ వడ్డవి రథుఁడయ్యు నసిముద్గరాదుల నడరి పోరాడు వారు. విరా. 3-169

11. వెంబడించు, వెన్నాడు.

చ. అతిరథసంబుమై నడరి యాతనిఁబట్టి సుశర్మ వెల్చనార్చి తన రథంబుపై నిడి. విరా. 3-201

శ్లో. ప్రమథ్య జిత్వా చ ప్రసహ్య మత్స్యం
విరాట మోజస్విన మభ్యధావత్. సం. భా. విరా. 33-7
(ఇచ్చట 'అభి'కి 'అను' అర్థము)

12. పడు, పతనమగు.

తే. అట్లు వచ్చునా గదఁ గని యచటి యోధు,లిరికి తమ తమ మీఁదన యడరుననియుఁ, దలఁచి యొదిగిరి రారాజుఁ దలఁపరైరి.

భీష్మ. 3-58

శ్లో. విహాయ సర్వే తవపుత్రముగ్రం
పాతం గదాయాః పరిహర్తుకామాః. సం. భా. భీష్మ. 86-35

13. వీచు.

క. వటులు మనచేరువఁ బెల్లఱచుట బెట్టుదురు గాలి యడరుట గ్రద్దల్, తఱచయి యాడుట వికృతవు, టఱపులతో రేఁగి కాకు లఱచుటఁ గంటే. కర్ణ. 2-116

14. సంచరించు, తిరుగు.

చ. కరిపతి నీరు ద్రావుటకుఁగాఁ జనుదెంచినఁ గూర్మరాజు సం,గర మొనరించు చుండి తమకంబున నీళ్లలఁ బాసి వీఁక మై, దరి నడరంగఁ బట్టునది తత్సమయంబున రెంటిఁగూడ. అను. 1-227

15 సిద్ధపడు, పూను.

క. మీ రాఁకలి పెల్లున నా,హారంబుగ శవముగొనుట కడరితి రిట్లే, లా రండిచ్చెద మీ కా,హారంబులు వలసినట్టి వని తా మఱియున్. అను. 3-212

16. గర్వించు.

తే. ఇంక నెన్నఁడు రక్కసు లిద్దురాత్ము,నట్లు మనుజులఁ దినకుండుఁ డడరి మనుజ, భక్షణముసేసితర యేని బకుని యట్లు, చత్తురని రక్కసులకెల్లఁ జాటె వినఁగ. ఆది. 6-307

17. ఒప్పు, యుక్తమగు.

చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ, బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె. అర. 1-44

ప. క్రి.

అలముకొను.

క. విడియం బలుకఁగ వెండియు, నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద,న్నడరిన నన్నడుగుటకుం, దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్. విరా. 2-171

అడలడి దే. వి.

శోకము, దుఃఖము, అలజడి.

చ ఆడలడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోవదిమేరుకల్పు౦౦, గొడుకుల నేవురన్ జముఁడు గొన్న నలందురఁజూడనేర్తురే. (అడజడి అని పాఠాంతరము) శాంతి. 1-202

క. అడలడిఁ బడఁగా మమ్మును, విడిచితి. ఆశ్వ. 1-99

(ఇది పాఠాంతరము - 'అడవెడఁబడఁగా' - అని పాఠము)

క. చిత్తం, బడలడిఁ జిక్కుపడ నిట్టులను నర్జునుతోన్.

(ఇదియుఁ బాఠాంతరమే. 'చిత్తం బడలునఁ జిక్కుపడ'- అని పాఠము.
శాంతి. 1-56

అడలు=దుఃఖించు ధాతువుయొక్క కృదంతరూపమిది. అడలు+అది= అడలడి — అడలుపై 'ఉ' చేరియు అడలు+ఉ=అడలు అనియుఁ గృదంతమగును.

**అడలు** దే. వి.

1. దుఃఖము, శోకము.

చ. కడు వెస వచ్చి రూపటిన కాయము నున్న తెఱంగుఁ జూచి వి,
ట్టడలు మనంబులం గదిరి వో, యనువారలు. విరా. 3-5

క. అడలెడఁబడఁగా మమ్మును, విడిచితి గురువైన శోక వేదనయేమిం,
కుడిపికొను నప్పటికిఁ దోఁడ్పడు నీవగు సద్గుణములు బంధులు
వోలెన్. ఆశ్ర. 1-98

శ్లో. త్యక్తా వయం తు భవతా దుఃఖశోకపరాయణాః
భవిష్యామ శ్చిరం రాజన్ భవద్గుణశతైర్హృతాః.
సం. భా. ఆశ్ర. 11-18

2. భయము.

క. అనికడు నడలుగఁ బలికిన. సభా. 2-128

దే. అ. క్రి.

దుఃఖించు, శోకించు, ఏడ్చు.

క. కాలంబగుటయు నృపులకు, నాలము సమకూరె దీని కడంకు మది.
భీష్మ. 1-6

సీ ఉభయ సార్శ్వంబుల నురిపోసిన ట్లవి వ్రేలి చచ్చినఁజూచి విప్రుఁ
డడలి...నిర్వేద మొంది. శాంతి. 4-40

**అడవి** వై. వి. (సం. అటవి)

అరణ్యము, అటవి.

వ. ...తమ వెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబుఁ దోడనకొని
వర్తిల్లు భూసురోత్తములు. విరా. 1-46

**అడవిఁగలయు** దే. వై. జాతీయము.

1. చీలిపోవు, పాఱిపోవు.

గీ. పాండుసుతులు శిఖండియుఁ జేఁడశక్తి, మెఱయ నొక్కటఁ జైఁ
బడ్డ వెఱచి శాత, విడిచి నా పుత్రులందఱు పాఱిగి యడవిఁ, గలసి
రొకో యాతనికిఁ బడవలసె నకట. భీష్మ. 1-58

2. అడవికిఁజేరు, భయముతోఁ దలఁదాఁచుకొనుటకు అడవికిఁజేరు.

వ. మనస్వినివైన నీకుపశమించుట కర్తవ్యంబు శోకంబు దక్కి మశ్వ
త్థామ యొనర్చిన పరాభవంబునఁబుట్టిన యలుక వాని సమయిం
పక పోదని చెప్పుటయ కాదు. నా తలంపును నిట్లు వాఁ డడవిం
గలసినవాఁడుగానోపు. సౌప్తి. 2-86

శ్లో. సకల్యాణి వనం దుర్గం దూరం ద్రౌణిరితో గతః.
సం. భా. సౌ. 11-19

3. అడవిలో లీనమగు. అడవిలోఁ గనఁబడకుండఁబోవు.

క. ఆపాసల వచ్చితినను, గాసింబెట్టి యది యడవిఁగలసెను మృగయా,
వ్యాసక్తుఁడు వగచుం దన, యేసిన మృగమనఘ తప్పయేఁగుటకుఁ
గడున్. శాంతి. 3-158

4. అడవిలో నివసించు, అడవిలోఁ బడియుండు.

సీ. ధర్మపుత్రాదు లందఱు నొక్కచోనుండి, ధృతరాష్ట్రి నాతని
దేవిఁ జేరు,కొని వారి కొడుకులెల్లరు ద్రుంగిరని వార, లతివృద్ధు
లెమ్మెయి నడవిఁ గలసి, యున్నారనియు నింకనెన్నాళ్లు లుండెడి,
గొంతి వనంబునఁ గూర దినుచు, ఆశ్ర. 2-15

శ్లో. కథం న రాజా వృద్ధః సవనే వసునిర్జనే
గాంధారీచ మహాభాగా సా చ కుంతీ పృథా కథమ్.
సం. భా. ఆశ్ర. 28-3; ఆశ్ర. 1-118

**అడవి చిచ్చు** వై. వి.

దావాగ్ని, కారుచిచ్చు.

సీ. ...అడవిచిచ్చు-తే-వలనఁదెగటార్చె నేమనఁగలదు. అ౹శ. 2-161

**అడవి మునగ వై. దే. మి. వి.**

ఒక విధమైనమునఁగ, వనశిగ్రువు.

ఆ. మునగయుల్లి యడవిముఁన...ప్రవర్జనీయ కోటి యగుట.

ఆము. 8-189

**అడి విశే. (దీనికి వ్యస్తముగాఁ బ్రయోగములేదు)**

1. వట్టిది, వ్యర్థము, 2. అల్పము,

చూ. అడిబీరము, అడియాస.

**అడిగికొను దే. స. క్రి. ఆత్మనే.**

యాచించు.

వ. పగవారి నడిగికొనంబోవుట యుచితంబిలె. ఉ. 3-99

**అడిగిచూచు దే. స. క్రి.**

అడిగి తెలిసికొను.

ఆ. రెండు పక్షములకుఁ బ్రియము హితంబును, నాత్మఁ గోరువారి నడిగి చూడు. ఉద్యో. 1-300

**అడిచిపడు దే. అ. క్రి.**

1. ఉద్రేకించు, పైకి పొంగు.

క. మగలడఁకువ నుండక తమ, తగులము పాటింతురెట్ట తగులం బైనన్, మగువల యెడలన యడగుం, దగవు విడిచి యడిచి పడరు ధైర్యము పేర్మిన్. విరా. 2-261

2. త్వరపడు, తొందఅపడు.

వ. ఎట్లు పొరలినను దైవోపహతంబులగు కార్యంబులు సిద్ధి బొందునె యడచి పడవలవదు విచారించి కొందము. సౌప్తి. 1-44

క. జడనిధి చందంబున నిమ్మడు వొప్పఁగ నిప్పుడేమి మాఁడెనె యిమైత్రి, నడచిపడ రిత్తనెవ్వగ,లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్. శాంతి. 3-189

3. మిట్టిపడు, మిడిసిపడు, త్రుళ్లిపడు, ఎగిరిపడు.

క. విడు విడు మాతం డిమ్మెయి, నడచిపడఁగ నేల 'వట్టె దవనీశ్వర నీవుడిపెడు తెలుఁగున నా బిరు, దుడుగునె నా చేయి దాఁకి యుడిగిఁ భంగిన్. ద్రోణ. 5-108

ఆ. తిండిపోత, నీకు భండనం బేటికిఁ, గరవజేరి మనసు శాంతుదీఱ, నోపుకొలఁది మ్రింగి యూరక నీ, వింటికడన యుండు మింక నడచిపడక. ద్రోణ. 4-289; కర్ణ. 2-262

4. సంరంభించు, ఆటోపించు.

సీ. ...భ్రాతృవ్యుఁడు దపము, దమమును గల్గువర్తనమున నుండుఁగా... కనినేయునే యెంత యడచి పడినఁ.

ఆ. బదితిగాని యడ్డపడలేవు కౌరవ, కులమునెల్ల భంగి గెలుతు మేము. కర్ణ. 2-262

అడిచిపాటు దే. వి.

1. తొట్రుపాటు, సంభ్రమము.

సీ. ఆడఁగంగఁ బోవిన నడచి పాటించుక, యుమ లేక వీఁక నొండొరుల నడరి. విరా. 2-347

2. విజృంభణము.

సీ. సమర ముపేతించి శాంతిమై నుండెదే, నడచి పాటేటికి వనఁగ నెలిఁగి. భీష్మ. 3-395

3. సంరంభము, కోపము.

ఆ. అట్టియెడ నృపాలుఁ డాచార్య పాలికిఁ, జనియెఁ దేరు దోలికొని రయమున.

వ. చని యడిచిపాటు గదుర నతనితో నిట్లనియె. ద్రోణ. 4-161, 162

శ్లో. తూర్ణమభ్యద్రవ ద్ద్రోణం మనోమారుతవేగవాన్,
ఉవాచైనం పుత్రస్తే సంరంభా ద్రక్తలోచనః.

సం. భా. ద్రోణ. 130-8

**అడిచిపొడిచి** దే. జాతీయము.

చావఁగొట్టి.

తే. జ్ఞాతి నాశనమునఁగాదె సకల దేవతలు ప్రవర్తన మొందుట ధనము లడిచి, పొడిచి యొవ్వని వారిచేఁ బుచ్చికొనక, యడఁగి యుండంగఁ జేరునే యంద్రు బుధులు. శాంతి. 1-54

**అడిదము** దే. వి.

ఖడ్గము, కత్తి.

క. అడిదముఁ బలకయునుంగొని, చిడిముడి వడ కపుడు చిత్రసేనుం డులికెం, బుడమికి. భీష్మ. 3-59

(అడుచు + ఇదము = అడిదము, బెడియు + ఇదము = బెడిదమువలె.)

**అడివీరపుఁదులువ** దే. వి. సమ.

శౌర్యము లేకుండియు నున్నట్లు డంబములు పల్కెడు అధముఁడు, డంబాల రాయఁడు.

క. అడివీరపుఁదులువ గెలుచునటె పాండవులన్. ద్రోణ. 4-184

**అడివీరము** దే. వి. సమ.

వృథాపౌరుషము, వట్టిశౌర్యము, దంభము.

క. తొడరెడు కొలఁదియె వానికి. వడముడి భుజవిక్రమంబు వారల మన మెప్పుడు వినమె కర్ణు వినమో, యడివీరపుఁదులువ గెలుచునటె పాండవులన్. ద్రోణ. 4-184

చ. ...మారుత సురాధిప సూనులలోన నల్లనొక్కరు దెసకై రథంబు దొలఁగంగొని పొమ్మడివీరమేటికిన్. కర్ణ. 1-158

**అడియరి** దే. వి.

1. మూర్ఖుఁడు, మోటకు.

ఆ. తండ్రి పాలుమాకుఁదగునంచు నడయరి, తనముసేసి రాకతప్పుఁ గాక. ఉద్యో. 1-250

2. పాదసేవకుఁడు.

చూ. అడియరితనము.

(క. త. అడి = పాదము, అరి తద్ధిత ప్రత్యయము)

అడి + అరి = అడియరి - పాదములను సేవించువాఁడు అయి పాదసేవకుఁడు కింకరుఁడు అను నర్థము నిచ్చుచున్నది. ఇచ్చట అడి = అడుగు శబ్దము నీచార్థద్యోతకము.

**అడియరితనము** దే. వి.

మౌర్ఖ్యము.

ఆ. దీన నేమి తప్పు గానకునేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి,
తండ్రిపాలు మాకుఁ దగునంచు నడయరి, తనము సేసిరాక తప్పఁ
గాక. ఉద్యో. 1-250

శ్లో. నతం సమయ మాదృత్య రాజ్య మిచ్ఛంతిపైతృకం,
బలమాశ్రిత్య మత్స్యానాం పాంచాలానాంచ మూర్ఖవత్.
సం. భా. ఉద్యో. 21-11

2. కింకరత్వము, పాదసేవకత్వము.

సీ. ...ఇంక, నడయరి తనమున నప్పాండవుల నాశ్రయింపఁగఁజాలనే,
నెక్కడేనిఁ, -ఆ- బోదుఁగాక. ఉద్యో. 1-250

శ్లో. కథం రాజ్ఞః పితా భూత్వా స్వయం రాజా చ సంజయ,
ప్రేష్యభూతః ప్రవర్తేయం పాండనేయస్య శాసనాత్.
సం. భా. సౌ. 1-112

**అడియాలము** దే. వి.

1. గుఱుతు (రాజ ధ్వజాదులపై నుండు చిహ్నము)

వ. బిరుదులతోడి గొడుగులును నడియాలంబుల తోడి సిడంబులును
వైపించుకొని. విరా. 5-221

2. గుఱుతు.

వ. మన యరదం బాయితంబు సేసికొని యెల్లి గయ్యంబునకుం గొని
రమ్మని చెప్పె నప్పు డెట్టి యడియాలంబులతోఁ శాంచజన్యంబు
పూరింపం గలవాఁడై పలికె. ద్రోణ. 4-277

3. (రాజ)ధ్వజము.

వ. అంద అకు సంజ్ఞలు నడియాలంబులుం గల్పించి దొరలదెసం గనుం గొని. భీష్మ. 1-122

అడ+ఆలము; అడ = చిహ్నము - ఆకృతి - ఒక విధమై గుర్తునకు స్థానమైనది. అడయాలమ్ (ఆలము = స్థానార్థకము) అడయాలము అను పదమే అడియాలము అయినది. కావుననే తమిళ కర్ణాటకములందు ఈ పదము. అడయాళమ్ - అడయాలమ్ - అని యున్నది.

అడియాస దే. వై. వి.

1. వట్టియాస, ముందు కాలమునందు మేలుగలుగునను కోర్కి.

ఉ. అక్కట మోసపోయి యడియాసలఁ జావకయున్నదాన. విరా. 2-226

2. పేరాస.

ఆ. అనుచు సంచరించు నడియాసఁ గ్రమ్మఱఁ జావఁ దలఁచి విరా. 2-299

ఇచ్చటను అడి - నీచార్థద్యోతకము- అప్పుడు నీచమైన యాళ - పనికి మాలిన ఆళ. వట్టి ఆస. పేరాస- ఫలింపని దాని కాస అనునర్థముల కాకరమగును. అడి దేశ్యము. ఆస-వై (సం. ఆశ)

అడుకులు దే. వి. బ. (రూపాం) అటుకులు.

నానఁబోసిన వడ్లు (కొత్తవి) వేయించి కొట్టి చెఱుఁగఁగా వచ్చినవి. అటుకులు - పృథుకములు.

క. అడుగులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁబలచితి నాఁ, డొడ లెఱుఁగక. ద్రోణ. 4-89

అడుకులు దిన్నట్లగునే కడుపునఁ గుట్టెత్తినపుడు.

లోకోక్తి

కడుపులో నొప్పియున్నపుడు మధురముగానున్నవి గదా యని యడుకులు దిన్నచో అవి మేలుచేయక పోవుట యట్లుంచి కడుపు నొప్పి యెక్కువచేసి శరీరమునకే ముప్పు తెచ్చును. సాగుచున్నది గదా యని

యొడ లెఱుంగక చేయరాని పని చేసి దాని ఫలితము అనుభవించుచున్న
ప్పుడు ఈ లోకోక్తి పలుకుదురు.

క. అడుగులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టై తినవుడు గడఁబఱచితి
నాఁ, డోడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మదుగవలసె నిప్పు
డోక సాత్యకిచేన్. ద్రోణ 4-89

**అడుగు** దే. స. క్రి.

1. వేఁడికొను, ప్రార్థించు.

చ. అహితుల కప్రభేద్యమగు నా పదమూఁడగు నేఁడు మత్పితా.
మహులు చరించిరంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమీ.

క. అని యడగిన వైశంపాయనుఁ డమ్మనుజేంద్ర చంద్రు నధికా
త్సుకర్యంబున కలిమికి......నిట్లనియె. విరా. 1-44, 45

క. ... కార్యం, బీరెఱఁగింపవలయునని, కౌరవ పతి నన్ను నడిగెఁ
గాన యితనికిన్. విరా. 3-101

వ. శిపుఁడు ప్రత్యక్షమై యభీష్ట మడుగు మనిన. శాంతి. 6-247

2. ప్రశ్నించు.

వ. ...అయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మ
పుత్రులతోడి మైత్రిం దగిలి యతని పాల వసియింతు ననంగల
వాఁడ. విరా. 1-73

3. వాంఛించు, కోరు, అభిలషించు,

తే. కత్తి గొడ్డలి యడుగ నే కట్టియలకు. విరా. 1-73

సీ. అతఁడు త్రైలోక్యంబగ మడిగినఁ బతి గమ్మ నూనియ దెప్పించి మేను
శిరము, నక్ష్యక్షములు సేయ. అను. 2-303

4. యాచించు.

చ. అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁ గాఁగ నెఱింగియిచ్చు
టెక్కుడు ఫలమిచ్చు... అను. 2-343

5. సంగమమునకు (రతికేళికి) రమ్మని పిలుచు

తే. చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ,బుట్టువులతోడ నీవును

బుట్టినాఁడ, వట్లుఁగాకయు హీనవంశాభిజాతఁనైన పతిపత్ని నగు నన్ను నడుగఁ దగునె. విరా. 2-50

క. విడియం బలుకఁగ వెండియు, నడుగక కీచకుఁడు మన్మథోన్మాదము దన్నడరిన నన్నడుగుటకుం, దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్. విరా. 2-171

అడుగు దే. వి. (రూపాం) అడ్గు √అడి

1. ఒక యడుగు దూరము. అడుగు పరిమాణము.

ఉ. ఇప్పటి భంగి నొక్కఁడుగు నేఁగెదు దానికి నోర్వ నెమ్మయిన్. విరా. 1-148

శ. ఎనిమిది యడుగుల కొలఁదిని, వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గిట్టిన తగళుల కైవడిఁ దాఁకు నగంబులం భంగి దోఁచు గురుకులముఖ్యా. శల్య. 1-178

2. పాదము, కాలు.

సీ. తిగిచిన నడుగులు దెరలక యోఁడొరుఁ గ్రమ్మఱఁ దిగుచుచుఁ గడిమి మెఱయ. విరా. 2-347

3. క్రిందిభాగము-దిగువ-మొదలు-మూలము.

వ ఇతండు కేతనంబునకుం గుదురుగాఁ బెనుపొనరం గావించిన పీఠంబు నడుగున నొదింగిన. ద్రోణ. 4-286

సీ. అడవిలో నొక మఱ్ఱి యడుగున లాఁగలఁ, బలితుండు నా నొక్క యెలుక యుండు. శాంతి. 3-208

అడుగు మాలిపోవు దే. అ. క్రి.

మొదలంట నశించు.

తే. అనుజ తనుజులుఁ జెలులు వియ్యములు నడుగు, మాలిపోదురు నీకుఁగా మనుజనాథ. ఉద్యో. 3-341

అడుగుల పైఁబడు దే. అ. క్రి. జాతీయము.

బతిమాలు, కాళ్ళమీఁదఁబడి వేఁడికొను.

క. విను మడుగుల పైఁబడియైనను నెంగిలి గుడిచియైన నరులకుఁ

బగలోఁ, గొని యరుల కినుపడఁచి బ్రదు,కనవలయు నిహమ్ముఁ
బరముఁ గలుగునె చెడినన్. ద్రోణ. 4-248

**అడుచు** దే. స. క్రి.

1. తఱుము

తే. రాజు నొచ్చిన విఱిగిరి రథికవరులు, విభుఁడు దోడన తిరిగె న
వ్వీరుఁ దవుడు, దోలి యా చిక్కు మూఁకల తోడఁగూడ, నతని
దవ్వుల నడవికి నడిచి మగిడె. విరా. 5-298

2. కనఁబఱచు, ప్రకటించు.

క. ఎదిరిం దమ యట్టులకా, మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుం
గుడుమిం,డిదె మీరె వ్రక్క గొనుఁ డని, చదురడిచిన మనసు
పొందు చక్కంబడునే. ఉద్యో. 1-312

3. కొట్టు, వ్రేటువేయు, మోదు, తాడించు.

తే. కవిసి వ్రేసిన గ్రక్కున గదయమర్చి, యాఁగి వజ్రప్రహారంబు
ననుకరింప, ద్రుపదనందను డడిచివఁ దునియలయ్యె. భీష్మ. 2-194

వ. జనమేజయుతమ్ములు శ్రుతసేనుండును నుగ్రసేనుండును నను
వారలా సారమేయు నడిచిన నది యఱచుచుం బఱతెంచి.
ఆది. 1-83

4. విఱుగఁగొట్టు, ముక్కలుసేయు.

చ. విజయుఁడు వారినెల్ల నొకవ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక,
ధ్వజము నడంచియున్ రథము వాజుల నొంచియు.
విరా. 5-174

5. చంపు, కొట్టిచంపు.

క. ...ఒక పోకకుఁబోవని కుక్కయందు దానిని నడిచి తెచ్చి వండి
తిను నీచపు మాలని యందు. శాంతి. 5-109

క. తనసతి కపకారము సేసిన పాముల కలిగి బాధసేయుదునని
చిక్కని దండముఁగొని పాములఁ, గనినప్పుడ యడువఁ దొడఁగె
గహాసములోనన్. ఆది. 1-155

6. అదలించు.

సీ. ...కాకులు మగల తనువు, లెక్కయున్నను జేష్టలు దక్కి కొంద,
అడువఁ జేయాడకున్నవా రంబుజాత. స్త్రీ. 2-11

7. ప్రాఁతు, నేలలో గ్రుచ్చు, గ్రుచ్చు.

సీ. ...మార్గముఁ గ్రంప నడిచి కొయ్యలు ప్రాఁతి, చెఱచుట నర
కంబు సేయు నంద్రు. అను 2-62

8. వెడలు-పోవు ధాతువులకు అవ్యవహితంబుగాఁ బ్రయుక్తమయి ప్రేర
ణార్థకమును దెల్పును.

తే. సమయ సముచిత కృత్యంబు చక్కఁజేసి, పాండవులు రాజ్యమున
కాసపడకయున్న, యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి,
యట్ల యిడుములఁ గుడువఁటో నడువవలయు. విరా. 8-90

సీ. బాహు బలాఢ్యుల బలహీనులఁ గ్రియ నెడలంగ నడిచిన వెట్టితనము.
ఉద్యో. 1-376

క. గురుతల్పగు భ్రూణహనున్, నరేంద్ర విద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ
బెలుచున్, ధరణి వెడల నడుపవలయు, శరీర నిగ్రహము సేయఁ
జన దెయ్యెడలన్. శాంతి. 2-176

(వ్యవహితముగాఁగూడ శారతేతరకపుల ప్రయోగములు గలవు)

9. పీడించు, బాధించు.

సీ. ...అర్థుల కొసరి తిండియు ధనగుప్తిమీది,
తే. భరముఁ దమలో విరోధులై పట్టి మనసుఁ, జిక్కువఱుపంగఁ
బెక్కంద్రు సిరికి నడువఁ, బరిహరించుచు బహుదుఃఖపరులు నల్పు
సౌఖ్యులును నగుచునికి రాజ్యంబు తెఱఁగు. శాంతి. 6-200

**అడ్డపడు** దే. అ. క్రి.

1. విరోధము గలిగించు, ఆటంకము గలిగించు.

వ. సకల సుర నికరంబు లడ్డపడినం, బుండరీకాక్ష సహాయుండనై
ఖాండవ వనం బేర్చినప్పుడు విరా. 4-149

క. వాపుడు మదాత్మ బ్రాహ్మణ, తావిద్వత్తాస్పదంబు దీనికిఁగా నే,
నీ విధి యొనరించుట పాపావేశము లేమ దీనికడ్డపడకు లే.
శాంతి. 3-297

ఆ. ...ఎంత యడిచిపడిన౯, బడిబిగాని యడ్డపడలేవు కౌరవ, కులము
నెల్ల భంగి గెలుతు మేము. కర్ణ. 2-262

2 అడ్డముగా వచ్చు,

సీ. అనవుడు నెగవెక్కి యాబిడ్డ వైచి పో, యెతు వారలకు నడ్డ
పడుచు నక్క. శాంతి. 3-377

ఉ. ...వేగ నా, తే రటఁ దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబు
దు, ర్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెళ్చె నార్చుచున్.
విరా. 5-288

3, ప్రాణమును రక్షింప నడ్డముగా నిలఁబడు.

తే ఎల్లి యెల్ల విధంబుల నెందుఁజొచ్చె,నేని నా ధర్మ తనయుండు
తానవచ్చి, యడ్డపడెనేని నీవ పెంపారుకరుణఁ, గాచితేని నాచేఁ
బడు కీచకుండు. విరా. 2-282

4. ఎదుర్కొను, మార్కొను.

వ. కౌరవపతి యలంబుసుతో నిట్లనియె. వీఁడు రెండవ యర్జునుండై
మన బలంబులఁ గలంచుచున్నవాఁ డర్జుననందను నెదుర్కొన
నీవకాని మాఱు లే రేము పాండవుల కడ్డపడియెదము. నీవు వీనిం
బొదివి భంజింపుము. భీష్మ. 3-195

అడ్డపాటు దే. వి.

అడ్డపడుట, రక్షణము, కాపాడుట.

చ. నడికెడు వాఁడుగాఁడు గురునందనుఁ డక్కట తండ్రి చావు
న,ప్పుడు మొగ తప్పి యొుండుగడఁబోరుచు నుండెనో యడ్డపాటు
గ,వ్వడి కతనన్ ఫలింపమి నవారణ నా ద్రుపదాత్మజుండు
బె, ట్టడరి వధింపఁగా వికలుఁడై దురపిల్లుచుఁ జూచుచుండెనో.
ద్రోణ. 1-92

అడ్డమాడు దే. అ. క్రి. జాతీయము.

ఎదురుచెప్పు, ప్రతి వచనము పలుకు.

తే. అనిన నాతని మాటకు నడ్డమాడ, వెఱచినట్టి తెఱంగు భావించి.
విరా. 4-38

వ. అలసి డస్సి యెప్పుడేని మీర లడ్డమాడుదు రప్పుడ శపింతు.
ఆను. 2-831

**అడ్డము** దే. వి. (క. అడ్డ. త. అడ్డి.) √ అడ్డు.

1. అటంకము, నిరోధము.

చ. అలిగిన భీమఫల్గునుల కడ్డములేమి యెఱుంగుదు. ఉద్యో. 3-201

2. రక్షణము, కాపు.

క. ఏ విధము కాంతనైనం, దా విహరణమునకు నెపుడు దార్పఁడు తనయం, దావిష్టము భార్యావ్రత, మావెర వడ్డం బుపస్థ మను వాకిటికిన్. శాంతి. 5-320

శ్లో. భార్యావ్రతం హ్యాత్మని ధారయీత తథాऽన్యోపస్థ ద్వార గుప్తి ర్భవేత. సం. భా. శాం. 269-27

3. తిర్యగ్గతి, నిలువునకు వ్యతిరేకము (నిలువు × అడ్డము)

క. అనుటయు విరాట తనయుఁడు, మొనకడ్డము గాఁగఁ దూర్పు మొగమై రథముం, గొని కట్టెదిరికిఁ బోయిన. విరా. 4-264

4. వైపరీత్యము, ప్రాతికూల్యము, వైరుద్ధ్యము, వేఱుపాటు.

క. ...ఏ, మనఁగలదు విధాతచేత కడ్డముగలదే. మౌస.-158

విశ

1. నిరోధకము, ప్రతిబంధకము, నిరోధించునది.

క. జ్ఞానమునకు సద్గుణ సంతానం బడ్డంబుగాన తత్ప్రీతిహానికై, పూని మును సాత్త్వికముననుు, మానస మూన్పంగవలయు మహనీయ ధృతిన్. శాంతి. 4-299

క. సాహసమున మద్బాహు గదాహతి దుర్యోధనాదులగు రిపుల జగద్ద్రోహులఁ జంపుదు నత్యుగ్రాహవమున హరిహరాదు లడ్డంబైనన్. సభా. 2-295

2. మఱుఁగు పఱచునది. చాటు చేయునది.

క. వినుమాఁటది పోలెం దన, తనువున కడ్డంబుగాఁగఁ దగిలించికొన్నాఁడు దనఘు యిటులైన నెట్లగునని యెఱుఁగఁడు దీని విధములన్నియుఁ దెలియున్, ద్రోణ. 3-201.

3. విరుద్ధము, వ్యతిరిక్తమయినది, ప్రతికూలము

క. ఐనను నొక పలు కడ్డము,గా నుడివెద దాని తెన్నఁగా విని యది మే,లైనను జేసెద, గాదేన్, మానెద వేర్పడఁగ వినుము మనుజాధిశా. కల్యా 1-48

**అడ్డముండు** దే. అ. క్రి.

రక్షణముగా నిలుచు.

తే. సైంధవున కడ్డమున్న రాజవ్రజంబు, పార్థునాకకు వెలవెలఁ బాఱఁ జొచ్చె. ద్రోణ 3-110.

**అడ్డము గదల్చు** స. క్రి. ప్రే.

అంగీకారము లేమిని దెల్పుటకై ముఖమును (తిర్యక్కు) గా, ద్రిప్పుట (ఆడించుట)

క. అనుటయు మోఁటకుచందం,బున మోమడ్డము గదల్చి భూవిభుఁడు. విరా. 1-221

**అడ్డముసెప్పు** అ. క్రి.

మాఱుపలుకు, వ్యతిరేకముగాఁ బలుకు.

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీ పంపెట్లునుం జేయఁగా, నోపం డడ్డము సెప్ప రెవ్వరును. ఉద్యో. 3-46.

**అడ్డమునొచ్చు** అ. క్రి.

1. అడ్డము పోవు, లేని జోక్యము గల్గించుకొను.

క. చనువాని చేయు కార్యం,బున కడ్డము నొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా,నును బయిఁబూసికొనుట దన,మును మెలఁగిన మెఱుఁగుపుకును ముప్పగుఁ బిదపన్. విరా. 1-125

2. అడ్డువచ్చు, ప్రతిబంధమును గలిగించు.

ఉ. ...తా, నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డము నొచ్చిన సిగ్గుపెంపు, న, న్నత్తలమందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యెడున్. విరా. 2-84

3. నడుమఁజేరు.

ఉ. ఆట్టి యెడం గనుంగొని జయద్రథుఁడున్ ద్రుపదుండు వచ్చి యా౯కట్టు పళాసు లిద్దఱకు గ్రక్కున నడ్డమునొచ్చి యొండొరున్, గట్టిగఁ దాఁకి తీవ్రతరపీడితదేహులఁ జేసిరి.
భీష్మ. 1-260

అడ్డసాళులు; అడ్డసాళ్లు దే. వి. బ.

పాచికలు, సారెలు.

సీ. మణిమయమ్ములుఁ గలధౌతమయములును సువర్ణమయములు నాదిగావలయునట్టి, యడ్డసాళులు గలవు నా కభిమతముగ, వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ.
విరా. 1-72

ఆ. అతఁడు గాండివమున నడ్డసాళులు వైవ, దురుల నంపవానఁ గురియుఁగాని.
విరా. 4-187

వ. సుయోధనుండు శకుని యడ్డసాళ్లను బలకయు నమ్మండపంబును దలంపవలయు.
కర్ణ. 3-181

(అడ్డము + సారెలు) అడ్డములోని 'ము' వృత్తియందు లోపించి అడ్డ సారెలు అగును. ఉదా :- అడ్డపడు మొదలగు వానియందువలె నిచట అడ్డు ధాతువునకు 'ప్రతిఘటించు'- అని యర్థము.

అణిమ(ము) సం. వి. న్. పుం.

అష్టైశ్వర్యములలో నొకటి.

క. పొదలుదు రణిమాదిచయ విభూతి పదమునన్.
అను. 4-212

ఈ యైశ్వర్యము వలన సూక్ష్మాకారత నొంది సర్వత్ర సంచరించుటకు శక్తిగలుగును. ఇవి యెనిమిది. 1. అణిమ, 2. మహిమ. 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశత్వము, 8. వశిత్వము.

అణుత్వము సం. వి. అ. న.

సూక్ష్మత్వము, అణుభావము.

మ. ......సర్వసం,వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ

ఆతుః ప్రత్యతృసపూలంబిత దేజరిల్లు పరమాత్మాఖ్యంబు.
అను. 5-245

**అణువు** సం. వి. ఉ. పుం.

1. నలుసు.
ఆ. ...అయ్యవ్యక్త, మణువు నిత్య మేక మక్రియంబు. అను. 5-245

2. విణ (ఉ-ఉ-ణ్వీ-ఉ.)

అత్యల్పము, మిక్కిలి చిన్నది.
చ. క్వణ దణుకింకిణీ కలిత కాంచన కాంచికలాపమున్.
ఆది. 8-178

**అతండు; అతఁడు** దే. సర్వ.

వాఁడు, ఆతఁడు.
తే. అతఁడు పేరోలగంబున్న యవసరమున. ఉద్యో. 1-270
వ. అతండు ప్రార్థించిన తెఱంగును. ఉద్యో. 1-108

**అతగుఁడు** దే. విణ.

దుర్బలుఁడు, హీనుఁడు, నీచుఁడు.
క. అతగుంచే ద్రుపదుఁ డనవహితుఁడై పట్టువడ నంత హీనుఁడె.
ఆది. 6-68

**అతత్త్వము** సం. వి. అ. న.

అగుణము.
వ. అతత్త్వంబై తత్త్వము నగుదు. శాంతి. 4-241

**అతథ్యము** సం. విణ. అ. న.

అసత్యమైనది, తథ్యము కానిది.
క. తథ్యములైనను దలఁప నతథ్యములైనను సభక్తి తాత్పర్యములై, తథ్యంబుఁ బొరయకుండఁగ. శాంతి. 1-87

**అతనువు** సం. విణ. (ఉ. ఉ. ఉ.)

అధికము.

చ. కవిసి ఖరంబులైన మునికాళ్లను వ్రేయఁగ సాము నీరిలోను
వెడలకుండి కూర్మ మతనుస్థిర తీవ్ర నఖంబులం బదాగ్ర విదళ
నంబు సేయఁగ. అను. 1-232

**అతర్క్యము** సం. విశే. (అ. ఆ. అ.)

విచారింప సాధ్యముగానిది, తర్కింప నలవి గానిది.

క. అతర్క్య వైభవుఁ దలంతు నప్పరమాత్ముఁన్. శాంతి. 4-229

**అతలము** సం. వి. అ. న.

సప్తపాతాళములలో నొకటి.

సప్తపాతాళములు :- అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము.

క. మీనయి తా నతలగతంబైన నిగమచయముఁ దెచ్చి. శాంతి. 2-39

**అతసి** సం. వి. ఈ. (స్త్రీ).

మూనె యగిసె.

సీ. ...అతసీ కుసుమవర్ణ పీతాంబరము ధరించి. శాంతి. 2-50

**అతి** సం. అవ్య.

1. విశేషణములకు మొదట నుండునపుడు 'అత్యంతము-ఎక్కువగా' అను నర్థములను దెల్పును.
క. మేనతి చంచలము. విరా. 1-193

2. విశేషములకుఁ బూర్వముననుండి 'అధికము, ఎక్కువ' అనునర్థములను దెలియఁజేయును.
ఆ. ...మమ్ము నింక నతిరహస్య వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి,
యింపుఁడని యనుగ్రహింపవలయు. విరా. 1-47

3. ప్రాది సమాసమున 'అతిక్రాంతము, అతిక్రమించినది' అను నర్థమును తెలియఁజేయును.
మ. ...రాజన్య మాన్యప్రియాం, గనలం దెల్లఁ బొగడ్తగంటి నతిలోకం
బైన పేమన్నవన్. విరా. 2-217

**అతికామి** సం. విణ. (స్. సీ. న్.)

మిక్కిలి యిచ్ఛ గలవాఁడు.

వ. సంగ్రామాతికామియుం గోపాటోప ఘూర్ణమాన మానసుం డును. విరా. 5-221

**అతిక్రమణము** సం. వి. అ. న.

అతిక్రమించుట, అతిక్రమము, ఉల్లంఘించుట దాఁటుట.

వ. విభాండకుండు గొడుకుం జూచియిట్లేల చింతాపరుండవై యగ్ని హోత్రంబు వేల్వక కాలాతిక్రమణంబుసేసె దనినఁ దం(డికి బుశ్యశృంగుం డిట్లనియె. అర. 3-102

**అతిక్రమము** సం. వి. అ. పుం.

ఉల్లంఘనము, దాఁటుట, అతిక్రమణము.

క. ..సౌభ్రాత్ర స్నేహమునకు విచ్ఛేదముగా, సమయాతిక్రమము సేయ సమకట్టరుగా. అర. 1-92

**అతిక్రమించు** సం. స. క్రి.

1. దాఁటిచను. తలకడచు, మీఱు.

వ ఇవ్విధంబున గుంభసంభవుండు విజృంభించిన విప్వచ్ఛుం దలిగి సవ్యశరాసనుండై యా ధనురాచార్యుఁ బటు బాణ విసర వేగం బున నతిక్రమించి కెలంకుల బలంబుల నాక్రమించిన. ద్రోణ. 3-61

2. మించు, అతిశయించు.

వ. ...అయ్యిరువురుం గొఱవిఁ గొఱవి దాఁకిన తెఱంగునం దలఁపడి యొండొరులపైఁ బ్రచండ బాణంబులు వఱగించుచుం బోరుచోఁ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్రమించి. ద్రోణ. 4-44

3. ఉల్లంఘించు, అవదాఁటు, మేరమీఱు.

వ. దుహితృ స్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం దతిక్రమింపండు గావున... ఆది. 3-107

4. తిరస్కరించు, అనాదరముసేయు.

వ. అని పలుకుచున్న భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుఁడు జనార్ద
నున కభిముఖుండై యిట్లనియెః సభా. 2-62

ఆ గురుల ధర్మపరుల, గోపించి ధీరు లతిక్రమింతురే తదీయ నిత్య
ధర్మగౌరవంబు. సభా. 2-224

అ. క్రి.

గతించు (కాలము) కడచు.

సీ. గురుపత్నినేఁడ యక్కుండలంబులు దొడ్గు, దివస మీ దివస మతి
క్రమింపకుండఁగఁ బోక యెట్లాడగూడు. ఆది. 1-114.

**అతిక్రాంతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. అతిక్రమించునది, కడచినది 2. అతిక్రమింపఁబడినది.

వ. భూతక్షయావహంబగు కాలం బతిక్రాంతం బగుచున్నయది.
శాంతి. 4-20

**అతిక్రామి** సం. విశే. (న్. నీ. న్.)

అతిక్రమించువాఁడు

క. వామన రూపంబున నుద్దామబలున్ బలి నడంచి త్రైలోక్యాతి
క్రామితఁ జేర్చిన యద్భుత శాముస్. శాంతి. 2-48

**అతిక్రామిత** సం. వి. ఆ. స్త్రీ.

అతిక్రమించువానితనము, అతిక్రమించుట.

క. వామనరూపంబున నుద్దామబలున్ బలి నడంచి త్రైలోక్యాతి
క్రామితఁ జేర్చిన యద్భుత కాముస్, శాంతి. 2-48

**అతిచంచలము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి అస్థిరమైనది.

క. నానావిధ భూతమయము, మే నతిచంచలము.
విరా. 1 - 188

**అతిదారుణము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి భయంకరమైనది.

చ. తలిమి సుశర్మఁ గిట్టి యతి దారుణ భంగి రణంబుసేయ,

విరా. 3-213

**అతిదీనము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి జాలి కలిగించునది.

చ. అరయ నతండు మానధను, డక్కట రంగమునందు నిల్చి సుం,ద
రులకు నాట నూపెడు విధం బతి దీనము. విరా. 2-208

**అతిథి** సం. వి. ఇ. పుం.

1. తిథి పర్వోత్సవాది నియమము లేకుండ భోజనమునకు వచ్చువాఁడు
అభ్యాగతునికంటె వేఱైనవాఁడు,

సీ. ఇరువది వేవురు పరిణత పాలకు లభ్యాగతులకును నతిథులకును.
ద్రోణ. 2-209

2. భోజన సమయమునకు వచ్చినవాఁడు. బాటసారి.

వ. ఆ కుంచెడు వేలపిండియుఁ జెలిమూనెండు బంచుకొని యుపయో
గించుకొనువారై యున్న సమయంబున.

తే. అతిథియొక్క ధరామరుం డరుగుదెంచె. అశ్వ. 4-222

3. స్వర్గలోకమునకుఁ బోవువాఁడు. మృతుడు.

వ. ఇది యెట్లు ధర్మ పరిపాలనపరులై వీరులై రణ నిహతులైన
రాజు లభయలోక సుఖంబు లనుభవింప నతిథులై యుండులకు
నింత కాలంబయ్యు రాని కారణం బేమి? అర. 2-30

అతిథి యనఁగా-

1. శ్లో. తిథి పర్వోత్సవాస్సర్వే త్యక్తా యేన మహాత్మనా, సోఽతిథి స్సర్వ
భూతానాం శేషా నభ్యాగతాన్ విదుః. మన్వాద యుగాది ప్రభృ
తిషు తిథి విశేషేషు ద్రవ్యలాభముద్దిశ్య యే అభ్యాగచ్ఛంతి
తేఽభ్యాగతాః, తాదృశం తిథి విశేష మనపేక్ష్య యదాకదాచిత్

క్షుత్తృష్ణాది పరిపీడయోపగతోఽతిథిః.

పరా. 1. అ. 42 శ్లో. వ్యాఖ్య.

అని యుండుటచే 'తిథిపర్వోత్సవాది నియమములు లేకుండ అన్నార్థియై వచ్చువాఁడు అను నర్థము వచ్చుచున్నది. దీనిని బట్టి 'తిథి పర్వోత్సవ నియమములతో వచ్చువాఁడు' అభ్యాగతుఁడు అగుచున్నాఁడు. నిత్యము అతిథ్యభ్యాగత పూజ లొనరించుచున్నటులఁ జెప్పఁబడు సందర్భములయందు ఈ పై నిర్వచనము సరిపడుట లేదు.

సీ. ఇరువది వేవురు పరిణత పాచకు, లభ్యాగతులకును నతిథులకును,
బాటించి క్రొత్తగాఁ బవలును రేలును, వలయు నన్నములిడి
వెలసె. ద్రోణ. 2-209

2. అతతి-గచ్ఛతి-న తిష్ఠతి-అత్-ఇథిన్-ఉణాది. 4-2 శబ్దార్థము-ప్రయాణికుఁడు, బాటసారి.

శ్లో. ఏకరాత్రం తు నివసన్నతిథిః బ్రాహ్మణ స్మృతః
అనిత్యం హి స్థితో యస్మాత్ తస్మాదతిథి రుచ్యతే.

అను మనుస్మృతి నిర్వచనమును బట్టి నిలుకడగా నొకచోట నొక దినముకంటె నెక్కువ నిలువనివాఁడు అతిథి యగుచున్నాఁడు ఇట్టివాఁడు సామాన్యముగా, గ్రామాంతర వ్యాపృతుండగు పథికుఁడే (బాటసారి)యై యుండవచ్చును.

అతిథ్యభ్యాగతు లిర్వురు చెప్పఁబడినప్పుడు అతిథియన ప్రయాణికుఁడు బాటసారి (ఒక్క దినమునకన్న నెక్కువగా నొకచోట నిలువనివాఁడు) అనియు అభ్యాగతుఁడు అన వేళ చూచుకొని భోజనమునకు వచ్చువాఁడు అనియు గ్రహింపవలెను.

(ఈ విధమున నభ్యాగత సేవా పరతంత్ర సకల జీవనుఁడై భూదేవ కుమారుఁడుండఁగా...మను చరిత్ర. 1-58)

ఈ అతిథి, అభ్యాగత శబ్దములకు కవులు వాడుక యందెక్కువ భేదము గమనించినట్లు కన్పింపదు.

వ్యవ- గౌరవనీయులు తమ యింట విడిది చేసినపుడు వారిని అతిథి యనియుఁ బిలుచుచున్నారు.

"ఈ దినము మా యింట మంత్రిగారు అతిథులుగ విచ్చేసిరి"

**అతిపక్వము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎక్కువగాఁ బండినది, మిక్కిలి పండినది.

క. కంధరములు దెగి తలలు వసుంధర నతిపక్వతాల సుభగ ఫలాళా,
బంధురత రాలు దామగ్రగంధి పగఱమీఁద గినిసి కవిసిన యెడలన్.
విరా. 8-229

**అతిబలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. గొప్పబలము గలవాఁడు.

సీ. నివ్వెఱపడిన యానృప నందనునితోడ, నయ్యతిబలుఁడు మాయన్న
యొకని, బ్రాణంబునకును దప్పకుమయ్య యనియాన, యిచ్చిన.
అశ్వ. 4-108

2. త్రపుఁడు అను నగ్నియొక్క పదునైదుగురు పుత్రులలోఁ బ్రథమ పంచకమునందు నైదవవాఁడు. చూ. అర. 5-168

**అతిభారపు మానిసి** తత్స. తద్భ. మి. సమ.

మిక్కిలి భూభారము గలిగించు మనుష్యుఁడు, భూమికి బరువైనవాఁడు, మిక్కిలి దుర్మార్గుఁడు.

చ. ...వీని వెనుకంజని రేమి తలంచియో మహీపతులును వీరు
గొందఱ అతిభారపు మానిసు లేమి సేయుదున్. ఉద్యో. 3-376

**అతిభారము** సం. వి. అ. పుం.

మిక్కిలి బరువు, దుస్సాధ్యము.

క. వారల నోర్వఁగ మనకతి, భారమ దుర్వారవీర్య బలయుతు
లగుటన్. ఆది. 8-108

**అతిభీమము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి భయంకరమైనది.

వ. అయ్యవసరంబునం దక్కిన దొరలును దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు సేయం దొడంగిన. విరా. 3-179

**అతిభీముఁడు** సం. వి. అ. పుం.

'త్రపుఁడు' అను నగ్నియొక్క కొడుకులలో మొదటి యైదుగురలో రెండవవాఁడు. చూ. అర. 5-163

**అతిభీషణము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి భయంకరము.

శా. జ్యాఘోషం బతి భీషణంబయి ధరాచక్రంబు నిండన్. విరా. 4-202

**అతిమాత్రము** సం. విశే. (అ. ఆ. అ.)

కొలఁదికి మించినది, అధికము.

చ. ...భవదీయమై భోజన మతిమాత్రము. మహా. 44

**అతిమానము** సం. వి. అ. పుం.

గొప్పదనము, పెద్దతికము, సాత్త్వికభేదము.

సీ. స్తంభాతిమాన హర్షంబులు సాత్త్వికములు. అశ్వ. 2-88

శ్లో. హర్షః స్తంభోతిమానశ్చ త్రయస్తే సాత్త్వికాగుణాః సం. భా. అశ్వ. 32-1

**అతిమానుషము** సం. విశే. (అ. ఆ. అ.)

మనుష్యశక్తికి మించినది, దివ్యమైనది.

చ. ...అతిమానుష విక్రమశాలి వీని నెవ్వని కెదురంగరాదు. ద్రోణ. 5-348

**అతిరథికుఁడు** సం. వి. అ. పుం.

అతిరథుఁడు, చూ. అతిరథుడు.

వ. అయ్యిరువు రతిరథికులకుఁ బ్రకట ప్రథనంబయ్యె. కర్ణ. 1-191

**అతిరథుఁడు** సం. వి. అ. పుం.

1. అనేక రథికులతో నొక్కఁడే పోరాడఁగలవాఁడు.

వ ఇవ్విధంబున సన్నద్ధుండై యతిరథశ్రేష్ఠుండు రథంబెక్కి.
విరా. 4-168

2. కర్ణుని పెంపుడు తండ్రి, అధిరథుడు.

ఇతఁడు సూతకులమువాఁడు. ధృతరాష్ట్రునకు స్నేహితుఁడు. ఇతని భార్య యతిలోక సుందరి. రాధ యను నామె. వీరిరువు రొకనాఁడు గంగానదికేగి స్నానము చేయుచుండఁగాఁ బ్రవాహవశమునఁ గొట్టుకొని వచ్చిన యొక మంజూషలో కర్ణుఁడు లభించెను. తర్వాత వారికి ఔరస సంతానము గల్గెను.
అర. 2-849, మొ. 864.

**అతిరాత్రము** సం. వి. అ. పుం.

జ్యోతిష్టోమము నందలి ఒక భాగమగు యజ్ఞము.

వ. అగ్నిష్టోమ, హయమేధ, వాజపేయాతిరాత్ర పౌండరీకములనఁ బరఁగిన యధ్వరంబు లనేకములుసేసి.
ద్రోణ. 2-205

**అతిరావము** సం. వి. అ. పుం.

ఎక్కుడప ధ్వని.

క. ...ఇట్లని, యతిరావముగా నొనర్చె నాక్రందనమున్.
విరా. 3-18

**అతిరిక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి మీఱినది, మీఁదు మిక్కిలియైనది.

ఉ. ...ఉ, ర్వీవరు, డాత్మశక్తి కతిరిక్తములైన సముద్యమంబులం, దావలియం దలంచి సముదగ్రత నైకొనుటొప్పదు.
శాంతి. 8-172

**అతిరేకము** సం. వి. అ. పుం.

హెచ్చు, అతిశయము, ఆధిక్యము.

వ మదీయ పరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనలం భేదింతురు.
విరా. 2-208

15)

**అతిలోకము** సం. విణ. (అ. ఆ. అ.)

లోకాతీతము, లోకము నతిక్రమించినది, అమానుషము.

శా. ...రాజన్యమాన్య ప్రియాంగనలం దెల్లఁ బొగడ్త గంటి నతి లోకంబైన నీ మన్ననన్. విరా. 2-217

**అతిలోకుఁడు** సం. విణ. అ. పుం.

లోకము నతిక్రమించినవాఁడు, అసామాన్యుఁడు.

వ. నయవిక్రమంబుల నతిలోకుం డగు నతని నెవ్వనికేనియుం బొగడ వలయు. విరా. 4—195

**అతివ** దే. వి.

1. స్త్రీ.

క. అతివ తగునమ్మ నీ గృహ, మతి నిర్మల చరిత భరిత మని యీ యెడ మృత్పతుల యసన్నిధినైనను, మతి నూఁటిడియున్నచోట మన్నన దప్పన్. విరా. 2-94

2. భార్య

సీ. ధృతరాష్ట్రి సఖుఁడైన యతిరథుండను సూతుఁ డతివలు దానును నతివిభూతి. అర. 7-350

**అతివర్తించు** సం. స. క్రి.

అతిక్రమించు, దాఁటు, మీఱు,

క. సమదృష్టివి జూయియుఁ గన్వకముఁ జూచుచు సత్సమాధికలితం బగు వృత్తము నడపిన శబ్దబ్రహ్మము షణ్మాసముల యోగి యతివర్తించున్. శాంతి. 5-122

**అతివాదము** సం. వి. అ. పుం.

లౌకిక విషయ సంభాషణము, అధిక ప్రసంగము.

సీ. ...దురభిమానరాహిత్య, మతివాద వర్జన మఖిల భూతదయ... తే...వీని నల పుణ్యుఁ డభయుఁ డైహికముల వలనను నాముష్మికముల వలన. శాంతి. 4-364

**అతివాయువు** సం. వి. అ. పుం.

మహావాయువు, ప్రచండ వాయువు.

సీ. ప్రదర వేగమున నరాతులఁగూల్చు పార్థాతివాయువునకు నచల
మగును. కర్ణ. 2-95

**అతిశయము** సం. వి. అ. పుం.

1. ఆధిక్యము, ఎక్కువ.

ఉ. ఆ కమలాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబు.
విరా. 3-32

2. గొప్పదనము.

క. నిష్పాపుఁడైన ధరామరుండు, నెపుడు విజయ ప్రియుకగునేని నట్టి
యతఁడు దైవ పిత్ర్యములకు నతిశయంబు, గల్గుపాత్రంబులగు
దురు కౌరవేంద్ర. అను. 2-59

**అతిశయవంతము** సం. విశ. త్. (అ-తీ-అ)

అధిక్యము గలది, గొప్పదనము గలది.

సీ. శ్రుతము నాచారంబు నతిశయవంతంబు లెడ నహంకార మొక్కింత
యేని లేదు. శాంతి. 5-82

**అతిశయితము** సం. విశ. (అ. ఆ. అ.)

1. మీఱినది, మిక్కిలియైనది.

క. అతిశయిత పుణ్యదీప్తులు. శాంతి. 3-302

2. మీఱఁబడినది, అతిక్రమింపఁబడినది.

చ అతిశయితామరోత్తముఁ డహర్పతితేజుఁ డజాతశత్రుఁడు.
అర. 1-51

**అతిశయిల్లు** సం. అ. క్రి.

అధికమగు.

తే. అర్థిగలవచ్చి వాత్సల్య మతిశయిల్లి. విరా. 1-10

2 విజృంభించు.

తే. ప్రళయకాలానలమున, గండరించిన రూపంబు కరణి భీము(, డతి
భయంకరాకారత నలిశయిల్లె. విరా. 2-184

3. ప్రసిద్ధికెక్కు.

సీ. నిఖిల ధర్మాధర్మ నిపుణంబులైన శుద్ధాంతరంగంబుల నతిశయిల్లి
విరా. 2-140

వ. కావున మునివరుల నృపవరుల వలనం గలిగిన జన్మంబులెల్లను బీజ
ప్రధానంబులై యతిశయిల్లు. అను. 2-28

4. పెంపొందు.

తే. సహజమైన యలంకార మహిమ నతిశయిల్లి మహనీయ వైభవ
మెసక మెస(గ, వఱలు నరపతి మందిర ద్వారభూమి.
విరా. 3-74

**అతిసారము** సం. వి. అ. పుం.

విరేచనములు మిక్కుటముగా నగు రోగము.

చ. జ్వరమున గుల్మపీడ, నతిసారమునన్ బలుపుండు౦న్.
అను. 5-108

**అతిసారుఁడు** సం. వి. అ. పుం.

నితంతువు కొడుకు. ఔశీనరపతి కొమరితయగు అజితయను దానిని
స్వయంవరమున వివాహమైన యయిదుగు రన్నదమ్ములలో నైదవ
వాఁడు. ఆది. 7-277

చూ. అజిత.

**అతిస్ఫుటము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ధృఢమైనది.

ఉ. సారథిఁజూచి నీవు రథసంబునఁ బూన్పుము ఘోటకంబులన్, దేరిఁ
దదీయ వర్మము లతిస్ఫుటబంధము గాఁగఁబెట్టు. విరా. 8-148

**అతిస్ఫురణ(ము)** సం. వి. అ. న.

(ఇది చరిత్రాదులలోఁ జేరినందువలన 'ము' వర్ణమునకు లోపము బహుళము)

దురూహ, దురాలోచనము.

తే. ...భీముఁ డీతఁ, డొంటి యగపడ్డ చోటన యుక్కడంగఁ, బొదివి చంపుద మని యతిస్ఫురణసేసి. భీష్మ 2-357

**అతిహీనము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి నీచమైనది.

క. ...చెప్పకు తద్విధాతిహీనవచనముల్. విరా. 1-327

**అతీంద్రియము** సం. విణ. (అ. ఆ. అ.)

ఇంద్రియముల కందనిది, ఇంద్రియముల కప్రాప్యము.

క. అనుపమ మజర మతీంద్రియ మనామయము. శాంతి. 6-27

**అతీతము** సం. విణ. (అ. ఆ. అ.)

1, అతిక్రమించినది.

మాలిని. పరిచయకలనా లబ్ధవ్యయాతీత సౌఖ్యోత్తర మునిజన హృన్మాద్యన్మరాళప్రతానా. విరా. 2-365

2. కడవఁబడినది, అతిక్రమింపబడినది.

వ. అతండు నజ్ఞాతవత్సరం బతీతంబగుట నిరూపించి. విరా. 4-14

3 కడచినది, గతించినది.

వ. అతీత కల్పాంత సమయంబున. అర. 4-251

4. కడచిన కాలము, భూతకాలము.

వ. అతీతానాగత వర్తమానంబు లెల్లను దెల్లంబుగా నెఱుంగుదు. ఆది. 6-219

**అతీతుఁడు** సం. విణ. అ. పుం.

1. చచ్చినవాఁడు.

వ. మఱియు నతీతానాగతులైన నిజవంశంబుల రాజులకెల్ల వంశకర్త యయ్యె. ఆది. 4-110

2. అందనివాఁడు-

వ. అప్రమేయ ప్రభావ భావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం

డాశ్రితులకు నత్యంత సులభుండు. విరా. 1-19

**అతులము** సం. విణ. (అ. ఆ. అ.)

సాటిలేనిది,

తే. ...నా యతుల బాహుబలముఁ జెనయంగ భవదీయపతుల కారు,
మూఁడు లోకంబులందు నెవ్వాఁడు లేడు. విరా. 2-56

**అతులితము** సం. విణ. (అ. ఆ. అ.)

సాటిలేనిది, నిరుపమానమైనది.

క. మన చూడ్కికిఁ బ్రేవ్ గయి యీ తని యతులితమూర్తి యత్యుదా
త్తతఁ గడు నొప్పినయది. విరా. 4-257

**అతృప్తుఁడు** సం. విణ. అ. పుం.

తృప్తిలేనివాఁడు.

వ. పలుమాఱు రాజుల నెల్లను బోరిగొని పరశురాముం డతృప్తుండై.
శల్య. 2-199

**అతృష్ణుఁడు** సం. విణ. అ. పుం.

తృష్ణ లేనివాఁడు. ఆశ లేనివాఁడు.

క. అనహంకారుఁడు నక్రోధనుఁడు నతృష్ణుండు నై నతఁడు శుభ
మశుభం, బను భేదముఁ బొరయఁడు, శాంతి. 5-327

**అత్త** దే. వి.

1. మగని తల్లి.

క. చెలులైనఁ జూడఁ బయ్యెద, దొలఁగుటకును సిగ్గుపడు వధూ జన
తతి య, త్తల యెదుర నేకవస్త్రుంబులతో నంగములు విశృతిఁ
బొందగఁ నడచెన్. స్త్రీ. 1-99

క. సతతంబు న త్తదూఱుటఁ, బతియెడ దుశ్చిత్తయగుటఁ బరమాన్నము
నొక్కత సేవించుట నగు దుర్గతి విసముఁలు డాఁచికొన్న కష్టకుఁ
గలుగున్. అను. 3-244; అశ్వ. 2-143

2. పితృ సోదరి.

వ. మా యత్త సాత్వతి నన్నుం బ్రార్థించుటంజేసి యిద్దురాత్మువకు సేసిన యపరాధశతంబు సహించితి. సభా. 2-68.

దీనికి మూలము 'అత్తు' ధాతువు; అత్తు = సంబంధించు, కలియు, కూడు- సన్నిహిత సంబంధము గలది గావున అత్తయను కృదంతరూపము దీనినుండి యుత్పన్నమగుచున్నది (అత్తునది అత్త) అందును ఒక వ్యక్తికిని మఱొక వ్యక్తికిని మధ్య సంబంధమును గల్పునది గావున ఈ పదము భార్య యొక్కయు భర్తయొక్కయు తల్లులయందే రూఢికెక్కి తత్సంబంధమునకు అనుకూలమైన వారగు తండ్రి యప్పచెల్లెలు, మేనమామ భార్య అను వారి యందును బర్యవసించుచున్నది. కావున ఇది దేశ్యము.

**అత్తమిల్లు** దే. అ. క్రి. √అత్తు - అత్తము, అత్తమిల్లు

ఒరగు, వాలు.

వ. విదురుండును మణిమయ పీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నత పీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె. ఉద్యో. 3-253

**అత్తల** దే. వి.

ఆతల, ఆవల.

క. వాయువుల నియతవృత్తి మనోయంత్రణ బోమల నడుమ నూల్కొలిపి విచ్చేష్టాయిత శరీరుఁడై మూర్ధాయోజితములుగఁ జేసి యత్తలఁ జేర్చున్. శాంతి. 4-185

**అత్తళము** దే. వి.

ప్రాసము, ఈటె, బల్లెము.

క. పెనుఁగడఁత దొడ్డయత్తళమున వైచిన నతఁడు వహార్భ మునిఁగి రథము మీఁదన పడినఁ గనలి యప్పావని పొదిశెను గౌరవేంద్ర వాహిని కడకన్ శల్య. 1-381

శ్లో. ఏతస్మిన్నంతరే శూర స్సౌబలేయః ప్రతాపవాన్
ప్రాసేన సహదేవస్య శిరసి ప్రాహరద్భృశమ్.

సం. భా. శల్య. 29-10

**అత్తు** దే. అ. క్రి.

ఆసక్తిగొను.

లయగ్రాహి :- రిత్తలగు దుర్వచన వృత్తులను నొండొరుల నెత్తికొని మాంసం, బత్తి తినుటన్. స్త్రీ. 2-8

**అత్యంతము** సం. విశే. (అ. ఆ. అ.) (అతి + అంతము)

1. అధికము.

వ. అప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంత సులభుండు. విరా. 1-19

2. తుదలేనిది, శాశ్వతము.

ఉ. నీకు నుదారసౌఖ్య మత్యంతము నవ్యయంబునగు నందలి మాన్యులు సంస్తుతింపఁగన్. మహా. 66

**అత్యతీతము** సం. విశే. (అ. ఆ. అ.) (అతి + అతీతము)

1. మిక్కిలి వేఱైనది.

క. అగు నీ తత్త్వము సత్త్వాదిగుణత్రయ వికృతి కత్యతీతంబై. శాంతి. 4-94

**అత్యధికము** సం. విశే. (అ. ఆ. అ.) (అతి + అధికము)

మిక్కిలి యెక్కువయైనది.

చ. ...నన్ను నత్యధిక మనోజరాగమతియై కనుగొంచు. విరా. 2-170

**అత్యయము** సం. వి. అ. పుం.

1. ప్రళయము, ప్రళయ కాలము.

మ. ...అత్యయకాలజ్వలనోద్ధతిం గవిసి యేకాక్షౌహిణిం ద్రుంపఁగన్. ద్రోణ. 5-400

అత్యయ సమవర్తి చాడ్పున. కర్ణ. 1-120

2. నాశము.

క. అత్యంత ప్రబలంబులు, పైత్య వికారములు రేఁగి ప్రాణములకు శీఘ్రాత్యయముం జేయు మహార్ధత్యంబున నెలవు వెడలఁదలిమి

సుచరితా. అశ్వ 1-169

3. హాని, కీడు.

క. చను బొంకఁగఁ బ్రాణార్థయ,మున సర్వధనాపహరణమున. ఆది. 3-178

**అత్యుగ్రము** సం. విణ. (అ. ఆ. అ.) (అతి + ఉగ్రము)

మిక్కిలి క్రూరమైనది. మిక్కిలి భయంకరమైనది.

శా. ...శస్త్రాగ్నిప్రజ్వా, లోద్యత్స్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబు. విరా. 4-52

**అత్యుదగ్రము** సం. విణ. (అ. ఆ. అ.) (అతి + ఉత్ + అగ్రము)

మిక్కిలి భయంకరమైనది.

క. తరణియు దుఃఖితయగు న,త్తరుణిం గాచుటకు నత్యుదగ్ర భుజా
వి,స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁ డగుచు
గ్రక్కునఁ బనిచెన్. విరా. 2-110

**అత్యుదగ్రుఁడు** సం. విణ. అ. పుం.

మిక్కిలి భయంకరమైనవాఁడు.

తే. సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోఁడి, పట్టఁ గడువడిఁ దగిలి
కోపంబు గదుర, నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకు
కొసరించుకయు లేక కూలఁ దాఁచె. విరా. 2-128

**అత్యుదగ్రత** సం. వి. ఆ. స్త్రీ.

మిక్కిలి భయంకరత్వము.

తే సింహబలుఁ డత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి. విరా. 2-128

(సం–ము: అశా–ప్రతిపాఠము)

**అత్యుష్ణము** సం. విణ. (అ. ఆ. అ.) (అతి + ఉష్ణము)

మిక్కిలి వేఁడియైనది.

క. ...దవదహనా,త్యుష్ణ ప్రతాపదీప్తులు, కృష్ణానోదరులుఁ దలఁ
పఁ గేవలులె నృపా. ఉద్యో. 2-178

**అత్రి** సం. వి. ఇ. పుం.

1. సప్తర్షులలో నొకఋషి.. ద్రోణ. 5-308 చూ. సప్తర్షులు

2. బ్రహ్మమానస పుత్రులలో నొకఁడు. (విష్ణువు)

తే. ...భవ్య, తల్పగతుఁడైన నాభిఁ బద్మంబుదోఁచె, నం దజుఁడు పుట్టి సృజియించె నందనుల మునంబునన సప్తసంఖ్యల నరవరేణ్య.

వ. మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండును బులహుండును గ్రతువును దక్షుండు ననం బరఁగువారలు.

శాంతి. 4-205, 206; శాంతి. 6-41

ఈ అత్రియే సప్తర్షులలో నొకఁడై యుండవచ్చును.

ఈతఁడు శుక్లము ఇంద్ర దైవత్యము అని జనులకుఁ దెలిపెను. అది కారణముగ శుక్లమునకు 'ఇంద్రియము' అను పేరు వచ్చెను. శాంతి. 4-307 ఈతఁడు మరీచ్యాదులతోఁ గలిసి విష్ణు నుద్దేశించి తపస్సుచేసి తన చేతఁ బ్రణీతంబై సకల జగంబులకు హితంబును మర్యాదా ప్రవర్తకంబునై శాస్త్రంబు వెలుంగునటుల పఠము వడసెను. శాంతి. 6-359

3. ఒక బ్రాహ్మణుఁడు.

చ. వినుతచరిత్రుఁ డత్రి యను విప్రవరుండు తపంబొనర్పఁగా.

చూ. వివరము - అర. 4-193; మొ 205 వ.

పరికించి చూడఁగా ఈ ముగ్గురు నొక్కరుగానే కనిపించుచున్నారు. ఈ అత్రిని శెక్కతావుల మిగిలిన బ్రహ్మమానస పుత్రులార్వురి తోడను గల్పియే చెప్పుచున్నారు. ఈ బ్రహ్మమానస పుత్రులు ఏడ్వురిలో శాంతి పర్వము చతుర్థాశ్వాసమునకును షష్ఠాశ్వాసమునకును భేదము గన్పించుచున్నది. వరుసలో భేదమట్లుంచి చతుర్థాశ్వాసమునఁ జెప్పఁబడిన యేడవ వాఁడను దక్షునకు మాఱుగా షష్ఠాశ్వాసమున వసిష్ఠుఁడు చెప్పఁబడినాఁడు. మూలమును దీనికనుకూలముగనే కన్పించుచున్నది.

శ్లో. బ్రహ్మమనసృతే పుత్రా న్మానసాన్ దశసప్తమాన్,
మరీచిమత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుమ్.

శ్లో. మరీచిం కాశ్యపం తాత పుత్రమగ్రజమగ్రజః,
మానసం జనయామాస తైజసం బ్రహ్మవిత్తమమ్.
సం. భా. శాంతి. 207, 17, 18.

చూ. ఋషి.

**అధర్వణము** సం. వి. అ. పుం.

నాల్గవ వేదము.

అ. .... అవి క్రమంబున ఋగ్వేద,మును యజుస్సు సామము
నధర్వణమ్మను సారభూత భవ్య సంభాషణము సేత. అను. 1-162

ఇది వేదములలో నాలవది ఇందు శత్రు వినాశకములును, పాపనిబర్హణములును, అపాయ నివర్తకములును, సౌఖ్యాపాదకములును నగు పెక్కువిధములైన మంత్ర భాగములు కలవు. మఱియుఁ దక్కిన వేదములందు వలెనే వైదిక క్రియల యందు ఇంద్రాద్యధిదేవతాకములగు మంత్రములు గలవు. ఇది తొమ్మిది శాఖలును అయిదు కల్పములును గలిగి యిరువది కాండలయందుఁ గలదు' ఇందు ముఖ్య బ్రాహ్మణము గోవధ బ్రాహ్మణము. ఈ వేద సంబంధమైన యుపనిషత్తులు ఏఁబదిరెండు అని చెప్పుదురు. మఱికొందఱి లెక్కన ముప్పదియొకటియే యగుచున్నవి.

**అధర్వము** సం. వి. అ. పుం.

అధర్వణ వేదము. చూ. అధర్వణము.

క. అరుణంబులును సకంటక, తరుభవములుఁ గటుక గంధధామములు
నొనర్తురు శాత్రవాభిచారిక, కరణమున నధర్వ మాంత్రికతఁ
గుసుమంబుల్. అను. 4-7

**అధర్యుఁడు** సం. వి. అ. పుం.

1. ఒకానొక అగ్ని. చూ. అర. 5-169 మొగలు 174.

2. త్రిపురాసుర సంహారము సేయఁబోవు శివుని రథమునకు చక్రరక్షకుఁడు.

వ. అన్వేదాశ్వంబులం బఱప నధర్వాంగిరసులు చక్రరక్షకులయి చనుదేర. కర్ణ. 1-292

**అదండ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

శిక్షింపఁబడఁదగినవాఁడు.

సీ. అదండ్యులు ధరణిదివిజులు... శాంతి. 2-219

**అదక్షము** సం. విణ. (అ. ఆ. అ.)

సమర్థము గానిది.

మ. ...అన్యసాధనఖిదాదక్షంబునై సర్వలోక మనోజ్ఞంబయి దివ్యమై వెనుఁగు నగ్గాండీవమన్ చాప రత్నము నిచ్చెన్ వరుణుఁడు పార్థునకు. ఆది. 8-258

**అదత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

ఈయఁబడనిది.

వానికి నదత్త ప్రతివచనుండైన. సభా. 2-210

**అదను** దే. వి.

సమయము, తఱి.

తే. అదను నెఱిఁగించి నా కడ కనుపు నొక్క. విరా. 2-295

ఆ. అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ, బిలువఁబంచి.

ఉద్యో. 1-241

**అదయత** సం. వి. ఆ. స్త్రీ.

దయలేమి.

చ. ...నాఁ, డదయత సూతసూతి సభ నాడిన మాటకుఁ జాల నొచ్చి. ఉద్యో. 1-114

**అదయము** సం. విణ. (అ. ఆ. అ.)

దయ లేనిది.

క. ఇదియెల్లను నొకతల యీ, పదమూఁడేఁడులును నాకు బావ కొడుకుచే, నదయమగు కూడు గుడుచుట, యది యొక్కల యయ్యె, నేమి యనఁ గల దనఘా. ఉద్యో. 3-192

**అదయుఁడు** సం. విణ. అ. పుం.

దయలేనివాఁడు.

క. అ,య్యదయుని ముట్టుకొని వామమడచుట దక్కన్. సౌ. ప్తి. 2-32

**అదరిపడు** దే. అ. క్రి.

1. కోపముచే మిట్టిపడు- మిడిసిపడు- ఎగిరిపడు- ఉద్రేకించు.

క. గోవులకు వెనుకయ్యై వెసఁ, బోవుచునున్నారు గడవఁ బోవక యుండం, బోవలయు నడ్డపడియెదు, దీవస మెడఁ గలిగెనేని దేవర కడకున్. వ. అనిన విని విరాటుఁ డదరిపడి. విరా. 3-188-189

2 భయపడు, ఉలికిపడు.

మ. అదె కౌరవ్య లశక్తదుర్జనత సేయంబూని పైఁ బాఱుఁ జూ,చెదరమైత్త్రి దమచేతఁ దీఱునె జయశ్రీ కాంతు దైత్యాంతకుఁ, బోదు వం దారు దలంచుటెల్ల ననలంబుం జీర బంధింపఁగా, మది నూహించిన యట్ల కాక తమ దుర్మంత్రతఁబులం బోవునే,

వ. అనిన విని విదురుం డదరిపడి వైచిత్రవీర్యున కిట్లనియె.

ఉద్యో 3-396-367

3. సంభ్రమము నొందు, అచ్చెరుపాటు నొందు.

అ. ఇతఁ డపూర్వ మనజుఁ డెందుండి వచ్చెనో, యనుచు నదరిపడి లతాంగులెల్ల, నాసనములు డిగ్గి యప్పుడభ్యుద్గత, వైరి మనములందు హర్షమెసఁగ. అర. 2-39

శ్లో. తతస్తా నైషధం దృష్ట్వా సంభ్రాంతాః పరమాంగనాః

సం. భా. అర. 55-15

**అదరు** దే. అ. క్రి.

1. వడఁకు, చలించు.

సీ. హృదయంబు తటతట నదరంగ బెలుకుఁబు. విరా. 4-80

**అదరులు** దే. వి. బ.

మిడుగుఱులు, నిప్పుకణములు.

కైదవుల నదరు తెగయుంగాన్. భీష్మ. 2-171

చరల నదరు తెగయ. అర. 5-181

**అదర్శనము** సం. వి. అ. న.

1. కనఁబడకుండుట, మఱుఁగుపాటు.

వ. భీమసేను శారింబడిన సుదర్శనుండు దదీయ శరజాలంబుల నదర్శనగనతుండై పదంపడి తచ్ఛరవిఖండితకంఠుండైన. శల్య. 1-380

2. అజ్ఞానము, ప్రకృతి.

వ. ఇది యతురతుర వివేకంగ శేకం బనేకంబు దర్శనం బదర్శనంబు నిస్తత్త్వంబు దత్త్వంబు. శాంతి. 6-84

**అదలించు** దే. స. క్రి. ప్రే.

బెదరించు, తర్జించు, గద్దించు, జడిపించు.

వ. అప్పు డశ్వత్థామ యఱువదినాల్గు నారసంబుల నొప్పించిన నన్నరుండు నిలునిలుమని యదలించినం దెరలి యతండు కరుల గమిం జొచ్చె. ద్రోణ. 4-246

**అదలుచు** దే. స. క్రి. ప్రే. (రూపాం) అదల్చు-స్వార్థము అదలు

గద్దించు, భర్జించు.

క. బవరము గిడని యెఱుఁగుదు, నవినీతుండైన కొడుకు నదలిచి యుదుపం దివిరియు నోరాడమిదైవ వశం బప్పనికి మనకు వగపిఁకేలా. ఉద్యో. 4-183

క. దుర్యోధనుఁ డదలిచి సర్వసైన్యతతిఁ బురికొల్పెన్. భీష్మ. 2 - 216

**అదలుపు** దే. వి. (రూపాం) అదల్పు

గద్దింపు, బెదరింపు.

దే. ..... ఈఱ శాఱ, యదలుపుల వాహనంబులు సెదరి పఱచె. ద్రోణ. 3-48

అదల్చు దే. స. క్రి. ప్రే.

వదలించు, తొలగించు, తప్పించు, (జుట్టు) విదల్చు

మ. అనుచున్ గ్రక్కున లేచి రోష కఠినంబౌ హాస మా సూతు
నె,మ్మన ముద్వేగముఁ బొందఁజేయ బలసామగ్రీ సముజ్జృంభణం,
బున వానిం దలపట్టి వంచుటయు నేవుం జేవయుందోఁప వాఁ, డమ
మానింపక పెట్టదల్చికొని కోపాటోపదీప్తాంగుఁడై. విరా. 2-340

శ్లో సకేశేషు పరామృష్టో బలేన బలినాంవరః, ఆక్షిప్య కేశాన్ వేగేన
బాహ్వో ర్దగ్రాహ పాండవమ్ సం.భా. విరా. 22-54

2. కోపముచే మందలించు.

వ. తదవసరంబున శిఖండి దేవవ్రతున కెదిర్చిన నొండుసేయ నొల్లమి
నాతండు కోదండంబుఁ దుండంబులు సేసి పిలుసనఁ జేయుటయుఁ
బాండవాగ్రజుండు వాని ప్రతిజ్ఞావచనంబు లెత్తి చెప్పి మొగ
మోడక యదల్చినం బురికొని యప్పాంచాలపతి సూనుండు సుర
నదీసూను మార్కొనుటయు. భీష్మ. 3-55

3. వెడలఁగొట్టు, తఱిమివేయు.

ఆ నీరువట్టు శ్రమముఁ గూరిన నీమీఁది కరుణ వచ్చినాఁడఁ గాదు
నా కృయర్థిఁ ద్రావు టొప్పు ననియె నా చండాలు, నలుక మెయి
నదల్చె నత్తపస్వి.

వ. అదల్చిన నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబుసేసె.
ఆశ్వ. 3-55, 56

శ్లో. సతథానిశ్చయాత్తేన ప్రత్యాఖ్యాతోమహాత్మనా,
శ్వభిః సహామహారాజ తత్రైవాంతరధీయత. సం.భా.అశ్వ. 55-26

4. తర్జించు. గర్జించు, కూడదని గట్టిగాఁ జెప్పు.

ఆ. ధర్మజుండు భీముఁ దగు వచనములఁ న,దల్చె నరుఁడు మఱియుఁ
దగడె పూజ, కాంబికేయుఁ డిట్టు లనకుము. ఆశ్ర. 1-118

శ్లో. తమేవం వాదినం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః, ఉవాచ వచనం
ధీమాఞ్జోషమాస్స్వేతి భర్త్సయన్. సం. భా. ఆశ్ర. 12-24

**అదల్పు** దే. వి.

అదలువు.

క. హుంకారములు నదల్పులు, జంకెలు ధిక్కరణములును సంస్తుత
ములును వీరాంకోక్తులు నిస్సాణజఘాంకృతులును గలసి యుద్ధ
టంబుగఁ జెలిగెన్. భీష్మ. 2-133

**అదాసి** సం. వి. ఈ. (స్త్రీ).

దాసికానిది (అదాసి X దాసి)

ఆ. ధన్యులార, యే నదాసినే దాసినే, యెఱుఁగఁ జెప్పి పనుపుఁ
డెల్ల దాని. సభా. 2-244

**అది** దే. సర్వ. మహతి, అమహత్

1. ఆమె, (స్త్రీ).

క. తన భార్యకు రాధకు నిచ్చిన నదియును గరము సంతసిల్లి.
ఆది. 5-32

క. బల విక్రమసంపన్నులు, గలరేవురు దాని పతులు గంధర్వులు.
విరా. 2-72

2. తచ్ఛబ్దార్థకము, అమహత్తు.

వ. వైశంపాయను వలన వినిన కథ యగుటం జేసి తత్ప్రకారంబున
నడపె నది యెట్లనిన. విరా. 1-48

తే. ఎల్లయందును దా వసియించు నెల్ల యదియుఁ దనయందు వసి
యించుటం బ్రదు. ఉద్యో. 2-326

క. ఇన్నగమునందు గాండివమున్నది యదిగాని. విరా. 4-105

3. సంబంధార్థమునందు పదముల కనుప్రయుక్తమగును.

ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరిదానవు. విరా. 1-312
(ఎవ్వరి దానవు- ఎవ్వరికి సంబంధించిన దానవు. స్వామిస్వామ్య సంబం-
ధము)

తే. ...నీవరుగు మార్యవర్య యెవ్వరి దూతవు వారి కడకు.
స్వర్గ. 27

అ. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడిదానవు. ఆది. 4-76

(ఎక్కడి దానవు = నీవుండ నాధారమైన స్థల మెద్ది?)

(ఆధారాధేయ భావము)

4. క్రియలపై వచ్చి విధి ప్రార్థనాశీరాద్యర్థకములఁ దెలుపును.

అందుఁ గొండొక కాలం బుండి వచ్చునది యనిపంచిన.

(విధి) ఆది. 6-187

విష్ణుని దివ్య వచనంబుల చొప్పున నడచునది. (విధి) శాంతి. 6-416

ఇట్లుగా దట్లని చక్కం బెట్టునది. (ప్రార్థన) ఉద్యో. 3-272

నీవు నాకు నాగ్నేయాస్త్రం బిచ్చునది (ప్రార్థన) ఆది. 7-51

యుష్మదన్వయంబు భార్గవ కుల సంబంధంబున జన శ్లాఘనీయం బయి వెలయం గలయది. (ఆశీస్సు) అను. 2-331

5. నిశ్చయమును దెలుపును.

మీ మీ కడనున్న బ్రహ్మ హత్య ప్రవేశింపఁగలయది.

శాంతి. 5-432

నీ కెట్లు ప్రియం బట్లు కాఁగలయది. శాంతి. 2-71

6. క్రియాజన్య విశేషణముల మీఁద వచ్చి భావార్థమును దెలుపును.

శ్రమమున నింద్రియములు లీనమగు నది నిద్ర. శాంతి. 4-324

(లీనమగునది = లీనమగుట)

క. అహితుల నెల్ల విధంబుల, విహతులఁగాఁ జేయునది వివేకము

(చేయునది = చేయుట) సభా. 2-271

తమ హావిర్భావములు గొనుదాని కనిన. శాంతి. 5-432

(కొనుదానికి = కొనుటకు)

7. క్రియాజన్య విశేషణములకు విభక్తి వివక్షించునపుడు అనుప్రయుక్త మగును.

చేయునదిలేక చింతిల్లుచున్న దాన. విరా. 3-216

శాకి యనుదానికి నులూకంబులు పుట్టె. ఆది. 3-71

నా వేఁడిన దాని నిమ్మనిన. ఆది. 4-176

8 క్రియాజన్య విశేషణముల మీఁద ననుప్రయుక్తమై క్రియార్థమును బూర్తిచేయును.

కోపించి గాంధారి శాపమిచ్చిన యది. మౌస. 191

మది కధికంబై తోఁచినయది. ద్రోణ. 3-296

పాపత్వంబు బొరయకున్నయది. శాంతి. 1-320

క. అసంఖ్యకవిధమై పరఁగుచుండునది మనుజేంద్రా. శాంతి. 6-96

9. ప్రాధాన్యము దెల్పుటకై భావార్థకము మొదలగువానిపై నుప యోగింపఁబడును.

వేఁడఁగాఁ బడుటది పెద్దసావు. అను. 2-348

విద్య యనునది యెట్టిది ఉద్యో. 2-320

ఆశ యనునది అనంతమైయుండు. శాంతి. 3-150

10. పాదపూరణముగా నుపయోగింపఁబడును.

హస్తిపురం బది రాజధానిగాన్. ఆది. 5-6

నీ దగుకోర్కి దీర్చు టది నాకు వ్రతంబు. ఉద్యో. 1-39

. మనః ప్రీతిదమగుచు నాదిపర్వంబది వినఁగా నొప్పు భారతాఖ్యం బగుచున్. ఆది. 1-35

అదిగాక దే. జాతీ.

అదియునుగాక.

క. మాటలు పెక్కాడితి వీపోటు మగలు వినఁగ నిఁకఁ బోవుట దగ దెప్పాటన పదిగాక తమ్మని, పాటును గన్నారఁ గంటి పాటకు మింకన్. ద్రోణ. 1-304

అదితి సం. వి. ఇ. (స్త్రీ).

కశ్యపుని భార్య. దేవతల తల్లి.

(శ్రీమన్నారాయణుఁ డా యా యవతారము లెత్తనున్నపుడెల్ల నీ యదితి కశ్యపులు నుద్భవించి శ్రీమన్నారాయణుని గనుచుందురు) విరా. 1-54

**అదితితార** సం. వి. ఆ. స్త్రీ. అ. న.

పునర్వసు నక్షత్రము.

ఈ నక్షత్రమునందు పులగము దానము చేసిన నుత్తమ ఫలము గల్గును. అను. 2-378

ఈ నక్షత్రమునందుఁ జేసిన కృషి చక్కఁగా ఫలించును. అను. 3-168

**అదిమికొను** దే. స. క్రి.

ఒత్తిపట్టుకొను, కౌఁగలించు.

క. అని దాని చేతికిచ్చినఁ, గొని యురమున నదియు నదిమికొనియె. అర. 7-353

**అదియటులుండె; అదియట్టులుండె** దే. జాతీ.

ఆ విషయ మట్లుండనిమ్ము- అది యంతియే- దాని యందేమి లోపము లేదు. కాని

సీ. అన విని బలి దేవతాధీశుతో నీకు, నా విభవంబు గానంగరాదు, గుప్తమైయున్నది గుహాయందు నా కిచ్చ,వుట్టిన నిప్పుడ పొలిచి తోఁచు, నది యటులుండె నీ వధికుండ వల్పుల, యెదుర రజ్జుల వల్కు కేటిపెంపు. శాంతి. 4-392

క. అది యట్టులుండె నీతోఁ, బదరం బనిలేదు నాకు. శాంతి. 4-409

**అదియుంగాక; అదియుఁగాక; అదియునుంగాక; అదియునుగాక** దే. జాతీ.

మఱియు, అంతేగాక.

నా మదికిం జూడ మేలై యుండ దదియుం గాక. సౌప్తి. 1-48

సీ. వగతు నదియుఁగాక తగవేది యమ్మత్స్య,మేదినీశ్వరుఁడు వినోదమునకు. విరా. 2-195

అదియునుంగాక. విరా. 1-117

చ. అదియునుగాక కొలువులినైనను, విరా. 1-88

**అదీనము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉదారమైనది, దీనము గానిది.

వ. అనిన విని వృత్రుం డదీనంబులు నమృత స్వరూపంబులు నగు భవదీయ వచనంబులు వినికింజేసి విశుద్ధుండనైతి. శాంతి. 5-422

**అదీనుఁడు** సం. విణ. అ. పుం.

ఉదారుఁడు, దీనత్వము లేనివాఁడు.

క. ...అతఁ డ,దీనుండై యతని ఇత్రుదేశం బేసెన్. ద్రోణ. 1-168

**అదీపిత** సం. వి. ఆ. స్త్రీ.

అప్రకాశత్వము, వెలుఁగొందకుండుట.

క. స్వాపావస్థం బ్రకృతి క,దీపిత వాటిల్లినపుడుఁ దెలివెడలక.
శాంతి. 4-828

**అదీర్ఘసూత్రము** సం. విణ. (అ. ఆ. అ.)

దీర్ఘసూత్రము కానిది, చిరకాలము చేయుటలేనిది, తొందరగా నిర్వహించుట గలది.

వ. ఈ యుపాయంబులలో నెయ్యది యుచితంబును నవగత దోషంబును నదీర్ఘసూత్రంబును నగు నట్టి దానిం జెచ్చెర ననుష్ఠించునది. ఆది. 8-24

**అదుము** దే. స. క్రి.

1. నొక్కుఁ, క్రిందికిఁ ద్రొక్కిపట్టు.

క. జలజాక్షుఁడు గని పంచాం,గుళ మాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్. కర్ణ. 3-319

2. కప్పు, ఆచ్ఛాదించు.

వ. అని పయిచీరచెఱంగు మొగంబున నదిమికొని యేడ్చినఁ గృష్ణుండు వివిధ వాక్యంబుల నద్దేవిం దేర్చి. శల్య. 2-374

శ్లో. ఏవ ముక్త్వా తు వచనం ముఖం ప్రచ్ఛాద్య వాససా

పుత్రశోకాభిసంతప్తా గాంధారీ ప్రరురోదహ.

సం. భా. శ్లో. 68-69

3. అదల్చు-గద్దించు- మందలించు.

ఆ. ధర్మజుండు భీము దగువచనముల న,దల్చె నరు(డు మరియు(
దగ(డె పూజ, కాంబికేయు( డిట్టు లనకుము మనకు న,గ్రజుని
బనుపు సేత వ్రతముగాదె.

క. అని భీము నదిమి విదురుని(, గనుగొని. అశ్ర. 1-119

4. అడ(చు, నివారించు, పోగొట్టు.

క. ద్రౌపదియు సుభద్రయు సం,తాపం బందుదురు పాండుతనయులు
దలరన్, భూపాల భవజ్జనకుని, చూపందఱ మానసముల శోకము
నదుమున్. అశ్ర. 2-18

5. లో(బఱచుకొను, నిర్జించు.

సీ. నిజమహీమండల ప్రజ( బ్రీతి( బెంచుచు(, బరమండలంబుల ధరణి
పతుల, నదిమి కప్పంబులు ముదముతో( గొనుచును.

అది. 1-7; అది. 6-125

6. ఒత్తిపట్టు,

ఆ. ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా, మెదలుచున్న వ్రయ్య
లదిమి రెంటి(, గూడబట్టి నవియు( గూడి యొండొంటితో(, జక్క
నంటి రెండు నొక్క(డయ్యె. సభా. 1-147

అదురు(బ్రిక్క దే. వి.

పశురోగ విశేషము

వ. ఉంగిడి యదురు బ్రిక్క యగువానికి నా పేరు సెప్పినం జాలు.

విరా. 1-286

అదురు్చ దే. అ. క్రి.

అదురుచు- వడ(కు- చలించు,

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు గుంఠీభవ, త్కిర

ణుం డయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదర్చెన్ మహీధర సంతానములోలి గ్రక్కదరె. ద్రోణ. 4-377

**అదూష్యము** సం. విణ. (అ. ఆ. అ.)

నిందింపఁదగినది.

తే. ...మహాత్ములు దక్క నున్మార్గచరుల, దండితులఁ జేత వినమె యధర్మమడఁగు, ధర్మమెసఁగు దండము ననర్థంబు గామ,మును నదూష్యంబులై సిద్ధిఁ బొందు నధిప. శాంతి. 1-108

**అదృశ్య** సం. విణ. ఆ.

కనఁబడకుండఁ బోయినది, తిరోహితమైనది (స్త్రీ)

వ. అదియు నట్లచేయుదునని యదృశ్యయయ్యె. ఆది. 4-138

**అదృశ్యంతి** సం. వి. ఇ. స్త్రీ.

శక్తిభార్య, వసిష్ఠుని కోడలు- పరాశరమహర్షి తల్లి. ఆది. 7-128

**అదృశ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

మఱుఁగుపడినది, తిరోధానమైనది, తిరోహితమైనది.

వ. ఇంద్రాణియుం దోడన చని తదీయ తంతు మధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతిం గన్నంత నయ్యువక్రుతి నదృశ్యం బగుటయు. ఉద్యో. 1-171; అను. 2-828

(అదృశ్య-అని సం. ము. అకా. ప్ర-పాఠము)

2. కనఁబడనిది.

వ. వాఁడునుం బనిపూని యంబరతలంబున నదృశ్యాకారుండై వచ్చి నిలిచె. విరా. 2-111

**అదృశ్యుఁడు** సం. విణ. అ. పుం.

తిరోహితమైనవాఁడు, కంటికిఁ గనఁబడకుండ నున్నవాఁడు.

రథ సమేతంబుగా నా ఘటోత్కచుం డదృశ్యుండైన.

ద్రోణ. 5-225

**అదృష్టము** సం. విశ. (అ. ఆ. అ.)

1. చూడఁబడనిది-కనఁబడనిది.

వ. ప్రమథగణంబు లదృష్టాకారంబులై యమ్మహాత్ముని బరమాత్ముఁ గొలుచు చందంబున. సౌప్తి. 1-134

2. ఆముష్మికము.

వ. అదృష్టపూర్వంబైన భవదీయ రూపంబు గమంగొనం బడయుటం బ్రమోదంబును. భీష్మ. 1-219

వ. క్షమ విడిచి నీవు దృష్టాదృష్ట విరుద్ధంబైన క్రోధంబుఁ జేకొని సకల క్షమారక్షకుండైన పరీక్షితునకుం బరీక్షింపక శాపం బిచ్చి చెట్టచేసితివి. ఆది. 2-175

**అదృష్టిగోచరము** సం. విశ. (అ. ఆ. అ.)

కంటికిఁ గనఁబడనిది.

స్వప్నలబ్ధ పదార్థంబునుంబోలె నదృష్టి గోచరంబును. విరా. 2-295

**అదె** దే. అవ్య.

అదిగో, అల్లదె.

అదె పట్టువడియె ధర్మజుఁడు.

ద్రోణ. 1-210, ద్రోణ. 5-320 ఆశ్ర, 2-82.

**అదేహుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

1. దేహము లేనివాఁడు. 2 ప్రకృతి రహితుఁడు.

తే. ఇతఁ డబీజుం డదేహుం డనింద్రియుండు, వీత మానసుఁ డని యాత్మవిధము సెప్ప, వేదములు భవదుఃఖ కర్మాదిగములు నాతనికి లేవు నిర్గుణుం డగుటఁజేసి. శాంతి. 6-81; శాంతి. 4-237

**అద్వైవము** సం. వి. అ. న.

ద్వైవము గానిది.

క, ద్వైవంబు నద్వైవముగ నద్వైవము ద్వైవముగఁ జేయ ధరణి దివి

జుల్, ఘూవరశక్తులు వినువా, రేవానికిఁ గూర్తు రతఁ దధీశత
నొందున్. అను. 2-141

**అదోషము** సం. విణ. (అ. ఆ. అ.)

దోషము గానిది.

ఆ. మనము మోసపోయి యనిమిష పతి సూతి, తోడఁ బోడిచితిమి
యదోషవృత్తి నతఁడు సమయకాలమంతయుఁ గడచిన, వచ్చెనో
యెఱుంగవలయు నిజము. విరా. 5-372

**అద్దము** వై. (సం. ఆదర్శః-ప్రా. అద్దాఓ-త. అద్దం)

ముఖము చూచుకొనెడు గాజుబిళ్ళ, గాజుబిళ్ళ, దర్పణము.

క. పాపక్షయమున బోధం, బాపాదింపఁబడి మెఱుఁగు టద్దము
కరణిం, జూపునకు వచ్చు దనుఁదా, నా పురుషుఁడు గాంచుపనికినై
తన్మయతన్. శాంతి. 4-178

**అదిరా** దే. అవ్య.

కోపమును సూచించును.

సీ. అద్దిరా నీకు గ్రొవ్వఱుఁగ దేఁ జూతుఁగా, కని తలనూపక యడఁగు
వారు. విరా. 3-36

**అద్దు** దే. స. క్రి.

ముంచు.

చ. ...అంబరమునఁ బట్టినట్టి మలపంకము గారములోన నద్దఁగా,
విరిసినయట్లు, శాంతి. 8-364

**అద్భుతము** సం. వి. అ. పుం. న.

1. ఆశ్చర్యము.

వ. అయ్యవసరంబున వారందఱు మహాద్భుతం బంద. విరా. 1-184

విణ. (అ. ఆ. అ.)

2. ఆశ్చర్యకరము, వింతయైనది.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుత సంపద నొందు శక్తులం.
విరా. 3-168

సం. వి. అ. పుం.

3. ఒకరసము (నవరసములలో నొకటి)
తే. ...అచ్చర హృదయములకు. నద్భుతంబు బీభత్సంబు నావహింప,
సంగరాంగణ మతిఘోర భంగియయ్యె. కర్ణ. 1-177

**అద్భుతుఁడు** సం. వి. అ. పుం.

అద్భుతుఁ డను పేరుగల యొక అగ్ని– ఇతఁడు ఆపుఁ డనువానికి ముదిత యను కాంతయందు జనించినవాఁడు. అర. 5-168

**అద్యతనము** సం. విశే. (అ. ఈ. అ.)

నేఁటి కాలపుది.
ఉ. భావి పురాతనాద్యతన పార్థివ లక్ష్ములు పాండవేయు ల,క్ష్మి
విభవంబుతోడ నుపమింప సమంబులు గావు. సభా. 2-114

**అద్యతనుఁడు** సం. విశే. అ. పుం.

నేఁటి కాలపువాఁడు.
క. విద్యామయ షడ్వంశుఁడు, విద్యావిద్యావిభేద విరహితుఁ డజరుం
డార్యుఁ డనంతుఁ డచ్యుతుఁ, డద్యతనుఁ డనాది కేవలాత్మకుఁ
డరయన్. అను. 4-229

**అద్రి** సం. వి. ఇ. పుం.

కొండ.
సీ. రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చు నద్రులు, భయమున వాపోవు
భంగినుండఁ... విరా. 3-156

**అద్రిక** సం. వి. ఆ. స్త్రీ.

ఒకానొక అప్సరస, చూ. వివరము. ఆది. 8-31, 32, 38

**అద్రిధరుఁడు** సం. వి. అ. పుం.

వాసుదేవుఁడు, శ్రీమన్నారాయణుఁడు, మందరగిరిని దాల్చినవాఁడు,

గోవర్ధన పర్వత మెత్తినవాఁడు.

క. వినుత త్రివర్గనిరతులు..నమస్కార్య అద్రిధర విను వాకున్.
అను. 2-184

**అద్రుచు** దే. అ. క్రి.

అదురుచు, కంపించు, వడఁకు.

తే. తాను మున్నుగ శాత్రవసేన మీఁద, రథము లొక్కటఁ బఱపిరి
పృథివి యద్రువ. విరా. 3-211

**అద్రోహము** సం. వి. అ. పుం.

అహింస.

క. కోపంబులేమి సత్యాలాపము నిజదార పరవిలాసము శుచితా,
గోపన మద్రోహం బవనీ పాలక సర్వవర్ణ నియత గుణంబుల్.
శాంతి. 2-221

**అద్రోహుఁడు** సం. విశే. అ. పుం.

కీడు చేయనివాఁడు (మేలు చేసిన వానికిఁ గీడుచేయనివాఁడు)

క. తగునే యిట్లు కృతార్థుఁడ, వగు నీ కురిగొలుక కిట్టు లాలస్యము
నేఁ, తగదా కృతమ్నులకు నెం,వగు టొప్పనె కొలుకు కడఁక
నద్రోహుఁడవై. శాంతి. 3-212

**అద్వయుఁడు** సం. వి. అ. పుం.

శ్రీమన్నారాయణుఁడు, తనతో సమానమైన రెండవవాఁడు లేనివాఁడు,
అసమానుఁడు.

క. పరముండు నిరంజనుఁ డజరుఁ డజరుం డద్వయుండు శాశ్వతుఁ
డగు. శాంతి. 6-602; అను. 1-386

**అద్వారము** సం. వి. అ. న.

ద్వార వ్యతిరిక్త ప్రదేశము, ద్వారముగాని చోటు.

వ. ద్వారంబున మిత్రనివాసంబును, నద్వారంబున నమిత్ర నివాసం
బును జొచ్చుట యిది బాహువీర్య సంపన్నులయిన క్షత్రియులకుం

గ ర్తవ్యంబు. సభా. 1-184

**అద్వైతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. రెండు విధములు కానిది, ఒక్క రూపైనది

శా. ...కృష్ణ ద్వైపాయను సీవెఱుంగుము విభున్ నారాయణుంగా
...ధర్మాద్వైతుండు తద్వాచ్యుఁడే. శాంతి. 6-476

2. భేదము లేనిది.

శా. కృష్ణ ద్వైపాయనుఁ డర్థిలోకహిత నిష్ఠంబూని కావించె ధర్మా
ద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.
విరా. 1-3

**అధఃకరించు** సం. స. క్రి.

తిరస్కరించు, నిందించు, అవమానపఱచు.

వ. మన్నవగల మానిని యగుట నంగరాజునకు సంగర పాటవంబు
మాటలు దగుఁగాక మాన్యుల నధఃకరింప నగునె.
విరా. 4-220, ఉద్యో. 1-192

**అధఃపాతము** సం. వి, అ. పుం.

అధోగతి, కిందుపాటు, నరకము.

వ. అతండు (ఉపరిచర వసువు) దేవతా పక్షపాతంబునఁ బశు విశస
నంబు గ ర్తవ్యం బని పలికి యధఃపాతంబు ప్రాపించెం గావున
హింసారహితంబయిన యజనంబు పూజనీయంబు. అశ్వ. 4-258

**అధనత** సం. వి. ఆ. స్త్రీ.

దారిద్ర్యము.

క. ధనవత్త్వము దుఃఖకరం, బని కని తత్కాంక్ష విడుచు నతని కధ
నతా, జనితాత్మాధీనత్వం, బనుపమ సౌఖ్యంబు సేయు నతీఁణము
గన్. శాంతి. 4-38

**అధనుఁడు** సం. విణ. అ. పుం.

దరిద్రుఁడు. డబ్బు లేనివాఁడు.

జగంబున ధనవంతులు నధనులుం గలిగి యుందురు. శాంతి. 4-82

**అధమత్వము** సం. వి. అ. న.

నీచత్వము, నైచ్యము.

వ విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్త మాధమత్వ నిరూపణంబు సేయుఁడు చూతమని. శాంతి. 3-452

**అధమము** సం. విశే. (అ. ఆ. అ.)

తక్కువైనది - నీచము.

చ. అనుటయు నంత్యజుండు నగి యట్టి విధం బధమంబు గాక నెట్టన యది ధర్మమే శాంతి. 3-294

**అధముఁడు** సం. విశే. అ. పుం.

1. నీచుఁడు, తక్కువవాఁడు.

క. నా యనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తిలేక మిగిలి మెలఁ గెనే, నా యధముని దండితుఁగాఁ, జేయుదు నతఁడెంతయుం బ్రసిద్ధుం డయినన్. విరా. 1-201; కర్ణ 2-112

2. ద్రోహి.

వ భవదీయ రాజ్యలక్ష్మి మధురభంగి యయ్యును, నధములగు వారి యుక్తుల వలనం జోరజన సంవృతంబైన కావేరియుం బోలె నుపయోగ్య గాకునికి. శాంతి. 2-368

**అధరము** సం. విశే. (అ. ఆ. అ.)

క్రిందిది.

వ. జగజ్జన సంత్రాసన వ్యగ్ర సంచలనంబైన దీర్ఘజిహ్వా వధరోష్ఠ పుటంబు వాకుచు. అర. 3-195

**అధరితము** సం. విశే. (అ. ఆ. అ.)

క్రిందు పఱుపఁబడినది, తక్కువ పఱుపఁబడినది. ఆది. 5-15

**అధరోష్ఠము** సం. వి. అ. పుం.

క్రింది పెదవి. చూ. అధరము.

**అధర్మజ్ఞుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ధర్మము తెలియనివాఁడు.

వ. విను నీ తనయులు దుర్యోధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు.
అను. 5-459

**అధర్మత** సం. వి. ఆ. స్త్రీ.

ధర్మము లేకుండుట.

ఉ. ...అభిమన్యు బాలుని నధర్మతఁ బ్రౌఢు లనేక యోధు లొ,క్కం
డన కెట్లు చంపిరి. శల్య. 2-108

**అధర్మము** సం. వి. అ. పుం.

1. అన్యాయము, అవినీతి, ధర్మవ్యతిరిక్తమైనది.

వ. చంద్రుండు...రోహిణి రూపాతిశయవతి యగుటం జేసి తదా
సక్తుండై న, దక్షాదివారు వగనొంది తండ్రి కడకుం జని చంద్రుని
యన్యాయం బెఱింగించిన నా ప్రజాపతి చంద్రునితో నుగ్గడించి
యిది చాల నధర్మం బింక నిట్లు సేసితేని శపింతు. శల్య. 2-148

2. దోషము, పాపము.

క. జననిందితమయి నీయం,దనపత్యతయను నధర్మమది యుండఁగ.
సభా. 2-48

**అధర్ముఁడు** సం. వి. అ. పుం.

వరుణుని కూఁతురై న సురయను దాని కొడుకు. ఆది. 8-71

**అధర్మువు** సం. వి. అ. పుం. న.

అధర్మము.

తే. ...నీవు భ్రాతృత్వ సౌహృ,దమునఁ గర్మంబు విడుచుట ధర్మ
వనిన. శాంతి. 1-189

**అధశ్శయనము** సం. వి. అ. న.

నేలపైఁ బరుండుట, క్రింద బండుకొనుట.

వ. బ్రహ్మచర్యంబునై యథశ్శయన మాచరించుచు.

శాంతి. 1-304

**అధస్, అధః** సం. అవ్య.

క్రింద, దిగువ. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

క. బ్రహ్మచర్యంబునై యధశ్శయన మాచరించుచు. శాంతి. 1-304

**అధార్మికుఁడు** సం. వి. అ. పుం.

ధార్మికుఁడు గానివాఁడు, అవినీతి గలవాఁడు, ధర్మము ప్రకారము నడువనివాఁడు.

క. ధర్మంబు కలఁకఁగాంచి య,ధార్మికులం బొలియఁజేసి.

అశ్వ. 3-43

**అధి** సం. అవ్య.

తెలుఁగునందు దీనికి వ్యస్తప్రయోగము లేదు. ఇది క్రియలకును విశేష్యములకును ముందుఁజేరి యీ యర్థములిచ్చును.

1. అధికము.

అధీశ్వరుఁడు విరా. 3-151; అధిరాజ్యము అను. 5-484; అధికమతి అర. 1-59.

2. ముఖ్యము, సర్వోన్నతి.

అధిదేవత విరా. 4-183; అధిదైవతము విరా. 1-175.

3. మీఁద, పైని.

1. అధికారము శాంతి. 1-378; 2. అధిరోహణము కర్ణ. 1-75.

4. శబ్దార్థమునే రూఢి పఱచును.

1. అధివాసము అను. 2-359; 2. అధిష్ఠానము ద్రోణ. 5-417.

5. సంబంధమును దెలుపును.

1. అధ్యాత్మము ఉద్యో. 2-106; అధిగమము అశ్వ. 2-184.

**అధిక** సం. విణ. (అ. ఆ. అ.)

అధికురాలు, ఎక్కుడైన స్త్రీ.

ఆ. అంబ గౌరవమున నధిక యగుట. శాంతి. 5-274

**అధికత** సం. వి. ఆ. స్త్రీ.

ఆధిక్యము, గొప్పదనము.

క. భీముని సుయోధనుని సం,గ్రామంబు తెలంగఁ జూడఁగా నెవ్వఁడి
యం,దే మేన నధికతఁ దోఁచెడి. శల్య. 2-268

**అధికత్వము** సం. వి. అ. న.

గొప్పదనము, ఆధిక్యము.

క. ...అధిక,త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు,రిమ్మెయిఁగని యట్టి
వార లిభపురనాథా. ఉద్యో. 2-84

**అధికమతి** సం. వి. ఇ. పుం.

గొప్ప మనస్సు గలవాఁడు, బుద్ధిమంతుఁడు.

ఆ. కార్యగతుల తెఱఁగు కల రూపునెప్పిన, నధికమతులు దాని
నాదరింతురు. అర. 1-69

**అధికము** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఆదనము, ఎక్కువ.

ఉ. పావనిమెయిలావు పెద్ద కురువల్లభుఁ డారయఁ గౌరవంబు
పెం,పు నధికుండు దత్పరతఁ బూని శ్రమం బధికంబు సేయుటల్-
శల్య. 2-269

2. ఎక్కువయైనది.

క. ...అమ్మనుజేంద్ర చంద్రు నధికౌత్సుక్యం,బున కలిమికి.
విరా. 1-45

**అధికరణము** సం. వి. అ. న.

ఒకచే విషయమును జర్చించి నిర్ణయించు వేదాంత విషయ భాగము-
ఒకచే విషయమునకు సంబంధించిన విషయ విభాగము- మీమాంసక
మతము ననుసరించి యది యైదు అంతర్విభాగములు గలది. (అంతర్విభా
గము అవయవ మనఁబడును)

తే. ఏకాధికరణ, మస్ఖలితముగ మదినది యలవరించి. అను. 5-224

అధికరణావయవములు :
1. విషయము = వివరింపఁ దగిన యంశము 2. విషయము లేక సంశయము = ఆసంశయముపై గలుగు ననుమానములేక ప్రశ్నము 3. పూర్వపక్షము = సిద్ధాంతమునకు వ్యతిరేకమగు మొదటి పాదము. విషయ నిర్ణయమున కడ్డువచ్చు మొదటి పాదము. 4. ఉత్తరపక్షము = పూర్వపక్ష వాదమునకుఁ బ్రత్యుత్తరము. 5. సిద్ధాంతము లేక నిర్ణయము విషయముయొక్క ఫలితాంశము.

వేదాంతుల మతమున కధికరణ భాగములు 1. విషయము 2. సందేహము 3. సంగతి 4. పూర్వపక్షము 5. సిద్ధాంతము.

**అధికార పురుషుఁడు** సం. వి. అ. పుం.

రాజకీయోద్యోగి.

వ. ...వంచకులైన యధికార పురుషులకు నేర్పుమైఁ గ్రమంబునఁ బరస్పర విరోధంబు గలిగించి సంప్రీతి సెఱిచి నీ వలసిన ట్లొకనొకని దండింపుమని. శాంతి. 2-366

**అధికారము** సం. వి. అ. పుం.

1. అధ్యక్షత- పై యధికారిగానుండి చూచుట.-పెత్తనము.

వ. ... మఱియుం గరణీయంబులగు నధికారంబుల నెల్లను గల్పించి వారల మీఁదన పెట్టి. శాంతి. 1-378

2. దొరతనము, రాజకీయ పదవి.

ప్రజా సంహారంబు సేయ నధికారంబు పూనె. శాంతి. 1-213

3. విధ్యుక్త ధర్మము.

ప్రజ్ఞ యుత్తమాధికారంబని విని ధర్మ తనయుండు. శాంతి. 4-69

**అధికారి** సం. విశ. (న్-ణీ-న్)

1. అధికారము గలవాఁడు మఱి సంబంధమైన కార్యముల నిర్వహించుట యందు యోగ్యత గలవాఁడు.

క. ...అర్పితంబగు నగ్నిన్, దాని యధికారి ధౌమ్యుం, దాము ప్రదక్షిణ విధాయతం గొలిచి తగన్ అశ్వ. 3-140

2. రాజకీయోద్యోగి.

క. ఆ రాత్రి యవ్విభుని యధికారులు సంపి రోక భంగిఁ గాకము
శాంతి. 2-365

**అధికుఁడు** సం. విణ. అ. పుం.

గొప్పవాఁడు, మించినవాఁడు.

అధికుండగు నప్పాండవ మధ్యముం గనుగొని. విరా. 5-144

తే. ఉమయు గంగయు నుండ నన్ను, గారవంబున నధికునిఁగాఁ దలంచి. శల్య. 2-179

**అధికృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అధికారమునం దేర్పఱుపఁ బడినవాఁడు.

వ. అర్థంబులయం దధికృతులైనవారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు. అర. 1-218

**అధికృత్యము** సం. వి. అ. న.

అధికారము.

నిత్యాధికృత్యా. శాంతి. 6-624

**అధిక్షేపించు** సం. స. క్రి.

1. ఆక్షేపించు, తూలనాడు.

వ. దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింపవచ్చు నఁటియు శంక దేవదానవులకయినను దుర్జయుండగు నర్జుననకుం దలనూవ వచ్చునే. విరా. 4-195

2. ధిక్కరించు, తృణీకరించు.

వ విశ్వామిత్రు పౌత్రుండైన పరావసు పను రాజు దుర్వినీతుండై గర్వోద్రేకంబునం బరశురాము నధిక్షేపించి రాజులకు వెఱచి డాఁగి యున్నవాఁడవని. శాంతి. 2-84

**అధిగతము** సం. విశ. (అ. ఆ. అ.)

ఎఱుఁగఁబడినది, తెలుసుకొనఁబడినది.

వ. సత్యవతీ సుతుండు సాంఖ్యయోగశాస్త్రంబు లతనికి నధిగతంబులు గావించె. శాంతి. 6-256

**అధిగమము** సం. వి. అ. పుం.

పొందుట, పడయుట.

తే. ... నిత్య వస్తు, సమ్యగధిగమ సిద్ధికి సంయమ ప్రసిద్ధు లాగమ తంత్ర ప్రసిద్ధులార. అశ్వ. 2-184

**అధిగమించు** సం. స. క్రి.

1 చేర్చు.

వ. ఆ గ్రంథం బధిగమించి. శాంతి. 2-203

(అధికరించి- అని పాఠాంతరము)

2. పొందు.

వ ఒక ముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపున కిచ్చె. శాంతి 3-449

3. తెలిసికొను.

సీ ...సర్వంబు,నందును నా తత్త్వ మధిగమింప, నగు. అను. 1-378

సీ గంధంబు ఘ్రాణంబ కాని తక్కిన యారు నధిగమింపఁగ నోవ వధిగమించు, రసము జిహ్వయ. అశ్వ. 2-29

**అధిజ్యము** సం. విశ. (అ. ఆ. అ.)

మోపెట్టినది, ఎక్కిడినది.

ఉ. ఆ సహుసాత్మజుండగు యయాతి యధిజ్య ధనుస్సహాయుఁడై. ఆది. 3-189

**అధిదేవత** సం. వి. ఆ. స్త్రీ.

అధిదైవము, అధిష్ఠించియుండు దేవత.

వ. అమహాత్ముండు నియతాత్ముండయి యధిదేవతలకుం బ్రణమిల్లి. విరా. 4-163

వ. నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక యగ్ని యధిదేవత గురుండు రుద్రుండు. శాంతి. 8-449

**అధిదైవతము** సం. వి. అ. న.

అధిదైవము, అధిష్ఠించియుండు దేవత.

తే. ...ఒక్క, విపులశాఖ నాయుధములు వ్రేలఁగట్టె.

వ. ఇట్లు గట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. విరా. 1-174. 175

**అధిదైవము** సం. వి. అ. న.

1. అధిష్ఠించియుండు దేవత.

సీ. అధిభూతములు వాని కధిదైవములు వరుసన విష్ణుమిత్ర ప్రజాపతులును. శాంతి. 6-90

2. సర్వాధిపతియగు పరమేశ్వరుఁడు.

వ. ఆత్మజ్ఞు లధికులు వారలు సర్వధర్మవిదులు సత్యసంకల్పులు నధిభూతాధిదైవ వేదులు. శాంతి. 5-99

**అధినాథుఁడు** సం. వి. అ. పుం.

1. అధిపతి, భర్త.

క. అసి రచనా కౌతుకమున, మనమలరఁగ నీ ప్రబంధమండలి కధినాథుసేఁగా నే పురుషునిఁ జేర్కొనువాఁడనొ యను తలంపు గూరిన మదిలోన్. విరా. 1-8

2 ప్రభువు, సర్వాధికారి.

చ. అమరాపగాతనయుతోడి రణంబునకున్ దిశాధినాథులు నలు మంగఁజాలరని శోచుచునున్నది నా మనంబునన్. భీష్మ. 2-6

**అధిపతి** సం. విశే. ఇ. పుం. (స్త్రీ, ఇ. త్రి-నపుం-ఇ.)

ప్రభువు

సీ. అనుదినంబును నంతకంతకు బెరిగెడి, యధిపతి మన్నన యప్పుఁడీర్చు. విరా. 4-205

**అధిపాలుఁడు** సం. వి. అ. పుం.

ప్రభువు.

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురు. ఉద్యో. 1-205

**అధిపుఁడు** సం. వి. అ. పుం.

ఏలిక, ప్రభువు.

ఆ. అట్టి నీవు విరటు నెట్టి చందంబున, ననుచరించువాఁడ వధిప
చెపుమ. విరా. 1-67

**అధిభూతము** సం. వి. అ. న.

సర్వభూతముల యందుండు పరమాత్మ.

వ. వారలు సర్వధర్మవిదులు, సత్యసంకల్పులు నధిభూతాధిదైవఁ
వేదులు నగుదురు. శాంతి. 5-89

**అధిమాసము** సం. వి. అ. పుం.

అధిక మాసము, సంక్రాంతి శూన్యమగు మాసము.

చాంద్రమానమునందు ( చైత్రాది మాసములందు ) ఏ మాసము సూర్యునియొక్క సంక్రమణము లేకయున్నదో అనఁగా సౌరమానము (మేషాది మాసములు) ప్రారంభము కానేరదో అనఁగా శుక్లపాడ్యమి మొదలు అమావాస్యవఱకు సూర్యుఁడున్న రాశికి చలనము లేదో ఆ మాసము అధికమాస మనఁబడును.

లోఁగడ వచ్చిన అధిక మాసము మొదలు ముప్పది మాసములకు పైన 8 వ మాసముగాని 9 వ మాసముగాని అధికమాసముగా వచ్చును. ఇది మూఁడు సంవత్సరముల కొక పర్యాయము (మూడవ సంవత్సరమున) వచ్చుట సంభవించును.

సీ. రెండవయేట నొక్కండు డధిమాస మి,ట్లెక్కిన యన్నెల లెల్లఁ
గూర్చి,కొనఁ బదమూఁడు హాయనములు దప్పక నిన్నటి తోడన
నిండె. విరా. 4-232

**అధిరథుఁడు** సం. వి. అ. పుం.

కర్ణుని పెంపుడు తండ్రి, సూతుఁడు, అతిరథుఁడు. చూ. అతిరథుఁడు.

వ. రాధయు నధిరథుండును నాకు జాతకర్మాది సమస్త సంస్కారం
బులు నిజకులోచితంబుగా నాచరించిరి. ఉద్యో. 4-86

**అధిరాజ్యము** సం. వి. అ. న.

గొప్పరాజ్యము, చక్రవర్తిత్వము.

మాలిని. మంత్ర గీతాధిరాజ్యా, అను. 5-484

**అధిరూఢుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. వృద్ధిపొందినవాఁడు.

తే. వినుము ప్రజ్ఞాధిరూఢుండై వనట దక్కి, సంసృతి క్లేశపరుల
భూస్థలిఁ జరించు, వారి నచలంబుమై నున్నవాఁడు సూచు, నట్ల
చూచుట సూవె నే ర్పమలహృదయ. శాంతి. 1-129

2 ఎక్కినవాఁడు.

ఉ. అంచిత వాహనాకలిత యానముఁ దేరఁగఁబంచి నన్ను నెక్కించి
సహాధిరూఢుఁడయి కేల్ దనకేల నమర్చి. అను, 2-456

**అధిరోహణము** సం. వి. అ. న.

ఎక్కుట.

ఉ. దంతిఘటల్ మహోగ్ర సముదగ్రతతో నడతేర దర్ప దుర్దాంత
గజాధిరోహణ నితాంత సముజ్జ్వల భంగి. కర్ణ. 1-75

**అధివాసము** సం. వి. అ. పుం.

నివాసము, ఉనికిపట్టు.

చ. ఇతరుల దానిమేనిఁ దమ యీగియ యేనిని నన్ను మార్తురే,
మతి నరకాధివాసగతి మాన్పఁదలంచుట గల్గినన్. అను. 2-359

**అధిష్ఠాత** సం. విశే. (బు-త్రీ-బు)

అధ్యక్షుడు, నియామకుఁడు, నియమించువాఁడు.

సీ. ...ధర్మాత్మజుం, డేరి కధిష్ఠాత వారు ధర్మ-తే-పథము దప్ప
దురే. విరా. 4-232

**అధిష్ఠానము** సం. వి. అ. న.

1. ఉనికిపట్టు, వాసస్థానము.

క. వారలు లింగాధిష్ఠానారూఢుంగా నొనర్చి యర్చించిరి.
ద్రోణ. 5-417

2. ఆశ్రయము, ఆస్పదము.

తే. గోపులకు బ్రాహ్మణులకును గులమొకండ, కమలజుండు రెండు
దెఱంగులగా నొనర్చె, హవికిఁ బూర్వంబు గారణ మఖిల మంత్ర,
ములకధిష్ఠాన మపరంబు భూపవర్య. అను. 2-278

3. స్థానము.

తే. వినుము ఘ్రాణాదికములైదు, మనసుబుద్ధి, యొక యధిష్ఠానమున
నుండియును నెఱుంగ, వబల యొండొంటి విషయంబు నలమి
కొనఁగ, ననిన వివరింపు మా తెఱం గనియె నింతి అశ్వ. 2-27

4. నియమము.

తే. ఎదురులేక దివ్యాస్త్రంబు లిట్లు నీకుఁ గాడియే ప్రయోగింపఁ
బాండుపుత్త్రి, సిద్ధమిది యధిష్ఠానవర్జితము లయ్యె,నేని మూఁడు
లోకములు దహించు మాత్ర. అర. 4-96

**అధిష్ఠించు** సం. స. క్రి.

అధివసించు, నివాసము చేసికొనియుండు.

చతుర్వింశతి తత్త్వంబుల నధిష్ఠించియుండు తత్త్వంబు.
అను. 4-179। అశ్వ. 8-146

**అధిష్ఠితము** సం. విశ. (అ. ఆ. అ.)

1. నియంత్రితమ్ము, కూర్పఁబడినది.

వ. దైవాధిష్ఠితంబైన సంతానంబు నీకు ధర్మానిలశక్రాశ్వినుల
వరంబున నగు. ఆది. 5-76

2. అవలంబింపఁబడినది, పూనఁబడినది.

వ. అని పునర్వనవాసకరణంబు దోఁపనాడిన నవ్వి యుధిష్ఠిత సత్య

ప్రవతుండయిన యుధిష్ఠిరు డతని కిట్లనియె. విరా. 5-369

3. ఆశ్రయింపఁబడినది. నివాసముగాఁ జేసికోఁబడినది.

క. వ్యక్తసప్తధార మవ్యక్తనాభంబు, షోడశకవికార సుపరిమండ, లంబు ధ్రువ మధిష్ఠితం బాత్మచేతఁ జక్రఁబు దిరుగుచుండుఁ గాలవశత. శాంతి. 4-279

4. నిలువఁబడినది- ఉంచబడినది.

వ. నాకు నుదృవిల్లెడు పుత్రుండు పక్షి కులంబున కెల్ల నింద్రుం డయ్యెడు మని కశ్యపుండు వారల నొడఁబఱిచి నీ యింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసె ఆది. 2-88

వ. ఇక్కుమారులు కురుకుల నిస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిర భీమార్జుననకులసహదేవు లనంగా దేవాధిష్ఠిత నామంబులు దాల్చి ఆది. 5-156

5. గ్రహింపఁబడినది, అధీతమైనది.

ఏను భవదధిష్ఠిత విద్యాప్రభావంబున. అర. 4-52

**అధిష్ఠితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అధిష్ఠింపఁబడినవాఁడు, ఆశ్రయింపఁబడినవాఁడు.

వ. అయ్యహంకారాధిష్ఠిత పురుషుండు గబళించు నయ్యహంకృతి నవ్యక్తంబు లోఁగొను. శాంతి 6-88

**అధీతి** సం. వి. ఇ. (స్త్రీ).

చదువుట, అధ్యయనము.

సీ. ...వేదాధీతి తపముల నాచరించె-ఆ-నేతి మఱయు లోకహీనా త్ముఁడగు. అను. 3-272

**అధీనత్వము** సం. వి. అ. న.

వశము,

క. దనవత్త్వము దుఃఖకరం, బని కని తత్కాంతు విడుచు నతని కథ నతా, జనితాత్మాధీనత్వం, బనుపమ సౌఖ్యంబు సేయు నక్షీణము గన్. శాంతి 4-88

**అధీనము** సం. విశే. (అ. ఆ. అ.)

1. వశమైనది.

ఉ. ...కర్ణ సౌ బలా,ధీనము కార్య నిశ్చయము. ఉద్యో. 2-8

వ. అంతకు మున్న దుశ్శాసన రక్తపాన కౌతుకాధీన మానసుండైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడియుండి. కర్ణ. 3-228

2. స్వాధీనమందున్నది.

క యముని యధీనం బిది దుఃఖముల ననేకముల, జేయఁగానోపు. స్త్రీ. 1-60

**అధీనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. బద్ధుఁడు, కట్టబడినవాఁడు.

క. ...ఏ నపుడు ధర్మపాశాధీనుఁడనై. విరా. 5-91

2. వశమైనవాఁడు, లోబడినవాఁడు.

వ. మదంబు మిగిలి మన్మథాధీనుండై వర్తిల్లు సమయంబున. ఉద్యో. 1-148

క. ...అజ్ఞానంబున, యవిరతి విరతుల యధీనుఁ డగు టాత్మునకున్. శాంతి. 4-184

**అధీయానుఁడు** సం. వి. అ. పుం.

అధ్యయనము చేయువాఁడు. చదువుకొనువాఁడు.

క. అనధీయానుండితఁ డనఁ,జను బుద్ధిజునట్ల చూచె సంరతా కల్పన హీనుఁడైన నృపుఁడని, మనువు పలికెఁగాదె. శాంతి. 2-192

**అధరత** సం. వి. ఆ. స్త్రీ.

ధీరత్వము లేకపోవుట.

ఉ. ...నీ విటుల ధీరతఁ బూనికి దప్పినన్. భీష్మ. 2-160

**అధీరత్వము** సం. వి. అ. న.

ధీరత్వములేమి.

మ. ...పౌరుషము మైఁ జూపొండె గెల్పొండెఁ గాక యధీరత్వము నాకు నీడె. కల్య. 2-61

**అధీరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

పిఱికివాఁడు.

ఉ. ...నీయట్టి దురాత్ములుం గలరె యంత యధీరులె ధారుణీ పతుల్. సభా. 2-40

**అధీశత** సం. వి. ఆ. స్త్రీ.

అధిపత్యము.

క. దైవంబు నదైవము గన,దైవము దైవముగఁ జేయ ధరణీ దివి జుల్, భూవర శక్తులు వినువా,రేవానికిఁ గూర్తు రతఁ డధీశత నొందున్. అను. 2-141

**అధీశుఁడు** సం. వి. అ. పుం.

1. ప్రభువు.
సీ. మత్స్యదేశాధీశు మఱఁదిఁ గీచకుని. విరా. 3-88

2. అగ్రణి, సేనాపతి.
తే. కార్తికేయుం డధీశుఁడుగా నమర్త్య, వెలమిఁ బురికొని దైత్యుల గెలుచుకరణి. కల్య. 1-80

**అధీశ్వరుఁడు** సం. వి. అ. పుం.

ప్రభువు.
మ. దివిజాధీశ్వరు పాలికిం జని. ఉద్యో. 1-189

**అధృతి** సం. వి. ఇ. స్త్రీ.

అధైర్యము.
క. స్నేహార్ణవ మగ్నుండయి, దేహి మహాదుఃఖముల నధృతిఁబొందును ఆర. 1-28

**అధోక్షజుఁడు** సం. వి. అ. పుం.

చావు పుట్టుకలు లేనివాఁడు, విష్ణువు.

క. కాత్త్వికంబైన నాకు జాతత్వ వికృతి, లేమి నజుఁడనియును నది లేకపోయి,నపుడు తదనంతరక్షయమందకునికి, బుధు లధోక్షజుఁడనియుఁ జెప్పుదురు నన్నుఁ. శాంతి. 6-432

**అధోగతి** సం. వి. ఇ. స్త్రీ.

1. పాపలోకము, నరకము.

వ. ఆ సాపాత్ములు దమలోనం గలహించి యొండొరుల వధియించి యందఱు నధోగతిం జెందిరి. ద్రోణ. 2-194; అను. 2-62

**అధోగతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

నరకమును బొందినవాఁడు.

వ. దిలీపుండును దనపితామహులైన సాగరు లధోగతులు కాకుండ. అర. 3-73

**అధోనీవి** సం. వి. ఈ. స్త్రీ.

ముట్టుత, రజస్వల (క్రిందికి పోకముడి లేక అవిక ముడివేసిన స్త్రీ.)

వ. ...అక్కోమలి ప్రాతికామి పిలుంద నేక వస్త్రయు నధోనీవియు నగుచు సభకుం జనుదెంచి. సభా. 2-212

**అధోముఖము** సం. విణ. (అ. ఆ, ఈ. అ.)

క్రింది వైపు ముఖము గలది, తలక్రిందైనది, వ్యత్యస్తము.

సీ. .....తమం బెలుఁగలి యధికంబైన, స్రోతస్సధోముఖస్రుతి రజస్సు -అ- పెరిఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు. అశ్వ. 2-125

**అధోముఖుఁడు** సం. విణ. అ. పుం.

క్రిందివైపు ముఖము పెట్టినవాఁడు, తలక్రిందుగా వ్రేలాడువాఁడు.

వ. వాఁ (అగస్త్యుఁడు) డొక్క నల్లికి పల్లవంబున నధోముఖులయి వ్రేలుచున్న తన పితరులం జూచి యివ్విధంబున మీకున్న కారణం బేమి యని యడిగినఁ బితరు లిట్లనిరి. అర 2-321

**అధోలోకము** సం. వి. అ. పుం.

పాతాళలోకము, భూలోకమునకుఁ గ్రింది లోకము.

వ. దుర్యోధన దుశ్శాసన కర్ణశకుని సైంధవ ప్రముఖులగు దుష్ట లోకంబు నధోలోకంబున కనుచు నంతకు. విరా. 2-235

**అధోలోకమున కనుచు** జాతి.

పాతాళ లోకమునకుఁ బంపు, చంపు, సంహరించు.

చూ. అధోలోకము.

**అధ్యక్షము** సం. వి. అ. న.

ప్రత్యక్ష జ్ఞానము, పరిపాలించుట, ఆధిపత్యము.

సీ. ఆయుధాగార ధనాధ్యక్షముల యందు, వరవాజి వారణావళులం యందు, బండారముల యందుఁ బరమవిశ్వాసుల, భక్తులఁ బంచి తయ్య. సభా. 1-46

**అధ్యక్షుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

1. పనులు గనిపెట్టి చూచువాఁడు.

వ. భూపతి ప్రేయసీ జనంబుల కధ్యక్షులగు వృద్ధకంచుకులం గలసి. శల్య. 2-22

సం. వి. అ. పుం.

2. అధిపతి, నియంత.

సీ. ...అవ్విష్ణు నధ్యక్షునెల్ల -అ- లోకములకు. అను. 5-320

**అధ్యయనము** సం. వి. అ. న.

1. వేదమును జదువుట, గురుముఖమున వేదమును జదువుట.

ఆ. బ్రాహ్మణునకు దమము పరమ ధర్మంబవశ్యంబుఁ గృత్య మధ్య యనము దావ, సర్వకర్మములును శాసితంబులు వాని, నడవ వలయు నిష్ఠ యెడపకతఁడు. శాంతి. 2-222; ఆది 8-84

వ. విప్రుఁడు...ఆచార్యుపాల నధ్యయనంబు చేసి. శాంతి. 5-80

2 చదువుట.

చ. అనుడు దయార్ద్రచిత్తుఁడగు నప్పరమేశ్వరుఁ డక్కిరీటి కిట్లనుఁ దపమాచరించి నిగమాధ్యయనం బొనరించి కానరా, దనఘ మదీయ దివ్యపరమాకృతి. భీష్మ. 1-220

**అధ్యయనశూరుఁడు** సం. వి. అ. పుం.

వేదమును జదువుటయందుఁ బ్రౌఢుఁడు.

వ ఇట్లు మాతుల భాగినేయు లిద్దఱు సవయస్కులై పెరిఁగి పంద్రెం డేండ్లొక్కట నుద్దాలకుతోఁ జదివి యధ్యయన శూరులై రందు.

**అధ్యవసాయి** సం. విశ. (న్-నీ-న్)

పూనిక గలవాఁడు.

చ. ఆయనయ సంగ్రహుండు, వినయాధ్యవసాయి. అర. 6-218
(వినయ వ్యవసాయి అని కొన్ని ప్రతులు)

**అధ్యాత్మికము** సం. అవ్య. అ. న.

ఆత్మ సంబంధమైనది.

వ. అప్పౌరవోత్తముం డయ్యుత్తమ బోధనిధికి నమస్కరించి యధ్యాత్మిక విద్యాబోధక ప్రకారంబులగు వాక్యసంచయంబులు.
అను. 4-165

**అధ్యాత్మ దర్శనము** సం. వి. అ. న.

ఆత్మ జ్ఞానమునకు సంబంధించిన శాస్త్రము, చతుర్వింశతి తత్త్వావలోకనము. అశ్వ. 2-110

**అధ్యాత్మము** సం. అవ్య. అ. న.

1. ఆత్మ సంబంధమైన జ్ఞానము.

మ. అతి గుహ్యంబిది నీవు భూరికృప నీయధ్యాత్మముం గానఁ జేసితి నాకిమ్మెయి విన్కిఁగొంత భ్రమవాసెన్. భీష్మ. 1-206

2. ఆత్మస్థ స్వభావము, (బహు) సంబంధియున్న స్వస్వభావము.

సీ. పాదపాయూపస్థ పాణివాక్కులు విను మధ్యాత్మములు దత్క

మానుయుక్తి, గంతవ్యములు నిసర్గంబు నానందంబు...చక్షువు జిహ్వాయు ఘ్రాణంబుఁ ద్వక్కు శ్రోత్రంబుఁ జూవె - తే - యనఘ యధ్యాత్మములు రూపమును రసంబు. శాంతి. 6-90

**అధ్యాత్మవిత్త్వము** సం. వి. అ. న.

ఆత్మ సంబంధమైన జ్ఞానమును దెలిసికొనుట.

వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మ విత్త్వంబు పర తత్త్వంబు నొందరామి. అశ్వ. 2-110

**అధ్యాత్మ విదుఁడు** సం. వి. త్. పుం.

ఆత్మజ్ఞానము తెలిసినవాఁడు.

క. విను మాత్మతీర్థపంనే, వనము తెలంగెఱుఁగునట్టి వానికిఁ దిరుగం, జనవలయునె పెఱచోటుల, కని చెప్పుదు రాశ్రితులకు నధ్యాత్మ విదున్. శాంతి. 5-150

**అధ్యాత్మ విద్య** సం. వి. ఆ. స్త్రీ.

బ్రహ్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానమును బోధించు శాస్త్రము.

వ. అనిన విని యుధిష్ఠిరుం డధ్యాత్మ విద్య వినవలతుం జెప్పవే యనిన నతనికి దేవవ్రతుం డిట్లనియె. శాంతి. 4-120

**అధ్యాపకుఁడు** సం. విశే. (అ-పికా-అ)

చదువు చెప్పువాఁడు, వేదమును జెప్పువాఁడు, గురువు.

క. శాంతుఁడు సువ్రతశీలుఁడు, దాంతుం డధ్యాపకుండు దయగల వాఁడ,తన్వంత ప్రబోధ సంప, ద్వంతుఁడు పావనులు భూపవర పంక్తులకున్. అను. 2-179

**అధ్యాపనము** సం. వి. అ. న.

వేదమును నేర్పుట - చదువు చెప్పుట.

క. తనరిరి తద్దేశంబున, ననవరతము యజనయాజనాధ్యయనాధ్యా, పన దానములు, బ్రతిగ్రహ,మును నను షట్కర్మములును భూసుర వంశ్యన్. ఆది, 8. 84

**అధ్యాయము** సం. వి. అ. పుం.

సంస్కృత గ్రంథమునందలి ఒక భాగము.

వ. అస్మన్మహనీయ తంత్రంబు సంక్షేప రూపంబునం బదివే లధ్యాయం బుల వై శాలాక్షుండన నిర్మించె. శాంతి. 2-203

**అధ్రువము** సం. విశే. (అ. ఆ. అ.)

అస్థిరము. అశాశ్వతము.

క. క్షమలేని తపసి తనమును, బ్రమత్తు సంపదయు ధర్మబాహ్య ప్రభురాజ్యము భిన్నకుంభమున తోయములట్టుల యధ్రువంబు లగు నని యెల్లన్. ఆది. 2-178

**అధ్వగుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

బాటసారి, తెరువరి.

(కుంతి ద్రౌపదితో)

సీ ...అన్నకాంక్షులైన అధ్వగులకు నగ్రమిందుఁ బుచ్చి.

ఆది. 7-221

**అధ్వపరిశ్రాంతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

మార్గాయాసముచే మిక్కిలి అలసినవాఁడు.

సీ. అధ్వపరిశ్రాంతుఁడగు వింతవానికి, నన్నంబిడిన ఫలము.

అను. 1-143

**అధ్వము** సం. వి. న్. పుం.

మార్గము, త్రోవ. చూ, అధ్వపరిశ్రాంతుఁడు.

**అధ్వరము** సం. వి. అ. పుం.

యజ్ఞము.

రాజసూయ మహాధ్వరము గోరిచేయంగ. విరా. 2-189

**అధ్వర్యుఁడు** సం. వి. ఉ. పుం.

యజ్ఞమునందు యజుర్వేద తంత్రము నడపువాఁడు, యజ్ఞము చేయించు వాఁడు

వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగిన సంవాదంబు సెప్పెదనా కర్ణింపు మధ్వరుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింసగాదే యనిన నతండు. ఆశ్వ 2-65

పింగళుం డధ్వర్యుండుగా. ఆది. 2-210

**అన[1]** దే. వి.

1. అన్న, అగ్రజుఁడు (ఈ యర్థము వృత్తియందే కానఁబడియెడి)

క. అనజుం డొకఁడు వెంగళియై,నను దప్పెడుఁగాని పెద్దనకుఁ గార్య జ్ఞాననిరూఢిలేక తక్కిన, నను జన్ములు సిక్కువడుదు రవనీనాథా. అను. 4-188

2 పురుష నామముల కనుప్రయుక్తమగును.

సీ. .....కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల, కూరిమి తమ్ముండు గుంటూరి విభుఁడు, కొమ్మనదండనాథుండు. విరా 1-10

**అన[2]** అవ్య. ద్రు. (అనఁగ-అనఁగా) నా, నాఁగ, నాఁగా.

అను ధాతువు యొక్క తుమన్నాద్యర్థక రూపము.

1. అనుటకు, అనఁగా మొ.

ఉ. ...ప్రాణములు దీపనమున్ వినవే బృహన్నలా. విరా. 4-55

క. అన విని తగుమాటల నా,తని కొండలపాటు పాండుతనయుండు క్రమం,బున డిందుపడిచి. విరా. 4-178

క. క్షీరోదక గతిఁ బాండవ, కౌరవులొడఁగూడి మనికి కార్యంబదినీ, వారని నడపుము వారన, వీరనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే (ఇచట నిర్దేశమును దెల్పును) ఉద్యో. 3-158

2. ఉత్ప్రేక్షావాచకముగాను, ఉత్ప్రేక్షావాచకమునకు అనుప్రయుక్తముగాను ఉపయోగింపఁబడును.

మ. వెలుచన్ గోతులనొత్తి యగ్గజము తాఁబేలున్ వసంబేడిమూ,ర్ఛల జొందన్ వెసనెత్తి మేఘయుగళీసక్తోల్లసద్గైరికా,చల వైహాయసి కేళిమోయన. అను. 1-235

ఉ. ...ఛాస్వదసితోత్పల వర్ణుఁడు సేంద్రచాప శం,పారుచి మేఘ
మోయనఁగఁ దాండవ మధ్యముఁ డొప్పె. ఆది. 6–16

3. కొన్నిచోట్ల ఉపమా వాచకముగాఁ గూడ నుపయోగింపఁబడును.

మ. దాని మగలన్ వజ్రాహతింగూలు శైలనికాయంబన మద్భుజా
సమదలీలన్ గీటడంగించెదన్, విరా. 2-75

చ. ...కూలె వాఁడు వ్రజనిహతిఁ గూలు శైలమన సారథికేతు
యుతంబుగా నిలన్. భీష్మ. 2-68

**అనంగతంత్రము** సం. వి. అ. న.

మన్మథ వ్యాపారము, సురతము.

ఉ. ...అ,జ్ఞానఁ బట్టి తెచ్చి హృదయం బలరఁగ ననంగ తంత్ర
వి,ద్యావిపుణత్వ మేర్పఱిచెదం బ్రమదాంబుధి నోల లార్చెదన్.
విరా 2–298

**అనంగీకృతము** సం. విశ. (అ. ఆ. ఆ.)

అంగీకరింపఁబడనిది. అవలంబింపఁడనినది.

క. వ్యాకులతఁ బొంది రూపఱు, లోకస్థితి తొంటి రాజలోకము
చే నం,గీకృతమగు ధర్మ మనం,గీకృతమగునేని వీతకిల్బిష చరితా.
శాంతి. 2–159

**అనంగుఁడు** సం. వి. అ. పుం.

1. మన్మథుఁడు.

తే. ...ఆ సింహబలుఁ డనంగు, పట్టియాడెడు జంత్రంబు పగిదినుండె.
విరా. 2-87

2. కర్దముని కొడుకు, వేనుని తాత. చూ. వివరము. శాంతి. 2–205

**అనంత** సం. వి. ఆ. స్త్రీ.

1. పూరుని కుమారుఁడైన జనమేజయుని భార్య - ప్రాచీనుని తల్లి.
ఆది. 4-2

2 అంతము లేనిది. (విణ)

ఆళి యనునది యనంతయైయుండు. శాంతి. 3-150

**అనంతత్వము** సం. వి. అ. న.

1. నిత్యత్వము, అంతము లేకుండుట.

క. సత్యత్వానంతత్వని, రత్యయ శుభసారమయ సమగ్ర వికాసా. స్త్రీ. 1-188

**అదిశేషత్వము**

వ. కృష్ణుని పరమానంద ప్రాప్తియు, బలభద్రుని యనంతత్వసిద్ధియు, సకల యాదవ మౌసలాహవ ప్రకారంబును నెఱింగి. మహా. 2

**అనంతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అపరిమితము, అపారము.

వ. కశ్యపుండును దన దివ్యజ్ఞానంబున నట్లకా నెఱింగి తత్తకుచేత ననంతంబైన యర్థంబుగొని క్రమ్మఱి చనియె. ఆది. 2-191

2. తుదిలేనిది, సమాప్తిలేనిది

ఉ. అలము నేసి నాతగుల మాఱడి పుచ్చఁగనేల బేల న, న్నెలి యనంత భోగముల నిచ్చుమెయిన్ విహరింపు విరా. 2-252

3. అంతము లేనిది, మేరలేనిది.

ఇ ట్లనంతాత్మకుం డగువాఁడు విష్ణుండు. శాంతి. 4-88

4. నాశము లేనిది. శాశ్వతము, నిత్యము.

ఆ. అఖిల కర్మఫలము నంతవంతంబు ముద్భక్తులకు ననంతపదము గలుగు. శాంతి. 4-254

**అనంతరము** సం. క్రి. విణ.

పిమ్మట.

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు. విరా. 1-255

**అనంత విజయము** సం. వి. అ. పుం.

యుధిష్ఠిరుని శంఖము.

వ. అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులును భీమసేనుండు పౌండ్రమును యుధిష్ఠిరుండనంత విజయంబును నకుల సహదేవులు సుఘోషమణిపుష్పకంబులును...బూరించిన. భీష్మ. 1-176

**అనంతశయనుఁడు** సం. వి. అ. పుం.

శ్రీకృష్ణుఁడు.

వ. అనంతశయనుండు శిశుపాలు సంస్కారింపం బంచి వాని కొడుకుం జేదిరాజ్యమున నభిషిక్తుం జేసె. సభా. 2-72

**అనంతుఁడు** సం. వి. అ. పుం.

1. శ్రీమహావిష్ణువు (అంతము లేనివాఁడు)

తే. ఆది మధ్యాంతములు నాకు నరయలేమి,నై యనాది యమధ్యుం డనంతుఁ డనఁగఁజెల్లు. శాంతి. 6-436

**అనఁగి పెనఁగు** దే. అ. క్రి. (అనఁగు + పెనఁగు)

కలసి మెలసి యుండు.

ఆ. ఆ నితంబిని మక్కువ ననఁగిపెనఁగి, యింపు పొంపిరివోవ నన్నేలి కొనఁగఁ, దలఁచి పొందిన నది జన్మఫలముగాదె. విరా. 2-88

సీ. కౌరవ కోటియు మీరుఁ బెద్దయుఁగాల, మనఁగి పెనంగి యన్యోన్య సంభృతాధిక స్నేహులరై ప్రవర్తించితి రనఘవర్తనులార వినుఁడు ఆశ్ర. 1-85

**అనఁటి** దే. వి.

అరఁటి, కదళి.

క. ఈ లోకము నిస్సారం, బాలోకింపంగ ననఁటి యట్టుల. స్త్రీ. 1-82

క. ...ఆ,వ్వనిత యిలఁ ద్రెళ్లె నఱకిన యనఁటి క్రియన్. స్త్రీ. 2-25

**అనఁటికంబము** దే. వై. సమ. వి.

అరఁటిచెట్టుబోదె.

సీ. అనఁటి కంబమునట్ల యనిరి నిస్సారత సంసార మనఁగ నిస్సం ప్రబుద్ధులు. శాంతి. 1-189

**అనక** దే. అవ్య. (అను ధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థక రూపము)

1. (వాక) లక్ష్యము సేయక.

క. కరిఘటలు దురగముల దళ, మరదంబుల మొత్త మనక యడరి వడిం గాల్వురు మ్రగ్గఁజేయుచును మ్రగ్గిరి. ద్రోణ. 1-272

2. ఎంచక, తలఁపక.

వ. పగతురఁ దెగటార్చునెడ నన్యాయంబనక యుపాయం బెయ్యది దొరకొనిన దాన నుత్సహింప వలయుట శాస్త్రసిద్ధంబకాదె. సౌప్తి. 1-24

3. (మాత్రమే కాక అను తాత్పర్య మిచ్చును)

తే. సేన దమకును గలవారు లేనివారు, ననక తగువారిఁ జెప్పెద నఖిల సమరపండితుల నేర్చి వారి నీ బలము లేదు, నడపఁజాలించి యభిషేచనం బొనర్పు. ఉద్యో. 4-107

**అనక్షము** సం. వి. అ. న.

అనింద్రియము, ఇంద్రియము కానిది.

తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది, విరహితంబు నితాంతంబు విమల మవ్యయంబు పుండరీకాక్షు మనక్ష విషయ, మచ్యుతము సదసత్పర మైకభ్యభాసి. అను. 4-190

**అనగ్ని** సం. వి. ఇ. పుం.

అగ్నిహోత్రము లేనివాఁడు, గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అను మూఁడు విధములగు అగ్నులు లేనివాఁడు. చూ. అగ్ని.

ఆ. వడ్డికిచ్చి కుడుచువాఁడు ననగ్నియుఁ, బ్రాణివిక్రయమున బ్రదుకు నతఁడు, దైవపిత్ర్యములకుఁ దగరు సంధ్యోపాసనములు లేని వారు నరవరేణ్య. అను. 2-57

**అనఘము** సం. విణ. (అ. ఆ. అ.)

పాపరహితమైనది, పవిత్రము.

క. మునినాథ నీవు చెప్పఁగ, ననఘంబగు నీసమంచితాఖ్యానం బే విని. ద్రో. 2-180

**అనఘుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పాపరహితుఁడు, (అఘము లేనివాఁడు)

సీ. .... అనఘులు కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల కూరిమి తమ్ముండు. విరా 1-10

**అనడ్వాహము** సం. వి. హ్. పుం.

ఎద్దు, వృషభము (బండిని వహించునది)

వ. అగ్నిహోత్రంబులు ననడ్వాహంబులు నతిథి బాంధవ విద్వజ్జన గురు మిత్ర భామినీ నివహంబు లపూజితంబులై యెగ్గు సేయును. అర. 1-31

**అనతిక్రమణీయము** సం. విణ. (అ. ఆ. అ.)

అతిక్రమింపరానిది, కడవరానిది, దాఁటరానిది.

క. మనుజులకు నెవ్విధంబున, ననతిక్రమణీయమైన యాపద్విషయం, బున సంతాపింపఁగఁ జన,దని యెఱిఁగియు నగునె యెట్టులని శోకింపన్. ఆది. 6-251

**అనతిదూరము** సం. విణ. (అ. ఆ. అ.)

కొంచెము దూరము, సమీపము (అతిదూరము కానిది)

వ. విరాటు నగరంబున కనతిదూరంబగు కాంతారంబున. విరా. 1-147

**అనద** వై. విణ. √పుం అనాథః స్త్రీ అనాథా.

1. దిక్కులేనిది, రక్షకుఁడు లేనిది, నాథుఁడు లేనిది.

ఆ. వీరపత్నినయ్యు వీరసహోదరినయ్యు నీకుఁ జూడ ననదవోలె,

మున్నదాన నెట్టులున్నను నాకు నిన్, దెలుపనేల పలుకు తియ్యమేల.
అర. 6-184

ఆ. అనదనైతి నిచట నాలికుయ్యాలింపుఁ, డకట మీరు గలుగ నాక్ర
మించి, నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి వెఱపు లేక భంగ
పఱుచువారు. విరా. 3-19

2. అశక్తుఁడు, దుర్బలుఁడు, అల్పుఁడు.

ఆ. కలహమగుట లక్ష్మిఁ గారించుఁ బ్రాణహానియును జేయు నింత
నిక్కువంబు, పలువు రొకని కోడి పాఱుట బల్లిదు, లనదచేతఁ
జెడుటయును ఘటించు. ఉద్యో. 3-17

సీ. ...భూవరులు మేర, దప్పి లోకములోని ధాన్యముల్ గొన నర్థ,
ర్మం బంతకంతకుఁ బ్రబ్బ నధికు, లనదలఁ జెఱుపంగ.
శాంతి. 3-280

**అనదతనము** వై. వి. √అనద.

1. అనాథత్వము, అశక్తత.

తే. కౌరవేంద్రుఁ డనదతనము దోఁపంగ గదఁ జేతఁగొని వినిశ్చయ
మునఁ బోరికి నమరెనే యక్కటకట. శల్య. 2-286

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నేనెఱుంగుదు,నైన ధనము లీగ ననద
తనము, వచ్చుఁ జెచ్చుపెరిగి వైరులు గర్వింతు, రేల పగ యడంగు
నెట్టులైన. ఉద్యో. 3-164

2 దైన్యము, హైన్యము.

క. అనదతనంబును బెడిదపుఁదనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు
నేఁటినుబోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం
గ్రమంబున నధిపా. శాంతి. 3-24

**అనధికము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎక్కువ కానిది, సూక్ష్మము.

వ. అని తలంచి యపునర్భవకారియు ననధికంబును నచలంబు నగు
ధర్మంబును గోరుచుండు. అను. 3-809

**అనధీతము** సం. విణ (అ. ఆ. అ.)

చదువఁబడనిది.

క. అనధీతాధ్యయనుం డనఁ, జను ఋత్విజు నట్లచూవె సంరక్షా
కల్పన హీనుఁడైన నృపుఁ డని, మనువు పలికె. **శాంతి. 2-192**
(పాఠాంతరము)

**అనధీయానుఁడు** సం. వి. అ. పుం.

చదువనివాఁడు, వేదాధ్యయనము చేయనివాఁడు.

క. అనధీయానుం డితఁ డనఁ. జను ఋత్విజునట్ల చూవె సంరక్షా
కల్పన హీనుఁడైన నృపుఁ డని, మనువు పలికె. **శాంతి. 2-192**

**అనధ్యయనము** సం. వి. అ. న.

1. అధ్యయనము సేయకుండుట.

వ. అవ్విశేషజ్ఞుండు పుత్రుతో ననధ్యయనసమయం బగుట సెప్పి.
**శాంతి. 6-307**

2. అధ్యయనము సేయరాని దినము లేక సమయము.

తే. మొదవుఁ దన్నుట రవి యభిముఖత దనకుఁ, గలుగ మూత్ర
పురీష మోక్షణము సేఁత, యధ్యయన మనధ్యయనమునందు
నడపుటగు బిసంబులు ద్రుచ్చిలినట్టులైన. **అను. 3-226**

**అననుపస్థలము** సం. వి. అ. పుం.

లోపభూయిష్ఠమైన తావు, అపాయముగల చోటు.

ఆ. పలుఁగు రాల కుడ్యముల రుచుల్ గప్పిన, జలములున్న యెడలు
వెలయఁజూచి, యననుపస్థలంబు లని జను తెలియఁగక, యుండు
నట్లుగా మయుండు సేసె. సభా. 1-12

**అనురూపము** సం. విణ. (అ. ఆ. అ.)

అనుగుణము గానిది, తగనిది, యుక్తముగానిది.

క. అను పలుకులకును భీష్ముండును ద్రోణుఁడు ద్రోణ సూనుఁడును
గృపుఁడును మేలని యియ్యకొనిరి హృదయానను రూపములైన
తెలివు లాస్యముఁ బొందన్. **విరా. 4-103**

**అనన్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ఇతరము కానిది, వేఱుకానిది, అన్యము కానిది.

మఱియొకనికిఁ జెందనిది.

వ. ఇది అనన్య సామాన్య కరణం బగు పరమ ధర్మప్రకారంబు
విరా. 1-29

**అనన్య సామాన్యము** సం. విణ. (అ. ఆ. అ.)

అసాధారణము, ఇతరులకు సాధారణము కానిది, ఇతరులకు లేనిది.

ఆ. అర్జునాంబుదం బనన్య సామాన్య స్యముద్యమమున ముఖపయో రుహముల కాంతి దఱిఁగి యపుడు కౌరవసేనా స్సరోవరంబు దీన భావ మొందె.
విరా. 5-105

**అనపజయము** సం. వి. అ. పుం.

అపజయములేమి, పరాజయము లేకుండుట.

క. నానాత్వైకత్వము లజ్ఞానజ్ఞానజముల నపజయమండ్రు బుధుల్ వాని నవిద్యయు విద్యయుఁ, గా నివి విను పంచవింశకస్థావస్థల్.
అను. 4-228

**అనపత్య** సం. విణ. ఆ. స్త్రీ.

బిడ్డలు లేనిది.

వ. అట్టియెడ, ద్రుపదుం డనపత్య యగు తన మహిషి విషాదంబు దీర్పం దివురుటయు.
ఉద్యో. 4-369

**అనపత్యత** సం. వి. ఆ. స్త్రీ.

బిడ్డలు లేకపోవుట, సంతానము లేమి

క. జన నిందితమయి నీయం, దనపత్యత యను నధర్మమది యుండఁగ ధర్మనివృత్తచరిత్రక నీ, యనుశాసన మెట్లు నమ్మనగు జనము లకున్.
సభా. 8-43

**అనపత్యుఁడు** సం. విణ. అ. పుం.

బిడ్డలు లేనివాఁడు.

నీవన పత్యుఁడవగు మని ప్రతిశాపఁబిచ్చిన. ఆది 1-99

**అనపరాధుఁడు** సం. విణ. అ. పుం.

తప్పు చేయనివాఁడు, అపరాధము సేయనివాఁడు, అపరాధము లేని వాఁడు, నిర్దోషి.

తే అనపరాధుఁ దపోనిధి నధికశాంతి, యుక్తుఁ జంపిన పాపాత్ము నుఱక పట్టి, మ్రింగఁజాలెడువాని నుత్తుంగదేహు, నేను సృజి యింతుఁ జూడుఁడీ యీతఁణంబ. ఉద్యో. 1-12, 18; మహా. 58

**అనపహార్యము** సం. విణ. (అ. ఆ. అ.)

హరింప శక్యముగానిది.

తే. అనపహార్యంబు తేజోమయంబు సర్వ,గుణములకు నలంకారంబు గురుతరంబు, భామలకుఁ బతిభక్తియ. అర. 2-142

**అనపాయత** సం. వి. ఆ. స్త్రీ.

అపాయములేమి, ఎడబాటులేమి.

క. ...ధర్మ తనయుఁ దండఱమును ని,ట్లనపాయత వర్తిల్లుచ, మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. విరా. 1-114

**అనపాయము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అపాయము లేనిది, హానిలేనిది, చెఱుపులేనిది, నాశము లేనిది

క. కను,గొనుసిన తెరువరి తన, కనపాయంబైన మార్గ మరసి తగ నెఱిఁగిన వారు సెప్పఁగాఁ గై,కొనని కరణిఁ దగిన వెంటకుం జొర వకటా. ఉద్యో. 2-280

2. ఎడబాటులేనిది.

మ. ...మునీంద్రా రండు నీవున్ భవ,త్తనయుం డీకరియున్ నితాంత సుఖ నిత్యంబైన నాకంబువం, దనపాయస్థితి మత్ప్రభుత్వమునఁ బెంపారం బ్రవర్తింపఁగన్. అను. 4-78

3. తొలఁగనిది.

అనపాయమగు నుపాయమున ముక్తివడయు. శాంతి 5-365

**అనపాయమగు నుపాయము జాతీయము.**

సురక్షితమైన సాధనము, ముక్తిసాధనము, అపాయములేని ఉపాయము, తొలఁగని ఉపాయము.

తే. హృద్గత ద్వంద్వములనెల్ల నెడల విడుచు, ననఘ యనపాయమగు నుపాయమున ముక్తి,వడయుఁ బడపడి.

తే. అనుడు ననపాయ మగు నుపాయం బనంగఁ జెప్పి యొక్కటి మోక్షంబుఁ జెందు తెఱఁగు. శాంతి. 5-366

తే. తాను గ్రోధాదు లెడలించుఁ గాని ముక్తి,దెచ్చి యీ దొక భంగి ముక్తికిఁ బథంబు, నగుట ననపాయమగు నుపాయంబనంగఁ, వలసె నీనేర్పు వే రిందువంశవర్య. శాంతి. 5-371

శ్లో. తతో మోక్షాయ యతత తేనానుపాయాదుపాయతః
సం. భా. శాంతి. 273-21

శ్లో. మోక్షః పితామహేనోక్త ఉపాయాన్నానుపాయతః
తముపాయం యథాన్యాయం శ్రోతు మిచ్ఛామి భారత.
శాంతి. 274-1

వ్యాఖ్య:- నానుపాయాదుపాయా వనుష్ఠానాత్ కింతూపాయత ఏవ. అనపాయమగు నుపాయము భగవంతుడే, భగవంతునే యుపాయము గాఁగొని భగవంతుని యనుగ్రహముతో భగవంతునిఁ జేరఁదగునని భక్తి యోగము.

**అనపాయుఁడు** సం. విణ. అ. పుం.

వినాశము లేనివాఁడు.

క. అనపాయుం డగు నెవ్వం,డును నను బాధింపఁజాలఁడు.
అశ్వ 1-127

**అనపాశ్రయ** సం. విణ. (అ. ఆ. అ.)

దిక్కులేనిది.

క. అవనీతల సామ్రాజ్యోత్సవమునకు యోగ్యయైన సతి ద్రౌపది పాండవ ధర్మపత్ని నీకం, తవమానము సేయ నేమి యనపాశ్రయయే సభా. 2-208

**అనపేక్షితము** సం. విణ. (అ. ఆ. అ.)

కోరఁబడనిది.

వ. తత్సుతుండు కర్దముండు ననపేక్షితరాజ్యుండై. శాంతి. 2-205

**అనపేతము** సం. విణ. (అ. ఆ. అ.)

తొలఁగనిది, వీడనిది.

సీ. వరుసఁ బ్రాణాపాను లిరువురు నయ్యగ్ని, వెలిగింతు రనపేత వృత్తులగుచు. అర. 5-101

**అనభిగమ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పొందశక్యము గానివాఁడు.

చ. ...వి, స్తర మహనీయ తార్కిక వచః కలనానభిగమ్య. శాంతి. 4-455

**అనభిజ్ఞాతము** సం. విణ. (అ. ఆ. అ.)

తెలియఁబడనిది, ఎఱుఁగఁబడనిది.

వ. నీ యజ్ఞంబు నిర్వృత్తంబయిన నే నరిగి బలభగ్నీకృత పాదప వనంబుల దాని ననభిజ్ఞాత ద్వారదేశంబుల దాని....ద్వారవతిం జూచి. అర. 1-179

**అనభితోషము** సం. వి. అ. పుం.

సంతోషము లేకుండుట.

క. పరితాప మనభితోషము...రాజసంబులగు భావంబుల్. శాంతి. 4-351

**అనభిమతము** సం. విణ. (అ. ఆ. అ.)

అయుక్తము, అసమ్మతము.

వంశనాశ మనభిమతము. ఉద్యో. 3-15

**అనభివ్యక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

తెలియఁబడనిది.

అపగతమైన శబ్దమై, యనభివ్యక్తమార్గమై. ఆర 7-406

**అనభిషిక్తుఁడు** సం విశ. అ. పుం.

తడుపఁబడనివాఁడు, సంబంధము లేనివాఁడు.

సదసదనభిషిక్తా. స్త్రీ 1-189

**అనభ్యస్తము** సం. విశ. (అ. ఆ. అ.)

అభ్యసింపఁబడనిది, నేరువఁబడనిది.

అనభ్యస్త శాస్త్రంబునుం బోలె దుర్గమంబును. విరా. 2-826

**అనయము** దే. అవ్య. ద్రు.

1. అత్యంతము, మిక్కిలి.

క. అనిన విని యనుచితంబున, కనయము శంకించియును లతాంగి మదిం దమ్ముని వలవంత దలఁచి యిట్లనియెం బాంచాలితోడ సాదర వృత్తిన్. విరా. 2-97

చ. అనయము నొచ్చుచున్నయవి యంగములెల్లను వేగవచ్చుటన్. ఉద్యో. 2-15

2. సంతతము, ఎల్లప్పుడు.

క. అని పలికి పిల్లిపొదిగిటఁ, ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసించిన. భీష్మ. 1-177

క. అనయముఁ గొంచెపు వెలకుం, గొనవచ్చును సారభూత గోవును దానం,బున ఫల మధికము దానము, గొని నాతఁడు సుఖము దానఁ గొనుఁ జేసేతన్. అను. 2-418

3. మఱిమఱి, మాటిమాటికి.

చ. మన మురియాడుచుండ ననుమానముతోన సుదేష్ణఁజూచి నీ, వన యముఁ గోరినట్టి పని యర్థిమెయిం బని చేయుదాన. విరా 2-102

**అనయము** సం. వి. అ. పుం.

దుర్నయము, అవినీతి, నీతిలేమి.

చ. అనయము పుట్టె జూదమున యప్పుడ యెంతయుఁ జిచ్చు వెట్టి
కాల్చిన యది నీయుపేక్షయ. ఉద్యో. 2-14

**అనర్గళము** సం. విణ. (అ. ఆ. అ.)

నిరాఘాటము, అడ్డులేనిది.

తే. అతఁడు నానాప్రకార శస్త్రాస్త్రనిహతి, నతుల విక్రమ విభవ
మనర్గళముగ, యోధసారథి యుగ్యసంయుతము గాఁగ, నూఱు
రథములు వ్రేల్మిడి నుగ్గుచేసె. విరా. 3-172

**అనర్గళుఁడు** సం. విణ. అ. పుం.

అడ్డులేనివాఁడు.

ఉ. ...రాముని కులాంగన జానకి నేను నన్ను మోహావిలుఁ డొక్క
రక్కసుఁ డనర్గళుఁడై కొనిపోయెడుం గృపం, గావరె.
అర. 6-348

**అనర్ఘము** సం. విణ. (అ. ఆ. అ.)

అమూల్యము, అధికమగు వెలగలది

క. శరణాగత సంశ్రిత భయహారణా సురనికర శేఖరానర్ఘ మణి,
స్ఫురణా పరిచయ రంజిత చరణా. విరా. 1-38

**అనర్థకము** సం. విణ. (అ. ఆ. అ.)

సంబంధము లేనిది, అన్వయము కుదురనిది, పొందిక లేనిది.

అర్థంబులం దనర్థక చింత. సభా. 1-55

**అనర్థజ్ఞుఁడు** సం. విణ. అ. పుం.

కార్యస్థితి నెఱుఁగనివాఁడు, అర్థజ్ఞుడు గానివాఁడు.

అనర్థజ్ఞులతోడి చింతనంబు...రాజదోషంబు. సభా. 1-55

**అనర్థభాషి** సం. విణ. (న్-ణీ-న్)

అవాచ్యములగు మాటలాడు వాఁడు, అప్రయోజక వాక్యముల్లు
మాట్లాడు వాఁడు.

క. విను చలసుండును గర్వియుఁ, ననర్థ భాషియును మత్సరాభీలుఁడుఁ

క్రోధనుఁడును గావలదు శ, క్త్యనురూపతఁ జేయ వలయు నాతిథ్యంబున్. శాంతి. 5-454

**అనర్థము** సం. వి. అ. పుం.

1. కీడు.

వ. అర్థానర్థంబులు, బలాబలంబులు మొదలైన సకలావస్థలును. శాంతి. 3-111

2 దారిద్ర్యము, పేదఱికము.

క. పొరి నర్థంబు ననర్థము, మరణము, జీవితము సుఖసమాగమమును దు, స్తర దుఃఖ సంగమంబును, దొరకొను నే నెపుడు సమతతోడన నిలుతున్. శాంతి. 4-394

**అనర్హము** సం. విశ. (అ. ఆ. అ.)

అర్హము గానిది, అయుక్తము, తగనిది.

తే. వినుము దుర్యోధనుండు సేసిన యనర్హ, మొక్కటియు లేదు. ఆశ్ర. 1-98

**అనర్హుఁడు** సం. విశ. అ. పుం.

అర్హుఁడు కానివాఁడు, అపాత్రుఁడు, తగనివాఁడు.

క. విను మర్హుఁడగు ననర్హుం, డనఘా విష్ణుస్తుతి క్రియం. శాంతి. 5-486

చ. ...అనర్హు నర్హుఁ డని యచ్యుతు నర్చితుఁజేయఁ జూడియే సభా. 2-10

**అనల** సం. వి. ఆ. స్త్రీ.

క్రోధునకు జనించిన సురభికిఁ బుట్టినది. దీనికి గిరివృత లతాగుల్మము పుట్టెను. ఆది. 3-71

**అనలము** సం. వి. అ. పుం.

1. అగ్ని.

తే. ...ప్రళయ కాలానలమున, గండరించిన రూపంబు కరణి భీముఁ,

దతి భయంకరాకారత నతిశయిల్లె. విరా. 2-134

2. అగ్నితత్త్వము.

ఆ. విను మహన్మనో గగనపవనానల, సలిల భూములవఁగ సంభవించు, మహిత విభవములు గ్రమంబున నేడు రూపములు జన్యజనక భావమొంది. శాంతి. 5-59

**అనలసత్త్వము** సం. వి. అ. న.

మాంద్యములేమి, జాగరూకత.

క. అంతశ్చర మారుతములు, శాంతములుగఁ జేసి యనల సత్వము శమమున్, దాంతియుఁ గల జనములు. శాంతి. 2-29

**అనలసుఁడు** సం. విశే. అ. పుం.

జాగరూకత గలవాఁడు, అప్రమత్తుఁడు.

క. అనఘ యిది యోగపథ మిం, దనలసుఁడై చనఁగఁ జాలు నతఁడు కృతార్థుండు. శాంతి. 6-122

**అనలాస్త్రము** సం. వి. అ. న.

ఆగ్నేయాస్త్రము, అగ్ని అధిష్ఠాన దేవతగాఁగల మంత్రపూరిత బాణము.

వ. మద్రనాథుం డెడ సొచ్చి మహానలాస్త్రంబు ప్రయోగించిన. భీష్మ. 3-51

సీ. అమ్మహాత్ముండు నాకతి దయ నిచ్చె నియ్యనలాస్త్రము. ఆది. 7-44

**అనలుఁడు** సం. వి. అ. పుం.

అగ్నిదేవుఁడు.

చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు. కర్ణ. 3-397

**అనల్పము** సం. విశే. (అ. ఆ. అ.)

తక్కువగానిది, అధికము.

మ. వలలుం డెక్కడఁ జూచె....ననల్ప ప్రీతి సంధించుచున్....యీ భూజము వంట కట్టియలకై ఖండింపఁగా నేటికిన్. విరా. 2-136

**అనవద్యత** సం. వి. ఆ. (స్త్రీ).

అనింద్యత, పూజ్యత.

చ. ...భూవర యతఁ డేమి పూని యనవద్యతఁ బొందు నెఱుంగఁ జెప్పుమీ. అర. 7-444

**అనవద్యము** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఉత్తమము, పాపరహితము.

చ. ...నీతి నిర్మలాత్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుచేయు కొడుకు. విరా. 1-98

2. పూజ్యము, అనింద్యము.

సీ. వాద్య నైపుణ మనవద్య శిక్షావిధి, నలవరించుచు బృహన్నల యనంగ. విరా. 5-338; స్వర్గ. 86

3. నిరాఘాటము, అడ్డులేనిది.

క. అనవద్య హృద్యనాదంబున మ్రోసెను దేవదుందుభులు. అశ్వ. 4-241

**అనవద్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. పూజ్యుఁడు.

మూలవిద్యానవద్యా. ద్రోణ. 2-388

2. పాపరహితుఁడు.

క. తనువై స్పర్శము నై కొను, ననవద్యా బుద్ధి యాత్మయందు నిలుచుచున్. శాంతి. 5-169

**అనవధానము** వి. అ. న.

ప్రమాదము, ఏమఱుట.

తే. ఎన్నికొనుచుండఁ జనుచుండ నేండ్లు లివ్విధమున నాయువు దోడ్తోడఁ దఱిఁగి జీవహాని వాటిల్లఁగాఁ బుత్ర యనవధాన నిద్ర మోహితుఁడై యున్కి నీకుఁ దగునె. శాంతి. 6-224

**అనవధానుఁడు** సం. విశే. అ. పుం.

ఏమఱుపాటు గలవాఁడు.

తే. పసుల యెడ మాఱుపలుకక యనవధాను,డైన పతిఁ దలపించి ...
అను. 5-291

**అనవరతము** సం. విణ. (అ. ఆ. అ.)

నిరంతరము, తెంపులేనిది

క. అని ధరణి నుండి పొగడెదు, జనుల నిరంతర రవంబు జలధర
మార్గంబున నుండి పొగడు దివ్యుల, యనవరత రవంబు నొక్కటఁ
టయి కడు నొప్పున్.
ఆది. 7-186

సం. క్రి. విణ. అ. న.

ఎల్లప్పుడు.

ఆ. ...ఎంత బోధ మెక్కుడయ్యె, నంత శాంతుఁ డగుచు ననవరతం
బును, గురుని గొలిచి మేలు పురుషుఁ డొందు.
అను. 3-321

**అనవశేషము** సం. వి. అ. పుం.

మిగులులేనిది, సమాప్తము.

తే. ...పగలు, ననవశేషంబుగాఁ దెగటార్చె నితఁడె. శాంతి 1-357

**అనవసరము** సం. వి. అ. పుం.

వేళగానిది, అదనుగానిది, తగని సమయము.

తే. అరయు, మిది కోపమునకు ననవసరంబు.
అర. 1-396

**అనవహితుఁడు** సం. విణ. అ. పుం.

ఏమఱుపాటు గలవాఁడు.

క. ఆతఁగులచే ద్రుపదుఁ డనవహితుఁడై పట్టువడనంత హీనుఁడె. ...
ఆది. 6-68

**అనవిత్త్వము** సం. వి. అ. న.

జ్ఞానము.

క. సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు, దత్త్వాశ్రయమునను సత్త్వతత్త్వ
ములు వివేకిత్వాలేపత్వము లన, నవిత్త్వము జిత్త్వంబులు వొందు
విశ్వాధారా.
అను. 4-217

**అనవుడు** దే. అవ్య. ద్రు.

నావుడు, అనుడు, అనిన పిమ్మట.

(అను ధాతువు యొక్క అనంతర్యార్థక రూపము)

క. అనవుడు నప్పలుకులు విని. తన చిత్తము కలఁకదేటి ధర్మతనూ-
జుండు. విరా. 1-55.

**అనశనము** సం. వి. అ. న.

ఉపవాసము, పస్తు.

చ. అనశన నిష్ఠఁజేసి సురలాది మునుల్ మహితానుభావులై, రి.
అను. 4-158.

**అనశనుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఆహారము తీసికొననివాఁడు.

క. మునివరుఁడు......తపమ్మొనరించె ననశనుం డయ్యును బహు-
కాలంబు ప్రాణయుక్తుం డగుచున్. ఆది. 4-265.

**అనశ్వరము** సం. విశ. (అ. ఈ. అ.)

నశింపనిది, శాశ్వతమైనది.

క. తత్త్వ మనశ్వర మశరీ,రత్వంబునఁ బరఁగు భూతరాశి.
అశ్వ. 1-121.

**అనశ్వరుఁడు** సం. విశ. అ. పుం.

నాశనము లేనివాఁడు.

క. హరియందేనును నాయం, దరయంగా హరియుఁ గలము హరి-
నాకును నా, హరి కేను ననశ్వరులము, హరిప్రసాదోదయము
మహత్త్వర మహిమన్. శాంతి. 4-244.

(అధీశ్వరులము అని పాఠాం)

**అనశ్వుఁడు** సం. వి. అ. పుం.

విదూరథుని కొడుకు, తల్లి మాధవియయిన సంప్రియ. తండ్రి కురువు.

ఈతని వంశమువాఁడే భీష్ముని తండ్రియైన శంతనుఁడు. ఆది. 4-113

**అనసూయ** సం. వి. ఆ. స్త్రీ.

సద్గుణములయందు ఈర్ష్య లేకుండుట.

క. ....అనసూయార్జవశౌచములు నహింసా దాన, క్షమా త్యజన సూనృతములు సత్యము మూర్తుల్. శాంతి. 3-417

**అనసూయత** సం. వి. ఆ. స్త్రీ.

అసూయ లేకుండుట, ఈర్ష్యలేమి.

చ. అగు సంధి యెట్లు ననసూయత నూల్కొని చేయు మిత్తఱిన్. శల్య. 1-61

**అనహంకారము** సం. వి. అ. పుం.

'నేను' అనెడి యభిమానమును గర్వమును లేకపోవుట, అహంకారములేమి

క. అనహంకారము నప్రార్థనమును విషయములఁ బెద్ద తగులమి యును మే, లనఘా. శాంతి. 5-458

ఇతఁ డనహంకారుఁ డెపుడు. మౌస. 36

**అనా** దే. వి.

ప్రార్థనార్థమున క్రియలకు అనుప్రయుక్తముగా వచ్చును.

క. ...నీ, వీ జన్మంబున నమ్మన్ని, రాజికి వెఱఁగను తపశ్చరణ మొందవనా. అను. 4-335

క. ...శావాల, శ్రీవిశ్రుత కృష్ణ పనుపు నెల్లింపవనా. మౌస. 123

క. ...నిన్నుం దోడ్కొన, బోవచ్చినవారు గినుకఁ బోవిడువవనా. స్వర్గ. 36

**అనాకాంక్షిత్వము** సం. వి. అ. న. పుం.

కోర్కె లేకపోవుట.

వ. సర్వ సమతా సముపహితంబైన యనాకాంక్షిత్వంబు ధర్మోత్తమంబు నిరతిశయానందమునకు నిధానంబు. శాంతి. 6-619

**అనాకారము** సం. విణ. (అ. ఆ. అ.)

నశించినది.

క. ఆరయఁ గామముఁ గ్రోధము, వైరులు ముక్తి కవి రెండు వారించిన సంసార మనాకారంబగు, నేరిమి యొండేల ముక్తి నెలవు గనుటకున్. శాంతి. 6-312

**అనాకులము** సం. విణ. (అ. ఆ. అ.)

సంక్షుభితము గానిది, చెడనిది, నశింపనిది.

క. నీ కారణమున వంశ మనాకులమై నిలుచుటయున్. ఆది. 4-245

**అనాకులుఁడు** సం. విణ. అ. పుం.

వ్యాకులత్వము లేనివాఁడు, కలఁతఁ జెందనివాఁడు.

చ. .... వినయంబును భక్తియుఁ దోఁప నయ్యనాకులు నట వుచ్చి యొక్కెడ నకుంఠిత నిర్ణయశాంతచిత్తుఁడై. మాస. 35

**అనాగతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. రాఁబోవునది, భవిష్యత్తు.

చ. అరసి యనాగతం బెఱుఁగు నట్టి మనంబులు గల్గు పాండుభూవరసుత బంధు మిత్ర కురువర్గ సుహృజ్జన కోటులు. శల్య. 1-115

2. రానిది, జరుగనిది.

క. గతమునకును వగవ కనాగతమునకును నోరు దెలిచి కడుఁగోరక దీనతఁ బొందక దైవం బేగతిఁబుచ్చిన దానఁ బోదుగా కనవలయున్. శాంతి. 3-30

**అనాగతుఁడు** సం. విణ. అ. పుం.

రాఁబోవువాఁడు.

వ. మఱియు నతీతానాగతులైన నిజవంశంబున రాజులకెల్ల వంశకర్త యయ్యె నట్టి భరతునకు. ఆది. 4-110

**అనాగసుఁడు** సం. విణ. (స్)

పాపము లేనివాఁడు, అపరాధము లేనివాఁడు.

చ. అనఘు ననాతతాయి గరుణాత్ముఁ బ్రశాంతు ననాగసున్ మహా-
మునివరుఁ జూచి చూచి యధముల్ వధియించిరి. అర. 3-154

ఇది ఆనందవారి పాఠము. ఇది సం.మున పాఠాంతరముగాఁ గూడ లేదు. 'నిరాగసున్' అని పాఠాంతరము గలదు. 'ప్రశాంతుని దాంతు నిమ్మహా,మునివరు' అనునది. సం.ము; అకా. ప్రతిపాఠములు. మూలమును బట్టి చూడ 'అనాగస' శబ్దమే యుక్తముగాఁ గన్పించుచున్నది.

శ్లో. ధర్మజ్ఞస్య కథం తాత వర్తమానస్య సత్పథే,
మృత్యురేవంవిధో యుక్తః సర్వభూతేష్వనాగసః.
సం. భా. అర. 117-2 శ్లో. (వావిళ్ల)

**అనాచారము** సం. వి. అ. పుం.

ఆచారములేమి, అయోగ్యవర్తనము (విహితముల ననుష్ఠింపకుండుట-నిషిద్ధముల ననుష్ఠించుట.)

వ. వారి యనాచారంబులు వారింపమిం జేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు. కర్ణ. 2-109

**అనాతంకము** సం. విణ. (అ. ఆ. అ.)

సందేహము లేనిది.

క. పంకజ సన్నిభుఁ డఘు,పంకక్షాళన మహాతపస్సలిలుఁ డనా,తంక
మతి పైఁ శిష్యుఁ డు,దంకుం డను మునివరుండు దద్దయు భక్తిన్.
ఆది. 1-91

**అనాతంకుఁడు** సం. విణ. అ. పుం.

భయము లేనివాఁడు.

ఉ. శంకర సన్నిభుండు, జనశంకరుఁడున్, గరుణాకరుం, డనాతంకుఁ
డుదంకుఁ డన్మని వ్రతస్థితుఁడై మరుభూమియందు ని,శ్శంక
మతిన్ వసించి. అర. 4-374

**అనాతతాయి** సం. విణ. (న్-నీ-న్)

చంప నుద్యుక్తుఁడు గానివాడు, ఆతతాయి కానివాఁడు, అనపరాధి, చూ. ఆతతాయి.

చ. అనఘు ననాతతాయిఁ గరుణాత్ముఁ, బ్రశాంతు, ననాగసున్,
మహా,మునివరుఁ జూచి చూచి యధముల్ వధియించిరి.
అర. 3-154

ఇది ఆనందవారి పాఠము, అకాడమివారి పాఠమును, సం-మువారి పాఠము 'అనఘుని పీతరాగు'; పాఠాంతరము అనాతతాయి. మూలమునకు 'అనాతతాయి' శబ్దమే దాపుగ నున్నది.

శ్లో॥ ధర్మజ్ఞస్య కథం తాత వర్తమానస్య సత్పథే
మృత్యు రేవంవిధో యుక్తః సర్వభూతేష్వనాగసః."
సం. భా. అర. 117-2 శ్లో. (వావిళ్ల)

**అనాతురత** సం. వి. ఆ. (స్త్రీ).

ఆతురత లేకుండుట, వేగిరపాటు లేకుండుట.

క. ఈ తెరువున వేదవిదుఁడు, వీతామ్నాయుండు ధర్మవేదియుఁ
బాప,స్ఫీతుఁడు సరియై కడతు ర,నాతురత జరామరణమహాంభో
రాశిన్. శాంతి. 5-91

**అనాత్మజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆత్మజ్ఞానము లేనివాఁడు, తన్నుఁదా నెఱుంగనివాఁడు, బుద్ధిహీనుఁడు.

వ. నీ వనాత్మజ్ఞుఁడ వూరకుండుము. కర్ణ. 2-115

**అనాథ** సం. విణ. ఆ. (స్త్రీ).

నాథుఁడు లేనిది, దిక్కులేనిది.

సీ. ...మదలోల ననాథను బాలవృద్ధఁ -తే- దాపసిని భీత వంచనఁ
దలరఁ జే,యుట...నిరయహేతువులు. అను. 2-61

**అనాథత్వము** సం. వి. అ. న.

నాథుఁడులేనితనము, దిక్కులేనితనము.

సీ. నానాజనములకు నాథుఁడై శోభిల్లు దొర యనాథత్వంబు బొరసె
నేఁడు. ద్రోణ. 2-349

**అనాథవంతుఁడు** సం. విశే. త్-పుం. (త్-తీ-త్)

నాథుఁడు లేనివాఁడు, దిక్కు లేనివాఁడు.

వ. ధర్మనందనుఁడు....మీరు భరతకులులకుం దక్క ననాథవంతులైన వారలకు విధ్యుక్తంబుగా నగ్ని సంస్కారంబు సేయుండని పనిచి. స్త్రీ. 2-172

**అనాథుఁడు** సం. విశే. అ. పుం.

నాథుఁడు లేనివాఁడు, దిక్కు లేనివాఁడు.

వ. అమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదుర నుద్దేశించి పుత్రహీనుండ ననాథుఁడ నగుట యెఱింగితి. శల్య. 1-10

**అనాదరణము** సం. వి. అ. పుం.

ఆదరములేమి, తిరస్కారము, లెక్కసేయకుండుట.

చ. గురుఁడని నన్నెఱుంగు దనఘుండవు నావనంబునం దనాదరణము సేసి తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ. ఉద్యో. 4-307

**అనాదరము** సం. వి. అ. పుం.

ఉపేక్ష, లక్ష్యముసేయమి

వ. అమ్మాటదెస ననాదరంబుసేసి యతండు వెండియుఁ దొంటి యట్ల వర్తించిన. శల్య. 2-148

**అనాది** సం. విశే. (ఇ)

1. ఆదిలేనిది, మొదలు లేనిది.

క. ఆ దేవదేవుఁడు...అనాది నిరవసాన నిజపదస్థితుఁ డయ్యెన్. మౌస. 1-93

2. ఆది లేనివాఁడు, మొదలు లేనివాఁడు, పుట్టువు లేనివాఁడు.

తే. ఆదిమధ్యాంతములు నాకు నరయ లేమి, నైయనాది యమధ్యుఁ డనంతుఁ డనఁగఁ, జెల్లు పేళ్లులు. శాంతి. 6-486

**అనాది నిధనుఁడు** సం. విశే. అ. పుం.

పుట్టుకచావులు లేనివాఁడు.

వ ఆ లోకపితామహు లలాటంబున నానాదినిధనుండును విశ్వజగత్కర్తయు, సర్వభూతాత్మకుండును, సనాతనుండును నగు విరూపాక్షుండు విశాలాక్షు డను నామంబున నావిర్భవించి
శాంతి. 2-203

**అనాదృతము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆదరణము చేయఁబడనిది, తిరస్కరింపబడినది.

క. జూదమునఁ గయ్యమున నీ, కేదురితంబులు నితాంత హృదయక్లేశా, పాదములు వాటిల్లె న,నాదృతములు సేయు వాని కన్నిటి ననఘా.
స్వర్గ. 9

**అనాద్యంతుఁడు** సం. విశే. అ. పుం.

మొదలును చివరయు లేనివాఁడు, శాశ్వతుఁడు.

సీ. అనాద్యంతు నవ్విష్ణు...నమ్మి భక్తి, గొలిచి సర్వదుఃఖంబులు దొలఁగఁ ద్రోచు. .
అను. 5-320

**అనాధృష్యుఁడు** సం. వి. అ. పుం.

కురుకుమారుఁడు, ఇతఁడు గాంధారి కొడుకులైన దుర్యోధనాదులలో తొంబదియవవాఁడు. మహాభారత యుద్ధమున ఎనిమిదవనాఁడు భీమునిచే మరణించెను.
భీష్మ. 3-161

**అనామయత** సం. వి. ఆ. స్త్రీ.

దుఃఖరాహిత్యము.

క. విను మనఘ యింక సుకృతం,బునకుం జొరదుష్కృతంబు పొంతకుఁ బోనే, ననుపము నచ్యుతు నవ్యయు ననంతుఁ జెందెద ననామయత నవ్విష్ణున్.
శాంతి. 5-406

**అనామయము** సం. వి. అ. న.

1. దుఃఖ రాహిత్యమునకును సుఖస్ఫూర్తికిని హేతువు.

తే. ...ధ్రువంబు, నా ననామయ మన నొప్పి లీనరూప,బుద్ధి సంప్రాప్యమగు తత్త్వమునకు వేద,మానిత బ్రాహ్మణులకు నమస్కరింతు.
శాంతి. 5-845

2. దుఃఖము లేమి.

క. అనుపమ మజర మతీంద్రియ, మనామయ మనంత మమల మన
వెలుఁగు నొకం, డని వేదశాస్త్రములచే, విని యుండుదు దానిఁ
దెలుపవే కృప నాకున్. శాంతి. 6-27

3. ఆరోగ్యము, కుశలము.

చ స్థిరమతులైన పార్థులకు సేమము; నీకు ననామయంబె భూవర
తగ విందవైతి కురుముఖ్యుల యిఁటికి. అర. 6-160

**అనాయాసము** సం. వి. అ. పుం.

1. ఆయాసము లేమి, అశ్రమము.

వ. పాశుపత మహాస్త్రంబు నా కిచ్చె; నది నాయందు సన్నిహితంబయి
యున్నది గావున శత్రునిరాసం బనాయాసంబై యుండు.
ఉద్యో. 4-425; అశ్వ. 2-219

2. అవలీల, చులకన.

వ. మదీయ తేజో విశేషంబున నప్పురుహూతున కుత్సాహంబు సంభ
వింపం గలదియ, యప్పు డనాయాసంబునఁ బగతు వధియింపనగు.
ఉద్యో. 1-132

**అనాయుధుఁడు** సం. విణ. అ. పుం.

ఆయుధము లేనివాఁడు.

క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను, సరభసముగఁ గృపుఁడు సంపె సారథి
నమ్మెశ్ర, నరసుతుఁ డనాయుధుండును, విరథుండును నగుట
నూచి వెఱపేది వడిన్. ద్రోణ. 2-108

**అనాయువు** సం. వి. ఉ. స్త్రీ.

1. బ్రహ్మ దక్షిణాంగుష్ఠమునఁ బుట్టిన దక్షునకును వామాంగుష్ఠమునఁ
బుట్టిన ధరణియను స్త్రీకిని కూఁతురు. ఈమెను దక్షప్రజాపతి కశ్యపు
నకు భార్యగా నిచ్చెను. ఆది. 3-61

సం. వి. ఉ. పుం.

2. ఊర్వశీ పురూరువులం కొడుకు, నహుషుని తండ్రి. ఆది. 3-92

**అనారంభకుఁడు** సం. విణ. అ. పుం. (అ-భికా-అ)

నిష్కర్ముఁడు.

సీ. అల్పభోజనులు ననారంభకులు నయ్యు, నత్యంత సంతోషులైన వారు. ఆర. 2-241

**అనారంభుఁడు** సం. విణ. అ. పుం.

ప్రయత్నము లేనివాఁడు.

వ. దుష్కృత్యంబులయం దనారంభు లయ్యును జనులు దుర్జన దర్శన స్పర్శన సంభాషణ సహాసనంబులం జేసి ధర్మవిహీనులగుదురు. ఆర. 1-7

**అనారతము** సం. క్రి. విణ. అ. న.

ఎల్లప్పుడు, ఎడతెగకుండ, అనవరతము.

ఉ. సీరి యనారతంబు దన శిష్యుల లోపల నెల్ల నిన్ను దు,ర్వారపరాక్రమాఢ్యుఁడని వర్ణన సేయుట గేలిచేసి యా,మారితికిన్ జయం బొసఁగె మాల విధాతృఁడు. సౌప్తి. 1-218

**అనారబ్ధుఁడు** సం. విణ. అ. పుం.

ఆరంభింపనివాఁడు, ప్రయత్నింపనివాఁడు.

వ. యదువృష్ణి భోజాంధకులు కృష్ణానుమతంబున సజ్యకర్మంబునం దనారబ్ధులై మిన్నకుండిరి. ఆది. 7-178

(అనారంభులు అని కొన్ని ప్రతులు)

**అనార్జవము** సం. వి. అ. న.

వక్రత, కుటిలత, కాపట్యము.

వ. సంతతోత్సాహవంతుఁడై శత్రుకోటి, నార్జవంబున నైన ననార్జవమున, నైనఁ జెరుపనవలయు. శాంతి. 2-194

**అనార్యము** సం. విణ. (అ. ఆ. అ.)

దుష్టమైనది.

తే. ...అనార్యవృత్తి, గాని తెరవున నడచుచున్నని గురుని,నైన

శాసింపఁగా దగు నం(దు బుధులు. శాంతి. 3-275

2. నింద్యము.

క. ఆర్యులుఁ (బవృత్తి లక్షణ, కార్యంబుల చేతఁజేసి (గ్రాహ్యము నగు త,ద్ధుర్యత్వమందు విడువ ర,నార్యము లగు మదనమద భయ(క్రోధాదుల్. శాంతి. 4-288

**అనార్యుఁడు** సం. విణ. అ. పుం.

ఆర్యుఁడు కానివాఁడు, అవినీతుఁడు.

ఉ. ...సమ(గ కో,పా(గహబుద్ధి మాదెస ననార్యుఁడు కార్యమునందు ధార్త,రాష్ట్రా(గజుఁడు. విరా. 5-15; శాంతి. 5-288

**అనాలస్యము** సం. వి. అ. న.

చురుకుఁదనము, సోమరితనము లేమి.

వ. ...అవ్వరమసాధ్వి దన య(గతనయుం డాదేశించిన తెఱఁగూహించి రెండవ యండబున జనియించిన తనూజుం దలంచుచు నాసపాటు గదిరిన హృదయంబుతో దాస్య మనాలస్యంబున నడపుచుండ. అను. 1-202

**అనాలస్యుఁడు** సం. విణ. అ. పుం.

ఆలస్యము లేనివాఁడు, జాగరూకత గలవాఁడు, ఏమఱుపాటు లేనివాఁడు.

వ. నీ వనాలస్యుండవును సహాయసంపన్నుండవును నై నెగడుము. శాంతి. 3-85

**అనావర్షము** సం. వి. అ. పుం. న.

వర్షము లేకపోవుట, అనావృష్టి.

తే విమల వంశంబునను బుణ్యవృత్తమునను, వఱలు నీకని రక్షంబు వసుమతీశ, ధరణిపై నెన్ని బిందువుల్ దొరఁగె నన్ని, వర్షములు గల్గు నిం దనావర్ష భయము. విరా. 5-261

**అనావృత** సం. విణ. ఆ. (స్త్రీ.

అడ్డు పెట్టఁబడనిది, నియమింపఁబడనిది (అందఱచేఁ జూడఁబడఁదగినది - స్వైరిణి)

వ. ...తొల్లి స్త్రీలు పురుషులచేత ననావృతలయి స్వతంత్రవృత్తి నఖిలప్రాణి సాధారణంబైన ధర్మంబునం దమతమ వర్ణంబులందు ఋతుకాలంబు దప్పక నియతానియత పురుషలయి ప్రవర్తిల్లు చున్న. ఆది. 5-81

శ్లో. అనావృతాః కిల పురా స్త్రియ ఆసన్ వరాననే
కామచార విహారిణ్యః స్వతంత్రా శ్చారుహాసిని
అనావృతాః సర్వైర్ద్రిష్టుం యోగ్యాః. సం. భా. ఆది. 128-4

**అనావృష్టి** సం. వి. ఇ. స్త్రీ.

వానలు లేకపోవుట-వఱవు (ఈతిబాధలలో నొకటి)

వ. ఇక్ష్వాకుమారుండు నీపేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పంద్రెండేం డ్లనావృష్టియైన నయ్యాపదఁ బొందకుండఁ బెక్కండ్రు మునుల రక్షించి వేదాధ్యయనంబులు సేయించు నని చెప్పి యొప్ప గించిన సరస్వతి ప్రీతియై తనయుం గొని చనియె. శల్య. 2-208

**అనాశము** సం. విణ. (అ. ఆ. ఆ.)

నాశము లేనిది

క. ఆ శౌర్యం బా సత్త్వం, బా శీలం బా పరాక్రమాఖిలత్వం, బా శుద్ధవ్రత మెందు ననాశము లని భీష్ముఁ బెద్ద నమ్మితిమిగ దే.
భీష్మ 1-58

**అనాశ్రయము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆశ్రయము లేనిది.

వ. అతఁడ స్తమించిన ధాత్రి య స్తమితసుధాగభస్తియగు రాత్రియుం బోలె నగు సకల జ్ఞానంబులు ననాశ్రయంబులై పొనుంగువడు.
శాంతి 2-15

**అనాహారము** సం. వి. అ. పుం.

ఆహారము లేకుండుట, ఉపవాసము, పస్తు.

క. భాగీరథి యెచట నుదగ్భాగమునను శివుని నెలవు ప్రాంతమునం జనున్, దిగణ్య యచట నెలకు సమాగతులగు సురలఁగం డ్రనా హారవిధిన్. అను 2-75

డును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని.

విరా. 1-180

వ. నిను సర్జునుండని యెఱింగిన యంతన పాసె నెల్ల కిల్బిషములు.

విరా. 4-159

9. ధ్వన్యనుకరణమును సూచించును.

క. ...గాంధారేయులు వెస నొక్కపెట్ట రేఁగి యతనిపైఁ, గోయని కవిసిన. భీష్మ. 2-100

**అనిందితము** సం. విణ. (అ. ఆ. అ)

దూషింపఁబడనిది.

వ. ఈ లోకంబున వనితలు బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతు రిచ్చటి కిది యనిందితంబైన యాచారంబు. ఆగ. 1-368

**అనింద్య** సం. విణ. ఆ. (స్త్రీ).

ఉత్తమురాలు, నిందింపఁదగనిది.

క. నీ తోడి పరిచయము లేదే తలపోయఁగ ననింద్య యెందును నీవి, ట్లాతుర వగుటకె నామది నేతాపము లేదు నైజ మెఱుఁగవు గంటే.

విరా. 3-51

**అనింద్యము** సం. విణ. (అ. ఆ. అ.)

దూషింపఁదగనిది, నిందింపఁదగనిది, ఉత్తమమైనది.

ఉ. నీవిభవం బహింసయు ననింద్యచరిత్రము గాక యన్యమే.

ఉద్యో. 1-328

**అనింద్యుఁడు** సం. విణ. అ. పుం.

నిందింపఁదగనివాఁడు, పూజ్యుఁడు, అర్హుఁడు.

క. ...దివ్య బోధంబున నలవడు నట్టి పెంపుఁ బొందు మనింద్యా.

శాంతి. 2-124

**అనింద్రియుఁడు** సం. వి. అ. పుం.

ఇంద్రియములు లేనివాఁడు.

తే. ఇతఁ డబీజుం డదేహుం డనింద్రియుండు. శాంతి. 6-31

**అనింధనము** సం. విణ. (అ. ఆ. అ)

కట్టెలేనిది, రగుల్చుట లేనిది.

తే. ...వితతోజ్జ్వలాగ్ని, యద్భుతముగ ననింధనమై వెలుంగ. అను. 1-355

**అనికేతనుఁడు** సం. విణ. అ. పుం.

1. నియమితమైన నివాస గృహము లేనివాఁడు.

సీ. ఆశ్రమయం దగ్ని సమారోపణము సేసి యజన మాంతరముగ నకృత సంధి, విగ్రహుండగుచుఁ బరిగ్రహ విముఖుఁడై మునుండు ననికేతనుండు వృక్ష, మూలవాసియు...గాఁగవలయు. శాంతి. 5-142

2. స్థిరనివాసము లేనివాఁడు.

వ. అంతన ండియు నమ్మహానుభావు నేకవస్త్రు ననికేతను నన్వేషించుచు సైరంధ్రీ వృత్తంబు నేకొని...బరిభ్రమించితి. అర. 2-118

**అనికొను** దే. స. క్రి.

తలఁచు, భావించు.

చ. ...శరంబులం, గురియుచుఁ జంపినాఁడ ననికొందు జయంబు సముద్భటంబుగన్. ద్రోణ. 5-422

**అనిచిపుచ్చు** దే. స. క్రి.

పంపివేయు, వీడ్కొలుపు.

క. పోయెదఁ బనులు గల వనిచి పుచ్చుము నన్నున్. అను. 2-24

**అనితరము** సం. విణ. (అ. ఆ. అ)

అన్యము కానిది, మఱియొకనికిఁ జెందనిది.

క. అనితర సులభోద్యమమున, ధనంజయుం డిట్టులను నతనితో మఱియున్. విరా. 5-115

**అనితల** దే. వి.

యుద్ధరంగము.

చ. అనితల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలుచేయు నా,తన యులకుం బరాక్రమము దక్కువయుం బ్రకటింప విందు.
భీష్మ. 2-258

**అనిత్యత** సం. వి. ఆ. స్త్రీ.

అశాశ్వతము, అస్థిరత్వము.

తే. నరుఁ డనిత్యత యూహించు టరయ నురవు. శాంతి. 1-218

**అనిత్యత్వము** సం. వి. అ. న.

అశాశ్వతము, స్థిరము గాకుండుట.

క. భూ శానిత్యత్వ మదియ పుచ్చును వగలన్. స్త్రీ. 1-67

**అనిత్యము** సం. వి. అ. న.

1 ప్రకృతి, మాయ.

శా. నిత్యానిత్య వివేక వైభవ సమున్నిద్రాంతరంగస్ఫుట, ప్రత్యహా.
ఉద్యో. 2-382

సం. విశే. (అ. ఆ. అ.)

2. నిలుకడ లేనిది, చంచలము.

తే. యౌవనంబును రూపంబు జీవితంబు, ద్రవ్య సంచయములు ననిత్యములుగా వె.
స్త్రీ. 1-27

3. శాశ్వతము కానిది, నశ్వరము.

తే. నిత్యు, డాత్మ౦దు దేహ మనిత్యము. అను. 5-125

4. అవిద్యాకల్పితమగుటచే నిత్యము గానిది.

క. అనిమిత్తము భూతంబుల, జననం బవి రూపు సెడుట సంపన్నములై యునికి విషాదము మోదం,బును జేయఁగలే వనిత్యములుగ నెఱిఁగినన్.
శాంతి. 4-55

**అనిపించు** దే. స. క్రి. ప్రే.

అనునట్లుచేయు, అన్పించు.

క. కలిమియ చుట్టలఁ జేర్చుం, గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యోజ్జ్వలుఁ డనిపించుం గలిమియ పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. శాంతి. 1-51

**అనిమిత్తము** సం. వి. అ. న.

1. కారణము లేమి, నిష్కారణము.

క. అక్కట నా హృదయము గడు, నక్కటికము లేనిదయ్యె ననిమిత్తమ యీ, కొక్కెర నిటు సేసితి, నా కెక్కడి శాంతి యని వికల హృదయుండగుచున్. అర. 5-8

2. కారణము లేనిది. సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమైన ఏకరసాత్మకమైన వస్తువునుండి జగత్తుయొక్క పుట్టుక చెప్పఁబడుచున్నది. అవిద్యాకల్పిత మగుటచే ఇయ్యది అనిమిత్తమని చెప్పఁబడినది.

క. అనిమిత్తము భూతంబుల, జననం బవి రూపు సెడుట సంపన్నములై, యునికి విషాదము మోదం,బును జేయఁగ లే వనిత్యములుగ నెఱిఁగినన్. శాంతి. 4-55

"స దేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం
తదైక్షత బహుస్యాం ప్రజాయేయ- శ్రుతిః."

**అనిమిషగురుఁడు** సం. వి. ఉ. పుం.

దేవతలకు ఆచార్యుఁడు బృహస్పతి.

శోకం బడరఁగ ననిమిషగురుఁ జూచి, ఉద్యో. 1-157

**అనిమిషగురుతార** సం. వి. ఆ. స్త్రీ. అ. నపుం.

పుష్యమి, అశ్వని మొదలగు నక్షత్రములలో ఎనిమిదవది. ఇది మంచి పుష్టిని గలిగించును.

అనిమిష గురుతార సృష్టి. అను. 3-168

**అనిమిషత్వము** సం. వి. అ. న.

రెప్ప వాల్పకుండుట.

తే చూచి రమరు లక్ష్మి, ననిమిషత్త్వంబు దమ కప్పు డచ్చుపడఁగ.
విరా. ౬-౧౬౫

**అనిమిషపతి** సం. వి. ఇ. పుం.

దేవేంద్రుఁడు. దేవతలకుఁ బ్రభువు.

సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న, సంచరణమున వర్తించుట యును. విరా. 1-54

**అనిమిషము** సం. విణ. (అ. ఆ. అ)

ఱెప్పపాటు లేనిది, వికసించినది.

క. అ,య్యనిమిష చారువిలోచన, యనురూప విధాన నిరతయై యుండంగన్. విరా. 2-246

**అనిమిషుఁడు** సం. వి. అ. పుం.

1. దేవత.

చ. అనిమిష దానవాంబర చరాదిక జాతుల నెల్ల. విరా. 1-168

2. అనిమిషులు- ఇంద్రియములు.

ఆ. బుద్ధిఁగొని మనంబు వోనీక నిలిపి మ,నోభియుక్తి నింద్రియముల నాఁగి, విషయ సమితి వెడల విడిచినవానికి, ననిమిషులు ప్రసన్ను లగుదు రనఘ. శాంతి. 4-314

(దేవతా పర్యాయ శబ్దములన్నియు ఇంద్రియములకుఁ జెల్లును)

**అనిమీలత్** సం. శత్ర.

మూసికొనుచున్న.

లయగ్రాహి. ...అనిమీలదరవింద సరసీవనములందు... ఆది.5-189

**అనియతము** సం. విణ. (అ. ఆ. అ)

1. పర్యాటులేనిది, కట్టుబాటు లేనిది. 2. నిలుకడలేనిది. 3. అనిశ్చితము.

ఆ. అనియతంబులైన యాహార విహరణ శయనముల విధాత్మసంప్ర యుక్త, భంగిఁ బరఁగు నంతరంగ నిర్భరవ,ర్తనము కలిమి యజ గర వ్రతంబు. శాంతి 4-68

**అనియతుఁడు** సం. విణ. అ. పుం.

నిశ్చితుఁడు గానివాఁడు, నియమము లేనివాఁడు.

వ. తొల్లి స్త్రీలు పురుషులచేత ననావృతలయి స్వతంత్ర వృత్తి నఖిల ప్రాణి సాధారణంబైన ధర్మంబునం దమతమ వర్ణంబులయందు ఋతుకాలంబు దప్పక నియతానియత పురుషులయి ప్రవర్తిల్లు చున్న. ఆది. 5-84

**అనియు** దే. క్రియ.

అని చెప్పఁబడుచున్నదనియు వాక్యాంతర సంయోజకము.

ఆ. స్వప్నమనఁగ సుప్తజనము మనశ్చేష్ట, యనియుఁ గాంచు మన మనాగతములఁ, గాన కలలు సూచకములగు భావిశుభాశుభోద యముల కనియుఁ జెప్పె. అను. 5-158

శ్లో. సుప్తానాం తు మనశ్చేష్టా స్వప్న ఇత్యభిధీయతే
అనాగతమతిక్రాంతం పశ్యతే సంచరన్మనః.

సం. భార. అను. 227-40 (నిర్ణయ)

సం.ము "అదియుఁ గాంచు" అని అనందప్రతిలో ఈయబడిన పాఠాం తరము పాఠముగా నీయఁబడినది. పై మూలమును బట్టి "అనియు" అనుటయే యుక్తమేమో అనిపించుచున్నది.

**అనిరతము** సం. విణ. (అ. ఆ. అ)

ఆసక్తిలేనిది.

ఉ. ...మానవనాథుఁడు తాల్మిఁ జేసి బద్ధానిరతాత్ముఁడై యరిగెః మహా. 42

**అనిరుద్ధుఁడు** సం. వి. అ. పుం.

1. నారాయణుని చతుర్వ్యూహములలో నొకటి.

వ. అద్దేవుండు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాత్మంబులగు చతుర్విధ దివ్యస్వరూపంబులు గలిగి. శాంతి. 4-206

2. శ్రీవిష్ణువు.

సీ. క్షేత్రజ్ఞుఁ డాతండు జీవుండు వాసుదేవుండును సంకర్షణుండుఁ

జూవె, వారు మనం బహంకారంబు వరుసఁ బ్రద్యుమ్నానిరుద్ధ నామోపహితము. -తే- వింతయును మన్మయంబు... పరమ పురుషుఁడనియు నాపేరు మఱి పర మరయ లేదు. శాంతి. 6-381

౩. ప్రద్యుమ్నుని కొడుకు.

వ అక్రూర సారణ సాత్యకి సాంబ సంరక్షణ ప్రద్యుమ్న కృష్ణ కృత వర్మానిరుద్ధ యుయుధాన ప్రముఖులైన యదు వృష్ణి భోజాంధక వరులను. ఆది. 7-170

**అనిరూపణీయము** సం. విణ. (అ. ఆ. అ)

నిరూపింపఁబడనిది.

క. వనితలు మాయావినులై, యనిరూపిత చిత్తవృత్తి నంచితరతుం, బనుపడకుండుదురైనను, విననది కథ యొకటి నీకు వినిపింతుఁ దగన్. అను. 2-181

**అనిరూప్యము** సం. విణ. (అ. ఆ. అ)

నిరూపింప సాధ్యముగ్గానిది.

క. చని రన వశమే యద్భుత, మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీ రమణా. అను. 5-309

**అనిర్జేయుఁడు** సం. విణ. అ. పుం.

జయింప శక్యము గానివాఁడు.

హంస డింభకు లనువార లనిర్జేయులు. సభా. 1-111

**అనిర్దేశము** సం. వి. అ. పుం.

నిర్దేశము లేమి.

క. ...పురుషుఁడు నిశ్లేపుఁ డనిర్దేశముం గలిగి వెలుగొందున్. శాంతి. 5-64

**అనిర్వచనము** సం. విణ. (అ. ఆ. అ)

అర్థ వివరణముచేసి చెప్పరానిది.

విష్ణునామంబు లనిర్వచనంబులు. శాంతి. 6-418

**అనిర్వాచ్యము** సం. విణ. (అ. ఆ. అ)

నిర్వచింపరానిది.

క. వ్యక్త మనిర్వాచ్యం బ,వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వ ధురా,యుక్తము కలిత గుణత్రయ, శక్తి నవద్వారపుర మసాధ్యముసుండీ. అశ్వ. 2-114

**అనిలజుఁడు** సం. వి. అ. పుం.

భీముఁడు, పాండురాజు రెండవ కుమారుఁడు. వాయుదేవుని వలనఁ బుట్టినవాఁడు.

తే. అని నిగూఢభాషణముల నయ్యజాత, శత్రుఁ డనిలజుకోపరసంబు పేర్మి, సెటిచె. విరా. 2-187

**అనిలతనయుఁడు** సం. వి. అ. పుం.

అనిలజుఁడు.

వ. అనిల తనయు నిరీక్షించి తత్కాలజనితంబైన ఖేదంబున. విరా. 1-78

**అనిలతార** సం. వి. ఆ. స్త్రీ.

స్వాతి యను నక్షత్రము, అశ్వని మొదలగు నక్షత్రములలోఁ బదునైదవది.

తే. అనిలతార వాణిజ్య వర్ధనము గలుగు. అను. 3-168

**అనిలము** సం. వి. అ. పుం.

వాయువు.

వ. ప్రజ్వల జ్వాలాభీలంబగు నయ్యనలం బనిలంబుచేతం జెడు. శాంతి. 6-88

**అనిలసుతుఁడు** సం. వి. అ. పుం.

వాయుదేవుని కొడుకు-భీముడు.

క. ...ధర్మతనూజుం, డను జన్మ్మలదెసఁ జూచిన, ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్. విరా. 1-55

**అనిలాస్త్రము** సం. వి. అ. న.

వాయవ్యాస్త్రము.

అనిలాస్త్రంబు ప్రయోగించిన. ద్రోణ. 264

**అనిలుఁడు** సం. వి. అ. పుం.

1. వాయుదేవుడు. చూ. అనిలసుతుఁడు,

2. అష్టవసువులలో నైదవవాఁడు. ఆది. 8-67

**అనివర్తనము** సం. విశ. (అ. ఆ. అ)

వెనుకకుఁ దిరుగనిది, వెనుదీయనిది, తొలఁగిపోనిది.

క. అనివర్తన మతిఁ గవయఁగ, ననిఁ బోనీదగు తనువు సునిశితాయుధ
ములు దాఁకిన నొవ్వదు. కర్ణ. 1-304

సం. వి. అ. న.

వెనుకకుఁ దిరుగకుండుట, వెనుదీయకుండుట.

సీ. ...రాజులు బ్రాహ్మణారాధనంబు, జన్మముల్ సేఁతయు సమ
రానివర్తన వ్రతమును గలదు. శాంతి. 2-341

**అనివర్తి** సం. విశ. న్. పుం. (న్. నీ. న్.)

మఱలనివాఁడు. వెనుదీయనివాఁడు.

వ. భవదీయ జ్ఞాతులు సమరంబున ననివర్తులై యూర్ధ్వలోకవర్తులైరి.
అశ్వ. 1-7

**అనివారణ** సం. వి. ఆ. స్త్రీ

క. మీరేమి సేయుదురు దై, వారంభముగాక శుభము నశుభంబును
సంసారులఁ దన తన తఱినని, వారణఁ బొందంగ మాన్పవచ్చునె
వానిన్. విరా. 2-227

**అనివారితము** సం. విశ. (అ. ఆ. అ)

నివారింపఁబడినది.

సీ. వారిధారల నని వారిత నిర్గళ,ద్దానధారలఁ దటిద్దామములను.
అర. 3-355

**అనివార్యము** సం. విణ. (అ. ఆ. అ.)

నివారింపఁబడినది.

చ. ...శల్యుఁ డెగటార్చెద నాకిది కృత్య మీ సముద్యమ మనివా
ర్యమై నెగడునట్టి తెలుంగు వినుఁడు చెప్పెదన్. శల్య. 1-284

**అనిశము** క్రి. విణ.

ఎల్లప్పుడు.

సీ. మదిఁ దల్లిదండ్రుల మాఱుగాఁ గొని జను, లనిశంబు భక్తి సేయంగ
నెగడె. విరా. 2-216

**అనిశ్చయము** సం. విణ. (అ. ఆ. అ.)

నిశ్చయము గానిది.

వ. ధర్మంబు లనేక విధంబులు వీనిలో నెవ్వం డెయ్యది యవలం
బించె నదియ వాఁడు మేలను నే మన్నింటి మీఁదనుం బరఁగిన
బుద్ధులు గలిగి యనిశ్చయ దర్శనులమయియుండుదు మిది ప్రధా
నానుష్ఠేయం బని యుపదేశింపవలయు. అశ్వ. 2—187

**అనిష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

సమ్మతము గానిది, అప్రియము.

వ. అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్టప్రాప్తులకుం గారణంబులు
గసు గొనలేవు. శాంతి. 1-217

సీ. ...అనిష్టంబు ద్రోవను నిష్టంబు దేరను, నరుఁడు గర్మాచరణం
బొనర్చు. శాంతి. 4-172

వి. అ. న.

కీడు, ఆపద.

వ. వ్యాధిశ్రమానిష్ట సంస్పర్శనేష్ట వివర్జనంబులను నాల్గిటం బుట్టు
శారీరదుఃఖంబు లౌషధక్రియాది ప్రతిప్రయోగంబుల నుపశమిల్లు.
అర, 1-22

**అనిష్టుఁడు** సం. విణ. అ. పుం.

ఇష్టము గానివాఁడు, అప్రియుఁడు.

క. ఖలు నసుర నోర్వనోపెదు, బలయుతుఁగా నెఱిఁగి కొడుకుఁ బంచితిఁగా కిమ్ముమ్మల శతపుత్త్రిలుగల ధన్యులకైన ననిష్టుఁ డగు తనూజుఁడు గలఁడే. ఆది. 6-274

వి. అ. పుం.

విరోధి, అహితుఁడు

క. కుపథప్రవృత్తుఁ డయి వీఁ, డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా, నిపుణుఁడవై నీ మఱఁదికి, నపరాధశతంబు సైపు మయ్య యుపేంద్రా. సభా. 2-59

**అనీకము** సం. వి. అ. పుం. న.

1. సేన,

శా. ...శతా, నీకుం దుర్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్. విరా. 3-146

చ. ...కూడి నిల్పిన యనీకము నంగడ నుంచి యోధులం, గలయఁగ. శాంతి. 3-7

2. సమూహము.

వ. ఇట్లు దివిజానీకంబును, మునిలోకంబును జాకశాసనుం బురస్కరించుకొని. ఉద్యో. 1-129

**అనీకిని** సం. వి. ఈ. స్త్రీ.

1. సైన్యము.

ఉ. నీకుఁ బ్రియంబుగా భవ దనీకినికిం బతి నయ్యెదన్. అర 5-231

2. చమువునకు మూఁడురెట్లు సైన్యభాగము.

అక్షోహిణిలోఁ బదియవపాలు. (2187 రథములు, 2187 ఏనుఁగులు, 6561 గుఱ్ఱములు, 10935 కాల్బురుగల సేనావిభాగము) ఆది. 1-80

చూ. అక్షౌహిణి.

**అనీతి** సం. వి. ఇ. స్త్రీ.

దుర్ణయము, నీతిలేమి.

క. తన సవతియైన కద్రువఁ, గని వగవును మత్సరంబుఁ గదిరెడు
మదితో, వినత గడున్ వేగిరపడి,యనీతినొక యెడ మఱియ నడిచె
నరేంద్రా. కల్య. 2—299

**అనీలుఁడు** సం. వి. అ. పుం.

కద్రువకుఁ బుట్టిన వేయి కొడుకులలో నొకఁడు, ఆది. 2–4

**అనీశ్వరము** సం. విణ. (అ. ఆ. అ.)

ఈశ్వరము కానిది, ప్రభువు కానిది, స్వాతంత్ర్యము లేనిది.
తే. అన్ని తత్త్వంబులకు నమృతార్థతత్త్వ,మెక్క డది యీశ్వరంబు,
నసీశ్వరంబు, సత్యపాకంబు సతిరహస్యంబు దానిఁ గనిన మృత్యు
జాలము చిక్క గడవవచ్చు. అను. 4–188

**అనీహ** సం. వి. ఆ. స్త్రీ.

ఉత్సాహములేమి, ప్రయత్నములేమి,
వ. అనీహామానుఁడయి దైవపరుండయినవాఁడు నీటిలోని యాన
పాత్రంబునుంబోలె నవసన్నుండగు. అర. 1-286

**అనీహమానుఁడు** సం. విణ. అ. పుం.

ఉత్సాహము లేనివాఁడు, ప్రయత్నము లేనివాఁడు.
చూ. అనీహ. అర. 1-286

**అను**[1] దే. స. క్రి.

(కొన్ని యెడల అన్వయమునకై దీనికిఁ బూర్వము ఇత్యర్థకమగు అని
అనునది కల్పుకొనవలయును.)

1. చెప్పు, పలుకు.

వ. ...నన్ను నాకర్షించి కొలిపించికొని వీఁడె విజయం చేయుచున్న
వాఁడనుచుం జూపుటయు. విరా. 1–11

క. నలువురు నాలుగు వేద,మ్ముల మంత్రంబులను బ్రహ్మముఖములు
పోలెన్, వెలయంగ సంస్తుతించుచు, నలఘులు మాకభయ మభయ
మని రయ్యనలున్. ఆది. 8-311
(అభయ మభయ మనిరి = అభయ మభయ మని పలికిరి)

2. ఒక వస్తువును మఱొక వస్తువుగా నిరూపించుట (రూపకము)

సీ, వదన బాణాసన వ్యక్తముక్తములైన, పలుకుల నక్కడు వాఁడి బాణతతుల. ఆది. 8-206

(తద్ధర్మార్థక విశేషణ రూపమగు 'అను' నకు హల్లు పరమైనపుడు ఉత్త్వ లోపమును గలదు)

3. నామనిర్దేశమును దెల్పును.

ఉ. శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప. విరా 1-1

క. ...పూర్వార్థతను సహితుఁ డరుణుఁ డనం,గా నుదయించె సుతుండు మ,హానీతియుతుండు తల్లి కప్రియ మెసఁగన్. ఆది. 2-6

ఉ. అలుమ దాసియున్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్. ఆది. 3-174

4. అడుగు, ప్రశ్నించు.

వ. ...తదీయ ప్రియ శిష్యుండయిన వైశంపాయను వలన వినిన కథ యగుటం జేసి తత్ప్రకారంబున నడిపెద నది యెట్లనిన. విరా. 1-43

(ఎట్లనిన = ఎట్లని ప్రశ్నించిన)

5. ప్రత్యుత్తరమిచ్చు, సమాధానమిచ్చు.

క. అని యడిగిన వైశంపా,యనుఁ డిమ్మనుజేంద్రచంద్రు నధికౌత్సు,క్యం,బున కలిమికిఁ దన హృదయం,బున గాఢాదరము భరిత ముగ నిట్లనియెన్. విరా. 1-45

(ఇట్లనియెన్ = ఇట్లు సమాధానమిచ్చెను)

6. బాంధవ్యమును పరిగణించు

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు, మిత్రుల నరు రాజు లాజ్ఞ మిగిలిన చోటన్, శత్రులకాఁ దమ యలుకకుఁ, బాత్రము సేయుదురు నిజ శుభస్థితి పొందెన్. విరా. 1-124

7. సందేహించు.

క. మన యింట నిచ్చ టచ్చో,టన కెచ్చటనైన నీ బృహన్నల మెలఁగం

జనియెడు మానిసి తనమన,మున కిమ్మగునట్టి చరితమున వర్తిం
చున్. విరా. 1-254

చ. ఇది యుచితంబు గాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండ
దు,రర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి. సభా. 2-219
(ఉచితంబు గాదనక = తగదని సందేహింపక)

8. తెలిసికొను.

క. పెనుమిట్టిది పల్లంబిది, యనకుండఁగ నోలమును బయలు నొక్క-
టిగాఁ, గనువిచ్చుటయును మోడ్చుటయును సరిగాఁ దమము
పర్వె నుర్విం దోడ్తోన్. విరా. 2-321

9. వివరించు

ఆ. అట్లుగాక యింత యననేల నీమది, తెలుఁగు గొంత యేను నెఱుఁగ
కున్న, దానఁగాను. విరా. 3-53

10. ఆలోచన చెప్పు.

క. బరవసము మైఁ ద్రిగర్తేశ్వరుఁ డిట్లను టుచిత మింక జననాయకుఁ
డెప్పురుసున నానతి యిచ్చెను, దొర లేమని రట్ల చేయఁ దుది
కార్యమగున్. విరా. 3-122

11. ప్రశంసించు.

చ. .. యి, ట్లనఁదగునయ్య యే నిచటనైనది యేటిది యింత యేటి
కిన్. విరా. 3-225

12. నిర్దేశించు.

క. భవదీయ ప్రార్థనచేఁ దివిరి పరమ దుష్కరములు దీర్చియయిన
న్యుత్సవ మొనరించెద సార,ధ్య విధం బొకఁడనఁగ నేల యంబు
జవదనా. విరా. 4-31

13. గౌరవముంచు, లక్ష్యముంచు,

క. పేనుఁగు నంటఁగ నగునే, భూనాథ తనూజుఁ డనక పులిలోడకొ
న, న్నీ నీచవుఁబనిఁబనుపం,గా నీకుం దగునె పాపకర్మముగాదే.
విరా. 4-109

14. నిందించు, ఆక్షేపించు.

క. నిన్నెఱుఁగక యేనేమే, నన్న పలుకులెల్ల మఱచి యాశ్రితరక్షా,
సన్నద్ధభావ మేర్పడ, నన్నుం గృపజూడవే సనాథుఁడ నగుదున్.
విరా. 4-151

క. ఒఁటిమెయిఁ దాఁక నా ముక్కంటికి వశమగునె కృష్ణగాండీవుల
నిట్లఁటు యుడిగి తగు రథికుల, జంట గొని రణమ్ము సలుపు
శత్రులు దలఁకన్.
కర్ణ. 2-85

సీ. ఇట్టి క్రూరుల యింటి కిచ్చిన మునవారి నందుఁగా కట్లు దా ననుట
మేలె.
ఉద్యో. 3-195

15. బోధించు, తెలుపు.

తే. జ్ఞాన విజ్ఞాన దృష్టి శాశ్వతిక తత్త్వుఁడయ్యె నేనియు విడువరా
దాశ్రమములఁ, గ్రమసమారూఢి యనునె వేనములు దీనిఁ,
దెలియఁజెప్పవె మోక్షవిత్తిలకజన్మ.
శాంతి. 6-275

16. ఎంచు, భావించు, తలఁచు.

చ. వినుము సుయోధనాదులగు వీరు సధర్ములు గాక కార్యము,
ల్గొనక మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబు వర్తనమిది
గాదునాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి, న్మనములు నొవ్వఁగా
నవగుణంబులకుం బుయిలోడ రేమియిన్.
ఉద్యో. 3-261

(నాక అనక = అనితలఁపక)

చ ధరణిపు చక్కఁగట్టెదురు దక్కిపిఱుందను గానియట్లుగా, నిరు
గెలనం దగం గొలిచి యేమనునోయెటు సూచునొక్కొ యెవ్వరి
దెస నెప్పు డేతలఁపు వచ్చునొ యాతని కంచుఁ జూడ్కిను, స్థిరముగఁ
దన్మొఖఁబునన చేర్చుచు నుండుట నీతి కొల్వునన్. విరా. 1-129

17. మేలమాడు, పరిహాసమాడు.

క. వెఱ పెట్టిడియో యెన్నఁడు, నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో
యీాపిటికితన మింత యలవడఁ, గఱపిన వారనుచు శౌరి కలకల
నవ్వెన.
ఉద్యో. 3-57

18. దుఃఖించు.

చ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన. ఉద్యో. 3-119

**అను**[2] సం. అవ్య.

సమాస పూర్వకముగా మండి తఱచు నీ క్రింది యర్థముల నిచ్చును.

1. అనంతరము, తరువాత.

**అనుజన్ముఁడు** (తరువాత బుట్టినవాఁడు- తమ్ముఁడు) విరా. 1-55

2. ఆశ్రయము, ప్రాపు.

**అనుజీవి** (ఒకరి నాశ్రయించి జీవించువాఁడు) అను. 1-152

3. సహార్థము.

**అనుచరుఁడు** (తోడఁ దిరుగువాఁడు. వెంట సంచరించువాఁడు) భీష్మ. 3-120

4. అనుకూల్యము.

అనువర్తనము (తగిన నడవడి) విరా. 3-41

5. వీప్సార్థము.

**అనుదినము** (దినదినము, ప్రతిదినము) విరా. 1-94

6. అనుగతము, ప్రాప్తము.

అన్వర్థాభిధానుఁడు (అన్వర్థము = పొందిన అర్థకము గలది) భీష్మ. 1-396

7. పునరర్థకము.

అనువచనము (అనువాదము. మఱలఁ జెప్పుట) శాంతి. 4-225

అనుద్యూతము (మఱల ద్యూతము) సభా. 2-274

8, కొన్నిచోట్ల నిరర్థకముగాఁ బ్రయోగింపఁబడును.

అనులేపనము (లేపనము, పూఁత) విరా. 3-2

అనుశాసనము (శాసనము) అర. 6-311; ఆది, 5-3

**అనుంగు; అనుఁగు** వై. విశే. (సం. అనుగః. త. అణుక్కన్ = దగ్గఱవాఁడు)

1. ప్రియము,

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ గోడలి కెక్కుడు గూర్తు.

ఉద్యో. 3-187

2. ప్రియుఁడు,ఇష్టుఁడు అనురక్తుఁడు.

క. నరుఁ డనుఁగు బంటు గావునఁ బోరిగొనఁ బోర వీవు.

ద్రోణ. 5-26

చ. పతికి ననుంగులైన తగు బంధుల మిత్రుల భోజనాది సత్కృత
ముల నాదరించుచు నకృత్రిమభక్తి విశేషసంతతో,త్థితమతివై
చరింపుము. అర. 5-319

3. ప్రియురాలు, ననుపుకత్తె.

వ, ఏను వంద యను నప్సరసఁ గుబేరుననుంగ వా సఖులు సౌరభే
యియు, సమీచియు, బుద్బుదయు, లతయు ననువారలు.

ఆది. 8-153

వి.

4. మిత్రుఁడు, స్నేహితుఁడు, ఆప్తుఁడు.

వ. ఇవి మీ యన్న వోయిన పోకు లిట్లు దుర్యోధనునకు ననుంగై
యుండం గళింగపతి యగు చిత్రాంగదుండు శుభాంగియను నిజ
పుత్రికి స్వయంవరమహోత్సవంబు సేయించువాఁడై చాటించిన.

శాంతి. 1-28

సీ. సభ కేకవస్త్ర రజస్వల యరక నన్ తలపట్టి యీడ్చిన తప్పుఁ దనదు
-తే- కొడలు సూపిన తప్పును దుష్టకష్ట,తర వచనములఁ బలిచిన
తప్పు ననుజు,నందు దుర్యోధనుని యందు ననుఁగునందుఁ, గాంచి
దండించి తిట్టిది కల్మషంబె. శాంతి. 1-94

(కర్ణునందు దుర్యోధనునియందు ననుజునందు- అను పాఠాంతరము
సరియైనది కాదు. తలపట్టి యీడ్చినవాఁడు అనుజుఁడు దుశ్శాసనుఁడు
గాని కర్ణుఁడుగాదు. దుష్టకష్టతర వచనములు పల్కినవాఁడు కర్ణుఁడు
గాని అనుజుఁడు దుశ్శాసనుఁడు కాదు)

**అనుఁబో** దే. జాతి.

అనును బొమ్ము (నిశ్చయార్థమును దెల్పును)

క. ...పాండురాజసుతులను నిమ్మో, దిని వారి సగపాలీఁదగు, నమఁ
బో యే నీనుగాని యది యట్లుండెన్. ఉద్యో. 3-168

**అనుకంప** సం. వి. ఆ. స్త్రీ.

దయ, కనికరము.

క. అనుకంపాతిశయంబునఁ, దన దక్షిణ నేత్రమును సుధారోచియకా,
నను వింతలేక చూచి వదనమునఁ దరహాసరసము దళుకొత్తంగన్.
ఉద్యో. 3-10

**అనుకంపనము** సం. వి. అ. న.

చ. ...శరణాగతానుకంపనములనఁగాఁ బ్రసిద్ధులగు భారతవీరుల.
ఆది. 3-10

**అనుకంపనీయ** సం. విశ. ఆ. స్త్రీ.

దయచూపఁదగినది.

వ. ఇది మదనుజీవిత యనియును, ననువ్రత యనియును, ననుకంప
నీయ యనియుఁ నన్ను విడువక, నాయనుగమనంబున కొడంబడు
మనిన. అర. 2-75

**అనుకరించు** సం. స. క్రి.

1. ఒకరు చేసినట్లు చేయు.

వ. ...మొగిడియు జనంబు సంధ్యాంజలిపుటకరణంబుల ననుకరించు
విధంబునం దర్శనీయంబులగు కుముదవదనంబులును. విరా.2-240

2. ఒకరు చెప్పినట్లు చెప్పు.

వ. దాని నన్వేషించి యెందునుం గానక ప్రలాపించినం దత్ప్రలాపం
బేను ననుకరించితి. అర. 2-187

3. పోలు, సాటివచ్చు, పురుడించు.

తే. కవిసి వ్రేసిన గక్కువ గద యమర్చి, యాఁగి వజ్రప్రహారంబు
ననుకరింప, ద్రుపదనందనుఁ డడిచిన, దునియ లయ్యెఁ, బలక
రెండవ వాటునఁ బగిలె శిరము. భీష్మ. 2-194

వ. అస్త్రశస్త్రపాతంబులం గ్రమ్మ రుధిరమ్ముల గైరికనిర్ఝరంబుల తోడి ధరాధరంబుల ననుకరించు నవియు, కర్ణ. 2-227

వ. అంగుళీయక రుచులడర నెఱిం జాఁగిపడియున్న బాహుదండంబుల వలన నురగ నివాసంబుల ననుకరించు తలంబులును. విరా. 3-236

**అనుకర్మ్మ(డు** సం. వి. ఉ. పుం.

ఉష్మపులలో నొకఁడు దేవతలయందు పితరులుగా నిర్దేశింపఁబడిన వారిలో నొకఁడు. **అను. 8-192**

**అనుకారము** సం. వి. అ. పుం.

అనుకరించుట, సామ్యము, పోలిక.

వ. తరణి కిరణానుకార పారంగతంబులగు నారాచంబులు తదీయాంగఁబుల నిలుపం దొడంగిన, విరా. 5-148

వ. భీముఁడు వాని హీనసత్త్వంగా నెఱింగి సురహస్తిహస్తానుకారంబులైన సవ్యదక్షిణ హస్తంబుల నమ్మనుజకంఠకు కంఠప్రదేశంబులు వట్టికొని, ఆది. 6-301

**అనుకారి** సం. విశ. న్. న. (న్-ణీ-న్)

అనుకరించునది, పోలునది.

ఆ, ... తేజరిల్లు దివిజనగము, గమలకర్ణి కానుకారియై కాంచన, మణిమయత్వమహిమ మహితమగుచు. భీష్మ. 1-21

**అనుకీర్తనము** సం. వి. అ. న.

కీర్తనము, చెప్పుట.

వ. రాజవంశానుకీర్తనంబును భారత వంశానుకీర్తనంబును. ఆది. 1-32

**అనుకూలత** సం. వి. ఆ. స్త్రీ.

హితము, ఇష్టము,

చ. ...యతైఱం,గున నెఱి నెఱుంగఁజెప్ప ననుకూలత వారలయందుఁ దద్దగ,ల్గివఁ దెలి వగ్గలింప వెఱఁగించె. మౌస. 7

**అనుకూలము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సహాయమైనది.

వ. మీ తలంపునకు దైవం బనుకూలంబు గావుత. విరా. 1-57

2. అనుగుణమైనది, సరిపడునది.

ఆ. హరుల హేషితములు ననుకూల వాయు సంచారములును మనకు జయము కలిమిఁ దెలుపుచున్నయవి, విరా. 4-188

3. హితము, ఇష్టము.

క. తన వచ్చిన కార్యము మన, మనుకూలము సేయకున్న హరి యలుక మెయిన్. ఉద్యో. 4-134

(అనుకూలత- అని కొన్ని ప్రతులు)

**అనుకూలుఁడు** సం. విణ. అ. పుం.

1. సహాయుఁడు, తోడ్పడువాఁడు.

వ. శాంతుండుగాని విప్రుండును, తేజస్విగాని రాజును, దక్షుండుగాని వైశ్యుండును, త్రివర్ణానుకూలుండుగాని శూద్రుండును నిందం బడయుదురు. సౌప్తి. 1-48

2. తగినవాఁడు.

తే. కోరి జనపతి దన కూర్మి కూఁతుఁ జూచి, గుణవయోరూపములఁ గనుకూలుఁడైన, భర్త నెమ్మెయి దీనికిఁ బడయువాఁడ, నొక్కొ యని. అర. 7-178

3. ఇష్టుఁడు.

వ. పాండవాగ్రజు తలంపున కనుకూలుండై యాఖండలుండు. స్వర్గ. 2

**అనుకృతి** సం. వి. ఇ. స్త్రీ.

అనుకరణము, పోలిక.

చ. భ్రుకుటి లలాట దేశమునఁ బొల్చెఁ ద్రికూటతటి త్రిమార్గగానుకృతి. సభా. 2-51

**అనుక్రమణిత** సం. వి. ఆ. స్త్రీ.

విషయసూచిక.

వ. ఆదిపర్వంబున ననుక్రమణికయును. ఆది. 1-164

**అనుక్రోశము** సం. వి. అ. పుం.

దయ, కనికరము, జాలి

వ పౌరజనాక్రోశంబునం దనుక్రోశపరుండనై వాని విడిచితి
అర. 3-67

**అనుగతము** సం. విశ. (అ. ఆ. అ.)

1. అనుసరింపఁబడినది, వెంబడింపబడినది.

శా. అరూపం బవికార మాభుజబలం బత్యంత నిర్గర్వ మా, శూరత్వం
బు దయారసానుగతము. విరా. 2-209

2. పొందఁబడినది.

క. ధని యధనుఁడు రూపసి యొవ్వనివాఁడు వివేకి మూఢభావుఁ
డరోగుం, డనుగతరోగుఁ డనక యంగన పతిఁ బాటింపవలయుఁ
గామధ్వంసీ... అను. 5-295

క. సత్య క్షమాదమంబులు, నిత్యపదంబునకు నెక్కు నిచ్చెన యవి
సంగత్యనుగతములు సత్సాంగత్యం బటుగాన ముఖ్య కార్యము
సుండీ. శాంతి. 5-556

**అనుగతి** సం. వి. ఇ. స్త్రీ.

1, అనుకరించుట, వెంబడించుట.

క. మీ యనుగతి మాకు నభిప్రాయము. అర. 1-8

2 పొందుట, ప్రాప్తి.

ఉ. ...మిత్రకోటి లోకానుగతిన్ విమోహపద మందదు.
శాంతి. 5-560

**అనుగతుఁడు** సం. విశ. అ. పుం.

1. అనుసరింపఁబడినవాఁడు, వెంబడింపఁబడినవాఁడు.

వ. అజ్ఞాతశత్రుం డనుజవర్గానుగతుండై మరలె. భీష్మ. 1-161

2. అనుసరించువాఁడు, వెంటనుండువాఁడు.

క. అనుగతుఁ డగు శిష్యునకుం, దన సుతునకు....దగ నెఱిఁగించు నది. అను. 2-95

**అనుగమనము** సం. వి. అ. న.

వెంబడించుట (కూడఁబోవుట) వెంటవచ్చుట.

క. వినయముతో గేల్మొగుచుచు, నమగమనం బడుగ శరుగ నాతం డును నిర్జనమగు ప్రదేశమునకుం, జని యొక వటవిటపి నీడఁ జదికిలబడియెన్. అశ్వ. 1-48

క. కావునఁ బతి యనుగమనం, బే విధమున విడువఁ దగవె యొత్తె నను మోహావేశముఁ బొందక ధర్మావస్థితి నలుపవలదె యవ హిత బుద్ధిన్. అర. 7-288

వ. మా యనుగమనంబున కొడంబడవలయు. అర. 1-7

**అనుగమము** సం. వి. అ. పుం.

అనుసరణము.

ఉ. ...దేవ మంత్రి మంత్రానుగమం బొనర్పఁగఁ బ్రియం బెసలార వరించెఁ జారుధర్మావన దేవసేనఁ గరియానఁ గరగ్రహణ ప్రయుక్తితోన్. అర. 5-287

**అనుగమించు** సం. స. క్రి.

1. అనుసరించు, వెంబడించు.

తే. అక్రూరాతుండు సన వాని ననుగమించి, వెన్ను రుచిర దేహము పడియున్న చోటు, సేరి తెలియంగఁ జూచి మూర్ఛిల్లి పుడమిఁ, బడియెఁ గవ్వడి యనుచరు లడలువొంద. మౌస. 162

2. కూడఁబోవు, సహగమనము సేయు.

వ. అన్నిలింపవందనీయుండు దానును జొచ్చి యచ్చటనుండి పతుల ననుగమింపవలసిన యంగనలు గంగాతోయంబులం గ్రుంకుటకు రండనిన. ఆశ్ర. 2-127

వ. కావున నీవును ప్రియాసంగమంబయిన యప్పుడ పంచత్వంబొందెదుమని నీ ప్రియయు నిన్ను ననుగమించునని పాండురాజునకు శాపంబిచ్చి. ఆది. 5-52

3. పొందు,

వ. గరుడుని గతి నన్య విహంగంబు లనుగమింప నోపని యట్లు మానవులు వీని వీర్యంబు ననుగమింప నోపరు. సభా. 1-157

శ్లో. అస్య వీర్యవతో వీర్యం నానుయాస్యంతి పార్థివాః,
పతత్రో వైనతేయస్య గతి మన్యే యథా ఖగాః,సం.భా. సభా.19-8

**అనుగమ్యమానుఁడు** సం. విణ. అ. పుం.

వెంబడింపఁదగుచున్న వాఁడు, వెంబడింపఁబడినవాఁడు.

వ. గరుడుండు తనకు నురగ భోజనత్వంబు సురపతి చేతం బడసి తదనుగమ్యమానుండై యురగుల యొద్దకు వచ్చి. ఆది. 2-113

**అనుగలము** వై. విణ. (సం. అనుకూలము)

1. ఇష్టము, అనుకూలము.

క. అని యప్పురి దెస సెప్పినఁ, జని యాతం డతనిఁ గాంచి సముచిత భంగిన్, వినిపించె రాజధర్మన, కనుగలమగు సఖుడ ననియు నతని పనుపునన్. శాంతి. 3-488

**అనుగీత** సం. వి. ఆ. (స్త్రీ).

ఉత్తర గీతలు, తరువాతఁ జెప్పిన గీతలు.

వ. భీష్ముని మరణానంతరము ధర్మజుఁడు రాజ్య మేలుచుండ శ్రీకృష్ణుఁ డర్జునున కెఱిఁగించిన యధ్యాత్మ విద్యావిషయములగు వాక్యములు. ఆది. 1-82

**అనుగుణము** సం. విణ. (అ. ఆ. అ.)

తగినది, అనుకూలమైనది.

వ. అయ్యవసరంబున వారందఱు మహోద్భుతంబంద వారి వారికి నయ్యై వేషంబుల కనుగుణంబులగు నంబరాభరణ మాల్యా ద్యుపకరణంబులు సన్నిహితంబులయినం జూచి సంతసిల్లి. విరా. 1-184

**అనుగృహితము** సం. విశే. (అ. ఆ. అ.)

అనుగ్రహింపఁబడినది; ఉపదేశింపఁబడినది.

వ. ఆమ్మనుజపతి యమ్మునిపతితో మహాత్మా. భవదనుగృహీతంబు లైన యివ్వాక్యంబులు హర్షంబు నావహించె శాంతి. 1-335

**అనుగోప్త** సం. వి. ఋ. పుం.

ఉపస్వరులలో నొకఁడు, దేవతలయందు పితరులుగా నిర్దేశింపఁబడిన వారిలో నొకఁడు. అను. 3-192

**అనుగ్రహము** సం. వి. అ. పుం.

అనుగ్రహించుట, దయచూపుట. ప్రసాదించుట (అహితమును దొలఁగించి హితమును జేకూర్చుట)

వ. తదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్న యునికిన సన్న్యాసి రూపం బలవడి ధాతుపట దండకమండలు కలితమూర్తియయ్యె. విరా. 1-184

**అనుగ్రహించు** సం. స. క్రి.

1. ప్రసాదించు. దయతో నిచ్చు, దయతో నుపదేశించు.

వ. ఆ భరత వంశంబునందు ఖడ్గ సంప్రదాయంబు గలిగి వచ్చె నొక ముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపున కిచ్చె. శాంతి. 3-449

వ. మన్మథ మథనుండు మంత్ర స్వరూపం బనుగ్రహించె. ద్రోణ. 2-374; శాంతి. 5-160; అశ్వ. 2-96.

2. దయతోఁ జూచు.

ఆ. తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తి యుక్తిఁ జాల, నీవు నన్ను మాననీయుఁడు గాఁగ ననుగ్రహించి తగఁ బరిగ్రహింపు. ఉద్యో. 1-96

వ. అని శాపంబిచ్చి పదంపడి యనుగ్రహించి భవదీయ వంశజాతుం డయి యజాతశత్రుండను పేరు గలిగి యుధిష్ఠిర నామధేయుం డైన యొక్క సత్పురుషుని సందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయువాఁడ వనిన. ఉద్యో. 1-201

**అనుచరణము** సం. వి. అ. న.

1. ఆచరించుట, ఒనరించుట.

సీ. పురుషోత్తముం డెల్ల భువనంబులును దాన, యఖిల భూతాత్మ కుండై విహార, లీల విచేష్టించు నీ లోకముల మాయ, దొట్టి యొక్కొకమరి పుట్టి పెరిగి, కర్మానుచరణముల్ గైకొని వర్తించు. ఉద్యో. 2-318

2. అనుసరించుట.

వ. వాసుదేవానుచరణ పరాయణులగుచు వర్తించిన సాత్యకి కృత వర్మాది యాదవుల నవలోకింపుము. స్వర్గ. 59

**అనుచరత్వము** సం. వి. అ. న.

సేవ.

ఆ. ...భూమి, సుర నృపాల వైశ్య శూద్రులకును, నధ్యయనము బల సమగ్రత వాణిజ్య, మనుచరత్వ మధికధనము లరయ
అను. 3-272

**అనుచరించు** సం. స. క్రి.

కొల్చు, సేవించు.

ఆ. ఒరులఁ గొల్చి తిరుగ వెరవులేని, యట్టి నీవు విరటు నెట్టి చందం బున, ననుచరించువాఁడ వధిప చెపుమ. విరా. 1-67

ఆ. మత్స్య విషయ రాజ్య మహిమకు యుక్తుఁడు, గాఁ దలంచెనేని గారవమున, నట్లచేసి భక్తి ననుచరింతు నమాత్య, సుత సుహృ ద్భటార్యయుతము గాఁగ. విరా. 1-188

**అనుచరుఁడు** సం. విశే. అ. పుం. (అ. ఈ. అ.)

1. సహాయుఁడు.

వ. గురుకృపాశ్వత్థామ... వికర్ణులు నేకోద్యోగంబునం దను తమ యనుచరులైన యోధవీర సహస్రంబులతో రథంబులు దోలికొని చని. భీష్మ. 3-120

2 భృత్యుఁడు.

క. నా యనుచరులం దెవ్వఁడు, మీ యెడ భయభక్తి లేక మిగిలి మెలఁగెనే, నా యధముని దండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్రసిద్ధుం డయినన్. విరా. 1-201

**అనుచారిక** సం. విశే. స్త్రీ. (అ. రికా. అ)

పరిచారిక.

క. తన తలసీర యరసి య, వ్వనితారత్నంబు వినయ వైభవము సతీ, తనువొందిన చందంబునఁ, జనియెం గేకయసుతానుచారి కలబడిన్. విరా. 1-306

**అనుచారిణి** సం. విశే. ఙీ. స్త్రీ.

పరిచారిక.

క. మును నీ వెచ్చో నిలుతే, పని మెయి వర్తిల్లు దనినఁ కాంచాలిక నే, ననుచారిణినై తగఁ బం,చిన గరువపుఁ బనులు నేర్చి చేయుదు నందున్. విరా. 1-108

**అనుచితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఉచితము కానిది, కూడనిది, అయుక్తము.

క. నీకుఁ దగు పదవి యిచ్చెద... హయశిక్షకుఁడవగు, నా కొలఁదిదియె యిట్లు పలుకు టనుచిత మరయన్ విరా. 1-265

**అనుచు** దే. స. క్రి. (అంచు, అన్చు, అనుపు, అన్పు, అంపు)

1. పోవునట్లుచేయు, పంపు.

వ దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖం బగు దుష్టలోకంబు నధోలోకంబున కనుచు నంతకు మదీయాంతరంగంబు చింతాభర భగ్నంబును నవమాన పంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది. విరా. 2-235

క. ...వృద్ధాంగవలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబుఁ బ్రస్తుతి సేయన్. ఉద్యో. 4-276

2 సాగనంపు.

చ. ...దారుక సారథియైన దివ్య కాంచన రథమెక్కి యాతుణము సాత్త్వత కుంజరుఁ డేగె భక్తి నాతని ననిచెన్ యుధిష్ఠిరుఁడు దమ్ములు దానును బాదచారులై. సభా. 2-28

(అరుగు = ప్రేర అనుచు)

అనుజ సం. వి. ఆ. స్త్రీ.

చెల్లెలు- తన తర్వాత బుట్టినది.

అ. ...కొండ, అకట సింధురాజు ననుజ మగనిఁ, దునిమి తేటి రాజ్య మని పల్కుదురు. స్త్రీ. 1-121

అనుజన్మ సం. వి. న్. పుం.

తమ్ముఁడు- తరువాతఁ బుట్టినవాఁడు.

చ. ...అచ్యుతానుజన్మని దలపడ్డ నాతనికి మించి వృకోదరుఁ డన్నరేంద్రు నేసిన... ద్రోణ. 5-90

(జన్మని ... ముంచి వృకోదరు- అని పాఠాంతరము)

అనుజన్ముఁడు సం. వి. న్. పుం.

తమ్ముఁడు- తరువాత బుట్టినవాఁడు.

క. ...ధర్మతనూజుం, దనుజన్ముల దెసఁ జూచిన, ననిలసుతుం డిట్ల నియె నాతని తోడన్. విరా 1-55

అనుజాతుఁడు సం. వి. అ. పుం.

తమ్ముఁడు- తరువాతఁ బుట్టినవాఁడు.

వ. యుధిష్ఠిరానుజాత సిష్ఠురభల్లభజ్యమాన బలవదరాతి ఖరాస్థిసంస్వనంబుల వలనను. విరా. 5-60

(అనుజాతి- అపపాఠము- 'అనుజు' అని కొన్ని ప్రతులు)

అనుజీవి సం. విశే. (న్. నీ. న్)

1. ఆశ్రయించి జీవించువాఁడు.

క. అది తరువు విడిచి పోవక, హృదయంబున భక్తి పేర్మి నెండను

గాలిన్, బెవరక ధృతిహై నయ్యెడఁ, గదలకయుండె ననుజీవి గౌరవ మెసఁగన్. ఆను. 1-152

వి. న్. పుం.

2. సేవకుఁడు, భృత్యుఁడు.

చ. ... మాటల చందము సూడ మీరు డస్సిన యటు లున్నవార లను జీవులు తేరు తొలంగి నేటి మాత్ర నిలువుఁ డెల్లి పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్. కల్య. 2-83; ఆశ్ర. 2-34

**అనుజీవిత** సం. వి. ఆ. స్త్రీ.

ఆశ్రయించుకొని జీవించునది.

వ. కావున నిది "మదనుజీవిత యనియును, ననువ్రత యనియు, ననుకంపనీయయనియు నన్ను విడువక, నా యనుగమనంబున, కొదంబడు" మనిన నట్లు చేయుదుఁ; బ్రాణ సమానవైన నిన్నేల విడుతు, నోడకుండుమని నలుండు తన దేవి నాశ్వాసించుచు. అర. 2-75

**అనుజుఁడు** సం. వి. అ. పుం. (అ. ఆ. అ.)

తమ్ముఁడు, తరువాతఁ బుట్టినవాఁడు

క. అను పలుకులు కర్ణ రసాయనము లగుడు నయ్యధిష్ఠి రానుజుఁడు మురంబున దేలి. విరా. 2-361; సభా. 2-102

**అనుజ్జ్వలము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపనిది, అప్రకాశమైనది.

సీ. కాళ్ళదెుప్పెద మాఁడుకట్ట నుజ్జ్వలము చేయంగ. విరా. 1-228

**అనుజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ.

అనుమతి, ఇయ్యకోలు.

ఆ. ఎవ్వరేని యింటి కెద్దియే నొకటికి, నన్నుఁ బంపఁ దగునె నిన్ను నాఁడ, కొలుచు నెడ ననుజ్ఞ గొనవె నీచములగు, పనుల కేను జాల కునికి సెప్పి. విరా. 2-96

**అనుజ్ఞాతుఁడు** సం. విణ. అ. పుం.

అనుమతి యీయఁబడినవాఁడు.

వ. అనిన విని సంజయుండు... భీమార్జున నకుల సహదేవ సాత్యకి ద్రుపద విరాటుల నీక్షించి "మీ యందఱచేత ననుజ్ఞాతుండనకదా పోయి వచ్చెద..." యనుటయు. ఉద్యో. 1-361; అను. 5-468

**అనుజ్ఞానము** సం. వి. అ. న.

సమ్మతి, అంగీకారము.

క. దీనికి ధృతరాష్ట్రు ననుజ్ఞానము వడయుదును మనకు సమకూరు ధరిత్రీనాథ భవదభిప్రాయానుగుణైశ్వర్య మఖిలయంబునఁ బ్రీతిన్. సభా. 2-100

**అనుతాపము** సం. వి. అ. పుం.

1. తాను చేసినది తప్పని యెఱింగి దానిఁ గూర్చి పిదప వగచుట, పశ్చాత్తాపము.

వ. అనిన ధృతరాష్ట్రుండు... బలవంతుల తోడి విగ్రహంబు పరిహరించుట లగ్గు నా వచనంబు ధర్మోపేతంబు దీని నతిక్రమించి యనుతాపంబు సేయక యిప్పుడు జూదం బుడిగి యెప్పటియట్ల యుండుట కార్యం బనిన విని దుర్యోధనుం డతని కిట్లనియె. సభా. 2-148

2. పరితాపము, పరివేదనము.

ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యిప్పుడు, నాకు, దెల్లమయ్యెఁ బ్రాకటముగఁ, గోపమును మనోనుతాపంబుఁ బొందుచో, ధీరు డవుడ యుడుపనేరవలదె. అర. 6-33

**అనుత్తమము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మిక్కిలి యుత్తమము, దేనికంటె శ్రేష్ఠము లేదో అది.

క. అనుత్తమంబయిన యిమ్మహోత్సవము పఠించిన వినినను వ్రాసిన శ్రీయును నాయువుఁ బెంపుఁ బేరు నొసఁగు జనులకున్. శాంతి. 2-59

2. ముఖ్యము, అవశ్యాచరణీయము.

క. అన విని గృహస్థునకు నే,పని ముఖ్యం బనియె గిరిజ పశుపతి నీ,జన కారాధన మతనికి, ననుత్తమంబైన ధర్మమని నిరూపించెన్.
అను. 5-85

**అనుత్తరము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి శ్రేష్ఠము.

క, గురు శుశ్రూషకులును సత్యరతులు శమ దమ వినిర్మలాత్ములు దుర్భృత్య రహితులును నిల్తు రనుత్తరమగు నచ్చోట గోప్రధాన పరులతోన్.
అను. 2-467

**అనుత్సాహము** సం. వి. అ. పుం.

ఉత్సాహము లేమి.

మధ్యాక్కర...తత్సిద్ధి, యలయక యుత్సాహవంతుఁడు వడయు నట్ల నుత్సాహ, మొలసి దైవపరుఁ డది వడయంగను నోపునె యెందు.
అర. 1-234

**అనుత్సాహి** సం. విశే. న్. పుం. (నీ-నీ-న్)

ఉత్సాహము లేనివాఁడు.

తే. నేను కయ్యపు శకునంబు లెన్నియేనిఁ, గంటి నీవనుత్సాహివి గాఁగవలదు.
ఉద్యో. 3-41

**అనుదాత్తత** సం. వి. అ. స్త్రీ.

నైచ్యము, నీచభావము.

ఉ. ఖాండవ మేర్చె...మహానుభావుఁ డీ,తం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో.
విరా. 1-85

**అనుదాత్తము** సం. వి. అ. పుం.

నీచైస్స్వరము, ఉదాత్తానుదాత్త స్వరితములలో రెండవది. ఉచ్చారణ సాధనములగు తాల్వాది స్థానముల యధోభాగమున ఉత్పన్నమగు అచ్చు.

వ. ఒక్కనాఁడు బలి యను రాజు గంగాభిషేకార్థంబు వచ్చిన వాఁ డయ్యింధన బంధనంబున నుండియు యుదాత్తానుదాత్తస్వరిత ప్రచండ స్వర భేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుఁ దరంగఘట్టనంబునం దన యున్న దరిం జేరవచ్చిన వానిఁ దీరంబుఁ జేర్చి. ఆది. 4-230

"నీచైరనుదాత్తః" - పాణిని అష్టాధ్యాయి.

శ్లో. "ఉదాత్త శ్చానుదాత్తశ్చ స్వరితశ్చ త్రయః స్వరాః"

ప్రయత్నప్రేరితో వాయుర్యథోర్ధ్వ భాగే ప్రతిహతోఽచం నిష్పాదయతి స ఉదాత్తః. ఏవ మధో నిష్పన్నోఽచ్ అనుదాత్తః, తాల్వాదిషు సభాగేషు స్థానేషు నిష్పన్నోఽచ్ అనుదాత్తః" సిద్ధాంత కౌముది.

**అనుదినము** సం. వి. అ. న.

ప్రత్యహము. ప్రతిదినము

ఆ. ...గుఱ్ఱములకు వలయు, తెఱఁగు లెల్లఁ జాల నెఱుఁగుదు రూపుగా నరయ నేర్తు వాని ననుదినంబు. విరా. 1-94

**అనుదీప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

వెలిగింపఁబడినది.

వ దీపమున ననేకములగు దీపములు పరంపరానుదీప్తాకృతులై వ్యాపించు చందమున. శాంతి. 6-97

**అనుద్యూతము** సం. వి. అ. న.

రెండవ జూదము, పునర్ద్యూతము.

వ. కావున వారల ననుద్యూతంబునఁ బరాజితులం గావించి విరళదేశ నిర్వాసితులం జేయుట కార్యంబనిన ధృతరాష్ట్రుం డొడంబడి యప్పుడ యనుద్యూతార్థంబు ధర్మనందనుం దోడి తేరం బ్రాతికామిం బంచిన. సభా. 2-274

**అనుద్వేగము** సం. వి. అ. పుం.

అవ్యాకుల చిత్తత, మనస్స్వాస్థ్యము.

క. స్వాగతమే మీ యిద్దఱ, యాగమనంబునకు హేతువగు కోర్కి-
యను,ద్వేగంబున నెఱిఁగింపుఁడు, వేగమ యొడఁగూర్తు నెల్ల
విధముల దానిన్. ద్రోణ. 2-362

**అనుధావ్యమానుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

తఱుమఁబడుచున్నవాఁడు.

వ. అన్నగరంబు రాజునర్థంబు ముచ్చిలికొని ముచ్చులారెకుల చేత
ననుధావ్యమానులై మాండవ్య సమీపంబునం బాఱి యయ్యాశ్ర
మంబులో డాఁగిన. ఆది. 4-261

**అనునయము** సం. వి. అ. పుం.

1. ఓదార్పు, ఊఱడించుట.

ఉ. ఖేదము దక్కు మీతుణమ కీచకు దండితుఁజేసి నీకు నా,హ్లాద
మొనర్తు నేనని నయంబునఁ గేకయ రాజపుత్రి య,త్యాదర
వృత్తితో ననునయం బొనరించిన నయ్యసత్యసం,వాదిని పూన్కి
పాండుసుతవల్లభ యాలముసేసి యిట్లనున్. విరా. 2-160

2. ప్రార్థనము, బతిమాలుట.

వ. అర్ధశార్ణపతికి విందుపెట్టి కట్నంబు లిచ్చి యతని యనునయా
లాపంబులు గైకొని యనిచి పుచ్చిన. ఉద్యో. 4-391

వ. తానును శత్రుఘ్నుఁడును రామానునయార్థంబు చిత్రకూట
శైలంబున కరిగి. అర. 6-308

3. విన్నపము, విజ్ఞాపనము.

చ. కినుకయు మాను మేలె మునికిం గుపితత్వము శాంతవృత్తి నా,
యనునయ మాదరింపు విను మల్పతపంబులచేతఁ గోలుపోదునె.
ఆశ్వ. 3-85

**అనునయించు** సం. స. క్రి.

1. ఊఱడించు.

చ. భీమసేను దెస మరలి చూచి సాంత్వన వచన సమేతంబుగా
నతనిం గౌఁగటం జేర్చి యనునయించి. విరా 1-178

2. బతిమాలు.

వ. అని మఱియు ననేక ప్రకారంబుల దివాకరు ననునయించి యెట్లునుం గ్రమ్మఱింపనేరక. అర. 7-334

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి ననునయించి రాధే యునిఁ గినిసి... ఉద్యో. 1-255

3. సంభావించు, ఆదరించు.

వ. ఆ భుజంగపతి బాంధవులు దదీయ పత్నీ పుత్ర సహితంబుగా నమ్మహీసురవరు పాలికిం జనుదెంచి మృదుమధుర వాక్యంబుల ననునయించి. శాంతి. 6-568

**అనునీతుఁడు** సం. విణ. అ. పుం. (అ. ఆ. అ.)

అనునయింపఁబడినవాఁడు.

చ. ...అజాతశత్రుఁ డూర్జితుఁ డజితుండు నీ సుతులు సేసిన యెగ్గు దలంప డాతనిన్, ధృతి ననునీతుఁ జేయుము. అర. 1-51

**అనుపగతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పొందనివాఁడు.

మ. నవతాదూర పురాణతానుపగతానానాత్వ సంశోభితా- విరా. 4-275

**అనుపము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపమానము లేనిది, సాటిలేనిది

క. వినుఁ కొడుకు గొన్న వేఁదుల కొని కొట్టిన తిండి కాఁడు కటిలుం దతఁ డా, జనపతి చందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు దది యట్లుండెన్. ఉద్యో. 1-56

**అనుపమానము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపమానము లేనిది, సాటిలేనిది.

తే అనుపమాన భోగములకు నాస్పదంబు. విరా. 2-52

**అనుపమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సాటిలేనివాఁడు, అద్వితీయుఁడు.

సీ. నారాయణుం డవ్యయుఁడు...యజరామరు ననుపమాను,

శాంతి. 4-81

సం. విణ. (అ. ఆ. అ.)

పోల్పఁబడనిది, సాటిలేనిది.

చ. అనినఁ బతివ్రతాతిలక మాతని కిట్లను నయ్య మత్ప్రియుం, డనుపమితక్షుధాచలితుఁడై చనుదెంచిన. ఆర. 5-14

**అనుపముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అద్వితీయుఁడు, సాటిలేనివాఁడు.

క. విను మఘ యింక సుకృతంబునకుం జోర దుష్కృతంబు పొంతకుఁబోనే, ననుపము నచ్యుతు నవ్యయు, ననంతుఁ దెందెద ననామయత నవ్విష్ణున్. శాంతి. 5-405

**అనుపమేయము** సం. విణ. (అ. ఆ. అ.)

పోల్పరానిది, సాటిలేనిది.

ఆ. తనదు బాలబింబ మనుపమేయ ప్రభా, పటల జటిల గగన భాగ మగుచు, నుల్లసిల్లి జగము లెల్లను విలసిల్లఁ బూర్వశిఖరి మీఁదఁ బొడిచె నినుఁడు. ఉద్యో. 2-114

**అనుపయోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపయోగింపఁదగనిది, ఉపయోగమునకు రానిది, అనుభవింపఁదగనిది.

వ. కాపురుష లక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును.

విరా. 2-325

**అనుపాధికము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపాధిరహితమైనది.

క. నలునకును రవికిని శశాంకునకును గ్రహతారకములకును తేజం బెవ్వని వలన నావహిల్లెడు, ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్మున్. శాంతి. 4-221

**అనుపాల్యము** సం. విశే. (అ. ఆ. అ.)

పాలింపఁదగినది.

మ. ఈ త్రిలోకములు నస్మద్బాహువజ్రానుపాల్యము లే నింద్రుఁడ
ఆది. 7-278

**అనుపు** దే. స. క్రి. అన్పు

1. అనుచు, పంపు.

క. అనుటయు ననఘా తెలియ, న్విమ మిది నా తోడ సాళ్వవిభునకు నేఁ గూర్చినదాన నతని పాలికి, ననుపుము నన్నని నఁ గాదె యని చిఱి మగుడన్. ఉద్యో. 4-308

ఆ. సమర మరణ మొందె విమల తపమునకుఁ, జొచ్చి యందు నిలిచి చచ్చుటొండె,వలయు నస్మదీయ కుల ముఖ్యు లిట్టుల, నడపి రనుపు నన్ను నడవి కవఘ. ఆశ్ర. 1-27

2. వీడ్కొలుపు.

తే. అతని దీవించి నీవు పొమ్మ చటి కేము, నరుగుదెంచెదమని ప్రీతి ననుప నరిగి ఉద్యో. 3—146

3. సాగనంపు

క. మును పాంచాల విభుని వీడ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం, గని యనుమతుఁడై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్, ఉద్యో. 1-61

తే. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య, రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ, దలఁచి భయమంది నిన్ను నీ వలచునెడకు, నరుగు నట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె. విరా 3-59; ఉద్యో. 1-47

**అనుపూర్వము** సం. అవ్య.

అనుక్రమము, వరుస (ఒకరి తర్వాత నొకరు)

శా. ...రంగ మధ్యమున నంతన్ నిల్చి రుదగ్రధ్యుణ, శ్రేణీరమ్యులు ధర్మజ ప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబుగన్. ఆది. 6-10

**అనుపేక్ష** సం. వి. ఆ. స్త్రీ.

ఉపేక్ష లేకపోవుట.

గాఢసర్వానుపేతా-. సౌ ప్తి. 1-240

**అనుపోష్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పోషింపఁబడువాఁడు, ఒకని యాధారముచే జీవించువాఁడు, ఆశ్రయించి బ్రదుకువాఁడు.

క. అనఘా నీ ప్రస్తవమున, నని నీల్గిన వీరభటుల యనుపోష్యుల నెల్లను బ్రోతె భోజనాచ్ఛాదనముల వారలకు నెమ్మి దఱుఁగక యుండన్. సభా. 1-40

**అనుప్రమోది** సం. విణ. (న్. నీ. న్)

సంతోషించువాఁడు.

మాలిని. మదవదసురభేదీ మానసానుప్రమోదీ· స్త్రీ. 1-189

**అనుబంధము** సం. వి. అ. పుం.

1. సంబంధము.

వ. వారలు దూరంబు సని యొక్క విపులవటంబు పొంత విశ్రాంతి వొంది నీ నందనువలనికిం జనిన హృదయంబులతోఁ దదీయ కార్య చింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధ సంభాషణంబులు సేయు చుండి రక్కడ. శల్య 2-46

2. కట్టు, బంధము.

అ. మూత్రమునఁ బురీషమున నూనుచును గర్భమునఁ బ్రవర్ధనమ్ముఁ బొంది వెడలి, సంతతానుబంధ సంసార దుఃఖనిర్మగ్నుఁ డగుచు నుండు మానవుండు. శాంతి. 4-292

3. సంసార బంధము.

క. ఆ పూర్ణ తేజు డపగత, పాపుఁ డపాకృత భవానుబంధుఁడు. ఆది. 2-161

4. యోగము, కూడిక.

చ. వినము జరాబంధమున వెంబ్రుక తండముఁ బండ్లు వీనులుం, గనుఁ

గవయున్ జరం బోరయుఁగాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణ గాదు.
అను. 1-147

క. అది సర్వదోషముల కాస్పద మది దురిత క్రియానుబంధంబుల
కున్, మొదలు. అర. 1-25

**అనుబంధించు** సం. అ క్రి.

అవ్యవధానముగాఁ జేరు, అనుస్యూతమగు.

వ. వేలులను బంధించు మేలు లట్ల కీళ్ళును ననుస్యూతంబులై
తొడరు నాకర్ణింపుము, శాంతి. 4-71

**అనుబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

1. లగ్నమైనది, ఆసక్తిగలది.

ఆ వినుము దీర్ఘవైర వృత్తియుఁ గ్రోధ చింతనము లేక వాక్కు
మనము నొక్క చందమగుట సకల జనముల కనుబద్ధ సంపదాప్తి
పరమ సాధనంబు. ఆశ్ర. 2-75

2. సంబంధించినది.

ఉ. ఆ ధృతరాష్ట్రి చేసిన యనర్థ మణిప్రకరానుబద్ధ శోభాధృతి
నొప్పుచున్న సభ. సభా. 2-182

**అనుభవము** సం. వి. అ. పుం.

1, ఉపయోగము.

సీ. ఎడనెడఁ గొనివచ్చి యిచ్చిన వానినెల్లను వేర్క ననుభవించిన
విధంబు. —తే- సలిపి యనుభవ మొల్లక చనఁగ. ఉద్యో. 3-178

2. భోగము.

క. తనవారుఁ దానుఁ గూడఁగ, ననుభవ సుఖమందఁ దేని యది
రాజ్యమె రాజునకు భవత్పరిజనములు, ననుజన్ములు బ్రదికి రేలు
మఖిల ధరిత్రిన్. శల్య 2-70

ఆ అన్నమిడిన మణిమయావాస శయ్యాసనములు నమృత భోజ
నంబు హృద్యమాల్య లేపనములు వహనీయ మహితానుభవము
జిరత నొందు దినమనందు, అను. 2-376

3. సుఖదుఃఖ రూపకమైన కర్మఫలము పొందుట.

క. అనుభవము గ్రమింగు శాంతిం, గనునది నిర్వేద సత్త్వకాశం బది దా, విను తలఁపునకును బలుకున,కు నగమ్యము గర్మముల కగోచర మనఘా. శాంతి. 4-199

వ. సంసారంబున మాతృపితృ సోదర దారపుత్ర సహస్రంబు లనుభవ గోచరంబులయ్యె నందెవ్వరికి వగచెద వని. స్త్రీ 1-26

4. స్మృతి భిన్నజ్ఞానము, ప్రత్యక్షాదిజ్ఞానము.

చ. మనసును దాన వాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా, త్మని వలనన్ భవద్వచనమున్ జనకానుభవంబు చొప్పరియై,నను విను కార్యమున్ గుఱిచినం దగ వాగనువర్తనంబు సేయనవలె నెన్ మనంబునకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్. ఆశ్వ. 2-17

తే. అవ్విధంబున కా రాజు నంగవయును, మనము లద్భుతరసమున మునుఁగుచుండఁ, గల యొకో యిది నిక్కము కానివాఁడు, మిగుల ననుభవ గోచర మగునె యిట్లు. అను. 2-330

**అనుభవించు** సం. స. క్రి.

1. ఉపయోగించు.

సీ. ఎడ నెడఁ గొనివచ్చి యిచ్చిన వాని నెల్లను వేడ్క ననుభవించిన విధంబు. -తే- సలిపి యనుభవ మొల్లక చనఁగ. ఉద్యో. 3-173

2. తిను, భుజించు, అరగించు.

తే. యోగి యెట్టి ఆహారంబు లుడగవలయు, నాతఁ డెట్టింగి భోజ్యంబు లనుభవించి, బలము వడయువాఁ డిది నాకుఁ దెలియఁ జెప్పవే జన స్తవనీయ సమిద్ధబుద్ధి. శాంతి. 5-591

తే. తల్లి చన్నుల పా లేను ద్రావ నెట్టు, లానసే పలు తెఱఁగుల తేని యలును, ఖండశర్కరతోడి దుగ్ధంబు లనుభవింపఁ బడవె యన్నియు నింత యింపు గావు. కర్ణ. 3-216

3. భోగించు, రమించు.

ఆ. అట్టులున్నఁ జూచి యత్తన్వి మగవారు, భోగపరులు ధార్మి

పొలఁతు లందుఁ, గలుగు నవ్విధంబు గాక యేఁ గోరంగ, ననుభ
వింప కునికి యగునె నీకు. అను. 2-15

4. పొందు.

వ. పాణిగ్రహణ మహోత్సవంబు ననుభవింపుమని పలికిన. అను. 2-21

తే ...సల్లాపరసము ననుభవించుచు నల్లనల్లన లతాంగి, యరిగె
నర్తన మండపోపాంతమునకు. విరా. 8-42

వ. రాజ్యాభిషేక శోభనం బనుభవింపుమని. శాంతి. 1-871

5. సుఖదుఃఖములను పొందు.

వ. ఈ శాపఫలంబు భవదజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి తదనంత
రంబ శాప మోక్షంబు వడయుము. విరా. 1-87

ఆ. తగిలి జరయు రుజయు దైవవశంబున, నయ్యెనేని వాని ననుభ
వింత్రు గాక. ఆది. 3-193

**అనుభావము** సం. వి. అ. పుం.

1. ప్రభావము, మహిమ.

తే. అతఁ డతిభక్తి దలఁచె దేవానుచరుని, నపుడ యక్కుండధారుఁడు
నరుగుదెంచె, నరుగుదెంచిన నతఁడు నిజానుభావ, జనిత గంధ
పుష్పములఁ బూజన మొనర్చి. శాంతి. 5-357

వ. త్రిపురంబులు సంగతంబులు గాకున్న నసాధ్యంబులై వెలయ
వలయునని పల్కిన నద్దేవుండు మీరు పురత్రయంబును సంపాదించు
కొనుం డే నమ్మహానుభావంబులం బొందునట్లుగా నిచ్చితి నని నిజ
స్థానంబునకుం జనియె. కర్ణ. 1-261

2. అనుభవము, పొందుట.

వ. సూర్యతనయ పవననందనాదుల నరక దుఃఖానుభావంబులు మా
చేసిన వెడ మాయంబులగుట నీకుఁ దెలిసె. స్వర్గ. 49

**అనుభావ్యము** సం. విశ. (అ. ఆ. అ.)

అనుభవింపఁదగినది.

వ. రాజులకు జయాపజయంబు లనుభావ్యంబులు- మద విషాదంబు

లనాదరణీయంబులు. శాంతి. 3-37

**అనుభావ్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

అనుభవింపఁదగువాఁడు.

మాలిని. భరిత భువన తేజో భవ్య యోగానుభావ్యా. భీష్మ. 1-306

**అనుభుక్తి** సం. వి. ఇ. (స్త్రీ).

అనుభవము.

సీ. ...నీఁదగు పుణ్య జలముల సగరసుతులు సిక్తులై స్వర్గానుభుక్తిఁ బ్రాపింతురు, గావున దేవి యిద్దేవపథము, నందుండి వసుమతి కొందంగఁ జనుదేర,వలయు. అర. 3-30

**అనుభూతము** సం. విశే. (అ. ఆ. అ.)

అనుభవింపఁబడినది,

వ. ప్రేతపత్యనుభూతోజ్జితంబైన యాపాన భూభాగంబు ననుక రించు కురుక్షేత్రంబు దఱియు సమయంబున. శాంతి. 2-64

**అనుభూతి** సం. వి. ఇ. (స్త్రీ).

అనుభవము.

తే. ...తత్క్రియాపరత లేని, యట్టివానికి నరుఁడు హేమాదులిచ్చి, వారయుఁ బదియేండ్లు నరకానుభూతి నసిరెు. అను. 2-36

**అనుభోగము** సం. వి. అ. పుం.

అనుభవము.

క. అనుభోగయోగ్యములుగా, ధనరాసులు భూషణములు దాసీ నివహంబును గాంచనమయ శయ్యాసనములు ముని కిచ్చె హృదయ సంతోషముగాన్. అర. 3-115

**అనుమతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. సమ్మతింపఁబడినది, అంగీకరింపఁబడినది.

క. వారలు లేరకొ పో పెటి, వారలఁ దగు భంగి మనకు వశ్యులఁ జేయన్, భూరిబలయుతుల మగుటయు, కారణమను టనుమతంబు

గాదే మనకున్. విరా. 3-112

వి. అ. న.

1. సమ్మతి, అనుమోదము.

క. తగు పని కుద్యోగించుచుఁ, దగ వెఱిఁగెడు హితుల కనుమతంబుగఁ జేయన్, జగతీ సురవర కార్యము, లగు వారికిఁ గలుగు విధి సహాయత్వంబున్. సౌప్తి. 1-33

2. అనుజ్ఞ.

క. ధనధాన్యంబులుఁ గూర్చుట, జనపతి యనుమతము లేక చన దతని కి ద్దా న ని రూఢి శ్రద్ధ గలిగినఁ, జనునది సుపవిత్రయగుట జగతీ నాథా. శాంతి. 2-227

**అనుమతి** సం. వి. ఇ. (స్త్రీ).

సమ్మతి, ఇష్టము.

వ. అనిన నతఁడు వికసిల్లుచు, నను నమ్మోయి నేలికొనిన నలినా నన నీ, యనుమతి సేయనె యొక్కఁడఁ, జను దెంచెద నేఁటి రాత్రి సమ్మదలీలన్. విరా. 2-266

2. అనుజ్ఞ.

వ. వారలం గలయం గనుంగొని, యట్లగాక మీకుం బోలిన తెఱంగు సేయుం డనిన నదియ యనుమతిఁ గైకొని సరభసంబునం జను దెంచి. విరా. 3-16

**అనుమతించు** సం. స. క్రి.

సెలవిచ్చి పంపు.

చ. ...ఏను భవదీయ సమాగతిఁ జేసి ధర్మసంస్థితమతినైతి నన్ననుమతింపు గుణాకర పోయివచ్చెదన్.

వ. అని వానికిం బ్రదక్షిణంబు సేసి వీడ్కొని చని కౌశికుఁడు.
అర. 5-144, 145

మిశ్ర. స. క్రి.

అంగీకారమును బొందు.

వ. అమ్మహీసురవరేణ్యు ననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని. విరా. 1-147

**అనుమతిసేయు** మిశ్ర. స. క్రి.

1. అంగీకరించు.

వ. నన్ను విరాటుండు మున్ను నీవెందుండు దని నిరూపించెనేని యుధిష్ఠిరు గోష్ఠంబుల కధిష్ఠాతనై యుండుదు ననియెద నని పలికినఁ గౌంతేయాగ్రజుం డిది యుక్తం బగునని యనుమతిసేసి పాంచాలి నాలోకించి. విరా. 1-103

2 ఆజ్ఞ యిచ్చు.

సీ. అనిక్రమంబున వారలంగఱు విందులు పెంపెసలార వేర్వేఱ బొగడి, -ఆ- గొనయసుఁలు వదల్ప ననుమతి సేయుఁడు వారు నట్లచేసి తేర. విరా. 1-172

వ. దీన మజ్జనంబు సేయుఁ డని యనుమతి సేసిన. శల్య. 2-172

3. ఇష్ట ప్రకారము నడచు.

క. అనిన నలుఁడు వికసిల్లుచు, నను నమ్మేయి నేలుకొనిన నలినానన నీ యనుమతి సేయనె. విరా. 2-266

**అనుమతుఁడు** సం. విశే. (అ. ఆ. అ)

1. అంగీకరించినవాఁడు.

వ. నన్ను విడువక నా యనుగమనంబునకు ననుమతుండవు గమ్ము. అర. 2-75

2 అనుజ్ఞ పొందినవాఁడు, అంగీకారమును బొందినవాఁడు.

వ. అది సేయుటకై యమ్మహాత్మునకు విజ్ఞాపనంబు సేసి.

క. అనుమతుఁడై విజయుం డాతనిమీఁద నిశాత విశిఖతతి వఱపి. ద్రోణ. 3-52;53

**అనుమరణము** సం. వి. అ. న.

సహగమనము, భార్యభర్తతోఁ గూడఁ జితిఁ జొచ్చుట.

క. తేని యనుమరణమునఁ దన, మేను విడిచినట్టి కాంత మేలి పదవికిం, దాను నతండును నరిగి య,నూనస్థిర సుఖము లందు చుండుట వినుదున్. శాంతి. 3-384

ఆ. అట్లుగాక పతుల యంతిమ సమయంబు,నందుఁ జింతదక్కి యను సరణము, సేసిరేని సుగతి సిద్ధించుఁ బతి సమే,తంబు గాఁగ న న్నితంబినులకు. అను. 5-301

**అనుమానము** దే. వి.

1. సందేహము, సంశయము.

క. చనుదెంచి కాంచి నాన్వేర్చిన తెఱఁగున విన్నపంబుసేసితి నన్నుం, బనిగొనఁ దలఁచిన నేలెడి, దనుమానము గలిగేనేని నరిగెద నధిపా. విరా. 1-270

క. జననీ వధంబు చేసిన, ననుమానమె నరకమగుట. శాంతి. 5-267

2. ఎవ్వరు కందురో ఎవ్వరు విందురో యన్న యళుకు.

క. మన మియ్యెడఁ బెద్దయుఁ బ్రో,ద్దనుమానము లేక మాటలాడుట దగ దీ,వును బో మ్మేనును నా దగు, పని సేసెద ననియెఁ గమల పత్రేక్షణయున్. విరా. 2-268

(ఇది తెలుఁగు పదమని అ. శే. 32. సంస్కృత పదముగాఁ గొందఱు చేర్చిరి. కాని సంస్కృతమునఁ బై యర్థములు గాన రావు. తెనుఁగున మాత్రమే కలవు.)

**అనుమానించు** దే. అ. క్రి.

1. జంకు, వెనుదీయు.

మ. ...వానిం దలపట్టి వంచుటయు నేవుం జేవయుం దోఁప వాఁ, డనుమానింపక బెట్టదల్చికొని కోపాటోప దీప్తాంగుఁడై.
విరా. 2-340

2. సందేహించు.

మ. అనుమానింపకు తోడఁ బుట్టువులు గారా తున్మితూటాడి నెం,దును గ్రొన్నెత్తురు లేఖులై పటువ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్.
శాంతి. 1-287

**అనుమృతి** సం. వి. ఇ. స్త్రీ.

సహగమనము.

సీ. ...అనుమృతి కలనకు నమరియున్న, యా బలదేవ ముురాంతక మహిషులకు.... మౌస. 204

**అనుమోదము** సం. వి. అ. పుం.

1. సంతోషము,

క. ...పటుతురగగతి, స్ఫురణానుమోద లీలా,ఖరితుఁ డగుచు వేగి రంపుఁ బయనముల దగన్. ఉద్యో. 1-68

2. అంగీకారము, సమ్మతి.

సీ. ...మానిని త్రివిధముతో మానసవాచిక, కాయికంబులఁ జాత కంబులందుఁ, బరధనాపేక్షణ పాపానుమోద ధర్మద్వేషముఖ ములు మానసములు. అను. 5-174

**అనుమోది** సం. విణ. (న్. నీ. న్.)

1. సంతోషించువాఁడు.

స్రగ్ధర-స్ఫాయచ్చేతః ప్రసాద ప్రసృమర విమల ప్రౌఢ బోధాను మోదీ. సౌప్తి. 2-184

2. అనుగుణమైనది. యుక్తమైనది, ఒప్పినమైనది.

తే. ...అహింసానుమోది, క్రోధరహితంబు, నిర్మల బోధయుతము ...యైన చిత్తంబు గల నియతాత్మకులరు. అను. 1-378

**అనుమోదించు** సం. అ. క్రి.

1. సంతోషించు.

క. మనుమని జయప్రయాణం, బనుమోదింపంగ నా సుధాంశుఁడు సనుదెంచిన కరణి గొడుగు కుంతీ, తన యాగ్రజు మోల నతిసిత ప్రభ నొప్పెన్. ఉద్యో. 4-121

క. విప్రవరుఁడు మునిజనములు పూజనము లొనరింప ఖేచరు, లను మోదింప విహరించె నప్రతిహతుఁడై. శాంతి. 5-361

స. క్రి. సమ్మతించు, అంగీకరించు.

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నా వసుధాధిపుఁడు దాని ననుమోదించున్, భావము సంతోషశ్రీ, భావితమగుచుండఁ గురు నృపాల ప్రవరా. శాంతి. 4-341

**అనుయాతి** సం. విణ. (న్. నీ. ని.)

వెంబడించువాఁడు, అనుయాయి.

మాలిని. అపరిమిత విభూతీ యప్రమత్తానుయాతీ. ఆశ్ర. 1-186

**అనుయానము** సం. వి. అ. న.

వ. మన మలరంగ నిల్చి జనమాన్యునిఁగా వను జేసి ప్రీతి నే, ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగ రక్షకై. అశ్వ. 4-94

**అనుయాయి** సం. విణ. (న్. నీ. న్.)

వెంబడించువాఁడు, అనుచరుఁడు.

ఉ. అమ్మెయి నూరకుండ ననుయాయి జన్మములు పెక్కు లాడి చిత్తమ్మ కలంక దేర్చి. మౌస. 167

**అనుయుక్తము** సం. విణ. (అ. ఆ. అ)

అడుగఁబడినది.

క. ....జగతీశ్వర నీ, వినుతోపదేశమున భవదనుయుక్తము లెల్ల నడచు నవికలభంగిన్. ఆశ్ర. 2-61

**అనుయుక్తి** సం. వి. ఇ. స్త్రీ

ప్రాప్తి, పొందిక, యోగము.

సీ. పాదపాయూపస్థ పాణి వాక్కులు విను, మధ్యాత్మములు తత్క్రమానుయుక్తి, గంతవ్యమునువిసర్గంబు నానందంబు, గర్తవ్యవక్తవ్యకములు నయ్యె. శాంతి. 6-90

**అనుయోగము** సం. వి. అ. పుం.

ప్రశ్నము.

తే. భక్తి మనకునై పూజించి బంధుజనుల నందఱను దత్తదౌచిత్య

మతినుతముగ, నాదరించి వారల కుశలానుయోగ, విధము నస్మ
త్కృతమ్ముగ విస్తరించి. అశ్వ. 3-18

**అనురంజనము** సం. వి. అ. న.

సంతోషపెట్టుట.

తే. ఇట్లు దమతమ వర్తిల్లు నెడల సకల, జనములకు హృదయాను
రంజన మొనర్చి. విరా. 2-8

**అనురక్తము** సం. విశే. (అ. ఆ. అ)

3. అనురాగము గలది.

ఉ. ...నీవు పాండవుల్, సజ్యతఁ దండ్రి చిత్తము ప్రసన్నతఁ
బొందఁగఁ గొల్చి యున్కి, సామ్రాజ్యముగాఁ దలంతు రనురక్త
మతిం దమకున్ ధరాధిపా. ఉద్యో. 3-342

**అనురక్తి** సం. వి. ఇ. (స్త్రీ).

అనురాగము, ప్రేమ,

సీ. ...ఆపార్థ పౌత్రుని జూపి మా యేవురఁ మాఱుగా మీ రిక్కు
మారవరునిఁ, గైకొని తగనెల్ల కార్యజాతంబును, నడపుచు నను
రక్తి నాఁడు వాఁటి, కెక్కుడగుచు నుండ నీతని యుల్లంబు,
రంజిల్ల సమ్యగారాధనంబు, నందు సంప్రవణుల రగుడయ్య.
మహా. 18

ఆ. ...కీచకాధముఁడు నిజానురక్తి దెలుప వచ్చెంచు. విరా. 2-45

**అనురక్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ)

1. అనురాగము గలవాఁడు, ఇష్టుఁడు.

వ. ఇట్లు సన్నద్ధులై వెలి వీడు విడిసి తమకు ననురక్తులైన రాజుల
పాలికిం దగు దూతలం బుచ్చిరి. ఉద్యో. 1-50

ఉ. రాజులు భక్తిఁగొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవిభ్రాజిత
వృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు. శల్య. 1-67

2. సంతుష్టుఁడు.

వ. తాను (యుధిష్ఠిరుఁడు) మఱియు ననేక దేశాగతులైన జనంబుల

నన్నపానంబులం గనక వస్త్రాదిదానంబుల ననురక్తులం గావించి. అశ్వ. 4-212

**అనురతి** సం. వి. ఇ. స్త్రీ.

అనురాగము, ఆసక్తి.

తే. ...దివంబు, రాత్రియును యోగసేవానురతి నివాత, దీపమును బోలె వెలుఁగు నాత్మీయమూర్తిఁ గనుచు. శాంతి. 6-38

**అనురాగము** సం. వి. అ. పుం.

ప్రేమ.

క. ...నిమఁగర, మనురాగమునఁ గొలువఁగా నియ్యోడకున్. విరా. 1-269

**అనురాగించు** సం. అ. క్రి.

ప్రేమ చూపు, అనురాగము చూపు.

వ. అట్టియెడ రెండు బలంబులవారును పాండవులు తొల్లి పడిన పాట్లు సెప్పికొని వగచుచు వారు సంధికై చేసిన యత్నంబు వాక్రుచ్చి మెచ్చుచు నప్పుడు గురుజనంబులయెడఁ బాటించిన వినయంబు వర్ణించి యనురాగించుచుండిరని చెప్పిన. భీష్మ 1-170

**అనురాగిల్లు** సం. అ. క్రి.

1. అనురక్తినొందు, ప్రేమగలిగియుండు.

క. ప్రభువుల నుపచారంబుల, విభుఁ డనురాగిల్లఁజేసి వెవగొనుఁ గావుల్, సభయులు గాకుండ ధనం, బుభయజగత్సిద్ధి పొందు నుర్వీనాథా. శాంతి. 2-387; అర. 5-220

2. సంతోషించు.

క. తరుణ ప్రదేశినులు మాత్సరముగ వారలు యయాతి శర్మిష్ఠలఁ జూపిరి తండ్రియుఁ దల్లియు నని, కర మనురాగిల్లెఁ గన్యకా నివహంబుల్. ఆది. 3-184

**అనురాధ** సం. వి. ఆ. స్త్రీ. అనూరాధ

అశ్విని మొదలగు ఇరువదేడు నక్షత్రములలో పదునేడవది అనూ

రాధ- రాధ అనఁగా విశాఖ దానితర్వాత వచ్చునది అనురాధ-గొడుగు ఆకారముగా మూఁడేసి నక్షత్రములతోఁ ప్రకాశించునది. (ఇది అ. పుం. బ. అని కొందఱు చెప్పుదురు) ఈ నక్షత్రమున పై యుత్తరీయమును దానము చేయుట ముఖ్యము. అను. 2-378

ఇది రాజాధికారమిచ్చును. చూ. అనూరాధ.

**అనురుద్ధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

చుట్టఁబడినవాఁడు, కట్టఁబడినవాఁడు.

తే. ...వర్గత్రయాన రుద్ధులైన జనుల కెంతయు నొప్పు నప్పురంబు. ఆది. 8-74

(అవిరుద్ధులు - అని కొన్ని ప్రతులు)

**అనురూప** సం. విశే. (అ. ఆ. అ.)

తగినది.

తరువోజ - ...వివాహంబుగా జరత్కారుఁ, డనఘుండు దన కోర్కి కనురూపమైన యట్టి కన్యకఁ గొనడయ్యె మర్త్యమున. ఆది. 2-151

**అనురూపత** సం. వి. ఆ. (స్త్రీ).

అనుగుణత్వము, తగిన విధము.

క. ....శ, క్త్యనురూపతఁ జేయవలయు నాతిథ్యంబున్. శాంతి. 5-454

**అనురూపము** సం. విశే. (అ. ఆ. అ)

1. అనుగుణము, తగినది.

వ. మీకు సంపదలకుం జూడఁబోలునేని దీని కనురూపంబగు నద్యోగంబు సేయుండు. విరా 3-117

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుపల్కెక్కటి లేదు; నీ కొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్, పెక్కులు పెక్కు భంగులను బ్రేలుచు నుండఁగ, నీవు దానికిన్, బ్రక్కలికించునుండె దనరూః మె నీది కౌరవేశ్వరా. ఉద్యో. 2-68

2. ప్రకారము. విధము.

వ. అప్పురుషుం డశ్లేని నీ యశ్వకర్ణరంధ్రధ్యానంబు సేయు మనిన వశ్లైయని తద్వచనానురూపంబు సేయుఁడు. ఆది. 1-110

**అనురూపుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అనుగుణుఁడు, తగినవాఁడు

తే. రూపగుణ శీలముల ననురూపుఁడైన, వరునకు కన్నియఁ దన వలసినట్లు, తగనివానికి నిచ్చుట ధర్మదేవ,తా తనూభవ బ్రహ్మ హాత్యా సమంబు. అను. 2-70

**అనులాపము** సం. వి. అ. పుం.

మహూర్భాషణము, మాటిమాటికిఁ బలుకుట.

చ. ...మర్త్యుని యాగము నొజ్జఁగాఁగ జూ,ల నిది నిజంబ యింక నను లాప మొనర్పక పొమ్ము వేఱయొ,క్కని నుపదర్శనంబునకుఁ గై కొను మారని నీవు నావుడున్. అశ్వ. 1-41

**అనులిప్తము** సం. విణ. (అ. ఆ. అ)

పూయఁబడినది.

దండకము. లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ భస్మానులిప్తాంగ. అర. 1-325

**అనులేపనము** సం. వి. అ. న.

1. చందనాదుల పూఁత.

వ. అనులేపనంబున నస్రుగ్గంధం బుడిపికొని. విరా. 3-2

2. పూఁత.

వ. రుధిరానులేపనంబున నాభీలంబగు నసిపట్టిక ఘోరాకారయైన రాక్షసి పగతుఁ గీటడంగించుటకుఁ దనకుం దోడు వచ్చిన తెఱంగున మెఱయ. సౌప్తి. 1-177

**అనులేపము** సం. వి. అ. పుం.

అనులేపనము.

క. ఏనుఁగుల మదము తావియు, సైనిక నికరానులేప సౌరభ్యము లుం, దా నుపలాలించుచుఁ బవమానుం డనుకూల మృదు గమనమునఁ బొలసెన్. భీష్మ. 1-121

**అనులోమము** సం. విణ. (అ. ఆ. అ.) (వ్యతి-విలోమము-ప్రతిలోమము)

1. అనుకూలమైనది.

క. మృగములు పతులు ననులోమగతిం జరియించు. శాంతి. 3-13

2. క్రమము ననుసరించియున్నది.

ఆ. ...ఆర్యవర్యు, లాత్మకర్మ మెడలి యనులోమవృత్తి నె, జ్జాతి సొచ్చు నన్యజాతి పనికి, దాని కట్టిభంగి దలకొనుఁ జెక్కులు, పనులఁజేసి జారతనము వచ్చు. శాంతి. 4-97

**అనువచస్సు** సం. వి. స్. న.

అనువాదము, చెప్పినది మరలఁ జెప్పుట.

క. వ్యక్తమునకుఁ బ్రభవం బవ్యక్తం బా తత్త్వమునకు నవుల యను వచో, యుక్తికిఁ బరాయణం బగు, భక్తపరాధీను భవ్యభావ్యు నుతింతున్. శాంతి. 4-225

**అనువయించు** సం. స. క్రి.

నేయు.

వ. అని యిట్లు నాగకులంబు నెల్ల స్తుతియించి యందు సితాసిత తంతు సంతాన పటంబు ననువయించుచున్న వారి నిద్దఱ స్త్రీలను. ఆది. 1-108

**అనువరి** దే. విణ.

ఉపాయశాలి, నేర్పరి.

చ. ...పురుషోత్తముఁ డింత యొప్పఁబల్కునె మఱుమాటలాడ నెయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం, దనువరి యెవ్వఁ డంచు నచలాకృతులై నెటి మూరకుండఁగన్. ఉద్యో. 3-285

**అనువర్ణించు** సం. స. క్రి.

క్రమముగా వర్ణించు, వివరించు.

క. ...జంబూ ద్వీపమ్మున జనపదములు విను, మమ్మహీశాంశములు దెలియ ననువర్ణింతున్. భీష్మ. 1–24

**అనువర్తనము** సం. వి. అ. న.

అనుసరించి నడచుకొనుట.

తే. అవ్విభుఁడు వోయివత్తుగా కనక పోను, మేనుఁ బ్రాణంబుఁ దన యులు మిత్త్రగణము, బంధులును నర్థచయము నప్పార్థివేంద్రు; సౌమ్యు తదనువర్తనము వ్రతమ్మ నాకు. అశ్వ. 1–148

**అనువర్తి** సం. విశే. (న్‌-నీ-న్)

అనుసరించి మెలఁగునది.

తే. కనియెఁ బవమాన వివిధ వర్తన కళానువర్తిఁగాక ఘూకా రవ స్ఫూర్తిజాత, భీతపరివర్తి నాభీల భుజగ, చండమూర్తి శమీతరు చక్రవర్తి. విరా. 1–162

**అనువర్తించు** సం. స. క్రి.

అనుసరించి నడచు.

క. ఎఱుగవె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నెత్తెఱఁగున ననువర్తించెనో, యెఱుఁగవె తగుచేవ గలుగు టెఱుఁగవె యధిపా. ఉద్యో. 3–278

**అనువాదిత** సం. వి. ఆ. స్త్రీ.

అనువదించి చెప్పుట, వివరించుట.

క. నిను నెవ్వఁ డెఱిఁగె నాతఁడు, నను నెఱిఁగినవాఁడ నిన్ను నమ్మిగ సేవించిన నదియ నన్నుఁ గొల్చుట, యనువాదిత లేదు భేద మర యఁగ మనకున్. శాంతి. 6–451

**అనువాసన** సం. వి. ఆ. స్త్రీ.

అనుగతమగు గంధము, అనుసరించి వచ్చిన పరిమళము.

మ. ఘనధూమధ్వజ దహ్యమాన లవలీ కర్పూర తక్కోల చందన
కాలాగరు సల్లకీతరుల యుద్యద్ధూమ ధూపానువాసన నొప్పెన్
సురభీకృతంబులగుచున్ సంక్రీడమానామృతాశన విద్యాధర
సద్విమాన వితతుల్ సావిత్ర వర్త్మంబునన్. ఆది. 8-262

**అనువిందుఁడు** సం. వి. అ. పుం.

1. కురు కుమారుఁడు- ఇతఁడు గాంధారీ ధృతరాష్ట్రుల తొమ్మిదవ కొడుకు. విందుని తర్వాతివాడు. ఇతఁడు ద్రోణుని నాలవ నాఁటి యుద్ధమున విందునితోపాటు భీమునిచేఁ జచ్చెను.

ఆది. 5-107; ద్రోణ. 4-142, 143

2. అవంతీశ్వరుఁడు. ఇతఁడు విందుని తమ్ముఁడు. విందుఁడు అనువిందుడు అను వారిర్వురు అవంతీశ్వరులు. ఇందు అనువిందుఁడు అన్నయగు విందునితోపాటు ఒకయక్షౌహిణిఁ దీసికొని భారత యుద్ధారంభకాలమున దుర్యోధనుం జేరి యుద్ధమున సాయపడెను.

ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున అర్జునుఁడు కౌరవ వ్యూహము సొచ్చి సైంధవుఁడున్న దిక్కునకుఁబోవ ఈ యనువిందుఁ డాతని నెదిరించి యతనిచే నన్నయగు విందునితోపాటు హతుఁడయ్యెను.

ఉద్యో. 1-225; ద్రోణ. 3-143 మొ. 148 వరకు

ఈ విందానువిందులు శ్రీకృష్ణునకు మేనత్తయుఁ పాండవుల తల్లియగు కుంతికిఁ జెల్లెలు నగు రాజాధిదేవికి అవంతీశ్వరుఁడైన జయత్సేనుఁడు అను వానివలన జన్మించిరి. వీరు దుర్యోధనునకు వశులై శిశుపాలాదులకు వలె శ్రీకృష్ణుని విరోధకోటిలోఁ జేరిరి. వీరి చెల్లెలు మిత్రవింద. ఈమెను శ్రీకృష్ణుఁడు వివాహమాడెను. (శ్రీభాగవతము)

3. కైకేయుఁడు. విందుఁడు అనువిందుఁడు అను వారిర్వురు అన్నదమ్ములు. కేకయ దేశపు రాజులు. వీరు మహాభారత యుద్ధమున దుర్యోధను పక్షమునఁ బోరాడిరి.

కర్ణుని మొదటినాఁటి యుద్ధమున ఈ విందానువిందులు సాత్యకి నెదిరించి యతనిచే హతులైరి. కర్ణ. 1-89, 97, 98

అనువు దే. వి.

1. విధము, పద్ధతి, రీతి.

తే. ...అతఁడు, పెక్కు పాములు వొదివినఁ బెనఁగు గరుడు, ననువు దోఁపఁగఁ బోరాడె మనుజనాథ. కర్ణ 2-278

క. ఇనుమును గనకము నిందయు, వినుతియు సమములుగఁ గొనుచు వివిధాంగకముల్, దనలోన నడఁచు కమఠము, ననువున నింద్రియము లడయ నతఁడు గను శివున్. శాంతి. 6-286

2. ఉపాయము, నేర్పు.

క. తనువున విఱిగిన యలుగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్, మనమున నాటిన మాటలు, వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా. ఉద్యో. 2-62

తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ, ననువుతో ధృతిగల్గి కార్యంబు నడపు, నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యు నట్లపోలెఁ, బరమ సంశయమయ్యెడు బ్రదుకుఁ గాంచు. శాంతి. 3-200

3. శక్తి, సామర్థ్యము.

తే. దారుణాస్త్ర జాలాంశుల వైరిసైన్య,శాప మొనరించి యా సూతతనయ తరణి, పార్థ దుస్తరకాల వైభవము గడవ, ననువు లేమి నవ్వీథిమున నస్తమించె. కర్ణ. 3-366; ద్రోణ. 2-126

4. శక్యము, సాధ్యము.

క. పెలుకుటి తాళంబీ మదిఁ, దలఁచి యనువుగాక ధరణితలము గరతలంబుల నప్పళించె వాఁడక్కొలు వార్వఁగ విడిచి మొఱసెఁ గుంతీసుతుఁడున్. విరా. 2-19

5. అవకాశము, వీలు.

క. అని చెప్పి హర్షసంభ్రమమున సజ్జననాయకుండు మునుఁగుట నది యేమని యడుగఁ దలంపమిఁ దన, కనువైన కార్యము ఘటించి యతనిం బుచ్చెన్. విరా. 5-270

చ. అనవుడు భీముఁ డాధి యతఁ డాతని కిట్లను నట్టివాఁడకా, కనిలజుఁ

డల్పెఁ డెట్లు సమరాగ్రమునన్ భవదుక్తి యిట్ల యిం,తనువగునే
కిరీటిఁ దెగటార్పఁగ నీతని నొంపఁజంపఁ దాఁ, గని వెసవచ్చు
నాతఁ డధికంబగు మగ్నల మవ్వు నూఁడుమీ. కర్ణ. 2-206

6. ఆనుకూల్యము.

వ. .....సంక్రందన నందను సురవదికిం దెరలక యేకరథస్థులగు
నయ్యిరువురుం బరాక్రమించిన.

తే. చేరియుండుట నరువైనవారి నొక్క,నా శసంబున నేసె నరుఁడు.
ద్రోణ. 1-360

7. ఒప్పు, ఒప్పిదము, బాగు.

సీ. కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు
ననువుగాఁగ. విరా. 1-807

క. తలుగుల పొది యొకదెసఁ, బెయ్యల దామెన యొక్కవలన
ననువై యుండన్, మొలమోపి పెకుృచుట్లన్, బలుద్రాటం
బుట్టి గోపభావం బలరన్. విరా. 1-275

విణ.

1. అనుకూలమైనది, పీతైనది.

క. అను మాటలు విని సంక్రం,దన నందనుఁ డిట్టులనియె దైవంబు
కతం,బున నాకు నొక్కచందఁ, బనువైయున్నయది దీని నొంగా
దనుఁడా. విరా. 1-86

2. అయితము, సిద్ధము.

ఆ. పాండవాగ్రజుండు పవనాత్మజుని గూడి, తటిమి సాత్యకియును
దాను గవిసె, నంత మూఁగ్ఛదేటి హైడింబు డొక్కతే, రనువు
గాఁగఁ జేసికొని కదంగె. ద్రోణ. 5-85; విరా. 4-6

3. వశమైనది, స్వాధీనము.

తే. ఆయుపాయముల్ మూఁటికి ననువుగాని, యట్టి పగతుని యెడ
భేద మాచరింప,వలయు. శాంతి. 2-416

**అనువుదప్పు** దే. అ. క్రి.

అవకాశము చెడు,

సీ. పరసేన భేదింపఁ బనిచితి నేను సౌభద్రుని వాఁడు నబ్బలము
సొచ్చె, వెనుక నేమును జొచ్చి చనఁగ సైంధవుఁడు మమ్మాఁగిన
దోడ్పడ ననువు దప్పె. ద్రోణ. 2-147

**అనువుసేయు** దే. స. క్రి.

సిద్ధపఱుచు, అయత్తపఱుచు.

క. మొనలో నప్పుగఁ దీర్చికొనుఁడు, దనతన వాహనము లాయుధము
లెల్ల జనంబును ననువుసేసికొనుఁ డోపిన యంతయుఁ గాచి
కొనుఁడు బెదరక పనులన్. విరా. 4-89

క. కురుపతి పడవాళ్లందగు, దొరలకడకు సత్వరముగ దురమునకు
భటోత్కరము ననువు సేయుటకై, బరవసము దలిర్పఁ బనిచెఁ
బార్థివముఖ్యా. శల్య. 1-98

**అనువృత్తము** సం. వి. అ. న.

అనుసరణము, అనువర్తనము.

సీ. సంయమివరులార సత్త్వరజస్తమో, నామరూఢములు గుణంబు
లవియు, నన్యోన్య మిథునత్వ మన్యోన్య సంశ్రయ మన్యోన్య
సంకలితానువృత్త, భావ మన్యోన్యోపజీవనాచరణంబు గలిగి.
అశ్వ. 2-116

**అనువృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

అనుగుణము, అనువర్తనము.

సీ. ....ఆలలన మీరు, మద్గురుకురులరు మహిత శుశ్రూషకుఁగాదె
ప్రాణములు సంగములుఁ గలిమి, -తే- విహిత మిటుసేఁత నా
కనువృత్తి శీలఁ గాఁగఁ జేయుఁడు నన్ను మీ కరుణయలర, ననిన.
అశ్వ. 4-287

**అనువ్రత** సం. విణ. (అ. ఆ. అ.)

అనుసరించునది, అనుకూల వర్తనము గలది.

వ. కావునం బతికి ననువ్రతయగుట గృహిణికి ధర్మం బని పలికి.
అను. 5-289; అర. 2-206

**అనువ్రతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

**అనుకూలుఁడు, అనుసరించి వర్తించువాఁడు.**

వ. నన్ను ననురక్త. ననువ్రతుఁ, దలంపక యన్యాపేక్షుఁబున స్వయంవరంబు రచియించుట యిది కులస్త్రీధర్మంబు గాదు. అర. 2-210

**అనుశాసకుఁడు** సం. విణ. (అ. సికా. అ.)

**శాసించువాఁడు, నియమించువాఁడు.**

వ. మఱియు బృహస్పతికి మహేంద్ర భరద్వాజ ప్రముఖులగు రాజ ధర్మానుశాసకులు రాజత్వ మూలకారణంబు ప్రజాసంరక్షయ యనిరి. శాంతి 2-193

**అనుశాసనమున** సం. వి. అ న.

1. ఆజ్ఞ.

సీ. అమరాపగాసుతు ననుశాసనంబునఁ గౌరవ రాజ్యంబు గడు వెలింగి. ఆది. 5-3

2 ఉపదేశము.

క. జననిందితమయి నీయం, దనపత్యత యను నధర్మ మది యుండఁగ ధర్మనివృత్త చరిత్రక నీ, యనుశాసన మెట్లు నమ్మనగు జన ములకున్. సభా, 2-43

వ. దేవర్షియైన రోమశుండు ధర్మరాజునకు ధర్మానుశాసంబు సేసి దివం బున కరిగె. అర. 4-100

3. నియోగము. విధి

వ. ఇట్లు జూదంబున నయ్యోడు దోసం బెఱింగియు దైవానుశాసనం బున ధర్మజుడు దాని కభిముఖుండయి సభా. 2—178

4. నిరూపణము, నిర్ణయము.

సీ అట్లుగా దిట్లని యనుశాసనము సేయఁ గడు నేర్పు శిష్యుల కడకుఁ బోయి. అశ్వ. 2-88

సీ. వధము ధర్మంబుగా బుధులు సెప్పుదు రని యనుశాసనము సేయ
జనకుతోఁద. శాంతి. 5-294

5. పాలనము.

క. అయ్యుదాత్తచరితుఁ డెవ్వరుసున నోడఁబడఁడయ్యెను, సరస
మహిరాజ్య సమనుశాసనమునకున్. అర. 6-311

**అనుశాసించు** సం. స. క్రి.

1. బోధించు, కఱపు.

క. అనఘుఁడు మైత్రేయుం డను, మునినాథుఁడు వచ్చి ధర్మమున
నాతని దా, ననుశాసించునుఁ దిరముగ నని చెప్పుచు నప్పరాశరా
త్మజుఁ డరిగెన్. అర. 1-90

2. ఆజ్ఞాపించు.

క. ఈసున దుర్యోధన దు,శ్శాసను లా పాండవులను సభలో నెగ్గుల్
సేసిన విని వారల ననుశాసింపఁగ వలవ దనఁగఁ జనదే నీకున్.
అర. 1-383

వ. యముండు ధర్మజు ననుశాసించుటయు. అది. 1-88

3. పాలించు

వ. దేవా సకల సామ్రాజ్య ధురీణుండవై మమ్మందఱ ననుశాసింపవే
యని యర్థిజన హితంబుగా నతని బ్రార్థించిన. అర. 6-310

**అనుశాసితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఉపదేశింపఁబడినవాఁడు.

వ. వినీతుండయి విప్రులచేత ననుశాసితుండయిన రాజునకు నలబ్ధలా
భాది త్రితయంబు సంపన్నంబగు. అర. 1-207

**అనుషంగము** సం. వి. అ. పుం.

1. కలయిక, కూడిక.

సీ. సర్వభూత దయానుషంగంబు గలిగి య,తీతవస్తువులఁ జింతింపక.
అశ్వ 2-172

2. విషయము, ప్రసంగము.

క. ...నిర్భర వేదవ్యాసానేక వచోనుషంగ హరిహరనాథా.
స్వర్గా. 76

**అనుషక్తి** సం. వి. ఇ. స్త్రీ.

కూడిక, కలయిక.

క. వినుఁ డా గుణంబు లన్నిటిఁ, గని కొని తత్తదనుషక్తి గలుగని వాఁ డప్పనిచే భుజింపఁగాఁ బడఁ, డనఘాత్మకులార ప్రింగు నత డా రాశిన్.
అశ్వ. 2-123

**అనుషక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అసక్తి గలవాఁడు.

క. ...పరమ నైష్ఠికత్వ వ్యాపార పరానుషక్త హరిహరనాథా.
కర్ణ. 1-1

**అనుష్ఠాత** సం. విణ. (ఋ-త్రీ-ఋ)

అనుష్ఠించువాఁడు, ఆచరించువాఁడు.

వ. విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలకును అది. 4-22

**అనుష్ఠానము** సం. వి. అ. న.

1. చేయుట, ఆచరణము.

వ. వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.
విరా. 1-43

2. కర్మ నాచరించుట. క్రియ జరుపుట.

క. నహుషుండు పనుచు వాఁడకొ, విహితానుష్ఠానపరులు వీరకొ తా లోకహితంబకొ యిది మనకున్, మహనీయము కాక యెట్లు మానఁగవచ్చున్.
ఉద్యో. 1-169

**అనుష్ఠించు** సం. స. క్రి.

1. ఆచరించు, ఒనరించు.

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగా జరిపి...తా రనుష్ఠింపం

బూనిన పని వారఖ కెఱింగింపఁ దలఁచి. విరా. 1-46

**అనుష్ఠితము** సం. విణ. (అ. ఆ. అ.)

అనుష్ఠింపఁబడినది, ఆచరింపఁబడినది.

క. సత్యాకృతులగు గుణములు, నిత్యానుష్ఠిత సమగ్ర నిర్మల యోగ, స్థిత్యభిముఖునకు సులభము, లత్యంత సుఖప్రపంబు లవి కార్యంబుల్. శాంతి. 3-418

క. తన తన వెరవున కర్మం, బనుష్ఠితంబైన మేల. శాంతి. 5-256

**అనుష్ఠేయము** సం. విణ. (అ. ఆ. అ.)

క, సత్యప్రకార ధర్మము, నిత్యానుష్ఠేయము. శాంతి. 3-112; 4-267

**అనుష్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

వేఁడిలేనిది, చల్లనిది.

క. ఓంకార వాచ్యమది, యనహంకార నిరూఢ భావనారాధ్యము నిష్పంక మశీత మనుష్ణము, శంకరమఖిలంబునకుఁ గృపాహారము శివా. అను. 4-189

**అనుసంధానము** సం. వి. అ. న.

విచారము, సమ్యగ్నిరీక్షణము, చింతనము.

వ. ...లోకంబుతోడి పాటిమై యాత్మానుసంధానంబు సేయలేక మెలంగుచున్నం జూచి. శాంతి. 6-257

2. పరిపాలనము.

వ. భరతుండును రాముచేతఁ బ్రత్యాఖ్యాతుండై తదీయ పాదుకంబులు గొని చని వాని నర్చించుచు నందిగ్రామంబునందు వసియించి రాజ్యామసంధానంబు సేయుచుండె. అర, 6-312

శ్లో. విసర్జితః స రామేణ పితుర్వచనకారిణా
నందిగ్రామేఽకరోద్రాజ్యం పురస్కృత్యాస్య పాదుకే.

సం. భా. వన. 178-45

**అనుసంధించు** సం. స. క్రి.

1. మననము సేయు, చింతనము సేయు.

వ. ...అమ్మహాత్ముండు దన మధుర వాక్యంబుల నుపదేశింప నత్యంత గుహ్యంబైన యోగ ప్రకారంబు విశదంబుగా ననుసంధించితి. భీష్మ 1-259

క. ...నిత్యము నీ యధ్యాత్మము ననుసంధింపు పాసెదవు దురిత ములన్. ఆశ్వ 2-228

2. సమీక్షించు, పరికించిచూచు.

వ. ...మిమ్ము నిందఱను జూచుటకును నా శిష్యుల గదాయుద్ధం బనుసంధించుటకును వచ్చితి ననియె. శల్య. 2-141

శ్లో. శిష్యయోర్వై గదాయుద్ధం ద్రష్టుకామోఽస్మి మాధవ.
సం. భా. శల్య. 84-6

3. చూచు.

వ. అప్పుడు దమకు విజయప్రదంబులును గౌరవులకు విపరీతంబులు నైన గంధవాహాది నానానిమిత్తంబు లనుసంధించి యా సవ్య సాచి సాత్యకితో నిట్లనియె

శ్లో. దృష్ట్వాఽర్జునో నిమిత్తాని విజయాయ ప్రదక్షిణం
యుయుధానం మహేష్వాస మిదం వచన మబ్రవీత్.
యుయుధానాద్య యుద్ధే మే దృశ్యతే విజయో ధ్రువః
యుయుధ హీమాని లింగాని దృశ్యంతే శినిపుంగవ.
సం. భా. ద్రోణ. 85-16,17

4. నియమించు, పనుచు.

ఆ. ఇంతి నీ కధర్మ మేలయ్యెడు నాదు, పనుపు సేయు నిన్నుఁ, బరమ ధర్మ, మొందు విమల కీర్తియును జెందునట్లుగా, వరము లిత్తు మేను హరుఁడు నీకు.

వ. ఏ మనుసంధించిన పనికి నీకు భయంబేల. ద్రోణ. 2-174, 175

5. ప్రత్యక్షముగా నెఱుఁగు.

వ. అంబికేయుండు సంజయుతో నీ వింక సంగరంబుఁ జూడం బొమ్మని

సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారత రణ ప్రకారం బను సంధించి యతండు కతిపయ దినంబులకుం జనుదెంచి, భీష్మ. 1-44

శ్లో. అథ గావల్గణి ర్విద్వాన్ సంయుగా దేత్య భారత
ప్రత్యక్షదర్శీ సర్వస్య భూతభవ్యభవిష్యవిత్ సం. భా. భీష్మ. 14-1

6. తెలిసికొను, గ్రహించు.

వ. ఆయోషధినాథుండు నానాటికిం గృశుం డయ్యె నట్లాతెవులు చేత నతండు పోడిమి మాలిన నోషధులు పస చెడియె, దానం బ్రజలు డయ్యం జొచ్చిరది చంద్రకార్శ్య హేతుకంబగుట యను సంధించి. కల్య. 2-148

7. నియమించు, శాసించు.

వ. అట్లు పావకక్రియాకలాపం బనుసంధించి యాసంయమివరుండు. అను. 3-186

**అనుసంభవుఁడు** సం. వి. అ. పుం.

తమ్ముఁడు (తర్వాతఁ బుట్టినవాఁడు)

ఆ. పాండవాగ్రజుండుఁ బవనపుత్రుఁడు నకులుండుఁ దదనుసంభవుండుఁ, బట్టునవి కుమార యగ్గవాజికోశమ;హోశరంబు పార్థు నదియ చూపె. విరా. 4-126

**అనుసరణము** సం. వి. అ. న.

అనుసరించుట, అనువర్తించుట.

క. వినుసత్త్వరజస్తమముల, యనుసరణము వలన వివిధమగు యోని గణంబున వెలసిన యా తత్త్వము, దనఁ జూడఁగలేక యవియ తా నని యుండున్, శాంతి. 6-12

**అనుసరిత** సం. వి. ఆ. స్త్రీ.

అనుసరణము, అనుసరించుట.

క. నరవర యేర్పడ విను మ,త్తురగంబుల పటురయంబుతో నను సరతం, దిరుగు పురుషుండు సంసృతిఁ బరువడి భ్రమియించు నవశ భావవ్యాప్తిన్. స్త్రీ. 1-58

**అనుసరించు** సం. స. క్రి.

1. వెంబడించు, వెంటఁబోవు.

వ. ...అప్పరమ తురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖంబై యల్లనల్లన యరుగుచుండ నర్జునుం డనుస రించి పాలనపరుం డగుచుఁ బ్రవర్తింప, అశ్వ. 4-4

2. పరికించు, కనిపెట్టియుండు.

వ. ...నేనును వనవాస కాలంబున నా నేర్చు విధంబున మీకునెల్లను గారామైన తమ్ముని నమ్మెయిం బరికించుకొని వచ్చితి నిపు డజ్ఞాత వాసాయాసితుండగు నతని ననుసరింప వెరవు గామింజేసి చేయు నది లేక చింతిల్లుచున్నదాన. విరా. 2-215

3. అనువర్తించు.

తే. కూటికై ద్రోణభీష్ములు గుమతి యనక, యనుసరింతురు ధృత రాష్ట్రుఁడును దనూజు, తృష్ణ నూనినవాఁడు రాధేయుఁబోటి, తులువ లెల్లరు నతని సద్బుద్ధియండ్రు. ఉద్యో. 1-36

శ్లో. అనువర్త్స్యతి తంచాపి ధృతరాష్ట్రః సుతప్రియః
భీష్మద్రోణా చ కార్పణ్యాన్మౌర్ఖ్యాత్ ద్రాధేయసౌబలా.
సం. భా. ఉద్యో. 4-2

4. గౌరవించు, పూజించు.

వ. ఇట్లు నిలువరించి నిటలంబున నారాచంబు నాటించి యక్కుంభ సంభవుండు దన మనంబున వీఁడు వివ్వచ్చు నట్ల నన్ననుసరింపఁ గలవాఁడని తలంచి యప్పవనతనయు నుద్దేశించి. ద్రోణ. 4-145

శ్లో. సమన్యమానస్త్వాచార్యో మామయం ఫల్గునో యథా
భీమః కరిష్యతే పూజామిత్యువాచ వృకోదరమ్.
సం. భా. ద్రోణ. 127-43,44 (వావిళ్ళ)

5. సరిపోలు.

సీ. అవధరింపుము సాంఖ్య మనుసరించును యోగ,తంత్రంబు నది యను దాని తెరువు, నొందుఁగావున సాంఖ్య యోగంబు లేకంబ. శాంతి. 6-29

**అనుసారము** సం. వి. అ. పుం.

1. అనుసరణము, అనువర్తించుట.

క. జనవర శుక్లము లోహిత,మును గృష్ణము నైన వర్ణములఁ జతుర మొందును సత్త్వరజస్తమములు, యనుసారంబున నవర్ణమయ్యు వికృతమై. శాంతి. 6-14

2. అనుగుణము.

సీ. ప్రణవవీణావేణు రణితానుసారమై, రస గీతరవ మెల్ల దెసల నెసఁగె. ఆది. 7-172

**అనుసారి** సం. విణ. (న్. జి. న్)

1 అనుసరించువాఁడు, వెంబడించువాఁడు.

వ. అయ్యనిమిషసుతుండును గ్రతువిషయంబులయిన వలయు ననుష్ఠానంబులు విధివంతంబునుగాఁ జలుపుచుఁ దురగంబు వెనుకం దారామృగానుసారి యయిన పినాకపాణియుంబోలెఁ బోవుచుండ. అశ్వ. 4-49

**అనుస్మరించు** సం. స. క్రి.

ధ్యానించు.

క. తనుఁ దనయంద నిలిపి పేరనువున బుద్ధి కడ వెలుఁగు నచ్యుతుని సనాతను నగ్రాహ్యునిఁ జిన్మయు, ననుస్మరించునది యపునరావృత్తికినై. శాంతి. 4-247

**అనుస్మృతి** సం. వి. ఇ. స్త్రీ.

అనుస్మరణము. అనుస్మృతి యను పేరు గల్గిన విష్ణుధ్యానము.

చూ. శాంతి. 4-212

ఈ యనుస్మృతిని నారదునకు శ్రీ మహావిష్ణు వుపదేశించిన విధంబున భీష్ముఁడు ధర్మరాజున కెఱింగించెను తొలుత వాసుదేవ ద్వాదశాక్షరిని (ప్రణవము తర్వాత నమశ్శబ్దము తర్వాత చతుర్థితో భగవచ్ఛబ్దము ఆ పిమ్మట చతుర్థితో వాసుదేవ శబ్దము కలిసియున్న మంత్రము) జపించి పిదప దీనిని జపింపవలయును.

ఈ యనుస్మృతి ఔత్తరాహ సంస్కృత భారత ప్రతుల యందుఁ గొన్నిటఁ గానరాదు

**అనుస్యూతము** సం. విణ. (అ. ఆ. అ.)

అనుబంధించినది, అవ్యవధానముగాఁ జేరినది.

వ. అనుటయు దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను మేలుంను బంధించు మేలు లట్ల కీళ్లను ననుస్యూతంబులయి తోడరు.

శాంతి, 4-71

**అనుహ్లాదుఁడు** సం. వి. అ. పుం.

హిరణ్యకశిపుని మూఁడవ కొడుకు. ఆది 3-63

ఇతని భార్య సూర్మి-కుమారులు బాష్కలుఁడు, మహిషుఁడు (భాగ)

**అనూదరుఁడు** సం. వి. అ. పుం.

కురుకుమారుఁడు, ధృతరాష్ట్రుని నూర్గురు కొడుకులలో నేఁబది యెన్మిదవవాఁడు. ఆది. 6—107

**అనూనత** సం. వి. ఆ. స్త్రీ.

తక్కువగానితనము, నిండుదనము, పూర్ణత్వము.

క. మనము బలశౌర్యఘనుఁ గర్ణుని సేనాముఖము సేసి నూల్కొని యరిమర్దన మొనరింత మితనియం, దనూనతం బొల్చు సద్గుణావలియు నృపా. కర్ణ. 1-50

**అనూనత్వము** సం. వి. అ. న.

అనూనత.

క. కాన తపంబును విద్యయు, దానౌదాత్త్య ప్రవర్ధితంబులు విద్యా, నూనత్వం బచ్యుతుఁగను, దానికి దీపంబు సద్వ్రతప్రవణులకున్.

అను. 4-352

**అనూనము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తక్కువగానిది, నిండైనది, పూర్ణము.

ఉ. ...మీ, పూనిక దీర్చి మీరెలమిఁ బొందుట యెల్లను బుణ్యి

దేవతా,నూనస్యయాసమృద్ధి నను నొందుటగాదె సురేంద్రనందనా.
విరా. 5-346

2. లోపము లేనిది.

క. అని పలికిన విని క్రమ్మఱ, జనుదెంచితి మేము విష్ణుచందంబిది నీ, కనఘా యలుగం బనిలేదనూనములుగాఁగనదవు మధ్వరవిధులన్.
శాంతి. 6-371

ఆ మీ యనుగ్రహమునఁ జేయంగఁ గడఁగితి, నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ, దీని నిందఱును ననూనఁబుగాఁ బూని పెంపుమెఱసి నిర్వహింపవలయు.
సభా. 1-286

**అనూనయించు** సం. స. క్రి.

మన్నించు, ఆదరించు.

వ. ఏ నెట్లును సత్యభంగంబు సేయుట కోడంబడనోప నని ధర్మతన యుం డనుజు ననూనయించె.
అర. 1-398

**అనూనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

అధికుఁడు, తక్కువ గానివాఁడు.

క. అనిన ముకుందుఁడు దుర్యోధనుతో నిట్లనియె విమలతర వంశమునన్, జనియించి తెల్లగుణముల, ననూనుఁడవు నీకు నీదురాగ్రహ మగునే,
ఉద్యో. 3-331

**అనూపము** సం. విశే. (అ. ఆ. అ.)

1. జలసమృద్ధి గల నేల, 2 జలసమృద్ధి గల దేశము, 3. నదీపర్వతముల సమీపము, 4. ఒకానొక దేశము.

వ. ఇట్లు శబరసాగరానూపవాసులైన యోధవీరులతోఁ బన్ని.
సభా. 1-229; భీష్మ. 1-40

**అనూరాధ** సం. వి. ఆ. స్త్రీ. అనురాధ

చూ. అనురాధ

అనూరాధ రాజాధికారము,
అను. 3-169

**అనూరుఁడు** సం. విణ. అ. పుం.

వినతకు కశ్యపుని వలనఁ బుట్టినవాఁడు, గరుత్మంతుని అన్న, సూర్యుని సారథి ఇతని భార్య శ్యేని, సంపాతి జటాయువు అను వారలు ఇతని పుత్రులు. వినత తన సవతియగు కద్రువకు వేయిసర్పములు పుట్టుటయుఁ దనకుఁ గలిగిన రెండు గ్రుడ్లు పొదుగఁబడకుండుటయుఁ జూచి యోర్వలేక యొక యండమును బగులఁగొట్టెను. ఆ యండమునుండి పూర్వాంగము మాత్రము గల్గిన యనూరుఁడు పుట్టెను. ఇతఁడు తల్లి యవినీతికిఁ గోపించి సవతికి దాసి యగునటుల శపించెను. అను. 1-168 మొ 172 వ, 178 ఆది. 8-65. అర. 2-169.

**ఆనృణత్వము** సం. వి. అ. న.

ఋణవిముక్తిత్వము.

వ. ఇట్లు సకల బాంధవ సుహృజ్జనంబులకుం బారలౌకిక క్రియలు సేసి యనృణత్వంబున వెలింగి. శాంతి. 1-885

**అనృతత్వము** సం. వి. అ. న.

అసత్యము.

క. కలుగునె యమోఘమగు నీ, పలుకున కనృతత్వ మేను బని విని యెద నన్నలఘు కృపఁ జూడుము. అను. 1-131

**అనృతము** సం. విణ (అ. ఆ. అ.)

1. అసత్యమైనది, కల్లయైనది.

క. అనవుడు శోకం బడరఁగ, ననిమిషగురుఁ జూచి యిట్టు లను శచి యిటు వుచ్చిన దూఱు రాదె నను శుచి,యని మీ కొనియాడుటెల్ల ననృతముగాదే. ఉద్యో. 1-156

సం. వి. అ. న.

2. అసత్యము, కల్ల

వ. అనవుడు నజాతశత్రుండు గంగాపుత్రునితో సత్యానృతంబులు జగంబులం బరఁగియుండుఁ బురుషుండు వానియెడ నెట్లుఁగి వాఁడై ధర్మపరుఁడగు, శాంతి, 8-44

3. యథేష్టానుచరణము. ఇచ్చవచ్చినట్లు చేయుట.

క. సత్యమ బ్రహ్మము దపమును, సత్యమ ప్రజలను సృజించు సత్యమ లోకస్థిత్యాధానముఁ జేయును, సత్యం బనృతంబు చేత సంపిహితమగున్. శాంతి. 4-100

4. 1) అధర్మము 2) తమము 3) అజ్ఞానము 4) నరకము 5) దుఃఖము.

వ ధర్మాధర్మంబులనఁ బ్రకాశతమంబులన బోధాజ్ఞానంబులన స్వర్గ నరకంబులన సుఖదుఃఖంబులనఁ బరఁగు బుధజనవ్యావహారిక శబ్దంబులకు నర్థంబై సత్యానృతంబులు ప్రవర్తిల్లుం గావున. శాంతి. 4-101

5. కపటము, మోసము.

క. ఈ యనృతవర్తన లేలా యున్న నిజంబు నీ తలంపును నిన్నుం, దోయజలోచన చెప్పుము, పోయెదఁ బనులుగల వనిచివుచ్చుము నన్నున్. అను. 2-24

**అనృతవాది** సం. విణ. (న్. నీ. న్.)

అసత్యమాడువాఁడు.

వ. మఱియు నాహితాగ్నులకు నతీర్థసేవకులకును నన్నృతవాదులకు .. ఘోర నరకవిషయంబును...నైన దాని నమరావతిఁ జొచ్చి. అర 1-150

**అనృతాత్ముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అసత్యమాడువాఁడు.

ఆ. మనల నింక నమ్మ రనృతాత్ము లన్యాయపరులు గర్వు లనుచు... ఉద్యో. 1-234

**అనేకకాలము** సం. విణ. అ. పుం.

చాలకాలము.

వ. ఉపవంబు నడనేక కాలంబు దపంబు చేసె. ఆది. 1-120

**అనేకత్వము** సం. వి. అ. న.

1. పెక్కండ్రుగా నుండుట.

క. ఏకత్వం బన్యత్వ మ,నేకత్వము గలుగు నీ మహిమ చందం బా,లో
కింప నిపుణులగు సు,శ్లోకులకుం బరమ పదము సులభము శార్ఙ్గీ.
శాంతి. 4-289

2. భిన్నత్వము.

క. నానాశాస్త్రంబుల న,ర్థానేకత్వంబు గనుచు నప్రాప్తసువి,జ్ఞాన
పరినిష్ఠమగు మ,నాన్మౌనసముం దేర్పవే సమగ్రవివేకా.
శాంతి. 5-448

**అనేకనికేతనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకచోట నియతముగా నుండక పెక్కుచోట్ల నుండువాఁడు

వ. కామక్రోధాదులం బొరయక శౌచాచార క్రియారతులయి సర్వ
ద్వంద్వంబులు నొడిచి సర్వసంగ వివర్జితులయిన యతులను,
ఆది. 3-221

**అనేకపము** సం. వి. అ. పుం.

ద్విపము, ఏనుఁగు.

క. ...ఉ,గ్రానేకప శార్దూల భ,యానక వనవాస మర్హ మగునే
మీకున్. విరా. 1-14

**అనేకభంగి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

వివిధము.

ఆ. ...అనేక భంగి నాశ్విక సేనలు, బొమ్మలాడినట్లు పోరుచుండె.
విరా. 3-164

**అనేకము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పెక్కు, ఒక్కటిగానిది.

క. ...అతండు గడుఁబ్రియమున న,ర్థములొసఁగె వారికి ననే,కములు
వహింపంగఁ గొలఁది గాకుండంగన్. శల్య. 2-40

2. ఉరము, పెక్కు రూపములు గలది.

వ. ఇది యక్షరక్షర వివేకం భేకం బనేకంబు దర్శనం బదర్శనంబు

నిస్త్వేఁబు దత్త్వం బపవర్గంబు వర్గం బని యక్షరక్షరంబుల పర్యాయ నిర్దేశంబులు. శాంతి. 6-34

**అనేకాగ్రత** సం. వి. అ. స్త్రీ.

వ్యగ్రత. ఒక విషయమందే చిత్తము నెలకొల్పకుండుట.

క. వా కెఱింగింపుము దీని న,నేకాగ్రతఁ బొందనేల యే నుండఁగ న,వ్యాకుల భవత్ప్రతాప నిరాకృతులు ధరిత్రిలోని రాజులు నీకున్. సభా. 2-93

శ్లో. అనేకాగ్రం తు తం దృష్ట్వా శకునిః ప్రత్యభాషత. సంభా. సభా. 74-21

పాఠాంతరము అనేకార్తత యుక్తము గాదు.

**అనేకులు** సం. విశే. అ. పుం. (బహు)

పెక్కండ్రు.

ఆ. నిఖిల దిశలయందు నిపుణవృత్తి, నెఱుఁగు వట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటి లోన నెఱుఁగఁబడరె, విరా. 8-94

**అనేకనుఁడు** సం. వి. అ. పుం.

1. నహుషుని తమ్ముఁడు. ఊర్వశీ పురూరవుల కొడుకైన ఆయువునకు స్వర్భానవి యను దానియందుఁ బుట్టిన నల్వురలో నాలవవాఁడు. ఆది. 3-92

2. కకుత్స్థుని కొడుకు, ఇక్ష్వాకుని ప్రపౌత్రుఁడు. అర. 4-380

**అన్చిపుచ్చు** దే. స. క్రి.

పంపివేయు.

చ. ...ఇత్తెఱంగు సెప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్చిపుచ్చు. అశ్వ. 3-4

**అన్చు** దే. స. క్రి.

అనుచు, పంపు.

చ. క్రీడి త్రిగర్తుని చాపదండ కేతనములు ద్రుంచి పైపడిన తమ్ముల

నంతకు బ్రోలి కన్చి. ద్రోణ. 1-844

**అన్న**[1] దే. వి. (ఓ. క. మ. అణ్ణ; త-అణ్ణన్; తు. అణ్ణె)

(సం. జనకః; ప్రా-జణ్ణ అను శబ్దములనుండి ఇది పుట్టినదనియుఁ గాన వైకృత మనియుఁ గొందఱందురు ఈ వాదము కృతకముగాఁ గన్పించును.)

('జనకుఁడు' అను నర్థము ఈ పదమునకు భారతమునఁ గానరాదు. వాడుకలోని 'నాయన' నా + అన; నాన్న = నా + అన్న అని విడఁదీసి అన్నకు జనకుఁ డను నర్థము కల్పింతురు. ఏమైనను జనకార్థము భారతమునఁ గానరాదు గాన ఇది దేశ్యమే యగును)

1. అగ్రజుఁడు, జ్యేష్ఠ సోదరుఁడు.

ఆ. అన్న పతితుఁడైన నటుగాక సన్న్యాసి, యయ్యెనేని తమ్ముఁ డాతఁ డుండ, దారసంగ్రహంబుఁ దాఁ జేసి పాపంబుఁ, బొరయుఁ డండ్రు బుధులు కురువరేణ్య. శాంతి 1-301; ఆది. 6-202

2. పురుషుల నుద్దేశించిన ప్రార్థనమందు క్రియల కనుప్రయుక్తమగును.

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న త్తెఱఁగది యేల నీ కుడుగు తేరికి సారథిగమ్మె. విరా. 4-88

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁబోవన్న ఉద్యో 3-348

3. వాత్సల్యమును దెలుపును.

సీ. ...అన్న నీ వింతేల, యదలెదు కాల విర్యయము నుడువ, వశమె యెవ్వరికిని. మౌస. 197

క. నాయన్న కాము దలఁపక, యీయెడ లీచీర యిట్టి యేవపుఁ జందం, బోయన్న మదనవిక్కృతిం జేయుననుట యెంతయును నిషిద్ధముగాదే. విరా. 2-49.

సీ. కద్రువ కొడుకులకడ కేగి యేను మిమ్మందఱ వేఁడెద నన్నలార ఆది. 2-84; అర. 3-228

**అన్న**[2] అవ్య. క్రియ.

అనిన (అను ధాతువు యొక్క చేదర్థకరూపము) అనినప్పటికిని, అనిన యెడల.

చ. అన విని యాకురుప్రవరుఁ డమ్మునివల్లభు మోముఁ జూచి యిట్లను
మహితాత్మ మాకు గురుఁడన్నను ధర్మవిధోపదేష్టయన్నను బర
దైవమన్నను మనఃప్రియకార్యకలాపకర్తయన్నను విను నీవ
నీకు వచనంబున కడ్డము పల్కువాఁడనే. ఆశ్ర. 1-47

(గురుఁడన్నన్ = గురుఁడు ఎవరు అన్న యెడల ఇక్లే యాయాతావుల సందర్భానుసారముగా అర్థములు గ్రహించునది.)

సీ. వేఁడము వరమన్న వేడ్కతోఁ బతిదాన మని. ఆది. 7-87

**అన్నదానము** సం. వి. అ. న.

అన్నము పెట్టుట.

సీ. ...గృహస్థుఁ డెల్ల వారికి నన్నంబు గారుణ్యమునఁ బెట్టు నన్న
దానము సేత యధిక ధర్మము. శాంతి. 1-183

**అన్నపాకము** సం. వి. అ. పుం.

అన్నము వండుట.

వ. ఆత్మార్థంబుగా నన్నపాకంబును, నసాక్షిక భోజనంబును, వృథా
పశుఘాతంబును బాపహేతువులు. అర. 1-31

**అన్నప్రదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అన్నము నిచ్చువాఁడు, అహారము పెట్టువాఁడు.

క. ఆత్మోన్నతి నెసఁగు నాతఁ డన్నప్రదుఁడై. శాంతి. 3-112

**అన్నమయము** సం. వి. అ. పుం.

అన్నమయకోశము, పంచకోశములలో మొదటిది స్థూలశరీరము.

క. అన్నమయత్వాది విరామోన్నత వాఙ్మనసదూర. విరా. 1-384

**అన్నమయత్వము** సం. వి. అ. న.

అన్నమయకోశత్వము. చూ. అన్నమయము.

**అన్నమాంబ** సం. వి. ఆ. స్త్రీ.

తిక్కన తల్లి, కొమ్మన భార్య. విరా. 1-10

**అన్నము** సం. వి. అ. న.

ఓగిరము, కూడు, ఆహార పదార్థము.

క. పాలిక కౌరవులకు దు,శ్శీలతఁ జెడఁదలఁచి రేని, జెప్పెద రుధిరా,
భీలాన్నంబున కంచెను, మేలగు భిక్షాన్నమైన మీ సడవశికిన్.
ఉద్యో 1-329

**అన్నవిక్రయము** సం. విణ. అ. పుం.

అన్నమును అమ్మట, డబ్బు తీసికొని భోజనము పెట్టుట, పూఁటకూలి పెట్టుట.

తే. అన్న విక్రయ మొనరింతు రఖిలజనలు. అర. 4-308

**అన్నసంసారము** సం. వి. అ. పుం.

వంట చేయుట.

వ. (నలుఁడు) ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుండయి దుష్టాశ్వంబు లవశంబుల వశంబుఁ జేయుచు, నశ్వారోహకుల నారోహణంబుల శిక్షించుచు, రసవంతంబులుగ నన్నసంస్కారంబులు సేయుచు.
అర 3-129

**అన్నసాధకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అన్నము సిద్ధము చేయువాఁడు, వంటలవాఁడు.

వ. అయ్యర్జును తోడి విద్యామత్సరంబునఁ జీఁకటి నాతం దేయనేరకుండ వలయునని తలంచి యశ్వత్థామ రహస్యంబున నన్నసాధకుం బిలిచి యెన్నండును నరునకు నంధకారంబునఁ గుడువం బెట్టకుమీ యని పంచిన. ఆది. 5-227

**అన్ని** సర్వ. ఔ. అని[2]

(అంత శబ్దముయొక్క అమహదర్థక బహువచన రూపము. ఇది ప్రథమా విభక్తియందు తఱచుగా సముచ్చయార్థకమగు 'ఉన్' తోఁజేరి యుండును)

1. సమస్తము, సర్వము.

వ. పదార్థంబులన్నియు నన్నల వశంబు సేయుచు. విరా. 2-2

క. నన్నూఱులు మున్నూఱులు, నిన్నూఱులు నూఱులును మహిత వర్షము లయ్యన్ని యుగములకును గ్రమ్మఱసన్నత సంధ్యలును వాని సంధ్యాంశములున్. శాంతి. 5-50

2. అన్ని మాటలు.

వ. పాపాత్మురాలైన సుదేష్ణ తనకు మదిరారసంబు దేరం గీచక నివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక యెన్ని చెప్పిన నన్నింటికి నన్నిచెప్పి నిర్బంధించినం బెద్దపెనంగ నోర్లక నా మనంబున నన్నెవ్వరికి నేమిసేయ వచ్చుననని. విరా. 2-178

**అన్ను** దే. అ. క్రి.

1. మత్తుగొను, చొక్కు, పరవశమగు.

సీ. అలరుఁ దేనియ గ్రోలి యన్ను సోలంబుల, మఱియు తేఁటుల నను గ్రమోఁత యింపు. అను. 1-181

వి.

2. అహంకృతి. గర్వము.

ఉ. ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకుమయ్య దుర్జనుం, డన్నన సాహసక్రియలయందు గడంగి నశించుఁ గావునన్. అర. 5-434

3. పారవశ్యము, ఒడలు తెలియమి.

ఉ. కన్నుల నిద్రదేఱఁగ నకంపితుఁడై యతఁ డెంత సేసినం, దన్ను నెఱుంగ కొక్కమొగిఁ దక్కపిసైన్యచయంబుఁ బోరఁ బేరన్నన ద్రమింగఁబొచ్చె. అర. 2-99

4. అఁదుది.

క. కన్ను మనంబును దనిసినఁ, గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా,యన్ను నతని కిచ్చుట వెల, వన్నుట యాసురము సూవె పౌరవముఖ్యా. ఆది. 2-223

**అన్నువ** దే. విశ.

1. అల్పము, సన్నము.

సీ. అన్నువ కౌఁదీఁగ యందంబు మది నిల్పి, జఘనచక్రంబుపైఁ జలుపు దృష్టి. ఆది. 3-88

క. అన్నగమునందు గాండివ, మున్నది యదిగాని మద్భుజోద్రేక విలా,సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీవిండ్లు గుఱుచ లంఁతి బలంబుల్. విరా. 4-105

2. సుందరము.

ఉ. ...అ,య్యన్నువ బ్రహ్మచారి ముఖ మంబురుహంబు సమంబు సూడఁగన్. అర. 3-107

**అన్నువు** దే. వి.

కాంతి, శోభ.

సీ. నలువ చెందొవల చేకులకు నన్నువుపెట్టఁ, గోరి గావించిన గుళిక యనఁగ. ద్రోణ 1-275

**అన్ను** దే. స. క్రి.

అనుపు వీడ్కొలుపు, సాగనంపు.

ఉ. (జరానుబంధము) అనయముఁ జేర్చి ప్రాణముల నన్పఁ బోదది రోగ మల్పబు,ద్ధి నరులు ద్రోవలేరది మదిం జొరనీరు సుఖార్థులై బుధుల్. అను. 1-147

**అన్య** సం. వి. ఆ. స్త్రీ.

వేఱు స్త్రీ, ఇతర కాంత (అవివాహిత లేక మఱొకరి భార్య)

చ. .. అగ్ని సాక్షికం,బునఁ బరిణీత యైన సతిఁ బొల్పగ నొక్కతఁగాని యన్యలన్, మనమున నేనియుం దలఁప. ఆది. 4-137

**అన్యత్వము** సం. వి. అ. న.

వేఱుగా నుండుట.

క. ఏకత్వం బన్యత్వ మనేకత్వము గలుగు నీ మహిమ చందం బాలో

కింప నిపుణులగు సుశ్లోకులకుం బరమ పదము సులభము శార్ఙ్గి.
శాంతి. 4-239

**అన్యథా** సం. అవ్య.

వేఱు, మఱియొక విధముగా.

తే. నీవు ధర్మవిదుఁడవు మావివాద, మెఱిఁగి తీర్పు గుణశ్రేష్ఠుఁ డితఁడొ నేనొ, చెప్పు మన్యథా బుద్ధి వై చెప్పితేని, మఘవు కులిశంబు వ్రచ్చు నీ మస్తకంబు. సభా. 2-240

(దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగములు గానిపింపవు)

**అన్యథాకరించు** సం. స. క్రి.

వేఱుచేయు, చేయవలసినట్లు చేయక భిన్నముగాఁ జేయు, మీఱు, అతిక్రమించు.

ఆ. గురులలోనఁ బరమ గురువు తల్లియ యట్టి, తల్లి వచనమును విధాతృకృతము, నన్యథాకరింప నలవియె యనిన నం,దొఱకు నిట్టులనియె ద్రుపదవిభుఁడు. ఆది. 7-252

**అన్యథాత్వము** సం. వి. అ. న.

వేఱుపాటు, భిన్నప్రకారము.

ఆ ధర్మములకు సంజ్ఞ దద్వేదులగు మహాత్ములు దగంగఁ జెప్పుదురు నరేంద్ర, వినుము కాలపాకమున నది యన్యథాత్వంబు గలిగి యవిశదత్వ మొందు. అను. 5-407

**అన్యథాబుద్ధి** సం. వి. ఇ. స్త్రీ.

ఉండవలసిన విధముగాఁ గాక మరియొక విధముగా నున్న బుద్ధి.

చూ. అన్యథా. సభా. 2-240

**అన్యము** సం. విణ. (అ. ఆ. అ.)

భిన్నము, ఇతరము, మఱియొకటి.

ఉ. నీ విభవం బహింసయు ననింద్య చరితము గాక యన్యమే.
ఉద్యో. 1-338

**అన్యవర్ణుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

ఇతరకులమువాఁడు.

తే అన్యవర్ణుండు దీనుఁ డీయనకు నెట్లు, గూఁతు నీవచ్చునని మదిఁ గుత్సపుట్టి, యీఁడ ప్రార్థన మఫలమై యేఁగి యజ్ఞ, సమయ మున నగ్ని దనమూర్తి సంహరించె. అను. 1-55

**అన్యాయము** సం. వి. అ. పుం.

1. న్యాయములేమి, అధర్మము.

వ. ...తక్కటివారు వగనొంది తండ్రి కడకుం జని చంద్రుని యన్యాయం బెఱింగించిన నా ప్రజాపతి చంద్రునితో నగ్గడించి యిది చాల నధర్మం బింక నిట్లు సేసితేని శపింతుఁ జుమ్మీ సముఁ డవై వర్తింపు మనుటయు. శల్య. 2-148

2. పాపము.

తే. నీవు రుచిఁ గాచు నప్పటి నిపుణవృత్తి, వాకు నెఱిఁగింప కునికి యన్యాయపముగఁ దలంచిరో కాక దానిఁ గల్మషము గాఁగ, నేను దలఁచిన శాప మీ నెట్లు నీకు.

వ. అప్పని పాపంబు గాకుండ వరం బిచ్చితి. అను. 2-212; 213

**అన్యాయ్యము** సం. విణ. (అ. ఆ. అ)

న్యాయము కానిది.

శా. ...నా కన్యాయ్య వృత్తంబుగాఁ, దీ తంత్రంబున కీవ సాఉయని తా నేతెంచె నిన్ గావఁగన్. అశ్వ. 3-65

**అన్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

1. ఇతరుఁడు.

ఉ. ...ఎట్లితం, డవ్వరి సంచరించునొకొ యన్యు లెఱుంగకయుండు నట్లుగన్. విరా. 1-92

2. శత్రువు, విరోధి.

చ. విరటు మఱంది కీచకుఁడు విక్రమ దుర్దముఁ డన్యసైన్యభీకర

మహనీయమూర్తి. విరా. 3-69

3. ఒకానొకఁడు, ఒక వ్యక్తి.

క. అవనీశ యశ్వమేధము, నవభృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం, డవు బాపుఁడైనఁ దత్కర్త విశేషము లోకపూజితం బగు టరుదే. శాంతి. 1-305

**అన్యోన్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పరస్పరము, ఇతరేతరము.

వ. గోగణ నివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్య విదితంబైన యనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కిట్లనియె. విరా. 5-305

**అన్వయము** సం. వి. అ. పుం.

1. పదములకుఁగాని పదార్థములకుఁగాని పరస్పరముగల సంబంధము.

తే. అతఁడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ దనకు, సందిగ్ధమైనట్టిదాని నెల్ల నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంత కరుణఁ, దెలియఁ జెప్పుచు హృదయ సంచలత మాన్చె. భీష్మ. 1-222

2. కులము, వంశము, సంతతి.

తే. కౌరవాన్వయజాతులై గారవమునఁ, బెరిఁగినట్టి మీరు. విరా. 1-118

**అన్వర్థత** సం. వి. అ. స్త్రీ.

1. పొసఁగిన యర్థము గల్గియుండుట, సార్థకత.

క. ఇవి యన్నియు నాశ్చర్యము, లవుఁ దెరువున నాకుఁ జూపి తన్వర్థత నొప్పు వివిధ శబ్దంబుల బోధవరేణ్యా పోయి వచ్చెదం బ్రియమొందన్. శాంతి. 6-611

**అన్వర్థము** సం. విణ. (అ. ఆ. అ.)

పొసఁగిన యర్థము గలది, సార్థకము.

వ. అంత నరుణకిరణుఁ డన్వర్థాభిధానుం డగుచు వచ్చిన. భీష్మ. 2-316

**అన్వితము** సం. విణ. (అ. ఆ. అ.)

సహితము, కూడినది.

క. ...బంధురమూర్తి పరాక్రమాన్వితుఁడు గానోపున్.

విరా. 1 - 259

సత్యభామాన్వితముగ. అర. 4-152

**అన్వితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సహితుఁడు, కూడినవాఁడు.

క. కృత మెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెవుదు వదలరు కరుణాన్వితు లీ నరపతికి శుభ, ప్రతిపాదకు లగుదురేమి భంగుల నైనన్. విరా. 3-64

**అన్వేషణము** సం. వి. అ. న.

వెదకుట.

సీ. నిక్కమ కాలంబు నీకుఁ గొంతగలట్లు పలికెదు నీవు గర్భంబు సొచ్చినప్పటినుండియు నన్వేషణము సేయుఁ గొనిపోవుటకు మృత్యు వని యెఱుఁగు. శాంతి. 4-23

**అన్వేషి** సం. విణ. (న్. ఈ. న్.)

వెదకువాఁడు, రోయువాఁడు.

సీ. ...వినవె యవింధ్యుఁడు వా నొక్క వృద్ధ దైత్యుఁ, డన ఘుండు రామహితాన్వేషియై నీకు, నాశ్వాస మొనరింప నబల నన్నుఁ, బనిచెను. శాంతి. 6-394

**అన్వేషించు** సం. స. క్రి.

వెదకు.

వ. ...పాండవుల నన్వేషించు పని యిటమీఁదం జిత్తగించు తెఱంగానతిచ్చునది యనిన. విరా. 3-89

**అప**[1] సం. అవ్య.

సమాసమునఁ బూర్వపదముగా నుండి యీ క్రింది యర్థముల నిచ్చును.

1. వ్యతిరేకము, విపరీతము.

ఆ. ఏను నర్జునుండు నెక్కి యెక్కటి తల,పడకయున్న నగరె పుడమి
జనము, లందు నాదు వచ్చు టతనికి నపకీర్తి యనిన నాకు వేఱ
యడుగనేల. (అపకీర్తి = విపరీత కీర్తి, దుష్కీర్తి) ఉద్యో 4-41

2. తొలఁగినది, అపగతము.

వ. ...యయాతికి నీకు నయిన, యీ వివాహంబునం దపక్రమ
దోషంబు లేకుండెడు మని వరంబిచ్చి. ఆది. 8-168

(అపక్రమము = క్రమము తొలఁగినది. క్రమ భంగము)

3. చెడ్డది.

వ. వడిగల తురంగంబులం బూనిన రథం బెక్కి యింద్రప్రస్థపురంబు
నకుం జని యిందులకు ధర్మనందనుం దోడ్కొని రమ్మని విదురుం
బంచిన నాతండును నాపగేయున కంతయు నెఱింగించి యిది యప
కర్మం బనుచుండె. (అపకర్మము = చెడ్డపని) సభా. 2-134

4. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.

చ. ...లతాలలనల్ మృదులానిలాపవర్జిత కుసుమాక్షతావళులు
సేసలువెట్టిన యట్లరైరి. (అపవర్జితము = వర్జితము) ఆది. 4-17

**అప**[2] దే. వి.

అప్ప. చూ. అప్ప.

ఆ. ...మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁ జూచి. ఆది.1-9

**అపకర్మము** సం. వి. న్. న.

చెడ్డకార్యము. చూ. అప[1] - 3.

**అపకర్షణము** సం. వి. అ. న.

తొలఁగించుట, ప్రక్కకు లాగుట.

క. కర్షిత రిపు లన్యోన్యాకర్షణ సంరంభ తాపకర్షణముల సామర్ష
లయి పెనఁగి రా హవహర్షంబున బవనసుత బృహద్రథపుత్రుల్.
సభా. 1-208

**అపకర్షత్వము** సం. వి. అ. న.

తక్కువతనము.

వ. అనిన విని జనకుండు వర్ణంబుల యుత్కర్షాపకర్షత్వంబులకు మూలం బెయ్యది దానిన దా నపుత్రుండై జన్మించునం ద్రదియు సంశయంబగుట నెఱింగింపవే యనుటయుం బరాశరుం డిట్లనియె.
శాంతి. 5-503

**అపకర్షము** సం. వి. అ. పుం.

తగ్గుట, అవమానము.

క. హర్షంబును మానంబు న్నుత్కర్షము నపరాధమును సమదభావము నుత్కర్షాపకర్ష చింతలు, నార్ష సమాచారమున నిరస్తగుణంబుల్.
శాంతి. 5-24

**అపకారము** సం. వి. అ. పుం.

అపకృతి, కీడు, ద్రోహము, చెడ్డపని.

వ. అప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను నీ కొడుకు ప్రాణగొడ్డంబైన కార్యంబు సేయం దలంచె దామోదరు నిట్లు సేయం జూచెనేనిం దానును బ్రధానులును వినాశంబుం బొందు నింతియ యిది సేసిరేమి సేయరైరేమి యమ్మహాత్ము నెవ నీ యపకారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ముల కాక యని పలికి.
ఉద్యో. 3-172

(అపరాధము అని కొన్ని ప్రతులు)

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళీ వినోదంబున నున్న కాలంబునఁ బ్రమాణ కోటియందు సుప్తుండయిన భీమసేను నంటఁ గట్టి మడవువం ద్రోపించియు... ననేకంబులైన యపకారంబులు సేసి.
అర. 1-140

**అపకారి** సం. విశ. (స్. జీ. న్.)

అపకారము చేయువాఁడు.

క. క్రూరాకారుల జగ దపకారుల నున్నగులఁ ధాత్రిగా నోపని

యి,ద్ధారుణికి. ఆది. 2-186

**అపకీర్తి** సం. వి. ఇ. (స్త్రీ).

దుర్యశము, చెడ్డపేరు. చూ. అప. ఉద్యో. 4-41

**అపకృష్ట** సం. విణ. (అ. ఆ. అ.)

లాగఁబడినది.

వ. ఇట్లు వాతావధూతంబైన పతాకయుంబోలె దుశ్శాసనాప కృష్టయై ద్రౌపది వికీర్ణకేశయు వివర్ణవదనయునై. సభా 2-217

**అపక్రమణము** సం. వి. అ. న.

పాఱిపోవుట, తప్పించుకొనుట.

వ. జతుగృహదాహంబును, విదురోపదిష్ట ద్వారంబునఁ బాండవాప క్రమణంబును, హిడింబాదర్శనంబును. ఆది. 1-34

**అపక్రమము** సం. విణ. (అ. ఆ. అ.)

క్రమభంగమైనది, అక్రమము. చూ. అప. ఆది. 3-169

**అపక్రాంతము** సం. విణ. (అ. ఆ. అ)

తొలఁగినది.

వ. ఇవ్విధంబున యజ్ఞం బపక్రాంతం బగుటయు నిర్జరులు నిశ్చేతను లైరి. సౌప్తి. 2-122

శ్లో. అపక్రాంతే తతో యజ్ఞే సంజ్ఞా న ప్రత్యభాత్సురాన్,
నష్ట సంజ్ఞేషు దేవేషు న ప్రాజ్ఞాయత కించన.
సం. భా. సౌప్తి. 18-15

(యజ్ఞంబు ప్రశాంతం బగుట-అను పాఠాంతరము నిరాకరము)

**అపక్రాంతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. తప్పించుకొని పోయినవాఁడు.

సీ. విదురోపదిష్ట భూవివరంబునం దపక్రాంతులై బ్రదికి నిశ్చింతు లయిరి. ఆది. 3-14

2. తొలఁగినవాఁడు, వెనుకకుఁ బోయినవాఁడు (యుద్ధాదులనుండి)

క. విక్రమము విడిచి సమరాపక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁ డునుం, జక్రధరుఁడుఁ గుమారులు, నక్రూరాదులును నేమి యని నగరె సభన్. ఆర. 1-171

**అపక్వము** సం. విశ. (అ. ఆ. అ.)

పక్వముగానిది, ఉడుకనిది.

సీ. గతకాలమును నపక్వంబును గురుదుష్ట విషను విరుద్ధము విపుల రసము -తే- నైన యన్నము దా నరయక భుజించుట. ఆశ్వ. 1-166

**అపక్షత్రము** సం. విశ. (అ. ఆ. అ.)

తొలఁగిన క్షత్రియులు గలది. క్షత్రియులు లేకుండఁ జేయఁబడినది.

వ. ఇరువదియొక్కమాఱు ధాత్రీతలం బపక్షత్రంబు సేసిన. ఆది.3-51

**అపగతక్షత్రము** సం. విశ. (అ. ఆ. అ.)

క్షత్రియులు లేకుండఁ జేయఁబడినది.

వ తొల్లి జమదగ్ని సుతుండయిన రామునిచేత ధాత్రి యపగత క్షత్రంబయిన. సభా. 1-110

**అపగతము** సం. విశ. (అ. ఆ. అ.)

1. తొలఁగినది, పోయినది.

సీ. భూవర యమ్మెయిఁ బోవఁగ సహదేవుఁ, డపగత ప్రాణుఁడై యవనిఁ బడినఁ. మహా. 86

2. మోఘమైనది, వ్యర్థమైనది.

క. కుపితుఁడగువాని వ్రతమును, జపమును దేవార్చనంబు శ్రద్ధా క్రియయుం, దపమును దానము యజనము, నపగతములు గాఁగఁ జేయుఁ నంతకుఁ దలుకన్. శాంతి. 5-554

సం. వి. అ. న.

భినాశము,

తే. ఇవ్విధంబున ధర్మంబు లెల్ల నపగ,తమునఁ బడ జనులెల్లను దల్లడిల్లి.

**అపగమనము** సం. వి. అ. న.

అపగమము.

వ. శిశిరాపగమన సమయ కమలంబు ననుకరించు నాననంబుతో.

శాంతి. 1-345

**అపగమము** తొలఁగుట, పోవుట.

సీ మత్సరాహంకారమానదంభాగమంబును బ్రహ్మచర్యముఁ గలిగి -తే- జపము సెల్లించు పురుషుఁడు. శాంతి. 4-130

క. వినురేఖామాత్రవుఁ జంద్రుని యట్టుల జీవుఁ డతని దుష్కృతముఁ బో,లిన యజ్ఞానము నపగమ,మున బోధానంద సాంద్రపూర్ణతఁ బొలుచున్. శాంతి. 5-130

**అపఘనము** సం. వి. అ. పుం.

శరీరావయవము, శరీరము.

మ. జనితామర్షణుఁ డంతఁ బార్థుపయిఁ బర్జన్యాస్త్ర మక్కర్ణుఁడే,సె నపారంబయి భూనభోంతరముఁ దజ్జీమూతయూథంబు గ,ప్పినఁ దద్ధ్వాంత తిరోహితాపఘనుఁడై బీభత్సుఁ డుండెన్. ఆది. 8-39

శ్లో. మేఘచ్ఛాయోపగూఢస్తు తతోఽ దృశ్యత ఫల్గుణః

సం. భా. ఆది. 146-26

సీ. కాంచనవర్ణాపఘనుఁడై మహోన్నత కార్ముకహస్తుఁడై కాలకంఠు. అర. 1-300

**అపచయము** సం. వి. అ. పుం.

పుష్పాదులు కోయుట.

సీ. సృంజయుండు... కుసుమాపచయ ముఖ బహువిధకేళి తత్పరత నొంది. శాంతి. 1-269

**అపచరించు** సం. స. క్రి.

అపకారము చేయు, కీడొనరించు, అవమానించు.

క. అన్యతోపచార కలనం,బునఁ బుట్టిన పాతకంబు వోవుం దా నె,
వ్వని నపచరించెఁ దగ నా,తనిఁ బ్రీతుం జేయు ధర్మతత్త్వప్రవణా.
శాంతి. 1-310

**అపచారము** సం. వి. అ. పుం.

అపరాధము, పెద్దల యెడఁ జేయు తప్పు. తప్పు, అపథ్యము.

క. వీరలయెడఁ గొడుకా యప,చారంబులు పలుకుదునె విచారము
విడు మే, నేరూపంబున నిలువన, గారవమున నిది వ్రతంబుగాఁ
గైకొంటిన్.
ఆశ్ర. 1-150

**అపచారి** సం. విణ. (న్. ఈ. న్.)

అపచారము చేయువాఁడు, అపరాధి.

తే. పాపశాలి సజ్జన సతతాపచారి.
స్వర్గ. 10

**అపజయము** సం. వి. అ. పుం.

ఓటమి, పరాజయము.

చ. అఖిల జనక్షయంబయి, జయాపజయంబులు రెండునుం దుదిన్,
సుఖములుగాని యీ పనికిఁ జొత్తురె.
ఉద్యో. 1-298

**అపజితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఓడింపఁబడినది, జయింపబడినది.

చ. ద్రుపద తనూజులన్ గెలిచి దోర్బల సంపద నుల్లసిల్లి మి,మ్మప
జిత దర్పహీను లగునట్లుగఁ జేసి.
శల్య. 2-69

**అపజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

జయింపఁబడినవాఁడు.

క. కేకయ సాల్వులు తోడుగ, నా కీచకుఁ డాజి నన్ను నపజితుఁ
జేసెం, జూరఁడ మున్న యొకపరి, నా కాతనితోడ భండనము
లేదయ్యెన్.
విరా. 3-119

**అపతిత్వము** సం. వి. అ. న.

నాథుఁడు లేనితనము.

ఉ. ...పతుల్ విజృంభిత, శ్రీ విలసిల్లు కామినులు సేద్పడి రిట్లప
త్యత్వ దీనతన్. కర్ణ. 8-224

**అపత్యము** సం. వి. అ. న.

సంతానము, బిడ్డ (కొడుకుగాని, కూఁతురుగాని)

సీ. వానికి నిట్లనఁ దండ్రియాలును నపత్యంబుఁ గలుగు తెలఁగు
నడపి,... -అ-కాననమున కేగి, సౌమ్యవృత్తి ముక్తి సాధించి.
శాంతి. 4-31

**అపథము** సం. విశ. (అ. ఆ. అ.)

అవినయమైనది, అధర్మమైనది, నీతిబాహ్యమైనది.

తే. కామముననైన విపులార్థ కారణముననైన భయముననైనను నపథ
వర్తనంబునకుఁ బోరఁ డెవ్వాఁడు నన్ను నేమి, యడుగఁ దలఁచె
నా ధర్మజుం డడుగుఁగాక. శాంతి. 2-161

**అపథ్యము** దే. విశ. (అ. ఆ. అ.)

1. హితము కానిది.

తే. కాని తెరువునఁ బోయిన గలుగునయ్య, బ్రదుకు చవి యెంత
యైన నపథ్యములకు, వేడ్క సేయు దురయ్య వివేకులు.
విరా. 2-28

2. శరీరమునకు సరిపడని యాహారము.

క. తనలావున కధికమయిన, పనిసేయుట యుక్తమును నపథ్యము నగు
భోజనములు హరించు నాయువు. అను. 5-137

**అపధూమము** సం. విశ. (అ. ఆ. అ.)

పొగ లేనిది.

క. ...తానఁ దెలిపినొందిన నిరంజనత్వ సిద్ధిం, గని యపధూమాన
లంబు కరణి వెలుంగున్. శాంతి. 5-120

(గతధూమ అని పాఠాంతరము)

**అపధ్వని** సం. విశ. (ఇ. ఈ. ఇ.)

చెడ్డమ్రోఁత గలది, విపరీతపు నాదము గలది.

క. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలు సాయల్, సేసెం బఱమొయిళు లడరి, మ్రోసెం దమయంతఁ దూర్యము లవధ్వనులై, విరా. 4-86

**అపనయనము** సం. వి. అ. న.

1. తొలఁగించుట.

క. నిగమ విరోధి,స్థిత్యపనయనోన్ముఖ చిత్సత్యాత్మక భక్తలోక దౌర్గత్యహారా. కర్ణ. 1-271

2. తొలఁగుట.

వ. శ్వావిల్లోమాపహంబగు తీర్థంబునం దేకాదశ తీర్థంబులు గల వందుఁ బ్రాణాయామంబు సేసిన విప్రులకు స్వలోమాపనయనం బగు. అర. 2-264

**అపనయము** సం. వి. ఉ. పుం.

1. తొలఁగించుట.

వ. నీవు సంయమిలోక సురలోక బ్రహ్మలోక ప్రఖ్యాత ప్రజ్ఞాన సంభావనీయుండవు మదీయ సందేహాపనయంబు సేయవే యను టయు. శాంతి. 6-148

2. దుర్ణయము, దుర్మార్గము, అపకారము.

క. కుపథ ప్రవృత్తుఁడయి వీఁ, డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా,నిపుణుఁడవై నీ మఱఁదికి, నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా. సభా. 2-59

**అపనయించు** సం. స. క్రి.

పోఁగొట్టు, నివారించు.

వ. పాండవులు గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకయి యొక్క సమస్థలంబునం బటకుటీర సంవిధానంబు సేయించి. శాంతి. 1-2

వ. మదీయ తపోవిశేషంబున నీదయిన కీటత్వం బపనయించెద. అను. 2-326

ఆ. ...మేలు గాక నీ దారిద్ర్య, మపనయింతుఁ జింత యపనయింపు
(అపనయింతున్-పోగొట్టుదును) శాంతి, 3-482

2. తొలఁగించు, తీసివేయు.

వ. ...అగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించి దాని దివ్యాంబరాభరణంబు లపనయించి వల్కలాజినధారిణిం జేసి. అర. 2-330

3. పీడు, మాను.

వ. ...విషాదం బపనయింపుము, తపోబలంబును గడచిన బలంబులుం గలవే మనుష్య జన్మంబు నొంది మేలొనర్చెద నను కోర్కి నీకుం బుట్టుట మేలు. అను. 4-326

ఆ. ...మేలుగాక నీ దారిద్ర్య, మపనయింతుఁ జింత యపనయింపు
(అపనయింపు = మానుము, పీడుము) శాంతి 3-482

4. కడపు.

వ. దశరథాగ్రనందనుండు... ఘన సమయ దివసంబులు నెట్టకేనియుం గడపి... అతిదీర్ఘ యామంబులునైన శారదయామినులపన యింప నోపక. అర. 7-2

**అపనీతము** సం. విణ. (అ. ఆ. అ.)

తొలఁగింపఁబడినది, ఊడఁదీయఁబడినది.

సీ. దుశ్శాసనుండు, నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు, సభలోన విడ్చె
నాశంక లేక, యుడుగక యొలువంగఁబడియు మున్నపనీత,మైన
తద్వస్త్రంబు నట్టి వలువ, లలితాంగి జఘన మండలమునఁబాయక
యొప్పుచున్న. సభా. 2-231

**అపనోదనము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తొలఁగించునది, పోఁగొట్టునది.

క. మనుజేంద్ర సర్వమాయాపనోదనంబయిన యగ్నిబాణంబున.
అర. 1-189

సం. వి. అ. న.

2. తొలఁగించుట, పోగొట్టుట, నివారించుట,

ప. సింహబలుఁడు... మనోవేదనాపనోదనార్థంబు మందిరారామ భూమికిం జని. విరా. 2-302

**అపనోదము** సం. వి. అ. పుం.

తొలఁగించుట, పోఁగొట్టుట.

వ. (ధర్మనందనుండు) డగ్గుత్తిక పెట్టి దుఃఖవరవశుం డగుటయుఁ... తత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు తదీయ విషాదాపనోదంబు సేయం దలంచి యిట్లనియె. విరా. 1-50

**అపనోది** సం. విణ. (న్. నీ. న్.)

తొలఁగించువాఁడు.

క. శోకాపనోదిఁ బుణ్యా, శ్లోకుని నలు రోయఁ బనుపు. అర. 2-151

**అపమృత్యువు** సం. వి. ఉ. పుం. (స్త్రీ).

1. అకాల మరణము, ఆకస్మికముగాఁ గలుగు చావు.

క. నమ్మమి మృత్యువు పెద్దయు, నమ్ముట యపమృత్యు వగుట నరపతి నమ్మీ, నమ్మక పని గొనునది ని,త్యమ్మును సూక్ష్మమతిఁ దాను నరయఁగ వలయున్. శాంతి. 2-351

శ్లో. ఏకాంతే న హి విశ్వాసః కృతోఽస్తి ధర్మార్థనాశకః,
అవిశ్వాసశ్చ సర్వత్ర మృత్యునా చ విశిష్యతే.
అకాలమృత్యుర్విశ్వాసో విశ్వసన్ హి విపద్యతే
యస్మిన్ కరోతి విశ్వాసమిచ్ఛతస్తస్య జీవతి
తస్మాద్విశ్వసితవ్యం చ శంకితవ్యం చ కేషుచిత్.
ఏషా నీతిగతిస్తాత లక్ష్యా చైవ సనాతనీ.

సం. భా. శాం. 80-10,11,12

కావున "నమ్మినమ్మక" అను పాఠమే సరియైనది గాని పాఠాంతరములు యుక్తములు గావు.

**అపమేఘము** సం. విణ. (అ. ఆ. అ.)

మేఘము లేనిది,

సీ. అప్రదక్షిణముగా నయ్యె నుల్కాపాత మపమేఘమై యున్న

యంబరమున. సభా. 2-299

**అపర** సం. వి. ఆ. (స్త్రీ).

జరాయువు, మావి.

క. రాగపరిలిప్త మానస, యోగంబున నింద్రియంబు లుల్లసితములై, భోగులగుట యుడిపిన నపరా, గత సంసార దుర్విరామము సేయున్. శాంతి. 4-296

**అపరక్త** సం. విశే. (అ. ఆ. అ.)

అనురాగము లేనిది.

ఆ. ఒక్క సతికిఁ బతులు పెక్కండ్రు రగు టిది, సతుల కోర్కిగాన యతివ కృష్ణ, సుందరాంగి వారియం దేల యపరక్తయగు మనో ముదంబుఁ దగులుఁ గాక. ఆది. 8-25

**అపరగిరి** సం. వి. ఇ. (స్త్రీ).

అస్తమయ పర్వతము.

వ. అంత నినుం డపరగిరి గడచనినం గాలోచితకృత్యంబు లాచరించె. అను. 2-299

**అపరఘటిక** సం. వి. ఆ. (స్త్రీ).

మఱుగడియ, తర్వాతి గడియ.

సీ. అతఁడు త్రైలోక్యంగ మడిగినఁ బలి గమ్మ, నూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తములు సేయ నమ్మని నెడనాడి యంత హ్రీతుం డయ్యె నపరఘటికఁ, దోఁచి వికారంబు దొడరక యున్న రాజును దేవులను గని సముఖుఁ డగుచు. అను. 2-308

**అపరజన్మము** సం. వి. అ. న్. న.

తరువాతి పుట్టువు.

తే. ...అన్నాతి పలుకుఁ, దద్ద యవమాన పడితి శాంతనవుచేత, నపర జన్మంబునందైన నతనిఁ జంప, నేను జాలుటకై యిట్టిదాననైతి. ఉద్యో. 4-363

**అపరదినము** సం. వి. అ. న.

మఱునాఁడు.

సీ. ...అపరదినము,సం దగ్నిరత్తంబు నట్లవ ధంబును,నైన కృష్ణుని చక్ర మద్భుతముగ, -అ- నెగసి యఖిల జనులు నీక్షింప దివమున, కరిగె. మౌస 25

**అపరదివసము** సం. వి. అ. పుం. న.

మఱునాఁడు.

ఆ. అట్లు నిశ్చయించి యాదవనివహము,యంబు దివ్య బుద్ధి నరసి యపర, దివసకలిత మగుటఁ దెల్లంబుగాఁ గని, కొని య తంతు పెద్ద కొలువులోన. మౌస. 23

**అపరనంద** సం. వి. ఆ. స్త్రీ.

ఒక నది. అర్జునుఁడు తీర్థయాత్రకుఁ బోయినపు డీ నదిని దర్శించెను. ఆది. 8-136

**అపరపక్షము** సం. వి. అ. పుం.

కృష్ణ పక్షము, బహుళ పక్షము.

తే. కాకులును, గ్రద్దలును దిన్నఁ గడును ద్రెస్సి, యపరపక్ష చతుర్దశి యమృతకరుని, కరణి నొప్పెడు కర్ణు మొగంబుమీద, వనిత యందంద మోపెడుఁ దన మొగంబు, స్త్రీ. 2-92

**అపరభవము** సం. వి. అ. పుం.

పునర్జన్మము.

క. భూసురధనాపహరణము, సేసినఁ గులనాశమగుట సిద్ధము దానం, జేసి యగును జండాలత్వాసంగమున పరభవము నందు నరేంద్రా. అను. 4-44

**అపరభాగము** సం. వి. అ. పుం.

పృష్ఠభాగము, వెనుక ప్రదేశము, వెనుక భాగము.

సీ. గాండివ తూణ యుగ్మములు పూర్వాపర,భాగంబులకు ననాభరణములుగఁ. ఉద్యో. 4-125

**అపరము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఇతరము, అన్యము, వేఱైనది.

క. మనుజులపై బ్రహ్మశిరం,బను నస్త్రంబేసితేని నశుభం బొలయున్. విను మెన్ని యాపదలు వ,చ్చిన నపరోపాయములన చెలువుము పుత్రా. సౌప్తి. 2-45

2. వెనుకది, తర్వాతది.

వ. ఈ కథ పూర్వాపర వాక్యముల యందలి తాత్పర్యంబు నిరూపించి. శాంతి. 3-80

3. రెండవది.

తే. గోవులకును బ్రాహ్మణులకును గుల మొకండ, కమలజుఁడు రెండు తెఱఁగులు గా నొనర్చె, హావికిఁ బూర్వంబు గారణ మఖల మంత్రములు కధిష్ఠాన మపరంబు భూపవర్య. అను. 2-278

4. పడమటిది; పశ్చిమము.

వ. ...అరుణకిరణుం డపరమహీధరంబు మౌళికి సరసీరుహ శేఖరంబై చెలువార. ద్రోణ. 2-187

వి. అ. న.

5. అచిత్తు.

చ. ...వినచూవె యపరంబు పరంబనఁ గల్గు తత్త్వముల్. ఆశ్వ 3-33

**అపరరాత్రము** సం. వి. అ. పుం.

రాత్రి కడపటి భాగము, రాత్రి నాలవ జాము.

సీ, ఇమ్ముల నపరరాత్రమ్ములం దెప్పుడుఁ జింతించె నిజబుద్ధి, జేయఁ దగిన, రాజకృత్యముల. సభా. 1-26

**అపరాంగము** సం. వి. అ. న.

వెనుక భాగము, పృష్ఠము, వెనుక దెస.

క. విని కద్రువ యపరాంగం,బున నీలిమ దోఁచె ననియె భూపవరేణ్యా. అను. 1-185

**అపరాగతము** సం. వి. అ. న.

మావిని బొందినది.

క. రాగపరిలిప్త మానస, యోగంబున నింద్రియంబు లుల్లసితములై,
భోగులగుట యుడిపిన నపరాగత సంసార దుర్విరామము
సేయున్. శాంతి. 4-293

**అపరాజితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఓడింపఁబడినది.

ఉ. ... అపరాజిత భూరిభుజాకృపాణధారాజల శాంత శాత్రవ
పరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్. ఆది. 1-3

**అపరాజితుఁడు** సం. వి. అ. పుం.

1. కురుకుమారుఁడు. గాంధారి ధృతరాష్ట్రుల నూర్వురి పుత్రులలో
నొకఁడు. ఇతఁడు కాలాపుత్రుని యంశమున జన్మించెను.
ఇతఁడు భీమునిచేత భీష్ముని యష్టమదివస యుద్ధమునఁ జంపఁ
బడెను. ఆది 5-107; ఆది. 3-80; భీష్మ. 3-78

2. కద్రువ కొడుకు.

కశ్యప ప్రజాపతి పుత్రకామేష్టి యొనరింపఁగా కద్రువకు వేవురు
సర్పజాతివారు జన్మించిరి అందు నీ యపరాజితుఁ డొకఁడు.
ఆది. 2-4

విణ (అ. ఆ. అ)

ఇతరులచే జయింపఁబడనివాఁడు.

క. నిఖిలాస్త్రశస్త్ర విద్యాసఖుఁ డపరాజిత యశోవిశాలుఁడు విష్ణుం,
డఖిలేశ్వరుఁ డతనికిఁ బ్రియ, సఖుఁడవై యవ్వీరు గెల్వ శక్యమె
నీకున్. అర. 6-259

**అపరాద్రి** సం. వి. ఇ. పుం.

అస్తమయ పర్వతము, పడమటి కొండ.

క. కిరణంబు లడఁగి యంతకు, నరుణత్వము మెఱయఁ దరణి యప

రాద్రిశిరః, స్ఫురణను నధికరణాలం,కరణం బొనరించుటయును
గాంగేయుఁ డెడన్. భీష్మ. 2-839

**అపరాద్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

తప్పు చేసినవాఁడు, అపకారము చేసినవాఁడు.

చ. విరహిత సత్త్వుఁడయ్యెఁ బ్రబిపీరుఁడు వీని నశేషధారుణీశ్వర
నికరాపరాద్ధు నతిసాహసికున్ వధియించి. సభా. 1-207

(నికరాపరాధు-అని కొన్ని ప్రతులు)

**అపరాధత** సం. వి. ఆ. స్త్రీ.

అపరాధము గలిగియుండుట.

చ. ...అట్టి విధము సాపరాధతను డెందము లూఁటఁ బొంది
యుండ,నేరవు మన కట్లు గానఁ దగఁ బ్రార్థన సేయుట యుక్త
మిత్తఱిన్. విరా. 5-351

**అపరాధము** సం. వి. అ. పుం.

నేరము, తప్పు.

సీ, ...అపరాధగతి యెఱింగి, దండించు నృపతికి రెండు లోకంబులు
శేకుఱు... శాంతి. 1-94

క. హర్షంబును మానంబు న,మర్షము నపరాధమును సమదభావము
ను,త్కర్షాపకర్ష చింతలు, వార్షసమాచారమున నిరస్తగుణఃబుల్.
శాంతి. 5-24

**అపరాధి** సం. విణ. (న్. నీ. న్.)

అపరాధము గలవాఁడు. తప్పు చేసినవాఁడు.

తే, ...అనపరాధియైన యతని, తనువు నొంచుట నూహింప ధరణి
పతికి. అను. 5-66

**అపరార్ధము** సం. వి. అ. న.

ఒకదానిని రెండు సమభాగములు చేయఁగా రెండవ సమభాగము,

క, దినమున మూఁడవ యామం,బున యపరార్థంబు యోగ్యముగ

నాహారంబునకుం గల్పించిరి నా, కనిమిషు లటుగాన మాన
నాఁకలిపుత్తున్. అశ్వ. 3-92

**అపరాహ్ణము** సం. వి. అ. న.

పగటిని మూఁడు భాగములు చేసినప్పుడు కడపటి భాగము. ఇది పితృ
పూజకుఁ దగిన కాలము.

క. నృపవరపూర్వాహ్ణంబును, నపరాహ్ణము దేవపితృ సమారాధనవి
ధ్యుపదిష్ట కాలములు మధ్యపు సమయము మానుషార్చనం
బరయన్. అను. 2-54

వ. అంత నపరాహ్ణంబయ్యె నట్టియెడ. భీష్మ. 1-289

**అపరిగ్రహము** సం. వి. అ. పుం.

ఏమియును దీసికొనకుండుట.

అపరిగ్రహంబు నొక్కటన శుద్ధుం డయ్యెద. శాంతి. 1-47

**అపరిచయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఎఱుకలేనివాఁడు.

క. పురుష విశేషవివేకా, పరిచయులగు ధరణిపతుల పాలికిఁ బోవం,
బరులందు దుష్ప్రవృత్తి ప్రవా, భర మెవలో రోసి ధర్మపథమున
నున్నన్. ఆది. 5-215

**అపరిచ్యుతి** సం. వి. ఇ. స్త్రీ.

తొలఁగుట, లేకుండుట,

ఉ. ...ప్రాణసంయమ, క్షీణత దేహ మధ్యశిఖిఁ జిమ్మఁగఁ దత్త్రియ
మొందిమూర్ధపారిణతఁ గోర్కి నల్పు నపరిచ్యుతిఁ దగ్గతుఁడైన
యోగికిన్. అను. 5-260

**అపరిజ్ఞాతము** సం. విశ. (అ. ఆ. అ.)

ఎఱుఁగనిది, తెలియనిది.

వ. శాంతనపుండా శతానందునకు నపరిజ్ఞాతంబును గలదే యతని
గొలువ వచ్చినట్టి సిద్ధసాధ్యాదులకు వినిపించెదంగాక,

శాంతి. 6-390

**అపరిమితము** సం. విణ (అ. ఆ. అ.)

పరిమితము కానిది, మితము లేనిది, విస్తారము.

క. ...ఆయుశ్శ్రీ, లపరిమితము లొంది యమరు లగుదురు పిదపన్.
అను. 4-363

**అపరిమితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పరిమితి లేనివాఁడు. ఇంత యని చెప్పుటకు వీలు లేనివాఁడు.

చ. ...ఇద్దెసఁ దక్కఁ గల్గు వా, రపరిమితుల్ గొనందు ద్రుపదా త్మజుఁ డగ్గురుఁ బోరఁ జీరికిన్. ద్రోణ. 3-293

**అపరిమేయము** సం. విణ. (అ. ఆ. అ.)

పరిమితము తెలువ శక్యము గానిది. అమితము, అత్యధికము,

తే. ...అయ్యపరిమేయ, తేజుఁ డాత్మ తేజమున నాద్యబ్రహ్మఖేంద్రి, యములు మనసులు సమ్మోహితములు సేసి, యిపుడు తనయుండు పుట్టెడు మనియెఁ బిదప. ఆశ్ర. 2-101

**అపరిశ్రాంతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అలసట పొందనివాఁడు.

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు గర్ణుండు.
కర్ణ. 3-275

**అపరీక్షితము** సం. విణ. (అ. ఆ. అ.)

పరీక్షింపఁబడనిది.

వ. ఉదంకుండు గడుచుచో నన్నంబు కేశదుష్టంబైన రోసి కరం బలిగి యిట్లపరీక్షితంబైన యశుద్ధాన్నంబు పెట్టినవాఁడ వంధుండవగుమని శాపంబిచ్చిన నల్గి యల్పదోషంబు నాకు శాపంబిచ్చిన వాఁడవు నీ వనపత్యుండ వగుమని శాపం బిచ్చిన. ఆది. 1-99

**అపర్ణ** సం. వి. ఆ. స్త్రీ.

పార్వతి (తపసి పర్ణానామప్యనశనా దపర్ణా- ఆకులైన (పర్ణములు) తినక తపస్సు చేయునది)

వ. ఆసర్ణాదేవి వర్ణంబుల కర్మంబులు పాకంబుఁ బొందు ప్రకారంబు సెప్పుమని యప్పరమేశ్వరు నడిగిన యతం డిట్లనియె.

అను. 5-80

**అపర్యాప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

చాలనిది, సరిపోవనిది.

వ. అనిన నతండా జలచరంబు గైకొని పోయి యొక్క బావియందు విడిచిన నది యెప్పటి యట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపియందు నవకాశం బర్యాప్తం బగుటం జెప్పి. అర. 4-222

**అపలాపము** సం. వి. అ. పుం.

మఱుఁగు పుచ్చి చెప్పుట, కప్పిపుచ్చి చెప్పుట.

వ. అనిన విని వేదార్థాపలాపంబునకుం గోపంబు నొందిన మునుమల శాపంబున నతండు భూవివరపతితుండయి యుండ నమరు లేతెంచి.

శాంతి. 6-374

**అపలాపించు** సం. స. క్రి.

నిరసించు.

మ విపరీత స్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్య దుఃఖ పరాధీనతఁ దూలి రంచు మనలన్ గర్వాంధిత స్వాంతుఁడై, యపలాపింపఁగ వచ్చి దుర్ణయపరుం డా ధార్తరాష్ట్రుండు దోషపరీతాత్ముండు తత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁడై.

అర. 5-406

**అపవర్గము** సం. వి. అ. పుం.

1. మోక్షము.

వ. కర్మహీనత్వం బపవర్గకరంబు. శాంతి. 1-70

2. చతుర్వింశతి వర్గములకు వెలియైనది. శాంతి. 6-34; చూ. వర్గము

**అపవర్జితము** సం. విణ. (అ. ఆ. అ.)

విడువఁబడినది, తొలగింపఁబడినది.

చ ...అవ్వనంబున లతాలలనల్ మృదులానిలాప వర్జిత కుసుమా

తుతాపళులు సేసలు వెట్టిన యట్టిరైరి. ఆది. 4-17

**అపవాదము** సం. వి. అ. పుం.

నింద, దూఱు

తే. అన్య తెఱుఁగమిఁజేసి లోకాపవాద, భీతినెఱిఁగియు నిత్తన్విఁ
బ్రీతిఁదప్పి యెఱుఁగనఁటిని. ఆది. 4-108; అర. 5-210

**అపవిత్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పవిత్రము కానివాఁడు, అనాచారుఁడు.

క. అపహ్నాష్టకమండలుఁడై, యపవిత్రుం డగుటఁజేసి యధిక తపో
వీర్యపరిక్షయనుగుదును నా, తపస్విసుతు రాక్షసుండు తడయక
తాఁకెన్. అర. 3-269

**అపవిద్ధుఁడు** సం. వి. అ. పుం.

ద్వాదశ విధ పుత్రులలో నొకఁడు, తల్లిదండ్రులు విడువఁగా మఱొక
రిచేఁ బుత్రుఁడుగాఁ జేకొనఁబడినవాఁడు. చూ. అను. 2-249

**అపశదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

నీచుఁడు

ఉ అవనజాననం గురుకులాపశదుండు...శిరోజములం దెమల్చి పాపా
వహు డీడ్చి తెచ్చె సభకు. సభా. 2-216

**అపసవ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

కుడివైపు నున్నది, దక్షిణము.

వ. ఆమ్మల్లవరులడును—అనిల సుతుండునుం బరస్పరమూర్తుల నవలో
కించి...యున్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచిత సవ్య
బాహుతలంబుల నప్పళించు చప్పుళ్లుగలసి యొక్కరుఁడ మల్లసఱ
చిన చందంబున వీతేర. విరా. 2-14; ఆది. 6-12

వ. అతండు కై సేయు విడిచి యపసవ్యకరంబున శరంబులు వఱుచు
కొని ప్రాయోపవేశనమతి నుండి ప్రాణాయామ పరాయణుండై
యోగయుక్తుం డయ్యె. ద్రోణ. 4-278

ఇక్కడ 'అపసవ్యము' అనుటకు 'ఎడమ' అని యర్థము చెప్పవలయును అది పొసఁగదు. కావున ఇది అపపాఠము. భూరిశ్రవుని కుడిచేయి అర్జునుఁడు నఱికెను. ఇఁక కడి చేతితో దర్భలు పఱచుకొనుట అసంభవము. ఎడమ చేతితోనే పఱచుకొనెను. తాళపత్ర ప్రతులందు 'అప' కానరానప్పుడు పరిష్కర్తలెందుకు 'అప' చేర్చిరో బోధపడకున్నది. మూలమునందును 'సవ్య' శబ్దమే ప్రయోగింపఁబడినది.

శ్లో. శరీనా స్తీర్య సవ్యేణ పాణినా పుణ్యలక్షణః.

సం. భా. ద్రోణ. 143-35

3. ప్రతికూలమైనది, క్రమభంగమైనది.

వ. కృపి మున్నగ శిష్యులు సొద,యపసవ్యము గాఁగఁ దిరిగి యరిగిరి. స్త్రీ. 2-124; అను. 5-473

(అపసవ్యముగాఁ దిరుగు = కుడి ప్రక్కనుండి ఎడమ ప్రక్కకుఁ దిరుగు = అప్రదక్షిణముగాఁ తిరుగు )

## అపస్మారి సం. విణ. (న్. ఈ. న్)

అపస్మార రోగము గలవాఁడు, మోహదుఃఖాదులచేఁ గలిగెడి యావేశము గలవాఁడు, స్మృతి దప్పినవాఁడు.

అపస్మారము — చీఁకటి ప్రవేశించినటులఁ దోఁచుట. వికారముగ కన్నులు ద్రిప్పుచు కాళ్లుచేతులు విదిలించుట దోషప్రాబల్యము వలన జ్ఞానము నశించుట. ఇవి సాధారణాపస్మార లక్షణములు. పలుమాఱు వణఁకులు, శరీరము కృశించుట, కనుబొమ లెగురవేయుట, నేత్రములను వికారముగఁ ద్రిప్పుట అనునవి అసాధ్యాపస్మార లక్షణములు.

తే. క్లీబుఁ గుష్ఠి...నపస్మారి...వేదవిక్రయు విడువవలయు.

అను. 2-56

## అపహాతము సం. విణ. (అ. ఆ. అ.)

కొట్టఁబడినది.

వ. ఏను గార్పణ్యదోషాపహత స్వభావుండగు ధర్మసమ్మూఢ చేతస్కుండను. భీష్మ. 1-194

**అపహము** సం. విణ. (అ. ఆ. అ.) (ఇది తత్పురుష సమాసోత్తర పదముగానే యుండును.)

అపహరించునది, పోఁగొట్టునది, తొలఁగించునది, నాశనము చేయునది.

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబు. విరా. 1-48

**అపహరణము** సం. వి. అ. న.

1 దొంగిలించుట

వ. అర్జునుఁజంపుదు మతని కోడలిమేని గోవధఁబును వనితావధంబు .. పరధనాపహరణంబు ..జనులకెట్టి గతులఁ బుచ్చు నట్టి గతులు వాఁడలు. ద్రోణ. 1-201

2. అపహరించుట, నాశము చేయుట.

వ. ..సరస్వతి యత్తపస్వి తన చేరువ నొకప్పుడు జపయుక్తుఁడై యుండం గూలాపహరణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొని పోయిన నతం డాంగిరస మంత్రంబుల నత్తరంగిణిం బ్రణుతించె. శల్య. 2-170

3. బలాత్కారముగఁ దీసికొనిపోవుట

క. పఱెనఁగరేగి యట్లు,పాపాత్మకమగు కిరాతబలము సమగ్రాటోప మునఁ గవిసి వివిధ ధనాపహరణ మాచరింప నారంభించెన్. మౌస. 1-184

**అపహరత్వము** సం. వి. అ. న. పుం.

అపహరించుట.

క. మహాసుర, గర్వాపహరత్వ సంప్రకాశైకరణా. విరా. 5-406

**అపహరించు** సం. స. క్రి.

1. దొంగిలించుట, కాఁజేయుట.

వ. కావునఁ జండాల ధనంబగు సారమేయ మాంసం బపహరించి ప్రాణహాని పరిహరించికొందు. శాంతి. 3-288

క. కృష్ణుని గోరికొనియె విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించికొనిన యట్లకాఁగఁ, దలఁచి చెన్నుమీఱ బలముల గైకొని, చనియెఁ బ్రీతి రాము సదనమునకు. ఉద్యో. 1-76, 77

2. నశింపఁజేయు.

క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి,శారదుఁ డబలాత్మకుండు సబలుం డనలే, దేరినయిన మృత్యువు దు,ర్వారంబై యపహరించు వైదిక వర్యా. శాంతి. 4-24

తే. ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు, పరసతీ సంగమము. విరా. 2-69

3. నివారించు, మాన్చు, పోఁగొట్టు.

సీ. వారట్లు కాకని బోరన నరిగి పద్మజుని గాంచి యజీర్ణదశ యెఱుంగ -తే- విన్నవించినఁ దనయొద్ద వెలుఁగుచున్న, యగ్నిఁ జూపి యిక్కి డితఁ డపహరించు ననిన. అను. 3-196

4. క్షయింపఁజేయు, తగ్గించు.

క. మేలివి గీడివియని భూ,పాలక యే,ఱెప్పినట్టి పను లెఱుఁగుము నీ, పోలిన యాయువుఁ బెనువం, జాలుననియు నపహరింప శక్తము లనియున్. అను. 4-95

5. మోసముచేసి తీసికొను, కపటముచేఁ దీసికొను.

సీ. కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ డగు ధర్మసుతు సిరి యపహరించి. కర్ణ. 3-356

6. బలాత్కారముగాఁ దీసికొనిపోవు.

వ. గ్రస్తుండను పేరంబరఁగు నొక్కరుండ భృగుపత్ని నపహరించి తదీయ శాపంబునం గీటంబనై యుండి భవదీయ విలోకనామృత సేకంబున సుఖినైతి. శాంతి. 1-24

అపహారుఁడు సం. విశే. (అ. ఆ. అ.)

అపహరించువాఁడు.

క. సురారికాంతా విలాస శోభాపహారా, సౌప్తి. 2-185

**అపహసించు** సం. స. క్రి.

గేలిసేయు, పరిహాసము సేయు.

తే. బహువిధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ, జీఁదకన్నిడి తనపెడ చెవులఁ బెట్టి, యీ ఱ తాఱలు మఱుమాట లిచ్చి యపహసించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల? ఉద్యో 4-76

వ. మమ్ము నపహసించిన వారిలోఁ గురుకుల దాహకుం డొక్కరుఁడ తక్కె. శల్య. 1-395

**అపహసితము** సం. విశే. (అ. ఆ. అ.)

తిరస్కరింపఁబడినది, నిరసింపఁబడినది,

వ. ...అపహసిత శిలాసారోదారంబును గనక పట్టికా మండితంబును నైన గదాదండంబు. శల్య. 2-95

**అపహారము** సం. వి. అ. పుం.

నాశము, హాని.

ఆ. ప్రాణహాని వచ్చు పట్టున సర్వధనాపహార వేళయందు నడవు, సత్య మనృతమం డ్రసత్యంబు సూనృత, మని పరిగ్రహింతు రార్య జనులు. కర్ణ. 3-77

తే. చంపెఁ గురువిభు నాకు లజ్జాకరముగ, భీముఁ డదియు నధర్మ సంగ్రామ వృత్తి, నంతఁ బోవక వచ్చి ప్రాణాపహార, మాచరింపఁగఁ బూని నన్నాక్రమించె. సౌప్తి. 2-72

సం. విశే. (అ. ఆ. అ.)

అపహరించునది.

వ. మఱియు నచేతనంబులయ్యును గిరిసరిత్సరోవరంబులు పుణ్యతీర్థంబులై జనులకు దురితాపహారంబులయిన కారణం బేమియని యడిగిన. అర. 2-308

**అపహారి** సం. విశే. (న్. జీ. న్.)

దొంగిలించువాఁడు,

వ. ఆరెకు బిమ్మ్మనిం గని రాజధనాపహారులయిన చోరులు నీయొద్దన పాటి రెట పోయిరి. ఆది. 4-261

అపహారిణి సం. విణ. (న్-ణీ-న్)

అపహరించునది.

వ. అవ్విరించి వచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహానిం జేయ నామృత్యుదేవత ప్రాణాపహారిణి యగుటం బ్రాణంబులు దేహంబులం బాసి దేహాదిభావంబులం బొందుచు మగుడ మనుష్యత్వంబు నొందుచుండు. ద్రోణ. 2-175

అపహాసనము సం. వి. అ. న.

అపహసించుట.

మ. కులిశప్రస్ఫురణాపహాసన విభాగుచ్ఛంబులం గల్గి యాఁకలిమై వచ్చు కృతాంతవక్త్రమున. కర్ణ. 3-368

అపహాసము సం. వి. అ. పుం.

గేలి, ఎకసక్కెము.

ఉ. అజ్జులు కొంద అప్పు డపహాసము సేయుచు, గూఢరూప రేఖా జ్జతలేమిఁ దద్విశ్వకృతకాయము మీఁదను దృష్టి నిల్పఁగా.

విరా. 4-74

తే. చిఱునగవుతో నొండొరు చేతు లప్పళించి నిర్భర సంతోషలీల నొప్పి, రమ్మహీనాథుఁ డయ్యపహాస మెఱిఁగి. బొమలు ముడి వడఁ గమఁగవఁ బొడమఁగెంపు. శల్య. 2-98

అపహాసి సం. విణ. (న్. సీ. న్.)

అపహసించునది.

వ. కైలాసశైల విలాసాపహాసి భాసుర గగనతలోల్లేఖి శిఖరరమ్య హర్మ్యతలంబులను. ఆది. 7-166

అపహుతము సం. వి. అ. న.

హోమ వ్యతిక్రమము, క్రమ పద్ధతి వదలి వ్రేల్చుట.

క. క్రమయుక్తము యుక్తము గా, నమరగురు ప్రతిములైన యాజ్ఞి
కులు గ్రియా,సముదయము నడపఁగా స్థలి, తములే కపహుతము
సారక తత్క్రతు వొప్పెన్. ఆశ్వ. 4-178

**అపహృతము** సం. విశ. (అ. ఆ. అ.)

1. అపహరింపఁబడినది.

వ. కపట ద్యూతంబున నపహృతంబులైన సకల ధనంబులు నలుఁగు
మొన మరల్చినవాఁడనై పాండవాగ్రజుని చింతవంత యంతయుఁ
బుచ్చివైచెద. శల్య. 1-378

2. విధ్వస్తము, నాశనము చేయఁబడినది.

క. అమిత బలంబగు బ్రహ్మాస్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగు
టయు. కర్ణ. 3-347

3 తిరస్కరింపఁబడినది.

వ. వివిధ విశిఖజాలంబులఁ గాలు సేయార్వ రాకుండఁ గప్పి యార్చిన
నప్పార్థుం డతనిచేతఁ దన విక్రమం బపహృతం బయ్యెనని తలంప.
కర్ణ. 2-291

**అపహృష్టము** సం. విశ. (అ. ఆ. అ)

అపహరింపఁబడినది.

క. అపహృష్టకమండలుఁడై, యపవిత్రుం డగుటఁజేసి. అర. 3-269
(అపహృత కమఁడలుండై – అని కొన్ని ప్రతులు)

**అపాంగము** సం. వి. అ. పుం.

1 కడకన్ను, నేత్రాంతము.

వ పరిభవానల సంతప్తయైన పాంచాలి నిజశయన స్థానంబున సంజ
నిత తల్పంబుపై మేనువైచి యపాంగములం దొరఁగు కన్నీరు
చెవుం కొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిలం దలపోయుచుండె.
విరా. 2-168

2. నొసటఁ బెట్టుకొను బొట్టు, తిలకము.

వ. ...అరథికు చూపు కంఠంబు. చక్కటికిం గాక తప్పి యపాంగ

ప్రదేశంబు కొలంది యగుటంజేసి. కర్ణ. 8-816

**అపాండవము** సం. విణ. (అ. ఆ. అ.)

పాండవులు లేకుండుట గలది.

వ. అగ్గురునందనుండు ...... బ్రహ్మశిరోనామకం బగు దివ్యాస్త్రంబు దలంచి యొక్క యిషీకంబు పుచ్చికొని యుందయ్యస్త్రం బు నావహించి యపాండవం బయ్యెడుమని దారుణ భాషణంబులతోడ రోషప్రదీప్తుం డగుచుఁ బ్రయోగించిన. సౌప్తి. 2-58

**అపాంతరతముఁడు** సం. వి. అ. పుం.

వేదవ్యాసుఁడు.

వ. వేదంబులకుం బ్రవర్తకుండు నారాయణనందనుం డపాంతరతముం డను పేరం బ్రసిద్ధుం డగు వేదవ్యాసుఁడు సాంఖ్యంబునకుం గపిలుండును. శాంతి. 6-517

**అపాకృతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తొలఁగింపఁబడినది.

క. ఆ పూర్ణతేజుఁ డపగత,పాపుఁ డపాకృత భవానుబంధుఁడు. (ఆస్తీకుఁడు) ఆది. 2-161

**అపాటవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

శక్తి చాలనివాఁడు, నేర్పు లేనివాఁడు.

వ. కడు భయమున మాతలి చేడ్పడి రథచోదనమునం దపాటవుఁడైనన్. అర. 4-63

**అపాత్రత** సం. వి. అ. స్త్రీ.

అనర్హత.

క. మిత్రత్వము శత్రుత్వముఁ, బాత్రతయు నపాత్రతయును బరికించు సుచా,రిత్రుఁడు చిరతరగణనా,సూత్రితముగ దాన నెల్ల శుభములు నొందున్. శాంతి. 5-289

**అపాత్రము** సం. వి. అ. న.

1. అనర్హుడు, అయోగ్యుఁడు, తగనివాఁడు.

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న,పాత్రములకు నీగి, పాత్రములకుఁ, బెట్టకునికి, యనఁగ నెట్టన రెండు వి,ధములఁగీడు తొడరు ధరణినాథ. ఉద్యో. 2-43

2. అనర్హము, తగనిది.

కవిరాజ విరాజితము : అపాత్రపుఁజా వొనరించుఁ గురుపవరా. స్త్రీ. 1-55

**అపాత్రభూతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అనర్హుఁడైనవాఁడు.

తే. అడవి గోవులకై కాల్చు టధ్వరమునఁ, బశువుఁ జంపుట దాన మపాత్రభూతుఁ,డగు రెఱుంగక యిచ్చుట దగని బంటుఁ, బ్రోవ కుండుట గీడులు గావు వత్స. శాంతి. 1-302

**అపానము** సం. వి. అ. పుం.

1. మలమూత్రాదులను క్రిందుగాఁ ద్రోసివేయునట్టి యొకా నొక వాయువు (ఇది ప్రాణాది పంచవాయువులలో నొకటి. ఇది గుదస్థానమం దుండును.)

పంచవాయువులు : 1) ప్రాణవాయువు, 2) అపానవాయువు, 3) వ్యాన వాయువు, 4) ఉదానవాయువు, 5) సమానవాయువు.

శ్లో. అపానోపానగః శ్రోణి వస్తి మేఢ్రోరుగోచరః.

శుక్రార్తవ శకృన్మూత్ర గర్భనిష్క్రమణ క్రియః - వాగ్భటము - అపానవాయువు ముఖ్యముగా గుదస్థానము నాశ్రయించి పిఱుదులు, వస్తి, శిశ్నము, తొడలు వీనియందు సంచరించుచు, రేతస్సు, ఆర్తవము, మలము, మూత్రము గర్భము అనువానిని వెలివఱచుచుం డును.

మందాక్రాంతము : ప్రాణాపానహరణ నిపుణ ప్రాపణీయానుభావా స్త్రీ. 2-184

సం. వి. అ. న.

గుదస్థానము.

ఉ. ఆతతమైన నాదగు నపానము నూఁదు మొకింతయుఁన్ జగు,ప్రా
తురవృత్తి నీదు హృదయంబునఁ జొన్పరు. అశ్వ. 3-110

**అపానుఁడు** సం. వి. అ. పుం.

1. వ్యాసుని వలనఁ గల్గినవాఁడు. చూ. శాంతి. 6-307

2. అపానవాయువు.

క. విను సృష్టశోణితంబునఁ, బనుగొను శుక్లంబు వలనఁ బ్రాణుఁడు
దగ వర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనూన హేతువులుగా
నపానుఁడు నడచున్. అశ్వ. 2-46

క. చనుఁ బ్రాణుఁ డథోగతి నూర్ధ్వనిరూఢి నపాను డివ్విధము గల
యీ రెంటను నగ్నిమయోదానంబును వ్యానంబును సమాన
మనువర్తించున్. అశ్వ. 2-47

**అపాయము** సం. వి. అ. పుం.

1 చెఱుపు, కీడు, హాని.

తే. రాగరస మగ్నుఁడయ్యె నైగంధ్రిఁ జూచి, యకట దీన నింకేమి
యపాయమగునొ. విరా. 2-62

అపాయము చేసిన నిందపుట్టదే. విరా. 2-95

2. విశ్లేషము, వేఱుపాటు.

ఉపాయాపాయకూబరంబును. శాంతి. 5-92

క. ఆపదయైనను ధర్మువ, ప్రాపుగ రక్షింపవలయుఁ బరమార్థము
ధర్మాపాయ ధార్మికులకు, నాపద జన్మాంతరమున ననుగత
మగుటన్. ఆది. 6-218

**అపారము** సం. విశే. (అ. ఆ. అ.)

అవలి దరిలేనిది, మితములేనిది, అధికము.

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనార్య

ర్చితమైన భారత మపారకృపా పరతంత్ర వృత్తిమై, బేర్చిన
దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి. విరా. 1-28

క. పాత్రము గాకుండుదే యపారత్రికిన్. శాంతి. 3-485

**అపార్థకము** సం. విశే. (అ-ర్థిక-అ)

అపార్థము, అర్థము లేనిది, విరుద్ధార్థము గలది.

ఆ. ...హీను లధికు, లను వివేకమది యపార్థకంబగుఁ గాదె.
అర. 4-128

**అపార్థత** సం. వి. ఆ. స్త్రీ.

విరుద్ధభావము, తద్భిన్న యర్థము.

క. నీవును భీష్ముఁడు ద్రోణుఁడు, భూవినుత విశుద్ధ ధర్మబుద్ధుల రగు
టన్, మీ వచనమున కపార్థత, గావింపఁగ నంత కార్యగతి
మూఢుఁడనే. ఆది. 8-50

('అవజ్ఞత' అని కొన్ని ప్రతుల పాఠము)

శ్లో. భీష్మశ్శాంతనవో విద్వాన్ ద్రోణశ్చ భగవానృషిః,
హితం చ పరమం వాక్యం త్వం చ సత్యం బ్రవీషి మామ్
సం. భా. ఆది. 206-1 (వావిళ్ల)

ఇచ్చట 'అవజ్ఞత' మూలమును బట్టి చూడ యుక్తముగాదని తోఁచెడిని. 'సత్యం' అను పదమునకు 'అపార్థత గావింపఁగ' అనునది సరిపడునట్లు 'అవజ్ఞత' సరిపడదేమో విచారణీయము.

**అపార్థీకృతము** సం. విశే. (అ. ఆ. అ.)

విషయముగాఁ జేయఁబడనిది.

క. అర్థమ యనర్థమూలం, బర్థమ మాయా విమోహ నావహము
నరుం, డర్థార్జన దుఃఖమున న,పార్థీకృత జన్ముఁడగుట పరమార్థ
మిలన్. అర. 1-28

**అపావృతము** సం. విశే. (అ. ఆ. అ.)

తెఱవఁబడినది.

క. సమరంబు రాజులకు ను,త్తమ కర్మం బది యపావృత స్వర్గ

ద్వారము. భీష్మ 1-201

**అపాస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తొలఁగింపఁబడినది.

ఉ. ...అతండును మూర్ఛితుం డయ్యె వాని సం,క్రాంతిఁ దదీయ సారథి యపాస్తరణాంతరుఁ జేసె, జెచ్చెరన్. అర. 1-166

క. అన విని తెలిసి విడిచె న,ర్జునకుఁడు భుజగము నపాస్తరోషుం డగుచున్. అను. 1-40

2, నిరసింపఁబడినది.

ఆ. ...కొండలు, లోనుగాఁగఁ బవనుచే నపాస్త మహిమ గలుగు చెలుఁగుమా. శాంతి. 3-887

**అపిధానము** సం. వి. అ. న.

1. మఱువు, కవచము (రూపాం) పిధానము.

తే. ...దళిత, రథుని విగతాతపత్త్రు నిర్భగ్న శక్తి, ఖడ్గముద్గరకేతు విఖండితాపిధానుఁ జేసె నప్పార్షతుం డా నరేంద్రుఁడు. కర్ణ. 2-269

శ్లో. దుర్యోధనం తు విరథం ఛిన్నవర్మాయుధం రణే.

సం. భా. కర్ణ. 57-35

**అపిహితము** సం. విణ. (అ. ఆ. అ.)

కప్పఁబడనిది.

క. ప్రమద విషాదాదిద్వం, ద్వమలాపిహితాంతరంగవాసా.

అను. 2-477

**అపుడు** దే. వి. బౌ. వ.

అప్డు, అప్పుడు. చూ. అప్పుడు.

తే. ...లాయమున నున్న యపుడు దొడ కించుకయు లేని యట్లు గాఁగ, మాటిమాటికిఁ బరికించి మంధడీల, కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. విరా. 1-95

క. మగతనము నాఁడు మీర్యున్మగుపతనము నపుడు వీరు నాయం

దుదయం, బగుటను దోడంబుట్టువు, లగుదురు ధిర పంచి కుడువుఁ
డందఱు ననుడుఁవ్. అను. 1-292

**అపుణ్యము** సం. వి. అ. న.

1. పాపము.

క. ఉపరమముం బ్రాపించిన, యపుణ్యపుణ్యములు గలుగు నరి
శాంతులు. శాంతి. 2-30

**అపుత్రకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

కొడుకులు లేనివాఁడు.

వ. ....అక్కాంత కృతాంజలియై మా తండ్రి మద్రేశ్వరుం
డపుత్రకుఁ డతనికిఁ బుత్రశత లాభంబు గావలయు. అర. 7-240

**అపుత్రస్య గతిర్నాస్తి**

కొడుకులు లేనివానికిఁ ద్రోవలేదు. (కొడుకులు లేనివానికి పితరుల
ఋణము తీఱదు. పున్నామ నరక మనుభవింపక తప్పదు )

వ. అపుత్త్రిస్య గతిర్నాస్తి యను వేదవచనంబుం గలదు గావున
నే నపుత్త్రికుండ నేమిసేయుదు ననిన. ఆది. 5-70

**అపుత్త్రిఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

కొడుకులు లేనివాఁడు.

వ. పదంపడి యేఁబండ్రు, గూఁతులుం బుట్టిన వారలనెల్ల దక్షుం
డపుత్రుండు గావునఁ బుత్రీకరణంబు సేసి. ఆది. 3-61

**అపునరావృత్తి** సం. వి. ఇ. (స్త్రీ).

1 మఱల జన్మము లేకుండుట.

క. తనుఁ దనయంద నిలిపి పేరనువున బుద్ధికడ వెలుఁగు నచ్యుతుని
సనాతను నగ్రాహ్యునిఁ జిన్మయు, ననుస్మరించునది యపునరా
వృత్తికినై. శాంతి. 4-247

**అపూజితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. పూజింపఁబడనిది, గౌరవింపఁబడనిది.

వ. అతిథి బాంధవ విద్వజ్జన గురు మిత్ర భామినీ నివహంబు లపూజి
తంబులై యెగ్గుసేయును. అర. 1-81

**అపూపము** సం. వి. అ. పుం.

1. పిండితోఁ జేయఁబడిన భక్ష్యము, పిండి వంట.

సీ. ...అధ్వరములు పెక్కు లొనర్చి వేడుకఁ, బాయసమ్ములు నపూ
పములు మోద, -ఆ- కములు లోనుగాఁగఁ గల వంటకముల
నుర్వీసురావళులకుఁ బ్రీతిఁజేసి. ద్రోణ. 2-206

**అపూర్వము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఇదివఱకెన్నఁడు గలుగనిది, క్రొత్తది.

అపూర్వ మనః ప్రమదంబు సేకుఱున్ విరా. 3-68

ఆ. ఇతఁ డపూర్వమనుజుఁ డెందుండి వచ్చెనో, యనుచు నుదరిపడ
లతాంగులెల్ల, నాసనములుడిగ్గి. అర. 2-39

2. అపురూపము, వింతయైనది.

ఉ. తల్లి వసిష్ఠుడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దత్కులం,
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము ఆది. 1-125

**అపూర్వుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

క్రొత్తవాఁడు.

సీ. ...అపూర్వ సంబంధి సూరి, యాజితపోనిత్యులందు సత్పాత్రము,
లెవ్వార లనుటయు. అను. 2—36

**అపేక్ష** సం. వి. ఆ. స్త్రీ.

కోరిక, కాంక్ష.

వ. బ్రాహ్మణుండ భృగువంశ జాతుండ నస్త్రవిద్యాపేక్ష నిన్నాశ్ర
యింప వచ్చితి. శాంతి. 1-20; అర. 2-210

**అపేక్షణము** సం. వి. అ. న.

అపేక్ష, కోరిక.

సీ. మానిని త్రివిధముల్ మానస వాచిక, కాయికంబులఁ బాతకంబు
లందుఁ, బరధనాపేక్షణ పాపానుమోద ధర్మద్వేష ముఖములు
మానసంబులు అను. 5-174

**అపేక్షించు** సం. స. క్రి.

కోరు, వాంఛించు.

వ. హారీతుఁడను మునివరుండు విద్వజ్జనంబులు దనవలనం బ్రవ్రజ
నంబు సమీచీన ప్రకారంబుగా నెఱుంగ నపేక్షించిన.
శాంతి. 5-392

**అపేతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తొలఁగినది, పోయినది.

ఉ. .. అపేత కళంకులు వారు వారికే, లా తగవేది దైవము దలంచు
రణంబునఁ జేటు సంజయా. ద్రోణ. 4-185; శాంతి. 4-175

2. విరుద్ధము, వ్యతిరేకమైనది.

క. ద్యూతార్థము తత్కృతవాహాతుఁడ నై జూద మాడకుండుట
ధర్మాపేతం బని యభిముఖుఁడై, యాతనితో నలుఁడు జూద
మాడఁగడంగెన్. అర. 2-59

**అపేయము** సం. విణ. (అ. ఆ. అ.)

త్రాగఁగూడనిది, త్రాగఁదగనిది.

వ. అశ్వాదరాయణుతో నమ్మౌనీ రమణుం డపేయంబులు నభోజ్యం
బులు నెయ్యవి యపాత్రభూతపురుషు లెట్టివారు మహాపురుషా
యెఱింగింపవే యని యడిగిన నతం డిట్లనియె. శాంతి. 1-320

**అపైశునత్వము** సం. వి. అ. న.

ఇతరులకు హానిగలిగించు మాటలు పలుకకుండుట.

సీ. ...అపైశునత్వంబు సాధు, జనసంగమం బమృషా భాషణంబు.
శాంతి. 4-364

**అపైశునము** సం. వి. అ. న.

ఇతరులకు హానిగలిగించు మాటలు పలుకకుండుట.

క. అనసూయయు నక్రోధం,బును దమమును బ్రహ్మచర్యమును
ఋజుభావం,బును సత్యంబు నపైశున,ము నహింసయుఁ జూవె
యతికి ముఖ్యవ్రతముల్. అశ్వ. 2-178

**అపోహము** సం. వి. అ. పుం.

1. విరుద్ధమైన ఊహ, తప్పుటూహ.

క. ...సకలవేదో, హాపోహాతీతసార హరిహరనాథా. మౌస. 1

2. అతద్వ్యావృత్తి. ప్రతిపాదింపఁదగిన విషయమును ఇది యిట్టిది అని తెలుపక దానికంటె భిన్నమగు దానినెల్ల అదికాదు అదికాదు అని నిషేధించుట.

వ. నీవును శుశ్రూషాశ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థ విజ్ఞాన
తత్త్వజ్ఞాన సమన్వితుఁడవు. అర. 1-88

**అప్డు** దే. వి. ఔ. ప.

అపుడు, అప్పుడు (చూ. అప్పుడు)

ఉ. అంబురుహాక్షివచ్చు తెరువారయఁ గీచకవ ఖ్యుఁ డప్డు తె,ల్లంబుగఁ
జూచి. విరా. 2-113

**అప్ప** దే. వి.

1. 'అయ్య' అను నర్థమిచ్చుచుఁ బురుషనామాంతములకుఁ జేర్పఁబడును. (నామాంతములందు దీని ద్విత్వము లోపించుటయుఁ గలదు)

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా,చార్యు సుజను నన్నపార్యుఁ
జూచి. ఆది. 1-9

2. అక్క, జ్యేష్ఠ సోదరి.

వ. ...సింహబలుండు తనయప్ప సుదేష్ణకు మ్రొక్కి,ంజనువాఁడు.
విరా. 2-22

3 తనకన్నఁ బెద్దదియగు తోడికోడలు.

తే. గొంతి ప్రాణంబుతో నుఁడఁ గురువరేణ్య, యచ్చటికిఁ జని యొక
మరి యమ్మహాను,భావ దర్శింపవలవదె శావనప్ప, ననుసరించుచు
నెట్లున్న యదియొ సాధ్వి. అశ్ర. 2-22

**అప్పగించు** వై. స. క్రి.

1 ఒప్పగించు, ఆధీనపఱచు, వశమున నుంచు, వశముసేయు.

చ ...తనకూఁత విరాటుఁడు పిల్వఁబుచ్చె న,ర్తనమునకై బృహన్న లకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్, విరా. 1-248

వ. అని యిత్తెఱంగున నయ్యైరుపుర నొండొరులకు నప్పగించి వచ్చిన యనంతరంబ. విరా. 1-255

సీ. ...మిమ్ము నెల్లభంగులఁ దన,పాలనంబునఁ బరమసుఖులఁ -ఆ- గానొనర్చువాఁడుగా నప్పగించిన, వాఁడ. ఆశ్ర. 1-93

**అప్పటిఁగోలె** (అప్పుడు + కోలె) క్రి.

1. ఆ సమయంబున నుండి.

క. ...ప్రియంబున నినుఁ జూ,చిన యప్పటిఁగోలె నుగడు, మహోభవ నిపీడ్యమాన మానస నయితిన్. ఆది. 6-192

**అప్పటి కప్డు** (అప్పుడు + కిన్ + అప్పుడు)

ఏ సమయమున కా సమయము.

ఉ. ...సురవ్రజం, బప్పటికప్డు వింతయగు నచ్చెరు నొందఁగఁ బోరి రేవునన. శల్య. 2-260

**అప్పటికి** (అప్పుడు + కిన్) క్రి.

ఆ సమయమునకు.

క మన మురియాడుచు నుండఁగఁ, దన కోరు లప్పటికిలేమి ధరణీశ్వ రనం,దనుఁడు బృహన్నలఁ బిలువం, బనుచుట కొడఁబడిన వలుకు వలుకుటయుఁ దగన్. విరా. 4-24

**అప్పనము** వై. వి. (సం. అర్పణమ్. క. అప్పన)

1. రాజుచే ఇంతయని నియమింపఁబడక ప్రబలుగాని పాలెగాండ్రుగాని అయ్యా కాలములయందు రాజునకు సమర్పించు కానుక.

ఆ. సాంగవేదవేది యగు పురోహితుఁ డెప్డు, నగర మెలఁగవలయుఁ దగవుఁ గృపయుఁ, జక్కటియును గలుగు సచివు నప్పనములు,

నరులు నరయఁబనుచు నది విభుండు. శాంతి. 2-298

2. కప్పము, పన్ను.

ఆ. మనుజభతుకుఁ డిది తనకు నప్పనముగా, నొరులవలని బాధ వొరయ కుండ, దీని గాచుచుండు నీనాఁటి రాజును, దలఁపఁ డసుర నోర్వ బలములేమి. ఆది. 6-266

తే. ....అప్పనంబు, పలుకుబడి దప్పికొనియెడు పతియు గోవు, ముక్కుఁ గుట్టెడువాఁడుఁ దన్మిష్కృషాతి, యగు నతండు నథో గతి కరుగువాఁడు. అను. 2-62

తే. దైవమానుష బలములు దఱిఁగియుండు, నెవ్వరికి నెప్పుడప్పుడ యెసకమెసఁగ, వైరమతనితోఁ బాటింపవలయుఁ జెఱచు, టప్ప నముగొను టర్హాత్వ మరసి నడపు. ఆశ్ర. 1-68

ఈ శబ్దము 'అర్పనమ్' అను శబ్దమునుండి పుట్టినది. అర్పణమునకు 'పొందుఁచుట, ఇచ్చుట' అని అర్థములు గలవు గనుక అప్పనమనఁగా పొందించునది. ఇచ్చునది యని చెప్పవలెను. ఈ పొందించునది, ఇచ్చునది 1) అనియమితము, 2) నియమితము అని రెండు విధములు. అనియ మితమై స్వేచ్ఛా పూర్తిగా నిచ్చుదానికి 'కానుక' యనియు, నియ మితమై బలవంతము మీఁద నిచ్చుదానికి 'కప్పము, పన్ను' అనియు నర్థ ములు గలుగుచున్నవి. అప్పనమునకు 'కానుక' అనునర్థము భారతేతర గ్రంథములయందు స్పష్టముగాఁ గానిపించుచున్నది. అప్పనము, అరి యనునవి సమానార్థకములైనను రెండు నుపయోగించినపుడు, అప్ప నము = కానుక; అరి = పన్ను అని గ్రహింపవలెను. చూ. పై ఒకటవ ఉదాహరణము ఈ రెండును రాజులకుఁ బ్రజలనుండి రావచ్చును. సామంత రాజులనుండి రావచ్చును.

**అప్ఫాళించు** వై. స. క్రి. (సం. ఆస్ఫాల్ ప్రా. అప్ఫాల. క. అప్పళిసు)

1. ఆస్ఫాలనము చేయు, చఱచు, తట్టు.

తే. అగ్గలించి నా యెదుర బాహాప్ఫాళించి, కడఁగఁ జాలెదు మల్లుఁగా నన్నెందు, విరా. 2-7

వానిఁ బప్పళించి. ద్రోణ. 5-287

ఉ. కంధము లప్పళించి తురగంబుల నించుక నిల్పి. విరా. 5-69

(కీచకవధానంతరము ద్రౌపదిని జూచి)

తే. ...కరంబున నుదర మప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల,
ములుకు వారునై పురజనంబులు దలంకి. విరా. 8-86

2. అదిమి పట్టుకొను.

క. పెలుకటి తాళంబీ మదిఁ, దలఁచి యనువుగాక ధరణి తలముఁ
గరతలంబ, బల నప్పళించెదు వాఁడు. విరా. 2-19

ఉ. కొన్నిటి కంఠముల్ నులువుఁ గొన్నిటి కాళులు ద్రుంచు నుగ్ర
తం, గొన్నిటి పతముల్ నఱకుఁ గొన్నిటి పొట్టలు పుచ్చుబీనమైఁ
గొన్నిటి నప్పళించుకొని కోలెమ్ముకల్ నుఱుమాడు లిట్టుల,య్యన్నిటి
నయ్యులూకము రయంబెసఁగన్ వధియించె ఘూవరా.
సౌప్తి. 1-18

3 సంతోషముతో నొకరి బుజ మొకరు చేతితోఁ జఱచు.

వ. ...అమ్మువ్వురు మునీంద్రులు సెప్పిన హితోపదేశంబుల దెస
ననాదరంబుసేసి గాంధారేయుండు రాధేయుం గనుంగొని చే
యప్పళించి నవ్వి వీర లింత వెఱ్ఱులదుగురే యని పలికి వారల
నవలోకించి. ఉద్యో. 3-324

తే. చిఱునగవుతోడ నొండొరు చేతు లప్పళించి నిర్భర సంతోషలీల
నొప్పి, రమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిగి, బొమలు ముడివడఁ
గనుఁగవఁ బొడముఁ గెంపు. శల్య. 2-98

4. కొట్టు.

సీ. మట్టియ లొండొంటి బిట్టుదాఁకఁగ నేల, నందంద మునిగాళ్ల
నప్పళించు. విరా. 2-260

5. ఆక్రమించు, క్రమ్ము.

వ తదవసరంబున నల్లనల్లన తెఱపి యిచ్చి యవుఁ వులం జను నంధ
కారఘులు ధూరఁబుల యంధ్రుము భేకునికి ఫలనం గడ ల్లప్పళించి

నెరసి విరసినం బోలుచు కలుకట్టలుం బోని దిక్తటంబులును.
విరా. 2-240

6. ఉత్సహించు, తమకించు.

ఆ. అనుచుఁ జూచుఁ జేరు నమ్మార్గ పలుకులు, వినఁగఁ గోరుఁ గేలు దనదు కేలఁ, గీలుకొలుపఁదలఁచుఁ గీచకాధముఁడు ని,జానురక్తి దెలుప నప్పళించు. విరా. 2-45

తే. లలిత వివిధ విహారంబులకు లతాంగి, యెలసి పొలసిన యట్లైన నెలమిఁగలసి, యభిమతక్రీడ సలుపంగ నప్పళించి, వెదకి రిత్త బయల్ గని విహ్వాలించు. విరా. 2-301

వ. ఇట్లు వికలేంద్రియుండై వైశ్వానరుం దమ్మునిపత్నులయందుఁ దగిలిన డెందంబు మగిడింపనేరక వారలం గదియ నప్పళించి గార్హపత్యకుండంబునం దావేశించి. అర. 5-196

**అప్పు** దే. వి.

ఋణము.

సీ. అనుదినంబును నంతకంతకుఁ బెరిగెడి యధిపతి మన్నన యప్పు దీర్ప. విరా. 4-205

ఇది 'అచ్చు' అను క్రియాపదము నుండి పుట్టిన కృదంతము. మెచ్చు-మెప్పువలె అచ్చు—అప్పు.

**అప్పుడప్పుడు** (అప్పుడు + అప్పుడు)

అప్పటికప్పుడే, తత్క్షణము.

తే. అప్పుడప్పుడ తలపడినట్టు లప్పు,డేచి విలసిల్లు మేనుల యెట్టి చెలువు, గలయఁబూచిన నడ మోదువులఁ దలంపఁ, బట్టుగానొప్పె నధిప నీ పట్టిదోయి. శల్య. 2-266

**అప్పుడు** దే. వి. కా. వ. (త. అప్పొళుదు, అప్పోదు)

(దీని రూపాంతరములైన అపుడు, అప్డు అనునవి యితర విభక్తులతోఁ గూడి యుండవు.)

27)

1. ఆ సమయము, ఆ కాలము.

వ. అవ్వేళనుం గనుంగొను నప్పుడు. విరా. 1-11

క. ముఱిముఱి చీఁకటి యప్పుడు. విరా. 3-195

వ. ఇట్టియప్పుడు జనులు రసమీఁదం జాలమి వెట్టుకుఁడుటకుం గాదె కర్ణ. 2-96

**అప్పుడు దొడంగి** (అప్పుడు + తొడంగి)

అది మొదలుకొని.

వ. అప్పుడు దొడఁగి యంతరంగంబు నిప్పులం బోరఁటి నట్లయ్యెడి. శాంతి. 1-8

**అప్పులు** సం. వి. స్. స్త్రీ. బ.

నీళ్లు.

వ. అప్పుల వలన నగ్నియు బ్రాహ్మణుల వలన క్షత్రియ జాతియు నశ్మంబుల వలన లోహంబును నుద్భవించె. ఉద్యో. 1-185

**అప్రకంపము** సం. విణ. (అ. ఆ. అ.)

చలింపనిది.

క. ఇతరేతర శరకృత శోణిత ధారలు నిగుడ నపుడు నిర్భరదాన, ద్యుతు లడరఁ బొలుచు నగముల, గతిఁ బొలిచిరి వారలప్రకంపో న్నతులై. భీష్మ. 2-208

**అప్రకాశత** సం. వి. ఆ. స్త్రీ.

రహస్యము, ప్రచ్ఛన్నము.

సీ. ఆతని యున్నెడ కప్రకాశతఁ జన్న, నెఱింగి యమ్మహిమాత్ముఁ డెఱిఁగి. అను. 4-348

**అప్రకాశము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశములేనిది, కాంతిలేనిది, ప్రసిద్ధిలేనిది.

క. కలరూపగుణద్రవ్యంబులు విక్రమవంతునందు భావితములై, నిలుచు, నవిక్రమమునకు నవి, గలిగియు లేనట్టియ నప్రకాశంబు లగున్. సభా. 1-128

2. రహస్యమైనది, రహస్యము.

తే. సాధులింద్రియవిభ్రాంతి సంహరింతు, రఘము దెలిసి ప్రాయ శ్చిత్త మాచరింతు, రప్రకాశంబుగా ధర్మ మాచరింతు, రఖిల భూతదయాళుత్వ మారఁగలదు. అను. 5-428

**అప్రచలితము** సం. విణ. (అ. ఆ. అ.)

కదలనిది, చలింపనిది.

వ. అప్రచలిత విద్యుల్లతా రుచిర మూర్తియైనదాని నొక్కకన్నియం గాని. అర. 5-178

**అప్రతర్క్యము** సం. విణ. (అ. ఆ. అ.)

తర్కింప నలవి కానిది, ఊహింప శక్యముగానిది.

వ. ...ఇద్దేసకుం, జనిరన వశమే యద్భుత, మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీరమణా. అను. 5-309

**అప్రతికారము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రతిక్రియ లేనిది, మాఱు లేనిది.

శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప. విరా. 2-275

**అప్రతికారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రతీకారము లేనివాఁడు, మాఱుసేయుట లేనివాఁడు.

క. అవమానితులై ధరణీ, దివిజులు క్రోధాగ్నిశిఖలు దీపించి మహో, గ్రదివనద్వీపంబులతో, నవనినయినఁ బొడవడంతు రప్రతికారుల్. అర. 5-17

**అప్రతిగ్రహము** సం. వి. అ. పుం.

ప్రతిగ్రహము సేయకుండుట, దానము పుచ్చుకొనకుండుట.

సీ అధ్యాపనంబు, నప్రతిగ్రహమును... -ఆ- వశ్య యాచరింప వలయునట్టివి. అను. 3-8

**అప్రతిగ్రహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రతిగ్రహము చేయనివాఁడు, దానము పుచ్చుకొననివాఁడు.

తే. అతిథి శిష్టాన్నభోజులు నప్రతిగ్రహులును గంద్రది సరకుసేయు
దునె యచట. అను. 4-68

**అప్రతిగ్రాహకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రతిగ్రహము చేయనివాఁడు, దానము పుచ్చుకొననివాఁడు.

సీ ...శ్రుతము సంపాదించి, యప్రతిగ్రాహకుఁడైన మద్య, మాంస
పరస్త్రీ సమాగమ వైముఖ్యమున. అను. 2-63

**అప్రతిభుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రతిభ లేనివాఁడు, అప్పటికప్పుడు వికసించెడు బుద్ధి లేనివాఁడు.

తే. ...కొంత, ప్రజ్ఞగల వారలైన యప్రతిభులైన, జనులు దుఃఖార్తు
లగుట నిస్సంశయుంబు. శాంతి 1-190

**అప్రతిమము**

సాటిలేనిది.

ఉ. ...అవ్విభుం, గట్టెదఁ బట్ట మప్రతిమ కావ్య కవిత్వ మహావిభూతి
కిన్. విరా. 1-27

**అప్రతిముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అసమానుఁడు, సాటిలేనివాఁడు.

క. ...మహేశ్వరుఁ, డని కొనియాడ హరుఁ దొప్పు నప్రతిముండై.
అను. 5-897

**అప్రతివారణము** సం. విణ. (అ. ఆ. అ.)

అప్రతిహతమైనది, అనివార్యమైనది.

వ దఁడధరుం డప్రతివారణంబైన దండంబు విధియుక్తంబుగా
నిచ్చిన. అర. 1-889

**అప్రతిహతము** సం. విణ. (అ. ఆ. అ.)

నిరాటంకము, అనివార్యము, అడ్డగింపఁబడినది.

వ. అట్లైన నప్రతిహతంబుగాఁ జతురంత భూచక్రం బాక్రమించి కీర్త
నీయులమై వర్తిల్లుదుము. విరా. 8-117

**అప్రతిహతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఎదురు లేనివాఁడు, అడ్డు లేనివాఁడు.

తే. అతిరథుఁడు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ, డాహవంబున నప్రతి
హతుఁడు. ఉద్యో 4-255

**అప్రతిహన్యమానము** సం. విశే (అ. ఆ. అ.)

అనివార్యమగునది.

చ. అమిత జరద్భయంకర విషాగ్నియు నప్రతిహన్యమాన వీర్యము
గల యట్టి సర్పములకు. ఆది. 1-127

**అప్రతీకారము** సం. విశే. (అ. ఆ. అ.)

అప్రతికారము, ప్రతిక్రియ లేనిది.

వ. అక్కర్ణుం డప్రతీకారంబులగు రోషవిషాదంబులఁ గన్నీరొలుక
రథంబు డిగ్గి కవ్వడి దెసఁ గనుంగొనుచు నిట్లనియె కర్ణ. 3-350

**అప్రతీఘాతము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎదురులేనిది.

ఉ. ఈతని పౌరుషం బరయ నెఁడు నమానుషకృత్య మప్రతీఘాత
మనేక మద్భుతము. అర. 6-210

**అప్రతీతము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎఱుఁగఁబడనిది, అప్రసిద్ధము.

ఆ. అప్రతీత భంగియగు మందపవన విచేష్టితంబు గర మభీష్టమయ్యె.
అర. 4-405

**అప్రదక్షిణము** సం. విశే. (అ. ఆ. అ.)

కుడిప్రక్క నుండి ఎడమ ప్రక్కకుఁ దిరిగినది.

సీ. ధృతరాష్ట్ర విభుని మందిరమున...యప్రదక్షిణముగా నయ్యె
నుల్కాపాత, మపమేఘమై యున్న యంబరమున. సభా. 2-299

**అప్రధృష్యము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎదుర్కొనరానిది, గెలువరానిది.

మ. అమరాహీంద్ర వియచ్చరాదుల కశేయం బప్రధృష్యం బభే,ద్యము
...నగ్గాండివమన్ చాపర,త్నము. ఆది. 8-253

**అప్రబుద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మెలఁకువ లేనిది.

చ. సతతము దాల్చుటన్ వపువు సంకటపాటునఁ బెట్టు నార్య మ,చ్యుతమమలంబు దాను దను జూడక యక్షర మప్రబుద్ధమై.
శాంతి. 6-17; 48

2. క్షరము (తెలిసికొనుట లేనిది)

వ. క్షరాక్షరంబు లప్రబుద్ధ బుధ్యమాన బుద్ధంబు లను నిర్దేశంబులు గలిగియుండు. శాంతి. 6-56

**అప్రబుద్ధుఁడు** సం. వి. అ. పుం.

అజ్ఞానము గలవాఁడు.

వ. అక్షరక్షరంబు లపర్యాయ నిర్దేశంబు లక్షరంబు నప్రబుద్ధులు గానరు. శాంతి. 6-85

**అప్రబోధము** సం. వి. అ. పుం.

అజ్ఞానము.

ఆ. ఇంతకాల మేని యెఱుఁగక సంగాభి,భూత యగుచు నప్రబోధ
కలిత,యైన యట్టి ప్రకృతియే నంటి, శాంతి. 6-49

**అప్రభేద్యము** సం. విణ. (అ. ఆ. అ.)

భేదింప శక్యముగానిది.

చ. అహితుల కప్రభేద్యముగ నా పదుమూఁడగు నేఁడు మత్పితా
మహులు చరించి రంతయు గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా.
విరా. 1-44

**అప్రమత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

సావధానుఁడు, ప్రమాదము లేనివాఁడు, ఏమఱుపాటు లేనివాఁడు.

క. గతహర్ష భయక్రోధుఁడు, ధృతిమంతుండు నప్రమత్తధీమహి

తుఁడు సంశ్రితధర్ముఁడు దాంతుఁడు నగు, నతఁ డవసాదంబు నొందఁ డతులవివేకా. శాంతి. 5-87

**అప్రమత్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సావధానుఁడు, ప్రమాదము లేనివాఁడు, ఏమఱుపాటు లేనివాఁడు.

వ. ఏను రాజరక్షణంబునకు నిలిచెద నీవప్రమత్తుండవై యరుగు మనిన, ద్రోణ. 3-307, కర్ణ. 1-261

**అప్రమాణము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రత్యక్షాది ప్రమాణము లేనిది, నిరాధారము.

వ. దుర్యోధనుండు నిజపురంబునకుం జని చని నడుమ విడిసిన యెడం గర్ణశకునిదుశ్శాసనుల దుర్మంత్రంబుఁ బట్టి గాంగేయుని వచనంబు లప్రమాణంబులు సేసి. విరా. 5-367

2. అప్రమేయము, మేరలేనిది.

మాలిని. అపరిమిత విభూతీ అప్రమాణ స్వరీతీ. శాంతి, 5-632

**అప్రమాదము** సం. వి. అ. పుం.

పొరపాటు పడకుండుట, ప్రమాదము లేకుండుట, జాగరూకత,

సీ శ్రమ క్రోధమునకు సంకల్పవర్జనము కామమునకు నప్రమాదము భయంబునకు... వైరులు. శాంతి. 5-612

**అప్రమాదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఏమఱుపాటు లేనివాఁడు, జాగరూకత గలవాఁడు.

వ. పరీక్షితుండు... ఆత్మరక్షయం దప్రమాదుఁడై. ఆది. 2-181

**అప్రమేయత** సం. వి. ఆ. స్త్రీ.

అమితత్వము,

క. వ్యాసాది మునిప్రోక్త మహాసందర్భాప్రమేయతారూఢ గుణోల్లాసా. ఉద్యో. 2-388

**అప్రమేయము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మితిలేనిది, ఇంతయని పరిమితి యేర్పఱుప శక్యము కానిది,

వ. అప్రమేయప్రభావభావనాతీతుండయ్యు నప్పరమేశ్వరుం డాశ్రితు
లకు నత్యంతసులభుం డని. విరా. 1-19

2. ఇది యిట్టిదని నిశ్చయింప శక్యముగానిది.

వ. విష్ణుండు జగన్మూర్తి విష్ణుతనుభూతంబైన మహాభూత పంచకం
బప్రమేయంబు గాక తక్కునే. శాంతి. 4-88

**అప్రమేయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

మితిలేనివాఁడు, అప్రమేయమైనవాఁడు,

ఆ. పూజ్యుఁడవు పురాణపురుషుండ వీవుండ, వప్రమేయుఁడవు చరా
చరంబులయిన భూతరాసు లచ్యుత నీయంద, పుట్టు నిలుచు
లయముఁ బొందుచుండు. అర. 1-126

**అప్రయత్నుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రయత్నము చేయనివాఁడు.

వ. అప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు ధర్మపరులును నీతి
విదులునైన బలవంతులు బహుమార్గంబులగు సదుపాయంబుల
నర్థంబు లాకాంక్షింప సిద్ధింపకుండెడు. అను. 5-429

**అప్రయోజకము** సం. విశే. (అ. జీకా. అ.)

నిరుపయోగమైనది, నిష్ప్రయోజనమైనది.

చ. ఒకనిని జంపి యిట్లు చను నుజ్జ్వలశక్తి నెటింగి కర్ణుఁ డేటికి
నరు మీఁద దానిని గడింపక యిన్నిదినంబు లప్రయోజకముగఁ
జేసెఁ గయ్యము. ద్రోణ. 5-240

**అప్రయోజనము** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రయోజనము లేనిది, నిష్ఫలము.

తే. వీని నేటికిఁ బట్టితి వీఁడు బ్రదికి, యిచట వర్తించి మనకు నెగ్గేమి
సేయు, నప్రయోజన మిది విడువు మనిన.
శల్య. 2-7; అర, 7-361

2. వ్యర్థము, ప్రయోజనము లేమి.

తే. ...బంధుమిత్రజనులు తెగటాఱి రప్రయోజనము గాఁగ.
కర్ణ. 3-61

**అప్రవాసి** సం. విణ. (న్. నీ. న్)

ప్రవాసమునం దుండనివాఁడు.

ఆ. అప్రవాసియైన యవనీసురుని యుద్ధ,శాలిగాని ధరణిపాలు నుర
గ,ముల బిలాంధకారమున నడంచిన యట్లు, మెఱయనీక భూమి
మ్రింగు నం్రడు. అను. 2—159

**అప్రశస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

శ్రేష్ఠము గానిది, ప్రసిద్ధము గానిది.

వ. కలియు నవ్విభీతక వృక్షంబు నాశ్రయించె నది మొదలుగా విభీ
తకం బప్రశస్తంబయ్యె. అర. 2-190

**అప్రసక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

అసంగతము, అసందర్భము.

వ. అప్రసక్తంబైనను నీ యర్థంబు వినవలయునట్టిది. అను. 4—155

**అప్రసిద్ధము** సం. విణ. (అ. ఆ. అ,)

ప్రసిద్ధము గానిది, పొగడ్త కెక్కనిది.

చ. ...హరి భూరిపరాక్రమ మప్రసిద్ధమే. ఉద్యో. 2-310

**అప్రాకృతము** సం. విణ. (అ. ఆ. అ.)

అమానుషము, అసామాన్యమైనది.

వ. నీవప్రాకృతపరుఁడవు...నావుడుఁ బార్థుండు గర్జన కిట్లనియె.
ఆది. 7-199

**అప్రాప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁబడనిది.

క. నానాశాస్త్రంబుల న,ర్థానేకత్వంబు గనుచు నప్రాప్త మవి,జ్ఞాన
పరిసిద్ధమగు మ,నాత్మనసముం దేర్చవే సమగ్ర వివేకా.
శాంతి. 5-448

**అప్రాప్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందరానిది.

క. విను పాణిగ్రహణము సే,యని వనితకుఁ బుణ్యలోక మప్రాప్యము.
శల్య. 2-210

**అప్రార్థనము** సం. వి. అ. న.

ప్రార్థనము లేమి, ప్రార్థింపకుండుట.

క. అనహంకారము నప్రా,ర్థనమును విషయములఁ బెద్ద దగుఁ గమి యును మే॥.
శాంతి. 5-453

**అప్రియము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రియము గానిది, అనిష్టము.

చ. ...రిపులఁ ద్రుంచి యశం బిల నించె పుత్రుఁ డెక్కటి దివి చూర కోల్ ప్రియము కాకిది యప్రియమే తలంపగాన్. ద్రోణ.2-257

క. ఒరు లేమేమి యొనర్చిన, నరవర యప్రియము దన మనంబున కగుఁ దా, నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమ ధర్మ పదముల కెల్లన్.
శాంతి. 5-220

**అప్రీతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సంతోషింపనివాఁడు.

వ. అనిన విని గురుం డప్రీతుండయ్యును గటకటం బడక యతనితో నిట్లనియె.
ద్రోణ. 1-389

**అప్సరస** సం. వి. స్. స్త్రీ.

దేవవేశ్య, అచ్చర.

సీ. తురగఖురోద్ధూతధూళి యప్సరసల చిన్నిపువ్వుల తోడఁ జెలిమి సేయన్.
భీష్మ 1-104

వ. (కశ్యపుని వలన) కపిల యనుదానికి నమృతంబును గోగణంబును బ్రాహ్మణులును ఘృతాచీ మేనకాదు లయిన యప్సరసలును బుట్టిరి.
ఆది. 3-65

**అప్సరస్త్రీ** సం. వి. ఈ. స్త్రీ.

దేవవేశ్య, అచ్చర.

వ. దానికి భయంబందె సిలింపపతి యప్సర స్త్రీలఁ దత్తపోభంగంబు సేయుం డని నియమించి పంపిన. ఉద్యో. 1-117

**అఫలత** సం. వి. ఆ. స్త్రీ.

నిష్ఫలత్వము, వ్యర్థము.

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపి పుచ్చిన నూర్ధ్వ లోకములు దప్పు, బుణ్య కర్మంబు లఫలతఁ బొందు.
ఉద్యో. 1-161

**అఫలితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఫలింపనిది.

వ. అప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలిత ప్రయత్నుండై తత్కాల జనిత వైరాగ్యంబునం దపస్వి యగుట. శాంతి. 3-166

**అఫలము** సం. విణ. (అ. ఆ. అ.)

ఫలములేనిది, నిష్ప్రయోజనము.

తే. అన్యవర్ణుండు దీనుఁ డీయనకు నెట్లు, గూఁతు నీవచ్చునని మదిఁ గుత్సవుట్టి, యీఁడ, ప్రార్థన మఫలమై యేగి యజ్ఞ,సమయ మున నగ్ని దనమూర్తి సంహరించె. అను, 1-55; అను. 5-149

**అఫలీకరణము** సం. వి. అ. న.

నిష్ఫలము అగునట్లు చేయుట.

చ. దొరకొని దివ్య బాణములు ద్రోణుఁడు బల్విడి నైంద్రమాదిగా, నరుపయినేయ నాతఁడు మనంబునఁ గొంకక తత్తదస్త్రముల్, వెర పున నేసి యేసి యఫలీకరణం బొనరించి పేర్చుఁ ద,ద్వరశరజాల మున్ గురునినారితమై యడఁగుం బొరిన్‌బొరిన్. ద్రోణ 5-293

**అఫల్గువు** సం. విణ. (ఉ. ఉ. ఉ.)

అధికమైనది, అమోఘమైనది.

వ. అట్లు ఫల్గును నఫల్గు విద్యావిశారదుం జేసి శౌరి యతనితోడ.
అశ్వ. 3-2

**అబల** సం. వి. ఆ. స్త్రీ.

ఆఁడుది.

సీ. తెలిగన్నుఁగవకాంతి పొలుపార నించుక, కనువిచ్చి చూచినఁ
గాదె యబల. విరా. 2-45

**అబలము** సం. వి. అ. న.

బలము లేమి.

వ ధర్మాధర్మంబులు... బలాబలంబులు... దండంబున సమ్యగసమ్య
క్ప్రకారంబులం గలుగు. శాంతి. 3-111

**అబలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

బలము లేనివాఁడు.

క. కలవాఁడు లేనివాఁడు స్వబలుఁ డబలుఁడు, మూఢబుద్ధి ప్రౌఢుం
డనఁగా, వలదెవ్వరికైన జనని, కలిమియ యత్యంత సౌఖ్యకరమై
యుండన్. శాంతి. 5-278

**అబహుభాషి** సం. విణ. (న్. ఈ. న్.)

అధిక ప్రసంగము చేయనివాఁడు.

వ గురునకుఁ బ్రియకరుం డయి వేదాధ్యయన మొనరించుచు...
యజ్ఞోపవీతియు నబహుభాషియు...(నై) వర్తించు బ్రహ్మచారి
అశ్వ. 2-168

**అబాంధవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చుట్టములు లేనివాఁడు.

క. పంగుల మూకాంధుల విక,లాంగులను నబాంధవుల దయం బ్రోతె.
సభా. 1-44

**అబాధ్యత** సం. వి. ఆ. స్త్రీ.

బాధింపఁదగకుండుట.

క. ఓవరో, యిట్లనుట జగద్ద్రోహం బిమ్మాట మఱవు; దూతత్వం
బున్, మాహాత్మ్యంబును ధర్మో,త్సాహంబును విను మబాధ్యతకుఁ

గారణముల్. ఉద్యో. 8-170

**అబీజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కారణము లేనివాఁడు.

తే. ఇతఁ డబీజుం డదేహుం డనింద్రియుండ. శాంతి. 6-81

**అబుద్ధిపూర్వకము** సం. విణ. (అ-ర్వకా-అ)

తెలియక చేసినది, బుద్ధిపూర్వకముగాఁ జేయనిది.

వ. తొల్లి పరిక్షిత్తనయుండగు జనమేజయుం డను మహారాజు దన కబుద్ధిపూర్వకముగ బ్రహ్మహత్య వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె. శాంతి. 3-344

**అబుద్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

జ్ఞానము లేనివాఁడు.

తే. ...విను ప్రబుద్ధుఁ, డన నబుద్ధుండు నా నొప్పు నతఁడు మఱియు. అను. 4-196

**అబోధము** సం. వి. అ. పుం.

తెలివి తొలఁగుట, మూర్ఛ,

క. ఆ ధర్మనందనుఁడు సక్రోధాత్ముం డగుచు నేసెఁ గోదండము నుగ్గ దరఁ దొరఁగఁ వాతఁ డబోధంబునఁ దేరి మీఁదఁ బొలుపఱి వ్రాలెన్.

తే— ఇట్లు మూర్ఛిల్లుటయుఁ గౌరవేశ్వరుండు. ద్రోణ 5-58;54

**అబ్జగర్భనితార** సం. వి. ఆ. స్త్రీ.

రోహిణీ నక్షత్రము.

అబ్జగర్భనితార మాసములు... మేలు దానమునకు. అర. 2-878

**అబ్జభాండము** సం. వి. అ. పుం. న.

బ్రహ్మాండము.

ఆ. అట్లు లోకకర్తయగు నంబుజాక్షుండు, పట్టుఁగొమ్మ భావభవహ రుండు, హరుని యనుమతమున నఖలాబ్జ భాండంబు లట్టు పుట్టఁ

జేసి యడఁచుచుండు. అను. 1-334

ఈ పద్యము "ప్రాఁత ప్రతులలోనే లేదు" అని ఆనంద ముద్రణము వారును, "పెక్కు తాళపత్ర ప్రతులలో లేదు" అని సం.ము వారును దెలిపిరి. సంస్కృత భారత ప్రతులయందలి ఆనుశాసనిక పర్వములో ఈ భావముగల శ్లోకమేలేదు. నిర్ణయసాగర ప్రెస్సుప్రతిలో ఈ అధ్యాయము గలదు గాని ఈ భావముగల శ్లోకములేదు. నీలకంఠీయ వ్యాఖ్య గల ప్రతిలో ఈ ఆధ్యాయమే లేదు. కావున ఈ పద్యము ప్రక్షిప్తము అనవలసి యున్నది.

**అబ్జజుఁడు** సం. వి. అ. పుం.

తమ్మిచూలి, బ్రహ్మ.

సీ. అబ్జజు వీడ్కొని యది దేవసభకుఁ బ్రదక్షిణం బొనరించెఁ దక్షణంబ. ఆది. 8-105

**అబ్జనాభము** సం. విణ. (అ. ఆ. అ.)

నడుమ పద్మము గలది. శ్రీకృష్ణచక్రము.

సీ. ...అపరదినమునం దగ్నిదత్తంబు నబ్జనాభంబును, నైన కృష్ణుని చక్రమద్భుతముగ, -ఆ- నెగసి యఖిల జనులు నీక్షింప దివమున కరిగె. మౌస. 25

**అబ్జనాభుఁడు** సం. వి. అ. పుం.

బొడ్డునందు తామర గలవాఁడు. శ్రీ మహావిష్ణువు.

ఆ. ...రవి సహస్రనిభు హిరణ్యగర్భు, నబ్జనాభు. శాంతి. 4-216

**అబ్జము** సం. వి. అ. న.

పద్మము.

మాలిని- కమలభవ కిరీట గ్రామ పద్మావలీ సంగమ సుభగపదాబ్జా. విరా. 1-335

**అబ్జముఖి** సం. వి. ఈ. స్త్రీ.

పద్మము వంటి మోము గలది,

సీ. మానిని గరువంపు మాట పొందూహించు దళితాబ్జముఖి తిన్నఁ
దనము మెచ్చు. విరా. 2-292

**అబ్జాక్షి** సం. వి. ఇ. స్త్రీ.

పద్మమువంటి కన్నులు గలది- స్త్రీ

ఉ యతఁడు డెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగనేల చెప్పు మబ్జాక్షి
భవన్మనోరుజకు నౌషధమే నొనరించు. ఉద్యో. 4-385

**అబ్జానన** సం. వి. అ. స్త్రీ.

పద్మము వంటి మోము గలది. స్త్రీ

ఉ. ...ఇప్పుడ పోయి మ ట్టి యబ్జాననఁ బట్టి తెచ్చి హృదయం
బలరఁగ ననంగ తంత్ర విద్యానిపుణత్వ మేర్పడఁజేదం బ్రమ
దాంబుధి నోల లార్చెదన్. విరా. 2-298

**అబ్జిని** సం. వి. ఈ. స్త్రీ.

తామర సమూహము.

తే. అబ్జినీ తటాక తరుషండ పుష్పవాటముల నిలుతు. అను. 1-285

**అబ్దకము** సం. వి. అ. న.

సంవత్సరము.

తే. వనములందును బండ్రెండు వత్సరమ్ము లలయ కజ్ఞాతవాస మే
కాబ్దకంబు, పూని నిర్విఘ్నవృత్తిఁ జల్పుదురు మీరు. అర. 4-88

**అబ్దము** సం. వి. అ. పుం.

1. సంవత్సరము.

వ. ఇమ్మహనీయ చాపంబు... సోముడు పంచ దశాబ్దంబులు...
గ్రమంబున ధరియించిరి, విరా. 4-122

2 మేఘము.

మ. ... నీ సేన యబ్జవితానంబు మహా సమీరణ నిరస్తంబైన చందం
బునన్, ద్రోణ. 1-198

**అబ్ధి** సం. వి. ఇ. పుం.

సముద్రము.

మ. ...ద్రోణు వా,హన సూతధ్వజ దేహముల్ పొదివె నిట్లస్త్రాబ్ధి నిరన్మగ్నుఁ జే,సిన హాహా నినదంబు లొక్క మొగిఁ బేర్చెన్ సర్వ సైన్యంబులన్. విరా. 5-187

**అబ్బు** అ. క్రి.

1. సిద్ధించు.

ఆ. అకట దినములోన నా సైంధవుని జంప, నబ్బకున్న నతని కగ్ని సొరఁగ,వలయు నాతఁ డనృతవాదిగాఁ డిక్కార్య, మెట్లులగునో మనకు నేది గతియొ. ద్రోణ. 2-343

క. అపత్సమయంబున కౌ,చాపాదన మిట్టి భంగి నబ్బుమి మలసం, లేపన గంధము వోవఁ గ్రి,యాపరుఁడయి చేయునది మృదాకల నంబున్. అను. 3-288

2. వశమగు, చిక్కు.

క. ...మోసంబుగాక ధర్మజుఁ డట్లబ్బినఁ బోనిచ్చుట రాధా తన యునకున్ బుద్ధి యగునె తప్పెం దప్పెన్. కర్ణ. 3-8

**అభంగము** సం. విణ. (అ. ఆ. అ.)

భంగము కానిది.

వ. ...ముందట నతి బాహుబలాక వ్యూహసన్నాహ సమున్నతంబు లైన యభంగోత్తుంగ శృంగ సముదయంబుల నఖిల గగన క్రోడ పీడనంబు సేయుచున్న దాని ఋశ్యమూక శైలంబుఁ జేరి. అర. 6-368

**అభక్ష్యము** సం. విణ. (అ. ఆ. అ.)

తినఁగూడనిది.

వ. అభక్ష్యభక్షణంబును నన్యభామారతము మద్యపానంబు మొదలైన కృతులు కాయికంబులు, అను. 5-174

**అభయకారి** సం. విణ. (స్. జీ. స్,)

రక్షణము సేయువాఁడు, అభయ మిచ్చువాఁడు.

తే. అచలు సూక్ష్ము వరేణ్యు సహస్రశీర్షు, నభయకారి నశీర్షు నారా
యణుని. శాంతి. 4-217

**అభయము** సం. వి. అ. న.

1. రక్షణము.

సీ. ఓర్వక పెక్కండ్రు రుర్వీశు లొక్కటఁ బైనెత్తి వచ్చిన భండన
మున, వారి హేతిచ్ఛత్రవాహనధ్వజములు, నఱకిన గడుగడు
నడిఁకి వార,లభయంబు వేఁడిన నందఱఁ గృపఁగాచి, యేలె
నీపెన్నేల యెల్లఁ దాన. ద్రోణ. 2-206

2. ప్రాణదానము.

ఆ. తనయు లార్వుర నఱకు మనియె నర్దేవి దక్కనుజులెల్ల వారి
కభయ మొసఁగు,మనిన నట్లకాక యని మమ్ము నలువురం, బట్టెఁ
గాని తెగడ ప్రాణములకు. శాంతి. 1-9

3. భయము లేమి.

వ. కృతయుగంబునం జార్వాకుం డను దైత్యుండు తపం బొనరించి
పద్మభవుండు ప్రత్యక్షం బైన సకల భూతంబుల వలనను నభయంబు
వేఁడిన: శాంతి. 1-269

4. అభయమను పేరు గల్గిన భార్యాభర్తృ సంవాదము. అశ్వ. 2-5

**అభయహస్తము** సం. వి. అ. పుం.

భయము లేదని సూచించుటకు అఱచేతివ్రేళ్ళను నిలువుగఁ బట్టి ముందఱికి
చాఁచిన చేయి.

తే. కాలు తక్కువ వారలు గలయఁ జెదరి వెనకఁబడిపోవునెడఁ
దన్నుఁ గని భయమునఁ, బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ
హస్తమిచ్చుచు దయ పెనుపారఁ బలుకు, విరా. 5-225

**అభయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. భయరహితుఁడు, నిర్భయుఁడు, భయము లేనివాఁడు.

తే. ...దమము, నాకృతులు వీనిఁ గల పుణ్యుఁ డభయుఁ డైహిక ములవలనను నాముష్మికముల వలన, శాంతి మంగళవిధి బోధ సౌమ్యమూర్తి. శాంతి 4-364

2. కురుకుమారుఁడు, గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకులలో 87వ వాఁడు. ఇతఁడు ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున భీమునితోఁ బోరి రౌద్రకర్మయను తమ్మునితోడను దుర్విమోచనుఁడు అను అన్న తోడను మరణించెను. ఆది. 5-102; ద్రోణ. 4-142

**అభవము** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టువు లేనిది,

అమృతము నభవము నజరము. శాంతి. 6-18

**అభవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. పుట్టుక లేనివాఁడు.

ఈశానుఁడు నభవుఁడు నమృతుఁడు నైన శివుని. శాంతి. 6-458

**అభవ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

నిందితుఁడు, దుష్టుఁడు.

క. పరమ మునియగు నగస్త్యుఁడు, పరోపకారార్థకృతి నభవ్యుం డగునే. శాంతి. 3-296

**అభావము** సం. వి. అ. పుం.

1. లేకపోవుట, లేమి.

వ. కౌంతేయాగ్రజుండు సంతోషించి జీవనాభావంబైనచో క్షత్రియ కర్మానుష్ఠానంబునకు శక్తుండగు విప్రుం డెట్లు బ్రదుకు వాఁడని యడిగిన భీష్ముం డిట్లనియె. శాంతి. 2-348

2. నాశనము.

ఉత్సాహ : శో,కావిలత్వ ముడుపఁ బూని యధుగు ధెంచితిన్

సుతా, భావజనిత దుఃఖవార్ధి పారమెద్దియు పుత్రికా. స్త్రీ. 1-66

8. అనిత్యము.

వ. అనేక వాక్యంబుల నాత్మకు నభావంబు శరీరమునకు భావంబును గలుగమి దెలిపి. భీష్మ. 1-196

**అభావితము** సం. విశ. (అ. ఆ. అ)

భావింపఁబడనిది.

క. నీవట్టిఁడ వగు టెఱుఁగవు, భావంబున సంశయమును భయమును బాల్యఁ, బావేశింపఁగఁజేయ న,భావిత నిశ్చయుఁడ వగుటఁ బరమ మునీంద్రా. శాంతి. 6-289

**అభికాంక్షి** సం. విశ. (న్. ణీ. న్.)

కోరువాఁడు.

చ. ...జనమేజయుఁడన్ జనపాలుఁ డుత్తమ,స్తుతమతి దీర్ఘసత్త్రి మఱితుం డొనరించె శుభాభికాంక్షియై. ఆది. 1-82

**అభిఖ్య** సం. వి. అ. స్త్రీ.

నామము, పేరు.

తే. ఇంతయును మన్మయంబ యే నిరువదియు, నాల్గు నగు తత్త్వకోటికి నాథుడైన, పంచవింశకాభిఖ్యుండఁ బరమ పురుషుఁ డనియు నా పేరు మఱి పర మరయలేదు. శాంతి. 6-881

**అభిగతి** సం. వి. ఇ. స్త్రీ.

ప్రాప్తి.

తే. అఁకలేక యెవ్వాని జలాశయమున, మండువేసవి యందును మనుజకోటి, యవభృథస్నాన పానంబు లాచరించు, నతఁడు వొందఁడు విషమదుర్గాభిగతులు. అను. 2-886

**అభిగమనము** సం. వి. అ. న.

1 ఎదురుగాఁ బోవుట.

ఉ. ఆటఁబోయిన జనఁబుల వలన వైచిత్రవీర్యుండు పౌళికజనికి వచ్చు

చున్నాఁడని విని తదభిగమనోన్ముఖుండై (అజాత శత్రుండు) స్త్రీ 1-116

2. పోవుట.

వ. తీర్థాభిగమనంబున మహాభిష నాభాగ భరత భగీరథ ముచుకుంద మాంధాతృ సగర సార్వభౌమాష్టక రోమపాదుల యట్ల శత్రు జయంబును సర్వలోక సుఖంబులుఁ బడయుదురు. ఆర. 2-306

3 పొందు, సంభోగము.

అతిదూష్యంబగు పరదారాభి గమనంబు దగదు. అను. 2-172

**అభిగమించు** సం. స. క్రి.

పొందు, సంభోగించు.

వ. అపత్యార్థం బగస్త్యమహాముని లోపాముద్ర నభిగమించుటయు. ఆది. 1-88

**అభిగమ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁదగినవాఁడు, (పూజ్యుఁడను భావముతో ఇతరులు తన్ను సమీపించుటకుఁ దగినవాఁడు- పూజ్యుఁడు) సమీపింపఁదగినవాఁడు.

వ. కృష్ణుండు పాండవ కార్యార్థంబుగా మన యొద్దకు వచ్చుచున్న వాఁడు నేఁడు కుశస్థలంబున విడిసె. రేపిందులకు వచ్చునని వింటి మిట్టి యాశ్చర్యంబునుం గలదే సర్వలోకాభిగమ్యుఁడగు నమ్మహా మభావునకు మన మభిగమ్యులమైతిమి. మన కింతకంటెను బెంపె య్యది. ఉద్యో. 3-149

**అభిఘట్టనము** సం. వి. అ. న.

సంఘర్షణము, ఒరయిక.

చ. సరభసవృత్తిఁ బాండుసుత సైన్యము లొక్కట నేచినం గడుం, దిరమయి నీ బలంబులు నుదీర్ణత సూపిన జాహ్నవీసము,ద్ధర యమునాభిఘట్టనముతో నెనవచ్చె. ద్రోణ. 3-117

**అభిఘాతము** సం. వి. అ. పుం.

వ్రేటు.

భీముగదాభిఘాతంబున దుర్యోధనుండు తొడలు విఱిగి పడిన.
ఆది. 1-52

**అభిచారము** సం. వి. అ. పుం.

శత్రుహింసార్థమై చేయు కర్మము. (శ్యేనయాగాదికము) మారణ కర్మము, వంపకము.

వ. అకాల ఫల సంయోగంబునం బుణ్యలోకంబులు వడయుదు; రందు నసూయాభిచార దర్ప పైశున్య విగ్రహ క్రోధ మద మత్సర భయ సంతాప వ్యాధి ప్రజాక్షయేంద్రియక్షయంబులు లేవు. అర 3-387

**అభిజనము** సం. వి. అ. పుం.

కీర్తి, గౌరవము.

క. సుత్రామపుత్రుం డభిజన పాత్రుండు విచిత్రవీర్య పౌత్రుండు శుభచారిత్రుం డీ విజయుండు మత్పుత్త్రికి వరుఁడయ్యె పెట్టి పుణ్యోదయమో. ఆది. 7-288

**అభిజాత** సం. విణ. (అ. ఆ. అ.)

1 పుట్టినది.

తే. హీనవంశాభిజాత నైన పతి పత్నినగు నన్ను. విరా. 2-60

2. పూజ్యురాలు.

ఆ. యజ్ఞసేను కూఁతు నభిజాత నాతని యజ్ఞవేది నుదితయయినదాని, ననఘ విధి వివాహమయి పాండునందనుల్ మిగుల మిత్రబల సమృద్ధులయిరి. ఆది. 8-15

**అభిజాతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గొప్ప వంశమునందుఁ బుట్టినవాఁడు, పూజ్యుఁడు.

మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు నీయందైన సంబంధ మిం దభి రమ్యం బనురూప మిష్టము. ఆది. 8-52

**అభిజిత్తు** సం. వి. త్. పుం.

ఒకానొక నక్షత్రము- ఉత్తరాషాఢ చతుర్థ పాదము శ్రవణ ప్రథమ

పావమును గలిసి యేర్పడు నక్షత్రము. ఉత్తరాషాఢ తుదిని పదియేను గడియలును శ్రవణము మొదట నాలుగు గడియలును గలిసి యేర్పడు నక్షత్రము అని కొందఱు. దీనితో గలసి నక్షత్రము లిరువదియెన్మిది యగుచున్నవి. కొన్నివట్ల యీ నక్షత్రమునకును పరిగణనము గలదు.

ఈ నక్షత్రము రోహిణి చెంత నుండును. ఇది చంద్రున కందఱకంటె తానే ప్రియవల్లభ గావలెనని తలంచి తపమ్మునకుం బోయెను. ఆ స్థానమునం గుమారస్వామి నిజ భర్తలచేం బరిత్యజింపంబడినవారును దనకు మాతృసములు నగు అర్వురు కృత్తికలను నిల్పెను.

అను. 3-169; అర. 5-244

**అభిజ్ఞము** సం. విణ. (అ. ఆ. అ.)

బాగుగాం దెలిసినది.

క. విజ్ఞానానందరసా,భిజ్ఞ హృదయ కమల హంస. విరా. 3-238

**అభిజ్ఞానము** సం. వి. అ. న.

1. గుఱుతు.

వ. పాంచజన్య రవాభిజ్ఞానంబు సవిశేషంబుగా నతనిచేత వినికొని తత్కాలంబున నాలంబులోనికి నరదంబు గొనివచ్చెద ననియె.

ద్రోణ. 2-356

2. ఆనవాలు.

సీ. అద్దేవిం గని యతం డట్లు చెప్పిన మునివల్లభ నా కానవాలు దెమ్ము, నృపుపాల ననియె న న్నెలంత యుదంకుండు, సనుదెంచి విభు నభిజ్ఞాన మడిగె. అశ్వ. 3-95

3. నిదర్శనము.

వ. అట్లు నియోగుల కపటోపాయంబునం గాక మృతంబగుట సాభిజ్ఞానంబుగా నెఱింగించి. శాంతి. 2-366

**అభిజ్ఞుండు** సం. విణ. (అ. ఆ. అ.)

తెలిసినవాడు.

అఖిల ధర్మాభిజ్ఞుం డగు పరాశరాత్మజుండును.

**అభితప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి పరితపింపఁబడినది.

ఆ- భూతరాశి తొల్లిపుట్టి బుభుక్షాభితప్తమయిన. అర. 1-88

**అభితప్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి తపింపఁబడినవాఁడు.

ఆ. పుత్రశోకాభితప్తుఁడైన యతఁడు గనలి. ద్రోణ. 5-71

**అభితర్పణము** సం. వి. అ. న.

తృప్తి నొందించుట, తృప్తి.

క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభి తర్పణమున ని,త్యా
నూన వ్రతశీలుఁడ, కర్ణ. 3 359

**అభితర్పితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి తృప్తి నొందింపఁబడినది.

సీ. అనవరతాన్నదానాభితర్పిత మునివిప్రజనాళి పవిత్రమూర్తి.
ఆది. 5-84

**అభితాడితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

బాగుగాఁ గొట్టబడినవాఁడు.

వ. అట్లవ్వీరుండు విరథుం డగుటయుం దఱిమి యద్దనుజుండు గదాం
తర పాతాభితాడితుం జేసిన. ద్రోణ. 5-228

**అభిదారణము** సం. వి. అ. న.

చీల్చుట, వ్రచ్చుట.

ఉ. ఘోరగదాభిదారణ విఘూర్ణిత శాత్రవ కుంభి కుంభముల్.
(గదా విదారణ అని కొన్ని ప్రతులు) అర. 6-187

**అభిధాన** సం. విణ. (అ. ఆ. అ.)

పేరు గలది.

వ. పంచశిఖుం డను మునివరుండు మహిం దిరుగుచుండి మిథిలకుం

జనుదెంచె నతండు కపిలాభిధానయగు గురుకుటుంబిని చన్ను
గుడిచి పెరిగిన వాఁడగుటం గాపిలేయుండు ననంబరఁగు.
శాంతి. 4-342

**అభిధానకము** సం. విశే. (అ. ఆ. అ.)

పేరు గలది.

పార్వత్యభిధానక మాధుర్యధుర్య. అశ్వ. 1-1

**అభిధానము** సం. వి. అ. న.

నామము పేరు.

వ. నేను సైరంధ్రీజాత సంభూత- నభిధానంబు మాలిని.
విరా. 1-318

**అభినందనము** సం. వి. అ. పుం.

పొగడ్త, ప్రశంస.

తే. లీల మూరిఁబో నచ్చరలేమపిండు, బలసి యభినందనము సేయఁ
బొలిచె. శాంతి. 3-338

**అభినందించు** సం. స. క్రి.

1. పొగడు, ప్రశంసించు.

క. ధనదారాదికముల నెవ్వనికిని రక్షించికొనఁగ వసమే రక్షా, ఘనుఁ
డగు పతి గల్గినఁగా, కనఁడే శుక్రుండు సుమతు లభినందింపన్.
శాంతి. 2-191

క. కొందఱు కర్మకరణ మభినందింతురు వారలకు జనన మరణ
ములం బొందక పోరాదు. శాంతి. 5-126

అ. క్రి.

2. సంతోషించు.

వ. ...పాకశాసనుం డతని వివేకపాకంబున కచ్చెరువొంది యభి
నందించి యతని కిట్లనియె. శాంతి. 4-448

**అభినందితము** సం. విశే. (అ. ఆ. అ.)

అభినందింపఁబడినది,

సీ. దివస ముఖాభినందిత చక్రయుగ్మకం,బుల యనురాగంపుఁ బ్రోవ
నంగ. విరా. 2-241; ఆది. 8-6

**అభినందితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

అభినందింపఁబడినవాఁడు.

వ. ఇట్లు పురంబు వెడలి యతండు కురుపతి కడ కేతెంచి ప్రీతుండగు
నతనిచేత నభినందితుండై లోకంబు నవలోకించి.
ద్రోణ. 1-27, అశ్వ. 8-165

**అభినంద్య** సం. విశే. (అ. ఆ అ.)

అభినందింపఁదగినది.

క. ...నీ, నందనులయందుఁ బౌత్త్రుల,యందును నభినంద్యవగుము
యని దీవించెన్. ఆది. 8-6

**అభినంద్యము** సం. విశే. (అ. ఆ. అ.)

అభినందింపఁదగినది.

తే. తప మనంగ వేఱొండె ధర్మాభినంద్య హృదయ. అను. 4-84

**అభినయము** సం. వి. అ. పుం.

తనయొక్కగాని యితరులయొక్కగాని భావములను దెలుపు శరీర చేష్టా
విశేషము. ఇది నాలుగు విధములు. 1. ఆహార్యము- భూషణాదులచేఁ
గలిగినది. 2. వాచికము- వాక్కుచేఁ గలిగినది. 3. ఆంగికము- అంగము
చేతఁ గలిగినది. 4 సాత్త్వికము సత్త్వముచేతఁ గలిగినది.

క. విశ్రుత వాద్యంబులు మఋజుశ్రుతి సంభావ్య గీత సుగతులు
సద్భావాశ్రయములఁ దజ్జన్యరసాశ్రయములునైన యభినయంబు
లెఱుఁగుదున్. విరా. 1-241

**అభినవము** సం. విశే. (అ. ఆ. అ.)

క్రొత్తది.

సీ. కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి తనువున నలఁదుదు నమవు
గాఁగ. విరా. 1-107

**అభినిరతము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ఆసక్తిగొన్నది.

ఉ. దయాభినిరతస్థితి నీవు... సర్పయాగ ముడిగింపుము
ఆది. 2-280

**అభినుతము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁబడినది,

తే. బంధుజనుల, నందఱను తత్తదౌచిత్య మభినుతము గ, నాదరించి.
అశ్వ. 3-18

**అభినుతి** సం. వి. ఇ. స్త్రీ.

స్తుతి, పొగడ్త.

సీ. ...మనసు నిందాభినుతులు, హింసయు నాత్మ ప్రశంసయు లేవు.
శాంతి. 5-228

**అభిన్నము** సం. విణ. (అ. ఆ. అ.)

వేఱుగానిది, ఏకరూపము గలది

క. ...అఖిల జన,దభిన్న రూపునకు భావనాతీతునకున్. విరా. 1-83

**అభిపన్నము** సం. విణ. (అ. ఆ. అ)

పొందినది

తే. ఒదవు వృత్రు రక్తమున బుద్బుదము లెసఁగి, పుట్టకొక్కులై
యవి జనభోజ్య భావ, మొంది విప్రాదిక ద్విజయోగ్యతాభి,పన్న
ములు గావు ధర్మ సంపన్న చరిత. శాంతి. 5-488

**అభిపూజితము** సం. విణ. (అ. ఆ. అ)

లెస్సగాఁ బూజింపఁబడినది.

క. భూపాలక వల్లభాభిపూజిత చరణా. స్త్రీ. 1-173

**అభిపూజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

లెస్సగాఁ బూజింపఁబడినవాఁడు.

వ. వచ్చి యభిపూజితుండై సమున్నతాసనంబున నున్న యమ్మహా
 త్మునితో నిట్లనుండు. శాంతి. 5-408

**అభిప్రాయము** సం. వి. అ. పుం.

తలంపు, ఉద్దేశము.

నా యభిప్రాయంబు వినుము. కర్ణ. 1-252

2. తాత్పర్యము, భావము

వ. పాండవాగ్రజా నీ మనంబున నెక్కొలుపు మిక్కటపు యభిప్రా
 యంబు. అను. 1-83

3. వృత్తాంతము.

వ. నాకు ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయ బు
 విన నభిలాష పెద్దయై యుండు. ఆది 1-11

4. సమ్మతము, ఇష్టము.

క. మా యందు లేని గుణములు, మీ యనురాగమునఁ జేసి మిగిలి
 వెలింగెన్, మీ యనుగతి మాకు నభిప్రాయము వనవాస భర
 మోపుదురే. అర. 1-4

**అభిభవము** సం. వి. అ. పుం.

పరాభవము, అనుమానము.

తే. ఏను (సిరి) వచ్చుటగోరి కాదే తపంబు, లాచరింతురు నన్నిట్టు
 లభిభవించు, టుఱవె మీ కన్న నధ్రువ మొల్లమనుట, యభిభవమె
 నీకుఁ బోలిన యచటి కరుగు.

క. అని గోవులు పలికిన సిరి, విని మీచే నిట్లు పరిభవింపఁగఁబడియేఁ,
 జనినను నెవ్వరునున్ గైకొనరు శరణ మడుగు వేఁడికొనియెద
 మిమ్మున్. అను. 8-114,115

**అనుభవించు** సం. స. క్రి.

పరిభవించు, అవమానించు. చూ. అనుభవము. అను. 8—114, 115

తే. పరఁగ నమ్మధుకైటభాసురుల సుతుఁడు, సుత్రౌ ధరణీశ ధుంధు

డన కూరవరుఁడు, వాఁడు వరగర్వమునఁ జేసి వాఁడి మిగిలి, యమరపతిఁ దొట్టి వేల్పుల నభిభవించు. అర. 4-401

**అభిభాషణము** సం. వి. అ. న.

వచనము, సంభాషణము.

ఆ. అగ్ని దేవుఁ డనృతంబునకు విప్ర, శాపమునకు వెఱచి శాప భయము, దీర్చుకొనఁగఁ బోలుఁ దీర్పరా దనృతాభిభాషణమున నైన పాప భయము. ఆది. 1-129

**అభిభూత** సం. విశే. (అ. ఆ. అ.)

పొందఁబడినది.

ఆ. ఇంతకాల మేది యెఱుఁగక సంగాభి,భూత యగుచు నప్రబోధ, కలితయైన ప్రకృతియేనంటె నిస్సంగ, బోధ మహిమ గానఁ బోల దయ్యె. శాంతి. 6-49

**అభిభూతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. వంచింపఁ బడినవాఁడు, అవమానింపఁ బడినవాఁడు.

వ. ధర్మతనయుండు పితామహులో ధన తృష్ణాభిభూతుండగు పురుషుం డేమిట సుఖి యగు, శాంతి. 4-39

2. ఆక్రాంతుఁడు

వ శివుఁడు దపంబు సేయఁ దదీయ సంవిత్సౌఖ్యం బనుభవించి యయ్యనలంబు గడచి యరుగుచుండ నేను ప బధి శ్రమాభిభూతుండ నగుచు విడువక వెనుకఁ బోవుచుండితి. అను. 1-356

**అభిమంత్రించు** సం. స. క్రి.

మంత్రముచే సంస్కరించు.

వ. దానిం బుచ్చికొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథున కిచ్చి యీ ఫలంబువలన నీ కొక్క పుత్రుండుద్భవిల్లునని చెప్పిన. సభా. 1-148

**అభిమంత్రితము** సం. విశే. (అ. ఆ. అ.)

మంత్రముచే సంస్కరింపఁబడినది.

వ. తేజోమయ బయిన మార్గణంబు పర్జన్య మంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబు గాఁడ నేసిన భాసురచ్ఛాయంబగు తోయంబు ధారారూపంబున దివ్యగంధరసోపేతంబయి యెగసిన.
భీష్మ. 3-429

**అభిమతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సమ్మతము, ఒప్పుకొనఁబడినది.

ఆ. నాకుఁ జూడ మత్స్య నరపతి సద్ధర్మ,వర్తి... యతని పాల నందఱుఁ దగ,వైన పనుల నిలుచు టభిమతంబు. విరా. 1-64

**అభిమతార్థము** సం. వి. అ. పుం.

కోరఁబడిన వస్తువు.

వ. కవిగాయక ప్రముఖ నిఖిల విద్వజ్జనంబులు పాఠకవాంశిక వైణికాది వినోద పాత్రంబులు నప్పరమేశ్వరుం గానవచ్చి ప్రొద్దుపుచ్చి యభిమతార్థంబు వడసి చనిరి ఉద్యో. 3-282

**అభిమన్యుఁడు** సం. వి. ఉ. పుం.

శ్రీకృష్ణుని చెల్లెలగు సుభద్రకును పాండురాజ పుత్రుఁడగు అర్జునునకును కుమారుఁడు.

భయములేనివాఁడును క్రోధముగలవాఁడును నగుటచే నితనికి అభిమన్యుఁడని పేరు వచ్చెను.

శ్లో. అభీశ్చమన్యు మాంశ్చైవ తత స్తమరిమర్దనమ్
అభిమన్యురితి ప్రాహురార్జునిం పురుషర్షభమ్.
సం. భా. ఆది. 247-68

వయోనిర్ణయము: అభిమన్యుని వయస్సు ఇంత యని నిర్కర్షగా వచించుటకు ఆంధ్రభారతమున నాధారము లేనియు గానరావు సంస్కృత భారతమున ఆదిపర్వము 6 వ అధ్యాయమున అభిమన్యుని జననము గుఱించి చెప్పు సందర్భమున చంద్రుఁడు సురలతోఁ దన పుత్రుండైన వర్చుఁడు భూలోకమున దేవహితార్థ మర్జునుని కడుపున జన్మించుననియు నతనికిఁ బదాఱవ యేట యుద్ధము జరుగుననియు నా యుద్ధమున ససమాన ప్రతాపంబు వెలిబుచ్చి దుష్టసంహారం బొనరించి

యసువుల వదలుననియుఁ జెప్పెను. దీనిని బట్టి చూడ అభిమన్యుని యాయుర్దాయము పదాఱు వత్సరములని స్పష్టపడుచున్నది.

అభిమన్యునకుఁ బదాఱు సంవత్సరములే యాయుఃపరిమితియైన యెడల వనవాసాజ్ఞాతవాసములు పదుమూఁడేండ్లును అజ్ఞాతవాసానంతరము యుద్ధారంభమునకు నాఱు మాసములును గడవఁగా వనవాసారంభమునకు ముందు నభిమన్యునకు రెండు సంవత్సరముల యాఱుమాసముల వయస్సే యుండవలయును, తరువాతనే యుపనయనాదులు జరిగియుండవలెను, అర్జునుఁడు ధనుర్విద్యయు వనవాసమునందే నేర్పియుండవలయును. కామ్యకవనమునందుఁ గొన్ని నెలలున్న వెంటనే సుభద్రాభిమన్యులను కృష్ణుఁడు వెంట కొనిపోయెను, కావున పవవాసమునందు ధౌమ్యుచేఁ జౌలోపనయనాదులు కావింపఁబడుట అర్జునునిచే ధనుర్విద్య నేర్పఁబడి 'ప్రవీర వైరి పతాకినీ భేద మార్గములెల్ల నభేద్య విక్రమ సంపదన్' (ఆది. 8-227) నేర్చుట పొసంగనేరదు. అదియునుగాక ప్రతివింధ్యాదులు అభిమన్యుని జననానంతరము పుట్టినటులఁ గలరు. (ఆది. 8-228) ద్యూత సమయమునఁ గుమారులు గలరు. వారు నీతివిక్రమ స్థిరులని ద్రౌపది వాకొన్నది. (ఉ. 8-108) వారును యుద్ధమునందుఁ బాల్గొనిరి. అభిమన్యునకుఁ బదాఱేం డ్లంగీకరించుచో ద్రౌపది యైదవ కొడుకునకుఁ బదేండ్ల వయస్సు నంగీకరింపవలెను. అతఁడు యుద్ధము చేసియుండెగావున నదియుఁ బొసంగదు. వనవాసమునందు బ్రహ్మచర్య నిష్ఠులగు పాండవులకు సంతానము గలుగుటయుఁ జెప్పరాదు. (ఒక్క కారణంబున నుద్ధతులగు విరోధుల చేతం బతుల సన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబున కరిగి వ్రతంబుమై వల్కలసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడువుచు బ్రహ్మచర్యంబు నడపితి (విరా. 1-313). శ్రీమద్రామాయణమునందుఁ గౌసల్య శ్రీరాముని వయస్సు గుఱించి చెప్పుచు ఉపనయనమును ప్రధానముగాఁ జేసి చెప్పినట్లు ఇచ్చటను ద్విజత్వారంభమునుండి పదునాఱు సంవత్సరములని గ్రహించుచో నొకవిధముగా సరిపడును. లేనిచో నాయా సందర్భములంగల కథలఁ జూడ నిది పొసఁగుట లేదు. అభిమన్యుఁడు సర్వధనుర్విద్యా కోవిదుఁడైన పిదప ఖాండవ దహన మర్జునునిచే జరిగినట్లున్నది. (ఆది. 8-227, 228) అట్లైన నా సమ

యమున నభిమన్యుని వయస్సు 18, 14 సంవత్సరములైన నైయుండ వలయును. మఱేమన ఉపనయనము కాని ధనుర్వేదాభ్యసనము జరుగదు. అస్త్రమంత్రము లభ్యసింపరాదు. క్షత్రియుల యుపనయన వయస్సు 11 వ సంవత్సరము.

శ్లో. గర్భాష్టమేబ్దే కుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనమ్
గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తుద్వాదశే విశః (మనుస్మృతి)

ఖాండవ దహనానంతరము మయసభ నిర్మించుటకు పదునాల్గు నెలలు పట్టినవి. పిదప రాజసూయము జరిగినది. తర్వాత నరణ్యావాసము, ఇవన్నియు జరుగుటకు ఖాండవ దహనము నుండి మూఁడు సంవత్సరముల కాలమైన పట్టక తప్పదు. అరణ్యవాసము పదిరెండు సంవత్సరములు. అజ్ఞాతవాసము సంవత్సరము. పిదప యుద్ధమాఱు నెలలకుఁ బ్రారంభము. ఇవన్నియుఁ జూడ నభిమన్యుఁడు యుద్ధకాలము నాఁటికి 30-31 సంవత్సరములవాఁడై యుండక తప్పదు.

ఖాండవ దహనమునకుఁ బూర్వమే అభిమన్యుఁడు చౌలోపనయనాదుల నొంది శస్త్రాస్త్రకోవిదుఁడయ్యెనని చెప్పిన వాదము త్రోసివేయుటమా అట్లైన అభిమన్యున కివన్నియుఁ బాండవులు తొలుత కామ్యక వనము వదలు నప్పటికి జరిగి యుండవలెను. అచ్చట కృష్ణుఁడు వచ్చి సుభద్రార్జునులఁ దీసికొని వెళ్ళినటులఁ గలదు. అభిమన్యుఁడు తండ్రి యొద్దనే ధనుర్విద్య నేర్చినట్లుండుటచే నాపైన నది పొసఁగదు. తొలుతఁ బాండవులు కామ్యక వనంబునందుఁ గొన్ని నెలలే యున్నటుల ధర్మరాజు ద్వైత వనమున కరుగుచుఁ జెప్పిన కార్యముల వలనఁ దెలియుచున్నది. అట్టిచో నభిమన్యుఁడా కాలమునకైనను పదునాల్గేండ్ల వయస్సు గలిగి యుండవలెను. అంతమాత్రము లేనిది విద్యాకోవిదత్వమబ్బదు. పైగా ధర్మరాజాదులు అద్వైత వనమున నున్న కొంత కాలమునకు బలరామకృష్ణ సాత్యకులు వచ్చిరి. అప్పుడు సాత్యకి "కేకయ సృంజయ పాంచాలవృష్ణి భోజాంధక వీరులుం గృష్ణాను మతులయి యుద్ధంబున ధృతరాష్ట్ర పుత్రులను భీష్మద్రోణ కర్ణాదులను వధియింతురు. ధర్మరాజు దమ్ములుం దానును సమయాబ్దంబులు సలిపి రాజ్యాభిషిక్తుండగు నంతకు నతిరథు నభిమన్యు నఖిలరాజ్య రక్షకుం జేసియుండుదము" (అర. 8-168) అనెను.

అతిరథుఁడయిన అభిమన్యుడప్పటి కెంత వయస్సువాఁడై యుండవలెనో. అట్లు చూచినను యుద్ధము నాఁటికి అభిమన్యుని వయస్సు 27, 28 సంవత్సరముల కే మాత్రము తక్కువ యుండదు. ధర్మరాజాదులు 72 సంవత్సరముల వారగుటచే వారికి ముప్పదేండ్ల యభిమన్యుఁడు బాలుఁడుగాక మతెవరగును ? ఏబదియైదేండ్లు నిండిన సహదేవుఁడు కుంతికి కడు పసిబిడ్డగాఁ గనఁబడెఁగదా. (విరా. 2-213.)

సంస్కృత భారతమునఁ జెప్పఁబడిన పదాఱు సంవత్సరముల గుఱించిన కథ యాంధ్రభారతమునఁ గానరాదు. అందుచే నది ప్రక్షిప్తమనియో లేక యగ్రాహ్యమనియో నన్నయభట్టారకుఁడు త్రోసివేసెనేమో యెఱుంగరాదు.

**అభిమానము** సం. వి. అ. పుం.

1. ధనబల కులాధికారాదుల వలనఁ గలుగు దర్పము, గర్వము.

చ. ...వృథాభిమాన దుర్మద బహుభాషియైన కురురాజె చటం జనుచున్నవాఁడొకో. విరా. 4-245

2. ఆత్మ గౌరవము.

చ. ...భీష్ముఁ బ్రధనంబున నాతఁడు సంపఁ గౌరవుల్ మసరని తోఁచె నాకు నభిమానముఁ గాచుటకై పెనంగెదన్. ద్రోణ. 5-28

3. మమత, మమకారము, నాదియను భావము.

క. ఆరయ నధ్యాత్మ మహంకారం బధిభూత నామకం బభిమానం, బారూఢయశః పరమోదారా యద్రఁ డధిదైవతంబన నెగడున్. శాంతి. 6-98

**అభిమాని** సం. విశే. (న్. సీ. న్)

1 అభిమానము గలవాఁడు, గర్వి.

కీచకాగ్రజుండును రూపాభిమానియు. విరా. 2-22

2. మమకారము గలవాఁడు, ప్రేమ గలవాఁడు.

తే. వినుము దేహాభిమానికి వీనినెల్లఁ, దొలఁగ దొరకొన నెంత శాంతు నకునైన. శాంతి. 4-284

**అభిముఖము** సం. విశే. (అ. ఆ. ఈ. ఉ.)

(ముఖము స్వాంగము కానప్పుడు స్త్రీలింగ మాకారాంతమే యగును)

1. ఎదురు ముఖము గలది.

వ. సమస్త జనంబులుం దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియ డిగ్గి. విరా 1-187

2. ఎదురు.

వ. విరాట కన్యకల యాటం జూచు చందంబున నందుం బురందర నందనుం గనుంగొను నప్పాంచాలి నాలోకించి యతండునుం దారును దదభిముఖంబుగా వచ్చి యక్కన్నియ లిట్లనిరి. సభా. 3-48

**అభిముఖి** సం. విశే. (అ. ఈ. అ.)

ఎదురుగా నిల్చునది.

క. పురుహూతున కభిముఖియై, కరములు మోడ్చుటయు నతఁడు గారవమున. శాంతి. 5-7

**అభిముఖుఁడు** సం. విశే. (అ. ఆ, ఈ. ఉ.)

ఎదురుగా నిల్చునది.

క. పురుహూతున కభిముఖియై, కరములు మోడ్చుటయు నతఁడు గారవమున. శాంతి. 5-7

**అభిముఖుడు** సం. విశే. (అ. ఆ. ఈ. అ.)

(ముఖము స్వాంగము కానప్పుడు స్త్రీలింగ మాకారాంతమే యగును)

1. ఎదురు మొగమైనవాఁడు, సమ్ముఖుఁడు.

వ. వారల కభిముఖులై పాండునందను లందఱు నిట్లనిరి. విరా. 1-178

2. ప్రసన్నుఁడు.

వ. నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి. ఉద్యో. 1-280

3. అనుకూలుఁడు (వ్యతి. విముఖుఁడు)

క. ద్యూతార్థము తత్కృతవ్యాహూతుఁడనై జూద మాడకుండుట ధర్మాపేతం బని యభిముఖుఁడై, యాతనితో నలుఁడు జూద మాడఁ గడంగెన్. అర. 2-59

**అభియాతి** సం. వి. ఇ. పుం.

శత్రువు.

చ. పలువురు రాజులం దునిమె బల్లిదు, డాతఁడు పిన్న పాపఁడే,
యలుగుల పాలు సేయ *నభియాతులు పువ్వుల కోల సాఁతురే.

ద్రోణ. 2-149

**అభియుక్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. కూడిక, పొందిక, కల్గియుండుట.

వ. దుర్యోధనుఁడు విచారాభియుక్తి నున్న యవసరమున. కర్ణ. 1-213

2. ప్రాప్తి.

అభిజిత్తునందు విద్యాభియుక్తి. అను. 3-169

**అభియోగ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

మిక్కిలి యుక్తమైనవాఁడు

సత్త్వరితాభియోగ్యు. ఆది. 1-9

**అభిరక్ష** సం. వి. ఆ. స్త్రీ.

అభిరక్షణము.

ఆ. ...ధర్మచరణ వేది,యై ప్రజాభిరక్ష యధ్వర కరణంబు, వలను మెఱసి నడపవలయు నధిప. అను. 4-124

**అభిరక్షణము** సం. వి. అ. న.

పూర్ణముగా రక్షించుట.

ఆ. ఆదిదేవుఁడైన యవ్విష్ణుఁ డఖిల లోకాభిరక్షణార్థమై జనించి.

ద్రోణ. 5-408

**అభిరక్షితము** సం. విశ. (అ. ఆ. అ.)

పూర్ణముగా రక్షింపఁబడినది.

భీమాభిరక్షితం బగు నబ్బలంబు. భీష్మ. 1-174

**అభిరక్షితుఁడు** సం., విణ. (అ. ఆ. అ.)

పూర్ణముగాఁ గాపాడబడినది..

వ. ధృతరాష్ట్ర పాండు విదురులు భీష్మాభిరక్షితులై. ఆది. 5-2

**అభిరక్ష్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పూర్ణముగాఁ గాపాడఁదగినది.

క. భవదభిరక్ష్యము లగు నీ, భువనంబుల యందు సర్వములు ద్రిమ్మరుటన్, దివిజాధిప నీ కెఱిఁగింపవలసె నీ యాజ్ఞ నాకుఁ బడయఁగ వలసెన్. ఆది 2-117

**అభిరతి** సం. వి. ఇ. (స్త్రీ).

మిక్కిలి ఆసక్తి.

సీ. ...ఇంద్రియముల పొందును విషయాభిరతియుఁ బరిహృతంబులు. శాంతి. 4-242

**అభిరతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అత్యంతాసక్తి గలవాఁడు.

తాండవాభిరతుఁ డగు. భీష్మ. 2-318

**అభిరామ** సం. విణ. (అ. ఆ. అ.)

మనోహరమైనది.

సీ. ...శోభనాలంకరణమున నభిరామయైన పాంచాలి. శాంతి. 1-374

అభిరామము సం. విణ. (అ. ఆ. అ.)

1. అందము, సుందరము.

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁగూడదు. విరా. 1-123

2. మనోహరము, ఇంపయినది.

క. అభినందించిరి దేవప్రభుఁడును నారదుఁడు నపుడు పవనంబున్ను

సౌ.గభసుఖ సంస్పర్శంబుల, నభిరామంబగుచు వీచె నల్లన యచట న్. శాంతి. 5-14

**అభిరాముఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

మనోహరమైనవాఁడు, ఒప్పుచున్నవాఁడు.

ఉ. ...అర్కుం డభిరాముఁడై పొడవుఁ గొండవయిన్ వెలుఁగొందెఁ జూడగన్. శల్య. 1-114

**అభిరూక్షము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి కరకైనది, అతికఠినమైనది.

క. ...ధర్మాత్మజుండు ప్రాకృత జనున, ట్లభిరూక్షతలంబున ని,ట్లభి భూతుం డగునె నిద్ర నతిఖిన్నుండై. ఆది. 6-178

**అభిరూపము** సం. విశే. (అ. ఆ. అ.)

అనురూపము, తగినది.

సీ. ...ఆ, రూఢ యౌవను నభిరూపతేజు, అర. 6-195

**అభిలషణము** సం. వి. అ. న.

కోరిక, ఇచ్ఛ.

సీ విషయోపభోగాభిలషణ మింకను నాకు, వదలక పెరుగుచున్న దియు. ఆది. 8-95

**అభిలషితము** సం. విశే. (అ. ఆ. అ.)

కోరఁబడినది.

ఆ. బ్రాహ్మణాభిలషితదాయి వగుట మేలు. ఆశ్వ. 4-187

**అభిలాష** సం. వి. అ. పుం.

కోరిక.

తే. అఖిల జనులకు పరమపదాభిలాష, వృత్తి సామాన్య. అను. 8-317

**అభిలాషము** సం. వి. అ. పుం.

కోరిక.

తన యభిలాషంబు తేటపడం బలికిన. విరా. 2-48

**అభిలాషి** సం. విణ. (న్. ఈ. న్.)

అభిలషించువాఁడు.

క. తాపసవరతీవ్రంబగు, పాపాగ్ని జ్వాలచయము పాలుపడి పరీ, తాపము నొందుచు ధర్మ, వ్యాపార జలాభిలాషినై యున్నాఁడన్. శాంతి. 3-354

**అభిలీఢము** సం. విణ. (అ. ఆ. అ.)

పూర్తిగాఁ దినబడినది, పూర్తిగా గ్రహింపఁబడినది.

వార్ధకాభిలీఢమైన మదీయ కాయమునకు. ఆశ్వ. 1-27

**అభివందనము** సం. వి. అ. న.

ప్రణామము, నమస్కారము.

క. అనవుడు నట్టుల చేసెద,మని వారలు భక్తియుక్తి నతనికి నభివం,దన మొనరించినఁ దగు దీ,వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. విరా. 1-144

**అభివంద్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

నమస్కరింపఁ దగినవాఁడు.

తే. ...సన్న్యాసకోవిదులును, దనకు నభివంద్యు లగుట యతండు సెప్పె. అను. 3-328

**అభివర్ణనము** సం. వి. అ. న.

పొగడుట.

క. నీ దానంబున విస్మితులై దైవత యక్షసిద్ధు లభివర్ణన మ,త్యాదరమునఁ జేసెదరు. ఆశ్వ. 4-240

**అభివర్ణించు** సం. స. క్రి.

1. వివరించు, తెలుపు.

క. వర్ణాశ్రమ ధర్మము లభి,వర్ణింపుము వేద నిరత వత్సల యని వా,

కర్ణములతో నఖిల జన, కర్ణంబులఁ బొంది పుణ్యకర్తృత యొసఁ
గున్. ఆను. 4-446

2. పొగడు, స్తుతించు.

క. ...అగ్రాహ్యాకారుండయి వెలుఁగు దయాకరు నప్పద్మనాభు నభి
వర్ణింతున్. శాంతి. 4-327

**అభివర్ణితము** సం. విణ. (అ. ఆ. అ.)

అభివర్ణింపఁబడినది.

**వ.** భవదీయ రాజ్యలక్ష్మి మధురభంగియయ్యును నధములగు వాని
యుక్తుల వలనం జోరజనసంవృతంబైన కావేరియుంబోలె నుప
యోగ్యగాకునికి యెఱింగి నీ కెఱిఁగించుటకై మిథ్యాభివర్ణితం
బైన కాకంబు నెపంబిడి జొచ్చితి శాంతి. 2-366

**అభివర్ణ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది.

ధర్మములందెల్లను నభివర్ణ్యము లవి, శాంతి. 5-544

**అభివర్ధనము** సం. వి. అ. న.

అభ్యుదయము, వృద్ధి.

క. ధరణి నధార్మికులగు కాపురుషుల కభివర్ధనంబుఁ బుణ్యచరిత్రం,
బరఁగెడు ధార్మికులకు దుర్ధరమగునవి వర్ధనంబుఁ దగునె
మునీంద్రా ఆర. 2-307

**అభివర్ధిత** సం. విణ. (అ. ఆ. అ.)

పెంపఁబడినది.

వ. ఏము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల మిదియును మాచే
నభివర్ధిత యగుటంజేసి హృదయానందనియైన కూఁతు రని కణ్వ
మహాముని యమ్మమలకుం జెప్పిన. ఆది. 4-50

**అభివాంఛితము** సం. వి. అ. న.

కోరిక.

క. ...అనిం,దిత చరిత నీకు నభివాం,ఛిత మెయ్యది దానిఁ జెపుము
చేయుదు ననినన్. ఆది. 1-109

**అభివాదనము** సం. వి. అ. పుం.

తన గోత్రనామములు చెప్పి పాదములకు నమస్కరించుట, అభివాదము.

వ. అమ్మహాదేవిం గాంచి కానీనుండు సంభ్రమ వినయంబులతోడం
జేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాద
నంబు నేసి. ఉద్యో. 4-58

**అభివాద్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అభివాదనము చేయఁదగినవాఁడు, నమస్కరింపఁ దగినవాఁడు.

శచీపతి ముఖ్యానిమిషాభివాద్య. శల్య. 2-420

**అభివిష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

కలిగినది.

చ. దురితము నేసి తాపమునఁ దూలిన నింకిటు నేయ నమ్మతిం, బొర
సిన ధర్మసంచరణ బుద్ధియ మేలని యూఁదినం గ్రియాపరుఁ
డయి మేలు నేసినను బాదము పాదముగాఁ గ్రమంబునన్, విరియు
సమస్తముం దదభివిష్ట కళంకము నిర్భయంబుగన్, శాంతి.3-368

**అభివీక్షించు** సం. స. క్రి.

చూచు.

తే. అతని నట్లుఁడనిమ్ము నా యనుజ తను జ; మిత్రజనములఁ
బాంచాలపుత్త్రి నా కవశ్యమును నభివీక్షింప వలయుఁ జూపఁ.
బనుపు వారల యున్నెడ భవ్యచరిత. స్వర్గ. 11

**అభివీక్ష్యమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చూడఁబడుచున్నవాఁడు.

సీ. .. కడు వేడ్కతోఁ దన్నుఁ, జూచు ఖేచరసిద్ధసురభుజంగ, గరుడ
గంధర్వకిన్నరకామినులచేత, మానుగా నభివీక్ష్యమానుఁ డగుచు
అర. 4-312

**అభివృద్ధి** సం. వి. ఇ. స్త్రీ.

పెంపు.

ఉ ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁజేసెదం, గాన. ఉద్యో. 1–187

**అభివ్యక్తము** సం. విశ. (అ. ఆ. అ.)

స్పష్టమైనది. తెల్లనైనది.

వ. కావుననే తత్స్వరూపం బభివ్యక్తంబుగా వివరింపవలసియుండు. స్త్రీ. 1–52

**అభివ్యక్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

తెల్లమగువాఁడు, తెలుపఁబడువాఁడు.

మాలిని. అకలుష హృదయాభివ్యక్త సర్వోపయుక్తా. సౌప్తి. 2–135

**అభివ్యాపించు** సం. స. క్రి.

వ్యాపించు, ఆక్రమించు.

వ. ...ఇంద్రానుజుండవై త్రివిక్రమంబులం ద్రిజగంబుల నభివ్యాపించిన విశ్వరూప ధరుఁడవు. అర. 1–127

శ్లో. శిశుర్భూత్వా దివం ఖం చ పృథివీం చ పరంతప,
త్రిభిర్విక్రమణైః కృష్ణక్రాంతవానసి తేజసా.
సం. భా. అర. 12–26

**అభిశంకిని** సం. విశ. (న్. నీ. న్)

ఆధిక్షేపించునది, నిందించునది.

వ అని విధాతృని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి ధర్మరాజిట్లనియె నాస్తికుల యట్లు ధర్మాభిశంకినివై దైవదూషణంబు సేసెదు. అర. 1–228

**అభిశోభి** సం. విశ.

మిగులఁ బ్రకాశించునది.

తే. అతనిపై మకరంద ధారాభిశోభి, కుసుమ వర్షంబు పెల్లుగఁ

గురిసె నధిప. అశ్వ. 4-216

**అభిశోభితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశ మొందినది.

వ. వారణావతంబు... వన జన కేళీ కందుక మృగయాది వివిధ విహార హారి ప్రదేశాభిశోభితము. ఆది. 6-132

**అభిశోభితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశ మొందినవాఁడు.

సీ. లోకజ్ఞు నుభయ భాషా కావ్యరచనాభి,శోభితు... నన్నపార్యుఁ జూచి. ఆది. 1-9

**అభిశ్రావ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

వినఁదగినది.

మాలిని. సుమహాదుపనిషత్ప్రస్తుత్యభిశ్రావ్యసేవ్యా. మహా. 79

**అభిషిక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

పట్టాభిషేకము చేయఁబడినది.

అ. ...అంతం బోక కురుదేశ రాజ్యాభి,షిక్తమైన యతని శిరము దన్నె. సౌప్తి. 1-27

**అభిషిక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పట్టాభిషేకము చేయఁబడినవాఁడు.

తే. ముస్న చనుదెంచి ప్రీతిమై నున్నయట్టి, దుశ్శలకుఁ బెంపు గలుగఁ దత్పుత్త్రిపుత్త్రి, సింధుదేశంబునకు నభిషిక్తుఁజేసె, దోహ లమున నజాతశత్రుఁడు నరేంద్ర. అశ్వ. 4-210

2. స్నానము చేసినవాఁడు.

వ. ...ఆకౌశిక హ్రదంబున నంతఱు నభిషిక్తులై. అర. 8-118

**అభిషేకము** సం. వి. అ. పుం.

పట్టాభిషేకము, ఒకనిని ఒక దేశమునకుఁగాని ఒక సేనకుఁగాని ఒక మహాకార్యమునకుఁగాని అధిపతిగాఁ జేయునపుడు చేయించు స్నానము.

తే. అంగరాజ్యాభిషేకార్థమైన శిరముఁ దడవె వెండియు హార్షాశ్రు తతుల నొప్ప. ఆది. 6-58

వ. అట్టివానికి వాహినీ నాయకత్వం బిచ్చి యభిషేకింపవలయు. ఉద్యో. 4-96

వ. అప్పు డద్దేవునకు దేవతలు విభవం బెసఁగఁ బురహాసనంబునకయి యభిషేకంబు సేసి. కర్ణ. 1-281

2 తడపుట (జలతైలాదులతో)

వ. పరిమళ పరంపరాభాసిత నూతన తైల ధారాభిషేక ప్రదీపితంబు లయిన కరదీపికా సహస్రంబులు వెలుంగ. భీష్మ. 3-169

3. భగవంతునకు మంత్రపూర్వకముగా చేయించు స్నానము.

చ. కలమెయిఁ బాల నేత నుదకంబులనేని వరాభిషేక మంగళము నొనర్చి... లింగలసితమూర్తియందు ననుఁ గాంచి భజించిన ముక్తి సేకుఱున్. అను. 5-273

4 స్నానము.

వ. బలియను రాజు గంగాభిషేకార్థంబు వచ్చినవాఁడు. ఆది. 4-280

**అభిషేకించు** సం. స. క్రి.

1. అభిషేకము సేయు (రాజ్యమునకు- సేనకు-ఒక మహా కార్యమునకు)

వ పాండవాగ్రజుండు...పుండరీకాక్షుండు పనిచినట్లు పాంచాలనాథ ప్రముఖుల నక్షోహిణులకు నధిపతులుగా వేఱువేఱ యభిషేకించి, చూ. అభిషేకము. ఉద్యో. 4-113

2. తడుపు.

వ. సత్యవతియుఁ బెద్ద కాలంబునకు వచ్చిన యా ప్రథమపుత్త్రు నతి హర్షంబునం గౌఁగిలించికొని యవిరళ పయోధర పయోధారల వానంద బాష్పధారలం జేసి యభిషేకించుచున్న నమ్మునివరుం డును దల్లి బాష్పజలంబులు దుడిచి. ఆది. 4-240

వ. ఇట్లానతీఁ దగదు నాకుం బ్రసన్నుండ వగుమని నిజనేత్ర జలంబు లం దదీయ చరణయుగళం బభిషేకించుచు. అర. 6-24

**అభిషేచనము** సం. వి. అ. న.

1. అభిషేకము.

తే. ...అఖిల సమర, పండితుల నేర్చి వారి నీ బలము లేదు, నడపఁ
జాలించి యభిషేచనం బొనర్చు. ఉద్యో. 4-107

2. స్నానము.

వ. ధర్మపత్ని నగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపుమని పంచి
యభిషేచనార్థ మరుగ. ఆది. 1-128

**అభిష్టుతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

స్తుతింపఁబడువాఁడు.

ఈ. అనఘు యిది యోగకథ మిం, దనలసుఁడై చనఁగఁజాలు నతఁడు
కృతార్థుం, డనితర సులభ పదప్రాప్తినిరూఢుఁ డనామయుం
డభిష్టుతుఁ డెందున్. శాంతి. 6-122

**అభిష్టుత్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది, స్తుతింపఁదగినది.

క. ధర్మంబుఁ బరిజ్ఞానము, నిర్మలమతి నభ్యసించి నృప యనిశంబున్,
ధార్మిక సంగతి గలిగినఁ, బేర్మి యుభయలోకముల నభిష్టుత్య
మగున్. శాంతి. 6-74

**అభిసంధి** సం. వి. ఇ. పుం.

ఉద్దేశము, అభిప్రాయము.

ఆ. అశ్వమేధ మఖమునం దట్ల యనఘు య,లోలుపత్వ గుణ విశాల
బుద్ధి, శాలివై ఫలాభిసంధిలే కకార్యము, ధర్మంగాఁ బొనర్పు
ధర్మతనయ. అశ్వ. 1-134

**అభిసర్గము** సం. వి. అ. పుం.

సృష్టి.

వ. ఆదికాలమునఁ బ్రజాభిసర్గమునకు నారాయణుఁడు నిజనాభిపద్మ
మున బ్రహ్మఁ గల్పింప. శాంతి. 6-520

**అభిసూచనము** సం. వి. అ. న.

సూచించుట, తెలుపుట.

మ. ...పాండవ కౌరవ్య గదావిఘట్టన మహాకాండ ప్రోత్థమై భావి
పాండవ కౌరవ్య రణాభిసూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్.
ఆది. 6-13

**అభిహతి** సం. వి. ఇ. స్త్రీ.

దెబ్బ, వ్రేటు.

క. ...అన్యోన్యాభిహతిఁ జనిరి యమపురమునకున్. ఆది. 8-118

**అభిహరణము** సం. వి. అ. న.

1 దగ్గఱకుఁ దీసికొని వచ్చుట, సమర్పణము.
అర్ఘ్యాభిహరణంబు శిశుపాలవధ. ఆది. 1-823

2. తీసికొని వచ్చుట.
చ. అతఁడు సమిత్కుశాభిహరణార్థము గానకు నేఁగియుండఁగా.
శాం. తి. 2-81

**అభిహితము** సం. విశే. (అ. ఆ. అ.)

చెప్పఁబడినది, పలుకబడినది.

క. జననుత కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత
బద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక
ధీయుక్తిమెయిన్. ఆది. 1-16

**అభీరుఁడు** సం. వి. అ. పుం.

కాలాపుత్రుని యంశమునఁ బుట్టినవాఁడు. ఆది. 8-80

**అభీష్టత** సం. వి. ఆ. స్త్రీ.

కోరిక, అభీష్టము,

ఉ ...ఇత్తునేఁ, బెట్టెగఁ గౌరవేంద్రుని కభీష్టత రాజ్య రమావిలాస
ము.న్. ద్రోణ. 1-34

**అభీష్టము** సం. విశే. (అ. ఆ. అ.)

1. ప్రియము, ఇష్టము.

క. విను మివి యెయ్యవియును నాకు నభీష్టములు గావు.
ఆర. 7-359

2. కోరఁబడినది.

క. విని రోయు తీఁగగాళ్ళం, బెనఁగెం దాననుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణుఁన్, ఘనభుజు నభీష్ట పూజా ధనదాన విధానముల ముదం బునఁ దనిపెన్.
ఆది. 5-220

**అభేద్యము** సం. విశే. (అ. ఆ. అ.)

భేదింపశక్యము గానిది.

చ. ...ఇంద్రుఁ డిచ్చిన కిరీట మభేద్య మహోగ్ర సుస్థిరత్వ విభవ రూఢిమై జనులు దానన నన్నుఁ గిరీటి నామ సంస్తవన విశేష పాత్రముగ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా.
విరా. 4-148

**అభేద్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

భేదింప శక్యముగానివాఁడు. తెలిసికొన శక్యము గానివాఁడు.

క. విని విననివాఁడపోలెఁ, గని కానని వాఁడపోలెఁ గావలయు విభుం, డొనరింపఁ దలంచిన పని, కనువగునంతకు నభేద్యుఁడై జనుల యెడన్.
శాంతి. 3-273

**అభోగము** సం. వి. అ. పుం.

భోగము లేకుండుట,

క. అతనికి ...భోగాభోగ సుఖదుఃఖములు లేవధిపా. శాంతి. 5-594

**అభోజ్యత్వము** సం. వి. అ. న.

తినరానితనము.

క. విను సురతోఁ గూడఁగ దెచ్చిన యట్టిది యెద్దియును భుజింప రభోజ్యత్వ నిరూపణ నిపుణతగల, మనజోత్తము లఖిలలోక మాన్య చరిత్రా.
శాంతి. 1-328

**అభోజ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

తినరానిది,

వ. అశ్వారదరాయణునితో నమ్మెదినిరమణుం దపేయంబులు నభో జ్యంబులు నెయ్యవి యెఱిగింపవే యని... శాంతి, 1-320

**అభ్యంగము** సం. వి. అ. పుం.

తలంటు; ఒడలికి నూనె మొదలగునవి రాచుట.

సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి గమ్మ, నూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తముఁలు సేయ నన్నుని సెడనాడి యంత క్షీతుం డయ్యె. అను. 2-303

**అభ్యంతరజనము** సం. వి. అ. పుం.

ఆంతరంగిక పరివారము.

వ. సుభద్రాభిమన్యులం బాంచాలి పాలికిం గొనిపోవ నభ్యంతర జనంబుల నియోగించి. విరా. 5-377

**అభ్యంతర పరివారము** సం. వి. అ. పుం.

అంతరంగిక సేవక జనము.

వ. ఇత్తెఱంగున నభ్యంతర పరివారంబు నెల్ల నియోగించి... పీడు కొలిపె. విరా. 1-115

**అభ్యంతర మందిరము** సం. వి. అ. న.

లోపలి గృహము.

వ రాత్రియగుటయుం దగిన యభ్యంతర మందిరంబున హంస తూలికా తల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితా సనంబున నుండి (విదురుఁడు). ఉద్యో. 3-282

**అభ్యంతరము** సం. విశే. (అ. ఆ. అ.)

1. లోపలిది.

ఉ. ...కీచకుం డహంకృతి ముంగలిగాఁగ మండపాభ్యంతర భూమిఁ జొచ్చె. విరా. 2-331

2. అంతరంగికము.

వ. సంజయుండునుం జని, యుపప్లావ్యంబు సొచ్చి, మాధవు ఘద్ది

రంబున కరిగి, యభ్యంతర వినోదంబుల నరసహితుండై యున్న యన్నారాయణునకుం దన రాక యెఱిగించిపుచ్చి ఉద్యో 1-272

సం. వి. అ. న.

3. లోపలి మందిరము.

క. ...రాజును నభ్యంతరమునకుం జనియె రాజతనయుండు బహిః, పరివారముఁ బొమ్మని మిత, పరిజనుఁడై యేఁగె నాత్మభవనం బునకున్. ఉద్యో. 4-27

4. నడిమిచోటు. మధ్యప్రదేశము, లోపల.

తే. ...సభక్తికముగఁ బర్ణశాలాభ్యంతరమున కతనిఁ, దోడుకొని పోయి. అశ్వ. 4-322

తే. ...మీరు, పగలు నిద్రింతు రాహవాభ్యంతరమున. ఆర. 4-98

**అభ్యంతరావాసము** సం. వి. అ. పుం.

లోపలి గృహము.

వ. సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన నీ కొడు కభ్యంతరావాసమున కరిగె. కర్ణ. 1-59

**అభ్యంతరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అంతరంగికుఁడు.

వ. కృతవర్మాది యాదవులు లోనుగాఁగల యభ్యంతరులైన బలు మానుసులు పొదిగికొనిపోవ, ఉద్యో. 3-249

**అభ్యక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

(తైలాదులచే) అంటఁబడినది. అభ్యంజనము చేయఁబడినది.

సీ. .. కమ్మ, నూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తములుసేయ. అను. 2-308

**అభ్యర్చనము** సం. వి. అ. న.

పూజించుట, పూజ.

వ. అత్తెఱంగున భుజంగంబుల యాపద దీర్చిన యస్తీకు నభ్యర్చనం

బున నత్యంత సంతుష్టునిం జేసి... స్వర్గ. 1-79

**అభ్యర్చిత** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁబడినది,

క. వనవాస పరిక్లేశం,బున కోపదు కుంతిదేవి భోజాత్మజ గా,ఘన
నా గృహమున నుండెడు, ననవరతము భక్తితో మదభ్యర్చితయై.
సభా. 2-281

**అభ్యర్చితము** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁబడినది.

ఆ. అందు నగ్నితోఁటి యట్టు లభ్యర్చితం,బయి వెలుంగుచున్న...
ఆది. 8-128

**అభ్యర్చితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁబడినవాఁడు,

క. ...కనక మయోన్నత పర్యంకంబునందు నారాయణుఁ
డూర్జిత మహిమనుండి యభ్యర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే
సత్కృతులన్. ఉద్యో. 3-210

ఆ. ...అమ్మహాధ్వరమున, నధముఁ డయ్యెఁ గడుఁ బ్రియంబున
నభ్యర్చితుండ కాని వంచితుండు లేఁడు. సభా. 2-116

**అభ్యర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

సమీపమున నున్నది, దాపైనది.

వ. గురుకృప గాంగేయులకుఁ జరణసమీప స్థలంబుల నిలువ రెండును
గర్ణాభ్యర్ణ ప్రదేశంబులం జన రెండునుగా నాలుగేసి యమ్ము
లేసిన నా సవ్యసాచిం జూచి యాచార్యుండు. విరా. 4-250

**అభ్యర్థనీయము** సం. విణ. (అ. ఆ. అ.)

యాచింపఁదగినది, కోరఁదగినది.

వ. అప్పరమ పతివ్రత వేఁడు దెలంగుల నభ్యర్థనీయంబులయిన
వస్తువు లుపన్యసించిన నతం డవి యెవ్వియు నొల్లనమటయు.
ఆను. 1-71

**అభ్యర్థి** సం. విణ. (న్. నీ. న్.)

యాచించువాఁడు, కోరువాఁడు.

క. వికార షోడశక మిది వివేకాభ్యర్థీ. శాంతి. 4-273

**అభ్యర్థించు** సం. స. క్రి.

ప్రార్థించు, వేఁడు.

వ. ...సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణు చిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠించువారలని యభ్యర్థించిన సమ్మతించి శల్యుఁడు. ఉద్యో. 1-110

**అభ్యర్థితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కోరఁబడినది.

వ. యాజ్ఞవల్క్యజనక సంవాదం బితిహాసరూపంబునం బ్రవర్తిల్లు నది వినిన భవదభ్యర్థితంబైన యర్థంబు ప్రతిభాసించు. శాంతి. 6-80

సం. వి. అ. న.

2. కోరిక. వాంఛితము.

దండకము : సురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు. అర. 1-325

**అభ్యసనము** సం. వి. అ. న.

1. అభ్యసించుట, అలవాటు సేయుట.

క. యమ నియమాద్యష్టాంగ, క్రమాభ్యసన నిర్మథిత వికార సుచేతః కమలామోదమయాత్మా. శాంతి. 2-448

2. నేర్చుట, కఱచుట.

క. ...వేదాభ్యసనంబులు సేయుచుండు నాతఁడు నియతిన్. శాంతి. 5-188

**అభ్యసించు** సం. స. క్రి.

నేర్చు, కఱచు, అలవాటు సేసికొను,

తే. ఒండు పనులకు సెలవు లేకునికిఁ జేసి, యభ్యసించితి శైశవ
మాదిగాఁగ, దండలాసక విధమును, గుండలియును. బ్రెక్క
ణంబు తెలుంగును బేరణంబు. విరా. 1-240

**అభ్యసూయ** సం. వి. ఆ. స్త్రీ.

గుణములయందుఁగూడ దోషారోపణము చేయుట, అసహనము.

చ. పరుసని పల్కు బొంకులగు పల్కులు... సతత ధర్మరతాభ్య
సూయయుఁ, గరినిభయాన ఘోరనరకంబున కేగెడివారి చిహ్న
ముల్. అను. 5-220

**అభ్యస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

అభ్యసింపఁబడినది.

సీ. అభ్యస్త వేదవేదాంగులు విధిదత్త దక్షిణాప్రీణిత ధరణిదేవులు.
ఆది. 8-86

**అభ్యాగతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. సమీపించినవాఁడు.

వ. మఱి యదియునుంగాక యతథ్యుం డను మునివరుని పత్ని
మమత యనుదాని గర్భిణి నభ్యాగతుఁ డయి బృహస్పతి దేవర
న్యాయంబున నభిలషించిన. ఆది. 4-226

సం. వి. అ. పుం.

2. తిథి పర్వము ఉత్సవము మొదలగు సందర్భములయందు ప్రవా
పేక్షతో వచ్చినవాఁడు.

వ. తగువారును దానును వారల గృహంబుల కరిగి యభ్యాగత
పూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని.
ఉద్యో. 8-147

శ్లో. అభ్యాగతో జ్ఞాతపూర్వో హ్యజ్ఞాతోఽతిథి రుచ్యతే
తయోః పూజాం ద్విజః కుర్యాదితి పౌరాణికీ శ్రుతిః
చూ. అతిథి భార. అశ్వ. 101-5

**అభ్యాసము** సం. వి. అ. పుం.

1. నేర్చుట, కఱచుట,

సీ గురునకు భక్తుఁడై పరమాదరమున వేదాభ్యాస మెప్పుడు నాచ
రింతు. శాంతి. 4-107

2. అలవాటు, వాడుక.

క. తన గృహంబున నభ్యాసంబున మెలఁగెడు నందు చందమున
సంసారంబునఁ దిరుగు మూఢుఁ డెఱుఁగఁడు, వినుతంబగు మోక్ష
పదము విమల వివేకా. శాంతి. 5-532

3. సాధన.

సీ. నానాయుధాభ్యాస నైపుణంబునఁ బోల్చి. అను. 4-124

4. సేవించుట, భుజించుట (మందులోనగునవి)

తే. తపమునను బ్రహ్మచర్య వ్రతమున హితమితాశనమున రసాయ
నాభ్యాసమునను, బెరుగు నాయువు. అను, 5-131

5. ఆవృత్తి (మరల మరల చేయుట- చెప్పుట- మొ)

ఉ. వాసవనందనుండుఁ గుడువం గుడువం బటుమారుతాహతిం, జేసి
చలించి దీపశిఖ చెచ్చెరఁ బోవుడు భోజనక్రియాభ్యాస వశంబునం
గుడిచి పన్నగ నిట్టుల విద్యలెల్ల నభ్యాసవశంబునం బడయ భారము
లేదని నిశ్చితాత్ముఁడై, ఆది. 5-228

**అభ్యుదయము** సం. వి. అ. పుం.

1. పుట్టుట.

మ. ...నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వము విరా. 1-7

2. ఉత్సాహము.

తే. విపినవాసంబు నజ్ఞాత విధము వర్తనంబు గడపి నవాభ్యుదయంబు
నొంది, రాత్రిఁ బుచ్చి తోతెంచు మార్తాండు మాడ్కిఁ. జూడ
నుజ్జ్వలుం డగుచు నర్జునుఁడు పొలిచె. విరా. 4-254

3. క్షేమము.

వ. అద్దేవి నహుషు కడకుం జని సముచితంబుగాఁ దదీయ సాంగత్య
మున కెడ వలికి కొనివచ్చునది, యటమీఁద మన మందఱముం
బురందరున కభ్యుదయంబగు తెఱం గాచరించువారము.
ఉద్యో. 1-162

4. శ్రేయస్సు, మేలు.

వ. సత్య పరాక్రములగు పాండవులు మనకుఁ బరమమిత్రులు విశేషించి మన మేనత్త కొడుకు లనీతిపరుల చేతం బరిభవింపఁబడిన వారు గావున వీరల కభ్యుదయంబు గలిగించుట నీకుం గర్తవ్యంబు. శల్య. 2-299

క. మానమున దృఢజ్ఞానము, దానంబున నభ్యుదయము ధర్మనిరతయ్యాశా నిర్వహణంబున నరకానీకనివారణ సౌఖ్యమగు నంద్రుబధల్. శాంతి. 6-584

5. అభీష్టప్రాప్తి.

ఉ. కావున మీర లభ్యుదయ గౌరవ మొందుట యాత్మఁ గోరి యే, నే విధినైన వాపదలకెల్లను నోర్చెద దానికేమి. విరా. 2-228

**అభ్యుదితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉదయించినది (సూర్యుఁడు. మొ.)

సీ. ...ధర్మనందనునకుఁ ... గట్టెదురఁ దోఁచె -తే- నున్నతాసనాసీనుఁ డభ్యుదిత సరసిజాప్తసంకాశుఁ డమృతాశనాంగనాదివృతుఁడు వీరలక్ష్మి విరాజితుఁడు సతత,యుక్త సుఖ సాధనుండు దుర్యోధనుండు. స్వర్గ. 8

**అభ్యుదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అభివృద్ధి నొందినవాఁడు.

క. ఉగ్రరభిదాముఖమున నభ్యుదితుండై నిర్గమించె బుధనుతుఁడు కచుం,డు (అభ్యుదయముతో నిర్గమించెనని కొన్ని ప్రతులు) ఆది. 3-125

**అభ్యుద్గత** సం. విణ. (అ. ఆ. అ.)

గౌరవముతో లేచి యెదురు వచ్చినది.

ఉ. ఆతఁ డపూర్వ మనుజుఁ డెందుండి వచ్చెనో, యనుచు నదరిపడి లతాంగులెల్ల, నాసనములు డిగ్గి యప్పు డభ్యుద్గతలైరి మనములందు హర్ష మెసఁగ, ఆర. 2-89

**అభ్యుద్గతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సీ. పాండవాలోకనపరుఁడై సహస్రాక్షుఁ, డమరగణంబుతో నమ్మ హాద్రి, కేతెంచెఁ బ్రీతి నయ్యింద్రున కందఱు, నంత నభ్యుద్గతు లైరి. అర. 4-44

**అభ్రకము** సం. వి. అ. న.

ఒక ఖనిజ పదార్థము. అగ్నిచేత విడువంబడిన దేహంబునందలి గోళ్ళ నుండి యిది పుట్టెను. ఇది ఇప్పుడు గనులలో దొరకును. ఇవి నాల్గు విధములు. 1) పినాకము 2) నాగము 3) మండూకము 4) వజ్రము- ఇవి ప్రత్యేకము తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు అను రంగులను బట్టి నాల్గు రకములు. వజ్రాభ్రకము శ్రేష్ఠమైనది. దానిని 'కృష్ణాభ్రకము' అని పిలుతురు. నిప్పులలో గాల్చినపుడు చిటపట మనక ఎగురక పొగరాక కాలునది కృష్ణాభ్రకము. దీనిని భస్మముచేసి యౌషధముగా వాడుదురు. అర. 5-172

**అభ్రకుంజరము** సం. వి. అ. పుం.

ఐరావతము.

క. ...విభవం బెసఁగ నభ్రకుంజరము పయిన్, వినువీధిఁ జనియె సురలును, మునులును వేష్టింప భూతములు వినుతింపన్. శాంతి. 4-452

**అభ్రగజము** సం. వి. అ. పుం.

దిగ్గజము, ఐరావతము.

తే. హస్తిపురిఁ బేరుగల మదహస్తి నెక్కి, కాలు కావలి రథములు గవియుదేర, నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప, వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె. విరా. 5-192

**అభ్రము** సం. వి. అ. న.

మేఘము.

ఉ. ...ఉగ్రాకృతి కల్పసక్షయమహాభ్రము చందము నొందుచున్. విరా. 3-172

2. ఆకాశము.

ఘంటారవ మభ్రవీథి నిగుడ. ద్రోణ. 5-239

**అమ** వి.

(వృత్తియందు అమ్మ అను పదమునకు జడ్డ లోపించిన రూపము)

1. స్త్రీ.

క. ... ఈ యమతోడ. విరా. 2-100

వ. ...నీవ యీయమ నడుగు మనుటయు, నయ్యనిమిషపతి యమ్ముద్దియ మొగంబు గనుంగొని మాకు నిన్నెఱింగింపు మన వుడు. శాంతి. 4-400

2. స్త్రీ నామాంతముల యందుఁ జేర్పఁబడును.

అన్నమాంబాపతి. విరా. 1-10

**అమంత్రకము** సం. విశే. (అ. త్రికా. అ.)

మంత్రము లేనిది

సీ. నరనాథ కాలహీనంబును నశుచి సంస్పృష్టంబుఁ బరిభుక్తశేషమును నమంత్రకమును వీతతంత్రంబు కీటకేశ ప్రదుష్టంబు రాక్షసులు గొంద్రు. అను. 2-56

**అమంథరము** సం. విశే. (అ. ఆ. అ.)

1. వేగము గలది.

మ. ...ఆచార్యునిపై, గంధవహ సుతుఁడు గవియ నమంథరగతి నెవ్వఁ డాఁగు మన యోధులలోన్. ద్రోణ. 1-88

2, వక్రముగానిది, అవక్రము, దోషము లేనిది.

క. ... అమంథర భవదీయ కీర్తి మలినము గాదే. అర. 7-386

**అమందత** సం. వి. ఆ. స్త్రీ.

మందము కానితనము, వేగము

క. ఇందొక త్రాడు గలదు చి యే, నొందంగాఁ గ్రుచ్చినట్ల యుండెద వీరీ, క్రంమకొనుట మానంగ నమందత నది యెడల విడిచి మధువు దలిసెదన్ శాంతి. 8-194

**అమందము** సం. విశే. (అ. ఆ. అ.)

మందము కానిది, అధికము.

వ. ఇట్లు బహుప్రకారంబులగు మన్మథ వికారంబుల కగపడి వెగ డంది యమందసంతాపభరితాంతఃకరణుం డగుచు.

విరా. 2-30?; కర్ణ. 2-108

**అమత్రము** సం. వి. అ. న.

పాత్రము, భాజనము.

క. చిత్రాంగదయు నలూపియు, ధాత్రీశ్వర వత్తు రెపుడు ద్రౌపది తోడన్, గాత్రములు భూరివినయా,మత్రములుగ సుబలసుత ప్రమదమునఁ గొలువన్.

ఆశ్ర. 1-5

**అమత్సరము** సం. విశ. (అ. ఆ. అ.)

1. మాత్సర్యము లేనిది.

ఉ. దాని నెఱింగి భూసురతఁ దాల్చి వెసం జనుదెంచి యర్కుఁ డ, మ్మానితసంయమిం గని యమత్సరభావము దోఁప రోష మఱన్, మానుము నావుడు.

అను. 8-260

పి. అ. పుం.

2. దానధర్మముల యందు సంయమము.

క. సమతయుఁ దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్యత్వములు నహింసా దాన, క్షమాత్యజన సూనృత ములు సత్యము మూర్తుల్.

శాంతి 3-417

**అమధ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

మధ్యము లేనివాఁడు.

తే. ఆదిమధ్యాంతరములు నాకు నరయలేమి,నై యనాది యమధ్యుఁ డనంతుఁ డనఁగఁ, జెల్లు పేళ్ళులు శుచులు నా చెవుల కింపులగుట మునులు శుచిశ్రవుఁ డండ్రు నన్ను.

శాంతి. 6-186

**అమరగృహము** సం. వి. అ. న.

స్వర్గము.

నిస్సంగవృత్తి యమరగృహము.

శాంతి. 4-25

**అమరత** సం. వి. ఆ. స్త్రీ.

దేవత్వము.

తే. అల్పపుణ్యుండు తొలితొలి యమరతాసు,ఖంబు గయికొని
మఱియు దుఃఖముల నొందు, భూరిపుణ్యుండు మునుమును ఘోర
నిరయ, యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు. స్వర్గ. 39

**అమరత్వము** సం. వి. అ. న.

దేవభావము.

క. వానికి నిత్యామరత్వ వైభవ మొదవున్. అను. 5-307

**అమర పర్వతము** సం. వి. అ. పుం.

ఒకానొక పర్వతము. నకులుఁడు పశ్చిమ దిగ్విజయంబునకై చనినప్పుడీ పర్వత నివాసులను వశగతులం జేసుకొని వస్తువాహనంబుల బహుకృతిగా గ్రహించెను. సభా. 1-166

**అమరరాజు** సం. వి. అ. పుం.

దేవేంద్రుఁడు.

ఉ. ...అమరరాజ తనూభవుఁ జూచి యిట్లమున్. విరా. 1-58

**అమరాచలము** సం. వి. అ. పుం.

మేరు పర్వతము.

వ. అమరాచలము పర్వతములలో... నెక్కుడు... అశ్వ. 2-162

**అమరాధిపుఁడు** సం. వి. అ. పుం.

దేవేంద్రుఁడు.

క. మాతలి పాణిగ్రహణం, బాతనిఁ జేయించి యున్న, నంతయు విని
తా, నేతెంచి గరుఁడు డతి కో,పాతురుఁడై రేఁగి పెలుచ నమ
రాధిపుతోన్. ఉద్యో. 3-293

**అమరావతి** సం. వి. ఈ. స్త్రీ.

దేవేంద్రుని పట్టణము.

ఉ. ...వి,ద్రావణ దంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁడా శచీ
దేవియుఁ దాను మోదమునఁ దేలి రభీష్టవినోదలీలలన్.
ఉద్యో .1-205

**అమరి** సం. వి. ఈ. (స్త్రీ).

దేవతా (స్త్రీ)

క, అమరీ న్యూడలి వీచోపు లిడఁగ, నుండి గనుంగొనుచు నుండె నుజ్జ్వల భంగిన్. విరా. 4-241

**అమరు** దే. అ. క్రి.

ఒప్పు.

క. సిరి విడుచును బురుషుని విను, పురుషుఁడు సిరి దొరఁగు నిది యపూర్వమె ఫలమ్మూలరతుండై వాఙ్నియతిం, బొరసి యునికి యట్టిచోటఁ బురుషున కమరున్. శాంతి. 3-83

మ. ...మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై. ఆది. 1-65

2. కుదురు, అనుకూలమగు.

ఆ. కచ్చ యమరఁబట్టి కాళ్ళును చేతులు, వ్రేల మత్తగజము లీల మెఱయ. విరా. 2-17

3. ఏర్పడు.

క. విరటు బలంబు త్రిగర్తేశ్వరు బలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయంకర నాదమేదురములగు, శరనిధు లొండొంటిఁ దాఁకు చందం బమరన్. చూ. అమర్చు. విరా. 3-158

4. అబ్బు, లభించు.

చ. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁడా, మనుజాధిశునకు సభా, జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. విరా. 1-229

5. సిద్ధమగు.

సీ. ...తృణ మష్టిఁగొని వాఁడు వీఁచుడు, నం డగ్ని యుదయించి యతని వంట, లమరు నంతకు నింధనము లపేక్షింపక, యుడుగక మండుచునుండు. అర. 2-196

సీ. ...సంభారముల నెల్ల సంఘటించి, యజ్ఞాచరణమున కమరి

యున్నాడ నీ, వుపదర్శనంబు సేయుటకు రమ్మి. అశ్వ. 1-40

6. సరిపడు, తగు.

వేదికాస్థలి మణి కనకాత్మికయై మువ్వదాఱు యోజనముల దైర్ఘ్యము నంత యమరు విస్తారంబు గలుగఁగ నొనరించి క్రతువు సేసె. శాంతి. 1-240

7. ఊఁదు, ఆను.

ఆ. ఇట్లు సేసి శక్తి యెల్లను గరచన్న, నతఁడు నేలఁ బ్రాలె నతి రయమున, వచ్చి యమరఁబట్టె వాసవుఁ డక్కట, నీకుఁ జెప్పనయ్యె నెమ్మి నేను. అను. 1-99

8. పూన్చు, కట్టు.

సీ. ...హరి వసు, జల తారకములఁ గంబళము గుజ్జు లమరిన బండియు యవలు. అను. 2-379

**అమరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. చావు లేనివాఁడు.

క. అమరుఁడ వజరుఁడ వజితుఁడ, వమేయుఁడవు నీకు నమృతమది యేల ఖగో, త్తమ దీని నొరుల కిచ్చిన, నమరులకును వారసాధ్యు లగుదురు పోరన్. ఆది. 2-110

2. నశించు శరీరమునం దుండియు నాశనము పొందనివాఁడు.

క. అమృతుం డవ్యయు డజరుం, డమేయుఁ డమలస్వభావుఁ డప్పురుషుఁడు దేహమున మహీజమునం దనిలమున్న గతి నుండు మథన లక్ష్యుం డగుచున్. శాంతి. 4-273

సం. వి. అ. పుం.

3. దేవత.

ఉ. అమరరాజ తనూభవుఁ జూచి యిట్లనున్. విరా. 1-58

**అమరుచు; అమర్చు** దే. స. క్రి.. (అమరించు, అమరఁజేయు)

1. సిద్ధపఱచు.

ఉ. పొచ్చెము లేని బల్మిగలఁ బోరి కమర్చుము దర్ప మేర్పడన్.
విరా. 4-181

2. (ఆయుధములు మొదలగు వానిని) పూను, పట్టు.

తే. కవిసి వ్రేసిన గ్రక్కున గద యమర్చి, యాఁగి వజ్ర ప్రహారంబు
ననుకరింప, ద్రుపదనందనుఁ డడిచిన దునియలయ్యెఁ, బలక
రెండవ వాటునఁ బగిలె శిరము. భీష్మ. 2-194

3. (వస్తువులు) ధరించు, తాల్చు.

ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁడయ్యుం గను
పట్టి వెల్లతల యొల్లియ మౌళి దృఢంబుగా సమర్చెం గురునాథ.
కర్ణ. 3-327

4. (ప్రతిమలను) నిర్మించు.

తే. వినయమున ద్రోణురూపు నమర్చి. ఆది. 5-282

5. చూచు, సారించు.

క. పోవకు పోవకు మనుచు మహావీరుఁడు గద యమర్చి యమ్మణి
మంతున్, లావఱఁగవైచె. ఆర. 4-20

6. కావించు, చేయు.

ఉ. తూర్పరుణంబుగాఁ దొడఁగె దుష్టనిశాచర వేళయయ్యెడున్,
మార్పుము కాలయాపన మమర్పక యప్పిశితాశిఁ బట్టి పాలా
ర్పఁగ నేల నావుడు.... ఆది. 6-218

ఆ. మంత్రతంత్ర విధు లమర్చి యేమఱకుండునది. ఆది, 2-180

7. కలిగించు.

క. నీ యొద్దకుఁ బుత్తెంచిరి, మాయం దొక్కరు నభీష్టమతి వరి
యింపం, దోయజముఖిఁ బ్రార్థింపుము, మా యందఱకును బ్రియ
మమర్పుము ప్రీతిన్. ఆర. 2-45

8. పట్టుకొను.

చ. అన విని ధర్మసూనుఁడు కృతాంజలియై తగ భీష్మదాయ నల్లన
చని కేలఁ బాదకమలంబు లమర్చి శిరంబు సోఁక వందన మొనరిం

చిన. శాంతి. 2-158

వ. ...మందరధరుండు మందస్మితంబుతో సందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రి కరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చి లీలం గేల నమర్చి. ఉద్యో. 3-221

9. ఉంచు.

ఉ. అప్పుడు శౌరి పార్థునకు నడ్డముగాఁ దన మేనమర్చి యున్నగ్గ ప్పెస లార వేరురమునన్ ధరియించిన నమ్మహాస్త్రము. ద్రోణ. 1-355

10. వ్యూహముపన్ను.

తే. చూడు మాచార్య నీదు శిష్యుండు ద్రుపదసుతుఁ డమర్చిన యది పాండుసుతుల సేన. భీష్మ. 1-178

వ. ...అన్నరపతి నిబిడ చారు సన్నాహంబుగా నుచిత వ్యూహం బమర్పుమని యతనికిం జెప్పిన. భీష్మ. 1-103

11. పెట్టుకొను, వహించు.

తే. ఇట్లు లంఘించి పోయి పరేతభూమి, యొద్ద నలుదిక్కులును చూచి యొక్క యున్న, తావనీజంబు వెలికి రౌద్రాతిరేక, మడర భుజ శిఖరంబున యందమర్చి. విరా. 3-23

12. ఏర్పఱచు.

వ. ...అందఱు నప్పర్వతంబు దెచ్చి సముద్రంబులో వైచి దాని క్రింద నాధారంబుగాఁ గూర్మరాజు నియమించి యోక్త్రంబుగా నాసుకి నమర్చి. ఆది. 2-11

క. అమలమతిఁ గరముఁ గ్రోలుగ, నమరిచి. అశ్వ. 1-21

**అమరేంద్రుఁడు** సం. వి. అ. పుం.

దేవేంద్రుఁడు.

సీ. అమరేంద్రు నర్ధాసనమునకునైన నర్హుం డెంతయును నను రూఢి మాట. విరా. 2-204

**అమర్త్యత్వము** సం. వి. అ. న.

దేవత్వము, చావులేనితనము.

క. ఏను సుధ యడుగుటయు హరి, మానవులకు నేలయగు నమర్త్య
త్వము మేలైన తెఱఁ గొందు గోరుము, దానిం దగ నిచ్చెదన్
ముదం బారంగన్. అశ్వ. 3-61

**అమర్త్యుఁడు** సం. వి. అ. పుం.

వేల్పు, దేవత.

మ. ...అ, మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల.
ఉద్యో. 1-208

**అమర్యాద** సం. వి. ఆ. స్త్రీ.

అతిక్రమణము, కట్టుబాటు నల్లంఘించుట, మేరలేమి.

ఆ. మహి గలంగె, గడు నమర్యాద వర్తించెఁ, గమలజుండు విష్ణు
కడకుఁ జనియె శాంతి. 3-116

**అమర్షణము** సం. విశ. (అ. ఆ. అ.)

కినుక గలది, క్రోధము గలది.

మ. జనితామర్షణుఁ డంతఁ బార్థుఁడయి బర్జన్యాస్త్ర మక్కర్ణుఁ
డేసె... ఆది. 6-39

**అమర్షము** సం. వి. అ. పుం.

1. అసహనము, ఓర్వలేనితనము,

క. అని గదఁ జేకొని నృప నీ, తనయుని మొనవట్టి యనిమి తల
గ్రమ్మఱఁ దన్నినఁ గని మును దన్నుట నెమ్మన మెరియు తద
గ్రజుం డమర్షముతోన్. శల్య. 2-287

2. కోపము,

క. నహుషుడు మహేంద్ర పదవీ, సహితుఁడు శచికిన్ వరింప జను
నాతని లోకహితంబుగాఁగఁ బుచ్చుము, మహాత్మ తచ్చిత్తమున
యమర్షం బడఁగన్. ఉద్యో. 1-156

**అమలము** సం. విశ. (అ. ఆ. అ.)

నిర్మలము, మలినము లేనిది.

క. అమృతం బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత మవ్యై

లుఁగు యమ్యా,ద్యము ల నలవడిన చిత్తము, శమాతిరేకమునఁ
బొంద సంవేద్యమగున్. శాంతి. 4-201

**అమలినము** సం. విణ. (అ. ఆ. అ.)

నిర్మలము, మలినము లేనిది.

అంబరము లు నిత్యామలినము లు. అను. 5-217

**అమలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

దోషరహితుఁడు, నిర్మలుఁడు.

...శంకరుఁడు...సకలుం డమలుండు. ద్రోణ. 5-427

**అమవస** వై. వి. (సం. అమావాస్య, అమావస్యా- క. అమవాసె. అమాసె. త. అమావసి)

అమావాస్య.

క. అమవస గావున నేఁ డక్కమలజుఁ గొలువఁగ మహర్షి గణములు
పితృ సంఘములును బోదురు బ్రహ్మాండమునం గల వారలం
దొడంగూడంగాన్. ఆది. 5-68

క. అమవస నమవస నా తీర్థమునఁ గృతస్నానుఁడై సుధాకరుఁడు
ప్రవృద్ధి మహితతనుఁ డగు. శల్య. 2-152

**అమాంసభోజి** సం. విణ. (న్. నీ. న్.)

ఎల్లప్పుడు మాంసము తిననివాఁడు; దేవపిత్రతిథి పూజావిధులయందు
నివేదించియే మాంసము తినువాఁడు.

సీ. దేవపిత్రతిథి పూజావిధులం దిడి, మఱి నంజు పురుషుఁ డమాంస
భోజి. శాంతి. 4-388

**అమాత్యుఁడు** సం. వి. అ. పుం.

1. మంత్రి.

చ. అమాత్యవర్గమునుగాఁ గల రాజ్య మితండ యేలు. విరా. 5-348

2. సహవాసి.

తే. వరదుఁ డగు విష్ణుఁ డిట్లనుఁ బరమ భక్తి, నిర్మలశ్రద్ధ యింద్రియ

నిగ్రహంబు, మన్మయ ధ్యానమునకు నమాత్య కోటి.
శాంతి. 4-211

**అమానుషము** సం. విశే. (అ. ఈ. అ.)

1 మనుష్య శక్తికి మీఱినది, అసాధారణము, మనుష్యులకు సంబంధింపనిది.

ఉ. మండలచారియై రథ మమానుష విక్రమ లీల నొప్పు.
విరా. 3-175

క. ...విభుం డమానుష తేజోధనుఁ డగు సహదేవుఁ గనుంగొని యిట్లను.
విరా. 1-97

2. దైవికము.

వ. అతం (దుర్యోధనుఁడు) దశక్తి దుర్జనత సేయం జూచిన నమానుషంబులగువానిం గొన్ని వెడమాయలం బన్ని పెక్కు పోకలం బోయితి.
ఉద్యో. 4-88

సం. విశే. (అ. ఆ. అ)

3. మనుష్యులు లేనిది, నిర్జనము.

క. హిమశైలకందరా భాగము కడ నిమ్నురుపనగము గల దచ్చో నీ, ద్రుమశాఖ విడువు మది రా, నమానుష మగమ్య మీశ్వరాదుల కైనన్.
ఆది. 2-77

**అమావసువు** సం. వి. ఉ. పుం.

ఊర్వశీ పురూరవుల కొడుకు.
ఆది. 3-92

**అమావాస్యాముఖము** సం. వి. ఉ. పుం.

అమావాస్యోదయము, అమావాస్యా ప్రారంభము.

వ. ...అమ్ముహూర్తంబు రౌద్రనామకంబయి సోమసూర్య సంగమ కారణంబయిన యమావాస్యాముఖంబై.
అర. 5-190

**అమాహరుఁడు** సం. వి. అ. పుం.

ధృతరాష్ట్రి సర్పజాతివాఁడు.

వ, ఇతఁడు జనమేజయ సర్పయాగమ్ములోఁ దన జాతివారితోఁగూడ

నగ్ని కుండమునఁ బడి మరణించెను. ఆది. 2-212

**అమితము** సం. విశే. (అ. ఆ. అ.)

మితిలేనిది, కొలఁది లేనిది, అధికమైనది.

తే. ఒక్కరుఁడు విశాలోరస్కుఁ డమిత బలుఁడు. విరా. 2-5

**అమితేజుఁడు** సం. వి. న్. పుం.

పాంచాలుఁడు.

ఇతఁడు కేతుమంతుని యంశంబున జన్మించెను. ఆది. 3-80

ఇతఁడు మహారథుఁడు పాంచాల కులప్రదీపకుఁడు. మహాభారత యుద్ధమునఁ బాండవ పక్షమునఁ బోరెను. ఉద్యో. 4-265

నిద్రా పరవశుఁడై యుండఁగా అశ్వత్థామ యితని జంపెను.

సౌప్తి. 1-168. 169

**అమిత్రుఁడు** సం. వి. అ. పుం.

శత్రువు.

అమిత్ర ధ్వంసీ. భీష్మ. 2-124

**అమిథ్య** సం. అవ్య. అ.

సత్యము.

క. ...అతఁడు, మీకుం బ్రియశిష్యుఁ డసె యమిథ్యావచనా.

ఆది. 5-240

**అముత్ర** సం. అవ్య.

(తెనుఁగున దీనికి వ్యస్తప్రయోగము గానిపింపదు- వ్యతి. ఇహ)

పరలోకమందు.

క. క్షత్రియ సంస్కారమునకుఁ, బాత్రముగా నీవు నన్నుఁ బాటించ నిహా,ముత్ర ఫలములకు నీకేఁ, బుత్త్రుఁడ నని వచ్చుటింకఁ బోసఁ గనె చెపుమా. ఉద్యో. 4-62

**అముష్కరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

కుటిలుఁడు కానివాఁడు.

మ. అరయుం దప్పు కృతం బెఱుఁగు మదలోభావేశముల్ లే నముష్కరుఁ డాత్మ స్తుతి లేదు. శాంతి. 2-296

**అమూర్ఛితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మూర్ఛ నొందనివాఁడు.

చ. ఇతఁడు సురేంద్రుఁ డొండెఁ బరమేశ్వరుఁ డొండెఁ ధనేశుఁ డొండెఁ గా,కతులబల ప్రభావయుతుఁ డన్యుఁడుగాఁ డోరుడైన మద్భుజా, వితత ధనుర్విముక్త శరవేగము పోర సహించి యిట్టు లక్షతుఁడు నమూర్ఛితుండు నయి కంపముఁ బొందక యుండ నేర్చునే. ఆర. 1-812

**అమూర్తరయుఁడు** సం. వి. స్. పుం

గయుని తండ్రి.

సీ. అనఘుఁ డమూర్తరయః ప్రియపుత్రుండు, గయుఁ డను రాజర్షి క్రతువు లిందు, బ్రహ్మసరంబునఁ బరఁగంగ మును చేసె ఆర. 2-815.

ఈతని కుమారుఁడు గయుఁడు, ఇతని పేరనే గయ యను పుణ్యతీర్థము వెలసెను. చూ. గయుఁడు.

**పూర్వ** ప్రతులఁ గొన్నింట నిది 'అ'కారాంతముగానే యున్నది. "అమూర్తరయ ప్రియ పుత్రుండు.' కాని ఈతని పేరు అధూర్తరజుఁ డని మూలమునఁ గలదు.

శ్లో. అధూర్తరజసః పుత్రో గయో రాజర్షిసత్తమః సం. భా. వన. 93-20.

**అమూర్తి** సం. వి. ఇ. పుం.

ప్రకృతి సంబంధమైన దేహము లేనివాఁడు- శ్రీమహావిష్ణువు.

క. అగమనునిం శాంతు నఖిల, జగద్భరణపరు నమూర్తి...గొలుతున్. శాంతి. 4-224.

**అమూల్యము** సం. విణ. (అ. ఆ. అ.)

విలువ లేనిది, మిక్కిలి వెలగలది.

చ మునులకు నేనుఁ నేటికి నమూల్యపుఁ గోవులఁ బుచ్చికొమ్మనె. అను. 4-67

**అమృత** సం. వి. ఆ. స్త్రీ.

పూరువంశోద్భవుఁ డైన కురునకుఁ బుత్రుఁ డగు విదూరథుని తనయుఁడైన అనశ్వునకు భార్య. ఈమె కుమారుఁడు పరీక్షితుఁడు ఆది. 4-113

శ్లో. అనశ్వాంస్తు ఖలు మాగధీముపయేమేఽమృతాంనామ,
తస్యామస్య జజ్ఞే పరీక్షిత్. ఆది. 68-44

**అమృతకరుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుఁడు.

అపరపక్ష చతుర్దశి యమృతకరుని కరణి నొప్పెడు కర్ణు మొగంబు. స్త్రీ 2-92

**అమృతకిరణుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుఁడు

తే. అభ్రపటలంబు వాసిన యమృతకిరణ, పూర్ణమండలంబును బోలె. శాంతి. 5-190

**అమృతత్వము** సం. వి. అ. న.

1. మోక్షము.

క. అమలంబగు నీ యితిహాసము భక్తిఁ బఠించినం బ్రశాంతి యొలసి దుఃఖములం దొలఁగి మనుష్యుం, డమృతత్వావాప్తి మహితుఁడై వెలుఁగొందున్. శాంతి 4-360

2. చావు లేమి

క. అనఘా మృత్యువు నమృతంబును దేహమునంద కలవు మోహము మృత్యుత్వ నిరూఢ మున్న రూపుం, గను నమృతత్వోపహిత ముగా వెలుఁగుమీ. శాంతి. 5-384

**అమృతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. నశింపనిది, శాశ్వతము.

వ. ఇప్పరమతత్త్వంబు వినుము విజ్ఞేయం బవ్యయం బకలంకం బనామయం బమృతంబు. శాంతి, 6-10

సం. వి. అ. పుం.

2. సుధ.

దేవదానవులు క్షీరసాగరమును మథించునపు డందుండి జనించినది. దీని సేవనము వలన మృత్యువుగలుగదు. ఆది. 2-16; విరా. 1-12

దేవేంద్రునితో యుద్ధముచేసి దీనిని గరుడుఁ డపహరించి మఱల దేవేంద్రుని ప్రార్థనముపై నతని కప్పఁజెప్పెను. చూ. గరుడుఁడు.

శ్రీకృష్ణుఁడు దీనిని ఉదంకునికై పంపెను. ఆది. 1-118

3. మోక్షము.

క. నిను దనుఁగా నతినిగ్రహం, మనస్సమాధి ప్రకర్ష మగ్నత వలనం, గనఁగొని తద్రూప భజన, మొనరించు మహాత్ముఁ డమృత మొందుఁ బశుపతీ. ద్రోణ. 5-412

క. అమృతము మృత్యువు నన సత్యము మోహము గాన విను మహాత్మ యే సత్యమునన మృత్యువు గెల్చెద, సమదుఃఖుండ నగుచు శాంతిపరుఁడనై. శాంతి. 4-26

4. అన్నము.

సీ. ఆధిప యింకను విను మన్నంబు జలమును, నిచ్చుట యీవులకెల్ల నెక్కు, డగుట నేఁ జెప్పెద నమృత సుధా స్వధా నామముల్ సురలందు నాగకులము, నందును బితృకోటియందును వర్తిల్లు, నన్నంబునకు. అను. 2-405

5. యజ్ఞశేషము.

వ. కావున గృహస్థుండు సర్వసంతర్పకుండు గావలయుం గావునం బ్రతిదినంబును బక్షి శునక శ్వపచార్థంబు సాయంప్రాతస్సం యందు వైశ్వదేవంబు సేసి యమృతాశియు విఘసాశియుఁ గావలయు. అర. 1-31

6. దక్ష ప్రజాపతి కన్యయైన కపిలకును కశ్యపునకును జన్మించినది.

వ. కపిల యనుదానికి నమృతంబును గోగణంబును బ్రాహ్మణులును ఘృతాచీ మేనకాదులయిన యప్సరసలును బుట్టిరి. ఆది. 3-65

**అమృతసూతి** సం. వి. ఇ. పుం.

చంద్రుఁడు.

శా. ...సాత్యవతేయ ధీవనధిజన్మశ్రీమహాభారతాఖ్యానాఖ్యామృత
సూతి యెప్పు నిఖిలాఘధ్వాంత విధ్వంసియై. ఆది. 8-21

**అమృతాంశుఁడు; అమృతాంశువు** సం. వి. అ. పుం.

అమృతమయమైన కిరణములు గలవాఁడు; చంద్రుఁడు.

చ. ...ఉదయమై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్ను సేయు
చున్. శాంతి. 2-126

సీ. వలమొయిల్ గప్పినఁ జాడటి నునుఁగాంతి, గదలిన యమృ
తాంశు కలయుఁ బోలె. విరా. 2-124

**అమృతాశనుఁడు** సం. వి. అ. పుం.

అమృతము ఆహారముగాఁ గలవాఁడు, వేలుపు.

క. ...అమృతాశన గణ సమ్మద సంపాదనుఁ డగుచును (కుమార
స్వామి) శల్య. 2-188

**అమృతాశి** సం. వి. న్. పుం.

1. భృత్యులు తినిన పిదపఁ దినువాఁడు

తే భృత్యవర్గంబు గుడిచిన పిదపఁ గుడుచు, నాతఁ డమృతాశి
శాంతి 4-368

2. యజ్ఞశేషముమ భుజించువాఁడు

ప్రతిదినంబును పక్తి శునక శ్వపచార్థంబు సాయం ప్రాతస్సుల
యందు వైశ్యదేవంబు సేసి యమృతాశియు, విఘసాశియుఁ గావ
లయు. అర. 1-31

3. అమృతము భక్షించినవాఁడు.

ఆ. ...అమృతాశి వగుట నీ, కభిమతార్థసిద్ధియయ్యె. ఆది. 1-118

**అమృతుఁడు** సం. వి. అ. పుం.

1. చావు లేనివాఁడు, శ్రీమహావిష్ణువు.

సీ. ...విష్ణుఁ బరమపురుషు, -గీ- అమృతు నచ్యుతుని... దలఁతు.
శాంతి. 4-216

2. జీవుఁడు, హంసుఁడు.

తే. విను నవద్వార పురమున వెలుఁగుచుండు, హంసుఁ డతనిన యతురుఁ డమృతుఁ దంద్రుఁడు, పరమ యోగులు శాంతి. 5-113

3. శివుఁడు.

క. నానారూపంబుల ని, శ్లేను బ్రవర్తింతు జనము లన్నింటను నీ, శానుఁడు నభవుఁడు నమృతుఁడు,నైన శివు గొలువు మర్జున యెపుడున్ శాంతి. 6-456

**అమృష** సం. అవ్య

అసత్యము గానిది, సత్యము.

సీ ...సాధు,జన సంగమం బమృషా భాషణంబు. శాంతి. 4-364

**అమేధ్యము** సం. వి. అ. న.

ఉమ్మనీరు, ప్రసవ జలము, జరాయువు.

తే. కలసి శుక్రశోణితములు కరుడుగట్టి, విను మమేధ్య మధ్యమునఁ బ్రవృద్ధి నొంది, కాలవశత నప్పిండ మంగంబులెల్లఁ, గలిగి శిశువయి మారుతగతి యెలర్చు. స్త్రీ. 1-36

పురీషము- మలము- అన్ని నిఘంటువులు కాని యా యర్థ మిక్కడ పొసఁగదు. స్త్రీ గర్భాశయము లోనికిఁ దల్లి మల మూత్రములు పోవ వీలులేదు శిశువు గర్భమునం దున్నంతవఱకు మలమూత్రములు వదలదు. ఇంక శిశువు నావరించి మల మెట్లుండును? నెలనెలకు బ్రవర్తించు ఋతు రక్తము గర్భాశయమున పిండమునకు- తర్వాత శిశువునకు తొమ్మిది నెలలు ఉమ్మనీరు (ప్రసవ జలము) గ జరాయువుగ (మావి) మాఱి క్రమ్ముకొని యుండును. ఇందే పిండము పెరిగి శిశువై పూర్ణావస్థను బొంది వాయు ప్రేరితమై వెలువడును. శిశు జననముతోఁ బాటు ఉమ్మనీరును, మావియు వెలుపలకుఁ బడిపోవును.

శ్లో. మలాల్పత్వ దయోగాచ్చ వాయోః పక్వాశయస్య చ,
వాతమూత్ర పురీషాణి న గర్భస్థః కరోతి హి.

శ్లో. జరాయునా ముఖేచ్ఛన్నే కణ్ఠే చ కఫవేష్టితే,
వాయుర్మార్గ నిరోధాచ్ఛ న గర్భస్థః ప్రరోదతి
సుశ్రుత శారీరము ద్వితీయాధ్యాయము 52,58 శ్లో.

**అమేయము** సం. విణ. (అ. ఆ. అ.)

అపరిచ్ఛేద్యము, మితిలేనిది

తే. ...అతఁ డమేయ శల్ల, తతుల నన్నిటిఁ దునుమాడెఁ దరతరంబ.
భీష్మ. 2-177

క. అమృతం, బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత మవ్వె. లుఁగు.
శాంతి. 4-201

**అమేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. మితిలేనివాఁడు.

ఉ. ...శివదేవు నెఱుంగుదు... నతండె...... భక్తికి విధేయుఁ డమేయుఁడు కౌరవేశ్వరా.
సౌప్తి. 2-109; శాంతి. 2-40

2. శరీర ధర్మమగు మితి లేనివాఁడు.

క. అమరుం డవ్యయుఁ డజరుం, డమేయుఁ డమలస్వభావుఁ డప్పురుషుఁడు దే,హమున మహీజమునం దనఁల మున్నగతి నుండు మథన లక్ష్యం డగుచున్.
శాంతి 4-276

**అమోఘము** సం. విణ. (అ. ఆ. అ.)

1. వ్యర్థముగానిది, సఫలమైనది. 2. అఖండము.

తే. గోమయ ప్రభావ మూల మిట్టిది గోవు నమోఘ మహిమ
అను. 8-118

ఈతని వచనం బమోఘంబు.
అర. 7-182

**అమోఘుఁడు** సం. వి. అ. పుం.

1. క్రోధుని కుమారుఁడైన కామునకు కొడుకు. ఇతని కుమారుఁడు ఉక్థుఁడు.
అర. 5-159

2. ఒక యక్షశ్రేష్ఠుఁడు.

ఈశ్వరుఁడు కుమార సహితుఁడై భద్రవటంబు సేరునపు డతని

దక్షిణ పక్షంబున నితఁడు ప్రబల రక్షో యక్ష రక్షితుఁడై చనెను
ఆర. 5-264.

**అమోహత** సం. వి. ఆ. స్త్రీ.

మోహము లేకుండుట

క. .. నిన్ను భక్తిఁ దెలుతురు దురిత, వ్యూహమ్ముఁ బుణ్యచయ, మున న,మోహాత నిరసించు యోగి ముఖ్యులు కృష్ణా.
శాంతి. 4-287.

**అమ్మ** దే. వి. (అమ) (సం. అంబా. ప్రా- అమ్మా- అనువాని వికృతి అని శబ్దసామ్యమునుబట్టి చెప్పుదురు. అట్లైన తెలుఁగు, వారికి అమ్మలేదు; అయ్యా లేఁడు కాఁబోలు)

1. కన్నతల్లి.

సీ. ఇట రమ్మ, నన్నుఁ గౌగిటఁ జేర్పు కొడుక మీయమ్మ నూరార్పఁ, రావయ్య.
శల్య. 1-18.

2. స్త్రీ నుద్దేశించి ప్రార్థనార్థక క్రియంకు అను ప్రయుక్తమగును.

క. అతివ తగునమ్మ నీ గృహా, మతి నిర్మల చరిత భరితమని యీ యెడ మతృతుల యసన్నిధినైనను, మతి నూఱట యున్న చోట మన్నన దప్పన్.
విరా. 2-94; ఆశ్వ. 4-66.

3. ప్రేమను, ఆదరణమును దెలుపును.

ఉ. కీచకకోటిచేత నొక కీడును బొందక వచ్చితమ్మ ని, న్వేచిన దుర్మదుండు జముని౦ గొలువం జనె నమ్మ యంతఁబో, కేచిన సూతు నీ యొడలి నంత యపాయ మొనర్తు రమ్మ వే, కాచి, విరోధులం దునుమగా నిటు ముట్టుదురమ్మ నీ పతుల్.విరా.3-44

(బ్రహాన్నల ద్రౌపది నాలోకించి పర్కిన పల్కులు)

తడమి నా చేత దీవన వడయు మమ్మ.
విరా. 2-214.

4. పూజ్యతను దెల్పును.

సీ విసవమ్మ, తృణముష్టికి గొని వాఁడు పీచుచు, నందగ్ని యుదయించి యతని వంట, అమరునంతకు నింధనము లపేక్షి-షక

యడుగక మండుచునుండు (కేశిని యను దూతి దమయంతితో)
అర. 2-196

౯. వాత్సల్యమును దెల్పును.

అ. ...అతిథి జనుల సంతతంబుఁ బూజింపు, మన్నదానమున ధరామ
రేంద్ర, వరులఁ దనుపు మఖిల వసుమతీ ప్రజలెల్లఁ, గరుణ
గలుగు మమ్మ కమలనేత్ర (కుంతి ద్రౌపదితో) ఆది. 8-4

౧౦. ఔదార్య, సంతాపము మొదలగువానిని దెల్పును.

మత్తకోకిల. పుత్రి యిట్లగునమ్మ శోకముఁ బొంది కుందుచు నన్న నీ,
గాత్ర మొండొక కీడు పాటిలి కందుఁ. స్త్రీ. 1-188

**అమ్మచెల్ల** దే. అవ్య. అమ్మకచెల్ల; అమ్మచెల్లగా.

ఆశ్చర్య సంతాపాదులను దెల్పును.

అ. అమ్మచెల్ల యిట్టు లనకుము కొండలు, లోనుగాఁగఁ బవనుచే
నపాస్త, మహిమ గలుగు లెలుఁగు మా భూతముల చేష్టితములు
వాయువశగతములు గావె. శాంతి. 8-887

**అమ్మరో** దే. అవ్య.

భయమును సూచించును.

తే. ...కరంబున నుదర మప్పళించి యమ్మరో; రక్కసయంచు నుల్ల
ములుకువారునై పురజనంబులు దలంకి. విరా. 8-86

**అమ్ము** దే. వి.

అంబు (వృత్తియందు తరచుగా 'అంప' అగును)

1. బాణము.

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబుల మొదలం బడ
రెండమ్మ లేసి. విరా. 4-252

దే. స. క్రి.

1. విక్రయించు,

వ. వాయునందనుండు వంటకు మిగిలిన మాంసంబు లమ్మ నెపంబున
నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు. విరా. 2-2

**అమ్ముకొను** దే. స. క్రి.

1. లంచమిచ్చు.

చ. క్రమమునసైన శాస్త్రవులఁ గ్రమ్మనసైనను జావఁజేత ధర్మము
వినుపాపకర్ములగు రాజులతోఁ దగ సంధిసేతఁ దోషము
విభుఁ డుర్వి యమ్ముకొని సంగరముం దొలగింపఁ గూడునే,
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండు ధర్మముల్.

శాంతి. 1-178

2. విక్రయించు.

సీ. పాపాత్ముఁ డొక బోయ పశుల వధియించి, తినియును పెక్కమ్మి
కొనియు నదియ, బ్రదుకుగా దానికి బహు సాధనంబులు, సవ
రించుకొని మహాటవిఁ జరింప. శాంతి. 3-307

**అమ్ములపొది** దే. వి.

అంబుల పొది, అంపపొది, తూణీరము, బాణములుంచు పొది.

క. ఈ నెలఁతఁ గన్న మన్మథుఁడైన జిగురు గొడుగుఁ బువ్వుటమ్ముల
పొదులున్, లోనుగ సెజ్జలు సేయం, దా నియమింపండె విరహ
తాపము పేర్మిన్. విరా. 2-28

**అమ్లానము** సం. విశే. (అ. ఆ. అ.)

1. వాడనిది.

వ. అమ్లాన కుసుమ మాలికా మనోహరులు. ఆది. 6-131

**అయతి** సం. వి. ఇ. పుం.

నహుషునకు ప్రియంవదయందు జన్మించినవాఁడు.

యయాతి తమ్ముఁడు. ఆది. 3-94

**అయత్నము** సం. వి. అ. పుం.

యత్నములేమి.

సీ. ...నీవు పెద్దలకును, బెద్దవ యత్న సంభృత జగత్త్రియుఁడవు.

అను. 4-410

**అయనము** సం. వి. అ. న.

1. గతి, పోవుట.

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృకుంటు లురలం ద్రోచి యే కాయన పథంబున కడ్డంబ శయనించి లాంగూలలీలాచాలనంబుఁ జేసిన. అర. 3-316

2. మార్గము.

క. శ్రీకరణ నిపుణ పదపద్మా కేవలసత్త్వసద్మ మాయావ్యవధ్యా త్యేకాయన గమ్యా. శల్య. 2-1

3. వర్తనము.

క. పరమాత్ముని నారాయణుఁ, జిరంతనుని భక్తశేముషీనిష్ఠా స్వీక రణైకాయనుని నమస్కరణంబునఁ దలఁతు నతుల షడ్విధ భూతిన్. శాంతి. 4-248

4. నెలవు, స్థానము.

క. నారము లనఁగా జలముల, పే రయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్, వారము లయనం బగుటను, నారాయణుఁ డంద్రు జనులు నన్నుఁ గిరీటీ. శాంతి. 6-421

5. సూరుని యొక్క దక్షిణోత్తరదిగ్గమనములకు పట్టు కాలము. అర్ధ సంవత్సరము (ఉత్తరాయణము, దక్షిణాయనము)

క. మాసర్త్వయనాబ్దమయోదార్యాసిత రూపుఁడయి సృష్టిఁ బ్రళ యంబు దగం జేసి పొలుపారు శౌరి. శాంతి. 2-85

6. సూర్యుఁడు దక్షిణోత్తర దిశలకుఁబోవుట.

క. అయన వశంబునఁ దేజో, వియుక్తుఁడై రవి ప్రతాప రహితుఁడగు.. శాంతి. 4-407

**అయము** సం. వి. అ. పుం.

1. భాగ్యము.

చ. ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడు కూడది తెప్పకూడు దక్క య నయహీనతం దమకు నాపదయైనెడ నిట్టునట్టు నేమియు ననలేని కూడదియు, మేపడియై చను నీవు మాదేవం, బ్రియుఁడవు గావు మాకు ధృతిపెంపఱ నాపద లేదొకింతయున్. ఉద్యో 2-222

2 మంగళము, శుభము.

అయమహితా. శాంతి 4-6

3. పూర్వజన్మ సుకృతము.

అయ నయశాలి. ఆది. 4-250

**అయశ్శంకుఁడు** సం. వి. అ. పుం.

కేకయ రాజయి పుట్టినదానవుఁడు. ఆది. 3-80

**అయశ్శిరుఁడు** సం. వి. స్. పుం.

కేకయ రాజయి పుట్టిన దానవుఁడు. ఆది. 3-80

**అయస్సు** సం. వి. స్. న.

ఉక్కు, ఇనుము.

ధృతరాష్ట్రుం డిట్టివాఁడు గాఁగల వాఁడని తొల్లి యెఱింగి త్రికాలవేది యైన కృష్ణుం డయోమయంబుగా భీమప్రతిరూపంబు సేయించి.

స్త్రీ. 1-126; అర. 1-209

**అయాచకుఁడు** సం. విశే. (అ. ఈ. అ.)

యాచింపనివాఁడు, అడుగనివాఁడు

చ. అడిగిన నిచ్చు కంటెను నయాచకుఁగాఁగ నెఱింగి యిచ్చు టెక్కుడు ఫలమిచ్చు. అను 2-348

**అయాచనము** సం. వి. అ. న.

యాచింపకుండుట, అడుగకుండుట.

వ. పాండవాగ్రజుండు యాచనా యాచనంబులలో నెయ్యది దానార్థం బగునని యడిగిన నతనికిఁ బితామహుం డిట్లనియె

అను. 2-342

**అయిదు** దే. (సంఖ్యా వాచకము)

ఐదు.

వ. తన తోఁబుట్టువు లేవురకు నిలువ తావు లయిదిచ్చిన సర్వశాంతి యగు. ఉద్యో. 1-377

**అయిదూళ్లు** దే. సమ.

పాండవులు సంధిప్రయత్నకాలమున దుర్యోధనుని ఇమ్మని కోరిన గ్రామములు 1. కుశస్థలము, 2. వృకస్థలము, 3. వాసంతి, 4. వారణావతము, 5. ఏదేని యొక్కటి.

వ. కుశస్థలంబును, వృకస్థలంబును, వాసంతియు, వారణావతంబును జాలుఁ గాదేని మఱియు నెందేనియు నొక్కటి యగునట్లుగాఁ దనతోడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయిదిచ్చిన సర్వశాంతి యగు. ఉద్యో. 1-377

శ్లో. అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతమ్
అవసానం భవత్వత్ర కంచి దేకంచ పంచమమ్.
సం. భా. ఉద్యో. 31-19

శ్లో. అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతమ్
అవసానంచ గోవింద కంచి దేవాత్ర పంచమమ్.
సం. భా. ఉద్యో. 71-33

శ్లో. అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతమ్
అవసానం మహాబాహో కంచి దేకం చ పంచమమ్.
సం. భా. ఉద్యో. 31-7, 8

సంస్కృత భారతమునఁ జెప్పఁబడిన పై మూఁడు తావులం బట్టి చూడఁగా పాండవులు కోరిన గ్రామములు 1. అవిస్థలము, 2. వృకస్థలము, 3. మాకన్ది, 4. వారణావతము, 5. ఏదేని యొకటి.

ఆంధ్ర మహాభారతమునకు సంస్కృత భారతమునకు ఈ గ్రామనుల పేళ్లయందు భేదము గన్పించుచున్నది. సంస్కృత భారతమునందు గ్రామముల పేళ్లు చెప్పఁబడిన మూఁడు స్థలములలో మొదటి స్థలమునందు మాత్రము ఆంధ్ర భారతమునఁ బేళ్లు చెప్పఁబడియున్నవి. మిగిలిన తావులయందు వివరింపఁబడక.

క. ఇచ్చట బంధులు నీవును, నచ్చెరువడి వినుచునుండ నయిదూళ్లును మా,కిచ్చినను జాలునంటిని. ఉద్యో. 3-11

ఉ. .. తా,నంతన భూములేవురకు నైదు సుయోధనుఁడిచ్చునొక్కొ ఉద్యో. 3-101

అనిమాత్రము చెప్పఁబడియున్నది. సంస్కృతభారతములో నెచ్చటఁ జెప్పఁబడియున్నను సమముగానే యున్నది. కాని ఆంధ్ర భారతమున అవిస్థలమునకు మాఱుగా కుశస్థలము, మాకందికి మాఱుగా వాసంతి చెప్పఁబడియున్నవి. కొందరు (సూ-అ) అవిస్థలమే కుశస్థలమనియు ఇంద్రప్రస్థమనియుఁ జెప్పుచున్నారు. ఈ విషయమునకై చూ. కుశస్థలము- ఇంద్రప్రస్థము. మాకంది వాసంతియై నటులఁగూడ నెచ్చటఁ గనఁబడుటలేదు. చూ. వాసంతి.

వావిళ్లవారి సంస్కృత ప్రతిలో మొదటి తావున మాత్రమే (ఉద్యో. 80-19) కుశస్థలము అని ఉండి మిగిలిన రెండు తావుల అవిస్థలము అనియే గలదు. ఇది తెనుఁగు నుండి సంస్కృతమునఁ జేరిన ప్రమాదమై యుండును. అందును వాసంతి లేదు.

**అయిన** దే. అవ్యా. ద్రు. (ఐన)

అను ధాతువు యొక్క చేదర్థకరూపము వికల్పముగాని పఠాంతరముగాని తెల్పును.

క. దయమాలి పోవనేటికిఁ, బ్రయత్నమునఁ బొదువ దైవబలమున
మీకుం, బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం, డయినను మఱి పోవ
రాదె యని చెప్పటయున్. (ఇది పఠాంతరము) శాంతి. 3-373

చ ...ఇం,క నమరలోకమైన నరకంబయినన్ సరి మాకు నారయన్.
కల్యా. 2-285

(వికల్పము)

(విఁ) అను ధాతువు యొక్క భూతార్థక విశేషణము.

వ. భవత్ప్రసాద భాజనంబులయిన వారికి దుర్లభంబులగు వస్తువులుం
గలవే. ద్రోణ. 2-218

**అయిపోవు** దే. అ. క్రి.

సమగ్రముగా నగు.

చ. అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు ని,ప్పుడు
మును నిస్పృహుండ వయి పోవఁగఁ గన్నఁగులంబువారు ని,
ప్పుడమి నృపాలురున్ బ్రదికి పోదురు. శాంతి. 1-62.

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగె చిత్తము నీఱయిపోయె నాకు నీ,రవ
ముస.  విరా. 4-177

**అయుక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

1. కూడనిది, తగనిది.

క. ...తనలావున కధికమయిన పనిసేయుట యుక్తమును నపథ్యము
నగు భోజనములు హరించు నాయువు.  అను. 5-132

**అయుతము** సం. వి. అ. న.

పదివేలు.

మ. ...నాగాయుతసామ్యకీర్తిత బలోదగ్రుం.  ఉద్యో. 2-172

**అయుతానీకుఁడు** సం. వి. అ. పుం.

పూరు వంశోద్భవుఁడైన మహాభౌముని పుత్రుఁడు. ఇతని తల్లి ప్రసేన
జిత్తు పుత్రియైన సుపుష్ట (సుయజ్ఞయని సంస్కృత భారతమున) భార్య.
పృథుశ్రవసుని కొమరితయైన కామ (భాస యని సంస్కృతభారతమున).
ఇతని కుమారుఁడు అక్రోధనుఁడు.  ఆది. 4-2

పురుషమేధము కొఱకు పదివేల పురుషులను దెచ్చినవాఁడు గాన వీనికి
అయుతానాయి అని పేరు వచ్చెను.

శ్లో. యం పురుషమేధే పురుషాణా మయుతమానయ,
తత్తస్యాయుతానాయి.  సం. భా. ఆది. 68-20

**అయుతాయువు** సం. వి. ఉ. పుం.

దుర్యోధన పక్షీయుఁడైన యొక క్షత్రియుఁడు. కళింగ దేశీయుఁడు.
శ్రుతాయువు సోదరుఁడు. ఇతని కుమారుఁడు నియుతాయువు.

ఈ అయుతాయువు ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున అర్జునునితోఁబోరి
మరణించెను.  ద్రోణ. 3-96

ఇతనికి సంస్కృత భారతంబున అశ్రుతాయువు. అచ్యుతాయువు అను
పేళ్లు గలవు. అయుతాయువు అను పేరు గాన్పింపదు.

సం. భా. ద్రోణ 63-7-74

**అయోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

అనర్హము, తగనిది.

చ. అవినయ బుద్ధివై హరికి నర్ఘ్యమయోగ్యమ యంటి నీవు మూర్ఖవు
శిశుపాల. సభా. 2-24

**అయోగ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అనర్హుఁడు, తగనివాఁడు.

తే. వధమునకు నయోగ్యుం డగువాని జంపి, తే పరాజితుఁడైతె నీ
తెఱఁగు సెపుమ. మౌస. 207

**అయోధ్య** సం. వి. అ. స్త్రీ.

కోసల దేశమునకు రాజధాని. ఉద్యో. 3-314

ఇది సరయూ తీరంబునందున్నది. దీనికి సాకేతమని మఱియొక పేరు గలదు. శ్రీరామచంద్రమూర్తి జన్మస్థలము. ఇప్పుడు Oudh, అయోధ్య అదికాదు. ఆనాఁటి అయోధ్య సముద్రమున మునిఁగిపోయినది. అయోధ్యా జీవకోటి యంతయు శ్రీరామునితో పరమపదము పొందెను. శత్రువులచే యోధింప శక్యముగానిది అయోధ్య.

**అయోనిజ** సం. విణ. (అ. ఆ. అ.)

యోని నుండి పుట్టనిది, స్త్రీ గర్భమునుండి రానిది.

వ. ఆ ద్రుపదుండు తనకూఁతు నగ్నికుండ సముద్భవయైన దాని
నయోనిజ నగణ్య పుణ్యలావణ్యగుణసమన్విత. ఆది. 7-4

సం. వి. ఆ. స్త్రీ.

ద్రౌపది.

చ. పరమ పతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధర్మరత
నయోనిజం బ్రకృతి మానవ భామినిగాఁ దలంచి...
సభా. 2-255

**అయోనిజాతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

యోని నుండి పుట్టనివాఁడు.

వ. పశు యోనిజాతులు నయోనిజాతులును లోనుగా సద్ద్విజులును
రాజవరులు నగుట గన్నదిగాదె కావున మునివరుల నృపవరుల

వలనం గలిగిన జన్మంబులెల్లను బీజప్రధానంబులై యతిశయిల్లు. అను. 2-28

**అయోనిజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

యోని నుండి పుట్టనివాఁడు.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, లపరిమిత భుజబలాఢ్యులు. ఉద్యో. 3-210

**అయోమయము** సం. విణ. (అ. ఈ. అ.)

ఇనుముతోఁ జేయఁబడినది.

వ. త్రికాలవేదియైన కృష్ణుం డయోమయంబుగా భీమ ప్రతిరూపంబు సేయించి. స్త్రీ. 1-129

**అయ్య** దే. వి.

(సం. ఆర్యః. ప్రా. అయ్య ఓ, అజ్జపా, అయ్యో, తణయన్ అను వికృతిని అని శబ్దసామ్యమునుబట్టి చెప్పుదురు. అట్లైన తెలుఁగువారికి అమ్మ, అయ్య లిర్వురు లేరేమో.) కన్న తండ్రి, జనకుఁడు.

సీ. ...మంత్రులాఁ,తనిఁజూపి యతని నందనుని రాజ్యమునకు బట్టము గట్టికొని రక్కుమారుండు, దమయయ్య చేటు చిత్తమునఁదలఁచి. అశ్వ. 1-18

క. మా యయ్యకుఁ బాయక పని,సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండున్, మీ యయ్య. ఆది. 8-187

వ. మాతలియు నర్జునుం జూచి... మహేంద్రుండు మీ యయ్య భవద్దర్శనం బపేక్షించి నిన్ను నమరావతికి రాఁబనిచె. అర. 1-346

2. తండ్రి వరుసవాఁడు, పెదతండ్రి, పినతండ్రి.

క. మీ యయ్యా మీరు వనవా,సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్, డాయుట విని ముదితాత్ముం,డై యిట పుత్తెంచె నన్ను నను మీ మొదలన్. ఉద్యో. 1-261

3. వాత్సల్యమును దెలుపును.

తే. అయ్య నేము నీ పితరులము. అర. 2-322

తే. కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్య, బ్రదుకుచవి యెంతయైన నపథ్యములకు, వేడ్కసేయుదురయ్య వివేకులెవ్వి,తమున వా ఖుద్ధి వినవయ్య తమక మ్ముడిగి. విరా. 2-78

4. పూజ్యతను దెలుపును.

వ. అయ్యా, నీవు బ్రాహ్మణుఁడవు భృగువంశ సముత్పన్నుండవు. ఆది. 1-158

5. పురుషు నుద్దేశించిన ప్రార్థనమందు క్రియలపై ననుప్రయుక్తమగును.

ఆ. తండ్రి, నీకు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు తెఱఁగు, సమయ సముచితముగ సమకట్టుమయ్య యీ, రాకు మారు లవిధిఁబోకయుండ. విరా. 1-181

తే. నెయ్య మొనరంగ నెఱిఁగింపు మయ్య మాకు. ఆది. 8-224

6. పురుషుల నుద్దేశించి పలుకునపుడు అనుప్రయుక్తమగును.

చ. ...పోకడ మాలిన వారమయ్య యి,ద్దురిత శరీరముం దినఁగ దోసము మాకని వార లొల్లమిన్. శాంతి. 3-505

చ. ...అ,య్యనఘుల పైతృకంబయిన యంశము మిన్నక వజ్రపాణి కై,నను గొనఁబోలునయ్య, కురునందన. ఆది. 8-86

7. ప్రశ్నార్థకమును దెల్పును.

ఆ. విను మసత్య లోభమున సిరియగునె యాఁ,కొని మునిఁడి దినినఁ గ్రొవ్వు లావుఁ, గలుగునయ్య శకుని కర్ణ దుశ్శాసన, మంత్రి తంబు గార్యతంత్ర మగునె. (ఇచట కాక్వర్థము) ఉద్యో. 3-383

ఆ. ...పుత్రవరులఁ, దగిలి కాచునట్టి తల్లి సర్పములకు. నేల యలిగి శాపమిచ్చెనయ్య. స్త్రీ. 1-170; అర. 2-148

8. పరిహాసమును దెల్పును.

క. వీరెవ్వరయ్య ద్రుపద మ,హారాజులె యట్లు కృపణులయి పట్టు వడన్, వీరికి వలసెనె యహహా మ,హారాజ్య మదాంధకారమది వాసెనొకో. ఆది. 8-90

**అయ్యది** సర్వ. (ఆ + అది)

అయది.

ఉ. ...నాకు నింతయును నేర్పడఁగా వెలిగింపుఁ దున్నరూ, వయ్యది వావుడున్. విశా. 1–190

**అయ్యము** దే. వి.

ఆయను, ఆమె.

చ. అయ్యమయూఁ డుణ్యుఁడు గృష్ణుఁడు కార్యకాదముల్, పలికెడు వార లిట్లు దెగఁ బాటిరి. ఉద్యో. 4-22

**అయ్యయి** సర్వ.

అయ్యై — ఆయా.

ఉ. ఆయ్యాయిచోటుల నాచరింపరే. అను. 2-394

సీ. అయ్యాయిబంధుల నందునందు, నందును నిలుచు నట్లొందు గనియ మించి. హాస. 193

**అయ్యు** అవ్య. క్రు.

1. అయియు, అయినప్పటికిని.

వ. అమ్మౌని వచనం బమోఘంబు గావున నీవు సర్వజ్ఞుండ వయ్యు మాలో నగ్రపూజ్యుండ వని యొడంబఱచి. కల్య. 2—195

క. అనఘా, యీ యజ్ఞము విధి, సనాథ బుత్విక్ప్రయోగ సంపూర్ణం బయ్యును గడచననేరదు నడుమన యుడుగును భూసురోత్తమ నిమిత్తమునన్. ఆది. 2-207

2. అయి.

ఉ. ....ధర్మని,స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవ ముండెడున్. ఉద్యో. 3-278

సీ. చక్రధరుండయ్యు జలరుహ నాభుండు, గాండీవధరుఁ డయ్యుఁ బాండవుండు, నరిది రవ్వనమున నుభయ పార్శ్వంబుల. ఆది. 8-261

**అయ్యై** సర్వ. అయ్యాయి, ఆయా

వ. ...వారి వారికి నయ్యై వేషంబుల కమగుణంబులగు నలంకారభరణ

మాతాపితృద్రవ్యకర్షణంబులు సన్నిహితంబులయినం జూచి సంతసిల్లి
విరా. 1-184

క. అరణ్య కర్మంబుల దెస, నెయ్యం బల్కరాఱ. అను. 5-306

**ఆరక్షణము** సం. వి. అ. న.

కాపాడకుండుట.

సీ. శరణాగతారక్షణమ్ము దుష్కృతాభిరతియు. ద్రోణ. 1—221

**అరగతి**

సందేహము, జంకు.

చ. నరుపకుఁ బూని పల్కుటి వినం జవిమాలిన దొడ్డపల్కులే, నరగతి లేక బెట్టదరినప్పుడు నూడుము వన్ను నాతనిన్. కర్ణ. 2-28

**అరణము** వై. వి. (సం-హారణమ్)

1. వివాహకాలమందు వధూవరుల కిచ్చు ధనాదికము.

వ. సౌభద్రునకు భద్రసామజ సప్తశతియును లోకోత్తరతురంగ దశసహస్రంబును సలక్షణ గోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనము లక్షయు మఱియు నానా ప్రకారంబులగు ధనంబులు నరణంబిచ్చె. విరా. 8-403

సీ. ...అగణ్య మహావస్తు, వాహనంబులు గొని వాసుదేవుఁ డనుజకు నరణ మీ నర్థితోఁ జనదెంచె. ఆది. 8-215

**అరణి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ.

ద్రచ్చి నిప్పు పుట్టించెడు కొయ్య.

ఆ. అరణి వగ్ని వొతము కరణి దేవకియందు, విప్రకర్మ యజ్ఞ వేదగుప్తి కై జనించె నెవ్వఁ డవ్వసుదేవ నందము భజింతు నేకతా నిరూఢి. శాంతి. 2-28

**అరణ్యము** సం. వి. అ. న.

అడవి.

ప్రేతభూమి పరిసరారణ్యంబునందు. విరా. 1-161

**అరణ్యవాసి** సం. వి. న్. పుం.

వానప్రస్థుఁడు.

తే. ...పమి, వ్రతము ఫలిపిన శాపనిర్హరణ మగుటఁ, బుణ్యగతి
కల్మి దప్ప దరణ్యవాసికి. అను, 5-22

**అరతి** సం. వి. ఇ. స్త్రీ.

ప్రియము లేమి.

తే. రతియు నరతియుఁ బవనంబు గతియు నుడిపి, ధారణా నిశ్చలుం
డయి తన్నుఁ దాన, కనుచునుండెడి యోగి. శాంతి. 5-592

**అరత్ని** సం. వి. ఇ. పుం.

మోఁచేయి మొదలు చిటికెనవ్రేలి చివరవఱకు నుండు కొలఁత, మూర.

క. పడరత్ని ధనుర్ధరుఁ డై,య్యెడ నజితుఁడు గాన. ఆది. 7-15

**అరదము** వై. వి. (సం. రథః. త. ఇరదము)

రథము, తేరు.

క. శరములు శరాసనము న,య్యరదముపై డిగ్గ విడిచి యతిరథస
మునన్, ధరణికి లంఘించి. విరా. 4-72

**అరము** సం. వి. అ. పుం. న.

1. బండికంటి యాకు.

వ. ద్వాదశార చక్రంబుం బరివర్తించుచున్న వారి నార్వుర గుమా
రుల. చూ. అంచు. ఆది. 1-108

2. కోణము.

మాలిని. అసురదళన లీలా వ్యాప్తి దీప్తార శోచి,ర్లసిత. భీష్మ.2-410

**అరయవచ్చు** దే. స. క్రి.

విచారించు.

తే. అరయ వచ్చినఁ దన మేను నెరవ తనకు, నొండు రూపులు దక్కఁ గ
యునికి యరుదె. స్త్రీ. 1-38

**అఱయు** (అరయు) దే. స. క్రి. (క్రి. అరయు. త. అరాయ్)

1. విచారించు, ఆలోచించు.

తే. తెనుఁగు బాస వినిర్మింప దివురటరయ, భవ్య పురుషార్థ తరు

పక్వఫలము గాదె. విరా. 1-18

2. పరిశీలించు.

క. వెనుఁ బోడవుఁ బలుపు సొంప,మ్మును గలయది దీన నెల్ల పురుషులకుఁ బ్రయోజన మొకఁడు లేదు నేరం,బనఁ జూడఁగ నరయ నెక్క సమకట్టంగన్. విరా. 1-165

3. పరామర్శించు.

ఆ అకట యూఁడుకూయు నాలకూయును లాఁతి, వారికైన నరయ వలయు ననిన, నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు, నూడనేర్చె ధర్మసూనుఁ డపుడు. విరా. 2-177

4 పరీక్షించు.

చ. అనుఁడు విషణ్ణమైన హృదయంబున గారవ మొంద నైపుణం, బున నుచితంబుమై నరసి పొచ్చెము లేమిఁ దదీయ సేవఁ గై,కొనుటకు నిశ్చయించి తన కూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె న,ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్. విరా. 1-248

5. వెదకు, అన్వేషించు.

క. దేవర యానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్న యెడయే మరయం గా వెదలి. విరా. 3-80

ఆ. పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గమంపుఁజోటు, దొనదొనగుహ యాదిగాఁగ నెందు నరసియరసి. విరా. 3-82

6. చూచు, వీక్షించు.

మ. బలియుం డా సొబగుండు భావభవ దర్పభ్రాంతుఁడై వచ్చి ని,శ్చల సర్వాంగతనున్న నన్నరసి నీ చందంబుగాకున్న నా,కులతం బొందెడు. విరా. 2-281

7. ఏలు, పోషించు, కూడుగడ్డ యిచ్చి భరించు.

క. నీచము లయ్యెడు పనులకు, నా చాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా, నీ చిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ

నరయుము నన్నున్. విరా. 1-318

తే. శత్రుభీతికయును నరి పక్షభాగ, మాహరించుటయును భృత్యు
నరయుటయును. అను. 5-11

శ్లో. భృత్యానాం భరణం ధర్మః కృతే కర్మణ్యమోఘతా.
సం. భా. అను. 208-128

8. కనిపెట్టు, జాగ్రత్తతోఁ జూచు.

తే. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టు లరయ, వలసె నెమ్మెయి వారయు
మంసి దస్సె, వొచ్చియైనను నేమఱ కిచ్చఁ దలఁచి, తడమి నావేత
దివన వెఱయుమమ్మ. విరా. 2-214

9. రక్షించు, కాపాడు, పాలించు.

క. రమ్మింద్ర పదవి వేకొని, మమ్మెల్లను నరయుమనిన మానవపతి
నా, కమ్మహిమకుఁ దగు మాహాత్మ్యమ్ము గలదె నన్ను నేల
యలఁచెద రనినన్. ఉద్యో. 1-145, అర. 4-391

ఆ. కొడుకుఁబోలె నరయ గురుఁ బోలెఁ గొలువంగ, నగ్నిఁబోలె నిష్ఠ
నర్చితుఁడుగఁ, జేయవలయు విప్రు, అను. 1-160

శ్లో. పుత్రవచ్చైవ తే రక్ష్యా ఉపాస్యా గురువచ్చ తే,
అగ్నివచ్చోపచార్యా స్తే బ్రాహ్మణాః కురుసత్తమ.
సం. భా. అను.

10. ప్రతీక్షించు, నిరీక్షించు.

సీ. ...అరుణుని యుత్తరాయణము వచ్చునంతే టరసికొని యుండి
నా కడ కరుగుదెమ్ము. అను. 5-442

11. తెలియు.

చ. కనుఁగొని యప్డు గ్రొత్తయగు కౌతుకవృత్తి మునింగి పల్లటిల్లిన
ధృతితో క్రమం బరయలేని మనంబు చలింప విరా. 2-247

12. ఊహించు.

చ. పరి సమచెంచి గోగణముఁ బట్టి రనన్ విని విన్నగాన మీఁ, దర
యక రాజనందనుఁ డహంకృతి మైఁ బఱతెంచి సైన్య వి,స్ఫుర

అమ్మఁ జూచి భీతిఁ దవులుద్ధి ధళింగినఁ గాలఁజొచ్చె. విరా. 4-78

13. యోగక్షేమములు విచారించు.

క. చూపుటయు నగ్గలంబగు, నేపునఁ గిమ్మీర వైరి యేన కలఁచెదన్, రూపు సెడఁగ నిమ్మేనలను, భూపతి నరయంగ నీవ పొమ్మని యెం నృపా. కర్ణ. 8-27

14. ప్రోగుచేయు.

ఆ. సాంగవేదవేదియగు పురోహితుఁ డెవ్వ, నగర మెలఁగఁ వలయుఁ దగవుఁ గృపయుఁ, జిక్కుటియును గలుగు సచివు నప్పనములు, నరులు నరయ బనుచు నది విభుండు. శాంతి. 2-298

అరవాయి దే. వి.

వెనుదీయుట, శంక, జంకు.

క. ఈ యెడ ననుఁగని వారణ, సేయుడు నితఁ డగ్గమైన చిచ్చుబలె పిడుగై, పోయి పయింబడు నీ వర, వాయించుకలేక పఱపవలయు రథంబున్. విరా. 5-14.

తే. ఇవ్విధంబున గురుసుతుఁ డేపు మిగిలి, చనఁగ. గృపుడును గృత వర్మయును దలిర్చు, కడక పతనితోడ నడచిరిగాని వారి, పలన నించుకయును నరవాయి లేదు. సౌప్తి. 1-140

అరవాయిగొను దే. అ. క్రి.

1. వెనుదీయు.

వ. ఇట్లిరువాఁగు నరవాయి గొనక పెనంగుచుండ. విరా. 8-170

2. శంకనొందు, సందేహించు.

క. కురు సైన్యము నిస్సారం, బరయఁగ మనబలము లెల్ల నతి దృఢ ములు నీ, వరవాయి గొనక నడపుము, ధరణీశ్వర సేన మొగము దైవము నీకున్. ఉద్యో. 4-111

3. జంకు, భయపడు.

వ. ...పాండవాగ్రజుండు ధృష్టద్యుమ్నుం గనుంగొని గురుని పురో భాగంబునఁ గౌరవసేన భీమసేనుండు దాఁకి తెరల్చుచున్నాఁడు.

సీ. ... నీవక్కుంభసంభవు సంరంభంబు మాన్పు ముం తద్వినాశం బాచ
రించుటకయి యనలంబున జనియించినవాఁడవు, శిఖండి ప్రముఖ
పాంచాల కుమారులం గొని యరవాయి గొనక యడరుమని పలికె.
ద్రోణ. 5-265

**అరవిందగంధి** సం. వి. ఈ. స్త్రీ.

స్త్రీ.

ఉ. ఇయ్యరవిందగంధి కులమేమి చరిత్రము చందమెట్లు. విరా, 2-40

**అరవిందనాభుఁడు** సం. వి. అ. పుం.

శ్రీకృష్ణుఁడు.

వ. కొలువు వారెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు
నవతరించి యరవిందనాభుండు. ఉద్యో. 3-247

**అరవిందభవుఁడు** సం. వి. అ. పుం.

బ్రహ్మ.

చ. ...నరుండు సిద్ధుఁడై, వినుతికి నెక్కుఁ బొందు నరవిందభవాం
తికవాససంపదన్. అను. 2-89

**అరవిందము** సం. వి. అ. న.

పద్మము.

అరవిందభవుఁడు నమరులుఁ జనుదెంచి ప్రార్థించి. అను. 4-433

**అరవిరి** దే. వి.

సగము వికసించిన పువ్వు.

సీ. అరవిరి నెత్తావి నడరించుచున్నిద్ర, విటపీటి సౌరభ వితతివొదలం.
ఉద్యో. 2-112

**అరశోచి** సం. వి. ఇ. పుం.

చక్రము.

(అరము = చక్రపుటాకు, అరములయొక్క ప్రకాశము గలది అరశోచి-
చక్రము)

మాలిని, అసురదళన లీలావ్యాప్తి దీప్తారశోచిర్లసిత పరశు గాఢా
లంకృత. భీష్మ. 2-419

**అరసావు** దే. వి.

సగము చచ్చుట, మూర్ఛ (అర + చావు)

చ. ...అతండు నీ మఱం,దికి నరసా వొనర్చె ఘనతీవ్ర సముజ్జ్వల మార్గణంబులన్. ద్రోణ. 5-178

**అరాజకత్వము** సం. వి. అ. న.

రాజు లేకపోవుట.

అ. ...అరాజకత్వ, దోషజాతమైన దురిత శాఖాళ్యంబు, గుతిలపెట్ట భూమి యతలమునకుఁ, బోవ. శాంతి. 2-89

**అరాజకము** సం. విణ. (అ. జికా. అ.)

రాజు లేనిది.

వ. ...అరాజకంబయిన రాజ్యం బకలంకంబుగాఁ బ్రతిపాలించుచున్న కొడుకు నఖిల ధర్మవిదు గాంగేయుం జూచి సత్యవతి యిట్లనియె. ఆది. 4-217

**అరాతి** సం. వి. ఇ. పుం.

శత్రువు

సీ ...దుర్దమారాతి, మర్దన చాతుర్య మహితభుజుఁడు. విరా. 3-162

**అరాతితనము** మిశ్ర. వి.

శాత్రవము, శత్రుత్వము.

క. వెట్టన సభలో నేర్వర, కట్టెదుర నరాతితనము గాకెంతయు వా,రెట్టి తులువలో ద్రౌపది, నట్టు పటిచెడిదె, జ్ఞాన మాడదె యెందున్. ఉద్యో. 1-344

**అరాళము** సం. విణ. (అ. ఆ. అ.)

1. వలయములుగా (చుట్లు చుట్లుగా) ప్రసరించు- అలలు అలలుగా ప్రసరించునది- కుదురుగా నిలబడక ప్రసరించునది.

ఉ. ...వచ,శ్శ్రీ లలితుండు వచ్చి- నిలిచెన్ హరినీలవినీలవిగ్రహా, రాళరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లి ముందటన్.

(ఆరాః వేష్టనాని సంత్యస్యేత్యరాళం) ఆది. 4-239

శ్లో. అరాళం వృజినం జిహ్మమూర్మిమత్కుఞ్చితం నతమ్
ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్రమిత్యపి. అ. కో.

2. వంకరయైనది.

తరలము. ...లసన్మహోత్పలపత్త్రినేత్ర యరాళకుం,తలవిభాసిని.
ఆది. 7-19

శ్లో. సుభగా దర్శనీయాంగి స్వసితాయతలోచనా
శ్యామా పద్మపలాశాక్షీ నీలకుంచితమూర్ధజా, సంభా. ఆది. 68-45

(ఇచ్చట పాఠాంతరము 'మదాళి కుంతల' అయుక్తము)

**అరి**[1] (క. త. అరి.)

కవ్వము, పన్ను.

క. అరి యని విప్రులచేతను, ధరణీశులు రూకయును మొదలుగాఁగొన
రెవ్వరును. ఆది. 6-268

క. అరి యాఱవ పాలు గొనుచుఁ, గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి
మధ్యస్థా,చరణంబునఁ బాలించుట పరమపదముఁ జేర్పు విడుచు
భయ సంశయముల్. (చూ. అప్పనము).

శాంతి. 1-176; శాంతి. 2-298

**అరి**[2] దే. వి.

అల్లెత్రాడు, వారి, మౌర్వి.

గీ. అరిబలంబుపై నొక్క దివ్యాస్త్రమేయఁ, దఱఁచి యరిఁబోసి తిరిగి
యుదగ్రవృత్తిఁ, గవిసి. భీష్మ. 3-386

**అరి**[3] మతుబర్థకము.

కలది, కలవాఁడు అను నర్థమున వచ్చును.

చ. వెరవరి గాక వీఁడు కురువీరులకుం బొదసూపువాఁడె.

(వెరవు + అరి) విరా. 4-91

తే. ...తియ్యఁ,పండు వెస వాఁచికొనిన నేర్పరియుఁ బోలె.

(నేర్పు + అరి) ద్రోణ. 5-248

**అరి**[4] సం. వి. ఇ. పుం.

1. శత్రువు.

వ. నీకుం బోలిన భంగి రహస్య భంగంబు గాకుండ పరిరక్షణంబు సేయుము. విరా. 2-208

2. చక్రము (అరములు గలది) చక్రాయుధము.

మాలిని. స్ఫురదరి దృఢశూలం వ్యాఘ్రత్రి సంశస్త్రహస్తా అను. 4-451

**అరిందముఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. శత్రువుం నణఁచువాఁడు.

క. క్షత్రియులము పాండుప్రియ, పుత్త్రిం మేనగ్రజుండ ధూనుతులు ధర్మత్సుత్రార్జున యమ లమల చరిత్రులు నలువురను వీరరిందము లెందున్. ఆది. 7-286

2. కామాద్యరిషడ్వర్గమును గెలుచువాఁడు.

క. తక్షకుఁడను పన్నగుఁడు పరీక్షితుఁ గలచేశాలె నేఁ డరిందము నతకిన్, రక్షింపఁగ బోయెద. ఆది. 2-188

**అరిపోఁయు** దే. స. క్రి. (√అరి)

సఖ్యముచేయు, వారి విగించు, ఎక్కుపెట్టు.

సీ. .. దర్పంబున శిరము ద్రుంచుటకు సరమరిఁ బోయుటయుఁ గృతవర్మ రెండమ్ముల విల్లు నయ్యమ్ముఁ దునిమె. ద్రోణ. 1-169

**అరికట్టు** దే. స. క్రి.

1. (దారులు) కట్టు, అడ్డగించు, నిరోధించు.

మ. వడి నడ్డం బరికట్టి నెట్టన హరి వ్రాతంబు వెన్ ద్రూఁకుంన్. ఆర. 7-99

2. చుట్టుకొను, పరివేష్టించు.

తే. అతని ముఖ గహ్వరంబుల నద్భుతముగ, నుగ్రదహన శిఖావళు లుద్భవించి, వేల్పు మూఁకల నరికట్టి వేల్పఁ దొడఁగె, నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు. ఆర. 5-218

**అరిగాఁపు** దే. వి. (√అరి[1])

పన్ను చెల్లించువాఁడు, కప్పము చెల్లించు సామంతుఁడు.

సీ వైదేహ పాండ్రాది వసుధేశు లెవ్వని, కడిమి సొంపున నరిగాఁపు లైరి -ఆ- యట్టి కర్ణు డీల్గెనట్టె. కర్ణ. 1-211

సీ. పరువడి దక్షిణ పశ్చిమోత్తర పూర్వ, దేశస్థులయిన మహీశులెల్ల,
తే- నీక యరి గాంపులై రిప్డు. అర. 5-345

**అరిగొను** దే. స. క్రి.

పన్ను దీసికొను, కప్పము పుచ్చుకొను.

మహీపతుల చేత నరిగొని. సభా. 1-227

నీలుచేత నరిగొని. సభా. 1-260

క. పరుసధనము మెయి నరిగొనఁ, జొరఁ దగదది పొదుఁగఁగోయు
చొప్పగు. శాంతి. 2-299

**అరిత్వము** సం. వి. అ. న.

శత్రుత్వము.

క. అరిత్వము దొలంగి మైత్రి యలవఱుపు మదిన్. శాంతి. 3-205

**అరిది** దే. విశే. (క. అరిదు, అరుదు. త- అరిదు)

1. అసాధారణము, అపూర్వము, అపురూపమయినది.

చ. అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా సురగుల
నెల్లఁ గాచిన మహోరగ నాయకుఁడు. ఆది. 1-105

క. అరిది విలుకాని యుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పి చనినం
జను. ఉద్యో. 2-36

2. అద్భుతము, ఆశ్చర్యకరము.

తే. నెరయ కినుకఁ బెన్వెడఁదయై నిప్పులురలు, కన్నుఁగవ శల్యుఁ
జూచిన మన్న యునికి, నతఁడు నీఱు గాకుండుట యరిదియయ్యె,
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ... శల్య, 1-280

శ్లో. నిరీక్షితోఽసౌ నరదేవ రాజ్ఞా పూతాత్మనా నిర్దహతా కల్మషేణ,
ఆసీన్నయద్భస్మ సాన్మద్రరాజస్తదద్భుతం మే ప్రతిభాతి రాజన్.
సం. భా. శల్య. 17-40 (వావిళ్ల)

మిక్కిలి సాహసమైనది.

ఆ. రాజుఁ గూల్చి జయము దేజంబుఁ బొందిన, యత్యుదగ్ర విభవు

లైన యరుల, శిబిర మాక్రమింపఁ జిత్తంబులందుఁ ద్రెం,పొదవి
ముప్వురట్లు గదియ టరిది. సౌప్తి. 1-98

4. అశక్యము.

క. మును మమ్మఁ బొగడి పదపడి, యని వారల గెల్వుప నరిదియని
పొత్తుగఁ జెప్పిన మాటకు నే నొడఁబడ, విను సంజయ పక్షపాత
వృత్తి విడువుమీ. ఉద్యో. 1-322

క. విను మంత్ర భేదమున వచ్చిన కీడున కనఘ శాంతిసేయ టరిది
గావున మంత్రులతో మంత్రావననియమం బూఁది చెప్పవలయుం
జుమ్మీ. ఆశ్ర. 1-69

శ్లో. మంత్ర భేదే హి యే దోషా భవంతి పృథివీభృతామ్.
న తే శక్యాస్సమాధాతుం కథంచిదితి మే మతిః
దోషాం శ్చ మంత్రభేదస్య బ్రూయాత్తం మంత్రమండలే.
సం. భా. ఆశ్ర. 5-24; 25

5. దుస్సహము.

క. గురుపుత్రుఁడు తేజోనిధి, సురాసురులకైనఁ దేటి చూడ నరిది
సంగరమున నీతని. విరా. 5-8

6. దుష్కరము.

క. జన రహితంబగు వనమున, నముజన్ములు ద్రుపద భూవరాత్మజ
యును నీవును నింతకాల మలయక, యునికి కడున్ దుష్కరము
మహోదాత్తమతీ.

ఆ. దానికంటె నరిది తలపోయ నజ్ఞాత,వాస ముజ్జ్వలాంగ భాసమాను,
లైన మీకు. ఉద్యో. 1-105, 108

క. బ్రదుకును జావును సుఖదుఃఖదములుగా జంతుకోటి గరుణా
మూర్తి, మదిఁ దలఁచుఁ బ్రాణ లాభము, వనలు టరిదిగాన
యట్టివారి నడిగితిన్. అను. 4-313

శ్లో. దుఃఖం ప్రాణపరిత్యాగః పురుషాణాం మహామృతే,
జానాసి త్వం మహా ప్రాజ్ఞ ప్రాణదానం సుదుష్కరమ్.
సం. భా. అను. 117-2

7. రూపాపార్థ్యము.

శ. పాండవాగ్రజా తెలివల తెలుఁ గెలింగితి వారి రచించుటయు నిట్లరిదియై యుండు. అను. 2-217

8. దుర్లభము.

క. తోడు దొనరేని యప్పటి, క్రీడి కోలఁది యట్టి దధిప కినియక విను మేఁ, దోత్రై దా నెదురుట గదుఁ, గీశు వలవదుడుగవయ్యా గెలు పరిది సుమా. ఉద్యో. 3-340

9. అసంభవము.

అ. లావు గలిగి మొక్కలమ్మునఁ గీచకా,గ్రాణి నొచ్చి ధార్తరాష్ట్రి వెరవు, వలన నొచ్చుచున్నవాఁడు గావున ధర్మ, సంగరమున నరిది జయము గొనుట.

వ. అన్యాయంబునం జంపువాఁడు. శల్య. 2-270, 271

శ్లో. భీమసేనస్తు ధర్మేణ యుధ్యమానో న శేష్యతి,
అన్యాయేన తు యుధ్యన్వై హన్యాదేవ సుయోధనమ్.
సం. భా. శల్య. 59-4

క. కను టరిది యొందు మెయి విష్ణుని భక్తిం గనుము నీవు సువ్రత యద్దేవుని వినుము భక్తవత్సలుఁ, డను నామము గలిమి దృశ్యుఁ డగు భక్తులకున్. అను. 4-376

అరియుఁబెట్టు దే. క్రి.

కప్పము చెల్లించు.

తే. సఖ్య సంబంధముఁ జేసి చక్రధరుఁడు, ద్రుపదుడును దక్కఁ దక్కిన నృపతులెల్ల, నరియుఁ బెట్టని వారులే రఖిల జలధి, వల యిత క్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి. సభా. 2-106

అరివెట్టు దే. క్రి.

కప్పము చెల్లించు.

క. ...ధర్మజుఁడు నిరంతర ధర్మశీలుఁ డాతని కరివెట్టుము రమ్మా ప్రీతి నమ్మెళమునకున్. సభా. 1-283

**అరివోయు** దే. స. క్రి.

సజ్యముచేయు, ఎక్కుపెట్టు.

అప్పార్థుఁ డాగ్నేయాస్త్రం బరివోసి. కర్ణ. 3-287

(అరిఁబోయు- అని కొన్ని ప్రతులు)

**అరిషడ్వర్గము** సం. వి. సమ. అ. పుం.

అంతశ్శత్రువుల యాఱింటి సమూహము. అవి : 1. కామము, 2. క్రోధము 3. లోభము 4. మోహము 5. మదము 6. మాత్సర్యము

అరిషడ్వర్గము చేమిట నుదయించు. శాంతి. 3-410

**అరిష్ట** సం. వి. ఆ. స్త్రీ.

హంసుఁ డను గంధర్వ విభుని తల్లి- ఆ హంసుఁడే ధృతరాష్ట్రుఁడై పుట్టెను.

వ. అరిష్టా పుత్రుండయిన హంసుఁ డను గంధర్వవిభుండు ధృతరాష్ట్రుండై పుట్టె. ఆది. 3-80

ఈమె దక్షుని కూఁతురు, కశ్యపుని భార్య- హాహాహూహ్వాది గంధర్వులును, అలంబుసా ద్యప్సరసలును ఈమెకు జన్మించిరి.సం. భా. ఆది.66-46

**అరిష్టనేమి** సం. వి. ఇ. పుం.

1. సగరునకు ధర్మప్రకార ముపదేశించిన ఒక ముని.

ఆ. విను మరిష్టనేమి యను ముని నడిగె నీ, యడిగినట్లు సగరుఁడు.

శాంతి. 5-460

2. కశ్యపుఁడు, కుమారస్వామి భార్యయైన దేవసేనకు తండ్రి, మరీచికి బుత్రుఁడు.

వ. అయ్యా, నే నరిష్టనేమి యను ప్రజాపతి కూఁతుర దేవసేన యను దాన, దైత్యసేన చెలియల. అర. 7-182

శ్లో. మరీచేః కశ్యపః పుత్ర స్తస్య ద్వే నామనీ స్మృతే.
అరిష్టనేమి రిత్యేకే కశ్యపే త్యపరే విదుః.

సం. భా. శాంతి. 207-8

**అరిష్టము** సం. వి. అ. న.

1. కీడు, అశుభము.

ఉ. ...వారు బాహుబల ధీబల దైవబలంబు లొప్ప వ్యర్థిల్లుదు రమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేల వాటిల్లెడు. విరా. 3-99

ఆ. ఆ ధృష్టద్యుమ్ను దర్శనంబు దనకు నరిష్టం బగుటయు న్గురుండొక్కింత విన్నుడై యతని దిక్కుదెస చూడంజాలక.
ద్రోణ. 1-234

2. మరణచిహ్నము, మరణసూచకము.

వ. అని చెప్పి మఱియు నిట్లను నరిష్టంబుల తెఱం గెఱుంగవలయుం గావున నెఱింగించెద నాకర్ణింపుము.

సీ. ధ్రువమండలమున నరుంధతిఁ గనుశక్తి, గంటికిఁ గలుగంగఁ గానకున్న, ముక్కున వలపటఁ జెక్క వాసిన యట్ల, దోఁచినఁ బూర్ణచంద్రుఁడు మలినుఁడై కానవచ్చిన నాయువు సంవత్సరంబున గడచను. శాంతి. 6-125; 126

**అరిష్టుఁడు** సం. వి. అ. పుం.

కృపాచార్యుని రథ రక్షకుఁడు.

ఇతఁడు అర్జునునిచే ఉత్తర గోగ్రహణ కాలమునఁ జంపబడెను.
విరా. 5-148

**అరిహుఁడు** సం. వి. అ. పుం.

1. పూరు వంశీయుఁడైన క్షత్రియుఁడు, అవాచీనుని కుమారుఁడు.

ఇతని తల్లి విదర్భరాజపుత్త్రియైన మర్యాద. ఇతని భార్య అంగి. ఇతని కుమారుఁడు మహాభౌముఁడు. ఆది. 4-2

ఆంధ్ర భారతమునఁ గొన్ని ప్రతులయందీ విషయము కుండలీకరణమునఁ గలదు. దీనికి సంస్కృతమున మూలము గానవచ్చుచున్నది. కాన కుండలీకరణ మనవసరము.

శ్లో. అపరాచీనస్తు ఖలు వైదర్భీముపయేమే మర్యాదాం నామ, తస్యామస్య జజ్ఞేఽరిహః. అరిహః ఖల్వాంగీ ముపయేమే.

తస్యామపత్యజజ్ఞే మహాభౌమః. సం భా. ఆది 63-17, 18
అవాచీనుఁడే అపరాచీనుఁడు

**అరుంధతి** సం. వి. ఇ. స్త్రీ.

వసిష్ఠుని భార్య.

అరుంధతి కర్దమ ప్రజాపతి పుత్రి. ఆమె తల్లి స్వయంభువుమను పుత్రియైన దేవహూతి. ఆమె సోదరీలు 1) మరీచి భార్య 'కల' 2) అంగిరసుని భార్య 'శ్రద్ధ' 3) పులస్త్యుని భార్య 'హవిర్భుక్కు'. 4) పులహుని భార్య 'గతి' 5) క్రతువు భార్య 'క్రియ' 6. భృగుని భార్య 'ఖ్యాతి' 7) అంగిరసుని భార్య 'శాంతి' 8) అత్రి భార్య 'అనసూయ'.

ఈమె సోదరుఁడు కపిల మహర్షి. (సం. భాగ. 3-24)

ఈమె కుమారుఁడు శక్తియను మహర్షి.

ఆది. 3-36; సం. భా. ఆది. 11-42.

ఈమెకు అక్షమాల యను నామాంతరము గలదు. సం. ఉద్యో. 117-11.

ఈమెకు "ఊర్జ" యనియు నామాంతరము గలదు (సం భాగ. 4-1) (మత్స్య పురాణము 201).

ఈమె రూపమును ధరించుటకు స్వాహాదేవికి శక్తి చాలకపోయెను.

అర. 5-204; సం. భా. వన. 227-16.

ఈమె వసిష్ఠునకు ముందు నిలిచెనేని ఉత్పాతమును సూచించును.

సం భీష్మ. 2-31

ఈమె ఇనుప రేఁగుపండ్లను గుగ్గిళ్ళు వండిపెట్టెను. అందులకు శంకరుఁడు సంతసించి వర మొసంగెను. సం. శాంతి. 41-83.

ఈమె నక్షత్ర రూపమును బొంది యాకాశమున వసిష్ఠ నక్షత్రము ప్రక్కన నుండెను. ఈ నక్షత్రము కనఁబడకపోవుట మరణమును సూచించును. సం. భా. శాంతి. 302-9; 6-126.

**అరుంధతీవటము** సం. వి. అ. పుం.

ఒకానొక తీర్థము; సర్వసిద్ధికరము. అను. 2-271; సం.భా. వన. 82-41.

**అరుగు** దే. అ. క్రి.

1. చను, పోవు.
33)

వ. అమర నగరంబున కరిగిన యెడ నూర్వశి నన్ను నపుంసకునిగా శపియించిన. విరా. 1—87

క. అరదములు సవరణలతోఁ, బరపై యొక్కొక్క యూరి పరవున నరిగెం, బరుసని పలుకుల నాకృతి, పరుపత నసురాలివోలె భటతతి మెఱసెన్. భీష్మ. 1-84

ఈ సందర్భమున గజము లొప్పె, తురంగములు వొలిచె, భటతతి మెఱసె, గంగాసుతుఁడు వెలిఁగె- అని చెప్పుచు అరదములు అరిగె అన్నప్పుడు అరదములు చనెను అని చెప్పుట సమంజసముగాఁ గన్పింపదు. మెఱయు, ఒప్పు, పొలుచు స్థానములో నిది వాడఁబడినది. పోనీ యతిస్థానమై వాడఁ బడినదా, అదికాదు. పాఠాంతరమును గానరాదు. బహుశః 'పరఁగె' అనునది తిక్కనగారి పాఠమై యుండునా? విచార్యము.

శ్లో, తత్ర నాగా రథాశ్చైవ జాంబూనద పరిష్కృతాః,
విభ్రాజమానా దృశ్యంతే మేఘా ఇవ స విద్యుతః
రథానీకాన్యదృశ్యంత నగరాణీవ భూరిశః
అతీవ శుశుభే తత్ర పితా తే పూర్ణచంద్రవత్.
సం. భార. భీష్మ. 16-67 శ్లో.

2. కడచు, గతించు.

క. ధన దానములను బ్రియ భోజన దానములను విశిష్ట సద్ద్విజ తతులం, దనుపుచునుండఁగఁ దత్పురమున షణ్మాసములు భరత ముఖ్యుల కరిగెన్. ఆది. 6-158

ఆ. అమరనాథునొద్ద నర్జునుఁ డుండ నేనేఁడు లరిగె నిట మహీ తలమున. అర. 1-869

3. ఉఱుకు, లంఘించు, మీఱొక్కను.

సీ. హయములఁ జెండాడ నరుగుచోట్లను లేళ్ళగమిఁ గిట్టు కోల్పులి కరణి యొలయు, భటులకు నరుగుచోఁ బసలేని పెనుఁగాన, దరి కొనుచిచ్చు చందంబు గలుగు. శల్య. 1-282

ఆ. ...రక్కసునకు నరిగిన యగ్రజు, నలుక యెఱిగి వీరుఁ డర్జునుండు అర. 1-116

4. తొలఁగు, నశించు.

క. ధృతి విజ్ఞాన శ్రద్ధలు,నతివ యసమ్మోహమును దయయు హర్షము
నంచిత సత్త్వవృద్ధిఁ బరివర్ధితంబు లగు సత్త్వ మరుగఁ దెరలుం
దారున్. ఆను. 5-247

5. ప్రవర్తిల్లు, నెలకొను.

తే. వర్ణముల నాశ్రమంబుల వలను మెఱసి, యరసి చక్కని తెరు
వున నరుగఁజేసి, ధరణి పాలింపు. శాంతి. 1-192

శ్లో చాతుర్వర్ణ్యం స్థాపయిత్వా స్వధర్మే
పూతాత్మా వై మోదతే దేవలోకే. సం. భా. శాంతి. 25-35

వి॰.

చను, పోవు

వ. జననీసహితులై దక్షిణపాంచాలంబున కరుగువారు. ఆది, 7-158

అరుగుదెంచు దే. అ. క్రి. (√అరుగు) అరుదెంచు.

1. వచ్చు.

తే. ...జగత్ప్రాణుఁ డొడలు, మనుపఁ జెలుపంగ నొదయుండు సనుట
మగుడ, నరుగుదెంచుట వింతగా దతని కెందు. ద్రోణ. 2-176

వ. అన్నాడీజంఘుండును జీవితుండై యెప్పటియట్ల యొప్పెడు
నాకారంబుతో నరుగుదెంచుచున్నవాఁడు. శాంతి. 3-518

2. అరుగు, పోవు, వెళ్ళు (స్వార్థమున 'తెంచు')

వ. ...పాంచాలీ బంధమోక్షంబు గావించి యింక నిశ్చింతంబున సుదేష్ణ
మందిరంబునకుం జను మని యవ్వేలంది వీడుకొలిపి తాను
వేఱొక్క మార్గంబున మహానస గృహంబున కరుగుదెంచె.

విరా. 3-29

శ్లో. వైరంధ్రి గచ్ఛ నగరం కృష్ణే న భయం విద్యతే తవ,
అన్యేనాహం గమిష్యామి విరాటస్య మహానసమ్.

సం. భా. విరా. 23, 33 శ్లో.

**అరుచము** సం. విశ. (అ. ఆ. అ.)

రుచిలేనిది.

క. పెరుఁగుట ప్రగ్గఁగ రుచులం, బొరయుట యరుచంబు గాఁగఁ బుట్టుట పావం, బెరయుట పాయఁ బదార్థో,త్కరముల నై జమది యెట్టు దప్పింపనగున్. శ్రీ. 1-24.

**అరుచికము** సం. విశ. (అ. ఆ. అ.)

రుచి కలిగింపనిది.

వ. సర్వరుచికరం బైన యాహారంబు రోగాతురునకు నరుచికరం బైన యట్లు. ఆర. 1-58.

**అరుణకిరణుఁడు** సం. వి. అ. పుం.

సూర్యుఁడు.

వ. వదంపడి పద్మినీ ప్రమోద సంపత్కరుం డగు నరుణ కిరణుం డుదయించె. విరా. 1-35.

**అరుణగభస్తి** సం. వి. ఇ. స్త్రీ.

సూర్యుఁడు.

వ. అంత నరుణగభస్తియు నస్తగిరిమస్తకాంతరితుం డయ్యె. భీష్మ.2-166.

**అరుణత్వము** సం. వి. అ. న.

ఎఱ్ఱఁదనము.

క. అరుణత్వము మెఱయఁ దరణి యపరాద్రి శిరః, స్ఫురణను నధికరజాలం,కరణం బొనరించుటయును. భీష్మ. 2-889.

**అరుణమణి** సం. వి. ఇ. పుం. స్త్రీ.

పద్మరాగము, కెంపు.

క. అరుణ మణిమాలికా విస్ఫురణంబున దంతి తనువు సూడఁగ నొప్పెన్. విరా. 5-195.

**అరుణము** సం. విశ. (అ. ఆ. అ.)

1. ఎఱ్ఱనిది.

క. అరుణాంబులును సకంటక, తరుభవములుఁ గటుక గంధధూమములు
హౌనర్తురు శాత్రవాభిచారిక, కరణమున నథర్వ మాంత్రికతఁ
గుసుమంబుల్. అను. 4-7.

సం. వి. అ. పుం.

2. ఎఱుపు.

క. ఆ సమయంబున నరుణో,చ్ఛ్వసితగాత్రుండు దొలుతవట్టి యరుణుఁ
డ ల్లాసి యగుచు... అను. 1-178

సం. వి. అ. న.

3. నెత్తురు.

క. వీరుండు, క్షత్రియులఁ దన, దారుణ పరశువున జామదగ్న్యుఁడు
రౌద్రా,కారుఁడు వధియించి తదీ,యారుణమున నేను మడుపు
లాపాదించెన్. అర. 2-260

**అరుణాంబుజము** సం. వి. అ. న.

ఎఱ్ఱదామర.

సీ. అరుణాంబుజంబుల యంతర్దళంబుల, తళతళ యను జిగి దళము
హొప్పి. ఉద్యో. 2-144

**అరుణాంశుఁడు (వు)** సం. వి. అ. పుం.

సూర్యుఁడు (ఎఱ్ఱకాంతి గలవాఁడు)

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశుని గన్న విధంబునన్ వికా,సంబున
నుల్లసిల్లి. విరా. 1-256

**అరుణానది** సం. వి. ఈ. స్త్రీ.

కురుక్షేత్ర సమీపమునందున్న ఒక నది. ఇందు స్నానముచేసిన సమస్త
పాపములు హరించును. శల్య. 2-172

చూ. వివ. శల్య. 2-168 మొ. 174 వరకు

**అరుణితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎఱ్ఱగాఁ జేయఁబడినది, ఎఱ్ఱనైనది.

**అరుణుఁడు** సం. వి. అ. పుం.

1. అనూరుఁడు, సూర్యుని సారథి, వినత పెద్దకొడుకు.

క. సారథ్య మ్మొనరింపఁగ, సారస హితునకు వెలయు సామర్థ్యము కరుణుఁడు సారథ్యము సేయఁగ ననిచినట్లుగ. కర్ణ. 1-247

చూ. చరిత్ర. అను. 1-167 మొ. 178 వ.

2. సూర్యుఁడు.

వ. అరుణోదయ రాగపటలంబు పెనయు కెంజాయ రంజిల్ల.

విరా. 2-240

**అరుణోదయము** సం. వి. అ. పుం.

సూర్యోదయమునకు ముందు నాల్గు గడియల కాలము. విరా. 2-240
"చతురస్రో ఘటికాః ప్రాత రరుణోదయ ఉచ్యతే"

**అరుదారు** దే. అ. క్రి. (√ అరుదు)

ఆశ్చర్యమగు, వింతయగు.

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ, నొప్పారి తనుపగు చప్పరములు. ఉద్యో. 1-93

**అరుదు** దే. వి.

2. ఆశ్చర్యము, వింత.

వ. నీవు కురుసైన్యంబుల జయించుట యరుదె గెలుపుకొనుము.

శ్లో. నైతచ్చిత్రం తవ కర్మాద్య భీమ,
యాస్యావహే జహి పార్థారిసంఘాన్. సం. భా. కర్ణ. 68-22

విశే.

2. అశక్యము.

ఆ. ఇంత దలఁచ నేల యెమ్మెయినైనను, గొమ్మ నలవరించి కూర్చుటరుదె. విరా. 2-80

3. దుర్లభము.

తే. అరయ వచ్చినఁ దన మేను నెరవ తనకు, నొండురూపులు దక్కఁగ యునికి యరుదె. స్త్రీ. 1-33

4. అనివార్యము.

క. నిరుపద్రవ సుఖనిద్రా. నిరతాత్మకులలున వీరి నిద్రకు నస్మ, చ్చరణ
ఖుర ఘాతశబ్దం, బరుదుగ విఘ్నంబు సేయునని వగచి మదిన్.
ఆది. 6-205

5. ఆశ్చర్యకరము, మిక్కిలి వింతను గలిగించునది, అద్భుతమైనది,

క. నరసిద్ధసాధ్యవిద్యాధరసురకన్యకలకంటె దమయంతియ సుం,
దరి దాని సుస్వయంవర, మరుదై వర్తిల్లుచున్న యది యప్డు,
మదిన్. అర 2-81

క. అప్పుగ షుడు రవి యంద వెలుంగు, నరు దంశటికం టెం గలదె.
శాంతి. 6-603

**అరుదెంచు** దే. అ. క్రి. (√అరుగు - అరుగుదెంచు)

వచ్చు.

క. సమయం బరుదెంచెం దొంటి చందము గలదే. విరా. 4-198

వ. పితృదేవతలు ననుచర సమేతులై యేతెంచిరి మూర్తిమంతం
బులై యోషధి సరిత్సముద్రపర్వతంబులు నరుదెంచె.
కల. 2-178

**అరువు** దే. వి.

ఏదేని జాగ్రత్తగాం గాపాడి మరల నడిగినప్పుడు ఒప్పగించుట.

ఉ. ...మీ, చేతికి నిచ్చి యిట్లరువు సేసెద నిన్నరనాథ... కర్ణ.2-202

ఈ పదమునకు ఒక వస్తువును వెలకుం దీసికొని ఆ వెల మఱొకప్పుడు వడ్డితోడనో వడ్డి లేకుండనో చెల్లించుట- అను నర్థము నేంటి వ్యవహారమున నున్నది.

దీనికిం బాఠాంతరములు "ఇల్లడము-ఇల్లెరవు" అనునవి.

శ్లో. రాజాన మద్య భవతాం న్యాసభూతం దదాని వై
తస్య సంరక్షణే సర్వే యతధ్వం విగతజ్వరాః.
సం. భా. కర్ణ. 51-12

**అరువుసేయు** దే. స. క్రి.

ఏదేని జాగ్రత్తగాం గాపాడి మరల నడిగినప్పుడు ఒప్పగింపుమని దాంచి నిచ్చుట. చూ. అరువు.

**అరూపుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

రూపము లేనివాఁడు.

క. ...నే, సకలంకుఁడ నరూపుడఁ... శాంతి. 6-51

**అరోగత** సం. వి. ఆ. స్త్రీ.

రోగము లేకపోవుట, ఆరోగ్యము.

ఆ, సాధుచరితులైన జనులు దుర్గతుల రోగములఁ దెగుదు రల్ప కాలముననం, పాపపరులు లగ్గుఁ బరమాయువును నరోగతయు సిరియుఁ బొందఁ గాంతు రెందు. అర. 4-294

**అరోగుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

రోగము లేనివాఁడు.

క. అరోగుం, డనుగతరోగుం డనక యం,గన పతిఁ జాటింపవలయుఁ గామధ్వంసీ. అను. 5-295

**అర్కజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సూర్యుని పుత్రుఁడు, కర్ణుఁడు.

మ. ...అర్కజుని యుల్లం బెప్పుడుం గ్రోధదీ,ప్తము. ఉద్యో.4-57

**అర్కుఁడు** సం. వి. అ. పుం.

సూర్యుఁడు.

ఆ. వేదువ దర్కు నంశవిభవంబు చాడ్పున బోధలక్ష్మి. శాంతి.5-538

**అర్గళ** సం. వి. ఆ. స్త్రీ.

అర్గళము, ఇనుపకడ్డీ.

సీ. పుండరీకాక్ష... భవదీయ మహనీయ బాహార్గళానిచ,యాపిహిత ములయ్యె నన్ని దిశలు. అశ్వ. 8-50

**అర్గళము** సం. వి. అ. న.

1. ఇనుప కడ్డీ

వ. నిరర్గళ భుజార్గళ సంరంభ విజృంభణంబు శోభిల్ల. విరా. 5-2

2 ప్రతిరోధము, అడ్డంకి.

క. ...శివుండును నిజది,వ్య నిరర్గళ చిత్త పథ విహారుం డయ్యెన్. అను. 4-289

**అర్ఘువు** సం. వి. అ. పుం. (రూపాం) అర్ఘము
వెల.

చ. అవని యరాజకం బయినయప్పుడ... వృష్టిలే, దవు మఱి యర్ఘు
వుల్ దఱుఁగు నందురు. ఆది. 4-249

ఆ. అర్ఘులోలిఁ బెరిఁగె నవనీశు లెల్ల నీ, యనుజ వీర్య విజితులయి
త్వదీయ శాసనస్థులయిరి... (బహువచ.) అర్ఘులు. సభా. 1-271

**అర్ఘ్యపాత్ర** సం. వి. అ. న.
**పూజాపాత్రము, పూజించుటకొఱకు కుంపఁబడిన ద్రవ్యములుగల పాత్ర.**

చ. శిరమున నర్ఘ్యపాత్రగొని చెచ్చెరవచ్చి ప్రియం బెలర్ప నగ్గురు
సుతుఁగాంచి. శాంతి. 6-266

**అర్ఘ్యము** సం. విశ. (అ. ఆ. అ.)
పూజకొఱకైనది.

క. ...లలితాక్షతములఁ గుసుమంబులఁ బూజితుఁజేసి యర్ఘ్యమును
గోవును నక్కులపతికి నిచ్చె. శాంతి. 6-267

అష్టార్ఘ్యములు:- పెరుఁగు, తేనె, నెయ్యి, అక్షతలు, గఱిక, నువ్వులు, దర్భ, పుష్పములు- అని కొందఱు. తెల్లయావాలు, అక్షతలు (పచ్చనివి) దర్భల కొనలు, నూవులు, యవలు, గంధము, ఫలము, పుష్పము— అని కొందరు.

శ్లో సిద్ధార్థ మక్షతం చైవ కుశాగ్రం తిలమేవ చ,
యవం గంధం ఫలం పుష్పం అర్ఘ్యే ద్రవ్యాని నిక్షిపేత్.

సం. వి. అ. న.

పలు రకములగు ద్రవ్యములతో నొక గౌరవనీయునిగాని భగవంతునిగాని యర్చించుట.

సీ ...పుండరీకాక్షుండు కృష్ణుం డవాది నిధనుఁ -గీ- డబ్జనాభుఁ
డుండ నర్ఘ్యంబునకు నిందు, నర్హు లొరులు గలరె. సభా. 2-6

వ మాకు నొండు కార్యంబు గలుగుటం జేసి నీ యిచ్చు నర్ఘ్యంబు
గొన నొల్లమనిన జరాసంధుఁ డిట్లనియె. సభా. 1-184

**అర్చ** సం. వి. ఆ. స్త్రీ.

1. పూజ.

తే. ...మఱునాఁడ యేఁగుదెంచె, భార్గవుం డమ్మునీంద్రులు పరమ
భక్తిఁ నర్చలిచ్చిరి హోత్రవాహనుఁడు గనియె ఉద్యో. 4-298

2. దేవతాదుల ప్రతిమ, విగ్రహము.

వ ఎత్తెఱంగునం జేసినను బరమేశ్వరారాధనంబు సర్వార్థ సాధనం
బగు నందును లింగంబునందుఁ బూజించుట యర్చయం దారాధిం
చుటకంటె ననేక గుణంబు లెక్కుడు గావున లింగార్చనపరులగు
వారల సర్వారాధకుండవగు నీకు నెట్లు జయింపవచ్చు.
ద్రోణ. 5-418

**అర్చకుఁడు** సం. విణ. (అ. ర్చికా. ఆ.)

పూజించువాఁడు.

ఆ. పితృ సమర్చకులు... పూజ్య లనఘ నాకు. అను. 2-183

2. భక్తుఁడు.

క. ఏను బ్రసన్నుఁడనై నం, గానిది లే దర్చకులకుఁ గావున మర్త్య,
ధ్యానస్తుతి వందనముఖ, నానాభజనముల వలయు నైష్ఠికత శివా.
అను. 5-266

**అర్చన** సం. వి. ఆ. స్త్రీ.

1. పూజ, పూజించుట.

వ. విదురుండు... గోవిందునకు దేవోపచారంబులం దనేక ప్రకారం
బుల నర్చన లిచ్చి. ఉద్యో. 3-180

2. దేవతాది పూజనము.

క, పులగముఁ బాయస మట్టులు, బలలము నర్చనకుఁ గాక పక్వము
లయినం, గలుగు నభోజ్యత్వము వి,చ్చలవిడి వంటకముచేసి చనదు
భుజింపన్. శాంతి. 1-324

**అర్చనము** సం. వి. అ. న

పూజించుట, పూజ.

వ. వేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి సేయు నర్చనంబులం గైకొని. భీష్మ. 1-5

**అర్చనీయము** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁదగినది.

తే. త్రిభువనములందు నర్చనీయ సంక్రీడన మవిహితముగ సంచరించు మాహాత్మ్యంబు సంభవించు. అను. 2-125

**అర్చనీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁదగినవాఁడు.

సురార్చనీయ. శాంతి. 6-622

**అర్చి** సం. వి. స్. న. స్త్రీ. (అర్చిస్సు)

1. కాంతి, దీప్తి, కిరణము.

ఉ. ...ఉజ్జ్వల రోష మహానలార్చు లొండొండ మొగంబుపై నెగయ. ఉద్యో. 4-319

2. జ్వాల, మంట, అగ్నిజ్వాల.

వ. వహ్నులు కాలంబునం బుణ్య గంధంబులతోఁ బ్రదక్షిణార్చు లగుటయు. భీష్మ. 1-11

క. ఘృతమర్చి స్సంపదయయి, ఘృతార్చి రభిధాన మొందె. శాంతి. 6-435

**అర్చించు** సం. స. క్రి.

పూజించు

ఆ. ఆతఁ డెవ్వ డొక్కొ యమ్మహాత్మునిఁ గనుంగొనఁగఁ గాఁగిలింప వినయ మొప్ప, నర్ఘ్యపాద్య విధుల నర్చింప భక్తి సంయుక్తి నెపుడుఁ గొలిచి యుండవలయు. విరా. 5-300

**అర్చితము** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁబడినది.

చ. ...దేవతా, పితృనివహంబులం గరమ ప్రీతియు భక్తియు నుల్లసిల్ల నర్చితములు సేయుము... అశ్వ 1-19

**అర్చితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

పూజింపఁబడినవాఁడు.

వైశ్వానరు నర్చితుం జేసి ఉద్యో. 1-184

**అర్చిష్మంతుఁడు** సం. వి. త్. పుం.

అగ్ని,

వ. ఆజ్య ధారాక్రాంతుఁడైన యర్చిష్మతుండునుంబోలె నుండి...
భీష్మ. 3-161.

**అర్చిష్మతి** సం. వి. ఈ. స్త్రీ.

అగ్నికి అగ్రతనయుండైన యంగిరసునకు శివ యనుదానికిఁ గూఁతురు. ఈమెకు బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుఁడు, బృహన్మంతుఁడు, బృహద్భానుఁడు బృహస్పతి నను నేడ్వురు సోదరులు భానుమతి, రాక, సినీవాలి, కుహువు, మహిష్మతి, మహామతి యను వార్వు రప్పచెల్లెండ్రు గలరు. అర. 5-158

**అర్చిష్మత్త్వము** సం. వి. అ. న.

1. కాంతి గలిగియుండుట.

శా. ...ఉదగ్రధ్వజార్చిష్మత్త్వాకలితంబు సైన్యము, విరా. 4-52

2. వేఁడిమి గలిగియుండుట.

క. గ్రీష్మాదిత్యుని క్రియ నర్చిష్మత్త్వము సూపి యడరె సేనలు దెర
లన్. భీష్మ. 2-278

**అర్జునకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. తెల్లనివాఁడు.

అర్జునకనామము నీ కవదాత శరంగికిం గావలదే. అను. 1-12

సం. వి. అ. పుం.

ఒకానొక బోయవాఁడు.

క. ఈ పాముఁ జంప బ్రదుకున్నె నా పుత్రుఁడు విడువు మర్జునక.
అను. 1-11

**అర్జునము** సం. వి. అ. పుం.

ఏఱుమద్ది, తెల్లమద్ది- ఏఱునందుఁ బుట్టునుగాన ఏఱుమద్ది యనియుఁ దెల్లగా నుండుసుగాన తెల్లమద్దియనియు దీనికి పేర్లు గలిగెను. "అర్జున" అని పేరుండుటచే నింద్రునకిష్టమైన వృక్షము. దీని కొమ్మలతి విశాలములై దిక్కుల వ్యాపించును.

చ. కదలీ లవంగ పనస ద్రుము కార్జున కేతకిలతా,గరు ఘనసార సాల
సహకార మహీరుహ రాజరాజి. ఆది. 8-78

(కరవీరము-గన్నేరు అను నర్థమును గలదు)

**అర్జునుఁడు** సం. వి. అ. పుం.

1. కుంతికిఁ బాండురాజునకు జన్మించినవారిలో మూఁడవవాఁడు.

దేవేంద్ర ప్రసాదంబున ఉత్తరఫల్గునీ ప్రథమ పాదమున నుదయించెను.
ఆది. 5-122, 124

శ్లో. ఉత్తరాభ్యాం తు పూర్వాభ్యాం ఫల్గునీభ్యాం తతో దివా,
జాతస్తు ఫల్గునే మాసి తేనాసౌ ఫాల్గునః స్మృతః
సం. ఆది. 132-17

కార్తవీర్యుని కంటెను వీరుఁ డగుటచేత నీతనికిఁ అర్జునుఁ
డని పేరుగల్గెను. చూ. అనుబంధము.

**అర్ణవము** సం. వి. అ. పుం.

సముద్రము.

అర్ణవముల్ ఘూర్ణవ మొంద. విరా. 2-284

**అర్ణస్సు (ము)** సం. వి. స్. న.

జలము, నీరు.

మ. .. దైత్య దానవ దేవా ప్రకరంబు వాత విధుతార్ణః పూరసం
ఘూర్ణితార్ణవ కుక్షిం బడియె. అర. 1-185

**అర్థకము** సం. వి. అ. వ.

నిమిత్తముగాఁ గలది.

తే. వేద దేవతానిందలు వేతనార్థకముగ జోస్యంబు నడపుట కల్మ
షములు. అను. 4-104

**అర్థకరము** సం. విశే. (అ. ఈ. అ.)

ధనమును గలిగించునది, లాభకరము, ఆదాయమును గలిగించునది.

చ. ...కోటివిధంబుల నాప్తసఖులం, గని వన గోకులాకర నగ
ప్రముఖార్థకరంబు లారయుం, బరుచుచు... శాంతి. 2-283

**అర్థకీలము** సం. వి. అ. పుం.

ఒకానొక తీర్థము. ఇది దధీచినిర్మితము. ఇందు స్నానముచేసిన శూద్రులు బ్రాహ్మణు లగుదురు.

బ్రాహ్మణులు పరమసిద్ధు లగుదురు. చూ. దధీచి. అర. 2-267

ఈ తీర్థమునకుఁ జెప్పిన మాహాత్మ్యము సంస్కృత భారతమున బ్రాహ్మణ తీర్థమునకుఁ జెప్పఁబడియున్నది,

శ్లో. తతో గచ్ఛేత రాజేంద్ర బ్రహ్మణ స్తీర్థ ముత్తమమ్.
తత్ర వర్ణావరః స్నాత్వా బ్రాహ్మణ్యం లభతే నరః.
బ్రాహ్మణశ్చ విశుద్ధాత్మా గచ్ఛేత పరమాం గతిమ్.
సం. అర. 83-113, 114

బ్రాహ్మణ తీర్థ ప్రశంస ఆంధ్ర భారతమునఁ గనుపట్టదు. అర్థకీలతీర్థము క్రింద సంస్కృత భారతమున ఈ విషయము స్పష్టముగా లేదు. బ్రాహ్మణుల విషయమే చెప్పఁబడినది.

శ్లో. అర్థకీలం చ తత్రైవ తీర్థం కురుకులోద్వహ,
విప్రాణామనుకంపార్థం దధీచినా నిర్మితం పురా,
వ్రతోపనయనాభ్యాం చాప్యుపవాసేనచాప్యుత
క్రియా మంత్రైశ్చ సంయుక్తో బ్రాహ్మణస్స్యా న్న సంశయః
క్రియామంత్ర వినోహీఽపి తత్ర స్నాత్వానరర్షభ,
చీర్ణ వ్రతో భవే ద్విద్వాన్ దృష్టమే తత్పురాతనైః,
సముద్రాశ్చాపి చత్వారః సమానీతాశ్చ దధీచినా,
తేషు స్నాతో నరశ్రేష్ఠో న దుర్గతి మవాప్నుయాత్.
సం. భా. అర. కర్ణ. 83-154 మొ 157 వ.

**అర్థక్రియ** సం. వి. ఆ. స్త్రీ.

డబ్బు సంపాదించుటకుఁ జేయు కృషి, వాణిజ్యాదికము.

క మనమునకు సుఖము గోరుడు, జనులకు నర్థక్రియా విశారద
భంగల్ పొనుపడ విడిచి భరము లేకునికియ యూహించి చూడ
మర వెల్బంగిన్. శాంతి. 4-48

**అర్థచింతకుఁడు** సం. విణ. (అ. ఈ. అ.)

ధనమును గుఱించి తదేకాలోచనమునం దుండువాఁడు.

తే. అలుక యెత్తినవానికి నర్థచింతకునకు, నాతురునకుఁ గామ గోచ
రాత్మునికిని, వచ్చునే విను నిద్ర. సౌప్తి. 1-66

**అర్థజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కార్యస్థితి నెఱిఁగినవాఁడు.

అనర్థజ్ఞుల తోడి చింతనంబు. సభా. 1-56

**అర్థదూషణము** సం. వి. అ. వ.

ధనమును పాడుచేయుట. ఇది సప్తవ్యసనములలో నొకటి. సప్త వ్యసన
ములలో కామజములు 5; క్రోధజములు. 2; కామజములు 1
ద్యూతము 2. వేఁట 3. స్త్రీ 4. మద్యపానము 5. అర్థదూషణము.
క్రోధజములు 1. వాక్పారుష్యము 2. దండపారుష్యము. శాంతి. 2-285

**అర్థనము** సం. వి. అ. వ.

కోరిక.

క. నను మోక్షముఁ జెఱచెద,నని యెవ్వఁడు దలఁచు వానియందే
మోక్షార్థనమై యునికి నపథ్యుఁడ. అశ్వ. 1-130

**అర్థము** సం. వి. అ. పుం.

1. శబ్దార్థము (ఇది వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము అని మూఁడు
విధములు)

ఉ. ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి. విరా. 1-6

క. ...నీవును, గనుగొను యేతద్వచోనికాయార్థంబుల్.
శాంతి. 4-367

2. ధనము.

సీ. కలయట్టి వివిధార్థములు నశేషంబుగఁ, దగ నొసంగుండు సత్పా
త్రములకు. ఉద్యో. 2-127

వ. తృష్ణాతురుం డర్థలోభంబునఁ గోటరస్థంబయిన యనలంబునం జేసి దగ్ధంబగు వృక్షంబునుం బోలె వినాశంబునం బొందు.

అర. 1-26; అర. 1-80

3. ధనధాన్యాదికము.

సీ. అర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు, నగుకాలమున నార్య లయ్యుఁగాని, -ఆ- కాల మవి ఘటింపఁగా నేరదు. శాంతి.1-185

4. పదార్థము, వస్తువు.

వ. గాంగేయుండు వారించి వారికభిమతార్థంబు లిచ్చి వీడుకొల్పె.

భీష్మ. 3-425

5. విషయము.

వ. కొన్ని యర్థంబులు భరద్వాజుం డడిగిన భృగుండు సెప్పె.

శాంతి. 4-50

వ. అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద. విరా. 1-37

6. నిమిత్తము, కారణము.

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నా నేర్చిన విధంబున నుపదేశం బవశ్య కర్తవ్యంబు. విరా. 1-120

7. కార్యము, ప్రయోజనము.

ఆ. ...నీతియుతులు సమరసాహసము సాధనముగ నాడుదు రర్థసంసిద్ధిఁ బొందు తెఱఁగు సేయునెడల. విరా. 4-207

వ. అగుదేశకాల బలయుతంబుగఁ జేసిన పౌర నర్థములు. విరా. 4-203

8. నాలుగు పురుషార్థములలో ధనసంపాదన రూపమగు పురుషార్థము.

క. ...దా,మూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్. విరా. 1-4

9 లాభము.

వ. ధర్మాధర్మంబులు, సుఖదుఃఖములు, నయానయంబులు నర్థానర్థంబులు, బలాబలంబులు, ప్రమాదాప్రమాదంబులు మొదలైన సకలావస్థలును దండంబున సమ్యగసమ్యక్ప్రకారంబులం గలుగు.

శాంతి, 3-111

10. భాగ్యము.

క. పొరి నర్థంబు ననర్థము, మరణము జీవితము సుఖసమాగమమును దు, స్తర దుఃఖ సంగమంబును, దొరకొను నే నెపుడు సమతతోడన నిలుతున్. శాంతి. 4-394

**అర్థవంతము** సం. విణ. (త్. వతీ. త్.)

ఫలవంతము, సార్థకమైనది, సఫలమైనది.

క. ...పాప, వ్యవసాయుల చెయ్వు లర్థవంతము లగునే. ఆది. 5-176

**అర్థవంతుఁడు** సం. విణ. (త్. వతీ. త్.)

ధనము గలవాఁడు.

వ. అర్థవంతులకు రాజచోర స్వజన జలానలంబుల వలన భయంబు నియతంబు. అర. 1-26

**అర్థశాస్త్రము** సం. వి. అ. న.

నీతి విద్య. పదునెనిమిది విద్యలలో నొకటి.

పదునెనిమిది విద్యలు: 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామ వేదము 4. అథర్వణ వేదము (ఈ నాలుగు చతుర్వేదములు) 5. శిక్ష. 6. ఛందస్సు, 7. వ్యాకరణము 8. నిరుక్తము 9. జ్యోతిషము 10. 10. కల్పము (ఈ యాఱు వేదాంగములు) 11. పురాణములు 12. ధర్మ శాస్త్రములు 13. న్యాయశాస్త్రము, 14. మీమాంసశాస్త్రము 15. వైద్య శాస్త్రము, 16. ధనుర్విద్య 17. గాంధర్వము 18. అర్థశాస్త్రము.

బ్రహ్మదేవుఁడు మూఁడు లోకముల హితము కొఱకు వీని నేర్పఱిచెను. శాంతి. 3-119

**అర్థసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ.

1. కార్యము నెఱవేఱుట.

ఉ. పోరితంబు లేకయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండు సేయునే. ఉద్యో. 1-304

2. ధనము కూర్చుట.

సీ. ...విద్య వార్త, సేవకారుత యర్థసిద్ధికి మూలముల్. అను, 5-75

**అర్థాంతరము** సం. వి. అ. న.

ఒక యర్థమునకు మఱియొక యర్థము,

ఆ, అతఁడు వాసుదేవుఁ డన నాత్మయనఁగ వేదాంత కార్య
బోధ్యుఁడై వెలుంగు, నరుల కప్పదములు నామాంతరంబు
లర్థాంతరంబు లేని యట్టి వనఘ, ఆను. 4-367

**అర్థాభ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

అర్థశాస్త్రము బాగుగా నెఱిఁగినవాఁడు,

సీ. ...అర్థాభ్యుండు ప్రకట బుద్ధి, నెంతయు సంయమవంతుండు
సహదేవుఁడు. సభా. 2-282

**అర్థి** సం. విశ. (న్. నీ. న్.)

1. కోరువాఁడు, ఇచ్ఛించువాఁడు.

వ. భవజ్జననీ జనకు లిప్పుడ వచ్చెదరని చెప్పిన నదీస్నానార్థియయి
యరిగె. శాంతి. 2-69

2. ఆసక్తిగలవాఁడు.

చ. ...సూతుఁ డుద్గత భీతిం దొలఁగంగఁ దోలె రథముం దళ్ళాప్రాణ
రక్షార్థియై. విరా. 5-29

వి. పుం.

౩. యాచకుఁడు, వేఁడువాఁడు.

సీ. ప్రీత్యర్థి జనుల సచేతన త్యాగ ధ్వజములుగా నన్ని దేశములఁ
బఱపె. విరా. 5-320

వ. ధర్మనందనుండు దేశో విశేషంబున మహోజ్జ్వలత్వంబు శోభిల్లి
మహీసురుల నాశ్రిత జనంబుల నర్థులం గృతార్థులం గావించి.
(తెనుఁగున మాత్రమేగల యర్థములు.) శాంతి. 2-2

వి.

1. ప్రియము, కుతూహలము.

చ. ...కృష్ణుఁ డర్థితో, వినఁగఁ బురాతనంబయిన వృత్తము నీ విమ్మని
సెప్పు టొప్పగున్. అను. 4-412

2. ప్రీతి.

తే. యర్థి గలవచ్చి వాత్సల్యమతిశయిల్ల. విరా. 1-10

వ. అమ్మహిశాత్ముల కర్థితో మఱునాఁ డనుజ్ఞ యిచ్చిన.

ఆశ్ర. 2-69

3. స్నేహము.

చ. వాక్యవి,_స్తర చతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థి తోన్. విరా. 1-209

ఆ. మేలుగాక నీకుఁ బోలినట్లయిన వం, దరిగి యేము వారు నర్థిఁ బొంది, యుండునట్లుగాఁగ నొడఁబాటు గావింపు, మొక్కఁభంగి మనకు నదియ లెస్స. ఉద్యో. 3-83

శ్లో. యత్తుభ్యం రోచతే కృష్ణ స్వ_స్తిప్రాప్ను హి కౌరవాన్.

శ్లో. యథా సర్వే సుమనసః సహాస్యామసుచేతసః. ఉద్యో. 71-89-91

4. అభిలాష- కోరిక.

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన పద్మహితుఁడో హిమకరుఁడో. విరా. 1-215

గీ. అర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు,నందు గాంధర్వ విధి వివాహామునఁ గరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము.

ఆది. 4-106

5. ఆస_క్తి.

సీ. సఖులయి వేదముల్ చదివి ధనుర్వేద, మగ్నివేశులతోడఁ నర్థిఁ గఱచి. ఆది. 7-5

గీ. అనఘ ధర్మార్థ కామంబులందు నొకట, నర్థి దగిలిన మానవుం డధముఁ డొకటి, మాని వ_ర్తించు నాతఁడు మధ్యముండు, నడపు నన్నింటి నుత్తమనాయకుండు. శాంతి. 3-461

6. ఆతురత.

తే. ... చూచి తమరు లర్థి, ననిమిషత్వంబు తమ కప్పు డచ్చు పడఁగ. విరా. 1-165

7. భక్తి.

సీ. ...బ్రాహ్మణులకు మన్ననగల్గి, యందు వేనే మర్థి నొసఁగినట్టి
వృత్తులు సెల్లునే, ఉద్యో. 1-278

తే. ...మొదలుగ, నరుగుదెంచిరి యద్దేవు నర్థి గొలువ, మౌస. 77

**అర్థించు** సం. స. క్రి.

కోరు,

గీ. ...కృతి ప్రతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ, విరా. 1-18

ఉ. ...నకులార్థిత ధర్మము నాకు నన్మతిన్, వీనుల కింపుగా నకులు
వేఁడితి తద్విధ మెందుఁ గల్గునే. మహా. 1-63

**అర్థిత్వము** సం. వి. అ. న.

వ. అయినను నా యర్థిత్వంబునం జేసి నీ కెఱింగించెద, సభా. 1-106

**అర్థిని** సం. విశే. (న్. నీ. న్.)

కోరునది

వ. కృత్తిక లక్కుమారుం గని పుత్రార్థినులై యందఱు నొక్క
పెట్ట వీఁడు మా కొడుకని పలుకుచు, శల్య. 2-176

**అర్థ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

కోరఁదగినది, వేడఁదగినది.

వ. పదార్థ్యంబులైన యొండు వస్తువులఁ బరిగ్రహింపక, ఆది. 7-238

**అర్దితము** సం. విశే. (అ. ఆ. అ.)

పీడింపఁబడినది.

నా యనుజులు దుఃఖార్దితులై యున్నారు. స్వర్గ. 28

క. ...నలుదేవి యుండె నెదఁ బతిఁ దలఁచుచు దుస్సహవియోగ
తాపార్దితయై, అర. 2-121

**అర్ధచంద్రబాణము** సం. వి. అ. పుం.

అర్ధచంద్రాకారము గలిగిన ముఖము గల బాణము.

వ. అద్దమజుం డర్ధచంద్ర బాణంబునఁ దద్భాణాసనంబు దుండంబులు
సేసె. భీష్మ. 3-28

**అర్ధచంద్రవ్యూహము** సం. వి. అ. పుం.

అర్ధచంద్రాకారముతోఁ బన్నఁబడిన మొగ్గరము. కర్ణ. 1-69

చూ. వ్యూహము.

**అర్ధచంద్రుఁడు** సం. వి. అ. పుం.

సగము మాత్రము గనఁబడుచంద్రుఁడు. అరచందురుఁడు. సప్తమి అష్టమి. తిథులలోఁ గనఁబడు చంద్రుఁడు.

క. ...కురుధాత్రీరమణుఁ డర్ధచంద్రాకార శరము దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్. భీష్మ 3-125

**అర్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

అసంపూర్ణము, ఖండము.

అవంతి దేశాధీశులగు విందానువిందు లర్ధరథులు. ఉద్యో. 4-328

క. (అర్జునుండు) మన మొనఁ గని ధృష్టద్యుమ్నున కిట్లనుఁ బన్నబంపు మోహార మర్ధేందుని చందంబున దుర్యోధను సైన్యముఁ బొదువు ననువు దలకొనవలయున్. భీష్మ. 2-97

వి. అ. పుం.

భాగము, అంశము.

క. మాయం దొక్కొక్కళ్ళ తురీయార్ధముఁ దాల్చి శుభచరిత్రుండై దీర్ఘాయుష్యం డష్టమ వసు వాయతభుజుఁ డుండు నీకు నాత్మోద్భవుఁడై. ఆది. 4-130

వి. అ. న.

అర, సగము.

వ. మదీయంబులయిన తేజోబలంబులం దర్ధంబు పుచ్చికొని మీరందఱుం గూడి యాదుష్టదైత్యుల మర్దించుట కార్యంబు. కర్ణ. 1-274

క. నిర్జరవరనందనుండు నిమిషార్ధమునన్, విరా. 5-37

**అర్ధరథుఁడు** సం. వి. అ. పుం.

రథికుని కంటె (సమరథుని కంటె) తక్కువ యోధి (అతిరథ మహారథుల కంటెఁ దక్కువవాఁడు. గుఱ్ఱముమీఁద నుండియే యుద్ధము చేయును

గాని సమరథునివలెఁ (ప్రావీణ్యత గలిగియుండఁడు) ఒక్క విలుకానితోఁ సరిగా నిలిచి పోరలేని యోధుఁడు (శ. ర)

రాధాసుతుం డర్ధరథుఁడు. ఉద్యో. 4-284

వ. అవంతి దేశాధీశులగు విందానువిందు లర్ధరథులు. ఉద్యో. 4-228

**అర్ధరాజ్యము** సం. వి. అ. న.

సగము రాజ్యము, దొరతనమునకు లోఁబడిన దేశమునందు సగము.

వ. మా తండ్రి సమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లును బడయుదుమని కృతనిశ్చయుల మై పడితిమి. ఉద్యో. 3-272

**అర్ధరాత్రము** సం. వి. అ. పుం.

నడిరేయి.

వ. అర్ధరాత్రం బగుటయుఁ బండాలురెల్ల నింద్రింప. శాంతి. 3-288

**అర్ధాసనము** సం. వి. అ. న.

సింహాసనమునందు సగము భాగము. పీఠమున సగము భాగము. (సింహాసనాధిపతితోఁబాటు సమానముగా నతని ప్రక్కన సింహాసనమునందుఁ గూర్చుండుట.

సీ. అమరేంద్రు నర్ధాసనమునకునైన న న్నర్హుం జెంతయును నను రూఢి మాట. విరా. 2-204

**అర్ధేందుఁడు; అర్ధేందువు** సం. వి. ఉ. పుం.

క. ధృష్టద్యుమ్నున కిట్లనుఁ బన్నవంపు మోహర మర్ధేందుని చందంబున. భీష్మ. 2-87

**అర్పించు** సం. స. క్రి.

ఒసఁగు, ఇచ్చు, అప్పనచేయు.

ఆ. ...అతవు, నాశ్రయించి యతని కాత్మోపహార మర్పించు వాఁడఁ గాక పెక్కు తలఁపు, లేల నాకు. సౌప్తి. 1-112

**అర్పితము** సం. విశే. (అ. ఆ. అ.)

అర్పింపఁబడినది, ఈయఁబడినది.

ఉ. కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁ జేత సద్ధర్మము.
శాంతి. 1-149

**అర్భకుఁడు** సం. వి. అ. పుం.

**శిశువు.**

గర్భంబుల నున్న యర్భకులను. శాంతి. 2-86

**అర్మిలి** దే. వి.

1 ప్రేమ, ప్రీతి.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నెమ్మొగము
మొగంబునం గదియ మోవుఁ గరాంగుళులం కపోల మింపుగఁ
బుడుకుం బొరింబొరి నపూర్వవిలోకన మాచరించుఁ గప్పగు
మృదుమౌళి నుజ్జ్వల నఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్.
విరా. 1-247

సీ. పడతుల కర్మిలి బిడ్డల దెప కడుఁ బెద్ద అను. 1-304

2. స్నేహము.

క. తనకుం దా నెర వనినను, విను బంధులు సతమె యన్వివేకంబు
ననే, జనులపయిఁ జేయ నర్మిలి, నను వగవొందఁ దది కారణముగ
నరేంద్రా. శాంతి. 4-11

శ్లో ఏవం పుత్రాశ్చ పౌత్రాశ్చ జ్ఞాతయో బాంధవాస్తథా
తేషాం స్నేహో న కర్తవ్యో విప్రయోగో ధ్రువో హి తైః.
సం. భా. శాంతి. 164-16, 17

**అర్మ్మ** దే. వి. (రూపాం) అఱుము

ప్రతిఘటనము, మార్కొనుట.

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక యర్మ్మ పెంపునం
బోటుల వాతఁబోవు భటపుంగవులన్ మది మెచ్చుచున్.
విరా. 3-163

**అర్మ్మపెంపు** దే. సమ.

ప్రతిఘటించుట యందలి యతిశయము (లేక) ప్రతిఘటనాతిశయము.

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక యర్మ్మ పెంపునం

జోటుల వాతఁబోవు భటపుంగవులన్ మదిమెచ్చుచున్.

విరా. ౩-౧౬౩

**అర్యముఁడు** సం. వి. న్. పుం.

1. అదితి కశ్యపులకుఁ బుట్టినవాఁడు. ద్వాదశాదిత్యులలో నొకఁడు-

వ. అదితి యనుదానికి ధాతృమిత్రార్యమ శక్రవరుణాంశు భగ వివస్వత్పూష సవితృ త్వష్టృవిష్ణు లనంగా ద్వాదశాదిత్యులు పుట్టిరి.

ఆది. ౩-౬౧

2. సూర్యుఁడు.

క. హిమకరుఁడు శైత్యమును న,ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ,త్వము విడిచిరేని గుర్వ,ర్థము నా చేకొనిన సద్వ్రతంబు విడుతునే.

ఆది. ౪-౨౨౩

3. పరంబ్రహ్మము. పరంజ్యోతి.

తే. ఆ పరంజ్యోతి పేళ్లు లర్యముఁడు వరుణుఁ, డనిలుఁ డగ్ని.

అశ్వ. ౨-౨౪౩

**అర్యముని తార**

ఉత్తర అను నక్షత్రము, ఈ నక్షత్రమునందు పైతృక కర్మము నాచరించినఁ బెక్కు సంతానము పుట్టును.

తే. అర్యమునితారఁ బెక్కపత్యములు పుట్టు. అను. ౩-౧౬౩

**అర్యుఁడు** సం. వి. అ. పుం.

స్వామి, యజమానుఁడు.

వ. అత్రి నిమితో నిట్లను, శ్రాద్ధంబున నర్య వరుణ సోమాగ్నులకు భాగంబులు బ్రహ్మ కల్పించె. అను. ౩-౧౯౨

దీనికి సరియైన తావులఁ వెచ్చుటఁ జూచినను సంస్కృత భారతమున ఆర్యునకు భాగము కల్పించినటులఁ గానరాదు.

శ్లో. తతోఽగ్నయేఽథ సోమాయ వరుణాయ చ నిత్యశః
విశ్వేదేవాశ్చ యే నిత్యం పితృభిః సహ గోచరాః
తేభ్యః సంకల్పితా భాగాః స్వయమేవ స్వయంభువా.

సం. భా. అను, ౧౩౩-౨౮, ౨౯; అను. ౯౧-౨౩, ౨౪

అర్వాది (సంఖ్య)

అఱువది, అఱుపదులు.

చ. ...నా నృపాలుఁ డున్మదుఁ డయి మేటి వింట బలు మార్గణముల్
వెస నేసె మూఁడు న,ర్వాదియును నర్ధరామరునిపై శినివంశకరుండు
దోడ్పడన్. కర్ణ. 2-25

అర్వావసువు సం. వి. ఉ. పుం.

రైభ్యుని పెద్దకుమారుఁడు.

వ. అందు రైభ్యుండు కృతాధ్యయన శూరులైన యర్వావసు పరా
వసులను తన యిద్దఱఁ పుత్రులతో విద్వత్పూజితుండై యున్న.
అర. 3-253

అర్హ సం. విశే. (అ. ఆ. అ.)

తగిన స్త్రీ.

తే. మాతృ పితృహీనయైనను భ్రాతృరహిత, భావమొందిన నబ్బాల
పరిణయార్హ, వరణమున కర్హ గా దని కురుకులాగ్రగణ్య
చెపుదురు పరిణయ కల్పవిదులు. అను. 2-227

శ్లో. యస్యాస్తు న భవే ద్భ్రాతా పితా వా భరతర్షభ,
నోపయచ్ఛేత తాం జాతు పుత్రికా ధర్మిణీ హి సా. అను. 44-15

ఇచ్చట తిక్కనగారు మూలమునలేని 'తల్లిని' గల్పిరి.

అర్హణీయుఁడు సం. విశే. (అ. ఆ. అ.)

పూజింపఁదగినవాఁడు.

వ. సహదేవోపనీతంబయిన యర్ఘ్యం బర్హణీయుం డయిన వాసుదేవు
నకు శాస్త్రదృష్ట విధానంబున ధర్మతనయుం డిచ్చిన. సభా. 2-7

అర్హత సం. వి. ఆ. స్త్రీ.

యోగ్యత.

సీ. ...రాక్షస యక్ష భూతభుజంగమాది, తర్పణంబులు నర్హతా
నిరూఢములుగా, నివి గొని యొనరించు. అను. 4-34

**అర్హత్వము** సం. వి. అ. న.

తగియుండుట, యోగ్యత.

తే. అప్పనము గొను టర్హత్వ మరసి నడపు. ఆశ్ర. 1-68

**అర్హము** సం. విణ. (అ. ఆ. అ.)

1. యోగ్యము, తగినది.

క. తగఁజొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి. ఉద్యో. 1-121

2. వెల, విలువ.

సీ. ...వారు మహార్ణంబులగు వివిధాన్న పానములు ఘటించి కుడువఁ బనిచిన అను. 2-308

తే. ద్రోణ గాంగేయ భానుమత్సూను కృప సుశర్మ దుశ్శాసనులు సర్వసైన్యపతులు, నార్యజనములుఁ గొలువ మహార్హ కాంచ, నోన్నతాసనమునఁ గొలువున్నవాని. విరా. 3-76

**అర్హుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. తగినవాఁడు.

వ. సత్యవ్రత నిష్ఠుండగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాఁడుగాని దూఱువడ నర్హుండు గాఁడు. విరా. 2-182

2. సమర్థుఁడు.

వ. ఎక్కువ దక్కువలు నిరూపించి భీష్ములు దీనిని నిశ్చయింప నర్హులు. విరా. 4-185

మ. అనిలో నిల్వఁగలేని నీ విటుల కీడాడంగ నర్హుఁడవే. కర్ణ. 3-86

**అఱ** దే. వి.

1. సగము, అర్ధము.

క. నిన్న యఱ సచ్చిపోయితి, వున్న యఱయు నేఁడు దీర్చె యుడి పెద నీ గర్వోన్నతి. ఉద్యో. 4-341

2. సందేహము, అనుమానము.

క. అని పలికి మహారాజా, వినుమని ధృతరాష్ట్రుఁ తోడ వెండియుఁ

దానిఁ,ట్లని చెప్పె వాసుదేవుఁడు, తనమది నఱలేక కార్యదశ దెలి
యంగన్. ఉద్యో. 3-276

3. కీడు, ద్రోహము.

ఆ. దుర్ణయమున శకుని కర్ణ దుశ్శాసనుల్, గఱపఁ బాండవులకు
నఱయచేయఁ, గడఁగెఁ బాండవులును గడు ధార్మికులుగాన,
పొరయరైరి వారు దురితవిధులు. ఆది. 8-12

4. కొఱఁత, న్యూనత్వము.

చ. శివుఁడు ప్రసన్నుఁడైన నఱచేయునె యెవ్వరికైన. సౌప్తి.2-108

5. కపటము, మోసము.

వ. పాండవుల గెలువ నలవిగాదని యెప్పుడు, నెప్పుడునైన నఱలేక
నీకు జయంబు గోరి పోరెద వగవకుండుము. భీష్మ. 3-8

శ్లో. పరేణ యత్నేన విగాహ్య సేనాం, సర్వాత్మనాహం తవ రాజ
పుత్ర, ఇచ్ఛామి దాతుం విజయం సుఖం చ, నచాత్మానం ఛాద
యేఽహం త్వదర్థే. సం. భా. భీష్మ. 82-8

ఇచ్చట ఒట, బర, ఒర అనునవి పాఠాంతరములు. "అఱ"యను పాఠాంతరమే సంస్కృత పాఠమునకు దగ్గఱగా నున్నది.
ఆ బల్లకు అఱ లున్నవి. ఇచ్చట నొక యఱ యేర్పాటు చేసినారము అని వ్యవహారము గలదు. అప్పుడు కప్పఁబడిన లేక మఱుగుపడిన తావు అని యర్థము వచ్చును. అనఁగా ఉన్నది గానరాకుండఁ జేయుట. కపటము మోసములోఁ గూడ అదే భావము స్ఫురించును. "న చాత్మానం ఛాదయేఽహం" అన తన్ను తాను గప్పిపుచ్చను అనఁగా మోసము చేయనని యర్థమేగదా.

**అఱకడ** దే. వి.

స్కంధము, మూఁపు.

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁడై, పఱవి జలధిలోనఁ జదలఁ బాఱెకు
నెడ. ఉద్యో. 3-310

సీ. ఎఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకడ నిడి ధర్మసుత విజయులఁ దన వితత
బాహు... ఆది 6-160

శ్లో. స్కంధమారోప్య జననీం యామానంకేన వీర్యవాన్
పార్థౌ గృహీత్వా పాణిభ్యాం భ్రాతరౌ సుమహాబలః"
సం. ఆది. 160-27

క. తఱియగు నంతకు రిపుఁ దన, యఱకడఁ బెట్టికొనియుండునది తఱి
యగుడుం, జెఱుచునది ఱాతి మీఁదను, పఱలఁగ మృద్ఘటము
నెత్తివైచిన భంగిన్. ఆది. 6-114

**అఱకాలు** దే. వి.

పాదతలము, పాదము క్రింది భాగము,

క. నాయంగంబులనెల్లన్, బాయని మతి భక్తిఁ బూసి పాదతలమునన్,
బూయవు గావునఁ గలుగు న,పాయం బఱకాల నీకు నవిలం
ఘ్యంబై. అను. 5-377; మాన. 80

**అఱచు** దే. అ. క్రి.

1. మొత్తుకొను, మొఱవెట్టు.

క. నీవు బలిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలకయిమ్మైత్రి
వావిడిచి యఱచినం గడు, సేవపడరె జనులు నిన్ను నే మన
నేర్తున్. ఉద్యో. 2-216

క. అఱచినఁ బఱచిన వ్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణిం
పక యం,దఱ నులుము వేసె గుంపుల, కుఱికి యుఱికి ఖడ్గధారు
ణోల్లసనములన్. సౌప్తి. 2-7

సీ. శిరములు మేనులఁ జేర్చి భావించి ని,జాస్యముల్ వ్రేసికొం చఱచు
వారు. స్త్రీ. 2-22

2. విలపించు, పద్రు.

క. నెఱి దప్పంబడి పెల్లున, నొఱలెడి నరవాజికరుల యులివళి
మన్న్యం, డఱిమఱిఁ బడుటకు వగ మదిఁ, బఱిగొన నిల పెలుచ
నఱచు భంగిఁ జెలంగెన్. ద్రోణ. 2-182

3. (పశుపక్ష్యాదులు) ధ్వనిసేయు,

ఆ. పులుఁగు మెకము లఱవ మేల్కాను చుండిరే యక్కటకట.
ఉద్యో. 3-188

తే. నక్క లఱచెడు చేరువ నక్కటకట. స్త్రీ. 2-69

క. కాకాయని చంచు దెఱవఁగా నఱచుచు నీ,రాకరంబున మునిఁ

గెడు నక్కాకి. కర్ణ. 2-79

ఉ. ...ఆ వఱచినట్లు... ఆది. 6-198

4. కేకలువేయు, బొబ్బలువెట్టు, గోలవెట్టు.

సీ. ...కొందఱు దంతపాళిఁ జేసి భిన్నాంగులై రి కొంద —గీ-ఱఱచి

ప్రాణభీతిఁ బఱచి మహీజంబు లెక్కిరి. అర. 2-110

ఉ. ...అఱచెన్ వివిధ ప్రలాపుఁడై. ఆది. 6-168

స. క్రి.

ప్రేలు, వదరు, వాగు.

క. నను సుప్రసాద దృష్టిం, గనుఁగొను మే నివుడు గొన్ని కాఱు

లఱచితిన్, మనుజేంద్రు వానిఁ బెడ చెవు,లను బెట్టుము వేఱుగాఁ

దలంపక దయతోన్. కర్ణ. 3-98

వ. అవ్వెంగలి విత్తు లఱచు వీఱిడి యఱపులకు వంకలొత్తి మాఱు

సెప్పుటయు నొప్పకయుండు. ఉద్యో. 3-285

**అఱచేతఁ బ్రాణములు పెట్టుకొను(ఇడు) (జాతీయము)**

ప్రాణములు విడువ సిద్ధముగానుండు.

క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతి

బలం, బుఱని తెగువ ముందటఁ బె,న్గొఱలుట చిత్తమునఁ బెట్టుకొని

విహరించెన్. స్త్రీ. 2-87

తే. ఇం కెడ,సేయ కనికి నడవుఁ డఱచేతఁ బ్రాణములిడి కడంగి.

ఉద్యో. 2-127

**అఱచేతికిఁదెచ్చు దే. స. క్రి.**

1. వశము సేసికొను.

క. సకల భువనములు నఱచేతికిఁ, దేరం జాలునట్టి ధీమంతుఁడు దే,వకి

కొడుకు గలఁడు ధర్మజు,నికి నాతం డెత్తిరాక నిలుచునె యధిపా.

ఉద్యో. 2-182

అఱచేతిది; అఱచేతిలోనిది దే. వి.

1. అఱచేతి యందున్నది. బాగుగా నెఱింగినది, ముఖస్థమైనది(విషయము)

క. భూతలంబుల సంస్మరణము, భూతభవద్భావి కార్యములు గరమ్మ సమ్ముద్యోతన భంగియు నీ యఱచేతివిగావె కురువంశశేఖర జనాన్మ. శాంతి. 2-101

2. అఱచేతియందున్నదానివలె వశమైనది, ప్రాపించినది.

క. ఇన శశి పావక భూమి గగన జల పవనాది వస్తుగతులెల్లను గాలుని యఱచేతి వనినఁ దక్కన పని సెప్పంగ నేఁటికిని భుజగేంద్రా. అను. 1-23

చ. జనవర, నీసుభాషల నసత్య మొకండును లేదు నీవు సమ్మని గణకీర్తనీయుఁడవు మోక్షము నీ కఱచేతిలోనిదై, యునికి దృఢంబుగాఁ గనియు నొండొక చందము మాటలాడితిన్. శాంతి. 6-217

అఱచేతిలోన నున్నయట్లు దే. జాతి.

అఱచేతిలో నున్న వస్తు వెంత విస్పష్టముగాఁ గనఁబడునో అంత విస్పష్టముగా.

తే. లోకమెల్లను నఱచేతిలోన నున్నయట్లు గనికొని. శాంతి. 4-250

అఱచే(సే)యు దే. స. క్రి.

వంచనముచేయు, మోసపుచ్చు.

ఉ. ...పాండవుల్, సేపడిరేని చంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టఱఁ జంపుదుం జుమీ. ఉద్యో. 4-68

"న వై త్వయ్యన్నృతం వదే" సం. భా. ఉద్యో. 145-18

అఱచేయి దే. వి.

హస్తతలము, చేతిక్రింది భాగము.

ఆ. కాంతమైన నొక్కకరము వొడమి యఱచేయి సాచుటయును జిత్త మద్భుతంబుఁ బొంద దాని దప్పక చూచి యయ్యధిపు కౌతూహలవగుట నాత్మ నెఱిఁగి. అను. 8-128

అఱపీనుఁగు దే. వి.

1. మూర్ఛితమైన ప్రాణి.

ఉ ...విల్, ద్రుంచి తురంగ వక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొ,ప్పించినఁ దేరితోడ నఱపీనుఁగు నీడిచికొంచుఁ బాఱె నే,వాంచల భూమికిం బెలుచ నత్తురగంబులు విహ్వలంబులై. ద్రోణ. 2-74

2. కొఱప్రాణముతోనున్న ప్రాణి, కొనయూపిరితోనున్న ప్రాణి.

వ. ...పదంపడి యఱపీనుఁగు లొఱలుటయును దానవ కలకలంబు డిందుపడియె. సౌప్తి. 1-202

అఱపు దే. వి.

1. వ్యర్థభాషణము, తెలివిమాలిన మాట.

వ. ...తమ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు నవ్వెం గలివిత్తు లఱచు వీఱిడి యఱపులకు వంకలొత్తి మాఱుసెప్పుటయు నొప్పకయుండు. ఉద్యో. 3-285

2. అఱచుట.

క. ...వికృతపు, టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే. కర్ణ. 2-116

అఱపొఱడు దే. వి. (√అఱ)

సగముగూను.

క. అఱపొఱడు కుఱుచ చేతులు, నొఱవ శరీరంబు గలిగి. అర. 2-134

అఱవ దే. వి.

సాధువుగాని యావు.

క. అఱవులనైనను నంపువ, వెరవున. విరా. 1-101

ఇది పాఠాంతరము.

అఱవఱలు దే. వి. బ.

ఖండఖండములు, ముక్కముక్కలు.

సీ. పటుభల్లనికరంబు పఱిఁగినఁ బఱియలై, యఱవఱలయ్యెడు నరద
ములును. ద్రోణ. 3-158

విణ.

భగ్నమైనది, ధ్వస్తమైనది.

సీ. ...దేవతల్ మునులు నతిప్రయత్నంబునఁ, గావించు దక్షయాగ
మున శివుని, మఱచిన నయ్యజ్ఞ మఱవఱలై పోదె. అను. 5-388

**అఱవాయిగొను** దే. అ. క్రి.

వెనుదీయు, జంకు.

సీ. ...తలలేటి యుర్వికి బలిఁయొనర్తుననని యదల్చినను వారఱవాయి
గొనక యప్పలుకులన్నియును రజ్జులుగఁ గొనుచుఁ.
మౌస. 1-185

'అరవాయి' అను పద మిక్కడతప్ప భారతమునందలి మిగిలిన ప్రయో
గములన్నియు లఘురేఫముతోనే యున్నవి. శబ్దరత్నాకర సూర్యరా
యాంధ్రనిఘంటు కర్తలు లఘురేఫము గల శబ్దమునే యిచ్చిరి. గాని
శకట రేఫయుక్త శబ్దము నొసంగలేదు. తి. ప. వ్ర. కోశమువారు మాత్ర
మిచ్చినారు. ముద్రణ ప్రమాదమా, సాధువా, విచార్యము.

**అఱసచ్చిపోవు** దే. అ. క్రి.

సగము చచ్చు.

క. నిన్న యఱ సచ్చిపోయితి, వున్నయఱయు నేఁడు దీర్చి యుడిపెద.
ఉద్యో. 4-341

**అఱిగించు** దే. అ. క్రి.

1. (తినిన పదార్థము) జీర్ణముచేయు.

సీ. ...దరిద్రవుజనంబు, లోకటం దిని ఱాలు నఱిగించుకొందురు,
భోజనసంపన్నులు భోజనంబుఁ -గీ- బూర్ణమునఁ జేయఁజాలరు.
శాంతి. 1-216

**అఱిగించుకొను** దే. అ. క్రి.

1. (తినిన పదార్థము) జీర్ణము చేసికొను.

చూ. అఱిగించు. శాంతి. 1-216

**అతిముతి** దే. క్రి. విశ. ద్రు.

1. అనాలోచితముగా.

క. వెలువక సంకేతించిన, తెఱఁగున నయ్యెడకు నరుగుదెంచు నొకో కొంద ఱఁ దెచ్చునొకో వెడఁగై, యతిముతి వెలిపుచ్చునొకో రహస్యం బెల్లన్. విరా. 2-277

2. తోడ్తో, వెంటనే, శీఘ్రముగా, వేగముగా.

చ. ...యుధిష్ఠిరుం, డతిముతిఁ జంపె సారథిఁ దదశ్వములన్ వర బాణపాణియై. విరా. 3-215

శ్లో. యతోయుధిష్ఠిరోరాజా త్వరమాణోమహారథః సం. విరా. 33-37

సీ. ...ఉత్కట శోకంబు గదిరిన, నతిముతి మేదిని నొఱగువారు. మాస. 150

3. తఱచుగా, దట్టముగా.

చ. ఉఱుముచు నెల్లెడం బడుగు లుగ్రగతిం బడ ఘోరమూర్తియై యతిముతి గప్పుదెంచు పిలయాభ్రము చాడ్పున. ద్రోణ. 1-89

వ. ...అశ్వశరీరంబులు గోసి పాఱవైచి, వాఁడిసేయుచు నుబ్బున గుబ్బంబుల కుతికి బడలువడ నతిముతి విసరిన నోరవోయిన సురియం జెంది యవలీలం గాలుబలంబుల పైఁబడి చక్కం జేయుచు భీష్మ. 2-71

4. ఉత్సాహముగా, పూనికగా.

చ. అతిముతి నీ కుమారవరు లత్తఱి నందఱు నా బకారిపై, నుఱక. భీష్మ 2-298

క. ముతిముతి చీఁకటి యప్పుడు, నతిముతి భటులుడుగ కడరి యని సేయంగా, నెఱసి తల మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మతి పాసి నిలిచి రెంతను నంతన్. విరా. 3-195

5. తబ్బిబ్బుగా, తాఱుమాఱుగా, ఉచ్చావచముగా.

క. విఱిగి భవత్సుత నివహం, బతిముతిఁ గనుకనిఁ జనంగ ననిలసుతుం డేదైఱ నెనచి వగచె నారం,దఱుఁ దనచేఁ జచ్చుటపుడు.

తప్పుటకుఁ గడున్. భీష్మ. 2-390

క. ...ఉక్కఱి బహుళ సైన్యమఱిముఱిఁ, బఱచిన నాగంగఁ గాదు
బలియురకైనన్. శాంతి. 1-16; ద్రోణ. 4-168

6. అత్యంతము, మిక్కిలి.

క. మెఱుమతనుర్దండము గుణ, మఱుమఁగ విశిఖశతి దొరుఁగ నొకటం
దఱచై, పఱవ రుధిరంపుఁ గాలువ, యఱిముఱి ఘనభుజుఁడు
ద్రోణుఁ డడరె నరేంద్రా. ద్రోణ. 1-294

వ. అంచపిండు పేరాఁకలి నఱిముఱిం బెఱికినఁ గుఱుకులు గట్టిన
మృణాళనాళంబుల. విరా. 3-286

7. పూర్తిగా, నిండుగా.

క. తఱిమి తన మును సైన్యము, నఱుమాడఁగఁ గని సుయో
ధనుఁడు మున్నుగ నే, త్తెఱ నీ యోధులు మార్కొని, యఱిముఱి
నొప్పించి పట్ట నమరి పొదివిరన్. కర్ణ. 2-276

అఱు దే. అ. క్రి.

1. నశించు, క్షీణించు.

క. బలవంతుల బలమఱఁగా. ఆది. 7-176

జన మఱియున్నన్. ఆది. 2-18

చ. కురుబల మేఁగుదెంచె నలు గోవుల బిట్టఱఁబట్ట. విరా. 4-20

చ. చిఱునగవొప్ప గాండివము చెచ్చెర సజ్యముసేసి సేన లుక్కఱ.
విరా. 5-148

2. చెడు, తొలఁగు.

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుఁగు, పెంటలయ్యె రాజుఁ
బెద్దదొరలుఁ, జీర లొలువఁబడిరి సిగ్గఱి బిరుదులు, వైచి రింక మగుడ
వఱదె మనకు. విరా. 5-222

క. ఎఱుకలు విఱిగిన గురుడుని, తెఱఁగునఁ దేజంబు సెడిన దినకరు
గతి నంద్రఱు బంధులు దెగి విభవం, బఱి వెలవెలఁ బాఱుచునికి
యది బ్రదుకగునే. స్త్రీ. 1-11

చ. ప్రియమతి యజ్ఞ నేనియు దరిద్రుని నేనియు విప్రుఁ గందఁ జేఁత యుభయలోక సౌఖ్యములు దవ్వగఁజేయు. అను. 5-6

**అఱుఁదెవులు** దే. వి.

క్షయరోగము, క్షీణింపఁజేయు రోగము.

వ. అమ్మహాత్మునందు గోపించి యఱుఁదెవులు గొనుమని శాపంబిచ్చిన నయ్యోషధినాథుండ నానాఁటికిఁ గృశుండయ్యె. కల్యా. 2-148

సీ ...కష్టముగల తనువు నాతఁ, డఱుఁదెవుల్ గొన్నాతఁ డఖిల వస్తువులును నమ్మెడు నతఁడు... -తే- పంక్తిదూషకు లంద్రు పౌరవేంద్ర. అను. 3-176

అఱుగుఁదెవులు- అఱుఁదెవులు; అఱుగు = క్షీణించు; అఱుఁదెవులు-క్షీణింపఁ జేయురోగము, క్షయరోగము. (చై. ణ్యాత్ క్షయా)

**అఱుగు** దే. అ. క్రి.

1. అడఁగు, అణఁగు, నశించు.

సీ. అద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగదేఁ జూతుఁగా, కని తల సూపక యడఁగువారు. విరా. 3-86

క. నీ, క్రొవ్వఱుగదేని దలపడు మెవ్విధి జనితేని నను చు నెత్తిన క్షితిన్. విరా. 4-71; అను. 3-300

2. క్షీణించు, తఱుగు.

సీ. సత్త్వంబు నరులకు సంక్షిప్తమగు సత్త్వహాని నాయువు గడు నఱిగి పోవు, నాయువు తఱిగిన నల్పంబులగు విద్యలు. అర. 4-288

తే ...భీమసేనుచేఁ బచ్చి చచ్చి, బలము లఱుగ నా కర్ణుండు,
చూ. అఱువు. ద్రోణ. 4-220

3. తినిన పదార్థము జీర్ణమగు.

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్మని భాగమీక నీవె క్కటి మ్రింగఁ జూచె దది యెట్లఱుగున్. ఉద్యో. 2-52

తే. ...అగ్నిమత్సహితులై కొనిన నఱుగఁ జేయువాడ నాహార ముల్ సిద్ధ మిదియు. అను. 3-196

**అఱుగమి** దే. వ. క్రి. విశే.

తినిన పదార్థము జీర్ణము కాకపోవుట.

సీ. ఒక తఱి మునివర్యు లొక్కటఁ బెక్కంద్ర, శ్రాద్ధముల్ సేయు
భోజ్యములు పెక్కు, లనుభవించుటఁ దమ కఱుగమి పుట్టుట
యును పితృదేవతల్ సనిరి-సోము కడకు. అను. 3-196

**అఱుత** వి. షా.

ఉపకంఠము, సమీపము.

వ. అమ్మడువు నఱుత నొక్క పఱపు గల పొద యీాఱమిం దూఱి
పొంచియుండితి. శల్య. 2-46

"ఆఱ్టు" శబ్దమునకు ఔపవిభక్తిక రూపము.

**అఱుము** స. క్రి.

ఒత్తిడిచేయు, బాధించు

వ. ...ఇప్పరుసునం బ్రతివీరుల నఱుముటయు నప్పుడు పతంగుండు
పశ్చిమాచల శృంగంబు మఱుంగుపడుటయుం జూచి గాంగే
యుండు. భీష్మ. 2-405

అ. క్రి.

1. యుద్ధముచేయు.

(విరాటునితో నుత్తరుఁ డర్జునుని విషయమై తెల్పుట)

క. మొగమోడఁ డితఁడు కౌరవ, జగతీశుఁడు విఱిగినపుడు జవమున
వెనుకం, దగిలి యిది జూదమాడఁగ, నగు నెడగా దఱుమువలయు
ననియె నతనితోన్. విరా. 5-338

2. విజృంభించు, చెలరేఁగు. (శ్రీకృష్ణుఁడు విదురునితో సంభాషించుట)

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁగూడిన
నృపులం,దఱుఁ బగ్గె మనమున నిడికొని, యఱుముటయును సంధి
పొసఁగ దనియు మహాత్మా. ఉద్యో. 3-237

3. సాహసించు, తెగించు.

తే. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు నెల్ల సుఖముఁ, గోరెదము వార

అందఱు వీరె వచ్చి, ప్రాణములు నర్థము లొల్లఁ(ఖాట్లు)సేసి,
కయ్యమునఁ జావ నఱుముట గంటిగాదె. భీష్మ. 1-182

4. ప్రతిఘటించు, మార్కొను.

వ. పలినవాఁ డఱుముటయును దొరలు తెగి తిరుగుటయు.
విరా 5-207

చ. .. అమరాపగాతనయుతోడి రణంబునకున్ దశాధినాథులు నఱు
మంగఁ జాలరు. భీష్మ. 2-6

దే. వి.

ప్రతిఘటనము, ఎదుర్కొనుట, మార్కొనుట.

క. ఉఱక నరు డట్లు మైమఱు, వఱువుళ్ళుగఁ జేసి లీల నంగము లెల్లం,
బఱియలుగఁ జేయ వాతం, డఱు మెదలక మఱియు నేసె నధిక
రయమునన్. భీష్మ. 2-306

**అఱువది** దే. సంఖ్యా. ఔ.

అర్వది, ఆఱుపదులు.

ఆఱువది శరముల నన్నరు నంగఱులను, విరా. 5-103

తే. మున్నూట యఱువదింటఁ బెంప మానుషాబ్దంబులై పేర్చియుండు.
శాంతి. 5-43

సీ. అమరనదీసూను నఱువదింటను నేసి. విరా. 5-66

**అఱువదినాలుగు** దే. స. ఔ.

ఆఱుపదులపయి నాలుగు,

అఱువది నాలుగు నారసముల నక్కిరీటి. భీష్మ. 3-51

**అఱువదివేవురు** దే. స.

ఆఱువదివేలమంది.

నివాత కవచుల నఱువది వేవుర నిర్జించితి. ఉద్యో. 2-150

**అఱువదేను** దే. స. ఔ.

ఆఱుపదులపయి నయిదు.

అఱువదేనేండ్లు ధరియిచ్చునప్ప గలవాఁడు, విరా. 4-122

**అఱువదేవురు** దే. స.

అఱువదివయి నయిదుగురు.

> దుర్జయులగు హిరణ్యపుర నివాసుల నఱువది వేవుర దేవారాతుల
> వారాశితీరంబునం బరిమార్చిరి, విరా. 4-148
>
> (ఆఱువదివేవురు- అని పాఠాంతరము)

**అఱువు** దే. అ. క్రి.

పగులు, వ్రయ్యు.

> చ. అని పలుకంగ గౌతమ మహాముని యచ్చటనుండి యంతయున్,
> విని కలుషించి యేల యిటు వీకను నోరఱువంగ, బ్రేలె దీ,జన
> పతియే విధాతయును శక్రుఁడు నీశుఁడు నర్థకాంక్షివై, మనమున
> శంకలేక యొక మానవు నింత నుతింప నేటికిన్-

ఇది ఆనందవారి పాఠము. దీనికి పాఠాంతరముగా ఆనంద ప్రతిలోనే 'నోరెరువంగ' అని యిచ్చిరి. అకాడమి, పలము ప్రతులలో 'వీకున నోర ఱుగంగ'- అనియున్నది. సం. ము- 'వీకున' అనుదానికి 'వీకను' 'వీకున' అను బిందురహిత పాఠాంతరము లిచ్చిరేగాని 'అఱుగంగ' అనుదానికి ఆనంద వారిచ్చిన పాఠముగాని పాఠాంతరముగాని ఈయలేదు. అనఁగా సం. ము 'అఱుగంగ' అనుదానికి పాఠాంతరమేలేదు. మూలమును బట్టి ఈ పదమునకు ఆకరము కనఁబడుటలేదు. పరికించిచూడ "అఱువంగ" అనుదానికన్న "అఱుగంగ" అనునదే సమయోచితముగానున్నది- "అఱు గంగ" = అఱిగిపోవఁగా- ఒక వస్తువును ఎక్కువగా వాడిన దాని రూప మె ట్లఱిగిపోవునో అట్లే అసంబద్ధ ప్రలాపములు చేయుటచే నోరు అఱిగిపోవునని భావము "నోరఱుఁగంగ" అనునది తిక్కనగారి తెలుఁగు నుడికారము.

**అఱువుళ్లు** దే. వి. బ. (అఱువుడ - అఱువుళ్లు)

ఖండములు, తునుకలు.

> క. ఆమెయిన వివిధ వర్ణ, స్తోమం బఱువుళ్ళు సేసి. విరా. 5-38
>
> క. ద్రోణుఁడు గోపించి తమ్ముత్రాణం బఱువుళ్లు సేసి. భీష్మ. 3-288
>
> క. చిఱునగవుతోడ మైమఱువఱువుళ్లుగఁ జేసి యతని యంగము

దోఁగఁ, బఱపె రుధిరంబు. కర్ణ. 3-300

ఏకవచన ప్రయోగము భారతమునందుఁ గానరాదు.

**అఱువుళ్లు సేయు** దే. స. క్రి.

ఖండించు, ముక్కలుసేయు.

క. ...చాపంబులు విఱుచుచు, మైమఱవు లఱువుళ్లు సేయుచు. ద్రోణ. 4-176

**అఱ్ఱాడు** దే. అ. క్రి.

1. సమీపమునఁ దిరుగు, ఇటునటు తిరుగు, చుట్టిచుట్టి తిరుగు.

వ. ...అతండును సత్త్వహీనుండు గావున సత్వరుండై క్రమ్మఱి ద్రౌపదియున్న యెడకుం జని యాసమీపంబున నఱ్ఱాడుచు నమ్మానవతితో నిట్లనియె విరా. 2-42

అఱ్ఱు + ఆడు = అఱ్ఱాడు.

**అఱ్ఱావు** దే. వి.

అడవియావు.

అఱ్ఱావులను నైన నలువున వెరవున విరా. 1-101

ఇది పాఠాంతరము,

**అఱ్ఱు** దే. వి. ఔ.

1. మెడ, కంఠము.

అట్లఱ్ఱెత్తి చూచి కర్ణుఁడు. కర్ణ. 3-127

వ. అమ్మద్రపతి యఱ్ఱెత్తి యాలోకించి. కర్ణ. 2-119

సీ. శక్తి యాచార్యుని శక్తి నూయించుఁ బొమ్మని చూపఱెల్లరు నఱ్ఱులెత్తిరి. ద్రోణ. 3-248

వ. అపగత ప్రాణంబై పడియున్న పాముం దన వింటికొప్పున నెత్తి యమ్మునిని యఱుతం దగులవైచి. ఆది. 2-167

తే. ...ఒక్క, వాఁడు తన యఱ్ఱుసాఁచి కాననములోన దీనుకొని మేయఁగాఁ బెనువాన వచ్చె. శాంతి. 3-88

2. పసువుల మెడ వంపు.

సీ. అరథికోత్తముఁ దచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల నలుఁగు లుండ - తే- నురవడింపవు వీరల నరకుగొనక, వీనినిప్పుడ యత్తులు విడిచి తడవుము. ద్రోణ. 3-151

(ఔప విభక్తికములు పరమగునప్పుడు ఈ పదములోని క్రింది అకారము నకు నిత్యముగను ఇతరత్ర వైకల్పికముగను లోపము వచ్చును.)

అల దే. విశే. (రూపాం. అల్ల)

1. ప్రసిద్ధిని దెల్పును.

ఉ చిత్తము లుల్లసిల్ల నల సింహకిశోరము లొక్కమై మదోన్మత్త గజావళిం బొదువు మాడ్కి. ఉద్యో. 2-140

2. నిర్దేశమును దెల్పును.

చ. ...పార్థుఁ డాఁక కెటపోయితి నాఁ డల ఘోషయాత్రలో. కర్ణ. 2-32

అలంకరణము సం. వి. అ. వ.

1. అలంకరించుట.

వ. పట్టణాలంకరణ ప్రముఖ నిఖిల భద్ర విధానంబులు సేయించిరి. విరా. 3-287

క. తరణి యపరాద్రి శిరః స్ఫురణను సధికరణాలంకరణం బొన రించుటయును. భీష్మ. 2-319

2. భూషణము.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి, విరా. 5-383

అలంకరించు సం. స. క్రి.

1. అలంకారము సేయు, కై సేయు, సింగారించు.

వ. ...రేపకడ వనలక్ష్మి పురశ్రీ నలంకరించు వడువున నెడపడక యెల్లెడల నిగుడు విభాత కుసుమ కదంబ పరిమళంబును. విరా. 2-240

2. అలంకారము గలదిగాఁ జేయు.

చ. ...యిట్టులను భ్రూకుటి ఫాల ములంకరింపఁగన్. విరా. 3-208

3. (అలంకారముగా) పెట్టు.

క. ...నధిపు చుట్టలఁ నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్.

ఉద్యో. 4-127

4. వహించు, పూను.

సీ. అనిమిషాసుర యుద్ధమున నసురావళి, సమయించి వర్ణాశ్రమముల
నేర్పరించి భూమి యలంకరించి. ద్రోణ. 2-205

5. అధిష్ఠించు.

వ. ...తదనంతరంబ యంబుజాప్తు డపరగిరిశిఖరం బలంకరించె.

శాంతి. 2-125

6. ప్రకాశింపఁజేయు.

వ. ...వార లధ్యాపన యాజన విశేషంబుల నశేష దేశంబులు నలం
కరించుచుండి రట్టిఘెడ. శాంతి. 6-303

అలంకారము సం. వి. అ. పుం.

1. భూషణము.

వ. హ్రీంకారమయ మనోజ్ఞాలంకా రోల్లాస నిత్య లాలిత్యనకున్.

విరా. 1-82

2. కావ్యాలంకారములలో నొకటి.

విషమ కావ్యంబునుం బోలె నస్పష్టాలంకారంబును. విరా. 2-325

ఇవి ; 1. శబ్దనిష్ఠమగు అనుప్రాసాదులు 2) అర్థ నిష్ఠమగు ఉపమానా
దులు 3. ఉభయ (శబ్దార్థ) నిష్ఠమగు పునరుక్తవదాభాసాదుల్ను- అని
త్రివిధములు.

అలంకారుఁడు సం. విశ. (అ. ఆ. అ.)

అలంకారము గలవాఁడు.

అట్టి శౌర్యాలంకారు మహాత్ము. ఉద్యో. 2-145

అలంకృత సం. విశ. (అ. ఆ. అ.)

అలంకారము చేయఁబడినది.

వ. ...అమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబి

కయు నంబాలికయు ననుముద్దియల మువ్వురం బట్టి. ఉద్యో. 4-274

కన్యల నలంకృతలం జేసి... ద్రోణ. 2-202

**అలంకృతము** సం. విణ. (అ. ఆ. అ.)

అలంకరింపఁబడినది.

వ. కృష్ణుం డరిగి యలంకృతమైన నిజపురము సొచ్చునప్పుడు. అశ్వ. 3-119

**అలంకృతి** సం. వి. ఇ. స్త్రీ.

అలంకారము.

తే. లోకములకు మూఁటి, కుజ్జ్వలాలంకృతియుఁ బెంపు నొసఁగినట్టి,
యమలతరమూర్తి యగు దేవి. అను. 2-114

**అలంకృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. అలంకరింపఁబడినవాఁడు.

వ. ...వారలం దోడ్కొని చని... యంగ రాగ మాల్యాభరణంబుల
నలంకృతులం జేసినం. విరా. 3-155

2. అలంకారము చేసికొనినవాఁడు.

వ. ...మత్స్య మహీనాథుండు... లగ్నం బాసన్నం బగుచు వచ్చెనని
ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు ననుజ సహితంబుగా
నలంకృతుండై. విరా. 5-399

**అలంక్రియ** సం. వి. ఆ. స్త్రీ.

అలంకారము.

మత్తకోకిల. సంగరాంగణ భూమికిం దమ చారు భావ మలంక్రియా,
సంగతిం గలిగింప. స్త్రీ. 2-144

**అలంఘనీయము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉల్లంఘింపరానిది, దాటరానిది.

వ. .. ఇతని (వాసుదేవుఁడు) వచనం బవశ్యంబు నలంఘనీయం బనిన
విని జనార్దనుండు సంజయున కిట్లనియె. ఉద్యో. 1-335

**అలంఘితము** సం. విణ. (అ. ఆ. అ.)

అవదాటఁబడనిది, అతిక్రమింపబడనిది.

ఆ. ధర్మరతులు నర్థనిర్మాణ చతురులు, తౌల్య రహితులును నలం
ఘితాజ్ఞులును సునీతి నిపుణులును గుణులు నగు, పరిజనములఁ
జెనుపుపతికి హితము. శాంతి. 2-189

**అలంఘ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అవదాఁటరానిది, ఉల్లంఘింపరానిది.

సీ. ఇట్టి రత్నము వీరికిఁ జాలుదునె ముని,నాయక నీ వచనం బలంఘ్య
మగుట దీని నీకు నర్పించితిని. సౌప్తి. 2-78

2. లంఘింప నలవికానిది, దాఁట శక్యముగానిది.

స్రగ్ధర : ...దుర్వార వారోఘగంభీ, రాలంఘ్య ప్రాణవేగం బగుచు
బహుతరాయామ విస్తారమై దిట్టాలోకింపఁగ నుగ్రంబగు జలనిధి
నంతంతటం గంటి మంతన్. అర. 7-16

**అలంబతీర్థము** సం. వి. అ. న.

1. ఒకానొక పవిత్ర క్షేత్రము.

క. కనక వ్రతతీ తతులం, బెనఁగిన సురభూరుహములఁ బెద్దయు బెడఁ
గై, తనరిన యలంబు తీర్థం,బున కరిగె. ఆది. 2-70

వివరమునకై చూ. ఆది. 2-63 మొదలు 78 వఱకు.

**అలంబసుఁడు** సం. వి. అ. పుం.

బకుని తమ్ముఁడు.

అసురేంద్రు లగు నలంబస హలాయుధులును. భీష్మ. 1-95

వీనికి 'ఆలంబుసుఁడు' అనియుఁ బేరు గలదు. చూ. అలంబుసుఁడు.

**అలంబుస** సం. వి. ఆ. స్త్రీ.

ఒకానొక అప్సరస్త్రీ. చూ. వివరము. శల్య. 2-208

**అలంబుసుఁడు** సం. వి. అ. పుం.

1. బకాసురునకుఁ దమ్ముఁడు, కిమ్మీరుని తరువాతివాఁడు.

ఇతఁడు ఘటోత్కచునితోఁ బోరి మరణించెను. ద్రోణ. 3-259; 288

2. ఒకానొక రాజు, దుర్యోధను పక్షమువాఁడు, ఇతఁడు సాత్యకితో యుద్ధముచేసి యతనిచేఁ జచ్చెను. ద్రోణ. 4-252; 258

3. జటాసురుని కొడుకు, ఇతఁడు కురుపాండవ యుద్ధ సమయంబునఁ గురురాజుఁజేరి తనకుఁ బాండవులదెసఁ బూర్వవైరము గల దనియు నందుచే నతనికిఁ బ్రియంబుగా వారిని వారివారిని వధింప చేరవచ్చితిననియుఁ బలికి యతని పక్షముఁజేరి ఘటోత్కచునితోఁ బోరి మరణించెను. ద్రోణ. 5-208

అలఁకి దే. వి.

ఒక విధమైన కుండ, భాండ విశేషము.

సీ. కలశములును, నల్కులుఁ గాఁగులు నాదిగాఁగల బాండములును. అశ్వ. 3-156

(శ-ర; సూ. ఆ. నిఘంటువులలో దీనియం దఱునున్న లేదు)

అలఁగు; అలంగు దే. అ. క్రి.

శ్రమపడు, అలయు.

ఉ. ఎండకు వానకోర్చి తన యిల్లు ప్రవాసపుఁ జోటునాక యా,
కొండు నలంగుదున్ నిదురకుం దఱిదప్పెడు దప్పివుట్టె నొ,క్కండన యెట్లొకో యనక. విరా. 1-185

అలఁచు; అలంచు దే. స. క్రి.

1. శ్రమపెట్టు, వేధించు, పీడించు.

క. తమ్మింద్రపదవి సేకొని, మమ్మెల్లను నరయు మనిన మానవపతి
నా, కమ్మహిమకుఁ దగు మాహా,త్మ్యమ్ము గలదె నన్ను నేల యల
చెద రనినన్. ఉద్యో. 1-145

వ. దుశ్శాసన వికర్ణ చిత్రసేనులతో మథ్రాసూనునకు మహాయుద్ధం బయ్యె నందు వారల నందఱ నా సంక్రందనపౌత్రుండు విరథులం జేసి వృకోదరువచనంబులు దలంచి యలంచుచుండెం గ్రాన్ని సమయింపఁడయ్యె. భీష్మ. 3-46

2. కలఁతపెట్టు:

క. పెరయీఁగల గతిఁ గవియుచుఁ, బోరిఁబోరిఁ గడుఁ దురుల పగిదిఁ బొడువుచు నెరకై, వెరవునఁ గాకులుఁ గ్రోఁతులు, బరువడిఁ జీకాకు పఱుచు భంగి నలఁచుచున్. ద్రోణ. 1-258

క. దైన్యము చిత్తమ్మలపంగఁ గురుక్షేత్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా. మౌస. 1-189; స్త్రీ. 2-15.

**అలఁత; అలంత** దే. వి.

1. దుఃఖము, బాధ.

సీ. కదిసిన యత్తైనఁ గౌఁగిలింపఁ గడంగి యరసి బొంకైనను నలఁత నొందు. విరా. 2-201

క. మున్నిట్టి తెఱఁగు శోకం, బెన్నఁడు దా ననుభవించి యెఱుఁగదకట నేఁ, డన్నెలఁత యలఁత పెల్లున, నెన్నియవస్థలకు వచ్చి యెట్ల య్యెడినో. సౌప్తి. 1-19

సీ. అనిమిషనాథుఁ డిచ్చిన శక్తి యర్జును, సమయింపఁ గర్ణుండు సంగ్రహించెఁ, నదియున్నదాన నయ్యాపద వాటిల్లదేని నయ్యలఁత సహింపవశమె. ద్రోణ. 5-281

శ్లో. తతోఽభవేత్తే వ్యసనమ్ ఘోరమ్ భరతసత్తమ. ద్రోణ. 184-62

2. ఆపద.

సీ. అమరుల యీలువు టాండ్రను జెఱవట్టి తభల లోకమ్ములకు నలఁత నేసి. అర. 7-61

**అలఁతి; అలంతి** దే. విశ.

1. సూక్ష్మము, చిన్నది, కొలఁదిపాటిది.

తే. ...పెక్కండ్రు రథిల దిశలఁ, బొదివి యతని కరకఁబువఁ బొలుచు చక్రమలఁతి తునియలుగా నేసి రాగ్రహమున. ద్రోణ. 2-116

ఆ. హరి సహస్రశీర్షుఁ బరము సహస్రాక్షు, వేదమయు సహస్రపాదు నలఁతు, లైన వారికంటె నలఁతి పెద్దలకును, జాలఁ బెద్దయగు దయాళుఁ గొలుతు. శాంతి. 2-21

క. సరసన సాత్యకి రుచిరపుటరదంబునఁ జనియె వెనుక నలంతి రథ
ముపై, నరిగె సుభద్రయు. ఆశ్వ. 8-26

2. స్వల్పము.

క. ఇన్నగమునందు గాండివమున్నది యదిగాని మద్భుజోద్రేక విలా,
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీవిండ్లు గుఱుచ లలంతి బలం
బుల్. విరా. 4-105

3. సన్నమైనది (కంఠస్వరము)

తే. నావుడు నునుసిగ్గు గదిరి యాననము వాంచి, యలంతి యెలుఁగున
నిట్లను నా లతాంగి. అను. 1-50

4. వశము, శక్యము.

వ. ...పుత్రశోకం బడరి యలంతిగాని యలంతఁబెట్ట నూరకుండి
యక్కౌరవ రాజపత్ని పద్మనాభు దెసఁ గనుంగొని కోపోద్దీపితయై.
స్త్రీ. 2-158

వి.

అల్పమైన ప్రయత్నము.

ఆ. ధర్మపుత్రు భాగ్య మలంతి బోవు నెట్లు. ద్రోణ. 1-91

5. అందుబాటులో నున్నవాఁడు, లోకువయైనవాఁడు.

చూ. చేయలంతి

అలంతిగానియలంత దే.

భరింప శక్యముగాని బాధ.

వ. పుత్రశోకం బడరి యలంతిగాని యలంతఁబెట్ట నూరకుండి.
స్త్రీ 2-158

అలంతిఁబోవు; అలంతింబోవు దే. స. క్రి.

అల్పమైన ప్రయత్నముచేఁ జక్కఁబడు.

సీ. పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్రహ్మాస్త్రంబు సర్పముఖాస్త్ర
మలంతిఁ బోవునె. కర్ణ. 1-42

ఆ. ఆ ధర్మపుత్రు భాగ్య మలంతిఁబోవు నెట్లు. ద్రోణ. 1-91

మానిని. ...యిప్పని యి,మ్మెదిని సేనలకుం గురుకోటికి మృత్యువుగాన
నిజం బలఁతిం,బోదని యాడరె. స్త్రీ. 2-31

సీ. మనసేన మున్నవమానపాటు, దుఃఖపాటు గతిగి తొడరంగ వచ్చిన,
వారుగాన యలఁతిఁబోదు ప్రాణ మానపడక. ఉద్యో. 4-257

మ. అలఁతిం బోరు మహారథుల్ ద్రుపద మత్స్యాదీశులు.
ఉద్యో. 4-261

**అలఁతినగవు; అలఁతినవ్వు; అలంతినవ్వు** దే. వి.

చిఱునవ్వు, మందహాసము.

క. ...అలఁతి నగవు, నినుపారెడి చూడ్కి వారి నెమ్మొగములపై —
అశ్వ. 3-145

తే. ...అలఁతి నగవు చెలువు మొగమున కొక క్రొత్త పొలుపొనర్ప.
ఉద్యో 3-364

అలఁతి నవ్వినుమడి చెలువు నొసఁగ. అను. 4-419

అలరు మొగంబున నలఁతి నవ్వుకాంతి దళుకొత్త శల్య. 2-339

**అలఁతులఁబోవు; అలంతులఁబోవు; అలతులంబోవు** దే. స. క్రి.

కొలఁది ప్రయత్నములచే జిక్కబడు.

సీ. .. సాత్యకి యలఁతులఁ బోయెడువాఁడె. ఉద్యో. 1-268

అలంతులఁ బోక గలుగు నెట్టులు. ఉద్యో. 3-205

ఉ. ...యీ, కావరమైన కీచకుఁడు కామని పీడితుఁడై యలంతులం
బోవక. విరా. 2-223

వ. చూడం జిన్నవాఁడుగాని యలంతులం బోయెడువాఁడు గాఁడు.
ద్రోణ. 2-104

**అలఁదు; అలందు** దే. స. క్రి.

పూయు, రాచు.

సీ. కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి. తనువున నలఁదుచు
నునుపుగాఁ విరా. 1-107

ఆ. నాఁడు దోర్దండముల చందనం బలంది,కుసుమదామముల్ సుట్టి.
ఆశ్ర. 1-19

**అలఁదురు; అలందురు** దే. అ. క్రి.

1. దుఃఖించు, పరితపించు, ఏడ్చు.

వ. వాని దెసం జింత యావంత వలన దమ్మాటలు విడువుమని యూఱడిల్లం బలికి దుర్దశల నలందురు నవ్వేలంది డెందంబు కుందు వాపం దలంచి యిట్లనియె. విరా. 2-288

చ. తలరు నలందురు నవయుఁ దాప భరంబున వెచ్చనూర్చు. విరా. 2-293

చ. ఇటు దగునయ్య కూరులకు నెల్లను బోకడ యిట్లుకాదె యే,మిటికి నలందురన్. ద్రోణ. 2-257

2. కలఁతజెందు, క్షోభమునొందు.

ఆ. వట్టి యతఁడు దనదు పైచీర యాస్తరణంబు సేసి భూస్థలంబునందుఁ, బెట్టె మానసములు పెద్దయు నలదురి యర్జునాది సోదరాలి వాదితె. అశ్వ. 1-4

లయగ్రాహి : ప్రోషితుల డెందము లలందురఁగ మందమలయానిల ముమందగతి వీచెన్. ఆది. 5-189

3. కృశించు.

వ. ...కందర్ప దర్పంబున నలందురి వందురు ననిన. విరా. 2-68

**అలక** సం. వి. ఆ. స్త్రీ.

1. కుబేరుని పట్టణము.

ఆ. ...నాతఁ డతి రయమున ముట్టె నలకఁ గుబేరుండు, ననికి వెడలె నిజబలాన్వితముగ. శాంతి. 2-321

**అలక(ము)** సం. వి. అ. పుం. న.

(బహువచనము నందే దీనికిఁ బ్రయోగములు కనఁబడుచున్నవి)

నెఱివెండ్రుక, కుటిలకుంతలము.

సీ. ఖచరకాంతల యలకములందుఁ గెంధూళి యళులపై పుప్పొడి ననుకరించు. భీష్మ. 1-242

సీ. ...నుదుటి పెం పలకలఁ బొదువఁ బడఁగ. విరా. 1-228

**అలక్షితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చూడఁబడనివాఁడు.

అన్యులచేత నలక్షితుండనై వచ్చితి. ఆర. 2-46.

**అలఘుఁడు** సం. విణ. ఉ. పుం.

గొప్పవాఁడు.

చ. ...నేఁ, డలఘుఁడు గుంభసంభవుని నాఁగు భవత్పరిరక్షణార్థియై.
ద్రోణ. 1-227, శాంతి. 3-491.

**అలఘువు** సం. విణ. ఉ. ష్వి. ఉ.

గొప్పది.

క. అలఘుతనుస్త్రీసనాథ హరిహరనాథా.
విరా. 1-40: అశ్వ. 4-155.

**అలజడి** దే. వి.

1. బాధ, శ్రమము, క్లేశము.

సీ. కుంభసంభవునికై ఘోరదుర్గముల లో, పాముద్ర యలజడిపాలు గాదె. విరా. 2-284.

క. నీ వలనను భక్తి స్నే,హావేశము గలిగి శూరుఁడై యలజడికిం, దా విసువని సత్కులజుం, గావింపుము సైన్య విభునిగాఁ గురుముఖ్యా. ఆశ్ర. 1-65.

క. అలజళ్ళు దీని వలనం, గలిగెదు నో. అశ్వ. 4-155.

2. హాని, నష్టము.

వ. ...ధర్మపుత్రుండు కురుక్షేత్రంబు దఱియం జొచ్చి ఋష్యాశ్రమంబులకు దేవతాయతనంబులకు నలజడి గాకుండం బరిహారంబు సేయుచు. ఉద్యో. 4-180

3. ఆపద, కష్టము.

ఆ. ఇదియకాని చేయ నెద్దియే నను చు ని,ర్బంధవృత్తి దలఁపు పట్టుకొనిన, నట్టివాని కెందు నలజడి వాటిల్లు. ఉద్యో. 3-305.

క. కులశీలోన్నతియు విని,శ్చల కరుణారతియు ధర్మ సంగ్రహ-

మఱియుం, గల మనకు నివ్విధంబున, నలజడి వచ్చుటకు మూల
మది యెయ్యదియో. అర. 7-381

**అలజడిఁబెట్టు** దే. స. క్రి. (√అలజడి)

బాధ నొందించు, క్లేశపఱచు.

వ. ...నా దగు శాంతియు దాంతియుఁ జెల్లించి నన్నలజడిఁ బెట్టక
పోరిశంబుడిగి... ఉద్యో. 1-377

**అలజడిపాటు** దే. వి. (√అలజడిపడు)

అలజడిపడుట (ఇచ్చట నష్టము. కష్టము)

సీ ...కార్యముునఁ బరాక్రమమునఁ దా నలజడిపాటు దుష్కర్మ
సరణిఁ బొరయకునికి. అను. 2-64

**అలజడివడు (పడు)** దే. అ. క్రి. (√అలజడి)

అలజడినొందు.

సీ. ఏ వింట విజయుఁ డనేక యుద్ధంబుల నలజడి వడుట. అశ్వ.4-152

**అలబ్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁబడనిది.

వ. అలబ్ధ ప్రతివచనయై మీ తల్లిదండ్రు లెవ్వరని యక్కుమారుల
నడిగిన. ఆది. 8-184

**అలబ్ధలాభాదిత్రితయము** సం. సమ.

1. అలబ్ధ లాభము (లభింపనిది లభించుట) 2. లబ్ధవృద్ధి (లభించినది వృద్ధి
పొందుట) 3, యథార్హార్థ ప్రతిపాదనము (ఈ రెంటి విషయమున
తగిన రీతిని అర్థమును సమకూర్చుట)

వ. విప్రులచేత ననుశాసితుండయిన రాజునకు నలబ్ధ లాభాది
త్రితయంబు సంపన్నంబగు. అర 1-202

"అలబ్ధ లాభాది చతుష్టయము" అని పాఠాంతరము కాని మూలమున
త్రితయమే చెప్పఁబడినది.

శ్లో. అలబ్ధస్య చ లాభాయ లబ్ధస్య పరివృద్ధయే
అలబ్ధ లాభాయ చ లబ్ధవృద్ధయే యథార్హతార్థప్రతిపాదనాయ.

**అలమట** దే. వి.

1. దురవస్థ, కష్టము, బాధ.

ఆ. పడుచు పీఁక టొడ్చి పట్టి యాడెడునట్టి; పులుఁగు చందమయ్యెఁ దలఁప నా య,వస్థ యెందుఁ జొచ్చువాఁడ నీ యలమట, దీర్ప నెవ్వ రింక దిక్కుఁగలరు. కర్ణ. 1-34

క. తిలకాదులఁ గంతులచే, నలమటఁ బడువారు.

అను. 5-101; అను. 5-144; అర. 1-218

2. దుఃఖము,

క. తననారు పెక్కంద్రు వొలిసిన యలమట మునిఁగి, కర్ణ. 1-17

**అలమటఁబడు; అలమటపడు** దే. అ. క్రి. (√అలమట)

అలమటను బొందు.

తే. ...అనాథలై దీనికి నంతరంగ, మలదురక తల్లడిల్లక యారట మున, నుడుక కలమటఁ బడక యెట్లుండుఁ జెపుమ. ఆశ్ర. 2-168

**అలమికొను** దే. స. క్రి.

1. ఆక్రమించు,

క. ...సెజ్జపై మే నిడి య,శ్రులు గ్రమ్మనున్న యవ్విభుఁ, డలమట గ్రొత్తయయి మనసు నలమి కొనంగన్, మౌస. 106

2. తెలిసికొను, అధిగమించు.

తే. వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి, యొక యధిష్ఠానముల నుండియును నెఱుంగ, యబల యొండొంటి విషయంబు నలమి కొనఁగ. ఆశ్వ. 2-27

అ. క్రి.

3. ఏకీభవించు, మిళితమగు.

క. అలమికొని యొండొరుల ప్రోవులఁ బ్రాపుల నెలమిఁ బొంది బహుజ్ఞాతులు నెమ్మిఁగూడి తామర, కొలని క్రియన సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. ఉద్యో. 2-87

4. ప్రసరించు, వ్యాపించు.

మహాస్రగ్ధర. సాధ్యుల్, హసిత స్వాంతంబులం బెల్లలమికొనఁగ

నత్యాదరోత్కర్ష ముల్. స్వర్గ. 34

ఆ. నారచీరయేని చారుచీనాంబరం, బైనఁ గట్టికొనిన యపుడు హృదయ, మొప్పు దొప్పు సనకయుండు రూపాదుల, నలవి కొనవు చతురాదికములఁ. శాంతి. 4-60

**అలము** దే. అ. క్రి.

వ్యాపించు, ప్రసరించు.

చ. సులభమొ దుర్లభంబొ యని చూడ నెఱుంగవు గన్నదానిపై, నలముఁదు కామమా. శాంతి. 4-51

**అలయించు** దే. స. క్రి.

నొప్పించు, కారించు.

ఆ. అంపగముల గురుని నలయించి కడచి యింద్రజుని కొడుకు మొగ్గరంబు సొచ్చె. ద్రోణ. 2-17

ఆ. పులుఁగుఁ ద్రాటఁబట్టి యలయించి యాడెడు, బాలునట్లపోలె బాణగురుఁడుఁ, గడఁగి కృష్ణ ననుజుఁ గారించుచున్నవాఁ, డతని బొదువుఁ డితని కడ్డు పడఁడు. ద్రోణ. 3-278

**అలయు** దే. అ. క్రి.

1. విసుగు, వేసారు.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొడ్డులు రాచిన చందనంబు మే, నెల్లఁ జెమర్పఁగా నలయు కేను శ్రమంపడి నిల్చినిల్చి యుల్లల మార్దవం బొనరునట్లుగ నెట్టకు నేని రాచి మీ, తల్లికి భక్తిఁబెట్టెడు విధంబునఁ బెట్టుదు బ్రహ్మ దిట్టుదున్. విరా. 2-220

చ. అలయక నాఁడు నాఁటికి లతాంగి యపూర్వములైన భోజనం, బులు గడు భక్తిఁ బెట్టుచు. ఆది. 8-188, అర. 1-234

2. శ్రమపడు డస్యు.

చ. తలరు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చు మే, నలయఁగ నొల్లఁబోవు వెగడందుఁ గలంగుఁ బరిభ్రమించు

విరా. 2-298

3. బడలికఁజెందు, అలసట పొందు.

తే. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టు లరయ,వలసె నమ్మెయి వాఁగయు మలసి డస్సి, నొచ్చియైనను నేమఱ కిచ్చఁ దలఁచి, తడమి నాచేత దీవన వడయుమమ్మ. విరా. 2-214

(ఇందు "అలసి" అనుదానికి మాఱుగా "అరసి" అని సం.ము. అకాడమి ప్రతి. సం.ము. న "అలసి" పాఠాంతరము. ఇది తిక్కనగారి స్వతంత్ర రచన. "అరసి, అలసి" రెండింటిలో ఏది స్వారస్యమగునో పాఠకులే నిర్ణేతలు).

4. తడయు, విలంబముచేయు.

ఉ. హాలధరునిం దలంచి మునులాడిన మాట తెఱుంగు దప్పరం, చలయక తత్ప్రదేశమున నారసికాంచి తదీయ దేహమున్, వలయు తెఱంగునం బరమ వహ్నికి నాహుతి సేసెనయ్యె మౌస. 172

5 సంభ్రమించు.

క. ...నీ, వరదము సనని మ్మ నేఁటియని కలయకుమీ. ద్రోణ. 4-63

శ్లో. నసంభ్రమో మే వార్ష్ణేయ విద్యతే సత్యవిక్రమ.

సం. భా. ద్రోణ. 119-18

6. కోపగించు.

క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ దగదు గురుఁడునై యున్నాఁడం, చలయక కలంచితిఁ గా కిటు, నిలు మీ సిరణము నేఁత నిజమగు నేనిన్. ఉద్యో. 4-312

2. బాధపడు, నొచ్చు.

సీ. ...పేదలై పెంచుట కలయంగఁ బెల్లు పుట్టు,దురు ప్రజలెంతయు సిరి గలవాఁడు గోరంగఁ బుట్టరు. శాంతి. 1-216

ఆ. అలయ విసువఁగాదు తలకొని యమనియ,మాదు లెనిమిదియును నభ్యసింపఁగా విచార మెలయు, శాంతి. 4-127

3 వగచు, చింతిల్లు

వ. ...ఏను...గౌతముండ... శామలోలత్వంబున బోయత యిల్లా

లుగా బోయలం గలసియుండి పేదలికంబునకు నలసి బేహారంబు వెంట నొక్కపాతుం గూడి పరదేశంబున కరగుచోట గిరి గహన దుర్గమ ప్రదేశంబున. శాంతి. 3-480

**అలరారు** దే. అ. క్రి. (√అలరు)

1. కలుగు.

ఉ. తక్కటి వారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచున్. విరా. 5-265

2. ఒప్పు, శోభిల్లు.

వ. వేయువేల రథ కరి తురగ దాస దాసీజనంబుల నొసంగి పద్మనాభుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారుచుండె. విరా. 5-379

**అలరించు** దే. స. క్రి. (√అలరు, అలరుచు)

1. సంతోషపెట్టు.

క. శ్రౌత స్మార్త నిమిత్త, జ్యోతిర్విద్యలు వహించి యోగ్యసమయ సంజాత ప్రాగల్భ్యుఁడనై, చాతుర్యము మెఱసి మానసం బలరింతున్. విరా. 1-70

2. కలిగించు.

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీ సుందరోల్లాస మా, భీలత్వం బలరింపఁ ద్రిప్పుఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు. కర్ణ. 3-210

3. కనఁబఱచు (శల్య యుద్ధము)

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం, గూలుగజంబులుం గెడయు గుఱ్ఱపు తండముఁ ద్రెళ్లు తేరులుం, శల్య. 1-155

**అలరు** దే. అ. క్రి.

1. సంతోషించు, ఆనందించు.

క. అని రచనా కౌతుకమున, మన మలరఁగ నీ ప్రబంధమండలి కధినాథునిగా నే పురుషునిఁ జేర్కొనువాఁడనొ. విరా. 1-8

ఆ. పలుపు రవనిపతులు, గవిసిరవుడు తేరుగములతో వడి శవ, త్స్యాత్రు
మీఁద నీదు పుత్రు లలర. ద్రోణ. 2-83

సీ. ...ఆశీర్వాదములు గ్రమమున, నర్మిలి పెంపున నలరు మనఃబులో
వేర్వేల నిచ్చె నా వీరజనని. ఆశ్ర. 2-148

2, (పుష్పము) విరియు, విచ్చు.

క. ఇమ్మెయిని నభిక పరితా, పమ్మునఁ బడు సూతు హృదయ పద్మం.
బలరఁ, దమ్మికొలంకులు మొగుడ వ,నమ్మలు సోలంగ దివస
నాథుఁడు గ్రుంకెన్. విరా. 2-816

3. పూచు, పుష్పించు.

సీ. అతని మేను పెల్లలరిన మోదువు, తెఱఁగుగాఁ జేసిన. ద్రోణ. 3-219

శ్లో. స విద్ధో బహుభిర్బాణై ర్నీలాంజనచయోపమః
శుశుభే సర్వతో రాజన్ ప్రవుల్ల ఇవ కింశుకః. ద్రోణ 108-21

4. వికాసము పొందు, శోభాయుక్తమగు.

వ. ..హాలాయుధుండు సను దెంచిన నెమ్మనము దెలివొందె మూఁపులు
దనరె మొగం బలరె నీదు తనయున కధిపా. శల్య 2-228

5. ఒప్పు, మెఱయు.

ఓ. ...అరిప్రకరఁబులు వేరువేలు యుద్దండ భుజాబలం బలరఁ
దాఁకిన. విరా. 3-168

క. ...శత్రుంతపుఁ డొసరిల కాజి దోహల మలరం, గాంగేయు
తోడఁ దలఁపడి, విరా. 5-75

క. త్రైలోక్యంబును దనకు వశగతంబు సేసె ధర్మం బలరన్.
శాంతి. 3-132

6. కలుగు, ఉదయించు.

క. ...అవ్వనజాతు లెట్టు నెరలొప్ప నతని వీక్షించి యార్చి బరవస
మలరన్. ద్రోణ. 3-178

వ, నీవు నగర రక్షకై నిలువు మని నెయ్యం బలర విదుర సమేతం
బుగా నిలిపి. అశ్వ. 3-139

7. స్పష్టపడు, బోధపడు.

తే ...అమ్మహాను,భావయిట్లని చెప్పెఁ దద్భావ మలర.
అను. 3–335

8. ప్రజ్వరిల్లు, వెలుగొందు.

గీ. ...హోమ, మాచరించిరి యాజకు లగ్ని యలర, అను. 5-469

వి.

పుష్పము.

క, విను మలరునఁ దేనియఁ గొను గతి. శాంతి, 3-460

అలరుఁదేనియ దే. వి.

పూఁదేనె,

సీ. అలరు తేనియ గ్రోలి యన్నుసోలంబులం, మరియు శేఁటుల నమ
ప్రమోఁత యింపు. అను. 1–192

అలరుఁబోఁడి దే. వి. (√అలరు) బ. అలిరుబోడులు, అలరుబోండ్లు.

అలరు బోండ్లు. అలరుబోణి, స్త్రీ. పుష్పమువలె మనోజ్ఞురాలగు స్త్రీ.

తే. ...సైరింప నోపఁ బచ్చ, విలుతు తూపుల తాఁకున కలరుఁబోఁడి.
విరా. 2-53

అలరు విలుతుఁడు దే. వి.

పుష్పధన్వుఁడు–మన్మథుఁడు. (పూవు బాణముగాఁ గలవాఁడు)

ఆ, అలరువిలుతుని పూవు టమ్ముపోలె. విరా. 1-245

అలర్కుఁడు సం. వి. అ. పుం.

ఒకానొక రాజు.

చూ. వివరము. అశ్వ. 2-81

అలవడు దే. అ. క్రి.

1. అభ్యస్తమగు, అబ్బు, పట్టువడు.

చ. నృపనయవిద్యకుం దగిన నేర్పలవడ్డది కొంతకొంత.
విరా. 1–197

సీ. సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు నలవడి యెవ్వని

యందు వెలయు. శాంతి. 2-151

2. స్వాధీనమగు, వశమగు.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ దిరిగితి నాకేమి యనుచు.

విరా. 1-122

3 ఏరువడు.

వ. ...తదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్న యునికిఁ సన్న్యాస రూపం బలవడి ధాతుపటదండకమండలుకృతమూర్తి యయ్యె.

విరా. 1-184॥ శాంతి. 1-360

4. ఒప్పు.

శ. వలపలి దిక్కున కించుక, మలగంగాఁ దఃఋమిడి కఃఋమాపుడుఁ బుట్టం, బలవడఁ గట్టి జరఠ వ, ల్కలమున నెవ్వీఁగుఁ జన్నగవఁ గప్పి తగన్. విరా. 1-291

క. తల చక్క ముడిచికొని ద్రిం, డలవడ బంధించి పోరి కమరినిలుపు.

శల్య. 2-106, ఆశ్ర. 2-27

5. సరిపడు, అర్హమగు, తగు.

ఆ. అంతిపురము చరిత కలవడ మెలఁగుచునుండె నవ్వధూటియును ముదమున. విరా. 1-330

క. విను నా కీర్తి జగంబులఁ, బొనుగునదియె నీవు భువనపూజిత వృత్తిం, బనుపడితి గానఁ దగు నీ, యనల పదవి నీక నాకు నల వడ దింకన్. అర. 5-152

6. ఉండు.

క. పిలుచుటయు నతఁడు చాప్పము, లొలుకఁగ గాండివము బెట్టి యొయ్యన చనినం, దలగడ తూపులు సెజ్జకు, నలవడఁ బెట్టుమని భీష్ముఁ డాతని బనిచెన్. భీష్మ. 3-421

7. సిద్ధించు, నెఱవేఱు,

క. ...మనం,బుల జనియించు మనోరథ, మలవడుటయు...

కర్ణ. 2-140

సీ. ...నేమ నియతి, నాత్మావలోకన మాచరించెదనని తొడఁగుదు

నని యలవడదు నాకు. శాంతి. 6-550

8. కలుఁగు, లభించు.

వ. ...అందు మీ రెవ్వరెవ్వ రెక్కడ నే రూపంబునం జరియింపం గోరిన నయ్యై రూపంబు లలవడియెడు.

శాంతి. 4-268, అర. 7-465

క. దివ్య బోధంబున నలవడునట్టి పెంపుఁ బొందుమనిరి. శాంతి.2-124

9. అలవాటు పడు, చాలు

క. ...కాంభోజులును మధుర చుట్ల దేశంబులవారును గుఱ్ఱపు బర వంబులకు నలవడియుందురు, శాంతి. 3-11

10. స్థిరపడు.

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు, నెఱుఁగని నీ యట్టివాని కెవ్వరొకో యీ,పిఱికితన మింత యలవడఁ, గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్. ఉద్యో. 3-67

క. అమృతం బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత మవ్వే లుఁగు యమా,ద్యముల నలవడిన చిత్తము, శమాతిరేకమునఁ బొంద సంవేద్యముగున్. శాంతి, 4-201

11. కూడు, చేరు, కలియు.

క. పురికొనుచుం దెరలుచు నో,హరిసాహరి నొక్కచోట నలవడు నొకచో, విరియు నొకచోటఁ దిరుగుం, దిరుగక యొకచోట రెండు దెఱఁగులు నొచ్చున్. భీష్మ, 2-178

**అలవరించు** దే. స. క్రి. (√అలవడు) అలవడఁజేయు, అల్వారించు, అలవఱచు.

1. అభ్యసించు, నేర్చు.

సీ. ...గాంధర్వంబుఁ గామతంత్రంబు లోనుగ శాస్త్రములనెల్లఁ దగిన భంగి నలవరించి అను. 4-124

సీ. ...తన వర్తనము విన్న మునిజనంబులనైన నలవరించికొనంగ వలయువాఁడు. విరా. 2-208, విరా. 1-95

2. అభ్యసింపఁజేయు, నేర్పు.

సీ. వాద్య నైపుణ మనవద్య శిక్షావిధి నలవరించుచు బృహన్నల
యనంగ,బరఁగు నీతండు వీక్షిత్సుండు. విరా. 5-338

3. లోఁబఱచుకొను, వశము చేసికొను.

తే. ...పైఁ బడుచు నింతి, వింతభంగుల కెలయించి వెకలిఁజేసి, యఖి
మత క్రీడనములకు నలవరింతు. విరా. 2-310

4. అనుకూలపఱచు.

ఆ. ఇంత దలరనేల యెమ్మెయినైనను, గొమ్మ నలవరించి గూర్చు
టరుదె. విరా. 2-80

5. పట్టుకొను, పూను.

వ. గాండీవంబుఁ బుచ్చికొని యెక్కుపెట్టి ముష్టి నలవరించి గుణధ్వని
నేసిన. విరా. 4-168

సీ. ...పకాదఁశాస్త్రంబు లోక ముష్టి నలవరించి. ద్రోణ. 5-175

6. ధరించు, తాల్చు.

వ. ...విరాట తనయుండు నిజాయుధంబులు గైకొని రథికుండయి
వచ్చునట్లుగాఁ జేసి తొంటి చందంబునం దలచీర యలవరించికొని
సారథియై సవ్యసాచి నొగలెక్కి. విరా. 5-231

తే. విను పతివ్రతా తిలకమై వెలయునట్టి, యయ్యరుంధతి రూపంబు
నలవరింప, నెట్టు నేరదకాని యయ్యింతి యున్న, యువిద లార్వురు
రూపులు నొనరఁ దాల్చె. అర. 5-204

7. సంపాదించు.

క. వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించుకొన్న పదం బగుటయు.
ఉద్యో. 1-17

శ్లో. యత్తు స్వయం పాండుసుతై ర్విజిత్య,
సమాహృతం భూమిపతీన్ నిపీడ్య. సం. భా. ఉద్యో. 1-17

8. కూర్చు.

వ. ఆ వర్గంబులు శిలాఃబను వెరవుతో నలవరించి తత్ప్రథమ వేగం బార్యా

లుదువుదురు. స్త్రీ. 1-61

శ్లో. శీలరశ్మిసమాయుక్త స్థితో యో మానవే రథే. స్త్రీ. 7-34

9. పాదుకొలువు, నెలకొలుపు, నిలుపు.

వ. ఇందలి యర్థంబులు నీ చిత్తంబున నలవరింపుము. శాంతి, 1-191

వ. ...నారాయణ ప్రణీతంబై యతఃప్రదర్శకంబైన యిత్తెఱంగుఁ జిత్తంబున నలవరింపు మని దేవవ్రతుండు ధర్మనందనునకుం జెప్పె. శాంతి. 5-629

క. ...విద్వన్నుత నీవును నలవరింపు మీ మనమున నివ్వాక్యముల యర్థముం దత్పరతన్. శాంతి. 4-202

10. పొందు.

క. మనుజు డెవ్వని దలంచి మహనీయ నిరంజన సిద్ధిఁ బొందఁగనునే, యనువు దలఁపు నలవరించునని యుడుగుటయున్. శాంతి. 4-207. స్త్రీ. 1-33

11. నడపు, నెరపు, జరపు.

తే. అరులు మిత్రులుదాసీను లనుచు సంధి, విగ్రహాది షడ్గుణముల వెరవు లోకరుఁ, డలవరించుచు విజయంబు నాసపడుచు, ముందు నలెముక్తి తెఱఁగిటు లున్నె యరయు. శాంతి. 6-197

12. ఒడఁగూర్చు.

సీ. హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి, యందంబు వింత గా నలవరించు. విరా. 1-107

13. ఏర్పఱచు.

తే. అర్జునుఁడు వెట్టె సీతని కంపపాన్పు,నకుఁ దగంగ నిశాత బాణముల మూఁట, నలవరించిన తలగడ. స్త్రీ. 2-115

14. చేకూర్చు, లభింపఁజేయు.

వ. ...వివ్వచ్చుండు...యప్పుడా వహిల్లిన రుధిరసాగరంబునకు రక్షాకరత్వం బలవరించె. విరా. 1-183

15. ఆచరించు, చేయు.

వ. ఇది సూక్ష్మకర్మానుష్ఠాన ప్రకారంబు దీని నీ వలవరింపుము.
ఆది. 1-114

**అలవఱచు; అలవఱుచు** దే. స. క్రి.

1. అలవడఁజేయు, అభ్యస్తమగునట్లు చేయు.

క. అజగర చరితము దనకును, నిజముగ నలవఱుపనేర్చు నిర్మల మతికిన్, వృజిన భయ మన్యుశోకము, లజేయములుగావు మోక్ష మాయత్తమగున్. శాంతి. 4-66

2. పూను, వహించు.

క. ఉరిత్రెవ్వఁగొఱికి యిప్పుడ, వెరవారఁగ నీకు నేను విడుగర సేయం, దొరకొనుట నీదు భాగ్యం, బరిత్వము దొఱింగి మైత్రి యలవఱువు మదిన్. శాంతి. 3-205

క. ...అ,య్యతిథి పనువు సేయక క్రోధము తలం పలవఱుచుఁ జేయఁ జూచుం దలఁరున్. అను. 1-72; శాంతి. 1-327

3. అలవాటు పఱుచు.

క. శమయును సత్యంబును శౌచమును సుధర్మములు బ్రహ్మచర్యం బత్యుత్తమ ధర్మము వానికిఁ జిత్తము నలవఱుపంగ వలయు ధైర్యము పేర్మిన్. శాంతి. 4-299

4. నెక్కొలుపు, నిలుపు.

క. శివమును బరమబ్రహ్మము, నవికృతియు సనాతనంబు నగు పద మును ధ్యాధవ యెఱిఁగించితి నిర్భయుఁడవు గమ్మంవరుపు మిది దృఢంబుగ నాత్మన్. శాంతి. 6-64

క. ఆ వణిజుఁడు ధర్మస్థితి, దేవతలును మెచ్చునట్లు దెలియఁగఁ బలికెన్, వీ వీ వాక్యము లన్నిట, భావం బలవఱచి కనటు పావుము వత్సా. శాంతి. 5-258

ఆ. మనంబు కలఁక విడిచి యీ జ్ఞానం బలవఱుపుము. శాంతి. 6-70

5. అభ్యసించు.

క. మలమూత్రంబుల కాలంబుల భుక్తికనంతరమున భూవరయోగం బలవరుచు రెండు మార్గంబులును నిషిద్ధంబు లండ్రు పూర్వాచార్యుల్. శాంతి. 6-87

6. కలిగించు.

క. వెలివగలఁ గెలుపు గెలుపే, యలఘుమతిన్ గెలువవలయు నభ్యంతర శత్రులఁ దద్విజయము మోక్షము, నలవరుపం జాలు నొంట నమ్మెలగునే. అశ్వ. 1-124

7. సమకట్టు.

చ. ...నే, ర్వలవడ వాహనంబులు మహాస్త్రములున్ సమకట్టి క్రమ్మరుండు... -అ- అనినఁ బోక నిల్చి యాహితోత్సాహులై, సకల వాహనాస్త్రశస్త్రచయము, లలవరించి పేర్చి యార్చి తాఁకిరి వసురుద్ర సాధ్యముఖ మరుత్ప్రవరులు.
అర. 5-271; 272

**అలవాటు** దే. వి. (√ అలవడు)

అలవడుట, సిద్ధి.

తే. ఎట్టి కృత్యంబు మేలొ యే నెద్ది సేసి, కృతపరాయణ ధర్మతాస్థితి వహింతు,నొక్కొ యని చింత, బొందుచునుండు నాత్మనిష్ఠ యలవాటు కాంక్షించి నృపవరేణ్య. శాంతి. 6-547

**అలవి** దే. వి.

1 కొలఁది, పరిమితి.

క. వెలిలి బలరిపుఁడు చలమునఁ, గలహమునకుఁ జొచ్చె వృత్రు ఘన బాహుబలం, బలవికి మీఱెను దంభ్రి విమల తపమునఁజేసి సురల మనములు దలంకన్. ఉద్యో. 1-126

క. ...మెయికలి కర్ణుం, డేటలవికిఁ గవిసె ధనుర్జ్యాటంకృతి సెలఁగఁ, బాండవాగ్రజుఁ బెలుచన్. కర్ణ. 2-187

2. రీతి, విధము.

తే. రథములను సామజములఁ దురంగమముల, నుఱక నైతుకేలుల

సీ. దితటియ నడిచి, పోరి రేటును వ్రేటును బోటు నొక్క యలవిఁ
తెలంగఁ గ నుభయ సైన్యములవారు. భీష్మ. 3-225

3. శక్తి, సామర్థ్యము.

చ. అలవి యెఱుంగ నేరక మహాత్ముని లోకము తోడిపాటిగాఁ, దలఁ
చితి బేలనైతి. భీష్మ. 2-6

చ. అలవి యెఱుంగ కిమ్మెయి దురాశఁ దలంచిరి గాక ధార్త
రాష్ట్రులు ద్రోణ 1-121

విణ.

శక్యము, సాధ్యము.

క. బలహీనుఁడైన వానికి, నలవియె మోపెట్టి తివియ నర్కార్ముక
ముం, గులహీనున కస్త్రతాస్త్రిన, కలవియె యా లక్ష్య మేయ
నశ్రమలీలన్. ఆది. 7-232

సీ. ధర్మైకనిరతుఁ డాకెం దొక్కరుఁడ చూవె, యనఁ జన నొరులరు
నలవి యగునె. విరా. 2-199

వ. భీమగదాభీషణుండైన భీమసేనుం డెవ్వరికి నలవి గాకయుండు.
ద్రోణ. 1-96

అలవు దే. వి.

1. బలము, శక్తి, సామర్థ్యము.

చ. ...పోటరులైన భర్త వేవురు గలరంటి వారి యలవుం బలముం
గడకంటి విరా. 2-257; కర్ణ. 1-186, 137

2. ఉపాయము, నేర్పు.

క. పులివాతి కండఁ గొనుగతి, నలవునఁ బాంచాలతనయు నయ్యో
ధరునకుం, దొలఁగించిన సాత్యకిపై, నలుకవొడమకుండు నెట్టు
లాచార్యునకున్. ద్రోణ. 3-127

క. తలపడి వాలమ్ములపై, నల వేర్పడ నిసుచుటయును నలుక
పొడమినం, దల దునిమివైచె నాతని, బలసూనుఁ డొక్క పటు
భల్లమునన్. విరా. 5-80

3. అవలీల, అనాయాసము.

చ. ...ఎల్లివారు నే, ర్పలవడ వాహనంబులు మహాస్త్రములున్ సమ
కట్టి క్రమ్మరం, దలవునఁ దున్మివైవుదు దురాత్ముల దైత్యుల.
అర. 5-271

**అలవుంజలము; అలవుఁజలము** దే. (అలవును చలమును)

సామర్థ్యమును, పౌరుషమును.

క. నా యలవుఁ జలము నీ వెఱింగి తంలియచాలున్. కర్ణ. 1-186

తిక్కనగారు ఈరెండు పదములను జంటగా 15, 16 తావుల వాడి యున్నారు.

**అలవోక** క్రి. విశే. ద్రు.

1. యాదృచ్ఛికముగా, దైవికముగా.

సీ. విను మకంపనుఁ డను మనుజేంద్రుఁ డాత్మజుఁ, డాహవంబున
మృతుండైన వగవు, గదురంగ నుండి నారదు నలవోక వచ్చిన
వాని గని. శాంతి. 5-202

శ్లో. యదృచ్ఛయా శాంతిపరో దదర్శ భువి నారదమ్.
సం. భా. శాంతి. 257-9

గీ. పొంది నారదముని యలవోక యచటి, కరుగుదెంచిన వినతుఁడై.
శాంతి. 6-327, శాంతి. 5-456

2. ఆకస్మికముగా, హఠాత్తుగా.

సీ. అలవోకఁ గనుఁగొని యంతరంగము బిట్టు, బెదర మాఱుమొగంబు
వెట్టువారు. విరా. 3-36

**అలవోకవోలె** క్రి. విశే. అలవోకవలె, అలవోకయునుబోలె, అల
వోకయును బలె.

1. అనాదృతముగా, నిర్లక్ష్యముగా.

సీ అజగవ్యాఘ్రుల నలవోకవోలెఁ గన్గొని దక్షిణమునకుఁ జన.
ద్రోణ. 3-166

2. యాదృచ్ఛికముగా, దైవికముగా.

వ. ...ఇట్లు వివాదంబైన సమయంబున నలవోకవోలె నుపరిచరవసు

వయ్యేడకుం జనిన. శాంతి. 6-372

**అలస** సం. విణ. (అ. ఆ. అ.)

మందురాలు, శ్రాంతిగలది.

ఉ. వామవిలోచన లంగజన్మ లీ,లాలసలై. అర. 7-345.

**అలసత** సం. వి. ఆ. (స్త్రీ).

1, నెమ్మది, మెల్లన.

క. నమ్ముము కైదువు మోపగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం, దిమ్మనుడుఁ జేయునది లే, కమ్మగ్గుం డమ్మహీజ మలసత నెక్కెన్. విరా. 4-112

2. బడలిక, మాంద్యము.

తే. అసురనాథుండు నలసత యడర నీల్గి, యావులించిన. ఉద్యో. 1-125

3. ఆలస్యము, జాగు.

క. ...అమ్మూఁషిక మయ్యురిచేరులు గోఱు, కక యలసత నల్ల నల్ల గఱచుచు నుండెన్, శాంతి. 3-210

4. నిద్రవలనఁ గలుగు మాంద్యము.

క. తలఁపులు గ్రందుగఁ బొడముట, గలగను చేమఱుట భ్రమము గదురుట జాడ్యం, బలసతయను నీభావం,బులు దామసకోటియంద్రు బుధులు నరేంద్రా. శాంతి. 4-352

**అలసము** సం. విణ. (అ. ఆ. అ.)

మందమైనది, మెల్లనైనది, సౌమ్యమైనది (నడక)

క. బలువిడి మన దివ్యాస్త్రం,బుల చవి సూపంగ వలయుఁ బోనిమ్ము రథం, బలసగతి నతని దెస కని, పలికిన. విరా. 5-168

చ. అలసవిలాసలాలసరసాన్వితలైన నితంబినీజనుల్. అర. 7-359

2. అజాగ్రత్త, ఏమఱుపాటు-

తే. అనియు (ఉష్ట్రము) పరగర్వమున సహాయంబు నొల్ల, కలస

భావంబులోనుండి వలచి యొక్క,నాఁడు తన యఱ్ఱుసాఁచి కాన
నములోన, దీసుకొని మేయఁగాఁ బెనువావ వచ్చె. శాంతి. 3-83

**అలసమూర్తి** సం. విణ. (ఇ. ఇ. ఇ.)

జడత్వము గలిగిన యాకారము గలది.

(రావణ వధానంతరము శ్రీరామచంద్రుని పలుకులకు సీతామహాదేవి)

ఆ. మొదలు నఱక నొఱగు కదళి చందంబున, నెలత దల్లడమున నేల
వ్రాలె.

తే. పడతి యల్లన మఱికొంతవడికిఁ దెలిసి, యలసమూర్తియై
దండడి నశ్రు లురలఁ, గేలు మొగిడించి వసుమతీపాలుఁ జూచి.
అర. 7-158, 160

**అలసుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. మెల్లని నడక గలవాఁడు, మందగమనుఁడు.

క. అనిన విని పూని గ్రక్కునఁ, జను దేరమి నతఁడు డస్సెఁ జాలండని
నెమ్మనమున నెఱింగి యాతని, యనుజన్మునిఁ బనిచె నతఁడు
నలసుం డయినన్. విరా. 1-152

2. పాటుపడనివాఁడు, సోమరి.

క. అలసులు ధనహీనులునై, సొలసి క్రియలు విడుతు రడవిసూత్రత
దానఁ, గలదే సద్గతి వేదం,బులు విడిచి యఫలంబు పరతఁ బోవలె
తండ్రి. శాంతి 5-314; 454

3. ఉపేక్ష వహించినవాఁడు,

తే ఏమి గ్రొత్తగఁ బుట్టిన నించుకేని, నలసుఁడవుగాక దాని నీ
వరసి తీర్పు, మిట్టి తెఱఁగుల కె ప్రొద్దు లింతపట్టు, నర్హాములు
కౌరవక్షితిపాగ్రగణ్య. ఆశ్ర. 1-62

**అలాతకము** సం. వి. అ. న.

కొఱవి.

సీ ...తోమర ముద్గరాలాతక ముసల శూల, శర శతఘ్నిముఖ
సాధనోపేతమై. అర. 7-57

**అలాతము** సం. వి. అ. న.

కొఅవి.

వ. ప్రదీప్తాలాత శాత శర చక్ర తోమర పరశు పాశాంకుశ కూటంబు లును. ఆర. 1-158

**అలాబువు** సం. వి. ఉ. ఊ. స్త్రీ.

సొఱ, అనుఁగు.

వ. వైదర్భికి నొక్క యలాబూఫలంబును శైబ్యకు నసమంజసుండను కొడుకునుం బుట్టిన... అర. 3-58

**అలాభము** సం. వి. అ. పుం.

1. కీడు.

వ. గురు సమాశ్రితులగు వార లెద్దానివలన సుఖదుఃఖంబులు లాభా లాభంబులుఁ బ్రియ ద్వేషంబులు నాదిగాఁ గల ద్వంద్వంబులం బడక బ్రదుకుదురు. ఉద్యో. 2-106

**అలాయుధుఁడు** సం. వి. అ. పుం.

బకాసురుని తమ్ముఁడు.

ఈ అలాయుధుఁడు తన యన్నయగు బకుని జంపినందులకు భీమునిపై వైరము చాలకాలము హృదయమును దహింప ద్రోణుని నాలవనాఁటి నిశాసంగ్రామమునకు ససైన్యముగా వచ్చి దుర్యోధనుం జూచి యతనితో భీముని నతని సోదరులతోడను సుతుల తోడను బ్రమింగెదననియుఁ బలికి ప్రతినపట్టి మహాఘోరయుద్ధంబుచేసి ఘటోత్కచుని చేతిలోఁ జచ్చెను. ద్రోణ. 5-209 మొ. 228 వఱకు.

**అలి**[1] దే. అవ.

వృత్తియందు 'అందు, ఇందు, ఎందు' అనువానిపై వచ్చు ఆగమము.

ఉ. ఆఱు రసంబులం జవుల యందలి క్రొత్తలుపుట్ట. విరా. 1-77

**అలి**[2] (శ్) సం. వి. న్. ఇ. పుం.

తుమ్మెద.

సీ. ఇంపైన ప్రియ కాన నిచ్చి నిల్చిన మధు, వాదట నాను మత్తాలి విభుని. విరా. 2-806

**అలింగ** సం. విశ. (అ. ఆ. అ.)

నిత్యానుమేయ (అనుమాన ప్రమాణముచేఁ గనుఁగొనఁదగినది)

చ. ప్రకృతి యలింగ తజ్జనిత భంగులు లింగములట్టులయ్యు రం,జక గుణలీల లింగచయ సంగతిఁ దాను సలింగయయ్యె. శాంతి. 6-82

**అలింగుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

1. స్త్రీ పున్నపుంసకమూర్తి కానివాఁడు, ఆత్ముఁడు,

క. ...అమ్ముని, మదాత్మకుం దేటపఱిచె మహనీయ కృతిన్. శాంతి. 6-69

2. సన్న్యసన బ్రహ్మచర్యాది చిహ్నములు లేనివాఁడు.

ఆ. అనఘ దానపాత్ర మగుట విప్రుఁడు లింగియైననో యలింగుడై చరించుటనో యెఱుంగఁ జెప్పు మనవుడు. అను. 2-31

3. బుద్ధ్యాదులచే నెఱుఁగఁబడువాఁడు, జ్ఞానస్వరూపుఁడు.

సీ. అవ్యక్త నామకం బగు తత్త్వ మరయ స్వలింగంబు పురుషుఁ డలింగుఁడు. అశ్వ. 2-159

**అలికిడి** దే. వి.

మనుష్య సంచారాదుల వలనఁ గలిగిన ధ్వని- కాళ్ళ చప్పుడు.

సీ. అలికిడి మేల్కను నతని ధృష్టద్యుమ్నుఁ బట్టిన క్రియ. సౌప్తి. 1-169

**అలిగించు** దే. స. క్రి. అల్గించు

కోపము వచ్చునట్లు చేయు, రెచ్చఁగొట్టు.

తే. పలు యాశీవిషంబుల నెఱిఁగి యెఱిఁగి మూర్ఖవై యలిగించెదు. సభా. 2-204

వ. అప్పాండవుల కెంతలగ్గుసేసియు హితుల మయ్యెదమె యాశీవిషంబుల నలిగించి కంఠసమీపంబున విడుచునట్లు వారల విడిచిపుచ్చి కర్జంబు దప్పితిమి. సభా. 2-272

క. వలవని క్రేంకరి మాటల, నలిగింపకు నన్ను నేమియాడిన నింకం, దలఁ దెప్ప నేయుదుం గురు, బలమదె పురణించె ఒడలు పఱితుము రమ్మా. చూ. అల్గించు. ద్రోణ. 5-370

**అలుఁగు** దే. వి.

1. బాణాగ్రము, ములికి, పిడిగాక మిగిలిన ఆయుధాంశము.

క. తనువున విఱిగిన యలుఁగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతి నిష్ఠురతన్, మనమున నాటిన మాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా. ఉద్యో. 2-62

సీ. ...రథ్యమ్ములు మేనున నలుఁగు లుం,డ నురవడింపవు. ద్రోణ. 3-151

తే. అలుఁగుటమ్ములు దాఁకిన నలిగి భద్ర,కుంభి రౌద్రంబు సొంపారఁ గొలిపె నతఁడు. ద్రోణ. 1-349

2. బాణము.

సీ. కోల నక్కజంబుగ నలుఁగుల మొన ఘటి,యించి యమ్ముల దాని కిల్లుగట్టి. ద్రోణ. 3-168

వ. ...తత్సైనికోత్తములు చతురంగ బహుబలంబులతోఁ గలిసి కవ్వడిం జుట్టుముట్టి యలుఁగుల సోనలు గురిసిన. ద్రోణ. 3-209

3. ఖడ్గము, కత్తి.

గీ. పలక పఱియలుగాఁ జేసి యలుఁగు దునిమి, యొడల వాలంప పొది నింప. భీష్మ. 3-23

శ్లో. చర్మాచ్ఛిన దసిం చాస్య ఖండయామాస సంయుగే. సం. భా. భీష్మ. 83-34

**అలుఁగుటమ్ము** దే. వి. (అలుఁగు + అమ్ము)

కత్తివాతియమ్ము, (కత్తి పదనువంటి పదనుగల బాణము)

తే. అలుఁగుటమ్ములు దాటిన నలిగి భద్ర, కుంభిరౌద్రంబు సొంపారఁ గొలిపె. ద్రోణ. 1-349

**అలుక**[1] దే. వి. (√అలుగు)

1. కోపము.

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు, మిత్రు లనరు రాజు లాజ్ఞ మిగిలిన చోటన్, శత్రులకాఁ దమ యలుకకుఁ, బాత్రము సేయుదురు

నిజశుభస్థితి పొంటెన్. విరా. 1-124

తే. అలుక యింద్రునిపైఁ బొడమిన నమ్మహోత్ముఁ, డప్పురుషుఁ జూచి మగుడ నీ వరుగు మార్య. చూ, అల్క. స్వర్గ. 27, విరా. 5-80

**అలుక**[2] దే. విశ.

గౌరవహీనుఁడు, అల్పుఁడు.

సీ. గాని నంతయు భీమసేనుండు విని... పురుషున కెందును నిర తంబు మిక్కిలి, తేజంబు కర్మంబు దీని విడిచి... -ఆ- యలుక గాఁడె పురుషుఁడని కోపఘూర్ణిత రక్తనేత్రుఁడై. సభా. 2-269

**అలుకఁదనము** దే. వి.

అమర్యాద, అగౌరవము, నిర్లక్ష్యము, పలుచదనము.

క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ దగదు గురుడు నై యున్నాఁడు. ఉద్యో. 4-312

**అలుకు**[1] దే. అ. క్రి. అల్కు

1. భయపడు, వెనుదీయు, జంకు.

తే. ఈతఁ డింతకు మీకుఁ దన్నెఱుఁగఁ జెప్ప, వలవదని నియమించినఁ దెలియఁ బలుక, నలికి యొక దేవసన్నిభుం డంటిఁ గాని, నిన్న యంతయుఁ దాఁ గదా నిర్వహించె. విరా. 5-335

తే. ధార్తరాష్ట్రులు నడికిన ధర్మమునకు, నలుక రెన్నఁడు విడువు దైన్యంబు. ఉద్యో. 3-35

క. తనయులఁ దెగటార్చి వడిం, దనమీఁదం గవిసినం బ్రతర్దను శౌర్యం బున కలికి వీతహవ్యుం, డనయము వెసఁ బాఱె భృగువు నాశ్ర మమునకున్. అను. 1-124

(ధర్మరాజు సాత్యకితో)

క. హరి యొకఁడు నీ వొకండవుఁ, బరమాప్తులు గలిమి నరుఁడు భారవుఁ బనికిం, జొర నలుకఁడు నీ కూరిమి, పొరపొచ్చెము గాక యుండఁ బోవఁగవలదే. ద్రోణ. 3-285; ఉద్యో. 3-92

2. అనృతమగు, వ్యర్థమగు.

వ. శృంగి యిట్లనియె.

క. అలుక మెయి మున్న పలికితి, నలుకని నా పలుకు తీక్ష్ణమై
యింతకు ను,జ్జ్వల దహనాకృతిఁ దక్షకుఁ, దలరఁగఁ బ్రేరేపకేల
తా నెడ నుడుగున్.

వ. నా వచనం బమోఘం బనిన. ఆది 2-177, 178, 179.

శ్లో. నైవాన్యథేదం భవితా పతరేష బ్రవీమి తే
నాహం మృషా బ్రవీమ్యేవం స్వైరేష్వపి కుతః శపన్.
సం. భా. ఆది. 42-2 (నిర్ణయ).

వి.

3. భయము, వెఱపు, జంకు.

క. తల ద్రెవ్వ్యలైనఁ బ్రాణం,బులును గృపాణంబు విడిచి భువిఁ
ద్రెళ్ళినతం, డలుకొందికురుబలం బా,కులతం బొందంగఁ గొండఁ
గూలిన భంగిన్. భీష్మ. 2-195.

మ. ...ద్రోణుఁ డు,ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియతమంత్ర
స్ఫూర్తి సంధించినన్.

తే. అంతరంగంబు నందొక యింతయేని, యలుకులేక తనర్చి బ్రహ్మా
స్త్రమునన, వేడుకకు మరలించిన విధము దోఁప, నద్భుతంబుగ
వారించె నర్జునుఁడు. ద్రోణ. 5-297, 299.

అలుకు² దే. స. క్రి.

1. (పేడ మున్నగువానితో నేల మున్నగునవి) రాచు, లిప్తముచేయు.

క. కలువడములు మణితోరణ,ములు గట్టిరి క్రముకకాండ మోచా
స్తంభం,బులు నాటిరి కుంకుమమునఁ, గలయనలికి ముగ్గులిడిరి
కర్పూరమునన్. విరా. 5-182.

క. అలుకుఁడు మృగమదమున ముగ్గులు పెట్టుఁడు గప్పురమున.
ఉద్యో. 3-152.

2. చల్లు.

క. తలపై జాహ్నవి వాలుక, యలికికొనిన ఫాలతటిఁ దదంతర్మ్రో
త్స్నం, కలితముఁ జేసినఁ బాపం,బులు దొలఁగు సుపర్ణుఁ గనిన భుజ
గముల క్రియన్. అను. 2-208; శాంతి. 1-355.

అలుకుఁడు; అల్కుడు దే. వి. (అలుకుడు - అలికిడి)

మనుష్య సంచారాదుల వలనఁ గలిగిన ధ్వని, చప్పుడు.

చ. వెడవెడ నిద్రవొందికనువిచ్చిన పాంథుల మీఁద దాడివోఁ, దడఁబడ నొండొరుం బిలుచు దర్పకు పంపు బలంబులోని యల్కుడు కర ణిం జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనంబులం, దెసనెడఁ బల్కఁ గూయ సొగియింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్.

ఉద్యో. 2-111

అలుకొందు దే. అ. క్రి.

భయపడు, వెఱచు.

క. అలుకొందు మనముతోడన, బలముం బురికొలిపి పొదివి భగదత్తుని నమ్ముల్మలఁ గప్పె నతఁడు. ద్రోణ. 1-319

అలుగు దే. అ. క్రి. అల్గు

1. కోపపడు.

తే. మదిర వోయింపుఁ డద్దేవి యెదురుచూచు, నలుగుఁ దడవైన మగుడఁ బోవలయు ననిన. విరా. 2-120

మత్త:- ఏమి కారణమయ్య పాములకేల యల్గితివీవు. ఆది. 1-151

క. ...నా సుతునకు సుశ్లోకా యలుగం దగునే, నీకు సుఖ జేయు మీతనిం గృపతోడన్. శాంతి. 5-474

ఆ. అయ్యజాతశత్రుం డలుగుట నీళ్లలో, నగ్ని పుట్టినట్టిదయ్యె.

ఉద్యో. 2-125

2. ద్వేషించు, పగగొను.

క. అలుగుదు పాండవులకు వారలు నాకుం బ్రాణములు ధరావల్లభ యిట్టలముగఁ దమప్రాణము లకు, నలుగు జనులు పగతు రగుట యనుమానంబే ఉద్యో. 3-223

ఉ. కపటములేక వైభవము గప్పక యొండొరు మీఁద రాజువై, నపరిమిత ప్రియం బెసఁగ నల్గకయుండు ముదంబుఁ బొంది యే, వృపు విషయంబునం బ్రజ విసిర్మలవృత్తతఁ బుత్రుభంగి వ నృపు

నృపు డంద్రుగా కితరునిం దగువా రెద నియ్యకొందురే.
చూ. అల్గు. శాంతి. 2-190, 2-270

**అలుగులపడు** దే. అ. క్రి. (అలుగులము+పడు)

వ్యాకులతనొందు, స.క్షోభమునొందు.

క. నీవలుగుల పడుటకు దుఃఖావేశము వొంగనే నిరర్థకమగు ని,య్యే
వవుఁ బుట్టువు పుట్టిన, నావగ పెవ్వరికి నెక్కు నళినదళాక్షీ.
విరా. 3-50; కర్ణ. 1-147

క. అలుగులపడి ఖాండవమునఁ, గల యాశీవిష మహోరగములెల్ల
విషాగ్నులు గ్రక్కుచు. ఆది. 8-267

**అలుగులము** దే. వి.

సంక్షోభము, వ్యాకులత, క్లేశము.

చ. అలుగుల మంది యందుల మృగావలియున్ విహగంబులున్ భయా,
కులగతిఁబొంది మూగలుమ గుంటులుఁ జీకులునైన యట్లులై.
అర. 1-301

**అలుచ** దే. వి.

అల్పుఁడు, నీచుఁడు.

క. అలుచైనను బగతుని దెసఁ, దలపు గలుగవలయు. విరా. 8-107

**అలుపము** వై. విణ.

అల్పము, కొంచెము.

సీ. ఈ వెంద్రుకలు వట్టి యీడ్చిన యాచేయి, దొలుతగాఁ బోరిలో
దున్ససేవ, తను వింతలింతలు తునియలై చెదరి రూపఱియున్నఁ
గని యందు కాఱుఁగాక, యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది.
ఉద్యో. 8-117

(అలుపాలన్ = అలుపములచేత, అల్పకార్యములచేత)

**అలుపుఁడు** వై. విణ.

అల్పుఁడు

ఆ. అనుడు నకులు డిట్టు లనుదేవ తమతము, నేర్పు పనుల వెంట

నెగడి బ్రదుక, వలయుఁ గాక నగరఁ దలము దప్పిన మెలంకువల
కలువు లియ్యకొనుట దగునె. విరా. 1-286

("మెలంకువల కొలువు లియ్యకొనుట"- అని కొన్ని ప్రతులు)

**అలుప్తత** సం. వి. ఆ. (స్త్రీ).

లోపించుట, లేకపోవుట.

ఉ. ...మ్మా, లోన నొకఁడఁ గల్గితి నలుప్తత వారలయందుఁ గల్గి
లో, కానుమతంబుగాదె నకులార్థిత ధర్మవు నాకు, మహా. 68

**అలుప్తము** సం. విశే. (అ. ఆ. అ.)

లోపింపనిది, కొఱంత పడనిది.

క. విను సత్యభామలోనగు, వనితాజను లధిక నియతి వనములకుఁ
దపం, బొనరింపఁ బూని కొందఱు, చని రవ్విధమున నలుప్త.
సత్కర్మరంజైై. మౌస. 205; మౌస 153

**అలుబ్ధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

లుబ్ధత లేనివాఁడు, లోభబుద్ధి లేనివాఁడు.

సీ. నిజకర్మనిరతులు విజితేంద్రియులు, సర్వభూత హితులు నలుబ్ధు
లును శుచులు... వారి కిచ్చుట వంశ విస్తారకంబు. అను. 2-50

**అలువు**[1] దే. వి. అలుగు

జల నిర్గమన మార్గము, చెఱువు మున్నగువానిలో ఎక్కువగానుండు
నీరు పోవుటకు ఏర్పఱచిన దారి, నీటి తూము.

గీ. అంతరంగంబు నిండి రెండలువులందు, వెడలు సంతోషపూరంబు
విధమునఁ దోఁపఁ, గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు.
విరా. 5-240, అశ్వ. 3-196

**అలువు**[2] దే. అ. క్రి.

అలుగు, కోపించు.

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్ జమదగ్ని సుతుండు శాప
మిచ్చెన్. శాంతి. 1-85

**అలేపత్వము** సం. వి. అ. న.

అంటులేమి, తగులమి.

క. సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు, దత్త్వాశ్రయమునను సత్త్వతత్త్వ
ముల వివేకిత్వాలేపత్వము లన, విత్త్వము జిత్త్వంబు నొందు
విశ్వాధారా. అను. 4-227

**అలోకము** సం. విణ. (అ. ఆ. అ.)

1. లోకము నతిక్రమించినది

వ. వృష్ణి కుమారలోకం బలోకసామాన్యంబు. ద్రోణ. 1-96

2. కనఁబడనిది, చూడఁబడనిది.

క. లోకాలోకంబున నచలుఁడు గావలయున్.

శాంతి. 4-316, ఆది. 3-119, శాంతి. 5-37

**అలోకసామాన్యము** సం. విణ. (అ. ఆ. అ.)

లోక సామాన్యము గానిది, ప్రపంచమునం దెవ్వరికి సాధారణముకానిది.

ఉ. ...రౌద్రరసం బలోప సామాన్యము గాఁగ. భీష్మ, 1-261

**అలోలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

లోలత్వము లేనివాఁడు.

క. వినుత త్రివర్గ నిరతులు, నవహంకార మమకారు లగు జనులు
సువర్తనయుతులు నలోలురు లో,ధనులు నమస్కార్యు లద్రిధర
నాకున్. అను. 3—184

**అలోలుపత** సం. వి. ఆ. (స్త్రీ).

లోలత్వము లేమి.

తే. లోకయాత్ర వాటించు చలోలుపతయు, శమముఁ గల్గి వర్తిం
చుట శౌచ విధము. అను. 2-45

**అలోలుపత్వము** సం. వి. అ. న.

లుబ్ధత లేకుండుట.

ఆ. ...అలోలుపత్వ గుణ విశాల బుద్ధిశాలివై ఫలాభిసంధి లేక.

అశ్వ. 1-184

**అలోలుపభావము** సం. వి. అ. పుం.

లోభము లేకుండుట.

క. శీలంబు మైత్రి కరుణ య,లోలుపభావము తితిక్ష లోనగు ముని లో,కాలంబనీయ సద్గుణజాలంబు. శాంతి. 3-408

**అలోలుపము** సం. విశ. (అ. ఆ. అ.)

లోభ రహితము.

సీ. సుర యక్ష గంధర్వ గరుడోరగాదుల,లోన నెవ్వఁడు గాఁ డలోలుపాత్ముఁడు. శాంతి. 6-610

**అలోలుపుఁడు** సం. వి. అ. పుం.

ధృతరాష్ట్రుని నూర్వురు కొడుకులలో నొకఁడు.

ఇతఁడు కవచి, నిషంగి, పాశి మొదలగు తన తొమ్మండ్రు సోదరులతోఁ గలసి యప్పుడే దుశ్శాసను వధించియున్న భీమునిపై కుఱికి యతనిచే మరణించెను. కర్ణ. 3-224, ఆది. 5-107

**అలౌల్యము** సం. వి. అ. న.

లోలత్వము లేకపోవుట, ఆసక్తి లేకపోవుట.

క. నీ విజయోత్సాహమునకు, లావునకు జవంబునకు నలౌల్యమునకు సద్భావమునకు మెచ్చి వరం, బీ వచ్చితి వేఁడు మెద్ది యిష్టము నీకున్. ఆది. 2-105

**అల్క** దే. వి. (√అలుగు)

అలుక, కోపము.

ఉ. ...భూజనులు నింద యొనర్పఁగ నే నొనర్చు నీ, చివ్వకు నీవు నల్క మెయిఁ జేసిన యీ పని. విరా. 2-286, శాంతి. 4-396

చూ. అలుక.

**అల్కు** దే. వి.

అలుకు.

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీచెవి సోఁకెనె నాదు పల్కులం, దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి నల్కెడు.

చూ. అలుకు. ఉద్యో. 1-304, కర్ణ. 3-298

**అల్కుఁడు** దే. వి. చూ. అలుకుడు

**అల్గించు** దే. స. క్రి. అలిగించు

కోపము వచ్చునట్లు చేయు.

మ. ...లస్త్రత్కూర శరాగ్ని దుస్సహుని నగ్గాండీవి నల్గించి యెక్కరణిన్ మానధనాఢ్యులై బ్రతికిపోవన్ వచ్చునే యేరికిన్.

చూ. అలిగించు. అర. 6-177

**అల్గు** దే. అ. క్రి. అలుగు

చూ. అలుగు.

తే. ...విరాట విభుఁడు, వరవునకు నల్గినట్టుల సరకుగొనక, యతుల రభసాతిరేకత నతని దాఁకె.

విరా. 3-185, మౌస. 109, అను. 5-338

**అల్పకము** సం. విణ. (అ. ల్పికా, అ.)

అల్పము, కొంచెము.

క. కుడిచేతఁ బిదప డాచేఁ, గడిగి పారిన్ సప్తమృత్తికాకలనమునం, గడగునది కరయుగము మఱి, కడుగవలయు గుహ్య మల్పక మృదాకలనన్. అను. 8-280

**అల్పబుద్ధి** సం. విణ. (ఇ)

నీచమతి.

క. నీ కొడుకు లొండు సుఖములు, సేకొన రవ్వీర సుఖమ చిత్తములఁ గరం, బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లల్పబుద్ధులె వారల్. ఉద్యో. 8-205

**అల్పము** సం. విణ. (అ. ఆ. అ.) అలుపము.

1. కొంచెమైనది, తక్కువది.

శా. ...నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దు,స్సాధంబైన విరుద్ధ కార్య మిటు లానన్నంబుగా సంఘటింపఁతే ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చఁ దగ సాధింపంగఁ గా నల్పమే. విరా. 2-275

తే కొంచెమైనను దగఁ బంచి కుడువు మేలు, పనులయెడ దుఃఖ

మోర్చి యల్పంబు సుఖము; ననుభవించుట హితము శత్రునకు
నైన, నిచ్చుటయ తెస్స యడిగినయెడ నృపాల. ఉద్యో. 2-47

2. అల్పకార్యము.

వ. తమవారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె యక్లేశకృత్యమె కాఁ
గయ్యము ద్రోణ భీష్మ కృప కర్ణాటోపముల్ మాన్చు టల్ప
ములఁ దీఱునె యందు నర్జునుని యుల్లంబు... ఉద్యో. 4-57

(అల్పము = అల్ప కార్యములు)

3. సంక్షిప్తము.

క. కౌరవ సభఁ దా వాడిన, గౌరవ వాక్యములఁ గార్యఖడ్గక్రమ
వా, క్ప్రారములు సుయోధను దుష్ప్రారంభము నల్ప వచన
పద్ధతిఁ జెప్పెన్. ఉద్యో. 4-10

అల్పీయము సం. విణ. (న్. యసీ. న్.)

అల్పతరము, మిక్కిలి కొంచెమైనది.

వ. అల్పీయంబైన కార్యంబు సాహసారబ్ధంబైనను దోషంబు లేదిది
మహాకార్యంబు సాహసక్రియా సాధ్యంబు గాదు. అర. 1-269

(అల్పోపాయంబైన కార్యంబు- అని కొన్ని ప్రతులు)

శ్లో. మహా పాపాని కర్మాణి యాని కేవల సాహసాత్
ఆరభ్యంతే భీమసేన వ్యథంతే తాని భారత
సుమంత్రితే సువిక్రాంతే సుకృతే సువిచారితే,
సిధ్యంత్యర్థా మహాబాహో దైవం చాత్ర ప్రదక్షిణమ్.
సం. భా. అర. 36-6, 7 శ్లో.

మూలమునకు "అల్పోపాయము" కన్న "అల్పీయమే" దగ్గఱగాఁ గను
పించుచున్నది.

అల్పుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

కొద్దివాఁడు, తక్కువవాఁడు.

సీ. కవ లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు, ద్రుపదుఁ డల్పుండె తత్సు
తులు తాపస,గర్వ సమగ్రులు గారె. ఉద్యో. 1-268

**అల్ల**[1] దే. అవ్య. (అల్లవాఁడు - అల్లదె) (రూపాం. అల)

అ - అదిగో (నిర్దేశ వాచకము)

చ. అల్ల గట్టె మొనఁ గ్రాలుచున్న త్రిగర్తనాథు కేతనము.

(అల్ల కంటె అని కొన్ని ప్రతులు) విరా. 3-180

వ. అల్లవాఁడె నరుండు. ద్రోణ. 5-161

తే. మల్లయుద్ధంబు సేయుచు నల్లచోట, నున్నవాఁడు. ఆది. 6-211

వ. చూడవె యల్ల యతి ధవళంబైన యశ్వంబునందు. ఆది. 2-31

వ. అల్లదె దాక్షిణాత్య సేన. ద్రోణ. 4-12

**అల్ల**[2] వై. విణ. (సం. అలసః)

1. మందము కొంచెము. (కర్మధారయమునందు దీనికి "నిగాగమము" వికల్పము.

మ. ...అల్లని నవ్వొప్పఁగ నా సమీరణుఁడు హేలాస్ఫారుఁడై యిట్లనున్. శాంతి. 3-391

సీ అల్లఁదనంబున ననువు మైకొనఁ జూచు, నడపుకాంతికి వింత తొడవు గాఁగ. విరా. 1-245

క్రి. విణ. ద్రు.

2. మందముగా, మెల్లగా, నెమ్మదిగా క్రమక్రమముగా.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశ మాత్ర మొక్కచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁడు. విరా. 1-58

గీ. సర్వ సంకల్ప వర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు, నతఁడనింధనానలమున ట్లల్లఁబొందు, వికృతి వర్జిత మైన నిర్వృతిఁ గృతాత్మ. అశ్వ. 1-205

**అల్లఁదనము** వై. విణ.

కొఁచెపుఁదనము, మందత్వము.

సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁజూచు నడవు కాంతికి వింత తొడవు గాఁగ. శాంతి. 1-247; విరా. 1-245

**అల్లన** క్రి. విణ. ద్రు.

మందముగా, మెల్లఁగా, నెమ్మదిగా.

తే. ...అజాతవైరి యల్లన నకులుని వలను సూచి, నెమ్మనంబున నుమ్మలికమ్మ గదుర, నెలుఁగు చందంబు వేలుగా నిట్టులనియె. విరా. 1-91

వ. ...ఆ వ్యాతి పదంపడి యల్లన సురిఁగి ధేనుకాశ్రమంబున కరిగి యత్యంత దీర్ఘకాలంబు ఘోర తపంబుసేసి... శాంతి. 5-207

క. దక్షిణ మారుత మల్లన వీతెంచె... ఆది. 4-40

**అల్లనల్ల** క్రి. విణ. (అల్ల+అల్ల)

మెల్లమెల్లఁగా.

ఆ. వచ్చి కొలువుసొచ్చి నెచ్చెలిపిండు నంతంత నిలువఁబనిచి యల్ల నల్లఁ, గదిసి ప్రౌఢవనిత కైవడి ముద్దియ, ముద్దుపుట్టఁ దనకు మ్రొక్కుటయును. విరా. 1-246

**అల్లనల్లన** క్రి. విణ. (అల్లన+అల్లన)

మెల్లమెల్లఁగా.

చ ...అల్లనల్లన వెడభీతి దోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్. విరా. 1-276

**అల్లలనాడు** అ. క్రి.

అల్లాడు, చలించు, కదలు.

చ. అనియని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించు. విరా. 2-31

మ. భీముఁ డా సూతసూతి రథం బల్లల నాడ దాని పయికిం దెంపొప్ప లంఘించినన్. ద్రోణ. 4-235

**అల్లల్లన** క్రి. విణ. (అల్ల+అల్లన)

మెల్లమెల్లఁగా.

క. అనుటయు నాతం డందఱకును మెలపునఁజెప్ప వగలఁగుందుచు నల్లల్లన తమ నిలయంబులకును, జనిరి మఱియు నేడ్చుచుండె సంజయుఁ డలఁతన్. శల్య 1-12

**అల్లాడు** అ. క్రి. అల్లలనాఁడు

1. కదలు, చలించు, వడకు.

మ. అవనీ చక్రము పాదఘాతహతి నల్లాడంగ. ఆది. 6-18.

మ. అవని చక్రము సంచలింపఁగ దివం బల్లాడ. విరా. 2-284.

సీ. పాలిండ్లు దనువెద వ్రాలింపఁ జెన్నొందు నవఁదుగాఁదీఁగె యల్లాడుచుండి. విరా. 4-26.

2 భయాదులచే తొట్రుపడు, కలఁతజెందు.

శా. కూడంబాటి సముద్ధతిం గడఁగి తద్గోపాలకుల్ మూఁక లల్లాడం దాఁకి నిశాత సాయక పటు వ్యాపార ఘోరంబుగా, నీడంబోక పెనంగినం గని త్రిగర్తేశుండు. విరా. 3-132.

**అల్లార్చు** స. క్రి.

1. కదలించు, చలింపజేయు.

సీ. ...లక్కముస్తినఁ గేతు వల్లార్చి పేర్చి. కర్ణ. 1-99.

2. ఆడించు, ఊపు.

సీ. చూడు మిమ్ముద్దియ సుతుఁ జూచి వదన మల్లార్చుచు శ్రాణేశు నాననంబు; పైఁ జూడ్కి యడరించి పాణితలంబున, నందంగ నెమ్మొగ మడిచికొనుచు. స్త్రీ. 2-45.

3. సారించు, త్రిప్పు.

వ. ...అమ్మహాబలనందనుండు గండశిలంబునం దొరుగు నెత్తురను మదంబున మత్తకరి ననుకరించుచుఁ దుండంబు చందంబునం జెలువొందు గద యల్లార్చి పేర్చి వ్రేటుగొనిన. శల్య. 2-267.

**అల్లు** దే. స. క్రి.

(జడ, చాప, మాటలు మొ.) కూర్చు. అల్లికవేయు.

క. గారవమున నిజ దేహాచారము మై నల్లియున్న జడయగు కబరీ భారంబు విచ్చి తిరముగ, సైరంధ్రీజాతి వేష సముచితభంగిన్. విరా. 1-290.

**అల్లుఁగుఱ్ఱ** దే. వి.

అల్లుఁడు, మేనల్లుఁడు.

క. గతి నీవే నాకు మఱిసం,తతికిని నీ యల్లుఁగుఱ్ఱ తనయుఁడు పుట్టెన్ మృతుఁడై క్రూరుండగు గురు,సుతుని యిషీకాస్త్రవహ్నిఁ జూడిన కతనన్. అశ్వ. 2-169

**అల్లుఁగుఱ్ఱ తనయుఁడు** మిశ్ర. వి.

మేనల్లుని కొడుకు.

చూ. అల్లుఁగుఱ్ఱ. అశ్వ. 2-169

**అల్లుఁడు** దే. వి. (బహు. అల్లురు, అల్లుండ్రు)

1. మేనల్లుఁడు, మేనల్లుని వరుసవాఁడు (తల్లి యక్కచెల్లెండ్రకు తల్లి యన్నదమ్ములకు తండ్రి యన్నదమ్ములకు సంబంధించి యల్లుని వరుసయైనవాఁడు.)

సీ. ...శల్యు డతిరథుండు -అ- వాసుదేవుతోడి యీసువాఁ డల్లుర విడిచె నిన్నుఁ గూడి. ఉద్యో. 4-221

తే. వారికి నీ యల్లుఁ డడ్డుపడియె. ద్రోణ. 2-67

సీ. ఇతఁడు మీ యల్లుని సుతుఁ డన్న వ పార్థుఁ డప్పుడు నా యల్లుఁ డెచట నున్నవాఁ డని యడిగిన. అశ్వ. 4-45

క. ఏ నమ్మహానుభావుల మేనల్లుఁడ విరా. 4-128

2. జామాత, కూఁతు మగఁడు.

(సంజయుఁడు ధృతరాష్ట్రునితో చెప్పిన వాక్యములు)

తే. చిత్తమున వరగర్వంబు చిగురు లొత్తఁ, బాండుపుత్రుల దుర్దాంత బాహుబలము, మొనల పెల్లున సరకుగాఁ గొనక యేచి, యాశ్చి వారికి నీ యల్లుఁ డడ్డపడియె. ద్రోణ. 2-26, అను. 1-108

(సంబంధము అల్లువాఁడు గాన అల్లుఁడు)

**అవ** అవ.

సంఖ్యావాచకములపై పూరణార్థకమున వచ్చును.

దీని పూర్వ రూపము అగు, అవు. చూ. అగు.

సీ. రెండవ యేట నొక్కం డధిమాసము. వీరా. 4-282

వ. బలంబున నాలవపాలు గొని. విరా. 4-237

సీ. ఆయంబునందు నాలవ భాగమొందె మూఁడవ భాగమొందె నందర్థ
మొందె, గాని మిక్కిలి సేయఁగాదు వ్యయము. సభా. 1-46

అవ సం. అవ్య.
ఇది సమాసమునందు పూర్వపదముగానే యుండును. ప్రత్యేక ప్రయోగము లేదు.

1. వ్యతిరిక్తము, విరోధము.
చ. వినుము సుయోధనాదులగు వీరు... బంధుకోటికిన్, మనసలు
నొవ్వఁగా నవగుణంబులకుం బయిలోఁ దరేమియున్. ఉద్యో. 8-281
అవగుణము = విరుద్ధగుణము, దుర్గుణము.
అవమానము. విరా. 1-118; అవకార్యము. కర్ణ. 1-224

2. అనాదరణమును దెల్పును.
అవకర్ణించు. ఆది. 2-210

3. అగౌరవమును దెల్పును.
అవజ్ఞ. ఆది. 2-177

4. ఆధారమును దెల్పును.
అవలంబనము. ఆది. 4-219

5. పరిశుద్ధిని దెలుపును.
అవదాతము. ఆది 4-170

6. వంగుటను దెలుపును.
అవనతము. శాంతి. 1-864

7. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.
అవాప్తి- ఆప్తి. శాంతి. 4-119
అవరుద్ధము, రుద్ధము. ద్రోణ. 1-808

8. దీని తొలి యక్షరము కొన్నిఁటియందు వైకల్పికముగా లోపించును.
అవతంసము. ఆది. 8-129, వతంసము. ఆది. 5-141

**అవంతి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. (రూపాం) అవంతిక

ఒకదేశము.

భారత కాలమున దీనికిఁ బ్రభువులు విందుఁడు, అనువిందుఁడు అను నిర్వురు సోదరులు (చూ. అనువిందుఁడు) భారత యుద్ధమున వీరిర్వురు చెఱియొక యక్షోహిణి సేనతో వచ్చి దుర్యోధనుని పక్షమునఁ జేరిరి.

చూ. అవంతిక. ఉద్యో. 1-225

**అవంతిక** సం. వి. అ. స్త్రీ.

అవంతి- ఒకదేశము.

వ. ...మాళవ నేపాళ ఘూర్జర కుంతలావంతికానూపాది జనపదంబులు సమస్త వస్తు సంపత్సంపాదనంబు లయిన గుణ విశేషంబుల వెలసి. భీష్మ 1-40

భారత కాలమున మాళవదేశము అవంతిదేశము వేఱువేఱుగ నున్నను బిదప అవంతిదేశము మాళవ దేశములోఁ జేరిపోయి మొత్తమంతయు మాళవ దేశముఁగనే వ్యవహరింపఁబడినది. దీనికి ముఖ్యపట్టణము ఉజ్జయిని. ఇది మోక్షదాయికములగు సప్తపురములలో నొకటి.

శ్లో. అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా,
పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః.

ఈ పట్టణపు సరిహద్దులలో సుప్రసిద్ధమైన మహాకాలాలయము గలదు.

**అవంతీశ్వరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అవంతిదేశపు రాజు. (విందుఁడు - అనువిందుఁడు) ఉద్యో. 1-225

**అవంధ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

అమోఘము, సఫలము.

మత్త :- ...అవంధ్యవిక్రమ మేర్పడన్, భూరివీరరణం బొనర్తము.
అర. 2-222

**అవకర్ణించు** సం. స. క్రి.

విను- అనాదరముతో విను- పెడచెవినిబెట్టు.

వ. ...అనిన వాని వచనం బవకర్ణించి రాజనియుక్తులయి చ్యవనకుం

విఖ్యాతుండైన చండభార్గవుండు హోతగాఁ బింగళుం డధ్వర్యుం డుగా శార్ఙ్గవుఁడు బ్రహ్మగా. ఆది. 2-210

**అవకలితము** సం. వి. అ. న.

గ్రహింపఁబడినది, తీసికొనఁబడినది.

సీ. అంగనాజనుల యుత్తుంగ సంగత కుచ కుంకుమ చందన పంకము లయు, వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్ప దామములయు. ఆది. 3-156

**అవకార్యము** సం. వి. అ. న.

దుష్కార్యము, చెడ్డపని.

క. దుర్యోధను చేసిన యవకార్యంబున వచ్చినట్టి కష్టంబులు, కర్ణ. 1-324; శల్య. 2-78

**అవకాశము** సం. వి. అ. పుం.

1. ఎడము, చోటు.

క. సవరణల నొప్పి యనిఁ బాండవ బలముల మార్కొనం గడం గుచు నత్యుత్సవమునఁ బేర్చిన సేనల కవకాశము లేదు విడియ హస్తిపురమునన్. ఉద్యో. 1-228, అర. 4-221

2. అవశ్యకత.

తే. అనఘ నాయందు నీవు నీయందు నేనుఁ, గలము నీకు నీ సర్వ లోకంబు గలదు, చింత కవకాశ మెద్ది నిశ్చింతభావ, మొందు మనియె నా దండశూకోత్తముండు. శాంతి. 6-616

3. ప్రవేశము, విశ్రమించు తావు.

వ. ...అయ్యా, నిన్ను నతిశ్రాంతుంగా నెఱింగితిఁ గొండొకసేపు విశ్రమింపవలతేని నవకాశం బిచ్చెద నా శరీరంబు ప్రవేశించి సుఖంబున శయనింపుము. అర. 4-256

**అవకీర్ణత్వము** సం. వి. అ. న.

వ్యాపించుట, నిండుట.

మహాస్రగ్ధర. దనుజవ్రాతంబు కాంతాతతియును బ్రజలుం దారు

నానావిధో గ్రధ్వను లాకాశావకీర్ణత్వ మహిమఁ బొరయం...
సౌ. ప్తి. 1-201

**అవకీర్ణి** సం. వి. న్. పుం.

స్త్రీ సంగమాదులచే వ్రతభ్రష్టుఁడైన బ్రహ్మచారి.

సీ. పరిణయంబునకు మున్ సురతి సుఖము ననుభవించిన నవకీర్ణి యందురు. అను. 4-105

"అవకీర్ణీ భవే ద్గత్వా బ్రహ్మచారి తు యోషితమ్".
యజు. 8-280

**అవకృష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

తొలగింపఁబడినది, బహిష్కరింపఁబడినది.

సీ. సరస్వతీ సత్త్రంబున నవకృష్టోత్తరా సంగుండవయి. అర. 1-127

"అవకృష్ణ" యని కొందఱ పాఠము. అవకృష్ణము అను పాఠమే యుక్తముగాఁ గనిపించుచున్నది. చూ- అవకృష్ణము.

**అవకృష్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

తొలఁగింపఁబడినది, బహిష్కరింపఁబడినది.

సీ. సరస్వతీ సత్త్రంబున నవకృష్ణోత్తరా సంగుండవయి. అర. 1-127

ఆనంద వారి పాఠాంతరమును అకాడమి సం శో. ము. పాఠమునయిన "అవకృష్ణ" యే యుక్తమైన పాఠము.

శ్లో. అవకృష్ణోత్తరాసంగః కృశో ధమని సంతతః,
ఆసీః కృష్ణ సరస్వత్యాం సత్రే ద్వాదశవార్షికే.
సం. భా. అర 12-15 శ్లో.

**అవక్రము** సం. విణ. (అ. ఆ. అ.)

అకుంఠితము, అడ్డులేనిది.

వ. అవక్రవిక్రములగు కర్ణార్జునులును. ఉద్యో. 2-89

**అవక్రీతుఁడు** సం. వి. అ. పుం.

భారద్వాజుని పుత్రుఁడు. చూ. చరిత్ర. అర. 3-262 మొ. 283 వఱకు.

**అవగతము** సం. విణ. (అ. ఆ. అ.)

తెలియఁబడినది, జ్ఞాతము.

వ. ఇవ్విధంబునఁ బార్థున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి.
భీష్మ. 1-228

**అవగతి** సం. వి. ఇ. స్త్రీ.

తెలిసికొనుట, జ్ఞానము.

క. ధృతి యారోగ్యము నొసఁగును, ధృతి యుజ్జ్వల లక్ష్మిఁ దెచ్చు
ధృతి కీర్తికరము,న్నతిఁ జేయుఁ గాలగత్యవగతి గలిగినఁ గలుగు
ధృతి వికార విదూరా. శాంతి. 4-421

**అవగమము** సం. వి. అ. పుం.

జ్ఞానము, తెలివి.

తే. అట్లు గృహమేధి ధర్మతత్త్వావగమము, దనకుఁ గలుగంగఁ జేసిన
తాత కెఱఁగి అను. 4-3

**అవగమితము** సం. విణ. (అ. ఆ. అ.)

తెలిసికొనఁబడినది.

మాలిని. అవగమిత రహస్యాష్టాంగ సమ్యక్ప్రకారా ఉద్యో. 4-428

**అవగమ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁదగినది.

క. సాత్యవతేయాది మహామత్యవగమ్యప్రకార. స్త్రీ. 1-188

**అవగమ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁదగినవాఁడు.

ఉపనిషదవగమ్యా. శాంతి. 5-682

**అవగాఢము** సం. విణ. (అ. ఆ. అ.)

1. దుశ్శక్యము, దుస్సాధ్యము.

క. రవి శశి గతు లుడుగుడు నిది, దివ మిది రాత్రి యని వసుమతీజను
లకు న, ద్దివిజమునివరుల కెఱుఁగఁగఁ, నవగాఢం బయ్యె నంధ
మయ్యె జగంబుల్. అర. 8-25

2. చేటు గలిగించునది, ప్రమాదకరమైనది.

ఉ. ఆ కమలాయతాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబు

భో,గైక పరాయణుల్ పురము లంగజుఁ డప్రతికారచేష్టిత, స్వీకృతలోకుఁ డట్లగుట చేసు పురంబున వారి కెప్పుడుం, గా కెటులుండు నిట్టి యవగాథపుఁ బొత్తు మనంగవచ్చునే
విరా. 3-32

**అవగాహనము** సం. వి. అ. న.

1. స్నానము.

సీ అతఁడు సరస్వతి నవగాహనము సేయు,చుండి యాచేరువ నోర్తు తడుపుగట్టిక సీళ్లాడఁగాఁ జూడఁ దనదు శుక్లము నిర్గమించిన.
కల్కి 2-160

2 మునుఁగుట.

తే. బాహుదా నదియం దవగాహనంబు, సేయఁ బ్రభవించె నాతని చేతు లపుడు.
శాంతి. 1-170

3. ప్రదేశము, లోపలఁజొచ్చుట.

సీ. సాత్యవతేయుండు జాహ్నవీ సలిలావగాహన మొనరించి గారవమున, నింపారు నెలుఁగున నిందు రం డనవుడు.
ఆశ్ర. 2-118

**అవగాహము** సం. వి. అ. పుం.

అవగాహనము.

క. కమనీయ హంసకుల సం,గమ శోభితమైన యొక్క కమలాకరముం, బ్రమదమున దాన నవగా,హము సేయుచు నున్న తన్ను నచటం గంటిన్.
అను. 1-370; అర. 6-295

**అవగుణము** సం. వి. అ. పుం.

1. అకార్యము, చెడు పని.

చ. ...బంధు కోటికిన్, మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయి లోడ రేమియున్.
ఉద్యో. 3-261; శాంతి. 1-329

2. దోషము, నేరము.

క. స్త్రీ రతు సూత్మ్న మీవ, శ్లేరూపునకైన వంశహీనత మమ్ముం, జేరక యుండం దగఁ బరి,హారము సేసి తదియేల యవగుణ మయ్యెన్.
అను. 2-216

3. దుర్గుణము.

తే. ...ఇచ్చుచోట,నైన నవగుణ మెక్కుడై కానఁబడిన నిందితా త్ములకిచ్చుట నిష్ఫలంబు. శాంతి. 1-329

**అవగ్రహము** సం. వి. అ. పుం.

అనావృష్టి, వఱపు.

వ. ...ధర్మంబు నడవక యవగ్రహాది దురితంబులు దుస్తరంబులయిన నాహారంబుల దొరకొనని యట్టిచో ద్విజాతు లేమిత్రంగిం బ్రాణం బులు రక్షించుకొనువారు. శాంతి. 3-278

**అవచయము** సం. వి. అ. పుం.

క్షీణత, తగ్గుదల, క్షయము.

ఆ. అర్థకర్మలోప మవచయ మొనరించు. అశ్వ. 1-188

**అవజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గెలువఁబడినవాఁడు, నిర్జితుఁడు.

క. అవినీతులయి మహాత్ముల, కవమానము సేసి మును జయద్రథ దంభో,ద్భవ కార్తవీర్యు లనువా, రవజితులయి రొరులచే మహా బలులయ్యున్. సభా. 1-190

**అవజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ.

అవమానము, తిరస్కారము.

ఆ. ఉద్ధతియు నసూయయును నవజ్ఞయును నెఱుంగఁడు.

శాంతి. 5-82, ఆది. 2-177

**అవజ్ఞత** సం. వి. ఆ. స్త్రీ.

అవమానము,

సీ. అసపాటును నవజ్ఞతయు నెందును లేక సర్వధర్మతంత్రతలోలుం డును. అశ్వ. 1-208

**అవడు** దే. విణ.

నీచము.

ఉ. పాయక యొమ్ము నంద దవడుఁ బాములమోవను వారికిం జమల్,

సేయను నేమి కారణము సెప్పుము. ఆది. 2-48

**అవతంసము** సం. వి. అ. పుం. న.

శ్రేష్ఠవాచకము.

మహీదేవకులావతంస. ఆది. 3-129

**అవతరణము** సం. వి. అ. న.

1. (తీరాదుల నుండి జలాదులయందు) దిగుట.

వ యాజ్ఞసేనీ పురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు సేసి. విరా. 1-180

2. (రథాదుల నుండి క్రిందికి) దిగుట.

వ. పురంబున కరుగుదెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి. విరా. 4-4

3. తొలఁగించుట, నివారించుట.

వ. అఖిల భారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుదయించుటయు. సభా. 2-2

వ. నరనారాయణులు జగదుపకారులు జగతీ భారావతరణ కారణులై. అర. 1-376

4. క్రిందికి దిగుట.

వ. దిలీపుండును దన పితామహులైన సాగరు లధోగతులు గాకుండ గంగావతరణంబునందు యత్నంబు సేసి యశక్తుం డయ్యె. అర. 3-78

**అవతరించు** సం. అ. క్రి.

1. అవరోహించు. దిగు.

తే. ...గ్రక్కున విమాన, మవతరించి యాసన్నులై యతివ యోర్తు శాంతి. 5-6; అశ్వ. 4-24.

2 భగవంతుఁడుగాని దేవతలుగాని మనుష్యాకారముతోఁ బుట్టు.

వ. యాదవ కులంబునం బుట్టి పురందరనందనుండై యవతరించిన నరుండు రోడ్పడ. శాంతి. 6-388

క. లోకేశ నీవు ధర్మ,శ్రీ కావలిగాఁగ నవతరించుట విద్వ,ల్లోకంబు
చెప్పు నమ్మూ,ర్త్యాకృతి యెట్లుండునో దయాత్మకమూర్తీ.
శాంతి, 6-351

3. (పతులు మొదలగునవి) వాలు.

వ. హంసావళి యవనీతలంబున కవతరించిన. అర. 2-11

**అవతారము** సం. వి. అ. పుం.

1. భగవంతుఁడు లేక దేవతలు మనుష్యాకారముతోఁ బుట్టుట.

సీ. అదితి గర్భంబున నవతారమై వామనాకారమున హరి యడుగుట
యును, విరా. 1-54

సీ. ...వరాహావతారలీల యఖిలయిల్ల. శాంతి. 6-437, మౌస. 219

2. ప్రాదుర్భావము.

వ. దేవదైత్యదానవుల యంశావతారంబుల వివరించెద. ఆది. 3-73

3, రూపము, ఆకారము.

క. తరుణావతారధరణీ సురవర సురభూజ. సభా. 2-320

**అవతీర్ణుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

దిగినవాఁడు.

దివ్యరథావతీర్ణుండై. అర. 1-358, అర. 7-390

**అవదాతము** సం. విశే. (అ. ఆ. అ.)

1, తెల్లనిది.

తే. దుర్లభమగు నవదాత వర్ణంబు గలుగుట నర్జునుఁ డంద్రుడు.
విరా. 4—146, ఆది. 2-31

**అవదానము** సం. వి. అ. న.

2. దోషరహితము.

వ. ఈ రెండవదానంబులు నీవును గొంత యెఱుంగుదు. శాంతి. 1-34

**అవద్యత** సం. వి. ఆ. స్త్రీ.

నింద్యత- నిందింపఁబడఁదగి యుండుట.

క. ఉద్యోగము ప్రియవాదిత, విద్యాపరినిష్ఠ సంధి విగ్రహ విహితా,
వద్యత దీనానాథ వి,పద్యాపన మాఙ్ఞ వెరవు వాటించుఁ దగన్.
ఆను. 5-49

**అవద్యము** సం. వి. అ. న.

దోషము, పాపము.

తే. తగిరె మునివర వాహనత్వంబు నమ్మ,హాద్యుతికి వేయు నేల
యవద్యరహిత. ఆను. 4-36

సం. విశే. (అ. ఆ. అ.)

నిందింపఁదగినది.

క. ...బ్రహ్మ హత్యా,వద్యము మొదలైన పాపవర్గం బెల్లన్.
స్వర్గ. 1-86

**అవధరించు** సం. స. క్రి.

1. విను, ఆలకించు.

వ. ...నీవు తొల్లి రచియించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి
భక్తవత్సలుండగు హరిహరనాథుండు నీదెస దయాళుండై.
విరా. 1-11

2. దయతో విను, చిత్తగించు.

వ. దామగ్రంథి యనువాఁడ నాకు పశ్వవిషయంబయిన విచక్షణత్వం
బెల్లను గల దవధరింపు మని యిట్లనియె. విరా. 1-262

3. సెలవీయు, సెలవిచ్చు.

వ. బహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థలంబునం
గూడికొని మా వర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట
దివ్య చిత్తంబున నవధరించినభంగి సేయువారమై చనుదెంచితిమి.
విరా. 3-87

4. తలఁచు, ఊహించు.

వ. అతండు మీదివ్యచిత్తంబున నవధరించిన దానిం గాదన నెట్లు
వచ్చు. ద్రోణ. 2-185

వ. అనినం దపననందనుం డది యట్లుండె నాకు సహజంబైన కవచంబు నొలిచి యిచ్చిన మదీయ దేహంబు గరంబు వికృతంబగునది యేమని యవధరించి తనిన. ఆర. 7-873

5. ఎఱుఁగు, తెలిసికొను. 

సీ. ఆయంబువందు నాలవ భాగ మొండె, మూఁడవ భాగమొండె నం దర్ధమొండె, గాని మిక్కిలి సేయఁగాదు వ్యయం బని యవధరించితె బుద్ధి నవనినాథ. సభా. 1-46

6. చూచు, కనుఁగొను.

సీ. శోకాగ్ని దనికిన సొగయు నీతమ్ముల నుపపన్న వాక్యామృతోపయుక్తిఁ, దేర్పుము గానలం ద్రిమ్మరునాఁడు వీరాయాసములఁ బడు టవధరించి, సమయ కాలము సన్నఁ జని సుయోధనుఁ జంపి భోగంబులను బహుత్యాగములను, యాగంబులను సద్విహారముల్ సలుపుదు మని యూఱడింపవే. శాంతి. 1-89

7. దయతోఁజూచు, అనుగ్రహించు. 

తే. ...ఆతండు సితసరోజ, రేఖ దలకొనఁగా నలవరించె గన్ను లవధరించెను నను లోచనాంచలముల. ఆర. 4-255

**అవధానము** సం. వి. అ. న. 

1. ఏకాగ్రత, మనస్సు ఇతర విషయములనుండి మరలి యొకే విషయముపై నిలిచియుండుట.

క. ... ఉన్నరూపు చెప్పెద, విను మవధానంబుతోడ. ఉద్యో. 2-51

2. ఏకాగ్రతతో వినుట.

చ. ...సంయమి, స్తవన కథావధాన పరదర్పక దర్పహరా. ద్రోణ. 2-364

3. ఎచ్చరిక.

సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్యలిద్దఱు గల,రందొక భామిని యతనిహితము, నడపెడు నవధాన మెడలి యాతఁడు పంప, కయుఁ దాన సురపితృకార్యపరత, నడచు. అను. 5-287

వ. యుయుత్సుం గనుంగొని విదుర సంజయుల నాలోకించి మీర లను దినంబును నవధానంబు గలిగి రాచవారి యోగక్షేమంబు లే నెట్లట్ల నిర్వహింపవలయు, శాంతి. 1-378

4. శ్రద్ధతోఁ జేయు పని.

తే. ఎవ్వఁ డిమ్మహాసురు వధియించు పనికిఁ, బూను నతనికి నాత్మీయ భూరి శక్తి, యిచ్చి జయమిత్తు నని యానతిచ్చె నధిప, యాదరంబున నాకు జక్రాయుధుండు,

వ. కావున.

చ. అతులిత విష్ణుశక్తి సముపాహితమూర్తివి గమ్ము లెమ్ము సంతత భుజశక్తి నిట్టి యవధాన మొనర్పఁగ నీవకావి యీక్షితి నిత రుండు లేఁడు. అర. 4-385, 386, 387

5. శ్రద్ధ, జాగ్రత్త.

క. నీవును నవధానముతో, గోవుల మన్నింపు పాత్రకోటి కొసఁగు సద్భావిత పుణ్యచరిత్రము, లా వెలవునఁ బోల వెన్ని యైనఁ గుమారా. అను. 2-478

క. ...నవ్విపులుఁడును జిత్తంబున నవధానము దృఢముగ, వనితం గాచికొనియుండె వసుధాధీశా. అను. 2-190

అవధాయకుఁడు సం. విణ. (అ. యికా. అ.)

ఏకాగ్రత గలవాఁడు, ఏక విషయమునందే మనసు నిలుపువాఁడు.

క. ఆయతికాఁడు కావలయు నరనాయకునకు వాని కెల్ల నరులుం జేటుం, జేయఁ దలంతురు దా నవధాయకుఁడై కావవలయు ధరణిపుఁ డతనిన్. శాంతి. 2-363

అవధి సం. వి. అ. పుం.

1. మేర, హద్దు, మొదలుకొని వఱకు, అనునర్థములం దుపయోగించును.

వ. అపత్యార్థియై యిక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్యయగుట పుత్రజన్మావధిగా నొడివి. ఉద్యో. 3-316

2. (సమాసాంతముల) సమాప్తమగుట, వఱకు అనునర్థము నిచ్చుట.

ఉ. ...కా,లావధియయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్. ఉద్యో 3-398

3. వేళ.

సీ. ...రణమొనర్చినఁగాదె మరణ,మెయ్యది యవధి యిందెల్లవారును
దెగు,వార కాలది గడవంగ వశముగాదు. స్త్రీ. 1-25

**అవధిఁబోవు** అ. క్రి.

కష్టపడు, శ్రమపడు. విరా. 1-181

(సం. ము, పాఠాంతరముగా నీయఁబడినది. పాఠము అవిధిఁబోవు – అని పాఠము) చూ. అవిధిఁబోవు.

**అవధీరణ** సం. వి. ఆ. స్త్రీ.

అవధీరణము, తిరస్కారము, అనాదరము.

చ. ...అట్లునేయ కవధీరణ చేసితి యేని వజ్రముం, బనుచు నతండు
నీవయి సభాసదులున్ వినఁ జాటి చెప్పితిన్. అశ్వ. 1-89

**అవధీరితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

అవమానింపఁబడినవాఁడు, పరాభవింపఁబడినవాఁడు.

చ. ...పవమాన తనూజుని చెయ్విఁబెన్గొడన్, విటిఁగి ధరిత్రిఁజొచ్చె యెడ
వేగమె వచ్చి శిరంబుఁదన్నె నే,త్తైలగల యప్పు శత్రు నవధీరితుఁ
జేయుట యొప్పుఁగాక యే,పఱినఁ బరాభవించిన జనావళి నవ్వదె
నొవ్వదే మదిన్. కర్ణ. 2-387

**అవధూతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. కదల్పఁబడినది.

మ. అవనీ చక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం, బవధూ
తంబుగ గోత్ర శైలనికరం బాకంపముం బొంద. విరా. 2-284

2. వెడలఁగొట్టఁబడినది.

క. సదసత్ప్రకార నిత్యం,బది దాని తెలంగెలుంగు నాత్ముఁడు విజ్ఞాన
దశావధూతగుణుఁడై. అశ్వ 2-133

3. ఎగురఁగొట్టఁబడినది.

వ. వాతావధూతంబైన పతాకయుంబోలె. సభా. 2-217

4. వంగఁగొట్టఁబడినది.

వ. మఱియు నక్కుమారుం డొక్క యెఱ్ఱని ఫలంబు దన దక్షిణపాణి తలంబున నందంద చఱచుచు నది నేలంబడి యెగయం బోయిన వలనికి బ్రాలుచు వాతావధూతంబైన బాలవృక్షంబునుం బోలె నొప్పుచున్న నమ్మునిపుత్రునందు నా హృదయంబు దద్దయుం దగిలినయది. అర. 3-106

**అవధూతి** సం. ఇ. స్త్రీ.

నిరసనము, త్యాగము.

క. శోకమదాద్యవధూతి, వ్యాకోశ వివేకభవన హరిహరనాథా. అను. 5-1

**అవధ్యత్వము** సం. అ. న.

చంపరానితనము.

వ. ...సత్యవతీ వివాహం బొనర్చుటకు మా తండ్రి మెచ్చి యవధ్యత్వంబును స్వచ్ఛంద మరణంబును నిచ్చినవాఁడు భీష్మ. 3-415

**అవధ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

చంపఁబడనిది.

వ. ...అతనికి నక్షయ తూణీరంబులు నగ్నిదేవుం డిచ్చిన యభేద్య రథంబును నవధ్య రథ్యంబులుం గలవు. కర్ణ. 1-235

**అవధ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చంపఁదగనివాఁడు.

(కృష్ణుఁడు ధర్మరాజుతో)

వ. క్రూరాత్ములగు కౌరవులెల్ల వారికి వధ్యులుగాఁదగుదురు. నీకేల యవధ్యులైరి, పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల నిర్వి చారంబుగా వధియించుట కర్తవ్యంబు. ఉద్యో. 3-87

2. చంపశక్యము గానివాఁడు.

వ. అమ్మహాదేవికి వద్దేవుం డిట్లను దైత్యులు సుందోపసుందు లను

నిర్వురు గలరు. వార లవార్యభుజ వీర్యశౌర్య సంపన్నులు నస్త్ర, శస్త్రవిధుర్యులు. అను. 4-425

**అవనత** సం. విణ. (అ. ఆ. అ.)

వంగినది.

అతి ఘనలజ్జావనతయగు నక్కన్య. ఆది. 8-88

**అవనతము** సం. విణ. (అ. ఆ. అ.)

వంపఁబడినది, వంగినది, క్రిందికి వంపఁబడినది.

లజ్జావనతాననుం డగు సుశర్మ. విరా. 3-286

వ. ఇట్లు పుట్టంబనియేమి యను వచనంబులతోఁ దిరుగుడు వడిరి. ధర్మ నందనుండు లజ్జావనత వదనుండై యూరకుండె. శాంతి. 1-364

**అవనతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వంగినవాఁడు, క్రిందికి వంగినవాఁడు.

వ. వినయావనతుండై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటియించి. విరా. 1-18; శల్య. 2-297; అను. 1-377

**అవనము** సం. వి. అ. న.

రక్షణము, కాపాడుట.

మాలిని. త్రిజగదవన నిత్యక్రీడనోద్యత్ప్రమోదా. విరా. 3-239; అను. 3-347

**అవని** సం. వి. ఇ. స్త్రీ.

భూమి, నేల.

సీ. బలు విడి వాఁడు పై, నడరిన జరగక యవనిఁ గ్రుంగి నిలుచు. విరా. 2-15

**అవనిజము** సం. వి. అ. పుం.

1. చెట్టు.

క. చనియెన్ రోమశుఁడు నవనిజముపైకి వెసన్. శాంతి. 8-221

2. వృక్షము- బ్రహ్మవనమునందలి వృక్షము- మహదహంకార పంచ

తన్మాత్రాది సంఘాతరూపమైన దేహములే వృక్షములుగాఁ జెప్పఁబడినవి.

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమ ఫలము,లందుఁ గొన్నిటి కేక
వర్ణాంచితంబు, లవనిజములు గొన్నిటికి నవ్యక్త వర్ణ,కములు
సౌరభ్యమాధుర్య సమధికములు — ఆశ్వ. 2-56

**అవనినాథుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — విరా. 2-7

**అవనిపుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — సభా. 2-24

**అవనిభృత్తు** సం. వి. త్. పుం.

కొండ, పర్వతము.

ఉ. నీ వలమూఁపు లావు మును నేల వహించిన నాగకూర్మ గో,త్రా
సనిభృద్దిశావరుల కారయ నూఁతపట్టుగాదె. — విరా. 2-193

**అవనీకాంతుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — విరా. 2-20

**అవనీజము** సం. వి. అ. పుం. అవనిజము.

చెట్టు. — విరా. 3-23; శాంతి, 1-68

**అవనీనాయకుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — విరా. 3-181

**అవనీవల్లభుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — విరా. 2-12

**అవనీశుఁడు** సం. వి. అ. పుం.

రాజు. — విరా. 2-158

**అవబోధము** సం. వి. అ. పుం.

**1. మేలుకొనియుండుట, 2. జాగరణము, 3. తెలివి, 4, వివేకము.**

క. సమవబోధ నిరంతరావిదాత్మాధీనా. — శాంతి. 1-399

5 తెలిసికొనుట.

వ. ధర్మంబు బహుప్రకారంబై యుండుఁ దదీయ సూక్ష్మగతి దురవబోధంబు గావున శ్రుతిప్రమాణంబుల వలనను వృద్ధాచార నిదర్శనంబులను నెఱింగికొనునది. అర. 5-61

**అవభృథము** సం. వి. అ. పుం.

1 యజ్ఞము కడపట న్యూనాతిరిక్త దోషపరిహారార్థముచేయు కర్మము, 2. యజ్ఞమునకు అంగమై దాని కడపటఁ (యజ్ఞానంతరము) జేయు స్నానము, 3. యజ్ఞ సమాప్తియందు యాజకుఁడును యజ్ఞపరికరములును స్నానముచేత నొందు శుద్ధి.

ఉ. ...పంకజనాథ యొకండు రాజసూయావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి వట్టి యీ, యేపురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. ఉద్యో. 3-110

తే. అఁక లేక యెవ్వాని జలాశయమున, మండువేసవి యందును మనుజకోటి, యవభృథస్నాన పానంబు లాచరించు, నతఁడు వొందఁడు విషమదుర్గాభిగతులు. అను. 2-386

ఉ. ...రాజసూయావభృథంబునందు వసుధామర మంత్ర పవిత్ర వారిధారావళిఁ జేసి పావనములైన శిరోజములం దెమల్చి పాపావహుఁ డీడ్చి తెచ్చె. సభా. 2-216

**అవమతి** సం. వి. ఇ. స్త్రీ.

అవమానము, తిరస్కారము, అనాదరము.

క. మన్నన కుబ్జక యవమతి, దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభములొదవు నాపద లడఁగున్. విరా. 1-138; శాంతి. 1-18

**అవమతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అవమానింపఁబడినవాఁడు.

క. ...పవిత్ర చారిత్రులైన పరమద్విజు లి ట్లవమతులై కోపించిన, నవనీశుల కేలకల్గు నాయువు సిరియున్. విరా. 5-278

**అవమము** సం. విణ. (అ. ఆ. అ.)

తక్కువయయినది, అధమము.

క. అవమానాసహామగు నీయవమ క్షత్త్రియ కులంబునం దిం కిట పుట్టువు గాకుండెడు సత్త్వము బ్రాహ్మణ కులము నంద యయ్యెడు నాకున్. ఆర. 1-284

**అవమానపడు** అ. క్రి.

అవమానము పొందు.

తే. ...అన్నాతి పలుకుఁ దద్ద యవమానపడితి శాంతనవుచేత నపర జన్మంబునందైన నతని జంపఁ నేను జాలుటకై యిట్టిదాన నైతి. ఉద్యో. 4-368

**అవమానపాటు** వి. (√ అవమానపడు)

అవమానపడుట.

సీ. ...మున్నవమానపాటు -గీ- దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన వారు గాన యలఁతిఁబోరు. ఉద్యో. 4-257

**అవమానపెట్టు** స. క్రి.

అవమానించు, భంగపఱచు.

సీ. ...ఇప్పాత్తిఁ దలపట్టి యీడ్చి తెచ్చి, సభలోన నట్టు దుశ్శాసనుం డవమానపెట్టంగ నచ్చట పెద్దలెల్లఁ, బలుకకయుండ. ఆశ్ర. 1-168; స్వర్గ. 5

**అవమానము** సం. వి. అ. పుం.

1. తలవంపు. అగౌరవము.

తే. మీ రొండొక నరునిఁ గొలిచి, మసలి వర్తిల్లి మానావమానము లకు, నోర్చి యడకువతోడన యునికి యరిది. విరా. 1-118; శాంతి. 5-267

2. పరాభవము.

క. తానును నన్నుయు నయ్యాస్థానమ్మున నుండి పవన తనయుఁ డనఘాత్ము, నైవ మనోవల్లభ యవమానము నా సింహబలుని మద జృంభణమున్. విరా. 2-132

**అవమానించు** సం. స. క్రి.

1. అవమానపఱచు, పరాభవించు.

క. ఆ నరుఁ డెప్పుడు మము నవ,మానించుచు నునికిఁజేసి మనుజేశ్వర కో,పానలము సంతతము మా, మానసములఁ బొదువ నతని మార్కొనఁ గడఁకన్. ద్రోణ. 1-219

2. న్యూనత యొనర్చు, తక్కువ పఱచు.

వ. ...తన తపోభిమానంబున మహర్షుల తపంబు లవమానించి పలికిన నయ్యయాతి గర్వంబునకు సహింపక యింద్రుం డలిగి.
ఆది. 3-211

**అవమానింపఁబడు** స. క్రి. కర్మ. ప్ర.

పరాభవింపఁబడు.

వ. అబ్బంగి నవమానింపంబడినవాఁడు గావున ధార్తరాష్ట్రకులధూమకేతువగు కపికేతువు దోఁచె. విరా. 4-195

**అవమానిత** సం. వి. ఆ. స్త్రీ.

చ. ఇది యుచితంబు గాదనక యిక్కురుముఖ్యులు సూచుచుండ దు,ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి. సభా. 2-219

**అవమానితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అవమానింపఁబడినవాఁడు.

(భీముఁడు) తే... కర్ణు,చేత నవమానితుండయి చిన్నఁబోయి.
ద్రోణ. 4-286, ఆది, 5-219

**అవమాన్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. అవమానింపఁబడినవాఁడు.

ఉ. ...సా,మమ్మున నెల్లవారి నవమాన్యులఁ జేసె నమాన్యుఁ డంచు రూ,తమ్మున భీష్ముఁజూచి బలగర్వితుఁ డిట్లని పల్కె నల్కతోన్.
సభా. 2-89

2. అవమానింపఁదగినవాఁడు.

మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునం గౌరవ,

స్థవిర ప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ బూజించిరి.
సభా. 2-63

**అవయవము** సం. వి. అ. పుం.

1. శరీరములోని భాగము (కరచరణాది)

వ. ఏనును... లలా టోపరిభాగంబున నంజలిపుటంబు ఘటియించి నయనంబులు నవయవంబులును ప్రమద బాష్ప సలిల నిలులితంబులును బులక పటల పరికలితంబులునుంగా నంతంత నిలిచిన నద్దేవుండు... విరా. 1-13

2. ఒకదానిలోని భాగము.

వ. బద్ధ పరికర కూబరాక్షయుగాద్యవయవంబును. విరా. 3-144

వ. ప్రాకార గోపుర ప్రాసాద ప్రముఖ వివిధావయవంబులు.
కర్ణ. 1-263

వ. ...సంధివిగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులును మొదలుగా వలయువానికిం బ్రబోధంబులగు నానావయవంబులుం గలిగి. శాంతి. 2-208

**అవరజ** సం. వి. ఆ. స్త్రీ.

చెల్లెలు.

క. భువనైకదీపకుం డగు, సవితృనకుఁ దనూజ మఱియు సావిత్రికి నే, నవరజ నవినయ వర్జిత, నవనీశ్వర వినుము తపతి యను సుర కన్యన్. ఆది. 7-80

**అవరజుఁడు** సం. వి. అ. పుం.

**తమ్ముఁడు, అనుజుఁడు.**

వ. అనిన విరాటుండు పాండవావరజున కిట్లనియె. విరా. 1-28

**అవరతము** సం. విశే. (అ. ఆ. అ.)

**అఁగినది, ఉడిగినది.**

క. ...అచల స్థిరుఁడై పరము ధ్యానావరతేంద్రియ వృత్తి నున్న వాని శమీకున్. ఆది. 2-171

**అవరుద్ధము** సం. విశే. (అ. ఆ. అ.)

వ. ఇట్లు పాండవబలంబులు జలధిరంబులు శైలంబు గప్పు కరణిం గుంభసంభవుం బొదివిన దృష్టపథం బవరుద్ధం బగుటయు నతండు దెగిరియె నను దిగులు మనవారికిం బుట్టు నట్టియెడ ద్రోణ 1-808

**అవరూథి** సం. విశే. న్. (న్. నీ న్.)

కవచము ధరించినవాడు (వ్యతి-వరూథి)

చ. రణశూరుతోడ భీరునకు వరూథితోడ నవరూథికి సజ్జనుతోడం గష్ట దుర్జనునకు నెయ్యిధంబునను సఖ్యము దా నొడంగూడనేర్చునే. ఆది 5-204

**అవరోధించు** సం. స. క్రి.

ముట్టడించు

వ. దుర్యోధన యుయుత్సు దుశ్శాసన వికర్ణ జలసంధాదులైన ధార్తరాష్ట్రు లనేకనృపకుమారసహితులై పాంచాలపురం బవరోధించిన. ఆది. 6-69

వ కామగమనంబయిన తన సౌంభకంబను నగరంబుతో సన్నద్ధుండయివచ్చి ద్వారవతీపురంబు నవరోధించి అర. 1-150

**అవర్ణము** సం. విశే. (అ. ఆ. అ.)

రంగులేనిది.

క. జనవర శుక్లము లోహితము నను గృష్ణము నైన వర్ణముల నధరమొందును సత్త్వరజస్తమముల, యనుసారంబున నవర్ణమయ్యు నవికృతమై. శాంతి. 6-14

**అవర్ధనము** సం. వి. అ. న.

కీడు, దుఃఖము.

ఆ. ...నీచ దుర్యోధనాదులకు వర్ధనమును నలఘులైన, పాండునందనులకు దండితారుల కవర్ధనము నిట్లు సేయందగునె విధికి. అర. 8-162

**అవల** దే. వి.

(దేశ్యమునందు అనంతరము)

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలు భటులఁ జూచి మొదలు వడఁకఁగ మేనుల్, దూలఁగఁ దముఁ దాఁకితయును, నాలము సాలించి కొంద అవలఁ జనంగన్. విరా. 5-62

ఆ. ఇవుల మూఁడి కవల నవల యమ్మూఁడికి, నివల.
(వేఱుచోటు–ఇతర స్థలము) భీష్మ. 1-21

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు ముందరరదము డిగు మ్మేన విడప డిగియెక, శల్య. 2-333

**అవలఁద్రోఁచు** దే. స. క్రి.

తిరస్కరించు, ధిక్కరించు, త్రోసివుచ్చు.

సీ. కేతనంబుల మణివ్రాతంబు రోచులు రవి కిరణంబు అవలఁ ద్రోవ.
భీష్మ. 1-104

**అవలంబనము** సం. వి. అ. న.

1. చేపట్టుట, పూనుట.

వ. (అర్జునునకు) అతనికి రణోత్సాహంబునకుం గారణంబైన స్వకర్మావలంబనంబు వదలం దగమి దెలియుటకు వలయు వాక్యంబులు పెక్కు లుపన్యసించి. భీష్మ. 1-200

2. ఆధారము, ప్రాపు, ఆశ్రయము.

చ. ...అనఘ యెఱుంగు దున్నత గుణాఢ్యుఁడవున్ భరతాన్వయావలంబనుఁడవు నీవ నిన్నొకఁడు వంచెదఁ జేయుము మైత్రియంబుగన్. ఆది. 4-219

**అవలంబనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆధారమైనవాఁడు, ప్రాపైనవాఁడు.

భరతాన్వయావలంబనుఁడవు. ఆది. 4-219

**అవలంబము** సం. వి. అ. పుం.

ఆధారము, ప్రాఁపు, ఆశ్రయము.

వ. అగ్ని దేవుఁడు గరంబు సంతసిల్లి కమలజు వచనం బవలంబంబుగాఁ బెద్దకాలం బుండి. ఆది. 2-250

**అవలంబించు** సం. స. క్రి.

1. పట్టుకొను.

వ. .. అంతకుమున్ను సన్నిహితులై యున్న కృతవర్మ కరంబును సాత్యకి హస్తంబును నవలంబించి యూరక వెడలె. ఉద్యో. 8-411

వ. తచ్చరణంబులు గరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు మొగిచియున్న. అశ్వ. 1-168, సౌప్తి. 2-48

2. ఊఁతగాఁగొను, ఆధారముగా గ్రహించు.

వ. అ య్యసురవరుండు దశవిశిఖంబులు రయంబున నురంబున గ్రుచ్చిన మూర్ఛవచ్చి యమ్మేటి జోదు కేతుదండం బవలంబించి.

వ. ఆలోచన తెలిసి... ద్రోణ. 5-150, 151; ఆది. 2-74

3. పూను.

వ. తత్కాలజనితంబయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యిట్లనియె. విరా. 1-73

వ. పొనుఁగు వడ్డ యగ్గి వేఁడిమి వోని వాడిమితో దుర్యోధనుండు ధైర్యం బవలంబించి. కర్ణ. 1-17, శాంతి. 3-423

4. గ్రహించు, చేపట్టు.

వ. ఆచార పరిపాటి యవలంబించి యిట్లుపాధ్యాయ వరణంబు చేసి... శాంతి. 6-255

వ. తపంబు ననేక యోగసమాధి నవలంబించి. అను. 1-354

వ. ఎప్పాటి ధర్మంబగు మార్గం బవలంబించి రాజ్యతంత్రంబు నడపి యశుభంబునం దొడరక జయింతు. శాంతి. 1-885, అశ్వ. 2-187

5. ఆశ్రయించు.

వ రజస్తమోదూషితంబుగాక కేవల సత్త్వాధిష్ఠితంబయిన జ్ఞానంబున నన్నవలంబించునది. అను. 1-879

**అవలిప్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

పూయఁబడినవాఁడు, లిప్తుఁడు.

**అవలీఢము** సం. విశే. (అ. ఆ. అ.)

లీఢము.

**అవలీల** సం. వి. ఆ. స్త్రీ.

చులకన, అనాయాసము.

క. వివిధము లగు లక్ష్యంబుల నవలీలం దునియ నాట నవియఁగ నేయున్. విరా. 5-19

సీ. ఏచి ధృష్టద్యుమ్నుఁ డేడ్తెర ద్రోణుపై, నడరిన నవలీల నాతఁ డతని, ఘన శరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి. భీష్మ. 1-256

క. భవవర్ధన నిలయంబుల, నవలీలన పరుస బ్రహ్మయన విష్ణుఁడనన్, శివుఁ డన నిర్వర్తింతును, భువనంబుల నేన చూవె భూరిమహిమలన్. అశ్వ. 3-42

**అవలుంచించు** సం. స. క్రి.

పెఱుకు, ఉత్పాటనము సేయు.

వ. ...ఒక్క జట యవలుంచించి వేల్చిన. అర. 3-267

**అవలేపము** సం. వి. అ. పుం.

గర్వము, పొగరుబోతుఁదనము

సీ. ... మత్సము లెవ్వరును నెందు లేరని యత్యవలేప యుక్తి నాడిన. అను. 5-318

**అవలోకనములు** సం. వి. అ. న.

చూచుట.

వ. బహుప్రకార పాదప గుల్మ లతావలోకనంబులను... వినోదించుచు... విరా. 1-147

**అవలోకించు** సం. స. క్రి.

1. చూచు.

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. విరా 3-221

2. పరికించి చూచు.

వ. ...అతండును ననిలసుతుండునుం బరస్పర మూర్తుల నవలోకించి.

యుద్ధరంగంబు మన్ను ఫాలప్రదేశంబుల ధరియించి. విరా. 2-14

**అవశిష్టము** సం. విణ. (అ. ఆ. ౦అ.)

శిష్టము. చూ. శిష్టము.

**అవశేషము** సం. వి. అ. పుం.

మిగులు, శేషము.

క. ప్రళయాంతకుండు బడబానలమును మృత్యువును నెదిరినం గొలఁ దవడన్, నిలిపినను నిలుపు మార్కొని, చెలఁగిన నరుశరముల నవశేషము సేయున్. విరా. 4-186

**అవశ్యంభావి** సం. విణ. (న్. నీ. న్.)

తప్పక సంభవించునది.

**అవశ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

అనివార్యము, తప్పనిది, మానఁగూడనిది.

చ. ...అధర్మమునందుఁ జిత్తముం, దగులదు నాకు నెన్నఁడును ధర్మ వవశ్యము నట్లు కావునన్. ఆది. 7-250

క్రి. విణ.

నిశ్చయముగా, తప్పకుండఁగా.

ఉ. వచ్చినవాఁడు ఫల్గుణుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు విరా. 4-284

వ. ఇతని వచనం బవశ్యంబు నలంఘనీయంబు. ఉద్యో. 1-385

**అవష్టంభము** సం. వి. అ. పుం.

అవలంబనము, ఊఁత.

శా. నీవున్ ధర్మవిరోధులైన జనతానింద్యాత్ములం బుణ్యమార్గావష్టంభము దేజరిల్ల నృపవంశాచార మొప్పార... శాంతి. 1-268

**అవసన్నము** సం. విణ. (అ. ఆ. అ.)

సమర్థము గానిది, శక్తిలేనిది, ఆపదనొందినది.

చూ. అవసన్నుఁడు.

**అవసన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సమర్థుఁడు గానివాఁడు, శక్తి లేనివాఁడు, ఆపద పొందువాఁడు.

వ. ఆశీహమానుండయి దైవపరుండయినవాఁడు నీరిలోని యాన పాత్రంబునుంబోలె నవసన్నుం డగుం గావున. ఆర. 1-286

**అవసరజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చూ. అవసరము.

**అవసరము** సం. వి. అ. పుం.

1. తఱి, సమయము.

వ. అవసరోచితంబులగు వినోదంబులం బ్రమోదంబు పుట్టించుచు.

విరా. 1-78, ఉద్యో. 1-309, ఆది. 1-115

2. అవకాశము.

సీ. ధనిక గృహద్వారమునఁ బ్రతీహారి త,మ్మాగంగనుండి దైన్య మున దుఃఖ, -తే- పడుజనంబులు లోగై కపరతఁ దొల్లి, మాన నీయుల కవసరమీనివారు. అను. 5-107

(అవసరమీనివారు = తమ్ముఁ గలిసికొనుటకు అవకాశము గల్పింపనివారు)

**అవసాదము** సం. వి. అ. పుం.

1. తుదముట్టు, ముగియుట. 2. నాశము.

**అవసాదితము** సం. విణ. (అ. ఆ. అ.)

తుదముట్టింపఁబడినది.

క. వాదైన యాశ్రితత్వము, నీరగు చిత్తమునఁ గల్మి నియతమ యేనిన్, సాదరఫణితుల నన్నవసాదిత సమ్మోహుఁగాఁ బ్రసా దింపు తగన్. ఆర. 4-268

**అవసానము** సం. వి. అ. న.

తుది, అంతము, ముగియిక.

వ ధార్తరాష్ట్రులకుం గాలావసానంబైన యట్లు సమయ కాలావ సానంబయ్యె. విరా. 2-235

**అవసాయకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

నశింపఁజేయువాఁడు.

ఉ. ...ఘోరసంసార దురామయాపదవసాయక. భీష్మ. 2-408

**అవసితము** సం. విశ. (అ. ఆ. అ.)

ముగిసినది, సమాప్తము.

సీ. ...పుణ్య మవసితమగుడు మర్త్యత్వమొందవత్తురు. అను. 5-18

**అవస్థ** సం. వి. ఆ. (స్త్రీ).

1. స్థితి.

క. అనుచుం దొరఁగెడు నశ్రుల, మునిఁగిన మోముతని వక్షమునఁ జేర్చిన నవ్వనిత యవస్థయ తాల్చుచు, ననిలసుతుం డడలె డెంద మలమటఁబొందన్. విరా. 2-222

2. దుస్థితి, దురవస్థ.

వ. కాల పర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరాని యవస్థ వచ్చె. ఉద్యో. 2-198; శాంతి. 5-397

క. మున్నిట్టి తెలిఁగు శోకం, బెన్నఁడు దా ననుభవించి యెఱుఁగ దకట నేఁ, డన్నెలఁత యలఁత పెల్లున, నెన్నియవస్థలకు వచ్చి యెట్లయ్యెడివో. సౌప్తి. 2-19

3. పర్యావస్థలు.

అవస్థాద్వయము : 1. సుఖము 2. దుఃఖము.

అవస్థాత్రియము ; 1. జాగ్రదవస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తావస్థ.

అవస్థాచతుష్టయము (వేదాంతము) : 1. జాగ్రత్తు 2. స్వప్నము 3. సుషుప్తి 4. మోక్షము (వైద్యము) 1. బాల్యము 2. కౌమారము 3. యౌవనము 4. వార్ధక్యము.

(పంచదశ పర్యంతం బాల్యమ్, ఆత్రింశద్వర్షం కౌమారమ్. ఆపంచాశద్వర్షం యౌవనమ్, తత ఊర్ధ్వం వృద్ధత్వమ్)

అవస్థాపంచకము (యోగము) : 1. అవిద్య 2. అస్మిత 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశము.

అవస్థాషట్కము : 1. పుట్టుట 2. ఉండుట 3. పెరుగుట 4. మాఱుట 5. క్షీణించుట 6. నశించుట.

(జాయతేఽస్తి వర్ధతే విపరిణమతేఽపక్షీయతే నశ్యతి) (నిరుక్త)

అవస్థాసప్తకము : 1. గర్భము 2. జన్మము 3. బాల్యము 4. యౌవనము 5. ముసలితనము 6. మరణము 7. నరకము.

అవస్థాష్టకము : 1. కౌమారము 2. పౌగండము 3. కైశోరము 4. యౌవనము 5. బాల్యము 6. తారుణ్యము 7. వృద్ధత్వము 8. వర్షీయస్త్వము.

(కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి,
కైశోర మాపంచదశాత్ యౌవనం తు తతఃపరమ్,
అషోడశాద్భవేద్బాలస్తరుణస్తత ఉచ్యతే,
వృద్ధస్తు సప్తతేరూర్ధ్వం వర్షీయాన్ నవతేః పరమ్-స్మృతి)

అవస్థాదశకము (అలం) : 1. దర్శనము 2. మనస్సంగము 3. సంకల్పము 4. జాగరము 5. కార్శ్యము 6. అరతి 7. అలజ్జ 8. ఉన్మాదము 9. మూర్ఛ 10. మరణము.

(జ్వరము, సంతాపము కలిసి ద్వాదశావస్థలని కొందఱు)

క. స్వాపావస్థం బ్రకృతిక, దీపిత వాటిల్లునపుడు దెలి వెడలక తా, దీపించు బురుషు డిమ్మెయి, చూపు ప్రబోధంబు పరమసూక్ష్మత పుత్రా. శాంతి. 4-326

తే. అని జపించి సర్వావస్థలందు నను వి,శిష్టభక్తి ననుస్మరించిన యతండు, సకల పాపంబులను బాసి శాంతినొంది, యవ్యయానంద పదమున నతిశయిల్లు. శాంతి. 4-249

**అవహస్తము** సం. వి. అ. పుం.

అపహస్తము, హస్తపృష్ఠ భాగము, చేతి వెనుకవైపు.

చ. ...భీముడును...సారథిం జఱచెం దా నవహస్తమునన్ వసుంధరా, తలమునం ద్రెళ్లె సారథియు. ఆది 5-177

**అవహిత** సం. వి. అ. స్త్రీ.

ఏకాగ్రచిత్తురాలు, సావధానము గలది.

వ. శివుండు శైలేంద్ర తనయతో ధర్మంబులు మఱియు నెఱిఁగించెద నవహితవై యాకర్ణింపు మని యిట్లనియె
అను. 5-29; అశ్వ. 2-93

**అవహితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఉంపఁబడినది, సావధానముగ నున్నది.

క. అనిమిషనాథున కిత్తఱి, ననుగ్రహము సేయవలయు నవహిత బుద్ధిన్.
ఉద్యో. 1-181; ద్రోణ. 1-10

**అవహితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. సావధానము గలవాఁడు.

వ. ధృతరాష్ట్రుం డవహితుండై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పిన తెంగులు నతండు వానికినెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి.
ఉద్యో. 2-117

వ. అవహితుండవయి యాకర్ణింపుము.
శాంతి. 3-360

2. ఏమఱుపాటు లేనివాఁడు.

క. ధృతరాష్ట్రి కుమారులు నవహితులై పాంచాలు మీఁద నేసిరి సాంద్రాయతత బాణప్రకర తిరోహితమై రవికిరణజాల మేర్పడ కుండన్.
ఆది. 6-72; శాంతి. 5-117; అశ్వ. 4-174

**అవాఙ్మనసగోచరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

వాక్కునకును మనస్సునకును విషయము కానివాఁడు, చెప్పను, దలంపను శక్యము గానివాఁడు.

వ. అనేక ప్రకారంబుల నవాఙ్మనస గోచరుండగు నప్పరమేశ్వరుఁ బ్రస్తుతించి.
ద్రోణ. 2-368

**అవాచీనుఁడు** సం. వి. అ. పుం.

జయత్సేనునకు వైదర్భియైన సుశ్రవసునకుఁ బుట్టినవాఁడు. ఇతనికి విదర్భరాజ పుత్రియైన మర్యాదకు నరిహుండు పుట్టెను. ఆది. 4-2

**అవాచ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

చెప్పుటకు శక్యముగానిది.

వ. బ్రహ్మవిద్యా విషయంబు మాబోటివారికి నవాచ్యంబై యుండు.
ఆర. 5-82

**అవాప్తము** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రాపించినది, పొందఁబడినది.

క. అనఘ భవత్సుకృతంబున, ననిమిష లోకాభిగమ మవాప్తంబయ్యెం
జను దెమ్ము విమానము చయ్యన నెక్కుము. ఆర. 6-127

**అవాప్తి** సం. వి. ఇ. స్త్రీ.

ప్రాప్తి, పొందుట.

క. గురు శుశ్రూషయును బ్రహ్మకుల భజనము న్యాయురవాప్తిం
జేయు. శాంతి. 4-119

**అవాప్యము** సం. విశే. (అ. ఆ. అ.)

పొందఁదగినది.

సుసంవిద వాప్య. శాంతి. 6-622

**అవారణ** సం. వి. ఆ. స్త్రీ. (అవారణము)

అడ్డులేనిది, నిరాటంకము.

చ. ...నీ, వదన సరోజ సౌరభ మవారణ నన్నును గ్రోలనిమ్ము.
విరా. 2-121

**అవారితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. అడ్డగింపఁబడనిది, వారింపఁబడనిది.

చ. వనజభవ ప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్య శోక మ, వ్వననిధి
లోకన ముంచిన యవారితసత్త్వుఁడు. ఆది. 4-87

2 అధికము.

క. భూరిభుజుం డర్జునుఁ డతి, శూరుఁడు దన యస్త్రవిద్యఁ జూపఁగ
రంగ, ప్రారంభుఁడయిన నతని న,వారితముగఁ బొగడు . జన
రవం బిది యధిపా. ఆది, 6-22

శ్లో॥ ఇత్యేవంతుములా వాచః శుశ్రువుః ప్రేక్షకేరితాః,
తేన శబ్దేనమహతా పూర్ణ శ్రుతిరథాబ్రవీత్
కిమేష సుమహోధ్వనిః

శ్లో. ఏష పార్థో మహారాజ ఫాల్గునః పాండునందనః,
అవతీర్ణ స్స కవచ ప్రతై 9ష సుమహాస్వనః.
సం. భా. ఆది. 135, 13, 14, 15, 16.

సీ. ...అనేక విప్ర... -తే- ...వరుల కతిథిజనులకు నవారితముగఁ
దండ్రి పని నిష్టమృష్టాన్నదాన మొనరఁ జేయుచున్న దుర్వాసుఁ
డన్ సిద్ధమునియు, వచ్చె నతిథియై భోజన వాంఛఁజేసి...
ఆది. 5-17.

**అవార్యత** సం. వి. ఆ. (స్త్రీ).
అనర్గళత్వము, వారింప నలవి కాకుండుట.
చ. వినుము కుమార విప్రు భుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం...
కర్ణ. 1-156.

**అవార్యము** సం. విణ. (అ. ఆ. అ.)
వారింపనలవిగానిది, అడ్డగింప శక్యముగానిది.
ఆ. మత్స్య నరపతి సద్ధర్మవర్తి సుజనహితుఁ డవార్య బాహు-
బలుఁడు. విరా. 1-64.
ఉ. ... ఈ, వంటలవాని చేసిన యవార్యపరాక్రమ మొండు
చోటులం, గంటిమె. విరా. 3-228, మహా. 58.

**అవార్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
అడ్డగింపఁబడనివాఁడు, వారింప నలవి కానివాఁడు.
చ. ...ఎవ్వరక్కడ నవార్యులు క్రీడికి సారథిత్వముం, దలకొని
నీ వనూన శుభదంబగు వర్తన మాచరింప... ద్రోణ. 2-355.
శా. ...అవార్యుం డయ్యెఁ గర్ణుం డనిన్. శాంతి. 1-31

**అవి**[1] దే. సర్వ. బహు
అది యొక్క బహువచన రూపము.
నా కవి యెల్లనేల. చూ. అది. విరా. 1-222.
భక్తి మెయిం దలంప నవి వచ్చెన్, విరా. 4-164.

**అవి**[2] సం. వి. ఇ. పుం.

1. సూర్యుఁడు.

క. ...అవి,కల్పుఁడు కృతవర్మ సనియె గాధసూఫ్రరిన్. భీష్మ 1-91

2. గొఱ్ఱె.

చ. ...అజావిగోమహిషవర్గములన్. ఆది. 5-39

**అవింధ్యుఁడు** సం. వి. అ. పుం.

ఒక వృద్ధ దైత్యుఁడు- ఇతఁడు రామహితాన్వేషియై సీతాదేవి నాశ్వాసింపఁ త్రిజటను బంపెను ఆర. 6-894

వ. అద్దేవి నా కిట్లనియె నన్నా నిన్నెఱింగితి నది యెట్లనిన రామహితాన్వేషియగు వాఁ డవింధ్యుండను వృద్ధ రాక్షసుండు మున్న యింతయుం త్రిజటచేత నా కెఱింగించె ఆర. 7-32

ఇందు మొదటి సంఖ్య క్రింద సంస్కృత మూలమున "అవధ్యుఁడు" అని యుండెను రెండవ సంఖ్య క్రింద అవింధ్యుఁడు అనియే యుండెను. మొదటిది ప్రమాదజనితము గానోపు.

**అవికలము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అవయవ వైకల్యము లేనిది.

క. శ్రోత్రియు లరోగు లవికల గాత్రులు పాత్రములు పైతృకములకు. అను. 5-208

2. అవిఘ్నము.

క. జగతీశ్వర నీ, వినుతోపదేశమున భవ, దనుయుక్తులెల్ల నడచు నవికలం భంగిన్. ఆశ్ర. 2-61

3. దృఢము.

క. సారథి తురంగముల మెల,పారంగాఁ బూన్చి తేర్చి యవికలముగు నా, తే రల్లఁ దేర సాత్యకి, బీరము వాలివోవకుండఁ ప్రియమున నెక్కెన్. ద్రోణ. 1-325

4. వికలత్వము లేనిది.

క. అవి యెల్లను బైఁ గురియఁగ, నవికలమూర్తియగు ననిమిషాధిప

తనయుం, డవిరళ వర్షము మీఁదం, గవియంగా నొప్పు నగము
కర్ణుం బోలిచెన్. భీష్మ. 2-35

**అవికంపితము** సం. విణ. (అ. ఆ. అ.)

చలింపనిది.

చ. కని యభిమన్యు ముఖ్యు లవికంపిత వృత్తిఁ గడంగి యేసినం.
భీష్మ. 2-240

విషయావికంపితాత్మ. శాంతి. 6-291

**అవికల్పము** సం. విణ. (అ. ఆ. అ.)

వికృతి నొందనిది.

చ. ఘనముగ నీవు నీ పదము గైకొనవే యవికల్ప భావనన్.
అర. 5-150

**అవికల్పుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. సూర్యునితో సమానుఁడు.

క. ... అవికల్పుఁడు గృతవర్మ సనియె గాఢస్ఫూర్తిన్.
భీష్మ. 1-90

2 వికృతి నొందనివాఁడు.

ఉ. సర్వలోక రక్షాకర శైక బుద్ధి నవికల్పుఁడ నయ్యెదఁ గట్టు పట్ట
మున్. అర. 5-231

**అవికారము** సం. విణ. (అ. ఆ. అ.)

మార్పులేనిది, వికారము లేనిది.

శా. ఆ రూపం బవికార మా భుజబలం బత్యంత నిర్గర్వము.
విరా. 2-209

చ. అవికార నిగూఢ నిజ ప్రకారుఁడై. విరా. 2-382

**అవికృతము** సం. విణ. (అ. ఆ. అ.)

వికారము పొందనిది, విడ్డూరము గానిది.

క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి రూప మవికృత
వేషం,బుగ సమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభున కతఁడు
సమ్మాన్యుఁ డగున్. విరా. 1-121

**అవికృతి** సం. విణ. (ఇ. ఇ. ఇ.)

పరిణామము లేనిది, వికారము లేనిది.

క. శివమును బరబ్రహ్మము, నవికృతియు సనాతనంబు నగు పదమును, ధ్రువ మెఱింగించితి. శాంతి. 6-64

**అవికృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వికారము నొందనివాఁడు.

క. అలఘుండగు నసురపతియు నవికృతుఁ డగుచున్. శాంతి. 3-491, అను, 2-261

**అవిక్రముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

క. కులరూపగుణద్రవ్యంబులు విక్రమవంతునందు భూవిదితములై, నిలుచు నవిక్రమునకు నవి, గలిగియు లేని క్రియ నప్రకాశంబు లగున్. సభా. 1-128

**అవిక్షిత్తు** సం. వి. త్. పుం.

కరంధముని కొడుకు. అశ్వ. 1-32

**అవిచలితము** సం. విణ. (అ. ఆ. అ.)

కదలనిది, సుస్థిర మైనది.

క. అమరాధిపుఁ డమృతముగొని, యమరావతి కరిగి తొంటియట్టుల సుస్థానమున నవిచలిత రక్షాక్షముఁడై రక్షించుకొని సుఖస్థితి నుండెన్. ఆది. 2-121

**అవిచారత** సం. వి. ఆ. స్త్రీ.

ఆలోచనలేమి.

ఉ. ...పార్థునిఁ దాఁకెడు బుద్ధి గ్రమ్మఱన్, సాహస వృత్తిఁ జేసి యవిచారతఁ బోయితి మేని వాఁడు పూర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మార్గణాగ్నికిన్. విరా. 5-219

క. ...కౌరవపతి యపుడు సంధి గావింపక హింసారుచియై తినుట యవిచారత నృపవంశ కలితజనియగు నీకున్. శాంతి. 1-160

**అవిచారము** సం. విణ. (అ. ఆ. అ.)

మంచిచెడ్డలు ఆలోచింపనిది, వివేచనము లేనిది.

మ. అవిచారం బని పల్క నోడెదము. ఆది. 8-198

**అవిచారితము** సం. విణ. (అ. ఆ. అ.)

చక్కఁగా ఆలోచింపఁబడనిది, గుర్తెఱుఁగఁబడనిది.

క. ఇట్లు వేర్చిన కోపాటోపంబున నవిచారిత సమయ వర్తనుండయి వృకోదరుండు కీచకుని గీటడంగింపం జూచి, విరా. 2-185

**అవిచారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆలోచనము లేనివాఁడు.

చ. ముని విదురుండు సెప్పె నతి మూర్ఖమనోగతియైన యీ సుయో-
ధను చరితంబు గీ దఖిల ధాత్రి జనంబులకుం బొనర్చు నాశన
మని దానిఁ గొంద అవిచారులు పాటిగఁ బట్టరైరి.

శల్య. 1-36, శాంతి. 1-268

**అవిచింత్యము** సం. విణ. (అ. ఆ. అ.)

వితర్కింప సాధ్యము గానిది.

చ. ...అవిచింత్య భూరి బలసత్త్వ సమన్వితు దీప్తహవ్యవాహన సము వైనతేయుని. ఆది. 2-74

**అవిచింత్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వితర్కింప నలవి గానివాఁడు.

తే. ...పురాణ, పురుషుఁ డచింత్యుఁ డచలుండు పుండరీక, లోచనుండు సద్భక్తులఁ గాచు నధిప. శాంతి. 3-47, అను. 5-265

**అవిచేష్టితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చేష్ట లుడిగినవాఁడు.

చ. ...నీ వెనుమూఁక పాయ విచ్చి నిలిచి చూచుచుండె నవిచేష్టితులైరి బలాధినాథులున్. ద్రోణ. 2-68

**అవిచేష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చేష్టలు తొలఁగినవాఁడు.

క. నయనములు వా కుఁ బవనత,నయ విజయులు మనకు కమల
నాభుఁడు వీరిం, బ్రియహితులఁ బాసి నిమిషం,బయినను నెట్లుండ
నేర్తు నవిచేష్టుఁడనై. సభా. 1-168

(ఇచ్చట చేష్టలు తొలఁగనివాఁడు- జీవించినవాఁడు అనియుఁ జెప్పవచ్చును).
(అ + వి + చేష్టుఁడు = చేష్టలు తొలఁగినవాఁడు కానివాఁడు)

**అవిచ్ఛిన్నము** సం. విణ. (అ. ఆ. అ.)
తెంపులేనిది, ఎడతెగనిది.

వ. దుష్టారిష్ట వికృతులయి యా సుకృతు లవిచ్ఛిన్నాత్మానుసంధా
నబునం దదీయ దురవస్థం ద్రోవఁ జాలుదురు. అను. 4-281

**అవిజయ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
క. అవిజయ్యులు వారిఁ దొడర నగునే తనకున్. ద్రోణ. 4-208

**అవిజితము** సం. విణ. (అ. ఆ. అ.)
జయింపఁబడనిది.

తే. అవిజితేంద్రియ బల కుత్సితాత్మ నీచ. అను. 2-201

**అవిజేయము** సం. విణ. (అ. ఆ. అ.)
జయింప శక్యముగానిది.

సీ. అంగభూవిభుఁడును, భూరిశ్రవుఁడు, మద్రభూమిపతియు, నాదగాఁ
గల వీరు లవిజేయవిక్రములు. అర. 1-269

**అవిజేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
జయింప శక్యము గానివాఁడు.

సీ. బ్రహ్మ విద్వేషంబుఁ బరికించి కోపించి, యవిజేయుఁడైన సహస్ర
బాహుఁ, బరిమార్చి. శాంతి. 1-244, ఆది. 6-208

**అవిజ్ఞాతగతి** సం. వి. ఇ. పుం.
అనిలుఁడను వసువునకు శివయను దానికిఁ బుట్టినవాఁడు. వీని యన్న
మనోజవుఁడు. ఆది 3-67

**అవిజ్ఞేయము** సం. విణ. (అ. ఆ. అ.)
తెలిసికొనఁబడనిది, తెలియ శక్యముగానిది.

వ ంచవింశతితమంబై యుత్తరం బనం బరఁగు నిష్పరమతత్త్వంబు
వినుమవిజ్ఞేయం బవ్యయం బకలంకం బనామయం బమృతంబు.
శాంతి. 8-10.

**అవితథము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అసత్యము కానిది, నిజమైనది.

క. వృథ యనఁగఁ బలుకఁ డుసే యవితథ వచనుం డైన ధర్మతనయు
నను జుఁడన్. విరా. 4-148.

2 అమోఘము, వ్యర్థముగానిది.

క. సమవిషమ వినిమ్నోన్నత, సమీప దూర స్థలములు సన్కృశము
లుగఁ జిత్తను క్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడి
రథము సను నవితథమై. విరా. 6-46.

**అవిదితము** సం. విణ. (అ. ఆ. అ.)

తెలియనిది.

సీ. లోకత్రయంబున మీకు నవిదితంబు లేదు త్రికాల సంవేదులార,
అను, 4-410

**అవిద్య** సం. వి. ఆ. (స్త్రీ).

1 విద్యకు విరోధి. సాత్త్వికరాజస తామస వికారంబుల ద్రిప్పలం బడుచు ధర్మం బాచరింపక భావశుద్ధిలేకయుండుట. దీనిచే దూషితుఁడైన వాఁడు విష్ణు నెఱుంగఁజాలఁడు. ఉద్యో. 2-320.

2. లోభమోహములు దోష సంసేవనము సేయఁగా మిక్కిలి గాఢయగు ఈ అవిద్య భూమియై పలు రకములైన కర్మబీజములకు అంకురాదిశక్తు లిచ్చును. శాంతి. 4-844.

8. అజ్ఞానము. ఇది ఆవరించినవారు కర్మల నాచరింతురు. ఇది తొలఁగిన విద్య. అది మోక్షము నిచ్చును. మాయ యని అద్వైతులు చెప్పుదురు. ఈ మాయ చేతనే నిర్విశేష చిన్మాత్రమును సత్యమును అగు బ్రహ్మమునందు మిథ్యయగు జగత్తు తోఁచుచున్నది అని వారి వాదము. తత్త్వజ్ఞానము లేకపోవుట అని విశిష్టాద్వైతులు చెప్పుదురు. చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు- అను మూఁడు తత్త్వములకుఁ

గల పరస్పర సంబంధము తెలియకపోవుట. దీనిచేతనే ఆత్మలు బద్ధావస్థ నొందుచున్నవి. ఈ యజ్ఞానము తొలఁగుటకు లక్ష్మీనారాయణుల యనుగ్రహమే కారణము. క్షణికములను స్థిరముగాఁ దలఁచుటయని బౌద్ధుల వాదము. జ్ఞానము లేకుండుట అని నైయాయికులు ప్రవచింతురు జ్ఞాన మింకను రాకున్న నవస్థయని సాంఖ్యాదులు చెప్పుదురు. శాంతి. 5-127

దీనికి క్షేత్రము, అవ్యక్తము, ప్రకృతి, ప్రధానము, అవేద్య, చలము అని పేరులు గలవు. శాంతి. 6-44, 140; అర. 1-88

**అవిధి** సం. వి. ఇ. పుం.

నియమ విరుద్ధము.

ఆ. తండ్రి నీకు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు
తెఱఁగు, సమయ సముచితముగ సనుకట్టుమయ్య యీ, రాకుమారు లవిధిఁ బోకయుండ. విరా. 1-181

**అవిధిఁబోవు** అ. క్రి.

నియమము తప్పి చరించు. చూ. అవిధి. విరా. 1-181

**అవిధేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

విధేయత లేనివాఁడు, విధేయుఁడు కానివాఁడు, దుర్మార్గుడు.

సీ. బ్రహ్మ విద్వేషంబు పరికించి కోపించి, యవిధేయుఁడైన సహస్ర
బాహుఁ, బరిమార్చి. ద్రోణ. 2-212

**అవిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

గాయపడనిది, నొవ్వనిది.

క. ...నొప్పిం, బొరయక యవిద్ధగాత్రుని కరణి సుఖాత్ముఁడవు
గమ్ము కౌరవనాథా. శాంతి. 2-122

**అవినయము** సం. వి. అ. పుం.

1. దుర్నయము, చెడు నడవడి.

క. నీ కా, దుర్యోధను నవినయ మని, వార్యం బని యెఱుఁగరామి
వలనో వెడఁగో... ఉద్యో. 1-318, ద్రోణ. 4-22; అను. 4-325

2. దోషము.

వ. స్వతంత్రవై నీవు చేసిన యీ యవినయంబున నెయ్యది వాటి ల్లిన నది నీయంద నిలుచుంగాక యని పలికి. శాంతి. 6-188

**అవినాభవత్** సం. శత్ర.

ఐక్యమును పొందుచున్న. అభేద భావమును బొందుచున్న.

ఉ శాంతబోధ సం,పత్త్యవినాభవన్మహిమ భాసుర. ద్రోణ. 1-395

**అవినీత** సం. వి. ఆ. స్త్రీ.

నీతి మాలినది దుర్మార్గురాలు.

వ. ఇట్లు వికలాంగుండై పుట్టిన యనూరుండు వినతకు నలిగి నన్ను సంపూర్ణ శరీరుం గానీక యేఁడం బవియించిన యవినీతవు కావున నీవు నీ సవతికి దాసివై యేనూ తేం డ్లుండుమని శావం బిచ్చి. ఆది. 2-7

**అవినీతత** సం. వి. ఆ. స్త్రీ.

దుర్మార్గము, అవినీతి.

క. దివిజారి దొల్లి యట్టెఁడ, యవినీతత నిపుడు బ్రాహ్మణాసూయ మెయిన్. శాంతి. 4-403

**అవినీతి** సం. వి. ఇ. స్త్రీ.

1. దుర్మార్గము, అయుక్తము, తగవుగాని పని.

మ. నను నీ వప్పుడు సూతు మందిరమున న్మద్వ్యంబుఁ దెమ్మన్నఁ బోయిన నాతం డవినీతి సేసినను జేయీ కేను...

విరా. 2-185, ఉద్యో. 2-84

2. తెలివి తక్కువదనము.

సీ. ...వృష్ణి కుమారులు విధి వశమున, మనముల నవినీతి జనియింప సాంబున, కంగనాలంకార మమరఁజేసి. మౌస. 5

**అవినీతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

నీతి మాలినవాఁడు, చెడు నడవడి గలవాఁడు,

వ కురురాజు పొద్ద నవినీతులు నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు బెరసి యుండుదురు, ఉద్యో. 1-283

వ. బాహ్లికులకంటె మద్రదేశజాతు లవినీతు లని యార్యులు చెప్పుదురు. కర్ణ. 2-109.

**అవిప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.)

చలింపనిది, భంగములేనిది.

వ. అవిప్లుత బ్రహ్మచర్యులయిన బ్రహ్మచారులును. ఆది. 8-221

**అవిభావ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

భావింపఁదగనిది

గా. కాల స్వైర విహార భంజన కళా కౌతూహల స్తవ్య, దుర్భీలాంతఃకరణా విభావ్యకరణా శ్రీమందిరాపాంగ మంత్రాశీ వాచ్య... సంసార నిస్తారణా. మాన. 224

**అవిభేదత** సం. వి. ఆ. స్త్రీ.

భేదములేమి.

ఉ. ...సుహృజ్జన, ప్రీతియు మున్నపోలె నవిభేదత యొప్పఁగ నిర్వహించితిన్. శాంతి. 6-377

**అవియనడుచు** దే. స. క్రి.

పగులఁగొట్టు, పగులుచు.

క. తన సవతియైన కద్రువ, గని వగపును మత్సరంబు గదిరెడు మదితో, వినత గడున్ వేగిరపడి, యనీతి యొకయండ మవియ నడిచె నరేంద్రా. అను. 1-168.

**అవియించు** దే. స. క్రి.

పగులుచు.

చ. ఇరువుర మేము పుట్టెద మహీనవు మేనులతో మహా బలస్ఫురణ నెఱంగ నప్పెనువుఁ బొందఁగనీ కవియించి తిట్లు.

అను. 1-172, ఆది. 2-7

**అవియు** దే. అ. క్రి.

పగులు, భేదిల్లు, బద్దలగు.

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగె, జిత్తము నీఱయిపోయె నాకు.

విరా. 4-177, భీష్మ. 1-287

వ. ...ప నూతేండ్లకుఁ గద్రూ గర్భాండంబులు తరతరంబ యవిసిన
నందు శేష... మహోదరు లాదిగాఁగల వేవురు నాగముఖ్యులు
పుట్టిరి. ఆది. 2-4

2. విరియు, ఉబుకు, పొంగు.

క. ఆతతబలుఁ డగు భీష్ముని, చేతి బలువు ద్రోణు నంపసెల లవియూ
టయుం, జూతు రటు రెండు కృష్ణుని, చేతన సకలంబుఁ జక్కఁ
జేసికొనుండీ. ఉద్యో. 4-192

క. గొడుగునను వింటి కొమ్ములు, సిడమున నరదంబునందు సెల లవిసి
కడున్, వడి నిగిడెదు చాడ్పున నా, వ్వడిముడిచెన నమ్ము లడరె
వసుధాధీశా. ద్రోణ. 4-222

3. భేదిల్లు, నశించు

క. వివిధములగు లక్ష్యంబులఁ, నవలీలం దునియ నాట నవియఁగ
నేయున్, భువనైకధన్వి నత్యుగ్ర విచేష్టితు నోర్చెఁ బరశు
రాముం బోరన్. విరా. 5-19

4. తెగు, గండిపడు.

క. చెఱువు నడు మవిసినను బెను, వెఱ మెకములు సెదరినను వివేక
నిధి యుక్కటి బహుళ సైన్యక మఱిముఱిఁ, బఱచిన నాగంగ రాదూ
బలియురకైనన్. శాంతి. 3-16

5. నొగులు, నొచ్చు, బాధపడు.

క పవనజుఁడు మూఁడు శరముల, దివిజనదీసూను నేసి దృఢగతిఁ
గృపుమే, నవియ నొకటఁ గృతవర్మని యవయవతతి నెనిమి
దింట నార్చుచు నేసెన్. భీష్మ. 1-277

**అవిరతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. విరామము లేనిది, ఎడతెగనిది.

క. ...అధమమగు లోకము ధర్మాదిదూర జనులు వొందుదు, రవిరత
బహుదుఃఖ నియమమది విప్రవరా, శాంతి. 4-114, మౌస. 166

2. విచ్ఛిత్తి పొందనిది, అవిచ్ఛిన్నమైనది.

క. ధృతి నీ యనుజుండై వి, శ్రుతుఁడైన విచిత్రవీర్య సుక్షేత్రము లన్, సుతులం బడయుము కుల మవి,రత సంతతి నెగడ దేవర న్యాయమునన్. ఆది, 4-244

**అవిరతి** సం. వి. ఇ. స్త్రీ.

వదలకుండుట.

క. రవిబింబము రాహువుపయిఁ, గవిసినఁ జూసినను దోఁపకయుఁ దోఁచియు నుం,డు విధమ యజ్ఞానంబున, యవిరతి విరతుల యధీనుఁ డగు టాత్మునకున్. శాంతి. 4—184

**అవిరళము** సం. విశ. (అ. ఆ. అ.)

1, ఎడము లేనిది.

క. వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁ బడుట నద్భుత భంగిన్. విరా. 5-97

2. విస్తారము, అధికము.

చ. అవిరళ దివ్యమార్గణ దురాసదు ద్రోణుని జూచి.

ద్రోణ. 1-302. శాంతి. 1-348, శాంతి. 5-69

**అవిరుద్ధుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

విరుద్ధము గానివాఁడు, విరోధము గానివాఁడు, వ్యతిరేకము గానివాఁడు

తే. ...వర్గత్రయావిరుద్ధు,లైన జనుల కెంతయు నొప్పు నప్పురంబు. ఆది. 8-74

(ఇది సం.ము అకాడమీ ప్రతుల పాఠము. 'అనురుద్ధుఁడు' అని ఆనంద వారి పాఠము. చూ. అనురుద్ధుఁడు.)

**అవిరోధము** సం. వి. అ. పుం.

విరోధములేమి, నెయ్యము.

మ. అవిరోధంబున జానకీసహితుఁడై యాబద్ధ రత్నప్రభా, నవపుష్పం బగు పుష్పకంబను విమానం బెక్కి యర్కాన్వయ్, ప్రవరుం డిమ్ములఁ జేఁగె. అర. 7-165

**అవిరోధి** సం. విశే. (న్. సీ. న్.)

ప్రతికూలము గానిది.

తే. కరము నియతుఁడై కొంతేసి కాలముల శ,రీరధర్మావిరోధిగాఁ
జేయుఁబగలు, ప్రాణసంయమనము నడపంగ వలయు.
శాంతి. 6-115

**అవిలంఘ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

తొలఁగ శక్యముగానిది.

క. నాయంగంబుల నెల్లం, బాయన మతిశక్తిఁ బూసి పాదతలమునం,
బాయవు గావుఁ గలుగు న,పాయం బఱుకాల నీకు నవిలం
ఘ్యంబై. అను. 5-877; మౌస. 80

**అవిలంబితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

జాగులేనివాఁడు.

క. జాంబవతేయు బృహద్విశి,ఖంబులకున్ బెదర కెదిరి ఘనుఁ డేసె
రథా,గ్రంబున నాతనిపైన వి,లంబితుఁడై క్షేమవృద్ధి లక్షశరం
బుల్. అర. 1-156

**అవివర్ధనము** సం. వి. అ. న.

క్షీణత, పెంపులేమి.

క. ధరణి నధార్మికులగు కా,పురుషుల కభివర్ధనంబుఁ బుణ్యచరిత్రిఁ,
బరఁగెడు ధార్మికులకు దు,ర్ధరమగు నవివర్ధనంబుఁ దగునె
మునీంద్రా. అర. 2-307

**అవివేకము** సం. విశే. (అ. ఆ. అ.)

వివేకము లేనిది, తెలివిలేనిది.

క. కాలంబైనం బోవక, యీ లోకమునందు నిలువ నెవ్వరి వశ
మి, ల్లెల యవివేకజనముల, పోలిక శోకానలమునఁ బొగులుచు
నుండన్. ద్రోణ. 2-827

వి. అ. పుం.

వివేకము లేమి, తెలివి లేమి.

క. బాలత్వంబున నవివేకాలోలత శుచియు నశుచియైనదియు సమం,బై
లీల జుగుప్సిత విధి,శీలత నొందంగ దుర్విచేష్టలఁ దిరుగున్. స్త్రీ. 1-39

**అవివేకి** సం. విశే. (న్. నీ. న్.)

వివేకి కానివాఁడు, వివేకము లేనివాఁడు, అజ్ఞాని.

ఉ. ... వా, వృద్ధియ కోరుదేని నవివేకివి నీవని నన్ను నిట్లసం, బద్ధము లైన వాక్యములు నల్కను వే పలిపింపు కోమలిన్. విరా. 2-76

చ. ...చచ్చిరి మీ యవివేకు లందఱున్. కల్య. 1-894

**అవిశిష్టము** సం. విశే. (అ. ఆ. అ.)

వేఱుగానిది.

తే. భూతములను నీవు నేనును సర్వగతావిశిష్ట విధములను. శాంతి. 6-617

**అవిశేషము** సం. వి. అ. పుం.

పంచతన్మాత్రలు, బుద్ధి.

క. పోరిఁబోరి భూతముల గుణో,త్కర మవిశేషాన్వితముగఁ గనుఁ గొను సంవి,త్పరు దుఃఖంబు సుఖముచే, విరియుఁ దరణిచేతఁ దమము విరిసిన భంగిన్. శాంతి. 5-192

"విశేషా విశేషలింగమాత్రా లింగాని గుణపర్వాణీతి యోగేక్షేషు గుణావయవేషు, విశేషాః స్థూలపృథివ్యాదయ ఏకాదశేంద్రియాణి చ, అవిశేషః పంచతన్మాత్రాణి బుద్ధిశ్చ లింగమాత్రం మహత్తత్వం. అలింగ ప్రధానం తత్ర పూర్వ పూర్వ త్యాగేన ఉత్తరముత్తరం ప్రతిపద్యమానో యోగీ గుణానపి త్యజతి తత్రావిశేషాణి భూతానీతి పంచతన్మాత్రాణి గుణా ఇతి మహదవ్యక్తం చ జహతో మునేస్త్యజతా మునినా దుఃఖం సంసారాఖ్యం మపోహ్యతే.

శ్లో. అవిశేషాణి భూతాని గుణాంశ్చ జహతో మునేః,
సుఖేనాపోహ్యతే దుఃఖం భాస్కరేణ తమో యథా.

సం. భా. శాంతి. 251-21

**అవిశ్లేషము** విం. విశే. (అ. ఆ. అ.)

ఎడఁబాటు లేనిది.

క. రోషముఁ గామము రాగ,ద్వేషములును లేక భక్తి దిరమై యేకా, శ్లేషితగాఁ గొలుతు రవి,శ్లేష మనోనిలయవృత్తి సిద్ధులు విన్నన్. శాంతి. 4-235

**అవిశ్వాసము** సం. వి. అ. పుం.

నమ్మకములేమి.

క. అని పలికి యవిశ్వాసము, మనమున నెలకొల్పి. శాంతి. 3-264

**అవిషయము** సం. విశే. (అ. ఆ. అ.)

పొందశక్యముగానిది, చొరశక్యముగానిది.

వ. అనాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధాచారులకు మాంసాహారులకు రణపరాఙ్ముఖులకు నవిషయంబైన దాని నమరావతిం జొచ్చి. అర. 1-349

క. నలుఁగాన మివ్వనంబునఁ, గల వెప్పుడుఁ గాంతు ముగ్రకరులను సింహాంబుల ఋక్షంబుల నిది మర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనన్ అర. 2-106

**అవిషహ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

సహింపరానిది, దుస్సహము.

చ. ...ప్రబలుం డనఁగాఁ జరియించుచుండు విచ్చలవిడి భీముఁ డీతఁ డవిషహ్య పరాక్రమ దర్దముం డనిన్. విరా. 5-328

**అవిహతము** సం. విశే. (అ. ఆ. అ.)

1 ఆటంకము లేనిది, అడ్డులేనిది,

క. సమ విషమ నిమ్నోన్నత, సమీప దూర స్థలములు సదృశములుగఁ జిత్తము క్రియ నవిహత గతులను, సమరమహిం గ్రీడి రథము సను నవితథమై. విరా. 5-48, అర. 3-27

2. అప్రతిహతము, కొట్టఁబడినది

చ. ...క్రోధ దీప్తుఁడై, యవిహత భంగి భూరిగద నాతఁడు వైచినఁ గూలె వాఁడు. భీష్మ 2-63

**అవిహితము** సం. విశే. (అ. ఆ. అ.)

అయుక్తము,

క. ఒక యల్ప మనుజు క్రియ సోమ కులోత్తమ నీకు నిట్లు మహనీయ సుఖ ప్రకృతియగు నిజ శరీరం, బకట విడువఁ దలఁచ

నగునె యవిహితబుద్ధిన్. ఆర. 6-28

("అవహితము" అని పాఠాం. అప్పుడు నిదే యర్థము)

**అవు** దే. అ. క్రి. అగు

1. సిద్ధించు, నెఱవేఱు.

ఉ. నీ వొనరింపఁ బూనిన పనిం గమలోదర కీడువుట్టువే, కావనినట్లు యుండి యవుఁ గార్యములు. ఉద్యో. 3-73

2. అగు

ఉత్తరాయణ మవునంతకు. చూ. అగు. భీష్మ. 3-423

**అవుంబొమ్ము** దే. అ. క్రి.

అవుఁగాక, కానిమ్ము.

ఇది తగ నవుం బొమ్మనుచున్. ద్రోణ. 5-319

**అవుఁగాక** దే. (అగుఁగాక)

సరియే.

క. నీ మాటకు దుర్యోధనుఁ, డా మెయిఁ దాఁ ద్రుళ్ళిపడక యవుఁ గాకని వాఁడే మేనిఁ గొంత యక్కట, భూమి యొసఁగెనేని నింత పుట్టదు సుమ్మీ.

శల్య. 2-371, అను. 1-853, అను. 5-292

**అవుడుగఱచు** దే. క్రి.

పెదవి గొఱకు (కోపసూచకము)

ఆ. అలిగి యవుడు గఱచి యన్నరుఁ డాన్నృపు, తురగములును సూతుఁ దునిమివైచి. ద్రోణ. 3-208, భీష్మ. 1-267, భీష్మ. 3-222

**అవుఁదల** దే. వి.

బొదల, శిరము, తల, ముందల.

క. అవమానంబులు సేసిన, యవినీతుల దుస్ససేనుఁ డాదిగఁ గలవారి వధించి యడుగు పగతుని; యవుదల నిడితింత వార లవనిం గలరే.

శల్య. 2-319

**అవుదానికి** దే. ద్రు.

కాఁగలదానికి, భవిష్యత్తునకు.

ఆ. ...వనితయైన, యతనిఁ జూచి యింక నవుదాని కిట్టుల, యుండుఁ
గాక యని విభుండు పలికె. ఉద్యో. 4-394.

**అవురు** దే. వి. ఔరు

ఔరుగడ్డి, పీరణము.

వ. ...మీ పట్టిన యవురుగంట వేళ్లెల్లం గాలుండు మూషికవ్యాజం
బునం దరతరంబ కొఱికిన. ఆది. 2-148.

**అవుల** దే. వి. ఆవల

వెలుచోటు, ఇతర స్థలము.

నవ్వుచు నవుల నిలిచి. ద్రోణ. 3-168.

వ. అచ్చటనున్న రథికాది జనంబుల నవులం బోవం బనిచి యతనితో
నిట్లనియె. భీష్మ. 3-440

(వెనుక వైపు)

వ. పతంగుండు పశ్చిమాచలంబు నవులకుం జనిన. ద్రోణ. 1-387

వ. అంశుమంతుం డపరగిరి యవులకుం జనుటయు. కర్ణ. 1-209.

(కాలమునందు అనంతరము)

తే. ఇవుల నేడుదరంబుల నవుల నేడు, దరములను బితృవర్గంబు నరుఁడు
గంగ, నాడి శుచిఁ జేయు. అను. 2-110.

(దేశమువందు అనంతరము)

సీ. ...వారియవుల నున్నవారు మిత్రులగుదురు. ఆశ్ర. 1-66.

విణ.

(ఆవతలిది, అన్యము, ఇతరము)

ఆ. ఇవుల మూఁటి కవులనవుల యమ్మూఁటికి, నివులఁ దేఁ రిల్లు దివిజ
నగము. భీష్మ. 1-21

ఆ. విభుని సకల ధర్మవృత్తి నత్తఱి కృత,యుగముఁ బోలు ధర్మ
యుక్తి మాత్ర, లరయు విభుల కెట్టులయ్యె నయ్యె తలు,లవుల
యుగము లట్లయగు నృపాల. శాంతి. 2-294.

క. ...బ్రాహ్మణ్య మవుల జాతులు మూటఁటన్, జనియించిన వానికి దొరకొనునొకో. అను. 1-85

**అవులం(ద్రోచు** దే. స. క్రి.

వెనుకకుఁ ద్రోసివేయు.

సీ. బృంహిత ధ్వనులును బృథుల ఘంటావలీ, రవములు దిక్కుల నవలఁ ద్రోవ. విరా. 3-167

తే. ...ఎన్నఁడో మరలి యింద్రియముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోచి, యేను శాంతిసుఖంబున కెలయు టనఘ. శాంతి. 5-395

**అవులంబెట్టు** దే. స. క్రి.

పోఁద్రోచు, పరిత్యజించు,

తే తెలియ మేల్కని యుండుట కలలు నిద్ర,యను నవస్థాత్రయంబును నవులఁ బెట్టఁ,జాలు విజ్ఞాన నిర్మల సత్యబోధ,రూప నిర్భరానంద స్వరూపుఁ డనఘ. శాంతి 4-327

తే. ...గర్భంబు దాల్చియున్న, యపుడు వాచవులెల్లను నవులఁబెట్టి, దాని కెయ్యవి పథ్యముల్ వానిఁ గొందు. అను. 4-361

**అవులవుల** దే. వి.

దూరదూరము.

తెలిపి యిచ్చె యవులవులం జను నంధకారంబు. విరా. 2-240

**అవేక్ష** సం. వి. ఆ. స్త్రీ.

అవేక్షణము, పరిపాలనము, కాచుట.

తే. విషయములు నంత విరసతావేక్షణమున, నిత్యసంతోషమున లోభనిరతి కృపన, ధర్మ ముచితకృతావేక్ష ధర్మమవులఁ, ద్రోవనేర్చుట ముక్తికిఁ ద్రోవ యధిప. శాంతి. 5-369

**అవేక్షణము** సం. వి. అ. న.

చక్కఁగా ఆలోచించుట, జాగరూకతతోఁ జూచుట.

సీ. ...అఖిల —తే— విషయములు నంత విరసతావేక్షణమున... అవులంద్రోవ నేర్చుట ముక్తికిఁ ద్రోవ యధిప. శాంతి. 5-369

**అవేద్యము** సం. వి. అ. న.

ప్రకృతి.

వ. విద్యావిద్యా వేద్యావేద్యాచల చలంబులును శబ్దంబులు వరుసం బురుషునకుం బ్రకృతికిని వాచకంబులు. శాంతి. 6-140

**అవైకల్యము** సం. వి. అ. న.

వైకల్యము లేకుండుట.

వ. ...తనకు సమకట్టిన సమస్త వస్తువుల యవైకల్యంబునకు కలుష్యండు సంతుష్టాంతరంగుండై. ఉద్యో. 1-94

**అవైదికము** సం. వి. అ. న.

వేద విరుద్ధము.

క. విను తృష్ణా రాహిత్యం,బున నాలవు నాశ్రమంబుఁ బొందుదురు మహా,జను లది యుపనిషదుక్తం, బనక యవైదిక మనంగ నగునే నీకున్. శాంతి. 5-388

**అవ్యక్తము** సం. విశ. (అ. ఆ. అ.)

తెలియబడనిది, స్పష్టముగానిది.

తే కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమ ఫలము,లందుఁ గొన్నిటి కేక వర్ణాంచితంబు, లవనిజములు గొన్నిటికి నవ్యక్త వర్ణ,కములు సౌరభ్య మాధుర్య సమధికములు. అశ్వ. 2-58, ద్రోణ. 2-367

వి. అ. న.

1. ప్రకృతి, క్షేత్రము.

సీ. క్షేత్రంబునాఁగఁ బ్రకృతి యనంగ, నవ్యక్తమునకు నామాంతరములు. అశ్వ. 2-159

2. వ్యక్తముగాని కారణము, జగత్కారణమగు ప్రధానము- మూలప్రకృతి.

క. భూతము లవ్యక్తంబున, జాతములగు నంద పెరుఁగు సమయఁ దదీయ, స్థితత్వమునన పురుషుం,డే తద్విధ సాక్షితాసమిద్ధుఁడు వతాస. శాంతి. 4-278

3. చిదాత్మ, నిర్గుణము (సుషుప్తి వంటిది)

తే. వ్యక్త మవ్యక్తమును రెండు నవగతములు గాక, మోక్ష మార్గంబు గానరాదు. శాంతి. 4-328

4. అమృతము.

తే. వ్యక్తమది మృత్యు వవ్యక్త మమృత మనియె, నతుల విజ్ఞాన ఘనుఁడు నారాయణుండు. శాంతి. 4-328

5. నివృత్తి లక్షణముగల ధర్మము.

క. అనఘా విను మవ్యక్తం, బనునది త్రైలోక్యమునకు నాధారము దా,ని నివృత్తి లక్షణంబగు, ననుపమ ధర్మమని చాటు నాగమ ఫణితుల్. శాంతి. 4-329

**అవ్యక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. తెలివి లేనివాఁడు, అజ్ఞాని.

క. ...అవ్య,క్తాగోచరుఁ డధిక సులభుఁ డమలాత్ములకున్.

వి. అ. పుం.

2. యోగులకుఁ బ్రత్యక్షమయ్యును మూఢులకుఁ దెలియఁబడనివాఁడు. నారాయణుని సహస్రాంశమున జన్మించినవాఁడు.

సీ. నారాయ,ణుం డవ్యయుం డనంతుండు ధాత, సృజనంబు దలఁచి మున్ సృజియించెఁ దనదు సహస్రాంశకమున నవ్యక్తుఁ డనఁగ, -తే- మనసునన యజరామరు ననుపమాను, నతనివలన మహత్తత్త్వ మావహిల్లె, నతఁడు దివ్యతేజోమయంబైన పద్మ,మొకటి గలిగింపఁ బ్రహ్మ యం దుద్భవించె. శాంతి. 4-81

3. శ్రీమహావిష్ణువు.

సీ. అవ్యక్తు శాశ్వతు నఖిల ప్రభవ భూమి, భక్తవత్సలు విష్ణుఁ బరమ పురుషు, నక్షయుఁ బ్రాంజలియై యాశ్రయించెన. శాంతి. 4-216

**అవ్యగ్రము** సం. విణ. (అ. ఆ. అ.)

స్థిరమైనది, తొట్రుపాటులేనిది.

సీ. .. పితృక్రి -తే- యలకు శౌచ మక్రోధ మవ్యగ్ర భావ మర్థ.

ములు. అను. 5-203

**అవ్యపనయము** సం. వి. అ. పుం.

తొలఁగుట.

క. నవ్యత్వ పురాణత్వ ద,శావ్యపనయ దుర్నిరూపసౌందర్యా. ఆశ్వ. 1-232

**అవ్యయత్వము** సం. వి. అ. న.

మోక్షము.

క. జలమున మీను నుదుంబర, ఫలమున మశకములుఁ బోలెఁ బ్రకృతిం దాని.మ్ముల నునికి దెలిసి వేఱ్పా, టలవఱిచిన పురుషుఁ డవ్యయత్వము నొందున్- అను. 4-232

**అవ్యయము** సం. విశ. (అ. ఆ. అ.)

1. నాశనము లేనిది, శాశ్వతము.

నిశ్చలావ్యయదీపా. విరా. 3-288

తే. అవ్యయానంద సంప్రాపణంబు, గురుపదాబ్జ సమారాధకుండు గాంచు. శాంతి. 3-48, శాంతి, 4-28, శాంతి. 4-233

ఉ. ...నీకు నుదార సౌఖ్య మ,త్యంతము నవ్యయంబు నగు.... మహా. 66

2. పరిణామము లేకుండుటచే నిత్యము.

సీ. ప్రభవం బనంగ నవ్యయ మన శాంతి నాఁ, దేజంబు నా నెందుఁ దేజరిల్లు. శాంతి. 5-345

**అవ్యయుఁడు** సం. వి. అ. పుం.

1. నారాయణుఁడు.

నారాయణుం డవ్యయుం డనంతుండు భూత సృజనంబు దలఁచి. శాంతి. 4-81

2. శంకరుఁడు.

సీ. స్థాణు రుద్రుని శివు... నవ్యయు శ్రీకంఠు... శంకరు నాశ్రయించి. సౌప్తి. 1-112

(వ్యు) ఆదిమధ్యాంతములు లేనివాఁడు, పరమ పురుషుఁడు.

క. ఆదియు మధ్యము నంతము, నా దేవేశునకు లేమి నవ్యయుఁ డతఁ
డీ, వేదములకు నానావిధ, వాదములకుఁ జేరుగడ భవచ్ఛేపి
నృపా. శాంతి. 4-198, శాంతి. 4-276

**అవ్యవహితము** సం. విణ. (అ. ఆ. అ.)
వ్యవధానము లేనిది.

మాలిని. విజ్ఞానసారా, వ్యవహిత పతమ్మానంద్దానుభూ త్యైక భూపా.
ఉద్యో 4-428

**అవ్యవసితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
అంగీకరింపనివాఁడు, సమ్మతింపనివాఁడు.

క. తనయుల నలువురఁ గ్రమమునఁ, బనిచెన్ జమదగ్ని దనదు భార్య
వధింపన్, అననీ ఘూతము పాతక, మని వారలు పలుకకుండి
రవ్యవసితులై . అర. 8-140

**అవ్యాకీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)
చెదరుటలేనిది, భేదింపఁబడనిది,

శా. ...అవ్యాకీర్ణగజాదియై మెఱయు సైన్య శ్రేణిఁ బాలించి.
ద్రోణ. 1-74

**అవ్యాకులము** సం. విణ. (అ. ఆ. అ.)
కలఁత పొందనిది.

క. ...వీ వుండఁగ న, వ్యాకుల భవత్ప్రతాప నిరాకృతులు ధరిత్రి
లోని రాజులు నీకున్. సభా. 2-98

**అవ్యాజము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కారణములేనిది, నిర్హేతుకము.

క. తేజోరూపము బ్రహ్మము, ప్రాజాపత్యం బనంగఁ బరఁగి పురు
షుఁ డు, భ్రాజిష్ణు సత్వ నిత్యావ్యాజ మహిమ వెలుఁగుచుండు
నకలంకమతిన్. శాంతి. 5-68

2. కపటములేమి, మోసములేమి.

క. భూజన పరిపాలనం బవ్యాజంబునఁ బరిహరింప వలయును మన

కన్, వ్యాజము నధర్మ లోపం, బాజి జయా పరిహారింతురయ్య
మహాత్ముల్. ఆది. 8-123.

**అవ్యాపన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఆపద నొందనివాఁడు, సుఖి.

వ. పదమూఁడగు నేఁ డజ్ఞాతవాసంబు సలుపవలయుట నిట వచ్చి
మన వీట నవ్యాపన్నులై యున్నవారు. విరా. 4-183.

**అవ్యాప్తి** సం. వి. ఇ. స్త్రీ.
వ్యాప్తిలేమి, నాశము,

సీ. వినుమ ధర్మం బహింసనమున నెడలు ధర్మంబు సంకల్ప వర్జనము.
చేత, నవ్యాప్తిఁ బొందు. శాంతి 6-320.

**అవ్యాహతము** సం. విణ. (అ. ఆ. అ.)
అప్రతిహతము, అడ్డగింపఁబడనిది.

వ. దివ్యాస్త్రవేదియు నవ్యాహత విక్రమోద్దాముండను నగు నశ్వ
త్థామ శల్య. 1-76, సౌప్తి. 2-52, అను. 1-820.

**అవ్యాహతి** సం. వి. ఇ. స్త్రీ.
అడ్డులేమి, నిరాటంకము.

క. ...బలిమి, డవ్యాహతి నాచరించు నకార్యంబులున్. అశ్వ 8-222

**అవ్రణము** సం. విణ. (అ. ఆ. అ.)
దోషరహితము.

ఆ. అజము లవ్రణంబు లక్షయంబు లతీంద్రియములు ప్రకృతి పురుషు
లనఁగఁ బరఁగు రెండు తత్త్వములు. శాంతి 6-141

**అవ్వ** దే. వి. (క. అవ్వ. త. అవ్వై)
1. అమ్మ, పెద తండ్రి భార్య.

సీ. ...చిత్తమ్మనఁ, బాలి గాంధారి శాపంబు తెలఁగుఁ —తే— దఁలఁచి
యయ్యవ్వయతఁ గ్గతంపుఁ జోట, నరయ దిక్కెవ్వరును లేని
యట్టి తెగులు, నొందఁగల వాఁడుగాఁ బల్కె నొద్దనుండి, వింటి
వకట నిప్పును తెద లంటునొక్కొ. మౌస. 157

2. తల్లి, తల్లి వరుస స్త్రీ, పినతల్లి, పెదతల్లి మొ,

సీ. ఆనందభరితాత్మురాలై రాజమాత యగు కమలాక్షి ప్రీతితోఁ
గౌఁగిలించి, కొని తల్లి నీవు నా కూఁతుర వేను నీ జననియుఁ
జేరి మా దశార్ణ రాజతనయలమ మఱియు విదర్భేశుపతి యయ్యె,
నే వీరబాహుని కిఁటిపై నీ వనిన నయ్యవ్వకు నతి వినయంబుతోఁ,
నలుదేవి మ్రొక్కె. ఆర. 2-150

3. పూజ్యురాలు, ఆర్య.

వ. హిడింబ ధర్మరాజుకుం గుంతీదేవికిని మ్రొక్కి యేకాంతంబు
కుంతికి నిట్లనియె నవ్వా సర్వప్రాణులకు సామాన్యంబయ్యును
మనోజరాగంబు వనితల కసహ్యంబయి విశేషంబయియుండు.

ఆది. 6-219

శ్లో. ఆర్యే జానాసియ ద్దుఃఖ మిహ స్త్రీణా మనంగజమ్.

సం. భా. ఆది. 167-9

అవ్వ నీవ వేల్పవగుదని కొందలు మొగిన కేలు మొగిచి మ్రొక్కి
రంత. ఆర. 2-102, ఆర. 2-117

4. వృద్ధ స్త్రీ.

సీ. అయ్యిద్దఱకును గృష్ణ సట్లొప్పఁ దోడ్కొని, చని యొక్క ముదు
సలి పాని కవుడు, మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి మఱి
యొక్క, గౌరవర్ణుఁడు వంపఁ గడఁకతోడ, నలువురు భూసుర
నాథ గృహంబుల, కరిగి భైక్షము దెచ్చి యంత గూడు, నొగిన
నయ్యవ్వకు నొప్పించియున్న నయ్యవ్వయు ద్రౌపది నర్థిఁ బిలిచి—

ఆది. 7-221, ఆది. 7-223

5. అమ్మ (గౌరవార్థకము- ఆదరార్థకము)

వ. అవ్వా నీ ప్రశ్నంబునకు మత్తరం బయ్యుధిష్ఠిరుండు సెప్పవలయు.

సభా. 2-245

క. అమ్మనుజులు దమయంతిం జూచి యచ్చెరువడి యవ్వా నీ వెవ్వరి
దానవు. ఆర. 2-97

6. సామాన్య స్త్రీ వాచకము.

తే. అవ్వ నీ తల్లి దండ్రుల కాత్మజులకు, బంధుజనులకుఁ గుశలంబు
ధామ నీదు, కుశల మెఱుఁగునంతకు వంతగూరి వగచుచున్న
వారు. అర- 2-'44

వ. అవ్వా! నీ వెవ్వరి కూఁతుర వెవ్వని భార్యవని యడిగిన.
అర. 3-184

వ. అవ్వాలకు రోదన ధ్వని విని యంతిపురంబున నున్న ముదుసలి
యవ్వ లెల్లం బఱతెంచి. సభా. 1-149

7. ఇల్లాలు, కుటుంబిని.

వ. అందొక్క పుణ్యగృహంబు వాకిట నిలిచి భిక్షాందేహి యనుటయు
నా యింటి యవ్వయు నతి సంభ్రమంబున భిక్షయిడుటకుం బాత్ర
శోధనంబు సేయునెడ. అర. 5-9

"శౌచం తు యావత్కురుతే భాజనస్య కుటుంబినీ"
సం. భా. అర. 205-9

8. స్త్రీతో మాట్లాడునప్పుడు అమ్మ శబ్దమువలె క్రియలమీఁద వచ్చును.

ఆ. బలియు నిట్టి భీము బ్రాహ్మణార్థముగాఁ నసురవాతఁ ద్రోతు
రవ్వ యిట్లు. ఆది. 6-287

**అవ్వల** దే. వి. ఆవల
(దేశ్యమునందు అనంతరము)

వ. యుధిష్ఠిరుండు కుండాల మాలికాభిలంబుగా మధ్య ప్రదేశం
బలంకరించె నవ్వల సాత్యకి మొదలుకొని యోలిన కవలును
ద్రౌపదేయులు నభిమన్యుఁడు ఘటోత్కచుండుఁ గేకయపతులుం
బన్నిరి భీష్మ. 2-98

వ. కురు నందనుం డా హార్దిక నందనుని నిజస్యందనంబున నిడు
కొని యవ్వలికిం గొనిపోయె. శల్య. 1-291

వివ.

ఆ వైపుది.

వ. అవ్వలి సైనికు లడలఁగ, నవ్వుచు మనవార లార్వెం. ద్రోణ. 2-318

**అవ్వి** దే. సర్వ. బహు.

అవి (ఆది యొక్క బహువచన రూపము)

అవ్వి పుచ్చుకొనకయున్న (అవి- అని పాఠాం.) అను. 3-218

మధ్యాక్కర : ఎదురను దవ్వులఁ జూచిన పొడవులెల్లఁ దక్షణము, కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడ, అర. 2-169

**అశంక** సం. వి. అ. స్త్రీ.

సందేహము లేమి, నిస్సందేహము,

శా. ...రౌద్రరేఖా ఘోరాకృతి యేన చూపెద నశంకం జూడుఁడీ యేర్పడన్. విరా. 4-202

**అశంకితము** సం. విణ. (అ. ఆ. అ.)

సందేహింపఁబడనిది. అనుమానింపఁబడనిది.

క. అనినం జలమునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టులనియె దరహాసంబా,ననమున ముసుఁగు వడఁగ నజ్జనవాయకుతోడ ని ట్లశంకిత భంగిన్. విరా. 5-256

**అశంకితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. సందేహింపఁబడనివాఁడు.

వ. మఱియుం దన యొద్దకు వచ్చి యశంకితులయి తత్త్రిశోచితంబులైన మహాసనంబుల నున్నవారల రాజపుత్రులగా నెఱింగి, ఆది. 7-285

2. భయముపొందనివాఁడు, నిర్భయుఁడు.

వ. దమయంతి నివేశంబు ప్రవేశించునపుడు ని న్నెవరు వారింప నోడుదు రనిన శత్రు వచనంబుల నశంకితుండయి నలుం డప్పుడ. అర. 2-88

**అశక్తదుర్జనత** సం. వి. అ. స్త్రీ.

చేతగాని దౌర్జన్యము.

మ. అదె కౌరవ్యు లశక్తదుర్జనత సేయం బూని పైఁ గాఁక గ్రాచెదు

రమ్మెక్కుడమచేతఁ దీఱునె జయశ్రీ కాంత దైత్యాంతకుం,
బోదువం దారు దలంచు టెల్ల. ఉద్యో. 3-396

**అశక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అసమర్థుఁడు, శక్తిలేనివాఁడు.

ఉ. మహి నేల నశక్తుఁడు కాంతు సేయునే.
కర్ణ. 3-57. ఉద్యో. 1-244, శాంతి. 2-348

**అశక్యము** సం. విణ. (అ. ఆ. అ.)

తే. ఇట్లు దమ్ము నిరూపింప నితర జనములకు నశక్యంబుగాఁగ,
సల్లాపరసము, ననుభవించుచు. విరా. 3-42, అను. 1-102

**అశక్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అలవి గానివాఁడు, సాధ్యము గానివాఁడు.

వ. ఇక్కుమారుండు మేరుగిరి శృంగంబునుంబోలె నాకెత్తుకొన
నశక్యుం డయ్యె. సభా. 1-151

**అశఠుఁడు** సం. వి. అ. పుం.

శఠుఁడు కానివాఁడు

మ. ...అశఠుఁ డస్త్రులోలుఁ డక్రోధనుండు. శాంతి. 2-296

**అశనత్వము** సం. వి. అ. న.

భుజించుట.

సీ. తపం బనఁగా నియతాశనత్వము. అను. 4-82

**అశననిగ్రహము** సం. వి. అ. పుం.

ఆహారమును జయించుట. నియతమైన యాహారమును మితిగాఁ దీసికొనుట, తపము

క. వినుమశననిగ్రహము తప, మను నభిధానంబు గల మహాధర్మము. శాంతి. 3-414

**అశనము** సం. వి. అ. న.

1. తినుట, భుజించుట.

సీ. కపాలంబున, నెత్తి భైక్షాన్న మేకకాల, మశనంబు గొనుచు.
శాంతి. 1-304

2. అన్నము.

సీ. మాన్యులఁ జంపుట మగపాడిగాదు భి,క్షాశనంబైన నత్యంత సుఖము. భీష్మ. 1—198

3 ఆహారము, ఆహారపదార్థము.

క. మనలోఁ గయ్యం బేటికి, నని ధర్మసుతుండు సెప్పె నది మీ పతికై కొనఁ డయ్యె రోగి పథ్యా,శనమునకుం జోరని భంగి సంజయ యెట్లున్. కర్ణ. 1-88 అర, 4-505

వ. ఆ రక్కసున కే నశనం బయ్యెద మీరు వగవకుండుఁడు. ఆది. 6-252

**అశనముగొను** మి. స. క్రి.

భుజించు

సీ. కపాలంబున నెత్తిన భైక్షాన్న మేకకాల, మశనంబు గొనుచు. శాంతి. 1-304

**అశని** సం. వి. ఇ. పుం. స్త్రీ.

1. పిడుగు

సీ. అశని కల్పము లివి యర్జును బాణముల్, గాని శిఖండిని గావు సుమ్ము. భీష్మ. 2-403, శాంతి. 4-88

2 వజ్రము, వజ్రాయుధము.

క. గిరిపై వఱతేర నశని, శరమును మేఘత్వమొంది సాయకవృష్టిం గురిసిన. ద్రోణ. 5-78

**అశబ్దము** సం. వి. అ. పుం.

శబ్దము లేనిది.

క. అసమానంబ మశబ్దము, రస గంధ స్పర్శ రూప రహిత మగుణ ముల్లసిత గుణమగు వెలుఁగు న,శ్వరమన నియతిపరుఁ డొకండు వడయుం బ్రహ్మ. అశ్వ. 1-204. శాంతి. 1-174

**అశమము** సం. వి. అ. పుం.

శమము లేనిది.

క. పలు చాయల నొప్పిన యా, బలము లొకటి కొకటి కెదురఁ

బల్లవ పుష్పావలి గల వనముల క్రియ నిశ్చలత నిలిచి పాలిచె నశమసమధైర్యమునన్. భీష్మ. 1-150

**అశరీరత్వము** సం. వి. అ. న.

శరీరములేకుండుట.

క. తత్త్వ మనశ్వర మశరీరత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియత నాశిత్వంబు హింసకత్వము, శాత్త్వికమై లేదు దేహ దశమునను నృపా. అశ్వ. 1-121

**అశరీరవాణి** సం. వి. ఈ. స్త్రీ.

సీ. అర్జును పుట్టిన యప్పుడు వీఁడు లోకములెల్ల గెల్చు పొగడ్త మొగులు -తే- ముట్టినట్టిదయగు రణమున జయించుఁ, గౌరవుల సోదరులుఁ దాను భూరిరాజ్య, గౌరవముఁ బొందునని యశరీరవాణి, వలికెనది దిట్టువడుఁ గాక వలయునేని.

ఉద్యో. 3-195, శాంతి. 5-365; ద్రోణ. 5-349

**అశరీరి** సం. వి. న్. పుం.

ఆకాశవాణి.

వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరి పలుకు లప్పుడు దలంచి, సభా. 2-58

**అశర్మము** సం. వి. న్. న.

దుఃఖము, కీడు.

మ. ...అతి క్రూరకర్మములం దుద్యతులైనవారికి నశర్మప్రాప్తి గాకుండునే. ఆది. 7-185

**అశాశ్వతము** సం. విణ. (అ. ఆ. అ.)

శాశ్వతముగానిది, నశించునది.

క. ఇవి యెల్ల నశాశ్వతములు, భవమరణాకలితములును. అను. 3-308

**అశి** సం. విణ. (ఇ. ఈ. ఇ.)

భుజించువాఁడు, తినువాఁడు.

అతిధిశిష్టాశి. అశ్వ. 2-169

**అశిక్షితము** సం. విశే. (అ. ఆ. అ.)

అభ్యసింపఁబడినది.

వ. సువర్ణష్ఠీవి యశిక్షితాస్త్రుండును నకృతవివాహుండును.

ద్రోణ. 2-222

**అశీతము** సం. విశే. (అ. ఆ. అ.)

శీతముగానిది, చల్లగా నుండనిది,

క. ఓంకారవాచ్యము... నిష్పంక మశీత మనుష్ణము. అను. 4-181

**అశీతి** సం. వి. ఇ. స్త్రీ.

ఎనుబది.

కృతవర్మ నశీతి సాయకంబులను.                ద్రోణ. 2-94

**అశీర్షుఁడు** సం. వి. అ. పుం.

విష్ణువు, నారాయణుఁడు.

తే. అచలు సూక్ష్మువరేణ్యు సహస్రశీర్షు, నభయకారి నశీర్షు నారాయ
ణుని.                శాంతి. 4-217

**అశీలత్వము** సం. వి. అ. న.

శీలత్వములేమి, చెడునడత.

క. లోభక్రోధాశీలత్వ కామ భయములఁ దేలు జనుఁడు కాలవృత్తి
తెలఁగు నెఱుఁగునే.                శాంతి. 4-444

**అశుచి** సం. విశే. (ఇ)

1. అపవిత్రమైనది, పరిశుద్ధి లేనిది.

క. బాలత్వంబున నవివేకాలోలత శుచియు నశుచియైనదియు సమం,
బై లీల జుగుప్సిత విధి, శీలత నొందంగ దుర్విచేష్టలఁ దిరుగున్.
స్త్రీ. 1-89

2. మలినమైనది, ముఱికిగలది.

ఆ. పాదరోగు లశుచి పదముల దేవాలయముల మెట్టుటయును నసదు
వారిఁ, దప్పులేక క్రొవ్వి తన్నుటయును దొలుపుట్టునందుఁ గలిగి
నట్టివారు.                అను. 5-102

3. అపవిత్రుఁడు.

చ అశుచియుఁ గష్టుఁడున్ లఘువునైన నిజాగ్రజుమేనితోడ నిత్య శుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జను నింతిఁ గొంచుఁ గ్రర్కశమతిఁ గీచకుల్. విరా. 3-17, కర్ణ. 1-295

4. శౌచము లేనివాఁడు.

క. యాగంబునందు శ్రద్ధా,యోగము గల యశుచి శ్రద్ధ యొనరని శుచి పుణ్యాగమ సంపదఁ దుల్యులు,గా గణుతించిరి నిరూపకత నమరవరుల్. శాంతి. 5-247

**అశుచిత** సం. వి. ఆ. (స్త్రీ).

అశుచిత్వము, శుచి లేకపోవుట.

తే. పలుదెఱంగుల వంటకంబులఁ బ్రమాద, జాతమై యశుచిత్వంబు సంభవించి,నప్పు డసురులు గొంద్రు క్రియాఫలంబుఁ, దిలలుపైఁ జల్లి నశుచిత దొలఁగునంద్రు. అను. 3-178

**అశుచిత్వము** సం. వి. అ. న.

మృతాశౌచము, సూతకము.

వ. ఇట్లు చని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు నర్హ జనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదక ప్రదానంబులు నిర్వర్తించి నివృత్తులై యశుచిత్వం బపనయించు టకుం బుర బహిరంగణంబునఁ బట కుటీర ప్రకరంబుల వసియించిరి. ఆశ్ర. 2-169, శాంతి. 1-2

2. అపవిత్రత.

క. వినుకాలిన కొఱవి తెఱంగున నల్లఁదనంబు మిగులు కుఱుచ యొడలు, నెత్తని కన్నులునై యశుచి,త్వ నిరూఢుం డొకఁడు పుట్టె ధర్మతనూజా. శాంతి. 2-206, అను. 3-178

**అశుద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

శుద్ధముకానిది, అపవిత్రము.

వ. ఆశుద్ధాన్నంబు పెట్టినవాఁడవు. ఆది. 1-99

**అశుభత్వము** సం. వి. అ. న.

హాని.

ఉ. నిమిత్త శుభాశుభత్వ ని,ర్ధారణమున్ మదిం గని హితం బెఱింగిం
చుట నీతి... కర్ణ. 2-52

**అశుభము** సం. వి. అ. న.

1. కీడు.

క. మీరేమి సేయుదురు దై,వారంభము గాక శుభము నశుభంబును
సం,సారులఁ దనతన తటి నని,వారణఁ బొందంగ మాన్పవచ్చునె
వానిన్. విరా. 2-227

సీ. విష్ణు నామంబులు వేయును నిత్యంబు, వినినఁ బఠించిన మనుజుఁ
డిహాము,నందుఁ బరమునైన శుభంబు నొందక... అను. 5-326

2. దుర్నిమిత్తము. అపశకునము

వ. అనేక దుర్నిమిత్తంబులు పుట్టె.....అయ్యశుభ సూచకంబులకు
ధార్తరాష్ట్రులు దలంకక తూర్యంబులు మొరయింప నియో
గించిన... భీష్మ. 1-145

**అశుభసూచకము** సం. వి. సమ. అ. న.

అపశకునము సూచించునది.

వ. అనేక దుర్నిమిత్తంబులు పుట్టె.....అయ్యశుభసూచకంబులకు
ధార్తరాష్ట్రులలుక లంకక తూర్యంబులు మొరయింప నియోగిం
చిన. భీష్మ. 1-145

**అశేషము** సం. విశే. (అ. ఆ. అ.)

మిగులులేనిది, సమస్తము.

చ. .. అశేషబలంబులు నడ్డెసల్ భయ,ద్రుతగతిఁ బాఱినన్.
విరా. 3-201, శాంతి. 1-71, శాంతి. 3-442

వి. అ. పుం.

శేషములేమి, మిగులు లేమి

వ ...దదీయానుజ్ఞ నడసి తద్దయాలబ్ధ ప్రజ్ఞావిశేషందనై యశేషం
బును వివరింప. స్వర్గ. 75

సీ. కలయట్టి వివిధార్థములు నశేషంబుగఁ దగ నొసంగుఁడు సత్పాత్ర
ములకు. ఉద్యో. 2-127

**అశోకము** సం. వి. అ. పుం.

అశోక వృక్షము.

ఆ. అంత నుదయశైల మను నశోకద్రుమ, సమితియందుఁ గాంతి
చారు భంగి, నెఱయ విరసి తొలుత నెగసిన యుజ్జ్వల, స్తబక
మనఁగఁ బద్మసఖుఁడు వొడిచె. ఉద్యో. 2-118, అర. 6-885.

అశోక వృక్షములో రెండు జాతు లున్నవి. ఒకటి రామఫలపు చెట్టు
ఆకులను బోలి పండిన నారింజపండు రంగుగల పూలగుత్తులు కలిగి
యుండును. మఱొకటి మామిడి ఆకులను బోలిన యాకులు గలిగి తెల్లని
పూలగుత్తులు గలిగియుండును. మాఘఫాల్గుణ మాసములలో దీని పూత
యారంభమగును. వైశాఖ మాసమున పండ్లు పండును. కాయలు
ముదిరినప్పుడు నీలపురంగును బాగుగా పండినప్పుడు ఎఱ్ఱని రంగును
గలిగియుండును. చిగురు ఎఱ్ఱగా నుండును. పూలయందు తేనెయుండును.
ఇది మిక్కిలి గుబురుగా వ్యాపించియుండును. శోకమును చెఱచునుగాన
దీనికి అశోకము అని పేరువచ్చినది. వంజుళము అని నామాంతరమును
గలదు, కొందఱు నరమామిడి కంకేళి యందురు. కాని యది వేఱు అశో
కము వేఱు. ఇది దక్షిణ దేశమున అందును మలయాళదేశమున విరివిగా
నుండును. మామిడి ఆకులవంటి ఆకులు గలిగిన అశోకము చెట్టు పట్టను
స్త్రీల ప్రదరరోగములకు వాడుదురు.

విణ. (అ. ఆ. అ.)

దుఃఖము లేనిది.

క. ...మీర లశోక స్థితి నుండుఁ డనుచు సురనది కరుణన్.
ఆది. 4-128

**అశోకవనము** సం. వి. అ. న.

అశోక వృక్షములు గలతోఁపు, ఇచ్చట నారదుఁడు నివసించును.

. అనుచు వినతుం డగుటయు నమ్మౌని (నారదుఁడు) తనదైన

యశోకవనమునకుఁ జనియె. చూ. అశోకము. ద్రోణ. 2-181

**అశోకుఁడు** సం. వి. అ. పుం.

అశ్వుని యంశమునఁ బుట్టినవాఁడు.

అశ్వుం డను వాఁ డశోకుండై పుట్టి. ఆది. 3-80

**అశ్మంతకదేశము** సం. వి. అ. పుం.

ఒకానొక దేశము.

ఇది భారత కాలంబున సమస్తవస్తు సంపత్సంపాదనంబులయిన గుణ విశేషంబుల వెలసి పురుషార్థంబులగు ధర్మార్థకామంబులకుం గారణంబై కమనీయం బగుచుండెను. భీష్మ. 1-40

**అశ్మంతకుఁడు** సం. వి. అ. పుం.

మగధ రాజు కుమారుఁడు, ఇతఁడు దుర్యోధనుని పక్షమునఁ బోరాడి యభిమన్యునిచేఁ జచ్చెను.

తే. మగధపతిసూనుఁడైన యశ్మంతకుండు, బాలుఁ డయ్యును బ్రౌఢ
దోర్బలము మెఱయఁ, దాఁకుటయు సూతు తలయు రథ్యముల
తలలు, నతని తలతోన యభిమన్యుఁ డవనిఁ గూల్చె. ద్రోణ. 2-97

**అశ్మకి** సం. వి. ఇ. స్త్రీ.

ప్రాచీశుని భార్య, సంయాతి తల్లి. ఆది. 4-2

**అశ్మకుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు జనకునకు నీతి బోధించి వివేక పరిపాకము గలిగించెను. చూ. వివరము. శాంతి. 1-210 ము.

2. దుర్యోధను పక్షమునఁ బోరిన యోధుఁడు.

ఇతఁడు అభిమన్యునిచేఁ జంపఁబడెను. చూ. ద్రోణ. 2-80, 81

3. కల్మాషపాదుఁ డను రాజర్షికి భార్యయైన దమయంతికి వసిష్ఠునివలనఁ బుట్టినవాఁడు. ఆది. 5-89

చూ. వివరము. ఆది. 7-129, 130, 131

**అశ్మము** సం. వి. న్. పుం

ఱాయి, శిల.

అశ్మంబుల వలన లోహంబును నుద్భవించె.

ఉద్యో. 2-185, అర. 7-98

**అశ్మరి** సం. వి. ఈ. స్త్రీ.

ఒకానొక మూత్ర రోగము. ఈ రోగమునందు మూత్రము వాతపిత్త శ్లేష్మములతోఁ గూడికాని శుక్రముతోఁ గూడికాని ఆర్చివేయబడి వస్తి (మూత్రపు తిత్తి) యందు కల్లు (ఱాయి) గట్టును. మూత్రము అతి కష్టముమీఁద వెల్వడుచుండును. అప్పుడప్పుడు ఱాళ్లు మూత్ర ద్వారమున కడ్డుపడి మూత్రమును వెలికి రానీయక చాల బాధ పెట్టును. ఈ ఱాళ్ళే చిన్నచిన్న ముక్కలుగా నున్నచో "శర్కర" వ్యాధి అనియు నన్నని పలుకలుగానైనచో సికతా రోగమనియు నందురు. చూ. శర్కర.

సీ. ...కోశ మశ్మరిని శర్కరను బాధితుఁ డగు నరుఁ డన్య సతిని
గన్య -ఆ- మహిషి గోవుఁ దురగి మదవాతురత మున్న, గవిసి
నాఁడు. అను. 5-99

**అశ్రమము** సం. వి. అ. పుం.

శ్రమలేమి; అనాయాసము, అవలీల.

తే. తొలుత నీవు నన్నడిగిన దొడ్డ విల్లు, గాండివము ఫల్గునున కేడు
గడయు నడియ, సమరమున దేవ దానవ సమితినైన, గెలుచు నశ్ర
మమున దాని వలన నతఁడు. విరా 4-120

సీ అశ్రమంబున గెల్వనగు నాకు. శల్య. 2-242, అను. 1-123

**అశ్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.)

అవిరతము, ఎడతెగనిది; తెంపులేనిది.

క శ్రీ శ్రితవత్సస్థల గౌరీ శ్రిత వామాంగ సుభగరేఖా సంప, త్త్యశ్ర
శ్రాంత తనూ లలిత. శాంతి. 4-1

తే తాను దెగునేని బాంధవ దారపుత్ర, మిత్త్రు లను సజ్జనంబు లేమి
టికి విగత, చింతుఁడై గుహ సొచ్చి యశ్రాంత బుద్ధిఁ, దడవి
కానంగివలె దె తన్నుఁ దాన. శాంతి. 6-233

**అశ్రి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

ఆయుధముయొక్క పదునైన అంచు.

ఉ. ...ఉగ్ర దైత్యారుణ రంజితాశ్రి. ఆర. 5-179

**అశ్రుకణము** సం. వి. సమ. అ. పుం.

కన్నీటి బొట్టు.

సీ. తోయజ దళముల తుది మంచు దొరగెడు, గతిఁ గమ్నగవ నశ్రు కణము లురుల. విరా. 2-188

**అశ్రుతము** సం. విణ. (అ. ఆ. అ.)

విననిది.

వ. నీ పలుకు ధర్మవిరుద్ధం బన నోడుదు నుయినను లోకంబున నిది యశ్రుతపూర్వంబు దీని నింక నీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును విచారించి యెల్లి నిశ్చయింతము.

(అశ్రుత పూర్వము = మున్నెన్నఁడు విననిది) ఆది. 7-243

**అశ్రుధార** సం. వి. సమ. ఆ. స్త్రీ.

కన్నీటి చాలు.

వ. దీని వృత్తాంతం బంతయు వినుమని యమ్మౌనినిం గానిపించిన నదియును-

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానతయైన రాముఁ డిట్లను. ఉద్యో. 4-294, 295

**అశ్రుపూరము** సం. వి. సమ. అ. పుం.

కన్నీటి ప్రవాహము.

క. దలదండి దొరఁగం, జనుదెంచు నశ్రుపూరము, కనుఁగవలో మ్రింగుకొనుచుఁ గామిని పలికెన్. విరా. 2-79

**అశ్రుబిందువు** సం. వి. సమ. ఉ. పుం.

కన్నీటిబొట్టు, కన్నీరు.

వ. మృత్యువ ప్రజలఁ బ్రబల దుర్బల భేదంబులేక సంహారింపుమను టయు నవ్వనిత వసటం గన్నీరొలుక నశ్రుబిందువులు దోయిటం బట్టి యద్దేవుం డమ్ముద్దియతో. శాంతి. 5-205

**అశ్రువు** సం. వి. ఉ. న.

కన్నీరు.

అమ్మాధవ ధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రుపులక లును దదనంతరంబ భయంబును బుట్టె నట్టియెడ.
ఉద్యో. 2-12, విరా. 2-79

(బహు) కన్నీళ్లు

ఉ ...కుంతి సహదేవుని నిల్లడవెట్టి నాకు నమ్మాద్రి నిను నమ్మి చాల విషమం బగు నీ వ్యవహార మీతఁడుం, బూనఁగ నియ్యకొంటి.
విరా. 2-211

**అశ్లథము** సం. విణ, (అ. ఆ. అ.)

శిథిలముగానిది, దృఢమైనది.

మ. ...సంగ్రామార్హ చాపంబు లశ్లథ వర్మంబులు వీరి కిమ్ము.
విరా. 3-154

**అశ్లేషము** సం. వి. అ. పుం.

దేనితోడను సంబంధము లేకుండుట.

క. రోషము శోకము రాగ,ద్వేషము లభిమాన దర్పవేగానంసా,
శ్లేషము లజ్ఞాన మని మనీషిజనము సెప్పు మాననీయ చరిత్రా.
శాంతి. 3-401

**అశ్వకము** సం. వి. అ. పుం.

అశ్వము, గుఱ్ఱము.

తే అవుల మూఁటను గృష్యవృద్ధ్యశ్వకాయువులు శుచి శ్రాద్ధ కర్తకుఁ గలుగు నధిప.
అను, 3-169

**అశ్వక్రంతుఁడు** సం. వి. అ. పుం.

దేవేంద్రుని భటుఁడు.

క. తలరఁ గరేణు క్రథన, ప్రలిహ ప్రరుజాశ్వక్రంత పద నఖులను గ,తులఁ గులిశనిశాన నఖా,వలిఁ బడీంద్రుఁడు వచ్చి వందఱ లాడెన్.
ఆది, 2-100

(రేణుక క్రథన అనియుఁ బాఠము గలదు. అప్పుడ 'క్ర' తేలఁ బలుక వలయును)

**అశ్వజ్ఞానము** సం. వి. అ. న.

అశ్వము యొక్క మనోగత భావమును దెలుపు జ్ఞానము, అశ్వహృదయము.

క, హరి కెక్కు డరయ మద్రేశ్వరుఁ డశ్వజ్ఞానమున నసంశయము.
కర్ణ. 1-289

**అశ్వతరుఁడు** సం. వి. అ. పుం.
కద్రువ కొడుకు. ఆది. 2-4

**అశ్వతీర్థము** సం. వి. అ. న.
గంగా తీరమున కన్యాకుబ్జమునకు సమీపమున నున్న తీర్థము.
చూ. వివరము, అను. 1-106, అర. 3-182

**అశ్వత్థము** సం. వి. అ. పుం.
రావిచెట్టు.

వ. ఆప్రలంబవైరి ప్రమోద భరితుండగుచు మెలంగి యశ్వత్థ మధూ కామ్ర బిల్వాది భూరుహోపశోభితంబైన నిజ పూర్వాశ్రమంబు గనుంగొని. శల్య. 2-218

వ. ఋతుకాలంబున నీ తల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును నాలింగనము సేసి భక్తితో మీమీ చరువు లుపయోగించునది.
అను. 1-110, అర. 3-185

**అశ్వత్థామ** సం. వి. న్. పుం.

1, మాళవేంద్రుఁడైన యింద్రవర్మ యేనుగు. భీముఁడు దీనిని సంహ రించెను. దీని నాధారము చేసికొనియే యుధిష్ఠిరుఁడు అశ్వత్థామ సచ్చె నని యెలుంగెత్తియు ద్రోణుని చెవికి వినరాకుండఁ గుంజరమనియుఁ బలుకఁ గలిగెను. ద్రోణ. 5-316

క. భీమునిచే నని నశ్వత్థామ యనం బరగు భద్ర దంతి వడిన.
ద్రోణ 5-307

వ. మాళవేంద్రుండగు నింద్రవర్మ వారణం బశ్వత్థామ యను పేరి టిది ద్రోణ. 5-311

2. ద్రోణుని కొడుకు.
చూ. వివరము అనుబంధము. విరా. 4-4, ద్రోణ, 5-849, ఆది 8-79

**అశ్వనది** సం. వి. ఈ. స్త్రీ.
కుంతిభోజ పురమునకు సమీపము నందలి యొక నది. ఈ నదియందే కర్ణుని బేటిక యందుంచి కుంతి వదలెను.

వ. ...అయునుం దానును గొని చని పురసమీపగతంబయిన యశ్వనదీ ప్రవాహంబున విడిచి కుంతి యెంతయు సంతాపంబున నిట్లని విలాపంబు సేసె. అర 7-240

**అశ్వనీతీర్థము** సం. వి. అ. న.

ఒకానొక పుణ్య జలాశయము. పుణ్యనదీజలము.

ఇందు స్నానం బాడినవారు రూపవంతు లగుదురు. అర. 2-259

**అశ్వపతి** స. వి. ఇ. పుం.

మద్రదేశపు రాజు, సావిత్రి తండ్రి

వ. ...అయ్యశ్వపతియును సావిత్రీ ప్రసాదంబున నిజధర్మపత్ని యయిన మాళవియందు సావిత్రియను కూతుంగని, అర. 7-170

**అశ్వము** సం. వి. అ. పుం.

గుఱ్ఱము.

అశ్వకలిత శకటము అను. 2-379

ఉ ...అశ్వములం బరికించియున్కి యిం,పేనిఁ దురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడనై ... విరా. 1-272

**అశ్వముఖము** సం. వి. అ. న.

గుఱ్ఱపు ముఖముతోనుండు ఔర్వాగ్ని-ఇది సముద్రమునం దుండును. బడబాగ్ని

వ. ఔర్వుండు పితృదేవతాదేశంబునఁ దనకోపానలంబు సముద్రంబులో వైచిన నది యౌర్వానలంబునా నశ్వముఖంబున నబ్ధి జలంబులు ద్రావుచుండు... ఆది. 2-148

**అశ్వమేధదత్తుఁడు** సం. వి. అ. పుం.

జనమేజయుని (పరీక్షిత్తు కుమారుఁడు) కుమారుఁడైన శతానీకునకు వైదేహివలనఁబుట్టినవాఁడు... ఆది. 4-117

**అశ్వమేధపర్వము** సం. న్. న. పుం.

భారత భాగములలోఁ బదునాల్గవది. చూ. మహాభారతము

అశ్వ. 1-288

**అశ్వమేధము** సం. వి. అ. పుం.

అశ్వమును పశువుగాఁజేసి సార్వభౌముఁడు చేయు యాగ విశేషము సర్వ పాపనాశనమునకై దీనిని జేయుదురు. ఉద్యో. 1-168; అర. 2-274

శ్లో. "సర్వ పాప్మానం తరతి, తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజేత"—అని శ్రుతివాక్యము.

'రాజా సార్వభౌమోఽశ్వమేధేన యజేత'–అని స్మృతి.

ఈ యజ్ఞము చైత్ర పూర్ణిమనాఁ డారంభింప వలయును. ప్రథమ సంవత్సరమున అనఁగా యజ్ఞారంభపు మొదటి సంవత్సరమున చైత్ర పూర్ణిమనాఁడు సాంగ్రహణము అను పేరు గల యొక యజ్ఞమును జరిపించి మరుసటి దినమున బ్రహ్మౌదనము, మేధ్యాశ్వబంధనము, స్నాపనము, ప్రోక్షణము మొదలగు క్రియల నొనరించి అశ్వమును వదల వలయును. ఆయజ్ఞాశ్వము మొదటి సంవత్సరము స్వేచ్ఛా విహారము చేయుచుండ రాజపుత్రులు, ఉగ్రరాజులు సూత గ్రామణులు క్షత్త సంగ్రహీతలు అను వారొక్కొక్కరు నూఱేసి మందిగా వెరసి నన్నూరు మంది దాని సంరక్షణార్థమై వెంబడి పోవలయును. వారు దానిని మరలింపఁగూడదు. అది యట్లు తిరుగుచు, తుదకుఁ దాను గృహమునకు మఱలి వచ్చును. ఇట్లా అశ్వము వదలిన సంవత్సరమున పదునొకండు మాసములు గడచిన పిదప దానిని తోలుకొని వచ్చి సదస్సునకుఁ దెచ్చి రావిచెట్ల తోపులో బంధింపవలయును.

యజ్ఞాశ్వము తిరిగి వచ్చువఱకు సార్వభౌముఁడు ప్రతిదినము శ్రుత్యుక్త క్రమముగ సావిత్రాది కర్మములు చేయుచుండవలయును. యజ్ఞారంభమునకుఁ బూర్వము శ్రుత్యుక్తముగ ఋత్విగ్వరణముచేసి ఉపాంగముగఁ గొన్ని యజ్ఞములు చేయవలసి యున్నది.

పదునొకండు మాసములలో యజ్ఞాశ్వము తిరిగి వచ్చిన పిదపఁ బన్నెండవ మాసమున యజ్ఞములకు వలసిన సామగ్రులను సంపాదించుకొని యా సంవత్సరము కడపటి ఫాల్గుణామావాస్యనాఁడు ఋత్విక్కులతో యజ్ఞశాలను బ్రవేశించి రెండవ సంవత్సరము ప్రథమ దినమగు పాడ్యమి మొదలు అశ్వమేధయజ్ఞమారంభింపవలయును. పదుదినములు హోమము చేసి పూర్ణాహుతి చేయవలయును.

అశ్వమును బ్రహ్మ, అధ్వర్యుఁడు, హోత, ఉద్గాత అను నలువురు ఋత్విక్కులు రథకారుని గృహమున బంధించి దాని నాలుగు పాదములయందు "ఇహ ధృతి స్స్వాహా" ఇత్యాదులగు మంత్రములఁజెప్పి హోమము చేయుదురు.

పిమ్మట సోమలతారాజమునకు సభివర్ధకములగు కొన్ని క్రియలు జరపి సోమపానము చేయుదురు.

**అశ్వమేధి** సం. వి. న్. పుం.

**అశ్వమేధ యాగము చేసినవాఁడు**

క. నాకదియేల యశ్వమేధుల పదమని యెంచితి. అను. 4-72

**అశ్వమేధేశ్వరుఁడు** సం. వి అ. పుం.

రోచమానుఁడు అను పేరుగలవాఁడు.

రాజసూయయాగ కాలంబున పూర్వదిగ్విజయంబు సేయు భీమునిచేతఁ దమ్ములతోఁగూడఁ జచ్చెను. సభా. 1-241

**అశ్వవిద్య** సం. వి. ఆ. స్త్రీ.

అశ్వలక్షణాదికమును దెల్పు విద్య, అశ్వహృదయము.

క. తురగంబులఁజూచు విధం,బరయఁగ నితఁ డశ్వవిద్యయందు నిపుణతా,స్ఫురణము గలవాఁడు. విరా. 1-259

**అశ్వశాల** సం. వి. ఆ. స్త్రీ.

గుఱ్ఱపుసాల, మందుర.

వ. ఒక్కరమ్య ప్రదేశంబున రాజమందిరంబును నుచితస్థానంబులసమస్త జననివాసంబులునై రమణీయ బంధురంబును సింధురాశ్వశాలా మాలికా మనోహరంబునుంగా వీడెల్ల విడిసె ఉద్యో. 4-132

**అశ్వశిక్షకుఁడు** సం. వి. సమ. అ. పుం.

గుఱ్ఱములకు విద్య నేర్పువాఁడు, గుఱ్ఱముల నలవఱచువాఁడు, గుఱ్ఱములను బరిపాలించువాఁడు.

ఆ. అశ్వ శిక్షకుఁడనై మత్స్యభూవిభుఁ గొలుచువాఁడ గుఱ్ఱములకు పలయు, తెఱఁగు లెల్లఁ జాలనెఱుఁగుదు రూపుగా, నరయనేర్తు వానినను దినంబు. విరా. 1-94

**అశ్వశీర్షుఁడు** సం. వి. అ. పుం.

తక్షకుని కొడుకు, అర్జునుఁడు ఖాండవ దహనము సేయు సమయఁమున నితఁడు అగ్ని శిఖలకు వెఱచి తల్లిని దనతోఁకను గఱచి పట్టుకొనునట్లు చేసికొని ఆకాశమున బర్వెడుచుండ నర్జునుఁడు వాని తోఁకం దెగఁ గొట్టెను. ఆ తోఁక తోడ తల్లియగ్నిఁబడి నశించెను. వెంటనే పార్థుఁడు అశ్వసేను నేయ సమకట్టిన నింద్రుఁడు మోహిని యను మాయగావించి యాయశ్వసేను విడిపించెను. ఆది. 8-272, 273, 274

**అశ్వహృదయము** సం. వి. అ. పుం.

గుఱ్ఱము యొక్క మనోగత భావమును దెలుపు విద్యావిశేషము.

వ (దుర్యోధనుఁడు శల్యునితో) కృష్ణునకు నశ్వహృదయ జ్ఞానంబున నీ వధికుఁడవు. కర్ణ. 1-252

మహాస్రగ్ధర: (కర్కోటకుఁడు నలునితో) అతనికి (ఋతుపర్ణునకు) నశ్వహృదయ మనెడి విద్య యిచ్చి, వెలయ నతనిచేత నక్షహృదయ మన్విద్యఁ జేకొనుము. అర. 2-128

**అశ్వి** సం. వి. న్. పుం. (ద్వివచ) అశ్వులు

అశ్విని పుత్త్రులగు దేవవైద్యులు

తే. అశ్విపితృ శతానందులు నందు వెలుఁగు,చంద్రు. శాంతి. 6-124

సీ ...పరమాహ్లాదమునఁ జన్మ,దెంచి గంధర్వులు దేవమునులు మర దశ్విపసువులు మహీతాదరంబున. మహా. 67; అను. 5-313

**అశ్విని** సం. వి. ఈ. స్త్రీ.

ఇరువదేడు నక్షత్రములలో మొదటి నక్షత్రము. ఈ నక్షత్రమున తిల దానము శ్రేష్ఠము. అను. 2-379

**అశ్వేతము** సం.విశే. (అ. ఆ. అ.)

తెలుపు కానిది, నల్లనిది.

సీ. పలువురఁ గొడుకులఁ బడయంగ వలయునం, దొక్కరుఁడయినను నోపి గయకు, నరుగునో యనియును నశ్వమేధం బొప్పఁజేయునో యనియు నశ్వేతమైన, యాఁబోతు విడుచునో యనియును గోరు దురు. అర. 2-274

**అష్ట** సం. విశే. న్. సంఖ్య.

ఎనిమిది (ఇది తెనుఁగున సమాస పూర్వకముగనే యుండును)

అష్ట వైడూర్యములు. విరా 4-80

ఆ అమరులకు నజయ్యులగు నష్టసంశప్తకులు. కర్ణ. 2-275

ఇది ఇతర సంఖ్యావాచకములతోఁ జేరినపుడు తఱచుగా 'అష్టా' అను రూపముగా మాఱును. చూ. అష్టాదశము.

**అష్టకము** సం. విశే. అ. ష్టికా. అ.

ఎనిమిది పరిమితి గలది.

నిశిత బాణాష్టకమున. విరా. 5-168

పాదాష్టకంబును. శాంతి. 3-109

**అష్టకుఁడు** సం. వి. అ. పుం.

విశ్వామిత్రునకు మాధవి వలనఁ బుట్టినవాఁడు; యయాతి దౌహిత్రుఁడు.

క. (విశ్వామిత్రుఁడు) మునివరుఁ డష్టకుఁ డనియెడు, తనయు, బడసి శిష్యునకు సుదతి (మాధవి) నొప్పించెన్.

ఉద్యో. 3-321; ఆది 3-218

**అష్టగుణము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎనిమిదియైనది, ఎనిమిది విభాగములు గలది, ఎనిమిది రకములు గలది.

క. అష్టగుణంబగు నైశ్వర్యంబు నొందియు. సౌప్తి. 1-116

(అష్టైశ్వర్యములు)

**అష్టచక్రము** సం. విశే.

ఎనిమిది చక్రములు గలది, విష్ణుని తేరు.

వ. అష్టచక్రంబును, బ్రభూత భూత యుక్తంబును మనోజవంబును నగు మహనీయ శకటంబున వినోదపరాయణుండైన నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుండై విహరించుచుండు. భీష్మ. 1-37

**అష్టమత** సం. వి. ఆ. స్త్రీ.

ఎనిమిదవది యగుట..

క. విను మై దింద్రియములకును, మనంబు షష్ఠంబు సప్తమత్వము
బుద్ధిం, బనఁగొను భవ్య క్షేత్రజ్ఞునియం దష్టమత గల్గు సుగుణా
భరణా. శాంతి. 5-165

**అష్టమము** సం. విణ. (అ. ఈ. అ.)
ఎనిమిదవది.

క. ...అయ్యష్టమ యామిని నుదిత పటువిషాదుం డగుచున్.

క. గురువిభుఁడు నగరు సొచ్చియు. భీష్మ. 3-164, 165

**అష్టమి** సం. వి. ఈ. (స్త్రీ).
1. ఎనిమిదవదియైనది (స్త్రీ).
క. యష్టమియగు దేవత నేఁ, గష్టాత్మత యసురులందుఁ గని విడిచితి.
శాంతి. 5-13

2. పక్షములో ఎనిమిదవ తిథి.

ఉ. మానవుఁ డోపి యాశ్వయుజమాసము రెండవ యష్టమిం దగం,
బూని దినత్రయంబు. అను. 3-16

**అష్టముఁడు** సం. విణ. అ, పుం.
ఎనిమిదవవాఁడు.

ఆ. ...ఎప్పటి, యట్ల నెమ్మినుండు నంతఁ బుట్టెఁ, దనయుఁ డష్ట
ముండు తల్లిదండ్రుల కతి, ప్రీతియును ముదంబుఁ బెరుఁగుచుండ.
ఆది. 4-150

**అష్టమూర్తి** సం. వి. ఇ. పుం.
శివుఁడు.

అష్టమూర్తులు:-పంచ భూతములు-5, సూర్యచంద్రులు-2, యజ్ఞముచేసిన పురుషుఁడు 1.

వ. ఇట్లు ప్రళయకాల తాండవంబునం బ్రచండమూర్తియగు నష్ట
మూర్తియుంబోలె విజృంభించిన భీష్ము మార్కొను మగలులేక.
భీష్మ. 1-271

**అష్టశోభనము** సం. విణ. (అ. ఆ. అ.)
ఎనిమిది విధములైన యలంకారములు గలది; ఎనిమిది విధములైన

మంగళకర వస్తువులు గలది, అవి : 1. సింహము 2. వృషభము 3. గజము, 4. కలశము 5. వ్యజనము 6. వైజయంతి 7. భేరి 8. దీపము

వ. పరమ సంతుష్ట హృదయయై చంద్రుతోఁ గూడిన రాత్రియుం బోలెఁ బతిఁ గూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి తన పురంబునం దష్ట శోభనంబులు దేవ గృహంబులయందు విశేష పూజలు సేయించె. అర. 2-220

వ. పాంచాలపతియును గరం బనురాగంబుగఁ బురం బష్టశోభనంబు సేయించి (ద్రౌపది వివాహమునకు) సభా. 1-153

**అష్టాంగము** సం. వి. అ. పుం.

1. యోగ విశేషము. దీని యంగములు : 1. యమము 2. నియమము 3 ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6 ధారణ 7. ధ్యానము 8. సమాధి.

మాలిని. అవగమిత రహస్యాష్టాంగ సమ్యక్ప్రకారో త్సవ గురు కరుణావిస్తార గాఢ ప్రశాంతి, ప్రణవ హృదయ పద్మోద్భాసి విజ్ఞానసారా. ఉద్యో. 4-428

2. ఆయుర్వేదము. దీని యంగములు : 1. కాయచికిత్స 2 కౌమార భృత్యము 3. భూతవిద్య 4. శాలాక్యము 5. శల్యము 6. అగద తంత్రము 7. రసాయనతంత్రము 8. వాజీకరణము.

క. అనిశము సేవింతురె ని, న్ననఘా యష్టాంగమైన యాయుర్వేదం బున దక్షులైన వైద్యులు. సభా. 1-33

**అష్టాకపాలము** సం. వి. అ. పుం.

ఎనిమిది మట్టిపాత్రములలో సంస్కరింపఁబడిన పురోడాశముతోఁ జేయు నొక విధమైన యజ్ఞము.

వ. దక్షిణాగ్ని ప్రముఖులయిన వహ్నులు వాయుహతింజేసి యన్యోన్య సంస్పృష్టంబు లయ్యెనేనియు రజస్వలాది సంకరంబులం బొరసె నేనియుఁ బ్రాయశ్చిత్తార్థంబై యష్టాకపాలేష్టి సేయ వలయు. అర. 5-167

**అష్టాదశ** సం. విణ. న్.

పదునెనిమిది(ఇది తెలుఁగున సమాస పూర్వపదముగనే ప్రయుక్తమగును)

ఉ. అష్టాదశపర్వ నిర్వహణ సంభృతము. విరా. 1-6

**అష్టాపదము** సం. వి. అ. పుం. న.

ఎనిమిది ధాతువులయందును ప్రతిష్ఠ గలది- బంగారము.

ఉ. కళింగుఁ డష్టాపద దీప్త పుంఖ నవశాత శరంబులు నాటనేసినం. భీష్మ. 2-78

**అష్టావక్రము** సం. వి. అ. న.

తీర్థవిశేషము. ఇందు స్నానముచేసిన మర్త్యుఁడు బ్రహ్మభావ మొందును. అను. 2-85

**అష్టావక్రుఁడు** సం. వి. అ. పుం.

మునికుమారుఁడు.

చూ. చరిత్ర. అను. 2-3 మొ. 25 వ.

ఎనిమిది వంకలుగల శరీరము గలవాఁడు. ఏకపాదుని కుమారుఁడు.

చూ. చరిత్ర. అర. 3-286 మొ. 250 వ.

**అష్టాశీతి** సం. వి. ఇ. (స్త్రీ).

ఎనుబది యెనిమిది.

వ. ఊర్ధ్వరేతసులయిన యష్టాశీతి సహస్రములును. సభా. 1-80

**అసంఖ్యకము** సం. విణ. (అ. ఆ. అ.)

సంఖ్యలేనిది, లెక్కింపరానిది.

క ప్రకృతి దన యిచ్చఁ గ్రీడార్థకముగ సత్త్వాది గుణవితానము
నానా వికృతులఁ బొందింప నసంఖ్యకవిధమై వరఁగుచుండు
నది మనుజేంద్రా. శాంతి. 6-96

**అసంఖ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

సంఖ్యలేనిది, లెక్కింపరానిది.

క. అసురవరుఁ డీ హలాయుధుఁ, డసమానబలుండు సమరథాగ్రణి
విను పాండుసుతుల యెడ రోషము గలఁ, డసంఖ్య మాయాబల

మున నరులఁ గలంచున్. ఉద్యో. 4-231

2, త్రవ్వితండము.

ఆ. భక్తిఁ బ్రస్తుతించి ప్రణుతుల దేల్చి తత్కరుణ వడసి పసిఁడి త్రవ్వి తండములు నృపాల పెక్కు మోపులు దెత్తము, రమ్ము ఖాత వహులఁ దెమ్ము చాల.

క. అని పలికి యమ్మహాత్ముఁడు, గొనిపోవఁగఁబోయి శివు నకుంఠిత కరుణం, గనక మసంఖ్యము మోపులు, గొనివచ్చె నతండు మంచు కొండ యిపులకున్. అశ్వ. 1-62, 63

**అసంఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఇన్ని యని లెక్కింపరానిది, బహుసంఖ్యగలది.

వివిధ విశేష వికృతి స్వరూపులగు నసంఖ్యాత ప్రమథులు,
సౌప్తి. 1-116

**అసంఖ్యులు** సం. విణ. పుం. బహు

అనేకులు.

చ. ఇటు తగునే సుయోధన మహీవలయంబున నిట్టి సైన్య మెచ్చట వినఁ జూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁగాఁగఁ జచ్చుట యును. శల్య. 2-54

**అసంగత** సం. వి. ఆ. స్త్రీ.

తగులమి, సంబంధము లేమి,

క. ధర్మారాముఁడు సంతత, ధర్మసుఖుఁడు నైయసంగతానిష్ఠమతిన్, నిర్మలుఁ డగువానికి నిష్కర్మతాల్వానందసిద్ధి గలుగు మునీంద్రా. శాంతి. 5-286

**అసంగతము** సం. విణ. (అ. ఆ. అ.)

కూడనిది. పొసఁగనిది, యుక్తముగానిది.

చ. ఇతఁ డిది యేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమానియై, గత మునఁ బోయె. ఉద్యో. 3-376

క. మానవులకు దలఁపఁగ నజ్ఞానము నట్టి పగ లేదసంగత కృత్యాధీ

నుండై రూపునెడు న,దానం గావున నుదాత్త ధర్మవిధిజ్ఞా.
శాంతి. 5-32

**అసంగతుఁడు** సం. వి. అ. పుం.

విరోధి.

క. అనిమిషవరుఁ డివ్విధమున, జనియింపఁగఁ జేసెఁ బగ యసంగతులై వా,గును దెగి యొండొరువులతో, నని బెట్టుగఁజేసి చచ్చి రందఱు నధిపా, అర. 1-298

**అసంగము** సం. వి. అ. పుం.

సంబంధములేమి, విషయాదులయందు భోగాసక్తిలేమి.

ఆ. అరయ మే లసంగ మంచిత జ్ఞానంబు. శాంతి. 5-525

తే. ప్రకృతి సేసెనె యీ యపరాధ మరయ, నా యదియగాక వేఱొకండే యసంగ, కలితుఁ డగు నేను దానితోఁ గలయనేల, కలిగె బహురూపముల దానఁ గాదె నాకు. శాంతి. 6-52

**అసంగుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

విషయ సంగము లేనివాఁడు, దేనితోడను సంబంధము లేనివాఁడు.

సీ. అమ్మాంనపతి యసంగులుఁ గృతాత్ములు వ్రతాచరితమతులు నధ్యాత్మ నిరతులు నందుఁ (బ్రహ్మలోకము) బోదురుగాక యిచ్చటుగా నశక్యంబె నాకు. అను. 4-74

వి. అ. పుం.

విష్ణువు.

సీ. వరుఁ డసంగుఁడు ధర్మపాలుండు... సంగుప్త మంత్ర మనఁగఁ,
-తే- బరఁగు పేళుల వొప్పి యధ్వర మయాత్ముఁడైన విష్ణుండు.
శాంతి. 3-110

**అసంతానుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

బిడ్డలు లేనివాఁడు.

తే. ...యసంతానుఁ డగుట గర్భ,దాసుఁ డగుట దరిద్రత్వతపుఁ డగుట, చెందుఁ దూఁడుల కట్ట మ్రుచ్చిలిన కష్ట, నరుని కని పల్కెఁ బకసఖు నాముఁ డధిప. అను. 3-245

**అసందిగ్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

అనుమానము లేనిది, నిస్సంశయము.

క. అసందిగ్ధము మన కాజి యగుట దీనికి దగఁగన్. విరా. 4-88.

**అసంబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పొందిక లేనిది, అతుకనిది, అయుక్తము, (వాక్యము)

ఉ. ...నా, వృద్ధియ కోరుదేని నవివేకివి నీవని నన్ను నిట్లసంబ-
ద్ధములైన వాక్యములు పల్కక వే సిలిపింపు కోమలిన్.
విరా. 2-76.

ఉ. ...రాజ్యసంసిద్ధి నిజాగ్ర జన్మునకుఁ జేయు తలంపును గల్గు ని-
వసంబద్ధములైన వాక్యములు పల్కుట యొప్పునె కీచకాంతకా.
ఉద్యో. 3-55.

2. అసత్యమైనది, హాని కలిగించునది (మాట).

వ. సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

క. వృద్ధని జాత్యంధుం డని, బుద్ధివిహీనుఁ డని నన్నుఁ బుత్త్రుఁడు-
బలదర్పోద్ధతుఁడై మెచ్చ డసంబద్ధంబులె కాని వినఁడు పలికిన
పలుకుల్. అర. 1-383.

**అసంబద్ధుఁడు** సం. విణ. అ. పుం.

అయోగ్యుఁడు, అపాత్రుఁడు, హితము విననివాఁడు.

ఉ. బద్ధునిఁ జేయఁ జూచె ననుఁబట్టి సుయోధనుఁ డింక న య్యసం-
బద్ధునితోడి సంధికి నుపాయము నా మదిఁ దోఁప దెమ్మెయిన్.
ఉద్యో. 4-88.

**అసంభవము** సం. విణ. (అ. ఆ. అ.)

సంభవింపనిది, కలుగనిది, అసంగతము, పొసఁగనిది.

ఆ. ద్రుపద తనయుఁ డట్టి ద్రోణుని తలఁ గోయు, వాఁడు విధికనెట్టి
వారి నెట్టి, తెలుఁగు సేయరాదు దీనికి నేమను, వార మిది-
యసంభవంబుగాదె. స్త్రీ. 1-122.

2. లభింపనిది, దొరకనిది.

వ. ...హింస దలంపక నిత్యంబును నొక్కొక్క వనస్పతియందు నొక్కొక్క వన్యఫల భిక్షగొని యసంభవంబయిననాఁ డుపవాసంబు సేసి. ఆది. 5-49

**అసంభృతము** సం. విణ. (అ. ఆ. అ.)

చక్కగాఁ బొందఁబడనిది.

తే. అర్థధర్మంబు లితరేతరాశ్రయములు, గాన వానిలో నొకఁ డూఁదు మానవేంద్రు, జగము పోకలఁ బుచ్చు నసంభృతార్థుఁడైన వానికిఁ గామ మప్రాప్య మరయ. శాంతి. 3-457

**అసంభ్రముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సంభ్రమము లేనివాఁడు, తొట్రుపాటు లేనివాఁడు.

ఉ. ఆ సభ కేకవస్త్ర యగునట్టి ననుం గొనివచ్చి నొంచు దుశ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై తగు చేష్టలేక వ్యాసులు మాని చిత్రముల యాకృతి నున్నయెడన్. ఉద్యో. 3-111

క. అవి గనియు వినియు నులుకక, సవరణ లొప్పార నపు డసంభ్రములై యుండవులు. మాస. 28

**అసంశయము** సం. విణ. (అ. ఆ. అ.)

సంశయములేనిది, నిశ్చితము.

ఉ. ...మదీయ బాహుబల హీనబలుండయి నీకుఁ బ్రీతిగాఁ, బచ్చు నసంశయం బిది విచారము లన్నియు నింక నేటికిన్ విరా. 2-279

**అసడ్డ** వై. వి. (సం. అశ్రద్ధా. ప్రా. అసడ్ఢా క. అసడ్డె. త. అసట్టై)

తిరస్కారము, తృణీకారము, నిరసనము, ఉపేక్ష

(ఇంద్ర బలి సంవాదము) ఆ. సరకుసేయ నను నసడ్డమాటలుగొన్ని యాడినంత నేమియయ్యె నింద్ర నీదు శక్తి వింతయే దైవ వశమున, నెట్టిపాటివారు నెట్లుగారె. శాంతి. 4-426

(అసడ్డమాటలు = తృణీకరించి పలుకు మాటలు)

**అసతి** సం. వి. ఈ. స్త్రీ.

కులట, అంకుటాలు,

క. పలుమాఱుం దల వాకిట, మెలఁగుట యసతీజనైక మిత్రత
కలహాంబుల కెలయుట సగు పలుకులఁ, బెలుచనగుట నాకుఁగాని
వేరివి మగువా. ఆర. 5-302

**అసత్తు** సం. విణ. (త్. తి. త్.)

1. లేనిది, అసత్యమైనది.

మాలిని. సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా, ఉద్యో. 1-335

2. చెడ్డది, దుష్టమైనది

చ. హితు లెంత చెప్పిన, న్వినక బహు ప్రకారముల నిందకు నోర్చి
పరాభవించె సజ్జనులగు పాండుపుత్రుల నసత్పథ వృత్తికి హేటు
దప్పునే సౌప్తి. 1-37, శాంతి. 5-291

నపుం.

ప్రకృతి.

సీ. అలవడ సదసద్ద్వయంబును నా యందు, సనుపేతమై యున్కి
సత్యుఁ డనియు. శాంతి, 6-432

**అసత్యత** సం. వి. ఆ. స్త్రీ.

అసత్యము, అన్కృతత్వము.

క. వాణివచనంబు లసత్యతఁ బొరయఁగ నేర్చునొకో. శల్య. 1-205

క. అనుటయుఁ బెలుచని యెలుఁగున, ఘనముారెల ప్రబల శాఖికా
దుర్జయు నన్నును దాఁకిన నతని ప్రభంజనుఁడను నామంబునకు
నసత్యత వచ్చున్. శాంతి. 3-333

**అసత్యత్వము** సం. వి. అ. న.

అసత్యము, అబద్ధము.

క. గెలువుము శల్యుని నీవని, పలికి ముకుందుండు నన్నుఁ బనిచిన
వాఁ డప్పలుకులకు నసత్యత్వము, గలుగఁగ నేర్చునొకొ దైవ
ఘట బలమునన్. శల్య. 1-263

**అసత్యము** సం. వి. అ. న.

అనృతము, అబద్ధము, బొంకుమాట.

క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమ ధర్మయుగళ మందు నహింసన్, సత్యముగాచుట ధర్మ మ,సత్యము న నహింసఁ గావఁ జనునండ్రు బుధుల్. కర్ణ. 3-78. విరా. 2-160

**అసత్యసంవాదిని** సం. విణ. (న్. నీ. న్.)

అసత్యము మాట్లాడువది, కల్లమాటలు చెప్పునది.

ఉ. ...కేకయ రాజపుత్రి య,త్యాదర వృత్తితో నమునయం బొనరించిన నయ్యసత్యసం,వాదిని పూన్కి పాండుసుతవల్లభ యాలము సేసి యిట్లనున్. విరా. 2-160

**అసదు** దే. విణ.

1. తక్కువది, అల్పము, దుర్బలము, స్వల్పము.

తే. పాండవులు కౌరవులతోడి పగకు నోల్ల, రఖిల భూప్రజా నాశనమగుటఁ జేసి, వారలసదని తలఁపంగ వలవ దధిక, ధర్మపరులైన కతమునఁ దగవు నడచె. ఉద్యో. 1-234

చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱచై పొరి నెత్తురు గ్రమ్మ పోటులన్. విరా. 3-134

తే. ...భీష్మాదులెల్ల విన్వచ్చుఁ బోలు, నెక్కుడగుఁగాని యసదు గాఁడితఁ డనిరి. (అభిమన్యుని) భీష్మ. 1-272

ఆ. పాదరోగు లశుచిపదముల దేవాల,యములు మెట్టుటయును నసదువారిఁ, దప్పులేక క్రొవ్వి తన్నుటయును దొలు పుట్టునందుఁ గలిగినట్టివారు. అను. 5-103

చ. మా, కడిమియు లావు నీ వసదుగా గణుతింపకు. ద్రోణ. 2-208

2. అయుక్తము, తగనిది.

(కృష్ణుఁడు) క. మానుషయోని జనించితిఁ, గాన మదీయమగు బుద్ధిగౌరవము దదీ,యానుగుణత్వోపహితము,గా నెఱుఁగుఁడు మీకు చెప్పు కత విను టసదే. అను. 4-411

3. కొద్దివాఁడు, బలహీనుఁడు

సీ. విరాటుండు, నాతని తమ్ములు నాత్మజులును నసదులే. ఉద్యో. 1-269

(దుర్యోధనుఁడు భీమునితో) శా. వ్యూహోభావము సూచిన న్నసదుగా నూహించెదో భీమ. శల్య. 2-248

4. కృశము, సన్ననిది.

అసదుఁ గాఁ దీఁగె యల్లాడుచుండఁ... విరా. 4-26

**అసదుఁగోటు** దే. వి.

దుర్బలమైన ఆవు.

క. మూలబలము సంతుష్టం,బై లాలితమగుచు నున్న యప్పు డసదుఁ గోటాలోకించి నడవ భూ,పాలకునకు దండ మతికుతం బొనరిం చున్. శాంతి. 2-418

**అసదువాఁడు**

కొద్దివాఁడు; అల్పుఁడు.

ఆ. పాదరోగు లశుచిపదముల దేవాల,యములు మెట్టుటయును నసదువారిఁ, దప్పులేక క్రొవ్వి తన్నుటయును దొలు,పుట్టు నందుఁ గలిగినట్టివారు. అను. 5-102

**అసదృశుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అసమానుఁడు.

(భీష్ముఁడు కర్ణునితో) క. నీ యుదయము దైవిక గ,ర్భాయత్తము నీకు మర్త్యు లసదృశులు గాం,తేయుఁడవుగాని విను రా,ధేయుం డవు గావు నీవు ధీరవిచారా. భీష్మ. 3-448

**అసదృశము** సం. విణ. (అ. ఈ. అ..)

సాటిలేనిది, అసమానమై.

(అర్జునుఁ డుత్తరునితో) చ. అసదృశ లీల బొల్చు రథికావలి మీఁదఁ జనంగ వెట్టినే. విరా. 4-57

క. పావనమీది యసదృశశరము పౌరవముఖ్యా. శాంతి. 6-589

**అసదృశుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. సాటిలేనివాఁడు.

క. ...ధనుశ్శాస్త్ర పరిజ్ఞాన ఘనుఁ డసదృశుఁడు శక్తిన్. విరా. 5-6

2. పోలనివాఁడు, తగనివాఁడు.

క. పొడువునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిది బలంబునను జూడఁగా నసదృశు నీ, కొడుకని యీతని నెంతయు, నెడమడుగుగఁ జూప దెత్తె యిందఱు నగఁగాన్. ఆది. 4-100

**అసద్భావము** సం. వి. అ. పుం.

1. నిర్గుణత్వము.

క. కావున గుణములు ప్రకృతివ; యే విధమునఁ జూచినను మహేశ్వరుని గుణత్వావేశము పొరయదసద్భావము సద్భావమగునె భరిత వివేకా, శాంతి 6-38

2. చెడ్డస్వభావము,

క. వావిరి మాటలఁ దేలక, భావంబునఁ గీడు మేలుఁ బరికించి యసద్భావుని సద్భావుని నవనీవర యేర్పఱుప నెఱుఁగ నేరఁగవలయున్. శాంతి. 3-81

**అసద్భావుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చెడ్డ స్వభావము గలవాఁడు, దుర్మార్గుఁడు.

క. వావిరి మాటల దేలక, భావంబునఁ గీడు మేలుఁ బరికించి యసద్భావుని సద్భావుని నవనీవర యేర్పఱుప నెఱుఁగ నేరఁగవలయున్. శాంతి. 3-81

**అసన్నిధి** సం. వి. అ. పుం.

పరోక్షము.

(ద్రౌపది సుదేష్ణతో) క. అతివ తగునమ్మ నీ గృహ, మతినిర్మల చరిత భరిత మని యీయెడ మత్పతుల యసన్నిధినైనను, మతి నూఱడి యున్నచోట మన్నన దప్పున్.

విరా. 2-94, ద్రోణ. 4-290, అశ్వ. 2-77

**అసన్మార్గము** సం. వి. అ. పుం.

దుర్మార్గము.

అ. అధిప పాండుసుతుల క్షరయంగ నతి కాంక్ష, లేదు లబ్ధబుద్ధి నీదు సుతుఁడ, శకుని కఱపు విని యసన్మార్గ వృత్తికిఁ, జొచ్చి యిట్టి యెడరు దెచ్చికొనియె. భీష్మ 1-30.

**అసభ్యము** సం. విశ. (అ. ఆ. అ.)

సభకుఁ దగనిది. అశ్లీలము (ప్రసంగము మొ॥)

(భీముఁడు శల్యునితో) ఇద్దురాత్ముఁడు (కర్ణుఁడు) సభలోన నసభ్యంబులగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించిన కోపం బజాతశత్రునకు బ్రియంబుగా నడంచికొనియుండితి. కర్ణ. 2-214.

**అసమంజసుఁడు** సం. వి. అ. పుం.

సగరుని కొడుకు. చూ. శాంతి. 2-188.

**అసమము** సం. విశ. (అ. ఆ. అ.)

సాటిలేనిది.

సీ. దామగ్రంధి యసమ సంగ్రామకేళీ గాఢ కౌతుకుండు విరా. 3-152.

**అసమర్థము** సం. విశ. (అ. ఆ. అ.)

శక్తి చాలనిది.

(దుర్యోధనుఁడు ద్రోణునితో) భీష్మ పరిపాలితంబయిన యీ సైన్యంబు పెద్ద యసమర్థంబై తోఁచుచున్నయది. భీష్మ. 1-174.

**అసమర్థుఁడు** సం. విశ. అ. పుం.

1. శక్తి చాలనివాఁడు.

క. అప్పుడ యసమర్థుండగు, నప్పుడ దుఃఖయగు శూన్యమై తోఁచు జగం, బప్పుడ మాతృవియోగం, బెప్పుడు వాటిల్లె నపుడ యంతయుఁ దూలున్. శాంతి 5-277.

2. బయటఁబడి యే పనియుఁ జేయఁజాలనివాఁడు.

ఆ. నైషధేశ్వరుండు నలుఁ డిప్పు డసమర్థుఁ, డగుటఁజేసి తన్ను నమ్మి;

తెలియఁగ కుండ మండుఁ గానయును సభాంతరములఁ, గరఁగి నిట్టు
లనుదు వరుస మీర. అర. 2-156

మూలమునందు అసమర్థ శబ్దమే గలదు.

శ్లో. యది వాసౌ సమృద్ధస్స్యా ద్యదివా వ్యథనో భవేత్
యది వాప్యసమర్థస్స్యాత్ జ్ఞేయ మస్య చికీర్షితమ్.
సం. భా. ఆర 80-47

**అసమాన** సం. విశే. అ. (స్త్రీ).

తే. మహిత లావణ్యమున నసమాన యనఁగఁ, జనిన పౌలోమి యా
నహుషునకు నయిన, మార్గగోచరయగుటయు. ఉద్యో. 1-149

**అసమానము** సం. విశే. (అ. ఆ. అ.)

సమానము లేనిది, సాటిలేనిది.

ఆ. అధిక విభవ మెసఁగ నసమాన శక్తి స,నాథుఁ డగుచు నున్న
నహుషుఁ డిప్పుడు. ఉద్యో. 1-200

**అసమానుఁడు** సం. విశే. అ. పుం.

సమానము కానివాఁడు.

క. సమశీల శ్రుతయుతులకు, సమధనవంతులకు సమసుచారిత్రులకుం,
దమలోన సఖ్యమును వివా,హమునకుఁ గాకగునె రెండు నసమా
నులకున్. ఆది. 5-205

**అసమాలంబిత** సం. వి. అ. (స్త్రీ).

గ్రహింపఁబడనిది.

మ. ...చతుః ప్రభృ,త్యసమాలంబితఁ దేజరిల్లు పరమాత్మైక్యంబు.
అను. 5-254

**అసమాలంబము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆధారము లేనిది, ఆశ్రయము లేనిది.

క. అసమాలంబ మశబ్దము, రసగంధ స్పర్శరూప రహితం బగుటం,
బ్రసరించు నింద్రియములకు, వసఁబుగా దొందఁ బరమవస్తువు
పుత్రా. శాంతి. 4-174; ఆశ్వ. 1-204

**అనమీచీనము** సం. విశే. (అ. ఆ. అ.)

తగనిది, అపాత్రము.

క. దాన విధి యరయ ననమీ,చీనం బగునేని కీడుసేయుం గురు ధా,త్రీ నాథ మఱియుఁ బాత్రం,బైనను గొన్నతని కిచ్చు నతనికి నెట్లున్. శాంతి. 1-383

**అనము** దే. వి.

1. అహంకారము, గర్వము, దర్పము.

ఉ. ఆనమున మీఁ దెఱుఁగక మహోగ్రహ వృత్తిఁ గడఁగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడ యొం, టిగనట యేడ... విరా 5-284

క. మునిశాపము వారలమది, ననయము నన మెక్కఁజేయ నందొకఁ డైనన్, విను మరలుట దెరలుట లే, కని బెట్టుగఁజేసి రధిప యార్పులు సెలఁగన్. మౌస. 59

2. ఉత్సాహము.

వ. (కౌరవులు) ఇట్లు సన్నద్ధులై వెడలి యన మెడలిన బలంబులం గూర్చికొనుచుండి. విరా. 1-18

క. మీ రెల్లఁ జూచుచుండఁగఁ, గౌరవ నికురంబమునకుఁ గన్నాకై యొప్పారిన భీష్ముఁడు వడియెను, మేరు వొఱఁగినట్టు లనము మిగుల నరునకున్. ద్రోణ. 1-81, భీష్మ. 2-148, ద్రోణ. 3-104

**అనమెక్కు** దే. అ. క్రి.

1. ఉత్సాహము పొందు.

క. యాదవ కేకయ పాంచాలాదులు వాఱుటలు నూచి యన మెక్కి జయోన్మాదంబునఁ గురు సైన్యము, లే దిక్కునఁ దామ యగుచు నేర్తెఱఁ బొదివెన్. భీష్మ. 2-148

2. గర్వము గలిగించు, మదము గలిగించు, అహంకారము గలిగించు.

క. మునిశాపము వారల మది, ననయము ననమెక్కఁ జేయ న దొకఁ డైనన్, విను మరలుట దెరలుట లే,కని బెట్టుగఁ జేసి రధిప

యార్పులు సెలఁగన్ మౌస. 59

**అసమ్మతము** సం. విణ (అ. ఆ. అ.)

సమ్మతము కానిది, ఇష్టము కానిది.

(శకునితో దుర్యోధనుఁడు)చ. ...ఉన్నతమగుచున్న పాండు నరనాథ తనూజుల లక్ష్మి నా కసమ్మతమయి సూవెలింగె. సభా. 2-98

**అసమ్మితము** సం. విణ. (అ. ఆ. అ.)

అపరిమితము, మితిలేనిది.

ఁయగ్రాహి ...అహీన ముసలమ్ములును జక్ర నివహమ్ములును లోనగు నసమ్మిత మహోగ్రాస్త్రమ్ములును. స్త్రీ. 2-7

**అసరు** దే. వి. (√పసరు)

పసరు.

సీ. ...విను మొక్కనాఁ డత్తపస్వి వేల్మాటి దర్భ -ఆ- గంటిఁ గూర యసరు గారిన నర్తించె, నతఁడు తపము సిద్ధి కాత్మఁ బొంగి. శల్య. 2-160

శ్లో. పురామంకణస్సిద్ధః కుశాగ్రేణేతి విశ్రుతమ్
క్షతః కిల కరే రాజంస్తస్య శాకరసోఽస్రవత్.

శ్లో. స వై శాకరసం దృష్ట్వా హర్షావిష్టః ప్రణృత్తవాన్,
తతస్తస్మిన్ ప్రణృత్తే వై స్థావరం జంగమంచ యత్.

సం. భా .శల్య. 40-39,40

**అసలారు** దే. అ. క్రి.

అధికమగు, అతిశయిల్లు.

క. ...వసియించు నమ్మదిత ప్రియ, మసలారఁగఁ గాంచి వచ్చు నప్పుడ. అను. 2-6

**అసహత్త్వము** సం. వి. అ. న.

ఓర్వలేమి

ఉ. ...జగత్పావను ధర్మనందను సభాస్థితుఁ జూచి ముదంబు నెంది రింద్రావరజాది మిత్త్రు లసహత్త్వముఁ బొందిరి ధార్తరాష్ట్రులున్. సభా. 2-78

**అసహాయత్వము** సం. వి. అ. న.

1, సహాయత్వములేమి, తోడు లేకుండుట.

సీ. ఆలస్యమును నసహాయత్వమును నొప్ప, వవిలేని పతి సుఖసైౖ చరించు. శాంతి. 3-83

2. ఏకాకిత్వము.

వ (దమయంతి) ప్రాణ సమానురాలవయిన నిన్నవశ్యంబును విడువా నని పలికితి సత్యప్రాతిపాలనంబు సేయుమని ప్రలాపించుచుం దన యేకాకిత్వంబునకు నబలా భావంబునకుఁ బ్రతిపదన్యాస జాయమాన కంటక మృగ పన్నగ భయంబునకు వగవక నిజనాథు నసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసా శ్రమాకులత్వంబునకు వగచుచు. అర. 2-83

**అసహాయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

తోడు లేనివాఁడు, సహాయులు లేనివాఁడు.

క. మన్నె నసహాయుఁడనై, చన్న కడం జనఁగనైన చందం బయ్యేన్, వెన్నుఁడు తోడు గలఁడు వెఱ, పెన్నండును వలవదింక నేమిటి కైనన. ఉద్యో. 4-178

**అసహిష్ణుఁడు** సం. విశ. (ఉ)

ఓర్వనివాఁడు, సహింపనివాఁడు,

వ. ...కృష్ణుం డిట్లని చెప్పె నీ యజ్ఞంబున నర్ఘ్య నిమిత్తంబున నసహిష్ణుం డయిన శిశుపాలుండు నాచేత నిహతుండగుట విని వాని తమ్ముండు సాల్వుం డనువాఁడు. అర. 1-150

**అసహ్యాపడు** అ. క్రి ($\sqrt{}$ అసహ్యాము)

1. అసూయపడు.

క. పరుల ధనమునకు... అసహ్యాపడు న, న్నరుఁడు దెవులులేని వేదనం బడు నధిపా. ఉద్యో. 2-58

2. ఏవగించు.

వ. దానికిఁ గొంద అసహ్యాపడి పాండవ పక్షపాతంబున బ్రతికూల

వచనంబులు పలికిన నవి కృష్ణునకుఁ బ్రియంబులై యుండె.
ఉద్యో. 1-80

8. చూపోపమిపొందు, ఓర్వలేకపోవు.

వ. భవదీయ సభ యొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసంబునకును నట్లసహ్యపడి ధృతరాష్ట్రునితో (దుర్యోధనుఁడు)
శాంతి. 8-129

**అసహ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సహింపరానిది.

(ధర్మరాజు కర్ణునివృత్తము విని కుంతితో) వ. అవ్వచనంబులు దనకు నసహ్యంబులైనం గటకటం బడి యద్దేవి నాలోకించి భవదీయ మంత్రకార్యగోపనంబునం గాదె యింతవుట్టె.
శాంతి. 1-40

తే. ఈ నెలవులు బృందారకాధీన మిదియు, మనకు రావలసిన చోటనిన నతం డసహ్య దుర్గంధ ఘోర దర్శనత నచోటు; చిత్తమతి దుఃఖితంబుగఁ జేయుటయును.
స్వర్గ. 19

చ. ...కడు దీర్ఘములై నిదాఘ వాసరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.
ఆది 8-280

2. భరింప శక్యముగానిది.

క. తామను నన్నయు నయ్యాస్థానమ్మునుండి పవనతనయుఁ డసహ్యంబైన మనోవల్లభ యవమానము సింహబలుని మద జృంభణమున్.
విరా. 2-132

క. చింతించి నతనితో భూకాంతుం డిట్లనియె మఱియు గాథత రాశాక్రాంతత దుర్లభ ఫలమగు, టింత యనహ్యమగునయ్య యెడఁద మునీంద్రా.
శాంతి. 3-159

సీ. విను తొల్లి ధర్మవర్తనము లసహ్యంబులైన దానవులు మహోగ్రహమున, నరులయం దెలసిన నరవర వారలు దర్పరోగముల నధర్మవృత్తిఁ దగిలినఁ గలఁగె వేదములును...
శాంతి. 5-498

**అసాక్షిక భోజనము** సం. వి. సమ. న.

పంక్తిని రెండవవాఁడు లేకుండ భోజనము చేయుట, ఒక్కఁడే కూర్చుండి తినుట.

వ. ఆత్మార్థంబుగా నన్నపాకంబును నసాక్షిక భోజనంబును వృథా పశుఘాతంబును బాప హేతువులు. అర. 1-81

**అసాధనము** సం. వి. అ. న.

సాధనము కానిది, సాధించుటకుఁ గారణముకానిది.

ఆ. కయ్యమునకఁ యెపుడుఁ గాలు ద్రవ్వుదు కార్యగతికిఁ జొరవు నీతియుతులు సమర,హత మసాధనముగ నాడు దురర్థ సం,సిద్ధిఁ బొందు తెలుఁగు సేయునెడల. విరా, 4-207

ఇచ్చట పాఠాంతరమైన అధమ సాధనమే యుక్తము.

శ్లో. యుద్ధంతు పాపిష్ఠం వేదయన్తి పురావిదః. సం. భా. విరా. 49-2

**అసాధుత్వము** సం. వి. అ. న.

అసాధుభావము, మంచి నడత లేకుండుట.

తే. విప్రుఁ డేమిట దేవత్వ విభవమొందు, నేమికతమున సాధుత్వ మెసఁక మెసఁగు, వ్రతనికెద్ది యసాధుత్వ మావహించు, మానుషుం డగు నెద్దాన మహితమూర్తి. శాంతి. 5-566

**అసాధువు** సం. విణ. (ఉ. ఊ, ద్వి. ఉ.)

1. సాధువుగానివాఁడు, మంచి నడత లేనివాఁడు. చెడ్డవాఁడు.

చ. ...జనం బసాధు నాఁజనుఁ బరివాదశీలమున. శాంతి. 5-567

2. తన్నంత తానుగాని సదుపదేశము వలనఁగాని ధర్మము తెలిసికొనని వాఁడ.

సీ. తమ యంత నెఱుఁగరు ధర్మంబు సదుపదేశమునను గాన రసాధు జనులు. అను. 5-425, 426

**అసాధ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

సాధ్యముగానిది, అశక్యము.

మ. ...మాధవుఁ డా దిక్కెలు పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే. ఉద్యో. 1-240

**అసాధ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సాధ్యము గానివాఁడు, శక్యము గానివాఁడు.

చ. అన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యులట్లుగా కెరవయి నిల్చినం
గెలని కెల్లిదమై పటివోదు రెంతయున్. ఉద్యో. 2-88

**అసారము** సం. విశే. (అ. ఆ. అ.)

1. సారములేనిది, మంచిదికానిది.

క. ఈ రెంటియందు నరసి య,సారం బిది గాఢసార సహితంబిది నా,
నేరవలయు. ఉద్యో. 1-357

2. చేవలేనిది, దుర్బలము.

క. అరయఁ గదళీ గర్భా,సారము సంసారము. శాంతి. 5-580

**అసింహము** సం. విశే. (అ. ఈ. అ.)

సింహములులేనిది.

మ. ధృతరాష్ట్రేంద్రుము బుత్త్రులున్ వనము గుంతీనందనుల్ సింహ
ముల్, మఱి నూహింప నసింహమైన వనముల్ మర్దింతు రెందున్
వనావృత వృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేటొందుఁ
గాన తగం బొందుట కార్య మీ యుభయము న్సంతుష్టిమై
నున్కికిన్. ఉద్యో. 1-358

**అసి** సం. వి. ఇ. పుం.

1. ఖడ్గము, కత్తి.

ఆ. ...అసిముద్గరా,ద్యాయుధములుఁ గూడ నతఁడు గట్టె.
విరా. 1-172

ఉ. వచ్చినఁ దత్పదాంబురుహ వందనపూర్వము గాఁగఁ బద్మజుం,
డిచ్చెఁ గృపాణ మవ్విభుఁడు... అటు లయ్యసిఁ జైకొని మేను
పెంచుచున్, శాంతి. 3-446

2. విష్ణుని పేరు, దండనీతియైన విష్ణునకుఁ బేరు.

సీ. ...దురాసదుఁ డసి సత్యగుండు నిత్యగుఁడు శాస్త,... సంగుప్త
మంత్ర మనఁగఁ -తే- బరఁగు పేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ,
డైన విష్ణుండు దండమై యావహిల్లు, శాంతి. 8-110

3. ఖడ్గముయొక్క యెనిమిది పేరులలో ఒకటి. శాంతి. 3-449

**అసితపక్షము** సం. వి. అ. పుం.

కృష్ణపక్షము.

వ. వారణావతంబును... నవసుధా ధౌత సౌధ సుధాకర నికర ప్రభాపటల ప్రధ్వంసితాసితపక్ష దోషం బనియును... ఆది. 6-182

**అసితపథుఁడు** సం. వి. అ. పుం.

అగ్ని.

మాలిని అసితపథుఁడు విప్రుండై ... డాయవచ్చెన్ వసునిభులగు వారిన్ వాసవిన్ వాసుదేవున్. ఆది. 8-234

**అసితము** సం. విశ. (అ. ఆ. అ.)

నల్లనిది, తెల్లనిది కానిది

ఉ. ద్రోపది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంద్రుకల్, దా వలచేత బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో, నా విలసిల్లి వ్రేఁగ. ఉద్యో. 3-114

వ. సితాసితంబులగు మూషికంబు లమ్మహీరుహంబు మూలంబు నలుకుచుండ. స్త్రీ 1-47, అను. 1-104

**అసితుఁడు** సం. వి. అ. పుం.

ఒకముని. జనమేజయుని సర్పయాగంబున సదస్యుఁడు గానున్న వాఁడు. ఆది. 2-210

**అసిద్ధత** సం. వి. ఆ. స్త్రీ.

నిష్ఫలత్వము.

తే. పెద్ద కాలంబు యత్న సంపీడ నొంది, నెల్లఁజేసిన పనియుక్క పొల్ల పగతు,చే నసిద్ధతఁ బొందుట వీన నొకటఁ,గా ర్యపాండు రత్యంబులు గలుగు ననఘ. అను. 4-386

**అసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ.

సిద్ధింపమి, సంప్రాప్తిలేమి, అప్రాప్తి.

ఉ. కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహమెయ్యెడ, న్వావిరిఁ జేయ కేలు భువనంబు.

శాంతి. 1-150, శాంతి. 4-379, శాంతి. 5-223

**అసిధారావ్రతము** సం. వి. అ. న.

1. కత్తివాతి మీఁద శయనించుటవలె దుష్కరమగు వ్రతము- ఎలజవ్వనితో యువకుఁడు కలసిమెలసి యుండియు దానితోడ రతిని సలుపకుండుట.

2. అసిధారతోఁ జేసెడు వ్రతము. దంపతు లిర్వురు ఏక శయనమునఁ బరుండి వారి నడుమ కత్తి పెట్టుకొని బ్రహ్మచర్యమును జరుపుట.

3. అసిధారావ్రతము వంటి దుష్కర కార్యము.

క. జనవర యసిధారా వ్రత, మనఁ దగియెడు ధారణా నియతి పనుపడు నెవ్వని చిత్తంబున నాయ్యాగ నిరూఢున కరిది యైన కార్యము గలదే, శాంతి. 5-598

**అసిపట్టిక** సం. వి. ఆ. స్త్రీ.

ఖడ్గము, కత్తి.

వ. ...రుధిరానులేపనంబున నాభీలంబగు నసిపట్టిక ఘోరాకారయైన రాక్షసి పగతుర గీటడంగించుటకుఁ దనకుం దోడు -వచ్చిన తెఱంగున మెఱయ. సౌప్తి. 1-177

**అసిపత్రవనము** సం. వి. అ. న.

నరక విశేషము.

(ఇందలి చెట్లయాకులు కత్తులవలె నుండును, ఇందలి జలములు సలసల క్రాగిన నూనియవలెఁ దెరలుచుండును. ఇది వాడియైన మొనలు దేలిన యినుప మేకులతో దుస్స్పర్శమై యుండును. స్వర్గ. 1-18

**అసిపుత్రిక** సం. వి. ఆ. స్త్రీ.

చిన్నకత్తి.

చ. ...శిబి తక్షణంబ యసి పుత్రిక నాత్మశరీర కర్తనం, బనఘుఁడు సేసి చేసి తన యంగములంగల మాంస మెల్లఁ బెట్టినను. అర. 3-235

**అసిలోముఁడు** సం. వి. అ. పుం.

దనువు కశ్యపుల కొడుకు. ఆది. 3-63

**అసుదు** దే. వి.

అసదునకుఁ బాఠాంతరముగా నీయఁబడిన పదము. చూ. అసదు.

శల్య. 1-91, శల్య. 2-248, శాంతి. 2-418, విరా. 4-96.

**అసుర** సం. వి. అ. పుం.

(ఈ పదము సంస్కృత సమాసాంతమున నుండదు)

**అసురుఁడు, రాక్షసుఁడు.**

క. కీచకుఁడు ప్రేటువడి తన, నీచపు దెస యొరు లెఱుంగనేరక యుండన్, లేచి వెనుకఁ జని విస్మయ, గోచరుఁడై యసుర కతనఁ గుంఠితుఁ డయ్యెన్. విరా. 2-190, భీష్మ. 3-86.

తే. ...అరువది వేలు దివ్యాబ్దములును మహాతపం బొనరించె నీ యసుర.

శాంతి. 5-425, శాంతి. 6-479, ఆది. 6-252, ఆది. 6-294, 295.

**అసురుఁడు** సం. వి. అ. పుం.

రాక్షసుఁడు.

ఉ. ...మహాసురప్రతతి దర్పమడంచి ప్రియంబొనర్చి యా,ఖండలుఁడున్న గద్దియ సగంబున నుండె. విరా. 1-85.

**అసువులు** సం. వి. ఉ. పుం. బహు

ప్రాణములు, ఉసులు-

క. శాతఘనశరము వే కొని, యా తల వెడలంగనేసి యసువులఁ బాపెన్. విరా. 5-77, శాంతి. 3-377.

**అసూయ** సం. వి. ఆ. స్త్రీ.

1. ఇతరుల గుణములయందు దోషము నారోపించుట, ఓర్వలేని తనము. (మృత్యుదేవత బ్రహ్మదేవునితో) వ. లోభంబును క్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింప వలయు ననవుడు నతం డట్ల యయ్యెడు మదియునుంగాక.

ద్రోణ. 2-175.

(ధర్మజు శపింపఁ బూనిన గాంధారితో వ్యాసుఁడు) సీ ...పాండ
వాగ్రజుపై నల్క మానుము... -ఆ- ...ధర్మపరుల కాఁగ
వలయుఁ బాండుతనూజు లసూయలేని బుద్ధిఁ జూడు మెట్లు.
స్త్రీ. 1-151

2. క్రోధము, కోపము.

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెద చేతులు సవ్యసాచికిం,
దక్కటి మిత్త్రబాంధవ హితప్రియ మంత్రి వయస్య కోటికిన్,
ప్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ,
యి క్కరుణాకరున్ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్.
ఉద్యో. 1-302

3 ద్వేషము.

(యుద్ధానంతరము దుఃఖించుచున్న ధర్మజుతో భీముఁడు)

చ. అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు నిప్పుడు
ముమ నిస్పృహుండవయి పోవఁగఁగన్న గులంబువారు నిప్పుడమి
నృపాలురున్ బ్రదికిపోదురు నెమ్మది నట్టులైన నే, ముదుగుదు
మస్త్ర జీవన సముద్ధతిఁ జొత్తుము భైక్ష వృత్తికిన్. శాంతి. 1-62

అసృక్కు సం. వి. జ్. న.
రక్తము, నెత్తురు,
నవాసృగ్రక్త నేత్రుల్. ఆది. 2-213, అర. 4-65

అసేవ్యము సం. విణ. (అ. ఆ. అ.)

1 ఫలపుష్పచ్ఛాయాదులచే ననుభవింపఁ దగనిది, అనుభవింపఁ దగనిది, సేవింపఁదగనిది.

మ. వలుఁ డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యత్వాత్మజముల్ పుట్ట వే,
ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్ప ప్రీతి సంధించుచున్, విలస
చ్ఛాయ సుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ, గల యీ
భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేదికిన్. విరా. 2-186

2. ఆచరింపఁదగనిది.

క. పడియుఁ దలఁప నసేవ్యము, గా దాశ్రమ సమితిలోనఁ గావున

శుచులై, యే దాన నున్న సంసారోదధి యా దరికిఁ బోవ నోపు
దురు బుధుల్. శాంతి. 5-340

**అసౌఖ్యము** సం. వి. అ. న.

సౌఖ్యముగానిది, కష్టము, కష్టమైనది.

చ. ...అసౌఖ్యపుఁ జోటని సమ్మతించితిన్. అను. 2-481

**అసౌమ్యము** సం. విశే. (అ. ఈ. అ.)

ఒప్పిదముగానిది, తిన్ననైనది కానిది, మనోజ్ఞము కానిది.

క. సౌమ్యాసౌమ్య బలులు విను, సౌమ్యాసౌమ్య ప్రకార జన
కృత్యంబుల్, సౌమ్యనృపోత్తమ యయ్యె, కామ్యముఁ దత్త
త్ప్రపూజ్య కరణిం జేయున్. అను. 4-31

**అసౌమ్యుఁడు** సం. వి. అ. పుం.

అయోగ్యుఁడు.

క సౌమ్యు లసౌమ్యుల భంగి న,సౌమ్యులు సౌమ్యుల విధమున జన
వర చిత్తాగమ్యతఁ దోఁతురు వారిని, సమ్యఙ్నిశ్చయతఁ గాంచు
చందము సెపుమా. శాంతి. 3-52

**అస్ఖలము** సం. విశే. (అ. ఆ. అ.)

తొలఁగనిది, స్థిరమైనది.

సీ. ...ఉంచవృత్తి మహీసురోత్తముం, డస్ఖలనియముండు...
శాంతి. 6-610

**అస్ఖలిత** సం. విశే. ఆ. స్త్రీ.

సీ. (ధర్మరాజు) నిత్యసత్యవ్రతంబుగా సత్యంబు పాలించు నిష్ఠ యస్ఖ
లితగా నెఱపె నితఁడె. శాంతి. 1-867

**అస్ఖలితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. చలింపనిది, స్థిరమైనది.

చ. (దుశ్శాసనుఁడు దుర్యోధనునితో) వలవదు రోయఁ బాండవుల
వారొక యూఱట లేని త్రిమ్మటన్, బలమఱి వన్యసత్త్వముల
పాల్పడి చచ్చినచోటఁ బూరియు, నొమ్మలవదె యింతకింకిట మనో
ముద మస్ఖలితంబుగాఁగ విచ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగు చంద

మునం గొనియాడు మున్నతిన్. విరా. 3-95

2. చ్యుతిలేనిది.

ఉ. ...నిష్పంద నిరంజనాస్ఖలిత శాశ్వత నిర్మల వైభవా.
ద్రోణ. 4-338

3. ప్రమాదములేనిది, ఏమఱుపాటు లేనిది.

సీ. ...భవత్సతియుఁ బవిత్ర యస్ఖలిత చరిత... అను. 1-80

4. విడువనిది.

క. ఫలమూలౌషధి శాకంబులుఁ బశుమృగ తతులు భక్ష్యములుగా
భూతంబుల కజుఁడు సేసె నవి యస్ఖలితంబుగ మ్రోయు శ్రుతు
లఁ గాదనవశమే.(అస్ఖలితంబుగ = మానక, విడువక) అర. 5-54

**అ_స్తమయము** సం. వి. అ. పుం.

(సూర్యాదులు) అ_స్తమించుట, క్రుంకుట, కనఁబడకుండుట.

క. అ_స్తమయమునకు మును రిపు, మ_స్తకముం దునుమవలయు మన
కిది పోలన్, దు_స్తరము నగు న_స్త్రవ్య_స్తం బగునేని వాఁడు వగవు
గదిరెడున్. ద్రోణ, 2-308, ఉద్యో. 3-147

**అస్తమించు** స. అ. క్రి.

1. క్రుంకు.

క. ఇనుఁ డ_స్తమింపకుండఁగ, మును సైంధవుఁ జంపువాఁడ.
ద్రోణ. 2-352

సీ. ...ఇంక నొక్కించుక, ప్రొద్దాఁగి పెనఁగినఁ బ్రొద్దు దాను,
న_స్తమించెడును నీ యట్టి జోదునకు... ద్రోణ. 4-291

ఆ. అధిప భీష్మభానుఁ డ_స్తమించె... భీష్మ, 1-47

2. మరణించు.

వ. అతం డ_స్తమించిన ధాత్రి య_స్తమిత సుధాగభ_స్తి యగు రాత్రియుం
బోలె నగు.... శాంతి. 2-15

వ అట్టి వ్యుషితాశ్వుండు కాక్షీవతియైన భద్రయను తన భార్య
యందు ననవరత కామాసక్తిం జేసి యక్ష్మరుజాక్రాంతుండయి
య_స్తమించిన. ఆది 5-80

**అస్తమితము** సం. విణ. (అ. ఆ. అ.)

అస్తమించినది.

వ. అతం డస్తమించిన ధాత్రి యస్తమిత సుధాగభస్తియగు రాత్రియుం బోలె నగు. శాంతి. 2-15

**అస్తమితుఁడు** సం. వి. అ. పుం.

అస్త మించినవాఁడు.

తే. ధర్మచే నస్తమితుఁ డగుఁ దపనుఁ డమ్మ, హాత్మునకు సత్యమాధార మంద్రు బుధులు. అర. 7-423

**అస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

క్షిప్తము, త్రోయఁబడినది, నశించినది.

క. అన విని తెలిసి విడిచె న,ర్జునకుఁడు భుజగము నహాస్తరోషుండగుచున్ అను. 1-40

వి. అ. పుం.

(సూర్యాదులు) అస్తమించు కొండ.

క. అస్తశిఖరికి జేరెం, దోయజ మిత్త్రుఁడు. భీష్మ. 2-252

**అస్తవ్యస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

తాఱుమాఱైనది, వ్యత్యస్తము.

క. అస్తమయమునకు మును రిపు, మస్తకముం దునుమవలయు మన కిది సాలన్, దుస్తరమును నగు నస్త,వ్యస్తంబగునేని నాకు వగవు గదిరెడున్. ద్రోణ. 2-303

వ. కొందఱు నెఱయ మేల్కనని భ్రమను భయంబునను బాదంబులు గుదివడఁ బాఱలేక నెల వెడలిన యెలుంగుల నస్తవ్యస్తపు మాట లాడ. సౌప్తి. 1-197

**అస్తాద్రి** విం. వి. ఇ. పుం.

అస్తమయ పర్వతము (శ్లే అస్తగిరి మొ)

క. దరోజ్జ్వలాఁడా భీష్ముఁ డ,హార్పతి యస్తాద్రి సేరునట్లునఁ బడి యెన్. భీష్మ. 3-412

**అస్తీకుఁడు** సం. వి. అ. పుం.

ఆస్తీకుఁడు, జరత్కారుని కొడుకు. చూ, ఆస్తీకుఁడు.

వ. అయ్యుధిష్ఠిరానుజ పుత్త్రపౌత్త్రుఁ డత్తెఱంగున భుజంగంబుల యాపద దీర్చిన యస్తీకు నభ్యర్చనంబున నత్యంత సంతుష్టునిం జేసి... స్వర్గ. 79

**అస్తోకము** సం. విశే. (అ. ఆ. అ.)

అల్పము కానిది, అధికము.

శా. దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర, ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్.

విరా. 2-56, శాంతి. 6-658

**అస్త్రగురుఁడు** సం. వి. ఉ. పుం.

ద్రోణాచార్యుఁడు.

తే. అందఱ కన్ని రూపులై మహారణ మొనరించె నస్త్రగురుఁడు.

భీష్మ. 3-245

**అస్త్రము** సం. వి. అ. న.

1. బాణము.

మ. అనుచుం దంద్రిద శేంద్రసూనుఁడు రయం బత్యంతఘోరముగా, ఘనశాతోజ్జ్వల దుర్నివార విలస త్కాండంబులన్ ద్రోణు వా,హన సూత ధ్వజదేహముల్ వొదివె నిట్లస్త్రాద్ధి నిగ్రగ్నుఁ జే,సిన హాహా నినదంబు లొక్కట మ్రోగెఁ జేర్చెన్ సర్వసైన్యంబులన్. విరా 5-137

క. కనుఁగొని శిఖండి వెస మ్రొక్కని భీష్మని నేసె మూఁడు క్రూరా స్త్రములన్. భీష్మ. 3-320

2. మంత్రచోదితమైన బాణము.

శా. ...అప్పార్థుఁ డాగ్నేయాస్త్రం బరిఁబోసి దారుణ మహాగ్ని జ్వాలికల్. కర్ణ. 3-337, కర్ణ. 3-289, కర్ణ. 2-46, ద్రోణ. 5-402

3. ఆయుధము.

ఆ. అస్త్రదర్శవాగశాఖల క్షత్రియ వైశ్య శూద్ర వివిధ వర్ణజనుల

కలకలంబు. ఆది. 6-7

తే. వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్ర విద్యలందు, వీఁడె యగ్రగణ్యుఁడు. ధర్మవిదులలోన, వీఁడె భరతవంశం బెల్ల వెలుఁగఁ గుంతి, కడుపు, చల్లగాఁ బుట్టిన ఘనభుజుండు.

వ. ...'దాఖడ్గాది వివిధాయుధ దక్షతం జూపి యర్జునుండు.

ఆది. 6-18, 27

**అస్త్రవిద్య** సం. వి. ఆ. స్త్రీ.

1. విలువిద్య, అస్త్ర ప్రయోగోపసంహారములను దెలుపు శాస్త్రము.

శా. జామదగ్న్యకలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యుఁ డీ, రాధేయుఁడు.

విరా. 5-11

క. .. నిన్నున్, వాడిఁ మగఁ డనుట యుడుపుడు, వేఁడిమి సొంపెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్. భీష్మ. 3-325

2. ఆయుధ విద్య.

తే. వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్ర విద్యలందు. ఆది. 6-18

**అస్త్రీలోలుఁడు** సం. విశే. అ. పుం.

స్త్రీలకు వశముగానివాఁడు.

మ. ...అశరుఁ డస్త్రీలోలుఁ డక్రోధనుం, డరి నొవ్వంగొనఁ డన్యాగ్రక్త గను రా జత్యంత దీప్తుం డగున్. శాంతి. 2-296

**అస్థి** సం. వి. ఇ. న.

ఎముక.

వ యుధిష్ఠిరానుజాతి నిష్ఠుర భల్లభజ్యమాన బలవదరాతి ఖరాస్థి నిస్వనంబులను. విరా 5-60

తే. రక్తమాంస మేదోస్థి మస్తిష్క మయతఁ జూడ. ద్రోణ. 3-158

**అస్థిబంధము** సం. వి. అ. పుం.

కీలు.

సీ ...రవిసుతు రథ్యసారథుల నొంచి, వర్మమంతయుఁ ద్రుంచివైచి మర్మాస్థి బంధములు భేదించి విక్రమము నెఱపి. విరా. 5-66

అస్థిమాల సం. వి. ఆ. స్త్రీ.

ఎముకలదండ.

శ్లో. కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహు మన్యసే త్వమ్, కిం కాలకూటః కిము వా యశోదా_స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే" యని నీవు తొల్లి రచించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి. (చూ. కిమ్) విరా. 1-11

అస్థిమాలిక సం. వి. ఆ. స్త్రీ.

ఎముకలదండ.

క. ఆ_స్తికచేత స్సహితా, కౌస్తుభ రత్నాస్థి మాలికా శబలిత వ,క్షస్థల. ద్రోణ. 4-336

అస్థిర సం. విణ. ఆ. స్త్రీ.

చంచలమైనది, స్థిరముకానిది.

సీ. ...ఆక్షరక్షర భేద, మీవు సెప్పితి బుద్ధి యెంతయేని నస్థిర గాన యయ్యవబోధమను మానె. శాంతి. 6-86

అస్థిరత సం. వి. ఆ. స్త్రీ.

అశాశ్వతము.

ఆ. భావములు నిజస్వభావంబునన తోఁచు, నడఁగు నట్లుగాన యస్థిరతకు, నెలవు లని యెఱుంగ నేర్చిన భావంబు, లందుఁ దగులు నెట్లు డెంద మనఘ. శాంతి. 4-375

అస్థిరత్వము సం. వి. అ. న.

అశాశ్వతము.

సీ. భూతా_స్థిరత్వంబు బుద్ధిగానమి లోభ మనఘ జనించుఁ గాంచిన నడంగు. శాంతి. 8-421

తే. అర్థముల యనిత్యత యెఱిఁగినఁ గందె వికృతి. శాంతి. 5-898, శాంతి. 6-847

అస్థిరము సం. విణ. (అ. ఆ. అ.)

1. అశాశ్వతము

క. తుదిఁ బోయి క్రూర కర్మా,స్పదమగు తెఱఁగునకుఁ జొచ్చు

బంధుల గురులన్, వెసకి వధియించు సౌఖ్యం, బది యేటికి నార్య
నింద్య మస్థిర మరయన్. ఉద్యో 1-382

తే అర్థవంతుఁడై భోగంబు లనుభవించుచున్న యప్పుడ యిది యిట్లు
లుండనేర, దస్థిరమ తాను లోనగా నని యెఱుఁగు, నతఁడు
వగఁ బొందఁ డేది యెట్లైన నధిప. శాంతి, 3-27, శాంతి. 4-316

2 చంచలము, నిలుకడలేనిది.

తే అస్థిరేంద్రియ సలిలమయంబుఁ గామ, రోష దారుణ గ్రాహదూషి
తంబు, నైన సంసారసాగర మతులధైర్యపోతపాత్రిక నిస్తరిం
పుము కుమార. శాంతి. 6-228

**అస్థిసారము** సం. వి. అ. న.

ఎముకలలో నుండు చమురు పదార్థము, మజ్జ. మూలగ. (దీని నుండియే
శుక్రము జనించును.)

సూ. ఆ. నిఘంటువున అస్థిసారమునకు అస్థికృత్తు అనియు అస్థికృత్తు
నకు మజ్జ, మూలగ అనియు నున్నది. అస్థికృత్తు మేదస్సుగాని
మజ్జ కాదు.

శ్లో. రసాద్రక్తం తతో మాంసం మాంసా న్మేద స్తతోఽస్థి చ,
అస్థ్నో మజ్జా తత శ్శుక్రం శుక్రా ద్గర్భః ప్రజాయతే.
అష్టాంగహృదయము-శరీర-3 అధ్యా. 62, 63 శ్లో.

వ. మొక్కలు వోయిన నస్థిసారంబులగు నశ్వశరీరంబులు గోసి పాఱ
వైచి- భీష్మ. 2-71

[ఇక్కడ అస్థిసారము=ఎముకల యొక్క చేవ (మజ్జ) యని యర్థము
మజ్జ ఆఱిపోయిన ఎముకలు నిస్సారములగును. మజ్జ ఎంత ఎక్కువగా
నున్న ఎముక లంత పటిష్ఠముగా నుండును. వ్యవ:- ఎముకలలో సున్నము
లేకుండ తన్నెదను.]

**అస్థిభూతము** సం. వి. అ. న.

ఎముకల చేసైనది. (ఎముకలు మాత్రము మిగిలినది)

వ. సంయాతి యప్పుడా పుట్టయొద్దకు వచ్చి యందుఁ దపఃక్లేశత్వ

గస్థిభూత శరీరు నతివృద్ధు భార్గవుం గని నమస్కరించి.
ఆర 3-180

**అస్థైర్యము** సం. వి. అ. న.

అస్థిరత్వము.

మ. ...అర్కేందు భూ,జల తేజః పవనాంబరంబులకు నస్థైర్యంబు
గాకుంట ని,శ్చల శక్తి స్థితి నీగి. ఆర. 5-225

**అస్పందము** సం. విణ. (అ. ఆ. అ.)

చలింపనిది, నిశ్చలము.

ఆ, అస్పందబోధఘను ముకుందుఁ దలఁతు. శాంతి. 2-49

**అస్పందితము** సం. విణ. (అ. ఆ. అ.)

తొలఁగనిది, చలింపనిది.

ఉ. ...నన్నుఁ బతివ్రతాగుణా,స్పందిత వర్తనం బరమసాధ్వి ననిందిత
శీలఁ గీచకుం, డెందును నెట్టి యంగనల నెవ్వరుఁ జేయని యట్లు
సేయఁగా... విరా. 2-142

**అస్పందితుఁడు** సం. విణ. అ. పుం.

క. అతి దృఢీకృత శిలా స్పందితుఁ డగుము. శాంతి. 5-17

**అస్పర్శనము** సం. విణ. (అ. ఆ. అ.)

తాఁకకుండుట.

క. భూతంబుల దర్శింపమి, భూతాస్పర్శనము భూతములయెడ
సంభా,షాతరలత నొందమి సూ,రే తెరువు విమోహసుఖ గరిష్ఠత
వడయన్. శాంతి 6-314

**అస్పష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

స్పష్టముగానిది.

వ. విషమ కావ్యంబునుందోలె నస్పష్టాలంకారంబును. విరా. 2-325

**అస్ఫీతము** సం. విణ. (అ. ఆ. అ.)

అల్పము.

ఉ. ..అ,స్ఫీతములైన భారవహ జీవనముల్ దలపం గనిష్ఠముల్.
ఉద్యో. 2-71

**అస్ఫురత్** సం. శ(త్ర.

కాంతి విహీనమగుచున్న, అస్పష్టమగుచున్న

చ. ....వచ్చి చొచ్చి రజ్జనములునుం బరికితుఁడు సామజపట్టన మస్ఫురద్గతిన్. మహా. 21

(ఇది తెనుఁగున సమాసపూర్వ పదముగానే వాడఁబడును.)

**అస్మత్** సం. స.

(ఇది తెలుఁగున సమాసపూర్వపదముగనే యుపయుక్తము.)

1. నా యొక్క.

క. ననుఁ గుచ్ఛితంపుఁబనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక తగుమన్ననతోడి నరయు వారల, కనురాగము నెఱపి నడతు రస్మత్స్మృతులున్. విరా. 1-329

2. మా యొక్క.

((బ్రాహ్మణులు పాండవులతో)

వ. అస్మత్పోషణోపాయ చింత సేయ వలదు. వన్యమూల ఫలంబుల నేమ తెచ్చికొని యుపయోగించుచు జపహోమాది పుణ్యక్రియల మీకుం బ్రియంబు సేయుచు నుండెదము. అర. 1-17

3. మనయొక్క

శా. ...అస్మత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. విరా. 4-95

**అస్మదీయము** సం. విశ. (అ. ఆ. అ.)

1. నాది, నా సంబంధమైనది.

తే. ...అస్మదీయ ప్రణామంబు నాదరించి, తుష్టి దీవించి కరుణార్ద్ర దృష్టిఁ జూచి, యెలమి యిట్లని యానతి యిచ్చె నాకు.

విరా. 1-10

క. అనిన విని బూరు విట్లను, ననిలుని బల మస్మదీయమైన బలముతో, నెన గాదేర్పడ వినుమ, పదునెనిమిది యగు నంశమునకు నెనయ దర యఁగన్. శాంతి. 3-385

2. మా సంబంధమైనది.

క. నా చిత్తము శాస్త్రులకు, గోచరమే యస్మదీయ కులజన సంశీ, ాచార మహిమ యట్టిది,యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్
విరా. 1-327

3. మన సంబంధమైనది.

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ,యాతత సేనలోఁ గలుగు టారయ సంశయము. విరా. 1-96

**అస్మాదృశుఁడు** సం. విణ. (అ. ఈ. అ.)

నావంటివాఁడు, మా వంటివాఁడు.

సీ. అస్మాదృశులకు ధర్మానుబంధుల కిట్టి క్రోధంబుదాల్చుట గుణమె చెపుమ. అర. 1-222

**అస్మేరము** సం. విణ. (అ. ఆ. అ.)

నిగూఢము, గంభీరము.

సంత తాస్మేరమతీ. అర. 6-1

**అస్రగంధము** సం. వి. అ. పుం.

నెత్తురుకంపు.

వ. ...పవనతనయుం డట్లు సని మహానస మందిరంబు పరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున నస్రగంధం బుడిపి కొని. విరా. 3-2

"అసృగ్గంధము" అని కొన్ని ప్రతులు. సం.ము వారు "విస్రగంధము" పాఠాంతరముగా నిచ్చినారుగాని "అస్రగంధము" ఈయలేదు.

"రుధిరేஉసృగ్లోహి తాస్రరక్తక్షతజశోణితమ్" అని అమరము.

(అనుశేవణే-చర్మము తెగిన మాత్రమునఁ బ్రవహించునది)

**అస్రము** సం. వి. అ. న.

నెత్తురు. చూ. అస్రగంధము.

**అస్వతంత్రత** సం. వి. ఆ. స్త్రీ.

అస్వాతంత్ర్యము, స్వాతంత్ర్యము లేమి.

సీ. ...మంత్రులుఁ బ్రేమపాత్రతరుణులు నస్వతంత్రతఁ జేయ...
శాంతి. 6-200

**అస్వప్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
నిద్రపోనివాఁడు, పగటిపూట నిద్రపోనివాఁడు.
వ. సదోపవాసియు సదాబ్రహ్మచారియు నమాంసభోజియు విఘసా శనుఁడును నమృతాశియు నస్వప్నుండునుం గావలయుఁ దత్ప్వరూపంబు లెట్టివనంటేని-
సీ. దివసంబునందు నిదురవోని పుణ్యుఁ డస్వప్నుఁడు.
శాంతి. 4-367, 368

**అస్వాతంత్ర్యము** సం. వి అ. న.
స్వేచ్ఛ లేకపోవుట, పారతంత్ర్యము.
తే. పుత్రభావ మస్వాతంత్ర్యమునకు నెలవు. శాంతి. 5-267

**అస్వాస్థ్యము** సం. వి. అ. న.
వ్యాకులత, క్షోభము, సౌఖ్యము లేమి.
వ. అట్టివి దేవదేవుని దివ్యలీల లతండు కోపించిన భువనంబు లస్వాస్థ్యంబును బ్రసన్నుండైన సుఖిత్వంబును గను. సౌప్తి. 2-188

**అస్వేదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఒంటికిఁ జెమట పట్టనివాఁడు.
వ. శ్వేతద్వీపంబునం దనాహారులు, నింద్రియ వృత్తి రహితులు, నస్వేదులు, సుగంధి శ్వేతాంగులు నగు పురుషులం గాంచె.
శాంతి, 6-853

**అహఃపతి** సం. వి. ఇ. పుం.
సూర్యుఁడు.
క. ...అహఃపతి నా మీఁదఁ గృపాసంగతమగు తన చూడ్కి వోల యఁగా వత్సలుఁడై, శాంతి. 6-609

**అహంకరణము** సం. వి. అ. న.
అహంకారము, గర్వము.
చ. వెరవరిగాన వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె యచ్చెరు

వొక బ్రూనివేర నిటనేరఁగ వచ్చుచు నున్న వాఁ డహంకరణము
కాని యొండొకటి గానఁడు. విరా. 4-91; శాంతి. 5-93

**అహంకరించు** సం. అ. క్రి.

అహంభావముతో నుండు, గర్వించు, దురభిమానమొందు.

సీ. వతు లాత్మ నొండొక్క పడఁతులఁ గలసిన, నలుగ నెయ్యెడల
నహంకరింప. అర. 5-300

**అహంకారము** సం. వి. అ. పుం.

1. నేను అనెడి అభిమానము, గర్వము.

క. ఇది యేమి కంక నీవు,న్మదన వృత్తిని శంకదక్కి నాగద్దియపైఁ, బవి
లంబుగఁ గూర్చుండితి, వదియునుగా కిపుడు డిగవహంకారమునన్
విరా. 5-318

క. కృష్ణ విజయులలో నొ,క్కనిఁ బోరిపుచ్చెదఁ జూడుం, డనుచు
జనున్ సూతుసుతుఁ డహంకారముతోన్. ద్రోణ. 5-287

2. మహత్తత్త్వము వలనఁబుట్టి పంచ తన్మాత్రలకుఁ గారణమైన శక్తి
భేదము (ఇది మహత్తు వలనఁ బుట్టెను. దీనివలన ఆకాశము పుట్టెను.)

క. చైతన్య శక్తిఁ బురుష స,మేతత్వ విశేషమున వహించుఁ బ్రకృతి
త,జ్జాతయగును బుద్ధి తదు,ద్భూత మహంకార మదియుఁ
బోరయుఁ జిత్తున్. శాంతి. 4-270

క. కలిగె వినుమహంకారము, వలన నభము దానఁజేసి వాయువు
గ్రమ సం,కలిత జననములఁ దేజము, జలము నిలయుఁ దత్త
దాత్తజన్యత్వమునన్.

వ. బుద్ధికి మహత్తను తత్త్వ నిర్దేశనంబునుం గలిగియుండు.
శాంతి. 4-270, 271, 272

**అహంకారి** సం. విణ. (న్. జి. న్.)

అహంకారము గలవాఁడు.

క. ఆ రాజన్యు నెడ నహం,కారిత మమకారితయును గర్తవ్యముగా
దేరికి. శాంతి. 6-260

**అహంకారిత** సం. వి. ఆ. స్త్రీ.

అహంకార భావము. చూ. అహంకారి.

**అహంకృతి** సం. వి. ఇ. స్త్రీ.

1. అహంకారము.

చ. అకుటిలుఁ డార్య సమ్మతుఁ డహంకృతి దూరుఁడు గొంతి ముద్దు సేయు కొడుకు. విరా. 1-98, శాంతి. 2-232

2. మదము, గర్వము.

(సుశర్మ దుర్యోధనునితో) ఉ. ...అతనిం (విరాటుని) జెఱుపం దటి యయ్యె ముట్టిస,ప్తాంగముఁ జూఱ దెచ్చెద న హంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. విరా. 3-119

**అహంకృతి పురుషుఁడు** సం. వి. అ. పుం.

అహంకారాభిమానియైన మహారుద్రుఁడు.

వ. ప్రళయ ప్రకారంబు వినుము రాత్రియగుటయు నవ్యక్తం బహంకృతి పురుషు బోధించిన నతండు పంద్రెండు మూర్తులు గైకొని. శాంతి. 6-88

**అహంత** సం. వి. ఆ. స్త్రీ.

అహంభావము.

క. త్వంతాహంతా నిరసన, శాంతాంతఃకరణ యోగిజన విజ్ఞేయా, చింతా సాగరమగ్న, భ్రాంతజనాధ్యేయ వరమశక్తి విధేయా. స్త్రీ 2-185

**అహంయాతి** సం. వి. ఇ. పుం.

ప్రాచీనుని మనుమఁడు సంయాతికి వరాంగికిఁ బుట్టినవాఁడు. ఆది, 4-2

**అహము** సం. వి. స్. న.

దినము, రేయుంబవలు.

సీ. అధిప రజస్వల నంటుట కల్మష మాచరితస్నానయైన సతిఁ జతుర్థ దినంబున దోషాసమయమునఁ జెందఁగఁ దగు నంద్రు గొంద ఱార్యు, లేనవవాఁ డొందె నింతియు షష్ఠాహమునఁ బొందె మగ

వాఁడు బుట్టు, అను. 4-128

సీ. ...సప్తాహములలోన, నా పరీక్షితుఁడు నా యలుకఁజేసి, తక్షక విషమున దగ్ధుఁ డయ్యెడు. ఆది. 2-180

పగలు.

ఉ. అతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచునుండు వా,రే తప మాచరించిరో యుపేంద్రుని నాశ్రితవత్సలున్. ఉద్యో.2-380

**అహర్నిశము** సం. వి. అ. న.

పగలును, రేయును, ఎల్లప్పుడు.

ఉ. అతనిఁ గన్నులార నహర్నిశముం గనుఁగొంచునుండు వా,రే తప మాచరించిరో యుపేంద్రుని నాశ్రితవత్సలున్... ఉద్యో. 2-380

**అహర్పతి** సం. వి. ఇ. పుం.

సూర్యుఁడు.

క. దర్పోజ్జ్వలుఁ డా భీష్ముఁ డ,హర్పతి యస్త్రాద్రి సేరునట్లుగఁ బడి యెన్ భీష్మ. 3-412

**అహల్య** సం. వి. ఆ. స్త్రీ.

గౌతమ మహర్షి భార్య.

సీ. అహల్యకై యింద్రుండు, గౌతము డలిగిన గాసిఁబడఁడె.

చూ॰ అనుబంధము. అను, 5-340

**అహల్యాహ్రదము** సం. వి. అ. పుం.

గౌతమ వనమునందలి యొకానొక తీర్థప్రదేశము.

ఇందు స్నానము చేసినవారు అశ్వమేధఫలంబుఁ బడయుదురు. అర. 2-275

**అహస్సు** సం. వి. స్. న.

పగలు.

క. మితభోజియై వివిక్త, క్షితి సావిత్రీ జపంబు సేయు నది యహ,స్స్థితియు నిశాసీనత్వము, మతి నేమఱ కట్టులైన మాను నఘంబుల్. శాంతి. 1-317

తే. అందు మూఁడేసి ఋతువుల కయన నామ,కంబులగు నుత్తరాఖ్య
మొకండు దక్షి,ణాభిదాన మొక్కటియు గుణాభిరామ, యవి యహ
స్సును రాత్రియు ననఁగ బరఁగు, శాంతి. 5-41

**అహస్సుదినములు** సం. వి. అ. పుం. న. బహు.

ఈ తీర్థములందు స్నానము చేసినవారు సూర్యలోకప్రాప్తు లగుదురు.
అర.2-263

**అహహ** దే. అవ్య.

అధిక్షేపమును. ఆశ్చర్యమును దెలుపును.

క. వీరెవ్వరయ్య ద్రుపద మ,హారాజులె యిట్లు కృపణులయి పట్టు
వడన్, వీరికి వలసెను యహహ మ,హారాజ్య మధాంధకార మది
వానెనొకో. ఆది. 6-88

**అహార్యము** సం. విణ. (అ. ఆ. అ.)

హరింపఁదగనిది, హరింప శక్యము గానిది.

బలారికైనను నహార్యంబు. అర. 1-287

(అవార్యము అని ఆనందపాఠము)

**అహి** సం. వి. ఇ. పుం.

1. పాము.

క. భూనాయకుఁడు మరలి పటుకో,పాయత్తతఁ ద్రొక్కఁబడ్డ
యహిగతిఁ గవిసెన్. విరా. 5-206, కర్ణ. 2-45

2. నాగజాతివాఁడు.

శా. దేవా యేను సమస్త దేవ పితృ దైతేయాహి గంధర్వ ర,క్షో
విద్యాధర యక్షజాతులకు నక్షోభ్యుండఁగా. అర. 6-280

**అహింస** సం. వి. ఆ. స్త్రీ.

1. హింససేయమి, హింసలేమి.

(సంజయుఁడు ధర్మరాజుతో) ఉ. నీ విభవం బహింసయు ననింద్య
చరిత్రమ కాక యన్యమే.

ఉద్యో. 1-328, శాంతి. 1-111, కర్ణ. 3-78

2. సర్వభూతములకును మనోవాక్కాయ కర్మముల ద్రోహము తలంప కుండుట, శమము దమము హృదయమునకు నెప్పుడు నలవడఁజేయుట

అ. విను మహింస శమదమములు హృదయంబున నెప్డు నలవడంగఁ జేత యండ్రు బుధులు. శాంతి. 5-511, శాంతి. 3-412

**అహింసకత్వము** సం. వి. అ. న.

హింస సేయకుండుట.

ఆ. ...ప్రజల వలనఁ గరుణ, గలిగి వారిఁ గీడు గదురకయుండంగఁ, గావు పతి కహింసకత్వ మనఘ. శాంతి. 5-299

**అహింసకుఁడు** సం. వి. (అ. సికా. అ.)

హింసచేయుకుండువాఁడు.

తే. అన్నరేంద్రుం డహింసకుం డగుటఁజేసి, పశువిశసనంబు లేకుండఁ బరమ నిష్ఠ, నాతఁ డారణ్యకోద్గీతమైన వాక్య, సంచయము విష్ణు గుఱిచి పఠించె నధిప, శాంతి. 6-362

**అహింసనము** సం. వి. అ. న.

1. హింసింపకుండు పని.

క. అనిన విని జనక భూవిభుఁ, డనఘ యహింసనములైన యవి యెయ్యవి య,వ్వను లెఱుఁగఁ జెప్పవే వా కనుడు. శాంతి.5-510

2. అహింస, హింస చేయకుండుట.

శమపుణ్యులు సూవె యహింస నాత్మకున్. అను. 5-55

సీ. విను మధర్మం బహింసనమున నెడలు ధర్మంబు సంకల్పవర్జనము చేత నవాప్తిఁ బొందు. శాంతి. 6-320

**అహికేతనుఁడు** సం. వి. అ. పుం.

సర్పము ధ్వజమున గుర్తుగాఁ గలవాఁడు, దుర్యోధనుఁడు.

క. అహికేతను పల్కులకు మహోత్సవమునన్. విరా. 3-128

**అహికేతువు** సం. వి. ఉ. పుం.

సర్పధ్వజము, దుర్యోధనుని ధ్వజము.

వ. అయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహికేతు మహితంబై

వచ్చుచున్న ధృతరాష్ట్రనందన స్యందనంబునకు సమ్ముఖంబుగా మన రథంబు నడుపుమనుటయు. కర్ణ. 1-191

**అహిచ్ఛత్రము** సం. వి. అ. పుం.

1. దుర్యోధనుని దండు విడిసినచోటు.

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రౌహితకారణ్యంబున మరు దేశంబున నహిచ్ఛత్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున విచ్చలవిడి విడిసి. ఉద్యో. 1-228

2. అర్జునుఁడు ద్రుపదుని జయించినపుడు ద్రోణున కిచ్చిన యొక దేశము. అని సంస్కృత భారతమునఁ గలదు.

శ్లో. పుత్రజన్మపరీప్సన్ వై పృథివీ మన్వసంచరత్,
అహిచ్ఛత్రం చ విషయం ద్రోణ స్సమభిపద్యత.

శ్లో. ఏవం రాజ న్నహిచ్ఛత్రాపురీ జనపదాయుతా,
యుధి నిర్జిత్య పార్థేన ద్రోణాయ ప్రతిపాదితా.

సం. భా. ఆది. 1-38, 76; 77 శ్లో.

**అహితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రియముగానిది, ఇష్టముగానిది, ప్రతికూలము, విరుద్ధమైనది.

వ. అగ్గోమాయువు దదీయ హితాహితంబు లరసి బుద్ధి సాచివ్యంబు సేయు తెఱంగును జూచి. శాంతి. 3-61

వి. అ. న.

చెఱుపు, హాని, కీడు

వ. ఎఱింగి కూడుకొని గోవుల కడకువచ్చి వానితో నగ్ని దాఁచుట యఖిల జగజ్జనంబులకు నహితంబు సేయుటగాదె.

అను. 3-102 అను. 1-294

**అహితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

శత్రువు,

చ. అహితుల కప్రభేద్యమగు నా పదమూఁడగు నేఁడు మత్పితా,
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. విరా. 1-44

**అహిభంజనుఁడు** సం. వి. అ. పుం.

కాళింగుని మర్దించినవాఁడు. శ్రీకృష్ణుఁడు.

(అర్జునుఁడు) క. ...అహిభం,జన తేరు నడపు గురుబల, విని పాతన పాటవమున విహరించుటకున్. భీష్మ. 3-158

**అహిమద్యుతి** సం. వి. ఇ. పుం.

సూర్యుఁడు.

క. సద్యోగర్భంబున నహి,మద్యుతితేజుండు వేదమయుఁ డఖల మునీం ద్రాద్యుఁడు వేదవ్యాసుం, డుద్యత్జ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్. ఆది. 3-44

**అహిర్బుధ్న్యుఁడు** సం. వి. అ. పుం.

ఏకాదశరుద్రులలో నొకఁడు.

వ. వారల నేకాదశరుద్రులుగా నెఱుంగుము.

తరువోజ. అనఘాత్మ యజపాదుఁ డన నహిర్బుధ్న్యుఁ డనఁ గడు విల సిల్లి. అను. 8-57, 58

**అహీనత** సం. వి. ఆ. స్త్రీ.

ఆధిక్యము.

సీ. ...జగతి నెందు నితనికిబోలె నహీనత మెఱయునే, యెవ్వరికైనను నిట్టి పుణ్యుఁ గుత్సితదశ యెట్లొకో. మహా. 38

**అహీనము** సం. విణ. (అ. ఆ. అ.)

తక్కువకానిది, ఎక్కువయైనది, అధికము.

ఉ. ...అహీన పరాక్రమశాలి యర్జునుఁడు.

ఉద్యో. 1-253, ద్రోణ. 4-387

**అహీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అధికుఁడు, గొప్పవాఁడు.

ఉ. ...పరమేశ విక్రమా,హీనులఁ బాండునందనుల నేపుర సైన్య యుతంబుగా ననిం,బూని జయించునట్టి వరముం గృపసేయుము నాకు నావుడున్. అర. 6-255

**అహుఁడు** సం. వి. ఉ. పుం.

అష్టవసువులలో నాలవవాఁడు. చూ. ఆది. 8-57.

**అహైతుకము** సం. విశే. (అ. ఆ. అ.)

కారణము లేకుండఁ గలిగినది.

ఆ. ...అయ్యవ్యక్త, మణువు నిత్య మేక మక్రియం బహైతుకంబు
చక్షురాదుల కగ్రాహ్య, మది ప్రధాన మనఁగ నతిశయిల్లు.
అను, 5-245

**అహోరాత్రము** సం. వి. అ. పుం.

పగలును రేయును.

తే. మూఁడుపదులు ముహూర్తమున్ మోహదూర, యగు నహో
రాత్ర మట్టివి యన్నిగూడ, మాసము. శాంతి, 5-40

**అహోరాత్రములు** సం. వి. అ. పుం. బహు

పగలును, రేయును.

వ. అమ్మిథునం బహోరాత్రంబు లయ్యార్వురు ఋతువులు.
అను. 2-218

**అహోరాత్రవిదుఁడు** సం. వి. ద్. పుం.

బ్రహ్మయొక్క పగలురాత్రి ప్రమాణము ఎఱిఁగినవాఁడు,

తే. ఆ యుగంబులు నాల్గు మహాయుగంబు, నాఁగఁ జనుఁ దత్సహ
స్రంబు నలువపగలు, దాని కోలఁదియ రేయును దీని నెఱుఁగు,
ప్రౌఢజనములు సు మ్మహోరాత్రవిదులు. శాంతి. 5-54

**అళకము** వై. వి. (√అలర్కము)

ఒకజాతి కీటకము.

గీ. అళకమనియెడు నొక కీట మద్దిరేంద్ర,తనయు క్రిందొడఁ దొలిచె
సత్వరముగాఁగ. శాంతి. 2-21

శ్లో. దదర్శ రామ స్తం చాపి కృమిం సూకరసన్నిభమ్.

శ్లో. అష్టపాదం తీక్ష్ణదంష్ట్రం సూచీభిరివసంవృతమ్
రోమభిస్సన్నిరుద్ధాంగ మలర్కం నామ నామతః.
సం. భా. శాంతి. 12-13

**అళి** సం. వి. న్. పుం. (అలి)

తుమ్మెద.

సీ. ఉభయ పార్శ్వంబుల నిభఘట లేలకో చను దేవు సమదాళి సమితి మొరయ, విరా. 1-186

క. విను మళి యలరునఁ దేనియ గోమగతి. శాంతి. 3-460

**అళిని** సం. వి. ఈ. స్త్రీ. (అలిని)

ఆఁడు తుమ్మెద.

చ. ...సంపత దళినీ నినాద మృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్. ఆది. 4-17

**అళుకు** దే. అ. క్రి.

వెఱచు, భయపడు.

తే. పాపమయ్యెఁ గాకుండె నప్పనిఁ దలంచి, యళుకుచుండుదు మద్భయ మపనయింపుఁడు... ఆశ్ర. 2-105



**ఆ**[1] దే.

కొన్ని పదాంతములకు సంబోధమునందు విభాషను ఆదేశముగావచ్చును.

క. చేరఁ జనుదెంచి పాండవవీరుఁడు మత్స్యాధిపునకు వినతుండై దేవా రాజవాహనములగు, వారువముల నరయనేర్తు వల నేర్పడఁగన్. విరా. 1-261, విరా. 2-91

(ఆ. అనుడు నకులుఁ డిట్టు లను దేవ తమతమ నేర్చు పనులవెంట నెగడి బ్రదుకవలయుఁగాక. విరా. 1-266 దేవా, దేవ)

ఉ. నూయవిధియా యని దైవము దూఱు,

విరా. 2-104, శాంతి. 4-395

అ² దే.

తచ్ఛబ్దార్థము.

1. కంటి కెదురుగాఁ గనఁబడుచున్నదానిని దెల్పును.

సీ. దుర్వారగర్వోద్ధతి, నగ్నిప్రభఁబగు నారథంబు పటురయంబున
నెక్కి (కర్ణుఁడు) ద్రోణ. 1-38

వ. అతండు ప్రీతుండై యభినందింప నా సూతనందనుం గలసి తల
కడచి హిడింబానందనుం దాఁకిన. ద్రోణ. 5-203, ద్రోణ.8-19

2. దూరముగానుండి గోచరమగుచున్నదానిని దెలుపును.

సీ. ఆ సేనమీఁద నైంద్రాస్త్ర మక్కిరీటి నవ్వుచు వేయ నాటోప
మున. కర్ణ. 2-238

వ. మార్గణోజ్జ్వలంబగు దక్షిణ కరంబున నా ఫల్గునుఁ బిలిచి హాస
భాసిత ముఖుండగుచుఁ గుపితుండగు నతని కిట్లనియె. కర్ణ.2-285

3. పూర్వము నిర్దేశింపఁబడినదానిని దెలుపును.

ఉ. అ సభ కేకవస్త్ర యగునట్టి నమ్ం గొనివచ్చి. ఉద్యో, 3-111

వ. ఆ నియమాచరణంబునకు నింద్రుఁడు శంకించి. శల్య. 2-208

తే. ఆ విధమున నరి భ్రమించుచునుండు. అశ్వ, 1-197

4. ప్రసిద్ధిని దెలుపును.

తే. శాంత మానవుఁడైన యాశాంతనవుఁడు విస్మయావహాచరితుండు
వినుము వలసినపుడు విడుచుటకై ప్రాణ మాఁగినాఁడు, గాదె
యొరు లంతవా రెందుఁ గలరె నరులు. శాంతి. 1-339

వ. ఇట్లు చతుర్విధాహారంబుల నందఱం దృప్తులం జేసియున్న యా
నందినిం జూచి విశ్వామిత్రుండు విస్మితుండయి. ఆది. 7-97

[దీనికి ఆమ్రేడితమున అయ్యయి (అను. 2-394, మౌస. 198) అయ్యై
(విరా. 1-184) (అను. 8-308) అనురూపములు గలవు.

౬. నిర్దేశ్యమును దెల్పును.

శా. ఆ రూపం బవికార మా భుజబలం బత్యంత నిర్గర్వ మా, శూర
త్వంబు దయారసానుగత మా శుంభ త్ర్కియాజ్ఞాన మా, రాయ్యరంభ
ప్రతికూలవాద రహితం బా యీగి సమ్మాన విస్తారోదాత్తము
మాద్రి పిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్. విరా. 2-209

౭. విభక్తి వివక్షించునపుడు 'ఉన్న, కల, న' వర్ణకములపై మహత్తునకు
రెండు వచనములయందును మహతికి బహువచనమునందును
వచ్చును.

తే. శాంతమానసుఁడైన యా శాంతనవుఁడు, విస్మయావహాచరి
తుండు వినుము వలసి,నపుడు విడుచుటకై ప్రాణమాఁగినాఁడు,
గాదె యెరు లంతవా రెందు గలరె నరులు. శాంతి. 1-389

తే. చనునె యిన్మాటలాడ సజ్జనుల కాఁడుఁ, బుట్టువులతోడ నీవును
బుట్టినాఁడ, వట్లుఁ గాకయు హీనవంశాభిజాత, నైన పతిపత్నినగు
నన్ను నడుగఁదగునె. విరా. 2-50

ఆ[3] దే. అవ్య.
ప్రశ్నార్థకము.

ఉ. అమ్మని శిష్యుఁ డయ్యువిద యంగము వాసి నిజాంగవర్తియై
యమ్మరుదీశుతో మఱచితా మును మూఁడిన యబ్జగాంకిత, త్వ
మ్మొక భంగి నీఁగు టిది దైవత సంయమి సేవనీయ భావమ్మ
గలట్టె నీకుఁ దగవా యిసిరో యని పల్కి వెండియున్.
అను. 2-200

ఉ. ...అస్త్రశస్త్ర విద్యానిపుణుండు క్రీడి సుఖయా.
ఉద్యో 3-186

క. భవదీయ తేజో, ధనహానికిఁ గరుణపుట్టదా యెవ్వరికిన్.
శాంతి. 3-298

క. ధరణీరాజ్యము నాకును, నరవర సౌఖ్యంబుఁ జేయునా.
ఆశ్ర. 1-30 ఉద్యో. 2-204
(మూఁడు నాలుఁ గుదాహరణములందు కాక్వర్థము)

2. ఆశ్చర్యార్థకము.

చ. ...తేరికి బృహన్నల సారథియైన దీని నవ్వరె పురిలోన నింత
కఱవా రథచోదకు లింత యేటికిన్. విరా. 4-20

3. సంప్రార్థనమున మధ్యమ పురుష "ము వర్ణక" "డు" వర్ణకములకు అనుప్రయుక్తమగును.

చ. నిక్కము సెపుమా తనూజ భుజగర్వవిహీనతఁ బొంచెఁ జిత్తమున్
కర్ణ. 1-187

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటు మనము వడయుద
మదియెల్లను నేర్పరించి యందఱుఁ, దనతన మదియున్న తెఱఁగు
తథ్యము చెపుఁడా. విరా. 1-65

ఆ[4] సం. అవ్య.

తఱచుగా ఈ క్రింద యర్థములను దెలుపును. తెలుగున దీనికిఁ బ్రత్యేక ప్రయోగములేదు.

1. మర్యాద, అభివిధి (మొదలుకొని వఱకు అనునర్థమున 'వఱకు' అర్థమున)

ఆపాదమస్తకము : విరా. 1-311 (పాదమునుండి తల వఱకు)

ఆబాలవృద్ధము. ఉద్యో, 3-175, శాంతి. 1-354

ఆబాలగోపాలము. కర్ణ. 2-48

2. ఒక్కొక్కప్పుడు మొదలుకొని యనియు వఱకు అనియు మాత్రమే తెలుపును.

ఆకర్ణాంతము. (చెవి చివరవఱకు) ఆది. 7-198

3. అంతట.

కీర్ణము (వ్యాపించినది) ఆకీర్ణము (అంతట వ్యాపించినది)విరా. 1-62

ప్లావితము : అశ్వ. 1-175, అప్లావితము : కర్ణ 3-19,

ఛాదనము- ఆచ్ఛాదనము ఆది. 3-169

4. మిక్కిలి.

పూరితము (నిండినది) ఉద్యో. 2-127 అపూరితము = మిక్కిలి నిండినది. శాంతి. 6-308

ప్రిశితము (అప్రశయించినది) ఆది. 5-89
అప్రిశితము (మిక్కిలి అప్రశయించినది) విరా 4-170
రూఢము. విరా. 2-1, ఆరూఢము. ఉద్యో. 2-388,
నతము. భీష్మ. 3-178, ఆనతము. స్త్రీ. 1-176.

5. ఈషదర్థకము (ఇంచుక)
కంపము (వణకు) విరా. 2-83 ఆకంపము (ఇంచుకవణకు) విరా. 2-284

6. ఒక్కొక్కప్పుడు స్వార్థమునందును వచ్చును.
రావము (ధ్వని) విరా. 3-159, ఆరావము (ధ్వని) కర్ణ. 1-78
లోలత. ఉద్యో. 2-52 ఆలోలత. స్త్రీ. 1-39
శోభితము. ఉద్యో 4-428 ఆశోభితము, శాంతి. 2-1
లేపనము. స్త్రీ. 2-16, ఆలేపనము. మౌస. 29.
వాసము. విరా. 1-63, ఆవాసము. శాంతి. 4-305.

7, గమనాద్యర్థక ధాతువులకు ముందువచ్చి ధాత్వర్థకమునకు వ్యతిరేకార్థమును దెలుపును.
గమనము = పోవుట. భీష్మ. 3-455, ఆగమనము = వచ్చుట, రాక. శాంతి. 6-594; దానము = ఇచ్చుట. విరా. 4-149, ఆదానము = తీసికొనుట. శాంతి. 5-523, ముక్తము (వదలఁబడినది) విరా. 5-544 ఆముక్తము = ధరింపఁబడినది. అర. 5-221.

**అంగరిష్ఠుఁడు** సం. వి. అ. పుం.

ఒకానొక రాజు. శాంతి. 3-128

**అంగి** సం. వి. ఈ. స్త్రీ.

1, పూరుని వంశము రాజైన అరిహుని భార్య- మహాభౌముని తల్లి. ఆది. 4-2

2. అంగదేశ స్త్రీ- అంగరాజు పుత్రిక ఈమెకు సుదేవ యను పేరుగలదు. పూరుని వంశియుఁడైన ఋచీకుని భార్య, ఋక్షుని తల్లి. ఆది. 4-2

**ఆంగికము** సం. విశే. (అ. ఈ. అ.)

దేహావయవ సంబంధమైనది.

ఆంగికంబులైన శుభ సూచకంబులు గైకొనుచు. ఉద్యో. 3-132

**ఆంగిరసము** సం. వి. అ. న.

1. అథర్వ వేదములోని యొక సూక్తము.

వ. సరస్వతి యత్తపస్వి శన చేరువ నొకప్పుడు జపయుక్తుండై యుండం గూలాపహారణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొని పోయిన నతం డాంగిరస మంత్రంబుల నత్తరంగిణిం బ్రబుతించె. శల్య. 2-170

2. అశ్వత్థామవంశము.

(అశ్వత్థామ శివున కాత్మోపహార మీయ నిశ్చయించి)

క. అంగిరసకుల జనిత మీ, యంగము శిఖయందు దీని నాహుతిగాఁ, జేయంగంటి భవద్భక్తి సు,సంగత మతితోఁ గృతార్థజన్మ్ముఁడ నైతిన్. సౌప్తి 1-123

**ఆంగిరసి** సం. వి. ఈ. స్త్రీ.

ఒక బ్రాహ్మణుని భార్య. చూ. వివరము. ఆది. 7-129

**ఆంగిరసుఁడు** సం. వి. అ. పుం.

1. బృహస్పతి.

వ. అంగిరసభార్గవాదులను పెద్దలిట్లని చెప్పిరి. శాంతి. 2-284

వ. విష్ణుండు దండనీతిశాస్త్రంబు సకలంబు నాంగిరసున కిచ్చె నాంగి రసుం డింద్ర మరీచులకు మరీచి భృగునకు భృగుం డనేక మును లకు నిచ్చె. శాంతి. 3-120

వ. మదీయాధ్వరంబున నాంగిరసు నుపాధ్యాయుంగా వరియింపఁ బోయితి నద్దేవగురుండు నన్ను దూషించి. అశ్వ. 1-42

2. అంగిరసుని కొడుకు, (ఆ యర్థమున బహు. అంగిరులు, అంగిరసులు)

వ. మాంధాతృనకు నాంగిరసుం డగు నుతథ్యుండు సెప్పిన హిత వాక్యము లుపన్యసించెద. శాంతి. 2-400

తే. ఆంగిరస వంశ సంభవుం డగు నుచథ్యుఁడు. చూ. అను. 5-340
ఇక్కడను మూలమున ఉతథ్యుఁ డనియే కలదు.

శ్లో. శృణు రాజ న్నుతథ్యస్య జాతస్యాంగిరసే కులే.
సం. భా. అను. 154-9

**ఆంజనేయుఁడు** సం. విశ. అ. పుం.

హనుమంతుఁడు, అంజనాదేవి కొడుకు.

అంజనేయుండు రాఘవునకు నభిజ్ఞానార్థంబుగా నొక్క పల్లవదామంబు నలుతఁ బెట్టె. ఆర. 6-385

**ఆంతరము** సం. విశ. (అ. ఈ. అ.)

మనస్సంబంధమైనది.

సీ. ఆత్మయం దగ్ని సమారోపణము సేసి యజనమాంతరముగ నకృత సంధి విగ్రహుం డగుచు. శాంతి. 5-142

**ఆంతరయాగము** సం. వి. అ. పుం.

1. మానసిక యజ్ఞము, 2. మానసిక పూజ.

సీ. ...తదీయ మధ్యవర్తిత నొప్పు మహనీయ వహ్నియు, దానంబు దాని నిర్ద్వంద్వభావ, మాంతరయాగ విద్యాప్రవీణులు గంద్ర. అశ్వ. 2-48

**ఆంత్రము** సం. వి. అ. న.

అంత్రము, ప్రేగు.

వ. అంత్ర ఫేనయు, భేరీ మండూకయు, హేతి మీనయు, గళకళేబర పులినయు నగు నమరపుణ్యనది నవభృతస్నానంబు సేసి. శాంతి. 2-443

**ఆందోళిక** సం. వి. ఆ. స్త్రీ.

అందోళము, అందలము.

పాండవాగ్రజుండు పాండురాజాగ్రజు నతని దేవిం బ్రభూతాందోళికా రూఢులంజేసి... చూ. అందలము. శాంతి. 1-350

క. ఆందోళికాదివాహన, సందోహంబున నిశాంతచారుత్వము చెన్నొంద౯ సమలంకృత లగు, సుందరు లేతేర విభవ శోభిత భంగి౯.
మౌస. 32

**ఆందోళితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ముందు వెనుకలకుఁ గదలింపఁబడినది.

వ. ఆందోళిత రక్తాంబర యుగళాంచలుండును. విరా. 4-73

2. ఊఁపఁబడినది.

వ. మందమారుతాందోళితంబగు మందారంబు చందంబు దోఁప నర్తించుచు. ద్రోణ. 5-287

**ఆంధ్ర కవిత్వము** సం. వి. అ. న.

తెనుఁగు కైత.

ఉ. ...అం, దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వ విశారదుండు. విరా. 1-6

**ఆంధ్రదేశము** సం. వి. అ. పుం.

తెనుఁగువారు నివసించు దేశము.

(ఈ దేశమువారు కౌరవుల పక్షమునఁ జేరి పాండవులతోఁ బోరాడిరి.)

వ. యవన యుగంధరాంధ్ర సింధు చేది... అవంతికానూపాది జనపదంబులు... భీష్మ. 1-40

వ. రాధేయునకుఁ బ్రాపయి పుళింద బాహ్లీక కేంకణాంధ్ర భోజానీకంబు గవిసినం గౌంతేయ బలంబునకు భరంబగుటయు.

కర్ణ. 2-317

వ. ధనంజయుండు... పౌండ్రాంధ్ర ద్రవిళ కేరళ కర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించికొనియె.

అశ్వ. 4-118

శ్లో. తత్రాపి ద్రవిడై రాంధ్రై రౌద్రై ర్మాహిషికై రపి,
తథా కోలగిరేయైశ్చ యుద్ధమాసీ త్కిరీటినః.

శ్లో. తాంశ్చాపి విజయో జిత్వా నాతితీవ్రేణ కర్మణా.

సం, భా. అశ్వ. 83-10, 11

వ. అంగ వంగ బంగాళ గౌళాంధ్ర కేరళ కోసలాధిపతులు.

సభా. 2-113

**ఆంధ్రము** సం. విణ. (అ. ఈ. అ..)

1. ఆంధ్రదేశమునకు సంబంధించినది, (భాషాదికము)

ఆంధ్రకవిత్వ విశారదుండు. విరా. 1-6

వి. అ. పుం.

2. ఆంధ్రదేశము, తెనుఁగుదేశము. చూ. ఆంధ్రదేశము.

**ఆంధ్రుఁడు** సం. వి. అ. పుం.

1. ఆంధ్ర దేశపువాఁడు, తెనుఁగువాఁడు.

ఉ. ...ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ... రచియించెదం గృతుల్. విరా. 1-80

2. ఆంధ్రదేశపు రాజు.

అంగ వంగ బంగాళ గౌళాంధ్ర కేరళ కోసలాది మహీపతుల. సభా. 2-113

**ఆంబాలికేయుఁడు** సం. వి. అ. పుం.

అంబాలిక పుత్త్రుఁడు, పాండురాజు.

మహాస్రగ్ధర. కానఁగావచ్చి సకల జగత్సేవ్యమానుల్ మహేంద్ర, ప్రతిముం గౌరవ్య వంశ ప్రభు నఖిల మహీపాలు రాంబాలికేయున్. ఆది. 5-38

**ఆంబికేయుఁడు** సం. వి. అ. పుం.

అంబికపుత్త్రుఁడు, ధృతరాష్ట్రుఁడు.

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొనునె యెన్నఁడైనను గొడుకున్, మగటిమి గలఁ డనియెడు న,మ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగెనయేనిన్. ఉద్యో. 1-315

**ఆఁక** దే. వి.

అడ్డు, విరోధము,

గీ. ఆఁకలేక యెవ్వాని జలాశయమున, మండువేసవియందును మనుజకోటి, యవభృథస్నానపానంబు లాచరించు. అను. 2-386

**ఆఁకగొను** దే. అ. క్రి.

ఆఁగు, నిరోధమొందు.

**ఆఁకలి** దే. ఔప

క్షుత్తు.

ఆ. అనఘ నీరువట్టు నాఁకలియును నెవ్వ, బొరయకుండు నట్టి భూరి శక్తి, నీకుఁ గలుగ నేను నెమ్మనంబున దలంచితిఁ దదీయ పీడఁ జెందకుండు. శాంతి. 2-128

చ. ఫలము దళంబునుం దొడిమఁ బాయుట రాలినవాని గొంచు నాఁకలి కెరనేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి.

అను. 5-55, విరా. 2-240, ఆశ్ర. 1-29, అను. 2-212

**ఆఁకిడు** దే. స. క్రి. (√ఆఁక)

అడ్డగించు.

క. ఆ కొలువువారు గర మచ,లాకృతి నొక పలుకులేక యందఱు వింజం, బాఁకిడిన కరణి నవశము,దాకారిత చిత్తవృత్తులై యుండంగన్. ఉద్యో. 3-255

**ఆఁకొను** దే. అ. క్రి.

ఆఁకలిగొను, క్షుత్తునొందు.

ఆ. విను మసత్య లోభమున సిరియగునె యాఁ,కొని మునిందిఁ దినినఁ గ్రొవ్వు లావుఁ, గలుగునయ్య. ఉద్యో. 3-333

వ. అమ్మహాత్ముండు దేవాసుర మనుష్య తిర్యగాత్మక భూతంబుల సృజియించిన నాఁకొని యవి దక్షప్రజాపతి భక్షింపఁ గవిసిన.

శాంతి. 2-112

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసపుఁజోటు నాక యాఁకొఁడు నలంగుదున్ నిదురకుం దఱి దప్పెదు. విరా. 1-185

**ఆఁగఁబడు** దే. స. క్రి.

1. నిలుపఁబడు, ఉంచఁబడు, నెలకొల్పఁబడు.

సీ. భవదింద్రియములు మనము,నం దాఁగఁబడ్డవి. శాంతి. 2—8

శ్లో. ఇంద్రియాణి ప్రసన్నాని మనసి స్థాపితాని తే.

సం. భా. శాంతి. 46-28

2. నిషేధింపఁబడు.

అ. వేదవిహితవిధుల నాదరించుట, యూర్ధ్వగతికిఁ దెరువు విధులఁ గడచి యెందు, నాఁగఁబడిన పాని లోఁగకచేయుట, యధమ గతికి మార్గ మనిరి మునులు. ఆది. 3-220

ఆఁగికొను దే. స. క్రి.

అడ్డగించు, నిరోధించు.

దే. మద్రపతివారి నమ్మెయి మార్తురాఁగి, కొనఁగ మనకు నుపేక్షింపఁ జనునె యనుఁడు, నతఁడు నామాట వినక వా రరిగి రేమి, సేయువారము చెప్పు మౌచిత్య మనియె. శల్య. 1-207

ఆఁగు దే. స. క్రి.

1. అడ్డగించు, నిరోధించు, ఆటంకపఱచు, అరికట్టు.

క. దవ్వుల వితిగినఁ జోరులు, నవ్వుదురఁట మేలుమేలు నను నాఁగకు, నీ, క్రొవ్వరుగ దేనిఁ దలపడు, మెవ్విధిఁ జనితేని ననుచు నెత్తిన ధీతన్. విరా. 4-71

సీ. సైంధవుఁడు మ,మ్మాగినఁ దోడ్పడ నను వు దప్పె. ద్రోణ. 2-147

2. నిలుపు, ఆఁపు.

తే. శాంతమానసుఁ డైన యీ శాంతనవుఁడు, విస్మయావహాచరితుండు వినుము వలసి,నపుడు విడుచుటకై ప్రాణమాఁగినాఁడు, గాదె యొరు లంతవా రెందుఁ గలరె నరులు శాంతి. 1-389

సీ. (శుభాంగి స్వయంవరమున) కురుపతిఁ గడచిపోయె, నతం డల్గి యచ్చపలాక్షిఁ బోనీ కాఁగిపట్టి రథంబుపై బెట్టఁ జనిచి -ఆ- యేఁగుచున్న. శాంతి. 1-80

3. మరలించు, వెనుకకు త్రిప్పు.

ఉ గోవు నెట్టులాఁగితి వకుంఠిత విక్రముఁడైన రాజరా, జేవిధి, మానభంగమున కెల్లను నోర్చి. విరా. 5-288

క. చెఱువు నడు మవిసినను జెను, వెఱ మోఃములు నెవరినను వివేక

నిధీ య,క్కటి బహుళ సైన్య మటిముటిఁ, బఱచిన నాఁగఁగరాదు బలియురకైనన. శాంతి. 3-16

౪. నిగ్రహించు, అణచు, అదుపులోఁబెట్టు

ఆ. విమము తన్ను గెలుచు టన వేఱొకండె పంచేంద్రియములఁ దూలనీక కోలఁది, నాఁగుటయ. శాంతి. 3-277

ఆ. బుద్ధిఁగొని మనంబు వోనీక నిలిపి మనోభియుక్తి నింద్రియముల నాఁగి. శాంతి. 4-314

తే. ఎల్లకడలకు వెలువడు నింద్రియముల, బాలపుత్రులఁ దండ్రియుఁ బోలె నాఁగుమ్ము శాంతి. 5-179

౫. ఉడిగించు, పోఁగొట్టు.

క. భగదత్తు నేనుఁ గడరిన, వైగడునఁ బాండవుల మొనలు విఱుగుటయు మహానగమేటి వేగమాఁగిన, పగిది ఘటోత్కచుఁడు దాని పరు వుడిగించెన్. భీష్మ. 3-35

౬. నిషేధించు.

ఆ. వేదవిహిత విధుల నాదరించుట యూర్ధ్వగతికిఁ దెరువు విధులఁ గడచి యెందు, నాఁగఁబడిన వాని లోఁగక చేయుట, యధమగతికి మార్గ మనిరి మునులు. ఆది. 3-220

అ. క్రి.

నిలఁబడు, ఓపికపట్టు.

సీ. కైనేయుఁడును భీమసేనుఁడు నిరుదెసఁ, రా నర్జునుఁడు సింధురాజు దెసకు, చేడ్తెఱఁ దఱిమెదు సింక నొక్కించుక, ప్రొద్దాఁగి పెనఁగినఁ బ్రొద్దు దాను నస్తమించెడును. ద్రోణ. 4-291

**ఆఁచికొను** దే. స. క్రి.

నాఁచికొను, అపహరించు.

ఇది 'ఆఁచికొను శబ్దమా ? నాఁచికొను శబ్దమా ?' ప్రయోగములను బట్టి నిర్ణయింప వీలుగాకున్నది. భారతేతర కవి ప్రయోగములందు 'ఆచికొను, నాఁచికొను, రెండును స్పష్టముగాఁ గనిపించుచున్నవి.

ఆ. చావులేని మందు చక్కఁగ మనకబ్బె,ననుచుఁ గడవ నసురు లాఁచి
కొనిన, వెఱచి సురలు. భాగ. 8-287

సీ. పురిలోనఁ జొచ్చి విస్ఫురిత గేహంబుల, యర్థసంచయమును
నాఁచికొనుచు. హరి. ఉద్యో. 6-126 (సూ. ని.)

చ. .. హుమ్మని నోరికండ నాఁ,చికొనిన మ్రోఁగు జేవ్వలి విశేషము
దోఁపఁగఁ బార్థుపట్టి సా,యకముల నొంచినం దెరలి రందఱు వేశుం
పెందు సాకృతిన్. ద్రోణ. 2-25; శాంతి. 5-547

ఆఁచికోలు దే. వి.

నాచికోలు — అపహరణము.

చూ. నాఁచికోలు.

ఆఁటది దే. వి.

ఆఁడుది, స్త్రీ.

క. విను మాఁటది వోలెం దన, తనువున కడ్డంబుగాఁగఁ దగిలిచి కొన్నా
డనఘ. ద్రోణ. 8-201

"స్త్రీవదేవ బిభర్త్యేతాం యుక్తాం కవచ ధారణమ్."
సం. భా. ద్రోణ. 103-16

ఆఁడు దే.

(దీనికి వ్యస్తప్రయోగము లేదు)

స్త్రీ — చూ. ఆఁడకట్టు, ఆఁడుకూయి, ఆఁడుచందము, ఆఁడుదనము,
ఆఁడది, ఆఁడువేడ, ఆఁడుఁబుట్టువు, ఆఁడుముత్తము.

ఆఁడుఁబుట్టువు దే. వి.

ఆఁడుది, అఁకుబిడ్డ, అక్కసెల్లెండ్రు లోనగువారు.

తే. చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ,బుట్టువులతోడ నీవును
బుట్టివాఁడవు. విరా. 2-50

ఆఁడుకట్టు దే. వి.

ఆఁడుదాని కోక కట్టు, ఆఁడువాండ్ర వస్త్రధారణము.

సీ. కాళ్ల మొప్పిద మాఁడు కట్ట నుజ్జ్వలము నేయంగ సంకుల
బాహులంద మెడల. విరా. 1-228

**ఆఁడుకూయు** దే. వి.

ఆఁడుదాని మొఱ.

ఆ. అకట యాఁడుకూయు న లకూయును లాఁతివారికైన నరయ
వలయుననిన, విరా. 2-177

**ఆఁడుచందము** దే. వి.

ఆఁడుదానికుండు విధము.

మ. వనితావేషము గల్గియున్నయది చెల్వం బాఁడుచందంబు గాదు..
విరా. 1-331

ఆఁడు చందంబు పురుష సమాకృతియును గలిగియున్నది.
విరా. 4-75

**ఆఁడుదనము** దే. వి.

స్త్రీత్వము.

ఉ. ఆఁడుదనంబు నిక్కమున కారసి చూచిన లేదు. విరా. 1-288

**ఆఁడుది** దే. వి.

స్త్రీ.

తే. అకట నా పోల్కి యాఁడుౘదాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ
బడయవచ్చునె యెఱుఁగక పలికితిట్లు. విరా. 2-387

ఆ. ఆఁడుదానిఁ జంపి నతఁ డేకవింశతి దూష్యనరకవాసదుఃఖ
మొందు. అను. 4-265

**ఆఁడుపేడి** దే. వి.

నపుంసకుఁడైన ఆఁడుది, ఆఁడుకొజ్జా. మాచకమ్మ.

(ఆఁడుదాని విధమున నుండును, పురుషునితో సమానమైన ఆకారము గలిగియుండును. రూపమున ఆఁడుది బొమ్మను మీసములు మగవానివి)

చ. ...బృహన్నల యన నాఁడుపేడివయి నాన యొకింతయు లేక
నీవు నగ్గలమగు దైన్యమొంది. ఉద్యో. 4-200

**ఆఁడుమొత్తము** దే. వి.

స్త్రీ సమూహము

సీ. ...ధర్మతనయుండు ధృతరాష్ట్రు వినయ మొప్ప, మున్నిడుకొని
యాఁడు మొత్తంబుఁ దోడ్కొని. స్త్రీ. 2-178

**ఆఁడువారు** దే. వి. బహు.

స్త్రీలు.

ఆఁడువారు వెరవుతో మృదువచోరచనఁ జెప్పు టరయ నుచితవృత్తి.
విరా. 3-31

**ఆఁపు** దే. స. క్రి.

ఆఁగఁజేయు, నివారించు, అడ్డగించు.

వ. ...అధర్మంబు నాఁపనివాఁడు. సభా. 2-243

**ఆఁబెయ్య** దే. వి.

ఆవుపెయ్య.

అయ్యేడకు నొక్క యాఁబెయ్య యుఱికి. కర్ణ. 2-90

**ఆఁబోతు** దే. వి.

ఆలపోతు, అచ్చుటెద్దు, యథేచ్ఛముగాఁ దిరుగుటకై అచ్చువేసి విడిచిన యెద్దు

వ. ...నేనగునని కైకొనిన యాఁబోతు పంచితంబు మూర్కొని
ననుఁ, శైగాలి వీచినను గొడ్డున కైనం జూలు నిలుచు.
విరా. 1-286

క. బలితపు వెస నాఁబోతుం, బులి గొనినం బసులు వాఱు పోలికి.
కర్ణ. 3-372

**ఆకంపము** సం. వి. అ. పుం.

వణకు, ఇంచుక వణకు.

గోత్రశైలనికరం బాకంపముం బొంద. విరా. 2-284

**ఆకరము** సం. వి. అ. పుం.

1. నిలయము, స్థానము.

ఉ. ...పు,ణ్యాకరమూర్తివైన నిను నాతని గొల్చినయట్ల కొల్చె
దన్. విరా. 1-222, శాంతి. 4-277, అను. 2-364

2. పుట్టుకచోటు, ఉత్పత్తిస్థానము.

వ, మృణాల నాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును. విరా. 3-236

ఉ. ...పరిపక్వ దయాకరచిత్త మాధవా, శాంతి. 2-144

**ఆకర్ణనము** సం. వి. అ. న.

వినికి, వినుట.

వ. పక్షికుల ప్రకరానేక భంగి విరుతాకర్ణనంబులను. విరా. 1-47

తే. ...తాను, మున్నవాఁడుగా నాకర్ణనోత్సుకుండు, నక్క లఱచెడి చేరువ నక్కటకట. స్త్రీ. 2-69. శాంతి. 4-88

**ఆకర్ణాంతము** సం. అవ్య. అ. న.

చెవివఱకునైనది,

శా. చాపంబు లాకర్ణాంతంబులుగా వడిం దిగిచి. ఆది. 7-196

**ఆకర్ణించు** సం. స. క్రి.

విను.

అను పలుకు లాకర్ణించి కర్ణుఁడు కటకటంబడి. విరా. 4-97

ఆకర్ణించు కౌతుకంబు నా మనంబున నెసకం బెసఁగెడు.

అశ్వ. 2-225

**ఆకర్షణము** సం. వి. అ. న.

1, ఆకర్షించుట, లాగుట.

క. కరి హస్తాకర్షణ విధ్వస్తంబులగు రథంబులును. భీష్మ. 2-295

క. కర్షితరిపు లన్యోన్యాకర్షణ సంకర్షణాపకర్షణముల సామర్షులయి పెనఁగిరాహవహర్షంబునఁ బవనసుత ధృతరాష్ట్ర పుత్రుల్, సభా. 1-208

2. ఈడ్చుట, లాగుట.

(వారి, నాగలి, జుట్టు మొదలగువానిని బట్టుకొని)

ఆ, వీకఁ బూడ ముష్టి నెలవు వాకర్షణ, గాఢతయును శాణగతియుఁ దోఁటఁలుగుట్లా రొుుంద్ను భంగిరొు కోఁచెనో వాకు, నున్న రూపు

సెప్పవన్న పార్థ. ద్రోణ. 3-198.

వ మహాలాంగలాకర్షణములయందు. అర. 1-84.

వ. విరథుండగు నమ్మహీవిభుం గేశాకర్షణంబున నేలం బడవైచి.
అర. 5-401.

**ఆకర్షించు** సం. స. క్రి.

1. ఆకర్షణముచేయు, లాగు, వశము సేసికొను.

వ. నన్ను నాకర్షించి కొలిపించికొని వీఁడె విజయం చేయుచున్నవాఁడు.
విరా. 1-11.

2. తిగుచు, తీయు, హరించు.

వ. (బ్రహ్మ మృత్యుదేవతతో) సర్వజీవుల యెడం గామరోషంబు లుడిగి జీవంబుల నాకర్షింపుము. ద్రోణ. 2-175.

3. రప్పించు, వచ్చునట్లుచేయు.

వ. ...అవ్వీరద్యుమ్నునకుం గరుణించి యతని కొడుకు భూరిద్యుమ్నుం దన తపోమహిమ నాకర్షించి పీడుకొలిపె.
శాంతి. 3-168.

**ఆకలనము** సం. వి. అ. న.

1. ఒనరించుట, చేయుట.

క. లోకోత్పత్తిస్థితి విలయాకలన వినోద. భీష్మ. 2-264. శాంతి.1-2.

2. కూర్చుట.

సీ. పలవించి పలవించి బహుశిష్య లయ్యతిరథవర్యు (ద్రోణుని) నస్త్రశస్త్రములు రథము నవయవంబులును జితాకలనంబు చేయుచు
స్త్రీ. 2-123, శాంతి. 6-155.

3. పొందుట, ప్రాప్తి.

క. ...స్వర్గత్యాకలనంబు సరియ తదుభయములకున్.
శాంతి. 5-578, శాంతి. 6-549.

**ఆకలితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కల్పింపఁబడినది.

ఉ బాంధవ శాత్రవాకలిత భావభవా... విరా. 1–338

2. కూడినది.

శా. ఉదగ్రధ్వజాగ్రిప్రష్ఠత్వాకలితంబు సైన్యమిది. విరా. 4-52

క. కులమును శీలము విద్యయుఁ, గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా,వలయు నుదకప్రదానా,కలితంబుగ బ్రహ్మకర్మగతి యిది యధిపా. అను. 2-221

3. గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది.

క. నిత్యనిధి సద్వివేకము, సత్యవ్రతశీల ధర్మసారజ్ఞ భవ,న్మత్యాకలితమయ్యెనమ, నిత్యంబును వృద్ధసేవ నిష్ఠఁ జలుపుమీ. ఆశ్ర. 1-79

4. పొందఁబడినది.

ఉ. సంగవిదూరితా కలిత శాంతరసస్ఫుట రోహదిద్ధ బో,ధాంగ సమాశ్రితాపదుదయజ్వలన ప్రశమప్రవర్తకా. కల్య. 1-408

క. ప్రాకట తపోబలంబున, వాకలిత విలోచనుండవై యున్న నినున్ లోకేశ చూడఁగంటిమి.

**ఆకల్పము** సం. వి. అ. పుం.

1. ధరించుట, వహించుట, అలంకరింపఁబడినది, వహింపఁబడినది.

శా. రథ దంతి ఘోటక భట శ్రేణీ సముద్దాంత సే,నాకల్ప ధ్వజ విభ్రమంబున. విరా. 3-145

2. భూషణము.

గుణరత్నాకల్ప. భీష్మ. 2-284; గుణాకల్పా. అను. 5-175, అశ్వ. 4-2, మౌస. 204.

**ఆకల్పితము** సం. వి. అ. న.

అలంకరణముగాఁ జేయఁబడినది.

క, హరిహరనాథునకు మరు,త్సరిదాకల్పిత మనోజ్ఞ చరణ శిర స్సుందరమూర్తికి. విరా. 1-86

**ఆకసము** వై. వి. (సం. ఆకాశః; ప్రా. ఆకాసో)

ఆకాశము, మిన్ను.

తే. సాంద్రనాయక తతి నాకసంబు గప్పె. విరా. 5-168

**ఆకాంక్ష** సం. వి. అ. స్త్రీ.

కోరిక.

మ. ...పోరి రుత్కట దర్పోద్ధతులై పరస్పర జయాకాంక్షం బ్రచండంబుగన్. విరా. 3-187

సీ. ...ఫల మూల నీరమారుతాహారుఁడగు ముని యాకాంక్ష సేయఁడు, ప్రాప్తంబుగాని పదార్థములకు. శాంతి. 6-610

**ఆకాంక్షించు** సం. స. క్రి.

వాంఛించు, కోరు, అపేక్షించు.

క. నీ కొడుకు లొందు సుఖములు, సేకొన రవ్వీరసుఖమ చిత్తములఁ గరం, బాకాంక్షింతు రలంతులఁ, బోకగలుగునెట్టు లల్పబుద్ధుల వారల్. ఉద్యో. 3-205; అను. 5-429

**ఆకారత** సం. వి. అ. స్త్రీ.

ఆకారత, ఆకారము గల్గియుండుట.

శా. ఘటచయం బత్యంత చూర్ణీకృతా, కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గాంగేయ సైన్యంబునన్. కర్ణ. 3-14

**ఆకారము** సం. వి. అ. పుం.

1. రూపము.

సీ. అదితిగర్భంబున నవతారమై వామనాకారమున హరి యడగుటయును. విరా. 1-54

2. విధము, స్వరూపము.

వ. ఇది యనన్యసామాన్యాకారంబగు పరమ ధర్మ ప్రకారంబు. విరా. 1-29

క. ...సుశ్లోకుఁడు పరాశరుఁడు ధర్మాకారము తెలుఁగఁ జెప్పె నంచిత చరితా. అను. 8-270

3. హృదయమునందలి భావములను వెలికి సూచించు వికారము. (బొమముడిపాటు మొ. చేష్టలు)

ఆ. న్యాయశాస్త్ర వేదియై యింగితాకార చేష్టలెఱిఁగి. శాంతి. 1-175

4. సౌందర్యము, చక్కని రూపము.

వ. ...వేద వేదాంగ ధనుర్వేద పారగుండును నగు పరమాకారవంతుఁ డుదయించె. శాంతి. 2-207

**ఆకారవంతుఁడు** సం. విణ. (త్. వతి. త్.)

సౌందర్యము గలవాఁడు, చక్కని శరీరము గలవాఁడు.

పరమాకారవంతుం డుదయించె. శాంతి. 2-207

**ఆకారితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆకారము గలదిగాఁ జేయఁబడినది.

శా. ధ్వాంతాకారిత కుడ్యకుట్టిమ ఘనస్తంభావరీ రూపముం. విరా. 2-327

**ఆకాశగంగ** సం. వి. ఆ. స్త్రీ.

మందాకిని, మిన్నేఱు.

క. ఆకాశ గంగ యిదె పుణ్యాకృతి యున్నది. స్వర్గ. 47

**ఆకాశము** సం. వి. అ. పుం.

1. సూర్యాది గ్రహములు ప్రకాశించు ప్రదేశము. అనసము, మిన్ను.

వ. ఆకాశంబున నుండి యొక్క దేవదూత యిట్లనియె. ఆది. 1-150

2. ఆకాశతత్త్వము (దీని గుణము, శబ్దము)

తే. శ్రోత్ర మాకాశమునఁ గ్రమ సూత్రితముగఁ బొందఁజేసి గోవింద యానంద మిమ్మ. శాంతి. 4-242

**ఆకాశవాణి** సం. వి. ఈ. స్త్రీ.

ఆకాశము నుండి పుట్టినట్లు వినఁబడునట్టి యదృశ్య దేవాదుల వాక్కు — అశరీరి వాక్కు.

తే. మ్రోసె నాకాశవాణి, ధర్మపరుఁడైన యత్తులాధారుఁ డింత, యోడఁ డిట్లాడ నేలని యద్భుతముగ శాంతి 5-221

**ఆకీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

1. క్రిక్కిరిసినది.

వ. కురు జనపదంబు చుట్టుం బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లిక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు సుఖితంబులు జనాకీర్ణంబులు. విరా. 1-62

2 అంతయు వ్యాపించినది

శా. గ్రీష్మాదిత్య పటు ప్రతాపవిసరాకీర్ణంబు. విరా. 4-52

3, నిండినది.

సీ. అశ్వమేధములు జాహ్నవి పొంత శిష్ట జనాకీర్ణములుగఁ జెలువొంద చరించె. ద్రోణ. 2-200

**ఆకు** దే. వి.

1. పర్ణము, పత్రము.

క. నరపతులనెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్, మరల్లం బోయెద నచటం, దిరిగెదఁ గూరాకు గోసి తినియెద ననఘా. భీష్మ. 2-8

తలిరాకు. భీష్మ. 2-48, తామరపాకు. ద్రోణ. 4-809.

కాయలాకులు నీళ్లును గాలి యనుభవించి. శాంతి. 1-24

కొండఱాకు లెండినవి యేఱికొని. అను. 5-28

2. ఱెప్ప (కన్ను)

కౌరవ నికురంబమునకుఁ గన్నాకై యొప్పారిన భీష్ముఁడు.
ద్రోణ. 1-31

తమతమ మొనలకుఁ గన్నాకులగుచు మునుకొని. భీష్మ. 2-291

**అకుంచితము** సం. విణ. (అ. ఆ. అ.)

ముడువఁబడినది.

వ. ఉన్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచిత సవ్యశాఖాంతరాళంబుల నవ్వళించు చప్పుళ్లు గలన యొక్కరుఁడు మల్ల చలించిన చందంబున వీతేర. విరా. 2-14

**ఆకుజొంపము** దే. వి.

ఆకుల గుబురు.

సీ. శ్యామంబు లగునెడ లాకు జొంపంబు లనుకరింప. విరా. 4-50

**ఆకులత** సం. వి. ఆ. స్త్రీ.

వ్యాకులత్వము గలిగియుండుట, సంక్షోభము.

మ. బలియుండా నొలగుండు భావభవ దర్పక్రీడా తుండై వచ్చి
నిశ్చల సర్వాంగత నున్న నన్నరసి నీ చందంబుగాకున్న వా,
కులతం బొందెదు. విరా. 2-280, భీష్మ. 1-291

**ఆకులపడు** వి. అ. క్రి.

ఆకులమగు, కలఁగు.

క. లోకము గాలముచే నిట్లాకుల పడుచునికిఁ గాంచి. శాంతి. 6-286

**ఆకులము** సం. విణ. (అ. ఆ. అ.)

వ్యాకులము, కలఁగినది.

మ. ...ఆకులమయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేళ—
విరా. 4-172, సౌప్తిక. 2-122

**ఆకులితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆకులపఱుపఁబడినది.

వ. ఇట్లు వృత్రారి బ్రహ్మహత్య వాయుటయె కాని నహుషునంత
బలంబు లేమిం జేసి భయాకులితచిత్తుండై. ఉద్యో. 1-168

**ఆకుల్యము** సం. వి. అ. న.

ఆకులత్వము, క్షోభము.

క. నీ కఱపుల నిక్కురుకుల, మాకుల్యముఁ బొందుటెమి యాశ్చ
ర్యము. ఆది. 8-41

**ఆకృతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆకారము గల్పింపఁబడినది.

తే. వికృత వేషాకృతంబులై వెలయ కితఁడు, నివులు గవిసిన మెఱు
యని నిప్పువోలె. విరా. 4-75

**ఆకృతి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఆకారము, రూపు.

చ. మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యులు.
విరా. 1-44

సీ. పుణ్యోజ్జ్వలాకృతియగు నొక్కవనిత.
విరా. 3-88; శాంతి. 4-364

2. దేహము.

క. శ్రీమత్కీర్తిమదత్యథి, రామాకృతి సద్గుణాభిరతి. స్త్రీ. 2-1

3. ఆయా సమయములయందు రాజులు గనఁబఱచు ప్రీతిని బ్రకటించు బహిరాకారము.

ఉ. రాజగృహంబు కంటె నభిరామముగా నిలుగట్టఁగూడ దే, యోజ
నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు నే, యోజ
విహారముల్ సలుప నుల్లమునం గడువేడ్క సేయు నే, యోజ
విదగ్ధుఁడై పలుకు నొద్దులకుం దగదట్లు సేయఁగన్. విరా. 1-123

4. విధము.

మ. ...నొండొరున్, మిగులంజాలక కొంతసేపు వడి మేమేఁ బోరి
రుగ్రాకృతిన్. విరా. 2-348

**ఆకృష్టము** సం. విశే. (అ. ఆ. అ.)

లాగఁబడినది.

క. కర్ణుని మెయి నాలోనన, కర్ణాంతాకృష్టచండకాండములు.
కర్ణ. 3-308

**ఆకృష్టి** సం. వి. ఇ. స్త్రీ.

ఆకర్షణము.

స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగ న్మధుకర పటలీ మానసాకృష్టి విద్యా
శాలి స్ఫారాబ్జ రేఖాంజలి పుటఘటనా... రుచి స్ఫీతు నాగేంద్ర
కేతున్. విరా. 3-77

**ఆకృష్టుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆకర్షింపఁబడినవాఁడు, ఈడ్వఁబడినవాఁడు.

తే ...కలిచేత నాకృష్టుఁడైన నలుఁడు, విగత కరుణుఁడై దమ
యంతి విడిచి చనియె. అర. 2-79

**ఆక్తము** సం. విశే. (అ. ఆ. అ.)
తడుపఁబడినది.
ఆ. ...ఉల్లసిత లోహితాక్తలాజములను, సురను బలియొనర్చ.
అను. 4-80

**ఆక్రందనము** సం. వి. అ. న.
ఏడ్చుచు మొఱపెట్టుట.
క. పిత్రృవనము దెసకుఁ జన నయ్యతివ భయక్రాంతచిత్తయై బాష్ప
జలోద్గతి మొగము గప్ప నిట్లని, యతిరామముగా నొనర్చె
వాక్రందనమున్. విరా. 3-18

**ఆక్రందము** సం. వి. అ. పుం.
పెద్దయేడ్పు, ఆక్రందనము.
క. నారదుఁ డుపశమ ఫణితులఁ గౌరవసత్తమునిఁ దేర్పఁ గ్రమమున
నాక్రందారవము లుడిగె. ఆశ్ర. 2-159

**ఆక్రందించు** సం. అ. క్రి.
1. ఏడ్చు.
క. కొడుకుల దెస నెవ్వగఁ జేడ్పడి వందిరి యట్టున్న యా నృపాలు
నడుగులం బడి భీష్మపాటు సెప్పుచు, నడలి కరుణ నాద మెసఁగ
వాక్రందించెన్,
వ. అయ్యేడ్పుతో నిట్లని విలాపంబు సేయు. భీష్మ. 1-45, 46
2. మొఱపెట్టు.
వ. ఆ సైన్యంబు జనంబులు హాహాకారంబు లెసంగ దీనదశం బొంది
ముకుంద పురందర నందనులం జేరొక్కని యాక్రందించి.
కర్ణ. 3-15
3. పెద్ద పెట్టున ధ్వనిసేయు, బొబ్బరింత పెట్టు.
తే. అడవి దరమిడి నణుకంగ నంతఁగల విహంగమంబులు గలగొన
నఱచు తెఱఁగు, దోఁదె వ్యాతము రెూధులఁ దున్నమఁ గలగి,

యన్యజనము లాక్రందించునప్పు డధిప. సౌప్తి. 2-6

ఆక్రమము సం. వి. అ. పుం.

1. నిర్బంధము.

క. జ్ఞాతుల పోరితమును గో, వ్రాతము నాక్రమము విప్రవర్గము చన వున్, నాతుల కారించుటయును, బ్రీతిం జననిచ్చు నతని పెంపొప్పు నృపా. ఉద్యో. 2-86

2. ఆక్రమించుట, క్రమ్ముట.

తే పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు, నిలువ నిమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి, యుండ నత్యంత తుచ్ఛ శిఖండి పల్వ, లాక్రమం బున మునిఁగితే యకట తండ్రి. భీష్మ. 1-58

3. ఎదుర్కొనుట, ఢీకొనుట.

తే. ...చేదీశ పౌరవుల స, మాన ఘోరపరాక్రం బొప్పె మారుతాత్మ, జుండు రారాజు సేనిక పిండుఁ జదిపె భీష్మ. 3-370

4. పరాక్రమము, విజృంభణము.

తే అట్లు భీషణమగు నర్జునాక్రమంబు, ఘోరమైన మురారి శంఖా రవంబు, నధిక భయసంభ్రమంబుల నావహింప, నధిప నలుగడఁ బఱచె సైన్యంబు గలఁగి. ద్రోణ. 3-211; కర్ణ. 1-273

5. వినాశము.

ఉ. ...దే, వావలికైన నత్తెఱఁగు నాక్రమ లీలలు సెల్లనేర్చునే. సౌప్తి. 1-211

6. శత్రు సంహారము.

ఆ. కర్ణు మనము పెద్దగాఁ గొనియాడుదు, మతనికంటె శల్యుఁ డధికుఁ డందు, రతఁడు నతఁడు నిట్టి యాక్రమంబున నాకుఁ బ్రియము సేయఁజాలిరే మహాత్మ. సౌప్తి. 1-236

ఆక్రమించు సం. స. క్రి.

1. బలాత్కారముగాఁ బట్టుకొను.

ఆ. మీరు గలుగ నాక్రమించి, నన్నుఁ గట్టె సూతనందను లిమ్మెయి,

వెఱపులేక భంగపఱచువారు. విరా. 3-19

2. అదిమిపట్టుకొను.

ఉ. దాని నెఱింగి యెంతయు నదగ్రత వాలికవైరి గ్రక్కునన్, వాని నడంగఁబట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం,చానన మేణముం బొదువునట్లు. విరా. 2-350

3. వశము సేసికొను.

వ. వారలం గ్రమ్మఱం బండ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తమత్తైన సప్రతిఘాతంబుగాఁ జతురంత భూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము.

విరా. 3-117, శాంతి. 1-378

4, ఓడించు, జయించు.

వ. నహుషునకుఁ దేజోహాని లేమింజేసి యతని నాక్రమింపరాదయ్యె ఉద్యో. 1-197, ఆది 7-205

5. కవియు.

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టి ధర్మపుత్రు నాక్రమింప, మనము దలఁచుటెల్ల మంటలో మిడుత లు,దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్లు. ఉద్యో. 2-100

6. చుట్టుముట్టు, పొదువు.

వ. ...వివ్వచ్చుం డలిగి సవ్యశరాసనుండై యాధనురాచార్యుం బటు బాణ వినరవేగంబున నతిక్రమించి కెలంకుల బలంబుల నాక్రమించిన. ద్రోణ. 3-61

7. అతిశయించు, పరాక్రమించు, ఉరవడించు.

వ. అయ్యదువీరుం డాక్రమించి బాహ్లిక తనయుం గొప్పుపట్టి యొలుగఁ దిగిచి యనుకంప పెంపునం జంపనొల్లక తన్ని విడిచిన. ద్రోణ. 4-275, ద్రోణ 4-28

8. విజృంభించు, చెలరేఁగు.

చ. ...ఇంక నెమ్మెయిం దెగఁడను భీతి యోధుల మదిన్ జనియింపఁగ

నాక్రమించినన్. ద్రోణ. 5-227; సభా. 1-195.

9. ఎదుర్కొను, మార్కొను.

తే. చంపెఁ గురువిభు నాకు లజ్జాకరముగ, భీముఁ డదియు నధర్మ
సంగ్రామవృత్తి, నతఁ డోపక వచ్చి ప్రాణాపహార, మాచరిం
పఁగఁ బూని నన్నాక్రమించె. సౌప్తి. 2-74.

చ. ...పురాణ పురుషులైన కృష్ణులు రణంబున శాత్రవు లాక్ర
మించుటం, గుపిత మనస్కులైన నిలకున్ బ్రదు కెమ్మెయిఁ గల్గ
నేర్చునే. కర్ణ. 3-25$_1$.

10. పూను, ఆవేశించు.

క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు
నొడలన్, వెలువడి నలునకు విహితాంజలియై తన్నెఱుఁగఁ జెప్పె
చంచలుఁ డగుచున్. ఆది. 8-178.

11. భంగపఱుచు, అవమానించు.

వ. తన్ను నాక్రమించి తనతోఁబుట్టువు రుక్మిణిం గొనివచ్చిన యా
కృష్ణు సన్నిధిన సిగ్గులేక యాడిన మాటలు విని చిఱునవ్వువవ్వుచు.
ఉద్యో. 4-175.

**ఆక్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆక్రమింపఁబడినది.

క. ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీర లెఱుఁగక
మోహాక్రాంతంబులయ్యె. విరా. 5-215.

2. అణఁపఁబడినది.

ఉ. ...అద్దెసఁ గల్గు యోధు లాక్రాంత విరోధి దర్పుఁడు పురందర
నందను కల్మి నిశ్చింతత నుల్లసిల్లెదరు. శల్య. 1-50.

**ఆక్రాంతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆక్రమింపఁబడినవాఁడు.

వ. ...కొంతసేపు చింతాక్రాంతుండై యమ్మహీకాంతుండు.

మంత్రులం జూచి. విరా. 3-89

**ఆక్రోశము** సం. వి. అ. పుం.

1. చాటింపు, ప్రకటన.

తే. తలరి యమ్మునిఁ దెగఁ జూచి ధర్మరహితుఁ, డగుట యెవ్వరు
నెఱుఁగని యట్లు గాఁగ, నేఁడు గాలంబు గడపిన నెఱిఁగి భూత,
గణము లాక్రోశ మొనరింపఁగా నతండు.

వ. తన దుష్కర్మంబు ప్రకటం బగుటకు రోసి, ఉద్యో. 1-119, 120

2. (రక్షణమునకు) బిగ్గఱగా నఱచుట, కేకలువేయుట.

తే. ...చచ్చె వాఁడు, దాది యాక్రోశమున నార్తనాద మెసఁగ.
శాంతి 1-289, ఆది 6-116

**ఆక్రోశించు** సం. స. క్రి.

1. నిందించు.

వ. ...ఉతథ్యుం డను మునివరుని పత్ని మమత యనుదాని గర్భిణి
నభ్యాగతుండయి బృహస్పతి దేవర న్యాయంబున నభిలషించినఁ
దదీయ గర్భస్థుండయిన పుత్రుం డెఱింగి ధర్మవిరుద్ధంబని యాక్రో
శించిన వానిక నలిగి బృహస్పతి. ఆది. 4-226

అ. క్రి.

2. (రక్షణముకొఱకై) కేకలువేయు, బిగ్గఱగా నఱచు.

వ. గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున
కరుగుదెంచి. విరా. 4-4

3. విలపించు, ఏడ్చు.

వ, అని దీనవదనుండై యాక్రోశించువానికి నాకాశంబుననుండి
యొక్క దేవదూత యిట్లనియె ఆది, 1-150

**ఆక్షిప్తము** సం. వి. (అ. ఆ. అ.)

కలఁత పెట్టఁబడినది. సంక్షుభిత మైనది.

మహాస్రగ్ధర :- భయాక్షిప్తయోధ వ్రజంబున్. సౌప్తి. 2-9

**ఆక్షేపము** సం. విణ. అ. పుం.

1. త్రోసివేయుట, చిమ్మివైచుట.

శా. ...బాణజ్వాలా పాతంబునఁ దూలనేసి చటుల వ్యాపార ఘోరా
నిలాక్షేప క్షోభిత వారివాహచయభంగిం జూపె నేపారఁగాన్.
ద్రోణ. 3-329

2. త్రోసికొని పై కెగయుట.

వ. పలువురు రక్కసులు గ్రక్కున నవ్వాలి నందనుం బొదువం బట్టిన
బిట్టెగసి వారశ్రృఙ్గశిఖరంబు పైకి దాఁటుటయుఁ దదాక్షేప వేగం
బున నన్నిశాచరులు ధరణీతలంబున జర్జరిత శరీరులై పడిరి.
అర. 7-63

ఆక్షేపించు సం. స. క్రి.

1. నిందించు

వ. అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను నాక్షేపించుట యాకర్ణించి
కౌరవేశ్వరుండు. శల్య. 2-324

వ. అని విధాత్రుని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి.
అర. 1-228; సభా. 2-50

2. దెప్పు, దూషించు.

వ శిశుపాలుం డుపాలంభనపరుండయి యధోక్షజు నాక్షేపించుచు
ధర్మరాజున కిట్లనియె. సభా. 2-7

3. ధిక్కరించు.

(చిత్రాంగదుఁడు) ఆతండును నతివ్యాలోలుండై గర్వంబున నెవ్వరి
నుఱక సుర దనుజ గంధర్వాదుల నాక్షేపించుచున్న వాని కలిగి
చిత్రాంగదుండను గంధర్వపతి యుద్ధార్థియై వచ్చినం గురుక్షే
త్రంబునందు. ఆది. 4-195

4. నిరసించు, తక్కువగాఁజేయు.

సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించి నల్లనై తోఁతెంచు నల్లగృహము.
ఆది. 6-210

5. కాదని త్రోసిపుచ్చు, త్రోసిరాఁజను.

వ. అని పలికిన నాగృధ్రవచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు
వారల నుద్దేశించి. శాంతి. 3-371

**ఆఖండలసూతి** సం. వి. ఇ. పుం.

దేవేంద్రుని కొడుకు, అర్జునుఁడు.

ఉ. ఖాండవ మేర్చునప్పుడు దగన్ రథచోదకవృత్తి సల్పి యా,
ఖండలసూతికిన్ జయముగల్గ నొనర్చినయట్టి బుద్ధియున్.
విరా. 4-37

**ఆఖండలుఁడు** సం. వి. అ. పుం.

ఇంద్రుఁడు (వ్యు. శత్రువులను ఖండించువాఁడు)

ఉ. ...ఆ, ఖండలుఁ డున్న గద్దియ సగంబుననుండె. విరా. 1-85

**ఆఖ్య** సం. వి. ఆ. స్త్రీ.

పేరు.

శా. శ్రీ మహాభారతాఖ్యానాఖ్యామృతసూచి యొప్పు. ఆది. 3-21
రావణాఖ్యా నిరూఢుఁడ. అర. 6-888

**ఆఖ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పేరుగలది.

శా. ...భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్. విరా. 1-8

గీ. ఉత్తరాఖ్య మొకండు. శాంతి. 5-41

**ఆఖ్యానకము** సం. వి. అ. న.

చిన్నకథ.

మ. అమితాఖ్యానక శాఖలం బొలిచి, ఆది. 1-75

**ఆఖ్యానము** సం. వి. అ. న.

1. కథ.

క. ఈ యాఖ్యానము విని భూ, నాయకుఁ డెవ్వండు. శాంతి. 3-122

క. నారాయణీయమగు నీ, పారాఖ్యానంబు వినినఁ జదివిన.
శాంతి. 6-541

2. పూర్వవృత్త కథనము.

తే. పుత్త్రి శోకాపహంబును బుణ్యతమము, నైన యాఖ్యానమున
వాడు మానసంబు, కలఁక యంతయుఁబాసె (షోడశరాజ చరిత్ర

ముని నారదుఁడు చెప్పుట) ద్రోణ. 2-217

3. చెప్పుట, వినిపించుట.

వ. కృష్ణ ద్వైపాయనుండు వైశంపాయన మునిం జూచి శ్రీమహాభారత కథాఖ్యానం బాద్యంతం బితనికి సవిస్తరంబుగాఁ జెప్పుమని పంచిన. ఆది. 3-6

4. పూర్వచరిత్ర ప్రతిపాదక గ్రంథము— ఇతిహాసము.

శా. ...శ్రీ మహాభారతాఖ్యానాఖ్యామృతసూతి యొప్ప.

ఆది. 3—21, ఆది. 3-11

5. ఆర్ష మహాకావ్యముల నడుమ వచ్చెడు కథావిశేషము,

వ ఉదాహరణంబైన యీ గృధ్రజంబుకోపాఖ్యానంబు.

శాంతి. 3-381

సీ ఇన్నిలోపాఖ్యాన మెప్పుడు దత్తావధానులై వినువారు.

అన. 2-280

ఆగంతుకుఁడు సం. వి. అ. పుం.

అతిథి.

తే. పద్మఁ డనుపేరి యన్నాగపతి... ఆగంతుక ప్రియతముండు.

శాంతి. 6-558

ఆగడము దే. వి.

1. దౌర్జన్యము, దౌష్ట్యము.

సీ. వేశ్యయొకత దొల్లి విద్యాంసు నొకరుని, ముచ్చని తలవరుల్ మోఁదఁ జూచి, -తే- యితఁడు మావాఁడు మీరిది యేటి కాగ, డంబు సేసెద రని మోక్షణంబు సేసి. అను. 5-812

2. వంచన, మోసము.

సీ. ...వృష్ణికుమారులు... సాంబున, కంగనాలంకార మమరఁజేసి... యమ్మహాముని వర్గమునకు... వందన మొనర్చి యీ భూమిని బభ్రుని భార్య ప్రజలఁ —తే- గనునె యిదియని యడిగినఁ గౌరవేంద్ర, యత్తపోధనవర్యు లయ్యాగడమున, కాత్మఁ నందుఁ గ్రోధానల మగ్గలముగ, నెలయ నక్కుమారులతోడ నిట్లనిరి:—

మౌస. 3, ఉద్యో. 4-376, అను. 1-261

**ఆగతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. వచ్చినది, ఆయాతము.

ఉ. బహుళో గ్రమహాస్త్ర గతాగతంబులన్. భీష్మ. 1-250

వి. అ. న.

2. ఆగమనము, రాక.

తే. వినుము బ్రహ్మోదితంబు ప్రవృత్తిధర్మమది గతాగత వ్యాప్తులు నావహించు.... శాంతి. 4-329

గతాగత భ్రమణంబుల నలయం దొడంగి. అర. 4-170

**ఆగతి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఆగమనము, రాక.

క. దండనీతి సమారంభము నడపుఁ గృతయుగాగతి నధిపా. శాంతి. 2-288

2. ప్రాప్తి.

చ. ...విక్రయింపఁగా, దనుమతి యూఁది వైశ్యకృతినైనను విప్రున కాపదాగతిన్... శాంతి. 2-344

**ఆగతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సీ. ఆగత నృపాలుఁ డచ్చెరువొంది. అశ్వ 4-140

ఆ. అస్త్రదర్శనాగతాఖిల క్షత్రియ వైశ్య శూద్ర వివిధ వర్ణజనుల కలకలంబు. ఆది. 6-7

**ఆగమనము** సం. వి. అ. న.

1. రాఁక, వచ్చుట

క. స్వాగతమే మీ యిద్దఱ, యాగమనంబునకు హేతువగు కోర్కి యను,ద్వేగంబున వెలిఁగింపుఁడు. ద్రోణ. 2-362, శాంతి 6-594

2 ప్రాప్తి.

వ. మేము నిద్రాగమనంబున జడులమై యున్నవారము. సౌప్తి 1-66

**ఆగమము** సం. వి. అ. పుం.

1. వచ్చుట, రాక.

క ...దుర్వినీతుల, కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్.
ఆది. 1-85.

వ అట్టి శారదాగమనంబున. అర. 4-148.

2 ప్రాప్తి, పొందుట.

ధనధాన్యాది సంపదాగమంబులు.
భీష్మ. 1-88, శాంతి. 5-84, శాంతి. 5-247, శాంతి. 1-189.

3. వేదము.

క. నారదముని త్రైలోక్య సమారాధ్యుం, డతని పలుకు లాగమ.
వాక్యోదారము లు వినుము. ఉద్యో. 4-854.

సీ. ఆగమత్రయంబును నగ్నిత్రయంబును. శాంతి. 3-48.

4. దేవపూజా విధానమును తత్సంబంధిత విషయములను దెలుపు పాంచ.
రాత్రాదికము.

చ. ...జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములయందు నిర్వికల్ప.
ప్రకాశముగా హృదయంబు భక్తితోన్. ఆది. 1-10.

5 జనప్రవాదము.

సీ ఈ క్రమంబు లోకాగమంబులందు విరుద్ధము.
ఆది 8-88, ఆది. 8-11.

6. శాస్త్రము.

క. జననీజనకులచే నగు, జననం బాగమము తన విషయం బని.
చెప్పున్. అను. 4-140.

**ఆగమిష్యమాణము** సం. విశ. (అ. ఆ. అ..)

రానున్నది.

ఆ. మానితాగమిష్యమాణ చైత్రమాస పౌర్ణమాసి మహితాశ్వమేధ.
కాలంబు. అశ్వ. 4-98.

**ఆగస్సు** సం. వి. స్. న.

దోషము, అపరాధము, తప్పు.

ఆ. మీరు నాకు నేను మీకు నెన్నండు మున్నహితమాచరించినదియు,

లేదు, మీకు నేల నే నమిత్రుఁడనైతి ని,రాగసుఁడ సద్గుణాన్వి
తుఁడ. సభా. 1-185

ఆగామి సం. విశ. (న్. నీ. న్.)

ప్రాప్తించునది, ప్రాపింపనున్నది.

వ. ఆగామి నిజప్రాదుర్భావంబుల తెలంగెల్ల నెఱింగించె.
శాంతి. 6-467, ఆది. 7-164

2. వచ్చునది, రానున్నది.

వ. ఆగామియయిన చైత్రంబు పున్నమనాఁ డన్నరేంద్ర చంద్రు
నశ్వమేధయాగంబున కనురాగం బెసఁగ రమ్మి. అశ్వ. 4-128

ఆగారము సం. వి. అ. న.

అగారము, ఇల్లు

క, ...క్రీడా,గారములు గట్టఁ దొడఁగుడు. అర. 5-831. మౌస. 77

ఆగ్నికము సం. విశ. (అ. ఆ. అ.)

అగ్ని సంబంధమైనది.

సంగ్రామాగ్ని కాజ్యాహుతుల్,గా వైరిక్షతజంబు వ్రేల్చి.
శాంతి. 1-181

ఆగ్నీధ్రుఁడు సం. వి. అ. పుం.

అగ్నీధ్రమునందుండు ఒకానొక ఋత్విజుఁడు.

(అగ్నీధ్రము = యజ్ఞవేదికలో ఉత్తరభాగ మందుండు స్థాన విశేషము;
ఇతని పని యజ్ఞమునందు నిప్పు రగుల్చుట)

వ. ...వీరల పుత్రశిష్యగణంబులు క్రమంబునఁ మైత్రావరుణుం
డును... బ్రాహ్మణాచ్ఛంసియు నాగ్నీధ్రుండు... సుబ్రహ్మ
ణ్యుండునగా- సభా. 1-292

ఆగ్నేయము సం. విశ. (అ. ఈ. అ.)

1, అగ్నికి సంబంధించినది, అగ్ని దేవతాకము.

అశ్వత్థామ యాగ్నేయాస్త్రంబు సంక్షీణం బగుటయు.
ద్రోణ. 5-403

2. తీక్ష్ణము, వేడిమిగలది రౌద్రము.

సీ. సౌమ్యాగ్నేయ యోగ కలిత మఖల జగంబు. అను. 4-441

సీ. అగ్నేయ భావరూఢమైన యాకృతి లోకహితార్థముగ వహించి వాఁడ. అను. 4—441

3. తగులఁబడునది

క. ఈ గృహ కుడ్యంబులు లా,క్షాగర్భము లాజ్యతైల గంధులు మఱి శ,స్త్రాగార సమీపము మా,యాగృహ మగు నిది యవశ్య మాగ్నేయంబై. ఆది 6-150

**ఆగ్నేయాస్త్రము** సం. వి. అ. న.

అగ్ని దేవతాకమైన యస్త్రము, అనలాస్త్రము.

వ. అతనిపై నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన. ద్రోణ. 1-388

**ఆగ్నేయుఁడు** సం. వి. అ. పుం.

కుమారస్వామి.

సీ. గాంగేయుఁ డన మఱి కార్తికేయుఁ డన, నాగ్నేయుఁ డన రౌద్రుఁ డనఁగ శరవణోద్భవుఁ డన గుహుం డుద్భవిల్లెఁ డె.
ఆది. 6-59

**ఆగ్రయణుఁడు** సం. వి. అ. పుం.

భానుఁడను వహ్నికి సోమపుత్రియైన బృహద్భాసయందుఁ బుట్టిన వాఁడు. అగ్నులలోఁ జేరినవాఁడు. చూ, అర. 5—167

**ఆగ్రహము** సం. వి. అ. పుం.

1. ఆక్రమణము.

ఉ. ...సమగ్రకో,పాగ్రహ బుద్ధి మాదెస ననార్యుఁడు కార్యము నందు భా,ర్తరా,ష్ట్రాగ్రజుఁడు. విరా. 5-15

2 ఒత్తిడిపెట్టుట, నిర్బంధపఱచుట.

(ధర్మజుఁడు భీష్మునితో) వ. ఆగ్రహంబున నే మేనియును నడుగుచున్నవానినిగా నన్నుం దలంపవలదు. శాంతి. 6-221

3 కోపము,

చ, మనకు నజాతశత్రుని సమంచిత మార్దవమూఁది సంధిసేయ

మచితమైన కాలమిది యాగ్రహముం జొర నీకు చిత్తమున్.

శల్య. 1-54

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రికల భీషణరోషుఁడు చిత్త మెప్ప డెత్తై మద మెత్తునో యతని యాగ్రహ వృత్తికి లోనుగాక మీ, రే మెయినైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం, బేమఱకుండఁ గావలయు నివ్విషమార్గములోన నాతనిన్.విరా 1-177

(ఈ యర్థము సంస్కృతమునఁ గానరాదు. తెలుఁగు గ్రంథములయందును వాడుకయందును గనిపించుచున్నది)

**ఆగ్రహించు** సం. అ. క్రి.

కోపించు.

అ. ...భీష్మ పలుకు లవి కర్ణశూలంబు, లయినఁ జేదినాథుఁ డాగ్రహించి...

ఉ. ...ఇట్లని పల్కె నల్కతోన్. సభా. 2-88, 89

2 చలపట్టు, మాత్సర్యముగొను.

క. ...కర్ణుఁ డమ్మువ్వుర సం,పిహిత శరీరులఁ జేసెను బహువిధబాణములఁ జలము బలమును మెఱయన్.

చ. కనుఁగొని శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో నిది యేల ధర్మనం,దను పయి నాగ్రహించెదు కర్ణ. 2-338, 339

**ఆఘాటము** సం. వి. అ. పుం.

ఎల్లసీమ

వ ఇట్లు కృతప్రతిజ్ఞుండై క్షత్రియులనెల్ల వధియించి దిగ్దంతి దంతాగ్రఘాట మహీచక్రంబు సాధించి. అర. 3-155

**ఆఘాతము** సం. వి. అ. పుం.

1. వధ, సంహారము.

శా ...త్రిగర్తేశుండు చే వీచుడుం, గ్రీడాఘాత నిరూఢి నాశ్వికులు వారిం దున్మితూఁటాడినన్. విరా. 3-132

2. వ్రేటు, దెబ్బ.

తే. ...కేక,యులును మాత్స్యపాంచాలురు నొక్క పెట్ట,కవిసి విరిసిరి తచ్ఛరాఘాతభీతి: ద్రోణ. 1-289, అను. 5-100

**ఆఘోషణము** సం. వి. అ. న.

1. చాటింపు.

తే. ...గురుప్రతిన యెల్లెడఁ జాటించె రాజరాజు.

వ. ఇట్లు శిబిరంబునను సేనాస్థానంబునను గలయ నాఘోషణంబు సేయించిన. ద్రోణ. 1-114; 115

2. పెద్ద మ్రోత.

(కుమారస్వామి) ఆఱుముఖంబుల నొక్కపెట్ట యార్చినం ద్రిళయ భైరవారావభీషణంబైన తదాఘోషణంబున.. అర. 5-207

**ఆఘ్రాణము** సం. వి. అ. న.

వాసన చూచుట, మూర్కొనుట.

వ. ఆ ఘటోత్కచుండు ధర్మనందనున కభివందనంబు సేసిన నతండు సంతుష్టాంతరంగుండై యాలింగనంబును మూర్ధాఘ్రాణంబును జేసి యగ్గించె. ద్రోణ. 3-268

2. వాసనపీల్చుట.

వ. తదీయవిస్రగంధాఘ్రాణంబునను యోధులు వీతచేతస్కులైరి. శల్య. 1-341

**ఆఘ్రాణించు** సం. స. క్రి.

మూర్కొను, చూచు.

వ. అశ్వవపాహోమంబునం బరఁగు గంధం బాఘ్రాణించి ధర్మనందనుండు. అశ్వ. 4-184

వ. (శంతనుఁడు) ఒక్కనాఁడు యమునా తీరంబున వేఁటలాడుచుఁ గ్రుమ్మరువాఁ డపూర్వసురభిగంధం బాఘ్రాణించి. ఆది. 4-169

**ఆచమనము** సం. వి. అ. న.

ఉపస్పర్శము, ఆచమించుట.

వ. ...కృష్ణుఁడును జిష్ణుతోన దదీయ సదనంబునకుం జని విమల జలం బులం గృతాచమనుండయి. ద్రోణ. 2-389

తే. గరగ లోసఁగిన నరుఁడు భూసురులోనర్చు, నాచమనముఖకర్మ లందు షష్ఠభాగఫలమొందు. అను. 2-388

**ఆచమించు** సం. స. క్రి.

ఆచమనము చేయు.

వ. పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం బ్రక్షాళిత పాణిపాద వదనుండయి యాచమించి పౌష్యామమతంబున నద్దేవి యొద్దకుం జనిన. ఆది. 1-97

**ఆచరణము** సం. వి. అ. న.

1. ఒనరించుట, చేయుట.

వ. అనిన విని ధర్మాచరణంబున కింత పట్టి పెనంగవగునే. ఉద్యో. 4-308

వ. పురుషుం డేమిటఁ బాపాచరణమునకుఁ జొచ్చు. శాంతి. 5-368

2. కృత్యము, కార్యము.

క. విరటుఁడు సంభ్రమమును నాదరమును భక్తియును నాత్మఁ దల కొనఁ బూజాపరుఁడై సమయ సముచితాచరణంబులు నిర్వ హించె సమ్మదలీలన్. విరా. 5-390

వ. పాంచాలి సుదేష్ణ మందిరంబునం దా నుచితాచరణంబున నుని కియు. విరా. 2-274

3. అనుష్ఠానము.

వ. ఇటమీఁద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొలంత గలదు. విరా. 1-313

**ఆచరణీయము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆచరింపఁదగినది.

వ. కావున గృహస్థ ధర్మంబు యాచరణీయం బట్లు గాక. శాంతి. 1-77; అను. 3-338

**ఆచరించు** సం. స. క్రి.

1. చేయు, కావించు.

ఆ. పనులు పట్టువడిన పదపడి నరుఁ డెద్ది, యాచరించెఁ గౌరవాధి
నాథుఁ డేమి చేసె. విరా. 4-278

వ. శమీవృక్ష సమారోహణం బాచరించి.
విరా. 1-178; శాంతి. 5-210; కర్ణ. 1-298

2. ధరించు (వేషము మొ.)

ఉ. ...ప, యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు.
విరా. 1-123

**ఆచరితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆచరింపఁబడినది, చేయఁబడినది.

వ. దైవంబు దుఃఖభాజనత్వం బొనర్చుటం బూర్వజన్మాచరితం బైన
సుకృతంబు లేమి. స్త్రీ. 1-14

క. అనదియం బాచరితస్నానుండై. శాంతి. 5-5

2. నిర్మింపఁబడినది, కూర్పఁబడినది.

వ. ఇచ్చుటయు బుచ్చుకొనుటయును నివి దైవాచరితంబులు మీకుం
బనిగాదు. శాంతి 4-159

**ఆచారము** సం. వి. అ. పుం.

1. నియమము.

క. ఆరయ నెంతయు గౌరవ, భారం బెడలంగనీక పాతివ్రత్యా,చా
రముమై వర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్.
విరా. 1-112

2. ఆచరించుట, అనుష్ఠించుట.

వ. నీతిశాస్త్ర సముద్భవం బెఱింగించి దీని నధిగమింపను దదీయాచా
రంబు నడపను శక్తుండగువాని నొక్కరుని నిర్దేశింపవలయు నని.
శాంతి. 2-205, శాంతి. 3-163

3. ధర్మము.

క. నీచము లయ్యెడు పనులకు, నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ

కాత్రముగా, నీ చిత్తంబునం గైకొని, యాచారము దప్పకుండ నరయుము నమ్మ్నన్. విరా. 1-318

క, నాచిత్తము కాదృశులకు, గోచరమే యస్మదీయ కులజన సంశీ, లాచార మహిమ యట్టిది,యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్. విరా, 1-327

వ. ...ధర్మాకారంబు నిర్దేశించితి వృత్తమాచార ప్రకారం బెఱింగిం పవే. శాంతి. 5-221

తే. వేద మాచారములం జెప్పు వివిధ గతుల, సకల హితమగునట్టి యాచార మరయ, ననఘ వేల్పొండు గలదె మహాత్ము లెద్ది, యాచరించిరి దానిం జేయంగ వలయు. శాంతి. 5-222

4. శీలము.

శా. సారాచార నిరూఢుండైన ధనురాచార్యున్ వధింపంగ. సౌప్తి. 1-68

క, ఆచారనేమియుం బ్రాణయుగంబును. శాంతి. 5-92

5. నడవడి, ప్రవర్తనము.

క, అనిన విని ధర్మజుండు శాంతనవునితో జనుల కెవ్విధము నాచారంబున నెట్టిపాటి శీలంబున నే విద్యను మహాత్మ ముక్తి దొరకొనున్. శాంతి. 5-18

మ. హరి మేనల్లుండు బాహువీర్య పటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్య సుందరుం డాచారపవిత్రుండు. విరా. 5-363

6. విధి, కృత్యము.

వ. గీతవాద్య నృత్తంబులును నాదిగాంగల వివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింపవలయు ననిన. విరా. 3-286

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు దశాకాలోచితాచారంబులు నిర్వర్తించి. ఉద్యో. 2-115

7 సంప్రదాయము, గురువులు పెద్దలు మొదలగు వారినుండి పరంపరగా వచ్చు వాడుక.

సీ. సజ్జనులం దురాచారవంతుల. శాంతి 4-117

వ. ఆచార పరిపాటి యవలంబించి యిట్లుపాధ్యాయ వరణంబు నేసి. శాంతి. 6-255

**ఆచారవంతుఁడు** సం. విశే. (త్. వతీ. త్.)

ఆచారము గలవాఁడు, సదాచార సంపన్నుఁడు.

వ. సజ్జనులం దురాచారవంతుల. శాంతి. 4-117

**ఆచారి** సం. విశే. (న్. ణీ. న్.)

ఆచారము గలవాఁడు.

వ. ...ఆసమంచితాచారులతోడ నాశ్రమ ప్రకారంబు లెఱింగించెన. అశ్వ. 2-167

**ఆచార్యకము** సం. వి. అ. న.

1. ఉపాధ్యాయత్వము, గురుత్వము,

క. ...కృపాచార్యుఁడు మత్పిత్రసఖుఁ డాచార్యక మొనరించె మాకు శైశవము తఱిన్. విరా. 5-9

2. ఉపదేశము, శిక్ష.

వ. ...నీ కొడుకుం దోడ్కొని ద్రోణుని కడకుం జని జయద్రథుండు దనకు నర్జునునకు ధనుర్విద్యా విభవంబు నందలి వాసి యెట్టిదని యడిగిన నతండు నీకును నతనికి నాచార్యకంబు సమప్రకారంబ యవ్వీరుండు వివిధశ్రమంబుల యలజడి కోర్చి యలఘు ప్రయోగంబులు పెక్కులు సాధించుటంజేసి నీకంటె నధికుండై యుండు. ద్రోణ. 2-296

**ఆచార్యుఁడు** సం. వి. అ. పుం.

1 శిక్షకుఁడు, ఉపాధ్యాయుఁడు, గురువు.

ఆ. సకల కురుకుమార చాపశిక్షాచార్యుఁడు. విరా. 5-118; ద్రోణ. 1-158

2. బృహస్పతి.

వ. జంభారి కర్తవ్యం బెయ్యది యని యడిగిన నాచార్యుం డితం డెఱింగినను విస్పష్టంబుగా నహుషు వృత్తాంతంబంతయు వివరిం

చెదం గాక యని తలంచి యిట్లనియె. ఉద్యో. 1-191

3. ద్రోణుఁడు.

క. సూర్యోదయావసరమునఁ, దుర్యోధను బలము ప్రబల దోర్బల లీలాధుర్యగతి నడచె భీష్మాచార్య రవిసుతాది యోధ సంఘోద్భటమై. విరా. 4-8

4. మహా మంత్రోపదేష్ట- తత్త్వోపదేష్ట.

క. జననీ జనకులచే నగు, జననం బాగమము తను విషయమని చెప్పున్, వినుమాచార్యు వలన నొందిన పుట్టు జరామరణంబు దివ్యంబు నగున్.

వ. కావున గౌరవంబున నాచార్యుండు సర్వాధికుండు. అను. 4-140, 141

క. వినుమాచార్యులు నూర్వురు, జనక నృపాలునకు వారు సంతతంబును నజ్ఞనపతి వినిపింతురు తత్త్వ నిరూపక శాస్త్రములు పృథగ్విధములుగన్. శాంతి. 4-340

5. అటితేటినవాఁడు, ఉపదేష్ట.

శా. భక్తాంభోరుహ బాలసూర్య దనుజ ప్రధ్వంసనాచార్య. శాంతి. 1-398

**ఆచితము** సం. విశే. (అ. ఆ. అ.)

కప్పఁబడినది.

క, వడి సవ్యసాచి శరాచిత దేహులుగఁజేసె నందఱఁ గడిమిన్. ద్రోణ. 1-158

**ఆచుంచితము** సం. విశే. (అ. ఆ. అ.)

తాఁకఁబడినది.

ఉ. ...ప్రకటస్ఫుట భూషణ రత్నరోచిరాచుంబిత దిగ్విభాగ, అర. 4-216

**ఆచ్ఛాదనము** సం. వి. అ. న.

వస్త్రము.

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ డర్థి నెయ్యది యిచ్చిన నందక... అశ్వ. 2-172

వ. (యయాతికి) శర్మిష్ఠం జూపి యిది వృషపర్వుని కూఁతురు దీనికిం బ్రియంబున నన్న పాన భూషణాచ్ఛాదన మాల్యానులేపనాదుల సంతోషంబు సేయునది. ఆది. 3-179

**ఆచ్ఛాదితము** సం. విణ. (అ. ఆ. అ.)

కప్పఁబడినది.

సీ. అయ్యుధిష్ఠిరుఁడు నానాస్త్రంబు లేసిన, నాచ్ఛాదితం బయ్యె నంబరంబు. కర్ణ. 1-192

**ఆజగరము** సం. వి. అ. న.

ఆజగర చరిత్ర. ఆది. 1-32

**ఆజగవము** సం. వి. అ. న.

మాంధాతృని ధనుస్సు.

వ. ...అమ్మాంధాతృండు... యజగవంబను ధనువును దివ్యాస్త్రంబులు నభేద్య కవచంబును ధరియించి. ఆది. 3-205

**ఆజానేయము** సం. వి. అ. పుం.

1. ఆజానేయ దేశమునకు సంబంధించినది మేలుజాతి గుఱ్ఱము)

వ. ...ఆజానేయ తురంగారూఢులైన యాశ్వికులు. ఆది. 4-10

2. ఒక దేశము.

ఆ. ఆజానేయ బాహ్లిక హూణ పారసీక దేశంబులం గల హయంబుల. సభా. 2-113

**ఆజామీఢుఁడు** సం. వి. అ. పుం.

అజామీఢుని వంశస్థుఁడు, యుధిష్ఠిరుఁడు

శా. రాజర్ష్యర్తులు వచ్చి కాంచి రనఘుల్ రాముండుఁ గృష్ణుండు న,య్యాజామీఢు నజాతశత్రు... గాంగేయాగ్రజున్ ధర్మజున్. ఆది. 7-215

**ఆజి** సం. వి. ఇ. స్త్రీ.

యుద్ధము.

సీ తన బంటుతన మాజిఁ గనిన మార్తురకైనఁ బబుమాఱు నగ్గింప

వలయువాఁడు. విరా. 2-208

**ఆజీవి** సం. వి. (న్. నీ. న్.)

ఒకదానిని ఆశ్రయించి బ్రతుకువాఁడు, ఒకదానిని వృత్తిగా బెట్టుకొని బ్రదుకువాఁడు. ఉపజీవి.

క. విను మర్థార్జకులను గా,ర్యనిపుణ మానసులు నాయుధాజీవులు ద,క్కునుగల పనుల జనులు గలరు. శాంతి. 3-38

(ఆయుధాజీవులు = ఆయుధములు ధరించి వానిమీఁద జీవించువారు- సైనికులు, రాజభటులు మొ.)

**ఆజీవిక** సం. వి. ఆ. స్త్రీ.

జీవనార్థమగు వ్యాపారము, బ్రతుకుతెరువు, జీవనము

క. రాజునకు ధర్మము శస్త్రాజీవిక యొకఁడ. శాంతి, 5-494

**ఆజీవిత** సం. వి. ఆ. స్త్రీ.

బ్రదుకుట

క. ధృతవేనత్యజనానల, వితతి వృథా త్యాగ సోమ విక్రయ వృష లీ, పతితా దుర్గ్రాహ మాజీ,వితలు బిసస్తేయ కష్టవృత్తికి నెనయే. అను. 3-240

**ఆజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ.

ఉత్తరువు, ఆదేశము.

క. ఆజ్ఞాభంగం బయినం బ్రాజ్ఞేతరుసట్లు దుఃఖపడియుండఁడె. ఉద్యో. 1-207

మ. భవదాజ్ఞా దృఢబంధసంయమిత కుంభద్వేగమై కాక నాఁ, డవ లీలన్ మన యర్జున ద్విపము... కౌరవ్యాంబుజ శ్రేణిఁ జిక్కు వడం జేయదె. విరా. 1-56

**ఆజ్ఞాపనము** సం. వి. అ. న.

1. ఆజ్ఞాపించుట, ఆదేశించుట.

వ. సాత్యవతేయ మునిపతి కురుపతి పాలికిం జనుదెంచి నేఁడు మొదలుకొని నెలనాళ్లపర్యంతమును... సమస్త శుభంబులు నావహిల్లునని ఆజ్ఞాపనంబు సేయుటయు, అశ్వ. 4-171

2. నియమనము- నియోగించుట.

సీ. ...అమ్మహానీయుఁ డట్లగు టంబుజాసనుని యాజ్ఞాపనమున.
ఆర. 2-77

ఆజ్ఞాపరిపాలకుఁడు సం. వి. అ. పుం.

ఉత్తరువులను నెరవేర్చువాఁడు- ఆజ్ఞలనుబట్టి పరిపాలించువాఁడు.

వ. ...తత్సంబంధ (కీచక సంబంధి) బద్ధుండును నాజ్ఞా పరిపాలకుం డును గావున మత్స్యపతి. విరా. 2-185

ఆజ్ఞాపించు సం. స. క్రి.

ఆజ్ఞవెట్టు, నియోగించు.

వ. భృత్యులకు జీవితంబులు పెట్టుటకుఁ గర్మకలాపంబులు సేయించు టకు నకులు నాజ్ఞాపించి. శాంతి. 1-378. స్వర్గ. 77

ఆజ్ఞాపితుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

ఆ. అవనిప ఘచేత నాజ్ఞాపితుండయి సూతనందనుండు ప్రాతికామి.
సభా. 2-206

ఆజ్యపాత్రము సం. వి. అ. న.

నేతిగిన్నె- హోమమునకై తీసియుంచిన నేయి గల గిన్నె.

తే. ...స్రుక్స్రువాజ్యపాత్ర దండకమండలు దాత్రములును.
అశ్వ. 3-156

ఆజ్యము సం. వి. అ. న.

నెయ్యి, ఘృతము.

ఆజ్యముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి. అను. 5-202

ఆట దే. వి. (√ఆడు)

1. క్రీడ.

వ. అచ్చెరువం జరియించు మునికుమారులతోడి యాటపాటలు మరిగి లోకంబుతోడిపాటిదై. శాంతి. 6-257

సీ. ...ప్రాణ -అ- మోటుపడిరె నె త్తమాటకు నీతండు.
స్త్రీ. 2-186

2. నృత్యము.

క. నిన్నుఁ గొల్వవంగ వచ్చితిఁ, గన్నియలకు నాట గఱపఁగా నోపుదు. విరా. 1-233

వ. ఇమ్మగువ నీకు నాట గఱపం దగు పాత్రం బగునే యని యడిగి. విరా. 1-248

3. పలుకుట.

ఆ. ...మీకుఁ గానవాస, మెల్ల భంగిఁ గలుగునేని నేనుఁ, దగిలి తోన వత్తుఁ దగు మాటగా నాట, గాదు నాదు హృదయగతియు నిట్ల, అశ్ర. 1-34

క. అని తగు నుల్లస మాటకుఁ గినిసి... విరా. 5-182

4. కొన్ని శబ్దములకు అనుప్రయుక్తమై వచ్చును.

పోరాట. ఉద్యో. 3—7. మోదులాట. మౌస. 1-95

**ఆటపట్టు** దే. వి.

1. క్రీడాస్థలము, విహార స్థలము.

తే. అతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు. అను. 4-308

2. నివాసస్థానము.

ఆ. యతికి మోక్షవీథి యాటపట్టు. అను. 5-43

**ఆటపాట** దే.

ఆడుట, పాడుట, నృత్యము, గీతము.

చ. అనుటయు నాటపాట గల యప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ బంచినఁ దగుఁగాక. విరా. 4-35

**ఆటు** దే. వి.

అడచుట, దెబ్బ, వ్రేటు.

సీ. దానత్వమొందని యదల్పుల, దిట్టుల నాటులఁ బడుచుండునట్టి నీచులు. అను. 5-107

**ఆటుఁబోటు** దే.

అడుచుట, పొడుచుట వలనఁ గలిగిన దెబ్బ,

(గదదెబ్బ, కత్తి, బాణముదెబ్బ)

ఆ. అట్లు దివిసిపోయి యాటుఁబోటు నొడళ్ళఁ గలయఁ గలిగి.
కర్ణ. 1-213

**ఆటోపత** సం. వి. ఆ. స్త్రీ.

సంరంభత్వము.

మ. ...నిమ మెచ్చించుం దుదిన్ సైంధవుం, దనువానిం దెగటార్చి
వేర్చు రిపు ధైర్యక్షేపణాటోపతన్. ద్రోణ. 3-15

**ఆటోపము** సం. వి. ఇ. పుం.

1. వేగిరపాటు, సంభ్రమము.

వ. ఇట్లు వేర్చిన కోపాటోపంబున నవిచారిత సమయవర్త నుండయి
వృకోదరుండు... విరా. 2-135

2. సంరంభము.

మ ...వాఁ, డనుమానింపక జెట్టవల్చికొని కోపాటోపదీప్తాంగుఁడై.
విరా. 2-340

3. విజృంభణము.

క. ...వీర వినోదము నప్పు డధిక రథసములగు మ,ద్విధాటోపము
లకుఁ జాలవు విల్లది నూఱువేల లావరయంగన్. విరా. 4-106

4. గర్వము, గరువము.

వ. అమ్మేటి మగండు నాటోపంబుగా దేవ నిన్ను నొప్పించిన
యప్పాపకర్ము మశ్కార్ముకముక్త శిలీముఖంబులం బొలిపుచ్చి
యిదె వచ్చెద. కర్ణ. 3-112

**ఆడంబరము** సం. వి. అ. పుం.

1. సంరంభము, వేగరపాటు.

క. వేడుకమైఁ దలపడి పో,రాడిరి ద్రుపద భగదత్తు లస్త్రబలము
శౌ,ర్యాడంబరమును నెలుఁగులుఁ, జూడమ వినఁ జిత్రములుగ
శుంభద్భంగిన్. ద్రోణ. 1-168

2 దర్పోన్నతి, విజృంభణము.

మ. ...భారత కథావిఖ్యాతికిం గారణం బును దద్భారత విస్తరోక్తి

విభవంబుం గాండవాడంబరం,బును భీష్మాది కురు ప్రవీర చరితంబుం జెప్ప ముద్యన్మతిన్. (ఇచ్చట పరాక్రమము అను అర్థము స్ఫురించును) ఆది. 1-74

3. అతిశయము.

ఉ. ...శారద చంద్ర చంద్రికా,డంబరచారుమూర్తి...అర. 4-216

**ఆడించు** దే. స. క్రి.

1. నాటు, గ్రుచ్చుకొనునట్లు చేయు.

క. తోడన కోదండము దును,మాడెను సూతు మెయిగ్రుచ్చె నాలు మ్మూలు సం,క్రీడయ పోలెను ముప్పది, యాడించెను మఱియుఁ దూపు లనిలజుమేనన్. కర్ణ. 8-201

2, పలికించు.

సభలో నులూకుని బంచి యాడించిన పరుసములును గక్కించి. భీష్మ. 2-287

**ఆడు** దే. స. క్రి.

1. ఆటలాడు.

క. నెచ్చెలుల తోడ నెంతయు, మచ్చికఁ దన యిచ్చ నాడమరిగిన యదియై, విచ్చలవిడి నింతకుమును, న్నిచ్చెడియ మెలఁగు శిశు రొయెఱుఁగద సుమ్మీ, విరా. 1-250

2. ఆటయాడు (జూదము. మొ.)

వ. ధర్మసూనుండు... నొక్కొక్కమాటు మధుర ప్రసంగంబుగా నాడిన నెత్తంబున గెలిచిన విత్తంబులు. విరా. 2-2

తే. జూద మిచ్చట నాడంగరాదు సుమ్ము. విరా. 5-204

3. క్రీడించు.

ఆ. పడుచు లేక లూద్చిపట్టి యాడెడునట్టి, పులుఁగు చందమయ్యెఁ దలఁప నా యవస్థ. కర్ణ 1-84

గీ. తుంగమడువున నాడు మాతంగవిభుని, భంగి భవదీయ సైన్యంబు బడలువడఁగ, భీష్మ. 2-222

4. నృత్యము చేయు, నర్తించు.

సీ ...నలువుర నేవుర నాటు నవియు -తే- వైన శరములు గనుఁ
గొని యాడియాడి, నారదుఁడు పిచ్చలింపంగ వీరకేళి సలిపె.
విరా. 3-161

చ ...తన కుంచెయుఁ గృష్ణ మృగాజినంబునుం, బలుమఱు వీచుచుం
గలహాబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్.
సభా. 2-51, అర 2-264

5. స్నానము చేయు, మునుఁగు

క. సరస్వతి చేరువ నడచి తదీయ సకలదీర్థంబు లాడుచు.
శల్య. 2-146

సీ. సర్మద నాడి భూనాథ నందనుఁ డగు. అను. 2-87

ఆ. గంగ నాడ వచ్చి నీవుఁ ఆది. 7-41

6. తిరుగు, సంచరించు, విహరించు.

తే. అదరి కురుసేనపై గ్రద్దలాడఁ జొచ్చె, భీష్మ. 3-354

7 కదలు, చలించు.

మత్తకోకిల. వాలు కాడకయుండి య,ద్దేవి యూద్చు నిగిడ్చె.
స్త్రీ. 1-175

ఉ. ...మే, యాడక నిద్రవోయె శిశిరానలముల్ పయి వీచుచుండఁ
గన్. ఆది. 5-170

8. (అవయవాదులు స్వకార్యములందు) ప్రవర్తించు,

క. వెఱవారినెల్లఁ దరమిడి నఱకుదుఁ బాండుతితిశ నందనులను
ర్యాపఱనేయం జేయాడదు, దఱుమరు నా మీఁద నత్యుదగ్రత
వారున్. ఉద్యో. 4-150

సీ. ...అక్కటా బాలుని నబ్జవదను, నిట వైచిపోవఁ గా ళ్ళెట్లాడె.
శాంతి. 3-369

తే ఏల తెంపు వాటిలుఁ జేతు లెట్టు లాడు. శాంతి. 4-279

స. క్రి.

1. పలుకు, వచించు, చెప్పు.

తే. చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ,బుట్టువులతోడ నీవును బుట్టినాఁడవు విరా. 2-60, భీష్మ. 1-68

క. విఱుఁగుట నొచ్చుట మనదెసఁ దఱచుగ నాడెదవు. భీష్మ. 1-31

తే. నారి వీక్షించి ఖచరులు పోరు లెందుఁ, జూడమే దీని కెనయని యాడఁగలదె, కలుగ వింకను వీరల బలముఁ జలము, నలువు వెరవు నిట్లుండునే యనుచునుండ. కర్ణ. 1-107

ఉ. నిక్కమపోలె నవ్వు డొక నేరిమిమై ననుఁ ద్రోచిపుచ్చఁగా, నక్కమలాతి పొందు దగ నాడి తుదన్ నిజ మేది నేఁటి రే, యిక్కకు రాక తక్కిన సహించునె నన్ మరుఁడు. విరా 2-296

౨. నాటు, గ్రుచ్చు.

ఆ ...వేఱొక్క వింట వ,జ్రంబుఁ బోని నారసంబు దొడిగి, రాజరాజు వెస నురం బాడనేసిన, మూర్ఛవచ్చి యతఁడు ద్రెమ్మగ్గ నధిప. భీష్మ. 2-288

సీ. అర్జున భీష్మచాపాచార్య భీమ క,ర్ణాదుల మహిత దివ్యాస్త్ర వితతు లాడిన నొఁడొక కీడు రానేరమి. స్త్రీ. 2-14

క. మహోభల్ల మురస్థ్సలమ్మ నాడఁగ నేసెన్. ద్రోణ. 4-229, 189

ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన సరములు, నెఱుకులాడి నాకు సిశిత దివ్య, విశిఖతతుల యట్ల వేదన గావించు, టిది యపూర్వ మితఁ డెవ్వఁ డొక్కొ. అర. 1-314

౩. దూఱు, నిందించు.

మత్తకోకిల. తాన చుట్టుఁ దగిల్చి యగ్ని యుదగ్రతం దరికొన్నఁ దా, సామభూతికి నోర్వఁ జాలక య ప్రయోజన వాక్యసం,తాన శోషితపక్షుఁడై యతి దైన్యమొందెడువాని య,స్తైన నీదు విలాస మన్యుల నాడఁ బట్టగు భూవరా. స్త్రీ. 1-21

చ. గురులను బంధుమిత్రులను గ్రూరశరంబులఁ గూల్చె నుగ్రతన్, నరుల ననేక కోటుల రణంబునఁ దాఁ దెగటార్చెఁ గాన యిఃకు రుపతి నీ సమతమునకుం గదియం బుయిలోడెడుం గృపా, విర

హిత కార్యకర్మతుఁడు వీఁడని యాడునొ యన్ తలంపురన్.
శాంతి. 2-158

4. ఆచరించు, చేయు, ఒనరించు.

సీ. (పార్వతి) తమిన్నతెకుల నుల్లసమ్మాడు తన మృదు కరయుగ్మము మునకు శంకరుని నేత్ర -ఆ- యుగ్మ మల్ల మూసియున్నంత.
అను. 4-419

బంకె మే లాడవు కౌరవేంద్ర. శల్య. 2-402

5. ఇది పెక్కుపదముల కనుప్రయుక్తమై విశేషార్థములు కలిగియును లేకయును ఉండును. వాని యర్థములు సకర్మకత్వాకర్మకత్వముల రెంటను సందర్భానుసారముగ గ్రహింపవగును.

వాయించియాడ. విరా. 2-184, తన్నియాడ. విరా. 2-134, త్రిప్పియాడి. శల్య. 1-317, తూలాడు. విరా. 5-185.

ఆఢ్యము సం. విశ. (అ. ఆ. అ.)

కూడినది, కలిగినది, కలది,

తే. నిష్కళత శుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ, లాష్టపై దూర్యములుఁ దురగాఢ్య రథముఁ, గరటి శతకంబు నొక యూరుఁ బురము నొచ్చినపుడ యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు. విరా. 4-80

ఆ. తమకు ధనము లేక తగు భోగముల కెవ్వరైన నడపమను సుఖాఢ్యజనులు, దొల్లి పేదవార లుల్ల మర్థుల కెప్డుఁ బెట్టఁ గోరు చుండినట్టివారు. అను. 5-90

ఆఢ్యుఁడు సం. విశ. (అ. ఆ. అ.)

కలవాఁడు, సమృద్ధిగాఁగలవాఁడు.

శోభాఢ్యుఁడు. విరా. 1-85, మధ్యాహ్నస్నాయత్రృభాఢ్యుఁడు. కర్ణ. 2-224, అలఘునయాఢ్యులు. అను. 5-91

ఆణి దే. వి.

1. (ముత్యముల) వట్టువదనము, గుండ్రదనము.

గీ. ...చందనమునఁ బరిణయాగార మణికంగఁ శాణి యాణి;గలుగు ముత్తియముల ముగ్గుగా నొనర్పఁ, జతుర పుణ్యాంగనాజనతతిఁ

బొనర్చె. విరా. 5-886

2. శూలముయొక్క చివరిభాగము, శంకువు

వ. .. శిలంబువలన నమ్మునిం (మాండవ్యుని) డాచుచో నది వుచ్చ రాకున్న దాని మొదలు మెత్తన తునిమించినఁ దత్కంఠ పార్శ్వంబునందు శూలశేషం బంతర్గతంబై యుండె దానంజేసి యాణి మాండవ్యుఁడు వాఁ బరగుచు. ఆది. 4-287

**ఆతంకము** సం. వి. అ. పుం.

1. అడ్డు, అడ్డుగలది.

క. భూతముల తారతమ్యము, చేతోగతమైన యట్టి శిష్టజనము ప్రద్యోతితుఁ డగు పురుషుఁ గని నిరాతంకావ్యయ పదంబు ప్రాప్తింపఁ గనున్. అశ్వ. 2-197

2. సందేహము.

క. పంకజభవ సన్నిభుఁ డఘ, పంకక్షాళన మహాతపస్సలిలుఁ డనా, తంకమతి పైలశిష్యుఁ డు,గంకుం డను మునివరుండు దద్దయు భక్తిన్. ఆది. 1-91

3. భయము.

శా. ...కల్పాంతసంజాత ప్రోద్ధత బాడబానలశిఖా శంకాధికాతంకమై. ఆది. 1-111

4. ఆధి, మనోవ్యథ.

క ఆతని రాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజా శోకాంతక భయ శంకాపేతంబై ధర్మచరితఁ బెరుగుచు నుండెన్. ఆది. 4-9

**ఆతండు, ఆతఁడు** సం. సర్వ. ఏ.

వాఁడు, అతఁడు.

ఇది 'అ' శబ్దమునకు మహదర్థకమున వచ్చు ప్రథమైక వచన రూపము.

మ. ఆతం డవినీతి సేసినను. విరా. 2-158

వ. రమ్మని నియోగించిన వాతండు నట్లచేయుటయు. విరా. 4-169

క. ఆతఁడు తనమదిఁ బ్రియమందె, విరా. 1-278

ఆ. నరుఁడు సేనగూల్చి యాతని భంగపెట్టె. ఉద్యో. 3-287

ఆతనికిన్, ఉద్యో. 3-68, అతనిచేన్. కర్ణ. 2-46.

అతనిచేత. స్త్రీ. 2-56, ఆతనితో. శల్య. 2-94.

ఆతనితోడన్ విరా. 1-55, ఆతనిని. కర్ణ. 1-110,

ఆతనియందు ఉద్యో. 1-22 మొ.

**ఆతతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. విరివియైనది, విస్తారము-

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ,యాతత సేనలోఁ గలుగు టారయ సంశయము. విరా. 4-96

2. విశాలమైనది.

క. హవ్యము, లాతతహస్తములఁ గొందు రగ్నిముఖమునన్. ఆది. 5-79

**ఆతతాయి** సం. విణ. (న్. నీ. న్.)

చంపనుద్యుక్తుఁడైనవాఁడు, ఆతతాయులు ఆఱుగురు.

శ్లో. అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః,
క్షేత్రదారాపహారీ చ షడేతే ఆతతాయినః- (వసిష్ఠుఁడు)

సీ. కూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షు లం
దొఱును మనకు, నాతతాయులు. అర. 1-269

ఆతతాయులు : 1. అగ్నిదుఁడు = నిప్పు ముట్టించువాఁడు-లక్క యిల్లు కాల్చినారు 2. గరదుఁడు = విషము పెట్టువాఁడు. భీమునకు విషము పెట్టినారు. 3. శస్త్రపాణి = చేతియందు ఆయుధములు గలవారు. మహాస్త్రములు, మహాస్త్రములు గలవారిని గలవారు. 4. ధనాపహుఁడు = ధనమపహరించువాఁడు; జూదము నెపమున ఐశ్వర్య మపహరించినారు. 5. క్షేత్రాపహారి = ఆస్తి కాఁజేయువాఁడు - జూదమున రాజ్య మపహరించి 6. దారాపహారి = ఒకని భార్యను అపహరించువాఁడు - ద్రౌపదికి సభలో మానభంగము చేయఁ బూనినవారు.

**ఆతపత్త్రిము** సం. వి. అ. న.

1. ఎండనుండి రక్షించునది- గొడుగు.

సీ. ధవళాతపత్త్రముల్ దఱచుగా నేలొకో పట్టరు మౌక్తిక ప్రభలు వెలుఁగ. విరా. 1-186

2. యోధుల బిరుదచ్ఛత్త్రము.

చ. అనుగుణమైన యానమును నాసనమున్ రుచిశాలిపత్త్రమున్. విరా. 1-220

వ. దుశ్శాసన దుర్మర్షణ వివింశతి వికర్ణాదులగు సోదరులు వాహన చ్ఛత్త్రంబులు మెఱసి మెఱుఁగారు తమతమ సిడంబు లుల్లసిల్ల. భీష్మ. 1-96

3. సెల్లగొడుగు.

వ. పలితాతపత్త్ర హంసంబులనుం బోలుచునట్టి నదీప్రవాహంబులు వఱపె. కర్ణ. 2-157

**ఆతపము** సం. వి. అ. పుం.

1. ఎండ.

వ. శీతాతపవర్ష పరిహారంబుగా నాయుధంబులం బొదివించి. విరా. 1-180

2. వెలుఁతురు, ప్రకాశము.

నిరతిశయ సాంద్ర చంద్రాతపస్నపన శీతల సమీరవాహ్యమాన వినిద్ర కుముద కేదార సౌరభ్య నిర్ఝరంబులు. అర. 7-2

**ఆతల** దే. వి. అవతల

1. ఆవలి ప్రదేశము.

క. ఆతలకు నేమఁ జని వి,ఖ్యాతంబుగ నీదు వినయ మభివర్ధింతున్. ఉద్యో. 3-38

ఉ. నీవు సైన్యావలియైనఁ జేప్పడక యాతం కెద్దియుట లేదు నేని యున్. విరా. 4-192

చ. ఆతల వేటొక కొంత సేన యల్లదె. విరా. 4-245

2. ఆవైపు, ఆ పక్షము.

మంగళమహాశ్రీ... ధర్మం, శేతల నమూనమగు సిద్ధజయ మాత లకు నెట్లయిన సిద్ధమగు నంటిన్. స్త్రీ. 2-29

**ఆతిథ్యము** సం. వి. అ. న.

అతిథికిఁ జేయు సత్కారము.

క. నను దగియెడు నతిథింగా, మనంబునఁ దలంచి నీవు మన్నించెద వే,నిని వచ్చెద నీ పాలికి, ననఘా సంగ్రామ మొసఁగు మాతిథ్యము గన్. కర్ణ. 2-286

క. నారదుఁడు వచ్చి నరునిన్, నారాయణుఁ గాంచి భక్తినమ్రుం డై నన్, వారతనికి నాతిథ్యము, గారవమున నడిపి యడుగఁగా వారలతోన్. శాంతి. 6-463

విశే. (అ. ఆ. అ.)

అతిథి కొఱకైనది (భోజనాది)

వ. అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొను మని రుచిమంతంబు లగు మందాకినీ మీనంబులు సుపక్వంబులుచేసి మధురంబులగు వన్య ఫలంబులు దెచ్చి తృప్తి యగునట్లుగా నతనికి నాహారవిధి యొనర్చి. శాంతి. 8-488

**ఆతుర** సం. విశే. (అ. ఆ. అ.)

1. పీడింపఁబడినది, బాధ పెట్టఁబడినది.

క. నీతోడి పరిచయములే, దే తలపోయఁగ ననింద్య వెందును నీ వి,ట్లాతురవగుటకె నా మది, నేతాపము లేదు నైజమెఱుఁగవు గంటే. విరా. 3-51

2. పరితాపము గలది.

క. నాతోడి ప్రేముడిం గడు, నాతురవై యెదురుచూచు నంబకుఁ జేతః, ప్రీతిగఁ జని యాయమఁ బొడఁ,సూతుం బోసీఁగదే విశుద్ధ చరిత్రా. విరా. 4-81

**ఆతురత** సం. వి. ఆ. స్త్రీ.

1. పీడ, బాధ.

క. ఆనహుషు వలన నాపద, రానీ నాతనికి నాతురత గావింపం, బూని యొనర్చెద వేలిమి, దానను మునివాహనత గతస్థైర్యుం డగున్. ఉద్యో. 1-188

2. పరితాపము.

క. విరథుఁడయి మాత్స్యపుత్రుఁడు, గరవాలముగొని రథంబు గ్రక్కున డిగి యాతురత సురరాజనందను, నరదము మాటునకు నతి రయంబున నరిగెన్. భీష్మ. 1-291

3. తమకించుట, సంభ్రమమొందుట, వేగిరపాటు, తొట్రుపాటు.

చ. గురుదెస వంత నాతురతఁ గూరెద వైరిఁ దలంచి రోషసం,భరితుఁడ నయ్యెదన్ సమరభంగి నిరూపణ చింత నొందెదం, గురుపతికిం బ్రియం బెసఁగఁ గోరుట నుత్తలపాటు నొందెదం, బురుషవరేణ్య యే నిదుర వోవఁగ నెమ్మెయినేర్తుఁ జెప్పుమా. సౌప్తి. 1-68

క. గురువిభుఁడు నగరు సొచ్చియుఁ, జేరమిన గాంధారవిభుని సూత తనూజుం, ద్వరితముగఁ బిలువుమని యాతురతం బలుమాఱుఁ జెప్పె దుశ్శాసనుతోన్. భీష్మ. 3-165

4. దుఃఖము, శోకము.

మ హరియుం బార్థుఁడు నట్లు నేర్పుగల బాహాశక్తిమైఁ జొచ్చుచోఁ, దొరలున్ సేనలుఁ జెల్లుగూలుటకు నా దుర్యోధనుం డెంత యాతురతం బొందెనొ దంతి ఘోటక పదాతుల్ సాత్యకిస్ఫూరదో, స్స్ఫురణన్ గ్రమ్మగుట కెట్లు దాను ననుజుల్ శోకించిరో యక్కటా. ద్రోణ. 4-20

**ఆతురత్వము** సం. వి. అ. న.

ఆతురత.

1. వ్యథ.

తే. వానితోడిద లోకమై యేను బోవ,నైతిఁబోఁ గన్నుఁ బుత్త్రశోకాతురత్వమున నితాంత వివర్ణతఁ బొందుచుండఁ, జూడకుండెడి వాఁడ నర్జును మొగంబు. ద్రోణ. 2-143; శాంతి. 1-227

2. దుఃఖము.

సీ ...యివ్వనితా జనంబు,నందు దైన్యముతోడి యత్యంత శోకసమాకులత్వము దోఁచె నస్మదీయ,మగు చిత్తమున వీరి యాతురత్వము గన్న, యంతన కొందల మతిశయిల్లె. మౌస. 104

**ఆతురము** సం. విశే. (అ. ఆ. అ.)

వేగిరపాటు గలది.

క. కార్యాతుర విప్రోపేక్షా, నీతి బిసము లపహరించు నిపుణత యరయన. అను. 3-284

**ఆతురుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. తమకించువాఁడు, వేగిరపడువాఁడు, ఉత్కంఠితుఁడు.

క. గురుభీష్మాదుల మనములు, దురమునకుం గోరకయుండ దుర్యోధనుఁ డాతురుఁడై యొడఁబఱుపఁగ నిప్పరుసున నెరవైన టిచ్చవడు బలమెల్లన్. ఉద్యో. 1-58

2. ఆపదయందున్న వాఁడు.

క. మరలువుఁడు పట్టుఁ డిటఁ జెం, డరదమునకు వేగవేగ యడ్డము సనుఁ డాతురు డయ్యెను సాత్యకి సెచ్చెరఁ గోరుఁ డను నులివు వారిసేనఁ జెలంగెన్. భీష్మ. 2-299

3. వ్యాధిగ్రస్తుఁడు, రోగి.

తే. అలుక యెత్తినవానికి నర్థ చింత,కునకు నాతురునకుఁ గామగోచ, రాత్మునికిని వచ్చునే విను నిద్ర నీవు నెఱుఁగు, దెఱఁగి యుండి యిల్లేటికి నేప నన్న. సౌప్తి. 1-66

4. పీడింపఁబడువాఁడు, బాధపడువాఁడు.

చ. జ్వరమున గుల్మపీడ నతిసారమునన్ బలువుండులన్ మహోదరమున వాతపిత్తకఫ దారుణ రోగములన్ నిరంతరాతురులగువారు నిర్దయతఁ దొల్లి వినోదముగాఁగఁ జీమలం, దరమిడి చంపినారు గురుఁ దల్లడ పెట్టినవారుఁ బార్వతీ. అను. 5-103

క. భూతదయయు ననహంకా,రాతిశయముఁ గలుగు విమలుఁ డప్రా

యశ్చిత్రాతురుఁడు సూచె విధులు సునీతములైనను దృఢాత్మ
నిష్ఠకతమునన్. శాంతి. 5-884

**ఆతోద్యము** సం. వి. అ. న.

వాదిత్రము, తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనెడి వాద్యచతు-
ష్టయము.

మాలిని :– హృద్య విద్యాధర పటు పటహాతోద్యమంబులు.
ఆది. 5-127

**ఆత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁబడినది.

మ. ...సుకర్మతం గలుగు నాకం బాత్తవీరవ్రతా. శాంతి. 1-138

క. తత్తద్విధాత్త నైపుణుఁడైనన్. శాంతి. 5-502; విరా. 3-1

**ఆత్మ** సం. వి. న్. పుం.

1. జీవుఁడు.

ఆ ఆత్మఁ దగులు నాత్ముండు నారాయణుఁడు.
శాంతి. 5-603; అను. 5-157

2. దేహము.

క. నావుడు మహాత్మ బ్రాహ్మణ,తా విద్వత్తాస్పదంబు దానికిఁగా
నే, నీ విధి యొనరించుట ప్రాప్తావేశము లేదు దీని కడ్డపడకువే.
శాంతి. 3-297

3. స్వరూపము.

జని మృతి ఖిషగాత్మా. ద్రోణ. 2-383

4. హృదయము.

క. రాజునకుఁ బ్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మ గాన రాజుం
బ్రజయున్, రాజోత్తమ యన్యోన్య వి,రాజితులై యుండవలయు
రక్షార్చనలన్. శాంతి. 2-228

5. మనస్సు.

ఆ. జున్న డెప్పరంపుఁ జోకైన చటిమన్నఁ, జూచి విఱుగఁబడుటఁ

జూడ కాత్మ, దీపుఁగోరి యుఱుకు తిండికాఁడునట్లోలె, నయితి
వగచు టింక ననుచితంబు. స్త్రీ. 1-19, శాంతి. 1-213

మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. విరా. 1-6

6. బుద్ధి.

తే. ఇంద్రియంబులు దమ యిచ్చ విట్టునట్టుఁ, దిరిగెనేనియు దుఃఖ
ముల్ దెచ్చు నవియ, కట్టువడి సుఖ మొనరించుఁ గాన యాత్మఁ
గావవలయు నింద్రియ చోరగణము వలన. శాంతి. 4-184

7. క్షేత్రజ్ఞుడు.

ఆ. వ్యక్తసత్త్వధార మవ్యక్తనాభంబు, షోడశకవికార సుపరిమండ
లంబు ధ్రువ మధిష్ఠితం బాత్మచేతఁ జక్రంబు దిరుగుచుండుఁ గాల
వశత. శాంతి. 4-279

8. అదృశ్యము, ప్రత్యక్షమత్వము నగు మనస్సు.

తే. అనఘ యింద్రియములు విషయములు మనసు, బుద్ధియును
నాత్మయును గ్రమంబునన యెక్కు, డాత్మ బుద్ధి యనంగ నల్పాంత
రంపు, వస్తువులు బుద్ధి యిన్నింట విస్తరిలుట. శాంతి. 5-168

9. (1) జీవుఁడు, జీవాత్మ 2) పరమాత్మ బ్రహ్మము. 3) స్వరూపము
4) దేహము, మనస్సు.

క. హరి యాత్మ యర్జునున కా, హరి కర్జునుఁ డాత్మ హరియు నర్జునుఁ
డును నా,నిరువురగుట క్రీడార్థం, బరయఁగ నది యొక్క వెలుఁగ
యతులం బెందున్. ద్రోణ. 1-39

10. తన తన సంబంధమైన, తమ తమ సంబంధమైన, నిజ.

ఉ. ఆత్మ తురంబుల కెల్లను. విరా. 1-267

ఉ. సంపద నేయుదు రాత్మభర్తకున్. శాంతి. 3-468

**ఆత్మకము** సం. విణ. (అ. త్మికా అ.)

1. స్వరూపముగాఁ గలది.

(ఇది సమాసాంతములనే యుండి వికారమైనది, పరిణమించినది,

స్వభావమునకు సంబంధించినది, గుణమునకు సంబంధించినది, అనునర్థము లొసఁగును) యజ్ఞాత్మకక. విరా. 8-288

వి. అ. పుం.

ఆత్మగానైనది, ఆత్మగాఁగలది.

వ. అగ్నిహోత్రం బస్మదాత్మకంబు అర. 4-215

**ఆత్మగతము** సం. విశే. (అ. ఆ. అ.)

మనస్సునందున్నది.

వ. ఫల్గునుం డాత్మగతంబున. భీష్మ. 8-826 (తనలో)

వ. ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరంబను శబ్దంబు మొదలుగా వినం గానక ఆత్మగతంబున. అర. 2-183 (తనలో)

క. కడు లజ్జయు దైన్యంబును, నడరి ముసుఁగు వడఁగ నాకు నాత్మగతమునఁ, బుడమి వివరంబులేదే, యడిగెద నన్నట్టిదయ్యె నప్పుడు కర్ణా. అర. 6-14 (నాలో)

**ఆత్మగుణము** సం. వి. అ. పుం.

నిస్సీమ జ్ఞానవైరాగ్యైశ్వర్య ధర్మాత్మకము. ఈయది చంద్రాఖ్యమైన సమష్టి మనస్సు యొక్క గుణముగాఁ జెప్పఁబడినది.

ఆ. ఆకసమును మనసు హరియించు గంధాది, యగు గుణాళితోడ నఖిల భూతములును నిట్లు లయముఁ బొందిన గ్రసియించు, మనసు నాత్మగుణము నెనసి విధుఁడు. శాంతి. 5-75

**ఆత్మఘాతము** సం. వి. అ. పుం.

ఆత్మహత్య.

ఆ. అన్నహోత్ముఁ డిట్టులనుఁ బెక్కు దివసంబు, లుపవసించి యునికి తపము చొప్పె, దాన విను తపస్వి గానేరఁ డది యాత్మఘాత మగుట నరుఁడు కౌరవేంద్ర. అను. 8-205

**ఆత్మజ** సం. వి. ఆ. స్త్రీ.

కొమరిత, కూఁతురు.

ఉ. ద్రుపద క్షితిపాత్మజ. విరా. 4-194

**ఆత్మజన్ముఁడు** సం. వి. న్. పుం.

ఆత్మజుఁడు, కొడుకు.

క. మదీయాత్మజన్ముఁ డాతం డరయన్. స్త్రీ. 3-175

**ఆత్మజుఁడు** సం. వి. అ. పుం.

కుమారుఁడు, ఆత్మజన్ముఁడు.

వాసవాత్మజుఁడు. విరా. 1-155

**ఆత్మజ్ఞానము** సం. వి. అ. న.

ఆత్మయొక్క స్వరూపస్వభావాదులు తెలిసికొన్నవాఁడు. తన్నుఁ దానెఱింగినవాఁడు.

వ ప్రవచనశీలురయం దాత్మజ్ఞు లధికులు. శాంతి. 5-99

**ఆత్మతంత్రత్వము** సం. వి. అ. న.

స్వాతంత్ర్యము.

సీ ఆత్మతంత్రత్వంబు నీ కెగ్గు లేదు. అర. 7-237

**ఆత్మతంత్రము** సం. వి. అ. న.

తన యధీనమైనది, తనకు వశమైయున్నది.

తే, కర్మఫల మాత్మ తంత్రంబు గాకయుండు అర. 5-68

**ఆత్మధారణము** సం. వి. అ. న.

ఆత్మయందు నిలుపుట,

సీ. వినుమందు సమము వివిక్తంబు నగుచోటఁ, బ్రాఙ్ముఖాసీనుఁడై వరమ యోగ,రతిఁ బద ప్రభృతి గాత్రములఁ గ్రమంబుగ నాత్మ ధారణము సేయంగ. శాంతి. 6-327

**ఆత్మనింద** సం. వి. ఇ. స్త్రీ.

తన్ను దాను నిందించుకొనుట.

క. కడుకొని కడు దుఃఖములై, నెడ నుచితమె యాత్మనింద యెయ్యెడల మనం, బడలక యేకాకృతి నెప్పుడు నుండుట సూవె పురుష పురుషార్థ మిలన్. అర. 4-114

**ఆత్మప్రశంస** సం. వి. ఇ. స్త్రీ.

తన్నుఁ దాను పొగడుకొనుట.

వ. ఆత్మప్రశంస సేయు మది మరణం బని పెద్దలు సెప్పుదురు. కర్ణ. 3-90

**ఆత్మభవుఁడు** సం. వి. అ. పుం.

స్వయంభువు- తనకుఁ దానే కలుగువాడు.

ఆ. నృసింహాత్ము, నాత్మభవుని భక్తి నాశ్రయింతు, శాంతి. 2-42

**ఆత్మభావనము** సం. వి. అ. న.

తనవలెఁ దలంచుట.

క. శాంతికవిధు లవ్వట్టున నొనరించి రాత్మభావనపరులై. అర. 5-209

**ఆత్మవత్త్వము** సం. వి. అ. న.

జితేంద్రియత్త్వము.

తే. అర్జవంబు ప్రసన్నత యాత్మవత్త్వ, మప్రమాదంబు వృద్ధసేవాభి
నిరతి, మేలుసేయుఁ బ్రజ్ఞాశాంతిశాలి యగుట, కాలపాకంబుతోఁ
దాన కలుగు ననఘ. శాంతి. 4-388

శ్లో. అర్జవేనాప్రమాదేన ప్రసాదేనాత్మవత్తయా.
సం. భా. శాంతి. 222-34

**ఆత్మవధము** సం. వి. అ. పుం.

ఆత్మహత్య.

సీ. జ్ఞాతుల నందఱఁ జంపితి మది యాత్మవధమ కాదే. శాంతి. 1-45

**ఆత్మవిద్య** సం. వి. ఆ. స్త్రీ.

ఆత్మయొక్క యథాస్వరూపమును దెలుపు విద్య.

ఆ. చిత్తశుద్ధి మాత్రఁ జేసెనేనియు నవి, ద్యాత్మకంబ చూవె యరయఁ
గరమ్ము, మది దొఱంగు టంచితాత్మ విద్యాత్మక, ధర్మ మదియ
మోక్షదంబు సుమ్ము. శాంతి. 5-127

**ఆత్మస్తుతి** సం. వి. ఇ. స్త్రీ.

తన్నుఁదాను బొగడుకొనుట.

మ. అరయం దప్పు కృతం బెఱుంగు మదలోభావేశముల్ లేవము,
ష్కరుఁ డాత్మస్తుతి లేదు పేయు నియతిం గార్యంబులు,
శాంతి. 2-28

**ఆత్మానుసంధానము** సం. వి. అ. న.
పరమాత్మను తనయాత్మయందు చింతించి తెలిసికొనుట.
వ. అటులు మరిగి లోకంబుతోడి పాటియై యాత్మానుసంధానంబు
సేయలేక మెలంగుచున్నం జూచి. శాంతి. 6-257

**ఆత్మారామత్వము** సం. వి. అ. న.
ఆత్మానందము.
క. తేజోమయతత్త్వము నాత్మారామత్వంబున నిరంతరంబును
జూతున్. శాంతి. 4-231

**ఆత్మారాముఁడు** సం. విశే. (అ. ఆ. అ.)
ఆత్మయందే రమించుచు దానియందే తృప్తుఁడై యుండువాఁడు(యోగి)
వివరమునకై చూ. శాంతి. 6-393

**ఆత్మార్థము** సం. విశే. (అ. ఇ. ఉ.)
తన నిమిత్తమైనది.
వ. ఆత్మార్థంబుగా నన్నపాకంబును వసాక్షిక భోజనంబును.
అర. 1-81

**ఆత్మికము** సం. విశే. (అ. త్మికా. అ.)
చూ. ఆత్మకము 1. అర్థము.
సీ. వేదికాస్థలి మణికనకాత్మికమై. ద్రోణ. 2-208

**ఆత్మీయము** సం. విశే. (అ. ఆ. అ.)
తనది.
ఆ. అరినృపాలు పెంపు నాత్మీయశక్తియు నెఱిఁగి. శాంతి. 3-90
తే. అతిథులకు నెడమిచ్చి యాహారములను, భక్తి నాత్మీయముల లోనఁ
బంచిపెట్టి. అశ్వ. 2-170; విరా. 1-384; అశ్వ. 1-141

**ఆత్ముఁడు** సం. వి. న.
ఆత్మ. జీవుఁడు.

క, ...ఆత్ముం, డకుటిల తేజో రూపత, బ్రకృతియు వికృతియును గాక ప్రస్ఫురితుఁడగున్. శాంతి. 5-602; 603

2. పరమాత్ముఁడు.

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం డన భూతాత్ముఁ డనఁ బురుషుఁడనఁ బరమేశుం, దన బుద్ధిసాక్షి యన నంజన రహితుం డనంగఁ బరఁగు శాంతిప్రవణా, శాంతి. 4-122

**ఆత్మోపహారము** సం. వి. అ. పుం.

శరీరమును బలిపెట్టుట.

సీ. ...అథవు -అ- వాశ్రయించి యతని కాత్మోపహార మర్పించువాఁడ. పౌ ప్తి. 1-112

**ఆత్యంతికము** సం. విశ. (అ. ఈ. అ.)

1. అత్యంతముగాఁ గలిగినది, సమృద్ధము, పూర్ణము.

వ. కుంభకర్ణుం డాది వరం బడుగుమనిన వాఁడును దైవోపహతుండై తనకు నాత్యంతికంబై నిద్ర యడిగిన నట్లయగునని. అర 6-281

**ఆత్రేయుఁడు** సం. వి. అ. పుం.

ఒకముని, జనమేజయు సర్పయాగంబున నొక సదస్యుఁడు. ఆది. 2-210

2. వామదేవుని శిష్యుఁడు. చూ. వివరము. అర. 4-341

**ఆదట** దే. వి.

1 ఆసక్తి, అపేక్ష.

ఉ. తక్కటి వారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచున్, మ్రొక్కుచు నాదటం దనదు మోముపయిం దనివోని చూడ్కులం, గ్రిక్కిఱియించుచుం బోదివి. విరా. 5-265

సీ. ...గుండె,కాయ లాదటమెయిఁ గబళించుచును. స్త్రీ. 2-9

సీ. అంతంతఁ జనుదేర నాదట గనుఁగొను, శౌరికిఁ బ్రాణంబు జల్లనంగఁ. ద్రోణ. 4-259

2. ప్రీతి, ప్రేమ.

సీ. కాంపైన ప్రియు శాననిచ్చి నిల్చిన మధు వాదట నాను మత్తాలి

విభుని                                          విరా 2-306

వ అప్పు డప్పదనొకంద్రుమ ప్రమోదంబునం బయోజపాదంబు సొచ్చి.

తే విసము లాదట నందఱుఁ బెట్టికొంపి, పోవ నీటఁ దెమల్చి.
అను. 8-223

3. స్త్రీ పురషుల యనురాగము.

సీ. ఇంపారు చోఁకిన నిగురొత్తు చిత్తంబు, తెలసి యోండొరులపైఁ బొలయు చూడ్కు, లాదట నుపకరణావళి వెడవెడ యాదరించుట రాగ మడరఁదొడరు                  విరా 2-268

సీ. తటివేచి చనఁబోయి తడఁబడి మార్గతి నడి చూపు లాదట బయలు పఱుప.                  విరా. 5-402

చ. అతివలు దన్నుఁజేరుటకు నాసపడుం బొరిఁ జేరుచోట నాయత విలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ గౌతుకం, బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁగోరు.                  ఉర. 5-197

4. శ్రద్ధ, భక్తి.

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రముల యర్థము లారఁగఁ గ్రోలి.
శాంతి. 1-141

చ. ...ఆకురుభూతిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వచ్చిన కరుణామయాదర విశేషము కంటెను మేలుఁ గల్గునే.                  అశ్ర. 2-84

5. తనివి, తృప్తి

చ. అనఘుఁడు దాని చిత్తమున నాదట వోవక చూచెఁ బ్రీతితోన్.
ఆది. 4-144

**ఆదటవోవు** దే. అ. క్రి.

తృప్తినొందు, తనియు.

చ. అనఘుఁడు దాని చిత్తమున నాదటవోవక చూచెఁ బ్రీతితోన్.
ఆది. 4-144

"పిబన్నివ చ నేత్రాభ్యాం నాతృప్యత నరాధిపః"
సం భా. ఆది 103-54

**ఆదమఱచు** దే. అ. క్రి.

ఒదలు మఱచు, హాయిగా నిశ్చింతమై యుండు.

క. తే దింకం బగ యని ధను, రాదుల దెస వాహనములయందును సంతస్త్రాదరులై పగతురు నేఁ, డాదమఱచి నిద్రవోదు రది తఱి పొడువన్. సౌప్తి. 1-51

శ్లో. అద్య స్వప్స్యంతి పాంచాలా విశ్వస్తాజిత కాశినః,
విముక్తయుగ్య కవచా హర్షేణ చ సమన్వితాః॥
జయం మత్వాత్మనశ్చైవ శ్రాంతా వ్యాయామకర్శితాః,
తేషాం నిశి ప్రసుప్తానాం స్వస్థానాం శిబికే స్వకే.
సం. భా. సౌప్తి. 8-24, 25

**ఆదరణము** సం. వి. అ. న.

1. మన్నన, లక్ష్యము చేయుట

క. ఆదవుసిరి యాసపడం, గాదని విదురుండు సెప్పఁగా నప్పుడు కర్ణాదుల పలుకులు విని పతి, యాదరణము సేయకున్న నంతన తీరున్. ఉద్యో. 1-316

2 ప్రేమ, అనురాగము

చ. వెరవున లావునం గృషికి వేయు విధంబుల మేలొనర్చినన్, దొరకొను నే ఫలంబు దరితోఁ దగు వర్షము లేక యున్న నెవ్వరున తెప్ప సేసినను పౌరుషముల్ ఫలియించు నెల్ల నాదరణమునం బ్రసన్నమగు దైవము చేతన చూవె ఫల్గునా. ఉద్యో. 8-82

**ఆదరణవంతుఁడు** సం. విశే. (పు. తి. పు.)

ఆదరణము గలవాఁడు.

వ. ఈ విద్యయం దత్యంతాదరణవంతుండ వగుటం జేసి దీని వలన వెలసితివి. శాంతి. 2-449

**ఆదరణీయము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆదరింపఁదగినది, పాటింపఁదగినది, లక్ష్యము సేయఁదగినది.

ఉ. ఆదరణీయ సార వివిధార్థ గతిస్ఫురణంబు గల్గి. విరా. 1-6

వ. మీకు శోకోపశమనంబుగ నిప్పుడు శౌరి సెప్పిన వచనంబు లాదర

ణీయంబులు నుండి. కల్యా. 2-377

**ఆదరణీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁదగినవాఁడు, గౌరవింపదగినవాఁడు.

వ. అని పలికి పరమాదరణీయులగు సాత్యవతేయ దేవకీ నందనుల వాక్యంబు లాదరింపక పాండు సంతాన సకల గర్భవిషయంబుగా నస్త్రపు మోచనంబు నేసిన నుపలక్షించి వాసుదేవుం డతనితో నిట్లను. సౌప్తి 2-86; శాంతి. 5-99

**ఆదరము** సం. వి. అ. పుం.

1. మన్నన, గౌరవము.

వ. అని నీవు దొల్లి రచించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి. విరా. 1-11

సీ. ఇట్లనియె నాచతురాస్యుఁ డాదరమున ఉద్యో. 2-147

2. పూనిక, ప్రయత్నము.

క. భూదేవోత్తము నాశీర్వాదంబులఁ బ్రీతిఁబొంది వారలు ప్రస్థానా దరపరులగుటయు సమ్మోదావహ పుణ్యకర్మముల కుద్యతుఁడై. విరా. 1-145

3. ప్రేమ, అనురాగము.

ఉ. ...ఆదరార్ద్రంబగు చూడ్కితో బ్రియహిత స్థిర భాషల నూఱడింపవే. విరా. 1-183

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దన మనమున నుప్పిరి గొనగా, భూదయితుఁడు వివిధ ప్రియవాదంబుల గౌరవించె వారల నెల్లన్. విరా. 3-220

4 పరిగ్రహము, స్వీకారము.

క. కా దిది విక్రమకాలము, లే దిప్పుడు నాకు నలుక లీలాత్మక రోషాదరము గలిగినను నిను, నీ దగు పరిజనముఁ గూల్పవే పెడ చేతన్. శాంతి. 4-488

క. వరుసఁ గృత త్రేతా ద్వాపర కలియుగములఁ దపంబు భవ్యజ్ఞాన స్ఫురణము యజనము రోషాదరమును మానవులకుఁ బ్రధానతఁ

గలుగున్. శాంతి. 5-52

5. పాటించుట, లక్ష్యము సేయుట.

తే. బ్రాహ్మణుఁడవయ్యు నిట్లు క్రూరతను రోయ, కస్మదీయ వాక్యంబుల నాదరంబు సేయ కీ పాపకర్మంబు సేసినాఁడ, వచ్యుతుఁడు పల్కినట్టులన యగుము నీవు. సౌప్తి 2-87

ఆదరించు సం. స. క్రి.

1. సమ్మానించు, గౌరవించు, మన్నించు

ఉ. రాజులనెల్ల నుగ్రసమరంబుల ద్రెళ్ళిమి నోర్చి పేర్చి యీ, భూజన కోటి నాదగు విభుత్వ సమగ్రత నాదరించి. విరా. 2-254

వ. అమ్మహీవల్లభుండు సంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచిన యాబృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యిట్లనియె. విరా. 5-278

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో, నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా.నా రుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు. ఆది 1-26

(ప్రశంసింప అని భావము)

2. పాటించు, లక్ష్యముసేయు, లెక్కసేయు.

వ. అని చెప్పి యప్పాటం బరమ హితోపదేశంబు సేసిన భీష్మద్రోణుల పలుకు లాదరింపక వారికి సదుత్తరంబు లీయక. ఉద్యో. 2-167

ఆ. అనిన బాహ్లికాదులగు కురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప, కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచిపోయె సంచలించెఁ గొలువు. ఉద్యో. 3-378

వ. అప్పుడు తన్నుఁ దొడరవచ్చు శల్యు నాదరింపక ధర్మతనయుండు. భీష్మ. 3-58

తే. ఆఁకలియు నీరువట్టును నాదరింప, కేను విప్రుల పనిచేసి యిట్టి మహిమ గంటి. అను. 4-84; ద్రోణ. 2-308; శాంతి. 3-267

3. స్వీకరించు, గ్రహించు.

వ. నీ వాహారంబు గొనక నిలువం దొడంగిన నాఁటికి నేఁడాఱవ

దినంబయ్యె నే మతిథిపూజాపరులము మాకు ధర్మవిరోధంబు గాకుండ మా చేయు నాతిథ్యంబు నాదరింపుము శాంతి. 6-568

ఆ. మేన భసిత మలంది మాననీయ తపఃప్రయుక్తి నాదరించియున్న ద్రోణతనయుఁగాంచి. సౌప్తి. 2-57

తే. అనఘ దేహంబుకంటె వేఱయిన దేహి, సూక్ష్మరూపము శాస్త్రోక్త సుకృతములఁ బ్రశాంత జనములు గాంతురు సాధనములఁ నాద రింపరు దర్శనానంతరమున. శాంతి 5-195

4. సేవించు, అనుభవించు.

చ. కమలవనంబు పొంత నునుగా డ్పొకయించుక యాదరించుఁజి, త్తము నకుఁ దానఁ దల్లడము దన్కుటయుం జని గౌరవంపుఁ జా, తము కడ నిల్చి. విరా. 2-303

5. అంగీకరించు, ప్రేమతో అంగీకరించు.

ఆ. అనుడు నతఁడు కర్మ మఖిలంబు నీడఁబో, విడుచు టొప్ప దంద్రు వేదవిదులు, దాని నాదరింపఁ దగదొకో సంయమి, ప్రవర్త్య సంది యంబు నాపవలయు. శాంతి. 1-134

గీ. అస్మదీయ ప్రణామంబు నాదరించి. విరా. 1-10

6. తెలిసికొను,

తే. ......తియ్యఁగంటి పరువ, మాదరించి తదుపచార మాచరించు, వెరవు గలయట్టి జనముల విధము దోఁప. అను. 5-424

7. ఆశ్రయించు, ఆధారనుగాఁగొను.

క. తమ తమ కలవడు విజ్ఞానముల తెరువు లాదరించి నానాగతులన్, సుమతులు ధర్మము దెలిపిరి, దమము పరాయణము దీరతమ యన్నిటికిన్. శాంతి. 3-405

శ్లో. ధర్మస్య విధయో నైకే యే వై ప్రోక్తా మహర్షిభిః,
స్వంస్వం విజ్ఞానమాశ్రిత్య దమస్తేషాం పరాయణమ్.
సం. భా. శాంతి. 160-6

8. అనుగ్రహించు, మన్నించు.

వ. కృప నాదరింపుము. శాంతి. 5-221

వ. నాకుంగా లోకంబులఁ గరుణాలోకంబున నాదరింపు మనిన.
ద్రోణ. 2-188

శ్లో. ప్రసీద భగవన్ సర్వం రోషేన స్యాద్వరో మమ. ద్రోణ. 58-10

(ఆవరించు - అని సం.ము పాఠము. చూ. ఆవరించు)

**ఆదర్శము** సం. వి. అ. పుం.

అద్దము, దర్పణము.

వ. మంగళప్రకారంబున నలంకరించి నిజాకృతి యాదర్శంబునందు దర్శించి శాంతి. 1-129; అను. 4-118

**ఆదాత** సం. విణ. (ఋ. త్రి. ఋ.)

గ్రహించువాఁడు, పుచ్చుకొనువాఁడు.

క. కావున విను పాత్రము మే,లై విహితాచరణ సౌమ్యమగు దానము ధా,త్రీవర దాత్రా దాతలఁ, దా వెలయించు భువనద్వితయరంజ కతన్. శాంతి 2-334

**ఆదానము** సం. వి. అ. న.

1. గ్రహించుట, తీసికొనుట, పొందుట.

క. దానములఁ బుణ్యతీర్థ, స్నానంబుల నతిథి పూజనంబులను ఫలా, దాన నిరతుఁడు గాక, మానుష్యము గారవించు మతి నిత్యుఁ డగున్. శాంతి. 5-528

2. తీసికొని పచ్చుట

సీ. వసుధ యిత్తఱి వసుహీనమై యున్నది దానఁజేసి, భూదేవ నిహిత ధనాదాన మావశ్యకం బయ్యె, ఆశ్వ. 3-187

**ఆది** సం. విణ. (ఇ. పుం.)

1. మొదటిది, ప్రథమము, మూలము.

ఉ. ఆదికి నాది లోకముల కన్నిటికిం బ్రభుఁడు...అంబాదయితుండు. ద్రోణ. 5-426; శాంతి. 4-232

2. మొదలుగాఁగల, మొదలయిన, మొదలుగాఁగలవాఁడు.

మ. మహిష వ్యాఘ్రమృగజాది సత్త్వచయమున్.
విరా. 2-18; శాంతి. 6-8

తమవోజ:- ఏ నేడ నిం|ద్రాదు లేడ. ఆర. 2-47

3. మొదలు.

క. ఆదియు మధ్యము నంతము, నా దేవేశునకు లేమి నవ్యయుఁడు. శాంతి. 4-198

ఉ. ......అం,దాదిఁదొడంగి మూఁడు కృతు లాం|ధ్ర కవిత్వ విశార దుండు. విరా. 1-9; శాంతి. 5-175

4. తొల్లి, పూర్వము,

వ. నీకుం బుండరీకాక్షుం డిప్పుడు సెప్పిన యాదిరాజ విషయంబులగు శోకోపశమన వచనంబులు సెప్పి. శాంతి, 1-268

ఉ. పూరువంశో త్తరుఁ డాదిరాజగుణయోగి. అశ్వ. 3-166; ఆది. 1-6

**ఆదిఁదొడంగి** సం. మి.

మొదటిది, మొదలుకొని.

ఉ. ......అం, దాది దొడంగి మూఁడుకృతు లాం|ధ్ర కవిత్వ విశార దుండు, విరా. 1-6

**ఆదికము** సం. వి. అ. న.

చ. అనిమిషదానవాంబరచరాదిక జాతులం. విరా. 1-168

ఆ. ......రూపాదులం, నంమికొనవు చతురాదికములు. శాంతి. 4-60

**ఆదికర్త** సం. విణ. (బు. త్రీ. బు.)

మూల కారణుఁడు.

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ, బనిచి చంపించె పీ సుయోధనుఁడు దలఁపఁ, గాని యిప్పాపముల కాదికర్త వీవ, యిన్ని యెడలను నీ పాడి యెందుఁ బోయె. కర్ణ. 3-356

**ఆదికారణము** సం. వి. అ. న.

మొదటి కారణము, మూలహేతువు.

ఉ. ......గణుతింపఁగ నేమియొ యిమ్మహాద్భుత, ప్ర|క్రియ కాది కారణము, పాపనిరూఢుఁడు నీతిఁ గాంచునే, సౌప్తి. 1-107

**ఆదికొను** దే. అ. క్రి.

సూటిగాఁ బరుఁగిడు, మీఁదికిఁ గవియు, లంఘించు.

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొను బెబ్బులియునుంబోలె రాధేయుదెస నడచు కవ్వడిం గని. వి రా. 5-73

**ఆదిగ, ఆదిగా.** అవ్య. ద్రు.

తొట్టి, మొదలుకొని.

చ. ......బాల్యము నాదిగ దుష్టభావనం, బెరిఁగితి నీ నిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్. సభా. 2-255

మ ధ్యాత్కల అ......అది యాదిగాఁగ శతద్రునామమై యన్నది యొప్పె. ఆది. 2-120

వ. తార్కికులు నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు. ఆది. 1-8

వ. కుండోదర మహోదరు లాదిగాఁగల వేవురు నాగముఖ్యులు పుట్టిన ఆది. 2-4

(కడపటి రెండు ప్రయోగములందును 'ఆదిగాఁగల' = 'మొదటివారు గాఁగ, మొదలయిన' అను నర్థములు)

**ఆదిగర్భేశ్వరి** సం. విశ. ఈ. స్త్రీ.

జన్మప్రభృతి గొప్ప యైశ్వర్యముగలది.

ఆ. కలుకు దర్భపూరి పలవులు భిక్షాన్న, మశన మట్టివారి నతిముదమున, నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి, యయ్యు నేవగింపదయ్యెఁ గృష్ణ. ఆది. 7-224

**ఆదిగొను** దే. క్రి. ఆదికొను

ఎదుర్కొను, మార్కొను.

వ. రాజులగములకు నాదిగొను నప్పుడు. ద్రోణ. 5-308

**ఆదిజుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

మొదటఁ బుట్టినవాఁడు.

క. యాదవ వంశంబున జగ దాదిజుఁ,డగు విష్ణుదేవు నంశంబున మత్యాదిత్తై గృష్ణుఁడు. ఆది. 3-74

చ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు.
సభా. 2-18

**ఆదిత్యకేతుఁడు** సం. వి. ఉ. పుం.
కురుకుమారుఁడు- ఎనిమిదవనాఁటి యుద్ధమున భీమునిచే జచ్చెను.
భీష్మ. 8-78

**ఆదిత్యతీర్థము** సం. వి. అ. న.
ఆదిత్య మను పేరుగల పుణ్యస్థలము, చూ. వివరము. శల్య. 2-200

**ఆదిత్యాశ్రమము** సం. వి. అ. పుం. న.
ఇదియొకపనము, ఇందు నాదిత్యుఁబూజించి యాదిత్యలోకగతు లగుదురు.
అర. 2-267

**ఆదిత్యుఁడు** సం. వి. అ. పుం.

1. సూర్యుఁడు.
సీ దుర్యోధన గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణంబు. విరా. 4-52

2 వేల్పు, దేపత.
మాలిని :-పద్మజాదిత్య సత్పేక్షణ చతురదయా విస్ఫారితాలోక.
విరా. 4-277

3. ద్వాదశాదిత్యులలో నొకఁడు.
క. ఆదిత్యమరుద్వసురుద్రాది దివిజగణము లెల్ల. శాంతి. 2-37

ద్వాదశాదిత్యులు 1. ధాత 2, మిత్రుఁడు 3. అర్యముఁడు 4. శుక్రుఁడు 5. వరుణుఁడు 6. అంశువు 7, భగుఁడు 8. వివస్వంతుఁడు 9. పూషుఁడు 10. సవితృఁడు 11. త్వష్ట 12. విష్ణువు. ఆది. 3-61

4. ఊష్మపులలో నొకఁడు. చూ. వివ. అను. 3-192

**ఆదిదేవుఁడు** సం. వి. అ. పుం.
విష్ణువు.
ఆ. ఆదిదేవుఁడైన యవ్విష్ణుఁ డఖిల లోకాభిరతుఁడార్థమై.
ద్రోణ. 5-408

**ఆదిపర్వము** సం. వి. న్. న.
మహాభారతమందలి తొలిపర్వము. ఆది. 1-36

**ఆదిమగృహస్థుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

వ. కొండొక కాలంబునకు నయ్యాదిమ గృహస్థుని తేజం బాపరమ గృహిణి నిమిత్తంబుగా రేతోధాతు రూపంబునం బ్రస్కన్నంబై యమ్మహేశ్వరు మానస వృత్తింజేసి యగ్నియందు నిలిచియుండు. అను. 8-142

**ఆదిమధనుర్ధరుఁడు** సం. వి. సమ. అ. పుం.

శివుఁడు,

వ. అట్టి పరమేశ్వరుండు నీకు వరదుండై సన్నిధిసేసె...అయ్యంధ కాసురభంజనుకతంబునం గడింది పగ అడంగుదు రయ్యాదిమ ధనుర్ధరుం డివ్విధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపుగొనుట సుకరంబయ్యె. ద్రోణ. 5-423

**ఆదిమము** సం. విశ. (అ. ఆ. అ.)

1. మొదలుగాఁగలది.

సీ. అగ్నిహోత్రాదిమ యజ్ఞ వాజిపేయ ఫలము లోలి నాయన కగు.. అను. 3-380

2. మొదటిది.

అయ్యాదిమ రథికుండు. కర్ణ. 1-292

**ఆదిమరథికుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

వ (త్రిపురాసుర సంహార కాలమున) అత్తెరాపురంబుల కదరిన నయ్యాదిమరథికుండు. కర్ణ. 1-292

**ఆదివిష్ణుఁడు** సం. వి. ఉ. పుం.

శ్రీమన్నారాయణుఁడు.

ఉ ప్రభవిష్ణుండగు నాదివిష్ణుఁడుగదా యాకృష్ణుండు. ఉద్యో. 3-302

**ఆదిష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఆదేశింపఁబడినవాఁడు, ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

సీ వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి, పేర్మితో నవ్విశ్వకర్మపురము నిర్మించె. ఆది. 6-20

**ఆదీపము** సం. విఀ. (అ. ఆ. అ.)

ప్రజ్వరిల్లునది, ప్రకాశించునది.

మాలిని. మోహ వ్యతికర తిమిర ప్రధ్వంసనాదీపరూపా.

ద్రోణ. 4-337

**ఆదృతము** సం. విఀ. (అ. ఆ. అ.)

ఆదరింపఁబడినది, మన్నింపఁబడినది.

క. పరిధాన ప్రాపరణీకరణాదృత పీతవసనగజచర్మ.

ద్రోణ. 3-309

(ఇచ్చట ఉపయోగింపఁబడినది యను నర్థము స్ఫురింపఁజేయుమ.)

ఉ. సర్వలో, కాదృత దివ్యబోధ మహిమాతిశయం బుదయింపఁ జేయుచున్. శాంతి. 2-69

**ఆదేశము** సం. వి. అ. పుం.

ఆజ్ఞ, పంపు.

వ. తత్ప్రసాదంబునఁ గుండలంబులు వడసి తదాదేశంబున నశ్వరంగంబు నెక్కి. ఆది. 1-117

**ఆదేశించు** సం. స. క్రి.

1. చెప్పు.

వ. ఒక్కనాఁడశరీరవాణి వీఁడు (సైంధవుఁడు) సంగ్రామంబున నేమఱి తల దునుమంబడునని యాదేశించిన. ద్రోణ. 4-328

(అమర కన్యకలు అర్జునునితో) తే. నీ పరాక్రమ బలమున నిఖిల ధరణి, రాజ్యభారంబు నీ ధర్మరాజు దాల్చు, రఘుకులాధీశ్వరుం డైన రాముకీర్తి, యట్ల నీ కీర్తి త్రిజగంబులందుఁ బర్వు.

క. అనియాదేశించి దేవకన్యకలు వోయిన ఆర. 4-99-100

(యముఁడు సావిత్రితో) చ...అ,య్యనిమిషకోటి కెల్లను నిజాన్వయ మౌళి విభూషణుండగున్.

వ. అని యాదేశించి యాతం డంతర్హితుండయ్యె. ఆర. 2-250;251

వ. దుర్యోధనుండు జనియించినప్పుడు మును లిప్పాపాత్ముండు నిఖిల

క్షత్రియ క్షయ హేతువగునని యాదేశించిరిగాదే యనిన నర్జునుం డతని కిట్లనియె.

తే. అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె శల్య. 1-358, 359

2. ఆజ్ఞాపించు.

వ. అ జగత్కర్త బలిష్ఠ భూతంబులకు దుర్బల భూతంబులు భక్ష్యం బగుంగాక యనియు వాదేశించె. సౌప్తి. 2-114

ఆద్య సం. వి. (అ. ఆ. అ.)

మొదటిది.

క. ప్రకృతులు పెక్కన్నింటికి నకృత యనం బనిన యదియ యాద్య అను. 1-311

ఆద్యంతము సం. వి. అ. న.

మొదటినుండి చివర వఱకుఁ గలది.

క. ఆద్యంతంబును నీయనవద్యకథ వినంగఁ గనిన వారికి. స్వర్గ. 86

ఆద్యతిథి సం. వి. ఇ. పుం. (స్త్రీ).

ప్రతిపత్తిథి-శుక్ల పక్షమునందును కృష్ణ పక్షమునందును పాడ్యమితిథి. అను 4-202

ఆద్యపురుషుఁడు సం. వి. అ. పుం.

బ్రహ్మ.

క. ఆద్యపురుషోపలాలిత, మద్ద్యోతిత రోచిరుగ్రమోగ్రం బరిని, ర్వైద్యము దివ్యజనన మనపద్యంబని కార్ముకైకవరము గుమారా.విరా. 4-121

ఆద్యము సం. విశ. (అ. ఆ. అ.)

1. మొదటిది.

క. విను కర్షకులును వణిజులు, ననఘా గోరక్షకులు ధరాధీశునకున్, ధన మొదఁ గూడెడు చోటుల, ననేక విధములకు నెల్ల నాద్యస్థల ముల్. శాంతి. 2-391; అను. 3-162

2. మొదట గలది.

క, కామ క్రోధాద్యములగు, నీ మానన వికృతు లుడిపి శాంతి. 4-80

3. మొదలుగాఁ గలది.

క. అమృతం బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత మవ్వెలుఁగు
యమా, ద్యముల నడవడిన చి, త్తము శమాతిరేకమునఁ బొంద
సంవేద్య మగున్ శాంతి. 4-201

ఆద్యుఁడు సం. విశే. (అ. ఆ. అ.)

1. మొట్ట మొదటివాఁడు.

క. గుణములకు నాదియై ని, ర్గుణమ్ములకు నాద్యుఁడగు నరూపుని లక్ష్మి
ప్రణయపరము నజు నూత్మని, బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁ బరము
సర్వగతున్. శాంతి. 4-232 ఆది. 1-2

2. సనాతనుఁడు

చ. అనంతు నాద్య విష్ణుని... శాంతి. 5-406

ఆధానము సం. వి. అ. న.

1. ఉత్పాదనము, కలిగించుట

వ. గర్భాధాన వేళయందును, పిండావస్థయందును, ప్రసూతి
మాత్రంబున బాల్యంబునను యౌవనంబునం బ్రౌఢత్వ సమయం
బునను వార్ధకంబునం గర్మానురూపంబగు నాశంబు శరీరంబునకు
సంప్రాప్తంబగు. స్త్రీ. 1-85

వ. అశుభ నిరాసనంబును, శుభాధానంబును బొనర్చుచు.
శాంతి. 2-285 శాం. 4-100

2. పుట్టినది, కలిగినది.

క. శ్రీ నిత్యత్వ ప్రమదా, ధానకుతూహల నిరూఢతాస్తవ్యా
స్వర్గ. 76

3. ఉంచుట, కలిగించుట

క. శ్రీ ధర్మ కాము హృదయ స, మాధానా ధానకారకాంఘ్రిసరోజా
మౌస. 1

ఆధాయి సం. విశే. (న్. నీ. న్.)

కలిగించువాఁడు.

భరతవంశ మహిమాధాయీ మౌస. 1-74

**ఆధారభూతము** సం. విశ. (అ. ఆ. అ..)

ఆధారముగా నైనది.

క. ప్రకృతి యనఁ బురుషుఁ డనగా, వికృతు లనం బరఁగుచున్న వీవికి నెల్లన్, సకలాత్మక నీ విభవము, యకృత్రిమాధారభూత మై యుండు శివా. ద్రోణ 2–366

**ఆధారము** సం. వి. అ. పుం.

1. ఆదరువు, ప్రాపు, ఆశ్రయము

సీ. ఆత్మయోధుల కెల్ల నాధారమగునట్టి, తనకు నస్త్రంబు లాధార మయ్యె. భీష్మ. 1–47; శాంతి 4–329

వ. అప్పర్వతంబు దెచ్చి సముద్రంబులో వైచి దాని క్రింద నాధారంబుగాఁ గూర్మరాజు నియమించి యోక్త్రంబుగా వాసుకి నమర్చి ఆది. 2–11

2. ఆలవాలము, పాదు.

సీ. విమ మోహబీజ సంజనితంబు గామద్రుమంబు ప్రమాదజలంబు దనకుఁ బరిషేచనంబుగఁ బెరుఁగు నజ్ఞాన స్థిరాధార కలిత మై అను. 5–199

**ఆధారుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఆధార మైనవాఁడు

మానసేజ్యాధారా. శల్య 2–421

**ఆధి** సం. వి. ఇ. పుం.

మనోవ్యథ (మనస్సునకు సంబంధించిన రోగము)

క. ...శరీరము లాధివ్యాధి జరా,సమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్. ఉద్యో. 2–92

**ఆధిక్యము** సం. వి. అ. న.

అతిశయము, హెచ్చు, ఎక్కుడు.

మా. ...సంతీణంబు లై యుర్వి నిల్చి గుణాధిక్యముఁ బొందు బీజములుఁ బోలెం గౌరవుల్. ద్రోణ. 1–49

వ. శుకుండు మొదలుగాఁగల యే మేపురమును వేదవిషయ ప్రఖ్యాతి

నెల్లవారికంటె నెక్కుడు గావలయు మమ్ముంబోలె నొడ్ల నాద రాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయకుండుట మాకు వరంబు. శాంతి. 6-297

**అధిపత్యము** సం. వి. అ. న.

1. ప్రభుత్వము, దొరతనము.

(శ్రీకృష్ణునితో కర్ణుడు) తే. ధర్మతనయుండు దాను నా తమ్ముఁ డగుట, యెఱిఁగెనేనియు సామ్రాజ్యమేల పూను, నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁజేయ, వలవదే శాశ్వతంబుగ వసుధయెల్ల. ఉద్యో. 4-44

2. నాయకత్వము.

సీ. ...ఎవ్వరును ద్రోణుఁ, -తే- ఘనిన గాదన రాతండ యర్హుఁ డాధిపత్యమునకు నాచార్యుండు బ్రాహ్మణుండు, వివిధరణ కోవి దుఁడు వయోవృద్ధుఁ డధికబలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని. ద్రోణ. 1-62

**అధిరాజ్యము** సం. వి. అ. న.

అధిరాజత్వము. ఆధిపత్యము, దొరతనము.

ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాసములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబు, లాహరించి యునికి కాధిరాజ్యము పత్త్రి భక్షతకు దివంబు ఫలము లభిప. అను. 1-148

**అధివ్యాధులు** సం. వి. సమ. బహు.

మనోరుగ్మతయు శరీరరుగ్మతయు.

వ. అవ్విరించి వచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహానిం జేయ నా మృత్యుదేవత ప్రాణహారిణి యగుటం బ్రాణంబులు దేహంబులం బాసి. ద్రోణ. 1-175

**అధూర్తరయసుఁడు** సం. వి. స్. పుం.

అధూర్తరజసుని పుత్రుఁడు, గయుఁడు.

వీనితండ్రి అమూర్తయుం డని ఆంధ్ర భారత ప్రతుల యందు (అర. 2-318) గలదు అక్కడనే మూలమున అధూర్త రజసుఁడని గలదు

(చూ. అమూర్తరయుఁడు) కొన్ని వ్రాఁతప్రతులయందును ముద్రణప్రతులయందును అధూర్తరయః ప్రియపుత్రుఁడు అని (అర. 2-318) కలదు. 'అధూర్తరజః' శబ్దమే 'అధూర్తరయః' గా వాడఁబడినట్లును 'అమూర్తరయః' శబ్దము యుక్తముగానట్లును తోఁచెడివి అర, 2-318లో 'అమూర్తరయః' శబ్దమిచ్చిన ప్రతులు గూడ ఇక్కడ అధూర్తరయ శ్శబ్దమిచ్చినవి.

వ. తొల్లియాధూర్తరయసుండై ప గయిందు చూ. అర. 3-178

**ఆధ్యేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ధ్యానింపఁ బడువాఁడు.

క. చింతాసాగరమగ్న, శ్రాంత జనాధ్యేయ పరమభక్తి విధేయా. స్త్రీ 2-185

**ఆన** వై- (సం. ఆజ్ఞా, ప్రా. ఆణా)

ఒట్టు, తోడు

తే. వానిఁ దెగఁజూడవై తేని వాయుపుత్ర, నీవు గనుఁగొన నురినైన
నీరనైన, నగ్నినైన విషంబునసై నేను, మేను దొఱఁగుదు నెట్టు
నీయాన సుమ్ము. విరా. 2-229

ఆ- గురుని యలవుఁ జలము నెరవును గలఁచి నీ, యాన గాండివంబు
నాన దివ్య శరములాన యెల్లి సైంధవుతల యెల్లభంగిఁ దునిమి
వైతుఁ బగఱు దలఁక. ద్రోణ- 2-311

చ. అనవుడు నమ్మహీపతికి నర్జునుఁ డిట్లను నేఁడు కర్ణునే, ననిఁ బడ
వైతు నీ యడుగులాన. కర్ణ. 3-111

**ఆనంత్యము** సం. వి. అ. న.

అంతములేమి, తుదిలేమి. నాశములేమి, మేరలేమి, అమృతత్వము, మోక్షము.

క. దాని నెఱింగి గృహంబున, మానితమగు చదువునందు మనసు
గొలుప కెం,దేనిఁ జని చదువుదురు శ్రుతు, లానంత్యమునకు
దపస్వు లగుదురు విప్రుల్. అను. 2-160

**ఆనందనము** సం. విణ. (అ. ఈ. అ.)

ఆనందింపఁజేయునది, సంతోషము గలిగించునది.

గ్రాఁగకుండు. విరా. 2-335

**అనందితము** సం. విశే. (అ. ఆ. అ.)

సంతోషించినది.

క. ఆనందిత మాగధ సుగీత నాదంబుల ద్రోణ. 2-6

**ఆనకదుందుభి** సం. వి. ఇ. పుం.

1. వసుదేవుఁడు, కృష్ణుని తండ్రి.

ఉ. ఆనకదుందుభిప్రభృతి యాదవులు. ఆది. 8-217

(ఇతని జన్మకాలమున దేవతలచేత ఆనకములును, దుందుభులును వాయింపఁబడినవి. "అస్య జన్మకాలే దేవతాభి రానకశ్చ దుందుభయశ్చ వాదితా ఇత్యానక దుందుభిః" అని అమరకోశము)

ఇ. ఈ. స్త్రీ.

పెద్ద ఢక్క.

వ. శంఖానకదుందుభిప్రభృతి మంగళ తూర్యంబులు గంభీర నాదంబు లం జెలంగె. శాంతి. 1-375

**ఆనత** సం. విశే. (అ. ఆ. అ.)

నమస్కరించినది.

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానతయైన రాముఁ డిట్లను. ఉద్యో. 4-295

**ఆనతి** వై. (సం. ఆజ్ఞప్తి. ప్రా. అణత్తి.)

ఆజ్ఞ, సెలవు.

క. దేవర యానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు మున్నయెడ మే మరయంగా వెడలి వారు నసిన మృగావిపినంబులకుఁ దొలుత నరిగితిమి వెసన్. విరా. 3-80

మోక్షము తెరు వానతి యీవే దయామయా. శాంతి. 4-261

**ఆనతిచ్చు; ఆనతియిచ్చు** స. క్రి.

1. సెలవిచ్చు (గొప్పవారు తక్కువ వారికి) చెప్పు.

క. ...మీ, తలఁపెయ్యది యానతిమ్ము ధరణీనాథా. విరా. 1-224

తే. ...కార్యనిశ్చయంబు ధర్మతనూభవుం డానతిచ్చె,వాఁడు మన
మెల్లఁ గావించువార మదియు. విరా. 5-365

తే. ఎలమి నిట్లని యానతి యిచ్చె నాకు. విరా. 1-10

2. ఆజ్ఞ యొసఁగు, ఆజ్ఞాపించు.

తే. అమృతమయమగు నల్లపద్మాకరమున, నాదు శాణాసనంబు బాణ
ములు నున్న, యవి దృఢవ్రతులార మీ రచటి కరిగి, వానిఁ దెం
డిచ్చటికి నని యానతిచ్చె. ద్రోణ. 2-388

క. బరవసము మైఁ ద్రిగర్తేశ్వరుఁ డిట్లను టుచిత మింక జననాయ
కుఁ డెప్పుడుసున నానతి యిచ్చెన, దొర లేమని రట్లు చేయఁ దుదిఁ
గార్య మగున్. విరా. 3-122

ఆనతుఁడు సం. విశ. (అ. ఆ. అ.)

1. వంగినవాఁడు.

వ. ...అతం డంజలిపుటంబు ఫాలంబున మోపి యానతుం డయ్యెఁ.
స్త్రీ. 1-178

2. నమస్కరించినవాఁడు.

ఉ. వానికి నమ్మహీశ్వరుఁడు వత్సలుఁడై పొడసూపి యాప్తితం బైన
ది వేఁడు మన్న నతఁ డానతుఁడై పరమేశ. అర. 6-256

3. అణఁచఁబడినవాఁడు, లోఁబఱుపఁబడినవాఁడు.

ఉ. ఆనతవైరి యిట్టు లను హంసము వారలతోడ. శాంతి. 5-560

ఆననము సం. వి. అ. న.

మోము, మొగము.

వ. కొమ్మనామాత్యు నాననం బాలోకించి తనమమతి వడస యిట్లంటి.
అను. 1-19

ఆనమత్ సం. శత్ర.

మ్రొక్కుచున్న (దీనికి తెనుఁగున ప్రత్యేక ప్రయోగములేదు)

తరలము. ...నిరంతరా, నమదశేష నృపాల మౌళి పినద్ధ ముగ్ధమణి
ప్రభా, క్రమ సమర్చిత విస్ఫుర త్పదకాంతి నిర్జిత పంకజా.
అర. 7-475

**ఆనయనము** సం. వి. అ. పుం.

తోడి తెచ్చుట, తీసికొని వచ్చుట.

ఉ. ...భూమి దే,వానయనాది కృత్యపరులైన జనంబుల గారవించు చున్. వి రా. 5-584

వ. అభిషేచనిక ద్రవ్యానయనంబునకుం దగువారిం బనిచి. శాంతి. 1-371

**ఆనయము** సం. వి. అ. పుం.

ఆనయనము, తీసికొని వచ్చుట.

చ. ...సురాపగానయ సమర్థ తపోగుణయుక్తు నుత్తమున్. అర. 3-74

**ఆనయించు** సం. స. క్రి.

తెప్పించు.

ఉ. రాజులఁ బిల్వఁబంపుము ధరాసుర సంఘము నామతింపు వే, రోజ నుదాత్త యజ్ఞగృహ యూపతతుల్ సమకట్టఁ బంపు వి,భ్రాజిత భక్ష్యభోజ్య విధి భవ్య పదార్థము లానయింపు మ,వ్యాజవిభూతిమై నమరవల్లభు చాడ్పునఁ జేయు జన్నమున్. అర. 6-70

**ఆనర్తకము** సం. వి. అ. పుం.

దేశ విశేషము, ఈ పేరుతోఁగొన్ని దీవులు గలవు. వాని యన్నింటికి ముఖ్య పట్టణమైనది ద్వారక- సౌరాష్ట్రి మని సూ. అ. ని.

వ. ఇంద్రప్రస్థ పురంబున కభిముఖుండై యానర్తక దేశంబులకుం జని యందు ముందఱ ముకుంద ప్రేషితులయిన దాశార్హ వీరులతో నగరాష్ట్రారణ్యంబులు గడచుచు, ఆది. 8-209

**ఆనవాలు** దే. వి.

అభిజ్ఞానము, గుఱుతు.

గీ. అద్దేవి గని యతం డట్లచెప్పిన ముని,వల్లభ నాకానవాలు దెమ్మ,
నృపు పాల ననియె నన్నేలఁత యుదంకుండు, సను దెంచి విభు నభి
జ్ఞాన మడిగె. అశ్వ. 3-95; అశ్వ. 3-98

**ఆనీతము** సం. విణ. (అ. ఆ. అ.)

తేఁబడినది, తీసికొని రాఁబడినది.

వ. తత్కాలోపగత సముచిత పరిజనానీత జలంబుల ముఖప్రక్షాళ
నంబు సేసికొనిరి. కర్ణ. 3-109; అను. 5-51

**ఆను** దే. స. క్రి.

1. త్రాగు.

క. వాసిత రాజన్మదిరా రసమానఁగ నాత్మహృదయంబున వేడ్క
యెసక మెసఁగెడుఁ దరుణీ.

విరా. 2-83; విరా. 2-306; విరా. 2-98

ఉత్సాహ వృత్తము. ...మధురధార లెల్ల ప్రొద్దునుఁదొరఁగుచుండ
నతఁడు వాని దోహలమున నానుచుం, బొరయ డెప్డుఁ దృప్తి.
స్త్రీ. 1-48; శాంతి 5-181

2. ఆక్రమించు, క్రమ్ము.

ఉ. వైదిక బ్రహ్మచారి జనవత్సల నీమదిఁ బట్టుకొన్న యున్మాదము
హీనమానవు మనంబునఁ బుట్టిన వెట్టివోలె నస్వాదులఁ దీర్చు
టొప్పదు సజానుజ వర్గము మీఁదగల్గు నత్యాదర సాంద్రసార
కరుణామృత మానఁగ నిమ్ము నెమ్మదిన్. శాంతి. 1-101

ఉ. తేరుల యొప్పు మోడు పడఁదేఁకువ లేని పదాతికోటి నుగ్గ
రుధిరంబులో మునుఁగ నానిన యేనికసిందు. ద్రోణ. 1-278

3. తిను, భుజించు.

ప. జక్కవలు గలసిపోలసి నవి రేఁగి చెలంగుచు రేయింటి యాఁకటి
వెల్లున గొందగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు.
విరా. 2-240

వ. ఇవ్విధంబున వివిధ వికారాననంబులు బహుభంగిక కరపాదంబులు
గలుగు నపరిమిత క్రవ్యాదులు గవిసి మేదోమాంస మస్తిష్క
మజ్జంబు లానుచుం జవియైన వానిఁ బుత్త్రమిత్త్ర కళత్రాదుల
కొసంగుచు. సౌప్తి. 1-202

శ్లో. మేదోమజ్జాస్థిరక్తానాం వసానాం చ భృశాశితాః
పరమాంసాని ఖాదంతః క్రవ్యాదా మాంసజీవనః.
సం. భా. సౌ ప్తి. 8-139; ఆది. 5-188

4. విను, ఆలకించు.

క. శివనారాయణ యచ్యుత, భవదీయములైన మధుర భాషణములు
నా, చెవులానిన నమృత రస,ప్లవనంబును బోలెఁ బ్రమదభరితుఁడ
నైతిన్. శాంతి. 2-118

5. చుంబించు, ముద్దాడు.

సీ. అంగుళంబుల నల్లి నలకలు గబళించి, కెమ్మోవి యాని యెక్కింతుఁ
గాయ్వు విరా. 2-310

6. ఆస్వాదించు, అనుభవము.

క. సంతోషామృతము నాని సంశుద్ధుఁడగున్. శాంతి 5-419

లోచనము లమృతం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్.
ఉద్యో. 3-254

**అనుకూల్యము** సం. వి. అ. న.

అనుకూలముగా నుండుట, తగియుండుట, ఒద్దిక, సాహాయ్యము.

క. అనలం బించుకయైనఁ బవనుచే వెలుఁగొందు మాడ్కి వర్ధనముం
బొందును సత్కర్మాచరణంబున దైవము నానుకూల్యము గురు
ప్రవరా. అను. 1-138; అను. 1-137

వ. దైవానుకూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమిసేయు.
ఆది. 8—12

**అనుగము** దే. వి.

బొటుకాయ.

ఆ. (శ్రాద్ధమునకు) మునగ యుల్లి యకవి మునగ దుర్మాంసము, లాను
గమ్ము మలినమైన యుప్పు,కటియ జీలకఱ్ఱ, కటివేము కురుజ
యింగువ ప్రవర్జనీయ కోటియగుట. అను. 3-189

**అనువు** సం. వి. ఉ. పుం.

యయాతికి శర్మిష్ఠయందుఁబుట్టిన ముప్వురు కొడుకులలో రెండవవాడు.
ఆది. 3-94

**ఆనుశాసనికపర్వము** సం. వి. న్. న.

మహాభారతమునందలి పదుమూఁడవ పర్వము.

చూ. మహాభారతము. అను. 1-389

**ఆనృశంస్యము** సం. వి. అ. న.

అక్రూరభావము, నిష్ఠురత్వములేమి, కపటములేమి, మోసములేమి.

వ. (భీష్ముఁడు శరీరంబు విడుచు సమయంబున) అందఱఁ గౌఁగిలించు కొని యానృశంస్యంబును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుం డని చెప్పి. అను. 5-468

**ఆన్వీక్షికి** సం. వి. ఈ. స్త్రీ.

పర్యాలోచన ప్రయోజనముగాఁగలది, రాజు విద్య.

వ. ఆన్వీక్షికీ త్రయీవార్తా దండనీతులను రాజవిద్యలయందును ప్రవీణులగు సహాయులతోడం గూడి. శాంతి. 1-182

**ఆపగ** సం. వి. ఆ. స్త్రీ.

1. నది, ఏఱు

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి, ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము దోఁపఁ దా నిట్టులనియె. ఉద్యో. 1-255

2. ఒక తీర్థము, ఆదియు నది.

వ దాని తూర్పున (మానుష తీర్థంబునకుఁ దూర్పున) నొక్క యిరవున నాపగయను మహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్క బ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ గోటిబ్రాహ్మణులు గుడిచిన ఫలంబగుఁ బితృదేవతలు దృప్తియు నొందుదురు. అర. 2-263

**ఆపగా తనయుఁడు** సం. వి. అ. పుం.

భీష్ముఁడు. చూ. ఆపగ.

**ఆపగేయుఁడు** సం. వి. అ. పుం.

భీష్ముఁడు.

చ. అనుటయు నాపగేయుఁడు. శాంతి. 2-169

**ఆపణము** సం. వి. అ. పుం.

అంగడి, దుకాణము.

క. ...నిర్వృతి పణ్యాపణ పదారవింద వికాసా. విరా. 2-364

**ఆపతనము** సం. వి. అ. న.

ప్రాప్తి, సంభవము.

స్రగ్ధర. ...వదనోత్కీర్ణ కీలాల ధారా,వంక ప్రాగ్భార మగ్నాప
తన విఘటిత ప్రాణుఁడై యాహవోర్విన్. అర. 7-91

**ఆపత్తు** సం. వి. ద్. స్త్రీ.

విపత్తు, ఇడుమ

ఉ. ...ఘోరసం,సారదురామయాపదవసాయక. భీష్మ. 2-408

**ఆపద** సం. వి. ద్. అ. స్త్రీ.

1. ఆపత్తు, విపత్తు, కష్టము

క. ఒకనాఁ డేమును నాపద,లకు విడుమరఁగాంచి విప్రులం జుట్టలఁ
బెట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో. విరా. 1-49

క. శిఖిచోరాది ముఖ్య విషయాపదకున్. శాంతి 4-34

2. కోపంబును లోభంబును, నేపారి మనంబు గలఁప నెప్పుడుఁ జింతా,
లాపంబునొంచు సధనుం, డాపదగా కవ్విధము సుఖావహ మగునే.
శాంతి. 4-35

**ఆపద్ధర్మము** సం. వి. అ. పుం.

ఆపదయందు అవలంబింపఁ దగిన ధర్మము.

సీ. కాయంబు వికృతులఁ గాల పర్యయముల వచ్చు నాపద్ధర్మ వర్తన
ములు. అను. 5-216 శాంతి. 1-395

**ఆపన్నుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆపదయందున్న వాఁడు, విపత్తునొందిన వాఁడు

తే. ...ఆపన్నుఁడ, వైన నిన్నుఁ, జూచి దుఃఖోపహార మనస్కుండ
నైతి. అర. 1-147

**ఆపస్తంబసూత్రము** సం. వి. అ. న.

ఆపస్తంబ మహర్షి చెప్పిన నియమశాస్త్రము.

సీ. ఆపస్తంబ సూత్ర పవిత్ర శీలుఁడు. విరా. 1-10

**ఆపస్తంబసూత్రుఁడు** సం. వి. అ. పుం.

ఆపస్తంబ మహర్షి చెప్పిన నియమావళి ననుసరించి ప్రవర్తించువాఁడు. (నన్నయభట్టు-తిక్కన మొ.)

సీ. పౌత్రు నాపస్తంబసూత్రు ముద్గల గోత్రజాతు సద్వినుతావదాత చరిత్రు. ఆది. 1-9; విరా. 1-10

**ఆపస్తంబుఁడు** సం. వి. అ. పుం.

యజుర్వేద విహితకర్మములను సూత్రముగఁజేసిన యొక మహర్షి. విరా. 1-10; ఆది. 1-9

**ఆపాతము** సం. వి. అ. పుం.

హఠాత్తుగాఁ బైఁబడుట (బాణములు మొ.)

శా. ఆయోధ్యాధులన్ బాణజాలాపాతంబునఁ దూలనేసి. ద్రోణ. 3-229

2. పడునట్లు వేయుట.

వ. దూరాపాత విశిఖంబుల జయద్రథు రథ్యంబులం బడనేసిన. అర. 6-243

**ఆపాతనము** సం. వి. అ. న.

ఆహతము, పడునట్లు వేయుట.

(జమదగ్ని) ఒక్కబయల నయ్యంపపొది నిలువ వైపించుకొని దూరాపాతనం బాచరింప నక్కుసుమకోమలి సని యమ్ములేటికొని వచ్చి యిచ్చుచుండు. అను. 3-265

**ఆపాదకము** సం. విశే. (అ. దికా అ.)

కలిగించునది.

క. జూదమునఁ గయ్యమున నీ, కేదురితంబులు నితాంతహృదయ క్లేశాపాదకములు వాటిల్లె న,నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా. స్వర్గ. 1-9

**ఆపాదనము** సం. వి. అ. న.

ఉత్పాదనము, కలిగించుట.

క. వేదములు డాంభికత్వా, పాదనములుగాఁగ యతులు పలుకుదురవి
సర్వాదరణీయంబులు నీ, కాదర పాత్రముగావో యని పలుకుట
యున్. శాంతి. 6-308; కర్ణ. 1-245; అను. 2-476; మౌస 9

**ఆపాదమస్తకము** సం. సమ. అవ్య. అ. న.

పాదమునుండి తలవఱకు.

క. ఆపాద మస్తకము తద్రూపము వీక్షించుచుం గుతూహల మడ
రన్. విరా. 1-311

**ఆపాది** సం. విణ. (ఇ. ఇ. ఇ.)

కలిగించునది.

మ. ...పౌరనిమిషస్తోమాద్భుతాపాదియై. కర్ణ. 1-86

మానివి. అమరగణ విరోధి వ్యాసదాపాదికోపా. మౌస. 226

**ఆపాదించు** సం. స. క్రి.

1. కలిగించు, కలుగఁజేయు, సమకూర్చు.

క. నా పలుకు నమ్మి మర్జునుఁ, డాసాపాత్మకుని నెల్లి యనిఁ జంపి
ముదం, బాపాదించుం గులమున, కీపెంపున కెలమివొందుఁ డీవును
నతఁడున్. ద్రోణ. 2-330

క. పాపక్షయమున బోధం, బాపాదింపఁబడి మెఱుఁగుటద్దము కరణిం,
జూపునకు వచ్చుఁ దనుఁదా, నా పురుషుఁడు గాంచు పనికినై
తన్మయుతన్. శాంతి. 4-187; అను. 5-354; ద్రోణ. 3-96

2. ఒనరించు, చేయు.

వ. కవలు నీకు చక్రరక్షకులుగా లోకసామాన్యంబులైన చాప
కృపాణ గదాదులగు నాయుధంబుల విరోధివధం బాపాదించి
వేవేగ విరాటు విడిపింపుము. విరా. 3-207

వ. నీ వాపాదించిన పాపంబులకెల్ల మూలంబైన కర్ణునరదంబు ధరణిం
గ్రుంగిన. శల్య. 2-328; అర. 3-14

**ఆపాదితము** సం. విణ. (అ. ఆ. అ.)

సమకూర్పఁబడినది.

ఉ. ...నృపపుంగవ నీవు ననేక భూసురా,పాదిత సర్పయాగమున భస్మము సేయుము. ఆది 1-124

**ఆపానము** సం. వి. అ. న.

కల్లు సారాయముల దుకాణము,

ప. ప్రేతపత్యనుభూతోజ్ఝితంబైన యాపాన భూభాగంబు సమతి రించు కురుక్షేత్రంబు దఱియు సమయంబున శాంతి, 2-64

**ఆపుఁడు** సం. వి. అ. పుం.

ఒక అగ్ని. చూ. అను 4-168

**ఆపూరణుఁడు** సం. వి. అ. పుం.

కద్రువ కొడుకు ఆది. 2—4

**ఆపూరితము** సం. విశ. (అ. ఆ. అ.)

నిండింపఁబడినది, మిక్కిలి నిండింపఁబడినది.

భువనమంతయు నాదాపూరితముఁ జేసె. శాంతి. 6-306

**ఆపోవు** దే. అ. క్రి. (ఆదట + పోవు అని శ. ర.)

తృప్తి నొందు.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమాన ము ని,ర్వ్యాపారత్వము నను నివి, కాపురుష గుణంబు లంద్రు కౌరవనాథా. ఉద్యో. 2-82

వ. ఇట్లు సిద్ధ స్వరూపదీపితుండైన యతని నాపోవక చూచుచు శంకరుండు, శల్య. 2-185

క. శ్రీపతి గడు వెయ్యంబున, నాపోవక పార్థు నొద్ద నా రాత్రి ప్రియా,లాపములఁ దగిలియుండెను, దీపమణుల్ వెలుఁగ భువన దీపుఁడు దానన్, ఆది. 8-172

**ఆపోశనముగొను** మి. స. క్రి. (√ ఆపోశనము)

ఆక్రమించు, వశపఱచుకొను.

వ. పరదేశం బాపోశనంబు గొనం దమకించు తన బలంబు గజిబిజి

యుడిపికొని. విరా. 3-181

(ఆపోశనము = భోజనాదియందును భోజనాంతమందును పుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగాఁ బుచ్చుకొనుట, అట్లు పుచ్చుకొను జలము)

**ఆప్తచరుఁడు** సం. వి. అ. పుం.

ఆప్తుడైన గూఢచారి (గూఢచారులలో దనకు విశ్వాస పాత్రుడైన వాఁడు)

వ. తద్వృత్తాంతంబతయుఁ గుంతి తన యాప్తచరులవలన విని శిథిలీకృత సంతాపయయి యుండె. అర. 7-356

**ఆప్తత** సం. వి. ఆ. స్త్రీ.

హితము

సీ. అతనిఁ దొఱఁగి మదాప్తత మెఱయు పెక్కాడంగనేటికి. ఆశ్వ. 1-33

**ఆప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రాప్తము, పొందఁ బడినది.

తే. ఆప్తసర్వవిధైశ్వరుఁడు. స్వర్గ. 1-80

**ఆప్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. పొందుట

చ. పరమపదాప్తి హేతువగు భారత సంహిత- స్వర్గ. 1-94

2. యథార్థమును జెప్పుట

తే. నీవిపేకంబు నాప్తియు నెఱపి తీవు, తల్లిదండ్రుల మాడ్కిహితంబు సెప్పి, తేను నా రాక తెఱఁగెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ. ఉద్యో. 3-236

శ్లో. ధర్మార్థయుక్తం తథ్యం చ యథార్థత్వయ్యుపపద్యతే
తథా వచనమక్తోఽస్మి త్వయైత త్పితృమాతృవత్.
సం. భా. ఉద్యో. 92-3

చ. నా యాప్తియును గార్యవివేకంబు కలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపుము. శాంతి. 2-366

ఆప్తుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

1. కావలసినవాఁడు, ముఖ్యుడు.

క. తానెంత యాప్తుఁడైన మహీనాయకు సొమ్ము పాము సొమ్ములుగా లో, నూనిన భయమునఁ బోరయక, మానినఁగా కేం కలుగు మానము బ్రదుకున్. విరా. 1-186

2. సుహృదయుఁడు, హితుఁడు, స్నేహితుఁడు.

వ. సేనజితుండను రాజు పుత్రశోకార్తుండయి యున్నయెడఁ దదాప్తుండగు విప్రుం డతని కిట్లనియె. శాంతి. 4-7

తే. దుష్పథంబులఁ బోరనీక తొలఁగఁ దివుతు,రాప్త జనములు దగ వశ్యులైనవారి, నందుఁ బుణ్యంబు దొలఁగని యతఁడు దొంగుఁ, దొలఁగ నేరఁడు భాగ్యంబు దొలఁగువాఁడు. సౌప్తి. 1-79

3. విశ్వసింపఁదగినవాఁడు.

చ. జనకుఁడుఁ బోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్ఠభాగముం, గొనునది వారిచేత నరిఁ గోటి విధంబుల నాప్తదకులం, గని నవ గోకులాకరనగ ప్రముఖార్థకరంబు లారయం, బనుచుచు నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడి యున్నఁ బెంపంగున్. శాంతి. 2-288

4. మేలు గోరినవాఁడు.

మ. జనకుండున్ గురు భీష్ములుం దగిన కర్ణుం డాప్తులై నీకుఁ బ్రీతి నెఱింగించు తెఱంగుగాదు. ఉద్యో. 3-372

5. పొందినవాఁడు.

క. ఈగతి యెఱింగి చేసిన, యాగము సోమాప్తుఁజేయు నప్పురుషుని. శాంతి. 2-348

ఆప్యాయనము సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రీతి గలిగించునది, తనివి కలిగించునది.

వ. అంతకుమున్న సాత్యకియుఁ గృతస్నానుండై యాప్యాయన మధుపానంబున నెలమిం బొంది. ద్రోణ. 3-307

వి. అ. న.

2. తృప్తి, ప్రీతి.

క. ఖర కిరణ తాపమున నురుతర దవదాహమున శోషితములైన వనాంతరతరుతతి కాప్యాయన కరమైన వర్షాగమంబు గదు బెడఁ గయ్యెన్. అర. 4-184.

**ఆప్యాయిత** సం. విణ. (అ. ఆ. అ.)

తృప్తి నొందింపఁబడినది, సంతుష్టి పొందింపబడినది.

వ. క్షీముండు జాత సస్యయైన వసుధ తోయసంప్రాప్తి నాప్యాయిత యైనట్లు జ్ఞాత చర్యుండైన తన పతిం బడసి పరమ సంతుష్ట హృదయయై చంద్రులోఁ గూడిన రాత్రియుం బోలెఁ బతిం గూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి. అర. 2-220

**ఆప్యాయితము** సం. విణ. (అ. ఆ. అ.)

బలియఁ జేయఁబడినది.

వ. చంద్రుం డా తీర్థంబునకుఁ జని తదీయ జలస్నానంబున నాప్యాయిత శరీరుండై. శల్య. 2-158

**ఆప్యాయితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

తృప్తి నొందిరపఁబడినవాఁడు, సంతోష పెట్టఁబడినవాఁడు.

వ. ...సర్వ యజ్ఞంబులను మానవులు మాననీయంబులుగా నడప మీ కెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల నాప్యాయితులై యుపబృంహణంబు నొందువారలు. శాంతి. 6-410

**ఆప్లావితము** సం. విణ. (అ. ఆ. అ.)

అంతటను తడుపఁబడినది.

వ, అనిన నతండు గన్నీరొలుక నన్నపాదంబులపైఁబడిన నప్పాండవాగ్రజుండును బాష్పప్లావితముఖుండగుచు నతనిమీఁద నొఱఁగె. కర్ణ. 3-109

**ఆప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆర్ద్రీభూతము, తడుపఁబడినది.

చ. ఉతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్తమంగ మా,
ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెన్ ధరం....
శల్య. 1-285

**అబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)
బాగుగాఁ గట్టఁబడినది, కూర్పఁబడినది.

వ. ...అబద్ధ మరకత వజ్ర వైడూర్య పద్మరాగ ప్రవాళ ప్రభావ ప్రకర వ్యతికర విరచితాపూర్వ సురచాప చారుగౌరవంబై - ప్రేక్షాగారంబున నున్న. ఆది. 6-4

**అబాలగోపాలము** సం. సమ. అవ్య. అ. న.
బాలుని మొదలు గోపాలుని వఱకు (చిన్నవాని నుండి పెద్దవాని వఱకు)

సీ. క్షత్రియాధమ నీచ కలదు లోకంబున నాబాలగోపాలమైన వాక్య,
మతికుటిలుండు సంగతుండు గాఁడేమిటఁ, జెలికిఁ గీడొనరించుఁ
జెట్టవలుకు కర్ణ. 2-47

**అబాలవృద్ధము** సం. సమ. అవ్య. అ. న.
బాలుని మొదలు వృద్ధుని వఱకు (ఎల్లరు)

వ. అనుచు నతికుతూహలంబున వవలోకింప నాబాలవృద్ధంబగు పౌర లోకంబు. ఉద్యో. 3-176; శాంతి. 1-354

సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా వచ్చి రక్కురువంశవరులఁ జూడ.
మహా. 20

**అబ్దికము** సం. విణ. (అ. ఈ. అ.)
సంవత్సరమునకు నగునది.

క. హీననరునట్లు గుఱ్ఱము, నేనుఁగును మనుష్యవధ మనేకాబ్దిక భి,
క్షానిరతి ప్రభృతి సుకర్మానుష్ఠానములఁగాని. అను. 3-299

**అభము** సం. విణ. (అ. ఆ. అ.)
ఇది సమాసోత్తరముగా నుండి 'సదృశము' అను నర్థము నిచ్చును.

తే. ...ధర్మపరత్వంబు వాసవాభవై భవము నయ్యెడుమ నీకు.
అను. 2-287

**ఆభరణము** సం. వి. అ. న.

భూషణము, తొడవు.

క. వనమాలికా భుజంగాభరణా. విరా. 1-88

**ఆభాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపిబడినది, ప్రకాశించినది.

క. ఈ సర్వము దేహాత్మాభాసిత మిది దేహియైన పరమాత్ముని వి. వ్యాసమునకుఁగా నొదవి యుపాసించుం గరణరూపమై యా కర్తన్. శాంతి. 4-274

**ఆభిచారికము** సం. విణ. (అ. ఈ. అ.)

అభిచారమునకు శత్రుమారణ వశీకరణాదులకు సాధనమైనది(మంత్రాది).

క. అరుణంబులును సకంటక, తరుభవములుఁ గటుకగంధ ధామములు నొనర్తురు శాత్రవాభిచారిక, కరణమున నధర్వమాంత్రికతఁ గుసుమంబుల్. అను. 4-7

**ఆభిజాత్యము** సం. వి. అ. న.

1. కులీనత, గొప్ప వంశమునఁ బుట్టుట.

వ. అని చెప్పి యిది మరుత్తుని యాభిజాత్యంబును దదీయ వృత్త విశేషంబును నెఱింగించుట యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెద. అశ్వ. 1-82, ఆది, 7-60

2. మనోజ్ఞము, సౌందర్యము.

సీ. ...కన్యారత్నమయిన యా దమయంతి, యత్యంత శాంతి రూపాభిజాత్య. అర. 2-9

**ఆభిజితము** సం. వి. అ. న.

అభిజిత్తు సంబంధమైన కాలము. ముప్పది ముహూర్తములుగల దినములో ఎనిమిదవ ముహూర్తము అభిజిత్తు అనఁబడును. సూర్యోదయానంతరము సుమారు 6 గంటల కిది ప్రారంభమగును. సూర్యుడాకాశమున నట్టనడి యెత్తుననుండు సమయము.

ఉ. శాత్రవజైత్రతేజమున సర్వదిశల్ వెలుగంగ నైంద్ర నక్షత్ర

యతుడుగా శశి ప్రకాశజయోన్నతమైన యష్టమిన్ మిత్ర
ముఖ గ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబున, బుత్రుఁడు
ధర్మవంశమునఁ బుట్టి నతిస్థిరధర్మమూర్తియై ఆది. 5-94

శ్లో. ఐంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తేఽభిజితేఽష్టమే,
దివా మధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతిపూజితే.
సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతమ్.

సం. భా. ఆది. 123. 6, 7 శ్లో.

**అభిజితోదయము** సం. సమ. వి. అ. పుం.

అభిజిత్కాలము పుట్టుట, అభిజిత్తు సమయము. చూ. అభిజితము.

**అభిషేచనికము** సం. విశే. (అ. ఈ. అ.)

పట్టాభిషేకమున కుపయోగించునది (పదార్థము)

వ. రాజ్యాభిషేక శోభనం బనుభవింపుమని పలికి యాభిషేచనిక
ద్రవ్యానయనంబునకుం దగువారిం బనిచి. శాంతి. 1-371

**అభీరము** సం. వి. అ. పుం.

ఒక దేశము.

వ. సింహళాభీర శూరసేన కేకయ ప్రముఖులు మెడయును.

ద్రోణ. 1-222

వ. పాంచాల పాండ్య బర్బర...పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీర
సౌరాష్ట్ర...జనపదంబులు. భీష్మ. 1-40

ఇచ్చట పాండ్య శబ్దము రెండుసార్లు కనఁబడుచున్నది. సంస్కృతము నందలి యీ ఘట్టమున నిచ్చినవానికి వీనికిఁ గొన్ని భేదములు గనఁబడు చున్నవి. అక్కడ 'పాండ్య' శబ్దము గానరాదు. ఇది పుష్కరారణ్యము నందలి యొక దేశము. సం.మున. 'పాంచాల పాండ్య బర్బర' అన్నచోట పాండ్య శబ్దము వదలఁబడినది. 'పాండ్య' ఉన్నట్లు పాఠాంతరము గూడ నీయలేదు. సం.ము. పాఠమే సరియైనదిగాఁ గన్పించుచున్నది.

**అభీరుఁడు** సం. వి. అ. పుం.

పుష్కరారణ్యవాసి, గొల్లవాఁడు, చెంబడివాఁడు

మూలమునందలి పాఠమునకు ఈ పాఠమునకు ఇంచుక భేదము

గన్పించుచున్నది, అందు 'శూద్రాభీర' అనియు వారు సరస్వతీ నది ప్రాంతము వారనియుఁ దెలియుచున్నది.

"పునశ్చ పరివృత్యాథ పుష్కరారణ్యవాసినః
గణానుత్సవసంకేతాన్ వ్యజయత్పురుషర్షభః
సింధుకూలాశ్రితా యేచ గ్రామణీయా మహాబలాః
శూద్రాభీరగణాశ్చైవ యేచాశ్రిత్య సరస్వతీమ్
వర్తయంతి చ యే మత్స్యైర్యేచ పర్వతవాసినః

సంభా. సభా. 32-8, 9, 10 శ్లో.

ఈ 'శూద్రాభీర' శబ్దమే సంస్కృత భారతమున భీష్మపర్వమునందును గనఁబడు చున్నది.

శ్లో. శూద్రాభీరాశ్చ దరదాః కాశ్మీరాప త్తిభిస్సహ,
ఖశీరాశ్చాంతచారాశ్చ సహవాగిరిగహ్వరాః

సంభా. భీష్మ. 67 శ్లో.

ఏమైనను ఈ "ఆభీరులు" ఆడవులయందు నదీ ప్రాంతముల పల్లెలలో నుండు వారనియు నాలవజాతికిఁజెందిన వారనియు ఈ పల్లెల కన్నింటికి వారిలో నొకఁడు ప్రభువుగా నుండి స్వతంత్రుఁడై (రామాయణమునందు గుహునివలె) పరిపాలించుచుండుననియు నదిని దాట వేయు పని గూడ వీరిదే యైయుండుననియు నూహింపనగును.

వ. ఇట్లు రౌద్రాకారంబున మాద్రేయుండు మహాసేనాన్వితుం డయి యరిగి మహాసేన రక్షితంబైన మహితకవిషయంబున దత్తత మయూరకాది శూద్రులతోఁ గయ్యంబుచేసి కురు మాళవ బర్బర కర్బర శైరీషక దాశార్ణదేశంబుల రాజుల జయించి పుష్కరారణ్య నివాసులైన యాభీర గణంబులను సరస్వతీ సింధు కూలాశ్రితులైన గ్రామణీయులను బంచనదామరపర్వత నివాసులను వశగతులం జేసికొని. సభా. 1-268

**అభీలత** సం. వి. ఆ. (స్త్రీ).

భయంకరత్వము.

క. ...ప్రాండవజ్వలనం బ్రాభీలత మండం దొడరిన. విరా. 1-119

**ఆఖీలత్వము** సం. వి. అ. న.

భయంకరత్వము, వెఱపు గొల్పువది.

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీ సుందరోల్లాస మాఖీలత్వం బల రింపం ద్రిప్పు. కర్ణ. 3-210; భీష్మ. 1-56

**ఆఖీలము** సం. విశే. (అ. ఆ. అ.)

భయంకరము, వెఱపు గొలుపునది.

తే. ...ఆఖీల భుజగ చండమూర్తి శమీతరు చక్రవర్తి. విరా. 1-162

**ఆఖీలుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

భయంకరుఁడు

క. శస్త్రప్రకార నిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాత నాఖీలుఁడు.

విరా. 5-6

**ఆభోగము** సం. వి. అ. పుం.

చక్కని సుఖాద్యనుభవము.

క. యోగీంద్ర చిత్త కమలా,భోగ మధుపవిభుఁడు ప్రకృతి పురుషా త్ముఁడు. ద్రోణ. 5-426

2. వైశాల్యము.

సీ. పర్వతాభోగనిభంబునైన మేనిపెంపును గల దాని. మౌస. 76

3. ప్రాంత ప్రదేశము.

క. గిరిశిఖరాభోగ బృహ,త్తరభుజగ శరీర వేష్టిత శరీరుండై.

అర. 4-116

**ఆభ్యంతరము** సం. విశే. (అ. ఈ. అ.)

లోపలిది, హృదయ సంబంధమైనది.

సీ. ఆభ్యంతరము బాహ్యము ననఁగా శౌచ మిరుదెఱఁగై యుండు.

అను. 5-181

**ఆమంత్రణము** సం. వి. అ. న.

ప్రయాణాదులయందు బంధువులు లోనగువారి యనుజ్ఞ పొందుట, వీడు కొనుట, వీడ్కోలు.

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బల దేవుని వీడ్కొని వాసుదేవు నామంత్రణంబుసేసి కృతవర్మ పాలి కిం జని. ఉద్యో. 1-84; స్త్రీ. 1-117; శాంతి. 6-618

వ. అప్పుడుదేవు దీవించి యామంత్రణంబుసేసి. అను. 1-381

**ఆమంత్రణముసేయు** మి. స. క్రి.

వీడ్కొను.

వ. ధృతరాష్ట్ర విదురుల నామంత్రణంబుసేసి యద్దేవముని యంతర్ధా నంబు నొందె. చూ. ఆమంత్రణము. ఉద్యో. 2-108

**ఆమంత్రించు** సం. స. క్రి.

పోయివచ్చెదనని చెప్పి యనుజ్ఞతీసికొను, వీడ్కొను.

వ. అంత ననుద్యూతపరాజితులయిన పాండవులు దమరాజ్యోపభోగం బులు విడిచి...వనంబునకుంబోవ సమకట్టి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాచార్యుల నామంత్రించిన. సభా. 2-280

**ఆమంత్రితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆమంత్రణము చేయబడినది. వీడుకోలుపఁబడినది.

సీ ...ధృతరాష్ట్ర మేదినీపతి తపస్విగణము సవినయంబుగా నిజస్థాన యానమునకు నామంత్రితముగఁజేసి. ఆశ్ర, 2-130

**ఆమంత్రితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఆమంత్రణము చేయబడినవాఁడు, వీడుకోల్పఁబడిన వాఁడు.

వ. ఇవ్విధంబునం బాండునందనులందఱును గోవిందునకు వలయు మాటలు సెప్పి యతని గౌఁగిలించుకొని యథోచిత ప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి. తక్కిన వారలు నర్హంబులగు తెఱంగుల నామంత్రితులై మరలిరి. ఉద్యో 3-145

వ. ...భవదీయ కృపావిశేషంబునకుం గృతార్థుండ నైతినని యతని నామంత్రితుంజేసిన. ఆశ్ర. 2-132; శాంతి. 1-222

2. వీడుకొనఁబడినవాఁడు.

క. వేగిన నామంత్రితుఁడై, యా గుణనిధి వీడుకొలిపి యతఁడు

[ప్రయాణో,ద్యోగంబు సమీచీనవి,ధాగరిమ [ప్రౌఢవృత్తి దగ
నొనరించెన్. శాంతి. 6-562; అను. 1-269

**ఆమడ** దే. వి.

యోజనము, నాలుగు కోసుల దూరము.

వ ...అచటికి రెండామడయగు సరస్వతీ పొంతం బయలికి బలంబులం
గొని చని. శల్య. 1-74

శ్లో. తతో వాహాన్ సమాశ్వాస్య సర్వే యుద్ధాభినందినః
ఉపద్విమోజనే గత్వా [ప్రత్యతిష్ఠంత కౌరవాః.
సం. భా. శల్య. 5-50

సీ. ...ఈ,[ప్రోలికి నామడ నేల నల్ల, యమునానది గహ్వరమున
బకుండను రక్కసుం డుండు. అర. 6-284

(ఇక్కడ మూలములో)

శ్లో. సమీపే నగరస్యాస్య బకో వసతి రాక్షసః సం.భా. ఆది. 160-3

(ఆమడ ఇప్పటి లెక్క [ప్రకారము సుమారు 8 మైళ్లు లేక 13 కిలో
మీటర్లుండను)

**ఆమతించు** వై. స. [క్రి.

1- ఆమం[త్రణము చేయు, నియం[త్రణ మొనరించు – పితృకార్యములందు
భోక్తగా నియమించు.

క. వినుము సపిండీ కరణ,మ్మైన నేకోద్దిష్టమునను భోజనవిధివ,ర్జన
మొప్పు నామతింపక, చన దామెత(గుడువ(బోవ. అను. 4-122

శ్లో. అనిమం[త్రితో న గచ్ఛేత యజ్ఞం గచ్ఛేత దర్శకః
అనర్చితే హ్యనాయుష్యం గమనం త[త్ర భారత.
సం. భా. అను. 105. 143, 144

2. పిలుచు, ఆహ్వానించు.

ఉ. రాజుల( బిల్వ(బంపుము ధరాసుర సంఘము నామతింపు.
అర. 6-70

**ఆమ[ద్రవ్యము** సం. వి. అ. న.

పచ్చి వస్తువు-అగ్నిదగ్ధముగాని పదార్థము.

క. అమద్రవ్యము మణియును, రామయు కుచులగుట గాదె రామా
రత్నా, రామత దగవగు దుష్కృల,మై మెచ్చుమి దోఁచెనేని ననిరి
మునీంద్రుల్. శాంతి. 4-434

**ఆమము** సం. విశే. (అ. ఆ. అ.)

పచ్చది, వండనిది, అగ్నిదగ్ధముగానిది.

చూ. అమద్రవ్యము.

**ఆమయము** సం. వి. అ. పుం.

రోగము, తెవులు.

కం. ...లోకామయ నిర్హారణ నిపుణ హరిహరనాథా. విరా. 2-1

**ఆమర్దితము** సం. వి. అ. న.

మర్దింపఁబడినది, నలఁపఁబడినది.

ఆ. అతని కరతల ద్వయామర్దితంబులై, కందియును మహాసుగంధ
కుసుమ,తతులు దొంటి యట్ల తమ కంపు విడువక,యుండు నతని
తేజ మున్నతంబు. అర. 2-196

**ఆమర్శము** సం. వి. అ. పుం.

చక్కఁగా స్పృశించుట.

క. .. సంకల్పామర్శ రహితమగు చేతోముద్రం దాల్తు నేను దుది
యది నీకున్. శాంతి. 4-45

**ఆమలకము** సం. వి. అ. పుం.

ఉసిరిక కాయ.

క. అతని కెల్ల ధర్మముఁ, గరస్థ లామలక సన్నికాశం బధిపా.
శాంతి. 1-337; 4-448

**ఆమిషము** సం. వి. అ. పుం. న.

1. ఆశగొలుపు వస్తువు, లోభనీయ వస్తువు, వాంఛితార్థము.

చ. ...భూజనుల నేలుట మేలని పల్కెదా ర్తికాస్పదమని రార్య
లామిషముపైఁ దగు లిమ్మహియెల్ల నేలినం, దుది నరకం బొకండ.
శాంతి 1-128

ఉ. అసదృశలీలఁ బొల్చు రథికావళి మీఁదఁ జనంగ వెట్టినే, మసలక

యామిషంబు గొని మార్గము పట్టిన తుచ్ఛసైన్యమున్.

విరా. 4-57

(ఇచ్చట మూలమునందును 'ఆమిషము' అనియే గలదు)

క. దుర్మతు లామిషగతమగు, కర్మము వాటించి బంధకలితులగుదురు.

శాంతి. 1-125

2. మాంసము.

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగమీక నీ, వెక్కటి
మ్రింగఁజూచె దది యెట్లిఱుగున్ విను మీను లోలతన్, గ్రక్కున
నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పుసూవె. ఉద్యో. 2-52

3. ఆహారము, భక్ష్యము.

వ. అమ్మహాజగరం బామిషార్థియై భీముం బట్టికొని.

ఆ. ఎదురఁబడిన వాని వదలక శార్దూల, శరభ సామజాది సత్త్వతతులఁ
బట్టి తినుచునున్నయట్టి నాకిప్పుడు, భక్ష్యమైతి వీవు పాండుపుత్ర.
అర. 4-106, 111

4. ఆహుతి, అగ్నిహోత్రమునందు వేల్చు పదార్థము.

క. హోమవిధులఁ దన్మాంసము, లామిషములుగాఁగ నొసఁగి.

అను. 5-72

**ఆముక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

ధరింపఁబడినది.

సీ. అయ్యగ్ని సంభవు నాయతోన్నత బాహు, నాముక్త కవచుఁ
దేజో మహిష్ఠు. అర. 6-221, 414; అర. 7-108

**ఆముష్మికము** సం. విశే. (అ. ఈ. అ.)

పరలోకమందుఁ గలుగునది.

వ. ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం
బొందు ననిన మందాకినీనందనుం డతని కిట్లనియె.

శాంతి. 3-42, 310

**ఆమెత** వై. వి.

పితృకార్యమ నందలి భోజనము.

క. వినుము సపిండీకరణ,మ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వర్జన
మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁబోక సజ్జనవినుతా.
అను. 4-122

**ఆమోదము** సం. వి. అ. పుం.

1. దూరముగా వ్యాపించెడు పరిమళము, పరిమళము.

తే. శ్రుతి శిరోభాగములఁ దన సుభగచరణ, సరసిజామోదమును
గూర్పు చతురుఁ డితఁడె. ఉద్యో. 3-175

2. సంతోషము, ఆనందము.

క. యమనియమా ద్యష్టాంగ, క్రమాభ్యసన నిర్మథితవికారసుచేతః,
కమలామోద మయాత్మా. శాంతి. 2-444

**ఆమోదితము** సం. విణ. (అ. ఆ. అ.)

సంతోష పెట్టఁబడినది.

క. ...సంపత్త్యామోదిత భక్తలోక హరిహరనాథా. త్రి. 2-1

**ఆమ్నాయము** సం. వి. అ. పుం.

1, వేదము.

శా. ...భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.
విరా. 1-8

2. సమూహము.

ఉ. ఆయత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీ సురామ్నా
యము నాహితాహుతి సమంచిత దక్షిణ లిచ్చి తన్పుచుం.
ఆది. 1-89

3. వంశము.

మ. అమితౌజుం డగువానిఁ జూచి కృతవీర్యామ్నాయజ క్షత్రియా,
ధములెల్లన్ హృతదర్పులై. ఆది. 7-185

క. ...పాపమతివై భరతామ్నాయులగు పాండవేయుల, శ్రీ
యిమ్మెయిఁగొనిన నిన్నుఁ జీ యనరె యొరుల్. సభా. 2-185

**ఆమ్రము** సం. వి. అ. పుం.

మామిడిచెట్టు, చూతము.

వ. అశ్వత్థమధూకామ్రబిల్వాది భూరుహోపశోభితంబైన నిజపూర్వాశ్రమంబు గన్గొని. కల్యా. 2-218

**ఆమ్రేడితము** సం. విణ. (అ. ఆ. అ.)

పెక్కుమాఱులు పలుకఁబడినది, అధికము చేయఁబడినది.

ఉ. ...సజ్జనామ్రేడిత కీర్తి నిమ్మని నమిత్రనిషూదను నాశ్రయించెదన్. ఆర. 4-358

**ఆయతత్వము** సం. వి. అ. న.

ఔన్నత్యము.

క. ...ఓహో చాలు భూనభోమధ్యవ్యాపితమయ్యె భవద్దేహాయతత్వ ముపసంహరింపు మనవుడుఁ గపియున్. ఆర. 3-344

**ఆయతనము** సం. వి. అ. న.

శాల.

వ. యజ్ఞాయతనంబున నానాదేశగతులైన రాజులకు సన్నివేశంబులు సేయించి. సభా. 1-281

2. ఇల్లు, గృహము.

క. ధృతరాష్ట్రి నగ్నిహోత్రాయతనంబున నలచె పలుకు లగ్నులు శాంతద్యుతులయ్యెన్. సభా. 2-251

3. స్థానము, ఆశ్రయము, ఉనికి పట్టు.

క. ఈ యాఱును మంచి తెరువులై యుండు నహింసయున్న యైదింటికిఁ బవిత్రాయతనము. అను. 4-279

వ. ఆ సంయమ చతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు భేదించి. అను. 5-468; శాంతి. 2-50; అను. 3-254

**ఆయతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. విస్తృతము, విరివియైనది.

సీ. పాయు తొలంగు మం చాయత వేత్రహస్తులమొత్త మేలొకో తోడు రాదు. విరా. 1-186

2. విశాలము.

చ. కమలాయతాక్షి. విరా. 1-247; సభా. 1-18

3. దీర్ఘము, నిడుపైనది.

ఉ. ఆయత బాహులున్ వెడఁదయైన సమున్నత వక్షమున్. విరా. 1-294

వ. కనకాయత కుశాసనంబులం గవల నిరుపక్కంబుల నునిచికొని కుంతీ మహాదేవియు. శాంతి. 1-371

వ. అందు రౌహిణంబను పాదపోత్తమంబు గరుడునిం గని సంభావించి శతయోజనాయతంబైన మదీయ శాఖపైనుండి యుగ్గజ కచ్ఛపంబుల భక్షించి పొమ్మనిన, ఆది. 2-71

4. నియతము.

తే. సాక్షియును ధర్మదర్శియు సాక్ష్యవిధులు, దప్పఁగాదు తప్పినను నధర్మయుక్తి, వరుణపాశసహస్రంబు వానిఁగట్టి, పాయ నేఁటేఁట నొక్కొక డాయతముగ. సభా 2-242

ఆయతి[1] దే. వి.

ఆయము, రాబడి.

క. వినికి కలిగి రక్షించుచు, ననువున దయతోడిపాడి నాయతులెల్లం గొనుచుఁ దగ నేలి పొగడొందిన రాజున కుర్వి గామధేనువుగాదే. భీష్మ. 1-41

క. వినుమొక కుంచెడు ధాన్యము, దన కాయతి గల్గు నతఁడు దాని కొసఁగినన్, ధనకోటి గల్గువాఁ డర్థన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. అను. 5-211

ఆయతి[2] సం. వి. ఇ. స్త్రీ.

1. రాఁబోవు ఫలితము.

క. ధృతిఁబూని బ్రహ్మచర్యవ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననపత్యతయైనను లోకము లాయతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై. ఆది. 4-189

2. కార్యము, పని.

చ. ...విధిదృష్ట విశిష్ట పూజనాయతికి ననర్హు నర్హుడని యచ్యుతు నర్చితుఁజేయఁ బాడియే. సభా. 2-10

**ఆయతికాఁడు** దే. వి. (√ఆయతి[1])

రాజాదాయమును రక్షించువాఁడు, కోశాధ్యక్షుఁడు.

క. ఆయతికాఁడు వలయు నర,నాయకునకు వాని నెల్ల నరులుం జేటుం, జేయఁ దలంతురు దా నవ,ధాయకుఁడై కావవలయు ధరణిపుఁ డతనిన్. శాంతి. 2-369

శ్లో. రాజకోశస్య గోప్తారం, రాజకోశవిలోపకాః,
సమేత్య సర్వే బాధంతే సవినశ్యత్యరక్షితః. సం. భా. శాంతి. 82-4

**ఆయత్తత** సం. వి. ఆ. (స్త్రీ).

వశము, ఆధీనత్వము.

క. భూనాయకుఁడు మరలి పటుకో,పాయత్తతఁ ద్రొక్కఁబడ్డ యహిగతిఁ గవిసెన్. విరా. 5-206

మ. ...వితెంచె దుర్యోధనుఁడన్, యతి యమ్ముద్గలు పాలికిం బటు బుభుక్షాయత్తతం దూలుచున్. అర. 6-116

**ఆయత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆధీనము, వశమైనది.

(కీచకుఁడు) కామాయత్త చిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకు సేయక రహస్యప్రకాశ విభేదంబు దక్కి- విరా. 2—120

క. మోక్ష మాయత్త మగున్. శాంతి. 4-66

క. విధి యధీనంబులు గా,కారయ విత్తంబులు పురు,షారంభాయత్తములె. శాంతి. 4-873

2 జాగరూకము.

క. నీయందు వారియందుం, జేయంగల మానసుల విశేషంబులఁ జిత్తాయత్తంబుగఁ జెప్పుము, నీ యెఱుఁగని యవియు లేవు. ఉద్యో. 4-218

ప్రణవ వృత్తము. నీ యుల్లం బొక నియతిం గార్యం,బాయత్తంబుగ ననుసంధింపం, జేయంజాలవు స్త్రీ. 1-145

3. చేయఁబడినది.

స్రగ్ధర :- కుముదవనీ కాంధవాయత్త చంద్రశ్రీలీలా. విరా. 3-77

4. సిద్ధము, పొందఁబడినది.

క. ...నిష్ఠుర నినాదా,యత్త మయి నభము పిడుగుల, మొత్తంబులు వడియె నగరమున నెల్లెడలన్. ఉద్యో. 4-160

**ఆయన** దే. సర్వ. ఏక (అ + అన)

అతఁడు,

క. ...అతని, కాయన సెప్పిన విధంబు నభివర్ణింతున్.

భీష్మ. 2-261; ఉద్యో. 3-48; అను. 3-330; స్వర్గా. 14

**ఆయమ** దే. సర్వ. ఏక. (అ + అమ)

ఆమె.

ఉదకప్రదాన సమయంబున నాయమచేత వింటిని.

శాంతి. 1-7; ఉద్యో. 4-276; శాంతి. 1-9

తే. గొంతిఁ గాంచి యాయమ యడుగులకు నెఱఁగి. అశ్వ. 4-168

**ఆయము**[1] వై. వి. (సం. ఆయుః. త. ఆయం. క. ఆయ)

1. ఆయువు పట్టు, మర్మస్థానము.

తే. ఆయముల్ నొంచి దోర్త్సీల నెఱపి. విరా. 2-347

**ఆయము**[2] సం. వి. అ. పుం.

1. రాబడి, ఆదాయము.

తే. ఆయములును వ్యయంబులు నరసి కోశ,సంపదలు గాంచి యునికి రాజన్యగుణము. శాంతి. 3-107

2 గ్రామములనుండి వచ్చు శిస్తు.

"గ్రామేషు స్వామిగ్రాహ్యో భాగ ఆయః శ.కా. మృచ్ఛకటిక.

**ఆయవ్యయములు** సం. వి. (ఆయము + వ్యయము)

రాబడియు పోబడియు - ఆదాయ వ్యయములు.

వ. వలయు పనులు వెనుక ముందర రరసి యొఱింగించుటకును నాయ

వ్యయంబు లెక్కించుటకును సంజయుం బోనిపి.

శాంతి. 1-378, ఆశ్ర. 1-60

**ఆయసకంటకము** సం. వి. అ. పుం. న.

ఇనుప ముల్లు, సూది మొనవంటి మొనదేలిన యినుప శలాక.

వ. ...ఆరంగ్రాంగిన నూనియ వోలెం దెరలుచున్న జలంబులు గలిగి యాయసకంటక దుస్స్పర్శంబగుచుఁ దటంబున నిశితాసిపత్త్రి వనంబు శోభిల్ల వైతరణి యనుపేరఁ బరఁగిన యేఱును.

స్వర్గా. 18

**ఆయసము** సం. విశే. (అ. ఈ. అ.)

ఇనుముతోఁ జేయఁబడినది, లోహమయము.

సీ. ...గురుతల్పగుం డనల ప్రతప్తమైన -ఆ- అయసాంగనాంగ మాలింగనము సేసి, యైనఁ గోసి కరమునందు మేహనము ధరించి యంబరముఁజూచు చరిగి యేనియును బచ్చి యఘము నిస్తరించు

శాంతి. 1—307

చ. అనిలజు మేని చందమగు నాయసరూపము చూర్ణితంబు సేసిన బలమావనీయుఁడు.

ఆశ్ర. 1-41

**ఆయసరూపము** సం. వి. అ. న.

లోహమయమైన ఆకారము.

చూ. ఆయసము రెండవ ఉదా.

ఆశ్ర. 1-41

**ఆయాతము** సం. వి. అ. న.

ఆగతము, రాక.

క. ...రుక్మి వృథా, యాతాయాస విషణ్ణుఁడై తన పురంబునకు మగుడ నరిగెం జెలుచన్.

ఉద్యో. 4-180

**ఆయాతి** సం. వి. ఇ. పుం.

యయాతి తమ్ముఁడు.

వ. అట్టి నహుషునకుఁ బ్రియంవద యను దానికి యతి యయాతి సంయాత్యాయాత్యయతి ధ్రువులనంగా నార్వురు పుట్టిరి.

ఆది. 3-24

**ఆయామము** సం. వి. అ. పుం.

1. దైర్ఘ్యము, నిడుపు.

వ. ...ఒక్క మహాపర్వతంబు శృంగంబులు...యనేక యోజనాయామ విస్తారంబులు గలిగి మార్గంబున కడ్డపడియుండె.
శాంతి. 6-330

సీ. మహోద్భుతాయామంబు. అను. 4-429; సభా. 1-68.

2. వ్యాపించుట, పఱవు.

వ. ...శాస్త్రవిహిత ప్రమాణోపేతవృత్తాయామంబును. ఆది. 6-4.

**ఆయాసపడు** మి. అ. క్రి. (ఆయాసము + పడు)

శ్రమపడు, కష్టపడు.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట కోర్వమియు.
ఉద్యో. 3-58; శాంతి. 3-330; అను. 2-267

ఆ. ...ఒకట నాయాసపడి యున్నదాని నీరు గోప్రదానవిదులు.
అను. 2-402

శ్లో నవ్యం గాం న పరిశ్రాంతాం దద్యాద్గాం బ్రాహ్మణాయ చ.
సం. భా. అను. 66-58

**ఆయాసము** సం. వి. అ. పుం.

1. శ్రమము, బడలిక.

క. మీ యయ్య మీరు వనవాసా యాసము నిస్తరించి యభ్యుదయమునన్, డాయుట విని ముదితుండై. ఉద్యో. 1-281; శాంతి. 1-89

2 క్లేశము, వ్యథ, కష్టము.

క. దాంతుఁడుఁ బ్రజ్ఞావంతుఁడు, శాంతుఁడు నగువాని మానసం బాయాస, శ్రాంతము గా దెమ్మెయి నిశ్చింతుఁడనై యుండుదును విశిష్టాచారా. శాంతి. 4-381

క. మాయారహితుఁ డహంకా, రాయత్తతఁ జూవె పుట్టువను చెఱఁబడి నానా యాసంబులఁ బడునా, జ్ఞాయుతుఁడై యాత్మఁ డింత చర్చింపు మదిన్. అను. 5-158

8. ఉత్సాహము, పూనిక.

క. అనిన విని పార్థునకు ని,ట్లనియె నినాత్మజుఁడు దుర్బలాయాస క్షే,పనిబంధమ్ములు వలుకక, ఘననిశితాస్త్రములఁ బలుకఁగడగుము నాతోన్. ఆది. 6-86

ఆనంద వారి ప్రతిలో 'దుర్బలాశ్వాసాక్షేప' అని పాఠాంతర మీయఁబడినది. అకాడమి సం. శో.ము-ప్రతులందు 'దుర్బలాశ్వాసక్షేప' అని పాఠముగా నీయఁబడినది. దానికి బలముగా పుట క్రింద

"కిం క్షేపైః దుర్బలాశ్వాసైః శరైః కథయ భారత"

అని మూలమిచ్చినారు. కాని వావిళ్లవారి సంస్కృత భారతమున 'కింక్షేపైర్దుర్బలాయాసైః శరైః కథయ భారత" (ఆది. 186-20) అని యున్నది. ఏ పాఠము గ్రాహ్యమో పాఠకులే నిర్ణేతలు.

**ఆయాసితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

బడలికఁ జెందినవాఁడు, శ్రమమొందినవాఁడు.

వ. ఆవు డజ్ఞాతవాసాయాసితుండగు నతని నాకు ననుసరింప వెరవుం గామింజేసి చేయునది లేక చింతిల్లుచున్నదాన. విరా. 2-215

**ఆయితము** దే. విణ. (క. అయిత, ఆయత. త. ఆయత్తం)

1. సిద్ధమైనది.

క. సమరమునకుఁ దగు ను,ద్యోగమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు మ,త్స్యమహీనాథుఁడు సన్నా,హముసేసెన్ ద్రుపద విభుఁడు నాయితమయ్యెన్. ఉద్యో. 1-49

2 సిద్ధపఱుపఁబడినది.

క. ...శకటంబు లాయితంబు సేయుఁడు మీరల్. మౌస. 182

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ, నొప్పారి తనువగు చప్పరములు ఉద్యో. 1-98

వి.

సన్నాహము, సిద్ధమగుట.

వ అటమున్న నకులుం డొక్క యరదం బాయితంబు సేసికొని యుండుట. కర్ణ. 8-4

వ. వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబులు సేయఁ బ్రవర్తించు పదాతివర్గంబుల సంరంభంబునను. ఉద్యో. 4-186

వ. కర్ణుండు దనమొన యెట్లాయితంబు సేసెఁ గౌంతేయ ముఖ్యసైన్య సన్నాహం బెట్టిది. కర్ణ. 2-148

**ఆయుధము** సం. వి. అ. పుం.

శస్త్రము, ఖడ్గాది యుద్ధసాధనము.

వ. ఆయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలకి యోగ్యస్థల నిరూపణంబునకు నలుదిక్కులుం బరికించి.

విరా. 1-161; కర్ణ. 1-268; శాంతి. 2-880

**ఆయుధవంతుఁడు** సం. విణ. (త్. తీ. త్.)

ఆయుధము ధరించినవాఁడు.

క. శాంతుఁడు గా కని నాయుధవంతుండై కవియు విప్రు వసుధేశుఁడు వేదాంతివయిన హింసించుట, యెంతయు ధర్మంబు శ్రుతులు నిట్లని చెప్పున్. శాంతి. 2-175

**ఆయుధాజీవి** సం. వి. న్. పుం.

ఆయుధముచేత జీవించువాఁడు, శస్త్రాజీవుఁడు, యోధుఁడు.

క. విను మర్థార్జకులను గార్యనిపుణ మానసులు నాయుధాజీవులుఁ ద్యక్కును గల పనుల జనులుఁ గలరనఘా యొక్కిండ్ల వారలైన జనంబుల్. శాంతి. 3-38

**ఆయుధీయుఁడు** సం. వి. అ. పుం.

ఆయుధాజీవి, ఆయుధముచేత జీవించువాఁడు, శస్త్రాజీవుఁడు, యోధుఁడు.

వ. ఆయుధీయ సురక్షితంబైన రాజగృహం బెట్లు సొరనగునని శంకింప వలదు. అర. 2-88

**ఆయుర్వేదము** సం. వి. అ. పుం.

వైద్యశాస్త్రము- ఇది అష్టాంగ పరిపూర్ణమైనది. చూ. అష్టాంగము.

"ఆయుః విందతి వేత్తి అనేన ఇతి ఆయుర్వేదః" ఆయుః పరిమాణమును దెలిసికొనుటకును ఆయువును వృద్ధి పొందించుటకును సాధనభూత

మైన శాస్త్రము. ఇది ఋగ్వేదాథర్వణ వేదములయందు జెప్పఁబడి యున్నది. ఇది ముఖ్యముగా రెండు విభాగములు 1) కాయచికిత్స :- వ్యాధులు రాకుండఁ దీసికొనవలసిన జాగ్రతలు వ్యాధులు వచ్చిన నివారించు మార్గములు ఇందుఁ జెప్పఁబడును. 2) శల్య చికిత్స :- ఇది కేవల శస్త్ర చికిత్స (సర్జరి Surgeory) కు సంబంధించినది. అష్టాంగము లీరెంటియం దంతర్భూతములు.

క. అనిశము సేవింతురె ని, న్ననఘా యష్టాంగమైన యాయుర్వేదంబున గడుకులైన వైద్యులు. సభా. 1-88

**ఆయువు** సం. వి. ఉ. పుం.

1. ఆయుర్దాయము, జీవిత కాలము, ఆయుస్సు.

(ఇది సాంతమైనపుడు 'ఆయుస్సు' అని యగును. అప్పుడది నపుంసకలింగము)

శరీరేంద్రియ సత్త్వాత్మ సంయోగోధారి జీవితం
నిత్యగశ్చానుబంధశ్చ పర్యాయైరాయు రుచ్యతే-

—చరకము- సూత్రస్థానము.

శరీరము, ఇంద్రియములు, సత్త్వము (మనస్సు) ఆత్మ(జీవుఁడు) వీని కలయికయే ఆయువు. వీని యెడబాటు మరణము.

సీ. వీని యాయువు దెగటాఱె. శల్య. 2-242

సీ. అవయవ లక్షణం బాయుఃప్రమాణంబు.

విరా. 1-263; శాంతి. 3-382

2. ఊర్వశీ పురూరవుల కొడుకు, నహుషుని తండ్రి. ఆది. 3-92

3. మండూక నాయకుఁడు. చూ. వివరము. అర. 4-335

**ఆయుష్మంతుఁడు** సం. విణ. (త్. ష్మతీ. త్.)

దీర్ఘాయువు గలవాఁడు, చిరకాలము బ్రదుకువాఁడు.

వ. దుర్యోధనాదు లాయుష్మంతులగు వారకాక యనిపల్కె.

ఉద్యో. 2-146

**ఆయుష్మత్త్వము** సం. వి. అ. న.

ఆయువు కలిగి యుండుట, చిరకాలము బ్రతికియుండుట.

క. శ్రీమత్త్వాయుష్మత్త్వ సుధీమత్త్వప్రద కటాక్ష. ద్రోణ. 4-1

**ఆయుష్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆయుర్వృద్ధికరము.

సీ. ఇక్కథ...పుణ్య మాయుష్యము భూతిప్రదము. అను. 1-382

ఆయుష్యం బతిపావన వస్తుసముదాయంబు. ఆది. 8-11

వి. అ. న.

దీర్ఘాయుర్దాయము, చిరకాలము బ్రదుకుట.

మ. జనులు నిత్యాయుష్యులే చెప్పుమా.

శాంతి. 1-225; ఆర. 8-260

వ. నీ యాయుష్యంబునం దర్థం బిక్కన్యక కిమ్మనిన రురుం డట్ల చేయుదు ననీ తన యాయుష్యంబునం దర్థం బక్కన్యక కిచ్చిన. ఆది. 1-150

(ఇక్కడ శేషించిన ఆయువు అని స్ఫురించును)

**ఆయోజితము** సం. విణ. (అ. ఆ. అ.)

కూర్పంబడినది, చేర్పంబడినది.

క. ఛాయావుల నియతవృత్తి మనో యంత్రణ బొమల నడుమ నూల్కొలిపి విచేష్టాయిత శరీరుండై మూర్ధాయోజితములుగం జేసి యత్తంజేర్చెన్. శాంతి. 4-165

**ఆయోధనము** సం. వి. అ. న.

యుద్ధము.

క. ఆ యిరువురు నొకతలయై, యాయోధనమునకు నడచునట్టిద యేనిన్, వేయేల మనకకా దెదుర్రై యేతైఱం దాఁక వారునకై నను వశమే. ఉద్యో. 2-151

**ఆర** అవ.

ఆరా - సంబోధనమునందు బహువచనమున వచ్చు ఆగమము.

క. మునులార నన్న విధియేమని పుట్టించె నట్టు లయ్యెడుఁగాక.

ఉద్యో. 3-315

చ. నృపులార చూచితిరె కల్య. 2-294; ఆర. 5-177

**ఆరంభకుఁడు** సం. వి. (అ. భికా. అ.)

ఉపక్రమించువాఁడు. యత్నించువాఁడు.

క. సర్వారంభక. భీష్మ. 1-805

**ఆరంభణము** సం. వి. అ. న.

ఆరంభము, ఉపక్రమము.

క. బహు యజ్ఞారంభణ మాచరింపు మఖిలహితముగన్.

శాంతి. 1-105

**ఆరంభము** సం. వి. అ. పుం.

1. ఉపక్రమము.

శా. ఆకుంఠక్రియాజ్ఞాన మాశ్యారంభ ప్రతికూలవానరహితంబు.

విరా. 2-209; ఉద్యో. 4-66

2. ఉద్యమము, ప్రయత్నము.

క. ...అరయ విత్తంబులు పురుషారంభాయత్తములె.

శాంతి. 4-378

క. ఆరంభ రహితుఁ బొందునె, యారయ సంపదలు హీనుఁడయ్యును బురుషుం, డారంభశీలుఁడయి యకృతారంభుల నోర్చు నెంత యధికుల నయినన్. సభా. 1-122

3. పని, కార్యము.

క. మీరేమి సేయుదురు దైవారంభముగాక శుభము నశుభంబును సంసారులఁ దనతన తటిన నివారణ బొందంగ మాన్పవచ్చునె వానిన్. విరా. 2-227

క. నారాయణ గోపాలుర, భూరిపరాక్రములఁ గురువిభుఁడు గొన సంగ్రామారంభ రహితు నన్నుం, గోరికొనుట నీకు మేలగునె తలపోయన్. ఉద్యో. 1-85; శాంతి. 6-318

వ. అని యందఱుఁ దమలో విచారించి యధర్మారంభంబునకు సుముఖులు గాకయున్నఁ గద్రువ కోపోద్దీపిత ముఖయై ఆది. 2-35

**ఆరంభించు** సం. స. క్రి.

మొదలుపెట్టు.

క. ...కిరాతబలము సమగ్రాటోపమునఁ గవిసి వివిధ ధనాపహరణ మాచరింప నారంభించెన్. మౌస. 1-184

**ఆరక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎఱ్ఱనైనది.

సీ. శ్యామాంగు నారక్తజలరుహనేత్రు. అర. 7-456

**ఆరగించు** దే. స. క్రి.

తిను, భుజించు.

సీ. ...పుండరీకాక్షుండు, దమ్ముండుఁ దాను నుత్సవ మెలర్ప.

తే. సరసరంజక మహనీయ సంప్రయోగ, మగు చతుర్విధహృద్యాన్న మారగించె. ఉద్యో. 3-229

ఆ. ఏమి సేయఁ దలఁచితేని నీ వక్కట, యారగించి చేయుమయ్య యనుడు. ఆశ్ర. 1-54; ఆశ్ర. 1-44; అర. 3-108

**ఆరచితము** సం. విణ. (అ. ఆ. అ.)

చక్కఁగా నిర్మింపఁబడినది.

వ. హిమపదచల కందరా రచిత రత్నవేదికా తలంబున సింహాసనాసీనుండయి. ఆది. 7-270

**ఆరటపెట్టు** దే. స. క్రి.

తపింపఁజేయు, బాధపెట్టు.

చ. ...విషమెత్తి క్రోలి యేది యంగము వారటపెట్ట నన్యుం, గినిసిన యట్లు మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండునందనులకుఁ జెట్టవై హృదయతాపము వచ్చినఁ బల్కె దొండులన్. ద్రోణ. 4-209

**ఆరటము** దే. వి.

1. పరితాపము, సంతాపము, బాధ.

లయగ్రాహి :...వారలును బోరఁబడి నెత్తురులఁ, గూరటఁ గరం బెడఁద నారటము సేయన్. స్త్రీ 2-6

తే. ఎగ్గతంబునఁ గారగ్గిఁ గాలెనని యనాథయై దీనికి నంతరంగ, మలఁదురక తల్లడిల్లక యారటమున, నుడుక కలమటఁబడక

యెట్లుండు చెపుము. ఆ|శ. 2-168

2. లభింపని వస్తువునకై పొందు బాధ.

సీ. తనికెడు నారటంబున నంతకంతకు, వెమ్మచు నునికికి విడుమర యును. విరా. 2-815

**అరణేయము** సం. వి. అ. న.

1. సంస్కృత భారతమునందలి 100 పర్వములలో 48వ పర్వము. ఆది. 1-32

2. అరణి వృత్తాంతము, అర. 7 గద్యము.

**అరణేయుఁడు** సం. వి. అ. పుం.

అరణియందుఁ బుట్టినవాఁడు, శుకుఁడు.

వ. ...అయ్యారణేయుండు నిజాశ్రమంబున నున్న తండ్రిపాలికిం జనుదెంచి. శాంతి. 6-257

**అరణ్యకము** సం. వి. అ. న.

అరణ్యమునందుఁ జదివఁదగిన వేదభాగము. చూ. వేదము.

తే ......అతఁడారణ్యకోద్గీతమైన వాక్యసంచయము విమ్మగులిచి పఠించె నధిప. శాంతి 6-632

**అరణ్యపర్వము** సం. వి. న్. న.

మహాభారతమునందలి మూఁడవ పర్వము. ఆది. 1-39

చూ. మహాభారతము.

**అరణ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

1. అడవికి సంబంధించినది.

సీ. అరణ్యదేశ సంచారశీలి. శాంతి. 8-177

వి. అ. న.

సంస్కృత భారతమునందలి 100 పర్వములలో 78వ పర్వము. ఆది. 1-32

(పాండవారణ్య గమనమును గూర్చిన కథ)

**అరబ్ధము** సం. విశే. (అ. ఆ. అ.)

అరంభింపఁబడినది, మొదలు పెట్టఁబడినది,

క. కారణముల వలనఁ గృత,ప్రారంభంబైన కర్మ మంచితగతికిం, గారణమే కర్తవ్యత్వారబ్ధ క్రియల యట్టు లనఘచరిత్రా.
కాం. 5-287

క. ఆక్రంద,దారవములుడిగె బంధు జ,నారబ్ధములైన యనునయా లాపములన్.
ఆశ్వ. 2-159

**ఆరభ్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.)
ఆరంభింపఁబడుచున్నది.

సీ. ఆరభ్యమాణ మహాధ్వరు మనుచరిత్రు.
ఆది. 8-82

**ఆరయు** దే. స. క్రి. అరయు (క. ఆరయు. త. అరాయ్)
1. వెదకు

ఉ. ... కీచకుఁ డహంకృతి ముంగలిగాఁగ మండపా, భ్యంతరభూమిఁ జొచ్చి తతియంజని యారసి సెజ్జ గాంచి య, త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలుసాఁచినన్.
విరా. 2-331

ఉ. ఆలురుహాంబులం గలయ నారసి చొచ్చి యొకండు నాళసూ త్రంబున నున్న యింద్రుఁ గని.
ఉద్యో. 1-188; మౌస. 172; ఉద్యో. 3-291

క. ...దాని యగ్రవిటపం బెక్కి నీరారయుచున్నంత ననతిదూరం బున
ఆది. 6-171

2. ఆలోచించు, విచారించు, పరిశీలించు.

క. భూరి భవత్కారుణ్య, క్షీరాంబుధి నాదు తుచ్ఛ చిత్తంబున విస్తార మహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ.
విరా. 1-20

క. వారెల్లను భవదీయ, స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను, న్నారమని పలుకుదురు నిజ,మారయఁగా నట్లు కాదె యది జన నాథా.
ఉద్యో. 2-26

ఉ ...భూవర రెండు దెఱంగులందు నీ, కారయఁ బథ్య మేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా.
ఉద్యో. 3-284

చ. అరులను మిత్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మ కృత్య,మ
వ్వెర వతిదుర్లంభంబు. శాం. 3-227

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి, లో నారసి
మేలు నా. ఆది. 1-25; ఆది. 6-236

3. కాపాడు, కనిపెట్టి చూచు.

చ. ... నీ గురువుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు సె,ప్పె నటుల
భక్తిమై నడవు పెంపెసలారఁగఁ గూడు గూర చం, దనకుసుమాదు
లున్ నడపి తప్పక యారసి గారవింపుమా. విరా. 1-252

క. దయ వీవే సుద్వాదితు, లయిన సుతులు దమ్మెంటుంగునంతకు
భీష్మం, డయనయశాలి సమర్థుం, డయి చేకొని రాజ్యభార
మారయుచుండున్. ఆది. 4-250

4. యోగక్షేమములు విచారించు.

క. ...కిమ్మీరవైరి యేన కలఁచెదన్, రూపు సెడఁగ నిమ్మోనలను,
భూపతి నరయంగ నీవ పొమ్మనియె నృపా. కర్ణ. 3-27

క. ద్వారవతి నుండియును నిట, యారసియుండునది దానవాంతక
లోకా,ధార సమీపస్థుండవ, దూరంబున నుండియుం జతుర్భుజ
మాకున్. సభా. 2-82

5. కనుఁగొను, తెలిసికొను.

వ, ప్రహ్లాదుండొక్క యెడ నొక్కరుండ యాసీనుండై యుండ నింద్రుం
డతని యంతరంగం బారయ వేఁడి చేరంబోయి.

శాంతి. 4-369; శాంతి. 1-215; శాంతి. 5-342

ఉ. అంబురుహాక్షి వచ్చు తెర వారయఁ గీచక ముఖ్యుఁ డప్డు దెల్లం
బుగఁ జూచి. విరా. 2-113

6. పరీక్షించు, శోధించు.

క. అరయ నెందును గౌరవ,భారం బెడలంగనీక పాతివ్రత్యా,చారము
మై వర్తింతురు, సైరంధ్రీ జాతివారు సౌజన్యమునన్.

విరా. 1-112

ఉ. అఁడుదనంబు నిక్కమున నారసి చూచిన లేదు పుంస్త్వముం, బోడిమి దప్పియున్నది. విరా. 1-238

చ. అనవుడు బ్రాహ్మణ ప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ, న్మనమున వేడ్కవుట్టి నరనాయక వచ్చితి నేను ధర్ముఁడన్. అశ్వ. 2-95

7. అడుగు, ప్రశ్నించు.

క. మీ రెఱిఁగినఁ జెవు డితని, పే రెఱుఁగనియట్టులైనఁ జెంపారంగా, జేరంజని యల్లన యొకఁ, డారసి యెఱుఁగంగ వలయు నను సమయమునన్. విరా. 1-260

8. పాటించు, లెక్కచేయు.

చ. అన విని యింద్రుఁ డిట్లనియె నగ్నికి నిమ్మరివోయి చెప్పు మ,ర్జున పతితోడ నా పలుకు సమ్మతిఁజేయక తక్కనేని నేఁ, బనిచెద వజ్రమున్ జమునిపాలికి నన్నరనాథు వేగమే, యనుచుట కింత యొల్లదమె యాతనికిన్ మనయాజ్ఞ యారయన్. అశ్వ. 1-81

**ఆరవము** సం. వి. అ. పుం.

ధ్వని.

తే. కాకఘూకారవస్ఫూర్తి. విరా. 1-162

**ఆరా** అవ

ఆర, సంబోధనమునందు బహువచనమున వచ్చు రూపము.

వ. ...వారలెచ్చోట నుండి రచ్చోట యేను బుణ్యలోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లిట్లనిరి. స్వర్గ. 15

మహిత బోధనులారా. స్వర్గ. 87

సంయమీంద్రులారా. స్వర్గ. 89

**ఆరాధకుఁడు** సం. విశే. (అ. ధికా. అ.)

ఆరాధించువాఁడు, పూజించువాఁడు.

వ. ...లింగమునందుఁ బూజించుట యర్చయందారాధించుట కంటె

ననేక గుణంబు లెక్కుడు గావున లింగార్చనపరులగు వారల నర్చా
రాధకుండ వగు నీకు నెట్లు జయింపవచ్చు.

ద్రోణ. 5-418; శాంతి. 3-1

**ఆరాధనము** సం. వి. అ. న.

1. **పూజ** (దేవతాదులకు)

వ. అని పూని యీ దృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం ప్రకాశించుటయు నొక్కయారాధన విశేషంబు. విరా. 1-81

వ. కృష్ణుండు భక్తపరతంత్రతం జేసి యత్కృత్త చరితుల యారాధ నంబునకు భాజనంబయి భోగమోక్షంబులు గరుణామయ కటా క్షంబుల నొసంగు. శాంతి, 4-206

2. సంతోష పెట్టుట, తృప్తిపఱచుట, గౌరవము.

వ. (పాంచాల మహీవల్లభు పంచిన భూదేవుఁడు) వారివారి మందిరం బులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యో ధను సందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృత రాష్ట్రు నభిముఖుం గావించి. ఉద్యో. 1-280

**ఆరాధనీయము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆరాధింపఁదగినది,

సీ. ...నారాయణుండను మునీంద్రుఁ, బదరికాశ్రమముల భక్తిమెఁ గొలిచి నారదుఁ డెద్ది సిద్ధికారాధనీయ మానతి యిమ్మన్న.

శాంతి. 6-849

**ఆరాధించు** సం. స. క్రి.

1. సంతోషపఱచు.

వ. అమ్మనివారి చిత్తం బారాధించి యర్జునుండు. ద్రోణ. 2-820

వ. యుధిష్ఠిరుండు వరిష్ఠ ప్రభువుల చిత్తంబు లారాధించి సర్వజన సమ్మతంబుగా సమరోత్సాహంబు సేసి.

ఉద్యో. 4-115; ఉద్యో. 2-106; ఉద్యో. 3-282

2. అర్చించు, పూజించు.

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించిన. ఉద్యో. 1-171

వ. ఋగ్యజుస్సామంబుల నాత్రిధాముం బ్రస్తుతించి మనంబుల నారాధించితిమి. శాంతి. 6-416; ఉద్యో. 2-262

తే. యజ్ఞశీలు నారాధించునట్టి విష్ణు డిష్టదాయి. శాంతి. 4-222; శాంతి, 1-247

3. నుతించు, స్తోత్రముసేయు.

వ. పార్థివుండున్నుం దదనురూపంబులగు నాలాపంబుల నారాధించినం బ్రసన్నుండై సనత్సుజాతుండు. ఉద్యో. 2-106

వ. అని మఱియు నత్యంత వినయవాక్యమ్ముల నారాధించుచుండె నిట్లు కృతాహారుండైన వారికి. ఉద్యో. 3-222; శాంతి. 6-269

4. అనుగ్రహము సంపాదించు.

సీ. ప్రబలుని జేరి యారాధించి యాతని సేనతోడుగ నరిఁ జెఱుప వలయు. శాంతి. 3-86

5. కొలుచు. సేవించు

క. విను భక్తియు వెఱపు గలిగి, యనుజన్ములు పెద్దవాని నారాధింపన్, జనవర యతండు దమ్ములఁ, గొనియాడన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై ఆను 4-182

సీ. అతని నారాధించు టస్మదీయ -ఆ- చిత్తముపకుఁ బ్రియము. ఆశ్ర. 1-19

**ఆరాధితుఁడు** సం. విశే. (అ. ఆ. అ..)

ఆరాధింపఁబడినవాఁడు.

క. వారలు దుర్యోధనుచే, నారాధితలు. ఆర. 1-279

**ఆరాధ్య** సం. విశే. (అ. ఆ. అ.)

ఆరాధింపఁదగినది, పూజ్యురాలు.

క. లోకోత్తరచరితుండగు, నాకావ్రతనూజ నీకు నారాధ్యమనేఁ, బ్రాకట భూసురకన్యక,నీ కట్టినమైల గట్టనేర్తునె యనినన్. ఆది. 3-185

**ఆరాధ్యము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆరాధింపఁదగినది, పూజింపఁదగినది.

క. ...భారతమను పేరఁబరఁగు పంచమవేదం, బారాధ్యము.
విరా. 1-17; శాంతి. 6-849

**ఆరాధ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పూజింపఁదగినవాఁడు, పూజ్యుఁడు.

క. లోకారాధ్యుఁడు సెప్పె. శాంతి. 6-588; విరా. 1-32

క. మీరలు నా పితృదేవత, లారాధ్యులరేను మీకు నాత్మజుఁడ.
ఆది. 2-148

**ఆరామత** సం. వి. ఆ. స్త్రీ.

ఆరామత్వము, రమించుట.

ఆ. వేత్తలైనవారు వివరించి యన్యోన్య, బోధకత్వమునఁ బ్రఖ్యాత సౌఖ్యు, లగుచు సంతతము శివారామతా నిరూఢాత్ములై చరింతు రధిపముఖ్య. అను. 5-400; శాంతి. 3-484

**ఆరామము** సం. వి. అ. పుం.

1. ఉపవనము, తోఁట, ఉద్యానవనము.

వ సింహబలుండు......మనోవేదనాపనోదనార్థంబు మందిరారామ భూమికిం జని. విరా. 2-302

2. వనము.

వ. అది మహోవాత నిహత విటపంబైన యారామచందం బయ్యె.
కర్ణ. 2-279

3. క్రీడనము, విహరణము.

క. కామక్రోధాద్యతులగు, నీమానసవికృతు లుడిపి యేకాంతగుహా రాముఁడవై నిను వెదకుట, సూ మేలు. శాంతి. 4-30

**ఆరాముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

విహరించువాఁడు.

క. ధర్మారాముఁడు సంతతధర్మసఖుఁడు. శాంతి. 5-285

**ఆరావము** సం. వి. పుం.

ధ్వని, మ్రోత.

భుజాస్ఫాల నారావములతోడ. కర్ణ. 1-78

**ఆరికబియ్యము** దే. వి. (పాఠాం)
చూ. అరుగబియ్యము. అను. 3-194

**ఆరు**[1] దే. అ. క్రి.

1. కలుగు, జనించు.

ఉ. కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁ గయ్యముసేయఁ గర్ణుఁ డా, భూరమణున్ వడిం గదిసి భూరిశరంబులు మేన నింప నొ్వ్వాటుట యుం దొలంగె నతఁ డాహవ రంగమునందు లేఁడు కర్ణ. 3-21

క. కౌరవులు సేయు నవమతి, కారణముగఁ గోపమెత్తు కర్ణుని వద వాం,భోధువామునఁ గనుఁగొన శమ, మారున్ పావకముగాక యుంతవ యుద్దిన్. శాంతి. 1-13

(భీముఁడు గాంధారితో)

సీ. తలపోసి చూడంగ ధర్మమయ్యె నధర్మమయ్యె నేఁ బ్రాణభయంబు కతన, నట్ల సేసితిఁ గృపయారత నైరింపుము. స్త్రీ. 1-157

2. ఒప్పు, ప్రకాశించు.

మ. ధవళాశ్వంబులఁబూని కేతన కపీంద్రస్ఫూర్తి మార్తాండమూర్తి విడంబింపఁగఁ జక్రగాండివధరుల్ దేజోమయాకార వైభవ మారం దనపై వెలుంగ నతిదీప్తంబైన తేరొప్పె. ద్రోణ. 1-124

తే. ధరణి దుర్లభమగు నవదాత వర్ణ,మారఁ గలుగుట నర్జునుఁడంద్రు నన్ను. విరా. 4-146

చ. పరమ విపీతిమై నెఱిఁగి బాంధవమారఁగ నల్ల నిట్లనున్, గరుఁ డుఁడు అను. 1-209; అను. 5-528; అను. 5-428

3. అతిశయిల్లు

మ. తనకోదండము ఖండితం బగుడుఁ గ్రోధంబార మందాకినీ, తన యుం డప్పు విరా. 5-178

క. ద్రుపద నృపాలుని దవళా,తపత్ర మస్త్రంబు లెచొటుఁ దాఁకక తెగియార్రి పొలిచె శారదచంద్రుం, డుపమాపాత్రంబుగాఁగ నుర్వి

యను దివిన్. త్రి. 2-147

4. నిండు, పూర్ణమగు.

క. అని తను మల్లసమాటకుఁ, గినిసి యినతనూజుఁ డేమ గ్రిడి నిచట మా,ర్కొను వీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలచి యనుచుఁ గవిసెం దెలుచన్. విరా. 5-182

క. వినుము తెలియంగ శ్లేష్మం,బను దోషం బారఁ బరఁగి యవయవములు జా,డ్యనిరూఢంబులుగాఁ జే,యును లోపలి బయలునెల్ల నొయ్యన కప్పున్. అశ్వ. 1-171

5. తనియు, తృప్తినొందు.

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి. విరా. 1-30

క. మున్నును నేఁ గారణముగ, నన్నియిడుమ లనుభవించి రనుజులు వీరిం, గన్నారఁ జూతుఁగాని జ,గన్నుత భీష్మునకుఁ గోలుగానీఁ జాలన్. భీష్మ. 3-279

ఉ. నా మనమార దీనిఁ గని నందముఁ బొందితి నింత సాలు. సౌప్తి. 2-99

6. తీఱు, ఫలించు.

క. నారాయణ సౌహార్ద్రో,దారత్వవిభూతి మున్న తనకుఁ గలిమి న,న్నారాయణుని మనోరథ, మారం బూరించె శంకరాంబికల కథన్. అను. 4-414

(సందర్భానుసారముగ దీని తుమున్నంతరూపము నిశ్శేషముగా, నిండుగా, చక్కఁగా, బాగుగా, సమృద్ధిగా మొదలగు నర్థములనిచ్చును.)

ఆరంగన్ :- (1) నిశ్శేషముగా.

సీ. ఉదధిలో నున్న యత్యుగ్ర నిషాదుల నారంగ మ్రింగిన ఘోరవీర వరుఁడు. ఆది. 2-83

2. ప్రియముగా, సంప్రీతిగా.

క. ద్వారవతి కేగి యర్జునుఁ, డారంగ సుభద్రఁ బెండ్లియై వచ్చి. ఆది. 8-16

ఆరంగూరు, ఆరఁగూరు. 1. నిండుగా.

ఉ. ఇట్టుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నున్నటు లారఁగూరునే
(నిండుగా నెఱవేఱు) ఉద్యో. 2-52

2. బాగుగా.

తమ్మునిదెస కూరిమి నారంగూరిన వగపెంపున.
ద్రోణ. 2-137; శాంతి. 3-346
(బాగుగాఁ గలిగిన) శల్య. 1-337; స్త్రీ. 2-150

3. పూర్తిగా

పౌరులు వంత నారఁగూరి. ఆశ్ర. 2-13

ఆరంగ్రాగు; ఆరఁగ్రాగు పూర్తిగా బాగుగా

వ. ...ఆరంగ్రాఁగిన నూనియవోలెం దెరలుచున్న జలంబులు గలిగి.
స్వర్గ. 18

ఆరంబండు; ఆరఁబండు 1. పూర్తిగా, బాగుగా

ఆరఁబండిన పండ్లుగని. శాంతి. 1-160

2. సమృద్ధిగా.

తే. ...ఉత్తర కురుభూము లారఁబండియున్నయవి. ఆశ్వ. 4-265

(ఇది కొన్నిపట్ల నర్థవిశేషము లేకయుఁ గొన్నిపట్ల నర్థవిశేషము కలిగి యుఁను గొన్ని పదములతోఁగలిసి శబ్దపల్లవమగును)

పొంగారు = పొంగు. ఉద్యో 4-206; తనరారు = తనరు విరా. 1-169; చెలువారు = చెలువొందు. ద్రోణ. 2-187; ఎసలారు = అతిశయించు విరా. 2-86; తెగటారు = చచ్చు, నశించు. శల్య. 1-39

ఆరు[2] దే. వి.

రోమావళి, నూగారు.

సీ వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు దేరని పళులలో నారు నిగుడ. విరా. 1-245

ఆరుగ దే. వి.

ధాన్యవిశేషము, అరిక.

క. ఉఅవగు నారుగపంటలు, గొలియల పాడియును దలచగుం బురు
షులకుం, దెఅవల చుట్టము లయ్యేఁగ, రెఅచియ భుజియింతు రర్థి
నెల్ల జనంబుల్. (ఆరిక అని పాఠాం) ఆర. 4-295

**ఆరుగబియ్యము** దే. వి.

అరుగ ధాన్యము నుండి వచ్చిన బియ్యము- ఆరిక బియ్యము.

ఆ. పూరి పంటఁప్రాలు నారుగబియ్యంబు, జంబువున ఫలంబు శ్రాద్ధ
కృతికిఁ, గావు తుమ్మ నేద్వఁ గాదు శ్రాద్ధక్రియాచరణ సమయ
ములఁ బ్రశాంతి వలయు. అను. 3-194

(ఆరిక బియ్యము — పాఠాం)

**ఆరుణి** సం. వి. ఇ. పుం.

ధృతరాష్ట్రుని సర్పజాతివాఁడు. ఆది. 2-212

**ఆరూఢ** సం. విశ. (అ. ఆ. అ.)

1 అధిరోహించినది.

క. మద్ర రాజపుత్త్రి పతితోడన చితారూఢయై యగ్నిశిఖల నధిగత
ప్రాణయయ్యెఁ. ఆది. 5-146

2. చేర్పఁబడినది, కూర్పఁబడినది. అను. 3-209

**ఆరూఢత** సం. వి. ఆ. స్త్రీ.

నిరూఢి.

క. ఘోరాస్త్ర శస్త్రవిద్యల, నారూఢత మిగుల నిపుణులైరి కుమా
రుల్, మీరలు వీరల విద్యాసారము నను చెలుఁగ వలయు భవ
దీయ సభన్. ఆది. 6-8

(ఇది అకాడమి సం.ము ప్రతి పాఠము) చూ. ఆరూఢము.

**ఆరూఢము** సం. విశ. (అ. ఆ. అ.)

1. రూఢియైనది.

క. వ్యాసాది మునిప్రోక్త మహాసందర్భాప్రమేయ తారూఢ గుణో
ల్లాసా. ఉద్యో. 2-388

2 మిక్కిలి ప్రసిద్ధము.

క. ఆరూఢయశః పరమోదారా. శాంతి. 6-93

3. పొందింపఁబడినది, చేర్పఁబడినది.

క. మేరువు మణులును, వారిధి వారికణంబులును నెన్నవచ్చునె గంగా,స్ఫార గుణంబులు దగు సం,ఖ్యారూఢంబులుగఁజేత యతుల వివేకా. అను. 2-122

4. సంప్రాప్తము, పొందఁబడినది.

వ. అట్టి విచిత్రవీర్యు నారూఢయౌవనుం జూచి. ఆది. 4-197

5. ఆరోహింపఁబడినది, ఎక్కఁబడినది (రథము మొ.)

వ. తొల్లి తారకాసుర సంగ్రామంబున నింద్రారూఢం బయినదాని నింద్రునివలన వసువనురాజు వడసె వాని వలన బృహద్రథుండు వడసె నని తద్దివ్యరథ ప్రభావంబు సెప్పుచు. సభా. 1-215

వి. అ. న.

ఆరోహణము (వాహనాదులు)

క. ఘోరాస్త్ర శస్త్రవిద్యల, నారూఢములందు నిపుణులైరి కుమారుల్. ఆది. 6-8

(ఇది ఆనందవారి పాఠము. అకాడమి సం.ము పాఠము ఆరూఢత- చూ. ఆరూఢత)

ఆరూఢుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

1. అధిరోహించినవాఁడు, ఎక్కినవాఁడు.

అనేక యోధవీరులు వివిధ వాహనారూఢులై. విరా. 3-149

2, పొందినవాఁడు.

క. వారలు లింగాధిష్ఠా,నారూఢుంగా నొనర్చి యర్చించిరి శ,వ్యా రాధనపరులై మును, గౌరీపతి వతులవినియమకల్పన వెలయన్. ద్రోణ. 5-417

ఆరూఢి సం. వి. ఇ. స్త్రీ.

నిరూఢి.

మహాస్రగ్ధర :- కంఠ త్రుటన విలసనారూఢి నవ్విప్రుఁ డొప్పెన్. పాప్తి. 1-189

**ఆరెకుఁడు** వై. వి. (సం. ఆరక్షః, ఆరక్షికః ప్రా. ఆరక్ఖో పా. ఆరక్ఖికో)

గ్రామరక్షకుఁడు, తలారి

వ. అయ్యాశ్రమంబులో డాఁగినవారి వెనుదగిలి వచ్చిన యారెకులమ్మునిం గని రాజధనాపహారులైన చోరులు నీయొద్దన పాటిరి. ఆది. 4-261

**ఆరోగ్యము** సం. వి. అ. న.

రోగము లేకపోవుట, నీరోగము, స్వాస్థ్యము.

క. శ్రీవాగ్విభవారోగ్య, ప్రావీణ్య ప్రాభవానుభావ మహితపౌ భాగ్యపహా పదస్మరణ. ఉద్యో. 3-1

**ఆరోపించు** సం. స. క్రి.

ఆరోపణము చేయు.

వ. అచ్చితియం దాశవంబు నారోపింపం బనిచి. మౌస. 1-146

**ఆరోపితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆరోపింపఁబడినది, చేర్పఁబడినది.

ఆ. అగ్ను లాత్మయంద యారోపితములుగఁ జేసి. శాంతి. 6-272

**ఆరోహకుఁడు** సం. విణ. (అ. హికా. అ.)

అధిరోహించువాఁడు, ఎక్కెడివాఁడు.

గజారోహకులు. భీష్మ. 1-267; ద్రోణ. 1-280

**ఆరోహణము** సం. వి. అ. న.

అధిరోహించుట, ఎక్కుట.

వ. ...రథారోహణంబు సేసి. విరా. 4-49; శాంతి. 4-140

**ఆరోహము** సం. వి. అ. పుం.

ఎక్కుట

వ. ...తపోదానధర్మ శమ దమ రహితులైన జనులకది దురారోహణంబు అర. 3-95

**ఆరోహించు** సం. స. క్రి.

ఎక్కు.

వ. స్వర్గం బారోహించి యెచ్చెట్టి నెలవుల నిలిచిరి. స్వర్గ. 2

**అర్చీకపర్వతము** సం. వి. అ. పుం.

చ్యవనుని తపోమహత్త్వము ప్రకాశించు ఒక కొండ. చూ. అర. 3-197

**అర్చు**[1] దే. అ. క్రి. అఱుచు

1. అఱచు, బొబ్బవెట్టు, ఘోషించు.

చ. ...త్రిగర్తు లెంతయున్, రయమున గోవులంబొదివి రక్షకులొక్కట నార్చి తాఁకినన్, భయదమహాస్త్రశస్త్రపటుపాతపరంపరఁ దుష్కి యుద్ధతిన్. విరా. 3-186

ఉ. ఆతఁడు ఖండనం బనిన నార్చిన మూరెడునేర్చు. ఉద్యో. 2-225

క. కలయ నసిముసలదండం, బులు గొని కాంపిల్య నగరమున జను లెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బల సుభటులఁ బొడిచి రాజిఁ బడలు వడంగన్. ఆది. 6-71; కర్ణ. 3-274

2. అపహసించుచుఁబలుకు.

క. వసులని యార్చుచు మము న, ల్లసమాడిన ధర్మహీనులను నృప ధర్మం, బెసఁగఁగ నేమిదె యివ్వుడు, వసులని యార్చెదము మగుడ బంధుద్రోహీ. శల్య. 2-280

శ్లో. గౌర్గౌరితి పురా మంద ద్రౌపదీ మేకవాససమ్
యత్సభాయాం హసన్నస్మాం స్తదా వదసి దుర్మతే.
తస్యాపహాసస్య ఫల మద్యత్వం సమవాప్నుహి. శల్య. 60-4-5

**అర్చు**[2] అరుచు. దే. స. క్రి. (√అడు) అడఁజేయు

1. చలింపఁజేయు, కదలుచు, విదలించు.

(భీష్మపాటు చూచి)

తే. కాలుసేయార్చుటలు లేక కన్నుఁగవల, నశ్రులొలుకంగఁ జిత్తంబు లడలఁ బాండుసూనులఁ జూచుచుండిరి గాని యించుకయును గడఁగరు మనవారు గయ్యమునకు. భీష్మ. 3-416

వ. ఇవ్విధంబున వివిధ విశిఖజాలంబులఁ గాలుసేయార్పరాకుండఁ గప్పి కర్ణ. 2-291

తే. అపుడు సేయార్చి శౌరిలీలఁ గొందఱు. కర్ణ. 2-229

2. ప్రవర్తిల్లఁ జేయు.

క. రాగ విరాగతల హృదయ రంగమునకుఁ గేళీ గతులఁ దెచ్చి యార్చుచు, యోగి యనుభవించు శాంతి. 5-584

3. నర్తింపఁ జేయు, ఆడించు.

క. నేర్పరి పెక్కు విధంబుల, నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడు చందం, బేర్పడఁ గాన్పుము. శాంతి. 1.283

చ. పలవ దాయుధ మార్చుట భీష్మ. 1-148

చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ మిముఁబట్టి యార్పఁబో, మ్మలక్రియ నాడుచుండుదురు. ఉద్యో 2-11

4. ద్యూతాదులను ఆడజేయు, ఆడించు.

చ మది మది నుండ నీ సుతుఁడు మంత్రులు సౌబలు జూద నూర్చి. ఉద్యో. 3-280; కర్ణ. 3-197

5. పలికించు, చెప్పించు

సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు మాటలఁ దగు మఱు మాటలార్తు. విరా. 2-310

అర్చు³ అఱుచు³ స. క్రి. అఱఁజేయు

1 ఉపశమిల్లఁజేయు.

వ. ...నీవిఁక దప్పి యార్చికొమ్మ... కర్ణ. 3-179 మౌస. 1-155

2. చల్లఁబఱచు, చల్లార్చు.

వ. తన మనంబున దరికొను తృష్ణానలం బార్చ నొరు లడ్డంబు నొరమిం జేసి... ఉద్యో. 1-377, ఉద్యో 1-222

3. (దీపాదులను) పోఁజేయు, చల్లార్చు.

మ. ...ధూపాల యేపారి మం,దునె యాఱంగల దీపమ ట్లతఁడు మఁడుంగాక యే నార్చెదన్. కర్ణ. 3-49

అర్జకుఁడు సం. విశ. (అ. ర్జికా. అ.)

సంపాదించువాఁడు, గడించువాఁడు.

క. విను మర్థార్జకులను గ్యాశ్యనిపుణ మానసులు నాయుధా జీవులు
దృక్కును గల పనుల జనులుఁ గలరు, శా. శి. 3-38.

**ఆర్జనము** సం. వి. అ. న.

ఆర్జనము, సంపాదనము, గడన.

సీ. కీర్తిధనార్జన క్రీడనంబు గలిగి. విరా. 1-67

వ. పాడితోడి యార్జనంబునం దమకుఁ గల కలిమి యనుభవించుచు.
ఉద్యో. 1-343; శాంతి. 2-225.

**ఆర్జవము** సం. వి. అ. న.

1. ఋజుత్వము, పరిశుద్ధ ప్రవర్తనము, కపటము కామి.

క. భక్తియు నార్జవమును సంయుక్తములై యున్న యట్టి యుల్లంబున
నాసక్తి నిలుతు నిం దొరకఁడు యుక్తంబైనను వసింప నుర్వీనాథా
శాంతి. 2-115.

2. సరళత్వము, ఎగుడు దిగుడు లేకుండుట.

చ. అరుదుగ సర్వశైలముల యంత తనర్చును నార్జవంబు సుస్థిర
తయు నోషధీరస విశేషతయుం గల దుత్తమంబు మంధర
కుధరంబు. ఆది. 2-10.

**ఆర్జవుఁడు** సం. వి. అ. పుం.

శకుని తమ్ముఁడు, ఇరావంతునిచేఁ జచ్చెను. భీష్మ. 3-41

**ఆర్జించు** సం. స. క్రి.

సంపాదించు, గడించు

సీ. విభవ మార్జించుబోఁ బ్రజల నొప్పింపని వశము పుణ్య కర్మంబునకు
మెచ్చి. ద్రోణ. 2-200

**ఆర్జితము** సం. విశ. (అ. ఆ. అ.)

సంపాదింపఁబడినది, గడింపఁబడినది.

ఉ. ...విద్విషదీకర మద్భుజార్జితము పెంపొనరంగ భుజింతు దిక్పతీ.
శాంతి. 2-325

సీ. న్యాయార్జితంబైన యర్థంబు వేదవిత్త్వము శాంతి మొదలగు
వరగుణములు. అను. 5-198.

**ఆర్జుని** సం. వి. ఇ. పుం.

అర్జునుని కొడుకు, అభిమన్యుఁడు.

తే. అర్జునియు సింధురాజుఁ బజాభిరామ, సింహశార్దూలగతి విలసిల్లి రథిప... ద్రోణ. 1-171

**ఆర్త** సం. విశే. (అ. ఆ. అ.)

దుఃఖిత.

ఉ. నన్నిటు లాదురాత్ము సదనంబునకుం జనుమన్న జంత కీ, బన్నము లన్నియుం దెలిపి పైత్రియిడనే యని పోయె నార్తయై. విరా. 2-154

**ఆర్తత్వము** సం. వి. అ. న. దైన్యము

వ. చతురాననుండు సన్నిహితుండై 'మూర్తోభవ' యని పలికి యతని యార్తత్వం బుడిపి. అను. 8-62

**ఆర్తము** సం. విశే. (అ. ఆ. అ.)

దుఃఖము నొందినది.

చ. ...అందియిచ్చు కాంచనచషకంబు పుచ్చికొని చారువిలోచన యార్తమూర్తియై. విరా. 2-102

**ఆర్తి** సం. వి. ఇ. స్త్రీ.

దుఃఖము.

ఆ. కర్ణకర్ణ వచ్చికావు మనాథుల, మైతి మను నెలుంగు లగ్గలముగ, బలములోన నెల్లఁ గలయంగ పీతెంచె, నార్తి దెల్లముగ జనాధినాథ. ద్రోణ 1-18

మాలిని;- సకృపలసదపాంగోత్సార్యమాణాశ్రితార్తి. అను. 2-478

**ఆర్త్విజ్యము** సం. వి. అ. న.

ఋత్విజుని భావము, ఋత్విజుని పని.

క. ఈతఁ డనవరత యజన, ప్రీతుం డితనికి దురిత భీతునకు మనః, ప్రీతిగ నార్త్విజ్యమునకు మహాతేజోధికుఁడ చేయు మని దయఁ బంచెన్ ఆది. 8-246

**ఆర్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. దుఃఖితుఁడు

తే. ... పురము సొచ్చినపుడ యిచ్చెద నీకను నార్తుఁ డగుచు. విరా. 4-80

2. రోగగ్రస్తుఁడు

చ. వల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మందుల నొడఁగూర్చ నేర్చి తనుదోషములారయ బుద్ధి గల్గి యార్తుల కుఁ జికిత్స సేసెదరు. శాంతి. 1-215

వ మఱి యార్తునకు శయనంబును భీతున కభయంబును దృషితునకు జలంబును బుభుక్షితునకు నన్నంబును శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనంబైన యుత్తమ గృహస్థ ధర్మంబు. అర. 1-81

**ఆర్ద్ర** సం. వి. ఆ. స్త్రీ.

అశ్విన్యాదులగు నిర్వదియేడు నక్షత్రములలో ఆఱవ నక్షత్రము. ఈ నక్షత్రమున గోదానము చేసిన నూర్ధ్వలోకములు లభించును.

చూ. అను. 2-378

**ఆర్ద్రత** సం. వి. ఆ. స్త్రీ.

మెత్తఁదనము.

మ. చెప్పె శివు నుల్లం బార్ద్రతఁ బొందఁగన్. శాం. 2-438

క. ...అన విని మొగమోట మనము నార్ద్రతఁ బెనుపన్ అను 2-279

**ఆర్ద్రపాదుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

తడికాళ్ళు గలవాఁడు.

ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్రపాదుండునై భోజ, నంబుల నేఁత మేలనంగ విందు. అను. 4-99

**ఆర్ద్రము** సం. విశే. (అ. ఆ. ఆ.)

1 తడిసినది, క్లిన్నము.

తే. తుష్టి దీపించి కరుణార్ద్ర దృష్టిఁ జూచి. విరా. 1-10

(కరుణార్ద్రము- కరుణరసము చేతఁ దడుపఁబడినది)

2. మెత్తనైనది, ద్రవించినది, కరఁగినది.

ఆ. ...నాదు, హృదయమతులు దీని యెడఁ గడు సార్ద్రమై, యుండుఁ
గాన చెప్పకుండరాదు. విరా. 1-249

ఉ. ...చూడఁగాఁ బోవు తలఁపు పుట్టెడుఁ బ్రఖ్యాతగుణున్ బలదేవు
వత్సలన్, దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని ఆశ్వ. 1-146

చ. కని మఱి తల్లి పాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు ల, వ్వని
తయు నందఱం జోదివి వత్సలతన్ మన మార్ద్రభావ మొం,ద నురలు
నశ్రుబిందువుల దంపడిఁ జిక్కగఁ గౌఁగిలించి వా,రి నయనవారిచేఁ
దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. ఆశ్ర. 2-85

3. పచ్చిది, ఎండనిది, శుష్కముగానిది.

వ. అది యెయ్యది యనిన నార్ద్రంబగు దానను శుష్కంబైన సాధనం
బునను దారువునం బాషాణంబున శస్త్రాస్త్రంబులం దివంబున
రాత్రియందును నేను వధ్యుండఁ గాకుండవలయు నవిన.
ఉద్యో 1-187

వ. అగ్ని జలంబుల నార్ద్రంబునను శుష్కంబునను. ద్రోణ. 5-414

**ఆర్ద్రీకృతము** సం. విణ. (అ. ఆ. అ.)

తడుపఁబడినది, తడిగాఁ జేయుబడినది.

సీ. ...మలయజ మృగమదావిలసలిలంబునఁ నిమ్మగా నార్ద్రీ కృత
మ్ములయిన -తే- యంగళుల నొప్పె. ఆది. 9-148

**ఆర్ద్రీభూతము** సం. విణ. (అ. ఆ. అ.)

తడిగానైనది, ఆర్ద్రమైనది, కరఁగినది.

శా. భావం బేకముఖంబుఁ జేసికొని యాపద్ధ్వాంతభానున్ మహా,దేవుం
బర్వతకన్యకాప్రియు దయార్ద్రీభూత చేతస్కు. శాంతి. 1-109

**ఆర్ద్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. మెత్తఁబడినవాఁడు, మార్దవము గలవాఁడు.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట, కోర్వమియుఁ గౌరవులఁ
జంపనొల్లమియును, గలుగునెయ్యంబు పెంపునఁ గరుణనార్ద్రుఁ,
డైన పవనజుఁ బిరికొల్పు వాత్మఁ దలఁచి. ఉద్యో. 8-58

2. దుఃఖితుఁడు.

సీ. ...ఆమ్రేహి,తాత్కుండుఁ గరమును నార్ద్రీఁడగుచు, గౌరవంబున వారిఁ గలయఁ గనుంగొని, యంతరంగంబు శోకాగ్ని వేరయ.
మౌస. 1-188

ఆర్ద్రీఁడు సం. వి. అ. పుం.
విశ్వకుని కుమారుఁడు. యువనాశ్వుని తండ్రి. చూ. అర. 4-880

ఆర్పు (దే. వి. √ ఆర్చు1)
1. అలుపు, కేక.
సీ. అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడబొబ్బలును దూర్యనాదంబు లుల్లసిల్ల. విరా. 5-188; భీష్మ. 1—47

2. గర్జనము.
తే. యూధపతితోడి దంతి సముత్కరంబు వెనుకఁదగిలెడు సింగంబు విధముదోఁప, నార్పునాదంబుగా నరుఁ డంటదాఁకె. విరా. 5-197

ఆర్పు దే. స. క్రి. (ఆర్చు3)
1. చల్లార్చు, నశింపఁజేయు.
క. బలుగాలిఁ బేర్చు దావానల మొక్కరుఁ డార్పఁబోయినను దీటనె.
విరా. 4—214; శాంతి, 3-276; ఉద్యో. 2-73

2 తీర్చు, పోఁగొట్టు.
చ. అలఘువిచార నాయలఁత యార్పుము నన్ గడతేర్పు మెమ్మె యిన్. ఉద్యో. 3-201

(ఇది ఆర్చు3యొక్క క్త్వార్థక తుమున్నర్థకా ద్యసమాపక క్రియల యందు కృదంతమునందును మధ్యమపురుషయందును వచ్చురూపము. అర్థములకై చూ. ఆర్చు3.)

ఆర్య సం. వి. ఆ. స్త్రీ.
1 పార్వతి.
ఆ. హారుఁడు కరుణఁజూడ వాహిమవన్నగ,దావ ముదిగి శోభితత్త్వ మొలసె,నార్య పరమ విస్మయముఁబొంది యాసర్వ, భువనకర్త

తోడ సవినయముగ. అను. 4-421

2. కుమారమాతృకలు ఏడుగురిలో ఆఱవది. చూ. అర. 5-245

**ఆర్యకుఁడు** సం. వి. అ. పుం.

భుజంగరాజు, చిరకుని తండ్రి, సుముఖుని తాత.

చూ. వివ. ఉద్యో. 3-291

**ఆర్యత్వము** సం. వి. అ. న.

1. పెద్దఱికము.

క. దుర్యోధను నింటం దగు, కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చాతుర్యంబు మెఱయు కర్ణుని, యార్యత్వము సెల్లుచున్న యదియే నెమ్మిన్. ఉద్యో. 1-231

2 జీవకోటికి శుభము గలిగించుట.

క. సమతయు దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూర్యత్వములు నహింసాదానా, క్షమాత్యజన సూనృతములు సత్యము మూరుల్. శాంతి. 3-417

**ఆర్యమిత్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పూజ్యులకు స్నేహితుఁడు, ఆర్యమిత్రుఁడు, గౌరవాన్వితుఁడు, పూజ్యుఁడు.

క. ఏనమ్మహాను భావుల, మేనల్లుఁడ వారలార్య మిత్రులు శత్రుజ్ఞా వాయక గర్వత మోహానులు బంధురహిత కార్యపరతంత్రాత్ముల్. విరా. 4-128

**ఆర్యమూర్తి** సం. విణ. (ఇ. ఇ. ఇ.)

సుందరమైన, మనోజ్ఞమైన, అనుత్తమమైన ఆకారము గలది.

వ. ...లోలత్వరాహిత్యంబున నత్యుదాత్తుం డగుచుం జని యభ్యంతర మందిరంబున వివిధ రత్నరశ్మి విరాజితంబైన పర్యంకంబున నార్యమూర్తియు ధవళవ నాంగరాగయు రుచిరాభరణ భూషితయుఁ బ్రౌఢవయస్కయు నగు నొక్క వనితం గని. అను. 2-10

**ఆర్యవృత్తము** సం. వి. అ. న.

సాధువర్తనము.

సీ. భార్య పుత్రకుఁ డల్లుఁ డార్యవృత్తములేమి, అను. 4-346

**ఆర్యాత్ముఁడు** సం. వి. అ. పుం.

పూజ్యమైన మనస్సు గలవాఁడు.

ఇంద్రవజ్ర :— చింతా పరత్వంబునఁ జెందు దుఃఖా, క్రాంతత్వ మున్వి శ్వర కాన గీడుం, జింతింపఁ డార్యాత్ముఁ డచింతనుండై, యంత, పరితాపము నొర్వ, జాలున్. స్త్రీ. 1-29

**ఆర్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. పూజ్యుఁడు, గౌరవనీయుఁడు.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు. విరా. 1-98

క. ధుర్యత ననాగతములగు, కార్యము లూహించి పని తగం జేయు నయా, చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును, నార్యస్థితి దీర్ఘదర్శి యను మీను క్రియన్. శాంతి. 3-201: స్త్రీ. 1-29

2. మంచివాఁడు, సాధువు.

సీ. శార్య పుత్రకుఁ డల్లుఁ డార్య వృత్తము లేమి. అను. 4-346

3. కులీనుఁడు, విశ్వసనీయుఁడు, వినీతుఁడు.

తే. ద్రోణ గాంగేయ భానుమత్సూను కృప సు, శర్మ దుశ్శాసనులు సర్వసైన్యపతులుఁ గొలువ మహార్హ్యాకాంచ, నోన్నతాసనమునఁ గొలువున్న వాని. విరా. 3-74

4. కర్మఠుఁడు, కర్మనిష్ఠుఁడు, కర్తవ్యము నాచరించుచు అకర్తవ్యము విసర్జించుచుఁ బ్రకృతాచారమున వర్తించువాఁడు.

క. ఆర్యులుఁ బ్రవృత్తి లక్షణ, కార్యంబులచేతఁ జేసి గ్రాహ్యము నగు త, ద్ధుర్యత్వమందు విడువ ర, నార్యములగు మదనమద భయ క్రోధాదుల్. శాంతి. 4-288

**ఆర్యోక్తి** సం. వి. ఇ. స్త్రీ.

సామెత, పెద్దల వాక్యము.

సీ. ఇట్లుండు నార్యోక్తి నృపనీతి, దురితంబు సేయునే యొరుఁడు వెట్టి-ఆ- గుడువ నృపతిమాత్రకునకును గాదన్నఁ. గౌరవాన్వయాగ్ర గణ్యుఁడైన నీకుఁ దగునె. శాంతి. 1-152

**అర్వ్వురు** దే. సర్వ.

1. ఆఱుగురు

ఉ. ...అహీన పరాక్రమశాలి యర్జునుం,డొక్కఁడ యార్వ్వురన్ మనల
నుగ్రరణంబున గెల్చె నిన్న. ఉద్యో. 1-258

తే. ...నీకుఁ దనయు లార్వ్వు రనకు మనిహు. శాంతి. 1-9

2. షడృతువులు.

వ. మఱియు మార్గంబున నార్వ్వురు జూదమాడుచుండ. అను. 2-210

**ఆర్షము** సం. విణ. (అ. ఈ. అ.)

1. ఋషి సంబంధమైనది.

క. హర్షంబును మానంబు న,మర్షము నపరాధమును సమదభావ
ముల ను,త్కర్షాపకర్ష చింతలు, నార్షసమాచారమున నిరస్త
గుణంబుల్. శాంతి. 5—24.

వి. అ. పుం.

2. అష్టవిధ వివాహములలో నొకటి (ధర్మార్థము వరుని వలన ఒకటిగాని
రెండుగాని గోమిథునములు పుచ్చుకొని కన్యక నిచ్చి యథాశాస్త్ర
ముగాఁజేయు వివాహము) చూ వివాహము.

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రాజాపత్యమును
రాక్షసంబు నాసు,రంబు గాంధర్వంబు రమణఁ బైశాచంబునను
నెనిమిది వివాహములయందు. ఆది. 4-54.

**ఆర్ష్టిసేనాశ్రమము** సం. వి. అ. పుం. న.

ఆర్ష్టిసేనుని యాశ్రమము. ఇచ్చట ఉజ్జానకమను తీర్థభూమి గలదు.
ఇందు స్నానముచేసిన మర్త్యుఁడు అఖిల పాపంబులం దొఱంగును.
అను. 2-88

**ఆర్ష్టిషేణుఁడు** సం. వి. అ. పుం.

ఒక రాజర్షి- ఇతని యాశ్రమమున ధౌమ్యద్రౌపదీ ప్రభృతులంబెట్టి
కుబేరునితో యుద్ధముఁజేయఁబోయిన భీముని జూడఁబోయెను. అర. 4-22
54)

కుబేరుఁడు ధర్మరాజాదుల నితని యాశ్రమంబున నొకపక్షము వసియించునది యని యాదేశించెను. అర. 4-34

పాండవులితని యాశ్రమంబున నొక్కమాస ముండిరి అర. 4-39

ధర్మరాజాదు లీతని యాశ్రమమునం దుండఁగనె దేవలోకమున కంత మున్నరిగియున్న యర్జునుఁడు వచ్చెను. అర. 4-40

శ్లో. ఆర్ష్టిషేణస్య రాజర్షేరాశ్రమం దదృశుస్తథా.

సం. భా. అర. 158-108

**ఆర్ష్టిసేనుఁడు** సం. వి. అ. పుం.

ఒక మహర్షి. ఇతని యాశ్రమమున ఉజ్జానకమను తీర్థ స్థలము గలదు. అచ్చట స్నానముచేసిన సమస్తపాపములు నశించును.

శ్లో. ఉజ్జానక ఉపస్పృశ్య ఆర్ష్టిసేనస్య చాశ్రమే,
పింగాయాం చాశ్రమే స్నాత్వా సర్వపాపైః ప్రముచ్యతే.

సం. భా. అను. 25-54

పై ఆర్ష్టిషేణుఁడు ఈ ఆర్ష్టిసేనుఁడు ఒక్కఁడే యో కాఁడో అని నిర్ణయింప వీలుకాకున్నది. మూలములోఁగూడ ఈ రెండుచోట్ల రెండు విధములుగనే కన్పించుచున్నది.

**ఆర్షేయము** సం. వి. అ. న.

ఋషిప్రోక్తము. ఋషులచేఁ జెప్పఁబడిన విధము.

వ. గయయందు నక్షయ వటంబున నార్షేయంబైన విధానంబునం జాతుర్మాస్య క్రతువులు సేసి. అర. 2-814

**ఆలడి** వి.

నశనము.

సీ. నీవు ధరిత్రి యీనేర్చినఁ గురుకులంబునకు నిట్లాలడిఁ బొందనేల.

శల్య. 2-74

2. చావు, మృత్యువు.

తే. పరశురాముని నోర్చిన బల్మిదుండ, కాశిరాజు కన్యకలకుఁగాఁగఁ
బరమి, నరపతులనెల్ల గెలిచిన బిరుదు గలవ, నాలడియపడు

టూహింప నడలుగదురు. శాంతి. 1-196

8. నింద, అట్టు, అపవాదము.

క. విను మొకనినేల భవదనుజుని పుత్రులనెల్లఁ జంపఁ జొప్పడినను
నీతనయులు మగుడఁగ వత్తురె, యనయము పాపంబు నేసి
తాఱిఁబోవన్. స్త్రీ. 1-189

: విశే.

అపరాధము చేయనిది.

ఉ. అక్కడ లోకమెల్ల నగ నాఱడి కప్పలఁజంప దీన నీకెక్కడి పెంపు
గల్గుఁ బృథివీశ్వర కోపము డింపు కప్పలం, జక్కని మాడ్కిఁజూడు
మిది చాల నధర్మము వ పుఁడున్. అర. 4-383

శ్లో. మా రాజన్ క్రోధవశంగమః ప్రసాదం కురు వార్ష్ణిమండూ
కానా మనపరాధినాం వధం కర్తుమితి శ్లోకౌ చాత్ర భవతః
సం. భా. అర. 192-20

క్రి. విశే.

1. నిష్కారణముగా.

క. ఇది విధివశత్వమున నై, నదియని శోకంబు దొఱఁగునట్టి వివేకం,
బొదవదు ఫల్గున యాఱడి, యదువంశంబెల్ల సమసె నను వగ
పేర్మిన్. మౌస. 1-113

ఉ. యముఁడెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగనేల చెప్పు మ,జ్ఞాతి
భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతునన్న. ఉద్యో. 4-385

తే. అభిమన్యువీరుని నతని తమ్ముఁ,గుఱ్ఱలను గర్ణు నాఱడిఁ గోలు
పోయి, యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు, మాటలాడుదు
ర్పరిజనుల్ మఱుఁగుచుండ. ఆశ్ర. 2-15

2. వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా.

చ. అనుటయు నాతఁ డిట్లనియె నాఱడి విప్రుల కేల యశ్వముల్.
అర. 4-349

ఉ. చచ్చిన పిమ్మటం గడిఁది శత్రుల నోర్వఁగవచ్చునే శుభం, బిచ్చునె

చావు లెందును నరేశ్వర యాఱడి చత్తునంట దా, మెచ్చుగునయ్య.
అర. 6-58

4. దీనముగా.

చ. నినుం బొఱలు సంపఁగ గావఁగలేని మీ బలాధిపతుల దూఱు
సాత్యకి యతిశ్రమ మొందినచోటఁ దాఁకి కృష్టపఱచి చంపె దీ
నేఁడు సచ్చునె యాఱడి యేను గల్గఁగాన్. ద్రోణ. 4-270

**ఆఱడిఁబుచ్చు; ఆఱడిపుచ్చు** దే. స. క్రి. (√ఆఱడి)
వ్యర్థముచేయు.

ఉ. ఆలము నేసి నాతగుల మాఱడి పుచ్చఁగనేల బేల న,న్నేలి యనంత
భోగముల నిచ్చు మెయిన్ విహరింపు. విరా. 2-253

**ఆఱడిఁబోక; ఆఱడిపోక** దే. వి. (√ఆఱడిపోవు) ఆఱడిపోవుట
నిష్ఫలమగుట, వ్యర్థమగుట.

ఉ. ఆఱడి పోకయున్ ఫలమునందుటయుం గని పల్కనేరమిన్.
ఉద్యో. 3-100

**ఆఱడిఁబోవు; ఆఱడిపోవు; ఆఱడివోవు** దే. అ. క్రి.

1. వ్యర్థమగు, నిష్ఫలమగు.

చ. ...అతి దుష్కరమైన తపంబు సంచితం,బనఁదగు బ్రహ్మచర్య
మును నాఱడిఁబోవె కటా శపించినన. అశ్వ. 3-35

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టులను నాఱడిఁబోయెఁ బ్రయత్నమెల్ల.
అశ్వ. 3-59

2. చెడు, భగ్నమగు.

క. ...చొరుమం,చనుమానింప శతనిఁ జొరు,మనరు గదా మీ యు
పాయ మాఱడిపోవన్. ద్రోణ. 2-284

3. నశించు, చచ్చు.

వసంత తిలక :- హా,పుత్రవర్గ మిటు లాఱడిఁబోవ. స్త్రీ. 1-10

ఆ. ...అడరి వెలుచ నేడ్చె నాఱడిఁబోయిన ప్రజల పేరుఁగ్రుచ్చి
పవివి షనవి. మౌస. 1-107, 208

ఆ. అప్పెధమునఁ గర్ణుఁ డాఱడిఁబోయిన, నాదు మానసంబు వోదు నూఱుపఱియలై. ఆశ్ర. 1-154

4 నిందపడు.

క. విను మొకనినేల భవ్యదనుజుని పుత్రులనెల్లఁ జంపఁజొప్పడినను నీతనయులు మగుడఁగ వత్తురె, యనయము పాపంబు నేసి యాఱడిఁ బోవన్. స్త్రీ. 1-139

(కొన్ని ప్రతులయందు 'ఆడడిపోవు, ఆఱడివోవు' అనియు గలదు)

ఆఱాఱు దే. సర్వ.

రెండు ఆఱులు — పండ్రెండు

ఆ. ...కూర్చె మెఱుఁగు వాలారుతూపు లాఱాఱు నిగుడఁజేసి యద్భుతముగ. ద్రోణ 4-211

ఆఱు[1] దే. అ. క్రి.

1. తీఱు, ఉపశమిల్లు, నశించు.

క. ...నిను మద్ఘోర శరనివాతిఁ బడఁ గ, న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్. కర్ణ. 1-124

క. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడకం దిగిచి డస్సియున్నతని శ్రమం, బాఱఁగ నెడఁ బరితాపము, దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. ఆది. 4—19; అర. 6-210

ఉ. నెట్టన యిట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొఁదిం, గట్టిన యట్ల పెద్దయును గాలము దీనికి నాఱు టెన్నడుం, బుట్టదు. ఉద్యో. 3-118

2. నిర్జీవమగు, ఎండిపోవు.

సీ. వెలవెలఁ బాఱుచు వెగడొందుఁ బెనవుం తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు. విరా. 4-80

3 (దీపాదులు) పోవు, మలుగు, చల్లారు.

మ. భూపాల యేపారి మం,దునె యాఱంగల దీపమట్లతఁడు మందుం గాక యేనార్చెదన్. కర్ణ. 3-49

ఆ. ...ఆడరు శోకవహ్ని యాఱనేర, దింద్రపదవి నేరె నేనియుఁ గావున, ఖండనంబు సేయకుండువాఁడ. భీష్మ. 1-198

మ. నిరాకృత శీలుండగు నా సుయోధనుఁడు సంక్షయంబు నేసెం గులం, బతనిం జంపఁగ దీపమాఱె మది శోకాక్రాంతమయ్యెం దుదిన్. శాంతి. 1-46

4. చచ్చు.

క. అడవుల దవశిఖ దరికొను, వడువున నిట్లరిబలం బవారణఁ బొడిగా, నడరి యతఁ డాఱె ద్రుపదునికొడుకు కార్వ్య నుభయ జనములకున్ వగ మిగలన్. ద్రోణ. 1-77

శ్లో. ఏతాని చాన్యాని చ కౌరవేంద్ర
కర్మాణి కృత్వా సమరే మహాత్మా,
ప్రతాప్య లోకా నివ కాలసూర్యో
ద్రోణో గతస్స్వర్గ మితో హి రాజన్, సం. భా. ద్రోణ. 8-29

**ఆఱు**[2] దే. సర్వ. సంఖ్యా. వి. (బౌత. ఆఱు. క. ఆఱు)

ఐదునొకటి.

ఉ. ఆఱు రసంబులం జవుల యందలి క్రొత్తలువుట్ట నిచ్చలున్, వేఱొక భంగిఁ బాకములు విన్ననువొప్పఁగఁ జేసి చేసి. విరా. 1-77

క. తురగముల నాలుగిట నుత్తరు నాఱిట నెనిమిదిట రథముఁ బదిటన వ్యానరు నఱువది శరముల నన్నరు నంగంబులను బెలుచ నాఁటగ నేసెన్. విరా. 5-108

తే. ఇంద్రియంబుల నాఱింటి నిట్లు విషయములకు నొలయక యుండంగ నిలువరించి. శాంతి. 5-181

వ. సంజయుం డాఱవ దివసంబు నాహవంబు తెఱంగెఱింగించె భీష్మ. 2-405

2. సంధి, విగ్రహ. యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములు.

తే. ఒకటి గొని రెంటి నిశ్చల యుక్తిఁజేర్చి, మూఁటి నాల్గింటఁ గడువశ్యములుగఁజేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగియేడు,

విడిచి వర్తించువాఁడు వివేకధ . . .  ఉద్యో 2-87

చూ వివరమునకై ఒకటి

**ఆఱునూఱు** దే. సర్వ. సంఖ్యా.

ఆఱు వందలు.

వ ...ఇయ్యాఱు నూఱు గుఱ్ఱంబులను గురునకు సమర్పింపుము.

ఉద్యో. 3-818; కర్ణ. 2-91

**ఆలంపుగోల** వి.

(అలము + గోల)

యుద్ధమునందు వీరులు చేయు కలకలము, అఱుపు, బొబ్బరింత.

సీ హారుల నాల్గిటఁ జంపి యాలఁపు గోలతో, నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి. విరా. 5-150

**ఆలంపు౛ెలుఁగు** వి.

(అలంపుగోల కిది పాఠాంతరము) (అలము + ఎలుగు)

యుద్ధమునందు వీరులుచేయు కలకలము, అలుపు, బొబ్బరింత.

సీ. హారుల నాల్గిటఁ జంపి యాలంపు ౛ెలుఁగుతో, నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి. విరా. 5-150

**ఆలంపుఁగేలి** వి.

(ఇది అకాడమి సం.ము పాఠము) (అలము + కేలి)

యుద్ధక్రీడ, యుద్ధమునందు వీరులొండొరులు చేసికొను పరిహాస వాక్యములు

సీ. హారుల నాల్గిటఁ జంపి యాలంపుఁగేలితో నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి. విరా. 5-150

**ఆలంబనము** సం. వి. అ. న.

1. ఆశ్రయముగాఁ గొనుట, ఆధారముగాఁ గొనుట

క. శ్రీత్ర్యక్షివాత్స్యాలంబన తత్త్వశ్లేషాత్త. విరా. 3-1

2 ఊఁత, ప్రాపు, ఆధారము, ఆశ్రయము.

వ. ...అయ్యారణేయుండు నియ్యత్యధిక మారుతం బెక్కుడిది యని.

యడిగిన నఖిల భూతవేదియగు వేదవ్యాసుఁడు దేవయానంబున
విష్ణుఁడును బితృయానంబున భానుండును నూర్ధ్వాధోగమన
పర్యాయ రూపంబునం బ్రవర్తిల్లుదు రది పవనాలంబన కృతంబై
చెల్లు. శాంతి. 6-307; శాంతి. 4-447; శాంతి. 6-77

**ఆలంబనీయము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆశ్రయింపఁదగినది.

క. శీలంబు మైత్రి కరుణ య,లోలుప భావము తితిక్ష లోపహ
మునిలో,కాలంబనీయ సద్గుణ,జాలంబు దమంబు రూప సంపద
యధిపా. శాంతి. 3-408

**ఆలంబము** సం. వి. అ. పుం.

ఆధారము, ప్రాపు.

క. శ్రీగిరిజా సమవాయ మ,హాగురుతర శుభగ సంపదాలంబనదా,
యోగిజనక్షేమ సమీ,హాగర్భిత దివ్యచిత్త. కల్యా. 1-1

**ఆలంబి** సం. విణ. (న్. నీ. న్.)

1. పట్టుకొనునది, గ్రహించునది.

తే. చిత్తమున గాఢరాగంబుచేతఁ బూవు, తెఱఁగుదోఁప గెంపారెడు
తీఁగబోఁడి,మృదులపాణిఁ గుమారుండు మెలపుమైఁ గ్ర,హించెఁ
బల్లవాలంబి మత్తేభలీల. విరా. 5-400

2. ఆశ్రయించినది.

క. మేలర్థింపను గీడును, జాలింబడి తొలఁగఁ ద్రోవ నరిఁ దూష్ణీం
భా,వాలంబి మనస్కుఁడనై, యాలంబుగఁజేసి నడతు నయ్యిరు
తెఱఁగున్. శాంతి. 4-58

**ఆలంబించు** సం. స. క్రి.

అనుభవించు.

క. మును మే మాలంబించిన, వెనుకఁగదా నీకు ననుభవింప వశం బో,
మనసా నీ వెంగిలి కాఁ,దను మా యవ్విషయ మెక్కు డయ్యెడు
మనలోన్. ఆశ్వ. 2-96

**ఆలంబ్యమానము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆశ్రయమగుచున్నట్టిది.

క. ...లక్ష్మీరమణత్వ శివాప్రియతా, సమవాయాలంబ్యమాను సౌం
దర్యనిధీ. కర్ణ. 1-821

**ఆలంభము** సం. వి. అ. పుం.

చంపుట, యజ్ఞమునందు పశువును విశసించుట.

వ. ...సర్వ పశుశ్రపణంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభ సమ
యంబున యాజ్ఞసేని సన్నిహితం జేసి. అశ్వ. 4-184

**ఆలకించు** సం. స. క్రి.

విను.

వ. అట్లు ధర్మనందనుం డేతెంచు కలకలం బాలకించి. శల్య. 2-43

**ఆలకూయు** దే. వి.

ఆవుల యఱపు, ఆవుల యార్తధ్వని.

ఆ. అకట యాఁడుకూయి వాలకూయియును లాఁతి,వారికైన నరయ
వలయు ననిన, వన్నుఁ గిచకుండు దన్నంగ నెట్టులు, సూడనేర్చె
ధర్మసూనుఁ డపుడు. విరా. 2-177

**ఆలక్ష్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.)

చూడఁబడుచున్నది.

వ. తొల్లి వార్ష్ణేయుండు తెచ్చిన రథంబునందు నిజహయంబుల వాలక్ష్య
మాణ శుభలక్షణంబులు మనోవాయు వేగంబులు నైన వానిం
బుచ్చుకొని. ఆర. 2-166

**ఆలనేయి** దే. వి.

ఆవుల పాలనుండి తీసిన నేయి.

తే. ఆలనేయి ముఖ్యము మహిషాదిమేష, జనిత ఘృతములుఁ దైలంబు
మనుజనాథ, మధ్యమములగు మేదోస్థిమాంసరసము, లరయ
నింద్యముల్ దీపసమర్పణమున. అను. 4-22

**ఆలపనము** సం. వి. అ. న.

ఆలాపము, సంభాషణము.

చ. అతఁడు మందహాస సహితాలపనంబును సత్యభాషణ వ్రతమును ...గ్గి శాంతి 2-263

**ఆలపుటాలము** వి. (ఆలము + ఆలము)

యుద్ధమునందు ఉపేక్ష- యుద్ధమును త్రోసిపుచ్చుట, యుద్ధమునందు అనాదరము.

సీ. ద్వారకా నగరంబు చేరువ ఘోటక మరుగంగఁ బ్రీతులై యదుకుమారు, లాలపుటాలంబు నమువున నయ్యింద్రనందనుఁ గని పూజనం బొనర్చి. అశ్వ. 4-114

**ఆలమంద** దే. వి

ఆవుల సమూహము.

ఆ. ...అలఁ డాలమందలు, పరవుఁలైన యెడల కరిగి యరిగి. అను. 1-254

**ఆలము**[1] వై. వి. (సం. హారః = యుద్ధము)

యుద్ధము.

క. వాలమ్ములు దాఁక ధరన్, వ్రాలు భటులఁజూచి యెడలు వడఁ కఁగ మేనున్, దూలఁగఁ దముఁ దాఁకకయును, వాలము సాలించి కొంద అవలఁ జనంగన్. విరా. 5-62

తే. పెచ్చుపెరిగి, యాలమెడసేసి యనిలజ ప్రేలెదిట్లు. కల్య. 2-245

**ఆలము**[2] దే. విశ.

1. అలక్ష్యము, ఉపేక్షితము, అనాదృతము.

క. మే లర్థింపను గీడును, జాలిఁబడి తొలఁగఁ ద్రోవ నరిఁ దూష్టింభా,వాలంబ మనస్కుఁడనై, యాలంబుగఁజేసి నడతు నయ్యరు తెలఁగున్. శాంతి. 4-68

ఉ. ఆలముచేసి నా తగుల మూఁడి పుచ్చగనేల జేల న,న్నేలి యనంత భోగముల నిచ్చుమెయిన్ విహరింపు విరా. 2-258

ఉ. ...అయసత్యసం,వాదిని పూన్కి పాండుసుతవల్లభ యాలముచేసి యిట్లనున్. విరా. 2-160

వ. అని పలికి వాని యాలాపంబు నాలంబుపేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన. ద్రోణ. 2-16

శ్లో. తతో౽భిమన్యుస్తామ్ వాచమ్ కదర్థీకృత్య సారథేః సం. భా. ద్రోణ 36-8

వి.

ఉపేక్ష.

సీ. యదుకుమారు.లాలంపు టాలంబు ననువున నయ్యింద్ర నందనుం గని పూజనం బొనర్చ అశ్వ. 4-114

**ఆలయము** సం. వి. అ. పుం.

1. ఇల్లు

తే. ఒక్కనాఁడు, సృంజయునిఁగాంచి యతఁడు విశిష్టభక్తి, నర్చనము సేసినను భవదాలయమున, ననఘ వసియింతుమే కొన్ని దినము లనిరి. శాంతి. 1-286

2. నిలయము, మందిరము.

ఉ. మాలని రాకచూచి భయమర్దితమైన మనంబుతోడ నశ్కాలము నందు నీకుఁ బనఁగావయున్ వెస ద్రుమానిపైకి వా, యాలయముం బొరన్ సమయ మప్పుడ నాకుమగాన యత్నతి,న్మె లొనరింతు నమ్ము మిది నిక్కము గర్జము నే నెఱుంగనే శాంతి. 3-215

**ఆలరి** దే. విణ.

అవివేకి, కొంటె.

ఉ. ...ఒక్కతన్, బాలికఁ దొల్లి యేవురకు భామినిగా సృజియించి యున్న య,య్యాలరి బ్రహ్మచెయ్ది పరమార్థముగా కది యేల యొండగున్. ఆది 7-211

**ఆలవట్టము** వై. వి. (సం. ఆలావర్తమ్. ప్రా. ఆలావట్టం. త. ఆలవట్టం)

వస్త్రముతోఁ జేయఁబడిన గుండ్రని విసనకఱ్ఱ (ఇది రాజాద్యుపచారమునకై వినియోగపడును.)

గీ. కనక బహురత్నమయ పీఠమున మృగాక్షు, లాలవట్టంబులిడఁ
తెలువమరునట్టి కౌరవేంద్రుండు పెనుసేలఁ గంకపత్ర, పవన
హతుఁడయ్యెఁ జూచితె పద్మనాభ. స్త్రీ. 2-38

వ. భీమసేనార్జునులు ధవళచామరంబు లిడిరి యుయుత్సుం డుత్తమ
చ్ఛత్రంబు పట్టె వృద్ధలగు కౌరవస్త్రీ లాలవట్టంబులు పట్టిరి,
ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపె నట్లు పొద నేర్చి దేవవ్రతుని
దేహంబు క్రౌతాగ్ని కాహుతిసేసి అను. 5-478

**ఆలవాలము** సం. వి. అ. న.

కుదురు, పాదు.

ఉ. ...నిత్య లక్ష్మీంతికాలవాలమగు జీవనమంతయు నీమొగంబకాఁ,
జాలనసేయు మిప్పురము భామినులెల్లను నిన్నుఁ గొల్వఁగన్-
విరా. 2-258

సీ. ...అది ధర్మబుద్ధికి నాలవాలం బగు. శాంతి 5-365

**ఆలస్యము** సం. వి. అ. న.

1. సోమరితనము, కార్యనిర్వహణమునందు చుఱుకుదనము లేకుండుట.

వ ఇట్లుత్తముండైన విప్రుం డుత్తమమంత్రోపాశ్రితంబులగు విహిత
కర్మంబులు నడపుట రత్నకాంచన సాంగత్యంబునుం బోలె సంస్తు
త్యంబై యుండు నాలస్యంబునఁ గ్రోధంబున శోకంబునఁ దదనుష్ఠా
నంబు విడుచుట పాతకంబు. శాంతి. 1-72

క, తాలిమి లేని జనంబులు, మేలెఱుఁగక యట్టివాని మీఁదను జాడ్యం
బాలస్యం బిదియని దోషాలోచన మాచరింతు రది మతియగునే.
శాంతి. 5-268

2. జాగు, విలంబము.

క. అరయఁగ నయ్యేడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి నాల
స్యము లే, కరయునది పెక్కుభంగుల, నరసినఁ దోచెదరు గాక
యది యట్లుండెన్. విరా 3-105

3. ఏమఱుపాటు, జాగరూకత లేమి.

వ. విచ్ఛిపోయె సమస్త దేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొక

యు నుపేక్ష లేక పరుషు లోడిదకా పరికించుచు బయలను నాల-
స్యంబు దక్కి యోలంబునట్లు శోధించుచు.
విరా 2-87; శాంతి. 3-80

4 నిర్లక్ష్యము - ఇతరుల వలన భయములేమి, నితరులను తిరస్కార
పూర్వకముగా నాత్మనిర్భయమును బ్రకటించుట

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున నంగణంబునొచ్చి
విరా. 2-14

5. అజ్ఞానము.

వ. అని యడిగిన నతం డేను మధ్యదేశీయుండ గౌతముండ నొక్క-
మహానీయ చరిత్రుని పుత్రుండ నాలస్యంబున వేదాధ్యయనాది
విప్రకర్మ విరహితుండనయి కామలోలత్వంబున బోయిత యిల్లా-
లుగా బోయలం గలసియుండి. శాంతి. 8-480

6. అలసత, మాంద్యము, మత్తు.

వ. ...అదైత్యునకు నావులించునట్టి యాలస్యం బావహించిన.

తే. అసురవాథుండు నలసత యడర నీల్గి, యావులించిన నత్తఱి నమర
విభుఁడు, దనశరీరంబు సంకుచితంబు సేసి, కడుజవంబునఁ గుప్పించి
వెడలనుటికె. ఉద్యో. 3-124, 125

**ఆలాతకము** సం. వి. అ. న.

కొఱకచ్చు, కొఱవి, ఆలాతము.

సీ. ...తోమర ముద్గరాలాతక ముసల శూల, శర శతఘ్నిముఖ సాధనో-
పేతమై. అర. 7-57

**ఆలాతము** సం. వి. అ. న.

కొఱవి, కొఱకచ్చు, ఆలాతకము.

వ. ఇట్లు గవిసినం బ్రాకార రక్షకులైన రాక్షసవీరులు వారలం జేర
నీక శిలా శూల పరశు తోమ రాలాత ప్రముఖంబులు ప్రయో-
గించినం. అర. 7-70

**ఆలాపము** సం. వి. అ. పుం.

1. మాట.

క. అనుటయు మోఱకు చందంబున మోమడ్డము గదల్చి భూవిభుఁడు
సఖాజనులు విన ననిలసుతుఁ డిట్లనియెం బ్రస్ఫుట నిరర్గళాలాప
ములన్. విరా. 1-221

2. వచనము.

వ. ...ఏమేని నెపంబున నొండొరుల మేలు కాన్పు రమణ రమణీ జనం
బుల నర్మాలాపంబులన్ బెరయు దరహాసంబుల కాంతిఁ దెలుపెక్కు
నట్లు వెలరారు దీపంబులును. విరా. 2-240

క. పరమ సుఖము దృష్ణయుడుగు, టరయఁగ నిట్లగుట పింగళాలాప
ములం బరిశోధితమగు. శాంతి. 4-15

3. సంభాషణము.

వ. అని పలికి వాని యాలాపంబు లాలాపంబు సేసి యభిమన్యుండు.
ద్రోణ 2-16

4. పలుకుట.

క. కోపంబులేమి సత్యాలాపము నిజదార పరవిలాసము శుచితా,
గోపన మద్రోహం బవనీపాలక సర్వవర్ణ నియత గుణంబుల్.
శాంతి. 2-221

ఆలి[1] సం. ఇ. ఈ. స్త్రీ. (ఆళి)

పంక్తి, వరుస, శ్రేణి, సమూహము.

మ. ...పౌరాలి దీవన లిచ్చెం... విరా. 4-68

క. ...మధుశ్రీ ల్యాలిత్యాస్పద వాక్యాలీకలనమున నాకు నానతి
యీవే. అను. 4-424

ఆలి[2] దే. వి.

1. పరిహాసము, గేలి. చూ. ఆలిగొన.

2. హీనము, నీచము. చూ. ఆలితనము.

ఆలింగనము సం. వి. అ. న.

ఉపగూహనము, కౌఁగిలింత.

ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నాలింగనము సేసి. విరా. 5-341

వ. అమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును మూర్ధాఘ్రాణం
బునుం జేసి. శాంతి. 5-287

**ఆలింగితము** సం. విణ. (అ. ఆ. అ.)

కౌఁగిలింపఁబడినది, స్పృశింపఁబడినది, తాఁకఁబడినది.

వ. సర్వాలింగాలింగితమహీతలంబగు నమస్కారంబు చేసిన నజ్జగన్నా
థుండు. విరా. 1-22; అర. 1-328

**ఆలింగితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కౌఁగిలింపఁబడినవాఁడు.

వ. ఇవ్విధంబున నాలింగితుండయి భూమింజయుండు. విరా. 5-272

**ఆలించు** దే. స. క్రి.

1. ఆలకించు (విను)

ఆ. అనదనైతి నిచట నాలికుయ్యాలింపుఁడు. విరా. 3-19

వ. ...అట్లయ్యిరువురు వివాహంబు సేయుట యాలించి.
కర్ణ. 2-115; భీష్మ. 3-228; శాంతి. 3-330

(ఆలించి విను) శ్రద్ధతో విను.

తే. ...నద్రజ, ఘోరనాదంబు నీకోర్వఁగోలఁది యగునో కాదో నీవ
యెఱుంగుదు మేదినీశ,యనుటయును నృపుఁ డాలించి విని
భయమున. అశ్వ. 1-90

2 స్మరించు, మనసునకుఁ దెచ్చికొను.

ఆ. ఇంకనైన నన్నునేల యాలింపవు, నాకు శరణమగుము నాథ.
అర. 2-37

శ్లో. కథం భవిష్యసి పునర్మామనుస్మృత్య నైషధ,
కథం భవాన్ జగామాద్యమాముత్సృజ్య వనే ప్రభో.
సం. భా. అర. 63-24 శ్లో.

**ఆలికుయ్యి** దే. వి.

భార్యమొర.

ఆ. అనదనైతి నిచట నాలికుయ్యాలింపుఁ డకట. విరా. 3-19

**ఆలిగొను** దే. స. క్రి.

పరిహాసించు, గేలిసేయు, తక్కువ పఱచు,

గీ. అకట సైరంధ్రి నన్ను నిట్లాలి గొనఁగ,నేల చక్కఁగఁ గనువిచ్చి
యేను జేడిఁ, జూడ రోయుదు రణమున సూతకృత్యభరము
దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ. విరా. 4-18.

**ఆలితనము** దే. వి.

హీనత్వము, నైచ్యము.

ఉ. .....పాటిగఁబట్టుము వాదుమాట లి,య్యాలితనంబు వాపెదఁ
బ్రియం బొనరించెద నీకుఁ దంద్రికిన్. కల్యా. 2-85

**ఆలిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడినది చూ. ఆలిప్తి

**ఆలిప్తి** సం. వి. ఇ. స్త్రీ.

పూయఁబడుట, పూఁత.

తే. సారచందన మృగమదకస్తూరికాది, లేపనాలిప్తి నుండెడి భూప
పర్యంకటకట శోణిత పంక దిగ్ధాంగులగుటఁ, గనుట కోర్వరా
దయ్యెడుఁ గమలనాభ. స్త్రీ. 2-16 (ఆలిప్తము-అని పాఠాం)

**ఆలీఢము** సం. విణ. (అ. ఆ. అ.)

గ్రసింపఁబడినది, ఆక్రమింపఁబడినది.

తే. వేఁగు పెద్దెననోడ వారిధిఁ దరింప, లేని భంగి మనోభశవాలీఢ
వృత్తి, యగుచు నుండు జీవుండు భవాబ్ధి యుత్తరింపలేఁ డిది
నిజము గరిష్ఠచరిత. శాంతి. 5-584

**ఆలీఢుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గ్రసింపఁబడినవాఁడు, ఆక్రమింపఁబడినవాఁడు-

క. వినుము మలసుండును గర్వియు, ననర్థభాషియును మత్సరాలీఢుఁడుఁ
గ్రోధనుఁడును గావలవదు శ, క్త్యనురూపతఁ జేయవలయు నాతి
థ్యంబున్. శాంతి. 5-454

**ఆలీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అంటియున్నవాఁడు, సంగతుఁడు.

క. శాలగతి గనుట శాంతికి, మూలంబై యంతరంగమున కాత్మమ
యి,త్యాలంబనంబు నిచ్చుఁ ద,గాలీనుండైన పురుషుఁ డక్షోభ్యుఁ
డగున్. శాంతి. 4-447

**ఆలు** దే. వి. స్త్రీ. (బ. ఆండ్రు. ఆండ్రురు)

భార్య.

క. ఆలును బిడ్డలు బంధులు, నై లీలఁ జరించుచును గృహస్థుఁడు
దత్తల్లోలత్వరహిత చిత్తత, మేలుగ నలవఱుపవలయు మీఁద
దెఱిఁగి నృపా. శాంతి. 1-827

సీ. ...చతురులు వా రెందును నుతికి నెక్కె -తే- యున్నగంధర్వు
లేవురు నన్ను నిట్టు, లొకఁడు వఱుపంగ మూరకయునికి సూడ
నచ్చెరువుగాదె యెవ్వరి యాండ్రు రింకఁ, బరిభవంబునఁ బొందక
బ్రదుకువారు. విరా 2-160

సీ. నాలుగు జాతుల నాతులు విప్రున కాండ్రుగాఁ గై కొనఁదగు.
అను. 2-27

వ. జూదరి యాలికి గఱువతనం బెక్కడి యది. విరా. 2-159

క. వెడపనికి నాలిఁ జంపం గొడుకుఁ బనిచి వచ్చినాడ. శాంతి. 5-281

**ఆలుబిడ్డ** దే. వి. (ఆలు + బిడ్డలు) (ఆలు + బిడ్డ)

భార్యాపుత్రులు.

ఆ. ఆలుబిడ్డ లేని యట్టి బ్రతిమ్మరియగు, కొయ్యగాక కుదుటఁ గూడు
వెట్టి, కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ,జొచ్చు టచ్చ
గించి చూతురయ్య. ఉద్యో 2-9

ఆ బలము నీవ నాకు భక్తుండ నీయెడ. నాలుబిడ్డ లేని యట్టివాఁడ.
అను. 5-468

తే. ఆలుబిడ్డనక యతిథి, పూజనం బిట్లు నడపిన పుణ్యమునకు.
అశ్వ. 4-144

**ఆలుబిడ్డలు** దే. వి. బహు. (ఆలు + బిడ్డలు)

భార్యాపుత్రులు.

ఆ. ఆలుబిడ్డ లొంటులై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు

నవయ జనులు, మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర పీడనంబు
సేసి పేర్చివారు, అను. 5-98

**ఆలేపనము** సం. వి. అ. న.

మైపూఁత.

తే మాల్యములును భూషణములు నాలేపనములు వస్త్రములు వింత,
చెన్ను సేయఁ జేష్టలు విలసిల్లుచుండ. మాస. 29

**ఆలో** అవ్య. ద్రు.

అంతలోపల, అది జరుగులోపల.

క. ఆలో ధర్మజు సారథిఁ గూలఁగఁ గృపుఁ డేయ. శల్య. 1-261

క. ...మద్రసుతుఁ డాలోఁ దెలిసి లేచి శోభిల్లెఁ గడున్.
ద్రోణ. 1-190

**ఆలోకదానము** సం. వి. అ. న.

దీపదానము, దేవుని సన్నిధియందు దీపారాధనము (దీపము వెలిగించుట)
చేయుట.

క ఆలోకదాన మన భూపాల పరఁగు దీప మీగి. అను. 4-18

**ఆలోకనము** సం. వి. అ. న.

1. చూచుట, దర్శనము.

వ. ...ఒక్కనాఁడు యయాతి యశోకవనికాలోకన తత్పరుండై.
ఆది. 8-178

క. ...నా కొసఁగు తదీయాలోకనంబగు తెలుఁగు కృపన్.
శాంతి. 6-352

2. చూపు, దృష్టి.

క శ్రీమదపాంగాలోకనధామ. విరా. 2-1

3. నేత్రము, కన్ను.

వ ...కృష్ణుండు ధనంజయుం దనచేరువ నునిచికొని చిరకాల దర్శ
నోల్లాసితంబులైన యాలోకనంబుల నతని యాకారం బత్యాదరం
బున నభినందించుచు. అర. 4-153

**ఆలోకనీయము** సం. విశే. (అ. ఆ. అ.)

చూడఁదగినది.

వ. ...తత్ప్రకారంబునం గరదీపికాలోకం బాలోకనీయం బయ్యె. ద్రోణ. 5-144

**ఆలోకము** సం. వి. అ. పుం.

1. చూపు, దృష్టి.

మాలిని- వసుమజాదిత్య సత్ప్రసూన చతుర దయావిస్ఫారితాలోక. విరా. 4-277

2. దీపము.

క. ఆలోకదాన మన భూపాలక పరఁగు దీప మీగి. అను. 4-18

3. కాంతి.

వ. ...తత్ప్రకారంబునం గరదీపికాలోకం బాలోకనీయం బయ్యె. ద్రోణ. 5-144

**ఆలోకించు** సం. స. క్రి.

1. వీక్షించు, చూచు.

వ. కొమ్మనామాత్యు నాననం బాలోకించి తదనుమతి వడసి. విరా. 1-10; శాంతి. 3-427

2. ఆలోచించు, విమర్శించు.

క. ఈ లోకము నిస్సారం, బాలోకింపఁగ ననఁటియట్టుల. స్త్రీ. 1-32

క. ఏకాంత జనంబులు సుశ్లోకుండగు హరిమనంబులో నుందురు రా,లోకింప వారి కతనికి, నేకత్వము గలదు తెల్లమిది వేదములన్. శాంతి. 6-509; అను. 4-368

**ఆలోకితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

చూడఁబడినవాఁడు.

క. నాకుఁ గల సొమ్ము లెల్లను, నీకిచ్చెద ననుఁ బ్రసాదనిరత కటాక్షా, లోకితుఁ జేయు మనుఁడు నతఁ,డి కాఱులు మానుమనుచు నేగెం దెలుచన్. కర్ణ. 2-93

**ఆలోచనము** సం. వి. అ. న.

1. ఆలోచించుట, యోజించుట.

క. అని యూజడించిన నరుఁ డొడ్డొని ధర్మతనూజు నొద్దకుం బ్రియ మెసఁగం, జనుదెంచెం గార్యాలోచనమును దగఁ జేయు బుద్ధిశౌరి గడంకన్. ఉద్యో. 1-90

2. విచారణము, చర్చ.

క. తాలిమిలేని జనంబులు, మేలెఱుఁగక యట్టివాని మీఁదను జాడ్యం, కాలస్యం బిదియని దోషాలోచన మాచరింతు రది మతి యగునే. శాంతి. 5-263

**ఆలోడించు** సం. స. క్రి.

చక్కగా విమర్శించు, చర్చించు.

అ. సర్వశాస్త్ర వాక్యసమితి నాలోడించి. అను. 4-868

(సూ. ని. ఇచ్చిన పాఠము. దీని స్థానమున ఆలోకించి అని ఆనంద అకాడమి సం.ము. ప్రతుల పాఠము. తి.వ. ప్ర.లో. ఈపదము కానరాదు)

**ఆలోన** దే. అ. ద్రు. (ఆలోనన్ + అ—ఆలోనన)

ఆలో, అంతలో, ఆంతలోపల, అది జరుగులోపల, త్రుటి కాలములో.

వ. ఆలోన సైంధవుండు సంభ్రమంబున. ద్రోణ. 1-170

వ. వధియించు సాధనం బన్వేషించు నాలోన వంచించి. శల్య. 2-170

క. ఆలోనం గురుధరణీపాలుఁడు. శల్య. 2-275

సీ. అరదంబుపై వ్రాలి యాలోనఁ దెలిసి. విరా. 3-170

వ. ...అతని కాలోన నచటి కేఁగుదేర సమకూరిన విధంబుమ. శల్య. 2-144

క. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివింశతి రథంబెక్కె వాలోనన యట్టి నారాచంబున రారాజు నురంబు నొనాట నేసిన. విరా. 5-196

**ఆలోలత్** సం. శత్ర.

ఆసక్తి గొలుపుచున్న.

శా. ...కర్ణాఖ్యన్ జగత్కర్ణ పూర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు
ప్రభూతాశ్చర్యులై రచ్చటన్. ఆది. 6-80

**ఆలోలత** సం. వి. ఆ. స్త్రీ.

వ్యామోహత.

క బాలత్వంబున నవివేకాలోలత కుచియు నశుచి యైనదియు.
స్త్రీ. 1-39

**ఆలోలము** సం. విణ. (అ. ఆ. అ.)

కదలునది. చలించునది.

సీ. ఆలోల పవన వాచాలితకల్లోల, రసిత మృదూక్తులు నెసఁగుచుండ.
అర. 8-88

సీ గాలి నవ్విట సమాలోల మగుడు. అశ్వ. 8-105

**ఆవ** దే. వి.

ఆవగింజ. చూ. ఆవంత

**ఆవంత** దే. వి.

ఆవగింజంత, మిక్కిలి కొంచెము.

క. నీ వింత యలుగ నేటికి, నా వంతయుఁ బౌరజన మనఃఖేదము నొ,
క్కావంత ద్రిక్కకుండఁ గ,లావంతులు మత్ప్రతులు గలరు వగ
దీర్పన్. విరా. 2-161

ఆ. ...మనముల నావంత, శంక లేదు సంతసంబు ఘనము.
సౌ ప్తి. 1-52

ఉ. ...మనంబులో నా, వంతయు శంకలేక. కర్ణ. 8-288

**ఆవము** దే. వి.

కాల్చుటకై పేర్చినకుండలు ఇటికలు మొదలగు వాని దొంతర

సీ. ...కడవకు...తే. ఎత్తియొకచోట డించిన నెడలుటయును, నెండ
యవియుటయును నావమిడినఁ బగిలి, పోవుటయు వాడు జనులచేఁ
బొలియుటయును, గలుగు గతి మేని కెట్లును గలుగుఁ జేటు.
స్త్రీ. 1-34

**ఆవరణము** సం. వి. అ. న.

ఆచ్ఛాదనము, కప్పు, కవచము.

ఉ. ...కృపాణచ,ర్మావరణాది భాసిత మహోభుజ విక్రములైన వార
లన్. సభా. 2-278

చ. స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి నిరస్త నీరదావర
ణము లైదళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్లి...వెలిగె వాసర
ముఖంబులు శారదవేళఁ జూడఁగన్. అర. 4-158

**ఆవరించు** సం. స. క్రి.

క్రమ్ము, కప్పు.

వ. నాకుంగా లోకంబులం గరుణాలోకంబున నావరింపు మనిన.
ద్రోణ. 2-168

ఇది నం.ము పాఠము. ఆనందవాణి పాఠము అదరించు. సం.ము 'ఆవ
రించు' అనుదానికిఁ బాఠాంతరమేమియు నీయలేదు. 'ఆవరించు' కన్న
'అదరించు' పాఠమే యర్థస్ఫూర్తి గలదిగఁ గన్పించుచున్నది.

"శ్లో. ప్రసీద భగవన్ సర్వం రోషేనస్యాద్వరోమమ" ద్రోణ. 58-10

చూ. అదరించు, 8వ అర్థము. (ఆవరించు పద మీ యొక్క భావననే
కన్పించుచున్నది)

**అవర్జితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆకర్షింపఁబడినది.

ఉ. అర్జునుఁ డప్డు భీష్ముఁగని యగ్గలికన్ గుణరావసంగమ,స్ఫూర్జిత
దేవతత్తరవ శోభితుఁడై గణకేళి కౌతుకా,వర్జిత చిత్తవృత్తి నని
వార్య పరాక్రమలీలఁ దాఁక న,తూర్జిత రౌద్రమయ్యె బహు
శోగ్ర మహాస్త్రగతాగతంబులన్. భీష్మ. 1-250

2. వంపఁబడినది, వశము సేసికొనఁబడినది.

ఉ. ...విక్రమా,వర్జితవైరి భీముఁడును వారికిఁ దోడుగ నేగుటెల్లకో
ద్రోణ. 4-129

**అవర్తనము** సం. వి. అ. న.

1. ఆవృత్తి, జనన మరణ రూపమైన తిరుగుట.

క. పునరావర్తన రహితుం, డనఘా పరమాత్ముఁ జెందినట్టి పురుషుఁడు.
శాంతి. 5-619

2. సుడి తిరుగుట, మరలుట.

క. అంగములు హోమకాలంబున నానాభూత వర్ణములతోడ శిఖల్, మనుజేశ్వర నామావర్తన మొందఁగ నుగ్రగంధ రౌద్రంబ లగున్ మౌస. 1-20

**ఆవర్తము** సం. వి. అ. పుం.

1. నీటి సుడి

వ. ... రక్తాంబు తురగావర్తిక కరి గిరి కలితంబైన సమరాంగణ సాగరంబు. ద్రోణ. 1-280

వ. ... తృష్ణావర్తంబును నానా ప్రీతి రత్నంబును సత్యతీర్థంబును నగు సంసార సాగరంబు. శాంతి. 5-618; సభా. 2-175

2. మరలినది, కొనగలది.

ఆ పరిగృహీతులైన బ్రాహ్మణుల్ పంక్తిపావనపరిమ్లలగుట వారికిడిన, దర్భ విష్టరములు దక్షిణావర్తంబులగుటఁ గ్రియలు దిల సమగ్రలగుట. అను. 3-182

3. తిరిగినది, చుట్టినది.

ఉ. ప్రదక్షిణావర్త శిఖాగ్రహస్తముల వహ్ని. ఆది 2-228

**ఆవర్తి** సం. విణ. (న్. నీ. న్.)

చుట్టు తిరుగునది,

క. ఈ జన్న మొనర్చియకా, దే జగదావర్తికీర్తి దీపితులైయ, వ్యాజ సురలోక సుఖముల, భ్రాజిల్లిరి రఘు యయాతి భరతాది నృపుల్ ఆర. 6-89

**ఆవర్తించు** సం. స. క్రి.

త్రిప్పు, మరలుచు.

క. నీ వడిగి పనుం బ్రాణముఁ, గావఁగ మాయంద బోధకంబగు ద్రవ్యం, బావర్తింపఁగఁ జేయుట, గావించును నీకుఁ దెలివుఁ గని కొను మిదియాన్. ఆశ్వ. 2-87

**ఆవర్తితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆవృత్తి నొందినది.

క. వితత ప్రదక్షిణావ,ర్తిత దీప్త శిఖానలమున ధృతి వేల్చెఁ బురో,
హితుఁడగు ధౌమ్యుఁడు బుధస,మ్మతుఁడు వివాహ ప్రయుక్త
మంత్రాహుతులన్. ఆది. 7-288

**అవఉచినట్లఅచు** దే. జాతి.

ఆవు అఱచిన విధముగా నఱచు, పెద్ద పెట్టున ఏడ్చు,

ఉ. బాధిత శత్రువర్గులగు పాండుకుమారుల దుఃఖవార్త...విని దుఃఖ
బాధ్యలై, యాధృతరాష్ట్రిఁ డావఱచిన ట్లఱచెన్ వివిధ ప్రలా
పుఁడై. ఆది. 6-168

**అవల** దే. ప్రా. అవ్య. (అ+వలను)

అవ్వల, అవల, అవుల.

1. దేశ కాలములయందు అనంతరము, అవతల.

(దేశమునకు) సీ. హిమాచలంబును నావల హేమకూటంబును నట
నిషధంబు నొప్పు. భీష్మ. 1-21

సీ. రౌరవంబనఁగ ధరాస్థలి క్రింద మహారౌరవంబన నవుల దాని
నావల విను కంటకావనంబవనుండు. అను. 5-170; అర. 6-368

(కాలమునకు) ఉ. ఆవల వచ్చునాపదల కన్నిటికోర్చి లతాంగిఁగూర్చి
కాకివెడమాటలన్ మరలఁ జెన్ని విధంబులఁ జూపి చెప్పినన్.
విరా. 2-78

చ. అకట నిశాంతలోభమున నావలఁ బాటిలు కీడు గానఁజాలక.
భీష్మ. 1-186

2. ఆ వైపు.

క. చావును నోవును మనయో,ధావలికిన్ గెలుపు నుబ్బు నావలికివి
స్త్రీచే వినియెదఁ దుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడున
ఁదే. భీష్మ. 2-199

విణ.

అవలిది. అన్యము, ఇతరము.

క. విను నూతి కప్పు విధమున, నను నీవ యెఱుంగు దెఱుఁగ నేరవు
గర్వం, బున నావలికోలఁది రణం, బున నొకమరి పట్టుపడక

పోనేర్చెదవే. ఉద్యో. 4-196

**ఆవలి(ళి)** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

సమూహము, గుంపు.

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారం గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ. విరా. 1-80

ఉ. చిత్తము లుల్లసిల్ల నల సింహకిశోరము లొక్కమై మదోన్మత్త
గజావళిం బొదువు మాడ్కి. ఉద్యో. 2-140

సీ. కుల పర్వతావళి కులిశ భయంబున బెదరి వాపోవున బ్లైదురు
సెంగె. విరా 4-116

తే. ...కమల, ముఖుల తాలవృంతానిలముల సుఖించు, ప్రభువె
కంక గృధ్రావలీపక్షవాయు. వడర నిలంబడి యున్నవాం డక్క
టకట. ఆశ్ర. 3-161

**ఆవశ్యకము** సం. విణ. (అ. ఆ. అ.)

అవసరమైనది, ముఖ్యమైనది. తప్పనిది

సీ. ... వసుధ యిత్తఱి వసుహీనమై యున్నది, దానంజేసి భూదేవ
నిహిత ధనాదాన మావశ్యకంబయ్యె ఆశ్వ. 3-187

**ఆవసథము** సం. వి. అ. పుం.

వాసస్థానము. ఉనికిపట్టు, ఇల్లు

చ. ...కుక్కలకు నావసథంబు ప్రవిష్టపంబునం, గలుగునె...
మహా. 54

మత్తకోకిలము : దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులుం,
బావనాశ్రమ భూములుం జెడి పాడగున్. అర. 4-305

**ఆవహము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కలిగించునది.

వ. మహాభారతంబు సమస్త దురితాపహంబును నఖిలమత శుభావహంబు
నుం గావున. విరా. 1-48

క. నీ కూరిమి సౌఖ్యావహ మఖిల జగములకు.
ద్రోణ 5-21; శాంతి. 1-63

వి. అ. పుం.

2. కలది.

క. ...వి,రావహుని( గర్ణు నోర్వంగా వచ్చిన(గాదె నాకు( గడు(బ్రీతి
యగున్. ద్రోణ. 5-3

**ఆవహించు** సం. స. క్రి.

1. కలిగించు, ఆవహిల్లఁజేయు.

వ ...కెంపు సొంపు సంపాదించి యకాలసంధ్య నావహించిన.
విరా. 5-60

క. అది నాయది యను మూ(త,న్మది నెయ్యది పట్టుకొల్పినను వాసి
తమై, తుది( జేటునొందు వానికి, నది శోకము నావహించు నత్యం
తంబున్. శాంతి. 4-18; శాంతి. 5-292; 570

2. రప్పించు.

క. కని యిది కన్యక దోసం, బని తలఁచక బాల్యసంభృతాజ్ఞానము
వేడ్క వొనర్ప నావహించితి, మునిమంత్రబలమున సూర్యు
మునినాథవరా.

తే. అవహించిన నద్దేవు( డాకసమున, నాత్మమూర్తి వర్తింపమూర్త్యం
తరంబు, దాల్చి వాకడ కేతెంచె( దత్క్షణం బ,నాదుచిత్త మాశ్చర్య
మగ్నంబుగా(గ. అర. 2-98, 99

3. ఆవాహనము చేయు, మంత్రాదులచే ప్రవేశపెట్టు.

వ. ...ఒక్క పసిండి కత్తళంబునం దాశక్తి యావహించి యిచ్చిన.
ద్రోణ. 3-116

తే. శుభ్రమగు మృత్తిక సురుచిర(పు(, బ్రతిమ గావించికొని యందు(
బరము నావ,హించి పూజా విశేషంబు లెల్లఁజేసి, నీవు దొలుమేన(
గొలిచితి నిష్ఠతోడ. ద్రోణ. 4-416; శాంతి. 6-184

4. ఆవేశించు.

వ. ... రౌద్రం బావహించిన అయకాలరుద్రుని సంక్రీడనంబు
చందంబు దోఁచె శల్య. 1-211

5. మార్పు నొందించు, ప్రవర్తింపఁ జేయు.

తే. నాకు నివ్వర మిమ్మని నమ్రమయగుదు; వీఁడు బ్రాహ్మణుఁ డగుఁ గాక వీని కొడుకు,నందు రాజత్వ సంపద యతిశయిల్లు, వనియోఁ గరుణార్ద్రచిత్తుఁడై యత్తపస్వి.

వ. అట్లమ్మౌని యావహించుట కతంబున సత్యవతీ పుత్ర పౌత్రులైన జమదగ్ని పరశురాములు గ్రమంబున బ్రహ్మక్షత్రతేజోవిరాజితు లయిరి గాధి భార్యకు జనియించి విశ్వామిత్రుఁడు.

అను. 1-116, 117

6. కల్పించు.

తే. బ్రహ్మఁ గల్పించి దానికిఁ బతిఁగఁ జేయ, నమ్మహాత్ముఁ డహంకార మావహించి, మనసుఁ బది యింద్రియములు బుద్ధిని ఘటించి, చదలు మొదలగు భూతపంచకముఁ జేయు. అను. 1-324

ఉ. అత్తకు భక్తిగల్గి మది నాయమ సెప్పిన మాడ్కి జీవితా, వృత్తము లావహింతు. అర. 5-304

7. ప్రతిష్ఠించు.

వ. ... అత్తపోధనుండు దన నందముం డగు జమదగ్నియందు సమస్త ధనుర్వేదంబును నావహించు నవ్విశేషంబు తత్పుత్రునందు ఫలియించు. అను. 2-381; శాంతి, 2-69

8. ధరించు, పూను.

చ. భువనము లొక్కపెట్ట మృతిఁ బొందిన జీవము లావహింపనేర్తు వలచినట్టులైన గుణరూఢుఁడు మేనమఱందిపౌత్రుఁ జావ విడుతె. ఆశ్వ. 3-177

అ. క్రి.

9. కలుగు, సంభవించు.

ఆ. అగ్ర పుస్తకంబు లర్చించి చూచుచుఁ, బరమనియతిమైనుపశ్రుతు లకుఁ, బోవుచును శుభంబు లావహించుటఁ గాంచి, చెలఁగి యొండొ రులకుఁ జెప్పికొనుచు ద్రోణ. 2-345

ఆవహిల్లు సం. అ. క్రి.

1. కలుగు, ఉండు.

వ. అప్పు డావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె. విరా. 5-188

గీ. అఖిల సిద్ధులు నటచేత నావహిల్లు. శాంతి. 3-415

2. పుట్టు, జనించు.

వ. అందు దుర్నయంబు లాచరించిన వమ్మునిని కోపించి విఖహోమధేనువు వాలోకించి నీ బలంబు పనుపుమనిన నది దన మాహాత్మ్యంబున నచట నావహిల్లిన ఘోరాకారులగు వీరులఁ బనుప వారలా రాజు వరూథిని మడియించిన. కల్కి. 2-165

3. పరిణమించు, ఏర్పడు.

సీ. ఎయ్యవి సుఖము లొక్కింతకాలమునకు నవియ దుఃఖంబు లై యా వహిల్లు. శాంతి. 4-172

ఆవహుఁడు సం. వి. అ. పుం.

సప్తవాయువులలో నొకఁడు. శాంతి. 6-307

వీరు 1. ప్రవహుఁడు 2. ఆవహుఁడు 3. ఉద్వహుఁడు 4. సంవహుఁడు 5. వివహుఁడు 6. పవహుఁడు. 7. పరావహుఁడు.

ఆవళి సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆవలి

చూ. ఆవలి

ఆవాప్తము సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁబడినది.

తే. చాల దుస్తరమైన యజ్ఞాతవాస, వత్సరంబు భవద్గర్భవాస గుప్తి, వలన గడపితి మతిసుఖావాప్త చిత్త,వృత్తి నేము నిర్భయులమై యిందులట్లు. విరా. 5-344

ఆవాప్తి సం. వి. ఇ. స్త్రీ.

ప్రాప్తి, పొందుట.

క. దేవతలకైన నొక్కొక, చో వలయునకావె శత్రు సూదనవిధి కా,

లావాప్తికి మను దమ న, ద్భావంబు లడంచి యడుగఁబడి యుండంగన్. విరా. 1-58; శాంతి. 4-360; శాంతి. 5-248

**ఆవాసత** సం. వి. అ. స్త్రీ.

ఉండుట, నివాసము.

క. అతిథుఁడు రాజ్య సుఖలీ,లా విముఖత వెడలి బంధులం దొలఁగి యత్తేష్టావాసత ప్రబంగనుడువడి, పోవుట. విరా. 1-268

**ఆవాసము** సం. వి. అ. పుం.

1. ఉండుట, ఉనికి.

మ విపినావాసము గూఢచర్యయును గావింపం దలం పొప్పరే. విరా. 1-7

క. ఆవాసము శుక్లమునకు నఖిలాంగకముల్. శాంతి. 4-305

2 నివాసము, మందిరము, ఇల్లు

క. దేవవ్రతుఁడు గీర్వాణావాసంబునకుఁ జనిన. స్త్రీ. 2-117

క. ...అర్జునుండు భాసురమగు న, మ్మానవ ప్రగేసరముగ యజ్ఞా,శావా సంబునకు వచ్చె నంచిత లీలన్. అశ్వ. 4-166

**ఆవాసి** సం. విశే. (న్. సీ. న్.)

నివసించువాఁడు.

క ... పరదేశావాసుల మగుదుము. అను. 1-195

**ఆవాహనము** సం. వి. అ. న.

ఆహ్వానము, పిలుపు, అస్త్రాదులయందు మంత్ర పూర్వకముగా శక్తిని ప్రవేశపెట్టుట. ఒకస్థలమునందుఁగాని ప్రతిమయందుఁగాని మంత్ర పూర్వకముగా దేవతాదులఁ ప్రవేశపెట్టుట.

తే. మోహనాస్త్రంబు సంచితావాహనంబు సేయుటయును. ఉద్యో. 5-347

వ. కుబేర మాణిభద్ర ప్రభృతి భూత యక్ష జనంబులను సభక్తికా వాహన కలితులం గావించి పూజనంబు లాచరించి. అశ్వ. 3-150

**ఆవి** దే. వి.

ఊపిరి, శ్వాసము

గీ. అసురయోధను ముక్కున వావిగలుగఁ, బడమి నీ కీఁడు.

ఉద్యో. 3-41

**ఆవిద్ధము** సం. విశే. (అ. ఆ. అ.)

కొట్టఁబడినది, గాయపఱుపఁ బడినది.

క. ఆ విజయుఁడు గర్ణుని విల్లు, వావిరిఁ దునుమాడి విపుల వక్షము నవలీలా విద్ధముచేసి యతని, జీవము గొనునట్టి ఘనవిశిఖ మేసె వడిన్ ద్రోణ. 4-300

**ఆవిద్ధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. గాయపఱుపఁ బడినవాఁడు, కొట్టబడినవాఁడు

మ. విరథుండున్ వినికృత్తచాపుఁడు శరావిద్ధుండునై మేదినీ, వర నీ పుత్రుఁడు. శల్య. 1-145

2. పీడింపఁబడిన వాఁడు

సీ. దమయంతిఁ జూచి కందర్ప శరావిద్ధుఁడయ్యె నలుండు.

అర. 2-39

**ఆవిర్భవత్** సం. శత్ర.

పుట్టుచున్న.

మందాక్రాంతము : వీణానాద ప్రతినిగమావిర్భవ త్స్వర పుణ్య, శ్రేణీ సంపాదిత విమలతా స్థేమ నిర్లేప చిత్త, ప్రాణాక్రీడాకలన సంతతోత్సాహవద్దివ్యభావా స్త్రీ. 2-184

**ఆవిర్భవించు** సం. అ. క్రి.

ప్రభవించు, పుట్టు

వ. ... ఆ లోకపితామహు లలాటంబున...నావిర్భవించి.

శాంతి 2-208; అను. 5-276

**ఆవిర్భావము** సం. వి. అ. పుం.

పుట్టుక, కలుగుట

క, ...నాకై, నిర్భర విధ్వంసదశా, విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా. 1-322

**ఆవిర్భూతము** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టినది, వెలువడినది

మ. వెరవే సంపదఁ గోరి గాండివగుణావిర్భూత బాణాలి కి, ల్బైరయై
వచ్చుట. ద్రోణ. 3-185

**ఆవిర్భూతి** సం. వి. ఇ. స్త్రీ.

ఆవిర్భావము.

మ. ... భారతకథావిర్భూతికిం గారణంబును ఆది. 1-74

**ఆవిలత** సం. వి. అ. స్త్రీ.

1. (రక్తాదులచే) కలుషత్వము, మలినమగుట.

క. ప్రోవులు గట్టిన గుఱ్ఱపుఁ, బ్రేవులు నేనుఁగుల తలచుఁ బీనుంగులు
ర,క్తావిలత వెల్లచీరలు, గావులు నై భటనికాయ కాయంబులునై
భీష్మ. 2-289

2. నష్టము

క. ... సంక, ల్పావిలతకు నలుగుట పితృ దేవతలకుఁ గలుగుఁ
బొమ్మౌ దిగ్గున ననుడున్. అశ్వ. 4-281

**ఆవిలత్వము** సం. వి. అ. న.

కాలుష్యము.

ఉత్సాహవృత్తము :... పను శో,కావిలత్వ ముడుపఁబూని యరుగు దెంచి
తిన్. స్త్రీ. 1-66

**ఆవిలము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కలఁగఁబాఱినది. (చిత్తము మొ.)

ఉ. ...ఈతఁ డ,త్యావిలచిత్తుఁ డయ్యెను నుపాదా ప్తమృతిన్ దుర
టల్లు నెవ్వగం, బోవఁగఁ ద్రోవు నీదయిన పుణ్యతపస్ఫుట వాక్య
పద్ధతిన్. శాంతి. 2-109

2. కలుషమైనది, పాపము గలది.

ఉ. ...కా,మావిల బుద్ధిగాక యుచితాగత సౌఖ్యము లాచరించు
చున్, భూవిభుఁ డెవ్వ భూమిసతిఁబొంది రమింప మహోన్నతుం
డగున్. శాంతి. 3-125

ఉ. కావున నన్నదానమునఁ గాకేటులుండు మహాప్రమోద కు,త్సా
విల చిత్తుఁడైనను మహాత్తర దానమునన్ విశుద్ధ స,ద్భావత
నొందు నిక్క మని పల్కె. అను. 4-358

ఉ. ...ఆ,త్మావిల భావముం దపము నగ్గలికం బెడఁబాపు.
అశ్వ. 2-181

3. కలాపిగాఁ జేయఁబడినది.

సీ. మలయజ మృగమదావిల సలిలంబుల నిమ్ముగా నార్ద్రీకృతమ్ము
లయిన -గీ- యంగకులవొప్పె. ఆది. 6-146

**ఆవిస్ఫురణము** సం. వి. అ. న.

పరాక్రమము.

క. ...అ త్తరుణిం గాచుటకు నత్యుదగ్ర భుజావిస్ఫురణాఢ్యు నొక్క
రక్కను...గ్రక్కునఁ బనిచెన్. విరా, 2-170

**ఆవిష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

1. (దయ మొదలగువానిచే) గ్రసింపఁబడినది.

వ. ఇట్లు వేసి పరమకృపావిష్ట హృదయుండై తపోవనంబునకుం
జనియె. శాంతి. 2-84

2 చొచ్చినది, నివిష్టము.

క. ఏ విధము కాంతనైనను, దా విహరణమునకు నెపుడు దార్చుఁడు
తనయం దావిష్టము భార్యావ్రత, మా వెరవ వడ్డం బుపస్థ యను
వాకిటికిన్. శాంతి. 5-320

3. ఆవేశింపఁబడినది.

సీ. ...పురహరునకు, నంతయు నెఱింగింప నతఁడు త్రిశూలంబుఁ
బనుప దై త్యావిష్ట భావ మడఁచె. శాంతి. 5-495

4. కలిగినది, ఏర్పడినది.

క. నీ వలనన కలిగి కురు,త్మావలయం బెలునట్టి జనపతు లన్యోన్యా
విష్టరోషులై రణ,సేవనమునఁ గులము తఱచు నెఱుతురు వత్సా.
శాంతి. 6-526

**అవిష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

1. (భయక్రోధాదులచే) గ్రసింపఁబడినవాఁడు.

వ. ...అయ్యాచార్యసుతుం జూచి రోషావిష్టుండై ధృష్టద్యుమ్నుండు దాఁకి. ద్రోణ. 5-127

2. నిండినవాఁడు, వ్యాపింపఁబడినవాఁడు.

సీ. పీతంపురోమంబు చేత నొప్పార నావిష్టుండగుట శిపివిష్టుఁడనియు. శాంతి. 6-482

3. ఆవేశింపఁబడినవాఁడు.

సీ. రాక్షసావిష్టుఁడై నవ్వు రాజ్యలీల, విడిచి తన్నెఱుంగక తదాదేశ రహితుఁడైన యప్పుడు రాజ్య కార్యంబులందు, బద్ధబుద్ధియై కల్మాషపాదుఁ డుండె. ఆది. 7-113

**ఆవు** దే. వి. (బహు. ఆవులు-ఆలు)

వృత్తియందు అంత్యవర్ణలోపము వికల్పముగ నగును. ఉదా : ఆవు పెయ్య-ఆఁబెయ్య. మొ. కర్ణ. 2-90

గోవు, మొదవు.

ఉ. ఆ ధృతరాష్ట్రుఁ డావఱచిన ట్లఱచెన్. ఆది. 6-168

చ. అనుటయు భీతి వేఁడికొని యావులు వేయును నెద్దనాఱునూఱును. కర్ణ. 2-91

**ఆవులనేయి** దే. వి.

ఆలనేయి, ఆవుల పాలనుండి తీసిన నేయి.

తే. ఆవుల నేయి విప్రులకు నీగిఁ దాని వ్రేల్చుట ద్రావు టుదాత్త తరము. అను. 8-48

**అవులించు** దే. అ. క్రి.

ఆవలించు, జృంభించు.

వ. ఇట్లు మ్రింగినం ద్రిదశ గణంబులు దక్షిణంబ యాదైత్యునకు నావులించునట్టి యాలస్యం బావహించిన. ఉద్యో. 1-124

తే ఆసురనాథుండు నలసత యడర నీల్గి, యావులించిన నత్తతి నమర
విభుఁడు, దనశరీరంబు సంకుచితంబుసేసి, కడుజవంబునఁ గుప్పించి
వెడల మఱికె. ఉద్యో. 1—125; అర. 7-95

**ఆవులింత** దే. వి. (√ఆవులించు)

ఆవలింత, ఆవులించుట.

ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములుగాఁగఁ,
జలుపవలయు. విరా. 1-137

**ఆవృతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కప్పఁబడినది, మఱుగు పఱుపఁబడినది.

ఉ. కావున దీనియం దిడుట కార్యము గైదువులెల్లఁ గేశచర్మావృత
సంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం.

విరా. 1-166; శాంతి. 5-559; అర. 3-369

2. చుట్టఁబడినది.

తే జగతిఁగల జనపతులు నీ చరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవేలా
వృతోర్వి, యెల్ల నేలుట యొప్పదే. ఉద్యో. 3-265

3. ఆక్రమింపఁబడినది.

సీ. ...నక్షత్ర గణావృత గగన సదృశు. శాంతి. 2-8

4. గుప్తము, సురక్షితము.

మత్తకోకిల: (అభిమన్యుఁడు) ఆదిఁగొలెను గృష్ణచే దయ నావృతుం
డయి ధౌమ్యుతో, వేద మంగయుతమ్ముగాఁ జదివెన్.

ఆది. 8—227

**ఆవృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఆవరణము.

ఉ. ...పుష్పితవల్లి వేల్లితో,ర్వీజవనావృతిన్......రమ్యమగు రైవత
కాచల కందరంబునన్. ఆది. 8-171

**ఆవృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చూ. ఆవృతము.

**ఆవృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. జనన మరణ రూపమైన తిరుగుడు.

క. ...చిన్మయు, ననుస్మరించునది యపునరావృత్తికినై.

శాంతి. 4-247

2. ఒక వంకనుండి మఱియొక వంకకుఁ ద్రిప్పుట.

వ. (అర్జునుఁడు) ఈ శరీరంబుతోడన నమరావతికి నరిగి యందు మహేంద్రు నాచార్యుఁగా వరించి తత్ప్రసాదంబున దివ్యాస్త్రంబుల ప్రయోగంబును నుపసంహారంబును నావృత్తియుఁ బ్రాయశ్చిత్తంబును బ్రతిఘాతంబులును నేర్చిన వాని సంతోసిల్లి సురేంద్రుఁ డిట్లనియె.

అర. 4-52

**ఆవేదించు** సం. స. క్రి.

తెలుపు, ఎఱిఁగించు.

వ. ...సత్యవతీ నందనుం డాగామి శుభంబు లావేదించి చనిన.

ఆది. 7-164

**ఆవేదితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

(తెలుపుడు సేయుట) కలవాఁడు, విన్నవింపఁబడినవాఁడు, విజ్ఞాపితుఁడు.

వ. ...పుత్రశోకార్తుఁడగు నప్పాండురాజ పుత్రుండు పుత్రశోకార్తిం బొగులు విచిత్రవీర్యపుత్రుకడకుం జని తత్పార్శ్వవర్తులచేత నావేదితుం డగుచు నాభూవల్లభు పాదంబులకుం బ్రణతుం డగుటయు.

స్త్రీ. 1-124

**ఆవేశము** సం. వి. అ. పుం.

1. ప్రవేశము, చొచ్చుట.

క. కావునఁ గామక్రోధము, లావిర్భూతములు గాని యట్లుగఁ దత్సత్త్వావేశంబున నూన్పుము, భావం బివ్విధము విష్ణుపరత గుమారా.

అను. 1-313

2. ఆవేగము, చిత్తసంభ్రమము.

క. నీ వలుగుల పఱుటకు దుఃఖావేశము వొందనే నిరర్థకమగు ని,య్యో

వపుఁ బుట్టువు పుట్టిన, నావగ నెవ్వరికి నెక్కు నళినదళాక్షీ.
విరా. 3-50

3. అభినివేశము, చలము.

వ. ...అప్పార్థుండు రెండు బలంబులయందు నున్న సోదర సుత మాతులాచార్యాదులగు బంధు శిష్ట జనంబుల నాలోకించి పరమకృపావేశంబున నత్యంత విషాదంబు నొంది. భీష్మ. 1-180

క. యౌవనమున విషయ పర,త్వావేశము దుఃఖకారియై యలఁపఁగ నా,నావిధ దుర్వినయములకుఁ, దావలమై మెలఁగు నిందిత ప్రక్రియలన్. స్త్రీ. 1-40

4. ఉద్రేకము, విజృంభణము.

క. వినుము శుక్లావేశము సంకల్పజ, మావాసము శుక్లమునకు నఖిలాంగకముల్. శాంతి. 4-305

5. కలుగుట, ఏర్పడుట.

వ. (జ్వరము) మనుష్యులకు జనన మరణాదుల యెడ వేదనావేశంబునుంగా విభజించె. శాంతి. 5-448

6. (పిశాచరాక్షసాదులు) సోఁకుట.

వ. అని చెప్పిన వినుచు మున్ను రాక్షసావేశంబునం జేసి నీచపరాక్రమంబు లాచరించి తదనంతరంబ తెలిసి యారథికవరులు వగం బొగులుచున్నవారు. సౌప్తి. 1-204

7. సంరంభము.

శా. విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం,పద్విఖ్యాతుఁడు. విరా. 1-3

ఆవేశించు సం. అ. క్రి.

ప్రవేశించు, చొచ్చు.

వ. ...అతం డెఱుంగకుండ, తేజోరూపంబున నతని తనువున నావేశించె. సౌప్తి. 1-184

క. ఆవేశించెద యోగ, ప్రావీణ్యంబున మునీంద్రు కార్యం బదప్పె,

యావిప్రులతాత్మ మనమున, కీ విజ్ఞానంబు దోఁచునే వెఱపేలా ?
ఆను. 2-192; శాంతి. 6-289; ఆర. 5-262

**ఆవేశితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రవేశపెట్టఁబడినది, ఉంచఁబడినది.

క. దేవా జనమేజయ జగ,తీవరుఁడు గుతూహలము మదిన్ మొల
తేరం,గా వైశంపాయన వద,నావేశిత దృగ్విలాసుఁడై యిట్లని
యెన్. స్త్రీ. 1-2

**ఆశ** సం. వి. ఆ. స్త్రీ.

1. ఆస, కోరిక, తృష్ణ, ఉత్కంఠేచ్ఛ.

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁ
డున్, భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెఱుఁగరే పోరెట్లుఁ గయ్యంబు
లా,శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం జావేఁడి మార్గాంతరం,
తే పో తమ్ముఁ గపిధ్వజప్రభల యందీభూతులం జేయవే.
ఉద్యో. 1-321

2. దిక్కు.

మహాస్రగ్ధర : వితతజ్యానాద మూశా వితతి నినిచి. సౌప్తి. 1-189

**ఆశంక** సం. వి. ఆ. స్త్రీ.

1. భయము.

క. పితృగణ హితార్థముగ సత్రక్రతు వొనరింపంగ బుద్ధిగలదు ప్రజా
సం,హ్రాతి తత్రక్రతువున నగు నని, మతి నాశంకయును గలదు
మానుగ నాకున్. సభా. 1-95

2. సందేహము, అనుమానము

క. ఇవవంశోత్తముఁ డిప్పడ, చనుదెంచుఁ బ్రియంబు నొందు జల
జానన నా,విని జానకి లక్ష్మణునెడ, జనితాశంకయయి క్రోధసం
భ్రాంతమతిన్. ఆర. 6-388

**ఆశంసనము** సం. వి. అ. న.

కథనము, చెప్పుట, తెలుపుట.

క. జనవరతీర్థ విధాశంసనమగు నీపుణ్య వాక్యచయము పవిత్రం, బనుపమము మాననీయం, బనిమిష పదవీప్రదము రహాస్యము సుమీ. అను. 2-94

**ఆశపడు** వి. అ. క్రి. (అశ + పడు)

కోరు; అపేక్షపడు.

తే. నాకుఁ బ్రజగతి నిచ్చు ననంగ వలవ, దేన ప్రజనయి పాదమెసఁ గాన యేను, నన్నుఁ గనుచున్న నది మోక్షణంబు సేయు, నాశపడ నట్టులగుటఁ బ్రజాళియుక్తి. శాంతి. 4-27

**ఆశయము** సం. వి. అ. న.

1. స్థానము, పట్టు.

క. సలిలాశయములు సేసిన, నలఘు ప్రియమందుఁ దిత్పచయములు. అను. 3-381

2. మనస్సు, చిత్తము, హృదయము.

క. ప్రియవస్తు చెడలుటయు న, ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన వినిశ్చయ హీనులైన యల్పాశయులకు దుఃఖంబుఁ జేయు జగతీనాథా. స్త్రీ. 1-80

క. ...శుద్ధాశయ సంభజన మహిత హరిహరనాథా. సౌప్తి. 2-1

**ఆశాచక్రము** సం. వి. అ. న.

దిగ్వలయము.

సీ. చాఁగిన శాఖ లాశాచక్రముల కొలందులు బారవెట్టంగఁ బొలుచుదాని. విరా. 1-162

**ఆశాసించు** సం. స. క్రి.

1. ఆశీర్వదించు.

వ. ...అమ్మనుజపతి దనకు జయం బాశాసింపుమని యభ్యర్థించిన నయ్యాచార్యుండు నీకుం గృష్ణుండు మంత్రియైయుండ నొరుల జయం బాశాసింపు మననేల. భీష్మ. 1-161

2. కోరు.

తే. (ధృతరాష్ట్రుఁడు) వారలకు శ్రీయు నాయువు వైరిజయము,

మానసమున నాశాసించు మానవేంద్ర (వారలకు : పాండవులకు).
ఆశ్ర. 1-14.

**ఆశి** సం. విణ. (న్. నీ. న్.)

(తఱచు సమాసాంతమందు వచ్చును) తినువాఁడు.

ఉ. మార్పుము కాలయాపన మమర్పక యప్పిశితాశిఁ బట్టి పాలార్పఁగ నేల. **ఆది. 6-218.**

**ఆశీర్వాదము** సం. వి. అ. పుం.

దీవన.

క. భూదేవోత్తము నాశీర్వాదంబులుఁ బ్రీతిఁ బొందె. విరా. 1-145.

**ఆశీవిషము** సం. వి. అ. పుం.

కోఱలందు విషముగలది, పాము.

తే దారుణాశీవిషముల తారి దప్పుట. ద్రోణ. 8—175.

**ఆశీస్సు** సం. వి. స్. స్త్రీ.

మంగళాశాసనము, దీవన.

సంప్రీతాశీఃప్రవృష్టి. ఉద్యో. 1-385.

**ఆశుక్రియ** సం. వి. అ. స్త్రీ.

మందు పుచ్చుకొనుట, ఔషధ సేవనము.

వ. వ్యాధిక్రమానిష్ట సంస్పర్శనేష్ట వివర్జనంబులను నాల్గింటం బుట్టు శారీరదుఃఖంబు లాశుక్రియాది ప్రతియోగంబుల నుపశమిల్లు.
అర. 1—22.

**ఆశుగము** సం. వి. అ. పుం.

బాణము.

వ. ......ఫల్గునాశుగ సంతాడనవికీర్ణ శత్రుశేఖర వజ్రవ్రజంబుల వలనను. విరా 5-60.

**ఆశువు** సం. విణ. (ఉ. ఉ. ఉ.)

వేగము గలది.

తే. రామునందును గార్తవీర్య క్షితీశునందు నరునందు భీష్మునం

యందుఁ దక్కఁ గలుగునే యెందు నీయస్త్ర బలము నీని, యాఖు
విక్రమ మద్భుతంబయ్యెఁ జూడ. ద్రోణ. 3-184

**ఆలోఖితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించినది.

క. .. శక్తిత్రయ సమయుక్త్యాలోఖిత రూపహేల హరిహరివాథా.
శాంతి. 2-1

**ఆశ్చర్యము** సం. విణ. (అ. ఆ. అ.)

అద్భుతము, అచ్చెరువు.

మ అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనన్.
విరా. 1-321

**ఆశ్రమము** సం. వి. అ. పుం. న.

1. మునిపల్లి, మునులు నివసించు చోటు.

వ. ...అవ్విప్రవరుండును నొక్క పుణ్యాశ్రమంబున వసియించె.
విరా. 1-147

2. బ్రహ్మచర్యాది.

(ఇవి నాలుగు: బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము)

క. ద్విజుఁడఁ గురువిషయ జాతుఁడ, సుజనప్రియుఁడైన ధర్మసుతు
సఖుఁడఁ బరి, వ్రజనాశ్రమ కలితుండ. విరా. 1-195; అను. 1-15

**ఆశ్రమవాసపర్వము** సం. వి. న్. న.

ఆంధ్ర మహాభారతమునందలి 18 పర్వములలో 15వ పర్వము.

చూ మహాభారతము. ఆశ్ర. 1-187

**ఆశ్రమస్థుడు** సం. విణ. (అ. ఆ. అ.)

బ్రహ్మచర్యాదులలో నేదేని ఒక యాశ్రమమునం దున్నవాఁడు

సీ. ఆశ్రమస్థులఁ దనకులంబు -తే- వారి భరియించినను. ఆది. 2-63

**ఆశ్రయణము** సం. వి. అ. న.

ప్రాపు, ఆశ్రయించుట, అండఁగొనుట, అవలంబించుట.

చ. ...రక్షణ క్రియా,శ్రయణ విలాసబాసుర. శాంతి. 3–529

**ఆశ్రయణీయము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆశ్రయింపఁదగినది, అండఁగొనఁదగినది.

సీ. ...ఆశ్రమములకెల్ల నాశ్రయణీయమై గృహస్థత్వమొప్పు.
అను. 1–15

**ఆశ్రయణీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆశ్రయింపఁదగినవాఁడు, అండఁగొనఁదగినవాఁడు.

క. నీవాశ్రయనీయుండవు, గావే భోగపరము గాకున్నది మ,ద్భా
వం బటుగావున నా, కి వచనము లింపుసేయ విద్ధగుణాఢ్యా.
శాంతి. 3–58

**ఆశ్రయత** సం. వి. ఆ. స్త్రీ.

ఆశ్రయత్వము.

కవిరాజ విరాజితము: ఉదాత్తగుణాశ్రయమహితా. స్త్రీ. 1–51

**ఆశ్రయము** సం. వి. అ. పుం.

1. ఉనికిపట్టు.

క. విశ్రుత వాద్యంబులు మం,జుశ్రుతి సంభావ్యగత సుగతులు సద్భా,
వాశ్రయములుఁ దజ్జన్య ర,సాశ్రయములు నైన యభినయంబు
తెలుఁగుదున్. విరా. 1–242

2. అండ, ప్రాపు.

తే ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి,యున్నవారము గావున
నుగ్రరిపుల, పాలుపడకుండ వినిపింపఁ జాడి యితని, నెయిదు
మెయిదుము రథరయ మెసక మెసఁగ. విరా. 3–203

సీ —గృహస్థ ధర్మ ముత్తమం బని చెప్పు నుర్వీశ పశుపక్షులాదిగా
జీవుల కాశ్రయంబు. శాంతి. 1–156

3. రక్షణము, నిలువనీడ.

తే. ...ఆశ్రయంబు, దీనులకు నిచ్చినను హింస మానినను క్షమంచిత
స్వర్గలక్ష్మి సిద్ధించు నంద్రు అను 2–63

**అశ్రయానుఁడు** సం. వి. అ. పుం.

కురుకుమారుఁడు. చూ. ఆది. 5-107

**అశ్రయించు** సం. స. క్రి.

1. సేవించు, అండఁగొని బ్రదుకు.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతి దూరుఁడు నీతినిర్మలాత్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుసేయు కొడుకు మేను లేత దనయుల్లము మెత్తన యిట్టి యాతఁడె, ట్లొకో యొరు నాశ్రయించు విధియోవదె యెవ్వరి నెట్లు సేయఁగన్ విరా. 1-98

2. శరణుసొచ్చు.

ఉ. ...భార్గవరాము నాశ్రిత, శ్రీకరుఁగాన్పు మాపదలు నొందఁగనీఁడతఁ డాశ్రయించినన్. ఉద్యో. 4-289

3. ప్రార్థించు, వేఁడికొను.

ఉ (భీష్మునితో ధర్మరాజు)....నీకృప నాశ్రయింపఁగా, వచ్చితి మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁజెప్పవే. భీష్మ. 3-299

4. ఉపాసనపూర్వకముగాఁ బ్రయోగించు.

వ. ఆ వృద్ధ క్షత్రియుండు శమంతక పంచక సమీపంబున నుండు నీవమ్మహానీయాస్త్రంబు నాశ్రయింపు మనవుడు నర్జునుం డట్లకాక యని భక్తియుక్తంబుగా నియతమతిం దత్ప్రయోగం బాచరించిన. ద్రోణ. 4-380

5. చేరు.

వ. ...కృపాచార్యుండు కరిపురి కేతెంచెఁ గృతవర్మ నిజపురంబునకుఁ జనియె నశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమంబు నాశ్రయించి గ్రక్కునం దపస్వియయ్యె. స్త్రీ. 1-116

శ్లో. జగామ హాస్తినపురం కృప శ్శారద్వత స్తదా,
స్వమేవ రాష్ట్రం హార్దిక్యో ద్రౌణిర్వ్యాసాశ్రమం యయౌ

ఏవం తే ప్రయయుర్వీరా వీక్షమాణాః పరస్పరమ్.

సం. భా. స్త్రీ 11-21, 22 శ్లో.

వ. తొల్లి కన్యాకుబ్జంబున గాధిపుత్రుండు విశ్వామిత్రుండను రాజు నిరమిత్రంబుగా ధాత్రినేలుచు నొక్కనాఁడు మృగయార్థం బరిగి యపారబల సమేతుండయి ఘోరారణ్యంబునం గ్రుమ్మరి వడవడి కడుడస్సి వసిష్ఠు నాశ్రమం బాశ్రయించిన. ఆది. 7-95

శ్లో. వ్యాయామ కర్శితస్సోఽథ మృగలిప్సుః పిపాసితః,

ఆజగామ నరశ్రేష్ఠ వసిష్ఠస్యాశ్రమం ప్రతి.

సం. భా. ఆది. 175-5 శ్లో.

**ఆశ్రయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆశ్రయమైనవాఁడు.

వ. ...అవ్విరించి పలుకులు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండనీతి కాశ్రయుండై పరఁగుచుండె. శాంతి. 3-118

**ఆశ్రితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆశ్రయించినది, మిక్కిలి యాశ్రయించినది

వ. (అర్జునుఁడు) తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దనవరంబున మున్న కలిగి విశ్వకర్మ నిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగు మహోగ్ర కేతనంబును తదాశ్రితంబులైన వికృతాకీల నానావిధ భూతంబులనుం బుత్తెంచిన.

విరా. 4-170

**ఆశ్రితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆశ్రయించినవాఁడు.

వ. అప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంత సులభుండు. విరా. 1-19

2. ఆశ్రయింపఁబడినవాఁడు, ఆధారముగాఁ జేసికొనఁబడినవాఁడు.

మ. నన్నుఁ గుటిలాలాపంబులన్ వెట్టఁజేసిన నీకైనది యేమి యాశ్రిత గుణశ్రేష్ఠుండు వంచించునే. ద్రోణ. 1-388

3. అనుజీవి, ఆశ్రయించి బ్రదుకువాఁడు.

ఆ. అమర వల్లభుండు నమృతసేచనమున, భూజమునకుఁ దొంటి పొల్పుకంటెఁ, మిగుల నెలమిసేసె మేలియాశ్రితు లిట్ల, మనుతు రధిపుఁ గురుకుమారవర్య. అను 1-158 (చూ. అను. 1-152)

ఆశ్లేష సం. వి. ఆ. స్త్రీ.

అశ్విన్యాది యిరువదేడు నక్షత్రములలోఁ దొమ్మిదవ నక్షత్రము- ఈ నక్షత్రమున వెండి దానము చేసిన నూర్ధ్వలోకములు గల్గును. అను. 2-378

ఆశ్లేషము సం. వి. అ. పుం.

1. చేరిక, సంయోగము, కూడిక.

క. శ్రీత్వ శివాత్మాలంబన, తత్త్వాశ్లేషాత్త శబలతా సంగత.
విరా. 3-1

2. సంపర్కము, ఒకదాని నంటుకొని సంబంధము గల్గియుండుట.

క. రోషము, శోకము, రాగ, ద్వేషము లభిమాన దర్ప వేగాలస్యాశ్లేషము లజ్ఞాన మని మునిజనము సెప్పు మాననీయచరిత్రా.
శాంతి. 3-401

ఆశ్లేషిణి సం. విణ. (ఙ్. ణీ. ఙ్.)

విశ్లేషము లేనిది, సంయోగము గలది.

క. రోషముఁ గామము రాగ, ద్వేషములును లేక భక్తి దిరమై యేకాశ్లేషిణిగాఁ గొలుతు రవి, శ్లేష మనోనిలయవృత్తి సిద్ధులు నిన్నున్.
శాంతి. 4-235

ఆశ్వమేధికము సం. వి. అ. న.

1. సంస్కృత భారతమునందలి నూఱు పర్వములలో 91వ పర్వము. ఆంధ్ర భారతమునందలి 18 పర్వములలో పదునాలుగవ పర్వము.
ఆది. 1-82

ఆశ్వయుజము సం. వి, అ. పుం.

అశ్వినీ నక్షత్రమునకు సంబంధించిన నెల, చైత్రాది మాసములలో ఏడవ నెల.

ఉ. మానవుఁ డోపి యాశ్వయుజ మాసము రెండవు నష్టమిం దగం,

బూని. అను. 3-16

**ఆశ్వాసము** సం. వి. అ. పుం.

1. పర్వములోని యొకభాగము. విరా. 1-366

2. ఓదార్పు, ఊఱట.

వ. ...వలయు వాక్యంబుల వారికి నాశ్వాసంబు గావించి. శల్య. 2-377

వ. ...పరమానందంబు నొందుమని యిట్లు గోవిందుండు ధర్మనందను నకు నాశ్వాసం బొనరించె. సౌప్తి. 2-188; మౌస 99

క. ...దుర్బలాశ్వాస హేతుప నిబంధమ్ములు పలుకక. ఆది 6-36

(చూ. ఆయాసము 3వ అర్థము)

**ఆశ్వాసవచనము** సం. వి. అ. న.

1. ఓదార్పు మాట.

వ. అనిన విని వారలు వెనుకయై యాశ్వాస వచనంబులు పలుకుచుం బోవం బోవుచున్న యన్నరేంద్రు నెలుంగెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. విరా. 5-202

**ఆశ్వాసించు** సం. స. క్రి.

1. ఊరార్పు, ఊఱడించు, ఓదార్పు.

వ. అని డగ్గుత్తిక పెట్టి దుఃఖ పరవశుం డగుటయు నమ్మహీసురవరులుం దమ్ములు నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు దదీయ విషాదాపనోదంబు సేయం దలంచి యిట్లనియె. విరా. 1-50; ఆది. 2-222

2. సుఖముగా నిశ్వసించు, మనస్సునకు ఊఱట పొందు.

వ. ...గాండీవిం గనుంగొని జలాశయంబు వెలువడి సుస్థలంబు సేరిన నట్లాశ్వాసించుచున్న నచ్యుతుం డయ్యోధవరు నాలోకించి నరు నుద్దేశించి. ద్రోణ. 4-255

3. ధైర్యము చెప్పు.

వ. ...పవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించు

చున్నంత. అర. 1-107

4. ఉత్సాహపఱచు, సంతుష్టి పఱచు.

వ. ...అర్జున దుర్యోధనులు ద్వారకా నగరంబునకుం జని శ్రీకృష్ణు నిం గని సహాయత్వంబునకుం బ్రార్థించుటయు, నారాయణుండు వారి నాశ్వాసించి నారాయణ గోపాల బలంబుల నిరూపించి వారలం గోరికొం డనుటయు. ఆది. 1-42

**ఆశ్వాసిత** సం. విణ. (అ. ఆ. అ.)

ఊఱడింపఁబడినది, ఓదార్పఁబడినది (స్త్రీ)

సీ. హృదయేశుఁడైన తన్నెప్పుడు విడుచునికి, నలయ కాశ్వాసిత యైన దాని. అర. 2-49

**ఆశ్వికుఁడు** సం. వి. అ. పుం.

గుఱ్ఱపు రౌతు.

శా. క్రీడాఘాత నిరూఢి నాశ్వికులు వారిం దున్మి తూఁటాడినన్. విరా. 3-182

**ఆశ్వినులు** సం. వి. అ. పుం. ద్వి.

అశ్వినీ దేవతలు, దేవవైద్యులు.

వ. ఆదియునుంగాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుంతును నాశ్వినులును వారలకుఁ బాండురాజుతోడివారలు వారి కొక కీడును బొరయకుండ రక్షింతురు. ఉద్యో. 2-258; అను. 5-848

వ. సవితృనకు బడబా రూపధారిణియైన త్వాష్ట్రికి నాశ్వినులు పుట్టిరి. ఆది. 3-69

బ్రహ్మాండ పురాణమున వీరి జన్మముమ గూర్చి యిట్లు కలదు :

సూర్యుని భార్యయైన సంజ్ఞాదేవి యాయన తేజస్సును సహింపఁజాలక బడబ (ఆఁడుగుఱ్ఱము) రూపమున నుత్తర కురుదేశమున నుండగ నచ్చటకు అశ్వరూపమున సూర్యుఁడు వెళ్లెను, ఆమె తన భర్తను గుర్తించెను. సూర్యుఁ డశ్వరూపముతోడనే యామెను రమించెను. అపుడు వారికిఁ బుట్టిన సంతానమే (అశ్వినులు) ఆశ్వినులైరి. నాసత్యుఁడు దస్రుఁడు అని వారికి పేర్లు.

**ఆశ్వినేయులు** సం. వి. అ. పుం. ద్వి.

అశ్వినీ దేవతలు, అశ్వినులు.

సీ. రూపమున నాశ్వినేయుల సరియనఁ దలిర్చు. ఆశ. 7-179

**ఆషాఢము** సం. వి. అ. పుం.

ఆషాఢా నక్షత్రమునకు సంబంధించిన మాసము. చైత్రము మొదలుకొని నాలవ మాసము.

తే. అధిప యాషాఢ ముఖ్యంబులైన నెలలు, నాలుగింటను.

అను. 4-301

**ఆషాఢుఁడు** సం. వి. అ. పుం.

క్రోధవశ గణాంశ సంభవుఁడు. చూ. ఆది. 3-80

**ఆస** వై. వి. (సం. ఆశా)

1. అపేక్ష.

ఉ. అప్పుర మిచ్చుటచ్చటను నాసల వచ్చితి నెంత దవ్వొకో.

విరా. 1-148

సీ. ...దుర్యోధను నాస మానె. కర్ణ. 1-81

వ ...రాజ్యంబునం దాస విడిచి మదువు సొచ్చిన వాని వెదకి వెలార్చి యెక్కటి కయ్యంబునకుఁ బిలుతురే. శల్య. 2-271

2. కోరిక, అభిలాష.

క. సమయంబు నడిపినను రాజ్యము భాగం బీరెయెట్లు నను నాస నరణ్యమున వసించితిగాక నిజమునకు నీయందు ధైర్యసారము గలదే. విరా. 5-94

క. ధరణిసురు నాస నెఱచిన. శాంతి. 6-583

వ. తద్ద్విజు నాసదీర్పఁ గోరుట వలదే. శాంతి. 6-584

**ఆసంగము** సం. వి. అ. పుం.

1. సంబంధము, కూడిక.

క. ...మిత్రాసంగ మొంది శత్రునిశాసం బొనరించి తమ్ము నరసెద మనుమీ. ఉద్యో. 1-368

2. సాంగత్యము.

మ. నిజదారైక పరత్వమం...సుజనాసంగము...బంకజ గర్భుండు గృహస్థ ధర్మములుగాఁ గల్పించె సుర్వీశ్వరా. శాంతి. 2-281

వ. సరస్వతీ సత్త్రంబున నవకృష్ణోత్తరా సంగుండవై. ఆశ. 1-127

**ఆసక్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. అపేక్ష, కోరిక.

క. ...నిజాసక్తి ఫలింపఁ గొలిలు మఖిమతకేళిన్- విరా. 2-81

2. తత్పరత్వము, సంబంధము.

క. భూసురులాదిగఁ గల జను, లీసుర సేవించిరేని యిది మొదలుగఁ దా,పాసక్తిఁ బతితులగుదురు, చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్. ఆది. 3-121

**ఆసక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆసక్తి గలవాఁడు.

సీ. అట్లుగాకయు సురతాసక్తునను బల మొలయు అను. 4-304

సీ. శాంతి ననఘ విప్రు లానక్తులగుదురు. అశ్వ. 4-258

**ఆసగొను** అ. క్రి.

ఆసగలిగి యుండు, అపేక్షించు.

వ. ఆలంబున నోల మాసగొనండు. ఉద్యో. 4-228

**ఆసగొల్పు** అ. క్రి. (√ఆసగొను)

ఆశపెట్టు.

వ. ఆసగొల్పి విప్రున కియ్యకున్కి యొప్పదు. అను. 5-275

**ఆసత్తి** సం. వి. ఇ. స్త్రీ.

పొందిక, యోగము, కూడిక

క. అఖిలజగద్రక్షాసత్తివినోద. శాం. 6-1

**ఆసనము** సం. వి. అ. న.

1. (కూర్చుండుటకు ఆధారమైన) పీఁట, చాఁప, కంబళము మొ. పీఠము.

ఆ. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనంబులును గరుణఁ దమకు భూమిపాలుఁ, డీక తార యెక్కు డెంతటి మన్ననఁగలుగు వారి. కైనఁ గార్యమగునె. విరా. 1-182; అను. 5-266

2 కూర్చుండుట.

క. ...విలాసినుల సహాలాప సహాసన సహాయానములు బంధనము. ములుగావే. అరణ్య 3-111

3. దేశకాలాదులమబట్టి దండెత్తి పోక నిలుచుట (వ్యతి-యానము).

వ. ...సంధివిగ్రహాయానాసన ద్వైధీభావ సమాశ్రయంబులు శాంతి. 2-208

"ప్రతిబద్ధశక్త్యోః కాలప్రతీక్షయా తూష్ణీ మవస్థానమాసనమ్,
పరస్పరస్యసామర్థ్య విఘాతా దాసనమ్ స్మృతమ్."

**ఆసన్నత** సం. వి. ఆ. (స్త్రీ).

కూడుట, చేరుట, ప్రాప్తించుట.

క. నన్నూటులు మున్నూటులు, నిన్నూటులు నూటుబును మహిత. వర్షము ల, య్యన్నియుగములకును గ్రమాసన్నత సంధ్యలను. వాని సంధ్యాంశములన్. శాంతి. 5-60

**ఆసన్నము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉపస్థితము (దేశకాలములందు) సమీపమున నున్నది, దగ్గరనున్నది

శా. ...దుస్సాధంబైన విరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘ. టించే. విరా 2-275

తే. ...గక్కున విమాన, మవతరించి యాసన్నయై యతివయోర్తు. శాంతి 5-6.

వ. అనుటయు నచ్యుతుండు భీష్మున కత్యాసన్నుండై శారీర మానస కుశలప్రశ్నంబుఁ జేసిన... శాంతి- 2-148.

వి. అ. న.

2. సమీపము

వ. ముందట నాసన్నంబునం గొలను కలుగవలయునని యుపలక్షించి. అర. 3-318

ఆసపడు అ. క్రి.

1 ఆసగొను, అపేక్షపడు,

గీ. పాండవుల రాజ్యమున కాసపడక మున్న యరసి యొకింగి.

విరా. 3-90

సీ పరుల పొమ్ముల కాసపడమి. శాంతి.5-218; అను. 8-297

2. అభిలషించు.

వ. ...సుయోధనుండును దోడాసపడి పుచ్చు నుచితపరు లగు నర పతులు దోలుతఁ జెప్పినవారి కసహాయత్వంబుఁ జేయం జూతురు.

ఉద్యో. 1-87

3. స. క్రి.

ఆశించు.

క. ధరణీశ పాండుపాలిత, ధరావలయ మాసపడుట దగదే నీకున్.

శాంతి. 1-112; ద్రోణ. 1-21

ఆసపఱుచు స. క్రి.

ఆసపడఁజేయు.

క. నీ వాసపఱుప ధనములఁ గావించెదఁ బో. శాంతి. 4-50

ఆసపాటు వి.(√ ఆసపడు)

అపేక్షపడుట, కోరిక.

సీ ...ఆసపాటును నవజ్ఞతయు నెందును లేక. అశ్వ. 1-208

వ. ...ఆసపాటు గదిరిన హృదయంబుతో దాస్యం బనాలస్యంబున నడపుచుండ. అను. 1-202

ఆసమాలు అ. క్రి. (√ఆస)

ఆశలేడుగఁటు, నిరాశుఁడగు.

చ. ...సూతసుతుఁ డోలుదు మంతట నాసమాలెదున్, ఉద్యో. 4-208

ఆసవము సం. వి. అ. పుం.

కల్లు, పక్వముగాని చెఱకు రసముతోఁ జేయఁబడినది.

క. ఆసవమునకని నీదు ని,వాసమునకు దివములో నవశ్యంబును నే,

నా సుదతిం బుత్తెంతు. విరా. 2-81; విరా. 2-98

"శీధు రిపుర‌సై। పక్కైరపక్కైరాసవో భవేత్"

**అసనే(చే)యు** అ. క్రి.

ఆశపడు, అపేక్షపడు, కోరు.

సీ. మహావ్యాధి ని,రాసంబు సేయంగ నాసనేయు నతఁడు.

అను. 2-59

ఆ. తా,త్రమంత్రుడు బుధులు గన్య పురుషుఁ గోర, నతఁడుఁ గన్యమీఁద నాసనేయ. అను. 2-222; అశ్వ. 2-172

**ఆసాదితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రాప్తము, పొందఁబడినది.

వ. అని సకల బ్రహ్మప్రార్థనంబుసేసి తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్త్వ నిరతిశయానుభావానంద భరితాంతఃకరణుండ నగుచుండి.

విరా. 1—2

**ఆసారము** సం. వి. అ. పుం.

మహావృష్టి, జడివాన.

వ. ప్రముఖ రథిక జనంబులు గోపాల వర్గంబు ననర్గళ ప్రసారంబగు శరాసారంబుసం గప్పినం గని. విరా. 4—4

**ఆసాసలు** వి. బహు. (ఆస+ఆస)

అధికాశ, పేరాస.

క. ఆసాసల వచ్చితి నన్నుఁగాసిం బెట్టి యద యడవిఁగలసెను.

శాంతి. 3-153

ఉ. ఆ,సాసల నొక్కరుండయను నాగ్రహావృత్తి బలంబుపైఁబడున్.

విరా. 5-280

మ. పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం, బిఱు వోపుం. (ఆసాస అని పాఠాం) అర. 6-327

**ఆసించు** స. క్రి. (√ఆస)

అపేక్షించు, కోరు.

తే. ...నీ వింత సెప్ప,నేల సర్వలోకముల కధీశుఁడైన, నీ గురుం

డోరు వాసించునే మహేంద్ర. అశ్వ. 1-86

సీ. నీ సొమ్మునకు నొరుఁ డాసించుచుండంగ, దానికిఁ దగ రక్షదలఁచు
చునికి. అను. 4-384

**ఆసిక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

తడుపఁబడినది.

శా. ...శోణితాసిక్తాకారతఁ బొంది. విరా. 5-84

**ఆసితము** సం. వి. అ. న.

నిరర్థక ప్రయత్నము.

క. శతవర్ష వృద్ధుఁడవు నీ, వతికృశుఁడ వశక్యమైన యర్థమునం దా,
సిత మేలచేసి కడుదుర్మతివై తింకెన్నఁ డిది సమాప్తిం బొందున్.
అర. 3-258

శ్లో. కిమిదం వర్తతే బ్రహ్మన్ కించ తేహ చికీర్షితమ్
అతీవ హి మహాన్ యత్నః క్రియతేఽయం నిరర్థకః.
సం. భా. అర. 185-85 శ్లో.

"ఆస్థితి, ఆస్థిత" అని పాఠాంతరములు. 'ఆస్థిత' అని సం. ము. చూ
ఆస్థిత.

**ఆసీన** సం. విణ. (అ. ఆ. అ.)

కూర్చుండినది.

క. అవ్విదేహపతికి నాసన్నంబగు నుచితాసనంబున నాసీనయై యుండి.
శాంతి. 6-171

**ఆసీనత్వము** సం. వి. అ. న.

కూర్చుండుట.

క. మితభోజివై వివిక్తక్షితి సావిత్రీ జపంబు సేయునది యహస్స్థితి
యు నిశాసీనత్వము, మఱి నేమము కట్టులైన మాను నఘంబుల్.
శాంతి. 1-317

**ఆసీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కూర్చున్నవాఁడు.

వ. ...బలదేవ సహితంబుగఁ దాను నాసీనుండయ్యె. శల్య. 2-282

**ఆసురము** సం. విణ. (అ. ఈ. అ.)

రాక్షస సంబంధమైనది, భయంకరము.

క. ఆసాత్యకి వేటొక వి, ల్లాసురగతి సెత్తి. భీష్మ. 3–210

క. ...విసివితి, ననఘా యే నింకఁ జాల నాసుర విధికిన్. భీష్మ. 3-365; ఆశ్వ. 3-86

వి. అ. పుం.

1. రాక్షసు లాచరించు విధి.

ఆ. మునికుమారు నెగచికొని వచ్చి నిశితశూలాయుధమునఁ బొడిచి యాసురమున, రక్కసుండు చంపి యకాంతయును దాను, నరిగె రైభ్యు కడకు నాక్షణంబ. అర. 3-271

వ. ఇమ్మహీశుం డాసురంబున నాసురియం దనురక్తుండై. ఆది. 3-187

2. అష్టవిధ వివాహములలో నొకటి.

క. వెలవన్నుట యాసురము చూవె పౌరవముఖ్యా. అను. 2-228

చూ. వివాహము.

**ఆసురి** సం. వి. ఈ. స్త్రీ.

1, అధర్మ ప్రవర్తనముగల స్త్రీ, రాక్షసులలో నొకతెగవారైన అసురుల యంశమునఁ బుట్టిన స్త్రీ.

సీ. పరమేశ యాసురి పైశాచి రాక్షసి,యను పేళ్లుగల వధర్మాంగన లకు, వ్యభిచార తత్పరత్వంబు వారికి నెల్లఁగల దసురాంశజ క్రౌర్యనిరత, దనయిచ్చఁ బొలియించు ధనధాన్యములు చల మ్మాదయ భోగపరాత్మ ఈర్ష్యగలదు. అను. 5-299

2. రాక్షస స్త్రీ.

వ. ఇమ్మహీశుం డాసురంబున నాసురియం దనురక్తుండై పుత్ర త్రయంబు వడసి. ఆది 3-187

**ఆసూత్రణము** సం. వి. అ. న.

చొచ్చుకొని యుండుట, ప్రవేశము

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల, గాత్ర వ్యాప్తత్వ మహిమ గలిగి సమీరా,
సూత్రణమున జీవుండును, గోత్రమునై సర్వవర్తకుం డగు చుం
డున్. శాంతి. 4-98

**ఆసూత్రితము** సం. వి. అ. న.

ఒకదానితో నొకటి కూర్పఁబడినది, అంటింపఁబడినది.

క. శ్రీ సంశ్రయ మంగళగౌరీసంగమ విభవ పుణ్యరేఖా సంపద్వ్యా
సిత వక్షోవామాంగా సూత్రిత చిత్ర మహిమ హరిహరనాథా.
ద్రోణ. 1-1

**ఆసేకము** సం. వి. అ. పుం.

1. పోయుట, క్రుమ్మరించుట,

వ. ....ఘృతేజధనుం డాజ్యధారా చ్ఛటాసేకంబున నుద్రేకంబు
నొందిన హుతవహుండునుం బోలె నుండి. కర్ణ. 3-352

2. చల్లుట. ఆది. 7-43

**ఆసేవనము** సం. వి. అ. న.

చక్కఁగా సేవించుట, మరల మరల సేవించుట

తే. త్రిపథగాసేవనమున సిద్ధించునట్టి, గతి జనములకు నియత
కల్పితములయ్యు, నధ్వరంబును బ్రహ్మచర్యంబుఁ దపము, సంవరి
త్యాగమును జేయఁజాల వనఘ. అను. 3-102

(ఇచ్చట పూజ సల్పి స్నానము చేయుట యని యర్థము)

**ఆస్తరణము** సం. వి. అ. న.

తివాచి, కంబళి, వస్త్రము మొదలగునవి పఱచుట.

వ. ...సమున్న తౌదుంబర పీఠంబునం బరమాస్తరణం బొనర్చి
యంగపతి నందు నిలిపి కర్ణ. 1-56

ఆ. పట్టి యతఁడు దనదు పై చీర యాస్తరణంబు సేసి భూస్థలంబునందుఁ
బెట్టె. అశ్వ. 1-4

కుశాస్తరణము. అను. 3-130

2. పఱచెడు చాఁప (కృష్ణాజినము మొదలగునది)

వ అక్కొకపలి యొక్కనాఁడు తన కుఱువు దలయంపిగాఁ గృష్ణాజి

నాస్తరణంబున నిజనాథుండు నిద్రితుండై యున్న యవసరమున
ఆది 2-157

**ఆస్తికత** సం. వి. ఆ. స్త్రీ.

ఆస్తికభావము, భగవంతుఁడు గలఁ డనియు, పరలోకము గల దనియు నమ్మిక.

క. విను మాస్తికతా శ్రద్ధా, వినయంబులు గలుగువారు వీనికి నెల్లన్, జననాథ యర్హులు. శాంతి 1-319

**ఆస్తికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.).

దేవుఁడు కలఁడనియు, పరలోకము కలదనియు నమ్మువాఁడు.

క. ఆస్తికచేతస్సహితా. ద్రోణ, 4-338

**ఆస్తీకము** సం. వి. అ. న.

సంస్కృత భారతమునందలి నూరుపర్వములలో మూఁడవ పర్వము. (ఆస్తీకుని చరిత్ర) చూ. ఆది, 1-32

**ఆస్తీకుఁడు** సం. వి. అ. పుం.

జరత్కారుని కొడుకు. ఈతఁడు జనమేజయుని సర్పయాగ మాపెను. చూ. వివ. ఆది. 2-220 మొ. 287

**ఆస్తీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

పఱపఁబడినది.

సీ. వేదాంత విదులను మోదించునట్టిది జపకర్మ మత్యంత శాచ శాలి,యై కుశాస్తీర్ణ సమావనీతలమున. శాంతి 4-180

**అస్థత** సం. వి. ఆ. స్త్రీ.

అభిలాషత్వము, కోరిక, నిరర్థక ప్రయత్నము.

(ఇది ఆనందవారి ప్రతిలోని 'అసితము'నకు మాఱుగా సం.ము. పాఠము) ఆసితముకన్న అస్థతయే యుక్తముగా నున్నది. చూ. ఆసితము

**అస్థాన మండపము** సం. వి. అ. పుం.

సభామందిరము, కొలువు కూటము.

వ. ...అస్థాన మండపంబునకు ఏచ్చి. ద్రోణ. 3-7

**ఆస్థానము** సం. వి. అ. న.

కొలువు, రాజసభ.

వ. ...విరాటుండు వెడలివచ్చి బయలి కొలువిచ్చుటం జేసి తదా స్థానంబు సేరంబోవునప్పుడు. విరా. 1-184

**ఆస్పందనము** సం. వి. అ. న.

అదరుట.

వ. ...తన దక్షిణ భుజాస్పందనం బుపలక్షించి. అర. 4-115

**ఆస్పదము** సం. వి. అ. న.

1. తావు, చోటు.

ఉ. ...సాత్యవతేయు సంస్మృతి, శ్రీవిభవాస్పదంబయిన చిత్తము నోడ. విరా. 1-30; విరా. 1-301

(కొన్నిచోట్ల దీనికి మహద్వివక్షయుఁ గాన్పించుచున్నది)

మ. అయ్య వివేకాస్పదులైన పాండవులు. సభా. 2-68

2. ఆధారము, ఆశ్రయము.

క. పదపడి దుర్యోధనుఁ డున్నదుఁడై తలుమంగ ధర్మనందనుఁడు జయాస్పదముగఁ బరికొల్పఁగ బెట్టిదముగ నొండొంటిఁ దల పడియె సైన్యంబుల్. భీష్మ. 1-241

**ఆస్పదీభూతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆస్పదముగానైనవాఁడు,

మ. ...సత్స్వభలందు మెచ్చఁబడునే హాసాస్పదీభూతుఁడై.

ఆది. 7-49

**ఆస్పర్శనము** సం. వి. అ. న.

తాఁకుట.

వ. ...అప్పుడమితేఁడు సితకుసుమాక్షత కాంచన రజత రత్న గర్భా స్పర్శనం బాచరించె. శాంతి. 1-371

**ఆస్ఫాలనము** సం. వి. అ. న.

తాడనము, చలుచుట, చలుపు.

వ అప్పరపతి కట్టెనట నిల్చి భుజాస్ఫాలనంబుఁజేసి యిట్లనియె.
విరా. 2-6; శల్య. 1-102; కర్ణ. 1-73

**ఆస్ఫురితము** సం. విశే. (అ. ఆ. అ.)

జళిపింపఁబడినది, హఠాత్తుగా ఆడింపఁబడినది

చ. ...ఆస్ఫురిత మహాయుధోగ్ర రుచిపుంజ విజృంభణ ఘోరమయ్యె.
విరా. 5-28

క. ...అట్లాస్ఫురితాస్త్రుఁ శార్ఙ్గ నత్యుద్ధర బాణ సమగ్రుఁ డైన
ద్రోణుఁడు వొదివెన్ ద్రోణ. 3-66

**ఆస్మేరము** సం. విశే. (అ. ఆ. అ.)

వికసించినది.

క. ...సంతతాస్మేరమతీ అర 6-1

**ఆస్యము** సం. వి. అ. న.

1. ముఖము, మోము.

చ. ...నిశాంతదంత పీడనరట దాస్యగంగ వికటభ్రుకుటీ చటుల
ప్రవృత్త న,ర్తనఘటనా ప్రకారభయదస్ఫురదా పరిణద్ధమూర్తియై
విరా. 2-183

2 నోరు.

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడు పల్కె
క్కఁడు లేదు. ఉద్యో. 2-63

**ఆస్వాదనము** సం. వి. అ. న.

ఆస్వాదించుట.

క. ...భక్తిరసైకా,స్వాదన సుకరాకందో,త్పాదన దివ్యమతినగుచుఁ
దగ నెఱిఁగింతున్. భీష్మ. 1-69; శాంతి. 3-168

**ఆస్వాదము** సం. వి. అ. పుం.

త్రాగుట.

మ. ...నీ,యనుజుల్ మద్వచనంబు గైకొనక తోయాస్వాదులై
యివ్విధం,బున ప్రాణచ్యుతిఁ బొందిరి.
(ఇచ్చట మహద్విపత్తు) అర. 7-414

**ఆస్వాదించు** సం. స. క్రి.

రుచిచూచు, చవిచూచు.

వ. దుశ్శాసనుం జంపి భీముండు తద్వక్షోరక్తం బాస్వాదించుటయు. ఆది. 1-48

వ ...బాహులకు వండిన నంజుళ్లు దెప్పించి యాస్వాదించి. అర. 2-197

2. స్పృశించు, తాకు.

వ. ...ఘోరసమీర ప్రేరితంబై దుర్వార శిఖాజిహ్వాల నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుం గని. ఆది. 2-101

శ్లో. నభస్స్పృశంతం జ్వాలాభిః సర్వభూత భయంకరమ్. సం. భా. ఆది. 82-24

3. త్రాగు, పానము చేయు.

మ. ...దుశ్శాసనున్ లోకభీకర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైలరక్తాంబు నిర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదించు నుగ్రాకృతిన్. సభా. 2-288

క. కలహమున నిట్లు సురవీరులం బల్విర నోర్చి యొక్కరుండ యమృతముం దెక్కలికొని యాస్వాదింపక, యలోలుండగు వానిం జూచి హరి యిట్లనియెన్. ఆది. 2-104

సీ అర్ధరాత్రమున నవ్వు డందుల కేతెంచె, గజయూధములు జలకాంతం జేసి, యంబుధి విమలతోయంబు లాస్వాదింపం జనుదెంచు జలధరసమితి యట్ల. అర. 2-110

4. తిను, భుజించు.

వ. ...నీరస వన్యమృగ మాంసఖాదన జాత నిర్వేదనపరుండ నయి పెద్ద కాలంబునకు మానవ మాంసం బాస్వాదింపం గంటి. ఆది 6-185

**ఆహతము** సం. విణ. (అ. ఆ. అ.)

కొట్టంబడినది.

సీ. ...దండాహతంబైన మహాహి వోలె కర్ణ. 3-381

చ. ....తద్రథచోదకు మార్గశ్రయాహతుఁడుగఁ జేయ.

కర్ణ. 1-117

**అహతి** సం. వి. ఇ. స్త్రీ.

వ్రేటు, దెబ్బ.

మ. వజ్రాహతింగూలు శైలనికాయంబన.

విరా. 2-75; విరా. 5-194

**అహననము** సం. వి. అ. న.

కొట్టుకొనుట, చంపుకొనుట.

చ. ...అట్టి బిడ్డల కకారణ రోషమునం బరస్పరాహననము గల్గి చావలసె నందఱ క్కట దైవ మల్గినన్. మౌస. 1-109

**అహరణము** సం. వి. అ. న.

1. ఆకర్షించుట, లాగుట, పైకిఁదీయుట.

మంత్రాకాంత్రము:- [ ] రణ నిపుణ ప్రాపణీయాను భావా. స్త్రీ. 2-184

1. నాశనము చేయుట.

క. భూతాహరణంబు నిజ, ద్యోతనము దదీయవృత్తి దుర్దశపుత్రా.

శాంతి. 5-161

3. ఆహరించుట, గ్రహించుట, స్వీకారము.

క. కమలా విధేయుఁడగు నా, హరి యతనికిఁ గానవచ్చు నట్టులుగాఁ దెచ్చెర వచ్చి హవిర్భాగాహరణం బొనరించి చనుదు నతికుపితుండై. శాంతి. 6-363

4. తెచ్చుట, తీసికొనివచ్చుట.

చ. వినతకు దాస్యమొండె నొకవెంటఁ దదీయ నిరాసహేతువై, యనఘ విచార నాకు నమృతాహరణంబు విధేయమయ్యె.

అను. 1-251

క. యమునా స్నానంబునకును, సుమతోయాహరణమునకు సువ్రతుఁడా సంయమి సనియె. ఆశ్ర. 2-88; అర. 3-96 ఆది. 4-47

5. అపహారించుట, కాఁజేయుట.

క. ...విప్రస్వాహరణము భూపాలవరున కాపదఁ దెచ్చున్ అను. 2-440; ఆది. 1-32

వ. కుండలాహరణంబు సవిస్తరంబుగాఁ జెప్పిన విని. అర. 7-374

ఆహరించు సం. స. క్రి.

1. అపహరించు, గ్రహించు.

వ. అఖిల జగద్ధన మాహరించి కొనవలె. అశ్వ. 4-268

ఆ. ...యాగముల భాగ, మాహరింతుఁగాన హరియు నంద్రు. శాంతి. 6-481

2 అరగించు, తిను.

ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాస,ములకుఁ జిత్తశుద్ధి ఫల జలంబు, లాహరించి యునికి కాధిరాజ్యము వత్స, భక్షతకు దివంబు ఫలము లధిప. అను. 1-143

3. ప్రోగుచేయు, సంపాదించు.

వ. ...మయుండు లోకంబులం గల యెవ్వలం దెల్ల నుత్తమ సారంబులు తిలప్రమాణంబు లాహరించి యొక్క కామినిం గావించి తిలోత్తమ యను పేరిడె. అను. 4-425

4. తీసికొను.

గీ. శస్త్రజీవికయును నరి పక్ష భాగ,మాహరించుటయును భృత్యు నరయుటయును, బ్రజలవాదంబు వినుచోటఁ బక్షపాతి,గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి. అను. 5-11

5. తీసికొని వచ్చు.

వ. అయ్యుదంకుం డట్లు దన మహాతపంబు బలిమిఁ బరాక్రమించి యనన్య సులభంబులగు కుండలంబు లాహరించి గురుజన మనోరథ సిద్ధి గావించె. అశ్వ. 3-113

ఆహవనీయము సం. వి. అ. పుం.

అగ్నిహోత్రభేదము (ఇది దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము అనెడ త్రేతాగ్నులలో నొకటి)

క. విను గార్హపత్యమును న,య్యగ్నులము విహరింపఁబడి తదాహవ
నీయం,బన వెలుఁగునట్లు వెలుఁగును, జనకుఁడు దాఁ బుత్రుఁడై
నిజద్యుతి తోడన్. ఆది. 4-86

**ఆహవము** సం. వి. అ. పుం.

యుద్ధము.

తే. దొరలు దలపడ్డ నాహవదోహలమున, నుభయ బలములు దమ
కించి యోర్వలేక. విరా. 3-190

**ఆహా** దే. వి.

ఆశ్చర్యము.

శా. ఆహా పుట్టెడు లాఁతి చూపులకు హాహా పుట్టు మీ వారికిన్.
కల్యా. 2-248

**ఆహారత** సం. వి. ఆ. స్త్రీ.

ఆహారమగుట.

క. ...భి,క్షాహారత నొందఁ దలఁపనగునె నరేంద్రా. శాంతి. 1-48

**ఆహారము** సం. వి. అ. పుం.

1. భోజన పదార్థము.

వ. వన్యాహారంబుల శరీర యాత్రలు నడపుచు. విరా. 1-147

2. భోజనము.

సీ. పదుమూఁడు వర్షముల్ పగలును రేయును, గర్ణు దర్పం బెట్లు
గడతునొక్కొ, యను చింతఁ జేసి యాహార నిద్రలు లేక, పరి
తాపమందితి. కర్ణ. 2-38

3. (పశువుల) మేఁత, తిండి.

సీ. (అశ్వములకు) దేశకా,లోచితాహార ప్రయోగ భంగి.
విరా. 1-263

సీ ...ఆహారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁబోయి శాంతి. 3-203

4. చతుర్విధములగు ఆహారములలో నొకటి. భక్ష్యము, భోజ్యము, చోష్యము, లేహ్యము అనునవి చతుర్విధాహారములు.

వ. ఇట్లు చతుర్విధాహారంబుల నందఱం దృప్తుం జేసి యున్న యా
నందినిం జూచి విశ్వామిత్రుండు. ఆది. 7-97

**ఆహితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. స్థాపింపఁబడినది. ఉంపఁబడినది, పుట్టింపఁబడినది.

ఉ. ఆహిత గౌరవంబగు శుభాంగముఁ దేజముఁ జూడబుద్ధి సం,దే
హముఁ బొందుచున్నది. విరా. 1-295

2. కలిగింపఁబడినది.

క. సితనీలాదిక వర్ణా, హిత వైకృత దూర. శల్య. 2-421

ఉ. సధర్మకోపాయసమాహితంబును. అను. 2-461

3. చేయఁబడినది.

క. శ్రీ మదరేఖవిషాదవి,రామాహితగాథ శమధురా. విరా. 4-1

4. కూడినది.

క. అమృతము నభవము నజరము, నమలము నగు తన్ను మృతము
నాహితభవమున్, సమధిక జరమును మలసహి,తముగా నశ్వరము
మమతఁ దలఁచు నరేంద్రా. శాంతి. 6-18

**ఆహితాగ్ని** సం. విణ. (ఇ)

అగ్నిహోత్రమును గృహమునం దెప్పుడును ఆధానవిధి పూర్వకముగా
స్థాపించుకొని యుండువాఁడు.

ఆ. ఆహితాగ్నిఁ బుణ్యుఁ డను శ్రుతి జననియు, జనకుఁడును గురుండు
సద్గతియును. శాంతి. 5-487

వ. అని పలుకుటయు ధర్మనందనుం డిట్లను నీ యఖిల జనంబులు
నాహితాగ్నులయట్ల యగుం గాక. స్త్రీ. 2-172

**ఆహుకుఁడు** సం. వి. అ. పుం.

హృదికుఁడు, కృతవర్మ తండ్రి.
(ఇతఁడు ఉగ్రసేనుని తండ్రి ఆహుకుఁడు కాదు)

వ. ఆహుకాత్మజకు వలన నంత వృత్తాంతంబును వెఱింగి.
అర. 1-179

శ్లో. దృష్ట్వా శంకోపపన్నోఽహ మపృచ్ఛం హ్యార్దికాత్మజమ్
ఏవముక్తస్య తు మయా విస్తరేణేదమబ్రవీత్,
రోధం మోక్షం చ సాళ్వేన హార్దిక్యో రాజసత్తమ.
సం. భా. అర. 70-3, 4 శ్లో.

ఆహుకుఁడు (హ్యార్దికుఁడు) ద్వారకకుఁ జెందిన యొకరాజు. ఈతఁడు ద్వారకను శత్రువుల నుండి కాపాడుచుండును.

శ్లో. ఏవం సువిదితా రాజన్ ద్వారకా భూరిదక్షిణా
ఆహుకేన సుగుప్తా చ రాజ్ఞా రాజీవలోచన.
సం. భా. అర. 16-28

శ్లో. రాజానమాహుకం చైవ తథైవానకదుందుభిమ్
సం. భా. అర. 20-7 శ్లో.

ఆహుతి సం. వి. ఇ. స్త్రీ.

(దేవతల నుద్దేశించి) అగ్నియందు మంత్రపూర్వముగా వేల్చుట.

మ. ...చటులాస్మదీయ శిఖాగ్నిజ్వాలలం దాహుతుల్, వరుసం
బెట్టుదు ధార్తరాష్ట్రితతి నైశ్వర్యం బవార్యంబుగన్.
ఉద్యో. 2-301

వ. ...ఈ పదింటిని గ్రమంబుగా నాహుతులుసేయు హోతలు.
అశ్వ. 2-18

2. హోమద్రవ్యము, హవిస్సు.

ఆ. ఇవ్విధమునఁ జేరి యవ్వేదిలోపల, భాసమానుఁడైన పావకునకు,
దేహ మొక్క యాహుతిగఁ జేయుటకుఁ దగు,నంత లేక యునికి
నతఁడు సూచి. సౌప్తి. 1-118

ఆహూతము సం. విణ. (అ. ఆ. అ.)

పిలువఁబడినది.

వ. అనుటయు విని మున్నాహూతంబైన హంసం బక్కాకంబు
నాలోకించి. కర్ణ. 2-62

వ. ...హేమకూటంబున నుపలంబుల వలన నెలువడు దహనంబున
నాహూతంబులై వచ్చు మేఘంబులను జూచి విస్మయం బంది.
అర. 3-85

**ఆహూతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

పిలువఁబడినవాఁడు, ఆహ్వానింపఁబడినవాఁడు

వ. అయోధ్యాగేంద్రుండు దేవేంద్రుని దేవతలనుం బిలిచె నమ్మహనీయ మంత్రశక్తి నాహూతులైన యప్పురుహూత ప్రభృతి బృందారకులు. అశ్వ. 1-98

వ. ...అనద్యూతార్థం బాహూతుండనై మగుడ నగునే యని. సభా. 2—278

**ఆహృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఆహరణము, హరించుట.

చ జగత్త్రియీ విధాయక పరిరక్షక ప్రతి సమాహృతికారక చిత్ర వృత్తి భావక. కర్ణ. 8—399

**ఆహ్నికము** సం. వి. అ. న.

ప్రతి దినము నిర్ణీత కాలమునఁ జేయఁదగిన కర్మము.

(సంధ్యావందనాదికము)

వ. ...మధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నిక విధానుండై గ్రామంబున కరిగి. అర. 5-9

**ఆహ్లాదనము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆనందము గలిగించునది, సంతోషపెట్టునది.

క. ...రత్నభూషిత రూపంబును గురుదేశాహ్లాదనంబును నగు నిజ కార్ముకంబు మోపెడలించెన్, విరా. 1-170

**ఆహ్లాదము** సం. వి. అ. పుం.

సంతోషము, ఆనందము.

వ. ...తెలియం జెప్పిన నతండు పరమాహ్లాదంబునం బొంది. విరా. 2-274

**ఆహ్లాది** సం. విశే. (న్. నీ. న్.)

సంతోషము గలిగించునది.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానా రసాభ్యుదయోల్లాసి విరాటపర్వము. విరా. 1-7

**అహ్వాయము** సం. వి. అ. పుం.

పేరు.

తే. ఫల్గునాహ్వాయ ముత్తరఫల్గునీ వి,శిష్టకాల సంజననతఁజేసి కలిగె. విరా. 4-146

అ. ...నరుని భార్య లులూపి చి,త్రాంగద యనఁ బరఁగు నాహ్వాయములు. ఆశ్ర. 2-48

**అహ్వాయుఁడు** సం. వి. అ. పుం.

పేరు గలవాఁడు.

తే. అతని యనుజుండు సూర్యదత్తాహ్వాయుండు. విరా. 3-147

**అహ్వానము** సం. వి. అ. న.

పిలుచుట, పిలుపు.

వ. నానా దేశాధీశులు పరస్పరాహ్వాన నాదంబులు...జెలఁగ. ద్రోణ 2-78

**ఆళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. (ఆలి)

సమూహము.

క. అతిపక్వతాల సుభగ ఫలాళీ,బ౹ధురతరాలు. విరా. 3-229

# ఇ

ఇ[1]

ఇ, ఈ, ఏ-ల మీఁది 'కు ను, వు' క్రియావిభక్తుల యొక్క ఉకారమున కాదేశముగా వచ్చునది.

ఉదా :- మానిసికిన్ ఉద్యో. 8-107; వారికిన్ ఉద్యో. 8-112; ఇంగిత. 58)

వేదివి, నెచ్చెలివి, సుకృతివి ఉద్యో. 1-153; వచ్చితిని ఆది. 1-95; వచ్చితిమి ఆది. 4-27; వచ్చితివి ఆది. 5-99; వచ్చితిరి ఆది. 7-2.

2. కొన్ని శబ్దములకు విభక్తి ప్రత్యయములు పరమగునపుడు ఆదేశముగా వచ్చు ఔపవిభక్తిక వర్ణము.

ఉదా:- నోరికిన్ విరా. 4-98; వారియందు ఉద్యో. 2-160

3. అలుక్సమాసమున 'చేత, తోడ, వలన'-ల అంత్యమునకు ఆదేశముగా వచ్చునది.

ఉదా:- అతని చేతిబలుపు భీష్మ. 2-322; అతని వలని వెఱపు శాంతి. 2-58; నీతోడి సఖ్యంబు ఆది. 7-51.

4. ఇ, ఏ-వర్ణములు కూడునపుడు అనాద్యమైన ధాతూకారమునకు ఆదేశముగా వచ్చునది.

ఉదా:- అరిగి విరా. 2-112; అరిగెను ద్రోణ. 2-231.

5. ఊష్మరేఫ భిన్నమును అసంయుక్తంబు నగు హల్లు పరంబగునపుడు వృత్తియందు సర్వనామమగు 'ఈ' శబ్దమునకు ఆదేశముగా వచ్చునది.

ఉదా:- ఈ విధము, ఇవ్విధము భీష్మ 1-166; ఈముని, ఇమ్ముని శాంతి. 3-95.

6. ఔపవిభక్తికములగు 'టి, తి' వర్ణములు పరమగునపుడు ఉకారమునకు ఆదేశముగా వచ్చునది.

ఉదా:- ఆఱిటిన్ ఉద్యో. 2-27; ఐదు, ఐదెంటిని అను. 4-279.

7 కొను ధాతువు అనుప్రయుక్తమగునపుడు యాంతధాతువులకు నిత్యముగను ఇతర ధాతువులకు వికల్పముగా వచ్చునది.

ఉదా:- పట్టికొను ద్రోణ. 5-312; తలంచికొను అను. 1-269; చేసికొని ఆది. 8-26.

8 క్రియలపై భూతంబున వచ్చునది.

ఉదా:- కావించితి అర. 4-68; కావించినవారు ఆది. 4-266; కావించినన్ ఆది. 6-158

ఇ² అవ్య.

ప్రశ్నార్థకమగు 'ఏ' శబ్దమునకు మహన్మహాత్మ్యార్థములందు అనుప్రయుక్తమగునది.

ఉదా :- ఏది విరా. 5-322.

ఇ₃ ప్ర.

1. కొన్ని ధాతువులపై వచ్చు కృత్ప్రత్యయము.

ఉదా :- చేయు + ఇ = చేయి విరా. 1-78; ప్రతిమ్మరు + ఇ = ప్రతిమ్మరి ఉద్యో. 2-9.

2. క్త్వార్థమున వచ్చు ప్రత్యయము.

ఉదా :- ఇచ్చి విరా. 5-378; పెట్టి అర. 1-119.

ఇంక దే. అవ్య. ద్రు. ఇఁక

1. ఇతఃపరము, ఈపైని, ఇందుమీఁద.

వ. ఒక్కయెడ నరదంబు లరిగిన చొప్పు గాంచి దానివెంబడిం జని చని.

క. కేవల సూతులతోడన, పోవుట గని వారిఁజేరఁబోవక యది యింకే వంకఁబోవునొకో యను, భావనఁ బోయితిమి దానివజ్జన యేమున్. విరా. 3-83, 84

వ. చెప్పు మింక నప్పాండవు లేమిసేయువారనిన విదురుం డిట్లనియె. అర. 1-45

క. పాముఁబొదివి పడఁదిగిచిన, చీమలగమి యట్ల ద్రోణుఁజిక్కువటిచెఁగా, కేమి బహుదేశ సైన్యము, లేమనఁగల దింక నూఁత యెవ్వరు మనకున్. ద్రోణ. 1-85

ఆ. ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగునొక్కొ. ఆది. 6-90

2. ఇంతకంటె వేఱు, ఏతదన్యము.

తే. (జమదగ్ని పరశురామునితో) సమరముదుగు నారాయణసఖుఁడు నరుఁడు, సవ్యసాచి నా నింకొక జన్మమొంది, యితని వధియించుఁగాని తక్కితరజనములకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన. ఉద్యో 4-357

క. నరుఁ డొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ జాపధరుం, డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలం డింకఁ గలుగు ననరా దెందున్. విరా. 5-128

3. ఇంతకంటె నధికముగా.

వ. విదురు దిక్కు మొగంబై ధృతరాష్ట్రుండు నీ చెప్పిన నీతివాక్యంబుల నామనంబు దనివోవ దింకను జెప్పుమనవుడు. ఉద్యో. 2-65

క. ధనమున విద్యను సంతతిఁ, దనిసిన వారెందుఁగలరె ధవళేక్షణ కావున నాకింకను బలువురఁ, దనయులఁ బడయంగవలయు ధర్మువు పేర్మిన్. ఆది. 5-119

4. మఱియు.

ఉ. ...నీకరుణ నిట్లు పదస్థుఁడనైతి నింకఁ జన్మాంతర దుఃఖముల్ దొలఁగు నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. విరా. 1-21

ఆ. నీచేత, భంగపడితి మింకఁ బలుకులేల. భీష్మ. 2-121

తే. క్షరము నక్షరమును ననఁ గలుగు రెంటి, నేర్పఱించి మున్ను సెప్పితి నింక నొకటి, సెప్పఁ గలదు. శాంతి. 6-46: అశ్వ. 1-158

5. మఱి విచారింపఁగా.

తే. ఎవ్వరి యాండ్రు రింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు. విరా. 2-140

చ. వాఁ, డిల మన నింక వాండ్రకును నెవ్వరు భంగము నీఁగజాలువారు. విరా. 2-231

6. మరల, రెండవ పర్యాయము.

వ. ఆసంరంభము నూచి సుయోధనుం డశ్వత్థామతో నింకను నమ్మహాస్త్రంబు ప్రయోగింపుమనుటయు నతం డది పునఃప్రయోగంబున కర్హంబుగాదు. ద్రోణ 5-390

7. ఇప్పటికిని

సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు వదలక పెరుఁగుచున్నదియుఁ గాన. ఆది. 3-95

వ. చెట్టచేసి యింకనయినఁ జెచ్చెర సాంబ చారుదేష్ణు లున్న చోటికి సాల్వాభిముఖంబుగా రథంబుఁ బోవఁ బుపుము. అర. 1—172

ఇంకించు దే. స. క్రి.

ఇంకునట్లు చేయు, లోపల నణఁగునట్లు చేయు.

వ ...తత్కాల జనితంబయిన ఖేదంబునం దొరఁగ నుకట్టు బాష్ప జలంబులు మగుడ నింకించుచు. విరా. 1-78

ఇంకు దే. అ. క్రి.

1. (ద్రవపదార్థము:లు) నేల మున్నగు వానిలో నడఁగు, ఇరుగు.

క. మూత్ర పురీషాదులు తమ, గాత్రములం దింక వారు గారవ మెసఁగం, బుత్రుం డని సంవర్ధిత, గాత్రునిఁగాఁ జేసి రింతకాలము గూర్మిన్. ఉద్యో. 4-84

తే. ...రాజవిహితమైన, పుడమి జనులకు నింకిన మడువులోని, జల చరంబులు పడుపాటు సంభవిల్లు. శాంతి. 2-265

చ. ...నా వచనంబు దప్ప ది,వ్యవనిధు లేడు నింకిన. అర. 1-141

ఇంగలము వై. వి. (సం. అంగారః-ప్రా-ఇంగాలో)

నిప్పు, అగ్ని.

వ. ఆ పొంత పల్లియకు రయంబునం జని పుల్లతల సంగతంబైన యింగలంబు. శాంతి. 3-317

ఇంగితము సం. వి. అ. న.

1. హృదయమునందలి భావము, అభిప్రాయము.

సీ. అవయవ లక్షణం బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితాకారము లును. విరా. 1-268

2. హృదయమునందలి భావమును దెల్పు చేష్టావిశేషము.

క. ...ఇం,గిత వేదివి నెచ్చెలివి సు,కృతి వట్లగుటన్. ఉద్యో. 1-58

వ. తదీయ భార్య దదింగితం బూహించి యతనితోడ. ఆశ్వ. 4-224

ఇంగువ వై. వి. (సం. హింగు)

రామఠము, ఒకానొక చెట్టుయొక్క జిగురు లేక పాలు

ఈ చెట్టు ఒక నిలువెత్తున పెరుఁగును. దీని మ్రానుపట్ట అంచేఁత యంత దళసరిగా నుండును. వావిలి చెట్టువంటి యాకులు పూలు గలిగి యుండును. దీనిలోఁ గొన్ని వస్తువులను జేర్చి వంటచేసి యనేక విధములైన యింగువను తయారుచేయు చున్నారు. దీనిని పులుపు గలిగిన పదార్థములలో నుపయోగింతురు.

ఆ. కటియ జీలకఱ్ఱ గఱివేము గురుజ యిం,గువ ప్రవర్ధనీయ కోటి
యగుట. అను. 8-189

## ఇంగువు వై. వి. (సం. హింగు)

ఇది ఇంగువకు పాఠాంతరము. చూ. ఇంగువ.

## ఇంచు[1] దే. అ. క్రి.

ఇంపగు, ప్రియమగు, రుచించు.

క. కర్ణుండు రేఁచిపెట్టఁగ, దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ,
నిర్ణయమె మేలనఁగ నీకర్ణములకు నించునెట్లు కార్యవచనముల్.
ఉద్యో 2-248

తే. వస్త్రమాల్యానులేపనావసరములును, జతురతూర్యత్రయంబుల
సమయములును, నేము వెలిగాఁగ మా తండ్రి కించునెట్లు, పుత్రు
లనపట్టి మమ్మేల పోవఁద్రోచు. ఉద్యో. 1-300

ఆ. తనియఁ బండ కుండమును గోసికొనఁ జవి, చేఁకాదు విత్తుచేటుఁ
గలుగుఁ, ఐక్యమైనఁగొనిన ఫల మించుఁజెడదు బీ,జంబుఁ గార్యసిద్ధి
చందమట్లు. ఉద్యో. 2-56; శాంతి. 6-226; ఆశ్ర. 2-128

## ఇంచు[2] అవ్య.

సంస్కృత ధాత్వాదులకును కొన్ని తెనుఁగు ధాతువులకును స్వార్థమునందును, అన్ని ధాతువులకుఁ బ్రేరణార్థమునందును వచ్చు ఆగమము

ఉదా: భుజించు. శాంతి. 4-368; ఆలోకించు విరా. 1-19; పలవించు
విరా. 3-5; త్రావించు విరా. 4-28.

## ఇంచుక దే. అవ్య.

1. కొంచెముగా.

తే. ...లాయమున నున్న,యపుడు దొసఁగించుకయులేని యట్లుగాఁగ, మాటిమాటికిఁ బరికించి. విరా. 1-95

ఉ. ఇంచుక యేని పాపమున కెన్నఁడు రోయక యెల్లవారి భాధించి. ఆది. 6-224

సీ. తెలిగన్నుఁగవ కాంతి బొలుపార నించుక కనువిచ్చి చూచినఁగా దె యబల- విరా. 2-45

2. కొంచెమైనను.

మ. రణనం బించుక దోఁపలేద. విరా. 3-159

ఉ. పటుల బ్రమొగ్గువారిఁ గని యించుక కొంకక. విరా. 3-163

చ. అనఘ భవత్ప్రభావమున యాపద యించుకలేక పాండునందనులు నిజాప్తబంధు సహితంబు సుఖస్థితి నున్నవారు ఉద్యో. 1-370

3. కొంచెము, స్వల్పము, సూక్ష్మము.

ఉ. ఎక్కడి మాట గొల్లతవ మించుక యేనియు లేదు నీదెసం. విరా. 1-281

క. ...దురితముం, బొరయఁ డొకయించుకయు. శాంతి. 1-296

క. ...ఒకయించుక ముల్లయి,నను పాదతలమున నున్న నడవఁగ నగునే. ఆది. 6-115

(ఒక యించుక = అత్యల్పము - మిక్కిలి చిన్నది)

4. ఇంచుక సేపు, కొంచెమైన కాలము.

వ. ఇంచుక నిద్రించు సమయంబున. విరా. 1-9

ఇంచుకంత దే. అవ్య.

మిక్కిలి స్వల్పముగా, ఏ మాత్రమైనను.

ఆ. యత్న మించుకంతయయినను వలవదు. విరా 1-42

ఇంటిసిరి వి.

ఇంటియందున్న యైశ్వర్యము, గృహసంపద, గృహలక్ష్మి.

ఆ శీలవంతులైన సిరిఁ బొందుదురు ధర్మతనయ నింటిసిరికి నెనయ

నంగ, నెక్కుడనగ. శాంతి. 3-130

ఇంత సర్వ. ఔప. అనౌప

1. పరిమాణార్థకము, ఈ కొలఁదిది, ఈ పరిమితి గలది, ఉద్దేశించినంత.
(ఇది సందర్భానుసారముగా ఆధిక్యమును, అల్పత్వమును దెలుపును)
ఆధిక్యము :–

తే. ఇంత ప్రొద్దేల యిచ్చోటికేఁగుదేరఁ గారణంబేమి. విరా. 2-168

వ. అప్పాండవేయాగ్రజుండు వృత్రుని విజ్ఞానంబును విష్ణుభక్తియు నింత గొప్పవే యని యుగ్గడించి. శాంతి. 5-422

క. వెలపెట్టఁదగిదియో యెన్నఁడు, నెఱుఁగని నీయట్టి వాని కెవ్వరికో యీ పిఱికితన మింత యలవడఁ, గలిపిన వారమును శౌరి కలకల నవ్వెన్. ఉద్యో. 8-57

వ. యోధవీరు లితం డింత వెఱచునే యనువారును. భీష్మ. 1-165

గీ. ఇంత పాపంబు సేయంగ నెత్తికొందుమయ్య. భీష్మ. 1-188

అల్పత్వము :–

చ. పొలఁతుక కాంతి యింత పొలివోవఁగ నీకెసలారు తారని,శ్చలత గడంగి క్రోలికొనఁ జాలుటఁ గీచకముఖ్య లోచనం,బులు. విరా. 2-85

చ. ...అతఁడుం, దెలిపి యొకింతఁ గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి. విరా. 5-141

మ. అరయం దప్పొకయింత మావలన లేదు. ఉద్యో. 3-358; ఉద్యో. 4-79

2. దీనికి బహువచన రూపముగూడఁ గలదు. చూ. ఇంతలు.

3. ఈ మాత్రము, ఇంతవట్టు.

తే. (కీచకుఁడు)...నా యతుల బాహుబలముఁ దెనయంగ భవదీయ పతుల కారు, మూఁడు లోకంబులందు నెవ్వాఁడులేఁడు, నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి. విరా. 2-56

తే. ఎలమిఁ బొందుము దీనికి నింతయేం.

విరా. 4-175; అను. 4-324; అశ్వ. 1-111

4. ఇదమర్థకము, ఇది యను నర్థము నిచ్చును (కొన్ని విభక్తులలో మాత్రమే యుపయోగించును.)

క. రాజధర్మంబున కిడుమఁజేసి యింత పుట్టఁగ వలసెన్.

విరా. 5-120

వ. ...ఇంతకంటెం బరమరహస్యం బొక్కటి చెప్పెద. భీష్మ. 1-238

క. ...అజ్ఞాయుతుఁడై యాత్మఁ డింత చర్చింపు మదిన్.

అను. 5-158

5. ఈ సమయము, ఇప్పుడు.

చ. ...గొంతి యింతకున్, బడుగయి పాలలోఁబడిన బల్లి విధంబున నుండకుండనే. (ఇంతకున్ = ఈ సమయమునకు) ఉద్యో. 3-185

ఉ. ఇంతకు నేర్చు నీకు నొక యింతటిలోన మదీయ వాణినత్యంత విభూతిఁ బెంపెసఁగునట్టి నినుం గొనియాడఁజేత దానెంతటి పెద్ద. (ఒక యింతటిలోన = ఈ కొలఁది స్వల్పకాలములో) విరా. 1-21

చ. ఎఱిఁగి యెఱింగి నన్నడుగ నేమిటి కిప్పు డెఱింగి యింతకున్మఱచుట గల్గెనే (ఇంతకున్ = ఈ స్వల్పకాలములో) విరా. 2-169

తే. ...అప్పు డమ్మగువ యమ్ముఁ, లేటితేరంగఁబోయి యొక్కింత దడసి, యరుగుదెంచిన. (ఒక్కింత = కొంచెము సేపు)

అను. 3-256

6. ఈ సర్వము, ఇదియంతయు.

ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరిదాన వేమి పనికిఁబూని యిప్పు డెచట బుద్ధిఁదలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁజెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి.

విరా. 1-312

క. ఇంతకు మూలము ద్రుష్ణాతంతులతయ. శాంతి. 4-298

క. మీరును వారును జలమునఁ, బోరెదు నెడ నెద్దియెట్లువోయిన నెఱి నే, నూరకయుండుదుఁ దోడెవ్వారికిఁ బో నింత చిక్కుపడం బెబ్బంగిన్, ఉద్యో. 1-88

తరువోజ. .. ఇంకెట్టులీ లోకపరివాద మే నుడిగింతు నింతకు నింతయు నెఱుఁగరె జనులు. ఆది. 5-28

7. విజృంభణము, చెలరేఁగుట, ద్రోహము, కీడు.

ఉ. ...దీనికై, కీచక యింతసేసితి సుఖత్వముఁ బొందుదుగాక యింక నన్నేలచిన నిట్టుగా కుడుగునే. విరా. 2-856

చ. ...నాదు వల్లభకు బీంద్రుడను గ్రమ్మఱ నింతసేసిరే, యనుచు. విరా. 3.22

అవ్య

1. అధికముగా, ఎక్కువగా.

సీ. ....అతని -తే- పలుకులకు నవ్వి యా బృహస్పతి మహాత్ముఁ డెఱుఁగనే నిన్ను నన్ను నీ వింత సెప్పనేల. ఆశ్వ. 1-33

వ విశేషించి నీవింత ప్రార్థించి పనుప నూరకుందుదునే. ద్రోణ, 3-293

ఆ. ...వారి కేల యింత వగవ. స్త్రీ. 1-70

2. కొంచెముగా.

చ. ...ధర్మమువున కొంకి తయుం దొలఁగఁ ద్రొక్కమి. శాంతి. 1-4

3. ఇంతటిలో, ఇఁకమీఁద, ఇది మొదలుగా.

సీ. ...రాజ్యమునకుఁ, బరువడి దే మింతఁ బాసిన మా పుత్రపౌత్ర వర్గంబును బాయు. ఆది. 6-127

ఇంతంత

సమీపము.

వ. పరమైకాంతు లగువారి కింతంత నిలిచి శాంతి. 6-377

ఇంతంతలు

ముక్కలు ముక్కలు.

మ. ...తురంగమావయవ సంతానంబు లింతంతలై. ద్రోణ 4-83

(ఇంతింతలు — అని కొన్ని ప్రతులు).

ఇంతింతలు

చిన్న చిన్న ముక్కలు.

చూ. ఇంతంతలు.

ఇంతకు దే. క్రి.

1 ఈ స్వల్పకాలమునకు.

చ ఎఱిఁగి యెఱింగి నన్నడుగనేమిటి కిప్పు డెఱింగి యింతకున్, మఱచుట గర్జనే. విరా. 2-169

2. ఈ వేళకు, ఇప్పటికి.

గా. .. ఇం,తిం గాముం డిట తేఁడె యింతకని యుద్వృత్తాంగకోన్మాదుఁడై. విరా. 2-330

ఉ. ...నేఁ,బట్టిన యాయుధంబు వెడఁబాసినఁగాని వధింపఁ బోల ది,ట్టిట్టన కేగు మిప్పరుస యింతక కాలముగాదు దానికిన్. భీష్మ. 1-159

వ. ...నానా దేశాధీశులు నింతకుఁ జనుదెంతురు. ఆది. 7-160; విరా. 3-2

3. ఈవఱకు, ఈనాఁటికి.

వ. అవనభూమి నాథఁ డింతకుఁ జనునో నిలుచునో. మౌస. 161

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చిగఁ దనయిచ్చ నాడ మరిగిన యదియై, విచ్చలవిడి నింతకు ము,న్నిచ్చేడియ మెలఁగు శిష్య యెఱుఁగదు సుమ్మీ. విరా. 1-250

ఇంతట క్రి.

1. ఈ మాత్రమునకు.

ఉ. ...ఇంతట సంతసింపరాదు. ఉద్యో 1-371

2. ఈ పిమ్మట.

క. ...ఇంతట నేఁటికి నని సా,లింతము. భీష్మ. 2-40

ఉ. ...జగతీవర యింతటఁ బోయివచ్చెదన్. ఉద్యో. 3-400

(ఇంతక, అంతట పాఠాంతరములు)

ఇంతటిలో క్రి.

ఈ స్వల్ప కాలములో.

ఉ. ...ఒక యింతటిలోన మదీయవాణి న,త్యంత విభూతిఁ బెంపెసఁగు
నట్టి నినుం గొనియాడఁజేత. విరా. 1-21

**ఇంతటి మానిసి** మి. విశ.

ఇంత గొప్ప మనుష్యుఁడు.

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును తాన యిచ్చి యెన్నఁడు
బోంకం, డింతటి మానిసి యలిగినఁ, గౌంతేయుల కెట్లు బ్రదుకఁగా
వచ్చు ననిన్. ఉద్యో. 2-291; ఉద్యో. 2-158; భీష్మ. 8-17

**ఇంతటివాఁడు** సర్వ.

ఇట్టి గొప్ప శూరుఁడు, ఇంత గొప్పవాఁడు.

వ. ...పరశురాముఁ డింతటి వాఁడగు నే. శాంతి. 2-97

ఉ. ...ఇంతటి వానిఁగాఁగ న,త్యాదరవృత్తి మీరు విజయాశ నను
గొనియాటఁజేసి. ద్రోణ. 1-78

**ఇంతనంత; ఇంతనునంత; ఇంతనంతలు**

1. సమీపము.

తే. ...చంద్రకుండను గూబవులుఁగు, పాలికుఁడను ముంగియు నింత
నంతఁ దోఁచె. శాంతి. 3-208

వ. ...వసువు లక్కడ కేతెంచి యింతనంత నొక్కరేవునం దోఁచి
కృతస్నానులై. (ఇంతనంతలు-అని కొన్ని ప్రతులు) అశ్వ. 4-88

2. దూరదూరము.

వ. ధృతరాష్ట్రిం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత
నంత నుండి గాంధారి వినుచుండ. ఆశ్ర. 1-18

వ. ...తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను
నంతన్. విరా. 3-195

**ఇంతప్రొద్దు** మి. వి.

1. ఇంత రాత్రివేళ, అర్ధరాత్రి సమయము.

తే. ఇంత ప్రొద్దేల యిచ్చోటి కేఁగు దేరఁ, గారణం బేమి.
విరా. 2-168

2. ఇంత కాలము, ఎక్కువ కాలము.

ఆ. ...ఇంత ప్రొద్దుఁ, బోరి తింక శాంతిఁబొందు టొప్పు.
అశ్వ. 4-127

**ఇంతమాత్ర**

ఈ చెప్పిన మాత్రము, ఈ మాత్రము.

తే. ఇతఁడు రాజగు రాజును నింతమాత్ర,గాదు మూర్ధాభిషిక్త
వర్గంబుఁ దనదుఁ, చరణయుగ్మంబు గొలిపింపఁజాలు సార్వ,భౌము
పదవికిఁ దగియెడు తంగివాఁడు. విరా. 1-186

**ఇంతియ**

ఈ మాత్రమే, ఇంతే.

వ. ఉన్మత్త ప్రలాపంబులు పల్కుచున్నవాఁ డింతియకాని.
ఉద్యో. 2-241

**ఇంతయంత**

చిన్నవాఁడు-పెద్దవాఁడు; బలహీనుఁడు-బలము గలవాఁడు; అల్పుఁడు-అధికుఁడు; చిన్నది-పెద్దది.

ఆ. ...దారుణాస్త్ర మింతయంత యనక యెదిరి నావాలతిఁగొను.
కర్ణ. 2-45

**ఇంతయేని** ద్రు. కళ.

ఏ మాత్రమైనను, మిక్కిలి కొలఁదిగానైనను.

తే. అంతరంగంబునం దొక యింతయేని యలుకులేక. ద్రోణ. 5-299

తే. ఇతని మది లేదు కలఁక యొక్కింతయేని. ఆశ్ర 1-51

ఆ. ఉటికి మంటలోన నుల్లంబు తెలివొక, యింతయేనిఁ గుంద కిద్ద
మూర్తిఁ, దేజరిల్లనున్న ధీరవర్యునకుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు
దయదలిర్ప. సౌప్తి. 1-125

ఉ. ఓటమొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు.
ఉద్యో. 3-104

**ఇంతలింతలు** (ఇంతలు+ఇంతలు)

1. ముక్కలు ముక్కలు, ఖండఖండములు.

సీ. ...దుస్ససేను తను వింతలింతలు దునియలై చెదరి.
ఉద్యో. 1-117

2. చిన్న చిన్నవి.

చ. ...ధరణిం బడియున్న శరీర మింతలింతలు శకలంబులై నెరయ.
ద్రోణ. 1-274

3. ఇంతంత గొప్పవారు, యోధానుయోధులు.

వ. ...ఇంతలింతలు మేటిమగలు మన కార్యంబునకై. కర్ణ. 3-380

**ఇంతలు** (ఇంత-బహువచన ప్రయోగము)

1. ఈ చెప్పిన పరిస్థితులు, ఇట్టి పరిస్థితులు.

క. ఇంతలు పుట్టిన చోటను, శంతమనంతన యహింసాశాంతిపరుండై, కౌంతేయాగ్రజుఁ డాలము, పొంతం బో నొల్లఁ డనుము బుధులియ్యకోనన్.
ఉద్యో. 1-375

వ. ...విరస వచనంబు లాడుచు నింతలు పుట్టించుట యది యర్జునునకుఁ గార్యంబు.
ఉద్యో. 2-298

2. ఇట్టి ఘోరములు, ఇట్టి హంతక కార్యములు.

ఉ. ...సుజనవత్సల నీ విటులంట వారు మ, మ్మీరసమెత్తి కడ్పఅచి యింతలుసేసినదాన నీమదిం, గూరిన నొవ్వుసొంపునను గోపము పెంపునఁగాదె యారయన్.
ఉద్యో. 3-74

ఉ. ...దుష్టచేష్టల సుయోధనుఁ డింతలుసేసె.
ఉద్యో. 3-47

ఉ. ...సుయోధనుండు సంభావనసేసి పాలొసఁగు పాడియ కల్గిన బాల్యమాదిగా, నేవిధినైనను జెఱుప నింతలు పాపము లాచరించునే.
ఉద్యో 3-83

సీ. ఇతరేతర ద్రోహమతిఁదెగి యింతలుసేయుట గావించె నీయధర్మపరత లోభంబు.
శల్య. 2-291

వ. ...కురుకులంబునకు గుద్దలిగొని దుర్యోధనుఁ నీవ తొడరితి దాన నింతలు పుట్టె.
శల్య. 2-328

**ఇంతవట్టు** దే.

1. ఈ మాత్రము.

తే. ఎల్లభంగుల సైరంధ్రి నేను సింహ,బలునితోఁ జంపువారమై తలఁచి నీకు, నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి మీవు నింత,వట్టు మన్నన మాకు నీవలయు ననిన. విరా. 3-14

చ. ...నినుఁ బ్రార్థనసేసెద నింతవట్టు నా,చనువునఁ బోవనిచ్చి నృప సత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే. భీష్మ. 3-171

చ. అతులిత విష్ణుశక్తి సముపాహితమూర్తివి గమ్ము లెమ్ము సం,తత భుజశక్తి నిట్టి యవధాన మొనర్పఁగ నీవకాని యీ,క్షితి నితరుండు లేఁ డధిక కీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ను నూ,ర్జితగుణ యింత వట్టు తగఁ జేయును గావుము లోకమంతయున్. అర. 4-387

2. ఇదియంతయు, సర్వము.

వ. ...నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింత వట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి. ఉద్యో. 2-302

తే. ఇప్పు డీసభ పుట్టెన యింతవట్టు, మీకుఁదెల్లంబుగాదె. ఉద్యో. 4-7

ఆ. విను మవిద్య గామమునకుఁ గామము గర్మ,మునకుఁ బుట్టఁబట్టు లనఘ యింత,వట్టుఁ గారణముగ వచ్చుఁ బునర్జన్మ, మంద్రు తత్త్వవేదులైన మునులు. శాంతి. 4—318

3. ఇది, ఈ విషయము.

క. అనుజులఁ దనుజుల మత్సరి, జనులకు సమయించి వారు సమరోల్లా సం,బున మెఱయఁ జూడ నేర్తునె, జననాథున కింతవట్టు సంజయ చెపుమా. శల్య. 2-14

శ్లో. ఆచక్షథాస్సర్వమిదం మాం చ ముక్తం మహాహవాత్.

సం. భార. శల్య. 30-58

**ఇంతింత** (ఇంత + ఇంత)

దరిదాపు.

సీ. ...పరమైకాంతు లగువారి కింతంత నిలిచి దుష్కర తపోనిష్ఠఁ బూని. శాంతి. 4-377

**ఇంతింతలు** (ఇంతలు + ఇంతలు)

క. పలుకయు వాలును వింతిం,తలు దునియలు సేసె. విరా. 5-155

క. సంతత శరీరముల నన్నిటి, నింతింతలు శకలములుగ నేసె నతండున్. అర. 7-120

**ఇంతి** వై. వి. (సం. స్త్రీ. ప్రా. ఇత్థి అ, ఇత్థి)

1. ఆఁడుది, స్త్రీ.

ఉ. అల్లన యింతి యిట్లనియె. ఉద్యో. 1-165

మ. ...ఇంతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నెమ్మనముల్ విస్మయమందఁ జూచెదరు భామా పల్కు లింకేటికిన్. విరా. 1-321

2. భార్య, ఇల్లాలు.

సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్యలిద్దఱు గల, రందొక భామిని యతని హితము, నడపెడు నవధాన మెడలి యాతఁడు పంపకయ దాన సురపితృ కార్యపరత, నడచుఁ దక్కటియింతి నాథుఁ బాటించుచుఁ దన్మతంబునఁ జేయు ధర్మవిధులు. అను. 5-287

**ఇంతియ** సర్వా. (√ ఇంత)

ఇంతె, ఇంతయె, ఇంత మాత్రము.

మ. ...పెక్కండ్ర కింతియ కాలంబగునట్టి నీమనము శాంతిం బొందఁగా నేర్చునే. ఉద్యో. 4-47

వ. ...వాఁడు తగవు మాలిన పనిఁ జేయంజాలక పెనంగె నింతియ కాని విరోధి గాఁడు. ఉద్యో. 4-360

చ. ...పరిచారము నీవును నీదు పత్నియున్, గొనకొని చేయఁగా వలయుఁ గోరిన యింతయ తీర్పు మోపినన్. అను. 2-295

**ఇందము** అవ్య.

'ఇదిగో పుచ్చుకొమ్మను' అను భావమును దెలుపును.

సీ. బొమ్మపొత్తిక లడిగిరి కొమ్మ, యింద మనుచు నిచ్చెఁ దాఁ
దెచ్చిన యంబరములు. విరా. 5-804

ఇందఱు సర్వ. బహు.

(ఇంత శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము)

1. ఇంత మంది.

ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్ను. విరా. 2-142

2. వీరందఱు (ఈ యర్థమునఁ బ్రాయికముగా సముచ్చయముతోఁగూడ
యుండును.)

క. ఇమ్మద్దియ నర్జునునకు, నిమ్మీవని బంధుజనుల కిందఱకుఁ గడున్,
సమ్మతము. విరా. 5-859

క. ...నీ, కొడుకని యాతని నెంతయు, నెడమడుగుగఁ జూపఁదెత్తె
యిందఱు నగఁగాన్. ఆది. 4-100

ఇందలి విశే. (√ఇందు)

ఇఁదున్న.

వ. ...ఇందలి సుఖలేశంబునకై యొండొరులం జెఱుపను జంపను
దొరఁకొల్పి ధర్మపథంబు దప్పి యమకింకరుల చేతం బడుదుర.
స్త్రీ. 1-42

ఇందాఁక అవ్య. ద్రు. (√ఇంత)

ఇంతవఱకు, ఇంత పర్యంతము.

క. ఇందాఁక నీదుపలుకుల, డెందము తాపంబు కాంత డిందుపడియెం-
ఉద్యో 2-54

క. ఇందాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి మిప్పు డిచట.
శల్య. 2-66

ఇందిర సం. వి. ఆ. స్త్రీ.

లక్ష్మి.

క. ...తిరమై, యిందిర నీకడ వసించు నిభపురనాథా. శాంతి. 5-177

ఇందిరానందనుఁడు సం. సమ. వి. అ. పుం.

లక్ష్మీదేవి కుమారుఁడు, మన్మథుఁడు.

ఉ. ...ఇందిరానందను వాజ్ఞ యేచి. విరా. 2-26

ఇందిరాపతి సం. సమ. వి. ఇ. పుం.

లక్ష్మీదేవి భర్త - విష్ణువు.

సీ. ఇత్తలోదరి తీవి తేఱనకు ఇందిరాపతికైన మెచ్చరా పలుకఁజనదె.
విరా. 2-27

ఇందీవరతీర్థము సం. వి. అ. పు.

ఇందీవర తీర్థము అను పేరఁగల ఒకానొక నదియొక్క పవిత్రమైన రేవు స్థలము ఇందు స్నానము చేసినవారికి అశ్వమేధము చేసిన ఫలము లభించును. ఆర. 2-278

ఇందీవరనయన సం. విశ. అ. స్త్రీ.

నల్ల కలువలను బోలిన కన్నులు గలది- స్త్రీ.

క. అందొలఁగి కీచకుండా, యిందీవరనయన వాత్మ నిడి. విరా. 2-309

ఇందీవరము సం. వి. అ. న.

నల్ల కలువ.

చూ. ఇందీవర నయన.

ఇందు అవ్య. ద్రు.

1 దీనియందు, వీనియందు, ఈమెయందు, వీరియందు.

క. అనఘ యిది యోగపథ మిం, దనలసుఁడై చనఁగఁ జాలునతఁడు కృతార్థుండు. శాంతి. 6-122; విరా. 1-47

ఆ. ఎల్ల చుట్టములును దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు, గురువ యింక నొక్క కొలఁతియు లే దిందుఁ,జేరి బ్రదుకు బుద్ధి గౌరవమున. విరా. 1-253

వ. ...వేదంబు గర్మంబుల నాచరించుటయుం బరిత్యజించుటయుం జెప్పు నివ్విధంబులు పరస్పర విరుద్ధంబులై యున్నయవి యిందెద్దాన నెట్టిగతి సిద్ధించు. శాంతి. 5-124

సీ. ఇక్కన్య యతిశాల యిందుద్భవంబగు, దౌహిత్రలాభంబు దలఁగ నెట్లు -అ- దీనిఁబుత్తు. ఆది. 6-248

ఉ. అక్కట కౌరవాన్వయము నింకెడునట్లు పుట్టె నిం,దొక్కరుఁడైన గేళవు హితోక్తికి మేకొనఁడయ్యె. ఉద్యో. 4-54

2 ఇక్కడ.

తే. ఇందు మీ యున్కి విని ప్రియ మెసకమెసఁగ. ఉద్యో. 1-278

సీ. ...ఇం,దున్నాఁడు చూచితె యొద్దు చక్క -తే- గా నమర్చుచు జాడ్కులు గలయ దెసలఁ, బొరి నిగుడ్చుచు ధృతరాష్ట్ర పుత్రుఁడు. శల్య. 1-368

ఆ. ఏం యెఱుకలేని యితరుల యట్ల నీ, వెఱుఁగ నముచుఁ బలికె దెఱిఁగి యెఱిఁగి, యేనకాని దీని నెఱుఁగ రిం దొరులవి, తప్పఁ బలుక నగునె ధార్మికులకు. ఆది. 4-78

3. ఇక్కడకు.

చ. ...ఇందుర,మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ చేరి వినీతి నిల్చినన్. విరా. 1-310

వ. కృష్ణుండు పాండవ కార్యార్థంబుగా మన యొద్దకు వచ్చుచున్నవాఁడు నేఁడు కుశస్థలంబున విడిసె రే పిందు వచ్చునని వింటిని. ఉద్యో. 3-149

4. ఈ లోకమున.

క. ఈ నామ నిర్వచనములు, మానవుఁడు పఠించినను సమాహితమతియై, వీనుల నించిన సౌఖ్యము, నానందము నిందు నందు నతనికిఁ గల్గున్. అను. 5-401

ఆ. మాననీయ దేవయోనులు జననంబు, నొంది రిందు మనుజయోనులందు. ఆశ్ర. 2-110

సీ. పరమప్రియము లిందుఁ బరలోకమున సంభవించు. ఆశ్ర. 2-128

ఇందుఁడు సం. వి. ఉ. పుం.

చంద్రుఁడు.

క. ఇందు శిశిరమైన హృదయంబున. ఉద్యో. 1-298

**ఇందుధరుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుని ధరించినవాఁడు, శంకరుఁడు.

వ. అయ్యిందుధరుఁడు మధురస్వరంబున నిట్లనియె. ఉద్యో. 2-361

**ఇందునిభాస్య** సం. వి. ఆ. స్త్రీ.

చంద్రునితో సమానమైన ముఖము గలది. స్త్రీ.

క. వేరేమి సెప్పు మిందునిభాస్యా. విరా. 2-48

**ఇందుబింబము** సం. వి. అ. పుం. న.

చంద్రమండలము

సీ. ఇందుబింబము మీఁది కందుచందంబున. విరా. 2-188

**ఇందుమౌళి** సం. వి. ఇ. పుం.

శిరస్సునందు చంద్రుని గలవాఁడు, శివుడు.

చ. వారుఁ బరమేశ్వరు...నిందుమౌళిఁ దత్పరమతి నాశ్రయించి సౌప్తి. 2-107

**ఇందుల** (√ఇందు)

1 ఇందలి, దీనియందున్న.

క. ఇందుల తాత్పర్యము నీ,డెందము నొందించి. శాంతి. 5-17

సీ. .....బకుం డను రక్కసుం డుండు వాఁ డక్కజముగ, నిందుల- కాఁపుల నందఱఁ దొల్లి యిల్వరుస భ్రమింగుచునున్న. ఆది. 6-264

2. ఇచ్చోటు, ఇక్కడ.

క. వీనికి మార్గ్యానఁజాలెడు, దానికిఁ దగువాని ధర్మతనయుని పురిలో, నానా నియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి నిప్పు డిందుల- నలఁతున్.

క. మన వాసిసేఁడు. విరా. 2-9, 10

క. ఎందుండి వచ్చి తిందుల, కెందుల కేఁగెదు మహామునీశ్వర. ఆది. 4-281

ఉ. ఎయ్యది జన్మభూమి కులమెయ్యది యెయ్యది యున్నచోటు మే,రె- య్యది మీరలిందులకు నిప్పుడు వచ్చిన దానికిం గతం,బెయ్యది. విరా. 1-190

**ఇందులాంఛనము**

చంద్రబింబములోని గుర్తు.

తే. అర్కు నుదయాస్తమయములయందుఁ గృష్ణ, కాంతి ఘోరక బంధంబుఁ గప్పఁ దొచ్చె, నిందులాంఛన స్థితి తలక్రిందుగాఁగఁ, దోఁచుచున్నది ప్రజయెల్ల ద్రుంగకున్నె. భీష్మ. 1-11

**ఇందుశేఖరుఁడు** సం. వి. అ. పుం.

నెలతాల్పు, శివుఁడు.

వ. శతానందుం డయ్యిందుశేఖరునితో. శాంతి. 5-448

**ఇంద్రకీలము** సం. వి. అ. పుం.

అర్జునుఁడు తపస్సు చేయఁబోయిన యొకానొక పర్వతము ఇది హిమవత్పర్వతమునఁ జేరినది. చూ. వివ. అర. 1-287

**ఇంద్రగోపము** సం. వి. అ. పుం.

ఆరుద్ర పురుగు, మెఱుఁగుడు పురుగు.

వ. ఇంద్రనీలేంద్రగోప పిక చంద్ర మయూర కీర వర్ణ తురంగంబులును. సభా 2-118

**ఇంద్రచాపము** సం. వి. అ. పుం.

ఇంద్రధనుస్సు, మేఘమునఁ జిత్రవర్ణములతో ధనురాకారముగాఁ గనఁబడు సూర్యకిరణ సముదాయము. వఱదగూడు.

తే. గాండివం బింద్రచాపంబుకరణి నొప్పె.

భీష్మ. 1-108; కర్ణ. 1-184

**ఇంద్రజాలము** సం. వి. అ. న.

కనుకట్టు విద్య, మంత్రౌషధాదులచేత నొక విధమగు పదార్థమును మఱియొక విధముగాఁ జూపెడి విద్య, కనుప్రామట, మోసపుచ్చుట.

ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని వన్నినన్.

ఉద్యో. 4-201

**ఇంద్రజి** సం.

ఇంద్రజిత్తు.

క. అంతఁ బటుతోమరంబుల, నెంతయు వెస నృపతమాఱు నింద్రజి
  దైవన్. అర. 7-120

**ఇంద్రజిత్తు** సం. వి. త్. పుం.

రావణుని కొడుకు, ఇంద్రుని జయించినవాఁడు, మేఘనాదుఁడు

వ. అని కౌఁగిలించుకొని వీడుకొల్పిన నింద్రజిత్తు సత్వరుండై యరః
  దం బెక్కి లంకాపురంబు వెలువడినం గని. అర. 7-114

**ఇంద్రజుఁడు** సం. వి. అ. పుం.

ఇంద్రుని కొడుకు, అర్జునుఁడు.

క. ...అర్దైస, కేచి భుజాబలము మెఱయ నింద్రజుఁ డరిగెన్.
  విరా. 5-140

**ఇంద్రతనయుఁడు** సం. వి. అ. పుం.

ఇంద్రుని కొడుకు, అర్జునుఁడు.

వ. ...మొత్తనిపలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. విరా. 4-1[illegible]

**ఇంద్రతీర్థము** సం. వి. అ. న.

ఇంద్రతీర్థమను పేరుగల పవిత్ర స్థలము, తీర్థస్థానము.

ఆ. ఇంద్ర తీర్థమునకు నేఁగె నా బలభద్రుఁ, డచట నూఱు క్రతువు
  లాచరించి, యనిమిషేశ్వరుండు గనియె శతక్రతుఁ,డను ప్రసిద్ధి
  తోడ నతులపదము. శల్య. 2-198

**ఇంద్రతోయ** సం. వి. ఆ. స్త్రీ.

ఒక పుణ్యనది, తీర్థస్థానము, గంధమాదన పర్వతమునందుఁ బ్రవహించు
నది.

వ. గంధమాదన సంగతయైన యింద్రతోయయుం గురంగదేశ గత
  యగు కరతోయయుం ద్రిరాత్రోపవాసోపేత స్నాతకులకు
  నశ్వమేధఫలంబు గలుగం జేయు. అను. 2-78

**ఇంద్రదైవత్యము** సం. వి. అ. న.

ఇంద్రుఁ డధిదేవతగాఁ గలది, రేతస్సు, శుక్రము.

తే. అత్రిముని యింద్రదైవత్యమని జనులకుఁ, దెలిపె నది కారణముగ
  నింద్రియ మనంగఁ, బరఁగుఁజూచె నృబీజంబు పరమమెల్ల, ధాతు

వుల కథి విను పుత్ర దాని విధము. శాంతి 4-307

**ఇంద్రద్యుమ్నము** సం. వి. అ. న.

ఒక సరస్సు

వ. (పాండురాజు) హిమవంతంబునుం గడచి సురసిద్ధ సేవితంబయిన గంధమాదనంబునం గొండొక కాలం బుండి యింద్రద్యుమ్నంబను కొలనును హంసకూటంబును నతిక్రమించి. ఆది. 5-68

ఇంద్రద్యుమ్నుండను మహారాజు బహువిధ యజ్ఞ దక్షిణార్థముగ బ్రాహ్మణులకిచ్చిన గోగణముల గొరిజల త్రొక్కుడుచే పల్లముగానైన యేర్పడిన సరస్సు. ఇందు కూపారుండను కచ్ఛపము వసించుచుండెను. ఆది 4-364, 368

**ఇంద్రద్యుమ్నుండు** సం. వి. అ. పుం.

1. యమధర్మరాజు కొలవులోనుండు ఒక రాజఋషి. సభా. 1-68

2 స్వర్గవాసియైన యొక మహారాజు. చూ. వివ. అర. 4-862 మొ 869

**ఇంద్రధనువు(స్సు)** సం. వి. స్. న.

ఇంద్రచాపము.

తే ఇంద్రధనువు చందంబున నెసక మెసఁగు, గాండివముపాటు గంటిరే. అశ్వ. 4-14

**ఇంద్రధ్వజము** సం. వి. అ. పుం.

భాద్రపద శుక్ల ద్వాదశియందు రాజు తన రాజ్యమందు సస్యవృద్ధికర మగు వాన కురియుటకై ఇంద్రప్రీతిగా నెత్తునట్టి ధ్వజము.

వ. ...అ ధ్వజం బింద్రధ్వజంబునుం బోలె. ద్రోణ. 4-267

**ఇంద్రనీలము** సం. వి. అ. పుం.

నీలమణి.

రుక్మబద్ధేంద్రనీలతుల్య. శాంతి. 2-2

**ఇంద్రపర్వతము** సం. వి. అ. పుం.

ఒకానొక పర్వతము. దీని సమీప ప్రాంతము నేడ్వురు కిరాతపతులు పాలించిరి. సభా. 1-248

**ఇంద్రప్రస్థము** సం. వి. అ. వ.

యమునాతీరమున నున్న యొకానొక పట్టనము. అడవులకుఁ బోక పూర్వము పాండవులు ముఖ్య పట్టనముగాఁ జేసికొని పరిపాలించిన పట్టనము. ఆది. 8-15

మూలమున ఖాండవ ప్రస్థమని చెప్పఁబడియున్నది.

శ్లో. నగరం ఖాండవప్రస్థం రత్నాన్యాదాయ సర్వశః,
తత్ర తే న్యవస న్పార్థాః సంవత్సరగణాన్ బహూన్.
సం. భా. ఆది. 61-౩౬ (నిర్ణయ)

ఈ యింద్రప్రస్థమును విశ్వకర్మ యింద్రుని పనుపున నిర్మించి యిచ్చెను. ఆది. 8-70

క. హరి యింద్రుఁ దలఁచె నింద్రుఁడు, కర మనురాగమున విశ్వకర్మను బనిచెన్, సురపురమున కెనయగు పుర,మరుదుగ నిర్మింపు ముర్వి నని కడుఁ బ్రీతిన్.

సీ. ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా,భూసురుల్ సూత్రవిన్యాస మమరఁ,జేసి శాంతికవిధుల్ సేయంగ సుప్రశ,స్తంబైన రమ్యదేశంబునందు, వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి, పేర్మితో నవ్విశ్వకర్మ పురము, నిర్మించె నదియును నిరుపమలీలలఁ దనరి యింద్రప్రస్థ మనఁగ నింద్రు -ఆ- పురముతోఁ గుబేరు పురముతో వరుణేంద్రు, పురవరంబుతోడ నురగరాజ,పుర విభూతితోడ నురు విలాసంబుల, సరియనంగ నొప్పె ధరణిమీఁద. ఆది. 8-70

ఇంద్రప్రస్థ వర్ణనమునకై చూ. ఆది. 8-70 మొ. 80 వరకు

సంస్కృత భారతమున నొకచోట ఇంద్రప్రస్థమనియు నొకచోట ఖాండవప్రస్థమనియుఁ గలదు. కావున ఇంద్రప్రస్థము ఖాండవప్రస్థము అను పేర్లతో ఆ పట్టనము పిలువఁబడుచున్నదని యెఱుంగవలసి యున్నది.

శ్లో. విరోచమానం వివిధైః పాండురైర్భవనోత్తమైః, తత్త్రివిష్టప సంకాశ మింద్రప్రస్థం వ్యరోచత. సం. భా. ఆది. 207-౩౬ శ్లో.

శ్లో. ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతాః కృష్ణయాసహ పాండవాః, రేమిరే ఖాండవప్రస్థే ప్రాప్తరాజ్యాః పరంతపాః. సం. భా. ఆది. 208-౬

క. ...ఇంద్రప్రస్థం, బొందెను వేలోక పట్టణ,మొందెను మాకిచ్చి
యనుచు టుచితమకాదే. ఉద్యో. 1-827

"ఇంద్రప్రస్థే భవతు మమైవ రాజ్యమ్"
సం. భా. ఉద్యో. 25-29 శ్లో.

వ. అని ధర్మరాజు నభిషిక్తుంజేసి

క. నెమ్మిం జని ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముంజేసి శ్రద్ధయు ననురాగ
మ్మెసంగ నుండుం డందుం చిరమ్ముగ నని పనిచెం బాండురాజాత్మ
జులన్. ఆది. 8-67

సంస్కృత భారతమునందును ఈ ఘట్టమున 'ఖాండవప్రస్థము' అనియే గలదు.

సూ. ఆ. ని-కారుఁడు 'అవిస్థలము' అను శబ్దము క్రింద ఇంద్రప్రస్థము, కుశస్థలము, అవిస్థలము ఒక్కటియని వ్రాసెను. కాని దానికి ఆధారము ఇందుం గానరాదు. చూ. అయిదూళ్లు - కుశస్థలము - 'అవిస్థలము' అను పేరు ఆంధ్రభారతమునం గన్పట్టదు.

**ఇంద్రమతంగ సంవాదము** సం. సమ. అ. పుం.

ఇంద్రునకు మతంగునకుం గలిగిన సంభాషణము.

చూ. వివ. అను. 1-88 మొదలు

**ఇంద్రమార్గము** సం. వి. అ. పుం.

ఒకానొక తీర్థస్థానము, ఇచ్చట స్నానముచేసిన వారలు అప్సరస్సమేత విమానవర్తను లగుదురు. అను. 2-72

**ఇంద్రమాల** సం. వి. ఆ. స్త్రీ.

ఇది కమలములు గ్రుచ్చిన మాలిక. దీనిని ధరించిన ఆయుధములు శరీరమునకు సోఁకవు. ఈ మాల యెన్నఁడును వాడదు. దీనిని ఇంద్రుఁడు ఉపరిచర వసువున కిచ్చెను. ఆది. 3-24

**ఇంద్రము** సం. వి. అ. పుం.

అధిపతి, శ్రేష్ఠము. చూ. ఇంద్రుఁడు 3వ అర్థము.

మృగేంద్రము. శాంతి. 3-74

**ఇంద్రవర్మ** సం. వి. న్. పుం.

మాళవరాజు, దుర్యోధనుపక్షమునఁ బోరాడెను. ఇతని యేనుఁగు అశ్వత్థామ యనుపేరు గలది ఇది భీమునిచేఁ జచ్చెను. ద్రోణ. 5-311

**ఇంద్రసేన** సం. వి. ఆ. స్త్రీ.

1. నాలాయని- మౌద్గల్యుని భార్య, ఈమెయే ద్రౌపదిగా జనించెను. చూ. శత. ఆది 7-255 మొదలు చూ. ద్రౌపది

2. నలుని కూఁతురు. అర. 2-62

**ఇంద్రసేనుఁడు** సం. వి. అ. పుం.

1. ధర్మరాజు రథము తోలువాఁడు. విరా 1-115

2. నలుని కుమారుఁడు. అర. 2-62

**ఇంద్రాణి** సం. వి. ఈ. స్త్రీ.

ఇంద్రుని భార్య శచీదేవి.

వ. ...ఇంద్రాణియు మగుడం జనుదెంచె. ఉద్యో. 1-166

**ఇంద్రాయితుఁడు** సం. వి. అ. పుం.

ఇంద్రునివలె నున్నవాఁడు.

ఉ. ...ధర్మజునొద్ద నుండి మైత్రేయుఁడు ధీయుతుం డరుగుదెంచిన నప్పుడ యమ్మసీంద్రు నింద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితిఁ బూజితుఁ జేసె. అర. 1-92

**ఇంద్రావరజుఁడు** సం. వి. అ. పుం.

శ్రీకృష్ణుఁడు (విష్ణువు వామనావతారమున నదితికి జన్మించుటచే నింద్రునికిఁ దమ్ముఁ డయ్యెను.)

క. నరు నింద్రాత్మజు నింద్రావరజసఖున్.

ఆది. 6-17; సభా. 2-78

**ఇంద్రియజిత్త్వము** సం. వి. అ. న.

ఇంద్రియములను జయించుట.

తే. అజుఁడు మొదలుగ నతరోపాస్తియందుఁ జేయుదురు శాంతి నింద్రియజిత్త్వమొంది. అశ్వ 2-8

**ఇంద్రియము** సం. వి. అ. న.

1. త్వగాది (ఇవి పది-త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ ఘ్రాణము-ఇవియైదు జ్ఞానేంద్రియములు-వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము- ఇవి యైదు కర్మేంద్రియములు. మనస్సుతోఁ గూడ ఏకాదశేంద్రియములగును).

శా. ...ఇంద్రియములన్ మర్దించు... శాంతి. 2-282; విరా. 2-35

2. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపార శక్తి

సీ. పంచాత్మకంబైన పవనంబు నిగ్రహీతమైనది భవదింద్రియము మనము, నం దాఁగఁబడ్డవి యవియును నదియును బుద్ధియం దొదిగించి. శాంతి 2-8

3. శుక్రము, రేతస్సు.

తే అత్రిముని యింద్రదైవత్యమని, జనులకుఁ దెలిపె నది కారణముగ నింద్రియ మనంగఁ, బరఁగుఁజూవె స్రుబీజంబు పరమమెల్ల. ధాతువుల కది విను పుత్ర దాని విధము. శాంతి. 4-307

**ఇంద్రుఁడు** సం. వి. అ. పుం.

1. సురపతి, వాసవుఁడు.

సీ. ...ప్రభావతి యనునది యింద్రుండు పతిగాఁగఁ గోరి.

కల్య. 2-196; అర. 5-161

2. ప్రభువు

మ. ...కొండల మందెం ద్రిదశేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె. విరా. 4-172

3. సమాసమునం దుత్తరపదమైనపుడు మహదముహాద్భావముల ననుసరించి ఇంద్రుఁడు, ఇంద్రము, అనురూపములతో నుండి శ్రేష్ఠము అను నర్థముల నిచ్చును,

మునీంద్రుఁడు. ఉద్యో 3-411; మృగేంద్రము. శాంతి. 3-74

**ఇంద్రోత్సవము** సం. వి. అ. పుం.

ఇంద్రుని గూర్చి రాజులు ఏటేటఁ జేయు నుత్సవ విశేషము.

సిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ. ఉద్యో. 3-358

3. మనోజ్ఞత, విలాసము, అందము.

మృదుమధుర వాక్యంబుల నింపొదవెడుఁ బలుకనవ్వుతోడ.
శాంతి. 2-871

4. ఇచ్ఛ, ఆసక్తి, వలపు.

తే. ఆనితంబిని మక్కువ ననఁగిపెనఁగి, యింపు పొంపిరివోవ నన్నేలి
కొనఁగఁ, దలఁచి పొందిన నది జన్మఫలముగాదె. విరా. 2-86

సీ. ...పొలఁతి యింపెసలారఁ బొందునొక్కొ. విరా. 2-295

క. మృగములుఁ బక్షులు లోనుగఁ,దగు నాహారములు దెచ్చి తమ
ప్రియులకు నిం,పుగ నిచ్చు. అశ్వ. 4-227

విశ.

1 ప్రియము, ఇష్టము.

తే. ఖండశర్కరతోడి దుగ్ధంబు లనుభ,వింపఁ బడవేయ నవి యింత
యింపుగావు. కర్ణ. 3-218

గీ. ...జారపొందు, హృదయమున కింపుసేయమి నెఱుకగలుగు,వారు
దీని సుఖంబుగాఁ గోర రెందు. విరా. 2-70

గీ. ఇంపు పుట్టంగఁ బలుకు మచట. ఉద్యో. 1-270

2. మనోజ్ఞమైనది, మనోహరము.

తే. శుచులు నా చెవుల కింపు,లగుట మునులు శుచిశ్రవుఁ డంద్రు నన్ను
శాంతి. 6-486

సీ. దీని నామాకృతిగా నొఁచి వడసిన, యింపగు వర్ణంబు లెవ్వి
యొక్కొ. విరా. 2-80

ఇంబు విశ. ఇంపు, ఇమ్మై.

ప్రియము, ఇష్టము.

ఉ. ఇంబుగ సర్వలోక జనులెవ్వని యేని ముఖామృతాంశు బిం.బంబున
నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం.ధ్రంబను నంజలిం
దవిలి త్రావుదురు. ఆది. 1-76

ఇఁక అవ్య. ద్రు.

ఇంక.

క. కావున మున మిఁక వసింం, బోవం బనిలేదు. కర్ణ. 8-54

ఇఁకమీఁద ద్రు.

ఇఁక.

క. ...ద్రోణుల, వేఁడిమి యిఁకమీఁద మునుము విక్రమమునకున్ (ఇది పాఠాంతరము- 'ఇట మనకు' పాఠము. విరా. 5-110

ఇఁడి ప్ర.

లేవిది, లేనివాఁడు అను నర్థముల నిచ్చును.

వెరవిఁడి- (వెరవు లేనివాఁడు) స్త్రీ. 2-58; కల్య. 2-76

ఇక్క దే. వి.

1. స్థానము, సంకేత స్థలము.

సీ. వరఁశి న న్నూఁడఁ బలికిన భంగిన, నిచ్చమై నిక్కకు వచ్చునాక్క. విరా. 2-295

ఉ. అక్కమలాతిపొందు దగ వాడి తుదిన్ నిజమేది నేఁటిరే, యిక్కకు రాక తక్కిన సహించునె నన్ మరుఁడు. విరా. 2-286

2. నివాస స్థలము, ఇల్లు, ఆశ్రయము.

సీ. ఎలమి నమ్మెలఁత న న్నెలయింపఁ దివిరిన నెడఁద యానందంబు నిక్కగాదె. విరా. 2-86

ఉ. చుక్కలు తోఁదుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు విల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁబొచ్చె. విరా. 2-319

ఉ. చయ్యన నేఁగి యంబుజ విశాల విలోచనఁగాంచి ప్రీతిమై, నియ్యకొనంగఁజేసి యెలయించెద నిక్కకుఁదార్చి నేర్పునన్, కయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకు పూవికి నేఁడ తీర్చెదన్. విరా. 5-245

3. ఉండుచోటు, ఉనికిపట్టు.

సీ. ...అమిషంబుల యిక్క లరసికొనుచు. సౌప్తి. 1-16

**ఇక్కడ** దే. వి. ప. (ఈ+కడ) (వ్యతి - అక్కడ)

ఈచోటు, ఇటువైపు.

ఆ. చెదరకుండఁ బసులఁ జోదివి యించుక మేర, యిక్క డరుగుదెంచి
యెలమి మగిడి, కడచిపోవుచున్న కౌరవపతి ముట్టనడరినంత
సేన లతనిఁ గూడె. విరా. 5-289; భీష్మ. 1-25

**ఇక్కడక్కడ** (ఇక్కడ+అక్కడ)

ఈవైపు; ఆవైపు; ఇటునటు.

వ. ఇట్టివలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. విరా. 2-307

**ఇక్కడక్కడఁబడు; ఇక్కడక్కడవడు** దే. సమ. అ. క్రి.

ఇటునటుపడు, క్రిందుమీఁదులగు, సంక్షోభమొందు.

తే. ఇట్లు పాండవ సైన్యంబులెల్లఁ గలఁగి యిక్కడక్కడఁ బడుచుండ.
భీష్మ. 1-297

**ఇక్కడక్కడఁబెట్టు** దే. సమ. స. క్రి.

తాఱుమాఱు చేయు, కలఁచు.

సీ. ఏడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి పలుచని రొంపి మైనలఁది
కొనఁగ. విరా. 2-134

**ఇక్షురసము** సం. వి. అ. పుం.

చెఱకు రసము. చూ. ఇక్షురస సముద్రము. భీష్మ. 1-27

**ఇక్షురస సముద్రము**

చెఱకు పాలవంటి నీరుగలిగిన సముద్రము, ఇక్షు సముద్రము, ఇది సప్త సముద్రములలో నొకటి.

వ. లవణేక్షురససురాఘృతదధిక్షీరశుద్ధజలమయంబులయిన మహార్ణవం
బులు (ఈ యేడును సప్తసముద్రములు) భీష్మ. 1-27

**ఇక్ష్వాకుఁడు; ఇక్ష్వాకువు** సం. వి. ఉ. పుం.

సూర్యవంశపు రాజులలో నొకఁడు. అయోధ్యాపతి, మనుని కుమారుఁడు.

తే. ...అయోధ్యకుఁ జని తదీయనాథు నిక్ష్వాకుఁ గనిన.
ఉద్యో. 3-314

వ. ...తీర్థయాత్రాపరుండైన యిక్ష్వాకుం డచ్చటి కేతెంచి.
శాంతి. 4-140

వ. తుతునకు నిక్ష్వాకుండు ప్రభవించె, నాభూపతికి నూర్వురు సుతు
లుదయించిరి. ఆశ్వ. 1-17

**ఇగిరించు** దే. స. క్రి. (√ఇగురు) ఇగురఁజేయు

ఇంకించు, నశింపఁజేయు.

తే. ఆత్మకోపంబు పుచ్చి జలాశయమున, వైచి శాలేందుధరుఁడు దేవ
తల నాదరమున వీక్షించె నమ్మహోగ్రంపు రోషమనల రూపమై
యిగిరించె నజ్జలముల. సౌప్తి. 2-180

**ఇగిర్చినమాట** దే. వి.

అంకురించిన మాట, పుట్టిన మాట.

సీ. మది నిగిర్చిన మాట మగువ నీపెంపునఁ గునిసి నా నాలుక తుదికి
రాదు. విరా. 2-47

**ఇగురు** దే. వి.

చిగురు, పల్లవము.

సీ. ఇగురు జొంపంబుల నింపారు విరులను బలుపైన పొదల క్రేవలకుఁ
దార్చి. శాంతి. 3-332

**ఇగురుఁబోఁడి** దే. వి. (√ఇగురు)

చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది, ఆఁడుది.

ఆ. ...ఇంతయు, నెఱుఁగఁజెప్పు మాకు నిగురుఁబోఁడి.
(ఇది పాఠాంతరము) విరా. 1-312

**ఇగురొత్తు** దే. అ. క్రి.

1. అనురక్తమగు. (ప్రభాతవర్ణనము)

సీ. ...మలయపవను నింపారుబోఁకున నిగురొత్తు చిత్తంబు వెలసి
యొండొరులపైఁ బొలయు చూడ్కులు. విరా, 2-288

2. అంకురించు, కలుగు

ఉ. కౌరవనికాయముగర్వ మడంపుఁడన్న ధైర్య మ్మిగురొత్త వే
తిరిగిరా రథికుల్ మరలెన్ బలంబులున్. కర్ణ. 2-198

ఇగుర్చు దే. అ. క్రి.

అంకురించు, పుట్టు. చూ. ఇగిర్చినమాట.

మానిని. కూలియుఁ గాంతి యిగుర్పఁగ దేజము గుందక స్త్రీ. 2-12

ఇచటు నిర్దేశక స్థలవాచకావ్యయము చూ. అచటు

ఇక్కడ, ఈ ప్రదేశము.

ఇచట క్రి.

ఈ ప్రదేశమునందు.

క. లే రిచట మగలు నీకును. ఉద్యో. 1-850

గీ. ...నే నిచటలేని, సమయమునఁ గాచు నీ వర్షశాల. అను. 4-55

ఇచోటు అవ్య.

ఇక్కడ, ఈ ప్రదేశము.

తే. ఇచోటు పుణ్యలోకము. స్వర్గ. 1-7

ఇచ్ఛ వై. వి. (సం. ఇచ్ఛా)

1. కోరిక

సీ. గుప్తమైయున్నది గుహయందు వా కిచ్ఛ, పుట్టిన నిప్పుడు పొలిచి తోఁచు. శాంతి. 4-392; ఆది. 7-50

2. మనస్సు, చిత్తము.

ఉ. గుణహీనత విప్రునియందుఁ గల్మినా, యిచ్ఛఁగా దలంచితి. శాంతి. 3-502

ఆ. ...భూతకోటి మంచు, వోలెఁ దోఁచు విరియు బుద్ధిమంతులు దాని, కిచ్ఛ వగవరు. శాంతి 4-392

3. యథేష్టము, స్వేచ్ఛ, మనసునకు వచ్చినట్లు

క. నెచ్చెలుల తోడ నెంతయు, మచ్చికఁ దన యిచ్ఛ వాడ మరిగిన యది విరా. 1-250

ఇచ్ఛకువచ్చు

మనస్సునకుఁ బ్రీతి గలిగించు.

ఉ. ఇచ్చకు వచ్చు పూజనల నెంతయు సంతసమంది. సభా. 1-152

**ఇచ్చగించు** అ. క్రి.

1. ఇష్టపడు, ఒప్పుకొను.

అ ఆలుబిడ్డ తేని యట్టి క్రిమ్మరియగు, కొయ్యగాక కుదుటఁ గూడు వెట్టి, కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చుటిచ్చగించి చూతురయ్య. ఉద్యో. 2-9

తే. ధార్తరాష్ట్రు లున్మత్తులు దగినపలుకు, లేల విని సంధిసేయుట కిచ్చగింతురు. ఉద్యో. 4-78

ఉ. ...అ,చ్చోటన సంగరంబులగు చొప్పులు వుట్టినసైనఁ బాండవుల్, పోటున కిచ్చగింతురొకొ పోదురొ కోనలమండ నచ్యుతా. ఉద్యో. 3-104

స. క్రి.

వాంఛించు, కోరు.

వ. ...ఎవ్వం డేని మూఁడు లోకంబులం జూడ నిచ్చగించు నాతండు దన యిచ్చకుం దగ నివ్విద్య పెంపున సర్వంబునుం జూచు. ఆది 7-50

**ఇచ్చట** క్రియా.

ఇచట, ఈ ప్రదేశమందు.

ఉ ఇచ్చట నేను నిల్చు టిది యెట్లు లెఱింగితి. ఉద్యో 1-173

క. ఇచ్చటికి మీరలందఱు, వచ్చిన పనియేమి భీష్మ. 3-294

**ఇచ్చటచ్చట** క్రియా.

ఇక్కడక్కడ-ఇదిగో, అదిగో.

ఉ. అప్పుర మిచ్చటచ్చటను నాసల వచ్చితి. విరా. 1-148

**ఇచ్చటచ్చొటు**

ఈ ప్రదేశ మా ప్రదేశ మను విచక్షణ.

క. మసయింట నిచ్చటచ్చోటన కెచ్చటసైన నీ బృహన్నల మెలఁగం, జనియెదు మానిసి తన మన, మున కిమ్ముగునట్టి చరితమున వర్తించున్. విరా. 1-254

**ఇచ్చసేయు** స. క్రి.

1. కోరు.

ఆ. ఇంక నేమి వినఁగ నిచ్చసేసె దనిన. అను. 5-74

**ఇచ్చటు** అవ్య. ఇచటు

చూ. ఇచ్చట ప్రయోగములు.

**ఇచ్చు** స. క్రి.

(ఇండు, ఈఁడు, ఈవుత మొ, విశేషరూపములు సిద్ధించును) (ఒకనిది మఱియొకని) అధీనము చేయు.

1. ఇడు, ఒసఁగు, ప్రసాదించు.

సీ పువ్వులు బహు విధంబులఁ గట్టి ముడి కొక్క ఖంగిగా నెత్తులు వట్టి యిత్తు. విరా. 1-107

తే. జనన మరణాదులైన సంసార దురిత,ములకు నగపడకుండఁగఁ దొలఁగు తెరువు, గను వెలుంగు నీ కిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెన నిండ నెలవుకొసఁగ. విరా. 1-24; ద్రో. 5-261

2. దానాది రూపముగా నొసఁగు.

సీ. ఇట్టి క్రూరుల యింటికిచ్చిన మనవారి నందుఁగాక. ఉద్యో. 8-195

క. రండని పిలువఁబనిచి, పా,లిండని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం, బొండెను వేఱొకపట్టన, మొండెను మా కిచ్చి యనువు టుచితము కాదే. ఉద్యో 1-327; అను 5-191

క. నను నిచ్చుటకుం గర్తలు, జననియు జనకుండుఁగాక చనునే నాకున్, వనితాధర్మము విడువఁగ. అర. 7-381

3. వశపఱచు, అధీనము చేయు (చేతులలో నుంచు)

ఉ. ...అమ్మహాత్ములన్, ముచ్చులఁ జంపినట్టులు పరుల్ దెగటార్చిరి దైవమిచ్చినన్. శల్య. 1-27

4. (ధ్వని,పూజ, ప్రతిజ్ఞ, యుద్ధము మొ.) చేయు, కావించు, ఒనరించు.

ఉ. ...వెదకిచూచి ననుం గని యప్డు సంగరం, బిచ్చు. విరా. 2-279

ఆ. ఇట్లు సింహనాద మిచ్చిన భీముని, మారొ్కనంగ మగఁడు మన
బలమునఁ గలిగెనే. ద్రోణ. 4-167

ఆ. ...నా్యిచ్చు బాస కౌరవేంద్ర వినుము. ద్రోణ. 5-388

చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా, నొడి-
వియు సత్య మిచ్చియుఁ జనున్ జననాథ కృతాపకారులం, గడఁగి
వధింపఁగా. ఆది 6-118

ఆ ప్రొద్దు నేఁడు పెద్దవోయె నిత్యము నిట, తెచ్చి యిచ్చు బలియుఁ
దెచ్చి యీఁగ, నొల్ల కెలుఁగు లిచ్చుచున్న వాఁ డమ్మనుజాధ
ముండు మెచ్చుఁ డయ్యె ననుచు. అను. 6-290

5. (కృతి మొ.) అర్పించు.

ఉ. ...జనా, ధ్యర్చితమైన భారత మపారకృపావరతంత్ర వృత్తిమైఁ,
జేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి. విరా. 1-28

6. కలిగించు.

తే. శోక భయ కారణంబులు లోకమున న, నేకములు దానఁ దలసూపు
శోకములకు, భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు,
మూఢుఁ డవి త్రోవనేరండు మునుఁగు వగల. శాంతి. 1-188

తే. కాలిదెసఁ జొరవచ్చుట గానిపించి, యుడుగు సీసానఁ బట్టియు
మప్పళించుఁ, బోవనిచ్చు మగుడ నేచి పోరఁజేరు, నెడల సరిసేయనగు
తడవీక హత్తు. విరా. 2-15

సీ. ...ఇది దైవ, మిచ్చిన దురిత నిస్తారంబు. ద్రోణ. 5-261

7 త్యజించు, విడుచు, ఎడమీయు.

ఆ ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు, రరుగుదెంచునప్పు డధిక
భక్తి, నెరఁగి ప్రియము వలికి తెరు విత్తు రిట్టిద, ధర్మ్మ వీవు దీని
దలఁపవెట్టు. ఆది. 7-111

8. (కొలువు) తీర్చు.

వ. ...విరాటుండు వెడలివచ్చి బయలు కొలువిచ్చుటం జేసి.
విరా. 1-184

9. అప్పగించు.

క. మీ పనిచినట్ల చేసెద,నేపారిన వైరిబలమునెల్లను శౌర్యాటోపమున నోర్చి మత్స్యమహీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్. విరా. 3-209

మ. ఇట్టి మగలు న్వేయేల నిన్నిత్తురే. ద్రోణ. 2-294

10. పలుకు.

తే. బహు విధంబులఁ బలుకు నాపలుకులెల్లఁ, జీఁదరన్నిది తన పెద చెవులఁబెట్టి, యీయుత్తరాలు మఱుమాటలిచ్చి యపహసించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేం ఉద్యో. 4-76

11. తుమున్నర్థకములకు అనుప్రయుక్తమగునపుడు చేయు, అడ్డుపెట్టకుండు, సమ్మతించు, అంగీకరించు మొదలగు అర్థముల నిచ్చును.

(i) చననిచ్చు = చనఁజేయు - విడుచు.

క. జ్ఞాతుల పోషితమును గోవ్రాతము నాశ్రమము విప్రవర్గము చనవున్, నాతుల గారించుటయును, ప్రీతిం జననిచ్చు నతని పెంపొప్పు నృపా. ఉద్యో. 2-86

(ii) పోవనిచ్చు = పోవఁజేయు - సమ్మతించు.

తే. కాలి దెసఁ బోరవచ్చుట గానిపించి, యుడుగు నీసానఁబట్టియు నుప్పళించుఁ, బోవనిచ్చు. విరా. 2-15

(iii) ఉపేక్షను అనాదరమును దెలుపును.

వ. ...అది యట్లుండనిమ్ము నీచిత్తమ్మున వలవని వెఱపు గట్టుకొని యెదవు. ద్రోణ. 3-295; శాంతి. 4-149

క. ......శుశ్రూషావశవర్తిత నడచితి, భూవర చిరకాల మింకఁ బోనిమ్ము తగన్. ఆశ్ర. 1-46

ఉ. కావున నాకలోకపు సుఖం బటు లుండఁగనిమ్ము. మౌస. 1-59

(iv) శాపమిచ్చు = శాపము పెట్టు.

సీ. ...నీవిట్లు సనుదేర తక్కిన శాపమిత్తు. భీష్మ. 1-157

వ. వారు ముదియునంతకు నుండక జవ్వనంబున పంచత్వంబున కరుగు

వారునుం గా శాపం బిచ్చి. అది. 8-195

(v) వెన్నిచ్చు = వెనుదీయు.

న. ఆయ్యనిలతనయుండు సాధనవై కల్యంబున వెడంగు వడియుమ వెన్నీక. ద్రోణ. 4-286

ఇట్లు ఇచ్చుతోఁగూడి సందర్భానుసారముగా నిచ్చుపదములను ఆయా పదముల దగ్గఱ చూచునది.

ఇచో్చ అవ్య. ద్రు.

ఈ స్థలమునందు.

క. స్త్రీ సంతోషించు తెఱం, గానపడని మనసు గలుగునట్టి యధముఁ డిచో్చ నడిగనుఁ జని యచో్చ, గాసింబడు జముని భటులు గాఱియ వెట్టన్. అశ్వ. 4-228; భీష్మ. 1-215

ఇచో్చటు అవ్య.

ఈ చోటు, ఈ స్థలము.

క. ఇత్తెఱఁగున సంభవించె నిచో్చటు సారన్. అను. 2-822

ఇచ్ఛ సం. వి. ఆ. స్త్రీ.

అభిలాష, కోరిక.

వ. అమ్మహానదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి. శల్య. 1-74; శల్య. 2-170

ఇచ్ఛసేయు స. క్రి.

ఇచ్ఛించు, వాంఛించు.

వ. ...ఇంక నేమి వినన నిచ్ఛ సేసెద వనిన. శాంతి. 4-2

ఇజ్య సం. వి. ఆ. స్త్రీ.

యజ్ఞము.

క. ...మాననేజ్యాధారా. శల్య. 2-421

ఇజ్యుఁడు సం. వి. అ. పుం.

గురువు.

ఉ. ...అతనిం, బుచ్చె సురేజ్యయుక్తముగ. అశ్వ. 4-270

**ఇటు** దే. ఏక.

1 ఈ చోటు, ఇక్కడ

వ. .. ఇట ధృతరాష్ట్రుండును. ఉద్యో. 1-258

క. .. ఇంకిట మనకుఁ గావింపవలయు కార్యము. ద్రోణ. 1-57

వ. ...ఆ శిష్యుం డరిగె నిట నిన్ను దర్శింపవచ్చితి. అశ్వ. 1-225

2 ఇక్కడకు, ఈ స్థలమునకు.

వ అజ్ఞాతవాసంబు సలుపవలయుట యిట వచ్చి. విరా. 4-188

ఉ నీ విట మున్న వచ్చి తిది నిక్కము. ఉ. 1-72

వ. ఆతం డట పోవ నే నిట వచ్చితిన్. కర్ణ. 8-32

వ. ఆ రా జిట వచ్చెను. అను. 1-127

3. ఈ లోకమున.

క ఉక్కతి సురపతికైనను, ద్రొక్కము నృపధర్మమూఁది మొనఁ తలఁబడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నృపేంద్రా ఉద్యో. 3-360

4 ఈ విషయమున.

చ. పలవదు రోయఁ బాండవులఁ వారొక యూఱటలేని త్రిమ్మటన్ బలమఱి వన్య సత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు,నొమ్రల వదె యింతకింకిట మనోముద మస్ఖలితంబుగాఁగ వి,చ్చలవిడి రాజ్య లక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మున్నిటన్ విరా. 8-95

**ఇటమీఁద** దే. ద్రు.

1. ఇప్పటినుండి, ఇటుపైని.

వ. ....ఇటమీద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొలంత గలదు. విరా. 1-318

2. ఇఁకఁ జెప్పవలసిన దంతయు, ఈపైనివిషయము.

వ. ఏనప్పుడు నీకుఁజూపి యన్వయనామధేయంబు లుడిగిన యప్పొ లఁతి వలనం జిక్కి చిత్తం బుత్తలపడుచున్న యది యిట మీఁద

నీవ యెఱుంగుదు. విరా. 2-81

ఇటముందఱ దే.

ఇంతకుమున్ను, ఇంతకుఁ బూర్వము.

క. పొందొందఁగఁ దలఁచితి నీవిందు కరమైన హృదయంబున నా, రందఱకును నేమం బిట, ముందఱ లేకున్న నేఁడు మొద లుగఁ గలుగున్. ఉద్యో. 1-288

ఇటమున్ను దే. అవ్య.

ఇంతకుఁ బూర్వము.

క. వినుము మనము మధ్యస్థుల, మని నర్జును నెదిరి సంజయా యిట ము న్నెవ్వనికి మానముఁ బ్రాణం, బును దగఁ దక్కించుకొనఁగఁ బోలెనె చెపుమా. ఉద్యో. 1-280

ఇట యట సూచు దే. స. క్రి.

వెనుకముందులు విచారించు.

క. ...నీ, కొడు కిట యట సూడక యెక్కుడు మగటిమి నతికి పేరు గొనియెనె పోరన్. ద్రోణ. 2-246

ఇటవట్టి దే. అవ్య. (√ఇట)

ఇది మొదలుకొని, ఇంతటినుండి.

ఆ. దివము కాని యింక భువనంబునం దిట, వట్టి రాత్రి లేని యట్టు గాఁగఁ, జేసె నొక్కొ విధి విశేషించి నాక కా, నేఁడ దివము సాఁగి నిలిచెనొక్కొ. (ఇటఁబట్టి - అని శబ్దరత్నాకరము) విరా. 2-313

ఇటు దే. అవ్య.

1. ఈ ప్రకారము.

ఉ. ....పేరునుం, బుట్టును మాలి యిప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి నా, కెట్టు మనంబు పట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్పు చెప్పుమా. విరా. 2-192

ఉ. తక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగమీక నీ, వె క్కటి బ్రమింగఁజూచె దది యెట్లఱుగున్. ఉద్యో. 2-52

చ. ఇటు దగునయ్య కూరులకు నెల్లను బోకడ యిట్లకాదె యే,మి
టికి నలందురన్. ద్రోణ. 3-257

2. ఇక్కడ, ఇక్కడకు, ఈదిక్కు, ఈవైపు.

క. అలుకఁదనంబున విప్రుల, కలుగంగాఁ దగదు గురుఁడునై యు
న్నాఁడం, చలయక తలఁచితిఁ గాకిటు, నిలుమీ నీరణముపేత
నిజమగు నేనిన్ ఉద్యో. 4-312

ఉ. ...నా,చేసిన పుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు సేరఁ దెచ్చుటం,
జేసి. కర్ణ. 3-194

చ. అనుడు నెదిర్చి నీ తనయుఁ డాతని కిట్లను నేల రిత్తగ,ర్జన
ములు గానవే పటుభుజాకలితోగ్రగదా సముద్భటున్, నను నిటు
రమ్ము నూవుము రణంబున నీదు బలంబుఁ జేవయున్, మనమిటు
చేరసిల్చి వెడమాటలయాడుచునున్కి యొప్పునే. శల్య. 2-136

(వ్యవ) ఇటు రా నీ పని చెప్పెదను.

ఇటులు ఇటు

ఈ ప్రకారము.

ఉ. ఏ నిటు లంటినా వలపదు. ఉద్యో. 3-105

చ. నరుఁ డిటు లాడునే నృపగణంబు వినంగ జయింపవచ్చునే, గురు
కురు సేనలం దరణిఁ గ్రుంకకమున్న... ద్రోణ. 3-348

ఇటువంటి దే. విశ. (√ ఇటు)

ఇట్టి.

వ ...ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటి కొలఁగాములు
మనంబునం దలంచినప్పుడు సేయంగలవాఁడవు గావున దీనం జేటు
వచ్చు నుడుగు మయ్య యని చెప్పి. ఉద్యో. 3-172

ఇట్టట్టను (ఇట్టు + అట్టు + అను)

1. ఈ మాట ఆ మాట పలుకు, అడ్డముచెప్పు, వేఱు విధముగా వొనరించు

ఉ. ...ఇంక నిట్టట్టనఁ జెట్టులైన హృదయంబున నెక్కడి శంక వాని
కిన్. విరా. 2-278; శల్య. 2-184

2. చెనకు, ఎదిరించు.

ఉ. ...నన్ను నిట్టట్టన వచ్చునే సురలకైనను నొల్లవుగాక చివ్వకన్.
ఉద్యో. 1-297

**ఇట్టలము** దే. విశ.

అధికము, మిక్కిలి

వ. ఒడవు దప్పిన మహానాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్ట లంబగు కోపంబు పెల్లున మల్లడిగొనుచుండె. విరా. 2-181

చ. తలపడి పోర వారి యరదంబు లనేకము లొక్కపెట్ట యిట్టలపు రయంబునం బొదివి డాసె. విరా. 3-199

క. అలుగుదు పాండవులకు వారలు నాకుం బ్రాణములు ధరావల్లభ యిట్టలముగఁ దమప్రాణములకు, నలుగు జనులు పగతు రగుట యనుమానంబే. ఉద్యో. 3-226; శాంతి. 4-192

**ఇట్టి** దే. విశ. (ఇట్టు+ఇ)

ఈదృశమైన, ఇటువంటి.

వ. ...ననుబోటి బాలస్వభావునకు నిట్టి మహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కాక యని తలంచుచు. విరా. 1-19

క ....లేడి కడుపునఁ బులి పుట్టునె యిట్టి దివ్యతేజంబువవాఁడధమాన్వయమునఁ బుట్టునె చెపుమా. ఆది. 6-58

**ఇట్టిఁడు** దే. వి. (ఇట్టి+వాఁడు)

ఈదృశుఁడు, ఇటువంటివాఁడు, (బహువచనమున మహన్మహతీ వాచకముల రెండింటికి 'ఇట్టిరు' అగును.)

తే. ...అర్జునుఁడొంటి భార్గవుఁడు వింట, నిట్టిఁడే యని పొగడంగ నెల్ల జనులు. ఆది. 5-280

చ. ...చూచి యొనెఱుఁగ సురేంద్ర కన్యకలు నిట్టిరె రూపవిలాస సంపదన్. ఆది. 7-78

క. భావితవత్సుతు లిట్టిరె. ఆది. 4-188

**ఇట్టిక** వై. వి.

ఇటిక, ఇటుక, ఇట్టుక- మట్టితోఁజేసి కాల్చిన రాయి (ఇది స్తంభము, గోడ మున్నగునవి కట్టుటకుపయోగించును.)

వ. పసిఁడి యిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశ కరాత్మకంబును గరుడాకృతియునుగా యజనం బొనర్చి. 4-180

(పసిడి యిట్టిక = మట్టికి బదులు బంగారము తీసికొని చేసిన ఇటుక)

**ఇట్టిట్టను** (ఇట్టు + ఇట్లు + అను)

ఇది కాదు అది-అది కాదు ఇది అనిపలుకు, మాఱుమాట పలుకు,

ఉ. ...నేఁ, బట్టిన యాయుధంబు వెడఁబాసినఁగాని వధింపఁబోల దిట్టట్టన కేను మిప్పరుస యింతక కాలము గాదు దానికిన్. భీష్మ. 1-159

**ఇట్టిట్టి** దే. విశే. (ఇట్టి + ఇట్టి)

ఈ యీ విధమైన.

వ. ...ఇట్టిట్టి గతిం బ్రాపించిరని నా చేతం జెప్పఁబడిన వారెల్లను. స్వర్గ. 1-78

**ఇట్టిట్టివారు** సర్వ. బహు.

వీరువీరు-ఈ ఈ విధమైనవారు.

వ. ...ఇట్టిట్టివారి చేత నిట్టిట్టివారు దెగిరని యేర్పడ నెఱింగించిన... కర్ణ. 1-17; అను. 2-458

(వ్యవ-ఫలాని ఫలానివాఁడు ఫలాని ఫలానివాని చేత)

**ఇట్టిట్టివి** సర్వ. బహు. (ఇట్టి + ఇట్టి + అవి)

ఇవి ఇవి-ఈ ఈ విధమైనవి.

వ. ...ఇట్టిట్టివి వారి సన్నివేశంబు లిచ్చటిచ్చట వని సాభిజ్ఞానంబుగా విని. సౌప్తి. 1-148; ఉద్యో. 2-228; శాంతి. 2-110

**ఇట్టిది** సర్వ. ఏక. (బహు) ఇట్టివి

ఇటువంటిది.

ఉ. ... శుభాంగముఁ దేజముఁ జూడ బుద్ధి సంౘదేహముఁ బొందుచున్నది సతీజన మిట్టిదె యెబ్బగంబులన్. విరా. 1-295

మ. ...ఇవ్విధం బిట్టిదిం, గలదే వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డా ధార్తరాష్ట్రులు పాలిక చలంబునం బెఱఁగ నిట్లుం గూడు దిపయ్యెనే. ఉద్యో. 3-95

క. ...అ, పద లిట్టివి గలవె మనుజపతులకు నెందున్. శల్య. 2-8
కలవే యెందును నిట్టివి. ద్రోణ. 3-71

ఇట్టిపాటి దే. విశే.

ఈ పరిమాణముగల.

ఉ. ...కాదన కిట్టిపాటి యపకారముఁ దలకుఁ దేకవిప్రవసం, బోధనఁ జేసి చేసె. ... ఆది. 1-124

ఇట్టియందు దే. క్రి.

ఇట్టిచో, ఇట్టి సమయమున.

ఉ. .. ఇట్టియం, దక్కట భీముఁడైన మన యర్జునుఁడైనను మాద్రిపుత్రులం, దొక్కరుఁడైన నీ పగలు మక్కడగింపరె యొక్క ప్రేల్మిడిన్. ఉద్యో. 1-287

ఇట్టు దే. అవ్య.

1. ఈ ప్రకారము.

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మన భంగి. విరా. 4-54

క. ఇట్టవునె మాద్రితోడం, బుట్టె వనక యితని ధర్మపుత్రునకుఁ గడుం, బెట్టెదుఁడై చంపవల్లనెఁ, జుట్టపుఁదన మేల రాజసుతులకుఁ గలుగున్. స్త్రీ. 1—108

సీ. వినుమని ముని యిట్టు లను. శాంతి. 5-186

2. ఈ వైపు.

ఆ. అలిగి యతఁడు సూతు తలఁదెగ నేసిన, నధిప వృష్ణివీరు నరద మిట్టు,నట్టుఁ దిగిచె భీష్మ. 2-298
అడవి లోపల కొన్నిదినము లిట్టునట్టుఁ దిరుగన్. మౌస. 160

ఇట్టునట్టు దే.

1. ఈ వైపు-చూ ఇట్టు.

2. ఇటునుది అటు, అటునుది ఇటు, ఈ వైపుది ఆ వైపు, ఆ వైపుది ఈ వైపు.

క. తెప్పించి తొడుగు మీ పని, యొప్పించిన నిట్టునట్టు గొలవలుగా మైఁగప్పికొని. విరా. 4-89

2. ఈవైపు అవైపు.

అ. అట్లు దిక్కు దప్పి యడవిలోపలఁ గొన్ని, దినము లిట్టునట్టుఁ దిరుగ
మాస. 160

ఇట్టులు

ఈ ప్రకారము.

క. అనుమాటలు విని సంక్రందననందనుఁ డిట్టు లనియె దైవంబు
కతంబున నాకు నొక్కచందం బనువైయున్నయది నొఁ గా
దనుఁడా విరా. 1-86

వసంతతిలక :- ఎల్లే కాలు సూర్యనిధు నిట్టులు డించి పోవంగా బుద్ధి
పుట్టునని కన్య మనంబులోవన్. ఆది 5-29

ఇట్లు ఇటులు

1. ఈ ప్రకారము

వ. ఒక్కనాఁ డిట్లని వితర్కించితి. విరా 1.2

తే. ...మీ జన్మములు నిట్లకావె వినఁగ. ఆది. 6-59

ఇట్లుగా = ఇటులు

అ. ...మహాతపంబు చేటు, లేని కృత్య మిట్లుగా నెఱుంగుట.
శాంతి. 5-525

2. దీనికి అర్థవిశేషము లేకయే పోలె మున్నగునవి యనుప్రయుక్తము
లగును.

చ. ననుఁ గని యొండు సత్త్వము మనంబున బెగ్గిలి పాఱునప్పు డీ
మ్మునివరుఁ డిట్లుపోలెఁ గృప మొక్కలమై శరభంబుఁ గాఁగఁ
జేయునొ... శాంతి. 3-95 (ఇట్టుపోలె. శ-ర-పా)

ఇడు దే. స. క్రి. (త. క. ఇడు)

1. ఉంచు

(క) పెట్టు.

చ. ...దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెద
నంచు దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁడు.
సభా. 2-80; కర్ణ. 1-89

(చ) తాల్చు, ధరించు.

తే. ...మైమఱ విడి తలిర్చు, నెలమిఁ గోదండ తూణీరములు
ధరించె... భీష్మ. 1-169

క. ఉత్తరుఁడు సత్వరంబుగ, దత్తనువున మఱువుదొడిగి తానును
హృద్యో,దాత్తంబగు కంకటమిడి. విరా. 4-40.

(ట) పడవైచు, వైచు, వేయు, త్రోయు.

సీ. ...కర్ణున కట్లుగా నున్నది యగుటఁజేసి, యేటిలో నాతని
నిడి తీవు... ఆశ్ర. 2-187

ఆ. హరుఁడు దనదు వీర్య మగ్నియం దిడిన... కల్య 2-175

(త) అలఁదు, పట్టించు, రాచు.

క. పలుకవలదు శౌచక్రియ, నలుపకమును నలుపునపుడు జలములు
దొడలం, జిలుకుట యొప్పదు మృత్తిక, పలయు నపానంబునం ద్రి
వారంబు లిడన్. అను. 3-277

(ప) విత్తు, చల్లు, ఊడ్చు, నాటు, పాఁదు.

తే. ...అమిత్ర, దత్తమైనది భస్మహుతంబుఁ జేట, నిడిన విత్తునుబోలె
నై చెడు నృపాల. అను. 3-181

ఆ. ...విధివిహితంబు గాని యట్టి ధర్మ మనుఘ, చవుట నిడిన విత్తు
చాడ్పున రూపించి, చేయ నిహపరములఁ జెందు సుఖము.
శాంతి. 5-218

(గ) ఉపయోగించు, వాడు.

ఉ. ...దుర్మతి పుట్టినయట్టి మర్త్యు వా,రే విధినైన మందు లిడి
యెప్పటిబుద్ధి ఘటించు చాడ్పునన్. శాంతి. 6-198

(జ) నిలుపు, నెలకొల్పు.

క. ...పరమేశ్వరు మనమున నిడి... సౌప్తి. 1-124

క. అం దొఱగి కీచకుం డా, యిందీవరనయన నాత్మ నిడి వేడ్క
మెయిన్. విరా. 3-309

క. భ్రమగొని యద్దేవునిఁ జిత్తమునం దిడి శరణు శరణు దయగావుము నన్నమితైశ్వర్య యనుడు. అను. 1-364

వ. ...ఇవ్విశేషం బారథికవరుని శక్తినైనదిగా దది చిత్రంబున నిడం బనిలేదు. సౌప్తి. 2-183

(డ) అటుపెట్టు, త్యజించు.

సీ. ఆయుధం బిడినవానిని శూరు లేయ రెందు. కర్ణ. 3-351

శ్లో. శరణాగతే న్యస్తశస్త్రే యాచమానే తథార్జున.
సం. భా. కర్ణ. 91-119

(ద) మోపు, ఆరోపించు.

చ. నెపమిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవవచ్చునే.
ఉద్యో. 4-249

క. మతిమంతులైన వారికి, హితులగు వెరవుగలవార లెఱిఁగింతురు దు,స్థితి గాకుండఁగఁ గార్యము,గతి యొత్తియుఁ దప్పులిడియుఁ గడవఁ బలికియున్. సౌప్తి. 1-80

వ. ...సహస్రచిత్యుఁ డను మహారాజు తన పెద్దకొడుకైన శతచిత్యునందు రాజ్యభారం బిడి. ఆశ్ర. 2-4

(బ) (నిప్పు) అంటించు, (దీపము. మొ.) వెలిగించు.

సీ. ఎఱుఁగుదు మఱచితి నే లక్కయింటఁ జిచ్చిడి మిమ్ముఁ బఱచిన యిదుమ లవియుఁ కర్ణ. 3-197

తే. ఇంటఁ జిచ్చిడు చాడ్పున నిట్లు సేసి. శల్య. 2-393

క. బరులిచ్చిన దీపం బవ, హరించి తత్పాతకమున నంధుండగు భూ,వర రత్నాసథ గుడిమై, గిరి దీపం బిడి విభూతికిం బాత్రమగున్.
అను. 4-21

2. ఒసఁగు.

(క) అర్పించు, సమర్పించు,

వ. ...అగ్న్యాది దేవతలకు నాహుతు లిడునపుడు. అశ్వ. 4-184

(చ) నియమించు.

తే. ఎఱిఁగి యుపధా విశుద్ధ నిడు నమాత్య పదవికి. అను. 5-45

(ట) ఇచ్చు. పెట్టు.

క. పేరు వలలుండు గూడుం జీరయు నిడి సాకతంబు సేసిన జాలుం.
విరా. 1-219

తే. ...గర్వులై బలియు శైత్యంబు లిడక. శాంతి. 5-11

(త) దానము చేయు.

వ. ...పితృకార్యాదులందు గొడుగులుఁ జెప్పులు నిడుట యుత్తమ ప్రకారంబు. అను. 3-255

(3) పెంచు, వేసి వృద్ధి పొందించు.

ఆ. ...(చెఱువు) కట్టఁ దగిన తరువు లిడిన సుగతి గలుగు.
అను. 3-330

4. నిర్మించు.

క. చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. ఉద్యో. 3-154

5. ఏర్పఱచు, నిర్ణయించు.

వ. ...దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలఁ గూర్చుండిరి.
ఉద్యో. 3-258

6. కోఁతగోయు.

సీ. వెస నంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసుమంతలుగా నుఱుమాడి యాడి. విరా. 5-35

7. ప్రయోగించు.

క. ...పద్మభవుని మ్రాట దలంపవలయు నీపై, భిదురంబిడ దనుజ నాథ ప్రియమందు మెదన్. శాంతి. 4-409

8. బిగించు.

క. ...వింట నిడియె గుణంబున్. సౌప్తి. 1-159

అంకిడు, బొబ్బిడు, ఎక్కిడు, వెన్నతోనిడు, చెవినిడు, కన్నిడు మొదలగు పదముల యర్థముల నాయా పదముల క్రింద గ్రహించునది.

**ఇడుగడ** దే. వి. (క. ఇడుగు. త. ఇడుక్కు)

అసూయ.

చ. తడయక మ్రొక్కియున్న వినతాసుతు నప్పుడు సూచి యాత్మలో, నిడుగడ సేయుచున్ గడు సహింపక కద్రువ. ఆది. 2-42

**ఇడుమ** దే. వి.

క్లేశము, కష్టము.

సీ. అకట మాతో మీరు నడవుల నిడుమలఁ బొందితి రొకభంగి బోఁడుఁ గాలము. విరా. 1-47

తే. సొమ్ము గోరినయంతన సుఖము గలుగ, దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె, కలిగెనేని యనేక చింతల నొనర్పుఁ, బెడుట చావుతోఁ దుల్య మయ్యీడుమ యేల. శాంతి 4-47

క. కలుపుపయిఁ గలవు వొరయుచు, వెలుపు పయిన్ వెలుపు దోఁప విడువని యిడుమం, దొలగమిపైఁ బురుషుఁ డిడుమఁ, దొలగమిఁ జెడ్పఁడుచు నడచు దుష్కర్మములన్. శాంతి. 4-72

**ఇడుమ గుడుచు** దే. అ. క్రి.

క్లేశముపొందు, కష్టమనుభవించు.

తే అడవుల నిమ్మెయి నిడుమ గుడిచితేల... ఉద్యో. 1-381

తే. పాండవులు రాజ్యమున కాసపడకమున్న, యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి, యట్ల యిడుమలఁ గుడువఁబో నడుపవలయు. విరా. 3-90

**ఇడుమపఱచు; ఇడుమలఁబెట్టు** దే. స. క్రి.

క్లేశపెట్టు, కష్టపెట్టు.

ఆ. (భీముఁడు ద్రౌపదిని, జూచి) పది కారణముగ నెవ్వరెచ్చోట నీకేమి కీడొనర్చి రెట్టిపాటి, సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదు,

భంగపఱుతు నిడుమపఱుతుఁ జెఱుతు. విరా. 2-156

సీ ...ఇట్టి కష్టపు డిడుమలఁ బెట్టెడిదె. స్వర్గ. 1-28

**ఇడుమఁబడు; ఇడుమలఁబడు; ఇడుమపడు** దే. అ. క్రి.

క్లేశము నొందు, నష్టపడు.

క. నరసుతుఁడు దొల్లి నలుఁడను, ధరణీశుఁడు జూదమాడి తన విభవము వు,ష్కరుచేత నోటువడి యొ,క్కరుఁడుఁ గరం బిడుమఁ బడడె కాననభూమిన్. ఆర. 2-6

క. వా రిడుమలఁబడఁ దగియెడు, వారే పితృభాగ మేలు వారలు గారే. ఉద్యో. 1-268

క. దానికి నొచ్చిన మనముల,తో నడవికిఁబోయి బహుళ దుఃఖంబుల న,ట్లూని విరాటుపురింబడఁ,గాని యిడుమపడియు వారు గనలర కంటే. శల్య. 2-166

**ఇతండు; ఇతఁడు** దే. సర్వ.

ఈతఁడు.

ఉ. ఇతండు రుద్రునిం బ్రీతుని జేసెనా విసమె. విరా. 4-96

తే. ఇతఁడు పుట్టినకోలెను వెనక మెసఁగు దర్పమునన. విరా. 1-74

**ఇతకరి** వై. వి.

మేలు చేయునది, మేలు చేయువాఁడు, ఇచ్చకాలు మాట్లాడువాఁడు.

వ. ...వార లెఱుంగకుండ నపరకుమారులకడకు నేగి యితకరి మాటలమొత్తంబుల వారల చిత్తంబులను గలంచె. అను. 1-297

**ఇతరము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అన్యము, వేఱైనది.

తే. ఇట్లు దమ్ము నిరూపింప నితరజనము,లకు నశక్యంబుగాఁగ. విరా. 3-42

2. వేఱు విధము గలది.

క. అమ్మర్గ యతని కిట్లను, నిమ్మూఁడు జగములు మీర లితరంబులుగాఁ, గ్రమ్మనఁ జేయఁగఁజాలుదు, రెమ్మెయినైనఁ గృపసేయరే

నా మీఁదన్. శాంతి. 2-70

**ఇతరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రాకృత పురుషుఁడు, పామరుఁడు.

క. నీ యవినయంబు పెంపున, నీ యాపద సంభవించె నింక వగచినం, బాయునె యితరులక్రియ శో,కాయత్తుఁడ వగుట నీకు నర్హమె యధిపా. ద్రోణ. 4-22

శ్లో. ఆత్మాపరాధాత్సంభూతం వ్యసనం భరతర్షభ, ప్రాప్యప్రాకృతవద్వీర మా త్వం శోచితు మర్హసి. సం. భా. ద్రోణ. 114-47

చ. వ్రతము ధరించి నిష్ఠ నుపవాస విధిం గొలుతున్ సముద్రు నా, కితఁడు ప్రియంబుతోడఁ దెరు విచ్చుట యంతన కల్గనేని మే,లిత రునిఁ గావనుం దలఁచెనేని యమానుష రోష వేష దీ,పిత శరవహ్ని నిజ్జలముఁ బీల్చెదఁ బ్రేల్చెద నొక్కవ్రేల్మిడిన్. అర. 7—47

2. అన్యుఁడు, వేఱైనవాఁడు.

ఆ. సుకృతు లమరలోక సురుచిర వాసులు నిట, దిగి చిరాయువులును నగుదు రితరు, లతిచిరముగ నరకగతు లయి తుది నాయు,వల్ప మగు మనుష్యు లగుట గలుగు. అను. 5-184

**ఇతరేతరము** సం. విణ. (అ. ఆ. అ.)

అన్యోన్యము, ఒండొకటి, పరస్పరము.

క. ఇతరేతర శరకృత శోణిత ధారలు నిగుడు.

భీష్మ. 3-208; ద్రోణ. 4-262; శల్య. 2-291; శాంతి. 6-454

**ఇతవు** వై. విణ. (సం. హితవు)

హితమైనది, ప్రియము.

క. పితృబూజనమని యెవ్వరి, కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శినా. అను. 5-208

చ. ...ఇట్టివా, రితవులు తండ్రికిన్ సుతుల కేమననేర్తుము పెద్ద రాజులన్. (ఇతవులు = హితులు) ఉద్యో. 4-240

**ఇతిహాసము** సం. వి. అ. పుం.

1. పూర్వచరిత్రప్రతిపాదక గ్రంథము (భారతాది)

సీ. ఐతిహాసికు లితిహాస మనియు. ఆది. 1-31

వ. తొల్లింటి యితిహాసంబు సెప్పెద వినుము. ఉద్యో. 1-117

2. పూర్వరాజుల వృత్తాంతము.

వ. తొల్లి యిట్లు పుత్త్రమరణ శోకాతురుండైన యకంపనుం డను రాజు నారదమునిచేత మృత్యుప్రకారంబు దెల్లంబుగా విని యుపశమిత శోకుండయ్యె నని యిందు మయ్యితిహాసంబు తెఱంగెఱింగించెద. ద్రోణ. 2-158; కర్ణ. 1-295

3. పూర్వకథ - కథ.

వ. ...కౌశికుం డను నొక్క విప్రుండు...సత్యవిభాగ విధిజ్ఞుండు గామిం జేసి తన కసత్యంబు వాటిల్లు నను శంక (జనులు) నీ గుల్మలతాగహనంబు సొచ్చిరని చూపి చెప్పిన నత్తెక్కలికాండ్రు వారలం జంపి ధనమ్ముగొని రమ్మని తద్వచన దోషంబున నరక ప్రాప్తుండయ్యె నను నితిహాసంబు విందుము. కర్ణ. 3-78; స్త్రీ. 1-51

**ఇది** దే. సర్వ.

(ఈ + ది = ఈది, ఇద్ది, ఇది- అనునవి రూపాంతరములు- 'ఈది' ప్రస్తుతము భాషలో లేదు. క-త-ఇదు.)

1. (i) 'ఈ' అను దానికి మహత్యర్థమునందు (స్త్రీ వాచకమగునపుడు) ప్రథమైకవచనమున వచ్చు రూపము.

చ. ఇది గడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేరదు. విరా. 1-108

క. ...సాధ్వి యిది మలీమస వృత్తం,బున పొంతఁబోవ దెన్నఁడు. విరా. 1-106

చ. ఇది మునికన్యయేని మఱి యేలొకొ. ఆది. 4-30

(ii) అమహదర్థంబునందు (తిర్యగ్జడములను దెలుపునపుడు) ప్రథమైక వచనమున వచ్చు రూపము.

సీ. ...ఇది హోమ,ధేను వత్సంబు. కర్ణ. 2-90

సీ. ...ఈ భవ్యసారమేయ, మిది యట రావలదే. మహా. 1-52

వ. ...కీటంబుం జూపి యిది దొలుఁచుచుండ మీ నిదుర సెడుటకుం జాలక కదలకుండితి ననియె. శాంతి. 1-22

వ. ...ఇది యెవ్వరి యాశ్రమంబు. కల్యా. 2-218

(iii) ద్వితీయాది విభక్తులలో ఏకవచనమున స్త్రీ తిర్యగ్జడ వాచకంబులకు రెండింటికిని 'దీని' అనురూపము వచ్చును.

సీ దీని జన్మంబున – దీని నామాకృతి – దీని వల్లభుఁడు. విరా. 2-80

క. ముని యశ్వముఁజూచి కరం, బనురాగముఁబొంది మేధ్య మగు నిది దీనిన్, వినుత విధానమున విడుతము. ఆశ్వ. 8-220

వ. .. ద్విజశ్రేష్ఠుండు దీని (చరువు) వలనం బుట్టు. శాంతి. 2-69; విరా. 1-160

(iv) ద్వితీయాది బహువచనంబులందు తిర్యగ్జడ వాచకంబులకు 'వీని' అనురూపము వచ్చును.

తే. మద్దన మిదియని వీనిలోన నొకటి యందు నంగీకార మొలయదు. ఆశ్వ. 2-98

2 దగ్గఱగా నున్నదానిని దెలుపును.

చ. ఇది గడు ముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేరదు. విరా. 1-108

క. ఇది కర్మభూమి భోగాస్పదము. శాంతి 4-110

చ. ఇది శతవృద్ధ మా జనని. విరా. 1-179

వ. వారలకందఱకు నిది ప్రాప్త కాలంబై యున్నయది. ఉద్యో. 8-235

సీ. ఇది యాదిగా నతు లెన్నండుఁ బరపురుషార్థినుల్ గాఁ జనదు. (ఇది– ఈ కాలము) ఆది. 5-85

3. ఈ విషయము.

వ. ఇది యనన్య సామాన్యాకారంబగు పరమ ధర్మ ప్రకారంబు. ఆది. 1-29; భీష్మ. 3-79

4. ఈ జరుగునది.

సీ. ఇది పదుమూఁడగు నేఁడు మాకజ్ఞాత, వాసంబు సలుపంగవలయు.
విరా. 1–47

5. ఈ చెప్పఁబడినది. ఈ రచింపఁబడినది.

వ. ఇది శ్రీమదుభయకవిమిత్ర...తిక్కన సోమయాజి ప్రణీతంబు.
విరా. 1–836

వ. ఇది జామదగ్న్యకోపంబు తెలుంగు. కర్ణ. 2–89

6. ఈ విషయములో, దీనిలో.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్, డిల్లపడంగ వాకిది గడింది విచారము పుట్టె నందుఁ బో,నొల్ల ననంగ రా దచటి కూరక పోవనురాదు నేర్పు సం,ధిల్లఁగ దీని కాపికొను దీనున మెట్టిది యొక్కొ దైవమా. విరా. 2–91

7. ఈ వచ్చినది.

వ. ...మందమందసంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శనంబున మేలుకని యిది యెవ్వ రనవుడు నే నను నమ్మానిని యెలుం గెఱింగి భీమసేనుండు. విరా. 2–167

8. పాదపూరణముగా నుపయోగింపఁబడును.

ఉ. కౌరవసేనఁ జూచి వడకం దొడఁగెన్ మదితోన మేను నీ,వూరక పోవుచుఖ్ఖి యిది యొప్పునె. విరా. 2–136

ఇదిగాక దే. అవ్య.

ఇదియును గాక–ఇది కాకుండ.

ఉ. దానఁ గొలంత లే దభిమతం బదిగాకయుఁ గల్గెనేనియుం బూనియొన ర్తు నన్నుఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి. ఉద్యో. 1–98

సీ. అన విని గాంగేయుఁడు...వైరుల నిర్జింపు, మిదిగాకయును వఠ మెద్దియైన, నడుగుము నీకుఁగా నని సేయు టొక్కటి, దక్కంగ నావుడు ధర్మసుతుఁడు. భీష్మ, 1–157

**ఇదిగో** దే అవ్య.

ఈ కనఁబడునదే.

మ. ప్రమదాపాది పయఃప్రపూర్ణ మిదిగో పద్మాకరం బంచు.
ఆది. 6-172

('ఇదియో' అని ఆనందపాఠము 'ఇదియే'-అని అకాడమీ సం. ము. పాఠము. 'ఇదిగో' అనునది పాఠాంతరముగా సం. ము)

**ఇది యది యనక**

అనవసరపు మాటలాడక.

క. ఎదిరికి హితమును బ్రియమును, మది కింపుగ గాఁగఁ బలుకు మాటలు పెక్కై, యొదవినను లెస్స యటుగా, కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్.
ఉద్యో. 2—59

**ఇదియో** దే. అవ్య. (ఇది + ఓ)

ఇదిగో (చూ. ఇదిగో)

**ఇదె** దే. అవ్య. (ఇది + ఎ)

ఇదిగో.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ. విరా. 3-27

సీ. ...ధృతరాష్ట్రుని యాశ్రమంబు, సెలఁగివవా రదె యిదె యంచుఁ బేర్కొని, చూపి చెప్పిన.
ఆశ్ర. 2-31

తే. అంతకుం డిదె యదె తోఁచెననఁగ నధిప. మౌస 1-17

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁబలికి సంధి వాటించెద. (ఇదె = శీఘ్రముగా)
ఉద్యో. 8-69

**ఇద్దఱు** దే. సర్వ.

(రెండు శబ్దములకు మహన్మహాత్వర్థక బహువచన రూపము)

ఇరువురు.

క. ...అయ్యిద్దఱు నెత్తుటఁ దోఁగి కడున్ వఱలిరి కల్పాంత నవ దివాకరులక్రియన్.
ద్రోణ. 4-216

సీ. భార్యలిద్దఱు గలరు. అను. 5-287

మ. ...ఇద్ధబలున్ భుజబలాటోపంబుమై. విరా. 2-348

క. ...ఇద్ధబల దిక్కుల సైన్యములును దలపడియె వడిన్.
భీష్మ. 1—289; కర్ణ. 8-258

**ఇద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

1. దీప్తము, కాంతివంతము.

ఆ. ...ఉటికి మంటలోన నుల్లంబు తెలివొౕక, యింతయేనిఁ గుంద కిద్ధ మూర్తిఁ, దేజరిల్లనున్న ధీరవర్యునకుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు దయదలిర్ప. సౌప్తి. 1—125

2. ప్రజ్వలించునది.

ఆ. ఇద్ధమైన యగ్ని యింధన సంపద, నతిశయిల్లు నట్టులు.
శాంతి. 5-580

3. ప్రసిద్ధము.

తే. ధ్యానయోగ నిశ్చలమదు నంతరంగ,మెడల విడుచు గుణంబుల నిద్ధశాంత,మైన నిర్గుణ వస్తువునందుఁ గలయుఁ, బరమపద మది దానికిఁ బరము లేదు. శాంతి. 4-184

4. అప్రతిహతము, అనివార్యము.

మాలిని: ఇద్ధమాయా విలాసా. ఉద్యో. 1-885

మ. ...జాకుదగ్నిఁ గలిశాస్త్రుల్ం డిద్ధతేజంబునన్, దొరసప్తార్చికి.
కర్ణ. 8-29

5. సత్యమైనది.

ఉ. ...ఇద్ధబోధాంగసమాశ్రితాపదుదయజ్వలనప్రశమప్రవర్తక.
శల్య. 1-408

**ఇధ్మము** సం. వి. అ. న.

వంట చెఱకు.

క. ఆతం డిధ్మ ముందు నటవీస్థలికిం జనినయెడ. అను. 1-69

**ఇధ్మవాహుఁడు** సం. వి. అ. పుం.

తేజస్వి యను ఋషి, అగస్త్యుని మనుమఁడు, దృఢస్యుని కొడుకు.

వ. వానికిం (దృఢస్యునకు) దేజస్వి యను ఋషిపుట్టి పారంబైన యిధ్మభారంబు నహించుటంజేసి యిధ్మవాహుం డనం బరఁగె.
అర. 2—358

**ఇనబింబము** సం. వి. అ. పుం. న.

సూర్యమండలము.

క. అని పలికిన యవసరమున, నినబింబములోన నుండి యిది నిజ మిబ్బంగిన నెగడవన్న మేలగు,నను వాక్యము వెడలెఁ గర్ణుఁ డా కర్ణింపన్.
ఉద్యో. 4-60

**ఇనసుతుఁడు** సం. వి. అ. పుం.

కర్ణుఁడు.

క. ఇనసుతుఁ డిట్టు లను.
విరా. 4-216

**ఇను** దే. సర్వ. (వృత్తియందే దీనికిఁ బ్రయోగము)

రెండు.

క. ...కర్ణుం, డినుమా ఱొక శరము దొడుగునే పరులు నగన్.
కర్ణ. 3-317

**ఇనుఁడు** సం. వి. అ. పుం.

సూర్యుఁడు.

క. ఇనుఁడు తనకడకు నేతెంచిన రాగముఁబొందుటది యుచితమనఁగాఁ గెంపున మెఱసి పశ్చిమాశాంగన జన సంభావనముల గౌరవ మందెన్.
విరా. 2-318

**ఇనుచు** దే. స. క్రి.

పూను.

క. ...ఆర్యజనుల షుహిమ హితవచనముల్, వీనుల వినుచుచు ధర్మము,లైనవి సేయంగఁ దప్ప కగుఁ దత్ఫలముల్.
శాంతి. 4-79

(ఊనుచు — అని పాఠాం)

**ఇనుపగుండియ** దే. వి.

ఇనుముతోఁ జేయఁబడిన గుండె- (ఇనుము ఎంత గట్టిగానుండునో అంత గట్టిగా నుండు గుండియ అని భావము.)

తే. ...ఇనుప, గుండియకుఁ జేటు పాటింకఁబుండరీక,నయన
స్త్రీ. 2-49

**ఇనుపొడుపు** మి.

సూర్యోదయము.

క. ఇనుపొడుపునఁ జెడని తమము నెందును గలదే. అను. 2-355

**ఇనుమడి** దే. విశే. (ఇను + మడుఁగులు)

ఇమ్మడి, ఇబ్బడి, రెట్టి, రెట్టింపు.

సీ. చెలువంపు నెమ్మోము వెలమినొాం పినుమడి,గా నల్ల నవ్వినఁగా దె యింతి. విరా. 2-45; ఉద్యో. 4-414; భీష్మ. 1-27

**ఇనుమడించు** దే. అ. క్రి.

ఇమ్మడియగు, రెట్టింపగు, ఇంతనంతలుసేయు.

తే. తగు నినుమడింపఁ జూచు న త్తన్విఁ బొరిఁబొరిఁ గిచకుండు.
విరా. 2-250

తే. ఇమ్మహీపతి సమ్మదం బినుమడించె. అను. 1-294

సీ. కర్ణభూషణ మౌక్తిక ప్రకాండోలన మీతుణ దీప్తుల నినుమడింప
విరా. 4-26

**ఇనుమడుఁగు** దే. వి.

రెట్టి, రెండింతలు.

క తన యెప్పటి రూపముఁజే, కొని దీనికి నినుమడుంగగుం బ్రతి బలముం, గనినప్పుడు నా రూపం, బనుపమముగ ననిన హనుమ కనిలజుఁ డనియెన్. అర. 3-345

**ఇనుమాఱు** దే. వి.

రెండు పర్యాయములు, రెండుమాఱులు

క. కర్ణుం, డినుమాఱొక శరముదొడుగునే పరులు నగన్.
కర్ణ. 3-317

**ఇనుము** దే. వి.

ఒక లోహము, కాలాయసము.

క. ఇనుమును రాగియుఁ దగరం,బును వెండియుఁ బసిఁడియుం బ్రభూ

తముత్తై పేర్చిన సిరిఁజేయఁగ నొప్పెడు, ఘను లెడనెడఁ బెక్కు-
కలవు కౌరవనాథా. భీష్మ. 1-86; కర్ణ. 1-263; భీష్మ. 3-419

**ఇన్నాళ్లు; ఇన్నాళ్లులు** దే. వి. బహు. (ఇన్ని + నాళ్లు)

ఇన్ని దినములు.

తే. పెండ్లి కని పిల్వఁబంచినఁ బ్రియముతోడ, నేఁగు దెంచితి మిన్నాళ్లు
నెల్లయొప్పి, దములఁ జూచితి మియ్యెడఁ దడవుఁగాఁగ, నిలువఁ
దీఱదు పోయి రావలయు మాకు. ఉద్యో. 1-42

వ. ...ఇన్నాళ్లు గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబుసేసె.
భీష్మ. 1-64

శా. ...నారల యుపేక్షంగాక యిన్నాళ్లు లేలా వైరం బడగింపనీ
వయిన లీలన్ గెల్తు కౌంతేయులన్. కర్ణ. 1-58

**ఇన్ని** దే. సర్వ. బ. బౌ.

1. ఇంతశబ్దముయొక్క అమహదర్థక బహువచన రూపము. అధిక
సంఖ్యను దెలుపును.

తే. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర,తా విహీనులైన
పాత్రములనైన, విరా. 1-242

వ. ... ఇన్ని సైన్యంబులు నొక్కలావున వర్తించు చందంబు సూచి-
కొనవలయు. ఉద్యో. 4-142

2. ఇవి యన్ని.

క. ... ఇమ్మెఁ, బూని వ్రతంబులు సలిపెడు, వానికి నిన్నియును
నిట్లు వలయునె చెపుమా. విరా. 1-205

క. ఇదె దేహం బిదె యర్థం, బిదె నా పరిజనసమూహ మిన్నిటిలో
నెయ్యదిన మాకిష్టము దానిన, ముద మొదవఁగ విత్తు గొనుఁ
డమోఘం బనినన్. ఆది. 5-148

ఇన్నిట. ఉద్యో. 3-108; ఇన్నింట. శాంతి. 5-168; శాంతి. 6-456
ఇన్నిటి. ఉద్యో 2-194; ఇన్నిటిని. శాంతి. 6-405; అను. 4-219;
ఇన్నిటికంటెన్. అను. 2-334; ఇన్నిటిలోన్. ఆది. 5-242; ఇన్నిటి-
లోనన్. అర. 3-70.

**ఇన్నూఱు; ఇన్నూఱులు** దే. సర్వ. బౌ. (√ఇను)

రెండు వందలు.

వ ఇన్నూఱు రథంబులు మూ జేసుంగులు. శల్య. 1-328

తే తనకు నిన్నూఱు కాని లే దనియె వారులు. ఉద్యో. 3-314

క. నన్నూఱులు మున్నూఱులు, నిన్నూఱులు నూఱులును.
శాంతి. 5-50; ఉద్యో. 3-317

**ఇన్పవల** దే. వి. సమ.

ఇనుముతోఁ జేయఁబడిన చిక్కము.

చ. .. ఇన్పవలలో నమృతంబు సురక్షిత స్థితిన్

క. ఉండు ననిన. అను. 1-216, 217

**ఇన్మాఱు** దే. సర్వ. వి.

రెండుసార్లు.

సీ. ఇన్మాఱు తిర్యగ్విధమున, నాస్యంబు దొడిసి. అను. 3-284

**ఇన్ము** దే. వి.

ఇనుము. చూ ఇన్పవల. అను. 1-216, 217

**ఇపుడు** దే. ఏక.

ఇప్పుడు, ఈ సమయము.

క. విగత భయవాసయోగ్యం,బుగ నొక్కెడ సెప్పుఁ డిపుడ పోవఁగ
వలయున్. విరా. 1-68

ఆ. ...తద నుగ్రహంబు పడయ వలయున నఘయిపుడు.
ఉద్యో. 4-359

**ఇప్పించు** దే. స. క్రి. ప్రే.

ఇచ్చునట్లు చేయు.

వ. ...గోపాలురకుం గట్ట నిప్పించి కంకు నాలోకించి నెత్తం బొక
పలుక యాదుదమే యని యుబ్బుమై మాటగాఁ బలికిన.
విరా. 5-244

వ. ...వీని కర్ఘ్యం బిప్పించి తదియునుం గాక. సభా. 2-42

వ. ...అమరులెల్లఁ బితామహుఁ బ్రార్థించి నాకు నవ్యయత్వంబును

సకల భయమోక్షణంబునుంగా వరం బిప్పించి రైనను.
ఆది. 2-129

(వరంబిచ్చిరైనను- అని ఆనందవారి పాఠము- ఇప్పించిరి- ఆకాడమి- సం.ము పాఠము)

**ఇప్పించుకొను** దే. స. క్రి.

1. ఇచ్చునటులఁజేసికొను.

వ. ...మదీయ ధర్మపత్ని యకుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన. ఆది. 1-95

2. కలిగించుకొను, పొందు.

ఆ. అతని నాశ్రయించి యవ్విర విప్పించుకొనిన మేలు వొందు ననియె భార్గవుండు. శాంతి. 3-135

**ఇప్డు** దే. ఏక.

ఇప్పుడు, ఇపుడు.

శా. ...మత్పుతు, ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్, వెసం గిట్టి గంధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యంబు.
విరా. 2-55

**ఇప్పుడు** దే. వి. ఏక.

(ఇది ద్వితీయాది విభక్తులతోఁగూడియు నుండును. దీని రూపాంతరము లగు 'ఇపుడ, ఇప్డు' అను వానికి ద్వితీయావిభక్తి రూపములు లేవు.)

ఈ సమయము.

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె.
విరా. 1-179

ఉ. ...నీ,చెల్లి నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. ఉద్యో. 1-135

ఉ. ఇప్పటి భంగి నొక్కరుడు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్.
విరా. 1-148

వ. ఎల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు. విరా. 3-117

మ. ...నీ చిత్తంబు పోరాటకుం, జొరవే నిప్పటికిం దొలంగి చని
శల్య. 2-44

క. ...ఇప్పటి నీ,యునికియును జూచి నాకు నుమ్మల మయ్యెన్.
శాంతి. 4-890

వ. ...ఇప్పటియట్లు యెల్లపుడుమ గోవులవలన భక్తి. అను. 3-76

క. ...ఇప్పటి పదనున్, గడవఁబడుట ద్రాటఁ దప్పు కరణియచుమ్మీ.
కర్ణ. 3-278

వ. ...విన నిప్పుడుం జెప్పెద. ఉద్యో. 2-89

ఉ. ...అ,తండ మరల్చుఁగాక విరోధి నిప్పుడున్. విరా. 4-194

క. ...సౌగంధిక,ములుగొని యిప్పుడును దర్పమున. అర. 4-25

**ఇభపురము** సం. వి. అ. న.

హస్తినాపురము.

క. ...ఇభపురమున మాట పుట్ట దెట్లివు వినన్. ఉద్యో. 1-79

**ఇభము** సం. వి. అ. పుం.

ఏనుఁగు.

సీ. ఉభయ పార్శ్వముల నిభఘట లేలకో చనుదేవు. విరా. 1-186

**ఇమి** అప.

సీ. ద్రుచ్చిమియును అంకు నెచ్చోటనైన భూమి లోపల లేదు.
శాంతి. 2-341

మగటిమి శల్య. 2-125; పోడిమి శల్య. 2-148.

**ఇమ్మడి** దే. విశ. (√ఇను)

1. రెట్టింపు, ద్విగుణితము.

సీ. ...అగ్గోవిందు సందర్శనంబున నుత్సవోన్మత్త భావ, మిమ్మడియై
ప్రమోదమ్మునం దేలిరి. అశ్వ. 3-119

2. రెండవవాఁడు, సరిసమానుఁడు.

క. అమ్మేటి మగఁడు తనచా,పమ్మూఁతగనిల్పి నోలి పదపడి తెలి
వు,ల్లమ్మున నొలసిన నౌరా, యిమ్మడియని పొగడెఁ గొడుకు
నెంతయుఁ బ్రీతిన్. అశ్వ. 4-60

(ఇమ్మడి = తనకురెండవవాఁడు, తనతో సరిసమానమైనవాఁడు)

ఇమ్ము దే. వి. (ఇంబు)

1. అనుకూల్యము, వీలు.

ఉ. ఎప్డు సం, క్రందనసూతి డగ్గఱియోఁ గయ్యము సేయుట కప్పు డిమ్మగున్. విరా. 4-184; విరా. 4-93

ఉ. లోకవిరుద్ధవృత్తి చపలుం డతఁ డిమ్మెఱుఁగండ యేమియున్. కల్య. 2-370

వ. ...గరుడుండు గగనంబునం బఱచి తనకు నూఁద నిమ్మగు ప్రదేశం బెందును గానక. ఆది. 2-78

క. తన కిమ్మగు నంతకు దు,ర్జను,డిష్టుఁడ పోలె నుండి సర్పము పోలెం, దన కిమ్మగుడును గఱచును, ఘనదారుణ కర్మగరళ దంష్ట్రిల చేతన్. ఆది. 6-112

2. ఉపాయము.

క. నెమ్మి గలవారి నొల్లరు, త మ్మొల్లనివారి వెనుకఁ దగులు దుర ధిక,త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు, రిమ్మెఱుఁగని యట్టివార లిభపుర నాథా. ఉద్యో. 2-84

3. స్థానము, చోటు.

తే. పెరిగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు, నిలువ నిమ్మగు దీవిగా నిమ్ముఁ దలఁచి, యుండ నత్యంత తుచ్ఛ శిఖండి పల్వ,లాక్రమంబున మునిఁగితే యకట తండ్రి. భీష్మ. 1-58

4 పదిలము, క్షేమము.

వ. అయ్యమోఘవీర్యం బొక్క యజీర్ణపర్ణపుటంబున నిమ్ముగా సంగ్రహించి యొక్క దేగయఱుతం గట్టి... ఆది. 3-28

సీ. ...వెఱ ధన మెల్లను నిధియుఁగా, నిమ్మైన నెలవున నిడుచునుండి ఆశ్వ. 1-15

క. రథి కిమ్మగానియెడ సా,రథి ధృతిమెయిఁ గానవలయు. అర. 1-178

విశ.

1. అనుకూలమైనది, వీలైనది.

ఉ. ఇమ్మదిరాతి డన్నె మన కీ నడుమన్ విడియంగ నొండు బో, టిమ్మను గాదు. విరా 1-154

ఇ. ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా, మెదలుచున్న బ్రయ్యలపై మి రెంటిఁ, గూడఁబెట్టె ననియుఁ గూడి యొండొంటితోఁ, బక్కనంటి రెండు నొక్కఁడయ్యె. సభా. 1-147

2. మనోహరము.

క. వనపర్వం, బిదినా నుద్యోగపర్వ మిమ్మగు సభలన్ ఆది. 1-43

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల జొంపములన్. ఆది. 4-20

3. ఇంపైనది, ఇష్టమైనది, అభీప్సితము.

క. మన యింట నిచ్చటచ్చోటన కెచ్చటనైన నీ బృహన్నల మెలఁగం, జనియెడు మానిసి తనమనమున కిమ్మగునట్టి చరితమున వర్తించున్. విరా. 1-254

క. ...రాజు మాటలకుం దేలని వెరవుతోడ నా పూజ్యుని దన కిమ్మైన యెడకుఁ జనియెఁ గుమారా. శాంతి. 3-264

శ్లో. సైవముక్త్వా శకునినా బ్రహ్మదత్తం నరాధిపమ్, రాజానం సమనుజ్ఞాప్య జగా మాభీప్సితాం దిశమ్. సం.భా. 139-112 శ్లో.

**ఇమ్ముగ** క్రి. (ఇమ్ము + కన్)

1. బాగుగా, చక్కఁగా.

వ. ...గర్భంబు లిమ్ముగా రక్షింపం బనిచిన. ఆది. 2-4

ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధించు విధంబున మంత్ర రక్షయ, త్నమ్మునఁ జేయఁగా వలయు. ఆది. 6-110; ఆది. 5-248

2. ప్రసిద్ధిగా.

క. ఇమ్ముగ సరస్వతీ తీరమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధి మార్గమ్మున సద్గుణ సముదాయ మ్మెసఁగఁగ జేసె సత్త్రియాగము నిష్ఠన్. ఆది 4-3

3. స్పష్టముగా, తెల్లముగా.

తే. వృక్ష శాఖాగ్రమున నున్న పక్షిశిరము, దెల్లముగఁ జూచితే.
మహీవల్లభుండ, యనిన నిమ్ముగఁ జూచితి. ఆది 5-249

4. రుచ్యముగా.

వ ...సూపకారుండు వధ్యస్థానంబునకుం జని మనుష్యమాంసంబు
దెచ్చి యిమ్ముగా వండిపెట్టిన. ఆది. 7-114

**ఇమ్ముల** (ఇమ్ము శబ్దము యొక్క ద్వితీయా బహువచనాంత
రూపము)

సంతోషము, సుఖము, ప్రీతి (అగునట్లుగా)

ఉ. .. ధర్మసుతనూభవుఁ డందు నాఁటి రే, యిమ్ములఁ జల్పి వేగుటయు
నీప్సిత కార్యము సేయఁగా విచారమ్మున నున్నచో.

విరా. 1-58; ద్రోణ. 2-285; సౌప్తి. 1-9

క. కులమునకు నఖిల లోకంబులకు నపాయంబుసేయు పురుషాధము
నిమ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టొలు దె
కువలయనాథా. ఆది. 5-111

క. కులపాంసనులయి యహితంబులు సేయుచునుండు చుట్టములఁ
బొందక యిమ్ముల నుండు వాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామస్థి
త్యైక వృక్షమపోలెన్. ఆది. 6-181

శ్లో. జ్ఞాతయో యస్య నైవ స్యుః, ర్విషమాః కులపాంసనాః.
స జీవేత సుఖం లోకే గ్రామ ద్రుమ ఇవైకజః

సం. భా. ఆది. 161-81,82

**ఇయ్యి**[1] ఈయ.

వ. అట్లగుటం జేసి యాసగొల్పి విప్రున కియ్యకున్కి యొప్పదు.
అను. 1—275

**ఇయ్యి**[2] అవ్య.

అంగీకారమును దెల్పును.

మధ్యా:- ఒనర నాసుతునకు భార్యవగుమన్న వొడఁబడి యియ్యి

యనియె. ఆది. 4-141

క. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ జెఱఁగి యియ్య యగు
నిప్పుడు నీ, యుక్కును బీరముఁ జూచెద ఆది. 6-208

ఇయ్యకొను ఈయకొను, స. క్రి. (√ఇయ్య)

1. అంగీకరించు, సమ్మతించు, ఒప్పుకొను.

తే. అనిన నిది పోలు నని యియ్యకొని యజాతవైరి. విరా. 1-91

ఉ. ముందడియట్లు యింకఁ బదు మూఁడు దినంబుల మాత్రకున్ భవ,
న్మందిర వాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ.
విరా. 3-62

క. అక్కడి బంధులఁ జంపుచు, నిక్కడి బాంధవుల సచ్చు టియ్య
కొనుచు సిం,దెక్కడి పెంపొందెదను. భీష్మ. 1-184

2. మెచ్చు.

తే. ఏమి కారణమున మెచ్చి తేకతమున, మెచ్చవైతి దానవుల నీ
మెచ్చు చొప్పు, మాకు నెఱిఁగింపు మనిన న మ్మానసీయ,వాక్య
యిట్లని చెప్పె న వ్యాసవునకు.

క. నానాధ్యయనాతిథిస,మ్మానాది విశిష్ట గుణ సమగ్రత కలిమిన్,
దానవుల నియ్యకొంటిని, వాని విడిచి గర్వులగుట వారి విడిచితిన్.
శాంతి. 5-8,9

అ. క్రి.

అంగీకరించు, సమ్మతించు.

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ దేను. విరా. 6-7

ఆ పొడుతు నెట్లుఁ బాండుపుత్రులతోఁ గయ్య, మేను నీవు దీని కియ్య
కొనుము. శల్య. 1-69; విరా. 1-160

ఇయ్యకొలుపు దే. స. క్రి. (√ఇయ్యకొను)

1. అంగీకరింపఁజేయు, సమ్మతింపఁజేయు, ఒప్పించు.

సీ. సముచితమగు మాటలఁ జక్కఁబడక, తక్కెనే నుక్కివుం డగు
ధార్తరాష్ట్రుఁ, గ్రూరశరముల నే నియ్య కొలుపువాఁడ, నవని

కౌంతేయులకు నిచ్చునట్లు గాఁగ. ఉద్యో. 1-27

వ. ... అజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగిన మాటలాడి తెఱంగుసేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యిట్లనియె. ఉద్యో. 3-3

2 లోబఱచు, లొంగునటులఁజేయు.

ఆ. కాలకేయ కులముఁ గాలుని ప్రోలికి,ననిచె నఖిల నృపుల ననికి నియ్య,కొలిపెఁ గ్రీడి జగము గొనియాడనేక కో,దండ చండపలసి తమునఁగాదె. కర్ణ. 1-211

సీ. కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవు. విరా. 1-95

ఇయ్యకోలు దే. వి. (√ఇయ్యకొను)

ఇయ్యకొనుట, అంగీకారము, సమ్మతి

చ. పెనఁకువ నాక యేం మన పెద్దల కెవ్వరి కియ్యకోలు గాదు. ఉద్యో. 2-246

ఇయ్యన

ఈయన.

క. అయ్యై కర్మంబుల దెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమని రూఢుం, డియ్యన యన సుకృతంబుల, నయ్యెడు సౌఖ్యంబు నిహా మునందు బరమునన్ -తే- అనుభవించు. అను. 3-306, 307

ఇరవు దే. వి.

1 స్థానము, తగిన చోటు.

క. శరణాగతుండ భక్తుఁడఁ, బరమపదవి గోరెదను శుభంబుగ నన్నుం, బరికించి యేది మే లయ్యిరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా. శాంతి. 2-54

క. ...ధాత్రీదైవత సమ్మానము, నేదేశమునందుఁ గలుగు నిర వది నిబుపన్. శాంతి. 5-455

క. శిరమును నాభియు హృదయము, నురమును గర్ణములుఁ బార్శ్వ యుగళము నాత్మాదరణీయ స్థానము లయ్యిరవుల గను యోగి

యాత్మ నిఖపురనాథా. శాంతి. 5-589

2. సంపూర్తి, సంపూర్ణము.

క. పరమంబగు వైవస్వతు, చరితం బతిభక్తి వినినఁ జదివినను మహో, దురితంబు లడఁగు జనులకు, నిరవుగ సిద్ధించు నసఘ యిహ పర సుఖముల్. అర. 4-234

క. శరణం బని వచ్చిన భీకర శత్రుని నయినఁ బ్రీతి గావఁగవలయుం, గరుణాపరుల తెఱం గిది, యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్. అర. 5-418

3. కుదుర, హాయి.

క. తురగంబులపై నాశ్వికు, లరదంబుల మీఁద రథికు లప్పుడు నిద్రం, బొరసిరి కొందఱు భూస్థలి, నిరవుగ సుఖనిద్ర సేసి రిట్లున్నంతన్. (ఇరవుగ = కుదురుగ, హాయిగా) ద్రోణ. 5-274

ఇరవొందు దే. అ. క్రి. (ఇరవు + ఒందు)

ప్రీతినొందు, సంతోషించు.

సీ. ...బిరుదైన యెద్దు భూసురున కిచ్చి -అ- నరుఁడు ధేనుదశక మిర వొంద నిచ్చిన, ఫలము వడయు మఱియు వలువు లొసఁగి, చంద్ర లోకమునకు సంప్రీతుఁడై చనఁ, గనక మిచ్చి నాకమునకు నరుగు. అర. 4-212

ఇరావంతుఁడు సం. వి. త్. పుం.

అర్జునునకు ఉలూచియను నాగకన్యయందుఁ బుట్టినవాఁడు.

జననము చూ. ఆది. 8-128 మొ. 134 వఱకు.

భీష్ముని యెనిమిదవనాఁటి యుద్ధమున నితఁడు అలంబుసునితో యుద్ధము చేసి మరణించెను. చూ. వివరము. భీష్మ. 3-89 మొ. 105 వ.

ఇరు దే. సర్వ. (ఇను)

రెండు.

(హల్లు పరంబగునపుడు 'రెండు' అను దానికి వృత్తియందు వికల్పముగా వచ్చు ఆదేశము. 'ఇరుగురు - ఇరువురు' అను వానిలోఁ దక్క విడిగా దీనికిఁ బ్రయోగము లేదు.)

వ అని యిత్తెఱంగున నయ్యిరువురఁ గొండొరులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు. విరా. 1-255

క. ఇరుదెసల నున్న కవల, న్నరపతి దురవస్థ సూచి. కర్ణ. 2-385

**ఇరుగడ** దే. వి.

రెండు ప్రక్కలు.

సీ ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ,రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె. విరా. 5-208

**ఇరుగాలు** దే. వి.

రెండు కాళ్లు.

వ. వాని వలచేయు నురంబును నిరుగాలం ద్రొక్కి. ద్రోణ 4-267

వ. ...ఉరంబును మెడయు నిరుగాలం ద్రొక్కిన. సౌప్తి. 1-158

**ఇరుగెలను** దే. వి.

రెండు ప్రక్కలు.

చ. ధరణిపు చక్కఁగట్టెదురు దక్కి పిఱుందును గాని యట్లుగా, నిరుగెలనం దగం గొలిచి. విరా. 1-129

**ఇరుగేలు** దే. వి.

రెండు చేతులు

క. ఖండనమున నిరుగేలను, గాండీవము దివియ నేర్పు గలిగిన నందు, ద్దండమగు సవ్యకరము ప్రచండతఁ బరఁగుదును సవ్యసాచి యనం గన్. విరా. 4-145

**ఇరుచేయి** దే. వి.

రెండు చేతులు.

తే. శిరము గ్రోఁకంగఁ దగ దిరుసేత. అను. 4-102

సీ. ...ఇరుచేయి నెత్తి -తే- యలత నాక్రందనములు హాహారవము ల,తో నొనర్చువారును. మౌస. 151

**ఇరుతేరు; ఇరుదేరు** దే. వి.

రెండు రథములు.

చ. ...పడిం ద్రిగర్తనాథులు నిరుదేరుఁ దద్రథముతోఁ గదియించి
తదీయ సారథిన్, బలువిడిఁ గూల్చి. విరా. 3-199

(ఇరుతేరు – అని పాఠాంతరము)

**ఇరుదెఱఁగు** దే. వి.

రెండు విధములు.

సీ. అభ్యంతరంబు బాహ్యము ననఁగా శౌచ మిరు దెఱఁగై యుండు.
అను. 5-181

**ఇరుదెస** దే. వి.

రెండు ప్రక్కలు, రెండు వైపులు.

సీ. శైనేయుఁడు భీమసేనుఁడు నిరుదెస, రా నర్జునుఁడు.
ద్రోణ. 4-291

**ఇరుపీనుఁగు** దే. వి.

రెండు పీనుఁగులు, పీనుగుల జంట.

చ. మగధమహీశుఁ డేచి యభిమన్యుసిపైఁ గరిఁగొల్ప నుజ్జ్వలంబగు
నొక నారసంబు దొడి యాతఁ డుదగ్రత ఫాలకుంభ సంధిగతము
గాఁగ నేయ నది దీనత ద్రెుగ్గఁగ నప్పు డక్కజంబుగ వెసమాగ
ధుం దునిమె భూస్థలి నయ్యిరు పీనుఁగుం బడన్. భీష్మ. 2-209

**ఇరుప్రొద్దు** దే. వి.

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువకయుండు నాతండు
సదోపవాసి. శాంతి. 4-368

**ఇరుమూఁడు** దే. సం.

రెండు మూఁడులు, ఆఱు.

చ. అమర తరంగిణీ తనయుఁ డర్జుననందను సూతుఁ గేతుదండము
నిరుమూఁడు రూపులఁ బడం గడు బెట్టిద మేసి. భీష్మ. 1-278

క. ...అతఁ డది యిరుమూఁడమ్ముల దునియలు సేయుడు.
కర్ణ. 3-160

**ఇరుమెయి** దే. వి.

రెండు ప్రక్కలు.

వ. ...ఇరుమెయిన్ గెలిచిన కుంతకుని కాదులుకు.

భీష్మ. 1-267; విరా. 3-161

**ఇరుమేను** దే. వి.

రెండు శరీరములు.

తే. ఆటిమి సాత్యకి కృతవర్మఁ దాఁక నతఁడు, నేచి మార్కొన నిరు
మేను పూచి యొప్పు, మిగులు మోదుగు మ్రాఁకుల పగిదిగాఁగ,
నడరె మార్కొన్న రెండు వాలంపగముల. భీష్మ. 1-251

క. వారుఁడు వినోదార్థంబుగా, నిరుమేనయి రణమొనర్చె.

ద్రోణ 5-295

**ఇరువంద్రు** దే. సం.

ఇరువది మంది.

వ. ముక్కడిమూఁక యిరువది నాలుగువేలు మున్నూట యిరు
వంద్రుఁ దెగిరి. స్త్రీ 2-167

**ఇరువది** దే. సం. (ఇరు + పది)

రెండు పదులు, ఇరువయి, ఇరువై, ఇర్వది.

క. ...నాకేశ సుతున్, ధనురాచార్యుం డిరువది, సునిశిత బాణముల
నేసె. విరా. 5-124; భీష్మ. 2-298

ఇరువదాఱు కర్ణ. 2-248; ఇరువది నాలుగు శాంతి 6-9;

ఇరువదినాల్గు అను. 4-178; ఇరువదిమూఁడు ద్రోణ. 5-395;

ఇరువదియేను భీష్మ. 3-75; ఇరువదియేవురు ద్రోణ. 3-277;

ఇరువది యొక్కటి అను. 2-302, ఇరువదిరెండు ఉద్యో. 4-320;

ఇరువదెనిమిది ద్రోణ. 3-196; ఇరువదేనేసి ద్రోణ. 3-78.

**ఇరువటియ** దే. వి.

రెండు చెక్కలు.

క. గురుసుతుఁడు క్రోధమయమగు, బగవసమున నప్పు డా ద్రుపద
నందను మే, నిరువటియఁగాఁగ నేసెను.

సౌప్తి. 1-182; కర్ణ 1-95.

**ఇరువాగు; ఇరువాగులు** దే. వి.

ఉభయ సైన్యములు.

వ. ఇ ట్లిరువాగును నరవాయి గొనక పెనంగుచుండ. విరా. 3-170

క. ఇరువాగులుఁ బోరికిఁ జొచ్చె విరా. 3-198

**ఇరువు** దే. వి.

1. ఇల్లు.

క. కునకంబు రజస్వలయగు, వనిత పతితుఁ డంత్యజాతివాఁ డాక్రియ పట్టునకే డిరువులఁ జేరక, చనఁజేయుట నుగ్గడించి సంభావించెన్. అను. 8-190

2. ప్రక్క, పార్శ్వము.

క. మరణ జరా రోగము లగ్గిరి యేడిరువులను లే వఖిల గుల్మలతా, తరువులఁ గుసుమ ఫలంబులు, గర మొప్పుచునుండు నెల్లకాలము లందున్. అశ్వ. 1-59

శ్లో. న జరా క్షుత్పిపాసే వా న మృత్యు ర్న భయం నృప, తస్య శైలస్య పార్శ్వేషు సర్వేషు జయతాంవర. అశ్వ. 8-10

**ఇరువురు** దే. సర్వ. బహు. (ఇర్వురు)

(రెండు అను దానికి మహన్మహాత్వర్థక బహువచన రూపము)

ఇద్దఱు.

తే. వీర లిరువురు మాన్యులు (ద్రోణాచార్య కృపాచార్యులు) విరా. 5-10

వ. ...ఇ త్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చిన (ఉత్తర, బృహన్నల) విరా. 1-255

క. విను శంఖుండును లిఖితుం, డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ దమ్ముం,డును గలరు. (ఇచట విశేషణముగాఁ బ్రయోగము) శాం. 1-159

వ. అయ్యిరువుర శరనికరంబు లంబరంబు గప్పె. ద్రోణ. 1-159

ధర్మసుతు నయ్యిరువురుఁ దనయట్ల. ఆది. 5-68

**ఇరువేయి** దే. సర్వ.

క. ఇరువే యుద్భట రథములఁ బోరి గొనుటయు. ద్రోణ. 1-244

క. ...పొడిసేసెన్, వాయుసుతుఁడు రథముల నిరు, వేయిటి రథి రథ్య సూత వితతంబులుగాన్. విరా. 3-212

**ఇరుసు** దే. వి.

బండియొక్క అక్షము.

క. అని పలికి యిరుసు లంతలు, సునిశిత బాణమ్ము లేయుచుం దటి మిన. ద్రోణ. 5-75

**ఇర్లవారము** దే. వి. (ఇరులవారము)

చీఁకటుల గుంపు.

ఉ. ...ఇర్లవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతే, జమ్మెన రూపునూవు క్రియ. కల్య 2-86

**ఇర్వురు** దే. సర్వ. బహు. (ఇరువురు)

ఇద్దఱు.

వ. ...దైత్యులు సుందోపసుందు లన నిర్వురు గలరు. అను. 4-425

చూ. ఇరువురు.

**ఇఱుకటము** దే. విశ. (ఇఱుకటము)

ఇఱుకైనది.

తే ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ, డెరువునందు నడవునెడి తిరుగఁబడిన, యట్టియెడ నిద్రవోయెడు నవసరమున, శాత్రవుల బెట్టు పైఁబడి చంపవలయు. సౌప్తి. 1-25

వ. ...క్రంతల నిఱుకటంపుఁజోట్ల మానవకోట్లు పీనుంగు తిట్టలగు చుండ. సౌప్తి. 1-197

వి.

ఇఱుకు చోటు.

వ. ఇవ్విధంబున నరదంబుల యిఱుకటంబు గడచి యెడఁగలుగ నిలిచి. విరా. 5-218

శ్లో. తస్తా విముక్తో రథబృంద మధ్యాత్. సం. భా. విరా. 66-18

ఈ రథబృందంబుల యిఱుకటంబు వెడలి నిలుతము విరా. 5-211

(ఇఱుకటము అని సూ అ. ని.)

**ఇఱి** దే. విశ. (√ ఇఱియు)

బిగువు, సందులేనిది. (ఇది వృత్తియందే కనఁబడుచున్నది)

ఉ. ఆరథికోత్తముం డధిక హర్షముఁ బొందుచు నమ్మహీశ్వరున్, గారవ మొప్ప గ్రుచ్చి యిఱిగౌఁగిటఁ జేర్చి. కల్య 2-416

**ఇఱికికొను** దే. స. క్రి.

ఇఱికించి పట్టుకొను, ఇముడ్చు.

క. చఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత గజంబుఁ బట్టి పెనచి ఖగేంద్రుం, డిఱికికొని గగనవీథి, బఱచె వియచ్చర విమాన పంక్తులు దూలన్. ఆది. 2-69

వ. గజకచ్ఛపంబులం గరంబుల నిఱికికొని గరుడుండు గగనంబునఁ బఱచి. ఆది. 2-78

**ఇఱిగౌఁగిలి** దే. వి.

బిగికౌఁగిలి, గాఢాలింగనము.

ఉ. ఆ రథికోత్తముం డధిక హర్షముఁ బొందుచు నమ్మహీశ్వరున్, గారవ మొప్ప గ్రుచ్చి యిఱిగౌఁగిటఁజేర్చి. కల్య. 2-416

**ఇఱియు** దే. అ. క్రి.

1. బిగియు, గట్టిగా నదుముకొను.

సీ ...అశ్వామిని వగచుచు నాతని నెత్తి తాఁగౌఁగిట నిఱియఁ జేర్చి ఆశ్వ. 2-84

క. పెద్దయునుం బ్రొద్దిఱియం గౌఁగిటఁ జేర్చిరి. మౌస. 1-163

సీ. ...కుచము లురంబునఁ గుదియించి క్రమమున, నిఱిసిన కౌఁగిట నింపొనర్తు విరా. 2-310

**ఇఱుకటము** దే. వి. (√ ఇఱుకు)

ఇఱుకు చోటు.

(ఇఱకటము అని ముద్రిత ప్రతులన్నియు- సూ. ఆ. ని. లో ఇఱు కటము అని ఇఱుకటములోని చివరి రెండుదాహరణము తీయఁబడినవి. చూ. ఇఱుకటము.)

**ఇఱుకు** దే. స. క్రి.

బిగియఁబట్టు, రెంటి సందున ఒత్తిపట్టు.

క. వెరవునఁ దత్తనువుం దన, చరణంబుల నిఱికి యెత్తి చాపుడిపి బల,స్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. చూ. ఇఱికికొను. కర్ణ. 2-80

**ఇఱ్ఱి** దే. వి.

మగలేఁడి.

క. మనసిజరాగంబునఁ బెనఁ,గిన యిఱ్ఱిని లేఁడిఁ జూచి కృతహస్తుఁడు పెం,ల్చన యేనమ్ముల నారెం,టిని ద్రెళ్లఁగ నేసెఁ గడుఁ గఠినహృదయుండై. ఆది. 5-49

**ఇల**[1] సం. వి. ఆ. స్త్రీ.

భూమి.

సీ దీనివల్లభుఁ డనఁగా నిల సొబగు సొం,పెసఁగ వర్తిల్లు వాఁ డెవ్వఁ డొకొ. విరా. 2-80

క. ఈ యాఖ్యానము విని భూ,నాయకుఁ డెవ్వం డిలాజనంబుల నతుల, న్యాయంబునఁ బాలించు శాంతి. 3-122; శాంతి. 4-204

**ఇల**[2] సం. వి. ఆ. స్త్రీ.

వైవస్వత మనువు కూఁతురు చంద్రుని పుత్రుఁడైన బుధునకు భార్య. పురూరవుని తల్లి. ఆది. 3-89

**ఇలాతలము** సం. వి. అ. పుం. న.

భూప్రదేశము.

వ. ...అతండు పదియడుగుల కొలంది నిలాతలంబు చిక్కంద్రొక్కి యాడిగిలఁబడి నిలువం బట్టి. భీష్మ. 2-159

**ఇలావృత వర్షము** సం. వి. అ. పుం. న.

నీలశైల దక్షిణదేశము, ప్రపంచము యొక్క 9 భాగములలో నిది

యొకటి. 1) కురు, 2) హిరణ్మయ, 3) రమ్యక, 4) ఇలావృత, 5) హరి, 6) కేతుమాల, 7) భద్రాశ్వ, 8) కిన్నర, 9) భారత. భీష్మ. 1-25

**ఇలాసురుఁడు** సం. వి. అ. పుం.

బ్రాహ్మణుఁడు.

ఉ. ...దీనిచే, రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్న యంతటన్. స్వర్గ. 89

**ఇలిలుఁడు** సం. వి. అ. పుం.

దుష్యంతుని తండ్రి

వ. ఆ త్రసునకుఁ గాళిందియను దానికి లిలుండు పుట్టె వానికి రథంతరి యను దానికి దుష్యంతుండు పుట్టె. ఆది. 4-5

సంస్కృత భారతమున నితనికి ఇలిలుఁడు, ఈలినుఁడు, ఇలినుఁడు అని మూఁడు పేరులు గనఁబడుచున్నవి.

"రాజా తాతాజగామేహ దుష్యంత ఇలిలాత్మజః" ఆది. 94-54

"ఈలినో జనయామాస దుష్యంత ప్రభృతీన్నృపాన్" ఆది. 88-16

"రాజర్షి స్తస్య పుత్రోఽహ మిలినస్య మహాత్మనః" ఆది. 92-11

**ఇలు** దే. వి.

ఇల్లు (చూ. ఇల్లు) గృహము.

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలుగట్టఁగూడదు. విరా. 1-128

క. లక్కయిలు గాలినది మొద, లక్కట మాతల్లి. ఉద్యో. 3-186

సీ ...లక్క యి ల్గాలిచి. ఉద్యో. 3-366

**ఇలుగు** దే. అ. క్రి. (√నీలుగు)

చచ్చు.

క. బలవిక్రమ ఘనులగు దొర,లిలిగిన మనసేన మేదినీశ్వర విను క,న్నులు సెడిన ట్లున్నది. శల్య. 1-51

**ఇలువడి** దే. వి.

1. కులీనత, మంచి కులమ్మునఁ బుట్టుట.

చ. వలనుఁ గులంబు లేని పరివారము గోటియు నేల నేర్పు న,గ్గలికయు శక్తి పెంపు మదిఁగల్గి సుహృజ్జన మిత్రమౌ బలం, బిలువడి గల్గెనేని నిలయెల్లను నేలఁగఁజాలు. శాంతి 3-108

2. మంచి నడత.

సీ. ...ఇలువడి ఘటశుద్ధి గలిగిన కాంతలందు -తే- నిల్తు వల్లభ ప్రతికూల నిష్ఠురాత్మ, నన్యమందిరగామిని నధిక నిద్రయైన మానినిఁ దొలఁగుదు. అను. 1-285

ఇలువరుస; ఇల్వరుస దే. వి.

ఇంటి వంతు.

సీ. ఇందుల కాఁపుల నందఱఁ దొల్లి యిల్వరుస గ్రమింగుచున్న.
ఆది. 6-264

వ. పెద్ద కాలంబునకు నీయిలు వరుస నేఁడు మాకు వచ్చిన.
ఆది. 6-269

ఇలువాడు దే. క్రి.

ఇంటిని ఇంటిలోని వస్తువులను శుభ్రపఱచి గృహాలంకారాదులు చేసి గృహశౌచమును గాపాడు.

క. అలన యిలువాడి నాథుఁడు వలచిన చవివంటకములు వండి యిడి తనుం, గలయఁ దలంచిన మెయికొని, యెలమిం గై సేసి హృదయ మీవలయు శివా. అను. 5-290

శ్లో. మంగళం గృహ శౌచం చ సర్వోపకరణాని చ, సర్వకాల మవేక్షేత కారయంతీ చ కుర్వతి. సం. భా. అను. 250-8 (నిర్ణ)

సీ. ఇలు వాడి తలవాకి లెప్పుడు నెఱుఁగక. అను. 4-358

(సం.ము పాఠము ఈ సంఖ్యలో 'ఇలువడిఁదలవాకి లెప్పుడు నెఱుఁగక' అని యున్నది. అను. 5-290 లో మాత్రము 'ఇలువాడి' యనియే యున్నది. అను. 4-358 లో 'ఇలువడి'కి పాఠాంతరముగా 'ఇలువాసి, ఇలువాడి' అని కలవు. 'ఇలువాడి' అను దానిని పుటయడుగున పాఠాంతరములు చెప్పుపట్ల ఇలు+పాడి యగునని చెప్పిరి. రెండు తావుల 'ఇలువాడి' యను పాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది. మొదటి

దాని మూలమును దానిని బలపఱచుచున్నది. వాడు = ఉపయోగించు; ఇలువాడు = ఇంటిని ఉపయోగించు- అనగా ఇంటిని ఉపయోగించుకొను స్థితిలోనుంచు- గృహశౌచమును గాపాడు అను నర్థము స్ఫురించును. సూ. ఆ. ని. ఇలువాడి శబ్దముగాని 'ఇలువడి' క్రింద పై ప్రయోగములు గాని ఇచ్చి యుండలేదు. ఆనంద వారిలోని 'ఇలువాడిఁ దఱవాకి లెప్పుడు' పాఠమ నందలి అర్థబిందువు 'వాడి' పాడియని స్ఫురింపఁజేయుట కేమో.)

**ఇల్లడ** దే. వి. (ఇల్లడము)

న్యాసము- జాగ్రత్తగాఁ గాపాడి మఱలఁ గోరినప్పుడు ఒప్పగించు పద్ధతిని ఒకరియొద్ద దాఁచిన ధనాదికము. ఇల్లడపెట్టిన వస్తువు వంటివాఁడు.

సీ. ఇల్లడ యిమ్మహానుభావు నిడితి మీకడ. అ శ్ర. 1-98

శ్లో. ఏష న్యాసో మయా దత్తః సర్వేషాం వో యుధిష్ఠిరః
భవంతోఽస్య చ వీరస్య న్యాసభూతాః కృతా మయా.

సం. భా. ఆ శ. 10-15

సీ. ...తగు వడువురకు నీ, నిల్లడ బ్రహ్మచే నిడఁగఁబడిన యిక్కన్య.

ఆది. 6-248

**ఇల్లడపెట్టు** దే. స. క్రి. (ఇల్లడవెట్టు)

జాగ్రత్తగాఁ గాపాడి మఱలఁ గోరినప్పుడు ఒప్పగింపుమని దాఁపనిచ్చు.

ఉ. ...కుంతి సహదేవుని నిల్లడవెట్టి నాకు. విరా. 2-211

తే. నమ్మి యిల్లడవెట్టిన సొమ్ముగొనిన, మీనులోనగు నీచపు యోను లందుఁ బుట్టు. అను. 4-267

**ఇల్లడము** దే. వి.

ఇల్లడ, చూ. ఇల్లడ.

ఉ. మీ, చేతికి నిచ్చి యిల్లడము సేసెద నిన్నరనాథు. కర్ణ. 2-202

(ఇది పాఠాంతరము - చూ. అరువు)

**ఇల్లడయిడు** దే. స. క్రి.

1. సంరక్షణమునకై యొసఁగు.

క. ...పాండు జనపతి నెమ్మిన్, క. కొడుకుల నిందఱ నిల్లడ,యిడి పరలోకమున కరిగె నెడసేయక యి,ప్పుడ వీరలఁ గురువృద్ధుల, కడకుం గొని పోవవలయు గజపురమునకున్. ఆది. 5-143

2. ఒకనిపై రక్షణ భారము వైచి తిరిగి యప్పగించుటకై యప్పగించు.

చ. (శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో) తడయక యేఁగి నీతిబల దర్పము లొప్పఁగ వాని డాసి క,వ్వడియును నేను భీముఁడు నవశ్యముఁ బోర బృహద్రథాత్మజుం, గడిఁదిరిపున్ జయింతుము జగన్నుత సన్నెద నమ్ము మేదిని యి,ల్లడయిడు భీము నర్జును నలంఘ్య బలాఢ్యుల నావశంబునన్. సభా. 1-168

శ్లో. యది భీమబలం వేత్సి యది తే ప్రత్యయోమయి, భీమసేనార్జునౌ శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛ మే. సభా. 20-7

**ఇల్లడసొమ్ము** దే. వి.

జాగ్రత్తగాఁ గాపాడి తిరిగి యప్పగించుటకై దాఁచి యుంచిన ద్రవ్యము

ఆ. కడఁగి యిల్లడ సొమ్ము లడఁచి కొండ్రు. అర. 4-294

**ఇల్లాలు** దే. వి.

భార్య, గృహిణి.

వ. ...కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసి. శాంతి. 3-480

వ. పరానురక్తచిత్త యగు మగువ నిల్లాలింజేయు వారుం గలరె. ఉద్యో. 4-308

**ఇల్లు** దే. వి. బొ. (బహు) ఇండులు, ఇండ్లు, ఇండ్లులు

ఇది హల్లుపరమగునపుడు వైకల్పికముగా 'ఇలు, ఇల్' అను రూపముల నొందును.

1. గృహము, ఉనికిపట్టు.

ఉ. ఎండకు వానకోర్చి తన యిల్లు ప్రవాసముఁ జోటు నాక. విరా. 1-135

ఆ. సుగుణములకు నెల్ల జొచ్చి నిల్లు. శాంతి. 1-386

సీ. పాడిల్లును బోలెనై యున్నది. ద్రోణ. 2-887

ఉ. రాజ గృహాంబుకంటె నభిరామముగా నిలుగట్టఁగూడ దే యోజ. చూ. ఇలు. విరా. 1-128

సీ. వారణావతంబున లక్కయిల్ గావించి. ఆది. 3-14

ఉ. ...ఇట్లు వంటయిల్, కుందెలు సొచ్చె. ఆది. 6-186

తే. ...దుర్మర్షణునియును దుర్ముఖునియు, నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె నృపతి. శాంతి. 1-886

చ. ...ఇట్లు దమయిండుల నుండినయట్లు మెచ్చకే, మఱి శయనింతు రే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై. ఆది. 6-194

2. వంశము, కుటుంబము.

మ. భవదీయాత్మజు నాత్మజుండు కురుభూభారోద్వహుండయ్యె యా, దవ వంశోత్తరుఁడైన వజ్రునకు నింద్రప్రస్థ రాజ్యంబు గౌరవ దీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రా రక్షణీయంబులై,నవి యీ యిండులు రెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమా. మహా. 1-11

సీ. ...భరతాన్వయంబు,నందు నా యిల్ల యిల్లుగా నతిశయిల్లి. విరా. 3-216

సీ. ఇట్టి క్రూరుల యింటికిచ్చిన మనవారి నందుఁగాక. ఉద్యో. 3-253

**ఇల్లురువు** దే. వి.

ఇల్లడము. చూ. ఇల్లడ.

క. తన చేతికి నిచ్చిన వస్తునికాయము నిల్లురువున చొప్పున మగుడం, గొన వచ్చి భార్య పతి దెమ్మని నప్పుడ యిచ్చు టొప్పునకపట వృత్తిన్. అను. 5-293

**ఇల్వరుస** దే. వి.

చూ. ఇలువరుస.

**ఇల్వలుఁడు** సం. వి. అ. పుం.

ఒక రాక్షసుఁడు, వాతాపి యన్న. చూ. అర. 2-318 మొ. 846 వ.

**ఇవల; ఇవుల** దే. వి. ఔ. అసౌ. ఇవ్వల, ఈవల

కొన్నియెడల అసమర్థ్యముగాను గొన్నియెడల ఉసమర్థ్యముగాను ప్రయో-
గములు గలవు. చూ. ఇవుల.

1. ఇవతలి విభాగము.

అ. ఇవుల మూఁటి కవల నవుల యమ్మూఁటికి, నివలఁ దేజరిల్లు దివిజు-
నగము. భీష్మ. 1–21; అశ్వ. 1–68

2. ఇవతలి కాలము.

తే. ఇవుల నేడు దరంబుల నవల నేడు, దరములను బితృవర్గంబు నరుఁడు.
గంగ, నాడి శుచిఁజేయు. అను. 2—11

(ఇవల అనియుఁ గొన్నింట)

**ఇవి** దే. సర్వ. బహు.

ఇది శబ్దము యొక్క అమహదర్థక బహువచన రూపము. ద్వితీయావిభ-
క్తుల యందు 'వీని' అను రూపము వచ్చును.

క. ఇవి దుస్ససేను ప్రేళ్లం దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి.
చూ. ఇది. ఉద్యో. 3-116

**ఇవురంబాఱు; ఇవురఁబాఱు** దే. అ. క్రి.

సీ. గగనంబుతో రాయు కఠడులు గల జలం బివురఁబాఱిన మహార్ణ-
వంబు కరణి. ద్రోణ. 2-126

క. ...బెడిద మైన యొండ దనుకఁగ నివురం,బాఱెను మడువు.
శాంతి. 3–192

**ఇవురు** దే. అ. క్రి.

1 ఇంకు.

క నానాస్త్రశస్త్రచయ బడ, బానలముం గవియజేసి యత్యుగ్రతనే,
నాళ్లన యప్పాండవ, సేనాసాగరము నివురఁజేయుదు నధిపా.
ఉద్యో. 4-416

2. వట్టు, ఎండు, శుష్కించు.

సీ. కల్పాంత వాయుసఖ స్ఫురణంబున నివిరిపోయిన మహార్ణవము-

కరణి. కల్యా. 2-399

ఆ. ఇంద్రియములనెల్ల నివుఁగంగఁజేయుచు, నడరు శోకవహ్ని యాఱ నేర, దింద్రపదవి సేరె నేనియు. భీష్మ. 1-193

3. చెడు, నశించు.

క. అధ్వరంబుకంటె నధికంబు దపము ద,పం బనంగ మేని ప్రసన్నఁ దనము, నివురఁజేతగా దహింసయు సత్యవా,క్యంబు దమము దయయుఁ గాని యరయ. శాంతి. 2-348

4. అడఁగు, లీనమగు.

గీ. ఇంద్రియంబులు మనమునం దివురఁజేసి, మనసు దిగిచి. శాంతి. 6-117

ఇవుల దే. వి. ఔ. అనౌ.

చూ. ఇవల.

ఇషీక(ము) సం. వి. ఆ. స్త్రీ.

కాశము, ఱెల్లు, వీరణ తృణము, అవురుగడ్డి, ముంజదర్భ మొక్కలోని మొవ్వు.

వ. అగ్గురు నందనుండు...బ్రహ్మశిరోనామకం బగు దివ్యాస్త్రంబు దలంచి యొక్క యిషీకంబు పుచ్చుకొని యందయ్యస్త్రంబు నావహించి. సౌప్తి. 2-60

ఆ. అనఘ ముంజగర్భమగు నిషీక నిదర్శ,నంబుగాఁగఁ గనుఁగొనంగ వలయుఁ, దనువు ముంజ మాత్మ దదిషీక నిష్కర్ష, విధము సుమ్ము యోగవిదుని వెరవు. అశ్వ. 1-207

వ. ఆ రుద్రుండు రౌద్రాకారంబున నయ్యజ్ఞంబు వెనుకొని నాప యింగవిసిన నొక్క యిషీక పరశు రూపంబుగా నభిమంత్రించి యతనిపయిం బ్రయోగించిన. శాంతి. 6-441

ఇషీకాస్త్రము సం. వి. అ. న.

మంత్రచోదితమైన అస్త్రము, ఆవహింపఁబడిన ఇషీకము.

వ. ...అగ్గురు నందనుండు...బ్రహ్మశిరోనామకంబగు దివ్యాస్త్రంబు

దలంచి యొక్క యిషీకంబు పుచ్చికొని యుందయ్యస్త్రంబు నావ
హించి యపాండవం బయ్యెడుమని దారుణ భాషణంబులతోడ
రోషప్రదీప్తుండగుచుఁ బ్రయోగించిన. సౌప్తి. 2-60

క. (కుంతి శ్రీకృష్ణునితో) గతి నీవె నాకు మత్సం,తతికిని నీ యల్లుఁ
గుఱ్ఱ తనయుఁడు పుట్టెన్, మృతుఁడై క్రూరుండగు గురు,సుతుని
యిషీకాస్త్రవహ్ని జూఁడిన కతనన్. ఆశ్వ. 3-169

**ఇషువు** సం. వి. ఉ. పుం. స్త్రీ.

బాణము.

ఉ. (మారుతి) చొచ్చి పితామహుం గని యిషుప్రచయంబునఁ గప్పె.
భీష్మ. 2-277

**ఇష్టదాయి** సం. విణ. (న్. నీ. న్.)

వరము లిచ్చువాఁడు.

తే. ....విష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడును నాకు.
శాంతి. 4-222

**ఇష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అభిమతమైనది, ప్రియమైనది.

వ. ...అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్ట ప్రాప్తులకుం గార
ణంబులు గని కానలేవు. శాంతి. 1-217

వ. (శల్యుఁడు దుర్యోధనునితో)....నీ కెయ్యది యిష్టంబు గోరు
మిచ్చెద ననిన. ఉద్యో. 1-94; విరా. 5-359

2. సమ్మతమైనది

క. (భీష్ముఁడు ద్రుపదు పంచిన భూదేవునితో) నీ వాక్యము విప్ర
స్వాభావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబై నన్, భావింపఁగార్యమున
యం,దే విధమున సభకు నింత యిష్టం బగునే. ఉద్యో. 1-243

వి. అ. న.

కోరిక, వరము.

సీ. ...ఇచ్చెద నిష్ట మడుగు మనిన. శాంతి. 4-188

ఉ. పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. విరా. 1-1

**ఇష్టాకృతము** సం. వి. అ. న.

బ్రహ్మచేసిన వేయి సంవత్సరముల సత్రయాగము.

వ. ప్రజాపతి సహస్ర వార్షికంబైన యిష్టాకృతంబను సత్రయాగంబుఁ జేసె. అర. 3-221.

**ఇష్టి** సం. వి. ఇ. స్త్రీ.

యాగభేదము.

సీ. అగ్నిహోత్రము నిష్టి యజనములును, గలవార లగుదురుగాక యన్నెల వొల్ల నని యాడె భూపతి. అను. 4-70

వ. (ధృతరాష్ట్రుఁడు) పాద్యమినాఁడు రేపకడ ఋత్విక్సమేతుండై యిష్టి నడపి. ఆశ్ర. 1-137; ఆశ్ర. 2-165.

**ఇష్టుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

హితుఁడు, మిత్త్రుఁడు, ఆప్తుఁడు.

వ. ...వారలు మొదలుగాఁ గల యిష్టజనంబులు పరివేష్టింప. ఉద్యో. 3-245; ఉద్యో. 3-3

ఉ. ...నారాయణు నట్లు దాను ధరామర వంశ విభూషణుండు నారాయణ భట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుడున్. ఆది. 1-24.

**ఇసిరో** దే. అవ్య. ఇస్సిరో, ఇస్సిరా.

ఏవగింపును, నిందను దెలుపును.

చ. ...కిరీటిచే నటుక శాంతత నొందిన సోమదత్తనందను తల ద్రుంపవే నుఱచితా యిసిరో యిది పోరిపాడియే. మౌస. 1-44; అను. 2-200.

**ఇసీ** దే. అవ్యా. ఇస్సీ.

ఏవగింపును నిందను దెలుపును.

చ. తలఁకెడు వానికిన్ మగఁడ తానలె నన్నిడికించువాఁ డిసీ, పలుకకు భీతున ట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు నిన్ను నచ్చియే, కలనికి వచ్చితిన్. విరా. 5-25; శాంతి. 1-117

ఇసుక దే. వి. ఏక.

ఇసుము, సికత, వాలుక.

సీ. ...భూషణ,స్తోమాస్థి చయముల తమురు లిసుక గాఁగ.

ద్రోణ. 2-128; శల్య. 1-180

ఇసుమంత దే. వి.

1. ఇసుక రేణువు పరిమితి.

సీ. వెస అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసు,మంతలుగా నఱుమాడి యాడి విరా. 5-85

2. మిక్కిలి కొంచెము.

చ. ...సద్గురుం, డనియెడు కొంకుబుద్ధి నిసుమంతయుఁ బుట్టదు వీని గాల్పనే. శాంతి. 1-861

ఇసుము దే. వి. ఏక.

ఇసుక.

సీ. ఇసుము చల్లుచు నమరేంద్ర పుత్రుఁడు వోయె. సభా. 2-301

ఇస్సిరొ దే. అవ్య. ఇస్సిరో, ఇసిరో

ఏవగింపును నిందను దెలుపును.

తే. ...నివ్వాలు నొకనిఁ, బొదివి రిస్సిరొ పెక్కండ్రు ప్రోడ లిదియు మగటిమియె. స్త్రీ. 2-76

ఇస్సిరో దే. అవ్య. ఇస్సిరొ, ఇసిరొ

ఏవగింపును నిందను దెలుపును.

శా. రారా జిస్సిరో చచ్చుచో, గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దోర్గర్వంబు బెండయ్యెనే. శల్య. 1-58; మౌస. 42

ఇస్సీ దే. అవ్య. ఇస్సీ

ఏవగింపును నిందను దెలుపును.

క. (భీముఁడు కీచకునితో) అనవుడు మనమున నిస్సీ,యని యుచిత నిగూఢ భంగులగు భాషణముల్, దనప్రియ వినిపించుట కిట్లని

యెన్ మృదురీతి భీముఁ డాతని తోడన్.

విరా. 3-886; ద్రోణ 6-288

**ఇహము** సం. అవ్య.

1. ఈ లోకము.

క. విను విప్రశరీరము సుఖముునకే బహునియమ దుఃఖముల నిహా
మునఁ జెందను నిత్యసౌఖ్యముం బరమునఁబొందను బుట్టెంగాక
బోధప్రవణా. శాంతి. 6-281; ఉద్యో. 2-94

2. ఐహిక సుఖము.

క. అని యతఁడు శౌరితో నిట్లను నిహముం బరము గలుగునట్టి
విధము నీ వనఘా చెప్పితి నాకుం.

ఉద్యో. 3-328, ద్రోణ. 4-248; శల్య. 2-56; ఉద్యో. 8-35

**ఇహలోకము** సం. వి. అ. పుం.

ఈ లోకము, భూలోకము.

తే. పాడి గలిగిన నిహలోక ఫలము లెల్లఁ, జేరుటయ కాదు కీర్తియుఁ
జెందుఁ బురుష. ఉద్యో. 2-67

**ఇహాముత్రఫలము** సం. వి. అ. న.

ఐహికాముష్మిక ఫలము, ఇహపరములందలి కర్మఫలము.

క. (కర్ణుఁడు కుంతితో) క్షత్రియ సంస్కారమునకుఁ, బాత్రిము గా
నీవు నన్నుఁ బాటింప విహాముత్ర ఫలములకు నీకేఁ, బుత్త్రుఁడ
నని వచ్చు టెంకఁ బొసఁగునె చెపుమా. ఉద్యో. 4-62

**ఇళ** సం. వి. ఆ. (స్త్రీ).

ఇళ అను పేరుగల నాడి — ఇడ.

ఉ. శౌచము బ్రహ్మచర్యము ను శాంతియు లఘ్వశనంబుకై యిళం
జూచుచు నంతరాత్మనెడ సొచ్చిన విఘ్నవిశేషమున్ ధృతిం,
ద్రోచుచు భక్తియుక్తికి గురుండు ప్రమోదమయుండు గాఁగ
దృగ్గోచరతం జరింపఁగ నకుంఠిత మోక్షసుఖంబు సొప్పడున్.

అను. 5-225

# ఈ

**ఈ**[1] దే. ఇది యొక్క ప్రాతిపదికము
నిర్దేశార్థకము దగ్గఱనున్న దానిని నిర్దేశించును.
(దీనికి వృత్తియందే ప్రయోగము గలదు)

వ. ...ఈ శాపఫలంబు భవదజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి.
విరా. 1-87; విరా. 2-78

**ఈ**[2]

ఇచ్చు ధాతువునకు వ్యతిరేకార్థక తుమున్నర్థక ప్రత్యయములు పరమగు నపుడు ఆదేశముగా వచ్చునది.

తే. ఆ సుయోధను ముక్కున నావిగలుగఁ, బుడమి నీ కీఁడు.
ఉద్యో. 3-41

తే. శోకములకు, భయములకు బుద్ధి నెడ యీఁడు పండితుండు.
శాంతి. 1-188

చ. అడఁగఁగ నీక శంతను నియన్వయముం గలిగించి తీవ
ఉద్యో. 1-373

వ. ఇవ్విధంబున నశ్వత్థామ వడనఁ దెగలు బలంబుల మరలనీక పురి కొల్పుకొని.
ద్రోణ. 2-32

చ. అనుగ్రహముం బోరనీకు చిత్తమున్.
శల్య. 1-54

క. అనుజులకు నడ్డపడి యేమిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితిఁగాక.
ఉద్యో. 3-18; శాంతి. 6-87

క. ...కౌంతేయులకుం, గల పాలీఁ దగుఁ దోడ్తో.
ద్రోణ 4-247

క. సౌబలు నీతియుఁ గర్ణుభు,జాబలమును గూడి తనకు సామ్రాజ్య బీఁగా బలసి వెలయువాఁడై.
కర్ణ. 1-2

క. నీఁ యెవ్వ ననుచు నల్లన, యాతని శయనమున కరిగి యతఁ డెడ,

యీఁగా,నా తల్పంబున నొకదెసఁ, బ్రీతహృదయయై శయించెఁ బృథ్వీనాథా. అను. 2-18

**ఈ** అవ్య.

1. సంప్రార్థనంబున మధ్యమ పురుష 'ము,ఁడు' వర్ణకంబులకు విధానసూ అనుప్రయుక్తమగునది.

చ. అని యుచితంబుగాఁ బలికి యంగన హస్తముఁబట్టి తత్కరం,బున గదియించి నీ గురువుఁ బొత్తి తగం గొనియాడు మెట్లు నె,ప్పె నటుల భక్తిమైనడవు పెంపెసలారఁగఁ గూడు గూర చం,దన కుసుమాదులన్ నడపి తప్పక యారసి గారవింపుమీ. విరా. 1-252

క. గురునట్టివారు పదివే,వురు గాచిన నెల్లి సైంధవునిఁ బగలిటిలోఁ, బొరిగొనునట్లుగ నరునకు, వరమిఁడీ వేల్పులార వారని కరుణన్. ద్రోణ. 2-346

2. ప్రశ్నించునపుడు (కిమర్థమగు) 'ఏ' అను శబ్దమునకు అనుప్రయుక్తమై అర్థవిశేషమును దెలుపును.

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడించిరాక గెలుపే యతఁ డేఁ,డీ డాఁగిపోయెనొకొ మా,తోఁడి బవర మిట్లు దాను దొలఁగినఁ దెగునే. ద్రోణ. 1-374

**ఈఁక** దే. వి.

ఈఁకె, పక్షి రెక్కలోని భాగము.

ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది తథ్యమెఱుంగక నాకు నీచభా,వమ్మగు భంగిఁ జేసితివి వాసవ యియ్యదితి ప్రసూత వం,శమ్మఖిలమ్ముఁ దాల్తు నొక సన్నపు టీఁకన. ఉద్యో. 3-298

ఆ. పడుచు లీఁక లూడ్చిపట్టి యాడెడునట్టి; పులుఁగు చందమయ్యెఁ దలఁప నాయ,వస్థ. కర్ణ. 1-84

**ఈఁగ** దే. వి.

మక్షిక.

ఆ. ఈఁగ కాలియంత యేనియు వీసర,పోవకుండ ధర్మమునను నడచి శాంతి. 2-335

**ఈఁగకాలియంత** దే. జాతీ.

ఈఁగ కాలి పరిమితి, మిక్కిలి కొంచెము, సూక్ష్మాతిసూక్ష్మము.

ఆ ఈఁగ కాలియంత యేనియుఁ బాపంబు, వీరివలనఁ గనుట వినుట గలుగ, దొక్కనాఁడు నట్టియుత్తములకు విధి, పాడిమాలి యిట్టి పాటు దెచ్చె. స్వర్గా. 26; శాంతి. 2-335

**ఈఁగఁగరాని యప్పు** దే. సమ.

తీర్చుటకు శక్యముగాని ఋణము.

ఉ. ...పాండువిభు కోడలు దవ్వుల నున్న నన్న 'గో,విందుఁడ కావు, మంచుఁ బలవించుట యీఁగఁగరాని యప్పుఁబో,లెం దల పోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్.

ఉద్యో. 2-129

**ఈఁగికొను** దే. స. క్రి.

1. (అవమానము మొ.) పోఁగొట్టుకొను.

వ. .. కయ్యంబు కర్జంబుగాదనె భంగంబు నీఁగికొనం దగదనె.

ఉద్యో. 3-99

2 తొలఁగించుకొను.

వ. అత్తపస్వివర్యుండు దపోవిశేషంబున దోషంబు నీఁగికొని.

శాంతి. 3-308

**ఈఁగు** దే. స. క్రి.

1. తొలఁగించు, పోఁగొట్టు.

చ. జలజదళాక్షి కీచకునిఁ జంపుట కిమ్మెయి ముట్టఁబల్కఁగా, వల యునె యేను జూడనని వారణ నిన్నుఁ బరాభవించి వాఁ,డిల మన సింక నాంధ్రకును నెవ్వరు భంగము నీఁగఁజాలువారు

విరా. 2-231

2 తీర్చు, పోఁగొట్టు (ఋణము, పగ మొదలగు వానిని)

ఉ ...నానా విధవైభవంబులు మనంబుల వాంఛలకుం దగంగ నీ,కే విధి నీఁగువాఁడ ఋణమెయ్యది యేనియు వేఁడు డిచ్చెదన్.

విరా. 3-282; ఉద్యో. 2-129; ఉద్యో. 3-9

శా. ఏ నూతేండ్లకుఁ బుట్టి నా యనుజుఁ డింకీయున్న యండంబు నె,త్తై నన్ ధైర్యము గల్గి కావుము ప్రయత్నాసక్తిమై వాఁడు ద,ర్పా నూనుండు బలాభిరాముఁడు మదీయస్ఫూర్తిమన్మూర్తి నీ, కానందంబుగ నీఁగు దాస్యము త్రిలోకాశ్చర్య సంపాదియై.

అను. 1-176

ఈఁగు దే. స. క్రి.

వెనుదీయు, వెనుకకుఁ దగ్గు.

ఉ. ఒండొరుఁ బట్టుచుం దిగుచు చొండొరుఁ బాయుచు వ్రేయుచున్ మహో,ద్దండత నొండొరుం దెరలఁ దాఁకుచు నీ,గుచు లోఁగుచుం జలం,బొండొరు మీఱ నొండొరుల యుద్ధతి సైఁపగ వీఁకఁ బోరి రా,ఖండల భానుసూను లవిఖండిత చండభుజా ప్రకాండతన్.

అర. 6-383

ఈఁత దే. వి.

ఈఁదుట.

వ. గాంధారిఁ గుంతినిం గాంచి యీతఁకాఁడు తీరంబు గనిన చందంబుఁ బొంది.

అశ్వ. 4-167

ఈఁతకాఁడు దే.

చూ. ఈఁత.

ఈఁదిఱు దే. స. క్రి.

ఇచ్చుటకు వలనుపడు.

తే. లొంటి చవి గని యిప్పుడుఁ దోఁచి పాండు,సుతులు రాజ్యంబు నేయంగఁ జూచు కలుచ,నాకు నీఁ దీఱునే యింక,నాఁటి చూఱ లెక్కడివి ద్రోణభీష్ము లీ దిక్కు సుమ్ము.

ఉద్యో. 3-382

ఈఁదు దే అ. క్రి.

1 ఈఁతకొట్టు.

తే ప్రళయకాల సముద్రము భంగిఁ బొంగి, కడుఁ భయంకరుఁడగు భీముఁ గడవనీఁద, వశమె నా పుత్రులకు విధివశము వొంది, యెదిరిఁ దమ్మ్రను వెఱుఁగరు మదముకతన.

ఉద్యో. 2-190; ఉద్యో. 4-65; భీష్మ. 1-54

2. తరించు, దాఁటు

చ. ...నిన్నుఁ దెప్పగాఁ,గొని పలుమాఱు నాపదలకున్ భయమొందక దుఃఖవార్ధులీఁ, దినమున నెల్ల నీక్కొ అఁత దీర్చి సుఖాత్ములంఁజేయు పావనీ. ఉద్యో. 3-68

**ఈక్షణము** సం. వి. అ. న.

1. చూచుట, చూపు.

ఉ. ...పరస్పర వక్త్రవిలోకన క్రియా,వ్యాజమునం దదీక్షణ నివారితులై రతి మత్సరంబునన్. ఆది. 5-285; విరా. 4-26

2. కన్ను.

మదిరేక్షణ యంతటిలోఁ దలంచె. అర. 5-11

**ఈక్షణశ్రోత్రము** సం. వి. అ. పుం.

కన్నులే చెవులుగాఁ గలది, సర్పము.

ఉ. ...ఈక్షణ, శ్రోత్రవిభుండు తక్షకుఁడు. ఆది. 1-107

**ఈక్షణశ్రోత్రవిభుఁడు** సం. సమ. వి. ఉ. పుం.

సర్పరాజు, తక్షకుఁడు. ఆది. 1-107

**ఈక్షించు** సం. స. క్రి.

చూచు.

ఆ. అత్తపస్వి యీక్షించుచుండఁ గన్నెఱచె నిట్లు మగుడఁ దెలివిఁబొంది. అను. 2-450

**ఈగి** దే. వి. (√ఇచ్చు)

ఇచ్చుట, దానము, త్యాగము.

ఉ. ధర్మసుతుండు....యీగియుఁ బ్రియంబును నాయెడ నాఁడు నాఁటికిం, బేర్మివహించుచుండ నడపెం దనతమ్ములలోని వానిఁగాన్. విరా. 1-267

సీ. నీ యీగి నేను భూనాయకుఁ డగు టొల్ల. శల్య. 2-74

**ఈడంబోవు; ఈడఁబోవు** దే. అ. క్రి.

1. వెనుదీయు, వెనుకకుఁబోవు

వ. ...అయ్యవనీకాంతుండు బోరింప శార్దూల శుండాలాదులతోడ నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు.
విరా. 2-20

క. ఆ చకయు నీడఁబోవక, కాంచనపుంఖ ప్రకాండ కాంతిస్ఫాయ, త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్.
విరా. 8-189

2 పాఱిపోవు.

వ. ఇవ్విధంబున రాధేయుం తోడిపాఱిన నీకంబోవు మన సైనికులం గనుంగొని కురువిభుండు.
ద్రోణ. 5-115

శ్లో. ద్రవతస్తాన్ సమాలోక్య రాజా దుర్యోధనస్స్వయమ్.
సం. భా. ద్రోణ 159-68

3. ఓర్చు, సహించు.

క. కీడాడిన మేలాడుదుఁ, దాడన మొనరించిరేని దరహాసముతో, నీడంబోదును గ్రోధోత్పీడ వొరయఁ జెప్పుదును మదీయ వ్రాదయమున్.
శాంతి. 5-548

శ్లో. ఆకృశ్యమానో న వదామి కించిత్, క్షమామ్యహమ్ తాడ్యమానశ్చ నిత్యమ్.
సం. భా. శాంతి. 289-12

**ఈడఁబోవిడుచు** దే. స. క్రి.

పూర్తిగాఁ ద్యజించు.

ఆ. అనుడు నతఁడు కర్మ మఖిలంబు నీడఁ బోవిడుచుటొప్పదంద్రు వేదవిదులు, దాని నాదరింపఁ దగదొకో సంయమి, ప్రవర సంది యంబు వాపవలయు.

వ అనినం గర్మంబు విడువమియు విడుచుటయుం గలిగియుండుఁ దదీయ యోగ్యతా విశేషంబు లెఱింగించెద. శాంతి. 5-184,185

**ఈడవిడుచు** దే. స. క్రి.

పూర్తిగాఁ ద్యజించు, మొదలంట విడుచు.

తే. ధనము చేటున విసివి నామనము నిమ్ము, నీడవిడిచె నోకామము యేను శాంతి సత్య క్షమా భూతదయలఁ జెంది, నాఁడ లోభాదు లొందవు నన్ను నింక.

తే కామసుఖ దివ్యసుఖములు కాంత దొఱఁగు, మేలి షోడశాంశం
బునఁ బోలలేవు, గాన కామము నిను శత్రుకరణిఁ జంపి, బ్రహ్మ
పురమున నుండెద రాజుఁబోలె శాంతి. 4-51, 52

సీ త్రివ,గ్గెచ్చ యెవ్వనిచేత నీడ యిడువఁబడు. ఆశ్వ 1-208



**ఈడిగిలంబడు** దే. అ. క్రి.

ముందునకు రాదని వెనుకకు లాగుచుఁ జదికిలఁబడు.

వ అర్జును డు రయంబున రథంబు డిగ్గనుఱికి పఱచి పురుషోత్తము పిఱిందిదెసం గ్రుచ్చిపట్టిన నతండు దీర్ఘబాహుండగు నతని నాయత శాఖఁబగు విపుల శాఖంగొనిపోవు మహావాతంబునుం బోలెఁ గొని పోవ నాతండు పదియడుగుల కొలంది నిలాతలంబు చిక్కం ద్రొక్కి యీడిగిలఁబడి నిలువంబట్టి యిట్లనియె.

భీష్మ. 2-159

**ఈడితము** సం. విణ. (అ. ఆ. అ.)



పొగడఁబడినది.

క. సురపతి విభవము మేరువు, హిరణ్యమును గిన్నరేశుఁ డీడిత సంప, ద్గురుతయు నొసఁగిరి రథకరి, తురగభటావళులు దలఁపులో నొడఁ గూడెన్. శాంతి. 2-212

క. వేడుక నాలుం గొడుకును, గోడలు నీవును బ్రభూతగుణ యెక్కుము సం,క్రీడమెయి నివ్విమానము, నీడితగతి బ్రహ్మసభకు నేఁగఁగ వలయున్. ఆశ్వ. 4-250



**ఈడు** దే. విణ.

1. సమానము, సాటి.

తే ఎందు గలుగునె యర్జును నీడువాఁడు.

విరా 2-204; విరా. 5-60; అను. 2-106; విరా. 2-66

2. అనుగుణము, తగినది.

ఉ. ...ఎవ్వరున్, ధర్మజుపాటి గారనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైన యట్టి నీ,పేర్మికి నీడె దుర్దశల పెల్లునకున్ దురపిల్లు టారయన్.

విరా. 1-51; ఉద్యో. 1-164; విరా. 2-30; విరా. 2-192

**ఈడుచు; ఈడ్చు** దే. స. క్రి.

లాగు, తిగుచు.

ఉ. ...తేరితోడ నఱపినుఁగునీడిచి కొంచుఁ బాఱె. ద్రోణ. 2-74

సీ. ఒక్కత యిలు వొచ్చి యువిదల నీడిచికొని పోవ. మౌస. 25

ఉ. ...ఏవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. ఉద్యో. 3-110

**ఈడ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది.

ఉ. ...గంధవతియందుఁ బరాశరసంయమీశ్వరుం,డే పురుషోత్తముం బడసి యీడ్యతమోన్నతి నొందె లోకశ్రీ,జూపరు భారతాధ్యయన కారకుఁ గొల్చెద నమ్మహాత్మునిన్. శాంతి. 6-514

(వావిళ్ల వారి ప్రతి పాఠము ఈడ్వము — పాఠాంతరము ఈడ్యము)

**ఈడ్వము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది. చూ. ఈడ్యము.

(కొన్ని ప్రతులలో ఇది పాఠాంతరము — ఈడ్యము పాఠము)

**ఈతండు; ఈతఁడు** దే. సర్వ. ఏక.

ఇతఁడు, ఈ పురుషుఁడు, ఈయన.

ఉ. ...మహానుభావుఁ డీ,తం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో. విరా. 1-85

ఉ. ...ఇట్టి యీతఁ డె,ట్లొకో యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్. విరా. 1-98

**ఈతల** దే. వి. ఔ.

ఇవతల (ఈవలి కాలము, పిమ్మట)

ఉ. ...ఈ, యాతత సేనయం దతని నారసి కానకయున్న వీరి ని,ట్లే తలడించి యా కడుపు నెయ్యఁగఁ బోదముగాక వ్రేల్మిడిన్. విరా. 4-247

**ఈదృక్కు** సం. విణ. శ్.

ఇట్టిది (రూపాం. ఈదృశము)

క. ఆది పురుషుఁడ వగుటను, వేదంబులు సెప్పు నవియు వెలుచుఁ బలు
కఁగా, నీదృక్ప్రకారుఁ డని దా,మోదర నీ పెంపెఱుంగ వొరుల
కలవియె శాంతి. 1-390

**ఈదృశము** సం. విశే. (అ. ఈ. అ.)

ఇట్టిది, ఇటువంటిది.

వ. అని పూని యీదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం
బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషంబగుటంజేసి.
విరా. 1-31; భీష్మ. 1-208; శాంతి. 4-288

**ఈనడుమ** దే.

ఈ మధ్యప్రదేశమునందు.

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన కీ నడుమన్ విడియంగ నొందుచో,
టిమ్మను గాదు. విరా. 1-154

**ఈను** దే. అ. క్రి. స. క్రి.

1. (తిర్యగ్జడములు) ప్రసవించు.

సీ. మానుషీక్షీరంబు నీనిన పదినాళ్లలోని ధేనువుల పాలును నపేయ
ములు. శాంతి. 1-322

క. ఎవ్వఁడు నచరాచరగురుఁ, డెవ్వని నాభీసరోజ మీనె విధాతన్.
శాంతి. 4-218

సీ. కుక్కలెల్లను బిల్లల నీను. మౌస. 1-19

2. కలిగించు.

సీ. రథ సమాగమన సంరావంబు మేఱుగహ్వారములఁ బ్రతిరవోత్క
రము నీన. మహా. 43

సీ. ఎవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి మానితసంపద లీనుచుండు.
విరా. 2-191

**ఈప్సితము** సం. విశే. (అ. ఆ. అ.)

పొందుట కిష్టమైనది.

ఉ. ....ధర్మశనూభవుఁ డందు నాఁటిరే, యిమ్ములఁ జల్పి వేగుటయు
నీప్సితకార్యము సేయఁగా విచా,రమ్మున నున్నచో. విరా. 1-58

వి. అ. న.

కోరిక, అభీష్టము.

క. అతఁ డతనితోడ శవదీప్సిత మెయ్యది నాకు నేం చెప్ప వనుఁడు.
ద్రోణ. 2-190

**ఈము**

ఇచ్చు ధాతువుయొక్క వ్యతిరేకార్థకోత్తమ పురుష బహువచన రూపము

తే. వినుము గాండీవమను నొకవిల్లు దాటి, పొడవు గలిగియుఁ గృష్ణుండు
వూని తోడు, గూడుకొని వచ్చుటయు నెఱుంగుదము పీని, కెల్ల
శంకించి భూమిపా లీముగాని. ఉద్యో. 4-198

**ఈయన** దే. సర్వ. ఏక. (ఈ + అన)

ఈతఁడు.

క. ఈయనతో రణ మిప్పుడు, సేయఁగ మది గొల్పదు. భీష్మ. 2-251

**ఈయమ** దే. సర్వ. ఏక. (ఈ + అమ)

ఈమె.

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతన
యకుఁ జిత్తంబున నింకఁ బెద్ద పెనఁగఁ, జన దీయమతోడ నను
విచారము పుట్టెన్. విరా. 2-100

**ఈరణము** సం. విణ. (అ. ఆ. అ.)

పురికొలుపునది.

క. తంత్రీపాలుం, డొక్కఁడ పొలియించె నీరణోత్సాహమునన్.
విరా. 8-280

**ఈరసము** వై. వి. (సం. ఈర్ష్యా)

1. ఓర్వలేకపోవుట, అసహనము.

గీ. బుద్ధిమంతుల వలన దుర్బుద్ధు లధికు,వలన హీనులు రూపసివలనఁ
గొనటి,వా రసూయలు సేయుదు రీరసమున, నింత యెఱుఁగంగ
వలవదే యీవు కొడుక. శాంతి. 8-70

2. ద్వేషము, పగ.

క. పెక్కండ్రతోడ నీరస, మొక్కతఱిన కొనక తఱిగియున్న పగ

తుతో, నుక్కాఁడి బంధుభావముఁ, దక్కటి వగలు యొసవలయుఁ
దా నెఱపంగన్. శాంతి. 3-25

క. ఆరాజకుమారుల మతి,నీరసము జనించునట్లు లెక్కఁడి జనకుఁ డేరికి
నేనియుఁ బుట్టిన, వారిం దోఁబుట్టువులుగ వల్వం జనునే.
అను. 1-296; ఉద్యో. 3-333

3. కోపము.

ఉ. ....సారథి...హితం బెఱిఁగించుట నీతిగాన నీ, వీరసమెత్తినోఁ
బలికి తేనియుఁ జెప్పుదు సూతనందనా. కర్ణ. 2-52

4. చలము, పట్టుదల, మాత్సర్యము.

సీ. ...అమ్మేది,నీశ్వరునితోఁ గర్ణుఁడిట్టు లనియె, నాకుఁ గృత్యంబు
లనేకముల్ గలిగె ము, న్నాధనంజయునకు నట్లకాన, యీరసం
బున మాకు నిద్దఱు కొండొరు విడువక పెనఁగఁ జొప్పడదు యింకఁ
...దలపడి పోరుదు మలవుఁ జలము నుల్లసిల్ల. కర్ణ. 1-229

ఈరసమెత్తు అ. క్రి.

1. అసూయ వహించు, ఈర్ష్యపట్టు.

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న నె,వ్వారికిఁ
బోలదే సుజనవత్సల నీవిటు లంట వారు మ, మ్మీరసమెత్తి కీడ్పఁ
అచి యింతలుచేసినదాన నీ మదిం, గూరిన నొవ్వునొంపునను
గోపము పెంపునఁ గాదె యీరయన్. ఉద్యో 3-74

2. కోపించు, ద్వేషము పూను.

ఆ. గురుఁడవై సమగ్రకోదండ విద్యామ,హత్త్వ మిచ్చినాఁడ వలుగఁ
దగునె, కారణంబు లేక యీరసమెత్తి యిట్లనినఁ బరశురాముఁ
డాగ్రహమున. ఉద్యో. 4-306

3. పట్టుదల పట్టు, చలము వహించు.

ఉ. ...దు,ర్వారత నీ పదంబుగొను వాంఛ నవశ్యముఁగాన యింత
లో, నీరసమెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమోన్నతిన్.
అర. 5-218

**ఈరెలుఁగు** దే. వి.

హీనస్వరము, అల్పస్వరము.

క. కారణ మెయ్యదియగునొకో, వీరల దురవస్థ కనుచు వెలుఁగం

దెడు నా, ఘోరమగుఁడు సభయును విన, నీరెలుఁగు దలంకఁ బల్కి

రిట్లని గోవుల్. విరా. 3—185

**ఈరితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రేరేపింపఁబడినది.

ఉ. ...ఇద్దఱ భూరిభుజారవంబు న, య్యిద్దఱ ముష్టిఘాత జనితేరిత

దారుణ నిస్వనంబు. ఆది. 6—297

**ఈరు**[1] దే. విణ.

అల్పము, హీనము.

ఈరెలుఁగు. విరా. 3—185

**ఈరు**[2] సర్వ.

రెండు శబ్దమునకు వృత్తిలో అజాది సంఖ్యావాచకము పరంబగునపుడు

ఆదేశముగా వచ్చునది.

ఈరేడు. విరా. 4—219; కర్ణ. 2—168

ఈరైదు. శల్య. 1—226

**ఈరు**[3] సర్వ.

'ఈవు'నకు బహువచన రూపము.

క. ...విపన్నుల, యెడఁ గృపసేయుటయు లెస్స యీరలుగకుఁడీ.

విరా. 5—128

**ఈరు**[4] క్రి.

ఇచ్చు ధాతువునకు మహన్మహత్యర్థకమున వచ్చు వ్యతిరేకార్థక బహు

వచన రూపము.

ఉ. ...తండ్రి పొలీరని తెఱవునేసి పయినెత్తిన నెత్తిరిగాక.

ఉద్యో. 1—341; అశ్వ. 2—188

**ఈరువు** దే. వి.

ఎఱచి, మాంసము.

ఆ. నీవుఁ గొడుకు వారి నెటి లేక పటిచితి, రదియ చాలు నుచితమైన పాలు, పంచి యిండు పిల్లి వెట్టిన యారువు, సేసియున్న నేల చెల్ల నేర్చు. ఉద్యో. 2-25

(క. పాల యారు వెఱచి నంజుడు, పాలసన నివి పరఁగు మాంసమునకు మహాభా. ఆం. సం. వి. 18- పిల్లి తననోటఁ గఱచిన మాంసమును చావునకైనను తెగించునుగాని తినువేఱకు వదలదు. అట్లే దుర్యోధనుఁడు మొండిపట్టు పట్టియున్నాఁడని భావము.)

ఈరేడు సర్వ. (√ఈరు²)

పదునాల్గు.

తే. ఏను విల్లందుకొన్న నీరేడు భువనములును వడవడ వడఁకు. విరా. 4-219; కర్ణ. 2-168

ఈరైదు సర్వ. (√ఈరు²)

పది.

మ. ...ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్ర నాయకుపై. శల్య. 1-226

ఈర్ష్య సం. వి. ఆ. (స్త్రీ).

అసూయ, ఓర్వలేమి.

క. చెలులుం జుట్టలు సంబంధులు ఋత్విజులును బురోహితులుఁ దగు పౌత్రతంత్రులు హింసాక్రోధేర్ష్యాదులు లేని జనంబులైన దురిత విదూరా. అను. 2-162

2. ఈసు, స్పర్ధ, ద్వేషము.

వ. ...లోభంబును గ్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింపవలయు. ద్రోణ. 2-175

ఈఱతాఱ దే. విణ.

1. తాఱుమాఱైనది, వక్రము.

తే. వంకయైన తలంపెల్ల వసుమతీశ, యరయ మృత్యుపదంబగు నార్జవాన్వితంబు బ్రహ్మపదంబింత తథ్యమేల, యీఱతాఱ తలంపులు దీఱువాఱ. అశ్వ. 1-108

2. పరుషము, కఠినము.

తే. చేఱుకోలల ప్రేటుల నీఱతాఱ, యదలువుల వాహనంబులు సెదరిపఱచె. ద్రోణ. 3-48

**ఈఱతాఱలు** దే. విణ.

తాఱుమాఱైనది, వక్రము.

తే. బహు విధంబులఁ బలుకు నాపలుకులెల్ల, జీఁదకనువడి తన పెద చెవులఁబెట్టి, యీఱతాఱలు మఱుమాటలిచ్చి యపహసించె: దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల. ఉద్యో. 4-76

**ఈఱమి** దే. వి.

తీఁగెలు, ఆకులు మొదలగు వాని గుంపు.

వ. ...అమ్మడువునఱుత నొక్కపఱవు గల పొద యీఱమిందూఱి పొంచియుండితి. కల్య. 2-46

**ఈలకఱచు; ఈలగఱచు** దే. అ. క్రి.

ప్రాణములు బిగఁబట్టు.

క. పొడవునకు నెగసి యెప్పటి, పడమటిదెస నిగిడి పెలుచఁబఱచినఁ గూడం, గడు రయమునఁ జని యంచం, గడవంగా కీల కఱచి కాకము పాఱున్. కర్ణ 2-68

వ. నిలువందగు నెలవగుట నసము డింపక యీలగఱచుకొనియున్న వాఁడ. ద్రోణ. 2-104

**ఈలుకఱచు; ఈలుగఱచు**

పాఠాంతరములు. చూ. ఈలకఱచు.

**ఈలువు**

పాఠాంతరము. చూ. ఈరువు.

**ఈలువు** దే. వి.

పాతివ్రత్యము. చూ. ఈలువుటాలు.

**ఈలువుటాలు** దే. వి. బొ. (ఈలువు + ఆలు)

పతివ్రత, సాధ్వి.

సీ. అమరుల యీలువు టాండ్రను జెఱపటిది. ఆర. 7-61

ఈల్గు దే. అ. క్రి.

చచ్చు, మరణించు.

క. సుతుఁడీల్గిన మద్రమహీ,పతి శోకక్రోధవేగ భరితాత్మకుఁడై. శల్య. 1-166

ఉ. అమ్మెయి సూతుఁ డీల్గుటయు నగ్గలికన్. ద్రోణ. 1-180

ఈవి దే. వి. (√ఇచ్చు)

ఇచ్చుట, దానము, ఈగి.

ఉ. ఎందు నపాత్రవుటీవి యొప్పునే. కర్ణ. 2-38

ఈవు దే. సర్వ.

నీవు.

('నీవు'లో ఆద్యక్షరము లోపించిన రూపము)

చ ...పా,మెనసిన తోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజ ముల్. శాంతి. 5-189; విరా. 4-88

ఈశానుఁడు సం. వి. అ. పుం.

1. శివుఁడు.

వ. తనకు నరణ్యంబున నయ్యీశానుఁ డిచ్చిన వరంబును. ద్రోణ. 2-376

క. ఈ,శానుఁడు నభవుఁడు నమృతుఁడు,నైన శివుని నీవు గొలువు మర్జున యెపుడున్. శాంతి. 6-456

2 నారాయణుఁడు. (ఈశనశీలుఁడు - ఈశనము = ఐశ్వర్యము)

ఆ. ...ఆత్మవేద్యు నీశాను న,వ్యయుఁ దపఃఫలాత్ము నాశ్రయింతు.

వ. అని మఱియు ననేక ప్రకారంబుల నప్పరమ ముని యప్పుడు భావంబున నెలకొన్న నారాయణుం బ్రస్తుతించి. శాంత. 6-415; 416

ఈశుఁడు సం. వి. అ. పుం.

1. ప్రభువు, రాజు.

తే. మేదినీశుండు హర్ష, నిర్భరాత్మకుఁడై. విరా. 3-152

2. శివుఁడు.

(శివుఁడు పార్వతితో) క. ఈశుఁడ, సనాతనుఁడ, నవ్యయుండ, సత్యాత్ముండన్. అను. 5-366; భీష్మ. 3-79

3. ఉపమ్మవులలో నొకడు.

వ. దేవతలయందుఁ గొన్గోద ఉప్మవు లయిన మహాభాగులం బిశ్రుత్వ నిర్దేశంబున నేర్పరించె నవ్వివరించి వివరించిన నామంబులు సెప్పెద వినుము బలుండు...భవుం డీశుండు...ప్రజుండు. అను. 3-192

**ఈశ్వరి** సం. వి. ఈ. స్త్రీ.

1. ప్రభ్విణి.

ఈ విశ్వంబునకు నీశ్వరివి. ద్రోణ 2-175

2. పార్వతి.

ఈశ్వరుం డీశ్వరితో నిట్లనియె. అను. 5-110

**ఈశ్వరము** సం. వి. అ. న.

ఒక తత్త్వము.

వ. శ్రుతిపురుషు నమృతార్థతత్త్వం బనియు బ్రహ్మం బనియు నిర్దేశించి -తే- అన్ని తత్త్వంబులకు నమృతార్థ తత్వ,మెక్కు డది యీశ్వరంబు ననీశ్వరంబు, సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ గనిన మృత్యుజాలము చిక్కు గడవవచ్చు. అను. 4-188

**ఈశ్వరుఁడు** సం. విశే. (అ. ఆ. అ. స్త్రీ లింగమున ఈకారాంతమును)

1. ప్రభువు, రాజు.

క. విరటు బలంబు ద్రిగర్తేశ్వరు బలముం జెంఁగ నార్చి వడిఁ దాఁకె. విరా. 3-158

వి. అ. పుం.

1. శంకరుఁడు.

ఉ. ఖాండవమేర్చె దేవతలు గానని యీశ్వరుఁ గ్గాంచె. విరా. 1-85

వ. అన్ని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో నిట్లనియె. అను. 5-110

2. భర్త, మగఁడు.

వ. ...ఆ లక్ష్మీశ్వరుండు దన దివ్యరూపంబు సూపె భీష్మ. 1-210

3 అంతర్యామి, భగవంతుఁడు, నారాయణుఁడు.

తే. అచలు సూక్ష్ము వరేణ్యు సహస్రశీర్షు, నభయకారి నశీర్షు నారా
యణుని సనాతను యోగమూర్తి లోకాతిరిక్తు, ధ్రువుని నీశ్వరు
వారిభక్తితోడఁ గొలుతు శాంతి 4-217

4 దండదేవుని పేరు.

ఆ. పురుషుఁ డీశ్వరుండు జీవుండు ప్రాణుఁ డక్షయుండు క్షత్త్వ మనఁగ
వేదు పేరు లష్టమంబు ప్రజాపతి యనఁ బరఁగు దండదేవు పేరు.
శాంతి. 3-114

5. రుద్రులలో నొకఁడు.

వ. దేవతలయందుఁ గొంద ఱుద్రులయిన మహాభాగులం బితృత్వ
నిర్దేశంబున నేర్పరించె నవ్విరించిన నామంబులు సెప్పెద వినుము
బలుఁడు...నప్త యీశ్వరుండు...వరి వీరలు భాగార్హులు.
అను. 3-192

6. క్రోధగణాంశభవుఁడు.

వ. ...క్రోధవశగణంబు వలన మద్రక...మతి మదీశ్వరాదు లనేకలు
పుట్టిరి. ఆది. 3-80

ఈను వై. వి. (సం. ఈర్ష్య)

1. ఓర్వలేమి, అసహనము.

చ. ...విను చెప్పెద మీసు గలంక పోరితర, బనునవి మత్సరంబు గల
యట్టి మనంబునఁ బుట్టు. శాంతి. 6-241

2. కోపము.

క. ...దుర్యోధనుఁడవగ్రహ నీయెడ నీసున మాటలు వలుకవలసె నూత
మామా. ఉద్యో. 4-247; శాంతి 1-18

వ. అంతఁ బంక్తివదనుండు నిబిడజ్వాలజాలను శూలంబు రాఘవు
మీఁదం బ్రయోగించిన నతండును దానిఁ దునియలు సేసిన నీసునం.

బెరిగి సురవైరి మఱియునుం దరతరంబ తోమరంబులు శరంబు లుం బఱఁగించి. అర. 7-149

శ్లో. తతః క్రుద్ధస్స సర్జాతు దశగ్రీవశ్శితామ్ శరాన్.
సం. భా. అర. 289-22

3. ద్వేషము, పగ.

సీ. ...శల్యుఁ డతిరథుండు -ఆ- వాసుదేవునితోడి యీసువా డల్లుర విడిచె. ఉద్యో. 4-221; శాంతి. 1-18

శ్లో. స్పర్ధతే వాసుదేవేన నిత్యం రూో వై రణే రణే.
సం. భా. ఉద్యో. 164-27

క. వాసవుఁడును నవ్విభుతెడ, నీసు గలిగి తన్ను మిగుల నీనని తచ్చిం, తాసక్తుండై మంత్రి ని,వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా ...చ...విరోధము దక్కి యధ్వరం,మున కిటువచ్చి దైవత విభుండు. అశ్వ. 1-94-95

4. మాత్సర్యము, చలము.

తే. అనిన గాంధారి కిట్లను జనవిభుండు, నీతనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ డుద్ధతుం డీసు మానినా బుద్ధి వినఁడు, వీఁడు నెఱుఁ గాని బ్రదుకంగలేఁడు సుమ్ము.
ఉద్యో. 2-329; ద్రోణ. 3-68; అశ్వ. 1-14

5. నింద.

క. అనయము నీసు వొనర్చిన, విని యతనికి నిట్టులనియె వృత్రుఁడు విజయంబునకు నయి తపము సేయనె. శాంతి. 5-403

6. దుగ్ధ, విచారము.

క. ఈ రెంటియందు నరసియు, సారం బిది గాఢసార సహితం బిదినా, నేరవఱయు నదియను గా,కేరూపం బయ్యెనేని నీసేమిటికిన్.
ఉద్యో. 1-357

ఈహా సం. వి. ఆ. స్త్రీ.
కోరిక, వాంఛ.

క. ...గాధాహంకార మమత్వము, లిహఁ బెనువఁ బ్రకృతులుఁ బురుషుఁ డే
నను చుండున్. శాంతి. 6-154; అశ్వ. 1-199

-ఈహితము సం. విణ. (అ. ఆ. అ.)
కోరఁబడినది.

ఉ. మీఁదయెడ చింతవాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి.
ఆశ్ర. 2-82

క. ఈహిత విధానములలో, కాహిత దుస్సహానతేజుఁ డయి వాఁడు.
సభా. 1-154



ఉ[1]

1. హలంత సంస్కృత శబ్దములు తత్సమములగునపు డంతాగమముగా వచ్చు వర్ణము— వాక్-వాకు, దిక్-దిక్కు

క. వాకును మనసును గాయము, నేకాయనవృత్తి శౌచమెదలని
తపముం, జేకొనునది. శాంతి. 4-333

వ. యోగ్యస్థల నిరూపణంబునకు దిక్కులుం బరికించి. విరా. 1-161

2. మహద్వాచకములగు బల్లిదాదుల యొక్కయు పెక్కు పుంలింగ మహద్వాచక తత్సమ శబ్దముల యొక్కయు తుది అకారమున కాదేశముగా వచ్చును: బల్లిదుఁడు, రాముఁడు.

తే. పరశురాముని గెలిచిన బల్లిదుండు, భీష్ముఁడు. ఉద్యో. 2-209

క. విరటుఁడుఁ బాంచాలుఁడును, హరియును, రాముండు వారి
యనుజ తనూజుల్. ఉద్యో. 1-5

3. నామములు తుది ఇకారమునకు బహువచనము పరంబగునపుడు ఆదేశముగా వచ్చును: హారులు, విరులు.

ఆ. హారుల పేషితములు నమకూళ్ళ వాయు సతి, ఘారములతో. విరా. 4-188

తే. వేడి నిట్టూర్పు యనా ఁబడెలేఁ గ్రొత్త, తావి నూతులు విచ్చు నెత్తమ్మి విరుల. విరా. 2-286

4. ఇకారాంతములగు తెలుఁగు శబ్దముల యుపోత్తమేత్వమునకు బహువచనమున ఆదేశముగా వచ్చును. (ఉపోత్తము = రెండి కెక్కువైన వానిలోఁ గడపటి దానికి ముందున్న యక్షరము) ములికి, ములుకులు.

ఆ. ఎఱుకు నమ్ము నుఱక యేసిన ములుకులు. అర. 1-314

(పందిరులు - వాకిళులు మొదలగు కొన్నిటికి రావు)

ఆ. ఏను వేఁదు అగుడు వాని నెవ్వేరుఱ, పట్టఁ జదురు గలదె భ్రాంతి దొలఁగి, యొంటికంబ మొప్పు నింటివాకిళులు దొ,మ్మిదియు నెఱయ మూసి నిదురవోదు. శాంతి. 4-17

5. ప్రేరణార్థమున వచ్చు 'చు', 'పు' వర్ణములు పరమగునపుడు ధాతువులలోని ఇకారమున కాదేశముగా వచ్చును: తెలియు, తెలుపు.

క. మఱచినఁ దలఁపింపఁగనగు, నెఱుఁగని నాఁడెల్ల పాట నెఱిఁగింపనగున్, మఱి యెఱిఁగియెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే. ఆది. 4-71

6. కృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని యువర్ణాంత ధాతువుల తుది ఇకారమునకు ఆదేశముగా వచ్చును. కినియు-కినుక, కినుపు; బలియు-బలుపు; ముదియు-ముదుక, ముదుకఁడు.

క. ఒదవెడు కినుకం గడు బెట్టిదముగఁ బెనఁగిరి. విరా. 2-348

క. అరుల కినుపడఁచి బ్రదుకవలయు. ద్రోణ. 4-248

ఆ. ముష్టిబలుపు నెఱియ ముక్కున వాతను, నెత్తురొలుక మల్లు నెత్తి వైచె. (బలువు అని పాఠాం) విరా. 2-17

చ. ముదుకఁడనైన నాదు బలముం బలమున్. ఉద్యో. 4-246

ఉ[2] అవ్య. ద్రు.

(ఉదంతేతరములకు పరమగునపుడు దీనికి నిత్యముగా యడాగమము వచ్చును. ఒకానొకచో నిందలి ద్రుతము మాత్రము మిగిలి ఉకార లోపము జరుగును. 'ను' సముచ్చయార్థకమనియు, ఉకారేతరములమీఁద 'యు' వర్ణపూర్వకముగా వచ్చుననియు ఆ 'యు' వర్ణము ఒకానొకచో లోపించుననియు పూర్వలాక్షణికుల మతము సూ. ఆ. ని)

1. అపిశబ్దార్థమును దెలుపును.

(క) సముచ్చయార్థమును దెలుపును.

మ. కవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ గావ్యయవు భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతియున్ భారత శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవ మున్ సంతత దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

ఆది. 1-12

మ. ...భూవర మున్నిట్టివి నూడరున్ వినరు సెవ్వారుం ద్రిలోకంబులన్.

ద్రోణ. 3-162

(గ) విరోధమును దెలుపును (కూడ, నయితము, అయినప్పటికి, మున్నగు వాని యర్థముల నిచ్చును.)

క. ఎట్టి విశిష్ట కులంబునఁ బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్, గట్టిన కర్మఫలంబులు నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్.

ఆది. 5-58

సీ. ...వారలిగినఁ బెడుదు రయ్యమరులైన, నట్టివీరుల పోరి కగపడియుండియు నేమియుఁగాకై తి రీవుఁ బాండు -గీ- తనయులందఱు నీ కూర్మితమ్ములేదును. (అగపడియుండియు = అగ్గమైయుండి కూడ)

స్త్రీ. 2-155

2. కిమర్థకోము గు ఏ, ఏవఁడు, ఎప్పుడు మున్నగు పదములకును, ఒకఁడు మున్నగు కొన్ని పదములకును అనుప్రయుక్తమై సర్వార్థము నిచ్చును. (అప్పుడు వ్యతిరేకార్థక క్రియలతోడనే సంబంధించి యుండును.)

ఉ. ...చిచ్చొదింగట్టిన యట్లు...దీనికి నాఖు సెన్నఁడున్, బుట్టదు.

ఉద్యో. 3-118

క పాండవుల వలని కీడ్కొక్కండును లే దధిప నీయకౌరవులు ధర,ణీ మండలమంతయు బ్రమింగిరి. పాండున్నృపతి భాగమునకుఁ బాపిరి వారిన్. స్త్రీ. 1-88

3. ఆనంతర్యము ను దెలుపును.

చ. అనుటయుఁ జిన్నినవ్వు నగి యంబుజనాభుఁడు పల్కె నెన్నఁడున్. విన నివి భీముపాలఁ గడవింతలు వింటిమి మాటలు. ఉద్యో 3-52

4 వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.

సీ. విషయ భోగాభిలషణ మింకిను నాకు వదలక పెరుఁగుచున్న దయుఁ గాన ఆది. 3-95

ఉ$_3$ ప్ర.

కొన్ని ధాతువులపై వచ్చు కృత్ప్రత్యయము.

ఒప్పు + ఉ = ఒప్పు; పలుకు + ఉ = పలుకు.

తే. తాను జొచ్చిన కతన మత్స్యక్షితీశు,నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్లవల్లఁ బాండు రాజతనూభవవల్లి యరిగె. విరా. 1-308

క. అనవుడు నప్పలుకులు విని విరా. 1-55

ఉంకించు దే. స. క్రి.

యత్నించు, పూను.

(ద్రౌపది) సీ లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు లడర నుంకించిన నాఁగి యాఁగి. విరా. 3-55

తే. (దుర్యోధనుఁడు) రక్తసంసిక్తమైన ధరాతలమున, నార్తిఁ బొరలుచు నూర్పు లందంద సంద,డింప జీవంబు వెడల నుంకింపఁ జేష్ట, లొయ్యనొయ్యన యడఁగంగమున్న యధిపు. సౌప్తి. 1-213

ఉంకువ దే. వి.

కన్యార్థము మామకుఁగాని కన్యకకుఁగాని యిచ్చు ద్రవ్యము, కన్యాశుల్కము, ఓలి.

సీ. అతని కీవొల్ల కప్పతి దన కూఁతున, కుంకువగాఁ జెప్పె నొక్క కర్జ

-తే- మసితమై తెలుపారెడు హారులు వేయి. అన. 1-104

వ. (గాధి)...అచ్చెరువును సంతోషంబును శాపభయంబును ముప్పిరి గొనం దన పుత్త్రికి నుంకువగా నియ్యకొని. అను 1-106

**ఉంకువు** దే. వి.

ఉంకువ, కన్యార్థము మామకుఁగాని, భర్తకుఁగాని కన్యకకుగాని యిచ్చు ద్రవ్యాదికము, కన్యాశుల్కము, ఓలి.

వ. అపత్యార్థియై యిక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్యయగుట పుత్త్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి. ఉద్యో. 3-316

తే. ఈలతాంగికి నుంకు వి ట్లిఁగనోపు,దేని. అది. 8-144

సీ. ఇట్టి గుఱ్ఱములు యిక్కన్య కుంకు వి,ట్లినోపుదేని. అర. 182

(చివరి రెండును 'ఉంకువ' అని న. వ. ప్రకోశము. రెండవదియైన ఆది. 8-144 'ఉంకువ'గా సూ. అ. ని. మొదటి యుదాహరణమైన 'ఉంకువు' ఆనంద, అకాడమి, సం.ము మొ. వానియందుఁ బాఠములుగా నుండఁగాఁ బాఠాంతరము గూడ లేకుండ నుండఁగా సూ. అ. ని. 'ఉంకువు' పదమేలకో ఈయలేదు.)

**ఉంగిడి** దే. వి.

పశువులకుఁ గణుపువేయని జొన్న మొదలగునవి తినిన వచ్చు కంఠరోగము

వ. ఉంగిడి యదురుఁద్రిక్క యనువానికి నాపేరు సెప్పినం జాలు. విరా. 1-286

**ఉంచు** దే. స. క్రి. (√ఉండు)

ఉండునట్లు చేయు, ఉనుచు, ఉన్చు.

1. కూర్చుండఁబెట్టు.

చ. ...ర,త్నరుచిర కాంచనాసనమునం దగ నుంచి. శాంతి. 6-266; అర. 1-355

2. దాఁచిపెట్టు.

ఉ. వైరి వినాశన క్రియకు వాసవుఁ డిచ్చిననుంచియున్న యా,ఘో

రవు శక్తి. చూ. ఉనుచు. ద్రోణ. 5-229

**ఉంఛవృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

క్షేత్రాది స్థానములందు రాలిన గింజలను ఏఱుకొని తిని బ్రదుకుట.

సీ. ...ఒక మహాద్విజుఁ డుంఛ వృత్తిమై నుండు. అశ్వ. 4-220

వ. ...కురుక్షేత్రంబున వసియించి యుంఛవృత్తి పరాయణుండై ఆర. 6-115

సం. విశ. (ఇ)

ఉంఛముచే బ్రదుకువాఁడు (ఉంఛము = క్షేత్రాది స్థానములయందు రాలిన గింజలను జీవనార్థమై ఏఱుకొనుట.)

వ. ...తత్సమీపంబున నొక్క శుష్కశవంబు నవలోకించి యిది యుంచవృత్తియైన మానవు కళేబరంబు గావలయు ననుచు. కవిరా. 1-180

**ఉంటు** దే. వి. (√ఉండు)

ఉండుట.

ఉ. ఉంటుతనంబు మాటలకుఁ జాలకు పాండునృపాలు పాలు గై, కొంటయ చాలు నన్న నృపకుంజరు పల్కుల కడ్డమాడరాకుంట యెఱుంగవే మును. ఉద్యో. 3-58

**ఉండి** అవ్య. (√ఉండు)

1. ఉండు ధాతువునకు క్త్వార్థకరూపము.

వ అయ్యింతి యింత సేపు నీ చేరువ నుండి యిప్పుడెట మెలఁగె. విరా. 2-81

2. అపాదానార్థమందు (ఎడఁబాటును దెలుపునప్పుడు) వచ్చిన 'వలన' కున, దానికి వికల్పముగా నాదేశమగు ద్వితీయాసప్తములకును అనుప్రయుక్తమగును.

ఆ. విష్ణువలనఁ ద్రిపుర విజయు మౌళివలన, నుండి హిమనగమున నొలసె గంగ. అను. 2-118

క. ...వనజాయత నేత్ర కడకు వచ్చెను గగనంబున నుండి కమల మిత్రుఁడు, తనశీవ్ర కరత్వ ముడిగి తరుణద్యుతితోన్. ఆది. 5-20

3. ప్రభృతి (మొదలుకొని) అను నర్థమును దెలుపును.

వ. పాండునందనులు పుట్టినంత నుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు. (పుట్టినంత నుండి = పుట్టినది మొదలు)
శల్య. 2-328; విరా. 5-113; ఉద్యో. 1-31

**ఉండు** దే. అ. క్రి.

ఉండురు, ఉండ్రు, ఉంటివి, ఉండిరి, ఉన్నను, ఉన్నది, ఉన్నెఁ, ఉన్నే మొదలగు రూపము లాయాతావుల గ్రహించునది.

టి. (ఇది సంస్కృతమునందలి 'భూ' ధాతువు వంటిది.)

1. సత్తను (స్థితిని) తెలుపును.

క. ...కడవఁ బోవక యుండం, బోవలయు నడపడియెడు, దీపస మెదఁగలిగెనేని దేవర కడకున్. విరా. 3-137

వ. ...పరమ బ్రహ్మణ్యులైన పాండవులును బ్రాహ్మణ సమూహంబులో నుండి పాంచాలరాజు సమృద్ధినిం జూచి సంతసిల్లిరి.
ఆది. 7-166; సభా. 1-31

2. కలుగు, సంభవించు.

ఉ. కావున నన్నదానమునఁ గాకెటులుండు మహాప్రమోదము.
అను. 4-358

3. ప్రవర్తిల్లు.

తరలము :- నేను భార్యయు దారుణాటవిఁ గ్రామభోగరతి నుండితి మిష్టచారిమృగవ్రజంబుల పొత్తునన్. ఆది. 5-51

వ. పురుషుని వలన నివియెల్లనుం గలుగుఁ బురుషుం డింతకు నధిష్ఠాతయై యుండు. శాంతి. 6-41; సభా. 1-31

4. కాలము గడపు.

ఉ. మత్పాద నిరంతరస్మరణ తత్పరభావము కల్మినాత్మన, మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గ్రోలియాడుచు నుండుదెప్పుడున్.
విరా. 1-1

5. నివసించు.

తే. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని వేడుకకుఁ దగఁ బెనఁగుడు.
విరా. 2-13

6. జీవించు.

క. దేవతలకైన వొక్కొక, చో వలయున కాదె శత్రుసూదన విధి
కాలావాప్తికి మును దమసద్భావము లడంచి యొదుగఁబడి
యుండంగన్. విరా. 1-58

తే. ఇంద్రులెందఱువో రింద్రువేల బ్రహ్మలుండుదురె తఱితోఁదెగు
చున్నవారుగాక. శాంతి. 4-486; ఆది. 4-221; భీష్మ. 1-195

7. పరుండు.

వ. ఇట్లు వొచ్చి తఱియంజని మధ్య ప్రదేశంబున విరాటనందన లీలా
పర్యంకంబరసికని దాని కనతిరూపంబునం బాంచాలి నోసరిల
నునిచి తానాతల్పంబున నుండె నంతం గీచకుండు. విరా. 2-328

శ్లో. శయానం శయనే తత్ర సూతపుత్రః పరామృశత్.
సం. భా. విరా. 22-484

8. కూర్చుండు.

ఉ. (అర్జునుఁడు)...ఆఖండలుఁడున్న గద్దియ సగంబున నుండె.
విరా. 1—85

9. ఆఁగు, నిలుచు.

వ. ఇక్ష్వాకువంశ్యపుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద
నా వచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని.
ఆది. 4-24

చ. వలయు నమాత్యులం దగినవారల నుండఁగ బంచి ధారుణీతల
విభుఁడొక్కరుండ చని. ఆది 4-25

10. తప్పు, తొలఁగు, మాను.

ఉ. ...అట్లగుటఁజేసి పురంబున వారికెప్పుడుం, గానెటులుండు నిట్టి
యవగాఢపుబొత్తు తునంగవచ్చునే. విరా. 3-82

11. కనఁబడు, తోఁచు.

సీ. రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చు నద్రులు, భయమున వాపోవు భంగి నుండ. విరా. 3-156

12. ఊరకుండు.

సీ. ...వీఁడు విజయుఁ -అ- డొక్కొ యనుచు సంశయోపేత చిత్తవై యుండియుండ నోప కొక్కనాఁడు. ఆది. 8—185

13. తలఁచు, అనుకొను.

వ. ...ధనువునకు బాణంబులకు వైకల్యంబు వాటిల్లినయెడం బర వీర ప్రహరణంబునకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మేలని యుండుదు నా తలంపెట్టిదియో తెలిసికొనవలయు. శాంతి.3-441

14 శేషించు, మిగులు

క. నిన్న యఱ నచ్చిపోయిితి, వున్నయఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి యింకెటు పోయెదు. ఉద్యో. 4-341; అను. 1-82

15. తగు, ఒప్పు, తనరు.

వ. .. తొల్లి జాజాలియను మునికిఁ దులాధారుండను వణిగ్వరునితో సంవాదంబు గలిగె నది యితిహాసరూపంబుగఁ జెల్లు నేతద్విషయం బయి యుండు దానిం జెప్పెద నాకర్ణింపుము. శాంతి. 5-229

వ. ...అది భవత్ప్రశ్నంబునకు నుత్తరంబై యుండు. శాంతి. 5-346

16. కొన్ని ధాతు జన్యములగు అవ్యయములకు అనుప్రయుక్తమగును.

ఉ. ఇంతకుఁబోరికి వచ్చుచుండుదురు. ఉద్యో 8—234

క. ...ఒండొరులతో నెప్పగఁ బోడిముండుదురు. శాంతి. 4-111

వ. రాజులెల్లం బ్రతివత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు. ఆది. 3-24

17. కొన్నియెడల తుమున్నంతములకు అనుప్రయుక్తమై భవిష్యదర్థము సూచించును.

క. ...నను ధర యేలింపఁగ నున్నారరు. ద్రోణ. 5-111

18. కొన్ని యెడల తుమున్నంతములకు అనుప్రయుక్తమై 'సిద్ధమగు', 'అభిముఖముగానుండు' అను నర్థ మిచ్చును.

తరువోజ :- ఇది యిట్టిదారుణ మిమ్మొయిఁజేయఁగా నున్న విధి యేల కడవంగనిచ్చు. ఆది. 6-247

ఆ. స్వజనములును దాను భుజియింపనుండి యా,నక్తునతిథికిచ్చెఁ జసదె పొగడ. అశ్వ. 4-259

ఉంటి. స్త్రీ. 2-34; ఉంటివి. కర్ణ. 2-112; ఉంతు ఆశ్వ. 2-57;

ఉందును శాంతి. 3-441; ఉందుము ద్రోణ. 1-220;

ఉందరు ఆశ్ర. 1-8; ఉన్నది విరా. 4-75;

ఉన్నె విరా. 2-27; సభా. 1-55; ఉన్నే విరా. 4-107;

ఉన్నాడు శల్య. 1-568; ఉన్నాఁడు అను. 5-118;

ఉన్నారము ఉద్యో. 1-276; ఉన్నారరు ద్రోణ. 5-111;

ఉన్నారలు ద్రోణ. 2-264; ఉన్నారు విరా. 3-138; ఉద్యో. 1-259;

ఉన్నవాఁడు విరా. 1-185; అర. 1-374;

ఉన్నవారు ఉద్యో. 2-284; అర. 2-145;

ఉన్నవారము శల్య. 2-172; ఉన్నవారలు ఉద్యో. 2-288;

ఉన్నవి స్త్రీ. 2—20; ఉన్నావు (విచార్యము)

ఉన్న విరా. 2-47; ద్రోణ. 2-128;

ఉన్నయది ఆది 2-144; విరా. 4-177;

ఉన్నయవి సభా. 1-183; ఉద్యో. 2-15;

ఉండెదు ఆది. 8-149; ఉండెదునని ఆది. 6-159;

ఉండెద ఆది. 6-286; ఉండెదము అర. 1-17;

ఉండెదు అర. 3-244.

**ఉక్కడంచు** దే. స. క్రి.

1. అవమానపఱచు.

సీ. పౌలపంబు మెఱసి దిక్కులఁ గాంతి పూరించు క్రొక్కారు మెఱుపుల నుక్కడంచి. విరా. 2-88

2. చంపు

ఇక్కర్ణు నుక్కడంచి యక్కుంతి సంభవు సంరంభంబు వారించెద. ద్రోణ. 5-197

శ్లో. అహ మేవం వధిష్యామి మామ్ వైష మధుసూదన. సం. భా. ద్రోణ. 174-35

**ఉక్కడఁగించు** దే. స. క్రి.

సంహారించు, చంపు

ఉ. ...ఇట్టియం, దక్కట భీముఁడైన మన యర్జునుఁడైనను మాద్రిపుత్రులం, దొక్కరుఁడైన నీఁగఱ నుక్కడఁగింపరె యొక్క ద్రవేల్మిడిన్. ఉద్యో. 1-287

**ఉక్కడఁగు; ఉక్కడంగు** దే. అ. క్రి.

1. దుర్బలమగు, నిస్సత్త్వమగు.

తే. వారలందఱు నొండొరుఁ బేరువేరఁ, బిలిచికొని వీఁడె చనుదెంచె భీముఁ డీశఁ,డొంటి యగపడ్డచోటన యుక్కడంగఁ, బొదివి చంపుదము. భీష్మ. 2-357

2. విహ్వలించు.

చ. అవనితలంబు వ్రస్సెనో హిమాచల శృంగము వ్రయ్యలయ్యెనో, శ్రవణ విదారణంబయిన శబ్దము దా నిదియేమి యొక్కొ భైరవమయి విన్చె నంచును బురంబునవారు భయంబు నొందిరం, దువిదలగర్భముల్ గలఁగె నుక్కడఁగెన్ మగధేశు సైన్యముల్. సభా. 1-212

**ఉక్కఱు** దే. అ. క్రి.

1. గర్వము చెడు, మదమడఁగు.

క. పెక్కండ్ర నొక్కపోరను, నుక్కఱ భంజింతుఁ జంపు టుడుగుఁడు రాజుం, దక్కటి చూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. విరా. 1-82

క. ఉక్కటి నరపతికై సను మ్రొక్కము. ఉద్యో. 3.360

2. బలహీనమగు.

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజమగు కడిమికలిమి నరిసేనఁ గరం, బుక్కఱఁ దంత్రీపాలుం, డొక్కఁడ పాలియించె నీరణోత్సాహమునన్. విరా. 3-230

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన, న్మెఱుఁగులు గ్రమ్ము నమ్ముల వినిశ్చల ధైర్యము పేర్మి నాతఁ డు,క్కఱక పెనంగె కర్ణ. 3-304

3. గండుమీఱు

క. ఎఱుకలు గల కులశైలము, తెఱఁగు మెయిన్ రయము మెఱయ దివికి నెగసి చెట్టుఱుము జలధరము క్రియ ను,క్కటి తద్వనమెల్ల నద్రువ నార్చుచు గడిమిన్. అర. 6-345

(ఈ యర్థమిక్కడ విచార్యము. ఉక్కు + అఱులో 'అఱు'నకు అతిశయార్థము గానరాదు. 'ఉక్కు'పైన మతుబర్థకము 'అరి' చేరినదన ఇచ్చట శకటరేఫమున్నది. లఘురేఫముగాఁ దీసికొనెదమన్న శకటరేఫముతోఁ బ్రాస నడచినది.

శ్లో. స క్రోధో ఽభ్యద్రవత్సాక్షీ రావణం రాక్షసేశ్వరమ్
సం. ఖా. అర. 279-2 అని మూలము.

**ఉక్కలుఁడు** విశే.

బెట్టిదుఁడు, అసాధ్యుఁడు.

క. నలువురు పార్థుల నత్యుజ్జ్వల శరవర్షముల ముంచి జలధరము, క్రియం, బెలుచన గర్జిల్లుచు ను,క్కలుఁడయి తన విక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్. అర. 5-425

(ఉత్కల శబ్దభవమని సూ. అ. ని. 'మొక్కలుఁడు' అని కొన్ని ప్రతులు)

**ఉక్కాడు** దే అ. క్రి. (√ఉక్కు)

బలము చూపు.

క. పెక్కంద్రతోడ నీరస, మొక్కతఱిన కొనక తఱఁగియున్న పగ

తుతో, నుకాక్కడి బంధుశావముఁ, దక్కటి పగఅయెడ వలయుఁ
దా నెఱపంగన్. శాంతి. 3-25

**ఉక్కివము** దే. వి.

మోసము, కపటము, కపటకృత్యము.

క. ఎక్కువ తక్కువ మాటలు, నుక్కివములు నెందుఁ గీడు లోందిం
చుటలుం, బెక్కు తన యన్నదమ్ముల, దిక్కుల నన్నియును సైరపఁ
దేజము సేయున్. శాంతి. 2-359

ఉ. ఇట్టి కార్యమునకు నేనవశ్యంబును, నొడఁబడంగ నోప నుక్కివమున
సుతులతోడ నేలసుతులకు భేదంబు,సేయఁ గడఁగి తిరియుఁ జెట్ట
యనక. సభా. 2-180

విశే.

కపటము గలది.

క ఒకటి గలదు వత్తురు వేఁతోక గర్భంబునకు మృతులు నుక్కివ
మౌ వ్యక్కకు నేటి బుద్ధి పీనుఁగు,నకు బ్రదుకలె గలుగునట్టి
నవ్వులు గలవే. శాంతి. 3-378

**ఉక్కివుఁడు** దే. విశే.

1. ఉక్కడు, మూర్ఖుఁడు, బుద్ధిహీనుఁడు.

తే. సముచితములగు మాటలఁ జక్కఁబడక, టక్కెనే నుక్కివుండగు
ధార్తరాష్ట్రిఁ, గ్రూరశరముల నే నియ్యకోలువువాఁడ,నవని
కౌంతేయులకు నిచ్చునట్లుగాఁగ. ఉద్యో. 1-27

ఉ. అక్కట వాసుదేవు పసు పాదగణంబునఁ జేయరైరి వీ,రెక్కడి
బుద్ధిమంతులని నిందును నందును లోకమెల్లఁ బేరుక్కున బ్రమ్గు
టం దలఁపనొల్ల కపాయము సేసిరట్టె యీ, యుక్కివు లెందునుం
గలరె యొవ్వరువో ధృతరాష్ట్రినందనున్. ఉద్యో. 4-20

2. ఖలుఁడు, దుష్టుఁడు.

వ ...భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను
రక్షింపక తక్కిన నుక్కివుండగు నతని పాపనిశ్చయంబున నాపద
వచ్చు. ఉద్యో. 1—174

**ఉక్కిస** దే. వి.

దగ్గు.

క. ...వళీ, పలితంబులయ్యే వగరును, దలయేరును ముక్కిసయును దల
కొను దెంచెన్. ఆది. 8-191

**ఉక్కిడు** దే. వి. ఉక్కివుఁడు

మూర్ఖుఁడు.

ఉ. ఉక్కిని మనంబు గీడు పరికించునె క్రొవ్విసఁ జేటు దప్పునే.
విరా. 3-7

**ఉక్కు** దే. వి.

1. ప్రతాపము, బలము.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుత సంపదనొందు శక్తులుం, జక్కని
మేనులున్ మొనకుఁజెల్వగు క్షైదువులుం దగంగ నుక్కెక్కిన
యట్టి మేటి మగ లించుక వారణలేక ఖేచరుల్, వెక్కసమంద
నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుళంగులన్. విరా. 3-168

క. చక్కనగుమనిన రక్కసుఁ,డక్కజముగఁ బెరిఁగి యియ్యయగు
నిప్పుడు నీ, యుక్కను బీరముఁ జూచెదఁ, జిక్కన నిలుమనుచుఁ
గడు విజృంభించి వడిన్. ఆది. 6-208

2. గర్వము, పొగరు, మదము.

వ. విరోధివర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ. విరా. 5-2

తే. పాండుపుత్రుల మాత్రకు భయము నాకు,నెక్కడిది వారి యుక్కు
మడఁతు. ఉద్యో. 4-116

3. పౌరుషము, పరాక్రమము.

క. ఉక్కును నస్త్రబలము మీ,కెక్కడియది పాలరైతి రిందఱు నని నీ,
వొక్కరుఁ గావఁగ మీరీ,తక్కువ కోర్చితిరి మిమ్ముఁ దక్కన
నేలా. ద్రోణ 2-266

4. అయస్సారము, కాచి శుభ్రముచేసిన యినుము.

వ. అభిమన్యుండు...అనేక యోధవీర విక్రమ సంకులంబునం, జిక్క

వడి యుక్కు మురిసినట్లు నమసి.

ద్రోణ 1-894; ఉద్యో. 2-176

**ఉక్కుతునియ** దే. వి.

ఉక్కుముక్కవంటి వాఁడు, శూరుఁడు

గీ. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు, నుక్కుతునియలుగారె
మి మ్మగ్రకుమారవరులఁ గొని యొప్పువాఁ డయి వచ్చు ధర్మ.
పుత్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు. ఉద్యో 2-176.

**ఉక్కుదక్కు** దే. అ. క్రి.

1. గర్వమడఁగు, మదమణఁగు.

వ ...విరోధి వర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ

విరా. 5-2

2. నశించు, చెడు.

ఉ. ఒప్పదె కూడి మన్కి మన కొప్పనివారల యుక్కుదక్కఁగన్.

ఉద్యో. 1-871

3. నిస్తేజనుగు, బలహీనమగు.

(భీముఁడు) అక్కుమారసప్తకంబు సమవర్తి సమీపంబున కనిచినం
దక్కటికుమారు లుక్కుదక్కి వెఱఁగుపడి యంతంత నొదిగిన

భీష్మ. 3-78

**ఉక్కుమడఁగు** దే. అ. క్రి.

1. చచ్చు, నశించు.

చ. ఉఱకవిరోధి సైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం, బఱప రథ
ద్విపాశ్వములు పాండవమధ్యము తేరి వీథి యం,దఱవఱలై పడం
గన్. విరా. 5-61

2. మదమడఁగు, గర్వము చెడు, క్రొవ్వణఁగు.

వ. కౌంతేయాగ్రజుండు సైన్యసంతాన సమేతంబుగా నురవడించి
భుజాటోపంబు సూపిన నవి (విరోధి సైన్యములు) మడిసియుఁ
జడిసియుఁ జిక్కువడియు నుక్కుమడిఁగియు వెఱఁగుపడి చూచు
చుండ. ద్రోణ. 5-92

**ఉక్కుమడఁచు** దే. స. క్రి. (√ఉక్కుమడఁగు)

1. చంపు, నాశనము చేయు.

ఆ అని నివాత కవచు లను దానవుల నాతఁ డొక్కరుండ కాఁడె యుక్కుమడఁచె. విరా. 4-210

తే (కర్ణుఁడు) పాండవపుత్రుల మాత్రకు భయము నాకు, వెక్కడిది వ్రేల్మిడిన వారి యుక్కుమడఁతు. ఉద్యో. 4-216

2. ప్రతాపమణఁగించు.

తే. నృపు లనేకులు నామీఁద నిగిడి రేను, జిక్కువఱిచెదఁ జూడుమీ యుక్కుమడిచి. భీష్మ. 3-11

**ఉక్కుమిగులు** దే. స. క్రి. (√ఉక్కు)

ప్రబలు, అతిశయిల్లు.

క. రెండు బలంబుల వారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కుమిగిలి యొండొండ కడంగుచు నుజ్జ్వల,చండస్థితి నొప్పి రపుడు జగతీనాథా. భీష్మ. 1-138

**ఉక్కుమీఱు** దే. అ. క్రి. (√ఉక్కు)

ఉక్కు మిగులు.

వ. సైంధవాది వసుంధరాపతులం జిక్కువడంజేసి యుక్కుమీఱిన మారుతియు. భీష్మ. 3-65

**ఉక్కుముట్టు** దే. స. క్రి. (√ఉక్కు)

ఉక్కు మిగులు.

సీ. ...ధృష్టకేతుండు సమర -తే- లంపటుండు శిఖండియు లావు వెరవుఁ గలరు నీయెడ ననురక్తి గలరు సాలఁ,బెంపు కల రుక్కుముట్టిన తెంపు గలరు, కోరి పతులుగఁ జేయు మక్షోహిణులకు. ఉద్యో. 4-109

**ఉక్కుమురియు** దే. అ. క్రి. (√ఉక్కు)

వ. అభిమన్యుండు.. అనేక యోధవీర విక్రమ సంకులంబునం జిక్కువడి యుక్కు మురిసినట్లు సమసిన. ద్రోణ. 1-394

**ఉక్కుమెఱయు** దే. అ. క్రి. (√ఉక్కు)

గర్వము వెలివడు, దర్పము అతిశయించు.

వ. సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కుమెఱయ నొక్కటం దాఁకిన. విరా. 5-148

**ఉక్కుసెడు** దే. అ. క్రి. (√ఉక్కు)

బలము నశించు.

వ. శిశుపాల జరాసంధ శల్య కర్ణులు దర్పితులై తమతమ లావులు మెఱసి క్రమంబున నలువురు మాష యవ ముద్గ రోమ మాత్రంబులు దక్క గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన నుక్కుసెడి వెక్కస వారలం జూచి. ఆది. 7-178

**ఉక్కెక్కు** దే. అ. క్రి. (√ఉక్కు)

బలమతిశయించు.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుతసంపద నొందు శక్తులుం, జిక్కని మేనులున్ మొనకుఁ జెల్వగు కైదువులుం దగంగ ను,క్కెక్కిన యట్టి మేటిమగ లించుక వారణలేక ఖేచరు,ల్వెక్కసమంద సొచ్చి యుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. విరా. 3-168

**ఉక్కేదు** దే. అ. క్రి.

బలము చెడు.

శా. మేనుక్కేది నీనందనుం,డెల్లం జూడఁగఁ బాటి యొండొక రథం బెక్కెం గురుగ్రామణి. కర్ణ. 1-146

**ఉక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

చెప్పఁబడినది.

వ. ఇట్లు పూర్వోక్త ప్రకారంబున. విరా. 1-178

సీ. ...సత్య,మన్నది గన్నద విన్నది యున్నరూ,పున నుక్తమగుట. అను. 5-181

**ఉక్తి** సం. వి. ఇ. (స్త్రీ).

1 పలుకు, మాట.

క చని వెడ వికసిల్లెడు నా,ననపద్మముతోడ ననిలనందనునకు నిట్ల

నియెఁ జతురోక్తిరీతి య,తని గూఢక్రోధవహ్ని దరికొల్పంగన్.
విరా. 2-270

2. వచనము.

వ. అట్లోయ లట్లు కెలన నేమటి సల్లాపంబులు సేయుచున్న యన్నర నాథుని యారథికవరుల వచనంబులు విని పూర్వాఖ్యానంబు వలన నయ్యుక్తి ప్రత్యుక్తుల పరిపాటి దేటపడిన నన్నిటిలో నీకొడుకు డాఁగియుండుట నిశ్చయించి శల్య. 2-86; శాంతి. 4-156

3 వాక్యము.

వ. ఇకఁడు దెలివొందునట్లుగా ధర్మార్థసమాధి యుక్తంబులగు నుక్తి విశేషంబుల ననుగ్రహింపవలయు ననుటయు నద్దేవకీనందనునకు దేవవ్రతుఁ డిట్లనియె. శాంతి. 2-117

**ఉక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అర్హుఁడు, తగినవాఁడు.

క. శౌర్యము సత్యంబును స,త్కార్యజ్ఞానమును భక్తితాత్పర్యము గాం,భీర్యముఁ గలిగినఁ గుడుకుల,వర్య కుజంబేల సిరికి వాఁడుక్తుఁ డగున్. శాంతి. 3-99

సీ. ...ఊర్ధ్వలోకాధివాసమునకు వా రుక్తులు.
అను. 5-425; శల్య. 2-328; శాంతి. 2-142, 302, 330

**ఉక్థుఁడు** సం. వి. అ. పుం.

అమోఘుని కొడుకు. చూ. అర. 5-159

**ఉక్షము** సం. వి. న్. పుం.

వృషభము, ఎద్దు.

సీ. అప్పురుషుం డింద్రుఁ డయ్యుక్ష మైరావతంబు. ఆది. 1-118, 93

**ఉక్షధ్వజుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

క. ...వియా,పాతు మహోక్షధ్వజుఁ బ్రత్యక్షముగావించె నుగ్రతపమున మేర్మిన్. ఆది. 8-49

ఉగ్గడన వై. వి. (సం. ఉద్ఘాటన)
ప్రకటనము, పైకిఁజెప్పుట.
తరల:- కొడుకు సద్గుణ కోటులెల్లను గోటిభంగుల నోలి నుగ్గడన
సేయుచు సత్యవంతునిఁ గానరే మునులార. అర. 7-269

ఉగ్గడించు స. క్రి.
1 పలుకు.
సీ. ఉచితంబుగా నెఱి నుగ్గడించిన మాట సభ యియ్యకొనమి
అను. 4-884
చ. అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించు.
విరా. 2-31
వ. తమతమ పేర్లు బిరుదు నుగ్గడించుచు నగ్గలిక సొంపునను.
ద్రోణ. 5-142

2. ప్రకటించు, తెలుపు, చెప్పు.
ఆ. అక్కుమారి చతురయగుట శిఖండి వర్తనమునెడఁ బ్రమాదమున
నెఱింగి, యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగనియదియపోలె నుండె
నాత్మ నొచ్చి. ఉద్యో 4-874
క. నగళుల లోపలి మాటలు, దగునే తెలి నుగ్గడింపఁ దనకేర్పడ నొం,
డగడం బుట్టినఁ బతి విన,నగుపని చెప్పెడిదిగాక యాతని తోడన్.
విరా. 1-180
వ. ఇట్లు దలఁచుటయును దివ్యజ్ఞాన మాననీయుం డగు నమ్మునివరే
ణ్యుం డాక్షణంబ పొడసూపిన విదురుం డతని వచ్చుట యుగ్గడిం
చుచు వినయంబున నతని నెదుర్కొని దండనమస్కారంబు లాచ
రించి. ఉద్యో. 2-104

3. స్తుతించు, ప్రశంసించు.
సీ. ఒత్తారువొండుల వలనఁ బుట్టదుగదా కలకులందుఁ -తే- బుట్టి
నప్పుడు గాండీవిభుజ బలంబు, దలఁతురా భీమసేను గదావిహార,
ముగ్గడింతురె. ఉద్యో. 1-278
తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గడించి కుడుపు తెఱఁగు పుట్టించి

పలుకు నా సుయోధనునితో. ఉద్యో. 3-214

4. ప్రస్తావించు.

వ. అతనిచేత మున్న చావకయున్న ప్రతర్దనాదుల నుగ్గడించి. శాంతి. 2-84

ఉగ్గడువు విశే.

అధికము, ఎక్కువ.

క నడురేయి తీవ్రభానుఁడు, పుడమి వెలసెనను తలంపు పుట్టించుచు నుగ్గడువగు తేజంబున వెలిఁగెడుఁ గర్ణుఁడు బాణరుచులు గిటి కొన దెసలన్. ద్రోణ. 5-195

ఉగ్మలి దే. వి.

ఆఁడుది, స్త్రీ

క. చిడిముడి పడుచు నెదుకసనఁ, గడగుచు హారములు చక్కఁగాఁ దోచుచు మల్లడిగొనుచు దుర్విలాసం, బొడలికి నొడగూర్చుచుండ నుగ్మలి యంతన్. విరా. 2-114

ఉగ్రకుఁడు సం. వి. అ. పుం.

కద్రువ కొడుకు, ఒక నాగముఖ్యుఁడు.

వ. కద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు శేష...శబలార్య కోగ్రక కలశ పోతక.....మహోదరు లాదిగాఁగల వేవురు నాగ ముఖ్యులు పుట్టిన. ఆది 2-4

ఉగ్రత సం. వి. ఆ. స్త్రీ.

1. క్రోధము.

శా. ...ఆలోను నిశ్చింతుండై సతికేలు వట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. విరా. 2-327

2. భయంకరత్వము.

ఉ ...వార్తకున్, ముందఱఁ బోయి గోధనము ముట్టుకొనన్ వల యున్ మహోగ్రతన్. విరా. 3-126

చ. మనుగడ దప్పునొక్కొ మునిమాటలు గైకొననైతి నాబలంబన

నది యెంత యుగ్రత మహాబలు రాకకు నోర్వఁజాల.

శాంతి. 3-384; కర్ణ. 3-229

**ఉగ్రమయూఖుఁడు** సం. వి. అ. పుం.

ఉ. నిగ్రహ మేది నన్ను ధరణీవర కూపము వెల్వరించునాఁ, డుగ్ర మయూఖ సాక్ష్యముగ నున్నత దక్షిణపాణిఁజేసి భూ,పాగ్రణి నాదు దక్షిణ కరాబ్జము పట్టితి. ఆది. 8-160

**ఉగ్రము** సం. విణ. (అ. ఆ. అ.)

1. భయంకరమైనది, క్రూరమైనది.

ఉ. అదియునుగాక కోలుపులినైనను గారెనుపోతునైన నున్మదకరి నైన నుగ్రమృగనాథునినైనను గిట్టిముట్టి బెట్టిదముగఁ గాలఁ గేలను గడించి మగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు. విరా. 1-88

2. ఉత్కటమైనది, మిక్కుటమైనది.

లయవిభాతి- అరయ నిది పెద్ద యని పరుల మొనఁ జిత్తమున, సరకు గొనకుగ్రమగు బరవసమెలర్పు. స్త్రీ. 2-72; ఉద్యో. 4-262

3. తీక్ష్ణమైన శక్తిగలది.

చూ. ఉగ్రమయూఖుఁడు. ఆది. 8-160

4. దీర్ఘము, నిడుదయైనది.

చూ. ఉగ్రశ్రవుఁడు స్వర్గ. 77

**ఉగ్రశ్రవసుఁడు** సం. వి. స్. పుం.

సూతుఁడు, రోమహర్షణుని కొడుకు

సీ. నైమిశారణ్య పుణ్యక్షేత్రమునఁ గులపతి శౌనకుండను పరమ మౌని,...ద్వాదశ వార్షికోత్తమ సత్రయాగంబు, మొగిఁ జేయు చున్న నమ్మునుల కడకు, వచ్చి తానుగ్రశ్రవసుఁడను సూతుఁడు, రౌమహర్షణి సుపౌరాణికుండు -ఆ- పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్న నక్కథకు వలన మునినికాయమెల్ల, వివిధ పుణ్యకథలు విను వేడ్క నతనిఁ బూజించి రపరిమిత విశేషవిధుల -వ- అక్కథకుండు వెండియు నమ్మౌని సంఘంబునకు నమస్కారంబు సేసి

యనేక పురాణ పుణ్యకథా కథనదక్షుండ వ్యాసశిష్యుండైన రోమహర్షణునకుఁ బుత్రుండ నావలన నెక్కథ వినవలతురనిన నమ్మునులతని కిట్లనిరి. చూ. ఉగ్రశ్రవుఁడు. ఆది. 1-27, 28

**ఉగ్రశ్రవుఁడు** సం. వి. స్. పుం.

1. సూతుని పుత్రుఁడు, రోమహర్షణుఁడు.

వ. సర్పయాగ సమయ ప్రవృత్తంబైన మహాభారతంబంతయుఁ దత్ప్రభాగతుండైన రోమహర్షణ నామధేయుండును సాత్యవతేయ శిష్యుండును బండిత ప్రవరుండును నగు సూతునిపుత్రుండైన యుగ్రశ్రవుం డనియెడు కథకుండు సమ్యగవధానంబున నాకర్ణించిన వాఁడగుటను సమాశ్రితవత్సలుండైన యా కృష్ణద్వైపాయను ననుగ్రహంబునఁ దత్కథా సాకల్యవివరణ విశారదుండై యుండు నతండు నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు శౌనకుండను కులపతి...సత్రయాగం బాచరించుచుండ.

క. అమ్మహాత్ముల కతివిశదముగాఁగ నిమ్మహాకథ సెప్పెన్. స్వర్గ. 77-78

"ఉగ్రస్య నృసింహస్య శ్రవః ఇవ శ్రవః యస్య సః— ఉగ్రశ్రవాః" (ఉగ్రుఁడైన నృసింహుని చెవులవంటి చెవులు గలవాఁడు ఉగ్రశవుఁడు- లేక ఉగ్రశ్రవసుఁడు.)

ఆదిపర్వమునందుఁ జెప్పిన దానికిని (చూ. ఉగ్రశ్రవసుఁడు) స్వర్గారోహణ పర్వమునందుఁ జెప్పిన దీనికి భేదము గనఁబడుచున్నది. ఆదిపర్వమున శౌనకాదులకు సూతుఁడును రోమహర్షుని పుత్రుఁడును నగు ఉగ్రశ్రవసుఁడు భారతము వినిపించినట్లుండెను. స్వర్గారోహణ పర్వమున సూతుని పుత్రుండును రోమహర్షణ నామధేయుండును నగు ఉగ్రశ్రవుఁడు శౌనకాదిమునులకు భారతము వినిపించినట్లుండెను. దీనిఁబట్టి ఉగ్రశ్రవసుఁడు, ఉగ్రశ్రవుఁడు ఒక్కఁడే యని తేలుచున్నది. కాని ఉగ్రశ్రవసుండు రోమహర్షుని పుత్రుఁడు సూతుఁ డనువాఁడు (చూ. ఉగ్రశ్రవసుఁడు) ఉగ్రశ్రవుఁడు సూతపుత్రుఁడు రోమహర్షణుఁడే. ఇవి పరస్పర విరుద్ధములు- సంస్కృత భారతమున ఆదిపర్వమందు.

రోమహర్షణ పుత్ర ఉగ్రశ్రవాస్సౌతిః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతేర్ద్వాదశవార్షికే సత్రే వర్తమానే- ఋషీనభ్యాగతా నుపతస్థే పౌరాణికః పురాణే కృతశ్రమః- సకృతాంజలి స్తానువాచ.

సం. భా. ఆది. 3-1 అని కలదు.

స్వర్గారోహణ పర్వమున తిక్కన కవీంద్రుని పాఠమునకు ఆధారము గానరాదు.

సూ. ఆ. నిఘంటువునందు ఉగ్రశ్రవసుఁడు, ఉగ్రశ్రవుఁడు ఒక్కరే యనియు అతఁడు సూతుని కొడుకు రోమహర్షణుఁడనియుఁ గలదు. ఎట్లో తెలియకున్నది.

2. కురుకుమారుఁడు- ధృతరాష్ట్రుని కొడుకు. చూ. ఆది. 5-107

ఇతఁడు ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున భీమునిచేఁ జచ్చెను.

ఉగ్రసేనుఁడు సం. వి. అ. పుం.

1. కంసుని తండ్రి స్వర్భానుని యంశమునఁ బుట్టినవాఁడు.

వ. స్వర్భానుం డుగ్రసేనుండై పుట్టె. ఆది. 3-80

2. పరీక్షిత్తు కొడుకు, జనమేజయుని తమ్ముఁడు.

వ. జనమేజయుని తమ్ములు శ్రుతసేనుఁడును భీమసేనుండును నుగ్రసేనుండును ననువారలు. ఆది 1-83

3. మునికిఁ గశ్యపునకుఁ బుట్టినవాఁడు, గంధర్వుఁడు.

దక్షుని కూఁతురుముని, ఆమె కశ్యపుని భార్య. చూ. ఆది. 3-61

వ. మునియను దానికి భీమసేనోగ్రసేనాదులయిన గంధర్వులు పదార్వురు పుట్టిరి. ఆది. 3-65

4 కురుకుమారుఁడు, ధృతరాష్ట్రుఁడు. చూ. ఆది. 5-107

ఇతఁడు పదునెనిమిదవనాఁటి భారత యుద్ధమున భీమునిచేఁ జచ్చెను.

ఉగ్రాయుధుఁడు సం. వి. అ. పుం.

1. పాంచాల కుమారుఁడు.

వ. అట్టియెడఁ బాంచాల కుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయరోచమాన సింహసేనులును బలుదేరుల

మొత్తంబులోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యేవమంద్రవీరుల నెని
మిది ఖల్లంబులం దునిమి. కర్ణ. 2-272

2. ధృతరాష్ట్రుని కొడుకు, కురుకుమారుఁడు. చూ. ఆది. 5-107

ఇతఁడు భీమునిచేఁ జచ్చెను.

**ఉగ్రుఁడు** సం. వి. అ. పుం.

1. శివుఁడు.

ఆ. ధృష్టద్యుమ్నుఁ డుగ్రతేజుఁ డనికి నుగ్రునట్లు. ఉద్యో. 4-262

2. కురుకుమారుఁడు ధృతరాష్ట్రుని కొడుకు. చూ. ఆది. 5-107

భీష్మని చతుర్థదివస యుద్ధమున భీమునిచేఁ జచ్చెను. భీష్మ. 2-286

3. ఏకాదశ రుద్రులలో నొకఁడు.

తరువోజ. ...ఉగ్రుఁ డన విశ్వరూపుఁ డనఁ బేర్చి యా రుద్రు లర్చితు
లైరి. అను. 3-58

విశే. (అ. ఆ. అ.)

4. భయంకరుఁడు.

తే. ఉగ్రుఁడై దుస్ససేనుని యురము వ్రచ్చి, రుధిర ముగ్రతఁ ద్రావు
మరుత్తనూజు. కర్ణ. 3-229; విరా. 5-15

**ఉచథ్యుఁడు** సం. వి. అ. పుం.

అంగిరసుని వంశమువాఁడు.

తే. అంగిరస వంశసంభవుం డగు నుచథ్యుఁ, గోరి నిజపుత్రి సోముఁడు
గౌరవమున నిచ్చె. అను. 5-340

**ఉచితపరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

నీతి గలవాఁడు.

వ. ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పినవారిక సహాయత్వంబుఁ
జేయఁజూతురు. ఉద్యో. 1-87

**ఉచితత్వము** సం. వి. అ. న.

ఔచిత్యము.

...మ్ము కయ్యంపు టుచితత్వంబునం గలసె. కర్ణ. 2-317

**ఉచితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తగినది, యుక్తము.

వ. మఱియు నవసరోచితంబులగు వినోదంబులం బ్రమాదంబు పుట్టించుచు. విరా. 1-78; విరా. 4-204

2. విధింపఁబడినది, నియమింపఁబడినది.

వ. అనినఁ బాంచాలి సుదేష్ణ మందిరంబునం దా నుచితాచరణంబున నునికియు. విరా. 2-274

3. న్యాయమైనది, నైతికము.

ఆ. అనుడు నతని కిట్టు లనుఁ బాండవాగ్రజుం డింద్రతనయుఁ డుచిత మెఱిఁగి పలికె. విరా. 5-365; ఆది. 3-14

4. సమంజసము.

చ. అనుడు విషణ్ణమైన హృదయంబున గారవ మొంద నైపుణంబున నుచితంబుమై నరసి. విరా. 1-248

5. ఒప్పిదము.

క. ...ఇట్లనియెం బాంచాలి యుచితమగు చందమునన్. విరా. 1-104

6. హితము.

తే. నీవు ధృతరాష్ట్రితో ధర్మనిష్ఠమైన, యుచిత మాడిన నందుఁ బో టోడియున్న, దొరల భృత్యుల మనములు దిరుగఁబడవె. ఉద్యో. 1-57

**ఉచ్చము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉన్నతము, ఎత్తైనది.

వ. కనకమయోచ్చాసనంబున నున్న వ్యాసభట్టారకు. ఆది. 3-4

2. పెద్దది, బిగ్గఱయైనది.

మ. ...అత్యుచ్చ భైరవ హుంకార రవంబునన్ వియదగారంబెల్ల భేదిల్ల. ఆది. 6-18

**ఉచ్చయము** సం. వి. అ. పుం.

సమూహము.

క. ...బ్రల్కయ్యము గురుని బలముతో, నయ్యె యుధిష్ఠిరబలోచ్చ
యంబున కధిపా. ద్రోణ. 3-287

**ఉచ్చరణము** సం. వి. అ. న.

ఉచ్చరించుట, నోటఁబలుకుట.

క. సమర్థ పుణ్యాభిధాన సకృదుచ్చరణా. ఉద్యో. 4-427

**ఉచ్చరించు** సం. స. క్రి.

వాక్రుచ్చు, పలుకు, చెప్పు.

క. కురుకుల విభుఁడగు ధర్మస్థిరమతి యగు నీతఁ డనుచు ధృతిఁజేసి
యుధిష్ఠిరుఁ డను నామముఁ దా నుచ్చరించె నాకాశవాణి జన
వినుతముగాన్. ఆది. 5-97

**ఉచ్చరితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉచ్చరింపఁబడినది, పలుకఁబడినది.

చ. ...అర్జునుఁ బోలఁగ నెవ్వ రెందు లే, రను జనఘోష ముచ్చరిత
మయ్యె. ఆది. 8-95

**ఉచ్చారణము** సం. వి. అ. న.

ఉచ్చరించుట, పలుకుట.

వ. ...శంకరు దర్శించి సప్రణవోచ్చారణంబుగా దండప్రణామంబు
లాచరించి. ద్రోణ. 2-368

**ఉచ్చిచను** దే. అ. క్రి.

ఉచ్చిపోవు. చూ. ఉచ్చిపోవు.

ఉ. ...అప్పృషతాన్వయాగ్రగణ్యుం డడరించు నారసము లుచ్చి
చనంగ. భీష్మ. 2-55

**ఉచ్చిపోవు** దే. అ. క్రి.

1. దిగఁబడి పైకి వెడలు.

క. తన దృష్టియు ముష్టియుఁ దగు, ననువున మున్నెత్తి యేయుతనఁ

దప్పుడు డించిన కాయముల సపాటంబునఁ బదియుఁ బదేను నుచ్చి
పోయెం గోలల్. విరా. 5–82; మౌస. 88

2. నాటుకొను, విచ్చిపోవు, విడిపోవు.

మ. ...మాయల్ పన్ను నేర్పింకఁ జెల్లదు సూ నీకని యా సుయోధ
నుని యుల్లం బుచ్చిపో నాడుమీ. ఉద్యో. 3-97

3. భేదిల్లు, చీలు.

తే. అలిగి యాతండు గడవైచి యక్కుమారు, ఘోటకంబుల సూతుని
గూల్చె నదియ, పట్టుకొనివైచె మగుడ నప్పాండుపౌత్రు,చేయి
వడి నుచ్చిపోవ నచ్చిత్రుఁ డధిప. కర్ణ. 1-69

"నిర్భిద్య దక్షిణం బాహుం, నిపపాత మహీతలే."

సం. భా. కర్ణ. 15-30

ఉచ్చు దే. అ. క్రి.

[దీనికి 'చను', 'పోవు — అను గమనార్థక ధాతువు లనుప్రయుక్తము లయిన ప్రయోగములే యెక్కువగాఁ కన్పించుచున్నవి. తి. ప. ప్ర కోశమువారు భీష్మ. 3-489 (అది. 431) విరా. 3–162 క్రింద 'ఉచ్చి' యని ప్రయోగమిచ్చియున్నారు. భీష్మ. 3-481 లో 'ఉచ్చి'యను పాఠము గనఁబడుచున్నది 'ఉచ్చి' పాఠాంతరముగాఁ గూడ సం.మున. కానరాదు. విరా. 3-162 లో వీరిచ్చిన ప్రయోగమునకు మాఱుగా "ఇరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱు నవియును'— అని ఆనంద, సం.ము. అకాడమి ప్రతులలోఁ గానవచ్చుచున్నది.]

1. దిగఁబడి వెడలు. చూ. ఉచ్చిపోవు[1].

2. నాటుకొను, విచ్చిపోవు, విడిపోవు. చూ. ఉచ్చిపోవు[2].

3. భేదిల్లు, చీలు. చూ. ఉచ్చిపోవు[3].

4. వైకివచ్చు, ఉద్గతమగు.

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు లల్లన
యోలిన్ వెడలంగ రేకులు సముల్లాసంబునన్ బింకమెక్కనయం
బెక్కుచు గ్రద్దె పొం దెదలి వీఁకం గేసరంబుల్ గడల్కొనఁ

దోడ్కొమధువుచ్చి పేరెలమిఁ బొల్పుంజెందె నంభోజముల్.
ఉద్యో. 2-110

(వుచ్చి, వుబ్బి- అనునవి పాఠాంతరములు- తి. ప. ప్ర. కోశము వారు ఈ పాఠ మీయలేదుగాని 'ఉబ్బ' క్రిందఁ బాఠాంతరము గుర్తుతో నిచ్చినారు.)

తే. ...కుంభజుండు గోపించి దొడ్డ,నారసం బేయ నమ్మత్స్యనాథ
తనయు నురము వడిఁ గాడి వీఁపున నుచ్చిపోయె. భీష్మ. 3-19

స. క్రి.

భేదించు, చీల్చు.

వ. అవ్వీరవరు నారాచాది నానావిధ విశిఖ వ్రాతంబులు హేతిసంఘ
ట్టనంబున మండుచుఁ గరుల నుచ్చిపోవుచుఁ దేరుల విఱుచుచు.
ద్రోణ. 2-18

**ఉచ్చైర్నాదము** సం. వి. అ. పుం.

పెద్ద ధ్వని.

క. పాదంబులు వెట్టుడుఁ ద,త్పాదప ఘనశాఖ విఱిగి బల్లన నుచ్చైః,
ర్నాదమున దిక్కు లద్రువఁగ, భేదిల్లె విహంగతతులు భీతిం బఱ
వన్. ఆది. 2-72

**ఉచ్చైశ్శ్రవము** సం. వి. స్. పుం.

ఇంద్రుని గుఱ్ఱము.

తే. జన్మవేళన యాతఁ డుచ్చైశ్శ్రవంబు, భంగి హేషించెఁ బృథివి
గంపఁబు నొంద,నప్పు డతని కశ్వత్థామ యని యొసఁగ్చెఁ, బేరు
జనములు విన నశరీరవాణి. ద్రోణ. 5-349

**ఉచ్ఛిఖుఁడు** సం. వి. అ. పుం.

తక్షక కులమునఁ బుట్టినవాఁడు.

వ. పుచ్ఛాండక.....రణేభకోచ్ఛిఖ శరభ.....మహాహన్వాదులయిన
తక్షకకులసంభవులును. ఆది. 2-212

**ఉచ్ఛిష్టము** సం. విశే. (అ. ఆ. అ.)

భుజింపఁగా మిగిలినది.

వ. అని తారతమ్య జ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు సెప్పిన నుచ్ఛిష్ట
దర్పితం బగునదియును (కాకి) కర్ణ. 2-57

వ. తొల్లి నాలాయనియైన ఇంద్రసేనయనం బరఁగిన పరమపతివ్రత
మౌద్గల్యుండను మహామునికి భార్యయయి కర్మవశంబున నమ్ము
నిం గుష్ఠవ్యాధిబాధిత త్వగస్థిభూత శరీరు వయోవృద్ధు...విశీర్య
మాణ నఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు కుడుచు
చున్న.

తే కుడుచునెడ వాని పెనుప్రేలు కూటిలోన, దునిసిపడియున్న ప్రేల్
పుచ్చి తోయజాక్షి, యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలఁ, దగిలికుడుచు
చున్నంత నత్తరుణిఁ జూచి. ఆది. 7-255; 258; అర, 2-120

**ఉచ్ఛేదము** సం. వి. అ. పుం.

1. భేదించుట, చీల్చుట.

మ. ఘనపక్షాహతులం బ్రకాండ పరిఘా ఘాతంబులం దీవ్రఖాత
నఖోచ్ఛేదములం బ్రదీప్త శరవేధ క్రీడలం...శక్తగేంద్ర నిశాచ
ద్రుమపోరు సాధన సమర్థస్ఫూర్తి నొప్పెంగడున్. అర. 6-847

2. నాశనము చేయుట, సంక్షోభ పఱచుట.

క. లోకోచ్ఛేదముఁ గర్మ,వ్యాకులతయుఁ గాక యుండవలయుటకై
సు,శ్లోకా చతురాశ్రమములుఁ, గైకొని నడపిరి దృఢంబుగాఁ
బూర్వమునుల్. శాంతి. 6-278

**ఉచ్ఛ్రితము** సం. విశ. (అ. ఆ. అ.)

1. పలుకెత్తఁబడినది.

ఉ. ...చటుల వేగసముచ్ఛ్రిత పుచ్ఛగుచ్ఛ విస్ఫోటిత దిగ్విభాగుఁ
డగుచుం జనుదెంచె సుషేణుఁ డత్తఱిన్. అర. 7-87

2. ఎత్తైనది, మీఁదికిఁబోయినది.

చ. అతులితమై ద్వితీయ కనకాద్రియొకో యిది నా నిజాంగ ముచ్ఛ్రి
తముగఁ బెంచి పుచ్ఛమునఁజేసి దిగంతములందుచున్న యున్నతుఁ
గపివాహుఁ జూచి కురునందనుఁడు. అర. 3-348

**ఉజ్జగించు** స. క్రి.

విడుచు, త్యజించు, విసర్జించు.

సీ. ...పోర నన్నొత్తి యెపుడుఁ, జెప్పుదు రేను నాచేనయినంతయుఁ
జేసితి నింక నిశ్చింతవృత్తి, సుగతికిఁ జనఁగోరి తగ మజ్జగించెద, శా
ణాసనంబును బాణములును - తే- దెలివి గలిగి మనుం డని పలికి
(ద్రోణుఁడు) ద్రోణ. 5-822

తే. లజ్జ పాటించి మది వెఱ యుజ్జగించి, రయము మెఱయ నప్పాం
చాల రాజసుతుఁడు. శల్య. 1-820; శాంతి. 1-191.

**ఉజ్జానకము** సం. వి. అ. న.

ఒకానొక తీర్థస్థానము.

వ. ఆర్ష్టిషేణాశ్రమంబున నుజ్జానకస్నాతుండై మర్త్యుం డఖిల పాపం
బులం దొఱంగు. అను. 2-88

**ఉజ్జ్వలత్** సం. శత్ర.

దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.

ప్రకాశించుచున్న.

క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల, దష్టాపదపుంఖ మార్గణావళి నయ్యు,
త్కృష్ట గజఘటలఁ గలఁచె. భీష్మ. 2-210

**ఉజ్జ్వలత** సం. వి. ఆ. స్త్రీ.

ప్రకాశము, కాంతి.

క. కల్పిత దృఢ చతురంగా, నల్పంబై గండుమిగిలి యాదవ బల
మ్మాకలోజ్జ్వలతఁ గొలువ నవి, కల్పుఁడు కృతవర్మ సనియె
గాఢస్ఫూర్తిన్. భీష్మ. 1-90

**ఉజ్జ్వలత్వము** సం. వి. అ. న.

ప్రకాశము, కాంతి.

తే. గంధకారి వేషంబు కతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱువడి
యుండఁ బాండుతనయ మహిషి. విరా. 1-294; శాంతి. 5-15

**ఉజ్జ్వలము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించునది.

చ. కప్పగు మృదుమౌళి నుజ్జ్వల నఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్.
విరా. 1-247; విరా. 4-118.

సీ. ఉరగంబుఁ దునిమి వే మరలి కర్ణునిమీఁదఁ, బదియుఁ బం|డెండును బటుశరములు, నిగిడించి యుజ్జ్వలంబగు దొడ్డనారసం బేసిన.
కర్ణ. 3-381.

**ఉజ్జ్వలితము** సం. విణ. (అ. ఆ. అ.)

వెలిగింపఁబడినది, జ్వలింపఁజేయఁబడినది.

క. ఉన్నతకరదీప నికర ముజ్జ్వలితముగాన్. ద్రోణ. 5-148.

**ఉజ్జ్వలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించువాఁడు.

వ. వెదలి వివిధ వాహనారూఢులయి పౌరు లపూర్వరువంశవరు ననుగమించి రిత్తెఱంగున మెఱయు మహిమ నుజ్జ్వలుం డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్రంబు ప్రవేశించి చనుచుండి. ఆశ్ర. 2-30; ఆశ్వ. 4-272; కర్ణ. 1-268.

తే. ...మార్తాండు మాడ్కిఁ జూడ నుజ్జ్వలుఁ డగుచు నర్జునుఁడు వొలిచె. విరా. 4-254.

2. శౌర్యము గలవాఁడు.

క. విను మవమానము వడి యిట్లునికిఁ బడయు పొగడు కంటె నుజ్జ్వలులై మాన్కొనినది లెస్స యొట్లయిన నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. ఉద్యో. 1-342.

3. పెంపొందువాఁడు.

ఆ. పుత్రమిత్ర బంధు భూరిసేనా సమన్వితముగాఁగఁ గొలిచి నిన్ను రాజ్యభార వాహనమునకుఁ బట్టంబుఁగట్ట నుజ్జ్వలుఁడ వగుదు రమ్ము వారికడకు (శ్రీకృష్ణుఁడు కర్ణునితో ననిన మాటలు)
ఉద్యో. 4-29.

**ఉజ్ఝితము** సం. విణ. (అ. ఆ. అ.)

విడువఁబడినది.

వ. ప్రేతపత్యనుభూతోజ్ఝితంబైన యాపానభూభాగంబు ననుకరించు.

కురుక్షేత్రంబు. శాంతి. 2-64

**ఉట్టు** దే. అ. క్రి.

కాఱు, స్రవించు.

ఆ. ఆర్చి నెత్తు రుట్ట నమ్మస్తకము వట్టి, కొని యతం డుదాత్తఘోర
భంగి. ద్రోణ. 5-205

చ. అరివయి వీఁక నెత్తి చనునప్పుడుఁ దేనియ లుట్టునట్లుగా, నరపతి
వానివారలు వినం బ్రియమాడుట మేలు. శాంతి. 8-21

**ఉడించు** దే. స. క్రి.

క్రుంగునటులఁజేయు, అణఁగించు.

క. తన దృష్టియు ముష్టియుఁ దగు, ననువున మన్నెత్తి యేయు నతఁ
డప్పుడు డిం, చిన కాయముం సపాటం, బునఁ బదియుఁ బదేను నుచ్చి
పోయెం గోలన్. విరా. 5-82

అప్పుడు + ఉడించిన - అని ఆనందవారి పాఠము

ఉడించు శబ్దము నిఘంటువులఁ గానరాదు. అవుడు + డించిన అని విడదీయుట సమంజసమని తోఁచెడిని. చూ. డించు.

**ఉడికించు** దే. స. క్రి. (√ఉడుకు)

1. కోపము వచ్చునట్లు చేయు.

క. రిత్తయుపచారముల నే, నుత్తముఁ దగు ధర్మతనయు నుడికించితి
దుర్వృత్తులగు మత్సుతులకును, మిత్తియగుం బోర వగలు మిగు
లకయున్నే. ఉద్యో. 2-82

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టు మాటలఁ
దచ్చిత్తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడగించువా రచట
నెవ్వరొకో. ఉద్యో. 2-242

2. మనోవ్యథ పొందునట్లు చేయు, అంతస్తాప మొందఁజేయు.

క. పాంచాలురుఁ బాండవులు న్నుదంచిత గర్వమున ననిశిఁ దఱిమి
యొడలు మండించుచు నుండఁగ ని ట్లుడికించెద వొకవలన నీవుఁ
గీడు పలుకులన్. ద్రోణ. 5-35

(ద్రౌపది యుధిష్ఠిరునితో) సీ. ...అరిగణంబుఁ -తే- ద్రుంచిరాజ్యంబు సేకొంటి తొలఁగిపోదుఁ,గాక యని యిప్పు డుడికింప నీకుఁ దగునె శాంతి. 1-89

శ్లో. కథమద్య పునర్వీర వినిహంసి మనాంసి నః. సం.భా. శాంతి.14-12

**ఉడిగించు** దే. స. క్రి. (√ఉడుగు)

ఉడుగఁజేయు.

1. మానిపించు, ఆఁపు.

క. భగదత్తు నేనుఁ గడరిన, వెగడునఁ బాండవుల మొనలు విఱుగు టయు మహో,నగ మేటి వేగ మాఁగిన,పగిది ఘటోత్కచుఁడు దాని పరు వుడిగించెన్. భీష్మ. 3-85

2 విడుచు, తొలఁగఁద్రోయు.

సీ. నినుఁ బ్రజాసంహారమునకునై కల్పించి, వాఁడఁ గావున నీ మనంబు నందుఁ, బొడము విచారంబు నుడిగింపుము. ద్రోణ 2-170

3. అణఁచు.

ఉ. ...వానినెల్లఁ గ్రక్కించెద నీమదాంధ్య-ముడిగించెద నిప్పుడ శాలు ప్రోలి కేఁగించెద. ఆది. 6-294

**ఉడిగిమడుఁగు; ఉడిగిమడఁగు** దే. అ. క్రి.

అణఁగిమణఁగు.

క. వనమున ఫలమూలంబులు, దిని మునివై యుండఁగాక ధీరోద్ధతిమై, ననిసేయ నీకు వచ్చునె, చను మచటికి నుడిగిమడిఁగి శాంతుఁడ వౌలెన్. (ఉడిఁగి మడఁగి - అని సం.ము) ద్రోణ. 4-241

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొకఁడు నెట్టులయిన నుడిగి మడిఁగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడవలయు. విరా. 1-148

2. ఉపరతమగు, వ్యాపారము లడఁగు, నశించు.

తే. ఉపరతంబైన మనసుతో నుడిగి మడఁగు, నింద్రియములు పరమ మొందెనేని దాన, మనను మగుడదు విషయతృష్ణను చరించు. శాంతి. 6-86

3. ప్రాణములు దక్కించుకొను, పాఱిపోవు.

(ద్రోణుఁడు దుశ్శాసనునితో) క ఏమి యువరాజ విభునకు, సేమమె సైంధవుని నేమిసేసె నరుఁడు నీ, వేమిటి కిట్లీ రథిక, స్తోమముతో విఱిగి తెందుఁ, జొచ్చెద వింకన్.

క. అడుకులు దిన్నట్లగు నే, కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బఱచితి వాఁ, డొడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మడుఁగ వలసె నిప్పు డొక సాత్యకిచేన్. ద్రోణ. 4-88, 89

**ఉడిచికొను** దే. అ. క్రి.

ఉపసంహారించుకొను, మరలించు.

కి. ధరణీ దిశా ప్రసారిత, గురుకర నికరంబు లుడిచికొని దీర్ఘనిరం, తరగతి ఖిన్నుఁడ పోలెను, హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రి దరిన్. ఆది. 6-174

**ఉడిపికొను** దే. అ. క్రి.

మాన్చుకొను, పోఁగొట్టుకొను.

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలం బుడిపి కొని నిశ్చయించి. విరా. 1-161; అశ్ర. 1-99; భీష్మ. 2-162

**ఉడివించు** దే. స. క్రి.

1. మానిపించు, ఆఁపు.

ఉ. ...మహోర్వీనుత సర్పయాగ ముడివింపుము కావుమ సర్పసంహతిన్. ఆది. 2-230

2. అణఁచు.

ఉ. వింతయె కాముశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్. ఆది. 7-58

**ఉడివోక** దే. వి.

విరమించుట, ఆఁగుట.

ఉ మండుచు వచ్చు దానిఁ బది మార్గణముల్ గొని వేగమొప్ప వా, ఖండల నందనుండు గడికండలు సేసినఁ జూచి యప్పు డాత్తం బుడి

వోక లేక సమరంబున ఖడ్గము ఖేటకంబు ను,ద్దండతఁ గొంచుఁ
దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. విరా. 5-151

**ఉడివోవు** దే. స. క్రి.

విరమించు, ఆపు

చూ. ఉడివోక. విరా. 5-151

**ఉడుకాఱు** దే. అ. క్రి.

మనస్తాపము తొలఁగు, విచారముడుగు, మంట చల్లారు.

సీ. ఈ వెంద్రుకలువట్టి యీడ్చిన యాచేయి దొలుతగాఁ బోరిలో
దుస్ససేను, తను వింతలింతలు తునియలై చెదరి రూపఱియున్నఁ
గని యుడు కాఱుఁగాక, యలుపాలఁ బొనపడు చిచ్చే యిది.
ఉద్యో. 3-117

**ఉడుకు** దే. అ. క్రి.

పరితపించు, (భయదుఃఖాదులచే) తాపమునొందు.

సీ. విప్రులు పట్టరా వెఱనొచ్చి యొదిగెదు, గవయంబు చాడ్పునఁ
గర్ణభీతి, నల్లల నడుకుచు నుండుదు. కర్ణ. 3-88

తే. చూచు వారల యుల్ల ముడుక. స్త్రీ. 2-14

తే. మదిఁ జింత సొనిపి యుడుకు లొక పెట్టి.
శాంతి. 1-282; శాంతి. 4-34

వి.

1. అంతస్తాపము, పరితాపము.

ఆ. ఓడి వచ్చినాఁడ నద్దతి నాకేల, యుడుకుమాని నీవ యుర్వియేలు
గుఱ్ఱములు నేనుఁగులు లేని బయలు నీతలనె కట్టికొనుము ధర్మ
తనయ. శల్య. 2-72

శ్లో. హతబాంధవ భూయిష్ఠా హతాశ్వాహత కుంజరా, ఏషాతే పృథివీ
రాజన్ భుంక్ష్వైనామ్ విగతజ్వరః. సం. భా. శల్య. 32-52

తే. నేలఁబొరలు,చున్న వారేమి సెప్పుదు నుడుకు పేర్మి.
స్త్రీ. 2-60; ఉద్యో. 3-117

2. బాధ, పీడ.

క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము, నుడుకులఁ బెట్టంగ విసివి యుగ్ర

తపమునం, గొడుకుఁ బడసి. అను. 4-407

విణ.

వేఁడియైనది, ఉష్ణము.

తే. ఉడుకుఁ గన్నీరఁ దడియంగ నొఱగుచును విచేష్టయై. స్త్రీ. 2-45

ఉడుకువ వి. (√ఉడుగు)

విశ్రాంతి, విరామము, ఊఱట, తెఱపి.

చ. ఉడుకువ లేని కయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు ఉప్పెవ్వ,ట్టెకు నొకమాటు వాగ్రహాము డింపవు. విరా. 5—146

సీ. వావిరిఁ బోదివెడు వగల సందడిఁబడి, యురియుచు నునికికి నుడుకవయును. విరా. 2-815

ఉడుగఁబడియుండు దే. అ. క్రి.

ఒదిగిపడియుండు.

క. దేవతలకైన నొక్కొక,చో వలయునకాదె శత్రుసూదన విధికా,లావాప్తికి మును దమ స,ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్. విరా. 1-58

ఉడుగు దే. స. క్రి.

1. మాను, విడుచు, త్యజించు.

క. పెక్కింద్ర నొక్క పోరను, నుక్కఱ ఖండింతుఁ జంపు టుడుగుదు రాజుం, దక్కటి చూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతు దగన్. విరా. 1-82

తే. నా బుద్ధి వినవయ్య తమక ముడిగి. విరా. 2-78

క. జనులకు నొడఁబాటగు విధ,మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁదని యొక కలిమి కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా. ఉద్యో. 2-82

తే. నియత తపమును నింద్రియ నిగ్రహంబు, భూరివిద్యయు శాంతికిఁ గారణములు, వాని యన్నింటికంటె మేలైన శాంతి, కారణము లోభ ముడుగుట, కౌరవేంద్ర.

ఉద్యో. 2-84; శాంతి. 5-208, 561; ఆది. 2-180

అ. క్రి.

1. విరమించు, ఆఁగు.

క. కదియుచుఁ దాయుచుఁ బట్టుచు, నుదలుచుచుం బడుచు లేచు చుడుగుచు వడిగొం, చొరద వెసు కినుకం గడుబెట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్. విరా. 2-848

క. ఉడు గుడ గు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ వేగంబున స,య్యొడ కేఁగుదెంచి నారదుఁ, డెడపడు టించుఁయు లేక యిట్లను నాతోన్. ఉద్యో. 4-849

2. తప్పు, తొలఁగు.

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై, యాచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై, గీచక యింత సేసితి సుఖత్వము బొందుదుఁగాక యింక న,ల్లేచిన నిట్లుగా కుడుగునే యనుచున్ వెఱ నందుచుండఁగన్. విరా. 2-356

ఉ. పైఁబడి పోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసభం దా వలదన్నఁ గీ డుడుగదా. కర్ణ. 3-224

3. బింకము వదలు.

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం,బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెదనంచుఁ దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో, నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై. సభా. 2-30

విశే.

నూను, విడుచు, త్యజించు.

తే. చేయుటెంతయు మేలైనఁ జేసి పిదప, వగచినట్టి దానము దనుఁ బొగడికొన్న, దానవిధి నిష్ఫలంబులు గాన రెండు, నుడుగుదాత మహాఫల మొందఁగాంచు. అను. 5-189

ఉడుచు స. క్రి.

ఉడిగించు, పోఁగొట్టు, తొలగించు.

ఆ క్రూరకర్ములయ్యు గోబ్రాహ్మణుల కగు, బాధ లుడుచు జనులఁ బాపచయము, వెట్టి యెడలఁ బొంద వింద్రనందన నీకు, సమయ భంగభీతిఁ జనఁగనేల. ఆది. 8-121

2. ఆఁపు, నివారించు.

వ. ...వారాశియుంబోలె బోరన మ్రోయుచున్న వాదిత్ర శబ్దంబు లుడిగి. ఆది. 6-15

**ఉడుపతి** సం. వి. ఇ. పుం.

చంద్రుఁడు, నక్షత్రములకు రాజు.

సీ. జిహ్వా, యధ్యాత్మకము రస మారయంగ -తే- దాని యధిభూత ముడుపతి దదధిదైవతంబు. అశ్వ. 2-148

**ఉడుపము** సం. వి. అ. పుం. న.

నీటినుండి రక్షించునది, తెప్ప.

వ. ...ద్రుహ్యువంశంబునవా రుడుపప్లవ సంతార్యంబైన దేశంబు నకు రాజులుగా. ఆది. 8-195

**ఉడుపు** దే. స. క్రి.

ఉడిగించు.

1. పోఁగొట్టు.

వ. ...అనులేపనంబున నస్రగంధం బుడిపికొని. విరా. 8-2

క. కామక్రోధాద్యములగు, నీమానస వికృతు లుడిపి. శాంతి. 4-30

క. విను తెవు లుడుపఁగ భేషజమునకుం దలకొనిన చందమున.

శాంతి. 4-286

2. ఆఁపు, నిరోధించు, అడ్డగించు.

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున, నొక్కఁడొక్కఁడ తల పడు టుడుపఁ దలఁచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె, భయ రసము వట్టుపెట్టునఁ బగలువాఱు. విరా. 5-78

సీ. నరుఁ డేచి వాయుబాణమ్మున నమ్మెనఁ, దూలింపఁ గుంభజుశైల శరము -ఆ- వచ్చి యుడుప నలిగి. భీష్మ. 3-218; కర్ణ. 2-49

వ. వాఁడు పాండవ బలంబులకెదురుగా నరదంబు సముచితరయంబున నడప నమ్మద్రపతి సముద్ర సముద్రేకంబు చందంబైన యా సైన్యంబు సరభసత్వంబు చెలియలి కట్టయుం బోలి యుడుపుట యచ్చెరువై యుండె. శల్య. 1-135

3. అణఁగించు.

ఉ. ...వీటికిం, బోవవు శత్రునే వుడిపి పోయెదు వాడవుగావు నీవు సైన్యావలియైనఁ జెడ్పడక యాతలకెయ్యుట లేదునేనియున్. విరా. 4-192

క. నిన్నయఱసచ్చి పోయితి,వున్న యఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి యింకెట వోయెదు. ఉద్యో 4-341

4. చల్లార్చు.

వ. పెల్లిగివచ్చు కార్చిచ్చు నుడుపను పాషాణవర్షంబు వారింపను. ఉద్యో. 2-262

తే. త్రినయనుఁడు వచ్చి యాతనిఁ దేర్చె నాతఁ, డాతెఱంగెఱిఁగించి యయ్యగ్ని నుడిపె, నపుడు పుట్టెఁ దదీయేంద్రియ వ్రజమున, నొక్కయంగన రక్తాక్షి యుజ్జ్వలాంగి. శాంతి. 5-204

5. మాన్చు, తీర్చు.

వ. ఇట్లయ్యిరువురు నొండొరులం బట్టుకొని యేడ్చి రచ్యుతుం డుడుప నుడిగి తత్కాలోపగత సముచిత పరిజనానీత జలంబుల ముఖ ప్రక్షాళనంబు సేసికొనిరి. కర్ణ 8—109

**ఉడువు** సం. వి. ఉ. స్త్రీ. న.

నక్షత్రము

వ. అకాలసంధ్య నావహించినం దదుచిత వ్యాపార పారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుం బోలె. విరా. 5-60

**ఉడ్కువ** దే. వి.

ఉడుకువ.

చ. వారోక యుడ్కువ లేని త్రిమ్మటన్. విరా. 8—95

(పాఠాంతరము)

**ఉతథ్యుఁడు** సం. వి. అ. పుం.

అంగిరసుని కొడుకు, బృహస్పతి యన్న.

సీ. మతి యంగిరసుఁడను మానసపుత్రున, కయ్యుతథ్యుఁడు బృహస్పతియును, సంవర్తుఁడును గుణాశ్రయ యోగసిద్ధి యన్కూఁతురు బుట్టిరి. ఆది. 3-66; శాంతి. 2-400

**ఉత్కంఠ** సం. వి. ఆ. స్త్రీ.

ఇష్టప్రాప్తికై పడయు వేగిరపాటు, విరహము వలనఁ గలిగిన విచారము.

క. కైసేసి మదవికారోల్లాసంబున మేనువొంగ లఘుగతి నుత్కంఠాసవపాన విధాన,వ్యాసంగతరంగి తాంతరంగుం డగుచున్. విరా. 2-329

**ఉత్కంపము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎక్కువ వణఁకునది.

మ. (హరి) ధరణీ చక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళ శ్రేణి కం, ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబుగా నీ బలం, బురలం దాఁకఁగ భీష్ముపైఁ గవిసె. భీష్మ. 3-262

వి. అ. పుం.

వణఁకు.

మ. ...కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ, గని యేఁ గ్రమ్మఱి రిత్తవోదునె భయోత్కంపంబు నీ కేటికిన్. విరా. 4-68

మ. ...దిశావలయ ముత్కంపంబు నొందెన్.

సౌప్తి. 2-122; అర. 7-254

**ఉత్కచము** సం. వి. అ. న.

ఒక పుణ్యతీర్థము.

వ. గంధర్వుండు పెద్దయుం బ్రొద్దు విచారించి యిచ్చోటికిం గుఱంగట నుత్కచంబను తీర్థంబునం దపంబు సేయుచున్నవాని ధౌమ్యుం డను బ్రాహ్మణునిఁ బురోహితునింగాఁ బ్రార్థింపుఁడు. ఆది. 7-156

**ఉత్కటము** సం. విణ. (అ. ఆ. అ.)

అధికమైనది, మిక్కుటము, అతిశయము.

ఉ. కీచక ముఖ్యుఁ డప్డు...నుత్కట సంభ్రమంబు హర్షంబుఁ బెనం
గొనంగ. విరా. 2-118; విరా. 2—226

వ. అని తన మనంబునం గదిరిన యనుజ వియోగతాపం బుత్కటం
బగుటయు వెండియు నిట్లనియె. విరా. 8-59; భీష్మ. 3-346

**ఉత్కరము** సం. వి. అ. పుం.

సమూహము, గుంపు.

సీ. భేరీధ్వనుల నింగి బీఁటలు వోకుండఁ, గరికర శీకరోత్కరము
దడుపు. భీష్మ. 1-119; విరా. 8-154

**ఉత్కర్షణము** సం. వి. అ. న.

పైకి లాగుట, పైకి ఎగఁబట్టుట.

వ. .. ఆ సభ విభవంబు సూచువేడుక నందుఁ గ్రుమ్మరు వాఁడ హరి
నీలబద్ధ స్నిగ్ధమణి స్థలంబునందు జలబుద్ధిం జేసి పరిధానోత్కర్ష
ణంబు సేసి విమల శిలాతల బుద్ధి నుదక పరిపూర్ణంబయిన వాపి
సొచ్చి కట్టిన పుట్టంబు దడియం ద్రెళ్లిన నన్నుం జూచి వృకోద
రుండు నగియె. సభా. 2-140

**ఉత్కర్షత్వము** సం. వి. అ. న.

శ్రేష్ఠత్వము.

వ, అనిన విని జనకుండు వర్ణంబుల యుత్కర్షత్వాపకర్షత్వంబులకు
మూలం బెయ్యది. శాంతి. 5—508

**ఉత్కర్షము** సం. వి. అ. పుం.

1. అతిశయము, గొప్పతనము.

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కి. విరా. 1-227

వ. అట్టి మహామూర్తిం గనుంగొని ధనంజయుండు విస్మయరోమ
హర్షణ ప్రహర్షోత్కర్షంబుతో ప్రణామంబులు సేసి. భీష్మ. 1-210

2. ప్రాశస్త్యము, శ్రేష్ఠత్వము.

క. హర్షంబును మానంబు న, మర్షము నపరాధమును సమద భావము

సృత్కర్షాపకర్ష చింతలు, నార్షసమాచారమున నిరస్త గుణం బుల్, శాంతి. 5–24

వ. అని పలికి స్వప్నంబున ఫాలలోచను వలనం బరమోత్కర్షంబు వడసిన తెఱం గేర్పడం జెప్పిన. ద్రోణ. 8-19

సీ. దుర్యోధనాది సుతులకును దక్కను, గలుగు బంధులకు సుత్కర్ష మెసఁగ. ఆశ్ర. 1-109

**ఉత్కర్షించు** సం. అ. క్రి.

అధికమగు.

క. తపము ల్లయు కల్మషముల, నపగతములఁ జేయు విద్యకాస్పదమగు నా, తపని మహిత దానంబున, నుపచితమగు విద్య దపము నుత్కర్షించున్.

క. కానఁ దపంబును విద్యయు, దానౌదాత్ర్య ప్రవర్తితంబులు,

అను. 4–351, 352

**ఉత్కలితము** సం. విణ. (అ. ఆ. అ.)

కలిగింపఁబడినది.

చ. ఉరుతర దావపావక శిఖోత్కలితశ్వసనంబులున్. ఆది. 8–230

**ఉత్కీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

పైకిఁ జిమ్మఁబడినది.

స్రగ్ధర :- వదనోత్కీర్ణ కీలాల ధారావంక ప్రాగ్భారమగ్నాపతన విఘటిత ప్రాణుఁడై. ఆది. 7–91

**ఉత్కృష్ట** సం. విణ. (అ. ఆ. అ.)

శ్రేష్ఠురాలు.

వ. రూపలావణ్య గుణంబులఁ బ్రమదా జనంబుల యందెల్ల నుత్కృష్ట యగుటంజేసి ప్రమద్వర యన నొప్పుచున్న కన్యక. ఆది. 1-145

**ఉత్కృష్టత్వము** సం. వి. అ. న.

గొప్పతనము, శ్రేష్ఠత్వము.

శా. ధృష్టద్యుమ్ననిఁ జూచుచున్ రణ సముద్రేకంబు శాపాలా,

వష్టంభంబును శౌర్యనిర్వహణ గర్వస్ఫూర్తియుం దొంటి యు, త్కృష్టత్వంబును దక్కి స్రుక్కి వగ బుద్ధిం బీఁకు వీఁకాదఁగాఁ, జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్లిష్టాంగుఁడై యున్నెడన్. ద్రోణ. 5-320

**ఉత్కృష్టము** సం. విణ. (అ. ఆ. అ.)

1. శ్రేష్ఠము, ప్రశస్తము.

ఆ. ఉత్తమాసనములు నుత్కృష్ట వాహనం, బులును గరుణఁ దమకు భూమిపాలుఁ, డీక తార యెక్కు టెంతటి మన్నన, గలుగువారి కైనఁ గార్యమగునె. విరా. 1-132

సీ. ధనము లుత్కృష్టంబులను ధనంజయు మాట పాటిగాఁగొనుము. శాంతి. 1-144

క. పరుషత్వములే కంతః,కరణంబున శుద్ధి సాలఁ గలిగి ప్రియము పొం, పొరివోవఁజేత దానము, పరమోత్కృష్టంబు పద్మపత్త్రనిభాక్షీ. అను. 5-212; భీష్మ. 1-117

2. మిక్కుటమైనది, అధికము.

క. ఒక తల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొక తల యైనన్, సకలము నసార మాతం, దొకరుని సారంబ చాల నుత్కృష్టమగున్. ఉద్యో. 2-315

**ఉత్కృష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

శ్రేష్ఠమైనవాఁడు, ప్రశస్తి పొందినవాఁడు, గొప్పవాఁడు.

తే. ధృష్టకేతుండు గౌరవోత్కృష్టుఁడైన బాహ్లికుని మాఱుకొని. భీష్మ. 1-257

వ. తపోధృతి శమంబుల నుత్కృష్టుండగు ద్విజశ్రేష్ఠుండు దీనివలనం బుట్టు నది నీ వుపయోగింపుము. శాంతి 2-69

వ. మనుష్యులయందు జాతిధర్మోపధారకు లెక్కుడు జాతిధర్మోపధారకులయందు విప్రు లుత్తములు విప్రులయందు వేదజ్ఞు లుదాత్తులు వేదజ్ఞులయందు ప్రవచనశీలు రుత్కృష్టులు ప్రవచన శీలురయం దాత్మజ్ఞు లధికులు. శాంతి. 5-99; ద్రోణ. 5-22

**ఉత్కోచము** సం. వి. అ. న.

ఒక పుణ్యతీర్థము. (పాఠాం) చూ. ఉత్కచము. ఆది. 7-156

**ఉత్కోపము** సం. వి. అ. పుం.

మిక్కిలి కోపము.

ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధింప నుత్కోప వికారుఁడై యసుర క్రూరకృపాణము గొన్న. ద్రోణ. 5-166

**ఉత్క్రమణము** సం. వి. అ. న.

1. మీఁదికిఁగాని వెలికిఁగాని పోవుట.

సీ. నరనాథ యుత్క్రమణ ప్రదేశంబులు పాద జంఘా జాను పాయుఁ గుహ్యాము లు. శాంతి. 6-124

2. ప్రాణము పోవుట.

సీ. చేకురు నఃవర్గి ముత్క్రమణ కాలంబున గంగఁ దలంచిరేని. అను. 2-113

**ఉత్క్రమము** సం. వి. అ. పుం.

ఉత్క్రమణము, వెలుపలికిఁబోవుట, మీఁదికిఁబోవుట.

తే. హృన్మయ పవన క్రమోత్క్రమముల నొందు నద్దైవతంబుల యోగి వరుఁడు. శాంతి. 6-124

**ఉత్తంసము** సం. వి. అ. పుం.

1. సిగబంతి, తలమానికము, శిరోభూషణము.

ఉ. ...నేను దుశ్చర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వయోత్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదే మీరుఁ జేసినన్. ఉద్యో. 3-379

2. శ్రేష్ఠవాచకము.

కురుకులోత్తంసమవై. శాంతి. 1-121

**ఉత్తంసీకరణము** సం. వి. అ. న.

అలంకారముగాఁ జేయఁబడినది.

క. అంసప్రదేశ లలితో, త్తంసీకరణోవలాల్య ధరణీవలయా.
శాంతి. 3-426

**ఉత్తమత** సం. వి. ఆ. (స్త్రీ).
ఉత్తమత్వము, శ్రేష్ఠత్వము.
క. పురుషుఁడన వేఱొకండే, పురుషోత్తముఁడైన యేన పురుషోత్త
మతా,స్ఫురణకుఁ బురుషత్వంబను, మెరమెర గల దదియకాదె
మెయికొనుఁ గ్రియకున్. భీష్మ. 1-199

**ఉత్తమత్వము** సం. వి. అ. న.
శ్రేష్ఠత్వము.
వ. తన చూపునం గపిలలయిన గోవులకుం దక్కిన వర్ణ బుల గోవుల
కంటె నుత్తమత్వంబు గలుగ వరంబిచ్చి విరించిని వీడ్కొలిపె.
అను. 2—25

**ఉత్తమము** సం. విశే. (అ. ఆ. అ.)
1. శ్రేష్ఠమైనది,
క. ఉత్తమ కన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు.
విరా. 1—88
వ. ధర్మార్థ కామంబులయం దుత్తమమధ్యమాధమత్వ నిరూపణంబు
చేయుఁడు చూతమని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె.
శాంతి. 3-452; ఉద్యో. 4-427
2. మిక్కిలి అనుకూలమైనది.
ఉ. ఉత్తర లోనుగాఁగల పయోజముఖుల్ పగలెల్లఁ బ్రీతితో, నృ
త్తముఁజేసి పోవ మహనీయ రహస్యవిధిన్ నిశీధినీ,వృత్తము
గోరు వారలకు వేడ్కకుఁ బట్టగుచుండు నాగృహం, బుత్తమ
మిత్తెఱంగునకు నొంటిమెయిం దగ నీవు వచ్చినన్. విరా 2-265

**ఉత్తమాంగకము** సం. వి. అ. న. (ఉత్తమాంగము)
శిరస్సు, తల.
చ. ఘనతర కంధరుండు దృఢకాయుఁడు దీప్తముఖుండు రక్తలో,చ
నుఁడు మహోత్తమాంగకుఁడు...సువర్ణుఁడు పుట్టె భూవరా.
అను. 1—77

**ఉత్తమాంగము** సం. వి. అ. న.

శిరస్సు, తల

వ. ఇవ్విధంబున ద్రుపదపుత్రి దురవస్థం బొందుచు...దినకరుం గనుంగొని వినయ వినమితోత్తమాంగయై నిజాంతర్గతంబున.

విరా. 2—107

ఉ. ధీ,ముండు దదుత్తమాంగము సముద్ధతిం దన్నిన. సౌప్తి. 1-209

**ఉత్తముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. శ్రేష్ఠుఁడు.

వ. ...భూసురోత్తములు దమ్ముం బరివేష్టించియుండ. విరా. 1-48

2. యోగ్యుఁడు.

క. ఆరోగ్యము గల యుత్తముఁ, బౌరోహిత్యంబు నడపఁబనుచునది.

శాంతి. 2—311

**ఉత్తమౌజుఁడు** సం. వి. స్. పుం.

యుధామన్యుని సోదరుఁడు, ద్రుపదుని కొడుకు, ఇతడు మహారథులలోఁ జేరినవాఁడు. చూ. ఉద్యో. 4-285; ద్రోణ. 4-168, 169, 170, 171. నిద్రించునితని నశ్వత్థామ హత్య చేసెను. సౌప్తి. 1-168, 169

**ఉత్తర** సం. వి. అ. స్త్రీ.

1. విరాటరాజు కూఁతురు, అభిమన్యుని భార్య. విరా. 1-245

విరాటుఁడీమెను ఆటగఱపుటకై బృహన్నల కప్పగించెను.

విరా. 1-243 మొ. 252

ద్రౌపది కోరికపై నుత్తర తన యన్నయగు నుత్తరుఁడు గోగ్రహణ సమయమున కురుసేనలపైకి యుద్ధము సేయఁబోవునపుడు బృహన్నలను సారథిగాఁ జేసికొనుమని యతనికిఁ జెప్పి యొప్పించి బృహన్నలను బిలిచి తెచ్చి యుత్తర సారథ్యంబున కంగీకరింపఁజేసెను.

విరా. 4-2 మొ 32 వ.

కురుసేన మీఁదికి నుత్తర సారథిగాఁ బోవుచున్న బృహన్నలను జూచి యీమె కురువీరులను గెలిచి వారి వస్త్రములలో జిత్రవర్ణ భాసురము

లును లోచనోత్సవకరము లగువానిని బొమ్మపొత్తికలుగాఁ దెమ్మని కోరెను విరా. 4-47 అర్జునుఁడట్లే తెచ్చి యిచ్చెను విరా. 5-804.
విరాటుడు ఉత్తరను అభిమన్యున కిచ్చి వివాహము చేసెను
విరా. 5-889 మొ.

ఈమె భర్త యభిమన్యుని ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధమున కర్ణుఁడు మొదలగు యోధులు వంచనచే వధించిరి. ద్రోణ. 2-122
శోకపరితప్తయగు నీమెను కృష్ణుఁ డోదార్చెను. ద్రోణ. 2-339

ఆ సమయమున కీమె గర్భిణిగా నుండెను, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకం బగు నస్త్రముచే నీమె గర్భము దగ్ధము గాకుండ, శ్రీకృష్ణుఁడు గాపాడెను. ఈమెకు పరీక్షితుఁడు అను కుమారుఁడు జన్మించెను సౌప్తి. 2-80 మొ.

2. ఉత్తరాషాఢా నక్షత్రము.
సీ ఉత్తరాఖ్యయైన యాషాఢమాక్షికార్ద్రాగ్నిన్నంబు అను 2-379

**ఉత్తరంగము** సం. విణ. (అ. ఆ. అ.)
లేచినట్టి తరంగములు గలది, ఉప్పొంగినది.
వ. దేవా జనమేజయుండు వైశంపాయనుతోడ మత్పూర్వ పితామహులగు పాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టి నెలవుల నిలిచి రెట్లు వర్తించిరి చెప్పవే తదాకర్ణనకౌతుకంబు మదీయ చిత్తంబున నుత్తరంగంబగుచున్నయది. స్వర్గ. 2
(ఉత్తలము అని పాఠా.)

**ఉత్తరకుమారుఁడు** సం. వి. అ. పుం.
విరాటరాజు కుమారుఁడు. చూ ఉత్తరుఁడు,
వ. ఆయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని. విరా 4-29

**ఉత్తరకురుభూమి; ఉత్తరకురుభూములు** సం. వి. ఇ. స్త్రీ.
జంబూనది ప్రవహించు ప్రదేశములు జంబూనది నీరము సోఁకిన చోట్లెల్లను సువర్ణ బగునఁట. అందుచే ఈ యుత్తర కురుభూములు సువర్ణమయము లని చెప్పవచ్చును. భీష్మ 1-19 స్వర్గతుల్యములైనవి
అను. 2-322

ఇవి మేరువునకు నుత్తరమున నున్న ప్రదేశములగుటచే ఉత్తర కురు భూములని పేర్వడిసినవి. భూమిపై సంచరించువారి కెవ్వరికి ఇవి అగోచరములఁట. ఎవ్వరును అచ్చట సాధించి కైకొన్నది లేదఁట ఇందు 'హారివాసము' అను పుర మొక ముఖ్యనగరము. అర్జునుఁ డీ నగరముపై విడిసెను అచ్చట వారు అర్జునుని జూచి భయపడి రాజసూయమునకు రత్నాభరణములు ధనములు నిచ్చిరి. సభా. 1–236

క. ఉత్తర కురుభూమియొ లోకోత్తరమగు నట్టి నాక మొకొ.

చూ. అనుబంధము తుది సంపుటము. అను. 2–322

**ఉత్తరగతి** సం. వి. ఇ. స్త్రీ.

ఊర్ధ్వలోకము.

చ. పరమ పవిత్రముల్ యజనభాజనముల్ దము విన్నఁ జూచినన్,
దురితచయంబులం దొలఁగఁ ద్రోవఁగఁ జాలుఁ బ్రదానగర్తకు,
త్తరగతి లాభవైభవము తంగెటి జున్నుగఁ జేయు గోవు లెవ్వరు
దగ వీని గొల్తు రనివారణఁజొత్తురు వారు నాకమున్. అను. 3-46

**ఉత్తరణము** సం. వి. అ. న.

దాఁటుట, అవ్వలిగట్టు చేరుట.

క. గిరివన దుర్గములందును, సరిదుత్తరణంబునపుడు శ్రాద్ధవిధి సమా
చరణ సమయమున వీరిం, బరికీర్తించిన యతండు వడయుశుభంబుల్. అను. 3–193

**ఉత్తరపాంచాలము** సం. వి. అ. పుం.

ఒకానొక దేశము.

వ ఉత్తర పాంచాల శూరసేన....మత్స్య దేశంబుల రాజులెల్లను
దదృయంబునఁ దమతమ దేశంబుల విడిచియున్నవారలు
సభా. 1–112

**ఉత్తరఫల్గుని** సం. వి. ఈ. స్త్రీ.

అశ్విని మొదలగు వానిలోఁ బండ్రెండవ నక్షత్రము.

సీ. ...చెలఁకుఁ దేనియ నుపాసిత్తమైన —తే- భక్త ముత్తర ఫల్గుని.
అను. 2–378

తే. ఫల్గునాహ్వాయ ముత్తరఫల్గునీ వి,శిష్టకాల సంజనతఁజేసి కలిగె.
విరా. 4-146

**ఉత్తరమించు** క్రి. మి.

ఉత్తరదిక్కు అధిగమించు, (ఉత్తరమించి = ఉత్తర దిక్కునుబట్టి)

మధ్యాక్కర :- ఏనేఁడు లగుదెంచె నర్జునుం డేగి యింతకేతెంచుఁ,
బూని దివ్యాస్త్రములఁ వడసి యమ్మహా భుజు భూరిసత్త్వ,నానత
రిపువర్గుఁ జూడఁ గాంతు మిందంచు బ్రాహ్మణుల,తోనేఁగె నుత్తర
మించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు. అర. 4-3

ఇది సం.ము పాఠము. వావిళ్ల ఆనంద అకాడమీల ప్రతుల పాఠము ఉత్తరము మించి- ఉత్తరము మించి యన్న ఛందోభంగమగును. ఈ మధ్యాక్కర 7 ఇంద్ర + 1 సూర్య + 7 ఇంద్ర + 1 సూర్యగణము లొక్కొక్క చరణమునకు గల్గియున్నది. కాన సం.ము పాఠమే సరియైనది. 'ఉత్తరా' అని అకారాంత స్త్రీలింగ శబ్దము 'ఉత్తరదిక్కు' అను నర్థములోఁ గలదు. "ఉత్తరాదిగుదీచీ స్యాత్"- అని అమరము.

**ఉత్తరము** సం. విణ. (అ. ఆ. అ.)

1 శ్రేష్ఠము, శ్రేష్ఠమైనది.

క. ఉత్తర కురుభూమియొ లో,కోత్తరమగు నట్టి నాకమొ.
అను. 2-822

క. ఇవి గమ్య భూము లుత్తమధిషణా. శాంతి. 5-348

2. తర్వాతిది, అనంతరమైనది.

తే. ఖండనంబునఁ దనయుంను గం డడంగి,శోక విని తీవ్రఖేదంబుఁ
బొంది యంబి,కాతనూభవుఁడప్పు డా సూతపుత్రు, నడిగె నుత్తర
వర్తన మాదరమున. భీష్మ. 3-3

3. ప్రధానము, ముఖ్యము.

క. ...బ్రహ్మ వచ్చి శివుఁ గని వినయో,త్తరముగ మ్రొక్కుచు.
శాంతి. 5-440

వ. ఇట్లు బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజావృద్ధియు సస్యసమృద్ధియు నగు
చుండ. ఆది. 5-5; అర. 2-7

4. మీఁదిది, పైది.

క. త్యాగ మొకనేఁవు శమసం, యోగం బుత్తరము దాని నూర్ధ్వము సంతోషాగమము. శాంతి. 5-348

వి. అ. స్త్రీ.

5. ఉత్తరపు దిక్కు.

వ. దశార్ణ దేశంబున కుత్తరంబునఁ బాంచాల జనపదయామ్య దిగ్భాగంబున సాళ్వశూరసేన విషయంబుల లోనం గాళిందీ దక్షిణ తీరం బొరసికొని. విరా 1-141; కల్యా. 2-5

వి. అ. న.

6. సమాధానము, ప్రతివచనము.

వ. నేను నా పోయిన కార్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వారి జోదరుం డిట్లనియె. ఉద్యో. 2-123; ఉద్యో. 4-177

క. నీ తులువ పలుకులకు నీ, కై తోఁచిన యుత్తరంబు నదియొ దురాత్మా. కర్ణ. 2-329; శాంతి. 4-342; శాంతి. 5-540

7. లీనరూపమగు బుద్ధిచే సంప్రాప్యమగు తత్త్వము.

సీ. అవ్యక్తమనఁగ బ్రహ్మంబు నా నుత్తరమనఁగ శివంబన వినుతికెక్కు
-తే- అనామయ మన నొప్పి లీనరూప, బుద్ధిసంప్రాప్యమగు తత్త్వ
మునకు వేదమానిత బ్రాహ్మణులకు నమస్కరించు.

శాంతి. 5-845

8. పైభాగము, ఊర్ధ్వభాగము.

వ. సరస్వతీ సత్త్రంబున నవకృష్ణోత్తరాసంగుండవై నియమకృశీకృత శరీరంబుతోఁ బండ్రెండు వర్షంబు లశేషవ్రతంబులు సలిపిన తపోనిధానంబవు. ఆర. 1-127

వి. అ. పుం.

9. రాఁబోవునది, భవిష్యత్తు.

క. ఉత్తర కాలంబున లో, కోత్తరుఁడు వసిష్ఠ పౌత్రుఁ డుదితజ్ఞానో,

దాత్తుఁడు పరాశరుం డను, నుత్తమ సంయమికిఁ బుట్టి దుజ్జ్వల తేజా. శాంతి. 6—525

**ఉత్తరము ముట్టిన తూర్పు** వి.

ఈశాన్య దిక్కు.

సీ. అనతిదూర,మై యుత్తరము ముట్టినట్టి తూర్పున నొక్క మడుపున్న. శల్య. 2-5

**ఉత్తరవేది** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

యజ్ఞమం దగ్నిస్థాపనార్థమై ఉత్తర దిక్కున వేసిన వేది. కురుక్షేత్రమందలి యొకానొక తీర్థము.

వ. అది ప్రజాపతి యుత్తరవేది యనియును సమస్త దేవతలు నందు వరిష్ఠంబులగు సత్రంబు లాచరించి రనియును దానిఁ గురుం డను రాజు దున్నుటంజేసి దానికిఁ గురుక్షేత్రం బను నామంబు గలిగె ననియు నెఱింగించిన. శల్య. 2—215

**ఉత్తరాభాద్ర** సం. వి. అ. స్త్రీ.

అశ్విని మొదలగు నక్షత్రములలో ఇర్వదాఱవది. ఇది రెండు నక్షత్రములు గలది.

సీ. పూర్వోత్తరాభాద్ర పౌష్ణాశ్వినీ భరణులందుఁ, -తే- గ్రొవ్వుగల మేఁకనంజుఁడు. అను. 2-379

**ఉత్తరాయణము** సం. వి. అ. న.

సూర్యుఁ డుత్తరపు వైపుగా నడచు ఆఱు నెలల కాలము. మకర సంక్రాంతి మొదలు కర్కాట సంక్రాంతి వఱకుఁ గల కాలము.

క. రవిఁ గొల్చి యుత్తరాయణ, మవునంతకు నంపపాన్పునం దిట్లు మహోత్సవ లీల నిలుతు నాకి, దివసంబులఁ జేయవలయు దృఢరథ దగన్. భీష్మ. 3-423

**ఉత్తరారణి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ.

అరణి నుండి యగ్నిని బుట్టింపఁజేయు మఱొక యరటి.

(అరణి = త్రచ్చి నిప్పు పుట్టించెడు కొయ్య)

ఆ. అరణి బ్రాహ్మణుండు గురుఁ డత్తరారణి. ఆశ్వ. 2-97

4 మీఁదిది, పైది.

క. త్యాగ మొకనేఁవు శమసం,యోగం బుత్తరము దాని నూర్ధ్వము సంతోషాగమము. శాంతి. 5-348

వి. అ. స్త్రీ.

5. ఉత్తరపు దిక్కు.

వ. దశార్ణ దేశంబున కుత్తరంబునఁ బాంచాల జనపదయామ్య దిగ్భాగంబున సాళ్వశూరసేన విషయంబుల లోనం గాళిందీ దక్షిణ తీరం బొరసికొని. విరా 1-141; కల్యా. 2-5

వి. అ. న.

6. సమాధానము, ప్రతివచనము.

వ. నేనును నా పోయిన కార్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వారి జోదరుం డిట్లనియె. ఉద్యో. 2-123; ఉద్యో. 4-177

క. నీ తులువ పలుకులకు నీ,డై తోఁచిన యుత్తరంబు నదియె దురాత్మా. కర్ణ. 2-329; శాంతి. 4-342; శాంతి. 5-540

7. లీనరూపమగు బుద్ధిచే సంప్రాప్యమగు తత్త్వము.

సీ. అవ్యక్తమనఁగ బ్రహ్మంబు నా నుత్తరమనఁగ శివంబన వినుతికెక్కి- తే- అనామయ మన నొప్పి లీనరూప, బుద్ధిసంప్రాప్యమగు తత్త్వ మునకు వేదమానిత బ్రాహ్మణులకు నమస్కరించు. శాంతి. 5-845

8. పైభాగము, ఊర్ధ్వభాగము.

వ. సరస్వతీ సత్త్రంబున నవకృష్ణోత్తరాసంగుండవై నియమకృశీకృత శరీరం బుతోఁ బండ్రెండు వర్షంబు లశేషవ్రతంబులు సలిపిన తపోనిధానంబవు. అర. 1-127

వి. అ. పుం.

9. రాఁబోవునది, భవిష్యత్తు.

క. ఉత్తర కాలంబున లో,కోత్తరుఁడు వసిష్ఠ పౌత్రుఁ డుదితజ్ఞానో,

దాత్తుఁడు పరాశరుం డను, నుత్తమ సంయమికిఁ బుట్టు దుజ్జ్వల
తేజా. శాంతి. 6—525

**ఉత్తరము ముట్టిన తూర్పు** వి.

ఈశాన్య దిక్కు.

సీ. అనతిదూర,మై యుత్తరము ముట్టినట్టి తూర్పున నొక్క మడు
వున్న. శల్య. 2-5

**ఉత్తరవేది** సం. వి. ఇ. ఈ. (స్త్రీ).

యజ్ఞమం దగ్నిస్థాపనార్థమై ఉత్తర దిక్కున వేసిన వేది. కురుక్షేత్రమందలి యొకానొక తీర్థము.

వ. అది ప్రజాపతి యుత్తరవేది యనియును సమస్త దేవతలు నందు
పరిపూర్ణంబులగు సత్రంబు లాచరించి రనియును దానిఁ గురుం డను
రాజు దున్నటంజేసి దానికిఁ గురుక్షేత్రం బను నామంబు గలిగె
ననియు నెఱింగించిన. శల్య. 2—215

**ఉత్తరాషాఢ** సం. వి. ఆ. (స్త్రీ).

అశ్విని మొదలగు నక్షత్రములలో ఇర్వదాఱవది. ఇది రెండు నక్షత్రములు గలది.

సీ. పూర్వోత్తరాషాఢ పౌష్ణాశ్విసీ భరణులందుఁ, -తే- గ్రొవ్వుగల
మేఁకనఁజుఁడు. అను. 2-379

**ఉత్తరాయణము** సం. వి. అ. న.

సూర్యుఁ డుత్తరపు వైపుగా నడచు ఆఱు నెలల కాలము. మకర సంక్రాంతి మొదలు కర్కాటక సంక్రాంతి వఱకుఁ గల కాలము.

క. రవిఁ గొల్చి యుత్తరాయణ, మువునంతకు నంపపాన్పునం దిట్లు
మహోత్సవ లీల నిలుతు నాకీ, దివసంబులఁ జేయవలయు దృఢ
రక్ష దగన్. భీష్మ. 8-428

**ఉత్తరారణి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. (స్త్రీ).

అరణి నుండి యగ్నిని బుట్టింపఁజేయు మఱొక యరటి.

(అరణి = త్రచ్చి నిప్పు పుట్టించెడు కొయ్య)

ఆ. అరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి. అశ్వ. 2-97

**ఉత్తరాషాఢ** సం. వి. ఆ. స్త్రీ.

అశ్విని మొదలగు ఇరువదేడు నక్షత్రములలో ఇరువదొకండవ నక్షత్రము.

సీ. ఉత్తరాఖ్యయైన యాషాఢ మాతిశకార్ధాగ్నిమ్నంబు. ఆమ. 2-379

**ఉత్తరాసంగము** సం. వి. అ. పుం.

ఉత్తరీయము.

వ. సరస్వతీ సత్త్రంబున నవకృష్ణోత్తరాసంగుండవై నియమ కృశీకృత శరీరంబుతోఁ బండ్రెండు వర్షంబు లశేషవ్రతంబులు సలిపిన తపోనిధానంబవు. అర. 1-127

**ఉత్తరించు** సం. స. క్రి.

దాఁటు, కడపు.

వ. అకృతాత్మ్మలకుం గడవరాని యట్టి లోభవాహిని సత్యతీర్థంబున నుత్తరించి. శాంతి. 5-184

తే. జీవుండు భవాబ్ధి యుత్త,రింప లేఁడిది నిజము గరిష్ఠచరిత
శాంతి. 5-586

సీ. కౌరవసైన్య సాగర ముత్తరింపంగఁ, గంటిమి.
అశ్వ. 3-6; అర. 4-228

**ఉత్తరీయము** సం. వి. అ. న.

పై వస్త్రము (పురుషులు ధరించు పైబట్ట, స్త్రీలు ధరించు మేలి ముసుఁగు వస్త్రము లేక పైఁట)

తే. అనుమతి చేయుఁడు మీ దనుఁడు, వార లుత్తరీయంబులు వదన
వినిహితములుగాఁ జేసికొని రోదనము రవంబు, లెసఁగఁ జేసిరి.
ఆశ్ర. 1-96

వ. అన్నారి రత్నంబును రయంబునం జేరి వ్రేటు గంటిం దొరంగు రుధిరంబుఁ దన యుత్తరీయంబున మెత్తనయొత్తి
విరా. 5-260; అర. 6-155

**ఉత్తరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

శ్రేష్ఠుఁడు.

తే. ...అతఁడు కీర్తి,ధరుఁడు కరుణోత్తరుఁడు. విరా. 2-189

సీ. లోకంబులెల్లఁ గల్గుట నిల్చుఁ గాదుగుట, తనయందయగు మహో
త్తరునిఁ గొలుతు. శాంతి. 2-20

వి.
విరాటుని కొడుకు, భూమింజయుఁడు, తల్లి సుదేష్ణ.

దీని నెఱింగింత ముత్తరునకు. విరా. 4-16; విరా. 5-288

ఈతఁడు బృహన్నలను సారథిగాఁ జేసికొని యుత్తర దిక్కునందలి గోవులను బట్టిన కౌరవుల మీఁదకు యుద్ధమునకుఁబోయి కౌరవసేనఁ జూచి వడవడ వడంకి పాఱిపోవుచుండ బృహన్నలయైన యర్జునుఁ డతనిని వెంబడించి రథముపై సారథికిగాఁబెట్టి తాను రథికుఁడై తమ ఆయుధములున్న జమ్మిచెట్టుయొద్దకు వచ్చి యుత్తరుని చెట్టెక్కించి యాయుధముల కట్టు విప్పించి గాండీవము నందిపుచ్చుకొనెను. ఉత్తర సారధ్యముతో అర్జునుఁడు కౌరవ సేనను జయించి గోవుల మరలించెను. విరాట చతుర్థాశ్వాసము - విరాటుఁడు తన కుమారుఁడే కౌరవులను జయించెనని యానందపడుచుండఁ దాను గాదనియు నర్జునుఁడు జయించెననియు నుత్తరుఁడు తండ్రికిఁ జెప్పెను. విరా. 5-279 మొ, 303 వ.

ఉత్తరుని తల్లి సుదేష్ణపాండవుల తల్లియగు కుంతికిఁ జెల్లెలు కూఁతురు. ఆ సంబంధము వలన ఉత్తరుఁడు పాండవులకు మేనల్లుడు. విరా. 4-128 ఇతఁడు మహారథుఁడు ఉద్యో. 4-260; ఈతఁడు పాండవ పక్షమున శల్యునితో బోరి యతనిచే భీష్మని ప్రథమ దివస యుద్ధమున మరణించెను. భీష్మ. 1-283

**ఉత్తరోత్తరము** క్రి. విశ.

మఱిమఱి, క్రమక్రమము, ఎడతెగక.

వ. సువర్ణష్ఠీవి యను పేరిడి ప్రియంబునం బెనుచుచు వాని వలనం గనకంబును దినంబు నుత్తరోత్తరాభివృద్ధి యగుచుండ సమృద్ధినొంది. ద్రోణ. 2-191

**ఉత్తరోలూకము** సం. వి. అ. పుం.

ఉత్తరోలూకమను పేరుగల దేశము.

వ. (అర్జునుఁడు) ఉత్తరోలూక వామదేవ మోదాపుర సుదామ ససంకు-

లంబులను దేశంబుల రాజుల జయించి. సభా. 1-285

**ఉత్తలపడు** దే. అ. క్రి.

1. పరితపించు, వగచు.

వ. అప్పాలంతి వలనం జిక్కి చిత్తం బుత్తలపడుచున్నయది.
విరా. 2-61

క. పరిజనహీనత దీనతఁ, బొరసిన యెడ ముట్టుకొని రిపుప్రకరము నిష్ఠుర వాక్యమ్ముల నమ్మెయిఁ, బరితాపము సేయ నేమి భంగి నిలిచెనో.

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుం డును దమ్ములుఁ గొడుకులును ద్రుపద పుత్రులును బొదువుకొని పలుకు పలుకులను జిత్తం బుత్తలపడ నాననంబు వల్లటిల్ల.
శల్య. 2-83

2 క్షుభితమగు, కలఁగు.

క. ఇత్తఱి మనష్య భువనం, బుత్తల పడుచున్నయది మహోగ్రాసుర దుర్వృత్తముల నీవు కరుణాయత్తమతిం బుట్టవయ్య యదు వంశమునన్.
భీష్మ. 2-267

వ. అనుచు నుత్తలపడు నయ్యవసరంబున నుత్తరుండు పుత్తెంచిన గోపాలురు పఱతెంచి.
విరా. 5-288

3. త్వరపడు.

వ. భీష్ముదెసకుం జనుచున్నం గనుంగొని యమ్మహీవల్లభు తమ్ములును శౌరిసాత్యకులును బరమాప్తులగు ధరణీశులు నతని చేతోవృత్త మెఱుంగమి నుత్తలపడు చిత్తంబులతో వాహనంబులు డిగ్గి యతనిం గూడంజని యప్పుడు.
భీష్మ. 1-158

4. కోపపడు, ఆగ్రహించు.

క. పలుమాఱును రామికి నుత్తలపడియెను దాన నిట్టి దశ నతఁడొందెన్.
శాంతి. 3-515

"యదా బకపతీ రాజన్ బ్రహ్మాణం నోపసర్పతి.
తతో రోషాదిదం ప్రాహ ఖగేంద్రాయ పితామహః"
సం. భా. శాంతి 173-8

**ఉ_త్తలపఱుచు** దే. స. క్రి.

ఉత్తలపడఁజేయు (తపింపఁజేయు)

వ. పాంచాలి వలని తగులు చిత్తంబు నుత్తలపఱుపం దలరి.

విరా. 2-82

**ఉ_త్తలపాటు** దే. వి. (√ఉ_త్తలపడు) ఉ_త్తలపడుట

(కలఁత, సంక్షోభము)

క. అత్తఱి నీతనయుం డెలుఁగెత్తి రథికవరులతోడ విట్లను నీదు, ర్వృత్తుని బోదువుఁడు భీముని, యుత్తలపాటుకువు కడఁక నుడువుఁడు గడిమిన్.

భీష్మ. 2-372

క. అనుడు నతఁడు దనచిత్తంబునఁ దోఁచిన విధము ధర్మపుత్రునితో నిట్లని చెప్పె నాతనికిఁ బుట్టిన యుత్తలపాటు గొంత డిందు పడంగన్.

విరా 1-99

**ఉ_త్తలపెట్టు** దే. స. క్రి. (√ఉ_త్తలము) ఉ_త్తలపడఁజేయు

1. పరితపింపఁజేయు.

వ అప్పు డశ్వత్థామోద్దామ మరణకరణ స్మరణంబు దన చిత్తంబుత్తల పెట్టఁ గోపంబు దీపింప నాసీనుడై.

సౌప్తి. 2-30

క. మత్తుఁ బ్రమత్తుని విషయా, యత్తుని దుర్బలునిఁ జూచి యిట్టి పగతుపై, నెత్తువది శిఖి విపాదుల, నుత్తలపెట్టునది యతని యుర్వి కడంకన్.

శాంతి. 2-281

ఉ ...అత్యుత్తమతేజు భూరిగుణు నొప్పెడు మెత్తనిమేను వాని నెట్లుత్తలపెట్టిరో పలువు రుగ్రమనమ్కులు గూడి యక్కటా.

ద్రోణ. 2-8

**ఉ_త్తలమందు** దే. అ. క్రి. (√ఉ_త్తలము)

పరితాపపడు.

ఉ. ...నన్నుత్తల మందఁజేయుటకునో తలపోసి యెఱుఁగనయ్యెడున్.

విరా. 2-84

**ఉ_త్తలము** దే. వి.

1. పరితాపము.

వ అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలం బుడిపి

కొని. విరా. 1-161; మౌస. 170; అను. 1-8

క. చిత్తంబునఁ జైకొనియెను, నుత్తలమడఁచుచును ముఖపయో
రుహామునఁ దఃళ్కొత్తెడు వెదనవ్వునఁ బ్రియు, చిత్తంబిగురొత్తఁ
జనియెఁ జెలువ యడవికిన్. అర. 7-210

శ్లో. సహాభర్త్రా హసంతీవ హృదయేన విదూయతా,
సం. భా, అర. 295-29

2. సంక్షోభము.

క. అప్పయుఁ బరిజనములఁ దనుఁ,దప్పక కనుఁగొనుచు నుండఁ దగ
వేది కరఁ,బొప్పని తమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు
గదురఁగ నచ్చోన్. విరా, 2-36

8. త్వర, వేగము, శీఘ్రము.

చ. విలు దునునూడి వెండియును విండులు నాల్గతఁ డెత్త నెత్త నుత్తల
ముగఁ ద్రుంచివైచె గదఁ దత్తురగంబుల సూతుఁ జూడ.
ద్రోణ. 5-154

శ్లో. తదప్యస్య ధనుః క్షిప్రం చిచ్ఛేద లఘుహస్తవత్,
ద్వితీయం చ తృతీయం చ చతుర్థం పంచమం తథా,
ఆత్తసూత్తం మహారాజ భీమస్య ధనురాచ్ఛినత్.
సం. భా. ద్రోణ. 167-51. 52

**ఉత్సారణుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

తరింపఁజేయువాఁడు.

మ. ...నమ్రాపరుత్తారణా. శల్య. 2-420

**ఉత్తారము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కుటమైన ధ్వని గలది.

మహాస్రగ్ధర :- తెలుచుగ నగు నుత్తారసల్లాపముల్ సేయు.
సౌప్తి. 1-201

**ఉత్తాలము** సం. విశే. (అ. ఆ. ఆ.)

1. గొప్పది, బలీయమైనది, భయంకరము, మిక్కిలి యురువైనది, మేలైనది, శ్రేష్ఠము, పొడువైనది.

సీ. తాలకేతువు మహోత్తాలమూర్తి. భీష్మ. 1-268

2. మిక్కిలి యెత్తైనది.

ఉ. ఆ లవణాబ్ధి మధ్యమునయందుఁ ద్రికూటనగంబుమీఁద సు,త్తాల విశాలసాలమణిధామ సముజ్జ్వలమైన లంకయన్, బ్రోలిని గంటి. ఆర. 7-26

**ఉత్తాలితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి యెత్తు గావింపఁబడినది.

సీ. ఉత్తాలితాట్టాలకాభీలమై. ఆర. 7-57

**ఉత్తుంగము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి యెత్తైనది.

తే. అనపరాధుఁ దపోనిధి నధికశాంతి, యుక్తుఁ జంపిన పాపాత్ము మఱకవట్టి, మ్రింగజాలెడు వాని నుత్తుంగ దేహు, నేను సృజియింతుఁ జూడుఁడీ యీక్షణంబ. ఉద్యో. 1-121; ఆది 2-30

2. ఉబికినది, విస్తరించినది, విరివి చెందినది.

క. గాంగేయుఁ డవష్టంభోత్తుంగతనుం డగుచు నిట్లు దూలిన కురుసే,నాంగంబులఁ బురికొలిపి సు,సంగతములు సేసె సమరపమ్ముఖములుగాన్, విరా. 5-67

**ఉత్తుఁడు** వై. వి. (సం. యుక్తః)

అర్హుఁడు, తగినవాఁడు, పాత్రుఁడు.

చ. ...నాదుసిరి కుత్తుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితో. శాంతి. 8-224

**ఉత్థము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పుట్టినది.

శా. పక్షివ్యాకులముఁం బరేతనిలయోపాంతోత్థమన్- ఈ శమీ,వృతుంబు. విరా. 1-164

2. పైకెగసినది.

సీ. రథ కరి తురగోత్థ పృథివీపరాగంబు, దెసల నాకసమున దీటుకొనఁగ. ద్రోణ. 1-189

**ఉత్థానము** సం. వి. అ. న.

లేచుట, పైకి లేచుట.

క. ఇమ్మెయి గుహ్యతలము శుద్ధమ్ముగ నొనరించి కేల్ పదంపడి జల ధౌతమ్ముగఁ జేసి సముత్థానమ్మ పిదపఁ బాదశోధనము సేయఁ దగున్. అను. 3-281

తే. జాపకులకు యోగులకును సమము పుణ్యగతి విశేషంబు ప్రత్యక్ష కలితమందు, జాపకులు నిర్భరోత్థానశక్తి నధికు,లనుచు వక్త్రింబు విచ్చి రమ్మనిరా నధిప. శాంతి. 4-167

**ఉత్థిత** సం. విణ. (అ. ఆ. అ.)

1. లేచి నిలఁబడినది.

తే. అనినఁ గొండొక తెలివొందు నానపంబు,తోడ నుత్థితయైన యా తోయజాక్షి, ప్రభలు పర్యంగ నొప్పు నావర్మరాగ,రత్న మణిచేత నిడికొని రాజుఁ జూచి. సౌప్తి. 2-97; ఆశ్వ 3-180

2. ఉద్గమించినది, పైకి వచ్చినది.

సీ. ఉదరంబు లందుండి యుత్థితయై శోక,విహ్వలత్వంబున వికల గమన యగుచు. అను. 5.474

**ఉత్థితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కలిగినది, పుట్టినది.

చ...కరీంద్ర ఘంటికా, ధ్వుదిత నినాదమున్ రథవరోత్థిత ఘోషము నుత్కటంబుగన్. విరా. 5-89

చ. కనుఁగొని వృష్ణివీరులు నికామ సముజ్జ్వల రోషవహ్ని నెమ్మన మున నుత్థితంబుగ... మౌస 52

2. పూనినది, ఉద్యుక్తము.

సీ. అఖిల జగత్ప్రభునకు దేవదేవు న,నంతునిఁ బురుషోత్తమాభిధాను నంచితనామ సహస్రకంబున సంస్తు,తించుచు సంతతోత్థిత మన స్కుఁడై ... అను. 5-820

**ఉత్థితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. లేచినవాఁడు, లేచి నిలువబడినవాఁడు,

వ. అనినం బ్రీతచేతస్కు లగుచు నుత్థితులై లలాటంబుల నంజలి పుటంబులు ఘటించి. ద్రోణ. 2-868

తే. మీ వగపెల్లఁ దీర్ప నిపుడ, యుత్థితుండగు నీ కౌరవోత్తముండు. ఆశ్వ. 4-82

2 ఉద్యుక్తుఁడు, పూనినవాఁడు.

క. అని పలికిన మీ మానంబుల, వనట సమస్తంబుఁ బుచ్చివై చెద నాతోఁ, జనుదెండు మీరు గంగకుఁ, గనియెద రనిఁ దెగిన బంధు గణముల నచటన్-తే-అనుచు నుత్థితుఁడగుటయు. ఆశ్ర. 2-114-115

**ఉత్పత్తి** సం. వి. ఇ. స్త్రీ.

పుట్టుక, జననము.

క. లోకోత్పత్తి స్థితివిల,యాకలన వినోద, మునిగణార్చిత. భీష్మ. 2-264

వ. నీకుం బుత్రోత్పత్తి గావింపంజాలు చరువు సంపాదించెద. అను. 1-108

**ఉత్పథము** సం. వి. అ. పుం.

కాని త్రోవ, తప్పుదారి

సీ. దక్షుఁడై భూపతి దండనీతి నయింప,కున్న నన్యాయ్యసులు నుత్పథ ప్రవర్తను లగుదురు. శాంతి. 1-108

**ఉత్పన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టినవాఁడు.

క. ఉన్నతటి వివిధదేశో,త్పన్నులు నద్భుతవిధాయి బలవిక్రమసం, పన్నులు నగు మల్లులు. విరా. 2-4

**ఉత్పలగంధి** సం. వి. ఇ. స్త్రీ.

స్త్రీ, (కలువ వాసనవంటి వాసన గలది)

ఉ. ఉత్పలగంధి నన్నడుగు మొగ్గను బంపుము కల్లుదేర. విరా. 2-98

**ఉత్పలదళాక్షి** సం. వి. ఈ. స్త్రీ.

(కలువ ఱేకులవంటి కన్నులు గలది) స్త్రీ.

సీ. దంతమౌక్తిక రుచి దలకొన మఱుమాట, పలిగినఁ గాదె యుత్పలదళాక్షి. విరా. 2-45

**ఉత్పలమాల** సం. వి. ఆ. స్త్రీ.

కలువ పూవులదండ.

క. ఆలోకన యారథికుని, ఫాలస్థలి వోలి నెనయఁ బడి వారసముల్ గీలించిన నవి యచ్చట, నీలోత్పలమాలవోలె నెఱయం బొలిచెన్. ద్రోణ. 4-230

**ఉత్పలము** సం. వి. అ. న.

1. కలువ.

సీ. అసితోత్పలచ్ఛాయమై దంష్ట్రికా చతుష్టయమును. శాంతి. 8-109

2. నల్లకలువ.

వ. కమలకైరవోత్పలాకీర్ణం బగు కొలని నమకరించు ప్రదేశంబులును భీష్మ. 8-247

**ఉత్పలాక్షి** సం. వి. ఈ. స్త్రీ.

స్త్రీ (కలువఱేకుల వంటి కన్నులు గలది)

పృథ్వి :- తిలోత్తమ యనంగ నొక్క యువతీలలామంబు నుత్పలాక్షి సృజియించె. ఆది. 8-108

**ఉత్పలావనము** సం. వి. అ. న.

ఒక తీర్థస్థానము.

సీ. నెల వసించి, నైమిశంబునఁ బొందు నరవర పురుషమేధ ఫలంబు నట్టి విధంబ యుత్పలావనంబునఁ జేయఁగా. అను. 2-82

**ఉత్పలిని** సం. వి. ఈ. స్త్రీ.

ఒక నది, అర్జునుఁడు తీర్థయాత్రా సమయమున దీనిని జూచెను.

వ. ఉత్పలినియుఁ గౌశికియు, నందయు, నపరనందయు, గయయు, గంగయు, గంగాసాగర సంగమంబును జూచుచు. ఆది. 8-186

**ఉత్పాతము** సం. వి. అ. పుం.

1. అరిష్ట లక్షణము.

వ. అతనిం (అర్జునుని) గనుంగొని కౌరవ సైనికులు గలంగిన మనం
బుల తోడ నివ్వెఱపడి యుండ వారలం గనుగొని తోచు నుత్పా
తంబుల నాలోకించి గురుం డిట్లనియె. విరా. 4-85

వ. ఇది రాక్షసనాశంబునకుం దోఁచిన యుత్పాతంబు
శాంతి. 3-443; మౌస. 2

2. నాశము.

వ. చ్యవనుండు నిజవంశమునకుం గుశిక కులంబు గారణంబుగా సంక
రంబు గలుగఁగలయది యని యెఱిఁగి యక్కుశిక కులంబునకు
నుత్పాతం బాపాదింపం గోరి కుశికభూపాలు పాలికిం జనిన.
అను. 2-291

**ఉత్పాదనము** సం. విశే. (అ. ఆ. అ.)

పుట్టించునది, కలిగించునది.

క. భక్తిరసైకా, స్వాదన సుకరానందో,త్పాదన దివ్యమతి నగుచుఁ
దగ నెఱిఁగింతున్. భీష్మ. 1-69

వి. ఆ. న.

2. పుట్టించుట, కలిగించుట.

ఉ. ఇది సేయు నాయురు,త్పాదన మిచ్చు సంతత శుభంబులు.
శాంతి. 4-570

**ఉత్పాదము** సం. వి. అ. పుం.

పుట్టుక, సంభవము, కలుగుట.

క. ఆదిత్యమరుద్వసురు,ద్రాది దివిజగణము లెల్ల నవయవ రూపో
త్పాద కలితు లెవ్వానికి, నా దేవుని సంస్తుతింతు హరి దేవాత్మున్
శాంతి. 2-37

**ఉత్పాది** సం. విశే. (న్. నీ. న్.)

పుట్టించునది, కలిగించునది.

క. నీవగు తనువున దివ్యా, మోదము సాంద్రము సోకు ముట్టెను

నత్యాహ్లాద మహైశ్వర్యసమ్మత్పాది యగుచు నీ గతాగతములం
జెపుమా. అను. 2-452

**ఉత్పాదించు** సం. స. క్రి.

పుట్టించు.

వ. నా సేన నడచునప్పుడు వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు
ఉద్యో. 2-262

వ. రక్తజలోద్రిక్తంబును నగు నదీ ప్రవాహంబు నుత్పాదించె.
ద్రోణ. 5-84

**ఉత్పాదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టింపఁబడిన వాఁడు.

క. దయ నీచే నుత్పాదితు,లయిన సుతులు దమ్మెఱుంగనంతకు భీష్మం,
డయనయశాలి సమర్థుం, డయి చేకొని రాజ్యభార మారయు
చుండున్. ఆది. 4-250

**ఉత్పాదిల్లు** సం. అ. క్రి.

1. పుట్టు.

క... విష్ణుదేవునంశంబున ను, త్పాదిల్లెఁ గృష్ణుఁ డపగతఖేదుఁడు
వసుదేవ దేవకీదేవులకున్ ఆది. 8-74

2. కలుగు.

క. ...యుష్మద్వైరమునఁజేసి యొగ్గు,త్పాదిల్లు ధరిత్రిఁ బ్రజకు భయ
జననంబై. సభా. 2-135

**ఉత్పీడ** సం. వి. ఆ. స్త్రీ.

1. కలఁత.

క. కీడాడిన మేలాడుచుఁ, జూడన మొనరించిరేని దరహాసముతో,
నీడం బోదును క్రోధో,త్పీడ వారయ దెప్పుడును మదీయ వ్యాప
యమున్ శాంతి. 5-548

**ఉత్పీడనము** సం. వి. అ. న.

ఉత్పీడ, బాధ.

క. ప్రాణాయామము క్రమమునఁ, బ్రాణోత్పీడనముగాని భంగి నడుపుచున్, ఘోరాగ్రస్థితి విషయ, శ్రేణి దొలఁగియుండి యోగ సిద్ధతఁ బడయున్. శాంతి 6-118

**ఉత్ఫుల్లము** సం. విణ. (అ. ఆ. అ.)

1. విప్పారినది, మిక్కిలి తెఱచినది (కన్ను)

వ. అమ్మారుతి మోదంబెసఁగ మోడ్పుగేలు ఫాలతలంబున మోపి కొనుచు నుత్ఫుల్లంబులగు లోచనంబుల నొప్పి నిజాగ్రజుం జేరం జని యిటకొనియె. శల్య 2-310; కర్ణ 8-254

2. వికసించినది (కన్ను)

వ. ఉత్ఫుల్లకమల కల్హార కేసర కరాళ కలిత కల్లోలమాలినియు. అర, 4-148

**ఉత్సంగము** సం. వి. అ. పుం.

1. ఒడి.

క. ఇక్కురువరు నాంధ్రురలో, నొక్కత యతి రమ్యమూర్తి యుత్సంగమునం, దక్కర మిడికొని పనవెడు, నెక్కుడు వగమాని యదె మహీధర కంజే స్త్రీ. 2-182

2. తొడ.

ఉ. (గంగ) ప్రతీపవసుధాధిపుశాల విశాల దక్షిణో,త్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబు వీలతోన్. ఆది. 4-184

3. తీరభూమి, ప్రాంతప్రదేశము.

వ. అట్టి శారదాగమనంబున... అనేక మునిలోక సతత సంసేవ్య మాన విపుల పులినోత్సంగయు. అర. 4-148

**ఉత్సర్పితము** సం. విణ. (అ. ఆ. అ.)

పై కుబికినది, అతిశయించినది.

ఉ. శూర్పణఖా నిమిత్తమున శూరు లనేకులు రక్కసుల్ మహో,త్స ర్పిత రోషులై బహుళ సైన్యయుతంబుగ నెత్తి వచ్చుడున్. అర, 6-819

**ఉత్సవము** సం. వి. అ. పుం.

1. వేడుక.

చ. ... సంగరోత్సవో,ద్యమ రభసాతిరేకము బయల్పడు టించుక లేక. విరా. 2-324

ఆ. ఉత్సవంబుమీఁద నుత్సవ మందుచు, సుఖముమీఁద సుఖము సొప్ప డంగ. శాంతి. 4-74

2. సంతోషము.

ఆ. అతఁడు వచ్చెనేవి నస్మచ్ఛిలీముఖ, వాత చలిత హృదయపద్ముఁ జేసి, వెగడు పఱిచి యోధవీరుల కెల్ల ను,త్సవ మొనర్తు బాహు దర్ప మొప్ప. విరా. 4-99

క. సత్సంగతి సజ్జనులకు, నుత్సవ మొనరించు నృగున కున్నతిఁ ద్రి జగ, ద్వత్సలుఁడగు కృష్ణుంషు స,ముత్సుకతం జేరఁజనుట యొసఁ గిన మాడ్కిన్. అను. 2-442

3 ఆనందమును బుట్టించు కార్యము (పండుగు, వివాహము మొ)

వ. ఇవ్విధంబున రెండు దెఱంగుల చుట్టంబులునైన భూపతులు దమ తమ విభవంబులు మెఱసి వచ్చియుండ విరాటుండు పురంబున నుత్సవంబు పాటించిన. విరా. 5-381

వ. అది వీడుఁబట్టు గాఁదగియె కుపట్టని పలికి వాసుదేవుఁడు రేపకడయ వచ్చు నంతకుమున్న యింతయుం గావింపవలయు నని పనిచి పురం బున నుత్సవంబు పాటుం డని నియోగించి. ఉద్యో. 3-155

**ఉత్సహనము** సం. వి. అ. న.

మిక్కిలి ఓర్పు.

క. మహితాయుధ సంప్రహతులు, సహించు దృఢదేహ ధృతుల సడి సన్నమహో,త్సహనులు యాదవ వీరులు, నిహతులయిరి దుంగలను మనీషి ప్రవరా. మౌస. 209

**ఉత్సహనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సహించు స్వభావము ఎక్కువగాఁ గలవాఁడు. మిక్కిలి ఓర్పు గలవాఁడు

చూ-ఉత్సహనము.

**ఉత్సహించు** సం. అ. క్రి.

1. ప్రయత్నించు, కడఁగు,

మ. ...వరిష్ఠంబగు నీదు కృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహింపవు నీకేమి కొఱంత. ఉద్యో. 1-189

వ. ...పగతురఁ దెగటార్చునెడ నన్యాయంబనక యుపాయం బెయ్యది దొరకొనిన దాన నుత్సహింప వలయుట శాస్త్రసిద్ధంబ కాదే. సౌప్తి. 1-24

తే. అనఘులార సంసిద్ధుల రైతి రింకఁ, దడయ నేటికి నిర్మలోదాత్త గతికి, నుత్సహింతురుగా కన్న మత్సరాది, బంధకంబులఁ బోఁ ద్రోచి బ్రాహ్మణుండు. శాంతి. 4-162

స. క్రి.

2. ప్రోత్సహించు, ఉత్సాహపఱుచు.

క. కావున మన సైన్యంబులు, సేవ సెడక సంగరంబు సేయు నటులుగా, నీవుత్సహించి నిజబాహావిభవము సూపు శక్తికను రూపము గాన్. ద్రోణ. 5-88

3. పూను, ధరించు.

సీ. ఏ యాయుధంబున నెమ్మెయిఁ బోరంగ నిష్ట మయ్యది యుత్సహింపుఁ డనిన. సభా. 1-197

**ఉత్సాదనము** సం. వి. అ. న.

సంహరించుట, నశింపఁజేయుట.

క. ఉత్సాహంబున శత్రుకులోత్సాదనవిధి యొనర్చి యున్నత సామ్రాజ్యోత్సవము నొందు పుత్రులఁ, నుత్సుకతం జూతుగాక యూఱడు మింకన్. ఉద్యో. 3-206

**ఉత్సాదము** సం. వి. అ. పుం.

నాశము.

క. మా కెమ్మెయి సామ్రాజ్యము, సేకుఱు నెబ్బంగి బహుళసేనోత్సాద, వ్యాకులతరాక తక్కుం, జేకొని యత్తెఱఁగు కరుణఁ జెప్పఁగ వలయున్. భీష్మ. 3-298

**ఉత్సాది** సం. విణ. (న్. నీ. న్.)

నాశము చేయునది.

తే. సీల పింగళదేవా మాభీంభంగి,కముగ నమ్మెయి వర్తించు జము౯
డు సకల, వృష్ణి భోజాంధ కోత్సాది విహరణమున, మునుల
శాపంబు ప్రేరేప మన జనాథ. మౌస 1-18

**ఉత్సాదించు** సం. స. క్రి.

నశింపఁజేయు.

వ. దైవానుకూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమి సేయుఁ
బాండవు లేమి దైవసంపన్నులైరోయని వగచి యీయవసరం
బున ద్రుపదు భేదించి పాండవుల నుత్సాదింపవలయు నెట్లనిన.
ఆది. 8-12

**ఉత్సారకము** సం. వి. అ. న.

తొలఁగించునది. పోఁగొట్టునది.

శా. ...సంక్లేశోత్సారక దివ్యనామ. ఆశ్ర 1-184

**ఉత్సారణము** సం. వి. అ. న.

తొలఁగించుట, పోఁగొట్టునది.

మాలిని :- ఇందుబింబ,క్షరదమృతవికారోత్సారణానందరూపా.
శల్య. 2-422

**ఉత్సారి** సం. విణ. (న్. ణీ. న్.)

పోఁగొట్టువాడు, తొలఁగించువాఁడు.

మాలిని... జననమరణ దుఃఖోత్సారి సర్వోపకారి. ద్రోణ. 1-397

**ఉత్సార్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.)

పోఁగొట్టఁబడుచున్నది. నివారింపఁబడుచున్నది.

మాలిని: - సకృకలసదపాంగోత్సార్యమాణా శ్రితార్తి.
అను. 2-478

**ఉత్సార్యమాణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వెడలఁగొట్టఁబడుచున్నవాఁడు.

వ అనవుడు బృహద్ద్యుమ్న ప్రేరితులయిన జనులచేత నుత్సార్య
మాణుండయి యర్వావసుం డసఁడయె. అర. 3-278

**ఉత్సాహత** సం. వి. ఆ. స్త్రీ.

కుతూహలత్వము.

ఉ. కౌరవ, వ్యూహము నోర్చి నీపసం నొక్కఁడుఁ దక్కకయుఁడ
సత్వరోత్సాహతఁ దెచ్చెఁ గావలయుఁ దప్పదు నావలు కట్ల
చూడుమీ. విరా. 5-267

**ఉత్సాహము** సం. వి. అ. పుం.

1. ప్రయత్నము, పూనిక.

వ. అశ్వత్థామ యుత్సాహం బమ్మహాత్మునకు (కృష్ణునకు) హృదయ
గోచరం బగుటయు దిగ్గనలేచి పారాశర్యు చరణంబులకు విన
తుండై యవ్విభునకుం బ్రణమిల్లి యతనితో నిట్లనియె.
కల్య. 2-374

సీ. మన వారిలోన నొక్కనినైనఁ బిల్వ కుత్సాహంబు నేసిన సాహ
సంబు. విరా. 2-360

2. కౌతూహలము.

తే. వత్సరంబునఁ గడచను వ్రతము నాకు,దాని నీపాలఁ జల్పి యుత్సా
హవృత్తి, మెఱయ నాకుఁ గృతఘ్నత నెఱపి తొల్లి,యెగ్గు నేసిన
వారి జయింపఁబోదు. విరా. 1-198

3 ఆస్థ, అభిలాష

శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంత చిం,
తాధూతుండనైన నాకుఁ బరమోత్సాహంబు సందిల్ల దు, స్సాధం
బైన విరుద్ధ కార్యమిటు లాపన్నంబుగా సంఘటిం,తే ధర్మా
త్మజుఁ డాత్మ మెచ్చఁ బగ సాధిపంగఁగా నల్పమే. విరా. 2-275

4. సంరంభము.

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజమగు కడిమి కలిమి నరిసేన
గరం, బుక్కణఁ దంత్రీ పాలుం, డొక్కఁడ పొలియించె నీ రణో
త్సాహమునన్ విరా. 3-280

5. బలము.

క. తమకు బలంబెక్కిన తఱి, సముచితమగు విగ్రహంబు శత్రుల కు త్సాహము మీఱి పుచు కర్తవ్యము సంధియనంగ విందు మార్యు లచేతన్. శల్య. 1-56

6. పురుషకారము, మానవ ప్రయత్నము.

సీ. దైవంబొ కర్మవర్తనము జనంబు ను,త్సాహంబొ యనిన నతండు దైవ, మోపి కర్మంబు సేయుట లేమ...కృషివో లెనుండుఁ బౌరుష గతి ...ఉద్యోగ రహితుఁ డై తెఱంగున దైవ సమృద్ధిఁ బడయుఁ అను. 5-155

7. (రాజులకు వలయు) మంత్ర ప్రభుత్వోత్సాహ శక్తులలో నొకటి.

ఇవి 1) మంత్రము 2) ప్రభుత్వము 3) ఉత్సాహము.

శాంతి. 2-285; ఆశ్ర. 1-78

**ఉత్సాహముసేయు** అ. క్రి.

ప్రయత్న మొనరించు, ఉద్యమించు.

క. మది సుఖముగోరి దుఃఖం, బొదవంగం గార్యములకు నుత్సాహ ముసే,యుదు రొప్పని తృష్ణంబడి, చదు రేమియు లేనియట్ట జను లాతురులై, ఉద్యో 1-3.6

**ఉత్సాహశక్తి** సం. ఇ. (స్త్రీ).

రాజున కుండవలసిన ప్రభుమంత్రోత్సాహ శక్తులలో నొకటి. అత్యధికమైన విక్రమచేష్ట.

సీ. ఉత్సాహ శక్తియు నుర్వీశ మంత్రశ,క్తియుఁ బ్రభుశక్తియుఁ గెలని వాని,కిని నీకు నిట్టివి యని శారతమ్యముల్, వెరవున బరికించి వేరమెత్త, వలయుట. ఆశ్ర. 1-73

**ఉత్సాహి** సం. విణ. (న్. నీ. న్.)

ఉత్సాహము గలది.

సీ. శరభంబు ధాటికిఁ జకితమైన నుదగ్ర శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె. శాంతి. 3-98

**ఉత్సుకత** సం. వి. ఆ. స్త్రీ.

తహతహ పాటు, అధికాసక్తి, ఉత్సాహము,

క. ఉత్సాహంబున శత్రుకులోత్సాదన విధి యొనర్చి యున్నత సామ్రాజ్యోత్సవము నొందు పుత్రుల, నుత్సుకతం జూతుగాక యీఁటడు మింకన్. ఉద్యో 8-206

**ఉత్సుకత్వము** సం. వి. అ. న.

ఉత్సుకత, ఔత్సుక్యము.

క. దేవా జనమేజయధాత్రీవల్లభుఁ డుత్సుకత్వ రేఖా సౌమ్యశ్రీ విలసితుఁడై. కల్య. 1-2

**ఉత్సుకము** సం. వి. అ. పుం.

తహతహ, తమకము.

క. ప్రధనోత్సుక వృత్తి మహారథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ బ్రస్ఫురితగతిన్. భీష్మ. 1-91

**ఉత్సుకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఇష్టవస్తు ప్రాప్తికై త్వరపడువాఁడు తహతహపడుఁవాడు, ఉవ్విళ్ళూరువాఁడు.

వ. పౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిర ద్వారంబు చేర నరుగునప్పటి యచ్యుతునకుఁ గొలువు వారెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. ఉద్యో. 8-247

2. ఇష్టార్థమునకై యత్నించువాఁడు, ఉబలాటపడువాఁడు.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నే కార్యసము చేతుఁ గాదియయ్యె యిట్టి పనికిఁ బనుపఁ,ననిన నుత్సుకుండవై యేల చేసెద, నఁటి చేయకుండ నగునె నీకు. అర. 2-38

3. కౌతుకము గలవాఁడు.

వ. ధృతరాష్ట్రుండును గాంధారియు గొంతియుం బనువ నుత్సుకుండై యయుయుత్సుండు విదురుం బురస్కరించుకొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన. ఆశ్వ 3-161

**ఉత్సృష్టము** సం. విణ. (అ. ఆ. ఆ.)

విడువఁబడినది.

సీ. అది యతిపరివృద్ధ మగుటయు ధరియింప, నోర్వక సిర్జిర పర్వ తంబు, తటమున శరవణస్థంబుగా గంగ యు, త్సృష్ట మొనర్చె.
అను. 8-150

**ఉత్సృష్టి** సం. వి. ఇ. స్త్రీ.

విడుచుట.

క. మూత్ర పురీషోత్సృష్టికి, రాత్రిపగలు దక్షిణోత్తర దిశాముఖతా, మూత్రణము వలయు నది సం,ధ్యాత్రయమును నుత్తరంబ యగు నప్పునికిన్.
అను. 8-276

**ఉత్సేకము** సం. వి. అ. పుం.

ఉద్రేకము, అతిశయము.

శా. చింతా శల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కెక్కెనే.
విరా. 2-868

**ఉత్సేధము** సం. వి. అ. పుం.

1. పొడవు.

వ. ఇట్లన్నయుం దమ్మిండును నన్యోన్య శాపంబులంజేసి యోజన త్రయోత్సేధంబు గలిగి దశయోజన వృత్తంబైన కూర్మంబును షడ్యోజనోత్సేధంబు గలిగి ద్వాదశ యోజన విస్తృతంబైన గజం బును నై.
ఆది. 2-69

2. గొప్పతనము. అర. 3-168

**ఉదంకము** సం. వి. అ. పుం.

మరుదేశమున వర్షించు మేఘముపేరు.

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం, బునవెసఁగున్ భవదృశము పొందిరివోవ నుదంక మేఘనా,మనుతవిహారముల్ గలిగి మాన్యత వెప్పుడు నియ్యెడం జరిం,చును జలదంబు లింక.
అశ్వ 3-67

**ఉదంకుఁడు** సం. వి. అ. పుం.

1. గౌతముని శిష్యుఁడు. ఒక మహర్షి. అశ్వ. 8-28

2. పైలుని శిష్యుఁడు—ఒక మహర్షి—సంస్కృత భారతమున 'ఉత్తంకుఁడు' అని గలదు. ఆది 1-91

3. ఒక మహాముని. అర. 4-378

ఈ మువ్వురు ఒక్కరా? వేఱా? అనున దొక పెద్ద సందేహము. ఉదంకుని చరితము నన్నయ తిక్కన ఎఱ్ఱనలు మువ్వురును వ్రాసిరి. కథా విషయమున కొన్ని భేదములు కన్పించుచున్నవి.

వివరము :- ఆది పర్వము కథ 88 పద్యములలోను, అశ్వమేధపర్వ కథ 91 పద్యములలోను నడవఁగా ఆరణ్యపర్వ కథ మధుకైటభుల చరిత్ర ధుంధువధ పోను 18 పద్యములలోనే నడచినది. అరణ్య పర్వమునందలి విషయము ఆద్యశ్వమేధ పర్వములలో లేదుగాన అది విశేషము తెల్పుచున్న దనుకొనవచ్చును. వఱొక ఉదంకుని చరిత్రమని తలఁపఁబనిలేదు. ఇఁక వచ్చిన విషయము ఆది పర్వమునందలి ఉదంకుఁడు అశ్వమేధ పర్వమునందలి ఉదంకుఁడు భిన్న వ్యక్తులా? ఒక్కరా యని ఎటు నిర్ణయింపలేని ఘట్టములు కొన్ని కనఁబడుచున్నవి. తొలుత రెండు కథలందుఁ గల సారూప్య వైరూప్యములను దిలకింతము.

సారూప్యము :- రెండు కథలయందు ఉదంకుఁడు తపస్సంపన్నుఁడు గురు శుశ్రూషాపరుఁడు. శీఘ్రకోపి, మహాగర్వి, నిగ్రహానుగ్రహసమర్థుఁడు. విప్రర్షభుఁడు—గురుపత్ని కోరికపై కుండలములు తెచ్చుటకుఁ బోయెను. రాజు భార్య నడిగి కుండలములు తెచ్చుచుండ ఉదంకుని ప్రమాదవశమున తక్షకుఁడు కుండలముల హరించి నాగలోకముఁ జేరెను ఉదంకుడును నాగలోకముఁ జేరెను. ఆ లోకమును జూచుట తోడనే ఉదంకునకు నిరాశానిస్పృహలు జనించెను. అశ్వము దృగ్గోచరమయ్యెను. దాని అపానము నూఁదగా ధూమము వెడలి నాకలోకమంతయుఁ గ్రమ్మి సర్పములకు భయాందోళనములు గలిగించెను. (సంస్కృత భారతమునందు అపానమునందే ఊదినట్లుండఁగా నన్నయకు జుగుప్సగాఁ దోఁచె

గాఁబోలు చెవియందూదెనని చెప్పెను. ఇక్కడ యున్నది యున్నట్లే చెప్పెను) తక్షకుఁడు కుండలములు తెచ్చి యీయఁగా వానిని దెచ్చి యుదంకుఁడు గురుపత్నికిచ్చి అభివందనములందెను.

## వైరూప్యము

| ఆది పర్వము | అశ్వమేధ పర్వము |
|---|---|
| 1. ఉదంకుఁడు భృగువంశీయుఁడగఁ జెప్పఁబడెను. | ఏ వంశీయుఁడైనది చెప్పఁబడలేదు |
| 2. పైలుని శిష్యుఁడు. పైలుని భార్య పేరు లేదు. | గౌతముని శిష్యుఁడు అయన భార్య పేరు అహల్య. |
| 3. కుండలములు తెచ్చుటకు 4 దినములు పట్టెను. | 35 దినములు పట్టెను |
| 4. తేఁబోవునపుడు పురుషుఁడు వృషభము కనఁబడుట గోమూత్రము గోమయము భక్షణము గలదు. | లేదు |
| 5. కుండలము లడుగఁబోయినది పౌష్యుఁడను రాజును. | 'మిత్రసహుఁడు అను నామాంతరము గల సౌదాసుని, ఆతఁడు మనుజాశి. |
| 6. కుండలము లిచ్చిన దేవి పేరులేదు | కుండలము లిచ్చిన దేవి మదయంతి |
| 7. కుండలములు నేలపైఁ బెట్టెను. | చెట్టునకు వ్రేలాడఁగట్టఁ గ్రిందఁ బడెను. |
| 8, దేవి తొలుత కనఁబడలేదు. కనఁబడినతర్వాత అభిజ్ఞానమడుగలేదు | తొలిసారిగనే కనఁబడినది అభిజ్ఞానమడిగినది. |

ఆదిపర్వమునఁ బెచ్చు విషయములు :

1. కుండలములు తేఁబోవునపుడు ఒక పురుషుఁడు వృషభమునెక్కి కనఁబడుట, ఉదంకుఁడు గోమయ గోమూత్ర భక్షణము చేయుట, 2) పౌష్యుఁ డుదంకున కాతిథ్య మిచ్చుట- ఒండొరులు శపించుకొనుట,

3) పాతాళ లోకమున నాగకులమును స్తుతించుట. ఇద్దఱు స్త్రీలను. ఈశ్వరకుమారులను అతిప్రమాణతురంగము నెక్కిన వానిని జూచుట. 4) గుఱ్ఱముపై నెక్కి గురుకులముఁ జేరుట.

అశ్వమేధ పర్వమునఁ జెప్పు విషయములు :

1) ఉదంకుఁడు శ్రీకృష్ణుని శపింపఁబూనుట శ్రీకృష్ణుని విశ్వరూప సందర్శనము 2) ఉదంకుడు వృద్ధాప్యమువఱకు గురువును సేవించుట 3) గుర్వనుగ్రహమునఁ బదాఱేండ్ల వాఁడై గురువు తీకను వివాహమాడుట.

చెప్పు విషయముల సంగతి యెట్లైన సరిపుచ్చుకొనవచ్చునుగాని అన్యోన్య వైరుధ్యములు మాత్రము బలవత్తరములు నున్నవి. ఇట్లని యిర్వురు వేఱు వేఱు ఉదంకు లనుటయుఁ బొసఁగకున్నది. సం. భా. న ఆది. పర్వమున ఉదంకునికి మాఱుగా ఉతంకుఁడు, ఉత్తంకుఁడు అని కనబడు. చున్నను అవి పర్యాయి పదములుగానే గ్రహింపవలెను. ఆంధ్రభారత మున నున్న విధముగనే సంస్కృత భారతమునను గలదు. ఆదిపర్వమున నున్న విధమున నన్నయ యనువదించెను. అశ్వమేధ పర్వమున నున్న విధమున తిక్కన యనువదించెను. ఇట్టివి భారతమునఁ గొన్ని కథలకు సహజములు.

**ఉదంచత్** సం. శత్ర.

దీనికి వ్యస్త ప్రయోగము లేదు మిక్కిలి యతిశయించుచున్న, మిక్కిలి ఒప్పుచున్న.

శా. చంచత్తుంగ తరంగ సత్వరగతి స్ఫారీభవ త్కేతనో,దంచద్దీప్తులు. ప్రజ్వరిల్ల. ద్రోణ. 1-150.

**ఉదంచితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. విజృంభించినది.

శా. పుష్టోదంచిత సార వీరరస సంపూర్ణాంగముల్ భీష్మ. 1-117.

2. మిక్కిలి యతిశయించినది,

క. పాంచాలురుఁ బాండవులు ను,దంచిత గర్వమున ననికిఁ దఱిమిరి. ద్రోణ. 5-86.

**ఉదంసము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎత్తైన మూఁపు గలది. ఉన్నతమైన భుజశిరస్సు గలది.

క. మీయుం దీ కృష్ణు మదం,సాయత భుజుఁ జూచి ఆది. 7-161

**ఉదకకర్మము** సం. వి. న్. పుం. న.

చనిపోయిన వారికి నువ్వులు నీళ్ళు కలపి వదలుట తిలోదకప్రదానము.

వ. సురనదీనందనున కుదకకర్మం బాచరించి. ఆశ్వ 1-2; స్త్రీ.2-182

**ఉదకక్రియ** సం. వి. ఆ. స్త్రీ.

తర్పణము. పితృదేవతాదులకుఁ జేయు జలాదితర్పణము.

క. రయమున నీ చే నిహతు,లయిన సురారాతులకు రణాంతరము
న నీ, దయిన రుధిరమున నుదకక్రియఁ జేసె బక హిడింబ కిమ్మీ
రులకున్. ఆర. 3-392

**ఉదకవిధి** సం. వి. ఇ. పుం.

ఉదకక్రియ, ఉదకకర్మము.

క. అనుజన్మలు నంతఃపుర, వనితా జనములును నీవు వసుధేశ్వర వే
చని నడుపుఁ డుదకవిధి నీ, జననీ నకును జన బలకును జాహ్నవిలో
నన్. ఆశ్ర. 2-167

**ఉదకప్రదానము** సం. వి. అ. న.

ఉదకకర్మము — ఉదకవిధి

చ. ఘన భుజవిక్రమోన్నతుఁ డకౌరవకోటికిఁ బట్టుగొమ్మ మున్మని
మొనఁ దూల పుచ్చిన మహాత్ముఁడు గర్ణుఁడు గొంతి తొల్త చూలని
యుదక ప్రదాన సమయంబున నాయమచే వింటి నా,తని కుద
కంబు లిచ్చుటకుఁ దా మముఁ బంచుట గోరి చెప్పినన్.
శాంతి. 1-7

**ఉదకము** సం. వి. అ. న.

1. జలము నీరు.

క. క్షీరోదక గతిఁ బాండవ కౌరవు లొండొరులఁ గూడి మనికి కార్యంబు.
ఉద్యో 4-254; శాంతి. 5-527

2. జలతత్త్వము.

తే. ఘ్రాణ జిహ్వాలు మహి నుదకమును దృక్కు, త్వక్కు తేజంబునందును
వాయువునను, శ్రోత్ర మాకాశమునఁ గ్రమసూత్రితముగఁ, బొందఁ
జేసి గోవింద యానంద మిమ్ము. శాంతి. 4-242

**ఉదక్కు** సం. విశే. (చ్. దీచీ. చ్.)

ఉత్తరపుది, ఉత్తరపు వంకకుఁ దిరిగినది. చూ. ఉదఙ్ముఖత్వము. ఉదఙ్ముఖుడు

**ఉదగ్రత** సం. వి. ఆ. స్త్రీ.

1. భయంకరత్వము.

ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నా బకవైరి గ్రక్కునన్.
వాని నడంగఁబట్ట పడవైచి మహోగ్రత నాక్రమించె.
విరా. 2-350

2 ఉద్ధతి.

చ. తఱియగునంతకున్ రిపు నుదగ్రత సైఁచుట నీతి. ఉద్యో. 1-176

3. ప్రఢిమ, దార్ఢ్యము.

చ. ఘనతర బాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు,
న్మనమున వచ్చి యప్డు మునినాథ కడంగితి నెట్టకేల క,ద్ధనువు
గుణంబుఁ గూర్చితి నుదగ్రత బాహుబలంబు లేకయుండె న,స్త్రనికర
మంత్ర తంత్రములు సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్.
మౌస. 211

4. ఆధిక్యము, మిక్కిలి పెరుఁగుట.

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం,పత్తి
యుదగ్రతన్ మెఱయ భాస్వరుఁడై... కర్ణ. 3-339

**ఉదగ్రము** సం. విశే. (అ. ఆ. అ.)

1. గర్వించినది, ఉద్ధతము.

తే. ఇతఁడు పుట్టిన కోలెను నెనకమెసఁగు, దర్పమునన వర్తిల్లు నుద
గ్రహృదయుఁడు. విరా. 1-74; విరా. 2-148

2. భయంకరము.

శా. ...ఉదగ్రధ్వజార్చిషన్మిత్రాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. విరా. 4-52

3. వృద్ధము, మిక్కిలి పెరిగినది.

క. కోపించి యతఁడు దర్పాటోప ముదగ్రముగ దశపటు ప్రదరములా, భూపాలుమేనఁ జొనిపిన. శల్య. 1-199

**ఉదగ్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1, భయంకరుఁడు.

ఉ. ఉగ్రుఁ డనూనమాన మహిమోన్నతచిత్తుఁ డజయ్య విక్రమోదగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకోపాగ్రహ బుద్ధి. విరా. 5-15

2. గర్వితుఁడు,

క. రక్కసుఁడో మానిసియో, సిక్కు మెఱుంగము వధించె నృపసూనుని వీఁ, డొక్కరుఁ డుదగ్రుఁడై రథ, మెక్కి యరిగెడున్ దురాత్మ నెయిదుఁడు కడఁకన్. సౌప్తి. 1-165; ఉద్యో. 2-172

3. సమర్థుఁడు, గొప్పవాఁడు.

ఉ. ...నీవ యొక్కఁడుం, దక్క నొరుండు దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు లేమి వేఁడెదన్. ద్రోణ. 3-279

**ఉదఙ్ముఖత్వము** సం. వి. అ. న.

ఉత్తరమువైపు మొగము గలిగియుండుట.

ఆ. ... ఉదఙ్ముఖత్వ మొండెఁ బ్రాఙ్ముఖత్వ మొండెఁ బ్రాపించి యిమ్మెయి నాచమనము సేయుటార్యమతము. అను. 3-284

**ఉదఙ్ముఖుఁడు** సం. విణ. (అ. ఇ. అ.)

ఉత్తరపు దిక్కు మొగము పెట్టినవాఁడు.

క. చనియె నుదఙ్ముఖుఁడై దివి, కనిమిషనాథుండు గౌరవాన్వయముఖ్యా శాంతి. 4-410; శాంతి. 6-268

**ఉదధి** సం. వి. ఇ. పుం.

సముద్రము.

చ. ...వాదబా, బుదధిజలంబు ద్రాగెను మహోగ్రసముద్ధతి వాని నన్నిటిన్. సౌప్తి. 1-98

**ఉదపానము** సం. వి. అ. పుం. న.

1 ఒకానొక తీర్థము.

వ. ...అరోహిణీనందనుం డరిగి చమసోద్భేదంబను తీర్థంబున నొక రాత్రి వసియించి యుదపానంబునకుం బోయె.

తీర్థయాత్రలు సేవించు బలరాముఁడు దీనిని సందర్శించెను.

విశేషము:- త్రితుఁడు, ద్వితుఁడు, ఏకతుఁడు అను ముప్వురు ఋషి పుత్రులు గలరు. వీరు రాజులచే యజ్ఞములు చేయించి గోసమూహమును గానుకగాఁబడసి నిజనివాసంబునకుఁ బోవుచుండిరి. త్రితుని వంచించి యేకత ద్వితు లాగోవులఁ దామే యపహరింపఁ దలఁచిరి పోవు సమయమున నొక తోఁడేలు వారి కెదురయ్యెను దానిఁ జూచి వారు భయపడి తొలఁగి పోవుచుండఁగా ప్రమాదవశమునఁ ద్రితుఁడొక నూతఁబడియెను. అయ్యి రువురు వాని నుపేక్షించి ధేనువులఁ దోలుకొనిపోయిరి-త్రితుఁడు నీరులేని యానూతియందుండి సంకల్పరూపమున యజ్ఞ సాధనంబునకుఁ బ్రతినిధులు సంపాదించుకొని క్రతువొనరించి సోమపానముచేసెను దేవతలు సన్నిధి సేసి హవిర్భాగంబులు గైకొనిరి. సరస్వతీ జలంబు తత్కూపంబున నుద్గతం బై యాసవనపతిని (త్రితుని) వెలికిఁ దీసి యుద్ధరించెను. అమరులు వరము కోరుకొనుమనిరి అందుల కా తపస్వి కుమారుఁడు ఆ కూపజలమున నాచమనము చేసినవారికి యజ్ఞముచేసి సోమపానము చేసిన ఫలమువచ్చు నటుల వరమీయుమని కోరెను. వార లట్లే యిచ్చిరి. ఆ కూపమునకే యుదపానము అని పేరు. శల్య. 2-153, 154. 155 156

**ఉదయము** సం. వి. అ. పుం.

1. ఉన్నతి, వృద్ధి, అతిశయము.

సీ. అంచితోదయము గృపాతిశయము...తే...కలుగు నక్షీణ పుణ్యా దోహలుఁడు ధర్మమూనుఁ డున్న దేశంబున మానవులకు

విరా. 3-102

2. (సూర్యచంద్రాదులు) పైకి వచ్చుట

వ ...మార్తాండోదయంబు వెలుంగుటయుం గాలోచిత కృత్యంబులు

నిర్వర్తించి... భీష్మ. 2-21; శాంతి. 2-126

3. ఉద్గమము, వెడలుట.

వ. అరవిందంబులు వికాసంబు నొందెం బదంపడి తదీయ ప్రకాశోదయ సహావర్తి యగుచు. భీష్మ. 2-21

4. ఉద్భవము, పుట్టుక.

ఉ. ...ఇది సేయు నాయురు,త్పాదన మిచ్చు సంతత శుభంబులఁ గీర్తి యొనర్చుఁ బుత్రపౌత్రోదయ మావహించు భరతోత్తమ తన్ విసినం బఠించినన్. శాంతి. 5-579

**ఉదయశైలము** సం. వి. అ. పుం.

తూర్పుకొండ, పొడుపుకొండ.

ఆ. అంత మదయశైల మను నశోకద్రుమ సమితియందు. ఉద్యో. 2-118

**ఉదయాద్రి** సం. వి. ఇ. పుం.

తూర్పుకొండ, పొడుపుకొండ,

సీ. చిగురు జొంపము నును జిగి యొప్ప నుదయాద్రిఁ, బొలుపారు నవకల్పభూజ మనఁగ. ద్రోణ. 5-275

**ఉదయించు** సం. అ. క్రి.

పుట్టు, జనిమించు, కలుగు.

వ. ఆతనికి సూర్యుఁడును, అత్రికి సోముండును నుదయించి రాజ వంశంబులకుఁ గూటస్థులైరి. శాంతి. 4-206

వ. దానం బ్రబోధం బుదయించుటం జేసి యమ్మహామతికి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ ధర్మంబులను నాశ్రమంబులు మూఁటను బుద్ధి రమింపదయ్యె. శాంతి. 6-257

2. (సూర్యచంద్రాదులు) పొడుచు, తోఁచు, ఉదయమగు.

వ. పదంపడి పద్మినీ ప్రమోద సంపత్కారుం డగు నరుణ కిరణుం డుదయించె. విరా. 3-35

**ఉదరపోషణ; ఉదరపోషణము** సం. వి. అ. న.

పొట్ట పోసికొనుట, జీవనము చేయుట.

ఉ. ఏను మనంబు పెంపు సెడి యిప్పుడు నీచతర ప్రచారగమం, బూని నికృష్టనై యుదర పోషణకై తగవేసి యెంతయున్, దీనతఁబొంది. యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుచున్నఁ జేయుచున్, హీనతనున్కి మీకు వగపేమియుఁ జేయద యేమి సేయుదున్. విరా. 2-218.

(ఉదరంపోషణ-మ వర్ణలోపము)

**ఉదరము** సం. వి. అ. న.

1. కడుపు, పొట్ట.

(కీచక వధానంతరము ద్రౌపదిని జూచి) తే. కరఁబున నుదరమప్పళించి యమ్మరో రక్కెస యఁచు నుల్ల, ములుకువారునై పుర జనంబులు దలంకి. విరా 3-86.

తే. శిశ్నము నుదరమును ధృతిఁ జేయఁ గాలుఁ, జూడ్కి వినికియు వినుమ విశుద్ధమానసమున మానస వాక్కుల విమలవిద్య, నవహితుఁడు రక్షించుఁ గులాగ్రగణ్య. శాంతి. 5-118.

2. గర్భము.

వ. తదనంతరంబ కాశీశ్వర కన్యాచైతన్యం బుదరంబు ప్రవేశించిన. ఉద్యో. 4-371

క. సురతటినీపుణ్యతమో, దరమున జన్మించినాఁ డుదాత్తప్రవత, త్పరుఁ డతనికెల్ల ధర్మముఁ. గరస్థలామలక సన్నికాశం బధిపా శాంతి. 1-337

3. జలోదరాదిరోగము, ఉదరవ్యాధి.

చ. జ్వరమున గుల్మపీడ నతిసారమునన్ బలుపుండులన్ మహోదరమున వాతపిత్తకఫ దారుణ రోగములన్ నిరంతరాతురు లగు వారు నిర్దయతఁ దొల్లి వినోదముగాఁగ జీవులం, దరమిడి చంపినారు గురుఁ డల్లడపెట్టినవారుఁ బార్వతీ. అను 5-108.

**ఉదరిండ్లు** దే. వి. బహు.

ఇది పదరులు అను పదమునకుఁ బాఠాంతరము. చెక్కెము

సీ. గొడగులు నదరిండ్లు మడివడ. అను 4-388.

**ఉదరిపడు** దే. అ. క్రి.

హఠాత్సంభవములైన భయక్రోధాదులచే ద్రుళ్ళిపడు, చలించు అదరిపడు, ఉలికిపడు.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డుదరిపడి విదురున కిట్లనియె.
ఉద్యో. 2-391

వ. అమ్మహాధ్వని విని యుదరిపడి ధృతరాష్ట్రుం డిది యేమి రభసంబని విదురు నడిగిన వాతం డిట్లనియె. ఆది. 6-21

వ. అంత దేవత లెల్ల మహావహ్ని శిఖాహతికి వెఱచి దేవేంద్రు పాలికిం బోయి ఖాండవంబున కైన యకాండ ప్రళయంబు సెప్పిన విని యుదరిపడి. ఆది 8-268

వ. అని యప్పుడ శకుని దుర్యోధనుం దోడ్కొని ధృతరాష్ట్రు నొద్దకుం జని యతని శరీర కార్శ్య వైవర్ణ్యంబులు సెప్పిన విని యుదరిపడి ధృతరాష్ట్రుండు. సభా. 2-101

(ఈ తావులనెల్ల సం.ము. అకాడమి ప్రతులపాఠము 'అదరిపడి' పాఠాంతరము 'ఉదరిపడి' సూ. అ. ని. ఉదరిపడు, ఉదరిపాటు అని శబ్దము లిచ్చినది. ఉసరిపడు క్రిందఁ బైని ఆది. 6-21 ఉదాహరణము గలదు.

**ఉదరు** దే. అ. క్రి. ('ఉదరిపలుకు' అనియే ప్రయోగము)

కోపించు, గద్దించు.

అ. అనుచు నుదరిపలుక హిడింబియుఁ గడు వెఱచి ఆది. 6-201

వ నీతోడ బద్ధ సఖ్యంబుఁ జేసెద మఱి మమ్ముఁ బరమధార్మికులం బరమబ్రహ్మణ్యుల నేమి కారణంబున నుదరిపలికి తనిన గంధర్వుఁ డిట్లనియె. ఆది. 7-64

"కారణం బ్రూహి గంధర్వ కిం తద్యేన స్మ ధర్షితాః".
సం. భా. ఆది 170-59-(వావిళ్ళ)

**ఉదలు** స. క్రి.

విడుచు, వదలు (చూ. ఉదలుచు)

**ఉదలుచు(ల్చు)** స. క్రి. (స్వార్థమున 'చు')

వదలు, విడుచు.

క. కదియుచుఁ దాయుచుఁ బట్టుచు, నుదలుచుచుం బడుచు లేచు చుసు
గుచు పడిగొం, చొందవెఱు కినుకం గడు బెట్టిదముగఁ బెరఁగిరి
చలంబు డింపక కడిమిన్, విరా. 2-348

2 విదిలించు, విడిపించు.

ఉ. పాప వినిశ్చయుండు సతిపయ్యెదకొంగు కడంగి పట్టినన్, గోపము
తో నుదల్చికొని కోమలియున్ వెస వాని ద్రేయుడున్ అర.6-190

**ఉదవాసము** సం. వి. అ. పుం.

జలమందు నివసించుట, (తపస్సునకై) జలమందు నిలిచియుండుట.

చ. ...శశ్వదుదవాస మహావ్రత శీతపీడితా. చల మునిసౌఖ్యహేతు
విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్, వెలిఁగెడు దానిఁ గాంచి
రరవిందనిభానన లమ్మహోదధిన్. ఆది. 2-28

**ఉదస్తము** సం. విణ. (అ. ఆ. అ.)

తిరస్కరింపఁబడినది- అవమానింపఁ బడినది.

వ. త్రిభువన వంద్యయైన శ్రీదేవియు, నిజ ప్రభాపటల పర్యుదస్త
ప్రభాకర గభస్తి విసరంబయిన కౌస్తుభంబును నారాయణు వక్షః
స్థలంబున విలసిల్లె. ఆది. 2-16

**ఉదాత్త** సం. విణ. (అ. ఆ. అ.)

గొప్ప బుద్ధి గలది

చ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువునైన నిజాగ్రజు మేనితోడ ని,
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁజను నింతిఁ గోంచుఁ
గర్కశమతి కీచకున్. విరా. 3-17

**ఉదాత్తత** సం. వి. ఆ. స్త్రీ.

1. గొప్ప తనము.

క. ఇతఁ డెవ్వఁడొకొ రూపు నిరతిశయమై మనమునకుఁ బ్రియం
బొసఁగెడుఁ జూచితిరే చిత్తంబు నుదాత్తత గానఁగ నయ్యెడున్
వదనమున భంగిన్. విరా. 1-258; శాంతి. 2-149

2. ఔదార్యము.

ఆ. శౌర్యముననొ వృద్ధసంసేవవలననొ, తపముననొ యుదాత్తతాని

రూఢి, గలిగి మమ్మొసరకుగాఁ గొనకున్నాఁడ, వేమికతము దీని
నెఱుఁగఁ జెపుమ. శాంతి. 4-425

**ఉదాత్తత్వము** సం. వి. అ. న.

ఉదాత్తత, గొప్పతనము.

వ. అవ్విప్రుండు గలంకయుఁ గొందలంబును లేని డెందంబుతో నద్దా
నవు నాననంబు గనుంగొనిన నా ధైర్యధుర్యుం గనుఁగొని తదీ
యంబగు నుదాత్తత్వంబునం జిత్తంబు రంజిల్లి. ఆను. 4-881

**ఉదాత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉన్నతము, గొప్పది.

చ. ఇది యొక ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేరదెంతయున్
మృదువొక కీడుపాటునకు మేకొనఁజాల దుదాత్తచిత్త యొంటి
దిరుగు దాని కోర్వదు. విరా. 1-108

శా. ... ఆ యోగి సమ్మాన విస్తారోదాత్తము. విరా. 2-209

2. మనోజ్ఞము, ఒప్పిదము.

చ. మనమున నూఅడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే,
పనులు నదాత్త నాగరిక భంగుల నీమది కెక్కునట్లు నే,ర్పును
భయభక్తులన్ మెఱయ రూపునఁ జేసెద. విరా. 1-828

3. ఉదారమైనది, దయగలది.

చ. అనిన సుదేష్ణ యిట్లనియె నంతవునంతకు మద్గ్రహంబునం,దునికికి
సమ్మతించితి నిజోచిత వృత్తిఁ జరింపు వాదునం,దముల మదీయ
వల్లభు నుదాత్తమతిం బరికొంచుకొమ్ము నీ. మనమున కెట్టు
లూఱట సనుస్తము నట్టుల చేసెదం దగన్. విరా. 8-67

4 దృఢమైనది మేలైనది,

క. ఉత్తరుఁడు సత్వరంబుగ, దత్తనువున మఱువు దొడిగి తానును
హృద్యోదాత్తంబగు కంటక మిడి, చిత్రమపని ప్రగమ్మెఱుపఁ జీకి
మడి పడఁగన్ విరా 4-40

5 అందమైనది.

క. ఉత్తర సలంకరింప ను,దాత్తాభరణాది వస్తుతతి యొసఁగి

నరేంద్రో త్తముఁడు. విరా. 5-888

వి. అ. పుం.

స్వరభేదము (వ్యతి. అనుదాత్తము)

వ. ఒక్కనాఁడు బలి యను రాజు గంగాభిషేకార్థంబు వచ్చినవాఁడయ్యింధన బంధనంబున నుండియు నుదాత్తానుదాత్తస్వరిత ప్రచయ స్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుఁ దరంగవు ట్టనంబునం దన యున్న దరిఁ జేరవచ్చిన వానిఁ దీరంబు జేర్చి. అది. 4-230

"ఉచ్చై రుదాత్తః" పాణిని అష్టాధ్యాయి.

"తాల్వాదిషు భాగేషు స్థానేషూర్ధ్వభాగే నిష్పన్నోఽ అనుదాత్తః" —సిద్ధాంత కౌముది.

చూ, అనుదాత్తము.

**ఉదాత్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

అధికుఁడు, గొప్పవాఁడు

క. అలఘు బలవిక్రమోదాత్తులకైనను బలము లేక దోర్గర్వము మై... గెలవఁగవశమె ఉద్యో. 1-15

**ఉదానము** సం. వి. అ. పుం.

ప్రాణాది పంచవాయువులలో నొకటి

సీ. మతి నపానమున సమానంబునందు నీ శానమిత్త్రావిష్పరస్సమితులు... అను. 4-196

**ఉదానుఁడు** సం. వి. అ. పుం.

ఒక వాయువు. సమానునివలనఁ గలిగినవాఁడు.

వ. పవనుల వినుము చెప్పెద సమానుండు దైవత సంఘ సంభవుం డతనికి నుదానుండును నుదానునికి వ్యానుండును వ్యానునకు నపానుండును నపానునికి ప్రాణుండును జనియించిరి.

శాంతి 6 807

శ్లో. తత్ర దేవగణాః సాధ్యామహాభూతా మహాబలాః,

తేషామప్యభవత్పుత్రః సమానో నామ దుర్జయః ।।

ఉదాన స్తస్య పుత్రోఽభూద్వ్యాన స్తస్యా భవత్సుతః,

అపానశ్చ తతో జ్ఞేయః ప్రాణశ్చాపి తతోఽపరః ॥
అనపత్యోఽభవద్భ్రాతా ప్రాణో దుర్ధర్షశ్చ క్రతుతాపనః.
సం.భా. శాంతి. 329-32, 33,34 (వావిళ్ళ)

**ఉదారత్వము** సం. వి. అ. న.
ఔదార్యము.
వ. భవదీయ బాహావిహారంబు నుదారత్వం బిట్లుండునే యని యగ్గించుచు నరిగి. ద్రోణ. 5-13

**ఉదారము** సం. విశే. (అ. ఆ. అ.)
గొప్పది, అధికమైనది.
వ. అపహసిత శిలోదారంబును, కనకపట్టికా మండితంబునునైన గదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని వెడలె. శల్య. 2-95

**ఉదారుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)
1. దాత.
సీ. అర్థికిఁ బ్రాణంబులైనను డాఁపక, తమకించి యిచ్చు నుదారులార
విరా. 3-21
2. గంభీరుఁడు, మనమ్మునందలి వికారములు వెలికిఁ దెలుపనివాఁడు.
మ. హరి మేనల్లుఁడు బాహువీర్య పటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్య సుందరుఁ డాచారపవిత్రుఁ డంచిత కళా దక్షుం డుదారుండు... వరించుగాక యభిమన్యుం డీ సరోజాననన్. విరా. 5-368

**ఉదాసీనత** సం. వి. ఆ. స్త్రీ.
1. అనాసక్తి, ఉపేక్ష.
వ. కీడయిన నుదాసీనత యుడిగి మేలు చందంబున భావించుచు.
విరా. 3-87
2. అసంగత్వము. దేనియందును జోక్యము లేకుండుట.
క. విను మూర్ఖ నాభితంతువు, జనియింపఁగఁ జేసినట్లు సత్వము గుణసంజనకం బగు నది పురుషుఁడు, గనుట యుదాసీనత నవికారము గలదే. శాంతి. 5-174

**ఉదాసీనత్వము** సం. వి. అ. న.

ఉపేక్ష, అనాదరణము.

వ. ఏ నాయుధవ్యాపారంబు వలన నుదాసీనత్వంబు నొందినను నన్ను
జయింప సమకూరు. భీష్మ. 3.308

**ఉదాసీనము** సం. వి. అ. పుం.

ఏ జోక్యము లేకుండుట, ఉపేక్ష సేయుట.

క. దాసీ దాస జనముల కు,దాసీనము గాకయుండ దడయక యే
మి,త్రాసంగమొంది శత్రుని,రాసం బొనరించి తమ్ము వరసెన
ననుమీ. ఉద్యో. 1-368

**ఉదాసీనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. నిరపేక్ష గలవాఁడు.

వ. నరేంద్రత్వంబు దెస నుదాసీనభావంబు నొంది బ్రాహ్మణ్యంబునందు
సస్పృహుండవైతి అను. 2-31

వి. అ. పుం.

శత్రువును మిత్రుఁడునుగాని రాజు.

వ అరిమిత్రోదాసీనాదిక ద్వాదశ రాజమండలంబును.

శాంతి. 2-208

తే. అరులు మిత్రు లుదాసీను లనుచు సంధి, విగ్రహాది షడ్గుణముల
వెరవు లోఁ దుఁ, దలవరించుచు విజయంబు నాసపడుచు, నుండు
నదె ముక్తి తెఱఁ గిటు లున్నె యరయ.

శాంతి. 6-197; ఆశ్ర. 1-68

**ఉదిత** సం. విశే. (అ. ఆ. అ.)

పుట్టినది. జన్మించినది,

ఆ. యజ్ఞసేనుకూఁతు నఖిజాత నాతని, యజ్ఞవేది నుదితమయిన దాని,
ననఘ విధి వివాహమయి పాండునందనుల్, మిగుల మిత్రబల సమృ,
ద్ధులయిరి. ఆది 8-15

**ఉదితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఉదయించినది, పైకి లేచినది.

క. తదనంతరంబ ద్రోణుం, డుదితార్కునిఁ గేణిసేయు నుజ్జ్వల రథ మెల్లదిశలు వెలిగింపగఁ జెట్టిదముగ మును గవిసె మొన గడి మిఁ గదియన్. ద్రోణ, 1-187

2, పుట్టినది, కలిగినది.

క. ...ఉదితనినదకోదండుఁడై విరా. 5-115

తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మఱియు, నీ దృశములును స త్త్వ గుణోదితములు. శాంతి. 4-288

ఆ. యజ్ఞసేనుకూఁతు నఖిజాత నాతని, యజ్ఞవేది నుదతయైన దాని
ఆది. 8-15

3. చెప్పఁబడినది.

తే. యోగతంత్రంబు సకల శాస్త్రోదితంబు శాంతి. 5-598

వ. ...విశ్వా విశ్వంబులు...చలాచలంబులు ననునవి వేదోదితంబులు.
శాంతి. 4-140

4. ప్రసిద్ధి కెక్కినది.

ఆ. అతని కోఘవంతుఁ డనువాఁడు జనియించె, నుదితయశుఁడు.
అను. 6-62; శాంతి. 8-100

ఆ. ధర్మపుత్రుని తోడి పొందొప్పదయ్య నీకు నుదితశౌర్య.
ఆది. 8-14

పీ. ఉదిత సత్యరతుల, ఆది. 8-14

**ఉదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉదయించినవాఁడు.

వ. నవోదితుండైన భానుండునుం బోలె. ... కర్ణ. 1-56

2. పుట్టినవాఁడు.

ఉ. ఆతత పక్షమారుతరయ ప్రవికంపిత ఘూర్ణితాచల, వ్రాత మహార్ణవుండు బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా.ధూత పతంగతేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః, ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్. ఆది. 2-88

**ఉదిలకొను; ఉదిలగొను** దే. అ. క్రి. (ఉదిల+కొను)

1. (భయాదులచే) చలించు, వణఁకు

అ ...బెవర వజ్రాయుధు, హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము. ఆది. 2-21

క. పనరుఁడు మానసము ధృతి, నూన నుచితవృత్తి నుండు నుదిలగొనక యెం,దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభములేదు వసుధాధీశా. శాంతి. 3-161; విరా. 2-24

2. కులుకు, మరియు.

గీ. తనలోచనములు వాదుమనసు నాఁచికొనఁగ నయ్యింతి ననుఁ గనుఁగొనియె నాత్మ, గైకొనియె రాగరసమునఁ గడలుకొనియె, మదన వికృతి బయల్పడ నుదిలకొనియె. విరా. 2-88

3. పరితపించు.

వ. మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున నిట్లనియె. అను. 1-49

**ఉదీచ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉత్తరపు దిక్కున నున్నది.

క. భారతవర్షముఁ దొడఁగి మ,హీరమణ యుదీచ్యములన యెక్కుడు బలస,త్త్వారోగ్యాయుస్సుఖపు,ణ్యారంభ గుణంబులంతకంతకు నరయన్. భీష్మ. 1-25

**ఉదీచ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉత్తర దిక్కువాఁడు.

చ. ....జయించె మహీశులం బ్రవర్ధిత యశుఁడై ప్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యుల దాక్షిణాత్యులన్. ఆది. 5-78

**ఉదీర్ణత** సం. వి. అ. (స్త్రీ).

ఉద్రేకము.

క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ, జెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్, గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు, దిక్కుల సైన్యములు నత్యుదీర్ణత బెరసెన్. భీష్మ. 1-243

2. ఆధిక్యము.

ఉ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కుడయ్యె న, ద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత ద్రోయఁదొడంగె.

ద్రోణ. 3-129

**ఉదీర్ణత్వము** సం. వి. అ. న.

గొప్పతనము.

వ. ఇట్లు ప్రసిద్ధ బలపరాక్రముండైన కర్ణు నుదీర్ణత్వంబు సెఱుచుట కునై కవచకుండలంబులు భిక్షించి. శాంతి. 1-84

**ఉదీర్ణము** సం. వి. అ. న.

1. గొప్పది.

ఆ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ, దెచ్చు టెల్ల నీ యుదీర్ణ, బాహుబలము కాఁగ నీవు పలుకుము వెలిఁబుచ్చు, టుడుగు మధిపు పాల నొందు తెఱఁగు. విరా. 5-227

2 అతిశయించినది, అధికము.

ఆ. దివ్య పరిమళంబు నవ్యవికాసంబు, నల్లసిల్ల వచ్చి యుర్విఁ బడిన ( గాంచి రుచి యుదీర్ణ కౌతుక చిత్తయై, దాని బుచ్చికొనియె మానవేంద్ర. అను. 2-207

ఉ. మేలి మదావళంబులును మేటిహయంబులుఁ దమ్ముఁ గ్రమ్మ పిండు నా, భీలతఁ జుట్టి రాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణు దోః,ర్ళీలకుఁ దోడ్పడం గడఁగె రేణు వుదీర్ణముగా నతండు పాం,చాలబలంబు పై నడచె శౌర్య సముద్భట బాహువీర్యుఁడై. కర్ణ. 2-156

3. గర్వించినది, ఉద్రేకము పొందినది.

తే. కర్ణనందనుఁ డిట్లుత్యుదీర్ణ భంగిఁ, బాండురాజ తనూజుల బలము సెల్లఁ, గనువు గొట్టంగఁ జొచ్చినఁ గిని నకులుఁ, నాత్మజుండు శతానీకుఁ డతని దాఁకి. ద్రోణ. 1-196

**ఉదీర్ణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉద్రేకము పొందినవాఁడు.

వ. ...కోపంబు రూపంబు గైకొన్న కైవడి నదీర్ణుండై యక్కర్ణుండు. ద్రోణ. 4-232; శల్య. 1-175.

**ఉదుంబరము** సం. వి. అ. పుం.

మేడిచెట్టు.

వ. ఋతుకాలంబున నీ తల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును నాలింగనముసేసి భక్తితో మీమీ చదువు లుపయోగించునది. అను. 1-110.

నపుం.

మేడిపండు.

ఆ. తాను బ్రకృతి బ్రకృతి దనయందు నిల్పు నిల్పినను దాన వికృతిఁ జెందకుండుఁ, బురుషుఁ డుదక మత్స్యముల యుదుంబర మశకముల సంగంబు కరణి గలుగ. శాంతి. 6-108.

**ఉద్గతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. పుట్టినది.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మకణంబు దాల్చుచున్, డిల్లపడంగ, విరా. 2-91; శాంతి. 3-281

2. పైకి వచ్చినది, ఊరినది.

వ. సరస్వతీ జలంబు తత్కూపంబున నుద్గతంబై యా సవనపతి నుద్ధరించె. శల్య. 2-155

3. బయలు వెడలినది.

తే. అచ్యుతాననోద్గతము వేదార్థమయము, యోగసాంఖ్యాత్మకము నైన వాగమృతము, గర్ణపుటపేయముగఁ జేయు గారవమున. శాంతి. 6-889.

తే. సత్యభామ గోపఁ మడరి వనితా స్వభావోద్గతాశ్రు పూర, యగుచు హరి యగ్రతలమున కరుగుదెంచె, మౌస. 46.

**ఉద్గతి** సం. వి. ఇ. స్త్రీ.

1. బయలు వెడలుట

క ఫిాఘ్రనము దెసకుఁ జన న,య్యతివ భయక్రాంతచిత్తయై కొప్పు
జలోద్గతి మొగముఁ గప్ప నిట్లని, యతిరావముగా నొనర్చె
నాక్రందనమున్. విరా. 8-18; కర్ణ. 3-38

2. పుట్టుక, ఉదయము.

క. ఘృతములు పైఁజల్లఁగ న,చ్చితిఁ బేర్చినస ప్తజిహ్వశిఖల రవము
నూర్జిత సామగాన వాదో,ద్గతియును హాహారవంబుఁ గలసి చెలం
గెన్. మౌస. 1-142

**ఉద్గతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

బయటకు వెడలినవాఁడు, పుట్టినవాఁడు.

వ. అప్పుడు తదీయ బ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలా
కృతియుం బ్రాదేశమాత్రుండు నగు పురుషు నెదిరొ్కని
శాంతి. 4-166

**ఉద్గమము** సం. వి. అ. పుం.

1. పుట్టుక, కలుగుట.

దుర్గతి రోగోద్గమ చికిత్సకా. విరా. 2-364

2. పైకివచ్చుట, బయటకు వెడలుట, కాఱుట.

మహాస్రగ్ధర:- బాష్పోద్గమము వొదువు వక్త్రింబులన్,
సౌప్తి. 1-214; అర. 8-264

**ఉద్గమించు** సం. అ. క్రి.

పుట్టు, కలుగు.

సీ. ఘోటకోత్తమరోమ కూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ
ముద్గమించి. అశ్వ 8-112

**ఉద్గాత** సం. వి. ఋ. పుం.

యజ్ఞమునందు సామవేదతంత్రము నడపువాఁడు.

వ. కౌత్సుం డుద్గాతగా... యాజ్ఞికు లగ్నిముఖంబు వేసి వేల్వందొడం
గిన. ఆది-2-210

**ఉద్గారి** సం. విణ. (న్. ఙి. న్.)

కాఱునది, స్రవించునది, క్రక్కునది.

లయగ్రాహి :- దంతవలభీరభస దంశోద్గారి రుధిరా ధరు... అర్ద నుజవీరుఁ గని అర. 7-96

**ఉద్గీతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. చెప్పఁబడినది.

తే. ఆతఁ డరణ్యా కోద్గీతమైన వాక్య, సంచయము విష్ణుగుణించి పఠించె నధిప. శాంతి. 6-362

2. పఠింపఁబడినది, పాడఁబడినది.

శా. ఉద్గీతామ్నాయుఁడు... పారాశర్యుండు. అర. 6-108

**ఉద్గీతి** సం. వి. ఇ. (స్త్రీ).

సామగానము చేయుట.

క. ధౌమ్యుఁ డరిగె వి, చారజ్ఞుఁడు రౌద్రయామ్యసామోద్గీతిన్. సభా. 2-308

**ఉద్దండ** సం. విణ. (అ. ఆ. అ.)

క్రూరాత్ములైనవారలు.

వ. శునస్సఖుండు దన యభిధానం బభివ్యక్తంబుగా నుగ్గడించినం గృతి నీపేరు దెలియంజెప్పు విదియేమి యనవుడు నతండు తేటపడం జెప్పి యుండం జెప్పవనియెద విట్లుంట తప్పుగాదె యిట్టి యుద్దండవు మత్త్రిదండంబుపాల పడుము. అను. 3-222

**ఉద్దండత** సం. వి. ఆ. (స్త్రీ).

1. భయంకరత్వము

ఉ. ... ఆతం డుడివోక లేక సమదంబున ఖడ్గము ఖేటకంబు ను, ద్దండతఁగొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. విరా. 5-151

క. చండ భుజబలమునై యుద్దండత నరుఁ డడర నెమరఁ దరమే సికున్. ఉద్యో. 4-48

2. విజృంభణము.

క. పాండవుల దిక్కు వీరు ల,ఖండిత బలులైన వామొగంబునఁ బడి-
యు,ద్దండత చూపఁగ లేరు శి,ఖండిని నొక్కరుని జంపఁగాని
కుమారా. ఉద్యో. 4-270.

**ఉద్దండము** సం. విశే. (అ. ఆ. అ.)

భయంకరమైనది.

ఉ. ... దోర్బలో,ద్దండ మహాసుర ప్రతతి దర్ప మడంచి ప్రియం
బొనర్చి యా,ఖండలుఁ డున్న గద్దియ సగంబున నుండె.
విరా. 1-85.

**ఉద్దండుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

భయంకరుఁడు.

శా. ... వీరకే,తుం డుగ్రంబున దాఁకి యగ్గురుని సూతు న్నొంచి
యేనమ్ము లు,ద్దండుండై తనువాడ నేయుటయు. ద్రోణ 4.97.

తే. కడఁగి వెనుకొన్న పాండవోత్కరము నొకడ, నిలువరించె-
నుద్దండుఁడై నీ తనూజుఁడు. శల్య. 1-290.

**ఉద్దవిడి** దే. అవ్య. ద్రు.

శీఘ్రముగా, వడిగా, వెంటనే

ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి
యడ్డుపడిన,చోటఁ బాండురాజసూనుల నరయుదు.
విరా. 3-120, ఉద్యో. 3-389.

**ఉద్దహనము** సం. వి. అ. న.

కాల్చుట. తగులఁబెట్టుట.

శా. ...అప్పార్థుఁ డా,గ్నేయాస్త్రంబు పరిఁబోసి... రా, ధేయాంగోద్ద
హానా ఖిలాప మెడఁదన్ దీపింప బెట్టేసినన్. కర్ణ. 3-287.

**ఉద్దామత** సం. వి. ఆ. స్త్రీ.

భయంకరత్వము.

క. భీముని ముందటి బల ము,ద్దామతఁ గాలింగ సేనఁ దలపడి.
భీష్మ. 3-61.

**ఉద్దామము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అధికము.

శా. వీరాలాపముల్ వల్కి యుద్దామక్రోధ శిఖా కలాప వికటోదగ్ర భ్రూకుటిస్ఫూర్తియై. విరా. 3-139

2 బెట్టిదము.

వ. ఉద్దామంబైన కామంబు విడువ వడకున్నఁ జిత్తంబు నిర్వృతి గలుగునే శాంతి. 4-44

3 భయంకరము.

క. ఈ మత్స్యపతి సహాయము,గా మాకుం దీర్పరాని కార్యము గలదే, సామాద్యుపాయపరుఁ డుద్దామ భుజా బలయుతుం డితఁడు కేవలుఁడే. ఉద్యో. 1-30

**ఉద్దాముఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. భయంకరుఁడు.

తే. భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్రతర్క్య తేజోమయుఁడు. శాంతి. 5-214

క. భీమార్జునులకు రణమున, నే మగలును బలిరె వీరు నేనను సైన్యోద్దాములమై నడచిన నే,భూమీశులు నెదిరి బ్రతికిపోవం గలరే. ఉద్యో 5-28

1. అధికుఁడు

వ. విభవోద్దామా. విరా. 2-1

**ఉద్దాలకుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక ముని.

వ. ఉద్దాలకు నధ్వరంబున. శల్య. 2-159

2. ఒక ముని,శ్వేతకేతుని తండ్రి.

వ. ఉద్దాలకముని నిజతనయు శ్వేతకేతుని విప్రులయెడ మిథ్యోపచారుం డని యెఱింగియుఁ బరిత్యజించె. శాంతి. 2-183

(వీరిర్వురు నొక్కరే యైయుందురు)

**ఉద్దీపించు** సం. అ. క్రి.

1. విజృంభించు, చెలరేగు.

మ. ...కన్నె కయ్యంబు నర్థిఁ బవత్పుత్రుమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి రయ్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతి యూథాకృతిన్. భీష్మ. 1-110

2. ప్రకాశించు, వెలుఁగొందు.

వ. సాత్యకి...కృతవర్మనిం దాకి యేసిన నతండునుం బోగలేని మంట చందంబున నుద్దీపించి సాయకజ్వాలలు నిగిడించిన నవి మగిడించి యాశై నేయుండు. ద్రోణ. 4-82

3. ప్రజ్వలించు, మండు.

వ. ...ఇద్దురాత్ముండు సభలోన నసభ్యంబులగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించిన కోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచుకొని యుండిరి. కర్ణ. 2-214

**ఉద్దీపితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రజ్వలింపఁ జేయఁబడినది.

క. చూపులు మిణుమిట్లు గొనఁగ. నేపారిన వానరేంద్రు నెసకంబున ను,ద్దీపిత మగుపడగ భయద రూపంబునఁ గ్రాలఁగా నరుఁడు దోతెంచెన్, ద్రోణ. 8-34

2. ప్రకాశింపఁజేయఁబడినది.

క. శ్రేవులు దోరా దుర్గతిఁ, బ్రాపింపఁ గలార యిట్టి భావిచరితము ద్దీపిత బోధమునం గని, మీపై కృపఁ జెప్పవలసె మీకుం దెలియన్. అను. 8-20

**ఉద్దీపితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. రెచ్చఁగొట్టఁబడినవాఁడు.

క. ఏవున హిడింబసుతుఁడును, ద్రౌపదిపుత్రులు సుభద్ర తనయుఁడుఁ గోపో ద్దీపితులై. భీష్మ 3-180

2 ప్రకాశింపఁ జేయబడినవాఁడు.

క. నిత్యసత్యాత్మతోద్దీపితుఁడై. శాంతి 5-64

**ఉద్దీప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి వెలుఁగొందినది, ప్రకాశించినది.

శా....బాహ్వద్వావా సంవల్గనోత్కృష్ట స్యందనముం గనద్ధనువు నుద్దీప్త ధ్వజంబుం దగన్, ధృష్టద్యుమ్నుఁడు వొల్పె నైజ విలస త్తేజో విరాజద్గతిన్. భీష్మ. 1-117

**ఉద్దీప్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశించినవాఁడు, వెలుఁగొందినవాఁడు.

శా. మద్రేశున్ వెఁడొందనేసె నతనిన్ మన్నించు జోదుల్ప్రతా, పోద్రేకంబున నొక్కపెట్ట రథవేగోద్దీప్తులై తాఁకినన్. భీష్మ.1-279

తే. గగన మధ్యంబునకు వచ్చి ఖరకరుండు, దేఱి చూడంగరాక యుద్దీప్తుఁడగుచు, నెట్లు వెలుఁగొందు ద్రోణుఁడు నట్ల వెలుఁగు, చున్నఁ గనుఁగొని ధర్మజుం డురవడించి. ద్రోణ. 1-148

**ఉద్దీప్యమానము** సం. విణ. (అ. ఆ. అ.)

వెలుఁగొందుచున్నది.

సీ. రత్నయూపంబును రజత వరాహంబు నుద్దీప్యమాన మహోరగంబుఁ, గేతనంబుల నొప్పు ... భూరిశ్రవునకు సైంధవునకు రారాజునకు. ద్రోణ. 3-288

**ఉద్దేశము** సం. వి. అ. పుం.

1. ప్రదేశము.

వ. ప్రోవులు గొనియున్న ప్రేవుల మసలావుగల యంచపిండు పేరాఁకలి నటిమటిం బెటికినఁ గుటుకులు గట్టిన మృణాళనాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును. విరా. 3-236

క. చలదళిపుంస్కోకిలకుల, కలరవ ముఖరిత లతాంత కమ్రఫలాళీ, లలిత మహీరుహమాలా, విలితోద్దేశముల విశ్రమించుచు లీలన్ అర. 4-6

వ జీవితేశ్వరు వామబాహువు నిజవామభుజంబుపయి నిడికొని దక్షిణ హస్తంబున నతని గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున నాశ్రమో ద్దేశంబునకు మగిడె. అర. 7-267

2. లక్ష్యము, గుఱి, అనుసంధానము, గుఱిగాఁ జేయుట.

వ ...ఆపగయను మహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్క బ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ గోటి బ్రాహ్మణులు కుడిచిన ఫలంబగు. అర. 2-268

3. ఉదాహరణములతో వివరించుట.

వ అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబుల తెఱం గెఱింగించి యింక నేమి యడుగవల తడుగు మనిన. అను. 5-122

4. ఊహ, అనుకొనుట, తలంపు.

వ సైన్యద్వయంబును రయంబునం గలయం బెరసినం బెందూళి యెగసి తఱితోఁ గవియుదెంచు తమంబునకుం దోడుపడి చూడ్కులు నిగుడ నీకున్నను దమకంబునం దమతమ పేళ్లు బిరుదులు నుగ్గడించుచు నగ్గరిక సొంపునమ సన్నల నుద్దేశంబున నద్దెస నిద్దెస వీరులు పోరుచుండ. ద్రోణ. 5-142

5. అభిప్రాయము.

క. జనకునకును స్వామిత్వము, తనయోద్దేశమునఁ గలిమి తథ్యము యది యజ్ఞునికిఁ గలుగున కావున, ఆనుఁ బనిఁ బంపంగ నిన్ను జన నుత నాకున్. ఆది. 4-241

**ఉద్దేశించు** సం. స. క్రి.

1. గుఱించి

వ. గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థ సంగతంబును, సువిహితంబునుగా నిట్లను విరా. 4-220

వ. అగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కిట్లనియె. విరా. 5-305

వ. ద్రుపదుం డనపత్యుండగు తన మహిషి విషాదంబు దీర్పం దివురుటను గాంగేయు తోడి రోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన

నద్దేవుండు ప్రత్యక్షుమై. ఉద్యో. 4-369; భీష్మ 3-820

2. భావించు, అనుకొను, తలఁచు

వ. ఇంద్రుండు వానియొద్దకు వచ్చి నీవేమి యుద్దేశించి యుగ్ర తపంబుఁ జేసెద వనిన. అర. 3-258; విరా. 1-175

**ఉద్ద్యోతనము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁ జేయునది.

క. భూతంబుల సంసరణము, భూతభవద్భావి కార్యములు గర్మ సము,ద్ద్యోతన భంగియు నీయఱ. చేతివి కావె కురువంశ శేఖర జన్మా. శాంతి. 2-101

**ఉద్ద్యోతమానము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించుచున్నది.

తే. అర్జునుఁడు గవియించిన యంప మూఁడ, మంచు దళముగఁ గప్పిన మారణాఁకు, జాలముల వెస విరియించె శాంతనవప,తంగుఁ డుద్యోతమాన ప్రతాపలీల. విరా. 5-169

**ఉద్ద్యోతితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశము కల్పింపఁబడినది. ప్రకాశితము.

క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతిత రోచిరుద్గమోగ్రం బరిని,ర్భ ద్యము దివ్య జనన మన,వద్యంబది కార్ముకైకపరము గుమారా విరా. 4-121

2. బయల్వెడలినది, బహిర్గతమైనది.

క. పాతాళమునకుఁ జని యం,దాతతమై ప్రణవరూపమగు నాదంబు, ద్ద్యోతితము సేసె నది యా, దైతేయులు విని పటుప్రతాపంబెసఁగన్. శాంతి. 6-485

**ఉద్ధత** సం. వి. ఆ. స్త్రీ.

ఏడుగురు కుమార మాతృకలలో నొకతె - బాలగ్రహము. పది యాఁడే డులు ప్రాయము వచ్చు వఱకు నరులను బాధించును. ఆ సమయ మున మ్రొక్కినను, కొల్చినను, వేఁడినను కనికరముతో వదలిపోవును. అర. 5-245 మొ. 250 వ

**ఉద్ధతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పెచ్చు పెరిఁగినది. అతిశయించినది.

తే. ఉఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ, జెలఁగి మార్కొని పొదివి సంకులముగాఁగ. విరా. 3-211

2. మదించినది.

సీ. ఒక మత్తకరిఁ జూచి యోటమై నోడఁగిన నుద్ధతకరిఁజేసి యొసఁగె జయము, శాంతి 3-98

3. కఠినమైనది. ఉరవైనది.

మ. పిడుగుల్వోని మహోద్ధతాశ్మముల నాళీలంబుగా దైత్యు ఖి, ట్టడువన్. అర. 7-98

**ఉద్ధతి** సం. వి. ఇ. స్త్రీ.

1. గర్వము, దర్పము.

ఉ. నిర్మలా, తూర్జిత కీర్తికారణ రణోద్ధతి వెల్వెలఁబాఱ నేటికిన్. విరా. 4-186

క. నీసుతుఁడు సమర విషయో, ల్లాసంబున నంగకంబులం బొంగారం, గా సుస్వరమున నా కుం,తీసూనునిఁ బిలిచె నుద్ధతిన్ రణము నకున్. శల్య. 2-208

2. అహంకారము, అభిమానము.

క. మతి నెప్పుడుఁ దా ధర్మ, స్థితి నూహించుచును హితులు సెప్పెడి వెరవు, ద్ధతిదక్కి యాచరించుచు, జితేంద్రియత గలిగి నడపఁ జెందు శుభంబుల్. శాంతి. 1-78

3. సంరంభము, ఆటోపము, వేగిరపాటు.

శా. ....శతా,నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్. విరా. 3-145

4. ఔన్నత్యము. ఆధిక్యము.

ఉ. ... వన్యబల ముద్ధతిఁ గొల్చు మృగేంద్రురేఖ శోభిల్లుచు నుండ. విరా 3-148

5. ప్రకోపము, ఉల్బణము.

మత్తకోకిల :— వృద్ధుఁడై నతఁడిన్ బలంబును పీఁకయుం దఱుగంగ
దుర్బుద్ధి వాటిల ప్రమ్మగ్గి యింద్రియముల్ విశక్తతఁ బొంద దో,
షోద్ధతిన్ రుజ లుద్భవింపఁగ నొందు రూపగు పాశసంబద్ధుఁ జేసి
జముండు దివ్వఁగఁ గాయు నబ్భవముం దుదిన్. స్త్రీ 1-41

**ఉద్ధతిమాన్చు** మి. క్రి.

గర్వమణఁచు, చంపు

ఉ. తక్కినవార లాతనికి దవ్వుల చోటుల వారు వాయుజుం,
డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్చిన మాన్చువాఁ డతం,
డక్కడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపదిగాఁగ నోపు వే,
ఱొక్కఁడుఁ డాఁకఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే.
విరా. 3-115

**ఉద్ధతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. గర్వముగలవాఁడు, అవినీతుఁడు.

వ అనిన విని యాజ్ఞసేని యిట్లను...ఒక్క కారణంబున నుద్ధతులగు
విరోధుల చేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి
విరా, 1-818

2. అహంకారి, స్వాతిశయము గలవాఁడు.

వ. ఇవ్విధంబున దుర్యోధనుం డుద్ధతుండై మఱియుం బెద్ద యెలుం
గునఁ బలుకుచుండ. శల్య. 2-113; విరా. 3-118

**ఉద్ధరణము** సం. వి. అ. న.

1 మీఁదికెత్తుట.

క అమృత మథనమున మంథనగము లీలోద్ధరణ కేలిఁ గైకొని
సురసంఘమునకుఁ బ్రియ మొనరించిన, యమేయుఁ గూర్మాత్మ
నంబుజాతుం గొలుతున్. శాంతి. 2-40

ఆ. ...కశ్యపుఁడు నిజోరువు నెఱి, గ్రుచ్చి దాఁపుగాఁగ నిచ్చియె త్తె

వ. అదికారణంబుగా ధరణియుర్వియనం బ్రసిద్ధి వహించె నయ్యుద్ధరణ
సమయంబునం గాశ్యపి గశ్యపువి వేఁడుకొని. శాంతి. 2-89-90

2. ఆపదనుండి తొలఁగించుట, రక్షించుట.

వ నీ వమ్మహారాజుచేత దండింపంబడుటం బుచితాత్ముండవును వంశో ద్ధరణ సమర్థుండవు నైతివి సంతోషింపుము - ధౌమ్యు
శాంతి. 1-169

వ నీగర్భంబున నున్నవాఁడు నూర్యానల సమ ప్రభుం డైన పుత్రుం డుభయకుల దుఃఖోద్ధరణ సమర్థుండు సుమ్మీ నీవు వగవక నీ యగ్రజువొద్ద నుండు మని జరత్కారువు నూరార్చి.
ఆది. 2-160

క- ధర్మతత్త్వోద్ధరణా.
అను. 5-488

**ఉద్ధరించు** సం. స. క్రి.

1. పైకిఁదీయు, వెలువరించు.

వ. దేవయాని యను దానఁ బ్రమాదవశంబున నిమ్నాతం బడి వెలువడ నేరకున్నదానను నన్నుద్ధరించి రక్షింపు మనిన.
ఆది. 3-143

వ. ఇమ్మడువు మహామత్స్య సంకులంబు గావున నపాయంబు వొంద కుండ నన్నుద్ధరించి యొండెడం బెట్టవే, యేను నీకుఁ బ్రత్యుప కారంబు సేయనోపుదు ననిన.
అర. 4-220

2. కాపాడు, రక్షించు, ఆపదనుండి తొలఁగించు.

వ. నీవింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే యెట్లును సంగరంబున మమ్ముద్ధరింపు మనియె.
ఉద్యో. 2-244; శల్య. 2-155; కర్ణ. 8-179

3 (ముల్లు మొదలగు వానిని) వెలికిఁదీయు, ఊడఁదీయు.

వ. వినిద్రకరణంబయిన నా హృదయ శల్యంబు నుద్ధరింపుము.
ఆది. 6-180

4. తరింపఁజేయు, పుణ్యలోక ప్రాప్తి గలిగించు

వ. లోకోద్ధారంబను తీర్థమాడి కులంబు నుద్ధరింతురు.
అర. 2-268

ఉ. ఇక్కులల మెల్లను నుద్ధరింపఁగా, వచ్చిన పుణ్య దేవతవు.
సభా 1-152

**ఉద్ధవుఁడు** సం. వి. అ. పుం.

కృష్ణునకు హితుఁడైన యొకానొక యాదవుడు.
ఆది. 8-176

ఇతఁడు యాదవులతోఁగలిసి రైవతకాద్రి మహోత్సవమునకేగెను.
యాదవ వినాశకాలమునఁ దపస్సు చేసికొనుట కడవికిఁబోయెను.
మౌస. 88

ఇతనిని గురించి శ్రీమదాంధ్ర భాగవతమున నిట్లు చెప్పఁబడినది.

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్, బుద్ధి
నిధి సమరగురుసము, నుద్ధవుఁ గాంచి కృష్ణుఁ డొయ్యన పలికెన్.
భాగ. దశమ. 1483

**ఉద్ధారుఁడు** సం. విణ. (అ. రిణీ. అ.)

ధరించువాఁడు.

సీ అవ్వీరు లన్యశరాసనోద్ధారులై యతనిపైఁ బఱపిరి శితశరఁబులు
కర్ణ. 1-90

**ఉద్ధురత** సం. వి. ఆ. (స్త్రీ).

1. ఆధిక్యము, అతిశయము.

క. నరనాథ యింక భీష్ముని, దురమునకుం దేకు మేను దోర్బలవిభవో,
ద్ధురతం బాండుకుమారో,త్కరముం దత్సేనఁ మదంబడఁగింతున్.
భీష్మ. 3-167

2. దృఢత్వము, నేర్పు.

తే. గదగొని వైచె నుద్ధురత నతఁడు. ద్రోణ. 8-248

**ఉద్ధురము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సమర్థమైనది, నిర్భరమైనది.

క. భరమువ నీ పోరెడు నెడఁ, బగము విపాకంబు నీవు బలిమి మెఱపి
యు,ద్ధురవృత్తి జయము గొనినం, బరతోషముఁ బొందు నన్ను
భావించి మదిన్. విరా. 2-198

2. అధికమైనది, దట్టమైనది.

క. శరవేగంబున సరుఁ డు,ద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరల్చెన్.
విరా. 4-270

సీ. ....పద్మనాభుఁడును దీవ్రకోపాగ్ని తనదు చిత్తమున నుద్ధురమై
జనింపంగ. మౌస. 61

**ఉద్ధురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1 ధీరుఁడు, బెట్టిదుఁడు.

క. పరిభవము రెండు దెఱఁగులఁ, దరుణీ తోఁచినది సాళ్వుఁ దగ దేర్తు
నో యుద్ధురుఁడగు భీష్మునిఁ దేర్చునో, కరము ప్రియంబెద్ది వ్యా
దయు గతముం జెపుమా. ఉద్యో. 4-297

2. సమర్థుఁడు.

చ. దురమున నర్జునప్రకట దోర్విభవంబు నెదుర్పఁజాలు నుద్ధురుఁ
డొకరుండు గల్గునె. శల్య. 1-88; శాంతి. 8-174

**ఉద్ధూతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎగురఁగొట్టఁబడినది, పైకిఁ జిమ్మఁబడినది.

సీ. తురగ ఖురోద్ధూత ధూళి యప్సరసం చిన్నిపువ్వుల తోడఁ జెలిమి
సేయ. భీష్మ. 1-104; ఆది, 2-288

**ఉద్ధృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఆపద నుండి తప్పించుట, రక్షించుట, విమోచనము.

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి... దేవ
ముని సమ్యాన్మనోద్ధృతిన్ భూభరంబు దొలంగించిన చక్రి నంబురుహ
నాభుం గొల్తుఁ గష్టాత్మునిన్. శాంతి. 2-47

**ఉద్బద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

పైకిఁ గట్టఁబడినది.

వ. (ఘటోత్కచుఁడు) పింగళోద్బద్ధ జటాకేశకలాపంబును.

ద్రోణ. 5-207

**ఉద్భటము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అధికము, ఉద్ధతము.

మ. భవదాజ్ఞా దృఢబంధ సంయమిత కుంభద్వేగమై కాక నాఁ, డవలీ
లన్ మన యర్జున ద్విపము క్రోధావేశ దుర్దాంత దర్ప విలాసో
ద్భటభంగి నే పదరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జిక్కువడం జేయదె.

విరా. 1-56

2. భయంకరము.

సీ. ఉద్భటాకార సముద్ధతి మనము లుత్తలపడఁ దోపంగఁ దల్లడిలుచు.
విరా. 4-243

**ఉద్భటుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉద్ధతుఁడు; గర్వి, శౌర్యము గలవాఁడు.

ఉ. ... (భీముఁడు)... ఆక్రమించె పంచానన మేణమం బోదువున
ట్లతఁ డూర్జిత శక్తి నుద్భటుం, డై నెగసెన్ సమీరసుతు నల్కకుఁ
బ్రాకిడినట్లు వీఁకతోన్, విరా. 2-350

2. భయంకరుఁడు.

వ. కర్ణుండు...కోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని
తేరికి సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి.
కర్ణ. 3-247; అశ్వ. 4-68; విరా. 3-24

**ఉద్భవము** సం. వి. అ. పుం.

పుట్టుక, ఉత్పత్తి.

సీ. అవ్విభుని కుద్భవమ్మయి కౌశికుఁ డిమ్మహి గాధినామమ్మునఁ
బరగె. శాంతి. 2—68

తే. అతని తలఁపునఁ బ్రభవించె నాకసంబు, దానియందు జలంబు
లుద్భవము నొందె. శాంతి. 4-82

**ఉద్భవించు** సం. అ. క్రి.

పుట్టు, జనించు.

వ. అప్పుల వలన నగ్నియు బ్రాహ్మణుల వలన క్షత్రియ జాతియు
నశ్మంబు వలన లోహంబును నుద్భవించె. ఉద్యో. 1—185

**ఉద్భవిల్లు** సం. అ. క్రి.

పుట్టు. జనించు.

చ. ఉడుగక యొండొరుం జఱచి యొక్క బలంబుగ దేవదానవుల్,
వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి నల్గడలను
విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన. ఆది. 2-15

**ఉద్భావన** సం. వి. ఆ. స్త్రీ.

ఊహించుట, భావించుట.

క, మత్ప్రాణ్యం కోద్భావన శ్రీకంఠుఁ డనఁగఁ బరగుము శర్వా. శాంతి. 6-452

**ఉద్భావితము** సం. విణ. (అ. ఆ. అ.)

కలిగినది, ఏర్పడినది.

క. కావునఁ గుడువక పోలియదు, దేవాసురమునులకైన దేవీ కర్మో, ద్భావిత ఫలమీ యర్థము, నీ వలవఱపుము భవన్మనీషఁ దిరము గన్. అను. 5-119

**ఉద్భాసి** సం. విణ. (న్. నీ. న్.)

మిక్కిలి ప్రకాశించువాఁడు.

వ. ఇట్లు భగ్నబల సమాశ్వాసనోద్భాసియగు భీష్మ భుజబలంబు ప్రాపున. విరా. 5-68

2. ప్రకాశించునది, మెఱయునది.

మాలిని :— హృదయపద్మోద్భాసి విజ్ఞానసారా. ఉద్యో. 4-428

**ఉద్భాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశింపఁబడినది.

క ...సేవ్యపదారవింద యోగిక విద్యోద్భాసితమతిమూర్తిమయా. విరా 5-1

**ఉద్భాసితుఁడు**

మిక్కిలి ప్రకాశింపఁబడినవాఁడు.

క. అనుకృతము గడయెయ్యి మహాసత్త్వాయోగ సేవనారామత నుద్భాసితుఁడ వగుచు నిష్ఠావ్యాసంగ విహారివగు మనామయలీలన్. శాంతి. 5-360

**ఉద్భిజ్జము** సం. విణ. (అ. ఆ. అ.)

భూమిని భేదించుకొని పుట్టునది.

ఆ. ఉవిద నోఁకు నెఱుఁగు నుద్భిజ్జములు, స్వేదజముల కదియుఁ జూపు సంభవించు. అను. 3—13

**ఉద్భిదము** సం. వి. అ. పుం.

మొక్క (చీల్చుకొని పైకి వచ్చునది)

వ. జంగమ స్థావరంబుల యందు జంగమంబులు లెస్స యని జరాయువు నండంబును నుద్భిదంబును స్వేదంబును నను జనకవిశేషంబుల జనియించి బహుపాదంబులు, ద్విపాదంబులును నైయుండు నందు మనుష్యులు మేలు. శాంతి. 5-99

**ఉద్భూతము** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టినది, కలిగినది.

క. చైతన్య శక్తిఁ బురుష, మేతత్త్వ విశేషమున వహించుఁ బ్రకృతి తజ్జాతయగును బుద్ధి తదుద్భూత మహంకార మఱియుఁ బొరయుం జిత్తున్. శాంతి. 4-270; కర్ణ. 2-165; అర. 1-182

**ఉద్భూతి** సం. వి. ఇ. స్త్రీ.

పుట్టుక.

తే ...మైత్రి సప్తపదకృతోద్భూతి యనియెడు పలుకు వినవె. కర్ణ. 2-102; శాంతి, 4-77

**ఉద్భ్రుకుటి** సం. విణ. (ఇ. ఈ. ఇ.)

బొమముడి గలవాఁడు.

క. శకుని ప్రతివింధ్యుఁ దాఁకినఁ, బ్రకటబలుం డా యుధిష్ఠిర ప్రియసుతుఁ డుద్భ్రుకుటి యగుచుఁ గవిసెను సింహకిశోరము గజముఁ బొదువున ట్లతనిపయిన్. భీష్మ. 1-268

**ఉద్భేదనము** సం. వి. అ. న.

భేదించుకొని వెలికి వచ్చుట, ఉల్లుట.

క. మయూరంబులకు పత్త్రోద్భేదనంబును. శాంతి, 5-44

**ఉద్భేదము** సం. వి. అ. పుం.

మొక్క (చీల్చుకొని పైకి వచ్చునది)

తే. స్వేద ముద్భేద మండమ స్వీనఁ బుట్టు, నధమ మధ్యమోత్తమ దశలైన భూతరాసులు. అశ్వ. 2-144

**ఉద్భ్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.)

సంక్షోభము చెందినది.

మ. ...ఉద్భ్రాంతంబులై యంబుధు, ల్వారలెం గట్టల మీఁద.
ద్రోణ. 5-377

**ఉద్భ్రాంతి** సం. వి. ఇ. (స్త్రీ).

మిక్కిలి భ్రాంతి, మిక్కిలి సంక్షోభము చెందుట.

మ. ...సప్తాశ్వ సప్తులు బిట్టుల్కి రథంబు నల్ దెసలకుం బోనీడ్చె నుద్భ్రాంతిమై.
అర. 5-208

**ఉద్భ్రాజితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశింపఁబడినది.

క. తేజోధనుఁడగు నరుఁ డుద్భ్రాజితగతి నడుమ మెఱసి.
విరా. 5-58

**ఉద్భ్రాజిష్ణుఁడు(వు)** సం. వి. ఉ. పుం.

మిక్కిలి ప్రకాశించువాఁడు.

క. తేజోరూపము బ్రహ్మము, ప్రాజాపత్యం బనంగఁ బరఁగి పురుషుఁడు, ద్భ్రాజిష్ణు సత్యనిత్యా, వ్యాజమహిమ వెలుఁగుచుండు నకలంక మతిన్.
శాంతి. 5-33

**ఉద్యత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

పుట్టుచున్న, కలుగుచున్న

శా. నానాగమ, క్షీరోద్యన్నవనీత లాలసిత నిశ్చిత్తత్త్వ సంభాసితా.
ఆశ్ర. 2-174

శా. ఉద్దామక్రోధ శిఖాకలాప వికటోద్య ద్భ్రూకుటిస్ఫూర్తియై.
విరా. 3-189

౨. అతిశయించుచున్న.

మ. ఉద్యద్భావానునృత్యద్భటో, త్కరమున్ దిట్టినయట్లు గూలె.
విరా. 5-290

౩. ఉత్కృష్టమగుచున్న, శ్రేష్ఠమగుచున్న.

శా. ఉద్యద్గుణ శ్రేణీరమ్యులు.
ఆది. ౧ 9

4. పైకెత్తుచున్న.

వ. ఉద్యద్గదాహస్తులయి. ఆది. 6-12

**ఉద్యతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పైకెత్తఁబడినది.

చ. ...అశ్రుతాయు వుద్యతగద నొప్పఁ బట్టి దనుజాంతకు వేసె. ద్రోణ. 3-105

చ. ...అతనిపయి భీముఁ డుద్యతగదాస్ఫురణన్ నడచెన్ నరేశ్వరా. శల్య. 2-258

2. పూనినది, వహించినది.

చ. సురేశ్వరోద్యతకులిశంబుఁ బొందె హరి దత్సమయంబునఁ గౌరవేశ్వరా. శాంతి. 5-424; సభా. 2-51

3 ఉద్భవించినది, పుట్టినది.

స్రగ్ధర: ఆదివ్యాఘ్రముసం దుద్యతమయి ఘన ఘోరాగ్ని యర్చిర్వితానం, బే దిక్కుం దానయై పెల్లెసఁగుచు. సౌప్తి. 2-61 అర. 4-246

4. సిద్ధమైనది.

వ. అఖిల లోకదహనోద్యతంబయిన నా కోపదహనంబు నిగృహీతం బయిన నన్ను దహించు నేమిసేయువాఁడ. ఆది. 7-148

చ. అతఁడు నివృత్తిధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షుణోద్యత మది. అను. 5-31

**ఉద్యతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

యత్నపడినవాఁడు, పూనినవాఁడు, సమకట్టినవాఁడు.

క. భూదేవోత్తమునాళీ, ర్వాదంబులఁ బ్రీతిఁబొంది వారలు, ప్రస్తావాదరపరులగుటయు స, మ్మోదావహ పుణ్యకర్మముల కుద్యతుఁడై. విరా. 1-145

మ. నిశ్శంకం బతిక్రూరకర్మములం దుద్యతులైన వారికి నశర్మప్రాప్తి గాకుండునే. ఆది. 7-185

**ఉద్యమత్వము** సం. వి. అ. న.

సిద్ధమగుట.

మ. ...త, క్కిన దైత్యావలి విచ్చె నల్గడఁ బరిక్షీణోద్యమత్వంబునన్.
శాంతి. 2-442

**ఉద్యమము** సం. వి. అ. పుం.

1 పూనిక, యత్నము.

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర, ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్, విరా. 2-55

2. సన్నాహము, సిద్ధమగుట.

శా. ...ధరిత్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ, ర్మానీతిక్రమదక్షులం బనిచె నయ్యైవారికిన్ గ్రక్కునన్.
విరా. 3-142

క. అనుటయు నాతఁడు దగ నూఁ,ల్కొనిఁ దా నుదితనినద కోదం డుండై, యనితర సులభోద్యమమున, ధనంజయుం డిట్టులను నతనితో మఱియున్. విరా. 5-155

**ఉద్యానము** సం. వి. అ. న.

1. ఆరామము, (విహారార్థము) తోఁట.

వ ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గాలూఁదక లీలోద్యానంబు గలయం గ్రుమ్మరుచు. విరా. 2-305

2. అడవి.

సీ. ఖాండవోద్యానంబుఁ గావనేరక సిగ్గుపడి చన్న నిర్జర ప్రభునికంటె
కర్ణ. 2-24

**ఉద్యాపనము** సం. వి. అ. న.

వ్రతసమాప్తి కాలమున వ్రతఫలమునకై చేయు కార్యము.

న. ...వ్ర, తంబున కుద్యాపనంబు సేయఁ, దలఁచి యర్థించునతఁడును.
అను. 2-59

**ఉద్యుక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. సిద్ధమైనవాఁడు.

వ. అని పలికి మరణోద్యుక్తుండై జలాగ్ని విష ప్రాయోపవేశాదు లుగ్గడించిన విని సంజయుం డతని కిట్లనియె.
కర్ణ. 1-24; శాంతి. 3-568

2. ప్రయత్నించినవాఁడు.

ఆ. పాలకడవ పెక్కు పసులలో డించిన, యాతఁ డెట్లు దాని నరసి
కొనుచు, నుండునట్లు లోన నునిచిన మనసు నే,మఱక యాత్మ
వెదకు తెఱఁగు మేలు.

క. ఈ తెఱఁగున నుద్యుక్తుండై. అశ్వ. 1-220, 221

3. పరిశ్రమ చేయువాఁడు, కృషి సలుపువాఁడు, పాటుపడువాఁడు.

వ. అగస్త్యుండు దనతపశ్శక్తి జేసి పుత్త్రకాముండైన విదర్భరాజున
కొక్క కూఁతుం బుట్టించిన నది లోపాముద్రయను నామంబుతో
జలంబులయందు నళినియుంబోలె వినీతునందు లక్ష్మియుంబోలె
నుద్యుక్తునందు విద్యయుంబోలెఁ బెరిఁగి యౌవనంబు దాల్చి
రూపవతియై. అర. 2-328

**ఉద్యోగత** సం. వి. ఆ. స్త్రీ.

ప్రయత్నము, పూనిక.

క. ఉద్యతులై కవలును ధృష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన సౌభ
ద్రుండున్, మాద్యద్గతిఁ గవియుడు నే,కోద్యోగత ద్రౌపదీసుతో
త్కర మడరెన్. భీష్మ. 1-238

**ఉద్యోగపర్వము** సం. వి. న్. న.

భారతమునందలి యైదవ పర్వము. చూ. మహాభారతము.

**ఉద్యోగము** సం. వి. అ. పుం.

ఉద్యోగ పర్వము.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా.
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగా.
విరా. 1-7

2. ప్రయత్నము, పూనిక.

వ. ...ఎల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుంబూడఁ
బోలునేని దీని కనురూపంబగు నుద్యోగంబు సేయుండనిన.
విరా. 3-117; శల్య 1-58

3. యుద్ధప్రయత్నము.

ఆ. అనఘ నీవు చెప్పినట్టులు సేసెద, మున్ను పలికినాఁడ నన్నరేంద్రు
కడిమి నాకుఁ బాలుగాఁబూని యుద్యోగ, వేళయందు నెల్ల వినుచు
నుండ. శల్య 1-98

4. మానుషము, పురుషప్రయత్నము.

మ. విను ముద్యోగము రెంటియందుఁ బర మర్వీనాథ యుద్యోగవం,
తునకున్ దైవము దోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్ మానసం,
బున కొక్కొక్కెడ సిద్ధి దప్పిన వగల్ పొందంగ రానీక య,
ప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హ వృత్తంబగున్.
శాంతి. 2-167

**ఉద్యోగవంతుఁడు** సం. విశే. (త్. తీ. త్.)

మనుష్య ప్రయత్నము సేయువాఁడు.

మ. విను, ముద్యోగము రెంటియందుఁ బర మర్వీనాథ యుద్యోగవం,
తునకున్ దైవము దోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్.
శాంతి. 2-167

**ఉద్యోగి.** సం. విశే. (న్. నీ. న్.)

ప్రయత్నము చేయువాఁడు.

క. త్యాగమొకనెలవు శమసం,యోగం బుత్తరము దీని కూర్ధ్వము
సంతో,షాగమము మోక్షలాభో, ద్యోగికి నివి గమ్యభూము లుత్తమ
ధిషణా. శాంతి. 5-343; ఆది. 1-42

**ఉద్యోగించు** సం. అ. క్రి.

1. పూను, కడఁగు.

శా. ఏమీ నిక్కమె మొన్నెఱుంగండె త్రిగర్తేశుండు మద్గోధన,
స్తోమంబుం గొనిపోవుతెంపునకు నుద్యోగించెనే మేలుమే, లామై
తోడనె పోవుఁగాక యని వీరాలాపముల్ పల్కి. విరా. 3-139

2. ఆయితపడు, సిద్ధపడు.

వ. ... అతండు పయనంబునకు నుద్యోగించిన.

ఆ. అతని ననుపనేఁగి యధికసంప్రీతి నేతెంచునప్పు డయ్యధిష్ఠిరుండు.
ఉద్యో 1-214, 215

**ఉద్ద్యోతితము** సం. విశ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁబడినది.

ఉ. .. భీమసేనుఁ డుద్ద్యోతిత హేమభూషిత చతుర్దశమార్గణ విద్ధుఁ జేయఁడన్ ద్రోణ. 4-200

**ఉద్ద్యోతితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁబడినవాఁడు.

ఉ. అతఁడు చిత్రసేనుని శరాసన మేడ్తెఱఁ ద్రుంచి ఘోటక వ్రాతము నొంచి మైమఱువు వ్రచ్చి శరంబులు మేన గ్రుచ్చి యుద్ద్యోతితుఁ డైనఁ జూచి. భీష్మ. 2-316

**ఉద్రిక్తము** సం. విశ. (అ. ఆ. అ.)

అతిశయించినది.

వ. ... రక్తజలోద్రిక్తంబును నగు నదీప్రవాహంబు నుత్పాదించె ద్రోణ. 5-84

శా. రౌద్రోల్లాసము మూర్తిసంకలన ఘోరంబై పొరిం బొర్చె నా నుద్రిక్తంబగు నూత్నరక్తమున మగ్నోన్మగ్నతం బొల్చి. శల్య. 2-264; కర్ణ. 2-188

**ఉద్రేకత** సం. వి. ఆ. స్త్రీ.

విజృంభణము.

క. మద్రేశుఁ డంత నిలువక, రౌద్రంబున వాలు వెఱికి రయము మెఱయ నత్యుద్రేకత డాసి యుఱికి, భద్రకరిం గరముఁ దునిమి పడ వైచె నిలన్. భీష్మ. 1-234

**ఉద్రేకము** సం. వి. అ. పుం.

1. విజృంభణము ; పెచ్చుపెరుగుట.

క ఇన్నగమునందు గాండివ, మున్నది యదిగాని మదృఢోద్రేక విలాసోన్నతి కోర్వవు పెద్దయు. నన్నువ లీవిండ్లు గఱుచ లలఁతి బలంబుల్. విరా. 4-105; శల్య. 1-168; కర్ణ. 3-291

2. అతిశయము.

క. నాకొడుకు పోటుమాటలు, నీకేటికిఁ బొసఁగ వాదనేరవు మౌర్ఖ్య

ద్రేకమునఁ బలుకుచుండుట, మాకు సహింపంగరాదు మానుము విప్రా. విరా. 5-255

**ఉద్రేకి** సం. విణ. (న్. ఈ. న్.)

ఉద్రేకముగలవాఁడు.

తే. పాండవార్థమై యొక్కరుఁ బనుప మీకు, భరము మీపలు కందఱ పలుకు మీరు, తెలుఁగు పలుపంగ మిగిలి,యుద్రేకులైన వార చెడువారు విమల విచార విభవ. ఉద్యో. 1-44

**ఉద్రేకించు** సం. అ. క్రి.

విజృంభించు, చెలరేఁగు,

వ. (ద్రౌపది భీమునితో) కావున మదీయ పరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనల భేదింతురు. నీకుం బోలినభంగి రహస్యభంగంబుగాకుండ నరిభంగంబు సేయుము. విరా. 2-208

**ఉద్వహనము** సం. వి. అ. న.

ఉద్ధరించుట.

వ. ... సత్యవతి కురువంశోద్వహనార్థంబు పారాశర్యుం దలంచుడు నాతఁడుఁబ. ఆది. 4-288

**ఉద్వహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. (వంశాదికము) ఉద్ధరించువాఁడు.

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు ... కౌరవ కులోద్వహుఁ డార్యనికాయ సంతత, ఖ్యాతచరిత్రుఁ డీచెలుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. విరా. 5.321; అశ్వ. 1-121; ద్రోణ. 5-419

2. మోచువాఁడు, వహించువాఁడు.

మ (యుధిష్ఠిరుఁడు సుభద్రతో) భవదీయాత్మజు నాత్మజుండు కురు భూభారోద్వహుం డయ్యె యాదవనంశోత్తరుఁడైన వజ్రునకు నింద్రప్రస్థరాజ్యరమ గౌరవదీప్తంబుగ నిచ్చినాఁడ మహా. 11 ౩.

ఉ. సప్తవాయువులలో నొకఁడు

వ. ... ప్రవహుం డావహుం డుద్వహుండు సంవహుండు వివహుండు ప్రవహుండు పరావహుం డనం బవనులు సప్తసంఖ్య లదితిపుత్రు లఖిల భువనవ్యాప్తులై చరియింతురు. శాంతి. 6-307

4 క్రోధవశగణాంశమునఁ బుట్టినవాఁడు.

వ ... క్రోధవశగణంబువలన నుగ్రక ... శ్రుతాయు రుద్వహామతి మదీశ్వరాదు లనేకులు పుట్టిరి. ఆది. 3-80

**ఉద్వాసించు** సం. స. క్రి.

వెలిపెట్టు, విసర్జించు.

తే. అప్పుడు యాజకజనము లయ్యగ్నిచయము, నడవిలోన నుద్వాసించి యరిగె. ఆశ్ర. 2-165

**ఉద్వికాసుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి సంతోషించువాఁడు.

మాలిని : అమృతమయ విలాసా, యోగభోగోద్వికాసా. ద్రోణ. 5-483

**ఉద్విగ్నము** సం. విణ. (అ. ఆ. అ.)

వ్యాకులత్వముగలది, సంక్షోభించినది.

వ దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖంబగు దుష్ట లోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాబరభుగ్నంబును నవమానపంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది.

విరా. 2-285; ద్రోణ. 3-186; శల్య. 2-277

**ఉద్విజిత** సం. విణ. (అ. ఆ. అ.)

(దుఃఖాదులచే) వ్యాకులత నొందినది.

క. ద్విజభామినికి నదర్శము, ప్రజ గాంచినపిదప నయ్యపత్యము శోకోద్విజితయుఁ బతిభక్తయునై, త్యజించి యనుమరణనియత యగుట మహేశా. అను. 5-301

**ఉద్వృత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

1. నీతిని అతిక్రమించి నడచునది, చెడునడత గలది.

తే. చిగురుఁ దఱచునఁ గెంజాయ మిగిలి చెలువు, వడయు క్రొమ్మావి చాడ్పున భార్గవుండు.

క. నెత్తురు వడసిన మూర్ఛ,యత్తుందై పొగయుటయును నాతనిఁ గని యు,ద్వృత్త క్షత్రియ దర్పో,పాత్తంబగు తేజ మొల్లఁబాసెఁ దోఁచెన్. ఉద్యో. 4-321; 322

2. మేర మీఱినది, మిక్కిలి అతిశయించినది.

శా. అ, రంగాగారము సేరవచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం, తిం గాముం డట తేఁడె యింతకని యుద్వృత్తాంగజోన్మాదుఁడై. విరా. 2-380

తే. ...ఉద్వృత్త శౌర్య,మాన తుంగ ప్రభద్రక మాత్స్యతతులుఁ, దోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణతనయు, ము ట్టి శస్త్రాస్త్రచయముల ముంచుటయును. సౌప్తి. 1-178; శల్య. 1-116

3. పై కుబికినది, పొంగినది.

వ. కోపావేశంబు నొంది యుద్వృత్త తారకంబుల వారలనెల్ల నాలోకించి. శల్య. 2-99; అశ్వ. 3-82

**ఉద్వృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

గర్వము, చెడునడత.

క. (త్రిగర్తులు) పయుచుఁ బొడుచుచు వ్రేయుచు, డాయుచు నద్వృత్తిఁ దఱుముటయుఁ బొడిసేసెన్, వాయుసుతుఁడు రథముల నీరు, వేయిటి రథిరథ్యసూతవితతంబులుగాన్. విరా. 3-212

**ఉద్వృత్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గర్వి, అహంకారుఁడు.

క. రిత్తలు రజ్జెడు వాఁడే, మత్తగజాయుతబలుండు మారుతియని యు,ద్వృత్తుఁడగు దుస్ససేనుని, నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. ఉద్యో. 4-204; మౌస 46

**ఉద్వేగము** సం. వి. అ. పుం.

1. వ్యాకులత్వము, కలఁత.

మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకలితం బౌ పోసమాసూతు న్మెమ్మెన
మ్ముద్వేగముఁ బొందఁజేయ బలసామగ్రీ సము జ్జృంభణం,బున వానిం
దలవట్టి వంచుటయు నేఫుం జేవయుం దోఁప వాఁ,డనుమానింపక
బెట్టుదల్పికొని కోపాటోపదీప్తాంగుఁడై. విరా. 2-340

2. భయము, వఱఁకు.

క. అవమానమునకుఁ దృవుం, డవు నమృతము ద్రావినట్ల యంచిత
సమ్మానవ విధికి నుద్వేగముఁ బొం,దు విషంబునఁ బోలె శమ
రతుఁడు మునినాథా. శాంతి. 5-25

3. దుఃఖము, పరితాపము.

సీ. ధర్మనందనుఁడు చిత్తమ్మున నుద్వేగ, మావహిల్లఁగ దైవ మకట
యిట్లు, సేసె నే కిదేమిసేసిరొకో వీర, లిన్నరకమునకు నేఁగు దేర,
వలసిన యట్టిది. స్వర్గ. 24

**ఉద్వేజితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కలఁత పెట్టఁబడినది, సంక్షుభితము.

సీ. రుద్రనారాయణ రూపప్రవర్తిత మూర్తి ద్వయము రణమునకుఁ
బొచ్చి, పరమ సంరంభంబు వాటింప నుద్వేజితము లయ్యె నఖిల
భూతములు శ్రుతులు. శాంతి. 6-444

2. వెఱపింపఁబడినది, భయపెట్టఁబడినది.

మత్తకోకిల: విక్రమో,ద్వేజితాహిత విష్ణుసన్నిభ విష్ణువర్ధన భూ
పతీ. ఆది. 8-323

**ఉద్వేలము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కుటమైనది, అతిశయించినది.

శా. ...గీర్వాణుల్ మునుల్ సిద్ధుల,వ్వీరుం బ్రస్తుతిసేయుచుం బొదలి
రుద్వేల ప్రమోదంబునన్. అశ్వ. 4-42

**ఉనికి; ఉన్కి** దే. వి. (√ఉండు)

1. ఉండుట.

చ. అనిన నుదేష్ణ యిట్లనియె నంతవుఁరంతకు మద్గృహంబునం,దునికికిఁ
సమ్మతించిరి. విరా. 3-67

ఆ. ...సాదుఁ దెరువరి కునికిపట్టొసఁగు టొసఁగుఁ దనుసుఖోదయ
ములు. అను 5-196

**ఉనిచికొను** దే. స. క్రి.

కూర్చుండఁబెట్టుకొను. (చూ. ఉనుచు)

క. భయశోకంబులు దనదు హృదయమునఁ బిరిగొన విరాట ధరణీ
నాథప్రియ సంభావనచేసె వినయ పూర్వముగాఁగ ద్రుపదనంద
నకుఁ దగన్.

వ ఇట్లు సంభావించి యత్తరుణిం దవ పరిసరంబున నునిచికొని తదీయ
వదనం బవలోకించి. విరా. 5-56; 57

**ఉనుచు; ఉన్చు** దే. స. క్రి. (√ఉండు)

1. ఉండునటులఁ జేయు.

క. ఇట్లు సొచ్చి తదీయం బని మధ్య ప్రదేశంబున విరాటనందన లీలా
పర్యంకం బరసి కని దాని కనతిదూరంబునం బాంచాలి నో..రిల
నునిచి తానాతల్పంబున నుండె. విరా. 2-328; స్త్రీ. 1-125

వ. అగ్రభాగంబున శిఖండి నునిచి. భీష్మ 3-191

2 కూర్చుండఁబెట్టు.

వ. సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచిత సమున్నతాసనం
బున నునిచి వినయావనతుఁడయి. విరా. 1-189

వ. గాఢాలింగనము సేసి కనకాసంబున నునిచి. ఉద్యో. 1-94

క. అమ్మనివరు నా పర్యంకమున్నపయిం బ్రీతి నునిచి...తత్పార్శ్వ
మునన్

వ. ...వేఱొక్క సెజ్జం గూర్చుండె. అను. 2-11, 12

3. ఊడిగమునకై నిలుపు.

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి, నూఁడిగంపుఁ బలికి యునిచి
కొనియె, నంతిపురము చరిత కలవడ మెలఁగుచు, నుండె ధన్వ
ధూటియును ముదమున. విరా. 1-330

4. దాఁచియుంచు.

సీ. కడుఁ బెద్దకాలంబు గంధపుష్పాదుల, నర్చించుచున్నాఁడ నను దినంబు, -ఆ- దానఁ గరంబు భక్తి నునిచిన యున్నది, యహిమయంబు దారుణాస్త్రము. కర్ణ. 2-45

క. మీ తండ్రి కుటికి సటికిన, పేటియు నీ కొఱకు నునిచి రిపుడ నరుకుదున్, నీ తులువ పలుకులకు నీకై తోఁచిన యుత్తరంబు నదియె దురాత్మా. కర్ణ. 2-329

5. నివసింపఁజేయు.

క. ఖలుఁడై ధృతరాష్ట్రుఁడు పుత్రులు దాను గూడి మమ్ము దూరస్థులుగా, నిలు వెలువరించి లాక్షా, నిలయంబున నునిచెఁ బాపనిష్ఠిత బుద్ధిన్. ఆది. 6-80

6. నెలకొల్పు, నిలుపు, ఆఁపు.

తే. బ్రహ్మచర్య శిక్షాశన పరత గలిగి, జటిత యొండె ముండిత యొండె సంభవించి, మనసు నాయందు థిరముగా నునిచి యొండు, వస్తువుల దెస నొల్లమి వర్తిలంగ. అను. 5-269

క. దేవుఁడుగా కితఁడు నరుఁడు, నా వచ్చునె నిష్ఠపెంపునం బ్రాణంబుల్, కావలసినపుడ విడువం, గా వేడుక నునిచినాఁడు గాదె తనువునన్. స్త్రీ. 2-112

వ... ఒక్క మోహరంబుగా నమర్చి యిందగ్రభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామ సౌబలుల నునిచి నడుమ శల్యు నిలిపి. ద్రోణ. 5-142; భీష్మ. 3-414

7. స్థాపించు, అభిషేకించు.

క. వినుఁ డింద్రప్రస్థపురం, బునకు నధీశుఁడుగ వజ్రుఁ బోఁడిమితో నే, నునిచెద మీరెల్ల నతఁడు, మనుపంగాఁ దొంటియట్ల మనుఁడచ్చోటన్. మౌస. 1-131

8. అమరుచు.

వ. ...ఎల్లినీవు మనయరదంబు పన్ని శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలా

హారంబుల గనకమణి మాలికాలంకృతంబులం జేసి పూన్చి గరుడ ధ్వజంబు సంఘటించి చక్రగదా ప్రముఖాస్త్ర శస్త్రంబులు దగు తెఱంగున నునిచికొని మైమఱువు దొడిగి రమ్ము. ద్రోణ 2-364

9. నియమించు, పర్పఱచు.

క. అని కృతవర్మకు సారథి, నొనర్చి తనకృత్యమునకు నునిచి కదఁగి యాశినివరు వెనుకొన ధర్మ సుతుని దొర లయ్యస్త్రగురుని, దొడర నడరినన్. ద్రోణ. 4-24

క. ..జనకునకుఁ గావలిగా, నునిచిన వాడయి నెమ్మదిఁ, జనిన హరికిఁ జావు సెప్పఁ జనియెద నకటా. మౌస. 1-56

10. రక్షించు, పోషించు, కాపాడు.

క. మొదలఁ గలిగించి జగములఁ, బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తనయం, దొదిగించి మఱియు నెమ్మయి, నుదారగతి నడపు చిన్మయుని గొలుతు హరిన్. శాంతి. 6-414

ఆ. మాఱుకొన్నవారి సీఱుసేయుము ప్రజ, నరసి మనుపు ధరణి సురులఁ బ్రోవు, మఖిల బంధుజనుల నాశ్రితులను సుఖ, వృత్తి నునుపు పెంపు వెలయ నధిప. శాంతి. 1-370

11. ఒదిగించు, అణఁగియుండునటులఁ జేయు.

క. మనమున నైంద్రియములు, నునిచి మనం బాత్మ నల్ల నొదిగింపఁగ నెక్కొని ప్రాణంబున పానంబును వశ్యత నిలుచు యోగమున సిద్ధికి నై. అను. 5-257

12. (యజ్ఞము) నిర్వహింపఁ జేయు, ఊనుచు.

సీ. ఈతండ నిఖిలావనీతలేశుల నోర్చి, రాజసూయము ధర్మరాజు నునుచు. ఆది. 5-124

క. పరచక్రపతులచే భీకరుఁడై ధనరాసు లదిమి కప్పము గొని చె, చ్చెరఁ దెచ్చియిచ్చి నన్నును, భరతకులశ్రేష్ఠుఁ డునిచె బహుయజ్ఞంబుల్. ఆది. 6-125

సీ. అగ్రగణ్యు రాజసూయాధ్వర మునిచిన, యధిక సమర్థున కర్జునునకు ఆర. 1-378

13. తలఁచు, స్మరించు.

క. విను మొకయించుకసే సైనను నారాయణునిఁ దలఁచినను సుగతిఁ గనున్, మనుజుఁ డనిన మది నెప్పుడు, ననిచిన యాతనికి బ్రాఁతె యుత్తమధిపణా. అను. 4-371

**ఉన్నట్టులు** దే.

ఉన్నది యున్న విధముగా, యథా ప్రకారము.

క. నన్నడుగ నేల నీవును, నన్నీచుఁడు నేమి మాటలాడితి రదినా, కున్నట్టు తెలుగఁ జెప్పుము, నిన్నే మెచ్చించువాఁడ నీరజ వదనా. విరా. 2-273

**ఉన్నతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఎత్తైనది.

తే. అట్ల చేయుఁడు రుచిరోన్నతాసనములు.

విరా. 1-200; ఆది 6-4

క. సమ విషమ వినిమ్నోన్నత, సమీప దూరస్థలములు సంస్థలము లుగఁ జి, త్తము క్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము సను వివితథమై. (మెరకయైనది) విరా. 5-469;

2 ఎత్తఁబడినది.

వ. ఉన్నతంబులగు నపసవ్య కరంబుల నాకుంచిత సవ్యబాహాతలంబుల నప్పళించు చప్పుళ్లు గలసి యొక్కరుండ మల్లచఱచిన చందంబున పీతేర. విరా. 3-14

3. గొప్పది, అతిశయించినది.

క. విను బండారము పెరుఁగని, జనపతికి బలంబు మిత్త్రసంపదయును గల్లునె బలమిత్త్రవిహీనున, కొనరునె రాజ్యంబు విభవమున్నత మగునే. శాంతి. 2-171

ఉ. ఉగ్రుఁ డమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో దగ్రుఁడు .........ధార్తరాష్ట్రాగ్రజుఁడు. విరా. 5-15

4. పొడవైనది.

వ. అనుచుఁ బురుషోత్తమునిఁ జిత్తమున నిలిపి యున్నతంబైన పూర్వ

కాయంబుతో మంద ప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతి దేహ నిగిడింప... శల్య. 1-267

**ఉన్నతి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఉచ్చస్థితి, వృద్ధి

చ. ...వి,చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మున్నతిన్. విరా. 3-95

మ. ...పది పంచిన వినిశ్చింతంబునం జేసి యు,న్నతిఁ బొందం గలవార మై యునికి కృష్ణా నేఁడు గావచ్చెనే.

ఉద్యో. 3-80; శాంతి. 5-576; అను. 2-156

2. కీర్తి.

సీ. ...సకలజనముఁ, గొనియాడు సిద్ధులు, మునులు సేవింతురు. ధర్మనందనుఁ డి ట్లురాత్తుఁ దగునె,-తే-యతని కున్నతి గావించి రనిలజుండు, గవలు నెంతయు నీచేతి గాండివంబు. అశ్వ. 1-144

**ఉన్నతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

అధికుఁడు, గొప్పవాఁడు.

క. ...విభ,వోన్నతుఁడగు విరటుపాల నుద్భటవృత్తిన్. విరా. 2-4

క. అనవద్య ధర్మచరితం,బున నున్నతుఁడైన నహుషు పుత్రుఁడు, ఆది. 3-2 4

**ఉన్నద్ధము** సం. విశ. (అ. ఆ. అ.)

ఉబ్బినది, పెరిగినది, అతిశయించినది,

శా. గీర్వాణ ప్రవిముక్త బాణపటల క్రీడా విలాసంబులై, గర్వోన్నద్ధ సురారి శీర్షములు వీఁకన్ డొల్లె. అర. 5-276.

**ఉన్నమత్** సం. శత్రు. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగములేదు)

పైకెత్తఁ బడుచున్న.

చ. జలధి విలోలవీచి విలసత్కల కాంచి సమంచితావనీ, తల వహనక్షమంబయిన దక్షిణ హస్తమునం దదున్నమ,ద్ఘళదురు ఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె

విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్. ఆది. 3-144

అతిశయించుచున్న.

శా. దూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు దుర్నీ
తిం గూరి యొనర్చినట్టి యఘముల్ నిష్కంప ధైర్యోన్నమచ్చైత
న్యారూఢవైన నీకొకనికిం జెల్లెన్ సహింపంగ. అర. 4-157

**ఉన్నయనము** సం. వి. అ. న.

పైకెత్తుట పైకెగుర వేయుట.

వ శోభద్ధ్వజోన్నయనంబును, విరా. 3-286

**ఉన్నయునికి** దే.

ఉన్నవాఁడున ట్లు (ఉన్నట్లే).

క. పాండవాగ్రజుం డున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి
విరా. 1-184

**ఉన్నరూపు** దే.

యథార్థము, సత్యము- ఉన్న విధము.

ఉ. ...నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూపయ్యది
నావుడ న్నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డిట్లనున్. విరా.1-190

ఆ.వె నాకు, నున్నరూపు సెప్పవన్న పార్థ... ద్రోణ. 3-193

**ఉన్నిద్రత** సం. వి. ఆ స్త్రీ.

వికాసము.

మాలిని:- నతాంఁవహో,నిరసన చరణాబ్జోన్నిద్రతా రాజమానా.
కర్ణ. 3-401

**ఉన్నిద్రము** సం. విణ. (అ. ఆ. అ.)

1. నిద్రనుండి లేచినది.

సీ. అరవిరినెత్తావి నడలించు నున్నిద్ర,విట వీది సౌరభ వితతివోదల
ఉద్యో. 2-112

2. జాగరూకత గలది. ఎచ్చరిక గలది.

మ. సతతోన్నిద్ర విశైక భక్తసులభా. శల్య. 2-420

8 విరవిరియైనది.

మాలిని:- నిరతిశయ సమత్వోన్నిద్రకారుణ్యభద్రా. శాంతి. 6-624

**ఉన్నిద్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించువాఁడు.

వ. ...అప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట చారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుండై (కృష్ణుఁడు) అశ్వ. 8-161

**ఉన్నేత** సం. విణ. ఋ. పుం.

రాజసూయ యాగంబునం దొక స్థానము వహించువాఁడు చూ- సభా. 1-292

**ఉన్మగ్నత** సం. వి. ఆ. స్త్రీ.

తేలుట.

శా. ఉద్రిక్తంబగు నూత్న రక్తమున మగ్నోన్మగ్నతం బొల్చి తర్జద్రూపోగ్రగదాయుగంబు...చెన్నవడసెన్. శల్య 2-264

**ఉన్మగ్నము** సం. విణ. (అ. ఆ. అ.)

తేలినది.

వ. అన్నియు నహంకార వ్యాప్తంబులయి యవ్యక్త సాగరంబున మగ్నోన్మగ్నంబు లగుచుండు. అను. 1-325; శల్య. 2-264

**ఉన్మత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి మదించినది.

ఉ. చిత్తము లుల్లసిల్ల నల సింహకిశోరములొక్కమై మదోన్మత్త గజావళిం బొదువు మాడ్కి నరాతిబలంబు ముట్టి. ఉద్యో 2-140

**ఉన్మత్తవేషిణి** సం. విణ. (న్. ఈ. న్.)

పిచ్చిదాని వేషము ధరించినది.

తే జీర్ణమై కడు మాసిన చీరగట్టి, ధూళిధూసరాలకములు దూలు చుండ, నళిల యున్మత్తవేషిణియైన లచ్చి, కరణి నిట వచ్చుచున్నది కంటె దాని. అర. 2-115

**ఉన్మత్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఒడలు తెలియనివాఁడు, వెర్రెక్కినవాఁడు.

వ. కామాయత్త చిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకుసేయక రహస్యప్రకాశ విభేద విచారంబు దక్కి. విరా. 2-127

2. దుర్మార్గుఁడు, చెడునడత గలవాఁడు.

సీ. సన్మార్గరతయు నున్మత్త శిక్షయు నంచితోదయము గృపాతిశయము. విరా. 3-102

3. పిశాచాద్యావేశము గలవాఁడు.

వ. ఉభయసైనికు లున్మత్తులగతిం గవిసె. భీష్మ. 1-267

4. పిచ్చివాఁడు.

సీ. గోవు బ్రాహ్మణు బాలకుని వృద్ధు నంధుని సఖుఁ దోడబుట్టువు జడుఁ బ్రమత్తు, మత్తుని గురుని నున్మత్తుని సుప్తుని నంగన భీతుని నస్త్రశస్త్ర, నిహతి నొప్పించుట విహితంబు గాదని యార్యులు సెప్పుదురు. సౌప్తి. 1-106

సీ భూపాల యతఁడు కాశీపురిఁ బాయక, వర్తించు నున్మత్త వర్తనమున అశ్వ. 1-45

5. మన్మథ వికారము గలవాఁడు, కామముచే మదమెక్కినవాఁడు.

సీ. అంతఁ బులోముండన్ వింత రక్కసుఁడగ్ని, హోత్ర గృహంబున కొయ్యవచ్చి, యత్తన్విఁ జూచి యున్మత్తుఁడై యెవ్వరి, సతి యిది సెప్పుము జాతవేద... -ఆ- యనఁగ. ఆది. 1-129

**ఉన్మథనము** సం. వి. అ. న.

చంపుట.

చ. ...దేవతా,సురపరిరక్షణోన్మథన శోభి కటాక్ష విహార శాంతి 4-455

**ఉన్మదము** సం. విణ. (అ. ఆ. అ.)

1 మద మెక్కినది.

చ. అదియునుగాక కోలుపులినైనను గారెనుపోతునైనను, న్మదకరినైన నుగ్ర మృగనాథునినైనను గట్టి ముట్టి. విరా. 1-83

2. గర్వించినది.

మ. ఈ వచ్చు నున్మద వీరావళికిన్ భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా, న్పెద గర్వంబు మరల్పెదం బసుల నాచేఁ జిక్కరా జెమ్మె యిన్. విరా. 4-263

3. చపలత్వము గలది.

మ. యదువంశంబున లోకరక్షణ పరుండై పుట్టి వ్రేపల్లె నున్మద బాల్యంబు నటించి కంసముఖ నానాదైత్యులం ద్రుంచి. ద్రోణ 1-97

**ఉన్మదించు** సం. అ. క్రి.

పిచ్చి మాటలు పలుకు

సీ. శయానుండయ్యు నాసీనుండయ్యుఁ బిశాచ శ్రేణిఁ గని యున్మదించెనేని నది పిశాచగ్రహము. ఆర. 5-258

**ఉన్మదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. దురహంకారము గలవాఁడు, గర్వి

క. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయి గల్గునెట్లు దుర్యోధనుఁ డున్మదుఁడు ధృతరాష్ట్రి భూవిభు, హృదయంబు తెలంగు గొంత యెఱుఁగుదుమె కదా. ఉద్యో. 1-339; ఉద్యో. 2-218

1. ఉద్రేకము గలవాఁడు.

క. పదిటన్ ధృష్టద్యుమ్నునిఁ, బదియమ్ముల నతని సూతుఁ బటురయమున నున్మదుఁడై నొప్పించినఁ గెం, పొందవిన మోము నతి నవ్వు నొప్పున నొప్పెన్. భీష్మ. 2-187; కర్ణ. 2-316

**ఉన్మాదము** సం. వి. అ. పుం.

1. మదము, మత్తు

క. అని పీడఁగఁ బల్కిన న, మ్మనుజాధము డంతఁ బోక మదనోన్మాదంబున దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియె గారవంపుఁ బలుకులన్. విరా. 2-51

2 వెఱ్ఱి.

ఉ. వైదిక ధర్మచారి జనవత్సల నీ మదిఁ బట్టుకొన్న యున్మాదము

హీన మానవు మనంబునఁ బుట్టిన వెఱ్ఱివోలె న,సాధ్యములఁ దీర్పు
టొప్పదు. శాంతి. 1-101

3. అతిశయమైన ఉద్రేకము.

మ. మదిరాళుల్వండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప
విరా. 3-173

**ఉన్మాది** సం. విణ. (న్. సీ. న్.)

ఉన్మాదముగలవాఁడు, మిక్కిలి యుద్రేకము గలవాఁడు

శా. ...ఇత్తుం గౌంతేయుల కిమ్మహీ వలయమున్ దుర్దాంత చంచ
ద్భుజా,సంగ స్ఫూర్జిత చక్ర విక్రమకళా పంక్రీడనోన్మాదినై.
భీష్మ. 2-158

**ఉన్మాదిని** సం. విణ. (న్. సీ. న్.)

ఉన్మాదముగలది, పిచ్చిది.

సీ. ఆఁకలి తృష నిద్ర లను వీని నెఱుఁగక యున్మాదినియుఁబోలెఁ
నున్నదాని. అర. 2-103

**ఉన్మార్గము** సం. వి. అ. పుం.

తప్పుత్రోవ, చెడ్డనడత.

సీ .... దుర్వృత్తుల వధియించు రుద్రుని, గోవిందు వాసవు గుహునిఁ
జూడు-తే-మా మహాత్ములు దక్కు నున్మార్గ చరుల, దండితులఁ
జేఁత వినమె... శాంతి. 1-108

తే. విభుల పంపు, సేయ కున్మార్గములఁ దమ చిత్తములకు, వచ్చినట్ల
వర్తింతురు వనిత లధిప. మౌస. 1-19

**ఉన్మార్గయానము** సం. వి. అ. న.

దారితప్పించి నడచుట.

తరువోజ :— అతి దుర్గమగు నరణ్యప్రదేశమున, నవనీసురుం డొకఁ
డరుగుచునుండ, మితిలేని ఘోరంపు మృగములు శరభ, మృగపతి
ప్రముఖముల్ మిక్కిలి భయము, మతి కావహించుచు మార్గంబు
నందు, మల్లడిగొనుడు నున్మార్గయానమున, ధృతి దూలఁ జన.
స్త్రీ. 1-43

**ఉన్మిశ్రితము** సం. విణ. (అ. ఆ. అ.)

బాగుగాఁ గలుపఁబడినది

వ మృగమదకర్పూర కుంకుమోన్మిశ్రిత సుగంధం బలంది.

అర. 1-858

**ఉన్మిషత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు).

1. ప్రకాశించుచున్న.

ఉ ఏమిట నిట్టులయ్యెనొకొ యమ్మహితాత్మకుఁ డంచు నున్మిష,
ద్ధామము లైన యంగములఁ దాఁ గలయం బరికించి. మౌస. 165

2. వికసించుచున్న.

చ. జలరుహనాళ గమ్యగిరిసానువనంబుల వేఁటలాడుచుం, జలువుదమీ
నిదాఘ దివసంబుల నీవును నేను నున్మిషన్నలిన రజస్సుగంధి
యమునాప్రవాహ తుంగ తరంగ సంగతానిల శీకర స్థలాంతర
వికిర్మిత నిర్మల హాగమ్య రేఖలన్. ఆది. 8-232

**ఉన్మీలత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు).

ప్రకాశించుచున్న.

శా. బాలార్కద్యుతి పుంజ పింజర జటాభారంబుఁ బ్రావృష్షన, శ్రీ
లీలం బ్రహసించు నంగముమ రోచిస్ఫారదండంబు నున్మీలన్నీల
మృగాజినాంబరమునై నిర్వాణ దానక్రియా, శీలుండైన పరాశ
రాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై. అశ్వ. 2-147; ఆశ్ర.2-1

**ఉన్మీలనము** సం. వి. అ. న.

వికాసము.

మాలిని— నిజతను విభవవ్యోన్మీల నాచ్ఛిన్ననాదా. విరా. 3-289

**ఉన్మీలితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. వికసించినది, పుష్పించినది.

ఉ ... వసంతవిభ్రమో, న్మీలితబాలవల్లి క్రియ మేలగుచూడ్కులు
మించి. అర. 6-148.

2 విరివియైనది, విస్తృతమైనది

ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి,

యున్మీలిత విక్రముం డగుడు మేమెయి నాతని దాఁకె నస్త్రవి,
ద్యాలసితుండు సాత్యకి శల్య. 1-322; ద్రోణ. 2-110

**ఉన్ముఖము** సం. విశే. (అ. ఆ. అ.)

ఉద్యుక్తము, సిద్ధమైనది.

వ. పాండవబలంబు సమయసముచితంబగు సమరవిరామంబునకు
నన్ముఖంబగుట యెఱింగియు. ద్రోణ. 1-387

**ఉన్మూలనము** సం. వి. అ. న.

వేళ్లతోఁ బెల్లగించుట.

వ. నదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు. సభా. 1-131

**ఉన్మూలించు** సం. స. క్రి.

1. వేళ్లతోఁబెల్లగించు, పెఱికివేయు.

తే. ఉదధి సుఖగోష్ఠి నున్నప్డు నదులతోడ, మీతటంబుల తరువులు
మీరు వొంగి, తఱిమి పాఱినఁ గూలు వేతసములేల, పెఱికిపోవవి
మీకేమి ప్రియమొనర్చె - వ - వాని నున్మూలింప మీకు శక్యం
బుగామింజేసియో వానికిం జేటు వాటిల్ల దిదియేమి యనవుడు
గంగ యిట్లనియె. శాంతి. 3-57

2. నాశనము చేయు.

మ. మునులం దిట్టుచుఁ బుష్ప వృతతతు లున్మూలించుచున్.
అర. 3-152

**ఉన్మేషణము** సం. వి. అ. న.

(కన్ను మొ) తెఱచుట.

వ. మఱియు నొకవరంబు భవదీయ నయనోన్మేషణ కారణంబయ్యె.
అర. 7-272

**ఉన్మేషభూతము** సం. విశే. (అ. ఆ. అ.)

అభివ్యక్తమైనది, స్ఫురితమైనది.

మాలిని— నిగమకుసుమ గంధోన్మేష భూతాభిధానా. విరా. 5-407

**ఉన్మేషము** సం. వి. అ. పుం.

1. అభివ్యక్తి, స్ఫురణము.

మ. నిజవంశోత్తమ వీరవృత్తమున కున్మేషంబుగా నాకపిధ్వజుఁడు
 త్సాహము సేయకున్న. ఉద్యో 4-16

మాలిని:— నిగమ కుసుమగంధోన్మేష భూతాభిధానా. విరా. 5-407

2. వికాసము, అభ్యుదయము

మ నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నేఁ జీరికిం
 గొన. భీష్మ. 3-170

క. ...మహావిద్యోన్మేషగాత్ర. స్వర్గ. 1

3. విజృంభణము, పెచ్చుపెరుగుట.

శా. నీరుం డాయఁగఁ జల్లి రాక్షసుల యున్మేషంబు మర్దించి.
 అను. 1—255

ఉప సం. అవ్య. (ఇది సమాస పూర్వపదముగానే యుండి తఱచుగా ఈ క్రింది యర్థములను దెలుపును)

1. ఆసన్నము, సమీపమున నున్నది

ఉపవనము. శాంతి. 6-262, ఉపనీతము. సభా 2-2;
ఉపగతము. కర్ణ. 3-109

2. సదృశము.

ఉపకీచకుఁడు. విరా. 3-9; ఉపపాండవులు. ఆది. 4-115.

3. అల్పము. చిన్నది.

ఉపపర్వము. ఆది. 1-66; ఉపాంగము. అర. 2-82, ఉపశాఖ.
 శా. ప్రి. 1-15; ఉపమహీధరము. భీష్మ. 1-85.

4. అధికము.

ఉపనయనము. ఆది. 5-3; ఉపబృంహణము. శాంతి. 6-410

5. కొన్నిచోట్ల నిరర్థకముగాఁ గూడఁ గనఁబడుచున్నది.

ఉపసంజనితము. అను. 1-155. ఉపజనితము. కర్ణ. 1-27
ఉపభుక్తి. అను. 3-282 ఉపభోగము. శాంతి. 5-501

6. కొన్నిచోట్ల అర్థవిశేషమును గలిగించును.

ఉపకృతి. ద్రోణ. 3-380; ఉపవాసము. అను. 1-142; ఉపహారము విరా. 1-308; ఉపచారము. విరా. 5-367; విరా. 3-44

**ఉపకంఠము** సం. విణ. (అ. ఆ. అ.)

దాపైనది, దగ్గఱనున్నది.

వ ... ఋశ్యమూకశైలంబుఁ జేరి తదుపకంఠ ప్రదేశంబున విశ్రమించి యున్నంత. అర. 6-368; అను. 3-62

**ఉపకరణము** సం. వి. అ. న.

1. ఉపకరించుట, ఉపయుక్తమగుట.

క. తరణి శశినేత్ర జగదుపకరణచణ చరిత్ర బోధగాత్ర. శాంతి. 3-580

2. సాధనము, పనిముట్టు, పరికరము.

వ. ప్రజాపతి ప్రజల సృజియించి పదంపడి సంహారంబు లేమింజేసి భూమికిఁ దదీయభారంబు దుర్భరం బగుటయు ననుసంధించి చింతాక్రాంతుడై తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటంబడిన. ద్రోణ. 2-160

వ. యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల యరదంబులు దురంగాది పరికరంబు లిట్టిట్టి వని యేర్పడంబలికి విరాటద్రుపదాదులకు వలయు నుపకరణంబులు గొఱంత లేమియు నెఱింగించిన. ఉద్యో. 2-228; అశ్వ. 1-31; ఆది. 4-84.

3. చిహ్నము, లక్షణము (వస్త్రాభరణ మాల్యాదులు)

వ. ... వారివారికి నయ్యైవేషంబుల కమగుణంబులగు నంబరాభరణ మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబులయినఁ జూచి సంతసిల్లి. విరా. 1-184

4. (రథ్యాదులకుపకరించు మైపూఁత మొదలగు) చిహ్నము, పరికరము.

సీ. మలయపవను నింపారు చోఁకున నిగురొత్తు చిత్తంబు, వెలసి యొఁడొరులపైఁ బొలయు చూడ్కి, లాదట నుపకరణావలి వెర వెడ, యాదరించుట లాగ మడరఁ దొడరి. విరా. 2-288

**ఉపకారకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

మేలొనరించువాఁడు.

సీ. వణిజులు లోక ప్రవర్తనంబులకెల్ల నుపకారకులు. అను. 5-18

**ఉపకారము** సం. వి. అ. పుం.

1. ఉపకృతి, మేలు.

సీ. ... కృప నుపకారమునకు, శాత్రముగ నీవు సేసిన పురుషుఁ డా మేల్దన, యలఘు పౌరుషమునఁ గలిగెననుట. అను. 4-382

2. ఉపయోగించునది.

వ. అనిన విని యాజగత్కర్త యోషధులును ఫలమూలాదిభక్ష్య సంపదుపకారంబులుగా వృక్షలతాగుల్మంబులును గల్పించి. సాప్రి. 2-114

**ఉపకారి** సం. విశే. (న్. ఈ. న్.)

ఉపకారము చేయువాఁడు, మేలుచేయువాఁడు.

మాలిని :— సర్వోపకారీ. ద్రోణ. 1-392

వ. పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము సేయ సమకూరునో యని. ఆది. 6-240

**ఉపకీచకుఁడు** సం. వి. అ. పుం.

కీచకుని తమ్ముఁడు.

వ. ఒక్క యుపకీచకుండు నిజసహోదరులం జూచి, విరా. 3-9

(వీరు నూటయైదుగురు. కీచకుని శవముతో ద్రౌపదిని గట్టి శ్మశానమునకుఁ దీసికొనిపోవు సమయమున భీముఁడు వీరినందఱినిఁ జంపి ద్రౌపదిని విడిపించెను.

చూ. (విరా. 3-9 మొదలు 29 వఱకు)

**ఉపకృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఉపకారము.

క. (ధర్మరాజు సాత్యకితో) త్వరితముగఁ జనుము సఖుఁడు, గ్గురుఁడు గదా నీకు నర్జునుం డుపకృతి తత్పరులై నెగడెడు నుత్తమ పురుషులు వేచు తఱి వచ్చె భుజవీర్యనిధీ. ద్రోణ 3-280

**ఉపక్రమము** సం. వి. అ. పుం.

ఉపాయము నెఱింగి ప్రారంభించుట, ఆరంభము, మొదలు పెట్టుట,

క. రేపకడ యుభయబలములు, నేపును నెలమియును నెసఁగ మెసఁగ
వెడలి యాహ్వటోపంబున రణపన్నా, హోపక్రమలీల మెఱయ
నుజ్జ్వలభంగిన్. ద్రోణ 1-214

2. కార్యము, పని

వ. ... వారల సంవాద ప్రకారంబు హృషీకేశుం డెఱింగి వీఁడు
సంయమివరు మాట గీటునంబుచ్చి తన వలసినట్లు నేయువాఁడయ్యె
నిప్పాపాత్ము నుపక్రమంబునకు నడ్డపడి చూచెదఁ గాకున్నఁ
దుది నాచేయు తెఱంగున్నదియ కాదె యని వితర్కించి.
సౌప్తి. 2—79

**ఉపక్రమించు** సం. వి. అ. క్రి.

తొడఁగు, పూను, కడఁగు.

వ. ... సూర్య సంకాశుండవగు నీవు సూర్యోదయ సమయంబునఁ
ప్రకాశ ప్రకారంబైన పరాక్రమంబున కుపక్రమింపు మనవుడు
నశ్వత్థామ కృపాచార్యున కిట్లనియె. సౌప్తి. 1—82 అశ్వ. 1-64

వ. ... కృష్ణార్జునులు సంతసిల్లి సన్నద్ధులయి రథంబెక్కి యగ్ని
దేవుం జూచి సురాసురపరివృతుండయి సురపతి వచ్చినను ఱయింతు
మింక శంకింపక ఖాండవ దహనార్థం బుపక్రమింపుమనిన నగ్ని
దేవుండు హర్షించి. ఆది. 8—254 ఆది. 6-276

స. క్రి.

వ. ... ఇప్పుడు మీరిందఱు నెఱుఁగ నాయందకారణ వ్యతిక్ర
మం బుపక్రమించి యత్యంత శత్రుం డయ్యె. సభా. 2-66

**ఉపగతము** సం. విణ. (అ. ఆ. అ.)

సమీపించినది, దగ్గఱినది.

వ. ... తత్కాలోపగత సముచిత పరిజనానీతజలంబుల ముఖప్రక్షాళ
నంబు సేసికొనిరి. కర్ణ 3-109

**ఉపగమము** సం. వి. అ. పుం.

1. జ్ఞానము. ఎఱుక.

సీ. శాస్త్రోపగమము నస్ఖలితదమము. విరా. 3-102

2. ప్రాప్తి, పొందుట.

మాలిని...శ్లాఘనీయ క్రమోదగ్రన్మరుదుపగమ లీలామధ్యమానేందు బింబ, క్షరదమృతవికారోత్సారణానందరూపా. కల్య. 2-422

**ఉపగిరి** సం. వి. ఇ. పుం.

ఒక దేశము, కొండ సమీపమునందున్న ఒక దేశము.

క. అతుల చతురంగసేనా, యుతుఁ డంతర్గిరి బహిర్గోపగిరుల భూప తుల నని నోర్చి శౌర్యోన్నతిఁగొనియెను వారిచేత నావాధన ముల్. సభా. 1-234

**ఉపఘాతము** సం. వి. అ. పుం.

చోఁకు, బాధ

క. విను డెబ్బది యేండ్లగుదాఁక మానవులకు గ్రహోపఘాతం బులు గల్గు ననంతరంబ గ్రహముల, పని వలవదు ముదిమియెల్ల పనులకుఁ జాలున్. అర 5-254

**ఉపచరణము** సం. వి. అ. న.

సీ. సంవర్తుఁ బిలిచి యాసన పాద్య ముఖ్యోపచరణముల్ నడిపించి. అశ్వ. 1-70

**ఉపచరించు** సం. స. క్రి.

1. గౌరవించు, సమ్మానించు.

వ. ... ఎవ్వరితోడ నెవ్విధంబునం బలుకం దగు ప్రణామ వినయ బాంధవమైత్రీ వాత్సల్యంబులకు నయ్యె ప్రకారంబుల మద్వచనం బులుగాఁ బలికి యుచితంబు మెయి నుపచరింపుము. ఉద్యో. 1-367

2. సేవించు, పూజించు.

తరల...తల్లి వచ్చిన భక్తితో, నుపచరింపక లాఁతివై యిటు లూర కుండుట యుక్తమే. స్త్రీ 2-27

అ. క్రి.

3. దుఃఖోపశమన మొనరించు.

వ ఇవ్విధంబున నాలింగనంబుసేసి సాంత్వవచనంబుల నుపచరించె. స్త్రీ 1-126

వ. నందనుల తనువుల మీఁద వదనంబు బాష్పాంబుధారాక్రాంతం బుగాఁ బ్రకటాక్రందనంబుసేయుచుఁ బలవించుచుండెఁ గృష్ణార్జునులును సముచిత భాషణంబుల బోధించిరి. తక్కటివారును దగుమాటల నుపచరించిరి. సౌప్తి. 2-22

4. ఉపకరించు, ఉపయోగించు,

సీ. (గోవు) తోఁట శృంగంబులు వాలంబు రోమచయము శకృన్మూత్రము లఖిలవర్తనముల కుపచరించు. అను. 2-397

**ఉపచారము** సం. వి. అ. పుం.

1. ఇచ్చకము, ముఖప్రీతికై పలుకుమాట

వ. అని తారు మున్న విన్న కీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు వలుకుచుండ నా బృహన్నల సైరంధ్రి కిట్లనియె. విరా. 3-45

2. పూజ.

వ. అతండును (విరాటుఁడు) ససంభ్రమ పరిజనసముపనీయమానంబులగు నానావిధోపకరణంబులం గౌంతేయులకు వివిధోపచారంబు లాచరించి మహార్హ మజ్జన భోజనంబులు పెనడ. విరా. 5-367

3. సేవ.

వ. వారలంజూవె దేవతలు బ్రాహ్మణు లంద్రు వా రెల్లవారికి నమస్కారాద్యుపచారాదరణీయులు. శాంతి. 5-99

4. ఉపయోగము, భుజించుట.

తే. ... తియ్య పంటిపరువ, మాదరించి తదుపచార మాచరించు వెరవుగల యట్టి జనముల విధము దోఁప. అను. 5-425

5. సాంత్వనము.

క. ప్రభువుల నుపచారంబుల, విభుఁ డనురాగిల్లఁజేసి. శాంతి. 2-397

6 నడవడి, ప్రవర్తనము.

సీ. ... అసతోపచారంబు గవానదాహము ... పాపంబులందురు బుధజనములు. శాంతి. 1-293

శ్లో. అన్ృతేనోపవర్తిచ ప్రతిరోద్ధాగురోస్తదా. సం. శా. శాంతి. 84-8

**ఉపచితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సంచితము, కూడఁబెట్టినది.

తే. పుణ్యకర్మముల్ సేయుచు భూసురులకు, వివిధధనములు ప్రీతితో వినయమొప్ప, నొసఁగుచుండెడువారు పూర్వోపచితము, లైన కిల్బిషములఁ బాతు రవనినాథ. శాంతి. 1—318

2. కుదురుపడినది.

మాలిని:— సదసదుపచితాత్మా సంభృతానందవర్మా. ఉద్యో. 1—385

**ఉపచిత్రుఁడు** సం. వి. అ. పుం.

కురుకుమారుఁడు, గాంధారీధృతరాష్ట్రుల కొడుకు. ఆది. 5-107

చూ. కురుకుమారుఁడు.

**ఉపజనితము** సం. విణ. (అ. ఆ. అ.)

పుట్టినది.

తే. శోక వారిధి పారంబు నాకుఁ బొంద, నేలవచ్చుఁ జిత్తంబునఁగీలు కొని యసహ్యమై కర్ణమరణోపజనితమైన పరిభవంబను శల్య మాతఁ రతఁ జేయ. కర్ణ. 1-27

**ఉపజీవకుఁడు** సం. విణ. (అ. విశా. అ.)

ఒకరానివలన జీవనము గడుపుకొనువాఁడు.

సీ అబ్ధిసంచారలాభోపజీవకుం డుర్వీశసేవకుండు ... గీ ... పంక్తి దూషకు లంద్రు పౌరవేంద్ర. అను. 8-175

**ఉపజీవనము** సం. వి. అ. న.

1 జీవనాధారము, బ్రదుకుఁదెరువు.

సీ. ... పనితోపజీవనశీలు నన్నంబు నాడెడు పాడెడు నట్టివాని యన్నంబు ... నభోజ్యమంద్రు. శాంతి. 1-322

2. బ్రదుకుట, జీవించుట.

సీ. అన్యకరోత్మోపజీవన మకృతజ్ఞత ... నిరయహేతువులు,

3. ఒకరినాశ్రయించి బ్రదుకుట.

సీ. ... అన్యోన్యోపజీవనాచరణంబు గలిగి. అశ్వ 2-116

**ఉపజీవి** సం. విణ. (న్. నీ. న్.)

ఒకరి నాశ్రయించి లేక యొకదానిని వృత్తిగాఁ గొని జీవించువాఁడు.

వ. ...అర్ద్దేవి విక్రమోపజీవులయిన ముచుకుందుండును సృంజయుం డును నను తొంటి నరపతుల చరిత్రంబులు సెప్పి. ఉద్యో. 4-18

చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమశీల నరాతిసేన సొచ్చినఁ బతిగావకున్న నుపజీవులు మెత్తురె.

శల్య. 1-299; శాంతి. 6-222; అను. 8-287

**ఉపజీవించు** సం. స. క్రి.

ఆశ్రయించి బ్రదుకు.

వ. సకల భూతంబులుం దన్నుపజీవింపం బెంపారువాని. అను. 1-315

సీ. ... అమరు లింద్రు, ననిశమును నుపజీవించునట్లు బంధు, జనులు ని న్నుపజీవింప మనుము పేర్మి. సభా. 2-79

**ఉపజీవిత** సం. వి. ఆ. స్త్రీ.

జీవనాధారము.

ఉ. ... వాని నుపజీవితఁ ద్రవ్వరె కందమూలముల్. శాంతి. 1-110

**ఉపతాపము** సం. వి. అ. పుం.

సంతాపము, వ్యధ, కీడు.

ఆ. సర్వభూతదయకు సత్యవాక్యము నకు, నుత్తమంబు ధర్మ వొండె యుంగ, నొరుల నొప్పిఁ గోడ కుపతాప మొనరించు, నదియ కడు నధర్మ మనిరి బుధులు. ఆది. 3-219

**ఉపతాయి** దే. వి.

పల్లిబంధ విశేషము (తల్లి విజ్ఞానము)

సీ. ఉపతాయిలోఁ దన కోదవిన తోరహత్తము సూపి. విరా. 2-15

**ఉపదంశము** సం. వి. అ. పుం.

ఊరుగాయ.

చ. ...హరి సన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగమోదన
కరణంబులైన యుపదంశములం గొనుచున్ మహేశ్వరా. మౌస. 1-89

**ఉపదర్శకుఁడు** సం. వి. అ. పుం.

ఉపద్రష్ట – యజ్ఞాది కర్మముల యందలి గుణదోషములను కనుపెట్టి చూచువాఁడు–ఒకానొక ఋత్విక్కు.

తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి, యజన శీలత
నశ్వమేధాధ్వరంబు, లంగిరసుఁ డుపదర్శకుండై నయింపఁ,
జెక్కొనర్చె లోకములు సంప్రీతిఁ బొగడ. అశ్వ. 1-27

**ఉపదర్శనము** సం. వి. అ. న.

యజ్ఞాది కర్మముల యందలి గుణ దోషములను కనుపెట్టి చూచుట ఉపద్రష్ట కార్యము.

వ. ...పరశురాముం డతృప్తుండై ప్రాయశ్చిత్తంబుగా నయ్యేడఁ
గశ్యపు నుపదర్శనంబున రాజసూయంబులు నశ్వమేధంబులు
వాజపేయంబులు ననేకంబు లొనర్చి- శల్య- 2-199;
శాంతి. 6-861; అను. 2-188

**ఉపదిష్టము** సం. విశ. (అ. ఆ. అ.)

1. చెప్పఁబడినది.

క. నృపవర పూర్వాహ్ణంబును, నపరాహ్ణంబును దేవపితృ సమారాధ
న విధ్యుపదిష్ట కాలములు మధ్యపు సమయము మానుషార్చ
నార్హం బరయన్. అను. 2-54

2. ఉద్దేశింపఁబడినదిఁ

వ పాండవాగ్రజా నీవును గురూపదిష్టంబులయిన యివ్వాక్యంబులు
భావగతంబులు సేసికొని. అను 8-17

8. నిర్దేశింపఁబడినది అజ్ఞాపింపఁబడినది·

వ ధర్మరాజు రాజసూయంబు సేయ నుపక్రమించి సహదేవుం జూచి

నీవు ధౌమ్యోపదిష్టంబులయిన యజ్ఞోపకరణ ద్రవ్యంబులు దేర నింద్రసేన ప్రముఖులను నర్జును సారథియయిన రుక్మను సమర్పించి. సభా. 1-281

**ఉపదేశము** సం. వి. అ. పుం.

1. హిత బోధనము.

వ. కావున మీకు నప్రదార్థంబుగా నానేర్చిన విధంబున నుపదేశం బవశ్య కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయినయినను బ్రదుకు జనంబులు గీడునుం బొరయకుండునట్టి సాధారణ నీతి సంక్షేప రూపంబున నెఱింగించెద సావధానులరయి వినుండు.

విరా. 1-120

2. బోధనము.

క. ...నీ, దివ్యమహిమ యాగమోపదేశము రుద్రా. ద్రోణ. 2-367; శల్య. 2-269; భీష్మ. 3-293

3. దీక్షా పూర్వకముగా మంత్రాదుల నుపదేశించుట.

సీ. హిమగిరిమీఁద ననేక ద్విజులు దపం బాచరింపంగ నయ్యాశ్రమమున నొక్క శూద్రుండు ధర్మోపేతుఁ డేతెంచి, యమ్మునులకు గురుఁడగు మునీంద్రుఁ గని కృప నుపదేశ మొనరింపవే తపో, వృత్తికై నా కని వేడుటయును. అను. 1-276; అర. 2-176

**ఉపదేశించు** సం. స. క్రి.

1. నిర్దేశించు, నిరూపించి చెప్పు.

వ. పితామహులం దుపదేశించిన లక్షణంబు లద్దేశంబునం గలిగి యుండు నని విందుము. పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటుప్రోల వసియించినవారు గావలయు. విరా. 3-117

2. బోధించు.

వ. ...విచిత్ర వీర్యనందనుండు సూతనందనునితో నవ్యాసుదేవనామ నిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి యతనిం బొందు నుపాయం బుపదేశింపవే యని యడిగిన. ఉద్యో. 2-326; శాంతి. 1-341 శాంతి. 2-164

3. హితబోధనము సేయు, ప్రబోధించు.

క. అచ్చెరువు సంపుటకుఁ దన, యిచ్చఁ జొరక కేలి సలిపె నిన్నాళ్లును వి,వ్వచ్చుఁడు హితమేఁ జెప్పినఁ, బొచ్చెముతో కంతరంగమున నిల్పె దగన్. శల్య. 2-347

క. ఏ నుపదేశించినతిననఁ, గా వొక పెంపెంచినాఁడు గాని తలంపన్, మానవనాథ సురేశ్వర, సూనుఁడు న్యాయట్టివాఁడచుమ్మో పవిక్రిన్ శల్య. 2-346; 347; మహా. 28. మహా 10.

4. ఉపదేశము సేయు.

వ. ఇవ్విద్య నాకు నుపదేశింపవలయు నని యడిగిన ఋతుపర్ణుం డిట్లనియె. అర. 2-174

**ఉపదేష్ట** సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.)
ఉపదేశించువాఁడు.

చ ఆతనిని యాకురుప్రవరుఁడమ్మునివల్లభుమోముఁ జూచి యి,ట్లను మహాత్మ మాకు గురుఁ డన్నను ధర్మవిధోపదేష్ట యన్నను... నీవ ఆశ్ర. 1-47

**ఉపదోహము** సం. వి. అ. పుం.

పాలు పితికెడు పాత్రము,

సీ. కాంస్యోపదోహయుఁ గాంచన చారు శృంగయు...నయి తగు గోవు. అను. 2-333

**ఉపద్రవము** సం. వి. అ. పుం.

1. విపత్తు, ఆపద.

క. నిరుపద్రవ సుఖనిద్రా, నిరతాత్మకులయిన వీరి నిద్రకు. ఆది. 9-205

2. రోగోద్రేకమును సూచించు వికారము,

సీ. ...రోగములు నుపద్రవములు హితము మితంబుఁ గాల, యోచితంబు వగు భోజనంబున...తే...అవులఁ ద్రోవనేర్పుట ముక్తికిఁ ద్రోవ యధిప... శాంతి. 5-370.

**ఉపద్రష్ట** సం. వి. ఋ. పుం.

యజ్ఞాది కర్మముల యందలి గుణదోషములను కనిపెట్టి చూచువాఁడు. ఒకానొక ఋత్విక్కు.

క. అనుజులు ఋత్విజులుగ నీ, పని యిటు సేయుమని నీ వుపద్ర ష్టవుగా, విను కురుకుమార పశువిశ,సనమున రణయజ్ఞమతఁడు సమ్మతిఁ జేయున్. ఉద్యో. 4-46

**ఉపధ** సం. వి. ఆ. స్త్రీ.

1. మంత్రి మొదలగు వారి గుణములను పరీక్షించుట.

తే. ఎఱిఁగి యుపధా విశుద్ధుల నిడు నమాత్య,పదవికి, అను. 5-46

2. కపటము, మోసము, కూటకల్పన.

క. ఉపధాశుద్ధులఁ జాప, వ్యపగత బుద్ధుల వినీతవర్తుల సములన్, సుపరీక్ష నియోగించితె, నిపుణుల నర్థార్జనాది నృపకార్యములన్. సభా. 1-85

వ్ర. శాత ప్రసీతుండై తల్పంబునకుం దిగువ యుపధానంబు వెట్టితని యతనిం గొనియాడి సకల పౌత్త్రులను ధాత్రీపతులను నవలోకించి. భీష్మ. 3-422; ఆది 7-223;

**ఉపధారకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఆవలంబించినవాఁడు. పూనినవాఁడు.

వ. మనుష్యులందు జాతి ధర్మోపధారకు లెక్కుడు. శాంతి. 5-99

**ఉపధాశుద్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కపటము లేనివాఁడు; మోసములేనివాఁడు.

క. ఉపధాశుద్ధులఁ జాప,వ్యపగత బుద్ధుల వినీతవర్తుల సములన్, సుపరీక్ష నియోగించితె, నిపుణుల నర్థార్జనాది నృపకార్యములన్. సభా. 1-85

**ఉపనందకుఁడు; ఉపనందుఁడు** సం. వి. అ. పుం.

కురుకుమారుఁడు, గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకు

వ. నందోపనందక చిత్రబాణ. ఆది. 5-107

వ. నందుకును ఉపనందుడును రౌద్రంబుగా సౌభద్రుం బొదివిన.
భీష్మ. 2-399

వ. నందోపనందుల నొక్కపెట్ట పెక్కుమ్ములం బొరివుచ్చె.
కర్ణ. 2-216

కాన ఉపందకుఁ డన్నను ఉపనందుఁ డన్నను ఒక్కరేయని చెప్పనగును. ఇతఁడు భీష్ముని పష్ఠదివసయుద్ధమున అభిమన్యునితోఁ బోరెను. భీష్మ. 2-399. భీమునితోఁ బోరి యన్నయగు నందునితోఁ గూడ మరణించెను. కర్ణ. 2-216

**ఉపనతము** సం. విణ. (అ. ఆ. అ.)

పొందఁబడినది.

క. శర మశిఁబోయుటయును ద,తక్కరయుగ్మము బాణ కార్ముకంబులతోఁ జెచ్చెర సంస్తంభము నొందుఁడు, నరనాథుఁడు విస్మయోపనతమానసుఁడై
అర. 4-356

**ఉపనయనము** సం. వి. అ. న.

వేదపఠనార్థము బాలుని గురు సమీపమునకుఁ బంపుటకైన సంస్కారము- వడుగు.

వ. ధృతరాష్ట్ర పాండు కుమారులు భీష్మాభిరక్షితులై పెరుఁగుచునుపనయనానంతరంబున నధ్యయనం బొనరించి రాజ విద్యలయందు జితశ్రములై యున్నంత.
ఆది. 5-2

**ఉపనిషత్తు** సం. వి. ద్. స్త్రీ.

(బ్రహ్మవిద్యా ప్రతిపాదకమును వేదశిరోభాగమునగు) వేదాంతము ఇవి పది 1) ఈశము 2) కేనము 3) కఠము 4) ప్రశ్నము 5) ముండము 6) మాండూక్యము 7) తిత్తిరి 8) ఐతరేయము 9) ఛాందోగ్యము 10) బృహదారణ్యము - బ్రహ్మకైవల్యాదులు కలిపినచో నూటయెనిమిది ఉపనిషత్తులగును.

వ. ఇవ్విధంబునఁ బార్థున కుపనిషదర్థజాతం బవగతంబు చేసి.
భీష్మ 1-228; శాంతి. 5-338

**ఉపనీతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. తీసికొని రాఁబడినది.

వ. భీష్మవచనంబున నప్పుడు సహదేవోపనీతంబయిన యర్ఘ్యం బర్హ-
ణీయుండైన వాసుదేవునకు శాస్త్ర దృష్ట విధానంబున ధర్మ
తనయుం డిచ్చిన. సభా. 2-7; అర. 3-71.

**ఉపనీతి** సం. వి.

ఉపనయనము.

సీ. జనియించి విప్రుడు జాతకర్మంబును జాలంబు నుపనీతి సంస్కృతి-
యును, బడసి యాచార్యులపాల నధ్యయనంబు చేసి.

శాంతి. 5-80.

**ఉపనీతుఁడు** సం. వి. అ. పుం.

ఉపనయనము సేయఁబడినవాఁడు.

తే. కామవైరి, యతని నుపనీతుఁ గావించె. శాంతి. 6-252.

**ఉపనేత** సం. వి. ఋ. పుం.

ఉపనయన సంస్కారము చేసినవాఁడు.

మధురాక్కర :- తనర జనకుండు, నన్నప్రదాతయును భయత్రాత-
యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురువులు వీర, లనఘ యుప
నేత మఱియు నిరంతరాధ్యాపకుండు, ననఁగఁ బురుషుని కియ్యేవు-
రనయంబును గురువులు. ఆది. 4-48.

**ఉపన్యసించు** సం. స. క్రి.

1. చక్కఁగా వర్ణించి చెప్పు.

వ. దీనిం బాండవులందయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహు-
విధంబులగు నాయుధంబులు పరికించి వేఱువేఱ వాని చందంబు
లుపన్యసించి యివి యెవ రెవ్వరివని యడిగిన. విరా. 4-119.

వ. అప్పరమపతివ్రత వేఱొండు దెఱంగున నభ్యర్థనీయంబులయిన
వస్తువు లుపన్యసించిన నతఁ డవి యెవ్వియు నొల్ల ననుటయు

అను. 1-71.

2. బోధించు.

వ. ఆతనిని రణోత్సాహంబునకుం గారణంబైన స్వకర్మావలంబంబు
వగలం దగమి దెలియుటకు వలయు వాక్యంబులు పెక్కు లుప-

సీ. భరత వంశోత్తమ పౌరజనంబులు, తమ మాటలు భవత్సన్ని ధానమున న న్నుపన్యాస మొనరింపఁబంచిన, యట్టి భాషణము లేకాగ్రబుద్ధి నవధరింపుము. ఆశ్ర. 1-98; కర్ణ. 2-109

**ఉపపన్నము** సం. విశే. (అ. ఆ. అ.)

సీ. శోకాగ్ని దనికిన సొగయు నీ తమ్ముల, నుపపన్న వాక్యామృ తోపయుక్తి దేర్పుము. శాంతి. 1-90

**ఉపపర్వము** సం. వి. న్. న.

మహా పర్వములోని యంతర్భాగము.

క. ఇట్టి మహాభారతంబు ననేక విధ పదార్థ ప్రపంచ సంచితంబు నుప పర్వ మహాపర్వోపశోభితంబు. ఆది. 1-66

**ఉపపాండవులు** సం. వి. బహు.

పాండవులకు ద్రౌపదియందుఁ బుట్టిన కుమారులు. పాండవులవలె వీరు నైదుగురు. వీరు 1) ప్రతివింధ్యుఁడు- ధర్మరాజు కొడుకు 2) శ్రుత సోముఁడు-భీముని కొడుకు 3) శ్రుతకీర్తి-అర్జునుని కొడుకు 4) శతా నీకుఁడు-నకులుని కొడుకు 5) శ్రుతసేనుఁడు- సహదేవుని కొడుకు.

భారత యుద్ధము తుదివఱకు హోరాహోరినఁ బోరిరి. శిబిరమునందు నిద్ర వోవు సమయమున అశ్వత్థామ వీరిపై నుఱుక వీరు మేల్కాంచి యాతనితోఁ బోరి మరణించిరి సౌప్తి. 1-181 మొ. 190 వఱకు-

చూ, అనుబంధము చివరి సంపుటము.

**ఉపపాద్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రతిపాదింపఁ దగినవాఁడు

మాలిని :- సకలనిగమవేద్యా, స్వాత్మవిద్యోపపాద్యా.

సౌప్తి. 2-136

**ఉపప్లవము** సం. వి. అ. పుం.

ప్రలయము (ప్రపంచ) నాశనకాలము.

క. సముదిత సూర్యసహస్రోపమ దుస్సహతేజు జగదుపప్లవ సమయా సమదీప్తి తీవ్రపావక సముఁ జూచుచు నసుర భస్మసాత్కుఁడయ్యెన్

ఆది. 1-181; ఆది. 7-184

**ఉపప్లావ్యము** సం. వి. అ. పుం.

మత్స్య దేశమునందలి యొకానొక పురము. పాండవులు అజ్ఞాతవాసానంతరము పాండవులు విడిసిన నగరము. ఇక్కడనుండియే పాండవులు సంధి ప్రయత్నము జరిపి యుద్ధమునకు సిద్ధపడిరి. ఇది విరాటనగరమునకు సమీపమున నున్నది.

వ. ఇవ్విధంబునఁ బ్రకాశితులై పాండునందనులు శమీవృక్ష నిక్షిప్త సమస్త సాధనంబులుఁ బూజాపూర్వకంబుగాఁ దెచ్చుకొని యుపప్లావ్యంబున వసియించి మత్స్య మహీనాథుండు పెంపు సేయం బెంపు మిగిలి. విరా. 5-375; ఉద్యో. 4-72

**ఉపబృంహణము** సం. వి. అ. న.

చక్కఁగాఁ బెరుఁగుట.

వ. మీకెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల నాప్యాయితులై యుపబృంహణంబు నొందు వారలు. శాంతి 6-410

**ఉపభుక్తి** సం. వి. ఇ. స్త్రీ.

తినుట.

చ. పలలవృథోపభుక్తి సభఁ బతిముపల్కుట. అను. 3-282

**ఉపభోగము** సం. వి. అ. పుం.

అనుభవము.

తే ఆనఘ సుఖదుఃఖములు వచ్చినపుడు మదవిషాదములు లేక సంప్రాప్త సముపభోగ, రతుండు నప్రాప్యవాంఛానిరాసకుండు, నగుట సారతపోరూప మంద్రు బుధులు.

శాంతి. 5-501; శాంతి. 5-604

సీ. విషయోపభోగాభిలషణమింకను నాకు, వదలక పెరుఁగుచున్నది యుఁగాక. ఆది. 3-95

**ఉపభోగించు** సం. స. క్రి.

రమియించు.

వ అనేకస్థానంబుల ననేక సహస్రవర్షంబులు నాలాయనియైన యింద్రసేన నుపభోగించి తృప్తుండై. ఆది. 7-257

**ఉపమ** సం. వి. ఆ. స్త్రీ.

సాదృశ్యము,

క. అపరాహ్ణసమయమున న,ట్లుపమాతీతాతిఘోరయుద్ధంబయ్యెన.
భీష్మ. 2-392; కర్ణ. 2-387

**ఉపమము** సం. విశ. (అ. ఆ. అ.)

సదృశము, సాటియైనది

(ఇది సమాసోత్తరపదముగా సే యుండును)

సీ. సాంధ్య రాగోపమచ్ఛాయంబులగు పల్లు, కిసలయోత్కరములఁ
గ్రేణిసేయు,
విరా. 4-50

**ఉపమహీధరము** సం. వి. అ. పుం.

చిన్నకొండ.

వ. మఱియు నుపమహీధరంబులనేకంబులు గలిగియుండు. భీష్మ. 1-35

**ఉపమానము** సం. వి. అ. న.

1. పోలిక, సాదృశ్యము.

క. ద్రుపదుఁడు వృషసేనుండును, నుపమానాతీతఘోరయుద్ధంబున
బాణపరీతశోణితప్లుత, వపురుజ్జ్వలులైరి కౌరవక్షితినాథా,
ద్రోణ. 5-168

2. దేనితోఁబోల్పఁదగునో యది.

సీ. ఓరాజకల్పవృక్షయోపమానంబగు కౌరవజాతి సంతయము చూడ,
కున్నాఁడ.
స్త్రీ. 2-127

వ. అమృతోపమానంబులగు నన్నపానంబుల నతనిం దృప్తు నింగావించి.
అను. 2-21

**ఉపమించు** సం. స. క్రి.

1. పోల్చు.

ఉ. ఆవిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయు ల,క్ష్మీవిభ
వంబుతోడ సనుపమింప మంబులు గావు.
సభా. 2-114

2 పోల్చిచూచు.

ఉ. వీరలు దైవశక్తిఁ బ్రభవించినవా రగుటలేమి సందియం, బీరమ

ణీయకాంతి నుపమింపఁగ వేల్పులకాక యిట్టి యాకారవిశేష
సంపదఁ బ్రకాశిత తేజము పేర్మిఁజూడ సాధారణ మర్త్యులే.
ఆది. 5-151

**ఉపమితము** సం. విణ. (అ. ఆ. అ.)
ఉపమింపఁబడినది, పోల్పఁబడినది.
క. ఫణిరాజోపమితాస్త్రంబు లతని యొడలం జొనిపెన్.
భీష్మ. 2-188

**ఉపయాజుఁడు** సం. వి. అ. పుం.
యాజోపయాజులలో నొకఁడుకవాఁడు, వానప్రస్థాశ్రమము నందున్న ఒక మహాతపస్వి.
వ. (ద్రుపదుఁడు) గంగాకూలంబునందు వానప్రస్థ వృత్తి నున్న యాజోపయాజులను వారినిద్దఱ ననవరతవ్రత వ్యాసక్తులం గాశ్యప గోత్రులం గని వారికి నమస్కరించి యందుఁ గొండుక యయ్యును దపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైనవాని నుపయాజు నుపాసించి యిట్లనియె.
ఆది. 7-8 చూ ఆది. 7-8 మొ. 12-వ.

**ఉపయుక్తము** సం. విణ. (అ. ఆ. అ.)
భుజింపఁబడినది;
వ. దానుకానుజుండగు నాసూతు నుపయుక్తాహారుం జేయుటయు.
ద్రోణ 3-305

ఉపయోగపడినది.
మాలిని :- అకలుషహృదయాభివ్యక్త సర్వోపయుక్తా. సౌప్తి. 2-186

**ఉపయుక్తి** సం. వి. ఇ. స్త్రీ.
కూడియుండుట; కూర్పబడినదియగుట.
సీ. ఉపపన్న వాణ్యమృతోపయుక్తిఁ దేర్పుము, శాంతి. 1-89

**ఉపయుక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఉపయోగపడినవాఁడు.
మాలిని :- అకలుషహృదయాభివ్యక్త సర్వోపయుక్తా. సౌప్తి. 2-186

**ఉపయోగము** సం. వి. అ. పుం.

1. పుచ్చికొనుట. భుజించుట.

వ. జాత్రంబయిన చరువు మీ తల్లికిచ్చి బ్రాహ్మంబయిన దాని నీవు పుచ్చికొనుము ఋతుకాలంబున నీ తల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును నాలింగనము సేసి భక్తితో మీమీ చరువులుపయో గించునది యని నియోగించె వారి యుపయోగంబు సమయం బున విధివశంబునం జేసి. అను. 1-110

2. వినియోగము, ప్రయోజనము.

వ. అధ్వరోపయోగంబు వడసిన గోగణంబులు గోలోకంబునకుం బ్రమోదంబునం బోయె, అను. 3-86

వ. అశ్వమేధయాగంబునం దుపయోగంబు నొందింపం గోరెద. అశ్వ. 3-208

**ఉపయోగించు** సం. స. క్రి.

1. ఆరగించు, భుజించు, తిను.

వ. ... ఆ కుంచెకు పేంపిండియుం జెఱి మానెండు బంచుకొని యుపయోగించువారై యున్న సమయంబున.
అశ్వ. 4-221; శాంతి. 1-163, ఉద్యో 2-123, ఉద్యో. 3-216, అశ్వ. 4-224.

2. ప్రయోగించు.

తే. అస్త్ర మన్త్రముతో శాంతమగుటం గోరి, నీలవ కిట్లుపయోగింప వలనెంగాని. సౌప్తి. 2-69

3. ఉపయోగపఱుచు, అనుభవించు.

వ. మేమొక్క భిక్ష దెచ్చితిమని తల్లికి నివేదించిన నెఱుంగక యెప్పటియట్లకా వగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీరేవురు నుపయోగింపుండని కొడుకుల నియోగించి
ఆది. 7-208; ఆది. 7-209

వ. దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌంగిలించుకొని నాతో బద్ధసఖ్యుండవయి నాకును బాంధవులకు హితంబుసేసి

నన్నుం గురు రాజ్యంబు నుపయోగింపుమనిన నట్ల చేయుదునని.
ఆది. 6-34

**ఉపయోగ్య** సం. విణ. (అ. ఆ. అ.)

సేవింపఁదగినది.

వ. భవదీయ రాజ్యలక్ష్మి మధురభంగియయ్యును నధములగు నా నియుక్తుల వలనం జోరజన సంవృతంబైన కావేరియుంబోలె నుపయోగ్యగాకునికి యెఱింగి నీ కెఱింగించుటకై మిథ్యాభి వర్ణితంబైన కాకంబునేవంబిడి జొచ్చితి. శాంతి. 6-366

**ఉపయోగ్యత** సం. వి. ఆ. (స్త్రీ).

ఉపయోగ్యత్వము, ఉపయోగమునకుఁ దగియుండుట.

వ. విశ్వలగు దేవతలు పితృదేవతలతోఁగూడం దద్రిక్రయోప యోగ్యతం దోతురు. అను. 3-192

**ఉపయోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆచరింపఁదగినది.

క. జననాథ మనోధారణ,యును బ్రాణాయామ విధియ నుపయో గ్యములై,చను నిర్గుణమును సగుణం,బును ననఁగా రెండు తంత్ర ములు యోగమునన్. శాంతి. 6-112

2. అనుభవింపఁదగినది.

వ. అజాతశత్రుండు శంతను పుత్రుతో నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు ధర్మపరులును నీతి విదులునునైన బలవంతులు బహుమార్గంబులగు నదుపాయంబులనర్థంబు లాకాంక్షింప సిద్ధింప కుండెడుఁ గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగ్యం బులు గాకుండు. అను. 5-429

చ. భవదుపయోగ్యమైన నృపభావము నాకు వహింప శక్యమే.
ఆర. 6-25

**ఉపరతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉపరతిపొందినది, వ్యాపారములడఁగినది.

తే. మనసుచేతిప యింద్రియ మహిమలెల్ల, నుపరతంబైన మనసుతో

నుడిగి మడఁగు, నింద్రియములు పరమమొందెనేని దాన, మనసు మగుడదు విషయ తృష్ణన చరించు. శాంతి. 6-86

2. ఉపశమించినది, నివారించినది.

ఉ. ...మదీయ బంధు సంతాన మనోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో,ర్వీనుత సర్పయాగ ముడివింపుము కావుము సర్పసంహతిన్. ఆది. 2-280

ఉపరమము సం. వి. అ. పుం.

1. మరణము.

క. అగలము శమించు చాడ్పున, ననఘ యతండు పరమోన్మ ఖాత్మండై తా, మను దలఁచె నింద్రియంబులు, మనమునఁ దగ నిగ్రహించి మహిత సమాధిన్. శాంతి. 2-18

2. నాశము, క్షయము.

క. ఉపరమముం బ్రాపించిన, యపుణ్యపుణ్యములు గలుగు నతిశాంతులు భవ్యపుగతిఁ బొందెదు నానందపురూపుని విష్ణు దలఁచెదను మోక్షాత్మున్. శాంతి. 2-80

3. విశ్రాంతి, విరమణము.

సీ. ... దివంబు, తే. రాత్రియును, యోగసేవానురతి నివాత దీపమును బోలె వెలుఁగు నాత్మీయమూర్తిఁ, గనుచు నెడనెడ నుపరసు కాలములున; నంగ వర్తించి యోగి యానందమొందు. శాంతి. 6-38

4. మోక్షము, విషయవైరాగ్యము.

వ. ... అయ్యుపరమపరుం డప్పారాశర్యుతో మోక్ష ప్రపంచెయ్యది దాని నెఱింగింపవే యనుటయు. శాంతి, 6-257

ఉపరి సం. అవ్య.

పైని, మీఁద.

సీ. విమలాస్య ముద్దుమొగంబులే మెఱుఁగుల మొత్తంబుపరి చుట్టుముట్టి కొనఁగ విరా. 2-87

(సూ-ఆ.ని-లో 'ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును' అని కలదు. కాని ఇక్కడ కొన్ని ప్రతులు' 'మొత్తంబు+ఉపరి+చుట్టుముట్టికొన 'అనియుఁ గొన్ని ప్రతులు 'మొత్తంబు+పరిచుట్టుముట్టికొన' అనియుఁ బ్రయోగములు చూపించుచున్నవి. 'ఉప' వ్యస్తముగాఁ బ్రయోగాంతరములేమి నిట్లు విడఁదీసియుందురా? విచార్యము)

**ఉపరిచరవసువు** సం. వి. ఉ. పుం. (ఉపరిచరుఁడు-వసువు)

ఒకానొకరాజు.

చూ. చరిత్ర ఆది. 3—28 మొ, 34 వఱకు శాంతి. 6—354 మొ, 375 వఱకు. చూ. అనుబంధము.

**ఉపరితలము** సం. వి. పుం. న.

పైభాగము.

క. కోపించి యాతఁ డొండొక, చాపముగొని నవనిశాతసాయకములు శాఖోపరితలముల నురమున,నేవున నాటుటయుఁ బార్థు డెల నవ్వాలయన్. ద్రోణ. 3-86

**ఉపరిచరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆకాశమునందు సంచరించువాఁడు.

వ. దానం జేసి వసునామధేయుండైన యతం డుపరిచరుం డనంబరఁగె. శాంతి 6-359

2. వసువు, ఉపరిచరవసువు.

చూ. ఉపరిచరవసువు.

**ఉపరిభాగము** సం. వి. అ. పుం.

పై ప్రదేశము.

వ. లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటియించి. విరా. 1-18

**ఉపరుద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

అడ్డగింపఁబడినది. నిరోధింపఁబడినది.

సీ. వాసుకి ప్రభృతి నివాసభూము, లుపరుద్ధభావంబు నొందె. అశ్వ. 8-112

**ఉపరోధి** సం. విణ. (న్. నీ. న్.)

అడ్డగించునది, అడ్డగింపు.

వ. ... ఇవ్వనంబు ఋషిచ్ఛిరనివాసంబు సంతేసి విరళఫలకుసుమపాదపంబై మృగకులోపరోధియై యొప్పుచున్నయది. అర. 1-276

**ఉపరోధించు** సం. స. క్రి.

అడ్డగించు.

మ. ... ఈ విపినం బుజ్జ్వల పుష్పపల్లవ ఫలావిర్భూతి నానాలతా,
గపరీతంబన విందుఁ గూడఁగ మదిం గౌతూహలంబయ్యె న,న్నుపరోధింపకు మింతవట్టు చన నీయుక్తుండ వెబ్భంగులన్,
అర. 7-208

**ఉపలక్షించు** సం. స. క్రి.

1. చూచు; కనుఁగొను.

వ. సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుంగా నతని నుపలక్షించి యిట్లనియె. విరా. 1-66

వ. ... (ధర్మజుఁడు) విదురునిం దమ్ములం మపలక్షించి ధర్మార్థ కామంబులయం దుత్తమమధ్యమాధమత్వ నిరూపణంబు సేయుఁడు చూతమని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె. శాంతి 8-458

2. ఉద్దేశించు.

వ. అంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి.

ఉ వీరుమ పాండుపుత్త్రులును వేరము దక్కి బొసంగి.
ఉద్యో. 4-2,3 శాంతి. 2-117

వ. అమ్మహాత్ముండు వెండియు శల్యు కిట్లనుఁ గృష్ణుండు వినుచుండఁ గొందఱు బ్రాహ్మణు లతని నుపలక్షించి వాతో నివ్వాలుండు యాదవుండైన వసుదేవునకుఁ గంసానుజయైన దేవకియందు జన్మించినవాఁ డితని నీవు క్రతుపురుషుం డని కొనియాడుటకు గతంబేమి యని యడిగిన. అను. 1-164

3. కనిపట్టు.

వ. మదనాతురుండయి దుష్యంతుడు దనయం దక్కోమలి యనురాగం

బుపలక్షించి యిట్లనియె. ఆది. 4-51.

4. తెలిసికొను.

వ. అనిన విని నగుచు నబ్జనాభుం డర్జును నతిస్నేహంబునం గౌఁగిలించు కొని యెల్లవారి కుశలంబును నడిగి యాతని తీర్థాభిగమననిమిత్తంబును విని సుభద్రయందు బద్ధానురాగుండగుట నుపలక్షించి ద్వారకాపురంబునకుం దోడ్కొని యరిగి. ఆది. 4-170

5. ఊహించు.

వ. ఇట్లరుగువాఁడు నిజసింహనాదశ్రవణ పరిత్రస్తంబులై యెగసి పఱచు పక్షుల యార్ద్రపక్షంబులఁ జూచి ముందట నాసన్నంబునం గొలను కలుగవలయునని యుపలక్షించి యతిత్వరితగతిం జనిచని ... యొక్క సరోవరంబుఁ గని. అర. 3-318

**ఉపలబ్ధము** సం. విశే. (అ. ఆ. అ.)

పొందఁబడినది.

ఉ. ఘోర,రాజిముఖోపలబ్ధవిజయప్రమదాశ్రితబాహుదండ
ఆది. 1-161

**ఉపలబ్ధి** సం. వి. ఇ. (స్త్రీ).

1. పొందుట, ప్రాప్తి. అను. 8-129

2. మహత్తత్వము.

సీ. అవ్యక్తమునను మహత్తత్త్వ ముదయించు నది బుద్ధి మతి ధృతి ఖ్యాతి సంవి,దుపలబ్ధి నామంబు లొంది యొప్పుదును గని, విని చని గావించి విభుతనొప్పు. అశ్వ. 2-135

**ఉపలము** సం. వి. అ. పుం.

ఱాయి,

వ. అవ్వీరుండు ఘోరాకారుండయి గాండీవచండనిస్వనంబులొండొండ నిగుడ నిశితసాయకపరంపరలు గురిసి కపాలోపలంబును మేదోమాంసపంకంబును నస్థిచూర్ణసికతంబును నసృక్శోణిత నదీప్రకరంబును బఱపె. ద్రోణ. 1-218; అను. 4-209

**ఉపలాలన(ము)** సం. వి. అ. న.

బుజ్జగి పు.

సీ. ఈ సుమధ్యమ యిమ్మహీశ్వరు బాహుతలంబున లలితోపలాలం
నంబు, నొంది రాగిల్లెడు నుల్లంబుతోనుండు. స్త్రీ. 2-47

తే. అనఘ మాతంద్రి యొక్కనాఁ డతిముదమున, నన్నునుపలాల
నము సేసి. అర. 5-188

ఉ. యౌవనదర్పమంది జనమంతకునంతకు నగ్గలింప మై, లావధికంబు
గాఁగ నుపలాలనసేయఁగ బద్మసంభవుం, డావిపహోత్తముండు.
అను. 1-203

**ఉపలాలించు** సం. స. క్రి.

1. బుజ్జగించు, లాలించు.

వ ఇ వ్వధఁబునం దన గాదిలిమూఁతు నుపలాలించి బృహన్నల దెసం
గను గొని. విరా. 1-248, శాంతి. 5-240

2. గ్రహించు, తాల్చు, వహించు.

క ఏనుఁగుల మదముతావియు. సైనిక నికరాను లేప సౌరభ్యములుం,
దా నుపలాలించుచుఁ బవమానుం డనుకూలమృదుగమనమునఁ
బొలసెన్. భీష్మ. 1-121

**ఉపలాలితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. బుజ్జగింపఁబడినది.

వ. ... ఆశనిచేత సంతతోపలాలితయు ధర్మాధర్మనిదర్శనశీలయు నగు
పాంచాలి. శాంతి. 1-88

2. ధరింపఁబడినది.

క. ఆద్యపురుషోపలాలిత, ముద్యోతితరోచిరుద్గమోగ్రగం బరినిర్వై
ద్యము దివ్యజనన మన,వద్యంబది కార్ముకైకవరము గుమారా.
విరా. 4-121

**ఉపలాలితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. బుజ్జగింపఁబడినవాఁడు.

వ. ఉపలాలితుండగు డింభకుండు దనకాలందియొటుంగక మహోపదా

ర్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి. విరా. 1—22

2. మెచ్చుకొనఁబడినవాఁడు, పొగడఁబడినవాఁడు.

వ. దీనంబులగు నాననంబులతోడం గౌరవులు విడిదలకుం బోయిరి. పాండవులు బహుతూర్యనినదంబులు సింహనాదంబులుం జెలంగం బొంగారిన సముద్రంబు చందంబున నుల్లసిల్లు సైన్యంబు మగిడించుకొని నిశ్చితంబులగు నంతఃకరణంబులతోఁ గృష్ణోపలాలితు లగుచు నిజశిబిరంబులకుం జనిరి. ద్రోణ. 5-418

**ఉపలాల్యము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపలాలింపఁదగినది.

ఉ. ... వాసవోత్సంగతలోపలాల్య పదసంస్మృతివారణ దైత్య దారణా. శల్య. 1-403

క. అంసప్రదేశలలితోత్తంసీ కరణోపలాల్యధరణీవలయా. శాంతి. 8-426

**ఉపరిలోకము** సం. వి. ఉ. పుం.

ఊర్ధ్వలోకము, భూమికిఁ బైనుండు లోకము, స్వర్గము.

వ. అవ్వసువును దద్విమానారూఢుండై యుపరిలోకంబునం జరించు టంజేసి యుపరిచరుండు నాఁ బరఁగి. ఆది. 3-24

**ఉపరివనము** సం. వి. అ. న.

ఆరామము, పెంచినతోట.

వ. వచ్చునప్పు డెయ్యెడ నేపదార్థంబులఁ జూచినం జూడనివాఁడపోలె వచ్చె నిట్లు వచ్చి విదేహజనపదంబు సొచ్చి మిథిలాపురంబు నుపవనంబు దఱిసి చని. శాంతి. 6-267; అర. 4-826

**ఉపవసించు** సం. అ. క్రి.

1. ఉపవాసముచేయు, భుజింపకుండు, ఆహారముడుగు.

ఆ. పుణ్య దినమునందు భూసురానుజ్ఞతో, నుపవసించి గోవులున్న మంద, కరిగి పరమనియతి నయ్యహోరాత్ర మగ్గోష్ఠమున వసించి నిష్ఠతోడ. అను. 3-7

2. వసించు, ఉండు.

వ. ఈ తీర్థంబున దేవఋషి పితృతర్పణపరుండై యొక్కనాఁ డుపసించినవాఁడు పంచాశద్వత్సర పరిపూరణీయంబగు నైష్ఠికబ్రహ్మచర్య ఫలంబు వడయువాఁ డని పలికి. శల్య. 2-214

**ఉపవహుఁడు** సం. వి. అ. పుం.

సప్తవాయువులలో నొకఁడు చూ. శాంతి. 6-307

**ఉపవాసము** సం. వి. అ. పుం.

భుజింపకుండుట, ఉపవాసవ్రతము.

ఆ బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాసములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబు, లాహారించియునికి కాధిరాజ్యము పత్రి, శతుతకు దివంబు ఫలము లధిప అను. 1-148

**ఉపవాసి** (సం. విణ. న్. సీ. న్.)

ఉపవాసము చేయువాఁడు.

సీ. ... భృగుతుంగ మను మహాభ్రాదమ్మున వాసరత్రయ ముపవాసియై బ్రహ్మవధంబు పాపంబు దొలఁగు. అను. 2-36

**ఉపవిలోకనము** సం. వి. అ. న.

చూచుట.

ఉ ద్రౌపదియున్ సుభద్రయును దక్కటికాంతలు భ్రాతృపుత్త్రి పౌత్రోపవిలోకనోత్సవము నొందుదుర. ఆశ్ర. 2-108

**ఉపవిష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కూర్చున్నవాఁడు.

వ. నారదుండు...ఏతెంచిన నెల్లవారలుం బ్రత్యుత్థాన ప్రణామంబు లాచరించి సుఖోపవిష్టుం జేసి పరివేష్టించిరి.

శల్య. 2-218; ఆశ్ర. 2-66

**ఉపవీతము** సం. వి. అ. న.

ఎడమభుజము మీదినుండి కుడిచేతి క్రిందుగా వ్రేలాడునట్లు ధరింపఁబడు జందెము.

సీ. ఉరగాత్మకములైన యుపవీతములు హారములు నంగదంబులుఁ
బొలుపుమిగుల: సౌప్తి. 1-95

**ఉపవేశనము** సం. వి. అ. న.

ఉపవేశము-కూర్చుండుట.

సీ. మణిహేమపర్యంక మహితోపవేశను, సురుచిరాభరణ విస్ఫురిత
గాత్రు. శాంతి. 2-8

**ఉపవేశము** సం. వి. అ. పుం.

కూర్చుండుట,

చ. ...ఉపవేశనిశ్చలతఁ జూచినమే లఖిలప్రియంబుగన్. శల్య. 2-281

**ఉపశమనము** సం. వి. అ. న.

1. శాంతము, ఓర్పు.

వ. ఆమ్మునులు నాకడకుం జనుదెంచి యుపశమనవాక్యంబులు పలికి
జామదగ్న్యుతోడం దమయాడినమాటలు దేట పఱిచి.
ఉద్యో. 4-358

వ. పరిక్షితుండు పరిక్షీణహృదయుండై తనచేసిన వ్యతిక్రమంబునకు
సంతాపించి శమీకు నుపశమనంబునకు మెచ్చి శృంగిశాపంబునకు
వెఱచి. ఆది. 2-181

2. శాంతి.

వ. అట్లు క్రోధోపశమనం బాచరించుసమయంబున. ద్రోణ. 2-165

3. ఊఱట.

వ అని చెప్పి యిది యుపశమనప్రకారంబు నీవి తొలఁగింతొత
నాకర్ణింపుము. శాంతి. 3-35

4. ఉడుగుట, విరమించుట.

వ. సహస్రపాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమన బుద్ధి
పుట్టించె ననిన. ఆది. 1-158

**ఉపశమము** సం. వి. అ. పుం.

1. ఉపశమనము, శాంతి.

తే. అట్లుగావున నెఱిఁగింపు మఖిల కార్యజాతమును జిత్తతాపోప
శమముగాఁగ. ఉద్యో. 2-50

2. నాశము.

వ. స్నేహాజంబులయిన మానసదుఃఖంబులు జలంబుల నగ్నియుపశమిల్లు
నట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశమంబునం బొందు ఆర. 1-22

3. ఊఱట.

తే. అనరుండు, దద్ద యడలి దాదుకు భూషితములఁ దేఱి, యఖిలజను
లకు నుపశమ మావహించె మౌస. 1-151

**ఉపశమించు** సం. అ. క్రి.

1. శాంతించు.

వ. అని పలికి వారలకందు మాన్పి యిది యట్లు కాక యొండుదగునే
యనుచుఁ దక్కినవారి దెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశ
మించిరి. విరా. 5-314

2. ఊఱడిల్లు.

వ, ... ఎవ్వరు నేమిసేయుదురు కాలవశంబున నవశ్యభావియైనది
యయ్యె నుపశమింపుమని పలికె. స్త్రీ. 1-186 విరా. 2-48

3. అడఁగు, తొలఁగు, నశించు.

వ. నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం
బొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లు భవద్వచనామృతంబు
వాయఁ ల్లంబున వెల్లిగొల్పుము. ఉద్యో. 2-80

**ఉపశమించుకొను** అ. క్రి.

ఊఱటచెందు.

వ. తన్నుందాన ఉపశమించుకొనియున్నం గనుంగొని శారద్వేశ్వరుం
డతనికి న్నెఱింగినవాఁడై దుశ్శాసనుతో నిట్లనియె. భీష్మ. 3-187

**ఉపశమితము** సం. విశే. (అ. ఆ. అ.)

శాంతిఁబొందింపఁబడినది, ఉపశమింపఁబడినది.

వ. తొల్లి యిట్లు పుత్త్రమరణశోకాతురుండైన యకంపనుండను రాజు

నారదమునిచేత మృత్యుప్రకారంబు దెల్లంబుగా విని యుపశమిత
శోకుం డయ్యెనని విందుము. ద్రోణ. 2-153; స్త్రీ 1-188

**ఉపశమిల్లు** సం. అ. క్రి.

ఉపశమించు, అడఁగు, నశించు.

వ. శారీరదుఃఖంబు లౌషధక్రియాది ప్రతియోగంబుల నుపశమిల్లు మఱి
స్నేహజంబులయిన మానసదుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లు
నట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశమంబునం బొందు. అర. 1—22

**ఉపశాంతము** సం. విశే. (అ. ఆ. అ.)

అడఁగినది. ఉడిగినది.

వ. ఇట్లు రాత్రియగుట దివాచరంబులైన జంతువు లుపశాంతవర్త
నంబు లయ్యె రాత్రించరంబులైనవి సంచరింపఁ దొడఁగె.
సౌప్తి 1-15

**ఉపశాంతి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఉపశమము.

వ. ఆసంయమికి ననేక ధేనువుల నొసఁగి దురితోపశాంతి యొనర్చె.
శల్య, 2-164; శాంతి. 1-123

2. మనశ్శాంతి.

తే. దార ధన మిత్త్ర పుత్త్ర శాద్యంబులగు పదార్థముల సంగమునఁ
జిత్త మలఁతఁ బొంది, విసివినప్పుడు నిర్మల విపుల తపము, గార
ణంబగు నుపశాంతి కలిమి కనఘ. శాంతి. 5-499

3. చేరుచోటు.

తే. వేదశాస్త్ర పురాణ సంవేదితంబులైన బహువిధ వరిజ్ఞానములకు,
నెల్ల నిది సేరుగడచూవె యేఱులకు సముద్రమునుబోలె నుప
శాంతి భద్రచిత్త. శాంతి. 5-623

**ఉపశాఖ** సం. వి. అ. స్త్రీ.

శాఖనుండి పుట్టిన శాఖ, చిన్నకొమ్మ.

వ. గురునందనుండు క్రోధాతిశయంబునం జేసి నిదురవోవక వటవిట
పంబు గలయంగనుంగొనువాఁడు తదీయశాఖోపశాఖల నానా

కాకంబులు విలీనంబులై నిద్రించుచుండ నాలోకించె నయ్యవసరమున. సౌప్తి. 1-15; శాంతి. 6-199

**ఉపశోభితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించినది, ప్రకాశింపఁజేయఁబడినది.

వ. అశ్వత్థ వధూకామ్రబిల్వాది భూరుహ శోభితంబైన నిజపూర్వాశ్రమంబుఁ గనుంగొని శల్య. 2-218

**ఉపశోభితుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

ప్రకాశించినాఁడు. ప్రకాశింపఁజేయఁబడినవాఁడు.

ఉ. పాండవసైన్యసంఘ పరిపాలనసేయు నితఁడయంచుఁ గృష్ణుం డభిషేకసంపదుపశోభితుఁ జేయఁగ నాధిపత్యముద్దండతఁబూనితి. భీష్మ 3-15

**ఉపశ్రుతి** సం. వి. ఇ. స్త్రీ.

1. శుభాశుభములను గూర్చి ప్రశ్నవేయఁగా తద్దేవతావేశముగం బాలాదుల ద్వారమునఁజెప్పఁబడు నుత్తర వాక్యము. ప్రసంగ సమయమున దైవికముగా వినఁబడు శుభాశుభ సూచకమగు వాక్యము.

అ. అగ్రపుస్తకంబు లర్చించి చూచుచుఁ, బరమనియతిమై నుపశ్రుతులకుఁబోవుచును శుభంబు లావహించుటఁగాంచి, చెలఁగి యొండొరులకుఁజెప్పికొనుచు. ద్రోణ. 2-345

2. ఉపశ్రుతి కధిష్ఠానదైవము.

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధిదేవత సీసత్యంబువలన సీమగనిం గనుదని చెప్పి యనంతరంబు సాకారయై పొడసూపిన. ఉద్యో. 1-171

**ఉపసంజనితము** సం. విణ. (అ. ఆ. అ.)

కలిగినది, పుట్టినది.

చ. ... అతఁ డచ్చెరువంది పురాకృతోపసంజనిత విశేష మీ ఖగము జానుగ నన్ను నెఱింగె దీనికిన్. అను 1-155

**ఉపసంహరించు** సం. స. క్రి.

1. సంహరించు, వశింపఁజేయు.

వ. ఏమనుసంధించిన పనికి నీకు భయంబేల చతుర్విధ భూతకోట్ల నుపసంహరింపు మనిన. ద్రోణ. 2-175; శాంతి. 4-206

2. అణఁచు.

వ. స్వామీ కోపంబుపసంహరింపుము. శాంతి. 5-441; ద్రోణ. 2-165

3. మాను, విరమించు.

వ. ఇటు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దుగ్రుంకినప్పుడు గణం బుపసంహరించుచు రేపకడ దొడంగుచు. ఉద్యో. 4-330

4. నివారించు, మరలించు.

వ. అగ్నిభట్టారకుండు నిఖిలలోకవ్యాప్తంబైన తనతేజోమూర్తి నుపసంహరించిన. ఆది. 1-189

వ. నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి. ఉద్యో. 8-411

**ఉపసంహారము** సం. వి. అ. పుం.

ఉపసంహరించుట. మరలించుట. నివారించుట (వ్యతి. ప్రయోగము)

వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్ర స్వరూపంబును ప్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచు ఉద్యో. 4-340

**ఉపసంహృతము** సం. విశే. (అ. ఆ. అ.)

ఉపసంహారము చేయఁబడినది. హరింపఁబడినది, నశింపఁజేయఁబడినది.

క. సంజనితసముపసంహృతమదవా. అను. 1-887

**ఉపసక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

పొదువఁబడినది, కూర్పఁబడినది.

ఆ, రథికభూషణముల రశ్మిలఁ గేతనచ్ఛత్ర చామరోపసక్తములు, రుచులసుభటహేతిరోచులఁ బవలింటి, దివియచందమయ్యె దినక రుఁడు కర్ణ. 1-62

**ఉపసుందుఁడు** సం. వి. అ. పుం.

ఒక రాక్షసుఁడు. సుందుని తమ్ముఁడు.

చూ. చరిత్రకై. ఆది. 8-95 మొ. 113 వఱకు; అను. 4-425

చూ. సుందుఁడు.

**ఉపసేవ** సం. వి అ. స్త్రీ.

ఉపసేవనము.

క. సారమతిఁ జేసి మానస, శారీరరుజావళులకు సతతంబుఁ బ్రతీకార ములు సేయుచుండుదె. యారఁగ వృద్ధోపసేవ నౌషధసేవన్.

సభా. 1-34; సభా. 2-265; అర. 3-322

**ఉపసేవనము** సం. వి. అ. న.

సేవించుట, పరిచర్యచేయుట.

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడవని నన్ను నీవ చెప్పితివి. ఉద్యో. 4-36; శాంతి 5-447

**ఉపసేవి** సం. విశ. (న్. నీ. న్.)

సేవించువాఁడు.

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసంవేదివి తెలియంగ వినుము.

ఉద్యో. 4-29

**ఉపసేవితము** సం. విశ. (అ. ఆ. అ)

సేవింపఁబడినది.

ఆ. జనకువిడిచి యిట్లు సని సిద్ధచారణ, సముదయోపసేవితమును యోగ, సేవనార్హవిధము నై వెలుఁగొందు కై, లాసశిఖరితట మలంకరించె. శాంతి. 6-326

**ఉపస్థము** సం. వి. అ. పుం. న.

స్త్రీపురుషుల రహస్యావయము.

వ. వాక్పాణిపాదపాయూపస్థంబు లను కర్మేంద్రియంబులును.

శాంతి. 2-285

**ఉపస్థానము** సం. వి. అ. న.

1. డగ్గఱుట, దరిఁజేరుట.

వ. అవ్విధం బద్దివ్యాస్త్రవిలాసంబుగా నెఱింగి పాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యమ్మహోరగంబుల కుపస్థానంబు సేసి వేదవిదు లగు నమ్మహాత్ములు శతరుద్రీయంబు జపియించుచు.

ద్రోణ 2-372

2. ఉపాసించుట, ధ్యానము.

వ. అయ్యరదంబుఁ బూజింపం బురోహితు నియమించి తదీయమంగళ విధానానంతరంబ తాను నర్చించి కృతప్రదక్షిణుండై ప్రణమిల్లి భాస్కరోపస్థానం బాచరించి సవినయంబున శల్యునారోహణంబు సేయుమనుటయు కర్ణ. 1-317

3. అనుసంధానము, స్మరణము.

క. వ్యాసమహామునిలోకహితాసక్తిని శివునివిషయమై పత్యముగాఁ, జేసె నుపస్థాన మొకటి, యాసమధికపుణ్యవాక్చయము విను మధిపా. అను. 5-403

**ఉపస్పర్శనము** సం. వి. అ. న.

1. ఆచమనము.

వ. అతండును బాదప్రక్షాళనంబు నుపస్పర్శనంబు నాచరించి. ద్రోణ. 2-389; అశ్వ. 3-187; అశ్వ. 4-79

2. స్నానము.

తే. సుందరి కాహ్రదంబునను దగఁగ, సకృదుపస్పర్శనము సేసి చారు మూర్తియై జనించు. అను. 2-76

**ఉపస్పర్శము** సం. వి. అ. పుం.

ఆచమనము, స్నానము.

తే. వినుఁ డుపస్పర్శ మిందుఁ జేసినయతండు, వడయువాఁడు మహిత సోమపానఫలము, శల్య. 2-156

**ఉపహతము** సం. విశ. (అ. ఆ. అ.)

కొట్టఁబడినది.

సీ. ఇకఁ దతిలోభోపహతమానసుఁడు దీర్ఘ, దర్శిగాఁడు. స్వర్గ 5

2. చెడినది, దూషితమైనది.

మ. ... మానుషంబున కొక్కెక్కెడ సిద్ధిదప్పిన వగల్పొందంగ రానీక యప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హవృత్తం బగున్. శాంతి. 2-167

క. కాలోపహతచేతస్కుఁడు, మేలు తెరువువట్టుసెట్లు. శల్య. 2-368

**ఉపహతి** సం. వి. ఇ. స్త్రీ.

అడ్డగింత, ప్రతిఘటనము.

తే. దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ. కర్ణ. 1-42

ఆ. దైవోపహతి నింత, చిక్కువడితి నేమిసేయువాఁడ. అర. 7-262

**ఉపహతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

చెడఁగొట్టఁబడినవాఁడు, దూషితుఁడు.

వ మందబుద్ధియు లోభోపహతుండునునయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింత సేసె. ఉద్యో. 2-198

**ఉపహారము** సం. వి. అ. పుం.

1. కానుక.

క. గురువునకు మాఱువల్కుట, కోరసిన కల్మషము పాసిపోవునతనికిం బరితోషముగా వినయపు, వెరవున నుపహారమిచ్చి వినతుండయినన్. శాంతి. 1-311; విరా. 1-308

2. కానుకగా నిచ్చుద్రవ్యము.

వ. పూజోపహార ప్రముఖ విధానంబుల నద్దేవు నారాధించుచుండి. కర్ణ. 1-296

3. దేవతాదుల కిచ్చు బలి

సీ. అథవు-ఆ-వాశ్రయించి యతనికాత్మోపహార మర్పించువాఁడ. సౌప్తి. 1-112

**ఉపహితము** సం. విణ. (అ. ఆ. అ.)

కూడుకొన్నది,

క. అనఘా మృత్యువు నమృతం, బును దేహమునందు కలవు మోహము మృత్యు, త్వనిరోధ మున్నరూపుం, గను టమృతత్వోపహితము గాఁగ నెఱుఁగుమీ. శాంతి. 5-384; శాంతి. 6-381

**ఉపహితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కూడు కొన్నవాఁడు.

క. గుహాయందు నిహితమని యెడు, మహానీయ బ్రహ్మపదము మహిత

ద మత్యోపహితుండగువానికి సన్నిహితంబని చెప్పుదురు మనీషి జనంబుల్. శాంతి. 3-409

**ఉపహృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

బలిగొనఁబడినవాఁడు, ఆత్మార్పణము చేయబఁబడినవాఁడు.

క. అప్పరుసునఁ బెరిగిన నృపు, లిప్పుడు భారతరణోపహృతులై ష్ఘలు వుర్, గుప్పలు గొనఁబడి రనికిం, దప్పినవాఁ డొకడొకండ ధరనంతంతన్. శాంతి. 2-96

**ఉపాంగము** సం. వి. అ, న.

అంగమునకు అంగముగా నుపయోగించునంతర్భాగము. వేదాంగసదృశమైన మీమాంసాది, ఇవి నాలుగు 1 పురాణము, 2. న్యాయ శాస్త్రము, 3. మీమాంస 4. ధర్మశాస్త్రము

"పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాణి చత్వార్యుపాంగాని."

క. వగవంగ సాంగోపాంగము,లగు నాలుగు వేదములయు నధ్యయనము పొల్పున నొక సత్యముతో నెన,యగునె యెచ్చియును బోలవలె సత్యంబున్. అర. 2-42

**ఉపాంతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సమీపమునందున్నది.

ఉ. ... కల్పసంతు యమహాభ్రము చందము నొందుచున్ శతా, నీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతివిద్యుదుపాంతశాంతియై. విరా, 3-171

వి. అ. పుం.

1. సమీపము.

క. అంతిపురము చుట్టటికం, బెంతయుఁ గీడంతకంటెనెగ్గు తదీయోపాంత చర కుబ్జవామన, కాంతాదులతోడిపొందు నలిమిభట్టునకున్. విరా 1-131

2. ప్రక్క, అంచు.

ఉ. కౌరవసేన గోగణముఁ గైకొనిపోవ నంతదు ముట్టియం,దారని రాజుఁగనక యుపాంతమునం బొలఁగించి వేగ న్యాత్తేరట డోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబు దుర్వారరయంబు మాన్చి

వలు వర్గము నిద్దెన వెల్చె నార్చుచున్. విరా. 5-288

**ఉపాంశువధ** సం. వి. ఆ. స్త్రీ.

రహస్యముగాఁ జంపించుట.

పృథ్వీ- ఉపాంశువధఁజేసి మధ్యము మదోద్ధతుంజంపి. ఆది. 5-168

**ఉపాంశువు** సం. అవ్య.

రహస్యము.

వ. ఉపాంశుప్రయోగంబుల భీము వధియించి వారల బలహీనులంజేయు దము. ఆది. 8-22; ఆది. 5-168

**ఉపాఖ్యానము** సం. వి. అ. న.

ప్రధానకథలో వచ్చెడి అవాంతర కథ.

క. సౌఖ్యంబులు నొందు జగ,త్ప్రఖ్యాతులుఁజెందుఁ దగఁ బురందర విజయో,పాఖ్యానము విన్నను ద.ద్వ్యాఖ్యానము సేసినన్ జనావలి కనఘా. ఉద్యో, 1-212; విరా. 1-43

**ఉపాత్తము** సం. విశ. (అ. ఆ. అ,)

పొందఁబడినది.

క. ...ఉ,ద్వృత్తక్షత్రియ ధర్మో,పాత్తంబగు తేజ మొల్లఁడాకై తోఁచెన్. ఉద్యో. 4-822; శాంతి. 1-155

**ఉపాదానకారణము** సం. వి. అ. న.

కారణవిశేషము, (కుండకు మన్ను ఉపాదానకారణము).

వ. ఇట్లు చరాచరాత్మకంబై తేజరిల్లు నత్తెరు వీక్షించి ఫాలాక్షుండు గ్రహమండిత వ్యోమమండలం బుపాదాన కారణంబుగా విశ్వకర్మ గావించిన కవచంబు దొడిగి శరాసనంబు ధరియించి కర్ణ. 1-288

**ఉపాధి** సం. వి. ఇ. పుం

చింత, ఆలోచనము.

వ. మోక్షోపాధి ప్రదంబులను వాక్యంబు లిట్లని యుపదేశించె. శాంతి. 4-842

**ఉపాధ్యాయుఁడు** సం. వి. ఇ. పుం.

1. విద్య నేర్పువాఁడు-గురుఁడు.

వ ఆచార పరిపాటి యవలంబించి యిట్లుపాధ్యాయవరణంబు సేసి.
శాంతి. 6-255

1. ఉపద్రష్ట.

వ. మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపాధ్యాయుంగా వరియింపం బోయితి.
అశ్వ. 1-42

**ఉపానయనము** సం. వి. అ. న.

తెచ్చుట, పొందుట.

చ. ...కీర్త్యుపానయన కృతార్థ సేవకజనా.
శాంతి. 3-529

**ఉపానహము** సం. వి. హ. (స్త్రీ).

చర్మపాదుక, చెప్పు.

మ. నయమిట్లారఁగ నాతపత్రము నుపానద్ద్వంద్వముం జూపి.
అను, 3-264

**ఉపానీతము** సం. విణ. (అ. ఆ. అ.)

తీసికొని రాఁబడినది.

క. ...తత్త్వాశ్లేషో, పానీత నిరంతర సాంద్రానంద ప్లావితాత్మ హారిహారవధా.
అశ్వ. 1-1

**ఉపాయజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపాయము తెలిసినవాఁడు.

క. ...అన విని విహంగవిభుం డల్లన నగుచు నీవు పుత్రస్నేహో,ద్యుండవయి పలికితే బలి, యుండ నుపాయజ్ఞుఁడను మహోజ్జ్వలతేజా.
అను. 1-217

**ఉపాయనము** సం. వి. అ. న.

కానుక.

ఉ. ... ఆతనిం, జెచ్చెరఁ దా నెదుర్కొని విశిష్ట సమాదరమై యుపాయనం బిచ్చి తదీయ చిత్తమున కిం పెసలారఁగ శాద్య మిచ్చినన్.
శాంతి. 6-574

**ఉపాయము** సం. వి. అ. పుం.

1. యుక్తి, పన్నుగడ.

చ. ...ఏమి గతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై, సహితుల కప్ర
భేద్యమగు నా పదుమూఁడగు నేడు మత్పిశాచమహులు చరించి
రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా. విరా. 1-44

సీ. ఈ రెండు పిశుల తారతమ్యంబులు, నెఱుఁగుదు పోరైన నెవ్వ
రోర్తురది నిశ్చయింత మే యొందు నుపాయంబుఁ; బౌరుషంబు గల
వారు గలరు. ఉద్యో. 2-304

2. సాధనము.

తే. ఆతని బొందు నుపాయంబు నంతరంగ, నిగ్రహముకాఁగ నార్యు
లనుగ్రహింతు,రు. ఉద్యో. 2-327

3. పద్ధతి, మార్గము.

క. తనువున పెఱిగిన యలుఁగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠుర
తన్, మనమున నాటిన మాటలు, విను మెన్నియుపాయములను
వెడలునె యధిపా. ఉద్యో. 2-62

4. సామాది.

తే ఆయుపాయముల్ మూఁటికి ననువుగాని, యట్టిపగతుని యెడ
భేద మాచరింప,వలయు రంధ్రముల్ దగవేమవలను గలిగి తత్ప
రతఁ జేయఁజాలు సాధకులఁ బనిచి. శాంతి. 2-416

ఇవి నాలుగు 1) సామము 2) భేదము 3) దానము 4) దండము
శాంతి. 2-412

(వీనితో 'ఉపేక్ష' చేర్చి అయి దుపాయము లని శుక్రుఁడు 'మాయ,
ఉపేక్ష, ఇంద్రజాలము' అను మూఁడిటిని జేర్చి పదని కొందఱు)

**ఉపార్జకుఁడు** సం. విణ. (అ. ర్జికా. అ.)

కృషివాణిజ్యాదులచే జీవించువాఁడు.

తే. యజ్ఞపరుఁడు రక్షకుఁడు నుపార్జకుండు, విప్రశుశ్రూషకుఁడుగాని
విప్రరాజ, వైశ్యశూద్రులు దిక్కటివాని నెట్టి, ధర్మములఁ జేసి
రేని నధర్మపరుల. శాంతి. 5-451

**ఉపార్జనము** సం. వి. అ. న.

గడన, సంపాదనము.

వ. కావున నర్థోపార్జనంబును బ ధుమిత్ర పరితోషణంబును భూపతు-
లకుం బరమ పురుషార్థం బదియునుం గాక. శాంతి. 1-58

**ఉపార్జించు** సం. స. క్రి.

గడన, సంపాదనము.

వ. పార్థివు లర్థంబు లుపార్జించి పర్జన్యాదులగు నాదిత్యుల నధ్వర-
క్రియా జాతంబునం బ్రీతులం జేసి, శాంతి. 1-55

తే. యశ ముపార్జింపఁ గ్రొత్త వెంపగునె నాకు, శాంతి, 2-148

సీ. ఐహిక సుఖము లుపార్జింపవలసిన వారికి.
అను, 5-370; అశ్వ. 1-68

**ఉపార్జిత** సం. విశే. (అ. ఆ. అ.)

సంపాదింపఁబడినది. పొందఁబడినది,

సీ. మునుమును పుట్టిన, సుతుఁడు ధర్మము పద్మజునకు దాని-తే-
పాక సంపద సుమతు లుపార్జింగను,పాసనము సేయుదురు తియ్య
పంటి పరుస, మాదరించి తదుపచార మాచరించు, వెరవుగల యట్టి
జనముల విధముదోఁప. అను. 5-424

**ఉపార్జితము** సం. విశే. (అ. ఆ. అ.)

గడింపఁబడినది, సంపాదింపఁబడినది.

ఉ. అర్జునుఁ డైననేమి సురలైనను నేఁగు విద్విషచ్చిరో, పార్జితమైన
గోధనముఁ బట్టితిమి. విరా. 4-188

ఆ. ధర్మ లబ్ధమైన ధనము పాతిక యేని, బహుళఫలము నిచ్చుఁ బాప
వృత్త్యుపార్జితంబు కోటియైన నిష్ఫల మంద్రు, దాసశాస్త్ర-
విదులు మానవేంద్ర. శాంతి. 5-492

**ఉపాలంభనము** సం. వి. అ. న.

నిందించుట, ఆక్షేపించుట;

వ. శిశుపాలుం డుపాలంభనపరుండయి యధోక్షజు నాక్షేపించుచు
ధర్మరాజున కిట్లనియె; సభా. 2-7

**ఉపాలంభించు** సం. స. క్రి.

నిందించుట, ఆక్షేపించు.

వ. ఏను గరోత్కటకుండను వాఁడఁ గర్మవశంబున నొక్క బ్రహ్మఋషి నుపాలంభించి తచ్ఛాపంబున నెక్కుడం గదలనేరకున్నవాఁడ.
ఆర. 2-239

**ఉపాశ్రయము** సం. వి. అ. పుం.

1. ప్రాపు, అండ, ఆశ్రయము.

చ. ప్రకృతియు బుద్ధ్యహంకృతులు భావము భూతచయంబు నింద్రియ, ప్రకరముఁ గేశవా భవదుపాశ్రయ భావిత వర్తనంబులు.
శాంతి. 4-288

2. ఊఁత, ఆస్పదము.

చ. సుమహదుపాశ్రయ ప్రమద శోభిత విశ్వజగన్మధుప్రతా.
శాంతి. 4-426

3. ఆధారము

సీ. ...అన్నంబునకు నోలినట్లుగాక, యది ప్రాణ మంద్రు మహాత్ములు గావున, దానిఁ బెట్టుట ప్రాణదానసమము -తే- విను విశేషించి తత్పాకమునకు జల ముపాశ్రయము చంద్రునకుఁ బుట్టఁ బట్టువయ్యె, జలము చంద్రుఁడు గాఁడె యోషధులఁ బ్రోచుఁ, గావ యుత్తమ మన్నంబుకంటె జలము.
అను. 2-405

**ఉపాశ్రితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఆశ్రయింపఁబడినది. ఆశ్రయించినది.

వ. ఇట్లుత్తముండైన విప్రుండు త్తమ మంత్రోపాశ్రితంబులగు విహిత కర్మంబులు నడపుట రత్నకాంచన సాంగత్యంబును బోలె సంస్తుత్యంబై యుండు.
శాంతి. 1-72

**ఉపాశ్రితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆశ్రయించువాఁడు, అండఁజేరువాఁడు.

మ. విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ, గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్.
విరా. 2-136

**ఉపాసనము** సం. వి. అ. న.

మననము, ధ్యానము.

క. పరతత్త్వోపాసనత,త్పరుడై సంతుష్టిం గామ భావతనున్నం, బురుషు
సుఖమొందు వృద్ధిం,బొరయుచు వవు వమృతకిరణుఁ బొందిన
మాడ్కిన్. శాంతి. 5-191

**ఉపాసించు** సం. స. క్రి.

1. సేవించు, కొలుచు.

ఆ. తత్సమీపమునకు ధర్మనందనపుర,స్సరత నరిగి తొలుత సకల
మునులఁ, బ్రణతిఁ దెలచి కదిసి బలసి యుపాసించి, రన్నదీతనూజు
నధిక భక్తి. శాంతి. 2-136; శాంతి. 4-274; శాంతి, 1-2

2. ఆచరించు.

వ. ఎవ్వరు ధర్మంబుసెడ నసూయ సేయుదు రెవ్వరు దాని నుపా
సింతు రెఱిగింపు వారివారి పొందుగతులును వినవలతుం జెప్పు
మనిన. అను. 5-428

3. పూజించు,

కుంతీదేవి గొడుకులుం దాను నవ్విప్రు ప్రీతి నుపాసించు.
ఆది. 7-2

4. ధ్యానించు.

క. అని పలికి దశరథాగ్రసూనుండు దానును దమ్ముండును నుప
వసించి దర్భశయనుఁడై జలధీంద్రు నుపాసించుచున్నంత సము
ద్రుండు. అను. 7-48

**ఉపాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

తదుపఁబడినది.

సీ. ...భగుం డధిదేవత యగుతారఁ, జెలుకుఁ దేనియ నుపాసితమైన
భక్తము. అను. 2-378

**ఉపాసితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

సేవింపఁబడినవాఁడు.

వ. ...మహాధ్వర ప్రముఖ ధర్మకార్య ధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగు పాండవేయులు. ఆశ్ర. 1-2

**ఉపాస్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఉపాసన.

వ. మఱువాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు కాలోచిత కృత్యములుఁ నిర్వర్తించి సూర్యోపాస్తిసేసి యన్న సమారాధనం బాచరించి. - ఉద్యో 3-130; అశ్వ. 3-110; అర. 7-367

2. సేవ, పూజనము.

వ. ఇట్లు ద్రుపదుండు ద్రోణుచేత విముక్తుండయ్యుఁ గోపపాశబద్ధుండయి యప్పరిభవంబునకుం బ్రతికారంబు సేయ సమకట్టి బ్రాహ్మణోపాస్తి సేయుచుండె. ఆది. 6-91

**ఉపాస్యమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కొలువఁబడుచున్నవాఁడు, సేవింపఁబడుచున్నవాఁడు.

వ ఇట్లుపాస్యమానుండయి చండకౌశికుండు బృహద్రథునకు మెచ్చి. సభా. 1-189

**ఉపాస్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపాసింపఁదగినవాఁడు.

తే. భక్తవత్సల పరమాత్మ పద్మనేత్ర, సర్వభూత మహేశ ఋక్సామయజురుపాస్య సాధు సంరక్షణపర విహార. ఆను. 1-340; ఆశ్ర. 2-175

**ఉపేంద్రుఁడు** సం. వి. అ. పుం

1 విష్ణువు.

1) ఇంద్ర ముపగతః అనుజత్వా దుపేంద్రః- ఇంద్రునికి తమ్ముఁడు గనుక ఉపేంద్రుఁడు, 2) ఇంద్ర రక్షణాయ దత్సమీపే స్థితో వా- ఉపేంద్రః- ఇంద్రుని రక్షించుటకై అతనియొద్ద నున్నవాఁడు గనుక ఉపేంద్రుఁడు, 3 ఇంద్రలోకా దుపరి తిష్ఠతీతివా ఉపేంద్రః- ఇంద్రలోకమున కంటె పై లోకమునందుండువాఁడు గనుక ఉపేంద్రుఁడు.

సీ. ...క్రాంతి యుపేంద్రుని యందును నర్థంబునందు లోభమును.
శాంతి. 5-602

2. కృష్ణుఁడు.

ఉ. ...ఉపేంద్రుని నాశ్రితవత్సలున్ వినిర్ధూతకలంకు.
ఉద్యో. 2-330

ఉపేక్ష సం. వి. ఆ. స్త్రీ.

1. అశ్రద్ధ.

సీ. దేవి యుపేక్షయచూవె యీాయమకు ని,ప్పాటు వచ్చుట యని
ప్రందువారు.
విరా. 2-147

2. నిరసనము.

ఉ. ఇవ్వ దుపేక్షసేసి కృపయేమియు లేక విహీనవృత్తి నా రొప్పమి
బొందఁ జూచు టిది యొప్పునె యింతట సంతసింపరాదు.
ఉద్యో. 1-371

3. ఉదాసీనత్వము, తగులులేకుండుట.

క. నరనాథ నీ వుపేక్షాపరుఁడవయినఁ గౌరవులక పాండవులక శాం,దర
యంగ భూప్రజ కెల్లను, దురితం బొనరించినట్లు తుదిఁ గీడు సుమీ.
ఉద్యో. 3-266

క. విని కాలవేది యగు నవ్వనజాక్షుఁడు నియతినగు నవస్థకుఁ దలఁ
పం, బన దన్యథాత్వకరణం, బని యూహించుచు నుపేక్ష యాత్మ
నొలయఁగన్.
మౌస. 1-11

4. ఆసక్తిలేమి.

సీ. నియత ధర్మము నీవు నిశ్శంక నడపుము, ప్రియము నప్రియము
నుపేక్షఁగూర్చు.
శాంతి. 2-210

ఉపేక్షకుఁడు సం. విణ. (అ. -క్షికా- అ.)

1. అశ్రద్ధ చేయువాఁడు.

చ. అతని జయించునంచు మన మర్జును నెంతయు నమ్మియుండఁగా,
నితఁడును సంగరంబున నుపేక్షకుఁడయ్యె వృకోదరుం డొకం;
డ తతికిఁ బొచ్చి దోర్బలము దాఁపకపోరెడు నేమిసేయు నాఁకిత

నని వీతనిం దడవ నేటికిఁ గయ్యము జోలి మానెదన్.

భీష్మ. 2-7; సభా. 2-145

2. ఉదాసీనుఁడు.

సీ. ఆ సభఁ బాంచాలి గాసిపేయఁగ నుపేక్షకుఁ డయి చూచె.

ద్రోణ. 5-379, ఉద్యో. 3-40

**ఉపేక్షించు** సం. స. క్రి.

1. అశ్రద్ధచేయు, ఒప్పరికించు.

వ. అన్నదమ్ములు దమతోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జిక్కఁబడదా యని యజ్ఞులైన జను లాడుదురు.

ఆది. 2-220

2. మాను. విరమించు.

సీ. సమర ముపేక్షించి శాంతిపై నుండెద, నడచి పాళెటికి.

భీష్మ. 3-395

3. విడుచు, త్యజించు.

క. వాయునుతుఁ బనిచి నేఁడటు, సేయింపక తక్కితేనిఁ జెప్పెద విను మేఁ, బ్రాయోపదేశమున నీ, కాయ ముపేక్షింతుఁజుమ్ము కౌరవనాథా.

సౌప్తి. 2-38; శల్య. 2-156

4. నిర్లక్ష్యముచేయు,

క. దారుకుఁ డిట్లనియె మహా వీరు నుపేక్షింపఁదగునె వీనిని మాయా, ప్రారంభు నుపేక్షింప ర,పార పరాక్రములు పోరఁ బ్రాకృతు నయినన్.

అర. 1-196

**ఉపేక్షితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపేక్షింపఁబడినది.

తే. అహితవృద్ధి యుపేక్షితంబగుడు నల్పమగు మహావ్యాధియును బోలె నదియసాధ్యమయి యుపేక్షకు నిర్మూలితాత్ముఁ జేయుఁ గాన పాండవశ్రీ యుపేక్ష్యంబు గాదు.

సభా. 2-145

**ఉపేక్షితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉపేక్షింపఁబడినవాఁడు.

వ. విశ్వామిత్ర పౌత్రుండైన పరావసువను రాజు దుర్వినీతుండై గర్వోద్రేకంబునం బరశురాము నధిక్షేపించి రాజులకు వెఱచి డాఁగియున్న వాఁడవని పశిష్ట జనసన్నిధికిం బలికి బాలవృద్ధ భావంబున నుపేక్షితులై యతనిచేత మున్ను చావకయున్న ప్రతర్దనాదుల నుగ్గడించి. శాంతి. 2-84

(ఉపేక్షితులు = వదలిపెట్టఁబడినవారు)

**ఉపేక్ష్యము** సం. విణ. (అ. ఆ. అ)

ఉపేక్షింపఁదగినది.

తే. పాండవశ్రీ యుపేక్ష్యంబు గాదు. సభా. 2-145

**ఉపేతము** సం. విణ. (అ. ఆ. అ.)

కూడుకొన్నది.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు. విరా. 1-7

**ఉపేతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

కూడుకొన్నవాఁడు.

వ. నీవును ధర్మంబు విడువక యధర్మోపేతులైన నీ కొడుకుల వలని పక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము.

ఉద్యో. 2-88; శాంతి. 6-466

**ఉపేయము** సం. విణ. (అ. ఆ. అ)

ఉపాయముచే సాధ్యమైనది, పొందఁదగినది.

వ విరోచను మహానుభావంబునంజేసి యోగ సాంఖ్య రూపోపాయ ప్రకారంబు దోఁచెఁ బదంపడి తదుపేయం బగు వేదవేద్యంబును నద్దేవుని కరుణా విశేషంబునం బ్రతిభాసించె. శాంతి. 6-140

**ఉపోద్బలకము** సం. విణ. (అ. త్రికా. అ.)

బలపఱచునది, ధ్రువపఱచునది.

వ. కురుపతి యశ్వత్థామ కభిషేకంబు సేయించిన నా కృపాచార్యుండును, గృతవర్మయు గురుపుత్త్రు నుత్సాహంబునకు పోద్బలకం బగు నుద్యోగంబునం బొదలిరి. సౌప్తి. 1-4

**ఉపోద్బలము** సం. వి. అ. న.

తోడ్పాటు; ఊఁత.

వ. నేఁడు శిఖండి చందంబు వింతయయి యున్నయది. నదీనందనుండు సమయుటకు సమయం బైన దైవదత్తోత్సాహంబున నేచి పలికెం గావలయునని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె. భీష్మ. 3-325

క. అతి తీవ్రమైన నిదగు ప్రతిన కుపోద్బలముగాఁగఁ బరఁగిన ధీరోద్ధత పాంచజన్యరవమున, ధృతి దూలకయున్నె కురువీరక నింద్రసుతా. ద్రోణ. 2-283

**ఉప్పతిల్లు** అ. క్రి. (సం. ఉత్పత్. ప్రా. ఉప్పత)

కలుగు, పుట్టు, సంభవించు.

చ. గుణమున నస్త్రకంబునను గోటియుగంబునఁ గేలఁ దారభీషణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగిన మాడ్కిఁ దీవ్రమార్గణ నికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్పె. విరా. 5-80

**ఉప్పరము** వి.

ఆకాశము.

వ. ఆదిత్యాస్త్రంబు కల్పాంతజ్వలనంబునుం బోలె నాభీల జ్వాలామాలా కరాళంబై యుప్పరంబెల్లను దవమయంబుగా నిగిడె. సౌప్తి. 2-64

**ఉప్పరవీథి** వి. (ఉప్పరము + వీథి)

ఆకాశమార్గము.

ఉ. ...రథం, బుప్పరవీథిఁ దోలికొని...

విరా. 3-176; విరా. 5-98; భీష్మ. 2-90

**ఉప్పలవాయి** దే. వి.

బొటనవ్రేలికిని చూపుడు వ్రేలికిని నడుమ నుండుచోటు.

తే. వలకేలి యుప్పలవాయి పైతృకంబుఁ దీర్థంబు తర్పణ కార్యమునకు. అను. 4-118

శ్లో. అంగుష్ఠస్య చ యన్మధ్యం ప్రదేశిన్యా చ భారత,
తేన పిత్రాణి కుర్వీత స్పృష్ట్వాపో న్యాయతః.

ం.భా అను. 1-61-110 (నిర్ణయ)

**ఉప్పళించు** దే. స. క్రి.

ఉప్పరించు, పై కెత్తు (మల్లయుద్ధక్రియా విశేషము)

తే. ...సీసానఁ బట్టియు నుప్పళించు, విరా. 2-15

**ఉప్పు** దే. వి.

లవణము. షడ్రసములలో నొకటి.

తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర,నేము సిడిముడి పడుచుండ
నిట్టు లనుట, యొప్పు దురిసిన పండుల నుప్పు వెట్టె,దరయ దీనికి
నిన్నునేమందు శార్థ. ద్రో. 5-353

**ఉప్పొంగు** దే. అ. క్రి.

1. మిక్కిలి సంతోషించు.

క. మన్నన కుబ్జక యవమతి, దన్పొందిన స్రుక్కఁబడక ధరణీశు
కడన్, మున్నున్న యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము
లొదవు నాపద లడఁగన్. విరా. 1-183

2. అతిశయించు.

మ. బొమలల్కన్ ముడివడ్డ రౌద్రరస మః పొంగం దనర్పన్ భుజా,
గ్రము లిం దెవ్వఁడు నాకు మాఱనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల.
ఉద్యో. 2-188

3. మిక్కిలి పొంగు, మీదికి ఉబుకు.

సీ కాఁగిన యెసరుల కరణిఁ బొరింబొరి శరనిధు లుప్పొంగి పొరలఁ
బడియె. ఉద్యో. 4-116

**ఉబ్బు** దే. అ. క్రి.

1. అతిశయించు, విజృంభించు.

ఉ. అప్పుడు రెండు సైన్యములు నాహవకేళికి నుత్సహించి పెల్లొ
ప్పెఁ జెలంగి యుబ్బిన సముద్ధతి. భీష్మ. 1-146

మ. అరులం గీటడఁగించి పాండుసుత సైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం.
శల్య. 1-302

తే. ...వీరతతికి, సంభ్రమము పుట్ట సంభృతోత్సాహలీల, నుబ్బి భూత

భేతాళంబు లోలనాద, నిట్టలంబగు నెత్తురు చేలు వఱతె
ద్రోణ. 1—146

2. ఉప్పొంగు, పెరుగు.

క. అడవి దరికొనిన పావకు, వడ వున భీముండు గౌరవవ్యూహంబుం, గొడిసేయుచుఁ బేర్చెం దన, యొదలు మనము నంతకంత కుబ్బుచు నుండన్. భీష్మ. 2-220; విరా. 8-192

3. గర్వించు.

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు.
ఉద్యో. 2-48

క. మన్నన కుబ్బక యవమతి, దన్నొందిన ప్రుక్కఁబడక ధగ జీకుకడన్, మున్నున్న యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. విరా. 1-183

చ. గజిబిజి లేక యుబ్బక యఖండిత శౌర్యము శస్త్రవీర్యమున్, భుజబలముం బొగడ్తవడ. భీష్మ. 2-33

4. ఉత్సాహపడు, వేడుకపడు.

చ. ...కుల విశిష్టుని స్వవ్రతు వృద్ధు నార్యు భీష్ముని నెపకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీవని యుబ్బఁజేసి యీ,నునఁ దలపెట్టి చంపి కొనఁజూచె సుయోధనుఁ డింతనేమగున్. ఉద్యో. 4-207

కవిరాజవిరాజితము :- ...మునిమైన మహాత్ముని గని యుబ్బుచు సాత్యకి యేమని త్రుంచె శిరంబు. స్త్రీ. 2-181; ద్రోణ. 1-146

5. సంతోషించు, మురియు.

వ. ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరం బడసితినని యుబ్బుచు వెడలి భీష్ముం దలపడఁగంటినని పొంగు శిఖండి దోడుగా రాజశాసనంబు నిర్వర్తించె... ఉద్యో. 4-210

ఆ కౌరవులు ప్రకంప గాఢ విస్మయులైరి, పాండుసుతులు వారి బలము నబ్బియార్చి సంకు లొత్తి రాజులంబుల నమ్మ హాత్ముఁ దృప్తుఁ జేసె నర్జునుండు. భీష్మ. 8-480

6. విజృంభించు, చెలరేఁగు.

మ. అరులం గీటడగించి పాండుసుత సైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం
గురుభూనాయక సేన నొచ్చి కలయం గూలెన్ ధరన్ గుంపులై.
శల్య. 1-302

చ. ...మనంబు విక్రమోత్సవమున నుబ్బఁగాఁ బళువుఁ బంపెడు
వాడ్పునఁ బంపువేడుకన్. స్త్రీ. 1-162

7. పొంగిపోవు.

క. ఇందఱఁ జంపితి నని యుబ్బం దీఱద ద్రుపద తనయపట్టుల నభిమ
న్యుం దెగటార్చితి మఱఁదుల, నందఱ ద్రుంగితి పిభూతియన
నీకెద్దీ. స్త్రీ. 1-128

వి.

1. ఆధిక్యము.

వ. ఆపాండవ కౌరవసైన్యంబులలో నెయ్యది యుబ్బు గలిగియుండె
నని యడిగిన సంజయు డతని కిట్లనియె. భీష్మ. 1-187

2. ఉత్సాహము.

చ. ...నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లు నాననములు దోపఁ
దర్పవచనంబుల సేనకు నుబ్బొనర్చుచున్. శల్య. 1-78

క. నిన్నుఁ దలపడఁ జూచిన యీతని యేడ్తెఱ మంటసొరఁగఁ దలఁచు
మిడుతయుబ్బున కెనయై నాకుం, దోఁచినయది మ్రందింపు మితని
శితవిశిఖములన్. కర్ణ. 2-348

3. విజృంభణము.

ఉ. పాండు నృపాల నందనులు పావనిముఖ్యగ నేచి యడ్డు భీష్ముండు
గడంకమై నడచు చోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచి యొండొండ
కడంగి సేన తమ యుబ్బున కుబ్బఁగ నన్యసైన్య వేదండ ముఖాంగ
ముల్ దృణ వితానముగాఁ గొని నిర్వికారులై. భీష్మ. 1-284

వ. అయ్యతిరథవర్యుండు శౌర్యగరిమం గనిన బెబ్బులి యుబ్బు దోఁప
నలిరేఁగి యందఱ నుఱుమాడిన. ద్రోణ. 2-78

4. గర్వము, పొగరు,

సీ. ...కృపుని, హయముల శరచతుష్టయతాడనమున నుబ్బడఁగించి. భీష్మ. 1-272

సీ. ...తన్నవ్వు దొడరు రాధా తనూజు,నుబ్బువాలమ్ముల డెబ్బది మూఁట వా,రించి. కర్ణ. 2-168

5. సంతోషము.

సీ. మనమున నుబ్బమై మాట నాలుకకు రాఁగడఁగిన నాడక కడపి కడపి, విరా. 3-55

తే. ఏను గలుగంగ నీ కేమియెఱిమి వాహనముల కుబ్బగ సంబోధ నంబు సేయు. విరా. 5-114

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమాన ము ని.ర్వ్యాపార త్వమునను నివి,కాపురుషగు ణంబులం[ు కౌరవనాథా. ఉద్యో. 2-82

శ్లో. క్రోధో హర్షశ్చ దర్పశ్చ హ్రీ స్తంభో మాన్యమానితా, యమర్థాన్నాపకర్షంతి స వై పండిత ఉచ్యతే. సం. భా-ఉద్యో. 32-22 (వావిళ్ళ)

**ఉభయకవి మిత్రుఁడు** సం. వి.

తిక్కన సోమయాజి బిరుదము-ఆశ్వాసాంతగద్య.

(సంస్కృతాంధ్ర భాషలు రెండింటియందును కవిత్వము చెప్పుటలో ప్రచండుఁడు-సంస్కృతాంధ్ర భాషలు రెండింటియందు కవిత్వము చెప్పు వారికి మిత్రుఁడైనవాఁడు)

**ఉభయభ్రష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఇహ పరలోకములు రెంటికిఁ జెడినవాఁడు.

వ. అజ్ఞానులగు నర్థహీనులు సన్న్యాసకాల వివేకంబులేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు. శాంతి 1-72

**ఉభయము** సం. సర్వ. (అ. ఈ. అ.)

1. రెండు.

సీ. ఉభయ పార్శ్వంబుల నిభఘటలేలోకో చనుదేవు సమదాళి సమితి మొరయ. విరా. 1-86

2. ఇహపరములు.

వ. ...అశుభ నిరాసనంబును, శుభాధానంబును నొనర్చుచుఁ బ్రజలం బాలించు భూపతి యుభయలోకసిద్ధులం బొందు. శాం. 2-265

**ఉమ** సం. వి. ఆ. స్త్రీ.

పార్వతి.

(1. ఉ ఇత్యనేన సంబోధ్య మా ఇత్యనేన తపసో మాత్రా నిషిద్ధత్వా దుమా ఉ-ఓబిడ్డా. మా-వలదు. అని యిట్లు తల్లిచేఁ దపస్సువలన నిషేధింపఁబడెను గనుక ఉమ 2 అవతీ త్యుమా రక్షించునట్టిది. అవ రక్షణే)

తే. ఉమయు నగ్నియు గంగయు నుండ నన్ను, గారవంబున నధికునిగాఁ దలంచి, చక్కనా పాలి కేతెంచు నొక్కొ వీఁడు, సంభృతస్నేహభక్తి ప్రసంభుఁడగుచు. కల్య. 2-179; అను. 4-865

**ఉమాపతి** సం. వి. ఇ. పుం.

శివుఁడు.

వ. శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుం డుమాపతియను పేళ్ళఁ బరఁగు. శాంతి. 8-140

**ఉమియు** దే. అ. క్రి.

1. నిష్ఠీవనముచేయు, ఉమ్మివేయు.

వ. వాని సంవర్తుగా నెఱింగి యజ్ఞపతి యతని పజ్జన చనం జనం నతండు మరలిచూచి పై ధూళిసల్లియు నుమిసియు వేదుఱు చందఁబు శావింప. అశ్వ. 1-47; అను. 4-116; అర. 4-31

2. క్రక్కు.

సీ. ఉగ్రవిషానలం బుమియుచున్న మహీంద్రుఁ గడగి నేఁ డెవ్వాఁడు గాలఁదన్నె. అర. 6-315

**ఉముక; ఉముకలు** దే. వి. ఊఁక.

తుషము, ధాన్యత్వక్కు, వడ్లపై పొట్టు.

ఆ. ఉముక దినుచు నిట్టులుండి నీ తొల్లింటి, లీలఁ దలఁచి యుమ్మలింతొ
లేదొ, యున్నరూపు సెప్పవన్న గార్దభరూప ధారణైక నిపుణ
దానవేంద్ర. శాంతి. 4-391

ఉ. గాడిదరూపు దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్ల
సం,బాడెదు శుక్ర. శాంతి. 4-396

**ఉమ్మడి** దే. అవ్య.

ఒకే కాలము, యుగపదర్థకము, 'ఒక్క' శబ్దపూర్వకముగానే దీనికి తిక్కనగారి ప్రయోగము. నన్నయ ప్రయోగము కానరాదు.

ఒక్క యుమ్మడి. ద్రోణ 2-92; ద్రోణ. 1-132

చూ. ఒక్కుమ్మడి, ఒక్కయుమ్మడి.

**ఉమ్మలము** దే. వి.

సంతాపము, దుఃఖము.

ఆ. ఇంత తలర నేల యెమ్మెయి నైనను, గొమ్మ నలవరించి కూర్చు
టరుదె, యుమ్మలంబుదక్కి యూఱటతోడ నీ, వేగు మసలవలవ
దింక నిచట. విరా. 2-80

క. కనకమయ యూపమొప్పఁగ, నమూన విధమున నీవు యాగం
బొనరించిన యొప్పును నిప్పటి నీ, యునికియునుం జూచి నాకు
నుమ్మలమయ్యెన్. శాంతి 4-390

**ఉమ్మలించు** దే. అ. క్రి. (ఉమ్మలము + ఇంచు)

1. తపించు, దుఃఖించు, శోకించు

ఉ. అక్కట యేమి వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁదేరఁగా, నొక్క
నికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో,నెక్కఁగఁ జేసి
నిన్ను నతిహీన విధాననియుక్తఁ జేతఁగా, నిక్కము యుమ్మలించి
తిది నెయ్యము కల్మి యె సఖి. విరా. 2-98

తే. చనిన నయ్యేలనాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱుంగని
తెఱఁగు దాల్చి, శోత్యమున నుమ్మలించి పాంచాలితోడ, నెలుఁగు
వేతొక భంగిగా నిట్టు లనియె. విరా. 3-155

2. విచారపడు, దీనత్వము నొందు.

వ. భీమ్మల గాంచి రట్లు సముచిత ప్రకారంబునం గని యతనిం బరివే

ష్టి చి యాసీను లై రప్పు డచ్యుతుం డమ్మహాత్ము న్నాలోకించి
యుమ్మలించుచు నతనితోడ. శాంతి. 2–99

"శ్లో. కించిద్దీనమనా భీష్మమితి హోవాచ కేశవః"
సం. భా. శాంతి. 50-12

3. విచారించు, ఆలోచించు. తలంచు.

వ. విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యా గ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు సాలవనియు మ్మలించి యమ్మహానీయ తంత్రంబు సంక్షేప రూపంబున బదివేలధ్యాయంబుల వైశాలాక్షంబున నిర్మించె.
శాంతి. 2-203

**ఉమ్మలిక; ఉమ్మలికము** దే. వి.

1. ఇమ్మహియెల్లను నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర.
ఉద్యో. 1-107

చ. ...ఉ,మ్మలికయు నుబ్బు నాదుమది మందునకైనను లేదు కేశవా.
శాంతి 4-895

క. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం,బునకుం గైకొనుట మేలు భూసురు నిం గై,కొని యరసి కాఁడనిన నా,తని యుమ్మలికంబు సెఱచు ధార్మికునైనన్.
అను. 3-182

2. కష్టము, ఇడుము, బాధ.

సీ. నలుని పిఱుందఁ గానల కేఁగి దమయంతి మనుజులు వడని యుమ్మలిక వడదె.
విరా. 2-234

వ. ఇవ్విధంబునఁ గృష్ణునితోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లి గొన.
ఉద్యో. 3-181

**ఉమ్మలికించు** దే. అ. క్రి. ఉమ్మలించు (ఉమ్మలిక + ఇంచు)

చ. ...భీష్ముఁ డెఱింగి వారికి,ట్లను సురలార కాలగతి నాత్మఁదలంచి యకాదె మేనిలో,నునిచిన నాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁ డించుకేనియున్.
భీష్మ. 3-15

సీ. క్షత్త్ర ధర్మంబునఁ గైకొంటి మేదిని. యుమ్మలికింపక లెమ్ము వత్స
అశ్వ. 1-6

**ఉయ్యాల** దే. వి.

ఉయ్యేల.

సీ. ఓహారిసాహారి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ జెనఁగు
నెడలు. విరా. 8-164.

**ఉయ్యాలచేరు** దే. వి.

ఉయ్యేలకుఁ గట్టిన త్రాఁడు, ఉయ్యేలత్రాఁడు.

సీ. ఓహారిసాహారి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ జెనఁగు
నెడలు. విరా 8-164.

**ఉయ్యేల** దే. వి.

ఉయ్యాల.

చ. నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియైన యుయ్యేల
యును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై.
అర. 2-78.

చ. ...సమీరణుఁడన్ సఖుఁ దూఁచు చుండగా, నులియుచు మొల్ల
గుత్తులను నుయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగె ఝుల్లల దళినీ
కులంబు. అర. 4-188.

**ఉరగకేతనుఁడు** సం. వి. అ. పుం.

సర్పము ధ్వజ చిహ్నముగాఁ గలవాఁడు, దుర్యోధనుఁడు.

వ. వీరలలో నురగకేతనుండు లేఁడు. విరా. 4-250.

**ఉరగనివాసము** సం. వి. అ. పుం.

పాతాళలోకము.

వ. ఉరగనివాసంబు ననుకరించు తలంబులును. విరా. 8-238.

**ఉరగము** సం. వి. అ. పుం.

1. ఱొమ్ముతోఁ బ్రాకునది, సర్పము,

మ. మహోరగంబులం బెట్టియలం బెట్టి కట్టుచందంబున బంధించి
విరా. 1-178.

2. దుర్యోధనుని ధ్వజచిహ్నము.

సీ. ...ఉద్దీప్యమాన మహోరగంబు కేతనంబుల నొప్పు ..రారాజు
సకు. ద్రోణ. 3-288

3 ఒక పర్వతము.

సీ. ప్రాక్పయోనిధి ప్రాంతఁ బర్వతం బొక్కటి, ఘనశృంగ కలితా
కాళ మగుచు, నురగ నామంబున నొప్పు. అను 1-220

**ఉరగుఁడు** సం. వి. అ. పుం.

నాగజాతివాఁడు.

క. సురలును నసురులు యక్షులు, నురగులు గంధర్వులును.

**ఉరము** సం. వి. స్. న.

ఱొమ్ము, వక్షము.

సీ. ప్రథమాద్రిఁ దోఁచెంచు భానుబింబమునా న,రమ్మునఁ గౌస్తుభ
రత్న మొప్ప. విరా. 1-12; శాంతి 5-589

**ఉరలంబాఱు** దే. అ. క్రి.

విడిపోవు, చెదరు.

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళ శ్రేణి కంధరముల్
మ్రొగ్గఁబడన్ దిశావలయముత్కంపంబుగా నీకులం,బురలంబాఱఁగ
భీష్ముపైఁ గవిసె భీష్మ. 3-262

**ఉరలించు** దే. స. క్రి.

ఉరలఁజేయు, ప్రవహింపఁజేయు.

వ. తలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు, నెత్తురు లురలించుచు
దండలుసెక్కుచు. ద్రోణ. 2-18; ద్రోణ. 1-308, శల్య. 1-211

**ఉరలు; ఉరులు** దే. అ. క్రి.

(ఉరలు, ఉరులు పదములు విచక్షణలేకుండ ముద్రింపఁబడి యున్నవి.
కొన్ని ప్రతులలో 'ఉరలు' చోట్ల 'ఉరులు' - 'ఉరులు' చోట్ల
'ఉరలు' గలదు. కావున కలిసియే యర్థమీయఁబడినది. నన్నయ

భారతమున 'ఉరలు' లేదు. తిక్కన భారతముననే యీ యస్త
వ్యస్త సముద్రణము)

1. స్రవించు, కాఱు.

వ. కరిహయతతిఁ బెల్లుగా నస్రు లురులఁ జొచ్చెను. భీష్మ. 1-9

వ. దమయంతి వానినెఱింగి తన పుత్రులఁ దల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యస్రుజలంబు లురుల నేడ్చుచున్నఁ జూచి. అర. 2-145; సభా. 2-289

2 దొర్లు, జాఱిపడు.

ఆ. పొదివి పలు పురేయఁ బొడువ వ్రేయఁగ భగదత్తుదంతి రక్తధార
లొప్పెఁ, జెలువు రెట్టిగాఁగ జేవులు సెలయేఱులున్న శాచల
మున నురలునట్లు. భీష్మ. 3-146

క. డెందము గలంగఁ గన్నీరందంద మొగంబుమీఁద నగ్గల మురు
లన్. మౌస. 196

3. పడు, రాలు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురలు చూపులడర నిశితాస్త్ర
ములం, గప్పె గురుని. ద్రోణ. 1-156

వ మత్స్యయంత్రం బర్జునుం డస్త్రమంబున నురులనేసి
ఆది. 8-15; ఆది. 7-182

4. కూలు, విఱిగిపడు.

వ. బావాలుకుండు విని వీని నెన్ని కాని నిశ్చయింపనేరనని తనరథంబు
నిలిపి యా వృక్షుఁ బాతుఁబంబ యురులం ద్రోచి యద్వైశాఖలంగల
యాకులుం బండులు నెన్నిన బుతుపర్ణుండు సెప్పినయన్నియయిన.
ఆది. 2-174

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షం బురులంద్రోచి.
అర. 3-316

క. గిరిగుహాంతర మురలన్. అర. 3-317

(గిరిగుహాముఖములకున్ - అని ఆనందవారి ప్రతి)

**ఉరవడి** దే. వి. (ఉరవు + వడి) ఉరవణి

1. మిక్కిలి వేగము.

సీ. ఉరవడి నేనలు దెరలఁ జైఁ దోఁతెంచు ధూళివెల్లిఁ దరిసఁ దూలపోక. విరా. 4-62

క. మోఁసి చనుదెంచు దుర్యోధన సేనా సముదయంబుఁ దఱియ సురవడిఁ, జననిమ్ము మనరథము నా, సునిశిత బాణముల సమయ జూచెద దీనిన్. శల్య. 1-348

2. శౌర్యము, పరాక్రమము.

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని యుభయబలము న,చ్చెరు వందుచుఁ జూచి వృకో,దరుఁడవగుట యెఱుఁగకున్నె తద్విధమేలా? విరా. 3-206

క. కురుబలముఁ దొడరి గెలువఁగ, సురగణములకైన నరిది శూరోత్తమ నీ, వురవడి గెలిచితి భాగ్య,స్ఫురణంబును బాహుబలముఁ బొగడం దగదే. ద్రోణ. 5-7; భీష్మ. 2-313

3. విజృంభణము.

వ. భయంకరంబగు నతిసంకులంబున సామజవాజిరథంబుల యురవడికి నోసరింపని కాలుబలంబులు. భీష్మ. 1-267

క, కురుపతి ధృష్టద్యుమ్నుని, యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్, శరపంచకమున నొంచెను. శల్య. 1-218

**ఉరవడించు** దే. అ. క్రి. (ఉరవణించు)

1. విజృంభించు, రేగు.

సీ. కసిమసంగిన మారి గడఁగి జీవులమీఁద నుగ్రతఁ గవియున ట్లురవడించి. ఉద్యో 2-139

2. పరాక్రమించు.

వ. సాత్యకియు ధృష్టద్యుమ్నుండును గేకయ పంచకంబును విరాటుండు నతని కొడుకులుం దలకడచి యురవడించిన. భీష్మ. 1-280

3. వేగముగాఁ బరువెత్తు.

సీ. ... అచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల నలుఁగు లుండ,గీ.

నురవడింపవు వీరల సరకు గొనక, వీని నిప్పుడ యట్టులు విడిచి
తడవు, మనుడు. ద్రోణ 3-151

4, లంఘించు. దూఁకు.

వ. కురుకుమారు లమ్మారులిం జుట్టుముట్టి విశిఖంబులు నిగిడించినం
గోపించి దుర్మదుఁడు తేరి కురవడించి తురంగంబులం బోరివుచ్చి
సారథిం జదిపిన. ద్రోణ. 5-68

**ఉరవణి** దే. వి.

ఉరవడి.

వ. అమ్మోహారం బా సూతనందను మొన యురవడి సరకుగొనక
మార్కొనియె. కర్ణ. 2-149

**ఉరవణించు** దే. అ. క్రి.

1. పరాక్రమించు.

వ. సౌబలుండు వేఁటొక్క విల్లెత్తి యత్తెఱఁపి నురవణించి పాండవ
రథికులం గలంచె. కర్ణ. 1-151

చ. ... సంగరంబున, న్విదిత విక్రీతిమై నురవణించుటయున్ నృప
ధర్మముల్. శాంతి. 2-224

శ్లో. నిత్యోద్యుక్తో దస్యువధే రణే కుర్యాత్పరాక్రమమ్.
సం. భా. శాంతి. 60-10

2 కవియు, దుముకు.

వ ప్రాణంబులు మీకింత సేఁడయ్యెనే యని పలికినను నిలువక పైపయి
వారు రవణించిన. ఆశ్వ. 4-48

**ఉరవు** దే. వి. ఉఱవు

ఉచితము, అర్హము, తగినది.

క. అనఘా ! మర్త్యుల జీవన, మనిత్యమని యెఱిఁగి సుఖము నప్పుడు
దుఃఖంబున యపుడు ధర్మ మేమఱకునికియ యొజ్జాతికైన
నుర వూహింపన్. శాంతి. 5-489; శాంతి. 4-43; శాంతి. 2-381

**ఉరస్థ్సలము** సం. వి. అ. న.

వక్షః పీఠక.

వ. గంధమాదనంబున నేను దపంబుసేయుచుండ నక్కాలంబునఁ గాలాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన నిటలాక్షశూలంబు వెడలెనేని నాయురస్థలంబునొందిన మదీయ కేశంబులు ముంజనిభంబులగుటం జేసి ముంజకేశుండను పేరు గలిగె. శాంతి. 6-441

**ఉరస్సు** సం. వి. స్. న.

ఱొమ్ము

క. తమలోన మాటలాడెను, సమయంబున నొక్కరుఁడు విశాలో రస్కుం, డమితబలుఁడు. విరా. 2-5

**ఉరి** దే. వి.

1 వాగుర, ఉచ్చు, పక్షులను మృగములను పట్టుకొను రజ్జువిశేషము.

తే. ద్రౌపదీ రూపమను నురిఁ దగిలి తనదు, హృదయమను మృగ మత్తఱి నుదిలకొనుచుఁ, గాముఁడను బల్లిదపు వేఁటకానిబారిఁ, బడుట కెంతయు నాసింహబలుఁడు దలరి. విరా. 2-24

క. వల యురి యోవము గాలము, గలిగికదా మృగముఁ బక్షి, గజము ఝషము దక్షులు వట్టుదు రట్టుల తజ్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. శాంతి. 4- 81

ఆ. యోగబలము లేని యొక భంగి యోగి బల్, ద్రోఁపులేని మీను నేపులేని, మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱుకంగ, లేవి యట్లు భవము లోన నడఁగ. శాంతి, 5-57౦; శాంతి. 8-208

2. కంఠపాశము, చనిపోవుటకై గొంతునకు వేసికొనెడి ఉచ్చు.

గీ. వానిఁ దెగఁజూడవై తేని వాయుపుత్ర, నీవు గనుగొన నురినైన నీరనైన, నగ్నినైన విషంబుననైన నేను, మేనుదొఱఁగుదు. విరా. 2-229

**ఉరిపోయు** దే. అ. క్రి.

ఉచ్చు తగిలించు.

సీ. ఉభయ పార్శ్వంబుల నురిపోసినట్లవి వ్రేలిచచ్చిన. శాంతి. 4-40

**ఉరియాట** దే. వి. (√ఉరియాడు) ఉరియాడుట

సందేహము, శంక.

తే .. ఇట్లు...మీరు సెప్పంగ నురియాట మేలె శాంతి. 1-275

శ్లో. న తే ఖిలం తే వచనమ్ యద్బ్రవీషి తపోధన,
అపరోక్షోహి తే ధర్మః సర్వధర్మవిదాంవర.

సం. భా. శాంతి. 32-10

ఉరియాడు దే. అ. క్రి.

1. కలవరపడు, కలంగంజెందు

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలంబుడిసి కొని. విరా. 1-161

వ. ఇట్లభినందించియున్న యన్నరేంద్రుం డమ్మద్రపతి మనం బురియాడునోయని శంకించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు. కర్ణ. 1-257

2 పరితపించు.

వ. పాండవులం బరిమార్చుపని నేఁడచేయక మఱిచేసిన రారాజు నిర్గత ప్రాణుండైన వాకెలసం బెవ్వరి కెక్కెడుఁ జక్కటితోడి బవరంబున నబ్బలుమగల గెలువరాదని యిట్లురియాడు నాచిత్తంబు చింతా పరంపర వాయ నీసత్త్వ విచేష్టితంబు లోచనగోచరంబయ్యె

సౌప్తి. 1-24

3. తొట్రుపడు, చలించు.

ఆ. అన్నరేంద్రుపాణి యల్లిన తనకరాబ్జమునఁ గీలుకొల్పి బహుళ బాష్పకలిత వదనుఁ డగుచు గళమున నెలుఁ గురియాడ, వగచి యమ్మద్రాంతకుండు శల్య. 2-361

4 డోలాయమానమగు, సందేహించు, వెనుకముందాడు.

క సతి దనపతి వచనంబులు, మతిఁజొనుపుం దెంపుమాను మాన వెఱచు నయ్యతిథిసనుపఁ నేయగత్రోచు తలం పలవఱుచుఁ జేయఁ జూచుం దలరున్

తే. ఇట్టు లురియాడు చిత్తంబు నెట్టకేని, నాథుచెప్పిన ధర్మంబునకుఁ జొరగ,నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న, లజ్జ వేగునఁ బోలె వ్రాలంగ మోము.

అను. 1-71,72; విరా. 2-102; ఉద్యో. 3-108

**ఉరియు** దే. అ. క్రి.

1. ఎరియు, కాలు, దగ్ధమగు, పరితపించు.

ఆ. ఇరియ, తల్లులార కరము తప్పయి తోఁచుట, నుల్ల మలఁత పేర్మి నురియుచుండు. మౌ స. 201

క. సుకుమారుఁ డతఁడు గోపాలక వృత్తిపహించి యడవులం గ్రుమ్మరుచున్నికి నాక కాదు పగవారికినైనను నాట మన మురియదే పగలన్. విరా. 2—210

క. తనలేనిచోటఁ బలువురు, నినుఁ జుట్టుముట్టి యొక్కనింజేరి వధించిన వంచనకు ధనంజయు, మన మెమ్మెయి నురియునొక్కొ మన్మథమూర్తీ. స్త్రీ. 2-78

2. రేఁగు, ఒరపిడి నొందు.

చూ. ఉరిసినపుండుల నుప్పుపెట్టు. ద్రోణ. 5-358

3. ఉడుకు, పచనమగు.

వ. పాకంబునకు రాకయుండ వెండియుఁ దన నవరించిన కాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁ గాని యా రేఁగుఁబం డ్లురియవయ్యె. శల్య. 2-197

శ్లో. తస్యాః పచంత్యాస్సుమహాన్ కాలో౽గాత్పురుషర్షభ
నచన్మతాన్యపచ్యంత దినం చ క్షయమభ్యగాత్.
సం. భా శల్య. 49-21 (వాషిత్ల)

**ఉరిసినపుండుల నుప్పుపెట్టు** దే. జాతీయము

రేఁగి ఒరపిడినొందిన పుండుమీఁద ఉప్పుపెట్టు.

(సహజముగా పుండు రేఁగి యొరపిడిపొంది మంటయు పోట్లు కలిగించు చుండు దానిపైని కోఁతగోసి మఱింత మంటలు పోట్లు పుట్టించు ఉప్పు గూరిన నెట్లుండునో అట్లు - ఏదో మనస్సున మిక్కిలి బాధపడుచుండ నెదుటివాఁ డేవేవో పొడువు మాటలాడి మన స్సును మఱింత బాధపెట్టునప్పుడీ జాతీయము నుపయోగింతురు )

తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర, నేము నిడిముడిపడుచుండ నిట్టులనుట, యొప్పు దురిసిన పుండుల నుప్పుపెట్టె, దరయ దీనికి

నిన్ను నేమందుఁ బార్థ. ద్రోణ. 5-358

శ్లో. వపన్ వ్రణే క్షారమివ క్షతానాం శత్రుకర్మవ
విదీర్యతే మే హృదయం త్వయా వాక్శల్యపీడితమ్
సం. భా. ద్రోణ. 198-15

**ఉరు** దే. అ. క్రి. ఉఱు

1. మేలగు, శ్రేష్ఠమగు, అధికమగు.

క. ఈ లోకమ యురుఁ గొందఱు, కాలోకమ కొందఱకు నిహంబును బరమున్, మేలగుఁ గొందఱ కధిపా, యే లోకము లేదు వినవె యిలఁ గొందఱకున్. అర. 4-174

(ఉరున్ - మేలనితోఁచును అని భావము)

2. తగు.

క. అన్నలుఁ దమ్ములు గలుగుట, యున్నతుఁజేయు నృపునెంత యొఱపిళ్లయినన్, మన్ననయు నీగియును సం,పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటురున్. శాంతి. 2-366

క. రసకర్మజ్ఞు డుదారము, పసిండి సేతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధత్వ సమగ్రము సేయు క్రియ, న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుటు రున్. శాంతి. 5-417

**ఉరులఁద్రోచు; ఉరులంద్రోచు** దే. స. క్రి.

విఱిగిపడునట్లు పడవైచు.

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురులం ద్రోచి యే కాయన పథంబున కడ్డంబు శయనించి. అర. 3-316

**ఉరులంబడు; ఉరులఁబడు** దే. అ. క్రి.

ఉచ్చులోఁ జిక్కుకొను, వలలో దగుల్కొను.

తే. దాయ లొడ్డిన మాయజూదంపుటురులఁ, బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె. విరా. 2-325

**ఉరులంబఱతెంచు; ఉరులఁబఱతెంచు** దే. అ. క్రి.

పైకి దుముకు, డీకొను.

వ. ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతి నిబిడ బలాహ కానీక భీకరంబై కాఁచుకొనుచున్న నిశాచర చక్రంబుతో నురులం బఱతెంచినం జలించి బలీముఖ బలంబులు దుర్బలంబులై తొలం గిన. అర. 7-85

శ్లో. అభిదుద్రావ ధూమ్రాక్షో వేగేన మహతా కపీన్
తస్య మేఘోపమం సైన్యమాపత ద్భీమదర్శనమ్
దృష్ట్వైవ సహసా దీర్ణా రణే వానరపుంగవాః

సం. భా. అర. 285, 5, 6

**ఉరులనేయు** దే. స. క్రి.

ఛేదించు, పడఁగొట్టు.

వ. మత్స్యయంత్రం బర్జునుం డక్రమంబున నురులనేసి. ఆది. 8-15

**ఉరులు** దే. అ. క్రి.

చూ. ఉరలు.

**ఉరువు**[1] దే. స. క్రి.

మాను, విడుచు, త్యజించు.

ఆ. క్షరము నక్షరంబుఁ గానంగఁ బోలు వే, దార్థ చింతనమున నమ్మి ధురము, నందుఁ బూర్వ మురివి యపరంబు చేపట్టి, నిలుక వలయు నధిక నిష్ఠఁ గలిగి. శాంతి. 6-144

గీ. ఊర్చి బొందువు వచ్చి ప్రేవురివి నంజు, డంతయును బుచ్చి పొడు కగా నమరఁగట్టి. శాంతి. 3-499

చ అన విని నంశయం బురివి యమ్మునితో వరణీకనూజుఁ డిట్లను.
శాంతి. 6-321; అర. 8-162

**ఉరువు**[2] సం. విణ. (ఉ. ఉ. ర్వీ. ఉ.)

1 మిక్కిలియైనది, అధికము.

మ ...అత్యురుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీ సరోజాననన్.
విరా. 5-368

**ఉర్వర** సం. వి. ఆ. స్త్రీ.

భూమి.

క. దారిద్ర్యముచే గుందుచు, నేరిని నడుగంగ బోవ కెంతయుఁ గృశ
తం, గూరిన విప్రున కుర్వర, వారని దయ సీగి ఫలము వాగ్గో
చరమే అను. 2-358; అశ్వ 4-5

**ఉర్వశీకృత్తికాయోగసిద్ధకీర్తి**

కృత్తికా నక్షత్రముగల దినమున లేదా కృత్తికా నక్షత్రముతోఁజేరిన పూర్ణిమ (కార్తిక పూర్ణిమ) యందు ఉర్వశి యను తీర్థమున స్నానము చేసి ఏ ఫలితము వచ్చునో ఆ ఫలితముపచ్చునని పేర్వడిసినది లౌహిత్య మను పుణ్యజలాశయమున కిది విశేషణము. చూ. 1) ఉర్వశి 2వ యర్థము 2) ఊర్వశీ తీర్థము, ఉర్వశి ఊర్వశి యనునవి రెండు నొకటే. ఈ లౌహిత్యమను తీర్థము గంగానది సమీపమునం దుండెనేమో యనిపించు చున్నది.

ఉర్వశి యని గంగకు పేరు.

శ్లో. తథా భాగీరథీ గంగా ఉర్వశీ చాభవత్పురా,
దుహితృత్వం గతా రాజ్ఞః పుత్రత్వ మగమత్తదా.
సం. భా. ద్రోణ. 60-6

కృత్తికా నక్షత్రమున గంగయందు స్నానముచేసిన ఏ ఫలితము గలుగునో అట్టి ఫలితము నిచ్చునదియని యైనను చెప్పుకొనవచ్చును.

సీ. ...ఉర్వశీ కృత్తికా యోగసిద్ధకీర్తి,యైన లౌహిత్యంబునందు
సుస్నాతుఁడై, పుండరీకాధ్వరమున ఫలంబుబొందు.

శ్లో. ఉర్వశీం కృత్తికా యోగే గత్వా చైవ సమాహితం,
లౌహిత్యే విధివత్స్నాత్వా పుండరీక ఫలం లభేత్.
సం. భా. అను. 25-45

**ఉర్వి** సం. వి. ఈ. స్త్రీ.

భూమి, నేల

వ ...తమముపర్వి నర్విం దోర్దోన్. విరా. 2-321

ఒకప్పుడు భూమి అరాజకత్వము వలనఁ గలిగిన దోషములచేఁ బుట్టిన దురితాధిక్యము పీడింపఁగాఁ బాతాళ లోకమునకుఁ బోయెను. అప్పుడు కాశ్యపుఁడు తన యూరువును గ్రుచ్చి దానితో భూమినిఁ బైకెత్తెను. అధికారణంబుగా భూమి యుర్వియని ప్రసిద్ధికెక్కెను. శాంతి. 2-89,90

ఉరుత్వాదుర్వీ-ఘనమైనది గాన ఉర్వి; ఊర్ణూయతే పర్వతైరిత్యుర్వి ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే పర్వతములచేఁ గప్పబడునదిగాన ఉర్వి– అమ.

**ఉర్వీమృత్తిక** సం. వి. ఆ. స్త్రీ.

నేలమట్టి.

తే. శుభమగు నుర్వీమృత్తిఁ సురుచిరంపుఁ, బ్రతిమ గావించుకొని యందుఁ బరము నావహించి పూజావిశేషంబు లెల్లఁజేసి, నీవు దొలుమేనఁ గొలిచితి నిష్ఠతోడ. ద్రోణ. 5-416

**ఉర్వీజము** సం. వి. అ. పుం.

వృక్షము.

సమీపోర్వీజముల్ ప్రాఁకియుం. విరా. 3-27

**ఉర్వీతలము** సం. వి. అ. పుం. న.

భూప్రదేశము.

వ. సర్వాంగ సంగతోర్వీతలంబగు దండప్రణామం బాచరించిన. విరా. 4-149

**ఉర్వీధరము** సం. వి. అ. పుం.

భూమిని ధరించునది, పర్వతము, కొండ.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ, జలుల కాంతికి మును మెఱుఁగు వెట్టి. ఉద్యో. 2-118

**ఉర్వీభృత్తు** సం. వి. త్. పుం.

1. కొండ.

శా. ...మహానిర్ఘాతపాతాపధూతోర్వీభృ ద్ఘన గండశైలములతో నూహింపఁ దుల్యాంబులై. అర. 5-276

2. రాజు.

**ఉర్వీరసము** సం. వి. అ. పుం.

జలము, నీరు

వ. (సూర్యుఁడు) ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయన గతిం బర్జన్యభూతుండై యోషధులం బడసి, అర. 1-89

**ఉర్వీరుహము** సం. వి. అ. పుం.

భూమియందు మొలచునది, చెట్టు.

క. ఉర్వీరుహ నివహములతోఁ బర్వతములు వెఱికి. ఆది. 4-7

**ఉఱఁడు** ఉఱు ధాతువునకు వ్యతిరేకార్థక మహదర్థక ఏకవచన రూపము.

చూ. ఉఱు².

**ఉఱక** ఉఱు ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము.

1. చూ. ఉఱు².

అవ్య.

2. అవలీలగ, సునాయాసముగ.

చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొక యమ్మున నొవ్వనేసి నీ వెఱఁగి యొఱింగి నన్ దొడరి తెక్కడఁ బోవఁగ వచ్చునంచు. ద్రోణ. 2-90

తే. పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి, కొఱఁతగా నూఱుశరముల నుఱక నొంచె. శల్య. 2-31

3. నిర్భయముగా.

సీ. ...రారాజు ద్రోణతనయుండుఁ జుట్టిన తలచుట్లు నల్లని, యవి సూతపుత్రు శిరోంబరంబు, పచ్చనియది కుంభసంభవ కృపాచార్య యుష్ణీషములు వెల్లలుఱక నీవు, దెమ్మి తవట్టును. విరా. 5-210

4. పలుకక, మాటాడక.

క. వెఱచఱవ నింతకంటెం, దఱుచుగ బాణంబులేసి తడయక పఱఱం జెఱుతునని యసుము చల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. సభా. 2-305

5. వ్యర్థముగా, ప్రయోజనము లేకుండ, నిష్కారణముగా.

ఆ. నీవు చూచుచుండ నీ యిష్టుఁ డిమ్మణిమంతుఁ డిపుడు వనమ మదముపేర్మి, నన్ను నుఱక యమిసె నా మీఁద నిట్టి యుద్ధనుజుఁ డిల్లు నొక్క మనుజు చేత. అశ. 4-31

**ఉఱదె** ఉఱు ధాతువునకు వ్యతిరేక అహామదర్థ కైకవచన రూపము
తగదే - చూ. ఉఱు[1].

**ఉఱవు** విణ.

1. ఉచితము, యుక్తము.
ఆ. అంత తోడ నెల్ల యాపదలును దీఱు,వంశ మధిక గౌరవంబు
నొందుఁ, గూడి మనుట గలుగుఁ గురు పాండవులకు ని,త్తెఱఁగు
నూడ మీకు నఱవకాదె. ఉద్యో. 8.380

2. తగవు, హితము
తే. శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ, నఱవుసెప్పదు రథికునే
నుఱఁగ నీను, గృష్ణసారథ్య ఘనుఁడగు గ్రీడి గెలువఁ, దలఁచు
నీకేను గడపుట దగు రథంబు. కర్ణ. 1-314

8. అధికము
క. పొడువఁగ వ్రేయఁగ నతఁడుం, గడునఱవగు నేర్పుకడిమి కలి
మిం దనపై, బడకుండఁ గృపాణమ్మునఁ, గడు జిత్రపుగతుల
నడిసెఁ గైదువు లెల్లన్ భీష్మ. 8-96
క. ఉఱవగు నారుగపంటలు, గొఱియల పాడియును దఱచగుం బురు
షులకుం, దెఱవల చుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి
నెల్ల జనంబుల్. అర 4-295
చ. ...ని,న్నుఱవుగ నేను వేఁడకొన యుక్తుఁడఁగాక మొఱంగి
నన్ను న,క్కఱపడి నీవు వేఁడుటిది గర్జమె నిర్జితదైత్య చెప్పుమా
అర. 7-866

**ఉఱికిపోవు** దే. అ. క్రి.
దుముకు, క్రిందికి దూఁకు.
ఆ. అసురశర్మ తేరియందున్న ఘనగదా, దండమెత్తికొని యుదగ్ర
వృత్తి, నరతదేవుఁడయ్యుఁ దరుణ వయస్కున, ట్లవని కఱికి
పోయి యతని వ్రేసె. విరా. 8-217

**ఉఱిది** దే. విణ.
సాటి, సమానము.

సీ చంద్రదత్త వ్యాఘ్రదత్తులు, వినుము సేనాబిందుఁ డను నృపాలుఁ
డు రథోత్తముఁడు మారుతపుత్రు నెన యతం, డొక్కరుండును
వారి యఱిలావు. ఉద్యో 4-268

**ఉఱు**[1] దే. అ. క్రి.

1. తగు, ఒప్పు, ఉచితమగు.

చ ...నీ,యఱు కడకేగి తోడుపడు మొల్లకు నెవ్వరినేని.
ఉద్యో. 4-179

క. కులమునకు నఖిల లోకం,బులకు నపాయంబుసేయు పురుషాధము
ని,మ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె
కువలయనాథా. ఆది. 5-111

క. నరవర నరసాన్నంబులుఁ, బరిమళ సద స్తువులును బరమశయన
వి,స్తరములుఁ గ లాధీనత, నరుఁ డొందుం బాయు వాని నమ్మ
మియ యుఱున్. శాంతి 1-214

క. శివలింగ స్థాపనముఁ ద్రి,భువనములం బరమహితము పొంచెం
గరుణన్, భవశాంతిచేసితిం ద,త్త్వవిమల లింగమున నన్ను భావించు
టుఱున్. అను. 5-272

ఉ. .. ఒక నక్కనిచ్చి సింహమ్ముల విల్చికో లుఱదె.
సభా. 2-151; అను. 1-18; అను. 1-24; అను. 5-864

2. ఇష్టమగు.

క. తెలుపిగొని నీవు పొచ్చినఁ, బిఱుద నె చొచ్చెదము రిపులు పెల్లగిలఁ
నం,గఱమును మాకిది యెంతయు, న ఱుఁట్టివరంబు దీని నొసఁ
గుము పుత్రా. ద్రోణ. 2-7

3. సరిపోలు, పోల్చు.

క. ఒకళులు నూచిన యది వా,రికిఁ బెట్టకనములుటయును బ్రీతిం దనవం,
శికిఁ దెచ్చిన చుట్టలు వే ఱొత భంగింగుడువఁ గుడువు మఱు విష
భుక్తిన్. అను. 4-111

**ఉఱు**[2] (దీనికి వ్యతిరేకమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి)

స. క్రి.

1. లక్ష్యపెట్టు, సరకుగొను, పరిగణించు.

క. పిఱుదం గురుధరణీపతి, సఱవేతం బ్రాణములు ఘనారాతిబలం, బుఱని తెగువ ముందటఁ బెన్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. స్త్రీ 2-87

అ. క్రి.

ఉఱఁడు సురేంద్రుడైన బలియుండు ఆది. 6-194; ఆది. 7-271

2. మాను, విరమించు, ఆఁగు.

తే. అతఁడు దివ్యశాస్త్రజాలంబు నశియఁబు, సూప చతురంగ బలముల రూపుమాపి, యుఱక తఱిమి శిఖండికిఁ దెఱపిసూప, వాఁడి తూపులు భీష్ము పై వాఁడు నిఱిచె భీష్మ. 3-331

చ. ఉఱక విరోధి సైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిఁ బఱప. విరా. 5-61

వ. పర్జన్య ప్రసాదంబున వహోవృష్టి గొడుకులంపయిం గురిపించి యయ్యురగుల విగతపరితాపులంజేసి కద్రువగర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులు గొనుచున్నంత. ఆది. 2-47

3. జంకు, వెనుదియు.

చ. తఱిమి సుశర్మఁగిట్టి యతిదారుణభంగి రణంబు సేయువాఁడుఱక నిశాత సాయకము లొక్కమొగిం బది మేనియందు గ్రిక్కిఱియఁగఁ జేసి. విరా. 3-215

క. కురుబలము పొలియుటకు మది,యెరియంగా నున్న నాకు నితఁడీ రాజున్, శిరము ఱక తన్ని యిమ్మెయిఁ, బరిభవమొందింప వగవు పాటిలకున్నే. శల్య. 2-308

**ఉఱుకడ** దే. వి.

తగిన స్థానము.

చ. నీ, యుఱుకడకేగి తోడుపడు మొల్లకు నెవ్వరికేని ఉద్యో. 4-179

ఉలుకు దే. అ. క్రి.

1. దుముకు.

క. ఎఱిఁగి పిలుసనిన వెసఁ బై, కలుకుదు సాళువము గాకినొడిసిన
భంగిన్. విరా. 2-282

క. మఱియు నొకవిల్లు గొనున, త్తెలపిన విరథుఁడగఁ జేయ ధృతిఁగర
వాలం,బుఁ గొని విభుఁడు నేలకు,నుఱికి యతనిమీఁదఁదపడరె
నుగ్రాకృతియై. భీష్మ. 3-27

సీ. ధనము లుత్కృష్టంబులను ధనంజయ మాటపాటిగాఁ గొనుము
సోపానభంగి, నున్నది మార్గంబు యోగసమారోహణమునకు
దానన నడచి కాక, వడి నుర్కిపడ నీకు వచ్చునే ధనసంగ్రహంబు
భోగార్థకృతంబు దుష్టమగుటయుఁగలదు యజ్ఞార్థకృతంబైన
నదియ నిచ్చెన బ్రహ్మపదమునంద. శాంతి. 1-144.

సీ. నొగనొగతోఁ దాఁకి పగులంగ నరదంబుఁ, బఱపియాతేరిపై కులుకు
వారు. విరా. 3-169; విరా. 4-218

2. పరుగెత్తు.

తే. ద్యూతమున గెల్పునెపమున నఱికి పుణ్య,కాంతఁ దలవట్టికొని
సభాభ్యంతరమున, కీడ్చి వలువలొలుచుటయు నెఱిఁగి సుతులఁ,
జంపెనని భీముఁ జంపఁ దలంపనగునె. స్త్రీ. 1-146

3. తప్పించుకొనిపోవు, బయటపడు.

ఆ. యోగబలము లేని యొక భంగి యోగి బల్, ద్రోపులేని మీమ
నేపులేని, మృగము వలయు నురియుఁ దెగిపోవ నులుకంగ, లేని
యట్లు భవములోన నడఁగు. శాంతి. 5-578

4. పైపడు.

క. అరయుదమగాని యిమ్మోహారమునకును డాపవించి యరదముఁ
బోని. మ్మరవడి నతనిక యుఱికెద, నరుమగ నెబ్బంగి నెవ్వ
రడ్డంబైనన్. విరా. 4-246

శ్లో. తస్యమూర్ధ్ని పతిష్యామి శ్యేనవతే పరాజితా।

సం. భా. విరా. 58-18

**ఉఱుము** అ. క్రి.

గర్జించు.

క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁగ నలుగడలఁ బడ నవారిత వృష్టుల్. ఆది. 8-270

క. మెఱుమ ధనుర్దండము, గుణ ముఱుముఁగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁ దఱచై, పఱవ రుధిరంపుఁ గాలువ, లతిముతి ఘనభుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా. ద్రోణ. 1—294

వ. మహాంబుదంబు చందంబునఁ బదలం దోఁచి మెఱుముచు నుఱుముచు. ద్రోణ. 5-225

చ. ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతింబడ ఘోరమూర్తియై. ద్రోణ. 1-89

వి.

1. మేఘధ్వని, గర్జనము.

క. మొగిలులు లేకయు నుఱుములు, గగనక్షోభంబు సేసె. భీష్మ. 1-9

2. వీరహుంకారము.

క. ఒకమఱి కిరీటి కట్టెదిరికి నుఱుమునఁ బోయిరేని రెండవ మాఱు య్యకొనుట కోర్వఁగ లేరై, రోకట్లఁ గురు రాజుసేన యోధులు లోనన్. విరా. 5-55

**ఉలి** దే. విశే. (ఇది వృత్తియందే కనఁబడుచున్నది)

అల్పము, చిన్నది. చూ. ఉలిగాలువ.

**ఉలికిపడు** దే. అ. క్రి. (√ఉలుకు)

(అకస్మికముగాఁ గలిగిన భయాదులచే) కంపించు, అదరిపడు, త్రుళ్లిపడు.

వ. ఏను సహస్రపాదుండను ముని ముఖ్యుండ నా సహాధ్యాయుండు ఖగముఖుం డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయ సర్పం బమ్మునిపై వైచిన నతం డులికిపడి నా కలిగి నీవు నిర్వీర్యంబైన యురగంబవగుమని శాపం బిచ్చిన. (అదరిపడి అని వావిళ్లవారి పాఠము.) ఆది. 1-158

**ఉలిగాలువ** దే. వి.

సన్నకాలువ, చిన్నకాలువ.

క. గురుఁడను జలనిధి గడచితి, నొరులును దలవంగ నాకు నులిగాలువ లీ, నరపతుల సరకుగొనక నీ,వరదము సననిమ్ము నేఁటి యని కలయక మీ. ద్రోణ. 4-68

**ఉలియు** దే. అ. క్రి.

మ్రోయు, ధ్వనించు, అఱచు (పశు పక్ష్యాదులు) కూయు, ధ్వని సేయు.

చ. పిడుగుల పిండు బిట్టులియు పెల్లునఁ శార్ఙ్గుఁడు శంఖ మొత్తినన్. విరా 4-171

సీ. తమతమ నియమిత స్థానంబులం బోలి నుండిరి బోరన నులిసె భే,రులు. ఆది. 6-7

చ. అలుగుల మంది యందుల మృగావలియున్ విహగంబులున్ భయా,కులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులునైన యట్టులై, యులియక యున్నచో నడఁగియుండఁ. అర. 1-301

**ఉలివు** దే. వి.

1. శబ్దము, మ్రోఁత, కలకలము.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోల దివియలు, గొనుచు నులివుమిగులఁ గూడఁ బాఱి, నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నా కల,కల మెఱింగి కీచక వ్రజంబు. విరా. 3-4

వ. కృతవర్మ సాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాది చతుష్టయం బొక్క రథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిర ద్వారంబు సేర నరుగు నప్పటి యులివునకుఁ గొలువు వారెల్ల సత్వరోత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. ఉద్యో. 3-247

వ. అట్టి యవసరంబున బోరన మ్రోయు జనుల యులివును వాదిత్ర నాదంబును వారించి. ఆది. 7-168; ద్రోణ. 5-178

2. ఉత్సాహము.

క. మొగమునఁ గయ్యపువేడుక, చిగురొత్త మదాత్తమూర్తిఁ జెలు వొందు గురుం, దగు రాజులు గొంవులును, బొగడి యులివు మిగుల,

ప్రమదపూర్ణ హృదయులై. ద్రోణ. 1-55

3. చలనము.

ఉ. ఆ నినదంబు సాంద్రముగ నాకసమంతయు నిండఁ బర్వుడున్, మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూల విద్విష, త్సేన నితాంత నిశ్చలతఁ జిత్రసమర్పిత మూర్తియో యనం,గా నులివేది యుండియును గ్రమ్మఱఁ దేఱిరవంబు మానఁగాన్. ద్రోణ. 1-239

(ఉలివు + ఏదు = చలనము వదలు)

శ్లో. తేన ఘోషేణ సంత్రస్తా సంశప్తక వరూథినీ,
నిశ్చేష్టావస్థితా సంఖ్యే హ్యాశ్మసారమయీ యథా.
సం. భా. ద్రోణ. 18-9

**ఉలివేదు** దే. అ. క్రి.

చలనము లేకుండు.

చూ. ఉలివు. ద్రోణ. 1-239

**ఉలుకు; ఉల్కు** దే. అ. క్రి.

1. భయపడు, బెదరు.

తే. ...కరంబున నుదర మప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల ములుకువారునై పురజనంబులు దలంకి. విరా. 3-86

చ. ధర్మనం,దను గరువంపుఁ బల్కుల విధంబునకున్ మదిలోన నుల్కుచున్. ఉద్యో. 1-290

క. అలయుచుఁ బులుగుల యెలుఁగుల, కులుకుచు నుగ్రాతపమున కోపక వృతుం,బుల నీడల నిలుచుచు నెలుఁ,గులఁ బులులం జూచి భయము గొని వగచుచున్. ఆర. 2-84

2. ఉడుకు, అనూయపడు.

క. జనులకు నొడఁబాటగు విధ,మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ,దని యొకని కలిమి కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మనుటొప్పు నృపా. ఉద్యో. 3-31

వి.

క్షయము.

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనము తోడ ధాత్రీ రమణుఁ, డలఘుభుజ విపుల వక్షస్స్థల రేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందెన్. విరా. 1-218

తే. ఉలివు విని యుల్లమునఁ గడు నులుకుపుట్టి. అను. 4-818

**ఉలుము** దే. వి.

కుష్ఠరోగము.

ఆ. ఉలుము గొన్నవాఁడు దొలు మేన నాఘాత, బంధనముల నొరులఁ బ్రవన్నఁదవము, సెలచినాఁడు. అను. 5-100

**ఉలూకము** సం. వి. అ. పుం.

1. గుడ్లగూబ.

తే. అచటి బయలెల్లఁదానయై యక్కజంపుఁ, జందమును ఘోరమైన నిస్వనముఁ బండ, గతియు భూతవితాన భీకరముగా నులూక మొకటి వచ్చె భూలోకనాథ. సౌప్తి. 1-16; శాంతి. 3-210

2. ఒక దేశము.

యుధిష్ఠిరుఁడు రాజసూయము చేయుటకు అర్జునుఁ డుత్తర దిగ్విజయంబు సేయనేగి జయించిన దేశము. దీనికా కాలమున రాజు బృహంతుఁడు.

వ. మఱియు నులూక దేశాధిపతియగు బృహంతునిఁ బరాజితుం జేసి. సభా. 1-385

**ఉలూకుఁడు** సం. వి. అ. పుం.

1. శకుని కొడుకు.

ఇతనిఁ జంపుట నకుల సహదేవుల వంతుగ ధర్మరాజు నిశ్చయించెను. ఉద్యో. 2-230

ఈతఁడు కృష్ణుని మీఁదఁ బార్థునిమీఁద బాణములు ప్రయోగించెను. ద్రోణ. 5-188

ఈతఁడు పర్వత ప్రతిముఁడు. ఈతనితో యుయుత్సుఁడు పోరాడెను. కర్ణ. 1-141 మొ. 147 వఱకు

ఈతఁడు నకుల సహదేవుల నెదిరించి పోరాడెను. సహదేవుఁడు ఈతని తండ్రియగు శకుని సమక్షములోనే యితని శిరస్సు ఖండించెను.

శల్య. 1-886

2. ఇతనిని దుర్యోధనుఁడు పాండవులం గని వాసుదేవ సన్నిధిని పాంచాల విరాట ప్రముఖులు వినఁబలుకుమని పరుసని మాటలు గఱపి పుచ్చిన నతండును వెళ్ళి యటులనే యక్షరము బీఱువోకుండ మాటలాడెను. ఇతఁడు శకుని పుత్రుఁడా మఱొకఁడా నిర్ణయించుటకు సాధ్యము గాకున్నను అర్జునుఁ డితనిని "కితవసుతా" (ఉద్యో. 4-206) అని సంబోధించుట చేతను సం. భా. ఉద్యో. 159-6 లో "ఉలూక గచ్ఛ కైతవ్య" యని యుండుట చేతను, ఇతఁడు కితవపుత్రుఁడని తేలుచున్నది. 'కితవుఁడు' అను పేరుగల వ్యక్తి భారతమున గానరాఁడు. కితవుఁడు అన వంచకుఁడు, మోసగాఁడు జూదరి యను నర్థములు గలవు. ఈ లక్షణములన్నియు శకునియందుఁ గలవు గాన ఇతనిని 'కితవసుతా' యని అర్జునుఁడు వ్యాఖ్యానించి యుండవచ్చును. దానింబట్టి ఈ రాయబారిగాఁ బోయినవాఁడు శకుని కొడుకే. శకుని కొడుకు గాకున్న నింత ధైర్యముగాఁ గృష్ణ పాండవ సమక్షంబున మాటలాడువాఁ డొకడుండఁడు.

ఉద్యో. 4-187 మొ. 210 వ.

**ఉలూచి** సం. వి. ఈ. (స్త్రీ).

ఉలూపి - అర్జునుని భార్య - నాగకన్యక ఇరావంతుని తల్లి. ఈ యులూచి కథ మహాభారతమునందు ఆదిపర్వమునం దొక చోటను అశ్వమేధ పర్వమునం దొకచోటను గన్పించుచున్నది. రెండు చోటుల, జెప్పఁబడిన వారొక్కరే యయినను ఆంధ్ర భారతమున ఆదిపర్వ కథయందు ఉలూచి యనియు అశ్వమేధ పర్వత కథయందు ఉలూపి యనియుఁగలదు... ఆదిపర్వ కథయందు ఉలూపి శబ్దము లేదు. అశ్వమేధ పర్వ కథయందు ఉలూచి శబ్దము లేదు. సంస్కృత భారతమునందు రెండుతావుల ఉలూపి శబ్దమే యున్నది.

ఈమె యైరావత కులసంభవుండైన కౌరవ్యుని కూఁతురు. తీర్థ యాత్ర లకై వచ్చిన అర్జునుని నాగలోకమునకుఁ దీసికొనిపోయి వివాహము

చేసికొనెను. సద్యోగర్భమున ఇరావంతుఁడను కుమారుఁడు జన్మించెను. చూ. చరిత్ర. ఆది. 8-124 మొ. 184 వఱకు.

బభ్రువాహనుని ప్రేరేపించి అర్జునునితో యుద్ధము చేయించెను. కుమారునిచే హతుఁడైన నర్జునుని సంజీవని మణిచే బ్రదికించెను. అశ్వమేధకాలమున హస్తిపురము చేరెను.

చూ. అశ్వ. 4-68 మొ. 95 వఱకు.

పాండవుల మహాప్రస్థాన సమయమున ఈమె జనకుని కడకు భుజంగలోకమునకుఁ బోయెను. మహా. 1-28

**ఉలూపి** సం. వి. ఈ. స్త్రీ.

చూ. ఉలూచి.

**ఉల్క** సం. వి. ఆ. స్త్రీ.

1. ఆకాశము నుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము – (ఇది అగ్న్యుత్పాదములలో నొకటి)

తే. అడరి కురుసేనపై గ్రద్ధ లాడఁబొచ్చెఁ, బడుచున్నవి యుల్క లిక్కడ. భీష్మ. 3-864

2. మంటలేని నిప్పు కణిక. (ఉల్కాస్యాన్నిర్గత జ్వాలా – అమరము)

వ. ఆ సంయమి చతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు ఛేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంత నంతర్హితంబయ్యె. అను. 5-468

**ఉల్కము** ఉల్క

(ఉల్కా శబ్దము 'అ' కారాంతముగాఁ గానరాదు. ఆనందవారి ప్రతిలో 'ఉల్కము' పాఠముగను 'ఉల్కికలు' పాఠాంతరముగను ఈయఁబడినది. మిగిలిన ప్రతులలో 'ఉల్కికలు' పాఠము. ఉల్కము పాఠాంతరము. చూ. ఉల్కిక.

**ఉల్కిక** సం. వి. అ. స్త్రీ.

ఉల్క.

ఆ. రత్నకేతనములు రాజిత శేఖరంబులును రుచిరమండికలును శార్ఙ్గ, బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవుల చేటు దెలుప దుల్లు ముల్కికలును బోలె. విరా. 5-50. చూ. ఉల్క. ఉల్కము.

**ఉల్కాపాతము** సం. వి. అ. పుం.

ఆకాశము నుండి రేఖాకారమగు కాంతిపుంజము పడుట.

వ. ఆ సమయంబున మనదెస నుల్కాపాత శర్కరా వర్షాదులగు నుత్పాతంబులు గలిగె. శల్య. 1-337

**ఉల్కు** దే. అ. క్రి.

చూ. ఉలుకు.

**ఉల్ల** దే. సర్వ.

నాతిదూరము నాతిసమీపము గాని దానిని తెల్పును. ('ఈ' యని యర్థము)

తే. వా సఖుండు విరూపాక్షు నామధేయుఁ, డతని పురము మధుప్రవణ
మదియు మూఁడు, యోజనము లిచ్చటికి దాని కుల్ల తెరువు,
వట్టివే చని యాదైత్యభర్త గనుము. శాంతి. 3-486

శ్లో. గచ్ఛ సౌమ్య పథాఽనేన కృతకృత్యో భవిష్యసి.
సం. భా. శాంతి. 170-14

తే. ఉల్ల కాంచన రథముపై నున్నవాఁడు, ఘనుఁడు క్షేమం
కరుండు త్రిగర్తవిభుఁడు, మఱియు నినుఁ జూచుచున్నాఁడు
మగువ వాఁడె, దీప్తభుజుఁడు కళింగధాత్రీవరుండు. అర. 6-153

శ్లో. అసౌ తు యస్తిష్ఠతి కాంచనాంగే రథే హుతోఽగ్నిశ్చయనే
యథైవ, త్రిగర్తరాజ్ఞః కమలాయతాక్షః క్షేమంకరో నామ సఏష
వీరః సం. భా. అర. 254-7 (వావిళ్ల)

తే. ఉల్ల పద్మాకరము పొంత నుండి నిన్ను, మెచ్చి కనుఁగొనుచున్న
యున్నిలితాక్షుఁ, డుత్పలాక్షి యిక్ష్వాకు వంశోద్భవుండు, సుబల
భూపతి పుత్త్రుండు సుభగుఁ డతఁడు. అర. 6-154

శ్లో. అసౌ తు యః పుష్కరిణీ సమీపే. సం భా. అర. 254-8.

('ఒనర' అను పాఠాంతరము యుక్తముగాఁ గన్పింపదు) (వావిళ్ల)

వ. అయ్యిరగవల్లభు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద.
శాంతి. 6-568

**ఉల్లంఘించు** సం. స. క్రి.

నిరసించు. త్రోసిపుచ్చు, మీఱు, జవదాటు.

వ. నీవిట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రులందఱుం గూడం గాంచి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘించంగల వారు పాండునందనులకు నేమియు నీకుండువారు ... అగుటం జేసి. ఉద్యో. 3-185.

వ. నీకు విజయంబుగోరి హితంబుపదేశించు నీ గోవిందు వాక్యం బుల్లంఘింపక. ద్రోణ. 5-311

వ. ఇంత ప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి మేంయ్యె మాతులాని యాజ్ఞ యుల్లంఘింప. కర్ణ. 2-214

**ఉల్లతెరువు** దే. వి.

ఈదారి. చూ. ఉల్ల.

**ఉల్లము** దే. వి.

1. హృదయము.

వ. అద్దివ్య వచనామృతంబు నా యుల్లంబున వెల్లిగొనినఁ బునఃపునః ప్రణామంబు లాచరించి. విరా. 1-19

2. ఇచ్ఛ. అభిలాష,

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి యుచ్చొత్తినయట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయకున్కిఁ దా, నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డము వచ్చిన సిగ్గుపెంపు నన్నుత్తల మందఁజేయుటకునో తలపోసి యెఱుంగనయ్యెడున్. విరా. 2-4

**ఉల్లల** దే. వి.

ఉడుకుట (పరితపించుట) యందలి ధ్వని కనుకరణము.

సీ. విప్రులు పట్టరా వెఱనొచ్చి యొదిఁగెదు, గవయంబు చాడ్పునఁ గర్ణ భీతి, నుల్లనుడుకుచు నుండుదు. కర్ణ. 3-33

క. ధనము గలవాఁడు మృత్యు వ,దనమున నున్నట్లు భయము దన చిత్తమునం, దనుపఁగ నుల్లల నుడుకును, విను శిఖ చోరాది ముఖ్య విషయాపదకున్. శాంతి. 4-38

**ఉల్లలనుడుకు** దే. అ. క్రి.

మిక్కిలి పరితపించు (పరితాపముచే) తుకతుక మఱిఁగిపోవు

చూ. ఉల్లల.

**ఉల్లలత్** సం. శత్ర.

చలించుచున్న, ఎగురుచున్న (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగములేదు)

క. లలితాచ్ఛ స్ఫటిక శిలాతలములపైఁ బాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరములను తారో్ల్లల దురుహారాలి సముజ్జ్వలం బగుదానిన్.
అర. 3-283; అర. 4-188

**ఉల్లవనము**

ఈ వనము.

వ. అయ్యెరగ వల్లభు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద.
శాంతి. 6-568

శ్లో. అనేన నిశ్చయే నాహం సాధ్వి సంప్రాప్తవానిహ,
ప్రతీక్షన్నాగమం దేవి వత్స్యామ్యస్మిన్ మహావనే.
సం. భా. శాంతి. 357-10

**ఉల్లసత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగములేదు)

ఉల్లసించుచున్న. ప్రకాశించుచున్న.

శా. ...సాంద్రకుసుమ శ్రేణీ వికాసోల్లసద్రక్తాశోక తరువ్రజంబుల
క్రియన్ రంజిల్లి యొప్పెంగడున్. విరా. 5-38; విరా. 5-279

**ఉల్లసనము** సం. వి. అ. న.

1. ప్రకాశము, వెలుఁగు.

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు
మో, మొప్పఁగ నస్త్రశస్త్రముల యుల్లసనంబున శత్రునేత్ర
ముల్, గప్పఁగ. విరా. 3-176

2. వికాసము, స్ఫుటత.

మహాస్రగ్ధర :- వసురుద్రాదిత్య గంధర్వ గరుడ భుజగ వ్రాతముల్
వైభవం బుల్లసనం బొందంగ సిద్ధుల్మనముల ముదము లుప్పతి
వింపంగ సాధ్యుల్, హాసిత స్వాంతంబులం బెల్లలమికొనఁగ
వత్స్యాదరోత్కర్ష ముల్. స్వర్గా. 1-34

3. విహారము, విహరణము.

క. ఆఱచినఁ బఱచిన ప్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణిం
పక యం,దఱ నుఱుము సేసె గుంపుల,కుఱికి యుఱికి ఖడ్గధారు
ణోల్లసనములన్. శాన్తి. 2-7; మౌస. 57

4 సంతోషము.

చ. ... సముదీరితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా, సుమహా
దుపాశ్రయ ప్రమదశోభిత విశ్వజగన్మధువ్రతా. ఉద్యో. 4-426

**ఉల్లసమాట** వి. (√ఉల్లసమాడు)

ఉల్లసమాడుట, పరిహాసము చేయుట.

క. అని తను నుల్లసమాటకుఁ, గినిసి యినతనూజుఁ డేమ క్రీడి నిచట
మా,ర్కొనను పీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ
గవిసెం జెలుచన్. విరా. 5-182

**ఉల్లసమాడు** సం. అ. క్రి.

1. ఎత్తిపొడుచు, పరిహాసించు, మర్మము దూఱనాడు.

సీ. ఈ యొడ్డు భేదింప నే మెవ్వరము నేర, మర్జునుండుచు నీవు నచ్యు
తుండుఁ, బ్రద్యుమ్నుఁడును దక్కఁ బార్థుండు మనల ను,ల్లస
మాడకుండ నీలావు మెఱసి, భేదించి మాకెల్లఁ బ్రియమొనర్పు,
కుమార. ద్రోణ. 2-5

2. అపహసించు, గేలి సేయు.

సీ. తమ్మిరేకుల నుల్లసమ్మాడు తన మృదు,కర యుగ్మమునను శంక
రుని నేత్ర -ఆ- యుగ్మమల్ల మూసి. అను. 4-419; శల్య. 2-215

**ఉల్లసము** దే. వి.

ఎత్తిపొడుపు, పరిహాసము, ఎత్తిపొడుపు మాట. సోల్లుంఠన వాక్యము.

క. పరదోషము సెప్పఁగ నే,ర్తురుగా నాత్మీయమైన దోషంబు మదిం,
బరికింపఁగ నధములు నే,ర్తురె తలఁపక యుంటె పలుకతో నుండ
కుమీ. కర్ణ. 2-112, 113

వ. అని యుల్లసంబాడి మఱియును.

ఉ. గాడిద రూపుదాల్చి యుముకల్ దిన్నుచుండఁగఁ జూచి యుల్లసం,

వాడెదు శక్రకాంతి సమయం బగుటన్ విను మింకఁ గొన్ని నీ,
వాడిన నాదు చిత్తమున నల్క యొకింతయుఁ బుట్టదు.
కల్య. 2-215

**ఉల్లసములాడు** దే. అ. క్రి.

ఉల్లసమాడు.

తే. వాసపై వీరరథికులు బలసి యెలమి, నొండొరుల గరువంబుగ
నుల్లసంబు, లాడుచును జేరి వడతేర నత్యుదార,గతి శిఖండియు
నడచిరి కౌరవేంద్ర. భీష్మ, 1-112

**ఉల్లసితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినది.

అ. ఆర్చి వెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ
దదీయ, భూరికంకటంబు పొలుపఱ నఱకి యు,ల్లసిత మకుట కుండ
లములు డులిచె. కర్ణ. 3-388

2. గర్వించినది.

వ. సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తియై. ద్రోణ. 2-18

3. ఉద్రిక్తమైనది, రేకెత్తినది.

క. రాగ పరిలిప్తమానస,యోగంబున నింద్రియంబు లుల్లసితములై,
భోగులగుట యుడిపిన నవ,రాగత సంసార దుర్విరామము సేయున్
శాంతి. 4-296

మ. మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీ మంత్రంబు నాకిచ్చె నే,నిది యే
చందమొ చూతునంచు నొకనాఁ డిచ్చన్ ఋతుస్నాతయై, సుదతీ
రత్నము పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూచి దళత్పం
కజ భంగి నుల్లసితమై చిత్తంబు రాగిల్లఁగన్. అర. 7-324

4. ప్రసిద్ధము, ప్రఖ్యాతము.

క. వినుతమగు లోకరచన,మున నన్ను విరించుఁడంద్రు బుధనుత
రవియం, దనుపాధిక విద్యాస్థితి, ననికిం గపిలాభిదాన ముల్లసిత
మగున్. శాంతి. 6-488

ఉల్లసితుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినవాఁడు, గర్వించినవాఁడు.

ఉ. తెల్లని జోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్య భూవల్లభు నగ్రనందనుఁడు వైరిమదాపహ విక్రమ ప్రకాశోల్లసితుండు వన్యబలం ముద్ధతిఁగొల్చు మృగేంద్ర రేఖతో, ఖిల్లుచునుండ శంఖుఁడు విభావణ శంఖనివాద మొప్పగన్. విరా. 3-148

4. సంతోషించినవాఁడు.

ఉ. గాండివముక్త బాణమునఁ గర్ణుఁడు గూలుటయుం దలంకి శల్యుం డరదంబు దోలుటయు నొక్క మొగిన్ భవదీయసేన లోం, దొండ కలంగి పాఱుటయు నుల్లసితుండయి చూచి వాయు పుత్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. కర్ణ. 3-374

3. ఉత్సహించినవాఁడు. శల్య. 2-262

ఉల్లసిలు; ఉల్లసిల్లు సం. అ. క్రి.

1. సంతోషించు.

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్న విధంబునన్ వికా, సంబున నుల్లసిల్లి జనచారు విలోచనముల్ నిజోజ్జ్వలాం, గంబున కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవయో, గంబున భూ విభుండు దురగంబులఁ దేరఁగఁ బంచి చూడఁగన్. విరా. 1-256

తే. ...ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు, వడయ నోడఁబడఁ డయ్యింద్ర పదవినైన, నుచితగతి నెండవడసిన నుల్లసిల్లు. ఉద్యో. 1-11

2. ఒప్పు, ప్రకాశించు.

ఆ. తనదు బాలబింబమును వమేయప్రభా, పటలం జటిల గగన భాగ మగుచు, నుల్లసిల్లి జగములెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరి మీఁదఁ బొడిచె నినుఁడు. ఉద్యో. 2-114

తే. ఇట్లయిదును నుల్లసిలుట, ననఘ భూజంబు పంచభూతాత్మకంబు. శాంతి. 4-88

చ. ...మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు సుందరతురగోత్తమంబు దవు దవ్వులఁ గాంచిరి చారులోచనల్. అను. 1-188

3. స్ఫుటమగు, వ్యక్తమగు.

చ. అదియును గాక కోలుపులినైనను గారెనుపోతునైన నున్మదకరినైన నుగ్రమృగనాథునినైనను గిట్టిముట్టి బెట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు నడఁగంగ.
విరా. 1-88

4. విజృంభించు, చెలరేఁగు.

తే. ఆడఁగఁ బొదువుచు నలుక యంతంత కగ్గలించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి, యుల్లసిల్లిన క్రుస్కకొండొరుల రౌద్ర, వృత్తినొంచు చొండొరులను వెక్కసముగ.
విరా. 2-347

5. దిక్కులందున బాణంబులు, పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరు తేరక్కడ డించి ద్రుపదవిభుఁ, డుక్కఱఁ తత్సేన మీఁద నురవడి గవిసెన్.
భీష్మ. 1-292

6. కలుగు, పుట్టు.

చ. మనుజవరేణ్య నావలని మన్ననయట్టిదకాదె శత్రుమర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ, చనుటయ నాకుఁ దేజమును సంపదయున్ గరిమంబుగాక.
విరా. 3-225

సీ. ఉద్భట క్రోధ సముద్రేకములఁ బొడ్కు,లం దుల్లసిల్లెడు నరుణరుచుల.
శల్య. 2-255

7. ఉండు, నిలుచు.

వ మనవారును వెడలి భీష్ముం దగ్రభాగంబున నుల్లసిల్ల నీ కుమారు అమ్మహాత్ముఁ బరివేష్టింప.
భీష్మ. 3-315

8. ప్రవర్తిల్లు.

ఆ. అదిదేవుఁడగు మహాదేవు మీఁద నెవ్వాని మనసు భక్తినై భవమునన, నుల్లసిల్లు వతని నెల్లకార్యముల డగ్గఱవు సూవె గ్రహ వికారకృతులు
అర. 5-257

9. పెంపొందు, వర్ధిల్లు.

వ. అట్టియెడఁ దక్షకు నపత్యంబై తత్సోదరుండగు నైరావతుండు పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుం డగు వాగ

కుమారుండు సర్పముఖ శరాకారంబు గైకొని తనయొద్దనుండ.
కర్ణ. 3-816

తే. ఒక్కఁ డుజ్జ్వల తేజోమయుండు దోఁచి, జరయు మరణంబు లేక యసురల సురల,నోర్వఁజాలిన బలముతో నుల్లసిల్లు,మని వరం బిచ్చె నిచ్చిన నధికశక్తి. అను. 1-851

**ఉల్లాసనము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉల్లసింపఁజేయునది.

వ. మిత్రోల్లాసనంబును త్రిగుణమణిజాంబూనదమయంబును జన ప్రస్తుతి పాత్రంబును హాస్తికజ్యాత్మకంబును నగు నతని కేత నంబు గనకపుంఖ ప్రభా భాసితంబైన భల్లంబునఁ బడనేసిన.
కర్ణ. 3-857

(మిత్రోల్లాసనము = మిత్రులకు సంతోషము గలిగించునది)

క. శ్రీ సంక్రామణ నిపుణ, విలాసకటాక్ష విస్ఫూర్తిలంపట చిత్తో, ల్లాసన రక్షా వేద,వ్యాసవచో విభవలక్ష్య హరిహరనాథా.
శాంతి. 1-1

**ఉల్లాసము** సం. వి. అ. పుం.

1. ప్రకాశము.

క. హ్రీంకార మయమనోజ్ఞా,లంకా రోల్లాస నిత్యలాలిత్యవకున్.
విరా. 1-82

2. ఆహ్లాదము, సంతోషము.

క. కైసేసి ముదన వికారో,ల్లాసంబున మేనువొంగ లఘుగతి నుత్కం, ఠాసవపాన విధాన, వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచున్.
విరా. 2-329

వ. చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించిన వానిఁగాఁ దలంచి యాప దలకుం బాసి సంపదలకు భాజనంబైతినని యూఱడిల్లి యుల్లా సంబున మరలె నిట్లు కర్ణ సాగరంబు గడవనీదిఁ పాండునందనులు పరమానందంబు నొందిరి. కర్ణ. 3-896

3. వికాసము, స్ఫుటత.

వ. అనన విని సంక్రోధహా దోల్లాస వికృతాననుండై మత్స్య మహీనా

ఘుండు. విరా. 5-258

4. ఉత్సాహము.

క. తమ తమ యొద్ది బలంబులు, క్రమ విరళములైన దొరలు గాండి
విపై నుగ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున
దివ్య శరతత్పరుఁడై, విరా. 5-65

5. విజృంభణము.

ఉ. ... వాస విశర ప్రతతిం దొరఁగించి ద్రోణునుల్లాసము మాన్చి
కౌరవ బలంబులు నెత్తురు వెల్లిఁ దేలఁగాఁ, జేసినఁ గర్ణ కర్ణమముఁ
జేకొనవే యనుచున్ భయంబునన్. ద్రోణ. 1-382

వ. అతని వధంబునకై పాంచాల విభుని వేలిమిం బుట్టినవాఁడగుట
నప్పార్షతుండు దత్సమయ జనితోత్సాహ రోష విశేషాయత్త
చిత్తుండగుచు నమ్మహీసురవరు మీఁదం గవిసి యేసిన ననికి నొల్లని
యుల్లంబునం బరుని యల్లాసంబు సహింపలేవి తేజంబునం బురికొని
యతండు వోరం దొడంగిన దివ్యాస్త్రంబులు ప్రతిభాసింపక
యుండె. ద్రోణ 5-321

6. సౌష్ఠవము

శా. వ్యూహాభావము సూచి నన్నసదుగా నూహించెదో భీమ మద్వ్యాహ
చండిమ సారదుర్దమగదాదండంబు దృప్యద్ధ్వనద్దేహోల్లా సము
నెట్టు దీనదశకుం దే నోపునో చూడుమీ, యాహాపుట్టెడు లాఁతి
చూపఱకు హాహాపుట్టు మీ వారికిన్. శల్య. 2-248

7. విస్ఫురణము.

శా. నిద్రాసక్తునిఁ గొంత మేల్కనినవానిన్ సుప్రబుద్ధాత్ముఁడై
యుద్రేకంబున శౌర్యసాగమును బాహూల్లాసముం జూపఁ జం,
చద్రేఖం దిరమైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాఁకి యున్ని
ద్రస్వైర సముద్ధతిన్ బొలయు వానిం దున్మె నే శాకృతిన్.
సౌప్తి. 1-178

8. వైభవము.

వ. భవదీయసభ యొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసంబు

నకు నట్లసహ్యాపడి శాంతి. 3-129

9. చేష్ట, వ్యాపారము, కర్మము.

క. జాతుఁడు మృతుఁడగుట ధ్రువము, ఘూతోల్లాసము లనిత్యములు వినుసద్యః, పాతియగు శరీరంబున, కై తాలఁగునె ధర్మపథము నార్యుం డడునఘా. శాంతి. 5-519

10. ఉద్రేకము.

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయట్లపోలెఁ గురువర దైన్యా, స్పదమగు విషయోల్లాసముఁ గుదియించును యోగ సిద్ధి గురుహృద్బలుఁడున్. శాంతి. 5-582

**ఉల్లాసి** సం. విణ. (న్. నీ. న్.)

ఉల్లాసము గలవాఁడు.

మ. నరసింహుం డసురేంద్రువచ్చు కరణి న్రౌద్రం బుదగ్రంబుగా, నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్మ రుధిర మ్ముల్లాసియై దోయిట, న్వెర వారం గొని త్రావు మెచ్చుఁ జవికి న్మేనున్ మొగంబున్ భయం కరరేఖం బొరయంగ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్.

కర్ణ. 8-214; విరా. 1-7; విరా. 5-868; అను. 1-178

**ఉల్లాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉల్లసింపఁ జేయఁబడినది.

క. శ్రీ సాంగత్య విధాయి వి,కాసోల్లాసిత కటాక్ష కరుణామయ మూర్తీ. శ్రీ. 1-1

**ఉల్లి** దే. వి.

ఉల్లిగడ్డ, ఉల్లిపాయ ఇది 1) నీరుల్లి (పలాండువు) 2) వెల్లుల్లి (లశునము) అని రెండు విధములు.

ఆ. మునగయుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్ము మలిన మైన యుప్పు,కఱియ జీలకఱ్ఱ కరివేము గురుజ యిం,గువ ప్రవర్జ నీయకోటి యగుట. అను. 8-189

**ఉల్లికుట్టు** దే. వి. (√ఉల్లి)

ఎత్తిపొడుపు, పోల్లుంఠనము.

చ. వినుమరిఁ జంపనుం దెలుప వేచుట లెస్స ప్రతాప భాషణం,బున వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి రేఁ,చినఁ దన పూఁపు, దప్పు నలసేయని చందము నమ్మియున్న చా,డ్పును మెఱయంగఁ బల్కుచుఁ గడున్ మది నమ్మక యుండఁగాఁదగున్.
శాంతి. 3-20

**ఉల్లికుట్టు మాటలు** దే. వి. (√ఉల్లి)
ఎత్తిపొడుపు మాటలు, నోల్లుంఠ వచనములు.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్చి, తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించు వారచట నెవ్వరొకో – (ఉల్లకుట్టు - ఉల్లము + కుట్టు - అని-శ ర.)
ఉద్యో. 2-242

**ఉల్లిఖితము** సం. విణ. (అ. ఆ. అ.)
రాచుకొనఁబడినది, రాపిడి చేయఁబడినది.

స్రగ్ధర :— లీలం గల్లోల భాగోల్లిఖిత గగనమై. అర. 7-16

**ఉల్లేఖి** సం. విణ. (న్. నీ. న్.)
రాపిడి దేయునట్టిది, తాఁకునట్టిది.

వ. కైలాసశైల విలాసాపహాసి భాసుర గగనతలోల్లేఖి శిఖరరమ్య హర్మ్యతలంబులను. ఆది. 7-166

**ఉవిద** వై. వి. (సం. యువతి)

1 స్త్రీ, ఆఁడుది.

వ. అన్నారాయణుండునుం శోకసంతాపితాంతఃకరణుండగుచు నుచిత వచనంబుల నయ్యువిదల నెట్టకేలకు నూరార్చి. ద్రోణ. 2—339

2. భార్య.

తే. ... బుచీకుఁదధిక, సమ్మదమున గృహస్థ ధర్మమ్ము నడుపు, చుండి సంతానకాంక్ష నయ్యువిదతోడ. అను. 1-107

**ఉవ్విళులూరు; ఉవ్విళ్లూరు** దే. అ. క్రి.

1. త్వరపడు, తమకించు, తహతహపడు.

ఉ. వీనుల దియ్యమెక్క మును విన్కిఁ బరస్పర రాగవృత్తి లో, నూనినఁ జూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబులు. విరా. 8-893

చ. పిలిచిన రాజులున్ మునులు ప్రీతి యెలర్ప బలోత్కరంబు శిష్యులుఁ దమతోడరా మనము లువ్విళు లూరఁగ యజ్ఞ వర్తనంబులు గనుగొంటకై సకల భూవలయంబునఁ గల్గునట్టి వార్తలు సనుదెంచిన. ఆశ్వ. 4-185

మ. అనినం గేకయ రాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్, విను నీ రూపము సూచి మా నృపతి యువ్విళ్లూరు. విరా. 1-321

ఉ. ... ఇక్కడకుఁ దార్చి నేర్పునన్, శయ్యకుఁ దెచ్చెదం గుసుమ సాయకు పూనికి నేఁడ తీర్చెదన్.

క. అని యువ్విళ్లూరుచు వెసఁ జని. విరా. 2-245; 246

**ఉవ్వెత్తుగొను** దే. స. క్రి. (ఉవ్వు+ఎత్తు+కొను)

నిశ్శేషముగా చంపు, నశింపఁజేయు.

ఆ. కవల వారుఁ గొడుకు గమియుఁ బాంచాల వర్గంబు వృష్ణి వరులుఁ గడఁగి రేని, యొక్క మాత్రలోన నువ్వెత్తు గొనరె దుర్యోధనాది శతము నుద్ధవిడిన. ఉద్యో. 1-29

క. అఱువది కోటులు గపివరు, లుఱక జగత్త్రియము నొకట నువ్వెత్తు గొనం, దఱిగొన్నయట్లు నడవఁగ, నెఱసి కుముదుఁ డురుగుఱెంచె నృపవరుఁ గనియెన్. అర. 7-86

**ఉశీనరుఁడు** సం. వి. అ. పుం.

ఒకానొక రాజు, అష్టవసువైన ప్రభాసుని భార్యకు ప్రియసఖియైన జితవతి తండ్రి.

వ. మర్త్య లోకంబున నుశీవరపతి కూఁతురు జితవతి యను కోమలి నా ప్రియసఖి. ఆది. 4-159

**ఉష్ట్రము** సం. వి. అ. పుం.

ఒంటె, లొట్టియ.

సీ. విను తొల్లి యొక యుష్ట్రి మనితరసాధ్యతపంబు సేయఁగ
మెచ్చి బ్రహ్మ వచ్చి యర్థించినది యేమి యనిన—
శాంతి. 3-33; అశ్వ. 3-157

**ఉష్ట్రి** సం. వి. ఈ. స్త్రీ.
ఆఁడు లొట్టియ.
క. తురగియు నుష్ట్రియు ఖరియును, గురిసిన దుగ్ధములు నిందుకోటి
గణితముల్, ధరణీసురాది జను ల,ప్పారువునఁ బోయిన నఘంబుఁ
బొందుదు రధిపా. శాంతి. 1-321

**ఉష్ణము** సం. విణ. (అ. ఆ. అ.)
వేఁడియైనది.
చ. దినమునవెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ ద్రావ్వి.
శాంతి. 2-126

**ఉష్ణకరుఁడు** సం. వి. అ. పుం.
సూర్యుఁడు, (వేఁడియైన కిరణములు గలవాఁడు.)
సీ. ... చంద్రముని నుష్ణ, కరుని జక్రంబులుగాఁబెట్టి. కర్ణ. 1-282

**ఉష్ణత్వము** సం. వి. అ. న.
వేఁడిదనము.
క. హిమకరుఁడు శైత్యమును న,ర్యముఁడు మహాతేజమును హుతా
శనుఁ డుష్ణత్వము విడిచిరేని గుర్వ,ర్థము నాచేకొనిన సద్వ్రతంబు
విడుతునే. ఆది. 4-223

**ఉష్ణినాభుఁడు** సం. వి. అ. పుం.
ఉష్మపులలో నొకఁడు. చూ. ఉష్ణపులు. అను. 3-192

**ఉష్ణిగంగ** సం. వి. ఆ. స్త్రీ.
ఒక తీర్థప్రదేశము. ఇచట స్థూలశిరసుని ఆశ్రమము గలదు. ఇచ్చట
మానక్రోధ త్యాగము ముఖ్యము ఇందు స్నానముచేసిన వారు కృతార్థు
లగుదురు. బహుశః ఇది ఉష్ణపు గుండముగల గంగానదీ ప్రదేశ
మేమో.

తే. ... నీ యుత్తమ నాయకత్వ, మెఱిఁగి నినుఁ గొనియాడ నే
నెంతదాన. విరా. 2-361

తే. నాథుల దూఱంగఁ గాదు వినుము, సతికిఁ దానెంత వడియును
సభల లోన. విరా. 2-148; ఉద్యో. 4-386

3. ఎంత కాలము.

క. ఎంతకుఁ గృతకార్యుండగు, నంతకుఁడీ రంతకును భయం బందక
ని,శ్చింతమున నుండుఁడు. ఆది. 7-266

4. ఎంతకు లేదు – ఎంతకుఁ గాదు. ఎంతకైననుఁ దగును.

క. పారాశర్యాది మునులు, నీరాజన్యులును వినికి యెంతకు లేదీ,
గారాము నాకుఁ బరమో,దారపదావాప్తి గాదె ధర్మతనూజా.
అను. 4-394

5. సంబంధ సర్వనామము.

చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్దమంబుగా,
మును మును గూర్చి. విరా. 3-108

**ఎంతదవ్వు** దే. వి.

1. ఎంత దూరము.

తే. ... ఎంత దవ్వు, సనిన నడవికిఁ గడలేమియును మృగ వ్ర,జంబు
పొదువుటయును గొందలంబు సేయు. స్త్రీ. 1-46

2. అసంభవము.

తే. ద్రోణ కర్ణ దివ్యాస్త్రముల్ క్రూర భంగిఁ, గవియు నప్పుడు
మము నీవు గావకున్న, బ్రదుకు టెంతదవ్వధిక శుభంబులను
భ,వత్ప్రసాదంబు గని. కాదె వాసుదేవ. శల్య. 2-389

**ఎంతదాఁక** అవ్య. ద్రు. (√ఎంత)

ఎంత వఱకు, ఎంత పర్యంతము.

గీ. ఇలయు గిరులును శరధులు నెంత దాఁకఁ, గలుగు నంత కాలం
బును వెలయుచుండు, శుకుని కీర్తియు. శాంతి. 6-341

శ్లోకములు వెనుక ముందగుట మాత్రమే కన్పించుచున్నది గాని పీర్లలో భేదము లేదు. ఈ మాత్రమునకే తిక్కనగారు నిర్ణయసాగర ప్రతిని అనుసరించినారనుటకు వీలు లేదు.

**ఊష్మము** సం. వి. అ. న్. పుం.

వేసఁగి, గ్రీష్మము.

సీ. ...శత్రుప్రతాపోష్మ సమయంబు,గా మిత్రు బర్హికేకారవంబు,
ఎసఁగంగఁ దోఁతెంచి యింద్రనందన మహోజలధరంబు.

ఆర. 6-186

**ఉసుఱు** దే. వి.

ప్రాణము.

క. ఉసుఱు వచ్చినవారలు వత్తురె. ద్రోణ. 2-185; శల్య. 2-56

**ఉసుఱుగొను** దే. అ. క్రి.

ప్రాణము దీయు. చంపు.

క. ...ఈ, పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీని యుసుఱుగొని
యెద ననియెన్. అను. 1-7; ద్రోణ. 5-135

# ఊఁ

**ఊఁకించు** దే. అ. క్రి.

ఉంకించు, ఉత్సహించు, పూను.

శా. నీతోడ్పాటున నేఁ త్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు.

కర్ణ. 3-130

**ఊఁకువ** దే. వి.

విశ్రాంతి, ఊఱట, తెఱపి, విరామము.

చ. వలవదు రోయఁ బాండవుల వారొక యూఁకువలేని త్రిమ్మటన్,
బలమతి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరి యు,న్నొం
వదె యింత కింకిట మనోముద మస్ఖలితంబుగాఁగ వి,చ్చలవిడి
రాజ్యలక్ష్మిఁ దగు చందమునం గొనియాడు మున్నతిన్.
విరా. 3-95

"ఊఁటట" అనునది పాఠము. "ఊఁకువ" యను నది పాఠాంతరము.

**ఊఁకొను** దే. స. క్రి.

1. ఊఁకొట్టు, మనస్సున పెట్టక విను, వినియు విననట్లు విను.

ప. మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేటి
చూడరాదనిన నమ్మాటలు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు
విదురున కిట్లనియె. ఉద్యో. 2-49

ఉ. రక్కెపమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ,వొ
క్కటి యైనఁ గాదనగ యూఁకొనుచుండుట యంతకంటె మేలు.
ఉద్యో. 3-94

2. విను, ఆలకించు.

చ. ... కార్య మల్పబు,ద్ధుల వెడమాట లూఁకొనకు దోషము
సేగియు వచ్చు నెమ్మెయిన్. ఉద్యో. 3-331

**ఊఁగు** దే. అ. క్రి.

ఉయ్యాలమాఁగు. చూ. ఊఁచు. అర, 4-198

**ఊఁచముట్టు** దే. క్రి. విశే.

(అరటి పొరలను దూఁట తగులు వఱకు వొలిచినట్లు); నిశ్శేషముగా,
మూలముట్టుగ.

ఆ. ఉద్ధవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు. విరా. 3-120

**ఊఁచముట్టుగొను** దే. స. క్రి. (ఊఁచముట్టు + కొను)

నిశ్శేషముగాఁ జంపు, చంపు.

గీ. కొడుక తమ్ములుఁ దోడ్పడఁగడఁగి శత్రు,వరుల గెల్చెదవంటి
వొక్కరుఁడు దక్క, కుంద నీతమ్ముఁ గుఱ్ఱల నూఁచ ముట్టు,గొనె
యొనె విధి యేగతిఁ జనుదుఁ జెవుమ. శల్య. 1-28

ఊఁచికొను దే. స. క్రి.

ఊఁగించుకొను, ఊఁగునట్లు చేసికొను.

ఉ శాతనఖాగ్రఖండిత లసన్మదకుంజర కుంభముక్త ము,క్తాతత
శైల కందర గుహాంతర సుప్తమృగేంద్ర కేసర, వ్రాతము
వేడ్కఁ నూఁచికొన వారక చేరులు గాదె క్రోధ నిర్ఘాత
మహోగ్రు భీముఁ జెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్.

అర. 6-176

ఊఁచు దే. స. క్రి. (√ఊగు) ఊఁపు

ఊఁగఁజేయు.

చ దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీరజో, మిళిత సుగంధ
బంధుర సమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా, నులియుచు
మొల్ల గుత్తులను మయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగె నుల్లల
దళినీకులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్,

చూ. తలయూఁచు. అర. 4-188

ఊఁటు దే. స. క్రి.

పొడుచు.

సీ. చేదీ సమ్మెటలను శేరుకోలల నేని యంకుశంబుల నూఁటి యతి
రయమున, వాహనంబులఁ దోలు వారును. భీష్మ. 8-284

ఊఁదు దే. అ. క్రి.

(దీనికి మూలరూపము తమిలమున 'ఉన్దు' - తమిలమున రేఫమునకు
'ఉ' కారోచ్చారణ ముండుట గాన 'ను' లోపించి 'ఊఁదు' అయినది
రేఫము లోపించి 'ఊను' అయినది 'ఊఁదు, ఊను' (సమానార్థక
ములు) చూ. ఊఁదుకొను.

ఊఁదుకొను ఊఁదు (స్వార్థమున 'కొను' ప్రత్యయము)

నాటు, గ్రుచ్చు, దిగబడు.

వ. కాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద నూఁదుకొనం గూలిన
ఘోటకంబులును. ద్రోణ 2-60

(ఇది 'ఊఁదుకొను' అను పాఠమునకు పాఠాంతరము)

ఊఁత దే. వి. (√ఊఁదు)

1. ఆధారము.

క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గానని విధంబు గైకొని చిత్తం,బున బెదరక తన ముందటి, పని వెరపున నుండె భీము పలుకుల యూఁతన్. విరా. 2-248

2 ప్రాపు, ఆశ్రయము.

వ (ధృతరాష్ట్రుఁడు) దప్పి యెక్కుడు గదిరిన గాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనా గ్రజుం డిట్లని పలవించె.

క. కరిదళ సహస్ర బలవి,స్ఫురితుఁడగు విచిత్రవీర్యపుత్త్రుఁ డొక తలో,దరి యూఁతగొనియె విధి, య్యెవ్వరి హీనులఁజేయఁ డకట వక్రుండైనన్.

చ, అనిలజు మేని చందమగు నాయసరూపము చూర్ణితంబు సే,సిన బలమూననీయఁ డొక చేడియ నక్కట యాశ్రయించె. ఆశ్ర. 1-39,40,41

3. అవలంబనము.

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడవుం ద్రివర్గమున్. గురుతర మోక్ష ధర్మమునకుం దలఁపం దన ప్రాప యూఁత. శాంతి. 2-158. ద్రోణ. 1-358

సీ. అవశమై యొఱగిన యంగవల్లిక పొంత,మున్న భూమీరుహం బూఁతగాఁగ, అర. 7-28

4. భావము; తలంపు.

క. ఇది వాయదియను యూఁత, నృదిది నెయ్యది పట్టుకొల్పినను వాసితమై, తుద్దిఁ జేటు నొంది వానికి, నది శోకము నావహించు నత్యంతంబున్. శాంతి. 4-18

శ్లో. కించిదేవ మమత్వేన యదా భవతి కల్పితమ్.
తదేవ పరితాపార్థం సర్వం సంపద్యతే తదా.
సం. భా. శాంతి. 174-44,45

క. అడుగున వెడల్పుగను పైని సన్నముగను నుండునట్లు రెండు వైపుల మూఁత లేకుండ వెదురు పేళ్లతో అల్లిన మత్స్యగ్రహణ సాధనము.

క. వెరవున నూఁతల నెత్తెలఁగరముల మత్స్యములఁ బట్టి కడుసంతస మంతం, బొరయుచుఁ ద్రాళ్లం గ్రువ్వఁగ, గరమూహించి మదిఁ బ్రాప్త కాలజ్ఞుండున్. శాంతి. 3-198

**ఊఁతకోల** దే. వి. (ఊఁత + కోల)

అవలంబముగాఁ బట్టుకొనెడు కఱ్ఱ, అవలంబము.

తే. అంధులకు నూఁతకోలగా నకట యొకని, నైన నిలుపక నూర్వుర నదయ వృత్తి, మ్రింగి తందెవ్వఁడేనియు మీకు నెగ్గు, లాచరింపని వాఁడు లేఁడయ్యెనయ్య. స్త్రీ. 1-170

**ఊఁతగొను** దే. స. క్రి. (ఊఁత + కొను)

ఆశ్రయించు, ఆధారము చేసికొను.

వ. అకపిధ్వజుండు నిజధ్వజదండం బొక్కింత యూఁతగొనిన.

ద్రోణ. 3-98; ద్రోణ. 1-40

**ఊఁదిచెప్పు** దే. స. క్రి.

నొక్కి పలుకు.

క. అతిథి నినుఁ గోరెనేనిని, మతిఁ గింకిరిపడక యోల మాసగొనక నీ పతనికిఁ బ్రియంబు సల్పుము. సతికిం బతి పనుపుసేయఁజను నెల్లడియున్.

క. అనియూఁది చెప్పి. అను. 1-69,70

క. విను మంత్ర భేదమున వచ్చిన కీడున కనము శాంతిసేయు టరిది గావున మంత్రులతో మంత్రావన నియమం బూఁది చెప్పవలయిం జుమ్మీ. ఆశ్ర. 1—59; శాంతి. 1-188

**ఊఁదిపట్టు** దే. స. క్రి.

పడకుండ గట్టిగా ఆని పట్టుకొను.

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలువట్టి యెత్తి తత్తను వులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృత్తనయుని నూఁదిపట్టి వికృతంబగు రూపము చక్కఁజేసి నెమ్మన

మొకఁ భంగిఁ దేర్చి నరిమంబుగఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్.
విరా. 4-174

ఊఁదు దే. స. క్రి.

1. అధ్మానము చేయు, అగ్ని ప్రజ్వలనము మున్నగువాని కొఱకు నోటితో గాలి విడుచు, నోటిగాలితో (నిప్పు) రేఁగఁ జేయు,

సీ. అల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మచాౕతెఱతావి తైర్యంబుఁ ద్రిప్పుకొంప.
అను. 1-48

క. ఇటు విశిఖపంక్తి యత్యుత్కట రయమున నిగుడఁ జేయఁగా నవ్విధ మూఁదుటయైన మండ దీప్త్యుత్కట భంగిఁ గృపానలంబు బలములు వొంగన్,
విరా. 5-147

2. గ్రహించు, స్వీకరించు.

సీ. ...నీతులు వారువ,దేశింప వాని నూఁదిన మనంబు, గలిగి వర్తింపుము.
ఆశ్ర. 1-56

3. పట్టుకొను.

క. ఉరగపతి తలలవల నురు,తరజవమున నసురులూఁది తత్పుచ్ఛము ని,ర్జరపరు లూఁది మహోమ,త్సరమున వడిఁ ద్రచ్చి త్రచ్చి జవముతి యున్నన్.
ఆది. 2-18

ఆ. వినఁగ నిష్టమేని వినుమని ద్రుపదుచే, యూఁది యింటిలోని కొనర నరిగి.
ఆది. 7-246

4. ఆశ్రయముగాఁ జేసికొను, ప్రాపుగాఁ జేసికొను, ఆశ్రయించు.

చ. తన భుజశక్తిలేక యొరు దర్పమయూఁది పరాక్రమింప వచ్చిన నదిసెల్లునే...
ఉద్యో. 4-207

శ్లో. పరవీరం సమాశ్రిత్య యస్సమాహూయతే పరాన్.
సం. భా. ఉద్యో. 162-4

సీ. పాండు సూనులతోడి పగకోర్చె నెవ్వని యుత్సాహమూఁది మదయోధమండు.
కర్ణ 1-21

వ. వచ్చి యవ్విటపంబు నూఁది యకాౕకంబుల నాలోకించి.
సౌప్తి. 1-12

5. ఆధారముగాఁ గొను.

ఉ. మానుషశక్తి యొల్లఁడు సముచిత దైవము యూఁదియుండు.
ఉద్యో. 2-8

చ. మనకు సజాతశత్రుని సముచిత మార్దవ మూఁది సంధిసే,య
నుచితమైన కాలమిది యాగ్రహముం బొరసీకు చిత్తమున్.
శల్య. 1-54

ఉ. ...నన్నుఁ దనయంతటి మానిసిఁజేసి యుండ నే,నే తగవూఁది
యాకురుకులేశ్వరుఁ డాయుదు ముట్టవచ్చినన్. ఉద్యో. 4-89

6. గట్టిగా అనుకొను.

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలువట్టి యెత్తి త,త్తను
వులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ-
త్తనయుని నూఁదిపట్టి వికృతంబగు రూపము చక్కఁజేసి
విరా. 4-174

7. ప్రమాణముగా గొను.

ఆ. ధర్మమెడలఁ గృపణ కర్మంబుఁ గోరి త,గ్ధంబు సువ్వె సకల ధర్మ
శాలి, యొడమి లేనివాఁడ నడపినుఁగను నహుషోక్తి వినమె
దాని నూఁద వలదె. శాంతి. 1-49

ఉ. ...లోకసం, భావితకీర్తి వయ్యెడు నృపాలక నా పలుకూఁదు
పాటిగాన్. శాంతి. 1-221

చ. సమయము యూఁది పాండవుల శక్తుల చాడ్పున నిందు నాఁడు
బన్నమువడి చన్న సైన్యము. ఉద్యో. 1-244

చ. ...సజ్జన మనోజ్ఞవచో మహనీయ నీవు సె,ప్పిన పలుకూఁది యా
క్రతువు ప్రీతి నొనర్చెద నెల్ల భంగులన్. అశ్వ. 1-13

8. అను, నిలువు, మోపు.

తే. ... రాజ్యలోభంబున సఖల బంధు, జనుల వధియింపఁ దొడగితి
మని రథంబు మీఁద గూర్చుండబడియెఁ జేయూఁది కొనుచు.
భీష్మ. 1-188

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గా లూఁదక లీలోద్యానంబు

గలయం[గుమ్మరుచు. విరా. 2-305

9. ఒత్తు. నొక్కు.

చ. పవనతనూజు శాహువులు పాణియుగంబునఁ బట్టి పీఁకమై,నవని
పయిం బడం దిగిచి యంగము జానుల నూఁదినం గడున్, జవమున
దఁడతాడితభుజంగముభంగి సముత్థితాంగుఁడై.
విరా. 2-342

క. అని యూఁదిచెప్పి యొకనాఁడు. అను. 1-68

10. వహించు, పూను.

చ. ఇటు దగునయ్య కూరులకు నెల్లను బోకడ యట్లకాదె యే,మిటికి
నలందురన్ మొనలు మేకొని యాయుధజీవనంబు నూఁదుటయు
నెఱుంగవే రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్రుఁ డె,క్కటిదివి
చూఱకోల్ ప్రియము కాకిది యప్రియమే తలంపఁగాన్.
ద్రోణ. 2-257

క. ఉక్కఱి సురపతికైనను, [మొక్కము నృపధర్మమూఁది మొన
తలఁ బడినన్, మిక్కిలి పేరును సిట దివి, నక్కజముగఁ బెంపుఁ
బడయ నగుట నరేంద్రా. ఉద్యో. 3-360

11. పట్టుదల పట్టు.

మ. గురుపుత్రుండ సురాంతకున్ విజయునిం గ్రూరాస్త్రసంతాన
ని,ష్ఠురపాతంబున నొంప వాహరి దదాటోపంబు సైరింప క,న్న
రుతో నౌవధ మూఁది చేసె తెవులున్నర్దింపకున్నం దుది, న్నరమై
యుండుదె యే పడంపుము రిపు న్సంరంభివై నావుడున్.
కర్ణ. 2-307

12. విశ్వసించు.

ఉ. అతనిఁ గానఁ బొమ్ము ప్రచురాదరణంబున వీదు కోర్కి సం,
ప్రీతిగఁ దీర్చు నా గుణగరిష్ఠుఁడు నావలు కూఁదుమన్న మో,
దాతిశయంబు నొంది భృగుఁ డా ధరణీసురవర్యుతో మహా,త్మా
తెలివొందె నా మనము తావక పావన వాక్యసంపదన్.
శాంతి. 6-559 శాంతి. 2-369

13. పొందు.

క. అగుణంబయ్యును నిమ్మెయిఁ, బ్రగుణతఁ బ్రాపించు నక్షర మహాం
కార, స్థగుణంబూఁదిన విడిచిన, దెగు నన్నియు నిర్వికార దీప్తంబు
నగున్. శాంతి. 6—15

క. అని పుత్రుం డుపదేశించిన జనకుం డట్లచేసి చెందె సుఖంబున్.
మనుజేంద్ర యవ్విధముఁ గని, కొని యూఁదుము సత్యధర్మ కుశ
లత్వంబున్. శాంతి. 4-31

క. నరనాథ సుఖము దుఃఖముఁ, బరువడి మెయిఁ బొరయుఁగాక
పన్నుగ నరునిం, బొరయునె యందొక్కటి యవి, పొరసిన వల
దూఁద మోదమును ఖేదంబున్. శాంతి. 4-12; శాంతి. 2-244

14. అలవఱుచు.

క. క్షరమును నక్షరమును ద, త్పరమును నెఱిఁగితివి శోకభయ
మోహుఁడవై, కురువర యానిశ్శ్రేయస, కరప్రబోధంబు
నూఁదు గాఢాదరతన్. శాంతి. 6-71

15. అనుభవించు.

ఉ. అయ్యమలాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రి నీ,
వెయ్యది యుక్త హేతువుగ నిమ్మెయిఁ బాసెను నీదు పన్నునం,
గయ్యము సేసి భూపతినికాయములం బరిమార్చెఁ దల్లి నీ,
కియ్యన లక్ష్మినూఁది చరియింపక యిప్పుడు వాయఁ బాడియే.
అశ్ర. 1-159

శ్లో. ప్రసీద మాత ర్మాగా స్త్వం వన మధ్య యశస్విని,
శ్రియం యౌధిష్ఠిరీం మాత ర్భుంక్ష్వ శాపద్బలార్జితమ్. అశ్ర. 16-28

16. గ్రుచ్చు, నాటు, దిగఁబడు.

వ. కాలుబలంబుల పీనుంగు పెంటలమీఁద నూఁదుకొనం గూలిన
ఘోటకంబులును. ద్రోణ. 3-60

అ. క్రి.

ఉండు, నిలుచు.

వ. అందు రౌహిణంబను పాదపోత్తమంబు గరుడునిం గని సంభా
షించి శతయోజనాయతంబైన మదీయశాఖపై నుండి యిగ్గజ
కచ్ఛపంబుల భక్షించి పొమ్మనిన గరుడుండు నట్ల చేయుదునని
యమ్మహాశాఖపై నూఁద సమకట్టి యందు. ఆది. 2-71

**ఊఁదుకొను** దే. స. క్రి. (స్వార్థమునందు 'కొను' ప్రత్యయము)

1. గ్రుచ్చుకొను, నాటుకొను, దిగఁబడు.

వ. కాలుబలంబుల పీనుంగు పెంటలమీఁద నూఁదుకొనం గూలిన
ఘోటకంబులును. ద్రోణ. 2-60

2. పట్టుకొను.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొక సేపునకుం దెలిసి గాంధారి పరిచారిక
లూఁది కొనిపోవ నప్పుత్రశవంబు కడకుఁ బోయి. స్త్రీ. 2-26

**ఊఁచు** దే. స. క్రి. ఊడ్చు

దులుచు, రాలుచు.

క. అందంద మెడయుఁ దలయు న,మందాటోపమునఁ బెక్కు
మాఱు లడిచి చా,వుం దెలియఁ జూచి యలరెదు, దెందముతో
నీఁకలన్నిటిని వెస నూచెన్. శాంతి. 3-498

తే. ఊఁచి బొందువు ద్రవ్చి. శాంతి. 3-499

('ఊడ్చు' - నకు ఇది పాఠాంతరము)

**ఊఁట** దే. వి. (√ఊఱు)

ఊఱిన ద్రవము.

సీ. ... ఎముక యూట, చవిగొని యానుచు. స్త్రీ. 2-9

**ఊఁటాడు** దే. అ. క్రి.

ఊగాడు, గ్రక్కదలు.

వ. కలఁగెం దోయధి సప్తకంబు గిరివర్గంబెల్ల నూటాడె సం,చలతం
బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడె విరా. 4-172

**ఊఁడు** దే. అ. క్రి.

వీడు, వదలు, సడలు.

క. గరుడాస్త్రం బేసిన న,చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు, స్ఫురణము మెఱయఁగ వెస న,య్యురగాత్మక బంధ మూడ నర్వీనాథా. కర్ణ 2-285

ఆ. ... అతని మౌర్వి యూడనేసె. కర్ణ. 3-298; కర్ణ. 3.348

**ఊడుకొను** దే. అ. క్రి.

1. మూఁగు, కవియు.

క. అరదంబులు మొదలగు నుద్ధుర వాహనకోటి డిగ్గి దుర్దాంతగతిం, దురగంబులపై హరిపై, నరుపై నూడుకొనఁబడిరి నలి నార్పుల తోన్. ద్రోణ. 1-260

2. నాటుకొను, గ్రుచ్చుకొను.

వ. మిగిలిన మాతంగంబులు పెనంగిన కనకలిప్త కాండంబు లూడుకొనం, దాటిన వెరగళ్లు వోవు కొండలకైవడి బొలుచునవియు. కర్ణ. 2-227

**ఊడ్చు** దే. స. క్రి. ఊడుచు

1 తొలఁగించు, తీసివేయు.

వ. ఆప్పౌరవోత్తముండు నవ్వుచు మన మనువులు సాలునని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు ద్రౌపదియు నట్ల చేసిరి మహా. 19

వ. అప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు లూడ్చి యాయుధంబులు వెట్టి గాంగేయుకడకుం బోయిరి. భీష్మ. 3-419

వ. గోదండంబు నెక్కుడించి కంటకంబూడ్చి నిద్రింపుము సౌప్తి. 1-65

2. విప్పు.

క. ఆయుధము విడిచియుండఁగ, సాయక గురు మీరు నూడఁ ఖంపిన కష్టోపాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియకాని తొడిన మఱువే నూడ్పన్. కర్ణ. 2-130

తే. సమర కౌతుకియైన యజాతశత్రుఁ, డొప్పు మిగిలెడు మైమఱు వూడ్చి యాయు,ధములతోఁ గూడఁ దనయరదమునఁబెట్టి, యిల మడిగి మౌనియై కరంబులు మొగిడ్చి. భీష్మ. 1-152

3. త్యజించు, విడుచు, ఉజ్జగించు.

వ. తోలూడ్చు మహానాగంబునుం బోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది. ఉద్యో. 2-146; శాంతి. 5-252

సీ. సుగతికిఁ జనఁగోరి తగ నుజ్జగించెద,బాణాసనంబును, బాణము లును -తే- తెలివిగలిగి మనుండని పలికి శర శ,రాసనము లూడ్చి తేరిపై నసఘమూర్తి యొప్పఁ గూర్చుండి. ద్రోణ. 5-322

శా. కానన్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁడై నం జనున్. శాంతి. 2-282

4. పెఱుకు, ఊడఁదీయు.

ఆ. పదుచు లీఁక లూడ్చి పట్టి యాడెడినట్టి, పులుగు చందమయ్యెఁ దలఁప నా యవస్థ. కర్ణ. 1-34

క. ఈ కలన్నిటిని వెస నూడ్చెన్ - తే - ఊడ్చి బొందువు ద్రవ్చి. శాంతి. 3-498; శాంతి. 3-499

**ఊనము** సం. విణ. (అ. ఆ. అ.)

హీనము, తక్కువైనది. కొఱవడినది.

క. అనవుడు శినిపుంగవుఁ డొక్కింత చింతించి పార్థుపజ్జం బోవుట బఁటుతనంబున కూనంబుగాదు. ద్రోణ. 3-300

క. నీ వడిగి తేను నిచ్చితి, భూవల్లభ యింక సత్యమున కూనముగా,దే వరియింపమి. శాంతి. 4-148

**ఊను** దే. స. క్రి.

1. పొందు.

ఆ. ... ఏమి సంభవించె, నేని దానఁ దృప్తినూనుట దప్పిన, పనికి వగవ కునికి భవ్యగుణము. శాంతి. 5-23

తే. మునుల మానసంబులు సంప్రీతి నూన. అను. 4-444

క. పనుంగు వడిన నచ్చటి, సేనలు దెరలుటయు రాజసింహుఁడు దన్నుం, దాన పురికొల్పుకొని వెఱవూనక దానవుని యెదుర నొక్కఁడ నిలిచెన్. భీష్మ. 3-116

క. హీనప్రజ్ఞుఁ డకార్యము,లైనవి సేసి తుది వగచు నతులప్రజ్ఞా, సానుమదారూఢుఁడు వగ,నూనఁడు దురితమును వఱితి కోడక యునికిన్. శాంతి. 2—852; శాంతి. 4-31

2. ఊఁదు, మోపు.

వ. జంభాంతక సూనుండు సరభసంబుగా రథంబు డిగ్గనుఱికి వెన్ను వెనుక నెయిది కరంబుల గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం బోవం బోవఁ బది యడుగుల కొలంది నా కౌంతే యుండు పదస్థైర్యంబును బాహావీర్యంబును మెఱయ మహీతలం బూని మెట్టి నిలువంబట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దను జమర్ధ మునితో నిట్లనియె. భీష్మ. 3—267

3. పూను, వహించు, అవలంబించు.

తే. ఒండొరువుల లేఁజెమటల నూని వ్రేఁగు, వడిన చాడ్పున నవయవ భంగులందుఁ, దగిలి మఱపునఁ దడయు నిద్దఱ విశాల, నయన దీప్తులు నెఱకువ బయలువడఁగ. విరా. 5-395

తే. కూటికై ద్రోణ భీష్ములు గుఱుతియనక, యనుసరింతురు ధృత రాష్ట్రుఁడును దనూజు, కృష్ణ నూనినవాఁడు రాధేయుబోటి, తులువలెల్లను నతని సద్బుద్ధియంద్రు. ఉద్యో. 1-86

క. మానిత ముని యొకఁడు సుఖా,సీనుండై యున్న నతని శిష్యుఁడు వినయం, బూని నిలిచి మోక్షము తెరు, వానతి యీవే దయా మయా నా కనుచున్. శాంతి. 4-261

క. మానవ నాయక యగ్రజుఁడైనను ననుజన్ముఁడేని వన్యాయంబుం, బూని సహోదరులకుఁ గీ,డైన, వతఁడు దండ్యుఁడండు రవనీ నాథా. అను. 4-186; స్త్రీ. 2-182

4. కీలుకొను, తగులు, నెలకొను.

క. అని పలికి యగ్ని వలగొని, తన దేహము దానిలోనఁ దడయక యిదినం,గని బోయ విస్మయంబున, మనమూనఁగఁ గొంతసేపు మ్రాన్పడి యుండెన్. శాంతి. 3—828

సీ. ... ప్రీతి సంతాప మోహాదు, లొదవినఁ దత్తద్గుణోదయ ములఁ గని యుపేక్షించుచు మనము నూనఁగనీమి కార్యంబు ధర్మార్థ కామములకు. అను. 5-256

క. తన మదిఁ గదిరిన తమకం,బునఁ జిడిముడి పడుచు ద్రుపద పుత్రిక పై నూ,నిన వేడ్క దిగువ నొకటియుఁ, గనుఁగొన వినలేక మదనకంపితుఁడగుచున్. విరా. 2-243; అశ్వ. 1-69

౪. ఆధారముగాఁ దీసికొను, ప్రమాణముగాఁ దీసికొను.

క. దానము ధర్మము దప మి,జ్యానిష్ఠ యనంగఁ గల్గు సత్క్రియ లెల్లన్, మానవనాథ యహింసా,నూనాకృతు లండ్రు శ్రుతుల నూనిన పెద్దల్. అను. 4-248

౫. ధరించు, తాల్చు.

మ. అనుచున్ సంయమిశాపజాత ముసలాత్యంతాద్భుత స్ఫీతశ,క్తి నిరూఢంబుగ నూనినట్టి నిజనిస్త్రింశంబు శీఘ్రంబునం, గొని తద్దీధితి రాజిచే నతని చూడ్కుల్ విహ్వలత్వంబు నొంద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తాంబుప్రపాగంబుగన్. మౌస. 1-48

అ. క్రి.

1. కలుగు, పుట్టు.

ఉ. వీనులఁ దియ్య మెక్కుముసు విన్కిఁబరస్పరరాగవృత్తి లో,నూనినఁ జూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబులు. విరా. 5-393

క. తానెంత యాపుఁడైన మ,హీనాయకు సొమ్ము పాము నెమ్ము లుగా లో,నూనిన భయమునఁ బొరయక, మానినఁ గాకేల కలుగు మానము బ్రదుకున్. విరా. 1-186

క. ... ఇ,ట్లను వారి చిత్తంబులోన నడలూనంగాన్. ద్రోణ 2-256

తే. ... వారలు నాత్మఁ బ్రీతి, యూనఁ జలిపిరి పావన స్నానవిధులు శల్య. 2-171

వ. ఇట్లు పెక్కం ద్రొక్కపెట్ట పెల్లేసినం గినుకనూనిన నవ్వు రౌద్ర రసంబు నలంకరింప. ద్రోణ. 3-225

3. స్రవించు.

ఉ. ... వృకోదరార్జునులు బొంగులుగాఁ బెనచేతఁ గన్నునీ, రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁడై.

ఉద్యో. 3–281

4. నాను.

ఆ. మూత్రమునఁ బురీషమున నూనుచును గర్భమునఁ బ్రవర్త నమ్ముఁ బొంది.

శాంతి. 2–292

5. అనుభవించు.

క. దానికి నొచ్చిన మనముల,తో నడవికిఁబోయి బహుళ దుఃఖంబుల నట్లూని విరాటుపురిం బడఁగాని యిడుమ వడియు వారు గనలర కంటె.

కల్య. 2-366

ఊనుచు; ఊన్చు దే. స. క్రి.

1. చేర్చు, తగిలించు.

సీ. నాభి యూరులు జఘనము మెత్తమెత్తన యొత్తి ముదంబున నుల్ల మూన్చు.

స్త్రీ. 2-138

2. ఉంచు, మోపు.

క. ఒలసి మనో వాక్కాయం,బుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం, గలిమి విను శీల మది మే, లొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా.

శాంతి. 3-147

క పూని మను సాత్త్వికమునను, మానస మూన్పంగ వలయు మహనీయ ధృతిన్.

శాంతి. 4-289

క. కావునఁ గామ క్రోధము, లావిర్భూతములు గాని యట్లుగఁ దత్స,త్త్వావేశంబున నూన్పుము, భావం బివ్విధము విష్ణుపరత గుమారా.

అను. 1-313

ఊరక దే. అవ్య. (యత్నము, కారణము, ఫలము, ప్రతీకారము మున్నగు వాని అభావమును దెలుపును)

1. యత్నము లేక.

ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు వేగయి పొల్చు పొత్తిపై
నెక్కొను చూడ్కిఁ గ్రమ్మఱుపనేరక యూరక నిల్చె.
విరా. 2-28

క. కలదో లేదో యని యెదు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు
సురాదులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును నరులు
గానమి దప్పె.

క. కలదది యూరక కానఁగ, నలవియె శ్రుతివాక్య సమితి యర్థంబు
లపై, నిలిచిన శ్రద్ధం గ్రమమునఁ, దెలివొందినఁ గాక యెట్లు
ధీమంతులకున్. అను. 5-162, 168

2. కారణము లేక, వ్యర్థముగా.

చ. ... భీష్ముపై, కులికనఁగాక మాకు సగమూరక యిత్తురె మీరు
మేదినిన్. ఉద్యో. 2-142

3. మానక.

ఉ. కౌరవ సేనఁ జూచి వడకం దొడఁగెన్ మదిలోన మేను నీవూరక
పోవుచున్కి యిది యొప్పునె. విరా. 4-55

4. వివరణము చేయక.

క. విను విధికృత్యము లూరక, కనుగొనుచును సిద్ధ్యసిద్ధి కల్పిత
సుఖ దుఃఖ నిరూఢిఁ బొందకుండఁగ, మనముం దొలగించు వెరవు
మహనీయమగున్. శాంతి. 4-379

5. ఉపేక్షించి, ఉపేక్షాభావముతో.

తే. గంధర్వులేవురు నన్ను నిట్టు లొకఁడు పట్టుపంగ నూరక యునికి
నూడ, నచ్చెరువు గాదె. విరా. 2-140

ఉ. ... ఇచ్చో ననుఁ దన్నఁ గీచకువిఁ జూచియు నూరక యున్కి
పాడియె. విరా. 2-143

ఉ. ... చిత్తములుం గలుషంబు లమ్మవో, వీరుల కీ నృపాలునెడ వీరికి
నూరక యున్కి గర్జమే. విరా. 3-106

క. తన చేతన సూతసుతుం, డనుముందు గాకనుచు నలుకతోడ
రయమునం, జనియెదు ధర్మసుతుండు, తని నూరక చూచునికి
తగునే మనకున్. ద్రోణ. 5-258

క. మీరును వారును జలమునఁ, బోరెదు నెడ నెద్ది యెట్లు వోయిన నెఱి నే, నూరకయుండుదుఁ దోడె, వ్వారికిఁ బో నింత నిక్కువం బెఱింగిన్. ఉద్యో. 1-88

6. పలుకక, మాటాడక.

క. ఊరక యుండక పలుపుర, తో రవ మెసఁగంగఁ బలుకదొడఁరుపక మదిం, జేరువ గల నాగరికులుఁ, దారుఁ గలసి పలుకవలయు ధర ణీశుకడన్. విరా. 1-127

చ. ... మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండు నం,దనులకుఁ జెట్టవై హృదయ తాపము వచ్చినఁ బల్కెదొండులన్.

వ. ఊరక బవరంబు తెఱుగు వినుము ద్రోణ. 4-209, 210

వ. కినియించి గదం దలవగుల వ్రేటువడక యూరక తేరువో ని మ్మనవుడు మద్రపతి యతని నవలోకించి.

కర్ణ. 2-60, ఆశ్ర. 1-185

చ. ... పురుషోత్తముఁ డింత యొప్పఁ బల్కునె మఱిమాటలాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం, కనువరి యెవ్వఁ డంచు నచలాకృతులై నెఱి నూరకుండఁగన్. ఉద్యో. 3-285

7. నిర్భయముగా, నిర్లక్ష్యముగా.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్, డిల్ల పడంగ నా కిది గడింది విచారము పుట్టె నందుఁ బో,నొల్ల ననంగ రా దచటి కూరక పోవను రాదు నేర్పు సం,ధిల్లఁగ దీని తాపికోను దీమస మెట్టిది యొక్కొ దైవమా. విరా. 2-91

8. ఏమియుఁ జేయక, నిర్వ్యాపారముగా, చేష్టలుడిగి.

వ. ఇట్టుభయ సైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు దక్కి తమకంబెక్క నొక్కింతసే పూరకున్నంత.

విరా. 3-196

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి తానిచటఁ గానక య్యాతని వజ్జ నరుగు తెఱఁ గగు, ననుమానము లేదు క్రోధ మగ్గలము మదిన్. విరా. 4-259

ఆ. తిండిపోత నీకు భండనంబేటికిఁ, గడవఁజేరి మనసు కాంతు దీఱ, నోపు కొలఁది మ్రింగి యూరక నీ వింటి, కడన యుండు మింక నడచి పడక. ద్రోణ. 4-239; ద్రోణ. 3-245

9. ప్రతీకారము చేయక.

వ. సమస్త జనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతులరయి యుండియు సత్యంబు పాటించి యూరక పోక చూచి యచ్చెరు వాటుతో నుమ్మలించుచుండిరి. ఉద్యో. 3-82

శా. సారాచార నిరూఢుఁడైన ధనురాచార్యున్ వధింపంగఁ గన్నా రం జూచితి నీవుఁ దత్పరిభవం బట్లుండె భగ్నోరుఁడై, రారాజెం తయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా విన్న యే, నీకే యూరక నిద్రవోదునకొ యిళ్లేలంటి వీరోత్తమా. సౌప్తి. 1—69

10. మాఱుపలుకక, సమాధానము చెప్పక.

వ. అని ప్రార్థించినం బార్థుని పలుకులకుం బ్రియంబంది ముకుందుం డూరక నురలె. భీష్మ 3—268

క. అనవుడు నీవి ట్లడిగిన, విని యూరక యుండఁదగదు విను మేర్పడు నెల్లను నున్నరూపు సెప్పెద, మనవారల వారివారి మానము లధిపా. ఉద్యో. 4-219

11. కొన్ని పట్ల నిది వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.

క. నారాయణాభిధానులు, వారలు గయ్యంబు సేయువా రొక్కెడఁ నే, మూరక నిరాయుధ వ్యాపారతమై నుందువాఁడ బర మాప్తుఁడనై. ఉద్యో. 1-74

ఆ. అక్కుమారి చతురయగుట శిఖండి వర్తనము నెడఁ బ్రమాదమున నెఱంగి, యుగ్గడింపనొల్ల కూరక యొఱుఁగని, యదియ పోలె నుండె వాత్మ నొచ్చి. ఉద్యో. 4-374

**ఊరార్చు** దే. స. క్రి.

ఊఱడించు, ఓదార్చు.

క. చని మదవాగ్ని జ్వాలలు, దనుకఁగ నిట్టూర్పు గాడ్పు దండడి

నిగుడం, దను నూరార్పఁగ సఖ దొరఁ, కొనమికి వెనుఁబడుచుఁ
గీచకుం డా సతితోన్. విరా. 2-80

క. వినుము ధనంజయుఁ డప్పుడు, తనుఁ దాఁ దేర్చుకొని యెల్ల తరు
ణుల నూరార్చె నతనిఁ దోడ్కొని హరి జన, కునికడకుం జనియె.
మౌస. 104

గీ. వాలుఁడొక్కండు కొండొకకోల చేతఁ, బట్టికొని యేను రక్కసుఁ
గిట్టి చంపి, చులుకఁగా వత్తు మీ రేడ్వవలవ దనుచుఁ, గలయ
నూరార్చెఁ దన తొక్కుఁ బలుకు లొప్ప. ఆది. 6-360

క. ఊరార్చి యింక నుచితా,చారంబులు నడపుటయ యిచటఁ
గృత్యము. మౌస. 208, అర. 8-160

**ఊరు**[1] దే. వి. జా.

(కొందఱు 'పూర్' శబ్దభవమని యందురు కాని దేశ్యమనుటయే యుక్త
ముగాఁ దోఁచెడిని)

(బహు — ఊళులు. ఊళ్లు, ఊళ్లులు - ఊరులు, ఊర్లు అను రెండు రూప
ములు భారతమునఁ గానరాకున్నవి.)

తే. కరటి దశకంబు నొక యూరుఁ బురము నొచ్చి, నపుడ యిచ్చెద.
విరా. 4-80

క. అరదములు నవరణలతో, బరపై యొక్కొక్క యూరి
పరపున నరిగెం. భీష్మ. 1-84

తే. వీనికి వగఁబొందు టూరివారి, కొలయు నెదరుల కెల్లఁ దానమ్మ
లికము, గట్టికొని కుందు నట్టులు గాదె వత్స శాంతి. 6-320

(ఊరివారు = గ్రామ ప్రజలు)

క. అయిదూళ్లును మాకిచ్చిననుఁ జాలునంటివి.
ఉద్యో. 3-11; ఆది 6-267

ఉ ... శా, నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు
నొక్కొ. ఉద్యో. 3-101

ఆ. వెలచి కాదె యేమాళ్లు నైనను, దమకుఁ జాలు ననియె ధర్మ
సుతుఁడు. ఉద్యో. 2-219

**ఊరు**[2] దే. అ. క్రి.

లోపల నుండి (ద్రవము) పైకి వచ్చు.

వ. ఎక్కువ దక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముకుఱ్ఱారి వగచుచున్న వాఁడవు (ముకుఱ్ఱారు = ముక్కున నీరుగాఱు). ఉద్యో. 2-222

**ఊరుకాండము** సం. వి. అ. పుం. న.

బోదియవంటి తొడ.

క. తునిసి చిక్కువడి యున్న యూరు కాండంబుల వలన మద గజం బులు నొచ్చిన కదళీవనంబులం బోని యెడలును. విరా. 3-236

**ఊరుపు** దే. వి.

శ్వాస, ఊపిరి.

వ. అంతఁ గొంత యూరుపు వోయినం జెలునవ్వు నవ్వి కవ్వడి కమల నాభున కిట్లనియె. కర్ణ. 2-230

**ఊరుపువోపు** దే. అ. క్రి.

ఊపిరి పుచ్చుకొనుటకు అవకాశము చిక్కు.

క. అంతఁ గొంత యూరుపు వోయినం జెలునవ్వు నవ్వి కవ్వడి కమల నాభున కిట్లనియె. కర్ణ. 2-230

**ఊరుమూలము** సం. వి. అ. న.

తొడ మొదలు రహస్య స్థానము.

తే. ఊరుమూల మేర్పడఁగ నయ్యువిదవలువు, దొలఁగె ననిలంబు చేత విధూతమగుచు. ఆది. 4-122

**ఊరువు** సం. వి. ఉ. పుం.

తొడ

సీ. జనని యూరు ప్రదేశంబున నతినిగూఢంబుగా నొర్వుందు డాఁగుటయును, విరా. 1-54

**ఊర్చు; ఊరుచు** దే. అ. క్రి.

ఊపిరి విడుచు. విశ్వసించు.

చ. తలరు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చ నూర్చు.
విరా. 2-293

వ అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి బిచ్చపడి.
ఉద్యో. 2-169; సభా 2-310

**ఊర్జితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. గొప్పది, ఉదారము.

ఉ ... ము, చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జితసేన.
భీష్మ. 2-277

చ. ఒరులకు నందరాని పద మూర్జితపుణ్యని రూఢిఁ బొందఁగా, దొర
కొని యున్కి నీ వికృతదూరమఃస్కృతఁ గాదె. మౌస. 73

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు. విరా. 1-7

2. దృఢము, బలముగలది.

ఉ. ... అతఁ డూర్జితశక్తి నుద్భటుండై నెగసెన్ సమీరసుతు నల్కకు
బ్రాఁకిడి నట్లు వీఁకతోన్. విరా. 2-350

3. వృద్ధి గలది, పెంపొందినది.

ఉ. ... నిర్మలా త్మూర్జిత కీర్తి కారణ రణోద్ధతి వెల్వెలఁబాటు
నేటికిన్. విరా. 4-186

4. వృద్ధి చేయబడినది, పెంపొందింపఁబడినది.

ఉ. అర్జునుఁ డప్డు భీష్ముఁ గని ... అనివార్య పరాక్రమలీల దాఁక
నాత్మూర్జిత రౌద్ర మయ్యె బహుళోగ్ర మహాస్త్ర గతాగతంబు
లన్. భీష్మ. 1-250

**ఊర్జితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఉత్సాహము గలవాఁడు.

వ. ఇట్లు నిర్జర వరుం నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడుండు.
ఆది. 2-101

**ఊర్ణనాభి** సం. వి. ఇ. పుం.

సాలెపురుగు

క. విన మూర్ణనాభి తంతువు, లవియింపఁగఁ జేసినట్లు సత్త్వము గుణ

సం, జనకంబగునది పురుషుఁడు, గనుట యుదాసీనతన వికారము
గలదే. శాంతి. 5-174

**ఊర్ణనాభుఁడు** సం. వి. అ. పుం.
కురు కుమారుఁడు గాంధారీ ధృతరాష్ట్రుల నూర్వురు కొడుకులలో
నొకఁడు. వికటానన సునాభుల నడిమివాఁడు. ఆది. 5-107

**ఊర్ధ్వగతి** సం. వి. ఇ. స్త్రీ.
ఊర్ధ్వ లోకములగు స్వర్గాదులకుఁ బోవుట.
వ. ... మాధవీ పుత్రులగు నన్నలువురు దౌహిత్రుల కతంబున
నూర్ధ్వ గతి గనియె. ఉద్యో. 3-322; శాంతి. 1-279
సీ. ... అయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వగతి కేగు టెఱిఁగి.
మౌస. 1-192

**ఊర్ధ్వబాహుఁడు** సం. విణ. (ఉ. ఊ. ఉ.)
చేతులు పైకెత్తిన వాఁడు.
తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁ గూల్చి, ధనువుఁ గేతువుఁ దును
మాడి తనువు నొంప, నాతఁ డరదఁబు డిగ్గి నిరాయుధుఁడు,
నూర్ధ్వ బాహుండునై యూరకుండె నధిప.
ద్రోణ. 3-245; ద్రోణ. 5-409

**ఊర్ధ్వము** సం. విణ. (అ. ఆ. అ.)
మీఁదిది, పైది, ఉపరితనము.
సీ ... ఊర్ధ్వంబు దిశల ... నెక్కుడు. అశ్వ. 2-162
క. త్యాగమొక నెలవు శమసం, యోగం బుత్తరము దానికూర్ధ్వము
సంతోషము. శాంతి. 5-348

**ఊర్ధ్వరేతసుఁడు; ఊర్ధ్వరేతుఁడు** సం. విణ. స్.
అధఃపతనము లేని రేతస్సు గలవాఁడు.
క. సుతు లనఘులు వేవురు దమ, యుతులై యుదయించి సాంఖ్య
యోగాభ్యాసోన్నతిఁ జేసి ముక్తులై భూరితేజు లందఱుమ
నూర్ధ్వరేతసులైనవ్. ఆది. 3-60

తే. ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ, డైన కణ్వమహాముని
యనఘ చరితుఁ, డట్టి మునికెట్లు గూఁతురవైతి. ఆది. 4-82

**ఊర్ధ్వలోకము** సం. వి. అ. పుం.

1. స్వర్గము.

మ. అనుమానింపకు తోడఁబుట్టువులు గారా తున్మి తూఁటాడె
నెందును గ్రొన్నెత్తురులేఱులై పఱవ నింద్రుండు దుర్గతన్ దైత్యు
లన్, మును లద్వైరు భజింపరే క్రతువు లామోదంబుతో నమ్మహా,
త్ముని జేయింపరె యూర్ధ్వలోక మది కాదో యేలఁదో నాకమున్.
శాంతి. 1-282

2. పైనుండు లోకము.

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలి యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వ
లోకములు దప్పు, ఉద్యో. 1-161

**ఊర్ధ్వశ్వాసము** సం. వి. అ. పుం.

ఎగరొప్పు, పై శ్వాస, శ్లేష్మ రోగము.

క. కుత్తుకకు నడ్డపడు నూ,ర్పొత్తిలి పోనీక యాఁగు నూర్ధ్వశ్వాసం,
బెత్తఁగఁ జేయును జీవుం, డత్తనువున నుండనేర కంతట వెడలున్.
అశ్వ. 1-178

**ఊర్ధ్వాలకములు** సం. వి. అ. పుం. న. బహు.

తల వెండ్రుకలు

సీ. పాంసుజాలములు పై, బ్రాఁకినఁ గరము రూక్షములగు నూర్ధ్వాల
కముల దాని. అర. 2-102

**ఊర్పు** దే. వి.

ఊపిరి.

ఉ. ... మీ, ముక్కున నూర్పు గల్గ నొక మూర్ఖుని చేఁబడితిన్
సభాస్థలిన్. విరా. 2-226; భీష్మ. 2-118, శల్య. 1-357

2. నిశ్వాసము.

వ. అవి శంకించి యూర్పులు సందడింప మొగంబు బిగువారం గ్రోధ
శోకంబులు మనంబునఁ బెనంగొనం గన్నీ రొలుక నూరకున్న.

నెల్లవారు నతనికి మాఱు పలుకను దేఱి చూడను వెఱచి యుండిరి. ద్రోణ. 2-289

**ఊర్పుగాడ్పు** దే. వి.

నిశ్శ్వాస వాయువు, నిట్టూర్పు గాలి.

తే. ... తఱుచు, టూర్పు గాడ్పుల పరిమళ ముల్లసిల్ల. విరా. 2-288

**ఊర్పువోవు** దే. అ. క్రి. (ఊర్పు + పోవు)

ఊపిరి యాడు.

వ. అంబుదు జగంబులు సృజియింప జంతు సంతానంబు పెరిగి సమ్మర్దం బధికంబై యూర్పువో వని యఖైన. శాంతి. 5-209

**ఊర్మి** సం. వి. ఇ. పుం. స్త్రీ.

1. అల

క. పీరాస్థి శర్కరా ఘన, భేరీమండూక కవచ పృథు లోర్మి రథ, స్ఫారావర్త గజ మకర, ఘోర మహిమ రక్త నదులకుం దగియె నృపా. ద్రోణ. 1-295

2. బుభుక్షాది షడూర్ములు- 1) బుభుక్ష, 2) తృష్ణ, 3) శోకము, 4) మోహము, 5) జర. 6) మరణము.

క. దుర్మతు లామిషగత మగు, కర్మము వాటించి బంధ కలితులగుదు ర,య్యూర్మి గడచి సువిచారులు, నిర్మమతను ముక్తి వడయ నేర్తురు వత్సా. శాంతి. 1-125

**ఊర్మిమాలిని** సం. వి. ఈ. స్త్రీ.

పుణ్య తీర్థమైన ఒక నది.

సీ. సప్త దినంబులు చంద్ర భాగను విత, స్తను నూర్మిమాలినిం దగ వసించి, యాహార విరహితుండై యుండ మునిసమానుం డగు. అను. 2-27

**ఊర్వశి** సం. వి. ఈ. స్త్రీ.

ఉర్వశి, ఒకానొక అప్సరస, స్వర్గ వేశ్య.

ఈమె పురూరవుని భార్య, పురూరవుని వలన ఈమెకు 1) ఆయువు

2. ధీమంతుఁడు, 3. అమా వసువు, 4. దృఢాయువు, 5. అనాయువు, 6. శతాయువు అను నార్వురు కొడుకులు పుట్టిరి. ఆది 3-92

అర్జునుఁ డమరలోకమును దర్శింపఁబోయినపు డీమె యర్జునుని వరించి రమింప నిర్బంధము పెట్టెను. అర్జునుఁడు తల్లిగా భావించి నిరాకరించినందున నపుంసకుఁడుగా శపించెను. ఆ శాప మర్జునునకు అజ్ఞాత వాసమున నుపకరించెను. అర. 1-358 మొ 368 వ.

2. ఒకానొక పుణ్య జలాశయము. చూ. ఉర్వశి అను. 2-85

ఊర్వశీ తీర్థము. అర. 2-275

**ఊర్వశీతీర్థము** సం. వి. అ. న.

ఒకానొక పుణ్య జలాశయము — ఇందు స్నానము చేసిన వారు సర్వపూజార్హు లగుదురు. అర. 2-275

**ఊఅట** దే. వి.

విరామము.

సీ. కోలుమసంగెడు కోర్కులు వెనువెంటఁ బాఱుచు నునికియు నూఅటయును. విరా. 2-315

2. విశ్రాంతి.

చ. వలవదు రోయఁ బాండవుల వారొక యూఅటలేని త్రిమ్మటన్, బలమఱి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు, నొల్లవదె. విరా. 3-95; విరా. 2-195

3. స్వాస్థ్యము, మనశ్శాంతి.

ఆ. ఇంత దలరనేల యెమ్మెయినైనను, గొమ్మ నలవరించి కూర్చుటరుదె, యమ్మలంబు దక్క యూఅటతోడ నీ, వేఁగు మసలవలవ దింక నిచట. విరా. 2-80

4. ప్రీతి, ఇష్టము.

చ ...నీ, మనమున కెట్టు లూఅట సమస్తము నట్టుల చేసెదం దగన్, విరా. 3-67

5. ఔదార్యు, ఉపశాంతి.

ఉ. ...అంతలు సేసి పోనడచి యక్కడ సంఱయుచేత చెప్పి పు, త్రెం

తురె యిట్టి యూఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు.
ఉద్యో. 3-101

చ. ...మా దెస గప్ప యెలుంగుc గామవై, యునికి యెఱుంగ వచ్చె
నటు లూఱటగా వరమిచ్చినాcడవో. ద్రోణ. 3-107

విణ.

విశ్రాంతి నిచ్చునది. సహాయము.

తె. మాటిమాటికిc బరికించి మందడీల కెల్ల మాఱట యగుచు వర్తిల్ల
నేర్తు. విరా, 1-95

**ఊఱటపట్టు** దే. వి.

విశ్రాంతినిచ్చు తావు.

ఉ. నీ వలమూcపు లావు మును నేల వహించిన నాగకూర్మ గో,త్రా
వనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టుగాదె. విరా. 2-193

**ఊఱడంబలుకు** దే. అ. క్రి.

మనశ్శాంతి గలుగు నటుల మాటాడు. చిత్తస్వాస్థ్యము గలుగ మాటాడు.

వ. కృతవర్మ పాలికిం బోయి యాతం డొక్క యక్షౌహిణితోడc
దన్నుం గలయ వచ్చువాcడయి యూఱడం బలికినc బ్రియంబంది,
ఉద్యో. 1-84

**ఊఱడించు** దే. స. క్రి.

ఊఱడc జేయు.

1. ఓదార్చు.

ఉ. ...అతి వత్సలభావముc బొంది యాదరార్ద్రింబగు చూడ్కితోc
బ్రియహిత స్థిర భాషల నాదరింపవే. విరా. 1-183

వ. అతని యంతరంగంబునకుం దెలివును నంగంబునకు దప్పితే కుని
కియు నొసంగి విష్ణు ప్రసాదంబునc బ్రత్యాపన్నుండ వగు దని
యూఱడించి యరిగిరి. శాంతి. 6-374

ఆ. ...మత్స్య నందనయు, నూఱడింపc బడియె నొకనాcడు నీ చేత
అశ్వ 3-170

సీ. సమయ కాలము సన్నc బని సుయోధనుc బంపి, భోగంబులను

బహు త్యాగములను, యాగంబులను సద్విహారముల్ సలుపుద
మని యూఱడింపవే. శాంతి. 1-89

2. చిత్త స్వాస్థ్యము గల్గించు.

క. అనినఁ గిరీటికి హరియిట్లను నీ దగు కోర్కి దీర్చుటకి నాకు
వ్రతం, బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమ యుద్ధ
క్రీడన్. క. అని యూఱడించి నరుఁదోడ్కొని ధర్మ తనూజు నొద్ద
కుం బ్రియ మెసఁగం, జనుదెంచె. ఉద్యో. 1-89, 90

వ. ...(భీష్ముఁడు) ఏసీ రాత్రి యేకాంతంబున దర్భశయనంబున
నుండి భూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు చేసి
పరశురాముని జయింపరాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె
నతని నాజి జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱ
డింపవలయునని ప్రార్థించి నిద్రించుచుండ. ఉద్యో. 4-388

ఊరడిలు; ఊరడిల్లు దే. అ. క్రి.

1. ఉపశాంతి నొందు.

వ మదీయ తేజో విశేషంబున ప్పురుహూతున కుత్సాహంబు సంభవింపం
గల యది యప్పుడనాయాసంబునఁ బగతు వధి యింప నగుసని
గదాధరుం డూఱడిలం బలికిన బలసూదన ప్రముఖ నిఖిల సుర
లోకంబును సంతసిల్లి. ఉద్యో. 1-133

వ. వానిదెసం జింత యావంత వలన దమ్మాటలు విడువుమని యూఱ
డిల్లం బలికి దుర్దశల నలందురు నవ్వేలంది కుందు వాపం దలంచి
యిట్లనియె. విరా. 2-283
(అకాడమి ప్రతి ఊరడిల్లు-సం. ము. ఆనంద—ఊఱడిల్లు)

క. అని యూఱడిలఁగఁ బలిగిన, విని యంకిలి దేఱు చిత్తవృత్తి గలుగు
నంగన. ఉద్యో. 2-125

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి నూఱడిల్లఁ బలికి యునిచి
కొనియె. విరా. 1-380

2. స్వస్థమగు, స్వస్థచిత్తమగు.

ఆ. పగయ కలిగేనేనిఁ దాముడ్న యింటిలో, మన్నయట్ల శాశ యూఱ

డిల్లియుండు నెట్లు చిత్త మొకమాటు గావున, వలవ దధిక దీర్ఘ వైర వృత్తి. ఉద్యో. 3-20

క. అని యూఱడిల్లఁ బలికిన, విని యతఁడు గలంకు దేఱి విభుఁడుం దానుం, జని సంగ్రామోత్సాహం బునఁ బొదవిరి తూర్య ఘోష ములు దివి ముట్టన్. ద్రోణ. 3-22

ఆ. ఏను నిలిచినట్లకా నూఱడిల్లు నీ,వున్న నన్నరేశ్వరోత్తముండు. ద్రోణ. 3-23

3. రాణించు, శోభిల్లు.

ఆ క్షుద్ర జంతువులకు గురులకు నెమ్మెయిఁ, దలఁప నొక్కరూప తల్లి వలయు, నూఱడిల్లఁగలదె యొండు చోటుల నువస్తువు నివాస మైన చోటఁగాక. శాంతి. 5-276

**ఊఱడు** దే. అ. క్రి. ఊరడిల్లు

1. విరమించు, ఊరకుండు.

క. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడకం దిగిచి ఆది. 4-19

వ. కృతవర్మ యతనిం దాఁకి

క. ఆఱమ్ము లతని మేనం, దూఱంగా నేసి నాల్గు తురగాంగములన్ గీటించి నఁ గని ద్రోణుం, డూఱడి ధర్మజుని దెసకు నున్ముఖు డయ్యెన్. ద్రోణ. 4-12,13

2. ఉపశాంతి నొందు.

క. అనినఁ గడు దెప్పయని నె,మ్మనమున నూఱడి విభుం డమానవ తేజో, ధనుఁడగు సహదేవుఁ గనుం,గొని యిట్లను. విరా. 1-97

క. అతివ తగునమ్మ నీగృహ, మతి నిర్మల చరిత భరిత మని యీ యెడ మత్పతులయసన్నిధినైనను, మతి నూఱడి యున్నచోట మన్నన దప్పన్. విరా. 2-84

3. స్వస్థమగు, స్వస్థచిత్తమగు.

క. ఉత్సాహంబున శత్రుకు, లోత్సాదన విధి యొనర్చి యున్నత సామ్రాజ్యోత్సవము నొందు పుత్రుల, నుత్సుకతం జూతుగాక యూఱడు మింకేత్పి. ఉద్యో. 3-206

క. పొంతకు వచ్చిన వానిన, కాంతునిఁగాఁ గొనుచు నొరునిఁ గాంతుం
పకి యే నెంతయు నూఱడి మనమున, జింత యొకఁడు లేకయున్నఁ
జెందు సుఖంబుల్ శాంతి. 4-18

క. అన్న సహదేవ నీవును, నన్నలతో నరిగెదయ్య యట యడవులకి,
వున్నను సుతులందఱు నిం,దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి
యుండున్ సభా. 2-289

ఊఱార్చు దే. స. క్రి. (ఊరార్చు)

ఓదార్చు.

వ. అయ్యాక్రందనధ్వని విని సంభ్రమించి సోమకుం డంతఃపురంబు
నకుం జని కొడుకు నూఱార్చి. ఆర. 3-210

ఊష్మ; ఊష్మము సం. వి. అ. న్. పుం.

1. వేడిమి.

శా. ...శస్త్రాగ్నిజ్వాలోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబు
విరా. 4-52

క. గందున రాధా తనయుఁడు, రెండు దినంబులు పెనంగి గ్రీష్మ
సమయ సూర్యుండుంబోలె వెలింగెడు, గాండివధరు శరకరోష్మఁ
గ్రాఁగె నరేంద్రా. అశ్వ. 3-124

2. ఉమ్మ, ఉక్క.

సీ. ...అతని నా,హాయమును గనుగొను నప్పు, డగ్గలంపు సందడి
నూష్మ జనింప నాజనంబులు. ఆశ్వ. 4-3

ఊష్మలత సం. వి. ఆ. స్త్రీ.

తేజస్సు, పరాక్రమము.

క. పావన శాంతత్వము నిజ,భావంబున నూష్మలతయుఁ బ్రకటంబు
లుగా, నా విధుఁడు మనుజ వేషుం,డై వచ్చెనో శిఖిశరీరి యయ్యో
నో యనఁగన్. విరా. 1-274

తే. అఁడుఁ జందఁబుఁ బురుష సమాకృతియును, గలిగియున్నది
యొప్పు నూష్మలత సొంపు, వికృత వేషాకృతంబులై వెలయ

కితఁడు, నిపులు కవిసిన మెఱయని నిప్పువోలె విరా. 4-75

**ఊష్మలత్వము** సం. వి. అ. న.

పరాక్రమము.

క. అనిన విని యింద్రాంశ సంజనితత్వ కలిత తేజోధనుఁడగు నర్జనం డయుండు దన యూష్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబులై నం బదరి దరస్మితంబున దద్వికారంబుఁ గప్పి యప్పుడమిఱేని కిట్లనియె శాంతి. 1-47

శ్లో. దర్శయ న్నైంద్రి రాత్మాన ముగ్ర ముగ్రపరాక్రమః. సం. భా. శాంతి. 8-3

**ఊష్మలము** సం. విణ. (అ. ఆ. అ.)

వేండ్రమైనది తీక్ష్ణమైనది.

వ. ఉదాత్త బ్రాహ్మణ్య నిధియైన భార్గవాన్వయంబునం జిత్రతర క్షాత్ర చరిత్రుండగు పరశురాముండు జనియించుటయు, నుత్తమ క్షత్రియత్వ మహోష్మలంబైన కుశిక వంశంబునం బరమ బ్రాహ్మణ్య విశ్రుతుండైన విశ్వామిత్రుం డుదయించుటయును నది యెట్లొకో. అను. 2-291

**ఊష్మలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వేఁడిమి గలవాఁడు.

క. భీష్ముని గర్వం బుడిపి మహోష్మలుఁడై కౌరవేంద్రు యోధుల కెల్లన్, గ్రీష్మాదిత్యుని క్రియ నర్చిష్మత్త్వము నూపి యడరె నేలు దెరఁగన్. భీష్మ. 2-278

**ఊష్మాయితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉష్ణకంబైనది వేఁడిమి కలిగించునది.

క. వాయువు చేష్టారూపము, వ్యోమము నెడ నభంబు ద్రవము మునికర జలమూష్మాయితమనలము గ శ్వాన్యాయితము ధరిత్రి యిటులైదు దెలుగుల్. శాంతి. 4-86

**ఊహ** సం. వి. ఆ. స్త్రీ. (ఊహము)

అపూర్వార్థము నుత్ప్రేక్షించుట. ఊహించుట, ఏదేని విమర్శించి నిర్ణయించుట.

వ. నీవును శుశ్రూషా శ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థ విజ్ఞాన తత్త్వజ్ఞాన సమన్వితుండవు. ఆర. 1-88

**ఊహము** సం. వి. అ. పుం.

వితర్కము, అపూర్వార్థము నుత్ప్రేక్షించుట, ఊహించుట.

క. ...సకలవేదో, హాపోహాతీత సార హరిహరనాథా మహా. 1

**ఊహించు** సం. స. క్రి.

1. వితర్కరించు, ఆలోచించు.

క. పారాశర్యుని కృతియయి, భారతమను పేరఁ బరఁగు పంచమ వేదం, బారాధ్యము జనులకుఁ దద్గౌరవ మూహించి నీవఖండిత భక్తిన్.

తే తెనుఁగు బాస వినిర్మింపఁ దివురుట. విరా. 1-17, 18

క. మన శస్త్రాస్త్రంబులు దక్కిన యవి యొక్కభంగి వీటికిని గాండివముం గొని పోయితిమేని సుయోధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. విరా. 1-158

2. తెలిసికొను.

వ. ఇట్లు దాన తమకంబున వడిగొనుచు నప్పుడయ్యంగన యింగితం బూహింప వెరవు మాలి మఱియును. విరా. 2-46

3. తలఁచు.

వ. అయిన నా నేర్చుకొలందిఁ దగిన తెఱంగున వారించి చూచెదం గాక యని యూహించి యిట్లనియె. విరా. 2-63

4. అనుమానించు.

క. భరమున నీ పోరెదు నెడఁ, బరమ విషాదంబు నీకు బలిమి మెఱసి యుద్ధుర వృత్తి జయముఁగొనినం, బరితోషము బొందు నన్ను భావించి మదిన్.

వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన

క. వలలుని దెస మాలిని చూడ్కులు తెఱఁగెడపొందుఁ దెలిసెదుం గంటిరె పేరలు వచ్చిన సమయంబును, దలఁపఁగ నొక్కటియ

యివ్విధం బెట్టొకొ్క. విరా. 2-198, 199, 200

"శ్లో. క్రుద్ధ్యంతీ మాం చ సంప్రేక్ష్య సమశంకత మాం త్వయి"

సం.భా. విరా. 19-12

5. ప్రశంసించు.

వ. అవ్విధంబునఁ గవ్వడి యాదుర్నివార సాధనంబు వారించుట నాలో
కించి యమ్మునీశ్వరు లమ్మహోత్కర్షం బూహించిరి. సౌప్తి. 2-78

6. మనస్సునఁ బాదుకొల్పు, దృఢబుద్ధి సేసికొను.

తే. మాతృపితృ దారపుత్రక భ్రాతృ శతసహస్రకంబులు సంసృతి
ననుభవింపఁ, బడియె నిందులో నెవ్వరి కడలునాఁడు, నరుఁ
డనిత్యత యూహించు టరయ నుఱవు. శాంతి. 1-218

7. పాటించు.

క. సంపద లేమికి మది శోకింపవు శత్రువుల చేఁకిని లోనగు టూ
హింపవు నిను నూరకునికి, పెంపని పాటించె దిట్టి బేలవుగద వే.
శాంతి. 4-870

# ఋ

**ఋక్కు** సం. వి. చ్. స్త్రీ.

ఋగ్వేదము.

వ. ఋగ్యజుః పఠన రవంబులును సామగాన నాదంబులును.
స్త్రీ. 2-172

**ఋత** సం. వి. తీ. స్త్రీ.

అజామీఢుని ముగ్గురు భార్యలలో నొకతె. ఆది. 4-101

**ఋక్షము** సం. వి. అ. పుం.

ఎలుఁగు గొడ్డు.

వ. పౌర వాన్వయ ప్రభవుండగు విదూరథ సుతుండు ఋక్షవత్పర్వ తంబున ఋక్షంబులు చేత రక్షితుండగుటయు. శాంతి. 2-92

**ఋక్షవంతము** సం. వి. అ. పుం.

కుల పర్వతము.

ఆ. మలయ మనఁగ శక్తిమంతంబు నా వింధ్య, మనఁగ పారియాత్ర మన మహేంద్ర, మనఁగ ఋక్షవంతమన సహ్యమన నిందు, గుల నగంబు వేడ్కఁ బొలుచు నధిప, భీష్మ. 1-84

**ఋక్షవత్పర్వతము** సం. వి. అ. పుం.

ఋక్షవంతము అను కులపర్వతము. చూ. ఋక్షవంతము,

**ఋక్షుఁడు** సం. వి. అ. పుం.

ఋచీకునకు అంగిరసైన సుదేవయను దానివలనఁ బుట్టినవాఁడు ఆది 4-2

**ఋగ్వేదము** సం. వి. అ. పుం.

నాల్గు వేదములలో మొట్టమొదటి వేదము.

సీ. వినుము ఋగ్వేదాది వేదములు నాలుగు. శాంతి. 3-119

**ఋచీకుఁడు** సం. వి. అ. పుం.

ఒక మహర్షి - ఈయన భార్య గాధిరాజు అని పేర్వడసిన కౌశికుని కుమార్తెయగు సత్యవతి. కుమారుఁడు పరశురాముని తండ్రియగు జమదగ్ని

ఈయన చరిత్ర ఆదిపర్వమునందును, శాంతి పర్వమునందును అను శాసనిక పర్వమునందును గలదు. ప్రధాన కథాంశములన్నియు సరిపోవుట చేత ఈ మూఁడు తావులఁ జెప్పఁబడిన వాఁడొక్కఁడే యనుటకు సందియము లేదు. ఆది. 3-70; శాంతి. 2-68 మొ, 71- వఱకు; అను. 1-104 మొ. 118 వఱకు.

సీ. విగతశోకుఁడైన యా భృగునకుఁ బుత్రుఁడై, చ్యవనుండు పుట్టె భార్గవ వరుండు, జనవంద్యుఁ డతనికి మను కన్యకకుఁ బుట్టె, నూర్వుల నౌర్వుండు భూరికీర్తి, యతనికి నూర్వురు సుతులు

ఋచీకాదు, ఉదయించి రఖిల భూవిదిత తేజ,లందు ఋచీకున
కొందంగ జమదగ్నియను ముని పుట్టెనాతనికిఁ బుట్టి-ఆ- రలఘు-
మతులు సుతులు నలువురు వారిలోఁ, బరశురాముఁ డాది పురుష
మూర్తి. ఆది. 3-79

దీనినిఁబట్టి చ్యవనుని కొడుకు ఔర్వుఁడు. ఔర్వుని కొడుకు ఋచీ-
కుఁడు, కాన ఋచీకుఁడు చ్యవనుని పౌత్రుఁడు.

ఆ. చ్యవన నందనుండు సత్యవతీ గర్భ,భంగి నూచి యకట బ్రాహ్మ-
ణుఁడు, గాఁడు తరుణి నీదు కడుపులోపలిబిడ్డ, క్రూరుఁడైన
రాచకొడుకు గాని. అను. 1-118

దీనినిబట్టి ఋచీకుఁడు ఆదిపర్వకథలోవలె చ్యవనుని మనుమఁడు గాక
కొడుకు అని తెలియుచున్నది. ఒకదాని కొకటి అసంగతముగ నున్నది.
సంస్కృత భారతమునందుఁ గూడ ఈయసంగత మిట్లే కలదు.

శ్లో. అన్యముత్పాదయామాస పుత్రం భృగు రనిందితమ్॥
చ్యవనం దీప్తతపసం ధర్మాత్మానం యశస్వినమ్॥
య స్సరోషాచ్చ్యుతో గర్భాన్మాతు ర్మోక్షాయ భారత।
ఆరుషీతు మనోః కన్యా తస్య పత్నీ మనీషిణః॥
ఔర్వ స్తస్యాం సమభవ దూరుం భిత్వా మహాయశాః,
మహాతేజా మహావీర్యో బాల ఏవం గుణైర్యుతః॥
ఋషీక స్తస్య పుత్రస్తు జమదగ్ని స్తతోఽభవత్।
జమదగ్నేస్తు చత్వార ఆసన్ పుత్రా మహాత్మనః॥
రామ స్తేషాం జఘన్యోఽభూ దజఘన్యై ర్గుణై ర్యుతః॥
సం.భా. ఆది. 66-46,47,48,49,50

ఇందు 'ఋషీకుఁడు' అని చెప్పి యున్నను అతఁడు ఋచీకుఁడు తప్ప
మఱొకఁడు గాఁడు, కొన్ని సంస్కృత ప్రతులలో ఋచీకుఁడనియుఁ గలదు.

శ్లో. కుశిక స్యాత్మజః శ్రీమాన్ గాధి ర్నామ జనేశ్వరః
అపుత్రః। సవేనార్థీ వనవాసముదావసత్॥
కన్యా జ సుతా తస్య వనే వివసతస్సతః।
నామ్నా సత్యవతీ నామ రూపేణాప్రతిమా భువి॥
తాం వవ్రే భార్గవః శ్రీమాంశ్చ్యవన స్యాత్మసంభవః।
ఋచీక ఇతి విఖ్యాతో విపులే తపసిస్థితః॥
సం. భా. అను 4-6, 7, 8 శ్లో

శ్లో. దృష్ట్వా గర్భ మనుప్రాప్తాం భార్యాం స చ మహామునిః
ఉవాచ తాం సత్యవతీ దుర్మనా భృగుసత్తమః॥ అను. 4-36 శ్లో.

మూలము నందున్న వ్యత్యాసమే ఆంధ్రీకరణమునందును గనఁబడు చున్నది. ఎవరిపాటికి వా రున్నదున్నట్టు లాంధ్రీకరించిరి.

**ఋజువు** సం. విణ. (ఉ. ఉ. జ్వీ. ఉ.)

సరియైనది, తగినది, యుక్తమైనది, కపటము లేనిది.

క. విమమీ తంత్రంబులకెల్లను నరయఁ బరాయణం బలఘుతర సంవి, త్తముఁడగు నారాయణుఁడ యతనిఁ బొందఁగ ఋజువులగు పథము లివి యధిపా. శాంతి. 6-516

**ఋణము** సం. వి. అ. న.

1. అప్పు-ఇది ధనరూపమునసే గాక ఉపకారమునను నుండవచ్చును

ఉ. ఏ విధి నీఁగువాఁడ ఋణ మెయ్యదిరయే,రియు వేఁడు డిచ్చెదన్. విరా. 3-232

(భీష్ముఁడు దుర్యోధనునితో)

క మును పదివేవురఁ జంపుదు,నని యిచ్చిన బాస వచ్చె నవనీశ్వర నీ, మనిచిన ఋణంబు దీర్చితి విను లావిటమీఁదఁ దఱుఁగు విధమై తోఁచెన్. భీష్మ. 3-319; శాంతి. 4-245

2. దేవఋణము, పితౄణము, ఋషిఋణము అని మూఁడు విధములు. శాంతి 5-80.

ఋణములు అయిదు.

1. దేవఋణము = ఇది యజ్ఞములు చేయుటచేఁ దీఱును 2. ఋషిఋణము = ఇది వేదాధ్యయవమువలనఁ దీఱును. 3. పితౄణము = ఇది శ్రాద్ధములు పెట్టుటవలనఁ దీఱును 4. అతిథి ఋణము = ఇది అతిథ్యభ్యాగత పూజలవలనఁ దీఱును 5. నరఋణము = ఇది సద్వ్రతములు ఆచరించుటచేఁ దీఱును. శాంతి 5-484

శ్లో. దేవతాతిథి భృత్యేభ్యః పితృభ్య శ్చాత్మన స్తథా,
॥ ఋణవాన్ జాయతే మర్త్య స్తస్మాదనృణతాం వ్రజేత్.
శ్లో. స్వాధ్యాయేన మహర్షిభ్యో దేవేభ్యో యజ్ఞకర్మణా,
పితృభ్యః శ్రాద్ధదానేన నృణా మభ్యర్చనేన చ॥

శ్లో. వాచా శేషావహార్యేణ పాలనే నాత్మనోఽపి చ, యథావద్భృత్య వర్గస్య చికీర్షేత్కర్మ ఆదితః సం. భా. శాంతి. 293-9,10 11

పర ఋణమే ఆత్మఋణము. పూర్వజన్మ సంచిత కర్మఫలము సద్ధర్మా చరణముచే తక్కువ సేసికొనవచ్చును.

**ఋతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. పూజింపఁబడినది, లీనరూపమైన బుద్ధిచే సంప్రాప్యమగు తత్త్వము,

సీ. వేసె తవ్యంబన విదితంబునా ఋతంబనఁగ సత్యంబన నతిశయిల్లు.
శా. తి. 5-845

2. సత్యమైనది. (వ్యతి-అనృతము)

క. వారికి ధర్మువు దప్పని, వారికి ఋతవచనులైన వారికి.
ఆర, 1-879

**ఋతుకాలము** సం. వి. అ. పుం.

స్త్రీ వెలుపలఁ జేరిన దినము మొదలు పదాఱవదినము వఱకుఁ గల కాలము ఇది గర్భధారణమునకు యోగ్యమగు కాలము.

["ఋతుస్తు ద్వాదశ రాత్రం భవతి దృష్టార్తవః అదృష్టార్తవాప్యస్తీత్యేకే భాషన్తే। (సుశ్రుతము శారీరస్థానము, తృతీయాధ్యాయము 5 సూ] దృష్టార్తవయగు స్త్రీకి ఋతు స్నానము చేసిన దినము మొదలు పండ్రెండు దినములు ఆర్తవము (ఋతు రక్తము, రజస్సు) కనఁబడు చుండును. కావుననే యా పండ్రెండు దినములు ఋతుకాల మనియెదరు.

'ఋతుష్షోడశ రాత్రయః -' అని గ్రంథాంతరమునఁ గలదు. మొదటి మూఁడు దినములును చివరి పదునాఱవ దినమును రజస్సు కనఁబడు చున్నను గర్భ ధారణమున కనర్హము లైన దినము లగుటచే ఋతు కాలము పండ్రెండు దినములని సుశ్రుతుఁడు నిర్వచించెను. ఆ కాలమున రజస్సు ఒకప్పుడు కనఁబడక పోవచ్చును. కనఁబడ కున్నను అది ఋతు కాలమే యగును.

శ్లో. ద్వాదశాద్వత్సరా దూర్ధ్వ మాపంచాశత్సమా స్త్రియః
మాసి మాసి భగద్వారా ప్రవృత్త్యైవార్తవం స్రవేత్ ॥
ఆర్తవస్రావదివసా దృతుష్షోడశరాత్రయః।
గర్భ గ్రహణ యోగ్యస్తు స ఏవ సమయస్స్మృతః ॥

సర్వాసామేవ చతుర్వర్ణ స్త్రీణాం సర్వవాది సమ్మతః పూర్వోక్త స్సమయః

(భావ ప్రకాశ - పూర్వ ఖండము – ద్వి.ప్ర 1, 2 శ్లో)

పండ్రెండు సంవత్సరముల వయస్సు దాటిన తర్వాత ఏబది సంవత్సరముల వఱకు స్త్రీకి ప్రతిమాసమునందు భగద్వారము నుండి స్వభావముగనే ఆర్తవము స్రవించు చుండును (పదాఱేండ్ల లోపు గలుగుట అస్వాభావికము) ఆర్తవ స్రావ దినము మొదలు పదునారు రాత్రుల వఱకు ఋతు కాలము. ఈ కాలమే స్త్రీ గర్భమును ధరించుటకు యోగ్యమగు కాలము. ఈ పదునాఱు రాత్రులును నాల్గు వర్ణముల వారికి ఋతు కాలమని సర్వ సమ్మతమైనది.

గ్రంథాంతరే తు విశేషః, తద్యథా - స్నానదివసా దూర్ధ్వం ద్వాదశ రాత్రావధి బ్రాహ్మణ్యాః, దశరాత్రావధి క్షత్రియాయాః, అష్ట రాత్రావధి వైశ్యాయాః; షడ్రాత్రావధి శూద్రాయాః, గర్భధారణే శక్తిః (భావ ప్రకాశ).

అత ఊర్ధ్వం ఋతు ర్ద్వాదశాహం బ్రాహ్మణానామ్, షకాదశాహం క్షత్రియాణామ్, దశాహం వైశ్యానామ్, నక్షత్రాత్ర మితరాణామ్ - ఋతుర్బీజకాల మవేక్షత ఇత్యాహు ర్మహర్షయః - (కౌమారభృత్య తంత్రము - ప్రథమాధ్యాయము.)]

సీ. ఋతుకాలమున నాత్మసతియందు రతి సల్పు భవ్యశీలుఁడు సద్బ్రహ్మచారి. శాంతి. 4-868; అను. 1-110

**ఋతుపర్ణుఁడు** సం. వి. అ. పుం.

అయోధ్యాపుర రాజులలో నొకడు - ఇతని యొద్దనే నలుఁడు బాహుకుఁడను పేరుతో వంటలవాఁడుగ నుండెను. ఇతఁడు నలునకు అక్ష హృదయము నుపదేశించి యతని వలన అశ్వ హృదయమును బడసెను.

మధ్యాక్కర - ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు మహిపుఁ డిక్ష్వాకు, కులమందు నీకు నెవ్వఁడగు. అర. 2-123-220

**ఋతుపుష్పరసము** సం. వి. అ. పుం.

ఋతురక్తము, ఆర్తవము, రజస్సు,

వ. గర్భ యోని యందు ఋతు పుష్పరస సంయుక్తం బగుచు రేతంబు గాడ్పు చేతం బ్రేరితంబయి కలసిన ఆది. 8–221

**ఋతుమతి** సం. వి. ఈ. స్త్రీ.

1. ఋతుకాలము నందలి స్త్రీ – ముట్టుత యైనది మొదలు పదాఱవ రాత్రి వఱకు కాలము గడపు స్త్రీ

సీ. అధిప రజస్వల నంటుట కల్మష, మా చరిత స్నానయైన సతిఁ జతుర్థ దినంబున దోషాసమయమునఁ జెందంగఁదగు నం్రదు గొంద ఱార్యులు – తే. ... ఋతు శక్తి యెడల కుంద, నెట్టి కార్యము గల్గిన ఋతుమతీ స,మాగమము దప్ప నీకున్న నాయు వెక్కు. అను. 4–126

2. ముట్టుతయై స్నానము నేసి పదాఱవ రాత్రి లోపం కాలము గడుపు స్త్రీ.

వ. ఋతు మతియై యున్న తన దేవి సుదేష్ణ యను దాని సమర్పించిన (చూ. ఋతుకాలము) ఆది. 4–232

3. పుష్పవతి, రజస్వల.

సీ. ఋతుమతి గాక శుద్ధతయుఁ గల్గిన యింతి, కన్య. అను. 5–285

**ఋతువు** సం. వి. ఉ. పుం.

1. రెండు నెలల కాలము. (ఋతువులు ఆఱు. 1. వసంత ఋతువు, 2. గ్రీష్మ ఋతువు, 3. వర్ష ఋతువు, 4 శరదృతువు, 5. హేమంత ఋతువు, 6. శిశిర ఋతువు.)

వ. అయ్యార్వురు ఋతువులు. అను. 2–218

తే. దినము రాత్రియు ఋతువులు మనుజుచేయు, సుకృతమును దుష్కృతమును జూచుచుండు. అను. 2–214; కర్ణ. 1–281

2. ఆఱు అను సంఖ్య.

తే. షడ్వయర్తు గుణంబులు. శాంతి. 5–46

8. స్త్రీ రజస్సు. అను. 4-126

తే. ... ఇట్టులు షోడశంబు దాఁక నెల్ల నాఁడును ఋతుశక్తి యెదల కుండ. అను. 4-126

**ఋతుస్నాత** సం. వి. ఆ. స్త్రీ.

ఋతుస్నానము చేసిన స్త్రీ, రజస్వలయై నాలవ దినమున స్నానము చేసిన స్త్రీ.

మ. మదిఁ గారుణ్యము నేసి విప్రవరుఁ డీ మంత్రంబు నాకిచ్చెనే, నిది యే చందమొ చూతునంచు నొకనాఁ డిచ్చన్ ఋతుస్నాతయై, సుదతీ రత్నము. అర. 7-324

**ఋత్విక్కరణము** సం. వి. అ. న.

ఋత్విక్కు చేయు కార్యము.

వ. అమ్మరీచ్యాది సప్తసంఖ్యలును మఱియునుం దత్సములగు మహానుభావులును ఋత్విక్కరణంబు లాచరించిరి. శాంతి. 6-361

**ఋత్విక్కు** సం. వి. జ్. పుం.

ఋత్విజుఁడు. చూ. ఋత్విజుఁడు.

సీ. ... దేవతలకుఁ దృప్తి, యగు నట్లుగా ఋత్వి గర్చన మొప్పఁగాఁ గావించునది. అను. 5-198; అశ్వ 4-187

**ఋత్విగాఢ్యుఁడు** సం. వి. అ. పుం.

ఋత్విక్కులలో ప్రధాన నిర్వాహకుఁడు.

క. విను ఋత్విగాఢ్యుఁ డగు న, మ్మునిపతి యట్లు కురువంశముఖ్యు, డొసఁగ మేదిని సంప్రమోదమునఁ గైకొని యిట్లను వానరేంద్ర కుంజరుతోడన్. అశ్వ. 4-186

**ఋత్విజుఁడు** సం. వి. జ్. పుం.

యాజకుఁడు.

(యజ్ఞకర్తచేత దక్షిణ పుచ్చుకొని) యజ్ఞము చేయించు బ్రాహ్మణుడు (హోత, ఉద్గాత, అధ్వర్యువు, బ్రహ్మ-అను వీరు నలువురు వీరిలో ఒక్కొక్కనికి ముగ్గురు చొప్పున బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రా

వరుణుఁడు, ప్రతిస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రుఁడు. సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు, ఉన్నేత-అని పండ్రెండు గురు సహాయ ఋత్విజులు)

క. జనజులు ఋత్విజులుగ నీపని యిటు సేయుమని నీ పుపద్రష్ట వుగా, విను కురుకుమార పశునిశసనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. ఉద్యో. 4-45

సీ. ...అగస్త్యుండు పండ్రెండేండ్లు సువ్రతాఖ్య, రతిఁజేయు మహాధ్వరమునకు దివ్యానుభావంబుగల యట్టి పరమమునులు, వేడ్క ఋత్విజులయి వెలయ. అశ్వ. 4-261; శాంతి. 3-116; సభా. 2-4

ఋద్ధి సం. వి. ఇ. స్త్రీ.

వృద్ధి, పెంపు

క. మహర్ద్ధి భక్త సమాజా. శాంతి. 4-456

ఋభువు సం. వి. ఉ. పుం.

వేల్పు, దేవత

క. ఋభువిభు విలోచనాంబుజ, శుభ దరవిశ్వా హారిత్వ సుభగ హారత్వా శాంతి. 6-628

ఋశ్యము సం. వి. అ. పుం.

మనుఁబోతు, ఒక జాతి మృగము దీని పాదములు తెల్లగనుండును.

ఆ. వాయు తనయు ఋశ్యవర్ణాశ్వముల మద్రపతి ధరిత్రిఁ గూల్చె. శల్య. 1-161

ఋశ్యమూకము సం. వి. అ. పుం.

పంపా సరస్సునకు దగ్గఱనున్న యొక పర్వతము. సుగ్రీవుఁడు నివసించిన కొండ. ఇచ్చట శ్రీరామ సుగ్రీవమైత్రి జరిగెను.

వ. పంపాభిధానంబయిన సరోవరంబు గలదు. దాని యావల ఋశ్యమూకంబను శైలంబునందు వాలి సహోదరుండు సుగ్రీవుండను వానరుండు సచివచతుష్టయ సహితుండై యుండు. అర. 6-868

(సంస్కృత భారతమునందు 'ఋష్యమూకము' అని గలదు.

శ్లో. ఏషా పంపా శివజలా హంస కారండ వైర్యుతా, ఋష్యమూకస్య
శైలస్య సన్నికర్షే తటాకినీ. సం. భా. అర. 2-78. 44 శ్లో.

శ్లో. తా వృష్యమూక మభ్యేత్య బహుమూల ఫలద్రుమమ్
సం. భా. అర. 279-9.

**ఋశ్యశృంగుఁడు** సం. వి. అ. పుం.

ఒక ముని ఋశ్య మృగము కొమ్మగలవాఁడు.

విభాండకునకి ఋశ్యమృగి (మనుబెంటి) యందుఁ బుట్టినవాఁడు. ఇత నికి నెత్తియందొక కొమ్ముగలదు. ఇతని భార్య అంగరాజైన రోమపా దుని కూఁతురు. శాంతయను పేరుగలది. చూ-చరిత్ర.

అర. 8-87; మొ. 118 వఱకు

శాంత దశరథుని కూఁతురు, తల్లిపేరు తెలియదు. దశరథుఁడు తన కూఁతురగు శాంతను తనకు మిత్రుఁడును అంగరాజు నగు రోమపాదు నకుఁ బుత్రిగా నిచ్చెను. శ్రీమద్రామాయణము బాలకాండ. 11 వ సర్గ.

సంస్కృత భారతమున ఋశ్యశృంగుఁడు అని కలదు-శ్రీమద్వాల్మీకి రామాయణమున ఋశ్వశృంగుఁడు అని కలదు.

**ఋషభకూటము** సం. వి. అ. పుం. న.

ఒక పుణ్యతీర్థ ప్రదేశము. ఋషభుఁడను మహర్షి నివాసస్థలము ఇచ్చట దేవ ఋషులు యజ్ఞముచేసిరి. యజ్ఞ భూములయందుఁ గుశాకారంబు లైన దూర్వాంకురములు యూపాకారంబులైన వృక్షంబులు గానం బడును. దీనికి హేమ కూటమనియుఁ బేరు గలదు. అర. 8_85

సం. భా అర. 110. అధ్యా.

**ఋషభము** సం. వి. అ. పుం.

1. ఒకానొక పర్వతముం జరాసంధుని పట్టణమైన గిరివ్రజమును చుట్టుకొని యున్న యైదు పర్వతములలో నొకటి సభా. 174

చూ. ఋషిగిరి.

2 ఎద్దు.

వ. (కృష్ణ భీమ పార్థులు) చైత్యక గిరి శృంగంబున కరిగి యందున్న మహాదుందుభులం జూచి తొల్లింటి మాగధులు మానుషాదంబను

ఋషభంబు వధియించి దాని చర్మంబున దీనిని నిర్మించిరి.
సభా. 1-175

**ఋషభుఁడు** సం. వి. అ. పుం.

ఒకముని ఋషభకూటము నందుండు వాఁడు.

ఆ. ...ఋష, భాఖ్యుఁడైన తపసి. శాంతి. 3-151

క. ఋషభుండు సుమిత్రుని చిత్తంబు మృగయాశాయత్తంబు గాకుండునట్లుగా బోధించె. శాంతి. 3-168 చూ. వివ, అర. 3-85

**ఋషి** సం. వి. ఇ. పుం.

ముని జ్ఞానముచే సంసార సాగరమును తరించినవాఁడు విరా. 3-150

సప్తర్షులు:- 1. మరిచి. 2. అత్రి, 3. అంగిరసుఁడు, 4. పులస్త్యుఁడు, 5. పులహుఁడు, 6. క్రతువు, 7. వసిష్ఠుఁడు. మఱియొక్కమన్వంతరమున

1. కశ్యపుఁడు, 2. అత్రి, 3. భరద్వాజుఁడు, 4. విశ్వామిత్రుఁడు, 5. గౌతముఁడు. 6. జమదగ్ని, 7. వసిష్ఠుఁడు.

వీరు దేవర్షులు, బ్రహర్షులు, రాజర్షులు అని మూఁడు తెగలు.

మఱి యొక క్రమమున 1. మహర్షి, 2. పరమర్షి, 3. శ్రుతర్షి, 4. కాండర్షి - అని నాలుగు తెగలు.

**ఋషికుఁడు** సం. వి. అ. పుం.

అర్కుని అంశమునఁ బుట్టిన వాఁడు.

వ. అర్కుండు ఋషికుండై పుట్టె. ఆది. 3-80

శ్లో. అర్క ఇత్యభివిఖ్యాతో యస్తు శాపపుంగవః. ఋషికో నామ రాజర్షి ర్బభూవ నృపసత్తమః.

సం. భా. ఆది. 67-33,34 శ్లో.

**ఋషికుల్య** సం. వి. ఆ. స్త్రీ.

ఒక తీర్థ ప్రదేశము - దీనిని సేవించిన దురితంబులు పోవును.

అర. 2-271

ఇది ఒక నది. అతి ప్రాచీన తీర్థ ప్రదేశము అని సం. భా.

**ఋషిగిరి** సం. వి. ఇ. పుం.

ఒక పర్వతము. జరాసంధుని పట్టణమైన గిరివ్రజమును చుట్టుకొని యున్న యైదు పర్వతములలో నొకటి.

క. గోధమును ఋషభము వైహారము ఋషిగిరియు, జైత్య కాద్రియు ననఁగా, భూరి గిరు లేను దీనికి, భూవ భటుల వోలెఁ గాచి చుట్టున నుండున్. సభా. 1-174

**ఋషితర్పణము** సం. వి. అ. న.

ఋషుల నుద్దేశించి చేయు జల తర్పణము.

వ. వాసవ సుతుండు ... ఒక్కనాఁడు ప్రభాతంబ విధిపూర్వకంబు నం గృతాభిషేకుండయి దేవర్షి పితృ తర్పణంబులు సేసి. ఆది. 8-127

**ఋషితీర్థము** సం. వి. అ. న.

ఋషుల కొసఁగు తీర్థము.

కుడిచేతి వ్రేళ్లను గుప్పిలిగా సగము వంచి అంగుష్ఠము తర్జని యను వ్రేళ్ల మధ్య నుండి చిటికెన వ్రేలి దిగువఁగాఁ బడునటుల విడుచు జలము.

తే. అంగుళాగ్రముల్ సిటికెనలందు మొదలు, లనఘ దేవర్షి తీర్థము లనఁగ బరఁగు, వరుస వలకేలి యుప్పలవాయి పైతృకంపుఁ దీర్థంబు తర్పణ కార్యమునకు. అను. 4-118

# ఎ

**ఎ[1]** ప. అవ్య.

1. అవధారణార్థకము.

చ. ... పెన్నొడకా, వితిగి ధరిత్రిఁ బడ్డ యెడ వేగమె వచ్చి శిరంబుఁ దన్నె. కల్య. 2-387; విరా. 3-134

శా. ... మే, లామై తోదనె పోవుఁగాక యని వీరాలాపముల్ పల్కి. విరా. 3-139

2. నిర్దేశమును (చూపుటను) బలపఱచును.

చ. ఇదె యొక పిన్నవాఁ డదరి యెక్కుడు మూఁకల క్రంపు దోలెడున్. ద్రోణ. 2-11

ఆ. కర్ణు కేతనంబు గ్రాసెకు నల్లదె. విరా. 5-70

ఆ. వీఁడె వచ్చు చున్న వాఁడు పార్థుఁడు మన మేమి సేయు వారము విరా. 5-181

వ. అదె యంగ సైన్యంబల్లదె దాక్షిణాత్య సేన. ద్రోణ. 4-12

3. ఆధిక్యమును (ఎక్కువను) తెల్పును.

క. అమరనదీ తనయుఁడు సింహము గాక నరుండె. శల్య. 1-24

ఎ[2] అవ్య.

1. ప్రశ్నార్థకము. (ఇది సందర్భానుసారముగా అభీష్ట పరిహాసాశ్చర్యాదులను గూడఁ దెలుపును.)

(అభీష్టము)

క. అతి గర్వమున్నత మగు, నతని శిరము వాని వారలందఱు బాష్పాంగతితో, జూడఁగ సమర, క్షితి ద్రొల్లెనె విజయ నీదు శిత భల్లమునన్. కర్ణ. 3-37

క. జననుత యామ్రానిని నన్నును మఱి నీ భ్రాతృవరులనుం జూచితె నీ, వవపుడుఁ జూచితి నన్నిటి, ననఘా వృతుమున నున్న యవ్విహగము తోన్. ఆది. 5-250

క. పారమతిఁ జేసి మానస, శారీర రుజావళులకు సతతంబుఁ బ్రతీకారములు సేయుచుందుదె, యారఁగ వృద్ధోపసేవ నౌషధసేవన్. సభా. 1-31

(పరిహాసము)

క. వీరెవ్వరయ్య ద్రుపద మ్మహారాజువె యిట్లు కృపణులయి పట్టువడన్, వీరికి వలసెనె యహహా మ్మహారాజ్య మదాంధకార మది హా సెనోకో! ఆది 6-89

(ఆశ్చర్యము)

సీ. అనవుడు రాతసుం డట్టహాసంబుతో, నెక్కెట్టు ధీముండె యీతఁ
డేమి, పుణ్యమో వీని నెప్పుడు సంపఁగాంతునో, యని యున్నచోఁ
దాన యరుగుదెంచె. ఆర. 1-116

వ. ఆచ్చిత్రము సూచి యచ్చోటం గల యట్టి.

క. ఎల్ల జనులు నివ్వెరుం, డొల్లడుగా కుత్తమాంగ మూర్వి నిటుల వే,
డొల్లఁగ నేయఁడె వలసినఁ, దెల్లంబో యితని కరుణ చెలువిట్లున్నే.
అశ్వ. 4-120

(పరిహాసము - అవమానము)

క. వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు కృపణులయి పట్టు
వడన్, వీరికి వలసెనె యహహా మహారాజ్య మదాంధకార మది
వాసెనొకో. ఆది. 6-89

సీ. ... సాత్యకి కృతవర్మని, వదనంబు గనుఁగొని మద మెలర్ప,
నొద్ద నిల్చున్న ప్రద్యుమ్ను చే సఱచుచు, నవమాన మేర్పడు
నట్టి భంగిఁ, బెలుచ నవ్వి యరాతి బృందంబు నిద్రావ, శత్వంబుఁ
బొందుటఁ జావు వోని - తే-దుష్టదశ నొంది యుండంగఁ దుచ్ఛుఁ
డేని, నడరి వధియింపఁగా బోరఁ డనిన రాజతనయుఁ డంత
పాపంబు సేయునె యితండు, పొడిచెనటె యిస్సిరో యిట్టి పోటుఁ
బోటు. మౌస. 42

(కాక్వర్థమును - ప్రశ్నించిన విషయము యొక్క వ్యతిరేక నిశ్చయ-
మును - తెలుపును)

తే. ఒక్కరుని కివి యెల్లను నిక్క మట్టె, యెందుఁగలుగునె యర్జును
నీడువాఁడు. విరా. 2-204

క. ... పాండవులకుఁ, జేసిన కీడెల్ల భంగిఁ దెలుపదె మిమ్మున్.
ద్రోణ. 5-31

తే. ... భూసురులకు, నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె.
శాంతి. 1-284

క. ... నేఁ, బ్రాకట భూసుర కన్యక, నీ కట్టిన మైల గట్ట నేర్తునె.

యనినన్. ఆది. 3-185

2. ప్రార్థనార్థకములగు మధ్యమ 'ము,' 'ఁడు' - లకు అనుప్రయుక్త మగుచు.

తే. అర్థములు బంధువులుఁ గల్గినపుడు తద్వి, యోగ మైనట్టి యెడను మర్త్యునకు నెద్ది, తలఁపుమై నున్న మద విషాదంబు లడర,కుండఁ జెప్పవె యది కృపాయుక్తి ననఘ (చెప్పుము + ఎ = చెప్పవె) శాంతి 1-211; శాంతి. 3-449

వ. ఎల్లవారికి ననుష్ఠింప నయ్యెడు నట్టి పుణ్య కర్మంబెయ్యది యుప దేశింపవే యనుటయు (ఉపదేశింపుము + ఎ = ఉపదేశింపవె.) అను. 4-160

వ. మానవులకుం గర్మభూమి కృతంబులైన సదసత్కర్మంబులం జూవె దేవతలును గీటంబులు నగుట వాటిల్లెడు. అను. 4-326

(చూడుము + ఎ = చూడవె)

ఎ[3] సర్వ.

సమాస పూర్వ పదముగా నున్న యత్కిమర్థక మగు 'ఏ' అను దానికి కొన్ని చోట్ల వచ్చెడి యాదేశము.

క. మన మొక యేవుర మీయం,గనయుం దో నరుగు దేరఁగా నెయ్యెడఁ బో,యిన నెఱుఁగ కుందురె (ఏ + యెడ = ఎయ్యెడ.) విరా. 1-59

తే మీకెప్పని నడపవలయు—(ఏ + పని = ఎప్పని.) శాంతి. 2-208

చ. ... ఎప్పరుసున లెస్స చేసినను. ఉద్యో. 3-82

ఎంగిలి దే. విశే.

1. నోటికిఁ దగిలి అపవిత్ర మైనది. ఉచ్ఛిష్టము, తినఁగా మిగిలినది.

సీ. పీత వికారమై వీరయోధ, చారు శరీర సంచయ ముండఁగా దీనిఁ, గంక శివాగృధ్ర కాక కులము, లాదిగాఁ గలుగు క్రవ్యాద ములే పీఁకు పీఁకాడుఁట నెంగిలి యయ్యె. స్త్రీ. 2-14

సీ. ... యెంగిలి వర్జించి యిలువడి, యుటశుద్ధి గలిగిన కాంతలందు-గి - నిల్చు. అను. 1-285

వ. ఆ కోమటి కొడుకుల యెంగిలి కూటం బెరిఁగిన యక్కాకంబు.
కర్ణ. 2-81

క. నను( గుచ్ఛితంపుఁ బనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక
తగు మన్ననతోడ నరయు వారల, కనురాగము నెఱపి నడతు
రస్మత్పతులున్. విరా. 1-329

2. అనుభవింపఁబడినది.

క. మును మేమాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశంబో,
మనసా నీ వెంగిలి కాఁదనుమా యవ్విషయ మెక్కుడయ్యెడు
మనలోన్. అశ్వ. 2-36

శ్లో. "భోగా నపూర్వా నాదత్స్వ నోచ్ఛిష్టం భోక్తు మర్హసి.
సం. భా. అశ్వ. 22-28

వి.

1. తినఁగా మిగిలిన పదార్థము.

వ. కురకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడు వారల
ధిక్కరించెదవు. కర్ణ. 2-81

క. విను మడుగులపై( బడి యైనను నెంగిలి గుడిచియైన నరులకుఁ బగ
లోఁ, గాని యరుల కినుపడఁచి బ్రదుకనవలయు నిహమ్ముఁ బరము
గలుగునె చెడినన్. ద్రోణ. 4—248

2. భుక్తశేషము తినుట వలనఁగాని స్పృశించుట వలనఁ గాని కలుగు
దోషము.

సీ. ... గోవుల, కెంగిలి లే దిందుఁ డెట్టు లమృత, మొసఁగు నట్టుల
గోవు లొసఁగు దుగ్ధంబులఁ, దద్వత్స పీత దుగ్ధంబు శుచియ కాన
కోపము దక్కి వర్తింపుము. అను. 8-24

ఎంచు దే. స. క్రి.

ఆరోపించు.

క. ఏ నుపదేశించితి ననఁ,గా నొక పెంపెంచి వాఁడు గాని తలంపన్,
మానవనాథ సురేశ్వర,సూనుఁడు నాయట్టివాఁడ చుమ్మే
పనికిన్. శల్య. 2—847

**ఎండ** దే. వి.

1. సూర్యుని ప్రకాశము, ఆతపము.

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసము నాక. విరా. 1-186

2. కాంతి.

సీ. సమర విశాసంబు చెమట నొప్పఁబకుండ హేతి దీధితులు రే యెంత నొడుచు. భీష్మ. 1-119

**ఎండకన్ను వానకన్నును నెఱుంగని** దే. జాతి.

రాణివాస మందుండి బయటికి రాని, ఎండ మొగము వాన మొగముఁ జూడని.

ఆ. వచ్చి రెండ కన్ను వాన కన్నును నెఱుం, గని పురంధ్రు వెల్లి - అక్కఱువృద్ధుఁ జూడ. ఆశ్ర. 1-148

**ఎండమావులు** దే. వి. బ.

(ఎండ + మావులు = ఎండలో గుఱ్ఱము వలె చలించుచుఁ గనఁబడు చాయలు.)

మట్ట మధ్యాహ్నమున బయళ్లయందు నీటివలెం దోఁచెడు చాయలు. మృగతృష్ణ.

క. మతిఁ దలఁపఁగ సంసారం, బతి చంచల మెండ మావు లట్టుల సంపత్ప్రి తతు లతిక్షణికంబులు, గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్. ఆది. 5-159

**ఎండయెక్కు** దే. అ. క్రి.

ప్రొద్దగు, ఎండ తీక్ష్ణమగు.

క. కడు నెండ యెక్కు నంతకు, నుడుగక యచ్చునుప గడచి. అర. 2-108

**ఎండిపోవు** దే. అ. క్రి.

శుష్కించు.

చ. అనయముఁ బండు చుండు నెద నాశ్రయ మొప్పిన నిల్చి యెండి పోయిన తడిఁ బాసి పోక తగ వెట్లు కృతఘ్నత గాదె అను. 1-156

**ఎండు** దే. అ. క్రి.

1. శుష్కించు, నిస్సారమగు.

ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచి నట్టి కో,పానల మెండి యున్న నది డాటవిపైఁ బచరించు తీవ్రదా,వానలుఁ బోలి. ఉద్యో. 2-187

2. ఆఱిపోవు, తడిలేకుండఁ బోవు.

క. శరవేదన సర్వాంగము, నెరియఁగ నాకిపుడు పెదవు లెండెడుఁ దృష్ణా,భర ముడుపఁదగిన నీళులు, వెరవునఁ దేనేర్తు వీవ వే తెమ్మనమా. భీష్మ. 3-428

**ఎంత** దే. ఔ. అనో.

1. ఏ పాటిది, ఏ కొలఁదిది (ఈ యర్థమున 'లు' వర్ణాంత రూపమును ఆమ్రేడిత రూపమును గలవు.)

ఉ. ఇంతకు నేర్పు నీకు నొక యింతటిలోన మదీయ వాణి న,త్యంత విభూతిఁ బెంపెసఁగు నట్టి నినుం గొనియాడఁజేసె దా,నెంతటి పెద్ద. విరా. 2-194

చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్దమంబుగా, మునుమును గూర్చి. విరా. 3-108

చ. అలఘు తపంబులం బ్రకట యాగములన్ ముని బోధిత వ్రతం, బుల మహనీయ దానములఁ బుణ్యచరిత్రములన్ మహాత్మ తెం, తలు రమణీయ విశ్రుత పదంబుల కేగుదు రంతకంటె ను,జ్జ్వల మగు సద్గతిం బడయు. ద్రోణ. 2-388

2. సందర్భమును బట్టి అధికత్వమును అల్పత్వమును సూచించును.

క. తానెంత యాప్తుఁడైన మ,హీ నాయకు సొమ్ము పాలు నెమ్ము లుగా లో,నూనిన భయమునఁ బొరయక, మానిన గాకేల తలుగు మానము బ్రతుకున్. విరా. 1-186

చ. ఎంత లెం,తలు వడి వాని నీఁగ వలదా?

ఉద్యో. 3-201 (పాఠాంతరము)

తే. ... నీ యుత్తమ నాయకత్వ, మెఱిఁగి నిన్నుఁ గొనియాడ నే
నెంతదాన. విరా. 2-361

తే. నాథుల దూఱంగఁ గాదు వినుము, సతికిఁ దానెంత వడియును
సభల లోన. విరా. 2-148; ఉద్యో. 4-386

3. ఎంత కాలము.

క. ఎంతకుఁ గృతకార్యుండగు, నంతకుఁడీ రంతకును భయం బందక
ని,శ్చింతమున నుండుఁడు. ఆది. 7-266

4. ఎంతకు లేదు - ఎంతకుఁ గాదు. ఎంతకైననుఁ దగును.

క. పారాశర్యాది మునులు, నీరాజన్యులును వినికి యెంతకు లేదీ,
గారాము నాకుఁ బరమో,దారపదావాప్తి గాదె ధర్మతనూజా.
అను. 4-394

5. సంబంధ సర్వనామము.

చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్గమంబుగా,
మును మును గూర్చి. విరా. 3-108

ఎంతదవ్వు దే. వి.

1. ఎంత దూరము.

తే. ... ఎంత దవ్వు, ననిన నడవికిఁ గడలేమియును మృగ వ్రజంబు
పొదువుటయును గొందలంబు సేయు. స్త్రీ. 1-46

2. అసంభవము.

తే. ద్రోణ కర్ణ దివ్యాస్త్రముల్ క్రూర భంగిఁ, గవియు నప్పుడు
మము నీవు గావకున్న, బ్రదుకు టెంతదవ్వధిక శుభంబులను
భ,వత్ప్రసాదంబు గని. కాదె వాసుదేవ. శల్య. 2-389

ఎంతదాఁక అవ్య. ద్రు. (√ఎంత)

ఎంత వఱకు, ఎంత పర్యంతము.

గీ. ఇలయు గిరులును శరధులు నెంత దాఁకఁ, గలుగు నంత కాలం
బును వెలయుచుండు, శుకుని కీర్తియు. శాంతి. 6-341

**ఎంతయు** విశే. ద్రు. (√ఎంత)

అధికము, మిక్కిలి.

క. ఎలమియు వచ్చెరువును సరి, నెలసి పొదలు మానసమున కెంతయుఁ

బ్రొద్దేఁ, గలలోనఁ గన్న చందము, దలఁచుచు నుండితిని భక్తి

తాత్పర్యమునన్. విరా. 1-25

గీ. సుతుల విద్యా ప్రవీణతఁ జూచు వేడ్క, నెంతయును సంత

సంబునఁ గుంతిదేవి, రాజసన్నిధి గాంధారరాజపుత్రి, కెలనమండె.

ఆది. 6-6

క్రి. విశే. ద్రు.

మిగుల, అత్యంతముగా.

క. మాతృ వియోగం, బెప్పుడు వాటిల్లె నపుడ యెంతయు దూలున్.

శాంతి. 5-277; శాంతి. 6-202

సీ. ... త త్తపమున, కెంతయు వెఱచి. ఆది. 4-86

**ఎంతేసి** దే. అవ్య. (ఎంత + ఏసి)

ఎంత చొప్పున.

సీ. పాండవుల బలమంతయు సమయింపఁ జాలుదు రెంతేసి కాలం

మానమున. ఉద్యో 4-420

**ఎంతవట్టు** దే. అవ్య.

ఎంతవఱకు.

క. నీ విషయ మెంత వట్టది,యే విని పరవిషయమునకు నేఁగెద.

అశ్వ. 2-88

**ఎందఱు** సర్వ. బ. (√ఎంత శబ్దమునకు మహన్మహాత్వర్థకరూపము)

ఎంత మంది.

చ. ... వెఱచితిరేని నిల్వఁ డొక పేరున కొక్కడు చాలుఁ గాక

యెం,దఱు వలయుం. విరా. 4-201

ఉ. అందు వృకోదరార్జునుల నాహవ రంగమునందుఁ ద్రేణి వేయు

వా,రెందఱొ యెన్నిమా యచట నీ గొరు భీష్ములుఁ ద్రేణి

వేయువా,రెందఱొ . ఉద్యో. 3-264

ఎందాఁక (√ఎంత)

ఎంత దాఁక.

గీ. ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్య
లోకము గలుగు నంద్రుడు. ఉద్యో. 2-67

గీ. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు, కీర్తి యందాఁక నక్షయ
స్ఫూర్తిఁ దాల్చి, నడవఁగల యది. శాంతి. 2-148

ఎందు అవ్య. ద్రు. (ఇది సందర్భమును బట్టి దేశము విషయము మొదలగు వానిని దెలుపును.)

1. ఏ చోట నైనను, ఏ తావునందు.

ఉ. ఎందున నిట్టి రూపు నరు లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం,
క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలరె. విరా. 2-26

వ. ఇక్కుమారున కెందు వివాహంబు సేయుద మని విదురునితో
విచారించుచుండె. ఆది. 5-16 (ఎందు = ఏ తావున)

2. ఏ విషయము నందు.

క. అరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా,
చారము మై ప్రవర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్.
(ఎందు = ఏ విషయము నందు) విరా. 1-112

ఆ. ఎల్లదాని నేన యెఱుఁగుదు నెందు వా,రర్థ్యు ల దాన యోగ్యుఁ
డయ్యెఁ జెపుమ. సభా. 2-41

3. ఎల్ల యెడల, అన్నిచోట్ల.

ఆ. పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గ
మంపుఁ జోటు, దుర్గమంపుఁ జోటు దొన దొన గుహ గుహ,యాది
గాఁగ నెందు నరసి యరసి. విరా. 3-82

వ. ఎందునుం జరియించు వారొక్క నాఁడు జమదగ్ని యాశ్రమంబు
నకుఁ బోయి. శాంతి. 2-78

వ. నారదుం డెందునుం జరించుచుండి పంచచూడ యను నచ్చర
వేను వొక్కెతం గాంచి. అను. 2-166; ద్రోణ. 1-78

4. ఎవ్వరి యందైనను.

క. ఈ నలువుర భుజశక్తుల,తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం, గానము గావున వీరల, లోనన యొకడొరుల కని గెలువు సమకూరున్. విరా. 3-114

5. ఎప్పుడైనను.

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం,ద్రున కిట్లను దూత లెందుఁ దొలితొలిగుడువం, గానఁ గట్టఁ దొడఁగుదురె వచ్చిన కార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. ఉద్యో. 3-249

(దీనికిఁ గొన్ని విభక్తులు చేరుటయుఁ గలదు)

## ఎందుండి

ఎచట నుండి.

క. ఎందుండి యేమి పనికై, యెందుల కరిగెదవు. శాంతి. 3-479

వ. అమ్మహీపతి మహాభాగ యెందుండి రాక యే దేశంబులఁ జరించితిరి. ఆశ్ర. 2-145

## ఎందును

1. అన్నిటి యందు.

క. అని పలికి భీష్ముఁ డిట్లను, విను మెందుమదీప దాన విధి మే లని శం,బునఁ జేయ నూర్ధ్వ లోకం,బును గర్తకుఁ బరమ దివ్య బోధము నిచ్చున్. అను. 4-40

ఆ. ... అమర, భావమున సుఖంబు జీవింతురవె దీని, నేలఁ గనిన వాఁడ యెందుఁ బెద్ద. ఆది. 4-158

2. అంతట, సర్వత్ర.

మహాస్త్రగర్ధర - వజ్ర నిర్ఘోష మెందుం, జెలఁగం జొచ్చెన్, సౌప్తి. 2-65

## ఎందేని

1. ఎక్కడకో.

వ. వృత్రారి ...నహుషునంత బలంబు లేమిం జేసి భయాకుల చిత్తుండై.

క. ఎందేనిఁ జనియె. ఉద్యో. 1-169,170

2 ఎచ్చటికైనను.

క. దాని నెఱింగి గృహంబున, మానిత మగు చేదువునందు మనసు గొలుప కెం,దేనిఁ జని చదువుదురు శ్రుతు, లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్. అను. 2-159

## ఎందేనినుండి

ఎక్కడ నుండియో.

వ. శర్మిష్ఠ లజ్జావనత వదన యయి యిట్లను నెందేనినుండి యొక్క మహాముని నిఖిల వేద వేదాంగ పారగుండు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్రోత్పత్తిఁ బ్రసాదించె. ఆది. 3-181

## ఎందేనియు

ఎక్కడకో.

వ. సైంధవుండు దన చారులచేత నీ యాడినమాట విని వెఱచఱచి కురురాజు గొలువున్న చోటికిం జని సిగ్గఱి నన్ను నగ్గించి నీ ప్రతిన యెఱింగించి యతం డరిగిన మీరు గావలేరని పలికి తా నెం దేనియుం బోయెద ననిన. ద్రోణ. 2-104

## ఎంపనుగ్గులు దే. వి. బ.

ఎమికల ముక్కలు.

ఉ ... పోరి రుదగ్రులై గదల్, మండగ నెత్తురుల్ సెదర మాంసము పిండిగ నెంపనెగ్గు లొండొండధరిత్రిపైఁ దొరఁగ. ద్రోణ. 2-122

## ఎంపపొడి దే. వి.

ఎముకల చూర్ణము.

క. ... బోమర్దనుఁడా ... యా,తనిమీఁద నుఱికి క్రొమ్మెఱుఁగనుకని నెరెప పొడి సెదరఁగాలం గేలన్. ద్రోణ. 5-62

## ఎఁతు ప్ర.

పరిమాణార్థకము.

గీ. అతఁడు వుడిసెఁడు నీ రన యప్పు డతనిఁ దెలచి.

అశ్వ. 1-84; భీష్మ. 3-410 - శల్య. 6-115

**ఎకవెక్కు** దే. అ. క్రి.

వైకవెక్కి వెక్కి యేడ్చు.

సీ. అనవుడు నెకవెక్కి యా బిడ్డ వైచి పోయెను వారలకు.
(పాఠాంతరము) శాంతి. 3-377

**ఎక్కఁబాఱు** దే. స. క్రి.

అధిరోహించు

ఆ. విరథుఁడై యతండు వృషసేను రథమెక్కఁ బాఱుటయును గలఁగ బాఱె సేనలు. ద్రోణ 4-161

శ్లో. హతాశ్వాత్తు రథా త్తూర్ణమవప్లుత్య విశాంపతే, స్యందనం వృషసేనస్య సమారోహ న్మహారథః. సం. భా. ద్రోణ. 129-39

**ఎక్కటి** సర్వ. ఏ.

1. ఒక్కఁడు, అసహాయుఁడు, పరాపేక్ష లేనివాఁడు.

ఉ. డెక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగమీక నీ, వెక్కటి మ్రింగఁ జూచెదది యెట్లగున్, ఉద్యో. 2-62

క. ఒక్కరుని నీవు సంపక, తక్కిన నంతటనె ప్రతిన దప్పువె విభవం, బెక్కఁగ మీరున్న నతం, డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా. స్త్రీ. 1-171

ఉ. ఒక్కరుఁడైనఁ గేశవు హితోక్తికి మేకొనఁడయ్యె, నర్జునుం, డెక్కటి దాన చాలుఁ దమునందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్చ. ఉద్యో. 4-54

క. ఇక్ష్వాకువంశంబున నీ వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం, బెక్కటి సేకొని తేజము, దిక్కుల వెలిగింపు సంతతియుఁ బడయుమొగిన్, ఆది. 4-220

2. ప్రత్యేకమైనది, మఱొక దానితోఁ గలియనిది.

క. ఎక్కటి యట్టివి దోషము, లొక్కొకట మరి రెండు మూఁడు నొదవి పెరయేఁ దా, నక్కడు సన్నిపాతం,బు. అశ్వ. 1-174

3. సాటిలేనిది.

ఉ. ఎక్కటి గాండివంబు మఱి కెక్కి వెలుంగుట. ఉద్యో. 2-194

4. శూరుఁడు.

చ. రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్త్రుఁ డెక్కటి దివి చూఱకొ౯
ప్రియము కాకిది యప్రియమే తలంపఁగా౯. ద్రోణ. 2-257

5. దురాశ, పేరాస.

క. ఇక్కొ-ఱగాములలోపల, నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ యొరు
నొ,మ్మెక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గతమేమి సెపుము
నిద్ర సెడుటకు౯. ఉద్యో. 2-22

శ్లో. కచ్చిచ్చ పరవిత్తేషు గృధ్యన్న పరితప్యసే.
సం. భా. ఉద్యో. 82-14

**ఎక్కటికయ్యము** దే. వి.

ఒకనితో ఒక్కఁడే చేయు యుద్ధము, ద్వంద్వ యుద్ధము,

మ. ... ఫాలాక్షు నెక్కటి కయ్యంబునఁ గన్న ఫల్గును భుజా
గర్వంబు. ఉద్యో. 2-174

**ఎక్కటి కార్యము** వి.

ఒక్కఁడు చేయుపని, తోడులేని పని.

ఆ. మమ్ము వేఱు పెట్టి యెక్కటి కార్య, మాచరించువాఁడ వగుట
దగునె. సౌప్తి. 1-89

**ఎక్కటిపోరు** దే. వి.

ఎక్కటి కయ్యము.

వ. కౌంతేయాగ్రజుండు రౌహిణేయుతో నన్నదమ్ముల యిరువుర
యెక్కటి పోరు సూడుమని పలికి. శల్య. 2-141

వ. అవ్విధ మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కుమల
బంధు పుత్రు నెక్కటి పోరికిం బిలిచినం బోయి. శాంతి. 1-31

శ్లో. అహ్వాయ ద్వైరథే రాజా జరాసంధో మహీపతిః.
సం. భా. శాంతి. 5-1

**ఎక్కటిబవరము** దే. వి.

ఎక్కటి కయ్యము.

సీ. బహు దివ్య శరములు వడయఁడే యెక్కటి బవరాన మెప్పించి శివునిచేత. భీష్మ. 3-177

ఎక్కసెక్కటి (ఎక్కటి + ఎక్కటి)

ఒకనితో నొకఁడు.

చ. నరవర యెక్కసెక్కటి పెనంగఁగ భీమునికైనఁ బన్నఁగాదు. శల్య. 2-116

ఆ. ఏను నర్జునుండు నెక్కసెక్కటి దల,వడక యున్న నగరె పుడమి జనములు. ఉద్యో. 4-41

శ్లో. యదిహ్యాద్య న గచ్ఛేయం ద్వైరథం సవ్యసాచినా
అకీర్తిస్స్యాత్ హృషీకేశ మమ పార్థస్య చోభయోః
సం. భా. ఉద్యో. 140-18

గీ. ఎక్కసెక్కటి పెనఁగిన యింత వట్టు, పెనఁకువలు నిట్టు లేచునే పృథివి నింక, జనము లీకురుపాండవ సంగరంబు, సెప్పికొంద్రు మనంబు లచ్చెరువునొంద. ద్రోణ. 1-178

ఎక్కడ దే. వి. (ఏ + కడ - వృత్తియందు ఔపవిభక్తికము - ఎక్కడి మాట)

1. ఏ చోటు, ఏ ప్రదేశము

క. మానవపతి నన్నెక్కడి, దానవు నీవనియెనేని. విరా. 1-90

వ. ఎక్కడఁ జూచినం దానయై. భీష్మ. 2-187

ఉ. ఎక్కటినుండి యెక్కడకు నేఁగెడినో.
విరా. 1-308; అను. 1-197

2. అత్యంత తారతమ్యమును దెలుపును.

క. ఇతఁ డెక్కడ మద్రమహీ, పతి యెక్కడ నితని కతఁడు పాటియె. ఉద్యో. 2-238

వ. ఏను రాజను నీవు పేద పాటుండవు నాకును నీకును నెక్కడి సఖ్యంబు. ఆది. 5-219

3. అసంగతత్వము, పొసఁగమిని దెల్పును.

ఉ. ... సుయోధనుం, డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ.
ఉద్యో. 3-94

4. అనాదరమును దెల్పును.

ఉ. ... నా, కెక్కడి ప్రాణ మేది తను వెయ్యది నిక్కడ యేమి చేయుదున్. విరా. 2-296

వ. పో పొ మ్మెక్కడి వాఁడ వని యదల్చి. కర్ణ. 3-70

క. ఎక్కడి తండ్రివి నీవే, నక్కౌంతేయులకుఁ గొడుక. ద్రోణ. 5-74

5. లోక వైపరీత్యమును దెలుపును.

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి పీ,రెక్కడి బుద్ధిమంతులు. ఉద్యో. 4-20

ఉ. ఎక్కడి మాట గొల్లతన మించుక యేనియు లేదు నీ దెసం.
విరా. 1-281

6. ఆశ్చర్యమును దెల్పును.

మ. వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననేవ్యత్వాత్మజముల్ పుట్టవే.
విరా. 2-136

ఉ. ... నీ బలం, బెక్కడఁ బోయె సైన్యపతులేలకొ యిక్కడఁ జేరరారు.
శల్య. 2-401

7. ప్రశ్నార్థకమైన వ్యతిరేకార్థము నిచ్చును.

చ. ... నీ, వెటఁగి యెఱింగి నన్ దొడరి తెక్కడ బోవఁగవచ్చు.
ద్రోణ. 2-90

వ. జూదరి యాలికి గరువతనం బెక్కడియది. విరా. 2-153

8. ఎప్పుడు, ఆకస్మికముగా నను నర్థమిచ్చును.

వ. ... ఎక్కడ వచ్చి నెవ్వరినేమి చేయునో యనుచు మేనులు వడఁక. ద్రోణ. 5-225

9. సంబంధ వాచకముగా నుపయోగించును.

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పరఁగు నెక్కడఁ

గలుగుం జక్కటి నిలుచుం గృష్ణుం; డక్కఢ నతఁడున్న కథన యగు
జయ మధిపా. ఉద్యో 2-317; ద్రోణ. 1-248

10. పలురకములుగా నుపయోగపడును.

సీ. నామీఁద గృపయుఁ బ్రియము నెక్కడవోయె. కల్య. 1-18
(ఎక్కడవోవు = కానరాకుండఁ బోవు)

తే. ఇంక నాఁటి చూఱ లెక్కడివి. ఉద్యో. 3-362

వ. ప్రముక్కడి మూఁకలు పని యెక్కడెక్కడ వని తలఁపడిన
(ఎక్కడెక్కడ - ఆదలింపు మాటలు) విరా. 4-4

**ఎక్కించు** దే. స. క్రి. (ఎక్కునట్లుచేయు)

1. అధిష్ఠింపఁ జేయు, నిలుపు, మోపు.

క. ... పృథివీపతి నీ, తలన తన కార్య ఖడ్గం,బుల మోపెక్కించె,
విరా. 5-28

వ. నీ గౌరవంబంతయు నెఱింగి కాదె వహ్ని సమానుండైన యీ
మహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద.
అర. 7-315

2. అధిరోహింపఁజేయు.

మ. ఇఃతేజుం డతిశక్తి గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దోడ్తోని
తెచ్చెన్. ఆది. 4-191

సీ. ...ధర్మ,సుత విజయులఁ దనవితతబాహులయమళంబు నెక్కించి.
ఆది. 6-160

వ. ... కుంతీదేవిని ద్రౌపది నొక్క రథంబెక్కించి తోడ్కొని.
ఆది. 7-233

3. కలిగించు.

క. ధర్మనందనునిఁ దగం, గను మతఁడు రాజనని తన, మనమున
నెక్కించు కొనఁడు మదగర్వంబుల్. కల్య. 1-59

ఆ. ఇక్కరంబు నెయ్యు మెక్కింప నేరంగఁ, దగిలి సంతతంబుఁ దలఁ
చుఃట్టి, తండ్రి మైఅయ్యఁ గీడు వఱుపంగఁ గొల్లియాడ, వలఁతి నీటు
పేయవలనె దీని. స్త్రీ. 2-133

4. అధికముచేయు, అతిశయింపఁజేయు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి, కెమ్మోవి యాని యెక్కింతుఁ
గాయ్యు. విరా. 2-310

4. (వారి) బిగించు.

గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన. ఆది. 7-178

6. ఉంచు, తూఁచు.

క. తక్కిన మూఁడాశ్రమములు, నొక్కదెస గృహస్థ ధర్మ మొకదెసఁ
దుల యం,దెక్కింప వానితో న,య్యొక్కటి సరితూఁగె నందు
రుర్వీశబుధుల్. శాంతి. 1-76

**ఎక్కించుకొను** దే. స. క్రి.

1. (రథముపై) కూర్చుండఁ బెట్టుకొను, అధిరోహింపఁజేయు.

వ. గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్నునిచి వత్తుగాని రమ్మని
కరంబు సాఁచి చెయివట్టి తన యరదం బెక్కించుకొని.
ఉద్యో. 4-19

2. భావించుకొను, మీఁద మోపుకొను.

వ. జామదగ్న్యుం డదియెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని.
ఉద్యో. 4-355

3. ఆరోహించుకొను.

వ. నీవు గొందఱ నర్జించితినని దుర్జయత్వం బెక్కించుకొనకు.
ద్రోణ. 5-127

4. కలిగించుకొను.

వ. ...ధర్మనందనునిఁ దగం,గను మతఁడు రాజనని తన, మనమున
నెక్కించుకొనఁడు మదగర్వంబున్. శల్య. 1-59

5. పూనుకొను.

వ. ...పోటెక్కించుకొనని వానిమీఁదం బ్రయోగించినవానిన మరలి
వధియించు. ద్రోణ. 3-88

శ్లో. అయుధ్యతి నమోక్తవ్యా సా త్వయ్యేవ పతేదితి,
హవ్యాదేశా ప్రతీపం హి ప్రయోక్తారమపి ప్రభో.
సం. భా. ద్రోణ. 92-51

**ఎక్కిడు** దే. స. క్రి. (ఎక్కుపెట్టు)

1. సజ్యముచేయు, నారితొడఁగు.

ఉ. చుక్కలు తోడ్తుతోడఁ దలచూపదొడంగె మనోభవుండు విల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె. విరా. 2-3.9

వ. తేరెక్కి యెక్కిడిన విల్లును మెచ్చువచ్చు నమ్ములును దొడలపైఁ బెట్టికొని. ద్రోణ. 3-305

**ఎక్కు** దే. అ. క్రి.

1. సంతోషకరమగు, ఇష్టమగు, నచ్చు.

తే. అకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁగ, మెలఁగి యేమి విధంబునఁ గొలుచువాఁడు. విరా. 1-74

క. ...ఐశ్వర్యోపవుఁ బుట్టువు పుట్టిన, నావగ పెవ్వరికి నెక్కు నళినదళాక్షీ. విరా. 3-50

వ. పాండవులం బరిమార్చు పని నేఁడ చేయక మఱిచేసిన రారాజు నిర్గతప్రాణుండైన నాకెలసం బెవ్వరి కెక్కెడు. సౌప్తి. 1-24

క. ...దుర్వినీతకోటి ధనంబుల్, దనకెక్కినట్టి తప్పులఁ గొని సుజనుల కీగి నృపతి గుణమండ్రు బుధుల్. శాంతి. 2-186

2. సమ్మతియగు.

క. అడుగకున్నను, నేమి వినుము చెప్పెదను మునీంద్రులకెక్కన్. శాంతి. 1-57

3. అధికమగు, అతిశయించు, హెచ్చు.

క. తమకును బలమెక్కిన తఱి, సముచితమగు విగ్రహంబు శత్రుల కుత్సాహము మీఱినపుడు కర్తవ్యము సంధియనంగ విందుమార్యుల చేతన్. శల్య. 1-56

వ. అట్లడరు నయ్యుద్ధము నాశినివరుండు గినుక యెక్కిన యేత్తెఱం బెక్కువటిచె. ద్రోణ. 5-177

క. ఎక్కువు దినముల శుభములు, నెక్కు నఖిల వైభవములు నెక్కు

దినమునం, దక్కక యుండెడు కాలము, నెక్కు మహాత్మతయు
నెక్కు నిభపురనాథా. అను. 4-149

ఉ. ...వా, రేమయిరేమి మాకెలన మెక్కు నెఱుంగుము మమ్ము
మువ్వురన్. సౌప్తి. 1-231

5. కలుగు, సంభవించు.

ఉ. ...గో, నెక్కఁగఁజేసి నిన్ను నతిహీన విధాన నియుక్తఁజేతగా,
నిక్కము యుమ్మలించి తిది నెయ్యము తియ్యము కల్మియే సఖీ.
విరా. 2-98

క. మహాత్మతయు నెక్కు. అను. 4-149

6. ప్రకటమగు, తెలియు.

వ. అతని లావును బీరంబును లోకంబున కెక్కియున్నయవి.
విరా. 4-204

క. నినుఁగీడు వొరయకుండఁగ, జనులకు నానిక్కమెక్కు జననాయక
నే, ననలంబుఁజొచ్చి వెడలెదఁ, గనుగొను మిచ్చనువు నాకుఁ గరు
ణింపు దగన్. అర. 7-160

7. మార్కొను, ఎదుర్కొను

సీ. ఒక్కఁడు పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ, బోదివి చెటొక పోటు
వొడుచు నెదలు. విరా. 8-164

వ. ఇట్లుక్కుమిగిలి యెక్కిన యర్జునసందనుం గనుంగొని శకుని
తమ్ములు. భీష్మ. 3-91

క. పటురయమున నాశ్వను లొక్కటఁ బెక్కండ్రెక్కి రథనికర
ములు ఝుటితి, త్రుటితాకృతులుగ విహరించుట యెక్కుడు
వేడ్కసేయు సురగణమునకున్. శల్య. 1-128

8. ప్రీతి గలిగించు, మెప్పువచ్చు.

(భీముఁడు ద్రౌపదితో) శా. చింతాశల్యము వాసెనే భుజబలోద్రేకంబు
నీ కెక్కెనే, శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం
జూచితే. విరా. 2-358

క. పతిమదికి నింత యెక్కిన, యతివ గదా పుణ్యవతి. శాంతి. 3-311

9. ఎచ్చు, అదనమగు.

సీ. రెండవయేఁట నొక్కం దధిమాస మిశ్లెక్కిన యన్నెలలెల్లఁ గూర్చి,కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటి తోడన నిండె. విరా. 4-232

తే. ... రెండును మూఁడు నాల్గు, నీ క్రమంబున నోపిన శైక్కినట్టి, దినము వెడ పెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు, నడపు వారల తెఱఁగు లేర్పడఁగ వినుము. అను. 4-148

10. కదచు, గతించు.

క. ప్రొద్దు జామెక్కుటయున్. శాంతి. 3-500

11. వృద్ధి పొందు.

తే. ... పోడశంబుదాఁక, నెల్లనాఁడును ఋతుశక్తి యెడల కుండఁ నెట్టి కార్యము గల్గిన ఋతుమతీ సమాగమము దప్పనీకున్న నాయు వెక్కు. అను. 4-126

12. వచ్చు, చేరు, లగించు.

చూ. కీర్తి కెక్కు, నుతికెక్కు ప్రసిద్ధి కెక్కు.

స. క్రి.

1. అధిష్ఠించు, ఆశ్రయముగాఁ గొను.

క. వల్లెయని రాజనందను, లెల్లను సమకట్టి రథము లెక్కి దిశల్ భే, దిల్లఁగ గర్జిల్లి నిశాతోల్లసిత కృపాణ కామ్ముకోద్యతకరులై. ఆది. 6-64

2. ఒందు, పొందు.

ఉ. ... నేల కెంపెక్కుచు వచ్చె. విరా. 2-319

సీ. బిగి యెక్కి యేర్పడంగఁ దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్కు. విరా. 1-245

3. క్రమముగాఁ బొందు, ప్రాఁకు.

ఆ. నేతికుండ మోచి యే తెలివున నోల,నాలు ప్రాకు నై పుణంబు

గలుగు, పురుషునట్లు యోగ చరిణతుండును నాత్మ, నేమలుక విముక్తి కెక్క వలయు. శాంతి. 5-587

క. తేనియ కుండఁ గొనుచు నో,పానము లేమియుట లేక ప్రాఁకిన క్రియ నా,త్మానందరసం బొక కణ,మైనఁ జిలుకనీక తుదికి నాతం డెక్కున్. శాంతి. 6-121

4. (చెట్టు మొదలగు వానిని) ఆరోహించు.

అ. ... పలుచి మహీజంబు, లెక్కి రందుఁ గొంద ఱుక్కడంగి.
అర. 2-110; అర. 8-112; ఆది. 1-109. అర. 8-244

క్రి. విశే.

1, తగు, అర్హమగు.

చ. ... సురేశ్వరుఁడు సుదర్శనంబునఁ బ్రశంసకు నెక్కు విమాన మెక్కి యం,బరగతి వచ్చె. విరా. 4-234

2 అధికమగు.

క. ఎక్కుడు దినముల శుభములు, నెక్కు నశుల వైభవములు నెక్కు దినమునం, దక్కక యుండెడు కాలము, నెక్కు మహాత్మతయు నెక్కు నిభపురనాథా. అను. 4-149

వి.

సజ్యము, జ్యాసంధానము, నారి కూర్చుట.

వ. ... గాండీవంబుఁ బుచ్చుకొని యెక్కువెట్టి ముష్టి నలవరించి:
విరా. 4-168

వ. కోదండంబు నెక్కుడించి కంకటం బూడ్చి, సౌప్తి. 1-65

ఎండ యెక్కు; కీర్తి కెక్కు, నుతికెక్కు మొదలగు పదముల నాయా తావులందు, జూడనగును.

ఎక్కుడించు దే. స. క్రి.

వింటి నుండి నారిని సడలించు.

వ. ఎక్కుడించిన పాండవాగ్రజుండు.

క. జనుజకులత్రాసకరంబును రిపు భంజనము రత్న భూషిత రూపం

బును గురుదేశాప్లావన,మును నగు నిజకార్ముకంబు మోపెడ లించెన్. విరా. 1-169-170, సౌప్తి. 1-65

ఎక్కుఁడు దే. విశే.

1. ఉత్కృష్టము, శ్రేష్ఠము.

తే. రాజు సర్వోత్తముఁడు ధర్మరాజి యందు, రాజధర్మంబ యెక్కుడు. శాంతి. 2-289

ఆ. అర్థసిద్ధికంటె వరయ నెక్కుడు ధర్మసిద్ధి. శాంతి. 2-408

2. అధికమైనవాఁడు, గొప్పవాఁడు.

ఉ. ... ఇట్లు శత్రు దోశ్శౌండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ డింత యెక్కుడే. విరా. 4-98

3. అధికముగా నాదరింపఁదగినది.

చ. ... నిను రాజరాజ యిమ్మనుపున కీడ్చి తెచ్చె విధి మానము ప్రాణము కంటెఁ జాల నెక్కుడగుట సెప్పఁగా వినవొకో కదు నీచతఁ బొంది తక్కటా. శల్య. 2-57

4. హెచ్చైనది.

చ. చిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనకీర్తి నాతఁ డెక్కుడు ముద మొప్ప నాన్నృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపగాన్. ద్రోణ. 3-250

5. స్థితికి మించినది, స్తోత్రమైనది.

ఉ. ... గెల్పునుతింపఁగ రాజపుత్రుఁ డయ్యెక్కుడుమాట కోరువక యిట్లను నర్హజనంబుతోఁ దగన్. విరా. 5-265

6. సాహంకారపూరితము.

ఉ. చిక్కని పోటు మానిసి విసి విను వారలు నవ్వ నేమిగా, నెక్కుడు మాటలాడెదవు. ఉద్యో. 1-258

7. తన్నుఁ దాఁ బొగడుకొనుటకు సంబంధించినది. ఆత్మశ్లాఘనమైనది

సీ సంజయుతో మీరు శంకతే కాడి,న యెక్కుడు మాటలు పెక్కు గలవు. ఉద్యో. 4-191 - చూ. ఎక్కుడు మాటలు.

8. ఒకదాని కన్న నొకటి పెచ్చు.

క. ఎక్కుడు దినముల శుభములు నెక్కు. అను. 4-149

9. మించినది.

వ. సహదేవుం డా శైనేయు నుద్దేశించి మిమ్మును పాంచాలురం గడచిన బంధువులు మాకును మమ్మును మిమ్మును మిగిలిన బాంధవులా పాంచాలురకును వారకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి. ద్రోణ. 5-371

10. ముఖ్యము, ప్రధానము.

(మనస్సు ఇంద్రియములతో)

వ. నిజంబుగా నేను దొలంగితేని.

ఆ. అప్రయోజనంబులై యుండు నాలిన, నిప్పులట్లు శూన్య నిలయములును, బోలె మీ స్వరూపములు గాన మనలోన, నెక్కు డేన చూవె యింత నిజము. అశ్వ. 2-32,33

క్రి. విశే.

అధికముగా, మిగుల.

వ. అప్పటి కప్పటి కెక్కుడొదవు మదంబునం ద్రిగర్తాదులగు నమ్మాద్రురు పైపయిం గ్రమ్మి. కర్ణ. 2-317

క. కడు నమ్మియునికియును నె,క్కుడు నమ్మమియును సుశీల కుశలత గా దె,య్యెడనైనను. శాంతి. 2-187

ఎక్కుడుపడు దే. అ. క్రి.

పైకెగయు.

చ. నడవ మహాత్మ యగ్ని యయి నావదనంబున నిర్గమించి యె,క్కుడు పడి పద్మగర్భుకడకుం జనె. అను. 4-408

ఎక్కుడుమాట దే. వి. ఏక.

[illegible]

ఉ. ... రాజపుత్రుఁ డ,ద్యెక్కుడు మాట కోరువక యిట్లను నర్హ... నంబున్ దగన్. విరా. 5-265

ఎక్కుడు మాటలు దే. వి. బహు.

1 స్వాహంకార పూరిత వాక్యములు.

ఉ. చిక్కని పోటు మానిసి వినీ వినువారలు నవ్వ నేమిగా, నెక్కుడు మాటలాడెదవు. ఉద్యో. 1-258

2. తన్నుఁ దాను బొగడుకొను మాటలు, ఆత్మశ్లాఘన వచనములు.

సీ. సంజయుతో మీరు శంకలే కాడిన, యెక్కుడు మాటలు పెక్కుగలవు. ఉద్యో. 4-191

"శ్లో" యదేతత్కత్థనా వాక్యం సంజయో మహదబ్రవీత్ సం. భా. ఉద్యో. 159-8

ఎక్కువెట్టు; ఎక్కువెట్టు దే. స. క్రి.

సజ్యము చేయు.

తే. ఒక్క విల్లెక్కు పెట్టంగ నుఱక. భీష్మ. 8-368

వ. గాండీవంబుఁ బుచ్చుకొని యెక్కు వెట్టి ముష్టి నలరించి. విరా. 4-198

తే. ఇట్టి యేఁ దేరుగడవంగ నెందు మతికి, నెక్కు గాండీవ మే త్రెంచి నెక్కువెట్టి, రెండు దొనలను బూని కిరీటి యనికి, వచ్చు నేఁ డెల్లి యొందు బోవచ్చు మీకు. ఉద్యో. 2-180

ఎక్కువ దే. వి. (√ఎక్కు)

ఆధిక్యము, హెచ్చు.

క. హరి సత్త్వాది గుణంబులఁ, బొరిఁబొరిఁ గలిగింపఁ బెంపఁ బొలియింపఁగ భూవర యవి యెక్కువఁదక్కువఁ, బొరయుచుఁ బరివర్తనంబుఁ బొందుచు నుండున్. శాంతి. 6-490

చ. పతి దెస కూర్మి వావుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచు నున్నతులగు మేదినీశులకు నానగఁ బల్కుటగాక. ఉద్యో. 4-240

ఉ. ...రాజపుత్రుఁ డయ్యెక్కువమాట కోరువక యిట్లను నర్హవనంబుతోఁ దగన్. విరా. 5-266 (ఇది పాఠాంతరము)

ఎక్కువ తక్కువ దే. వి.

ఎచ్చు, తగ్గు

("ఎక్కువ, తక్కువ"-అను రెండు పదములు కలిసి ఏకపదముగను ద్వంద్వ సమాసమున బహువచనమునను మాత్రమే ప్రయోగములు గనం బడుచున్నవి. శాంతి. 6-490 లో ప్రత్యేక ప్రయోగముగాం గనం బడుచున్నను రెండు నవ్యవధిగనే ప్రయోగింపఁబడినవి)

చ. పతి దెస కూర్మి వాపుటకుఁ బట్టుగ నెక్కువతక్కువంచు నున్నతు
లగు మేదినీశులకు వానగఁ బల్కుటగాక. ఉద్యో. 4-240

(ఎక్కువంచు, తక్కువంచు)

క. వినుఁ డెక్కువ తక్కువలే, కనయము నెనసిన గుణత్రయంబుమ
('ఎక్కువదక్కువ' అనియుఁ బ్రయోగము) అశ్వ. 2-182

విణ.

క. ఎక్కువదక్కువ మాటలు, మిక్కుటములు బందిగీడు లొందించు
టలుం, బెక్కు దన యన్నదమ్ములు, దిక్కున నన్నియును సైఁపఁ
దేజము సేయున్. శాంతి. 2-359

ఎక్కువదక్కువలు దే. వి. బ. (ఎక్కువ+తక్కువ)

ఎచ్చుతగ్గులు.

వ. కావున నెక్కువదక్కువలు నిరూపించి. విరా. 4-185

వ. ఈ యెక్కువదక్కువలు విచారింపక. ఉద్యో. 3-222

వ. ఇత్తెఱంగున నెక్కువతక్కువలు లేక యక్కజంబుగాఁ బోరువారి
భీష్మ. 2-46

వ. ఇట్లెక్కువ తక్కువలు లేక పోరిపోరి. ద్రోణ. 5-207

ఎగఁద్రోచు దే. స. క్రి.

పైకెత్తి పట్టు.

వ. నీలాశ్మరశ్మి స్థగితంబైన విమల మణిస్థలంబు జలాశయంబుగా
దగచి పరిధానం బెగఁ ద్రోచికొని. సభా. 2-86

ఎగచు

ఇది పొగచువంటిది. కాని నిర్ధారక ప్రయోగములులేవు "ఎగయు" యొక్క ప్రేరణార్థకమైన 'ఎగయించు' దీనికర్థము అని మా. అ. ని.

ఈ 'ఎగచు' ప్రయోగము భారతము ముద్రితప్రతులలో 15 తావు లందున్నది. కాని కొన్ని ముద్రిత ప్రతులలో 'ఎగచు' ఉండటయు లేక పోలేదు. మనము చూచి నిర్ణయించు వ్రాతప్రతులు కవిత్రయమువారి స్వహస్త లిఖితములు కావుగదా. తొట్టతొలుత ముద్రిత ప్రతియు వ్రాత ప్రతినుండి వచ్చినదే కదా—'ఎగుచు ఎగచు' అని రూపాంతరముగా గ్రహింపనగును. అట్టివి మఱికొన్ని గలవా అను ప్రశ్న నిరాధారము. 'ఎగయించు' అని చెప్పుకొనుటకు ప్రేరణముక్రింద గానరావు. పైగా అకర్మకముగాఁ గూడ దీనికిఁ బ్రయోగము గలదు.

అ క్రి.

1. విజృంభించు.

వ. ఇత్తెఱంగునందునిమి తఱుము నతని దోర్విలాసంబు దుస్సహం బగుటయుం బాండవబలంబులు దెరలినం గురుసైనికులు నలుగడ లకు నెగచి రట్లు విజృంభించిన కుంభసంభవు నెదుర్కొని.
ద్రోణ. 1-298

స. క్రి.

1. వెంబడించు, తఱుము.

క. వెనుకొని విఱిగిన సైన్యము, గనుకనిఁ కాఱంగఁజేసి క్రౌర్యో ద్రేకంబున ధృష్టద్యుమ్నుండును, దనకెలనం దఱుమ వాయుతన యుం డెగచెన్.
భీష్మ. 2-112

శ్లో. తతస్తాం కౌరవీం సేనాం ద్రవమాణాం తత స్తతః,
నిఘ్నన్ భీమశ్చరై స్తీక్ష్ణై రనువవ్రాజ పృష్ఠతః
సం. భా. భీష్మ. 58-19

చ. ...ఎంతయున్, భరమున నీ మొనల్ గలఁగి పాఱె నరేశ్వర వారి సైన్యసంచయమెగచెన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్.
కర్ణ. 3-9

వ. ...ఒక్కనాఁడు మహాగహనంబులఁ బెక్కుమృగంబుల నెగచి చంపి తనచేత నేటువడి పాఱిన మృగంబు వెంటం దగిలి.
ఆది. 2-165; ఆది. 5-43

ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగుఁ జూచి నగుచు

వాని, నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్కి, వాంఛ
బట్టుకొనియె నతిరయమున. అర. 2-12

క. నలి భగదత్తుఁడు గదువుల, వెలుచు పసులవాని యట్ల విలసద్గతి
న బ్బలము నెగవ ధూళియు నా,కుల సంరావంబు గగనకుహరము
నించెన్. ద్రోణ. 1-332

1. త్రోలు (రథము మొదలగు వానిని)

తే. ...సారథి తొలఁగంగ నెగచె రథము. ద్రోణ. 5-164

చ. అనవుడు సూతుఁ డెంతయురయంబునఁ దేరు వృకోదరాంతికం,
బున కెగవంగ. కర్ణ. 1-149 చూ. ఎగుచు.

ఎగయించు దే. స. క్రి. (√ఎగయు) ఎగయఁజేయు

ఎత్తు.

చ. అనునెడ వాని యుగ్ర సముదాకృతియుం బటువాక్యవృత్తియుం,
గని విని మల్లురెల్ల భయకంపితమూర్తులు దాల్చి మూఱువ,ల్కను
గనువిచ్చి చూడను మొగం బెగయింపను జాలకున్న విరా. 2-8

సీ. అతఁడు ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ దప్పక చూచి.
ఆశ్ర 2-60

క. ...ఇంచుకవడి మౌనము దగం దాల్చియుండి నతవదనుండై.

వ. పదంపడి నిట్టూర్పునిగిడించి మొగంబెగయించి భూపాలు వాలో
కించి. భీష్మ. 3-173,174

ఎగయు అ. క్రి. నెగయు

1. పైకిపోవు, ఎగురు.

సీ. ప్రమథులు గాసి సేయుచును రక్తములు సల్లి, యార్పంగ మృగ
రూపమై గగనంబున కెగసె నధ్వరము. శాంతి. 5-439

సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ బ్రగమమున, నెగసి మోమునఁ
జోఁకి మగిడివచ్చు. విరా. 5-395

వ. అట్టియెడ మున్ను తురంగమఖురాదళం దూలిన కెందూళియుం
బయి నెగయఁ బరబలంబు నెత్తుటి జొత్తిల్లుచు. విరా. 5-82

2. లేచు, ఉత్థితమగు.

సీ. మంకినాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై నర్తించు శిక్షింప
వలయునట్టి, గుజ్జు దోయిని జట్టిగొని ప్రీతి లంకించియుండ లంకియ
తోన గండ మీఱి, పాఱె నక్కోడియల్ పడియున్న గనప లోపై
నుంగుపై నది యెగసె పఱవ, నుభయ పార్శ్వంబుల నురిపోసిన
ట్లవి వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి. శాంతి. 4-40

3. కలుగు, పుట్టు, ఉద్భవించు.

ఆ. అన్ని వెడఁదవాలి యమ్ము లద్భుతముగ నొక్క ముష్టిఁ దొడిగి
గ్రక్కునంగ, నతఁడు లీలఁ దునిమె నందఱ తలలును, ఘోరభంగి
రక్తధార లెగయ. విరా. 5-149

వ. తమ విడిసిన విప్రగృహంబున నున్నంత, నందొక్కపెట్ట యార్త
ధ్వని యెగసిన విని కుంతీదేవి. ఆది. 6-239

4. వ్యాపించు, క్రమ్ము.

ఉ. బందొక విల్లుపుచ్చుకొని యుజ్జ్వలరోష మహానలార్చు లొం,డొండ
మొగంబుపై నెగయ నుర్వి చలింప. ఉద్యో. 4-819

క. చిచ్చఱ కన్నదరు లెగయ, విచ్చినఁ గపిలత్వ మొందె విబుధ
ప్రకరం, బచ్చెరు వందుచు గన్గొన, నచ్చెరువ శారభేయు లమర
చరిత్రా. అను. 3-22

క. దరికొని దహనుం డెగసెను. వరుసను సహదేవు సకల వాహిని
మాద్యం, తక్కురులపయిఁ దురగము లపయి, వరరథములపయిఁ బదాతి
వర్గములపయిన్. సభా. 1-250

5. వెడలు, ఉద్గతమగు.

తే. రథము మీఁదికిఁ జనుదెంచి పృథుల సైన్య, హర్ష శాపణ ధ్వను
లుఁ దూర్యస్వనములు, నెగసి దివిముట్టు మైమఱువిడ తలిర్చు
నెలమిఁ గోదండ తూణీరములు ధరించె, భీష్మ 1-169

విణ.

పుట్టు, కలుగు.

క. విని యా విప్రునితో ని,ట్లను నయ్యేలనాఁగ మన మనకు వ్రేరే
వం,గనెగయు వాక్కు దదను వ,ర్తనము మనంబునకు నెవ్విధం
బునఁ గలుగున్. అశ్వ. 2-15

ఎగవంజను దే. స. క్రి.

తఱుముకొని పోవు

క. మును సహదేవుండెగ వం,జని నప్పుడ యొండు దేరు నవరించు
కొనం, గనుట నది సేర్చి యశనిం,గొని పోయెను సంగరము
నకుం దొలఁ గంగన్. కర్ణ. 2-367

ఎగవు దే. వి.

ఆవలి భాగము.

ఆ. ... పాండవేయుఁ డా ర్తిఁ, గూరి నిలువలేక కూర్చుండఁబడి
మాతుఁ, నరద మెగవు తొలఁగ ననియె నధిప. కర్ణ. 2-381

ఎగవెక్కు దే. అ. క్రి.

పై వెక్కిళ్లతో ఏడ్చు.

సీ. అనవుడు నెగవెక్కి యాబిడ్డ వైచిపోయెదు వారలకు నడ్డ
పడుచు నక్కు. శాంతి. 8-777

ఎగుచు దే. స. క్రి.

1. త్రోలు.

వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు.

క. సారథి యరదము భీష్ముని, తేరి వెనుక కెగిచె. భీష్మ. 3-344

2. పైకొను; కవియు.

క. శాల హారిణములఁ బట్టెడు, లీలను విషమాటవీ చలిత కేసరి
శా,ర్దూలేభ శరభములఁ దన, బాలత్వమునంద యెగిచి పట్టుచు
మఱియున్. ఆది. 4-6

3. వెంబడించు, తఱుము.

చ. అనిలజుఁ డుగ్రుఁడై ... వేద దు,ర్మనుజులఁ జంపనేల యని
మానుగ గోవుడు గోగణంబులన్, గొనకొని రొప్పునట్టు లధికుం
డెగిచెన్ బృథునందు హస్తుఁడై. ఆది. 6-78

క. నలిరేఁగి కలఁగి తద్బలములు విశ్వామిత్రు సైన్యముల కేను
మదుంగులు పెరిఁగి మూఁడు యోజనములు వాఱఁగ నెగిచె
నొక్క మొగిఁ బ్రతిబలమున్. ఆది. 7-107; ఆది. 7-194

వ. ... ఇంద్రుడు శ్యేనంబైన నగ్ని కపోతంబై శ్యేన భయంబునఁ
బఱతెంచి శిబి మఱువునొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు
శిబి కిట్లనియె, అర. 3-237 చూ ఎగచు

**ఎగురు** దే. అ. క్రి.

ఉఱుకు, లంఘించు.

వ. అప్పాంచాల వరుండు.

తే. ...తలగోయుట తప్పించి, యెగిరె నగ్గురు తేరిపై కేపు మెఱయ.
ద్రోణ. 4-100, 101

**ఎగువఁబడు** దే. అ. క్రి.

నిరోధింపఁబడు, అడ్డగింపఁబడు.

ఆ. అగ్ని నేను నాకు నాహారమయ్యింద్రు, ఖాండవంబు దీనిఁ గాల్పఁ
గడఁచి యెగువఁబడితి ముంద, రింద్రు పంచిన మహా,దారుణాంబు
ధరశతంబు చేత. (ఎగువఁబడితి = అని పాఠాం) ఆది 8-288

**ఎగ్గతము** వై. విణ. (సం. ఏకాంతః)

ఏకాంతమైనది, నిర్జనమైనది.

(గాంధారి శ్రీకృష్ణుని శపించుట)

గీ, ...అయవ్వ యతఁ డెగ్గతంపుఁ జోట, నరయ దిక్కెవ్వరును లేని
యట్టి తెగుట, నొందఁగలవాఁడుగాఁ బల్కె నొద్దనుండి వింటి.
మౌస. 167

వి.

ఏకాంత స్థలము, ఒంటరిగా నుండుచోటు.

తే. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నకట యనాథయై దీనిత
నంతరంగ మలదురక...యెట్లుండుఁ జెపుమ. ఆశ్ర. 2-168

**ఎగ్గాడు** దే. అ. క్రి.

నిందించు.

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందు భూ,
వరు నాజ్ఞం జన రిగిమెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁజో,త్తురు
కౌతూహలం వేషభాషణములం దుల్యత్వముం బొంది యే, తురు
వారెల్ల పదంబు వేడుదురు సింతుర్ భూమి మాఱొడ్డులన్.
శాంతి. 3–180

ఎగ్గు దే. వి.

1. కీడు, హాని.

సీ. ధార్తరాష్ట్రులు మాకతనయ సౌబలులును, తెలుపన వేతురు
చిన్నసన్న. – ఆ. యెఱిఁగి రేనిఁ జాల నెగ్గు వాటిల్లు. విరా. 1-47

సీ. ...నీ జనించిన యది యాదిగా,నుడుగక పాండవేయులకుఁ జాల
నెగ్గుసేసితి విషమిడి పెనుఁబాములఁ గఱపించి నీరిలోఁ గట్టిత్రోచి
లక్కయిల్ గాలిచి. ఉద్యో. 3-367

ఆ. అ,ప్పాండవులను గుఱిచి బహువిధంబులగు నిమిత్తములు నయం
బునఁ జూచితి, నెగ్గులేమ వారికెల్ల లగ్గు. ఆది. 7–28

2. తప్పు, నిషిద్ధమైన పని.

క. కావునఁ గౌరవ పాండవు లీ వసుధకునై పెనంగుటెగ్గే దైవం,
బేవంక వ్రాతె వారిక, పోవుం గాకిది నరేంద్ర పొగలకుమింకన్.
భీష్మ. 1–48

క. చేతఁగొని యుప్పునములుట, రాతివయిని నుప్పుగొమట రాత్రి
దధి మధూ,పేతంబుగఁ గుడుచుట ధ,ర్మేతరములు రేయి సక్తు లెగ్గు
నరేంద్రా. అను. 4–110

(కర్ణుఁడు శల్యునితో)

ఆ. వావిలేక యెల్లవనితలుఁ బురుషులుఁ. గలయ మీరు నెగ్గుగాక
యుండు, మున్నుగల్లు పిదపఁ జన్నుఁబాలై పెరుఁ గుదురు సెప్ప
నేల గుణము:లింక. కర్ణ. 2–47

3. దోషము, అపరాధము.

శా. ...అట్టి శౌ,ర్యాలంకారు మహాత్ముఁ దా సరకుసేయం దచ్చు

తున్ మమ్మరం,డేలా కై కొను నాసుయోధనునియం దెగ్గెది
యూహింపఁగన్. ఉద్యో. 2-145

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో, నాథ నీయం దొకనాఁడు
నెగ్గు, గలదె. అశ్వ. 4-87

ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్ర వీర్యుఁడుఁ బాండు,రాజు నెట్టు లట్ల
రాజరాజు, ప్రజకు సంతసముగఁ బాలించె నీయందు, నతనియందుఁ
గలదె యధిప యెగ్గు. ఆశ్ర. 1-100

4. నింద,

చూ. ఎగ్గాడు.

క. కడు ననురక్తియు నేర్పును, గడఁకయుఁ గలవారి నుఱక కడ
వఁగ నెగ్గుల్, నొడివెడు వివేక శూన్యుల,కడ నుండెడు నంతకంటెఁ
గష్టము గలదే ఆది. 8-149

5. చెడుశకునము, అశుభచిహ్నము.

క. ఖలుఁడీ దుర్యోధనుఁడెగ్గులతోడన యుద్భవిల్లె గోమాయురుతం,
బులు వించె దుర్నిమిత్త,ములు పెక్కుపుట్టె వీని పుట్టిన వేళన్.
సభా 2-178

6 చావు, అంగవైకల్యము.

ఉ. అగ్గిసొరం దలంచునటు లర్జును నెక్కటిదాఁకఁ గోర్కి నీ,కెగ్గిది
మాను మీ పలుకు లెవ్వరుఁ జెప్పఁగలేరు రూపఱ,న్మగ్గఁగఁ గాల
మయ్యెనొకొ నావచనంబు లొకింత కర్ణము,ల్డగ్గఱనిచ్చి యోధులు
బలంబులుఁ దోడుగఁ బోరు టొప్పగున్. కర్ణ. 2-36

విశే.

1 కీడైనది, హానికరమైనది.

క. అంతిపురము చుట్టఱికం, బెంతయుఁగీ డంతకంటె నెగ్గు తదీయో,
పాంత చరక బ్జనామన, కాంతాదుల తోడి పొందుకలిమి. ఛటు
నకున్. విరా. 1-181

2. ఏవగింపు పుట్టించునది, అసహ్యమైనది.

ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ,నంబు గుప్తవర్తనములు గాఁగఁ,

జలుపవలయు నృపతి గొలువున్న యెడల బాహిరముద్రైనఁ గెలని
కెగ్గులగుట. విరా. 1-187

ఎగ్గుగొను దే. స. క్రి. (√ఎగ్గు)

ఎగ్గుగా భావించు.

క. కావునఁ బ్రభుత్వ సంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక నా,
చేవిను మీదు ప్రతినకు, నేవిధినేయనగు దానినేర్పడ ననఘా.
కర్ణ. 3-88

ఎగ్గులగ్గు దే. వి. ద్వం.

కీడును మేలును.

ఆ. బుధుఁడు సూత్మవిమలబుద్ధి నప్పురుషుని, నరసి కాంచి యతని
యందు మనసు, డిగ్గవిడిచి యెగ్గులగ్గును బొందక, శుద్ధశాంతిఁ
బరమ సుఖముఁ బొందు. శాంతి. 4-95

ఎగ్గులాడు దే. స. క్రి.

నిందించు.

వ నా కట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని గర్వంబున
నెగ్గులాడి దేవయాని నొక్క నూతం ద్రోచి శర్మిష్ఠ. ఆది. 3-138

ఉ. ధీయుత యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గులాడుచుం, బోయె
సదంబు వెల్వడి సవుత్త్రిబలుండయి చైద్యుఁ డల్కతోన్.
సభా. 2-15

ఎగ్గులుపట్టు; ఎగ్గులువట్టు దే. స. క్రి.

తప్పులుపట్టు, తప్పులుగాఁ దీసికొను.

క. జనవల్లభ యొకసమయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ
దోఁచిన మాటలెల్ల నాడుదు, నను నెగ్గులు పట్టకుండినం బోఁదొ
నరున్. కర్ణ. 1-255

ఎగ్గులుపలుకు; ఎగ్గులుపల్కు దే. స. క్రి.

ఎగ్గాడు, నిందించు.

క. అలిగిన పలుగక యెగ్గులు, పలికిన మఱి విననియట్లు ప్రతివచనం
బల్, పలుకక ఖిన్నము వడి యెడఁ దలఁపక యున్నతఁడచూవె

ధర్మజ్ఞుఁ డిలన్. ఆది. 3-147

చ. ఇతనికి నిట్లు నన్నులక యొగ్గులు వల్కఁగఁ బోలెఁగాక.

సభా. 2-61

**ఎచటు ఎచ్చోటు**

తే. ధర్మదేవత నీదు సత్కర్మమునకు, మెచ్చి యొంతయు బ్రీతిమై నిచ్చినట్టి, వరము గలుగంగ మనమేమి వర్తనమున, నెచట మున్నను నౌరులకు నెఱుఁగ నగునె. విరా. 1-61

ఆ. ఏది కులము నామమెయ్యది యెవ్వరి, దాన వేమి పనికిఁబూని యిప్పు డెచటు బుద్ధిఁదలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁజెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి. విరా. 1-312

**ఎచోటు ఎచ్చోటు**

క. ద్రుపదనృపాలుని ధవళా, తపత్ర మన్త్రంబు లెచోటు దాఁకక జిగి యా,రి పొలిచె, స్త్రీ. 2-147

**ఎచ్చటు ఎచ్చోటు**

క. మనయింట నిచ్చ టచ్చో,టన కెచ్చటనైన నీ బృహన్నల మెలఁ గం, బసియొడు మానిసి. విరా. 1-254

క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు నడరెడు మదితో, నిచ్చెలువ కడుపు కూటికి, నెచ్చటనే నిలుమనట్టె యిది పలుకగునే. విరా. 1-299, కల్యా. 2-54

**ఎచ్చొటు ఎచ్చోటు**

తోటకము – గరుపాఱఁగ మేను ప్రకంపమునం, బొరిఁ దొట్రువడం బదముల్ దొలఁగం, జొర నెచ్చొటు లేమి ననువ్యయ భీ, భర మొందినఁ జేడ్పడు భావము తోన్. స్త్రీ. 1-46

**ఎచ్చో క్రియా. ఎచ్చోటు**

1. ఏ ప్రదేశమునందు.

ఉ. ... ఎ,చ్చో వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి

కై కొనన్. విరా. 1-166

సీ. ... అతఁడెచ్చో నున్న, వాఁడో కోయనుదు నవ్వారిజాతి. శాంతి. 4-387

ఎచ్చోటు దే. వి. వ.

ఎచటు, ఎచోటు, ఎచ్చటు, ఎచ్చోటు.

(ఏ + చోటు—చూ. అచటు)

ఏతావు, ఏచోటు.

క. ఏచ్చోట నున్న వాఁ డతఁ డిచ్చోటికి సేఱ రాఁడొ. విరా. 5-301

తే. ... ఎచ్చోట నెదురుగా మెలఁగి రచట, మన రథం బల్లనల్లన చనఁగ నిమ్ము. విరా. 5-10

ఎట దే. వి. వ.

ఎచ్చోటు, ఎక్కడ.

వ. అయ్యింతి యింత సేవు నీ చేరువ నుండి యిప్పు డెట మెలఁగె. విరా. 2-61

క. ఇటు గర్వించుట నీచత, యెట వోయెదొ పొమ్ము. శాంతి. 4-398

వ. విధి వశంబున నన్నుం బాసి హృదయేశ్వరుం డెట యేనియుం బోయినఁ దదన్వేషణా సక్త చిత్తనై వివిన పరిభ్రమణంబు సేసెద. అర. 2-99

(ఎటయేనియున్ = ఎచ్చటికో) శాంతి. 5-266

కి. వీనెట నీవెట సుతుఁ డెట. ఆది. 4-99

(ఇట సంబంధము లేమిని దెల్పును.)

ఎటు దే. అవ్య. ఎట్లు

1. ఏవైపు, ఏదిక్కు.

చ. ... ఏమనునో యెటు నూచునొక్కొ యెవ్వరి దెస నెప్పుడే తలఁపు వచ్చునో యూతని కంచు. విరా. 1-129

2. ఏప్రకారము, ఏవిధము.

వ. ధృతరాష్ట్రుండు సంజయునితో నిత్తెఱంగునం బన్ని బహులలిమి

రంబున సమరం బెటు సేసి రని యడిగిన. ద్రోణ. 5-142

చ. ... తత్ప్రమయంబున రెంటఁ గూడ నీ,వెరవున యూఁది చిత్త
మున వేగిర పాటెటు లేక పొంచుమీ. అను. 1-272

(ఎటు=ఏ విధముగా నైనను)

**ఎటులు** దే. అవ్య. (√ఎటు)

ఏ ప్రకారముగా.

ఉ. . . . , నీవు, స,మ్మానము సేసి నాకిటు లమాత్యుఁడవైన పదంబు
కంటె మే,లై నుతికెక్కఁ గోర్కిఁ యెటు లారసి చూచిన నొండుఁ
గల్గునే. ఉద్యో. 1-98

ఉ. . . . క,య్యమ్మొ తెఱంగు సెప్పు మెటులయ్యెఁ బదంపడి సూత
నందనా. ద్రోణ. 2-86

**ఎట్టకునేని** అవ్య. (ఎట్టకున్+ఏని) ఎట్టకేని

చాల సేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, చాల కష్టము మీఁద.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొడ్డుల రాచిన చందనంబు మే, నెల్లఁ
జెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య,ల్లల్లన మార్ద
వం బొనరు నట్లుగ నెట్టకు నేని రాచి మీ,తల్లికి భక్తిఁ బెట్టెదు
విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదుఁన్. విరా. 2-220

**ఎట్టకేని** అవ్య. (ఎట్టకున్+ఏని) ఎట్టకేని

చాలసేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, అతి కష్టము మీదఁ.

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలు మందిరం బల్లఁ
జేర నరిగి, యొల్లఁ బోవుచు బెబ్బులియున్న పొదరు, సొచ్చు
లేడి చందంబునఁ జొచ్చుటయును. విరా. 2-112

వ. . . . ఇక్కార్యంబున దోషంబు లేదు వినిద్రకరణంబయిన నా
హృదయ శల్యంబు నుద్ధరింపుమని ధృతరాష్ట్రు నెట్టకేనియు
నొడంబఱిచి దుర్యోధనుండు. ఆది. 6-180

**ఎట్టకేనియు** దే. అవ్య. ద్రు.

ఎట్టకేని.

వ. ఈ దేవియును (కుంతి) బతితోడన పోవ సమకట్టినం బుత్త్రరక్షణార్థంబు మునిగణ ప్రార్థితయై యెట్టకేనియు ధృత ప్రాణయయ్యె. ఆది. 5-156

**ఎట్టకేలకు** దే. అవ్య. ద్రు. (ఎట్టకున్ + ఏలకు)

ఎట్టకేని.

చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టుల కాక యంచు. విరా. 1-287

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెదు రెండవ కన్ను నెట్టకేలకు దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు సూడ. విరా. 5-386

**ఎట్టి** దే. విశ. (ఎట్టు + ఇ)

ఎటువంటి.

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లమ పెద్దకాల మునికి తద్ద తగదు. ఆది. 4-65

తే. యోగి యెట్టి యాహారంబు లుడుగవలయు. శాంతి. 5-591

(ప్రశంసాదులను దెల్పును.)

ఉ. ఎట్టి లా వెట్టి పరాక్రమస్ఫురణ మెట్టి రయంబని పిచ్చలింపఁగన్. భీష్మ. 1-260

**ఎట్టిపాటివారు** దే. సర్వ. బహు.

ఎంతటి వారు.

ఆ. దైవ వశమున, నెట్టిపాటివారు నెట్లుఁగారె. శాంతి. 4-426

**ఎట్టిండు; ఎట్టిఁడు** దే. సర్వ. ఏక. (ఎట్టి + వాడు)

ఎటువంటి వాఁడు.

క. శిశిర సుత జన్మం బెట్టిండవు నాకొ దేవరుఁడు నాకు ననుచుం. ఆది. 4-252

క. ఇతఁడెట్టిఁ డైన నేమగు, నతనికి సఖుఁడట్టె బక మహత్తర సఖ్యం, బితనిం బాత్రముఁ జేయదె. శాంతి. 3-492; శాంతి. 4-418

**ఎట్టు** దే. అవ్య. ఎటు

ఏ విధము, ఏ ప్రకారము.

ఉ. ... ఇప్పు డిటు గ్రుంగుడుపాటునఁ బొందఁ బాచి నా,కెట్టు
మనంబు వట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్పుఁ జెప్పుమా.
విరా. 2-192

**ఎట్టులు** దే. అవ్య. ఎటు, ఎటులు

ఏ విధముగా, ఏ ప్రకారముగా.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీ వత్సర, మొకఁడు నెట్టులయిన
నుడిగి మడిగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప నెగడవలయు: విరా. 1-143

తే. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టులరయ, వలసె నెమ్మెయి నారయు,
మలసి దస్సి నొచ్చియైనను. విరా. 2-214

**ఎట్టులొక్కొ** (ఎట్టులు+ఒక్కొ)

ఏవిధముగాఁ గానున్నదో - ఏ విధముగాఁ బరిణమించునో.

ఆ. ... ఇమ్మని, యేల సైఁచు నింక నెట్టు లొక్కొ. అర. 2-327

**ఎట్టెట్టు** (ఎట్టు+ఎట్టు)

ఏమేమి (ఆశ్చర్యమును దెలుపును.)

సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో, నెట్టెట్టు భీముండ
యూరఁ దేమి. అర. 1-116

**ఎట్లొకొ** ఎట్లొకొ

ఏ విధముగాఁ బరిణమించునో.

క. ఇట్టగు తెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మన భంగి పిరలిందఱును
గడున్ బెట్టిదులు. విరా. 4-54

ఏపట్టున నైనను, ఎట్టి పరిస్థితి యందైనను.

ఆ. ఎట్లనియేని గూర్తు రింతులు మాకని, విశ్వసించు వారు వెడఁగు
లెందు. అర. 2-164

**ఎట్లు** ఎటులు, ఎట్టులు

1. ఏ ప్రకారము.

వ. తత్ప్రకారంబు నడపెద నది యెట్లనిన. విరా. 1-48

2. ఏ ప్రదేశము, ఏ తావు.

(భీష్ముఁడు కర్ణునితో)

చ. నెపమిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చునే-
కుపిత మనస్కుఁడై నరుఁడు గ్రూల్చఁ గ్రమంబున దొడ్డలెల్లఁ జ-
చ్చిన పిదప నెట్లుఁ జొచ్చెదు. ఉద్యో. 4-249

(ఎట్లుఁ జొచ్చెదు = ఏ తావునకుఁ బోయెదవు)

ఇది సం. ము అకాడమీ ప్రతుల పాఠము. ఎట్లుఁజచ్చెదు పాఠాంత రము - ఆనంద ప్రతి ఎట్లుఁ జచ్చెదు—పాఠము ఎట్లుఁ జొచ్చెదు పాఠాంత రము. ఎట్లుఁ జచ్చెదు = ఏ విధముగా నైనను జచ్చెదవు.)

3. ఇది వ్యతిరేక క్రియలపై 'వల' అను వర్థముతోఁ బ్రయోగింపఁబడి యుక్తార్థమునందు నిశ్చయమును దెల్పును.

ఆ. ... ఇట్లు వడిన వీరలు వదపడి, తమకు నగ్గమైన తటి జయింప రెట్లు - (నిశ్చయముగా జయించిరి.) విరా. 1-56

4. అన్ని విధముల.

ఆ. రాజు వొద్దఁ బలుపురకు సంకటముగాఁగఁ దిరుగు పనుల కెంత తేజమయిన, వాని బుద్ధి గలుగు వారొల్లర మీఁదఁ జేటు దెచ్చు నెట్లు సిద్ధమగుట. విరా. 1-126

5. సంబంధ సర్వనామముగా నుపయోగించుట.

ఎట్లు - అట్లు

వ. మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియంబట్లు చేయు వాఁడ కాక. ఉద్యో. 1-377

**ఎట్లుచెప్పిన; ఎట్లుసెప్పిన దే. అ. క్రి.**

ఏ విధముగా అనుకొనినను, ఏ ప్రకారముగా ఆలోచించినను.

చ. ఇది వేను కాము చెందమున నేరతయు భీషణమై జనంబులన్, బెద రఁగఁ జేయు; నట్లగుటఁ బెట్టి చనన్ వలయుం దలంచి నా, హృద యము దీనిఁ గాయుటకు నియ్యకొనం జొరదెట్లు చె. (చె), ప్పినఁ దుది నొకచోట వైచుటయ తోఁచిన కార్యము నయ్యెడుం గటా.
విరా. 1-160

ఎట్లొకొ, ఎట్లొకో, ఎట్లొకొ౯, ఎట్లొకో౯, ఎట్లొ-

క. ముని నాయక మృత్యువు ప్రభు, వని యిందుము లోకమువకు నది యెట్లొ కొ. ద్రోణ. 2-159 (ఏ ప్రకారమో)

క. ... హారు లి, త్తటి నీళులు ద్రావక తె,ప్పిటి లెట్లొకొ శత్రు సైన్య భీకర మూర్తి. ద్రోణ. 3-160 (ఏమి కారణమో) ద్రోణ. 5-45

ఎట్లొకో

1. ఏమగునో, ఏది జరుగునో.

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసపుఁ జోటువాక యా, కొండు నలంగుడున్ నిదురకుం దఱిదప్పెడు దప్పిపుట్టె నొ,క్కం డన యెట్లొకోయనక. విరా. 1-185

2. ఏమి కారణమో,

సీ. శుభ లక్షణాంగి యీ సుందరి సైరంధ్రి, యగు టెట్లొకో యని వగచు వారు. విరా. 2-146; శాంతి. 6-398

3 ఎందులకు జరుగఁ గూడదు, జరుగ వచ్చును అని భావము.

చ. ... ఈ బలం,బుల కధినాథుగా ద్రుపద భూపతి బట్టముఁ గట్టు టెట్లొకో. ఉద్యో. 4-99

ఉ. ... వి,క్రమా,వర్జిత వైరి భీముఁడును వారికిఁ దోడుగ నేఁగు టెట్లొ కో. ద్రోణ. 4-129

3. ఎటుల్ల సాధ్యపడునో,

వ. ముఖుల వలన శూద్ర జాతి భామలందుఁ బ్రభవించిన వారికి బ్రహ్మర్షిత్వంబు గల్గుటది యెట్లొకో యని వితర్కించి. అను. 2-28

వ. బ్రాహ్మణునకు శూద్రజాతియందు భార్యా పరిగ్రహంబు సేయం దగు నని విందు నతనికి భార్యలు ముష్వురని నిర్దేశించితి రది యెట్లొకో యనుటయు. అను. 2-280

ఎట్లొకొ౯

ఏమగునో, ఏది జరుగునో.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొనిరిం కెట్లొకొ యంచున్
భయం బొదవం. విరా. 3-27

ఎట్లొకో

ఎట్లు జరుగునో, ఎట్లు సాధ్యపడునో.

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ
దలంపం,గా మా మనోరథమునకు, నీ మాట విరుద్ధ మయ్యె నిది
యెట్లొకో. విరా. 1-286

ఎట్లో

సంభవము కామిని సూచించును.

క. మేలు దొరకొను విధమెట్లో. శాంతి. 3-133

ఎడ[1] దే. వి.

1. స్థానము, చోటు.

తే. ఇట్లు దమదమ వర్తిల్లు నెడల సకల, జనములకు హృదయాను
రంజన మొనర్చి. విరా. 2-8

క. మన మొకఁ డేపుర మీ యం,గనయుం దోనరుగు దేరఁగా
నెయ్యెడఁ బోయిన నెఱుఁగకుండుదురె. విరా. 1-58

వ. సరిగా రెండెడలకు, నరులు సనుటఁ గోరి మనమునన్.
అను. 5-160

ఆ. ... పార్థు, నరిగి నెడక మనము నరిగి యతని యున్నచోన ప్రీతి
నుండుద మిందుఁడ, నేల యనుచుఁ బౌరులెల్లఁ దెరలి,
ఆది. 6-142 అర. 2-178

2. ఎడము, అంతరము.

వ. అంత నంతుమంతుండు శాంతుం డగుచు వచ్చె నట్టి యెడం గదిసి
కవ్వడి గాంగేయుపైఁ గ్రూర నారాచ నికరంబులు నిగిడించి
పదం ద్రోచిన. భీష్మ. 3-411

వ. యోధవీరులుం గుమారులు నొక్క పెట్ట ధృష్టద్యుమ్నుం జేరి
విన నతండు ద్రోణ దత్త ప్రమోహాస్త్ర బాణంబున వారినందఱ
నిశ్చేష్టితులం జేసినప్పుడు దప్పి దీర్చికొన నెడగని యనిలనందనుం

డొక్క మడవున మధుర శిశిర జలంబులఁ బానంబుసేసి.

భీష్మ. 2-378

3. అవకాశము, వ్యవధానము.

వ. ఇవ్విధంబునం గృపాశ్వత్థామ శల్యవృషసేనులు రెంపుసేసి సైంధవున కడ్డంబైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁజూడ నెడ గానక యవుడుగఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డిట్లనియె. ద్రోణ. 4-311

క. కొండొక యెడఁగని శాంతనవుం డాఖండల తనూభవుని డాముఁపుద్దండ భుజబలము మెఱయఁ బ్రచండాస్త్రహతముసేసె

విరా. 5-175

తే. శోకభయ కారణంబులు లోకమున ననేకములు దానఁ దలసూపు శోకములకు, భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు, మూఢుఁ డవి త్రోవనేరండు మునుఁగు వగల. శాంతి. 1-188

ఉ. నాకెడ యిమ్ము లెమ్ము కురునాథు మనఃప్రియ ధర్మపత్ని నే, నేకత మెట్టులుండుదు మహీపతితోడనపోదు. ఆది. 5-144

తే. తేరు డిగ్గి పాఱించెఁ గ్రీడి గాండివ గుణంబు.

చ. ఎడగని యబ్బలంబు గదు నేర్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రముల్లడు వడిఁ గుప్పఁగూరగఁ జలంబునఁబైఁ దొరగింప.

ద్రోణ. 3-151, 152

శ్లో. ఇదం ఛిద్రమితి జ్ఞాత్వా ధరణిస్థం ధనంజయమ్.

సం. భా. ద్రోణ. 99-42

4. సమయము.

క. అమరనగరంబున కరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన. విరా. 1-87

వ. అదియును నిలిచి మార్కొన్న యప్పుడును నడచు నెడనుగాదు.

శల్య. 2-305

క. గెలుపు నెరనేయు నెడవడిఁ బఱచునెడం బెనఁగునెడ నపారబలంబుల్, మెఱయునెడ భీమునకు నందొఱుఁ గిద్పడఁ దొడఁగి రుద్ధ

తులు రాజసుతుల్. ఆది. 5–164

సీ. ఇతని విక్రమ మాశ్రయించియకాదె య,య్యెడ లక్కయిల్లు వెల్వ డఁగఁ గంటి,మి. ఆది. 6-278; అను. 2-195

5. గడుపు, వ్యవధి.

వ. ...అర్ధేవి వహంమకడకుం అని సముచితంబుగాఁ దదీయ సాంగ త్యంబున కెడవలికి కొనివచ్చునది. ఉద్యో. 1-162; ఉద్యో. 1-166

(ఎడవలికి = గడువుగా మాటాడుకొని అని తాత్పర్యము)

ఉ. ఆల్లన యింతి యిట్లనియె నారసి వాసవు కల్మిలేమియుం, దెల్లము గా నెఱింగికొని తేఁకువ వేకిట వచ్చుటొప్పు నా, యుల్లము శంకి తం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ,వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. ఉద్యో. 1-165

సీ. పలుకుల కెడలేదు బాణాసనము గొని,చనుదెమ్ము నా తోడ. ఆది. 8-118

6. విరామము, విచ్ఛిత్తి.

తే. పుత్త్రి విను మేను దశుని పుత్త్రి నన్నుఁ, బావకున కిచ్చె మా తండ్రి బాల్యమునను, నన్ను నతఁ డంత యొల్లఁడు నాకుఁ బలికె, నెపుడు నెడలేవి పొందుగా నీవొనర్పు. అర. 5–259

7. తెఱపి, తీఱిక.

ఆ. వేగ జాముగలుగ నెడనిద్రఁ బొందుదుఁ,గాని రాజ్యభారకార్య యుక్తి, సజ్జనయన నాకు నాహారనిద్రల, కెడయు లేదనుమ్మె యెల్లప్రొద్దు. అర. 5—308

8. మధ్యము (నడిమి ప్రదేశము)

సీ. ...నూత్నముక్తాదామముల తోడఁ, గుసుమమాలిక నెడగ్రుచ్చి ప్రేలఁ గట్టించి. విరా. 5–386

తే. ...మీ తండ్రి క్రీడపై నడర నడుమఁ, జొచ్చె సాత్యకి యన్నదీసు తుఁడు శక్తి,వైవ మెయివాల్చి యది వట్టివైచె మగుడ, నాతఁడా భీష్ముఁ డెడఁ దుమ్ముమాడె నధిప. భీష్మ. 8–285

క. కదిసి శరాసనగురు డిరు,వది యేను శరంబులేయఁ బార్థుఁడు వా
నిం, గుదియించి విశాలాస్య, ప్రదరము లడరింపఁ గుంభభవుఁ
డెడఁ ద్రుంచెన్. ద్రోణ. 3–75

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధవివశుం
డయి గ్ర,క్కున వాలు వెఱికికొని క,ర్ణుని దెసకుం గవియ భూవ
రుం డెడ సొచ్చెన్. ద్రోణ. 5–106

9. ప్రవేశము, చొరవ.

వ. ...పృథివి శాసింప భవదీయ విభవం బుజ్జ్వలంబై యొరుల కెడ
లేక చెల్లుచున్న నెంత యొప్పగునో యటు విచారింపుము.
ఉద్యో. 2–89

10. స్థితి, సందర్భము.

వ. విప్రుని దండించు నెడలునుం గలవు శుక్రుండును జెప్పిన వాఁడు
వినుము. శాంతి. 2–174

వ. పద్మవ్యూహంబు సంఘటించునెడ వివిధ దేశంబుల రాజులు దళం
బులును. ద్రోణ. 2–4

11. వీలు, అనుకూల్యము.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁడు.
ద్రోణ. 2–112

క. అవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు భూసురావళి
మంత్రో,ద్భవ దారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా
నెడ గలదే. ఆది. 2–132

12. దూరము.

చ. తడ వగు దెంచె బమ్మికిఁ బ్రదక్షిణ వృత్తిగఁ దేరువోవ ని,మ్మెడ
గలుగంగఁ బోయెఁ బసులిప్పుడ కూడుదమన్న. విరా. 4–171

(ఎడగలుగంగ = దూరముగా)

క. వేత్ర హస్తులు దొలఁగు తొలంగుం డని నెడ గలుగ బడియ
(ఎడ గలుగంగ = దూరముగా నుండునట్లు.) భీష్మ. 3–169

వ. పవమానసూనుం డవమాన పూర్వకంబున నీవెందులదాన వింత బ్రొద్దేల వచ్చి తెట వోయె డెడ గలిగి పొమ్మనిన విని హిడింబ యిట్లనియె. ఆది. 6-191

సీ. అడవిలో నిద్రావశాత్ములమై యున్న, మన నిద్రఁ దెలుపఁగా దని హిడింబ, యెడ గల్గఁ గొని పోయి యెక్కటి సంపిన. ఆది. 6-278

చ. ... అచ్చటన్, జను లెడయేట గాంచు నెటిపాలక. విరా. 2-247

13. ఆలస్యము, విలంబము.

క. ధరణీసురులకుఁ గడు, నెరగై నెడ నెఱిఁగి యెడయుఁ జేయుదు రె మహాపురుషులని నరుఁడు విలుగొని. (ఎడయున్ = ఆలస్యమును) ఆది. 8-119

14. విధము.

సీ. ... అబోయల సమద వృత్తి, నెట్టకేలకు నొకయెడ మాన్చి. మౌస. 1-188

(ఒక యెడ = ఒక విధముగా — అతి కష్టము మీద—అని భావము.)

15. అడ్డు.

వ. అనిన విని కుటిలం బగు నతని యభిప్రాయంబునకు రోసి యస్త్ర గురుఁ డవ్వరంబునకు నేమేనియు నెడపెట్టి యిచ్చు వాఁడుగా నూహించి. ద్రోణ. 1-112

శ్లో. సత్య శిపన్నమభిప్రాయం, జ్ఞాత్వా ద్రోణోర్థ తత్త్వవిత్.
తం వరం సాంతరం తస్మై దదౌ సంచిత్య బుద్ధిమాన్.
సం. భార. ద్రోణ. 12-19

విశే.

16. అధికము, మిక్కిలి.

చూ. ఎడదవ్వు.

అవ్య. ద్రు.

17. అందు, విషయమున.

తే. ... తల్లి ప్రజల, యెడ విరోధంబు వాటించు టెంత మేలు.
ఉద్యో. 3-265

క. మా తండ్రియెడం జేసిన, పాతకము కతంబుగాఁగ బాంఛాల
నిక్రృష్టా తుని మెద నిను. కర్ణ. 2-327

క. ... సజ్జన సేవ్య యన్న దానము, మను లధికంబంద్రు పాపములఁ
బాపు నెడన్. అను. 4-270

ఎడ2 వై. వి. ఎడఁద, ఎడ్ద, ఎడ్డ, ఎడ, (సం. హృద్)

హృదయము.

తే. దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ
దిక్కశర్మ. విరా. 1–18

క. ... కుమ్మరి కోలను సారెంబోలితిం దలఁచి చూడు మెడన్.
అను. 1—16

తే. ... బెట్టులూకుఁ, డడరి యన్న కులానుజు నంపవెల్లి, ముంప
నతఁడేచి పటు భల్లమున శిరంబుఁ, ద్రుంచె నన్నల యెడలు సం
తోష మొంద. శల్య. 1-886; విరా. 5-62

ఎడ3 విశే.

స్వల్పము.

ఆ. కర్షకునకు నేల కాల మెఱుంగుట, యట్టి కాని కేది సంభవించె
నందు విలువ మొదలనగు లాభమును నెడ, వ్యయము గల్గుటయు
శివప్రదములు. అను. 5-75

ఎడఁగాంచు దే. స. క్రి.

దూరమునఁ జూచు.

మత్త:—మహామునీంద్రుల యాశ్రమం బెడఁగాంచె నంఘోరుహాక్షి
పురా సమార్జిత పుణ్యకర్మ ఫలంబునన్. అర. 2-98

ఎడఁజొచ్చు దే. అ. క్రి.

1. నడుమఁ జొరఁబడు.

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యీ, బలము పసుల కడ్డపడక
యుండ, నెడ సొరంగ వలయు నిట యొయ్యు కొనుమని పనిచె

మత్స్య భూమిపాల మతుని. విరా. 4-267

క. ఎడఁజొచ్చి చిత్రసేనుఁడు, వడముడిపై నేయ. భీష్మ. 3-57

2 అడ్డుపడు.

క. ద్రోణాచార్యుండు సుతత్రాణ పరత్వమునఁ గృష్ణు తమ్ముని పై, నక్షీణోద్ధతిఁ గవియుడు గీర్వాణాధిప సుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. భీష్మ. 3-218

ఎడఁద వై. వి. ఎద్ద, ఎడ్డ, ఎద[2] (సం. హృదయము)

హృదయము, మనస్సు.

తే. వికట విస్ఫురదసిచర్మ వివిధ చిత్ర, గతులు చూపఱ యెడఁద కద్భుతము సేయ. ద్రోణ. 1-171

తే. ఎడఁద సొగయించు మాటల నెలమి మిగుల. విరా. 2-64

ఎడఁబడు దే. అ. క్రి.

ఊఱట గొను, విశ్రాంతిపొందు, తెంపు అగు.

క. ఎడఁబడక యహోరాత్రులు, వడిఁగొని చదివింప నిట్లు వలయునె. అర. 3-288

ఎడఁబాయు దే. అ. క్రి.

విడుచు, త్యజించు, పాయు.

ఉ. హా యను ధర్మరాజ తనయా యను నన్నెడఁబాయ నీకుఁ జన్నె యను. ద్రోణ. 2-242

ఎడగను దే. అ. క్రి.

వ్యవధి పొందు, అవకాశము పొందు, వీలు చూచుకొను.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁడు. ద్రోణ. 2-112

క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దన యునికిఁ జేసి నేరము పలుకన్, మా యిష్టం బెఱిఁగింపఁగ, ధీయుత యెడఁగంటి మిన్ని దివసంబులకున్. ఆది. 8-18

ఎడగర దే. వి.

చిత్త స్వాస్థ్యములేమి, నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటు.

చూ. ఎడగరపడు.

**ఎడగరపడు** దే. అ. క్రి.

చిత్తస్వాస్థ్యము లేకుండు. నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటును బొందు.

సీ. ...నీవు డస్సి,యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ,వెడ గర పడితె దీ యడవిలోన. సౌప్తి. 1-61

శ్లో. చిరం తే జాగ్రత స్తాత స్వప తావన్నిశామిమామ్
విశ్రాంతశ్చ వినిద్రశ్చ స్వస్థ చిత్తశ్చ మానద.
సం. భా. సౌప్తి. 4-4, 5 (వావిళ్ల)

**ఎడగలయు; ఎడగలుగు** దే. అ. క్రి.

1. దూరముగాఁ జేరు, దూరముగా నుండు.

క. నిలిచిన సకల జనులు నెడ,గలిగి బలసి నిలిచిరపుడు. కల్యా. 2-280

(ఎడగలసి — అని సం.ము పాఠము అప్పుడు నిదియే యర్థము)

వ. వేత్రహస్తులు దొలంగు తొలంగుండని సందడి నెడగలుగ జడియ. భీష్మ. 3-169

వ. ధృతరాష్ట్రుండు గొండొక యెడకలుగం జనియె. ఆశ్ర. 1-157

2. వ్యవధియుండు, సావకాశము చిక్కు.

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు ఘూసురావాలిమ-ద్రోఁ,ద్భవదారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడగలదే. ఆది. 2-182

**ఎడతెంపి** దే. వి.

వ్యవధానము.

చ. ...భయంపడి యిద్దెస వచ్చెనేని న,త్తెఱగయిపోమె యంచు నెడ తెంపిగఁ గొందఱు వాయఁబాఱఁగన్. విరా. 5-61

(ఎడతెంపు-అని పాఠాం)

**ఎడతెంపు** దే. వి.

చూ-ఎడతెంపి.

**ఎడతెగు** దే. అ. క్రి.

ఎడపడు, విచ్ఛిన్నమగు.

క. ద్రోణుఁడు రయమున వేసిన, బాణము లెడతెగక యొక్క బాణము వోలెన్, శ్రేణియయి వోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటిరే చిత్రగతిన్. విరా. 5-129; విరా. 5-41

క. జనవినుత యగ్నిహోత్రం,బును సంతానమును వేదములు నెడ తెగఁగాఁ, జన దుత్తమ వంశజులకు. ఆది. 4-181; ఆది. 4-221

**ఎడత్రెవ్వు** దే. అ. క్రి.

ఎడతెగు, విచ్ఛిన్నమగు.

క. వెనకువ యెడత్రెవ్వక పదు, నెనిమిది దివసములు సెల్లె. శల్య. 1-348

క. మడు వింకఁగఁ బాఱెడు నీ,రెడ త్రెవ్విన నొండుచోటఁ జేఁగఁగ రాదె,ప్పుడు నింకని నీళ్ళులుగల, మడువునకుం బోవవలదె మనకిట్టి యెడన్. శాంతి. 8-186

**ఎడదవ్వు** దే. వి.

మిక్కిలి కాలవ్యవధి, చాలాకాలము గడచుట.

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు, నెఱుఁగని యట్లుండు నొక్కొ యెడ దవ్వగుటన్, మఱచెనొకో ముగ్ధు లధిపులు, మఱవరె బహు కార్యభారమగ్నులు గారే. ఆది. 4-68

**ఎడదాఁటు** దే. అ. క్రి.

లంఘించు, ఉఱుకు.

చ. కరిపతి జిట్టుఁ దిరిగి క్రమ్మఱ నూల్గొని వృష్ణి వీరు నుద్ధుర రథ ముద్ధతింబెనఁచి తొండమునన్ వెసనెత్తి వీచివై,చె రయము మైనతం డిలకుఁ జిత్రమఁగా నెడదాఁటి పోయె. ద్రోణ. 1-324

**ఎడనుడుగు** దే. అ. క్రి.

నడుమమాను, మధ్యలో విరమించు.

క. ...తఘకుఁ, దలరఁగఁ బ్రేరేపకేలం బానెడ నుడుగున్. ఆది. 2-178

ఎడనెడ దే. వి.

అ౯ క్రీడక్రీడ.

వ. పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీర యాత్రలు నడుపుచు. విరా. 1-147

2. అప్పుడప్పుడు.

వ. తమకంబు నెడనెడ నతిముఖీం ప్రదర్శంబు దెసకు నతఁడు వాఁడి విడిచిన విశిఖంబులు నూఱు గలవు. ద్రోణ 2-228

3. మధ్యమధ్య, నడుమనడుమ.

సీ. కజ్జ బులును బండ్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్ర సుతుఁడు పుత్తెరఁ బ్రీతి, నెడనెడఁ గొనివచ్చి యిచ్చిన వానినెల్లను వేడ్క నను భవించిన విధంబు-తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ. ఉద్యో. 3-173

సీ. ఇరుప్రొద్దుగుడుచుచు నెడనెడఁ గుడువకయుండు నాతండు సదోప వాసి. శాంతి. 4-368

ఎడపక దే. అవ్య. (ఎడపు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకము)

1. తొలఁగక, వీడక, వదలక.

వ. ...చలం బెడపక నీమఱంది యన్న కులానుజుల గిట్టి. శల్య. 1-380

ఆ. ...వాని, నడపకయు నిష్ఠయొడప కతఁడు. శాంతి. 2-222

క....అయ్యేవురు పతులందు ధర్మ మెడపక యుండుం, గావున. ఆది. 7-262

2. వారు, వీరు అను భేదము లేకుండ.

క. అడవులునేఱులు నవి నీ, పడసిన యవియట్టె పుణ్య భాగిరథి యిప్పు డిఁగల జనులకెల్లను, నెడపక సేవ్యంబ కాక యది నీయదియే. ఆది. 7-40

మవః పూర్వకముగా.

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితిమి. సభా. 2-30

శ్లో. మతిపూర్వ మిదం సర్వం చేదిరాజ మయా కృతమ్.
తన్మే నిగద స్తత్త్వం కారణాన్త్ర మే శృణు.
సం. భా, స భా. 42-2

ఎడపడు దే. స. క్రి. (√ఎడ)

1. విడివడు, వీడు.

వ. రేపకడవన లక్ష్మి పుర శ్రీ నలంకరించు వడువున నెడపక యెల్లెడల నిగుడు వివిధకుసుమ కదంబ పరిమళంబులై యున్నంత.
విరా. 2-240

2. ఒకటి వెంట నొకటి వచ్చు.

ఆ. బ్రదుకు చేటు పొగడు వడుట దూఱుకొందుట, యీగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ, గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి, వాని కింత యేల వగవ నధిప.
ఉద్యో 2-79

శ్లో సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ, లాభాలాభౌ మరణం జీవితం చ, పర్యాయశః సర్వమేతే స్పృశన్తి త స్మాద్ధీరో నచ హృష్యేన్న శోచేత్
సం భా, ఉద్యో. 35-47

3. ఆలస్యమగు, జాగగు, తడయు.

క. ఉగ్రగుడుగు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ వేగంబున నయ్యెడ కేఁగు దెంచి నారదుఁ, డెడపడు టించుకయు లేక యిట్లను నాతోన్.
ఉద్యో 4-849

4. దూరమగు.

సీ ముక్త కామస్థితి నమ్మాఁడు మార్గములను, నడచి పరంబున కెడపడకుండుదు ముక్తి వైరాగ్యః మూలనూవె.
శాంతి. 6-174

ఎడపు దే. స. క్రి. (√ఎడయు)

1. విడుచు, వీడు, త్యజించు.

సీ. తొడఁగిన పని చలం బెడపక యతిదుష్కరంబైనఁ గడతేర్చు ప్రభువులార.
విరా. 3-21; శాంతి. 2-222

వ. ఇట్లు దన తురగసముదయంబు సమయుటయుఁ జలం బెడపక నీ మఱంది యన్నకులానుజుం గిట్టి
శల్య, 1-880

2. తొలఁగించు.

క. నా కీడు దలఁపనేరక, శ్రీకినెడపి పాడి యింత సేయక పుత్త్రా, నీక సుహృద్బాంధవులం, బోకార్చితి బ్రతుకుటింకఁ బోసఁగునె చెపుమా స్త్రీ. 1-18

3. తప్పించు.

క. ...కీలెడసిన జంత్రము, వడుపునఁ బడనేసె నతని వాసవి యధిపా. ద్రోణ. 3-79; ద్రోణ. 1-371

ఎడపెట్టు; ఎడవెట్టు దే. స. క్రి. (√ఎడపడు)

1. విడుచు, విడిచిపెట్టు.

గీ. దినము లెడపెట్టి కుడుచుచు. అను. 4-148

క. గెలుపును నోటమియుననిఁ, గలుగవె యెడపెట్టి యెట్టి ఘనులకు నిమ్మెంౘఁ, బలుకుదురే తగువారిం, తులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. ద్రోణ. 4-289

(ఎడపెట్టు = ఒక దానిని విడిచి యొకటి ఒకటి తరువాత నొకటి ఎడు పడి అని భావము).

2. అడ్డుగాబెట్టు, మితిగాఁ బెట్టు.

ఆ. గురుని బ్రతినవించె వెరవున లావునఁ జేసి దీని బొంకు సేయవలయు నెఱుఁగు మతఁడు నిన్ను నెడవెట్టి పలికిన, వాఁడు గానఁ జెప్ప వలసె నీకు. ద్రోణ. 1-116

వ. అనిన విని కుటిలంబగు నతని యభిప్రాయంబునకు రోసి యస్త్ర గురుం డవ్వరంబునకు నేమేనియు నెడవెట్టి యిచ్చువాఁడుగా మాహించి. ద్రోణ. 1-112

శ్లో. తస్య జిహ్మ మభిప్రాయం జ్ఞాత్వా ద్రోణోఽర్థ తత్త్వవిత్,
తం వరం సాంతరం తస్మై దదౌ సంచిత్య బుద్ధిమాన్.
సం. భార-ద్రోణ. 12-19

ఎడపొందు దే. వి.

మనసు తగిలియుండుట.

క. వలలుని దెస మాలిని చూ,డ్కు-ల తెఱఁ గెడపొందుఁ దెలిపెకుం
గంటిరె పీ,రలు వచ్చిన సమయంబును, దలఁపఁగ నొక్కటియ
యవ్విధం బెట్లొకో. విరా. 2-200

**ఎడమ** దే. విణ.

సవ్యము, డాపలిది.

ఉ. ధర్మము మాని యూరులు గదం బొడిచేసిన యంతఁబోక దు,ష్క
ర్మ్మఁడు వాయుజుం డెడమకాల శిరంబంటు దన్నె. సౌప్తి. 1-221

**ఎడమడియు** దే. అ. క్రి.

సమయము దాఁటిపోవు, అదనుచెడు.

క. కురుపతికి జయము గోరెదు, గురుపుత్త్రుఁడు మున్న యేలొకో
యిటు తఱికిం జొరక యెడమడిసినను మఱి,వెరవుం జేవయును
జూప వేడుకవడయెన్. సౌప్తి. 1-207

**ఎడమడుగు; ఎడమడువు** క్రి. విణ. (ఎడమ + అడుగు)

1. వ్యత్యస్తము, తాఱుమారైనది.

క నడిపింపఁగఁ బొఁడిపింపఁగ, నెడమడువై కలఁగినప్పు దేర్పఱుపఁగ
నేఁ, గడు నేర్తుఁ బేర్పునాదగు, కడిమియు నీ సైన్యమునకు గొనెన
గాదే. ఉద్యో, 4-214

2. విపరీతము, విరుద్ధము,

క. పొడవునఁ బ్రాయంబునఁ గడుఁ,గడిఁది బలంబునను జూడఁగా
ననదృశు నీ,కొడుకని యీతని నెంతయు, నెడమడుగుగఁ జూప
దెత్తె యిందఱు నగగాన్.

వ ఇట్టి లోకవిరుద్ధంబులకే మోడుదు మయుక్తంబులయిన పలుకులు
పలుకక. ఆది. 4-100, 101

**ఎడమిచ్చు** దే. అ. క్రి.

అవకాశమిచ్చు.

తే. అతిథులకు నెడమిచ్చి యాహారములను, భక్తినాత్మీయములలోనఁ
బంచిపెట్టి. ఆశ్వ, 2-170

(ఎడమిచ్చి = ఆతిథ్యమిచ్చి అని ఇక్కడ భావము)

**ఎడము** దే. వి.

1. నడిమి భాగము, మధ్య ప్రదేశము.

సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెడములు గ్రిుంగి ప్రబ్బఁగ సొంపు మిగులు వాని. విరా. 1-162

2. చోటు, స్థలము, అవకాశము.

ఆ. అనఘ నీ ప్రయత్నమున నా శరీరంబు, పొదలె నిందు నాకు మొదల నెడము, సాలనట్లుగాన మేలుగ నొండొక యెడకుఁ గొంచుఁ బొమ్ము కడఁగి నన్ను.

వ. అనిన నతం డాజలచరంబులఁ గైకొనిపోయి యొక్క బావియందు విడిచిన నది యెప్పటి యట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపియందు నవకాశంబు పర్యాప్తం బగుటం జెప్పి యతనిచేత గంగమడువున విడువంబడి కాలక్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు చాలకున్న నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కిట్లనియె. అర. 4-221, 222

శ్లో. అథ మత్స్యో మనుం దృష్ట్వా పునరేవాభ్యభాషత,
భగవన్ సాధు మేఽద్యాన్యత్ స్థానం సంప్రతిపాదయ.
సం. భా. అర. 147-14

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన, యెత్తుచు నెడముల నుత్తరించి. అర. 4-228

**ఎడమేను** దే. వి.

వక్షస్థలము.

సీ. ఎడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద, సగము దూలించి పైమగుడ దిగిచి. విరా. 2-64

**ఎడయుగు** దే. అ. క్రి. (√ఎడ)

దూరమగు.

చ. జను లెడయాటగాంచు నెటిసాలక. విరా. 2-247

**ఎడయాటు** దే. వి.

సమీపమునఁ దిరుగాడుట.

చ. జను లెడయాట గాంచు నెటి సాలక. విరా. 2-247
(ఇది పాఠాంతరము)

ఎడయిచ్చు దే. అ. క్రి.

1. గడువొసఁగు, వ్యవధి యిచ్చు.

ఉ. ...న్యాయుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ వెల్ల నెఱుంగు దివ్వు దెడయిచ్చుట యుక్తము నాకుఁ జూడగన్. ఉద్యో. 1-165

2. అవకాశమొసఁగు.

క. వగపున కెడ యీకుము నెవ్వగఁ గుందిన మానవుండు వైరుల చేతం, దెగుగాని తనదు కార్యముఁ, దగ నొనరింపఁగ లేఁడు తగు నే వగవన్. ద్రోణ. 2-357; ఆది. 5-144

3. తావొసంగు, చోటిచ్చు.

క. సీతయ్యె ననుచు నల్లన, యాతని శయనమున కరిగి యతఁ డెడ యీఁగా, నా తల్పంబున నొకదెసఁ, బ్రీత హృదయయై శయించెఁ బృథ్వీనాథా. అను. 2-13

ఎడయుడుగు దే. అ. క్రి.

నడుమ విరమించు, విశ్రాంతి తీసికొను.

వ. భీముఁ జరాసంధు లెడయుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచు. సభా. 1-206

ఎడరు దే. అ. క్రి.

విఱుగు, భగ్నమగు.

చ. తడయక ఘోరదర్శన సుదర్శనపావకుచే దహింపఁగాఁ బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధ పురత్రయాభమై, యెడరి ధరిత్రిమీఁదఁ బడియెం జెడి సౌంభక మంత సాల్వుఁడుం, బడయె మదీయ చక్రపటుపాతరయంబున రెండు వ్రయ్యలై. అర. 1-198

వి.

1. భంగము, అవమానము.

చ ...మానినికిం దనుఁదాన కాచికో, లోదవిన దానఁజేసి సభనొచ్చెము దక్కినఁ బాండునందనుల్, ద్రిదికిరి గాక యయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే ఉద్యో. 1-348

2. కీడు, హాని.

క. ఈనలువురుదక్కఁగ మన,సేనల నొక్కొకరునికైనఁ జేడ్పడని భటుం, గానం జెవి కెడకైనం, బూని తలఁగు నతఁడచూవె పురుషుం డెందున్. విరా. 2-231

ఆ. పుత్రదార బంధుమిత్ర సక్తుఁడు రోంపిఁ, బడిన గజమునట్ల యెడరు నొందు, భోగజాలపరుఁడు వాగురాజాల సం,పతిత మృగ ఝషముల భంగిఁ దలరు. శాంతి 6-318

3. యుక్త సమయము, అదను, తఱి.

ఆ. తలఁపఁ గ్రూరమతులు ధార్తరాష్ట్రులు గదు, నెగ్గునేయఁ జూతు రెడరువేచి. అర. 6-194

4. ఆపద

వ. ఇట్లు విరథుండును వికల హస్తుండునునై విషణ్ణుండగు నన్నర నాథుఁడు వెడంగగుటం గటకటంబడి యాకంకటంబు నిష్ఫలంబను బుద్ధింబుచ్చివైచి యొండొక కవచంబు దొడిగె నయ్యెడరు గనుంగొని శీఘ్రంబునం దత్త్రైగర్తకోత్తములు చతురంగ బహుబలంబులతోఁ గలిసి కవ్వడిం జుట్టుముట్టి. ద్రోణ. 3-209

శ్లో. తం కృచ్ఛ్రామాపదం ప్రాప్తం దృష్ట్వా పరమధన్వినం,
సమావేతుః పరీప్సంతో ధనంజయ శరార్దితమ్.
సం.భా ద్రోణ. 108-32

ఎడలు వి. ఎడ

1. తావు, చోటు.

వ తనయొద్దంగల యోధవీరు లెయ్యెడల లేమి దెల్లంబయినను మాకుఁ జేదోడు ధర్మంబు గలదు. ఉద్యో. 1-377

వ, మీరెల్లను వలయునెడల నిలిచి భీష్మునకుఁ గావలిగావలయు. భీష్మ. 1-174

సీ. ఉన్నతంబులయి నెడలెక్కుచు. ఆర. 3-312

తే. నాలుగే నెడల మాత్రఁ గన్నదానం దృష్టుండనై యున్న మేలు. శాంతి 1-58

క. నాయట్లువడిన యంగన లేయెడలం గలరె. శాంతి. 1-58

ఆ. జలములున్న యెడలు వెలయఁజూచి, యనముపస్థలంబులని జను లెఱుఁగక, యుండునట్లుగా మయుండు సేసె. సభా. 1-12

2. సమయము.

తే. పలియ వావంగఁ దునియఁగా విఱువ వలయు, నెడలఁ గాళ్లుఁ జేతులఁ దొడలఁబట్టి, కడఁగి యనువుగఁజేసి ప్రొయ్యిదుఁ గాని, కత్తిగొడ్డలి యడుగ నేఁ గట్టియలకు. విరా. 1-78

ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తపర్తనములు గాఁగఁ, జలుపవలయు నృపతి గొలువున్న యెడల వ్యాహారములైనఁ గెలని కెగ్గుంగుట. విరా. 1-187

విణ.

అధికము.

క. దుర్జనునకు సంపద లెడలయ్యెను నాతని, మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్. సభా. 2-202

ఎడల అవ్య. ద్రుత. ఎడ[1]

విషయమున, సందర్భమున.

ఆ. కథ జగత్ప్రసిద్ధ గావునఁ బూర్వపర్యార్థ యుక్తిసేయునట్టి యెడల, యత్నమించుకంత యయినను వలవదు. విరా. 1-42

క. శిలచేవ మ్రానుదెప్పగ, జలనిధిఁ గడవ దొరకొనిన చాడ్పునఁ బాత్రంబులు గాని యెడల దానంబులఁ బాపము నిస్తరించు బుద్ధి దలఁచినన్. శాంతి. 1-380

ఎడలఁద్రోచు దే. స. క్రి.

ఎడలించు, తొలఁగద్రోయు, పరిత్యజించు

తే. మేలు గడువేగ చేయరు కాలపాశబద్ధులై యేమరుటఁజేసి పడఁతి

మనుజు,లింత యెఱుఁగుట సంసార మెడలఁ ద్రోచు,నట్టి విసువుటఁ బుట్టించు నది హితంబు. అను 5-289

**ఎడలించు** దే. స. క్రి. (√ఎడలు) ఎడలఁజేయు

1. తొలఁగించు, ఊడఁదీయు.

క. బంధుశతంబులు శౌర్యమదాంధములై శక్తిసంపదాభీలతమై, సింధుర సద్భృశత మున్నను, సంధుల సంధు లెడలించి చంపుదు రతనిన్. విరా. 1-325

వ. ఇట్లుత్తరుండు సమారూఢ శమీవృక్షుం డగుటయు నరదంబు పయి నిలుచుండి పాండవ మధ్యముండు వేవేగ విడుపు మనవుడు నతండు నాయుధసంచయ బంధం బెడలించిన. విరా. 4-118

వ. ...ధర్మతనయుండు దన నికేతనంబున కరిగి యచట నిఖిల పరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్న సమయంబునం దమ్మునిడస కూరిమి నారం గూరిన వగ పెంపున ధైర్యంబు సొంపఱి వివర్ణ వదనుం డగుచు నిట్లనియె. ద్రోణ. 2-187

2. త్యజించు, విడుచు.

సీ. పన్నిన పగలపై సన్నాహమంతయు, నెడలించి నడచుట యెట్టు లొకొ. భీష్మ. 1-154

తే. తాను గ్రోధాదు లెడలించుఁగాని ముక్తి,దెచ్చి యీదొక భంగి ముక్తికిఁ బథంబు,నగుట ననపాయమగు నుపాయం బనంగ, వలసె నీ నేర్పు పేరిందువంశవర్య. శాంతి. 5-371

3. వదల్చు.

సీ. కీలుకాఁ డెడలింపఁ గెడసిన బొమ్మల, కైవడిఁ బటుతురంగ ప్రజంబు. ద్రోణ. 3-62

**ఎడలు** దే. అ. క్రి.

తొలఁగు.

సీ. ...ద్రుపద, తనయా సుభద్రలు ధర్మజుం డనుజు లా,శువు సంజీవితుఁ జేయకున్న -ఆ- బ్రదుక రవ్యయమున కుదక పిండప్రదా,

నంబు లెడలు. అశ్వ. 3-179

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు ర్మోల నున్న నా, మిళిత సుగంధ బంధురసమీర వశంబునఁ దూలి కాలపై, వలువెడలన్ బయల్పడియె వల్గకుచంబులుఁ గతుయుగ్మమున్, లలిత కృశోదరంబుఁ దరళ త్రివళీయుత రోమరాజియున్. ఆది. 4-43

2. పడలు.

వ. పయిఁబడిన వీరులం గీలెడలిన జంత్రంబులుం బోలె నేలంగూలనేయుచు. భీష్మ. 2-187

క. ఆరయ నెందును గౌరవ,భారం బెడలంగనీక పాతివ్రత్యా,చారము మై వర్తింతురు, సైరంధ్రీ జాతివారు సౌజన్యమునన్.

విరా. 1-112

3. తగ్గు, క్షీణించు, నశించు.

సీ. కాళ్లయొప్పిద మాఁదుకట్టుముజ్జ్వలము సేయంగ సంకుల కావు లంద మెడల, విరా. 1-228

క. గురునలుక నాకు నస్త్రస్ఫురణ మెడలెనండ్రు జనులు బొంకది.

ఉద్యో. 2-266

క. దగ్ధములై నట్టులు న,మ్మాగ్దైర్యము లెడలె మండె నాయుధ చయమున్. విరా. 4-88; విరా. 5-208; విరా. 1-294

4. విఱుఁగు, తునుఁగు.

సీ. ...చాపము సిడమెడల రెంట,నేసిన. భీష్మ. 3-19

5. చెడు.

క. అంబయు నట సాళ్వునికడ,కుం బోయిన నతఁడు భీష్మకొనిపోయిన దా,నిం బరచుం గైకొన ధ,ర్మంబే శన్యాత్వ మెడలె మగువాసికున్. ఉద్యో. 4-278

6. విభిన్నమగు.

(భీష్ముఁడు) క. కురువంశ మెడల వచ్చినఁ, బరమోపాయమున మగుడఁబడసెన్. స్త్రీ. 2-111

7. ఛిన్నాభిన్నమగు.

క. సేనాపతిత్వమునకుం, బూని యొకఁడు నడపకున్నఁ బొడవడఁగదె యీ, సేనయనిఁ గర్ణధార విహీనంబగు కలము జలధి నెడలిన భంగిన్. ద్రోణ. 1-60

8. వికలమగు.

చ. తనువు ఘనాస్త్రశస్త్రములు తాఁకిన నొప్పిని దప్పిపుట్టెనా, తునమువశంబు గాకెడలె మాటల చందము చూడ మీరు దస్సినయటులున్నవారలు. శల్య. 2-33

9. పగులు, ఛిన్నమగు.

సీ. ...నృప విను శడవకు సారిస్రై, నమర మృత్తిక యిడునపుడు విరియుటయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు, వాని యెత్తెడు నెడ వ్రయ్యుటయును -తే- నెత్తియొకచోట డించిన నెడలుటయును, నెండి యవియుటయును నావమిడినఁ బగిలి, పోవుటయు వాడు జనులచేఁ బొలియుటయును గలుగు గతిమేనికెట్లును గలుగుఁ జేటు. స్త్రీ. 1-34

10. వృథయగు, వ్యర్థమగు.

వ. ...అవ్వాలమ్ముద్రెలు నమ్మెయిన వమ్మైన విషాదంబున వాను దేవుండు వాసవి కిట్లనియె.

క. మున్నెన్నఁడు నివ్విధమేఁ, గన్నదిగా దమ్ములెడలె గాండివములావు నీ భుజముల శక్తియు, మిన్నకపోఁ జిత్రమిది యమిత్రధ్వంసీ. ద్రోణ. 3-197

11. ఖేదమును బొందు,

తే. ఊగి మన్ననఁ గలఁగంగనీక పొదిలి, యధికముగ గణముఖ్యుల నాదరించి, పనులు గొనువది తమలోనఁ బాయకుండఁ, బ్రోవు నెడలిన రాజ్యంబు పొలుపుదప్పు. శాంతి. 3-40

12. చచ్చు.

ఆ. గొడ్డు బడుగుఁ దెవులుగొఁటుఁ బ్రగే పెడలిన, దాని నెచ్చ చేసి

నూనమైన, యట్టిదాని నొకట నాయాసపడియున్న, దాని నీరు
గోప్రదాన విదులు. అను. 2-402

క. కదుఁగూర్తుఁ గవ్వడికి న,య్యొద్దలు గలుగ నేను బ్రదికియుండు
దుఁగా కె,క్కడి బ్రదుకు నాకు నాతం,డెడలిన నప్పార్థుఁగాతు నెల్ల
విధములన్. ద్రోణ. 2-349

సీ. శరణన్న మ్రొక్కినఁ దురగాళి యెడలిన నోరుతోడఁ బోరుచు
నున్నయెట్టి -ఆ- పగతునైనఁ జంపఁదగదు. శాంతి. 2-420

13. విఘ్నమగు, భంగపడు.

ఆ. ఏను గర్తనమట యెఱుఁగమి దాఁగర్త,యేని నేమిఫలము నెడల
కుండి, నఖిల కర్మములును నాచరించుచు నున్న,వాఁడె కాన
కర్తగాఁడు దాను. శాంతి. 4-876

14 లయించు, హరించు.

క. అతనిఁ బొందువు సంకల్పం, బతుల జ్ఞానంబు దాని నడచును విజ్ఞా,
నితఁ దద్బలముఁ బురుషదే,హితనుం గాలంబు వరుస నెడలం
జేయున్.  శాంతి. 5-76

స. క్రి.

విడుచు.

శా. ఉద్యద్విక్రములైన యీ ద్రుపద మత్స్యోర్వీపతుల్ నిన్ను సం,
పద్యోగోజ్జ్వలుఁ జేయఁబూని కడఁకం బ్రాణంబు లీ నున్న ని,ట్లు
ద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ. భీష్మ. 2-18

తే. క్రియ లహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన, దేహసంబంధ మెడ
లక తిరుగవలయు. శాంతి. 4-291

క. ... ఆ తం,డబుమెడలక మఱియు నేనె నధికరయమునన్.
భీష్మ. 2-306

ఆ. ... మా,తలి ప్రతోద మెడలి ధరణిఁబడియె. అర. 4-68

ఎడసేయు దే. అ. క్రి.

1. నాగొవరించు, అలస్యము చేయు.

(కీచకుఁడు సుదేష్ణతో)

ఉ. బుద్ధులు సెప్పుచెల్ల నటుపో విడు మెమ్మెయి నైన సౌఖ్యసం,సిద్ధి యొనర్చు నాకు నెడసేసినఁ దాపము రూపుమాపు నా. వృద్ధియ కోరుదేని నవివేకివి నీవని నన్ను నిట్లసం,బద్ధము లైన వాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్. విరా. 2-76

క. కొడుకుల నిందఱ నిల్లడ, యిడి పరలోకమున కరిగె నెడసేయక యి,ప్పుడ వీరలఁ గురువృద్ధుల, కడకుం గొనిపోనపలయు గజపురమునకున్. ఆది. 5-148

వ. పుత్త్రి మిత్ర బాంధవ బలసంపన్ను లైన ద్రుపదు నొద్దఁ బాండవు లుండు వారైన వారలం గృష్ణ బలదేవులు యదువృష్ణి భోజాంధక వర్గంబులతో వచ్చి కూడిన నెవ్వరు సాధింప నోపరు గావున నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింతము. ఆది. 8-22

2 తప్పించుకొను.

వ. సత్పాత్ర దానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్ను దనకు గోదాన ఫలంబిచ్చిన యతని కిచ్చు వాఁడయిన నతండును గొనువాఁడయి యుండి కొనక యెడసేసి తిరుగందిరుగ. శాంతి. 4-156

తే. అమరి యున్నాఁడ నా బారి కగ్గమైతి, పడుదు గాకింక నీకు నెక్కడకుఁ బోవ, ఎచ్చు ననవుడు నిదియేల పెచ్చు పెరిఁగి, యాల మెడసేసి యనిలజ ద్రేపెఁ దిట్లు. శల్య. 2-246

స. క్రి.

3. పరిత్యజించు.

క. తమియింప వలయు నొకఁ డెఱుఁ,గమి నీమే నన్న నంతఁ గటకటఁ బడి ధూ,రమణుని కార్యస్థితి చిత్తములం దెడసేయునట్టి తరమో మీరల్. విరా. 4-225

4. ఉపేక్షించు.

ఆ. పలవృద్ధరాజు లెడసేసిరో పార్థు, నరిగి నెడక మనము నరిగి యతని, యున్నచోన ప్రీతి నుండదు మిందుండ, నేల యమచుఁ

జారులెల్లఁ దెరలి. ఆది. 6-142

5. త్రోసిపుచ్చు, తిరస్కరించు.

వ. కావున నిక్కార్యం బెడ సేయక యొక్కరుం బనుపవలయు. ఉద్యో. 1-20

చ. కురువంశ వర్య నీ వలుగక విన్మి కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం, గలుగునె నీకు నిష్ఠురత గల్గదు దీనిఁ బరిత్యజించినం, జలము కొనంగ నేల శుభ సంగమనం బెడ సేతఁ గృత్యమే. మహా. 1-54

ఎడసొచ్చు దే. అ. క్రి.

1. జాగగు, ఆలస్యమగు.

ఉ. వీనులఁ దియ్య మెక్కు మును విన్కిఁ బరస్పర రాగవృత్తిలో, నూనినఁ జూచు వేడుకల మవ్విభులూరెడు నెమ్మనంబు లంచొ్చ నొక యింత సేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్న యమ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. విరా. 5-398

2. అడ్డపడు, అడ్డము వచ్చు.

వ. అప్పాంచాలసూనుండు సురనదీసూను మార్కొనుటయు మద్రనాథుం డెడసొచ్చి మహానలాస్త్రంబు ప్రయోగించిన. భీష్మ. 3-55

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధ వివశుండయి గ్రక్కున వాలు వెఱికికొని కర్ణుని దెసకుం గవియ భూపరుండెడ సొచ్చెన్. ద్రోణ. 5-106

ఆ. నృపతి తోడఁ గూడి కృపుఁడును నెడసొచ్చె. ద్రోణ. 5-107

ఎడు అవ.

తద్ధర్మాద్యర్థములందు ప్రథమైకవచన 'ను' వర్ణకము పరమైనపుడు ఆగమముగను, తృవర్ణ కార్థమునందు ప్రత్యయముగను వచ్చును.

1, వర్తమాన కాలమును దెలుపును.

క. ఖగ్గజములు మిన్నకయును, మ్రొగ్గెడు నుత్తమ తురంగములు

బాష్పజలం, బగ్గలము విడుచుచున్నవి, తగ్గెదుఁ గారణము లేక తడబడి పడగన్. విరా. 4-87

2. తాచ్ఛీల్యమును దెల్పును.

క. కడు నసుర క్తియు నేర్పును, గడఁకయుఁ గలవారి నుఱక కడనఁగ నెగ్గుల్, నొడివెడు వివేకశూన్యుల, కడ నుండెడు నంతకంటె గష్టము గలదే. ఆది. 3-149

3. భవష్యత్కాలమును దెలుపును,

వ. ...నాగముఖ్యులనెల్ల వాసుకి చెలియలైన జరత్కారువునకు జరత్కారుండను మహామునికిం బుట్టెడు వాఁడధికతేజస్వి యాస్తీకుండను మహాముని జనమేజయ సమారబ్ధ సర్పకుల ప్రళయంబు వలన రక్షించును; ఆది. 2-137

4. భూతకాలమును దెల్పును.

సీ. కరుఁల ద్రుంచెడువేళ గిరుల దువ్వాడెడు సంక్రందను కైవడి గానవచ్చు శల్య. 1-232

క. తడఁబడఁబడియెడు రవమును, బడి కాలెడు రవముఁ గాలి పలుదెఱఁగుల ప్రవస్సెడు రవమును దిగ్వలయము, గడుగొని మ్రోయించె నురగకాయోత్థితమై. ఆది. 2-215

ద్రు.

5. ఆశీర్వాప సంప్రార్థనములందు క్రియా ప్రత్యయములకు వచ్చు ఆదేశము. దీనికి అచ్చుపరమైనచో 'మ' వచ్చును. ఆశీస్సునకు.

క. ...యయాతికి నీకును నయిన యీ వివాహమునం దపక్రమ దోషంబు లేకుండెడు మని వరంబిచ్చి. ఆది. 3-169

శాపమునకు.

క. పతిహీనలైన భామిను, లతి ధనవతులయ్యుఁ గులజలయ్యును ననలంకృతలయ్యెడు మాంగల్య రహిత లయ్యెడుఁ గృపణవృత్తి నిటిమొదలుగాన్. ఆది. 4-229

ఎడ్డ ఎడఁద

హృదయము.

క. వికచ ముఖుఁడగుచు శాత్రవు,లకు హితులగునట్టి వారలం గని
ధూపా,లకుఁ డెడ్డ కత్తెరయు నా,లుక బెల్లమునై మనంబులుం
గన వలయున్. శాంతి. 3-268; శాంతి. 6-83వ

తే. వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుండు లేఁడుజగతి, నెందునని సంతతమ్ముఁ
దానెడ్డఁ దలఁచుఁ, దాన నిట్టయ్యెనంచు బ్రేతా నిరూఢ,బుద్ధి
నరుగుచునుండె నప్పురుష వరుఁడు. మహా. 1-36

ఎడ్డ ఎడఁద
హ్యాయము.

ఉ. ఏనొక పాపభావమును నెడ్డఁ దలంపకయుండు నట్లుగా,
అర. 2-215

ఎత్తించికొనిపోవు దే. స. క్రి. (√ఎత్తు)
మోయించుకొని పోవు.

వ. అచిరకాలంబునకు విష్ణుండు విహగపతిం బుత్తెంచి యెత్తించి
కొనిపోయి. శాంతి. 6-374

ఎత్తించు దే. స. క్రి. (√ఎత్తు)
1. పైకిలేవదీయించు (పతాకము మొ.) పైకి నెగురఁ కేయు.

వ. నన్నాహా సౌందర్యము నొంది తాలధ్వజం బెత్తించి మెలసె.
విరా. 4-237; శల్య. 1-193

2. నాటించు. (డేరాలు మొ.) వేయించు.

వ. ...విశాల రమణీయంబైన బహిరంగణంబునం బటకుటీరం బెత్తించి
విడిసి. ఉద్యో. 3-147

ఎత్తికొను దే. అ. క్రి. (√ఎత్తు)
పూను, సిద్ధపడు. యత్నించు.

తే. ఇంత పాపంబు సేయంగ నెత్తికొందు, మయ్య రాజ్యలోభంబున
నఖిలబంధు, జనుల వధియింపఁ దొరఁగిరి మని రథంబు, మీఁదఁ
గూర్చుండఁ బడియెఁ జేయూదికొనుచు. భీష్మ. 1-188

"శ్లో॥ అహో బత మహాత్పాపం కర్తుం వ్యవసితా వయమ్."
సం. భా. భీష్మ. 1-45

ఆ. ఎట్టికష్టుఁడైన నిట్టి పాపముసేయ, నెత్తికొనునె ధరణి నీవుదక్క
ఆర. 6-252

స. క్రి.

1. గ్రహించు, పట్టుకొను.

క. వేటాక్క విల్లెత్తికొని విరా 5-102

ఆ అనుశయ్యతేరి యందున్న ఘనగదా, దండ మెత్తికొని యుదగ్ర వృత్తి, జరతదేహుఁ డయ్యుఁ దరుణవయస్కున, ట్లవని కుటిలి బోయి యతని వ్రేసె. విరా. 8-217

2. వహించు, మోయు.

గీ. వాయువేగంబులైన తద్వాహనముల, భీష్మతేరెత్తికొని పాఱెఁ బృథివి యద్రువ. భీష్మ. 2-82

(భీముఁడు ఘటోత్కచునితో)

తే. అబల యిది భవన్మాత నిత్యార్థ్యగమన, యన్నలైయెదరి గజరాజ ఖేలగమన, దీని నీ వెత్తికొని చను దెస్కు మా న్యమిపమున నని సుతు నియమించె నపుడు. ఆర. 8-206

వ. వాఁడు పితృవచన చోదితుండై యిమ్మార్గం బతిపరువశిలా విషమంబు పాదచారుల కగమ్యంబు గావున మిమ్ముండఱ నెత్తికొని యుత్రమంబున నరిగెదనని ధౌమ్య పాండవ ద్రౌపదులం దా నెత్తుకొని బ్రాహ్మణుల నెత్తికొనం దన రాక్షస బలంబులం బంచె. ఆర. 8-307

3. నెత్తి బుజములు మొదలగు వాని మీఁదఁ బెట్టుకొను.

క. మహనీయ బహుళ పూజా, సహితంబుగ భోజనంబు సంతృప్తిగ నమ్మహితాత్ముండు నడపి దుర్వహభారముగాఁగఁ గనకరాశియు మణులున్.

చ. కుడిచిన పళ్ళెరంబున నకుంఠిత హర్షముతోడ నిచ్చినం గడుమదమంది యెత్తికొని గాఢభరంబునం మార్చిమోవఁగా, మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి గొవ్వఁగ గొంకుపోవ నెక్కుడు

వెస నేగు దెంచెఁ గని కొక్కెర సమ్మదమంద మ్మెట్టికిన్.

శాంతి. 3-494; 495

4, చేతులలోఁ దీసికొను, చేతులలోనికిఁ దీసికొను

వ. అని యంత సిలువని వలవంత పెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున విడికొని తదాననం బాలోకించి అశ్వ. 3-188

వ వజ్ర ఘనఘటిత శరీరుండై యిక్ష్వాకుమారుండు మేరుగిరి శృంగంబు ఎం లోలె నాకెత్తికొన నశక్యుఁ డయ్యె సభా 1-151

సీ ...ఆశిఖరి సహరు-లే-నల్లరి గుమ్మకమున సువర్ణమయత, వెలుఁగ బాలుఁడై వెలిఁగె నవీర గర్భ, మచ్చటికి వచ్చి కృత్తిక లాద్యు లను మక్కయ పుత్త్రకుఁ డనుచు నెత్తికొని రనఘ.

వ. ఇట్లెలు గుంగుస నొక్కట నెత్తికొనుటయు నక్కుమారుండును షణ్ముఖుండై యొక్కపెట్ట సకలకృత్తికాస్తన్యపానం బాచరించె అను. 8-150-151; ఆది 4-47

5 చంకఁ బెట్టికొను.

వ. అని దాని నతిప్రీతిం బూజించి కొడుకు నెత్తికొని దేవీద్వయంబు నకు నిచ్చి జరయను రాక్షసిచేత సంధింపఁబడిన వాఁడు గావున జరాసంధుఁ డను పేరిడి. సభా. 1-158

వ. అబ్బాలకు రోదనధ్వని విని యంతిపురంబున నున్న ముదుసలి యవ్వలెల్లం బఱతెంచి మహాహర్షంబుతో వాని నెత్తికొనిరి. సభా. 1-149

6 నాచికొను; అపహరించు, దొంగిలించు.

లయగ్రాహి :- తఱతులగు దుర్వచన, వృత్తులను నొండొరుల నెత్తికొని మాంసం, బత్తి తినుటన్ స్త్రీ. 2-8

క. అ యసుర నన్ను సూకరమై యప్పుడ యెత్తికొని రయంబునఁ జనుచోన్, ఆది. 1-133

ఎత్తికోలు దే. వి. (√ఎత్తికొను)

1. పూనిక ప్రయత్నము.

వ. ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల ననుజ సహితం బుగా నితనిం బరివేష్టించి, భీష్మ. 1-108

క. తరతరమ ప్రజలఁ దునిమెఁదు, నరునప్పటి యెత్తి కోలునకు సుర విద్యాధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. (ఇట 'విజృంభణము' అని భావము) విరా. 5-64

2. సంకల్పము, ఇచ్ఛ.

ఉ. ...గద పందువు వేయఁగోరు నా, దయ్యపు నెత్తికోలు దుది దాఁకుట గాదె భుజంగ భంజనా. ఉద్యో. 3-67

క. పదివేలఁ జంపఁగా నో,పుదు నేనను నెత్తికోలు పుట్టిన యది నీ; పదునొకఁ డక్షోహిణులను, ఐదురున నడిపింతు నెదిరి సైన్యము గలతున్. ఉద్యో. 4-406

వ. అలసి డస్సి యెప్పుడెని మీర లడ్డమాడుదు రప్పుడ శపింతు నిట్టిద నా యెత్తికోలు. అను. 2-381

3. పొందుట.

ఉ. ...నీ, కిసర మెత్తికోల్ గలుపి యిప్పుడు కార్యము దప్పఁజూచు నీ, వారలు ముట్టవచ్చిన నవశ్యము వంతకు జాలరుంజుమీ. ఉద్యో. 3-335

ఎత్తిచను దే. అ. క్రి. (√ఎత్తు)

దండయాత్రకుఁ బోవు.

సీ. చిగురులతో సంధిసేసి యంబుజముల, పైకెత్తి చనునట్టి పదతలములు. విరా. 2-67

ఎత్తినడుగులనుండు దే. జాతీ. (√ఎత్తు)

ఎత్తిన పాదములనుండి, మునివ్రేళ్ళమీఁద నిలఁచు (ప్రయాణమునకు సంసిద్ధముగా నుండు)

తే. గొంతి కొండ్రడు రెల్లను గురువరేణ్య, యెత్తి నడుగుల నున్న వార త్తపస్వి నీవరిష్ట దర్శింపఁగఁ బోవఁగోరి, యనియె నట్టు లయ్యెరువురు నాడుటయును. ఆశ్ర. 2-25

శ్లో. అగ్రపాద స్థితం చేమం విద్ధి రాజన్ వధూజనమ్.

సం.భా. ఆశ్ర. 24-17

**ఎత్తిపట్టు** దే. స. క్రి. (√ఎత్తు)

క్రిందఁ దగులకుండులాగున పైకెత్తియుంచు.

క. పార్థుం డట్లు చేయుదునని గాండివంబు పుచ్చుకొని మఱియు ననుజ్ఞగొని మూఁడు వాలమ్ము లభిమంత్రించి పెడతలఁదాఁకి యెత్తిపట్టుకొని పుంఖంబులు భూమి మోచినిలుచునట్టుగా నేసినం దాత ప్రీతుండై. భీష్మ. 3-472

**ఎత్తిపెట్టు** దే. స. క్రి. (√ఎత్తు) దెప్పిపొడుచు

తే. ...అబ్బంగిఁ బల్కి తి ముకుందు తోడనేను మీ రెమ్మెయి రూఢి కెక్కి, వెలుఁగఁ గోరుట కతమునఁ దలఁచి దాని,ననిలసుతుఁడెత్తి పెట్టె నేమనఁగఁ గలదు. ఆశ్ర. 1-168

**ఎత్తిపోవు** దే. అ. క్రి. (√ఎత్తు)

దండు వెడలు, యుద్ధమున కరుగు.

వ. ఆతనిపయి నెత్తిపోయి గోధనంబుల గ్రహించిన. విరా. 3-117

**ఎత్తివచ్చు** దే. అ. క్రి. (√ఎత్తు)

తే. పట్టి యీాతనిఁ జెఱఁబెట్టి పాండవులకుఁ దిగులు పుట్టింత మంతట దెగక యెత్తి, వచ్చి రేనియు నిర్జింపవచ్చు. ఉద్యో. 3-391

**ఎత్తివిడియు** దే. అ. క్రి. (√ఎత్తు) దండెత్తి చనుదెంచు

దండుదిగు, యుద్ధమునకు సిద్ధపడు.

తే. ఎత్తి విడిసిన వారని యెల్లతప్పుఁ, బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె. ఉద్యో. 3-369

**ఎత్తివైచు** దే. స. క్రి. (√ఎత్తు)

పైకెత్తి క్రిందఁ బడవైచు.

ఆ. కచ్చయమరఁబట్టి కాళ్ళును జేతులు, వ్రేల మత్తగజము లీం మెఱయ, ముష్టిబలువు నెఱయ ముక్కున వాతను, నెత్తురొలుక మల్లు నెత్తివైచె. విరా. 2-17

ఎత్తిచె(సె)ప్పు దే. స. క్రి. (√ఎత్తు)

ఉద్ఘాటించు, వెల్లడిచేసి చెప్పు.

వ. ...పాండవాగ్రజుండు వాని ప్రతిజ్ఞావచనంబు లెత్తి చెప్పి మొగమోడ కదల్చిన. భీష్మ. 8-55

ఎత్తు దే. అ. క్రి.

1. కలుగు.

సీ. కొలువులోపల నిన్న కోపమ్మెత్తినఁ, దలఁపక నిలిచిన ధైర్య మహిమ. విరా. 2-360

మ. అతులైశ్వర్య విభూతినొప్పు భవదీయంబైన రూపంబు సూచు తలం పెత్తెడుఁ బోలునేని దయఁ జూపుః ప్రీతిఁ గావింపవే. భీష్మ. 1-206

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు. ద్రోణ, 4-89

క. కౌరవులు సేయు నవమతి, కారణముగఁ గోపమెత్తుఁ గర్ణుని వదవాం, భోరుహముం గనుఁగొన శమ,మారున్ వావశము గాక యంతన బుద్దిన్. శాంతి. 1-18

2. (పోరుటకు) పూను, కడగు.

కి. నీ యనుజులు దివిజులకు న,జేయులు ధృతరాష్ట్రసుతులఁ జెలుచుట వేఁగే, తోయజ నాశము గజము లీలాయత్తము గాదె యొత్తు మాహవమునకున్. ఉద్యో. 4-112

3. దండెత్తు, పోరుటకై బయలుదేఱు.

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట యెత్తి వచ్చినం,దేరు బృహన్నలా వశగతిం జరియించిన గెల్వవచ్చు. విరా. 4-22

క. బలవంతుఁడు పైకెత్తిన, బలహీనుఁడు ధనముగోలుపడిన యతఁడు మ్రు,చ్చిల వేచువాఁడుఁ గామా.కుల చిత్తుఁడు నిద్రలేక యుండుదు రధిపా. ఉద్యో. 2-21

తే. ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁగలుగువాఁడు. ఉద్యో. 2-168

సీ. వానయు సీతును వర్జించి మండు వేసవి గాక మున్న సస్యములపంట,
లోదవెడు తటి నెత్తునది శత్రుపయి. శాంతి. 3-3

4. అతిశయించు, ఎక్కువవు.

క. దవ్వున వితరిగిన( జోరులు, నవ్వుదురట మేలుమేలు నను వా(గకు నీ, క్రొవ్వులుగ దేని( దలపడు, మెవ్విధి ననితేని నన్నుచు నెత్తిన ఖితిన్. విరా. 4-71

ఉ. ఎత్తిన వేడ్క( గంధరము లెత్తి మొగంబులు సా(చి...చిత్తజు కేళి( దేలె విలసిల్లుచు నక్కువదోయి వేకువన్. ఉద్యో. 2-109

స. క్రి.

1. లేవదీయు, పైకిదీయు.

క. అన్ని మనమున( దలపోయుచు(, దనతమ్ముని నల్ల నెత్తి దండడ దొర(గం,జను క్రేంచు నక్షత్రపూరము, కను(గవలో భ్రమింగికొను చు( గామిని పలికెన్. విరా. 2-79

క. పెనురొంపిలోపలను బ్రుంగిన ధేనువు నెత్తుపోలికిని. కల్య. 1—158

ఉ. పంబిన శోకభారమున( బ్రాణవిమోక్షము గోరి కంఠదేశంబున రాయి గట్టికొని సన్మనినాథు(డు నిశ్చితాత్ము(డై, యంబుధి( జొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తురంగ హస్తంబుల నెత్తి పెట్టె( దపసైకతతీరమ(చేర నమ్మునిన్. ఆది. 7-119; విరా. 4-174

2. ఉన్నమితము చేయు, ఊర్ధ్వముగా నుండునట్లు చేయు.

వ. తమ కందువలు రోసి యెత్తిన మెడలును. విరా. 2-240

క. హాయములు( బూమ్పము రథమున, రయమున నీడమెత్తుము, విరా. 5-42

ఉ. ఎత్తిన వేడ్క గంధరము లెత్తి మొగంబులు సాచి ... అక్కువ దోయి వేకువన్. ఉద్యో. 2-109; విరా. 5-82

3. పైని పెట్టు, మీ(ద నుంచు.

131-ఆ. నూతన పుత్ర యిత(డు నాత(ల పెద్దమో. పెత్తి నమ్మియున్న

ఘుట్టిచోటఁ, గ్రంథుసేయ నాకుఁ గాదని సైరించి, యున్న బ్రతికి తింక నూరకుండు. ఉద్యో. 4-251

శ్లో. సముద్యతోయమ్ భారో మే సుమహాన్ సాగరోపమః
సం. భా. ఉద్యో, 167-30

4. (అర్ఘ్యము, హవిస్సు మొదలగు వానిని) ఇచ్చు. సమర్పించు.

క. అమ్మంత్రము దన్నదగు వ్యాసయమ్మౌని నక్కన్య నిలిపి యాదిత్యున కర్ఘ్యమెత్తి నాకు నిష్టప్రియమున నీయట్టి కొడుకు నంబుజమిత్రా. ఉది. 5-9

వ. దివ్య ధిషణుఁడగు ధిషణుండు గన్నిరోఁ జక నన్నరపతితోఁ గనకై యెత్తిన పురోడాశ భాగంబు విష్ణుండెల్ల వేల్పులుం జూడ నాకు దర్శనగోచరుండై కొనక యదృశ్యుండై కొనియె.
శాంతి 6-364

5. ఇచ్చు. ఒసఁగు.

ఆ. అట్టి యవసరమున నమ్మహీపతి నన్నుఁ, దలఁచె నప్పుడే నవబల విరోధి, మది నిరోధ ముడిపి మసలక వచ్చి యర్ఘ్యాలు ప్రాణమెత్తి ప్రమద మెసఁగ. శాంతి 1-271

6. చావు మొదలగు వాని నుండి ఉద్ధరించు, పునర్జీవింపఁ జేయు.

క. ... విగతాసులఁ దన, మృదు వచన ప్రశ్న మను నమృతమున నెత్తెన్. ఆది. 6-262

7. మోయు, వహించు.

వ. ... కృష్ణునిచేసన్న నర్జుని వసువునం గనకరత్నమయంబగు నతని పాదపీఠం బతండు ద్రేల్చిన కాళ్లు దిగిచికొన సద్దఱు ముద్దియ యెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేమును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి. ఉద్యో. 2-121

8. తీసికొను, గ్రహించు.

సీ. ఘన శరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి, నారాచ మొక్కటి వాల్మి మేన, వేఱొక విల్లెత్తి వైసఁ బదునాలుగు, శాత బాణములఁ

కా-చాల సుతుఁడు, గలశజు నేసె. భీష్మ. 1-256

చ. ...విషమెత్తి క్రోలి యదియంగము వారట వెట్ట నమ్ముఁలం గినిసిన యట్లు. ద్రోణ. 4-207

9. చేతఁబట్టుకొను, కైకొను.

వ. అంబికేయుండు ప్రసన్నవదనుండగుచుం బ్రతిష్ఠితంబులయిన కలశంబులలో నుజ్జ్వలం బగు నొక్కటి ధౌమ్యుం డంది యీనెత్తి యా భూపోత్తము నభిషేకించె. శాంతి. 1-376

10. చేతులతోఁబట్టి పైకి లేవఁదీయు.

సీ. అనియె నప్పుడు పరమాహ్లాదమునఁ జనుదెంచి గంధర్వులు దేవమునులు, మరుదశ్వి వసువులు మహితాదరంబున, ధర్ముండు నింద్రుండుఁ దారు నమ్మహాత్ముని నెత్తి రథారూఢుఁగాఁ జేసి. మహా. 67

11. పూను, వహించు.

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె యాచరింతు, పుణ్యపరులు దోడఁ బుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారి తోడ. ఉద్యో. 3-227

ఉ. ... అతం (భీముఁడు) డలుక నెత్తిన యాగద కాలదండము, ద్దామ విలాసుఁడై కురుకదంబము లో విహరింపకుండునే. ఉద్యో. 2-185

సీ. ... తారతమ్యముల్, వెరవునఁ బరికించి వేర మెత్త, వలయుట నెఱిఁగి పలుకక యుండంగఁ, దగుట యూహించు టుత్తమంబు. ఆశ్ర. 1-78; ఉద్యో 2-69; ఉద్యో. 2-218

12. సంకల్పించు, తలఁచు.

సీ. ... తద్విపుల గుణోన్నతి సైఁపక, దుర్యోధనుండు దుష్కార్య మెత్తి - ఆ - దుర్ణయమున శకుని కర్ణ దుశ్శాసనుల్, గూడఁ బాండవులకు నలయ చేయఁ గడఁగె. ఆది. 3-12

13. పెట్టు. (తినిపించు.)

వ. శజ్జులైన పరిచారకు లత్తురంగంబుల నీరికిందిగిచి ఘాణంబెత్తి

తడవి. ద్రోణ 8-305

శ్లో. పీతోపవృత్తాన్ స్నాతాంశ్చ జగ్ధాన్నాన్ సమలంకృతాన్.
సం. భా. ద్రోణ 112-55

14. పట్టి తీసికొని పోవు.

సీ. ఘన కాయ జవ సత్త్వ గజ కచ్ఛపముల నొ,క్కెత్తున లీలమై
నెత్తె నితఁడె. అను. 1-270

15. అపహరించు.

తే కామ రసమున నతి తృష్ణుఁడై మనుష్యుఁ, డర్థ తృష్ణా పరీ
తాంతరంగుఁడైన, గొఱియ నడవిలో నెత్తెడు కోలుపులియుఁ,
బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి.
అను 5-285; శాంతి, 6-229

16. (కంఠస్వరము) హెచ్చు చేయు (ఈ యర్థమున ఎలుఁగు, గొంతు
మున్నగు శబ్దములతోనే కూడి యుండును.)

క. అత్తఱి సీతనయుం డెలుఁగెత్తి రథికవరులతోడ నిట్లను.
భీష్మ 2—372

17. (దీపము మొదలగు వానిని) వెలిగించు.

సీ. దివియలోఁబడుఁ బ్రువ్వు దివియ యెత్తినవారిఁ బాపంబు వొం
దునే. అను 5-58

18. ప్రయోగింప నుద్యమించు.

క. గురుసుతుఁడు భీమునకు నై,నరమాస్త్రం బెత్తె. అశ్వ. 3-172

19 తూచు,

తే ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు, నిలిపి యెత్తంగ మఱలు
నూఁపె నిర్ధనత్వ, మెక్కుడై దాని దిక్కున నెట్టులన్న.
శాంతి. 4-83

శ్లో. ఆకించన్యం చ రాజ్యంచ తులయా సమతోలయన్.
సం. భా శాంతి 176-10

20 (భిక్ష) యాచించు, అడుగు.

తే. తగు వేళఁ బర్ణశాలలకు నరిగి, యెత్తగా భిక్ష. శాంతి. 1—58

వి.

1. మాఱు, తడవ, పర్యాయము (ఈ యర్థము 'ఒక్క' శబ్ద పూర్వకము గనే యుండును.)

ఆ. ఇట్లు దఱిమెనేవి నిప్పుడ యాతఁ డి, ద్దిక్కువారినెల్ల నొక్కయెత్తు గాఁగఁ బిలుకుమార్చు. ద్రోణ. 5-198

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదులగు నీ కొడుకు లొకండొకఁడ జగంబులెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్కమొగంబై త్రోచి నడచిన సవ్యసాచి నొక్కరునిన కాదు పాండవులనెల్ల నొక్కెత్తునవ్వైచి కొననోపుదురు. ఉద్యో. 2—282

సీ. ఘనకాయ ఆవసత్త్వ గజకచ్ఛపముల నొక్కెత్తున లీలమై నెత్తె నితఁడె. అను. 1-270

2. పన్నుగడ, ఎన్నిక, యుక్తి.

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మారొ్కనిరేని గోవులం, దెత్తు మువహార్తమాత్రమున. చూ. ఎత్తునఁగొను. విరా 4-9

విశ.

సమానము, సమము.

వ. దివిజ దానవ గంధర్వాది సమస్త భూతంబులు నాతోడి యెత్తు రాకుండెడినట్టి దోర్వీర్యంబున వెలసి వర్తిల్లుదు.

శ్లో. దేవ దానవ గంధర్వ మనుష్య పతగోరగాః
నసమా మమవీర్యస్య శతాంశేనాపి పిండితాః
సం. భా. శాన్తి. 12—17

క. ఈ యున్న రాజులందఱు, వాయుసుతున కొక్కయెత్తు.
ఉద్యో. 8-887, అను. 2-48

ఎత్తుదెంచు దే. అ. క్రి. (√ఎత్తు)

దండెత్తి వచ్చు.

వ. ద్రుపదుపయి నెత్తుదెంచిన ద్రుపదుండును శీఘ్రుండై బ్రాహ్మణుల మఱుమ్మనిొచ్చె. ఆది. 7—191

**ఎత్తునఁగొను** దే. స. క్రి.

నైపుణ్యముచే జయించు.

చదరంగములోఁ గాయనడపుట యెత్తనఁబడును. అట్టి యెత్తుల చేతనే ఆ యాటలో జయము కలుగును. అటులనే చదరంగములో నెత్తు వేయుటకుఁ జూపునట్టి యుక్తిఁజూపి (కౌరవులనెల్ల) తన వశముచేసి కొందునని యుత్తరుని వచనము.

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని గోవులం,దెత్తు ముహూర్త మాత్రమున. విరా. 4-9

(ఎతెల, ఎత్తల, ఎత్తుర, ఎత్తెర, ఎత్తర, ఇత్తెర) అనునవి పాఠాంతరములు

**ఎత్తులువట్టు** దే. స. క్రి.

(పూలదండలు) సరిపడునో లేదో యని ఉరువు మొద్దలగు వానిని సరి చూచు

సీ. పువ్వులు బహువిధంబులఁ గట్టి ముడికొక్క భంగిగా నెత్తులు వట్టి యిత్తు. విరా. 1-107

**ఎత్తువచ్చు** దే. అ. క్రి.

సరితూగు, సమమగు, సాటియగు.

వ. వారెల్లఁ దేజోధైర్య పరాక్రమోపాయ విచారవివేకంబుల నా యెత్తువత్తురె. ఉద్యో. 2-265

**ఎత్తెరుచోటు** దే. వి.

రెండు వెడలు ప్రదేశము.

వ. సుశర్మయు...వేగిరంపుఁ బయనంబులయ్యును బ్రజల వోలాకు పడనీక యెత్తెడు చోట్లను విడిదల యందును లోనుగా నిస్సాణాదులయిన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక. విరా. 3-131

**ఎత్తెల** దే. వి.

చేపలను బట్టుకొనెడి యొకానొక సాధనము.

క. వెరవున నూఁతల్ల నెత్తెలఁ, గరముల మత్స్యముల్లఁబట్టి కడ సంతసముం, బొరయుచుఁ బ్రాళ్లం గ్రువ్వఁగ్ఁ, ధర మూహించి మదిఁ బ్రకాశ్ంబుడున్. శాంతి. 3-198

**ఎత్తెలగొను** దే. స. క్రి.

వలతోఁ జేఁపలను బట్టినట్లు అనాయాసముగా (శత్రువులను) పట్టుకొను లేక వశము సేసికొను

ఎత్తెల = చేఁపలను బట్టువల - వలవేసి పెక్కు చేఁపల నొక్క పర్యాయము అనాయాసముగాఁ బట్టిన చందమునఁ గౌరవులనెల్ల నొక్కెత్తునఁ బట్టుకొందును. అని యుత్తరుని బింకపుమాట.

ఉ. ఎత్తెలఁగొందుఁ గౌరవులనెల్లను మార్కొనిరేని గోవులం,దెత్తుమువాలార్త మాత్రమున. విరా. 4-9

(ఇది ప్రాత ప్రతి పాఠము అని సూ. అ. ని. ఇప్పటి ప్రతులలోనిది పాఠాంతరము) చూ. ఎత్తునఁగొను.

**ఎద** వై. వి. ఎడఁద

హృదయము, మనస్సు.

తే. ...సంతోష మెదనిండ సెలవుకొనఁగ. విరా. 1-24

క. ...అన్నాకవతియు సిగ్గెదఁ గదురన్. ఉద్యో. 1-118

క. వాలమ్మ్రులు దాఁకి ధరన్,వ్రాలు భటులఁజూచి యెదలు వడఁకఁగ మేనుల్, దూలఁగఁ దముఁ దాఁకకయును, వాలము సాలించి కొంద అవలఁ జనంగన్. విరా. 5-62

**ఎది** దే. పర్యా.

పది.

సీ. ...ఏకాదశేంద్రియానీక మీక,దింది సందడిఁబడి కుందక యందెదియుంపేనిఁ దనవంక కీడ్వఁజాలు, బుద్ధితత్త్వము గల్గు శుద్ధాత్మకుఁడు. అశ్వ. 2-144

**ఎదిరి** దే. విశ. ( √ఎదురు)

1. అన్యుఁడు ఇతరుఁడు.

క. ఎదిరికి హితమును ప్రియమును, మదికింపును గాఁగఁబలుకు మాటలు పెక్కై, యొదవినను లెస్స యటుగా, కిదియది యన కూరకుండి కొంతయు వొప్పున్. ఉద్యో. 2-59

2. ఎదుట నున్నవాఁడు, ఎదుట నున్నది.

క. అని వీడఁగఁ బల్కిన న,మ్మనుజాధముఁ డంతఁబోక మదనోన్మా
దంబునఁ దన్నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియె గారవంపు
బలుకులన్. విరా. 2-51

వి.

ప్రతిపక్షుఁడు, విరోధి.

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి
యెఱుఁగుదు వాక్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు, వామ్మెవ్వఁడ
నేను నీకు బుద్ధులు సెప్పన్, ఉద్యో. 3-84

**ఎదిరివాఁడు** దే. వి.

ప్రతిపక్షుఁడు, విరోధి.

ఆ. ఎల్లభువనములను నేలుటకైనను, నిట్టి క్రూరకర్మ మెట్లు సేయ,
వచ్చుఁగడఁగి యెదిరివారేమి సేసిన, మాఱుసేయ నాకు మనసు
రాదు. భీష్మ. 1-185

**ఎదురఁబడు** దే. అ. క్రి.

ఎదుటఁ గనఁబడు, చేఁజిక్కు, వశమగు, యాదృచ్ఛికముగా లభించు.

ఆ. ఎదురఁబడినవాని వదలక శార్దూల,శరభ సామజాది సత్త్వతతులఁ
బట్టి తినుచునున్న యట్టి నాకిప్పుడు, భక్ష్యమైతి వీవు పాండు
పుత్ర. అర. 4-111

**ఎదురీఁదు** దే. అ. క్రి.

నీటి ప్రవాహమునకు ఎదురుగా ఈఁతకొట్టు, బెట్టిదములగు కష్టములు డీకొన వానిని తరించుటకు ప్రయత్నించు.

చ. ...వారిజనాభుండు లేని దీనతం,బొరసి కృపైక భాజనతఁ బొం
దిన యప్పురిఁజూచి మానసం, బెరియఁగఁ జొచ్చె నేటికెదురీఁదిన
చాడ్పున నేమి సెప్పుదున్. మౌస. 1-98

**ఎదురు** దే. అ. క్రి.

మార్కొను, ప్రతిఘటించు.

క. కావున నీ యుద్భట రథి,కావలి నివ్విభునిఁ గాచునట్లుగఁ బనుపం

గావలయు మీరలందఱు, నేవలఁజూచిన శిఖండి కెదురుం డెవ్వ
డున్. భీష్మ. 1-81

క. పదివేవురు రాజులు దన, కెదిరి పొలిసిరా శిఖండి యేమిటివాఁడై
తుదిఁబోయి తన్ను నాజిం, గదియుచుఁ బొలియించె నియమిఁ గడ
వఁగ వశమే. భీష్మ. 1-48

తే. నకులుఁడును దదనుజుఁడు సాత్యకియు వా సుభద్ర కొడుకును
వెదిరిన బలము నెల్ల, బెదరఁజెదర బడల్పడఁబెల్లు సావఁజేయఁగని
కౌరవులు సంధిసేయువారు. ఉద్యో. 2-159; ఉద్యో. 3-303

వి. ఔ.

పురోభాగము, ముందు, సమక్షము.

ఆ ...ఇందఱు, యెదుర నీవు గోరి తివ్విధంబు. శాంతి. 4-160

తే నేలనాలుగు నెఱఁగుల నృపుల కొలువులందు నేను వర్తించితి
నవనివాథ, యగ్గలించి వా యెదుర బావప్పళించి, కడఁగఁ జాలెదు
మల్లులఁ గాననెందు. విరా. 2-7

వ నీచహృదయుండగు కీచకుండు దనయెదుర నప్పుడాడిన కర్ణ
శూలంబులగు మాటలమీఁద. విరా. 2-108

విశే.

1. ముందఱ నున్నది.

వ. అన్నరుం డరగని కళంబునకుఁ గవియు గరుడుని కైవడి నద్దెస
కడరె నట్లడరుట యాలోకించి తన కట్టెమటి మొనబెట్టు దాఁకి.
కర్ణ. 8-155

2. అన్యుఁడు, ఇతరుఁడు.

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి, పువ్వుఁ దేనియఁగొని
యెదుపోక్క నెదురు, గంధకుండఁగఁ గొనునది కార్యఫలము,
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁ జనదు. ఉద్యో. 2-57

క. పదపడి దుస్తరమగు నీ, పదు మూఁడవయేఁడు గడపఁబడుట యెఱి
ది తమ్మెదురు రెఱుఁగమికై యాపద, లొడవిన నైరించి రిట్టి
యునికియుఁ గలదే. ఉద్యో. 1-9

3. అభిముఖుఁడు (ఎదుట ముఖమైన వాఁడు) అభిముఖ, అభిముఖ.

క. ఎదురున్న రూపు వలుకఁగ, దుః ఁ గటగటబడవు. ఉద్యో. 1-368

వ. కొండ ఇదురుగాఁ జనుదెంచిన హారిది యేమి యని యడుగ నశ్వత్థామ వచ్చి పొడుచుచున్న వాఁడనిన సౌప్తి. 1-197

సీ. ఎదురుగా వచ్చిన నెత యేలియు దవ్వు, గలుగ వేఱొక త్రోవ దొలఁగు వారు విరా. 2-36

4. ఎదుర్కొన సమర్థమైనది, ప్రతిఘటింపఁ జాలినది-సాటి, సమానము.

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గాఁ,దుర్మక విద్యా ప్రౌఢిమై నిరూఢు లయిన యీ,శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాది యోధ వీరుల కెదురే. విరా. 4-63

తే. ...ఈ పీట నాబల్లిదునకు, నెదురు రథికునిఁ గాన, ననేక హేతి, నిపుణ శార్దూల విక్రమ నీవు దక్క. శల్య. 1-91

వ నీకై మీ తండ్రి యిట్లు సేయఁడయ్యెనేని వానికెదురెవ్వరు. ద్రోణ 5-289

5. మాఱు, బదులు.

సీ. కుల పర్వతావళి కులిశ భయంబున, బెదరి వాపోవు నల్లెదురు సెంగె ఉద్యో. 4-116

క్రి. విశే.

1. ఎదురుగా, అభిముఖముగా.

ఎ. నీకెదురై జయంబు గొనరాదు. ఉద్యో. 1-87

2. సమానముగా.

వ. సుయోధనుఁడు...భీష్ము కడకుంజని శోక గద్గద కంఠుం డగుచు నతనితో నిట్లనియె.

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కిట్లనియె. భీష్మ. 3-76,78

ఎదురుకొ(ర్కొ)ను దే. స. క్రి. (√ఎదురు)

1. మార్కొను, తలపడు.

వ. సుశర్మ తానుం దమ్ముండు సగడంబుగాఁ గొల్తల వేసి రథ సమూహంబుతో విరాట వ్యూహంబు నెదురుకొని. విరా. 3-182

ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవ రాజ సైన్యముల్ సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ.
విరా. 5-164

క. గురుఁడవు గాక పగతుఁడవె, దురమునఁ గుపితుడగు నిన్నెదుర్కొన నా కొక్కరునకు శక్యమె యాపుర,హరున కగుంగాక యనుచు నరుగుచు నుండెన్. ద్రోణ. 3-78

2 ప్రత్యుద్గమించు.

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడమెత్తు మిపుడ రావలయును గోచయముగొని యస్మదీయ విజయ మభినందింపఁ బురము జనులెదురుకొనన్. విరా. 4-42

శా. చాటంబంపుఁడు పేర్మి నుత్తరు జయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా, కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ.
విరా. 5-242; 389, ఉద్యో. 3-176

ఉ. ...అభుజగేశ్వరు పత్ని యాతనిం, జెచ్చెరఁ దానెదుర్కొని.
శాంతి. 6-574

అ. క్రి.

అభిముఖమగు, తారసిల్లు.

వ. అనుకృతి నట సూర్యుండు దనరశ్ముల వహించినదప పద్మతంతు సన్నిభంబైన మార్గంబు ప్రవేశించి చనంజన నూతున్నండును శీతలుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుత శ్రేష్ఠుండును నగు పవనుం డెదుర్కొని. శాంతి. 5-618

**ఎదురుగాలి** దే. వి.

ఎదురుగా వీచునట్టి గాలి.

క. వఱదలు మన చేరువఁ బెల్లఱచుట బెట్టిదురు గాలి యడరుట గ్రద్దల్, తఱచయి యాడుట వికృతవు, టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే. కర్ణ. 2-116

**ఎదురుచను; ఎదురుసను** దే. అ. క్రి.

1. ప్రతిఘటించు.

క. గురుఁడను సురుతరగిరి నిష్ఠుర శృంగిం బుట్టి వచ్చు సునిశిత
బాణోత్కర చండ వేగనదికి నెదురు చన రావయ్యె నపుడు
ద్రుపదసుతునకున్. భీష్మ. 2-57

2. ఎదురుగాఁ బోవు.

వ. అని సమస్త జనంబులుఁ దదభిముఖులయి భక్తి యుక్తిం బ్రత్యు
త్థానంబు సేయం దాను గద్దియ డిగ్గి యెదురు చని నమస్క
రించి యతని యాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ
దోడ్కొని చనుదెంచి సముచితసమున్నతాసనంబున నునిచి.
విరా. 1-189

క. చిడిముడి పడుచు నెదురు సనఁ గడఁగుచు హారములు చక్కఁగాఁ
ద్రోచుచు మల్లడి గొనుచు దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చు
చుండ నుగ్మలి యంతన్. విరా. 2-114

**ఎదురుచు; ఎదుర్చు** దే. అ. క్రి. స. క్రి.

ప్రతిఘటించు, మార్కొను.

క. పొదలెడు నప్పుడు శౌర్యోన్నద్ధుఁడగు నయ్యనిల తనయు
మార్గణములు బెట్టిదముగఁ గవియుఁడు నోటలి, యెదురుప
లేరైరి కురుకులేంద్రుఁడు వారున్. కర్ణ. 2-164

ఆ. అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడనై, ము న్నసజ్ఞఁ గొనఁగ
నిన్నుఁగాన, నెమ్మి వచ్చినాఁడ. భీష్మ. 1-166

క. విను సైంధవుఁడు మహారథుఁ, డని బోక పెనఁగు నతని నా
ద్రౌపదికై, పెనుపఱఁ బఱచిరి కుంతీ, తనయులు వారల
కెదుర్పఁ దపముం జేసెన్. ఉద్యో. 4-222

క. పొదువుచు విచ్చుచుబలువిడి, నెదురుచు బాఱుచును మఱి మహీ
భాగము, గ్రక్కదలం గార్ముక విద్యా, విదుఁడగు గురుతోడఁ
బోరె వివిధ బలంబుల్. ద్రోణ. 1-144

చ. అనిలజవంబునం బఱచు నమ్మెరవనాగ మెదిర్చి క్రమ్మఱిం,చిన
పరికాఁడ వోలె. ఆది. 4-206

చ. దురమున నర్జున ప్రకట దోర్విభవంబు నెదుర్పఁజాలు నుద్ధురుఁ
డొకరుండు గల్గెనె. శల్య. 1-88

**ఎదురుచూచు** దే. అ. క్రి.

ప్రతీక్షించు, నిరీక్షించుకొని యుండు.

వ. (కీచకుఁడు) అమ్మదిరాక్షిరాక కెదురు చూచుచుండె.
విరా. 2-87

క. హాయముల మరల్పమీ తల్లియు బంధులు నెడలు సంచరింప
గుములు గట్టియెదురు సూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమున్మ
నం బురికిఁ బోవలయున్. విరా. 5-224 విరా. 4-81

**ఎదురునడుచు** దే. అ. క్రి.

అభిముఖముగా వచ్చు, మార్కొనవచ్చు.

క. చరులఁ బనిచి యరుల తెఱంగరయుచు వారెదురు నడచునట్టి
దయిన దెప్పరపుం జెరువున దప్పిం, బొరసిన యెడ విడియుచోటఁ
బోడుచు టురవగున్. శాంతి 3-4

**ఎదురుపడు; ఎదుర్పడు** దే. అ. క్రి.

ఎదురువచ్చు మార్కొను.

క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ, బురుమిత్రుఁడు వేల్పుచేటి పుత్రుఁడుఁ
బ్రాపై, యురవడి దఱిమినవారికి, నరనందను డెదురుపడె గుణ
ధ్వని సెలఁగన్. భీష్మ. 2-313

ఆ. అరినృపాలు పెంపు నాత్మీయ శక్తియు, నెఱిఁగి మూర్ఖవృత్తి
నెదురుపడక, యుచితవృత్తి నతని యుద్ధతి మేవడిఁ, గడపి హీన
బలుఁడు సెడక నిలుచు. శాంతి. 1-90

వ (గరుత్మంతుఁడు) అమ్మిత్రవైరివి నూరెల మున్నసురలను మును
లను గలయం గమంగొని.

చ. ...తల్లి దాసియగు టోర్వక శత్రుడియనుజ్ఞ మీకెదుర్పడిన దురు
ద్ధతిన్ మఱచి బాంధవ సత్కృతి నాదరింపుఁడీ ఆను. 1-265-266

**ఎదురుపలుకు** దే. అ. క్రి.

మాఱుపలుకు, ప్రత్యుత్తర మొసఁగు.

క. ఏనొల్లఁగాక ధర్మము,గా నిమ్మంజూతునే వికారియనుడుం, దానె
దురు పలుకకంత,ర్థానము వెసఁజేసె నతఁడు ధరణీనాథా.
అను. 2-203

**ఎదురువచ్చు** దే. అ. క్రి.

అభిముఖముగాఁ బోవు, వచ్చెడివారికి ఎదురుగాఁ బోవు.

వ. శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం
జొచ్చె ధర్మనందను నివాసంబున కరిగిన నతండు దమ్ములుం
దానును ద్రౌపదీ సుభద్రలు నభిమన్యు ప్రభృతి పుత్రవర్గంబును
నెదురువచ్చి కృత ప్రణాముండై. ఉద్యో. 1-104

వ. కమల నాభుండు గదలిపోయి సూర్యాస్తమయ సమయంబునఁ
గుశస్థలంబు సేరం జనునప్పు డందలి విప్రు లెదురువచ్చి, కాంచి.
ఉద్యో. 3-147

తే. భవ్య విభవంబుతో నుపప్లావ్యపురము, సొచ్చి సంభ్రమమునఁ
బాండుసుతులు దనకు, నెదురువచ్చిన నాహ్లాద మెసక మెసఁగ
విరా. 5-378; సభా. 1-179

**ఎదురుపోవు** దే. అ. క్రి.

1. వచ్చువారికి ఎదురుగాఁబోవు, అభిముఖముగాఁ బోవు.

వ. ధర్మనందనుం డొక్కఁడు బోయం బొడఁగని దుర్యోధనుండు దొలఁ
గెం బెట్టుచేమల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ
వలయుననిన వాఁడును వృకోదరుని మృగయులలోని వాఁడగుటఁ
దమ వారికి నెదురుపోయి యమ్మాట తెలంగెఱింగించుటలు జేసి.
శల్య. 2-36

2. ప్రత్యుత్థాన మొనరించు. ఎదురుగా బోవు.

సీ. సత్యవతి కొడుకందుల, కేతేర నందఱు నెదురుపోయి. ఆశ్ర. 2-71

**ఎదురుశోకించు** దే. అ. క్రి.

దుఃఖించువానిని జూచి తాముసు వానితో సమానముగా దుఃఖించు.

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించియతవి కిట్లనియె.
భీష్మ. 3-78

**ఎదురుసేయు** దే. స. క్రి.

ప్రత్యర్థిగా నిలువు.

క. శౌర్యాటోపంబున దోర్వీర్యంబున నస్త్రశస్త్ర విత్త్వమునను మాత్సర్యంబు సేయు నాకును, దుర్యోధను డెవుడు దన్నెదురు సేయంగన్. విరా. 6-12

**ఎదురెదురు** దే. వి. ౘా.

ఎట్ట యెదురు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదురని యెఱుఁగఁ డకట నా యెదు రెదురన్, వివ్వచ్చుఁ జూపి సేనలు, గ్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు పలికెన్. విరా. 4-189

**ఎదురేచు** దే. అ. క్రి.

ప్రతిఘటించు, పోరికిదిగు.

క. పాండవులు శౌర్య మొల్ల ర,ఖండితనీతి ప్రకార కార్యము మెచ్చ్రైఁ, యుండఁదు రెదు రేచినఁ దుదిమం,డుదు రార్పంగరాదు మరి యెవ్వరికిన్. ఉద్యో. 2-73

**ఎదురేయు** దే. అ. క్రి.

ప్రతిఘటించి బాణ ప్రయోగము చేయు.

వ. ముందటి పుట్టువున నంగనయగుట వాని కెదురేయకుండుదు.

భీష్మ. 3-302

**ఎదురొడ్డు** దే. స. క్రి.

ప్రతిఘటింపఁ జేయు, ఢీకొనఁ జేయు.

మ. మహిషవ్యాఘ్రమృగజాదిసత్త్వచయమున్ మల్లవ్రజంబుం గృపారహితుండై యెదురొడ్డుచున్ వరుసఁ బోరం జూచు. విరా. 2-196

**ఎదుళ్లుచూచు** దే. అ. క్రి.

వ. కుంభసంభవ ప్రముఖులైన మాన్యులును జని మాధవుతోడ మా యిండ్ల నెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయం చేయుటకు నెదుళ్లు చూచుచున్నవారమని పల్కి ప్రార్థించిన.

ఉద్యో. 3-228

ఎద్ది దే. సర్వ.

ఏది.

క. ... ఇ, ద్దినములు గడపంగ నెద్ది తెఱఁగయ్యెడినో. విరా. 1-59

ఎద్దు దే. వి. (బహు) ఎడ్లు

సీ. అనఘ విశాఖ నెద్దు. అను. 2-879

తే. బలము తేజ్రాయమును రూపుఁ గలుగునట్టి, గవుప యెద్దు సద్ధర్మ విప్రునకు విచ్చి, నతఁడు సద్విధి గోదాన మాచరించి, నతని పడసిన గతిఁ గాంచు ననఘ చరిత. అను. 2-460

చ. అనుటయు భీతి వేడికొని యావులు వేయును నెడ్లనాఱు నూఱును రథముల్ శతంబును. కర్ణ. 2-91

తే. కడఁక నెడ్లను దఱిమి రొప్పెడు నరాలి, యులివువిని యుల్లమున గడు నులుకు పుట్టి. అను. 4-318

ఎద్దుఁబట్టు దే. స. క్రి. (√ఎద్దు)

ఎద్దును బీజములు లేని దానిని గాఁజేయు, ముష్క హీనముచేయు.

సీ. పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున, నెద్దుఁ బట్టిన వారు. అను, 5-105

శ్లో. యే పురా మనుజాః భూత్వా ఘోర కర్మరతా స్తథా।
పశు పుంస్త్వోపఘాతేన జీవంతి చ రమంతి చ॥

సం. భా. అను. 221-81 (నిర్ణయ)

(ఎద్దు పట్టు - అని.సూ.ఆ.సి. అన్యప్రయోగము.)

ఎన దే. విశ.

సాటి, సమానము.

సీ. ఇత్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము భాషా విభుతోనైనఁ బఱవ ర్గాదె. విరా 2-27

చ. ... మాతలియుం దలంప నీతని నెనరాఁడు. కర్ణ. 1-315

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులిత బలుఁ డితని యట్ల యాత్మజుఁడును విక్రమశక్తి సోమదత్తుం, డితనికి నీతనికి సమర మెన పెండిలికిన్. ఉద్యో. 4-230; స భా. 1-78

వి.

సామ్యము, పోలిక.

చ. ... వారల చెప్పెదు ధర్మ వృత్తి నిచ్చెనయుఁగ నూఁది సత్ప థముఁ జెందుట కెక్కుడు పొత్తినూలి ప్రవృత్తి నెనయుఁ గాకు బంధకుఁ డవుం దన కట్టుఁడు దాన యమ్మొయిన్. శాంతి. 6-227

ఎనమండ్రుు; ఎనమండ్రురు దే. సర్వ. బహు. (√ఎనిమిది)

ఎనిమిది మంది (ఎనిమిదికి మహాన్మహాత్మ్యర్థక రూపము.)

వ. అయ్యైన మండ్రను దక్కుటి దొరలను గమనంగొని. ఉద్యో. 4-113

క. ... వసువుల, నెనమండ్రం గాంచి యెంతయుఁ బ్రీతిన్. ఆది. 4-125

క. వారలఁ బొదువనదరు బలు, తేరుల మొత్తముల మిగిలి దీప్తపటు రథో, దారులగుచు నెనమండ్రుఱు, వీరులు దఱిమిరి నితాంత వేగోజ్జ్వలులై. ద్రో. 3-216

ఎనమన్నూఱు దే. సర్వ. బొ. (ఎనిమిది+నూరు)

ఎనిమిది వందలు.

వ. అత్తరిబోధనవర్యం డట్లని శుద్ధ ధవళ వర్ణంబులై యొక్క కర్ణంబు నీలంబైన యుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యిమ్మని పలికిన. ఉద్యో. 3-306

వ. ఇరువది యొక్క వేయు నెనమన్నూట డెబ్బది రథంబులు. ఆది. 1-81

ఎనయిక దే. వి. (√ఎనయు) ఎనయుట

పొందిక, ఒకదానితోనొకటి చేరుట.

క. అనఘ యమలోమమునఁ దోఁ, పును బ్రతిలోమమున లయము వొందుటయును గల్గును సర్వతత్త్వముల కవి, యెనయిక బ్రహ్మ మును గలయు నేకత్వమగున్. అను. 4-184

ఎనయు దే. స. క్రి.

1. పోలు.

చ. ఎనయ్యుదే నీవు పౌరుషమహిమఁ డ వజ్రివి శేంద్ర నందనున్. కర్ణ. 2-23

తే. ఉదయ ధరణీధరంబుపై నొప్పు దివసనాథు నెనయుచు సిం
హాసనంబు మీఁదఁ, బొలిచె లీలావతీ కర కలిత చామరములు
వాలయంగ నుచిత జనములు గొలువ.
ద్రోణ. 8-5; శాంతి. 5-75

2. పొందు.

క. పరమ మగు యశము నీకును, ధరణింగలిగింపఁ బూని తాత్పర్యము
నం, బురుషవర నాదు బుద్ధి, స్ఫురణము నీ మనమునందుఁ జొని
పిఠి నెనయన్. శాంతి. 2-147; శాంతి. 4-276; శాంతి. 5-75

క. ఘని సాత్యవతేయుఁడు గృప, నెనసి సుధాధారఁ బోలు నీక్షణము
ద, తనువున నిగిడించిన న, మ్మునిపతిఁ గీర్తించె భూతములు
ప్రీతములై. అను. 5-330

3. ఛేదించు, వ్రచ్చు.

క. ఆలోనన యారథికుని, ఫాలస్థలి నొలి నెనయఁ బదినారసముల్,
గీలించిన నవి యచ్చట, నీలోత్పల మాలవోలె నెఱయం బొలిచెన్.
ద్రోణ. 4-230

శ్లో. తే లలాటం విర్భిద్య సూతపుత్రస్య మారిష,
వివిశుః శోభితా స్తేన వల్మీకమివ పన్నగాః.
సం. భా. ద్రోణ. 189-7

(స్థలమోలినేయ-అను పాఠాంతరమే సమంజసమేమో)

అ. క్రి.

1. సరియగు, సమానమగు.

క. ఈ నలువుర భుజశక్తుల తో, నెనయఁగఁ జాలునట్టి దోర్బల
మెందుం, గానము. విరా. 8-114

క. పెల్లుఁడు యమ తనయునితో, నెల్లగుణంబులను జాల నెనయుదు
నని తా, నుల్లమున నిశ్చయించుం, జెల్లంబో పోరఁ బగఱచే
నిట్లయ్యెన్. స్త్రీ. 2-104

2. కలుగు, సంభవించు.

క. కోకిల కుల గంధర్వా, నీక ధ్వను లెనసి చెనసి మిగుడఁగ నమరెన్,

లోక భ్రమరీ మండలి, కాకలి కల నాదములును గలసి చెలంగన్.
అను. 4-417

3. వ్యాపించు, ప్రసరించు.

సీ. తునిసిన నెత్తురు నెనడుతు నెమ్ముల్ల, నెఱచియుఁ గండలు నెనసి
సమర - తే. - తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళహారులు
కోవిల్ల.
ఉద్యో 2-144

4. ఏకమగు, కూడుకొను.

ఆ అతఁడు కాలకలితమైన కర్మమున సంసార వర్తనంబు సలుపు
చుండు, స్వప్న సంప్రవృత్తి సలిపెడునరు మాడ్కి, నింద్రియ
ముల తోడ నెనయ జెరసి.
శాంతి. 4-295

తే. కేళి సలిపిరి భవన దీర్ఘికల తమ్మి, విరుల నెత్తావి నెనయంగ జెరసి
చెమట, పొడవు మేను లతని కంపు ప్రోచి తఱచు, టూర్పు
గాడ్పుల పరిమళ ముల్లసిల్ల.
విరా. 2-288

5. సంగమించు, రమించు

క. వనితకుఁ బురుషునకుం దన, తన యంతన రూపాకం దొదవఁ
జేయఁగ విన్ననువు గలుగ ధొండొరువుల, నెనయుటఁ గాని శ్రుతి
మతము నిట్ల మహాత్మా.
శాంతి. 6-22

6. ఒప్పు.

క. అని యొక గుదిమీల నడుమ, నెనయంగాఁ దూటి కఱచి యిరు
దౌడలఁ ద్రాడొనరంగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁప
మూర్ఛఁ జెందిన భంగిన్.
శాంతి. 3-196

7. కప్పు, ఆవరించు.

చ. ... పా, మెనసిన తోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజ
మున్.
శాంతి. 5-183

8. సఖ్యము చేయు.

తే ... అన్నదమ్ముల్, లేమి విధమునఁ దమలోన నెనసి నడచు, వార
లెఱుఁగింపు మనుటయు గారవమున.
అను. 4-130

ఎనవచ్చు దే. అ. క్రి. (√ఎన)

పాటివచ్చు, సమానమగు.

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా,చార్యుల కెనవచ్చు దివ్యశర విదుఁడు కృపా,చార్యుఁడు. విరా. 5-9

ఎనిమిది; ఎన్మిది దే. సర్వ. బౌ.

ఏడు నొకటి.

వ. కౌరవపతి యరదంబున నెనిమిది సునిశిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. కర్ణ. 3-190

ఆ. ఎనిమిదింట ద్రౌణిని. ద్రోణ. 3-227

క. ఎనిమిదిటఁ జేరుకున్కన నక్కురునృపాలు నొడలం గ్రుచ్చెన్. ద్రోణ. 4-42

క. విను నుఱ్ఱెచి నకులుఁ బొది,వె నుదగ్ర ధ్వని ననేక వేదం డములం, దెనిమిదిటిఁ గూల్చె శాణము, లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ డేడ్తెల నధిపా. కర్ణ. 2-345

వ పదునెనిమిదవ పర్వంబై స్వర్గారోహణము నాఁబరఁగె. ఆది. 1-64

సీ. ఐదు నెన్మిదియును నాఱు శల్యుఁడు. ద్రోణ. 2-80

ఎనుపోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. ...కోలు,పులినైనను గాఱెను పోతునైన...పట్టుదు. విరా. 1-88

వ నిత్యంబు నిలు వరుస నొక్క మానిసి రెండెనుపోతులం బూనిన శకటంబున నపరిమిత భక్ష్య పిశిత మిశ్రాన్నంబు నించుకొని పోయిన దానిని వానిని నయ్యెనుపోతులను భక్షించుచు. ఆది. 6-265

ఎనుబోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. వలసిన నేలు మేను బలవంతుఁడఁ గాఱెనుబోతు దంతి బెబ్బులి మృగనాథునిం దొడరి పోరుదు. విరా. 1—228

(శి.వ. ప్ర.కోశమున ఈ తావున 'ఎనుబోతు' అని సబిందుకముగా నున్నది, వారు అనఁగా అకాడమి వారు ముద్రించిన భారత ప్రతి యందు ఆచ్చట నిర్బిందుకము గాఁగలదు సంశోధితము నందును ఈ యొక్క తావుననే 'ఎనుబోతు' అని నిర్బిందుక ప్రయోగము గలదు. మిగిలిన తావున ఎనుపోతు అనియే గలదు. ఈ సంపుటాలో ఆనందవారి ప్రతి యందు 'ఎనుపోతు' అనియె కలదు. సూ.ఆ.ని. వారు 'ఎనుఁబోతు' గాని ఎనుబోతు గాని ఈయలేదు. విచార్యము.)

**ఎనుబది** దే. సర్వ. బొ.

ఎనిమిది పదులు, అశీతి.

తే. ఎందు మెనుబది నాలుగు వేల యోజనంబులని హేమధాత్రీ
ధరంబు పొడవు. భీష్మ. 1-22

**ఎన్నండు; ఎన్నఁడు** దే. వి. బొ. ఏనాఁడు

1. ఏదినము, ఏకాలము.

క. నీ పసులఁ గావఁబెట్టుము, భూపాలక నన్ను నేను బూనియరసినన్, గోపంక్తులు రుజవడ వొరు, చేపడ వెన్నఁడును దప్పిఁ జేడ్పడ వెచటన్. విరా. 1-278

ఆ. ఒలసి యెంత కాలముండిన నేను మీ, దానఁ గాన యొరుల ధనము నన్ను, వెన్నఁ డయిన నొరుల కిచ్చుచో ననురకు, భోజ నముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ. ఆది. 6-257

2. ఎప్పుడును, ఎల్లప్పుడు.

(ఈ యర్థమునఁ దఱచు ద్రుతాంతముగా నుండును.)

క. కని కొలువు నేసికొని మాలిని నాఁ జని సాధ్వి యిది మలీమస వృత్తంబున పొంతఁబోవ దెన్నఁడు, నను ప్రేంకఁదనంబు దోఁచు నట్లు చరింతున్. విరా. 1-106

సీ. ...మఱి, పాండు నందను లేక పత్నియందఁ, కరమనురక్తులు గావునఁ దమలోన, నేలచేటిల్లదు రెన్నఁడయ్యు -అ- నొక్క సతికిఁ బతులు పెక్కండ్రు గగుటిది, సతుల కొక్క గాన యతివ తృప్త యుండ తాలిగి వారి యుంకేల యుపరక్త, యగు.
(ఎన్నఁడయ్యు = ఎల్లప్పుడును) ఆది. 8-2

తే. (బలరాముఁడు) ఇట్టి దాని కోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణు తోడనేఁ
    జెప్పితిఁ గినిసి యిరు రె,అంగు వారికిఁ దగఁ జెప్పి సంగతంబు,
    సేయుమని యెంత సెప్పినఁ జేయఁడయ్యె. ఉద్యో. 4-168

(ఎన్నఁడేని = ఎన్నఁడో, ఏనాఁడో.)

మత్తకోకిల :- మదీయ భాషిత మెన్నఁడున్నేని మోఘము గాదు
    దిగ్ధరణి రవీందు లెఱుంగఁ గాన్. ఆది. 7-141

(ఎన్నఁడున్నేని = ఏనాఁడైనను, ఎప్పటికిని.)

**ఎన్నఁడో చచ్చినయట్లు** దే. జాతీ.

ఎంతకాలము క్రిందనో చచ్చినట్లు.

క. అని యతని జత్తు దేశం,బున నొక వాలమ్ము వక్షమునఁ జెక్కను
    గ్రుచ్చినఁ గ్రేళ్లి యెన్నఁడో చచ్చిన యట్లు రథంబు మీఁదఁ
    జేడ్పడి యుండెన్. ద్రోణ. 2-51

**ఎన్నాళ్లు(లు)** దే. వి. బ. (ఎన్ని + నాళ్లు)

ఎన్ని దినములు.

సీ. ...ఇంక నెన్నాళ్లు లుండెడి, గొంతి వనంబునఁ గూరదినుచు.
    ఆశ్ర. 2-15

**ఎన్ని** దే. సర్వ. బొ.

(ఎంత శబ్దమునకు అమహదర్థక బహు వచన రూపము సంఖ్యా
వాచకము.)

1. ఎంత సంఖ్య గలవి (ప్రశ్నార్థకము.)

సీ. నెఱి నిట్టిదని యింతి నెమ్మనం బెన్ని, భంగుల నరసినఁ బట్టు వడదు.
    విరా. 2-47

క. భూవర నాకుం జూడం,గా విష్ణుఁడు దైవ మట్లు గావున నగనిన్,
    భావించు పెల్లవారికిఁ, గావించును మోక్షమయ సుఖము లెన్నిం
    టన్. శాంతి. 5-509 (ఇది పాఠాంతరము.)

2. యావదర్థకము (ఇది తావదర్థకము నపేక్షించును)

వ పాపాత్మలైన సుదేష్ణ దనకు మతిరాగరసంబు చేరం గీచకనివా
    సంబునకు నన్నుం బనిచినఁబోవుట కొడఁబడక యెన్ని సెప్పిను

నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నొల్లక.
విరా. 2-178

ఎన్నియేన్ స్త్రీ. 1-140; ఎన్నియేనిన్ ఉద్యో. 3-41; ఎన్నియేని యన్ ద్రోణ. 2-199; ఎన్నియేనియును మౌస. 5

**ఎన్నికొను** దే. స. క్రి.

లెక్కపెట్టుకొను.

తే. ఎన్ని కొనుచుండఁ జనుచుండ నేండ్లు లివ్విధమున నాయువు దోడ్తోడఁ దఱిఁగి జీవహాని వాటిల్లఁగా. శాంతి. 6-224

వ. ఆడుగు లెన్ని కొనుచు నరిగి పదియగు నడుగు నప్పు డప్పాముచేత దష్టుండై తన రూపంబు విడిచి వికృత రూపంబుతో నున్న నన్న లునకు. అర. 2-127

**ఎన్ను** దే. స. క్రి.

1. లెక్కించు. లెక్కపెట్టు, పరిగణించు.

క. శత్రుంతపాదులగు గృప, పుత్రులఁ బేరుగల యోధ పుంగవులు మదచ్ఛిత్ర శరనిహతి సంగర, ధాత్రిఁబడిరి నారి నెన్నఁ దడలై యుండఁగన్. విరా. 5-91

చ. అమలిన తారకా సముదయంబుల నెన్నను ... భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే. ఆది. 1-10

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగము నందు మీఱు వారెం దఱో యెన్నుమా. ఉద్యో. 3-264

వ. వీని నెన్నికాని నిశ్చయింప నేరము. అర. 2-174

2. ప్రసంగించు, చెప్పు.

తే. అల్పులకు మ్రింగఁ జేరైన హాలహలము, భంగిఁబొంగెదు కోపంబు మ్రింగి కొనఁగ, సేలగఁలు నెన్ని నిన్నెన్నఁ బోలునట్టి, నీవుసాలినఁ గాకేల నెగడఁ జేరు. ఉద్యో. 1-838

వ. మన పేనానాయకులం జెప్పెద నిమ్మను భీష్మని నెన్న నేల కృపా చార్యుం డశ్వత్థామ శల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు

మఱియుం జెక్కండ్రు రథికులుఁ గలరు. భీష్మ. 1-174

సీ. వినుము ధర్మములెల్ల వినుత కృత్యంబుల, తపమెన్ని యెప్పఁగా
ధర్మమెందుఁ గలదు. అను. 4-81; అర. 5-115

## ఎపుడు (ఎప్డు) ఎప్పుడు

ఎల్లప్పుడు.

క. సన్న్యాసి వేషమున రాజన్యునిఁ గని యెపుడుఁ గొలిచి సభ్యత్వ
మునన్, మాన్యుఁడనై పుణ్య కథా, విన్యాస మొనర్తు నతని వేడు
కకుఁ దగన్. విరా. 1-69

ఉ. ...ఎప్డు నంగనా, జనములు నన్నుఁజూచి మరుసాయకముల్
దమ చిత్తవృత్తు లేచినఁ గొని వచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు
నాకు లంచముల్. విరా. 2-884

## ఎప్పటి అవ్య. (√ఎప్పుడు)

ఎప్పటివలె, యథాప్రకారముగా (మరల, తిరిగి అని తాత్పర్యము.)

వ. విశ్వరూపా యీ రూపం బుపసంహరించి నీదగు నెప్పటి యాకా
రంబు గైకొనవే యనిన. అశ్వ. 3-51

చ. ... తగం దొలంగఁగాఁ, ద్రోవఁగ జాడి బంధులకు దుర్మతి పుట్టిన
యట్టి మర్త్యు వారెవిధినైన మందులిడి యెప్పటి బుద్ధిఘటించు
చాడ్పునన్. శాంతి. 6-198

## ఎప్పటిచందము

యథాప్రకారము.

వ. కుంభ సంభవ, వారికిం దప్పించుకొని పోయినం బోపొమ్మని పలికి
డెందం బెప్పటి చందంబగుటయు నిశ్చల భావంబొందె.
ద్రోణ. 5-321

ఉ. ఎప్పటి చందముల్ విడిచి యేత్తెఱఁ దక్కిన చూడ్కులు.
ద్రోణ. 1-14

## ఎప్పటిచొప్పు

యథాప్రకారము.

వ. మున్ను నిద్రించు ప్రక్క దక్కి యొండు ప్రక్క నిద్రించు భార్గవు నట్లు గాంచి సంతోషించి పరిశ్రాంతి దిగఁద్రావి యెప్పటిచొప్పున నడుగు లొత్తుచుండ మఱియు దినంబు లిరువది యొక్కటి సనినం బ్రబుద్ధుండై. అను. 2-307

**ఎప్పటియట్లులు; ఎప్పటియట్లు**

యథాప్రకారము.

సీ. దనుజేంద్రు నిలుచుట గని సైన్యమెప్పటి, యట్టుల పురికొని. భీష్మ. 3—86

వ. దామోదరుండు ధృతరాష్ట్రునభిమతం బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి నిజ విశ్వరూప ప్రపంచంబు నుపసంహరించి. ఉద్యో. 3-411

**ఎప్పటివారలు**

పూర్వమెవరుండిరో వారు.

వ ధృతరాష్ట్రుండును మగిడి కొలువు కూటంబునకు వచ్చి యెప్పటివారలు పరివేష్టింప నుండె. ఉద్యో. 4-21

**ఎప్పుడు ఎపుడు, ఎప్డు**

వి. ప. ఔ.

(దీని రూపాంతరములగు 'ఎపుడు' 'ఎప్డు' అనునవి ద్వితీయాది విభక్తులతోఁ గూడి యుండవు.

1. ఏ వేళ, ఏ సమయము.

చ. ... ఎవ్వరి దెస వెప్పుడే తలఁపు వచ్చునొ యాతని కంచుఁ జూడ్కి సుస్థిరముగఁ దన్ముఖంబునన చేర్చుచు నుండుట నీతి కౌల్యనన్. విరా. 1-129

2. యదార్థకము (ఇది 'అప్పుడు' అను దాని నపేక్షించును.)

ఆ. ఒడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు, నరుగవచ్చు నెప్పు డరుగు తలఁపు, దోఁచె నప్పు డదియుఁ దోడదయ్యె ప్రీతినరుగు దెంచు ననియెఁ గురువరేణ్యు. అను. 1-80; ఆశ్ర. 1-68

3. ఎల్లప్పుడు, అన్నివేళల.

(ఈ యర్థమునఁ దఱచు సముచ్చయముతోఁ గూడియే యుండును)

ఉ. ఎప్పుడుఁ దాను బల్కునెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. విరా. 2-147

క. నీ మాట మెయిన చేయుదు, మే మెయ్యదియైన నెందు నెప్పుడు మాఱున్, దామోదర యశుభస్థితి, లేమి శుభము కలిమి నీదు లీల య కాదే. భీష్మ. 2-9

4. పూర్వము, మునుపు.

వ. ఎప్పటి పోలికలనికిం బోవుదమనిన నతం డాద్వైపాయనప్రాదం, బాసీమలోనిది గామియెఱుంగుం గావున నస్మాకటకియ్యకొని. శల్య. 2-229

5. మొదటి నుండియు, చాల కాలము నుండియు.

క. గదఁగయ్య మెన్నఁడోకో చేయుదు భీమునితోడ ననుచు నుల్లం బునఁ గోరుదు నెప్పుడు నిప్పుడు నాకది యొదవెన్ విధికృతిం గృతార్థుఁడనైతిన్.

శ్లో. చిరకాలేప్సితం దృష్ట్వా హృదయస్థమిదం మమ,
త్వయా సహగదాయుద్ధం త్రిదశైరుపపాదితమ్.
సం. భా. శల్య. 57-40

ఎముక దే. వి. ఎమ్ము

అస్థి, బొమిక, బొఁకె.

ఉ. కొన్నిటి నప్పళించుకొని కోవెముకల్ నుఱుమాడు. శాన్తి 1-18

వ. ఆ భూవల్లభుం డతని బరియెముకల గల ద్రేసిన, శల్య. 2-267

ఎముకయూటు దే. వి.

మజ్జ, మూలగ, ఎముకలయందుఁ బుట్టు నొకానొక జిగురు పదార్థము. దీని నుండియే సంతానోత్పత్తి కారణభూతమగు శుక్రము పుట్టును.

సీ. ఎముక యూటి, చవిగొని యానుచు. స్త్రీ. 2-9

ఎమ్ము దే. వి.

ఎముక.

సీ. చతురంగములును జర్జరితంబులై యవయవ భేద మెఱుఁగని
యట్లుగాఁగ, దుసిసిన నెత్తురు నెనడును నెమ్ములు, నెఱచియుఁ
గండలు నెనసి సమరతలము ఘోరంబుగా. ఉద్యో. 2-144

**ఎంపనుగ్గు** దే. వి.

ఎముకల పొడి.

ఉ. ఎంప నుగ్గు లొం,డొండ ధరిత్రిపైఁ దొరఁగ. ద్రోణ. 2-122

**ఎంపపొడి** దే. వి.

ఎముకల పొడి.

క. కినిసి ఒక మర్దనుఁడు...క్రుమ్మెం, గనుకని నెంప పొడిసెదరఁ
గాలంగేలన్. ద్రోణ. 5-82

**ఎయిదించు** దే. స. క్రి.

ఎయిదఁజేయు.

తెలుపు, ఎఱిఁగించు

క. చని యక్కుమారుఁడేమయ్యెనో యత్తెఱఁగెఱిఁగి మనకు నెయి
దించుము పుట్టిన కార్యమునకుఁ దగియెడు, పనియట విధిగెలువ
వసమె బ్రహ్మకునైనన్. విరా. 5-287

**ఎయిదికొను** దే. అ. క్రి.

1. కూడుకొను, ఒక చేటికిఁజేరు.

వ. మనుజపతి కనుజసహితుండై సహస్ర స్యందనంబుల తోడ వెన్ను
దన్ని నిలిచెనంతఁ దక్కటి బలంబులు నెయిదికొని యమ్మెయిన్న
దళంబుగాఁ గవిసిన. విరా. 5-2

2. డగ్గఱు, సమీపించు.

వ. పాంచజన్య రవం బాకర్ణించి నప్పుడ వేగం బయెదుకొనుమనిన
దారుకుండు. ద్రోణ. 2-354

3. మార్కొను, ఢీకొను.

వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి.

తే. నీవు భీష్మున కలికినఁ బోపదేను, గలుగ నెఱపేల యతనిపైఁ

గవియు మెయిది, కొని మదీయ బాణంబులఁ గుప్పఁగూరఁ బఱపి కూల్చెద నీతనిఁ బటురయమున. భీష్మ. 3-333, 334.

ఎయిదు దే. స. క్రి.

1. వెంబడించు, వెన్నాడు.

వ. అట్టి యెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరంబగు చిత్తంబుతో మత్స్యవిభుని వంక జూపుచు నిట్లయె.

తే. ఆతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి, యున్నవారము గావున నుగ్రరిపుల, పాలుపడకుండ విడిపింపఁ బాడి యితని, నెయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ. విరా. 3-202, 203.

2. తఱుము.

వ. ...సువర్మ లోనైన బంధుజనంబులు వాదిగాఁ గల పరివారంబు పలాయన పరాయణం బగుటయు వెనుకొని యెయిది గోధన వర్గంబు మరల్చె. విరా. 3-219

3. అందుకొను, చిక్కించుకొను.

ఆ. ఇట్లు వఱచుటయును నేతయు రయమున, నమ్మృగంబు వెనుక నరిగి యరిగి, యెయిద లేక ధాముణికుండు సారథిఁ, బదరి తేరు వేగ పఱపు మనియె. అర. 4-337

4. చేరు, సమీపించు.

వ. అలోన సైంధవుండు సంభ్రమంబున వాత కృపాణ చర్మంబులు గొని రథంబుడిగ్గ నుఱికి రయంబున నెయిది యదల్చినంగని జనక ద్వేషియగు నతని రోషంబగ్గలింప వాపురందర పౌత్రుండు పౌర వుని విడిచి యద్దెసకు లంఘించి కవిసె. ద్రోణ. 1-170

వ. నిరామిషంబైన యీ పేరతో ననిసేయుం బనిలేమ. వీర లేయిది యడ్డపడి తడవు సేయకుండు నట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును నెలగడవంబోవక యుండఁ బోదువవలయు.

విరా. 4-250.

5. పొందు.

క ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై కుఱుకుదు సాళువము గాక నొడిసిన భంగిన్, వెఱచఱవం బొదువుదుఁ బఱిపఱిసేయుదు నీదు పూన్కి పారం బెయిదన్. విరా. 2-282

క. నగరి సరకు, లయినది యిట్టిట్టి భంగినక్షీణములై, యెయిదం గలవారలఁ గని, పయనము తెఱఁగు సమకట్టుపని మఱవకుఁడీ. మాస. 136

6. కవియు, తాఁకు.

క. అన విని ధృతరాష్ట్రుం డిట్లను సంజయుతోడ భీష్మఘాటోపత నర్జునుఁ డెల్లెయిదిన భగదత్తుని కతనికి నేమి భంగి దురమయ్యె నొకో.

ఉ. నావుడు నాతఁడా ధరణి నాథున కిట్లను నట్లు డాఁకినన్.
ద్రోణ. 1-347; 348; కర్ణ. 2-216

అ. క్రి.

1. వెడలు, బయలుదేఱు.

క. అతిరయమున గురుఁడు భవ, త్సుతుఁడును బాహ్లికుఁడు నెయిది తోడ్తో బలసంతతి గూడికొనఁగఁ బటుబృంహిత హేషా నేమి రవము లెసఁగం దఱుచై. భీష్మ. 2-168

క. కడువడి నీవరుగఁగ వడముడియును నీవె క క్రమమున నెయి దుం గవ్వడి కుశలియైన విజయం, బొడఁగూడును మనకు దీని కొడఁబడు మనఘా. ద్రోణ. 3-297

2. పోవు, చను.

క. అనిన నట్లకాకయని శౌరి యరదంబు, ద్రిప్పి యాత్మసేన దిక్కు వోవ, నిచ్చటయును వెనుక నెయిది సంశప్తకు, లార్చి పేర్చి కురిసి రస్త్ర సమితి. ద్రోణ. 1-333

వ. ఆ సమయంబున దుర్యోధనుండును ద్రోణ జయద్రథులును నెయిది శాత్రవ సముద్రంబున మునుంగ కుండ నారాధేయు నుద్ధరించిరి.
ద్రోణ. 1-384

ఎద్దు దే. స. క్రి.

ఎయిదు.

1. పొందు.

ఉత్సాహ వృత్తము: ... వీను శో,కావిలత్వముదుపఁబూని యరుగు
దెంచితిన్ సుతా, తాపజనిత దుఃఖా వార్ధి పారమెద్దు పుత్రకా.
క్రీ. 1-66

2. పైకెత్తు.

ఉ. అంతకు భీమసేనుఁడు రయంబెసఁగన్ గద నెద్ది పట్టి య,త్యంత
రయంబుమైఁ బిఱిఁది కాతని ద్రోచిక నద్దదాపరి, భ్రాంతి వెలుంగ
నిల్చిన. ద్రోణ. 1-181

3. చేరు, సమీపించు, డగ్గఱు.

ఉ. అతఁడు సిక్కెనేని బలమంతయు విచ్చు మరల్పవచ్చు గో,వ్రా
తము నట్లయైన సుకరంబుగ నంతట నెల్లఁదీఱు నీ, యాతఁడేన
యందఱని వారసి కానకయున్న వీరి ని,ట్లీతలడించి యాకదుపు
నెద్దుఁగఁ బోదముగాక వ్రేల్మిడిన. విరా. 4-247

అ. క్రి.

1. తప్పించుకొని పోవు.

ఉ. ధరణీశ్వర యింతకు మున్ను వీటికిం, బోవవు శత్రునే పుడిపి
పోయెదు వాఁడవు గావు నీవు సై,న్యావలి యైనఁ జెడ్పడక
యాతల కెద్దుట లేదు నేనియున్. విరా. 4-192

2. తోడ్పడు.

(అభిమన్యుని మరణమునకు దుఃఖించుచు అర్జునుఁడు.)

చ. పలువురు సుట్టు ముట్టికొని బాణ కృపాణముఖాస్త్ర శస్త్ర పం,
క్తులఁ గడు నొంపఁగా దనకుఁ దోడ్పడువారలు లేక నన్ మదిం,
దలఁపఁడ యత్తఱిన్ రిపువధంబున కెద్దుము తండ్రి యేను గొం,
దలమునఁ బొందకుండనని తాఁ బలుమాఱును జీరకుండునే.
ద్రోణ. 2-247

3. చను, పోవు, వెళ్ళు.

చ. సచివులఁ జూచి యిప్పుడు వెసన్ మన మెద్దక తక్కినం బఱు,

ప్రచయము దప్పిపోవుఁ దుది భంగము సేగియు వచ్చు.

విరా. 3-140

క. విను పాంచజన్య పటుని, స్వనము దెయిది మఱిది యెడరు సైరిం పక కృష్ణుని రణము సేయు రథసంబని తలఁచెద నెయ్యు మెయ్యు మధికరయమునన్.

ద్రోణ. 4-141

శ్లో. గచ్ఛ గచ్ఛేతి గురుణా సోఽనుజ్ఞాతో వృకోదరః.

సం. భా. ద్రోణ. 1-127, 26

**ఎయ్యుకొను** దే. స. క్రి.

తటిమికొను.

ఆ. అప్పు డర్జునుండు తప్పక చూచి యీ, బలము పసుల నడ్డపడక యుండ, నెడ సొరంగవలయు నిట నెయ్యుకొనుమని, పనిచె మత్స్య భూమిపాలసుతుని.

విరా. 4-267

**ఎయ్యది** దే. సర్వ. (ఏ+అది) ఏయది, ఏది, ఎది, ఎద్ది

1. ప్రశ్నార్థకము.

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే, రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చిన దానికిం గతం, బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుడు.

విరా. 1-190

2. కాక్వర్థము ('లేదు' అను తాత్పర్యమిచ్చును)

వ. ఇంతకంటెను పెంపెయ్యది (పెంపులేదు అని తాత్పర్యము)

ఉద్యో. 3-149

ఆ. శోకమునకు నెయ్యది తుది (తుదిలేదు అని తాత్పర్యము)

స్త్రీ. 1-6

3. యచ్ఛబ్దార్థకము (ఇది తచ్ఛబ్దార్థకము నపేక్షించును)

వ. ఎవ్వరికి నెయ్యది యిష్టం బయ్యదియెల్లం దనమాయాబలంబున మయుం డొదవించుచుండు.

కర్ణ. 1-263

క. మన మందఱమును ధృతరాష్ట్రుని కడకుం బోయి కార్యమాత్ర మతనిచే, వినవలయు నాతఁడెయ్యది, గని పలికిన నదియ మనకుఁ గర్తవ్యమగున్.

సౌప్తి. 1-41

ఎయ్యేని ప.[1] (ఏ+ఏని) యచ్ఛబ్దార్థకము (తచ్ఛబ్దార్థకము నపేక్షించును)

వ. ఎయ్యేనివేల్పు నాహ్వానంబు చేసెద నవ్వేల్పు సనుదెంచి నీ వశంబున నుండు. అర. 7-323; ఆది. 5-18

2. ఏదియో, ఎవరో - అని నిర్దేశార్థమును సూచించును.

వ. ఇతండు కిరాతరూప ప్రచ్ఛన్నుండైన యెయ్యేని యొక్క దివ్య పురుషుండు గావలయు. అర. 1-315

వ. ఏము వసిష్ఠ మునివరు శాసనంబునం జేసి మర్త్యలోకంబునం దెయ్యేనియు నొక్క స్త్రీయందు జన్మింపం బోయెదము. ఆది. 4-127

వ. ఇవి యెయ్యేనియు నొక్క ధనుర్వేదవిదుం డయిన బ్రాహ్మణు నపత్యం బగునని శంతనునకుం జూపిన. ఆది. 5-188

ఎర దే. వి.

1. (భూతాదులకు వేయు) బలి, ఆహుతి.

క. నరపతుల నెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్, మరలం బోయెద. భీష్మ. 2-8; ద్రోణ. 3-185

2. పశుపక్ష్యాదుల యాహారము, మేఁత.

తే. భయము దక్కి యచ్చోటన పలితు దెరకుఁ, గ్రుమ్మరఁగ. శాంతి. 3-203

వ. ఎరలకై వచ్చి యట్లు దోఁచిన వయ్యోలుక. శాంతి. 3-204

వ. ఎరకుఁ జెనంగు డేగల చందంబునఁ జిత్రగతులం బోరి పోరి. ద్రోణ. 3-268

క. ...ఎరకై, వెరవునఁ గాకులుఁ గ్రోఁతులుఁ, బరువడిఁ జీకాకు పఱుచు భంగి నంఁచుచున్. ద్రోణ. 1-258

3. ఆహారము.

చ. ఫలము దళంబునుం దొడిమఁ బాయుట రాలినవానిఁ గొంచు నాఁ, కలి కెరసేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి. అను. 5-56

4. వ్యసనము.

చ. తిరుగుచుఁ బుట్టలం దొరలఁ ద్రిమ్మరు పాముల రోసిరోసి వి,స్ఫు
రతర దీర్ఘదండమున ద్రోల్లఁగ వ్రేయుచు వచ్చివచ్చి య,య్యెర
నొక డుండుభంబను నహిం గని వ్రేయఁగ దండమెత్తుఁడున్, హారి
హారి యంచు డుండుభ మహాహి భయంపడి పల్కె భార్గవున్.
ఆది. 1-152

## ఎరఁగు దే. అ. క్రి. ఎఱఁగు

1. క్రిందికి దుముకు, దిగ్గనుఱుకు.

క. సహదేవుండును గదగొని, మహి కెరఁగినయప్పు డొప్పె.
ద్రోణ. 1—161

2. ఉఱుకు, లంఘించు.

సీ. మృగంబు పై కెరఁగు సింగము పోలెఁ గిట్టి సత్యేషుని గిటడంచి.
శల్య. 1—379; కర్ణ. 3-256

3. నమస్కరించు.

ఆ. ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు,రరుగుదెంచునప్పు డధిక
భక్తి, నెరఁగి ప్రియము వలికి తెరువిత్తురు. ఆది. 7-111

## ఎరగలి దే. వి.

ఉల్క. ఆకాశమునుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము.

చూ. ఎరగలువోవు

## ఎరగలిచిచ్చు వి.

దావాగ్ని, కార్చిచ్చు. అగ్ని.

చ. ఎరగలిచిచ్చుకాఱడవి యొల్లను బెల్లున నొక్క పాయగా, దరికొని
రూపడంచిన విధంబున. భీష్మ. 2—5

వ. ఇట్లెరగలిచిచ్చు గవిసి చుట్టుముట్టిన నమ్మనుజనాథుండును
సన్నాతులు నిరాహారులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియ
ముటికి తొలంగిపోవ లేరైరి. ఆశ్ర. 2-152

## ఎరగల్లువోవు

ఉల్కలు పడి [illegible].

వ. మిగిలిన మాతంగంబులు పెనంగిన కనక లిప్తకాండంబు లూడు కొనం దాఁకి న నెరగళ్లువోవు కొండల కైవడిం బొలుచు నవి యును. కర్ణ. 2-227

శ్లో. శరైః కనకపుంఖైశ్చ చిత్రా రేజు ర్గజోత్తమాః
ఉల్కాభిః సంప్రదీప్తాగ్రాః పర్వతా ఇవ భారత. సం. భా. కర్ణ. 52-17

ఎరగొను దే. స. క్రి. (ఎర + కొను)

1. ఎరగాఁగొను, ఆహారముగాఁగొను, ఆహుతిగాఁగొను.

తే. కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు. మాకేమి మేలుకాక, నాలుకలు గ్రోయు నర్జునానలము దటిసి. యెరగొనం గని సంతృప్తి యొనక మెసఁగ. ఉద్యో. 4-12

2. మేఁత మేయు.

సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁడై యుండఁ బిచ్చికలు. గూఁడు, గావించెఁ దన్మస్తకంబున నమ్మిథునము గారణముగ నండములు గలిగి, పిల్లలై వర్తించి యొల్లెడ కెరగొన నరుగుచు. శాంతి. 5-224

ఎరవగువాఁడు దే. సర్వ.

భేదబుద్ధి గలవాఁడు, అన్యుఁడు.

క. వైరుల దూతలు నెరవగు, వారు నిరాకృతులుఁ జాపవర్తులుఁ దమకుం, జెరువగా వర్తించుట, నేలమి తుదఁబోయి చేటునిందయు. వచ్చున్. విరా. 1-138

ఎరవలి దే. వి.

ఎరగలి, కార్చిచ్చు, దావాగ్ని.

తే. కనక భూషణ జాలంబు కతన గజము, లెరవలుల ప్రోవు కొండల వెనసియొప్పె, వల్గనంబుల పోషల వల్లన నబ్ధి, ఘనతరంగంబులను దురంగములు వొలిచె. భీష్మ. 1-88

('ఎరవలులు వోవు' - అని పెక్కు ప్రతుల పాఠము)

ఎరవళ్లవోవు దే. అ. క్రి.

ఉల్కలు పడి మండు.

చూ. ఎరవి ('ఎరవఖులపోవు' - అని కొన్ని ప్రతుల పాఠము)

**ఎరవు** దే. వి.

కొంతకాలము వాడుకొని తిరిగి యిచ్చుటకు అడిగి తెచ్చుకొను సొమ్ము.

క. ఇమ్ము నరేశ్వర మాతుర, గమ్ములు నీ కార్యమయ్యెగాదే కడు లో, భమ్మున నొండ్లవి సొమ్ములు, రమ్మనగన్ వచ్చునే యెరవు సతమగునే. ఆర. 4-847

క. తన యొడ లెరవని నను మను, జునకును బంధుతతి సతమె శోకించిన వ, చ్చునె చచ్చిన జంతువు నెమ్మన మధికము నొచ్చుఁగాక మహిత వివేకా. శాంతి. 1-220; స్త్రీ. 1-88

(ఇక్కడ 'ఎరవువంటిది, అనిత్యము' అని భావము)

2. భేదము, అరమరిక.

క. గురుభీష్మాదుల మనములు, దురమునకుం జొరకయుండ దుర్యోధనుఁ డాతురుఁడై యొడఁబఱుపఁగ నిష్ఠురునను నెరవైన బిచ్చ వడు బలమెల్లన్. ఉద్యో. 1-58

విశే.

1. ఎరవయినది.

చ. హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి నీదుగాండివం, బెరవుగ నిచ్చి నీవు నొగలెక్కి హరిన్ రథిఁజేయఁగన్న నిష్ఠురభుజ విక్రమోగ్రుఁడగు సూతతనూభవుఁ దల్పహాయులం, బొరిగొనఁడే సుయోధనుని పోడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. కర్ణ. 3-65

2, అన్యము, లాఁతి, తనదికానిది.

వ, మమ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టట్టన వలవదు పురంబున కరిగి యయ్యెడ నీకెట్లు ప్రియం బట్ల మన్నింపుమని రందుఁ గంకుండు మఱియు నిట్లనియె. విరా. 3-284

ఉ. తనకుం దా నెరవని నను, విమ బంధులు సతమె యన్వివేకంబుననే జనులవయిఁ జేయ నర్మిలి, వను వగనొంద దది కారణముగన శేంద్రా. శాంతి. 4-11

శ్లో. ఆత్మాపి చాయం న మమ సర్వా వా పృథివీ మమ
యథా మమ తథాన్యేషా మితి చింత్య న మే వ్యథా.

సం. భా. శాంతి. 174, 14

క. వరనాయక నీ యేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధి గల్గుగకి, క్లైరవై యుండుటకుఁ గతం,బరయఁగ నెద్ది వినుపింపుమది విశదముగన్. ఆశ్వ. 2-91

**ఎరవుపడు** దే. అ. క్రి. (√ఎరవు)

కలహించు, భేదపడు, ద్వేషించు.

వ. అట్టియెడ సహదేవుం డాక్రైనేయు నుద్దేశించి...మీలో మీరెరవు పడం దగునే యలుకదక్కు మనునెడ. ద్రోణ. 6—371

**ఎరవుమాట** దే. వి.

ద్వేషపుఁబలుకు.

వ సురనదీసూను దిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింప నగునే నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వం బును సహింపవలయునని తేర్చి యంగరాజుం గనుంగొని మీ రిద్దఱు నొక్కటియై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి యెరవు మాటలేల యని పొదివి పలికె. ఉద్యో. 4-253

**ఎరవుసేయు** దే. స. క్రి.

తనదికాని దానిన్ని గాఁజేయు, ఎరవు వస్తువుగాఁజేయు.

క. ధనములు బంధులు భోగము,లనియెడు నస్థిరములెల్ల నాత్మకెరవు సేసిన శాంతి యలవడును మన,మున శాంతిశ్రీ సమృద్ధి మోక్షము నిచ్చున్. శాంతి. 4-346

**ఎరసేయు** దే. స. క్రి.

1. ఎరగాఁజేయు, బలియిచ్చు.

వ. అతని శిఖండి బాణముల కల్లెరసేసితి. కర్ణ. 3-120

క. ...అప్పాంచాలో,త్తరు నొక నారసమునకు, నెరసేసె.

శల్య. 1-214

2. ఆహారముగా నొనరించు.

చ. ఫలము దళంబునుం దొడిమఁ గాయుట కాలినవానిఁ గొంచు నాఁ,
కలి కెరసేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి. అను. 5-55

**ఎరియించు** దే. స. క్రి.

తపింపఁజేయు, పీడించు.

వ. శకునితోడంబుట్టువగు నలాయుధుం డను నసురేంద్రుండు వడ ముడివలని వైరంబు పెద్దకాలంబేనియు మనం బెరియింపం దఱి వేచికొని యుండి యన్నిశా సంగ్రామంబునకు ససైన్యంబుగాఁ జనుదెంచి దుర్యోధనుం గని తన్నెఱిఁగించుకొని యతనితో నిట్లనియె. ద్రోణ. 5-209

**ఎరియు** దే. అ. క్రి.

1. దగ్ధమగు, మండు, కాలిపోవు.

సీ. మతియొక్క నెవ్వగ మనమున జనియించె, వాంఛికేయుండుగా రగ్గి నెరిసె. ఆశ్ర. 2-165

క. గురు కర్ణుల యస్త్రాగ్నుల, నెరసిన యరదమ్ము దీని నిటుగాకుండం, భరపడి రక్షించితి సం,గరము దెగిపఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్. శల్య. 2-337

శ్లో॥ అస్త్రైర్బహువిధై ర్దగ్ధః పూర్వమేవాయ మర్జున,
మదధిష్ఠితత్వాత్ సమరేన విశీర్ణః పరంతప.
ఇదానీంతు విశీర్ణోఽయం దగ్ధో బ్రహ్మాస్త్ర తేజసా.
సం.భా. శల్య. 63-18-19

2. పరితపించు, బాధపడు.

క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియఁగ నసహ్యపడు న,న్నరుడు దెవులు లేని వేదనం బడు నధిపా. ఉద్యో. 2-58

క. శరవేదన సర్వాంగము, లెరియఁగ నాలుక యెండి పెదవు లెండెడుఁ దృష్ణాతురత ముఖము వదలగిన నీళులు, నెరవుగ దే నేర్తు నీవ వే తెమ్మనఘా. భీష్మ. 3-428; ద్రోణ. 4-286

8. నశించు, చచ్చు.

క. కౌరవులు దమదురితమునఁ, దా రెరిసిరి కల్మషంబు దానఁ గలదే భూ,భారము వహింపు బహు యజ్ఞారంభణ మాచరింపు మఖిల హితముగన్. శాంతి 1-105

తోటక వృత్తము: తమతమ తప్పులఁ దా రెరియంగా, విమలమతీ యిటు వీరికినై శో,కమున దహింపఁగఁ గాదు మనంబున్, సముచిత మిత్తఱి శాంతము సుమ్మీ. స్త్రీ. 1-81

శ్లో. ఆత్మాపరాధాత్పుత్రాస్తే వినష్టాః పృథివీపతే,
మా తాన్ శోచస్వ రాజేంద్ర న హి శోకే స్తి కారణమ్.
సం. భా. శాంతి. 8-35

ఎఱ్ఱ దే. విశే.

ఎఱ్ఱనిది, అరుణము.

క. నిలిచి మహాస్త్రీం బెఱ్ఱుమం,టలు గ్రమ్మఁగ నేయుటయు.
భీష్మ. 3-117

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కుమారోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె. ద్రోణ. 2-127

ఎఱంగు; ఎఱఁగు దే. అ. క్రి.

1. వ్రాలు, దిగు.

ఆ. దానిమీఁద నుండి వాని రెంటిని భుజం,పంగ మదిఁ దలంచి పంచ యోజ,నములు నిడుపు గల్గు రమణీయ శాఖపై, గరుడుఁ డెలమి నెఱఁగెఁ గురువరేణ్య.

క. ఎఱఁగిన యప్పెను వేఁగున విఱుగుటయును. అను. 1-236, 237

వ. కొలంకుల చందంబు నొంద వాని కెఱఁగెడు కొదమతుమ్మెద పదువుల పగిదిఁ దొరఁగు నాఖండలతనయ ఖండిత వరవీర కాలాయస నారాచశకలంబుల వలనను. విరా. 5-60

2. పడు, రాలు,

వ. శ్రుతవర్మ శిరంబు భల్లంబున నుద్రుంచిన నది ముఖకాంతి మెఱయం జంద్రమండలంబు మహి కెఱఁగు తెఱంగుఁ దోపం బడియె.
కర్ణ. 2-216.

8. నమస్కరించు.

క. మహోదారుఁడు గుంతీ చరణాం, భోరుహముల కెఱఁగి వినయ భూషణుఁ డగుచున్. ఉద్యో. 4-9

సీ. అనఘు సుఖాసీనుఁడైన వసిష్ఠ సంయమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి. శాంతి 6-8

వ. వేదవ్యాస మునివరు పాదంబుల కెఱంగి. అశ్వ. 1-137

వ అన్నరపతి చరణంబుల కెఱంగి. అశ్వ. 3-139, ద్రోణ. 5-428

ఎఱక దే. వి.

పక్షి ఱెక్క.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు వ్రేఁగడరి సొగసి వ్రేల్మి వివశుఁడై, యఱచిన నోడకు మని హరి, నెటి పక్కఁగఁ ద్రోచి యొత్తె నెగయంగఁ గృపన్.

ఉద్యో. 8-301; విరా. 2-240 కర్ణ, 2-72

('ఎఱకలు' — అని బహు వచనమువందే ప్రయోగము.)

ఎఱచి దే. వి.

మాంసము.

సీ. ...నెనడును నెమ్ములు నెఱచియుఁ గండలు నెనసి సమర -తే- తలము ఘోరంబుగా. ఉద్యో. 2-144

క. ఉఱవగు నారుగ పంటలు, గొఱియల పాడియును దఱచగుం బురుషులకుం, దెఱవలు చుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. అర. 4-295; ఆది. 5-58; స్వర్గ. 82

ఎఱింగించు; ఎఱిఁగించు దే. స. క్రి.

ఎఱుఁగఁజేయు.

1 ప్రకటించు.

సీ హయ మదద్విరద రథా రూఢ దక్షత, బ్రకటించువారును బ్రాస శక్తి, కుంత తోమర గదా కుశలత్వమెఱిఁగించు,వారునుగా నిట్లు వసుధలోన -అ- రాజసుతులతోడ రమణఁ బాండవ ధృత

రాష్ట్రసుతులు వృద్ధ రాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమ
తమ విద్యలు, మెఱసిరెల్ల జనులు మెచ్చి పొగడ. ఆది 6-11

క. కుంతీ తనయులు సమయము, శాంతత మై నడపి తమ భుజాబల
మును దుర్దాంతోద్యమ శౌర్యము నెఱిఁగింతుమనుచు నున్న
వారు గినుకెఁద గదురన్. విరా. 1-13

2. తెలియఁజేయు.

క. అన విని తగుమాటల నా తని కొండలపాటు పాండు తనయుండు
గ్రమంబున డిందుపఱచి యరదము, సనఁగా నెఱిఁగించి పట్టె
శంఖము మఱియున్. విరా. 4-178

తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి, నెలవు లార్యులు శాస్త్రను
నిశ్చయమునఁ, గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ దెలియు
నట్లుగఁ జెప్పెద ధీసమగ్ర. ఆశ్వ. 1-182

**ఎఱఁగఁబడు** దే. స. క్రి.

తెలిసికొనఁబడు, కనఁబడు.

ఆ. వివిధ దుర్నిరూప వేషముల్ గైకొని, నిఖల దిశల యందు
నిపుణ వృత్తి నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన
నెఱుఁగఁబడరె. విరా. 8-93

**ఎఱుఁగమి; ఎఱుంగమి** దే. వి.

అజ్ఞానము, అవివేకము.

క. ఎఱుఁగమి చీఁకటి నీ పెద్దఱికంబు దలంప నేమి తప్పు గలిగినన్,
మఱచి దయఁజూడు మిట్లుం దఱు నీకుం బనులు సేయఁ దగుదురు
వీరల్. విరా 5-367

చ తన మును పడ్డ బన్నములఁ దమ్ముని పైఁగల కూర్మి పేర్మి నీ,
జనపతి సైపకున్నె యది సక్కని రాజ్యము పాలు లేక తీఱున
కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె చాలరై రి వీరన రాకొ
నానలేమి యని యాడరె లోకము వారు కేశవా. ఉద్యో. 3-102

**ఎఱుంగు; ఎఱుఁగు** దే. స. క్రి.

1. తెలియు, గ్రహించు.

వ. తన దివ్యచిత్తంబునం గల యక్కారుణ్యంబు తెలం గెఱుంగు నట్టి శక్తిం బ్రసాదించి. విరా. 1—11

వ. అని యుపలాలితుండగు డింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున. విరా. 1-22

క. ధర్మం బెఱుఁగుచు నెఱిఁగిన దానిని, మఱవ కనుష్ఠించునది సమం జసబుద్ధిన్. ఆది. 3-268

2. అభ్యసించు, నేర్చు.

శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్, సేవా దక్షత యొందుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చున, ట్లేవండం గడునేర్తు శాసనమునం దిచ్చోటనే కాదు న,న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డబ్బంగులం జూచినన్. విరా. 1—218

3. కనుఁగొను.

క. కీచకుఁడు బ్రేటువడి తన, నీచవుదెస యొరు లెఱుంగనేరకయుం డన్, లేచి వెనుకఁజని విస్మయ, గోచరుఁడై యసురకతనఁ గుం ఠితు డగుచున్. విరా. 2—180

4. గుర్తుపట్టు.

వ మంద మంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శ నంబున మేలుకని యిది యెవ్వరనవుడు నేనను నమ్మానిని యెఱుం గెఱింగి భీమసేనుండు. విరా. 2-167; అర. 1-327

5. జ్ఞప్తియందుంచుకొను.

క. కృతమెఱుఁగుదు రుపకార,వ్రతమున వర్తింతురెపుడు వదలరు కరుణా,న్వితు లీవరపతికి శుభ,ప్రతిపాదకులగుదు రేమి భంగుల నైనన్. విరా. 3—63

6. వెదకి తెలిసికొను.

ఆ. వివిధ దుర్నిరూపవేషముల్ గైకొని, నిఖిల దిశలయందు నిపుణ వృత్తి, నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లినేఁటిలోన నెఱుఁ గఁ బడరె. విరా. 3—93

7. విచారించు.

తే. వారి యజ్ఞాతవాస సంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండు బయలు, మెఱసి సమయంబుదప్పె నీవెఱిఁగి దీని,కేది దగు నది సేయుము మేదినీశ. విరా. 5-368

8. అనుభవముచే గ్రహించు, అనుభవించు.

క. హరి కులిశక్షతి యెఱుఁగని, గురుతర పక్షముల తోడి కులగిరి వోలెన్, గరుడుండు గగన గతి నురు, తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. ఆది. 2-41

ఉ. ...వీఁడు నీ, చేతుల లావెఱుంగఁడు విశిష్టశుభం బిది నీకు ఫల్గునా. ద్రోణ. 3-188

9. క్త్వార్థకముపై వ్యతిరేకార్థక క్రియారూపమునఁ జేరి 'లేదు' అను నర్థము నిచ్చును,

వినియెఱుఁగఁడు = వినలేదు; చూచి యెఱుఁగఁడు = చూడలేదు.

క. ...ఇట్టి సభన్, మానవ లోకేశ్వరులం, దెన్నఁడుఁ జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్. సభా. 1-58

చొచ్చియెఱుఁగఁడు = చొచ్చుట యెఱుఁగఁడు - ప్రవేశించినవాఁడు కాఁడు - ప్రవేశింపలేదు.

క. బాలుఁడు సుకుమారుఁడు వె,క్కాలములం జొచ్చి యెఱుఁగడనక మొనసొరం, జాలుదు చొరుమని పనిచితి. ద్రోణ. 2-141

ఎఱిఁగి ఎఱిఁగి = బాగుగా దెలిసికొని.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసముపేతుఁ,బాడియయ్యె యిట్టి పనికిఁ బనుప. అర. 2-86; అర. 3-321

ఎఱుక దే. వి. (√ఎఱుఁగు)

1. జ్ఞానము, తెలివి.

తే. క్రీడ దెసఁ గౌతుకం బరియాడ రతుల, చవులు గొనియాడ వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. విరా. 2-70

తే. ఏన నీవను నైక్యంబు నెఱుక వొడముఁ,గాత గమనాగమనములు

గ్రాఁగిపోవ. శాంతి. 4-248

2. స్మృతి.

ఆ. ఎల్లవారు నెఱుక లెడలి చొక్కి నిద్రాతిశయము గూరినట్టు లైరి. విరా. 5-208

3. ప్రజ్ఞ.

వ. వనట యనియెడు నగ్ని నెఱుక యనియెడు నీట నార్పుము. స్త్రీ. 1-92

శ్లో. పుత్రశోక సముత్పన్నమ్ హుతాశం జ్వలితం తథా।
ప్రజ్ఞాంభసా మహాభాగ నిర్వాపయ సదాప తవ॥ స్త్రీ. 8-49

4 ఆత్మానాత్మ వివేకము.

సీ. తారు గొందఱకు బాధకులయి నడచుట నరులచే బాధలఁ బడుట గలుగు, నివి కాలభావ్యంబు లెఱుక గల్గిన వారుఁ బఱిచిరి వారు నిచేఁ బడితి ననుచుఁ, బురుషుండు ప్రియశోకమునఁ బొందఁడు. శాంతి. 1-188

5. ప్రసిద్ధి.

సీ. పాండు కుమారులు...భూసురవరుల వలన, వేదంబులును ధనుర్వేదాది విద్యలుఁ, గఱచుచుఁ గడతేని యెఱుకఁ దనరుచున్నఁ దద్విపుల గుణోన్నతి సైపక. ఆది. 8-12

ఎఱుకచే(సే)యు దే. స. క్రి.

తెలియఁజేయు, తెలుపు.

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁజూచి వారు వెఱచి,లోని కెఱుకచేసి లోఁగుచు వారు దన్నుమప నరిగె నృప గృహాంబు సేర. శాంతి. 6-288; ద్రోణ. 4-188

ఎఱుకపడు దే. అ. క్రి. (√ఎఱుక)

1. తెలియు, బోధపడు, స్పష్టపడు, ప్రకటితమగు.

క. హరి పలికిన విధమెంతయు, నెరవై యున్నయది వింటె యిమ్మాటలు తెలం, గరయుదము తొలుత నీ పెను,వరి చందం బెల్ల నెఱుకపడి యెడుఁ బిదపన్. ఉద్యో. 3-214; స్త్రీ. 2-167

ఆ. శాపమిచ్చువాఁడు జనని యుత్సంగంబునందు నిద్రపోయినట్ల
యుండి, యమరవరుల కజునకైన యన్యోన్య సంభాషణంబు
లెఱుకపడఁగ వింటి. ఆది. 2-131

2. అనుభవించుచున్నట్లు తెలియఁబడు.

గీ. అధిక దుఃఖరోగార్తున కౌషధంబు, సురచిరంబుగ సౌఖ్యంబు
చూపె యెందు, నొనర భార్యాసమేతుఁడై యున్న వాని, కెంతల
య్యును నాపద లెఱుక పడవు. అర. 2-78

ఎఱుకు దే. వి.

కిరాతుఁడు, నిషాదుఁడు.

తే. పఱప నోపక యున్న మైమఱచి పెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింప
మొనసియున్నఁ, దెవులుగొని మృగములఁ దివిరి యేయ, రెఱచి
యాహారముగ మను నెఱుకులయిన. ఆది. 5-68

క. ఎఱుకని యెఱుఁగక నిన్నున్, మఱుకువ నెదిరితిని దీని మఱవుము
నన్నుం, గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె
నీ చరితంబుల్. అర. 1-327

ఎఱుకువ దే. వి. (√ఎఱుఁగు)

అనురాగము, ప్రేమ.

తే. అవయవ భంగులందుఁ, దగిలి మఱపునఁ దడయు నిద్దఱ విశాల,
నయన దీప్తుల నెఱుకువ బయలువడఁగ. విరా. 6-395

క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట, యెఱుకువమై మనకు దైవ మిచ్చినసిరి
యిట్లుఱిమిన యీలో గ్రక్కున,నఱకు మితఁడు దెగిన మన మనః
పీడ దెగున్. ద్రోణ 3-181

ఎఱుగలి దే. వి.

పెరుగుట, పెంపు.

సీ. ...దమంబెఱుఁగలి యధికంబైన, స్రోతస్స్రధోముఖస్రుతి రజస్సు
ఆ-పెరిగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ బొంద సూర్ధ్వ
వృత్తిఁ బొందు. అశ్వ. 2-125

**ఎఱ్ఱ** దే. వి.

ఎఱుపు, ఆరుణ్యము.

సీ. ...పల్లవముల కట్టెఱ్ఱకుఁ బన్నుగొనఁగి. విరా. 2-114

విశ.

ఎఱ్ఱనైనది.

క. నరుఁడలుక వొడమియును సుస్థిరుఁడై తన యొఱ్ఱనెరల చెలువునఁ
గెందామరలం దెగడెడు కన్నుల నరుణచ్ఛవి నెఱయ...
విరా. 2-132; కల్య. 2-268

**ఎఱ్ఱఁదనము** దే. వి.

ఎఱుపు రంగు.

సీ. ఎఱ్ఱఁదనంబుఁ దనరిన మూఁపులు, నాయత స్ఫీతంబులైన బాహా
వులు వెడఁదయురంబునై పొలుచు నితఁడు భీముఁడు. ఆశ్ర.2-40

**ఎఱ్ఱన** దే. విశ. (ఎఱ్ఱ)

ఎఱ్ఱనిది

సీ ...భోజవతిమీఁదఁ గడు నెఱ్ఱనైన క్రేఁగంటి చూడ్కి, నిగిడించి.
మౌస 1-45

**ఎఱ్ఱనవ్వు; ఎఱ్ఱని నవ్వు** దే. వి.

కోపముచేఁ గలుగు నవ్వు.

చ హయములమీఁద సూతుపయి నాతని యంగములందు నస్త్ర
సంచయ మడరించినం గమల చారుముఖంబున నెఱ్ఱనవ్వు చె,
న్నయి విలసిల్ల తల్లమున నన్నరనాముఁడు ద్రుంచె విద్విషత్ప్రయ
దవిలాస బాహు సముదగ్రత వాని శిరంబు గ్రక్కునన్.
ద్రోణ. 2-64

క. అ...సురాధిపు డెఱ్ఱని, నవ్వొలయఁగ మాఱుకొనె ఘృణా రహి
తుఁడై. కల్య 1-248 (పాఠాం)

**ఎఱ్ఱనార్యుఁడు** వి.

ఎఱ్ఱ కవి- కవిత్రయములో మూఁడవవాఁడు.

సీ ...న్నయ్యఁడు ధర్మైక్యకతత్పరాత్ముఁ-తే-డెఱ్ఱనార్యుఁడు
(చూ. అనుబంధము -వివరింపుటకు) ఆర. 7-470,471

**ఎఱ్ఱని చూడ్కి** దే. వి.

కోపముగల చూపు, కోపదృష్టి.

ఉ. క్రోధవేగ సముదగ్రత నెఱ్ఱని చూడ్కిఁజూచి. విరా. 5-193

**ఎల** దే. విశే.

(వృత్తియందు 'ఎలమి'లోని 'మి' వర్ణము లోపించిన రూపము).

1. లేఁతది, కోమలము. చూ. ఎలదీఁగ.

2. అభినవము, నూతనము. చూ. ఎలజవ్వనము.

3. స్వల్పము. చూ. ఎలనవ్వు.

**ఎలచన్నుఁగవ** వి.

లేఁతచన్నుల జంట- బిగుతుగల చన్నులజంట.

సీ. మారేడుపండుల గారాము సెఱచు నీ, యెలచన్నుఁగవ వేడుకల నొనర్చె. అను. 1-5.

**ఎలజవ్వనము** దే. వి.

నూతన యౌవనము.

తే. శ్రమములేదు ప్రతోదవ్రణములులేవు, నాతియును నేను నెల జవ్వనంబుఁ గంటి, మిది మహాద్భుతతర మందు మే భవన్మహాను భావత్వ మేమి సేయదు మునీంద్ర. అను. 2-314; ఆది. 8-27

**ఎలదీఁగ; ఎలదీఁగె; ఎలదీవ** దే. వి.

లేఁత తీఁగె.

సీ. ఎలదీఁగఁ గప్పిన లలిత పరాగంబు, క్రియ మేన మేదినీరేణు వొప్ప విరా. 2-188

సీ. సోలెడు నెలదీఁగెలీలఁ గ్రాలుచు వింత, చెలువంబు దలకొనఁ జేరి నిలిచి (సం.ము ప్రతి, అకా-ప్రతి) విరా. 2-64

సీ. మావి మ్రోకల నెలదీవలఁ జెన్నొందు తోఁటలకడ నలి తోడఁ జెంది. శాంతి. 3-332

**ఎలదేఁటి** దే. వి.

కొదమతుమ్మెద.

సీ. మకరంద రసపాన మదవిలోలంబులై, క్రాలెడి యెలదేఁటిగముల యులివుఁ. ఆర. 7-212

**ఎలనవ్వు** దే. వి.

చిఱునగవు, కొద్దినవ్వు.

క. తలచుట్టుచుట్టెఁ గుండల,ములు పెట్టెను క్రిందు గాఢముగఁగట్టెఁ గరం,బుల వలయంబులు గనుఁగొని, యెలనవ్వొలయంగ నెక్కె నేడైల రథమున్. విరా. 4-165

**ఎలనాఁగ** దే. వి.

యువతి, స్త్రీ.

వ. కావున నా యెలనాఁగ నేమి యుపాయంబుననైన నన్నుం జేర్పవైతేని గంధర్వ దర్పంబున నలందురి వందుదునని. విరా 2-68

తే. ...అయ్యెలనాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱుఁగని తెఱఁగు దాల్చి, కార్యమున నుమ్మలించి పాంచాలిత్రోడ, నెలుఁగు వేలోక భంగిగా నిట్టులనియె. విరా. 2-155

**ఎలపఱుచు** దే. స. క్రి.

తేలిక చేసి అవమానించు.

క. నెట్టన సభలో వేవురఁ కట్టెదుర నరాతితనముఁగా కెంతయు వా. రెట్టి తులువలో ద్రౌపది, నట్టెలపఱిచెడిదె జూదమాడరె యెందున్.

ఉద్యో. 1-344 (సం.శో.ము. ఆకా. ప్రతులు)

**ఎలప్రాయము** వి.

జవ్వనము.

క. ఎలప్రాయ మిచ్చితిని నీ,కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం, బలరఁగఁ బెండిలిగమ్మనిఁ పలికి మఱియు నాతపస్విపతి యిట్లని యెన్. అశ్వ. 3-76 (చూ. 79)

**ఎలమామిడి** దే. వి.

లేమామిడి, లేఁతయైన మామిడి చెట్టు.

ఉ. ...సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతోఁ, మత్తగజంబు లీల నెలమామిడిఁ గూర్చిన భంగిఁ బాండుపుత్రో త్తమ వీనిఁ గూల్పు మతఁ డొంటిగ రాజ్యము నీకు జేకుఱున్.

కర్ణ. 2-350

ఎలమావి దే. వి. ఎలమామిడి

లేమామిడి (తియ్యమామిడి అని సూ. అ ని)

వ. అన్నరపతులు నఱుకుడువడిన యెలమావి జొంపంబుల చందం బగుటయు

ద్రోణ. 2-85

ఎలమి దే. వి.

1. సంతోషము.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసిపొదలు మానసమున నెంతయుఁ బ్రొద్దేఁ, గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తి తాత్పర్యమునన్.

విరా. 1-25 (చూ. 28)

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి.

ఉద్యో. 4-159

2 ప్రేమ, అనురాగము.

సీ. ఎలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరినఁ నెడఁద నానందంబు నిక్కగాదె.

విరా. 2-86; 1-10

3, అనుగ్రహము, దయ.

తే నామనంబు నానంద మగ్నమునఁ జేయ, నెలమి నన్నిధిఁ జేసె సర్వే శ్వరుండు.

విరా. 1-12

4. వికాసము.

క. అని పలికి గాఢనిశ్చయ,మున వదనం బెలమిఁ బొంద మును కలఁ గిన నీ,మొనలెల్ల నొక్క మొగమున, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్.

ద్రోణ. 5-42

క. ఎలమియు వాడుటయును దన, వలచినయట్లివి యెఱుంగ వావిధి చరితం,బులు బలవంతంబులగుట, వందె వివేకంబు పెద్ద వారికి నింద్రా.

శాంతి. 4-397

4. పెంపు, అతిశయము, వృద్ధి.

క. అలుచై నను బగతుని దెసఁ, దలఁపు గలుగవలయుననిన దర్పోజ్జ్వల దోర్బలులగు కౌంతేయుల మన, మెలమికలిమి వచ్చి లేయిట్టుమలు నగునే. విరా. 3-107

క. హీనస్థానమున విభవ,హీనత నిట్లుండి రిపుల యెలమిఁగనియు నీ మానసమున శోకింపమి, దానవకులనాథ యెవ్విధంబునఁ గలిగెన్. శాంతి. 4-423

6. ఉత్సాహము.

తే. ఇవ్విధంబునఁ దమతమ యెఱుఁగు,లందఱును జెప్ప విని మరునంద మందు, దగవిచారించి కార్యంబు తెగువగాంచి, యెలమి వారలఁ గముఁగొని యిట్టులనియె. విరా. 3-112

క. సమరమునకుఁ దగు నుద్యో,గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతే యులు మత్స్యమహీ నాథుఁడు సన్నా,హము నేసెన్ ద్రుపద విభుఁడు నాయిత మయ్యెన్. ఉద్యో. 1-49

7. ధైర్యము.

తే. శంఖ భేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింతలే పృథుల సైన్య, పరిచయోదాత్తులగు నరపాలసుతుల, కెలమి బొందుము దీనికి నింతయేల. విరా. 4-175

8. క్షేమము, సౌఖ్యము.

ఉ. వనన వేఱ యొక్కఁడనె యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం, గానన దేశవాసములఁ గాఱియ కోర్చి యడంగియుండి మీ, వూనిక దీర్చి మీరెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా, నూన దయా సమృద్ధి నను నొందుట గాదె సురేంద్రనందనా. విరా. 5-346

9. సౌందర్యము.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు వివాహో, త్సవ మాధవ లక్ష్మికి లలి,తవనంబై యెలమికలిమి తావల మయ్యెన్. విరా. 5-188

10. తెవులులేమి. ఆరోగ్యము.

సీ. నైజంబులైన-తే-కుసుమధూపాది గంధముల్ గొనుట నెలమిఁ
దాల్చునని చెప్పు దరువుద్రేంబు ఘ్రాణ, మురిప్రీశక్తి యిట్లయి
దును నల్లసిలుట, వనఘ భూజంబు పంచభూతాత్మకంబు.
శాంతి. 4-88.

11. విలాసము. శోభ.

క. అని తలఁచి నీదుపలుకులు. విని మెచ్చితి వరముగోరు విహగోత్త
ము నీ, వనిన శుకంబు మహీజంబునకుం బేరెలమి వేఁడె భూష్ఠవరే
ణ్యా. అను. 1-157

ఆ అమర వల్లభుఁడు నమృతసేచనమున, భూజమునకుఁ దొంటిపొల్పు
కంటె, మిగుల నెలమిసేసె మేలియాశ్రితు లిట్ల; మనుతు రధిపుఁ
గురుకుమారవర్య. అను. 1-158

12 తోడ్పాటు. రక్షణము

(భీముని అర్జున సాత్యకులకు సహాయముగాఁ బంపుట.

తే పెక్కుచోటుల నెఱిఁగిన యుక్కులావు. గలుగు నీతనిఁ బనుచుట
కలకనేల, యితఁడు గలయ నయ్యిరువుర కెలమివచ్చుఁ, బనుతు
నేఁటు శోకంబు వాయలయు. ద్రోణ 4-131

శ్లో. ఇతో గతే భీమసేనే సాత్యకిం ప్రతి పాండవే,
సనాథౌ భవితారౌ హి యుధి సాత్వత ఫాల్గునౌ.
కామం త్వశోచనీయౌ తే రణే సాత్వత ఫాల్గునౌ,
రక్షితౌ వాసుదేవేన స్వయంచాస్త్రవిశారదౌ
సం. భా. ద్రోణ. 126-28, 24

ఎలయించు దే. స. క్రి.

1. కౌఁగిటఁ జేర్చు, కౌఁగిలించు

సీ. ఎలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు
నిక్కగాదె. విప్రా. 3-86

2. వశమగునట్లుచేయు, లోఁబఱచు.

ఉ. చయ్యన నేగి యంబుజవిశాల విలోచనఁ గాంచి ప్రీతిమై, నయ్యెడ

నేకతంబ హృదయం బలరం దగ బల్కి యొక్కమై, నియ్య
కొనంగఁజేసి యెలయించెద నిక్కకు దార్చి వేర్పనన్, శయ్యకుఁ
దెచ్చెదన్ కుసుమ సాయకు పూనికి నేడ తీర్చెదన్.
విరా. 2-245.

క. విను విషయ జ్ఞానమునకు, ననయంబును మనసు మూలమది కామ
క్రోధనిరూఢమగుచుఁ బురుషుని, ననిశము నెలయించు నింద్రి
యార్థంబులకున్. అర. 5-80

3. ఉన్ముఖమగునట్లు చేయు.

తే. ...ఇంతి, వింతభంగుల కెలయించి వెకలిఁజేసి, యభిమత క్రీడన
ములకు నలవరించు. విరా. 2-810

4. కలిగించు, సమకూర్చు.

క. మానుషము దైవమును సరి,నేనేనని కార్యసిద్ధి నెలయింపఁగ ని,
శ్యానందుఁ డయ్యె ధర్మజుఁ,డీ నిర్మల భాగ్యమహిమ యేరికిఁ
గలదే. ఆశ్వ 4-162

5. తీసికొనిపోవు.

వ. ఇట్లతిదూరంబుగా నెలయించి యలయించిన నది రాత్రుసమాయగా
నూహించి రాఘవుం డమోఘబాణంబు దొడిగి తడయక యమ్మృ
గంబు నేసిన. అర. 6-828

ఎలయు దే. అ. క్రి.

1. అర్హమగు, తగు, భాజనమగు.

తే.రాజభావంబు తొడుసున గ్రుచ్చుకొన్న, మనసుతో నుండ కెన్నఁడో,
మరచి యింద్రియముల నిర్జించి సత్త్వాదు లవుఁ ద్రోచి, యేను
శాంతిసుఖంబున కెలయు టనఘ. శాంతి 5-896

2. సిద్ధపడు.

తే. ...శోణిత ప్రసరణంబు, నిరతిశయమైన వెడనోలి నిలిచి గదలు.
వామకరమున నూఁదియు వారు మగుడఁ, బోరి కెలయుట నిర్భరా
ద్భుతము వేసె. శల్య. 2-262

3. ప్రవేశించు, ఆవేశించు.

సీ. విను తొల్లి ధర్మవర్తనము లసహ్యంబులైన దానవులు మహోగ్రవ
మునన్నరులయం దెలసిన నరవర వారలు దర్పరోషముల నధర్మ
వృత్తిఁ, దగిలినఁ గలఁగె వేదములు గ్రతువులు శాంతి. 5-486

4. వర్తించు, మెలఁగు.

క. విను సత్త్వరజస్తమముల, యనుసరణము వలన వివిధమగు
యోని గణంబున నెలసిన యాత్మ త్త్వము, దనుఁ దూడగ లేక
యవియ తానని యుండున్. శాంతి. 6-12

5. కలుగు, పుట్టు.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసి పొదలు మానసమున నెంతయు
బ్రోద్దేఁ, గలలోనఁ గన్న చందము, దలఁచుచు నుండితిని భక్తి
తాత్పర్యమునన్. విరా. 1-25

చ. ...హోయని కిన్నర యక్షసిద్ధ సాధ్యులు దివినుండి యార్పు
చును దూర్యరవంబు సెలంగ నద్భుతం, బెలయఁగఁ బుష్పవృష్టి
గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్. అర. 7-878

6. ప్రవణమగు, ఉన్ముఖమగు.

సీ. ఇంపారు లోఁకున ని గురోత్త చిత్తంబు, లెలసి యొండొరులపైఁ
బొలయు చూడ్కు, లాదట నుపకరణావళి వెడవెడ, యాదరిం
చుట రాగమడరఁ దొడరి. విరా. 2-238

వ. వాఁడు (ఘటోత్కచుఁడు) నాకు భక్తుండేనును (యుధిష్ఠిరుఁడు)
సహదేవు కంటెను వానికిఁ గూర్తునట్టి పట్టిలేకున్న నాకు శోకంబు
గాకుండునే యని తత్ప్రతివీరుని దెసకు నెలసిన యంతరంగంబు
రోషాక్రాంతంబగుటయు. ద్రోణ. 5-257

సీ. పోటులనొచ్చి మేనును దప్పి గూరి చిత్తంబును బోరికెలయ-తే-
కునికిఁ జేసియుఁ దొలఁగితి నొదిగి నేఁడ, దేర్చుకొని రణమునకు
నుదీర్ణ వృత్తి వచ్చువాఁడను. శల్య. 2-64: అను. 3-138

7. లోనగు, వశమగు

కి. లలిత వివిధ విహారంబులకు లతాంగి యెలసి పొలసిన యట్టైన

నెలమిఁగలసి, యతిమత క్రీడ సలుపంగ నప్పళించి, వెరకి రిత్త-
బయల్ గని విహ్వాలించు విరా 2-301

సీ. ఇంద్రియార్థంబుల కెలసిన పురుషుండు, గాఢ రాగంబునఁ గరఁగు-
చుండు. అర. 5-81

8. ఒలయు, వ్యాపించు, ప్రసరించు.

క. ఎలసి పయివారి దంత ఘటల మదముల రాహువెట్టుటయుఁ
గౌరవ సేనల యేనుంగుల మద ధారలు డొంకెం బోలయు మధ
కరము లుబ్బడఁగన్. భీష్మ. 1-141

వ. అని యిట్లు శరణాగత రక్షణ ఫలవిశేష ప్రకటనంబగు లుబ్ధ-
కపోతాఖ్యానంబు సెప్పిన విని యప్పితామహుని మీఁదం బ్రీతి
వినయ విస్తారవిలోకనం బెలయ నప్పాండవాగ్రజుండు.
శాంతి. 3-342

9. ఉండు.

చ. శలభము వహ్నిమీఁదఁ జను చందము గాదె నృపాలుఁ దర్జునుం,
దలపడఁబోక యాతని శితప్రదరంబుల బారి కగ్గమై, యెలసినఁ
గావఁగావశమె యాతని నీవును నేను నుండి మొక్కలమునఁ
బోవనీఁదగదు గ్రమ్మన పెద్దయాము నిల్పు మవ్విభున్,
ద్రోణ 5-119

సీ. మృతిఁబొంది వేగ జన్మించినఁ బూర్వ దైహికములన్నియు బుద్ధి-
నెలయు వాఁడు, జాతి స్మరుం డనఁ జను. అను 5-151

10. చేరు, ముసరు.

సీ. ఏనిక మదమున కెలయు తేఁటుల మొత్త మ లు వెలిగొడుగుల
చెలువుగొలుప. భీష్మ. 1-104

11. వెలకొను, నిల్చు.

శరతల్పగతుండ ధృతిఁడే, శర్ణంబుగ నాశ్రయించి సద్భావ వ్యాప్తి-
రతుండగుటను వినుత్కృగత నతనియందు నాదు భావం బెలసెన్.
శాంతి. 2-14

12. సక్తమగు.

తే ఇంద్రియములెల్ల నట్టివ యెలసి యొండు, వలన మనసున్న దమ తమ వర్తనముల, నిగుడనేరమి దెల్లంబు నృపవరేణ్య. యిట్టి లగు టజ్ఞులకు నైన నెఱుఁగవచ్చు. శాంతి. 6-85

13. పొందు

సీ. వినుము మూర్ఖునఁ జవిగొన దర్శన స్పర్శనము లాచరింప విననంగ నెలయ, నేమి సంకల్పంబు నెడఁజేర్వ నిష్టార్థములను ననిష్టార్థములను గోరఁ,టయును నొల్లక. అశ్వ. 2-64

సీ. నెలయేఱులందలి తెలినీటఁ దనువునొంపెలసిన గిరుల తెప్పలకుఁ జేర్చి. శాంతి. 3-382

14. చను, పోవు

సీ. (రాజులకు) వేటకు నెలయు టఘము, గాదు. అను. 5-66

ఎలరారు దే. అ. క్రి. (√ఎలరు + అరు)

1. అతిశయించు, అధికమగు.

క. ఇవ్విధమున నాయితమై, క్రొవ్వెలరారంగ నిలిచి కురుపాండ వులం,దెవ్వరు మును గడగిరి. భీష్మ. 1-232

2. ప్రకాశించు, ఒప్పు.

క. మునివర నాదగు చిత్తం,బునఁ గౌతూహలము సాల మొలతెంచె. తలి,న్నన నెలరారెడు నేర్పడ, వినిపింపుము మీఁది కథ సవిస్తార ముగన్. అను. 4-447

ఎలరు దే. వి.

1. అతిశయము, 2. ప్రకాశము. చూ. ఎలరారు, ఎలర్చు, ఎలర్పు.

ఎలర్చు దే. అ. క్రి.

1. అతిశయించు.

ఉ. ఇట్టి నన్న నీ, విమ్మెయిఁ దూలవుత్తె యని యాతఁడరోచుడఁ గెంపెలర్పఁగన్. ఉద్యో. 3-298

ఉ. ...పాండవ బాహా సంపదల్, పేర్చు నెలర్చు నింకఁ గురుబృం

దము లెల్లను దల్లడిల్లఁగన్. ద్రోణ. 1-42

చ. ... నీ భుజ, స్థిరత యేలర్ప నయ్యనిలదేవు బలంబును నీ బలంబు భా,సురముగ నూకఁ జూపుము విశుద్ధయశోనిధి మూరు తాత్మజా. సభా. 1-207

2. ఒప్పు

ఉ. కేసరి విక్రముండు కపికేతనుఁ డత్తతి నైరివీరసం,ప్రాసకర ప్రకారమగు దర్ప మెలర్పఁగ. విరా. 4-82

3. ప్రకాశించు, శోభించు.

తే. ...కపిధ్వజము ధవళ,హరులు శోభిల్ల నొగలపై హరి యెలర్ప. ఉద్యో. 2-144

4. సంతోషించు

క. గురుఁడును గృపుఁడును లోనగు, గురులను మోదింప బాహ్లికుండు మొదలుగాఁ, గురుజాతి యెలర్పఁగ నృన్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. ఉద్యో. 4-158

ఉ. మీయెడ చింత వాయఁగ సమీహిత బుద్ధియొనర్పఁ గోరియే, నీ యెడ కిప్డు వచ్చితి నభీష్టము వేఁడుము శంకదక్కి భూ,నాయక యొల్లభంగిని మనః ప్రియమందగ నిత్తునన్నఁ గాం,తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము పొందె నెంతయున్. ఆశ్ర. 2-82

5. ప్రేరేపించు, ప్రేరణముచేయు.

తే. కలసి శుక్ల శోణితములు కరుడుగట్టి, విను మమేధ్యమధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది, కాలవశత నప్పిండ మంగంబు లెల్లఁ, గలిగి శిశు వయి మారుగతి యెలర్ప.

క. వెడలునెడ గాఢపీడం బడి. స్త్రీ: 1-86; 87

**ఎలర్పు** దే. వి. (√ఎలర్చు) ఎలర్చుట

అతిశయము

ఉ. వచ్చిన సంభ్రమంబు గురువంపు టెలర్పున నుల్లసిల్లి. శాంతి. 6-574

**ఎలుఁగించు** (ఆనందవారి పాఠము)

**ఎలుఁగిచ్చు** (సం.ము అకా. పాఠము) (విరా. 4-268 లో)

**ఎలిఁగించు** (పాఠాంతరము) దే. స. క్రి. అ. క్రి.

1. బిగ్గరగాఁ బలుకు.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జనఁచ్చె రథంబు గోపసంఘము దిరమై,కొని పొండు పసులనోడక, యని తానెలుఁగించి వీటికై నూల్కొలిపెన్. విరా. 4-268

2. కేకపెట్టు, పిలుచు.

క. పనురము వ్రచ్చి నెత్తురు, దేనియ యిదె ద్రావెదం గదిసినను గడి మిన్ మానుప దిక్కుగలిగిన, నావి మ్మెలుఁగింపు మీమొనం గల వారిన్. కర్ణ. 3-212

3. ధ్వనించు, (పక్షులు) కూఁతకూయు.

సీ చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి, నెలుఁగించు గండుఁ గోయిలల సొంపు. ఆము. 1-181

**ఎలుంగిచ్చు: ఎలుఁగిచ్చు** దే. స. క్రి. అ. క్రి.

పిలుచు, సంబోధించు, కేకవెట్టు.

వ దుర్యోధన కృప దుశ్శాసనులు నశ్వత్థామ శకుని కృతవర్మలుం బై కొని యాధర్మనందను సైన్యంబు సమయింప నది విచ్చిన నెలుం గిచ్చి పోనీక నిలిపి భీమ నకులు సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవ సైనికులం గనుపుగొట్టం దొడం గిన. కర్ణ. 3-172

**ఎలుంగు1; ఎలుఁగు** దే. వి.

1. కంఠస్వరము.

సీ. కలకంఠములు చేతఁ గఱచిన విద్య పీఁణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు. వైరా 2-67

తే. అనిన నిది వోలునని యియ్యకొని యజాత, వైరి యల్లన నకులుని

వలను నూచి, నెమ్మనంబున నుమ్మలిక మ్మొగదుర, నెలుఁగు చందంబు వేఱుగా నిట్టులనియె. విరా. 1-91

2. పక్షుల అఱవు, పక్షికూఁత.

వ. చీఁకటి వాసినం బ్రభాతంబను వింత మానిసి మెలంగి ముసుంగు వుచ్చినట్లు మేలుకని యొఱకలు వాఁడల విదిర్చి కూర్చిఁకొని కల గొనం బలుకు పులుఁగుల యెలుంగులవలన నొండొంటిం దెలుపు కరణి నొప్పు ధరణీరుహంబులును. విరా. 2-240

3. ధ్వని.

ఉ. లిట్టులఁబోయి యక్కొలువు తేఁకువవారలలోని కింతిఁదా, నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందలపట్టి యీడ్వఁగా, నెట్టుసహించె మామ సతి యేమ్ప యెలుంగున కెట్టులోర్చెనీ, పట్టున నేమ మార యఁగ ఐంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్. ఉద్యో. 1-347

చ అని పలవించు నయ్యెలుఁగు లాపవమాన తనూజు డేర్పడన్, విని విరా. 8-22

ఎలుఁగు[2] దే. వి.

ఎలుఁగుబంటు, భల్లూకము.

క. అలయుచుఁ బులుఁగుల యెలుఁగుల, కులుకుచు మద్రాతపమున కోపక వృక్షంబుల నీడల నిలుచుచు నెలుఁగులఁ బులులం జూచి భయముగొని వగచుచున్. అర 2-84

ఎలుంగు చలించు; ఎలుఁగు చలించు దే. అ. క్రి.

ఎలుఁగురాల్పడు, డగ్గుత్తిక పడు.

ఉ. పంబిన కోపమున్ సమయ భంగభయంబును నగ్గలించి యుల్లంబు పెపంగొనంగఁ బతులం దగ సభ్యులఁ జూచుసూడ్కిరూక్షం బగు చూడ్కి నాద్రుపదుకన్నియ నూచి సభాజన ప్రతానంబును మత్స్యనాథుఁడు వినంగ నెలుంగుచలింప నిట్లనున్. విరా. 2-139

ఎలుంగు రాలుపడు; ఎలుంగు రాల్పడు దే. అ. క్రి.

డగ్గుత్తికపడు.

వ. అనుచు నెలుంగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్త చిత్తుండయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి.
ఉద్యో. 3-119

వ. వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి సవ్యసాచి యడుగులు దొట్రుపడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుం గొని యెలుంగు రాల్పడ నిట్లనియె.
ద్రోణ. 2-282

వ. కొండొకసేపునకు మూర్ఛదేఱి యన్నరపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె.
సౌప్తి. 2-12; అర. 4-336

ఎలుంగెత్తి దే. అ. క్రి. క్త్వార్థకము

బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

వ. సంశప్తక సమితితోడం దమకించి పోరిపోరి కౌరవ సైనికుల సింహనాదంబులు వింటి నప్పు డెలుంగెత్తియుయుత్సుం డాడిన మాటలు నాకర్ణించితి.
ద్రోణ. 1-253

తే. వలయు కొలఁది నెలుఁగెత్తి వర్ణసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామ సచ్చెనసియె,నని పదంపడి యల్లన యతని చెవికి, సోఁగ రాకుండఁ గుంజర మనియె నధిప.
ద్రోణ 5-16

ఎలుఁగెత్తిచెప్పు; ఎలుగెత్తి పల్కు దే. స. క్రి.

బిగ్గరగాఁ బలుకు, ఉచ్చైస్స్వరములోఁ బలుకు.

చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొనన్ పెనఁ బాఱ నాపగా, తనయుఁడు సేననాఁగి యివి దైత్యుల మాయలుగాని బొంకు బొం, కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మకపోయె నట్లువో,యిన జనదేంచెఁ గౌరవ మహీశుఁడు దీనత భీష్ము పాలికిన్.
భీష్మ. 3-135

ద. అని యెలుగెత్తి పల్కునలి నాడు మహోద్ధతిఁ ద్రుళ్లు
కర్ణ. 3-217

ఎలుగుఁగుత్తిక దే. వి.

డగ్గుత్తిక.

తే. .. ధర్మనందనుని యాననంబు వీక్షించి నిర్జరనాథ తనయుఁ,

డెలుఁగు గుత్తికఁ దగులంగ నిట్టులనియె. ద్రోణ. 2-252

**ఎలుఁగుపెంపు** దే. వి.

పెద్ద కంఠధ్వని

తే. వెనుక నరుగుచునున్న యవ్వేదమూర్తి,తోడ సిద్ధ చారణులు
దత్సుతుఁడు శైల,శృంగ విధ్వంసియైపోక సెప్ప నెలుఁగు, పెంపు
మిగుల శుకా యని పిలిచె నతఁడు. శాంతి. 6-388

**ఎలుఁగురియాడు** దే. అ. క్రి.

ఎలుఁగు చలించు, డగ్గుత్తిక పడు.

ఆ. అన్నరేంద్రు పాణి యల్లన తన కరా,బ్జమునఁ గీలుకొల్పి బహుళ
బాష్ప,కలిత వదనుఁడగుచు గళమున నెలుఁ గురి,యాడ వగచి
యమ్మురాంతకుండు. కల్యా. 2-361

**ఎలుఁగు (ఎలుంగు) నూలుకొనంజేయు**

చలించు కంఠస్వరమును పదిలము చేయు.

వ. తత్ప్రదేశంబువనున్న కనక కలశ జలంబుల ముఖ ప్రక్షాళనంబు
సేసి యెలుంగు నూలుకొనం జేసి యిట్లనియె. కల్యా. 2-362

**ఎలుఁగులిచ్చు** దే. స. క్రి.

పిలుచు.

ఆ. తెచ్చియచ్చు బలియుఁ దెచ్చియీఁగ, నొల్ల కెలుఁగు లిచ్చుచున్న
వాఁ డమ్మను,ఖాధముండు మెచ్చఁడయ్యె ననుచు.
ఆది. 6-290 (చూ. 289)

**ఎలుఁగువడఁకు** దే. అ. క్రి.

కంఠస్వరము చలించు, డగ్గుత్తికపడు.

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని, యెలుఁగు వడఁక
నాతఁ డిట్టులనియెఁ, బసుల దయ్యమెలుఁగుఁ బడతుల సంతోష,
మేల నాకు ననికిఁ బాల నేను. విరా. 4-59

**ఎలుఁగునూపు** దే. అ. క్రి.

1. గట్టిగా అఱచు, పెద్దకేక వేయు.

తే. వచ్చి దుర్యోధనుఁడు చేపీచి యెలుఁగు, సూపి పురికొల్ప నెంతయు
నేపు మిగిలి, మన బలంబులు పాండుకుమార సైన్య, సమితితోఁ
దాఁకె నత్యంత సంకులముగ. భీష్మ. 2-28

2. కంఠధ్వని వినిపించు.

ఆ. ఎచ్చట నున్నవాఁడవే మైత్రి ప్రాణానఁ, గలవె యేను నిన్నుఁ
గానకులికిఁ, దలఁకుచున్నవాఁడ ధైర్యధౌరేయ నీ, యెలుఁగు
సూపవే సురేంద్రతనయ. ద్రోణ. 1-262

3. పలుకు, మాటాడు.

ఆ. వచ్చి పర్ణశాల వాకిట నిల్చి య, త్తన్విఁ బిల్చె నతిథి దాని నల్లఁ
నూరకుండు మనియె నువిదయు భూసుర,శాపభీతి నెలుఁగు సూప
కుండె. అను. 1-75

ఎలుఁగెత్తు దే. అ. క్రి.

చూ. ఎలుంగెత్తి, ఎలుఁగెత్తి చెప్పు, ఎలుఁగెత్తి పలుకు.

ఎలుక; ఎల్క దే. వి.

మూషికము.

సీ. అడవిలో నొకమఱ్ఱి యడుగున లాఁగలఁ బవితుండునా నొక్క
యెలుక యుండు. శాంతి. 3-203

క. నరనాయక శిశ్నోదర, పరాయణుండగుచు నొండు పరికింపని
దు,ర్నరుఁ డెలుకఁ బిల్లి వొదిలిన, పరుసున జరవొదువ ముక్తి బడ
యక పొలియున్. శాంతి 5-514

చ. అనుటయు నెల్క యిట్టులను. శాంతి. 3-218

ఎలువు దే. వి. ఎలుఁగు[2]

ఎలుఁగుబంటు, భల్లూకము.

సీ. ...పిశాచముల్ పూనుతేరు, లెక్కి కప్పారెడు నెలువు చర్మపుఁ
గత్తళములతో ఖరనిస్వనముల నెలఁగ -తే- నసురవల్లభులగు
వలంబున ఘటోత్క,చులు సముద్ధతిఁ దొడరి. ద్రోణ 1-163

ఆ శతసహస్ర కోటి సంఖ్యల యెలుఁగులు, గొలువ నలదనీల ఘోర
మూర్తి, జాంబవంతుఁ డతులసత్త్వుఁడై చనుదెంచె. అర. 7-39

ఎల్ల[1] దే. వి.

హద్దు, సీమ, పొలిమేర, అవధి.

క. విను విప్రులు పేరలుగుట, మనుజేంద్రుని బుద్ధిలేమి మాతాపితృ
భావన నతఁడు వారిఁ బ్రోచిన, గను మేలున కెల్లగలదె కౌరవ
నాథా. శాంతి 3-438

ఎల్ల[2] అవ్య. ద్రు.

సర్వశబ్దార్థకము (వృత్తియందు ద్రుతము లోపించును. ఎల్లది, ఎల్లరు, ఎల్ల
యందు, ఎల్లవలన"—అని విభక్తితోఁ గూడిన ప్రయోగములునుగలవు)

1. అంతయు, సమస్తము:

సీ. తెల్లంబుగాదె మీ కెల్లసుయోధను, చేసిన కుటిల విచేష్టితంబు.
విరా. 1-47

2. అన్ని.

వ. మన యగ్నిహోత్రంబులనెల్ల ధౌమ్యులు రక్షించువారు.
విరా. 1-115

క. నీ వడిగిన పని యేర్పడఁగా విను మే నొక్కనెలఁ దెగంజేయుదు
నానావిధ దివ్యాస్త్రంబుల, లావున నప్పాండవుల బలంబుల
నెల్లన్. ఉద్యో. 4-411

మత్తకోకిల...ఈతని (వికర్ణుని) బుద్ధి మీ, రేవగింపక చేకొనుం డిది
యెల్లయందును ధర్మసద్భావమొక్కని నేర్పరింపఁగ బ్రహ్మకై
నను బోలునే సభా. 2-286

[అన్ని- అన్నితావుల—(స్థలవాచకము)]

3. అందఱు.

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల, నేడగడయుంగాన హితము
సెప్పఁ, దగు జలాధినాథుఁడుగఁ జేయ నర్హుని, నెల్ల వినఁగ నిశ్చ
యింపవలయు. శల్య. 1-77; అను 2-282; భీష్మ. 2-322

దడిల, కెల్ల మూఱట యగుచు వర్తిల్ల నేర్తు విరా. 1-86

(ఎల్లన్—అందఱు)

4. ప్రతి, ఒక్కొక్క.

చ. ఒకరుని చేతి ప్రోవును దరున్నతి ప్రాపును గాంచి యెల్లవెం,ట
కును గొఅంత లేక పొగడందగు సంపదనొంది. ఉద్యో. 2-77

ఎల్లది; ఎల్లయది సర్వ. (ఎల్లన్ + అది)

సమస్తము.

క. సతికిం బతిపనువు పేయఁ జను నెల్లదియు. అను. 1-68

తే ఎల్లయందును దావసియించు నెల్ల, యదియుఁ దనయందు పసి
యించుటం డ్రు వాసు, దేవుఁడను పేరి కర్థంబు. ఉద్యో. 2-326

ఎల్లనాఁడు వి.

ప్రతిదినము.

తే. ...ఇట్టులు షోడశంబు నాఁక నెల్లనాఁడును ఋతుసక్తి యెడల
కుండ, నెట్టి కార్యము గల్గిన ఋతుమతీస, మాగమము దప్పని
కున్న వాయువెక్కు. అను. 4-26

ఎల్లప్పుడు వి. ఔ. (ఎల్లన్ + అప్పుడు)

సర్వకాలము.

క చుట్టము పగతును భేదం, బెట్టిబనులవలనఁ దగుల దెల్లప్పుడు
నె,ప్పట్టున సద్దానను మదిఁ, బుట్టదు సంతోషహాని బుద్ధాత్మున
కున్. శాంతి. 5-26; ఆశ్ర. 1-74

ఎల్లప్రొద్దు

ఎల్లప్పుడు

ఉత్సాహవృత్తము- ధరణినాథ వినుము మధువు ధారలెల్ల ప్రొద్దునుం,
దొరఁగుచుండ నతఁడు దాని దోహలమున నానుచున్.
స్త్రీ. 1-48

ఎల్లభంగులు

అన్నివిధములు. సర్వథా.

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలక నందనుండు జయలక్ష్మిం
జే,కొనునట్టు చీరలు దెచ్చుట పనియే యటుసూడుఁ డెల్లభంగులఁ
దెత్తున్. విరా, 4-48

ఎల్లయందు క్రియా.

సమస్తమునందు, ప్రతి వస్తువునందు.

తే. ఎల్లయందును దావసియించు నెల్ల, యది యుఁ దనయందు వసియిం-
చుటం ద్రు వాసుదేవుఁడను పేరి కర్థంబు. ఉద్యో. 2-326

ఎల్లయెడ క్రియా.

అన్ని తావుల, ప్రతిచోట.

క. మఱిమఱి చీకటియప్పుడు, నఱిముఱి భటులుడుగ కదరి యని-
సేయంగా, నెఱసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱిపాసి నిలిచి-
రింతను నంతన్. విరా. 3-95

ఎల్లవలన

క. నీ పనుపు ననే బ్రదికెద, నేపునహం కృతియు విడిచి యెల్లవలన మే-
లాపాదించుచు విప్రుల, శ్రీపాదము లాశ్రయించి చెందెద శాంతిన్. అను. 5-354

ఎల్లవాఁడు సర్వ.

సీ. వెరవిట్టి తెఱఁగిది వెంగలితనమని యెల్లవాఁడును దన యెఱిఁగి-
నట్టి. తెఱఁగున నిజకార్యదృష్టియ కయికొను, నొరుల నేర్పులు
పట్ల నొల్లఁడు, సౌప్తి. 1-45

ఎల్లవారు; ఎల్లవారలు సర్వ. బహు.

అందఱు.

చ. వడిగొని గోగణంబుఁ బోదువం బరతెంచితి రెల్లవారు.
విరా. 4-200; కల్యా. 2-11

క. ఆలోనన భోజపతిన్, వాలమ్మునఁ బొదివి రెల్లవారలు దానం,
దూలక తఁడు బలువిలుగొని, క్రాలుచు నాళీముఖ్యు రథికుల
నొంచెన్. ద్రోణ 4-29; కల్యా 2-141

ఎల్లవి వి. బహు.

సమస్తము.

తే. ...నే.దెట్టఁడసైతి వెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా.
భీష్మ.1-46; అను. 4-241

**ఎల్లి**[1] దే. వి.

ఛత్రము, గొడుగు.

ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణి తేరు సితాశ్వయుక్తమై, తెల్లనియెల్లి నొప్పినది. కల్య. 1-138

క. ...మణిమయంపు టెల్లులు మెఱయం, గా నీ వేతెంతువు. శాంతి 4-339

**ఎల్లి**[2] వి. ఏ. బొ. అవ్య.

1. నేఁటికి మఱుసటి దినము, రేపు.

తే. ఎల్లియెల్లి విధంబుల నెందుఁ జొచ్చె, నేని నా ధర్మతనయుండు తాన వచ్చి, యడ్డపడెనేని నీవ పెంపారు కరుణఁ, గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు. విరా. 2-282

వ. నీ నక్షత్రంబు రోహిణిగదా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలంబులు గలవు. గమనంబునకు రేపకడయ మేలు. ఉద్యో. 8-180; అర. 2-168

2. సమీపములో జరుగనున్న దానిని సూచించుటకు ప్రయుక్త మగును.

క. మొనతలఁబడియెదు నీఁచెప్పిన యట్టుల తడవులేదు విరుదులరై నీవును వీరు నిలువుఁడిదె భండన మెల్లియ వచ్చె మాటలు గనుఁ డింకన్. ఉద్యో. 8-865

**ఎల్లిదము** దే. విశే. ఏలిదము

1. లఘువు. తేలికయైనది. చులకనయైనది. గౌరవములేనిది.

చ ...అన్నదమ్ములును బొందిననేరి కసాధ్యులట్లుగా, కెరవయి నిల్చి నం గెలని కెల్లిదమై పటివోదు రెంతయున్. ఉద్యో. 2-88

ఉ. భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో, నేమిట నొక్కొ వారు గడునెల్లిదమై రిటు నీకు నిచ్చటన్. అర. 5-16; అశ్వ. 1-81; ఆది. 6-282

2. అగౌరవ పఱుచునది. అవమానకరము.

తే. వేడఁ దొడివూసి కట్టి యవ్విరటుఁ డుత్తరుండు దోఁజనుధేరఁ గొల్వుండు బుద్ధినచటి కేతెంచి కని విస్మయంబు వొంది, యెల్లి

దంబుగఁ దలఁచుచు నిట్టులనియె. విరా. 5-317

వి.

8. పరిహాసము.

క. మృదుభాషణముల దుర్జన, హృదయము ప్రసన్నతా మహిమఁ బొందునె యెల్లిదముగఁ గాని యంతంతకు, మదమెక్కం గాక దురభిమానము పేర్మిన్. ఉద్యో. 2-34

**ఎల్లినేఁడు** దే. వి. ఔ. అసా.

రేపు, ఈదినము.

ఆ. ఎల్లి నేఁటిలోన నెఱుఁగఁ బడరె. విరా. 3-98

తే. నరుఁడువచ్చు, నిందు మీ పంపునేఁతకై యెల్లినేఁడు. మౌస. 69

**ఎల్లుండి** దే. వి. ఔ. అసా.

రేపటి తావలి దినము.

వ. ...దమయంతీ స్వయంవరం బెల్లియో యెల్లుండియో యయ్యెడు. అర. 2-168

**ఎల్లెడ; ఎల్లెడలు** దే. వి. (ఎల్ల + ఎడ)

అంతట, అన్ని తావులు.

సీ. దమమును సత్యంబు క్షమయును నెల్లెడ వినుతింపబడు. శాంతి. 5-540

చ. ...అంతనం,త నడరి చింతు మెల్లెడలు దారుణ విక్రమణ క్రమంబునన్. ద్రోణ. 2-8

తే. ...గురుని, ప్రతిన యెల్లెడఁ జాటించె రాజరాజు. ద్రోణ 1-114

క. అనుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. ఉద్యో. 1-180

**ఎవఁడు** దే. సర్వ.

కిమర్థకము (ప్రశ్నమును దెల్పును)

సీ. ఆరాము, డెవనితోఁ బోరాడి యిరువది, మూఁడు దినములకు వాఁడి దఱిఁగె. శాంతి 2-12

(ఆక్ శి. ప. ప్ర.కో—ఆనందభారి పాఠాంతరము సం.ములో ఈ పాఠాంతరము లేదు)

**ఎవరు** దే. సర్వ. బహు. (√ఎవఁడు)

కిమర్థకము. (ప్రశ్నమును దెలుపును.)

క. ఆ యిరువుర నోర్వ నెవరికైనను వశమే కర్ణ. 1-41

వ. ఇది యెవరి ఘోషంబని గోపాలకుల నడిగిన వార లిట్లనిరి. అర. 3-118

**ఎవ్వఁడు** దే. సర్వ. (ఏ+వాఁడు) ఎవ్వాఁడు. (బహు) ఎవ్వరు (మహతీ వాచకముఁగూడ నగును)

1. యచ్ఛబ్దార్థకము.

క. మనలోన నెవ్వఁడెమ్మెయి, పనివెంటను విరటు మనము వడ యుద మది యెల్లను నేర్పరించి యందఱుఁ, దనతన మది నున్న తెఱఁగు తథ్యము చెపుఁడా. విరా. 1-65

వ. ఎవ్వనియేని వీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టి యుపరిచరుం డను రాజర్షి. ఆది. 4-188

2 తచ్ఛబ్దార్థము నపేక్షించును. సంబంధ సర్వనామము.

క నాయనుచరులం దెవ్వఁడు, మీ యెడ భయభక్తిలేక మిగిలి మెలఁగె నే, నా యధముని దండితుఁగాఁ, జేయుదు నతఁడెంతయుం బ్రసిద్ధు డయినన్. విరా. 1-102

ఆ. ఏనుగట్టువాలు దాన నాకెవ్వరు, గడుపు కూడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకఁ బనులు సేసి మెలఁగు బుద్ధి. విరా. 1-298

3. కిమర్థకము: (ప్రశ్నముఁను దెలుపును)

వ. మఱియు దుశ్శాసనుండు వీరులందఱును గొడ్డువోయిన వారలు పౌరుషంబుగల మానిసి యింకెవ్వం డనియె. ఉద్యో. 1-352

క. ...కురుపాండవులం, దెవ్వరు మును గడఁగిరి. భీష్మ 1-282

వ. అనుచు మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణి స్పర్శనంబున మేలుకని యిది యెవ్వరనవుడు. విరా. 2-167; శాంతి. 5-7

(ఎవ్వరు-ఎవ్వత-అని మహాశీవాచకైక వచనమునఁ బ్రయోగము)

క. ఇదియొక చాపము విస్మయ, మొదవించుచుఁ గొండ చిలువ యొకో వాఁ దగియున్నది ఖచిత కనకకమలం స,ముదయద్యుతి సముపగూఢా నోజ్జ్వల మగుచున్

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతురని. విరా. 4-118,119

(ఎవరు = ఎవ్వఁడు-గౌరవార్థక బహువచనము)

వ. వా రెవ్వరంటేని. ద్రోణ. 8-217

4. ఎంతటివాఁడు, ఏ పాటివాఁడు-ఎట్టివాఁడు

క. మమ్మెఱుఁగు దెరిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుగుదు వా.క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు, పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. ఉద్యో. 8—34

క. క్షమియింప నెవ్వరము ధూఁరనుఁగుని కార్యమున కెవ్వరము ద్రోణుల చి,త్తము శాంతి వొందఁజేయుట, మముఁ దెలుచుట యిట్టులేల మాకొలఁదులకున్. విరా. 4-227

ఉ. ...ఎవ్వరున్. ధర్మజు పాటిగారు. విరా. 1-61

(ఎవ్వరు = ఎంతటి గొప్పవారైనను)

5. ఎల్లవాఁడు (ఈయర్థమున బహువచనముననే ప్రయుక్తము)

వ. తపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైనవాని నుపయాజు నుపాసించి ఆది. 7-8

వ. సురపతి గురుడైన బృహస్పతి చేసిన నీతిశాస్త్ర రహస్యంబులం దెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుండు. సభా. 2-125

వ. ఆయుధీయ సురక్షితంబయిన రాజగృహం బెట్టు సొరనగునని శంకింపవలవదు దమయంతీ నివేశంబు ప్రవేశించు నపుడు నిన్నె వ్వరు వారింప నోడుదురు ఆర. 2-88 (ఎవ్వరు = అందఱు)

ఎవ్వత - ఎవతె, ఎవ్వతె

(శిఖండి భీష్మునితో)

క. ఏయు మొకనేరుమై ని,శ్లేయక క్రీడించి యరుగు మెట్లయినను

మ, త్సాయకముల నినుఁ గూల్చెదఁ, జూ యెవ్వతనై తినేమి సూచెదు నన్నున్. భీష్మ. 3-324

వ. ఇవ్వనిత యెవ్వత. శాంతి. 4-400; స్త్రీ. 2-81; అర. 7-348

ఎవ్వరివాఁడు

ఎవ్వరికి సంబంధించిన వాఁడు, ఎక్కడనుండువాఁడు.

వ. అమ్మహీపతి నీ వెవ్వరివాఁడవని యడిగెనేని పాండవాగ్రజునకు ప్రాణసంబు సేయుదు ననంగలవాడ. విరా. 1-84

ఎవ్వాఁడు సర్వ. (ఏ+వాఁడు) (బహు) ఎవ్వారు, ఎవ్వారలు ఎవ్వఁడు.

1. యచ్ఛబ్దార్థకము.

తే. అనుడు నతఁడిట్టు లనియె నాయతుల బాహు, బలముఁ జెనయంగ భవదీయ పతులు కారు, మూఁడు లోకంబులందు నెవ్వాఁడు లేఁడు. విరా. 2-56

తే. వైష్ణవియుఁ గల్మష ప్రజ ధ్వంసినియును, నైన యీాయను స్మృతి ప్రాజ్ఞుఁడైన నెవ్వాఁడు పరియించు యజ్ఞదాన, సమయ ముల వాఁడు తత్ఫలశతము పడయు. శాంతి. 4-250

ఉ. సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ, బారముఁ బొంగలేక చెడఁబాటినదైన యవస్థ దఱులె, వ్వార లు పేక్షసేసి రది వారల చేటగుఁ గాని ధర్మని, స్తారకమయ్యు సత్యశుభ దాయక మయ్యును దైవముండినన్. ఉద్యో. 3-278

2. కిమర్థకము.

తే. కౌరవులలోన నిప్పుడెవ్వారితోడ, ననికిఁ గడఁగుదునో చూచి కొనఁగ వలయు. భీష్మ. 1-179

ఎవ్వి[1] ఏది బహువచన రూపము.

చూ. ఏది.

ఎసఁగు దే. అ. క్రి.

1. అతిశయించు, ఒప్పు.

సీ. తన్వంగి మవ్వాపుఁ దనులత నెసఁగెడు, నునుఁగాంతి వెల్లువ మునుఁగఁ బాఱఁ. విరా. 2-37

క. భూతాత్మక మైన యఖిల, ధాతు చయము వెలిగలేదు తను వా మొత్తం, బాతత జీవవ్యాప్తి న, మేత ముగాకున్నఁ జేష్ట నెసఁగదు వత్సా. శాంతి 6-388

క. వసునిభుండు పైతృకంబగు, వసుధా రాజ్యంబు భీష్మువచనమున గత, వ్యసనుఁడయి తాల్చెఁ దేజం, బెసగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుండై. ఆది. 4-196

2. కలుగు.

క. ఊరక యుండక పలువుర, తో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరుప్రమదిం, జేరువగల నాగరికులుఁ, దారు గలసి పలికవలయు ధరణీశుకడన్. విరా. 1-127

సీ. ధర్మాభిసంరక్షితంబైన భూప్రజ కెంతయు నభివృద్ధి యొసఁగుచుండె. ఆది. 5-8

3. జనించు, పుట్టు.

సీ. ప్రళయ కాలంబున జలముల విష్ణుండు యోగనిద్రారతి నొంది మేలు, కాంచి లోకంబులు గావింపఁదలఁప నహంకార మెసఁగెఁ బ్రహ్మాభిధాన, కలితమైత న్నాభికమలంబునం దిట్లు జనియించి యాబ్రహ్మ. శాంతి. 6-479

తే. ఒదవు వృత్రు రక్తమున బుద్బుదము లెసఁగి, పుట్టకొక్కులై యవి అనభోజ్యభావ, మొంది విప్రాదిక ద్విజయోగ్యతాలి, పన్నములుగావు ధర్మ సంపన్న చరిత. శాంతి. 5-488; ఆది. 3-51

4. క్రమ్ముకొను, వ్యాపించు.

క. దగ్ధములైనట్టులు స, మ్యగ్ధైర్యము లెడలె మండె నాయుధ చయముల్, దిగ్ధూమం బెసఁగె నసం, దిగ్ధము మనకాజియగుట దీనితెఁ దగఁగన్. విరా. 4-88

5. సంతోషించు, ప్రీతిచెందు.

క. ఇమ్ముగ సరస్వతీ తీరమ్మున నం డ్రెండు వత్సరమ్ములు విధి

మార్గమ్మున సద్గుణ సముదాయ మ్మెసఁగఁగఁ జేసె సత్త్రి
యాగము నిష్ఠన్. ఆది. 4-8

(ఎసఁగఁగ-అని న. ప్ర-కోశము-ఇది పాఠాంతరముగ సం. ము మొ-
వానిలోఁ గానరాదు.

**ఎసకము** దే. వి.

1. విజృంభణము.

క. ఆ పన్నిద్దఱు సైన్యా, టోపసమేతముగఁ గవియుడును బాంచాల, క్ష్మాపాల సుతుఁడు భీముఁడు, నేపారిరి నీదుసేవ యెసకం బడఁగన్. భీష్మ. 2-378

2. అతిశయము, పెంపు.

తే. ...ఎంతయు వంతఁబొందుఁ, జింత యెసకంబు వడిగొని చిక్కువఱుప. విరా. 2-292; శాంతి. 1-56

3. అవలీల, అనాయాసము.

ఉ. కావలి వారిఁ దోలి యెసకంబున గోవులఁ బట్టికొంటినం,...వెడమాటలేల ధరణీశ్వర. విరా. 4-192

4. విక్రమము.

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁడై యేఱు వాఱ తెంచు నెసక మెసఁగ, నప్రమేయ శరము లడరించె నవి సత్వరముగ నేను ప్రతిహతములు చేసి ఉద్యో. 4-324

5. ఒప్పు.

క. ఈదేశము ప్రజ ధర్మజు, నాదరసంభావనముల నాజ్ఞానిరతిన్, యాదవ వీరుల కలనాఁ, డేది తెఱంగట్టి మనికి యెసకం బారున్ మౌస. 184

విణ.

1. అధికము, హెచ్చైనది.

క. స్వాతిగతుండగు శుక్రుం, డే తెఱఁగునఁ బరఁగఁజేయు నెసకపు వర్షం, బా తెఱఁగున సాయక వర్షాతిశయం బావహించె నతఁడు

నరేంద్రా. కర్ణ. 3-42

2. ప్రియము.

ఉ. అంధక వృష్ణి భోజ కుకురాన్వయ భూవరులెల్ల నీదెసన్, బాంధవ సౌహృద ప్రణయభక్తి విశేషము లొప్ప నీ మనో,గ్రంథియడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు. అర. 4-160

ఎసకమెసఁగు దే. అ. క్రి. ఎసఁగు (ఎసకము + ఎసఁగు)

1. అతిశయించు.

తే. ఇతఁడు పుట్టిన కొలెను నెసక మెసఁగు, దర్పమునన వర్తిల్లు. విరా. 1-74

తే. తాను జొచ్చిన కతన మత్స్యక్షితిశు, నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్లనల్ల, బాండురాజ తనూభవ పత్నియరిగె. విరా. 1-308

2. అభివృద్ధినొందు, వర్ధిల్లు.

క. పలువురు క్రీడింతురు భూ,వలయాధిప యరయ మంచివారును గలరఁ,కుక్కల ధర్మవతుల కతమున, నిల నిరపాయత్వ మొంది యొసకం బెసఁగున్. అను. 2-218

3. కలుగు.

తే. తాను జొచ్చిన కతన మత్స్యక్షితీశు, నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ, బాండు రాజ తనూభవ పత్నియరిగె. విరా. 1-308

తే. విప్రుఁడేమిట దేవత్వవిభవ మొందు, నేమి కతమున సాధుత్వ మెసఁక మెసఁగు, నతఁడికెద్ది యసాధుత్వ మావహించు, మానుషుం డగు నెద్దాన మహితమూర్తి. శాంతి. 5-566

4. పరమెద్దు, అత్యుచ్ఛదశ పొందు.

క. ఒరవెదు తృపవెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె వాసితరాజ న్మదిరారసమానఁగ వా,హృదయంబున వేడ్క యొసక మెసఁగెడుఁ దరుణీ. విరా. 2-88

తే. సహజమైన యలంకారమహిమ నతిశ,యిల్లి మహనీయ వైభవ
మెసక మెసఁగ, వఱలు నరపతి మందిర ద్వారభూమి, సేర నరిగి
యా వేగులవారు ప్రీతి. విరా. 8-74

5. ముఖ్యమగు, ప్రధానమగు.

తే. సారమతిఁ బరికింపఁగఁ బౌరుషంబు, కంటె దైవంబు ముఖ్యంబు
గార్యసిద్ధి, కెచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె, నేని యది
దైవ దత్తంబ యంత నిజము. శాంతి 4-41

6. పొందు పడయు.

క. పరమజ్ఞానుల యొద్దను, బరఁగిన నజ్ఞుఁడును బోధ భరితుఁడగు నిరం,
తర మేరుసమీపస్థితి, హిరణ్యరుచిఁ గాక మెసక మెసఁగిన పగిదిన్
అను. 8-325

శ్లో. సత్సంనికర్షే పరివర్తితవ్యం విద్యాధికాశ్చాపి నిషేవితవ్యాః,
సువర్ణతాంగచ్ఛతి సన్నికర్షాన్నిలఃఖగో మేరు మివాశ్రయన్వై
సం భా. అను. 152-30 (నిర్ణయ)

ఎసకొల్పు దే. స. క్రి.

పురికొల్పు, ప్రేరేపించు, ప్రోత్సహించు.

చ. కుల విశిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీష్ముని నెసకొల్పి సేనలకు
ముఖ్యుఁడ వీవని యుబ్బఁజేసి యీ,సునఁ దలపెట్టి చంపికొనఁ
జూచె సుయోధనుఁ డింతయే మగున్. ఉద్యో. 4-207

సీ. నీకుఁ బ్రెగ్గడయునై వెయ్యంపుఁ జెలియునై, కయ్యంబునకు
నెప్పుఁగాలు ద్రవ్వఁ, బాండు పుత్రులతోడి పగకు నిన్నెసకొల్పుఁ,
గొలువున రజ్జులు పలుకునట్టి, రాధాసుతుం డర్ధరథుఁడు.
ఉద్యో. 4-234

శ్లో. ఉత్సాహయతి రాజం స్త్వాం విగ్రహే పాండవైస్సహ.
సం. భా. ఉద్యో. 167-3

**ఎసరు** దే. వి. బొ.

వంటకై కాఁగఁ బెట్టిననీరు, పచనయోగ్య జలము.

సీ. కాఁగిన యెసరుల కరణిఁ బొరిపొరి శరనిధు లుప్పొంగి పొరలఁ

బడియె. ఉద్యో. 4-116

**ఎసలారు** దే. అ. క్రి. (ఎసలు+ఆరు)

ఒప్పు, అతిశయించు.

ఉ. ...నా వయిం, గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ.

భీష్మ. 3-321

ఉ. ...ఆ భుజగేశ్వరు వత్నియాతనిం, దెచ్చెరఁ దానెదుర్కొని విశిష్ట సమాదరయై యుపాయనం, బిచ్చి తదీయ చిత్తమున కింపెసలారఁగఁ బాద్య మిచ్చినన్. శాంతి. 6-574

క. అర్యా కర్మంబుల దెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమనిరూఢుం, డియ్యన యన సుకృతంబుల, నయ్యెడు సౌఖ్యంబు నివహమునందుఁ బరమునన్.

అను. 3-306; విరా. 2-85; స్వర్గ. 51

# ఏ

ఏ¹ అవ్య.

1. అవధారణార్థకము.

క. వావలని రాగముననే నీ విస్తైతి. శాంతి 6-184

మ. ... వీ, తెరువై నం దన యిచ్చతోఁ బడియె నింతేగాక రేఁబూటయే. ఉద్యో. 3-358

చ. పనిచెద వజ్రముఁ న్ జముని పాలికి నన్నరనాథువేగమే, యనుచుట కింత యొల్లిదమె యాతనికిన్ మన యాజ్ఞ యారయన్.

అశ్వ. 1-81

2. నిర్దేశము (చూపుటను) బలపఱచును.

క. నాచేత బలుపుగని నీ,యాచార్యుం డోడి తొలఁగి యరిగెను నీవే, ద్రోచి యెట వోవువాఁడవు. ద్రోణ 4-9

ఏ[2] అవ్య.

1. ప్రశ్నార్థకము (ఇది సందర్భానుసారముగా ఆశ్చర్య ప్రశంసాదులను గూడఁ దెల్పును)

శా. ఈ దుర్యోధనుఁ డింత గర్వియగునే యీ యున్నవారెల్ల నా,చే సైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపంఢ, ఉద్యో. 3-378

(ఇట ఆశ్చర్యమును దెలుపును)

వ. నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు వలికిన వచనంబు లంత యొప్పు నేయని యగ్గించిన. ఉద్యో. 2-117; సభా. 1-7

(ఇట ప్రశంసను దెలుపును)

తే వారు కందమూలంబు లాహారంబులుగఁ, బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము,ల అవ మేల్కనుచుండిరే యక్కటకట.

(ఇట దుఃఖమును దెలుపును) ఉద్యో. 3-188

ఏ[3] సర్వ.

1. యచ్ఛబ్దార్థకము (ఇది తచ్ఛబ్దార్థము నపేక్షించును)

క. ...అచ్యుతుఁడే దిక్కునందు నెమ్మినా దిక్కునకు జయము గల్గునని యకుంఠిత కరుణన్. శల్య. 2-341

క ఏ నరుఁడు మానసము ధృతినూన నుచిత వృత్తినుండు నుదిలగొనక యెం,దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభములేదు వసుధాధీశా. శాంతి. 3-161; ద్రోణ. 2-161

2. కిమర్థకము (ప్రశ్నార్థకము)

మ. ఏ జనులు నిత్యాయుష్యులే చెప్పుమా. శాంతి. 1-225

వ. ఈ ప్రబంధమండలి కథినాథునిగా నే పురుషునిఁ బేర్కొను వాఁడనో. విరా. 1-8

ఏ[4] సర్వ. అవ్య.

ఏమియొక్క లుప్తశేషము.

సీ. ఏ కారణమున నేనుఱ్ఱ్యేనో. శాంతి 3-310

(ఏ కారణము = ఏమి కారణము)

క. ఏ పాపమేని లేనిది, కాపురుషత నొకనిమీద గలిగించిన
(ఏపాపము = ఏమి పాపము) శాంతి. 3-489.

క. విను పాణిగ్రహణము సేయని వనితకుఁ బుణ్యలోక మప్రాప్య
ము గావున నేయుపాయమున నైన నను దగియెడు వరు వరింపు
నలినదళాక్షీ. శల్య. 2-210; విరా. 3-51

ఏ. అన్ని అను నర్థమునిచ్చును.

చ. ...ఏ పనులు నుదాత్త నాగరికభంగుల నీమది కెక్కునట్లు
నేర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁ జేసెద
(ఏ పనియైనను సరియే) విరా. 1-328

వ. (భీష్ముఁడు) ఏదిక్కు సూచినం దానయై రథికులను హాస్తికులను
నాశ్వికులను దునిమిన. భీష్మ. 3-248

2. ప్రార్థనార్థకములగు మధ్యమ 'ము', 'డు'లకు అనుప్రయుక్తమగును.

వ. అమ్మహాత్ము మొగంబు సూచి నాకు ధర్మంబు లుపదేశింపవే యని
యడుగ నేర్తునే. శాంతి. 1-341
(ఉపదేశింపవే-ఉపదేశింపుము అని ప్రార్థనము)

3 క్రియలపైఁ జేరి 'అవును', 'కాదు' అనునర్థముల నిచ్చును.

వ. అడుగ నేర్తునే (అడుగనేరను-అని యర్థము) శాంతి. 1-341

చ. అనఘ యతఁడు దాఁ బిదప నవ్యయ సౌఖ్యవిభూతి నొందఁడే.
శాంతి. 3-408

ఏఁకటు దే. వి.

అపేక్ష

సీ. నెలఁత చిటిన యెలుకల నెటిఁదీర్చు జక్కవలు చెందొవల కేఁకట
యొసర్చు. ఉద్యో 2-112

ఏఁగించు దే. స. క్రి. (√ఏగు)

ఏఁగఁజేయు, వెళ్లఁజేయు, పంపు

ఉ. ...ఇప్పుడ కాలుప్రోలి కేఁగించెదఁ బక్కనై నిలుము గిట్టి రణం
బున రాక్షసాధమా. ఆది 6-294

క. ...అంతకుపురి కేఁగించితిఁ బౌలోమ కాలకేయాసురులన్.
అర. 4-86

(ఎక్కడ కోపఁగించుకొనిపోయినాఁడు - అని వ్యవహారము)

ఏఁగు దే. అ. క్రి.

1. పోవు, వెళ్లు.

క. కొలువుగొన నొల్లకుండుట, గలిగినఁ బొమ్మనుట యంతికం బెను
మేలే, వలసినకడ కేగెద నీ, తలఁపెయ్యది యానతిమ్ము ధరణీ
నాథా. విరా. 2-224

క. ...ఇంకఁ దడయం, బనదని ద్రౌపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్.
విరా. 2-361

తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి నెలవులు. అశ్వ. 1-182

2. నడచు.

ఉ. ఇప్పటి భంగి నొక్కఁడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్,
విరా. 1-148

3. ప్రవేశించు. చొరఁబడు.

ఆ. ...పెట్టు నతనిఁ జేయొడ్డెడు, వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు-
వాఁడ యగుట నిక్కువం బింతనూఁదక, యిట్లు దీనవృత్తి కేఁగ
దలఁతె. శాంతి. 1-138

ఏఁగుదెంచు దే. అ. క్రి. (√ఏఁగు)

1. వచ్చు, ఏతెంచు.

(ఇట 'తెంచు' ధాతువు వ్యతిరేకార్థకమును దెలుపును)

క. ...వేగంబున నయ్యెడ కేఁగుదెంచి నారదుఁ, డెడపడు టించు-
కయు లేక యిట్లను నాతోన్. ఉద్యో. 4-349

చ. కురుబలము మేఁగుదెంచెనటె గోవుల బట్టఁబట్ట. విరా. 4-20

ఏఁచు దే. స. క్రి.

(సూ. ఆ ని. లో ఈ క్రింది విధమునఁ గలదు -త- ఏఱ్గు = బాధి పడు, కష్టపడు, ఈ ద్రావిడ పదమును బట్టియు శ. ర. ను బట్టియు, సబిందుకముగా గ్రహింపఁబడినది. నిర్ధారక ప్రయోగములు కనఁబడ లేదు. అని) బాధించు.

చ. ...అంగనా, జనములు నన్నుఁజూచి మరుసాయకముల్ దమచిత్త వృత్తు లేఁచినఁ గొనివచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు నాకు లంచ మున్. విరా. 2–334

కాని ఈ సంఖ్యయందలి 'ఏఁచిన' అని చూపఁబడిన సబిందుక ప్రయోగము ఆనంద వారి ప్రతిలోను, సంశోధిత ముద్రణములోను నిర్బిందుక ముగనే కాన్పించుచున్నది. సబిందుకముగా పాఠాంతరముగాఁ గూడ లేదు. తి. ప. ప్ర. కోశము గూడ నిర్బిందుకముగనే తెల్పినది. ఈ యర్థ మునఁ గాక 'విజృంభించు' అను నర్థములో ఆనందవారి ప్రతియందును సంశోధిత ముద్రణమునందును అకాడమి ప్రతియందును తిక్కన పద ప్రయోగ కోశమునందును ఈ క్రింది తావుల ఈ పదము గానవచ్చు చున్నది.

విజృంభించు, చెలరేఁగు.

క. నకలాదులు నా దైత్య, ప్రకరంబుఁ దెరల్చి రేఁచి రాధేయుఁడు నేఁ డకుఁ గోలకుఁ దెచ్చెను సోమకుల శిఖండ్యాది రథిక మర్దనుఁ డఁచుచున్ ద్రోణ. 5–216

సీ. సమధిక బలుఁడు గీచకుని యేఁచినయెడఁ, బూనిన విక్రమ స్ఫూర్తి తోడ. సౌప్తి. 2–89

ఏఁడీ దే. స.

ఎక్కడనున్నాఁడు.

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడించిరాక గెలుపే యతఁ డేఁడీ డాఁగిపోయె నాకో. ద్రోణ. 1–874

ఏఁడు దే. వి. బొ. (బహు. ఏఁడులు, ఏండ్లు, ఏండ్లులు)

సంవత్సరము.

చ. అహితుల కన్నభేద్యమగు నాపదమూఁడగు నేఁడు మత్పితా,
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా.
విరా. 1-44

వ. ...ఏఁటేట నింద్రోత్సవంబు సేయుచు. ఆది. 8-24

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరువంచించియుం,
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రా పాలీకపోవచ్చునే.
ఉద్యో. 3-97

వ. ఆసదప్పక తారును పాంచాలియు నొక్కటఁ బండ్రెండేండ్లు వనం
బున వసియించి. విరా. 4-138

తే. ఎన్నికొనుచుండఁ జనుచుండ నేండ్లు వివ్విధమున నాయువు
దోడ్తోడఁ దఱఁగి జీవహాని వాటిల్లఁగా బుత్రయనవధాన, నిద్రమో
హితుఁడై యున్కి నీకుఁ దగునె. శాంతి. 6-224

ఏఁడు కాలము; ఏఁడుగాలము దే. వి.

సంవత్సరము.

వ. ఇట్లు పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటు నగరంబున
వర్తించుచుఁ గతిపయదినంబులు గొఱంతగా నేఁడు కాలంబు
గడపిన సమయంబున. విరా. 2-22

సీ. ఏడుకాల మయ్యతుల వ్రతము సల్పి, యఖిల భూలోక సౌఖ్య
ములఁ ద్రిదివ-తే-మోదమును గండ్రు. అను. 4-148

తే. కుడుపునకు ముందరొడ్డుల గోవునకు సమంచిత గ్రాసముష్టి
నిత్యంబు నేఁడుగాల మిచ్చిన నతఁడెల్ల కామ్యములును, బ్రాహ్మ
ణుల కర్థి నొసఁగిన ఫలమువడయు.
అను. 2-416; ఉద్యో. 1-119

ఏఁపు స. క్రి.

(సూ.ఆ.ని-లో ఈ క్రింది విధమునఁ గలదు-'ఏఁచు'నుబట్టి సబిందుక
ముగా గ్రహింపఁబడినది. కాని నవనాథ, వి.పు. ప్రయోగములు నిర్బిందు
కములనుటకు సాధకములుగా నున్నవి. ఇంకను విచార్యము—నవనాథ
విష్ణుపురాణాది భారతేతర గ్రంథముల యందలి ప్రయోగములు చూపి

నారు. భారతమున ఈ క్రింది ప్రయోగము అనంద ప్రతి, సంకో. ప్రతి, అకా. ప్రతి.తి ప. ప.కో-లలో సబిందుకముగాఁ గన్పించుచున్నవి. నిర్బిందుకమైన పవుశబ్దము భారతమున విశేషముగనే వాడఁబడినది)

పీడించి, బాధించు.

తే. అలుక యెత్తినవానికి నర్థచింత,కునకు నాతురునకుఁ గామ గోచ
రాత్ముని కిని వచ్చునే విను నిద్ర నీవు నెఱుఁగు, దెటిఁగియుండి
యిట్లేటికి నేఁప నన్ను. సౌప్తి. 1-66

ఉ. ...ఆటవీస్థలి కేఁగుదెంచి యే,కాంతమ యున్నవాఁడ నియమాభి
రతున్ నను నేఁపనేటికిన్ శాంతి. 6-569

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ ని,ట్లను
ధృతిఁ గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁ డేటి విచార మిట్టులేఁ,వ
నగునె. విరా. 2-268; ద్రోణ. 2-241; శాంతి. 4-104

ఏఁబం[డ్రు దే. సర్వ. బహు. (ఏను + పది - ఏఁబది - దీనికి మహన్మ
హత్వార్థక రూపము)

ఏఁబదిమంది.

వ. పదంపడి యేఁబండ్రు) గూతులుం బుట్టినఁ అది. 8-61

వ. అతండుఁ దదనుచరుల నేనూట యేఁబం[డ్రు వీరరథికులం బిలుకు
మార్చె. కర్ణ. 2-21౮

ఏఁబది దే. సర్వ. ఔ. అనౌ. (ఏను + పది)

అయిదు పదులు.

ఉ, వేయును నేల పార్థులును విప్రులు నేఁబదివేలు వచ్చినం, జేయుదు
మేము గయ్యమొక చీరియు సంపదఁ బంచియిత్తుమే.
ఉద్యో. 4-201

తే. ...నవ్వుచు నేఁబది దూపుల్లిలురము,నందు నాటినం. ద్రోణ. 2-36

ఏకకుండలుఁడు సం. వి. అ. పుం.

బలరాముఁడు

వ. ...అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం బోయె

అందుండి యయ్యేకకుండబుందు యామునంబునకుం జనిరి.

కల్య. 2-199

**ఏకచక్రపురము; ఏకచక్రాపురము** సం. వి. అ. పుం. ఆ. స్త్రీ.

ఏక చక్రము అను పేరుగల ఒక పట్టణము పాండవులు లాక్షా గృహము నుండి తప్పించుకొని వచ్చిన పిమ్మట బ్రాహ్మణవేషధారులై యిక్కడ భిక్షుక వృత్తిఁ గడపిరి-ఇక్కడనే భీముఁడు బకాసురుని జంపెను.

సీ. ఏకచైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁజేసి, రక్షించె నేకచక్రా పురంబు. విరా. 1-74

వ. భీమసేనుండు హిడింబాసురుంజంపి వాని చెలియలి హిడింబను వివాహంబై యేకచక్రపురంబున కేగి యందు బకాసురుంజంపి విప్రులం గాచె. ఆది. 8-15

సీ. కడుఁ గ్రొవ్వి యేకచక్రంబున వారల, కేనింత యెల్లిదమేల యైతి. ఆది. 6-292

**ఏకచక్రము** సం. వి. అ. పుం.

ఏక చక్రపురము (లేక) ఏకచక్రాపురము.

సీ. కడుఁగ్రొవ్వి యేక చక్రంబున వారల, కేనింత యెల్లిదమేల యైతి. ఆది. 6-292

**ఏకచరుఁడు** సం. విశే. (అ. ఈ. అ.)

ఒంటరిగా సంచరించువాఁడు.

వ. సర్వసంగ వర్జితులయి యేకచరులయి యనేకనికేతనులైన యతులును. ఆది. 3-222

**ఏకచారి** సం. విశే. (న్. నీ. న్.)

ఏకచరుఁడు, ఒంటరిగా సంచరించువాఁడు.

వ. మాండవ్యుండను బ్రహ్మర్షి దొల్లి మహీవలయంబునం గల తీర్థంబు లెల్ల నేకచారియయి సేవించి. ఆది. 4-261

**ఏకడ** దే. వి. ప.

ఎక్కడ.

ఉ. ...నీ, కెక్కడ డాఁగవచ్చు గద నేనని సేయుటకుం గడంగినన్.
కల్కి. 2-249

**ఏకత** సం. వి. అ. స్త్రీ.

1. ఏకత్వము, ముఖ్యము.

ఉ. ...మహానందరసైకతాత్మల యవక్రమనిష్కల బోధపుష్కలా.
ద్రోణ. 4-885

2. ఏకాగ్రత్వము.

ఆ. ...అవ్వెను దేవనందనుభక్తియింపు నేకతానిరూఢి. శాంతి, 2-28

3. ఒక్కటియగుట, ఐక్యభావము.

క. జనన ప్రళయంబులఁ దనకు బహుత్వంబు నేకతయ శోభిల్లున్.
శాంతి. 6-42

**ఏకతము** వై. వి. (సం. ఏకాంతమ్ - ప్రా. ఎక్కంత)

ఒంటరిపాటు, ఒక్కరుగానుండుట.

ఉ. చయ్యన నేఁగి యంబుజ విశాల విలోచనఁ గాంచి ప్రీతిమై,
నియ్యకొనంగఁ జేసి. విరా. 2-245

తే. కొలుమసఁగి గురుండు పాంచాలసేన, నేలకును గోలకును దెచ్చె
నీవు గడఁగి, కౌరవులఁ బాయవలవు మేకతమయ్యెన. నతనిఁ బరి
మార్చుఁ జేకొని యబ్బలంబు. ద్రోణ. 5-301

**ఏకతుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక ఋషికుమారుఁడు. వీని సోదరులు ద్వితుఁడు, త్రితుఁడు.

క. త్రితుఁడనఁగా ద్వితుఁడన నే, కతుఁ డనఁగఁ దపస్వినుతులు గలరా
విప్ర,త్రితయము భూపాలురక్తున్క్రతుదీక్షలొనర్చి ధేనుగణమ్మం
బడసెన్. కల్కి. 2-154

(వీరే ప్రజాపతి పుత్రులుగ ఈ క్రింది సంఖ్యయందుఁ గలరు. కాని వరుస క్రమమున భేదము గలదు. పైది కనిష్ఠానుపూర్వకముగాఁ క్రిందిది జ్యేష్ఠానుపూర్వకముగాఁ జెప్పఁబడినదని యనుకొనవలయును)

వ. ప్రజాపతి పుత్రులగు నేకతుండును ద్వితుండు త్రితుండును నను

మునిసత్తములు సదస్యులైరి. శాంతి. 6-361

శ్లో. ఆసన్ పూర్వయుగే రాజన్ మునయో భ్రాతరస్త్రయః,
ఏకతశ్చ ద్వితశ్చైవ త్రితశ్చాదిత్యసన్నిభాః
సర్వే ప్రజాపతి సమాః ప్రజావంతస్తథైవ చ.
సం. భా. శల్య. 37-8,9 శ్లో.

శ్లో. ప్రజాపతిసుతాశ్చాత్ర సదస్యాశ్చాభవంస్త్రయః
ఏకతశ్చ ద్వితశ్చైవ త్రితశ్చైవ మహర్షయః.
సం. భా. శాంతి. 337-6 శ్లో. చూ ఉదపానము

**ఏకత్వము** సం. వి. అ. న.

1. ఒక్కటియగుట, ఐక్యభావము,

వ. అమ్మురహర పురహరుల యేకత్వంబు మనంబునం గొనియాడి ద్రోణ 2-268

క. అనఘ యనులోమమునఁ దోఁపును బ్రతిలోమమున లయము వొందుటయును గ్నల్గును సర్వగత్వముల కవి, యెనయిక బ్రహ్మము గలయు టేకత్వమగున్. అను. 4-184

2 ఒకఁడుగా నుండుట.

క. ఏకత్వం బన్యత్వ మనేకత్వము గలుగు నీ మహిమ చందం బాలోకింప నిపుణులగు సు, శ్లోకులకుం బరమపదము సులభము శార్ఙ్గీ శాంతి. 4-286

**ఏకపాద** సం. వి. అ. స్త్రీ.

అశోక వనమున సీతాదేవికి కావున్న రాక్షసస్త్రీలలో నొకతె.

వ. అమ్మగువ కావున్న దనుజాంగనలు త్ర్యక్షియు, లలాటాక్షియుఁ, ద్విస్తనియు నేకపాదయు దీర్ఘజిహ్వయుఁ ద్రిజటయు నేకలోచనయు మొదలయినవారు. అర. 6-391

**ఏకపాదుఁడు** సం. వి. అ. పుం.

1. ఏకాదశ రుద్రులలో నొకఁడు.

వ మఱియు స్థాణునకు మానసపుత్రులైన మృగవ్యాధ శర్వ నిరృత్యజైకపా దహిర్బుధ్న్య పినాకి దహనేశ్వర కపాలి స్థాణుభర్గులం

గా నేకాదశరుద్రులు పుట్టిరి. ఆది. 3-66

2. ఒకముని, అష్టావక్రుని తండ్రి.

వ. తొల్లి యేకపాదుండను మునివరుండు తన విద్యావిభవంబున సుజాత యను దాని వివాహంబై వనంబున ఘోరతపంబు చేయుచు ననవరతంబును శిష్యుల వేదంబులు చదివించుచున్న. ఆర. 3-237; ఆర. 3-238

ఇతఁడు ఉద్దాలకుని శిష్యుఁడనియు ఇతని పేరు కహోళుఁడనియు మూలమునఁ గలదు.

శ్లో. ఉద్దాలకస్య నియతః శిష్య ఏకో నామ్నా కహోళ ఇతి విశ్రుతోఽభూత్. సం.భా. ఆర. 132-6

3. సాగర ద్వీపనివాసి-సహదేవుఁడు రాజసూయయాగ సందర్భమున దక్షిణ దిగ్విజయ యాత్రకుఁ బోయినపుడు వీరిని జయించెను.

వ. సహదేవుండు దక్షిణ దిగ్భాగన కరిగి...సాగర ద్వీపవాసులైన నిషాదులం బురుషాదుల నేకపాదులం గర్ణప్రావరణుల ... వశగతులం జేసి. సభా. 1-260

విణ. (అ. ఇ. అ.)

ఒంటి కాలివాఁడు.

వ. అప్పుడు ప్రదీప్త వదనులుఁ బ్రజ్వలిత నేత్రులు నేకపాదులుఁ గరి తురంగ సింహ సూకరానన సమాన ముఖులును. సౌప్తి. 1-116

ఏకపుత్త్రిండు సం. విణ. (అ. ఆ. అ.)

ఒక్కఁడే కొడుకు గలవాఁడు.

క. వినవయ్య యేకపుత్త్రుఁడు ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మవిదులన్, విని నీకుఁ దొడుపుత్రుం, ననఘా పడయంగ నిష్ట మయినది నాకున్. ఆది. 4-180

ఏకభక్తి సం. వి. ఇ. స్త్రీ.

నిశ్చలభక్తి, ఏకాంతభక్తి, అవిచ్ఛిన్నభక్తి, అనన్యభక్తి.

చ. ...మదీయదివ్య పరమాకృతి పేర్చిన యేకభక్తి భావనమునఁ

దోఁచు దీని జనవర్గము గానదు నీక చూపిదివ్. భీష్మ. 1-220

తే. అచరములును జరంబులునైన భూత, సముదయంబులు మణులు సూత్రమున నున్న, కరణి నీ యంద యున్నవి గాన సమత, నేక భక్తి నే, గొలిద నిమ్ము దేవ. శాంతి. 4-240

**ఏకభుక్తము** సం. వి. అ. న.

పగలు రెండుజాములు దాఁటిన తరువాత ఒకపూట మాత్రమే తినుట.

సీ. ఏకభుక్త వ్రత మెంతయు నిష్ఠ మాసం బెల్ల నడపిన సద్విజుండు. అను. 4-48

**ఏకమతము** సం. విశ. (అ. ఆ. అ.)

ఒక్కటే తలంపు గలది.

ఉ. అందఱము నేకమతంబగు నిశ్చయంబుతోన్. అర. 7-18

**ఏకము** సం. విశ. (అ. ఆ. అ.)

1. ఒకటి (ఈ యర్థమున నిత్యైక వచనము)

వ. విశ్వావసుండు పంచవింశక తత్త్వంబునకుం బరంబు గలుగుటయు నది రూపింప నేకంబగుటయు నారద జైగీషవ్య దేవల కపిల శుక సుమంతు పైల్యాదులైన పరమమునుల గోష్ఠి విశేషంబుల విందు. శాంతి. 9-148

క. ఏక ద్వి త్రి చతుర్వ్యూహాకారతఁ దోఁచుచుండు హరిభక్తజనా,లోకమున వాసుదేవా, ద్యేకః ప్రాప్తముగఁ దత్తదుచితస్ఫూర్తిన్. శాంతి. 6-500; శల్య. 2-1; విరా. 4-160

2. ముఖ్యము.

సీ. ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె. విరా. 2-189

**ఏకముఖత్వము** సం. వి. అ. న.

ఒకటిగా నుండుట, ఒకే యుద్దేశముతో నుండుట.

వ. పవమానసూనుండు సోదర భుజబలంబు లేకముఖత్వంబున నెప్పుడుం గలుగు మనోబలంబు వలనం జలింపకుండె. శల్య. 2-297

**ఏకముఖము** సం. విశ. (అ. అ. ఈ. అ.)

1. ఒకవైపుననే యున్న ముఖము గలది. ఒకటే యుద్దేశముగలది.

వ. సేనయు నొక్కుమ్మడి నద్దిక్కు దఱిమినం గని కృష్ణార్జునులు నిజ
సైన్యంబు సమస్తంబు నేకముఖంబు సేసి మార్కొనిరి.
శల్య 1-231; అర. 7-14

2. ఏకాగ్రత గలది.

శా. భావం బేకముఖంబుఁ జేసికొని యాపద్ధ్వాంత భానున్ మహా,
దేవుం...భక్తి ప్రౌఢతం గొల్చెదన్. సౌప్తి. 1-109

3. ఏకాధిపత్యము.

ఉ. నాకును నీకు నేటికి రణం బొనరింపఁగ నేను బంప 'నీ,వేకముఖం
ముగా ధరణి యేలుము. శాంతి, 2-835

**ఏకరాత్రము** సం. వి. అ. న.

1. ఒకానొక తీర్థము.

వ. ఏకరాత్రంబను తీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మ
లోకంబు వడయుదురు. అర. 2-267

2. ఒక్క అహోరాత్రము, ఒక రాత్రి.

వ, ఏకరాత్రంబను తీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మ
లోకంబు వడయుదురు. అర. 2-267

[తీర్థయాత్రలు చేయువారు ఒంటిపూఁట భోజనము సేయుట విధిగాన రాత్రులయం దెటుల నుపవాసము చేయుచునే యుందురు గాన ఇక్కడ అహోరాత్రము (ఒక పవలు + ఒక రాత్రి) అని చెప్పుటయే సమంజసము.]

**ఏకలవ్యుఁడు** సం. వి. అ. పుం.

హిరణ్యధన్వుఁడను ఎఱుకురాజు కొడుకు, ద్రోణుని పరోక్ష శిష్యుఁడుం
క్రోధవశగణ సంభవుఁడు. ఆది. 3-80

చూ. చరిత్ర ఆది. 5-282; మొ. 245 వరకు; ద్రోణ. 5-239

ఇతని కొడుకు అశ్వమేధ హయరక్షణార్థము వచ్చిన అర్జునునితోఁ
బోరాడి యోడిపోయెను. అశ్వ. 4-111,112

చూ. అనుబంధము చివరి సంపుటము.

**ఏకలోచన** సం. వి. అ. స్త్రీ.

అశోకవనమునందున్న సీతాదేవికి కాపున్న రాక్షస స్త్రీలలో నొకతె.

చూ. ఏకపాద. అర. 6-381

**ఏకవర్ణము** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకేరంగు గలది (ఇక్కడ సుఖము అని భావము)

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమఫలము, లందు గొన్నిటి కేక
వర్ణాంచితంబు, లవనిజములు గొన్నిటికి నవ్యక్త పర్ణ,కములు
సౌరభ్యమాధుర్య సమధికములు. అశ్వ. 2-56

**ఏకవస్త్ర** సం. వి. అ. స్త్రీ.

ఒక్కటే వస్త్రముగలది, ముట్టుత,

ఉ. అక్కోమలి ప్రాతికాము పిలుంద నేక వస్త్రయు నధోనీవియు
నవిరళ గళితనయనోదకబిందు సందోహ పరిపీడ్యమాన పీన స్తన పరి
ధానాంతరయు. సభా. 2-312

వ. (దుశ్శాసనుఁడు) అనుచు డాయ వచ్చిన నేను రజస్వలను ముట్ట
కుండు మేక వస్త్రను నయియున్నదాన మఱి గురుబంధు జనాధి
ష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తుననిన నీ వేక వస్త్రవైతే నేమి
విగతవస్త్రవైతేనేమి నిన్నెట్లుం దోడ్కొని పోదునని బలాత్కా
రంబున. సభా. 2-215

శ్లో. ఏకవస్త్రా అధో నీవీ రోదమానా రజస్వలా,
సభామాగమ్య పాంచాలీ శ్వశురస్యాగతోభవ...
సం. భా. సభా. 66-18

శ్లో. సాకృష్యమాణా నమితాంగ యష్టిః
శనైరువాచాథ రజస్వలాస్మి,
ఏకం చ వాసో మమ మందబుద్ధే
సభాం నేతుం నార్హసి మా మనార్య.

శ్లో. రజస్వలా వా భవ యాజ్ఞసేని
హ్యేకాంబరా వా ప్యథ వా వివస్త్రా,
ద్యూతే జితా చాసి కృతాసి దాసీ
దాసీషు వాసశ్చ యథోపజోషమ్ సం. భా. సభా. 66-31, 33

స్త్రీలు ముట్టయిన మూఁడు దినములు ఒకే వస్త్రము ధరింపవలెను. అనఁగా రజోదర్శనమైనది మొదలు స్నానపర్యంతము వస్త్రము మార్చరాదు. పోకముడి క్రిందికి వేయవలెను-స్నానము చేయరాదు-అని ధర్మశాస్త్రము, వైద్యశాస్త్రమునే గాక సనాతనాచారమును.

కావున ఏకవస్త్రపదము రజస్వలకుఁ జెల్లినది. ఈ సమయమున ఆంధ్ర స్త్రీలు వాఁడు పైటచెఱఁగు ఔత్తరాహులువాడు మేలు ముసుఁగు నుండదు-"అవిరళగళితనయనోదకబిందు సందోహ పరిషిచ్యమాన పీనస్తన పరిధానాంతయు"-అనునది నన్నయగారి కల్పన.)

ఉ. ఆసభ కేకవస్త్రయగునట్టి ననుం గొని వచ్చి నొంచు దుశ్శాసను
జూచుచుం జతు లసంభ్రమములై తగు చేష్టలేక నాయాసలు మాని
చిత్రముల యాకృతి నున్నయెడన్. ఉద్యో. 3-111

(మూలములో ఈ కావున ఏకవస్త్ర పదప్రయోగము లేదు. భీష్మ పర్వములోఁ గలదు.

శ్లో. యచ్చైవ ద్రౌపదీ కృష్ణా ఏకవస్త్రా రజస్వలా,

శ్లో. సభామానీయ దుర్బుద్ధే బహుధా క్లేశితా త్వయా.

సం.భా. భీష్మ. 92-27,28 శ్లో.

విణ. (అ. ఆ. అ.)

2. ఒక్కటే వస్త్రముగలది.

వ. ఇట్లేకతంబ యేకవస్త్రయై యోడ నెక్కి వచ్చు వారి నిరీక్షించుచున్న సత్యవతిం జూచి యామునివరుండు దానియందు పరవశుండై, ఆది. 3-77

(ఇక్కడ 'ముట్టుత' అను నర్థము పొసఁగదు. ముట్టయి నావ నడపుట. ముట్టుకాలమున గర్భోత్పత్తియయి శిశువుపుట్టుట అసంభవము.)

సూ. తత్ర ప్రథమే దివసే ఋతుమత్యాం మైథునగమనమనాయుష్యం పుంసాం భవతి, యశ్చ తత్రాధీయతే గర్భః స ప్రసవ మానో విముచ్యతే. ద్వితీయేఽప్యేవం సూతికా గృహేవా, తృతీయేఽప్యేవ మసమ్పూర్ణాఙ్గోఽల్పాయుర్వా భవతి.

సుశ్రుతము శారీరస్థానము. ద్వితీయాధ్యాయము 30 సూ.

పరాశర మహర్షి ముట్టుతను ఆసించెనని చెప్పుటయు గర్హ్యము. సత్యవతి దాశవనిత. దాశవనితలు వివాహమునకు పూర్వము ఏకవస్త్రలుగా నుండుట ఆచారమైయుండవచ్చును. ఇప్పటికిని మళయాళ దేశమున ఏకవస్త్ర ధారణాచారము సనాతన మార్గావలంబులలోఁ గనఁబడుచున్నది నేఁడును కొన్ని కులములందు మగపిల్లలు మేనమామ ధోవతులిచ్చు వఱకు పంచెకట్టని యాచారమున్నది. ఇప్పటివఱకు అన్నిజాతులయందును ఆఁడ పిల్లలకు వివాహకాలమున మేనమామలు తలఁబ్రాలుచీరె వల్లెవాటు వస్త్రము నిచ్చు నాచారము విధిగాఁ గలదు. దీనినిబట్టి కన్యలు వివాహమగువఱకు ఏకవస్త్రలు అని రూఢియగుచున్నది. దాశకన్య రజస్వలా సిద్ధి పొందినను వివాహము కాలేదుగాన ఏకవస్త్రము ధరించియుండును. ఏకవస్త్రత్వము అవివాహికత్వ సూచకము. రజోదర్శన దినము మొదలు పదాఱవ దినమువఱకు రజోదర్శనావకాశముండుటచే సంతానయోగ్య అని సూచించుటకైనను ఏకవస్త్ర శబ్దముపయోగించి యుండవచ్చునేమో ఇది నన్నయగారి స్వకీయ పదప్రయోగము. మూలమునందీ శబ్దమీ తావున గానరాదు

**ఏకవస్త్రధరణము** సం. వి. అ. న.

ఒకే వస్త్రమును ధరించుట, దీక్షా వస్త్రమును ధరించుట.

ఆ. అనిన లెస్సగాకయని ధర్మసుతుఁడేక వస్త్రధరణనియతి వఱల నెల్ల వారు నట్ల యేఁగు దేరఁగఁ బౌరులు, బలసి చనఁగఁ జనియెఁ బౌర వేంద్ర. ఆశ్ర. 2-168

**ఏకవస్త్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకే వస్త్రము ధరించువాఁడు పైనియుత్తరీయము లేనివాఁడు.

(దమయంతినలు నన్వేషించుట) వ... అంతనుండియు నమ్మహానుభావు నేకవస్త్రు,నని కేతను నన్వేషించుచు సైరంధ్రీ వృత్తంబు సేకొని. అర. 2-118

**ఏకవారభోజి** సం. విణ. (న్. నీ. న్.)

దినమున కొకసారి భుజించువాఁడు.

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ డర్థి నెయ్యది యిచ్చిన కేకవారభోజియగుచు నమస్కార సఖ్య,నుతి నిరాకృతి యహి

తుఁడై యతి వెలుంగు. అశ్వ. 2-172

**ఏకవారము** సం వి. అ. న.

ఒక పర్యాయము. చూ. ఏకవార భోజి.

**ఏకవింశతి** సం. వి. ఇ. స్త్రీ.

ఇరువది యొకటి.

మ. తితి నెందుం జరియించి భూసతుల నిశ్శేషంబుగా నేకవింశతి వారంబులు ద్రుంచి యాతఁడు దుదిన్ శాంతత్వముం బొందె.
శాంతి. 2-66

**ఏకవీరుఁడు** సం. విశ. (అ. ఆ. అః)

ప్రముఖుఁడైన వీరుఁడు, యోధాను యోధుఁడు.

వ. అప్పుడు గగన మధ్య భాగంబున భాసమానుండయిన మార్తాండు రెండవ మూర్తియుం బోలె నయ్యేకవీరుండు వెలింగె.
ద్రోణ. 2-60

**ఏకశృంగుఁడు** సం. వి. అ. పుం.

విష్ణుమూర్తి.

ఆ. ఒక్క శృంగమునన యుర్వియెత్తితి వరాహావతార లీల యతిశ యిల్లి, నట్లులగుటఁ జేసి యార్య జనప్రియ, నాకు నేకశృంగనామ మయ్యె.
శాంతి. 6-487

**ఏకాంతము** సం. విశ. (అ. ఆ. అ.)

1. రహస్యమైనది. ఇద్దఱకంటె నెక్కుడు జనములేనిది (చోటు)

వ. ...అమ్మహాదేవింగాంచి కానీనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూత గోత్రంబును రాధేయ నామంబునుం జెప్పి యభివాద నంబు చేసి నీవు విజయం చేసిన కారంబేమి నాకుఁ జేయం గలపని యెయ్యది యానతిమ్మనినఁ గుంతి యేకాంతంబుగా నిట్లనియె.
ఉద్యో. 4-68; శాంతి. 1-18

వ. పిలిచి యేకాంతంబున నతని కిట్లనియె. అను. 2-184

2. ఏకాగ్రము.

ఐక్క విషయమునే గుఱిగాఁ జేసికొనినది.

క. కామ క్రోధాద్యములగు, నీ మానస వికృతు లుడిసి యేకాంత గుహా,రాముఁడవై నను వెదకుట, సూ మే లొండెల్ల నుడుగు సులభ వివేకా. శాంతి. 4-80

శా. ...లోకాగమ,న్యాయమైకాంత గృహాంబునాఁ బరఁగి నానావేద వేదాంత వి,ద్యాయుక్తంబగు దానిఁ జెప్పఁ దొడఁగెం తద్వార శాఖ్యానమున్. ఆది. 3-11

3. కేవలము, ముఖ్యము.

తే. తగిలి నిత్యంబు నేకాంత ధర్మనిరతుఁ, డగుట యుక్తమె పురుషున కట్టి వాని,పెలయ వెలయ ధర్మకామంబులు విడుచుఁ బ్రాణ, విగతు సుఖదుఃఖములు రెండు విడుచునట్లు. అర. 1-244

ఏకాంతస్థలము సం. వి. అ. న.

ఒంటరి ప్రదేశము, రహస్యప్రదేశము.

వ. అట గీచకుండు కందర్ప దర్ప గోచరుండై పరిజనంబుల వంచించి యేకాంత స్థలంబున. విరా. 2-291

ఏకాంతి సం. వి. న్. పుం.

ఏకాగ్రచిత్తుఁడు, విష్ణుభక్తుఁడు

క, ఫలములు గోరక కర్మం,బులు నడపుచు వాని విమల బోధాగ్ని హాతి, బొలియించుచు నిర్ద్వంద్వత, నెలకొను నేకాంతి జనులు నినుఁ గం(డు హరీ. శాంతి. 4-236; శాంతి. 6-86,88,76

ఏకాంతికము సం. వి. అ. న.

ఏకాంతము గలది.

వ. సాంఖ్యయోగ యుక్తులు బహిర్దర్శనులై నిశ్చయ రహితులై రేని నః మ్రదియ తత్త్వంబు గాననేర రది మోహపంక మగ్నులగువారికి నుపవాసంబుల నియంబుల వ్రతంబుల నెఱుంగ శక్యంబుగా దేకాంతిక ధ్యానపరుల కెఱుంగుట గలదు. అను. 1-379

**ఏకాంతికుఁడు** సం. వి. అ. పుం.

1. విష్ణుభక్తుఁడు.

తే. వికృతులందును సత్త్వస్థ విధము మేలు, దాన హరిఁ బొందవచ్చు నతండు నడపుఁ, దత్త్వకారులకు శలంపుఁ దంద్ర మెల్ల, వార కాంతికులు పెఱవారి వినుము. శాంతి. 6–506

2. శ్వేత ద్వీపవాసి (విష్ణుభక్తుఁడు.)

వ. శ్వేత ద్వీపంబునకుం జని....ఏమయ్యెడ వేకాంతికజనుల కింత నంత నున్నంత....జయ పుండరీకాక్ష జయ హృషీకేశ జయ విశ్వ భావన నమస్తే నమస్తే యను నెలుంగులు నింగిముట్టం గొల్చిరి. శాంతి. 6–367,370

**ఏకాకారుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఒక్కటే విధముగా నుండువాఁడు.

సీ. మనమునఁ జెయ్యులమాటల భక్తి నేకాకారుఁడై ఆది. 8–110

**ఏకాకి** సం. విశే. (పు. స్త్రీ. న.)

ఒంటరి.

సీ. సారహీనములగు సంసారసుఖములు విడిచి యేకాకినై యడవికేగి శాంతి. 1-58; శల్య. 2-5; శాంతి. 5-142

**ఏకాకిత్వము** సం. వి, అ. న.

ఒంటరితనము.

వ. (దమయంతి) తనయేకాకిత్వంబునకు నబలాభావంబునకుఁ బ్రతిపద న్యాస జాయమానా కంటక మృగ పన్నగ భయంబునకు వగవక. అర. 2-83

**ఏకాగ్రత** సం. వి. ఆ. స్త్రీ.

ఏకాగ్రభావము, చిత్తసమాధానము (మనస్సు) ఒకదానియందే నిలుపుట.

మ. మన సేకాగ్రతఁ బొందఁజేయ. శాంతి. 5-121; శాంతి. 6-85

**ఏకాగ్రము** సం. విశే. (అ. ఆ. అ.)

ఒక విషయమునందే లగ్నమైనది (చిత్తము. చూపు మొ.)

వ. ....ఒద్దేవు నాశ్రయింపు మతం దేకాగ్రచిత్తులై యారాధించిన వారికిఁ జేరువయగు. ఉద్యో. 2-825

వ. తెగ వాపుటయుం దదీయ స్థానకంబును ముష్టి ప్రకారంబును నేకాగ్రదృష్టిం గనుంగొను గాండీవికి, ద్రోణ. 2-834

**ఏకాదశ** సం. విణ. (న్)

పదునొకండు, పదునొకండవ,

(ఇది తెనుఁగున సమాస పూర్వపదముగనే యుండును.)

క. వారల నేకాదశ రుద్రులంగా నెఱుంగుము. అను. 8-57

వ. మెచ్చి భద్రమూర్తులైన రుద్ర విరించులు సన్నిధిసేసినం బెన్నిధి గన్న పేదచందంబున సంభ్రమించు వాకుం గరుణించి కృష్ణుండను నేకాదశనామంబును నప్రతిహతబాణంబులు నొసంగిరి. విరా. 4-149

**ఏకాదశరుద్రులు** సం. వి. బహు.

పదొకండుగురు రుద్రులు—వీరు 1) అజపాదుఁడు 2) అహిర్బుధ్న్యుఁడు 3) త్ర్యంబకుఁడు 4) వృషాకపి 5) శంభుఁడు 6) కపాలి 7) దైవతుఁడు 8) హరుఁడు 9) బహురూపుఁడు 10) ఉగ్రుఁడు 11) విశ్వరూపుఁడు. అను. 8-57; 58

**ఏకాధిష్ఠితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఏకచ్ఛత్రాధిపత్యమైనది.

క. ఈ కార్యసిద్ధియగుడును, నీకతమున నఖిల ధారుణీ రాజ్యము నా, కేకాధిష్ఠిత మగు నిది, నీకును సితోపభోగనిలయము కాదే; ఆది. 6-140

**ఏకాయనము** సం. విణ. (అ. ఆ. అ.)

ఏకాగ్రము, ఒక విషయమునందే లగ్నమైనది.

క. వాకును, మనసును గాయము, నేకాయన వృత్తి కొచమెడలం తపముం, జేకొనునది యది లోకశ్రీకి ఘృతంబునకు వెన్న క్రియ జనకమగున్. శాంతి 4-388

**ఏకార్థము** సం. వి. అ. పుం.

ఒకే ప్రయోజనము, ఒకే కార్యము.

ఆ ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసముపేతుఁ, బాడియయ్యె యిట్టి పనికిఁ బనుప. అర. 2-86

**ఏకార్థుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఒక్కటే కోరికగలవాఁడు, ఒకే ప్రయోజనము గలవాఁడు.

వ. వారిం గూడిన రాజులెల్లను దిగ్విజయంబునాఁడు పాండవుల చేత భంగపడిన వారు గావునఁ గర్ణుతో నేకార్థులమై చక్రము గెలుతు మింతియకాని యొడులేదని నిశ్చయించుకొని యున్నవారు. ఉద్యో. 3-285

వ. శునస్సఖుండను పరివ్రాజకుండు ఎచ్చిన వారిం గని వందనంబు సేసిన వారలభినందించి రతండు నమ్మునులంగలసి యేకార్థులై సంచరించె అను 3-220

**ఏకాశ్వాసము** సం. వి. అ. న.

ఒకటే యాశ్వాసము గలది

గద్యము – మహాప్రస్థానిక పర్వంబు సర్వంబు నేకాశ్వాసము .. మహా 80; మౌస. 227

**ఏకాశ్లేషిణి** సం. వి. ఇ. స్త్రీ.

ఒక దానియందే చేరినది. ఏకాగ్రమైనది.

క. రోషముఁ గామము రాగ,ద్వేషములును లేక భక్తి దిరమై యేకా, శ్లేషిణిగాఁ గొలుతు రవి,శ్లేషమనోనిలయవృత్తి సిద్ధులు నిన్నున్. శాంతి. 4-235

**ఏకాసనత** సం. వి. ఆ. స్త్రీ.

ఒకే పీఠముపైఁ గూర్చుండుట.

క. పతి దనకు వేమి యిచ్చిన, నతిముదమునఁ బొందవలయు వాక్సౌజ న్యైనన్, మఱిఁ గొంకక యేకాంత,స్థితి నేకాసనత నున్కి సెట్టు ప్రమదకున్. అను, 5-294

**ఏకీభూతము** సం. విశే. (అ. ఆ. అ.)

ఒక్కటిగా అయినది,

వ. కృష్ణద్వైపాయనుం డను బ్రహర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి తన శిష్యులయిన పైల వైశంపాయన సుమంతు జైమినులం బంచి క్రమం బునఁ జతుర్వేద సూత్రంబులఁ జేయించి. ఆది.1-80; ఉద్యో.4-261

**ఏకోత్తరము** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకటి ఎక్కువగాఁ గలది.

వ. ఈ రెండు వంశంబులవలన నేకోత్తరశత వంశంబులయ్యె (ఏకోత్తరశతము = నూట ఒకటి) సభా. 1-109

**ఏకోద్దిష్టము** సం. వి. అ. న.

ప్రేతము నుద్దేశించి మరణదినము మొదలు పదునొకండవదినమునఁ జేయు శ్రాద్ధము.

క. వినుము సపిండీకరణ,మ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వర్జన మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁబోవ సజ్జనవినుతా. అను. 4-122

**ఏగురు** దే. సర్వ. (ఏను + గురు - ఏను శబ్దమునకు మహన్మహ త్వర్థక రూపము)

అయిదుగురు.

వ. కురురాజు మొదలగు నేగురు రథికులు వెలుచ నేసిరి ద్రోణ. 5-177; ఆది. 7-213

**ఏచు** దే. అ. క్రి.

1. విజృంభించు, చెలరేఁగు.

క. భుజబలదుర్జయుఁ డింద్రుం డజయ్యుఁడవు నీవు నీకు నతనికి మీలో, విజయము దక్కదు మీరే,చి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా. ఉద్యో. 1-133

ఉ. ఏచిన యాపురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ, జూచినఁ బోవుఁగాని వెలిచొప్పునఁ బోవదు. కర్ణ. 1-286

ఉ. ...ఈ,కావరమైన కీచకుఁడు కామనిపీడితుఁడై యలంతులం, బోవక యేచి పట్టుకొనఁబోయినఁ దూలెదఁగాక యిమ్మెయిన్. విరా. 2-228

2. మదించు.

తే. ఏచి మున్నీరు సేయూఁత నీద నగ్ని, నుఱుక వాసుకి కోఱలు
వెఱుకఁ గడఁగినట్లు గాదె రాధేయనీ వర్జునునకుఁ, బోర నెక్కటి
మాఱొ్కనఁ బూను టరయ, విరా. 4-213

ఆ. అధిక దర్పయుక్తమై బలివర్తంబు, నగముదరి విదారణంబు
సేయఁ, గాలు ద్రవ్వునట్లు గడుబలాఢ్యుల తోడ, నేచి వీఁడు విగ్ర
హింపఁ దొడఁగె. సభా. 2-188

3. అధికమగు, అతిశయించు.

మ. ...పౌత్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం డ్రేణిసేయం
గ నేచిన పెంపొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్.
భీష్మ. 1-94

తే. ఎక్కుడెక్కటి పెనఁగిన నింతపట్టు, పెనఁకువలు నిట్టు, లేచునే
పృథివి నింక, జనము లీ కురు పాండవ సంగరంబు, సెప్పికొం్రదు
మనంబు లచ్చెరువు నొంద. ద్రోణ. 1-178

4. పెరుఁగు, బలియు.

సీ. నెగసిన కొనలేచి నింగి యంతంతకు,నవులఁ ద్రోవఁగఁ దనరారు
దాని (శమీతరు చక్రవర్తి) విరా. 1-162

మానిని :–ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగు రావుల జొంపములం
బూచిన మంచి యశోకములన్. ఆది. 4-20

క. ఏచిన పొదలఁ బొరల్పడఁ ద్రోచుచు, అర. 2-85

5. ఉత్సహించు.

చ. మనసుల నాలుకొల్పి యనుమానము లెల్లసు వాచి యేచి వా,హ
నములు శస్త్రాయుధంబులును నాయితమయ్యెడు భంగిఁ జేయుచున్.
విరా. 4-187

స. క్రి.

కలఁత పెట్టు, పీడించు.

చ. ...ఎప్డు నంగనా,జనములు నన్నుఁజూచి మరుసాయకముల్ దమ

చిత్తవృత్తులే, చినఁగొని వచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు నాకు లంచముల్. విరా. 2-884

('లంచములిత్తురు'-అనునది తిక్కనగారి భావము)

**ఏటికి** దే. క్రియా. (ఏమిటికి -ఏమిలోని మివర్ణము లోపించి వచ్చిన రూపము)

ఎందులకు.

మ. భామా పల్కులింకేటికిన్. విరా. 1-321; విరా. 3-225

**ఏటికెదురీఁదు** దే. జాతీ.

ఏటి యందలి నీటి ప్రవాహమునకు ఎదురుగా ఈఁదు.

(నీటివాలున ఈఁదుట సులభము సుఖకరముం ఉద్దేశించిన తావు చేర వచ్చును. ఎదురుగా ఈఁదుచున్నచో మిక్కిలి శ్రమగలిగి యెప్పుడు నీట మునుఁగుదునో యని మానసిక బాధ యేర్పడును. తలకుమించిన కార్యము చేయ సాహసించినప్పు డీ జాతీయము నుపయోగింతురు. ఇక్కడ-ఏటికెదు రీఁదునప్పుడు పడు మానసిక బాధ అనుభవించు. అని యర్థము).

చ. ...వారిజనాభుఁడు లేని దీనతం, బొరసి కృపైక భాజనతఁ బొందిన యప్పురిఁ జూచి మానసం. బెరియఁగఁ జొచ్చె నేటి కెదు రీఁదిన చాడ్పున నేమి సెప్పుదున్. మౌస. 98

**ఏటికోళ్లు** దే. వి. బ.

నమస్కారములు.

క. ...వరమిండీ వేల్పులార వ్వారనికరుణన్.

వ. అని ప్రార్థించుచు దైవంబుల కేటికోళ్లు నిరూపించుచు బహు ప్రకారంబులం బలుకుచుండిరి. ద్రోణ. 2-346, 347

**ఏటిది** దే. వి.

ఎటువంటిది, ఎంతమాత్రపుది.

చ. ...ఇట్లనఁదగునయ్య యే నిచట వైనది యింత యేటికిన్. విరా. 3-225

క. యదుఁ డగ్రగతనూజుఁడు వా,హ్యాదయసముద్భవుఁడు వాఁడయిన మద్వచనం, బిదియేటిది యని కడుదు,ర్మదుఁడై చేయక కృతావమానుం డయ్యెన్. ఆది. 8—198

**ఏటిమడ** దే. వి.

ఏటి యొడ్డు.

సీ. అనఘుఁడౌద్దాలకియను మహాముని దన, తనయుని బిలిచి యిధ్మ ములు దర్భ, కట్టయు జలపూర్ణ కలశంబుఁ బువ్వులు మఱచి వచ్చితి నేటిమడఁ గుమార, కొనిరమ్ము వేగంబ చని. అను. 2-446

శ్లో. ఇధ్మా ధర్భాః సుమనసః కలశశ్చాభితో జలమ్, విస్మృతం మే తదాసీయ నదీతీరాదిహా వ్రజ. సం భా. అను. 71-5

**ఏటిమాట** దే. వి.

ఎక్కటిమాట, వృథావచనము, అనవసరపు మాట.

చ. ...అ,వ్వనిత దరస్మిత స్ఫురిత వక్త్రముతో నిదియేటి మాట న,ల్లని యెడ గానగాదె తెమలం బలుకం బనియేమి నావుడున్. అను. 1-186

క. ధృతరాష్ట్రిందును బుత్త్రిలు, నతిలోకంబునఁ బ్రజాతుయము నేసిరి ధ,ర్మతనూజు గెలువవచ్చునె, మతిలేరై రింక నేటి మాటలు మనకున్. భీష్మ. 8-227

**ఏటు** దే. వి.

బాణ ప్రయోగము, బాణపుదెబ్బ.

ఉ. ఏటుల ప్రమొగ్గవాతిగని యించుక కొంకక. విరా. 8-168

వి. అని యిప్పిధంబున నతం డేటు దప్పిన జోహారు వెట్టుటయు (ఏటు దప్పు = బాణప్రయోగము విలిచిపోవు).

**ఏటులాడు** దే. అ. క్రి. (ఏటులు + ఆడు)

బాణములతోఁ బోరు, పోరు.

క. ఆటిముతి నడరిన రథికుల, తఱచునకు సుభద్రకొడుకు దలఁకక

తా నం,దఱ కన్ని రూపులై యే, త్తెఱ నవ్వుచు నేటులాడె ధీరత
మెఱయన్. భీష్మ 2-88; ద్రోణ. 3-267

ఏట్లాడు దే. అ. క్రి.

ఏటులాడు.

బాణములతోఁ బోరు, పోరు.

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాఁడీవి గర్జున కిట్లనియె.
విరా. 5-87; ద్రోణ. 3-180

ఏడ దే. వి. ఏ (ఏ$^2$+కడ) ఎక్కడ

(అసంగతము-పొసఁగమి తెల్పును.)

చ. అసమున మీఁదెఱుఁగక మహోగ్రవా వృత్తిఁ గడంగి చెచ్చెరఁ
బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడ.
యొం,టి సనుట యేడ వాకిది కడింది విచారము పుట్టె.
విరా. 5-234

తరువోజ :- ఏనేడ నింద్రాదులేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు.
అర. 2-47

ఏడిక వి. (సం. ఏడః)

మేఁక, గొఱ్ఱె.

సీ. శరభసింహవ్యాఘ్రమ సత్త్వచయంబుల నేడికలెల్లట్ల యెక్కియాడి.
ద్రోణ. 2-210

ఏడు దే. సర్వ.

1. ఆఱునొకటి.

సీ. ఏడు సాగరములు నిక్కడక్కఁబెట్టి, పలుచని రొంపిమై నలఁది
కొనఁగ. విరా. 2-134

క. విన నేడగు పర్వము మేఁలనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల
య,య్యోనిమిది పర్వములను. ఆది. 1-47

2. సప్తవ్యసనములు. ఇవి 1) ద్యూతము 2) వేఁట 3) స్త్రీ 4) మద్య
పానము 5) అర్థదూషణము (ఇవి కామజములు) 6) వాక్పారుష్యము.
7) దండ పారుష్యము. (ఇవి క్రోధజములు).

తే. ఒకటి గొని రెండు నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

ఉద్యో. 2-87 చూ. వివరణమునకై 'ఒకటె'

## ఏడుగడ దే. విణ. ఏడుగడయు

భారత ప్రయోగములన్నియు 'యు' వర్ణకము తోడనే కన్పించుచున్నవి రెండును ఇంచుమించు సమానార్థకములుగనే యున్నవి. 'యు' వర్ణము సముచ్చయముగా భావించిన ఏడుగడ విశేషణము అగును, కానిచో అవ్యయమగును.

రక్షకుఁడు.

ఆ. బాలకేళిమీఁది భరము గ్రమంబున, విడువఁ గళలయందు వేడ్కఁ బొసఁపి, నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవకాదె.

విరా. 1-251

తే. తొలుత నీవు నన్నడిగిన దొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేడు గడయు నదియ, సమరమున దేవదానవ సమితినైన, గెలుచు నక్రమమున దానిపలన నతఁడు.

విరా. 4-120

ఆ. అనిన నట్లకాక యఖిల ధర్మజ్ఞాన, ఘనుఁడు మనకునేడుగడయుఁ గాన, శౌరి నిశ్చయింప సంశయం బేటికి, సంఘటింపుఁ డుగ్రసమర విధము.

ఉద్యో. 4-93

## ఏడుగడయు అవ్య. ద్రు.

1. సర్వము, సమస్తము.

ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టిన యిండ్లను, బెద్దకాలమునికి తద్ద తగదు, బతులకడన యునికి సతులకు ధర్మవు, సతులం కేడుగడయుఁ బతుల చూవె.

ఆది. 4-65

2. శరణ్యము, గతి.

వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుఁడవు విశేషించి నాకేడుగడయు నీవ కావున నీకును మదియె హితంబవశ్య కర్తవ్యంబు.

కర్ణ. 1-54

శ్లో. భవాన్ ప్రాజ్ఞతమో నిత్యం మమచైవ పరాగతిః-

సం. భా. కర్ణ. 11-23

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల, నేడుగడయుఁ గాన హితము నెప్పఁదగు బలాధినాథుఁడుగఁ జేయ నర్హుని,నెల్ల వినఁగ నిశ్చయింపవలయు. శల్య. 1-77

శ్లో. గురుపుత్రోఽద్య సర్వేషా మస్మాకం పరమాగతిః,
భవాం స్తస్మాన్ నియోగాత్తే కోఽస్తుసేనాపతిర్మమ.

సం. భా. శల్య. 6-18

**ఏడునూఱు** దే. సర్వ. (√ఏడు)

ఏనూఱులు, ఏడువందలు.

తే. ఏడునూఱు రథంబుల నేపుమాపె. విరా. 8-214

**ఏడుమ్రొక్కులు** దే. వి.

నమస్కారములు.

ఆ. అనఘ యేడు మ్రొక్కు లాబృహస్పతికి మ్రొక్కెద నతండు నన్ను నదయవృత్తి. నపహసించి తాను యాజకత్వమునకు, నెట్లుఁ గోరకయున్న నేను బోయి. అశ్వ 1-75

(ఏడు మ్రొక్కులు = అనేక నమస్కారములు)

(వేయు మ్రొక్కులు అని—పాఠాం)

శ్లో. సంవర్తోఽయం యాజయితా ద్విజోమాం
బృహస్పతే రంజలిరేష తస్య,
నచైవాహో యాజయిత్వా మహేంద్రం
మర్త్యం సంతం యాజయ న్నద్య శోభేత్. అశ్వ 9-16

శ్లో. మరుత్తో బృహస్పతే రంజలిం ప్రాహిణోత్సః, అశ్వ. 9-22

**ఏడ్చు** దే. అ. క్రి.

రోదనము సేయు, శోకించు.

సీ. ...ఒక్కరుఁ బలువురిట్లు, సంపితి రిది మీకు సంతోష కాలమే యేడ్తురుగా కార్వనేల చెపుడ. ద్రోణ. 2-254

సీ. ఎలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు, విరా. 4-80

ఏడ్తెఱ దే. వి.

1. అతిశయము.

ఉ. ఇమ్మహనీయ రూపమున నేడ్తెఱఁ గన్గొని వేడ్కనీకు యోగ్య
మ్మగు భంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ యొండుగాదు. విరా. 1-226

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్య జాతియే,
యీహరిణాక్షి చెల్వమున నేడ్తెఱ చూడ్కుల నాఁచి కోలకాదు
విరా. 1-295

2. ఏపు, చేవ, విజృంభణము.

చ. మఱియు నొకండు వించె పవమానతనూజుని చెయ్యిఁ బెన్గదల్,
వితిగి ధరిత్రిఁబడ్డయెడ వేగమె వచ్చి శిరంబుఁదన్నె నే,డ్తెఱ గల
యప్పు శత్రు నవధీరితుఁజేయుట యొప్పుఁగాక యే, పతిఁ బరా
భవించిన జనావళి నవ్వరె నొవ్వరే మదిన్. శల్య. 2-387

సీ. అక్కుమారుఁడు దరహాసాభిరాముడై భల్లమొక్కటి దొడ్గి విల్లు
దునిమి యేడ్తెఱ నిరువదియేను దూపులు వడి నతరింప
శల్య. 1-254

మ. తఱికిం జొచ్చి కడంగిపోరు విజయున్ దౌరవ్యలం జూచి
యే,డ్తెఱఁ బాంచాల సుతుండు సత్వరగతిం దేరద్దైన్ సారథిం,
బఱపం బంచి. భీష్మ. 2-253

క. నిమఁ దలపడఁ జూచిన యీ,తని యేడ్తెఱ మంట నొరఁగఁ
దలఁచు మిడుతయ్యెబ్బన కెనయైనాకుం దోఁచిన యది భ్రమందింపు
మింతని శిత విశిఖములన్. కర్ణ. 2-348; కర్ణ. 2-368

3. వడి, వేగము, రయము.

క. కేకయులేపుర బలములు, నాకులతం బొంద మార్గణాసారమునం,
జీకాకు పఱిచె భీష్ముఁ డ,నేకగతులఁ దన రథంబు నేడ్తెఱ మెఱ
యన్. భీష్మ. 1-201

క. ఒక్కఁడవి కడఁగి రథికులు, పెక్కండ్రు విశాత విశిఖ భీమాకృతిఁ

వే,రుక్కునఁ బొడివిరి నరు నత(,డెక్కుడు మద మొలయఁ జేతి
యే_ర్తెఱ సూపెన్. (ఏ_ర్తెఱ = లాఘవము) ద్రోణ. 3-42

4. పూనిక.

మ, విరథుండై పాలివోని తీరమునఁ బృథ్వీభాగ సంచారియై, శరజాలం
బుల భీమ సేనుఁడు డాశ్చర్యంబుగా నీ మఱం,ది రథం బే_ర్తెఱగప్పి
కర్ణ. 1-149

5. శ_క్తి, సామర్థ్యము, నేర్పు.

చ. ...రూఢికి నెక్కిన సూతవృ_త్తిమై, నని నడిసన్న యే_ర్తెఱ బృహ-
న్నలకుం గలదంబుజాననా. విరా. 4-15

చ. ...ఎల్లెడల నాతని బాహు బలాఢ్యుఁడైన యొ,క్కని రథ మే_ర్తె-
ఱం గడపఁగా నియమింపుము రాజనందనా. విరా. 4-35

6. పరాక్రమము

ఆ. ఇట్లు దొరలు నొవ్వ నే_ర్తెఱఁ దనచేతి, కొలఁది సూపి క్రీడి నెలఁగి
దేవ,దత్త మొత్తుటయు. విరా. 5-67

ఉ. ...తమునిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం,పెక్కిన పాండునంద
నుల యే_ర్తెఱఁ దొల్లియుఁ దారెఱుంగరే. ఉద్యో. 4-64

7. తేజస్సు, కాంతి.

ఉ. ...నేల, కెం,పెక్కుచు వచ్చె దీవియల యే_ర్తెఱ నోయగమందెః
విరా. 2-319

ఉ. అప్పుడు భీష్మతేమి హృదయంబుల నుమ్మలికంబు గూఁడగా,
నెప్పటి చందముల్ విడిచి యే_ర్తెఱఁ దక్కిన చూడ్కులొండొరు-
|నెప్పల మాటునం బొంయ నీ సుతుపాలికి వచ్చు రాజులం,
దిప్పు డతండు రావలవదే యని కర్ణుఁ దలంచి రందఱున్.
ద్రోణ. 1-14

8. ఉత్సాహము.

క. తలచుట్టు చుట్టెఁ గుండల,ములు పెట్టెను దిండు గాఢముగఁ
గట్టెఁ గరం,బుల వలయంబులు గమఁగొని, యొలన వ్రాలయంగ
నెక్కె నే_ర్తెఱ రథమున్. విరా. 4-165

సీ. అంత శల్యుండును శాంతనవుండును, నతనికిఁ దోడ్పడి యదరి భీము
ఆ- వేయఁ దొడఁగుటయును నేత్తైఱ ద్రౌపదేయులును దామఁ
గవిసి యుగ్రగతిలఁ, బటు రయమున్మై సుభద్రాసుతుండు దుర్వార
విశిఖతతుల వారిఁ బొదివె. భీష్మ. 2-284

**ఏడ్పు** దే. వి.

రోదనము.

ఉ తిట్టులఁబోయి యక్కొలువు తేఁకువ వారలలోని కింతిఁదానట్టులు
దుస్సనేనుఁడదయాకృతి ముం దలవట్టి యీడ్వఁగా, నెట్టు సహించె
మామ సతి యేడ్పుచెలుంగున కెట్టులోర్చె.
ఉద్యో. 1-847; ద్రోణ. 4-194

**ఏణము** సం. వి. అ. పుం.

పెద్దకన్నులుగల నల్లయిఱ్ఱి.

ఉ. ...ఎంతయు నుదగ్రత నా బకవైరి గ్రక్కునన్, వాని నడంగ
బట్టి వడవైచి మహోగ్రత నాక్రమించెఁ బంచానన మేణముం
బొదువునట్లు. విరా. 1-850; శాంతి. 5-882; మౌస. 82

**ఏతద్** సం. సర్వ. (ద్)

ఈ (ఇది సమాస పూర్వపదముగానే తెనుఁగున నుపయుక్తము)

వ. జనక సులభా సంవాదం బను నితిహాసంబు గలుగు దాన నేతత్పం
శయంబు వాయు దానిం జెప్పెద వినుము. శాంతి. 6-169

వ. ఏతద్వ్రతానుష్ఠానంబు. అశ్వ. 4-79

వ. ఏతత్ప్రయోజనంబు.
శాంతి. 3-53; శాంతి. 4-387; శాంతి. 5-228

**ఏతదీయము** సం. విశ. (అ. ఆ. అ.)

దీనిది.

వ. నాఁడు కథప్రసంగ వయిన నిన్నునేతదీయంబయిన యర్థజాతంబు
వినిపించితివని యప్పురుషవరుతోడం బుధుషోత్తముండు వెండియు
నిట్లనియె. అశ్వ. 1-226

**ఏతన్మాత్రుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఇంతమాత్రమువాఁడు, సామాన్యుఁడు.

శా. ...మాద్రి పిన్నకొడుకేతన్మాత్రుఁడే చూడఁగన్.

విరా. 2-209

**ఏతాదృశము** సం. విశ. (అ. ఈ. అ.)

ఇటువంటిది, ఈ విధమైనది, ఇట్టిది.

క. మహితాత్మక యేతాదృశ, మహిమంబు సువర్ణమది సమంచిత తేజో,మహనీయము తద్దానము, మహాత్త్వ మా శివుఁడ యెఱుఁగు మాకుం జూడన్. అను. 8-152; అర. 6-192

**ఏతెంచు** దే. అ. క్రి.

ఏఁగుదెంచు.

1. చనుదెంచు, వచ్చు.

తే. వేడఁ దొడివ్రూసికట్టి యవ్విరటుఁ డుత్త,రుండు దోఁ జనుదేరఁ గొల్చ్వారు బుద్ధి,నచటి కేతెంచి కని విస్మయంబు నొంది, యెల్లి దంబుగఁ దలఁచుచు నిట్టులనియె. విరా. 5-317; విరా. 2-318

2. తీపికొనివచ్చు.

సీ. ...యాదవేంద్రు, శవము సుస్నాతంబుఁ జందన చర్చా స,మేతంబుఁ జీనాంబరాతిశోభి -తే- తంబు నాభరణ స్ఫురితంబు మాల్య,యోజితంబును గాఁ జేసి యాజక ప్ర,యుక్త మంత్రతంత్ర స్ఫుట యోగమిం పొ,నర్ప నేతెంచె సామగానంబు సెలఁగ.

మౌస. 141

**ఏది** సర్వ. ఏది (√ఏ[3] - ఏ శబ్దమునకు అమహన్మహత్యర్థక ప్రథమైక వచనము) బహు. ఏవి (అమహదర్థకము)

1. ప్రశ్నార్థకము.

ఆ. ఏది కులము నామమెయ్యది యెవ్వరి,దానవు. విరా. 1-812

ఆ. దీనికేది తుది యుపేంద్ర. స్త్రీ. 2-44

క. ...సంజయ, కై వారము సేసె దీవు కౌంతేయుల వా,రేవిరణ సాధనమ్ములు,గా వెఱవక నడచువారు కౌరవుల పయిన్.

ఉద్యో. 2-227

ఆ. ఏది కారణముగ నెవ్వరెచ్చోట నీ, కేమి కీడొనర్చిరి.
విరా. 2-156

2. యచ్ఛబ్దార్థకము.

'అది' అను దానితో అన్వయము నపేక్షించును.

తే. ...పార్థుండు బయలు మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని, కేది దగు నది సేయుము మేదినీశ. విరా. 5-368

మ. ...హితము ధర్మంబున్ విచారించి చూచి తగుం బొమ్మని యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు,న్నతిఁ బొందంగల నారమై యునికి కృష్ణా నేఁడుగా వచ్చెనే. ఉద్యో. 3-80

3. కాకువును దెల్పును.

శా. బాలక్రీడ మహాసుర ప్రకరమున్ ఖండింపఁడే యెప్పుడుం, దైత్రి లోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపడే యట్టి శౌర్యాలం కారు మహాత్ముఁ డా సరకు సేయం డచ్యుతున్ మున్మతం, బేలా కైకొను నా సుయోధనుని యఁదెగ్గేది యూహింపఁగన్.
ఉద్యో. 2-145

ఎగ్గేది = ఎగ్గులేనేలేదు. అనఁగా అన్నియు ఎగ్గులే అని భావము.

ఏదు[1] అ. క్రి.

1. చెడు, తప్పు, తొలఁగు, నశించు.

క. అప్పుడుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ దగ వేది కరం బొప్పని తమకము చిత్తముఁ గప్పికొనుట మత్త లంబు గదురఁగ నచ్చెన్. విరా. 2-36

సీ. ఘోష యాత్రావిధిఁ గురురాజుఁ జెఱవట్టి, మానమేదిన చిత్రసేను కంటె. కర్ణ. 3-24

శా. పెంపేదం దమకిట్టి తక్కువలు రూపింపంగనేలా ? ఉద్యో. 3-108

తే. తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్ర హంబు గొనుట, కుమ్మలించి వివర్ణత వొందినట్లు. గంది యెంత యుఁ జెలువేదెఁ జందురుండు.
ఉద్యో 2-107; శాంతి. 4-112; శల్య. 2-228 (సం.ము)

2. ఉడుగు.

మ. ...స,త్వరతన్ నల్గడఁ గాంచె నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్లఁగన్.
శల్య. 1-302

ఆ. చలన మేది పుట్టుఁ జావునుం బిఱువెట్టి, యామిషార్థిజనుల నపహ
సించు, చెలిమి తోడలేమి కలిమి వాటింపని రమణమునికి యజగర
వ్రతంబు. శాంతి. 4-62

సీ. వెగడునఁ జెయ్యేది వేగంబ తేఱి సం,శప్తకు లర్జును సాయకముల.
(ఇది స. క్రి. యు నగును) కర్ణ. 2-229

3. లేనిదగు, పోయినదగు.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం, డిట్టట్టరుగంగ నుపాయమేది యొక
నిచేఁ, బట్టువడెఁ దనదు డెందము, పట్టువదలి చకిత వికల భావేం
ద్రియుఁడై. శాంతి. 3-198

స. క్రి.
పొందు.

శా. పాండుక్ష్మావరసూను సైన్యములు దర్పంబేదుడున్.
ద్రోణ 4-9-7

ఉ. ప్రల్లదమేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై, త్రె
ళ్లడు. సభా. 2-69

ఏదు[2] దే. వి.

ముండ్ల పంది.

వ. ఇట్లు విరథుండును విశిఖక్షత దేహుండునునై యతఁ డేదు వెరిగి
నట్లు నీదు మఱందియగు వృషకు నరదంబుమీఁది కరిగె.
భీష్మ. 3-80

ఏదువెరుఁగు; ఏదువెఱుగు దే. అ. క్రి.

ముండ్లపంది విజృంభించు.

వ. ఇట్లు విరథుండును విశిఖహత దేహుండునునై యతం డేదువెరిఁగి
నట్లు నీదుమఱందియగు వృషకు నరదంబు మీఁదికరిగె.
భీష్మ. 3-80

వ. సుభద్రా తనయుం డతని రథ్యంబులను సారథినిం జదియమోఁది మనజోదుల యమ్ముల నేదుడెలిగిన చందంబున సౌబలుని దెసకు నడచి యాతనికి నడ్డపడిన. ద్రోణ. 2-119

శ్లో. శరాచితాంగస్సౌభద్రః శ్వావిచ్ఛ్రత్రప్రతశ్చ దృశ్యత. ద్రోణ. 49-6

వ. అయోధ్యాధవరుండు దురగసారథి సహితంబుగా రథంబు శకలంబులుసేసి యతని తను వేదు వెలిగిన తెఱంగుగా మెఱుంగుటమ్ములు గిరికొల్పినం గెరలి యన్నిశాచర నాథుండు (ఘటోత్కచుండు) ద్రోణ. 5-207

శ్లో. సోఽదృశ్యత మహారాత్రేన శ్వావిచ్ఛ లలితో యథా. సం. భా. ద్రోణ. 176-55

సీ. ...అతఁడొండొక చాపమెత్తి తఱచుటమ్ముల నేదు వెలిగిన చందంబు, నేసె రయంబునఁ జిత్రసేను. కర్ణ. 1-97

(ఏదు వెలిగిన - అని సం.ము)

ఈ ప్రయోగములలో మొదటి ప్రయోగమునందు మాత్రమే ఆనంద, సం.ము లందు లఘురేఫము గన్పించుచున్నది. వెఱుగు = విజృంభించు అర్థములో శకటరేపమే నిఘంటువులఁ గానవచ్చుచున్నది.

**ఏనగు; ఏనవ దే. విణ.**

అదుదవ.

వ. ద్రుపదు నేఁటికి డెబ్బదియేనగు దివసంబునం బౌషమాసంబున శుక్లంబున నష్టమియు రోహిణి వాఁడు స్వయంవరం బని ఘోషింపం బంచి. ఆది. 7-24

వ. ఏనవనాఁటి రాత్రి సనుటయుం దెల తెలవేగునప్పుడు ధనంజయుండు సేనాపతి రావించి మకర వ్యూహంబు సంఘటింపుమని నియమించిన. భీష్మ. 2-344

**ఏనస్సు సం. వి. స్. న.**

పాపము.

క. మానసము లనింద్రియములు, నేనియుఁ జేయంగబడిన యేనః పుంజం

శ్రీనిర్మలేతిహాసము, వీనుల నొక్కింత సిలుక విరియు సకలమున్.
స్వర్గ. 88

**ఏనాళ్లు** దే. వి. బ. (ఏను + నాళ్లు)
అయిదు దినములు.

క. నానాస్త్ర శస్త్రచయ ఖడ్గానలమునం గవియఁ జేసి యత్యుగ్ర
త నే,నాళ్లన యప్పాండవ, సేనా సాగరము నివురఁజేయుదు
నధిపా. ఉద్యో. 4-418

**ఏని; ఏనియు** వేని (ఏన్ అనునది 'ఏనియున్' అను దాని సంక్షిప్త
రూపము)

1. (చేదర్థకము.)

(క) పక్షాంతరమును దెల్పును.

వ. నా వలనం బ్రయోజనంబు గొనవలయునేని నొండుమాటలు
దక్కి పనులం జరికింప నియోగింపుము. విరా. 1-286

(కొనవలయునేని = కొనఁదలఁచిన పక్షమున)

ఆ. ఎఱిఁగితేనిఁ జాల నెగ్గు వాటిల్లు (ఎఱిఁగిన పక్షమున) విరా. 1-47

మ. అది కాదేఁ దెగి బంటనై యఱుము (కాదేన్ = కాని పక్షమున)
ఉద్యో. 3-93; విరా. 3-3; కల్యా. 1-48

ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు,
లనృతదోష ఫలమునం దర్థ మొందుదు, రనిరి ధర్మవేదులైన
మునులు. (చెపకుండిరేని = చెప్పని పక్షమున) సభా. 2-237

(గ) వికల్పమును దెలుపును.

క. మానవ నాయక యగ్రజుఁడైనను నమజన్ముఁడేని నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీడైన నతఁడు దండ్యుఁడందు రవనీపతికిన్
అను. 4-136

(అగ్రజుండు గాని యనుజన్ముఁడు గాని) అర. 1-54

చ. సందేహములేమిని దెలుపును. -తే- పాండుపుత్రులం జేను దప్పని

ఏనిక వి.

ఏనుఁగు.

సీ. ఏనిక బదమున కెలయు తేఁటుల మొత్తములు. భీష్మ. 1-104

ఏనికపోరు వి.

ఒక యేనుఁగు మఱొక యేనుఁగుతోఁ జేయు యుద్ధము.

వ. తమ మ్రానేన లేనికపోరు సూచునట్లు సూడం బోరి పోరి

ద్రోణ. 4-262; శల్య. 1-171

ఏనికలావు వి.

ఏనుఁగు బలమంత బలము గలవాఁడు.

క. నీనమ్మిన భూరిశ్రవు,డేనిక లావు. శల్య. 1-26

ఏను[1] నేను (బహు. ఏము)

వ. ఏనును భక్తిమయంబగు సాష్టాంగదండప్రణామం బాచరించి.

విరా, 1-13

ఉ. ...వంకమాట లే, నేర. ఉద్యో. 8-96

సీ. ఏము సంపితమని యించుకేనియు నహంకారంబు వారికిఁ గలుగదు. అను. 5-58

ఏను[2] సర్వ. బొ.

1. అయిదు.

తే. రాధాసుతుం డేసె నిరువదియేను నారాచములు. కర్ణ. 2-212

ఉ. ...తదీయ దేహముల్, ధీరుఁడు సూచెఁ దాళసముదీర్ఘతఁ బొల్చినవాని నేనిటిన్. ఆది. 7-376

2. పంచజ్ఞానేంద్రియములు. 1) త్వక్కు 2) కర్ణము. 3) చక్షువు (కన్ను) 4) జిహ్వా. 5. ఘ్రాణము (ముక్కు).

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ఉద్యో. 2-37

చూ. వివరమునకై 'ఒకటి'

ఏనుంగు; ఏనుఁగు వి.

గజము, దంతి.

ఆ. వసుమతీశుపాల వర్తించు నేనుంగు, తోడనైన దోమతోడనైన, వైరమగు తెఱంగు వలవదు. (ఏనుంగు = మిక్కిలి గొప్పవాఁడు)
విరా. 1-189

క. ....తామర, కొల నేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ జొచ్చెన్.
విరా. 3-188

క. ఆ తే రయ్యేనుఁగెత్తె వాకసమునకున్. శల్య. 1-316

ఏనుఁగుకయ్యము వి.

ఏనుఁగుమీద నెక్కి చేయుయుద్ధము-ఏనిక కయ్యము.

వ. అక్కురునాథుం డేనుఁగు కయ్యంబునకు వెరవుగల గళింగ వంగాంగ మగధ సుహ్మ పౌండ్రాది దేశంబుల బలంబుల గవియించిన. కర్ణ. 1-342

ఏనుఁగుకొమ్ము వి.

అస్త్ర విశేషము.

క. అమ్ముల నేనుఁగు కొమ్ముల, నమ్మత్తగజమ్ము నొంచి.
భీష్మ. 2-246

ఏనుఁగునకు సిడులు సూపినట్లు; ఏనుఁగునకు సిళ్లుసూపినట్లు

జాతీయము.

ఏనుఁగునకు అంకుశములు చూపిన విధముగా, అంకుశములను జూచి యేనుఁగు విజృంభించినట్లు విజృంభించి-అని భావము 'సిడులు' అను బహువచన ప్రయోగము ఏనుఁగు విజృంభణాతిశయమును దెల్పును.

క. కనుఁగొని సాత్యకి యేనుం,గునకు సిడులు సూపినట్లు కోపంబున భీష్ముని మీఁదఁ గవిసి యుజ్జ్వల, సునిశిత భల్లంబు నేసె సురలు నుతింపన్. అను 2-267

తే. అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజపాటుఁ, జూచి యేనుంగునకు సిళ్లు సూపినట్లు, గవిసి హాయముల మత్స్య భూకాంతు తనయు,

స్యందనంబులు దురంగ మాతంగ స్యందనంబులు రూపఱిన నేపఱి
మెలంగు నయ్యై యారోహకులునై.

భీష్మ. 2-91; భీష్మ 3-289

క. మఱియును శరశతము మెయిన్. గిఱిగొలిపిన వృష్ణి వరుఁడు
గినియఁగలే కేపఱియున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీ తనయు
లుబ్బుమిగిలి నరేంద్రా. ద్రోణ. 3-271

ఏపారు దే. అ. క్రి. (ఏపు+ఆరు)

విజృంభించు, చెలరేఁగు

క. చాపాచార్యుఁడు సాత్యకి, చాపము దునుమాడి సూతు సమ్మూ
ర్ఛితుఁగా నే పారి యేయ రథవ్యాపారను దాన నడపి యతఁ
డని సేసెన్. ద్రోణ. 4-52

క. అపస్నిద్ధలు సైన్యాటోప సమేతముగఁ గవియుడును బాంచాల,
క్ష్మాపాలసుతుఁడు భీముఁడు, నేపారిరి నీదుసేవ యొసకం బడఁగన్.
భీష్మ. 2-378

2. అతిశయించు, ఎక్కువగు

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరముల సంధి నొక్క వఱపుఁ ధరిత్రీ
తాపంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పండ్రెం డధిపా.
శాంతి. 3-279

ఆ. దైవ విహిత మగుటఁ దప్పింపరాకున్న, యట్టి యల్పదుఃఖ మను
భవించి, తింక నిట సుఖంబు లేపార నాతోడ, విహరణం బొనర్పు,
విమల చరిత. స్వర్గ. 42

శా. ఈడం బోవక పిఁకమైఁ బొడువఁగా నేపారు ఘోరాజి.
ఆది. 1-69

3. శోభిల్లు, ప్రకాశించు.

సీ. దీని వసించుటఁ దా నొప్పి పెంపున, నేపారు మందిరం బెద్దియొక్కొ.
విరా. 2-30

సీ. కిసలయహస్త కెంగేల నేపారు క్రొమ్మిణ్ణంచను లేయెండ మిగులఁ
బర్వ. విరా. 2-37

4. ఒప్పు.

శా. ...త్లేమంగేమఁగఁ దాఁకునట్లు సమరంబేపారఁగా నయ్యేడన్. విరా. 5-181

5. అధికముగాఁ గలుగు.

మ. ...అప్డు మండపము సంక్షోభింపఁగా నేతుఁ గ,ట్టలుకన్ బెబ్బులి గోల వేసినటు లుగ్రాకార మేపారఁగన్. విరా. 2-281

ఏపు దే. వి.

1. ఔద్ధత్యము, గర్వము.

సీ నేలయు నింగియుఁ దాళముల్ గాఁజేసి, యేపునరేఁగి వాయించి యాడ. విరా. 1-184

శా. ఈకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యేపొప్పరెందుం దుదిన్, శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుంగూడఁబోవే నృపా. ఉద్యో. 4-24

2. పరాక్రమము.

క. .. నరుఁ డేపున ముట్టిన నతని పొంతఁ బోదుమె యధిపా. విరా. 4-198

3. బలము, శక్తి.

ఆ. యోగబలము లేని యొకళఁగి యోగి బల్, ద్రోపులేని, మీను నేపు లేని, మృగము వలయుఁ మరియు దెగిపోవ ముఱుకంగ, లేనియట్ల శవము లోనె పడఁగు. శాంతి. 5-578

4. అధిక్యము, అతిశయము.

సీ. ఏకారణంబున నేమయ్యెనో వానయేపునఁ దెగియెఁగా నొప్పు నకట. శాంతి. 8-810

ఉ యుద్ధముమీఁది వేడ్కయు మహోగ్ర విరోధుల నల్కఁజేయు ధర్మోద్ధతియున్ సుయోధనుని యున్నతి సైపని యేపు. ఉద్యో 3-65

5. ఉత్సాహము.

ఆ. అప్పు డేపడంగి యన్నిసేవలు భీష్ము,రథము పొంత, కొదిగె. విరా, 5-154

తే. ఏచి దుర్యోధనుండు చేపిచి యెలుఁగు, నూపి పురికొల్ప నెంతయు
నేపు మిగిలి, మనబలంబులు పాండుకుమార సైన్య, సమితితోఁ
దాఁకె నత్యంత సంకులముగ. భీష్మ 2-28

తే. అఁట వృత్తాంత మరయంగ నమదినంబుఁ, దగిన, వారలఁ
బుచ్చుచుఁ దలఁకుచుండు, నేను నదియాదిగాఁ జింత నేపుదక్కి,
గ్రుక్కియుండియు రాజుల నక్కుమఱఁతు. ఉద్యో. 4-161

6. విజృంభణము.

ఉ. ఆ పరమేశ్వరుం డితని కప్పుడు దివ్యరథోత్తమంబునుం, జాపము
నస్త్రకోటియుఁ బ్రసన్నత నిచ్చి రణంబునందు నీ,యేపున కోర్వ
దేవతల కేనియు దైత్యులకేని రాదు పొ,మ్మెపగఱని గెల్వుము
మహిం జరణం బిడకుండు మాటిలోన్. శాంతి. 2-437

7. విధము.

ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుము నేపు గనుంగొని యోహటించి
యి ఘ్రమ్మునఁ జెంపఱం దొలఁగెఁ గర్ణుఁడు. ద్రోణ. 2-55

మ. ...కుంభజుండు విలసద్దోర్దండ చండాకృతిం, దెరలం జైఁ జను
దెంచు నేపు మనలం దీర్పంగ నోపుం దుదిన్. ద్రోణ 5-303

8. అనురక్తి.

క. పాపంబులు కర్జము లఖి,యేపునఁ జేయంగ నవియ నిందగు
ధర్మ, వ్యాపారంబు లకార్యము,లై పరిణతిఁ బొందెనేని నట్టుల
చేల్లున్. ఉద్యో. 2-69

9. వాఁడిమి.

వ. ...కృపాచార్యుల తూపుల యేపు రథ్యంబుల నొంచి సారథి
గ్రొవ్వడంచి యాద్రుపద నందను తనువు నెత్తుటం దోఁచి
యుల్లంబు గలంచె. కర్ణ. 1-155 (చూ-కర్ణ. 1-168)

10. శ్రమము.

తే. చేసినది సేయుచున్నది సేయవలయు,నది యనంగఁ గార్యంబు
లందుఁ దగులు. వాని మృత్యు నేపునఁ దనవశముఁ జేయుఁ, గాన

నేపు రేఁగి, మఱియమోఁదఁ గాలిఁబటు ప్రమాఁకుగముల తెఁలంగు దోఁచెనే మనంగఁ గలదు. మౌస. 5-8

ఆ కౌరవేంద్రుఁ డాదిగాఁగల భూపతు, లెల్ల నలిగి కలయ నేపు రేఁగి ఆది. 7-188

## ఏప్రొద్దు వి.

ఎల్లప్పుడు, ఏనాఁడు.

క. సౌబలు నీతియుఁ గర్ణుభు, జాబలమును గూడి తనకు సామ్రాజ్యం బిఁగా బలసి వెలయువాఁడై, యాజే లూఁఅడు మనంబునం దే ప్రొద్దున్. కర్ణ. 1-222

## ఏమఱు దే. స. క్రి.

1. మఱచు

ఆ. ...వాదుపతులు వెరపు లావు, నలఘు విక్రమంబుఁ గలుగు గంధర్వు లేమఱరు నన్ను నొక్కమాత్రయైన. విరా. 1-328

2. ఉపేక్షించు, అలక్ష్యము చేయు.

సీ. ...చేరు నృపులకు వైరబంధ-ఆ-మెట్లు గలుగు దాని నేమఱకుండుము. వారి యపులనున్నవారు మిత్త్రిలగుదు రెల్లభంగి నధిపయుదాసీను,లట సమీప వర్తులైన విభులు. ఆశ్ర. 1-68

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రికుల భీషణ రోషుఁడు చిత్తమెప్పు డెల్లై మదమెత్తువో యతని యాగ్రహ వృత్తికి లోనుగాక మీ,రేమెయినైన వంచన వహించి తొలంగుట మత్స్యమీహితం, బేమఱకుండఁ గావలయు నిర్విషమార్గములోన వాతనిన్. విరా. 1-177

క మఱచు నొకో మఱవకుండియు, నెఱుఁగక యుండునొకొయనలు డెటిఁగియు నెడ నే,మఱునొకో పుత్త్రిలఁ గావఁగ. ఆది. 8-814

అ. క్రి.

ప్రమాదపడు, మైమఱచు, జాగ్రత్త లేకుండు.

క. మన వంశంబున వృత్తం,బును కెంపును గానఁజాలు పుణ్యాసతి విదు, ర్జనులగు తులువం తలఁపులు,గన్నుఁగొని యేమఱక మెలఁగఁగాఁ వలయుఁజూమీ. విరా. 1-112

తే. మరగి నీమూర్తిపైఁ గన్నుమనముఁ దగిలి,యుండనేమతి యుండి
యొకొక్కమాట, దలఁచికొని వారిదెస మదినిలుపు నప్పు,డెఱుఁగ
నగువారు తెలఁగెఱుఁగుసెల్ల. విరా. 2-202

చ. ...ఏ,మతి కయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై.
ఆది. 6-194

ఏమి దే. సర్వ. ఏ. ఔప. అవ్య.

(ఇది వాక్యముచివర నున్నపుడును దీనికి హల్లుపరమైనపుడును వైకల్పికముగా 'మి' లోపించును)

1. యత్కిమర్థకము, ఏది, ఏ.

సీ. ...తానుబరుల...గీ...దిక్కు పలుకక దివియెల్లఁ జిక్కటిలఁగఁ,
దానయున్నట్లు గనుచు నేమేని గుడిచి. శాంతి. 5-142

క. ఏమి కులంబున వాఁడొకో, వామం బెద్దియగు నొక్కొ.
విరా. 1-216

క. చీఁకటి రేయొదవ నేమిసేసెదొ చెపుమా. విరా. 2-271

క. నన్నడుగనేల నీవును, నన్నిచుఁడు నేమి మాటలాడితిరి.
విరా. 2-278

ఉ. ఇయ్యరవిందగంధి కులమేమి చరిత్రము చందమెట్లు పే,రె
య్యది. విరా. 2-40

ఆ. తనది యవశ యేమి ధనమునఁ బ్రియమందు, నెద్ది కుదువకుండ
నెసఁగు దృప్తి. శాంతి. 5-198

క. పురుషుం డేమిట సుఖియగు. (ఏమిట = దేనిచేత) శాంతి. 4-89

వ. ఆశ్వికు లొక్కమొగిఁ జెక్కివం దునిసిపడి యేడింటి యంగంబులో
యను సందేహంబునకుం బట్టయి యున్నపదాతి గాత్ర ఖండంబు
లును. (ఏమిటి = ఎవరెవరి) ద్రోణ. 1-377

క. మనకడకు నేమిటికి వచ్చెనొకో. విరా. 1-187

(ఏమిటికిన్ = ఎందులకు - అని భావము)

తే. ఏమిటికి కర్ణ తీవు నటు లేటికిఁ దిట్టితి. ద్రోణ. 4-288

(ఏటికిన్ = ఎందులకు - అని భావము)

సీ. (అర్జునుఁడు) రామకృష్ణులు తపోరతులై ప్రవర్తించు, వనభూమి యారసికొని తదీయ సందర్శనమునకుఁ జనియెదనని వారి, నా మంత్రితులఁ జేసి యేమి యనుచు - అ - టకుమ శోక మార్చుటకును దారుకుఁడాదియయిన తగిన వారి నర్థావచన, రచన మెఱయఁ బనిచి యుచితాప్త కతిపయ, జనులు దోడరాఁగఁ జనియె నధిప. మౌస. 155

(ఏమి యనుచుటకును. ఏది కావలసిన నది పంపుటకు)

అవ్య.

ప్రశ్నార్థకము.

1. (ప్రశ్న).

వ. కురువంశ నిస్తారకా, నీరాకకుం గారణమేమి. అశ్వ 4-89

వ. మహాత్మా నీతలం బేమి యని యడిగిన. శాంతి. 3-288

2. 'లేదు' అని అర్థము.

క. మును లోకము ధర్మపరుం, డనఁ బరఁగినవాఁడ విట్టు లనుచిత కృత్యం,బునకుఁ జనుదగునె దీనం, గనియెదు ఫలమేమి దూష్య గర్వఁ జేలా. శల్య. 2-289 (ఫలములేదు అని భావము)

ఉ. వైరివడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి (కన్నది లేదు అని భావము) కర్ణ. 3-224

3. నిర్లక్ష్యమును దెల్పును.

ఉ. అర్జునుఁడైన నేమి సురలైనను నేమగు విద్వివచ్చిరో, పార్థిత మైన గోధనముఁ బట్టితిమి, విరా. 4-186

4. అవసరములేమిని దెల్పును.

వ. ఇది నేసిరేమి నేయరైరేమి యమ్మహాత్ము నెడ నీ యపకారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ములలకాక యని పలికి ఉద్యో. 3-172

5. ప్రశంసను దెలుపును.

ఉ నీవును జూచి తట్టసభ నేని వినంబడ దేయుగంబులన్, భూవలయం

బులో నదియపూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో,గావహ మే,క్రియం బడసె నయ్య మహాత్ముఁడు దానవేమి సం,భావిత భాగ్యుఁ డయ్యెను బ్రభాకర తేజుఁడు ధర్మజుం డిలన్. సభా. 2-95

(ఏమి భాగ్యుఁడు = వింత ప్రశంసనీయమైన భాగ్యముగలవాఁడు)

క. ఏమితపంబొ రెంచితి, భూమీశ్వర పుణ్యలోక భోగంబులఁ దే,జో మహిమ ననుభవించితి. ఆది. 8-208

(ఏమి తపంబు = ఎంత ప్రశంసనీయమైన తపస్సు).

6 ఆశ్చర్యమును దెలుపును.

వ. ధృతరాష్ట్రిం డిది యేమి రభసంబని విదురు నడిగిన.

ఆది. 6-21; విరా. 5-272

7. ఏ మాత్రమును అను నర్థము నిచ్చును.

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచునుండు నాకు రే, లేమియు నిద్రరాదు ఉద్యో. 2-185

క. అనుజులకు నడ్డపడి యే,మినిజేయఁగ నేమిఁజూచి మెచ్చితిఁ గాక. (ఏమియు = ఏ మాత్రమును, ఏ కొంచెమైనను.) ఉద్యో. 2-13

8. విధి ఆశీరాద్యర్థకంబగు 'కాక' ప్రత్యయంబుపైఁ జేరి కార్యసిద్ధి యందు నిశ్చయ భావమును దెలియఁజేయును. నిశ్చయార్థద్యోతకము

క. అ హైశ్వర్యము గ్రమ్మఱ, మాయుటకుం గారణంబు మాన్యచరిత తే,దే యొక్క దుష్కృత మది యటు, సేయుంగాకేమియేల చింతింపంగన్. (సేయుంగాక—సేయును)

శాంతి. 5-204; ద్రో. 1-85

## ఏమని

ఏమి కారణము చెప్పి, ఏ కారణమున.

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమున దపము సేఁత యిది నిర్ణయ మే, నెవ్వారికడకు నేమని, యెవ్విధిఁ బోనేర్చుదాన నేటికి బంధుల్. ఉద్యో. 4-287; (ఇట లజ్జను సూచించుచు)

## ఏమిగ; ఏమిగా ఎట్లుగా, ఎట్లు

చ. ...ఈతనిఁ బంపకుండ నేమిగ సమయంబు సేసితి. కల్య, 2-125

చ. ...వార్తలేమిగాఁ, ఖురవరఁ బొక్కుచున్ వినఁగ బుద్ధిఁ దలం
చెద. ద్రోణ. 1-102

ఉ. చిక్కని పోటుమూఁకసి విసీ విను వారలు నవ్వ నేమిగా, నెక్కుడు
మాటలాడెదవు. ఉద్యో. 1-253

ఏమిర టరి

ఉ. ఏమిర కర్ణ నీము నటు లేటికిఁ దట్టితి, ద్రోణ. 4-288

క. ఏమిర పసులసి యార్వవు కర్ణ. 3-221

ఏమీ ఏమి. సర్వ. (ఏమి+ఈ)

కిమర్థకము.

1. ప్రశ్నమును దెలుపును,

క. తామరసనేత్ర నీ పే,రేమీ యెవ్వరి తనూజ విశ్లేల మహా,వ్యా
మోహితవై తనవుడుఁ, గోమలి సురరాజపుత్రకున కిట్లనియెన్.
ఆది. 8-129

2. సందేహమును సూచించును.

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన స్తోమం
బుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే. విరా. 3-189

3. కౌతుకమును దెలుపును.

క. ఏమేమీ యని గోప,స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి
వొదలన్, భూమీశుఁ డవుడు మంత్రుల, మోములు గనుఁగొని సగ
ర్వమున నిట్లనియెన్, విరా. 5-241

4 మేల మాడుటను (పరిహాసమును) దెలుపును.

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్యసం,గ్రామ
క్షోభము తావుదర్పమునఁ దీర్పం బెద్ద మిట్టెక్కి మీ,మ్మె మెల్లన్
వెఱఁగంది చూచెదముగాక. ఉద్యో. 3-65

5. అనాదరమును దెలుపును.

క. ఏమీ తగనుతు ధర్మము, నీమనమున నేఁడ పుట్టెనే గర్వము ను,
ద్దామ దురభిమానము, లా ఘటచిత కర్ణ యాచలం బెట్టు
వోయెన్. కర్ణ. 3-358

6. క్రోధమును సూచించును.

క. ...ఏమేమీ నోంచెనె, యినుఁడు నినుం దత్ఫలంబు నిప్పుడ
కుడువం గనియెదుఁగా కష్టానల, మునఁ బొదివెద నతని నసియె
ముని గోపమున్. అను. 3-259

## ఏమొ; ఏమొకొ; ఏమొకో (√ఏమి)

ఊహను దెలుపును.

క. వెడ తంత్రీపాలుం డనఁ, గడుహీనత విరటు పసులఁ గాచితి నౌ నీ
పుడమిగలదేమొ యను మ్మా,నడి కోర్చితిగాక నీకు శౌర్యము
గలదే. ఉద్యో. 4-201 (పాఠాం)

క. ఇట్టివి యెల్లను గనుఁగొను, కట్టిడితన మొందునట్లుగా నేమొకొ
తొ,ల్పుట్టువునం జేసితి నీ,చుట్టల నిటు చూడకుండఁ జొప్పడ
దయ్యెన్. స్త్రీ. 2-24

సీ. ... మోదమగ్గలమయి మీయందుఁ గానఁబడదెయెఁ - తే. గారణం
బేమొకోయని గారవమున, నాతఁ డడిగిన. అను. 4-348

## ఏమో (√ఏమి)

1. సందేహమును దెల్పును.

క. ...మీ,లో నభిమన్యుఁడు లేఁడే,మో నాకుం జెప్పఁ డేల యూరక
యుండన్. ద్రోణ. 2-283

2. ఎందుచేతనో.

క. సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి
యరిగెద రదియే,మో నేఁడు వేణువీణా,గాన స్వనములును వీటఁ
గలుగవు కృష్ణా. ద్రోణ. 2-228

## ఏయది ఏది (ఏ + అది)

క. ఏయది భవదీప్సితార్థ మెఱిఁగింపవనా. శాంతి. 3-315

## ఏయించు దే. స. క్రి.

1. బాణములచేఁ గొట్టించు.

వ. ...శిఖండింబురికొల్పికొని మీ తండ్రి నేయించుచు నతం డెన్ని విండ్లెత్తిన నన్నింటిఁ దోడ్తోన తునుమాడుచుండె. భీష్మ. 8-394

2. చంపించు

క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ బోరంగ నేయించితి. శల్య. 2-326

**ఏయు** దే. స. క్రి.

1. (బాణాదులను) ప్రయోగించు.

సీ. సారథి నొచ్చిన తేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు సేయువారు విరా. 3-170

2. (బాణములతో) కొట్టు.

క. తదవసరంబున నొక్కఁడ, యిదియమ్ములు దొడి త్రిగర్తపతి వక్షంబున్, వదనంబు నేసి విరథుఁడు, మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్. విరా. 3-183

**ఏయూరికిఁబోవు** దే. జాతీ.

ఎక్కడకుఁబోవు, (కనఁబడకుండఁ బోవు, నశించిపోవు అని భావము)

ఉ. శూరుఁడ వంద్రు నిన్ మదువు సొచ్చుట శౌర్యము చొప్పెమాన మే, యూరికిఁబోయె. శల్య. 2-66

శ్లో. సతే దర్పో నరశ్రేష్ఠ స చ మానః క్వ తే గతః॥ సం. భా. శల్య. 32-20

**ఏరి**

ఎక్కడనున్నారు.

వ. ఇచ్చట ధర్మతనయుండ యేని భీమార్జున నకుల సహదేవులుం బాంచాలియు నేరి యని యడిగిన. (పాఠాం) విరా. 5-322

**ఏరు** దే. వి.

నొప్పి

క. తలయేరును నుక్కిసయు నుదల కొను దెంచెన్. ఆది 8-191 అర. 7-270

**ఏరునేల** దే. వి.

రెండు కోసుల దూరము.

ఆ. పరు నేల కోలఁది నెడనెడ విడియుచు, బోవవలసియుండె భూమి
భార,వహుల దప్పి యెఱుఁగువాఁడగు నాధర్మ,నందనునకు ధరణి
వాధవద్య. అశ్వ. 3-158

శ్లో. గోరుతే గోరుతే చైవ వ్యవసత్పురు షర్షభః,
సా పురాభిముఖా రాజన్నువాహ మహతీ చమూః
కృచ్ఛ్రాద్ధ్రివిణ భారార్తా హర్షయంతీ కురుద్వహాన్,
సం. భా. అశ్వ 65-21,22

(ఒకనాగటితో దున్నఁదగిన నేల-అని సూ.ఆ.ని)

ఏర్చికూర్చు దే. స. క్రి.

పఱిపఱి ఒకచోటికి జేర్చు, వేఱుచేసి యొకచోఁ జేర్చు.

సీ. చందురు నునుఁగాంతి కందేర్చికూర్చి భాగునకుఁ దెచ్చిన యట్లు
గోమరు మిగిలి. విరా. 2-52

ఏర్చికొను దే. స. క్రి.

ఎన్నికొను, ఏఱి తీసికొను (కావలసిన దానిని)

ఆ. మనము పూఁచిపట్టి మొనలేర్చికొన పోవఁ, బాండురాజ సుతుల
బలము గవిసి, గాసి చేయు. భీష్మ. 3-5; ద్రోణ. 2-270

ఏర్చు[1] దే. స. క్రి.

1. మండఁజేయు.

ఉ. ...అతఁడుం, జిచ్చున నేయి వోసిన విశేషము దోపఁగఁ భీమునొంచి
ము,చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జిత సేన.
భీష్మ. 2-277

2. దహించు, కాల్చు.

ఉ. ఖాండవ మేర్చె దేవతలు గానని యీశ్వరుఁ గాంచె. విరా. 1-85

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చు కరణి నేఁడు భీష్ముఁ డేచిన కడి
మిం, జేర్చి మన సేనఁ బొదివె. భీష్మ. 3-277; విరా. 4-37

క. రయమున మ్రింగుడు గాలము,క్రియ నెవ్వఁడు కంఠబలము
క్రిందికిఁ జన క,గ్నియపోలె నేర్చుచుండును. ఆది. 2-90

3 ధ్వంసముచేయు, నాశనముచేయు.

తే. వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన, శక్తి యీ భగదత్తుండు సమరంభుండు, గజమునెక్కి తా నేనికకయ్యమైన, నేర్చు నైరావణము మీఁదఁ యింద్రుఁబోలి. ఉద్యో. 4-232

ఏర్చు2 దే. స. క్రి. (ఏఱు)

1. (కావలసిన దానిని) ఏఱు, ఎన్ను, నిర్ణయించు.

సీ. గోడిగ జాతిలోఁ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు మార్దవంబు. విరా. 1—95

2. తీసికొను, కూర్చికొను.

క. అనుమాటకుఁ గాలానలుఁ,ముసు బోలెను మండి కయ్యమున కాయితమై, మొనలేర్చి వేగ యిచటికిఁ, జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. ఉద్యో. 4-310

శ్లో. గృహాణ సర్వం కౌరవ్య రథాది భరతర్షభ.

సం భా. ఉద్యో. 179.48

3. (వ్యూహముగా) పన్ను, నిర్మించు, ఏర్పఱచు.

ఉ. అంగలు నింతకున్ వెనుకలై మొనలేర్చచనంగ. విరా. 4-184

చ. ...భూ,వర భవదీయమైన బలవర్గము నొద్దన మేర్పవీఁకమైఁ, బుఱికొలుపంగ నిర్భయతఁ బోరెడు నట్లుగఁ దాను ముందరై, తిరముగఁ జేయఁజాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుగన్.

శల్య. 1-75

తే. భీష్మఁ డొద్దన మేర్చిన బెడఁగు సాల, నొప్పెఁ గౌరవయోధుల యుబ్బు మెఱసె. భీష్మ. 3-11

5. వేఱుసేయు, తొలగించు.

సీ. చఁదురు ననుఁగాంతి కంచేర్చి కూర్చి బాగునకుఁ దెచ్చిన యట్లు గొమరు మిగిలి. విరా. 2-52

6. పొందు, చెందు.

వ. విను దుఃఖంబులఁ దెగ ద్రోఁచిన పురుషుఁడు సౌఖ్యాసక్త చిత్తుఁడు

గాకారిన వైరాగ్యము తెందిన, ననుపమమగు పరమపదము నమ్మెయి నేర్చున్. శాంతి. 4-105

ఏర్పడు దే. అ. క్రి.

1. తేటపడు, స్పష్టమగు.

ఉ. ....నీ, విట్టి తెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం, బుట్టిన సంతసంబుననువుం బలికించియు కాదె. విరా. 2-278

వ. అని యేర్పడం బలికిన. విరా. 2-159

క. జననుత కృష్ణ ద్వైపాయన ముని వృషభాభిహిత మహాభార తీయు క్తిమెయిన్. ఆది. 1-16

2. కంటికిఁ గనఁబడు.

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్క కాంత రూ, పెక్కుడు పెంపుసొంపు మనకేర్పడుచున్నది. విరా. 1-303

క. వడిఁబడియెఁ బిడుగు లుడుగక, వడఁకె మహీతలము పాంసువర్షము గురిసెం, గడునెట్టనయ్యె దిశ లేర్పడకుండె వినుండు తిమిరపటలా వృతుఁడై. అర. 8-369

తే. ఊరు మూల మేర్పడఁగ నయ్యువిద వలువు, దొలఁగె ననిలంబు చేత విధూతమగుచు, నమరులెల్లఁ బరాఙ్ముఖులైరి దాని, సాభిలా షుఁడై చూచె మహాభిషుండు. ఆది. 4-122

3. తెలియు

క. ... కీచకుఁడు సచ్చిన పిమ్మటఁ బుట్టినవిశేషము లెల్లన్, విను వేడుక మన మలరెడు, ననఘా యేర్పడఁగఁ జెప్పుమనుటయుఁ బ్రీతిన్, విరా. 2-362

సీ. అభిలాష మేర్పడు నట్లుండఁగా బల్కు, వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు. ఆది. 8-88

వ. అక్కేశినిం జూచి యిక్కుమారు లిద్దఱు నా కొడుకునుం గూఁతు నుం బోలిన పీరి నెత్తికొని దుఃఖించితి నవి తన్నేర్పడకుండం బలికి దాని కిట్లనియె. అర. 2-199

4. వాసన గొలుపు, పరిమళించు.

వ. దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడు నట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజన గంధి యనియుఁ బరఁగి. ఆది. 3—41

5. ప్రకటితమగు, బయల్పడు.

క. అడరిపడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వంబై యే, ర్పడఁ గరి హయ నర నికరము, బడలువడం దఱిమె నలి నభశ్చరులార్వన్. విరా, 3-174

వ ఇల్వలుండును మునివరు శక్తికి భయంపడి విషణ్ణుండయ్యును బ్రసన్నుండ పోలెఁ దన వంచన యేర్పడకుండఁ గృతప్రణాముండై తదాగమన ప్రయోజనం బడిగిన వానికి నగస్త్యం డిట్లనియె. అర. 2-343

6. కలుగు సంభవించు.

చ, ...కౌతుక, స్ఫురణఁ గరంబు దత్కారముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్య వి,స్తర చతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితో. విరా. 1-209

వ. గర్భయోని యందు ఋతుపుష్పరస సంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితం బయి కలసిన నందుఁ బంచతన్మాత్రలు పొడవయి క్రమంబున నవయవంబు లేర్పడి లబ్ధజీవులయి యుద్భవిల్లి. ఆది. 3-221; శాంతి. 6-209

7. ఒప్పు.

క. రాజవాహనములగు, వారువముల నతయ నేర్తు వల నేర్పడఁగన్ విరా. 1-261

8. సందేహము తీఱు, అనుమానము తొలఁగు.

ఆ. అనిన నీ తలంచినట్ల కాదేర్పడ, వినుము నాదుపతులు వెరవులావు నలము విక్రమంబుఁ గలుగు గంధర్వు లేమఱరు నన్ను నొక్కమాత్రయైన. విరా. 1—328

9. వేఱుపడు, వేరుగాఁ గనఁబడు.

వ. కృష్ణ ద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతం బులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి. ఆది. 1-80

10 ప్రతిబింబించు.

వ. తన విమల విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుఁగు చుండు ఆది. 1-80

**ఏర్పడుదెంచు** దే. అ. క్రి. ఏర్పడు (ఏర్పడు + తెంచు, స్వార్థ మున 'తెంచు')

1. స్పష్టపడు

సీ వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు దేరని వళులలో నారు నిగుడ. విరా 1-245; శాంతి 1-248

2. కలుగు

వ. ...వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై యేర్పడు దెంచిన. ఆది 5—187

**ఏర్పరించు** దే. స. క్రి. (√ఏర్పడు) ఏర్పఱచు

1. నిరూపించు, నిర్ణయించు.

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటు మనము వడయుద మతియెల్లను నేర్పరించి యందఱుఁ, దనతన మదినున్న తెఱఁగు తథ్యమ చెపుడా. విరా. 1-65

క. వినుమా భూతం బిట్టిది, యని కల రూపేర్పరింప నమరులకు వశంబె నరేంద్ర తదాకృతిఁ, గనుఁగొనినన్ భేదిల్లవలయుఁ గొండకునైనన్. సౌప్తి 1-98

ఉ. ... బంధు సంఘముఖ్యుల నిందుఁదెత్తమొ విచార విదూర యుపేంద్రు భవ్యదేవ, హమ్మట గొంచుఁబోదమొ సమర్థ విధం బొకఁ డేర్పరింపుమా. మౌస. 167

2 విభజించు, వేర్పఱచు

క. తను నేర్పరించి కేవలంబును శాంతమునైన తత్త్వమును సంత

తముం,గనుచున్నఁ దమ్మ వెలుగం, గనుఁజీఁకటిఁ బాపు వెలుఁగు
గలుగుం బుత్రా. అశ్వ. 1-224

3. వివరించి చెప్పు.

తే. విధివశంబున మృతిఁ బొందు వివిధజంతు, నిచయమం దనహంకార
నిష్ఠఁ దైనఁ, బురుషుఁ గల్మష మేమియుఁ బొందనేర, దెట్టులంటేని
విను మది యేర్పరింతు. అను. 6-57

4. విమర్శించు, యోజించు.

మత్తకోకిల. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథా
విధిన్, దేవమంత్రియ పోలె ధర్మపుఁ దెల్పె. సభా. 2-286

5. ఎఱుఁగు, గుర్తుపట్టు.

సీ. నలుపురు వేల్పులు నలుఁదొట్టి యప్పు డే,కాకారులై యున్న
నందు నలుని, నేరర్పింపఁగ నేర కింద్రాదులను నలు, వెఱుఁగు ను
పాయ మింకెద్ది యొక్కొ. అర. 2-58

పర్పఱచు దే. స. క్రి. పర్పరించు

1. విభజించు.

తే. క్షరము నక్షరమును ననఁ గలుగు రెంటి, నేర్పఱచి మున్ను సెప్పితి
నింక నొకటి సెప్పఁ గలదు. శాంతి. 6-46

2. నిర్ణయించు, స్థిరపఱచు.

క. మొగమొప్పదు వాదెవ నీ, జగతీనాథునకు నే విచారించియునుం,
దగ దీనికిఁ గారణ మిది, యగునని యేర్పఱుపనేరనయ్యెద నెట్లన్.
విరా. 5-306

3. కనఁబఱచు, చూపు, తెలియఁజేయు.

ఉ. ... అజ్ఞాననఁ బట్టితెచ్చి హృదయం బలరంగ ననంగతంత్ర
విద్యా నిపుణత్వమేర్పఱిచెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్.
విరా. 2-298

4. చక్కఁబఱచు.

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, వెడమడుతై కలఁగినవ్వు దేర్పఱుపఁగ

నేఁ, గడునేర్తుఁ బేర్పునాదగు, కడిమియు నీ సైన్యమునకు గొనెన గాదే. ఉద్యో. 4-214

5 (వ్యూహము) పన్ను.

క. ... మొనలేర్పఱచెఁ గౌరవాన్వయముఖ్యా.
భీష్మ. 2-28 (పాఠాం)

(పన్పఱిచె — అని పాఠము)

6. పంచు.

వ వారల జీవనంబునకుఁ గొన్ని యలంతి పల్లియలైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్సయని చూచెదు.
ఉద్యో. 2-91

ఏఱు² దే. స. క్రి.

1 మంచివిగాఁ జూచి గ్రహించు.

చ. వనిత మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్కనేఱి పీ, కని నియమించి తెచ్చితి, విరా. 2-384

2. ప్రోవుసేయు.

వ. అక్కుసుమకోమలి సని యమ్ములేఱికొని వచ్చి యిచ్చుచుండు.
అను. 3-255

3. (క్రింద నుండి గింజలు మున్నగు చిన్నచిన్న వస్తువులను)ఒక టొకటిగా ఎత్తు.

గీ. వారు నలువురుఁ జని తృణధాన్య మల్ప, మేఱికొని వత్తురాఁకలి దీఱకుండు. అశ్వ. 4-220

సీ. ... కొంద ఱాకులెండినవి యేఱికొని అను. 5-28

4. (కావలసిన వానిని) ఎన్ను, ఎంచు, గ్రహించు.

తే. ఏఱికొను మీవు నొకని మాయేవురందు, వాఁడు నీతోడఁ దగఁ బోరువాఁడు వానిఁ, జంపి మహి యేలు వానిచేఁ జచ్చి త్రిదివ, సౌఖ్య మొందుము చేసితి సమయ మేను. శల్య. 2-108

వ. మన బలంబులలో మేలేఱి పదునాలుగు వేలేనుంగులును......

గ్రైకొనుండు, ద్రోణ. 3-31

5. ఎంచి ఖండించు, నఱకు, భేదించు,

(ఈ యర్థమున 'తలలు' అను పదముతోఁగలసియే ప్రయోగములఁ గన్పట్టుచున్నది.)

సీ. ... అడియాన దొద్దకుఁ జొచ్చినఁ, దలలేఱ యుర్వికి బలియొసర్తు.
మౌస. 185

సీ .... మనమోపి సర్వ పాండవులను జంపితిమేనిఁ బ్రచండ చక్ర, ధారఁ గౌరవకోటి తలలేఱి రాజ్యంబు గోవిందు డీకున్నె గొంతి కయిన. ద్రోణ 1-111

ఏఱు₂ దే. వి. ప్రా.

నది.

క. అనదతనంబును బెడిదవుఁ,దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు, నేఱును బోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా. శాంతి. 3-24; శాంతి. 4-356

ఏఱుపఱుచు; ఏర్పఱుచు దే. స. క్రి.

ఏర్పరించు. ఏర్పఱచు.

1. వేఱుసేయు, విభజించు.

తే. అర్జునుం డను పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిట్టునని యేఱు పఱుపరాక, యుండ నెత్తురువెల్లు లొండొండ పెరిఁగె, నుబ్బి భూతబేతాళంబు లోలలాడ. ద్రోణ. 3-103

2. కల్పించు, కూర్చు.

క. విను మా బీజము పిండము, తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరంబును గేలుఁ గాలు నుదరం,బు నురము వెన్ను నంగముల నేర్పఱుచున్. అశ్వ. 1-188

శ్లో॥ తతః స్పందయతేఽంగాని సగర్భశ్చేతనాన్వితః.

సం. భా అశ్వ. 18-8

సూ. తం చేతనావస్థితం వాయుర్విభజతి తేజ ఏనం పచతి ఆపః క్లేదయన్తి పృథివీ సంహన్తి ఆకాశం వివర్ధయతి, ఏవం వివర్ధితస్స యదా

హస్తపాద జిహ్వా ఘ్రాణ కర్ణ నితంబాదిభి రంగై రుపేత స్తదా శరీర మితి సంజ్ఞాం లభతే.

సుశ్రుతము – శారీరస్థానము – పంచమాధ్యాయము 2వ సూత్రము.

8. నియమించు.

సీ. అమరాధిపతి దొల్లి యాగంబుసేయంగఁ దొడఁగ మహాముని స్తోమములును, సురసంఘములుఁ గూడి కురుముఖ్య ఋత్విగ్గణ ముల నేర్పఱచి సొంపడర వేదిఁ గల్పించి. అశ్వ. 4-255

**ఏలుపాటు** దే. వి.

విభజనము, స్పష్టపడుట.

వ. కాలు చేయి తల డొక్క యని యేలుపాటు లేక వండం దఱిగిన యట్లున్న యొడలును. భీష్మ. 3-248

**ఏల[1]; ఏలా** దే. అవ్య. ఎందులకు

1. ఏకారణముచేత.

శా. ... నీవ పాండు సుతులం గుందింపఁగా సత్యముం, జాడిం దప్పు దొకప్పుడుం గినియరా బంధుత్వ మే లొల్లవో.

ఉద్యో. 3-384

క. ... మీ, లో నధిమన్యుఁడు లేఁ డే,మో నాకుం జెప్పఁ డేల యూరక యుండన్. ద్రోణ. 2-283

వ. వారలట యెవ్వలనికిం జని రేల మగిడిరి. స్త్రీ. 1-3

2. వలదు, కూడదు, అనావశ్యకము మున్నగు భావములను దెల్పును.

ఉ. కావలివారిఁ దోలి యొసకంబున గోవులఁ బట్టికొంటినం, చీవెడ మాట లేల ధరణీశ్వర యింతకు మున్ను విటికిం, బోవవు.

విరా. 4-192

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరు లేల సద్భటా, కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము. ఉద్యో. 2-295

క. జనములకు స్మృతిఁ జదువఁగ, విని మ్రొక్కిన యంత్యజునకు విశ్రుత గతి గ,ల్గుననిన సద్భక్తి జపిం,చిన యుత్తమ జాతిజునకుఁ

చెప్పఁగ వేలా, శాంతి. 4-258

3. ఏమి, ఏమిప్రయోజనము.

తే ఇంత ప్రొద్దేల యిచ్చోటి కేఁగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ గానకుండు, నట్లుగాఁ జనుదెంచితె. విరా. 2-168

ఉ ... పతిసెప్పెదు వారల బుద్ధి వాఁడ మ,న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల ఎచ్చి రిత్తగా,రింపక సూమము. ఉద్యో. 1-314

ఆ. నీచేతఁ, భంగపడితి మింకఁ బలుకు లేల. భీష్మ. 2-121

తే. ఎవ్వరికిఁగాఁగ రాజ్యంబు నెల్ల భోగ,ములను గోరుదు రక్కుమారులును నాదు, తమ్ములును లేరు తురగరథద్విపప్రహీన యయ్యె నీశోణియు నేల పెనఁగ. శల్య. 2-68

ఉ. ఈమునిపల్లె నుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగా, భామిని నాకు భార్యవయి...సౌఖ్యముల మేలుగ నందుము ఉద్యో. 4-58

4. ఎట్లు.

తే. కొయ్య, కోలఁద్రవ్విన మాత్రఁ బాతాళయాన, మేల సిద్ధింప నేర్చు. ఆశ్వ. 3-105

ఏల2 సం. వి.

ఏలకి, ఏలకుల తీఁగె.

మ. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలా వనై లావలీ, లవలీలుంగ లవంగసంగతలతాలాస్యంబు రచించుచున్. ఆది. 2-30; సభా. 2-110

ఏలకో దే. అవ్య. (√ఏల)

ఎందులకో.

క. కురుపతికి జయముగోరెడు గురుపుత్త్రుఁడు మున్న యేలకో యిటు తలఁకిం జొరక. సౌ. 1-207

వ. ఏడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్న యది. అర. 2-145

**ఏలాపుత్రుఁడు** సం. వి. అ. పుం.

నాగరాజునకు తమ్ముఁడు.

వ. అనిన విని నాగరాజానుజుండైన యేలాపుత్రుం డిట్లనియె.
ఆది. 2-188

**ఏలించు** దే. స. క్రి.

పరిపాలింపఁ జేయు.

క. గురుఁడును నీవును మద్రేశ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబ-
లుఁడు ననున్,ధర యేలింపఁగమున్నా, రరు. ద్రోణ. 5-111

**ఏలిదము** దే. వి.

ఎల్లిదము.

ఉపేక్ష, నిరసనము.

క. బాలుఁడని నమ్మి రిపుతో,నే పథమునఁ గలసియునికి యిది కార్యమె.
ఆది. 6—116

శ్లో. బాలవత్కురుతే మూలం బాలః శత్రురుపేక్షితః,
గహనేఽగ్నిరి వోత్సృష్టః క్షిప్రం సంజాయతే మహాన్.
ఆది. 168-103

**ఏలినది** (√ఏలు)

యజమానురాలు, ప్రభ్వీణి.

వ. ఇన్నాళ్లుం దక్కటి యెలనాఁగ లేలినదానిఁబోలెఁ బొదవికొని
యున్నవారు, స్త్రీ. 2-185

**ఏలినవాఁడు** వి. (√ఏలు)

ప్రభువు.

వ. సుశర్మయు నేలినవాని పనిఁబూని. విరా. 3-131

**ఏలినాతఁడు** వి. (√ఏలు)

ఏలిక, రాజు.

ఉ. ...ఏలినా,తండొక చాయ చూపినను దత్పరతం బనిసేయు
టొప్పగున్. విరా. 1-185

**ఏలిమాట** దే. వి.

1. స్తుతి వాక్యము పొగడ్త.

సీ. పాలు పంపని యీక యేలిమాటల న,మ్మలుక దీర్చెదరు.
ఉద్యో. 3-6

చ. కురుపతి నిర్జితుండగుటకుం బవనాత్మజ యేను బూ(ట పో,టరితన మెల్లఁ జూపుము కడంగుము నీవని యేలిమాటమై,నరవర ధర్మ సూనుఁడు వినన్ విజయం బొనఁగెన్ మఱందికిన్.
శల్య. 2-129 (మేలుమాట అని పాఠాం)

ఏలు దే. స. క్రి.

1. (రాజ్యాదికము) పాలించు, శాసించు.

తే. ఏలు మీలోక మెల్ల నీకేల రాధకొడు కితండను తక్కువ కొడుకుఁ గుఱ్ఱ.
ఉద్యో. 4-59

ఆ. ... జనులనేలఁ గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ వెరవులేని, యట్టి నీవు.
విరా. 1-97

క. ...జగమె,ల్లను నేలఁగఁదగు సముజ్జ్వలత యూహింపన్.
విరా. 4-258

ఆ. దీని పాలు ద్రావి మానవుల్ పదియువే,లేండ్లు జరయు రుజయు నెఱుఁగ కమర, భావమున సుఖంబు జీవింతురటె దీని, నేలఁగనిన వాఁడ యెందుఁ బెద్ద. (స్వామ్యమున నుంచుకొను) ఆది. 4-158

2. పరిగ్రహించు, చేకొను.

తే. అనితంబిని మక్కువ ననఁగిపెనఁగి, యింపు పొంపిరి వోవ నన్నేలి కొనఁగఁ, దలఁచి పొందిన నది జన్మ ఫలముగాదె. విరా. 2-86

(ఏలు = భర్తగాఁ గైకొను)

క. అని హర్షోత్కర్షంబున, మనమలరఁగఁ బల్కి మత్స్య మనుజాధీశుం, డనిలసుతు నేలె. (ఏలు = సేవకునిగాఁ గైకొను) విరా. 1-227

క. ఉత్తమ కన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు త,ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కఁ బనులు సేసెద నందున్. (ఏలు = సేవకునిగాఁ గైకొను) విరా. 1-88

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే, పనులు నుదాత్తనాగరికభంగుల వీమది కెక్కునట్లు నే,ర్పును

భయభక్తులున్ మెఱయ రూపు గఁ జేసెద. విరా. 1-328

(ఏలు = సేవకురాలుగాఁ గైకొను)

3. సేవచేయించుకొను, పనిగొను

ఆ. ఏను గట్టువాలుదాన వాకెవ్వరు. గడుపు కూడు వెట్టి కట్టఁజీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకుఁ బనులు సేసి మెలఁగు బుద్ధి. విరా. 1-298

4. పోషించు.

తే. భార్యయును దాను బుత్రులఁ బంచికొన్న, వాఁడు పసులఁ బెక్కొటి నేలువాఁడు కపట, కృత్యముల ముచ్చిమిని శిల్పకృతుల బ్రదుకు వారు, పంక్తిదూషకు లంద్రు పౌరవేంద్ర. అను. 3-175

## ఏలుకొను దే. స. క్రి. (√ఏలు)

లోఁబఱచుకొను, వశముసేసికొను.

తే. ఇట్లు నీ వొక్కతెవె నన్ను నేలుకొంటి,గాక మాటలింకేటికిఁ గమల వదన. విరా. 2-335

## ఏలుతీపు దే. వి. (√ఏలు)

పాలింపవలయునను పేరాస.

వ. అవినీతులైన నీ కొడుకులు పుడమియెల్లను దార యేలుతీపుఁ జూచెదరు. ఉద్యో. 2-279

## ఏలుదెంచు దే. స. క్రి.

జయించు, అణఁచు.

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళుఱికెడు వాలుగు సోగల నేలుదెంచి. విరా. 2-83

## ఏలొకొ, ఏలొకో, ఏలొకోన్, ఏలొక్కొ దే. అ. (√ఏల)

ఎందులకో.

క. నన్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ, జన్నె నీజిహ్వ వెక్కు శకలములై పోకున్నది యేలకొ. కర్ణ. 3-82

చ. ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీలలితాంగి యందు

ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రము లేవ,పడుట. అను. 8-82

క. నీవు బలిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నేమననేర్తున్. ఉద్యో. 2-210

**ఏవము** వి.

జుగుప్స, రోఁత.

చ. అధిపు మఱంది సింహబలుఁ డప్పుడు ప్రమ్మొక్కఁగ వచ్చి...మాన
ధన విహీనతం జెనకినం గడునేవము పుట్టి యయ్యెడన్. విరా. 2-170

విణ.

1. నీచమైనది, నికృష్టమైనది.

చ. ... పేరు కంకుఁ డే,వవుఁగొలువైన వాకు నిలువన్ మదిగొల్పదు. విరా. 1-197

2. రోఁత గలిగించునది, అసహ్యమైనది.

క. నాయున్న జాము దలఁపవ, యీ యొడలీ చీర యిట్టి యేవపుఁ
జందం, బోయన్న మదన వికృతిం, జేయుననుట యెంతయును
నిషిద్ధము కాదే. విరా. 2-49; విరా. 3-50

తే. ప్రయతులై పుట్టి యేవంపుఁ బనులఁ గడువుఁ, బ్రోచికొను
వా రహంకారమునకు గర్వ, మాన మద దంభములఁ దొల్లి
మాన్యజనులఁ, బరిభవించిన తుచ్ఛులు పద్మనయన. అను. 5-106

**ఏవల** దే. వి. బొ. అవ్య. ఎవ్వల (ఏ + వలను)

ఏప్రక్క, ఏవైపు.

క. ... మీరలందఱు, నేవలఁ జూచిన శిఖండి కెదురుం డెపుడున్. భీష్మ. 1-81

**ఏవాఁడు** దే. సర్వ.

ఎవ్వఁడు.

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నావసుధాధిపుఁడు దాని ననుమోదిం
చున్. శాంతి. 4-341

కై కొను - విరా. 1-114; కయికొను - విరా. 2-12

పై చీర - విరా. 1-211; పయిచీర. కల్యా- 2-874

ఐ అవ్య. అయి.

1. అగు ధాతువు యొక్క క్త్వార్థక రూపము.

క. నిర్భర విధ్వంస దశా, విర్భావము దెచ్చికొనుట వెరనై యున్నే. విరా 1-322

వ. అర్జునుఁడును ప్రీతుండై. విరా. 5-96

వ. క్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని ఉద్యో. 4-202

2. చతుర్థీ విభక్త్యర్థములగు, 'కి', 'కు'-లు చివరగల పదములకు అను ప్రయుక్తమగును. (సూ. అ. ని)

గీ. నేను వారలందఱును మఱచునట్లు సేయుదు నరునకునై కుమార. (నరునకునై = నరుని నిమిత్తము.) ద్రోణ. 5-250

ఆ ధాత నిన్ను నేమి ధర్మంబు నడుపుట,కై సృజించె దాని నాచరించి, యుండు నీవు నీకయొడయుండవే ధాతృనోదిత ప్రవర్తనుఁడవు గాక. (నడపుటకై = నడపు నిమిత్తము) శాంతి, 1-209

విరాటుఁడు పిల్వఁబంచె నర్తనమునకై. విరా. 1-248

అతనికై వగపేటికి. స్త్రీ. 2-85

ఉత్తమగతికై తార చనుదేర విలసించుచు శాంతి. 1-241

3. తనంతట తాను, స్వయముగా.

క. దుర్భరవగు నినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై, నిర్భర విధ్వంసదశా,విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా. 1-322

(నాకై = నాయంతట నేను-స్వయముగా)

క. ఏనై మేల్కొను నంతకు, ఘూనాయకవర్య నన్ను బోధింపకుఁడీ. (ఏనై = నాయంతట నేను) అను. 2-301

ఐందవము సం. విశే. (అ. ఈ. అ.)

చంద్రునకు సంబంధించినది.

ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవరేఖ కాంతియుం,
ఱ మ్మరయంగఁ గరమ్మెఫల శోభన సంపద. కాంతి. 5-128

**ఐందవాతపము** సం. వి. అ. పుం.

చంద్రుని కాంతి.

సీ. ... పరమ ధర్మ ... అ - మన్న రేంద్రునందు వా పూర్ణతర శర,
దైంద వాతపంబునందుఁ బ్రీతి, సమమకా సమస్త జనుల చిత్తంబు
లా,నంద రసభరంబు నొందఁ దాల్చె. ఆది. 8-82

**ఐంద్రము** సం. విశే. (అ. ఈ. అ.)

ఇంద్రునకు సంబంధించినది.

వ. నివాత కవచు లనియెడు దైతేయుల మాతలి సారథికంబగు
నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడు కోట్ల నిర్జించితి.
విరా. 4-149

వి. అ. పుం.

జ్యేష్ఠానక్షత్రము

సీ. ... ఐంద్ర, మనఁ బ్రభుత్వము పెంపు. అను. 8-169

**ఐంద్రాస్త్రము** సం. వి. అ. న.

ఇంద్రుఁడు అధిదేవతగాఁగల యస్త్రము.

(అర్జునుఁడు) ఐంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానాప్రకార
క్రూర శరకలాప రూపంబునం గవిసి కౌరవసైన్యంబు నొప్పింప.
భీష్మ. 2-164

**ఐకాక** దే. అవ్య.

అయి కాక, అగుట చేతఁగాని (లేకపోయినచో అని భావము)

మ. భవదాజ్ఞా దృఢ బంధ సంయమితకుంభద్వేగమై కాక నాఁ డవలీ
లన్ మనయర్జునద్విపము కౌరవ్యాంబుజ శ్రేణిఁ ద్రొక్కువడం
జేయదె. విరా. 1-56

**ఐక్యము** సం. వి. అ. న.

ఏకమగుట, ఒక్కటి యగుట.

చ. ...నేఁ, బరువడి, దెల్పి యైక్యపరిభావ నిరూఢముగాఁగఁ జేసి

ఐన విశే.

అను ధాతువు యొక్క భూతార్థక విశేషణము. అయిన.

వ. నిశ్శంకంబైన యంతఃకరణంబుతోడ. విరా. 1-179

వ. జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి. భీష్మ. 1-196

ఆ. ఉచితమైన పాలు, పంచియిండు. ఉద్యో. 2-25

అవ్య. ద్రు.

అగుధాతువు యొక్క చేదర్థక రూపము.

1. అయిన యెడల.

తే. ...అద్దేవి యెదురుచూచు, అలుగుదడవైన మగుడఁ బోవలయు నవిన. విరా. 2-120

సీ. ...చక్కటితోడి కయ్యమైన, లీల మిమ్మందఱ నేల పాలుగఁ జేయవే. శల్య. 2-325

2. అయినప్పటికిని

తే. ...శవదీయ దేహమునకు, నింత వెలయన వచ్చునే యేరికైన. అను. 2-275

వ. తీరునకుం బొచ్చియున్నవారి నైనం గాచికొనునొకో యని యూహించుచు. ద్రోణ. 4-156

క. తానైన నపుడు వక్రుండై నీతిపథంబు విడిచె నక్కట పతి మమ్మైనను జక్కని తెరువునఁ, బూని నడపుడనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్. ఉద్యో. 1-311

(తానైన = తాను మాత్రము) (మమ్మైనను = మమ్ముమాత్రము.)

3. కాని, ఏని (వికల్పమును దెలుపును.)

ఉ. ... ఆనంబు లిట్టియందక్కట భీముఁడైన మన యర్జునుఁడైనను మాద్రి పుత్రులం, దొక్కరుఁడైన నీ పగ లడఁగింపరె యొక్క వ్రేల్మిడిన్. ఉద్యో. 1-287

ఆ. పరమ కరుణనైన బంధు భావంబున, నైన భుజబలంబు నతిశయాముఁన, నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ బోవఁదగు మహానుభావ

నీకు. ద్రో॰. 3-286

తే. అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూల,కోటినైనను దగు
పారు నీటనైన, నిత్యమును జేయునది పితృకృత్య మోపి, నైశ్వ
దేవ మవశ్య నిర్వాహ్య మనఘ. అను. 3-337

(ఇచ్చట పూర్వపూర్వము ప్రాధాన్యము గల వికల్పము.)

4. పూర్వోత్తర కార్యములకుఁ గల విరుద్ధ భావమును దెలుపును.

ఉ. వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలం
ఘోర జయింప రామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
వ్యాప్రమణుండు నేయు తగు మన్ననలెల్లఁ దలంచి చూచినన్
భూరి వివేకహే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే. భీష్మ. 3-446

క. తనుఁ దాన చెప్పికొను టొప్పని పనియగు నైనఁ దండ్రి పరిభవ
మునకుం, గనలు గదిరి యిట్లంటిని, విను మేనేమనిన నేమి వృథవో
దధిపా. ద్రో॰. 5-340

వ. ఇట్టి సంబంధ మెవ్వరికిఁ బడయనగు.

క. విను మైనను పాపత్వ్వం,బను దోషము కలదు
ఆది. 4-183; 189

5. ఆధిక్యమును దెలుపును.

క. ఉక్కటి సురపతికైనను, మ్రొక్కము నృపధర్మమూఁది మొన
తలఁ బడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ
బడయవగుట మహేంద్రా. ఉద్యో. 3-360

క. గురు పుత్రుఁడు తేజోనిధి, సురాసురులకైనఁ దేఱి చూడన రిది,
విరా. 5-3

6. హైన్యమును దెల్పును.

ఆ. మత్స్యజనపాలపుత్ర యే, నట్టిదైనఁ బనుతునయ్య నిన్ను
విరా. 4-111

7. నిర్ధారణము లేమిని దెల్పును. (ఈ యర్థమున 'ఏ', ఎవఁడు ఎవతె)
మొదలగు వానితో సంబంధించి యుండును.

ఉ. నేఁడు పోరికిం, గవ్వడి రాకయుండఁ దొలఁగం గొని పోవఁగ

జాలు వారి నీ, వెవ్వరి నైనఁ జంపుము. ద్రోణ. 1-381

క. తాన సుతుఁడగుట తెలియం, గానగు మును లాత్మ వీర్యకలనం

బెచ్చో, నైనం జేయఁగ ముని భా,వానూనత బుళ్యశృంగుఁ డా

దిగఁ గమటన్. శాంతి. 5-505

**ఐరావణము** సం. వి. అ. పుం.

ఐరావతము. ఇంద్రుని యేనుఁగు.

ఉ. ... ఐ, రావణ దంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డా

శచీ దేవియుఁ దాను మోదమునఁ౼దేలె. ఉద్యో 1-205

**ఐరావతము** సం. వి. అ. పుం.

1. ఐరావణము, ఇంద్రుని యేనుఁగు.

వ. ఇంద్రుం డై రావతారూఢుం డై లీలం ద్రైలోక్యంబును జరించు

చుండి. శాంతి. 4-422

2 దిగ్గజము, తూర్పు దిక్కున నుండు ఏనుఁగు.

వ. ఐరావత సుప్రతీకంబు లను దిగ్గజంబు లయ్యగ్నిశపుమీఁదం

బఱతెంచిన. అర. 5-307

**ఐరావతవర్షము** సం. వి. అ. పుం. న.

ఉత్తర సముద్రమునకు శృంగ వంతంబునకు మధ్యగల భూభాగము.

వ ఉత్తర సముద్రంబు శృంగవంతంబు మధ్యమం బై రావత వర్షం

బన నొప్పు. భీష్మ 1-25

**ఐరావతుఁడు** సం. వి. అ. పుం.

1. తక్షకుని కొడుకును బెంచినవాఁడు, తక్షకుని తమ్ముఁడు.

వ అట్టి యెడఁ దక్షకు నపత్యంబై తత్సోదరుండగు నై రావతుండు

పెనిచి యుపలాలింప శుల్లసిల్లిన యశ్వసేనాభిధానుండగు నాగ

కుమారుండు. కర్ణ. 3-316

2. నాగరాజు.

వ. కుండలంబులు గొనిపోయిన భుజంగం బై రావతాపత్యం బనిన

విని యమ్మునిశిష్యుండు. అశ్వ. 3-106

ఐరావతి సం. వి. ఈ. స్త్రీ.

ఒక నది, పంజాబు నందలి రావి యనునది (సూ. అ. ని.)

సీ. కాళింది నర్మద ... పెన్న యైరావతి యనఁగ బ్రసిద్ధంబు లయిన నదులు. సభా. 1-71

ఐలుఁడు సం. వి. అ. పుం.

పురూరవుఁడు, వైవస్వత మనువు కూఁతురైన ఇలకును చంద్రపుత్త్రుఁడైన బుధునకును బుట్టిన వాఁడు.

ఇతని కార్గురు కొడుకులు గలరు. ఇతని వంశీయులు 'ఐలులు' అని పిలువఁబడిరి.

వ. తొల్లి యైలుండను పురూరవుండు వసుధ విప్ర క్షత్రియులం దెవ్వాని ధనంబై యుండునని వాయుదేవు నడిగిన శాంతి. 2-302

ఐలులు సం. వి. బహు.

కౌరవులు, పాండవులు (ఇలా పుత్త్రుఁడైన పురూరవుని వంశమువారు. చూ ఐలుఁడు.)

క. వీ రైలులుఁ బౌరవులును, భారతులును గౌరవులును బాండవులు నవన్, వీరులయి పరఁగిరి ఆది. 4-118

ఐశ్వర్యము సం. వి. అ. న.

1. సంపద.

తే. ఆయు రైశ్వర్య కీర్తుల నపహరించు, పరసతీ సంగమము.

విరా. 2-69; శాంతి. 5-404

2. ప్రతిష్ఠ.

మ. కురు సైన్యంబుల ముట్టి గెల్చి యెలమిన్ గోవర్గముం దెచ్చె న.త్తరు బాహాబల శౌర్య సారము లుదాత్తంబుల్ గదే యెందు నెవ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. విరా 5-247

3. శక్తి, సామర్థ్యము, పరాక్రమము.

మ ... చటులాస్మదీయ విశిఖాగ్ని జ్వాలలం దాహుతుల్, వరుసం

బెట్టుదు ధార్తరాష్ట్రితతి నైశ్వర్యం బవార్యంబుగన్.
ఉద్యో. 2-301

**ఐషీకము** సం. వి. అ. న.

సంస్కృత భారతము నందలి సౌప్తిక పర్వమందలి అవాంతర పర్వము.

వ. సౌప్తిక పర్వం, బైషీకంబు - అను శతపర్వంబులు గలిగి.
ఆది. 1-32

**ఐహికము** సం. విణ. (అ. ఈ. ఆ.)

ఇహలోక సంబంధమైనది.

వ. ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు.
శాంతి. 3-42

# ఒ

**ఒ** అవ్య. ఓ.

1. ప్రశ్నార్థకము.

చ. (అశ్వత్థామ దుర్యోధనునితో) ... హరికల్మి నారథికు దోర్బలోన్నతిఁ బడఁగిపోరె, యచ్చలమొ ఫలంబొ యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్.
కర్ణ. 3-260

క. ఏవ నకును నీకును బాంధవము గలదొ యతఁడు నిన్ను దయారక్షింపన్, సవినయ వృత్తిని బ్రతికితొ, చెవులకు నింపెసఁగ నిజము చెప్పుము నాకున్.
శాంతి. 3-384

ఉ. సందియమేల సర్వగుణ సంపదఁ జూడఁగ బాహుకుండు భూవందితుఁడైన నైషధుఁ డవశ్యముఁ దానగు నా మనంబు వానందముఁ బొందుచున్నది ఘనంబుగ వాఁడిట వచ్చువాఁడొ యే నందులకేగు దానవొ రయంబున నాతని నిశ్చయింపఁగన్.
అర. 2-202; అర. 2-98

2. సందేహమును దెలుపును.

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన వృద్మహితుఁడొ హిమకరుఁడొ శచీ, గృహమేధియొ కాక యితఁడు కేవల నరుఁడే విరా. 1-215

క తతండు గాలిహోత్రుఁడొ, మాతలియో నలుఁడొ యొరులు మానవులు జవో, పేతముగ విట్లు రథహాయ, నీతి యొఱుంగుదురె ధారుణీవలయమున్, అర. 2-171

3. సంభావన (ఊహ)ను దెలుపుము

క. నిమిషాంతరమున ని ట్లు, క్రమమున మర్త్యులకు నేయ సమకూరునె యు, త్తముఁ డితఁడు బ్రాహ్మణ రూపమున సురేశ్వరుఁడొ హరుఁడొ భానుఁడొ గుహుఁడో. ఆది. 7-184

4. ఆశ్చర్యమును దెలుపును.

క. తలఁకక మును సౌగంధిక,ములు గొని యిప్పుడును దర్పమున నిందుల పువ్వులుగొని మణిమత్సృతులఁ, బలువుర వధియించె నెట్టి బలియుఁడొ యనుచున్. అర. 4-25

5. నిశ్చయమును దెల్పును.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యొదిరి చత్తురొ మందురొ మానవేశ్వరా. ఆది. 8-46

(చత్తురు = చచ్చెదరు)

6. అనాదరమును దెలుపును.

ఆ. వరదుఁడైన యీశు వరమున నిది యొక్క, వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, దానిఁ బాలవైవఁ గానున్న నాశాశ, వాని యిట్టు లనియె వసుమతీశ. అర. 5-5

7. కాశ్వర్థకము.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యొదిరి చత్తురొ మందురొ మానవేశ్వరా. ఆది. 8-46

(మందురో = మనరు-బ్రదుకరు అని యర్థము)

**ఒంటమి** దే. వి. (√ ఒంటు)

పగ, వైరము.

క. ఒంటమిని లేని యొంటర, మింటతమ్ములు పలుకుటుచితమే యర్థ
రథుండట్టి నను నేమి తక్కువ, గంటి చెపుమ దీని నీవు గన్నది
గలదే. ఉద్యో 4-287

శ్లో॥ పితామహా యథేష్టం మామ్ వాక్శరై రుపకృంతసి,
అనాగసం సదా ద్వేషా దేవమేవ పదేపదే. సం భా. ఉద్యో. 167-11

**ఒంటరమింటరములు** దే. వి. బ.

ఎక్కువ తక్కువ మాటలు, పరుషవచనములు,
చూ. ఒంటమి. ఉద్యో. 4-287

**ఒంటి** దే. విశే. (√ ఒండు)

ఒంటరి, తోడు లేనివాఁడు, ఏకాకి.

చ. అసమున మీఁదెఱుంగక మహాగ్రహ వృత్తిఁ గడంగి చెచ్చెరం,
బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాప్యఁడు కౌరవసేన యేడ
యొంటి సనుటయేడ. విరా. 5-284

చ. ఇది గడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేర దెంతయున్,
మృదు వొక కీడుపాటున్నక్కు మేకొనఁజాల దురాత్మచిత్త యొంటి
దిరుగు దాని కోర్వఁడు. విరా. 1—103

విశే.

ఏకాకిత్వము, ఒంటరితనము, తోడులేమి.

క. ఒంటిమెయిఁ దాఁక నా ముక్కంటికి వశమగునె కృష్ణ గాండీవుల
కర్ణ. 2-85

వ. ఎల్లవారిం గలయంగమంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెండని
నియోగించి యతండు. విరా, 1-184

**ఒంటికంబము** వి.

అవిద్యా రూపమైన స్తంభము, అవిద్య యొక్క ఆధారము చేతనే శరీ
రము నిల్చుటచేత అవిద్య శరీరమను ఇంటికి ఒక్కటే స్తంభముగాఁ
జెప్పఁబడినది.

క. ఏను వేఁడు అగుడు వాని నిర్వేదుఁడు, పట్టఁ బదురుగలదే క్రాంతి-
దొలఁగి, యొంటికంబ మొప్పు నింటి వాకిలులు దొ,మ్మిదియు
నెఱయ మూసి నిదురవోదు. శాంతి. 4-17

**ఒంటికిఁజూచు** దే. అ. క్రి.

వేఱొక విధమునకుఁ బూనుకొను.

క. ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం,
బేచందమునం దెలఁగగు, నా చాలుట కోర్వవలయు నది యట్లుం
టెన్. విరా. 3-110

**ఒంటివడు** దే. అ. క్రి. (√ఒండు)

ఏకాకియగు, సహాయము లేనివాఁడగు.

తే. ... అభిమన్యు వీరుని నతని తమ్ముఁ, గుఱ్ఱలను గర్ణు నాఅడిఁ
గోలు పోయి, యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు మాట
లాడుదు ద్విరిజనుల్ మఱుఁగు చుండ. ఆశ్ర. 2-15

**ఒండను** దే. స. క్రి. (√ఒండు)

1. నిందించు.

ఉ. పాండవ పక్షపాతమునఁ బల్కుదు నోరికి వచ్చినట్లు ని,న్నొండన
రామిఁజేసి యిది యొప్పునె. విరా 4-98

2, వేఱు మాట పలుకు.

చ. .... మనం, బనవరతానురాగముగ నంగజకేళి భజింపు మింక
నొం,డని యెడసేసితేని కుసుమాస్త్రుఁడు సైపఁడు నన్నుఁ బావకా.
అర. 5-201

**ఒండు** సర్వ. బొ. (బహు) ఒండులు, ఒండ్లు

1. ఇతరుఁడు (ఈ మహదర్థమున బహువచనమునందే ప్రయోగములు
గన్పించుచున్నవి.)

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై, పురిఁగల
వారినెల్లఁగొని పోయిన నొండులు తేమిఁజేసె యు,త్తరుఁడిట వచ్చు
చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం, దొరకొనకున్న దా
నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడగన్. విరా. 4-77

చ. ... తగ నొండులం గొలువఁగా వెర వెమ్మెయిఁగల్గు నక్కటా.
విరా. 1-108

వ. ఇట్లు సృజియించి యవ్విరించి యతని (దక్షుని) నాలోకించి ప్రజల సృజియింపుమని పంచిన నతండు పెద్దవా రొండ్లు లేరై రేనియు సృజియించెద ననిన నప్పరమేష్ఠి...పెద్ద లెవ్వరునులేరు సృజియింతువు గాక యనవుడు, సౌప్తి. 2-112; ఉద్యో. 1-278

2. ఇతరము, అన్యము.

ఉ. (కర్ణుఁడు కుంతితో) నీ పలు కెంతవోలినను నిర్ణయమిట్టిద కాని యొండులే, దీపనిమీఁది భారమున నీవిట వచ్చితిగాన పాండవుల్, నేపడి రేని జంప నలనేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టలఁ జంపుదుంజుమీ, ఉద్యో. 4-68

క. యోగంబుఁ దపంబుఁ బరి, త్యాగంబును గాక యొండులగునే హితంబుల్, రాగము సరి దుఃఖంబును, త్యాగముఁ బోలెడి సుఖంబు నరయం గలవే. శాంతి. 5-386

తే. ... సంశయిత సంవేదనంబు, మనసు కృత్యంబ యికార్యము నకు నొండ్లు, సొరవు. అశ్వ, 2-29; శాంతి. 6-163

క. ఈ వ్యాధి యొంటఁ దీఱదు, దివ్యౌషధ యుక్తమైన దివిజ వనంబున్, హవ్యాశన భక్షింపు మ,హావ్యాధిశమంబు దాన నగు నీ కనినన్. ఆది. 8-248

ఉ. ... మీ, రొండు విధంబు సేయు టిది యుక్తమె బ్రహ్మనియుక్తి యుండఁగన్. ఆది. 2-87; ఆది. 4-85

సీ. భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి, పెట్టు నీవారాన్న పిండతతులు - తే - గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడుచున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజ,వైరి వర్గంబులయు సహవాసమపుడు, సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది. ఆది, 4-23

(ఒండు = ఒక్కట అని యర్థము)

3. ఒకటి.

వ. ...అప్పుడాతి వర్గంబులు దివియలు దెచ్చిన నర్ధరణీవరుండు రథం

బునకై దును గరికి మూఁడును దురంగంబున కొండును నియతం
బుగాఁ బట్టించి. ద్రోణ 5-144

క. విను జీవముతో నన్నుం, జననిచ్చుట యొండుదక్క సమరంబునఁ
గో,రిన యది నీ కొసగెద నిం,తన చెడియెనె యకట యన్న
నమ్మెల కూర్మిల్. కల్యా. 2-110

4. ప్రతి వచనము.

ఆ. ...అతఁడు వేఁడెదుఁగానకు, నేఁగుచుండి మనల నిప్పుడింత,
సూడవలదె యొండులాడక యప్పని, నలువు టొప్పు శాపుశాలి
నీకు. ఆశ్ర. 1-111

క. అనిన విని యొండు పలుకక, దనుజాధీశ్వరుఁడు వోయె దక్షిణ
దశకుం, జనియె సుదబ్ముఖుఁడై దివి, కనిమిష నాథుండు గౌర
వాన్వయముఖ్యా. శాంతి. 4-410

ఒండుమెయి, ఒండుమై దే.

వేఱు విధము, మఱి యొకరీతి.

తే. వినుము నృపస త్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు
ముప్పిరి గొనుచు నాత్మఁ,జుట్టుకొను నొండు మెయిఁదెగ నిట్టల
ముగ, నొలయు వై రాగ్యమను కొడవలిన కాని. శాంతి. 4-162

శా. దేవా నాలవజాతి వాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్, సేవా
దక్షత యొండుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చున,ట్లే సంతం
గడు నేర్తు. విరా. 1-218

ఒండె అవ్య. ద్రు.

పక్షాంతరమును దెల్పును.

వ. ...ఇది మనము మోహంబునం గానమి నొండె వారు లోభంబున
వచ్చుట నొండె నగు. విరా. 4-185

సీ. ...గుప్త నివాసమొండె, మాడువు మీఁదొండె మాటులేని
యరణ్య, తలమొండె మంత్ర విధానమునకు నర్హముల్.
ఆశ్ర. 1-58

వ. ఎడసేయక ద్రుపదుండు పాండవులను విడుచునట్లుగా భేదింత

మొండెవలను గల వారలం బంచి కౌంతేయ మాద్రేయులను
దమలో విరక్తులగునట్లుగాఁ జేయింత మొండె నతిలలిత ప్రమదా
జనంబులఁ బ్రత్యేకంబ యేపురకుం బ్రయోగించి ద్రౌపదివలన
విరక్తిఁ బుట్టింత మొండె నేపురకు నొక్కతియ యాలగుట
కష్టంబు. ఆది 8-22

సీ. ఆయంబునందు నాల్గవ భాగ మొండె మూఁడవ భాగ మొండె
సందర్భ మొండెఁ,గాని మిక్కిలి సేయఁగా దువ్యయంబు.
సభా. 1-46

**ఒండొంట** దే. అవ్య. (ఒండు + ఒండు + అ)

1. వరుసగా, యథాక్రమముగా, క్రమక్రమముగా.

సీ. గాండివ గుణరవం బొండొంట చెలఁగంగ శరపరంపర లాకసంబు
గప్పఁ. ఉద్యో. 2-144

తే. అర్జునుండును పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిణ్గునని యేఱు
పఱుపరాక, యుండ నెత్తురు వెల్లువ లొండొంట పెరిఁగె. నుబ్బి
భూత బేతాళంబు లోలలాడ, ద్రోణ. 3-108

క. పాండవుల విభవమటియా, ఖండలు విభవంబుకంటెఁ గడు మిక్కి
లిఁదై, యొండొంట పెరిఁగి దిక్కులు, నిండెఁ దదీయ ప్రతాప
నిర్మల రుచితోన్. సభా. 2-104

2. తోడ్తో, వెంటనే.

సీ. వెఱవక నముఁ జూచె వీఁడని యెదఁ గలు,షించిన నొండొంట చెమట
వొడమ. విరా. 2-38

వ. ...నెత్తురొండొంట పరఁగి పరశురాము శరీరంబుఁ జోకిన నతండు
మేల్కని. శాంతి. 1-22

వ. ...సముదిత సాంద్రసంరావంబు రోదసీ కుహరంబు నిండిన
నొండొంట మట్టలెత్తుకొని నేలమట్టవియుచు నద్రువం బసులు-
వెసం దిరిగి మున్ను పివ్వచ్చుందు వచ్చిన జాడం గైకొని.
విరా. 4-265

**ఒండొండు** దే. సర్వ. బొ (ఒండు + ఒండు)

అన్యోన్యము, పరస్పరము.

సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెదములు, మ్రింగి ప్రబ్బఁగ
సొంపు మిగులు దాని. విరా 1-162

సీ బహుళపదాతి దుర్ఘర ఘోరమదరిన, మరగ కూర్మంబు లొండొం
టిఁ బొంద, విరా. 3-156

సీ. ధర్మ విదుండవై ధర్మార్థ కామంబు లొండొంటి బాధింపకుండ
నుచిత,కాల విభక్తముల్ గాఁ జేసి. సభా. 1-25; శాంతి. 2-314

ఒండొక సర్వ. (ఒండు + ఒక)

మరియొక, వేఱొక.

తే. కౌరవాన్వయ సంజాతులై గారవమునఁ, బెరిఁగినట్టి మీ రొండొక
నరునిఁ గొలిచి, మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁ
కువతోడన యునికి యరిది విరా, 1-118

క. మనకేటి రాజ్య మొండొక, జనపదమున కేగి భైక్ష చర్యా విధి
జీవనము నడపికొని యుందుదము. శాంతి. 1-48

క. దీపంబువలన నొండొక. దీపము పుట్టించినట్లు. ఆది. 4-89

ఒండొకటి సర్వ. (ఒండు + ఒకటి)

1. ఇతరము, మఱియొక్కటి.

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీ చెవిఁ జొనఁ గెనె నాదు పల్కులం
దియ్యెడ సంజయా. ఉద్యో, 1-304

2. వేఱు విధము, విపరీత పద్ధతి.

చ. అని శిశుపాలుఁ డొండొకటి నప్రియముల్ వారిఁ బల్కుచున్నచో.
సభా. 2-68

ఒండొకండు; ఒండొకఁడు దే. సర్వ. (ఒండు + ఒకఁడు)

1. ఇతరుఁడు.

శా. రాధేయుండును దుస్ససేనుఁడును ఘోరం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నాకుం దోడె నీ వింక నన్
బాధం బెట్టకు. ఉద్యో. 2-251

ఉ. పేర్చిన మూఁక గూడ నడపింపఁగ గోత్రిఁ జేయుఁ దీవ్రశా,తా
ర్చుల మార్గణంబుల రయంబున నీఱుగఁ గాల్చు నాజి నీ, వేర్చిన
భంగి నొకఁడొకఁడు నేర్చునె ద్రో. ఆ 1-42

2. ఇతరము, మఱియొకటి (ఈయర్థమున ఔపవిభక్తికము)

తే. దినము వంధ్యంబు గాకుండఁ దివిరి యన్న,పానదానంబు లొదవిన
భంగిఁ జేసి, మఱి భుజించుటఁ బోలెడు మహితధర్మ, కార్య
మొండొకఁ డెందును గలదె యర్కజ్ఞ. అను. 4-278

చ. ...ఉద్ధవుండు ధ్యానలఘు తపం బొనర్చుటకు నై విపినంబున కేఁగు
వాఁడుగాఁ, బలికిన దాని కొండొకఁడుఁ బల్కఁడు కృష్ణుఁడు,
కాలవేదితన్, మౌస. 1-38

వ. అవ్వనిత యవ్వనం బెట్టిదని యడిగిన నమ్మహాద్విజుం డిట్లనియె.

ఉ. అంతకుఁ జిన్నలున్ పెదక నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ,త్యంత
ముఁ జేయ సౌఖ్యమెసలార నొనర్పఁగ నొండొకంటి యం,దంతటి
నేర్పు లేదు. ఆశ్వ. 2-54, 55

ఒండొకరుఁడు దే. సర్వ. (ఒండు+ఒకరుఁడు)

మఱియొకఁడు.

ఉ. ...మత్సరభూమిభృ, ద్వేష్యామున్నందుఁ బేర్మియనఁ గీర్పడి యుండెనొ
క్కాక యీ కురు,వ్యూహముతోడి కయ్యమ్మున కొండొకరుం డిటు
లొంటి వచ్చునే. విరా. 4-76

ఉ. ...వీరలకాక వీరితో, నొండొకరుండు మార్కొనఁగ నోపునె.
భీష్మ. 2-47

(భూరిశ్రవుఁ డర్జునునితో)

ఉ. నీ దెసఁ జూడ నొండొక్కరునిం దగ మార్కొని పోరుచుండఁ బెం,
పేద వినీచకర్మమున కియ్యకొనం దగునే భవాదృశుండు.
ద్రోణ. 4-268

ఒండొరుఁడు దే. సర్వ. (ఒండు+ఒరుఁడు)

అన్యోన్యము, పరస్పరము.

(ప్రథమైక వచనాంతముగకు మాత్రము ప్రయోగము కానంబడదు)

ఉ. ఒండొరు మీఱు కోర్కి మెయి నొక్కట వాసలవారు సొచ్చినన్.
విరా. 3-166

ఉ. ఒండొరు మీఁద సాయకము లొక్క మొగిం బఱఁగింతు రేపుమై,
నొండొరు బాణముల్ నఱకి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై
యొండొరు మేనులన్ శరము లుచ్చిచనన్ నిగిడింతు రిట్టులుద్ధం
డతఁ బోరి రాజనిమదంబుల నొండొరు మీఱు నాసలన్.
ద్రోణ. 4-218

వ. ...అమ్మహా వీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతి
లోకంబగు నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి రట్టి
యెడ. శల్య. 2-188

వ. అని యిట్లు గంగాత్మసుపు లొండొరులు సమయంబు సేసికొని చనిరి.
ఆది. 4-188

క. ఒండొరులకు రక్షకులై యుండుదురు. శాంతి, 2-200

వ. ఉబ్బునందలపట్టిన బెబ్బులుల క్కరణి నొండొరుల మేనులు నెత్తుట
జొత్తిల్లం జేసి. ద్రోణ. 8-268

**ఒండొరువుఁడు** దే. సర్వ.

ఒండొరుఁడు.

తే. ఘూరేణువు కతన రాత్రిగాక మున్న యొండొరువులఁ గానరై రి
విరా, 3-190

చ. అరదము మీఁదఁ మున్ బొలుచునాతఁడొ యిప్పటి యాతఁడో
దివాకరుఁడను సందియంబు భుజగంబుల చిత్తములందుఁ బుట్టి
యొండొరువులతోడ వారు కడు నొయ్యనఁ బల్కఁగ.
శాంతి. 6-608

క, అనిమిషవరుఁ డివ్విధమున, జనియింపఁగ జేసెఁ బగయ సంగతులై
వారును దెగి యొండొరువులతో,నని జెట్టుగఁ జేసి చచ్చిరందఱు
నధిపా. అను. 1-298

క. ఇరువురు నొండొరువులఁ గడు, సురుచిరమ్ముగఁ జూచి వాఁడి
చూడ్కులు దనకున్, శరములుగాఁ గొనియేసెను; మరుఁడయ్యిరు
వుర మనోభిమాన చ్యుతిగాన్, ఆది. 4-146

(రతియందు) కలియు, కూడు.

సీ. పనవ నాఁడొంద నింతియు షష్ఠాహ్నమునఁ బొంద మగవాఁడుఁ
బుట్టు. అను. 4-126

వ. ...అట్లొందిన యయ్యిరువురకును ప్రభవించిన సౌరభేయీ కులం
బాకమలాసను నిర్దేశించినట్టిదై సురాసుర ప్రముఖ నిఖిల జనం
బులకు నమస్కారార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు.
అను. 3-52

3, చేరు.

క. తనుఁ గాచి వెనుకవచ్చిన, దనుజ మహాబలము తనదు తను వొంది
న నాతనిచే విదిల్చి రథసంఘమునఁ దన్మందిరము ద్రుపద పుత్రిక
వెడలెన్. విరా. 2-126

4. ఊను, పూను.

ఉ. ...మహాకవిత్వ దీక్షా విధినొంది పద్యమున గద్యములన్ రచియిం
చెదం గృతుల్. విరా. 1-30

ఒక సర్వః (సం. ఏకః)
(వృత్తియందే ప్రత్యయము లోపించిన రూపము)

1. ఏకార్థము.

చ. వెఱచితిరేని నిల్వుఁడొక వీరుఁడ కొక్కఁడ చాలు. విరా. 4-201

క. ఉడిగి మడుగవలనె నిప్పు డొక సాత్యకిచేన్. ద్రో. 4-89

చ. నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత, వ్రత
యొకబావి మేలు. ఆది. 4-93

2. ఒకానొక.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నిరదంబులతోడఁ గ్రోశ
మాత్రమొక్క చోట కల్గఁ జని. విరా. 1-58

క. విలువిద్య నేరులు నీకగ్గలముగ లేరుండ నిమ్నఁ గలపుదు నని
మున్, పలికితిరి నాకు కాదే, త్రిలోకములఁ అధికుఁ జూచితిమి యొక
యొఱుకున్, ఆది. 5-289

3. సామాన్యము, సాధారణము.

ఉ. ...ఆ,ఖండలుఁ డన్న గద్దియ సగంబుననుండె మహానుభావుఁ డీ,తం డొక మర్త్యుఁ జేర యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో విరా. 1-85

క. నరుఁ డొక రథికుని యనుమతిఁ, జొరఁ దలఁచునె మనుజసేన సుర బలమైన,న్దెరలిచికొని నిచ్చల విడి, నరుగుం దన వలచినెడకు నది యట్లుండెన్. ద్రోణ. 4-147

తే. యోగబలములేని యొక భంగి యోగి బల్, ద్రోపులేని మీను నేపు లేని, మృగమువలయు నవియఁ దెగిపోవ నుఱుకంగ,లేని యట్లు భవములోన నడఁగు శాంతి. 5-578

4. అన్యము. వేఱైనది.

ఉ. ఏ నిటులంటినా వలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం, గా నుచితంబు సూచి మన కార్యము మీనుజనత్వముం బెడం,గా నొక భంగి నేయఁ దగుం గురువర్గముతోడి సంధి మీ,కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. ఉద్యో.3-106

(ఒకభంగి = కాని విధము, భిన్నమైన పద్ధతి)

గీ. ...భీముఁడెచట నున్నాఁడు నాయొడలెట్లు ప్రాణ, సహితమై యుండు నతఁడొక చందమైన, నేమిగతిఁ బోదు నక్కట యొఱుఁ గఁ జెపుమ. (ఒక చందమైన = మరణించిన) భీష్మ 2-265

5. అనిర్వాచ్యము, ఇంతయని వివరించి చెప్పుటకు వీలులేనిది.

తే. అనిన విని కిన్కఁబూనిన యలఁతినగవు, చెలువు మొగమున నొక క్రొత్తపాలు పొనర్పఁ, బుండరీకాక్షుఁడను పెల్లఁ బోయి యన్ను, డరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుఁడు. ఉద్యో. 3-364

6. తెగలు తెగలుగా విభజించునప్పుడు మొత్తమునకు వాడఁబడునది.

క మన మొక యేపుర మీ యం,గనయుం దో నరుగుదేరఁగా నెయ్యో డఁ బో,యిన నెఱుఁగకుండుదురె. విరా. 1-59

7. కొంచెము, అల్పార్థము.

చ. ఇది కడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేర దెంతయున్.
మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాలదు   విరా. 1-108

చ. ...అక్కట యింతకుముంద రేమియున్, మనల నెఱుంగఁ డవ్వి
భుని మాటునఁ బూనిక దీర్చికొంటి మా, శనికొక యెగ్గుసేతఁ యుచి
తంబె   విరా. 5-313

8. కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయుక్తము.

చ. నలవదు రోయఁ బాండవుల వారొక యూఱటలేని త్రిమ్మటన్,
బలమఱి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు, న్మ్రల
వడె.   విరా. 3-95

క. వెలివిరిసి వచ్చు జలనిధి, పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్రుని బలు
గోత్రల నిలువరింప నీవొక, చెలియలి కట్టవయి మమ్ముఁ జేకొను
మిచటన్.   భీష్మ. 3-241

**ఒకండు**; ఒకడు సర్వ. ఒక్కఁడు (ఇది అమహదర్థకమున ఔప
విభక్తికము)

1. ఒకటి.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్లనియె నీవత్సర, మొకఁడు నెట్లులయిన
నడిగిమడిగి, సంకటముల నోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప వెగడవలయు.   విరా. 1—148

తే. అతఁడు నీ లోమ్మ ద్రొక్కిన యపు డొకండుఁ, జేయఁజాలవ
యగ్గురు సాయకములఁ, బాండవానీకములు విచ్చి పాఱ నెన్ని,
యెడల మార్కొంటి వాతని నెఱుఁగవెట్లు.   ద్రోణ. 5-389

తే. అందు మూఁడేసి ఋతువులం కయన నామ, కంబులగు నుత్తరాఖ్య
మొకండు దక్షిణాభిధాన మొక్కటియు గుణాభిరామ, యవి
యహస్సును రాత్రియు ననఁగఁ బరఁగు.   శాంతి. 5-41

గీ. ఒకటనైనను వారియం దొకరిలోని, చిదురపాలును బోలందు.

చ. ఒకటను మేలుసేయని సుయోధనుఁడు.   స్వర్గ. 25

(ఒకటను = ఒక విషయమందైనను)

2. అన్యుఁడు, ఇతరుఁడు.

ఉ. ...న,న్మిఁ అఁగ బానసీని నొకనిం బురిఁగానని యట్లుగాఁగ మేన్, గాఱియ వెట్టినైన నొడికంబుగ వండుదు నెల్లగూరలున్.

విరా. 1-77

3. ఒకానొక పురుషుఁడు, అల్పుఁడు.

సీ. ...ఎందు నుతికినెక్కి —తే— యున్న గంధర్వు లేవురు నన్ను నిట్టు లొకఁడు పఱువంగ నూరక యునికి సూడ, నచ్చెరువుగాదె యెవ్వరి యాంద్రుఁడిరింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు.

విరా. 2-140

ఉ. ...ఇట్టి నమఁ బంకజనాథ యొకండు రాజసూ,యావభృథంబు నందు శుచియై పెనుపొందిన వేణి వట్టె యీ,యేపురుఁ జూడఁగా సభకు సిద్ధ్యెఁ గులాంగన నిట్లొనర్తురే.

ఉద్యో. 8-110

4. ఒక పురుషుఁడు.

(అర్జునుఁ డుత్తరునితోఁ గర్ణుని జూపి)

క. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగండనఁగఁ జాలువాఁ డిబ్బం గిం, బోడిమిసెడియెను ద్రోణుం, వేడిమి యిట మనకు మునుము విక్రమమునకున్.

విరా. 5-110

5. ఏకీభూతుఁడు, కలిసినవాఁడు.

ఉ. ఏ మును పాండునందనులు నేక కులంబునఁ బుట్టి యొక్కచో, నే మొకఁడై నఁజేసి గెడనెప్డు చరించిన యట్టి వార ము,ద్దామ బలంబు శౌర్యమును దర్పము వారిక కల్గివారసం, గ్రామమునన్ జయింతు రనఁగా నొక నిశ్చయమెట్లు గల్గెదున్.

ఉద్యో. 2-239

6. ఒక వ్యక్తి (ఎంతటి గొప్పవాఁడైనను లేక ఎప్పుఁడైనను అను భావము సూచించును)

ఉ. వారిని వారి వారి నిటువర్ణన సేసెదుగాని మమ్ము మా,వారిఁ దలంప విప్పుడమి వారికిఁ బాయను మాకు నంతయుం, జేరను మున్ సృజించె విధిసిద్ధము దీని నొకండు మాన్పఁగా, నేరఁ డకార ణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్.

ఉద్యో. 2-240

7. కీడు, హాని.

క. అది యొకఁడుఁ జేయఁజాలక, విదళితశైలమగు తనదు పిలస
మచటం, గుడియుట దనకుం దెలిసిన, మదమతి గిరిభేది కడక
మగుడం జనియెన్. అను. 1-25

ఒక కాలము వి.

ఏ కాలమందును, ఎప్పుడును.

(ఇది ఈ యర్థమందు సముచ్చయము గలిగి వ్యతిరేకార్థకముతోఁ గూ
యుండును.)

చ. ...నరేంద్ర యవ్వు సంగరమతి ఘోరమయ్యె నొక కాలము న
వి నూడ మెయ్యెడన్. ద్రోణ. 3-11

శ్లో. కదాచిన్నాస్మాభిర్దృష్టం తాదృఙ్న చ శ్రుతమ్.
సం. భా. ద్రోణ. 95-

ఒక కొండ వి.

మిక్కిలి గొప్ప పదా ము (అలంకారికము)

చ. కుడువఁగఁ బంధులకుఁ గోటి విధంబులఁ బెట్టి జన్మము,ల్నద
ప ననేక ధర్మ ధులం బొగడొందఁగఁ జాలు నట్టియొక్కఁడు సి
యిచ్చి పేర్మి నొకకొండగ మన్పిన వీవు సావఁగా, నొడ లిటు లొ
మితిం గురుకులోత్తమ యేనొక పేవకుండనే. సౌప్తి. 1-22

ఒకటు; ఒక్కటు అవ్య. ద్రు.

ఏక కాలమున, ఒక్కమాఱుగా.

క. ఒంటిమెయి నుండఁగా ముక్కంటికి నొకచ్ఛపంబు గౌరుం బట్టఁ
గంట యరిది యొక్కొకటన, రెంటిం బొరువంగవలయు రేవె
వారన్, అను. 1-22

ఒకటి సర్వ. ఒకటి (సం. ఏకః)

1. ఏకము. ఏకత్వ సంఖ్యాకము.

తే. మణిగణోజ్జ్వలమైన విమానమొకటి, యంబరంబునఁ గాంచి.
భీష్మ. 2-28

క. .. ఇతిహాసమొకటి సెప్పెద వేఁడిపా. శాంతి. 3-47

2 ఒక సంగతి, ఒక విషయము.

ఆ. పను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱు, గలవు వత్సరములు గాన నెందు, వాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధుని, బచ్చిపోయి మగిడి వచ్చువాని.

క ఒకటి గలదు వత్తురు వేఁటొక గర్భంబునకు మృతులు. శాంతి. 3-375, 376

అ. ఒకటి దెసను దృష్ణ యొలయదు గావున. శాంతి. 1-127

చ. కడు పనిబడ్డ వీఁడొకటి గాదవునా నెఱుంగఁడు. విరా. 2-218

క, తన మదిఁగదిరిన తమకంబున జిడిముడి పడుచు ద్రుపద పుత్రికపై నూ, నిన వేడ్క దిగువ నొకటియుఁ, గమఁగొన వినలేక మదన కంపితుఁ డగుచున్. విరా. 2-243

(ఒకటి = ఒక వస్తువు, ఒక విషయము).

3. తిన్యము, భిన్నము, వేఱైనది.

క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జాఱవిడిచి నట్ల తనదు సుజ్ఞానము న్వాక్కాఱు విడిచి తన కంచెను, మీఱ నొకటి లేమి,గాన్పు మెయి కొన వలయున్. అను. 4-207

వ. మిత్రుని కోరిన యది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే. సౌప్తి. 2-48

4. ఒక పని.

చ. —యొంటి దిరుగు దానికొర్వ దొకటిం దనుదా సవరించు చొప్పెఱుంగదు తగనొండొరులం గొలువఁగా వెరవెమ్మెయిఁ గల్గు నక్కటా. విరా. 1-108

5 బుద్ధి

తే ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటిఁగడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ఉద్యో. 2-37

ఒకటిన్ = బుద్ధిన్; కొని = గ్రహించి, పూని; రెంటిన్ = పుణ్యము పాపము అనువాని రెండింటిని, నిశ్చలయుక్తిన్ చేరి = అచంచలముగా

బుద్ధియందు నిలుచు నటులఁజేసి అనఁగా ఏది పుణ్యము ఏది పాపము అను విషయము నెల్లప్పుడు బుద్ధియందు విచారణలో నుంచి; మూఁటిన్ = శత్రువులు, మిత్రులు, బాంధవులు అను ముప్వురను; నాల్గింటిన్ = సామము, దానము, భేదము, దండము అను నాలుగు ఉపాయములను; కడువశ్యములుగన్ + చేసి = తనకు మిక్కిలి స్వాధీనములో నుండునట్లు చేసి అనగా శత్రుమిత్ర బాంధవులు తనకెప్పుడు మిక్కిలి లోఁబడియుండు వారుగను సామభేద దండోపాయములను బాగుగా నెఱిఁగి వాని వానిని ఆయా సమయములందు ఉపయోగింపవలసినంత వఱకు ఏమఱక ఉపయోగించి; ఏనిటిని గెల్చి = పంచ జ్ఞానేంద్రియములను (1. త్వక్కు, 2. చక్షువు, 3. శ్రోత్రము, 4. జిహ్వ, 5. ఘ్రాణము) జయించి; ఆఱింటిన్ + ఎఱిఁగి = సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అను నాఱు విషయముల యందు సంపూర్ణ జ్ఞానము గలిగి యాయా సందర్భముల యందు వానివాని ప్రయోగించుచు. ఏడు + విడిచి = సప్తవ్యసనములను. 1) ద్యూతము, 2) వేఁట, 3) స్త్రీ, 4) మద్యపానము, 5) అర్థదూషణము, 6) వాక్పారుష్యము, 7) దండపారుష్యము అను వానిని పరిత్యజించి; వర్తించువాఁడు = ప్రవర్తించువాఁడు; వివేకధనుఁడు = విజ్ఞానమను ధనము గలవాఁడు.

6. హాని, కీడు, ఉపాయము.

క. హితుఁడగు మంత్రిం గుటిలుల, యతి కపటోపాయములకు నగపడి చెఱుపన్, మఱిఁ దంఁతురె పతి సుపరీక్షితంబు గావింప కొకటి సేయం దగునే. శాంతి. 3–73

వ. కుములలంబున కొకటి పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీ తలన నిలుచు నట్లగుటంజేసి. విరా. 4–224

ఆ. వాసనాత్మజుండు వసుధేశ నందను, ముట్టకొనిన నొకటి పుట్టె నేని, మన ప్రయోజనంబు మఱియేమి పసులవి, యేటికొండు ధనము లెల్ల నేల. విరా. 4–261

7. మేలు, ఉపకారము.

చ. అన విని నన్నుఁగాంచితి ప్రయత్నమునన్ వినిపింపు మీపు వచ్చిన

పని నాకు నీ కొకటి సేసితినే యిటు వృథమూల వ్యాసుని క్రియ
తేచిపోక తగు చొప్పగునే భవదీయవాంఛ సెప్పిన నది యేను
దీర్ఘ మతి పెంపెసఁగం జను భూసురోత్తమా. శాంతి. 6-613

8. ఒక విధము.

క. అనవుడు భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లను నీవునుం గొడుకు
నేమే నిచ్చిన నొకటి యీగి లేకున్నను వేఱొక్కటి దలఁచు వా
రేవుఁడున్. ఉద్యో. 3-165

9. ఒకానొకటి.

క. ఒకవాఁడు గోవొకటి లేఁగకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని
నీ విం కకటా యెక్కడఁ జేరెద, వకృపులు వచ్చెదరు చంప నని
పల్కుటయున్. అను. 3-85

క. శకట పథంబునఁ గీటం, బొకటి వెసం బాఱఁ గాంచె యోగీం
ద్రుఁడు జంతుకలాప మానస దశాప్రకార సంవేది బాదరాయ
ణుఁ డధిపా. అను. 4-316

క. ...బనను, వినినది కథ యొకటి నీకు వినిపింతుఁ దగన్.
అను. 2-181

ఒకటియగు; ఒక్కటియగు అ. క్రి.

1. అన్యథా యగు, వేఱొక విధముగా నగు.

క. అతఁ డొకటి యైన నేనే, గతిఁ బోదుం జెపుమ యెల్లకార్యంబులలో,
నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁ జేయు మనఘ
విచారా. (ఒకటియగు = మరణించు అనిభావము) ద్రోణ. 3-287

2. ఏకమగు.

వ. శాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట
యొడఁగూర్చి రమ్ము. ఉద్యో. 1-272

వ. మీరును వారును నొక్కటియై యున్న మీ దిక్కు దేవతలకుం
దేఱి చూడరాదు. ఉద్యో. 2-49

ఒకత వి.

ఒకతె.

క. నీ వొకత వేలఁ బదివేవురనే వలచి పట్ట వెరకిన నడ్డంబై వచ్చి
వలదు వానిం, దేవాఁడు మగండు. విరా. 2-256

క. పని పంపఁగాని యొకత్తకుఁ, బనిసేయ నెఱుఁగ నన్నుఁ బనిగొను
నెడఁ జాం, దుని యగ్రమహిషి గొంకుచుఁ, బనిగఱపెడు చందము
నన పనుచు టెఱుఁగవే. విరా. 2-219

ఒకతల; ఒక్కతల వి.

1. ఒకవైపు, ఒక పక్షము.

క. ఆ యిరువురు నొకతలయై, యాయోధమునకు నడచు నట్టిద
యేనిన్, వేయేల మనక కాదైదు, రై యేత్రైలఁ దాఁక హాయన
కైనను వశమ్మే. ఉద్యో. 2-151

2. ఒక ఎత్తు.

క. ఇది యెల్లను నొకత్తల యీ, వధుమూఁదేఁడులును నాకు జావ
కొడుకుచే, నదయమగు కూడు గుడుచుట, యది యొకతల
యయ్యోనేమి యనఁగల దనఘా. ఉద్యో. 3-192

సీ. ఇది యెల్ల నొకతల యేపు మీఱఁగ నన్నుఁ జెనకుట యొకతల
చెప్పనేల. అర. 7-61

3. ఒక మొత్తము, ఒక గుంపు.

వ. ...అయ్యెడకు వచ్చు కౌంతేయులతో వీరెల్ల నొక్క తలగా
వెడలి వేడుక జూడం జనుదేర. కల్యా. 2-352; కల్యా. 1-100

ఒకనాఁడు; ఒక్కనాఁడు వి.

1. ఎప్పుడైన ఒకప్పుడు.

క. ఒకనాఁడేనును నాపద, లక్కు విడుమర్లఁగాంచి విప్రులం జుట్టలఁ
బెట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో యిప్పాటెందుఁ గలదె
యొరు లెవ్వరికిన్. విరా. 1-49

2. ఒకానొక దినము.

సీ. అరయంగఁ దప్పులేదంటి నీవలనఁ గీడొక నాఁడు సేసియు నొక్క
నాఁడు సేయవె. ఉద్యో. 3-366

సీ. ఒకనాఁడు పెనువానయును గాలియును ముట్టి సకల జీవులకు నాశంబు పుట్టు,నట్టిదియై. శాంతి. 3-307; శాంతి. 3-392

క. అనవిని యొకనాఁ డొక్కెడఁ గనుంగొంటి గృష్ణు మౌస. 1-161

వ. ఒకనాఁ డక్కౌరవేశ్వరు పేరోలగంబున సమస్త సేనాపతులం గలయం గనుఁగొని. ఉ. 1-230

3, ఏ దినమునందును, ఎప్పుడును.

(ఈ యర్థమందు ఇది సముచ్చయమ్ము గలిగి వ్యతిరేకార్థముతోఁ గూడి యుండును.)

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుప, ల్కొక్కఁడు లేదు. ఉద్యో 2-68

సీ. అల్లనవ్వుచు నయ్యింతి యతనితో నాథ నీయందొకనాఁడు నెగ్గు, గలదె ఉద్యో. 4-87

చ. అతిశయ రూపయౌవన గుణాధిక సుందరమైన యాసతీ, ద్వితయమునందు సంతతగతిన్ వివశుండయి రాజకృత్యముల్, మఱి యొకనాఁడుఁ జేయక. ఆది. 4-104

**ఒకపెట్టు; ఒక్కపెట్టు విశే.**

1. ఒక్కసారి, ఒక పర్యాయము.

చ. అనిన సుయోధనుండు దమయయ్యకు నిట్లను నిజ్జగంబు లన్నియు నొకపెట్ట మ్రింగినను వెట్టవ సర్వముగాచె నేనియు, న్వినుము ముకుందుఁ డర్జునుని నెచ్చెలి నాఁ జెవులార వించు నింక నతని నొక్కశామునకుఁగా ధృతి పెంపఱ నాశ్రయింతునే ఉద్యో. 2-322; విరా. 3-181

2. ఆకస్మికము.

వ. అందొక్కపెట్ట యార్తధ్వని యెగసిన విని కుంతీదేవి యెంతయు సంతాపించి ఆది. 6-240

**ఒక పోఁకకుఁ బోవు జాతి.**

ఎందుకుఁ గొఱకాకుండు

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నొ,
వ్వు నెఱయు హస్తియందు నొకపోఁకకుఁబోవని కుక్కయందుఁ
దా,ని నడిచి తెచ్చి వండి తిను నీచపు మానిసియందు దుల్యదుర్శ
నులు దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్.
శాంతి, 5-109

ఒక భంగి వి.

ఒక విధము.

సీ. అకట మాతో మీరు నడవుల నిడుములఁ బొందితి రొకభంగి బోయెఁ
గాలము. (ఒక భంగిన్ = ఒకానొక విధముగా, సామాన్యముగా)
విరా. 1-47

క. మన శస్త్రాస్త్రంబులు ద,క్కన యవియొక భంగి వీటికిని గాండీ
వము,గొని పోయితిమేని సుయో,ధనునకు నగపాటు నిశ్చితం
బూహింపన్. (ఒకభంగి = ఒక విధమైనవి ఎక్కువగాఁ బరిగణింపఁ
దగినవి కావు) విరా. 1-158

ఆ. యోగబలములేని యొకభంగి యోగిబల్, ద్రోపులేని మీను నేవు
లేని, మృగమువలయు నురియుఁ దెగిపోవ నుఱుకంగ,లేని యట్ల
భవములోన నడఁగు. (ఒకభంగియోగి = శక్తిచాలని యోగి).
శాంతి. 5-578

ఒక మందు వి.

ఒక యుపాయము.

చ. అని మొన దేవదానవులకైనను గెల్వ నశక్యు మిమ్మహా,త్ముని
నొకమందు నెవ్వాద సుతున్ హతుఁడయ్యెననంగ విన్నయం, తన
యితఁ డాయుధంబు దిగ్గ్రావి యచేష్టతఁ బొందునప్పు డీ,తనిఁ
బరిమార్పవచ్చు నిది దప్పనుపాయము గల్గ దెమ్మెయిన్.
ద్రోణ. 5-805

ఒకమాటు వి.

ఒక్క పర్యాయము, ఒక్కసారి.

చ. ...వారలెల్ల వెన్మునమున శంకలేక యొకమాటును నిక్కడఁ
జేరరెవ్వరున్. శల్య. 2-403

('ఒకమాటను'-అనందవారి పాఠము ప్రమాదపతితమేమో)

ఒకమొగి; ఒక్కమొగి వి.

1. ఒకే పర్యాయము-ఒక్కట (యుగపదర్థకము)

క. ఒకమొగి నఱువది యమ్ములఁ, బ్రకట బలుండైన పరశు
రాముఁడు నాయంగకములు దాఁకఁగఁ నక్కఁ బ్రకరము వానాట
సూతుపైఁబడనేసెన్. ఉద్యో. 4-317

చ. ...వాఁడుఱక నిశాతసాయకము లొక్కమొగిం బది మేని
యందుఁ గ్రిక్కిఱియఁగఁ జేసి. విరా. 3-215

2. ఐకకంఠ్యము, ఏకగ్రీవము.

వ. ....అవ్విప్రులందఱు నొక్కమొగిన మీ తలంబునకు దైవఁబను
కూలంబుగాపుతమని పాండుపుత్రుల దీవించి. విరా. 1-57

ఒక యింత; ఒకింత సర్వ. ఔ. అనౌ.

1. కొంచెము సేపు.

ఉ. ఇంతకు నేర్చునీకు నొకయింతటిలోన మఱియ వాణి నత్యంత
విభూతి బెంపెసఁగునట్టి నిముం గొనియాడఁజేఁత దా, నెంతటి పెద్ద.
విరా. 1-21

చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం,
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి.
విరా. 5-141

2 కొంచెము.

మ. అరయం దప్పొకయింత నా వలన లేదు. ఉద్యో. 3-358

ఆ. ...నీకు నరయఁ గీడొకింతయైన లేదు. అను. 2-326

వ. ఇట్లుభయసైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక
సంగ్రామంబు దక్కి తమకం బెక్క నొక్కింతసే పూరకున్నంత.
విరా. 3-190

ఒకింతయేని ద్రు. కళ.

చూ. ఇంతయేని.

ఒకరు సర్వ.

('ఒక్కఁడు'-నకని మహన్మహాత్మ్యర్థక ఏకవచన రూపాంతరము. బహు
96)

వచనమునందుఁ బ్రయోగము గానరాదు ఏకవచనమందైనను ఈ క్రింది తావునందు మాత్రమే కన్పించుచున్నది.)

ఒకఁడు, ఒకతె.

తే. ఒకటనైనను హారియం దొకరిలోని, చిదురపాలును బోలండు సిగ్గులేక, పాండవుల గెల్తు నేనని పలుకుచుండు, వీని రజ్జులు దులు వలు వింద్రు తగిలి. ఉద్యో. 2-160

ఒకరుఁడు; ఒక్కరుఁడు సర్వ. బహు. ఒకళులు, ఒకళ్లు
(ఇవి మహాత్మ్యార్థకములు కూడ నగును)

1. ఒక పురుషుఁడు, ఒకానొకఁడు.

తే. అరులు మిత్రు లుదాసీను లనుచు సంధి, విగ్రహాది షడ్గుణముల వెగవు లొకరుఁ, డలవరించుచు విజయంబు నాసపడుచు, నుండు నతె ముక్తి తెఱఁ గిటులున్నె యరయ. శాం 6-197

క. కడుఁదడవు నిద్రవోయితి, బడఁతీ నను దెలుపవలదె బలియుఁ డొకరుఁ డెక్కడు జవమునఁ బట్టి బలం, బెసలఁగ ననుఁ దిగిచె నాతఁ డెవ్వఁడు సెప్పుమా. అర. 7-25

క. తమలోన మాటలాడెదు, సమయంబున నొక్కరుండు విశాలోర స్కుఁడు, దమిళబలుఁడు పంచాసవ, సమమూర్తి స్ఫూర్తి యధిక సంరంభమునన్.

సీ. రాజ్యాధిపత్య సంపూజ్యత్వమున ధృతరాష్ట్రి పాండు సుతాం తరంబు గాన, రొకళులు జానపదోత్కరముఁ బౌర, వర్గంబు నందును వసుమతీశ. ఆశ్ర. 1-16

క. ఒక మణికిరీటి కట్టెదిరికి నుఱుముఁ బోయిరే రెండవ మాట, యెక్కొనుట కోర్వగలేరై, రొకళ్ళుఁ గురురాజసేన యోధులలో నన్. విరా. 5-65; మహా 1-20

2. అన్యుఁడు.

చ. ఒకరుని చేతిప్రోవుమ దదున్నతి ప్రావుమ గాంచి యెల్లవెం, టకుడు గొలంతిలేక పొగడం దగు సంపనొందెి. ఉద్యో. 2-77

వ. మన మొకళ్ళొకళ్ళకుఁ బ్రాపగుచు నేపారి పోరినం బుల్కన గెల్పు గొనవచ్చు. శల్య. 1-101

**ఒకొ; ఒకో** అవ్య.

1. సందేహమును దెల్పును.

క. వెఱవక సంకేతించిన, తెఱఁగున నయ్యెడకు నరుగుదెంచునొకో కొం,దఱఁ దెచ్చునొకో వెడఁగై, యఱిముఱి వెలిపుచ్చునొకో రహస్యంబెల్లన్. విరా. 2-277

క. ఒకనాఁడేమును నాపద,లకు విడుమరఁ గాంచి విప్రులం జుట్టలఁ బె,ట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకొ యిప్పాటెదుఁ గలదె యొరు లెవ్వరికిన్. విరా. 1-49; ద్రోణ. 2-228

2. ప్రశ్నను దెలుపును.

తే. పాండుసుతులు శిఖండియుఁ బండశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తాత, విడిచి నా పుత్రులందఱు విఱిగి యడవిఁ, గలసి రొకొ యాతనికిఁ బడవలసె నకట. భీష్మ. 1-58

క. అనవుడు దుర్యోధనుఁ డా,తని మీరు వధింపమికి గతంబేమి యొకో, వినఁదగునేనిం జెపుఁడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. ఉద్యో. 4-271

3. ఊహను దెలుపును.

ఉ. ...మీ,యన్న పరాక్రమంబు వలఁదన్ననొకో దయమాలి తక్కటా- విరా. 2-166

క. ....కర్ణుఁడు పుట్టె సూర్యమం,డలమొకొ భూతలంబున బెడం,గయి దీప్తి సహస్రకంబుతో, వెలిఁగెడు నా నిజద్యుతి సవిస్తర లీల వెలుఁగుచుండఁగన్. ఆది. 5-29

4. వ్యతిరేకార్థము నిచ్చును.

చ. మనుజులు సేయ నెవ్వరు సమ మునీశ్వరు నాజ్ఞ జెల్లెడు, న్వినుము కుఠారపాణి ధరణీరుహము నఱకంగఁ జాప మొందునొకో కుఠారమున్. (ఒందునొకొ = ఒందదు) శాంతి. 1-277

చ. ...నీవు సమాధిఁ బ్రాణరోధనము మనోలయంబు సుకృతంబు
లుగా నొనరించి వెండి యోగనిరతిఁ బొందెద తెలుఁగు గాదొకో
హింస. (కాదొకో = అవును) అశ్వ. 2-73

6. నిశ్చయార్థమును దెలుపును.

వ. కొడుకులు జయింప నోపుదురొకో యను నా సంజయు దిక్కు
మొగంబు సేసి. ఉద్యో. 1-256

**ఒకొండు** సర్వ.

ఒకటి.

వ. నాలుగువేలున్ మున్నూట పదునొకండు శ్లోకములు గలిగి.
ఆది. 1-36

చ. ... మీర లీ, యొనరిన సైన్యమున్ పదునొకొంటికి.
ఉద్యో. 4-140

**ఒకొఁడు** సర్వ.

ఒకఁడు.

క. ఉరు శస్త్రవృష్టి నాపైఁ గురిసినఁ దక్షణమె యొక్కొకొని పయి
నేమన్, వరుసఁ బదినేసి బాణము, లరుదుగ నేసితి మహాభయంకర
భంగిన్; అర. 4-61

**ఒక్క** ఒక

1. ఏకార్థము, ఒక్కదానిని దెల్పును.

వ. నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొలంత గలదు.
విరా. 1-318

2. ఒకానొక, నిర్దేశము లేమిని దెలుపును.

సీ. అగ్గోవు లవ్విభు నధ్వరంబునకుఁ బోనుత్సహించుటయు నందొక్క
గోవు, మనము సుమిత్రుని ధనమాతఁ దనుమతి, నేయక యొట్లు
వోఁజెల్లు ననిన. అను. 8-74

3. ఏకీభూతము.

ఉ. ఉడుగక యొండొరుం జలచి యొక్క బలంబున దేవదానవుల్,
వడిగొని వార్థి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి. ఆది. 2-15

4. అన్యము, వేఱైనది.

వ. మఱియు నొక్కమహనీయ కార్ముకంబు గొని కర్ణుండు గడంగె.
కర్ణ. 1-129

5. అనిర్వాచ్యమైనది, చెప్పుటకు వీలుగానిది.

వ. ఏమయ్యెడ నేకాంతిక జనులకెంత నంత నున్నంత భానుసహస్ర ప్రభా భాసితంబగు నొక్క దివ్య తేజోరూపంబు వారి యగ్ర భాగంబునం దోఁచిన.
శాంతి. 6-867

6. వాక్యాలంకారము.

సీ. అజుఁ డధ్వరంబు సేయంగఁ దలంచి ఋత్విజు నాత్మసదృశుని వెద కి యెందుఁ గానక తానొక్క గర్భంబు ధరియించి వెయ్యేండ్లకును దుమ్మి వెలువరించె.
శాంతి. 8-116

(ఇది పెట్టు,మాటు, మొగిన్, ఉమ్మడి మున్నగు శబ్దములకు ముందు చేరి యుగపదర్థకమగును. ఆయాపదముల నాయాతావులఁ జూచునది.)

**ఒక్కమహాద్విజుండు**

ఒక గొప్ప బ్రాహ్మణుడు.

చూ. దండక విషయము.
అర. 5-16

**ఒక్కంత(లు)** (ఒక్క+అంత)

1. సమానము, ఒకేరీతి.

క. సంతోషామృత సుఖిత, స్వాంతుండగునేని నట్టివాఁడు గృహంబుం, గాంతార దేశమును నొక్కంతగ నిశ్చింత వృత్తి నడఁకువ్యుఁ దగున్.
శాంతి. 5-887

క. విని పృథివియును సరస్వతియును గోవును దానవిధికి నొక్కంతలుగా, వినియుండుదు వీనిం బోలిన దాతవ్యములు నొండు లేవని విందున్.
అను. 2-411

2. కొంచెము.

ఉ. స్వాంతము సాహసగర్వ ఘనసంతమసాంధముగాఁగ శంక యొక్కంతయు లేక కీచకుఁ డహంకృతి యుల్లసిల్లఁగా మండపాభ్యం

తర భూమిఁ జొచ్చి. విరా, 2-381

3. ఒక మొత్తము.

వ. శిశుపాలు సేనాపతి సునీథుం డనువాఁ డతిరోష పరుషవచనుం డగుచు స్వపక్ష క్షత్రియులనెల్ల నొక్కంతం జేర్చికొని శిశుపాలు ననుమతంబున యుద్ధ సన్నద్ధుండయి యున్న సమయంబున. సభా. 2-32

ఒక్కఁడు; ఒక్కండు సర్వ. (√ఒక్క. చూ. ఒండు - అమహ ద్దర్థమున ఔపవిభక్తికము) బహు. ఒక్కండ్రు

1. ఒకటి.

వ. మఱియు నొక్కం డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయిన కృష్ణుండు సారథ్యంబు సేయుట నపార్థు పరాక్రమం బసాధ్యంబై యుండు. కర్ణ. 1-237

వ. గురువాస గృహవాస వనవాస పరులగు బ్రహ్మణుల కెల్లను శ్రేయః ప్రాప్తికిం దెరు వొక్కండ. అశ్వ. 2-96

సీ. ...నీ నాలుక యొక్కఁడయ్యె. ఆ. వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ, నట్లనఁగాని చాల వతనిఁ బొగడ సభా. 2-41

వ. ఎదిరిన రూపంబులం బెక్కింటి నొక్క బాణంబునం బెక్కు బాణం బుల నొక్కంఁటి గూర్చి కేలి సలుపుచు భీష్మ. 2-187

మ. గురుపుత్త్రుండు గడంగి...శర మొక్కంటన మూర్ఛవుచ్చి వెస ధృష్టద్యుమ్ను ఫాలంబు నిష్ఠుర నారాచహతంబు వేయుటయు వాఁడుం దేరిపై సోలినన్. ద్రోణ. 5-397

వ. పాండవ పుత్త్రులైన పదునొక్కండ్ర యందును వంశకరుండైన యభిమన్యునకు విరాటపుత్త్రియయిన యుత్తరకుం బరీక్షితుండు పుట్టె. ఆది. 4-116

2 అభిన్నము. ఏకీభూతము. సమానము.

చ. అ,హవభరులైన భోజులును నంధక వీరులు నొక్కఁడై దెసల్, సెవుడు వడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టిరి. మౌస. 1-50

క. మనో బుద్ధులు వా,రరయఁగ నొక్కండ యందు రదియట్లుండెన్.
అను. 4-174

సీ. వీరుల పలుకులు వేల్పుల మతమును నొక్కండ. అది. 7-254

3. ఒకానొకఁడు. నిర్దేశము లేమిని దెలుపును.

క. ఆపదఁబడి యొక్కఁడు స,ద్వ్యాపారముగాఁగఁ జూచి దాని నడపు. సౌప్తి. 1-46

ఆ. ఎఱిఁగియైన నెఱుఁగకేనియు నొక్కని, భంగపెట్టి పిదప సంగతుఁ డుగఁ, జేసికొనుట మేలె, శాంతి. 3-78

4. ఒంటరివాఁడు, ఏకాకి.

చ. ...ఒ,క్కండన యెట్లొకో యనక కార్యముముట్టినచోట నేలినా, తఁడొక చాయ చూపినను దత్పరతం బనిసేయు టొప్పగున్.
విరా. 1-184; విరా. 2-279

5. ఒక పురుషుఁడు.

క. ఈ నెలవులఁ దోచును వారి,దా నొక్కఁడ యింద్రియ ప్రతతి కందందు. శాంతి. 6-502

తే. ఒక్కఁడై వెలిఁగెడు పురుషోత్తమాభిధాన వాచ్య విభ్రమ వాత్స ల్యకల్య. శాంతి. 2-10

సీ. శాస్త్ర యొక్కండ తలంపసనంబునన యేఁ, బరియింతు నొక్కండ
అశ్వ. 2-553

ఒక్కట ఒకట అవ్య. ద్రు. (√ఒక్క)

1. ఒకే పర్యాయము, ఒక్కమాఱు

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు, వాలుగు సోగల నేలుదెంచి.
విరా. 2-83

తే. పాండుసుతులు శిఖండియుఁ జండశక్తిఁ మెఱయ నొక్కటఁ దైఁ బడ్డ. భీష్మ. 1-58

సీ. ద్రోణుండు మఱి పృషతున కుద్భవించిన ద్రుపదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట సఖులయి నేదముల్ సదివి. అది. 7-5

2. కూడ, కలిసి.

ప. ...వాస తప్పకతారును పాంచాలియు నొక్కటఁ బంద్రెండేడ్లు వనంబున వసియించి. విరా. 4-188

వ మీరును వారి కూడ వచ్చెదరేని యొక్కట బోదమురండు.
ఆది. 7-160; ఆది. 8-12

3. ఏకత్ర, ఒకచోట.

తే. కరఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు,చున్న యెలుకల పిల్లుల యొందు సహజ, వైరివర్గఁబులయు సహవాస మవుడు.
ఆది. 4-28

ఒక్కటి ఒకటి సర్వ. ఏ. (√ఒక్క - చూ. ఒండు)

1. ఏక సంఖ్యావాచకము.

వ. ...ఒక్కనాఁడు పెక్కుమృగంబుల నెగచి యొక్కటి నేనియు నేయం గానక. ఆది. 5-48

వ; ...తా దేని మఱియు నెం దేనియు నొక్కటియగునట్లుగాఁ దనతోడఁ బుట్టువులేవురకు నిలువ తావులయి దిచ్చిన సర్వశాంతియగు
ఉద్యో. 1-877; విరా. 2-200

2. అభిన్నము. ఏకీభూతము,

క. దేవాసురవరు లొక్కటి,యై వచ్చినఁ జిక్కువఱచు నాహవమున నా, దేవవ్రతుఁడు. భీష్మ. 1-51

వ. ...మీరును నారును నొక్కటియైయున్న మీదిక్కు దేవతలకుం దేఱి చూడరాదనిన. ఉద్యో. 2-49

3. ఒకానొక్కటి.

సీ. గ్రద్ద యొక్కటి వచ్చి. శాంతి. 8-866

4. ఒక సంగతి, ఒక విషయము.

వ. నాకు నొక్కటి వినుటకుం గుతూహలం బెప్పుడుం గల్గియుండు.
అను. 2-291

ఒక్కటియగు అ. క్రి.

ఏకమగు, ఐకమత్యమును బొందు.

వ. శాంతి ప్రకారంబునం గార్యంబు వడపి యొక్కటియై మనుట యొడఁ గూర్చి రమ్మని ఉద్యో. 1-272; ఉద్యో 2-49

**ఒక్కత** ఒక్కతె. సర్వ.

ఒక స్త్రీ.

వ. సుర గరుడ ఖచర విద్యాధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో నీవరయఁగ నొక్కతవగు దివ్యరికిం జనుదేరఁ గతము లొంకక చెప్పుమా, విరా. 1-314

**ఒక్కతి** ఒక్కతె సర్వ.

ఒక స్త్రీ.

ఆ. ...ఏకాంతమునఁ బిల్చి, యొక్కతియును గొల్వ నూరకుండె. ఉద్యో. 4-381

**ఒక్కతె** సర్వ. ఒక్కత

ఒక స్త్రీ.

క. తరుణులఁ దజాతపక్షులఁ, జరణంబులు లేనివారి శాడ్గేయుల న,ల్పురి నొక్కతె యొట దొడ్డొని, యరుగంగా నేర్చు జరిత యాపద గడవన్. ఆది. 8-313

**ఒక్కనాఁడు**

చూ. ఒకనాఁడు.

**ఒక్కపెట్ట**

చూ. ఒకపెట్ట.

**ఒక్కమాటు** వి.

ఒకప్పుడును, ఎల్లప్పుడు.

ఆ. ధీరుఁడై యభేద దృష్టియ పాటించు,చుండునట్టి పురుషు నొక్క మాటు, విడువ దర్థు వంశు విభవంబు చాడ్పున బోధలక్ష్మి పెంపు, ఖూవవర్య. శాంతి. 5-583

**ఒక్కమెయి; ఒక్కమై**

1. ఒక విధము.

కాదె. ఉద్యో. 1-108

**ఒక్కరుఁడు** సర్వ. (బహు. ఒక్కళులు, ఒక్కళ్లు - ఇవి మహత్యర్థకములు గూడ నగును.)
చూ. ఒకరుఁడు.

1. ఒక్క పురుషుఁడు.

చ. విరటుఁడు చూచుచుండ నను వేవురముందట నట్లు ద్రోవ నొ, క్కరుఁడును గాదు గూడ దనఁగల్గెనె పోటరులైన భర్త లేవురు గలరంటి, విరా. 2-257; విరా. 2-5

క. కడవఁగ నొకళ్లు పసరము, నడచిన నొక్కళులు బెయ్య నడువ వలయునే. ఉద్యో. 3-91

2. ఏకాకి, ఒంటరి.

మ. ...ఒక్కరుఁడున్ గోవులలోనఁ బొచ్చు పులిసింగం బొక్కనా నట్లు నొచ్చి రయంబార ననేకవీరశిరముల్ చెండాడె నుద్దండుఁడై (చూ. ఒకొక్కక్కరుఁడు) ఉద్యో. 2-188

**ఒక్కర్తు** సర్వ. ఒక్కతె

తే. బాలనొక్కర్తు నిక్కాన పాలుచేసి, నిష్ఠురుండనై యేనెట్లు నేర్తుఁ బోవ. అర. 2-79; అర. 3-266

**ఒక్కరూపు** వి.

1. సమానము,

క. వారలును వీరలును వా, కారయఁగా నొక్క రూప యైనను గార్యం, బీరెతిఁగింప వలయునని, కౌరవపతి నమ్ము నడిగెఁగాన నతనికిన్. విరా. 3-100

క. సరసాన్నముఁ బిచ్చాకము, సరిగాఁగ భుజింతు మృదుల శయ్యాతలమున్, ధరణియు శయనరుచికి నా,కరయంగా నొక్క రూప యసురప్రవరా. శాంతి. 4-59

2. ఒక్క ప్రాణి, ఒక్క వ్యక్తి.

వ. వారివారి బలంబులను మాత్స్యనీక ప్రభృతి సైన్యంబులను

నొక్కరూపేనియుఁ ద్రిక్కకుండ నొక్కరుండవ రెండు జాము
లలో నేలం గలిపితి. సౌప్తి. 1-106

ఒక్కరొకరుఁడు

ఒకరినొకరు-అన్యోన్యము.

ఆ. ...ఒక్కరొకరుని నొంపను జంప, జూతము. కర్ణ. 1-229

ఒక్కళులు

చూ. ఒక్కరుఁడు.

ఒక్కళ్లు

చూ. ఒకొక్కక్కరుఁడు.

ఒక్కించుక అవ్య.

మిక్కిలి కొంచెము.

తే. చెలువ యింక నొక్కించుక సేపు నీ వ,నాదరంబున నెప్పటియట్ల
యున్న. విరా. 3-47

ఒక్కిండ్లవారలు సర్వ.

పరిజనముల యందలి గణములైనవారు. చూ. గణము.

క. విను మర్థార్జకులును గా.ర్య నిపుణ మానసులు నాయుధాజీవులుఁ
ద,క్షకను గల పనుల జనులుఁ గల, రనఘా యొక్కిండ్ల వార
లైన జనంబుల్. శాంతి. 3-88

ఒక్కింత సర్వ. జా. అనౌ.

చూ. ఒక యింత.

ఒక్కింతసేసికొను

కొంచె మూఱట గల్గించుకొను.

వ. అనిన విని సంజయుండు వెచ్చనూర్చి లిచ్చవడి మూర్ఛవోయిన
చందంబున డెందంబు మగుడం జెట్టలు దక్కియుండి కొండొక
సేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని. ఉద్యో. 2-169

ఒక్కుమ్మడి వి.

చూ. ఒక్క యుమ్మడి.

ఒక్కెడ వి. (ఒక్క + ఎడ)

1. ఒక్క సమయము.

ఉ. అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్న దాన ము,న్నొక్కెడ నే దురంత దురితోత్కట బాధలఁ బెట్టియున్న.

విరా. 2-226

2. ఒక చోటు.

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు,చుండుఁడని పల్కుటయు

విరా. 8-205

ఒక్కెత్తు వి. (ఒక్క + ఎత్తు)

ఒకే పర్యాయము, ఒకేమాఱు.

వ. అందఱు నొక్కమొగంబై త్రోచి నడచిన సవ్యసాచి యొక్కరునిన కాదు పాండవుల నెల్ల నొక్కెత్తున వైచికొన నోపుదురు.

ఉద్యో. 2-222

క. మన సేనల నొక్కెత్తునఁ, గొనఁదలఁచి కడంగివచ్చు గురుపుత్రుని మార్కొన ధృష్టద్యుమ్నునిఁ గా, వనుశక్యమె నీకు నిచటి వారికి నధిపా.

ద్రోణ. 5-855

ఒక్కెఱ క్రి. విశే.

హఠాత్తుగా, ఆకస్మికముగా.

క. వెఱ చఱవ నీరిలో నొ,క్కెఱగా నొకమొసలి చూడ్కికి నగోచరమై, వఱితెంచి కుంభ సంభవు, చిఱుదొడ వడిఁ బట్టుకొనియె శిష్యులు బెదరన్.

ఆది. 5-256

చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి బహుప్రలాపయై, యఱచుచు నున్న తల్లిని గృతాంత వశస్థితుఁడైన తండ్రి నొ,క్కెఱఁ గని తీవ్రశోక పరిఖేదహతుండయి.

అర. 8-153

ఒక్కొ1 ఒక

చూ. ఒక్కమొగి.

ఒక్కొ2; ఒకొ్క ఒకో

1. సందేహమును దెలుపును.

సీ. కర్ణార్జునుల యందు ఘనుఁ డెవ్వఁడగు నొక్కొ, యను జనంబుల సందియంబు మాన్ప. విరా. 4-205

సీ. పరతి నన్నూఱడఁ బలికిన భంగిన, నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ-పొందునొక్కొ - నిక్కమొక్కొ - విడుచునొక్కొ - అనుచు నొక్కొ. విరా. 3-294

క. మా మనోరథమునకు, నీమాట విరుద్ధమయ్యె నిదియెట్లొక్కొ. విరా. 1-286

2. ఊహను దెలుపును.

ఆ. దివసు కాని యింక భువనంబు సందిట, వట్టి రాత్రిలేని యట్టు గాఁగఁ, జేసెనొక్కొ విధి. విరా. 2-318

క. శంకర నిభుఁడగు విప్రుఁడ,యంకర కోపాగ్నిమొక్కొ యనుచును జాతా,తంకుడయి. ఆది. 1-112

3. ప్రార్థనమును దెలుపును.

చ. ...దీనికిన్ నిష,వ్యపగతమైన జీవనుది వచ్చు నుపాయము సేయ రొక్కొనా, శపము ఫలంబు నధ్యయన దానఫలంబులు నిత్తు వారికిన్. ఆది. 1—149

ఒక్కండు ఒకఁడు (√ఒక్క[1])

1. ఒకటి.

క. పాండవుల వలని కీడొక్కండును లే దధిప నీదు కొడుకులు ధరణీ, మండల మంతయు గ్రమింగిరి. స్త్రీ. 1-83

ఆ. కమలభవుఁడు వారి కమరత్వ మొక్కండు, దక్కఁ గోర్కులెల్ల నక్కజముగఁ గరుణ నిచ్చె. ఆది. 8-94

2. ఒక్క, పురుషుడు.

క. పాండు నృపసుతులలో నొ,క్కొండైనను వొప్పఁ డింతకును.
కర్ణ. 1-226

ఒక్కొక; ఒక్కొక్క (ఒక్క + ఒక) (ఒక్క + ఒక్క)

ఒకానొక.

త. దేవతలకైన నొక్కొక, చో వలయునకాదె శత్రుసూదన విధి
కా,లావాప్తికి మును దమప్రద్భావంబులడంచి యుడుగఁ బడి
యుండంగన్. విరా. 1-53

వ. ధర్మనూనుండు...ఒక్కొక్కమాటు మధుర ప్రసంగముగా నాడిన
నెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ముల కొసంగుచుండు
(ఒక్కొక్కమాటు = అప్పుడప్పుడు అని భావము) విరా. 2-2

**ఒక్కొక్కరుఁడు (బహు) ఒక్కొక్కళ్లు**

ఒక్కొక్కఁడు, ఒక్కఁడొక్కఁడు,

వ. ...ఇయ్యష్టమ పుత్రుండు వసువులయం దొక్కొక్కళ్ళ చతుర్థా
ర్థంబులు చాల్చి సకల ధర్మమూర్తియయి పుట్టినవాఁడు.
(ప్రతివాని యొక్క అని భావము) ఆది. 4-116

**ఒక్కొకొఁడు**

ఒక్కొకఁడు, ఒక్కఁడొకఁడు

క. ఉరు శస్త్రవృష్టి నాపైఁ, గురిసినఁ దక్షణమె యొక్కొకొని వయి
నేనున్, వరుసఁ బదినేసి బాణముల్, లరుదుగ వేసితి మహాభయంకర
భంగిన్. (ప్రతివానియొక్క అని భావము) అర. 4-61

**ఒక్కొట ఒకట (√ఒక్కొ)**

ఏకకాలమున, ఒకేసారిగా.

క. ఇట పాండవ కౌరవు లొక్కొట నందఱు గురునను జ్ఞగొని మృగ
యాలంపటులై వనమున కరిగిరి. ఆది. 5-288

చ. ...ఇట్టు లొక్కొటఁ బడియెన్ హరార్జునుల ఘోరశరంబులు
పందిపై. అర. 1-305

**ఒక్కొటి ఒకటి (ఒక్కొ[I])**

ఏకము.

సీ. హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కొటిగాఁగఁ గరఁగిన
గుటిక యనఁగ-తే-భానుబింబము పూర్వాదిపై వెలింగె,
(ఒక్కటి అని సం.ము. ఒక్కటఅని వావిళ్ళప్రతి) విరా. 2-141

ఒకొ్కమొగి

ఏక పర్యాయము-ఒక్కసారిగా.

మ. ....రారాజు సైన్యంబు లొ,కొ్కమొగిం బెల్లగిలంగ బెట్టదరే
సక్రోధాంతరంగంబులోన్. కర్ణ 2-352

ఒగి అవ్య. క్రి.

1. క్రమముగా, వరుస ప్రకారము.

క. ఆదిత్య దైత్యదానవు, లాదిగఁగల భూతరాశి ననుసంభవమున్,
మేదినిఁ దదంశముల మ,ర్త్యోదయములు నాకుఁ జెప్ప మొగి నేర్ప
డఁగన్. ఆది. 3-58; ఉద్యో. 1-72

మధురాక్కర- తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత,
యును ననఁగ నింతులకు ముగ్వు రొగిన గురువులు. ఆది. 4-48

శ్లో. శరీరకృత్ప్రాణదాతా యస్య చాన్నాని భుంజతే,
క్రమేణైతే త్రయో ప్యుక్తాః పితరో ధర్మశాసనే.
సం. భా. ఆది. 98-25

2. పూనికతో, పట్టుదలతో.

తే. అస్త్రవిద్యలు గఱచి నాకైన యిష్ట,మొగిన తీర్పంగ నిం దెవ్వఁ
డోపుననినఁ, గాయ మొగ మిడి కౌరవుల్ పలుకకుండి,రేను దీర్చెద
నని పూనె నింద్రసుతుఁడు. ఆది. 5-224

3. వెంటనే, తత్క్షణము.

సీ, ....నాకుఁ....అ. గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి,వగు
మనియుమ శాప మొగిన యిచ్చె. అర. 4-119

4. చక్కఁగా, తెప్పగా.

ఆ. దార సంగ్రహంబు ధరణీశ రతిపుత్త్రి, ఫలము శీలవృత్తఫలము
శ్రుతము, దత్తభుక్తఫలము ధనము వేదము లగ్ని,హోత్ర ఫలము
లనియు నొగి నెఱుఁగు. సభా, 1-51

5 కొన్ని యెడల వాక్యాలంకారముగా నుపయుక్తము.

క. ఘనముగ నయ్యింద్రోత్సవ, మొనరించు మహీపతులకు నొగి నా-

యుర్వ్యర్ధనమునగుఁ బెరుగు సంతతి, యనవరతము ధరణిఁ బ్రజకు
నభివృద్ధి యగున్. ఆది. 8-25

**ఒచ్చెము** దే. వి.

అవమానము, పరాభవము.

క. అని విదురు చెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱ
గునే, పదనే యీగికి నిచ్చిన, బెఱరి రనరె యొచ్చెమొవఁ బిస్మట
నగరే. ఉద్యో. 3-163

శ్లో. అవమానశ్చ యత్ర స్యాత్ క్షత్రియస్య విశాంపతే,
న తత్కుర్యాత్ బుధః కార్యమితి మే నిశ్చితామతిః
సం. భా. ఉద్యో. 67-4

చ.....మానిః కిం దనుఁడాన కాచికో,లొదవిన దానఁజేసి సభ నొచ్చెము
దకి నఁ బా డునందనుల్, బ్రదకిరిగాక యయ్యెడరు రాచకొమా
రులు కోర్చునట్టిదే. ఉద్యో. 1-348

**ఒజ్జ** వి.

(ఉపాధ్యాయ శబ్దభవమని నైఘంటికులు అక్షర సామ్యము అర్థ పరి
పూర్ణత లేని 'ఉపాధ్యాయ' శబ్దము 'ఒజ్జ'కెట్లు ప్రకృతియో యొజ్జ
లకే యెఱుక.)

1. ఒజ్జ వంటిద,

సీ. ఎవ్వని చారిత్ర మెల్ల లోకములకు, నొజ్జయై వినయంబు నొఱపు
గఱపు. విరా. 2-91

2. ఉపాధ్యాయుఁడు.

తే మదనుఁ డింతికి నొజ్జయై మతకములును, నదను నెఱిగించి నాకద
కనుచు నొక్క. విరా. 2-295

3. గురువు.

చ. పలుకులు వింటరే ధనువువట్టెడి వారికనెల్ల నొజ్జ ద్రోణుల విది
తుండు గుంభజుఁడు. ద్రోణ. 2-45

4. ఉపదర్శకుఁడు, ఉపద్రష్ట.

చ. విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతు ప్రయోగముల్,

మనము దలిర్పఁగా నడపి మర్త్యునియాగము నొజ్జఁగాఁగ జా,లనిది నిజంబ యింక ననులాప మొనర్పక పొమ్ము వేల యొ,క్కని నుప దర్శనంబునకుఁ గైకొను మారసి నీవు నావుడున్. ఆశ్వ. 1-41

5. ఋత్విజుఁడు.

ఆ. భక్ష్యభోజ్య లేహ్యపానీయముల మీఁద, సదములోని విప్రజనుల మీఁద, వెగడు పడఁగఁ బాటి వెలిపింత మొజ్జలు, తత్ప్రయోగ విధులు దప్పి పలవ. ఆది. 2-131

## ఒజ్జతనము వి.

ఒజ్జనము, ఉపాయత్వము, ఉపదర్శనము.

ఆ. అన్న నాకు మాన్యుఁ డాతండు ననుపంగ, నాచరింతు నీదు యాగ మునకు, నొజ్జతనము వేగ మూర్వీశ యగ్గురుఁ, గని యనుజ్ఞ వడ యుము. ఆశ్వ 1-54

## ఒట్టిడు దే. అ. క్రి.

శపథముచేయు, ఒట్టుపెట్టు.

వ. అందొకం డేనట్లుసేసితి నేనిం బరలోకంబున విపులునిచన్న గతికిం జనుదునని శపథంబు సేసిన నమ్మాట వినుచు విపులుం డట సనం జన మఱియు మార్గంబున నార్వురు జూదం బాడుచుండ వారైన నొకం డట్ల యొట్టిడిన. అను. 2-210

## ఒట్టినమంట దే. వి.

ప్రజ్వలించిన యగ్ని.

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం,దొట్టిన మంట లా కొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడున్.

ఉద్యో. 1-297

ఉ. అర్జునుం,డొక్కఁడ వైరిసేనలకు నొట్టిన మంట. ఉద్యో. 2-194

## ఒట్టు దే. అ. క్రి.

ప్రజ్వలించు, మండు.

చూ. ఒట్టినమంట.

స. క్రి.

ఉంచు, పెట్టు.

ఉ. ఇట్టిది క్రూరకర్మమని యించుకకొంకక లక్కయింటఁ జిచ్చొట్టితి. శల్య. 2-134

వి.

శపథము, ప్రతిజ్ఞ.

వ. మార్గంబున నార్వురు జూదం బాడుచుండ వారైన నొకం డట్లు యొట్టిడిన. అను. 2-210

**ఒడంగూడు; ఒడఁగూడు** దే. అ. క్రి.

1. కలసి మెలసియుండు, స్నేహముచేయు.

క. ధీరోదక గతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి మనికి కార్యంబది నీ, వారసి నడపుము వారన, వీరనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే. ఉద్యో. 3-258

తే. అనుజతనుజులఁ జెలులు వియ్యములు నడుగు, మాలిపోదురు నీకుఁగా మనుజనాథ, దొరకుఁ గులనాశనుండను దూఱు మేలె, పాండవులతోడ నొడఁగూడి మనుము. ఉద్యో. 3-347

సీ. తద్దయు శాంతుఁడై తక్కువ కోర్చి శత్రుని గని యొడఁగూడి మనఁగవలయు. శాంతి. 3-33

క. ధృతరాష్ట్రి నెయ్యమున సం, తతవర్ధితులగుచుఁ బాండు తనయులు వినయాన్వితులు కుమార క్రీడాంచితులయి యొడఁగూడి ధార్తరాష్ట్రులతోడన్. ఆది. 5-163

2. కలుగు, సిద్ధించు; లభించు, ప్రాప్తించు.

క. కడువడి నీవరుగఁగ వడ, ముడియును నీ వెనుక శీఘ్రమున నెయిదుం గ, వ్వడి కుశలియైన విజయం, బొడఁగూడును మనకు దీని కొరబడు మనఘా. ద్రోణ. 3-297

ఉ. అట్టిద యేల చేయు ననయంబు నయం బొడఁగూడఁ బలికి నీ, విట్టి తెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పినవాని కత్తఱిం, బుట్టిన సంతసంబు ననువుం బరికించితి కాదె. విరా. 2-278

వ. అనవుడు సంజయుండు దేవా నీ చిత్తంబున నిడి దీని నింతం గొని
యాడినఁ గర్జం, బొడఁగూడునే యనిన వాసుదేవుం డిట్లనియె.
ఉద్యో, 1-345

క. ఒడఁగూడిన సామ్రాజ్యము, నడలున దిగద్రావి చనిన కఖిలజనులు
నిన్, గడుఁ బేదమనసువాఁడని, చెడ నాడుదురనిన మము నిసీ
యనుటదుడే. శాంతి. 1-117

శా. (గరుఁడుఁడు)...దుర్వారస్వైర విహార మెుప్ప నమృత గ్రాహం
బొడం గూడుదుం, దారావీథిఁ జనం దొడంగె నుగడన్ దర్పం
బెలర్పన్ వడిన్. అను. 1-255

3. వర్తిల్లు, ఉండు.

క. నడవడియను మున్నింటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా,
నొడఁగూడు ననిన సత్యము, గడచిన గుణ మింక నొందు గలదే
యరయన్. ఉద్యో. 2-89

4. సమావేశమగు; ఒకచోటికిఁ జేరు.

క. అమవస గావున నేఁడ,క్కమలజుఁ గొలువఁగ మహర్షి గణములు
పితృ సం,ఘములును బోదురు బ్రహ్మం,డమునంగల వారలం దొడ
గూడంగాన్, ఆది; 5-66

ఒడఁగూరు దే. అ. క్రి.

సిద్ధించు, కలుగు, లభించు, ప్రాప్తించు.

క. పదియేడ్చినఁ గృష్ణుఁడు తగు, నుడువుల నూరార్చితన మనోరథ
మిమ్మె, నొడఁగూడిన మానుషమగు; నొడలు విడిచి నిజపదంబు
నొందుట కరిగెన్. మౌస. 85 (పాఠాం)

ఒడఁగూర్చు దే. స. క్రి. (√ఒడఁగూడు) ఒడఁగూడఁజేయు

1. లభింపఁ జేయు.

క. ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభంబైన దాని నొడఁగూర్చను
మా, కిపుట్టువునకుఁ శాండు, క్ష్మాపాలుఁడు నిమ్ముఁజూపి చనియె
మహాత్మా. ఉద్యో. 3-6

క. రాజు యుధిష్ఠిరుఁడై హరి,దా జయ మొడఁగూర్ప మన్న తత్రై

న్యమురా, రా జిట్లు సరకు సేయమి, నా జన్మము దుఃఖ భాజనం బగుటం జూమీ. ఉద్యో. 2-286

ఉ. ....భక్తజనాభిమత ప్రదాన వి,ద్యాదయితత్వ మేర్పడ జయం బొడుగూర్చుము. కల్క. 1-275

2. సిద్ధపఱచు, అమర్చు,

వ. ....వాసుదేవుండు రేపకడయ వచ్చు నంతకుమున్న పురంబున నుత్సవంబు సాటుండని నియోగించి వివిధ గంధసహిత మాల్యం బులు సంపాదింపను మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను సరసాన్న స్వాదుపాన ద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరులగు తజ్జ్ఞుల నియమించె. ఉద్యో. 3-155

సీ. మణిగణోజ్జ్వలమైన మన యరదంబున, జవనాశ్వములఁ బూన్చి చాపబాణఖడ్గాది సాధనోత్కర మొడఁగూర్పుము.
ద్రోణ. 1-88

సీ. ఆఁకొని యొడఁగూర్చి యన్నంబు తఱియకు వచ్చిన గుడువని వాని కుంగి. శాంతి. 1-64

చ. వల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మందుల నొడఁగూర్ప నేర్చి తను దోషములారయు బుద్ధిగల్గి యార్తులకుఁ జికిత్స సేసెదరు. శాంతి. 1-215

3. సిద్ధింపఁజేయు, నెఱవేర్చు.

చ. ...వ్రయనువున నెప్పు డెయ్యెడ నిజాభిమతం బొడఁగూర్తు చెప్పుమా. విరా. 2-268

క. ...యుద్ధంబ...యోగ్యమనంబునకు హేతువని కోర్కి యమ్ముద్వేగంబున నెఱిగింపుదు, వేగమ యొడఁగూర్తు నెల్ల విధ ములఁ బాపిన్. ద్రోణ. 2-862

4. సమకూర్చు, కలిగించు.

క. చెదిముదిపడుచు నెదురుసనఁ గడఁగుచు వారెములు చక్కఁగాఁ ద్రొక్కుచు మల్లడిగొనుచు దుర్వ్యాసం, బొడలికి వొడఁగూర్చు

చుండ నుగ్మలి యంతన్. విరా. 2-114.

వ. శాంతి ప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మమట యొడఁగూర్చి రమ్ము. ఉద్యో. 1-272.

**ఒడంబడు; ఒడఁబడు** దే. అ. క్రి.

1. అంగీకరించు, అనుమతించు, ఒప్పుకొను.

సీ. ఒడఁబడ్డయట్టైన నడరి పైకొనఁజూచి, చెన్నటి యగుట విశ్వేష్టఁ బొరయు విరా. 2-301; విరా. 4-24

క. కడువడి నీ వరుగఁగ వడఁముడియుము నీ వెనుక శీఘ్రమున నెయిదుం, గవ్వడి కుశలియైన విజయం, బొడఁగూడును మనకు దీని కొడఁబడు మనఘా ద్రోణ. 3-297

క. ...మేము వెలిగ నట వో, నొడఁబడనని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా. శాంతి. 4-189; శాంతి. 3-167

చ. ఎడపక యర్ఘ్యమచ్యుతున కిచ్చుటి మిచ్చిన దీనికిం దొడంబడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెద నంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁడు. సభా. 2-80; సభా. 2-9

2. సంతోషించు.

మాలిని: తమ్ములుఁ దానుమ ధర్మతనూజుఁడు ... అమ్మునినాథ వరేణ్యునకున్ వినయమ్మున మ్రొక్కి సమున్నత పీఠమ్మున నుంచి యథావిధి పూజ లొడంబడఁజేసి... ఆది. 8-91

3. మైత్రి సేయు.

చ. కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునైన మంత్రి పెం, పడరఁగ రాజపుత్రుల మహాధనవంతులఁజేసి వారితో, నొడఁబడి పక్షమేర్పడఁగ నుండఁడుగా. సభా. 1-31

(మైత్రేయుఁడు దుర్యోధనునితో)

వ. వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధ సహాయులు జరామరణవంతులైన మనుజులు వారిం జెనకి యెట్లు జీవింతురు నీవు వారితో నొడంబడియుండు మిది కార్యంబు. అర. 1-103

స. క్రి.

సహించు, ఓర్చు.

ఉ. అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవ రత్నమెవ్విధిన్, దక్కు విధాత నిర్దయుఁ డొడంబడునే కడుమేలి వస్తువుల్, పెక్కు దినంబు లున్కి. ద్రోణ 2-240

ఒడంబఱచు; ఒడఁబఱచు దే. స. క్రి. (√ఒడఁబడు) ఒడఁబడఁ జేయు

ఒప్పించు, ఆమోదింపఁజేయు.

వ. ఆమ్మొఱకుల నెమ్మెయి నయినను.

క. ఒడఁబఱచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి పొందు పొసఁగి యుండెడు నట్టి తెఱఁగు సేయుట, కడుమే లది గౌరవము సుఖంబును జేయున్. ఉద్యో. 3-77, 78

క. అనుజుం డతనికి నను పెను, పొనరిన సంవర్తు భక్తి నొడఁబఱచి తగం గొనివచ్చితి మత్క్రతుయాజన మీ యోగీశ్వరుండ చాలుం జేయన్. అశ్వ. 1-76

ఒడంబఱుచు; ఒడఁబఱుచు దే. స. క్రి. (√ఒడఁబడు) ఒడఁబడఁ జేయు

ఒప్పించు, ఆమోదింపఁజేయు.

తే. వారికిఁ గర్తవ్యమగు పని నీకుఁ జేయఁదగవు గావున నెల్లవిధములఁ బూని, పాండవార్థంబు ధృతరాష్ట్రు పాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱచి యతనితో మఱియు నిట్లనియె ఉద్యో. 1-54, 55

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి పొందు పొసఁగియుండెడు నట్టి తెఱఁగు సేయుట, కడుమే లది గౌరవము సుఖంబును జేయున్. ఉద్యో. 3-78

వ. ...దుష్యంతుండు గాంధర్వ వివాహ స్వరూపంబు చెప్పి శకుంతల నొడంబఱిచిన. ఆది. 4-58

("ఒడఁబఱచు" - "ఒడఁబఱుచు" అను రెండు రూపములు భారతమునందుఁ గనఁబడుచున్నవి. సూ. అ. ని. వారు "ఒడఁబఱచు" ఈయలేదు, ముద్రిత ప్రతులయందు ఒడఁబఱచు ఒడఁబఱుచు - అను పదములు విచక్షణ లేకుండ నుపయోగింపఁబడినవి. కొన్నిట 'ఒడఁబఱుచు' ఉన్న తావుల 'ఒడఁబఱచు' కనుపట్టుచున్నవి )

ఒడఁబాటు దే. వి. (√ఒడఁబడు)

1. సమ్మతి, అంగీకారము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తానును రథమెక్కి రథికుఁడయి, చనియె నరుఁడు జమ్మి చేరఁ సమ్మదలీలన్. విరా. 4-84

వ. ...అక్కుంతి సంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠులగుట రాజుల కొడఁబాటు గాదొకో యనినను బలుకకున్న యన్నరపతి తోడం బవమానుండు మఱియు నిట్లనియె. అను. 5-346

2. ఒప్పుదల, ఒడంబడిక.

మ. జననీ నీవమృతంబు దెమ్మనిన యాసత్యోక్తి పాటించి యేఁ, జని నానావిధ కర్మకర్మఠుఁడనై సాధించి వేతెచ్చితిన్, విను నా నీ యొడఁబాటు సెల్లజనులన్ విన్పించితిం దెల్లగా, వినతం దోడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లేకుండుమీ. అను. 1-268

3. సంధి.

ఆ. మేలు గాక నీకుఁబోలి నట్లయిన నం, దరిగి యేము వారు నర్థిఁ బొంది,యుండు నట్లుగాఁగఁ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స. ఉద్యో. 3-88

క. అనినను వెండియు నొడఁబాటునకుఁ బోరని దానికిం గొడుకు తోడఁ గడుం, గినిసి ధరణీశ్వరుం డిట్లనుఁ గొలువుననున్న వార లందఱు వినఁగన్. ఉద్యో. 2-283

ఒడమి దే. వి.

ధనము, సౌమ్ము, సంపత్తు.

ఆ. ఒడమి లేనివాఁడ నడపీనుఁగను నహుషో_క్తి వినమె దాని నూఁద
వలదె. ('ఒడమె' - అనియు సూ. ఆ. ని.) శాంతి. 1-49

**ఒడయఁడు** దే. వి.

1. ప్రభువు, రాజు.

తే. శేషజనరక్షకొడయని జేయవచ్చు, వాసుదేవుని మనుమని వజ్ర
దేవు. మౌస. 158

2. అధిపతి, ఆజ్ఞాపకుఁడు.

సీ. నీవు రాజవుగాక నీకేను రాజనే, గురుని మహారాజుఁ గురువ
రేణ్యు, నిటు సేయుమని పంప నే నొడయండనే. ఆశ్ర. 1-84

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి, పరమభ_క్తి నక్షౌహిణీపతులఁ
జూపి, వీరికిని సైన్యములకును మీఁద యొడయ, లనుచుఁ బట్టంబుఁ
గట్టె శంతనుతనూజు. (ఒడయఁడు = సేనాధిపతి) ఉద్యో 4-159

3. క_ర్త.

తే. ...జగత్త్రాణుఁ డొడలు, మనువఁ జెఱుపంగ నొడయండు సనుట
మగుడ, నరుగు దెంచుట వింతగా దతని కెందు. ద్రోణ. 2-178

4 అర్హుఁడు, యుక్తుఁడు, తగినవాఁడు.

ఆ. అందు నెరవాళ్లు, లున్నవరుఁడు ము_క్తి కొడయ డంద్రు.
అను. 2-83

సీ. ...నీవు దక్కఁగ నాకు హితము సెప్ప, నొడయఁ డెవ్వఁడు భవ
దుపదిష్ట పథమున, నిష్ఠమై నడచెద. ఆశ్ర. 1-80

తే. ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె యాధర్మతనయు, నాజ్ఞనే మేల
యొనరింతు మనిమిషేంద్రుఁ డొక్కరుఁడ మమ్ము శాసింప
నొడయఁ డన్యు, లెందు నెవ్వరైనను భయమేమి మాకు.

(శాసింపనొడయఁడు - 'శాస్తా' అని మూలము)

**ఒడయుఁడు; ఒడయుండు** దే. వి. ఒడయఁడు

రాజు, ప్రభువు.

వ. వికృతవేషులగు పురుషు లిరువురు దమలో వివాదంబు సేయుచు

వచ్చి యవ్విభుండు మనల శాసింప నొడయుండు పొమ్మనుచు నిత్యాకు ముందఱ నిలిచిరి. శాంతి. 4-154

శ్లో. ఇహాస్తి నౌ వివాదో౽యమ్ అయమ్ రాజా౽నుశాసకః సం. భా. శాంతి. 198-85

ఉ. ఐనను మత్స్యదేశమున యాజ్ఞికితం డొడయుండు గాన నాకీనత నాథు దూఱఁదగు. విరా. 2-148; కర్ణ. 2-109

2. స్వామి, యజమానుఁడు.

ఆ. ...గృహాయుక్తుఁ డోషధులకు నొడయుఁడగుట. శాంతి. 5-312

(గృహాయుక్తుఁడు = గృహస్థుఁడు)

3. ఆజ్ఞాపించువాఁడు, శాసించువాఁడు.

ఆ. ధాత నిన్ను నేమి ధర్మంబు నడపుట, కై సృజించె దాని నాచరించి యుండు నీవు నీకయొడయుండవే, ధాతృచోదిత ప్రవర్తనుఁడవు గాక. శాంతి. 1—209

వ. ఉత్తమశిఖిపతు లనేకు లీ కయ్యంబున మృతులైరి నిజప్రాణం బునకు నొక్కరుఁడు నొడయుండు లేక తక్కె. శాంతి. 5—201

4. కర్త.

తే. ...జగత్ప్రాణుఁ డొడలు మనుపఁ జెలువంగ నొడయుండు సనుట మగుడ, నరుగు దెంచుట వింతగా దతని కెందు. శాంతి. 5-214

(ఈ పద్యము ద్రో. 2-176 గాఁ గూడఁ గలదు. అక్కడ 'ఒడయండు' అని యున్నది.)

తే. ...విను గ్రహచారంబు హేతువులుగ, నశుభములు శుభములు నరుఁ డాచరించు, గ్రహము సేయించునే తాన తానిచేత, కొడయుఁ డతొ గాన ఫలములు గుడవ వలయు. అను. 5-128

5. హక్కు గలవాఁడు, అధికారి.

సీ. బ్రాహ్మణు నర్థంబు పదిపాళ్లుగాఁజేయ నాలుగు బ్రాహ్మణీ నంద నుండు, క్షత్త్రియాత్మజుఁడు భాగములు మూఁడును వైశ్యతన యుండు రెండు శూద్రాతనూజుఁడొకపాలు గొనుటకు నొడయులు. అను. 2-285; అను. 5-285

ఒడయురాలు దే. విణ. (√ఒడయుఁడు)

స్వామిని, యజమానురాలు.

సీ. ...తల్లిదండ్రులును బాంధవ జనులును, గారు నిన్నిగిఁ గర్తలు
వినుసీవ యొడయురాలవు. ఆర. 7-337

ఒడలు దే. వి. ఔ. బహు. ఒడళులు, ఒడళ్లు

దేహము.

క. నా యున్నబాము దలఁపవ,యీ యొడ లీచిర యిట్టి యేవపుఁ
జందం, బోయన్న మదన వికృతిం, జేయుననుట యెంతయును
నిషిద్ధముగా దే. విరా. 2-49

తే. సగము చచ్చిన యొడళులు జలచరములు, రక్తపూరంబు దో
యంబు ప్రచుర మాంస, పటలి పంకంబుగాఁగల బహునదీ ప్రవా
హములు వాఱె సంగరావని నృపాల. భీష్మ. 2-185

వ. ప్రొద్దెక్కిన నెండ కాఁకను రేయింటి యలజడియు నప్పటి యాఁక
రియు నొడళ్లు డిల్లపడం జేసినను మొగంబులు వెడంగు పఱపినను
బొలివోని పౌరుషంబుల నయ్యిరువాగునుం గడంగి కలయన్ బెరసి
పెనంగె. ద్రోణ. 5-286

ఒడి దే. వి.

ఒడిపైఁ గట్టుకొను బట్ట, వస్త్రపుటి.

ఉ. నెట్టన యిట్టి యల్కమది నిల్పతి రక్కసు కాల్మిఁ జిచ్చొదిం,
గట్టన యట్లు పెద్దయును గాలము. ఉద్యో. 3-118

(ఒడి = తొడ పైభాగము, పొత్తికడుపు పైభాగము)

ఒడికము దే. విణ.

1. మనోహరము, రుచికరము, కమ్మనైనది.

ఉ. ...న,స్మెఱఁగ బానసీని పొకనిం బఱిఁ గానని యట్లుగాఁగ మేన్,
గాఱియ పెట్టయైన నొడికంబుగ వండఁరు నెల్లగూరలున్.
విరా. 1-77

2 సుఖకరము, హాయి గొల్పునది.

చ. కుడిచిన పిమ్మటం గుసుమ కోమలి విస్తృత సంస్తరంబుగా, నొడి

కవు నెజ్జనేసి ప్రియుఁ డొయ్యన యందు కయింప. అర. 5-11

**ఒడియు** దే. స. క్రి.

1. హఠాత్తుగాఁ బట్టుకొను.

సీ. ఘోరగృధ్రము సుకుమార నాగాంగనఁ బటుగతి నొడియంగఁ బాలుకరణి. విరా. 2-128

2. ఒడుపు వేసి పట్టుకొను, తటిమి పట్టుకొను.

క. ఎఱిఁగి పిఱుచచిన వెసఁ బైకుఱుకుదు సాళువము గాకి నొడిసిన భంగిన్, వెఱచఱవం బొదువుదు. విరా. 2-281

వ. కర్ణుండు శక్తివైవ మలంగి వెరవున నొడిసికొని దానిన యవ్వడ ముడి యతనిపై వైచిన.

(ఒడిసికొని = ఒడుపు వేసి పట్టుకొని — కొను స్వార్థము)

**ఒడుచు** దే. స. క్రి.

1. ఓడించు, జయించు, గెలుచు.

ఆ. అమరులకు నజేయులగు కాలకేయుల, నొక్కరుండ కాడె యొడిచెఁ గర్ణ. విరా. 4—209; కర్ణ. 2-24

చ. ...పన్నిదము గెల్చిన కద్రువ నేను మాటమై నొడిచితి. అను. 1-266

గీ. మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు, లోభమును మోహమును నను లోని సహజ, వైరివర్గంబు నొడిచినవాఁడ యొడుచు; నశ్రమంబున వెలుపలి యహిత తతుల. అది. 8-206

క. కడు నధికుతోడఁ దొడరినఁ బొడిచిన నొడిచినను బురుషు పురుష గుణం బేర్పడుఁగాక హీను నొడుచుట, కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెపుమా. సభా. 1-123; అది. 8-256

2. అడఁచు, నశింపఁజేయు.

సీ. ...పుణ్యపాప బంధంబుల నోపి బంధింపంగఁ బడక మనోవృత్తి నొడిచి. అది. 5-60

3. వధించు, చంపు.

తే. అతిథులకెల్లఁ దలదండ్రి యట్టివాఁడ, యసురవిభుఁడు ఘటోత్క-

చుం డాహిడింబ కొడుకు మాయా బలంబున నొడుచుఁ బగలు
నతనికడ దానవానీక మగ్గలంబు. ఉద్యో. 4-268

4. బలాత్కారముగా గ్రహించు, అపహరించు.

తే. నా తనూజులు దుర్బుద్ధు లీ తెఱంగు, నీవుఁ దలఁపక యాశక్తి
నీరజాతుఁ డొడిచి కొనియెనె మొఱకు చేమన్న తియ్య,పండు
వెస నాఁచికొనిన నేర్పరియుఁబోలె. ద్రోణ. 5-248

సీ. గాండీవ మాదిగాఁగల యాయుధావలు, లుక్కివంబున నప్పు
డొడిచి కొనఁగ, మఱచిన వాఁడయ్యె మందాత్ముఁ డాధార్తి
రాష్ట్రుఁడు గాంధార రాజతనయు, వచనముల్ విని యక్షవతి
నెపంబున వానిఁ గష్టుఁడై కొన సమకట్టి మనల, మగిడింపఁగా
దుష్టమతిఁజేసి విదురుఁ బుత్తెంచె. అర. 1-55

5. గెంటు, పూనిత్రోయు, పడఁద్రోయు.

వ. ...మల్లయుద్ధ సన్నద్ధులై కిట్టుచుం బట్టుచుఁ బాయుచు వ్రేయుచు
నొడుచుచుం బొడుచుచు మఱియు ననేక ప్రకారంబుల వీరత్వం
బును విశారదత్వంబు సేనలకు వెఱఁగు పుట్టింపం బోరాడిరి.
ద్రోణ. 3-268

6. కలిగించు, ప్రసరింపఁజేయు.

సీ. సమర వికాసంబు చెమట నొప్పఱకుండ హేతిదీధితులు రేయెండ
నొడుచు భీష్మ. 1-119

ఒడుపు దే. వి. (√ఒడయు)

పట్టుకొనుట యందలి యనుకూలస్థితి.

వ. ఒడుపు దప్పిన మహానాగంబునుం బోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం
బగు కోపంబు పెల్లున మల్లడి గొనుచుండె. విరా. 2-181

ఒడ్డగెడవు దే. విణ.

-రి కౌఁగి మఱియొక ప్రక్క పైకి లేచినది, తలక్రిందై

గొడ్డ గెడవయి గజవాజి,యుతముగాఁ గడంగి
ముఖము మొరఁగఁ దివురు మూర్ఖత మాన్చుట,

యధికమైన పుణ్యు మనఘచరిత. ఉద్యో. 3-288

శ్లో. పర్యస్తాం పృథివీం సర్వాం సాశ్వాం సరథకుంజరామ్.

ఆ. కెడసె హయములొద్ద గెడవయ్యె రథములు, చాపకట్టు వడియె సామజములు, భీష్మ. 2-165; భీష్మ. 3-319

వ. కొండొక క్రుంగిన చక్రంబు కుండమునుంగం దిగఁబడిన నొద్ద గెడవై యరదం చేటునకు ననుపీక తక్కిన నుక్కఱి యక్కర్ణుండు. కర్ణ. 3-350

ఒడ్డనము దే వి. (√ఒడ్డు)

1. వ్యూహము.

వ. ఒక్క యక్షోహిణి యొడ్డనంబు దీర్చి. ఉద్యో. 1-221

క. అనురూపములగు మా యొడ్డనముల్ ప్రస్ఫురితములు ధృష్టద్యుమ్నుఁ గలుగాఁ దీర్చినఁగాక తెఱంగగునే, యని మొనలేర్పఱిచెఁ గౌరవాన్వయముఖ్యా భీష్మ. 2-26 భీ. 3-12.

సీ. అనఘ సంశప్తకహననంబునకు నీవు, సనిన నొడ్డన కడంగి, వడచి ద్రోణునిఁ దలపడితిమి. 2-270.

2. ఒడ్డుట, అడ్డుపెట్టుట.

క. చేరి బహు చిత్రగతులం బోరంగా నొడ్డనములఁ బొలిసెం బంకల్. కర్ణ. 1-94.

మ. ఒకదిక్కుర్దతిఁబూన్చి యొండుదెస వ్రేయన్ మేను వంచించి వ్రేఁతకు దప్పన్ వడి వ్రేయు నొడ్డనమునం దప్పించి వేగంబుగుం దక నొప్పించు. శల్య. 2-57.

3. చక్రాకార ఫలకాస్త్రము, ఒకరకమైన డెక్కెము.

(ఈ యర్థమున తద్భవము. సం. అడ్డనమ్)

వ... క్రమమ్మఱంగదిసి పలకలు పడియలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబులను వ్రేటు పోటుల నవరింపకుండం గాచి గాచికొనునోజ మెఱయుచుండిరి. ద్రోణ. 4-282.

శ్లో. అసిథ్యామ్ చర్మణి చిత్రే శతచంద్రే నరాధిప
నికృత్య పురుషవ్యాఘ్రౌ బాహుయుద్ధం ప్రచక్రతుః.
సం. భా. ద్రోణ 142-40

**ఒడ్డారము** దే. వి. (√ఒడ్డు)
పంతము. పోటీ.
సీ. ...అవ్వధూటి, కేవల ధవళంబు నా విని యొడ్డారమునకు నేనదో
నల్లఁదనము కంటె...తే... వెనుకదెస నన్నువాదయ్యె.
అను. 1-198

**ఒడ్డిమి** దే. వి. (√ఒడ్డు)
జూదమునఁ బందెముగాఁ బెట్టిన వస్తువు
వ. ఆ శకుని యాడి యుధిష్ఠిరుఁ డొడ్డిన యొడ్డిమియు గెలుచుచు
వచ్చిన. ఉద్యో. 1-22

**ఒడ్డు**[1] దే. స. క్రి.
1. (వల మున్నగువానిని) ఒగ్గు. పఱచు, పన్ను.
తే. ఇందఱకు నిన్ని భంగుల నిడుమ గుడువవలసె ధర్మతనూభవు
వలనఁజేసి. దాయలొడ్డిన మాయజూదంపు టురులఁబడి కులంబున
కాతఁ డిప్పాటు దెచ్చె. విరా. 2-225
వ. అప్పు డా ద్వీపకాననారణ్యంబున నేదిక్కు చూచినను దఱచుగా
నొడ్డిన యురులు దోఁచె, స్త్రీ. 1-47 ; శాం. 3-203
2. పందెముగాఁ బెట్టు, పెట్టు.
తే. అనఘ మామామ శకుని నాకై కడంగి, జూదమాడెడి సితోడఁ
గాదు నాక, యాతఁడొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ, బోఁడిగా నీకు
నీఁగలవాఁడ నేను. సభా, 2-174
ఆ. జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను
పణంబు గాఁగనొడ్డి యాడికాఱియఁ బడఁడె య,ట్లగుట దీని
తోడి యర్థిగీడు. విరా. 5-245
3. అడ్డముగాఁబెట్టు.
క. నా కొలఁది విచారింపక, నీకిట్లనఁదగునె మిన్నునేలయు నిమ్మైత్రేఁ.

గాక తిరుగంగఁబడినం, బోకే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్.
ఉద్యో. 3-60

క. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి పొత్తు మనియెద మనఁగా, శ్రీ రామోఁకాలొడ్డిన వారి విధమకాదె నీవు వలదను చెల్లన్. ఉద్యో. 3-349

వ. అయ్యనిల తనయుండు సాధనవైకల్యంబున వెడంగు వడియును వెన్నికమున్న విన్వచ్చుచేతం జచ్చిన సామజంబుల హాయంబులఁ బుచ్చికొని డాచేత నొడ్డుకొనుచు వలచేత వైచుచుఁ బెనంగె.
ద్రోణ. 4-286

4. గుడిచేయు, బలియిచ్చు.

క. అనిమిషనాథుం డిచ్చిన, ఘనశక్తికి నసురనొడ్డి గాండివిఁ దొలఁగించిన వారివంచన పదపడి, మనమెల్లను దెలియ వినమె మను జాధీశా. కర్ణ. 1-216

5. పర్పఱచు, అమర్చు, సిద్ధపఱచు.

సీ. విను మట్టి ధృతరాష్ట్రి తనయులు గారె యీ, యొడ్డిన మొనలలో నున్నవారలు. భీష్మ 1-198

6. (ధనాదికము పుచ్చుకొనుచుటకు) హస్తాదికము చాచు, పట్టు.

తే. అనిన నాతఁడు భయమంది యాత్మలోన. నొరుల యీఁగికి నకట చే యొడ్డకుండు, నట్టి నాకిది వలసెనే యనుచుఁ గరము, సాఁచె నవ్విప్రు దెసకు నిశ్చయము తోడ. శాంతి. 4-158

7. (చెవి) ఒగ్గు

ఆ. ఇట్టు లాడఁదగునె యిది నీక పోలు ని, న్నేమనంగనేర్తు నిత్తెఱంగు, పాడిగాఁగఁ బూని పలుకంగఁ జెవియొడ్డి, యాదరించువారి నందుఁ గాక. ఉద్యో. 1-28; స్త్రీ. 1-2?

8. (యుద్ధమునకు) పూను.

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁబోయి, నీవు ధృతరాష్ట్రుతో ధర్మ నిష్ఠమైన, యుచిత మాడిన నందుఁ బోటొడ్డియున్న, దొరల

భృత్యుల మనములు దిరుగఁబడవె  ఉద్యో. 1-57

(పోటొడ్డు = యుద్ధమునకు సిద్ధపడు)

వి.

1 పందెముగాఁ బెట్టిన సొమ్ము.

వ. విరోచనుండును నంగిరసుండను విప్రుని కొడుకు సుధన్వుండును దమతమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకు సన్నిదంబు సలిచి వచ్చి  ఉద్యో. 2-88

క. గురు డొడ్డుగఁ దమకంబునఁ, గురువీరులు పాండుపుత్రకుల యోధులు నిర్భర సముద్యోత కళా, నిరతిం గ్రీడించి రుగ్రనిపుణత మెఱయన్.  ద్రోణ. 1-367

క. మనకును నితనికి సైంధవుఁ, డను నొడ్డున నయ్యె జూదము.  ద్రోణ. 3-182

2. వ్యూహము, ఒడ్డారము

ఉ. ఱెక్కలు సాచి కంఠమున జేతులు వాపి శిరంబు ద్రచ్చి పే, రుక్కునఁ గ్రౌంచచందమగు నొడ్డు గలంగఁగఁ జేపి భీష్ముఁ డే, దిక్కున దానయై.  భీష్మ. 2-80

సీ. వారట మున్నర్ధచంద్రాకృతిగ నొడ్డు సంఘటించి.  ద్రోణ 1-285

వ. భారద్వాజుండు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజు ననుమతి నభిమన్యుఁ డయ్యొడ్డు భేదించి.  ద్రోణ. 1-394

3. అడ్డుకొనుట, ఘటనము.

మ. పరిహాసంబునఁ దేవిభృత్యులయెడం బ్రహ్లాదముం బొందు భూవరు నాజ్ఞం జన రీగి మెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁ జొత్తురు కౌతూహల వేషభాషణములం దుల్యత్వముం బొందియే, తురు వారెల్ల పదంబు వేడుదురు నింతుర్ భూమి మాయొడ్డులన్.  శాంతి, 2-180

శ్లో. జర్జరం చాస్య విషయం కుర్వంతి ప్రతిరూపకైః

సం.భా. శాంతి. 56-61

**ఒడ్డు**2 దే. విశే.

పెద్దది, విశాలమైనది. అధికము.

వ. (సంజయుండు) మఱునాఁడు ధర్మతనయుం డొడ్డోలగంబున్న సమయంబు వేచి. ఉద్యో. 1-272

**ఒడ్డు**3 దే. సర్వ. బహు. ఒడ్డులు. ఒడ్లు

అన్యుఁడు, అన్యురాలు.

(బహువచనమునందే దీని ప్రయోగము)

ఉ. ...నృపాలుఁడు...ప్రయోజ విదగ్ధుఁడై పలుకునొడ్డులకుం దగదట్లు సేయఁగన్. విరా. 1-128

తే. కుడుపునకు ముందరొడ్డుల గోవునకు సమంచిత గ్రాసముష్టి నిత్యంబు నేఁడు, గాలమిచ్చిన నతఁడెల్ల కామ్యములును, బ్రాహ్మణుల కర్థినొసఁగిన ఫలము వడయు. అను. 2-415

ఉ. ఉత్పలగంధి నన్నుదుగు మొడ్లను బంపుము కల్లుదేర. విరా. 2-98; శాంతి. 2-302

**ఒడ్డోలగము** దే. వి. (ఒడ్డు + ఓలగము)

పేరోలగము, నిండుకొలువు.

సీ. మణిమయంబైన భూషణజాలముల నొప్పి, యొడ్డోలగంబున నుండఁగం దె. విరా. 5-204; ఉద్యో. 1-272

**ఒత్తరించు** స. క్రి. (సం. ఉత్తరము)

1. అతిక్రమించు. మించు.

సీ. వితత వీరాగ్రహావేశాతిదర్పిత,చిత్తులై యొండొరు నొత్తరించు నుగ్రమహోద్ధతి నుద్భటాటోపతీవ్రములగు సమర విభ్రమము లంగ, సంగతంబులుగాఁగ. కల్య. 2-263

2. ఉద్రేకించు.

క. ....అపల్గునుం బొదివిన నమ్మహాభుజుండు సారథుల సమయించియు దత్సేనాతురంగంబుల బడలు వఱచియు నబ్బలుమగలం జెరల్చి యొత్తరించి కెలనన దురంబు సేయు నమ్మరుత్తనయుం జేరంజని. కర్ణ. 3-179

**ఒత్తి** దే. అవ్య. (√ఒత్తు) గట్టిగా

1. నిర్బంధ పూర్వకముగా.

క. అనుడు విదురుఁ డాతని కిఁట్లను నిమ్మెయి వమ్ము నొత్తి యడిగినఁ జెప్పం,జను నున్న రూపు సెప్పెద, విను మవధానంబుతోడ విమల విచారా. ఉద్యో. 2-51; శాంతి. 2-334; అశ్వ. 3-84

వ. నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల. (ఒత్తిచెప్పు = నొక్కిచెప్పు) ఉద్యో. 2-198

2. హృదయ పూర్వకముగా.

ఉ. అత్తటి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబునెల్ల నో,రెత్తక యూరకుండిరి మహీశ్వరు చిత్తమెఱుంగకున్కిఁ దా,నొత్తి కుమారులం గినియ నోపఁడ యక్కట. ఉద్యో. 1-346

**ఒత్తికొను** దే. స. క్రి. (√ఒత్తు)

1. ఆక్రమించు. వశముచేసికొను.

మ. ఒకనాఁడా తమ ముందటం బలుమఱున్ వాోరాటమై నేలయొత్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లంబుగాఁ జూచి పాండుకుమారాళి నుతింపకుండుదురె. ఉద్యో. 1-279

వ. కొందఱు కొందఱ నివేశనంబు లభికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన. మహా. 19; ఉద్యో. 2-204

**ఒత్తిలి** దే. అవ్య. (√ఒత్తిలు)

బిగ్గఱగాఁ, గట్టిగా.

ఉ. అందఱివారలెల్లను జయంబునఁ బొంగుచుఁ జేరెలుంగు లం,దంద చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం,బందిన యట్టి మ్రోఁత విని యక్కడ వోవఁగ నుల్కి రప్డు. సౌప్తి. 1-5

**ఒత్తిలు** దే. అ. క్రి.

తక్కుకొను.

(శ్లేషమైన) క. క్రత్తుకను నెడ్డపడు నూ,ర్పొత్తిలి పోసిక యూఁగు నూర్ధ్వశ్వాసం, బెత్తఁగఁ జేయును. అశ్వ. 1-173

ఒత్తు దే. స. క్రి.

1. అడుము, అణచు.

సీ. ఒత్తిన వెగ్గలం బొందక ధ్రుయొండొరు, ల్లలువిడి నొత్తుచు నలవు మిగిలి. విరా. 2-347

2. నొక్కు, బలవంతపెట్టు.

క. అనుడు విదురుఁ డాతని కిట్లను నిమ్మెయి నన్ను నొత్తియడిగినఁ జెప్పం, జను నున్నరూపు సెప్పెద. ఉద్యో. 2-51; స్త్రీ. 2-157

3. (శంఖము మున్నగునవి) ఊదు.

చ. ....మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ, బిడుగుల పిండు బిట్టు లియు వెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. విరా. 4-171

ఉ. శాంతనవుండు నవ్వు నిజశంఖము కౌరవరాజ సైన్యముల్, సంతస మంద నొత్తుచు. విరా. 5-164

తే. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ, బాంచజన్యంబు ధర్మజ పార్థులాది, గాఁగఁ దమదమ వీరశంఖంబులెల్ల దొరలు నొత్తిరి దివి మ్రోఁతఁ దూఁటుగట్ట. ఉద్యో. 4-181

4. అద్దు.

వ. అన్నారీరత్నంబును శయంబునం జేరి వ్రేటు గంటం దొరఁగు రుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువనున్న కనక కలశ జలంబులం గరతలంబులం దడిపికొని తుడుచునప్పుడు. విరా. 5-260

5. ఆక్రమించు, వశపరచుకొను.

తే. ...కవలు మహోగ్రరిపుల, భూము లంతంత కొత్తుట బొగడఁ బడునె. ద్రోణ 1-278

వ. కొందఱు కొందఱ నివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన. మహా. 19

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన్న యొత్తుచు నెడముల నుత్తరించి. అర. 4-228

6. చక్కఁజేయు.

ఆ. వెలరు వాలు దీవియల నల్లనల్లార్చు, పోర్లగండ్లయందుఁ బొచ్చి
సుడిసి, తిరిగి వేగుఁబోక తెమ్మెర తెలదీఁగ, కొనలవంక లొత్తి
నవలఁ ద్రోచు. ఉద్యో. 2-112

7. పాదాదులు పట్టు, పిసుకు.

వ. ఏమింక వారి యడుగులొత్తను రాఁబోవనుం జాలము.
ఉద్యో. 2-214

తే. వాని యూరులు జఘనము మెత్తమెత్తన యొత్తి మదంబున
నుల్లమూన్చు. స్త్రీ. 3-188

తే. అతని చరణయుగము, గరయుగంబున నొత్తుచు.
శాంతి. 5-137; అను. 2-800; మౌస. 78

8. తుడుచు.

ఉ. దానికి నీవొడంబడితి ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం,
బూని వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్నునీ,రూనఁగ
నొత్తుకొంచుఁ జని. ఉద్యో. 3-281

క. నరపతి యానందాశ్రులు, గరసరసిరుహముల నొత్తి కనుదని
యఁగ నయ్యిరువురఁ జూచుచు. ద్రోణ. 5-17; ద్రోణ. 5-364

శ్లో. పరిష్వజ్య తదా కృష్ణా వానందాశ్రుపరిప్లుతః।
ప్రమృజ్య వదనం శుభ్రం పుండరీకసమప్రభమ్. సం.ద్రోణ. 149-4

క, ....అశ్రులు మఱియును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁజూచున్.
మౌస, 1-164; ఆది. 4-108

9. తఱుము, వెంటాడు, వెంబడిపడు.

ఆ. అతని కప్పు డెదుర నమ్మొనఁజెవ్వరుఁ, జాలరైరి సవ్యసాచి
యొకఁడ,నిశిత విశిఖపంక్తి నిగిడించి నొప్పించి, యొత్తి భీష్ము
సేనఁ గొదుఁగఁజేసె. భీష్మ. 3-378

శ్లో. అర్జునం ప్రాప్య గాంగేయం పీడయన్నిశితైశ్శరైః,
అశ్వత్థ్రదవత సమ్మర్దో వనే మత్తమివ ద్విపమ్.

సం.భా. భీష్మ. 117-54

10. ప్రశంసించు, అగ్గించు.

సీ. సంగరంబుఁ దన్విసని శాంతిఁ బొందిన చిత్తంబుతోఁ దమసేన
దిక్కఁ గనుఁగొని వెలుచ వో కర్ణ యో కృప యో సుయోధన.
పౌర నన్నొత్తి యెపుడుఁ, జెప్పుదు రేను నాచే నయినంతయుఁ
జేసితి. ద్రోణ. 5–322

11. మందలించు

మ. ....దుర్మద సంరంభ విశ్లథుండయిన శౌరవ్యాధముం దెబ్బ
నా, కెదురై ప్రాణముతోడఁ బ్రోవు నృపు నిల్లలొత్తె నీమాత్ర
కున్. శల్య. 2-118

ఉ. నీకెనవచ్చు రాజరమణిన్ ధర నెందును గంటిమే నృపా, నీకము
వించునుండ సుతునిం దగు పల్కుల నంత యొత్తుదే, నాకది
సికెక్కఁ జిత్తమున. శల్య. 2-370

(ఒత్తు = కఠినముగా మందలించు; నిర్బంధించు అని సూ–ఆ–ని)

12. నిర్బంధించు.

క. మతి మంతులైన వారికి, హితులగు వెరవుగలవార లెఱిఁగింతురు
దుస్థితి గాకుండఁగ గార్యము, గతియొత్తియుఁ దప్పలిడియుఁ
గడపఁ బలికియున్. శాంతి. 1-80

చ. ...వాకు భీష్ముఁడు, గ్గురుఁడును దోడుచెప్పిరి మునుల్ బహుభంగుల
నొత్తిరత్తతిన్. అశ్వ. 3.31

13. తెగఁగోయు, ఒరసికొనిపోవు.

క. అనదతనంబును జెడినపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెఁ
దునేఁబును బోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం
గ్రమంబున నధిపా. శాంతి. 3–24

14. రాపిడిపెట్టు, బాధించు, పీడించు.

క. అనదతనంబును జెడినపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెఁదు
నేఁబును బోలె నొత్తవలయును మనుజేంద్రుఁడు మార్తురం గ్రమం
బున నధిపా. శాంతి. 3–24

అ. క్రి.

1. గ్రుచ్చుకొను, ఒత్తుకొను.

సీ. శయన తలంబున శయనించియును నిద్ర,వోవనియ్యది డప్పిఁబొంది
కటికి —ఆ- నేలఁ గండ్లు లొత్త నిద్రవోయిన యది. ఆది. 6-178

2. పుట్టు, జనించు, కలుగు.

తే ఉత్తమం బెద్ది సీ చిత్తమొలయు వెఁదుఁ, బురుషుఁ డెయ్యది
గల్గినఁ బొందు నఖిల, కర్మబంధ మోక్షము నట్టి ధర్మమెఱుఁగఁ
జెప్పవే కరుణాంత చిగురులొత్త శాంతి. 5-542; ఉద్యో 1-326

వి.

1. ఒత్తుకొనుట వలనఁ గలిగిన ముద్ర, నొక్కు.

క. వెడలునెడ గాఢ పీఠం,బడి సుడిపడి యోగి నొత్తువడి యొక
భంగిన్, వెడలఁగ గ్రహాభూతము లప్పుడు దొడఁగి యనేక దురి
తములు గల్పించున్. స్త్రీ. 1-87

2. పీడ, బాధ.

వ. కౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెవ్వరికి
నజయ్యు లగుదురు పరుల యొత్తులేని రాజ్యము పూజ్యమహిమం
బరఁగు. ఉద్యో. 2-89

ఒత్తుకాఁడు దే. వి. (√ఒత్తు)

సుతిపోయు వాఁడు.

వ. ...అతండును గుణధ్వని తంత్రీనాదంబుగా నాఖిండ్లవా రొత్తు
కాఱుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె. విరా. 5-73

ఒత్తుడు దే. వి. (√ఒత్తు)

పీడనము, బాధ.

సీ. ...ఒత్తుడు నొరువుల వలనఁ బట్టముకట్టా. ఉద్యో. 1-278

(పాఠాంతరము)

ఒత్తువడు దే. అ. క్రి. (√ఒత్తు)

పీడితుఁడగు, బాధపడెందు.

వ. దుర్యోధనుండు విదురుం దూల నొదరి ప్రాతికామియను వానిం బిలిచి. సభా 2-205

శ్లో. ధిగస్తు క్షత్తారమితి బ్రువాణో దర్పేణమత్తో ధృతరాష్ట్రపుత్రః సం. భార. సభా. 66-1

**ఒదవించు** దే. స. క్రి.

కలిగించు.

సీ. లోని తొంపము పవలును జెమఁ జీఁకటి నొదవించి పొదలంగ నొప్పుదాని. విరా. 1-162; కర్ణ. 1-268

**ఒదవించుకొను** దే. స. క్రి.

సంపాదించుకొను.

క. ఇది దప్పు నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణంబు గాన నొండొక డిడి యున్, మది నూహింపఁగ మ్రుచ్చిమి, నొదవించు కొనంగ వలసి యున్నది నాకున్. శాంతి. 3-286

**ఒదవు** అ. క్రి.

(ఉద్భవ శబ్ద భవమని సూ.అ.ని. అక్షర సామ్యముచేఁ గాఁబోలు)

1. కలుగు, పుట్టు, జనించు.

క. అతనితో వాక్కొనక మరి, కౌతూహల వృత్తి క్రింద గందొడఁగి మృదు, ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతో ముద మొదవ నతులశిల్ప ప్రౌఢిన్. విరా. 1-71

క. ఒద వెడు కృపపెల్లిదమున, వదనము వణఁకట్లు వట్టె. విరా. 2-88

క. వనితకుఁ బురుషునకుం దన, తనయంతన రూపొకం డొదవఁ జేయు గ వి్వన్ననువు గలుగ రొండొరువుల, నెనయుటఁగాని శ్రుతిమతము నిట్లు మహాత్మా. శాంతి. 6-22

2. ప్రాప్తించు, లభించు, దొరుకు.

క. మన్నన కుక్కక యవమతి, దన్నొందిన సుఁకృకఁబడక ధరణీశు కడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్.

(శునక మాంసమును జూచి విశ్వామిత్రుఁ డనుకొనిన మాటలు),

క. ఇది దప్పి నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణంబుగావ నొండొకండు.
శాంతి. 3-286

సీ. భరతకులోత్తమ ఫలమూలముం నుప, యోగింపు మెసఁగెద
మెదవి తమకు, నెయ్యది యాహారమయ్యె నాతిథ్యంబు, దానన
నడవుట ధర్మసరణి. ఆశ్ర. 2-65; మౌస. 191

3. వచ్చు,

తే. చాలఁగాలంబు వోవక చతురులైన, వృద్ధజనముల బుద్ధులు విందుఁదా
గాక, ముదియ మతిదప్పి నోరికి నొదవినట్లు, పలుకు వెడఁగుల
మాటలు పాటియగునె. ఉద్యో. 4-243

క. ఎదురున్న రూపు పలుకఁగఁ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్నయ
మును తెట్టిదమును రెండును నను పలు, కొదవదు నీ వాలుకకు
నయోన్నత యెపుడున్. ఉద్యో. 1-368

క. నా కొఱఁతఁ దీర్చి వచ్చితి, నీ కొఱఁతయ యింక మాతునిందెగఁ
జూడన్, లోకము వంచింపను దగు, చీకటియె యొదవ నేమి
సేసెదు చెపుమా. విరా. 2-271

4. తగు, యుక్తమగు, అర్హమగు.

వ. రథంబెక్కిన యవసరంబున కొదవ సపరివారంబుగా నరుగుదెంచిన
సాత్యకిం దన రథం బెక్కించుకొని, ఉద్యో. 3-182

వ. తేరు తత్కాలంబున కొదవం దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు.
ద్రోణ. 4-277; శల్య. 2-332; అను. 4-36

(ఒదవన్ = తగునట్లుగా, యుక్త మగునట్లుగా)

5. నెఱవేఱు, సిద్ధించు.

క. మనచేసిన సుకృతంబుల, వినుతఫలము నెల్ల నెల్లి వివచ్చుఁదు సింధు
నరేంద్రుఁ జంపునట్లుగ, నొనరి యొదవవలయునని దృఢోక్తిఁ బలు
కుచున్. ద్రోణ. 2-344

6. తోడ్పడు, ఆదుకొను.

ఆ. నిన్నుఁ దృణముఁజేసి నన్నా దురాత్ముండు, బంధుహీనుఁ బోలె,

13. అమరు, ఒప్పు

క. అదె పార్థుఁడు దన మునుముప, కొదవిన సేనలఁ గలంచు నుతి
వతఁ డితనిం, గదియఁగ రాకుం డిక మును, పొదవుద మే సాత్య
కిం బ్రభూతబలముతోన్. ద్రోణ. 5-178

ఒదిఁగించు దే. స. క్రి.

1. ప్రక్కకుఁ దొలఁగించు.

క. తక్కటి రథికజనులు వే.రుక్కున నయ్యిభచయంబు నొదిఁగించి
యునుం, జిక్కువఱచియుం దునిమియు, నెక్కుడు ముద మొప్ప,
మెఱసి రిభపురనాథా. కర్ణ. 3-236

2. ప్రవేశింపఁజేయు, చొనుపు, చొప్పించు.

సీ. పంచాత్మకంబైన పవనంబు నిగ్రహీతమైనది భవదింద్రియములు
మనము, నందాఁగఁబడ్డ యవియును నదియును బుద్ధియం దొదిఁ
గించి. శాంతి. 2-8

శ్లో. వాక్సత్త్వం చ గోవింద బుద్ధే సంవేశితాని తే.
సం.భా శాంతి. 46.4

3. లీనముచేయు.

సీ. ఇల జలంబుల జలంబులు శిఖ శిఖ వాయువున వాయు వంబరఁబు
నను నంబరంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి నహంకృతి బుద్ధిఁ
దగ నొదిగించి. శాంతి. 4-243; శాంతి. 6-414

4. లయముచేయు.

క. మనసుగొని మనసుబుద్ధిం,గొని బుద్ధి నిదర్శనంబుగొని దర్శనమున్,
విను క్రమమున నొదిఁగించినఁ, గను బుధుఁ డక్షరుని విమ్ల ఘన
బోధమయున్. శాంతి. 4-200

ఒదిఁగిలు దే. అ. క్రి.

ప్రక్కకొఱఁగు, ఒత్తగిలు.

సీ. (కుంభకర్ణుఁడు) యొదిగిలి కనువిచ్చి హూయని బిట్టావులించి
కొండొకదేఁటి లేచి నీల్గి. అర. 7-85

ఒదుఁగఁబాఱు ఒదుఁగు

తొలఁగిపోవు.

చ. తలఁకెడు వానికిన్ మగఁడ తానవె నన్నడకించువాఁ డిసీ పలుకకు
భీతున ట్లొదుఁగఁబాఱునె శూరుఁడు. విరా. 3-25

చ. పలికిన బ్రాహ్మణుం డొదుఁగఁ బాఱక నిల్చి. అను. 8-261

ఒదుంగు; ఒదుఁగు దే. అ. క్రి.

1. అడకువతోఁ బ్రక్కకుఁ దొలఁగు, అవయవములు ముడుచుకొని యొ
సరిల్లు.

తే. ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్టి యొదిఁగి, యుండునారుఁ గరం
బున నుదరమప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల ములుకు
వారు నై పురజనంబులు దులంకి. విరా. 3-36

2. తొలఁగు, వెనుకకుఁ దొలఁగు, వెనుదీయు.

చ. శినిమనుమండు సద్దనుజు శీఘ్రమ నాలుగు నారసంబులన్, వెనుక
కొదుంగఁ జేసి... భీష్మ. 2-228; భీష్మ. 3-78

క. ఏలినవాని ధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికిన దిన
ముల్, బ్రేలారిచి తింట్రాతని, యోలముగని పిదప భీతి నొదు
గుదు రాజిన్. విరా. 4-217; విరా. 5-154

మ. హరియుం బాండవులున్ మదీయపటుబాణాశక్తిదివ్యాస్త్రని,ర్భర
సంతాప పరీతులై యొదుఁగ...విజృంభించెన్. ద్రోణ. 5-339

3. డాఁగియుండు.

వ. త్రిగర్తపతి మొదలయిన యమ్మహీపతులుం దెరలి తమతమ
సైన్యంబులు సన్నెలవులకుం జని యొదుంగుటయు గాంగే
యుండు గదంగుటయుం గని. భీష్మ. 3-16

వ. అతండు కేతనంబునకుం గుదురుగాఁ బెనుపొనరం గావించిన పీఠం
బు నడుమున నొదింగినం దేరిపయి వతనిం గానక భీమసేనుండు.
ద్రోణ. 4-286; కర్ణ 3-188

వ. ...చిత్తంబు గలంగినం జనం జాలక యరదంబు డిగ్గి యచ్చట
నొక్కయెడ నొదిఁగి నిలిచెదనని వారలకుం జెప్పి యమ్ముడుమ

నటింత నౌకాపటపుగల పాద యీారిమిం దూటి పొంచియుండితి.
శల్య. 2-46

4. లీనమగు.

క. మొదలఁ గలిగించి జనములఁ, బదిలఁబుగ నునిచి వానిఁ బదపడి
తన యందొదిగించి మఱియు నెమ్మెయి, నుదారగతి నడపు చిన్మ
యుని గొలుతు హరిన్. శాంతి. 6-414; శాంతి. 4-243

5. పాఱిపోవు, యుద్ధము నుండి తొలఁగు.

క. ఎట వోవవచ్చు నిను ముందట నిడుకొని పోదమన్న తగు రాజుల
నెక్కటి దోలెడి సాత్యకి నీవట దఱుముదుగాక యొదుఁగ
నగునే నీకున్. ద్రోణ. 4-94

6. అడఁగు, నశించు.

సీ. లోకంబు లెల్లఁగల్గుట నిల్చుకొనొదుఁగుట, తనయంద యగు మహో
త్తరుని గొలుతు. శాంతి. 2-20; శాంతి. 5-120

తే. స్వస్థతయు దుఃస్థతయు జడత్వమును గ్రమవిగణన సత్త్వరజస్త
మో గుణము లవి సమీరితము లగు టడఁగుట యింద్రియంబు,
లడరు టొదుగుట బుద్ధికృత్యములు పుత్ర. శాంతి. 5-167

ఒద్ద దే. వి. బొ. అనొ.

సమీపము, దాపు, దగ్గఱ.

ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటముగాఁగఁ, దిరుగు పనుల కెంత
తేఁజమయిన, వాని బుద్ధిగలుగు వారొల్ల రది మీఁదఁ జేటు దెచ్చు
టెట్లు సిద్ధమగుట. విరా. 1-126

తే. యాజకులు దార యక్కురు రాజు శక్తి, యుక్తి నొద్దనుండ గ
నగ్నిహోత్ర హోమమాచరించు రొక్కొక మరి యతఁడు పర్ణ
శాల వెడలి శూన్యాటవి సంచరించు. ఆశ్ర. 2-149

తే. ఒక్క పుణ్యాశ్రమంబున యొద్ది యేటవిడిసి దివస ప్రవర్తన
విధులు నడిపి. ఉద్యో. 3-146

ఒద్దివారలు వి. బ.

సమీపమున నుండువారు.

వ. మత్స్యజనవిభుఁడు తన యొద్దివారితో నిట్లనియె
ఉద్యో. 1-280

**ఒనఁగూడు** దే. అ. క్రి.

సిద్ధించు, నెఱవేఱు.

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్, భూరి యశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గువారికే, కోరిక లైన వేగ మొనఁగూడు. స్వర్గ. 90

(నిర్బంధకముగ శ. ర. సూ. ఆ. ని.)

**ఒనఁగూర్చు** దే. స. క్రి. (√ఒనఁగూడు) ఒనఁగూడఁజేయు

సిద్ధింపఁజేయు, పొందఁజేయు.

వ. ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి ... సంభావించి యతనికి సముచితంబులగు మజ్జన భోజనంబు లొనఁగూర్చి, ఉద్యో. 1-214

(పాఠాంతరము)

**ఒనరించు** దే. స. క్రి. ఒనరుచు, ఒనరఁజేయు

1. కావించు, చేయు.

క. ...వ బృహన్నల, యను నామముతోడఁ 'గన్యకాంతఃపురవ, ర్తన మొనరించుచు లాసిక,తనమున నిపుణుండనై యతని మెచ్చింతున్
విరా. 1-89

చ. ...శిశుపాలుఁ డెంతయును భక్తిపరుండయి రాజసూయ మున్నతి నొనరింపనున్న యమనందను యత్నమెఱింగి రత్నకో,ధి ధన రాసు లిచ్చె. సభా. 1-242

2. నిర్మించు.

ఉ. ....కై దువు లెల్లఁ గేళ చ,రాశ్మవృత సంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం, జోవరు దీని దిక్కొరులు. విరా. 1-166

క కుశగ్నన నొనరించిన శరపంజరంబులోనున్న పులుఁగు చాడ్పున బురుషవర జీవముండుట, పరికింపక యేమఱంగఁ జాడిరొ
శాంతి. 6-228

...డసిన యాదైత్యపదులు దమకుఁ, బురము లొనరింప

దానవ పూజ్యమయుని, వేఁడికొనుటయు. కర్ణ. 1-262

3. సిద్ధపఱుచు, సిద్ధము చేయు.

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ,సదనమునకుఁ జనియె నవుడు సమ్మో
దమున న,వ్విదురుం డోగిర మొనరిం,చెదనని తన్నాడుగ నట్ల
చేయుం దనుచున్. ఉద్యో. 3-181

వ. అనిన విని కీచకుండు ముదిత హృదయుండయి నిజసదనంబునకుం
జని వివిధ మధురసంబు లొనరించి సముచిత ఖాద్యంబులు సమకట్టి
విరా. 2-82

4. కలిగించు.

తే. అర్జునునకు ఖాండవ దహనాదులైన, విక్రమము లాబృహన్నల
వెరవు లావు,గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ.
విరా. 4-16; ఉద్యో. 1- 37

5. పూను, వహించు.

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా,చార్యుల కెనవచ్చు దివ్యశరవిదుఁడు
కృపా,చార్యుఁడు మత్పితృసఖుఁ డా,చార్యక మొనరించె మాకు
శైశవము తలిన్. విరా. 5-9

6. పర్పఱచు, నియమించు.

క. అనఘుల శాస్త్ర విధిజ్ఞుల, ననురక్తులఁ బితృపితా మహాక్రమమున
వచ్చిన విప్రుల మంత్రులఁగా, నొనరించితె కార్యసంప్రయోగము
పొందెన్. సభా. 1-26

క. ఇతని సమయింప నచ్యు,చ్యుతుఁడు ననుంబంచె నాకు నొనరించిన
పా,లితఁ డని తలంచి మొగ ము,గ్రత నొందఁగ శక్తిమీఁదఁ గను
దో యొలయన్. శల్య. 1—274

7. కల్పించు.

ఆ. తనకుఁ దాన బంధ మొనరించుకొనియెడు, పొత్తి నూలికాయ
పురువు భంగి. శాంతి. 6—19

వ. ఒనఁగూర్చు, చేయించు

వ. ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సము
చిత ప్రకారంబున మజ్జన భోజనంబు లొనరించి మాల్యాను లేప
నా ద్యుపచారంబులు సేయించి. ఉద్యో. 1-380

ఒనరు దే. అ. క్రి.

1. కలుగు.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొద్దులు రాచిన చందనంబు మే,నెల్లఁ
జెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య,ల్లల్లన మార్ద
వం బొనరు నట్లుగ నెట్టకునేసి రాచి మీ, తల్లికి భక్తిఁ బెట్టెడు
విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. విరా. 2-220

ఆ. ఇట్లు లాడఁదగునె యేనేమి సేసితిఁ, గొలిచి కుడుచు పాడి నలవుఁ
జెంపుఁ బలుకు బెందు నెగ్గ పతికిఁ బుత్రులకును, మనుమలకు
హితంబ యొనర నడతు. ఉద్యో. 2-157

క. విను బండారము పెరుఁగని, జనపతికి బలంబు మిత్త్రి సంపదయును
గ,ల్గునె బలమిత్త్రి విహీను న,కొనరునె రాజ్యంబు విభవమున్నత
మగునే. శాం. 3. 3-171

క యాగంబునందు శ్రద్ధా, యోగము గల యతుని శ్రద్ధ యొనరని
శుచి పుణ్యాగమ సంపదఁ దుల్యులు,గా గణియించిరి నిరూపకత
నమరవరుల్. శాంతి. 5-247; శాంతి. 4-82

2. పొసఁగు, అనుకూలపడు.

మ. జనకుండన్ గరు భీష్ముఁలుం దగిన కర్ణుం బాపులై నీకఁ బ్రీతి
నెటి గించు తెలుంగుగాదు తమ బుద్ధింబోయి సంధాన మిట్లొనరం
జేయక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పించు వారింత వ,ట్టు నిజం
బిచ్చుట నింక నీ యునికి నెట్లుం గిడువుట్టుంజుమీ. ఉద్యో. 3-373

3 ప్రోగగు, కూడు, ఒకచోటికిఁ జేరు.

మ. ఉ. అందఱఁ జెల్వొంగఁ బంచి వారితోనని పని మాటలాడి విన
యంబునఁ బ్రార్థనసేసి మీరలి, యొనరిన సైన్యముల్ పదునొ
కొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొచ్చిన సకలంబు నొప్పు నభిమే

కము నై కొనుఁ డుత్సవంబుగన్. ఉద్యో. 4–140

4. దృఢమగు, దిటవగు, పదిలమగు.

క. అని యొకగుదిమీల నడుమ, నెనయంగా దూతికలవి యిరు దౌ
డలఁ ద్రా, డొనరంగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁప
మూర్ఛఁజెందిన భంగిన్. శాంతి. 3–195

5. ప్రస్తుతికెక్కు, కీర్తిపొందు.

క. ఒనర జరత్కారు మునీంద్రునకు జరత్కారునకు సుతుండైన
మహామునివరు నాస్తీకుని ముదమునఁ దలఁచిన నురగ భయముఁ
బొందదు జనులన్. ఆది. 2–286

6. ఒప్పు.

(ఇది 'ఒప్పు' వలెనే కొన్ని యెడల వాక్యాలంకారముగా నుండును)

క. ఒనరుఁ ద్రయోదశ పర్వంబనఁగా – అనుశాసనికపర్వ మిలన్.
ఆది. 1–59

క. ...నా మేల్కను నంతకు నుండక యినుఁ డొనరఁగ నస్తాద్రికేఁగ
నోడఁడె చెపుమా. ఆది. 2–159

సీ. (యయాతి కొడుకులం జూచి) తన జవ్వనంబు నా కొనరంగ
నెవ్వఁ డీనోపు నాతండ నదీప సకల ధారుణీ సామ్రాజ్య భార
యోగ్యుఁడగు. ఆది. 3–95; ఆది 4–128

మ. ...ఎవ్వడే నొక జగత్ప్రాణ్యుండు క్రీడార్థ మిట్లొనరం దాల్చిన
రూపు గావలయు మీరూహింపుఁడా యట్లగున్. విరా. 1–281

7. లభించు, ప్రాప్తించు.

సీ. ...అనావృష్టి దోప –తే– మాపహిల్లిన నతని కాహార మొనరఁ
జేసికొనుట దుర్ఘటమయి చెల్లుచుండ. అశ్వ. 4–220

**ఒనరుచు; ఒనర్చు** స. క్రి. ఒనరించు (√ఒనరు)

1. కావించు, చేయు.

క. సన్న్యాసివేషమున రాజన్యునిఁ గని యెవుడుఁ గొలిచి సభ్యత్వ
మునన్, మాన్యుఁడనై పుణ్య కథావిన్యాస మొనర్తు నతని వేడు

గతియు నొనర్చున్. శాంతి. 4-116; విరా. 2-286

6 పర్వులచు, పంచు, విభజించు.

ఉ ...వాఁడి నూదిమొన యించుక మోపినయంత మాత్రయున్, భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె. ఉద్యో. 3-363

7. ఒసఁగు, పెట్టు, ఇడు.

వ. అతం డాసన పాద్యార్ఘ్యార్చనంబు లాచరించి మహనీయంబగు భోజనం బొనర్చిన సంతృప్తి బొంది యవ్విదేహపతికి నాసన్నంబగు నుచితాసనంబున నాసీనుఁడైయుండి. శాంతి. 6-171

8. సిద్ధముచేయు.

సీ. సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు, నానావిధముల నొనర్చికొనుచు. మౌస. 29

ఉప్పగించు వి. అప్పగించు (సం. అర్పణమ్)

వశపఱచు, అధీనము చేయు.

వ. అక్కుమారుండు నీపేర సారస్వతుండనం బరఁగుఁ బదంపడి పంద్రెండేం డ్లనావృష్టియైన నయ్యాపదఁ బొందకుండఁ బెక్కండ్రు మునుల రక్షించి వేదాధ్యయనంబులు సేయించునని చెప్పి యొప్పగించిన సరస్వతి ప్రీతయై తనయుం గొని చనియె. శల్య. 2-208

ఉప్పనితనము దే. వి. (√ఒప్పు)

అపచారము, తప్పు.

క. .. ఇప్పని మనవారల యొప్పనితనమున మూఁడె నని వంతఁ దలపోయకుఁడీ. మౌస. 12

ఉప్పనివాఁడు దే. వి. (√ఒప్పు)

1. శత్రువు.

ఉ. ఒప్పదె కూడి మన్కి మన కొప్పనివాతల యుక్కుదక్కఁగన్. ఉద్యో. 1-371

క. విను మేను గల్లసారెలు, గొని కపటపు నెత్తమాడు కుశలతఁగా దొప్పనివారి నేపడంచుట, ఘనశాహాస్వైరశేఁ గాని దురాత్మా శల్య. 2-281; శాంతి. 1-54

2. కురూపి; చక్కఁదనము లేనివాఁడు.

క. ధని యధనుఁడు రూపసి యొప్పనివాఁడు వివేకి మూఢుఁడావుం
డరోగుం, డనుగతరోగుఁ డనక యంగన పతిఁ జాటింపవలయుఁ
గామధ్యంసీ. అను. 5-295

ఒప్పమి దే. వి. (√ఒప్పు)

1. కీడు, కష్టము, ఆపద.

క. మన్నన మానిసివైనీ, వున్నం గడు మేల కాక యొప్పమి గలదే.
విరా. 1-288

ఉ. ఇప్పు డుపేక్షచేసి కృపయేమియులేక విహీనవృత్తి వా,రొప్పమిఁ
బొందఁ జూచుటిది యొప్పునె. ఉద్యో. 1-371

ఉ. ...గౌరిదేవి య,ట్లొప్పమి దం,డ్రికైనఁ గని యుల్లము బెగ్గిల నీరు
సం,భ్రమలం, గప్పఁగ మ్రోల భూషణము కాంతి ప్రణామము సేసెఁ
జేసినన్. అను. 4-420; ద్రోణ. 3-206

2. ద్వేషము, పగ, వైరము.

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు,డడ్డపడి వారితోడఁ గొట్లాడి
యైన, దాని నుడుపంగఁ జూళకున్నవానిఁ గ్రూర, కర్ముఁడని
చెప్పుదురు కర్మకాండ విదులు. ఉద్యో. 3-242

శ్లో జ్ఞాతీనాం హి మిథోభేదే యన్మిత్రం నాభిపద్యతే,
సర్వయత్నేన మాధ్యస్థం న తన్మిత్రం విదుర్బుధాః.
సం. భా. ఉద్యో 62-15

3. అప్రియము.

సీ. ...మీ మహాన్వయంబున మహీ,విభులయం దొప్పమి వెదకినైనఁ
గానము. అశ్వ. 1-98

శ్లో. న జాత్వస్య చ వంశస్య రాజ్ఞాం కశ్చిత్కదాచన,
శ్లాఘాఽఽసీద్యః ప్రజాపాలః ప్రజానా మప్రియోఽభవత్.
(తప్పు, దోషము-అని మూలాధారి) సం.భా. అశ్వ. 11-15 నిర్ణయ)

రూపు:

సేవు గర్గుఁడును నాటిన మాటలు గొల్వులోపలం, జెప్పెదు

నట్టివే కులము శీలముఁ గల్గిన పుణ్యాకాంత కృట్లొప్పమి సేయు
పెల్లఁ గనియున్న జనంబులు వించుముండఁగాఁ, ధవ్వోకయింత
తేదను విధంబది సీక చనుం గుమారకా. ఉద్యో. 3-868

**ఒప్పరికించు** దే. స. క్రి. (√ఒప్పరికము)

1. ఉపేక్షించు

సీ. అదరి పోరాడక యన్నియక్షౌహిణు లొప్పరికించెనె యొకనిఁ
గలన. భీష్మ. 1-58

చ. కొడుకులఁ గానఁ రే నృపు లకుంఠిత తేజుల నెందు నిమ్మెయిం, జెడు
తెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే.
ఉద్యో. 2-10

2. త్యజించు, విడనాడు.

ఉ. అప్పుడు నీవు సూడఁగ ననంతము లై ఖచరేంద్ర సైన్యముల్
గప్పె ననేకసాయక నికాయములన్ వడి నన్ను నేనునుం, గుప్పనఁ
గూరలేసి రిపుకోటి వధించితి నంతలోన వ్రన్నొప్పరికించె సైన్యతతి
యొక్కఁడనై రణభూమి నొచ్చితిన్. అర. 6-7

**ఒప్పు౦టు** దే. అ. క్రి. (√ఒప్పు)

1. చెడు.

సీ. సమర విశానంబు చెమట నొప్పుఅకుండ, హేతిదీధితులు రేయెండ
నొడుచు. భీష్మ. 1-119

2. చేవ్వడు, వివశత్వమొందు.

ఉ. ...వారు వాఁడొప్పరి తేరి మూభరమ యూఁతగ వ్రాలఁగనేసి
యార్చినన్. భీష్మ 3-167

3 భంగపడు, వికలత్వము నొందు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పులురలు చూపులదర నిశితాస్త్ర
ములం, గప్పె గురునిఁ దశైన్యఁ, బొప్పుటి తన బెట్టిదంపు టురవడిఁ దెరలన్. ద్రోణ. 1-156

4. భగ్నమగు.

ఉ. అప్పుడు చేకితానుఁడు శతాంగముల్ గురుమేన గ్రుచ్చి తెరా

వృజ సూతునొంచి తురగోద్ధతి మాన్ప. ద్రోణ. 4-125

5. మఱుఁగుపడు, కాంతి చెడు.

తే. నివుఱు గప్పిన నొప్పలు నిప్పవోలె కల్య. 1-368

**ఒప్పారు** దే. అ. క్రి. (ఒప్పు+ఆరు)

ఒప్పు.

సీ. వీతంపురోమంబుచేత నొప్పార నా విష్టుం డగుట శిపివిష్టుఁడనియు
శాంతి. 6-432; ఉద్యో. 1-98; అను 2-318

శా ఆరూఢస్థితి నెల్ల దేశములు నొప్పారుం బ్రకాశంబుగన్.
అర. 4-318; చూ. ఒప్పు. ఆశ్ర. 2-88

**ఒప్పించు** దే. స. క్రి. ఒప్పగించు

1. స్వాధీనపఱచు, అధీనము చేయు.

క. రుచిరమణిభూషణంబులు, నుచిత విహార ప్రకార యోగ్యాగార, ప్రచయము సుందరగణికా, నిచయము నొప్పించువాఁడ నీకుం దరుణీ. విరా. 2-128

2. ఒసఁగు, ఇచ్చు, అర్పించు.

క. (తనుత్రాణము) తెప్పించి తొడుగు మీవని, యొప్పించిన నిట్టునట్టు నొలవలుగా మైఁ, గప్పికొని యాబృహన్నల విరా. 4-39

సీ. ...అతఁడు (ఉచథ్యుఁడు) సర్వజలంబుఁ, ద్రావిన వరుణపురంబు ధూళిమయమైన భయమంది మానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణమిల్లి తప్పు వాపికొని మునికృప గాంచి చనియె. అను. 5-345

మ. జనకుండన్ గురుభీష్ములుం దగిన కర్ణం బాపుశై నీకుఁ బ్రీతి నెఱిఁగించు తెఱంగు గాదు తమ బుద్ధిం దోయి సంధాన మిట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పించువారు.
ఉద్యో 3-372

శ్లో. న చేత్సంధావ్యతే రాజన్ శ్వేన కామేన పాండవైః
బధ్వా కిల త్వాం దాస్యంతి కుంతీపుత్రాయ కౌరవాః
సం. భా. ఉద్యో. 127-28

**ఒప్పిదము** దే. వి. (√ఒప్పు)

1. చక్కఁదనము, సౌందర్యము.

సీ. కాళ్ల యొప్పిద మారఁదుకట్ట సుజ్జ్వలము సేయంగ సంకుల వాహు లంద మెడల. విరా. 1-228

2 వేడుక, ఉత్సవము.

తే. పెండ్లి కని విల్వఁబంచినఁ బ్రియము తోడ, నేఁగుదెంచితి మిన్నా ళ్లు నెల్ల యొప్పిదములఁ జూచితి మియ్యెడఁ దడవుగాఁగ, నిలువ దీఱదు పోయి తావలయు మాకు. ఉద్యో. 1-47

3 విధము.

క. తదవసరంబున సాత్యకి, మదమునఁ గాంతేయుఁ గడచి మంత్రం బున బెట్టిదముగఁ బడవైచిన యొప్పిదమున శస్త్రమునఁ గూల్చె భీష్మని సూతున్. భీష్మ. 2-80

చ. ఉదిత సమగ్రబోధుఁడగు యోగికి నిశ్చల దీపరూప సంపద సుఖ సుప్తి భంగి ఘన వంక్తులు లేని వియత్తలంబు నొప్పిద మొదవుం దరంగముల పెల్లునఁదాఁ జలితంబు గాని వార్ధిదశ నతం డకంపుఁడగు ధీపరివృత్తులు గల్గెనేనియున్. శాంతి. 6-119

విశ.

1. యోగ్యము, తగినది.

క. బలిభిక్షము గడప కిడన్వలయును దేవపితృ పూజనంబుల కాలం, బులఁ బతి కుశమందుటఁ దత్ఫలంబుగాఁ గోరు టొప్పిదము సతికి శివా. అను. 5-286

మ. ఇది యిట్లాలిని బంధులం దొలఁగి తానీ యగ్నిలోఁ గూలె నొప్పి దమై యుండఁగ నిట్టి తెంప యొలయం బెంపారు వైరాగ్య సంపద. శాంతి. 3-327

క. అది లేనివాఁడు నరకాస్పదుఁడగు నటుగాన ధర్మపమఁ దగుటయ యొప్పిదము మనుజునకు నేతెప్పెద మతియును వలయు వాని ప్రీతి నడుగుమీ. అను. 4-252

2. ఒప్పునది, మనోహరము.

మ. మదిరాక్షుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప సు,ప్ర
దర జ్యాలతికా క్రియా సమభిహార క్రీడనం బప్పు డొ,ప్పిదమై
యోగ వియోగసంధులు నిరూపింపంగ రాకుండఁ గ,ర్ణ దళోపాం
తము వింత సేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లఁగన్. విరా. 3-178

క. విదితంబై యుద్యోగము, మొదలుగఁ బదునొకఁడు పర్వముల
నెంతయు నొ,ప్పిదమై యేనవ పర్వం బిదివా నుద్యోగపర్వ
మిమ్మగు సభలన్. ఆది. 1-48

ఒప్పు దే. అ. క్రి.

1. తగు, కూడు, ఉచితమగు.

మ. పదియేనింటఁ దెనుఁగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుది
ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.
విరా. 1-7

క. అప్పుడుఁ బరిజనములుఁ దమఁ,దప్పక కనుగొనుచు నుండఁ దగ
వేది కరం,బొప్పని తమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు
గదురఁగ నచ్చెన్. విరా. 2-86

తే. తప్పు సేసితి రిట్టులు దగునె వీర,లేమిగతిఁ బల్కినను నదియెల్ల
మనము, గైకొన వలయుఁ గాకిట్లు గాదు గూడ,దని నిషేధించు
టొప్పునె మనుజనాథ. విరా. 5-276

ఉ. శాంతనవుండు సర్వకురు సంతతికిం గలవాఁడు గాఁడె య,త్యంత
హితంబు లీ పలుకు లాహవ మొప్పదు ధర్మసూతితో
ఉద్యో. 2-164

2. ఒప్పిదమగు, శోభిల్లు, ప్రకాశించు.

సీ. ప్రథమాద్రిఁ దోఁతెంచు భానుబింబమునా ను,రమ్మునఁ గౌస్తుభ
రత్న మొప్పు. విరా. 1-12

సీ. వక్షస్స్థలంబున వనమాల గ్రాలంగ, వెలిమావు గెడల వాగెలు
ధరించి, నొసలపై హరి యొప్ప నాశ్చర కేతువు మెలయంగ నర
తంబు మెఱుఁగు లడర. ఉద్యో. 4-125

క. తను వొప్పెదునది యౌవన,మును నూతన మిట్టి నీకుఁ బొలఁతి
యోగం,బున నింత చేరవ యెమ్మెయిఁ, బనుపడియెం జెపుమ
దాఁపఁ బనిలే దింకన్. శాంతి. 6—187; విరా. 2-136

3. ఉందు తనరు.

వ చీఁకటి వాపినం బ్రభాతంబను వింత మానిసి మేలంగి ముసుంగు
వుచ్చినట్లు మేలుకని యెలుకలు వొదల విదిర్చి కూర్చికొని కల
గొనం బలుకు పులుఁగుల యెలుంగుల వలన నొండొటిం దెలుపు
కరణి నొప్పు ధరణీరుహంబులును. విరా. 2-240

శా. ద్రోణాచార్యు పిలుందనొప్పి కృతహస్తుల్ బద్ధగోధాంగుళి త్రా
ణుల్ ...రంగ మధ్యమున నంతన్ నిల్చి రుదగ్రధను, శ్రేణీరమ్యులు
ధర్మజ ప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబు గాన్.
ఆది. 6—9; విరా. 3-236

4. ప్రశస్తమగు, ఉత్తమమగు.

ఉ. ఆఋ దనంబులం బవ్వుల యందలి క్రొత్తలు పుట్ట నిచ్చులున్, వే
ఋకార భంగిఁ గాకములు విన్నను వొప్పఁగ జేసిదేని. విరా. 1-77

వ. అవ్వరుణాభిషేకంబు కంటె కుమారాభిషేకం బొప్పె.
శల్య. 2-188

తే. దీని కంటెను నొప్పెడి వాని వొక్క లతు మొదవుల నిచ్చెద నతు
యముగ. ఆది. 7-100

క. ఒప్పని గుణములఁ బరఁగెడు, నిప్పరుషాధములలోన నెల్లఁ గృత
ఘ్నుం, డొప్పఁడు. శాంతి. 3-470

(ఒప్పఁడు = అధమమగువాఁడు, నీచుఁడు అని భావము)

5. అందమగు, సుందరమగు.

ఉ. ఒప్పెడు మేనుఁ జెంపుగల యుల్లము నాగరికంపుఁ జందముం,
జెప్పక చూప కితని విశేషముఁ దెల్పెడు. విరా. 1-92

6. మెచ్చు, సంతోషించు.

ఉ. నారచీర యేనిఁ జారు చీనాంబరం,బైనఁ గట్టికొనిన యపుడు

13 ఇంపగు, ఇష్టమగు.

తే. ఒప్పుకున్నను నాత్మకులో క్త కర్మమూర్ధ్వగతిఁ జేర్పుఁ బరకర్మ మొప్పెనేని, నార్యజనములు గిర్భిషమంద్రు దానిఁ గానవడపుము నిజవంశకర్మ మధిప. శాంతి. 1-279

మ. ....ధర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మిమ్మర్ధ రాజ్యరమం బొందుము మీరు గొందఱయినం జాకున్న నీకొప్పదే. భీష్మ. 3-434

14. పూను, వహించు, పెట్టుకొను.

ఉ. ...అనపై, తప్పు ఘటించి నీవునొక శాలిమిగల్గిన వాఁడవై నెపం, బొప్పినఁ జెల్ల నీదు నిలుపోవును జాతముగాక యిచ్చుటన్. విరా. 5-98

15. (పెద్దలయెడ) మర్యాదగలుగు, సాధువగు.

వ. ...గురుకృపగాంగేయులకుఁ జరణ సమీపస్థలంబులందబడ రెండును గర్ణాభ్యర్ణ ప్రదేశంబులం జనరెండునుగా నాలుగేసి యమ్ములేసిన నా సవ్య సాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తులగు నాప్తజనంబులతో నల్లన యర్జునుం డింత యొప్పియుండునే యని యగ్గించి వెండియు. విరా. 4-250

వి.

1. చక్కఁదనము, అందము, కాంతి, శోభ.

తే. తాను దొచ్చినకతన మత్స్యక్షితీశు, నింటనిమ్మెయిఁ గ్రొత్త యొప్పరక మెసఁగఁ నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ, జాండు రాజతనూభవపత్ని యరిగె. విరా. 2-208

సీ. తన యొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు. విరా. 2-208

తే. దుఃస్థుఁడై యుండియును నొప్పు దొరఁగకున్న, యన్నరేశ్వరుఁ గనుఁగొని. శల్య. 2-399

మ.... పొల్చె దుర్యోధనుం,డను రాజవ్రిభు నొప్పునర్మదకుఁ గామావే శముం జేసినన్,వనితారూపముదాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్య:

హృద్యంబుగన్. అను. 1-44; భీష్మ. 2-37

1 విధము, రీతి.

ఉ. అ, మువ్వుర తోడి జోడియగుమూర్తి యతీంద్రుని యొప్పు గంటిరే. విరా. 1-185

సీ. తలచుపాఁ దెగిపడ్డ ధవళచామరములు, డిండీరముల యొప్పుఁ బుండరీక,ములు పొలుపున గర వాలములు మీనభంగియు. ద్రోణ. 1-148

ఉ. తారక శోభితాంబర విధంబునఁ బొల్పెసఁగంగ వాశ్రమో,దార తలంబు బంధు జనతాకలనంబునఁ దాను జందు నొ,ప్పారవహించి విస్ఫురితుఁడై తనరెం గురు భర్త. అశ్ర. 2-38

(ఒప్పార = విధము పూర్తిగా)

3. మేలు,

తే. తగిన వేషంబు దనుఁదాన పొగడుకొనమి, నొచ్చియును గీడువలు కమి యిచ్చివగవ,కునికి దన కెంత నడవకయున్నఁ బథము, దప్పకుం డుట నడువడి కొప్పుపేయు. ఉద్యో. 2-45

4. మర్యాద, గౌరవము.

సీ. అడరి పోరాటకు నదనైనచో నొప్పు,పొలివోవఁ బోవుట వోలు నొక్కొ. భీష్మ. 1-154

5. అలంకారము.

క. కలిమికి నొప్పగు నీగియు, బలిమికిఁ దొడవైన యట్టి బలఁగము నై లో,కుల చిత్తములకు ప్రేఁగను, కొలఁది మనన్ గొంతి పెద్ద కొడుకున కమరున్. విరా. 2-190

6. సుందర వస్తువు.

వ. మయుండు లోకంబులం గల యొప్పులందెల్ల నుత్తమ సారంబులు దిలప్రమాణంబు లాహరించి. అను. 4-425

ప్రధనము.

ద్వయమ్ము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు

నొప్పునెఱయు హస్తియందు నొకపోకకుఁ బోవని కుక్కయందు దా,ని నడిచి తెచ్చి వండి తిను నీచపుమాలని యందుఁ దుల్యదృ,ష్టులు ద ంతరాత్మని నిరంజనుని గమనట్టి పండితుల్.
శాంతి. 5–109

8. పెంపు

క. కనకమయ యూపమొప్పఁగ, నమాన విభవమున నీవు యాగం బొనరించిన యొప్పును నిప్పటినీ, యునికియునుం జూచి నాకు మమ్మల మయ్యెన్. శాంతి. 4-390

9 ఐశ్వర్యము.

తే. అతుల సౌభాగ్యభోగ సమగ్రమహిమ, నొప్పుచున్న నీ దేవుల యొప్పుసూచి, ధృతి దఱిఁగి తమ్ముఁదాన నిందించుకొనుచు, హృదయమునఁ బాండవాంగన యెరియవలదె ఆర. 5-350

శ్లో. ఋరాజాం తే శ్రియం దృష్ట్వా దీప్తామద్య జనాధిప.
సం.భా ఆర. 236–22

10. వాక్యాలంకారము.

సీ. కౌరవ సేనాముఖంబునఁ దిలకమై, యొప్పి రాధేయాది యోధవరులఁ, గొని పాండురాజనందనులసైన్యములతోఁ దొడరి.
ద్రోణ. 1–75

మ. ...వికటాకారఁబులై యుండ నొప్పి రణోర్విం బడియున్న భూపతులఁ జూపెన్. కర్ణ. 3-379

విణ.

మంచిది, యుక్తమైనది.

ఉ. ...ఎలినా, తండొకచాయ చూసినను దత్పరతం బనిసేయు టొప్పగున్. విరా. 1-185

ఉ ...వారికొక యాపద పుట్టకయుండఁ గాచుటొ,ప్పైప్ప ధరఁ గీర్తి కెక్కదె యపాయము సేసిన నింతపుట్టదే. విరా. 2—95

ఒప్పుగందు దే. అ. క్రి.

అందము చెడు.

సీ. ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి, యుగ్మలి నీకురు లొప్పు
గంచె. విరా. 2-156.

ఒప్పుగొను[1] దే. అ. క్రి.

ఆరోగ్యముఁబొందు; రోగము లేమినిఁ బొందు.

క. ఇంతకుమును సూచితి నత(ఁ)డెంతయు నొప్పుకొనియుండె నిదిగడుఁ
చిత్రం, బెంత వెసఁ జచ్చెనముఁ దముఁ, జింతింపఁడు జనుఁడు మూఢ
చిత్తత్వమునన్. శాంతి. 4-445.

ఒప్పుగొను[2] దే. స. క్రి.

స్వీకరించు, గ్రహించు.

ఆ. ఒప్పు గొనుము వీని నుర్వీశయని సుతు, నిచ్చి గంగ సనిన.
ఆది. 4-168.

శ్లో. గృహాణేమం మహారాజ, మయాసంవర్ధితం సుతం
సం.భా ఆది. 107-85.

వ. ధృతరాష్ట్రుండు...యుధిష్ఠిరు రావించి నీవు సర్వసంపదలు స్వారా
జ్యంబును నొప్పుగొని యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున కరిగి
సుఖంబుండుము. సభా. 2-264

వ. ఇక్ష్వాకుమారుండు మేరుగిరి శృంగంబును బోలె నా కెత్తికోన నశ
క్యుండయ్యె వీని నొప్పుకొను మనిన విని బృహద్రథుండు ముదిత
హృదయుండయి దాని కిట్లనియె. సభా. 1-161

శ్లో. బృహద్రథ సుతస్సోయం మయా దత్తః ప్రగృహ్యతాం.
(ఒప్పుకొను—అని సూ.అ.ని) సం.భార. సభా. 17-50

ఒప్పుమిగులు దే. అ. క్రి. (√ఒప్పు)

ఒప్పారు.

తే. సమర కౌతుకియైన యజాతశత్రుఁ, డొప్పు మిగిలెడు మైమఱు
వూఢ్చి. (ఒప్పుమిగులు = అందమతిశయించు) భీష్మ. 1-152

ఒప్పుమెఱయు దే. స. క్రి. (√ఒప్పు)

ఒప్పారు.

వ. (ద్రౌపది) అరుగుదెంచి యంతంత నవనీకాంతుఁగాంచి యధిక శోకాక్రాంతయై యార్తింగూరి యాక్రందనంబుసేయు నమ్మాద్రీ పుత్త్రుీం డొయ్యన యయ్యంగన నరదంబు డించె సౌప్తి. 2-26

క. జడనిధి చందంబున నిమ్మడు వొప్పఁగ నిప్పుడేమి మాఁడెనె యిమ్మెశ్మ నడచివడ రిత్త నెవ్వగ, లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్. శాంతి. 3-189

క. కడుమేలటు సేయుదమని, యొడుబాటుం బలుకుపలికి యొయ్యన పిదపన్.

ఆశ్వ 1-151; ఆశ్వ. 1-171; ఆశ్వ 3-19; అర. 6-2, 2

2. శీఘ్రముగా.

చ. ఇది ప్రళయాగ్ని వోలె దెసలెల్లను గప్పఁగ విస్ఫులింగముల్, వదలక వాయుసారథి జవంబునఁ దానిటవచ్చె నేమిసేయుదు సుతులార యీ బిలము నొయ్యనపోయి చొరుండు దీనిఁ గప్పెద ఘన పాంసు జాలముల భీను శిలావళి దాఁకకుండఁగన్ ఆది. 6-304

శ్లో. ఇదమాఖోర్బిలం భూమౌ వృక్ష స్యాస్య సమీపతః, తథా విశధ్వం త్వరితా వహ్నేరత్ర నవోభయః

సం. భా ఆది. 156-16

**ఒయ్యనొయ్యన** దే. అవ్య.

మెల్లమెల్లగా క్రమక్రమముగా.

తే. రక్తసంసిక్తమైన ధరాతలమున, నార్తిఁ బొరలుచు నూర్పు లందందసంధిలంప జీవంబు వెడల నుంకింపఁ జేష్ట, లొయ్యనొయ్యన యడఁగంగ నున్నయధిపు. సౌప్తి. 1-218

(ఒయ్యనొయ్యనన్-అని ద్రుతప్రకృతికముగా సూ.అ.ని. భారతేతర ప్రయోగములు చూపెను.)

**ఒయ్యారము** దే. వి.

విలాసము.

సీ. హారముల్ మెఱయ నొయ్యారంబుగా గుచ్చి యందంబు వింతగా నలవరించు. విరా 1-107

**ఒర** దే. వి.

సామ్యము, సాటి.

క. అప్పుడు మధ్యందినమున, నొప్పిన యిను తోడఁ జాల నొరవచ్చి గురుం, డప్పాండవ బలములపైఁ, దెప్పదొరలఁ గురిసె శరతతిం దీవ్రముగాన్. భీష్మ. 2-381

**ఒరగు** దే. అ. క్రి.

ప్రక్కకు వ్రాలు.

క. అందొరగి కీచకుం డా, యిందీవరనయన నాత్మనిడి వేడ్కమెయిన్, డెందము చని విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెట్టిఁ జేయఁగా నిట్లని యెన్. విరా. 2-309

సం.ము. అకాడమి తి ప్ర.కో.-పాఠములు లఘు రేఫలు ఆనంద

(ప్రతిపాఠము శకట రేఫము)

**ఒరయు** దే. స. క్రి.

1. ఎదుర్కొను, ఢీకొను.

ఆ. ఎలమిఁగడచిపోవు బిలుచుఁ గ్రమ్మఱివచ్చి, ముక్కుముక్కుమీఁద మోపుఁ జుట్టు,నేచి తిరుగు సీఁక పీఁకలతో రాయుఁ, నొరయుఁ జిత్రగతుల మురియు నవ్వ. కర్ణ. 2-66

2. రాచు, సంఘర్షణము చేయు.

ఆ. వాని రసముపొంగి వాహినీమూర్తి నన్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ, నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము, లందుఁ జొచ్చి పారు నంబుధికిని. భీష్మ. 1-19; అర. 7-377

3. (ఒకరినొకరు) అతిక్రమించు, దాటు-తలకడచు.

సీ. మెఱయు తేజంబున మిఱుమిట్లుగొన నిద్దు, అచ్చట నొరసికొం చ రుగఁ జూచి. ఉద్యో. 2-147

శ్లో. తేషాం మనశ్చ తేజశ్చాప్యాదదానా దివౌజసా,
పూర్వదేవౌ వ్యతిక్రాంతౌ నరనారాయణా నృషీ.

సం.భా. ఉద్యో. 48-5

**ఒరలు** దే. అ. క్రి.

అఱచు, విలపించు

క. ...మనసై, న్యమ్మెల్లఁ జదియఁబఱచె భయమ్మున మొగ తిరిగి
దిక్కు లద్రువ నొరలుచున్. భీష్మ. 2-246

**ఒరుఁడు** దే. సర్వ. (బహు.) ఒరులు

అన్యుఁడు, ఇతరుఁడు.

క. నరుఁడొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ
జాపధరుం, డొరుఁడు గలఁడెః. విరా. 5-128

సీ. ...ఒరుని, వనితఁ దొల్మేనఁ జూచినవాఁడు అను. 5-89

క. నరులకు నాకుం దక్కఁగ, నొరులకు మీరూపు సూపకున్నది.
విరా. 1-176

చ. ...ఇట్టియాతఁ డెట్లొకొ యొరు వాశ్రయించు. విరా. 1-98

క. ఇప్పాటెందుఁ గలదె యొరులెవ్వరికిన్. విరా. 1-49

**ఒరులు** దే. సర్వ. ('ఒరుఁడు'-నకు బహువచన రూపము)

ఒకొక్కరు.

తే. శౌర్యవైభవ ప్రాభవశౌచములకు, నొరులకైనఁ గైవారమై
యుల్లసిల్లు, నొక్కరుని కివి యెల్లను నిక్కమట్టె విరా. 2-204

**ఒరువుఁడు** దే. సర్వ. (బహు. ఒరువులు - బహువచనమునందే
ప్రయోగము)

ఇతరుఁడు.

ఆ. ధనము గలిగి యుండి ధనకాంక్ష విడువక, కట్టకుండు పరమ కిష్ట
జనము, 'లొరువులొత్తి చెప్పుటుపకారులై తొలు,పుట్టునందు మనిన
యట్టివాఁడు. అను. 5-89; అను. 5-89

**ఒరువులవాఁడు** దే. వి.

ఇతరులకు సంబంధించిన మనుష్యుఁడు.

క. నేఁడింక నెఱిఁగి యొరువుల, వాఁడఁగదా యనుచు నేను వారిఁ
దొఱఁగినం, బోడిమిసెడదే మదిఁ గడు, వాఁడిగలదె నాకు నకట
వారిజనాభా ఉద్యో. 4-85

**ఒఱ** దే. వి.

ఖడ్గాది కోశము.

వ. కరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది.
ఉద్యో. 2-146

**ఒఱగనాడు** దే. అ. క్రి. (√ఒఱగు)

తొలఁగఁ ద్రోసికొనుటకై పలుకు.

క. నీవును మృత్యువుఁ బాప స,మావేశితమతుల కొఱగ నాడిన యం
తం,బోవునె మీపై దోషము,లే వెఱతునె యిట్టులనిన యింతన
మీకున్. అను. 1-29

**ఒఱగు** దే. అ. క్రి. ఒరగు

1. వంగు, వ్రాలు, వ్రేలఁబడు, పడు.

సీ. తన యూర్పు సెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ, నొఱలుచు
నేలకు నొఱగె నేఁడు. భీష్మ. 1-47

మ. ...కరివ్రాతముల్, ధరదంతంబుల యూఁతగా నొఱగె నుద్య
ద్భావము దృప్యత్స్ఫుటో,త్కరముల్ దిట్టినయట్లు గూడఁ గలయం
దద్బాణ పాతంబులన్. విరా. 5-190

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁడై. పఱచి జలధిలోనఁ బదలఁ బాఱెడు
నెరఁ జెయ్యాఱి దప్పి నిలువఁజాలక, యొఱగిన గాలవుని డించె
నొకగిరి మీఁదన్. ఉద్యో. 8-310; శా. 4-335; కర్ణ. 2-89

2. క్రిందఁబడు, నేలకువ్రాలు.

క. ట్వరదము లొఱగెడివియు నెత్తురు గ్రక్కుచుఁ గూలెడివి...
బయ్యెఁ బవనపుత్రు మునుమునన్. భీష్మ. 2-213

క. మీరెల్లఁ జూచుచుండఁగఁ. గౌరవ నికురుంబమునకుఁ గన్నాకై
యొ,ప్పారిన భీష్ముఁడు వడియెను, మేరువొఱగినట్టు లసముమిగుల
నరునకున్. ద్రోణ. 1-31

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలఁగఁ, దలలు మెడలుఁ
జక్కనిలువ కొఱగ, నెల్లవారు నెఱుకవెడలి చొక్కి నిద్రా

రిశయము గూరినట్టులైరి. విరా. 5-208

3. పక్షపాతము వహించు, ఒకరిపై నభిమానము పూను

ఆ. ఒఱగఁ బలికి తేని నుండుదు బ్రజ దేఁగ, గనిన పులుఁగుపిండు కరుణఁ జెదరు. శాంతి. 2-374

**ఒఱటు** దే. విణ.

మూర్ఖుఁడు, మొఱకు.

ఆ. అలు బిడ్డ లొఱటులై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు నవయు జనులు, మున్ను క్రోధ లోభముల వాస్తికతఁ బర,పీడనంబు నేసి పేర్చినారు. అను. 5-98

**ఒఱపిడి** దే. విణ. (ఒఱపు + ఇడి)

అయోగ్యుఁడు.

క. అన్నలుఁ దమ్ములు గలుగుట, యున్నతుఁ జేయు నృపు నెంతయొఱపిళ్ళయినన్, మన్ననయు నీగియును సం,పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటయున్. శాంతి. 2-356

**ఒఱపు** దే. వి.

1. నేర్పు, నైపుణ్యము.

క. వెలివారలుఁ దమ మెలఁగెడు, తెలుఁగుల దొరకొన్న వింత తెరువుల నేర్పుల్, మెఱయుచుఁ బరిచిత్తము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్. విరా. 2-21

2. పద్ధతి, విధము, రీతి, మార్గము.

సీ. ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు నొజ్జయై వినయంబు నొఱపు గఱపు. విరా. 2-191

3. బాధ, తాపము.

సీ. అడవులఁ దిరిగెడునపుడు దుష్టదైత్యులచేత సైంధవునిచే నొఱపు లంబడ్డ విషాదంబు. శాంతి 1-120

క. అలపొఱడు కురుచ చేతులు, నొరవ శరీరంబు గలిగి యొరులకుఁ జూడం, గొఱగాకుండియు మన్మథు, నొఱపుం బడిరొదు నితండు

యువతీ ప్రీతిని. అర. 2-134

4. ఉపాయము.

గీ. శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ, నొఱపు నెప్పుడు రథికు
నేమఱఁగ నీమ. కర్ణ. 1-614; (పాఠాంతరము).

విణ.

యుక్తము.

క. మొనలొఱపుగఁ దీర్చికొనుఁడు, దనతన వాహనము లాయుధము
లెల్ల జనం,బును నమువుచేసి కొనుఁడో,పిన యంతయు గాచి
కొనుఁడు బెదరక పసులన్ విరా. 4-89

**ఒఱలు** దే. అ. క్రి.

అఱచు, విలపించు, ధ్వనిసేయు.

క. నెఱి దప్పంబడి పెల్లుగ, నొఱలెడి గరవాజి కరుల యులి వఱిమ
న్యోం,డఱిముఱిఁ బడుటకు వగ మదిఁ, బఱిగొన నిల వెలుచ నఱచు
ఛంగిఁ జెలంగెన్. ద్రోణ. 2-182

సీ. తనయార్పు చెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ, నొఱలుచు నేలకు
నొఱగ నేఁడు. భీష్మ. 1-47

2. క్రిందఁబడు.

తే. భూరి రయమునఁ గూలు మహీరుహంబు; తెఱఁగు దోఁప నుదతు
లుఁ డొఱలి కెడసె. ద్రోణ. 3-95; శల్య. 1-365

శ్లో. పపాతాభిముఖశ్శూరో యంత్రముక్త ఇవ ధ్వజః,
శేతేస్మ నిహతో భూమౌ. సం.భా. ద్రోణ. 92-72-73 శ్లో.

**ఒఱవ** దే. విణ

వక్రము, వికృతము.

ఆ. ...పంగు వొఱవగఁ గాలుసే, విఱిచి సాధుజనులఁ బఱచినాఁడు.
అను 5-100

క. అఱపొఱడు కుఱుచచేతులు, నొఱవ శరీరంబుఁ గలిగియొరులకుఁ
జూడం, గొఱగాకుండియు మన్మథు,నొఱపులఁ బడియెడు నితండు
యువతీ ప్రీతిన్. అర. 2-134

2. తాఱుమాఱు, వ్యత్యస్తము, తలక్రిందు.

క. తెప్పించి తొడుగు మీవని, యొప్పించిన నిట్టునట్టునొలవలుగామైఁ, గప్పికొని యా బృహన్నల,యప్పుడు నగుపించె నచటి యబలా జనమున్. విరా. 4-39

శ్లో. ఊర్ధ్వముఖ్యస్య కవచం శరీరే ప్రత్యముంచత.

సం.భా విరా. 36-35

**ఒలవతనము** దే. వి.

వక్రత్వము, కుటిలత్వము,

తే. పితికితనము నేముఱుటయు నొలవతనము, మెత్తఁ బాటునఁ గార్యంబు నత్తెఱంగు, నేరమియు విషయంబులఁ గూరుటయును, గలుగు పతికి నుండదు సిరి దొలఁగిపోవు. అర. 6-84

**ఒలవలువోవు** దే. అ. క్రి.

వంకరలు వోవు.

వ ఉబ్బిన గుఱ్ఱంబుల కఱికి బదలువడ నటిమటి విసరిన నొలవలు వోయిన సురియం జెరివి. (పాఠాంతరము) భీష్మ. 2-71

**ఒలయించు** దే. స. క్రి.

1. నిలువు, ప్రదర్శించు.

తే. అచలభక్తి నిత్యంబు నా యందు నీకుఁ, గలిమిఁ జేసి నీయంతరంగ మున నాదు, దివ్యరూపంబు నొలయించితిం బ్రమోద, భాజనం బైతి భీష్మ తపస్స్వరూప. శాంతి. 2-110

శ్లో. యతః ఖలు పరాభక్తిర్మయి తే పురుషర్షభ,
తతో మయా వపుర్దివ్యం త్వయి రాజన్ ప్రదర్శితమ్.

సం.భా శాంతి. 50-10

2 కలిగించు, పొందించు.

క బలసి మనో వాక్కాయంబుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం,గలిమి వినుశీల మది మేలొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా. శాంతి. 3-147

అనిన విని ప్రీతుఁడై యజ్ఞవిభుఁడు గృహస్థధర్మ సాకల్య

జ్ఞానని రూఢి నాదు చిత్తంబున నొలయింపు భవదీయ పుణ్యఫణి
తులన్. అను. 8-338

8, వైచికొను, వహింపఁజేయు.

క. పలుకుపడి నతనిఁ బాపంబులు విడుచుం బలికి నతనిఁ బొందును
బాపంబులు నొరుపాపము దన్నై, నొలయింపఁగ నేల నిందయుడి
గినఁగాదే. శాంతి. 5-558

**ఒలయు** దే. అ. క్రి.

ప్రకాశించు.

సీ. తెలిగన్నుఁ గవకు నెచ్చెలియై లేతఁన వ్వొలయంగ సరసంపుఁ
బలుకు పలికి. విరా. 2-64

సీ. అరదముల్ దెరలించునప్పుడు ఘఱమొగుల్ విరియించు బలు
గాడ్పు విధము మెఱయు, హయములఁ జెండాడ నరుగు చోట్లను
లేళ్ళఁగమిఁ గిట్టు కోల్పులికరణి యొలయు కల్య 1-282

2, కలుగు, జనించు,

చ. అనుడు విరాటు డుల్లమున నక్కటికం బొలయంగ నంగనం, గనుఁ
గొని కీచకుం గినియఁగాఁ దగు సత్త్వము లేమిఁ జేసి సాంత్వన
ములు పల్కె. విరా. 2-144

క. అని యిట్లొలయు వితర్కింబునెడ హృషీకేశుఁడైన పురుషో
త్తము దర్శనమును క్రమమున నెఱిఁగినఁ, మునివర్గము శిష్యవర్గ
మున్ బోధించున్ శాంతి. 4-823

ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమి చతుర్దశుల నుభయపక్షవశత వచ్చు
షష్ఠిఁ బంచమిని సునిష్ఠమై నుపవాసమున్న, వివిధ శుభము లొలయు
నంద్రు. అను. 4-147

వ. అతని తోయస్తంభన వైదగ్ధ్యం బెఱుంగుట నొలసిన యూఱటను
ముందటి యట్లవారలతోడం జని చని. కల్య 2-46

3. అతిశయించు.

క. పేరుకుక్కనఁ బొదివిరి నరు నతఁ డెక్కుడు మదమొలయఁ జేతి

యే త్రైల మూ పెన్. ద్రోణ. 1-41

4. స్ఫురించు, తోచు.

తే మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస, సేయుదురు విజనత్వ విశేష మెఱిఁగి, కాన యింపై శ్మశానంబు మానసమున, నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె. అను. 4-437

క. (సూతాత్మజుఁడు) మనమునఁ గుంతీ వాక్యంబును నొలసిన నేయుటుడిగిపోయి కదిసి నవ్వునమో మొప్ప నతనికిట్లను వింటం గదుపు లీల నల్లఁ బొడుచుచున్. ద్రోణ. 4-288

శ్లో. వ్యాయుధం నావధీచ్చైనం కర్ణః కుంత్యావచః స్మరన్, ధనుష్కోట్యగ్రేణ తం కర్ణః స్పృష్ట్వా వాక్యమబ్రవీత్.
సం.భా ద్రోణ. 139-87

4. వ్యాపించు, ప్రసరించు.

చ. అతని మొగంబుమీఁద నొలయన్ మధురంబగు చూడ్కి పార్వతీ పతి మృదురీతి నిట్టులను. సౌప్తి. 1-131

వ. అత్తపోధనవర్యుం డాదరమేదురావలోకనం బాభూపాలునిమీఁద నొలయ నిట్లను. శాంతి. 3-360

వ ఆ సర్వలోక శరణ్యుండు గారుణ్యామృత మయంబైన చూడ్కి నా మీఁద నొలయ నిట్లనియె. అను. 1-377

6. ఉన్ముఖమగు, ఇష్టపడు.

సీ చెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబునకు మది యొలయ నన్న రుని తోడ. మహా. 4

7. పరివేష్టించు.

ఆ. ....(దమయంతి) సురసిద్ధ, సాధ్యకన్య లట్టి సఖులు నూర్వు, రొలసి తన్నుఁ గొలుచుచుండఁగ మహి నొప్పుచుండె, అర. 2-4

వ ల భూపతులుఁ బాయక భక్తియుక్తులై, యొలసి నీ పనులు యుదుర పేర్మి. సభా. 2-102

12. సిద్ధించు, సమకూరు.

తే. గోవులకు మేలు సేయంగఁగోరు నాదు,చిత్తమున మన్వరంబున సిద్ధమైన, తెఱఁగ యొలసె దైవికమయి దీని పెంప, యావహించెదనని యిచ్చె నవ్వరంబు. అను. 8-128

13. వశమగు.

తే. ఇంద్రియంబుల వాటింటి నిట్లు విషయ,ములకు నొలయకయుండంగ నిలువరించి, తలఁపు లుడిగి తేనియఁ బ్రమదమున నాను, భంగిఁ దృప్తుఁడవై యుందు పరము గాంతు. శాంతి. 5-181

14. సక్తమగు, తగులువడు.

క. ధనమేటికి నీ విప్రుని, మన మొలయఁగవలయు ధర్మమార్గంబున ధ్యానన సర్వసంపదలునగు, నని నిశ్చయమొంది వినయ మతిశయమందన్. శాంతి. 5-348

శ్లో. ధర్మేఽస్య రమతాం బుద్ధిర్ధర్మం చైవోపజీవతు

సంభా. శాంతి. 271-26

తే. ఉత్తమంబెద్ది నీ చిత్తమొలయు నెందుఁ, బురుషుడెయ్యది గల్గినఁ బొందు నఖిల, కర్మబంధ మోక్షము నట్టి ధర్మమెఱుఁగఁ, జెప్పవే కరుణాలత చిగురులొత్త. శాంతి. 5-542

15. ఆవేశించు, ప్రవేశించు.

వ. తేజోరూపంబున నతని తనువున నావేశించె నిట్లు రుద్రుం డొలసిన యగ్గురునందనుఁ డమంద హర్షమయ మూర్తియై.

సౌప్తి. 1-184

శ్లో. అథావిష్టో భగవతా భూయో జజ్వాల తేజసా.

సం. భా. సౌప్తి. 7-66

16. ప్రతిష్ఠితమగు, స్థిరపడు.

క. నిర్మలమగు వేదాంతిక, ధర్మము నారాయణోదితంబై క్రియలం, గర్మఠుఁడగు బ్రహ్మమతిని, ధార్మికవర యొలసె నతఁడు దయ సిగురొత్తన్ శాంతి. 6-495

17. అలవడు.

క. ఏనును నిట్టుల మోహా,ధీనుఁడనై యాత్మఁగాంచు తెఱఁగొల యుటకుం, బూని పడుదు నెయ్యది యో,గానం దెరువా శుభప్రకలనంబునకున్. శాంతి. 6-551

18. విజృంభించు, చెలరేఁగు.

క. ...ఖేదము గలిగిన నలఁతు రొలసి దస్యులు ప్రజలన్.
శాంతి. 2—815

స. క్రి.

1 పొందు.

క. అవలఁబగు నీ యితిహా,సము భక్తిఁబఠించినం బ్రశాంతి యొలసి దుః,ఖములం దొఱఁగి మనుష్యుం, డమృతత్వావాప్తి మహితుఁడై వెలుఁగొందన్. శాంతి. 4-860

తే. ...వినుము నాదు, బుద్ధి యనపుడు నతఁడు ప్రబోధ మొలసి.
అను. 5-858

చ. అనఘుఁ డజాతశత్రుఁ డిటు లన్నలు దమ్ములు లోనుగాఁగ ద్రష్ట నఖిల బంధుకోటులను జంపెడు తెంపొలసెన్. శాంతి. 5-872

మధ్యాక్కర :- తిలలందుఁ దైలంబు కాష్ఠముల యందుఁ దిరముగా నగ్నిఁగలుగు టెఱిఁగి యుపాయ పూర్వమునఁ గడఁగి తత్సిద్ధి, యలయక యత్నవంతుఁడు పడయు నట్లనుత్సాహ, మొలసి దైవపరుఁడది పడయఁగను నోపనె యెందు. అర. 1-234

2. అభిలషించు, కోరు.

తే. శక్తి రాక్షస నిహతుఁడై చనిన శోక,దహన హతుఁడై వసిష్ఠుండు దానిఁ దలఁచి, కడుఁ బ్రశాంతాత్ముఁ డయ్యు రాక్షస వినాశ,మొలసి మనమని వారింపకుండె నంత. ఆది. 7-149

ప్రహరణ కలితవృత్తము :- ఇది యిటులగు టెఱిఁగి పలికెవా, విదురుఁడు సభఁ గౌరవుల నొగడఁగా, నది వినియును నే నడపన దరితం, బొదవెఁ గలకనే టొలయ కుడుగునే. స్త్రీ. 1-185

చ. ...గజంబుల వ్రేసిన నెత్తురొల్కఁగా, నతి పడె.

భీష్మ. 2-360; శల్య. 2-285; స్త్రీ. 1-77; ఆది. 2-24

స. క్రి.

చల్లు.

తే. ...విప్రులును వసితాజనంబు, సేసలొలుక సింహాసనాసీనుఁడయ్యె.

విరా. 1-232; ఉద్యో. 3-182

వ. ఉమా శ్రీ సరస్వతీ శచీప్రముఖాలైన పుణ్యాంగనలు దీవనలతో సేసలొలుక. శల్య. 2-188

వ. దాని నోడకుఁడుమని మునివరుండు హుంకారంబున రాక్షసు నారించి వానిపయి మంత్రపూతంబులైన కమండలు జలంబు లొలికిన. ఆది. 7-125

ఒలుచు; ఒల్చు దే. స. క్రి.

1. (చర్మము, బట్ట మొ) ఊడఁదీయు, ఊడుచు.

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుంగు, పెంటలయ్యె రాజుఁబెద్ద దొరలుఁ, జీరలొలువఁబడిరి. విరా. 5-222

శా. నారిగత్నము నట్లుదెచ్చి సభలో నవ్వారలుం జూడఁగాఁ జీరల్ ప్రోవులుగాఁగ నొల్చుటయు. ఉద్యో. 1-232

వ. తగునుపాయంబు చింతించువాఁ డప్పుడ చంపి తిత్తొలిచి గాలి గొఁవైచిన తక్కఁకడిమంబు గనంగొని. శాంతి. 3-285

2. పెఱుకు. పీఁకు.

సీ ...లోచన, గుళికల నొలిచి మ్రింగుచును. స్త్రీ. 2-9

ఆ. ...గ్రద్దలొలిచి తినంగ నీసుకృతపరుని నిట్లు సూడనలసె.

స్త్రీ. 2-125

3 (మనుష్యులను) దోఁచు (ధనాదులను) అపహరించు.

సీ ...వారఱవాయి గొనక యప్పలుకు లన్నియును రజ్జులుగఁ గొనుచుఁ, జాముల నచట నచ్చట నొల్చికొనఁగ నాఁలోకించి యచ్చెర లొకవరుఁడు. మౌస. 185

వైవ, నడుమఁ బోడిసేసె నాచార్య నందనుండు. భీష్మ. 3-28
(ఒల్లఁబోక = తెమదీయక - అని యర్థము)

3. మూర్ఛవోవు, స్పృహతప్పు.

చ. తలరు నలందురున్ సవయుఁ దాపభరంబున వెచ్చమూర్ఛ మే,
నలయఁగ నొల్లఁబోవు వెగడందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం,
దలపడుఁ దల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు వి,చ్చలవిడిఁ
బేర్చు నెవ్వగల సందడి డెందముగంది చేడ్పడున్. విరా. 2-293

ఆ. అడ్డపడి గురుండు దొడ్డనారసము వ,క్షంబు దూఱనేయ సవ్య
సాచి, యొల్లఁబోయి తెలిసి పెల్లేసె నక్కుంభ, జన్మమీఁద నిశిత
సాయకములు. ద్రోణ. 3-63

ఒల్లమి దే. వి. (√వలచు)

1. ఇచ్చగింపకుండుట.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట, కోర్వమియుఁ గౌరవులఁ
జంపనొల్లమి యును,గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ,
డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. ఉద్యో 3-58

ఉ. అక్కట మున్న పాండవుల కల్గఁగ నొల్లమి సెప్పరై తిరే.
భీష్మ. 2-119

చ. ...రాజసిరి యి,ట్లొడఁబడి చేయవచ్చి వధకొల్లమి యొప్పునె.
ద్రోణ. 5-356

2. అనాదరము.

తే. బ్రహ్మచర్య భిక్షాశన పరత గలిగి, జటిలయొండె ముండితయొండె
సంభరించి, మనసు నాయంద తిరముగా నునిచి యొండు, వస్తువుల
దెస నొల్లమి వర్తిలంగ. అను. 5-269

ఒల్లియ దే. వి.

వస్త్రము, ఒట్టు, చీర.

ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁడ.య్యుం గను
పట్టె వెల్లతలయొల్లియ మౌళి దృఢంబుగా నమ,ర్చెం గురునాథ
(తలయొల్లియ = తలపాగ, తలగుడ్డ) కర్ణ. 3-327

**ఒవ్వనిజనము**

సరిపడనివారు, గిట్టనివారు, శత్రువులు.

సీ. ...రంధ్రమొవ్వని జనంబు-తే-వేచుః ఆశ్ర, 2-188

క. ద్యూతక్రీడఁకు గొండొక, నేతుం గపటమున నొవ్వని జనంబులు నా,చేతి ధనమెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తిపుట్టె నెడలి టన్. విరా. 1-186

**ఒవ్వనివాఁడు** దే. సర్వ.

సరిపడనివాఁడు, గిట్టనివాఁడు, శత్రువు.

సీ. సంధిమై, నొవ్వని వారెల్ల నవ్వఁ దలలు, వంని కౌరవులలో వర్తింపనేలని, హరితోడ నాడితి. ఆశ్ర. 1-166

క. ఒవ్వని వారల యెదురన, యవ్విధమున భంగపడితి. అర. 6-16

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు. విరా. 2-286

**ఒవ్వమి** దే. వి. (√ఒవ్వు)

1. గిట్టమి, ద్వేషము.

ఉ. ఎవ్వతెనేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగనా, కొవ్వమిఁ జేసి యట్టి నిను నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం, గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే, నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ. భీష్మ. 3-332

క. ఒవ్వమి, గౌరవులకుఁ గడుఁ, దవ్వయి మఱి విప్రవేషధారుల మయి మ. మ్మెవ్వరు నెఱుంగకుండఁగ, నివ్విధమున నున్న నెట్టు నెఱిఁగితి రిరల్. ఆది 7-217

**ఒవ్వు** దే. అ. క్రి.

(దీనికి వ్యతిరేకార్థముననే ప్రయోగములు గలవు.)

పరిపడు, గిట్టు, అనుకూలించు.

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీక్షి, న్నెవ్వగఁ బొంద (ఒవ్వనివాఁరు = పగవారు) విరా. 2-286

సీ. ...కూర్చువా రొవ్వకుండు,వారని తనకు నెవ్వరును గల్గక త్రివర్గే

చ్ఛ యెవ్వని చేత నీడవిడువఁ- తే-బడు. అశ్వ. 1-208

ఒసంగు; ఒసఁగు దే. స. క్రి.

1. ఇచ్చు.

వ. (బృహన్నలకు) చిత్రంబులగు చీనాంబరంబులిచ్చి మణిమయంబు లగు నాభరణంబు లొసంగి విరా. 1-248

ఆ. అఖిల రత్నపూర్ణ యగు వసుంధరయెల్ల, నొసఁగితేని యొసఁగు యోగ్యతాఖి,యుక్తిలేని వాని కొసఁగకు మీ విద్య, తగిన పాత్ర మైనఁ దడయ కిమ్ము. శాంతి. 6-88

ఉ. ...సుయోధనుండు సం,భావనసేసి పాలొసఁగు పాడియ కల్గిన శాల్యమాదిగా,వేవిధినైనను తెలుప నింతలు పాపము లాచ రించునే. ఉద్యో. 8-88

2. అర్పించు.

వ. అప్పరమ పతివ్రత భక్తి ప్రీతి వినయంబులు మనంబున నంకురింప లుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వా దంబుసేసి యాసంయమివరుండు. అశ్వ. 8-98

వ. లోకఁరుండగు శివి యాత్మాంగంబుల నౌరసపుత్రునిని బ్రాహ్మణా ర్థంబుగా నొసఁగె. శాంతి. 5-82

3. కలిగించు, కావించు, చేయు.

క. ఇతఁడెవ్వఁ డొకొ్క రూపు ని,రతిశయమై మనకును బ్రియం బొసం గెడుఁ జూచితిరే. విరా. 1-258

వ. అమ్మేటి విలుకాఁ డలుకమానిన యలంతి నవ్వుచెలువంబు మొగం బునకు వింత చెన్నొసంగ విజృంభించి. కర్ణ 1-176

# ఓ

ఓ అవ్య.

1. సంబోధమును దెలుపును.

(ఇది సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడును)

క. ...ఇట్టి యేవపుఁ జందం,బోయన్న మదన వికృతిం, జేయుననుట యెంతయును నిషిద్ధము గాదే. విరా. 2-49

సీ. ...ఓ కర్ణ యోకృప యో సుయోధన పోర నన్నొత్తి యెపుడుఁ జెప్పుదురు. ద్రోణ. 5—822

2. పిలిచినపుడు మాఱుపల్కుటయందు నుపయుక్తమగును.

వ. ...శుకుండు మృగపతిశైల సరిత్సరసీతరుగుల్మలతలం గలయం గమంగొని మా తండ్రి నా వెనుకం జనుదెంచి నాదగు పేరం బిలిచెనేని మీరెల్ల నో యనవలయుండుండీ యనిన నవి యట్లచేసెద మనియె. శాంతి. 6-330; శాంతి. 6-334; శాంతి. 6-335

సీ. పేర్కొని పలుమాఱు బిలిచి యోయనుట లేకున్న నయ్యింటిలోఁ గన్నువఱపి. అను. 1—76

3. ఆర్తిని దెలుపును.

తే. ఒక్క దనుజాధముఁడు మొఱ్ఱోయనంగ, నన్నుఁ జెఱగొని పోయెడు నన్నలార, యెవ్వరిట విడిపింపరే యింత వట్టు,పుణ్యమునఁ బోవరయ్య కారుణ్యబుద్ధి. అర. 5-177

(ఒక్క దనుజాధముఁడు మొఱయో కడంగి – అని ఆనంద వారి పాఠము)

4. సందేహమును దెలుపును.

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్ర కీర్తిప్రియమో, రిపు దుస్సహమగు నీరణ, నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్. విరా. 3-227

ఆ. అతఁడు సమయకాల మంతయుఁ గడచిన వచ్చెనో యెఱుంగ
వలయు నిజము. విరా. 5-372

క. ...ముక్తి గలదో లేదో, జనకున కరసెదఁ గాని.
శాంతి. 6-214; సభా. 1-212

5. ప్రశ్నమును దెలుపును.

చ. ...ఏను శ్చెచ్చెరఁజని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక
పాడిమై, వరవుడ మోపి చేయుదునో వారికి మాధవ నిశ్చయిం
పుమా. ఉద్యో. 3—112

క. కర్ణు వినమో,యడి వీరవుఁదులవ గెలుచునకొ పాండవులన్.
ద్రోణ. 4-184

తే. అతివ సేమమె తగ దేవతాతిథి ప్రపూజనంబులు నడచునే పూర్వ
వృత్తి, యెడలి యేను లేకునికి నేమేమి వికల మయ్యెనో చెప్పు
మనవుడు నా మృగాక్షి. శాంతి, 6—576

6. కాక్వర్థము.

ఉ అప్పుడు ధర్మహానికి భయంపడి నిల్చితివో కడంకతో, నిప్పుడు వచ్చి
నాఁడవు. విరా. 5-93

7. ఊహను దెలుపును.

ఉ. ...నన్నుత్తలమందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యె
డున్. విరా. 2-84

ఉ. ...అసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో, నా విలసిల్లి ప్రేలఁగ.
ఉద్యో. 3-114

వ. పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము సేయ
సమకూరునో యని చింతించుచున్నచో. అది. 6-240

8. ఎంత, ఎన్ని - అను సర్వనామములతోఁగూడి పరిమాణాతిశయమును
తెలుపును.

ఉ. ...ద్రోణుని పాటుగాంచి యా.వంతయు నాత్మలోనఁ దెలియండు
సుయోధనుఁ డెంత మూర్ఖుఁడో. శల్య. 1-352

ఉత్సాహవృత్తము :- శోకవహ్ని తాప మూర్ఛితముగాఁగ బంధు
జనుల చిత్త మెంతగుందునో. స్త్రీ. 2—152

9. ఎట్లు, ఏమి మొదలగు పదములతోఁగూడిన వాక్యములందు ప్రయుక్త మగును.

క. సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి యరిగెద రదియే,మో నేఁడు వేణువీణా, గానస్వనములును వీటఁ గలుగవు కృష్ణా. ద్రోణ. 2-288

క. ...ఎమ్మెమ్మె వ్రాలెదనో రిపులెట్టులు, గూలెదరో చూడు నాకుఁ గురుబల మెదురే. ద్రోణ. 2-850

క. ...పృథా,సూనుల నెట్లు జయించెద,నో నమ్మము నా బలంబును గలితనంబున్. శల్య. 1-22

క. దానికి రోసి బృహస్పతి,తో సమరేంద్రుండు మేలు దొరకొను విధమె,ట్లో వావుడు భార్గవునిం, గానఁగఁ జను మతఁడు సెప్పుఁ గరుణాన్వితుఁడై. శాంతి. 3-188

వ. ఇది యేమియో కాని నీవుత్తమ క్షత్త్రి ధర్మంబున సముపార్జించిన యుజ్జ్వల శ్రీ సుస్థిరతం బొందెదుమని యతనికి నాశ్వాసం బొనర్చి. శాంతి. 1-366

10. ఆశ్చర్యమును దెలుపును.

తే. కరము లెయ్యవి శిరమేది గాళు లెచటఁ, జొచ్చె గంధర్వవరులచేఁ జచ్చువారెల్ల నిట్టుల యగుదురో యితనితోడి, యలుకఁజేసిరో యిది కడు నక్కజంబు. విరా. 3-8

ఆ. ఇతఁ డపూర్వమనుజుఁ డెందుండి వచ్చెనో, యనుచు నదరిపడి లతాంగులెల్ల, నాసనములు డిగ్గి యప్పు డభ్యుద్గత,లైరి మనములందు హర్ష మెసఁగ. అర. 2-39

11. కాలనిర్ణయము లేమిని దెలుపును.

క. అని యతని జత్రుదేశం,బున నొక వాలమ్ము వక్షమునఁ బెక్కును గ్రుచ్చినఁ ద్రెళ్లి యెన్నఁడో చచ్చిన యట్లు రథంబు మీఁదఁ జేడ్పడి యుండెన్. ద్రోణ. 2-61

(ఎన్నఁడో = ఎంత కాలము క్రిందటనో)

చ. .. ఇద్దురవస్థ యెన్నడో, తెగుటని సంతతంబును మదిం దలపో
యుదు నేమిసేయుదున్. విరా. 2-207

(ఎన్నఁడో = ఎంత కాలమునకో)

**ఓంకారము** సం. వి. అ. పుం. (అ+ఉ+మ్)

ఓమ్' అను ప్రణవాక్షరము - ఇది వేదపఠనమునకు ముందును చివరను ఉచ్చరింపఁబడును.

క. ఓంకారవాచ్యునకు ననహంకార నిరూఢ భావనారాధ్యునకున్. విరా. 1-82

**ఓంకారవాచ్యుఁడు** సం. వి. అ. పుం.

ఓంకారముచేఁ జెప్పఁబడువాఁడు, పరమాత్ముఁడు, సర్వేశ్వరుఁడు.

చూ. ఓంకారము.

**ఓమ్ నమో భగవతే వాసుదేవాయ**

ఇది ద్వాదశాక్షరీ మహామంత్రము (భగవంతుఁడైన శ్రీమన్నారాయణుని కొఱకే నేను. నా కొఱకుఁ గాదు. ఆయన కొఱకే సర్వకర్మముల నాచరించెదను. నా కొఱకుఁగాదు నాకు నేను రక్షకుఁడగాను. ఆయనయే నాకు రక్షకుఁడు - అని భావము)

వ. ఓన్నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ ... నమో విష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుట మహాజపంబు. అను ౬-819

**ఓకస్సు** సం. వి. స్. న.

ఆశ్రయము, స్థానము, శరణము.

క. ఏక ద్విత్రిచతుర్వ్యాహాకారతఁ దోఁచుచుండు హరిభక్తజనౌ
కోకమున వాసుదేవా,ద్యోకః ప్రాప్తముగఁ దత్తదుచిత మూర్తిన్. శాంతి. 6-500

**ఓగిరము** వై. వి. (సం. ఆహారః)

అన్నము, ఆహారము.

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ, సదనమునకుఁ జనియె నపుడు సమ్మో
దమున నవ్విదురుం డోగిర మొనరింపెదనని తన్నడుగ నట్లు

చేయుం దనుచున్. ఉద్యో 8-181

**ఓఘమాల** సం. వి. అ. స్త్రీ.

సరస్వతీనదిరూపము - సప్త సారస్వతములలో నొకటి,

చూ. సప్తసారస్వతము. శల్య. 2-159

వ. ఒకమఱి యాపరమేష్ఠి యజ్ఞంబున...సుప్రభయు...ఓఘమాలయు ...అను నామంబుల నారీవేషయుక్తయై సరస్వతి చని. శల్య. 2-159

**ఓఘము** సం. వి. అ. పుం.

1. సమూహము

మ. ...ఘోటకవ్రజము శుంభత్స్యందనౌఘంబు. ద్రోణ. 2-307

2. ప్రవాహము.

క. అలిగి నరుఁడు భీముఁడు నిరు,గెలఁకుల నయ్యస్త్ర గురునిఁ గిట్టి శరౌఘం,బులఁ దేల్చిన. ద్రోణ. 5-132

**ఓఘరథుఁడు** సం. వి. అ. పుం.

ఓఘవంతుని కొడుకు.

ఆ. అతని కోఘవంతుఁ డనువాఁడు జనియించె, నుదిత యశుఁడు వాని కోఘరథుఁడు; నోఘవతియు ననఁగ నుదయించి రయ్యోఘ, వతికి నావిభుండు వరుని నరసి. చూ. ఓఘవతి. అను. 1-62

**ఓఘవంతుఁడు** సం. వి. త్. పుం.

ఓఘరథుని తండ్రి, ఈతని కూఁతురు. ఓఘవతి.

చూ. ఓఘవతి.

**ఓఘవతి**[1] సం. వి. ఈ. స్త్రీ.

ఓఘవంతుని కూఁతురు. సుదర్శనుని భార్య. కురుక్షేత్రమునఁ తపస్వి. భర్త్రాదేశము ననుసరించి యీామె తన భర్తయింట లేనప్పుడసైత మతిథి పూజనము చేయుచుండెను. ఒకనాఁడు సుదర్శనుఁ డాశ్రమమునందు లేని సమయమున ధర్మదేవత విప్రాకారము దాల్చి యోఘవతి వలన కోరెను. ఆమె వి పుఁడుగనే భావించి యాతిథ్యాదు లొసంగి తిథి యేదికోరిన దానిఁ గావింపుమని భర్తృశాసనము.

ఈ మాయావిప్రు డీమె సంగమము కోరెను. అనుమానించియు, వెను కాడియు నామె భర్త్రాజ్ఞ దలంచి యంగీకరించినటులఁ గన్పించెను. కపట విప్రుఁ డామెను చేతులతో స్పృశించెను. ఇంతలో సుదర్శనుఁడు వచ్చి విషయము గ్రహించి భార్య యతిథి కభీష్టము తీర్చుటయే తన దీక్షయు సంతోషము నని పల్కెను. విప్రుఁడు వెలుపలికి వచ్చి తన నిజస్వరూప మును జూపి సుదర్శనుని యచంచలాతిథి సత్కారదీక్షా వ్రతమునకు మెచ్చుకొని మృత్యువును జయించు నటుల వరమిచ్చెను. ఓఘవతీ పతి వ్రతాతమునకు భంగము గామిని ప్రసాదించి ఆమె శరీరము నుండి ఓఘవతియనునదియై యాకురుక్షేత్రమున బ్రవహించుచుఁ దనయందు స్నానముచేసిన వారి సర్వవిధ పాపములు బోఁగొట్టి పవిత్రులను జేయు నటులను ఓఘవతి రూపముతోడ పరలోకమున సుదర్శనునకు సేవచేయు నటులను వర మొసంగి యంతర్హితుఁడయ్యెను.

సుదర్శనుఁడు అగ్నిహోత్రునకు సుదర్శనకుఁ బుట్టినవాఁడు చూ. సుదర్శనుఁడు.

తెలుఁగు భారతమున సుదర్శనుని కుమారుఁడు ఓఘవంతుఁడు అతని కూఁతురు ఓఘవతి — ఓఘవతి సుదర్శనుని భార్య.

క. అనలునకు సుదర్శనకును, జనియించె నుదాత్త గుణవిశాలుండు సుదర్శన నామధేయుఁ డానృపు డనూన ధర్మమునఁబాల్చె నవనీ భరమున్ -వ- (ఆ సమయంబున) ఆ. అతని కోఘవంతుడను వాఁడు జనియించె, సుదిశ యశుఁడు వాని కోఘరథుఁడు, నోఘ వతియు ననఁగ నుదయించి రయ్యోఘవతికి నావిభుండు వరుని నరసి. వ. ఒరుల మెచ్చుక. క. అలేమ సుదర్శనునకు, నాలింగా నిచ్చె నర్థవాన నందనుఁడున్. లోలతఁగై కొని పరిణయు,కేలి నడపి విమల బుద్ధిఁ గృతనిశ్చయుఁడై. అను. 1-60, 61, 62, 63, 64

దీనిని బట్టి తాతకు మనుమరాలు పెండ్లామను అపభ్రంశత గానవచ్చు చున్నది- సంస్కృతమున నిట్లున్నది.

శ్లో. ప్రతిజగ్రాహ చాగ్నిస్తు రాజకన్యాం సుదర్శనామ్,
విధినా వేదదృష్టేన వసోర్ధారామివాధ్వరే ॥

తస్యా రూపేణ శీలేన కులేన వపుషా శ్రియా
అభవత్ప్రీతిమానగ్ని ర్గర్భేచాస్యా మనో దధే
తస్యాం సమభవత్పుత్రో మాహ్నాగ్నేయ స్సుదర్శనః
సుదర్శనస్తు రూపేణ పూర్ణేందుసదృశోపమః
శిశురేవాధ్యగాత్సర్వాం ప్రరం బ్రహ్మ సనాతనమ్
అథౌఘవాన్నామ నృపో నృగస్యాసీ త్పితామహః
తస్యాథౌఘవతీ కన్యా పుత్ర శ్చౌఘరథోఽభవత్
తామోఘవాన్ దదౌ తస్మై స్వయ మోఘవతీం సుతామ్
సుదర్శనాయ విదుషే భార్యార్థే దేవరూపిణీమ్
సగృహస్థాశ్రమరత స్తయాసహా సుదర్శనః
సం. భా. అను. 2-35, 36, 37, 38, 39, 40 శ్లో.

దీనినిబట్టి సుదర్శనుని కొడుకుగాడు ఓఘవంతుఁడు. ఓఘవంతుఁడు నృగుని తాత.

**ఓఘవతి**[2] సం. ఈ. (స్త్రీ).
కురుక్షేత్రమందలి ఒక నది. అను. 1-82
చూ. ఓఘవతి

**ఓచెల్ల** దే. అవ్య.
సంతాపార్థకము.
క. నా చేసిన కీడునఁ గదు, నీచుండగు నా తనూజు నేరమి నిమ్మై,
వోచెల్ల పార్థులకుఁ బ్రత్యాచారుల కెందులేని యాపద వచ్చెన్.
అర. 5-327

**ఓజ** వి.
విధము, పద్ధతి, రీతి, పోలిక.
శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా,
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో,జం
గాంతార నివాసఖిన్నమతి నన్మత్సేనపై వీఁడె వ,చ్చెం గుంతీసుత
మధ్యముండు. విరా. 4-95
క. తేజోధనుఁడగు నరుఁ డు,ద్భ్రాజితగతి నడుము మెఱపి బడబాగ్ని
దళం, బై జలనిధిఁ ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్మి

యుడిపెం దోడ్తోన్. విరా. 5-58

ఉ. రాజులకెందు నారయఁ బరాక్రమ జీవనవృత్తి దక్క నొండోజ నిషిద్ధమంద్రు. ఉద్యో. 4-14

ఆ. మేలు దనకుఁ గోరు మేదినీశుఁడు మున్ను, దేవతలకు భూమిదేవతలకుఁ, బూజ యాచరించు నోజ యత్నముఁ జేయవలయు రెండుఁ గార్య ఫలకరములు. శాంతి. 2-166

క. రాజోచిత ధర్మంబుల, యోజ విశదభంగిఁ జెప్పితి. శాంతి. 4-8

2. కౌశలము, నేర్పు.

వ. మఱియు ననేక గతుల యోజలు మెఱయుచుఁ గొండొక సేవ విరాటునకు వినోదంబు సలిపి. విరా. 2-16

క. రాజునకుఁ బియ్య మొసఁగెడు, పూజావచనముల నెయ్యపుం బలుకులఁ బేరోజమెయి బంధు మిత్ర సమాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచు. ఉద్యో 3-179,180

3. ఉత్సాహము.

సీ. ...ముంద, రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి, సపరివారముగ విశాలరమ్య, పూత స్థలంబునఁ బుండరీకాక్షుడు, దమ్మిందుఁ దాను నుత్సవ మెలర్ప. ఉద్యో. 3-229

తే. ఏనుండ వెఱపేల నాపగా తనూజుఁ బోదువుఁడు మీరని యోజఁ జెప్పె, శక్ర తనయుండు తనయోధ జనులకెల్ల. భీష్మ. 3-406

క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ రంజిల్లఁగఁ బేరోజం జేసిన కృత్యము, నూ జగములు రెంటియందు శోభన మిచ్చున్. ఆశ్ర. 1-28

వ. హాలికుండెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రాణులనేకంబులు పచ్చు. అర. 5-57

4. పాడి, నీతి, ధర్మము, తగవు.

సీ. ధైర్యంబు వచనమాధుర్యంబు శాఠ్య దైన్య క్రోధ లోభ నిరాస,

కత్వ-అ-మోజ యతనియందు నైల్యంబులు. శాంతి. 5-82

ఓజ[2] దే. వి.

ఉపాధ్యాయుఁడు. గురువు.

సీ. శకునిఁ జూచితె మురసంహార యితఁడు మా,యాజాలములకు
నాఁడోజ సకల, మాయలు నీచేత మడిసె. స్త్రీ. 2-136

ఓజస్సు సం. వి. స్. న.

బలము, శక్తి.

రసధాతువు మొదలు శుక్రధాతువు వరకుండు ధాతువులయొక్క ఉత్కృష్టమైన తేజస్సే ఓజస్సు, దీనివలన శరీరమునకు హృదయము నందుడి సర్వవ్యాపియై బలము స్థైర్యము శక్తి మొదలగు గుణములు గల్గును. శుక్రము యొక్క స్వచ్ఛత, ఆధిక్యమును బట్టి దీని బలాబలము లుండును.

సీ. శశితారకమున నోజః ప్రాప్తి. అను. 8-168

శ్లో. ఓజస్తు తేజో ధాతూనాం శుక్రాంతానాం పరంస్మృతమ్
హృదయస్థ మపి వ్యాపి దేహస్థితి నిబంధనమ్"

ఓటు దే. వి. ఓటమి, ఓటము (√ఓడు)

1. భయము, వెఱపు.

(ముని కుక్కకు శత్రుజంతువుల వలన భయము లేకుండఁ దత్త
ద్రూపముల నిచ్చుట)

సీ. ఒక మత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన నుద్ధత కరిఁజేసి యొసఁగె
జయము. శాంతి. 3-98

2. వినయము.

ఆ. మాట పొందెఱింగి యోటమై నల్లన, చేరి కౌరవేంద్రు చిత్త
వృత్తి, కనుగుణంబుగాఁగ నానతుండగుచుఁ బ్రార్థించి యడుగ
కున్నఁ దెలఁగుపడదు. ఉద్యో. 1-21

3. అపజయము.

ఆ. ...అక్కిరీటి కోలుతలకు నోట లేక, దుష్కరంబు సేసి తుదిగన్న

పుణ్యాత్మ, కలితగతుల మేలుగలుగు మాకు. ద్రోణ. 1-221

4. కొంకు, సంకోచము.

ఉ. ఓటయొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ,మాట
లఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁగాక.
ఉద్యో. 3-104

ఆ. వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమి సేయువార
మీవు దక్క, నొరులు నిలువరింప నోపెడు వారులే రోట లేక
కాఁకి యోర్వవలయు. విరా. 5-181

ఓటమి దే. వి. (√ఓడు)

1. అపజయము.

క. వినుము యుధిష్ఠిరు సైరణ, మనవారలు వెఱపుగా సమర్థింతురు
డీ, కొనఁగాఁ దగరని వాసినఁ, గని యోటమి వెట్టినట్లు కౌరవ
నాథా. ఉద్యో. 2-12; ఉద్యో. 4-355

క. గెలుపును నోటమియును ననిఁ గలుగవె యెడపెట్టి యెట్టి ఘను
లకు. ద్రోణ. 4-289

2. భయము, వెఱపు.

ఆ. ఒరుల వలనఁ బుట్టు నోటమియును నెగ్గుఁ, బొరయకుండ నరసి
పుత్త్రివరుల, దగిలి కాచునట్టి తల్లి సర్పములకు, నేల యలిగి
శాపమిచ్చెనయ్య. ఆది 1-159

ఓటము దే. వి.

భయము, వెఱపు.

గీ. అశ్వమేధమునకు నర్చితంబైన యీ,యశ్వరాజు నిట్టు లపహరించి,
ముచ్చుగొంటక యీ సముద్రదేశంబున, నోటమెడఁద లేక
యున్నవాఁడు. అర. 8-68

ఓటలు దే. అ. క్రి. ఓటాలు

1. ఓడిపోవు, పరాజయ మొందు.

ఉ. ఇంతకుమున్న నీబలకుఁ డెంతయు నోటలిపాటె నీవునా, పొంతకు
వచ్చి తింక నెటవో నగునంచు. ద్రోణ. 2-99

2 ఒక సంగతి, ఒక విషయము.

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱు, గలవు వత్సరములు గాన నెందు, బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధుని, జచ్చిపోయి మగిడి వచ్చువాని.

క ఒకటి గలదు వత్తురు వేఁ ఱొక గర్భంబునకు మృతులు.
శాంతి. 3-375, 376

ఆ. ఒకటి దెసను దృష్ణ యొలయదు గావున. శాంతి. 1-127

చ. కడు పనిబిడ్డ వీఁడొకటి గాదవునా నెఱుంగఁడు. విరా. 2-218

క, తన మదిఁగదిరిన తమకంబున జిడిముడి పడుచు ద్రుపద పుత్రిక పై నూ, నిన వేడ్క దిగువ నొకటియుఁ, గమఁగొన వినలేక మదన కంపితుఁ డగుచున్. విరా. 2-243

(ఒకటి = ఒక వస్తువు, ఒక విషయము).

3. అన్యము, భిన్నము, వేఱైనది.

క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జాఱవిడిచి నట్ల తనదు సుజ్ఞానము న, క్కాఱలు విడిచి తన కంటెను, మీఱ నొకటి లేమి, గాన్పు మెయి కొన వలయున్. అను. 4-207

వ. మిత్రుని కోరిన యది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే. సౌప్తి. 2-48

4. ఒక పని.

చ. ...యొంటి దిరుగు దానికోర్వ దొకటిం దనుదా సవరించు చొప్పెఱుంగదు తగనొండొరులం గొలువఁగా వెరవెమ్మెయిఁ గల్గు నక్కటా. విరా. 1-108

5 బుద్ధి

తే ఒకటఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటిఁగడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ఉద్యో. 2-37

ఒకటిన్ = బుద్ధిని; కొని = గ్రహించి, పూని; రెంటిన్ = పుణ్యము పాపము అనువాని రెండిఁటిని, నిశ్చలయుక్తిన్ చేరి = అచంచలముగా

వ. తదుత్సాహంబున కోటువడి యాసైన్యంబు జనంబులు హాహా కారంబు లెసంగ దీనదశం బొందె. కర్ణ. 3-15

ఉ. ...వారలు పోర వారి దోఃర్గీలలు సూచి రోటువడి రెండు బలంబుల యోధవీరులున్. శల్య. 1-322

3. మోహపడు, వలపుగొను.

వ అదియు నమ్మహీపతి రూపయౌవన సౌందర్య విలాసంబులు కోటు వడి మహానురాగంబున వానిన చూచుచున్నంత. ఆది. 4-145

వ. సహజ కుడల కవచాభిరామం బయిన తదీయమూర్తి విభవంబున కోటువడి దేవా భవత్సమాన రూప సుందరుండగు నందనుం గరుణింపవేయని మనంబునఁ గోరుచు మంత్రోచ్చారణంబు సేయుచున్న. అర. 7-32౯; అర. 3-311

4. భంగపడు, వైఫల్యమునొందు.

క. త్వరితము సేయక కార్యము, చిరంతన విమర్శనముగఁ జేసి యొనర్పన్, ధరణీశ్వర యోటువడఁడు, పురుషుఁడు సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్. శాంతి. 5-262

స. క్రి.

(ద్యూతాదులందు) కోలుపోవు, పోగొట్టుకొను.

సీ. (శకుని) అనియను జూదంబునందుఁ బ్రాణ మోటు పడియె. స్త్రీ. 2-136

ఓడ వై. వి. (సం. హోడః ప్రా. వేడో, బేడో)

నావ, పడవ.

క నడవడియను మున్నీటిఁ గడవఁ బెట్టంగ నోడకరణి దగి జ్ఞానోడఁ గూడు ననిన సత్యము, గడచిన గుణ మింత నొందు గలదే యరయన్. ఉద్యో. 2-39

క. వినుమయ్యేటులలో వాహనములె యోడలుగఁ జూడ నక్కాజమగు నుత్క్కన నుద్దామ విహారం బొనరించిరి వీరయోధు లుర్వీనాథా. శల్య. 1-181; శాంతి. 1-585

**ఓడరేవు** వి. (√ఓడ)

సముద్రమునందుఁగాని నదియందుఁగాని ఓడలు నిలుచు రేవు.

చ. ...పరాశరుఁడమ్మునీంద్రుఁ డయ్యతివఁ దలోదరిం గనియె నయ్యమునానది యోడ రేవునన్. ఆది. 3-36

**ఓడనల్పు**

పడవ నడపు.

ఉ. ఎందులదాన వేశతమ యియ్యమునానది నోడనల్పుచున్, సుందరి నీకు నునికి యిది నూడఁగఁ దా నుచితంబె. ఆది. 4-172

**ఓడి** దే. వి.

రయము-వేగము.

సీ. బెడిదంపు వట్టోడిఁ బడిన పేరడవి చందంబున బహుళ పదాతి చయము.

(వట్టొడ్డి, దావాగ్ని మొదలగునవి పాఠాంతరములు)

**ఓడిపోవు** దే. అ. క్రి.

పరాజయమొందు.

ఆ. ఓడిపోయి డప్పినూని గట్టును జెట్టుఁ జేరి యొదిగియున్న వారిఁ గాఁగఁ, మనలఁ దలఁతు రరులు. సౌప్తి. 1-52; విరా. 5-205

**ఓడు** దే. అ. క్రి.

1. (యుద్ధాదులందు) అపజయమునొందు, పరాజితుఁడగు.

క. ...నిలువక వెఱ్ఱనుటికెం దన రథముమీఁది కోడితి పోపో,పిటికి యని పలికి నుఱుముగ,నటికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్.

ద్రోణ. 1-174; ద్రోణ. 1-301

క. పాండుకాగ్రజుఁ డయ్యర్జునుఁ జూచి వీని విడఁవుము, యని నోడిన వాని హీను నయశోవిర్యున్. ఆది. 7-46

2. శంకించు, అనుమానించు, వెనుదీయు.

సీ. సుర నీమై చక్కఁ జూచుట కోడెదఁ, గనఁబాటు వోరయనో య తలంచి. విరా. 2-48

3. భయపడు, వెఱచు.

వ. నీ వోడకు మీ కూడిన కురుబలంబులం గెలిచి కర్ణ గాంగేయ కృప ద్రోణ ద్రౌణి దుర్యోధనులు గనుంగొనుచుండఁ గదుపులం ద్రమ్మఱించెద. విరా. 4-149

క. తనుఁ జూపి యోద కోడకు, వినతాసుత యనియె. అను. 1-375

ఉ. అ న్నవవారివాహ నివహమ్ములఁ జూచి భయప్రపన్నఁడై యున్న హుతాశనున్ విజయుఁ డోడకుమంచును మారుతాస్త్రము, త్యున్నతచిత్తుఁ డేసె. ఆది 8-276

క. తన వెనుక కోడిపాఱిన, ఘనయోధులఁ జూచి బాహుగర్వ స్ఫూర్తిం, దనరుచు నోడకుఁ డోడకుఁ, డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతుని. ద్రోణ. 1-388

శ్లో. తమాధి రథిరాక్రందం విజ్ఞాయ శరదైపిణామ్,
మా భైష్టేతి ప్రతిశ్రుత్య యయౌ వళిముఖోర్జునమ్.
సం.భా. ద్రోణ. 32-51

సీ ...వాసవి తోడి కయ్యంబున కిట్లఁ డోడె నవరె. శాంతి. 1-9

శ్లో. భీతో రణే శ్వేతవాహా దిమాం మంస్యతే జనః
సం.భా శాంతి. 1-30

4. పాఱు, పరుగెత్తు.

తే. ధూళిపెల్లుగ నెగయంగనేల గోడివడఁగఁ జమమూఁకఁ గని వడవడ వడంకి, పాఱుదేరంగ నమ్మహాభాగుఁ డప్పుఁ, డోడ కోడకుమని నన్నుఁ గూడవచ్చి. విరా. 5-286

5, లొంగు, వశుఁడగు.

ఉ. పాడియు సత్యముం గలరు పాండుతనూజులు నీను పుత్త్రిల,ప్రా డికి నోడ రత్తెఱఁగు పాపము సేయఁగఁ జూచి తీవు న,క్కీ్డటు సేయకే లుడుగు గెల్వదె ధర్మవు. భీష్మ. 2-260

6. కోపించు, కినియు, కలుషించు.

చ. కనుకనిఁగూడి దుర్జనులు గానక చూడక యేమొ హావ్యవాహ
నునకు నిచ్చుఁగంటిమని యాడిన నందుల కోడి మమ్ముఁ జయ్యన
బతు లుజ్జగించిరి ప్రియంబున నింకిట నీవు మాకు నందనుడవు
మమ్ముఁ బోవ విహితంబు గుమారక నీకవశ్యమున్. అర. 5-241

శ్లో. పరిత్యక్తా భర్తృభిర్దేవ సంమతైః,
అకారణా ద్రుషాత్తైస్తు పుణ్యస్థానాత్ పరిచ్యుతాః
సం. భా. అర. 228-8

7 తుమున్నంత ధాతురూపముల చివరఁజేరి వ్యతిరేకార్థమును సూచించును.

వ. ఎద్దానినెని తాల్చిన నాయుధంబులు దాఁక నోడునట్టి వాడని
వాఁజంబులు గలిగిన యింద్రమాల యను కమలమాలికయును.
ఆది. 3-24

(తాఁకనోడు = తాకని, తాకుటకు చాలని అని యర్థము)

స. క్రి.

(ద్యూతాదుల యందు) కోల్పోవు, పోఁగొట్టుకొను.

క తెలిసెట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్,
వారిజలోచన నీపైఁ, గూరిమిగల మగని వెదకికొను మొరు
ననఁడే. ఉద్యో. 1-350; కర్ణ. 3-128

పిణ.

(వృత్తియందు మాత్రమే ఔపవిభక్తికముగాఁ గన్పట్టుచున్నది.)

ఓటిది బీటలు వాటినది.

తే పడునకు బిడ్డ నిచ్చిన చందమొందు, బూదిలో నేయి వేల్చుటఁ
బోలు నోటికడవ నీళ్లలు పెట్టిన కరణియగు నపాత్ర జనులకుఁ
బెట్టుట కౌరవేంద్ర. కర్ణ. 1-332

ఓదనము సం. వి. అ. పుం. న.

అన్నము, వంటకము.

క. మునిపతి విశ్వామిత్రుఁడు, దనయాఁకలి కెందు మెలఁగి ధైర్య
మెడలి యోదన మాంస మూలఫలంబులు, జనుల నడిగి యెందుఁ
బడయఁజాలక దప్పెన్. శాంతి. 3-288

క. గృత నదులును నోదన పర్వతములు దధికుల్యములు నవారిత రస,
పూరిత బహు విధోపదంశోన్నత పుంజంబులును తత్క్షణంబున
గురిసెన్.

ఆది. 7-96

**ఓదము** వి.

ఏనుఁగులను బట్టుకొనుటకై త్రవ్వెడు గొయ్యి, అవపాతము.

క. వలయురి యోదము గాలము, గలిగిగదా మృగముఁ బక్షి గజము
ఝషము దగులు వట్టుదు రట్టుల తజ్ఞులు పిజ్ఞానంబు కలిమిఁ
జాతురు పురుషున్. శాంతి. 4-181

**ఓపమి** దే. వి. (√ ఓపు)

అసామర్థ్యము.

వ అర్జునుండు...యాదవ కళత్రంబులనెల్లఁ దోడ్కొని వచ్చుచో
గాండీవ దివ్య బాణంబుల శక్తి దఱిఁగిన వనచర భయంబు వలనఁ
దత్కళత్రంబుల రక్షింప నోపమియు.

ఆది. 1-64; అను. 4-884; ఆది. 1-64; అను. 4-884

**ఓపిక** దే. వి. (√ ఓపు)

ఓర్పు, తాలిమి, విసుగులేమి.

సీ. ...విప్రభిక్ష యోపికగల్గి పెట్టుచు వర్తించు. అను. 4-359

**ఓపు** దే. అ. క్రి.

1. చాలు, సమర్థమగు

మ. ...రణలీలా దక్షతన్ మన్మనోరథముం దీర్పఁగ వీర లోపుదురు
దోర్గర్వం బఖర్వంబుగన్. విరా. 154; విరా. 1-79

అ. శుక్లమునకు మనసు సూక్ష్మరూపము మనోబలము నిల్వరింపఁ
బక్వబుద్ధి, యోపుఁ దరుణవృద్ధు లోప రజ్ఞాన దౌర్బల్య మూర్ఖ

వికలభావు లగుట. శాంతి. 4-308

ఉ. ...విప్రుఁ డోపు నోపం దతిశాంతుఁ డయ్యె నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్. ఆది. 1-100

2. ఇష్టపడు, సమ్మతించు.

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁదేరఁగా, నొక్క నికృష్టుఁబంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో, సెక్కఁగఁ జేసి నిన్ను నతిహీన విధాన నియుక్తుఁ జేతగా, నిక్కము యొమ్మఁలించి తిది నెయ్యము తియ్యము కల్మియే సఖీ. విరా. 2-68

సీ. ...నాదగు జరాభారంబు దగిలి తాల్చి, తన జవ్వనంబు నాకొన రంగ నెవ్వఁ డినోపు నాతండ నదీప సకల, ధారుణీ సామ్రాజ్యభార యోగ్యుండగు. ఆది. 3-95; ఆది. 5-218

3. శ్రద్ధ గలుగు.

ఉ. ...యజ్ఞములుం దపంబులుం, జేసిన పుణ్యముం బడయుఁ జేయుము దానము లోపి నిత్యమున్. అను. 2-347

ఉ. మానవుఁ డోపి యాశ్వయుజమాసము రెండవ నష్టమిం దగం బూని దినత్రయంబు పరిపూజిత గోఘృతలంబునన్ వ్రతాధీనతఁ జెంద యన్నమును ధేనువు మూత్రముఁ బాలుఁ బానముం, గా నియతిన్ వసించి బహుకామ్య ఫలంబులఁ బొందు భూవరా. అను. 3-16

4. పొరపాటు లేకుండు, అప్రమత్తతతో నుండు.

తే. అగ్ని యోపి రక్షింతు రహస్యమైన, దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చియున్న, యపుడు వాచవులెల్లను నవులఁబెట్టి, దాని కెయ్యవి పథ్యముల్ వానిఁ గొందు. అను. 4-361

5. పనివడు, అక్కఱపట్టు.

ఏ రాఁజతుఁ బ్రువ్వు దివియ యెత్తినవారిఁ శాపంబు వోం గాషీదున్న, నాఁగేది మొనఁ జచ్చు నానావిధ ప్రాణు-

అన్నరుఁ బొందునే యఘము. అను. 5-58

6. ఇది తుమున్నంతముల కనుప్రయుక్తమై తద్ధర్మాద్యర్థకమగును.

సీ రాజ నామమునకు భాజనంబై మహాద్భుత చరిత్రుండగు పురుషుఁ డొకఁడు, గలిమికి మూలంబు ఘన విశేషము గల్గనోపుఁ గౌరవ కులదీపజనన. (కల్గనోపు = ఉండవచ్చును) శాంతి. 2-197

ఉ. ఆసతి ద్రౌపది గాఁగనోపు. విరా. 3-115

(కాఁగనోపు = కావచ్చును)

స. క్రి. అ. క్రి.

సహించు, ఓర్చు, సైచు.

సీ తెవులుగొంటులనైనఁ దీర్చు సంకటమున, కోపి ముందటి యట్ల రూపుసేయ. విరా. 1-101

తే. ఎన్నఁడును మున్నువారల యేపునోపఁ, గాన మెట్లు సముద్రంబులోన బుట్టి,వైవఁ గొన్నంత గొమఁగాక వారి గెల్వ,మాకు శక్యంబె చవిగాని మాటలేల. భీష్మ. 2-282

వి.

ఓపిక, బలము, శక్తి.

ఉ. ...అన్నవైఁ, దప్పుఘటించి నీవు నొకశాలిమి గల్గిన వాఁడవై నెపం,బొప్పినఁ జెల్లె నీదు నిలుపోపును జాతముగాక యిచ్చుటన్. విరా. 5-93

శ్లో. యోత్స్యసే హి మయా పార్థ మత్ర పశ్యామి తే బలమ్. సం. భా. విరా. 58-56

ఓచు దే. స. క్రి.

1 రక్షించు, కాపాడు, పోషించు.

చ. కొడుకులుఁ దమ్ములుం గలన ఘోరవుఁ జావులు సావఁజూచి యె, ట్లొడఁబడె నీదు బుద్ధి యెడ లోముటకై నిను రాజరాజ యిమ్మ డువున కిడ్చితెచ్చె విధి. శల్య. 2-57

ఆ. ధర్మసాధనంబు దనువు ధర్మము పరిజ్ఞానదాయి యట్లుగాన
తనువు, నోమవలయు మర్త్యుఁ డేమిట నేమఱ, కాత్మహితము గోరి
యనఘచరిత. ఆశ్వ. 1-164

సీ. ...పుత్త్రుల రాజ్యవైభవంబు విడిచి మేమోమక యడవికిఁ
బోయిన, తల్లి! వగచెద ధర్మసుతుఁడు, భీమసేనుండును బీభత్సుఁ
డును దన కడుపునఁ బుట్టిన కొడుకులట్టె. ఆశ్ర. 2—168

2. దాఁచు, వంచించు.

(భీష్ముఁడు దుర్యోధనునితో)

క. అనిన విని నవ్వి యతఁ డిట్లను నింతననేల నన్ను నని నాయొడ
లోమిన చోటుఁ గలదె పెఱయోధనికాయంబైన నకట తలఁకదె
చెపుమా. భీష్మ. 3—7

3. నిలుపుకొను, ఆఁపియుంచు.

చ. ...నీవు పాపఁగా, వొడ లిటు లోమితిం గురుకులోత్తమ యేనొక
సేవకుంతనే. సౌప్తి. 1—224

**ఓయన** దే. అవ్య.

ఒయ్యన, మెల్లగా, తిన్నగా.

క. ఈయగ్ని దేవుఁ డసురకు, నోయనఁ జెప్పుటయు విని మహోగ్రా
కృతితో, నాయసుర నన్ను సూకరమై యవ్వడ యెత్తుకొని
రయంబునఁ జనుచోన్. ఆది. 1-188

"భీతో౽న్వృతాచ్చ శాపాచ్చ భృగో రిత్యబ్రవీచ్ఛనైః"

సం. భా. ఆది. 5-33 (నిర్ణ)

**ఓర** అవ్య.

ప్రమత్తత, వెనుదీయుట.

ఆ. వీడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమిసేయ వార మీవు
దక్క, నొరులు నిలువరింప నోపెడువారు లేరె, లోరలేక తాఁకి
తూర్వవలయు. విరా. 5-181 (పాఠాం)

**ఓరగించు** దే. స. క్రి. (√ఓర)

తిరస్కరించు.

చ. అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించుఁ బై,
కొను తలఁపోరగించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు. విరా. 3-31

**ఓరగిలు** దే. అ. క్రి. (√ఓర)

1. ఒదుఁగు, తొలఁగు, వెనుదీయు.

గీ. కల్గు భూపాలకోటి మొగ్గరములెల్లఁ, గలఁగఁ దిరుగుడు వడ నోర
గిలఁగఁ బెల్లగిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె. భీష్మ. 1-268

2. ఒఱఁగు. వ్రాలు, పడు.

వ. ఆయన్నయుం దమ్ముండును గపిబలంబు లడల ధరణీ తలంబునకు
నోరగిలి విలయకాలపతితులయిన సూర్యేందుల చందంబున
నున్నం గని. అర. 7-125

**ఓరలువాఱు** దే. అ. క్రి.

ప్రక్కలకు ప్రసరించు.

చ. లలిత తనూవిలాసముల లజ్జకతంబునఁజేసి మున్నువి,చ్చలవిడిఁ
బిట్టఁగా వెరవుసాలక యోరలువాఱు చూపులన్, లలిఁదలఁబ్రాలు
వోయునెడలం దగవొందిన నూలుకొల్పి యి,మ్ములఁ బచరింతు.
రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్. విరా. 5-898

(ఓరలువాఱు చూపులు = క్రేగంటి చూపులు, వాలుచూపులు)

చ. ...న,వ్వొదవెడు మోముతో నతని నోరలు వాఱఁగఁ జూచు.
వాతఁడె,య్యది గత మొక్కొ నవ్వెనకు నంచు మదిం దలపోయు.
భూవరా. అను 1-28

(ఓరలు వాఱఁగఁజూచు = ప్రక్క చూపులు చూచు)

**ఓరవాఱు**

కనుకొలఁకుల చివరల నుండి చూచు, కడగంటి చూపు చూచు.

క. ఒకమతి కిరీటి కన్నెదిరికి నుఱుమునఁ బోయిరేని రెండవమాటి, య్యకొనుట కోర్వఁగ లేరై,రోకట్లఁ గురురాజుసేనయోధుల లోనన్. విరా. 5-55

ఆ. ...నీవును నాపద,కోర్చి భంగపాటు దీర్చికొనుము.

సీ. ...తాఁ,కోర్తురు పరులకు నోర్వరాని కోత్తల గలరు.

ఉద్యో. 4-257

2. జయించు, ఓడించు.

సీ. సైంధవ యక్షపాంచాలత్రిగర్తుల, దీనన యోర్చితి మానధనుఁడ.

(దీనన = ఈ గాండీవముచేత) విరా. 1-172

ఉ. రాజులనెల్ల నుగ్రసమరంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యా, భూజన కోటి నాదగు విభుత్వ సమగ్రత నాదరించి. విరా. 2-254

వ. ...అర్జునుండు...సురగణంబులతో సురపతి నోర్చి ఖాండవ దహనంబున నగ్నిదేవుం దనిపె. ఆది. 8-17

ఉ. పాండవ వీరులం గలన బాహుబలంబున నోర్చి యే సముద్దండత నీవు ద్రోల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్వులోనికిం, దెండని పుచ్చి తద్దెసకుఁ దెచ్చుట సొంపులు నీకిఁగాదె యా,తండ మరల్పఁగాక సముదగ్రత వచ్చు విరోధి నివ్వడున్. విరా, 4-164

క. మన బానసీఁడు వలలుం,డను శూద్రుఁడు వాకుఁ దెల్ల మధికబలుల నో,ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు నిజమది యధిపా. విరా. 2-10

3. అనుభవించు.

ఉ. ...పురాకృతకర్మఫలావ్య మే,వ్వాడును నేర్చునే తొలఁగవైవఁగ నోర్వకపోవ చ్చునే. విరా. 1-288

4. సంహరించు, చంపు.

తే. ...ఎక్కటి కాలకేయ వర్గములఁ బరిమార్చె నివాత కవచ,సంఘముల నోర్చె గంధర్వ సమితి గెలిచి, ధార్తరాష్ట్రగ్రజుని దెఱఁ

ఉ. అవలవచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చితా, కివెడ మాటలన్ మరలఁ దెన్నివిధంబులఁ జూపి చెప్పినన్. విరా. 2-73

2. ఓపు, చాలు, సమర్థమగు.

క. సేనాధిపత్యమును దగఁ బూనెద నను మూర్కొనంగఁ బురుషుల మర్త్యుంగాన గిరిదికి నొక్కని, కేనోర్వ నతండు శరము లెక్కు డెలుంగున్. ఉద్యో. 4-149

క. ఇన్నగమునందు గాండివమున్నది యదిగాని మద్భుజోద్రేక విలా, సోన్నతి కోర్వవు పెద్దయు. నన్నున విండ్లు గుఱుచ లలఁతిబలంబుల్. విరా. 4-105

చ. ...అ,య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱుచోటఁ బలవించు వారునై (ఓర్వక = ధైర్యసాహసము లేక-అవి భావము)
ఉద్యో. 3-5

3. నిలువరించు, నిబ్బరించు

తే. దొరలు దలపడ్డ నాహవదోహలమున, నుభయబలములుఁ దమకించి యోర్వలేక, కలయబెరసి ఘూరేణువు కతన రాత్రి, గాక మున్న యొండొరువులఁ గానరైరి. విరా. 3-190

4. సమ్మతించు, అంగీకరించు

చ. ...అ,చ్చలమున నీ సుయోధనుని చావున కోర్చుట కాదె యింత యున్. ఉద్యో. 2-287

ఓర్తు దే. సర్వా. ప.

1. ఒక స్త్రీ.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యాచేరువ నోర్తు తదువు, గట్టక నీళ్ళాడఁగాఁ జూడ. శల్య. 2-160

తే. .. అద్దేవపతియు, మునిపతియుఁ జూచుచుండ గ్రక్కున విమాన, మవతరించి యాసన్నయై యతివ యోర్తు. శాంతి 5-6.

3. అన్యస్త్రీ.

ఆ ..విధవ దొంటి, జన్మమునయందు భర్తృవంచన మొనర్చి ధనము గూర్చిన యదియు మదంబు పేర్మి, నోర్తు మగని హరించిన యుగ్మలి యును. అను. 5-105

ఓర్పు దే. వి. (√ఓర్చు)

క్షమ, సహనము, నిబ్బరము.

సీ. ..రేయుఁబగులు నిద్రయు నోర్పు నెఱుఁగక దయమంతి నలుఁడను ధరణినాథు-అ-వంద బుద్ధి నిలిపి కందర్పబాధిత యగుచున్న యది, అర. 2-28; అను. 5-215

ఓర్వమి దే. వి. (√ఓర్చు)

సహింపమి, సైఁపమి,

తే. అని సహోదరు లాఱి నాయానపడుట, కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును. ఉద్యో. 3-58

ఓల దే. వి.

జలక్రీడా సమయమున 'పట్టుకో చూతము' అని యితరుని, ప్రేరేచుటకై యుపయోగించు శబ్దము.

ఉ. రక్తనదులలోన రథయాన పాత్రముల్, వఱపి యోధవరులు బాహుబలము, వెలయ సమరకేళి సలిపిరి శూరత, నేది కడఁగి యోల రాచిరాచి. భీష్మ. 2-395

ఓలగము దే. వి.

కొలువుకూటము, ఆస్థానమండపము.

(ప్రత్యేక ప్రయోగముగానరాదు. పేరోలగము, ఒడ్డోలగము అను ప్రయోగములు మాత్రము గలవు)

చూ. పేరోలగము, ఒడ్డోలగము.

ఓలమానగొను (ఓలము$^2$+అన+కొను)

దేహము నపేక్షించు, యుద్ధమునకు వెనదీయు.

వ. మాహిష్మతీ పతియగు నీలుం డతిరథుం డతనికి సహదేవునకుఁ దెగని పగయైయుండు దానం జేసి యాలంబున నోల మాస గొనండు. ఉద్యో. 4-223

వ. ఆ సూతనందన ధృష్టద్యుమ్నులట్లు దార్కొనిన నయ్యిరువాగు నందు నొక్కరుండైన నోలమాసగొనక కడంగినం బోరు ఘోరం బయ్యె. కర్ణ. 2-272

2. సందేహించు, వెనుదీయు.

క. అతిథి నినుఁ గోరెనేనిని, మతిఁ గింకిరిపడక యోల మాసగొనక నీ వతనికిఁ బ్రియంబు సల్పుము, సతికిం బతివనువు సేయఁజను నెల్లది యున్. అను. 1-68

**ఓలము**[1] దే. వి.

1. రహస్య స్థానము, మఱుఁగు చోటు.

క. జనములు సూచుచునుండఁగఁ, జనదు మలము మూత్రమును విసర్జింపఁగ నప్పనులకు శౌచాచరణంబున నవశ్యంబు నోలములుగా వలయున్. అను. 3-282; విరా. 2-321

2. చాటు, మాటు, మఱుఁగుపాటు.

తే. భావజున్మని వూనికి పారమెయ్యునన్ను బంటుగా నేలుము నలిన వదన, యింక నీ సిగ్గు దెర యోలమేల నీకు. విరా. 2-118

వ. (భీముఁడు) అర్జునాస్త్ర పతితంబులైన చతురంగంబుల తిట్టల యోలంబు సొచ్చిన. ద్రోణ. 4-236

3. ఆపద, కీడు, నాశము.

క. ఏలినవాని ధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికిన దినములన్, వ్రేలాచరిచి తింద్రాతని, యోలముగని పిదప భీతి నొదుఁగుదు రాజన్. విరా. 4-217

4. మూలము, జన్మస్థానము.

క. శోక శ్రమ తృష్ణలకున్, నీ కలిమియ యోలమగుట నీ కగపడు

వాఁ, డే కర్తవ్యము గానం, డోకామమ నిన్నుఁ దొఱఁగియుండెద సుఖనై. శాంతి. 4-49

శ్లో. తృష్ణాశోకశ్రమాణాం హి త్వం కామప్రభవస్సదా.
సం.భా. శాంతి. 177-88

["మూలము"-అని పాఠాంతరము. ఆనంద (1915) ప్రతిలో 'మూలము' అనియే పాఠము గలదు]

**ఓలము**[2] దే. వి.

దేహము -చూ ఓలమూస గొను.

**ఓలరాచు** దే. అ. క్రి.

జలక్రీడయందు పందెము వేయు, ఓలశబ్దము ప్రయోగించు.

చూ. ఓల. భీష్మ. 2-395

**ఓలలాడు** దే. అ. క్రి. (ఓలలు + ఆడు)

జలక్రీడచేయు, ఈఁదు, మునిఁగితేలు, స్నానముచేయు.

గీ. ...సంభృతోత్సాహ లీల,నుబ్బి భూత బేతాళంబు లోలలాడ, నిట్ట లంబగు నెత్తురు టేఱు వఱచె. ద్రోణ. 1-146; కర్ణ. 2-227

**ఓలలార్చు** దే. స. క్రి. (√ ఓలలాడు)

ఓలలాడించు, ముంచితేల్చు, (నీరు మొదలగు వానియందు) విహరింపఁ జేయు, స్నానమాడఁ జేయు.

ఉ. ...అజ్ఞానఁ బట్టి తెచ్చి హృదయం బలరంగ ననంగ తంత్ర విద్యా నిపుణత్వ మేర్పడఁజెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్.
విరా 2-298

వ. రక్తనదీ ప్రవాహంబు భవదీయ సేనా మధ్యంబునం బఱపి బేతాళ క్రవ్యాదాది భూతంబుల నోలలార్చె. భీష్మ. 2-166

...ర్దర విహారస్థానంబుల ననవరత సురతకేళీ సౌఖ్యాంబుధి నోల ర్చు మనిన. అర. 1-368

**ఓలాకు** దే. వి.

క్షోభము, వ్యాకులత.

చూ. ఓలాకుపడు.

**ఓలాకుపడు** దే. అ. క్రి.

క్షోభపడు, వ్యాకులపడు.

వ. సుశర్మయు...గోగణంబుల యగపాటూహించి జవనంబుతో నడచు చుండియు వెసఁ గుందక వేగిరంపుఁ బయనంబులయ్యును బ్రజల నోలాకు పడనీక...వేగులవారి వలన విరాటు తొట్టియున్న యెడ యెఱింగి కదుపులం గార్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన.
విరా. 3-131

**ఓలి** వి. (సం. ఆళిః -ప్రా- ఓలీ)

1 వరుస. క్రమము, సొరిది

సీ ఏమేమయని యోలి నెత్తిన పరదేశిదొరల పావడములు తోరణ ముగ.
విరా 3-74

సీ. బ్రాహ్మణాదికముగఁ బరఁగు నన్నాలుగు జాతుల యుజ్జ్వల చ్ఛాయ లోలి, నొంపారు దెలుపును గెంపును బసుపుఛాయయుఁ గప్పునయ్యు నంద్రార్య వర్యులు.
శాంతి. 4-97

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహవ్యాళ శార్దూల ఖడ్గ మదేభాదులఁబట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూజ ములం దోలిన కట్టుచుం బలిమియై శాకుంతలుం డొప్పె.
ఆది. 4-83

ఉ. అమ్మెయి, పాపముల్ వోలియునంతకు దుఃఖములంది కీట జన్మ ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁబొంది మృగత్వ మానుషత్వ మ్ముల నోలిఁ బొందుదురు వారిను మెంతయుఁ గ్రాఁగి కల్మషత్వ మ.శ్రదొఱంగు మాడ్కి.
అను. 5-172

2 వాక్యాలంకారముగా నుపయోగింపఁబడి కొన్నిపట్ల బాగు, పెల్లు, అధికము మున్నగు నర్థముల నిచ్చును.

మ. ధరణీచక్రము దిర్దిరందిరిగె మార్తాండుండు గుంఠీభవత్కిరణుం
డయ్యె దిశావితానము వడంకెన్ మిన్ను దిర్చెన్ మహీధర సంతా
నము లోలి గ్రక్కదలె. ద్రోణ. 5-377

సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి, కృష్ణుపై నమ్ములు
గీలుకొలుప, నలిగి యన్నరుఁడు వాలంప శాలువ లోలి నడరించు
టయు. భీష్మ. 3-534

క. ధరణియుఁ గాశ్యప వైశ్వానర మార్కండేయు లోలిన జగద్ధిత
వాక్పరులైరి. అను. 2-88

చ. అవని యరాజకంబయిన యప్పుడ భూప్రజలందు సర్వధర్మములుఁ
దొలంగు దేవమునిముఖ్యులు వాయుదు రోలి వృష్టిలేదవు మఱి
యర్షువుల్ దఱుఁగు నందురు. ఆది. 4-249

**ఓషధి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

1. మందున కుపయోగపడు వనమూలిక.

వ. ...మంగళ తరుత్వక్ప్రచయంబున మహౌషధి నిచయంబున
విహిత మంత్రంబుల నుచిత తంత్రంబుల ఋత్విక్పురోహిత సహి
తుండై తత్సంస్కార ప్రకారం బాచరించి. ఉద్యో. 4-157

2. ఫలించుట తోడనే నశించు మొక్కలు వరి మొ.

సీ. ...గోరూపయైన యవ్వసుమతి నమర గణముఁ, బరిచి యోష
ధులను బహురత్నములుఁ బిదికించి జనంబుఁ బోషించెఁ బృథుఁడు
ద్రోణ. 2-211

ఆ. ...గృహాయుక్తుఁ డోషధులకు నొడయుఁ డగుట. శాంతి. 5-312

3 వ తులశాదులు.

. ఓషధు లమృత మయ్యుత్తమ వస్తు సంతతిలోనఁ బుష్పవంతములు
మేలు. అను. 4 5

**ఓషధినాథుఁడు** సం. వి. అ. పుం.

వ. అమ్మహోత్సవంబు గోపించి యట్టి దేవులు గొనుమని శాపంబిచ్చిన నయ్యోషధి నాథుండు నానాటికిఁ గృశుండయ్యె. శల్య. 1-148.

**ఓషధీశుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుఁడు.

క. జనులకు నింద్రుఁడు గ్రహముల, కినుఁడును బితరులకు నోషధీశుఁడుఁ బోలెన్, మనుజోత్తమ కడు నెక్కుడుఁ వినుము నదుల కెల్ల జాహ్నవి మహత్త్వమునన్. అను. 2-115

**ఓష్ఠము** సం. వి. అ. పుం.

పెదవి.

మ. ...చలద్వక్త్రోష్ఠద్వయుండు. విరా. 3-24.

**ఓసరించు** దే. అ. క్రి.

1. ప్రక్కకుఁ దొలఁగు, తొలఁగు పోవు.

వ. భయంకరంబగు నతి సంకులంబున సామజ వాజి రథంబుల యురవడికి నోసరింపని కాలుబలంబులు. భీష్మ. 1-367

వ. తడసిన కర్ణుం డప్పు డితనికి నోసరించి పోవలయు. ద్రోణ. 4-12

వ. శినివరుండు భూవరు విల్లు ద్రుంచి మేను గొంచిన నొప్పించి యోసరించి డప్పి దీర్చికొని మగుడ నమ్మాధవానుజుం దలపడి. ద్రోణ. 5-300

2. పాఱిపోవు.

వ. ఆగ్నేయుండు దురంగంబులం జడిపిన నరదంబు డిగ్గమతికి యోసరించి నగ్గాంధారవిభుం గని యులూకుండు. కర్ణ. 2-268

**ఓసరిలు** దే. అ. క్రి.

1. ఒదుగు, దాగు, నక్కు.

వ. ఇట్లు సొచ్చి తఱియంజని మధ్యప్రదేశంబున విరాటనందన లీలాపర్యంకంబు బరసి దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి

శానా తల్పంబున నుండె. విరా. 2—328

2. తొలఁగు, ప్రక్కకు తొలఁగు.

క. ఇంతయుఁ గనుంగొనియును శత్రుంతపుఁ డోసరిల కాజి దోహల మలరం, గొంతేయులతోడఁ దలపడి, వింతలయిన కూర్మనఖర విశిఖము లేసెన్. విరా. 5-75

క. ఒసరిలిపరచు మృగముల, నేసియు డాసిన మృగముల నెగిచి భుజాసిన్, ప్రవేసియుఁ జంపెను మృగయా, వ్యాసక్తి నపారఘోరవన్య మృగాలిన్. ఆది. 4-18

వ. (అశ్వత్థామ) కుంతిభోజతనూజు లొక్కపెట్ట పదుమువ్వు రతనిం బొదివినఁ బదుమూఁడు వేఁడితూపులం గీటడంచి కెరలి జము చందంబున గర్జిల్లి ఘటోత్కచుం గాల దండంబులోని కోలం దేరిపై ద్రెళ్ళ మూర్ఛిల్ల నేసిన నోసరిల నయ్యరదంబుఁ దోడన ధృష్టద్యుమ్నుండు గొనిపోవుటయు ద్రోణ. 5-84

శ్లో. తం హతం పతితం జ్ఞాత్వా ధృష్టద్యుమ్నో మహారథః,
ద్రోణేస్సకాశాత్ రాజేంద్ర అపనిన్యే రథాంతరమ్.
సం. భా. ద్రోణ. 156-189

ఓహాటించు దే. అ. క్రి.

1. వెనుదీయు.

చ. నెపమిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చునే.
ఉద్యో. 4—249

తే. ఆహవంబున నీవోహటించి, పోవసడివచ్చునదికంటెఁ జావు మేలు శత్రుజీవికఁ బరలోక సౌఖ్య మనుభవింపు మమరత్వ సంపద వెలయు మంచి. స్త్రీ. 2-88

తృతి ...యుద్ధ తంత్రములకు నోహటింప కుండెడు మదిఁ జేర్చి అను. 4-124

2. జంకు, బెదరు, వెఱచు, భయపడు.

ఆ. అనుచు సంచలించు నదియానఁ గ్రమ్మఱ, బాసఁ దలఁచి ధృతికిఁ బట్టువెట్టు. మరుని కోహటించి యురియాడుఁ దుదిముట్టఁ, గాన నిశ్చయించుఁ గలఁగు దేఱు. విరా. 2-299

ఉ. (కర్ణుఁడు ద్రోణునితో)...కౌరవసేన కెల్ల నొక్కండవ మేటి వీ బలము గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుదోశ్చండిమ కోహటించితి నిజంబునకున్ నరు డింత యెక్కుడే. విరా. 4-93

ఆ. మర్మభేదులైన మార్గణంబుల కోహటించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి, యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున, కోర్చి యక్కుమారుఁ డోడి పాఱె. కర్ణ. 1-188

వ. చిత్తంబులు గలంగ రాత్రి యుద్ధంబునకు నోహటించుటం జేసి మన దొరలఁ బాండవ సైనికులు దఱిమినం దాల్మి వాటింపక తిరిగి పోయిరి. కర్ణ. 1-206

శ్లో. తే త్రస్యంతో మహేష్వాసా రాత్రి యుద్ధస్య భారత
అపయానం తతశ్చక్రుస్సహితా సర్వయోధిభిః॥

సం.భా. కర్ణ. 81-39

3. భంగపడు.

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు వగచు పార్థాదులు దన్నుంగొలిచి చనఁగ విడి దలకుం గడు విన్ననయిపోయెఁ గురువంశనిధీ. వ. ఇట్లు పాండవ వ్యూహంబు లోహటించిపోయిన.

భీష్మ. 3-272; 274

4. అలయు, స్రుక్కు.

వ నిజ జనకునకు నర్జునుం జూపి యుత్తరుం డిట్లనియె

చ. తము నెఱిఁగించి యల్ల నుచితప్రియభాషలమున్న నూత కృత్యమునకుఁ జొన్ప నేను బ్రమదంబున నప్పటి కియ్యకొంటి లోకము సమరంబు నట్లయని కయ్యము తీవ్రతకుం దగంగ రథ్యములఁ

జరింపఁజేఁత ఖరమై తుదిఁ బల్కులు నోహాటంతిచిన్.

విరా. 6—334, 337

ఓహరిసాహరి దే. అవ్య. ద్రు.

అహమహమికతో, సాహంకారముగా.

వ. ...ఉభయ బలంబులుం బురికొని యోహారిసాహారిం బెనంగు చుండె. ద్రోణ. 3—140

సీ. ఓహారిసాహారి నుయ్యాల చేరుగా, వెనుకొంచుఁ దెరలుచు బెనఁగు నెడలు. విరా. 3-164

క. పురికొనుచుం దెరలుచు నో,హారిసాహరి నొక్కచోట నలవడు నొకచో, విరియు నొక చోటఁ దిరుగుం, దిరుగక యొకచోట రెండు తెలఁగులు నొచ్చున్. భీష్మ. 2-173

(గుంపులు గుంపులుగా-అని భావము)

ఓహో దే. అవ్య. (అహో శబ్దభవమని కొందఱు)

1. సంబోధమునందు వచ్చును.

వ. అద్దేవి దీవింపనొల్లక యుల్లంబు నిజతనూజుల మరణంబునకుం దాపంబునొంద శాపంబిచ్చు నదియై యజాతశత్రు నుద్దేశించిన నత్తెఱఁగు...సత్యవతీసూనుం డెఱింగి తత్క్షణంబ సన్నిహితుం డయ్యు నక్కోడలిం జేరి యోహో శపింపకు శమింపుమని పలికి మఱియు నిట్లనియె. స్త్రీ. 1-150

క. ...ఓ,హో తనుక క్రమ్మఱుమని, యాతతభయుఁ గ్రమ్మఱించె నాస్తికుఁ డెడన్. ఆది. 2-284

2. ఆశ్చర్యము, సంతాపము, ఆక్షేపము మొదలగు వానిని దెల్పును. (ఆశ్చర్యమునకు)

క. అతిభీషణ మిది యత్య,ద్భుత మోహో చాలు ఘనభోమధ్య వ్యా,పితమయ్యె భవద్దేహో,యతత్వ ముపసంహరింపు మనవుడుఁ గపియున్. అర. 3-344; అర. 1-364

(సంతాపమునకు)

వ. అతి ఘోరంబగు నవ్విచారంబునకు సమాత్య సహితంబుగా సంతప్త చిత్తుండై వైచిత్ర వీర్యుండు గొదుకున కిట్లనియె.

క. ఓహో యిట్లనుట జగద్ద్రోహం బిమ్మాట మఱవు

ఉద్యో. 3-169, 170

వ. కౌంతేయాగ్రజుఁ డోహో యెంత బెట్టిదంబులైన యిడుమల బడియెదరో వీరలని కారుణ్యం బొలయ నిలిచి.

స్వర్గ. 23; ద్రోణ. 2–184

(ఆక్షేపమునకు)

క. ఓహో యిట్టివిగలవే, బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి పదిన్, మాహాత్మ్యం బెడలఁగ భిక్షాహారత నొందఁ దలఁపనగునె నరేంద్రా. శాంతి. 1-48

# ఔ

ఔ ఉభ - ఓకారోక యక్షరము

(కొన్నిపట్ల తత్సమేతర పదముల యందలి 'ఔ'కు అవు 'అవు'నకు ఔ వచ్చును.

ఔనా. శాంతి. 2-394; అవు. భీష్మ. 3-428

ఔడు. ఆది. 6-291; అవుడు. భీష్మ. 1-267

ఔ దే. అ. క్రి.

అగు.

సీ. ధర్మకామంబులు దఱుగంగ నర్థార్థియగువాఁడు పతితుఁడౌను.
అర. 1-245

ఔఁగాక అవునుగాక

సరియే (అంగీకారమును దెలుపును)

క. అనవుడు నందఱు నౌఁగాకని సంతసమంద నధిపుఁ డభిషేకించెన్, జనులెల్ల సంప్రమోదం,బునఁ బొందఁగ నప్పు డతివిభూతిం బ్రభు లన్.
ఉద్యో. 4-141

క. అనిన ధృతరాష్ట్రు పలుకులు, గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్మం,డును నౌఁగాకని దుర్యోధనుఁడుం బరిచారక ప్రతతిఁ బిలిపించెన్.
ఉద్యో. 3-150

ఔఁగాదను (ఔన్ + కాదు + అను)

తగును తగదు అని నిశ్చయించి చెప్పు.

క. అనుమాటలు విని సంక్రం,దన నందనుఁ డిట్టులనియె దైవంబుకతం,బున నాకు నొక్క చందం,బనువై యున్న యది దీని నౌఁగా దనుఁడా.
విరా. 1-86

ఉ. ...అత్యాదరవృత్తి మీరు విజయాళ నసుం గొనియాడఁజేసి యౌఁ,గాదన కియ్యకొంటిఁ దగఁ గౌరవనాథుని కోర్కి దీర్పఁ గాన్.
ద్రోణ. 1-73

ఔచిత్యము సం. వి. అ. న.

1- ఉచితత్వము, యుక్తత్వము.

క. సత్య సరస్వతి వగు మౌ,చిత్య విశారద నీదు చిత్తము.
ఉద్యో. 1-95

వ. అయ్యిరువాఁగుం గదిసినప్పు డన్నియమంబు నడవక కయ్యంపు నౌచిత్యంబున నొండు దెఱంగు సెల్లె.
కర్ణ. 2-151

2. తగవు, హితము.

తే. మద్రవిభు వారి నమ్మెయి మార్తు రాఁగి, కొనఁగ మనకు నుపే
క్షింపఁ జనునె యనుడు, నతఁడు నా మాట వినక వారరిగి రేమి,
సేయు వారము చెప్పు మౌచిత్య మనియె.

వ. అని నన్ను నా పరివారంబును రక్షింపను దగ వెఱఁగింపను సర్వాం
డ వీవకావే యను మాటలాడిన. శల్య. 1-297, 298

**ఔటు** దే. వి.

1. చేటు పొందుట, హాని చెందుట.

క. ధన మపహరించుటయ తన్నానిశమ్ముఁ బనిగాఁగ బ్రదుకు నతిలుబ్ధున
కున్, విను శత్రుచేత నౌటకు,మును ధన ప్రజ చేన చేటు మూఁడు
నరేంద్రా. శాంతి. 2-188

2. అగుట.

చ. ...అచ్చటన్, జను లెడ యౌట గాంచు నెఱి సాలక.
విరా. 2-247; శాంతి. 6-446

**ఔడు** వి. (సం. ఓష్ఠః)

పెదవి, అధరము.

ఆ. అలిగి యౌడుగఱచి యాఁకటి పెలుచన, నిలువలేక.
ఆది. 6-291, ఆది 7-175

శ్లో. త్రిశాఖాం భ్రుకుటిం కృత్వా, సందశ్య దశనచ్ఛదన్.
సం.భా. ఆది. 169-8

**ఔడుగఱచు** క్రి.

(క్రింద) పెదవి గొఱకు,

చూ. ఔడు,

**ఔతథ్యుఁడు** సం. వి. అ. పుం.

దీర్ఘతముఁడు. ఉతథ్యుని కొడుకు, మమతకొడుకు మామతేయుఁడు నని

యు నందురు. ఈయన భార్య ప్రద్వేషిణి-చరిత్రకై చూ.
ఆది. 4-226; మొ 236 వఱకు.

**ఔత్సుక్యము** సం. వి. అ. న.

ఉత్సుకత్వము, ఉత్కంఠ. ప్రియస్మరణాదుల వలనఁ గాల విలంబనమున కోర్వలేమి.

క. అని యడిగిన వైశంపా,యనుఁ డమ్మనుజేంద్రచంద్రు నధికౌత్సు
క్యం,బున కలిమికిఁ దన హృ,దయం,బున గాఢాదరము భరితముగ
నిట్లనియెన్. విరా. 1-45

**ఔదల** దే. వి. (ఔ+తల)

ఆవుదల, తలముందఱి భాగము.

సీ. ...మోడ్పుఁగే లౌదల, గదియించి మిమ్ము వేఁడెద. ఆశ్ర. 1-97

**ఔదాత్త్యము** సం. వి. అ. న.

ఉదాత్తమైనది, ఉదాత్తత.

క. సత్య సరస్వతి వగు మౌ,చిత్య విశారదము నీదు చిత్తము నియ
మౌ,దాత్త్యంబు మెఱయ నాకు న,మాత్యుఁడవై పూని నడవు
మత్సైన్యంబుల్ ఉద్యో. 1-96; శాంతి. 3-448; అను. 4-352

**ఔదార్యము** సం. వి. అ. న.

ఉదారత్వము.

సీ. ...అనివార్య శౌర్యంబు దోర్బలౌదార్యంబు మెఱయ.
ద్రోణ 1-76

**ఔదుంబరము** సం. విశే. (అ. ఈ. అ.)

మేడి చెక్కతోఁ జేయఁబడిన.

వ. సమున్నతౌదుంబర పీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి
నందు నిలిపి. కర్ణ. 1-56

**ఔద్దాలకి** సం. వి. ఇ. పుం.

ఒకముని, శ్వేతకేతువు, అష్టావక్రుని మేనమామ, నాచికేతుని తండ్రి.

వ. ఇది యౌద్దాలకియైన శ్వేతకేతు తపోవనం బిందు సరస్వతి మనుష్య స్త్రీ రూపధారిణియై శ్వేతకేతుని సేవించె. అర. 3-237

విషయమునకై చూ. అను. 2-446; మొ. 462 వరకు

ఔధేయుఁడు సం. వి. అ. పుం.

ధర్మరాజునకు దేవికయను దానియందుఁ బుట్టినవాఁడు.

వ. ధర్మజునకు స్వయంవర లబ్ధయైన దేవికయను దానికి యౌధే యుండు పుట్టె. ఆది. 4-115

ఔద్ధత్యము సం. వి. అ. న.

ఉద్ధతి.

క. సత్యపరాక్రముఁడగు నీ, సాత్యకి బాహాబలంబు సమర విహా రౌద్ధత్యముఁ జూచెదుగాదే, యత్యాశ్చర్యంబు లితని యస్త్ర విధంబుల్. భీష్మ. 2-12

ఔనది దే. వి.

భవిష్యత్కాలము, రాఁబోవు కాలము.

వ. ఇంక నౌదానికి నిట్టి కొలఁగాములు సేయక బుద్ధిమంతుండవై యుండు మనిన, నతండు లజ్జావనత వదనుం డగుచు నచ్చోటు వాసి గంగాద్వారమున కరిగి యుండు. అర. 6-258

(ఔదానికిన్ = ముందుజరుగఁ బోవు కాలమునందైనను)

ఔపనిషదము సం. విశ. (అ. ఈ. అ.)

ఉపనిషత్సంబంధమైనది.

ఆ. శ్రుతులు నౌపనిషదసూక్తులు గోప్యరూపంబు లని సరోజభవుఁడు సెప్పె. అను. 3-95

ఔపరిమికము సం. వి. అ. న.

ఔపరిమికము, నిరుపకరణము, సోమకరణము - అను సుకృతములలో నొకటి—పాపవర్జనము (పాపములు చేయకుండుట)

2. ఆశ్చర్యమును దెలుపును.

క. అతఁ డౌండౌక వి_త్తె_త్తిన, నతిరయమున నదియుఁ దునుమ నాతం డౌర్వా, శతమఖనందన యనుచును; ధృతి వేటౌక వింట శరత తిం బరఁగించెన్. భీష్మ. 3-257

**ఔర్ధ్వదైహికము** సం. వి. అ. న.

ఉ_త్తరక్రియ, పరలోకక్రియ.

వ. ఇంతయు నెఱింగి శాంతినొంది పుత్త్రాదిజ్ఞాతులకు నౌర్ధ్వ దైహి కంబులు సేయించి సుఖవిగమ్ము. స్త్రీ. 1-61

వీణ (అ. ఈ. అ)

ఊర్ధ్వదేహ ప్రాపక మైనది. చనిపోయిన వానికిఁ జేయు కర్మము మొద లగునవి.

వ. దుర్యోధనాదులకు నంతశంతె విభవంబెసంగ ధృతరాష్ట్రిం డౌర్ధ్వ దైహిక విధు లాచరించునట్లుగా నొనర్చి. శాంతి. 1-382

**ఔర్వానలము** సం. వి. అ. పుం.

బాడబము.

వ. ఔర్వుండు పితృదేవతా దేశంబునఁ దనకోపానలంబు సముద్రం బులో వైచిన నది యౌర్వానలంబు నా నశ్వముఖంబున నబ్ధి జలం బులు ద్రావుచుండు.

**ఔర్వుఁడు** సం. వి. అ. పుం.

భృగువునకుఁ గుమారుఁడు చ్యవనుఁడు చ్యవనునకు మనువుతనయ యగు ఆరుషియందు నూరువులనుండి యుద్భవించినవాఁడు ఔర్వుఁడు. ఊరువులనుండి పుట్టుటచే నీతనికి 'ఔర్వుఁడు' అని పేరు వచ్చెను. ఇత నికి ఋచీకాదులు నూర్వురు సుతులు గలరు. ఋచీకునకు జమ దగ్ని పుట్టెను-జమదగ్నికి పరశురాముఁడు జనించెను.

ఆది. 8-20; విరా. 1-54

చరిత్రకై చూ. ఆది. 7-132 మొ. 148 వరకు.

ఔశనము సం. వి. అ. న.

తీర్థ ప్రదేశము.



చూ. మాహాత్మ్యము. శల్య. 2-168

ఔశనన తీర్థము సం. వి. అ. న.

ఔశనము అను తీర్థము. ఇందు స్నానముచేసి పాపవిముక్తులయి బ్రహ్మలోకంబు వడయుదురు. అర. 2-265



చూ. శల్య. 2-168



ఔశనన వ్యూహము సం. వి. అ. పుం.

ఒక రకమైన వ్యూహము.



శ్రీరామునితోఁ బోరునపుడు రావణుఁడు పన్నిన వ్యూహము. దీనికిఁ బ్రతిఘాతముగా శ్రీరాముఁడు బార్హస్పత్య వ్యూహమును పన్నెను. అర. 7-74

ఔశీనరము సం. వి. అ. పుం.

'ఔశీనరము' అను పేరుగల ఒక దేశము ఉశీనరము.

క. ద్రవిడ కళింగౌశీనర, యవన శక పుళింద నృపతు లవనిసుర పరా, భవమునఁ గాదే ధరణీ, ధవ పొందిరి తొల్లి శూద్రతా దైన్యం బిల్. అను. 2-143

ఔశీనరుఁడు సం. వి. అ. పుం.

ఉశీనర దేశస్థుఁడు.

వ. ఔశీనరు లెల్లకైదువులకు నేర్చి సత్త్వవంతులై యుండుదురు. శాంతి. 8-11

వ. ఔశీనరుండగు శిబి యాత్మాంగంబుల నౌరసపుత్రునిని బ్రాహ్మణార్థంబుగా నొసంగె. శాంతి. 5-82

ఔశీనరి సం. వి. ఇ. స్త్రీ.

శూద్ర స్త్రీ. గౌతమునివలనఁ గాక్షీవాదులఁ గనెను. గిరివ్రజనివాసిని.

వ. దానఁజేసి యిప్పురంబు గిరివ్రజంబునాఁ బరఁగె నిందుఁ దొల్లి గౌతముం డౌశీనరియను శూద్రయందుఁ గాక్షీవాదుల సృజియించె. సభా. 1–175

**ఔషధము** సం. వి. అ. న.

మందు.

ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగనేల చెప్పుమ, క్ష్మాశ్రవన్మనోరుజకు నౌషధమే నొనరింతు నన్న. ఉద్యో. 4-385

మ. ...ఔషధ మూఁదిచేసి శెవులు న్మర్దింపకున్నం దుది, స్ఫురమై యుండదె. కర్ణ. 2-307

ఆంధ్ర మహాభారత నిఘంటువు

ప్రథమ సంపుటము

సంపూర్ణము

# ఆంధ్ర మహాభారత నిఘంటువు

రెండవ సంపుటం

కూర్పు :
కీ॥ శే॥ అబ్బరాజు సూర్యనారాయణ



తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు - 500 004.

# ప్రకాశక విజ్ఞప్తి

కాలగమనంలో భాష అనేకపరిణామాలు చెందుతుంది. ఆయా కాలాల లోని భాషా విశేషాలను తెలుసుకోవాలంటే సమకాలిక సాహిత్యం ఒక ఆధారం.

తెలుగులో వెలువడిన మహాభారతం తెలుగు సాహిత్యానికే పరమ ప్రామాణికంగా నిలిచింది. ఆదికావ్యత్వ గౌరవాన్ని పొందడమే గాక అందలి ప్రయోగ పక్కి తరువాతి కవుల ప్రయోగాలకు ఒజ్జబంతిగా నిలిచింది. దాదాపు మూడు దశాబ్దాలుగా మూడు దశలలో ముగ్గురు కవుల చేతి మీదుగా సాగిన ఆంధ్రమహాభారతంలోని భాషా స్వరూపంలో భిన్నత్వం గోచరించడం సహజం. వీటన్నింటినీ క్రోడీకరించి నిఘంటువు రూపంలో పొందుపరిచే ప్రయత్నానికి దోహదం చేసింది పూర్వపు సాహిత్య అకాదమి.

కీ శే. అబ్బరాజు సూర్యనారాయణగారు ఈ నిఘంటు నిర్మాణం గావించారు అయితే వారు దీనిని సంపూర్తి చేయకుండానే గతించారు. తదనంతరం వారి కుమారులు కీ.శే. అబ్బరాజు శ్రీకృష్ణదేవుడు గారు మిగతా భాగాన్ని పూర్తి చేయడానికి పూనిక వహించారు. దురదృష్టవశాత్తు వారు కూడా సమగ్రంగా నిర్వహించకుండానే దివంగతులయ్యారు. ఇదంతా చూస్తే ఆనాడు మహాభారతం కవిత్రయం చేత సమగ్రరూపం చెందినట్లు ఈనాడు మహాభారత నిఘంటువు నిర్మాణం కూడా ముగ్గురి చేత కానీ పూర్తికాదేమో అని అనిపిస్తుంది

ఆంధ్ర మహాభారత నిఘంటువు అచ్చులకు సంబంధించి మొదటి సంపుటంగా శ్రీ అబ్బరాజు సూర్యనారాయణ గారి పేరుతో వారు జీవించి ఉన్నప్పుడే అప్పటి సాహిత్య అకాదమి పక్షాన వెలువడింది. వారు కూర్చిన నిఘంటువులో 'క' వర్గానికి పరిమితమైన భాగం ప్రకృతం రెండవ సంపుటంగా వెలువడుతున్నది. ఇది ఆంధ్రావళికి మోదం చేకూర్చగలదని నమ్ముతున్నాం.

హైదరాబాదు,
తేదీ. 11-8-1987

ప్రకాశకులు,
**తెలుగు విశ్వవిద్యాలయం**

# ఆంధ్ర మహాభారత నిఘంటువు

## క

క[1] కొన్ని ధాతువులకు వచ్చు కృత్ ప్రత్యయము.

1. అలుక (ల్క) దే. వి. (కోపము)

ఉ. ... ఆ బక వైరి గ్రక్కునన్, వాని నడంగ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం, డానన మేణముం బొదువు నట్లతఁ దూర్జిత శక్తి నుద్భటుం, డై నెగసెన్ సమీర సుతు నల్కకుఁ బ్రాకిడినట్లు వీఁకతోన్. విరా. 2. 340

2. కినుక (న్క) దే. వి (=కోపము)

చం. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు విల్లు ప్రేల్మిడిం, దునిమి. ... విరా 5.176.

గీ అనినవిని కినుకఁబూనిన యలఁతి నగవు, చెలువు మొగమున కొక క్రొత్త వెలుపొనర్పఁ, బుండరీకాక్షుఁ డగుచెల్లఁబోయి యప్పు, డరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు. ఉద్యో. 2.364.

3. పోక దే. వి. (ఈ పదము 'పోవు' ధాతువునకువచ్చు కృత్ప్రత్యయమే యగుట ఆధాతువునకు గల పెక్కు అర్థచ్ఛాయా భేదములతో ఆయా తావులందు ప్రయుక్తము).

i. గమనము, పోవుట.

సీ. ... ఈ దివస మతిక్రమింప కుండఁగఁ బోక యెట్లొడఁగూడు .... ఆది. 1 114.

ii. మరలి పోవుట, నివర్తనము.

చం. తన భుజశక్తియున్ విపుల దర్పము నేర్పడఁ జూచి చూచి యెట్లును దెగకున్నఁబోక యిది లోకము చక్కటి .... విరా. 4.61.

iii. గతి, మార్గము, విధము. ఈ అర్థమున బహువచనములోనేఁ ప్రయోగములు గన్పట్టుచున్నవి.

వ. ... అమానుషంబులగు వానిఁ గొన్ని వెడమాయలంబన్ని పెక్కు పోకలంబోయితి. ఉద్యో. 4.33.

iv. కపటవర్తనము, మాయ, నటన.

ఆ. ... ఇవ్విధమునఁ, బూని రాత్రి యన్ని పోకలఁబోవుట ... ద్రోణ. 3 3.

v. శృంగార చేష్ట. విలాసము.

ఉ. పొచ్చెము లేక యా నహుష పోయిన పోకలు వానికిం దగం... ఉద్యో. 1.178.

(vi) నాశము, క్షయము.

ఉ. భూమికి ఁగాఁగఁ బ్రాణముల పోక దలంపక ...భీష్మ. 1.15.

క[2] ద్రు. (కాన్). (కొన్నింట ఇయ్యది 'అగు' ధాతువుయొక్క నుజ్యంత రూపముగా వర్తించును.)

1. కలుగునట్లు.

కం...తరుణి విలోలా, క్షములందు బాష్పసలిలో, ద్గమముగఁ దలవాంచి యుండెఁ గడుఁగోపమునన్. అర. 3.264.

2. అగునట్లు.

గీ... ఎఱచి యాహారముగ మను
నెఱుకులైన. ఆది. 6.68.

**క3** ద్రు.

(అర్థవిశేషము లేకయే తుమున్నంత
ముల కిది యనుప్రయుక్తమగుటకాన
వచ్చుచున్నది)

ఉ. భూమికిఁగాగఁ బ్రాణములపోకఁ
దలంపక...భీష్మ. 1.15.

ఉ.... దేవతా విమానమ్ములు నిట్టివే
యని జనమ్ములు దానిన మెచ్చి చూడ
గన్. సభా. 1.32

ఉ. కోరిన కోర్కికిం దగఁగఁ గుంతి
సుతత్రితయంబుఁగాంచె గాం,ధారియు
నక్కడన్ సుతశతంబు ముదంబొ
నరంగ గాంచెనేఁ, బోరచియాడుఁబు
ట్టువునఁ బుట్టి నిరర్థక జీవనైతి సం,
సార సుఖావహంబయిన సత్సుతజన్మ
ముఁ గానఁబోలమిన్. ఆది. 5.129

**క4** ప్ర.

(వ్యతిరేక క్త్వార్థకమున ఇది పదాంత
మున వచ్చును)

కం. బాలహృదయమునన్నృపశా,ర్దూలు
నిజాధీశు నిలిపి దుష్టోరగశా,ర్దూలాభీ
ల మృగావలి, కోలిన భయ మంద
కేగె నుగ్రాటవిలోన్. అర. 2.98.

కం. అకాలంబునరూపం, బికాలం
మునందు (జూపనెట్లగుఁ? గాలం,బొ
క్కవిధంబున నుండిక, పెక్కుప్ర
కారములనుండు భిన్నావస్థన్. అర.
3 384

ఛం... ధనమెట్టి వారికిం, గడుకొని
చేయకుండునె జగన్నుత గర్వము
దుర్విమోహమున్. సభా. 1.32

**కంకభట్టు:** సం. వి. అ. పుం.
కంకుఁడు అనుదానికే గౌరవవాచక
రూపము (చూ: కంకుఁడు),

ఆ. నాదు వల్లభుండు నటుఁడింత
నిక్కంబు, పెద్దవారియట్ల పిన్న
వారుఁ,గానఁ బతుల విధమ కాక యే
శైలూషిఁ,గాననంగ రాదు కంకభట్ట!
విరా. 2.152

**కంకుఁడు** సం వి. అ. పుం.
అజ్ఞాత వాస సమయమున ధర్మరాజు
పెట్టుకొన్న మాఱుపేరు. 'కంక' పద
మునకు 'యముడు' అనునర్థముకలదు.
తనతండ్రి యముఁడగుట వలన, పితా
పుత్రులకుగల యభేదమునుఁ బాటించి
సత్యనిష్ఠగల ధర్మజుఁడీపేరును పెట్టు
కొని యుండును,

వ. మఱియు నవసరోచితంబులగు
వినోదంబులం బ్రమోదంబు పుట్టించు
చుఁబ్రసాదంబునకుం బాత్రుఁడనై
కంకుండను నామధేయంబుధరియించి
చరియింతు....విరా. 1.73

చం. నృపనయవిద్యకుండగిన నేర్పుల
వడ్డది గొంత కొంత ధ,ర్మపరుల
సంగతిందగిలి మచ్చికనుండుదుఁబేయ
కంకుఁడే,వప్పుగొలువైన నాకునిలువన్
మది గొల్పుదు...విరా. 1.196

**కంచు** వై. వి (సం. కంసమ్)
లోహభేదము.

కం. పరపురుష సంగమంబునఁ, బరి
హృతయైయున్న యట్టిభామిని శుద్ధిం

బొరయు రజస్వలయై కం,చరయఁగ భస్మమున శుద్ధమైన విధమునన్. శాంతి 1.314.

**కంచుకుండ** వై. వి. సమ.
కంచుతోఁజేయఁబడిన పాత్ర.
గీ. కంచుకుండతో మొదవశ్వకలిత శకట మతులతిల ధేనువీఁబొడి అను 2. 379.

**కంజము** సం. వి. అ. న.
తామర, పద్మము. (నీటఁబుట్టినది). మహాస్రగ్ధర–కమలభవ మనఃకంజ సంవాసభృంగా - సౌ ప్తి. 1.239.

**కంటకము** సం. వి. అ. న.
1 ముల్లు.
ఆ. కంపురూవుఁ దెలుఁపు గలిగియ కంటక భూరుహము లందుఁ బుట్టినట్టి పుష్పముల-అను. 4.5, అను. 4.7.
2. బాణాగ్రము, అలుఁగు.
గీ. కంటకము దూఱియంగంబుగాడి వోవఁ, గ్రూరనారాచ మేసిన సుకెన్కనతఁడు. ద్రోణ. 2.32. (సూ. అ ని, పారము) (ఇచ్చట కంకటము అని సం. ము, మొ, వాని యందు. సం. మున కంటకము అని పాఠాంతరముగాఁ గూడలేదు)

**కంటకావనము** సం. వి. అ న.
నరక భేదము–(ఇది మహారౌరవమున కావలనుండును. దీనికిఁ బిమ్మట అగ్నికుండము అను నరకముండును. మానవులు చేసిన పాపక్రియాతార తమ్యములను బట్టి యమధర్మరాజు వారినీ నరకముల కంపును. ఇచ్చట యమభటులు పాపులను గాల్చుదురు, నఱకుదురు. కట్టి కొట్టుదురు, ఆ పాపులను కుక్కలు గఱచును, క్రిములు తొలుచును, గ్రద్దలుముక్కులతో బొడుచును ) అను 5.170.

**కంటకించు** దే. అ. క్రి.
నొచ్చు.
వ. (విదురుఁడు ధృతరాష్ట్రునితో)– ద్యూదంబున నప్పుడే నడ్డపడి యప్రియంబగుటకు శంకింపక పథ్యంబు పలికితినది నీకురుచియింపక రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించు నట్లయ్యె. ఉద్యో. 2.89.

**కంటకుఁడు** సం. వి. అ. పుం.
క్షుద్ర శత్రువు (ముల్లువలె బాధించు వాఁడు)
వ. ... అయ్యవతారంబు నఁగంస కాలయవన మురనరకబాణ ప్రముఖులైన కంటకులం జెఱుతు - శాంతి. 6.388.
సీ. కిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి విగత కంటకము గావించె వనము. (తొలఁగిన క్షుద్రశత్రువులు గలది).

**కంటె** దే. ప్ర. ద్రు.
పంచమీ విభక్తి ప్రత్యయము.
ఉ. రాజగృహంబు కంటె నభిరామముగా నిలుకట్టఁగూడదు, విరా. 1.128.
వ. ... ఇట్టియకృత్యం బాచరించుట కంటె నీచేత నెట్లయినను లెస్స తొల్లి పెద్దలు సెప్పిన చొప్పవధరింపుమని యిట్లంటి. ఉద్యో. 4.308.

(ఆచరించుట కంటె)
చతుష్కమున కంటె అశ్వ. 2.196.
సీ. విను కార్తవీర్యకంటెను వీరుఁ
దగుట - ఆది. 5.124.

తే. కంటి తనయులు నీకన్న కంటె
నొప్పియుండుదురు వారు. దివిసౌఖ్య
యోగమెసఁగ. ఆశ్వ. 2.130.
(కన్న కంటె=కన్నదాని కంటె)

**కంఠత్వము** సం. వి. అ. న.
కంఠముగానగుట.

దానికి (గరుడ వ్యూహంబునకు) —
త్రిగర్తులతోఁగూడి భూరిశ్రవశ్శల్య
భగదత్తులును సౌవీరజయద్రథులును
గంఠత్వంబు నొందిరి. భీష్మ. 2.96.

**కంఠనాళము** సం. వి. అ. న.
గొంతు నుండి లోపలికి వ్యాపించు
గొట్టము. స్వరపేటిక యుండుతావు.
గొంతు నుండి లోపలికి వ్యాపించు
గొట్టము; స్వరపేటిక యుండుతావు.
తే. దంతములు జిహ్వ గుత్తుక తాలు
తలము, గంఠనాళంబు హృదయం
బగణ్యచరిత మఱియు లోపలనెచటి
కిమనసు మెలఁగెఁ దాఁగదల్పక య
చటనయాఁగవలయు. అశ్వ. 1.216

**కంఠము** సం. వి. అ. పుం
కుత్తుక, గళము, మెడ.
వ. దశార్ణ శూరదేశాధీశులు కంఠా
కారంబు దాల్చిరి. భీష్మ. 2.21.

**కంఠీరవము:—** సం.వి.అ.పుం.
సింహము (కంఠమున ధ్వనిగలది).

**కండ** దే. వి.
మాంసము, మాంసపుముక్క
సీ. తునిసిన నెత్తురునె నడును
నెమ్ములు నెఱచియుఁ గండలు నెనసి
సమరతలము ఘోరంబుగాఁ గపిధ్వజ
ముధవళహరులు కోళిల్ల ... ఉద్యో.
2.144.
తే. కూర్మిమైనెత్తుఁగండలు గోసియైన.
భీష్మ. 3.274.
సీ. గగనతలంబొ నెత్తురులుఁ గండలు
నెమ్ములు నొక్కయుమ్మడిన్, మొగి
ళులేకయుం గురిసె. ద్రోణ. 1.82.

**కండ²** వై. వి. (సం. ఖండః)
ఖండము,తునియ
సీ. వివిధాస్త్రతతులు వర్షింపఁ గండలై
వండఁదఱిగినట్లుండు పదాతిచయము.
ద్రోణ. 3.158.

**కండక్రొవ్వు** దే. వి.
కండలపుష్టి, మాంసమునందలి చేవ.
సీ. బడుగులనైననుబాదించి పరికించి.
గోమున మైఁగండక్రొవ్వుదేఱ విరా.
1.101.

**కంఠి** వై. వి. (సం గ్రంథిః)
కణఁతిగడ్డవలెఁబుట్టెడు రోగవిశేషము.
ఇది పోటు మంట నొప్పితోఁగూడి
పగిలిచీమురసిక కానవచ్చును. ఏబాధ
లేకశరీరమున బొడిపివలె కొంతవఱకు
పెఱిఁగి ఆగిపోవచ్చును
కం. తిలకాదుల గంతులచే, నలమట
(బడువారు బడియనడిచియు ముష్టిం,
జలమున బొడిచియు సాధుల,దొలుబా
మున నొంచినట్టిదుష్ట చరిత్రుల్.అను.
5.101.

ఇక్కడ ఇది కంతియా? గంతియా? క్రంతియా? నిర్ణయింపవీలులేకున్నది. కంతి, క్రంతిఅయిన తిలకాదులఁ అని 'ల'కు బిమ్మట అఱున్నయుండ వలయును, అట్లులేదు. గంతియందు మా? ఆపదమునిఘంటువులఁగానరాదు. ఆనందము. సం.ములలో అఱున్నలే ని పాఠమేగలదు. తి.ప్ర 'క్రంతి' అను పాఠముతెలుపుచున్నది. ఆనంద ముద్రణమున 'క్రంతి'పాఠాంతరముగ లదు.సం.మునక్రంతి.దీనికిఁబాఠాంతర మేయీయలేదు క్రంతిపదమును విచా ర్యము ఇది గ్రంథి యనుపదమునకు వికృతియగునేమో.

**కందము** వై. వి. (సం. స్కంధః). పశువులమూఁపు – మూఁపురము.

ఆ. కందములప్పళించి తురగంబుల నించుక నిల్పు వైరినే, నందెలియంగ జూడుము. విరా. 5.69.

**కందము** సం. వి. అ. పుం. న.

1. గడ్డ. దుంప.

తే...కరిబృంహితముల మేల్కాంచు నట్టి, వారు కందమూలము లాహార ములుగః బొదలఁబుట్టలఁ బడియుండి పులుఁగు మెకము, లఱవమేల్కాను చుండిరే యక్కటకట. ఉద్యో. 3. 183.

2. స్థానము.

వ. నితాంత కాంతవికసిత కనకార విందసమధిక సౌరభ సంవాసిత మహా నంద కందంబులైన మందాకినీ తీరమణిమయ వేదికల యందును. అర. 1.363.

**కందమూలములు** సం. వి. సమ. దుంపలు; వేళ్ళు.

తే. కరిబృంహితముల మేల్కాంచు నట్టి, వారు కంద మూలంబు లాహార ములుగఁ, బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకములఱవ మేల్కనుచుండిరే యక్కటకట. ఉద్యో. 3.183., శాంతి. 1.110.

**కందర** సం. వి. ఆ. స్త్రీ.

గుహ, గుహవంటి కనుమ.

కం. హిమశైల కందరా భాగము కదనిష్పురుష నగము గలదు. ఆది. 1.77.

**కందరము** సం. వి. అ. పుం. న.

గుహ; గుహాకారముగ నుండు కొండ నడిమి ప్రదేశము.

చం. ... ఉద్ధత హరిశూన్యమైన వసుధాధర కందరభూమి చంద మున్, మతిమనసేనఁ దోఁచెఖధమా న్యుఁడు భీష్ముఁడు లేక యుండుటన్– ద్రోణ. 1.16.

**కందర్పుఁడు** సం. వి. అ. పుం.

మన్మథుఁడు.

వ. ఇట్లు కందర్ప దర్ప గోచరుం డైన కీచకుండు. విరా. 2.38.

**కందళము** సం. వి. అ. పుం. న.

మొలక, అంకురము.

చం. దళిత నవీనకందళ కదంబక చంపక కేతకీరజో, మిళిత సుగంధ బంధురసమీరణుఁడన్ సఖుఁడు. అర. 4.138.

**కందళించు** సం. అ. క్రి.

అంకురించు, మొలచు.

మ. వినియుత్సాహము కందళింపఁగ వియద్వీధీగతుఁడై. అను. 1.329

**కందళితము** సం. వి అ. న.

1. మొలకెత్తినది, పయికి వచ్చినది

సీ. ... అచ్యుతుండు, నన్నరుండును బరమానంద కందళి తాత్ములైరి — ద్రోణ. 4. 833.

2. వికాసము నొందు.

వ. విదురుండు ... భయభక్తివినయ స్నేహానందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారం బుల ననేక ప్రకారంబులనర్చన లిచ్చి. ఉద్యో. 3.180.

**కందు** దే. అ. క్రి.

నొచ్చు.

తే. మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁ దేఁటి, పువ్వుఁదేనియగొని యెడిపోల్కి నెడురు, గందకుండఁగఁ గొనునది కార్య ఫలము, బొగ్గులకు వోలె మొదలంటఁ బొడువఁజనదు. ఉద్యో. 2.57.

తే. పుచ్చికొనునప్డు పల్కుల పొందు కలిమి, యెత్తిరిమదిఁ గంద నీదింత యెఱుఁగు మధిప. శాం. 2.342.

కం. ఆయాసంబున విదురుని, కాయము సంజయుని మేనుఁగందక యున్నే, పోయిరి భృతరాష్ట్రి మహీ, నాయకుపై భక్తిఁగాననమున వసింపన్. ఆశ్ర. 2.13.

2. తాపము నొందు, పరితపించు, తప్తమగు.

వ. ధృతరాష్ట్రి గాంధారులుం గాల పర్యాయంబు గని డెందంబులు గంద నూరకుండుదురు. ఆశ్ర 1.20.

చం. ... నెవ్వగల సందడి డెందము గంది చేడ్పడున్. విరా. 2.293., విరా. 2.119., సభా. 2.89.

3. వివర్ణత నొందు.

(క) తేజోహీనమగు,

తే. తనకులంబునఁ బుట్టిన ధార్త రాష్ట్రులన్నదమ్ములతో విగ్రహంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొంది నట్లు, గందియెంతయుఁ జెలువేదఁ జందురుండు. ఉ. 2.107.

(చ) మ్లానముగు, వాడు.

ఆ. అతని (నలుని) కరతలద్వయా మర్దితంబులై, కందియును మహా సుగంధ కుసుమ, తతులు దొంటి యట్ల తమ కంపు విడువక యుండు. అర. 2. 196.

మత్తకోకిల — పుత్రి యిట్లగునమ్మ శోకముఁబొంది కుందుచు నున్ననీ. గాత్రమొండొక కీడు పాటిలి కందు స్త్రీ. 1.183.

(ట) ఎఱుపెక్కు.

వ. . . పట్టావృత నయనయగు న ప్పతివ్రత దృష్టి పట్టంబునంచు సందునంజని యజ్ఞపతి పదనఖంబు లంజెందిన నవి గందినం జూచి సవ్య సాచి జనార్దను వెనుక కుంజనె. స్త్రీ. 1.176.

(త) కృశించు.
మ. అటవీ దేశములందు బహుళా యాసంబులం గుంది. శాం. 1.394,
వి.
1. మాలిన్యము, నలుపు.
కం. కందుగల పసిడి గాచినఁ గంది వివర్ణమయినట్లు ..సభా. 2.89.
2; నల్లనిమచ్చ, కళంకము.
సీ. ఇందుబింబము మీఁది కందు చందంబున విరా. 1.138; విరా. 2 52.
3. కోపము.
వ. కిరీటియుం గోపించి
వ. తనకొలఁది యెఱుంగని యమ్మ నుజాధము నిపుడ పట్టి మర్దింపక తక్కినగాదు వీని రాజ్యము, నిను నంతయు జేరుగాకనియెధర్మజుతోన్.
చం. అనవుడు నాతఁడిట్టులను.
వ. అని పలికి వారికందు మాన్పి – విరా. 5.311.12,13,14.

**కందుకక్రీడ** సం. వి. అ. స్త్రీ, సమ.
బంతియాట.
వ. ... అప్పుర బహిరంగణంబున ధృతరాష్ట్ర పాండునందనులందఱు కందుకక్రీడాపరులయి వేడుకతో నా డుచున్నంత. ఆది. 5.206., ద్రోణ. 4–322.

**కందుకము** సం. వి. అ. పుం. న.
చెండు, బంతి.
వ. అక్కాంచనకందుకంబొక నూతం బడి. ఆది. 5.206.

**కందువ** దే. వి.
1. ప్రదేశము, స్థానము.
వ. .... తమపాసిన కందువలురోసి యెత్తిన మెడలును. విరా. 2.240.
2. ఉనికి, ఉండుతావు.
వ ...వేదవ్యాసముని పాదంబులకెఱం గి భవత్ప్రసాదంబునం గందువగనిన కనకమ్ము మిమ్ముంబురస్కరించుకొని పోయి చేకొనంగలవాడ. అశ్వ. 1.138.
3. సంకేత స్థలము.
కం. కందువచోటికిఁ గొనిపోకందార రుగుటయు. మౌస 196
(అశ్వత్థామ) మ.వరవీరావళియిండ్ల కందువలెడం బాటించుచుం బోయిన న్. సౌ. 1.162.
వ. అమ్ముని కుమారుండు కందువలె ఱింగిపోవంబోవ. ఉద్యో. 3.316.
క...పురందరుఁడరిగిన, కందువయే నిప్పుడెట్లుగాంతునెయనుచున్. ఉద్యో. 1.170; ఉ. 4.176
4. కౌశలము. నేర్పు.
(ఉత్తర బృహన్నలతో) సారథ్యంబు సేయువాడులేమికి విషాదంబునొందిన నీకందువ సైరంధ్రి చెప్పినంబ్రియం బందినిన్నుఁ దోడ్తేరనన్నుఁ బనిచిన. విరా. 4.29.
శ్లో. ఆచచక్షే హయజ్ఞానే సైరంధ్రీ కౌశలం తవ. సం. భార. విరా. 33.11.

**కంధరము** సం. వి. అ. స్త్రీ.
శిరస్సును ధరించునది, మెడ.
కం. కంధరములుదెగితలలువ, సుంధ రనతిపక్వతాల సుభగ ఫలాళిబంధు

రతరాలుదామ, గ్రంధి పగఱమీఁదఁ గినిసి కవిసిన యెడలన్. విరా. 3.229.

**కంపన** సం. వి. అ. స్త్రీ.

ఒకానొకనది. తీర్థము. ఇందు స్నానము చేసిన వారు పౌండరీక ఫలంబు నొందుదురు. ఆర. 2.275

**కంపనము** సం. విణ. (అ. ఆ. అ).

వణఁకించునది, కదలించునది.

వి. అ. న.

వణకుట.

కం. వినుము నివాత స్థానం, బునఁ గంపన రహిత దీపము వెలింగెడు చాఁడ్పున నంతరాత్మ వెలుగుచు, మునికి ప్రసాదంబు భంగి యుత్తమధిషణా. శాం. 5.116.

**కంపము** సం. వి. అ. పుం.

1. వణఁకు

సీ. ఇచ్చట దిక్కు-లేరెవ్వరు నాకను. భయమున మేనఁ గంపంబు పుట్టఁ విరా. 2. 83.

2. కదలిక

చం. వెరవుగనంగముల్ నుపుల వ్రేటులువమ్మగ దాఁకినప్డు, కక్కరి రదన ప్రహారముఁగంపము నొందక యుండు మేదినీ, ధరములఁ బోల్పఁ బట్టగు నుదగ్రపు మూర్తుల కిద్దఱకు. శల్య. 1 176.

**కంపించు** సం. అ క్రి.

వణఁకు, చలించు.

తే. పాండవాగ్రజుఁ దక్కు-దుభర్త వలను, శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి, హా మహారాజముఖ్య యెందరి గెదనుచు, నొదలు కంపింపఁ జది కిలఁబడియె నధిప. ఆశ్ర. 1. 140; భీష్మ. 1.92.

**కంపితము** సం విణ (అ. ఆ అ.)

1. చలించినది, తొలఁగినది.

చం. — — — తదంగలత లాదటఁ గొఁగిటఁ జేర్పఁగోరుఁ గం, పిత ధృతియై కలంగఁబడుఁ బెల్లగురాగర సంబు ముంపఁగాన్. ఆర. 5 197.

2 వణఁకినది.

వ. అనిన భీముఁడు భీతికంపితుఁ డగుచు గాంధారికి వినతుండై విన యంబున నిట్లనియె. స్త్రీ. 1 156.

3. వణకింపఁబడినది, కదలింపఁ బడినది.

చం ...మల్లులెల్ల భయ కంపిత మూర్తులు దాల్చి మాఱుబ, ల్కను గనువిచ్చి చూ, డను మొగం బెగయిం పను జాలకున్న. విరా. 2.8.

కం. మదన కంపితుఁదగుచున్. విరా. 1.244; భీ. 3.246.

**కంపు** దే. వి.

1. గంధము, వాసన.

చం. చనదిటులంట గంపెఱుఁగఁ జాలరు నాసిక జిహ్వాయుంజవుల్, గొనవెర వేదు .. నేదొఱంగివన్.

2 సుగంధము, సువాసన.

ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగియ కంటకి, భూరుహాదులందుఁ బుట్టినట్టి.

పుష్పములఁ బ్రియంబుఁ బొంది కై
కొంద్రు నిర్జరులు పూజనములఁ
గురువరేణ్య. అను. 4 5.

తే. కేళిసలిపిరి భవన దీర్ఘికలతమ్మి,
విరుల నెత్తావి నెనయంగ బెరసి
చెమట, పొడము మేనులతని కంపు
ప్రోచి తఱచు టూర్పుగాడ్పుల రి
మళమ్ముల్లసిల్ల. విరా. 2.238.

ఓ. దుర్వాసన, దుర్గంధము.

కం వినుకుసుమంబుల వాసించినవొ
ప్పనికంపు విడిచి చెందును సౌరభ్య
నిరూఢిందిల లట్టుల, యనఘా సు
కృతముల జీవుఁ దకలంకుఁడగున్.
శాం. 5.418

**కంపుగొను** దే. స. క్రి.

వాసనచూచు

సీ. ...కంపుగొనఁగ నానఁగానముట్ట
గవినఁగాఁదలంప, తే. నిశ్చయము
దగఁజేయఁగ నేర్పులేదు, గలవు
జీవాత్మునకు, అశ్వ. 2. 51.

**కంబము** వై. వి.

స్తంభము.

సీ. ... దాళంబుగాఁ గరతలమునఁ
బెలుచఁగం,బంబు వ్రేయుచు వెద
పాటపాడు. విరా. 2 250.

**కంబళము** సం. వి అ. పుం.

కంబళి

సీ. హరివసుజల తారకములఁ గంబ
ళము గుజ్జులమరిన బండియు య
వలుఁ....ఈఁబాడి. అను. 2.379.
(ఉన్నితో నేసిన) ఉత్తరీయము
(పయిని వైచుకొను సాలువు మొ)

తే. యజ్ఞ దీక్షితుఁడైన ధర్మాత్మజు
నకు, గౌదకాంభోజపతులనేక ప్రకార,
వర్ణ కంబళములు సువర్ణవాహ,ని
వహములు దెచ్చియిచ్చిరి నెమ్మితోడ.
సభా. 2.109.

**కంబువు** సం. వి పుం. న.

శంఖము, సంకు.

సీ లలితకంబు ప్రభా కలిత పతాకా
వి,హారంబువాఁడు రాధాత్మజుండు.
విరా. 5.4.

**కంబుకంధర** సం. వి. ఆ. స్త్రీ.

శంఖము వంటి మెడగలది, స్త్రీ.

సీ. కంబుకంధర చెన్ను కైవడిదల
పోయు, నంగన సౌకుమార్యము
దలంచు. విరా. 2.292

**కంసదాసుని పుత్రుడు**

తొడలు విఱిగి పడియున్న దుర్యో
ధనుఁడు శ్రీకృష్ణ నాక్షేపించుచు
సంబోధించిన పదము. వసుదేవుని
కంసుఁడు కారాగార మందుంచుటచేత
వసుదేవుఁడు కంసుని దాసుఁడనియు
వసుదేవునకుఁ బుత్రుఁడగుటచే కంస
దాసుని పుత్రుఁగునియు భావము.

**కంసమర్దనుఁడు** సం. వి అ. పుం.

శ్రీ కృష్ణుఁడు — కంసుని జంపిన
వాఁడు.

కం. ...... మీ,రీ కార్యము సేయుం
దని, మాకానతి యిమ్ము కంసమర్దన
తెలియన్. ఉద్యో 8.79.

**కంసమర్ది** సం. వి. న్. పుం.

కంసుని జంపినవాఁడు—శ్రీకృష్ణుఁడు

కం. వినుకర్ణునకే నోడితి, నన నేటికి
నీవు నోడి తనిలజ మాద్రీతనయులు
మున్నే యోడిరి, మనతోఁగూడంగఁ
గంసమర్దియు నోడెన్. కర్ణ. 8.58.

**కంసుఁడు** సం. వి. అ. పుం.

కృష్ణుని మేనమామ, ఒకానొక మధురా పురము రాజు. ఇతఁడు కాలనేమి యంశమునఁ బుట్టెను.

సీ. దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ బట్టంబు గట్టిన ప్రభువితండె. ఉద్యో. 3 175.

వ. కాలనేమి కంసుఁడై పుట్టె. ఆది. 8.80.

**కకుత్థ్సుఁడు** సం. వి. అ. పుం.

అసురులను జయించుటకు వృషభ రూపుఁడగు ఇంద్రుని కకుత్తు (మూఁపు)ను ఎక్కినవాఁడు, శశాదుని పుత్రుఁడగు పురంజయుడు.

సీ. శశాదుండు రాజయ్యె, వాఁడు కకుత్థ్సుఁడన్వానిఁ గనియె. అర. 4. 380.

**కకుదము** సం. వి. అ. పుం. న.

ఎద్దు మూఁపురము.

సీ. కకుదంబునందు శ్రీ కంరుండు. ఆను. 3.60.

**కక్కు** దే. స. క్రి.

కడుపులోనిది వెలిపుచ్చు, వెడలించు.

సీ. సభలో నులూకునిబంచి యాడిం చిన పరుసదనము కక్కించి. భీష్మ. 2.393. (సం. ము)

**కక్షకుఁడు** సం. వి. అ. పుం.

వాసుకి జాతివాఁడు. ఆది. 2.212.

**కక్షము** సం వి, అ. పుం.

1. మఱుఁగు చోటు – పొద.

వ. బహుళ హయకక్షాకీర్ణంబును. శల్య. 1 361.

2. చంక.

వ. ... ... నానా విధంబులగు నక్షంబుల ముడి కక్షంబున నిడికొని. విరా. 1.184.

**కక్ష్య** సం. వి. ఆ. స్త్రీ.

1. ఏనుఁగు యొక్క అంబారిగానిఁ గుఱ్ఱముయొక్క జీనుగాని కదలకుండ ఏనుఁగు లేక గుఱ్ఱము నడుమున గట్టెడు మోకు.

వ. కనకకక్ష్యా సనాథంబులయిన మదాంధ గంధ సింధుర సందోహంబులును. (చూ. హస్తికక్ష్య). సభా. 2.177.

2. ఇంటిలోపలి భాగము, లోఁగలి. చూ. కక్ష్యాంతరము.

**కక్ష్యాంతరము** సం. వి. అ. న.

మఱియొక లోఁగలి

వ. ....... నారాయణుండు సమ్మర్ద మందగమనంబునం జని మణితోరణ సుందరంబగు రాజమందిర ద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలఁ జొచ్చియరదంబు డిగ్గి యల్లన నడచునప్పుడు. ఉద్యో 3. 176.

వ. (ధర్మజుఁడు) అగ్నికార్యంబు నిర్వర్తించి కక్ష్యాంతరంబునకు వెడలి

**చఖరము** సం. వి. అ. పుం.

వెండ్రుకల సముదాయము.

తే. అంఘ్రితలములఁ గుచములు నా ననంబు, గచఖరంబును నిట్లున్న య చరమూర్తి యనుపమాన భోగములకు నాస్పదంబు. విరా. 2.52.

**చము** సం. వి. అ. పుం.

తలవెండ్రుక, కేశము

చూ కచఖరము

**చుఁడు** సం. వి. అ. పుం.

బృహస్పతి కొడుకు.

చూ. చరిత్ర ఆది. 8.12. మొ.188 వఱకు.

**చ్చ** వై. వి. (సం. కచ్ఛః)

దట్టి, కాసె.

ఆ. కచ్చ యమరఁబట్టి కాళ్ళును చేతులు, వ్రేల మత్తగజములీల మెఱయ, మల్లు నెత్తివైచె. విరా. 2. 17.

**చ్చు** దే. వి.

గర్వము. బింకము.

చం. అగపడి కచ్చువెట్టి యితఁడాడిన మాటల కిప్డు బల్లి దుఁడుగఁగొనియేను బల్వురు గడున్ వడి సీతని జంప కుండనే,మిగ సమయంబు సేసిరిది. శల్య. 2.125.

**చ్చువెట్టు** దే. అ. క్రి.

(గర్వించు) చూ: కచ్చు.

**చ్ఛపము** సం. వి. అ. పుం.

పుచ్ఛముచేత పానముచేయునది, జల ప్రాయ ప్రదేశమును క్షుద్ర జంతు భక్షణముచేత రక్షించునది (అమర కోశము). ముఖపుటము శరీరములోఁ జొనుపుకొనిరక్షించుకొనునది.కప్పెర వంటిమేనిచిప్ప చేత తక్కినఅంగము లను రక్షించుకొనునది, (సూ. ఆ. ని) తాఁబేలు.

వ. గరుత్మంతుఁడా గజకచ్ఛపంబు లెచ్చట నుండు నెబ్బంగివియని యడి గిన నమ్మునీంద్రుండవ్విహ గేంద్రున కిట్లనియె. అను. 1.719

**కచ్ఛపవీణ** సం. వి. ఆ. స్త్రీ.

కచ్ఛపాకారముఁచ నుండువీణ—నారదు నివీణ

వ. నారదుఁడు హేమదండంబును మణికమండలువును కచ్ఛపవీణయుంబొ లుపుమిగులనేతెంచిన—శల్య. 2.218.

**కజ్జము** వై.వి.(సం.ఖాద్యం,ప్రా.ఖజ్జో)

ఖాద్యము, భక్ష్యము, భక్ష్యవిశేషము, అపూపము.

సీ. కజ్జంబులునుబండ్లు గంధమాల్యం బులుధృతరాష్ట్రిసుతుఁడుపుత్త్ర. ఉద్యో. 3.199

**కజ్జలితము** సం. వి. అ. న.

కలుషముచేయబడినది.

వ. దుర్యోధనుండు లజ్జాకజ్జలితహృద యుండగుచు. ఆర. 8.4.

**కటు** దే. అవ్య.

(సంతాపమును దెలుపును.)

తోటకము... వీరిపద, ద్వితయంబు

గడుఁజెడఁదిన్నవి సూ,చి తెనక్కలు
దైవము చెయ్యిగటా. శ్రీ. 1.111.

**కటుకటు** దే. అవ్య.

కట యొక్క ఆమ్రేడిత రూపము.
మిక్కిలి సంతాపమును దెల్పును.

చం. కటకట నాప్రతాపమునుగాసి
గఁజక్రముచేతనఁటిశే.భీష్మ. ౩.171

కం. కటకటపేరినవెన్నె,త్తుఁజొత్తిలి
యున్న మేనితోఁ గొడుకే చక్కఁటిఁ
బడియున్నవాఁడొయ చ్చొటుసూ పెడు
వారు లేరె చూచెదవానిన్. ద్రోణ
2.251.

**కటుకటా** దే. అవ్య.

కట కట

వ. ... అట్టియెడ దుర్యోధన దుశ్శా
సన కృప కర్ణ కృతవర్మ మద్రేశ్వ
రులు మాతంగంబుల ముందఱ పెట్టు
కొని కటకటాయనుచు నింతవుట్టునే
యనుచు నింకనేమి గలదనుచు ...
జనుచుండ. ద్రోణ. 5.326; ద్రో.
4.272; అను. 1.274.

**కటుకటుఁబడు**
**కటుకటుంబడు** } దే. అ. క్రి.

1. కష్టపడు, బాధపడు, సంతాపపడు

కం. వంది జనంబులు మాగధ, బృం
దంబులు సంస్తుతింపఁ బెంపొందుదు
ర్మో,లందిరిగెడు క్రవ్యాదుల, క్రం
దున నీవీను లిపుడు గటకటఁ బడవే.
ద్రోణ. 2.౬౬౯.

కం ఇటయేను నిమ్నుఁ బుత్తెం,చుట
యుత్తరకాల దివ్య సుఖ సంగమసం,
ఘటనకుగాదే నీకట, కటఁ బడుటకు
దీని దెలుపఁగా రావలసెన్. స్వర్గ.
40.

వ. దీనికి నీవు కటకటం బడినం
బోవునే. కర్ణ. 3.85౯.

2. కోపించు.

వ. అనుపలుకు లాలించి కర్ణుండు
కటకటంబడి కుంభసంభవున కిట్లని
నియె. విరా. 4. 97.

కం ఆలయక యందఱుఁ జెప్పం,గల
యంతయుఁ జెప్పిరతఁడు గటకటఁ
బడి యు,క్కొఁలువు వెడలిపోయెంద
మ్ములుఁ గర్ణుఁడు రాజలోకముందోడ
రుగన్. ఉద్యో. 4. 80.

**కటుకము** సం. వి. అ. పుం. న.

1. రాజధాని.

కం...రాఁదొడగిరి భూవిభులు నలు
దిక్కులనులో. కభయంకరలీల ను
భయకటకంబులకున్ ఉద్యో. 1.51.

2. సైన్యము.

వ. ఇట్లుభయ కటకంబులు రణంబు
నకు నుత్సహించి విజృంభించి యుల్ల
సిల్లె. ఉద్యో. 4.210.

3. కడియము

వ. దొల్లిన సకుండల మస్తకంబు
లును వీర కటకంబులును మెఱయ.
ద్రోణ. 2.60.

**కటము** సం. వి. అ. పుం. న.

1. మదజలము కురియునది. ఏనుఁగు
చెక్కిలి.

సీ. మాతంగకటగళన్మద జలబహుళ
ప్ర,వాహ విలాసంబు వానినడఁచె.

కర్ణ. 1.62; సభా. 2.111.

2. కఱఁత.

వ. అనుచు విరాటుండు గటంబుల దురఁగన్నులఁ గెంపుగదురఁ బలుక చప్పుడగ్గలంబుగా నాడుచున్న సరకు సేయక యుధిష్ఠిరుండు.విరా. 5.151.

కం. అనిన విని కెంపు సొంపునఁ, గనుకవ యుగ్రమున బొమలు గదియఁగ ఫాల,మ్మునఁ జెమట వొడమ నీ సుతుఁగనుఁ,గొని యిట్లని యెనతఁడు కటములదరఁగన్. కర్ణ. 1.248.

**కటా** దే. అవ్య.

(సంతాపమును దెలుపును).

చూ. కట; కట కటా.

**కటాక్షము** సం. వి. అ. పుం.

1. అపాంగ దృష్టి, కడగంటిచూపు.

సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జోఁకి మగిడివచ్చు. విరా. 5.395.

2. అనుగ్రహము.

వ; నీకటాక్షంబునుగ్రాప్తసంరక్షణంబునం గలిగి గాండీవంబను పామునకు ఱెక్కలు వచ్చినట్లున్న యది. భీష్మ. 1.128.

వ. అనిపలికి కురుపతిదెసఁగటాక్షవీక్షణంబు నిగుడ. శల్య. 2 122.

**కటాక్షించు** సం. స. క్రి

కడగంటఁ జూచు.

వ. ఆరాజుం గటాక్షించుచు హృదయసంతాపంబుదనకు దాన ఉపశమించుకొని. ఆది. 4.77.

**కటి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

మొల.

కం. ఉరమునఁ గటిమైఁ దొడలం, జరణంబులఁగౌరవేంద్రుచతు రంగంబుల్, ధరఁజాపకట్టు వడని,మ్మరగతి దాఁకుచు సమీర సుతుఁడు చరించెన్. భీష్మ. 2.221; శల్య. 2.269.

**కటికి** దే. విశ.

1. అధికము, మిక్కుటము, మితిమీఱినది.

ఆ.... మేను, కంప మొందఁ గనలు గదిరిన కటికిన,వ్వేసక మెసఁగనన్న కిట్టులనియె. ద్రోణ. 2.276.

2. కఠినము, గట్టిది, క్రూరము.

సీ. కటికినేల ... ఆది. 6.178.

**కటికినవ్వు** దే. వి.

అట్టహాసము ... చూ. కటికి.

**కటికినేల** దే. వి.

ప్రక్కలేని కఠినమైననేల. చూ.కటికి

**కటుకము** సం. విశ. (అ. ఆ. అ).

1. కారము గలది, గాటు అయినది.

కం. అరుణంబులును సకంటక, తరుభవములుఁ గటుక గంధ ధామములు నొన, ర్తురు శాత్రవాభిచారిక, కరణమున నధర్వ మాంత్రికతఁ గుసుమంబుల్. అను.4 7.

2. కఠినమైనది, పరుషమైనది.

సీ. ... ... కర్ణరో, గార్తుఁడు కటుక

వాక్యములఁ దొల్లి నొప్పించిన. కష్టుండు. అను. 5. 99.

3. అప్రియము ఇంపుగానిది.

వ. అమరేంద్రుండు తనమనంబున నితనితోడ, సముచిత సంభాషణంబులు సేసెద నివ్విధంబు గటుక వచనత్వంబు గాదని యూహించి యిట్లనియె. మహా. 71.

**కటువు** సం. విణ. (ఉ. ట్వి. ఉ.)

కారముగలది. గాటు అయినది.

కం. సుమధురమును గటువును దీక్ష్ణమునగు గంధముల ధూపకలన వరుస సుహృద్యములు సురయక్ష రక్షస్స మితులకును దత్ప్రకార జాతులకు గృపా. అను. 4.14.

**కట్టు** దే. వి.

ఒకటిగాఁ జేర్చి కట్టిన వస్తు సముదాయము, మోపు.

వ. ... ... ఇది యుంఛవృత్తియైన మానవు కళేబరంబు గావలయు ననుచు నదియునుం గైదువుల కట్ట పయింబెట్టి కట్టించె విరా. 1.180.

సీ... ఇధ్మములు దర్భ, కట్టయు జల పూర్ణకలశంబుఁ బువ్వులు పఱచి వచ్చితి నేరికి నేటి మడఁగు మార. అను. 2.446.

2. మట్టి – రాయి మొదలగు వానిచే నెత్తుగా నిర్మింపబడిన అడ్డు.

తే. ధీరయైయిట్లు సమ్మదపూరమునకు గఱువతనమను బలితంపుఁగట్ట వెట్టి. విరా. 3.55.

3. చెఱువు, కాలువ మొదలగు వానిని త్రవ్వి యొడ్డునం జుట్టుప్రక్కల ఎత్తుగాఁ బోసినమట్టి (చెఱువు కట్ట, కాలువకట్ట)

ఆ. కట్టఁదగిన తరువులిడిన సుగతి గలుగు. అను. 3.330.

**కట్టనిచ్చు** దే. స. క్రి.

ధరించుటకు భూషణ వస్త్రాదు లొసఁగు.

కఁ. లలిత మణిమయ విభూషణ, ములు రుచిరాంబరములును బ్రమోద మెదఁద నిట్టలముగ హరి కుంతీ పుత్రుల కెల్లను నిచ్చిపిదప ద్రోవది కిచ్చెన్.

వ. ఇట్లుగట్ట నిచ్చి – విరా 5.378-379.

**కట్టలుక** దే వి (కడు+అలుక)

మిక్కిలి కోపము, మెండుకోపము.

మ ... ... కట్టలుకన్ బెబ్బులి గోలనేసినటు లుగ్రాకార మేపారఁగన్ విరా. 2.281.

చం ఘనుఁడు వృకోదరుండు దను గట్టలుకం దలపడ్డఁ గోటి కాస్యుని తురంగంబులందునిమి సూతుని కంఠ ముద్రుంచి అర. 6 281.

**కట్టాయితము** దే. విణ. (కడు+ఆయితము)

సంసిద్ధము, సన్నద్ధము.

వ. ... తానునుం బయనంపుఁ జందంబునఁ గట్టాయితంబై జనంబుల చూడ్కులకుం బండువగుచుఁబుండరీకాక్షుండు. ఉద్యో. 3.182.

**కట్టించు** దే. స. క్రి.

1. బంధింపఁజేయు.

వ. ... నిజధ్వజంబు రథంబునం గట్టించి. విరా. 4.170;ఆది.5.171.

2. నిర్మించు.

తే. గుళ్ళుఁ జెఱువులుఁ గట్టించుఁ గోరియూళ్ళులగ్రహారముల్ గావించు వాఁబికేయుఁడు ఆశ్ర. 1. 7.

**కట్టిఁడి** దే. విశే. (కట్టు+ఇడి) క్రూరము, నిర్దయము; క్రూర, క్రూరుఁడు.

ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్ననా, కట్టిఁడి పీను లేమి విను కాఱియ కోర్వవు. భీష్మ. 1 65.

కం. అట్టేల రాకతకుఙ్ఞం, గట్టిఁడియే యా లతాంగి కామాతురునన్, బెట్టి యచట దానికి మన, సెట్టు నిలుచుఁడ గవు విడువ నెట్టులు నేర్చున్. విరా. 2.297.

**కట్టిఁడితనము** దే వి.

క్రూరత్వము. కఠినత్వము

కం. ఇట్టివి యెల్లను గనుగొను, కట్టిఁడితన మొందునట్లుగా నేమొకొ తొ,ల్పుట్టువునం జేసితినీ, చుట్టల నిటు సూడకుండఁ జొప్పడదయ్యెన్. స్త్రీ. 2 24.

**కట్టికొను** / **కట్టుకొను** దే. స. క్రి

బంధించుకొను.

ఉ. పంటిన శోకభారమునఁ బ్రాణ విమోక్షముఁ గోరి కంఠదే,శంబున రాయి గట్టుకొని సన్మునినాథుఁడు నిశ్చితాత్ముఁడై, యంబుధిఁ జొచ్చినం ... ఆది. 7. 119.

సీ. .... అంతకు కింకరు లంటఁబట్టి

తే. కట్టికొనిపోయి కోసియుఁ గాల్చి యును. అను 4.263; శాం.3.499.

2. (వస్త్రాదికము) ధరించు, తాల్చు.

వ. ... అక్కన్యకలన్యోన్య పరిధానంబులు పేర్వడంగాని కట్టునెడ దేవయాని పుట్టంబు శర్మిష్ఠ గట్టికొనిన. ఆది. 3.134.

ఆ. నాంచీరయేనిఁ జారుచీనాంబరం, బైనఁగట్టికొనిన-యపుడు హృదయ, మొప్పదొప్పుననక యుండురూపాదుల నలమికొనవు చక్షురాదికములు. శాం. 4.60.

చీర సక్కంగట్టికొని. శాం.3.497.

3. సంపాదించుకొను,తెచ్చిపెట్టికొను.

వ నీ చిత్తమ్మున వలవని వెఱవు గట్టుకొని యెదవు. ద్రోణ. 3.295.

వ. నిదుర సావునట్టిదకాదె పీమంగు లుంబోలె బడియున్న వారిం బొడిచి పాపంబు గట్టికొని నరకంబునఁ బడుట మేలె. సౌప్తి 1.82.,ఉద్యో. 2. 222.

తే ... ఊరివారి, కొలయు నెదరుల కెల్లఁ దానుమ్మలికము, గట్టికొని కుందు నట్టులుగాదె వత్స. శాం. 6.320.

4. భరించుకొను, మోసికొను

ఆ. ఓడివచ్చినాఁడను నుద్ధతినాకేల, యుడుకుమాని నీవ యుర్వి యేలు, గఱ్ఱములునునేనుఁగులులేనిబయలునీ,

తలనె కట్టికొనుము ధర్మతనయ. శల్య. 2.72.

5. సంక్రమింపఁజేసికొను.

సీ. ...మంత్రులా, తనిఁబాసి యతని నందను రాజ్యమునకుఁ బట్టము గట్టి కొనిరి. అశ్వ. 1.18.

వ. నీవ సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టి కొమ్మనిన కర్ణ. 1.54.

**కట్టియ** వై. వి. (సం. కాష్ఠం) రూపాం. కట్టె. ఈ రూపము భారతమునఁ గాన రాదు.

కాష్ఠము, పుడుక, చిదుగు.

తే. కత్తి గొడ్డలి యడుగనే కట్టియ లకు. విరా. 1.78.

సీ కోట యేమఱకెప్డుఁ బాటించి గడ్డియు బాణంబుఁ గొల్చును గట్టియ లను, నేయు ... వలయువాని సమ గ్రములుగ సంపాదించి. శాం. 2.284: శాం 3.8.

2. ప్రాసము, ఈటె

ఉ. కట్టియవైచె నెన్నదురుగాఁడ భవత్తనయుండు మాద్రిలేఁ బట్టిని. శల్య. 1.877.

"ప్రాసేన సహదేవస్య శిరసిప్రాహ రత్ భృశమ్" సం. భార. శల్య 1.377.

3. బాణము

సీ. లీలఁ గట్టియతోడఁ గూలంగవైచి యు, డొంకెన పోటులఁబొంక మడఁచి శల్య. 1 340

**కట్టియడుచు** దే. స క్రి.

ముకోౕణము మొదలగు వానికిఁగట్టి కొరడా మొదలగు వానితో గొట్టు. కం. నఱకుటయర్థముగానుటయుఁ, జెఱ ననుచుటకట్టి యడిచి చేర్పాటొందంబ ఱచుటమొదలుగఁగల పలు, దెఱగులఁ దగవు మెయినడచు ధీరవిచారా. శాం. 376

**కట్టు**; దే స క్రి

1. (త్రాళ్లమొదలగువానితో)బంధించు

సీ. నఱ్ఱలనైనను నలువైన వెఱవున, ముట్టియంటగఁబట్టికట్టివిడువ. విరా. 1 101

ఉ...సూతునిపీను. గు మీదఁబాండుపు, త్రాంగనఁ బెట్టి కట్టిరిదయాపరి వర్జిత చిత్తవృత్తులై. విరా. 3.16

సీ. శరభసింహవ్యాఘ్ర సత్త్వచయం బుల. నేడిక లెట్లట్లు యెక్కియాడి, కట్టుచువిడుచుచుఁ గణ్వాశ్రమంబున దమియింపఁగా సర్వదమననామమిడి యె ద్రోణ 2.210.

3. వస్త్రాదులుధరించుకొను

తే. వేడ్కఁదొడిపూసికట్టియ, వ్విరటు దుత్తరుండు దోఁజనుదేరఁ గొల్వుండు బుద్ధి. విరా. 5.317.

చ. కుఁడువగఁ గట్టబంధులకుఁ గోటి విధంబులఁబెట్ట, జన్నము,ల్నడ పంగ యెక్కుడుసిరియిచ్చి స్త్రీ. 1.224., ఉద్యో. 3.318, శాం. 1.348

3. కూడఁబెట్టు, సంపాదించు.

క. ఎట్టవిశిష్టకులంబున, బుట్టియు సదసద్వివేకములు గల్గియుమున్, గట్టిన కర్మఫలంబులు, నెట్టనభోగిం

పకుండ నేర్తురె మనుజుల్. అది. ౬.౬7

4. అడ్డగించు, నిరోధించు

ఆ. అగ్నినంట హిమవదచలంబుఁగ దలింప, గంగఁగట్టవచ్చుఁగాని విప్ర రాజిఁబరిభవింపరాదు. ఆను. 2.155; ఆది.4,164.

5. వ్రేలఁగట్టు

చ. కై దువులెల్ల గేళచ, ర్మావృతసంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం బోవరుదీనిది కొక్కరులు. విరా. 1. 166

క. అలుకుఁదుమృగ మదమున ముగ్గులువెట్టుఁదుగ ప్పురమున ఁగుంకుమము నగో, దలుపూయుఁదుమణిదామక, ములుగట్టుఁదు పెద్దకూటమున సొంపారన్. ఉద్యో 3.152.

కం. కలువదములు మణితోరణ ములుఁ ఁగట్టి రిక్రముక కాండమోచస్తం, భం బులునాటిరి విరా. 5.882.

6. (కట్టగా) బంధించు

ఆ... చాపములును దొనలు వర్మములు నసిముద్గరా. ద్యాయుధములుగూఁడ న తఁడుగట్టె. విరా, 1, 177.

కం సరకులు ఖరవహులకును, భరియింపఁ గొలఁదియయినభంగిని మోపుల్, వెరవుపడఁగఁగట్టుఁడు.. మౌ 187.

7. ఏర్పఱచు

తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి వేరిమివాటించి కరువు గట్టి, పోసిచేసి చైతన్య సంపుటము దగమ, టించిరొకొకయిట్టి చేడియలు గలరె. విరా. 2.37.

సీ. ... మదువులు గట్టు నెత్తురులను. సౌ. 1.177.

చం.. క, వ్వడివివిధోజ్జ్వలాస్త్రములవాని వెసన్ మగిడించితాఁ కు పెల్లదరగఁజే సెమింటి కలయంతయు ఁజిట్టలుగట్టు మంటలన్. ద్రోణ. 3.152.

8. (పూలు. మణులుమొ.) కూర్చు

కం. కలపములు గూర్చ బహువిధ, తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలుపు, వ్వులు గట్టికట్టి మోద్వగదఁ దలముదుచఁగ సరులు గ్రువ్వదద్దయు నేర్తున్. విరా. 1. 320.

కం. పెట్టక కట్టక మౌళిం, బుట్టిన క్రియ దీధితులు నభో భాగంబున్, మట్టివెలుగఁగ నింద్రుని. పట్టి కిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితంబై. విరా. 4.167.

9. (పూలు మొ.) ముడివైచు

క. కలపములుగూర్చబహువిధ, తిలకంబులువెట్టివింతతెరువునఁబలుపు, వ్వులు గట్టికట్టిమోద్వఁగ. విరా. 1.320.

(పువ్వులుగట్టికట్టి మోద్వగ; పూలుదారమునకు గ్రుచ్చిముడి వైచిచెందు గట్టగ)

1. (ఇల్లుమొదలగునవి) నిర్మించు

ఉ. రాజగృహంబుకంటెనభిరామముగా నిలుకట్టు, గూడదు విరా 1.193

అ. క్రి.

1 అగు, ఏర్పడు.

ఉ.వెఱబలంబువురికొనక వెఱం, దెరలు చుఁగుంపులు కట్టుచ.ద్రోణ. 1.244

సీ...ప్రోవుగట్టి,నిలిచినహయంబులం బొలియింపవలయు. కల్యా. 1.368., ఆర. 7.264

వి.

1.బంధించుట, బంధనసాధనమగు త్రాడు. మొ.

వ ఇట్లెసఁగు బహుళకోలాహలంబున హయంబులనిళంబుఁగట్లుద్రెంచుకొని కలయఁబాఱెసా.1.197

2.సూత్రధారణము.

సీ.కాళ్ల యొప్పిదమాడుకట్టనుజ్జ్వలము సేయఁగ.విరా 1;228

**కట్టుకొను** దే. స. క్రి.
(చూ:కట్టికొను).

**కట్టుపకాను** దే. విణ.
అచలుఁడు,ధీరుఁడు

ఉ. అట్టియెడం గనుంగొనిజయద్రథుఁ డున్ద్రుపదుండువచ్చియా. కట్టుపకాసులిద్దఱకు గ్రక్కుననడ్డము సొచ్చి యొండొరున్. బెట్టుగఁదాఁకి. భీష్మ. 1.280

చం. కనుగొనిపార్థతుండపుడు కట్టుపకాసయివీఁకదాఁకినం,దునిమెనతండుతద్ధనువు. భీష్మ. 2.882.

ఉ.. రావుతుల్, కట్టుపకాసులైనరునిఁకప్పిరికక్షుఁదోమంరబులన్. కల్యా. 1.377.

**కట్టుబట్టు** దే. వి. (√కట్టు).
(పశ్వాదులను) కట్టివేయుచోటు,కట్టుమట్టు

వ. కట్టుబట్లకడలఁదిగిచినంజెలంగుకరితురంగంబుల బృంహిత హేషిత ఘోషంబులకు.భీష్మ.1.78.

**కట్టువడు** దే. అ. (√ కట్టు)
బంధింపఁబడు

కం.పరధనహారణముదురితముపరికింపుమువరుణు చేతి పాశంబుల ని,ష్ఠురముగఁగట్టువడకుని,ర్భరనరకకృశాను శిఖలఁబడకు,మమీఁదన్. ఆర.4.148

**కట్టెదురు** దే. వి, (కడు + ఎదురు(
ఎట్టయెదురు, మిక్కిలియెదురు

చం.ధరణిపుచక్కఁ గట్టెదురుదక్కి పిఱుఁదునుగాని యట్లగా, నిరుగెలనం దగంగొలిచి. విరా. 1.129

**కట్టెఱ్ఱ** దే, విణ (కడు+ఎఱ్ఱ) మిక్కిలియెఱ్ఱనైనది.

సీ. .కట్టెఱ్ఱమేను.తే.వనజసన్నిభముఖమునై యినునిమహిమ,యుజ్జ్వలాకృతి దాల్చినట్లున్నయీల,తాంగినా రాయణునిచెలియలుసుభద్ర,నరునివల్లభసంయమినాథులార. ఆశ్ర. 2.42.

శ్లో అస్యాస్తుపార్శ్వే కనకోత్తమాభా, యైషాప్రభామూర్తిమతీవగౌరీ, మధ్యేస్థితాసాభగినీ ద్విజాగ్ర్యాశ్చక్రాయుధస్యాప్రతిమస్యతస్య. సం.భా.ఆశ్ర. 27.10 (వావిళ్ల).

**కట్నము** దే.వి (రూపాం) కట్టనము కానుక, కానుక గానిచ్చెడి వస్త్రము. వస్త్రము.

వ.పాంచాలవిభుండు సపరివారంబు
గా నద్దశార్హపతికి విందుపెట్టి కట్నం
బులిచ్చియతనియనునయాలాపంబులు
గై కొనియనిచిపుచ్చిన.ఉద్యో.4.391,

**కఠారము.** సం వి అ. పుం.

1. ఖడ్గము, కత్తి

సీ.పదద్రోచియును వాలఁగడి కంద
ములు గద్రవేసియును కఠారంబులఁ
జీఱిచెఱిచి. శల్య. 1.340.

**కఠినము** సం, విశ (అ. ఆ అ)

1 క్రూరము.

మ.అనుచున్ క్రక్కునలేచి రోషకఠి
నంబౌహాసమూసూతునె,మ్మనముద్వేగ
ముఁబొందఁజేయబలసామగ్రీ సముజ్జ్వ
ఖణం,బున వానిందలవట్టి వంచుటయు
విరా. 2,340.

("నవీర్యే కఠినాస్త్రయః" కు సం.4)

2,గట్టి కర్కశము.

సీ హంసతూలికపాన్పునందు బొందె
డుమేనుకఠినంపునేలతోఁగదిసెనేఁడు,
ద్రోణ.2.289

**కఠుఁడు** సం. వి. అ. పుం.

1. ఒకముని (ఇతఁడు వైశంపాయనుని
శిష్యుఁడు అని సూ.ఆ.ని)సభా.1.20

**కఠోరము** సం. విశ (అ. ఆ అ).

కఠినము,కటువు.

కం.కర్ణునిసారథినై నను,నిర్ణయమున
కేనుబార్థు నింగాచెదనా,దుర్ణయవిచారు
నెమ్మెయిఁ,గర్ణ కఠోరమ్ము లాడికెలఁ
కున్బోరన్. ఉద్యో. 1.112.

**కడ** దే వి.

1. సమీపము,దగ్గఱ

వ. విరాటుకడకుంజని. విరా. 1.87

క ...ఎగ్గుల్, నొడివెడువివేకశూన్యుల
కడనుండెడునంతకంటెఁగష్టముకలదే
ఆది. 3 149.

ఆ అగ్నిదాహభీతి నంగారపర్ణుండు,
బమ్మరిల్లినేలఁబడినవానిఁ, గొప్పుపట్టి
యీడ్చికొనివచ్చెధర్మజు,కడకునింద్ర
సుతుఁడు కడిమిమెఱసి. ఆది. 7,48.,
ఆది. 6.117.

2. .స్థానము,స్థలము,ప్రదేశము.

క.కొలువుగొననొల్లకుండుట,కలిగినఁ
బొమ్మనుట యంతకంటెనుమేలే, వల
సినకడకేగెదనీ,తలపెయ్యది యానతి
మ్ముధరణీనాథా. విరా. 1.224.

కం.ఎక్కడనడచునుసత్యం,బెక్కడ
ధర్మంబుపఁగునెక్కడ.గలుగుం,బ
క్కటినిలుచుంగృష్ణుం,డక్కడ నతఁ
డున్నకడన యగు జయమధిపా.
ఉ. 3.202 , ఉ. 4.178.

ఆ. ఎంతకాలమైననిప్పాటభరియింప,
నోపనింకనరుగుమొందుకడకు. ఆది.
4.328.

3, అంతము,తుద,మితి,మేర, అవధి.

వ. అనుచు వెండియునిగుడుమనోర
థంబులను భావరతంబులశిరోపచారం
బులఁ బ్రొద్దుగడపి కడగానక. విరా.
2.311.

తే. దెసలుకలయంగఁజూచుచుదిక్కు
దనకు, నెవ్వరునులేమివెగడందునెంత
దవ్వు,సనిన నడవికిఁకడ లేమియును

స్వగ్రప, జంబు పొదుపుటయును గొంద లంబు సేయు. స్త్రీ. 1.48.

సీ. పాండుకుమారులు... వేదంబులును ధనుర్వేదాదివిద్యలుగఱచుచుఁగడలేని యెఱుకఁదనరుచున్న. ఆది. 8.12.

సీ. నిషువునఁ దూర్పును బడమరనై రెండు, గడలు నంభోనిధి గదిసి యుండు. భీష్మ. 1 21.

4. పార్శ్వము, ప్రక్క, వంక, వైపు, పక్షము.

వ. కావునఁ బురుషులు నా కడంజేటి చూడను వెఱతురు. విరా. 1.826.

ఆ. ఎల్లకడలకు వెలువడు నింద్రియ ములు, బాలపుత్రుల దండ్రియు ... నిశ్చలై కాగ్రభావమొందు టుత్తమతపమది యుజ్జ్వలాత్మ. శాం. 5.179.

కం. వెలయంగ నశ్వమేధంబులు వేయును నొక్క సత్యమును నిరుగ దలం,దుల నిడ తూఁపఁగ సత్యము వలనన ములు సూపు గౌరవంబున బేర్మిన్. ఆది 4.94

5. దిక్కు, గతి, ప్రాయశ్చిత్తము.

క. అరివధము పాపమని మది, మెర మెర గవిగిరి దగిన మెయిఁ జేయుము భూవర ప్రాయశ్చిత్తము గృహాంతర యుడుగటమేలె కీడుతోఁ జననగునే.

వ. అనుటయుఁ గౌంతేయాగ్రజుఁడు సాత్యవతేయు నాననం బాలోకించి పుత్రులుం బౌత్రులు నన్నలుం దమ్ములు జనకులు. నాచేత. మడిసిరి. తదీయ స్త్రీజనంబులు పతిసుత సోదర పితృమరణ శోక సంతాపాతిశయంబునం బల వించి పలవించి ప్రాణంబులు విడు తురు. గావున దీని సూక్ష్మంబుగా విచారించిన వనితావధ పాతకంబునుం బాటిల్లు నెయ్యది కడగా నిష్కల్మ షుండనగుదు. శాం. 1.280., 281.

6. దిక్కు, దిశ.

కం. నిగుడు దవాగ్ని జ్వాలల, వెగ డందిన మృగకులంబు విధముననతి భీతి గదిరి నలుగడ విచ్చిన. కర్ణ. 3.208., కర్ణ. 1.208.

7. కాలము. సమయము

సీ. ... సంజకడ నిత్యమును మృగం బుల కురులొద్ది వేకువవచ్చి యొక్క మాలఁదగ పద్దవాని గొంచరుగు. శాంతి. 3.203.

వ. ఇట్లు బహుప్రకారంబులం బో రుచు ప్రొద్దు గ్రుంకినప్పుడురణంబుప సంహరించుచు రేపకడ దొడంగుచుం బెనంగ. ఉద్యో. 4.880.

కం. కొలువిమ్ము మాపుకడ, యోధుల కెల్లను సంధ్యవద్ద దూతలనుం జూపల సంభావింపుము. ఆశ్ర. 1.61.

1. ఇది ద్రుతాంతముగా నుండి అందు, ఎడ, విషయమున, వలన అను నర్థముల నిచ్చును.

క చెడుతెరు వాకౌరవ్యుల, కడనిలు చుంగాక మనకుఁ గ్రౌర్యం బేలా. విరా. 3.150.

చం...గో,ప్రకరములన్ మరల్చుటకు బంధులు నీవును బోవనాకు నిం,టి కడన యున్కి పాడియె. (ఇంటి కడ =ఇంటి యందు) విరా 3 150,

**కడంక**
**కడఁక** } దే వి.

1. పూనిక, పట్టుదల, యత్నము, ఉత్సాహము.

శా. ఉద్యద్విక్రములైన యీ ద్రుపద మత్స్యోర్వీ పతుల్ నిన్ను సం,పద్యోగోజ్జ్వలు జేయఁబూని కడకం ప్రాణంబులీనున్న, నిట్లుద్యోగం బెదలంగ నేమిటికి. భీష్మ. 2.18,

క్రౌంచపదవ్యూ. కౌరవసేనా వీరులు లావుంగడిమియుఁ బలమును గడఁక యెలర్పన్, ధీరత సొంపుం గ్రూరత పెంపుం దెగువయు నెఱపఁగ స్త్రీ. 1.166.

వ. (కుంతి) అని యుత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుంబుట్టువు దెలిపి సహోదర స్నేహ భావం బావహించెద నట్లయిన నాహవంబు వలని కడంక యుడుగ కుండునె యని విచారించి. ఉద్యో. 4.58. ద్రో. 5.87,

2 ధైర్యము స్థైర్యము, బరవసము.

తే. ఇవ్విధంబునఁ గ్రందు పాటింత యైన. భీష్మకడఁక నీ సైన్యంబు భీము బలిమిఁ, జేసి యా సేనయును నప్డు సిక్కువడక. పోరె నేమని చెప్పుదుఁ గౌరవేంద్ర. భీష్మ, 3 108.

వ అమ్మహీనాయకుండు సముత్సాహదోహలియై తఱిమిన మూఁకలు కడంక యెలర్ప దర్పస్ఫురితంబు లగుచు నురవణించినం గని గాండీవి గోవిందున కిట్లనియె శల్య. 1.345.

వ. ఇవ్విధంబున విక్రమించిన భీమ సేను బరవసంబును దదీయ సైనికుల సంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపిచెప్పె. .

వ ఇట్లు భీముకడంక గని కవ్వడి. కర్ణ. 2.358. .61.

3. చేష్ట, వ్యాపారము.

ఆ. పుట్టినంత నుండి యిట్టివి యెన్నడుఁ,గాననెఱుఁనట్లుగాన చోద్య,మంది యంతరంగ మవశతఁ బొందిన, కితన నింద్రియముల కడఁక దక్కె. విరా 5. 113.

4. ఉద్ధతి, గర్వము. విజృంభణము.

కం భూరిశరాసారంబునఁ గౌరవుల కడంక యుడిపె గాంధార బలాం,భో రాశిఁ దఱియఁ జొచ్చిరి, వీరాగ్రణి సాత్యకియును విజయసుతుండున్. భీష్మ. 2. 106.

కం. ఒక్కొఁ డొకఁడ పాండవులఁ దాఁకిక సైన్యోపేత గాఢ గతి నందఱు న్నొక్కొక తలగాఁ దలపడి వారి కడంక యుడుపఁగవలయుఁ గ్రీడయ పోలెన్. శల్య. 1.170.

కం. కలఁగిన సేనలఁ గాచెద,నిలిపెద నర్జునుని కడఁక నఱపెద బాహా బలమా భీష్మఁడెట్ల, గ్గలిక మెఱసె

నట్ల మీకుఁ గన్నులు దనియన్.
ద్రోణ. 1.33,

తే.....కమ్మీరవైరి కయ్యంబు కడక
యిట్టులుండెనె. కర్ణ. 3.163.

5. శౌర్యము, పరాక్రమము, ప్రతాపము.

సీ. మున్నును వీరలు మువ్వురకడఁ
కల కొలఁదులే నెఱుఁగుదుఁ గొంత
కొంత ... విరా. 3.152.

వ. ... నా కడంక గని గురువిభుం
డిరువురు ఫల్గునులను బుద్ధి, గలంగు
నట్లు సేసెద. ద్రోణ. 4.64.

6. కాంతి, శోభ, పటుత్వము.

(ద్రోణుఁడు అశ్వత్థామతో)

చం. తడఁబడె దివ్యబాణముల తం
త్రము మంత్రము దప్పెడుం గడు,
న్వడ కెడుఁ జాపదండము మనంబును
నాకు వశంబుగాదు వీ,ద్వడియెడుఁ
జెయ్యులంగము కడంక దొఱంగెడు
వేఁట భంగిఁగ,వ్వడి తన పూన్కి
దీర్చుట ధ్రువంబని బుద్ధి జనించె
పుత్రకా. భీష్మ. 3.350.

7. మాహాత్మ్యము. గొప్పతనము.

కం. కడు ననురక్తియు నేర్పును,
గడఁకయుఁ గలవారి నుఱక కడ
వఁగ నెగ్గుల్, నాడిపెడు వివేక
శూన్యుల, కడనుండెడు నంత కంటె
కష్టము గలదే. ఆది. 3.149.

**కడఁగించు** దే.సక్రి. ($\surd$ కడఁగు)
1. కడఁగఁజేయు.

కం. సమరమునకుఁ బురికొల్పుచు,
మముఁ దలఁచిన నుల్లికుట్టు మాటలఁ
దచ్చి, త్తము లుడికించుచుఁ బాండవ,
సమితిం గడఁగించు వారచట నెవ్వ
రాకో. ఉద్యో. 2.242,

2. ప్రోత్సాహపెట్టు, ప్రేరేచు.

**కడఁగు** } దే, అ. క్రి.
**కడంగు** } (రూపాం.) కఱఁగు.

1. ఉద్యమించు, యత్నించు, పూను, ఉత్సహించు,

చం, అధిపుమఱంది సింహబలుఁడ
ప్పుకుమొక్కఁగ వచ్చి నన్ను నత్య
ధిక మనోజరాగమతియై కనుఁగొంచు
గడంగి యెన్నియేన్, విధములఁ
బల్కె. విరా.2.170., విరా.1,128.,
అను. 4 408.

(దుర్యోధనుఁడు భీమునితో)

తే. .. విప్రుల వలనఁ బుట్టరె రె
సత్ క్షత్రియప్రభులవనిగావఁ,గడఁగి
మీజన్మములు నిట్లకావె వినఁగ. ఆది,
6.59.

2. ధైర్యముతో నిలుచు.

తే. నేల నాలుగు నెలఁగుల నృపుల
కొలువు, లందు నేను వర్తించితి
నవనినాథ. యగ్గలించి నా యెదుర
బాహువ్పశించి, కడఁగఁ జాలెడు
మల్లులఁ గాననెందు. విరా. 2.7.

మ. ... పాండవులు మోహాంధుండు
భీష్ముండు కే, శవ నీవుం గడగుండు
నాకు నెదురై సంగ్రామ రంగంబు
నన్. సభా. 2.62.

3. మార్కొను, కవియు, తలపడు,

చం మొనలకు హెచ్చుగా మనము మున్న గడంగినఁగాక శత్రులం,గను గొని యిట్టులొ:దొరు మొగంబులు చూచుచు నున్నఁ బోవునే. విరా 4.157.

ఆ. కవలవారుఁ గొడుకు గమియుఁ బాంచాల వర్గంబు వృష్ణి వరులుఁ గడఁగి రేని,నొక్క మాత్రలోన నువ్వెత్తు గొనరె దు,ర్యోధనాది శత ము నుద్దవిడిన. ఉద్యో. 1.29.

కం కవ్వడి యొక్కడ కంటిరె,చి వ్వనఁ జేరుద మితండు చేద్వడఁగా నిం, దెవ్వరుఁ గడంగ లేరివి, ద్రెవ్వి పడిన ధనము లెత్తఁగిరిమి లేఁతెల్లన్. మౌస. 181.

4. సాహసించు, తెగించు.

కం. కిమ్మీర మర్దనునిచే, నిమ్మెయి నోటూరఁ బెక్కులేటులు వడిద,ర్ప మ్మెదలి మూర్ఛ మునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురునాథుఁడెట్లు గడఁ గెనొ యనికిన్. భీష్మ. 2.407.

కం. కుడువను గట్టను బూయను, దొడువను బోఁబనిచి కాక తొలుత మొనసొరం, గొడుకుంబనుచుట కెవ్వ డుఁ,గడఁగునె నా యట్టి పాప కర్ముఁడు దక్కన్. ద్రోణ. 2.142.

5. ఉపక్రమించు, ప్రారంభించు, తొడఁగు.

కం. కొడుకుల నిధనమునకు నా, కడఁగిన హయమేధ మఖము గడచన మికినేఁ,గడు దుఃఖితుండనయ్యెదఁ, దడయక నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్. ఆర. 3 68.

8. సన్నద్ధమగు.

ఉ. ఆతని తమ్ముఁడైన మదిరాశ్వుఁడు కర్ణఝుళంఝుళా సముద్ధూతకులోత్థ రేణుపరిధూ సరితాంబరమైన వారణ, వ్రాతము గొల్చిరాఁ గడఁగి వచ్చె సముజ్జ్వల హేమవర్మ ని,ర్యాత రుచి చ్ఛటా పటల రంజిత హేతిమహోగ్ర సైన్యుడై. విరా. 8.146.

5. అతిశయిల్లుఁ వర్థిల్లు.

(ఈ యర్థమునని తఱచు పాద పూరకము.)

సీ. మోహంబువలనఁ బైమునురు లోభంబు లోభావేశమునఁ గామ మగ్గ లించుఁ, గామంబు పెంపునఁ గడఁగు క్రోధంబు క్రోధంబు వైరమెంతయు నుబెరుఁగ. ఆర. 4.288.

**కడఁత** దే. వి (రూపాం). కణఁత.

కడకంటికి ప్రక్కగా నుండుచోటు. శిరః పార్శ్వము.

సీ. ఆతఁడాతని పెనుఁగడఁత వాలిక యమ్ము గాడనేయ. (కణఁత అని పాఠాం) కర్ణ. 2 174.

కం. పెనుఁ గడఁత దొడ్డయ త్తళ, మునవైచిన నతఁడు మూర్ఛమునిఁగి రథము మీఁ,దన. శల్య. 1.381.

**కడకన్ను** దే వి (కడ + కన్ను) అపాంగము, నేత్రాంతము.

సీ కాంతి దళొక్కత్త నీకడగంటి

చూడ్కితోఁ బొందఁ గానని మేను
పొగులఁటయును. విరా. 2.118.

కం... నరుకడకి,న్నరుణంబగుటయు
దద్రుచి, పరంపరలతోన నిగిడె బాణ
చయంబు. భీష్మ. 2.105.

**కడకొఱవి** దే. వి,

కాలఁగా మిగిలి పొగయు కట్టె.

కం. జ్ఞాతులు తమలోఁ బొందినఁ,
జేతో మోదమువ వెలిఁగి చెలువొందు
దుర,స్నీతిం బాసిన విగతవి, భూతిం
గడకొఱవులట్ల పొగయుదు రధిపా,
ఉద్యో, 2.275.

**కడగను** దే. స. క్రి.

1. పూర్తిగాఁ దెలిసికొను,

చం. విరటుఁడు సూచుచుండ నిమ వే
వుర ముందటనట్లు ద్రోవ నా,క్కరుఁ
డునుగారు గూడదనగల్గెనె పోటరు
లైన భర్త లే,వురుగల రంది వారి
యలవుఁజలముం గడగంటి నింకనె,
వ్వరు గలరెట్లు దప్పెదనివారణఁ
బట్టెద నెందుఁ జొచ్చినన్. విరా.
2.257.

**కడకాలు** / **కడగాలు** } దే. వి. (కడ+కాలు)

1. పాదము, పాదాగ్రము

కం. వడి నసురవాత ముక్కున,
నుడుగక రక్తప్రవాహ మొలకఁగనలు
కం,గడకాలు వట్టి వానిని, మడవక
పవనజుఁడు నూఱు మాఱులు వీచెన్.
ఆది. 6.214.

(కడకాలు అని సం.ము).

**కడచను** దే. అ. క్రి.

1. మరణించు, చచ్చు.

వ. ఇంతకు ముందు కయ్యంబు
నం గడచనిన మనవారిని వారివారిని
నేర్పడం జెప్పుమనిన. కర్ణ. 1.17.

సీ. జననాథ శల్యుండు సకుసె
సౌబలుఁడుగీ, టదఁగె నులూకుఁడు
మడిసెనం, శ ప్తకులు గడచనిరి.
శల్య. 1.9.

సీ. అంబరీషుండు నా నాధ్వరంబులు
సేసి కడచని వాసవు కడకునేగి.

2. క్షీణించు, నశించు

ఆ ఇట్లుసేసి శక్తి యెల్లను గడచన్న,
నతఁడుద్రాలె. అను.1.99.

3. ముగియు, పూర్తియగు, సమా
ప్తమగు.

కం. అనఘా యీయజ్ఞము విధి,
సనాథబుత్విక్ప్రయోగ సంపూర్ణంబ,
య్యును గడచన నేరదు నడు. మన
యుడుగును భూసురోత్తమ నిమిత్తము
నన్. ఆది. 2.209.

తే. వత్సరంబునఁ గడచను వ్రతము
దాక...,గృజ్జిత నెఱపి తొల్లి,యెగ్గు
సేసినవారి జయింపబోదు. విరా.
1.195., శాం. 6.126.

కం. కొడుకుల నిధనమునకు నా,
కడగినహయమేధమఖము గడచన
మికి నేఁ,గడు దుఃఖితుఁడనయ్యెదఁ
దడయక నీవిపుడు దీనిఁదలగు
ముకడఁకన్. అర.8.68

4. కొనసాగు. నెఱవేఱు, సిద్ధించుఁ

కం. బలవంతుఁడైన శత్రుని, వలన
బ్రయోజనము గలిగి వలను కలిమిఁ

దాఁ, గలసియునది కడచనఁగాఁ దొలఁగవలయు నమ్మెనేని ఁదుదిగిడొలయున్. శాం.3.288

5. కడచు, గతించు, విడిచిపోవు.

వ. అనుటయు సంజయుఁ డమ్మనుజపతి కిట్లను వగచు గొలంది కడచని యె,ధీరుండవై వా ర్తలనవధరింపుము. శల్య.1.109

స. క్రి.

1. దాఁటు, అతిక్రమించు

వ.అంతనినుఁడపరగిరికడచనినం గాలోచితకృత్యంబు లాచరించి. అను. 2.299

2. అతిశయించు, మిగులు

ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁడై, య్యంగము పట్టివెల్ల తలయొల్లియుమౌళిద్భరంబు గానమ, ర్చెంగురునాథ పూర్ణశశి చెన్నునఁబూర్వ మహీధరంబుకాం, తింగడచన్న యఁదము ప్రతీతముగాఁ గ నటించు చాడ్పునన్. కర్ణ 3.327.

**కడచిచను** దే. అ క్రి.

1. ముందుపోవు, (బయలు దేఱినవారి నందఱ నతిక్రమించి ముందు గాఁబోవు)

వ...పుండరీకాక్షుండు విదురుసదనం. బునకుం జనియెదననిపలికి యాంబికేయు ననుమతివడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచిచని మంగళోపచార సహితంబుగా నెదుర్కొని. ఉద్యో 3.180

**కడచు** దే. స. క్రి.

1. (నదీసముద్రాదులను) దాటు, తరించు, లంఘించు

తే. ప్రళయకాల సముద్రము భంగిఁ బొంగికడు భయంకరుఁడగు భీముగడవనీద, వళమెనా పుత్రులకు విధివశము నొంది యెదిరిఁదమ్ముని నెఱుఁగరుమదముకతన. ఉద్యో 2.190.

తే. ఘనతర ప్రజ్ఞయను తెప్ప గలుగువాఁడు, సంసరణ నదికడవంగజేలుఁగాక, కామమును క్రోధమును మదిఁ గలిగి ప్రజ్ఞచించునేని నక్కడచుట చిక్కువడదె. శాం. 5.86.

కం. వారలు వారిధి గడవఁగ, నేరకతారున్న యెడన నిల సత్త్వమునన్ వారిధిలంఘించె మహా. వీరుఁడు హనుమంతుఁడనఁగవిం్రుఁగ పీంద్రా. అర. 3.327

2. ఉల్లంఘించు, జవదాఁటు, అతిక్రమించు.

ఆ. వేదవిదిత విధుల ఆచరించుట యూర్ధ్వ గతికిఁ దెరువు విధులఁగడచియెందు నాఁగఁ బడిన వానిలోఁ గక చేయుట యధమ గతికి మార్గమనిరి మునులు. ఆది. 3.220.

3. అతిక్రమించు, మించు,

కం. తలఁపగ రిపులకు నిమ్మగు, కొలది గడచి వచ్చితిమి. విరా. 4.93; 2.91.

కం వెనుక దెసవచ్చికదిసియు, దనరథము దొలంగనిచ్చి తఱియఁబడుట కొల్లని తలంపు గలిగి క్రీగంటన మనలం జూచుచుం గడచి యట నడచెన్. విరా. 2.58.

కం వడిగొని కౌరవులొండొరుఁగడవగ
మునుచనిరి వారిగర్వము సూడం,గడి
మిని ద్రుపదాధిపుతోఁ బొడువగ
దమ కలవి యగునె భుజవీర్యమునన్.
ఆది 6,67 , భీష్మ 2.80.

4. తొలఁగిం చుకొను, తప్పించుకొను
తరువోజ-ఏనును బ్రజలును నీ ధర్మ
సతియు నే యుపాయంబున నిబ్బారిఁ
గడవగా నేర్తుము. ఆది. 6.250.
సీ. బిరుదులనైనను బిఱికివాండ్రను
నైనఁజంపుచోఁ గడపఁడు జముఁడు,
స్త్రీ.1,25 ,విరా 2.208 ,ఆశ్వ3.32.

5. త్రోసి పుచ్చు.
తే.తమ్ము చేసిన దురితముల్ దలఁగఁ
బూని, ధర్మబుద్ధివై వ్రతములు పేర్మి
జలిపి, తనను నీకు నభీష్టంబులైన
వరము, లడుగు మిచ్చెదమీ మెచ్చు
గడవనగునె. అర. 3,279.

7. మించు, అతిశయించు.
వ. సహదేవుండా శైనేయు నుద్దేశించి
మిమ్మును బాంచాలురం గడచినబంధు
వులు మాకును మమ్మును మిమ్మును
మిగిలిన బాంధవులాపాంచాలురకును
వారలకంటె మాకంటె నెక్కుడు
సుహృజ్జనులుమీకునలేకునికిదెల్లంబు.
ద్రోణ. 5 371.

తే, ధర్మమును సత్యమును నుచితంబు
నిన్ను,గడవనెఱిఁగెడు వారలు గలరె
యధిప శాం. 1 90.
వ (ధర్మజుఁడు)కృష్ణునాననం బాలో
కించికర్ణునిగ్రహించుటయశక్యంబయ్యె
సుయోధనాది కౌరవులు గనుంగొన
వానిచేత బరిభవింపబడియేను జీవంబు
తో నునికిం గడచిన కష్టంబునుం
గలదే. కర్ణ. 3.62., అను. 1.84.

అ. క్రి.
1. గతించు, జరిగిపోవు.
ఉ; వారలు పూనినట్ల వనవాసము
సల్పిరి. వీరుశేచితమ్మారయఁగా బయ
ల్పడని యట్లుగ నుండెడు వత్సరం
బును జేరువ బేరువల్ గడచె.విరా.
3.106

2. తొలఁగిపోవు.
ఆ. అరయ జీవలోకమధ్రువమన నరు
నొడలి బ్రదుకుఁజావు గడవదనఁగ
వినియు. స్త్రీ. 1.68. ఉద్యో 1.107
కం. ఇమ్మహియెల్లనునీమది,యుమ్మ
లికకుఁ జాలనొచ్చె నుర్వివర నీ,
విమ్మెయి నిప్పుడఖిలదురి తమ్ములు
గడచుటకు సమ్మదమ్మును బొదవెన్.
ఉద్యో. 1.107.

3. మేరమీఱు, మితిమీఱు, మర్యాద
నతిక్రమించు.
కం. కను వనురక్తియు నేర్పును,
గడకయు గలవారి నులుక కడవఁగ
నెగ్గుల్,నొడివెడు వివేకశూన్యుల,కడ
నుండెడు నంతకంటెఁ గష్టము గలదే
ఆది.8. 149

4. తుదముట్టు, పారమునొందు.
కం.మనకడకునేమిదికివ,చ్చెనొకోయే
నిమ్మహాత్మ చెప్పిన పనులెల్లను
జేయువాడ గోరిన, కనకాంబర
మణులు దలపు గడవఁగ నిత్తున్.
విరా 1.187.

**కడ చేరుచు** దే. స. క్రి. (కడ + చేరుచు)=కడతేర్చు
1. గట్టెక్కించు, కృతార్థునిచేయు

కం......కౌరవుల మేటిపీవ కావున
నీపీ భారంబు పూనిమముఁ గడచేరువ
దగు నెమ్మెయిం బ్రసిద్ధ చరిత్రా.
ఉద్యో.4.145.

**కడతేర్చు** దే. స. క్రి. (√ కడతేఱు)
కడతేఱఁజేయు.

1. కొనసాగించు, నెఱవేర్చు, నిర్వ
ర్తించు.

సీ. తొడగిన పని చలం బెడపక
యతి దుష్కరం బైన గడతేర్చు
ప్రభువులార. విరా. 3.21.

ఉ...అ ప్రతినల్ గడతేర్చుగాక బొం
కాడునె ధర్మజావరజుఁడంచు దదా
ప్తులు వంత బొందగన్. కర్ణ.3.142.

2. చంపు, వధించు.

కం. కురుతనూభవుఁడుపది,దినముల
గడతేర్తు ననియె ధీరవిచారా. ఉద్యో.
4.414. చూ. ఉద్యో. 4 404.

కం కానయవశ్యము బెనఁకువ. గాని
యుపాయమునఁబగఱఁ గడతేర్చు ధృ
తింబూని నడచు నెవ్వఁడుడెం, దానం
జెయివెట్టికొని యతఁడు నిద్రించున్.
ఉద్యో 3.19.

చం.అలఘువిచార నాయలంత యార్చు
ము నన్ గడతేర్చుమెమ్మెయిన్ ఉద్యో.
3.201

**కడతేఱు**

1. నెఱవేఱు, సిద్ధించు

ఉ. ముందటియట్ల యింకఁ బదు
మూడు దినంబుల మాత్రకున్ భవ,
న్మందిర వాసమియ్య కొనినంగడతేఱు
మదీయవాంఛ విరా. 3 62.

కం. మునినాథ దేవకీ సుతు,డును
సంక్రందన తనూజుఁడుం బూనినయా,
పని యెమ్మెయిఁ గడతేఱెనొ, వినవల
తుందేటపఱువవే పరిపాటిన్. ద్రోణ.
2.379.

కం.వినుమేను జేయఁబూనిన, పనులం
దొకటికడదిఱెఁబాపాత్ము సుయోధను
బొరిగొని తలదన్నుదు, నను రెండవ
పనియుఁ దీర్చనరిగెద నెలమిన్. కర్ణ.
3.225

2. ఱీఱు, నశించు

తే. బుద్ధియు నుబ్రాణమును నిన్ను
బొరయఁజేయఁ,జాలు భక్తి నాకొసఁగు
ము జలధిశయన, పూర్వకర్మఫలం
బులుపొందుఁగాక, యవి ఋణంబులు
కడతేఱుటయైసుఖించు శాం. 4.745.

3. ముగియు, సమాప్తమగు,కడచను.

సీ. ......పూర్ణ చంద్రుండు మలిను
డై కానవచ్చిన నాయువు సంవత్సరం
బునఁ గడతేఱు రాజముఖ్య. శాం.
6.126.

**కడపల** దే వి. ల.

అంతము. చివర

వ. పాండవులువన వాసంబుసముచితం
బుగా జలిపి పంద్రెండగునేటికడపటఁ
దమకు ధర్మ దేవతా సమాగమం
బయిన, విరా 1.46.

సీ వనమున నప్పాండుతనయులుండఁ
గనందు వరుసఁ బంద్రెండగు నేటి
కడపటఁ దమకు ధర్మదేవతా సమాగ
మంబయిన విరా 1.46.

సీ. వనమున నప్పాండు తనయు
లుండగ నందు వరుస బంద్రెండగు
వత్సరంబు కడపట నింద్రుఁడు

గడఁగి పాండవహిత కారియై కర్ణుని కవచ కుండలములు మాయా ప్రయోగమున హరింపగఁ దలఁచిన ఆర. 7. 252

**కడపి పుచ్చు** దే. స.క్రి. (కడపి+పుచ్చు)

1 అభీష్టము నెఱవేర్పక పంపు

గీ శరణు సొచ్చిన రక్షింపఁజాలి యుండి కడపిపుచ్చిన పూర్వలోకములు దప్పు, ఉద్యో. 1.161.,ఆర. 7.284.

2. నివారింపఁజేయు, ప్రశాంతి నొందించు

వ. ...కృష్ణుండీయుపాయంబున నప్పరమ సాధనంబు గడపి పుచ్చె. ద్రోణ. 5. 390. (చూ: దోణ. 5 289 )

**కడపు** :_ దే.స.క్రి $\sqrt{\ }$ కడచు)

1. నడపు

సీ సారథి సొచ్చెఁదేరును గడపుచు నేయుచుఁ గయ్యంబు సేయువారు. విరా. 3.168.

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నోహటింపనేల యంతియ వలసినః దురంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువ వలయు. విరా. 5.187

కం....మత్స్యగంధి యనఁగా ధర్మార్థంబుగఁ దన తండ్రినియోగంబున నయ్యమున నోడఁ గడపుచు నుండెన్. ఆది. 3,84

2. జరపు, వెళ్ళబుచ్చు

కం. మనమొక యేవురమీ యం, గనయుం దోనరుగు దేర గానెయ్యేడఁ బోయిన నెఱగకుండుదురె యిద్దినములు గడపంగ నెద్దిదెఱగయ్యెడినో విరా. 1.19

వ ఇట్లు పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటునగరంబున వర్తించుచు గతిపయ దినంబులు గొఱంతగా నేడు కాలంబు గడపిన సమయంబున. విరా.2. 22

తే. కడపితే రాత్రి సులభసౌఖ్యంబు గా మనంబు గాఢప్రసన్నమేయంబు జాఘ. శాం 2.4.

3. దాటించు, తరింపజేయు

వ. అమ్మహానుభావుండు సంసార సాగరంబుగడచుటకా దాశ్రితులను కడపం జాలియుండు. అను. 3.316.

4. తపించు,తొలఁగద్రోలు,దాటించు.

కం కదిసిన బలములు విచ్చినఁ గదువులఁ బెదరంగనీక గాండీవి వెసం, బొదివి యట కడపెనవియును గొనకొని తల పొలము సొచ్చె గోపాలురతోన్ విరా. 4,272.

5. ఈయక పొమ్మను.

క. అడిగినయప్పుడ చెచ్చెరఁ, గడపిన బోనవ్వయేను గడుదుర్మతినై, పడఁతి నను నిలిపి క్షైత్రం, బిడకకడునవజ్ఞ సేసితేల ముడిముగన్. ఆర. 5.13

సీ. ప్రాణంబులకు విధారకమన్న మింటిజ, నంబులకుడిగి యైననుసు భక్తి, నతిథికిఁ బెట్టుటయధిక పుణ్యము శ్రాంతు, వృద్ధుఁ దాపసు బాలువికలు

వనితఁ, గడపగాదాఁకలి గదిరి యర్థించిన. గృహమేధి అను.2 821

6. పోఁజేయు, ఎదుర్కొనకుండు.

కం. బిగువెడలక నిలిచిపడున్,నగము లువేతనచయంబు నమ్రంబై పెల్లగు మావేగము గడపియె, సఁగుఁ బూర్వ స్థితిన బ్రదుకు సమ కూరంగన్.శాం 8.88

7. ఆఁపు. ఆఁగఁజేయు

సీ. మనమునను బుచ్చమై మాట నాలుక కురాఁగడగిన నాడక కడపి కడపి విరా. 8.55

8. విడిచిపెట్టు, వదలు.

సీ. బిరుదుల నైనను బిజికివాంద్రను నైనఁ జంపుచోఁ గడపఁడు జముఁడు నేర్పు, లావును మర్త్యుని చావు మాన్ప గలేవు రణ మొనర్చినఁగాని కాదె మర ణము స్త్రీ 1.25

కం. బలిభిక్షము, గడపకిడ స్వలయు సుదేవపిశ్రి పూజనంబుల కాలంబుల. అను 5.296.

(కుంతి కర్ణునితో నన్నమాటలు)

చం గొంతిహృదయంబున శోకముని వ్వటిల్లని.ట్లనునిది దైవ సంఘటన మక్కట యెట్లును దప్పనేర్చునే, యనుపమసత్య విస్ఫురణ నాడినమాట మణాకుమన్ననీ, యనుజుల నల్వురం గడపు మర్జునుచేతకుసమ్మతించితిన్. ఉద్యో. 4.70.

శ్లో. త్వయా చతుర్ణాః భ్రాతౄణా మభయం శత్రుకర్షణ దత్తం తత్ప్ర తిజానీహి సంగర ప్రతిమోచనమ్ సం. భార. ఉద్యో. 145.26.

**కడమ** దే. వి.

కొఱఁత, లోటు, లోపము, వెలితి

సీ. అన్నకుమార నీయట్టి సత్పుత్రుఁ డు గలుగ మాకేమిటఁగడమ సెపుమ. అర. 5.105.

2. శేషము, మిగులు

కం. తెగఁదీర్పకతగనార్పక, తెగటా ర్పకకడమకొంత ద్రిక్కఁగనున్నన్. జగదీశ యప్పు నగ్నియుఁ బగయును కడుఁబెరుగుఁ గీడు వాటిల్లు దుదిన్. శాం. 3.226.

విణ.

1. శేషించినది, మిగిలినది,అన్యము, ఇతరము.

వ. కులతియును దాని రెండుభాగసులు సేసియందొక భాగంబు భీమునకుం బెట్టి తక్కిన భాగంబు కడమకొడు కులుందాను గుడుచు ఆది 6.238.

**కడమవడు**. దే. అ. క్రి.

1 మిగులు, శేషించు

బంధురవృ... ద్రౌపది పుత్రులలో, నొకడును బ్రదుకక పొడిపొడియుఁ గ నయ్యర్వికి వారల మామల మస్త కములు కడమ వడక వడి బలిగా సంతసమందు పిశాచతతుల్. స్త్రీ. 1 115.

2. కొఱఁతపడు, తక్కువయగు

చం ఎడపక వాఙ్మనః క్రియల నేరికి హింస యొనర్పఁబూన రెయ్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు రిచ్చుచోఁక,డమ వడంగ ని కెదిరి కాంక్షితముల్ తుదిముట్టఁదీర్ప

రె,క్కుఁడు మది గూర్తు రాత్రితులకు
న్వి ను మిన్నియు నార్యధర్మముల్.
ఆర. 7.227.

**కడయెయ్యు** దే. అ. క్రి.(కడ + చెయ్యి)
1. సమాప్తమగు, ముగియు, అంత
మగు, నిశ్శేషమగు
(ద్రౌపది కీచకుని వలని పరాభవ
మను భీమునకు జెప్పుచున్నమాటలు)
ఉ. అక్కట మోసపోయి యడియాస
లఁజావక యున్నదానము,న్నొకక్కడ
నే దురంత దురితోత్కట బాధలఁ
బెట్టియున్న నా, కెక్కడి దుఃఖశాంతి
కడయెయ్యుట యెమ్మెయికల్గనేర్చుమీ,
ముక్కునమూర్చుగల్గనొక మూర్ఖునిచేఁ
బడితిన్ సభాస్థలిన్. విరా. 2. 226.

2. ఫలించు

కం. ఆసుకృతము గడ యెయ్యిమ,హా
సత్త్వయోగ సేవనారామత ను,
ద్భాసితుఁడ వగుచు నిష్ఠా, వ్యాసంగ
విహారి వగు మనామయలీలన్. శాం.
5-260

తే. బ్రాహ్మణత్వంబు గడుదుర్లభంబు
దాని,నెట్టకేలకుఁగనిక డయెయ్యఁజేయ,
వలదె తపముద మంబు నిశ్చల వివేక,
సంపదయునూఁదినరుఁడు దుస్సంగము
డిగి. శాంతి 6.230.

**కడలి:** దే.వి. (కడలు + ఇ, అలలు
కలది) సముద్రము
తే. పాలకడలి తీరమునఁ దపఃబు
సేసి శాం 6 401
చూ కడలు

**కడలు** దే. వి.
అల, తరంగము
ఆ. పాలకడలి కడలపాటియై యొప్పు
న,ప్పొన్నునందు శౌరి పవ్వడించె.
ఉద్యో 3.2 44
(సం.ము న ఇది పాఠము. ఆ ము ఇది
పాఠాంతరముపాలకడలికకడపాటియై
యనునది పాఠము కాని ఇది సం.ము
న పాఠాంతరముగఁగూడలేదు)

**కడలుకొను**దే. అక్రి. (కడలు + కొను)
**కడలొ్కను:** అతిశయించు.
కం తలపడి తలమీఱిన కాల్బలముల
బొడిసేయు మఱియు బైపైఁ బీనుం,
గులఁద్రొక్కుకొనుచు వెసముంగలి మొన
గవియుటయుగడకకడలు కొనంగన్
విరా. 4.152.
కం. ఉత్తరనలంకరింపను దాత్తాభర
ణాది వస్తుతతి యొసఁగి నరేం,ద్రోత్త
ముఁడు నేర్పుగలచెలి, కత్తియలం బు
చ్చెఁ బ్రాతి గడలుకొనంగన్ విరా.
5.288
2. వ్యాపించు, ప్రసవించు, కాలు
కం. అనవినుచు తేరుదిగి గ్రక్కునఁ
గౌఁగిటఁజేర్చె విరటు కొడుకును
గుంతీ, తనయుఁడు సమ్మదమునఁదన
కనుఁగవఁగడు నశ్రువారి గడలుకొనం
గన్. విరా.4,152
మ... ... ... గ్రద్దె పొందెదలి వీకంగే
సరంబుల్గడ,లొ్కనఁ దోడ్తో మదు
వుచ్చిపేరెలమి ఁబొల్పొంబొందె నంభో
జముల్ ఉద్యో. 2 110.
3. క్రమ్మ, పొదువు, పొందు.
చం. ... నద్గదిక నెలుంగుగడలుకొన.
ఆశ్ర. 2,31. మౌస, 107.

4 పెనఁగొను పిరిగొను

కం తన తనువు వనితమేనును, గను
గొని యచ్చెరువు ముదముఁ గడలు
కొనఁన,మ్మునితో భవత్ర్పభావము,
గొనియాడగదరమె మాకు గురుతర
కరుణా.అను 2.312

5. పొంగు, ఉప్పొంగు

ఆ....కథవినంగనాకు గౌతుకంబు,
మనముఃనుండిగడలుకొనుచున్నయది.
ఉద్యో. 3. 412.

వ...కర్ణుండుకనలునఁగనుఁగవకెంపు
గడలుకొన నమ్మద్రపతిం జూచు
చుంజూచి.. కర్ణ 3. 816.

**కడలు కొలుపు | కడలు కొల్పు** | దే స క్రి.

(√ కడలు + కొను)

1. వ్యాపింపజేయు

వ ...క్రొత్తయగు కాంతిప్రవాహం
బులం గడలు కొల్పు పుప్పొళ్ళుదుల్చి
రాల్చుచుం బొలయు మలయానిలం
బునం గ్రాలుమవ్వంపుఁదీవలఁగడివో
యితొరగిన విరుల వలన మీన కేతన
పురాతన బాణశాలలంబోని లతా
మఃడపంబులును విరా, 2.240.

సీ.కనుకమై నిగిడిన కనుఁగవ మెఱుఁ
గుల గములు మఃదట గెంపుగడలు
కొలుప ద్రోణ. 1.817.

**కడవ** వై వి

1. కుండ

సీ . నృప విను కడవకు సారెపై
నమరమృత్తికయిడునపుడు విరియుట
యును. ..గీ. గలుగుగతి మేనికెట్లును
గలుగుఁజేటు స్త్రీ. 1.34.

తే.... ఓటి కడవ నీళులు వెట్టిన
కరణియగున,పాత్ర జనులకుఁబెట్టుట
పౌరవేంద్ర. శాం, 1.332.

**కడవఁజెప్పు** దే, స. క్రి.

1 మిగిలినది చెప్పు

కం.చెప్పంగలయది యెల్లను, జెప్పితి
నీకింత గడవఁ జెప్ప నొకఁడులే.
డిప్పాట నెలల నాటిఁ, జొప్పడు
యోగంబు నియతి శుద్ధాత్మునకన్,
అశ్వ. 1.229.

**కడవఁజేరు** దే. అ. క్రి.

1, కూటికుండదగ్గరకుఁజేరు,తిండితిన
బోవు చూ· కడవ. ఁవ అర్థము.

**కడవంబడు** దే. అ. క్రి. (√ కడచు.
స్వార్థమున పడు)

1. మించిపోవు, చేజారిపోవు.

కం. పరిభవ కరుఁడగు కీచకుఁ,బరి
మార్చుట యిపుడు గడవఁబడియె
నెయిమ్మె, దురపిల్లనేల వ్రేల్మిడిఁ,
బొరిగొని నీమనము కలఁకపుత్తు
లతాఃగీ. విరా. 2.188 ,కర్ణ.3.213.

2. జరిగిపోవు, గతించు

కం. వెదపనికి నాలి జంపఃగొడుకుఁ
బనిచి వచ్చినాఁడ గ్రూరత్వమునం,
గడవంబడునొకొ పనియని,కడువెస
జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్.
శాం. 5.281. ఉద్యో. 4.187.,
ఆది. 2.221.

కం. పదపడి దుస్తరమగు నీ, పదు
మూడవ యేడు గడవబడుటయరిది.
ఉద్యో. 1 9.

వ. కడవం బడినదానికి వగవంబని

లేదు. కర్ణ. 1. 228.

**కడవఁబలుకు** దే. స. క్రి.

1. నిందించు, నిరసించు

కం. మతిమంతులైనవారికి, హితు లగువారలెఱిగింతురుదు,స్థితిగాకుండఁ గ గార్యము, గతి యొత్తియుఁ దప్పు లిడియుఁ గడవఁబలికియున్. స్వా 1.80.

**కడవం బెట్టు**
**కడవఁ బెట్టు** } దే. స. క్రి.

1. తొలఁగించు

కం.అవద గడవంబెట్టగ, నోపిశుభం బైనదానినొడగూర్పను మా, కి పుట్టువునకుఁ బాండుక్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా. ఉద్యో. 3.6.

2. (కష్టాదులనుండి)దాటించు,తరింప జేయు

సీ. మీ దయాసుకృతాదుల పెంపు మిమ్ముఁ గడవబెట్టకున్నె. ఉద్యో. 1.168

కం. నడవడి యను మన్నింటిం,గడ వం బెట్టంగ నోడకరణిం దగి తా, నొడఁగూడు ననిన సత్యముఁ,గడచిన గుణ మింకనొండు గలదే యరయన్. ఉద్యో. 2.39.

3. ఉద్ధరించు

కం ఆపత్సముద్రమగ్నం,బైపోయెడు నస్మదన్వయ. బు పెంపెసఁగం, దేపయయి కడవఁబెట్టిన, నీపుణ్యచరిత్రకీర్తనీయము తల్లీ. అర 7.273.

**కడవఁబోవు:** దే. అ క్రి.

1. మించిచను. దాఁటిపోవు. అంద కుంద వెళ్ళు

కం, గోవులకు వెనుక యైవెసఁ,బోవుచు నున్నాఁడు గడవఁ బోవక యుండం బోవలయు నడ్డపడియెడు, దీవస మెదఁ గలిగెనేని దేవర కడకున్. విరా. 3.137.

**కడవసము** దే. వి

ధార్యచర్మము =ధరించుట కుపయోగించు తోలు

కం. కడవసములుఁ గోలలుఁగ, ప్పడములు వీరలధనంబు. ఆది. 7.225.

**కడవాఁడు** దే. విశే. (కడ + వాఁడు

1.సమీపమందుండువాఁడు, సేవకుఁడు (నకులుఁడు ధర్మరాజుతో నన్న మాటలు)

కం ...నాతొంటివిధం, బా మనుజేశ్వరుఁడడిగిన నే మీకడఁవాడ నందు. విరా.1.96

2. చివరవాఁడు, కనిష్ఠుఁడు.

చూ: పైని యుదా

**కడింది**
**కడిఁది** } దే. విశే

1. గొప్పది. అధికము, పెద్దది

చం....కోలు పులినైనను గారెనుపోతునైనను, న్మదకరినైన నుగ్ర మృగ నాథుని నైనను గట్టి ముట్టి బెట్టిదము గఁగాలఁగేలను గడింది మగంటిమి యుల్ల సిల్లఁబట్టుదు. విరా. 1.78.

అ అనుచు బెలుచ నొంప నచ్చటి జనములు,గలఁగియపుడు మేలుకాంచి

చూచి, భయముతోఁప గడిఁదిబలుగా ముగాఁ దమ యుల్లముల దలంచి యొదిఁగియుండ. సౌ ప్తి. 1.157.

2. అసాధ్యము, అశక్యము.

ఉ....అమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందునేలపా,టిల్లెడు వారిఁగాన్పనుగ డిఁది తదీయ మహానుభావలన్. విరా. 3.92.

వ....నీయందు సర్వభారంబును బెట్టి సుఖినై యుండెదినడపుటనీకెప్పుడేనిఁ గడిఁదియైతోఁచె నప్పుడేను దోఁచి సమస్తంబును సునీతంబు సేయంగల వాఁడననియె. శాం.6 517.

ఆ నవసి పొవసి యనుదినముఁబర ప్రేష్యలై,యునికి దలఁ పనర్థమునక చూవె, యట్టి దుఃఖ లబ్ధమైన యయ్యర్థంబు, విడుచుటెవ్విధమునఁ గడిఁది గాదె. అర 6.111

3 బలముగలది, భయంకరము. ద్రోణ. 1.223.

వ...కడింది పగఱకు హృదయశల్యం బగుట గాదె నీకు శల్యుండను నభిదానంబయ్యె. కర్ణ. 1.252.

మహాస్రగ్ధర...తన్నెల్లవారుం గడింది యసుర సాంగానతి క్రూరచేష్టో,ద్ధతి యొప్పంజొచ్చి సైన్యాస్త్రముల నతని యస్త్రంబులద్రుంచి. సౌ ప్తి 1.191.

4. శౌర్యము గలది, పరాక్రమము గలది.

వ.. వెడఁగువడుచుం బెనంగు కడింది మగలును ద్రోణ. 1.280.

వ కవలు కడింది మగలు సాత్యకి సత్యపరాక్రముండు. ద్రోణ. 1.96.

వ. ... కేకయ పతులేవురు సహోదరులు మహారథులు గడింది మగలు. ఉద్యో. 4. 265.

వి.

కడిమి, శౌర్యము.

చం. .... మా,కడిఁదియులావు నీవస దుగా గణుతింపకు గెల్తు మెమ్మెయిన్. ఉద్యో. 2. 204.

(కడిమికి పాఠాంతరము)

**కడికండములు** | **కడికండలు** దే.వి.బ. (కండలు+కండలు)

ఖండ ఖండములు, ముక్కలు ముక్కలు.

మ. ... తురంగాంగముల్, గడి కండలు చేసి. ద్రోణ. 5. 114.

ఉ మండుచు వచ్చు దానిఁబదిమార్గణముల్గొని వేగమొప్పనా, ఖండల నందనుండు గడికండలు చేసిన. విరా. 5. 151.

**కడిమము** దే. వి.

మాంసపుఁగూడు.

వ. ... అప్పుడ చంపి తిత్తొలచి గాలిగొన వైచిన కుక్క కడిమంబు గనుంగొని. శాం. 3. 265.

(కలిమము అని శ.ర.,సూ. ఆ. ని).

శ్లో. సదచర్మ శ్వమాంసస్య కుతంత్రీ వితతాం మునిః. సం. భార, శాంతి. 141. 32.

**కడిమి** దే వి.

1. బలము, పరాక్రమము, శౌర్యము. కడిమిమై సౌగంధికమున యక్షుల

మద, మదఁచి కృష్ణకుఁ బువ్వులట్లు దెచ్చె. విరా. 1. 74

కం. తన కడిమి కలిమి నచ్చియు, మనమునఁ దలఁకదర సూతు మరణంబు గనుం,గొనుటకుఁ దల్లడపడు ప్రియ,వనిత కతని చావుచెప్పి వడిఁద న్మాత్రన్. విరా. 2 354.

వ. నాకడిమి వినుము.

ఉ. క్రచ్చఱ నొక్క రక్కసుఁద కాఁడు సురాసురులెల్ల నొక్కఁడై, వచ్చిన నీవచూడఁగ నవార్యబలోన్న తిఁజేసివారలన్, వ్రచ్చి వధింతు. ఆశ్వ. 6. 199

2 అధిక్యము, గొప్పతనము, అతిశయము, విజృంభణము.

కం పొడుపఁగ వ్రేయఁగ నతఁడుం, గడు నుఅవగునేర్పు కడిమి కలిమిం దనపైఁ, బడకుండఁ గృపాణమ్మున, గడుజిత్రవు గతుల జడిసెఁ గైదువులెల్లన్. భీష్మ 2. 96.

కం. ... అతని కడిమి కుంభజు,నికి వారింపగిరామి నిక్కంబరయన్. ద్రోణ. 5. 48.

**కడిమి2** వై. వి (సం. కదంబః) నీపము, కడిమి చెట్టు.

సీ. కడిమి లేమ్రాఁకు లయడవిదోఁచె. అను. 2. 9.

**కడివోవు** దే. అ. క్రి.

తొడిమలూడు.

వ. ... పొంయు మలయానిలంబునం గ్రాలు మవ్వంపు, దీవలఁ గడివోయి తొరఁగిన విరుల వలన మీన కేతన పురాతన బాణశాలలంబోని లతా మండపంబులును. విరా. 2.240

**కడు** అవ్య. ద్రు. (వృత్తి యందచ్చు పరమైనపుడు డు'ట్టుగా మాఱును ఉదా:- చూ, కట్టఁబుక, కట్టాయితము, కట్టెదురు.)

అత్యంతము, మిక్కిలి.

సీ... ఒకనాఁ దవ్వఁబడుతోడ నాక్రోతి గటకటా నీకిట్లు గడును హేయమైన పీనుఁగు నంజుఁ దాహారమైనట్టి భవము వాటిల్లుటే పాపమననొ, అను. 1 274.

మధ్యా క్కర. కడునిమ్మగాదున్నె. ఆర. 1 282.

(పైరెండు తావుల 'కడు'వ్యస్త ప్రయోగము)

కం. కడునధికు తోడఁ దొడరి నఁ,బొడిచిన నొడిచినను బురుషవురుషగుణంబే, ర్పడుఁగాక హీనునొడుచుట, కడిఁదియె పౌరుషముదానఁ గలుగునె చెపుమా. సభా. 1. '23.

చం. కడుఁ బసిబిడ్డ పీఁడొకటి గాదమనానెఱుగండు. విరా. 1.21 .

చం. ఇది కడు ముద్దరాలు పనులేమియుఁజేయఁగ నేరదు. విరా. 1.103.

**కడుఁదురు** వై. వి. (సం. గందోరి) కందురీఁగ

కం. పెరయిాఁగల గతిఁ గమియుచుఁ, బొరిఁబొరిఁ గడుఁదురుల పగిదిఁ బొదువుచు నెరకై, వెరవునఁగాకులుఁ గ్రోఁతులుఁ, బరువడిఁ జీకాకుపఱుచు భంగి నలయుచున్. ద్రోణ 1.258

**కడుకొను** దే. అ. క్రి. (√ కడు)

1. కడఁగు, పూను, యత్నించు, ఉత్సహించు

చం...ఎట్టులుం, గడుకొనిశత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతిమై ఆది. 6.118.

కం. కడఁగి వృకోదరు ఁడసురం, బడఁగ వడిన్ వైచి వామ పాదంబునఁ జే,ద్పడ వానిఱొమ్ము దాఁచెం,గడుకొని యసురయును లేచి కడునుద్ధతుఁడై. ఆది. 2.200

కం. అలసినెడ దస్సినెడ నాఁ, కలి తృష్ణయు నైనయెడలఁ గడుకొని ధరణీ, తలనాథ పురుషునకుని, మ్మూల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్. ఆర. 2.74.

చం. ... ద్రుపదకన్యక పాటున కిట్టివెన్నియుం గడుకొని చేసినన్ మనలఁ గల్మష మొందగఁ నేరదర్జునా. ద్రోణ. 5.357.

2. అతిశయించు. మెండుకొను. (ఈయర్థమునఁ బాదపూరణముగా గూడ నుండును.)

కం. పుడమియు రాజ్యము బంధుల, విడిచి మృగావళులఁ గలసి విపినంబులలోఁ, గడుకొని మాయట్లిడుమలఁ బడిన నరులు గలరె వరమమునీంద్రా. ఆర. 2.3.

కం. భూనాథ నీకు భార్యం, గా నన్ను బఁరిగ్రహింపఁ గడుకొని యిష్టం, బేని సమయంబు సేయుము, మానుగ నాకిష్టమయిన మార్గము ప్రీతిన్. ఆది. 4 148

చం... ధనమెట్టివారి కిం, గడుకొని చేయకుండునె జగన్నుత గర్వము దుర్విమోహమున్. సభా. 1.31.

**కడుగు** / **కడ్గు** దే. స క్రి.

1 ప్రక్షాళనముచేయు, శుభ్రముచేయు, ప్రక్షాళించి తొలఁగించు, తొలఁగించు.

వ. తానును శయ్యాతలంబు విడిచి మేనిధూళి జలంబులంగడిగి ననుబెడఁబాసిన క్రియ.

కం. కుడిచేతఁ బిడప డాచేఁగడిగి పౌరిన్ సప్తమృత్తికా కలనమునం, గడుగునది కరయుగము మఱి, కడుగవలయు గుహ్యక మృదా కలనన్ అను. 3.280

చం. అడుగులుగడ్గి అశ్వ. 4 223.

**కడుపు** వై. వి, (సం. గర్భః ప్రా. గబ్భో).

(వైకృతము గబ్బము అగుట సమంజసముగాని కడుపు ఎట్లగునో)

1 ఉదరము, కుక్షి, పొట్ట

అ కడుపు వ్రచ్చి యొడలు గలయంగ జల్లించి ద్రోణ. 2.198.

వం. కర్ణుండు సహదేవు నాలోకించి కుంతి మాటలు దలంచి యొండు సేయనొల్లక యల్లన విఁటి కోపునం గడుపు వొడిచి ద్రోణ. 5.161.

2. గర్భము (పార్వతి శివునితో)

కం నీకడుపున జన్మించుట, నాకుంగొడుక య్యెనితఁడు. శాంతి. 5.474.

(ఇచట గర్భాశయమనుట పొసఁగదు, ఉదరమేయగును)

3 గర్భాశయము.

కం. ...లేదీ కడుపునఁ బులిపుట్టునె. ఆది 8 58

4. సంతతి, సంతానము.

తే. భరత వంశంబెల్ల వెలుఁగఁ గొంతి కడుపు చల్లఁగా బుట్టిన ఘనభుజుండు. ఆది 6 19.

**కడుపుఁద్రోచు** పొట్టపోసికొను

చం...కడుపుఁద్రోచి కొనన్ లఘు వృత్తి కిమ్మెయిం, జొరనగు వాఁడె దేవపతి సూనుఁడు దైవము చేత సూచితే. విరా. 2.208.

తే. ప్రయతులై పుట్టి యేవంపుఁబనులఁ గడుపుఁ, ద్రోచికొను వారహంకారమునను గర్వ, మాన మద దంభములఁ దొల్లిమాన్యజనులఁ, బరిభవించిన తుచ్ఛులు పద్మనయన. అను. 5.108

**కడుపుకూడు** పొట్టకు సరిపోవు అన్నము, ఆఁకలికి చాలినంత మాత్రము తిండి

ఆ. ఏను గట్టువాలుదాన నాకెవ్వరు, గడుపుకూడు పెట్టి కట్టఁ జీర యిచ్చి సాకతమున నేలుదు రట్టివారలకుఁ బనులు సేసి మెలగఁ బుద్ధి. విరా. 1.298.

**కడుపుచల్లగా** సంతతి పెంపొందఁగా, సంతతి హాయిగా

చూ. కడుపు 4వ అర్థము.

**కడుపునఁ గుట్టెత్తినపుడు అడుకులు తిన్నట్లు** జాతీయము, అడుకులు తేలికగా జీర్ణమగునవి కావు. జఠరాగ్ని బలము ఏమాత్రము తక్కువగానున్నను అడుకులు తిన్నచో గాఢమగు కడుపు నొప్పి కలిగించును. అట్టిచో అగ్ని మాంద్యము వలనఁ దిన్న పదార్థము జీర్ణముగాక కడుపులో నొప్పి యేర్పడినపుడు అడుకులు తిన్నచో నింకగలుగు గడుపునొప్పి తీవ్రత అపారముగా నుండును. బలవద్విరోధికి హాని మీఁద హాని, అపకారము మీద నపకారము కావించినపుడీ లోకోక్తి నుపయోగింతురు.

(కౌరవులు మాయాజూదమునఁ బాండవుల సర్వస్వము అపహరించిరి. అంతేకాక సభలో ద్రౌపదిని భంగపఱచిరి. ఇంతటితో నూరకొనక దుర్భాషలు సలిపిరి. ఇట్లెన్నియోవిధములఁ బాండవుల నవమాన పఱచిరి. దీనిని బురస్కరించుకొని దుశ్శాసనుఁడు తన వలన బరాజితుడైనపుడు సాత్యకి ఈలోకోక్తి నుపయోగించెను) (దుశ్శాసనునితో సాత్యకి పలికిన పలుకులు)క. అడుకులు తిన్నట్లగనే, కడుపునకుట్టెత్తినపుడు గడుఁబఱచితి నాఁటొడలెఱుగక పాండుసుతుల నుదిగిమడుగవలసెనిప్పుడొక సాత్యకి చేన్. ద్రోణ 4.89.

**కడుపుశోకము** సంతానము మరణించుట వలన గలుగు శోకము.

కం. ... ఇతఁడు పేరును బెంపు, గని యుండఁగ నిట్లడలున, మును గుటరయఁ గడుపు శోకమున పెంపు నుమీ. స్త్రీ. 2. 34.

**కణపము** సం. వి అ. పుం.

ఆయుధ విశేషము, కుంతభేద మని కొందఱు, శరభేద మని కొందఱు.

మాలిని – పరశుకులిశ కుంతప్రాస బాణాస నోద్య, త్పరిఘ కణప చక్ర ప్రస్ఫురద్వ్యూహ సేనా, పరివృతుఁ డయి (కణయము అని పాఠాంతరము) ఆది. 2. 96.

**కణము** సం. వి. అ. పుం.

1. బిందువు, బొట్టు. (నీరు మొ).

సీ, అశ్రుకణము లురుల. విరా. 2·138.

సీ. నలిన పత్రంబున సలిల కణముఁ బోలె. శాంతి. 4. 127.

సీ. మున్నీశునుదుట, నలుకఁబుట్టి ఘర్మ జలకణ మిలఁ బడ్డ. శాంతి. 4. 439.

2. గింజ.

క. శాక కణమూల ఫలపి,ణ్యాకాదుల భైక్షమైన యన్నంబున ని,శ్శోకత నాఁకలి పుచ్చుచుఁ, లోకాలోకంబున నచలుఁడు గావలయున్ శాంతి. 4.316.

3. లేశము, లవము.

తే. జలములలోన నిడిన, లవణ కణము చందమ్మున. శాంతి. 4.357.

**కణయము** సం. వి. అ. పుం.

కణపము యొక్క రూపాంతరము.

**కణిక** సం. వి ఆ. స్త్రీ.

అణువు, నలుసు, లేశము. అతి సూక్ష్మాంశము, కణము

సీ అప్పుడానంద జనితాంబు కణ కార్ద్రి చక్షుస్సహస్ర జలరుహంబులు రాల్చె సమ్మదంబెసఁగ. ఆది. 8 185

**కణికుఁడు** సం వి. అ పుం.

శకునికి ఆప్తమంత్రి.

ఆ. ... కణికుఁడను వాఁడు సౌబలు నాప్త మంత్రి. ఆది. 6.100.

దుర్యోధనుఁడు యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషేకంబునకు భీమార్జునుల పరాక్రమంబునకు సహింపక కర్ణ, శకుని, దుశ్శాసనులతో మంతనంబుండి ఏ నేమిసేయు వాఁడ నృపనీతి యెయ్యది నిరతంబుగా మీర నా కెఱింగింపుఁడని న విని యితఁడు దుర్యోధనునకు రాజ నీతి నుపదేశించెను. ఆది. 6. 100. ఈ కణికుని రాజనీతికై చూ. ఆది. 6. 101. మొ, 119వ.

2, భారద్వాజ వంశస్థుఁడు.

ఇతఁడు సౌవీరపతియగు శత్రుంజయునకు హితవచనంబులుపదేశించెను. చూ శాంతి. 3 267 మొ. 277 వ. ఆంధ్ర మహాభారతమును బట్టి మొదటి కణికుఁడు శకునికి ఆప్త మంత్రియై నట్లును దుర్యోధనునకు రాజనీతి నుపదేశించినటులను దెలియుచున్నది. ఇదే ఘట్టమున సంస్కృత మహాభారతమున కణికుఁడు ధృతరాష్ట్రుని ముఖ్య మంత్రులలో నొకడై నట్లును ధృతరాష్ట్రునకు రాజనీతి నుపదేశించినటులను గలదు.

శ్లో॥ తత ఆహూయ మంత్రజ్ఞం రాజ శాస్త్రార్థ విత్తమమ్ కణికం మంత్రి

ణం శ్రేష్ఠం ధృతరాష్ట్రోఽబ్రవీద్వచః — సం. భా. ఆది. 140.2.

శ్లో॥ పశ్చాత్తాపో యథాస్యాత్తథా నీతిర్విధీయతామ్, ఏవముక్త్వా సంప్రతస్థే కణికస్స్వగృహం తతః, సం. భా. ఆది. 140.94.

**కణ్వాశ్రమము** సం. వి, అ. పుం. న. ఒకానొక తీర్థ స్థానము.

వ. కణ్వాశ్రమంబును ధర్మారణ్యంబును యయాతిపతనంబునుం జూచిన పాపక్షయంబగు అర. 2. 248.

2. కణ్వ మహర్షి యొక్క ఆశ్రమము. ద్రోణ. 2 210.

**కణ్వుఁడు** సం. వి అ పుం.

1. ఒక మహర్షి.

వ. ఒక్కయెడ నారద జమదగ్ని కణ్వాదులగు మహామునులం గొందఱం గని. ఉద్యో. 3 145 ఆది. 4.221 ఉద్యో. 3. 45, శాంతి.1 2; అను. 4 129; మౌస 7చూ.వివరము చివరి సంపుటము అనుబంధము.

**కత** వై. వి (సం. కథా)

1. వృత్తాంతము, సమాచారము, సంగతి.

కం. .. కొడుకుల కత విని యెద ... ద్రోణ 4. 221.

2. చరిత్రము, కథ

ఆ. సతికి నొక్కరుండ పతిగాక యెందునుబతులు పలువురవుట కతలఁ గలదె ఆది 7. 260,

కం. మీరు సెప్పుకత వినుటసదే. అను. 4.411.

**కతన** దే. వి

కారణము, కతము (దీనికి వృత్తి యందే, అందైనను తృతీయాంతముగానే, ప్రయోగములు గలవు.

తే. గంధకారికా వేషంబు కతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱపడి యుండ ... విరా. 1.294.

తే. .. భూరేణువు కతన రాత్రి,గాక మున్న యొండొరువులఁ గానరైరి. విరా. 3.160.

**కతము** దే. వి.

కారణము, హేతువు.

వ. నీకతమున నఖిల ధారుణీ రాజ్యము నాకేకాధిష్ఠితమగు. ఆది. 6.140.

కం. .. దైవంబు కతం,బున నాకు నొక్క చందం,బనువై యున్నది. విరా. 1 86.

కం. ... భూసురునకుఁ దనకతము నన, ద్దీనదశయగుట కోర్వక. శాంతి 3.150

**కతిపయము** సం. విణ. (అ. ఈ. ఆ). కొంత, కొంచెము పరిమాణము గలది, కొన్ని.

వ. ఇట్లు పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటు నగరంబున వర్తించుచుఁ గతిపయ దినంబులు గొఱఁతగా కాలంబు గడసిన సమయంబున ... విరా. 2 22.

కతిపయదినంబులు = కొన్ని దినంబులు

వ కతిపయ పరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి. ఉద్యో. 4,166.

(కతిపయ పరివారము = కొంత పరి
వారము)

**కత్తళము** దే. వి.

కవచము, బొందళము.

ఉ. ... పాం,చాలుర నెల్ల, దీవ్రశ
రంబులం బొలియించి కానిమా,పాలక
పుచ్చుఁ గత్తళము. శల్య. 2.56,

శ్లో॥ నాహత్వా సర్వపాంచాలాన్
విమోక్ష్యేకవచం విభో. సం. భార.
శల్య. 151.34.

**కత్తళముపుచ్చు**

(శరీరము నుండి) కవచమును ఊడఁ
దీయు.

కం. ... నేనుం జలము మెఱయఁ
బాంబాలురఁ, బొలియింపకకత్తళంబు
పుచ్చనరేంద్రా. ద్రోణ. 5.82.

శ్లో॥ నాహత్వా సర్వపాంచాలాన్ కవ
చస్య విమోక్షణమ్, కర్తాస్మి సమరే
కర్మ ధార్త రాష్ట్రహితంతవ. సం.
భార. అర. ద్రోణ 151,34.

**కత్తి** దే. వి.

ఖడ్గము (ఆయుధ విశేషము).

తే కత్తి గొద్దలి యడుగనేఁ గట్టియ
లకు. విరా. 1.78.

**కత్తివాతియమ్ము** దే. వి. సమ
అర్ధచంద్ర బాణము.

వ. అవ్వాసవి ... యొక్క కత్తి
వాతియమ్మున శల్యు చాపంబు ముష్టి
కింద్రుంచిన. ద్రోణ. 3. 223,
(భీముఁడు సైంధవుం బట్టి పరిభ
వించుట).

ఆ. వాడియైన కత్తివాతి యమ్మునఁ
గొని, పగతు శిరము చెక్క లెగయ
గొటిఁగి, నరులకెల్లఁ జూడ నవ్వగు
నట్లుగాఁ, గలయ నైదు గూఁకటుల
నొనర్చె. అర. 6 250.

శ్లో॥ ఏవము క్త్వా ప్రసటా స్తస్య పంచ
చక్రే వృకోదరః సం. భార. అర.
271.9. (వావిళ్ళ)

**కత్తెర** వై. వి. (సం. కర్తరి).

కత్తిరించుట కుపయోగించు సాధన
విశేషము.

కం. వికచముఖుఁడగు మశత్రువు,లకు
హితులగు నట్టి వారలంగని భూపా,
లకుఁడెద్ద కత్తెరయి నా,లుక బెల్లము
నై మనంబులుం గనవలయున్. శాంతి.
3. 268.

**కథ** సం. వి. ఆ. స్త్రీ.

కత, చరిత్రము,

మ. హృద యాహ్లాది చతుర్థ మూర్జిత
కథోపేతంబు. విరా. 1.7., శాంతి.
5.186.

**కథకుఁడు** సం. వి. (అ. థికా. అ).

వాచకుఁడు, చెప్పువాఁడు. పౌరాణి
కుఁడు

వ .. సూతుని పుత్రుండైన యుగ్ర
శ్రవుఁడనియెడు కథకుఁడు సమ్య
గవధానంబున నాకర్ణించిన వాఁడగు
టను. స్వర్గ 77.

**కథనము** సం. వి. అ. న.

1. చెప్పుట.

వ. ... ఇట్లు సంజయుండు ధృత
రాష్ట్రునకు నశ్వత్థామాది రథిక త్రయ

వ్యాపార కథన పూర్వకంబుగా దుర్యోధన లోకాంతర గమనంబు సెప్పె. సౌప్తి 1.237; స్వర్గ. 77.

2. వృత్తాంతము.

వ కృప ద్రోణ జన్మకథనంబును... మందపాలోపాఖ్యానంబు నను వృత్తాంతంబుల నొప్పి. ఆది. 1. 34.

**కథితము** సం. విశ. (అ, ఆ. అ.)

చెప్పఁబడినది.

సీ. .... ఇది వివాహ ప్రకార. ఆ - కథిత ధర్మము. అను. 2.27.

వ ... ఏడ్వురు మద్వృద్ధి ప్రద దేవతలు శ్రుతిస్మృతి కథితల్. శాంతి. 5. 12.

కం. ... ఇది వేదకథితము సుమ్మీ. స్వర్గ. 3.8.

**కద** } **కదా** } కాదా, కాదె, కదె, కదే, కదయ్య మొ.

(√అగు–కాదు + ఆ = కాదా; దీనిలో 'దా' లోపించి 'కా' అను రూపమయ్యెను. 'కా' మీఁది దీర్ఘము హ్రస్వమయి 'క' అయ్యెను. 'కాదా' అను దానిలో 'కా' మీఁది దీర్ఘము హ్రస్వమై 'కదా' అయ్యెను. కదా అను దానిలోని తుది దీర్ఘము హ్రస్వమై 'కద' అయ్యెను.

కాదు, కదలకు ఏడాదులను ప్రయుక్తమై 'కాదె, కాదే, కదె, కదే అను రూపములు సిద్ధించెను. పురుషవిషయమున 'అయ్య' వచ్చి కదయ్య అను ప్రయోగమును ఇందుఁ గలదు.

అవ్య.

ఇది ప్రసిద్ధిని, నిశ్చయమును, సంతాపమును, ప్రశ్నమును, ప్రార్థనమును, ప్రశంసను దెలుపును. కొన్నియెడల ఊఁత పదముగాఁ గూడ నుండును.

(ప్రసిద్ధికి)

ఉ...నేఁగదా కడప నేర్తు రథంబనంబురెన్. విరా. 4. 9.

(నిశ్చయమునకు)

కం. కలిమికి భోగముల కదా, ఫలమని తను మెఱసి బయలుపడఁ బెల్లగ వి,చ్చల విడి భోగింపక వే,డ్కలు సలుపఁగ వలయు భటు (డడంకువ తోడన్. విరా.1.140.

కం. మును నీ వచట నచటఁ జే, సిన బంటుతనంబు లెల్లఁ జెప్పఁగ విందుం, గనినఁగదా నమ్మెదునవి. విరా. 5.95.

(సంతాపమునకు)

మ...సైన్యము,గ్మజనంబుల్ వినుతింపఁ బేర్చె నా తొలంగంబాఱెనో పేరున క్కఱపుం బెంపును దీఱఁడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్. కర్ణ. 1.336.

(ప్రశ్నమునకు)

వ. బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి పలుక నగుంగాక పలికి నట్లు యెవ్వరికిఁ జేయఁ దీరుఁబని తీరెంగదా యనిన రాయంచకు నక్కాకంబిట్లనియె కర్ణ, 2.75.

(ప్రశంసకు)

వ. అమ్మహాత్ములిరువురును దానవుల వధియించుటకును ధర్మ సంస్థాపనంబు సేయుటకునై వలసిన యప్పుడెల్లను జననాది కృత్యంబులు గైకొని వినోదింతురు వారలుగదా యీకృష్ణార్జును లనిచెప్పి కృష్ణద్వైపాయనుండు వెండియునిట్లనియె. ద్రోణ. 5.414

(ప్రార్థనము)

కం. నను మార్కొని గెలువఁగ న, య్యనిమిషులకు నరిది యనుడు నట్లను టఁగదా, నిను వేఁడెదనని కుంతీ, తనయుఁడు పలుకుటయు దత్పితామహుండు గృపన్. భీష్మ 1.158.

చం. ...పాండునృపపుత్రుల నెమ్మెయి నైనఁగాచి కోల్, వినుతిగఁడియ్య నీకు నిను వేయివిధంబుల నాశ్రయించు టెల్లను ఫలమొందఁ జేయఁగఁ దలంచుట పెంపు సుమయ్య కేశవా. శల్య 2.328

చం తిరమయి నీవు నాలుకకు దెచ్చి నమాటగదా వినందగున్ కర్ణ, 2 11.

వ. నీవిట్లంటివిగదా యని హితోపదేశంబు మాననేర్తునే. కర్ణ 2.58, అను 8.200.

**కదంబకము** సం. వి. అ. న

1. కడిమిపువ్వు

వం. విలంబిత కదంబక స్థూలముక్తాఫల దామ రమణీయంబై ఆది 6 4.

2. సమూహము

ఉ ... విజయుఁ డోడకు మంచును మారు తాస్త్రము, త్యన్నత చిత్తుఁదేసె నదియున్ విరియించె రయంబుతో నము, త్పన్న సమీరణాహతి నపార పయోద కదంబకంబులన్. ఆది. 8.276

**కదంబము** సం. వి. అ. పుం.

1. కడిమి.

చం. దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీరజో, మిళిత సుగంధ బంధుర సమీరణుఁడన్ సఖుడూఁచుచుండఁగా. అర. 4.138.

న.

2. సమూహము

ఎ. ... మనోహర కుసుమ కదంబ గంధ మకరంద బిందు సందోహ సుందర తరుచ్ఛాయా సేవనంబులను. విరా. 1.147.

ఉ. ... ఇచ్చటన్ దంతి తురంగ నద్భట కదంబముఁ జూచి కలంగు టొప్పనే విరా. 4.68.

**కదనము** సం. వి. అ. న.

విహ్వలత్వము

(కీచకుఁడు ద్రౌపది యందలి మోహంబున).

వ. ఇవ్విధంబున మదన కదన ధూయమాన మానసుండగుచు నిట్లని వితర్కించు. విరా. 2.294.

**కదయ్య** కద.

(ప్రార్థనకు)

కం అన విని రాజుదేవులు మురారికి

నిట్లని రెంతయున్ రయం, బునఁజను మయ్యా పాండు నృపపుత్రుల నెమ్మెయి నైన ఁగాచికోల్. వినుతి గదయ్య నీకు నిను వేయివిధంబుల నాశ్రయించు టెల్లను ఫలమొందఁ జేయఁగఁ దలంచుట పెంపుసుమయ్య కేశవా- శల్య. 2.526.

**కదలి** సం. వి. ఈ. స్త్రీ.

అరఁటిచెట్టు

సీ...కదలీశోభియును మృగాకీర్ణంబు, నగు ధృతరాష్ట్రుని యాశ్రమంబు, నెఱిఁగిన వారదెయిదె యంచుఁ బేర్కొనిచూపిచెప్పిన. ఆశ్ర. 2.31.

**కదలు** దే. అ. క్రి.

1. చలించు.

వ. అమ్మూఢుండు అశ్వత్థామ దినవామ కరంబునఁ జక్రంబు నవలంబించి యెత్తం జాలక దక్షిణ పాణిఁబట్టి యెట్లును గదలఁ దివియ శక్తుఁడు గాక యుభయహస్తంబులను లావు చేసి తివిసినను నది కదలకుండె. సౌప్తి. 2.48.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు, నెఱవిరి తమ్ముల నుఱక తెగడి. విరా. 2 88.

చం. గురుకుచయుగ్మముల్ గదలఁ గ్రొమ్ముడులం దగు పుష్పముల్ పయిందొరఁగ ... ఆది. 8. 175

2. బయలుదేఱు, ప్రయాణమగు.

వ. .... అమ్మహీసురవరేణ్యు నను మతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండునుదోడ న యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం విరా 1.147.

వ.... అతండును (శల్యుఁడు) పుత్ర మిత్ర సమేతంబుగా నానా సేనాతి సంకులంబుగా, గదలి పాండవులున్న యెడకు నిత్య ప్రయాణంబుల నడచు సమయంబున ఉద్యో 1.91.

వ. అవ్వసుమతీపతి ప్రీతుండై యది లెస్స వెరవట్లు చేయుదమని సముచిత భంగిం దగువారల కెఱింగించి కదలి యచటికి రెండామడ యగు సరస్వతి పొంతం బయలిక బలంబులంగొని చని. శల్య. 1.74, ఉద్యో. 3.178

3. నడచు.

ఆ. తేరు గదల నీక వైరులు బలువిడి బొదివి పట్టె. కర్ణ. 2 231.

4 తొలఁగు.

సీ పఱమొయిల్ గప్పినఁబాదఱినునుఁ గాంతి, గదలిన యమృతాంశు కళయు బోలె, విరా 1 294.

(పోవు. నశించు అని సూ. ఆ. ని)

5. వీడు, పాయు, వదలు.

వ. అని యిట్లు సెప్పిన ధర్మతన యుని పలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినఁ జూచి యతండు. విరా. 2.149.

సీ. అచ్చోటు గదలి విప్పచ్చుండు సనఁజన. ద్రోణ. 3. 151.

కం. ఎఱుక గలవారి చరితలు, గద చుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం బెఱుఁగుచు నెఱిఁగిన దానిని, మఱక

కనుష్ఠించునది సమంజస బుద్ధిన్. ఆది. 3.203., సభా. 1 100.

**కదలుచు / కదల్చు** దే స. క్రి. (√కదలు) కదలించు

కదలఁజేయు (చలింపఁజేయు)

ఆ. అగ్నినంట హిమవదచలంబు కదలుప, గంగఁ గట్టవచ్చు గాని విప్ర, రాజిఁ బరిభవింపరాదు. అను. 2.155.

కం. అనుటయు మోఱకు చందం, బున మోమడ్డము గదల్చి. విరా, 1.221,

**కదళి** సం. వి. ఈ. స్త్రీ.

కదలి, అరటిచెట్టు.

మానిని: కాచి బెడంగుగఁ బండిన యా సహకారములం గదళీతతులం, జూచుచు. అను. 4.20., శాంతి. 2.354.

**కదళిక** సం. వి. ఆ. స్త్రీ. కదళి.

సీ. రత్నశిలా రశ్మిరాజిత కదళికా మహిమశోభిల్లంగ మద్ర విభుడు. భీష్మ. 1.87., అశ్వ. 3.202.

**కదళీ గర్భము** సం. వి ఆ. పుం.

అరఁటి చెట్టులోని నడిమిభాగము, అరఁటి ఊఁచ

కం. అరయ కదళీ గర్భా, సారము సంసారము, శాంతి. 6 530

**కదా** చూ. కద

**కదియంబడు** కదియు దే. అ. క్రి. (√కదియు స్వార్థమున పఁడు) కవియవచ్చు, కవియు, పైకుఱుకు, కలియఁబడు

వ. అనిన నవ్వేలంది వీఁడు దమకించి యున్న వాఁడు నాయంత్రించు మాటలకు మున్న కదియంబడినఁ గర్జంబు దప్పునని విచారించి. విరా. 2.258.

వ. మఱునాఁటి కయ్యంబున నేను నుంగడంగి.

కం. కడు బెట్టిదముగఁ గదియంబడి ఉద్యో. 4.330,331., ద్రోణ. 4.162.

**కదియించు** దే. స. క్రి. (√కదియు)

1. ఘటించు, చేర్చు, ఉంచు

వ. కరకమలంబులు మొగిచి ఫాల భాగంబునం గదియించి. విరా. 1.184, ద్రోణ 5.409.

2 దగ్గఱఁ జేర్చు, సమీపింపఁజేయు

చం... త్రిగర్త నాథులు నిరుఁదేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయ సారథిన్ బలువిడిఁ గూల్చి రథ్యముల ప్రాణములుం గొని దుగ్రమూర్తులై. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. విరా. 3.199, 200.

3. (బాణములు) పరఁగించు, ప్రయోగించు.

వ. (కర్ణుఁడు) పాంచాలబలంబు దఱిసి పెక్కు తెఱంగుల మెఱుంగు టమ్ముల గములు గదియించి. కర్ణ. 1.139.

కం. అది ధర్మంబుల కెల్లం, దుది యగు ధర్మంబు మనసుతో దానిఁ దగ౦, గుదియించి మేధతోడం, గదియింపుము నియతిఁ బుత్ర కడు గాఢముగన్. శాంతి. 5.180.

**కదియు** దే అ. క్రి.

1 తగులు, తాకు, అంటు.

చం. తిగిచి కిప్పుంగిలించి జగతీ విభుఁ దక్కమలాయతాక్షి నె, మ్మొగము మోపంజనం గదియ మోపు. విరా. 1, 247.

సీ. ఎకపువఁ దూప్పును బదమరన్నై రెండు, గడలు సంభోసిధి గదిసి యుండు. భీష్మ. 1 21.

2 కలియు, కూడ.

(కీచకుని వర్ణన) సీ...కవట లాం డాంజితోఁ గడయుచు నెదములుగ్రమింగి ప్రజ్వంగ సొంపు మిగులు దాని. విరా. 1 182., ద్రో. 2.239.

మధ్యా. ఎదురను పవ్వలఁ జూచిన పొచక్రలెల్లఁ దక్షిణము కదియఁగా నప్పుడొంటయును దవ్వయికనఁబద, బిజుఁజనెది దినేశ్వప రథమో యనూరుఁడో యితఁడంచునవుడు, హృదయమునను గడు విస్మయంబందె నిక్ష్వాకుకులుఁడు. అర. 2 169.

ఆ. (ఉత్తర) వచ్చి కొలువు సొచ్చి నెమ్మికపిందు నం, తంత నిలువఁ బనిచి యల్లనల్లఁ, గదిసి ప్రౌఢవనిత తైవడి ముద్దిడు, ముద్దు పుట్టఁదనకు క్రమెకుప్పడయును. విరా. 1.248.

సీ కదిసిన యత్నైనఁ గౌఁగిలింపఁ గడంగి, యూరక బొంకైన నలఁత నొందు విరా. 2.501.

స. క్రి.

1. డీకొను, ఎదిరించు.

వ. ...అతండును ననిలసుతుండును బరస్పర మూర్తుల నవలోకించి ... యున్నతంబులగు నపసవ్యకరం బుల నాకుంచిత సవ్యబాహుతలంబుల నప్పళించు చప్పుళ్ళు గలసి యొక్క రుండ మల్ల చలచిన చందంబున వీతేర వింత తానకంబుల నిలచి కదిసినయప్పుడువృకోదరుండు. విరా. 2.14.

చం. మదమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని నిల్చిన వీఁకమై మెయింగ దిసితిమేని నప్పుడు ప్రకాశ రహస్య విభేద బుద్ధి నా కొదవునె విరా. 2 280.

**కదుపు** దే. అ. క్రి.

2. పోలు, సమానమగు

మధ్యా. పదుంద్రబోలెడు సుతులనూ ర్వురఁ బడయంగ వలతొ, పదుంద్ర నూర్వుర కెనయగు సుతులఁ బడ యంగ వలతొ వదలక వేవురు సుతులఁబడయంగ వలతొ వేవురకుఁ గదియఁగ నుత్తము నొక్కరు వంతొ కమలాయతాక్షి. అర.2.348.

**కదుగదుప** చూ. గదుగదుప

**కదుపు** వి (సం. కదంబం)

(సజాతీయ పశుపక్ష్యాదుల) సంఘము, గోగణము, పశుసంఘము.

కం. కదిసిన బలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగనీక గాండీవి వెసం, బొదివి యట కడ పెనవియును, గొదగొని తమ పొలముసొచ్చె గోపా లురతోన్. విరా 4 271.

విరా. 1.279., 286.

కం. ద్విరదము లొఱఁగెదివియు నెత్తురుగ్రక్కుచుఁ గూలెదివి గదుపు

లై కలయం, దిరుగుడువడియెడివియు భువి,బొరలెడివియు నయ్యెఁ బవనపు త్రుమునుమునన్. భీష్మ. 2.213.

కం. నడుమన వానింబార్థుఁడు, పొడి గానేయంగఁ గనలి భూపకుమారుం, డడరించెఁ దోమరంబులు, గడుఁ బెక్కవి మిడుతకదుపు గతిఁ గవియంగన్. అశ్వ. 4.22.

**కదుపులు** గట్టు దే. అ. క్రి. సమ.

గుంపులుగూడు

మం....తీవ్రంబులై, పదశబ్దంబులు మీఱఁజూడు కలయం బాఱందొడం గెంబెనుం, గదుపుల్ గట్టి మృగంబు లెంతయుభయోత్కంపంబు నాకయ్యె డిన్. అర.7.254

**కదుపు సేర్చు** దే. అ క్రి

మంద వేయు

ఆ పిదుకఁ గదువుసేర్చ బెదరు వాపఁగ నీరు, మేపుగలుగు నెడకు మెంగ వెలువ, మృగమునరయ ముచ్చురేవగలును గొట్టు, నేర్తుబసికి, జాలుఁ గూర్తునేను విరా. 1.101

**కదురు** దే అ. క్రి.

1. కలుగు

తే ...అజాత, వైరియల్లన నకులుని వలను సూచి, నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర, నెలుగు చందంబు వేఱుగా నిట్టులనియె విరా. 1.91

కం విని ప్రహ్లాదుఁడు గృప దన, మనమున గదురంగ. శాంతి 8.140, అను, 3.278

2 పర్వు,వ్యాపించు

సీ. కనుగవ క్రమెఱు,ఁగులుఁగదిరిన ముందఱఁ బుష్పోపహారంబు పొలుపు దాల్ప, వేనలికప్పు పర్విసమీఁదునీందు కూలంబు మేల్కట్టు కొమరు వదయ. విరా- 1.308.

3. అతిశయించు, హెచ్చు

చం. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు విల్లు ద్రేల్మిడిం, గునిమి... ....విరా. 5.176, విరా. 2.128.

(అర్జునుఁడు)కం...ధర్మసుతునివిడి, దలకరిగెను మోము వెల్లఁ దనమునఁ గదురన్ ద్రోణ. 2.231.

4 కొట్టుకొను, అంటు

తే. కదలుకొనఁ జుట్టు బఁట్టెడు గొడుగులెవ్వి, యెసక మెస,గంగ సీవుపు లేలవట్ట, రంగమున నాననంబు న,నవని ధూళి గదిరెజలక మేలాడవు కౌరవేంద్ర. శల్య. 2.402.

**కదె-కదే** చూ. కద.

'కద' క్రిందనిచ్చిన యన్నియర్థము లందును 'కదె' 'కదే' ప్రయోగ ములు గలవు.

సీ నామాట వినగదె నాథయంటి..

కం. ఇ.ప్పురుషుఁడు (భీష్ముఁడు) పురుషార్థసార భూషణుఁడు గదే స్త్రీ. 2 111.

**కద్రువ** సం. వి. ఊ. స్త్రీ.

కశ్యపునిభార్య, నాగమాత. అర. 5252., అను. 1.2040.

(ఇచ్చట 'కద్ధ్రువ' అనిప్రయోగము)

కం కద్రువ గన్గొని సంతో, షద్రు
తమతియగుచుఁ బిలిచి సవతికిఁ
జూపెన్, భద్రాత్మక యవ్వినతయు,
తద్ద్రోహం బెఱుఁగలేమి దైన్యము
నొందెన్. అను 1.500.

చూ. చరిత్ర అను 1 167 నుండి
234. వఱకు

**కద్రువ** సం. వి ఈ. (స్త్రీ) చూ. కద్రువ

**కనకధ్వజుఁడు** సం వి అ. పుం.

గాంధారీ ధృతరాష్ట్రుల 98వ కుమా
రుడు; భీష్ముని ఎనిమిదవ నాటి
యుద్ధమున భీమునిచేఁ జచ్చెను ఆది.
5 197. భీష్మ. 3 161. చూ.
కురు కుమారులు.

**కనకపక్షుఁడు** సం. వి అ. పుం.

బంగరు ఱెక్కలు గలవాఁడు,
గరుడుఁడు.

తే. .. కనక, పక్షుఁదార్క్ష్యాత్మ్మఁ
దలఁతు నప్పద్మనాభు శాంతి.
2.26.

**కనకబాహుఁడు** | **కనకబాహువు** సం. వి ఉ పుం.

శివుఁడు

సీ. శ్రీకంఠు రుద్రుని శివుఁ....కనక
బాహుఁ బశుపతి భక్తిఁ బ్రస్తుతించి...
అశ్వ. 1.62.

**కనకము** సం వి. అ న.

బంగారము.

ఉ. కూర్చుట నూత్న రత్నమునకుం
గనకంబునకుందగున్ ... విరా
1.28, శాంతి. 5 1.2.

2. ఒక బంగారు నాణెము.

వ. ... అనేక గోవులం గనక దాసు
లను నొసంగిన నా భూసురోత్త
ముండు. అను. 1.282.

కం. కుడువక పెట్టక శూద్రుడు, కడు
నెక్కుడు గూర్చినట్టి కనకముఁ
గొలుచుం, బుడమిపతి ధర్మ కృతు
లకు, నిడునది సగముగాని మేదినీశ్వర
వర్యా. శాంతి. 3.432.

పుం.

సంపెంగ.

కం. కనక ప్రతతి వితతుల, బెనఁగిన
సుర భూరుహముల. ఆది 2 70.

**కనకస్థలము** సం వి అ. న.

హిమవత్పర్వతము నందలి కేళికావన
మునందుఁ గల ఒక తీర్థస్థలము.
ఇచ్చట శంకరుఁడు సర్వభూతగణ
పరివృతుఁడయి కొలువు దీఱి యుం
డును. అను. 4.418.

**కనకాంబరము** సం. వి. అ. న.

బంగారు చెఱఁగుల వస్త్రము.

వ. విశ్వచ్ఛుండు సంగీత ప్రసంగం
బున మెచ్చువడిసిన కనకాంబరాదులు
సోదరులకుం జేర్చుచుండు విరా.
2.2.

**కనకాక్షి** సం. వి ఈ స్త్రీ.

సప్త సారస్వతము అనఁబడు
సరస్వతీ నది యొక్క యేడు రూప
ములలో నొకటి శల్య. 2 152.

**కనఖలము** సం వి అ. న.

గంగా తీరమున హరిద్వార సమీపము
ననున్న తీర్థ విశేషము. ఆ తీర్థము

దగ్గఱనున్న ఒకానొక పర్వతము. ఇచ్చట స్నానము చేసినవారు పాతకములుపోయి స్వర్గసౌఖ్యములందుదురు. ఇది ఋషిదైవతము. ఇందు సనత్కుమారుఁడు సిద్ధిఁబొందెను అను. 2.74, ఆర. 3.251.

**కనత్** సం. శత్ర.

ప్రకాశించుచున్న

శా... హేమచంద్రక కనద్వర్మంబు నీ కెంతయున్, సత్కారంబున నిచ్చె ... విరా 1.234

కం. .... కన,త్కనకమయ విమానము. అశ్వ. 4 247.

**కనలు** దే వి.

కోపము.

వ. కర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గదలుకొన నమ్మద్రపతిం జూచుచుం జూచి. కర్ణ. 3 316.

కం. ... తండ్రి పరిభవంబునకుం, గనలు, గదిరి యిట్లంటిని. ద్రోణ 5. 140.

అ. క్రి.

కోపించు.

కం. అని చెప్పి గంటి సూపిన,నని లతనూభవుండుగనలి యాదుష్టాత్ముం, దనయాది బంధు హితముగ,ననిచెద జము ప్రోలికనియె నంగము వొంగన్ విరా 5.310.

కం. వనవాసాయాసంబుల, ననయంబును నలఁగి దానినాత్మనిడి మరుత్తనయుండు పెక్కులాడెఁ ద,గని మాటల దీన రాజుఁ గనలకు మనుమీ. అశ్వ 1. 133.

2. తపించు.

చం. కనుగాని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల నంగము,ల్గనలఁగ సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ. విరా. 2.133.

3. కలఁతఁజెందు

సీ ఇంపగు నీచెయ్వి తెలమిమైఁ గొనియాడఁ గానని కోర్కులు గనలుటయును. (కలఁగుటయును అని పాఠాం.)

**కనికొను** దే. స. క్రి.

1 గ్రహించు, తెలిసికొను, ఎఱుఁగు

వం. కృపాచార్య భీష్మలు పార్థ బాణపాత ప్రకారంబులు ప్రణామ కుశల ప్రశ్నంబులుగా నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి—విరా. 4.255

కం. విను దౌపద్వులఁ గార్యము, గనికొని వలయుపని మున్న కావింపఁ గనే,రని జడుఁడు దీర్ఘసూత్రుం,డను నమ్మత్స్యంబు భంగి నాపదనొందున్. శాంతి. 3.199., శల్య. 2.180.

2. విచారించు

కం. వినుమీ గోమాయువు వ,చ్చిన యంతటి నుండి మనకుఁ జేసిన హితమున్, గనికొన వలవదె యీ తరమున వాఁడిటు సేయుఁ దను సమూహయు వలదే. శాంతి. 3.72.

**కనియు** దే. అ. క్రి

కమియు, పరిపక్వమగు.

చం. ....ఎట్టిదెప్పుడుం, గనియఁగఁ బండియుండు. అర. 2,445.

**కనిష్ఠము** సం. విణ. (అ. ఆ. అ) అధమము

ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమభంగి శౌర్యసం, జాతములై కరంబలరు సంపద లొందుట మధ్య వృత్తియ, స్నీతములైన భారవహ జీవనముల్ దలఁపం గనిష్ఠముల్, నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. ఉద్యో. 2.71.

**కను** దే. స. క్రి.

(దీనికి కానన్, కానఁగన్, కానక, కానఁడు మున్నగు విశేషరూపములు గూడఁ గలవు)

1. చూచు

కం. మున్నెన్నఁడు నివ్విధమేఁ గన్నదిగాదు. ద్రోణ. 3.197.

సీ. కానరే కానలలోన లోకోత్తరు, నని భ్రమని భ్రమనికి నరిగి యరిగి అర. 2 84

2. ప్రసవించు, (బిడ్డను) కాంచు

చం. వెడవెడ యేనుఁ దొల్లియిది విఁటి నమంగని కుంతి యేఁతయుం, జెడ నది వైచిపోయె. ఉద్యో. 4 83

చం. కొడుకులఁగా నరేన్నృపులకుఁ రిత తేజుల నెఁదు నిమ్మెయిం, జెడుతెరు వైనచోఁ దగవు సెప్పక యొవ్వరి కించి చూతురే. ఉద్యో 2.10.

3. ఎఱుఁగు, గ్రహించు, తెలియు

కం. ... అప్పలుకు నం,గనియెను దనపలుకుఁ దప్పుఁగా నతఁడు మదిన్. సౌ. 2. 79.

తే. జనన మరణాదులైన సంసార దురితములకు, నగపడ కుండంగఁ దొలఁగు తెరువు, గను వెలుంగు నీ కిచ్చితి ననిన. విరా. 1.23.

కం. మన వంశంబున వృత్తం,బును బెంపును గానఁజాలు పుణ్యసతివి దు, ర్జనులగు తులువల తలఁపులు గను గొని యేమఱక మెలఁగఁగా వలయుఁ జూమీ విరా. 1.110.

కం. ... నీవి,ట్లాతుర వగుట. నేతాప ములేదు. నైజ మెఱుఁగవు గంటే. విరా. 3.51.

4 పడయు, పొందు.

తే. తల్లి నీ కులగోత్ర సౌందర్యము లకుఁ దగిన పతిఁగంటి.

ఆ... వేయి నెలలపై బ్రతికి నతఁడు గంద్రుడు త్రిదశ పదము. అను. 2.64

కం. ... ఇట్టులనుచిత కృత్యంబు నకుఁ జనఁదగునె దీనం, గనియెడు ఫలమేమి దూష్య గర్వంబేలా శల్య. 2 289.

5. నోఁచుకొను, అదృష్టమును పొందు, భాగ్యమును పొందు,

సీ కానని మేను, కానని వీనులు కానని కోర్కులు, కానని మది. విరా. 2.118, విరా. 1 27.

6 ఆశ్రయించు, శరణుచొచ్చు

కం సన్న్యాసి వేషమునరా, జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి. విరా. 1.69. (కృపాచార్యుఁడు దుర్యోధనునితో)

కం. నినుఁగాచికొనుము నీవు,న్నను సర్వముగల్గు ధర్మనందనుని దగం. గను మతఁడు రాజనని తన మనమున నెక్కించు కొనఁడు మదగర్వంబుల్. శల్య. 1.59.

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురా, జు న వశ్యంబును నెల్లిసంపుదు భయస్థుం డై నినుం జొచ్చినన్, వనజాక్షుంశ రణంబు వేడినను గర్వంబేది నన్నుం దగం, గనినం బోరు దొఱంగిపోయిన నెఱుంగంగాని సత్యవ్రతా -ద్రోణ. 2.277.

శ్లో॥ నచాస్మాన్ శరణంగచ్ఛేత్కృ ష్ణంవా పురుషోత్తమమ్ భవంతంవా మహారాజ శ్వోఽస్మి హంతా జయద్ర థమ్. సం. భార. ద్రోణ. 73.21.

7. గుర్తుపట్టు

కం. అందుల నుండుదురను నా, సం దెల్లముగాఁగఁ బెక్కు చందంబుల ము, ట్టందిరిగి తడవి కుంతీ, నఁద నులం గానలేక నానాభంగిన్. విరా. 3 86.

8. చాలు, పూను

(అర్జునుఁడు ధర్మరాజుతో)కం. మను జాధిప తగు సమయం, బున నీవెతిఁ గింపఁగన్నఁ బొరిపుచ్చనెవే, చను దెంచి నీసుతుం బొది, వినయెడ త త్రూ్కర యోధ వీరులనెల్లన్. ద్రోణ. 2 255.

ఆ. అర్జునాస్త్ర ఖండితాతపత్ర ధ్వజ, చామరములుగాలిఁ జదలఁ దూలఁ, జిహ్మములు విభూతిఁ జెందంగ ఁగని యొప్పె, నప్పుడాడుచున్న యట్టుల చటు. విరా. 5.54

9. విచారించు, ఆలోచించు

కం. మనమందఱమును ధృతరాష్ట్రి నికడకుంబోయి కార్యసూత్రమతనిచే, వినవలయు నాతఁడెయ్యది, గని పలికి న నదియ మనకుఁ గర్తవ్యమగున్. సౌప్తి. 1.41.

10. సంతోషపెట్టు.

మ. అట మిన్నందినయట్టివాని పొద వెంతన్నట్లు ఫాలాక్షునె,క్కటి కయ్యం బునఁ గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించుట. ఉద్యో. 2.174

శ్లో॥ తోషయామాస యుద్ధేన దేవదే వముమాపతిమ్. సం. భా. ఉద్యో. 49.28.

11. భావించు, తలంచు.

కం. విను సాంఖ్యసమజ్ఞానం, బును యోగసమాన బలము భూవర లేవెం, దునునవి రెండును వేఱుగఁ,గను వాలిశుఁడొక్క తెరువ కానేఁగందున్. శాంతి.5.111.

12. బ్రహ్మమునందు బ్రహ్మరూప మునఁ బుట్టినవానినిగాఁ దెలిసికొను

తే. నాకుఁ బ్రజ గతి నిచ్చుననంగ వలవ, దేనఁప్రజనయి పొదమెదఁ గాన యేను, నన్నుఁగనుచున్న నది మోక్ష ణంబుసేయు, నాశపడనట్టులగుటఁ బ్రజాభియుక్తి - శాంతి. 4 27.

శ్లో॥ ఆత్మన్యేవాత్మనా జాత ఆత్మని ష్ఠోఽ ప్రజోఽపివా ఆత్మన్యేవ భవి

ష్యామి న మాం తారయతి ప్రజా. సం. భార. శాంతి. 125.38.

వి. నేత్రము, కన్ను.

కం. కనుప్రమసిన తెరువరి లన, కనుపొడఁబైన మార్గమరని తగ నె ఱింగినవారు సెప్పఁగాఁ గైకొనని కరణిఁ దగిన వెంటకుం జొరవకటా ఉద్యో. 2.280.

సీ. కల్లుద్రావిన పాతకంబది యగ్ని వర్ణముగాఁగఁ గాఁచి పానంబు సేయ, గనుమూసి యుఱుకంగ ననలంబుఁ జొర మహాప్రస్థాన మాచరింపఁగ బాయు. శాంతి, 1.807.

విణ.

అల్పము

చూ: కనుఁజీఁకటి

**కనుంగవ - కనుఁగవ** దే. వి. సమ.

కన్నులజంట

సీ. కనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱఁ బుష్పోపహారంబు పొలుపు దాల్చ. విరా. 1.308

చం...ఆకఁడుగనుంగవ నిప్పులురాలు చుండఁగన్, ద్రోణ. 1.310.

**కనుంగొను, కనుఁగొను కన్గొను,** దే. స. క్రి. (కను + కొను)

1. చూచు, పరీక్షించు

మ...పౌత్రుని భూరిశ్రవసుం గనుం గొనుచు నింద్రుం డ్రేణి సేయంగనే, చిన పెంపొప్పగ బాహ్లికుండరిగె ని శ్చింతంబునన్ బోరికిన్. భీష్మ.1.94

ఉ. ఎందున్ నిట్టివాని నరు వెవ్వరు గాంచిరె నాకకాదు సం, క్రందన సూతికిం దగిలి కన్గొనఁజాలదె విరా. 2 26

తే...వసిష్ఠుఁడతని, శోధ నజుఁడును హరియు రుద్రుండుఁబోరు, గనుఁగొ నంగ వచ్చినవారు గదఁగుమనుఁడు. శాంతి. 5 423

2. తెలిసికొను, ఎఱుఁగు

కం. తన కడిమి కలిమి నచ్చియు, మనమునఁదలఁకదరసూతు మరణ ము గనుం,గొనుటకుఁ దల్లడపడు ప్రియ, వనితకతనిచావు సెప్పి వడిఁ దన్మాత్రన్. విరా. 2.354.

సీ...తునియలు పెకైగనఁ బనివడిఁ గూర్చి రూ,పులు గనుంగొని మూర్చ మునుగు వారు. స్త్రీ. 2.22.

**కనుఁగొన-కనుఁగ్రేఁవ** దే వి. కంటి కొలికి.

కం. తనయుఁడు వడ శకుని కనుం, గొని శోకం బాత్మ నారఁగూరఁగ న ద్రుల్,కనుఁగొనలయందు నినిచె,స్కను జేశ్వర విదురు భాషణంబులు దలఁ చెన్. శల్య 1.387.

చం...కనుఁగ్రేవఁ గెంపడర వీరర సోద్ధతిఁ జూచి సోమద,త్తుని తన యుందు బిట్టతనితోఁ దలవడ్డ నుతించె సైన్యముల్. భీష్మ. 2. 228.

**కనుఁజాటు** దే వి. సమ.

దృష్టి దోషము, కనుఁబాటు.

సీ. దర్పంబు గనుఁజాటు దాఁకకుండఁ గగొడు,గుల, పెల్లుఋచర దృక్కోటి నాఁగు. భీష్మ. 1. 119.

**కనుఁజీఁకటి** దే. వి. సమ.

అల్పమైన చీఁకటి. సంధ్యాకాల మందలి శేఁజీఁకటి.

కం. తను నేర్పరించి కేవల,మను శాంతమునైన తత్త్వమును సంతత ముం,గనుచున్నఁ దన్ను నెఱుఁగం గమఁజీఁకటిఁ బాపు వెలుఁగు గలుగుం బుత్రా. అశ్వ. 1. 224.

**కనుఁబాటు** దే. వి (కను + పాటు).

దృష్టి దోషము.

సీ. సుదతి నీమై చక్కఁజూచుటకో డెదఁ,గనుఁబాటు వొరయునో యని తలంచి. విరా. 2.47.

**కనుకని** | **కన్కని** దే. వి సంభ్రమము, తొట్రు పాటు. భయము, వెఱపు.

(అర్జునుఁడు) వ అట్టియెడ దుశ్శాసన శకుని దుర్ముఖ వివింశతివికర్ణులు తన్నుం బొదివి కొనిన వారల రథంధ్య కేతు వర్మంబులు జర్జరితంబులుగా నేసిగాసిచేసిన నంద ఱుంగను కనిబఱవం దొడంగిన. విరా. 5.161.

చం. ... కలఁగి కన్కనిఁ బాఱె బలంబులు. అశ్వ. 4 128.

చం. ఘనుఁడు వృకోదరుండు దనుఁ గట్టలుకం దల పడ్డఁ గోటికా,స్యుని తురగంబులం దునిమి సూతుని కంఠముద్రుంచి వైచి తీ,వ్రనిశితమైన ప్రాసమున వాని యురంబుఁ బగిల్చి చంపినం, గనుకనిఁ బాఱె భీతి యెసఁ గంగఁ దదీయ చమూసమూహమున్. అర 6 281.

వ. తత్పరిజనంబు లందఱు నశని పాతంబునఁ బెదరి చెదరినట్లు గనుకనిం బఱచిరయ్యేక స్తంభ హర్మ్యంబును దక్షకు విషాగ్ని దగ్ధంబయ్యె. ఆది. 2 198.

శ్లో॥ భయాత్పరిత్యజ్య దిశః ప్రపేదిరే. సం. భా. ఆది. 44.4.

**కనుకలి** దే. వి (కను + కలి).

చూపు, దృష్టి.

సీ. ఇన్నాతి చెలువంబుగన్న శచీప్రియుండైనను గనుకలి నవయకున్నె విరా. 2.27.

**కనుగలుగు — కన్గలుగు** దే. అ. క్రి. (కను + కలుగు).

జాగరూకత వహించు, అప్రమత్తత గలిగి యుండు.

కం. నాయున్నచోటనెప్పుడుఁ,బాయక కనుగలిగి నిలిచి ఖండనము దగం, జేయంగవలయు నక్కఁరు, నాయకు కోరికి ఫలంబునకు విముఖముగాన్. ద్రోణ- 1.117.

ఉ. ఏమటీ రక్షసాలని మృగేంద్రుని నక్కయు గోలుపుచ్చు సం,గ్రామము లోనఁ గన్గలిగి కావక దక్కిన నాశ ఖండిచే, నీ మనుజేంద్రుఁ గోల్పడమె. భీష్మ. 1.80.

**కనుగీటు** దే. అ క్రి, స. క్రి.

కనుగొలుపు, కనుసైగచేయు.

కం అనలుని నన్వేషింపఁగ, వనగజ మొక్కండురావివలనుచతురతం,గను గీటి చూపవార,వ్వనస్పతిం జేరఁ జనఁగ వారనియలుకన్. అను. 8.145.

**కనుదిరుగు** దే అ. క్రి.

భ్రమక్రమ్ము.

వ. .... కనుదిరిగి తమవారుగాని వారల చెట్టలు పట్టుకొనిచన... సౌప్తి 1.197.

**కనుదోయి** } **కన్దోయి** } వి. కనుల జంట

వ.నిద్రంబొరయనికనుదోయిమొగిడ్చియుండె. విరా. 3.236; కర్ణ 1.91.

**కనుపట్టు** దే.అ క్రి (√కను)

చూపట్టు, కనఁబడు, గోచరమగు

ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావిమ్రో కనన్. విరా. 3 192

ఉ. శృంగము లేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁడయ్యుం గనుపట్టె. కర్ణ. 3.322

**కనుపుకొట్టు** } **కనుపుగొట్టు** } దే. స. క్రి.

1. ఖండించు, నఱకు, సంహరించు

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టినవ్వుచున్న కవ్వడింగనుంగొని. ద్రోణ.3.159

వ. కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల దొక్కయని యేరు పాటులేక వండం దఱిఁగిన యట్లున్న యెడలును. భీష్మ. 5.248.

2. నాశముసేయు

వ. అప్పుడ మిత్రేని ముందట నిలిచిపని యేమి పనుపుమనిన నతండు ప్రీతుం డై కళ్యపాదులం గనుపుగొట్టుమని పనిచిననది వారలున్నెదరోసిపోయె. అను.3.220

శ్లో॥ జ్ఞాత్వానామాని చైవైషాం సర్వానేతాన్వినాశయ వినష్టేమ తథా స్వైరం గచ్ఛ యత్రేప్సితం తవ. సం. భార. అను.141.47 (నిర్ణయ)

**కనుభ్రమయు** దే. అ.క్రి

కనుచెదురు. సరియైన తీరుసఁ గన బడకుండు

కం. కనుభ్రమసిన తెరువరితన, కనపాయంబైన మార్గమరసి తగనెఱిం గినవారు సెప్పఁగాఁ గై,కొనిన కరణిఁదగిన వెంటకుం జొరవకటా:

**కనుమిడియు** దే.అ క్రి

కనుగ్రుడ్లు వెలికివచ్చు, మిడిగ్రుడ్లు పడు

కం. కడుబెడిదముగ ఁబొడిచెం, బగతుఁడు గనుమిడిసి నేలఁబడి తన్నుకొనన్.విరా.2 361

శ్లో॥ ఇత్యేవముక్త్వా పురుషప్రవీరస్తం కీచకం క్రోధ పరాగనేత్రః అస్రస్తవస్త్రాభరణం స్ఫురంత ముద్భ్రాంత నేత్రం వ్యసుముత్ససర్జ సం. భార. విరా. ' 83

**కనుమూసి యుఱుకు** దే. జాతీ

మరుప్రపాతముచేయ. సిద్ధ-ప్రదేశమునందుఁ బర్వతాగ్రము నుండి పుడమికి దుముకు.

సీ. కల్లుద్రావిన పాతకఃబడి యగ్నివర్ణముగాఁగఁగాచి పానంబుసేయఁ, గను మూసియుఱుకంగ ననలంబు జొర మహాప్రస్థాన మాచరింపంగఁ బాయు. శాంతి. 1.307.

**కనుమోసము** దే. వి. సమ.

ఏమఱుపాటు, అజాగ్రత్త.

కం. వాసవ నందనుఁ డెంతయుగా, సిరి యున్నాఁడు మనలఁ గని యించుకయుం,బా సైరణసేయఁడుగను, మోసములే కొక్క మొగిన ముసరఁగ వలయున్. విరా. 4.౨౬0.

**కనువెట్టు** దే. అ. క్రి.

కన్నువెట్టు, జాగరూకత దీసికొను, శ్రద్ధ వహించు.

సీ. ... ఆయువు జనులకు వేగంబ చేనుచున్నుండు, దీనిపైఁగనువెట్టిధీరత దలకొల్పి మేలు వాటిల నెమ్మెయి జరించు వారొకో. శాంతి. 4.21.

**కనువెలుగు** దే. వి, (కను+వెలుఁగు) కంటికివెలుఁగు (కంటికి వెలుఁగు వంటిదిమార్గ దర్శకము అనిభావము). కం. కనువెలుగు నీవుగానీ, వెనుక భవన్మతమయూది వీరలు నేనుం జను దెంచెద మూఅట నెల,కొన వృషభము పజ్జ నడచు గోవుల భంగిన్. ద్రోణ. 1.66.

చం. అనిమిషవాహినీ తనయుఁడస్త్ర గురుండును నీకు నెప్పుడుం గను వెలుఁగై చరింతురు వికర్ణుఁడు కర్ణుఁడు దుస్ససేనుఁడున్ నినునొక యప్డు వాయరు. శల్య. 2.403.

కం. ఆ వెలుఁగు గనువెలుఁగుగఁదా వెలసిన పుణ్యమూర్తి ధర్మ సుతుం డే,లా వెఅచురణమునకు. ద్రోణ. 1.100.

తే. కనువెలుంగు వేదవ్యాసముని వరుండు, నధిప కృష్ణుండు నీకుఁ బరాయణుండు. అను. 5.438.

శ్లో॥ ద్వైపాయన స్స్వయం చక్షుః కృష్ణ స్తేఽస్తు వరాయణమ్. సం. భా. అను. ౭71.63. (నిర్ణయ)

**కనుసన్న** వి.

కంటి సైగ.

వ. ఆతండునుధర్మతనయు కనుసన్న గయికొని. విరా. 2.12.

**కన్కని** చూ. కనుకని.

**కన్గిఱుపు** దే. అ. క్రి.

కనుగీటు.

చం. ఉఱక నరుండు ద్రోణసుతు యుగ్యములన్ వెసనొంచె నాతఁడుం, దెఅపి యొకింత గాంచి ఘనతీవ్ర శరంబున నారి ద్రుంచి కన్గిఱిపిన మాత్రలోననతనిం బటుబాణచతుష్క యుక్తమేద్రెఱఁ దొడి మౌర్వి గ్రమ్మ ఱఘటించునెడన్ వడినేసియార్చినన్ విరా.5.141

**కన్దెఱ** దే.విణ

(కను+తెఱచు) నేత్రముల తెఱచు నట్లుచేయువాఁడు, నేత్రోన్మీలనుఁకు

సీ. అఖిల జగముల కన్దెఱయగుచు జనస,మాజ కరవుట హృదయ సరోజములకు ముకుళంబును జృంభ ణంబును నొనర్చి భానుబింబంబు పూర్వాద్రి పై వెలిఁగె. విరా. 2.241

**కన్నాకు** (కను+ఆకు) విణ.

శ్రేష్ఠము. ముఖ్యుఁడు నాయకుఁడు, అగ్రేసరుఁడు (ముఁదుండువాఁడు)

కం. కన్నాకు మనకు భీష్ముఁడు. భీష్మ.1.78

వం. ఇవ్విధంబునం బ్రతివింధ్యుఁడును శ్రుతసోముండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతసేనుండును సౌభద్రుండును దమకుంగన్నాకుగా జెన్నుమిగిలి చనుదేరం గనుఁగొని కౌంతేయబలంబులు సంతసంబునం బొదలె. భీష్మ.1 101

కం. అనిలజ భీష్మలు దమదమ, మొనలకుఁ గన్నాకులగుచు మునుకొని వడి న, ర్జున కుంభసంభవులప్రా, పునఁజూపిరి విక్రమంబు భూరిబలంబున్. భీష్మ 2 391.

**కన్నార** క్రి

1. స్పష్టముగా

(అర్జునుఁడు కర్ణునితో)

కం. ...తమ్ముని, పాటును గన్నారఁ గఁటి పాఱకు మింకన్ విరా, 5.69.

2. కన్నులు తనియునట్లుగా, కన్నులకు తృప్తి గలుగనట్లుగా భీష్మ. 3.277.

(ధర్మరాజు శ్రీకృష్ణునితో)

కం. మున్నును నేఁ గారణముగ, నన్నియిడుమలనుభవించి రనుజులు వీరిం,గన్నారఁజూతుఁగాని,జగన్నుత భీష్మనకగోలుగా నీఁజాలన్. భీష్మ. 3.280.

**కన్నిడు** దే స. క్రి.

దృష్టి నిలుపు.

వ తల దునిసినం దారు మున్నుగన్నిడిన వారిఁబొడిచి పడువారును ... భీష్మ. 1.267.

2. కనిపెట్టు, కాచికొనియుండు.

వ. ... దుశ్శాసన రక్తపాన కౌతుకాధీన మానసుఁడైన యాభీమసేను పై నెవ్వరు గడంగుదురోయని కన్నిడియుండి యతం డప్రతి హతంబుగా బ్రతిన దీర్చుటకు వల్గనుండు ప్రీత చిత్తుండై యుండె కర్ణ. 3.228.

3. అత్యధిక శ్రద్ధతోఁ బరీక్షించు.

చం. ... అన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడియున్నఁ బెంపగున్. శాంతి. 2.283.

4. వలపు పెట్టుకొను, మోహము పొందు.

కం. రుచి మీఁదంగన్నిడి యా,శచీవిభుఁడు దిరుగు. అను. 2.189.

**కన్నియ** / **కన్నె** } వై. వి. (సం. కన్యా).

1. కన్యక, వివాహము కాని బాలిక.

సీ. మునిదత్తమగు మంత్రమునఁ గొంతి కన్నియనాఁడు. వేడు కదిన నాథుఁదనకుఁ బ్రత్యక్షముగఁజేసి పడయుట. శాంతి. 1.18.

కం...కన్నియలకు నాటగ అపఁగానో పుదు. విరా. 1.93.

కం. బలిమిమెయి వరుఁడు గన్నెకుఁ గల వారిం బొడిచి కరము క్రౌర్యంబున న, ప్పొల తుక దుఃఖింపగ వార,లు పొగులగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా. అను. 2.224.

2. కూఁతురు, పుత్రిక.

ఉ. పంబిన కోపమున్ సమయ భంగ భయంబును నగ్గలించి యుల్లంబు పెనఁగొనఁగఁ బతులందగ సభ్యులఁ జూచు మాడ్కి, రూక్షంబగు చూడ్కి నా ద్రుపదకన్నియ సూచి. విరా. 2.139.

విణ.

మొదటిది. ప్రథమము

చూ: కన్నె కయ్యము.భీష్మ. 1 110.

**కన్నియతఱి** సమ.

కన్యగా నున్నపుడు.

సీ మంత్ర బలంబున మార్తాండు వరమునఁ గన్నియ తఱి గొంతి గన్న వాఁడవు. ఉద్యో. ..29.

**కన్నియనాఁడు**

కన్యగానున్నపుడు, కన్నియతఱి.

సీ. కన్నియనాఁడు భాస్కరుని రావించితి వర మంత్రబలమున వచ్చి యతఁడు,సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు. ఉద్యో. 4.59.

**కన్నీరు** దే. వి (√ కన్ను).

అశ్రువు, బాష్పము,

సీ. కన్నీరు వట్టొడ్డి కాంతియెంతయు గొన్న, వెలఁది నీ కనుఁగవ విన్న నయ్యె ... విరా. 2.156.

**కన్ను** దే. వి. బొ. (ఇది హల్లోవంబగు నపుడు వైకల్పికముగా 'కను'. 'కన్' అను రూపముల నొందును).

1. నేత్రము, చూపు, దృష్టి.

తే. మరగి నీ మూర్తి పైఁ గన్ను మనము దగిలి యుండి యొక్కొక్క మాటు. విరా. 2.202.

వ. తదనంతరంబ దామోదరుఁడు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి. ఉద్యో. 3.411. ఆశ్ర. 1.144.

(ఎండకన్ను = ఎండచూచుట; వానకన్ను = వానచూచుట. చూ. ఎండకన్ను, వానకన్ను. ఆశ్ర. 1.148.

2 ఇంగితము, అభిప్రాయము, జాడ

వ. ద్రౌపదియద్దు రాత్ముండు (సైంధవుఁడు) తన్నుఁబట్టు సమకట్టు కన్నెఱింగి తమ పురోహితు ధౌమ్యునిం బేర్కొని యాక్రోశించిన. ఆర. 6 189.

వ. అని పలుకుచున్నయంగదు పరుష భాషణంబులకు రోషించిన యసురపతి కన్నెఱింగి నలువురు రక్కసులు గ్రక్కున నవ్వాలినదనుం బొదువంబట్టిన. ఆర. 7.63; భీష్మ. 3.187.

3. నేత, నడపువాఁడు, నడపునది

వ. విషమ ప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును గాంధారికిఁ గుంతి యుగన్నై మెలంగుదురు. ఆశ్ర2.150

శ్లో॥ సంజయోన్య పతేర్నేతే సమేషు విషమేషుచ. గాంధార్యాశ్చ పృథాచైవ చక్షురాసీదనిందితా.సం. భా. ఆశ్ర 39.17.

**కన్నుంగవ** } కనుఁగవ
**కన్నుఁగవ** }

మధ్యా; ఉవిద కన్నుఁగవ మొగిచి తెలవకయుండె ఆది. 4.253

సీ తెలి గన్నుఁగవ కాంతి పొలుపార విరా. 2.46.

**కన్నునీరు-కన్నీరు**

సీ. కద్రువ యిట్లను గన్నునీరు, దొరఁగంగ అను.1.193

**కన్నుమూయు** దే.అ.క్రి (√కన్ను)

నిద్రించు, నిద్రవచ్చు

వ. ఆ సమయంబున నవ్వీటి వారెల్ల ను దమ యిల్లంబుల నెవ్వగలు నివ్వ టిల్లం గన్నుమూయక విన్ననయి యుండి. ద్రోణ.2.341

కం. వినవయ్య కర్ణుగర్వం, బనినాత దభేద్యకవచుఁదగుటయు విలునేర్పు నతనిబాహు విక్రమ.మును దలఁచిన నాఁడు గన్ను మూయదు నాకున్. అర.1.270

**కన్నుమొగుడు** దే. అ క్రి

నిద్రవచ్చు

కం. ఎన్నఁబడి జను లెఱింగిన యిన్నాలుగు తెఱఁగులందు నెయ్యది యైనన్, గన్నుమొగుడ నీదచెమీ, కన్నియుఁ గలుగంగ నిద్ర యేటికి వచ్చున్. సౌప్తి 1 67. (చూ. 66)

**కన్నుమొగుడుచు** కనుమూయు, నిద్రించు

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబున కుంజని కీచకుండుఁ మున్నున్న తెఱం గు దప్పక సుఖోచిత శయ్యను నిద్ర సేయనీ, కన్నుమొగుడ్చు నూఱటకు గారణమెయ్యది భీమసేన. విరా. 2.166

**కన్నులనవ్వు** దే. అ. క్రి.

కన్నుల యందు నవ్వు కనఁబఱచు.

చం. సరభసుఁడై యుధిష్ఠిరుఁడు శల్యునిదాఁకుడునాతఁడమ్మహీ,శ్వరు మహనీయ చాప మనివారణఁద్రుంచిన నొండు విల్లు భీకర తర శీఘ్ర లీలఁ గొని కన్నుల నవ్వుచుఁ బాండవాగ్ర జుం.దరిబల ముక్కుదక్క వడి నాతనిపైఁ గురిసెన్ శితాస్త్రముల్. భీష్మ. 1.255.

(తిరస్కృతిని దెలుపును)

**కన్నులపండువు** దే. వి

నేత్రోత్సవము. ఉత్సవము.

కం. ... అరిగిరి నగరంబునకుం గన్నుల పండువు, జనపదము జనం బొనర్ప జనసంస్తుత్యా. ఆశ్ర. 2,144., ఉద్యో. 3.247.

**కన్నులసన్న** కన్నుసన్న.

ఉ. ... ఆ సుదేష్ణకుం, గన్నుసన్న లంబనులు గైకొని. విరా. 2.221

**కన్నులార**

స్పష్టముగా, పూర్తిగా.

కం అని తను నుల్లస మాటకుఁ, గినిసి యినతనూజుఁడేను గ్రీడిసిచట మాఱొక్కను వీకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ గవి సెం బెలుచన్. విరా. 5 181.

**కన్నులు గప్పు** దే. స. క్రి.

మోసగించు.

సీ. నేఁడిందుఁ జనుదెంచి నిర్వికారత
బ్రజ. కన్నులుగప్పిన గౌరవంబు....
విరా. ౩.౩౬౦.

**కన్నులు గట్టు** దే. స. క్రి.
మోసగించు.
('కన్నులు గప్పు' – నకు పాఠాంతరము)

**కన్నులు గమరు** దే. అ క్రి.
కనులు ఉడుకెత్తు.
కం. మున్నెన్నఁడు నెవ్వరికిం,గన్నులెదురఁబడని యట్టి కాంతలు జనులెల్లన్నిలిచి చూడ వెదలిరి, కన్నులు గమరన్ సుహ్రన్ని కాయంబులకున్.
స్త్రీ 1.108.
కం. మున్నింద్రప్రస్థంబున, నున్నతిమెయి ననుజతనుజ యుక్తంబుగ నీవున్నతెఱఁగు దుర్యోధను, కన్నులు గమరింప నతఁడు గడువగనొందెన్.
శాంతి. ౯.౧౨౬.
(చూచి యోర్వలేకపోయెను అని భావము)
(కన్నుగుట్టెను అని జాతీ)

**కన్నులు చల్లనగు**
నేత్రానంద కరమగు
ఉ. వెన్నుఁడు ప్రీతిఁజెప్పిన సవిస్తరవాక్ప్రచయంబు త్రోవఁబో, వన్నకుమార యట్లయిన నాయువు శ్రీయును గల్గు మా, కన్నులు సల్లగా.
ఉద్యో. ౪.౩౪౮.

**కన్నులుసెడువాఁడు**
పుట్టినప్పుడుగాక నడుమ కన్నులు పోయినవాఁడు
సీ కాంత జాత్యంధుఁడు గన్నులు సెడువాఁడు తన యొప్పు మెఱయుచు దగిలి యొరుని వనితఁ దొల్మీన జూచినవాఁడు. అను. ౬.౯౩.
శ్లో॥ జాత్యంధా శ్చైవ దృశ్యంతే, జాతావా నష్టచక్షుషః తేన కర్మ విపాకేన తన్మేశంసితు మర్హసి. సం.భా. అను. 220 1 (నిర్ణ)
(ఇచ్చట పాఠాంతరము యుక్తము గాదు
'కన్నులు చెడువాఁడు' అని సం. ము పాఠము)

**కన్నువఱపు** దే. స. క్రి.
చూచు
సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి యో యనుట లే.కున్న నయ్యింటిలోఁ గన్నువఱపి, వల్లభఁగానక....అను.
1.76.

**కన్నువొందు** దే. అ. క్రి.
నిద్రవచ్చు
ఆం. కడుపు నిండఁగుడువఁ గానమి రేయెల్లఁ గన్ను వొందకున్నఁ గరము డస్సి,యున్నవాఁడ. ఆది. 6.286.

**కన్నె** వై. వి. (సం. కన్యా)
చూ. కన్నియ

**కన్నెకయ్యము** వి. (√ కన్నె)
ప్రథమ యుద్ధము
మ. .... కన్నెకయ్యంబు నర్థిభవత్పుత్రుల మీఁద కోపమున నుద్దీపింప నేతెంచిర,య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతి యూథాకృతిన్. భీష్మ. 1 110.

**కన్నెఱుంగు** (√కన్ను)
అభిప్రాయములను తెలిసికొను.
వ. తన్నుందాన యువశమించు కొనియున్నం గనుంగొని కౌరమేశ్వరుండతని కన్నెఱింగిన వాఁడై దుశ్శాసనుతో నిట్లనియె. భీష్మ. 3.187.
(చూ. కన్ను. 2వ యర్థము.)

**కనోన్నట** దే. వి. (√ కన్ను).
దాక్షిణ్యము, మోమోట.
ఆ. మన్నువలికి నట్ల కనోన్నటలేక పల్కుటయు. శాంతి. 4.492.

**కన్మఱుఁగు** దే. వి. (√ కను)
చాటు, ఏకాంతము, రహస్యము, (ప్రదేశము).
కం. తెఱవ యొదఁబాటు మాటం, బఱివోయిన కొంతుతోఁడ బ్రాహ్మణుఁ గాని కన్మఱుఁగను వెదకు నరిగెన, త్రతి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా. అను. 1.74.

**కన్మొఱఁగు** దే. క్రి. (√ కను)
వంచించు.
చం. ... శత్రువుల కన్మొఱగం దలంచి యీ, వెరవున డాఁగ సర్వ పృధివీపతి దురశనిట్లు వి౦దునే. శల్య. 2.17.

**కన్య** సం. వి. ఆ. స్త్రీ.
కన్నియ.
1. పెండ్లిగాని పడుచు.
ఉం. ఉత్తమ కన్యా జనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు. విరా. 1.88., శాంతి. 5.82.
2. (వ్యు.) కామములెల్లను కామించి పొందునది.
సీ. కామంబులెల్లను గామించి పొందుట, నయ్యెఁ గన్యా శబ్దము. అర. 7.337.

**కన్యక** సం. వి. ఆ. స్త్రీ.
కన్య.
సీ... సురకన్యకల యట్టి సురచిరకన్య కాశిచేఁ బరివృతయైన దాని. అర. 2.49.

**కన్యాకుబ్జము** సం. వి. అ. న.
విశ్వామిత్రుని రాజధాని.
వ. తొల్లి కన్యాకుబ్జంబున గాధి పుత్రుండు విశ్వామిత్రుండను రాజు నిరమిత్రంబుగా ధాత్రి నేలుచు. ఆది. 7.95.
(ఇది విశ్వామిత్రుని పూర్వికులకు వంశ పారంపర్యముగా వచ్చు రాజధాని. చూ. అను. 1.104).
(ఇప్పుడు దీనిని కనూజ్ అను చున్నారు. అని సూ. అ.ని )

**కన్యాకూపము** సం. వి. అ. న.
ఒక తీర్థ స్థానము.
ఇచ్చట అగ్నిహోత్రము వ్రేల్చిన నుభయ లోకము లందును బొగడ్త కెక్కును. అను. 2.76

**కన్యాత్వము** సం. వి. అ. న.
కన్నెతనము అవివాహితగా నుండుట
కం... కన్యాత్వమెడలె మగువానీకున్. ఉద్యో. 4.278. అశ్ర. 2.95,103.

**కన్యాదానము** సం. వి. అ. న.

కన్యను వరున కిచ్చి పెండ్లి చేయుట.

వ. .... అజాత శత్రుండు సంజాత ప్రీతుండై పితామహుతో గన్యాదానంబునకు వరుండెట్టి వాఁడు గావలయు ననుటయు. అను 2.2

**కన్యాపురము** సం. వి. అ. న

కన్యలుండు గృహము.

వ. ... కన్యాపురంబు నందు నివాసంబు సేసిన. ఆది. 8.160.

**కన్యావరణము** సం. వి. అ. న

కన్యను వరించుట. వరునకై కన్యను వెదకి పట్టుట.

వ అనిన విని యజ్ఞనపతి జాహ్నవీ నందనునితోఁ గన్యావరణ ప్రకారంబు విచారణీయంబైన కృత్యంబు దాని తెలియఁ గెఱింగింపవే యనుటయు. అను. 2.220.

**కన్యాశ్రమము** సం. వి. అ. పుం, న.

ఒక తీర్థ స్థలము.

వ. ... దధీచ తీర్థంబునం గన్యాశ్రమంబు నందుఁ ద్రిరాత్రంబు వసియించిన వారికి స్వర్గ ఫలంబగు ఆర. 2.267.

**కన్యాసంబోధ్యము** సం వి అ న.

ఒక తీర్థస్థలము.

వ. ... కన్యా సంబోధ్యంబను తీర్థంబునఁ గన్యాదానంబు సేసి యక్షయ ఫలప్రాప్తులగుదురు. ఆర. 2.275

**కన్వఱపు** దే అ. క్రి. (√కను)

దృష్టిసారించు.

(ధర్మజుఁడు శ్రీకృష్ణునితో)

సీ. ఏవిఁటి విజయుఁ డనేక యుద్ధంబుల నలజడి వడుట... అతని మేను సులక్షణాన్వితంబు.

తే. నామదికి నెక్క నీవు గన్వఱపి కన్న. యట్టి కీడు తదీయంబులైన యవయవముల నేఁదేఁ గలిగెనే యమిత దుఃఖ, భాగియగుటకు మూలమై పద్మనాభ. అశ్వ. 4.152.

**కపటము** సం. వి. అ. పుం. న.

(కం = బ్రహ్మనుగూడ పటతి = అచ్ఛాదించునది)

1. కైతవము, కుట్ర, వంచనము.

కం. ద్యూత క్రీడకుఁ గొంకొక, నేతుం గపటమున నొవ్వని జనంబులునా, చేతి ధనమెల్లంగొని పరిభూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. విరా. 1 196.

**కపటి** సం. విఅ. (న్. నీ. న్.)

కపటము గలవాఁడు.

వ. ... నిజ కార్యార్థులగు కపటుల నేర్పుమాటల తెరువు లెఱింగికొనుటకును నుదాహరణంబైన యీ గృధ్ర జంబుకోపాఖ్యానంబు. శాంతి.3.381

**కపర్ది** సం. వి. న్. పుం.

శివుఁడు, కపర్ద మనెడి జటాజూటము గలవాఁడు.

కం. .... సుఖిత్వ, స్ఫురణము నొందుట నీదగు, కరుణాతిశయంబు వడసికాదె కపర్ది... ద్రోణ. 5.411., శాంతి. 3.1 0., అను. 4.423.

**కపాలధరుఁడు** సం. విఅ.(అ. ఆ. అ.)

తలపుఱ్ఱెను చేతి యందు ధరించిన వాఁడు, శివభక్తుఁడు.

కం. మంగల రక్షా శుచితా, లింగార్చన యోగ్యతలు ఫలించుటకై భూ,తిం గావించితఁ దల్లి, ప్రాంగులును గపాల ధపటన్నై శాంతి మెయిన్. అను. 5.289.

**కపాలమాలిక** సం. వి. ఆ. స్త్రీ.

కపాలములతో (గూర్చఁబడిన మాలిక

ఉ...తులసీదళ దామకపాలమాలికా, భావ భవాభిరామ. స్వర్గ. 95.

**కపాలము** సం. వి. అ. పుం. న.

1. శిరస్సును కాపాడునది, తలపుఱ్ఱె

వ. కిరీటి శరపాటవ పరిస్ఫోటిత రిపుకపాలగళిత మస్తిష్క పలలపంకంబునను. విరా. 5.304., 2.169.

2. భిక్షుకుల భిక్షాపాత్రము. బిచ్చపు కప్పెర

సీ. కపాలధారుండు నేకాకియు న క్రోధకామశోకుఁడను గాఁగవలయు భిక్షుకునకు. శాంతి. 5.142.

**కపాలమోచనము** సం. వి. అ. న

ఔశనము అను తీర్థము

తొల్లి రఘురాముని చేతఁ జచ్చిన మహోదరుఁడనురాక్షసుని తలపునుక యొకతపస్వి కాలిలోదిగఁబడి వెలికి రాకబాధపెట్టెను. అతని వేదనను జూచియార్యులు సరస్వతీ నదియందు ఔశనము అను తీర్థము గలదు అక్కడ శుక్రుండు తపస్సుచేసెను. నీవచ్చటికిఁ బోయిన నీచేసిన పాపము తొలఁగును అని ఆనతిచ్చిరి. అంతట మహోదరుడను పేరుగల యా తపస్వి (రాక్షసునిపేరుమహోదరుఁడే, తపస్వి పేరుమహోదరుడే) యచ్చటికిఁబోవుటతోడనే కాలినుండి యా తలపుఱ్ఱె యూడివెలికి వచ్చెను. అప్పటి నుండి యాస్థలము కపాలమోచనము అని ప్రసిద్ధికెక్కిన తీర్థస్థలము అయ్యెను. శల్య. 2.169; ఆర. 2 265.

**కపాలి** సం. వి. న్. పుం

ఏకాదశ రుద్రులలో నొకఁడు, శివుడు.

తరు........కపాలి, యనఁగ రైవతుఁడన...యా రుద్రు లర్చితులైరి. అను. 3.58.

**కపి** సం. వి. ఇ. పుం.

కోతి, వానరము

తే...... కపులు తోయధియు నింత పుణ్యంబు సేయునే శాంతి. 2.98

**కపికేతువు** సం. వి. ఉ. పుం

హనుమంతుఁడు ధ్వజముగాఁ గల వాఁడు. అర్జునుఁడు

వ...ధార్తరాష్ట్రకుల ధూమకేతువగు కపికేతువుతోఁ,చె. విరా 4, 195.

**కపిధ్వజుఁడు** సం. వి. అ. పుం.

వానరము(హనుమంతుడు) ధ్వజముగా గలవాఁడు. అర్జునుండు.

మ...నిజవంశోచిత వృత్తమున కున్మేషంబుగా నాకపి, ధ్వజుఁడుత్సాహము సేయకున్న నకటా దైన్యంబు వాటిల్లదే. ఉద్యో. 4.16.

**కపిల** సం. వి. ఆ. స్త్రీ.

దక్షుని కూఁతురు, కపిలుని భార్య.

మ. ... దక్షుండు ... అదితి ... కపిలా...కద్రువలను పదుముప్వురను గశ్యపున కిచ్చె. ఆది. ౩ ౭౧.

2. పంచశిఖుఁడు అను మునివరుని గురువు భార్య, ఈమెపాలు త్రాగి పెరిగి పంచశిఖుఁడు కాపిలేయుఁడని పేరు పొందెను శాంతి. ౪.౨౪౨.

౩. కపిల గోవు, పుల్లావు (కపిల వర్ణము నీలపీత మిశ్రిత వర్ణమని కొందఱు గోరోచనావర్ణమని కొందఱు చెప్పుదురు).

తే. కపిల యిచ్చిన వానిన కాదు నిజము, కొన్న వానిని బ్రహ్మాత్మకుఁడుగఁ జేయు, నీవు,గపిలా సమర్చనా నిరతమాన మానసుండ వగు పెంతయును మేలు సువ్రతాత్మ. ఆను. ౩.102.

గోవునకు కపిలత్వము వచ్చిన విధము ఒకప్పుడొకానొక కారణమున అగ్ని దేవతల నుండి తన్ను మఱుఁగు పుచ్చుకొనఁదలచి గోవులను ఆశ్రయించెను. అవి యగ్నిని దమయందు రహస్యముగాదాచియుంచెను. దేవతలు పావకుని కొఱకై వెదకి వెదకి ఆవుల యందుండుట యెఱింగి ఆవుల యొద్దకు వచ్చి వానితో "అగ్ని దాఁచుట యఖిల జగజ్జనంబులకు నహితంబు సేయుట యగును గదా చూపకుండుట తగదు" అని పలికిరి. గోవులప్పావకునిజూపెను. సుపర్వులు సంతోషించి యా ధేనువులకు వరమొసంగుమనియావాయుసఖునిప్రార్థించిరి. అనలుఁడు దానా గోవులయందు దాఁగియుండ నవి కపిలచ్ఛాయను బొందియుండుట గనుఁగొని గోవులలో కపిల యుత్తమమైనదనియు దానిని ఆరాధించినను దానమిచ్చినను పుచ్చుకొన్నను చేసిన పాపములన్నియుఁ దొలఁగిపోయి యుత్తమలోకములు ప్రాప్తించుననియు వరమిచ్చెను.

చెవులు, కొమ్ములు, కన్నులు,నాసాపుటములు, కుత్తుక, ముష్కములు కపిలవర్ణముండ వలసిన తావులు. ఇఁదేయొక్కచోట కపిలమైయున్నను కపిలాత్వ గుణమునకుఁగొఱఁతరాదు. ఇఁక శరీరమంతయుఁ గపిలత్వము గలిగినదాని యుత్తమోత్తమత్వము చెప్పఁబనిలేదు.పాలుపిదుకువేళలదప్ప దానికాళ్లు కట్టివేయరాదు. కాలితోఁగాని చేతితోఁగాని కఱ్ఱమొదలగు వానితో గాని దానిని దండించిన నరకమునంభవించును. గడ్డిమొదలగునవి పెట్టి పోషించిన స్వర్గము ప్రాపించును. ఆను. ౩.100 మొ 107వ

శ్లో॥ ఆగ్నేయా నేత్రకపిలా ఖురైర్మాహేశ్వరీభవేత్, గ్రీవాయాం వైష్ణవీ జ్ఞేయా పూష్ణోఘ్రాణా దజాయత. కర్ణతస్తు వసంతేరస్వ యోనిమథి జాయతే గాయాత్ర్యాశ్చ వృషణయో రుత్పత్తిః షడ్గుణాస్మృతాః. ఆను 4.5 (నిర్ణయ)

గోవునకు కపిలత్వము వచ్చిన విధము ఈ ఆనుశాసనిక పర్వములో ఈ యాశ్వాసమునందే మరొక విధముగా నున్నది.

ఒకప్పుడు దేవత లాఁకలికిఁ దట్టుకొన

లేక బ్రహ్మ దేవునిఁ బ్రార్థించిరి ఆతఁడువారికి అమృత మిచ్చెను. వారా యమృతమును దనివి తీఱఁ ద్రాగిరి. ఆ యమృతపు వాసనకు గోవు పుట్టెను. ఆ గోవుకొన్ని గోవుల ను బుట్టించెను.

ఒకప్పుడు గోవులు హిమవత్పర్వతో పరిభాగమున యధేచ్ఛముగఁ దిరుగు చుండెను. ఆసమయమున ఒకలేఁగ తల్లిచన్ను గుడుచుచుండఁగా ఆలేఁగ నోటినుండి జాఱిన పాలనురుగు గాలికిఁ గొట్టుకొని వచ్చి యుగ్రముగ తపముసేయుచున్న శివునిమౌళియందు బడెను. అతఁడందుల కుగ్రుఁడై తన మూఁడవకన్ను తెఱచెను ఆదరిదాపు న నున్నధేనువులన్నియు కపిలవర్ణము చెందెను. ఇదిచూచి దేవతలాశ్చర్య పడిరి. ఆ గోవులచ్చట నిలువఁజాలక యరరి చెదరి పరువు లెత్తెను వానిని జూచి మిగిలినవియుఁ బరుగిడెను. అన్నియు చంద్రుని యొద్దకు జేరెను

ఇదంతయు జూచి బ్రహ్మ శివుని యొద్దకు వచ్చి హస్తములు మోడ్చి 'దేవా! నీవు అమృతమున దడిసిటివి గోవులకు ఎంగిలి యనునది లేదు. చంద్రుఁ డెట్టులమృత మిచ్చునో అట్లే గోవులును పాలనిచ్చును, దూడ త్రాగిన పాలు శుచికాని వానికి ఎంగిలి దోషము లేదు, కరుణింపుము.' అని ఒక మహాయ వృషభమును కానుకగానిచ్చెను శంకరుఁడు ప్రియ మంది యా వృషభమును కేతువుగను వాహనముగను పరిగ్రహించెను.

శివుడు ప్రసన్నుఁడై తన చూపువలన పింగలత్వ మొందిన గోవులకు ఉత్త మత్వమును, సర్వ గోవులకు స్వేచ్ఛా సంచారత్వమును గలుగు నటుల వరము ప్రసాదించెను. అను. 8.21. మొ. 25 వ.

**కపిలకేదారము** సం. వి. అ. న.
ఒక తీర్థ స్థలము.
దీనిని సందర్శించిన **పాపవిముక్తులై** అదృశ్యులగుదురు. అర. 2.263.
కపిలుఁడను రాజేంద్రుని పేర దీనికి పేరు గల్గెను. సం. భార. అర. 83.72.

**కపిలము** సం. విణ. (అ. ఆ. అ.)
పింగళ వర్ణము గలది.
పింగళ వర్ణమును నీలపీత మిశ్రిత (నలుపు పచ్చ కలిసిన) వర్ణమని కొందఱు,గోరోచనావర్ణమని కొందఱు చెప్పుదురు.
సీ. ... కపిల జటా జాలకంబు ...
శాంతి. 3. 109.

**కపిల గోవు**
చూ. కపిల శివ అర్థము.

**కపిల గోసంవాదము** సం. వి. అ.
పుం సమ.
కపిలుఁడను మునిసత్తమునకును ఉత్తమాకృతియు తీరహితయు సహాసనసంభావితయు నగు నొక్క గోవునకును జరిగిన వాగ్వివాదము.
చూ. శాంతి. 5 800 మొ 824 వఱకు

**కపిలత్వము** సం. వి. అ న
కపిలవర్ణముగ నుండుట చూ:

కపిలము

క, చిచ్చుఅకన్నదరు లెగయ,విచ్చినఁ గపిలత్వమొందె విబుధ ప్రకరం, బచ్చెరు వందుచుఁ గన్గొన, నచ్చేరువ సౌరభేయులమల చరిత్రా. అను. 3.22.

**కపిలాతీర్థము** సం. వి. అ. న.

ఒకతీర్థ స్థలము

ఇందు స్నానము చేసినవారు వేయి కపిలగోవుల దానమిచ్చిన ఫలము నొందుదురు. ఆర. 2.263

కపిలుఁడు అను నాగరాజు పేర దీనికి కపిలతీర్థము అనియు కపిలాతీర్థము అనియు ప్రసిద్ధికల్గెను.

సం, భార. ఆర. 84 32.

**కపిలాహ్రదము** సం. వి. అ. న

ఒక తీర్థస్థలము

ఇందు స్నానము చేసిన రాజసూయ ఫలప్రాప్తులగుదురు. ఆర. 2.273. వారణాసి యందంతర్గతమైన ఒక తీర్థముపేరు, సం. భార. ఆర. 4.79.

**కపిలుఁడు** సం. వి. అ. పుం.

ఒక మహర్షి

సగరుఁడు అశ్వమేధము సేయదీక్షితుఁడై అశ్వమును వదలెను. సగర తనయులు అఱువది వేవురు అశ్వరక్షకులుగా, జనిరి. ఆ యశ్వము నీళ్లులేని సముద్రమున అదృశ్యమయ్యెను.

సగర పుత్రులఱువది వేవు రొక్కమొగిన సముద్రమును త్రవ్వి పాతాలమున తపము సేయుచున్న కపిలుని యాశ్రమముఁజేరి యచ్చట యశ్వము బంధించి యుండుట చూచిరి. అతడే యశ్వము నపహరించిన ముచ్చని ఆ కపిలుని పరిభవించిరి. ఆ మహాముని యలిగి యగ్నిచ్ఛటలు

వెడలఁగ్రక్క నతిఘోరదృష్టితోఁ జూడఁగానప్పుడు సగరసుతులందఱు భస్మమైరి.

పిమ్మట సగరుని మనుమఁడు అంశుమంతుఁడు తాతయాజ్ఞపై కపిలునిజేరి యతని ప్రార్థించియశ్వమును దెచ్చెను. కపిలుని యుపదేశాను సారము. అంశుమంతుని మనుమఁడు భగీరథుఁడు గంగను కొని వచ్చి కపిలుని ఆశ్రమము నందలి తన పూర్వులగు సగర పుత్రుల భస్మము పైఁ బ్రవహింపఁజేసి, వారికిఁ బుణ్యగతులు కల్పించెను. ఆర. 3. 62మొద 84వ

ఈకపిలుఁడు సాంఖ్యదర్శన ప్రవక్త. స్యూమరశ్మియను మునికి బ్రహ్మచర్య గృహస్థధర్మ వానప్రస్థవృత్తి పరివ్రజనంబులు ముఖ్య ప్రమాణంబులనియు నుపదేశించెను. శాంతి. 5. 300 మొ 346వఱకు

ఈతఁడు నరనారాయణులలో నారాయణుఁడయ్యెను. ఆర 1. 375

2 విష్ణుమూర్తి పేరులలో నొకటి కిం రవియందనుపాధిక విద్యాస్థితిమని కిం గపిలాభిధాన ముల్లసితమగున్. శాంతి. 6.438.

సగరాశ్వమును దేవేంద్రుఁ డవహరించి కపిలాశ్రమమునఁ గట్టివైచెను. సీ. నగభేది గొనిపోయి నాగలోకంబున

గపిలుని చేరవఁగట్టివైచె, ఆంధ్రభాగ నవమ. 204. ప
కపిలాతీర్థములోని కపిలుఁడుగాని, కపిలాకేదారములోని కపిలుఁడుగాని ఇతఁడు కాఁడు.

**కపోతము** సం వి. అ. పుం.
పావురము
వ.... ... అమ్మహీరుహంబు కోటరంబున వసియించి యుండునది యొక్క కపోతంబు తన వల్లభయెట యేసి మేఁతకుంబోయి రాక తడసిన శోకించి. శాంతి. ౫.209.

**కపోతి** సం. వి. ఈ స్త్రీ
ఆఁడు పావురము
తే......అప్పలుకులెల్ల, బోయవలలో నున్న కపోతి విని మనంబుసంతోష పూరమగ్నంబుగాఁగ శాంతి. 5.310.

**కపోలము** సం వి అ. పుం.
గండము, చెక్కిలి
చ....... కరాంగుళులఁ గపోలమిం, వుగఁ బుడుకుం విరా 1. 247.

**కప్ప** దే. వి.
మండూకము, భేకము
తోఁకలేనిదై భూమి మీఁదను నీటిలోను సంచరించు ఒకానొక జంతువు. దీని వెనుక కాళ్ళు పొడవుగా నుండి వ్రేళ్ల సందులలో అల్లిక కల్గియుండును, చిఱుచేఁపలను పురుగులను నీటిపాఁసి ఆహారముగాఁ దీసికొనును

**కప్పడము** వై. వి (సం. కర్పటః ప్రా.కప్పడ) చినిఁగిన బట్ట.
క. కడవసములుఁ గోలలుగ, ప్పడములు,వీరల ధనంబు పరికింపఁగ నెక్కడి దేశికులని వగవక. ఆది. 7.226.

**కప్పము** దే. వి.
కరము, పన్ను, కానుక
సీ...... పరమండలంబుల ధరణిపతుల నదిమి కప్పంబులమ్ముదముతోఁ గొనుచును. ఆది. 1.7.
సీ......కమనీయ వృషభంబు గప్పమిచ్చె. అను. 2.24.

**కప్పయెలుంగు కాము** జాతి.
కప్పయఱపు అఱచెడి పాము, వంచకము. (ఇది గోముఖ వ్యాఘ్రము వంటిది)
చం. ననునవలీల దాఁటి ప్రజనేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న యర్జునుఁ దలయెత్తియైననటు సూదవు పాండవ వక్షపాతినీ, మనమట్టుగాన యెప్పుడును. మా దెసఁ గప్ప యెలుంగు కామవై, యునికి యెఱుంగ వచ్చెనటు లూఅటగా వరమిచ్చి వాఁడవో ద్రోణ. 3.107.

**కప్పారు** దే. అ. క్రి. (కప్పు + ఆరు)
నల్లనగు.
సీ. కప్పారు రేణువు గమలాప్తబింబంబు రాహుమండలమున రమణఁ గప్పఁ, దెల్లని రజము శోభిల్లు సంగ్రామ రంగమునకుఁ దగు మేలు కట్టునట్లు. భీష్మ. 1,242.

**కప్పికొను** దే, స. క్రి. (√ కప్పు).

1. క్రమ్ము

కం అప్పయుఁ బరిజనములుఁ దనుఁ దప్పక కనుఁగొనుచు నుఁడఁదగవేఁడి కరం. బొప్పని తమకము చిత్తముఁ గప్పికొనుట నుత్తలంబు గదురఁగ నచ్చోన్. విరా. 2.88.

కం అప్పటి నుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడి మేనున్, నిప్పులఁ బొరలినయట్లయి, చొప్పడదించుకయు నిద్ర శుద్ధవిచారా. ఉద్యో. 2.19.

2. ఆచ్ఛాదించు, మఱుఁగు పఱచు.

తే. ... అమ్మనుజేంద్రసుతుఁడు, దృఢతనుత్రాణ మతనికిఁ దేరబని చె॥ కం తెప్పించి తొడుగు మీవని. యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగా మైఁ గప్పికొని యాబృహన్నల, యప్పుడు నగుపించె నచటి యబలా జనమున్ విరా. 4.38,39.

ఆ అనినఁ బేడిఁ బొగడెదవని యవివేకియై, కోపమదర సారెగొని యతండు, వ్రేసె నెత్తురపుడు వెడలఁ బోయినఁ జీరఁ,గప్పికొంటి నీవుగాన కుంద విరా. 5 309.

సీ. వదన సరోజంబు వస్త్రాంతమునఁ గప్పి,కొని యేగె ధర్మనందనుండు. సభా 2 301.

కప్పు దే స. క్రి.

ఆచ్ఛాదించు. మఱుఁగు పఱచు, గోపనము చేయు.

సీ. వదనంబు కొమరు భావనఁజేసి వేఱుగా, నుదుటి పెంపలకలఁ బొదువఁ బదఁగఁ, బవడంపు జొత్తుల జెవులు రూపడఁగంగఁ బాపట, తల కట్టు భంగిగప్పు ... విరా. 1 228.

వ. ...అద్దనంబయుండు దనయూష్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబులైనం బదరి దరస్మితంబున, దద్వికారంబుఁ గప్పి యప్పుడమితేని కిట్లనియె శాంతి 1 47.

ఉ అంబుజమిత్రుఁ డంబుదలవాంతరితుండగుడుం దదీయతే, జంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగమీరుగూఢ భావంబుననున్న మీదగు నవారిత తేజము భూజన ప్రసిద్ధంబగుఁ గాన దానిఁ బిహితంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే. ఆది. 7.2192. భీష్మ. 1.11.

2. చుట్టుకొను, పరివేష్టించు, ఆక్రమించు.

సీ. పఱమొయిల్ గప్పినఁ బాదఱినుమఁ గాంతి, గదలిన యమృతాంశు కళయుఁబోలె. విరా 1.294.

కం పితృవనము దెసకుఁ జనన,య్యతివ భయాక్రాంత చిత్తయై బాష్పజలోద్గతి మొగము గప్పనిట్లని, యతిదానముగా నొనర్చె నాక్రందనమున్. విరా. 8.19.

3 బంధించు, మూయు.

కం. పలుకఁదసత్యము దూఱం, బలుకఁడు బెట్టిదముగాఁగ బలుకఁడు వాదం,బులకుఁ జొరఁడు వాణియనం, గల వాకిలి యట్టి బుధుఁడు గప్పం జాలున్ శాం. 5.332.

1. క్రమ్ము, ఆక్రమించు, ఆవరించు.

వ ... రథిక జనంబులు గోపాల వర్గంబు ననర్గళ ప్రసారంబగు శరాసారంబునం గప్పిన. విరా. 4 4,

ఆ. కదఁగియనలుఁడేమి కారణంబున సహదేవు సేనపయి నతిప్రచండ, శిఖలు గప్పె దీనిఁ జెప్పుమేర్పడ నాకు. సభా. 1.252; విరా. 2,304

౯. పర్వు, వ్యాపించు, క్రమ్ము.

మహాస్రగ్ధర — అమరేంద్రారాతులిట్లాహవ ముఖమున నేయంగఁ దత్తీక్ష్ణ బాణౌఘము ఘోరంబై సురానీకముపయిఁ బెలుచం గప్పినం జూచి ...ఆది. 2.22.

**కప్పు** దే. వి.

నలుపు, నల్లరంగు.

చం. అన విని గౌరి నీకు భువనాధిప కంఠమునందుఁ గప్పు గ,ల్గిన కత మేమి నాకు నెఱింగింపుము. అను. 4.428.

సీ. సొంపారు దెలుపును గెంపును బసుపు చాయయుఁ గప్పునయ్యు నంద్రార్యవర్యులు. శాం. 4.97.

సీ. కట్టిన నునుఁజేల కప్పెంతయును జెన్ను సేయఁగ. విరా. 1.211.

౨. కాటుక.

సీ. ధవళాక్షి తొంగలితఱచు ఱెప్పలు చెన్నుకప్పును చీఁకటి గవియఁదేర- విరా. 2.87.

**కప్పుదెంచు** దే. అ. (√ కప్పు).

స్వార్థమున తెంచు, క్రమ్ము.

ఉ. ఉఱుముచు నెల్లెడం బిడుగులుగ్రగతిం బడ ఘోరమూర్తియై, యఱిముఱిఁ గప్పుదెంచు విలయాభ్రము చాడ్పున. ద్రోణ. 1.89.

**కప్పురము** వై. వి. (సం. కర్పూరః. ప్రా. కప్పురో).

కర్పూరము, కపురము, కప్రము, గంబుర, గంబురము, గంబురా. గంబూర, గంబూరము.

కం. అలుకుఁడు మృగమదమున ముగ్గులు వెట్టుఁడు గప్పురమున, గుంకుమమున గోఁడలు పూయుడు. ఉద్యో. 3.152.

(ఇచ్చట పచ్చ కర్పూరము) అశ్వ. 3.202.

**కఫము** సం. వి. అ. పుం

1. శ్లేష్మము.

కం. స్రోతో మార్గములు గఫము,చేత నిరుద్ధంబులైనఁ జెడు నింద్రియజాతత శక్తులు దానను, వీతములగుఁ జేష్టితములు విను మనుజుంకున్. అశ్వ. 1.175.

**కబంధము** సం. వి. అ. పుం. న.

1. తలతెగినను ప్రాణ వాయువులు గలిగి ఆడెడు మొండెము. అట్ట.

సీ. సైంధవు ఘోర కబంధంబు దలయిలఁబడు నంతకును దేరిపైన నిలిచి, మఱి కూలుటయును విస్మయము గావించె, జూపఱకు ద్రోణ. 4.363.

(శరీరం బధ్నాతీతి కబంధం. శరీరమును నిలుపునది.

2. మేఘము.

తే. అర్కు నుదయాస్తమయయముల యందుఁ గృష్ణ, కాంతి శరీర కబంధంబుఁ గప్పఁజొచ్చె. భీష్మ. 1.11., మౌస. 1.8.

**కబంధుఁడు** సం. వి. అ. పుం.
వనవాస సమయమున శ్రీరామునిచే హతుఁడైన యొకానొక రాక్షసుఁడు. చూ. చరిత్ర అర. 6 857. మొ. 368వ,

**కబరి** సం. వి. ఈ. స్త్రీ.
కేశ బంధము, చక్కని తలవెంట్రుకల సముదాయము. చూ. కబరీ భారము.

**కబరీభారము** సం. వి. అ. పుం.
చక్కని తలకట్టు, తలవెంట్రుకల జడచుట్ట.

కం. గారవమున నిజదేశా, చారముమై నల్లియున్న జడయగు కబరీ,భారంబు విచ్చి శిరముగ, సైరంధ్రీ జాతివేష సముచిత భంగిన్, విరా. 1.291.

**కబళనము** సం. వి. అ. న. కబళించుట.

1. మ్రింగుట

వ. ... రాహుకబళన కలుషితుండైన రోహిణీపతియునుం బోలె. అర. 6.5.

2. తినుట, భక్షించుట

వ. శవకబళన లోలంబులగు సృగాలంబులను. ద్రోణ. 1. 287.

3. గెలుచుట, అతిక్రమించుట

ఆ. కాలకబళనైకశీలుఁడై మృత్యువు, గెలిచి శాశ్వతము నచలము శివము, నచ్యుతము ననామయము నమృతము నవ్య, యంబు నగు పదంబు నందు నిలుచు. శాం. 6. 132,

**కబళించు** సం. స. క్రి.
సవరించు, పుడుకు, పుణుకు, చక్కఁజేయు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు కబళించి, కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్వు. విరా, 2. 310.

2. తిను, భక్షించు.

మ......రక్షఃక్ష్మాజ మాంసంబు ఁగీలాలంబుం గబళించి త్రావి మదలీలాలోలతం గ్రాలగన్. సౌప్తి 1.171.

చ. ఒకరుని చేతిప్రోవును తదున్నతి ప్రాపును గాంచి యెల్లవెం, టకును గొఱంత లేక పొగడందగు సంపద నొంది యట్టి దా,తకుఁ దుదిఁ గీడు సేసినకృతఘ్నుని పీనుఁగునైన రోఁత పుట్టక కబళింపఁ గుక్కలు నొదం బడునే కురువంశవర్ధనా. ఉద్యో. 2.77.

శ్లో॥ సత్కృతాశ్చ కృతార్థాశ్చ మిత్రాణామ్న భవంతి యేతాన్మృతానపి క్రవ్యాదా కృతఘ్నాన్నో పభుంజతే సం, భార. ఉద్యో 85.42

3. మించు, అతిశయించు

కం. ఘనతరగర్జాధ్వనులును, ఘనపథమఖిలంబుఁదూటు కట్టెడు తూర్య స్వనములునుం గబళించుచు ననిల తనయు సింహనాద మడరెంబెలుచన్. భీష్మ 1,286.

శ్లో॥ శంఖ దుందుభి నిర్ఘోషం వారణా
నాంచ బృంహితమ్ సింహనాదంచ
సైన్యానామ్ భీమసేనరవోఽభ్యభూత్,
హయానాం హేషమాణానా మనీకేషు
సహస్రశః సర్వా నభ్యభవచ్ఛబ్దాన్
భీమసేనస్య నిస్వనః.
సం. భా. భీష్మ 149 10.,

4. చంపు

ఉ. అంగద నాథుమ్రింగిన వృకావలి
దన్ వెసముట్టికొన్న సర్వాంగములుం
జలింప వెగడందుచు దిక్కులుసూచు
చున్న సారంగియ పోచెనుండెఁ గురు
రాజ భవత్సుతు సేన భీష్మునా, జింగ
బళించి పాండవులు జృంభితవిక్రమ
లీలఁబొల్చుటన్. ద్రోణ. 1.17.

5. మ్రింగు

చ. ఇనుఁ గబళించు రాహుక్రియ
నే నొకరుండన పోయి పార్థపు
త్రుని బరిమార్తు ద్రోణ 2.48.

శ్లో॥ గ్రసిష్యా మ్యద్య సౌభద్రం
యథారాహుర్దివాకరమ్ సం. భార
ద్రోణ 39.22

6. అణఁగించు, పోఁగొట్టు.

సీ ధరణీ పరాగ సంతానంబు కబళిం
చు కరశీకరచ్ఛటా స్ఫురణములును
శల్య 1.102.

7. పట్టిమ్రింగు

సీ. పేఁడె వికర్షుండు..... ఇబ్బాలు
ని ముంజేయి బాలగృధ్ర, మోపదు
కబళించి యును చంచుపుటమునఁ
జీరంగఁ జూచితే శౌరి, స్త్రీ. 2.64.

8. గ్రహించు, తెలిసికొను

ఆ చర్మశక్తిఁ జేసి సంస్పర్శ విష
యంబు, శ్రోత్రయుక్తి శబ్దమాత్ర
కంబు, కానియొంటి నొంటిఁ గబళింపఁ
జాలవెట్లధికతా నిరూఢికాసపడెటి.
అశ్వ. 2 85; శాంతి, 3.85.

9. అతిక్రమించు, గెలుచు

కం. విను యోగివరుఁడరిష్టము కనుఁ
గొని యనిశమును యోగగతియుత
సాంఖ్యం, బనపాయత నడపుచు నా,
త్మునిఁ బరముం జేర్చి కాలముం
గబళించున్. శాంతి. 6.150.

**కబళితము** సం. విశ. (అ ఆ అ)

1. గ్రసితము, మ్రింగఁబడినది

వ. అసమంజస పుత్రు నంశుమంతుం
దన మను మనిం జూచి యయ్యానీయ
య్యలయువది వేవురు నొక్కటఁ గపి
ల కోపానల కబళిత శరీరులయిరి.
ఆర. 3.67.

2 స్పృశింపఁ బడినది, తాఁకఁబడినది.

సీ. ప్రాక్పయోనిధి పొంతఁ బర్వతం
బొక్కటి, ఘనశృంగ కబళితాకాశ
మగుచు. అను. 1 220

**కమండలువు** సం. వి. ఉ పుం. న.

కరకము, సన్న్యాసులు గాని బ్రహ్మ
చారులు గాని ఉపయోగించు కొనెడి
గిండి వంటి జలపాత్ర విశేషము.

వ. ...పాండవాగ్ర జుండున్న యునిక
న సన్న్యాసి రూపంబలవడి ధాదుదండ
కమండలు కలిత మూర్తియయ్యె,
విరా. 1.184.

వ. ... సురగణంబు ముదంబునం
బొదలఁ దన చేతి కమండలు వొక్కె
దనిడి. కర్ణ. 1.290, శాంతి, 6.178

**కమఠము** సం. వి. అ పుం.

కూర్మము, తాఁబేలు.

సీ. కమఠంబు దన యంగకముల నెట్లట్లు కా,మముల విద్వాంసుడు మరలఁ దివుచు. అశ్వ. 2.158; శాంతి. 6.286.

**కమనీయము** సం. విశ. (అ. ఆ. అ.)

మనోహరము, ఇంపయినది.

వ ... బలసూదన సూను పలుకులు విని పాంచాలి యంతస్స్మిత కమనీయ కపోల యగుచు నిట్లనియె, విరా. 3 52.

**కమరించు** దే. స. క్రి.

కమరఁజేయు, ఉడుకెత్తించు.

కం. మున్నింద్ర ప్రస్థంబున, నున్నతి మెయి ననుజ తనుజ యుక్తంబుగ నీ, వున్న తెఱఁగు దుర్యోధను, కన్నులు కమరింప నతఁడు గడువగ నొందెన్. శాంతి. 3.128.

**కమరు** దే. అ. క్రి.

1. కాలు, దగ్ధమగు, తాపమునొందు, ఉడుకు.

కం చని దానిచుట్టు మండెడు, ననలంబును జూచి తన్మహత్తర జిహ్వల్, దనికిన నెఱకలు గమరునొ, యను తలఁపున బ్రహ్మఁ గా ననరి గెరయమునన్. అను. 1.249.

సీ. ... తీవ్రాంశు సంతాపమునఁజేసి, కమరె నా తెక్కలు గమరవయ్యె.తే. ననుజ పక్షమ్ములు ఆర. 7.31.

శ్లో॥ తతోదగ్ధావిమౌ పక్షౌ పక్షాన దగ్ధాతు జమీయుషః. సం. భార.ఆర. 277 50.

వ. ... నీవు సకల సామ్రాజ్య విభవంబు మెఱసి చని యందు నీతేజంబు ఘర్మ సమయంబునాఁటి తపనుతేజంబై పగతురు కన్నులు గమర నతి దుస్సహం బగునట్లుగాఁ జేయుము. ఆర. 5.347.

చం. కమరె నశేష కోకనద కైరవ పంక్తులు శైవలంబులున్ ఆది. 8.266.

కం. మున్నెన్నఁడు నెవ్వంకిం గన్నెదురఁ బడనియట్టి కాంతలు జను లెల్లన్నిలిచి చూడ వెదలిరి. కన్నులు గమరన్ సుహృన్ని కాయంబులకున్. స్త్రీ. 1.103.

2. ఎండిపోవు.

సీ. ఏఱులుఁ జెఱువులు నివురఁ గర్వనము లెందును జెడఁదరు లతాదులును గమర, భూమియుఁ బనమూల. శాంతి 3 280.

3. కొలువు.

సీ. పటు తరంబగు ఛటచ్ఛట రవ మెసగంగ మ్రాఁకులుఁ బొదలును గాఁచికొనుచుఁ. గమురను నార్త నాదములును బెల్లుగ నఖిల మృగంబుల నాగికొనుచు. ఆశ్ర. 2.151.

**కమర్చు** దే. స. క్రి. (√ కమరు)

కమరఁజేయు ఎఱ్ఱవాఱు. (కోపముచే) మండు.

గీ. భీముఁడపుడు గమర్చిన మోము తోఁత, విదురు వదనంబు సూచుచుఁ

బెదవులదర. ఆ(శ. 1.109.

**కమల** సం. వి. ఆ. (స్త్రీ.

లక్ష్మి.

కం. .... కమలావరుఁ డిట్లనియె.
వారలకు. అను. 4.405.

**కమలగర్భుఁడు** సం వి అ. పుం.

కమలము నందు పుట్టుక గలవాఁడు
(బ్రహ్మ

తే శరణు సొచ్చిన రక్షింపఁ జాలి
యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వ లోక
ములు దిప్పఁ, బుణ్య కర్మంబుల
ఫలతఁ బొందు ననఁడె, కమలగర్భుఁ
డుదొల్లి జగద్ధితముగ. ఉద్యో.1.161

**కమలజుఁడు** సం. వి. అ పుం.

కమలము నుండి పుట్టినవాఁడు, తమ్మి
చూలి, (బ్రహ్మ,

తే. గోవులకు (బాహ్మణులకును గుల
మొకండ, కమలజుఁడు రెండు తెఱఁ
గులుగా నొనర్చె, హవికిఁ బూర్వంబు
గారణ మఖిల మం(త్రముల కధిష్ఠాన
మపరంబు భూపవర్య. అను. 2.278.

**కమలనాభుఁడు** సం. వి అ. పుం

నాభియందు కమలము గలవాఁడు,
విష్ణువు.

వ. కానీనుండు కమలనాభునకిట్ల
నియె. ఉద్యో 4.49.

**కమలపాలిక** సం. వి ఆ. (స్త్రీ

హిడింబ

(వ్యాసుఁడు పాండవులతో)
వ.......హిడింబంజూచి దీని పేరు
కమలపాలిక యిది భీమునకు వశ
కర్తినియయి పరిచరించి మహాసత్త్వం
దయిన కొడుకుం గాంచు నాతండు
మిమ్మందఱ నాపద్విషయంబున
నుద్ధరించునని చెప్పి, ఆది. 6.228.

**కమలమిత్రుఁడు** సం. వి అ. పుం,

కమలమునకు స్నేహితుఁడు.

సూర్యుఁడు

తే. పాండు పుత్రులకేను దప్పని
మనంబు, గలుగుదానన యేని నో
కమలమిత్ర, కీచకునిదెస నన్నొక
కీడుతెరువు వొరయకుండఁగ రక్షింపు
కరుణతోడ. విరా 2.108.

**కమలము** సం. వి. అ. న.

తామర

వ...కమలపరాగ పరంపరా ధూసరిత
భాసుర జలాశయ సమవగాహనంబు
లను విరా. 1 147.

**కమలయోని** సం. వి. ఇ. పుం.

కమలము పుట్టుకగాఁ గలవాఁడు.
(బ్రహ్మ

వ. దివిజులసూయా(గస్తులై కమల
యోనిం గానంజని అను. 2.180.

**కమలవనము** సం. వి. అ. న.

కమలముల సమూహము, కొలను,
పద్మాకరము

కం. ఈ కమలవనము చేరువ, నే
కార్యము సేయఁజూచెఁ దీవెవ్వతవం,
చాకొలను నొరఁగ నమ్మునిలోకము
సేరుటయు నమ్మెఱఁత యెలుఁగెసఁ
గన్. అను. 2.221.

**కమలాకరము** సం. వి. అ. పుం.

తామర కొలను.

వ. మృణాళనాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులను. విరా. 8.236.

**కమలాక్షి** సం. విణ. (ఇ. ఈ. అ) తామరల వంటి కన్నులు గలది స్త్రీ

ఉ. అక్కమలాక్షిపొందు దగనాడి తుదిన్ నిజమేది నేటిరే, యిక్కకు రాకతక్కిన సహించుచెనెనన్ మరుండు విరా. 2.296.

**కమలాక్షుఁడు** సం. వి. అ. పుం తారకా సురుని కొడుకు.

వ. ... సురలతోడి దురంబున సుర వరుండగు తారకుండు దెగిన పిదపఁ దదీయ తనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును గమలాక్షుండును నను వారలు వారిజాసను నుద్దేశించి. కర్ణ 1.257.

2. విష్ణువు.

ఆ. అమర విభుని భగసహస్ర చిహ్నని గాఁగఁ జేసినదియు నేత్ర కాసురుండు, గా నొనర్చినదియఁ గమలాక్ష విప్రున,ల్కయుఁ బ్రసాద సంపదయును గావె. అను. 2.149.

**కమలాప్తుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సీ. కప్పారు రేణువు గమలాప్త బింబంబు, రాహుమండలమున రమణఁ గప్పు. భీష్మ. 1.242.

**కమలావాస** సం. వి. అ. స్త్రీ. కమలము నివాసము గాఁగలది, లక్ష్మి

కం. శతమఖ కమలావాసా. ప్రతిమ సమాగమ విశేష బహు మతము. శాం. 5.16. (చూ. 8 వప).

**కమలాసనుఁడు** సం. వి. అ. పుం. తామరపూవు పీఠముగాఁ గలవాఁడు, బ్రహ్మ.

(అర్జునుఁడు శ్రీకృష్ణుని విశ్వరూపము జూచి)

సీ. దేవ నీదగు దివ్య దేహంబునందు సు,రాసుర గంధర్వులాది గాఁగ గల దేవయోనులుఁ గమలాసనుండును సచరాచరంబైన జగము నాకుఁదోఁచె. భీష్మ. 1.211.

**కమలాస్య** సం. విణ. (అ. ఆ. అ.) తామరవంటి ముఖము గలది. స్త్రీ.

సీ. కమలాస్య ముద్దుమొగంబు లే మెఱుఁగుల మొత్తంబు పరిచుట్టుముట్టి కొనఁగ విరా. 2.37.

**కమలిని** సం. వి. ఈ. స్త్రీ. తామరతంపర, పద్మ సమూహము.

సీ కలహంస కలనాద కమనీయ కమలినీ దీర్ఘకా సైకత తీరములను. ఆది. 4.216.

**కమలోదరుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు (ఉదరమున కమలము గల వాఁడు)

ఉ. నీ వొనరింపఁ బూనిన పనింగమలోదర కీడు పుట్టునే ఉద్యో. 3.78.

**కమియు** దే. అ. క్రి. మాఁగు, మిగులబండు, బాగుగా పక్వమగు.

ఆ. కమియఁ బండ కుండఁగాయఁ
గోసినఁ జవి,చేదె కాదు విత్తుచేటు
గలుగుఁ, బక్వమైనఁ గొనిన ఫల
మిచ్చుఁ జెరదు బీఁ,జంబు కార్యసిద్ధి
చందమిట్లు. ఉద్యో. 2.56.

**కము** సం అవ్య. (కమ్)
నీరు

ఉ. భూసతికిం దివంబునకుఁ బొల్పె
సగంగ శరత్సమాగమం,బా సకల
ప్రమోదకరమై విలసిల్లె మహర్షి
మండలో, పాసిత రాజహంస గతి
భాసి ప్రసన్న సరస్వతీక మబ్జాసన
శోభితం బగుడు నబ్జజు యానముతో
సమానమై అర. 4,141.

**కముచు** దే. స. క్రి. (√ కమియు)
గ్రహించు, పట్టుకొను.

వ. ... జక్కవలు కలసి పొలసి నలి
రేఁగి చెలఁగుచు రేయింటి యాఁకటి
పెల్లున గొదగొని కమిచి చంచువులం
దిగిచి త్రుంచి యానుచు నిక్క
డక్కడఁ బఱచినం జిక్కువడి
యున్న మృణాల శకలంబుల వలన
బాల చంద్ర శకాభిరామంబులగు
శంభు జలమూర్తి విశేషంబులంబోని
సరోవరంబులను విరా. 2 240.

**కమ్మ** దే విశ.
(వృత్తియందు విఃఌముగా నిగాగ
మము వచ్చును).
ఘ్రాణ ప్రియమైనది, సువాసనగలది.
చూ. కమ్మనూనియ.

**కమ్మని** విశ. (√ కమ్మ)

1. మనోజ్ఞము.
సీ. కాంచన వర్ణుఁడు కడు రూప
వంతుఁడు కమ్మని జడలతో అర.
3 108.
2. రుచికరమైనది
ఉ. తేనెలు గ్రోలి క్రోలికడుఁ దియ్యని
కమ్మని పండు లింపు సొం,పూన గ
నానియాని. అర. 7.11.

**కమ్మనూనియ** దే వి.
సుగంధ వస్తువులు చేర్చి కాచినమూనె
సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁబతి
కమ్మ, నూనియ దెప్పించి మేను
శిరము, నభ్యక్తములు సేయ, అను.
2.308.
"శతపాకేన తైలేన మహార్హేణో పత
స్థతః. సం. భా. అను. 58 9.

**కమ్మి** దే. వి
రథము బండి మొదలగు వానియొక్క
చుట్టు నుండు కమ్మి, నేమి.
సీ ... కమ్మి గ్రుంకక గడుగడుప
రొంపులు గలుగమి నొప్పు చోటు
రథములనేల. శాంతి. 3.6.

**క్రమము** సం. విశ. (అ. ఆ. అ)
మనోహరమైనది. ఇంపైనది.
వ. అని పంచిన వారును వారణావ
తంబు ననవరత సురభి కుసుమ ఫల
భార నమ్ర క్రమ శాఖా విశాల తరు
వన రేఖాలంకృతం బనియును. ఆది.
6.182.
చం....క్రమ కరాబ్జము పట్టి నూతిలో
వెలువడఁ గోమలిందిగిచె విశ్రుత కీర్తి
యయాతి ప్రీతితోన్. ఆది. ౬.144.

**కయి** కై. (కు+అయి).

నిమిత్తార్థము.

వ. ... పదమూఁడు వత్సరంబులు మత్సరాధికుండగు నగ్గాంధారేయుండు భీము ఱయించుట కయిగదాపరిశ్రమం బాచరించె కల్యా. 2.271.

చం. ... అట్టి కర్ణున కయి నీకు నేటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రకా. శాంతి. 1 38., ఆశ్ర. 1.26.

**కయికొను** కై కొను.

1. గ్రహించు, స్వీకరించు.

వ. ... అతండును (భీముఁడు) ధర్మ తనయు కనుసన్న గయికొని. విరా 2.12.

2. అంగీకరించు.

కం. విను పిన్ననాఁడు నీవీ, యను చితమగు వ్రతము వట్టితది గాకయుబె, ట్టన్నృతమునునీ, కనియెడు చందంబు బుధులుగయి కొనరెందున్.కర్ణ 3.75

3. అవలంబించు, సత్రమమని తలఁచి గ్రహించు

సీ. వెరవిట్టి తెఱఁగిది వెంగలితన మని, యెల్లవాఁడును తనయెఱిఁగి నట్టి, తెఱఁగున నిజకార్య దృష్టియక యికొను నొరులనేర్పులుపట్టనొల్లఁడు. సాప్తి 1. 45

4 లక్ష్యముసేయు, లెక్కసేయు

వ ఇట్లు గవిసినం బ్రాకార రక్షకులై న రాక్షసవీరులు వారలం జేరనీక శిలాశూల పరశు తోమరాలాత ప్రముఖంబులు ప్రయోగించినం గయికొనక వనచరులు వృక్షశిలా ప్రకరంబులు వఱగించుచుం గడంగి ప్రాకారంబు ప్రాకుటయు. అర 7.70.

5. అనుభవించు, పొందు, ఒందు

తే అల్ప పుణ్యుండు తొలి తొలి యమరతా సుఖంబు గయికొని మఱియు దుఃఖములు నొందు. స్వర్గ. 89.

**కయిసేయు** దే. స. క్రి, కై సేయు.

అలంకరించు

కం ... మానిని మెయి చెన్నొదవఁ గయి సేసి రప్పుడు, ముదితాజన ములు ప్రమోదమున లలితముగన్. విరా. 5. 355

చం. ... .. అవ్వసుదేవ వల్లభల్, నలువురు నెమ్మిఁ గూడి మరణంబు నకై కయి సేసి రత్తఱిన్. మౌస.140 (సిద్ధపడిరి, ఆయత్తపడిరి. అని భావము)

**కయ్యమిచ్చు** (√కయ్యము)

యుద్ధమునందెదిరించు, పోరాడు.

ఆ. వచ్చిముట్టి కయ్యమిచ్చిన.నవ్విభు నొంచి బాహువనముఁ ద్రుంచ దుగ్ర పరశు ఘోరధార పాలసేసి పోయి నిజేచ్ఛనుండె మేదినీశవర్య. శాంతి. 2,80.

**కయ్యము** దే వి.

యుద్ధము, పోరు

ఉ. ... మత్స్యభూమి భృద్గేహము సందుఁ బేడి యయి గీడ్పడి యుండెనొ కాక యీకురు, వ్యూహము తోడి

కయ్యమున కొండొకరుండిటు లొంటి వచ్చునే. విరా. 4.76.

వ, ... సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె నీ, వెవ్వని తోడం గయ్యంబు సేసెదు. ఆర. 1.190.

**కయ్యమునకుఁగాలుద్రవ్వు-** జాతీ.

యుద్ధమునకు సిద్ధపడు, పోట్లాటకు సిద్ధమగు.

ఆ. పాండు రాజసుతులు బాసమై వడివడి, గడచి కయ్యమునకుఁ గాలు ద్రవ్వ.కున్న యట్టులైన నిన్నరనాథుతో, సంధిసేయుటొప్పు సముచితముగ. విరా. 8.109. విరా. 4 207.

**కరంకము** సం. వి. అ. పుం.

కంకాళము, చర్మమాంస రహితమగు ఒడలి యెముకల గూఁడు.

కం. పురపురఁ బొక్కుచు బకపతి కరంకముం దేరఁ బనిచి గారవమున నెయ్యురఁ దాను నగ్ని యిచ్చియ,సురపతి యున్నంత వచ్చె సురపతి నెమ్మిన్. శాంతి. 8.512.

**కరంజ** సం. వి. ఆ. స్త్రీ.

బాలగ్రహములలో నొకటి-వృక్షములకు తల్లి. ఇది షోడశ వర్షంబులలో పల పట్టి పీడించును. ఇది మాతృగణముతోఁ జేరును వారు వ... గర్భపీడనంబును శిశు పీడనంబును జేయుచు మనుష్యుల వలన బలి మంత్రోపహార దాన తర్పణంబులఁ దృప్తిం బొంది బాలురకు వాయురారోగ్య సుఖంబుల నొసంగుదురు. ఆర. 5.252.

**కరండము** సం. వి. అ. పుం.

సంపుటము, భరణి.

ఉ. .... హృత్కరండ వి,స్తారనివాస తంత్ర ఘనసార విధా పరమాభిరామ రే,ఖా రమణీయ ... భీష్మ. 2.408.

**కరంధముఁడు** సం. వి అ. పుం.

ఖనీనేత్రుని కొడుకు. ఇతని తండ్రి దుర్మార్గుఁడగుటచేత మంత్రులాతని తొలఁగించి యితనికిఁ బట్టముగట్టిరి. ఈతఁడు నిత్యధర్మ పరతంత్రుఁడు, సతతదానకీర్తితత్పరుండు. తనకుఁగల ధనములెల్ల దానముచేసి దారిద్ర్య వికలుఁడయ్యెను.

ఇది కని పెట్టి శత్రువులీతనిపై దండెత్తి వచ్చి రాజ్యముకై వసముచెసికొనిరి. ఇతఁడు ఆప్తులతోడ నడవులకేగెను. ఇతఁడచ్చట ఘోరతపమొనర్చి మహా ప్రభావమొందెను. తనచేతిని గొట్టము వలెఁబట్టి తపశ్శక్తిచే నూఁదెను. అందుండి భటతురగ సామజ రథోద్భటసేనా సముదయంబులును బహుళ రుచి సముత్కట కాంచన రాసులను ఆశ్చర్యము గలుగ జనించెను. అనరపతి వీని తోడ్పాటుతోశత్రురాజులపై దండెత్తి యుద్ధమునఁ గొందఱఁ జంపెను. కొందఱఁ గానలకు దోలెను కరము = చేయి, ధమనము = ఊదుట; కరధమనము చేయుట చేత నీతనికి కరంధముఁడు అనుపేరు వచ్చెను. ఇతని మనుమఁడు మరుత్తుఁడు. ఇతని జన్మనామ మేదో తెలియదు. అశ్వ. 1,18. మొ. 28. వ.

**కరఁగించు** దే. స. క్రి (√కరఁగు)
కరఁగఁజేయు, మెత్తఁబఱచు, దయ గలుగునట్లుచేయు
ఉ. చుట్టఱికంబునన్ మనసు సొచ్చి నన్నుం గరఁగించి వేడినన్, దిట్టతనంబువో విడిచి తీవ్రరణంబు కడంకదక్కనేఁబట్టిన యాయుధంబు వెఱఁబాసినఁ గానివధింపఁ బోలదు. భీష్మ. 1.159.

**కరంభ** సం. వి. అ. స్త్రీ
కళింగ దేశపు స్త్రీ. అక్రోధముని భార్య,దేవాతిథి తల్లి. ఈమెకు కాళింది దక్షకపుత్రి కరందమ, కరండమ, కరండక, కరండుక, కరిందువ, కరింద, కరఁద మున్నగు రూపములు పాఠాంతరములుగాఁ గలవు ఆది.4.2.
చూ. సం. ము.

**కరఁగు** దే. అ. క్రి.
1. ద్రవమగు
కం. ననుబోటులమనములుమెచ్చునఁ గరఁ గెననంగనేల సురతతి కృష్ణా, ర్జునుఁ గనిదుందుభిని, స్వనముంతోఁ గురిసె విరుల వాన వొగడుచున్. కర్ణ. 2,284.
2. చిత్త పారవశ్యము పొందు
చం. పరమ పదాప్తి హేతువగు భారత సంహితశౌనకాది భూ,సురవరులింపునం గరఁగుచొప్పునఁ జెప్పిన స్వర్గ. 94.
సీ. ఇంద్రియార్థంబుల తెలసిన పురుషుండు గాథరాగంబునఁ గరఁగుచుండు. అర. 5.81.

స. క్రి.
ద్రవింపఁజేయు.
తే. కుసుమ బాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, పోసిచేసి చైతన్య సంపుటము దగ ఘటించిరో కాక యిట్టి చేడియలు గలరె. విరా. 2.27.

**కరక** సం. వి. అ. స్త్రీ.
వడగల్లు, కరకము.
చం. కురిసెఁ బ్రచండవృష్టి ఘన ఘోషము లెల్ల కెలంకులన్ భయం, కరములుగాఁ గరాళ కరకాతతులొప్ప అర. 3.297.

**కరకర్షణుఁడు** సం. వి. అ. పుం.
ఇతఁడు చేదిరాజగు ధృష్టకేతుని తమ్ముడు, శిశుపాలుని కుమారుఁడు. అన్నలగు ధృష్టకేతు శరభులతో బాటు ఇతఁడు పాండవుల పక్షమునఁ బోరాడెను. భీష్ముని సప్తమ దివస యుద్ధమున మూర్ఛిల్లిన చేకితానుని తన రథముపైనిడి కొని యుద్ధభూమి నుండి తప్పించి రక్షించెను. భీష్మ. 3.42.
చూ. చేకితానుఁడు.

**కరగ్రహణము** సం. వి. అ. న.
పాణిగ్రహణము, పెండ్లి
సీ. సర్వజ్ఞుఁడగు పరాశర నందనుని చేత భాషితంబైన యిప్పరమపుణ్య వృత్తంబు చదివిన విన్నను ... కన్య సద్వర కరగ్రహణంబు · వడయు గర్భిణియైన కాంత సద్గుణుని బుత్త్రుఁ గాంచుఁ ... శాం. 6.417.

**కరజము** సం. వి. అ. పుం.
నఖము. గోరు.
సీ. ... అతి దృఢ దశన కరజు...
ఆ .... హనుమంతుఁ గాంచి...ఆర. 3 819.

**కరటము** సం. వి. అ. పుం.
ఏనుఁగు చెక్కిలి.
సీ. కరశీకరంబులు గరట గళదాన తోయ-బులును ధరాధూళి గ్రమ్మంగ.... విరా. 3.167.

**కరటి** సం. వి. న్. పుం.
పెద్ద గండస్థలము గలది, ఏనుఁగు.
తే. ...కరటి దశకంబు నొకయూరుఁ ఖురము సొచ్చినపుడ యిచ్చెద నీ కను నార్తుఁడగుచు .... విరా. 4.80.

**కరడు** దే వి. (బ. కరడులు—కరళులుఁ కరళ్ళు).
సీ. గగనంబుతో రాయు కరడులుగల జలం, బివురఁ బాఱిన మహార్ణవము కరణి. ద్రోణ. 2.128.
(కరళులు అని పాఠాం)
వ. ... పెను మూఁకలు వెఱఁగునం జెయ్యేది కరళ్ళతంగిన మున్నీటి యట్లుండె. కర్ణ. 3.285.

**కరణము** సం. విశే. (అ. ఈ. ఆ.)
చేయునది, చేయుటకు సాధనమైనది.
కం. శ్రుతి సీమంత మణికి నాశ్రిత వాంఛా పరిపూర్తి కరణ చింతామణి కానతదురిత తమోద్యుమణికిఁ గ్రతు భూషణ మణికి లోకరక్షామణికిన్. విరా 1.34.

వి. అ. న.
1. చేఁత, వ్యాపారము, పని, కార్యము.
ఆ. ... బోధనత్వ సంపన్నులు, సారరు కర్మతంత్ర కరణమునకు. శాం. 5.125.
కం. ... పుణ్యకరణ ప్రవణా. శాంతి. 4 108., శాంతి. 6.361.
2. కారణము.
ఉ. మిత్రుల చెయ్యలన్ సుఖము మేకొను నంటయుఁ జెందు దుఃఖముల్, శత్రుల చెయ్యినంటయును సన్మతి దా ధనమూల మంటయున్, గోత్రవరేణ్య భోగములకున్ ధనముల్ గరణంబు లంటయున్, జిత్రచరిత్రుఁ డైన విధి చేష్ట దొఱంగిన నీటిత్రాల గున్. శాంతి. 1.207.
3. సాధనము.
కం. వికృతులు మహదాదికస, ప్తక ముభయ విధేంద్రియములు పదియు విషయ పంచకమును మనసును గూడఁగ వికారషోడశక మిది వివేకా భ్యర్థి ...
కం. ఈ సర్వము దేహత్వాభాసిత మిది దేహియైన పరమాత్మని విన్యాసమునకుఁ గానొదవి యుపాసించుం గరణ రూపమై యా కర్తన్. శాంతి 4.278., 274
4. వర్ణాశ్రమధర్మము
క. కరణంబులు దొదరినని, ష్కరణతనున్నను శమంబుగల యోగికిసు, స్థిరమగు సమాధి యని ముని, వర శాండిల్యుండు శిష్యవరులకుఁ జెప్పెన్. శాంతి. 5 .98.

5. రచించుట, నిర్మించుట

వ. కల్పాది యందు మరీచి యత్రి స్వాయంభువుఁడను మనువుం దారు ననేక వర్షంబులు విష్ణునుద్దేశించి తపంబు సేసిన నద్దేవుం డదృశ్య రూపంబున వారల కడ్డెదుర నిలచి వారితో మీరు ధర్మశాస్త్ర కరణ ప్రవణులరై నన్నాశ్రయించితిరి. భారతి మీయందు నిలువనియోగించితి మీచేతం బ్రణీతంబై సకలజగంబుల కు హితంబును మర్యాదా ప్రవర్తకం బునై శాస్త్రంబు వెలుంగు. శాంతి. 6.359

**కరణి** దే. వి.

విధము, రీతి, చందము

సీ. ఘోరగృధ్రము సుకుమార నాగాంగనఁ, బటుగతి నొడియంగఁ బాఱు కరణి. విరా. 2.128.

సీ. హయములఁ జెండాడ నరుగు చోట్లను వేళ్లగమిఁ గిట్టు కోల్పులి కరణి యొలయు గీ ఆశల్యునందు ... శల్య 1.282.

కం. తరణి వొడిచి తమము సెఱచు కరణిని లోకమునఁ గలుగు కల్మష మెల్లన్, ధరణిపతి ధర్మ మాత్మ, స్ఫురణంబునఁ జెఱచు విమల బోధన చరితా. శాంతి. 2,160.

**కరణీయము** సం. విణ (అ. ఆ అ.)

కర్తవ్యము, చేయఁదగినది.

వ. ... కరణీయంబులగు నధికారం బుల నెల్లను గల్పించి వారల మీఁదన పెట్టి. శాంతి. 1.378.

కం. ఆదిత్య మరుద్వసు రుద్రాది సురులు మునులు నంబుజాసనుఁ గని మాకేది కరణీయ మీశద, యా దృష్టిని మమ్ముఁ జూచియానతి యీవే. శాంతి. 6.473.

**కరతలము** సం. వి అ. పుం.

అఱచేయి.

సీ, తాళంబుగాఁగరతలమునఁ జెలువఁ గంబంబు ద్రేయుచు వెదపాటవాడు. విరా. 2.250.

**కరతలామలకము** (జాతీ) సం వి అ.న.

అఱచేతిలోని యుసిరిక కాయఁ (ఇది యొకరు తెలుప నక్కఱ లేదయే తనంతటనే స్పష్టమగు దానికి ఉప మానముగాఁ జెప్పఁబడును).

కం. లావును వెరవును మెఱయఁగ, నీవీరులు పాండుపుత్రునిం బొదివిన చో, నా వీరుని యక్కఱమగు, లావు వెరవుఁగరతలామలకమై తోఁచెన్. ద్రోణ 3.154.

(చేతిలో ఉన్న ఉసిరిక కాయ స్పష్ట ముగాఁ గనఁబడుచుండ దాని గుఱించి యొకరు చెప్పనవసరము లేదు. అట్లే ఎదిరించినపుడు పాండు పుత్రుని బలాతిశయము ఒకరు చెప్పకుండఁగనే అనుభవము మీఁదనే స్పష్టముగాఁ దెలియును అని భావము.

**కరతోయ** సం. వి. ఆ స్త్రీ.

కురంగ దేశమునఁ బ్రవహించు ఒక నది.

వ. గంధమాదన సంగతయైన యింద్రతోయయుం గురంగదేశగ్య

యగు కరతోయయుం బ్రిరాత్రోప వాసోపేత స్నాతకులకు నశ్వమేధ ఫలంబు గలుగంజేయు అను. 2.78. (గౌరీ వివాహము నందు ఈశ్వరుని హస్తమునఁ బట్టిన యేఱు అని, శ.ర.). (ఇది గౌరీవివాహకాలమందు హిమ వంతునిచే ఈశ్వరుని హస్తమున విడువఁబడిన దానోదకము వలన నేర్పడినది అని. సూ, అ. ని).

**కరదానము** సం. వి. అ. న.
కప్పము చెల్లించుట.
చం... భూపతులెల్ల. మహాధనావళుల్. దడయక తెచ్చి యిచ్చి కరదానము సేయుటఁ బార్థివత్వ మేర్పడియెఁ బృథాగ్ర పుత్రునకు, సభా. 2.96.

**కరదీపము** సం. వి అ పుం.
చేతిదివిటీ,
చం. అశుచియుఁ గృష్ణుఁడున్ లఘు వునైన నిశాగ్రజు మేనితోడ నిత్య రుచియుఁ బుణ్య శీలయు నుదాత్తయు నాఁజనునింతిఁ గాంచుఁ గ్రక్కశమతి గీచకుల్ బహు ముఖంబుల బాంధవ విప్రలాపముల్, దిశలద్రువం జెలం గరదీప నికాయము ప్రజ్వరిల్లఁగన్. కం. పితృవనము దెసకుఁజన ... విరా. 3.17.18.

**కరదీపిక** సం. వి. అ, స్త్రీ.
దివిటీ, చేతిదివిటీ.
వ. .... పరిమళ పరంపరా భాసిత నూతన తైలధారాభిషేక ప్రదీపితం బులయిన కరదీపికా సహస్రంబులు వెలుంగ. భీష్మ. 3.169. భీష్మ. 2.166.

**కరధమనము** సం వి అ. పుం,
చేతిని గొట్టము వలెఁ బట్టి యూఁదుట.
కం. కరధమనంబున నాతఁడు, కరం ధముఁడనం గఁబరఁగి.
(చూ. కరంధముఁడు) అశ్వ, 1 26.

**కరపుటము** సం. వి. అ. పుం.
1. అంజలి, దోసిలి,
తే. ... జన సమాజ కరపుట హృదయ సరోజములకు, ముకుళం బును జృంభణంబును నొనర్చి. భాను బింబంబు పూర్వాద్రిపై వెలింగె ... విరా. 2.241.
2. దొప్పగాఁ బట్టిన చేయి.
తే. అని విలాపంబు చేసిన విని విభుండు, గన్నుఁగవ నశ్రులుర లంగఁ గరపుటములఁ, దుడిచికొనుచు దగ్గుత్తిక దొదరు నెలుఁగు, నెట్ట కేలకు నూలొ్కల్పి యిట్టులనియె. కల్య. 2.405.

**కరము**1 దే. అవ్య.
అత్యంతము, మిక్కిలి.
కం. కరమిష్టము సేసితి మా కరి సూదన దీన నీకునగు సత్ఫలముల్. ఆది. 1.119.
తే. ఏను వంటలవాఁడనై యా న రేంద్రుఁ గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్తమునకు వచ్చిన చందంబు ననయొనర్చి. పేర్చిమెలఁగుదుఁగరము ఫినీతి మెఱసి. విరా, 1.76.

**కరము2** సం. విణ. (అ. ఈ. అ.)
ఇది సమాసాంతము నందే యుప యుక్తము.
చేయునది.
తే. అయ్యుధిష్ఠిరు గాంభీర్యమతని ధైర్య, మరయ నొండెడఁ గలుగు నె యతఁడు కీర్తిధరుఁడు కరుణోత్తరుఁడు మహీసుర సమృద్ధికరుఁడు నిజవంశ కరుఁడప కారపరుఁడు. విరా. 2.189.
కం. దనుజకుల త్రాసకరంబును రిపు భంజనము ... నగు నిజ కార్ముకంబు మోపెడలించెన్. విరా. 1.120.
వి. అ. పుం.
1. హస్తము, చేయి.
వ. పాండవులు .... భూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దార నుష్ఠింపం బూనినపని వారల కెఱిం గింపం దలఁచి కరంబులు మొగిచి సవినయంబుగా నిట్లనిరి, విరా. 1.46
2. ఏనుఁగు తొండము.
సీ. కరికరంబులు గరట కళద్దాన, తోయంబులును ధరాధూళి మ్రింగ. విరా. 3.167.
3. కిరణము.
కం. కరములు నిగుడఁగ నొప్పెదు, తరణి బొదువు వర్షదంబుదము క్రియ విరా. 3.167,
4. కప్పము, పన్ను.
కం. శరనిధి పరివృత విశ్వం, బరఁ గల భూపతులు పాండుపతి కృత మునఁ గిం, కరులై ప్రతి సమకల్పిత, కరులై రథి మొదలుగాఁగఁ గౌరవ్యుల కున్ ఆది. 5 40.(చూ కరదానము) సభా. 2.96.
5. రెండు (గణితము).
తే...నభో ద్వితయ కరసుధాంశులును. శాంతి. 5 46.
6. ఇరువది నాలుగు బొటన వ్రేళ్ల పొడుగు (ఒక్కచేయి ప్రమాణము).
వ. పసిడి యిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశ కరాత్మకంబును గరుడా కృతియునుగా యజనం బొనర్చి. అశ్వ. 4.180.

**కరవాలము** సం. వి. అ. పుం.
ఖడ్గము, కత్తి.
వ. ... తోలూడ్చు మహానాగంబు నుంబోలెఁ గరవాలంబు దొనయొఱ వెలికి నిగుడుచున్నయది. ఉద్యో. 2.186.

**కరవీరుఁడు** సం. వి. అ. పుం.
కద్రువ కొడుకు, సర్పజాతి వాఁడు, ఆది. 2.4.

**కరస్థలామలకము** సం. వి. అ. న. (జాతి)
కరతలామలకము.
కం. అతనికెల్ల ధర్మముఁ, గరస్థలా మలక సన్నికాశం బధిపా. శాంతి. 1.337.

**కరహాటకము** సం. వి. అ. పుం.
దక్షిణ భారతము నందలి యొకదేశ పువేరు. ధర్మజుని రాజసూయయాగా రంభమున విజయయాత్రకు వెడలిన సహదేవుఁడీ దేశపు రాజును జయిం చెను,

కం. లాళవన పాండ్య కేరళ. కాళింగ ద్రవిడయవన కరహాటకభూ పాలకుల నొడిచి దక్షిణ, వేలావన భూము లందు విడిసి కదంకన్ సభా 1.:91

**కరాలితము** సం. విశ. (అ. ఆ. అ) కలుషితము

వ. అంతనొక్కనాఁడు నితాంతఘ ర్మజలవణ కరాలిత శరీరుండై ప్రియా సమేతంబుగా వాసగృహంబు వెలు వడి......కమలాకరంబుగిని కృతా వగాహుండై ఆర. 4.328.

**కరాళము** సం. విశ. (అ. ఆ. అ)

1 వెఱపు పుట్టించునది భయానకము

వ. ... ధారాకరాళరక్తపరిషి, క్త వి శ్వంభరా భాగంబును. విరా.౯.60.

వ......అతినిశితదంష్ట్రా కరాళం బై న తన వదన గహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లుమెఱవ బభ్రుకేశంబులు దూం బాలార్క రశ్మియుతంబయిన బలాహ కంబు నుంబోలె సకల ప్రాణి భయ జననంబుగా గర్జిల్లుచున్నవాని ఆర. 1.107.

2. కలుషమైనది, కలఁగఁబాఱినది మలినము

ఉ......ఆ, ప్పాఁడు దలంచి నిర్గళి త బాష్ప కరాళ కపోలయుగ్మఁ డై ఆది 8. 133

వ ఆనిన దమయంతి నయనాంతర్గ ళిత బాష్పకణ కరాళ కపోలయుగళ యగుచు, ఆర. 2.61

వి.

కాలుష్యము

వ. అట్టి శారదాగమనంబున నుత్ఫు ల్లకమల కల్హార కేసర కరాళ కలిత కల్లోల మాలినియు. ఆర. 4. 148.

**కరి** దే, విశ.

సాక్షి

కం. అనిమిషనాథ గుప్తము, యిన యమృతము దెచ్చి మీకు నిచ్చితినస్మ జ్జననీదాస్యము వాసెను, దినకర పవనాగ్ని తుకిన దీప్తుల కరిగాన్. ఆది. 2.116.

**కరి** సం. వి న్. పుం

తొండము గలది, ఏనుగు

చం ఆదియునుగాక కోలుపులినై నను గారెనుపోతునైనరిను, న్మదకరినై న ...పట్టుదు. విరా. 1.83.

**కరిణి** సం. వి. ఈ. స్త్రీ.

ఆఁడేనుఁగు

సీ కరణి యేనాఁట సూకరము గల యు ఆర. 6.341.

**కరిపురము** సం వి, అ. న.

హస్తినాపురము

కం. రాధేయుండు...... కరిపురంబు కరిగె. ఉద్యో. 4.58

**కరిపురి** సం. వి ఈ. స్త్రీ

హస్తినాపురము

చం. కరిపురి నెత్తుపట్టివని గల్గిన నోపినయంత సేసెదన్. విరా.౯.348

**కరియాన** సం. విశ (అ. అ. అ)

ఏనుఁగు నడకవంటి నడకగలది. స్త్రీ

ఉ...దేవమంత్రి...వరించె ఁజారుప, ద్మానన దేవసేనఁ గరియాన. ఆర. 5 287

**కరిలుఁడు** సం వి అ. పుం
కద్రువ కొడుకు, సర్పజాతివాఁడు. ఆది. 2.4

**కరిసనము** } వై. వి. (సం. కర్షణమ్. **కర్సనము** } ప్రా. త. కరిసనం)
కృషి, సేద్యము
కం. అరులు మిగుల గొనిరాజులు, నరులకు నెంతయును భయమొనర్తురు ధరణీ, సురులు గడఁగి వాణిజ్యముఁ గరిసనమును జేయఁగలరు కలికాలము నన్. ఆర. 4.293
సీ. గోవులెక్కుడు......వినుతహో మములకెల్లను బాలుఁబెరుగు నేయును నిచ్చుఁ గర్సనంబునకు నొదవు. అను. 2.192.

**కరీషము** సం. వి. అ పుం. న.
పెండ, పేఁడ
తే గోమృతంబు ప్రాశించియు గోక రీష, సువిహిత స్నానుఁడయ్యుఁబూ, దివిజుఁడధిక. భక్తి నిత్యంబు గోమ తీపతన మాచరించియును గల్మష ముల నిర్జించు ననఘ...అను. 3.97

**కరుడు** దే. వి.
గట్టిపడిన ముద్ద. చూ. కరుడుగట్టు

**కరుడుగట్టు** దే. అ. క్రి (√ కరుడు)
ముద్దగట్టు, పిండమగు
గీ కలసి శుక్ర శోణితములు కరుడు గట్టి వీను మమేధ్య మధ్యమున వృద్ధిఁ బొంది. శ్రీ 1.86:

**కరుణ** సం. వి. అ. స్త్రీ
కనికరము. దయ
తే తుష్టి దీపించి కరుణార్ద్ర దృష్టిఁ జూచి. విరా. 110.

**కరుణ గలుగు** అ. క్రి.
దయతోనుండు, దయగలిగియుండు
ఆ. వసుమతీ ప్రజకెల్లఁ, గరుణ గలుగుమమ్మ కమలనేత్ర. ఆది. 8.4.

**కరుణము** సం. విశే. (అ. అ. అ)
దీనము, జాలి పుట్టించునది.
వ......తొల్లి సకల గోమాతయయిన సురభి సురరాజుకడకుం బోయి కరుణంబుగా నేడ్చిన. ఆర. 1.72.
వి. అ. పుం.
జాలి, దైన్యము, దుఃఖము
కం. ధరణి నెఱి దప్ప నొఱగిన, కరిహయ నరచయము బొఱలఁగాఁ గరుణము బూ, వర యొలసె శిబిర మునఁ దన, కరయఁగఁ జేరుగడ లేమి నది వృథయయ్యెన్.
తే....కరుణమావ, హిల్లదురపిల్లె ను ల్లంబు దల్లడిల్ల. శల్య. 2 291; స్త్రీ. 2.63

**కరుణించు** సం అ క్రి.
కరుణగలవాఁడగు
వ. అమర నగరంబున కరిగిన యెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు నా కేశిందు గరుణించి యీ శాపఫలంబు భవద జ్ఞాతవాస వత్సరంబున ననుభ వించి తదనంతరంబ శాపమోక్షంబు

వదయుమని దీవించె విరా. 1.87., ఉద్యో. 3.292.

స. క్రి. కనికరించు.

వ. ఇగ్గురుడుండు... మీకు బాధయగు నని యుత్తరుణాఖ విడువనేరకున్న వాఁడు వీనిం గరుణించి మీరాండు కడకు నరుగుఁడనిన ఆది 2.75., ఉద్యో. 4.560.

**కరువలి** దే. వి.

వాయువు, గాలి.

సీ. కరువలిచేఁ దూలు కపిల జటాలి యు కరమొప్ప శిఖలుగా ... మూఁడ గ్నులు|పత్యక్షమైనయట్లు, తనమ్రోల శర్మిష్ఠతనయులు క్రీడించుచుండఁగ. ఆది 8.182.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు, నెఱవిరి తమ్ముల నుఱక తెగడి. విరా. 2.83.

**కరువలి పట్టి** దే. వి.

వాయుదేవుని కొడుకు. భీముఁడు.

కం. అట్టి సమయమునఁ గరువలిపట్టి త్రిగర్తేశురథము పై కుఱికి. విరా 3.218., భీష్మ. 3..20.

**కరువు** దే. వి.

అచ్చు.

చం. కరువునఁ బోసిరో విధుని కాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చి గం,దరు వొన రించిరో ... అను. 1.183.

2. గర్భము.

కం. చరువులు నమ్మని చెప్పిన, తరువులు పీద్పడియె సుతకుఁ దల్లికి నట్ల, య్యిరువురు నుపయోగింపఁగఁ గరువులు దత్తత్ప్రకార కలితములయ్యేన్. అను. 1.111.

శ్లో॥ అథగర్భౌ వనుప్రాప్తే ఉభేతేవై యుధిష్ఠిర, సం. భా. అను. 4.85.

**కరువుగట్టు** దే. అ క్రి.

అచ్చు. ఏర్పఱచు

తే. కుసుమ బాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, పోసి చైతన్య సంపుటము దగ మటించిరో కాకయిట్టి చేడియలుగలరె. విరా. 2.27.

**కరువునఁ బోయు**

అచ్చునందుఁ బెట్టితీయు

చూ. కరువు 1వ ఉదా.

**కరూశదేశము** సం. వి. అ. పుం

దీనినే కులూత దేశమనియు నందురు దీని నాథుఁడు క్షేమధూర్తి. ఇతఁడు కర్ణుని మొదటినాటి యుద్ధమున భీము నితోఁ బోరి మరణించెను. కర్ణ. 1.71., భీష్మ. 1.40.

సంస్కృత భారతమున కరూషదేశమొ కటి గన్పించుచున్నది. దాని యధిపతి కరూషుఁడు. అతఁడు పాఁడవ పక్ష మునఁ బోరి భీష్మునిచే మరణించినటు లఁగలదు. ఈ కరూష దేశప్రశంస, ఆంధ్ర భారతమున, గనఁబడుట లేదు. 'కరూష' వేఱుగా 'కులూత' వేఱుగా సంస్కృత భారతమున గలవు కులూతాధిపతి ఆంధ్రభారత మునందువలెక్షేమధూర్తియే. అతఁడు

భీమసేనుని చేతిలోనే మరణించెను. కరూశ, కలూత పర్యాయ పదములుగా ఆంధ్ర భారతమున గన్పించుచున్నవి. (కర్ణ. 1.80నుండి 85వఱకు)

**కరేణుమతి** సం. వి. ఈ. స్త్రీ.
చేదికన్య, నకులుని భార్య
వ. నకులునకు చైద్యయయిన కరేణుమతికి నిరమిత్రుండు పుట్టె. ఆది 4. 115

**కరేణువు** సం. వి ఉ. స్త్రీ.
ఆఁ దేనుఁగు
సీ సారణ సత్యకాక్రూర.......గదోద్ధవాది యాదవులధిక ప్రమోదులై యొక్కటఁ దరుణులుఁ దారును గరికరేణు, హయశిబి కారూఢులయి తదుత్సవమున కరిగిరి. ఆది. 8 176

**కర్కటకము** సం. వి అ పుం.
కుళీరము; ఎంద్రకాయ, వాడి తేలిన మొనలుగల పదికాళ్లు గలిగి నీటియొక్క భూరంధ్రములలో నివసించు జంతువు. ఈరంధ్రముల యందు నీళ్లుండును.
ఉ. తిమికూర్మ కర్కటక నక్రభుజంగచయంబుతో భయం, బందుచుఁగాలకేయులు బయల్పడి తోఁచిరి దాని లోపలన్ అర. 8.39.

**కర్కటము** సం. వి. అ. పుం.
కుళీరము, ఎంద్రకాయ. చూ. కర్కటకము.
సీ . పర్జన్యుఁ డే చేటఁ బసిఁడివాన. కనకమయములైన కర్కట ఝషనక్రకూర్మ చయముతోడఁ గురియుచుండ. ద్రోణ 2.198.

**కర్కటి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.
ఆఁడుపీత, ఆఁడు ఎంద్రి చూ॰ కర్కటి గర్భము.

**కర్కటి గర్భము** సం. వి. అ. పుం.
ఎంద్రకాయ కడుపు.
ఎంద్రకాయ నుండి పిల్లలు కడుపు చీల్చుకొని వచ్చును. అంతటితోనది మరణించును. ఎంద్రకాయకు కడుపు వచ్చుట దాని మరణమునకే యగును. ఎవరినైన దాఁపునకుఁ జేర్చినపుడు అదితనకు వినాశమునకుఁ గారణమని తోచినచో ఈ పదమును జాతీయముగను ఉపమానముగను జెప్పుదురు. పొట్టపగిలి చనిపోవునపుడును బిడ్డగని చనిపోవునపుడును దీని నుపమానముగ గ్రహింతురు.
(సుధేష్ణ ద్రౌపదితో)
కం. దుర్భరవగు నినుఁ గర్కటీ గర్భము ధరించినట్లు గైకొని నాకై నిర్భర విధ్వంస దశా, విర్భావము దెచ్చికొనుట వెరవైయున్నే... విరా. 1.322.
వ. దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి.
సీ. అశనికల్పము లివి యర్జును బాణముల్, గాని శిఖండివి గావు సుమ్ము, కర్కటి గర్భంబు కరణి గాత్రము వ్రచ్చె నిట్టివి పీనికి నెందుఁ గలవు. భీష్మ. 3.404.405.

**కర్కరము** సం. విణ. (అ. ఆ. అ.).
కఠినము.
మ. ...వజ్రపాషాణ క,ర్కరులర్క

ప్రతిమాన తేజులు ... జనియించి రెల్లయెడలన్ నాగాయుత ప్రాయులై. ఆర. 6.292.

**కర్కారుఁడు** సం. వి. అ పుం.
కద్రువ కొడుకు, సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కర్కశము** సం విశ. (అ. అ అ.)
గట్టిది. కఠినము.
కం. వ్యాయామ కర్కశ స్థిర,కాయు లయుద్ధము భయానకం బయ్యె. సభా. 1.204, ద్రోణ. 2 14.
2 నిర్దయము, కనికరము లేనిది.
చం. అశుచియుఁ గష్టుఁడున్ లఘువు నైనని జాగ్రజు మేనితోడని,త్య శుచి యుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జను నింతిఁ గొంచుఁ గ,ర్కశ మతి గీచకుల్. విరా. 3.17.

**కర్కోటకుఁడు** సం. వి. అ పుం.
ఒకానొక సర్ప శ్రేష్ఠుడు. అగ్నిదగ్ధ ముగాకుండ, గాపాడిన నలునిఁగాటు వేసి వికృతరూప మిచ్చి వరమిచ్చిన నాగకుమారుఁడు. ఆర. 2.123. మొ 127 వ.
వ అన్నాగ కుమారుండును నలున కుం గృతాంజలియై యేను గర్కోట కుండను గర్వవశంబున నొక్క బ్రహ్మఋషి నుపాలంభించి తచ్ఛా పంబున నెక్కడం గదలనేరకున్న వాఁడ. ఆర. 2.125.

ఈతఁడు బలరాముఁడు శరీరము విడిచి యనంతుని యందుఁ గలయు వేళ నా తని గొలుచుటకై వాసుకి తక్షకుఁడు మొదలగు వారితో వచ్చెను. మౌస. 76.
ఏ మాత్రము దయా దాక్షిణ్యములు లేక మిక్కిలి కఠినముగా ప్రవర్తించు వానిని కర్కోటకుఁడు మహాకర్కోట కుఁడుఅని పిలుచుట లోకవ్యవహారము నందుఁ గలదు.

**కర్జము** వై.వి. (సం కార్యం. ప్రా.కజ్జ)
1. కార్యము, పని,
ఉ. కర్జము దప్పె నీ యెదుట కష్టపు మాటలకేల యోర్తురు ఉద్యో. 4 242.
సీ. ముదుసళులు దమ కిమ్ముగాఁ జదివి కొండ్రు. గాక పతులకు హితమగు కర్జమేల, యోఁసి చెప్పుదురు ఆది. 8.83.
2. విధము.
చం. అరియెడ మిత్ర భావ మొక యప్పుడు కార్యము పొంటెఁ గల్గిన, న్వైరవునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దాని వాతికిం, గరముదొ లంగఁ జేరువగు కర్జము పట్టి చరించు టొప్పదే, పొరుగున నుండి నీకు హిత ముం దగఁ జేసెద నెప్డు పంచినన్ శాంతి. 3.230.
విశ. కర్తవ్యము, చేయఁదగినది.
వ. వానికి నర్తనశాల సంకేత ప్రదేశం బుగాఁ జెప్పి యొంటి మెయిం జను దేర నియమింపుము వాఁడు వచ్చిన నా పొలబగునిం చెగఁ జూచి నీకుంజావి

నీచిత్తంబు వడసెద నిత్తఱంగు దప్పు నొండు విధంబు గర్జంబు గాదు. విరా 2.235

తరువోజ. ఏయుపాయంబున నిబ్బారి గడవఁగా నేర్తు మెయ్యది గర్జమిం దుండఁగా దేఁగుదమ యొండు కడకు. ఆది. 6.247.

**కర్ణకఠోరము** సం. విణ. (అ. ఆ. అ.) విన గటువైనది.

వ. కర్ణుని సారథినైనను, సిర్ణయ మునకేను బార్థునిం గాచెద నా, దుర్ణ య విచారు నెమ్మెయిఁ గర్ణకఠోరం బులాడి కలఁతుం బోరన్. ఉద్యో. 1.112.

**కర్ణగోచరము** సం. విణ (అ ఆ. అ) చెవికి వినఁబడినది.

వ. యుధిష్ఠిరుఁడు .....గాండీవగు ణఘోషంబు గర్ణగోచరంబుగామికి మనంబు గలంగ. ద్రోణ 3.278.

**కర్ణదళము** సం. వి. అ. న. చెవిఆకు, చేక్కిలము, బయటిచెవి

మ...కర్ణదలోపాంతము నింత సేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లగన్. విరా. 3.173.

**కర్ణధారుఁడు** సం. వి. అ. పుం పడవ నడపువాఁడు. అరిత్రము (చుక్కాను) పట్టుకొని పడవనడుపు వాడు.

వ. కర్ణధారుండు లేని యానపాత్రం బుంబోలెఁ దద్బలంబు దిరుగుడు వడియె. భీష్మ. 2.75, శాంతి. 5.577.

**కర్ణపర్వము** సం వి. న్. న మహాభారతము నందలి ఎనిమిదవ పర్వము. చూ. పర్వము. కర్ణపర్వాశ్వా సాంతగద్య.

**కర్ణపాశము** సం. వి. అ. పుం అందమగు చెవి

వ. విప్వచ్ఛుండు ప్రేల్మిడిం బొడసే సి సకేయూరంబులగు బాహుదండం బులను సకుండలంబులగు కర్ణపాశం బులను... భూభాగం బలంకరించి. విరా. 5.138

**కర్ణపుటము** సం. వి. అ. న. చెవిదోనె; పుటము (దోనె) వంటిచెవి

ఉ. కావున భారతామృతము కర్ణ పుటంబుల నారఁగ్రోలి. విరా 1.30

**కర్ణపూరము** సం వి. అ. పుం. చెవికమ్మ, కుండలము.

తే. కదిసి మీఁదికి లంఘించి మద మెలర్ప, గళము దునిమిన నమ్మ స్త కంబు దొల్లెఁ, గర్ణపూర కిరీట సంక లిత వివిధ రత్న రోచులు మెఱయ ధరాతలమున శల్య. 1.133.

**కర్ణప్రావరణులు** సం. వి అ. బహు సాగర ద్వీపవాసులైన వారు రాక్షస జాతికిఁ జెందినవారు. సహదేవుఁడు దక్షిణ దిగ్విజయ యాత్రాకాలమున వీరిని వశపగతుల జేసికొనెను. సభా. 1.260.

**కర్ణభూషణము** సం. వి. అ. న. చెవినగ.

సీ. కర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలన
మీక్షణ దీప్తుల నినుమడింప. విరా.
4 26.

**కర్ణము** సం వి. అ. పుం.

1. చెవి.

ఉ, ఆతని తమ్ముడైన మదిరాశ్వుఁడు
కర్ణ ఝళం ఝళా సము, ద్ధూతబలోత్థ
రేణు పరిధూసరి తాంబర మైన వారణ
వ్రాతము గొల్చిరాఁ గడఁగి వచ్చెఁ
విరా. 8,1:6.

2. అరిత్రము, చుక్కాని. చూ. కర్ణ
ధారుఁడు.

**కర్ణరసాయనము** సం. విణ (అ.ఆ అ.)
చెవికి అమృతమైనది. వినసొంపైనది.
కం. అను పలుకులు కర్ణరసాయనము
లగుడు నయ్యుధిష్ఠి రానుజుఁడు
ముదంబునఁ దేలి విరా 2 261.

**కర్ణవేష్టుడు** సం. వి అ. పుం.
క్రోధగణాంశ సంభూతుఁడు. ఆది.
3 80

**కర్ణాంతము** సం. వి. అ. పుం. న.
చెవితుద.
కం...కర్ణాంతాకృష్ట చండకాండములు
కర్ణ. 8.303.

**కర్ణాట దక్షిణ మల్లులు** సం. వి అ. పుం.
సమ.
మత్స్యమండపతులు. భీముఁడు దిగ్వి
జయంబు సేసినపుడు వీరినిజయించెను
సభా. 1.248

**కర్ణాటము** సం వి. అ. పుం
ఒకానొక దేశము, కన్నడ దేశము.
అర్జునుఁడు అశ్వమేధ హయరక్ష
ణార్థము పోవునపుడు ఈ దేశాధిపతిని
అనాయాసముగ వశగతుని జేసికొ
నెను. అశ్వ. 4.113 , భీష్మ. 1.40.

**కర్ణాభరణము** సం. వి. అ. న.
చెవినగ, కర్ణభూషణము, చెవికమ్మ.
సీ. కర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలన
మీక్షణ దీప్తుల నినుమడింప. విరా.
4.26.

**కర్ణిక** సం. వి అ. స్త్రీ
1. పూవులోని పన్నీరుబుడ్డివంటి
దిన్నె, పూవుగద్దియ
ఆ. కమలకర్ణికానుకారియై కాంచన,
మణిమయత్వ మహిమ మహిత
మగుచు. భీష్మ. 1.21.
2, బాణవిశేషము.
ఇట్లింద్ర పౌత్రుండు...కర్ణుండుడాసి
నం గర్ణోపాంతంబు కర్ణికా నారాచం
బుల నొప్పించె.. ద్రోణ. 2,96

**కర్ణికారధ్వజము** సం. వి. అ. పుం న
కర్ణికారము గుర్తుగాఁ గలటెక్కెము.
అభిమన్యుని కేతనము,
వ. అభిమన్యుండు గనకవర్ణ తురం
గంబులుం గర్ణికారధ్వజంబును
మెఱయందాఁకి. భీష్మ. 1 271 చూ.
కర్ణికారము

**కర్ణికారము** సం. వి అ. పుం.
కొండగోఁగు చెట్టు, జెల చెట్టు.
తే కనకపుంఖ శరావృత గాత్రుఁడై
న, దుశ్ప్రహుఁడు చచ్చియుండియుఁ

దోయజాక్ష, వికచ నవ కర్ణికార సంవేష్టనంబు గలుగు శైలంబు తెఱఁగునఁబొలిచెఁ జూడు.స్త్రీ.2.70. 'కర్ణికార' శబ్దమునకు 'కొండగోఁగు' 'ఱేల' అనురెండర్థములు నిఘంటువులు చూపుచున్నవి. అభిమన్యుని ధ్వజముగుర్తు 'కర్ణికారము' అన్నప్పుడు అది కొండగోఁగా? ఱేలయా యనునది విచార్యము. మూలమునందన్ని చోట్లనాంధ్రమునకువలెఁ గర్ణికార శబ్దమే ప్రయోగింపఁ బడియున్నది. కర్ణికార శబ్దము కొండ గోఁగునకే ప్రధానముగా సంస్కృత నిఘంటువులు తెలుపుచున్నవి.

అమరమునందు 'కర్ణికార' శబ్దము ఱేలకుఁ గానరాదు. అర్థమునకుఁ గల ప్రాధాన్యమును బట్టి యభిమన్యుని ధ్వజము కొండగోఁగు అని చెప్పవలసియున్నది.కొండగోఁగు కొండల యందు విస్తారముగాఁ బెరుగును. దీనికి దోహద క్రియ సల్లాపము. అథ ద్రుమోత్పలః కర్ణికారః పరివ్యాధే అని యమరము. కర్ణికా మియర్తీతి కర్ణికారః.కర్ణిక యనఁగాదుద్దు. దానిని బొందియుండునది. కర్ణికాం కర్ణభూషణత్వమియర్తీతి వా కర్ణికారః బుగకా కర్ణభూషణత్వమును బొందునది.

కర్ణికారపుష్పము కర్ణభూషణమైన టుల అభిమన్యుని పేరు చెవులకు విన సొంపైనది అనునర్థము వచ్చునటుల అభిమన్యుడు కర్ణికారమును ధ్వజ చిహ్నముగా స్వీకరించియుండెనేమో. ఇచ్చట మఱొక సందేహమును గలుగవచ్చును. అభిమన్యుని ధ్వజము. కర్ణికారవృక్షము నంతయునా? లేక ఒక్కపుష్పము మాత్రమేనా? వృక్షము చిన్నదిగాన పూలతోఁ గూడిన చెట్టంతయుఁ జిహ్నము కావచ్చును. ఇది రెండు గజముల యెత్తువఱకు బెఱుగును. కానిఱేలకుఁ గూడఁ గొంత ప్రామాణ్యము లేక పోలేదు. కొండగోఁగు పూలు ఎఱ్ఱగానుండును. ఎఱుపు రంగు నిచ్చును. రంజనః సుఖదః అని భావప్రకాశ వైద్యనిఘంటువు. ఱేలకును కర్ణికారశబ్దము వైద్యశాస్త్రమున అత్యంత ప్రామాణిక గ్రంథమైన భావప్రకాశ నిఘంటువు తెల్పుచున్నది.

శ్లో॥ ఆరగ్వథోరాజ వృక్షః శమ్యాకశ్చతు రంగులః, ఆరేవతో వ్యాధిఘాతః కృతమాలః సువర్ణకః॥ కర్ణికారో దీర్ఘఫలః స్వర్ణాంగ స్స్వర్ణభూషణః॥ భావప్రకాశ పూర్వఖండము 137,138; ఇవిగాక చక్రపరివ్యాధ,స్వర్ణపుష్ప, స్వర్ణద్రుమ, స్వర్ణస్థాలీ స్వర్ణవృక్ష, మహారాజద్రుమ అను పేరులును అందు గలవు.

ఇది పెద్దవృక్షము. దీని ఆకులు పెద్ద నేరేడు ఆకులవలె నుండును. దీని పుష్పములు అయిదేసి రేకులు గల్గి పసుపు పచ్చగ ప్రతికొమ్మకు పూచియుండును. అప్పుడు వృక్షమును జూచిన పసుపు పచ్చగఁ జాలనందముగ నుండును. దీని కాయ రెండడుగులు మొదలు నాలుగడుగుల పొడవు కల్గి సన్నని రూళ్లకఱ్ఱవలె నుండును,

తే. కనకపుంఖశరావృతగాత్రుఁడైన, దుస్సహుఁడు చచ్చి యుండియు, తోయజాక్ష వికచ నవకర్ణికార సంవేష్టనంబు వెలుగు శైలంబు. తెఱఁగునఁ బొలిచెఁ జూడు స్త్రీ. 2.50.

అను పద్యభావమును బట్టి భారతమునందుఁ జెప్పఁబడిన కర్ణికారము పచ్చని పూలుగలదనియుఁ గొండల యందుఁ బెఱుఁగునది యనియుఁ దెలియుచున్నది. పచ్చనిపూలు గలది తేలగాని కొండగోఁగు కాదు కాన భారతమునందుఁ బ్రయోగింపఁ బడిన కర్ణికారశబ్దము తేలకే చెందుచున్నది.

శ్లో॥ దుస్సహ స్సైతదా భాతి శరీరం సంవృతం శరైః, గిరిరాత్మదుమైః పుష్పైః కర్ణికారై రివావృతః శాతకౌమ్యస్రజాభాతి కవచేనచ భాస్వతా, అగ్నినేవ గిరిశ్శ్వేతో గతాసురపి దుస్సహః-సం. భార. స్త్రీ 19.10,11

వ భూమధ్యంబున నుత్తర. తటంబునం గర్ణికార వనంబున గౌరీసమేతుండై సిద్ధ గణంబు పరివేష్టింప విశ్వేశ్వరుండు విహరించుచుండు. భీష్మ 1.28

శ్లో॥ పార్శ్వే తస్యోత్తరే దివ్యం సర్వతః కుసుమైశ్చితమ్॥ కర్ణికారవనం రమ్యం శిలాజాల సముద్గతమ్॥ తత్ర సాక్షాత్పశుపతి ర్దివ్యైర్భూతైస్సమావృతః ఉమాసహాయో భగవాన్ రమతే భూతభావనః కర్ణికారమయీం మాలాం బిభ్రత్పా దావలంబినీమ్. సం. భా భీష్మ 6 26,27.

శివుఁడు కర్ణికార పుష్పమాలను పాదములవఱకు ధరించెనఁట. గోఁగుపూలో తేలపూలో నిర్ణయింపలేము. కానిపైని తెలుఁగు భారతమున విహరించెను అనిచెప్పుటచే రెండుగజముల ఎత్తుగల కొండ గోఁగులలో విహరించెననుట సామరస్యముగఁ దోఁపదు. ఇచ్చట తేలయనుటయే కొంతవఱకు యుక్తముగనున్నది.

సీ. కర్ణికారవనంబునఁ గలదు మేరు తటమున నంద్రితనయయుఁ దాను పశుపతి లీలమై ప్రమథ గణము గొలువనుండ ... శాంతి. 3.242.

శ్లో॥ మేరుశృంగే కిలపురా కర్ణికారవనాయతే, విజహార మహాదేవో భీమైర్భూతగణైర్వృతః శైలరాజ సుతా చైవదేవీతత్రా భవత్పురా తత్రదివ్యంత పస్తేపే కృష్ణద్వైపాయనస్తదా. కర్ణికారవనమున వేదవ్యాసుఁడు తపస్సు చేసినటులఁ జెప్పఁబడినది. కాన కరికార మిట రాజవృక్షమైన తేలయే కాఁదగియున్నది తేలపూవునకును కర్ణికార శబ్దవ్యుత్పత్తి సిద్ధిచే కర్ణభూషణ ప్రాప్తియుఁ గలుచున్నది. పూలతో నలరారు తేల చెట్టు బంగరు చెట్టువలె నందముగ నుండును గాన నది అభిమన్యుని ధ్వజచిహ్న మనుట యుక్తియుక్తముగఁ గనిపించుచున్నది.

**కర్ణికారవనము** సం. వి. అ. న. చూ. కర్ణికారము. భీష్మ 1.28. శాం. 6.247

**కర్ణుఁడు** సం. వి. అ. పుం

1. కుంతి మొదటికొడుకు (ఇతఁడు

కుంతి యందుఁ గన్యాత్వ కాలమున సూర్యునికిఁబుట్టినవాఁడు) చూ. చివర సంపుటము అనుబ ధము.

2 కురు కుమారుఁడు గాంధారీధృత రాష్ట్రుల కొడుకులలో పదునైదవ వాఁడు. ఆది. 6 10/. ఇతఁడు భీమసే నునితోఁ బోరి మరణించెను.

3. ఒకానొకరాజు. భీముఁడు పూర్వ దిగ్విజయ యాత్రా కాలమున నితని వశగతుని జేసికొనెను. సభా. 1.243.

**కర్త** సం విశ (పు. స్త్రీ పు)
చేయువాఁడు, సృష్టించువాఁడు

వ. ఇంతకు గర్తయు, భర్తయు, హర్తయునై దుగ్ధాంబుధి యుత్తరంబున, నారాయణుండు. భీష్మ 1.27.

వ. మఱియు నిట్టి మహాభారతంబునకుం గర్తయయిన వేదవ్యాసుని, ఆది- 3. 2.

(రచించువాఁడు- అని యర్థము)

ఆ. .. ఈన్నపుడ (శకుని) కాఁడె పాండునందనుల తోడి వైరమునకుఁ గర్త. స్త్రీ. 2.136.

4. ఊష్మపులలో నొకఁడు అను. 3.191

**కర్తనము** సం. వి. అ.న
విఱుగఁగొట్టుట, త్రుంచుట

వ అందా కర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పర కర్తనంబును నితరేతరచ్ఛత్ర కేతుఖండనంబును నన్యోన్య వర్మవిదారణంబును మిథశ్శరీర పాతనంబును నగు సంగ్రామంబు నెల్లె కర్ణ. 2.326.

2. కత్తిరించుట, ఛేదించుట

సీ అంతకుం దనుపఁబనుచు – తే. దగిన యెడలఁ బాపాత్ములఁదదృటాలి దహన కర్తన బంధన తాడనముల బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు, దొలుచు గ్రద్దలు నొప్పించుఁ గుందనిహతి అను. 6.170

**కర్తవ్యత్వము** సం. వి. అ, న
కర్తవ్యభావము

కం. కారణముల వలనఁ గృత, ప్రారంభంబైన కర్మమంచిత గతికిం గారణమే కర్తవ్య, త్వారబ్ధక్రియల యట్టు లనఘచరిత్రా, శాంతి. 6.287.

**కర్తవ్యము** సం. విశ. (అ, ఆ. అ)
చేయఁదగినది.

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చిన విధంబున నుపదేశంబవశ్య కర్తవ్యంబు. విరా. 1.120.

కం తమకుఁబలం బెక్కినతఱి, సముచితమగు విగ్రహంబు శత్రులకుత్సా, హము మీఱినపుడు కర్తవ్యము సంధి యనంగవిందు మార్యులచేతన్. శల్య. 1 56.

తే. సుజన సంగతి కర్తవ్య కుజనుఁడైన, దాన నిర్మలు డయ్యెడు. శాంతి. 5.488.

**కర్తృత** సం. వి ఆ స్త్రీ.
కర్తృత్వము

కం. అవి...పుణకర్తృత యెసఁగున్. అను. 4.446

**కర్తృత్వము** సం. వి. అ. న.
కర్తృభావము, కర్తయగుట
కం. నృప ధర్మ వైశ్యధర్మము, లపాపకర్మములు జీవనాభావము పాలుపడిన బ్రాహ్మణునకు నరక పాతమగు శూద్రకర్మ కర్తృత్వమునన్. శాం. ౬.౪౯౩.

**కర్దమము** సం. వి. అ. పుం.
బురద, అడుసు
ఉ...దురంతక్లేదుర్దశా,కర్దమలేపనిర్హరణకారి కృపామృతపూర. భీష్మ. ౩.౪౬౨.

**కర్దముడు** సం. వి. అ. పుం.
1. కద్రువ కొడుకు, సర్పజాతివాఁడు ఆది. 2.4
2. విష్ణుమానసపుత్రుఁడైన విరజుని కొడుకు, వేనుని ప్రపితామహుఁడు
వ...కర్దముండుననపేక్షిత రాజ్యుండై తపంబున కరిగె. శాంతి. 2.205.

**కర్పరము** సం. వి అ. పుం.
1. కటాహము, కొప్పెర, కాఁగు, వెడల్పు మూతిగల గిన్నె
కం. ...గాండివ, క్వణనము రోదసీ హర కర్పరముం బగిలింప నుగ్రతన్. విరా. ౬.౩౦
2. ఒకానొక దేశము.నకులుఁడు దిగ్విజయంబు సేయు కాలమున ఈ దేశపు రాజును జయించెను. సభా. 1.286
మూలమునందు దీనికి 'కర్పటము' అని కలదు.

**కర్పూరధూపము** సం వి, అ పుం.
ధూపముగా నిడు కర్పూరము -అగరువుతోఁ జేరి ధూపమునకిడు సుగంధ ద్రవ్యము (పచ్చకర్పూరము)
వ. ధూపదానంబులందు నధికతరంబు కర్పూర ధూపంబని చెప్పి మఱియును. అను, 4.1౭.
దీనికి మూలము గానరాదు ఇదితిక్కన గారి కల్పనయో ప్రక్షిప్తమో తెలియరాదు. చూ. కర్పూరము. తిక్కన గారి కాలమున పచ్చకర్పూరమును ధూపముగానిడు ఆచారముండి యుండ వచ్చును.

**కర్పూరము** సం. వి అ, పుం, న.
1 ఘనసారము, కప్పురము, పచ్చ కర్పూరము
వ...మధుర సల్లాపంబు సేసి కర్పూర సహితంబగుతాం బూలంబువెట్టి విరా. 1.248.
కం. కలువడములు మణితోరణ, ములుఁ గట్టిరి క్రముక కుజమోచాస్తంభంబులు నాటిరి కుంకుమమును, గలయనలికి ముగ్గులిడిరి కర్పూరమునన్. ఆది. ౬.౩౨౮.
2. కప్పురపుఁ జెట్టు, కర్పూర వృక్షము.
మ. ఘన ధూమధ్వజ దహ్యమాన లవలీకర్పూర తక్కోలచం, దనకాలాగురు సల్లకీతరుల యుద్యద్ధూమ ధూపాను వా, సననొప్పెన్ సుంభీకృతంబులగుచున్ సంక్రీడమానామృతా, శన విద్యాధర సద్విమానవితతుల్

సావిత్ర వర్త్మంబునన్. ఆది.8.262

దీనినిబట్టి కర్పూరము ధూమద్రవ్య ములలోఁ జేరినదని బోధపడుచున్నది. కర్పూరములో అనేక భేదములు గలవు మనదేశములో ముఖ్యముగా వాడుకలో నుండునవి: 1. హారతి కర్పూరము

2. పచ్చకర్పూరము (పక్వకర్పూ రము). కర్పూరవృక్షమను నొక చెట్టుగలదు దీనిని చీనాజపాను దేశము లలో విస్తారముగాఁ బైరుచేయుదురు· అచ్చట పెద్ద పెద్ద తోఁటలు గలవు ఇదిదాల్చిన చెట్టుజాతిలోఁ జేరియుఁగువ చెట్టును బోలియుండును. ఈచెట్టునకు గంటుపెట్టిన పాలుకాఱును. ఆ పాల నుండియే కర్పూరము తయారగును. దీనిని అపక్వకర్పూరము హారతి కర్పూరము అందురు. పచ్చకర్పూర మును హారతి కర్పూరము నుండియే తయారు చేయుదురు. హారతికర్పూర ములో గవ్వపలుకు, సాంబ్రాణి,లవం గాలు, జాపత్రి, జాజికాయ,ఏలకులు, కస్తూరి, పసుపు, కుంకుమపువ్వు, కచ్చూరాలు కలిపి వండి పచ్చకర్పూ రము సిద్ధము చేయుప్రక్రియ యొకటి గలదు.

**కర్బూరము** సం. విణ (అ. ఆ. అ) చిత్రవర్ణము గలది.

కీర్యంతే నానావర్ణా అత్రేతి కర్బురః దీనియందు నానావర్ణములు నెఱపఁ బడును. క్రియతే నానావర్ణైరితి కర్బు రః. అనేక వర్ణములచేజేయఁబడునది. అని అమరము. లయగ్రాహి. దారుణ దవానల శిఖాఘన శిరోరుహ గభీర ఘన కర్బురశరీరు నద్దనుజవీరుఁ గని రచ్చెరువు గూరఁ గపివీరుల్. అర. 7 96.

**కర్మకరుఁడు** సం. విణ. (అ. ఆ. అ) వేతనమునకై పనిసేయువాఁడు, కూలివాఁడు

కం. వంచనయును జాడ్యంబును నించుకయును లేక ప్రభువు నిష్ట మెఱిఁగితాఁ,బంచిన పని నెరవునఁగా, వించిన కర్మకరుఁ డొందు విపుల ధనంబుల్. అను. 5.77,

**కర్మకలాపము** సం. వి అ. పుం. చేయవలసిన పనుల మొత్తము.

వ. .... కర్మకలాపంబులు సేయిం చుటకు నకులు నాజ్ఞాపించి. శాంతి. 1.378.

**కర్మకాండము** సం వి. అ. పుం. న. 1. ధర్మశాస్త్రము.

తే. చుట్టములలోన నొప్పమి వుట్టి నప్పు, దడ్డపడి వారితోఁడఁ గోట్లాడి యైన, దాని నుడుపంగఁ జూరకున్న వానిఁ గ్రూరకర్ముఁడని చెప్పుదురు కర్మకాండ విదులు. ఉద్యో. 3.242.

వ....ఇతండు గొనియెదనని యొడం బడికొనమి పాతకంబగుట కర్మకాండ విదులెల్ల నెఱుఁగుదురు. శాంతి. 4.156.

2. వేదమునందు యజ్ఞాది కర్మ విష యమగు భాగము·

వ... కర్మకాండవిమంచగు మపరిచర

వసువు...దేవతా పక్షపాతంబునఁ బహువిశసనంబు గర్తవ్యంబని పలికి యధః పాతంబు ప్రాపించె. అశ్వ. 4.2.58.

**కర్మఠుఁడు** సం. విణ. (అ. ఆ. అ,) కర్మశూరుఁడు, ఒక దానియందు సంపూర్ణ సామర్థ్యము గలిగి విడువక యీ పనిని నెఱవేర్చువాఁడు

ఉ. ధర్మసుతుండు మెచ్చెననుఁ దాన తురంగమ శాస్త్ర శిక్షకుఁ, గర్మఠుఁ జేసి యాత్మతురంగంబుల కెల్లను నన్న యుక్తుఁగా, నర్మిలి నిల్పి...విరా 1.267.

2. వైదిక కర్మానుష్ఠానము చేయువాఁడు

వ. జనంబులు పుట్టింపను మనువను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గులేదు. నేను గర్మభూమిని జనియించి కర్మఠుండనైతి నాకు నిచ్చటి యాచారంబుచితంబు గాదు. అర. 1.5.65.

**కర్మణ్యత** సం. వి. ఆ స్త్రీ. కర్మములయందు నేర్పరితనము

క. పుణ్యస్థలముల నెల్లన, గణ్యము లగు యూపములు ప్రకాశములుగఁ గ,ర్మణ్యతయు వివిధరత్నహి, రణ్యాదిక దానములకు బ్రస్తుతికెక్కన్- అను. 4 341.

**కర్మనిష్ఠ** సం. వి. అ స్త్రీ. విహిత కర్మముల నాచరించుట యందు ఆసక్తి,

మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ వినుతించున్ నిష్క్రియత్వంబు సద్గతిఁ గావించుట యుఁదిచెప్ప...శాంతి. 1-138

**కర్మభూమి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. భరతవర్షము, సుఖదుఃఖానుభవము గలలోకము. మర్త్యలోకము.

వ. జగంబులు పుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గులేదు. నేను గర్మభూమిని జనియించి కర్మఠుండనైతి నాకు నిచ్చటి యాచారంబు లుచితంబు గాదు అర-1-365.

వ ఇది కర్మభూమి భోగా, స్పదమా లోకంబు ధర్మపరులకు సులభంబది సత్యశౌచ సౌజన్య దయాదులు లేనివారి కప్రాప్యమగున్. శాంతి. 4.110.

సీ. ... మానుష్యంబు గర్మభూమి. అను. 5.75.

**కర్మము** సం. వి. న్. పుం. న.

1. పని, కార్యము

వ. అమ్మహనీయ చాపంబు .... వరుణుచేత నగ్నిదేవుఁడు వేడుకపడి పుచ్చుకొని పదంపడి యద్భుత కర్మంబునకు మెచ్చి విచ్చ్వునకిచ్చె విరా. 4 122.

తే శరణుఁ సొచ్చిన రక్షింపఁజాలి యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు, దప్పుఁ బుణ్యకర్మ ఫలంబు లఫలతఁ బొందు,ననఁడె కమలగర్భుండు దొల్లి జగద్ధితముగ. ఉద్యో. 1.161.

కం, ఫలములయెడ బ్రహ్మార్పణ, కలన పరుండగుచుఁ గార్యకర్మము నడపెన్ (కార్యకర్మము = చేయఁదగినపని). శాంతి. 1.69.

2. పుణ్య పాపకర్మము. సంచితము.

కం....కడు దుర్మతియైన నాతనూ జుఁడు, మతి గర్మము వెనుకఁ జనక మానునె యెందున్. భీష్మ. 2.859.

3. లౌకిక వైదిక క్రియానుష్ఠానము నిత్య నైమిత్తికాది

ఉ. కర్మము మేలునా విగత కర్మము మేలన రెండు నొప్పునే. కర్మఫలంబునర్పితముగాఁ దగనీశ్వరు నందుఁ జేతసద్ధర్మము. శాంతి 1.149.

4. విధ్యుక్త ధర్మము, కులాచారము.

తే. ఒప్పుకున్నను నాత్మకులోత్తమ కర్మ, మూర్ధ్వగతిఁ జేర్పుఁబరకర్మ మొప్పనేని, నార్యజనములు గిల్బిష మంద్రు దానిఁ, గాన నడపుము నిజవంశ కర్మమధిప శాంతి 1.279.

శ్లో॥ స్వధర్మే వర్తమానస్య సాపవాదేఽపి భారత, ఏవ మాత్మ పరిత్యాగ స్తవ రాజన్ న శోభనః. సం. భార. శాంతి. 32.23.

తే తనదు కర్మంబు విడుచుటయును వృథాపశుప్రహరణంబు... పాపంబు లందురు బుధజనములు. శాంతి. 1.293. శాంతి. 4.97.

5 పాపము.

సీ. వినుము కర్మము దెల్పుచును గపాలంబు నెత్తిన భైక్షాన్న మేక కాలమశనంబు గొనుచు...పంద్రెండు వర్షంబులు వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య, కల్బిషంబు దొలంగు. శాంతి 1.304.

6. ఆఱు కర్మములు.

1, యజనము 2. యాజనము.
3. అధ్యయనము 4. అధ్యాపనము 5. దానము 6 ప్రతిగ్రహము

మ......షడ్వర కర్మంబులయందు రాగ భర గాఢ ద్వేషముల్ లేక... శాంతి 2.230.; శాంతి. 5.31.

(బ్రాహ్మణుఁడైన ప్రతివానికి ఈ ఆఱు కర్మములందు అధికారము గలదు.)

**కర్మయోగము** సం. వి. అ. పుం.

నిష్కాముఁడై విహిత కర్మములనాచరించుట (ఇది మోక్షసాధనములలో నొకటి)

సీ జ్ఞానయోగము కృపా సంపన్న బుద్ధి నాకెఱిఁగింపవే యన్న నాతఁ, డతనికి నిట్లను ననఘ సత్కర్మయోగశ్రద్ధ దానికిఁ గారణంబు. శాంతి 4.172; శాంతి. 1.79.

**కర్మవిత్తము** సం. వి అ న.

మణి మంత్రౌషధి సాధనాదిక్రియ, అజగరవ్రతము. మణి మంత్రౌషధ్యాది సాధన క్రియలచే సాధింపఁబడు నదియా? యని ధర్మరాజుని సంప్రశ్నము.

అనిన విని యజాతశత్రుఁడు బంధు మత్త్వ కర్మ విత్త ప్రజ్ఞల యందెయ్యది నరునకు సుప్రతిష్ఠఁ జేయునని. యడిగిన నాపగాతనయుండతని కిట్లనియె. శాంతి. 4 67.

**కర్మసాక్షి** సం. వి. న్. పుం.
అగ్ని
మ. అఖిల జగత్కర్మ సాక్షినై యుండి యసత్యం బెట్లు పలుకనేర్తు.. ఆది. 1-127; చూ ఆది. 1-133

**కర్మసూక్ష్మము** సం. వి. అ. న.
ధర్మరహస్యము, ధర్మసూక్ష్మము
ఆ. కర్మసూక్ష్మ భంగి గానక యిమ్మెయి, సత్యరక్షణంబు సలుపు హొంతె, భ్రాత ధర్మపరుఁడు రాజిమ్మ హాత్ముజం, పఁగ్గ దలఁచుట ధర్మ పథముగాదు. కర్ణ. 3.74.
శ్లో. స గురుం పార్థ కస్మాత్త్వం హంతుకామో ఽ భి ధావసి అసంప్రధార్య ధర్మాణాం గతిం సూక్ష్మాం దురత్యయామ్,
శ్లో. ఇదం ధర్మ రహస్యంచ తవ వక్ష్యామి భారత- సం. భా- కర్ణ 70-22, 30

**కర్మస్థుఁడు** సం. విణ. (అ.ఆ అ)
కర్మమార్గ ప్రవిష్టుఁడు.
ఆ. పౌరుషంబు సూవె ఫలద మందురు గొంద, ఱనఘ దైవ మిచ్చునంద్రు కార్య, ఫలము గొంద ఱెల్ల ఫలము భూత స్వభావంబ యంద్రు గొందఱమితతేజ.
వ. ఇవి కర్మస్థులతెఱంగులు. శాంతి. 4. 67 68.

**కర్మాధికారి** సం. విణ. (ఇ. జీ. ఇ)
స్వర్ణకారుఁడు, శిల్పకారుఁడు.
వ. (ధర్మజుఁడు) కర్మాధికారులం గలయంగనుంగొని యజ్ఞంబునకు వల యునట్టి భాండ ప్రముఖంబులయిన సాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణ మయంబులుగా వేగంబ చేయింపవలయునని నియోగించిన. అశ్వ. 3.218.

**కర్మానురూపము** సం. విణ (అ ఆ అ.)
పూర్వ జన్మమునందుఁ జేసిన పాప కర్మములకుఁ దగినది.
వ ... గర్భాధాన వేళయందును బిండావస్థ యందును బ్రసూతి మాత్రంబునను...వార్ధకంబునం గర్మానురూపంబగు నాశంబు శరీరమునకు సంప్రాప్తంబగు. స్త్రీ 1.35.

**కర్మారుఁడు** సం. వి. అ. పుం.
కమ్మరవాఁడు.
వ. ... పురిగల వైశ్యశూద్ర శిల్పి కర్మారతక్షక క్షౌరక స్వర్ణకారకరణకారులమ్మహీపతి బలసి చనిరి. స్త్రీ. 1.104

**కర్మి** సం. విణ. (న్. జీ. న్.)
కర్మములు చేయువాఁడు.
కం. తాత్త్వికములైన పురుష, స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవునకా, తత్త్వమున నహంకృతి గర్మిత్వ మొలసి కార్య విధమ మెయికొనుచుండున్. అను. 5.187.

**కర్మిత్వము** సం. వి అ. న.
కర్మము. చూ. కర్మి

**కర్మిష్ఠత** సం. వి. ఆ. స్త్రీ.
పనియందు నేర్పరి తనము.
సీ వెలివెలి వస్తువులే విడిచెఁబో

నరుఁడు గర్మిష్ఠతంగాదె శరీరయాత్ర, నడపు వారది మోక్షణంబు గానేరదు. శాంతి. 1.85.

**కర్మిష్ఠుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
క్రియయందు సమర్థుఁడు, పనియందు నేర్పరి. చూ- కర్మిష్ఠత.

**కర్మేంద్రియము** సం. వి. అ. న.
వాక్పాణి పాయూపస్థములలో నొకటి (వ్యతి. జ్ఞానేంద్రియము. చక్షురాది) శాంతి 2.285.

**కర్శనము** కర్పనము, కరిసనము.
సేద్యము, కృషి
కాపు లావు వెరవుగల్గి కర్శనముసే, యంగ వృష్టి దగినయట్లు గలుగ, ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై,వంబు తోడుపాటు వలయునెందు. సౌప్తి. 1 31.
ఈ సంఖ్యయందు ఈ పదము ఆనంద వారి ప్రతియందును సంశోధిత ముద్రణము నందును 'కర్శనము' గఁజూపఁబడినది. శబ్దరత్నాకర కారుఁడు కర్సనముగాఁ దీసికొని ఈపద్యమునే ఉదాహరణముగ నిచ్చెను.

**కర్శితము** సం. విశ. (అ.ఆ.అ)
కృశింపఁ జేయఁ బడినది, పీడింపఁ బడినది.
వ. ... ధృతరాష్ట్రి పాలికిం జనిన నమ్మహీపాలుండు పాండవుల కుశలం బడుగుటయు నవ్విప్రుండు వారేవురు ననవరత శీత వాతాతప కర్శితాంగులై బహుదుఃఖ సాగరంబున మునింగి యున్న వారనియు. అర. 5.326.

**కర్షకుడు** సం. విశ. (అ ఆ.అ).
దున్నుకొని బ్రదుకువాఁడు.
క. విను కర్షకులును వణిజులు, ననఘా గోరక్షకులు ధరాధిపునకున్ ధన మొదఁగూడెడుచోటుల,నీనేక విధములకు నెల్లనాద్యస్థలముల్. శాంతి. 2-381

**కర్షణము** సం. వి. అ. న.
1 దున్నుట
సీ. కర్షణక్రియ భూమిఁ గావింతుఁ జాయయుఁ గృష్ణంబు గావునఁ గృష్ణుఁ డనియు. శాంతి. 6.432.
2 లాగుట.
శా॰ (వాలిసుగ్రీవులు) బాహాబాహిని బోరు నప్పుడమరెం బ్రౌఢద్విపద్వంద్వహే, లాహస్త ద్వయ గాఢ కర్షణ రణోల్లాసంబు విస్పష్టమై అర 6.384

**కర్షము** సం. వి- అ. పుం.
(విల్లు లోనగు వానిని) లాగుట
మ...మహాస్త్రంబునుం దొడివి కర్షంబు బ్బునం జేయుచున్. కర్ణ 3.358.

**కర్షితము** సం. విశ (అ. ఆ. అ)
ఈడ్వఁబడినది, లాగఁబడినది.
కం. కర్షిత రిపులన్యోన్యా, కర్షణ సంకర్షణాపకర్షణాపకర్షణముల సా, మర్షులయి పెనఁగి రాహవ, హర్షం బునఁబవన సుత బృహద్రథ పుత్రుల్ సభా 1. 203

**కర్సనము** చూ. కరిసనము.

**కఱ** దే. వి.

నలుపు

సీ. కఱలేని హిమరశ్మి కాంతిదాల్చి. ఆది. 5. 15

(కడలేని అని కొన్ని ప్రతులు)

**కఱకంఠుడు** (సం గరకంఠః)

నీలకంఠుడు, శివుడు

కం. ఎఱుకనియెఱుగక నిన్నున్, మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము నెఱి నెవ్వరి కెఱుఁగనగునెనీ చరితం బుల్. అర. 1.827, సౌప్తి 1.121.

**కఱకు** వై విశే. (సం కర్కశః).

కఠినము, క్రూరము, పరుషము బిరుసు

ఆ. కఱకు దర్పహారి పఱపులు బిషాన్న, మశనమట్టి వారినతిముదము న, నాదరించెఁ బ్రీతి నాది గిర్భేశ్వరి, యయ్యు నేవగింపదయ్యెఁ గృష్ణ. ఆది, 7. 231

ఆ. అగ్నిశిఖయుఁ బోలె నంటను, రాయను, జూడరాని యట్టి శుభ చరిత్ర, నెఱుకలేని కఱకు బెఱుక పేక్షించెఁ గా దనః తనకు నాయు వల్పమైన. అర. 2.60.

**కఱగోఱు** దే. వి.

లోపము, లోటు

చం. తఱిమి సుశర్మ తమ్ములును దానును నాజికినన్నుఁ బిల్వనే, నెఱఁ గనియట్టు లుండుటిది యే పురుషార్థము వారినెల్ల నే, డ్రైఱ నుఱుమాడ బంపుము వడిందిగఁ జూడకు నీకు నేమియుం, గఱగొఱగాదు పోమి కడు గష్టమునాకు నదాత్తమానసా ద్రోణ. 1.22:.

**కఱచు** దే. స. క్రి,

1. కాటువేయు, కొఱుకు.

గీ. తాఱఁగు వోకుండ మెకములు గఱవకుండఁ బాఁడి దఱుగకయుండ నాపాటిగొల్ల, లిచ్చమెచ్చ నీదృష్టికి నెక్కఁగడపు, నరయనేర్తు నన్నేలు ము ధరణినాథ విరా, 1.279.

కం జనపతి పంపఁగ సారథి ఘన విష కృష్ణోరగములఁ గఱపించె. ఆది 5,175., అను. 1.14.

కం. అఱచినఁ బఱచిన ప్రేళులు. గఱచిన వతఁడించుకయును గరుణిం పక యం. దఱ నుఱుము సేసె సౌ. 2.7, ద్రోణ 3 163.

2. నాటు, గ్రుచ్చుకొను, తగులు, తాఁకు

కం. అతిముతి ప్రేసినఁ బలకం, గఱచిన సైంధవుని యలుఁగుఁగని నరసుతుఁడే, డ్రైఱ మురిసిన. ద్రోణ. 1. 178.

3. పండ్లమున్నగు వానితోఁ బట్టు కొను, గ్రహించు.

వ.......ఇది భూమి పయిం బడిన నిమ్నునులకు బాధయగునని దానిం గఱచుకొని గజ కచ్ఛపంబులం గరం బుల నిడికొని గరుడుండు గగనంబు నం బఱచి ఆది. 2.7. ఆది. 8 273

కం. నకులము నులూకమును బో,

కకు సంతసమంది యుండి గ్రక్కున
నమ్మా, షికమయ్యురి చేరులు గొఱు.
కకయలసత నల్లనల్ల గఱచుచు
నుండెన్. శాంతి. 3.210.

**కఱచు²** దే. స. క్రి.
నేర్చు, అభ్యసించు, తెలియు
సీ. వేదంబులును ధనుర్వేదాది
విద్యలు గఱచుచు గడలేనియెఱుకఁ
దనరు ఆది. 8. 12.
కం. ఎఱుకగలవారి చరితలు, గఱ
చుచు సజ్జనుల గోష్ఠి గదలక ఆది.
?. 208
సీ. కలకంఠముల చేత గఱచిన
విద్య పీఁణలకిచ్చు. నట్టి తిన్నని యె
లుంగు. విరా. 2.67. ద్రోణ. 1.84.

**కఱటి** దే వి
మూర్ఖుడు.
కం. మఱవినఁ దలఁపింపఁగనగు
నెఱుఁగని నాఁడెల్ల పాటనెఱిఁగింప
నగున్ః మఱి యెఱిఁగి యెఱుఁగ
నొల్లని, కఱటిం దెలుపంగఁ గమల
గర్భుని వశమే ఆది. 4.72.

**కఱతలు** దే. వి బ.
దుశ్చేష్టలు, పోకిళ్ళు, మాయమాటలు,
కం. నరుడనుఁగు బంటు గావునఁ
బొరిగొనఁ జొర నీవు సూతపుత్త్రుఁ
డొకఁడు మా, ర్తుక మార్కొనియెడు
నతనికి, వెరవుచు గఱతలును లేవ
పీనుంగుటన్. ద్రోణ ?. 2. 6.
(దీనికి పాఠాంతరము గరుదులు,
గరదులు, మరవులు, గలవుగాని 'కఱద
అనుపదము యుక్తమేమో యనిపించు
చున్నది).

కఱదలు=మాయమాటలు సూ. ఆ.
ని. మాయమాటలు అనునర్థమే
యిక్కడ సమంజసముగా నున్నది.

**కఱపించు** దే. స. క్రి కఱవఁజేయు.
1. పండ్లు మున్నగు వానితోఁబట్టి
కొనఁజేయు.
ఆ. వెఱచి తల్లిఁ దోఁకఁ గఱపించు
కొని దివి, బఱచు వానిఁజూచి పార్థుఁ
డలిగి వాని తల్లి శిరసుతోన తత్పు-
చ్ఛంబు, దునిసియగ్ని శిఖలఁ దొరఁ
గఁజేసె. ఆది. 6.278.
2. కాటువేయించు, కొఱికించు.
సీ. విషమిడి పెనుఁబాముంఁ గఱ
పించి నీరిలోఁ గట్టి త్రోచి, లక్క
యిల్ గాల్చి. ఉద్యో. 3.356.
శల్య. 2.78.

**కఱపు** దే స క్రి. (√కఱచు²)
బోధించు. నేర్పు.
వ. ఉత్తమ కన్యాజనమునకు
నృత్తముగఱపంగ నాకు నేర్పుగలదు.
విరా. 1 88.
కం. ఇతఁడు మదీయాగ్ర పురోహితు
డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్,
ధృతరాష్ట్రు కడకుఁ బనుపుఁడు,
చతుర వచన రచనఁ గఱపి సంప్రీతి
మెయిన్. ఉద్యో. 1.33.
సీ ద్రోణ గాంగేయులు దురిత విహా
రుచు నన్నెద్ది గఱపిరి నెమ్మితోడ,
దానినచేయుట ధర్మువు. ఆది. 8.43.
2. ఎఱిఁగించు, తెలుపు.
క. ఎఱిఁగెడు వారికినైనను, గఱపక
తక్కరువిత ప్రకారము శుభముం,

గొఱలు హితులౌట నం, దఱకును
జెప్పంగ వలయుఁ దగియెదు బుద్ధిల్‌·
విరా. 1.116.
ఆ. భూతలేశ నన్నుఁ బు త్తెంచి
రిప్పుడు తద్భయంబు లెల్లఁ దలఁగు
నట్టి, మంత్రతంత్రవిధు లమర్చి యే·
మఱకుండు,నతి నిరంతరంబు ననియు
గఱప. ఆది. 2.180.
వి.
బోధనము, దుర్బోధనము.
ఆ. అధిప పాండుసుతుల కరయంగ
నతికాంక్ష. లేదు లుబ్ధబుద్ధి నీదు
సుతుఁడు, శకుని కఱపు విని య
సన్మార్గ వృత్తికిఁ జొచ్చి యిట్టియెదరు
దెచ్చికొనియె. భీష్మ. 1. 80.
క. నీ కఱపుల నిక్కురుకుల,
మాకుల్యముఁ బొందుటేమి యాశ్చర్య
ము సౌ,మ్యా కృతులుగాని వారల
వాకులు శిక్షలు నుపద్రవంబులు కావే.
ఆది. 8.41 , శాంతి. 3.76.

**కఱవు** దే వి.
దుర్భిక్షము, క్షామము కాటకము.
కం. కఱవు పయిఁ గఱవు పొరయుచు
వెఱపుపయిన్ వెఱపుదోఁప...శాం. తి.
4.72.
సీ. వహ్నియు భయమును వఱపును
గఱవుమ వాదిగాఁ గల యెగ్గులదఁగెఁ
బుదమి సభా. 1 271.
విశ.
అలభ్యము.
చం. తేరికి బృహన్నల సారథియైన
దీనిన,వ్వరె పురిలోన నింతకఱవా రథ
చోదకు లింతయేటికిన్. విరా. 4.20.

**కఱి** దే, విశ.
నల్లనిది.
సీ. ... విను జ్యేష్ఠఁదగఁ గఱివేము
గూర్చి. అను. 2.378. అను.
3.189.

**కఱియ** దే. విశ.
నల్లనిది.
ఆ. కఱియ జీలకఱ్ఱ కఱివేము గురు
జయింగువ ప్రవర్జనీయ కోటియగుట.
అను. 3.189.

**కఱియ జీలకఱ్ఱ** దే. వి
నల్లజీలకఱ్ఱ చూ కఱియ

**కఱివేము** దే వి.
కఱివేపాకు, కృష్ణనింబము
చూ. కఱి, కఱియ

**కఱ్ఱి** దే. వి.
అర్జునుడు
ఆ. కఱ్ఱి విక్రమంబు గాల్పనే యిట్లు
బ, న్నములు వడిస ధర్మనంద
నుండు, నేను రాజరాజు పీనుంగుఁ
గన్నారఁ గానఁ బరయ మైతిమేని
కృష్ణ. ఉద్యో. 3.117.

**కల** దే వి
1. స్వప్నము
ఇంద్రియములు ఉపరతి పొంది
నపుడు సంకల్ప స్వభావమైన మన
స్సునకు ఉపరమము ఉండదు. అట్టి
స్థితి కల.
కఁ. క్రమమున నింద్రియములు లీ.
నములగునది నిద్ర కల యనం ద

ర్వంసాస్కారము మిథ్యావిషయ ప్రాప్త మగుట యప్పుడును దేహి దా సాక్షి యగున్. శాం. 4. 324. చూ. 325, 326. 327. చూ. స్వప్నము

సీ..... సాంగవేదవేది గీ॥ యర్థిఁ గలవచ్చి వాత్సల్య మతిశయిల్ల నస్మదీయ ప్రణామంబు నాదరించి, తుష్టిదీవించి కరుణార్ద్ర దృష్టిఁజూచి, యెలమి నిట్లని యానతియిచ్చె నాకు. విరా. 1. 10. శాంతి. 1.225; అర. 2.101.

**కల²** అవ (√కలుగు)

1. భవిష్య దర్థకము

చ. వనమున కేగి యందు సుఖవాసత నుండఁగలార. అశ్వ. 4.192.

కం. గెలుపయ్యుధిష్ఠిరునకును గల దెఱుఁగుదు. ఉద్యో. 4. 50.

2. సమర్థతను దెలుపును.

తే. పోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను. సభా. 2 174.

మధ్యా:– కడఁగి చేయంగల దానిఁ జేయునుగాక కర్షకుఁడు. అర. 1.285.

వ. ... అర్జునునిచేత నిర్జింపబడిన యుత్కృష్ట జాతు లనేకులగుట యెఱుంగుదుర కాదె మనుష్యులతని కెంత పెద్ద యిట్టి జెట్టి వెమ్మదన్ని చూడఁగలవాఁడు గావున మముబోం ట్లెల్లఁబోక పెనంగినం బోరు భరం బైనం బ్రాణంబులపై వచ్చునంత కంటెను బరమ దయాపరుండైన పాండవాగ్రజు మఱువు సొచ్చి బ్రదుకుందనుము. ఉద్యో. 2.244.

4. అ స్వార్థకమగు 'కలుగు' ధాతువునకు వర్తమానార్థ మందుఁ లట్టుపరం బగునపుడు వచ్చు ఆదేశము.

విణ.

ఉన్న.

వ... పరాక్రమ వంతులైన తమ్ములు గలవాఁడు రాజ్య ప్రతిష్ఠితుండయి వృద్ధుల నమాత్యుల బంధు మిత్రులను దొల్లింటి కంటె మిక్కిలిఁ బూజార్హుల నెల్లంబూజించు. ఆది. 6.121.

తరువోజ:– లావును గలవారలకు నవసరము లలిత యశంబుఁ గళ్యాణంబుఁ బడయ. ఆది. 7 19.

ఆ. గురుఁడు పడిన యపుడ సైన్యము లఁగల వారణాశ్వ సుభట వర్గములును బడియె. ద్రోణ. 1.91.

ఇది తద్ధర్మార్థమందును గానఁబడు చున్నది.

మ. ... ఇట్టిదిం, గలదే. ఉద్యో. 3. 95.

మ. కలదే యిమ్మెయి పౌరుషంబు జగతింగారుణ్య మేపారఁ ని,ప్పులు గిట్టిచ్చునె మేము. శాంతి. 3.325.

ఆ. ... కర్ణుఁడిందుఁ గలఁడు వీని కెదురు గలఁడని యెన్ను మా,ధర్మ పుత్రు పాం ధరణినాథ. ఉ. 2 212

**కల³** సం విణ

మనోజ్ఞము.

చం. జలధివిలోల వీచికా లసత్కాం

కాంచి సముచితావనీ, తల వహన
క్షమంబయిన దక్షిణ హస్తమున. ఆది.
8 144.

**కల**[4]. సం వి. ఆ. (స్త్రీ)

1. రేఖ

కం... పింఛప్రప్రస్ఫురదరుచిర బలో
రగ, విస్ఫురద దీధితి కలాప వేష్టిత
మౌళీ. భీష్మ. 3 453.

2. చతుష్షష్టి విద్యలలో నొకటి సభా.
1. 4, విరా. 2.161.

చూ. కళ

3. భాగము (కాలము) చూ కాలకల
చూ. కళ

**కలంకము**
**కళంకము** } సం వి. అ పుం.

పాపము కల్మషము

ఉ. వినిర్ధూత కళంకు......శరణా
గత రక్షకు నాశ్రయించెదన్ ఉద్యో.
2. 330

2. దోషము, తప్పు

కం, దురపిల్లకు మయ్య మది విధూత
కళ-కా. శల్య 2.375.

వ. నిహత పాప కళంకుఁడైన యా
శంకరు పఙక్తులక్ష(పాప కళంకుఁడు
= పాపములను దోషము గలవాఁడు)
ద్రోణ. 2. 165

3. మలినము

తే పరఁగఁ బాపకళంక లేపంబు
వాయ. శాంతి 3.331.

**కలఁక**
**కలంక** } దే వి (√కలఁగు)

1 వ్యాకులత, సంక్షోభము

తే. పుత్రశోకాపహంబును బుణ్యత
మమునైన యాఖ్యానమున నాదుమాన
సంబుకలఁక యంతయుఁ బాసె...
నివర్తిల్లుమంద నీదయఁజేసి. సంయ
మి వరేణ్య. ద్రోణ. 2 212., విరా.
2 113.

వ. ... అవశ్యంబు మీకుం గర్ణసార
థ్యంబు గర్తవ్యంబు గాఁగలయది
సమర సమయంబున నిరాకరించి
పలికి కర్ణు చిత్తంబునకుం గలక
పుట్టించి పార్థు రక్షింప వలయు,
ఉద్యో. 1.110.

2 ఆవిలత, కాలుష్యము

కం. విను మానస ప్రసన్నతఁ, దనుఁ
గనుపురుషుండు గలుషతంగానఁడుదీ,
జీన నీట రూపుసూడఁగ, ననుచై కలఁ
క నదిలేని. యట్టుల పోలెన్. శాంతి.
4.165.

3. భయము, జంకు.

సీ. బంధుల కగపడ్డఁ బాయునన్వయ
మను కలఁకమైఁ జెమటలు గ్రమ్మ
దేర. విరా. 3.70.

4. దుఃఖము, విచారము

వ. గౌతమీలుబ్ధక భుజంగ మృత్యుకా
ల సంవాదం బను నియ్యితిహాసంబు
తాత్పర్యంబు మనంబునం బట్టుకొల
పియాపుట్టిన కలంకం దొలంగఁజడిసి
శమంబున సుఖివిగమ్ము.ఆను 1.42.

4. దురితము

ప్రహరణ కలిత వృత్తము-ఇది యిటు
లగుటఁగ్లెటిఁగి పలికెనా విదురుఁడు

సభ గోవిదులు వొగడఁగా,నది విని
యును నేనదపన దురితం, బొదవెఁ
గలఁక సేటొల యకుడుగునే. స్త్రీ.
1.185.

**కలఁకదేఱు** దే అ. క్రి (కలఁక + తేఱు) ప్రసన్నతనొందు, అవ్యాకుల మగు.

కం. అనవుడు నప్పలుకులు విని, తన చిత్తము కలఁక దేఱి ధర్మత నూజుం, దనుజన్ముం దెసఁ జూచిన ననిలసుతుం డిట్టులనియె నాతని తోడన్ విరా. 1.55.

**కలఁకు**
**కలంకు** } దే. వి.

1. కలహము

సీ. కలఁకులందుఁ-తే-బుట్టినప్పుడు గాఁడీవి భుజబలంబు, దలఁతురా· ఉద్యో. 1.278.

2. కలఁత

కం. అని యూఱడిల్లఁ బలికిన, విని యతఁడు గలంకుదేఱి విభుఁడుండా నుం,జని సంగ్రామోత్సాహంబునఁ బొదలిరి తూర్యఘోషములు దివి ముట్టన్. ద్రోణ. 2.300

**కలంకుదేఱు** దే. అ క్రి. (కలఁకు + తేఱు)
ప్రసన్నత నొందు, అవ్యాకులమగు. చూ. కలంకు 2వ ఉదా.

**కలఁగఁబడు** కలంగఁబడు, కలఁగం బడు; కలంగంబడు (√కలఁగు- స్వార్థమునపడు) చెదరు, తాఱుమా అగు

కం. శరముల వేగంబున గద, వరుస దనంబునను గలగబడి చేష్టదనా కరులందోలెను భీముఁడు భీష్మ. 2.215.

గీ కాలముల కిడుకతమునఁ గలఁగఁ బడిన, వేదముల నీవు నాఁడును వినులబుద్ధి నంచితవ్యాస మొందించి యఖిల దివిజ, మునిగణముల కొనర్తు సమ్మోదమనఘ శాంతి. 6.527 విరా 4 62; ద్రోణ. 4.5 భీష్మ 3.266

**కలఁగఁబాఱు** కలంగఁబాఱు, కల గంబాఱు, కలంగంబాఱు. దే. అ. క్రి (కలఁగన్ + పాఱు) కలఁగు
1. చెలరేఁగు

వ. ధార్తరాష్ట్రులం దమకు బ్రదుకు తెరువైన నాపలుకులు పట్టుదురు పట్టక నీతలంచిన చందమునం దులువలై కలఁగం బాఱిన వారు నాముందఱ నిలువంజాలుదురే. ఉద్యో. 3.248

2. వ్యాకులపడు, సంక్షోభము చెందు

ఆ. సూతుశవముతోడ నే· తెంచు నెరవులు, దవ్వు దవ్వులన యుదగ్ర రూప, కలితుఁడైన భీముఁ గనుఁగొని నదవక. నిలిచి రంతనంత గలఁగ బాఱి. విరా. 3.27. చూ. 27., ఉద్యో 2.158

3 చలించు, పోవు, నశించు (ముక్తుఁడు) చ......ఎయ్యది యెట్లయినం బ్రశాంతి సం, పద నొక యింతియుం గలఁగఁబాఱక యుండఁ డె నిర్వికారుఁడై ... శాంతి 6 202.

**కలఁగించు** దే. స. క్రి కలఁచు, కలఁబెట్టు, క్షోభ పఁజేయు.

చ. నను విను కీచకాంతక మనంబున
ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చియ, మ్మొన
గలఁగింపకిట్లు కురుముఖ్యుడు ధర్మ
సుతుండు గారవిం, చిన జతనంబు
నిష్ఫలము సేయుదునే నరుఁడున్
సుభద్రయుం, దనయుని గాంచి
సంతసము దాల్చుట యంతయు రిత్తఁ
బుత్తుపే. ద్రోణ. 2.10.

2. ముఱికి చేయు

కం. ద్వారవతి నొక్కనూతం, బోర
పుఁదను వక్కజమగు తొఁద నొక
ట న, చ్చేరువ మెలఁగు జనులు గని,
నీ రిది గలఁగించు నిట్ల నిలిచిన
యేనిన్. అను. 2.418.

**కలఁగు కలంగు** దే. అ. క్రి.
వ్యాకులపడు, క్షోభపడు, కలఁతఁ
జెందు.

ఉ. అప్పుడు ధర్మసూతి హృదయంబు
గలంగ లలాటభాగముం, గప్పఁగ
ధర్మవారి యధికంబగు రోషము
నొంది. విరా. 2.147.

చం. ... నన్నుఁ గే,వలమున ముట్ట
నెవ్వరికి వచ్చుననుం గలఁగున్ వెనుం
బడున్. విరా. 2.104., విరా.
2.298.

2. బెదరు, చలించు.

కం. నడపింపఁగ బొడిపింపఁగ, నెద
మదువైన కలఁగి నప్పు దేర్పఁబుపఁగ
నేఁ, గడు నేర్తుఁబేర్పునా దగు, కడి
మియ నీ సైన్యమునకుఁ గొసెనగాదే.
ఉ. 4.214 ద్రోణ. 3.114.

3. ముఱికి చెందు, కలుషమగు.

కం. కలఁగిన పెద్దమడుపు విను,
తెలివిఁ బొరయునెట్లు దానధీరుండట్ల,
గ్గలములయిన దురితంబులఁ, గలఁగి
యుఁ దనయంత దేలుగౌరవమొప్పన్.
శాంతి. 3.34.

4. కలహించు, పోట్లాడు.

కం. గురుఁడును నీవును మద్రేశ్వరు
డునుగర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడు
ననున్, ధర యేలింపఁగ నున్నా, రరు
మీకుందగునె సంగరములోఁ గలగన్
ద్రోణ. 5.111.

**కలచిఁయాడు** / **కలంచియాడు** దే. స. క్రి. (కలఁచి + ఆడు స్వార్థమున)
కలఁచు, క్షోభపెట్టు.

గీ. ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ
గలఁచి, యాడి భీష్ముని దెసఁబోవు
క్రీడిఁదాఁకె. విరా. 5.168. కర్ణ.
1.6.

**కలఁచు** / **కలంచు** దే. స. క్రి. (√కలఁగు) కలఁగఁజేయు.

1. వ్యాకుల పఱచు, క్షోభపెట్టు.

సీ. రాజిత బహువిధ రథసమూహముఁ
జొచ్చి, గలిబిలి యగునట్లు గలఁచి
కలఁచి. విరా. 5 58.

కం. పదునొకఁ డక్షౌహిణులను,
బదురున నడిపింతు నెదిరి సైన్యముఁ
గలఁతున్. ఉద్యో. 4.409.

గీ. అదియుఁగాక వేఱొక్కండు
మదిఁగలంచు, చున్న యది దాని
నేర్పడ విన్నవింతు. శాంతి. 1.6.,
భీష్మ 2.210.

2. త్రొక్కు, తిరుగవేయు

వ. వెడపదనికి రొంపి గలంచి వరు
ఱులు పదిలంబుగా నమర్చిన కేదారం
బు తెఱంగు దోఁచుటకు సీడై. విరా.
5. 69

**కలకంఠము** సం. వి అ. పుం

కోకిలము

సీ నీలకంఠముల చేత గఱచిన
విద్య పిౘలకిచ్చినట్టి తిన్నని
యెలుంగు. విా. 2.67.

**కలకల** దే. వి

నవ్వుటయందగు ధ్వనికి అనుకరణము
కం......ఎవ్వరాకో యీ, పిఱికి
తనమింత యలవడఁగఱపిన వారనుచు
శార్ఙ్గి కలకల నవ్వెన్. ఉద్యో. 3.57.

వ. కపటపు నెత్తంబు నెపంబుగా
మిమ్ము వెడల నడచు నప్పుడు దుర్యో
ధన దుశ్శాసన శకుని సూతనందనులు
పుయిలోట దక్క కలకల నవ్వుచుం
బలికిన పలుకు లుగ్గడింప వచ్చునే.
ఉద్యో. 3.32.

**కలకలము** సం. వి. అ. పుం

గుంపునందు పుట్టిన పెద్దమ్రోఁత;
అలబలము

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలది
వియలు, గొనుచు నులివు మిగులఁ
గూడఁబాఱి, నృత్తశాలఁ జొచ్చి
రత్తఱి నా కల, కలమెఱంగి కీచక
వ్రజంబు విరా. 3.4.

వ..... పిడుగట్టి పిశాచనిశాచరులు
నలిరేఁగి రక్తపానంబును మాంస
ఖాదనంబునుం జేయుచు మోదంబునం
బొందుచు నాడుచుం బాడుచుండు
కలకలంబునను. ద్రోణ. 2.187.

**కలగనినట్లు** దే జాతి.

ఏమియు జరుగని విధమున

తే (కుంతి)గూఢ మందిరాంతరమునఁ
గొడుకుగంటి.

కం. కని యేటిలో నిడితిఁ గలఁ, గని
నట్లయి యుండెఁ దత్ప్రకారంబు. ఆశ్ర.
2.104.

**కలఁగుండు** దే. వి. (కలఁగు ధాతువు
యొక్క భావార్థక రూపమగు
'కలఁగుడు' అనునది వ్యత్యయము
చేత నీరూపము నొందియుండును.
ఆని. సూ. అ ని.)

1. కలఁత, క్షోభము.

ఆ. చేది మగధ కేకయాదిసేన, లెల్ల
బెదరదరఁ దల్లడ పడఁగల, గుండు
గొనఁగఁ జేసెఁ గుంభజుండు. ద్రోణ.
1 298.

కలగుండుగొను=క్షోభపడు, కలఁత
నొందు.

2. నిశ్చేష్టత;

వ....పాండవ సైన్యంబు దైన్యంబు
నొందియుఁ గలగుండు, గొనియు
బెండు వడియుఁ గలఁగం బాఱియుఁ
దొలఁగం దెరలియుం గోలాహల
బహుళంబుగుట గనుంగొని గోవిం
దుండు. భీష్మ. 3.247.

కలగుండుగొను=చేష్టలుడుగు.

**కలగుండుగొను** దే. అ. క్రి.

చూ. కలగుండు.

**కలగుండుపడు** దే. అ. క్రి.

కలఁగు, క్షోభపడు.

కం. నిజ సింహనాదమున న, గ్గజము
లుగుండియలు వగిలికలగుండువడన్,
విజయాగ్రజుఁ డిట్లేచి ది, విజవర్గము
పిచ్చలింప విస్ఫురితగతిన్. భీష్మ.
2 20'.

**కలగుండుపెట్టు** దే. స క్రి.
క్షోభపెట్టు, కలఁచు
సీ సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడు
ను దానుఁగురుసైన్యములఁ గలగుండు
వెట్ట భీష్మ. 5 64.

**కలగొనఁబాఱు** దే. అ. క్రి.
అంతటను పడువిడు, సర్వేసఁను
పరుగులిడు.

ఆ. కడుపులోననుండి కలగొనఁ
బాఱెడు, విబుధవైరి గుడుఁదు వెడం
కుండు,నట్లుగాఁగఁ దెరువులన్నియు
మూసి....అంగ జన్మరిపుఁడు శాంతి.
6.472.

**కలగొను** దే. అ క్రి (కలఁక + కొను)
క్షోభించు, వ్యాకులపడు, గగ్గోలుపడు.
గీ. పక్షిమృగ జాతులెల్లను భ్రమసి
యిట్టునట్టుఁ గలగొనఁ జెడిరె విరా.
4 183.

**కలగొను**2 దే అ. క్రి.
చెలరేఁగు, అతిశయించు.

కం. కలగొన రాజస తామస,ములయి
న భావములు వికృతిఁ బొందింపం
గ మ,రుద్దలకే కాంతిక వృత్తిని, నెల
కొనగా నెట్లు వచ్చు నిర్మలధిషణా.
శాంతి. 6.50'.

2 వ్యాపించు, ప్రోవులుగట్టు, గుం
పులుచేరు

కం. వినుకూడు గూరపాకము, గనుఁ
గొని ప్రోయివాపి డింపఁగానప్పుడ
సం, జనితములై ప్రువ్వులు గల
గొన మిలమిల మెదలునందుఁ గురుకు
లముఖ్యా మౌస. 21.

3. ఇంపగునట్లు.

వ...... మేలుకని యెలుకలు వొదల
విదిర్చి కూర్చికొని కలగొనంబలుకు
పులుగుల యెలుంగుల వలన విరా.
2. 210

**కలధౌతము** సం. వి అ. న.
వెండి

వ. ఇట్లు పట్టణాలంకారంబు సంఘ
టించి రత్నకాంచన కలధౌత మ
యంబులగు కలశంబులఁ దీర్థజలం
బులు దెప్పించి. ఉద్యో 4 157;
విరా. 1.72.

**కలన** సం వి. ఆ స్త్రీ
కలుగుట, కలిమి

చ.......మూర్తి కలన లేక యుండి
యుఁ బరిస్ఫుట పుష్పఫలాది సూచక,
ప్రకరముచేత మూర్తమయి రంజిల
దే ఋతువేళ చూడఁగన్. శాంతి.
6.32. విరా, 2.365; విరా. 5.264

**కలనము** సం. వి, అ. న
చేరియుండుట, ఉండుట

వ...... ఆ దుర్యోధనుండును గదా
కలనంబున నంస పీఠంబు పొలుపార.
శల్య. 2.226.

2. పొందుట, ప్రాప్తి

సీ......అఖిల జనములు ఆహార కలన, తే. మాచరించిరి అశ్ర. 2.65.

ఉ. సత్త్వరజస్తమో గుణ వశస్థితిఁ గేవలపుణ్య మిశ్రకా, రిత్వ విరుద్ధ కర్మములఁ బ్రేరితమైనను మూర్ధ్వ లోక సే, విత్వము మానుషత్వ పదవీ కలనంబును రౌరవంబునా, తత్త్వము దన్నెఱుంగమి ప్రధానము చేతల నావహిల్లినన్ శాంతి. 6.101

3. చేయుట.

కం. ఫలముల యెడ బ్రహ్మార్పణ, కలన పరుండగుచుఁ గార్య కర్మము నడపన్ వలయుం. భీష్మ. 1.202., శాంతి. 1.69.

తే కర్మసంత్యాగ కలనంబు కార్య మిప్పుడను వినిశ్చయ మొందెనీ మనము. మహా. 4.

4. కూర్చుట, చేర్చుట.

కం. తాన సుతుఁడగుట దెలియం, గానగు మను లాత్మవీర్య కలనం బెవ్వో, నైనం జేయఁగ మునిభావా నూనత ఋశ్యశృంగుఁ డాదిగఁ గనుటన్. శాంతి. 5.505.

5. కూర్పు, రచనము.

వ నాలుగు ముఖములు నీకు,న్నాలన యన కలుగఁ గారణం బేమి మధు, శ్రీలాలిత్యాస్పద వా క్యాలీకలనమున నాకు నానతి యీవే అను. 4.424.

6. కార్యము.

కం. తిల పాయస ఘృతములు పితృ, కలనములకు నుత్తమములు. అను. 3.196.

**కలను** దే. వి. బా.

ప్రదేశము.

కం. ఇంటం దెవులునఁ జచ్చుట, కంటెను బాపంబు లొండు గలవెన్న వులకున్, బంటకలను పొలికలనిది, గంట నిధానంబుగ గ్గటగాదే మనకన్ భీష్మ. 1 99.

ఆ. ఏబలంబు దినకునెక్కుడు గలి గెన,బ్బలము నేలపోరు కలనుగాఁగ, నినుఁడు సీతు గాలి వెనుకగా మొనన ద,పించిపోదువ సంభవించు జయము. శాంతి. 3.6.

2. యుద్ధము.

తే కలను పీనుఁగు పెంట గాఁగఁల యబెరసె. విరా. 3.167.

తే. పాండునందనుల సేన గలనికి నడచు నెపుడు. భీష్మ. 1.119.

చం. గురుఁడును భీష్ముఁడుం గలనఁ గూలుదురట్టి కిరీటి కంక నె,వ్వరెదురు, ద్రోణ 1.102.

**కలప** దే. వి.

ఇల్లు కట్టుకొనుట వంట చేసికొనుట మొదలగువాని కుపయోగించు కొయ్య సామాను.

సీ ... భారవహత్య, దక్షజనుల్ పెక్కు లక్ష లర్థిఁ గదిసియేనని కదఁగిమోవఁగ యాగనిలయంబుఁ గలపయుఁ గలశములను. అశ్వ. 3.158.

**కలపము** దే. వి. (√కలపు)
మైపూఁత, పరిమళ ద్రవ్యములు చేర్చి కలిపిన ద్రవ్యము
సీ. కలపంబులలదిన గంధంబులుగ గూర్చి తనువున నలఁదుదు ననువు. గాఁగ. విరా. 1. 107.

**కలపికొను** దే. స క్రి.
కలియఁజేయు, చేర్చుకొను, తమలో నొకరినిగాఁ జేసికొను
వ. అనిన విని నీపుత్రుండు యుయుత్సుండేను వచ్చెద నన్నుం గలపి కొనుమని పలికిన దానికిం బాండవాగ్రజుండు ప్రియం బొందిన పలుకులు పలుకుటయు, భీష్మ. 1 168. ఆది 8. 88.
2. ఐక్యము చేసికొను
కం. అంతయును దివ్యదృష్టి, క్రాంతియగు మురాంతకుండుఁ గనుఁగొన నమ్మా, ర్త్యాంతరము గలసి కొనియె న, నంతుఁడు మూర్తియందు నరేంద్రా. మౌస. 79.

**కలపు** దే. స క్రి (√కలయు) `కలపు
1. కలియఁజేయు
చ........నీవును జక్కసేసి ప, చ్చడి గలపంగ వెండియును జండి తనంబున వచ్చి వచ్చి పో, రెడు మొనలు. విరా. 5. 186.
2. చేర్చు
తే. ఇంద్రియంబులు మనమునం దిపురఁజేసి, మనసుఁ దిగిచి యహంకారమున నడంచి, బుద్ధిలోన నహంకృతిఁబుచ్చి బుద్ధి, ప్రకృతిఁ గలప దధ్యాన తత్పరత గలుగు శాంతి. 6.117.
వ......పాండవు లేవురుం బాండురాజమహిషి ననుపమటియుంజనియాయాయమనుధృతరాష్ట్ర గాంధారులను గలపి వారల నిరువుర నుద్దేశించి. ఆశ్ర. 1.175., శాంతి. 3.493.,
3. కూడఁగట్టు
......ధర్మతనయుండు దేవవ్రతు నితో.......భవత్తేజ బు నాశ్రయింపెదమని తనవారలం గలపికొని పలికె. శాంతి. 6.2.
4. ఏకముచేయు, కలసి మెలసి యుండునట్లుచేయు.
వ..... అట్టివాఁడనయి యుండియు న ధర్మపరులగు ధార్తరాష్ట్రుల నత్యంత ధార్మికులగు ధర్మనందనాదులతోఁ గలపుటకుం బలు తెఱంగులం బడితి. అశ్వ. 3.44.
వి. కలయిక.
సీ.... పరిభోగమునకు దూషకులైన దొరలు రజస్తమములు. తే. వారి కలపులఁ బడు బుద్ధి నేరకుండి, మన సుతోడ వేర్పడినఁ దానును మనంబునేకముతఁ గార్యము సూచునేనిదుష్టులడఁగుదురు భోగమవ్యయ మగుఁ గుమార. శాంతి. 5.200.

**కలభుఁడు** సం. వి. అ. పుం.
జరాసంధుని సేవించు ఒకానొక యవన దేశపు రాజు. సభా. 1.112.

**కలమరి** దే. విశే. (కలము+అరి).

ఓడయెక్కి పోవువాఁడు.

గీ. రథికునకుఁ గలమరికి సారథియు గర్ణధారుఁడునుబోలె. శాంతి. 5.588.

**కలము¹** దే. వి.

నావ, ఓడ, పరేతము, పడవ.

సీ. కలములై గీలించి గాలికెత్తిన చాపవోలె మిన్నంతయు బూరటిల్లె. ఉద్యో. 4.116.

వ. వననిధి నడునీటఁగలము, ముని గిన బెగడందు చిత్తములు గలిగిన తజ్జనుల క్రియనున్న సేనలు, గను గొన దీవిగతిఁ దోఁచెఁ గర్ణుండంతన్. ద్రోణ. 1.26., అర. 7.45.

**కలము²** సం. విణ.

మనోజ్ఞము, అవ్యక్తమధురము.

చం. జలధివిలోల వీచి విలసత్కల కాంచి సమంచితావనీ తల వహన క్షమంబయిన దక్షిణ హస్తమున. ఆది. 3.144.

చం. ... మహాత్మ యే, యను వునఁ దృష్ణ త్రోపు వడునట్టి సమంచిత చిత్త ధర్మముం, బనుపజపంగ జాలుకల భాషణ పంక్తి ననుగ్రహిం పవే. శాంతి. 5.372.

**కలయ** అవ్య-ద్రు (√కలయు)

అంతటను, బాగుగా, పూర్తిగా; మిక్కిలి, యధికముగా

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని ఉ. 4.189.

చ. కలయఁగ దుర్ని మిత్తములుగాన గనయ్యో మదీయ చిత్తముంగలఁగెడు. ద్రోణ. 2.226.

వ. నారదుం దమ్మహనీయ ద్విజులం గలయం గనుంగొని శాంతి. 1.2.

గీ. బాలుఁ దొక్కండు కొండొక కోలసేతఁ బట్టుకొని యేను రక్కసుఁ గిట్టిచంపి, చులక గావత్తు మీరేడ్వ వలవదనుచుఁ గలయ నూరార్చెఁ దన తొక్కుఁబలుకు లొప్ప. ఆది. 6 260.

**కలయంత** దే. వి.

సమస్తము.

చం...కవ్వడి ... ... తాఁకుపెల్ల దరఁగఁజేసె మింటి కలయంతయు జిట్టలు గట్టు మంటలన్ ద్రోణ. 3.152.

**కలయంపి** దే. వి.

కలాఁపి, స్థలశుద్ధికై గోమయముతో, గలిపి చల్లెడు నీరు, కస్తూరి మున్నగు నవికలిపి చల్లెడు నీరు.

సీ. వరుస నేనుంగులు గురిసిన దాన ధారావళి దగు కలయంపిగాఁగ. విరా. 3.74.

వ......... కస్తూరి కలయంపులను గర్పూరముగ్గులను. శాంతి. 1.564.

**కలయఁబడు** దే. అ క్రి. (కలయన్+పడు స్వార్థమున) కలయు, కూడు, ఎడము లేకుండకూడు.

ఉ. ముందర రాజుఁబుచ్చి బలమున్ గలయంబడి గోవ్రజంబులన్, దండ డివెట్టకుండఁ బిఱుదన్ నడపింపఁగ బంచి విరా 4.184.

**కలయఁబాఱు** దే అ. క్రి (√కలయు) నలుదెసలకు చెల్లాచెదురుగా పరుగెత్తు

వ ఇట్లెసఁగు బహుళ కోలాహలం బున హయంబులు నిభంబులు గట్లు ద్రెంచుకొని కలయంబాఱె. సౌప్తి. 1. 197

**కలయ-బెఱయు** దే. అ. క్రి (√కలయ)

కలయఁబడు, కలసిపెనఁగు

తే దొరలు దలపడ్డ నాహవ దోహలం మున, నుభయ బలములుఁ దమకించి యోర్వలేక, కలయబెరసి భూరేణు వుకతన రాత్రి గాకమున్న యొండొ రువుంఁ గానరైరి. విరా. 3.190.

**కలయు** కలియు దే. స క్రి

చేరు

సీ. పాంచాలి నవమాన పఱచిన తెఱఁగును నయ్యింతి వెనుకరా నద విఁ గలయ, ధర్మజు చన్న చందం బును. ఆశ్ర. 1.118.

2. (రతియందు) కూడు, రమించు.

సీ. ఏనేల యన్యుని నెదలోన,గా మింతుఁ గరిణి యేనాఁట సూకరము గలయు. అర. 6.341.

3. ఏకమగు,ఏకీభవించు,ఒక్కటియగు

కం. ఊరక యుండక పలువురతో రవమెసఁగంగఁ బలుకఁ దొడరు పక మదిం జేరువగల నాగరికులుఁ, దారుఁ గలసి పలుకవలయు ధరణీ శుకదన్. విరా. 1.127.

వ... అతండును ననిలసుతుండును... యున్నతంబు లగు నపసవ్య కరం బుల నాకుంచిత సవ్యబాహా తలం బుల నప్పళించు చప్పుళ్లు గలసి యొక్కరుండ మల్లచఱచిన చందం బునవీతేర. విరా. 2.14; శాంతి. 2.248.

2. ఒక్కచోఁ జేరు

వ. ఇట్లు గట్టనిచ్చి వేయువేఱ రథిక రితురగ దాస దాసీజనంబుల నొసంగి పద్మనాభుండు పాండవులు దానును గలసి సంతసంబున నలరారుచుండె. విరా. 5.379.

**కలరూపు** వి.

1. యాథార్థ్యము, ఉన్నవిషయము, ఉన్నవిధము

వ. మీకలరూపెఱింగి కానియిక్కన్య వివాహంబు సేయనేరము. ఆది. 7.285., ఆది 1.180.

కం. కులమును విద్యయు వృత్తముఁ, గలరూ పెఱిఁగింపు మనినఁ గలఁ గక తన్నుం, దెలియఁగఁ జెప్పెవిప్రుం డలఘు డగు నసురపతియు నవిక్ర తుఁడగుచున్ శాంతి. 3.491.

సీ. జమదగ్నిసుత కృపాశ్రయమునఁ బడసిన విద్య కలరూపు వెలయఁజేయ. విరా. 4.105. (కలరూపు = ఉన్న శక్తి సామర్థ్యములు)

వ ఇట్లు కందర్పదర్ప గోచరుండైన కీచకుండు నిజసహోదరి వలన నక్కోమలి కలరూపు దెలియం దలంచి విరా. 2.39.

(కలరూపు = పుట్టు పూర్వోత్తరములు)

**కలవాఁడు** దే. విశ.

ఉన్నవాఁడు, ధనికుఁడు, భాగ్యవంతుఁడు

కం. కలవాఁడు లేనివాఁడు సబలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుండనఁగా వలవదెవ్వరికైన జనని, కలిమియ యత్యంత సౌఖ్యకరమై యుండున్. శాంతి, 5.278.

2. ఆప్తుఁడు, అండయైనవాఁడు,

ఉ. శాంతనవుండు సర్వకురు సంతతికిం గలవాఁడుగాఁడె ఉద్యో. 3.164.

తే. సేన దమకును గలవారు లేనివారు, ననక తగువారిఁ జెప్పెద నఖిలసమర, పండితుల నేరి వారి నీబలము లేఁడు నడపఁ బాలించి. యభిషేచనంబొనర్పు ఉద్యో.4.107

3 అయినవాఁడు, సంబంధి.

కం. బలిమిమెయి వరుఁడు గన్నెకుఁ, గలవారిఁబొడిచి కరము క్రౌర్యంబున న, వ్వాలఁతుక దుఃఖింపఁగ వారలు వొగులఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా. అను. 2.225.

4. శక్తుఁడు, సమర్థుఁడు.

చ...... అంతలం, తలు వడి వాని నీఁగవలదా విను మాపని కెల్ల బాండుపు, త్రులె కలవారు నీకెటులో దోఁచిన నట్టులు సేయువారు. ఉద్యో 3.201; ఉద్యో. 1 281.

**కలవింకము** సం. వి. అ. న

ఒక తీర్థస్థానము

ఇందు స్నానము చేసిన బ్రహ్మత్వము గలుగును అను. 2.95.

**కలశజుఁడు** సం. వి. అ. పుం.

కలశము నందుఁ బుట్టిన వాఁడు, ద్రోణుఁడు. విరా. 5.4.

చూ ; ద్రోణుఁడు

**కలశ పోతకుఁడు** సం. వి. అ. పుం

కద్రువకొడుకు, సర్పజాతివాఁడు. ఆది 2.4.

**కలశభవుఁడు** సం. వి. అ. పుం.

కలశమునందుఁ బుట్టినవాఁడు, ద్రోణుఁడు. ద్రోణ. 3.78.

చూ, ద్రోణుఁడు

**కలశభువు** సం. వి. ఊ. పుం.

కలశమునందుఁ బుట్టిన వాఁడు ద్రోణుఁడు.

వ. కలశభూ శాంతనవుల్. సభా. 2. 253.

చూ. ద్రోణుఁడు.

**కలశము** సం. వి. అ. పుం. న.

ఘటము, కుండ,

వ. ... కనక కలశంబులం గరతలంబు దడిపికొని. విరా. 5.280.

సీ. జమదగ్ని ... చారునూతన కలశంబున హోమధేనువు దాన పిదికి గారవముతోడ. అశ్వ. 4.276.

**కలహంస** } సం. వి అ. పుం.
**కలహంసము** }

రాజహంస, రాయంచ.

'కలో మధురాస్ఫుట ధ్వనిః. తద్వాన్ హంసః కలహంసః; అవ్యక్త మధుర ధ్వనిగల హంస. దీని ముక్కు కాళ్ళు

జెక్కలు ధూమ్ర వర్ణము గలిగి యుండును.

వ. ... అక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె. కర్ణ. 2.71.
కం. దమయంతికి నలునకు సంగమ కారణ దూతయైన కలహంస. అర. 2.18.

**కలహప్రియుఁడు** సం. విణ.(అ.అ.అ) ఎప్పుడును కలహము నందిచ్ఛ గలవాఁడు.

వ. ఆ సమయంబున నిచ్చలోకి జటామండల కలితుండును గుళచ్ఛాయా సుంచరుండును గలహప్రియుండును నగు నారదుండు...వీతెంచిన. శల్య. 2.218.

**కలహబంధుఁడు** సం. విణ. (ఉ ఉ.ఉ) జగడాల తోఁబుట్టువికము గలవాఁడు, జగడాల యందు ప్రీతిని బొందించు వాఁడు "కలహేషు బన్ధాతి ప్రీతిమితి కలహబంధుః. జగడాలమారి.

చం. ... తనకుంబెయుఁ గృష్ణమృగాజినంబునుం, బలుమఱు పీచుచుం గలహబంధు,డు నారదుఁడాడె వేడుకన్. సభా. 2.81.

**కలహము** సం. వి. అ. పుం.
యుద్ధము

కం. వెలలి బలరిపుఁడు చలమునఁ, గలహమునకుఁ జొచ్చె వృత్రు ఘన బాహుబలం బలవికి మీఱెను దంభ్రవి, మలతవమున జేసి సుకల మనముబు దలకఁన్. ఉద్యో. 1.128; కర్ణ. 2 42

2. జగడము, వివాదము.
కలహప్రియుఁడు, కలహబంధుఁడు

**కలాపము** సం. వి. అ. పుం
1. సమూహము, గుంపు
ఉ. ధ్దామక్రోధ శిఖాకలాప వికటోద్య ద్భ్రూకుటి స్ఫూర్తియై విరా. 8.189.
వ...... కర్మకలాపంబులు సేయుటకు నకులునాజ్ఞాపించి. శాంతి. 1.878.
చం......మనః ప్రియ కార్యకలాప కర్తయన్నను. ఆశ్ర. 2.128.
2. భూషణము
చ... ... క్వణదణు కింకిణీ కలిత కాఁచన కాంచి కలాపమున్ రణ, న్మణి నూపురంబులు. ఆది. 8.178.

**కలాపుఁడు** సం. వి. అ. పుం.
ఒక ముని. ధర్మరాజు సభకు వచ్చిన సుబల మార్కండేయాదులలో ఒకడు. సభా. 1.20.

**కలా(ళా)వంతుడు** సం. విణ. (త్.వతి. త్),
అరువది నాలుగు కళలు తెలిసినవాఁడు. విరా. 2 161.
చూ. కళ (చతుష్షష్టి కళలను)

**కలి** సం. వి. ఇ. పుం
కలిపురుషుఁడు.
వ...... సకల ప్రజాసంహార కారణంబైన కల్యంశంబున దుర్యోధనుండు జనియించె. స్త్రీ. 1.78.
(ఈతఁడు దమయంతిని భార్యగా

గ్రహింపఁజాలనైతి నన్ను కసిచే నలుని బరివరి విధముల వేధించెను. చూ. నలచరిత్ర. అర. 2.56. మొదలు,

**కలికాలము** సం, వి. అ. పుం

కలియుగము. చూ. కలియుగము.

కం. కలికాల చలిత ధర్మము నిలుపంగలయట్టి విష్ణునిం గత్యాకృత్యుం, దలఁతుఁ దురగవాహను మ్లేచ్ఛుల నెల్లం గీటడఁచు శుభ చారిత్రున్. శాంతి. 2.48,

**కలికి** దే. విశే.

మనోజ్ఞము; అందమైనది.

సీ పలుకుల ముద్దును గలికి క్రొగ్గన్నుల తెలివును వలుద చన్నుల బెడంగు... గలుగు నగ్గిరికనుదలఁచి తలఁచి. ఆది. 3 27.

**కలికితనము** దే వి. (√కలికి)

దిట్టతనము; నేర్పు.

గీ. అ తెఱంగున రేఖయు నవ్విధంబు గరువచందంబు నమ్మెయి కలికి తనముః నట్టి చెన్నును సైరంధ్రి యందకాక, కలవె యొరులకు. విరా. 2.67.

**కలిగించు** దే. స. క్రి. (√కలుగు)

కలుగఁ జేయు.

1. చేకూర్చు, ఒనరించు.

ఉ. క్రూరత కోర్చి యించుకయు రోయక పైకొని యెల్ల భంగులన్, వైరులఁజంపి భూప్రజకు వర్ధనముం గలిగించి. భీష్మ. 3.309,

వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని. విరా. 1.87.

2. ఉండఁజేయు, నిలుపు.

(దుర్యోధనుఁడు శల్యునితో) వ... మదీయ జీవితంబును రాజ్యంబును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును సుఖంబును గావింపను నీవ యొడయండవు. కర్ణ. 1.294.

3. ఆరోపించు, లేనిది యున్నట్లు కల్పించు.

కం. ఏపాసమేని లేనిది కాపురుషత నాకనిమీఁదఁ గలిగించిన న,ప్పాపము సేసినవాఁడగు, నాపొలువ యనంగ విందుమార్యులచేతన్. శాంతి. 3.439

4. పుట్టించు, సృజించు.

వ. తలఁపుననవాసుదేవుఁడు గలిగింప నునిలుప నడపఁగా నోపుజగంబులు మరియును క్రీడార్థము, పలువోకలఁ బుచ్చుచుంటఁ బౌరవ నాథా. ఉద్యో. 2.316.

5. వ్యక్తపరచు.

సీ. ... జనియించి యాబ్రహ్మ సకల సృష్టి,కాది భూతములుగ వేదముల్ నాలుగు గలిగించె నపుడు శాంతి. 6.479.

6. ఉద్ధరించు.

చం. అఘఁగఁగనీక శంతమని యన్వయముం గలిగించి శీవ. ఉద్యో. 1.378.

శ్లో. భవతా శంతనోర్వంశో నిమగ్నః పునరుద్ధృతః సం. భా.ఉద్యో. ౬0.9.

7. బ్రతికించు.

సీ. (చిత్రాంగద యులూపితో) పతికి నిమ్ము. తే జీవమాంద్రురఁ బెక్కిం డ్రఁజేసికొనుట, పురుషులకుఁ దప్పె భార్యలి తెరువు నందు, నడవరే యోర్చినీదు మనమునవింత, యెఁఱిగి కలిగింపు వరువేయునేల తల్లి. అశ్వ. 4.69.

శ్లో. కింతు సర్వాపరా ధోయంయదితే ద్యధనంజయమ్. క్షమస్వ యాచమా నా వై జీవయస్వధనమ్ జయమ్. సం. భా. అశ్వ. 80 ౬.

**కలితనము** మిశ్ర. వి.

శూరత్వము, పరాక్రమము.

కం. ఆనిలజుని యశ్వములఁ గూల్చిన యప్పుడు కల్యానిం గలితనము మెర యం,దన యంపవెల్లిచే ముం,చెనకులు తమ్ముండు నీదు సేన దలంచెన్. కల్కి 1.162.

ఆ. అరుల గుణములైన నగ్గింతు రెప్పుడు, గలయ బెరసినపుడు గలిత నంబు, మెరయుదురు మహాత్ము లెరుఁగడు తుది మొద, లెట్టి వారి నితఁడు బెట్టువలుకు విరా. 4 22౬., స్త్రీ. 1 16౬. కర్ణ. 1 22 మా. 28

2 సామర్థ్యము,

సీ. త్రైలోక్యకంటకు దశ ముఖు బంధు యుక్తంబుగాఁ జ పిన కలిత నమ్ము. ద్రోణ. 2 201, శాంతి. 1.288.

**కలితము** సం. విణ (అ ఆ అ)

1. పొందబడినది

కం. జలనిధి హిమవద్భూధర, కలిత జనన కేశకౌతుక వ్యక్తావ్య, క్త లలిత సౌందర్య స్ఫుర, దలఘుతను శ్రీ సనాథ హరిహరనాథా. విరా. 1.40

ఆ సూతు శవముతోఁడ నేతెంచు నెరవులు, దవ్వు దవ్వుల న యుద గ్రరూప కలితుఁడైన భీముఁ గనుఁ గొని నడవక నిలచి రంతనంతఁ గలఁ గబాజి విరా 8,2౬, శాం. 2. 2 ౬.

2. సంపన్నము, (వస్త్ర వస్తుధనా దులతో) కూడినది

వ. ..... ... పాండవాగ్రజుండున్న యునికిన సన్న్యాసి రూపం బలవడ ధాతుపట దండ కమండలు కలిత మూర్తి యయ్యె. విరా. 1.184.

8. కూర్పఁబడినది,

చం. అనుటయు ఫాలభాగ కలితాంజలి యై యతఁడట్ల చేయువాఁ, డనని. విరా. 8. 125

4. కల్పింపఁబడినది గ్రహింపఁబడి నది

కం ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ, సుజనప్రియుడైన ధర్మసుతు సఖుఁ డఁ బరి, వ్రజనాశ్రమ కలితుండ-మ, నుజవల్లభ యోగ్య బహు వినోద క రుండన్. విరా. 1 195.

**కలిపికొను** దే. స. క్రి

1. కూడఁగట్టుకొను

వ...... పెద్దవాఁడగు ఘనినేత్రుం
డధికబల శౌర్యుండును నకార్య
పరుండునునై సోదరులం గలిపికొని
నడవక పదునలువురం జెఱచి
సామ్రాజ్యంబుఁ గైకొని యుండి.
అశ్వ. 1.17.

2 చేర్చుకొను, దగ్గఱకుదీయు
వ... ...ధర్మంబులు దేటపడ నను
గ్రహించుచుం బుయిలోట వాసి
నన్నుంగలిసికొని కృపకు భాజనం
బుగాఁ జేయుటం జేసి కొంకక యింక
ననడిగెదను. అను. 3 2.

కలిమి | దే. వి (√కలుగు)
కల్మి |

1. కలుగుట, ఉండుట
కం. మృతుఁడయి క్రమ్మఱ సంజీ,
వితుఁడయ్యె నితండు కరము విస్మయ
మిది యా, నుత యిట్టి మహిమ కలిమికిఁ
గలిమెయ్యెడి యానతిమ్ము తాపసుఁడ
మానస్ ఆర 4.19?.
కం ఉనికియడఁగిన వైశంపా, యనుఁ
డమ్మను జే-వ్ర చంద్రునధి తౌత్సు
క్యంబు, బునకలిమికిఁ దనహృదయం,
బున గాఢాదరము భరితముగ నిల్చె
యెన్. విరా 1 45;
కం. ఒలసి మనోవాక్కాయం,
బుల గ్రాహభావ ... భూతసుల
యెడం, గలిమి విను శీలమని మే
లొం... ... దాన నుల్లమూన్చు
ము పుత్రా. శాంతి. 3.147.
ఉ. ... మత్పాద నిరంతరస్మరణ
తత్పర భావము కల్మి నాత్మ స,మ్మో
దముఁ బొంద. విరా. 1.13.

2. సంపద, ఐశ్వర్యము, సిరి.
ఉ. కలిమికి భోగము కదా, ఫలమని
తను మెఱసి బయలుపడఁ జెల్లుగ విచ్చ
లవిడి భోగింపక వేఁడ్కలు సలుపఁగ
వలయు భటుఁ దడంకువతోడన్,
విరా 1.140.
కం. కలిమియ చుట్టలఁ జేర్చుం,
కలిమియ చెలులను ఘటించుఁ గలి
మీయ శౌర్యోజ్జ్వలుఁ దనిపించుం
గలిమియ, పలువురు సద్బుద్ధి యనఁగఁ
బరఁగం జేయున్. శాంతి. 1.51.
కం. వెరవును లావును గలిగిన, పురు
షులు తేరెట్లులోకమున నెవ్వరికిన్, సిరి
శాశ్వతంబె యని వగఁ బొరయఁడు
ధీరుండు కలిమి పోకకునదిపా. శాంతి.
3.31.

3. జీవించి యుండుట. బ్రదికి
యుండుట.
(పౌలోమి నహుషునితో)
ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి
వాసవు కల్మిలేమియుం, దెల్లముగా
నెఱింగికొని తేఁకువ లేకట వచ్చు
టొప్పునా యుల్లము శంకితం బగుచు
నుండఁగ వేగిరపాటు మేలె నీ, వెల్ల
నెఱుంగు దిప్పుడెడ యిచ్చుట యుక్త
మునాకుఁజూడఁగన్. ఉద్యో 1.165.

కలియు దే. అ. క్రి. కలయు.
చేరు. ఒకటిగానగు.
ఆ. అర్జునుండు వనమృగావలిఁ
గలిసి యి,ట్లున్న జూచియును. ఆర.
2.215.

కలియుగము సం. వి. అ. న.
నాల్గవ యుగము కృతత్రేతాద్వాపర
కలియుగంబులనియుగంబులు నాలుగు

(కలియుగ పరిమితి 432000 సంవత్స రములు. నాల్గు యుగములలో కలి యుగమే పెద్దది ఇప్పుడు కలియుగ మున 5079 సంవత్సరములు గడచి 5080 వ సంవత్సరము గడచు చున్నది. అందు శాలివాహన శకము 1900 సంవత్సరాలు గడచి 1901 గడచుచున్నది. హూణ శకము 1979 వ సంవత్సరము సెప్టెంబరు 30వ తేదీ శుక్రవారము.)

ఇందు పాలకులు ధర్మమును దప్పి ప్రవర్తింతురు. వర్ణాశ్రమ మార్గములు తాఱుమాఱగును. శాంతి. 1.292. చూ. యుగము.

**కలు**[1] వై వి. (సం. కల్యా. ప్రా. కల్లాక్ కళ్. కళ్ళు).

ఇదిఇలు శబ్దమునకువలె హల్లుపరమగు నపుడు వైకల్పికముగా కల్ అను రూపము నొందును).

మద్యము; సుర

కం. జీవిత సంశయ వేళ, భూవర యొండన్న పానములు దొరక మిఁ గల్ ద్రావినఁ గల్లగు తెఱఁగక, త్రావిన నద్దురిత మధిక ధర్మమునఁ జెరున్. శాంతి. 1. 297.

కం. (కర్ణుఁడు శల్యునిపైఁ గోపించి) కం. పలుపురకుఁ బుట్టి నిచ్చలుఁ, గలుద్రావుచుఁ బెరిఁగి యెట్లుగఱతురు శీలం,బులు నుచితములగు భాషణ, ములు నీవిమ్మాటలుడిగి పొదపొద మని కిన్. కర్ణ. 2.48.

**కలు**[2] దే వి. (ఇది ఇలు శబ్దమువంటిది చూ. కలు[1])

శిల, ఱాయి. చూ. కలుకట్ట

**కలుకట్టు** దే. వి.

ఱాతి కట్ట,

వ. అల్లనల్లన తెఱపియిచ్చి యవు లవులం జను నంధకారంబు దూరం బులయందును లేకునికివలనం గడళ్ళ పృశించి నెరసి విరిసినం బొలుచు కలుకట్టలుంబోని దిక్తటంబులును. విరా. 2.240.

**కలుగు** | **కల్గు** దే. అ. క్రి. (దీనికి 'కల', 'లే' అను రూపములగును)

1. ఉండు, నిలుచు.

అ. ఏను గలుగ వెఱువనేటికి సేనలఁ గాతునీవు మెచ్చఁ గౌరవేంద్ర ఉద్యో. 4.203. విరా. 5 114.

వ. ... పలుదెసల నుండి వచ్చి కూడిన వాహినులు మూఁడక్షౌహిణుల కుఁ గలిగె. ఉద్యో. 1.225. (కలిగె = చాలియున్నవి)

కం. సూపాధ్యక్షుఁడు గలిగిన, నా పురమునితోఁడ సఖ్యమగు నట్లుగ నే, నేపాటనైన నడవఁగ, నోపుదు. విరా, 1.79.

(పరీక్షిజ్జననము) వ. ఇట్లు పుండరీ కాక్షుండు పాండవ సంతానంబు కలి గించె. అశ్వ. 3.201. (కలిగించెన్ = నిలిపెను)

2. చాలు, ఓపు, సమర్థమగు.

కం. దుర్యోధను నిఃటుం డగు. కార్యమునకు ఖడ్గమునకు గల వాఁడై దాతుర్యంబు మెఱయు కర్ణుని

యార్యత్వము నెల్లుచున్నయదియే నెమ్మిన్. ఉద్యో. 1.281.

చం విరటుఁడు నూచుచుండనినువేవు ర ముందటనట్లు ద్రోవ న్నా,క్కరుఁ డును గాదు గూడదనఁ గల్గెనె: విరా. 8.257,

3. సంభవించు, లభించు, ప్రాప్తించు, దొరకు.

తే. ధర్మదేవత నీదు సత్కర్మ మునకు, మెచ్చియెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి, వరము గలుగంగ మన మేమి వర్తనమున, నెచటనున్నను నొరులకు నెఱుఁగనగునె విరా,1.61

తె. ధరణిఁ బొగడిత యెందాకఁ బరఁగునంత, కాలమును బుణ్య లోకంబుగల్గు నంద్రు. కర్ణ. 2.90.

తే. పూరున్నప కులభూషణ పూత చరిత, నీవు భక్తి గలుగుము గోవు లందు అను 8.87.

గా. కానంగాని శరీరముంగల మహో గ్రగ్రాహమున్. ఆది. 8.258.

**కలుచ** వై. వి (సం. కలుషమ్, ప్రా. కలుస)

1. దోషము.

కం. కలుషం దోషమి యమవఁ గలుగునె యంతటనెయమృత కరు నకు నాశం, బలము పరవస్తువున కుం,గలదె యభావంబు మనసుగాన ని కలుచన్. శాంతి. 4 198.

చం. అకట నితాంత లోభమున నావ లఁ బాటిలు కీడుగానఁ జా,లక ధృత రాష్ట్రసూనులు కులక్షయ మయ్యెడు దాని కోరి పో,రికిఁ దెగి వచ్చిరక్క లుచ రెండు నెఱింగెడు నీవునేను దీ,నికిఁ జొరనేల వీరినిటు నిర్దయఁ జంపిన నేమియయ్యెడున్. భీష్మ. 1.186.

కులక్షయ కృతం దోషం మిత్రద్రో హేచ పాతకమ్. (మూలము)

తే. తొంటి చవిగని యిప్పుడుఁ దోఁచి పాండు. సుతులు రాజ్యంబు సేయంగ జూచు కలుచ, నాకు నీఁదీఋనేయింక నాఁటి చూఱ లెక్కడివి ద్రోణ భీష్మ లీదికుక్క సుమ్ము. ఉద్యో. 8.862. శాంతి. 6.554.

2. నెపము, వంక.

మ శ్రుతి వాక్యంబులు కర్మనిష్ఠవిను తించున్ నిష్క్రియత్వంబు సద్గతి గావించుట యూఁది చెప్పునిటు చిత్త ప్రక్రియల్ రెండు చో,దితముల్ వానిని వింటిమన్న కలుచన్ దీపించునే తత్వ సం,గత బోధంబు సుకర్మతం గలుగు నాకం బాత్ర వీరవ్రతా. శాంతి. 1,318.

**కలుపు** దే. స. క్రి. (√ కలియు) చేర్చు.

కం. నా కొలఁది యిచ్చు డెఱఁగితి, నీ కరుణాలోకనంబు నిగిడించి శర, ణ్యా కావున నన్నుమగుడం, గాకు లలోఁ గలుపఁదగవుగాదే నీకున్ కర్ణ 2 77.

ఆ. పదయరాని యాయు వొదలికిఁ గలిగినఁ, బాపకృతుల దానిఁ బదట గలుప, నగునె పుణ్యవిధి సమాచరణ

ములఁగై, సేసపలయుఁగాక చెలువు
మిగుల శాంతి 5.482.

వి.

పొందిక, కలసియుండుట.

ఆ. అనుడు నకులుఁ, డిట్టులను దేవత
ము తమ నేర్పు పనుల వెంట నెగడి
బ్రదుకి, పలయుఁగాక నగరఁదలము
దప్పిక మెలం, కువల కలుపు లియ్యె
కొముచ దగనె. విరా. 1.262.

**కలుఁవడగ** దే. వి.

కలువడము.

వ. అన్నరసాధుండు నడచి నానగ
రంబును బ్రవేశించె నంతకుమున్న
యందలి జనంబులు గలువడఁ గలను
కోటబంబులను ... ప్రాలంబ మాలిక
లను గొప్ప మిగుల నప్పురం బలం
కరించి. శాంతి. 1.254.

**కలుకడము** వి. (కలువ+వడము)
కలువడఁగ ఉత్సవాదులందు ధ్వజ
స్తంభములోనగు వానికి వ్రేలగట్టెడు
కలువ పూదండ.

కం. కలువడములు మణితోరణ,
ములఁ గట్టిరి క్రముక కాంచన మోచా
స్తంభంబుల నాటిరి కుంకుమమునఁ,
గలయ నలికి ముగ్గులిడిరి కర్పూర
మునన్. విరా. 5.232.

**కలుషత** సం. వి. అ (స్త్రీ)
కల్మషత్వము, మాలిన్యము
కం. విను మాకు ప్రసన్నుఁడ వనుఁ
గను షడుషము కలుషతం గానఁడు.
శాంతి. 4.165.

**కలుషము** సం. విశే. (అ. ఆ. అ)

1. చెడినది, భంగపడినది.

ఉ. పాతకియై సుయోధనుఁడు పాండు
తనూజులు సల్పుచున్న య,జ్ఞాత విధి
వ్రతంబు గలుషంబుగఁ జేయఁదలంచి
పంచినన్. విరా. 8.72.

2. మలినము, వ్యాకులత చెందినది.
(దుర్యోధనుం జూచి శకుని)
ఆ ఇన్ని దినములయ్యె నేటికినాలోఁడ,
నిభపు రేశపలుక విట్టుకేల,నీముఖంబు
దీర్ఘ నిశ్వాస ధూమ సంహతులఁ
జేసి కలుషమయిన యదియు. సభా.
2.92., శాంతి. 6.149.

3. కోపము గలది.

ఉ. వారలు పూనినట్లు వనవాసము
సల్పిరి వీరలేచి త,మ్మారయగా
బయల్పడని యట్లు గ నుండెడు వత్స
రంబునుం జేరువ చేరుపల్ గడచెఁ
జిత్తములుం గలుషంబు లమ్మహా.
వీరుల కిన్నృపాలునెడ వీరికి నూరక
యున్కి కర్జమే. విరా. 3.107.

4. గర్హితము, నిందితము
క. కుంతికినంతవెఱవమీ, కంతవెఱవ
దైవమునకు నంత వెఱవన,త్యంతకలు
షాత్మ విరటుని, కాంతకు నేవెఱతుఁ
బనులు గావించునెడన్.విరా 2.175.

**కలుషించు** సం. అ క్రి

1. కలఁగబాఱు, కలతనొందు

సీ. వెఱవక ననుఁ జూచె వీఁడనియెదఁ
గలుషించిన నొండొండ చెమట
వొడమ విరా. 2.33.

2. కోపగించు.

వ. అని తన యభిలాషంబు దేట
పడఁ బలికిన నబ్బోటి కలుషించియు

దుర్వారంబైన పరిభవ వికారంబు దోఁపకుండఁ దన్నుఁదాన యుపశమించుకొని. విరా. 2.48.

చ. అని పలుకంగ గౌతమమహాముని యచ్చటనుండి యంతయున్, వినికలుషించి యేల యిటు వీఁకను నోరఱుఁవంగఁ బ్రేలెదు. అర. 4. 192.

**కలుషితము** సం. విణ. (అ. ఆ. ఆ).

1. కలఁగఁ బాఱినది. చెడినది' వికారము నొందినది.

తే. పరశురాముఁడు, భృగుఁడును బలియు లోను, గాఁగ మహనీయ పురుషులు గర్మసూక్ష్మభంగిఁగలుషితదైవప్రభావితాత్మలై రి కర్మంబుదైవంబు నలఁతువెట్లు. అను. 1.140

వ. కౌంతేయులచేత బంధమోక్షితుండై దుర్యోధనుండు రాహుకబళన కలుషితుండైన రోహిణీపతియునుం బోలె విషాదవర్ణుండయి. అర. 6.5.

2. కుపితము, కోపగించినది.

క. పట్టువడిన సుగ్రీవునిఁ గట్టెదురం గాంచి యెయ్యికలుషితమతియై దట్టుడు లక్ష్మణుఁ డసురన్, బిట్టేసెం బిడుగు బోని పృథుబాణమునన్. అర.7.102

క. మారుతాత్మజుండు కలుషితాత్ముండగుచు సెజ్జకువచ్చె. విరా. 2.235.

**కల్కి** సం. వి. న్. ఇ. పుం.

విష్ణుదేవుని పదియవ యవతారము. శాంతి. 2.48.

కలియుగాంతమందు శంబళ గ్రామమున విష్ణుయశుండను పేర విష్ణుండు కలాంశ్యాత్మకుఁడయి జన్మియించును. సంస్మరణమాత్రన వేద శాస్త్రంబుల నధిగమించును; సార్వభౌముడగును. బ్రాహ్మణానీక సహితుఁడై మ్లేచ్ఛులను మడియించి ధర్మము నిలిపి వాజిమేధము చేయును. వార్ధకమున తపోవనమునందు వసించును. బ్రాహ్మణాది వర్ణములు తమతమ ధర్మములను సక్రమముగా నిర్వర్తింతురు. దాననచేసి కృతయుగము ప్రాప్తమగును. అను. 4. 308 మొ. 312 వఱకు.

**కల్కితనము** దే. వి.

సొంపు.

సీ. తెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు తారకంబులఁ గల్కితనము దొడర. విరా. 1. 245.

**కల్గు** దే. అ. క్రి.

చూ. కలుగు.

**కల్పకము** సం వి. అ. పుం.

కల్పవృక్షము.

చ...సురేంద్రకల్పకం, బు గరము లీలఁదెచ్చె. ఉద్యో. 2 310.

**కల్పన** సం. వి. ఆ. స్త్రీ.

1. చేఁత, చేయుట.

మ. ప్రియ మజేఱము నాకు నీ దెసమదిన్ భీతిప్రదోద్వేగసం, శయమల్ సేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధి ని,శ్చయసంపాదిని నాదు దృష్టినిను నశ్వవ్రాతముంజోఁక గాలి యురానీను దృ...రింపు రిపు దోర్లీలాసముల్లాసమున్. విరా. 4.157.

2. విధానము, విధి.

కం. నావుడు మీలోపలనొక, గోవై నను మోహవశతఁగూరుటయు మఖం బావేళఁ బరిసమాప్తము, గావలయు వినుండు సమయకల్పన దెలియన్. అను 3 63.,

క. తమతమ సారములకుఁ దగఁ, గమలాక్షి చేయు దానకల్పనల విశేషము నొక్కరూపయగు. అను. 5. 210.

3. నెఱవేర్చుట, నిర్వహించుట.

క. వారలు లింగాధిష్ఠా, నారూఢుంగా నొనర్చి యర్చించిరి. భవ్యారాధన పరులై మును, గౌరీపతి నతుల నియమకల్పన వెలయన్. ద్రోణ. 5. 417.

4. సాధనము.

క. శమనిరతియు నాత్మజ్ఞానముఁ జువ్వె బుద్ధలక్షణంబులు పర్యాప్తము లవి రెండు నరయ మోక్షము సాధించుటకు వేఱ కల్పనలేలా. శాంతి. 5.177.

5. అలంకరణము, అలంకరించుట.

వ.... సూతనందనుండు దన సూతు నాలోకించి తగురథంబునకుం గల్పన మొనర్పుమని సత్వరంబుగాఁ బనిచిన, కర్ణ. 1.317.

6. ఎక్కుటకై ఏనుగు నాయితము చేయుట.

తే. ... ఆహవోచి, తోగ్రకల్పనా భంగులు నల్లిసిల్లిఁ గరులు ధాత్రి తలంబు గ్రక్కదల కదచె. శల్య. 1.103.

2. నిర్ణయము, ఏర్పాటు.

క. నావుడునల్లనగుచు, నద్దేవుఁడు గరుణించి మునుల దేవతలను సం,భావింప భాగకల్పనఁ గావించిరి వారలా జగత్ప్రభువునకున్. శాంతి. 5.142.

**కల్పనము** సం. వి. అ న.

1. నిర్ణయము, ఏర్పాటు.

వ. తొడంగి యనుష్ఠాన ప్రపంచప్రవర్తను లగుచుండిరి గాని రుద్రుని మహానుభావం బెఱుంగమిం జేసి య య్యాగమూర్తికి భాగకల్పనంబొనర్పరైరి. సౌప్తి. 2.120., శాంతి 5 488.

2. కూర్చుట, కల్గించుట.

కం అనధీయానుండితఁడనఁ, జను ఋత్విజు నట్లచూవె సంరక్షాకల్పన హీనుఁడై నన్నృపుఁడని, మనువుపలికెఁ గాదె బుద్ధిమంతులు మెచ్చన్. శాంతి. 2 192.

3. కల్పించుట, నిర్మించుట.

సీ. అబలదేవ మురాంతక మహీపుల కతివిభవంబైన యానకల్పతే. నంబు నాకల్పరచనంబు నదవినరుడు, చంద నాగురుమయచితా సంవిధాన, మాచరించి. మౌస, 204.

4. ఆజ్ఞ, శాసనము.

చం. ...నిఖిల కర్మయోగ సవిశేషత గల్గుటయుం దదీయకల్పనమ తదాజ్ఞకుం దొలంగఁబాడియె శోకము గారణంబుగన్. శాంతి. 1 79.

తే. సకలభూతంబులకును శాసకుండు గండు, గాదె యొక్కరు డాతని కల్పనమునఁ బ్రాప్తమైనరి నీళ్లలు పల్ల

మునకు, వచ్చుక్రియఁ దానవచ్చు గీర్వాణముఖ్య. శాంతి. 4.413.

5. సృష్టి.

సీ. శేషభూతములకు జీవనముగ, నోషధికల్పన మొనరించు. శాంతి. 6.82.

6. అలంకరించుకొనుట.

వ...తత్తుల్యాకల్పనంబున ఋత్విగ్జన సమాజంబునుం దేజరిల్లె. అశ్వ. 4.3

**కల్పము** సం. విణ. (అ. ఆ. అ)

1. ఉచితము, తగినది. (పదార్థము)

క. లోకమునఁ గలుగు భూసుర,లోకమునకు నెల్ల గోవులుం బసిండియు నా, నాకల్పంబులు బంధుల, కై కోటివిధముల నిచ్చె నతులితభక్తిన్. శాంతి 1.384.

2. ఈషదసమాప్తిని సూచించును (ఇది యథార్థమున ప్రత్యయము)

తే. అతిరథుండు యుధిష్ఠిరుండగ్నికల్పుఁడావహంబున (అగ్నికల్పుడు = కొంచెము తక్కువగా అగ్నితో సమానుడు; అగ్నికిఁగల పచన శక్తి మాత్రము లేదు.)

సీ. అశనికల్పములివి యర్జును బాణముల్. భీష్మ. 3. 406.

వ. తత్సంతతులెల్లను దత్కల్పులై శాం. 2. 213.

వి. అ. పుం.

కల్పవృక్షము.

తే. కల్పలతానిచయములుపుష్ప, వృష్టి వెల్లుగఁ గురిసిన విధము దోచె. శాంతి. 1. 355.

తే. మందార కల్పలతలు విరులు గమియు. విరా. 5. 392.

(కల్పలత=కల్పవృక్షము యొక్క కొమ్మ.

2. బ్రహ్మదినమున పూర్వదవభాగము. పది కల్పములు బ్రహ్మకు పగలు అగును. అంతియేకాలము రాత్రి యగును బ్రహ్మయొక్క దివా భాగమున జగత్తుచేష్టావంతమై యుండును రాత్రిభాగమున నిశ్చేష్టమై యుండును)

సీ. విను కల్పములు పది దినమున కంతియ రజనికాలంబు సర్గంబుపగలు సేయు రే ప్రళయంబు నెల్లించు శాంతి 6.82.

మాలిని. గణనరహితలీలా. కల్పనిత్యాభిరామా. శల్య. 1. 405.

ప్రళయమునఁబరమాత్ముండుప్రకృతిఁ బొంది, యఖిలమును జేయించు కల్పాదియందు శాంతి. 4. 265.

3. వేదాంగములలో నొకటి. ఇది అశ్వలాయనాపస్తంబ బోధాయన కాత్యాయనాది సూత్రరూపముగా నుండును. వేదాంగములు ఆఱు, 1. శిక్ష 2. కల్పము 3. వ్యాకరణము 4. నిరుక్తము. 5. ఛందస్సు 6. జ్యోతిషము. వైదిక కర్మలను దెల్పునది కల్పము.

గీ వినుము ఋగ్వేదాదివేదముల్ నాలుగుఁ గల్పాదులైన యంగంబు లాఱు శాంతి 3. 119.

4. శాస్త్రము వైదిక క్రియలను దెలుపు గ్రంథము. ఋషులు చేసిన చట్టములుగల వేద మంత్రభాగము.

తే మాతృపితృ హీనమైనను భ్రాతృ రహిత భావమొందిన నబ్బాల పరిణ యార్థ, వరణమున కర్తగాదనికురుకు లాగ్రగణ్య చెపుదురు వరిణయ కల్ప విదులు అను. 2. 227.

5. ప్రక్రియ, నిర్వహణము.

కం. కపిలగోప్రదానంబు గోదాన కల్పంబునకంతకు నధికంబు. అను.2 25.

**కల్పలత** సం. వి. ఆ. స్త్రీ.

కల్పవృక్షముయొక్క కొమ్మ.

సమేశాఖాలతే— అమరము.

తే. ఒండొరుల దోయిళులు నిమ పొందఁజేయ నక్షత్రప్రకరంబులన్యో న్యమస్త్ర, కమలఁబోసిరిమఁదారకల్ప లతలు, విరులు గమియు నొండొం టిపైఁగురియునట్లు. విరా 5.387.

తే. కల్పలతానిచయములుపుష్ప వృష్టి వెల్లుగఁ గురిసిన విధముదోచె శాంతి. 1.655.

**కల్పవృక్షము** సం. వి. అ పుం.

దేవవృక్షవిశేషము.(ఇదిఅయిదుతీరులు 1. మందారము. 2. పారిజాతము. 3. సంతానము. 4. కల్పవృక్షము. 5. హరిచందనము)

తే. దేవదుందుభి వ్రాతఁబు డివిరెఁ గల్పవృక్ష పుష్పధారామయ వృష్టి కురిసె. ఉద్యో. 3.406.

ఇట్లే కల్పతరువు. కర్ణ. 2. 188 కల్పకతరువు. విరా. 2. 208 కల్ప భూజము. ద్రోణ. 5. 225.

ఇది వాంఛిత ఫలములను కల్పించు వృక్షము)

**కల్పాంతము** సం వి.అ పుం. (కల్ప+ అంతము)

ప్రళయము, బ్రహ్మకు రాత్రికాలము.

వ భీమసేనుండు ...... కల్పాంత గృహాంత జిహ్వాభ్రీలంబగు కరవాలం బును బుచ్చుకొని. భీష్మ. 2. 69.

**కల్పించు** సం. సం. స. క్రి.

సృజించు.

వ....పరమేష్టియన్నీరజాక్షి నిరీక్షించి సీ నినుఁ బ్రజాసంహారమునకు నై కల్పించి, నాఁడుగావున నీమనంబుఁ బొడము విచారం బుడిగింపుము. ద్రో. 2. 169.

క. కృష్ణుఁడు ప్రభవిష్ణుండగు విష్ణుం డనిలాగ్నితోయ వియదిలలఁగ్రియా,ని ష్ఠాతత్త్వ వినోదన తృష్ణంగల్పించెఁద నదుదివ్యవిభూతిన్. శాంతి 4 204.

2. కలిగించు, పుట్టించు.

క. తనకులము వీతహవ్యుని, తన యులచేఁద్రుంపఁబడుట దగ నెఱిఁగిం పన్, వినియతఁడోడకు నీ కొక తన యునిఁ కల్పింతురిపు విదారనిపుణున్.

వ. అని పుత్రకామేష్టి సేసిన ప్రభ వించిన పుత్రుండప్పుడ పదమూ డేండ్ల ప్రాయంబువాఁడయ్యె అను. 1. 121., 122.

సీ. చంచరీకావళి ఝంకృతుల్ గల్పించు కిర్ణదుకం ఝణాకలన ములును. కల్కి 1. 102.

3. (వ్యూహము) పన్ను, ఏర్పఱచు.

వ. అయ్యుధిష్ఠిరుండు మనమొనలం

గనుంగొని వజ్రవ్యూహంబు గల్పింపు మని సేనాపతింబనుప, భీష్మ. 3.10.

4· కూర్చు, విధించు.

శా. దక్షుండై తిటుబ్రహ్మశక్తి నభవ ద్భావవిలాసంబమి, త్రక్షోభం బొన రించెనే యనుడు నాతండిట్లు నీవంటి బ్రహ్మక్షత్రంబులకేక యోనిజననంబ ద్వేధ గల్పించె. శాంతి. 2. 313.

4. నిశ్చయించు, నిర్ణయించు.

(యుధిష్ఠిరుఁడు) వ... కరణీయంబు లగు నధికారంబుల నెల్లను గల్పించి వారల మీఁదనవెట్టి. శాంతి. 1.378.

6. నిర్మించు.

క. చేలిపందిరులును సత్త్రం,బులుఁ బెట్టించెను తటాకములు దేవగృహ ములు కల్పించెను బంధుజ,నులకు సుగతియగుటకై వినుతభంగి నృపా. శాంతి. 1. 383.

2. భావించు, గ్రహించు, స్వీకరించు.

వ. సగరుండు పుత్రశోకంబుడిగి యశ్వమేధంబు సేసి సముద్రుండనకు బుత్త్రుఁగాగల్పించిన నది మొదలు సముద్రంబు సాగరంబునాఁబరఁగె. అర. 3.21.

కల్పితము సం. విణ (అ. ఆ అ)

1. చేయబడినది, కావింబడినది.

శా యానప్రక్రమ సూచకంబులగు తూర్యంబుల్ దిగాపాదనధ్వాన స్వైర విహార కల్పిత సముద్ర క్షోభముల్గా. విరా. 3. 142.

2. కూర్పబడినది.

ఉ. కల్పితదృఢచతురంగా, కల్పం బై గండుమిగిలి యాదవ బలమా, కల్పో జ్జ్వలతఁగొలువనవి, కల్పుఁడు కృత వర్మ సనియె గాఢస్ఫూర్తిన్. భీష్మ. 1.90., అను. 1.179.

3. సిద్ధపఱుపఁబడినది.

వ...ఆసందునఁగల్పిత స్యందనుండై యా సూతనందనుం డప్పాండునందను నిపై నురవడించిన. ద్రోణ. 4.215.

4. సృజింపఁబడినది.

తే. సత్యవతియను తన కన్య సంప్ర మోద,మున బుచీకునకిచ్చె నమ్ముని సుకర్మ, నిరతి సంతాన వాంఛమైఁ జరుయుగంబు తనకు కూతురుకై కల్పితముగఁ జేసి. శాంతి. 2.68,

ఆ...అతఁడుబ్రహ్మపాంకతిరయంబు నఁబాటి, భూత తతులునన్నుఁ బోధవ మంద నాఁ గవల,యు వాని కాహార ములుగ గల్పి,, తములుసేయవల యుఁదగ మహాత్మ. సౌప్తి. 2 113;

5. అర్పింపఁబడినది.

కం. శరనిధి పరివృత విశ్వం, భరఁ గల భూపతులు పాండుపతికృతము నఁగింకరులై ప్రతి సమకల్పిత, కరు లైరది మొదలు గాఁగఁగౌరవ్యులకున్. ఆది. 5.40.

కల్మషత్వము సం. వి. ఆ. న.

1. పాపము.

(సవ్యసాచి ధర్మజునితో)

సీ, ... అవగత కల్మషత్వంబును గౌరవంబు ...

ఆ కలిగి జనుల నేలఁగాని యెన్నం డును, నొరులఁ గొల్చి తిరుగ వెరవు

లేని యట్టి నీవు విరటు నెట్టి చందం
బున, ననుచరించువాఁడ వధిపచెపు
మ. విరా. 1.67.

2 కాలుష్యము, మాలిన్యము.

ఉ. అమ్మెయిఁ బాపముల్ వాలియు
నంతకు దుఃఖము లంది కీట జన్మ
మ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ
బొంది మృగత్వ మానుషత్వమ్ముల
నోలిఁ బొందుదురు వారినుమెంతయు
గ్రాఁగి కల్మషత్వమ్ము దొలంగు
మాడ్కినవతామరసప్రతిమానలోచనా
అను. 5.172.

**కల్మషము** సం. వి. అ. పుం. న.
పాపము.

వ. (ఇంద్రుఁడు) తన దుష్కర్మంబు
ప్రకటంబగుటకు రోసి యొక్క
విషమ వ్రతంబాచరించి సముద్రతరు
ధరణీ స్త్రీజనంబుల యందు బ్రహ్మ
హత్య విభాగించి పెట్టి నిజకల్మషం
బు బాపికొని మునిగణ సేవితుం
డయి ఉద్యో 1.120.

ఆ. అగమోక్త కర్మమాచరింపమి
యు నిషిద్ధమైన దానిఁజేయుటయును
బ్రాజ్ఞ జనులు ధరణిపాలవరేణ్య
చెప్పుదురు పాపములుగ బోధ్యతతికి.
శాంతి. 1. 291

వ. ఇది కల్మష సామాన్య నిర్దేశంబు.
శాంతి. 1.291; 292; శాంతి.
5.166.

2 దోషము.

వ. ... పాండవులు గల్మషాయత్త
చిత్తులుగామియ మీరు నెఱిలెమియు
విచారింపుము. శల్య. 2.369.

ఉ. ... భవద్భావము కల్మషంబు
దెగఁ జూచి శుచిత్వముఁ బొందు.
శాంతి. 1.221; శాంతి. 1.105.

**కల్మాషపాదుఁడు** సం. వి అ. పుం.

కల్మాషపాదుఁడు ఇక్ష్వాకుకుల సంభ
వుఁడు. ఈతని తొలిపేరు సౌదాసుఁడు.
ఒక్కనాఁడు కల్మాషపాదుఁడు వేట
పోయి యడవులం దిరుగుటవే శ్రమ
నొంది విశ్రమార్థము వసిష్ఠాశ్రమము
నకు వచ్చుచుండెను. ఆ సమయమున
వసిష్ఠ జ్యేష్ఠపుత్రుఁడు అధికతపశ్శక్తి
యుక్తుఁడు శక్తియనువాఁడు దారిలో
నెదురయ్యెను. కల్మాషపాదుఁడు
రాజాభిమానంబున నమ్మహాముని
మెచ్చక దారి తొలఁగి పొమ్మనెను.
ఋషిసత్తముఁడెదురైనచోఁ దానెంత
వాఁడైనను రాజే తొలంగవలయును
గాన నేనుతొలఁగవలసిన పనిలేదనెను
అందులకు రాజు కోపోద్రిక్తుఁడై
కశకోలతో నా మునిని గొట్టెను. శక్తి
యతనిం జూచి నీవు రాక్షసుంబోలె
నకారణంబ నాకు నికారంబు చేసితివి
గావున రాక్షసుండవయి మనుష్య
మాంసభోజి వగుమని శపించెను.
కల్మాషపాదుఁ డమ్మహామునిని వసిష్ఠ
పుత్రునిగా నెఱింగి శాపమోక్షణంబు
ప్రసాదింపవలయునని ప్రార్థించు నెడ
నిచ్చోటికి విశ్వామిత్రుఁడు వచ్చి
వారలు తన్నెఱుంగకుండ అంతర్హి
తుఁడై కల్మాషపాదు నావేశింప
నొక్క రక్కసుని కింకరుండను
వానిని బంచెను. వాఁడు విశ్వామిత్రు
నాదేశంబునను శక్తి శాపంబునను

కల్మాషపాదుఁ నంతరాత్మ నాదేశిం చెను. విశ్వామిత్రుతు కల్మాషపాదునకు పురోహితత్వంబు వహింపఁ దలంచితన,పురోహితుడై నవసిష్ఠునితో వైరము వహించి యీ పనిచేసెను. కల్మాషపాదుఁడు దినమంతయు రాక్షసావిష్టుఁడై యుండఁడు. అపరాహ్ణకాలమున నిశీథ సమయమున నుండును. మిగిలిన కాలమున రాజకార్యములు సక్రమముగ నిర్వహించుచుండెను, ఈయన భార్య పేరు మదయంతి. ఒక్కనాఁడొక్క బ్రాహ్మణుఁడుభుక్షార్తుఁడై వచ్చి మాంసభోజనమడిగెను. రాజట్లే పెట్టెదనని అంతపురము చేరి మరచిపోయెను. అర్ధరాత్రమునకా విషయము జ్ఞప్తికివచ్చి బ్రాహ్మణునకు మాంసభోజనము పెట్టుమనిసూపకారు నాజ్ఞాపించెను అతఁడా సమయమున మాంసము లభ్యము కాదని చెప్ప రాక్షసావిష్టుఁడైన కల్మాషపాదుఁడు నరమాంసము వండిపెట్టుమనెను. విప్రుఁడు దివ్యదృష్టివలన దాని నెఱింగి కోపించి కల్మాషపాదుని మనుష్యాదుఁడవు గమ్మని శపించెను. కల్మాషపాదుఁడు తనకు తొలుత శాపమిచ్చిన శక్తిని, అతని సోదరులను విశ్వామిత్ర చోదితుఁడై చంపెను. ఒకనాఁడు కల్మాషపాదుఁడు వసిష్ఠాశ్రమమునకు రాఁగా అతనిని జూచి వసిష్ఠుని భార్య అదృశ్యంతి భయపడెను. వసిష్ఠుఁడు తన కమండలువు లోని నుంచి జలమును కల్మాషపాదుని పైజల్లెను. కల్మాషపాదుఁడు శాపము తొలంగి యథాప్రకారము సౌదాసుఁడయ్యెను. చూ. ఉదంకుఁడు. చివరి అనుబంధము.

**కల్మాషము** సం. వి. అ. పుం.
హంసవర్ణముగల గుఱ్ఱము. చూ. మండూకము.

వ. ... తిత్తిరి కల్మాష మండూకాఖ్యమయూర హంస శుకసవర్ణంబులైన హయంబులు. సభా. 2.386.

**కల్మాషుఁడు** సం. వి. అ. పుం.
కద్రువ కొడుకు సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కల్మి** దే. వి. కలిమి.
చూ. కలిమి

**కల్యము** సం. విణ. (అ, ఆ. అ).
1. సమర్థము, నేర్పుగలది.

వ. ... రణంబు రాజులకు తమ ధర్మంబుకాదె యందులకు రణంబును సుగతి కరణ కల్యంబు. ఆశ్ర. 1.101.

కం. అంబుజనాభుని కొడుకీ, సాంబుఁడు గను యాదవ క్షయాపాదన కల్యంబగు ముసలము. మౌస. 9.

చం. ... శత్రు సైన్య మథనకల్యుఁడగు శల్యుండు. ఉద్యో. 2.146.

వి అ న.
ప్రత్యూషము, వేకువ.

వ. మఱునాఁడు కల్యంబునం గాలోచిత కృత్యంబు లాచరించి. శాంతి. 1. 247., శాంతి 2.166.

**కల్యాణము** సం. విణ. (అ. ఈ. అ.)
శుభ యుక్తము, శుభ కరము, మంగళకరము.

శా. ... వాహన పరిష్కారాంలకసం
భావ్య సంపత్కల్యాణునిఁ జేసి...
వైభవము దర్పంబున్ విజృంభింపఁ
గన్. విరా. 1.285.

కం. వినుతింపందగు రాజసూయ
మునఁ బృథ్వీదేవతా కోటి కెల్లను
సంతృప్తి యొనర్చి వారిదయఁ గల్యా
ణాత్మనై విరా, 2.217., సుభద్రా
కల్యాణంబు ఆది. 1.82.

**కల్యాణి** సం. విశ. (న్. నీ. న్).
కల్యాణము గలది. పుణ్యాత్మురాలు
తే. ఆపతివ్రత యట్ల యీ యాజ్ఞసేని
పరామ కల్యాణి ధర్మ సంభావనీయ.
ఆర. 7,279.

**కల్ల** దే. విశ.
1. కపటమైనది.
ఆ. అట్లు కల్లభావమాడి పాప. భాగ
లైన నీదు పట్టుల సుగతికి, ననుచు
వాఁడఁ దపము నతియమున. ఆర.
7.269.
2. మాయా కల్పితము.
ఆ. వినుమేను గల్ల సారెలుగొని.
కపట నేత్రమాడు కుశలతఁగా దొప్ప
నివారి నేపదఁచుట, ఘనబాహు
స్వైరకేళిఁగాని దురాత్మ. కల్య.
2.281.

**కల్లు**[1] వై.వి. (సం కల్యమ్, ప్రాకల్లం
క. కళ్ళు. కళె)
మద్యము, సుర.
ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొద్ల
నుబంపుము కల్లుదేర. విరా, 2.98.
సీ. కల్లు ద్రావిన పాతకంబది యగ్ని
వర్ణముగాఁగఁగాఁచి పానంబు సేయఁ,
గనుమూసియు బకంగ ననలంబుజొర
మహా స్థాన మాచరింపఁగఁ బాయు.
శాంతి. 1.307.

**కల్లు**[2] దే. వి. ఔ. ఆనా.
1. ఱాయి.
సీ. కుంతి భోజాధిపు కూఁతురు ....
పాండుమహాదేవి ... దప్పిఁ బొంది
కటికి ... ఆ నేలఁగంద్లు లొత్తనిద్ర
వోయినయది. (కండ్లులు=ఱాళ్ళు;
కల్లు - బహు వచన రూపము) ఆది.
6.178.
2. (బండి) కన్ను, (బండి) చక్రము.
వ. పరశురామ దత్తంబయిన భార్గ
వాస్త్రంబను పేరిటి మహనీయ సాధ
నం బప్పుడు రాధేయునకుం బ్రతిభా
సింపకుండె; దాపటి కల్లు గ్రుంగినఁ
దేరుఘూర్ణిల్లె. కర్ణ. 3.342., కర్ణ.
2.229.

**కల్లోలము** సం. వి. అ. పుం.
పెద్ద అల.
వ. ... అనిలాలోల కల్లోల మాలా
స్ఫాలన సముచ్ఛలజ్జల కణాసార
శిశిర శిశిరంబగుచున్న గంగా పులిన
తంబున. ఆది. 4.142.

**కల్లోలిని** సం. వి. ఈ స్త్రీ
కల్లోలములు గలధి. నది.
కం. కాల మడఁగించు జనుఁగ,ల్లో
లిని గిరి, ద్రెంచు కరణి లోభక్రోధా,
శీలత్వకామభయములఁ, దేలు జనుఁడు
కాల వృత్తి తెఱఁగు నెఱుఁగునే.
శాంతి. 4.444

**కల్హారము** దే వి. అ. న.

ఇంచుక యెఱుపు తెలుపు గలిగి మిక్కిలి పరిమళించు కలువ.

వ. ... కమల కుముద కల్హార కల హంస సంకుల పంకజాకరంబులను. ఆర 1.285.

నిఘంటువు లందు 'కహ్లార' శబ్దమేకాని కల్హారశబ్దముగానరాదు. సంశోధితముద్రణమునం దునుఈ తావునకల్హార శబ్దమే కనిపించుచున్నది. పాఠాంతరముగాఁ గూడ కహ్లార శబ్దము ఈయలేదు, కాని ఆర. 6.84. సంఖ్యయందు పంపాసరోవర్ణన సందర్భము 'కహ్లార' శబ్దము కన్పించుచున్నది. అతావున 'కల్హారము' పెక్కు ప్రతులు అని పాఠాంతరము చూపుచున్నది. మూలమున ఈ పుష్ప ప్రశంసయే లేదు. భారతేతర కవిప్రయోగములందు ఈ కల్హార శబ్దము కన్పించుచున్నది. ఈ శబ్దమును గుఱించి శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు శబ్దరత్నాకరమునందలి సవరణలు. వివరణలు అను శీర్షిక క్రింద కూలంకషముగఁ జర్చించినారు

**కవ** దే. వి.

జోడు, యుగము.

కం. ... తన, కనుఁగవఁ గడునభ్రువారి గదలు కొనంగన్. విరా. 4.152

సీ. చిక్కని చనుఁగవఁ జీఱగోరు. ఆది. 8.38.

(బ) చూ. కవలు.

విణ.

రెండు

చం. కవదొనలేల పూనునొకొ కవ్వడి వావలదు, విరా. 5.45.

**కవచధారణము** సం. వి. అ. న.

కవచమును ధరించుటకు సంబంధించిన గొప్ప విద్య. దీనిని ద్రోణుఁ డర్జునునకెఱింగించెను. అర్జునుఁడభిమన్యున కెఱింగించెను.

సీ. కవచధారణమను ఘనవిద్య గవ్వడికే నెఱిఁగించి నితఁడు (అభిమన్యుఁడు) దాని, నేర్చు నీతని నెట్టన నొప్పింపశక్యంబు గాదు. ద్రోణ. 2.105.

యుద్ధ కాలమున దీనిని ద్రోణుఁడు దుర్యోధనున కిచ్చెను ద్రోణ.3 116 ఈ విద్య బ్రహ్మనుండి దేవేంద్రునకు ఇంద్రునుండి అంగిరసునకు అంగిరసుమండి బృహస్పతికి బృహస్పతి నుండిఅగ్నివైశ్యునకు అతని నుండి ద్రోణునకు వచ్చెను, ద్రోణ. 3 116.

**కవచము** సం వి. అ. పుం.

జొండశము (యుద్ధకాలమందు తొడుగుకొను) ఇనుప చొక్కాయ.

సీ. రాధా సుతుం దర్థరథుఁడు గుండలముల, గవచంబుఁ బోవుట కారణముగ, ఉద్యో. 4.234.

ఇదినాల్గు విధములు: 1. తనుత్రాణము (నడుము పై భాగమును గాపాడునది. 2. కంకటము (వక్షస్సును మాత్రము గప్పునది) 3. శిరస్త్రాణము (శిరస్సును గాపాడునది) 4. అంగుళిత్రాణము (చేతివేళ్లను మాత్రము గాపాడునది)

**కవచి** సం. వి. ఇ. పుం.

గాంధారి ధృతరాష్ట్రుల కొడుకు. అది 5.107.

ఇతఁడు తన తొమ్మిదిమంది సోద
రులతో నొక్క మాఱుగా భీమునిచేఁ
జచ్చెను.కర్ణ. 3.228.

**కవట** దే. వి.

పెద్దకొమ్మ స్కంధశాఖ.
(శమీ వృక్ష వర్ణనము)
సీ. కవటలొండొంటితోఁ గదియుచు
నెడములు ద్రిమ్మంగి ప్రబ్బ,గ సొంపు
మిగులు దాని. విరా. 1.162.

**కవణము** వి.

గుఱ్ఱము మొదలగు వానికిఁ బెట్టు ఉల
వలు లోనుగాఁగల భక్ష్యము, దాణ,
ఆహారము.

ఆ. బియ్యములును నేయిఁ బెరుగును
గూరగా,యలును వంటకట్టియలను
గడ్డి, కవణములు బెల్లుగా నొదఁ
గూర్చిని, గూఢవృత్తిఁ దానుగూడ
నడచె. ఉద్యో. 1.98.

**కవయఁబాఱు** దే స. క్రి.

కవయు. రతిఁగూడు, రమించు.

కం. కుడుచుట కట్టుట పూయుట,
తొడుగుటయును వివిధ ధనతతులు
గూడుట యెక్కుఁడు వేడ్కసేయఁ
జాలవు, పరఁతికిఁ బరపురుషుఁగ
వయఁ బాఱుట పోలెన్. అను.
2,177.

**కవయు** దే. స.క్రి.

(రతియందు) కూడు, రమించు.

కం. సురలోక రాజ్య పదవీ, గరి
మంబున మున్న నన్నుఁ గవయం బ
రమా, దరతిలఁ బతురయగునీ, సత
సిజముఖిగామి యేమి చందమొ తలఁ
పన్. ఉద్యో. 1.150.

కం. దినమున సురతంబెయ్యేదఁ,
జనదు చెడిపఁగన్యఁ గవయఁజనదు.
అను. 4.115.

కం, అందుఁ దన దృష్టి నాటుడుఁ,
గందర్ప నిశాతసాయకంబులు పెలు
చన్, డెందము గాఁడిన ధృతిసెడి,
కంది మునీంద్రుండు దానిఁగవయంది
విరెన్. ఆది 4.44.

**కవలవారు** దే. వి.

నకుల సహదేవులు.

ఆ కవలవారుఁ గొడుకుగమియుఁ
బాంచాలవర్గఁబు వృష్ణివరులుఁ
గదఁగిరేని, నొక్క మాత్రలోన ను
వ్వెత్తుగొనరెదు. ర్యోధనాది శతము
నుద్దవిడిన. ఉద్యో 1 29.

**కవలు** దే. వి. (√కవ)

నకుల సహదేవులు
(మాద్రికి ఇంచుమించు సమకాలమున
జనించిన వారగుటచే వీరికి పేరు
వచ్చెను)

కం. ... అ తండ్రి,ట్లను, బవనతన
యుఁ గవలం,గొని సమరంబునకుఁ
బోవఁ గోరెదు మదితోన్. విరా.
3.151.

ఉ. ...వినయాభరణుల్ కవల్ సమా
,ధానసమేతులే యకట ద్రోవదిసాధ్వి
సుఖంబె దానికిన్. ఉద్యో. 3.186.

**కవాటము** సం. వి. అ. పుం న.

తలుపు.

డస్త్ర ప్రతతినించి వెగడొందించెన్. ఉద్యో. 4. 342.

4. పైకొల్పు. ఉసికొలుపు.

వ. వారలిట్లైన నక్కురుభూనాథుం డేనుంగుకయ్యంబునకు వెరవుగల కళింగ వంగాంగ మగధ సుహ్మపౌం డ్రాది దేశంబుల బలంబులం గవి యించిన నవి తదీయ చతురంగ బలం బుల మష్టి మల్లాడి చిత్రవధ విహారంబు సలుప. కర్ణ. 2, 848.

5. సమీపింపఁజేయు

ఉ. భీముఁడప్పుడున్ రథము భీమ గతిం గవియింప. కర్ణ. 2. 228.

**కవియు** దే. అ. క్రి.

1. కప్పు, ఆచ్ఛాదించు.

ఆ. మంచు మలుంగు వడిన మార్తాం డుఁడును బోలె, నీఱు గవిసి యున్న నిప్పుఁబోలె, వేషధారియైన విష్ణుండు బోలెన, వ్విరటు కొలువు సేర నరుఁడు వచ్చె. విరా. 1 258

2. పర్వు, వ్యాపించు, క్రుమ్ముకొను

క. సమరంబున భటులుగడు, గ్రమ్మ మొందిరి తమము గవిసినఁగాని, సము ద్యమ సంరంభ ముడుగరిది, సమ యంబని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్. విరా. 3. 194., భీష్మ. 2. 184.

క...భూసురాహుతి మంత్రోద్భవ దారుణ దహన శిఖల్, గవిసిన నెద్ది యును జేయఁగా నెద గలదే. ఆది. 2. 182.

3. పైపడు పైకొను, మార్కొను, పడు, ఉఱుకు.

క. దిక్కులుఁ దనబాణంబులు, పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరుతే, రక్కడడించి ద్రుపదవిభు, డుక్కఱఁ తత్సేనమీఁద నురవడిఁ గవిసెన్. భీ. 1.282.

ఆ. మదము మిగిలి కేతుమంతుఁడు కౌంతేయు, పైకిఁ గవిసి యతని బాణ శిఖల క్రందిపోయె. భీష్మ. 2. 62. 871.

ఉ. దంతియు...దు, ర్దాంత సము ద్యమం బెసగ దానిపయిం గవిసెన్ మహోగ్రమై.

చ. కవిసి ఖరంబులైన మునికాళ్లను త్రేయగ. అను 1. 281, 282.

క. రవిబింబము రాహువుపయిఁ గవి సినఁ బాసినను దోఁపకయుఁ దోఁచియు నుం, డువిధము యజ్ఞానంబున, యవిరతి విరతులయధీకుఁడగు టాతుఁగొనెన్. శాంతి. 4. 184.

4. విజృంభించు.

క. అశ్వత్థామహుఁడు వెసన్.

తే అరిబలంబులపై నొక్క దివ్యశస్త్ర మేయదలంచి మరిఁబోసి తిగిచియు దగ్గ వృత్తిఁ గవిసి ముందటనున్న శిఖండిచూడ్కి, డొదరుటయుఁ దాల్మి మైఁదెగయుడిపె నధిప. భీ. 3. 335

5. వచ్చు, ఆసన్నమగు.

వ. పార్థు బాణాంధకారంబునకుఁ దోడు సంధ్యా సమయంబు గవిసినం గురుసైనికులకుఁ దమవారెదిరి

వారలని నిరూపింప, నశక్యంబగుట యు. ద్రోణ. 1.214.

6. పొదువు, క్రమ్ము,

కం. పెరయాఁగల గతిఁ గవియుచుఁ, బొరిఁబొరి గడుఁదురుల పగిది బొదువుచు నెరకై వెరవునఁ గాకులు క్రోతులు బరువడిఁ జీకాకుపఱచు భంగినలఁచుచున్. ద్రోణ. 1.268.

స. క్రి.

ఎదుర్కొను, ఢీకొను.

చం. ... వి,చ్చలవిడి భూవిభుం గవిసె సామజమున్ . వెసనేయుఁదంచు జో,దులకును జేయివీచి మున్ను దోలె నతండు రథంబు బల్విడిన్. భీష్మ. 2.250.

వ. ... అప్పుడు తన్నుం గవిసిన ధృష్టద్యుమ్ను నమ్ముల నవలీలం గుదియించి యగ్గురుండు వెండియుం గొందఱం జీకుకొవఱిచె. ద్రోణ. 1.308.

**కవియుదెంచు** దే. అ. క్రి. (కవియు + తెంచు. స్వార్థమున)

పైకొనవచ్చు, మార్కొనుటకు వచ్చు

కం. రక్కసుఁడును దనమదిలో, నక్కపి వీరులను జీరికైనఁ గొనక పే,రుకున్న రముకులు, దిక్కున కుం గవియుఁ దెంచెఁ దీవ్రస్ఫురణన్. అర. 7.97.

2. కూడవచ్చు, కలిసివచ్చు.

గీ. హస్తిపురిఁ బేరుగల మదహస్తి నెక్కి, కాలు కావలి రథములు గవియుదేర,న భగజముపైఁ జర్జున్యుఁడ నగనంప, వాన పరఁగ వికర్ణుండు వచ్చితాఁకె. విరా. 6.192.

3. పర్యా. వ్యాపించు.

గీ. జలరుహంబులు పాండవ సైనికుల మొ,గంబులట్టుల విన్ననై కాంతి దఱిఁగె, వారి మనముల భీత్యంధకార మదరు, కరణిఁ జీకటి యెదనెదఁ గవియుఁదెంచె, భీష్మ. 1.300.

సీ. ధవళాక్షి తొంగలి తఱచు తెప్పం బెన్ను, కప్పను చీకటి గవియుఁదేర. విరా. 2.37.

**కవిల** విశ. (సం. కపిలం-ప్రా.కవిలం, క. కవిల) కపిల వర్ణము గలది,చూ. కపిల

మధ్యాక్కర ;– అవసరజ్ఞుండయి వ్యాసుఁ దేతెంచెనంత నత్తపసి, కవిల గడ్డంబును, కవిల జడలును, ఆది. 4.253.

తే. ఖర శృంగాక్షిఖుర నాసికాపుటము లు,గపిలములు గుత్తుకయును ముష్కములు గవిల,పట్టులొందు నెందే నొక పట్టు కపిల,మైనఁ గపిలాశ్వ గుణము న కదియచాలు. అను. 3.104.

**కవుఁగిలి**
**కవుంగిలి** } దే. వి. ఔ. కౌఁగిలి (√ కవుఁగిలి)

ఆలింగనము.

కం. నివురంగఁ దెలిసియతనిం,గవుఁ గిటిలోఁ జేర్చిమస్తకము. మూర్కొను కౌ,రవ వృద్ధునతఁడు నాశ్లే,ష విశేషంబున నొనర్చె సంప్రీతునిగన్.

కం. గ్రుచ్చి కవుంగిటఁ జేర్చెను, వచ్చితిరే నృప కుమారవరులార యనున్. స్త్రీ. 1.180.

**కవుఁగిలించు** | కౌఁగిలించు దే.స క్రి.
**కవుంగిలించు** | (√కవుఁగిలి)

ఆలింగనము సేయు.

చం. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయ తాక్షి నె, మ్మొగము మొగంబునం గదియ మోపు. విరా. 1.247.

**కవ్యము** సం, వి. అ. న. (వ్యతి. హవ్యము).
పితృదేవతల కియ్యఁదగినది (అన్నము-మొ.)
మాలిని,- అమల హృదయవేద్యా హవ్య కవ్య ప్రసాద్యా. శాంతి. 4.457.
కం. ద్విజవర వినిర్మితములగు యజనస్వాధ్యాయ కవ్య హవ్య తపోదా,న జపంబులఁ బితృ దేవత లజస్రము దృప్తులగుదురని కడు నలుకన్. ఆది. 8.101.
2. పితృకార్యము.
కం. విను హవ్య కవ్యములు మ,జ్జన భోజనములను విప్రజాతి వనితదాఁజని సేయ నడపునది య,ప్పనులకు బెఱ సతులు, గామి బ్రాహ్మణుఁడు నృపా. అను. 2.240; శాంతి. 5.189.

**కవ్వడి** దే. వి. (కవ+వడి)
రెండు చేతులందును సమానమైన వడి గలవాఁడు. అర్జునుఁడు.
వ కవ్వడి యెయ్యెడఁగవిసె నయ్యెడ న తలపడ వలయు. విరా. 4.287.
(ఇది నిహతము - నిక్కలాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు. బాలవ్యా. సమాస 20).
విశ.
రెండు చేతులయందు సమానమైన వడి గలవాఁడు.
సీ. ఉత్తుంగ ఘనవిశాలోరస్కుఁడని యును గవ్వడియనియును గరము వేడ్క,వివ్వచ్చు నెప్పుడు విని యెడు నది-ఆది. 8.185.

**కవ్వము** దే. వి.
చిలికెడు సాధనము, మంథానము, మంధరము.
ఉ. మేరు మహామహీధరము మీఁదికి నందఱుఁ బోయి యేక్రియన్, వారిధిఁ ద్రచ్చువారము ధ్రువంబుగ దానికిఁ గవ్వమెద్ది-ఆది. 2. 9.

**కళ** సం. వి. ఆ. స్త్రీ.
గుఱ్ఱము మొదలగు వానిని కొట్టు చేబుకు, కొరడా
వ. ఇట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగ బటు కశాఘాతంబునం గెరలు శూకలాశ్వంబు చందంబున గెరలి. శల్య. 2 95.

**కళకోల** మిశ్ర. వి. (కళ+కోల)
గుఱ్ఱము మొదలగు వానిని కొట్టు చబుకునకుగల కఱ్ఱ, కొరడాకఱ్ఱ.
వ. ఏను ధర్మపథంబున నున్నవాఁడ నేలతొలంగుదు ననిన నలిగి కల్మాష పాదుండు తన చేతి కళకోల నమ్మునీంద్రుని వేసిన. శాంతి. 7.112.

మూలమునందు కశతోఁగొట్టినట్లే కలదు. నన్నయగారేలకో కశకోలతోఁ గొట్టించిరి.

శ్లో॥ అముంచం తంతు పంథానం తమృషిం నృపసత్తమః, జఘాన కశయా మోహాత్తదా రాక్షస వన్మునిమ్। కశాప్రహారాభిహిత స్తత స్స ముని సత్తమః, తం శశాప నృపశ్రేష్ఠం వాసిష్ఠః క్రోధమూర్ఛితః.

సం. భా. ఆది. 176. 11, 12 శ్లో

**కశ్యపగీత** సం. వి. అ. స్త్రీ.

క్షమను గురించి కశ్యపునిచేఁ జెప్పఁబడిన గీతలు.

ద్రౌపదీ ధర్మరాజ సంవాదమున ద్రౌపది క్షమను గూర్చి చెప్పుచు వీని పేరు గ్రుచ్చియెత్తెను. అర.1.224.

**కశ్యపబ్రహ్మ** సం. వి. న్. పుఁ.

కశ్యప ప్రజాపతి.

తే. విశ్వసృజులను మునులచే వితతమగు సహస్రవత్సర కలిత మహాధ్వరమునఁ, గశ్యపబ్రహ్మ యెవ్వానిఁ గనియెఁ గనక, పక్షుఁ దార్క్ష్యాత్ముఁ డలఁతు నప్పద్మనాభు. శాంతి.2.26.

**కశ్యపుఁడు** సం. వి. అ. పుం.

అదితి దితి మొదలగు దక్షుని పదుమువ్వురు కూతులకు భర్త, బ్రహ్మమానస పుత్రుఁడగు మరీచికి కొమరుఁడగు ప్రజాపతి సప్తర్షులలో నొకఁడు ఇతని పేర భూమి కాశ్యపి యయ్యెను.

క. విను నీవదితి సుతుండవు, వినతకొడుక నేను విజ్ఞాపింగెడు మనతున్, జనకుఁడు కశ్యపుఁడొక్కఁడ దనుజాలకోర్చించి చంపుదమ యిరువురమున్. ఉద్యో. 3. 295.

వ... మరీచికిం గశ్యప ప్రజాపతి జన్మించె. శాంతి, 4. 208.

వ....విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ కశ్యప వసిష్ఠాత్రి ప్రభృతి మునివరప్రకరంబు. ద్రోణ. 5.308.

అ కశ్యపునకిచ్చి కాశ్యపియను పేరఁ జనఁగఁజేసె నుర్వి జామదగ్న్యువినమె. ద్రోణ. 2. 212.

చూ. వివరము చివరి సంపుట అనుబంధము

2. ఒక బ్రహ్మర్షి -విషవైద్యుఁడు.

ఈతఁడు బ్రహ్మవలన సర్ప విషముచేఁ జచ్చినవారి బ్రతికించు మంత్రముపదేశమందెను. ఈతఁడు శృంగి శాపగ్రస్తుఁడైన పరీక్షితుని తక్షక విషాగ్ని నుండి రక్షించుటకై పోవుచుండెను. మార్గమధ్యమున బ్రాహ్మణరూపమునఁ బరీక్షిత్తు నొద్దకు బోవుచున్న తక్షకుఁడతనిఁజూచి విషయమెఱింగి యతని బరీక్షింప దలఁచెను. అచట నున్న వటవృక్షంబుఁ గఱచి భస్మంబుసేసి యోపుదేని సంజీవితంబుఁ జేయుమని కశ్యపుని గోరెను. తక్షకవిషాగ్నిచే భస్మీభూతమైన యా వటవృక్షమును కశ్యపుడు తనమంత్ర బలముచే నెప్పటియట్ల గావించెను. తక్షకుడు ఆ కశ్యపునకు కోరిన ధనముకన్న మిక్కిలి యిచ్చి రిమ

కకు పంపివైచెను.
ఆది. 2. 184 మొ. 198 వఱకు.
ఈ కశ్యపుఁడు వేఱు మరీచి పుత్రుఁడు కశ్యప ప్రజాపతి వేఱు. కాని మూలమున ఈ మట్టమున కాశ్యప శబ్దము చెప్పఁబడినది గాని కశ్యప శబ్దము గానరాదు, కాశ్యపులు పెక్కండ్రు గలరు అది గోత్రాపత్యార్థక తద్ధిత పదమైయుండును.
శ్లో॥ రాజ్ఞః సమీపం బ్రహ్మర్షిః కాశ్యపోగంతుమైచ్ఛతి తందదర్శాథ నాగేంద్ర స్తక్షకః కాశ్యపంమ్ తదా. తమబ్రవీత్ పన్నగేంద్రః కాశ్యపంత్వంతం ద్విజమ్ సం. భా.ఆది. 50. 1719.
3. వసుదేవుని పురోహితుఁడు. వసుదేవుఁడు పాండవుల జననము విని హర్షించివారికి అమేయ రత్నభూషణావళులిచ్చి తన పురోహితుఁడైన కశ్యపుని వారి యొద్దకుఁ బంపెను. ఈ కశ్యపుఁడు పాండురాజు నొద్ద కొంత కాలముండి పాండవులకుఁ గ్రమంబున జాతోపనయనంబు లొనరించి వేదాధ్యయనంబు సేయించెను. ఆది. 5.186 187.

మూలము నందీ కశ్యప ప్రస్తావనము గానరాదు. కశ్యపునకు పశ్యకుఁడు అని పేరు శ్రుతి స్మృతులందుఁ గాన వచ్చుచున్నది.

కశ్యపః పశ్యకో భవతి సాక్షాత్ యత్సర్వం పరిపశ్యతీతి శ్రుతిః.

**కషాయపక్వత** సం. వి. ఆ. స్త్రీ.
కషాయపక్వము. ఆయా యోషధులను నీటి యందు వైచి విధి ప్రకారము కాచఁగా ఆ యోషధుల సారము నీటి లోనికి దిగి కషాయముగ నగుట. కషాయ ద్రవ్యములను జెప్పబడిన పరిమాణములోఁ దీసికొని చెప్పబడిన పరిమాణముగల నీటిలో వైచి యొక రాత్రి నానబెట్టవలెను. మఱునాఁడు దానిని పొయిమీఁదఁబెట్టి తొలుత సన్న నిమంట బెట్టి క్రమక్రమముగా కాచవలెను. నీరు కొద్ది కొద్దిగా తగ్గుచుండ నోషధుల సారము నీటికి క్రమక్రమముగాఁ బట్టుచుండును. ఎనిమిదవ వంతు నీరు మిగులు వఱకు గాచిన ద్రవ్యముల సారమంతయు నీటిని బట్టి యప్పుడది కషాయపక్వత నొందును. దానిని వడఁగట్టి సుఖోష్ణముగా నుండు నప్పుడు సేవింపవలయును.

ఇట్లుగాక వస్తువులను ఇష్టము వచ్చిన పరిణామముగఁ దీసికొని యిష్టము వచ్చిన పరిమాణపు నీటిలో వైచి కాచినను లేక మంటఎగదిగ బెట్టి కాచి వైచినను ద్రవ్యసారము నీటికెక్కదు; అది కషాయము గాదుగాన గుణము లేకపోవుటయే గాక చెఱుపును గలిగింపవచ్చును.
అట్లే ఒకపని కాలక్రమముగ మార్పులు చెందుచు వచ్చి పరిణామ స్థితికి వచ్చినప్పుడే ఫలము నిచ్చువదగును. అందువలననే కాల పక్వము కషాయ పక్వము గావలయునను లోకోక్తి యేర్పడినది.

చం. అనుటయు నాతఁడిట్టులను నక్కురుభర్తకు వేగమేటికిన్. ఘన భుజ యెల్లచందములు కాలముతోడిన

చుమ్మ వర్ణధర్మనిరతి చిత్తపాకము
గ్రమంబున, దెచ్చు కషాయ పక్వ
తం, బనుపడఁ కర్షుఁడేలగు నృపాల
కుమారుఁడు సన్న్యసింపఁగన్ శాంతి.
5.892.

వర్ణాశ్రమ ధర్మములు సక్రమముగా నాచరించుచు గాలము గడుపుచు రాఁగాఁగ్రమ క్రమమునఁ జిత్తము పరిపక్వత నొంది సన్న్యసింప ననువగు స్థితి దాని యంతటనది యేర్పడును గాని యొక్కసారిగా చిత్తపరిపక్వత రాదు అని భావము.

సీ విను ముపనీతుఁడై విప్రుండు బ్రహ్మచర్యంబు వేదాభ్యసనంబు నడపి, దార సంగ్రహము సంతాన సంపాదనంబును నధ్వర క్రియయును నొనర్చి, దేవ పితృతిథి పూజా విధి పరుఁడగుచుండి వనమునకు హూత వహ ప్రయుతముగఁ జని యందున తిథులఁ గొనియాడి వ్రతము గషాయ పక్వత నొనర్చు.

ఆ. నగ్నులాత్మయంద యారోపితము లుగఁ జేసి వీతరాగ చిత్త వృత్తిఁ బరమ శాంతిఁ బొంది బ్రహ్మాశ్రమ పదంబుఁ బొందు వాఁడు లోకపూజ్య చరిత. శాంతి. 6.272.

**కషాయపక్వము** సం. వి. అ. న.

కషాయము పక్వమగుట. చూ. కషాయపక్వత.

ఇట్లాయురంశంబులు నాలుగుం జెల్లుట యుత్తమ ధర్మ స్వరూపంబంశత్రయ కాలాచరితంబైనయాశ్రమత్రితయంబు ప్రవర్తనంబులఁ గషాయ పక్వంబగుటయు జతుర్థాశ్రమంబుఁ జెందుట కృత్యంబు... విరా. 5. 141.

**కషాయము** సం. విణ. (అ, ఆ. అ)

ఎఱ్ఱనైనది.

క....వాలిసుగ్రీవులు దాఁకి రొండొరులకృత్రిమ రోషకషాయ వక్త్రులై ఆర. 6. 880.

వి. అ. పుం. న.

క్వాథము. ఓషధులను వేసి విధి ప్రకారము మిగులునట్లు కాచిననీరు. చూ. కషాయపక్వత, కషాయపక్వము.

**కషాయితము** సం. విణ (అ ఆ. అ)

ఎఱ్ఱవాఱినది. ఎఱ్ఱగాఁ జేయఁబడినది.

వ....అనిన విని రోషకషాయితంబు లగు తారకంబు లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధన సత్తముండు. అశ్వ 3. 82.

**కష్టత** సం వి. ఆ. స్త్రీ. కష్టత్వము.

పాపము.

చ. పలల వృథోపభుక్తి .... ఉగ్రలి దివసంబునంగవయుకష్టత... తూఁడు తీగలపొది ద్రుచ్చిలించుటని కశ్యప సంయమిపల్కెభూవరా. అను 3. 232.

**కష్టత్వము** సం. వి అ. న. కష్టత.

పాపము.

సీ. సజ్జనులం దురాచారవంతుల దురాచారంబు గష్టత్వకారి యట్లు, గావున నాచారగతి వింట గడులెస్స.
శాం. 4. 117.

**కష్టపడు** మి. అ. క్రి. (కష్టము + పడు

1. భంగపడు, నిర్జింపబడు.
క. నీవును ద్రోణుఁడు గలుగం,గా
వైరులచేత నేను గష్టపడితిం గాదే-
భీష్మ. 3. 187.
మహోత్కచం సమాశ్రిత్య పాండవై
ర్యుధినిర్జితః.
సం. భా. భీష్మ. 96. 6.
2. బాధపడు.
ఉ. దానవులచేతఁ గష్టపడి దైన్యము
నొందుట నోర్వలేకనీ,దైన పదాం
బుజంబు లభయంబని చేరితిమి.
అర. 6. 290.

**కష్టపఱుచు** మి. స క్రి. (కష్టము + పఱుచు) కష్టపడజేయు. బాధ పెట్టు.
చ...సాత్యకి యతిశ్రమ మొందిన
చోటఁ దాఁకి క,ష్టపఱిచి చంపెదీవతఁ
డు సచ్చనె యాఱడియేను గర్గిగావ్.
ద్రోణ. 4.220.

**కష్టపాటు** మి. వి.
దుఃఖముపడుట.
తే. క్షత్రధర్మంబు విడిచినఁ గలదె
యిహముఁ బరముఁ బేరోలగంబునఁ
బలుకు పలుకు, లెల్ల మఱచితె విను
మవిపొల్లులైనఁ గష్టపాటుగాకు సుజేం
గావవచ్చు శల్య. 2.56.

**కష్టపుఁబాటు** మి. వి. కష్టపడు.
ఇడుమలు పడుట.
చ. కౌరవకోటి చేత మన కష్టపుఁబాటు
దలంపు వచ్చినం, గ్రూరవిచేష్టితంబు
నకు గొంతి యొదఁబడె బంధువర్గమున్
ఘోరముగా వధించుటకుఁ గోల్కొన
కున్నది బుద్ధిమీరు నిర్ధారణ సేయుఁ
డా హితము ధర్మము నయ్యెడ పృత్తి
మెట్టిదో. ఉద్యో. 4.90.

**కష్టము** సం. విణ (అ. ఆ. అ)
1. బెట్టిదము, క్రూరము.
ఆ. క్షత్రధర్మమింత కష్టమగునె పెలు,
ధర్మ మాచరింపఁదగద యంద్రు,గాన
శస్త్రజీవికయ తగియున్నది,యైనవంశ
నాశమనభిమతము ఉద్యో. 3.15.
2. నీచము.
ఉ. కర్ణముదప్పె నీయెదురఁ గష్టపు
మాటలకేల యోర్తురీ, దుర్జనుఁడైన
శాంతనవు దోర్బల మేటిది యీత
డొక్కడున్ వర్జితుఁడైన నేమి.
ఉద్యో. 4.242.
ఉ. శూరుదవంద్రు నిన్ మదువు నొ
చ్చుట శౌర్యము చొప్పెమాన మే,యూ
రికిఁబోయె నాజినృపులోడుదురేన్నపుఁ
దన్నమాత్రయే, కౌరవవంశ జాతుఁ
డవు కష్టపుఁ జచ్చుట దెచ్చుకొంటి నీ,
పేరును బెంపు మాలి యరిబృందము
నవ్వగ నిట్లుసేయుదే. శల్య.2.55.
వి. అ న.
1. కీడు, హాని, విపత్తు.
వ. దుర్యోధను చేసినయవ,కార్యంబు
న వచ్చినట్టి కష్టంబులు దా, త్పర్యం
బున వినియెదఁ బ్రతి,కార్యంబులు
గామిమనసు గందుచునుండన్.
కర్ణ.1.224; కర్ణ. 1.28.
2. అవమానము, హైన్యము, న్యూన
త, అపకీర్తి.
సీ. దానినంతయు భీమసేనుండు విని
రాజ్య, సంప్రాప్తి పాండవ సత్తము
లకు, సతి కారణంబున ధృతమయ్యె
నను నింతకంటెను కష్టంబు గలదె
యొందు. సభా. 2.269.

చం. తఱిమి సుశర్మ దమ్ములును
దానును నాజికి నన్నుఁబిల్వనే. నెఱుఁ
గనియట్టులుండుటిది యే పురుషార్థము
వారినెల్ల నే. డ్డైఱనుఱుమాడఁ బం
పుముకడిందిగఁజూడకునీకునేమియుం,
గఱిగాఁ గాదు. పోమి గదుఁ గష్టము
నాకునుదాత్తమానసా. ద్రోణ.1 228.
ఉ. గాండివి నొవ్వఁ బల్కిటిటు గర్ణు
ని జంపక వచ్చితేనిత,మ్ముండవుగావు
నాకునని మూర్ఖత సోదరఘాతినైన
కష్టుండ మనంబునం బెఱుఁగు శోక
మునెట్లు సహించుతుఁ దప్పెనా,తండును
నేమునైన విబుధ ప్రకరంబును మాకు
నడ్డమే, శాంతి. 1,14.
4. దుఃఖము. చూ. కష్టపాటు.

**కష్టముపాటు** మి. వి.
కష్టపడుట, ఇడుమలు నొందుట.
ఉ. ఎందును నెవ్వరుంబడని యెంత
యుఁగష్టముపాటు వచ్చినన్, ఉద్యో.
2.129.

**కష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ)
1. దుర్మార్గుఁడు.
చం. అరుచియుఁ గష్టుఁడున్ లఘువు
నైన నిజాగ్రజు మేనితోడ ని,త్య
శుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు
నాఁ జనునింతిఁ గొంచుఁ గ,ర్కశమతి
కీచకున్. విరా, 3.18.
2. క్రూరుఁడు.
సీ. దుష్టాత్మకుఁడుఁ గదుఁ గష్టుఁడు
మద్రకుం,డు. కర్ణ. 2 47.
3. పాపి.
కం. సతతంబు నత్తమాఁకుట బతి
యెడ దుశ్చిత్త యగుటఁ పరమాన్న
మునా,కృత సేవించుట నగు దుర్గతి
బిసముల డాఁచికొన్న కష్టుఁ గలు
గున్, అను. 3.244; శాంతి. 1.14.
4. నీచుఁడు.
సీ... కటుక వాక్యములఁ దొల్లి, శిష్టు
నొప్పించిన కష్టుండు. అను. 5 99.

**కసటు** వై. వి.
1. విషాదము, ఖేదము. దుఃఖము.
వ. పార్థున కుపనిషదర్థ జాతం బవ
గతంబు సేసి మనసు కసటు. వాపి
వివేకంబునకుం జేవ గల్పించి
కృష్ణుండు... భీష్మ. 1.223.
2. మాలిన్యము.
క. ఆ వణిజుఁడు ధర్మస్థితి, దేవత
లును మెచ్చునట్లు దెలియఁ బలికెన్,
నీవీ వాక్యములన్నిట, భావంబలవడఁచి
కసటు వాపుము వత్సా. శాం.5.269.
మౌస 82.
3. పాపము.
క. వినువిష్ణుని సంస్పర్శం,బున నప్పు
డచూవె కసటుపోయిన నతనింగనుట
యు శాంతిఁబొందుట యును గురుపర
కలిగె వృత్రునుల్లంబునకున్. శాంతి.
5 428.
సీ. దురితంబు లెన్నండుఁ బొరయక
వెలుగొందు, కమలాప్త కులమునఁ
గసటు గలిపి. అర. 6 302.

**కసి** దే. వి.
తీఁట, దురద.
క. చేతులుదలలును బహు విధ,హేతు
లఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁ
గించెం,జేతులకసి వోవంగ న రాతులు
బెగ్గిలగఁ గ్రీడి ప్రకట స్ఫురణన్.
కర్ణ. 2.300.

చ...దుష్పసేమపనియొక్కటిదీర్చితి
తీర్పుమింకఁబా,వాంకసివోవ వీనిపని
యుం ద్వరితక్రమ విక్రమంబునన్.
కల్కి. 2.126.

**కసిమసఁగు** కసిమసఁగు. దే. అ. క్రి.
విజృంభించు, చెలరేగు.
క. వారలనందఱరౌద్రా, కారుండైకసి
మసంగి గాంగేయుఁడు దు,ర్వార పటు
బాణనిహతిని, వీరావహరంగమునకు
విముఖులఁ జేసెన్. ఆది 4.201.
సీ. కసిమసఁగిన మారిగడఁగి జీవుల
పొడ,సుగ్రతఁ గవియునట్లురవడించి.
ఉద్యో. 2,129.
క. వెసఁదెక్కమ్ములు మనపైమసఁగు
వడఁబఁజపియతఁడు మురభంజన
సంతసమందెదు నింతన యేఁ,కసిమ
సఁగెద,బాదు నన్ను గాండీవంబున్.
కర్ణ. 2,294.

**కసుగందు** దే. అ. క్రి. బాధపడు.
చం. అతఁడు మదీయ సఖ్యపరుఁ
యేదక్కట మే గసుగందకుండ బా
షితిపతి యమ్మెయిం బదుల చేతఁ
బరాభవ మొందెడి. సా ప్తి 1.71.

**కస్తూరి** సం. వి. ఈ. స్త్రీ.
మృగమదము, కస్తూరిక, కస్తురి (ఒక
రకమైన పరిమళ ద్రవ్యము) ఇది
కస్తూరీ మృగము యొక్క నాభినుండి
పుట్టును)
సీ. కస్తూరి నీళ్ళుల కలయంపులను
గప్పురంపు మ్రుగ్గుల ... అలంక
రించిపురము, అశ్వ. 8.202. శాంతి
1.364.

**కస్తూరిక** సం. వి అ. స్త్రీ
మృగమదము, కస్తూరి, కస్తురి,
సీ. కర్పూర చందన కస్తూరి కాదుల
నింపు సొంపార భోగింప గలదె.
విరా. 5.204; స్త్రీ 2.16.

**కహ్లారము** సం. వి. అ. న.
ఇంచుక యెఱుపు తెలుపును గలిగి
మిక్కిలి పరిమళించు కలువ.
సీ. కమనీయ కమలినీ కహ్లార దళ
కేసరాన్విత జలముల నర్ఘ్య విధియు,
అర. 6.364. చూ. కల్హారము.

**కళ** సం. వి. అ. స్త్రీ. కల.
విద్య (నర్తన విద్య. ధనుర్విద్యము.)
తే. కనియె బవమాన వివిధ నర్తన
కళాను, వర్తిఁగాక ఘూకారవస్ఫూర్తి
జాత; భీతి పరిసర వర్తి నాఖిలభుజ
గచండ మూర్తి శమీతరు చక్రవర్తి.
కం. వృకు,డను పాంచాల కుమా,ర
కుఁడఋవది తూపులం గరం బరుదు
గన, ద్రు కళాచార్యుం బొదివిన, వికా
సముం బొందెఁ బాండ వేయ బలంబుల్
ద్రోణ. 1.256. ఇవి అఱువది
నాలుగు 1. ఇతిహాసము. 2. ఆగ
మము 3. కావ్యము. 4 అలంకారము
5. నాటకము. 6. గాయకత్వము.
7. కవిత్వము. 8. కామశాస్త్రము
9. దురోదరము. 10. దేశభాషాలిపి
జ్ఞానము 11. లిపికర్మము 12. వాచ
కము. 13. అవధానము. 14 స్వర
శాస్త్రము. 15. శాకునము. 16. సాము
ద్రికము 17. రత్నశాస్త్రము 18. రథా
శ్వగజ కౌశలము. 19. మల్లశాస్త్రము
20. సూదకర్మము. 21. దోహదము
22. గంధవాదము. 23. ధాతువాదము
24. ఖనివాదము. 25. రసవాదము.
26. జలవాదము. 27. అగ్నిస్తం

భము. 28. ఖడ్గ స్తంభము. 29. జల స్తంభము. 30. వాక్స్తంభము. 31. వయస్స్తంభము. 32. వశ్యము 33. ఆకర్షణము. 34. మోహనము 35. విద్వేషము 36. ఉచ్చాటనము 37. మారణము 38. కాలవంచనము 39. పరకాయ ప్రవేశము 40. పాదుకాసిద్ధి 41. వాక్సిద్ధి 42. ఘుటికాసిద్ధి 43. ఇంద్ర జాలికము 44. అంజనము 45. దృష్టి వంచనము 46. స్వరవంచనము 47. మణిమంత్రౌషధాదిసిద్ధి 48. చోరకర్మము 49. చిత్రక్రియ 50. లోహక్రియ 51. అశ్మక్రియ 52. మృత్క్రియ 53. దారుక్రియ, 54. వేణుక్రియ 55. చర్మక్రియ 56. అంబరక్రియ 57. అదృశ్యకరణము 58. దూతీకరణము 59. మృగయ 60. వాణిజ్యము 61. పాశుపాల్యము 62. కృషి 63. ఆసనకర్మ 64. ప్రాణిద్యూతకౌశలము.

ఇవి కొన్నిచేరి కొన్ని శాస్త్రములుగ విద్యలుగ నైనవి నాట్యము, ధనుర్విద్య ఆయుర్వేదము. మొ.)

2. చంద్రునిలోఁ బదునాఱవ భాగము

సీ పఱమొయిల్ గప్పినఁజాడఁ జనునుఁగాంతి, గదలిన యమృతాంశుకళయుఁ బోలె. విరా. 1 294.

3. అంశము (భగవదంశము అను అర్థమున)

మ...బహుకళావిర్భావశాలీనము,ద్భవరాహిత్య నిరూఢ విరా. 4.275.

4. భాగము, వంతు.

5. 30 కాష్ఠలు (కాలము) కొందఱు

కం...కర్ణుండు పదాఱవ, కళకుసమానుండు గాఁడు కవ్వడితోడన్. ఆర. 2 293.

ఒక నిమిషము అనియుఁ గొందఱు 4 సెకండులనియుఁ గొందఱు 8 సెకండులనియుఁ జెప్పుదురు కొందఱు దినములో $\frac{1}{900}$ భాగమనియుఁ గొందఱు దినములో $\frac{1}{1800}$ భాగమనియు జెప్పుటగలదు. చూ. కాలము.

క. కళలుంగాష్ఠములోనుగఁ, గలచిదురలఁగూర్చు కొనుచుఁ గాలంబు జనంబుల వర్ధికిచ్చునాతని నలకడఁ బొదివి తనకుపశ్యులఁ జేయున్. శాంతి. 4.448

6. మదనకళ.

స్త్రీలకు సీమంతము (పాపట), నేత్రములు, పెదవులు, చెక్కిలి, కంఠము, కుక్షి, కుచములు, వక్షస్థ్సలము,నాభి, పిఱుఁదులు, గుహ్యప్రదేశము (యోని) మోకాలు,చీలమండ,పాదము, అంగుష్ఠము, అను నీ పదునైదు ప్రదేశములయందును చంద్రరూపమైన కళలు విహరించుచుండును. కామోద్రేకము కల్గినపుడీ కళలన్నియుఁ బ్రకోపించి యోనియందు గలమదన కళకుఁదోడ్పడును. అంతట యోనియందు స్త్రీశరీర గతమైన శుక్రము వచ్చి అలముకొనును. అది జిగురు పదార్థమగుటచే సుఖరతికి వీలగుట గాక ఆనందదాయకమునునగును. ఈ యవస్థను తిక్కనగారు "కామగృహమునఁబదనుతోడికళలు గలుగుట" గా నభివర్ణించెను. ఈ స్థితి గలిగిన

స్త్రీలు కామవాంఛ నరికట్టజాలరు. (యోగరత్నాకరము పూర్వఖండము)
చూ. పసుపుతోడి కళలు.
క. కలదొక రహస్య గోపన మలఘు మతీవినుము పురుషునన్నుంగసినం,బొంతులకు నేమి సెప్పదుఁ గలుగుఁబడ నుతోడి కళలు గామగృహమునన్. అను. 2.176.

**కళంకము** సం. వి. అ. పుం.
చూ. కలంకము.

**కళంకితము** సం. విశ. (అ.ఆ.అ)
కలంకము గలదిగాఁ జేయఁబడినది.
సీ...సకలలోకములఁ బొగడొంద బ్రదికిన పుణ్యమూర్తి, విట్టి నీ చరితంబు హింసా కళంకిత, మగుటెంత యొప్పెడు. ఉద్యో 1.332 (హింసా కళంకితము = హింసచేఁ జెడగొట్టఁబడది)
మ...ప్రకటక్రీడా కళా గర్వగర్జిత మందూరకళంకితాంబుకుచితా శుద్ధి ప్రదాచార్యుఁడై. అర. 4 146.
కళంకితము = మురికి చేయఁబడినది.

**కళత్రము** సం. వి. అ. న.
పెండ్లాము.
క. లలనా యుడుగుము నీ యే,డ్పులకొలదియె కురున్నపాల పుత్రకళత్రం, బుల యేడ్పులింక వానిం,గలకల నవ్వుచు వినంగఁ గాలంబయ్యెన్. ఉద్యో. 3 121; అను 1 203

**కళవళించు** దే. అ. క్రి.
కలవరము చెందు, కలఁతపడు.
చ...నెట్టన తెగనగ్గలించు నచటన్ జనులం బరికించు బుద్ధిమా, లిన వెసనెంతయుం గళవళించు మనోజవికార మగ్నుడై.. విరా. 2.31,

**కళింగము** సం. వి. అ. పుం.
ఒకానొక దేశము. కురు జనపదమునకు చుట్టుప్రక్కల నున్న యొక దేశము విరా. 1.32.

**కళింగుఁడు** సం. వి. అ. పుం.
కళింగదేశపు వాఁడు. కళింగ దేశీయులు దుర్యోధను పక్షమునఁ బోరాడిరి. ద్రోణ. 2 94.

**కళిక** సం వి. ఆ. స్త్రీ,
మొగ్గ, బిందువు.
సీ. తల్లడం బొందినఁ దన్వికి నవయవం,బులనెల్ల ఘర్మాంబు కళిక లెసఁగెఁ. విరా. 2.106.
అంబుకళిక. నీటి మొగ్గలు. నీటి బిందువులు అని భావము.

**కళేబరము** సం. వి అ. న.
మృతదేహము, శవము,
సీ. ...మూఁడు కళేబరంబులుఁ గంటి నక్కురు పుంగవుండు భార్యయు, బాండుపత్నియు సద్గతి నొందిరి ఆశ్ర. 2.156.
కం. ఉరగ కళేబర మంసాం,తర మునఁబడి వ్రేలుచునికిఁ దలంపక... ఆది. 2.171. విరా. 1.180, ద్రోణ 1.396.

**కళ్యము** కళ్లెము.
గుఱ్ఱము నోటఁదగిలించునది ఖలీనము
సీ, కళ్యాలఁ బదిలంబులుగాని గుఱ్ఱంబుల గొత్త ముట్టున కియ్యకొలువు వెరవు విరా. 1.95., కర్ణ. 1.140.

కళ్ళె
కళ్యమునకు పాఠాంతరము.

# కా

కా1 అవ్య. ద్రు. అగు ధాతువు యొక్క నుబ్యంత రూపము.

1. అగుటకు. అగునట్లు మొదలగు నర్థములను దెలుపును.

వ,....అశ్వమేధం బధిక దక్షిణాన్వితంబు గావలయుననుట దెల్లంబుగా మీరు నానతిచ్చితిరి. అశ్వ. 1.14;

ఉ...వ్రతా, ధీనతఁ బెండయన్నమును ధేనువు మూత్రముఁ బాలుఁ బానముం, గానియతిన్ వహించి బహుకామ్య ఫలంబులఁ బొందు భూవరా అను. 3.1.,ఆది. 5.223.

2. అర్థవిశేషము లేకయే తుమున్నంతములకు అనుప్రయుక్తమగు.

కం. కావున నియమాత్ము జగ,త్పావను ధర్మస్వరూపు బ్రాహ్మణుఁ బడయం గావలయు ఆది. 4.232.

శా. పాపాత్ముండు మదాంధుఁడా తులువ సీ,పఁ పెట్లనుం జేయఁగానో పండ్చు,ఉద్యో. 3.45

3. హేతువును దెలుపు 'కి' 'కు'-లకు అనుప్రయుక్తమగును

చం కలిసినఁ జూచి యాఁగుటకుఁగా నలినాక్షుఁడు వోవునంత. మౌస.50

కం. ఆచపలాక్షికిఁగా మన కీచకులంద ఱనున్ రాత్రి గీటడఁచెవిరా, 5.381

4. ఆయిఁప్రయోజనమును దెలుపు 'కి' 'కు'లకు అనుప్రయుక్తమగును.)

సీ...వరమెద్దియైన, నడుగుము నీకుఁగా నని సేయుటొక్కటి, దక్కంగ నావుడుధర్మసుతుఁడు భీష్మ.1.153

వ. ఇదియేమి సాహసంబు సేసితి రొల్ల కొడుకులకింగాఁ దమ కొడుకులవిడుచు దుర్బుద్ధులునుం గలరె. ఆది. 1.277

5. 'అని' అను నవ్యయమువలె పూర్వోక్త విషయమును సూచించును (తరచుగానిది యీ యర్థమున ఏకార్థ మగు 'అ' కారమునకుఁ దరువాతఁ గనిపించుచున్నది)

వ. భీమార్జునులును ద్రౌపదీ సహితు లయి చనుదెంచి మ్రొక్కి మేమొక భిక్షదెచ్చితిమని తల్లికి నివేదించిన నెఱుంగక యెప్పటియట్లకా వగచి కుంతీదేవి...ఆది. 7. 208

వ. ఇట్లభిమన్యుండు మడిసెనకాఁద లంచి దుర్యోధనుండు సంతోషింప. ద్రోణ. 2 85.

వ...అది తన సైన్యాపరాధంబున నయ్యెఁగా వగచి. అర. 3.178.

6. విధేయ విశేషణములకును క్రియా విశేషణములకునుఅనుప్రయుక్తమయి అగునట్లు మొ. అర్థములనిచ్చును.

ఉ...ఎవ్వనిం, బ్రాకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యు బురోహితుం డుఁగాఁ, జేకొనువారము ఆది.2 155

శా...కృష్ణద్వైపాయను నీ వెఱుంగుము. విభున్ నారాయణుంగా. శాంతి. 3.476

**కా2** కద

క... అధికధనలోభమునం, జోరుల రక్షింపరుగా, వారలచే ధనముగొని భవధ్భృత్యవరుల్. సభా. 1.41

**కా3** ప్ర.

(ఇది పెక్కు నామవాచకములకు మహత్తు వాచ్యంబగునపుడు మతు బర్థంబునందు వచ్చును. కొన్నిటికి స్వార్థమునందును వచ్చును.)

సంగడికాఁడు– ఆది. 5.203 తిండి కాఁడు స్త్రీ. 1.18. (ఇది మతు బర్థమున) చెలికాఁడు ద్రోణ. 2.239 (స్వార్థమున).

**కాంక్ష** సం. వి. ఆ. స్త్రీ.

ఇచ్ఛ, కోరిక

కం. భారత వర్షమునకుఁగా, గౌరవులును బాంధవులును కాంక్షం గడుబె, ల్లైరాసియొండొరులతోఁ, బోరం దెగి రిట్టిలుబ్ధబుద్ధులు గలరే. భీష్మ.1 28; స్త్రీ. 2 55.

**కాంక్షి** సం. విణ. (న్. జీ. న్)

కం. ఫలకాంక్షిగాక నియతిం, జలిపిన నీ యఖిల కర్మజాతంబును ని,ర్మల మోక్షపదముఁజేర్చుట, గలుగు నవశ్యంబుఁ బుణ్యకరణ ప్రవణా. శాంతి. 4. 108

**కాంక్షించు** సం. స క్రి.

కోరు

కం. పొంతకువచ్చిన వానిన, కాంతుని గాఁ గొనుచు నారునిఁ గాంక్షింపత. శాంతి 4 18

**కాంక్షితము** సం. విణ. (అ.ఆ.అ.)

కోరఁబడినది.

కం. ఆలము మతులార పర్వంబు లనీ యితిహాసరత్నములను వినిన న ఘంబు,లు వాయు నాక లోకము గలుగును సిద్ధించు ముక్తి కాంక్షిత యైనన్. స్వర్గ. 85.

వి. అ. న.

అభిలాష, కోరిక.

చం. ... కడువెస నా ధనంజయుని కాంక్షిత మెక్కడ నక్కడెల్ల నె,క్కుడు ముదమొప్పఁ దేరురథి కోటుల వైఁ బఱపెన్ ముకుందుఁడున్. ద్రోణ. 1.248.

**కాంచన బిందువు** సం. వి. ఉ. పుం.

బంగారు కమలము.

వ. అని పనిచి తాను యోధవీరోచిత ప్రకారంబున సింగారంబు సత్వరంబు గాఁజేసికొని ఖచిత కాంచన బిందు సందోహంబగు సన్నాహంబు వెట్టికొని. విరా. 8,144.

"అభేద కల్పం మత్స్యస్య రాజా కవచ మాహరత్ ఉత్సేధే యస్య పద్మాని శతం సౌగంధకాని చ. సం. భార, విరా. 31.14.

**కాంచనము** సం. విణ. (అ. ఈ. అ.)

సువర్ణమయము, బంగారుది.

వ. కాంచన పీఠము వెట్టఁగ. విరా. 2 89., విరా. 2.102.

వి. అ. న.

బంగారము.

వ. ఉత్తముండైన విప్రుం డుత్తమ మంత్రోపాశ్రితంబులగు విహిత కర్మంబులు నడపుట రత్న కాంచన సాంగత్యంబునుం బోలె సంస్తుత్యం బైయుండు శాంతి. 1,72.,71.

2. ధనము.

సీ. అనఘ మరుత్తుఁడు యజ్ఞంబు సేసి మహాధనరాసుల నవనిసురుల కిచ్చె. ఆ అతఁడెట్లుపార్జించె నంత కాంచనమును మహాత్మ చెపుమ. అశ్వ. 1.15

క. వినుము గుణవంతుఁ డొకరుఁడు ధనవంతుఁడైన యొక్క ధరణీనాథుం దన కూడు సీరకై కాంచన మడిగి తరియ బాలిశత్వము పేర్మిన్. శాం 8.164.

పుం.

కోవిదారము.

ఇది వృక్ష జాతిలోనిది; దీనియాకులు అడ్డాకులువలె రెండాకులు జంటగా కలిసి గుండ్రముగా నుండును. కాయలు తమ్మకాయలవలె పలుచనగా బద్దకట్టి పొడవుగా నుండును. ఇది తెలుపు, ఎఱుపు, పసుపుపచ్చ రంగులు గల పూపుల భేదముతో మూఁడు విధములుగా నుండును. దీనిని 'దేవ కాంచన'మని 'కాంచనార మని పిలుతురు. వీనిలో సువాసనగల వియు సువాసన లేనివియుఁ గూడఁ గలవు. దీని పూవులు ఇంచుమించుగా సంపెంగ పూపులవలె నుండును.

తే. ప్రౌఢబంధూక పల్లవ భాసిత ములు, వికచకాంచన చంపక విస్ఫుట ములు నైన వర్ణంబు లొప్ప నేత్రాభి రామ, భంగినలరారు గోకదంబములఁ గనియె. ఆర. 5.375.

ఒకానొక దేశము.

ఈ దేశ సైన్యముతో భగదత్తుఁడు దుర్యోధనుఁ జేరెను. చూ. కాంచన సైన్యము.

**కాంచన సింధురము** సం. వి. అ.పుం.

శల్యుని ధ్వజ చిహ్నము. (సువర్ణ మయమైన ఏనుఁగు).

సీ. ప్రస్ఫురద్వానర పతియును సింహ లాంగూలంబును నుజ్జ్వల గోవృషంబు వారణ కక్ష్యయు భూరిమయూరంబు సీతయుఁ గాంచన సింధురంబు ... కేతనంబుల నొప్పఁ గ్రీడికి నాచార్య సుతునకుఁ గృపునకు సూతజునకు...

తే. నతని నందనునకును మద్రా వనీశ్వరునకు శల్యునకు .. ద్రోణ. 8.284.

**కాంచన సైన్యము** సం. వి. అ. న.

కాంచన దేశమునకుఁ జెందిన సైన్యము వీరు కిరాత జాతికిఁ జెందినవారు. భగదత్తుని అధీనములో నుండువారు

వ. కిరాత కాంచన సైన్య నిచయంబులం గూర్చుకొని సమరంబునకు నమరి యొక్క యక్షోహిణిగల భగదత్తుండు సుయోధనుంగలిసె. ఉద్యో. 1.225.

**కాంచి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

ఆడుదాని యొంటిపేట మొలనూలు

సీ. అలఘు కాంచీ పదస్థలముల యొప్పును ఆది. 3.27

**కాంచికొను** దే. స. క్రి.

కాచికొను, రక్షించుకొను

వ. కౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం బెగం బొలియుట దెలిసియయి నను దీరునకుం జొచ్చి యున్నవారి నైనం గాంచికొననొకో యని యూహించుచు. ద్రోణ. 4.148:

(ఆనందప్రతి కాచికొను—సం. ము. తి. ప. ప్ర. కో. కాంచికొను ఒక దానికొకటి పాఠాంతరముగాఁ గూడ లేదు)

**కాంచు** దే. స. క్రి.

1. పొందు (భాగ్యమును) పొందు

చం...జనవంద్యులఁ బొందితి నీతి విక్రమ, స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపుగాంచితి. శాంతి. 6.321

వ. కలలుగాంతురు. నా. 1.198.

చం...భవదీయ దివ్యవచనామృతమాని యశోగ చిత్తతం,గని కృతకృత్యతం బొరయఁగాంచితి. శాంతి. 6.321.

కం. ఎంతతపంబొనరించియు, సంతానములేనివారు సద్గతిబొందం,గాంతురె. ఆది. 8.298; విరా. 2.30

(సద్గతిఁబొందుట యను భాగ్యమును బొందుదురె అని యర్థము)

2. దర్శించు, చూచు.

ఉ. ఖాండవమేర్చె దేవతలఁ గానని యీశ్వరుఁగాంచె. విరా. 1.55

సీ. జనులుగాంచిన మానుషముదూలఁ దనకను పుయిలోటమున మోము పుల్ల గిలఁగ....విరా, 2.70.

వ...వాసుదేవుండు...తన్నుంగాంచిన వారినెల్ల నభినందించి. ఉద్యో. 4 24

3 (బిడ్డను) కను,

వ...అమ్మునివీర్యంబు సలించినదాని సరస్వతి గర్భంబుగా ధరియించి పుత్రుంగాంచి తపస్విజనగోష్ఠి నున్న యత్తపోధను కడకుఁ దెచ్చి వీఁడు నీ కొడుకు భవత్తేజంబు వృథవోనీక యేను వహించి కాంచితి వీనింగైకొను మనిన...శల్య. 2.203

ఆ. కొడుకుఁ గాంచు రాచకూతురెద్దానికి నట్టి పనికి నుచితమైన సమయ మొదవె. ఉద్యో. 3.199

శ్లో. యదర్థం క్షత్రియా సూతే తస్యకాలోయ మాగతః. సం. భార. ఉద్యో. 90.77.

ఎఱుగు, గ్రహించు, తెలిసికొను. కని పట్టు.

సీ. అర్జును నస్త్రవిద్యా ప్రమాణంబు నా,యెఱిఁగిన యంతనీ వెఱుఁగవలని కొలఁదియు వనమాలి కొలఁదియుఁ గాంచి, నా కొలఁదియు నెఱిఁగి వారల మదీయ, దివ్యాస్త్రబలమునఁదెగటార్ప నగు ననియే నిశ్చయించితి. కర్ణ. 2.45.

చం. తిరమయి బాహుశక్తియును ధీరతయున్ వెరవుం బలంబు నెవ్వరి దెసఁగాంచె దెక్కుడుగ వారి నుతింపుము. కర్ణ. 2 28.

కం. పనుల యెడ మేలు గాంచిన, మనుగడ యగ్గలము సేసి మన్నింపుము రా,జనయజ్ఞ భృత్యకోటిం,గొని యాడుము సేతపేరు గ్రుచ్చి కొలువునన్. ఆశ్ర. 1.64.

తే. వీనినెల్ల నసత్కోటిగా నెఱింగి, కొనుచుఁ బ్రకృతి నుపేక్షించి తనకుఁ దాన. కాని యొండెద్దియును లేమిగాంచినపుడు పురుషుఁడపగత ధూమాగ్ని బోలివెలుఁగు. అను. 4.223.

4 నిరూపించు. నిశ్చయించు.

వ. ... ధర్మజుండు సుందరీజనంబులం గాంచు తెఱం గెఱింగింపవే యని యడిగిన నావగాతనూజుండ తని కిట్లను వారు మయ శంబరాది రాక్షసుల మాయలం గడచిన మతకంబులు గలిగి నిరూపింపరాక యుండుదు రదియునుం గాక వేఱొక్క విశేషం బాకర్ణింపుము. అను. 2.178.

సీ. బానికజ్ఞనములుఁ దానును త్రల మంది, చర్చించి కార్యంబు చాయఁ గాంచి మౌస. 107.

6 కాపాడు, రక్షించు,

చూ. కాంచికొను.

**కాండము** సం. వి అ. పుం. న.

1. బాణము.

శా. మత్కోదండ చయంబులోన నొక్క సమ్మానార్హచాపంబు భా,స్వత్కాండంబులు... సత్కారంబున నిచ్చి విరాం. 1.285.

2. చెట్టు|మాను, బోదె

వ. తునిసి చిక్కువడియున్న యూరు కాండంబుల వలన మదగజంబులు సొచ్చిన కదళీవనంబులలోని యెడలును. విరా. 3.236

3. సమూహము.

వ. కంకణాంగద కాంతంబులైన కర కాండంబులగములును. ద్రోణ.2.60.

4 నీరు.

సీ. కాండ మహాతరంగముల వైరుల ముంచు, విజయాంబు రాశికివేలనగుదు కర్ణ. 2 95

**కాంత** సం వి ఆ. స్త్రీ

1. ఆఁడుది, స్త్రీ.

క. అంతిపురము చుట్టఱికం, బెంతయు గీడంతకంటె నెగ్గు తదీయా, పాంతచర కుబ్జ వామన, కాంతాదులతోడి పొందు కలిమి భటునకున్. విరా. 1.131

కం. అనికాంతాజనములలోఁ దనునగ్గించుటయుఁ బొంగి విరా. 4 8.

2. భార్య, పెండ్లము

కం. గొంతికి నంత వెఱవ మీ, కంత వెఱవ దైవమునకు నంత వెఱవ న, త్యంతకలుషాత్మ విరటుని కాంతకునే వెఱతుఁ బనులు గావించునెడన్ విరా 2 185

**కాంతత్వము** సం. వి. అ. న.

ప్రకాశము, వెలుఁగు

వ. కాంతత్వ రుచి సౌరభంబులు పెంపున సంపూర్ణ చంద్రార్క కమలంబులం గ్రేణిసేయు నాననంబులును. కర్ణ. 1.74.

**కాంతము** సం. విశ. (అ. ఆ అ)

1 మనోజ్ఞము. ఇంపయినది.

సీ. (భీష్ముడు) పిండప్రదానంబు సమయ, మగుటయు దర్భవిన్యాస మొనర్ప నందంగుశీయక కంకణాంగదములఁ

ఆ. కాంతమైన యొక్క కరము వొదమి యలు,చేయి సాచుటయును. అను 3.128; శాంతి. 1 350.

2. ప్రకాశించునది

మ. తునిమెంగుండలకాంతమైన. శిర మున్ దుర్దాంతదర్పంబునన్, శల్య 1.288; భీష్మ. 1.82.

**కాంతారము** సం. వి అ. పుం. న.
మహారణ్యము, పేరడవి,

వ. విరాటు నగరంబున కనతి దూరం బగు కాంతారంబునం దతిమి పోవు సమయంబున. విరా. 1,14?,

**కాంతి** సం.వి. ఇ. స్త్రీ.

1. జిగి, దీప్తి, శోభ.

కం ... ధాత్రీ రమణుం డ లఘుత్రి భుజ విపుల వక్షస్థలరేఖా కాంతిఁ బరవశత్వముఁ బొందెన్. విరా. 1.218.

2. ఒప్పిదము, విధము.

సీ ఘంటికా టంకృతి కాంతి సంభా వించు, నిర్భర బృంహిత నిస్వన ములు శల్య. 1.102.

3. వర్చస్సు, తేజస్సు.

మధ్యా: ఘనముగ నమరేంద్రపాండు సుత సమాగమ మొక్క యేడు, దనరంగ బ్రహ్మచర్య వ్రతస్థులైత గిలి నిత్యంబు, వినిన పుణ్యాత్ములుమ జదివినవారు వినుము నూఱేండ్లు, నొనర జీవింతు రత్యంత సత్కాంతి యుక్తులై ధరణి అర. 4.49.

**కాంతుఁడు** సం. వి. అ. పుం.

1. మగఁడు, భర్త.

వ...మత్స్య మహీకాంతుం డత్యంత సంతుష్టాంతరంగుండై.

2. ప్రియుఁడు.

కం. వింతకు వచ్చిన నానిన, కాంతు నిఁగాఁగొనుచు నొరునిఁ గాంక్షింపక. శాంతి. 4.18.

**కాందిశీకుఁడు** సం. విశ. (అ. ఆ అ.)
భయముచే పలాయన మగువాఁడు.

కం. ఆయనయుఁ గాందిశీకుఁడై యుత్తర దిక్కు వాఱె. శాంతి. 3.425.

వ. కౌరవానీకంబు కాందిశీకంబగు టయు. ద్రోణ. 5.192.

**కాంపిల్య నగరము** సం వి. అ. న.
ద్రుపదు పట్టణము.

కం. కలయ నసిముసల దండంబులు గొని కాంపిల్య నగరమున జనులెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బలసు భటులఁబొడిచి రాజబడలు వడంగన్. ఆది. 6 71.

**కాంభోజకటకుఁడు** సం. వి అ. పుం
శ్వేత పర్వతమునకును హాటక దేశమునకును మధ్యగల దేశమున కధిపతి. ఇతఁడు ఉత్తర దిగ్విజయ యాత్ర సలుపుచున్న అర్జునుని బూజించెను. సభా-1-235

**కాంభోజనాథుఁడు** సం. వి. అ. పుం
కాంభోజరాజు. సుదక్షిణుఁడు. ఇతఁడు ఏకాక్షౌహిణీ సమేతంబుగావచ్చిదుర్యో

గలసెను. ఉ. 1.225.
చూ. సుదక్షిణుఁడు.

**కాంభోజము** సం. వి. అ. పుం.
ఒక దేశము. అర్జునుని ఉత్తర దిగ్విజయయాత్ర కాలమున నతనికి ఈ దేశపు రాజు విచిత్ర వస్తు వాహన నివహంబు సమర్పించెను. సభా. 1.235, భీష్మ; 1.40.
ఈ దేశమునఁ బుట్టిన గుఱ్ఱములు శ్రేష్ఠమైనవి. దీనిని కాంభోజ దేశమనియు నందురు. ఇప్పుడిది కాబూల్ ప్రాంతమైయున్నది.

**కాంభోజుఁడు** సం. వి. అ. పుం.
కాంభోజ దేశపు రాజు. ఇతనిని యుద్ధారంభ కాలమున దుర్యోధనుఁడు ఒక యక్షౌహిణీ సైన్యమునకు అధిపతిగా అభిషేకించెను. ఇతఁడు ప్రతాప ఘనుఁడు. ఉద్యో. 4.139.
అర్జునుఁ డితని వధించెను.

**కాంస్యము** సం. విశే. (అ. ఆ. అ.)
కంచుది.
వి. అ. న.
కంచు
సీ. కాంస్యోపదోహయుఁ గాంచన చారు శృంగయు ధవళాంబర కలిత యును సదక్షిణయును నయి తగు గోవు. అను. 2.333

**కాఁగు** దే. అ. క్రి.
తప్తమగు, సలసల మండు.
సీ. ... కాఁగిన యెసరుం కరణిఁ బొరిం బొరి శరనిధు లుప్పొంగి పొరలఁబడియె. ఉద్యో. 4.116

**కాఁచు** దే. స. క్రి.
1. తప్తముజేయు, లెస్సగ వేడిచేయు.
సీ. కల్లు ద్రావిన పాతకంబది యగ్ని వర్ణముగాఁగఁ గాఁచి పానంబు సేయు
2. వెచ్చగడేయు (చలిని పోగొట్టుటకై. చం. అనవుడు వాఁడు గుప్త హృదయంబలరం దనయంగకంబుల, య్యనల శిఖాకలాపమున నల్లన యల్లన కాఁచి శీతబాధన ముడుగంగఁ జేయగఁ బదంపడి యాఁకలి సాలఁదోచె. .. శాంతి. 3.319.
3. ఉడుకఁబెట్టు, వండు, పక్వము చేయు.
సీ. అమలాత్మ గోవు మూత్రముఁ బాలునేయిని బానార్హమగు పెండతోన వరుస, మూఁడు దినములు మున్ద్రావి మఱి మూఁడు దివసంబులందు వాయువు భుజించి, యవలు నుగ్గగ ధేనునివహంబు ద్రొక్కించి వెలవ నత్తెఱగు నూకలన కాఁచి, నెల్లు మూఁడత్యంత నియతి నాహారంబు గొన బ్రహ్మహత్యఁ బోవనిదిమైన ॥తే॥ బాయు, ... అను. 3.49.

**కాఁజాలు** దే. అ. క్రి.
అగుటకు సమర్థమగు.
సీ. జనులొక్క తఱిఁదొల్లి సమయంబు దమలోనఁ జేసి క్రూరత్వయు క్తముచ్చిమియు అంకు, నైపక యట్టి దుర్జను నంధఱును గూడి శాసించువారు గాఁజాలి దమకు నధిపతియుఁగ నొరు నాసపడక యుండి .. శాంతి. 2.257.

**కాఁజొచ్చు** దే. అ. క్రి.

అగుటకు మొదలిడు.

ఉ. అచ్చటి మూఁక 'నల్గడల నాతు రతం జెడి పాతె భీముచేఁ, జచ్చెఁ గురుక్షితీశ్వరుని సారథి కూలె, హయాళి నుగ్గు గాఁజొచ్చె ... కర్ణ. 2.368.

**కాఁడి** దే. వి.

(రథము, బండిమొ. వాని) యుగము, ఎద్దు మొదలగు వాని మెడపైనుంచెడు కఱ్ఱ.

కం. పలుపులుఁ గాండ్లుం బగ్గం, బులుఁ దన యస్త్రంబులదరి పొడి సేసిన వి,చ్చల విడి బాఱెడు రథ్యంఁ, బులనేయఁడు దివిజరాజ పుత్రుఁడు గృపతోన్. విరా. 5.53.

చం. పవనజు చాపమున్ హరుల పగ్గములుం దునుమాడి కాఁడితోనవి పెనఁగాడఁగా వెడద యమ్మునఁ గేతువు గూల్చి .. ద్రోణ. 4.232.

**కాఁడు**[1] దే. స. క్రి.

నాటు, గ్రుచ్చుకొను,లోనికి చొచ్చు కొను.

గీ. కంకటము దూఱి యంగంబు గాఁడిపోవఁ, గ్రూర నారాచమేసిన గ్రుక్కెనతడు. ద్రోణ. 2.32.

ఉ. కామము క్రోధమున్ మనసు గాఁడఁగ బాఱుట మాన్చి యింద్రియ, స్తోమ విమార్గ వర్తనము ద్రుంచుచుఁ ... శాంతి. 1.147.

**కాఁడు**[2] దే. అవ్య.

ఒకానొక పుం ప్రత్యయము.

(ఉ. సొగసుకాఁడు మొ.)

వ అట్టియెడ సంశప్తక గణంబు లన్నియు ... నస్త్ర పరంపరలు గురిసిన, నమ్మేటి విలుకాఁడలుక మానిన యలంతి నవ్వుచెలువంబు మొగంబునకు వింత చెన్నొసంగ విజృంభించి. కర్ణ. 1.176.

చం....పక్షిఁదా, దిరముగఁ జేయగా మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త,త్స్వరములు సూపికాదె తుదిఁ జంపఁదెగుం దన బారిఁ బాఱినన్. శాంతి. 3.21.

**కాఁడు**[3] దే. అ. క్రి.

నఞ్ అర్థకము. (మహదర్థక కర్తృ పదముతో మాత్రమే కననగును). 'అగును' అను క్రియకు ఇది వ్యతిరేకము.

చం. అనవుడు భీష్ముఁడిట్టులను నాత నితో నకటా వధింపగా, మనుజుఁడు గర్తకాఁడు వినుమా యితిహాస మొకండు సెప్పెదన్....అను. 1.5.

చం. ప్రియములు వల్కి నిన్నను సరింపగఁ బార్థుఁడు గాఁడు సుమ్మ. .. ద్రోణ. 4.148.

**కాఁపు** దే. వి.

శూద్రుఁడు, కర్షకుఁడు.

ఆ. కాఁపు లావువెంపు గల్గి కర్షన ముసే, యంగ వృష్టి దగిన యట్లు గలుగ, ఫలము గల్గు .. సౌప్తి. 1.31.

**కాఁపు వచ్చు, కాఁపులు వచ్చు** దే. అ. క్రి.

నివసించుటకు వచ్చు, వలసవచ్చు, కాపురమునకై వచ్చు.

తే. పీనులకుఁ జూడ్కులకు నింపు వెల్లిగొల్ప. ... గంధము విలసిల్లుచునికి

నాకంబువేడ్క, నయ్యేడకుఁ గాఁపు వచ్చిన యట్టులుండె. అను. 2.318.
కం. వచ్చెం దిమిరము గాపులు,వచ్చె మధుప కులము లబ్జవనములకు. విరా. 3.237.

**కాఁపువోవు** దే. అ. క్రి.
కాపురము వెళ్ళ, నివసించుటకుఁ బోవు, వలసపోవు.
తే. ... లలితవనము దివికి నలిఁ గాఁపువోయెడు తెలుఁగు దాల్ప. వీరా. 4.50.
వ. ... పటగృహంబులు మొదలుగా వలయు సమస్త వస్తువు లొడఁగూర్చి వెడలిన దండు పఱపై సముద్రంబు గాఁపువోవు చందంబయ్యె. ఉద్యో. 4.130.

**కాక** దే. అవ్య. 'అగు' ధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థక రూపము.
1. కలుగక, సంభవింపక, చాలక మొదలగు నర్థముల నిచ్చును.
వ. అమ్ముని వరంబునఁ దన కన్యాత్వంబు దూషితంబు గాకునికియు. చూ. 'అగు'. ఆది. 4.237; ఉ.3.399
2. వికల్పమును (పక్షాంతరమును) దెలుపును.
వ. ధర్మతనయునకు ద్రుపదుండిట్లనియె. అయ్యా మీరు క్షత్రియులరో బ్రాహ్మణులరో మాయావులయి క్రుమ్మరుచున్న మంత్ర సిద్ధులరో కాక కృష్ణా పరిగ్రహణార్థంబు దివంబు నుండి వచ్చిన దివ్యులరో యెఱూంగను .. అనిన. ఆది. 7.235.
మ. భవదాజ్ఞా ప్రతిబంధ సంయమిత శుంభద్వేగమై కాక నాఁడవలీలన్ మన యర్జునద్విపము క్రోధావేశ దుర్దాంత దర్ప విలాసోద్భట భంగి నేపదరి కౌరవ్యాంబుజ శ్రేణి జిక్కఁ, వడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సందిల్లగన్. విరా. 1.56.
3. అంతమాత్రమే కాని—అనునర్థమును దెలుపును.
వ. సత్యాది గుణంబులు శూద్రునందు గలిగెనేని వాఁడు నచ్ఛూద్రుండగుఁ గాక బ్రాహ్మణుండు గానేర్చునే యవియు బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుండ యనంబడు. ఆర. 4.129.
4. కాని అనునర్థము నిచ్చును.
కం. అలుకఁదనంబున విప్రున,కలుగంగాఁ దగదు గురుఁడునై యున్నాఁడం,చలయక తలఁచితిగాకిటు, నిలుమీ నీ రణముసేత నిజమగునేనిన్. ఉద్యో. 4.312.
తే. పాండుపుత్రుల కెప్పుడుఁ బక్షపాతి, విదురుఁడని చెప్పఁదొల్లియు విందు దీని,నెఱిఁగి వారించుగాకతఁడేల శకుని కైతవంబున కొడఁబడు కౌరవేంద్ర. సభా. 2.126.
5. తప్ప(తక్క) అను నర్థమును తెలుపును.
కం. అమరనదీ తనయుఁడు సింహముగాక నరుండె. శల్య. 1.24.
కం. నిర్బంధము దుర్మానము, దుర్బుద్ధికిఁగాక తగునె దుర్యోధన. ఉద్యో. 3.323.
ఆ. పరశురాముఁడొండె హరుఁడొండె నరుఁడొండె గాక యొరులు గలరె

దక్షకోర్చు, బలిమి భీముఁడొండె బలదేవుఁడొండె గా,కౌరవుల నరులు గెల్వ నోర్వఁగలరె. ఆది. 7.202.
తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైన, గాక నీ సముజ్జ్వల రూప కాంతి విభవ నిత్య సౌభాగ్యాభిజాత్య భద్ర,లక్షణా వళులవి సఫలంబు లగునె. అర. 2.20
6. కానిమ్ము అనునర్థమును దెలుపును.
ఆ. అనిన నట్లకాక యని సర్వసేనాధి, పత్య భార పట్టబంధమునకు, నియ్య కొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గాని, యాడె విభుఁడు ప్రముదితాత్ము డగుచు. ఉద్యో. 4.155.
7. ఆశీర్వాదమును దెలుపును.
కం. ... అద్దేవుండు పాండవులు నీ చేత నివారితులగుట యొక్క దివసం బున గలుగుఁగాక యని పలికి యుండె ద్విజుఁ డయ్యెఁ. ద్రోణ. 2.66.
వ. నముంచేసు ధర్మపథంబు దప్పని వాఁడవు నీ వచనంబున నాకు సంతృ ప్తి పనిసేయదయ్యెనేని నా చేత నుపదేశంబు గొన్న వారికిఁ బని సేయుంగాక. ఆది. 3.132; 3.116
8. నిశ్చయార్థమును దెలుపును.
కం. పెక్కునకుఁ గానియపుడు సంహా రమునకుఁ జూసితిన యింక భీష్ముని పెరికెదఁ, యనఁగ నాతండు మూలమీ హసికెళ్లఁ, గాన యాతని సాధింతుఁ గాక-యేను. ఉద్యో. 4.284.
కం. ప్రాంతంబయ్యెను వాహన, సంతానం బెల్ల నిపుడు సంధ్యా సమయం బింతట నేటికనని, సాలిం లము గోరింక బోంతలెస్త్రీయున్నే. భీష్మ. 2.340.
9. విధిని దెలుపును (విధ్యర్థకము
వ. ... మీకుం జూడంబోలినయెడఁ దగిన చందంబున నిలుచువారము గాక ... విరా. 1. 62.
కం. సమశీల వ్రతయుతులకు, సమ ధనవంతులకు సమసుచారిత్రులకుం, దమలో సఖ్యమును వివాహము నగు గాకగునె రెండు నసమానులకున్. ఆది. 5.205.
10. సందేహమును దెలుపును.
వ...అద్దేవి (కుంతి) విక్రమోపజీవు లయిన ముచుకుందుండును స్సంజ యుండునునను తొంటి నరపతుల చరి త్రంబులు సెప్పి యుధిష్ఠిరుండు వీరిని వినండా కాక యని పలికి, యెల్ల వారును వినుచుండ వెండియు నిట్లనియె. ఉద్యో. 4.13.

**కాకము** సం. వి. అ. పుం.
కాకి. చూ. కాకి.
తే... కాక ఘూకారవ స్ఫూర్తి శమీ తరు చక్రవర్తి. విరా. 1.162.

**కాకా** దే. వి.
కాకి యఱపు.
కం. ఆకులతఁ బొంది పలుకుచుఁ, గా కా యని చంచుఁ దెఱచి .. నీ, రాకరమున మునిఁగెడు న,క్కాకింగల హంస పరమ కారుణ్యమునన్. 2.79.

**కాకి** వై. వి. (సం. కాకః)
1. గుత్తిగా నల్లగానుండు ఈకలు గల ఒకజాతి పెద్దపక్షి. వాయసము, కాకము.
కం. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై, కుఱుకుదు సె-ళువము కాకి నొడిసిన భంగిన్. విరా. 2.282.

సం. వి. ఈ. స్త్రీ.
1. తామ్ర అనుదాని కూతురు;
వ. తామ్రకుఁ గాకియు శ్యేనియు భాసియు ధృతరాష్ట్రియు శుకియు నను నేవురు కన్యలు పుట్టిరి. కాకి యనుదానికి నులూకంబులు పుట్టె. ఆది. 3.71.

**కాకున్నె** (కాక+ఉన్నె).
ఏవార్థకము (కాకుండ మఱొకటి)
ఆ. అడవిఁ దన్నుఁ జూసి యరిగిన నరిగి కాఁకున్నె యిట్లు సేయ నవిద గడగె. అను. 2.764.
(అరిగియే యిట్లు సేసెను.)

**కాకుత్స్థుఁడు** సం. వి. అ. పుం.
కకుత్స్థ వంశమునఁ బుట్టిన రాజు- శ్రీరాముఁడు.
మ. .. కాకుత్స్థకుల ప్రదీపకుని... రామున్ రాజ చూడామణిన్. అర. 6.309.

**కాకేమి** (కాక+ఏమి)
ఏవార్థకము (కాకుండ మఱొకటి గాదు).
వ. అనిన విని యదంకుండప్పుడు దలంచి యా వృషభ గోమయ భక్షణంబున ..., దైన నాయశుచిభావంబునఁ గాకేమి యప్పరమ పతివ్రత మదీయ దృష్టి గోచరగాకున్నదయ్యె (అశుచిభావంబుననే - అశుచి భావమే గాని మఱొకటి గాదు). ఆది.1.97.

**కాకోదరము** సం. వి. అ. పుం.
ఉదరముతో కుటిలముగా నడచునది, పాము.
ఉ. .. నృపపుంగవ నీవు ననేక భూసురా, పాదిత- సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కాకోదర సంహతిన్. ఆది. 1.124.

**కాక్షీవంతుఁడు** సం. వి. అ. పుం.
ఇతఁడు గౌతమ వంశీయుఁడు. పేరు చండకౌశికుఁడు. కాక్షీవంతుడైన విధము తెలియదుగాని కక్షీవంత లేక కాక్షీవంత వంశమువాఁడేమో. ఇతఁడు మహా తపస్సంపన్నుఁడు. సంతానార్థియై బృహద్రథుఁడు ఈతని నాశ్రయించెను. ఇతఁడు తన తపఃప్రభావము వలన నొక మామిడిపండు మంత్రించి బృహద్రథునికిచ్చెను. ఆ రాజు దానిని దీసికొని క్రమ్మఱ నిజ పురమునకు వచ్చి తన యిద్దఱు భార్యలకు సమముగా విభాగించి యిచ్చెను. ఆ కారణమున వారికి నిర్వ్యరర్ధశరీరులు పుట్టిరి. అతఁడే జరాసంధుఁడయ్యెను. సభా. 1.137. మొ. 144 వ.
ఈతఁడు గిరివ్రజమునకు వచ్చి జరాసంధు నాశీర్వదించెను. సభా.1.155.

**కాక్షీవతి** సం. వి. ఈ. స్త్రీ.
వ్యుషితాశ్వుని భార్య. ఈమె పేరు భద్ర. కాక్షీవంతుని వంశజాతగాన కాక్షీవతియై యుండును.
ఈమెయందు భర్త వ్యుషితాశ్వుఁడు అనవరత కామాసక్తుడై క్షయరోగము వలన మరణించెను. ఆనాఁటికీమెకు సంతానము లేదు. ఈమె భర్తృశవమును కౌగిలించుకొని నేను నీతోడ సహగమనము చేయుదును లేదా నీ పుణ్యమూర్తికి ప్రతిమూర్తులైన పుత్రు

లను బ్రసాదింపుమని విలపించెను. వాని శరీరము నుండి యాకాశవాణి "నీవు ఋతుమతివై న యష్టమ దిన మునఁగాని శుచివై శయనంబుననుండి నన్ను దలంపుము. నీకు సంతానము గల్గును". అని పల్కెను. ఆమె యట్లే చేసెను. ఆమెకు మువ్వురు సొల్యులు నల్వురు మద్రులు జనించిరి. ఆది. 5.80; మో. 84.వ

**కాశీవదాదుఁలు** వి. బ.

1. మామలేయుని వలన ఉలిభార్య యగు సుదేష్ణ పంపిన దాసికూఁతు నకుఁ బుట్టిన కొడుకులు. వీరు పదు నొకండుగురు. ఆది. 4.234.

2. వీరు గిరివ్రజమున జన్మించిరి. వీరి తల్లిపేరు ఔశీనరి. సభా. 1.175. వీరి పేరులు వేర్వేరుగఁ గన్పింపవు.

**కాచికొను** దే. స. క్రి.

1. కాపాడు, రక్షించు.

ఆ. అట్లు గాకయుంత నీ రెండు తెలుఁగులవారిఁ గాచికొనుము వసుమ తీశ. ఉద్యో. 3.269.

2. రక్షించుటకై వదలక కనిపెట్టు కొని యుండు, కాపాడికొను.

కం. అదియగునై నను దెంపొదవఁగఁ గాచికొని యిచట నుండుట కంటెన్, మదనధికంబై తోఁచిన, యది నీవద్ద నుని పాలికదుగుము నాకున్. ద్రోణ. 3.296.

2. వేచు, ప్రతీక్షించు.

(కృష్ణుఁడు దుర్యోధనునితో) నీ వాపా దించిన పాపంబులకెల్ల .. నేయకేల కాచికొనియుండు. శల్య. 2.328.

**కాచికోలు** దే. వి. (√ కాచికొను).

కాచికొనుట, రక్షించుకొనుట.

చం. ఇది దగదంచు నడ్డపడునింతకు నేరక సభ్యులందఱున్, మది మది నున్న యట్టి యెడ మానినికిం దనుఁ దాన కాచికో,లొదవిన దానఁజేసి సభ నొచ్చెము దక్కెనఁ దాండునందనుల్ బ్రదికిరిగాక యయ్యెడరు రాచకొమా రుల కోర్చునట్టిదే. ఉద్యో. 1.248; ద్రోణ. 4.166.

**కాచు[1]** దే. స. క్రి.

కాపాడు, రక్షించు.

ఆ. అయ్యులూకు పలుకులన్నియు విని భవత్తనయుతోడ, నిట్టులనియె భీష్ముఁ,డేనుగలుగ వెఱవ నేటికి సేనలఁగాతు నీవుమెచ్చఁ గౌరవేంద్ర. ఉద్యో. 4.213.

కం. తరణియు దుఃఖితయగు నుత్త రుణిం గాచుటకు నత్యుదగ్ర భుజావి, స్ఫురణాఢ్యు నొక్క రిక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁడగుచుఁ గ్రక్కునఁ బనిచెన్. విరా. 2.110.

ఉ. కావునఁ గామరోషముల్ఁ గ్రాచుచు నాశ్రమకోటిఁ గాచుచున్, భూవలయ ప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యము సేత మేలు. శాంతి. 2.252.

2. ఆఁపు.

ఉ. ద్రోవది ... పొంగు విషాద రోష ముల్, గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై. ఉద్యో. 3.114.

3. రక్షింపఁబూను, కాపాడఁదలచు

కం. నీచమతి నన్ను.. నెవ్వఁడు,

సూచిన నా రాత్రిలోనఁ జూతురు దెగఁ దా,రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము లఖర్వము లైనన్. విరా. 1.324.

కం. గురునట్టివారు పదివేవురు గాచిన నెల్లి సైంధవునిఁ బగలిటిలోఁ, బొరి గొనునట్లుగ నరునకు, వరమిండీ వేల్పులార వారని కరుణన్. ద్రోణ. 2.246.

4. కావలిగాచు, తప్పించుకొని పోకుండఁ గాపాడు.

వ. దానవులు సహింపనోపక బృహస్పతితోడి యలుక నక్కుచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్నవాని వధించి. ఆది. 3.111.

**కాచు²** దే. స. క్రి.

1. (కాయ, కిణము మొ.) పుట్టు, బయలుదేఱు.

ఉ. ... ఆ సుదేష్ణకుం, గన్నుల సన్నలం బనులు గైకొన్ని వారక చేయుచుండుటన్, మున్నటులున్న పాణితలముల్ బలుగాయలు గాచె జూచితే. విరా. 2.221.

**కాచు³** అ. క్రి.

బయలుదేఱిన కాయలు గలది యగు.

మాలిని. కాచి బెడంగుగఁ బండిన యా సహకారములం గదళీ తతులం, జూచుచు. ఆది. 4.20.

**కాటుకకొండ** దే. వి.

అంజనాద్రి.

సీ. పెస మారుతియు నలంబుసుఁడును బోరుచో నద్దానవేంద్రుని యంప బలుపు, చేత నశండు మూర్ఛిల్లి యాలోనన, తెలిసి కాటుకకొండ పొలుపు గెలుచు నాతని మేను పెల్లలరిన మోదువు తెఱఁగుగాఁ జేసిన. ద్రోణ. 3.259.

**కాటులాడు** దే. అ. క్రి. (కాటులు + ఆడు)

కలహించు.

సీ. అసుఖదంబైన రాజ్యామిషంబునకుఁ గుక్కల భంగిఁ దమలోనఁ గాటులాడి. శాంతి. 1.145; స్త్రీ. 2.9.

**కాఠిన్యాయితము** సం.విణ. (అ.ఆ.అ.)

కఠినముగాఁ జేయఁబడినది.

కం. వాయువు చేష్టారూపము, మ్రోయునెడ నభంబు ద్రవము మునివర జలమూ,ష్మాయిత మనలము గాఠి,న్యాయితము ధరిత్రి యిట్టులైదు తెఱంగుల్. శాంతి. 4.86.

**కాడు** దే. వి. బొ.

శ్మశానము, వల్లకాఁడు, శవములను కాల్చు లేక పూడ్చు స్థలము.

కం. సౌధప్రై నుండఁగ వారలు, పదుంద్రుఁనుం జూచి దాని భక్షింపగా, మది, గోరి చేరి చుట్టుం, బొదిగిన సమయమునఁ గాటి పొంత తెరువునన్. అను. 3.210.

**కాడుపడు** దే. అ. క్రి.

నశించు, కనఁబడకపోవు.

చం. తనయుడొకండు వాఁడు గుణధాముఁడు క్రీడనవాంఛ సాంద్ర కాననమున కేఁగి కాడుపడెనం దదవంజనుదెంచి యెందుఁ గా,నని మది యాశ ద్రిప్పికొనినన్ వెగడందుచు వచ్చినాఁడ. శాంతి. 3.158.

శ్లో॥ వీరద్యుమ్న ఇతి విఖ్యాతో రాజాఽహమ్ దిక్షుభ్రశ్శుతః భూరిద్యుమ్నం సుతం నష్టమన్వేష్టుం వనమాగతః. సం. భా. శాంతి. 128.1.

**కాతరము** సం. విణ. (అ. ఆ. అః) అధీరము, పిఱికి.

శా. .... కాతర, స్వాంతత్రాసకరంబునై దురభివేశంబైన యాతోనని,శ్చింతుండై సతిచేలు వట్టికొని చొచ్చెన్ భీముఁడత్స్యగ్రతన్. విరా. 2.327.

**కాత్యాయనుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక మహర్షి.

వ. గార్గ్య గౌతమ కాత్యాయనాదులు ఏననచేసి దీప్తిబోధులయి. అను. 4.237.

**కాదంబము** సం. వి. అ. పుం. కలహంస, ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్ళు ఱెక్కలు గల హంస.

సీ. కాదంబ కాలేయ కాదంబినీ నీల, జాల తమాలికా సన్నిభములు. అర. 5.375.

**కాదంబిని** సం. వి. ఈ. స్త్రీ. మేఘపంక్తి.

సీ. కాదంబ కాలేయ కాదంబినీ నీల, జాల తమాలికా సన్నిభములు. అర. 5.375.

**కాదనక**

యుక్తము కాదని తలంపక, తగదని యెంచక.

ఉ. కాదనకట్టిపాటి యపకారముఁ దత్తుకుఁ జేసెవిప్రసం, బోధనఁ జేసి చేసె. ఆది. 1.124.

**కాదను** నిరాకరించు.

శా. గంగానందను పోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ, జుం గీడాడుచు. శల్య. 1.87.

**కాదయ్య** కాదు+అయ్య)

ఇక్కడ 'అయ్య' పదము వాత్సల్యమును దెలుపును.

"తగదు బాబూ" "కూడదు నాయనా" అని భావము. తరువోజ ... చేసి గాంగేయ విదుర కలశ జాశ్వత్థామ గౌతముల్ బుద్ధి,గా నొడంబడుదురె కాదయ్య యనినఁ గౌరవజ్యేష్ఠుండు ఘనుఁడబ్బులనియె. ఆది 6.130.

**కాదు** 'అగు' ధాతువుయొక్క వ్యతిరేకార్థము. మహదర్థకము 'కాఁడు' అగును.

'అగు' ధాతువునకుగల యర్థము సందర్భానుసారముగా ఆయా తావుల నూహించుకొనునది) (తగదు, కూడదు.)

ఉ. ... భీ,ష్మాదుల సన్నిధానమున నమ్మెయిఁ బల్కిన పల్కు దప్పఁగా, గాదని ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీర కోపమున్. అర. 4.170.

తే. ... బాహువీర్య, ఘనుఁడు మన కాశ్రయంబయి మనిచె మత్స్య,దేశ పతిగాఁడె సేనాపతిత్వమునకు. ఉద్యో. 4.97.

**కాదు గూడదు**

ఎంతమాత్రము కాదు, ఎంతమాత్రము పనికిరాదు.

చం. విరటుఁడు సూచుచుండ నిను వేత్రమునందు గీచక్కు ద్రోవ నొ,క్క

రుఁడును గాదు గూడదనఁగల్గెనె. విరా. 2.257.

**కాదె, కాదే = కద**

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ, భవ్య పురుషార్థ తరు పక్వ ఫలము గాదె. విరా. 1.18.

కం. నాయున్న బాము దలఁపవ, యీ యొదలీచీర యిట్టి యేవపుఁ జందం, బోయన్న మదన వికృతిం, జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే. విరా. 2.49.

**కాదొకో** (కాదు + ఒకో)

కూడదా యేమి? (కూడును, తగును అని భావము).

వ. నాకు మిమ్మును మీ కుబేరుం బ్రార్థించికాని యిక్కొలని పువ్వులు గొనంగాదొకో. అర. 3.366.

**కాదో కదా**

అవును గదా

వ. ... అక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠులగుట రాజుల కొడఁబాటు గ్గాదోకదే యని ననుం బలుకకున్న యన్నరపతితోడం బవమానుండు, అను. 5.346.

**కాద్రవేయుఁడు** సం. వి. అ. పుం.

కద్రువకొడుకు, సర్పము.

వ. ... వైనతేయ కాద్రవేయులను. అను. 5.313.

**కాన**[1] దే. అవ్య. కళ. (క్రమఁ ప్రకృతి కమని శ.ర; సూ. ఆ. ని) కాఁబట్టి, కనుక.

ఆ. నాకుఁ జూడ మత్స్య నరపతి సద్ధర్మ,వర్తి సుజనహితుఁ డవార్య బాహు,బలుఁడు గాన యతని పాల నందఱుఁ దగవైన పనుల నియుక్తు టభిమతంబు. విరా. 1.64.

మ. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము గుంతీనందనుల్ సింహముల్, మతి నూహింప నసింహమైన వస ఘున్ మర్దింతు రందున్ వనా,వృత వృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేటొందుఁ గా,న తగం బొందుట కార్యమీ యుభయము న్సంతుష్టిపై నున్కికిన్. ఉద్యో. 1.358.

సీ. ... వీఁడు మహా పుణ్యనిధిగాన యితరులఁ బనుపక యేన వీనిఁ, గ్రచ్చఱఁ గొనిపోవగా జనుదెంచితి. అశ. 7.219.

**కాన**[2] వై. వి.

అడవి.

కం. ముందిటి భంగిన కానల,యందు వసింపంగ వలదె. విరా. 2.181.

**కానఁబడయు** దే. స. క్రి.

చూచు భాగ్యమొందు.

ఆ. ... ధర్మనందనుండు, నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ గానఁ బడయమైతిమేనిఁ గృష్ణ. ఉద్యో. 3. 117.

**కాననము** సం. వి. అ. న.

అడవి.

సీ. ... కాన,నమున సుప్తుండైన నరుఁ బులి గొనుపోవు నట్టులు మృత్యువపహరించు. శాంతి. 4.23; అశ్వ. 1.73.

**కాని**[1] దే. వి.

దూపియలో ఆఱువది నాల్గవ వంతు పీఁచవగల రాగి నాణెము. ఇప్పుడు రెండు నయాపైసలకు సమానము.

కం. ఏనుఁగులు సుట్టిరాఁ జే,రేనుఁగు పై మణిమయంపు టెల్లలు మెఱయం,గా నీవేతెంతువు మముఁ గానికిఁ గొనవప్పు డిపుడు గాడిదవైతే. శాంతి. 4.389.

**కాని²** దే. అవ్య.

1. 'తక్క' అను నర్థమును దెలుపును (దీనికి తర్వాత వచ్చు క్రియ వ్యతిరేకార్థముగ నుండును).

ఆ. కలిమి జనులనేలఁగాని యెన్నండును, నొడలఁ గొల్చి తిరుగ వెఱవు లేని, యట్టి నీవు విరటు నెట్టి చందంబున, ననుసరించు వాఁడవదివ చెపుము. విరా. 1.67.

గీ. .. అన్నకవదుండు, దనకు నిన్నాళు కాని లేవనియె హరులుం. ఉద్యో. 3.314.

ఉ. .. తీవ్ర దావానలుఁ బోలి శాత్రవ చయంబు ఘయింఁ గవియించి నిల్చెనం,గాని యుధిష్ఠిరుల్ సరకుగాఁ గొనరా ధృతరాష్ట్రి నందనుల్. ఉద్యో. 2.137.

2. కొన్నిచోట్ల అర్థ విశేషము లేకయే ఊత పదముగా నుండును.

కం. ... ర,మ్మా చూలముగాని నీ గమనవేగంబున్. విరా. 2.89.

వ. ... నన్ను నిచి వత్తువుగాని రమ్మని కరంబు సాఁచి చెయివట్టి. ఉద్యో. 4.19; భీష్మ. 3.185.

3. పూర్వోత్తరములగు వాక్యార్థములకు కల భేదము సూచించును.

చం. ప్రియములు వల్కి . నిన్ను నరింపఁగ బార్థుఁడు గాఁడు సుమ్ము దుర్జయ భుజశక్తి నిర్మథిత శత్రుఁడు భీముఁడుగాని. ద్రోణ. 4.148; విరా. 1.226.

4. అయిన (అయితే)

కం. వేరొక్క పనికింగానుగాని యే నీవెంట నీమనసు వదయం జాలుదు. విరా. 1.286.

5. వికల్పార్థమును దెలుపును.

వ. ... మూకం జూడఁ బాండవులు పొడవడంగి లేకపోయిరిగాని యీ లోకంబున నునికి గలిగిన నగపడకుండ నేరరు. (కాని = లేనిచో; అట్లుగాకపోయిన) విరా. 3.87.

**కానిక** దే. వి.

కానుక.

కం. ధనవర్గంబులు వీరి,చ్చినయవి యట్లగుట వేడ్కసేయవు తగ నూతనమగు కానిక యీవల,యును వేతో డ్తెరఁ బనుపుము త్తరఁ బ్రీతిన్. విరా. 3.354; శాంతి. 1.346; అను. 4.433.

**కానికిఁగొను** దే. స. క్రి.

లక్ష్యముసేయు. (దీనికి వ్యతిరేకము ననే ప్రయోగము.)

కం. ఏనుగుఁలు సుట్టిరాఁ జే, రేనుఁగు పై మణిమయంపు బెల్లులు మెఱయం, గా నీవేతెంతువు మముఁ, గానికిఁ గొనవప్పుడిపుడు గాడిదవైతే. శాంతి. 4.389.

**కానినాఁడు** (వికల్పమును దెలుపును)

1. అట్లు జరుగని పక్షమున, అట్లు జరుగని దినమున.

ఉ. దేవతలన్ జయించుచు నతిస్థిర సంపదలం ద్వదీయ వి,ద్యావిభవంబు పెంపునను దానవు లుద్ధతులైరి కానినాఁ,డీ వనరాశిలోఁ జొరరె యింతకు నంతకకోపులైన య,ద్దేవ పతాకినీ పతుల దివ్య నిశాత మహాయుధాహతిన్. ఆది. 3.151.

2. లేకపోయిన, అట్లు చేయనియెడల.

వ. .. ఇక్కన్యక నీకు ధర్మపత్నిగాఁ జేయునట్టి యిష్టంబు గలదేని నా వేఁడినదాని నిమ్మనిన శంతనుండు దాని నీనగునేని యిచ్చెదఁ గానినాఁడీ నేరనది యేది సెప్పుమనిన. ఆది. 4.176.

3. లేని యెడల, కాని యెడల.

వ. అయ్యా నీవు బకరూప ధరుండవై యున్న రుద్రుండవో పావనుండవో, పవనుండవో? యట్లు గానినాఁడు కులపర్వత ప్రతిములయిన నా తమ్ములం బడఁద్రోచునట్టి బలంబు పులుఁగులకుం గలదే, అర. 7.417.

**కానిపించు** / **కాన్పించు** దే. స. క్రి.

చూపు, చూపించు. దర్శింపఁజేయు.

ఉ. అత్తఱి లేచివచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానిపించె న,య్యుత్తరు నర్జునుండు. విరా. 5.342.

వ. ... ఆ లుబ్ధకుల నగ్రజుఁ గానిపించి. శల్య. 2.41.

మ. (అర్జునుఁడు ఉత్తరునితో) .. ఈ వచ్చు ను,న్నద వీరావలికిన్ భుజావిభవ విన్యాసంబు గాన్పించి మ్మా,న్పెద గర్వంబు. విరా. 4.263.

వ. (ధర్మరాజు) బ్రాహ్మణ సంఘంబులం గానిపించికొని దర్శనమిచ్చి. (కనఁబడునట్లు చేసికొని అని భావము) శాంతి. 1.360; అశ్వ. 3.205.

**కాని పేరిది**

తగనిది, గిట్టనిది, ఇష్టము గానిది.

కం. పలుమాఱుం దలవాకట, మెలఁగుట యసతీ జనైక మిత్రత కలహం, బుల కెలయుట నగు పలుకులఁ బెలుచ నగుట నాకుఁ గానిపేరివి మగువా. అర. 5.302.

**కానివాఁడు** దే. వి. (√ అగు).

1. పనికి మాలినవాఁడు, అసమర్థుఁడు

కం. నరు నద్దెసఁగలవారిని, గురుబల ముబ్బు సెడఁ బొగడి కొఱ కొఱగాఁగన్, గురుని గురుతనయు మద్రేశ్వరునను నేమిటికిఁ గానివారిం జేయన్. ద్రోణ. 5.105

2. సంబంధము లేనివాఁడు.

వ. ... దేవాసుర గంధర్వ యక్షాదులకు దుర్జయులైన యప్పేరుపంట్ల సేసి నీవు కానివాఁడవ పోలెం దొలఁగి యున్న వాఁడవు. అర. 7.417; ద్రోణ. 3.168.

**కానీనుఁడు** సం. వి. అ. పుం.

కన్యకకొడుకు, కర్ణుఁడు.

వ. ... అర్జునుండును బ్రీతుండై గాండీవ విక్షేప క్షోభిత నభోభాగుండగుచుం గానీనుపై నారాచంబు విశిఖంబులు నినిచె. విరా. 5.96.

2. వ్యాసుఁడు.
వ. ... సత్యవతి దొల్లి కొండుక
నాఁడు కన్యయైయున్న కాలంబునఁ
బరాశరుండు దన్నుఁ గామించుటయు
నమ్ముని వరంబును...జేసి యమునా
ద్వీపంబునఁ గృష్ణద్వైపాయనుండు
గానీనుండయి సద్యోగర్భంబునఁ బుట్టి
పనిగలయప్పుడ తన్నుఁ దలంచు
నది యని చెప్పి తపోవనంబునకుం
జనుటయును భీష్మునకుం జెప్పి. ఆది.
4.238.

**కానుపు** } దే. వి.
**కాన్పు** }

1. దర్శనము. దృష్టి, చూచుట.
ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁ
గనెండియు నా లతాంగి య,చ్చొత్తిన
యట్లు నాకుఁ దన యుల్లము తెల్లము
సేయకున్కి దా,నత్తఱిఁ గ్రొత్త
కాన్పగుట నడ్డము సొచ్చెనొ సిగ్గు
పెంపు న,న్నుత్తలమందఁ జేయుట
కునో తలపోసి యెఱుంగనయ్యెడున్.
విరా. 2.84.
ఆ. జ్యోతి యాత్మయందు యున్నది
గాన్పు శక్యము సమాహితాత్ముఁడైన
మునికి, నొరులవలనఁ దనకు నొరు
లకుఁ దనదెస, భయము లేకయున్నఁ
బరముఁ గాంచు. శాంతి. 6.283.
2. తలఁపు, అభిప్రాయము.
కం. ఇరువది నాల్గనువారలు, నరసి
మనశ్శుద్ధి బుద్ధి యను కాన్పున నప్పు
డసుసెఁ బలికెద రేఁ గను తెరువున
విను తత్త్వవిధము దేవస్తుత్యా. అను.
4.175.

3. ఎఱుఁగుట, తెలిసికొనుట.
ఉ. తాలిమిఁ బేర్చువారలును ధర్మ
విధిజ్ఞులు సత్యవంతులున్, లోలత
లేనివారు మద లోభ నిరర్థక కోప
హీను లు,న్నిమ్మల సమేతులుం బలుక
నేర్చుట కార్యము కాన్పు పెంపుమై,
జాలుట గల్గు భృత్యులును సంపద
సేయుదు రాత్మభర్తకున్. శాంతి.
3.468.
4. ప్రాప్తి, పొందుట, భాగ్యమును
పొందుట.
ఆ. బ్రాహ్మణులకుఁ బ్రియము పాయక
చేయంగఁ గాన్పుచూపె పుణ్యకర్మ
ఫలము. ఆది. 6. 283.
సీ. ...కూఁతుల గన్న ఫలము దగిన,
వరులకు సద్ధర్మ చరితుల కీఁగాన్పు
కాదె నావుడు సూర్యుఁ డాదరించి.
ఆది. 7.86.
కం. జ్ఞానము విజ్ఞానము నీ, మానిత
గుణములగునవి సమగ్రమములైనం,
గానేరదు మోక్షపదము, గానుపు
దృఢనిశ్చయుండు గాకున్నె నిన్.
శాంతి. 6.290; సభా. 2.138.

**కానోపు** కాఁబోలు.
సీ. ... ఏ కారణంబున నేమయ్యెనో
వానయేపునఁ దెగియెఁ గానోపు నకట.
శాంతి. 3.310.

**కాన్పు** దే. స. క్రి. కాంచు
1. చూచు, దర్శించు.
తే. నీవు ధర్మజుపాలికి నెమ్మినరుగు,
మతఁడు పేరోలగంబున్న యవసర
మునఁ, గాన్పుమతనికి ననుజవర్గంబు

నకును, బంధులకు నింపుపుట్టంగఁ బలుకుమచట. ఉద్యో. 1.270.
కం. నేర్పరి పెక్కు విధంబుల, నార్పఁగ బొమ్మలు గదంగి యాడెడు చందం,బేర్పడఁ గాన్పుము కాలస, మర్పిత కార్యకరులైన మానవుల దెసన్. శాంతి. 1.283.
2. కనిపట్టు.
ఉ. ... అమ్మహాత్ముల కరిష్టము నేమిట నెందు నేల పాటిల్లెడు వారిఁ గాన్చుట గడింది తదీయ మహాను భావతన్. 3.100.
('కాన్పను' అని కొన్ని ప్రతులు)
3. ఆశ్రయించు.
ఉ. ... భార్గవరాము నాశ్రిత,శ్రీకరుఁ గాన్పుమాపదలు పెంచఁగనీఁడతఁ డాశ్రయించినన్. ఉద్యో. 4.289.

**కాపవ్యుఁడు** సం. వి. అ. పుం.
ఒక బోయ.
(మూలమున కాయవ్యుఁడు అని యున్నది).
చూ. చరిత్రము. శాంతి. 3.177. మొ. 1.84 వ.

**కాపిలము** సం. విశ. (అ. ఈ. అ.).
కపిలప్రోక్తమైనది.
కం. ఈ పరిబోధంబభవా, కాపిల మస్మద్గురుండు కపిలుండతని శిక్షా పరిణతి బహుశిష్యులు, దీపిత విజ్ఞాను లైరి దృఢనిశ్చయతన్. అను.4.285

**కాపిలేయుఁడు** సం. వి. అ. పుం.
పంచశిఖుఁడను మహర్షి. ఈతఁడు కపిలాభిధానయగు గురుకుటుంబిని చన్నుగుడిచిపెరిగినవాఁడగుటచే కాపిలేయుఁడు అని పేరు పొందెను. ఈతఁడు సాంఖ్యశాస్త్ర జ్ఞాన ఘనుఁడు జనకునకుఁ దత్త్వోపదేశము చేసెను.
చూ. శాంతి. 4.342. మొ. 359. వ.

**కాపు** దే. వి. ($\sqrt{}$ కాచు).
రక్షణము.
ఆ. విను మహింస విప్రజనులకు నెల్ల ధం,గులను వలయుఁ బ్రజల వలనఁ గరుణ,గలిగి వారిఁ గీడు గమురక యుండఁగఁ గాపు పతికహింసకత్వ మనఘ. శాంతి. 5.299; అర. 6.324

**కాపురుషుఁడు**
కుత్సిత పురుషుఁడు, దుర్మార్గుఁడు.
వ. ... కాపురుష లక్ష్మీ విలాసంబు నుం బోలె ననుపయోగ్యంబును. విరా. 2.325.
కం. భూపాల వల్లభాజన, దీపిక యనఁజాలు ద్రౌపదికి నెయ్యెదలం దేపాటులు వాటిల్లెనొ, కాపురుషుల వలన నిట్టి కాఁతీయ పుట్టెన్. విరా. 4.130.

**కాము**1 దే. వి.
1. గొడుగు ధ్వజము మున్నగువాని దండము.
ఆ. సితముకామ సూడు వదకెడు. కర్ణ. 2.118.
చం. కనకపుఁగామ తోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనాభుని భుజ శాఖ యుచ్చిచేన. కర్ణ. 1.169.
శ్లో॥ అయస్మయో హేమదండో జగామ ధరణీం తదా మాధవస్య త విద్ధస్య తోమరేణ మహారణే. సం. భా. కర్ణ. 28.17.
2. కలువ తామర మున్నగువాని కాడ.

తే. దామఁ బాసిన కమలంబు కరణి.
కర్ణ. 3.371.

**కామ²** సం. వి. అ. స్త్రీ.
వ...అయుతానీకుండు పుట్టె వానికిం బృథుశ్రవసుని పుత్త్రియైన కామకు నక్రోధనుండు పుట్టె. ఆది. 4.2.
(మూలమున నీమె భాస యని పేర్కొనఁబడినది. అయుతానీకుఁడు అయుతానాయుఁడుగఁ జెప్పఁబడెను.)
శ్లో॥ అయుతానాయీ తు ఖలు పృథుశ్రవసో దుహితర ముపయేమే భాసాం నామ తస్యామస్య జజ్ఞే అక్రోధనః. సం. భా. ఆది. 63.21.

**కామందకుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక ముని.

**కామగమనము** సం. విశే. (అ.ఆ.అ.)
కోరిన చోటికిఁ బోవఁజాలు శక్తి గలది.
వ. మాకు మున్నూరకు మూఁడుపురంబు లెల్ల సుఖంబులం గలిగి కామగమనం బులై విలసిల్లు నెల్లగా నొసంగుము.
కర్ణ. 1.261.

**కామగీతలు** వి.
కాముఁడు చెప్పిన వాక్యములు. చూ. అశ్వ. 1.126. మొ. 131. వ.

**కామగృహము** సం. వి. అ. న.
స్త్రీ జననేంద్రియము, యోని.
కం. ... వలుగుఁ బదనుతోడి కళలు గామగృహమునన్. అను. 2.175.

**కామచారి** సం. విశే. (న్. ణీ. న్)
యథేచ్ఛముగా సంచరింప శక్తి గల వాఁడు, స్వేచ్ఛగమనము గలవాఁడు.
సీ. కామచారులకు దుష్కరము గలదె
ఆది. 2.34.
వ. ఏనుఁను గామచారిణిని నీకిష్టంబైన చోటికి నిన్నుఁ దోడ్కొని పోవనేర్తు.
ఆది. 6.196.

**కామజము** సం. విశే. (అ. ఆ. అ.)
కామము వలనఁ బుట్టినది. ఇవి:
1) జూదము, 2) వేట, 3) స్త్రీలోలత
4) మద్యపానము, 5) అర్థదూషణము

**కామఠకుఁడు** సం. వి. అ. పుం.
ధృతరాష్ట్ర సర్పజాతివాఁడు. ఆది. 2.212.

**కామతంత్రము** సం. వి. అ. న.
కామశాస్త్రము.
సీ. క్షత్రియుండు..., కామతంత్రంబు లోనుగ శాస్త్రముల నెల్లఁదగిన భంగి
ఆ. నలవరించి. అను. 4.124.

**కామతీర్థము** సం. వి. అ. న.
ఒకానొక తీర్థము. దీనిని సేవించిన వారికి ఇష్టసిద్ధి యగును. అర.2.254

**కామదోహిని** సం. విశే. (ఇ. ఈ. ఇ).
కోరికలను ఇచ్చునది.
వ. ఏను నీకుఁ గామదోహిని నయి యుండ సన్నెట్లు దక్కఁపగాఁ బలికితి.
అశ్వ. 2.20.

**కామధేనువు** సం. వి. ఉ. స్త్రీ.
కోరిన వస్తువుల నిచ్చెడి ఆవు, వేల్పుటావు.
కం. ... పొగడొందిన రాజునకుర్వి గామధేనువుగా. భీష్మ. 1.41.

**కామధ్వంసి** సం. వి. న్. (అ. పుం.)
కాముని (మన్మథుని ధ్వంసము చేసినవాఁడు, శంకరుఁడు.)

కం. ... అం,గన పతిఁ బాటింప
వలయుఁ గామధ్వంసీ. అను.5.295.

**కామము** సం. వి. అ. పుం.
1. ఇచ్ఛ, కోరిక.
వ. .. అంబుజాసనుండు, నాయందు
గోపంబును గామంబును లేవు. ద్రోణ.
2.163.
ఆ. అతివ కామకృతములైన కర్మం
బుల, ఫలములనుభవింప వలయు.
అను. 5.108.
(ఇది సంకల్పము వలన గలుగును.
దేహజ్ఞానముచే నశించును.)
సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టు
కామంబు రూపఱు, దేహ నిరూపణ
మున. శాంతి. 3.421.
2. ఇష్టవస్తు ప్రాప్తియందుఁ గలుగు
ఇంద్రియప్రీతి.
కం. ... కామము సంకల్పమునఁ
గలిగెడు సంక,ల్పామర్శ రహితమగు
చే,తోముద్రం దాల్తు నేను దుది యది
నీకున్. శాంతి. 4.45; శాంతి. 4.343
3. తృష్ణ, ఆశ,
ఆ. వినుమవిద్య గామమునకుఁ
గామము గర్మమునకుఁ బుట్టఁబట్టులు.
శాంతి. 4.343.
4. ఒక పురుషార్థము.
కం. ... తా, మూదల ధర్మార్థకామ
మోక్షస్థితికిన్. విరా. 1.4.
5. సంభోగేచ్ఛ.
కం. ... ఆ లతాంగి కామాతురు
నన్, బెట్టి యచట దానికి మనసెట్టు
నిలుచు. విరా. 2.297.

**కామరూపము** సం. వి. అ. పుం.
కోరిన రూపము.
మ. ... మనోజాతాగ్ని సంజాత
వే,దనయై రాక్షసి కామరూపధర్మ
మర్త్యస్త్రీ స్వరూపంబుతోన్. ఆది.
6.188.

**కామరూపిణి** సం. విశ. (న్. ఈ. న్).
కోరిన రూపము గైకొనునది.
వ. ... ఒక్కనాఁడు కామరూపిణు
లగు గోవులు గొన్ని కాంతాకారం
బులు గైకొని కమనీయంబగు కొలన
జలక్రీడలు సలుపుచుండ. అను.
3.67.

**కామవికారము** సం. వి. అ. పుం.
మన్మథోద్రేకము, మోహముచే శరీర
మునందుఁ గాని మనసునందుఁగాని
రెండింటఁగాని కలుగు మార్పు.
వ. ... అమ్మృగ్గకుం దన సన్నిధిఁ
గామవికారంబు పుట్టుట గలుగ భావిం
చుచు. విరా. 2.82.

**కామవైరి** సం. వి. న్. పుం.
మన్మథునకు శత్రువు. శివుఁడు.
సీ. ... అంబి తే. కా సమేతుఁడై
యేతెంచి కామవైరి. శాంతి. 6.252.

**కామహరుఁడు** సం. వి. అ. పుం.
మన్మథుని హరించినవాఁడు, శంక
రుఁడు.
కం. ... అమేయాకార కామహర.
ద్రోణ. 2.161.

**కామాతురుఁడు** సం. విశ. (అ.ఆ.అ.)
మన్మథోత్కంఠ గలవాఁడు. కామ
ముచే ఆర్తిగొన్నవాఁడు.
కం. ... కట్టిడియే యీ లతాంగి
గామాతురు నన్, బెట్టి యచట దానికి

మన,సెట్టి యిటువ దగవు విడువ
నెట్టులు సేర్చున్. విరా. 2.297.

**కామి**[1] దే. వి. ('అను'ధాతువు యొక్క వ్యతిరేక భావార్థక రూపము).

1. కాకపోవుట.

ఆ. చెప్పినట్ల యేను జేసెదనవి
యొకం,బడిన వాఁడ వింక బలుకు
దిరుగఁ,గామి మఱవకుండఁగా నీకు
వలయుజ్ఞ, మ్మయ్య దండధారకాగ్ర
గణ్య. శాంతి. 2.162.

2. లేకుండుట.

కం. విను హవ్యకవ్యములు మ,జ్జన
భోజనములును విప్రజాతి వనిత
దాఁ,దనిసేయ నడపునది యప్పను
లకు వెలసతులు గామి బ్రాహ్మణుఁడు
స్వాహా. అను. 2.240.

**కామి**[2] సం. విశే. (న్. నీ. న్).
కాముకుఁడు, మిక్కిలి మరులు గల
వాఁడు.

ఉ. ... కామికి నయ్యుఱుక నొందు
పలుపఁబోయనే. ఆది. 4.214.

**కామించు** సం. స. క్రి.

1. కోరు, అభిలషించు.

సీ. ... తపములు యజ్ఞముల్ దాన
ముల్ వ్రతములు, దేవతా సజ్జన సేవ
నములుఁ, గావించుఁ బుత్రుని గామించి
జనకుఁడు. అర. 5.5; శాంతి.6.424

2. మోహించు, వలచు.

వ. ... శుక్తిమతి యను మహానదిం
గోలాహలంబను పర్వతంబు గామించి
యడ్డంబుపడిన. ఆది. 3.26.

**కామిని** సం. వి. ఈ. స్త్రీ.

అంగన, స్త్రీ.

కం. అని మనసునఁ దలపోయుచుఁ,
దన తమ్ముని, నల్లనెత్తి దండది
దొరఁగం,జనుదెంచు నశ్రుపూరము,
కనుఁగవలో గ్రెంగిపోనుచుఁ గామిని
పలికెన్. విరా. 2.59.

2. అందముగల = స్త్రీ.

వ. ... కామినీ గండ పాండుచ్ఛవిఁ
దొట్టి కుముదంబులకు జగన్నేత్రంబు
లకు నానందంబాపాదించుచుఁ జం
ద్రుండు. ద్రోణ. 5.276.

3. మిక్కిలి వలపుగల స్త్రీ, ప్రియ
సంగమమునందు . మిక్కిలి ఆసగల
స్త్రీ.

**కాముఁడు** సం. వి. అ. పుం.

1. మన్మథుఁడు.

ఉ. ... పౌత్రిపై ... నెక్కొను
చూడ్కిఁ గ్రమ్మఱుప నేరక యూరక
నిల్చెఁ గాముచేఁ జిక్కిన నెమ్మనంబు
గడుఁ జేదపుడు మానమునై యతఁ
డప్పుడయ్యెడన్. విరా. 2.23.

2. ధర్ముఁడు అను మనువునకుఁ
బుట్టినవాఁడు. ఈతని భార్య పేరు
రతి. ఆది. 3.69.

రసుని కొడుకు, అమోఘుని తండ్రి.
ఆర. 5.159.

**కాముకుఁడు** సం. విశే. (అ. ఈ.అ).
వలపుకొన్నవాఁడు.

**కాము బాణము** వి.

మన్మథుని బాణము, పద్మము.

సీ. గంధుమీలకుఁ బుట్టి కాము బాణ
ములతోఁ గలసి యాడెడు నట్టి కన్ను
గవయు. విరా. 2.67.

**కామ్యకవనము** సం. వి. అ. న.
పాండవులు అరణ్యవాసము చేసిన వనము. ఆర. 1.45.
వ్యాసుని యుపదేశాను సారము పాండవులు ద్వైతవనమును వదలి కామ్యక వనమును జేరిరి. ఆర. 6.101.
కామ్యక వనంబున ఘటోత్కచుఁడు సాహాయ్యము చేసెనని ధర్మజుఁడు వచించెను. ద్రోణ. 5.257.

**కామ్యపూజ** సం. వి. ఆ. స్త్రీ.
అభీష్ట సిద్ధికై యొనరించు దేవతా పూజ.
ఆ. అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలం,బుగ నొనర్చి కామ్య పూజ దీర్చి, యానసచయ మంగళార్థంబులగు మంత్ర సంచయము దగ జపించుచుండె. విరా. 1.146.

**కామ్యము** సం. విణ. (అ. ఆ, అ.)
కోరఁదగినది.
కం. ... కామ్యంబులు నా,మనమున లేవేనేమియుఁ గొని నిత్తునకాస యధిప కోరుము లగఁగన్. శాంతి. 4.143.
వి. అ. న.
అభీష్ట పదార్థము.
తే. కుడుపునకు ముందరొడ్డుల గోవునకు సమంచిత గ్రాస ముష్టి నిత్యంబు నేఁడు,గాలమిచ్చిన నతఁడెల్ల కామ్యములును, బ్రాహ్మణుల కోరఁగిన ఫలమువడయు. అను. 2.415.

**కాయ** దే. వి.
1. చెట్టు తీఁగ మున్నగునవి కాచెడి కాయ. పచ్చికాయ. పండనవసరము లేనియే భుజించుట కుపయోగించు ఫలము.
ఉ. కాయలఁ బండ్ల నీళులను గల్గవె సూక్ష్మపు జంతువుల్. శాంతి.1.110.
చం. ... కూరలును గాయలు బండులు భోజనంబుగాన్. ఆర. 1.94.
2. చేతులయందుఁ గాచెడి బొప్పి, కిణము.
ఉ ... కన్నుల సన్నలంబనులు గైకొని వారక చేయుచుండుటన్, మున్నటులున్న పాణితలముల్ బలుగాయలు గాచెఁ జూచితే. విరా. 2.221.

**కాయము** సం. వి. అ. పుం. న.
దేహము.
చం. ... నిరుపాధిక చిన్మయ కాయ. విరా. 2.363; శాంతి. 5.518; శాంతి. 4.333.

**కాయశుద్ధుఁడు** సం. విణ. (అ.ఆ.అ.)
శరీర మాలిన్యము తొలఁగినవాఁడు.

**కాయశౌచము** సం. వి. అ. న.
ఒకానొక తీర్థస్థలము. ఇచ్చట స్నానము చేసినవారికి కాయశుద్ధి గలుగును. అను. 2.263.

**కాయికము** సం. విణ. (అ. ఆ. అ).
శరీరమునకు సంబంధించినది (పాపాది)
సీ. ... అభక్ష్య, భక్షణంబును నన్య భామారతము మద్య,పానంబు మొదలైన పాపకృతులు.
తే.... కాయికంబులు. అను. 5.174.

**కాయ్వు** దే. వి.
అనురాగము, కామము.
సీ. ... కెమ్మోవి యాని యెక్కింతు గాయ్వు. విరా. 2.310.

**కారండవము** సం. వి. అ. పుం.
కన్నెలేడి పిట్ట.
వ. ... బక బలాక కోక కారండవ హంస చక్ర మధుకర సౌఖ్య సరోవర సంకులంబగు. అర. 1.201.

**కారంధమము** సం. వి. అ. న.
పశ్చిమ సముద్ర తీరంబునఁ బ్రసిద్ధం బైన పంచ తీర్థంబులలో నొకటి. చూ. పంచ తీర్థములు. ఆది. 8.149.

**కారకత్వము** సం. వి. అ. న.
చేయుట.
కం. ... పాప క్రియోక్తుచు కారకత్వ మెక్కుడంగ మన్నసేయఁడును సూత సుతుండును సొలయుండుఁ బ్రసంగిరి. కర్ణ. 2.301.

**కారకము** సం. విశే. (అ. రికా. అ.)
చేయునది, కలిగించునది.
కం. పరి సృజియించున వర్ణము. కవిభేదమనఁ గలదా ఫలం బసమం బయునఁ బోదికృపయు విస్మయకార కము. శాంతి. 6.599, కర్ణ. 3.399; స్త్రీ. 1.53.

**కారగ్గి** దే. వి. (కారు+అగ్గి).
కార్చిచ్చు, దవానలము.
గీ.. వగ్గరంబునఁ దాను గార్గ్గఁగాలి, నడచె. అశ్వ. 2.163. చూ. కారు

**కారణజన్మము** సం. వి. అ. పుం. (న. న్. న.)
పరమాత్మ యొక్క నిమిత్తముతో గలిగిన పుట్టుక
ఉ. ... కారణజన్ముఁడై కపటవేషము వచ్చినఁ జెంపు తప్పునే (కారణ జన్మముగలది). విరా. 4.22.

**కారణము** సం. వి. అ. న.
(క్రియా నిష్పాదకమగు) హేతువు.
వ. ... ఒక్క కారణంబున నుద్ధతు లగు విరోధులచేతం బతుల సన్నిధిం దలవట్టి యీడ్వంబడి. విరా. 1.313.
2. సాధనము, కరణము.
సీ. గౌరవంబున కేకకారణంబు ... భార్యయ చూవె. ఆది. 1.84.

**కారము[1]** సం. వి. అ. పుం.
ఒక ధ్వనినిగాని వర్ణమునుగాని చెప్పు నప్పుడు వచ్చు ప్రత్యయము.
వ. ఇట్లతండు మూర్ఛిల్లిన ముని జనంబులును నంబయు నధిక శోక సమాకులత్వంబు నొంది హాహాకారం బులు సెలంగఁ బొదివిరి. ఉద్యో. 4.334.

**కారము[2]** వై. వి. (సం. క్షారః; ప్రా. కారం; క. కారవు; త. కారమ్)-కటుః (సం); కారో (ప్రాకృ); కార (ప్రాకృ. సమ)-అని బాల వ్యా.) ఉప్పుమన్ను, చవుడు (గుడ్డలు శుభ్రము చేయుటకు నుపయోగించునది).
చం. ... అంబరమునఁ బుట్టినట్టి మలపంకము గ్గారములోన నద్దఁగా, విరిసినయట్లు. శాంతి, 3,364,
శ్లో॥ స తత్పాపమ్ నుదతే కర్మశీలో వాసో యథా మలినమ్, క్షారయుక్తమ్. సం. భా. శాంతి. 152.34.

**కారాకు** దే. వి. (కారు+ఆకు)
పండుటాకు.
కం. వైరమున మలిచి త్రెంపక, కారాకులు డుల్లినట్లు కర్మము లెల్లం, దార ఫెడఁబాయ వలయుట, సారకృపం

దెలియఁ జెప్పె శౌరి యతనికిన్.
భీష్మ. 1.204.
సీ. ... వెదలు నిట్టూర్పుల వేఁడిమిఁ
బగిలిన, యధర పల్లవము గారాకుఁ
బోల. అర. 7.28.

**కారి** సం. విణ. (న్. ణీ. న్.)
చేయువాఁడు (ఈ యర్థమున సమా
సాంతముననే యుండును.)
చం. ..లో,కనయన పర్వ నిర్వహణ
కారి సుపర్ణుఁడు పుట్టె భూవరా.అను.
1.137.
ఆ. బ్రహ్మచర్యమునఁ దపంబున
నుత్తమ, దానములను బడయఁ
దలఁచునట్టి, గతులకంటె సౌఖ్యకారిణి
యగు గతిఁ,బొందె నీ సుతుండు
గుందనేల. ద్రోణ. 2.324.
ఉ. ... దురంత దుర్దశా,కర్దమ లేప
నిర్హరణకారి కృపామృతపూః. ...
భీష్మ. 3.452.

**కారించు** సం. స. క్రి.
బాధించు, పీడించు.
ఉ. ... నీవడియాసల వచ్చి రిత్త
గా,రింపక మానుమాతని చరిత్రము
నీకును మాకు వింతయే. ఉద్యో.
1.314.
సీ. ... కొంచక నీరిలో ముంచుచు
నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁబెట్టు.
ఆది. 5.166; స్త్రీ. 1.49; శాంతి.
5.530.

**కారిత** సం. వి. ఆ. స్త్రీ.
కృత్యము.
ఉ. కావున భిక్షుఁజెంది ప్రియకారిత
శూద్రుఁడు గొల్చునేని. అను. 3.316;
కర్ణ. 1.1.

**కారితము** సం. విణ. (అ. ఆ. అ).
చేయింపఁబడినది.
వ. ... వారణావతమ్మున వారెల్లి
నిట్టి దారుణంబు దుర్యోధనునిచే
కారితంబకా నెఱింగి ఆది. 6.167.

**కారు**1 దే. వి.
1. అడవి.
చం. అదియునుగాక కోలుపులినైన
ను,గారెను,పోతునైన నున్మద కరినైన
నుగ్ర మృగనాథునినైనను గిట్టి ముట్టి
ప,ట్టుదు. విరా. 1.83.
కారగ్గి: ఆశ్ర. 2.163.
విణ.
1. దున్ననిది (పొలము)
సీ. ... తఱచువాన,కారు పొలంబునఁ
గల్గెనేనియుఁ గొల్చు గావింపనేర్చునే
యేవిధమున, వలనేర్పడఁగ దున్నఁ
బొలములోనైన వర్షంబు లేకున్న
ధాన్యంబు లగునె. సౌప్తి 1.31.

**కారు**2 నల్లనిది.
తే. గాండివంబింద్రచాపంబు కరణి
నొప్పు, మెఱసి దివ్య కిరీటంబు
మెఱుఁగులతర, [illegible]
గర్జగా మేని కృష్ణ,కాంతిఁ బొలిచెఁ
గప్పుచియను కారుమొగులు. భీష్మ.
1.108.

**కారు**3 వై. వి. (సం. కాలః. క. కారు)
వర్షాకాలము.
తే. ... కారుకాల మేచుతెఱఁగున
నేచుచు నీచకుటిల గతులఁ దునుముచు
నెగడుట పతికి నీతి. శాంతి. 3.105.

**కారుఁడు** సం. విణ. (అ. ఈ. అ).

(ఇది సమాహారమందే యుండును).
చేయువాఁడు.
ఉ. ... అగపడుఁడు పదార్థ తత్త్వ నిస్సంశయకారి. ... పెద్దసేయుఁ గొల్చెదన్. భీష్మ. 1.71.

**కారుకాలము** వి.
వర్షాకాలము. చూ. కారు3.

**కారుకాను - కార్కొను** దే. అ. క్రి.
విజృంభించు, వ్యాపించు, క్రమ్ము.
కం. కరి తురగ సమితిఁ గార్కొని, పదపదపు మొనలు మొగులు కొమరునఁ గదియన్, శరవేగంబున సమదుఁడు,ద్ధుర మారుత చందభంగి దోపఁ దెరల్చెన్. విరా. 4.270.
కం. కారుకొని మేఘజాలా,కారముగాఁ జాలనొప్పెఁ గౌరవ సైన్యం,బారూఢ పీడకస వి,స్ఫారంబై యుండఁ దోఁచె వాఁడమఁ దమమున్. భీష్మ 2.169.
ఆ. వసుధ నరేశ్వరుఁడు పెంపొల్పుఁ బ్రాపు,ణింగ దాడివాప్యు లంగ లంమ ప్లేప్పిరియు బెరయ. మేముకొని వాఁడు, గడుపు సమృద్ధి గారికొనుచు. ద్రోణ 3 98.

**కారుణికత్వము** సం. వి. అ. న.
దయ.
ఉ. ... లచ్చెడుం, గట్టెడిఁ బట్టమ ప్రేమను కారుణికత్వ మహావిభూతులన్. విరా. 1.27, స్త్రీ 1 90.

**కారుణికుఁడు** సం. విశ. (అ.ఈ.అ).
కనికరము గలవాఁడు, దయాళుఁడు.
ఉ. ... పరమ కారుణికా పరిణామ దూర. విరా. 1.333.
వ. ... కారుణికోత్తముండగు నత్తాపసోత్తముండు. శాంతి. 3.365.

**కారుణ్యము** సం. వి. అ. న.
కనికరము, దయ.
వ. ... నాకుఁ దన దివ్యచిత్తంబునఁ గల యక్కారుణ్యంబు తెఱంగెఱుంగునట్టి శక్తిం బ్రసాదించి. విరా. 1.11.
కం. నారదుఁడు పరమపురుషుని, కారుణ్యము వడసివచ్చి. శాంతి. 6.461.

**కారుత** సం. వి. ఆ. స్త్రీ.
కారువు (కళాకారుఁడు) చేయు వృత్తి
సీ. .. విద్య వార్త, సేవ కారుత యర్థసిద్ధికి మూలముల్. అను. 5.75.

**కారు మొగులు** దే. వి.
నీల మేఘము, నల్ల మబ్బు.
తే. గాండివం బింద్రచాపంబు కరణి నొప్పు, మెఱసి పెక్కరకేటుఁడు మెఱుఁగులవఁ, జ్యానినాదంబు గర్జగా మేని కృష్ణ,కాంతిఁ బొలిచెఁ గవ్వడియను కారుమొగులు. భీష్మ. 1.108.

**కారువు** సం. విశ. (ఉ. ఉర్వీ. ఉ).
కళాకారుఁడు (శిల్పి, వడ్రంగి, నేతకాఁడు మొదలగువారు). చూ. కారుత.

**కారూషకుఁడు** సం. వి. అ. పుం.
క్రోధవశగణము వలనఁ బుట్టిన వాఁడు. ఆది. 3 80.

**కారెనుపోతు** దే. వి. (√ కారు2)
అడవిదున్న.
చం. అదియునుగాక కోలుపులినైనను గారెనుపోతునైన నున్మదకరినైన .. బట్టుదు. విరా. 1.83.

**కార్కొను** దే.అ. క్రి. (చూ. కారుకొను)

**కార్చిచ్చు** (కారు² + చిచ్చు).
అడవిలో చెట్లు ఒండొంటితో రాచు కొనుట వలనఁ గలిగిన నిప్పు, దవా నలము.
వ. ... విరాటు పట్టుకొన్నయెడ యెఱింగి కదుపులం గార్చిచ్చు చం దంబునం బొదివి. విరా. 3.132.

**కార్తవీర్యార్జునుఁడు** / **కార్తవీర్యుఁడు** } సం.వి.అ పుం.
హైహయుఁడు. చూ. చరిత్ర. శాంతి. 2.73. మొ. 83 వ; సభా. 1.190., ద్రోణ. 3.134.

**కార్తికము** సం. విశే. (అ. ఈ. అ.)
కార్తిక మాసమునకు సంబంధించినది.
వ. .. మఱునాఁడు కార్తిక పౌర్ణ మాసియైన భూసుర సహస్రంబులు దన గృహంబునం బసిండి పళ్ళెరం బుల భోజనంబులు సేయను. శాంతి. 3.493; ఆశ్ర. 1.109.
(కార్తిక పౌర్ణమాసి = కార్తిక మాస మునందలి పూర్ణిమ).

**కార్తికేయము** సం. వి. అ. న.
ఒకానొక తీర్థము. ఇందు స్నానము చేసిన పాపవిముక్తులయి బ్రహ్మ లోకంబు వడయుదురు. అర.2.265.

**కార్తికేయుఁడు** సం. వి. అ. పుం.
కృత్తికల కుమారుఁడు, కుమార స్వామి.
తే. కార్తికేయుం డధీశుండుగా సమర్థ్య, లెలమిఁ బురికొని దైత్యుల గెలుచు పెంపు. శల్య. 1.80.

**కార్తె** వై. వి. (సం. కృత్తికా).
కృత్తికా నక్షత్రము.
సీ. కార్తెఁ బాయసమజ్జగర్భుని తార మాషములు. అను. 2.378.

**కార్పణ్యము** సం. వి. అ. న.
కృపణత్వము, లోభము.
వ. ... ఏను గార్పణ్య దోషోపహత స్వభావుఁడను ధర్మ సమ్మూఢ చేత స్కుండనునై నిన్ను శరణు సొచ్చి యడిగెద. భీష్మ. 1.194.

**కార్ముకము** సం. వి. అ. న.
విల్లు, ధనుస్సు.
కం. ... కురు దేహాహ్లాదన,ముసు నగు నెఱ కార్ముకంబు మోపెట్టించెన్. విరా. 1.170.

**కార్యఖడ్గముల మోవు** మి. ఎ. సమ.
కార్యముల యొక్కయు ఖడ్గముం యొక్కయు; కార్యాలోచన భారమునుఁ యుద్ధనిర్వహణ భారమును.
కం. ఎందుఁ గలదేని కడునెఱి, విడిచి విచారింపఁ బొమ్ము వ్యాపించెదని నీ, తలన కార్యఖడ్గంబుల మోపెక్కించె రిత్తవోవునె నీకున్. విరా. 5.23.

**కార్యఖడ్గములు** వి. సమ.
కార్యాలోచనము, యుద్ధనిర్వహణము.
చం. బలగముఁ బెంపు తేజమును బాహుబలంబును నగ్గలంబు పెక్కు లెఱుఁగుఁ గార్యఖడ్గములకు దగు త్రోవలు ... ఉద్యో. 4.99.

**కార్యగతి** సం. వి. ఇ. స్త్రీ.
కార్యమువలనఁ గలుగు మంచిచెడ్డలు
ఆ. కడపటమునుపు చెపుపఁ గాలు ద్రిప్పుడు కార్య, గతులఁ జొరవు నీతియుతులు సమము, మధమ సాహస

ముగ నాడుదురర్థసం,సిద్ధిఁ బొందు తెఱఁగు సేయునెడల. విరా. 4.207.

**కార్యజ్ఞానము** సం. వి. అ. న.
కార్యవిషయకమైన తెలివి.
కం.... పెద్దనకుఁ గార్యజ్ఞాన నిరూఢి లేక తక్కిన నను జన్ములు సిక్కు వడుదు రవనీనాథా. అను. 4.133.

**కార్యతంత్రము** సం. వి. అ. న.
1. ఇట్లు చేయఁదగినది యని నిశ్చయించిన కార్యము.
చం. ... అది కార్యతంత్రముగఁ జూచితయేని భవన్నియోగమున్, గొనకొని చేసెదన్. ద్రోణ. 3.115.
2. కార్యనిర్వహణపద్ధతి.
చం. అలుక మనంబునం గదిరి నాతఁడు తాను నెఱుంగఁడొడ్డచేఁ, దెలియఁడు కార్యతంత్రములు. సౌప్తి. 1.77., స్త్రీ. 1.17.

**కార్యదాహము** సం. వి. అ. పుం.
కార్యమును సాధించుకొన వలయునను తాపత్రయము.
వ. (దుర్యోధనుఁడు ద్రోణునితో) అని పలికి కార్యదాహంబునం జేసి తన రాజసంబదంచుకొని యతండు. ద్రోణ. 3.109.

**కార్యము** సం. విశ. (అ. ఆ. అ.)
1. కర్తవ్యము, చేయఁదగినది.
వ. అని పలుమాటలాడి మీమది కలంగకున్న దేని నీ [illegible] గర్తవ్యం బెద్ది చెప్పవలయుననినఁ గృపాచార్యుండు ధనురాచార్యనందను మొగంబు గనుఁగొని నీవు చెప్పఁదలంచిన యంతవట్టునుఁ జెప్పి కార్యం బెఱిఁగితేని నాకుఁదోఁచినదానిం జెప్పెద [illegible] యిట్లనియె. సౌప్తి. 1.30.
వ. ఇవ్విధంబున గార్యంబు నిర్ణయించి. విరా. 1.115.
కం. ... సత్యాం,గత్యంబిటు గొన ముఖ్యకార్యము సుండీ. శాంతి.5.556.
2. అర్హము, తగినది.
చం. జనులు నుతింపగా సుకృత సంపదఁజేసి యమర్త్య భావముం గనియును జెందకిట్లునికి కార్యమె ద్రౌపది భీమసేను న,ర్జునుఁ గవలం [illegible] సువ్రత చాలితి చాల వయ్యె దీ,శునకము విద్య నితెఱఁగు సూరిమతుందగు నీకు నర్హమే. మహా. 56.

వి. అ. న.
1. వ్యాపారము, పని.
వ. .. నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు దల్లడించెదవు. ఉద్యో. 2.89.
వ. ... పదంపడి కార్యంబు ప్రసంగించి నా యాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబులింత యొప్పునే యని యగ్గించిన ధృతరాష్ట్రుండు. ఉద్యో. 2.117.
(కార్యము = వచ్చినపని)
వ. ఆచార్యులైన వారలు కార్యంబు దవ్వులం గనియెడువారు గానఁ గయ్యంబు తెఱంగు వారల నడుగ [illegible]దు. విరా. 4.191.
(దవ్వులం గనియెడువారు = తొందఱగాఁ దేల్చువారు కారు. కార్య నిర్ణ

యమున కాలము గడుపుదురు- అని భావము.)

2. రతి, సంభోగము.

తే. కార్యమగుటయు నరిగెదుగాక పిదప, నిల్వుమంతకు క్షేమయు నీవు నన్నుఁ, గదియకుండెదవేని నిల్చెద సధర్మ, వృత్తివగు మని వారించె న త్తపస్వి. అను. 2.20.

3. (కార్యముగుట = పనిజరుగుట-రతి జరుగుట. ప్రయోజనము.)

వ. ఉత్తరుండు కాక గాండీవియు నగుట మన కార్యంబు. విరా. 4.185

4. మేలు.

ఉ. కావున దీనియందిడుట కార్యము గైదువులెల్లఁ గేశచ,ర్మావృత సంచ యంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం, బోవరు దీనిదిక్కొరులు. విరా. 1.166; ఉద్యో. 2.298.

5. మంత్రాలోచనము.

కం. దుర్యోధనునింటం దగు, కార్యముసకు ప్రస్తుతులు గలవాడై చా,తుర్యంబు మెఱయు కర్ణుని,యార్యత్వము సెల్లుచున్న యదియే నెమ్మిన్. ఉద్యో. 1.281.

ఆ. బ్రదుకఁ దలఁచితేనిఁ బాండు నందనులను, నింకనైనఁ బుడమి యిచ్చునట్లు,గాఁగ నన్నతోడఁ గార్యంబుఁ జెప్పు మ, వ్వెదఁగు భీష్మబుద్ధి వినక చెడియె. ద్రో.4.92.

5. విషయము.

కం. ఒక కార్యము సెప్పెద మీ, సకల బలములందు సవ్యసాచి కెదురుగా, నొరుఁడు గలిగెనఁ, గయ్యమునకుఁ బూనుఁడు రిత్త బహుజన క్షయమేలా. ఉద్యో. 3.338.

**కార్యవచనము** సం. వి. అ. న.
యుక్తమైన మాట.
వ...వెడంగులగుటం గార్యవచనంబు లెఱుఁగరు. ఉద్యో. 3.235.

**కార్యవాది** సం. విశ. (న్. నీ. న్.)
కర్తవ్యమును బోధించువాఁడు.
ఉ. నీ తెఱఁగిట్టిదేని రణనిష్ఠకుఁ బూనకు కార్యవాదివై, ద్వైతవనంబు నంద సముదగ్ర భుజాబల దుర్జయుండు రా,ధాతనయుండు వాని ననిఁదాక నశక్యము నాకునన్న నే,నీ తెరువేల వత్తు మహి యేల నశక్తుఁడు కాంక్ష సేయునే. కర్ణ. 3.57.

**కార్యసూత్రము** సం. వి. అ. న.
కార్యనిర్ణయము, కార్యవిధానము.
కం. మనమందఱమును ధృతరా,ష్ట్రుని కడకుం బోయి కార్య సూత్ర మతని చే,వినవలయు నాతఁడెయ్యదిఁ, గని పలికెన నదియ మనకుఁ గర్తవ్యమగున్. సౌప్తి. 1.41.

**కార్యోక్తి** సం. వి. ఇ. స్త్రీ.
కర్తవ్యమునకు సంబంధించిన వాక్యము.
సీ. ... ఉత్తరంబిచ్చు కార్యోక్తులు నెఱుఁగంగ వేడుక వచ్చిరి వీరలెల్ల. ఉద్యో. 3.146.

**కాఱడవి** దే. వి.
దట్టమైన అడవి. చూ.కాఱు.

**కాఱియ** వై. వి.
బాధ, కష్టము, యాతన.

కం. ధూపెం వల్లభాజన, దీపిక
యనఁజాలు ద్రౌపదికి నెయ్యెదలం,
దేపాడు వాటిగ్గినా, కాపురుషుం
వంక పెట్టి కాఱియ పుట్టెన్. విరా.
4.130.

సీ....తమ కఱుగమి పుట్టుటయును
విప్రకేసితల్ సనిరి సోమ,కవకర్తు
ననిఁ తమ కాఱియ సెప్పెన. అను.
3.195; ఉద్యో. 4.200; శ్రీ. 1.71.

**కాఱియవెట్టు** స. క్రి. (కాఱియ + పెట్టు)
బాధపెట్టు, కష్టపెట్టు.

ఉ. ... మేన్, గాఱియవెట్టెడు నొడి
పెంటుగ వండుచు నెల్ల కూరిచున్.
విరా. 1.77.

కం. శ్రీ సంతోషించు తెఱం,గాన
వచని మనసు గలుగునట్టి యధముఁ
డి,చ్చె నడిగినఁ ఇని యిచ్చె,గానిం
బడు ఇమని ధటుల గాఱియవెట్టున్.
అన్వ. 4.228.

**కాఱు**[1] దే. అ. క్రి.

1. స్రవించు.

సీ...ఒక్క,నాఁడ త్రిపస్వి ప్రేల్మాటి
దర్పు. ఆ. గంటిఁ గూర్చి యనదు
గాఱిన నర్తించె, నతఁడు తపము
సిద్ధిపాత్రుఁ బొంగి. [illegible] 2.160.

కం. ఒంటు నెమఁ దలఁపగా [illegible],
గలిగెనె వంచాలు నొదలఁ గాఱెడు
[illegible] త్రాక్షడనె యే,
[illegible] ప్రేమంపైన వరము గల్గి
[illegible]. అశ్వ. 3.58.

2. [illegible]

వ... తన యంగంబుల ప్రేలం గిఱిన
సందు భస్మంబు గాఱిన నా సంయమి
సిగ్గుపడి దండప్రణామంబు సేసి.
శల్య. 2.161.

శ్లో॥ తతో భస్మక్షతాద్రాజన్ నిర్గతం
హి సన్నిభమ్. సం. భా. శల్య.
40.49.

3. తొలఁగు.

తే. ఇంద్రియములలో నొక్కటియేనిఁ
బట్టు,వడక వెడలిన నాగంటిఁ
లంపించి. సభా. 1.171.

శ్లో॥ ధర్మకామార్థలోకానాం కార్యా
ణామ్ చ ప్రవర్తకా కురుభ్యః ప్రస్థి
తాస్తేతు మధ్యేన కురుజాంగలమ్.
రమ్యం పద్మసరో గత్వా కాలకూట
మతీత్యచ, గండకీం చ మహాశోణం
సదానీరాం తథైవ చ. ఏక పర్వతకే
నద్యః క్రమేణైత్యా వ్రజంత తే.
సం. భా. సభా. 20; 26,27; 28.
దుర్యోధనుఁడు దీని తీరమున దండు
విడిసెను. ఉద్యో. 1.228.

**కాలకేయులు**

ఒకానొక రాక్షసులు. కాలక పుత్రులు
పౌలోములతోఁ గలసి వీరు అఱువది
వేవురు. హిరణ్యపుర నివాసులు.
మాయావులు. వీరిని అర్జునుఁడు సంహ
రించెను. ఆర. 4.81. మొ. 87వ.,
విరా. 4.210.

**కాలక్షేపము** సం. వి. అ. పుం.

కాలము వెళ్ళఁబుచ్చుట.

వ. అనినఁ బాంచాలి ప్రకంపిత చిత్త
యగుచుఁ గొండొక దొలంగి వానిదెస
నవమానదృష్టిం జూచుచుఁ దనపతుల
రాకయ [illegible] ప్రతివాక్యంబుల

గొంత కాలక్షేపంబు సేయుటకై వాని కట్లనియె. ఆర. 6.167.

**కాలగతి** సం. వి. ఇ. స్త్రీ.
కాలము యొక్క పోకడ.
చం. ... భీష్ముఁడెఱిఁగి వారికిట్లను సురలార కాలగతి నాత్మఁదలంచియ కాదె మేనిలో నునిచినవాఁడఁ బ్రాణములు. భీష్మ. 3.414.

**కాలగోచరుఁడు** సం. విణ. (అ. ఆ.అ.)
కాలమునకు అధీనమైనవాఁడు, చచ్చినవాఁడు.
వ. ... జటాసుర కళేబరంబె త్తి యొక్క విశాల పరుష పాషాణంబుపై జర్జరితంబుగా వైచి వానిఁగాలగోచరుంగాఁ జేసిన వాయుపుత్రు పరాక్రమంబు ధౌమ్య రోమశాది మహీసురవరులు వర్ణించిరి. ఆర. 3.397.

**కాలఘటుఁడు** సం. వి. అ. పుం.
ఒక ముని. జనమేజయ సర్పయాగమునందలి సదస్యులలో నొకఁడు.

**కాలచక్రము** సం. వి. అ. న.
చక్రాకారముగా తిరుగుచుండు కాలము.
తే. కాలచక్రంబు నిరవధికంబు దీన, సర్గములుఁ బ్రళయంబులుఁ జనుచునుండుఁ. శాంతి. 4.265.

**కాలచక్రుఁడు** సం. వి. అ. పుం.
సూర్యుఁడు.
మ. ... అతిదీప్తంబైన తేరొప్పె, శాత్రవ సంఘంబు మనంబునన్ భయము గూడం గాలచక్రాకృతిన్. ద్రోణ. 1.124.

**కాలంజరము** సం. వి. అ. న.
ఒక పర్వతము. ఇందు దేవహ్రదమను తీర్థము గలదు. ఆర. 2.278.

**కాలజ్ఞత** సం. వి. ఆ. స్త్రీ.
కాలమును గుర్తెఱుంగుట.
కం. ... తా.నజ్ఞాతవాసమును గాల జ్ఞతఁ జలుపండె యన్యులకు వగపేలా. ఉద్యో. 1.207.

**కాలతత్త్వము** సం. వి. అ. న.
కాలము అను తత్త్వము, కాలము.
తే. ధరణి మొదలైన పంచ భూతములకంటె, మనసు కంటెను బుద్ధి కంటెను మహత్తరంబు గాలంబు గాలతత్త్వంబు మెఱిఁగి,యుండు విభుఁడిజ్జగంబుల కొడయుఁడతఁడు. శాంతి. 4.197.

**కాలదండము** సం. వి. అ. పుం. న.
యముని ఆయుధము.
ఉ. ... ఆరఁడ[illegible] నెత్తిన యా గద కాలదండము,ద్దామ విలాసుఁడై [illegible] విహరింపకుండునే. ఉద్యో. 2.185.

**కాలదంతకుఁడు** సం. వి. అ. పుం.
వాసుకి కులమునఁ బుట్టినవాఁడు. ఆది. 2.212.

**కాలపక్వము** సం. విణ. (అ. ఆ. అ).
కాలము చేతనే పరిపాకము నొందినది; మృత్యువు సమీపించినది.
తే. ... అకట కాల,పక్వమయ్యె నీ [illegible] యెల్ల. [illegible]. 3.377.

**కాలపర్వతము** సం. వి. అ. పుం.
ఒకానొక పర్వతము. రావణుఁడు శ్రీరాముఁడున్న తావునకు బోవునపుడీ పర్వతమును దాఁటి సముద్రతీరమును జేరెను. ఆర. 6.3.7.

**కాలపాకము** సం. వి. అ. పుం.
స్వభావము.
తే. ..ప్రజ్ఞా శాంతిశాలి యగుట, కాల పాకంబుతోఁ దాన కలుగు ననఘ. శాంతి. 4.383.
శ్లో॥ స్వభావాల్లభతే ప్రజ్ఞా శాంతిమేతి స్వభావతః. సం.భా. శాంతి. 222.35

**కాలమగు** అ. క్రి.
కాలము ముగియు, మరణము సంభవించు.
గీ.... నీదు భర్తకు నిపుడు కాల,మగుటయు వీఁడు మహాపుణ్యు నిధిగాన యితరులఁ బనుపక యేన వీనిఁ గ్రచ్చఱఁ గొనిపోవఁగాఁ జనుదెంచితి. అర. 7.218.

**కాలమానము** సం. వి. అ. న.
కాలపరిమాణము, కాలముయొక్క కొలఁది.
సీ. ..అనిఁ బాండవులబలమంతయు సమయింపఁ జాలుదు నెంతేసి కాల మాన,మున నన్న. ఉద్యో. 4.420.

**కాలము** సం. విశ. (అ. ఈ. అ).
నల్లనిది.
తే. కాల వాల సుందరించుచునున్న ధర్మనందనుని తురంగమంబులఁ బడనేసి. కర్ణ. 2.386.
వి. అ. పుం.
1. సమయము, (దిన మాస సంవత్సరాత్మకము).
సీ. ... మాత్రాంతరము వయోమానంబు దేశ, కాలోచితాహార ప్రయోగ భంగి. విరా. 1.263.
2. వేళ, తఱి, అదను.
సీ. అర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు నగుకాలమున నార్యులయ్యుఁ గాని ఆ - కాలమున ఘటింపగా నేరరనిల వ,ర్తాతపేందు రుచులు నధిప కాల, కల్పితములు మంత్ర శిల్పౌషధంబులు మేలుసేత కాలకీలితంబు. శాంతి. 1.185.
సీ. కాలంబుతోఁ గుక్క మాలఁడు దుదిగాగఁ నాఁకొని వచ్చిన ననుగుణముగ. ఆ.నాచరింప వలయు నాహార కల్పన. అను. 2.371.
3. జీవిత పరిమాణము.
కం...కౌరవులకుఁ గాలము,తుదియో కాకిట్టి గర్వితుని నేమందున్. ఉద్యో. 2.154.
వ. ... ముని ప్రపంచాతని పాలికే తెంచి భారద్వాజా నీవు బ్రాహ్మణుండవు వేద వేదాంగ విదుండవు నీకు సంగ్రామంబు సేయ ధర్మంబగునే యించుకమున్ను చేసితేనియుఁ జేసితి గాని కాలంబు పూర్ణంబయ్యెఁ గాన యింకనుడుగుట మేలు. ద్రోణ.5.308.
4. మృత్యు దేవత.
కవిరాజ. అనయము లోలతమై విషయ ప్రచయంబను దుస్తర పంకమునన్, మునుఁగుచుఁ దేలుచునుండఁగఁ గాలము ముట్టి రుజన్ జర నెవ్వగ పై,కొన దొరకొల్పి యపాత్రపుఁ జావొనరించుఁ గురుప్రవరా. స్త్రీ. 1.55.
5. మృత్యు సమయము, మృత్యువు.
సీ. ... కాలంబుగాదని తలఁచునకు

ననుచు నీవారు భయంబంద, ద్రోణ. 5. 175., ద్రోణ. 2.201.

క॥. ... పిదపం గాలం,బై తెగియె యొక నృపునకు పం,జాతుండయ్యెను సమస్త సద్గుణములతోన్. అను. 1.279., విరా. 2.193.

6. తడవ, పర్యాయము.

సీ. ..కపాలంబున నెత్తిన భైక్షాన్న మేకకాల, మశనంబు గొనుచు. శాంతి 1.304.

7. సుఖ దుఃఖ ప్రతిపాదక రూపమైన విధి.

ఆ... అనిల వ,ర్షాతపేందు రుచులు నధిప కాల కల్పితములు. శాంతి. 1.185.

8. ఫలప్రాప్తి సమయము.

ఆ. ... మంత్ర శిల్పౌషధంబులు, మేలుసేఁత కాల కీలితంబు. శాంతి. 1.185.

8. అజ్ఞానము.

సీ. తారు గొందఱకు బాధకులయి నడచుట పరులచే బాధలఁ బడుట గలుగు,నివి కాలభావ్యంబు లెఱుక గల్గిన నొరుఁ బఱిచితి నొరునిచేఁ బడితి ననుచుఁ బురుషుండు ప్రియశోకమునఁ బొందఁడు. శాంతి. 1.188.

9. అవ్యక్తమను పేరు గల్గిన జగత్కారణము.

తే. ధరణి మొదలైన పంచభూతంబు లం కంటె, మనసుకంటెను బుద్ధికంటెను మహత్త,రంబు గాలంబు గాల తత్త్వంబు మిగిలియుండు విభుఁడిజ్ఞగంబుల కొడయఁడతఁడు. శాంతి. 4.197.

10. ప్రకృతి, మాయ.

కం. అతనిఁ బొదువు సంకల్పం, బతుల జ్ఞానంబు దాని నడచును విజ్ఞానితఁ దద్బలముఁ బురుషదేహారసుం గాలంబు వరుస నెడఁ జేయున్. శాంతి. 5.76.

క॥. కాలంబెడలిన విద్యో,న్మీలితమగు బోధ మన్మనిర్మల్యంబుం,దూలించి వెలుఁగుచుండు వి,శాలమతీ బ్రహ్మమది ప్రశస్తము ప్రకటలన్. శాంతి. 5.77.

శ్లో॥ ... శయాన సంజిహానో త్తిష్ఠ. సంచరద్రూపవంతుఁడైన లోక స్వరూపుండగు జీవము. శాంతి.5.33

శ్లో॥కలిః శయానో భవతి సంజిహానస్తు ద్వాపరః ఉత్తిష్ఠంస్త్రేతా భవతి కృతం సంపద్యతే చరన్ (శ్రుతి).

(శయానుఁడు అవిద్యామగ్నుఁడగు పురుషుఁడు కలిసంజ్ఞఁ బరగును. సంజిహానుఁడు విషయములందు వైరాగ్యముకలవాఁడు ముముక్షువు కావున- ద్వాపరసంజ్ఞ చెప్పఁబడును. నిలుచుండువాఁడు శమాదిసంపత్తి మునకై యుద్యమించువాఁడు త్రేత సంజ్ఞఁ బరఁగును. చరించువాఁడు శమాదిక మాచరించుటచే కృతసంజ్ఞఁ బరఁగును. ఇట్లు కృత త్రేతా ద్వాపర కలి సంజ్ఞలలోఁ జెప్పఁబడు చతుర్విధమైన జీవమే లోకవాస్తవ రూపము. అయ్యది కాలమనఁబడును.)

(ఆంధ్రప్రకారమున.
18 నిమేషములు (ఱెప్పపాట్లు) = ఒక కాష్ఠ.
30 కాష్ఠలు = ఒక కళ.
30 కళలు = ఒక ముహూర్తము.
30 ముహూర్తములు = ఒక అహోరాత్రము
30 అహోరాత్రములు = ఒకమాసము.
2 మాసములు = ఒక ఋతువు.
3 ఋతువులు = ఒక అయనము.
6 ఋతువులు = ఒక సంవత్సరము
సంస్కృతప్రకారమున.
30 ముహూర్తములు = ఒక పగలు లేక ఒకరాత్రి. అనఁగా పగలు రాత్రి కలిసిన దినమునకు ముహూర్తములు 60 అగును. కొందఱు ముహూర్తమునకు 30 కళలు + 3 కాష్ఠలు అని వ్యాఖ్యానించిరి.)

**కాలముఖులు** పేరిట దక్షిణ దిగ్విజయ యాత్రాకాలమున సహదేవుఁడు వశము చేసికొనెను. సభా. 1.260.

**కాలయవనుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక రాక్షసుఁడు. శ్రీకృష్ణునిచే సంహరింపఁబడిన వాఁడు. శాంతి. 6.388.

కాలయవనుఁడు శ్రీకృష్ణుఁడ జేయుఁడని నారదునివలన విని కృష్ణుపై నొక్కఁడ దండెత్తి వచ్చెను. ఇది ముందుగానే గ్రహించిన శ్రీకృష్ణుఁడు నగరము విడిచి నిరాయుధుఁడై పోవుచుండెను. కాలయవనుఁడతని నెదుర్కొనెను. కృష్ణ భగవానుఁ డతనికిఁ జిక్కక పరువిడసాగెను. కాలయవనుఁడు వెంబడించెను. వాని శ్రీకృష్ణుఁడు వానికిఁ జిక్కక ముప్పతిప్పలు పెట్టెను. ఇట్లు కాలయవనునకు చిక్కినట్లు దక్కినట్లుగాఁ జాల దూరము తీసికొనిపోయి ఘోరమైన యొక కొండగుహలో దూఱెను. కాలయవనుఁడును గుహలోఁ జొచ్చెను. అంధకార బంధురంబయిన యా గుహాంతరాళమున దీర్ఘతల్ప నిద్రితుఁడై గుఱువెట్టుచున్న ముచుకుందుని జూచి యతఁడే శ్రీకృష్ణుఁడనియు దొంగనిద్దుర పోవుచుండెననియు నట్టహాసంబు గావించి కాలితో నొక్కతన్ను తన్నెను. ముచుకుందుఁడు కన్నుదెఱచి చూచెను. కాలయవనుఁడు భస్మమైపోయెను. అంతట కృష్ణ భగవానుఁడు ముచుకుందునకుఁ బ్రత్యక్షమై యాతని ననుగ్రహించెను. (శ్రీభాగవతము.)

**కాలయాపనము** సం. వి. అ. న. కాలవిలంబము. జాగు.
ఉ. ... ఆ నహుషు పోయిన పోకలు వానికిం దగం, జెప్పెరఁ గాలయాపనము సేసినభంగియుఁ జెప్పె దేవియున్. ఉద్యో. 1.173.

**కాలరి** దే. వి. (కాలు + అరి)
1. దూత, వార్తాహరుఁడు.
వ. ... మనము వెసగల కాలరుల వేగంబ పుచ్చి శల్య కేకయ జరాసంధతనయ ధృష్టకేతు ప్రభృతులయిన భూపతులకును వారి వారి బంధు మిత్త్రి జనంబులకు నెఱింగించుట కార్యంబు. ఉద్యో. 1.37., అశ్వ. 4 156.

శ్లో॥ శల్యస్య ధృష్టకేతోశ్చ జయత్సే నస్య వా విభో, కేకయానాంచ సర్వే షాం దూతాగచ్ఛంతు శీఘ్రగాః. సం. భార. ఉద్యో. 4.8.

2. జంఘాలుఁడు. మిక్కిలి వడిగ నడచువాఁడు.

వ. మన పురంబునకు జంఘాలురఁ బంపుము ... విరాటుండు బనిచినం గాలరులు వేగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి. విరా. 3.23

**కాలవశత** సం. వి. ఆ. స్త్రీ.

1. కాలానుసారము, కాలానుగుణము.

తే. కలసి శుక్ల శోణితములు కరుడు గట్టి, వినుమమేధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది, కాలవశత నప్పిండమంగంబు లెల్లఁ, గలిగి శిశువయి మారుతగతి యెలర్ప. స్త్రీ. 1.36.

2. మృత్యువునకు లోనగుట.

ఆ. ... అఖిల జనులఁ, దల్లివోలె నరసి దశరథ రాముండు, గాలవశత నొందెఁ గాదె యధిప. ద్రోణ. 2.201

**కాలవిరోధము** సం. వి. అ. పుం.

కాలము ప్రతికూలమగుట.

కం. వాలి వివిధాస్త్ర శస్త్ర, జ్వాలల వెలుఁగొందు పాండవ జ్వలనం బా, భీలత మండందొడరినఁ, గాలవిరోధంబు మఱచి కార్యముఁ దప్పున్. విరా. 1.119.

**కాలవేది** సం. విణ. (న్. నీ. న్.)

భూత భవిష్యద్వర్తమాన కాలముల మూఁడిఁటిని దెలిసిన వాఁడు; త్రికాలజ్ఞుఁడు.

కం. విని కాలవేదియగు నవ్వని జాతుఁడు. మౌస. 11.

**కాలశైలము** సం. వి. అ. పుం.

ఒకానొక పర్వతము. పాండవులు గంధమాదన పర్వతంబునకుఁబోవుచు దీనిని జూచిరి. అర. 3.283.

ఇది కాలపర్వతము (అర. 6.317.) అని నిరూపింప వలనుపడకున్నది.

**కాలాంజనము** సం. వి. అ. పుం.

ఒకానొక పర్వతము. ఇది గంగా యమునా సంగమమునఁ గలదు. ఇచట స్నానము చేసిన మోక్షమబ్బును. అను. 2.82.

**కాలాంతకుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

కం. అంత విరాటుఁడు [illegible]లయకా, లాంతకుఁడుఁ బోలె. భీష్మ. 2.301.

వ. ... [illegible] దక్షుని యజ్ఞంబున [illegible]... శాంతి. 6 441.

విణ.

కాలమును నశింపఁజేయువాఁడు. శివుఁడు, విష్ణువు.

ఉ. ... కాలాంతకుఁడైన రుద్రుని రథాగ్రము చెచ్చెరఁ బట్టెనుద్ధతిన్. అ. 5.279.

ఉ. ... కాలాంతకుడైన యచ్యుతుఁ డనంతుఁడు యోగిజనాంతరంగ విక్రాంతుఁడు విష్ణుఁ డద్వయుఁ డసంగుఁడు కౌరవవంశ దీపకా. అను. 1.336.

**కాలాంతరము** సం. వి. అ. న.

మఱియొక కాలము.

ఆ. పగయుఁ గలెనేని పాయునె గూఢమై, ప్రమాన నగ్నియున్న

మాడ్కి నుండుఁ, గాన నమ్మి జేలఁ కాలాంతరంబునసైనఁ, జెడును సంది యంబు వలదు. శాంతి. 3.258; సభా 1.94.

వ. (పరశురాముఁడు) గర్వంబుల నష్ట యస్పృకులను మఱియు వివిధ ప్రకారంబులఁ బోరం దప్పిపోయి పుడమి యేలు రాజులఁ గాలాంతరం బుల వెదకి వెదకి వధియించె. శాంతి. 2 86.

(కాలాంతరంబుల = వేఱు వేఱు సమయంబుల).

**కాలాగరువు** సం. వి. ఉ. న.
నల్లి అగరువు (వ్యా. వి.)
మ.... కాలాగరు నల్లకీతతుల. ఆది. 8.262.

**కాలాగ్ని** సం. వి. ఇ. పుం.
ప్రళయాగ్ని.
వ. ... అప్పుడు ఉగ్రుండుగాని కాలిన కాలాగ్నియుం బోలె. సౌప్తి. 1.202.

**కాలాతిక్రమణము** సం. వి. అ. న.
యుక్తకాలము గడచిపోవుట
వ...ఇట్టిల చింతాపరుండనై యగ్ని హోత్రంబు వేల్పక కాలాతిక్రమణంబు సేసెదు. ఆర. 3.102.

**కాలాత్ముఁడు** సం. వి. న్. పు
కాలమే రూపముగాఁ గలవాఁడు.
విష్ణువు.
కం. మాసర్త్వయనాబ్ద మయాభా సిత రూపుఁడయి సృష్టిఁ బ్రళయంబు లగం జేసి పొలుపొందు శౌరి నుపాసిం చు యోగిధీరులు గాలాత్మున్.

శాంతి. 2.35.

**కాలాయసుఁడు** సం. వి. అ. పుం.
కద్రువ కొడుకు.

**కాలాయసము** సం. వి. అ. న.
ఇనుము.
వ. ... ఆఖండల తనయ ఖండిత పరవీర కాలాయస నారాచ శకలం బుల వలనను. విరా. 5.60; కర్ణ. 2.268.

**కాలావధి** సం. వి. ఇ. పుం.
గడువు, మితి పెట్టిన కాలము.
ఉ. ... కా,లావధి యయ్యెఁగావలయు నక్కట వారికి వారి వారికిన్. ఉద్యో. 3.398.

**కాలావసానము** సం. వి. అ. న.
కాలము ముగియిక, మరణము సమీ పించుట.
వ. ... ధార్తరాష్ట్రులకుం గాలావ సానంబైనయట్లు సమయ కాలావసా నంబయ్యె. విరా. 2.235.

**కాళికాశ్రయ** సం. వి. ఆ. స్త్రీ.
విపాశనదీ తీరమునగల ఒక తీర్థ స్థలము. ఇచ్చట మూఁడు దినములు బ్రహ్మచర్య నియతితో సేవింప పునర్జన్మముండదు. అను. 2.77.

**కాళిమ** సం. వి. న్. పుం.
నలుపు.
వ. ... అర్ధానవులు నానావిధాయుధ సన్నద్ధులయి నిజకాయ నికాయ కాలిమ తమోభూత భువనులగుచు ఆర. 4.60. (కాళిమ అని కొన్ని ప్రతులు)

**కాలు**1 దే. అ. క్రి.

1. దగ్గమగు.

కం. లక్కయిలు గాలినదిమొదలు. ఉద్యో. 3.136.

వ. .. జనకుండు దన పురంబైన మిథిల గాలునప్పుడు దుఃఖంబులం బొరయమిఁజేసి. శాంతి. 4.359.

2. మండు, ప్రజ్వలించు.

వ. .... పేరడవిగొని కాలి పొనుంగు వడిన కార్చిచ్చు కైవడి. ద్రోణ. 5.321.

3. దహించుకొనిపోవు, తాపమొందు.

కం. కని యేటిలోనిడితిఁ గలఁ,గని నట్లుయియుందెఁ తత్ప్రకారంబిది మీ,కనిన యది దివ్యబోధం,బున నత్తెఱఁగంతరంగమునఁగొని కాలున్. ఆశ్ర. 2.104.

వ. ....జనకుండు దన పురంబైన మిథిల గాలునప్పుడు దుఃఖంబులం బొరయమింజేసిం తనకేమియుంగాల దని పలికె. శాంతి. 4.358.

**కాలు²** దే. వి.

పాదము, అడుగు.

తే. .... కాళ్ళలఁ జేతులఁ దొడలఁ బట్టి.కడగి యనువుగఁజేసి ప్రొయ్యి దుదుగాని,కత్తి గొడ్డలి యడుగ నేఁ గట్టియలకు. విరా. 1.78.. శాంతి. 5.117.

సీ. .... శిరంబు గాళ్లేల డొక్క, లోనికిఁ జొరద్రోచి పీనుంగుముద్దగాఁ జేసివైచిరి. విరా. 3.88.

కాలు-సభా. 1.144; కాళులు-భీష్మ- 2.211.

స్త్రీ 1.11; కాళ్ళు-ద్రోణ. 2.87; కాళ్ళులు-ద్రోణ. 5.63.

**కాలుఁడు** సం. వి. అ. పుం.

1. యముఁడు.

వ. అయ్యవసరంబునఁ గాలుండ దృశ్యాకారంబున. కర్ణ. 3.340.

2. శివుఁడు.

మ. గద సారించుచు నంత్యకాల విచలత్కాలాకృతిన్ భీముఁడు. ఉద్యో. 2.138.

3. కాలస్వరూపుఁడు.

తే. .... ధర్మబుద్ధి నీకడకు వచ్చు, యముఁడుఁ గాలుండు మృత్యువు నరు దెంతు,రు. శాంతి. 4.133; మహా. 4.

4. ధ్రువుఁడు అను వసువుకొడుకు. ఆది. 3.57.

**కాలుకొను**
**కాల్కొను** } దే. అ. క్రి. (కాలు² + కొను).

గీ. అంతకంటపు నెక్కుచు సంత మసముఁ, గాలుకొననీక చంద్రుండు గ్రాలె నధిప. ద్రోణ. 5.275.

తే. కరులగమి వాదివి రథములు గాలుకొనఁగఁ, నీకమరలిన ఘోటకా నీకములను, బిరుదుమగల మొత్త మునుబిండిపీఁచు,సేయు ... నేర్పులచ్చెరువు బెనుప. శల్య. 1.122.

ఉ. ఆతఁడు వాజినం దెరలు నచ్చటి సేనలఁ గాల్కొనంగనీ, కాతత బాహువీర్యులు .... తోలఁగఁ దోలె. ద్రోణ. 1.364.

చం. .... అప్పురుసున నెందుఁ గాల్గొనఁగఁ బట్టదు చిత్తము భీతి

పెఱఁ ద,త్పరమతి సంత నక్కాపటి బాటు పడంబుల సంస్మరించితిన్. ఆర. 4.258.

**కాలుగ్రుచ్చు** దే. అ.

ఆ. వేగపడుట మేలె విషము కార్యము దీఱుఁ, దీఱకుండు దాని తెఱఁగు వగన.చెప్ప దాచరాదె యిప్పుడు ముకుఁద్రావఁ, గాలు గ్రుచ్చనేల ఱిమనాథ. ఉద్యో. 3.220.

(కాలుగ్రుచ్చనేల = నిలబెట్టియడుగ నేల.)

**కాలుచు-కాల్చు** దే.స.క్రి. (√ కాలు)

కాలఁజేయు. దహించు.

సీ. లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁదలఁచిన .... ఉద్యో. 3.365.

చం. .... భూరిభీషణ పాండవులు నల్గడఁగడఁ జిచ్చుగా వెఱఁగ కాల్పఁ దొడంగె హుతాశనుండు. ఆది. 8.259.

ఆ. కట్టివిక్రమంబు గాల్పనే యుట్లు జ,న్మములు పడిన ధర్మనందనుండు నేను రాజరాజు పీడంగఁగన్నారఁ గానఁబడయ మైతి మేనిఁగృష్ణ. ఉద్యో. 3.317.

(ఇది నిందా సూచకము ఎందుకుఁ గొఱగానిది-అనుట)

చం. వినుము నరేంద్ర సర్వపుగ విప్రజనంబునుగూడి నన్నుఁబెం,చిన పితృమాతృదేవతల సేసినపాపము పెద్ద చంపుచో,జనకుఁడు భ్రాత పుత్రుఁదను శంక యొకించుకలేదు నష్టుడు,దనియెడి కొంకు బుద్ధి నిసుమంతయుఁ బుట్టదు వీనిఁగాల్పనే. శాంతి. 1.399.

(ఇదియు నిందాసూచకము. ఎందుకు గొఱగానివాఁడు మూర్ఖుఁడు-అనుట)

**కాలుతక్కువవాఁడు**

వడిగా నడువలేనివాఁడు.

గీ. కాలుతక్కువ వారలు గలయఁ జెదరి, వెనుకఁబడి పోవు నెడఁదన్నుఁ గని భయమున,బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ,హ స్తమిచ్చుచు దయ పెనుపారఁ బలుకు. విరా. 5.225.

**కాలుదన్ను** | **కాల్దన్ను** } దే. అ. క్రి. (కాలు² + తన్ను)

1. కాలుత్రొక్కుకొని నిలుచు, కాలూను.

వ. ఇట్లు వెఱచఱచి యవిసిన కలంబు జనంబులు దీవి సేరినయట్లు కర్ణుం జేరి కాలుదన్ని నిలిచె. ద్రో. 3.165.

2. నిలుచు.

సీ. అచటికి వేగంబ యరుగక యిచట గా,ల్దన్ని యుండెడు నట్టి ధైర్యమెందు అ. గలదు. మౌస. 97.

**కాలుద్రవ్వు, కాల్ద్రివ్వు** దే. అ. క్రి. (కాలు² + త్రవ్వు).

1. కారణము లేకయే (కలహమునకు) సిద్ధపడు.

అ. కయ్యమునకు వలదు కాల్ద్రివ్వ నధిప సా,మమున భేదమునను మార్దు మనము,మె త్తజేసి చెఱుకు మెయివడిఁ దప్పించు,కొను తెఱంగెఱింగికొనుట మేలు. శాంతి. 2.282.

వ. తదీయ సైన్యం బెల్లను బ్రమోద భరితంబై ...... గాలుద్రవ్వు చుండె. ద్రోణ. 5.22.
శ్లో॥ పాండవానామ్ రణేహృష్టమ్ యుద్ధాయచ మనోరథే. సం. భార. ద్రోణ. 149.43.
2. వృషభాదులు దర్పాదులచే కాలితో నేలను త్రవ్వు.
ఆ. అధిక దర్పయుక్తమై బలీవర్దంబు నగముదరి విదారణంబు సేయఁ గాలు ద్రవ్వునట్లు గడు బలాఢ్యులతోడ, నేచి వీఁడు విగ్రహింపఁదొడఁగె. సభా. 2.183.

**కాలుద్రోసి పోవు** దే. అ. క్రి.
మిక్కిలి వడిగాఁ బరుగెత్తు.
వ. ఇట్లు దొరయును విఱిగి పలను బాసి కాలుద్రోసి పోవుటయు నతిరథ మహారథులెల్లం జెల్లా చెదరగుటయుం జూచి. విరా. 4.196.
శ్లో॥ రథం సమావృత్య కురుప్రవీరో రణాత్ ప్రదుద్రాయతో పార్థః. సం. భార. విరా. 65.14.

**కాలు నిలుచు** దే. అ. క్రి. (కాలు+నిలుచు)
ఉండుటకు బుద్ధిపుట్టు.
కం. పలపలని మూకలోఁ కాల్,నిలువక గుట్టంబు డిగ్గి నీ కొడుకు గదా కలిత భుజుండై యొక్కఁడు, దొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా. శల్య. 1.401.

**కాలుబలము** } **కాల్బలము** } మి. వి. (కాలు² + బలము)
కాలితో నడచెడి సేన, పదాతి బలము.
ఆ. చదిసెఁ గాలుబలము చామరచ్ఛత్ర కేతువులు నాయుధములు దునియ లయ్యె. భీష్మ. 2.165.
కం. తలపడి తలమీఱిన కాల్బల ములఁ బొడిసేయ. విరా. 5.31.

**కాలుమానిసి** వి. (కాలు² + మానిసి)
పాదచారియైన మనుష్యుఁడు, కాలు బంటు, పదాతి.
వ. ... పదివేల కాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండు సంగరాంగణంబున మెఱసియుండె. శల్య. 1.400.

**కాలువ** వై. వి. (సం. కుల్యా).
ప్రవహించు చిన్న నది.
సీ. అలిగి యన్నరుఁడు వాలంప కాలువలోలి నడరించుటయును. భీష్మ. 3.234.
(పరంపర - అని ఇక్కడ భావము.)

**కాలుష్యము** సం. వి. అ. న.
(సంశయము, భయము, శోకము, కోపము మొదలగు వానివలన మనస్సునకుఁ గలుగు) కలఁక, అప్రసన్నత.
వ. అక్కౌంతేయాగ్రజుండు సంతుష్టాంతరంగుండై యగ్గాంగేయునకుం బ్రణమిల్లి గృహస్థధర్మంబు పరిత్యజింపక మోక్షంబు వడయుట గలుగ నోపునే మదీయ చిత్తంబు సంశయాయత్తంబగుచుండు. నిక్కాలుష్యంబు వాపవే యని యభ్యర్థించిన. శాంతి. 6.169.
కం. కాలంబగుటయుఁ గురుభూపాలోత్తమ యాదవేంద్రు పట్టణమునఁ హృత్కాలుష్య సమాపాదన,శాలి

మహోత్సాహముల్ ప్రజాదము లయ్యెన్. మౌస. 16.

**కాలూదు** దే. అ. క్రి. (కాలు² + ఊదు) కాలు మోపు, కాలు నిలుపు, నిలుచు. వ. ఇట్లు తెలుంగున నొక్కయెడనయి నను గాలూదక లీలోద్యానంబు గల యం గ్రుమ్మరుచు. విరా. 2 305.

**కాలేయము** సం. వి. అ. న. పీతవర్ణ సుగంధి వృక్షము. సీ. కాదంబ కాలేయ కాదంబినీ నీల, జాల తమాలికా సన్నిభములు. ఆర. 5.375.

**కాల్కడ** దే. వి. (కాలు² + కడ) కాలికడ, పండుకొనునపుడు కాళ్లుంచు కొను శయ్యాభాగము. గీ. అతఁడు పవడింప మును కౌర వాధినాథుఁడరిగి తలయంపి దెస నున్న యాసనమునఁ దుండె జపపడి కాల్కడ యొద్ది కల్లఁజని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి. ఉద్యో. 1.65.

**కాలొత్తను** చూ. కాలొత్తు.

**కాల్చు** చూ. కాలుచు.

**కాల్దన్ను** చూ. కాలుదన్ను.

**కాల్ద్రివ్వు** చూ. కాలుద్రివ్వు.

**కాల్నడ** దే. వి. (కాలు² + నడ) కాలి నడక, పాదచారము. సీ. ఏమెల్లనుంద నీవిట్లొంటి గాల్నడ నేగుచున్కికిఁ గలమెద్ది యొక్కొ. భీష్మ. 1.154; శల్య. 2.3.

**కాల్బలము** చూ. కాలుబలము.

**కాల్యము** సం. వి. అ. న. ప్రాతఃకాలము, వేకువ. వ. అనంతరంబు దానిర్వాపణంబుల నాదరిం చుచు నారేయి గడపి కాల్యంబగుట యుం గాలోచిత కర్తవ్యంబులు నిర్వ ర్తించి. అశ్వ. 3.150.

**కాల్వురు** దే. వి. బ. (కాలు²) పదాతులు, కాలిబంట్లు. మ. తనతోఁ గాల్వురు సాలగల్లు బల సంతానంబుతో ... బాహ్లికుండరిగె నెచ్చెంతయంబునం బోరికిన్. భీష్మ. 1.94.

సీ. వరగథమొక్కండు వారణ మొక్కండు తురగముల్ మూఁడు కాల్వురను నేవురు. ఆది. 1.80.

**కావచ్చు** దే. అ. క్రి. (√అగు) అగుటకు సిద్ధమగు. కం. ఈ వంశము విచ్ఛేదము గా వచ్చినఁ గులము నిలుపఁగా సత్యవతీ, దేవి వచనమున సంతతి గావించెను వ్యాసుఁడను జగత్కర్త దయన్. ఆది. 5.8.

**కావడి** దే. వి. ఔ. అనౌ. నీళ్ళు లోనగునవి మోయుటకై రెండు కొనలను ఉట్లమర్చిన వెదురుబద్ద. వివధము.

సీ. కావళ్ళ నెత్తించి. మౌస.175.

**కావరము** దే. షి. క్లావరము.

1. మదము గర్వము, అహంకారము, పొగరు.

కం. గోవింద యతఁడు మంత్రులుఁ గావరమునఁ జక్కవినరు కార్యవచన ముల్. ఉద్యో, 3.28. (సం. ము. ప్రతి).

2. కావరము గలవాఁడు.

ఉ. ... ఈ, కావరమైన కీచకుఁడు
కామనిపీడితుఁడై యలంతులం,
బోవక. విరా. 2.228.

**కావరుఁడు** దే. విణ. (√ కావరము)
కావలుఁడు.
కావరము గలవాఁడు, గర్వి,
ఉ. ... పాఱిపోయెఁ గడుఁ బొల్లఁద
నంబున సూతపుత్రుఁడీ, కావరుఁ
గష్టచిత్తు నధికంబుగ నమ్ముదునీవు.
అర. 6.62.

**కావలయు** (అగు, కాన్ + వలయు) దే.
అ. క్రి. ద్రు.
కావలెను, అగుట ఆవశ్యకము,
జరుగుట ముఖ్యము, అగుట యిష్టము.
చం. ... సైన్యముల్ వెసఁజని తోడు
గావలయు. విరా. 5.234.

వ. ... అట్లేని నాకు సనామ యయి
నది వివాహంబు గావలయు. ఆది.
2.150.

వ. ... అపత్యార్థంబపర్యంబు వివా
హంబు కావలయునని. ఆది. 2.146.
తే. వంశ నిస్తారకుండు గావలయుఁన్.
ఆది. 8.144.

వ. .. కర్మంబునందుఁ గ్మలోత్సా
హుండు గావలయు; నట్టివానికి. అర.
1.233.

అవ్య. ద్రు.
అయియుండవచ్చును-అను ఊహను
దెలుపును; కాఁబోలు.

వ. ఇది యుంఛవృత్తియైన మానవు
కశోచనంబు గావలయు. విరా. 1.180.
వ. ..., మన పర్ణాదునకుఁ బ్రబిపచ
నంబిచ్చినవాఁడు వాఁడ కావలయు•
అన. 2.185.

**కావలె** దే. అ. క్రి. ద్రు. కావలయు.
మధ్యా. భూపాల నీకు నిక్కేమలి
యందుఁ బుట్టిన సుతుఁడు నీపరోక్షం
బున రాజు గావలె. ఆది. 4.176.

**కావలి** దే. విణ. (√ కాచు)
సంరక్షకుడు. రక్షకుఁడు.
తే. హస్తిపురిఁ బెరుగల మదహస్తి
నెక్కి, క్రాలు కావలి రథముల గవి
యుదేర, సహ్రగజముపైఁ బద్దన్యుఁ
డనఁగ నంప, వాన వరఁగ వికర్ణుండు
వచ్చితాఁకె. విరా. 5.192.
కం. కావలియై సురరాజ్య, శ్రీపాలింప
గఁదగు విశేషంబున సంభావితుఁడు
నహుఁషుఁడు చని, యా విభుఁగని తారు
మునులు నతనికి నెమ్మిన్. ఉద్యో.
1.143

**కావలి యగు**
రక్షకుఁడగు, రక్షకులగు.
వ. మీరెల్లరు వలయునెడల నెంచి
భీష్మునికిఁ గావలి గావలయునని.
భీష్మ. 1.174.
కం. లోకేశ నీవు ధర్మ, క్రీకావలి
గాఁగ నవతరించుట విప్రుల్లోకంబు
సెప్ప. శాంతి. 6.341; ఉద్యో.
1.143.

**కావలిపెట్టు**
రక్షకునిగా నుంచు, రక్షకుంపుగా
నుంచు.
వ. ... నీతమ్ముఁడు పెద్ద మొగ
సాలం జాలు మానుసలం గావలి పెట్టి

యుష్ఫుంటరంబు ప్రవేశించి యుండె. శల్యా. 2.26.

**కావలియుండు**
రక్షకుఁడుగా నిలుచు, రక్షకులుగా నిలుచు.
ఆ. వీఁడె సైంధవుండు వీనిచుట్లను గృప శల్య, గురుతనూజ సౌమదత్తి, కర్ణ కర్ణసుతులు గావలియున్నారు, పోటు మగలుగాన పూఁచిపట్టి. ద్రోణ. 3.170.

**కావలివాఁడు** దే. వి. (కావలి + వాఁడు)
కావలియై కాచువాఁడు, రక్షకుఁడు.
ఉ. కావలివారిఁ దోలి యెసకంబున గోమలిఁ బట్టికొంటి నం,చీ వెడమాట లేల. విరా. 4.192; విరా. 3.2.

**కావలె** కావలయు.
మత్తే. భూపాల నీకునెక్కోమలి యందుఁ బుట్టిన సుతుఁడు, నీ పరో క్షంబున రాజు గావలె ఆది. 4.176.

**కావి** దే. వి.
కాషాయ వస్త్రము, ఎఱ్ఱ బట్ట.
కం. ప్రోవులు గట్టిన గుఱ్ఱపుఁ, బ్రేవులు నేనుఁగుల తలచుఁ బీనుంగులు ర,క్తావిలత వెల్లచీరలు, గావులునై ఘటనిఁకాయ గావులునై. భీష్మ. 2.289.

విణ.
ఎఱ్ఱనైన, జేగురు.
చం. ... కుంభము ప్రయ్యగ వ్రేసిన నెత్తురొల్కఁగా, నిభముల నింపుగావి సెలయేఱుల తోడి నగంబు లట్లు. ఉద్యో. 2.254.
గీ. ... పోటులఁ దొరఁగు రక్తాంబుధార,లంగమెల్లను గప్పిన నప్పు డొప్పెఁ,గావి సెలయేఱు లెల్లెడఁ గలయఁబర్వఁ బొలుచు కులపర్వతంబు చాడ్పున నతండు. శల్యా. 2.101.

**కావించు** దే.స.క్రి. (√ అగు.)
కలిగించు, లభింపఁజేయు.
మ. ... విశ్రాంతి గావింపగాఁ,గల యీ భుజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్. విరా. 2.136.
సీ. అజుఁడుపలాలింప నద్దేవు కావించు వర భోజనంబులఁ బెరిగె నితఁడె. అను. 1.270.
కం. సేవితమై జనులకు నది, గావించు ననూన ధర్మ కామార్థంబుల్. అర. 2.253.
2. సృజించు, నిర్మించు, రచించు.
కం. నారాయణ నీకేఁగడు,గారవమునఁ బుట్టి యిజ్జగములన్నింటిన్, సారమతిం గావించితి,నీఁ క్షణ వీని కెల్ల నిలుపై యుండున్. భీష్మ. 2 266; శాంతి. 6.479.
సీ. వదలక కురుపతి వారణావతమున,లక్కయిల్ గావించి యక్కజముగ, నందఱఁ జొన్పి యందనలంబు పరికొల్పఁ బనిచిన. ఆది. 3.14.
వ. .. తమ్మొరులన్యాయంబు సేసిన యప్పటికింగదా యీ శస్త్రాస్త్ర ధర్మంబులింద్రాదులగు పెద్దలు గావించిరి. ఉద్యో. 1.343.
శా. ... కృష్ణద్వైపాయనుఁ దర్థి లోకహితాభీష్టం బూని కావించె ధ,ర్మ

ద్వైతస్థితి భారతాఖ్యమను లేఖ్యంబైన యామ్నాయమున్. వి. 1.3.

3. చేయు, ఒనరించు.

సీ. ... కిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి విగతకంటకము గావించె వనము. విరా. 1.74.

వ. ... కీచకుండు ముదిత హృదయుండయి ... తత్ప్రదేశంబు విజనంబు గావించి. విరా. 2.82; ఉద్యో. 1.7.

4. నియమించు, ఏర్పఱచు.

కం. కావున శుద్ధస్థితికిం, గావించిన యట్టి పుణ్యకర్మములగు స,త్సేవిత యమనియమాదుల,తోవ సొరంగవలయు విపయ దూరాత్ముఁడై. శాంతి. 4.309.

5. ఫలింపఁజేయు, పండించు.

సీ. ... త,త్ఫలసిద్ధులెట్టన్నఁ దఱచు వాన, కారు పొలంబునఁ గల్గె కేనియుఁ గొల్చుఁ గావింప నేర్చునే. సౌ ప్తి. 1.31.

6. ప్రసాదించు, దయతో నొసఁగు.

కం. నరుఁడగ్ని దేవుఁ దనకును, వరదునిగాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు, స్ఫుటబాణంబాదిగఁ గల సం,గర పరికర మెల్ల నతఁడు గావించెదయన్. ఉద్యో. 2.257.

7. సంపాదించు, సమకూర్చు.

వ. అట్లుంగాం గలచోట్లనెల్ల నరసి తురంగంబులం గావించుకొమ్ము. ఉద్యో. 3.3.6.

కం. నీ వాసపఋప ధనములు, గావించెదఁబో. శాంతి. 4.50.

**కావుట** దే. వి. ($\sqrt{}$ అగు) (ఇది 'అగు' ధాతువు యొక్క భావార్థక రూపము) అగుట.

చం. ... ఇది సిద్ధము గావుటెఱింగి భక్తి నెప్పుడు ధరణీ సురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్లనోడుదున్. ఆది. 1.138; ఆది. 8.286.

కం. జీవుఁడు మత్స్యము పేతుఁడు, గావుటెఱుఁగవలయు దృఢముగా. శాంతి. 6.385.

వ. ఈ సమూహంబంతయు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి పరమానందంబు లభినందన పూర్వకంబుగా నిచ్చుఁగావుత. అను. 5.313.

**కావుతము** (కావుతన్ + అ).

'అగు' ధాతువుయొక్క ఆశీరాద్యర్థక ప్రత్యయాంత రూపము. ఇది ప్రాయికముగా ఆశీరర్థమున తద్ధర్మార్థక క్రియలకు అనుప్రయుక్తమగును)

ఆశీరర్థకము - అగునుగాక, అగును గాత.

ఆ. దాన హోమ జప విధానముల్ మనకవి,గలవయేని ధరణి వలయ రాజ్య,మింద యుండి ధర్మనందనుఁ డొనరించు,చుండుఁ గావుతమ యఖండితముగ. ఆది. 8.63.

**కావున** కాన. అవ్య. ధు. ($\sqrt{}$ అగు హేతువును దెలుపును.

ఉ. .. పోరితమైన నింతకును బుట్టు మహాపద గావునన్. ధరి,త్రీ రమణాగ్రగణ్య గణుతించి యవశ్యము పొందొనర్పవే. ఉద్యో. 3.262.

**కావేరి** సం. వి. ఈ. స్త్రీ.
దక్షిణభారత దేశమందలి ఒక పవిత్ర నది. అగస్త్యున కనేకాశ్రమములు గలవు. బ్రహ్మగిరి (కూర్గుమండలమున) యను పర్వతమునందగస్త్యుఁడొకసారి తపస్సుచేయు తన భార్యను లోపాముద్ర నొంటిగా విడిచి యుండ నొల్లక యామెను దన కమండలు పాత్రమునందుంచి ఉపమునకు బోయెను. అవల నొక కాకి యా పాత్రను బోరగిలఁద్రోసెను. ఆ నిర్బంధము సహింపలేక యుండిన లోపాముద్ర తన ఉపస్థశక్తిచే నేత్తై పాఱెను. ఆ నదికే కావేరి యని పేరు. ఉత్తరమువారికి గంగ యెట్టిదో దాక్షిణాత్యులకు కావేరి యట్టిది. ఈ కావేరి పేరు సుగ్రీవుఁడు చెప్పుటచే ఇది రామాయణ కాలమునాఁటికే గలదని తెలియుచున్నది. శ్రీ. రామా. అర. 13 సర్గ. మండపము వ్యాఖ్యా. ఏచేకసర్వరాత్ర్యభవలీల కావేరి. ఏవేరమనెడు పర్వతమునఁ బుట్టినది. కవేరస్య రాజ్ఞోఽపత్యం స్త్రీ కావేరి. కవేరుఁడను రాజు కూఁతురు – అని యర్థము.

**కావేరితీర్థము** సం. వి. అ. న.
ఇచ్చట స్నానము చేసిన అశ్వమేధ ఫలము లభించును.

**కావ్యము** సం. వి. అ. న.
ప్రబంధరూప గ్రంథము, కబ్బము.
ఉ. ... ఆత్మ సమ్మోదముఁ బొంద గావ్యరసముం గ్రోలయుచుండుచుండు నెప్పుడున్. విరా. 1.15; అశ్వ. 1.14.,

**కావ్యుఁడు** సం. వి. అ. పుం.
శుక్రుఁడు.
తే. ... యయాతికి నలిగి యేమి, కారణంబున శాపంబు కావ్యుఁడిచ్చె. ఆది. 3.98.

**కాశము** సం. వి. అ. పుం.
1. ఒకానొక దేశము. భీష్మ. 1.40; ఈ దేశమువారు పాండవుల పక్షమునఁ బోరాడిరి. కర్ణ. 2.154. అర్జునుఁడు అశ్వమేధాశ్వము వెంట నరుగునప్పుడు ఈ దేశమువారిని జయించెను. అశ్వ. 4.110.
2. తెల్లు.
తె. వికచ కాశ వనీ పరివేష్టనమున, నతిశయిల్లె నిర్మల కమలాకరములు. అర. 4.147.

**కాశవనము** సం. వి. అ. న.
తెల్లుదటవి.
వ. ... పెనుగాలిం జక్కుపెడిన కుసుమిత కాశవనంబునుం బోలు చక్కట్లును. భీష్మ. 3.247.

**కాశవని** సం. వి. ఈ. స్త్రీ.
తెల్లువనము.
తే. వికచ కాశవనీ పరివేష్టనమున, నతిశయిల్లె నిర్మల కమలాకరములు. అర. 4.147.

**కాశి** సం. వి. ఇ. స్త్రీ.
వారాణసి,-గంగా తీరమందలి ఒక ప్రసిద్ధ పుణ్యక్షేత్రము. అను. 5.313.

**కాశీశుఁడు** సం. వి. అ. పుం.
విరాటుని జ్ఞాతి. మహారథులలోఁ జేరిన

వాఁడు. యుధిష్ఠిరు పక్షమునఁ జోరా
డెను. ఉద్యో. 4.265.

**కాశ్మీరము** సం. వి. అ. పుం.
ఒకానొక దేశము. అర్జునుఁడు త్తర
దిగ్విజయ యాత్ర జరుపునపుడు
కాశ్మీరపతి విచిత్ర వస్తు వాహన నివ
హంబులు సమర్పించెను. సభా.1.235
భారత కాలమున ఈ దేశము సమస్త
వస్తు సంపత్సంపాదనంబులయిన
గుణ విశేషంబుల వెలసి పురుషార్థం
బులగు ధర్మార్థ కామంబులకుం గార
ణంబు. భీష్మ. 1.40.
న.
కుంకుమ పువ్వు.
సీ. సైనిక నికర వక్షస్స్థల పరిప్తి
కాశ్మీరదీప్తులఁ గౌఁగిలించి. శల్యా.
1.116.

**కాశ్యప గౌతమాఖ్యానము** సం. వి.
అ. పుం.
చూ. నాడీజంఘుఁడు. శాంతి. 3 485.

**కాశ్యపి** సం. వి. ఈ. స్త్రీ.
భూమి.
పరశురాముఁడు భూమినంతయు
జయించి కాశ్యపునకు దానమిచ్చుటచే
కాశ్యపి యను పేరు వచ్చెను. ద్రోణ.
2.2?2; శాంతి. 2.88.

**కాశ్యపుఁడు** సం. వి. అ. పుం.
1. నాడీజంఘుని తండ్రి.
కం. మిత్రుండెక్కుడు కాశ్యప,
పుత్రుఁడనగు నేను. శాంతి. 3.485.
2. ఒకానొక బ్రాహ్మణుఁడు.
ఈఁడొకనాఁడొక యుద్ధత పురుషుని
రథము దాఁకి పడి యా యవమా
నంబు భరింపఁజాలక యాత్మ
హత్యకుఁ బూనుకొనఁగా ఇంద్రుఁడు
నక్కరూపమున వచ్చి యతనికి
ప్రజ్ఞా సంబోధకమగు సంవాదంబు
దెలిపి చిత్తప్రసాదంబు గావించెను.
శాంతి. 4.69.
3. దేవర్షి. ఈతని శరీరావయవముల
నుండి తిలలు పుట్టెను. అందుచేత
తిలలకు గొప్పతనము. అను. 2.391.
ఈఁడొక తూఁటి వైశ్వానర మార్కం
డేయులతో గలిసి గోష్ఠి జరపెను.
అను. 2.38.
ఈతఁడు వ్యాపస వార్షికవ్రతక్లిష్టుండై
యున్న కృష్ణుని జూచుటకు నారద
పర్వతాదులతో విష్ణువును గూడఁ దీసి
కొనివెళ్ళెను. అను. 4.397.
ఈ కాశ్యపుఁడు వాసిష్ఠుఁడును ప్రాణుఁ
డును అంగిరసుఁడను చ్యవనుఁడును
అనేక వర్షములు ఘోర తపస్సు చేసి
పాంచజన్యుఁడు అను అగ్నిని కొడు
కుగాఁ బడసిరి. అర. 5 559.
4. ఒక బ్రాహ్మణుఁడు.
ఒక సిద్ధుని నాశ్రయించి జ్ఞానోప
దేశము పొందెను. అశ్వ. 1.156.
5. కశ్యప వంశీయుఁడు – కణ్వుఁడు.
వ. ఇక్ష్వాకు కాశ్యపుండైన కణ్వ మహా
మునీంద్రునకు నమస్కరించి వచ్చెద.
ఆది. 4 24.

**కాశ్యపుఁడు** సం. వి. అ. పుం.
1. ఒక రాజు. [illegible] బలము
గలవాఁడు. సమరమున యుధిష్ఠిరు
పక్షమునఁ బోరాడెను. ఉద్యో. 1.266
2. ఒక రాజు.

ఇతఁడు తన ప్రాణములిచ్చి బ్రాహ్మణ ప్రాణముఁ గాపాడెను. శాంతి. 4.82

**కాషాయపక్వత** సం. వి. ఆ. స్త్రీ.
కషాయపక్వత.
నిగ్గు తేలుట. కషాయము కాఁగి పక్వమునకు వచ్చునటులఁ బరిపాకమును బొందుట, పరిపూర్ణమైన పరిపాకమును పొందుట.
తే. ... కాషాయ పక్వత బ్రబుద్ధి, బొంది మఱి యుత్తమాశ్రమ మొందు టొప్పు. శాంతి. 5.80. చూ. కషాయ పక్వత.

**కాషాయము** సం. వి. అ. పుం.
కషాయ వస్త్రము, కావి బట్ట.
సీ. ... కాషాయములు ధరించి, ముండుఁడై నతఁడన్నమునకు గృహంబుల కరుగకయున్నె. శాంతి. 1.133.
కం. దండము గాషాయంబును, ముండితయుఁ గమండలువును మోక్షమొసఁగవెట్లంటేని పెంపగుచున్న, ఖండ జ్ఞాన ప్రదత్వ కలనము గలదే? శాంతి. 6.178.

**కాష్ఠ** సం. వి. ఆ. స్త్రీ.
కళలో ముప్పదవ వంతు $\frac{1}{30}$ కళ, 18 నిమేషములు.
చూ. కాలము (1 నిమేషము = ఱెప్ప పాటు అగును).
కం. కళలుం గాష్ఠలు లోనుగఁ, గల చిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనంబుల వద్దికిచ్చు నాలవెవల నల వడఁ బెంచి పనకు వచ్చుఁ జేయున్. శాంతి. 4.443.

**కాష్ఠము** సం. వి. అ. న.
1. వంట చెఱకు, వంట పట్టియటు.
వ. ఆ ఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండనవి పాకంబునకు రాకయుండ వెండియు నవరించిన కాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁగాని యా రేగుఁ బండ్లురియవయ్యె. శల్య. 2.187.
2. కఱ్ఱ.
వ. ... చీర సక్కంగట్టికొని యొక కాష్ఠంబు గరియుగంబునం జక్కా నమర్చుకొని. శాంతి. 3.497.
కం. విను పాంసూదకముల చాడ్పున జతు కాష్ఠముల భంగి చూడంబులగున్ మనుజేంద్ర కలుగుఁ బొందు. శాంతి. 6.192.
3. కట్టె, పేడు.
కం. నదియుం గాష్ఠముఁ గాష్ఠము, నదిలో మఱి కొంతసేపునకుఁ బాయును. శాంతి. 4. 10.

**కాహళము** సం. వి. ఆ. స్త్రీ.
పెద్ద ఢక్క, బాకా (సూ. అ. ని.)
కం. తగు శంఖ కాహళాదిక, మగు మంగళ తూర్యసంచయము. ఉద్యో. 4.120.

**కాళింగకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
కళింగదేశస్థుఁడు. ఉద్యో. 2.230.

**కాళింగము** సం. వి. అ. పుం.
కళింగదేశము. సహదేవుఁడు దక్షిణ దిగ్విజయయాత్ర చేయునపుడీ దేశపు రాజును జయించెను. సభా. 1.261.

**కాళింగి** సం. విశ. (అ. ఈ. అ.)

కళింగదేశపు స్త్రీ. (కరంభ అను పేరు గలది). ఆది. 4.2.

**కాళింగుఁడు** సం. వి అ. పుం.
కళింగదేశపు రాజు. సహదేవుఁడు దక్షిణ దిగ్విజయయాత్ర చేయునపు డీతనిని జయించెను. విరా. 1.172.

**కాళింది** సం. వి. ఈ. స్త్రీ.
1. యమునా నది.
తే. సురనదియును కాళిందియు బెరసి నట్లు, కాంతిపూరంబు శోభిల్ల. విరా. 1.12.
2. త్రసునిభార్య.
వ. ఆ త్రసునకుఁ గాళింది యను దానికి బలుండు పుట్టె. ఆది. 4.5.

**కాళి** సం. వి. ఈ. స్త్రీ.
1. పార్వతి.
కం. శ్రీ కాళీత్యాదర, సుశ్లోకాలోకన విలాస సుస్థిరభవనా. ఆను. 5.1.
2. ఏడ్వురు కుమార మాతృకలలో నొకతె. 1) హవిష 2) కాళి 3) కాళిక 4) ఉద్ధత 5) శారిక 6) ఆర్య 7) వైధాత్రి అను వారలేడ్వురు కుమార మాతృకలు. ఆను. 5.245.

**కాళికా కాళికాసంగమము** సం.వి.అ.న.
ఒక తీర్థము. ఇచ్చట త్రిరాత్రోప వాసము చేసినవారు సర్వపాప విముక్తు లగుదురు. ఆర. ౭.275.

**కాళిమ** చూ. కాలిమ.

**కాళియుఁడు** సం. వి. అ. పుం.
కద్రువకొడుకు. సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కాళీయకుఁడు** సం. వి. అ. పుం.
కద్రువ కొడుకు. సర్పజాతివాఁడు. ఆది. 2.4.

# కి

**కి** కు. ప్ర. ద్రు.
షష్ఠీ విభక్తియందు 'ఇ' 'ఈ' ఏ,లకు తరువాత ప్రాయికముగా 'కి'యును మిగిలిన యచ్చులకుఁ బిమ్మట 'కు'ను వచ్చును.
సీ. దానికిం గినిసి ఘనిమనుమండు. భీష్మ. 3.2.2.
ఆ. మదము మిగిలి కేతుమంతుండు గౌంతేయు పైకిఁ గవిసి. భీష్మ.2.62.
ఉ ..ఈ,యేవురు సూడఁగా సభకు నీడ్చె. ఉద్యో. 3.110
ఆ. ... నీకు వెఱవనేల. ఉద్యో. 4.1.66.
2. సంబంధ సామాన్యమును దెలుపును. ఈ యర్థమున క్రియతో నన్వయింపదు.
కం. .. కరుణా, నిపుణుఁడవై నీ మఱఁదిక,నపరాధ శతంబు సైపు మయ్య యుపేంద్రా. సభా. 2.59.
(మఱఁదికి = మఱఁది యొక్క)
2. సంబంధ విశేషమును దెలుపును.
క్ర. స్వస్వామిభావ సంబంధము.
ఆ. ఇదియు కాదు మఱియు నెన్నియు దుర్వినయములు గలవు వానికి. ఉద్యో. 1.196.
(చ) జన్య జనక భావ సంబంధము.
వ. పురూరవసునకు నూర్వశికి నాయువు ..నను నార్వురు కొడుకులు పుట్టిరి. ... ఆది. 3.92.

(ట) అవయవావయవి భావ సంబంధము.
పశువునకు కాళ్ళు నాల్గు.
(త) తృతీయా విభక్త్యర్థకము.
కం. . . అతఁడు దండ్యుఁడందు రవనీపతికన్. అను. 4.15.
(అవనీపతికన్ = అవనీపతి చేత)
(ప) చతుర్థీ విభక్త్యర్థము.
వ. ... చక్రంబును గదయును వాసుదేవుని కిమ్మని. ఆది. 8.252.
(వాసుదేవునికిన్ = వాసుదేవుని కొఱకు)
(గ) పంచమీ విభక్త్యర్థకము.
కం. ... దానికధికము గలదే. శాం. 6.599.
(దానికిన్ = దానికంటె)
కం. ధర్మసుతుఁడొడ్డి శకునిక, ధర్మస్థితి నోటువడియె. సభా. 2.279.
వ. చిత్రాంగదుండు బాల్యంబున గంధర్వ నిహతుండయిన వానికిం గొండొకవాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి. ఆది. 4.112.
(వానికిన్ = వానికంటె)
(జ) సప్తమీ విభక్త్యర్థకము.
గీ. ఎఱుకు విలువిద్య కలిమికి హీనుఁడయ్యె ఫార్థునకు. ఆది. 5.244.
(విలువిద్య కలిమికిన్ = విలువిద్య కలిమి విషయమున).
(డ) నిర్ధారణార్థకము-లోపల.
గీ ... అన్నదానంబు, ధర్మంబు లన్నిటికిని ముఖ్యము. అను. 4.276.
(అన్నిటికిని = అన్నిటిలోపల)
(ద) పైకి, మీఁదికి, పైని, మీఁది.
గీ. ... ఇది చాలనబల దీని,కలుగఁ జనదు. ఆది. 6.217.
వ. ... శుక్రుండు యయాతికలిగి. ఆది. 3.187.
(యయాతికిన్ = యయాతిపైన, యయాతిమీఁద).

**కింక** దే. వి. కినుక (√ కినియు)
1. కోపము.
ఉ. పంకజనాభ మా పడిన పాటులు రాజ్యము గోలుపోకయుం, గింకకు మూలమై. ద్రోణ. 3.13; ఆర. 7.91.

**కింకరత్వము** సం. వి. అ. న.
అనుసరణము, పరాధీనత.
తే. .. అట్టివాని కేల,తపములును యజనంబులు దానములును, వ్రతములును వేదవిదురరత్వంబు దొడఁరు. శాంతి. 5.323.

**కింకరుఁడు** సం. విఙ. (అ. ఆ. అ)
పరిచారకుఁడు, సేవకుఁడు, భటుఁడు
వ. అమ్మహీకాంతుండు దివిజ కింకరులం జూచి యిమ్ముదుసలి తాపసుని వృద్ధి విహంగంబును గార్వార్థంబు సహాయులుగాఁ దెచ్చితి వీరిని నిజ స్థానంబుల నునిచి వచ్చెద నిలువుం డని. ఆర. 4 371.
2. ఆజ్ఞ ప్రకారము నడచువాఁడు.
సీ. దేవతల్ వేదవిధి ప్రవర్తకులు బ్రాహ్మణులును వారల యట్లు శ్రుతుల కింకరులై కాదె కిల్బిషంబులఁ బాసి వారి చందమున శాశ్వత విభూతి, నొందుట. శాంతి. 1.75.
3. అధీనమైనవాఁడు, వశమైనవాఁడు.

వ. .. శంకరుండు కరుణా కింక రుండగుట. శాంతి. 3.378.
4. ఒక రాక్షసుఁడు.
వ. విశ్వామిత్రుండు...కల్మాషపాదు నంతర్గతుండయి యుండ నొక్క రిక్కసుం గింకరుండను వానిం బంచిన. ఆది 7.112.

**కింకిణి** సం. వి ఇ. ఈ. స్త్రీ.
క్షుద్ర ఘంటిక. చిఱు గంట, గజ్జె
మ. ... కింకిణీ క్వణన వ్యాహృత హేషిత స్వనములన్ విరా. 3.159.

**కింకిరిపడు** దే. అ. క్రి. (కింకిరి + పడు)
కోపించు, ఏవగించు.
కం. అతిథి నినుఁ గోరెనేనిని,మతిఁ గింకిరిపడక యోలమాసగొనక నీ,వలసినప్రియంబు సల్పుము, సతతం బతి పనుపు సేయవలయు. అను. 1.68.

**కింకిరిపాటు** దే. వి.
కోపము.
సీ. నగు మొగంబుం కాని నాతి నీ దెస నెప్డు, నడుకువ, గింకిరిపాటు లేదు. అర. 5.291.
శ్లో॥ కథం చ వశగాస్తుభ్యం న కుప్యంతి చ తే శుచే. సం. భార. అర 232.5.

**కింజప్యము** సం. వి. అ. న.
ఒక తీర్థము. ఇచట చేసిన దానంబు లక్షయంబులగును. అర. 2.263.

**కిందత్తము** సం. వి. అ. న.
ఒక తీర్థము ఇందు తిలలు ప్రస్థము దానము చేసినఁ బితరుల ఋణము నుండి విముక్తుండగును. అర.2 263.

**కిందముఁడు** సం. వి. ఉ. అ. పుం.
ఒక ముని. మృగములు నిరంతరము రమించుటఁ జూచి యీతఁడు మృగమై (మగ జింకయై) మృగమైన (ఆఁడు జింకయైన) భార్యతో రమించు చుండెను. ఆ సమయమున మృగముల వేటాడుచున్న పాండురాజు అవి వాస్తవిక మృగములనుకొని యేదమ్ములచే వానిని ద్రెళ్ళనేసెను. కొనయూపిరితో నున్న కిందముఁడు పాండురాజును జూచి సర్వప్రాణులకు సాధారణం బయి యిష్టంబగు సుఖావసరంబున నున్న మమ్ము ననపరాధుల వధించితివి గావున నీవునుం బ్రియాసంగమంబయిన యప్పుడ మరణ మొందెదు మని నీ ప్రియయు నిన్ను ననుగమించునని శాపంబిచ్చి భార్యతోఁగూడ నసువులఁ బాసెను. ఆది. 5.48 మొ. 5.78.

**కిందానము** సం. వి. అ. న.
ఒక తీర్థము. ఇందుఁ జేసిన దాన జపము లక్షయంబులగును. అర. 2.263.

**కింపురుష వర్షము** సం.వి.అ. పుం.న.
భారతాది వర్షములతో నొకటి. ఇది హిమవంతంబునకు అవతల గలదు. భీష్మ. 1.25.

**కింపురుషుఁడు** సం. వి. అ. పుం.
దేవతంయందొక జాతివాఁడు. పులహుఁడు అను బ్రహ్మకుఁ బుట్టినవాఁడు
వ. పులహుండను మానసపుత్రునకుఁ గిన్నర కింపురుషాదులు పుట్టిరి. ఆది. 3 67.

**కింశుకము** సం. వి. అ. పుం.

మోదుగు.

ఉ. .. క్రొవ్విరుల్, నిండిన ంశు కంబు రమణీయతఁ జూడఁగ నొప్పి. భీష్మ. 2.55.

దీని ఆకులు గుండ్రముగా మూఁడాకులకు తొడిమ గలిగి యుండును. ఈ ఆకులను విస్తరులుగ గుట్టి భోజన పాత్రలుగా నుపయోగింతురు కాయలు పొడవుగను వంకరగను నుండును. కాయలలోని గింజలకు మోదుగు మాడలని పేరు. గింజ బల్లపరుపుగా బద్దవలె గుండ్రముగా నుండును. రంగు ఎఱుపుగా నుండి పొట్టు తీసిన తెల్లగా నుండును. దీని కఱ్ఱలో అగ్ని గలదు. మథించిన నిప్పు పుట్టును. ఇవి తెలుపు, ఎఱుపు, నలుపు, పచ్చని పూల రంగుల భేదముచే నాలుగు రకములు; కాని తెలుపెఱుపులు తప్ప మిగిలినవి దుర్లభములు. పూవులు వంకరగా నుండును. బాణములచే దెబ్బలు పూర్తిగా తగిలి గాయాల నుండి రక్తము కాఱుచున్న శరీరమును పూచిన మోదుగు చెట్టుతోఁ బోల్చుదురు. ఇది ఆంధ్రారణ్యములలో విస్తారముగాఁ గలదు.

**కిట్టు** దే. స. క్రి.

1. సమీపించు, కదియు.

చం. ... ఉగ్ర మృగనాథునినైనను గిట్టి ముట్టి పెట్టదముగఁ గాలఁ, గేలను గడింది మగంటిమి యుల్లసిల్ల బట్టుదు. విరా. 1.83.

2. చంపు.

ఉ, .. కట్టుదు కర్ణ శల్యులను కీట ములం గదతాడనంబులం, బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగు పెంటలు గాఁగ. కర్ణ. 3.261.

శ్లో. హన్యాం కర్ణం తథా శల్యమ్ బాహుభ్యామివ సంయుగే. సం. భార. కర్ణ 88.107.

స. క్రి.; అ. క్రి.

3. కలియు, తాఁకు.

(దుర్యోధనుఁడు ద్రోణునితో నన్న మాట.)

మ. ... భీమాగ్రజుఁ దాజిఁ గిట్టిన బట్టం గడు నగ్గమైనయెడఁ గ్రేడింతెప్ప. ద్రోణ. 1.388.

(దుర్యోధనుఁడు భీష్మునితో నన్న మాట).

ఉ. ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁడే పునఁ గోలుమసంగి పొంగి నా, తమ్ములఁ జంపఁగా నకట తప్పక చూచెదుగాని రోషశో,పమ్ములు లేవు తోడుపడఁగాదని నిల్చితౌ. భీష్మ. 3.77; ద్రోణ. 4.69.

4. పొదువు, క్రమ్ము.

వ. అట్టియెడ సంశప్త గణంబు లన్నియు నార్పులు నింగిముట్ట నలు దిక్కులం గిట్టి బెట్టిదంబులగు నస్త్ర శస్త్ర పరంపరలు గురిసిన. కర్ణ. 1.176.

**కిణము** సం. వి. అ. పుం.

కఠిన వస్తు స్పర్శముచే హస్తాదులందు కాచెడి కాయ.

వ. ... పేడితనంబు దాల్చి బాహుల

దీర్ఘత్వంబునకు గుణకిణంబులకు, గంచుకంబును శంఖ వలయంబులును మాటు సేసికొని విరాటు కడకుం జని. విరా. 1.87.

**కిణీభూతము** సం. విణ. (అ. ఆ. అ)
కాయలుగలదిగా నైనది.
వ....కవలు దాని (ద్రౌపది) పల్లవ తామ్ర పాదతలంబు లాయుధాభ్యాస వశంబునం గిణీభూతంబులయిన తమ కర తలంబులంజేసి మెత్తన యొత్తు చుండిరి. ఆర. 3.298.

**కితవసుతుఁడు** సం. వి. అ. పుం.
శకునికొడుకు. ఉలూకుఁడు. చూ. ఉలూకుఁడు.
కం. ..మీ,వారిని మిమ్ము రేపుగ,దారూ పేర్పడఁగ జూచెదం గితవసుతా. ఉద్యో. 4.206.

**కితవుఁడు** సం. వి. అ. పుం.
జూదరి.
వ. ... మత్పతి శైలూషండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కుడియది. విరా. 2.153.

**కినియించు** దే. స. క్రి. (√ కినియు)
కోపము తెప్పించు.
ఆ. నాదు బాహుబలమునకు మాఱు కొనఁజాలు, భుజబలంబు గలిగి పోక చిక్కఁ,బెనఁగి నన్నుఁ గొంత కిని యింప నోపెడు. చందమైన వినుము సరసిజాక్షి. విరా. 2.283; ద్రోణ. 1.310.

**కినియు** దే. స. క్రి., అ. క్రి.
కోపించు.
చం. అనుడు విరాటుఁడుల్లమున నక్కటికంబ లయంగ నంగనం, గనుగొని కీచకుం గినియఁగాఁదగు సత్వము లేమిఁ జేసి. విరా. 2.144.
తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము,తోపఁగా నిట్టులనియె. ఉద్యో. 1.255.
ఉ. అత్తఱి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబులెల్ల నో,రెత్తక యూర కుండిరి, మహీశ్వరు చిత్తమెఱుంగఁ కున్కిఁ దా,నొత్తి కుమారులం గినియ నోపఁడ. ఉద్యో. 1.346.

**కినుక**
**కిన్క** } దే. వి. (√ కినియు)
కోపము, కనలు.
చం. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు విల్లు ద్రెళ్ళడిం దునిమి. విరా. 5.176.
తే. అనిన విని కిన్కఁ జూచెన యలఁతి నగవు, చెలువు మొగమున కొంత క్రొత్త పొఱపొనర్పఁ, బుండరీ కాక్షుఁడగు బెల్లఁ బోయియప్పఁ, డరుణ కమలాక్షుచగుచు మురాంత కుండు. ఉద్యో. 3.364.

**కినుపు** దే. వి. √ కినియు.
కోపము.
కం. వినుమడుగులఁ బడియై,నను... నరులకుఁ బగ లో,గొని యుండ కిను పడఁచి ప్రదు,కన వలయు నిహమ్ముఁ

విందుజా ఏమి? తవ = నీకు; కాల కూటః = హాలాహలమను విషము; స్వాదు కిమ్ = మధురమా ఏమి? వా = లేక; యశోదా స్తన్యం = యశోదా దేవి చనుబాలు; స్వాదు కిము = మధురమా ఏమి? ప్రభో = ఈశ్వరా; మే = నాకు; వద = చెప్పుము.

నీవు శరీరమును అలంకరింపఁ దలఁచుకొన్నప్పుడు కపాలమాలికపై ఎక్కువ మోజు పడియెదవా? కౌస్తుభ మణిపై ఎక్కువ మోజు పడియెదవా? నీకు కాలకూటము ఎక్కువ తియ్యగా నుండునా? మీ తల్లి యశోదాదేవి చనుబాలు ఎక్కువ తియ్యగా నుండగా? ఈశ్వరా నాకు చెప్పుము ఇది హరిహర నాథుని స్తుతి.

**కిమ్మీర వైరి** = సం. వి. న్. పుం.
కిమ్మీరుఁడను రాక్షసుని జంపిన వాఁడు-భీముఁడు.
ఆ. కీచకాధముండు కిమ్మీర వైరిపైఁ గేలు సాచి. విరా. 2.333.

**కిమ్మీరుఁడు** సం. వి. అ. పుం.
ఒక రాక్షసుఁడు. బకాసురుని తమ్ముఁడు కామ్యకవనమున ప్రవేశించి నపుడెదురై పైఁబడవచ్చిన ఈ కిమ్మీరుని భీముఁడు సంహరించెను. చూ. ఏకచక్రము ఆర. 1.107 మొ. 1.2 3.

**కిరణము** సం. వి. అ. పుం.
మయూఖము, వెలుఁగు.
వ. ... తరణి కిరణానుకార ప్రాసంగతంబులగు నారాచంబులు దవీయాంగంబుల నినుప. విరా. 5.148.
వ. ... వాహనంబుల మీఁదఁ బడి భూషణ కిరణంబులు మెఱయ సైనికులు నేలం గూలునప్పుడు. కర్ణ. 1.74.

**కిరాతము** సం. వి. అ. పుం.
ఒకానొక దేశము.
భారత యుద్ధారంభమున ఈ దేశ సైన్యముతో భగదత్తుఁడు సుయోధనుని గలసెను. అశ్వమేధాశ్వము వెంటఁ జను నర్జునుఁడీ దేశనృపతిని జయించెను. సభా. 1.40; ఉద్యో. 4.425; అశ్వ. 4.110.

**కిరాతుఁడు** సం. వి. అ. పుం.
నిషాదుఁడు, బోయ, నెమలిపింఛము ధరించి యడవి యందుఁ దిరిగెడి వాఁడు.
వ. ... కృత్రిమ కిరాతుండైన పశుపతి మెచ్చి జగత్సంహార సమయంబునం దాను ప్రయోగించునట్టి పాశుపత మహాస్త్రంబు నాకిచ్చె. ఉద్యో. 4.425.

**కిరీటము** సం. వి. అ. పుం.
మకుటము - రాజులు తలను దాల్చు భూషణ విశేషము.
మాలిని - కమలభవ కిరీటగ్రామ పద్మావలీ సంగమ సుభగ పదాబ్జా. విరా. 1.335.

**కిరీటి** సం. విన్. పుం.
అర్జునుఁడు. చూ. అర్జునుఁడు.
వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తం బుత్తలం బుడిపి కొని. విరా. 1.161.

**కిల్బిషము** సం. వి. అ. న.

1. [illegible], అపరాధము, ద్రోహము.

ఉ. నాకును [illegible] జవ [illegible] యింత [illegible], గేహము [illegible] కిల్బిషముల్ దల [illegible] జూచి [illegible] చేసిన [illegible] ఉద్యో. 3 [illegible].

2. దోషము.

కం. [illegible] కిల్బిషంబులన్, [illegible] భూజనుల [illegible] శాంతి. [illegible]23.

3. [illegible].

కం. [illegible] కిల్బిషముల [illegible] [illegible]. 4.[illegible]9.

4. [illegible].

తే. [illegible] మేలు [illegible] శాంతి. 2.[illegible].

తే. [illegible] కిల్బిషంబు, [illegible] ధర్మ, రతికి గంధర్వపతికి నిరంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకు దాన. విరా. 3.39.

5. పాపము.

కం. దండార్హులైనవారల, దండింపక యున్నఁ జుమ్మీ ధాత్రీవిభు నా, ఖండల సన్నిభునైనఁ బ్ర,చండపు గిల్బిషము వొందు జగతీనాథా. శాంతి. 1.96.

వ. ... తొల్లి పరీక్షిత్తనయుండగు జనమేజయుండను మహారాజు దన కబుద్ధిపూర్వకబ్రహ్మహత్య వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె. శాంతి. 3.344.

**కిశోరము** సం. వి. అ. పుం.

1. [illegible]వు.

కం. జనియించిన మాత్రన యమ్మని పతి కిశోరమును వేదములు వొందెను. శాంతి. 6.244.

2. శాబకము (పిల్ల).

ఉ. చిత్తము ఉల్లసిల్ల నల సింహ కిశోరము లొక్కమై మదోన్మత్త గజావళిం బొదువుమాడ్కి. ఉద్యో. 2.140.

**కిశోరుఁడు** సం. వి అ. పుం.

మృగ శాబకము; పదునైదేండ్ల వయసు లోపు బాలుఁడు; చట్ట ప్రకారము మైనారిటీ తీరనివాఁడు

చం. ... భుజవిక్రమాధరిత సింహ కిశోరులఁ బాండవేయులన్. ఆది. 5.150.

**కిష్కింధ** సం. వి. ఆ. స్త్రీ.

వానర రాజధాని; వాలి నివాస నగరము.

వ. ..., అంగదుం గూడికొని వాలిని వాసంబైన కిష్కింధా నగరంబున కరిగిరి. ఆర. 6.370.

**కిష్కుహస్త** సం. వి. ఉ. పుం. స్త్రీ. జేన, మూర.

వ. ...దశ కిష్కు సహస్ర ప్రమాణ వృత్తాయతంబును ... గా నపూర్వ సభా భవనంబుఁ బదునాలుగు నెలలు నిర్మించి. సభా. 1,14.

**కిసలయము** సం. వి. అ. న. పల్లవము, చిగురాకు.

సీ...కిసలయహస్త కేంగేల నేపారు క్రొమ్మించను లేయెండ మిగులఁ బర్వ. విరా. 2.37.

## కీ

**కీచకారాతి** సం. వి. ఇ. పుం. కీచకునకు విరోధి. కీచకుని సంహరించినవాఁడు-భీముఁడు.

తే. కీచకారాతిఁ దప్పక చూచి నగుచు నతనికట్లని చెప్పె ధర్మాత్మజుండు. విరా. 3.205.

**కీచకము** సం. వి. అ. పు.. ఒక దేశము. ఇది కీచకుని జన్మదేశమై యులదనోపు. పాండవులు ఏకచక్ర పురముమ చేరునపు డీదేశమును దాఁటి చనిరి. ఇది అడవిదేశము.

వ. ... పాండవులును ..చని విదర్భ మత్స్యత్రిగర్త కీచక విషయంబులు గడచి యేకచక్రంబను నగ్రహారంబు గని. ఆది. 6.233.

శ్లో॥ మత్స్యాం త్రిగర్తాన్ పాంచాలాన్ కీచకానాం తరేణ చ, రమణీయాన్వనోద్దేశాన్ ప్రేక్షమాణాస్సరాంసిచ. సం. భార. ఆది. 156.2.

ఆంధ్రమున పాంచాల శబ్దము విడువఁబడినది. దీనిని బట్టి మత్స్యదేశము, దానిప్రక్కన త్రిగర్తదేశము, దాని ప్రక్కన పాంచాలదేశము, దానికిఁ బిమ్మట కీచకదేశము, దాని యనంతరము ఏకచక్రపురము అని తెలియుచున్నది.

కీచకదేశ నివాసులకు కీచకులని పేరు.

**కీచకుఁడు** సం. వి. అ. పుం. సింహబలుఁడు-సుదేష్ణకు తమ్ముఁడు, విరాటుని మఱఁది, దండనాథుఁడు.

వ. ... మత్స్యపతి మఱందియు దండనాథుఁడును కీచకాగ్రజుండును రూపాభిమానియు నానాభరణ ధరణ శీలుండును దుర్వివిదగ్ధుండును బల గర్వితుండును నగు సింహబలుండు తన యప్ప సుదేష్ణకు మ్రొక్కంజనువాఁడు. విరా. 2.22.

ద్రౌపదిపై వలపుగొని యామెను బరాభవించుట కారణముగా నితనిని భీముఁడు సంహరించెను. విరా.2.352

ఈతఁడు సుదేష్ణకు ఏకోదరుఁడుగాఁ గన్పింపఁడు. ఆమె కేకయవంశము వారికి కీచక శబ్దము లేదు. కీచకునకు కేకయ శబ్దము లేదు. కీచకుఁడు సూతుఁడు, సూతవంశజుఁడు అని తెలియుచున్నది. "మ. నను నీ విప్పుడు సూతు మందిరమునన్మద్యంబు దెమ్మన్న" విరా. 2.158.

ఆ. సూతు శవముతోడ నేతెంచు నెరవులు విరా. 3.27.
ఉ. సూతులు భీతులై ద్రుపదసూతి సమేతముగాఁగ నగ్గజ, ప్రేతము వైచి. విరా. 3.280.
వీరిది చిన్న రాజ్యమగుటచే రథచోదక వృత్తి నవలంబించి సూతులని పిలువ బడి యుండవచ్చును. లేదా వీరి పూర్వుఁడొకఁడు సూతుఁడై యున్న కతన వాని వంశమువారు సూతులని పిలువఁబడి యుండవచ్చును.

బ్రాహ్మణ్యాం క్షత్రియా జ్జాతః-క్షత్రియునివలన బ్రాహ్మణ స్త్రీకి బుట్టినవాఁడు సూతుఁడని పిలువఁబడును. ప్రతిలోమ జాతులలోన అస ద్విజుండనఁ బరఁగి క్షత్రియునకంటె నించుక తక్కువయు వైశ్యునికంటె నధికుఁడునై ప్రాతిలోమ్యంబున రాజ సంబంధార్హుండగునట్టి సూతు వంశంబున సూతవిషయాధీశుండును రాజ కన్యా సముద్భూతుండును నగు కీచకుండనువాఁడు గలఁడు. వానికి మాళవియందు నూట యార్వురు కీచకులు పుట్టిరందగ్రజుండు బలవంతుఁడై యుండి కేకయ రాజపుత్రియగు తమ తల్లి చెలియలి కూఁతులైన సుదేష్ణకుం బరిచరింపుచు విరాట నగరంబున నుండు. వాని తమ్ములు నూట యేవ్వురును వానిన యనుసరించి యుండుదురని యిట్లు సూతవంశ ప్రకారంబని వైశంపాయనుండు జనమేజయునకెఱింగించె. సం. శో. ము. విరా. 2.163. Foot Note.

యాదవుఁడైన హృదికునికి దేవమీఢుండు అను కొడుకు గలఁడు. ఇతఁడు కృతవర్మకు జ్యేష్ఠభ్రాత. ఇతనికి శూరుఁడను పేరు గలదు. ఈ శూరునికి మారిషయను భార్యయందు వసుదేవుండును దేవభాగుండును దేవశ్రవుండును సృంజయుండును శ్యామకుండను గంకుండును నసీకుండును వత్సకుండును వృకుండును ననువారు పదుగురు గొడుకులును బృథయు శ్రుతదేవయు శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు రాజాధిదేవియు నను కూఁతులేవురును బుట్టిరి. ఆంధ్రభాగవతము. 9.714.

ఈ అయిదుగురు కూఁతుండ్రకు మాఱుపేర్లున్నవో శూరునకు ఇంకను కూఁతులు గలరో వివరము తెలియకున్నది. ఏలయన భాగవతమునందు జెప్పఁబడిన యీ పేర్లకును భారతము నందలి పేర్లకును భేదము కనఁబడుచున్నది. ఇందు పెద్దదియగు పృథ కుంతిభోజునకు దత్తు ఈయఁబడి కుంతి యను పేరుతో పాండురాజునకు భార్యయై ధర్మజ భీమార్జునులకు తల్లి యాయెను. ఒకతె సాత్వతి యను పేరుతో చేదిరాజునకు భార్యయై శిశుపాలుని తల్లి యాయెను. ఒక్కతె కేకయరాజునకు భార్యయై సుదేష్ణకు తల్లి యాయెను. ఒక్కతె మాళవి యను పేరుతో కీచకదేశపు రాజు కీచకునకు భార్యయై నూటయార్వురు కీచకులను గనెను. మఱి యొకతె

చివరిది రాజాధిదేవి యను పేరుతోడనే అవంతిదేశపు రాజును వివాహమై విందానువిందులను కొడుకులను మిత్రవింద యను కూతుఁ గనెను. ఆ మిత్రవిందను శ్రీకృష్ణుఁడు స్వయంవరమున వరించి భార్యగాఁ గైకొనెను.

**కీటకము** సం. వి. అ. పుం.
క్రిమి, పురుగు.
వ. ... అక్కీటకంబు నాలోకించిన నది యదృష్టపూర్వ వికృతాకారంబై యుండె. కర్ణ. 2.89.

**కీటకుఁడు** సం. వి. అ. పుం.
క్రోధవశ గణాంశ సంభూతుఁడు. ఆది. 3.80.

**కీటజము** సం. అ. వి. న.
క్రిమికోశోద్భవము, పట్టు, కౌశేయము
వ. ... సౌవర్ణకీటజ పట్టజాండజ శయ్యలను. సభా. 2.113.

**కీటడఁగు** దే. అ. క్రి. గీటడఁగు.

**వేచ్చు.**
లయవిభాతి .. కాల్బలము నెరవు లునుఁ గీటడఁగ,శరగురుఁడుఁ గర్ణుఁడును గురుసుతుఁడు మద్రేశ్వరుఁడు గృపుఁడుం బరవఁ బరఁగి దివిజుల్ వొగడ,ధరఁబడి ముకుంద మన నర తనయుఁడొప్పెన్. శ్రీ. 2.73.
సీ. ... అట్టి కర్ణుండు మదాంధ సింధురము బ,లోద్ధత ద్విరద మహోగ్ర విక్ర,మమునఁ గీటడఁగిన మాడ్కి నర్జును బలు గడిమిచేఁ దెగటార్పఁ బడియె. శ్రీ. 2.86.
ఇది గీటడఁగు శబ్దమై యుండవోవు. ఆనందవారి ప్రతి యందును సం.ము. ప్రతి యందును మొదటి యుదాహరణమునందును సం.ము. ప్రతియందలి రెండవ యుదాహరణము నందును గల యర్ధానుస్వారమును బట్టి యీ పదమీపదముగా వచ్చినది. తి. న.ప్ర. కోశము ఈ రెండు తావుల 'గీటడఁగు' నిచ్చెను. 'గీటడఁగు'నకే ప్రయోగ బాహుళ్య మన్ని ప్రతులయందుఁ గానవచ్చుచున్నది. శ. ర., సూ. ఆ. ని. కీటడఁగు ఈయలేదు.

**కీటము** సం. వి. అ. పుం.
క్రిమి, పురుగు.
వ. ... ఇంద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేటపఱచి యతనిం గోపింపఁ జేయువాఁడై కీటతనువు దాల్చి యట్లు సేసె. కర్ణ. 2.89.
తే. కర్ణు నుత్సంగమున మస్తరంబుఁ జేర్చి,గురుఁడు నిద్రింప వికృతాతి ఘోర రూప, మకరకమువియెడు నొక కీట మద్దినేంద్ర తనయు క్రీఁదొడఁ దొలిచె సత్వంము గాఁగ. కాంతి. 1.21.

**కీడాడు** దే. స. క్రి.
(కీడు + ఆడు).
నిందించు, దూఱు, గర్హించు.
మ. ... నను దోర్లీలా నసుగ్రుండవై యనిలో నిల్వఁగ లేని నీవిటులు కీడాడంగ నర్హుండవే. కర్ణ. 3.86., ఉద్యో. 3.195.
శ్లో॥ స భీమసేనోఽర్హతి గర్హణామేన త్వం ప్రత్యం రక్ష్యసే యన్నృ హృద్భిః. సం. భార. కర్ణ. 71.7.
సీ. బావ యొప్పుండను పలుకుల

నేమగ వాత్రిని రాషుకఁ గీడాడనేల,
కుమమ్మష్ఠుఁడగు బాహ్లికుని దూఱ
నేటికి భీష్మునిపైఁ బ్రియమెట్టఁగునె,
యిట్టి క్రూరుల యింటికిచ్చిన మన
వారి నందుఁగాక. ఉద్యో. 3.195.,
ఆ. గురుని గీడాడుటయు వధించు
టగుటఁజేసి. కర్ణ. 3.100.

**కీడు** దే. వి. బహు. కీడులు. కీళులు, కీళ్ళు, కీళ్ళులు.

1. నాశము, చేటు, హాని.

వ. ... రాజులంగొలిచి యెమ్మెయి
నయినను బ్రదుకు జనంబులు గీడు
నం బొందకుండునట్టి సాధారణ నీతి
సంక్షేప రూపంబున నెఱింగించెద...
విరా. 1.120.

ఉత్సాహ. హరిచేత రక్షితయైన
పాంచాలికగునయ్యు యిమ్మెయి
నత్యంత నీచ,పరిభవ దుఃఖంబు
పాలొనెంత మీఁదు పరికింపకున్నఁ
గీడ్పాటిల్లకున్నె. స్త్రీ. 2.58.

కం. మునుసహితులైన మునులం,గను
గొని యప్పుడు గరము గారవమున
నిట్లనుఁ బ్రజయంబు కీడునఁ జన
కుండఁగ మీరు రక్ష సలిపితిఁ గడు
జాన్. ఆర. 4.231.

2 అపకారము, చెడుగు, సెబ్బర.

చం. ... గతాగతంపు భ్రమణం
బులు గీళ్ళుగాక మేలులే. శాంతి.
5.232.

మ. గురు భీష్మాదులు చూచుచుండ
సభ, మీకుం గీడు నాఁడట్లుమ,ప్క
రులై చేసిరి. ఉద్యో. 3.36.

సీ. పూజా నమస్కారములకుఁ బాత్ర
ములు బ్రాహ్మణులు వారలకుఁ గీడా
చరించి వాసవుండును జెడు. అను.
5.336.

కం. కీడొనరించినవారికిఁ గీడగుటరు
దయ్యె. భీష్మ. 1.68.

3. దోషము.

తే. క్షత్త్రధర్మంబు కీడునఁ గటకటా
మహాత్మ నీయట్టి వాని కిట్లధిక పీడ
సేయవలసె. ద్రోణ. 4.272.

తే. కాలముల కీడుకతమునఁ గలఁగఁ
బడిన,వేదముల నీవునాఁడును విమల
బుద్ధి,నంచిత వ్యాసమొందించి యఖిల
దివిజ,ముని గణముల కొనర్తు
సమ్మోదమనఘ. శాంతి. 6.527.

4. పాపము, దురితము.

తే. అడవి గోవులకై కాల్చుటద్వార
మునఁ బశువుఁ జంపుట దాన మపాత్ర
భూతుఁడగుపెఱుంగక యిచ్చుట దగ
నిబంటు బ్రోవకుండుట గీడులుగావు
వత్స. శాంతి. 1.302. చూ. 301,
303.

కం. భూపాలక విను పంచ మహా
పాతకకరులుఁ బతితు లక్కొడులు
ప్రాణాపాయాంత ప్రతికృతిఁబాపుదు
రత్యధికపుణ్య పరతను దాయున్.
శాంతి. 3.436.

కం. అది పాపము దానికి నామది
నెప్పుడు వగతు విమల మానస
యక్కొడు దొలంగునట్లుగా సత్పథార్థ
దానములు సేయు బాత్పర్యమునన్.
ఆశ్ర. 1.153.

5. అకార్యము, దుష్కృత్యము.

వ. అనియప్పుడజ్జనంబుల మనంబుల
లేకున్నను దన కీడ్వగ్గడించి యరణ్యా
గమనాభ్యనుజ్ఞ [illegible] బ్రార్థించి
యవ్విభుండు (ధృతరాష్ట్రుఁడు)
వెండియు. ఆశ్ర. 1.90.

6. దుఃఖము.

తే. మున్ను కినియున్న వగ చిత్తమున
జనింప, దరయఁ గీడు పరిగ్రహమది
సమగ్ర, మైనతఁడు పౌత్రినూలి
ప్రవృత్తి తాన,తనకు బంధంబు
గావించుకొను లతాంగి ఆను. 5.230.

7. అశుభము.

కం. విముఖుండగుటయుఁ గీడులు,
దమయంతన చెందు జనులఁ దా వారల
కున్, సుముఖుండగుటయు శుభములు,
సమకూరును శివుని యట్ల చరితము
లెల్లన్. శాంతి. 5.596.

కం. తనకు మహిత ప్రసాదం, బొన
రకయున్నేనిఁ గీడ్కు లొలయునది
దృఢ,త్వనిరూఢమైనఁ జేకుఱు, నసం
తపదసిద్ధి దానికనువెఱఁగింతున్.
శాంతి. 5.154. చూ. 153.

విణ.

1. దుష్టము. చెడ్డది. నికృష్టము.

ఉ. అక్కట ధర్మనందనుని యాస్య
మునందొకనాఁడుఁ గీడు పల్కఁ
క్కఁడు లేదు నీ కొడుకులొందొరు
మీఱి నికృష్ట వాక్యములే. పెక్కులు
పెక్కుభంగులను ప్రేలుచు నుండఁగ
నీవు దానికిన్, ప్రుక్కక వించు
నుండెదు. ఉద్యో. 2.63.

వ. (యముఁడు ధర్మరాజుతో) రాజు
నకు నవశ్యంబును నరకంబు సూచుట
గలదు గావున నత్తెఱంగునకయి
యేనును వాసవుండును నిన్నుం గడు
గీడగు నచ్చోట నొనిపితిమి. స్వర్గ. 49.

వ. ... ఇతండును గీడు తెరువు
వాఁడు గాఁడు. విరా. 5.278.

2. హానికరము, అనర్థకము.

(భీష్ముఁడు అర్జునునితో అన్న మాట)
ఉ. ... శౌరియు నీవు గూడిన నసా
ధ్యము లెవ్వియు లేవు దర్పదుర్వారుఁ
డవైన నీవలని వైరము గీడని చెప్పఁ
జెప్ప నీ,కౌరవ రాజు మానఁడు దెగం
జెడుఁగాకిటమీఁద భీముచేన్. భీష్మ.
3.432.

3. అధమము, తక్కువది.

సీ. ... సక్తుప్రస్థు నలఘు ధర్మంబు
నేమియు బోలదీ యశ్వమేధ మనఁగ.
గీ. ... నీవేమిట నిమ్మహాధ్వ,రంబుఁ
గీడంటి చెప్పుము ప్రస్ఫుటముగ.
అశ్వ. 4.218.

**కీడుచేయు** దే. స. క్రి.
విడుచు, త్యజించు.

సీ. ... ఆత్మీయ చేతఃప్రవర్తన మర
యఁదు దాన బాల్యమునఁ దలఁచు. ఆ.
తలఁపు గీడుచేసి యెలప్రాయమున
నొండు,తలఁపునందు బట్టుకొలుపుఁ
బ్రీతి,ముదిమి వచ్చినతఱి నదియును
విడిచి యన్యంబులైన నేర్పులాచ
రించు. సౌప్తి. 1.45.

**కీడుతెరువు వాఁడు** దే. వి.
చెడు ప్రవర్తనము గలవాఁడు. చెడు
మార్గమున నడచువాఁడు.

వ....విరాటుండు భయభక్తి యుక్తం
బుగా వేఁడికొనినఁ బాండవాగ్ర

జుండు నగుచు నాకు నలుక యెక్క
డిది యితండును గీడుచెప్పఁడు
గాఁడిదియొక కీడుప్రొద్దుననయ్యె.
విరా. 5.278.

**కీడుపఱుచు, కీడువఱుచు, కీడ్ప ఱుచు, కీడ్వఱుచు.**

దే. స. క్రి.

అణఁచు, అణఁగద్రొక్కు.

వ. ... అద్దేవయాని గద్గద వచనయై
యధర్మంబున ధర్మంబు గీడ్పఱిచి
యిమ్మహీఖండాసురంబున నాసురి
యండసురక్షితంబై పుత్రత్రయంబు
వడసి నాకవమానంబు సేసెననిన
విని శుక్రుండు యయాతిఁ బిలిచె. ఆది.
3.187.

కం. శరనిధి నినాద నిభమగు పుణ్య
ఘోషముఁ గీడుపఱిచి పొలుపగుఁ
గరమప్పురి బ్రహ్మపురి మహీసుర,
వర వేదాధ్యయన రవ మవారితమగు
చున్. ఆది. 8.75.

(సం.ము. పాఠము. కీడ్పరంచి. కీడ్ప
రించి అని ఆ. ము. పా.)

సీ. .. ధర్మంబు గీడుపఱిచి, పరఁగి
యధర్మంబు వెరిఁగినట్లున్నది.
భీష్మ. 1.60.

2. తక్కువ పఱచు, తెగడు.

ఆ. ఇక్కరంబు నెయ్యమెక్కింప
నేరంగఁ గడగి సంతతంబుఁ దలఁచు
నట్టి భంగి మెఱయఁ గీడువఱుపంగఁ
గొనియాడ వలఁతి నీఱుసేయ వలసె
దీని. స్త్రీ. 2.134.

తే. బాలభాను బింబంబు గీడ్పఱచు
నట్టి దీప్తి మండలి దోఁచె నద్దేవ
పతియు మునిపతియుఁ జూచుచుండ
గ్రక్కున విమాన మవతరించి యాస
న్నయై యతివ యొద్ద. శాంతి. 5.6.

3. అసత్యమొనరించు, ఖండించు.

వ. ... పాంచాల విభుండు ..అతని
మాట గీడ్పఱచి సపరివారంబుగా నద్ద
శార్ఙపతికి విందుపెట్టి కట్నంబులిచ్చి
యతని యనునయాలాపంబులు
గైకొని యనిచిపుచ్చిన. ఉద్యో.
4.391.

4. మఱుఁగు పఱచు, కప్పిపుచ్చు.

కం. ఉభయ బల దీప్త కేతు ప్రభలం
గీడ్పఱచి కురు ధరావల్లభ సైన్య
క్షయంకరమై శక్ర ప్రభువు కపి
ధ్వజము వెలిఁగె బ్రకట స్ఫురణన్.
భీష్మ. 1.132.

మ. ... పక్షతి వితాన స్ఫార దీప్తి
వ్రజం బినరశ్మి ప్రకరంబుఁ గీడ్ప
ఱుపఁ బక్షీంద్రుండు చంచద్గతిఁ
జనియెన్. అను. 1.229.

5. లొంగఁదీయు.

తే. అట్లు వచ్చు నాగదఁ గని యచటి
యోధులలికి తమ తమ మీఁదన
యడరుననియుఁ దలఁచి యొదిఁగిరి
రారాజుఁ దలపరైరి ప్రాణభయమెట్టి
వారిఁ గీడ్పఱుపకున్నె. భీష్మ. 3.58.

6. కష్టముల పాలుసేయు.

(అర్జునుడు శ్రీకృష్ణునితో)

ఉ. .. సుజనవత్సల నీవిటులంట
వారు మమ్మీరసమెత్తి కీడ్పఱచి
యింతలు సేసినదాన నీమదిం గూరిన
నొవ్వు సొంపునను గోపము పెంపునఁ
గాదె యారయన్. ఉద్యో. 3.74.

**కీడుపాటు, కీడ్పాటు** దే. వి.

1. కష్టము, శ్రమము.

చం. ఇది కడు ముద్దరాలు పను లేమియుఁ జేయఁగనేరదెంతయున్, మృదువాక కీడుపాటునకు మేకొనఁ జాలదు. విరా. 1.103.

2. దైన్యము.

సీ. ... ఎలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప. విరా. 4.80.

3. పరాభవము, అవమానము.

శా. గంగానందనుఁడాదిగాఁగఁ గురు సంఘంబెల్ల సంగ్రామ ధాత్రిం గూలెం బతి యొక్కరుండుఁ బటు కౌంతేయ ప్రతాపంబు పేర్మిం గీడ్పాటునకోర్చి పాఱె విధి నా మేఁ బ్రాణముల్, నిల్చె. శల్య. 2.21.

3. తక్కువతనము, హైన్యము.

కం. మేలొనరింపఁగ దొరకొను, మేలిమి గల చాయ కీడు మెయికొని చేయున్, లోచ్చ్వ రహిత చాయకుఁ, జాలం గీడ్పాటు వొలయు చందము వచ్చున్. శాంతి. 5.415.

**కీడు ప్రొద్దు** వి.

చెడ్డకాలము (లేచిన వేళావిశేషము).

వ. ... పాండవాగ్రజుండు నగుచు నాకు సఖుఁడ యెక్కడిది యితండును గీడుతెరువు వాఁడు గాఁడిదియొక్క కీడుప్రొద్దున నయ్యెంగాని యని తాను రాజుదెసం బ్రసన్నుండగుట తెలియ నట్లుగా నుత్తరుతోడం బలికిన. విరా. 5.278.

ఇది సం. ము. పాఠము. ఆనంద వాతి పాఠము ప్రొద్దుకీడు. అప్పుడు 'కాల దోషము' అని అర్థము.

**కీడుమేలాడు** దే. అ. క్రి.

మంచిచెడ్డలు పలుకు.

వ. ... వివ్వచ్చుండు నెఱయం బ్రియంబందని డెందంబుతో గీడు మేలాడక యూరకుండె.... శల్య. 2.310.

**కీడ్పడు**
**కీడ్వడు** } దే. అ. క్రి.

1. అఱఁగిమఱఁగి మెలఁగు, లొంగు.

చం. కినుకకుఁ జాలకెంతయును గీడ్పడి నా పడుపాటులెల్ల వమ్మునఁ గలయంగ నిట్టులౌక మూర్ఖునిచే దుదిఁ బోయి కోలుపోయెనె యభిమానము. విరా. 2.186.

2. మఱుఁగువడు, దాఁగు.

ఉ. బాహుల చాయయున్ గమన భంగియు సజ్జనస్థ దీన సందే హము లేదితండు తన తేజము డాఁపఁగ మత్స్యభూమి భృద్గేహము నందుఁ జేడె యనఁ గీడ్పడియుండెనొ. విరా. 4.76.

3. చేటునొందు, హానిపొందు.

ద. బలవంతుల బలములు నగ్గలమగు బలమెదురఁ గలుగఁగాఁ గీడ్పడునే, కొలఁదుల వారికిఁ గర్వము, నిలుచునె నయమార్గ వృత్తి నిలిచిన భంగిన్. ఉద్యో. 3.303.

4. దైన్యమునొందు.

సీ. కృష్ణుఁ దోడుగఁగొని కీడ్పడి వీరలు వచ్చినఁ జెప్పితి వధ విధంబు. భీష్మ. 3.397.

చం. ... మదికిష్టమైన యది గోరుము గోవునకంచుఁ జేరి త,క్కినధరణీసు పర్వునకుఁ గీర్పడి యెవ్వరయి వేఁడి కొన్న నేఁ,గాన భవదీయ రాజ్యమును గుత్సితవృత్తికి నెవ్వఁకొండునే.
తే. అనియెఁగాని నామాట గైకొనఁడ. అను. 2.429., 430.

5. నశించు.
సీ. (శ్రీదేవి గోవులతో) ఏను బాసిన సర్వ దానవకులము గీర్పడియెఁ బొందిన సురల్ ప్రభుత నొందిరి. అను. 3.114.

6. వమ్మగు - పొల్లుపోవు, నిరర్థకమగు.
ఉ. అదితిఁ దెక్కు మాబలవి యన్నియు వమ్మయిపోయె నస్త్ర సం, తాడనశక్తి గీర్పడియె. అర. 4.358

7. తక్కువపడు, ఓడిపోవు.
కం. గెలుపునెడ నేయునెడ వడిఁ, బలుపునెడం బెనఁగునెడ నహార బలంబుల్, మెలయునెడ భీమునకు నెం, దొలుఁ గీర్పడఁ దొరఁగిరుద్ధతులు రాజసుతుల్. ఆది. 5.164.

**కీర్పరించు** దే. స. క్రి.
అణఁచు, అణఁగద్రొక్కు.
చూ. కీడుపఱుచు. 1 వ అర్థము. 2వ ఉదా.

**కీడ్పెర** దే. వి.
కలయిక, మేళనము, చేరిక
తే. ... జోదుల యంపపొదుల దీప్త ఒనవేఁతనవ్వుల దీధితులును హారి రత్నములఁ గీడ్పెర నగుచు వెలుఁగ. (సం. ము. పాఠము) శల్య. 1.104.

**కీడ్పెరయు** దే. అ. క్రి.
మిళితమగు, ఏకమగు, చేరు.
వ. ... చతురంగంబుల యవయవంబులుఁ జామరచ్ఛత్రి కేతు శకలంబులుఁ గోదండ గదాదండాది హేతి ఖండంబులుం గీడ్పెరసి పాఱు నెత్తురు టేఱులఁ దెట్టువలు గట్టి. (సం. ము. పాఠము) ద్రోణ. 4.29.
(బెరసి అని ఆనందముద్రణము. కీడ్పెరసి-అందు పాఠాంతరము. కీడ్పెరసి పాఠాం. సం. ము. లేదు).

**కీనాశుఁడు** సం. వి. అ. పుం.
1. యముఁడు.
కం. మృతులైనవారలు నిర్వ్యాకృతులై యుండుదురు వారిఁ గీనాశభటుల్ ప్రబలతి గొనిచనుట యా పితృపతిశాసించుటవి యెట్టి భంగులు దేవా. అను. 5.165.

2. రాక్షసుఁడు.
కం. ఏను బకాసురు ననుజుఁడ,గీనాశుఁడ మానవులకు గీమ్మిఁదుఁడనం,గా నెగడుదు నీకామ్యక,కాననమున సత్త్వ ఖాదన బుద్ధిన్. అర. 1.412.

**కీరము** సం. వి. అ. పుం.
చిలుక.
ఉ. ... మహాతరువుల్ ఫలవృద్ధి నొంది యి,క్కాన ననేకముల్ గలుగఁగా నిటులేటికి నెందు నిల్వ నో? మానితకీరమా యనియె మానుషభంగి కిరూపమొప్పఁగన్. అను. 1.16...

**కీర్తన** సం. వి. ఆ. స్త్రీ.
పొగడ్త.

కం. పదపడి పాండవ యోధుల్వ్రాది
వినఁ బెనుఁ దుంగమదుప్పులో గజపతి
యున్నదవ్వ త్రి గేలిసేలుపు ప,గిది
నాళలు వోలె సురలు గీర్తన సేయన్.
కర్ణ. 2.340.
చం. అతులిత రత్న కాంచన గవాశ్వ
విభూషణ వస్త్ర కన్యకా,క్షితి ముఖ
వస్తుదానములు గీర్తనకెక్కఁగ వచ్చి
ముందు స్వతంత్రుఁడయి చేసె. ఆశ్ర.
1.185; మూ. 9.

**కీర్తనము** సం. వి. అ. న.
1. స్తుతి; పొగడ్త; స్తోత్రము.
కం. ఇమ్మెయి నతఁడును దివ్యాస్త్ర
మ్ములు నామీఁద నేయ రయమునఁ
బ్రతిహతమ్మొనరించితి దివిజ గ,ణ
మ్మంబరవీథిఁ గీర్తనమ్మొనరింపన్.
ఉద్యో. 4.380.
కం. జనములు దుస్స్వప్నంబులు,గని
గోకీర్తనము సేయఁగా దద్దురితం,బున
బొరయదు. ... అను. 8.33.
2. కీర్తి, ప్రసిద్ధి.
వ. .... సత్యవతివలన నమ్మహార్షి
కీర్తనంబు విని భీష్ముండు కరకమ
లంబులు మొగిచి వ్యాసభట్టారకుఁ
డున్న దిక్కునకు మ్రొక్కి. ఆది.
4.238.
ఆ. ధరణి నొప్పుచున్న దమయంతి
స్వయంవరము జూచువేడ్క వచ్చి
యున్నవారమిన్న మమ్ము వారి
జాక్షికి నెఱింగింపు నామధేయ కీర్త
నముల. అర. 2.34.

**కీర్తనీయము** సం. విణ. (అ. ఆ. అ.)
కీర్తింపఁదగినది.
వ. ... అయ్యవసరంబున మనము
సమయభంగంబు సెప్పి వారలం
గ్రమ్మఱం బండ్రెండు వత్సరంబులు
వనవాసంబు సలుపం బుత్తమదైన
నప్రతిహతంబుగాఁ జతురంత భూ
చక్రం బాక్రమించి కీర్తనీయులమై
వర్తిలుదుము. విరా. 3.117.
సీ. ... దుష్యంత భరతులొందిన
కీర్తనీయోన్నతి నొందుము. స్వర్గ.45;
శాంతి. 5.438.

**కీర్తి** సం. వి. ఇ. స్త్రీ.
1. ఖ్యాతి.
సీ. ... కౌమ్మనదండనాథుండు
మధుర కీర్తి, విస్తరస్ఫారుఁడు. విరా.
1.10; 87.
1. పొగడిక.
ఉ. ... వారికొక యాపద పుట్టక
యుండఁ గాచుటొప్పె ధరఁ గీర్తి
కెక్కదె యపాయము సేసిన నింద
పుట్టదే. విరా. 2.95.
కి. దతునకు భరతయను స్త్రీయందుఁ
బుట్టిన యేఁబండ్రు గూఁతులతో
నొక్కతె. ఆది. 3.81.

**కీర్తించు** సం. స. క్రి.
స్తుతించు, పొగడు.
కం. ఉచితగతిఁ జేరి వందె,ప్రచ
యము గీర్తింప: ఉద్యో. 4.129.

**కీర్తికెక్కు** అ. క్రి. పొగడ్త పొందు.
ఉ. ... వారికొక యాపద పుట్టక
యుండఁ గాచుటొప్పె ధరఁ గీర్తి
కెక్కదె యపాయము సేసిన నింద
పుట్టదే. విరా. 2.95.

**కీర్తితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పొగడఁబడినది, స్తుతింపఁబడినది.
మ. ...విధ్వంసి ... నాగాయుత సామ్యా కీర్తిత బలోదగ్రుం బ్రతి వ్యూహ దాహకు భీముం గొనివచ్చు ధర్మజుఁడు. ఉద్యో. 2.172; శల్య. 1.42.

2. చెప్పఁబడినది. కథితము.
ఆ. కీర్తనీయుఁడైన కేశవు దివ్యనా, మంబులివి భవద్ధితంబు గోరి, తర తరంబ కీర్తితంబులయ్యె నశేష, భంగి వేయుఁ గురునృపాల వర్య. అను. 5.325.
చం. .... ఆ కృశానుఁ నతిసక్త మన స్థితిఁ గొల్చి దోషని,ష్కృతి దగఁ గాంతురట్లగుటఁ .. గీర్తితమయ్యెఁ దచాఖ్య వానికిన్. అర. 5.157.

**కీర్త్యము** సం. వి. అ. న.
కీర్తనీయము.
కం. ... గంగా గుణసం,తానంబు శతానంద ము,ఖానిమిష ప్రవర కీర్త్య మనఘచరిత్రా. అను. 2.121., ఆశ్ర. 1.13.

**కీల** సం. వి. ఆ. స్త్రీ.
మంట, అగ్ని జ్వాల
కం. భయమేటికి వినుఁడు ధనం, జయునిం గేశవుని నాదు శరకీలా ...నేర్చెదఁ జేర్చెద. ద్రోణ. 3.193.
సీ. అమరు ... పేరు శివు నకు ..., తత్కోప దృక్కీల ధర్మ ...వు,జాతుల నెల్లను సమయఁ జేయుఁ. అను. 5.388.

**కీలారము** దే. వి.
కీలారము, పశువుల మంద.
వ. ... దేవా ద్వైతవనంబునందలి కీలారంబుననుండి వీఁడె యొక్క గోపకుండువచ్చెననిన నతండును వాని కభిముఖుండై పసుల సేమ మేమి యని యడుగుటయు. ఆర. 5.359.

**కీలారి** దే. వి. (కీలారము + ఇ)
గొల్లవాఁడు, పసుల కాపరి.
కం. కీలారితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్య జనపాలు కడన్, మేలగు నడవడిఁ దంత్రీ,పాలుండను పేరితోడఁ బరఁగుదు నధిపా. విరా. 1.100.

**కీలారితనము** దే. వి.
పసుల కాపరితనము. చూ. కీలారి.

**కీలాలము** సం. వి. అ. న.
నెత్తురు.
వ. ... కీలాల జలంబులపయిం దేలుచు నవ్వినట్లున్న శిరంబుల వలన. విరా. 3.236.

**కీలించు** దే. స. క్రి. (√ కీలు)
1. లగించు, చేర్చు.
సీ. పెనకువఁ దన్నిస్సిన తనువులొండొం టితోఁ గీలించి నిద్రించి మేలుకాంచి. విరా. 2.238; విరా. 2.292.
2. కట్టు, బంధించు.
సీ. .. కుసుమమాలిక వెడగ్రుచ్చి వ్రేలఁ గీలింప నియమించి. విరా. 5.386.
3. పట్టుకొను.

వ. అని బహుప్రకారంబులం బల వించి యా సూతనందను చేసేతం గీలించి. భీష్మ. 1.57.

4. నాటించు, చొనుపు.

సీ. ... వివింశతి ధనువుఁ దునిమి, వెడఁద యమ్మునవేసి వెండియు మూఁడు వాలిక యమ్ములొడలఁ గీలించి. భీష్మ. 1.272.

కం. .. కృష్ణననుజునకు మార్కొని తీవ్రాంబకములు పదియింట నలంబు సుఁడు దదంగకంబులం గీలించె. భీష్మ. 2.226; ఆర. 7.130; ద్రోణ. 3.82.

**కీలితము** సం. విణ. (అ. ఆ. అ.)

నాటఁబడినది; గ్రువ్వఁబడినది.

సీ. గర్వంబు మెఱయ శిఖండి యశ్వత్థామ నెదిరిన నాతండు మదమెలర్ప, నారాచమురమున నాటింప నొచ్చియు, ద్రుపదనందనుఁడతి క్రూరశరము, దద్వక్షమునఁ గీలితము సేసె. భీష్మ. 1.259; శాంతి. 2.100.

చం. పటుగతి నా శినిప్రవరు బాహువు దోమర కీలితంబు సేయుటయును. ద్రోణ. 4.38.

2. కట్టఁబడినది, బద్ధము.

ఆ. ... మంత్ర శిలౌషధంబులు, మేలుసేఁత కాలకీలితంబు. శాంతి. 1.185.

**కీలు** దే. వి.

1. మర.

వ. గాంగేయుండు ... పయింబడెన వీరులం గీలెకలెన జంత్రంబులుం బోలె నేలం గూలనేయుచు. భీష్మ. 2.137; ద్రోణ. 1.71.

**కీలుకాఁడు** దే. వి. (√కీలు)

మర త్రిప్పువాఁడు.

సీ. .. కీలుకాఁడెదలింపఁ గెదసిన బొమ్మల కైవడిఁ బటు తురంగ వ్రజంబు. గీ. వికటముగఁ ద్రెళ్ళె. ద్రోణ. 3.62.

**కీలుకొను, కీల్కొను** దే. అ. క్రి. (కీలు + కొను)

1. తగులుకొను, చిక్కుకొను, అంటి యుండు.

కం. తోలు దిగవిడిచి నాగము, లీలఁ బొలుచుమాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ, గీలుకొననీక వెలుఁగు ని,రాలంబన బోధఘనుఁడు. శాంతి. 4.358.

2. నాటుకొను, గ్రుచ్చుకొను.

తే. శోకవారిధి పారంబు గానఁ బొంద,నేలవచ్చుఁ జిత్తంబునఁ గీలు కొని య,సహ్యమై కర్ణ మరణోప జనితమైన, పరిభవంబను శల్యమాతు రతఁ జేయ. కర్ణ. 1.27.

3. నెలకొను, పాదుకొను.

కం. మనమున ధర్మము నర్థం,బును గామముఁ గీలుకొనక పొరపొచ్చెము లై, చని సుఖ దుఃఖముల మద, మును దైన్యముఁ బొందకునికి మోక్ష కర మగున్. శాంతి. 3.466.

4. కలుగు, ఒదవు.

తే. ఇట్టులనియాడు చిత్తంబు నెట్టి చేని,నాథు చెప్పిన ధర్మంబునకుఁ జొరంగ, నూఱుపొల్పు నియమముఁ

గీలుకొన్న, లజ్జవేఁగునఁ బోలె
వ్రాలంగ మోము. అను. 1.78.
5. పట్టుకొని తగిలియుండుః
ఉ. లీల యెలర్పఁగా నబల లేఁజిగు
రాకున బోలె నొప్పు కెం,గేలు కదం
బశాఖ తుదిఁ గీల్కొనఁజేసి. అర.
6.148.

**కీలుకొలుపు, కీలుకొల్పు** దే. స. క్రి.
(√ కీలుకొను).
చేర్చు, కూర్చు, పట్టుకొను.
ఆ. .. అమ్మార్గ పలుకులు, వినఁగఁ
గోరుఁ గేలు దనరు కేలఁ గీలుకొలుపఁ
దలఁచుఁ గీచకాధముండు. విరా.
2.45.
ఆ. అన్నరేంద్రు పాజి యల్లన తన
కరాబ్జమునఁ గీలుకొల్పి ... యమ్మ
రాంతకుండు. శల్య. 2.361.
2. నాటు, చొనుపు.
కం. దానికిఁ జలమెడలక నీ,సూ
సుఁడా పవనసూను సూనుని మేనం,
బానిగ్రశరములిరువది యేను వెసం
గీలుకొలిపె నిశవుఁనాథా. భీష్మ.
3.114.

**కీలెడపిన జంత్రము** దే. వి.
పరిభ్రమించు ఊడఁదీసిన యంత్రము.
(చూ. కీలెడపు).

**కీలెడపు**దే. అ. క్రి. (కీలు+ఎడపు)
పరిభ్రమించు సడలించు.
కం. కీలెడపిన జంత్రముక్రియ,నేలం
బడనేసె. ద్రోణ. 1.371.

**కీలెడలిన జంత్రము** (కీలు+ఎడలు)
పరిభ్రమించు ఊడిపోయిన (చెడి
పోయిన) జంత్రము. భీష్మ. 2.187.

# కు

**కుఁ** ద్రు.
1. సంబంధ సామాన్యమును దెలుపును.
వ. ... కాశీరాజ దుహితలం
దోడ్కొనివచ్చి భీష్ముండు విచిత్ర
వీర్యునకు వివాహంబు సేయనున్న.
ఆది. 4.211.
కం. ... నాకుం గొడుకయ్యె నితఁడు.
శాంతి. 5.474.
(నాకుం గొడుకు = నాయొక్క
కొడుకు.)
2. సంబంధ విశేషమును దెలుపును.
(క) స్వస్వామిభావ సంబంధము.
చం. ... భరతవంశముఁ జొచ్చితి
నందుఁ బాండుభూ వరునకు గోడలైతి
... ఉద్యో. 3.168.
(చ.) జన్య జనకభావ సంబంధము.
ఉ. ... ధన్యులకా సుభద్రకు శత
క్రతు పుత్రునకుద్భవించె స,మ్మాన్య
యశుఁడు పుత్రుఁడభిమన్యుఁడు: ఆది.
8.224.
కం. ప్రహ్లాదునకు విరోచన కుంభ
నికుంభులనఁగా ముప్పురు పుట్టిరందు
విరోచనునకుఁ బలి పుట్టె. ఆది. 3.63.
3. ద్వితీయార్థకము.
చం. చిరముగ బ్రహ్మకుం దపము
సేసి యనంతుఁడనంత ధారుణీ, భర
గురుకార్య సక్తుఁడయి ఆది. 2.128.
(బ్రహ్మనుగూర్చి, బ్రహ్మనుద్దేశించి)
వ. వారలకు గోరసంబులం దుష్టి
సలుపుచుండు. విరా. 2. 2.
(వారలకు = తుష్టిగలవారలనుగా అని
అర్థము).

వ. ... చతుర్ముఖునకుం దపంబు సేసి. అర. 6.271.
వ. జనమేజయునకుం గరుణించి. ఆది. 3.6.

4. తృతీయార్థకము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. విరా. 2.2.
(జనమేజయునకు = జనమేజయునితో)
సీ. ఒకఁడు పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ బొదివి చెల్వొక పోటు పొడుచు నెడల. విరా. 3.164.
కం. ... గురులకు మ్రొక్కని యేదము. విరా. 5.120.
కం. శాంతనవుఁడు భీష్ముండు ప్రశాంతుఁడు తత్ప్రతుష్ప సూచి సంద ష్టుండై, యంతకతనూజునకు ధ్న్మతి, మంతునకత్యంత ధర్మమతి కిట్లని యెన్. సభా. 2.3.
(తనూజునకు = తనూజునితో)

5. చతుర్థ్యర్థకము.

కం. ... దీనిని భూభాగమునకు రచియించెనొక్కొ కమలజుఁడు దయన్. ఆది. 4.15.
(భూభాగమునకు = భూభాగము కొఱకు)
చఁ. కురుపతి రాజసూయమునకున్ ధనమిచ్చిరి రాజులెల్ల. (రాజసూయమునకున్ = రాజసూయము నిమిత్తము) సభా. 1.62.

6. పంచమ్యర్థకము.

కం. ... నాకశాదీ త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకున్. ఆది. 5.239.
(నాకు = నాకంటె)
ఆ. సర్వభూత దయకు సత్య వాక్యమునకు, నుత్తమంబు ధర్మమొండెఱుంగ. ఆది. 3.219. (సర్వభూత దయకు = సర్వభూత దయకంటె, సత్య వాక్యమునకు = సత్య వాక్యముకంటె).
కం. ఒకనాఁడేమును నాపదలకు విడుమర గాంచి. విరా. 1.49; విరా. 2,109.
(ఆపదలకు = ఆపదలనుండి)

7. సప్తమ్యర్థకము.

చం. ... కోమలి నీకనురక్త. అర. 2.216.

8. పైని, మీఁద.

కం. ... గొఱియల పిండునకుఁ గవియు కోల్పులిక్రియ. భీష్మ. 1.226.
కం. నీకడుపున జన్మించుట, నాకుం గొడుకయ్యె నితఁడు నా సుతునకు సుశ్లోకా యలుగందగునే,నీకు. శాంతి. 5.474.
(నా సుతునను = నా సుతునిమీఁద.)

9. మాఱుగా, బదులుగా.

చం. కనకము ధేనువుల్ మణి నికాయములిచ్చెద నేమియైనఁ ధక్కను మదికిష్టమైన యది గోరుము గోవున కంచు. అను. 2.429.

10. కాలముయొక్క అవధిని దెలుపును.

కం. ... ఏడెనిమిది దివసములకు నిట సనుదెంచున్. శాంతి. 6.566.

ii. పదకొండు ప్రయోగవిశేషములు:
వ. బాహుమూలపుకుంభ వంటుకు మిగి
లిన మాంసంబులమ్ము నెపంబున.
విరా. 2.2. (వంటుకు మిగిలిన =
వంట చేయఁగా మిగిలిన.)

**కు²** సం. అవ్య. వ్యుత్పత్తియందు ఉండి
పాప పురాతనార్థముల నిచ్చును.
పాప **కు**త్సితపదార్థకు కు).
కం. ... ఘనుఁడ,ద్దనుఁడిట్టి నీవ
కటకటా...శ్రేష్ఠుల నొప్పెనో కుపురు
షుఁడ పోలెన్. త్రి. 2.190.
(కుపురుషుఁడు = పాపపుఁ బురు
షుఁడు. పాపి; కుమతి ఉద్యో. 3.36.,
కుజనుఁడు. ద్రోణ. 1.237.)
సం. వి. ఉ. స్త్రీ.
భూమి (దీని తెలుఁగున వ్యస్తప్రయో
గము లేదు.)
కుజము ఆది. 6.117, కుతలము.
శల్య. 2.259, కువ్యక్తు సౌప్తి.
1.180.

**కుంకుమము** సం. వి. అ. న.
కుంకుమపువ్వు.
సీ. పసిఁడింపులం దెంపు పరఁగిన
లలము కుంకుమలిప్తమైన చందము
నిందం. విరా. 1.308; త్రి. 2.172.
2. కుంకుమపువ్వుతో సిద్ధము చేయఁ
బడిన లేపద్రవ్య విశేషము.
తే. ధరణి వెట్టుచు దోఁగి యూకంబు
[illegible] జాలంబులఁ జాల
[illegible] గాకుండఁ గుంకుమ
[illegible] తావవులు
[illegible]. భీష్మ. 3.162.
సీ. [illegible] సంగత
కుంకుమ చందన పంకములయు
ఆది. 3.156.

**కుంచెము** దే. వి.
ప్రస్థము. నాలుగు మానికల ప్రమా
ణము గల కొలఁత పాత్రము.
కం. వినుమొక కుంచెడు ధాన్యము,
దనకాయతి గల్గు నతఁడు దాని నొసఁ
గినన్, ధనకోటి గల్గువాఁడ,ధ్దనమొస
గిన నొక్కరూప తత్తత్ఫలముల్.
ఆను. 5.211.
వ. అట్టియెడ నొక్కనాఁడయ్యంద
ఱును రేపు దొడంగి పదమటి జాము
నకు వెదకితెచ్చిన పూరి కొలుచు ప్రస్థ
మాత్రంబు సక్తువయ్యెం గర్తవ్యాను
ష్ఠానంబులు నడపి యనంతరంబ
యాకుంచెడు పేలపిండియుఁ జెఱి
మూఁడుకు (నలువురును సమంబుగా)
పంచికొని యుపయోగించువారై.
[illegible]. అశ్వ.4.221.

**కుంచిక** సం. వి. ఆ. స్త్రీ.
ఇనుప కమ్మి.
వ. ... విస్ఫుర ధ్వజ పతాకా కుంచి
కలు శోభిల్ల. సౌప్తి. 1.116.

**కుంచితము** సం. విశ. (అ. ఆ. అ.)
వంపబడినది. వట్రువగా వంపఁ
బడినది.
ఉ. ఘోరతర ప్రకారమగు **కుం**చిత
బాహు విలాస మొప్ప. శల్య. 1.282.

**కుంచె** వై. వి. (సం. కుంచికా. ప్రా.
కుంచి ఆ)
1. బాహుదము.
చం. దడిగెలు కుంచెలున్ గొడుగు

తండములున్ విలసిల్ల వచ్చినన్. అశ్వా. 3.144.

1. గుత్తిగాఁ గట్టిన నెమిలిపురి కట్ట.

మ. .. నారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. విరా. 3.181.

చం. .... తన కుంచెయు మృగాజినంబునుం,బలుమఱు పీచుచుం గల హబంధుఁడు నారదుఁడాదె వేడుకన్. సభా. 2.31.

**కుంజము** సం. వి. అ. పుం. న.

నికుంజము, పొదరిల్లు.

చం. ... ఇందు రోచిరా,కుల శశికాంత వేది పృథు కుంజగళజ్జల నిర్ఝరంబులన్. ఆది. 8.72.

**కుంజరము** సం. వి. అ. పుం.

ప్రశస్తమైన హనువులును దంతములును గల ఏనుఁగు, ఏనుఁగు.

వ. ... ధ,నంజయ సాయక విదళిత, కుంజర కుంభ వికీర్ణ మౌక్తిక విసరంబుల వలనను. విరా. 5.60.

విశే. అ. పుం.

శ్రేష్ఠము (ఈ యర్థమున సమాస పూర్వపదముగా నుండదు.)

ఉ. ... పాండునృపాలు పాలు గైకొంటయ చాలునన్న నృపకుంజరు పల్కులకడ్డమాడ రా,కుంట యెఱుంగవే. ఉద్యో. 3.59., విరా. 3.198.

**కుంజరుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక సర్పశ్రేష్ఠుఁడు – కద్రువ కొడుకు.

బలరాముఁడు శరీరము విడుచునప్పుడు వాసుక్యాదులతో వచ్చి యాతని సేవించెను. మౌస. 76;ఆది. 2.4.

2. సౌవీర కుమారులు పన్నిద్దఱిలో నితఁడొకఁడు.

సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొని పోవుట తెలిసికొని పాండవులు సైంధవుని వెన్నంటిరి. సైంధవుడు వారితో యుద్ధమునకుఁ దలపడెను. సైంధవునకు సహాయ్యముగా వచ్చిన సౌవీరకుమారుల పన్నిద్దఱను అర్జునుఁడు వధించెను. అర. 6.232.

**కుంటి** దే. విశే.

కుంటు, కుంటిది, కుంటివాఁడు, పాదవికలుఁడు, పాదరహితుఁడు.

చం. అలుఁగుల మంది .... మృగావలియున్ విహగంబులున్ భయా,కులగతి బొంది మూఁగలును గుంటులు చీకులునైన యట్లులై, యులియకయున్నచో నడఁగియుండ గిరాత, బలంబుతోడఁ బింగల నయనుండుమేశ్వరుఁడు గప్పుచి డాయఁగ వచ్చెఁ జెచ్చెరన్. అర. 1.301.

**కుంటువడు** దే. అ. క్రి. (√ కుంటు)

నడుపలేనిది యగు. కుంటియగు.

కం. అరయఁగ నాలుగు విధములఁ, బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగిన గోవున్, దొరయుచు నందొకఁడెదలెన, నరవర సద్ధర్మ వర్తనము గుంటువడున్. అను. 4.285.(గోపక్షమున)

2. చెడు, భంగమగు.

(పైని యుదాహరణము ధర్మపక్షమున.)

**కుంఠితము** సం. విణ. (అ. ఆ. అ.).

1. మొక్కవోయినది, వ్యర్థమైనది.

తే. .. అమ్మారుత పుత్త్రుఁడేయు, సాయకంబులఁ గొన్నింటిఁ ద్రుంచ్చదగ్ధ్రు, కుంఠితములఁ గావించి కొన్ని యుఁదిమ్మనందు డిందంగ ఘైఱసె నయ్యాసురవరుఁడు. ద్రోణ. 5.215; ఆది. 2.81. శాంతి. 3.150.

2. అడ్డుపఁబడినది.

కం. కీచకుఁడు ద్రేటువడి... యసుర కతన కుంఠితుఁ డగుచున్. విరా. 2.130.

**కుంఠితపక్ష** సం. శత్ర.

మొక్కవోయినదగుచున్న, భంగమైన దగుచున్న.

మ. ధరణీచక్రము దిద్దిరం దిరిగె మార్తాండుండు కుంఠీభవత్కిరణుం డయ్యెఁ. ద్రోణ. 5.377.

**కుండ** దే. వి. (సం. కుండమ్. త. కుండం. క. కుండ.)

1. ఇరుసు తగిలించెడు బండికంటి నడిమి గుబ్బ.

వ. ... మున్ను కొండొక క్రుంగిన చక్రంబు కుండ మునుంగం దిగఁబడిన. కర్ణ. 3.250.

2. మట్టి మున్నగు వానితోఁ జేసిన పాత్ర.

ఆ. నేఁతికుండ ఘోఁచి యే వెరవున సోఁబనాలు ద్రాఁకు నైపుణంబు గలుగు పురుషునట్లు... శాంతి. 5.581

కం. తేనియకుండఁ గొనుచు సోపాన ములేమఱుట లేక ద్రాఁకిన క్రియ. శాంతి. 6.121.

తే. గొల్లియ ఘోఁచి గంచుకుండతో. అను. 2.370.

ఆ. కుండతోడి పాలు గూర్చినఁ గిని యక ఘూరకుండె. అశ్వ. 4.276.

**కుండ జఠరుఁడు** సం. వి. అ. పుం.

ఒక ముని; ఇతఁడు జనమేజయు చేయు సర్పయాగమందు, ఒక సదస్యుఁడుగా నుండెను. (కుండవలె గుండ్రమగానుండు కడుపు గలవాఁ డగుటచే ఈ పేరు వచ్చెనేమో) ఆది. 2.219.

**కుండధారుఁడు** సం. వి. అ. పుం.

1. కురుకుమారుఁడు – గాంధారీ ధృతరాష్ట్రుల 49వ కొడుకు. ఇతఁడు భీష్ముని అష్టమ దివస యుద్ధమున భీమునిచేఁ దన యార్గురు సోదరులతో సంహరింపఁబడెను. ఆది. 5.107; భీష్మ. 3.73.

2. దేవానుచరుఁడు.

ఈతఁడు నిజభక్తుని ధనకాంక్షనుండి తొలఁగించి తపస్సంపన్నుని జేసెను. శాంతి. 5.346 మొ. 361 వ.

**కుండభేది** సం. వి. పుం.

కురుకుమారుఁడు – గాంధారీ ధృతరాష్ట్రుల 91వ కొడుకు; ఈతఁడు భీమునితో యుద్ధము చేసి మరణించెను. ఆది. 5.107; ద్రోణ. 4.142.

**కుండము** సం. వి. అ. న.

1. మట్టి మున్నగు వానితోఁ జేసిన పాత్రము.

సీ. అండముల్ వేయును నంద
యుగము వరుసన యా కద్రువకు
వినతకుఁ బుట్టె నవి కుండములనిడి
యఁటసియుండిరి. అను. 1.167;
అను. 5.450.

2. నిప్పుల గుండము; హోమ
కుండము.

కం. భూరి భుజగ ప్రభులొం,దొరుఁ
బిలుచుచు నధికభయా,తురులై కుండా
గ్నులందుఁ దొరగిరి పెలుచన్. ఆది.
2.210.

**కుండలము** సం. వి. అ. పుం. న.
కర్ణభూషణము, చెవి నగ.
కం. బలరిపుఁడిచ్చిన కుండల,ములు
నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం,
దలఁప నవి వచ్చె. విరా. 4.164.
వ. అయ్యుదంకుండు ... పౌష్యం
డను రాజుదేవి కుండలంబులం బ్రతి
గ్రహించి తేరంబూని. ఆది. 193.

**కుండలి** సం. వి. ఈ. స్త్రీ.
కుండలాకార నృత్యము.
తే. (బృహన్నల విరటునితో) బందు
పనులకు సెలవులేకునికిఁ జేసి,యభ్య
సించితి శైశవమాదిగాఁగఁ, దండ
లాసక విధమును గుండలియును,
ప్రేక్కణంబు తెరంగును బేరణంబు.
విరా. 1.240.

**కుండలుఁడు** సం. వి. అ. పుం.
కౌరవ్య సర్పకులమునఁ బుట్టినవాఁడు,
జనమేజయుని సర్పయాగమున కుం
డాగ్నింబడి మరణించెను. ఆది.
2.2.2.

**కుండశాయి** సం. వి. న్. పుం.
కురుకుమారుఁడు. గాంధారీ ధృత
రాష్ట్రుల 68వ కొడుకు. ఆది. 5.107.

**కుండాగ్ని** సం. వి. ఇ. పుం.
నిప్పుల గుండమునందలి అగ్ని –
హోమాగ్ని.
కం. ... భూరి భుజగప్రభు లొం,
దొరుఁబిలుచుచు నధిక భయా,తురులై
కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచన్
ఆది. 2.211.

**కుండాశి** సం. వి. న్. పుం.
కురుకుమారుఁడు. గాంధారీ ధృత
రాష్ట్రుల కొడుకు. ఆది. 5.107.

**కుండి** సం. వి. ఈ. స్త్రీ.
కమండలువు. కుండిక
మ. (రావణుఁడు) కమనీయంబగు
జన్నిదంబు శిఖయుం గౌపీనమున్
ధాతువ,స్త్రము దండంబును గుండి
యుం గుశపవిత్రంబుం గడున్ వృద్ధ
భా,వము సంధిల్లఁ ద్రిదండివేష
ధరుఁడై వచ్చెం ... సీతయున్నెడల.
అర. 6.336.

**కుండుఁడు** సం. వి. అ. పుం.
కురుకుమారుఁడు – గాంధారీ ధృత
రాష్ట్రుల 81వ కొడుకు (కుండి – అని
మూలము).

**కుండోదరుఁడు** సం. వి. అ. పుం.
సర్పజాతివాఁడు – కద్రువకొడుకు.
ఆది. 2.4.

**కుంతము** సం. వి. అ. పుం.
ప్రాసము, ఈఁటె, బల్లెము.
మ... కుంత భుశుండి తోమర గదా
ఖడ్గాది శస్త్రాస్త్ర తీవ్ర విహారంబు.
విరా. 3.181.

**కుంతలము** సం. వి. అ. పుం.

1. ఒక దేశము. వింధ్య పర్వతము నకు దక్షిణముననుండు నొకానొక దేశము అని కొందఱు, మధ్యదేశము నందలి యొకానొక దేశమని కొందఱు భీష్మ. 1.40.

2. (బ)
కేశము, వెండ్రుక.
సీ. ... అళినీల కుటిల కుంతలముల కాంతియు. ఆది. 3.27.

**కుంతి** సం. వి. ఈ. స్త్రీ.

1. పృథ అని పుట్టుకతో వచ్చిన పేరు పాండురాజు భార్య; సిద్ధి యను దేవత యొక్క యంశమునఁ బుట్టినది; శూరుని కూఁతురు; కుంతిభోజుని పెంపుడు కూఁతురై కుంతి యను పేరు వహించెను.
కం. ప్రియమొనరఁగ సిద్ధియు,బుద్ధి యు నను దేవతలు వసుమతిని గుంతి యు మాద్రియునై పుట్టిరి పాండుఁ, ప్రియపత్నులు నిఖిల జగదభీష్ట చరి త్రల్. ఆది. 3.83.
(చూ. చివరిసంపుటము. అనుబంధము)
2. ఒకానొక దేశము. సభా. 1.112. (113 సం. ము)

**కుంతిభోజుఁడు** సం. వి. అ. పుం.
పాండురాజు భార్యయైన కుంతి పెంపుడు తండ్రి. కుంతి కన్నతండ్రి యైన శూరునకు మేనత్తకొడుకు.
సీ. యాదవకుల విభుఁడగు శూరుఁడ నువాని, యాత్మతనూజలఁ బెద్ద,దాని నంబుజముఖి ధవళాక్షి వసుదేవు, చెలి యలిఁ బృథయను చెలువఁ [ప్రీతిఁ,దన మేనయత్తనందనుఁ డపుత్త్రకుఁడైన యా కుంతిభోజున కర్థితోడఁ,గూఁతుగా నిచ్చిన. ఆది. 5.17.
(ఇతనిని అతిరథుఁడుగా భీష్ముఁడు చెప్పెను.)
ఆ. కుంతిభోజుఁ డాజికోవిదుఁ డతి రథుం డతని యొద్ది జోదులధికబలులు ఉద్యో. 4.266.
సంస్కృత భారతమును బట్టి ఈతఁడు తండ్రిగాక సోదరుఁడుగాఁ గనిపించు చున్నది. "మాతులో భీమసేనస్య' అనుటచేత, 'భాగినేయ కృతే వీరః స కరిష్యతి సంగరే'. అనుటచేత. కాని కుంతిభోజుఁడు అపుత్రకుఁడు గదా. ఇంకెవరినైన పుత్రునిగాఁ గూడ స్వీకరించెనా? భోజశబ్దము కుంతిదేశ పరిపాలకులకు పౌరుషనామము, విదేహాధిపతులకు జనకుఁడువలె. విచార్యము. భీష్మమతమున ఇతఁడు రథపుంగవుఁడు గాని అతిరథుఁడు గాఁడు.
శ్లో రిపుజిత్కుంతి భోజశ్చ మహే ష్వాసో మహాబలః మాతులో భీమసే నస్య స చ మేఽతిరథో మతః॥ ఏష వీరో మహేష్వాసః కృతీచ నిపుణశ్చ తు,చిత్రయోధీ చ శక్తశ్చ మతో మే రథపుంగవః స యోత్స్యతి హి విక్ర మ్య మఘవానివ దానవైః, యోధా యే చాస్య విఖ్యాతాః సర్వే యుద్ధ విశా రదాః భాగినేయ కృతే వీరః స కరిష్యతి సంగరే. సుమహత్కర్మ పాండూనాం స్థితః ప్రియహితే రతః॥ సం. భార. ఉద్యో. 171. 2,3,4,5.

**కుంతీసుత మధ్యముఁడు** సం. వి. అ. పుం.

కుంతీ కుమారులలో నడిమివాఁడు. అర్జునుఁడు. వాస్తవమునకు కుంతి కొడుకులలోఅర్జునుఁడుమూఁడవవాఁడు భీముఁడు నడిమివాఁడు. అయినను మాద్రికుమారులైన నకుల సహదేవులును కుంతిచేతిలోఁ బెరిగి పెద్దవారైన కారణము చేతను అయిదుగురు ఏకోదరులుగాఁ బ్రవర్తించుట చేతను వ్యవహరింపఁబడుట చేతను కుంతీకుమారులైదుగురయి అందు అర్జునుఁడు నడిమివాఁడయ్యెను.

శీ. .. వీఁడె వచ్చెం గుంతీసుత మధ్యముండు సమర స్థేమాభిరామాకృతిన్. విరా. 4.95.

**కుందము** సం. వి. అ. న.

మొల్లపూవు.

వసంత:- హారాహిరాజ వరహంస తుషార కుంద,స్ఫారద్యశః ప్రసర పాండురిత త్రిలోకా. అర. 3.399.

**కుందించు** దే స. క్రి. (√ కుందు)

కుందఁజేయు. తక్కువపఱచు, న్యూనపఱచు.

శా. పాపాత్ముండు మదాంధుఁడాతులువ నీ పంపెట్లునుం జేయఁగా, నోపం డడ్డము సెప్పరెవ్వరును మానోద్రేకమున్ గర్వముం, గోపంబుం దనుఁద్రిప్ప నా ప్రజనులం గుందించుటం బోయిన,ట్లే పోనిత్తురు. ఉద్యో. 3.45.

2. తపింపఁజేయు.

శా. క్రోధంబప్రతికారమై హృదయముం గుంధింపఁ. విరా. 2.275.

3. నశింపఁజేయు.

తే. క్షుధహరించుఁ బ్రజ్ఞా పరిశోభనతలఁ,దృష్ణ గుందించుఁ గృప ... అశ్వ. 4.244.

**కుందు** దే. అ. క్రి.

1. చింతించు, శోకించు, ఏడుచు, పరితపించు.

ఆ. బ్రహ్మచర్యమునఁ దపంబున నుత్తమదానములనుబడయఁ దలచునట్టి గతులకంటె సౌఖ్యకారికి యగు గతిఁ బొందె నీ సుతుండు గుందనేల ద్రోణ. 2.324. (చూ.321.)

సీ... భూత. తే. ములును నింద్రియములు నొక్క ప్రోవు గట్టి,యున్న వీనికి వగఁబొందు టూరివారికొలయు నెదరుల కెల్లఁ దానుమ్మలికము,గట్టి కొని కుందుచట్టుటగాదె వత్స. శాంతి 6.320.

2. బాధపడు, నొగులు

కం. బలవంతుఁడు పైనెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ముచ్చిల వేఁచువాఁడు గామాకుల చిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. ఉద్యో. 2.21.

3. తపించు, ఉడుకు.

తే. అట్లు దమలోనఁ దగుమాటలాడియాడి,కోపరస వేగమునఁ గుందికుంది వగలఁ బొంది హెంచి పురంధర నందనుండు,నచ్యుతుండు నారాత్రి యెట్లెరి చెపుమ. ద్రోణ. 2.319.

4. తగ్గు, క్షీణించు.

సీ. పెనుమంచు మీఁదఁ బర్విన వితా

సము దప్పి వెలవు గుందిన సరోజిని
విధమున. విరా. 1.294.
తే. ... అలుక బొంకు క్రూరత శుచి
తాపగమము, గురువిరోధ మాయువుఁ
గడుఁ గుందఁజేయు. అను. 5.130.
5. క్రుంగు.
చం. సురవిశిఖ ప్రయోగములు సూపఁ
బొదంగిన నేల దిర్దిరం,దిరిగెఁ బయో
నిధుల్ గలఁగె దిగ్గజముల్ మదమేది
కుందె. అర. 4.84.
6. నశించు.
ఉ. పాండవ పక్షపాతమునఁ
బల్కెడు నోటికి వచ్చినట్లు ని,న్నొం
దన రామిఁజేసి యిది యొప్పునె
కౌరవసేనకెల్ల నా,క్కండవ మేటి
పేలము గర్వముఁ గుందఁగ నిట్లు
శత్రుదో,శ్చండిమకోహటించితి నిజం
బరకున్ నడఁచింత యెక్కడే.
విరా. 4.98.
2. అలయు, శ్రమజెందు, సొటసొట
లాడు.
తే. ఆకలిపెసలంబె గుందినట్టి,యతిథి
వచ్చినఁ బ్రియమున నతని దప్పి,
పోవునట్లుగ సముచిత భోజనంబు,
పెట్టుటెల్ల పుణ్యములకుఁ బెద్ద దలఁప.
అను. 5.34.
వి.
1. దుఃఖము, పరితాపము.
వ. .. ఆ సౌమదత్తి నుపలక్షించి
శోకించి యతని కుందు మాన్పం
దలంచి. ద్రోణ.4,27., అశ్వ.4.236.
చం. విపుల విషాద తాపమున వేదన
నొందు మదీయ బుద్ధి కుం,దపగత
మయ్యె నీదు వచనామృత సేచనఁజేసి.
శల్య. 2.173.
చం. (విరాటుఁడు)...సాం,త్వనములు
పల్కి రోష భరితస్థితిఁ గంపిత
మూర్తియైన యా,తని మది కుందు
వాపిన నతండును బోయె నివాస
భూమికిన్. విరా. 2.144.
3. న్యూనత, తక్కువ, క్షీణత.
ఉ. వచ్చినవాఁడు ఫల్గుణుఁడ వశ్యము
గెల్తుమనంగ రాదు రా,లచ్చికినై
పెనంగిన బలంబులు రెండును గెల్వ
నేర్చునే, హెచ్చగుఁ గుందగుం ...
విరా. 4.234.(కుందు = అపజయము
అని భావము.)

**కుందెలు** దే. వి.
కుందేలు :- చెవులపిల్లి, శశము,
పొడవైన చెవులును, పొట్టితోకయు,
వాడియైన కోరలును, చీలియున్న
పైపెదవియు గలిగి నేలబొరియలలో
నివసించుచు మందతో కలిసి తిరు
గుచు వేటాడునట్టి యొకానొక అడవి
లేక కొండ జంతువు.
ఉ. ... వంటయిల్, కుందెలు సొచ్చె.
ఆది. 6.186.

**కుంభకర్ణుఁడు** సం. వి. అ. పుం.
రావణుని తమ్ముఁడు - లక్ష్మణునిచేఁ
జచ్చెను.
వ. కిన్నరేశ్వరుండు విశ్రవసుపాలి
కరుదెంచి "మహాత్మా యేను
నీకుఁ బుత్రుండనయ్యెద, నాకుఁ
గరుణింపు"మని యతనిం బ్రసన్ను
నిం జేసి నృత్త గీత విద్యా విశారదల
యిన రాక్షస స్త్రీలం బుష్పోత్కటయు

మాలినియు పాకయు ననువారి ముద్వు
ర నవ్విప్రవరునకుఁ బలిచారికలుగా
నిచ్చిన.
కం. పురుడున నయ్యువతులు నొం,
డొరులం గడవంగ విలసదుపచార
సమా,చరణ ప్రవీణ భంగులఁ బరి
తోషితుఁ జేసిరా తపస్వివరేణ్యున్.
వ. ఇట్లు ప్రీతుండై యతండు వార
లకుఁ బుత్రదానంబు సేసిన నందుఁ
బుష్పోత్కటకు రావణ కుంభకర్ణు
లును, మాలినికి విభీషణుండును,
పాకకు ఖరుండును, శూర్పణఖయను
కన్యకయు మిథునంబై ప్రభవించి,. .
ఆర. 6.271, 272,273.
ఇతనిని లక్ష్మణుఁడు సంహరించెను.
ఆర. 7.103,104.

**కుంభకారుఁడు** సం. వి. అ, పుం.
కుండలు చేయువాఁడు. కుమ్మరి.
వ.... పాండవులును గతిపయ దినం
బులకు ద్రుపదు పురంబు సొచ్చి ...
యొక్క కుంభకార గృహంబున
విడిసి. ఆది, 7.164.

**కుంభజన్ముఁడు** సం. వి. న్. పుం.
ద్రోణుఁడు. ద్రోణ. 1.290. (చూ.
ద్రోణుఁడు.)

**కుంభజుఁడు** సం. వి. అ. పుం.
ద్రోణుఁడు.
చం. కురుపతి భీష్మ కర్ణ కృప కుం
భజ ముఖ్యులు మత్స్యముద్యమ స్ఫుర
ణము చూచి పార్థుఁడనుబుద్ధిఁ గలంగ.
విరా. 4.11.

**కుంభభవుఁడు** సం. వి. అ. పుం.
ద్రోణుఁడు.
సీ. ... కుంభభవుఁడు ధృష్టద్యుమ్ను
ని పాలు. ఉ. 2.229.

**కుంభము** సం. వి. అ. పుం.
ద్రోణుఁడు.
సీ.... కుంభభవుఁడు ధృష్టద్యుమ్నుని
పాలు. ఉ. 2.229.

**కుంభము** సం. వి. అ. పుం.
1. ఘటము, కుండ.
వ. ... కుంభ నిక్షిప్త భుజంగంబు
చందంబుననుండె. కర్ణ. 1.139.
వ...రారాజు దగు రాజులు. దానును
శాతకుంభ కుంభంబులం బవిత్ర
జలంబులు దెప్పించి. కర్ణ. 1.56.
2. ఏనుఁగు కుంభస్థలము.
వ. .. ధనంజయ సాయక దళిత
కుంజర కుంభ విశీర్ణ మౌక్తిక విస
రంబుల వలనను. విరా. 5.60.

**కుంభసంభవుఁడు** సం. వి. అ. పుం.
1. ద్రోణుఁడు.
వ. అనిన విని దరహసిత వదనుం
డగుచుఁ గుంభసంభవుఁ డిట్లనియె.
విరా. 3.96.
2. అగస్త్యుఁడు.
సీ. కుంభసంభవునకై ఘోర దుర్గ
ముల లోపాముద్ర యలజడి పాలు
గాదె. విరా. 2.234.
గీ. కుంభసంభవుచేత నంభోధి యడఁ
గదె. అను. 5.340. (చూ.
అగస్త్యుఁడు.)

**కుంభస్థలము** సం. వి. అ. న.
ఏనుఁగు శిరస్సు – కుంభము.
వ. .. క్రోధారుణ నయన పల్లవి
తంబును దంతకాంతి స్తబకితంబును

కుంభస్థల ఫలితంబును నగు ఒడియ
కరటి ఘటా వికట విటపి పటలంబు.
విరా. 5.102.

**కుంభి** సం. వి. న్. పుం.
కుంభము గలది - ఏనుఁగు.
మ. బలమత్తాకృతి యైన భీముఁడను
కుంభత్కుంభి సంరంభమున్
దెలిపెన్. ఉద్యో. 1.379.

**కుంభిని** సం. వి. ఈ. స్త్రీ.
భూమి, నేల.
మ. ... ఆ భీముఁడు నన్ను నిం
పొడి చేసెన్ గదాప్రహారంబు వెట్టిదమై
తాఁకిన గూలు పర్వతము మాడ్కిం
గుంభినిం గూలఁద్రేసెద. ఉద్యో.
2.218.

**కుంభీనసి** సం. వి. ఈ. స్త్రీ.
అంగారపర్ణుఁడు అను గంధర్వుని
భార్య.
ఆ. ... అంగారపర్ణుండు, బమ్మరిల్లి
నేలఁబడిన వానిఁ గొప్పవట్టి యీడ్చి
కొని వచ్చె ధర్మజు,కడకు నింద్ర
సుతుఁడు కడిమి మెఱసి. కం. వాని
మనోవల్లభ కుం,భీనసి యనునది.
ఆది. 7.45,46.
ఈమె పతిదానము ఇమ్మని ధర్మ
జార్జునులఁ బ్రార్థించెను. ధర్మజుని
యాజ్ఞపై నర్జునుఁడు అంగారపర్ణుని
విడిచిపుచ్చెను. ఆది. 7.45, 46,
47, 48.

**కుంభీరము** సం. వి. అ. పుం.
నక్రము, మొసలి.
(ద్రౌపది సైంధవునితో నన్నమాటలు)
ఉ. ఘోర గదావిదారణ విఘూర్ణిత
శాత్రవ కుంభి కుంభ కుం,భీర చిరోరు
మౌక్తిక గభీరితరారుణ సాగరాంబు
కే,ళీ రస లోలుఁడై సమద లీల
బకాంతకుఁడేగుదేరఁ గ,న్నారఁగఁ
జూచి కాక యిటులంతకు నీమది
త్రుళ్ళదంగునే. ఆర. 6.187.

**కుంభుడు** సం. వి. అ. పుం.
ప్రహ్లాదునకు విరోచన కుంభ నికుంభు
లనంగా ముగ్వురు పుట్టిరి. ఆది.3.63.

**కుకురము** సం. వి. అ. పుం.
యాదవులలో నొక జాతి.
చం. ... యదు వృష్ణి భోజ కుకురాం
ధక వాహినియుం గలంగె. సభా.
2.33.

**కుకురు** సం. వి. ఉ. పుం.
ఒకానొక దేశము. భీష్మ. 1.40.

**కుక్క** వై వి. (సం. కుక్కురః- ప్రాకు
క్కుర, త. కుక్కన్, కుక్కర్)
వేఁపి, శునకము.
మాంసాహారియై విశ్వాసముతో కావలి
గాచునట్టియు వేటాడునట్టియు ఒక
పెంపుడు జంతువు.
చం...కృతఘ్నుని పీనుఁగునై నరోత్త
పుట్టక కిబళింపఁ కుక్కలు నొడం
బడునే కురువంశ వర్ధనా. ఉద్యో.
2.77, శాంతి. 3.508.

**కుక్కతిత్తి** వి.
కుక్కతోలుతోఁ జేయఁబడిన సంచి.
ఆ. పునుకఁగుక్కతిత్తిఁ బోసినపాలు
నీళ్ళధిక నిందఁ బొరయునట్లు. శాంతి.
1.331.

**కుక్కుటము** సం. వి. అ. పుం.
కోడి.

వ. (కుమారస్వామి) తన సహజంబైన శక్తి యొక్క కేలం గ్రీడార్థ కలితంబైన కుక్కుటంబొక్క కేలను. ఆర. 5.207.

**కుక్షి** సం. వి. ఇ. పుం.

1. జఠరము, కడుపు.

వ. ... శిరః కర వక్షః కుక్షి కటి చరణంబులును దునియలుం బఱియలుం దుమురున్నం బొమ్మనై రాలిన. ద్రోణ. 1.341.

2. మధ్యప్రదేశము.

వ. (నకులుఁడు) పశ్చిమాంబుధి కుక్షి నివాసులఁ,బరమ దారుణుల బర్బర ఁరాత,ఁపుల నోడించి. సభా. 1.267.

**కుచము** సం. వి. అ. పుం.

స్తనము, చన్ను.

తే. అంఘ్రితలములుఁ గుచములు నాననంబు, గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి. విరా. 2.52.

**కుచరితము** సం. వి. అ. న.

చెడు వర్తనము.

మహాస్రగ్ధర - కుపిత క్రవ్యాదుల లోనాఁ గుచరిత నిరతిం గ్రూరతా ధుర్యులైనన్. సౌప్తి. 2.9.

**కుచ్ఛితము** వై. విశే. (సం. కుత్సితః, ప్రా. కుచ్ఛితో, త. కుచ్ఛితమ్, క. కుచ్ఛిత.)

నీచము, అల్పము, తుచ్ఛము.

ఆ. వలయు పడవియందు నిలిచి నా రాజ్యమం,తయును జక్కఁబెట్టి నయము విక్ర,మంబు నడపునంత మానిసివై యుండి, కుచ్ఛితంపు బ్రదుకు కోరఁదగునె. విరా. 1.282.

కం. జలము నినుఁ దలఁపఁగా నిటు, గలుగునె చండాలు నొడలఁ గాఱెడు నీరే,నలఘుగుణా త్రావుదునే యే, కొలఁది శ్రమంబైన వరము గుచ్ఛిత మయ్యెన్. అశ్వ. 3.58.

**కుచ్ఛితుఁడు** వై. విశే.

నీచుఁడు. అల్పుఁడు. తుచ్ఛుఁడు.

సీ. (కుంతీసుభద్రలు కృష్ణునితో) గురుసుతు నదలించి కుచ్ఛిత నిన్ను మో,ఘాస్త్రునిఁ జేసెద,నంటి దాన, నూఱడియుండుదు. అశ్వ. 3.174.

**కుజనుఁడు** సం. వి. అ. పుం.

కుత్సితపురుషుఁడు - దుర్మార్గుఁడు.

క. మేలనుభవించుఁ జుట్టము,లాలోకింపంగఁ గుజనుఁడదియు నృశంసాశీలమ పంచి కుడుచునతఁ,డేలోకంబునను బేర్మి యెసఁగ సుఖించున్. శాంతి. 3.427; శాంతి. 5.488; ద్రోణ. 1.237.

**కుజము** సం. వి. అ. పుం.

చెట్టు (భూమినుండి పుట్టినది)

కం. మొనసి యపకారిఁ గడనిడి,కొని యుండెడు కుమతి దీర్ఘ కుజ శాఖాగ్రం,బుననుండి నిద్రవోయెడు, మనుజునకు సమానుఁడగుఁ బ్రమత్తత్వమునన్. ఆది. 6.117.

**కుజీవనము** సం. వి. అ. న.

నీచవృత్తి, కష్టపు బ్రతుకు.

మ. మహనీయంబగు నీ శరీరము జగన్మాన్యంబు నీచక్రియా, విహితంబైన కుజీవనంబు విధి గావించెఁగదా. విరా. 2.196.

**కుటజము** సం. వి. అ. పుం.
కొండమల్లె-ఇది వర్షర్తువునఁ బూచును
కం. ... రాజహంస కులములం,దిల కించె సప్తపర్ణా,వలి విగళిత కుసుమ కుటజ వాటికల గెడన్. ఆర. 4.145.

**కుటిలత** సం. వి. అ. పుం.
కుటిలత్వము, కౌటిల్యము.
కం. ఇట్టివి కృత్రిమములు గల,వట్టిదె యానక్క బేలవైతివి భృత్యుల్,పుట్టిన కోలెను గుటిలత, లెట్టెట్టివి సేయరకట యెఱుక గలిగెనే. శాంతి. 3.69.

**కుటిలము** సం. విణ. (అ. ఆ. అ.).
1. ఋజువు గానిది, కపటము గలది.
ఆ. కుటిలబుద్ధి లిచటఁ గొనవు నెట్టన ఘన,దోర్బలంబు మెఱసి తొడఁగ వలయు. విరా. 4.187.
సీ. .. వంటకము సేసిన యింతి దా మున్ను గుడుచుట పనియెడఁ గుటిల యగుట. యెట్టి దుర్గతిదెచ్చు నట్టిద కల్గు. అను. 3.245.
కం. విను కొడుకుగొన్న వేదుఱు,కొని కొట్టిన తిండికాఁడు కుటిలుండతఁడా, జనపతి చందము ధర్మజు,ననుపమ శీలంబు నెఱుఁగుదది యట్లుండెన్. ఉద్యో. 1.56.

**కుటుంబము** సం. వి. అ. పుం. న.
తల్లి, తండ్రి, తాను,తనభార్య, ఇద్దఱు కొడుకులు, ఇద్దఱు కోడండ్రు, ఒక కూఁతురు, ఒక యతిథి, యీ పదుగు రుండునది కుటుంబము.
శ్లో. మాతా పితా స్నుషే పుత్రౌ పుత్రీ పత్న్యతిథి స్వయం దశసంఖ్యా కుటుం బేతి విష్ణునోక్తం ద్విజోత్తమ. శ్రీమ ద్రామాయణము. బాల. 6సర్గ. 88 శ్లోకము.

**కుటుంబిని** సం. వి. ఈ. స్త్రీ.
ఇల్లాలు, మగఁడును బిడ్డలు గల స్త్రీ.
వ. ... అతండు కపిలాభిధాన యగు గుడుకుటుంబిని చన్ను గుడిచి పెరిఁ గినవాఁడగుటం గాపిలేయుండు నసం బరఁగు. శాంతి. 4.342.

**కుట్టిమము** సం. వి. అ. పుం.
శిలాఃత్న్యాది నిబద్ధ భూమి - ఱాతి కట్టడపు నేల.
తే. చందనార్ద్ర కుట్టిమములఁ జరణ తలము, లొందుటకు నేవగించు నయ్యువిదలిపుడు, నెత్తురుల తేవ మెక్కిన నేలఁ బొరలుచున్నవారేమి సెప్పదు నుడుకుపేర్మి. స్త్రీ. 2.50; విరా. 2.327.

**కుట్టు** దే. స. క్రి.
1. పొడుచు, దిగఁబొడుచు.
వ. దీనిం జిత్తగింపుము బలంబుగల బలీవర్దంబులతో బలహీనంబులయిన వానిం బూనిన నవి దుర్వహ భార వహన మహా లాంగలాకర్షణంబుల యందసమర్థంబులైన నడిచియుం బొడిచియు ములుకోలలం గుట్టియుఁ దట్టియు దుర్బల బలీవర్దంబుల జనులు బాధింపంజూచి యేను దానికి దుఃఖిం చెదననిన సురభిక సురపతి యిట్ల నియె. ఆర. 1.84.
2. (చీమ, తేలు, తుమ్మెద. మొ.) కుట్టు.
గీ. మధువుగొన నుత్సహించిన

మనుజుఁబట్టి కుట్టి నిర్జించు మధుకరి కులమునట్లు. అ. 1.251.

వ. ఒక్కనాఁడబ్బాలకు కుఱుమ చీమ గుట్టిన. ఆర. 3.210.

3. (కవచాదులలో) కూర్పు, కప్పు.

వ. ఒండుగడకుం గడంగు తలం పులు దక్క తలలు గుట్టుకొనియుండి యోధులు భగ్నాపరభాగులై పదం ఛొచ్చిరి. ద్రోణ. 5.225.

4. (ముక్కు., ము.) కుట్టు.

తే. ... గోవు,ముక్కుఁ గుట్టెడు వాఁడు దన్మక్షకఘాతి, యగు నతండు నధోగతి కరుగువాఁడు. అను. 2.62.

5. (కడుపులోఁ బుట్టెడు) బాధ, నొప్పి.

కం. అడుకులు దిన్నట్లగునే, కడు పున గుట్టెత్తినపుడు గడుఁ బఱచితి నాఁ,డొడలెఱుఁగక పాండుసుతుల, నడిగి మడుఁగ వలసె నిప్పుడొక సాత్యకిచేన్. ద్రోణ. 4.89.

**కుట్టెత్తు** దే. అ. క్రి.

(కడుపులో) నొప్పి పుట్టు, బాధ కలుగు.

(చూ. కుట్టు ఉదా,)

**కుఠారము** సం. వి. అ. పుం.

1. గొడ్డలి.

చం. మనుజులు సేయనెవ్వరు సమస్త ము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు. న్వినుము కుఠార పాణి ... నొకొ కుఠారమున్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం,డనియెడి నిశ్చయంబు దృఢమై మది నిల్చిన జాలు భూవరా. శాంతి. 1.277; శాంతి. 4.179.

2. పరశువు. గండ్రగొడ్డలి.

శా. ... రాముఁడలుకన్. ... దీర్ఘ ని,ర్ఘాత క్రూర కుఠారకలాన నిఖిల క్షత్త్రోరుకాంతారుఁడై. ఆది. 1.78.

**కుఠారుఁడు** సం. వి. అ. పుం.

ధృతరాష్ట్ర సర్పజాతివాఁడు, జనమే జయుని సర్పయాగమున కుండాగ్నిం బడి మరణించెను. ఆర. 2.212.

**కుడి** దే. విశ.

ఎడమది కానిది, దక్షిణము, వలపలది.

కం. కుడిచేతఁ బిదప డాచేగడిగి. అను. 3.280.

**కుడుచు** | **కుడ్చు** దే. స. క్రి.

తిను, భుజించు.

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువకయుండు నాతఁడు సదోపవాసి శాంతి. 4.368.

కం. ఏను హవిష్యము కుడుతును. విరా. 1.205.

సీ. ... ధర్మ,తనయుని ˘ బంతి నిత్యంబుఁబసిడి పళ్ళెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతిపుణ్య లెనిమిదివేలు సమిద్ధమతులు. ఆర. 5.306.

2. (సుఖదుఃఖాదులు) అనుభవించు, పొందు, చెందు.

గీ. ... తొంటి,యప్ప యిడుములఁ గుడువబో నడువవలయు విరా. 3.90

వ.... పితృధనంబగు రాజ్యంబు... ఈ రెండు తెఱంగుల వారికిం బంచి కుడువం దగుఁబయు. ఉద్యో. 1.12.

సీ. మేదినీపతి .. క్రమముఁడగువేళ

లోకంబు బెగడుగుడుచు. శాంతి. 2.178.

గీ. కర్మఫలములు గుడిచినఁగాని పోవ, వంటి వానిఁ బ్రాయశ్చిత్తమపహరించు అను. 5.116.

3. ఉదరపోషణము చేసికొను, పోషింపఁబడు.

కం. కౌరవులచేతఁ గుడిచిన వారికి నిది సమయము. ఉద్యో. 4.66.

ఆ. ఒరులఁ గొలిచి కుడువనోపము. ఆది. 6.127.

3. త్రాగు, పానము చేయు

వ. అతండు కపిలాభిధానయగు గురు కుటుంబినిచన్నుగుడిచి పెరిఁగినవాఁడ గుటం గాపిలేయుండు నవం బరఁగు శాంతి. 4.342.

వ.... (శృంగి) మొదవుల చన్నులు వత్సంబులు కుడుచునప్పు డుద్గతం బగు పయఃఫేనంబ తనకాహారంబుగా మౌన వ్రతంబునం దపంబు సేయుచున్న మహావృద్ధు మదీయ జనకు నవమానించిన పరీక్షితుండు. ఆది. 2.170.

**కుడుపు** దే. స. క్రి. (√ కుడుచు) కుడువఁజేయు, కుడిపించు, అనుభవింపఁజేయు.

కం. అతుల పుణ్యవతిఁ గృష్ణను మీ, వారెల్లఁ జూడఁ బఱిచిన,క్రూరపుఁ బాపము ఫలంబు గుడుపక యున్నే. అను. 2.87.

(కుడుపక = అనుభవింపఁ జేయక)

1. భోజనము, భోజనపదార్థము

గీ. కుల్యయందుఁ ద్రిరాత్రంబు కుడుపుదక్కి,శాచియై యఘమర్షణ జపము జేసి,యశ్వమేధ ఫలముఁ బొందు ననఘ నరుఁడు. అను. 2.87.

తే. వింతకూరలు కుడుపున వేడ్కసేయు,భంగి సంగ్రామమున నూత్న భంగులెడఁదఁ గౌతుకము సేయు శల్య. 2.93.

కం. పురరక్షణము దృఢంబుగ,నర వర చేయంగవలయు నమ్మగలుగు సత్పురుషుల నిడఁదగుఁ గుడుపు ని,దుర మొదలగు లోనిపనుల తొడరువులరయన్. ఆశ్ర. 1.57.

2. అనుభవించుట, భుక్తి.

తే. కొంచెమైనను దగఁ బంచికుడుపు మేలు. ఉద్యో. 2.47.

**కుడుము** దే. వి.

భక్ష్య విశేషము, మోదకము.

కం. ఎదిరిం దమయట్టులకా,మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుం గుడుమిం,డిదె మీరు వ్రక్కఁ గొనుఁ దని,చదుకడచిన మనసుపొందు చక్కంబడునే. ఉద్యో. 1.313.

**కుడ్యము** సం. వి. అ. న.

గోడ, భిత్తి.

శా. ధ్వాంతాకారిత కుడ్య కుట్టిమ ఘన స్తంభావలీ రూపముం. విరా. 2.327.

**కుణపము** సం. వి. అ. పుం.

శవము, పీనుఁగు.

వ. .. కౌరవకాంతలఁ దత్ప్రదేశంబునకు నడపించిన నప్పుడఁతులు పతులును, సుతులును, సోదరులును, పౌత్త్రులును, మిత్త్రులును గుణపం

బులై వడియున్నఁజూచి చెయ్యేది మేదిని నొఱగువారును. స్త్రీ. 2.10.; ద్రోణ. 2.137., స్వర్గ. 17.

**కుతపము** సం. వి. అ. పుం. న.
దర్భ.
సీ. ... కుతప ద్రౌహిత్రతి,లలు నితాంత పవిత్రములు పితృక్రి-తే - యలకు. అను. 5.202.

**కుతలము** సం. వి. అ. న.
భూమి.
అ. ... పరాక్రమమున, శత్రువరుల నుగ్రసంగరంబునఁ జంపి,కుతల రాజ్యమెల్లఁ గొందుననుచు. సభా. 2.269.

**కుతిల(ము)** దే. వి.
బాధ, దుఃఖము.
చూ. కుతిలపడు. కుతిలపెట్టు.

**కుతిలపడు** దే. అ. క్రి. (కుతిల + పడు.)
బాధపడు, దుఃఖపడు.
కం. అడుగకయున్నను నాలిం,గొడుకుల రక్షింపలేక కుతిలపడుచు నె,ప్పుడుఁ బేదతనముగల నరు,నెడరుడుపఁగవలయు. అను. 2.340.

**కుతిలపెట్టు** దే. స. క్రి. (కుతిల + పెట్టు.)
పీడించు, బాధపెట్టు.
సీ. అరాజకత్వ ..ఆ. దోషజాతమైన దురిత బాహుళ్యంబు, కుతిలపెట్ట భూమి యతలమునకుఁ, బోవ. శాంతి. 2.89.

**కుతూహలము** సం. వి. అ. న.
కుతుకము, ఉత్సాహము.
వ. ఇత్తెఱంగున మత్స్యరాజ మహిషి ద్రౌపదీదేవినాలోకించికుతూహలంబున. విరా. 1.302.

**కుతూహలి** సం. విశ. (న్. నీ. న్).
కుతూహలము గలవాఁడు.
వ. ... చలియింపక చెలియలి కట్టయుం బోలె నవి నిలువరించి యవ్విక్రమ కుతూహలి విజృంభించి. ద్రోణ. 3,157.

**కుత్తుక** దే. వి.
కుతిక, గొంతు, కంఠము.
కం. ... శోకము గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. భీష్మ. 2.364.
లయగ్రాహి. కుతుకల బంటియగు నెత్తురులు దోయిళుల నెత్తి చవి గ్రోలుచును స్త్రీ. 2.8,
చం. (శివుఁడు గౌరితో) త్రిలోకభీకరంబనితర సాధ్యమై యొదవ నత్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్. తే. అట్లు కంఠంబునందు మహావిషంబుఁ దాల్ప. అను. 4.426; 427.

**కుత్స** సం. వి. ఆ. స్త్రీ.
1. నింద, దూఱు.
ఉ. నీతి దొలంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం, బ్రీతిగ సిద్ధి బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు భూజను ల్వేతురు చేటు సేఁతలు ఫలింపక తక్కిన మున్నవచ్చు న,త్యాతురతాస్పదంబులగు నాపద లిద్ధవివేక వైభవా. సౌప్తి. 1.35,
2. రోఁత, ఏవగింపు.

తే. అవ్యవర్ణుండు దీనఁ డీయనకు
నెట్లు, గూఁతు నీవచ్చునని మదిఁ గుత్స
ప్రస్థి. అను. 1.55.

**కుత్సపుట్టు** దే. అ. క్రి.
రోతపుట్టు. ఏవగింపు గలుగు.
(చూ. కుత్స. 2. అర్థము).

**కుత్సించు** సం. వి. క్రి.
రోఁతపడు అసహ్యించు.
వ, (ఉత్తరుఁడు) ఇట్లు వాఱినం దన
మనంబునం గుత్సించుచు బీభత్సుండు
యుగ్యంబుల పగ్గంబులు నొగల
ముడిచి రథంబు డిగ్గనుఱికి. విరా.
4.73.

**కుత్సితము** సం. విశ. (అ. ఆ. అ.)
1. నికృష్టము, కీడ్పడినది.
తే. కుక్క మృగములలోనెల్లఁ గుత్సి
తంబు, దీనిఁ దిని ధర్మములకేల హాని
సేయ, నొండుపాయంబు వెదకి కొమ్ము
జ్వాలాత్మ యనుడు వానికి ముని యిట్టు
లనియె నధిప. శాంతి. 3.291.
చం. (భీష్ముఁడు దుర్యోధనునితో)
అన విని నవ్వి పాండవుల యంతటి
వారికిఁగాక నీకు మా, ర్కొనఁగు
నయ్యె యిప్పరుసు కుత్సిత వర్త
నమిట్టి దుస్తరం, బునఁ దగు లావు
సేయ మముబోటులు లేరె. భీష్మ.
3.138., మహా. 39.
2. నిందితము, దూఱఁబడినది.
కం. వినుము గురుద్రోహికిఁ గ, ల్గునె
యుత్తమగతె నిలాంత కుత్సిత భంగిం
దునిమితివి నీవు గురు నే, నును దుర్వి
ధమునన యిదె నినుం దెగఁజూతున్.
సౌప్తి. 1.156.
3. అధమము, వక్రమైనది, కపట
మైనది.
కం. పరిశుద్ధిలేని కుత్సిత పురోహితులు
నీచదశలఁ బొందుదురు మహీ, వర
యల్పమె శుద్ధుండై, పురోహితత్వంబు
సేఁత భూపతినగరన్. శాంతి. 2.310
చూ. 911,912.

**కుత్సితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
అల్పుఁడు, హీనుఁడు, నీచుఁడు.
ఆ. బాహుబలము మెఱసి పరుల సం
పదలు సే, కొనఁగ లావులేని కుత్సి
తుండునియత దుఃఖవృత్తి నిర్వేదప
రుఁడగుగాక నీకుఁ దగునె కౌరవేంద్ర.
ఆర. 1.241.
ఉ. క్రూరుఁడు ధార్తరాష్ట్రుఁ డతి కుత్సి
తుఁ డెంతయుఁ బాపబుద్ధి గాం, ధారుఁడు
పెక్కుమాయలకుఁ దావలము. ఆర.
7.409.

**కుత్సుఁడు** సం. వి. అ. పుం.
ఒక ముని. ఆది. 1.147.

**కుథము** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం.
ఏనుఁగుమీఁదఁ బఱచెడు చిత్ర కంబ
ళము.
వ. ... కనక కక్ష్యా కుథసనాథం
బులయిన మదాంధ గంధసింధుర
సందోహంబులు. సభా. 2.177.

**కుదియవడఁకు** దే. అ. క్రి.
కుంచుకొని పోవునట్లు వణఁకు.
సీ. ... చల్లన నంగంబులెల్ల నిండఁ
జెమర్చఁ బదములుఁ గరములుఁ
గుదియ వడఁకు. విరా. 4.80.

**కుదియించు** దే.స.క్రి. (√ కుదియు)
1. అణచు, నొక్కు.

సీ. కుచములురమ్మునఁ గుదియించి
క్రమమున నితికిన కౌగిట ఇంపొనర్చ.
విరా. 2.310.
2. తగ్గించు.
కం. అనృత భయము నాజిజయముఁ,
గొనియెడు తమకంబు పెంపుఁ,
గుదియింపఁగఁ బాం,డునరేంద్రు నగ్ర
తనయుం,డనుమానము నాత్మఁబెట్టి
యస్త్రగురునితోన్. ద్రోణ. 5.314.
3. అడ్డగించు, ఆఁపు.
కం. నదిరయము వారణేంద్రుఁడు,
గుదియించినయట్ల పోలెఁ గురువర
దైన్యాస్పదమగు విషయోల్లాసముఁ
గుదియించును యోగసిద్ధి గురుహృ
చ్ఛాలుఁడున్. శాం. 5.582.
శ్లో. తదేవ చ మహాస్రోతో విష్టమ్భ
యతివారణః తద్వద్యోగబలం లబ్ధ్వా
వ్యూహతే విషయాన్ బహూన్. సం.
భార. శాంతి. 300.23.
కం. శరవర్షము నాఁమీదం,గురిసిన
నేనాకసమునఁ గుదియించితి నా,యర
దంబు పొంతకును న,చ్చెరువుగ నొక
బాణమైనఁ జేరకయుండన్. ఉద్యో.
4.316., ద్రోణ. 1.308.
4. నియమించు, లొంగజేయు, వశ
పఱచు.
కం. ... మనసు దూలకయుండన్
మృడ వినుము బుద్ధిఁగొని యె,క్కుడు
నిష్ఠను వలయు దానిఁ గుదియింపం
గన్. అను. 4.208.
గీ. అనఘ శబ్దాది విషయంబులందుఁ
దగిలి,యిచ్చఁ జరియించు నెప్పుడు
నింద్రియములు, బుధుఁడు దత్త్వ
భావముఁ దన బుద్ధినెఱిఁగి, యేమఱక
వాని దగఁ గుదియింప వలయు.
శ్లో॥ ఇంద్రియాణాం ప్రసంగేన దోష
మృచ్ఛస్య సంశయమ్ సంనియమ్య
తు తాన్యేవ తతస్సిద్ధి మవాప్నుయాత్.
సం. భార. అర. 215.21.
5. అణఁచు.
కం. ... కోపో,ద్దీపితులై వారల
యా,టోపముఁ గుదియించి రతిపటు
ప్రదరములన్. భీష్మ. 3 130.
6. మదమడఁచు, నిర్జించు.
కం. ఇదె యేనుగూడ వచ్చితిఁ, బది
లుఁడనై పోరుమింక బకమర్దన యీ
కదిసిన వీరులనెల్లం గుదియించెద
ననుచుఁ గవిసెఁ గురువితతి పయిన్.
భీష్మ. 2.371.
7. త్రుంచు, భగ్నము సేయు.
కం. కదిసి శరాసన [illegible]
యేను శరంబు లేయఁ బార్థుఁడు వానిం
గుదియించి [illegible] ప్రదరము
లదరింపఁ గుంభసంభవుఁడెదఁ ద్రుం
చెన్. ద్రోణ. 3.75.
8. అడఁగించు, నశింపఁజేయు.
ఉ. ... కడునల్గి విధీపణుఁ దేగు
దెంచి యప్పీరుల మాయయుం జలము
వ్రేల్మిడిలోఁ గుదియించి వీరకే,శీరసి
కుండు వారి నవలీలమెయిం దును
మాడె నందఱన్. అర. 7.71.
9. చేర్చు. లగ్నము చేయు.
కం. అది ధర్మంబులకెల్లం,దుదియగు
ధర్మంబు మనసుతో దానిఁ దగం,
గుదియించి మేధతోడఁ, గదియింపు

ము నియతిఁ బుత్ర కడుగాఢముగన్. శాంతి. 5.180.

**కుదియు** దే. అ. క్రి.

1. క్రుంగు, దిగఁబడు.

ఆ. ... కడును వ్రేఁగు,గలుగునట్టి వంటకట్టియ మోపట్టు గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. అశ్వ. 3.72.

2. అఁగిపోవు, ఉపశమిల్లు.

సీ. మది నిగిర్చిన మాట మగువ నీ పెంపునఁ గుదిసి నా నాలుకతుదికి రాదు. విరా. 2.47.

కం. మరుదప్రమేయ గుహ్యక,శర మున వారించె నతఁడు సరభసముగ ను,ద్ధుర శిఖిబాణంబేసిన, గురుఁడు వరుణ విశిఖ నిహతిఁ గుదియం జేసెన్. ఉద్యో. 4.325.

3. వ్యర్థమగు, మొక్కవోవు.

(వజ్రాయుధము) కం. అది యొకఁడుఁ జేయఁజాలక, విదళిత శైలమగు తనదు విలసనమచటం, గుదియుట తనకుం దెలిసిన,మదమతి గిరిభేది కడకు మగుడం జనియెన్. అను. 1.258.

4. మ్రింగు, నశించు, రూపఱు.

(ప్రళయమున.)

వ. ... కూర్మపృష్ఠంబునుం బోని పృథివి జలమయంబగు జలంబు లోకంబులెల్లం దన మయంబకాఁ జేర్చి తన్నుం గాలాగ్ని మడియింపం గుదియుఁ బ్రజ్వల జ్వాలాభీలంబగు నయ్యనలం బనిలంబుచేతం జెడు. శాంతి. 6.88.

5. నిస్తేజమగు.

వ ..(ద్రోణుఁడు) ఖండనంబు సేసి పాండవ బలంబుల నుఱుమాడి పేది దవి గొని కాల్చి పొనుంగువడిన కార్చిచ్చు క్రైవడిం,గుదిసి యమ్మహా త్ముండు. ద్రోణ. 5.321.

6. వశపడు, అధీనమగు.

కం. అది గుదిసిన విజ్ఞానము, గద లక నిర్వాత దీపకాంతియు బోలెం, బొదలును. అను. 4.209.

**కుదుట గూడువెట్టు**

తన పంక్తిన భోజనమువెట్టు.

ఆ. ఆలుబిడ్డలు లేనియట్టి త్రిమ్మరి యగు కొయ్యగాక కుదుటఁ గూడువెట్టి కుడుచు వారలిట్టి క్రొవ్విదంబులు సేయఁజొచ్చుటిచ్చగించి చూతు రయ్య. ఉద్యో. 2.9.

**కుదురు** దే. వి. ఔ. అనౌ.

1. పాదు, ఆలవాలము.

కం. పెనుఁగుదుట నిడిన చూతం, బును నవమాలికయుఁ బోలెఁ బొలు పొందిరతం,డును నమ్ముగ్ధయు నేకా, సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్. విరా. 5.401.

2. పట్టు, ఆస్పదము, స్థానము. ఆశ్ర యము, ఆధారము.

తే. ఓపి ధర్మార్థ కామంబులొకటి నొకటి,నాశ మొందింపకుండంగ నడపవలయుఁ,గాక ధర్మంబు సెడ నర్థగామములను, గోరు పురుషుండు నిందకుఁ గుదురుగాఁడె శల్య. 2.302.

కం. కరి తురగ రథ సమితిఁ బొం. పిరివోయెడు నాదు లక్ష్మి పెంపున కెల్లన్, సరసిరుహవదన నీవ కు,దు

రుగా నొనరించెదం గుతూహల మెసఁగన్. విరా. 2.122.

కం. విదురుండొక్కఁడ దక్కఁగ సదస్యులెవ్వరును ధర్మ సంశయమిది గూ,డదు నార యతని శీలమ,కుదురీ లోకమునకింతకుం దలపంగన్. ఉద్యో. 3.190.

చం. ధరణికి నింక నాయకుఁడు ధర్మ లనూజుఁడు నేఁదవశ్యముం,గురువతి గూలు నెవ్వగలకుం గుదురయ్యెడు నాంబికేయుఁడు,ధ్దురులగు పాండు నందనుల దుర్దమభంగి యెఱింగి ధర్మద,త్పరులకు గెలు భ్రాఁతె హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్. శల్య. 1.305.

3. తునియ, ఖండము.

సీ. నానార్ధ చంద్ర బాణవ్రాత మద రినఁ దునియలై మేదినిఁ దొరఁగు కరులు, శాత నారాచ పుంజంబులు నిగిడినఁ కుదురులై కూలెడు ఘోటకములు. ద్రోణ. 3.158.

4. ఏదైన ఒక వస్తువు అటునిటు నొరగకుండ నుండుటకై యేర్పఱుపఁబడినది, చుట్టకుదురు.

వ. అతండు (కర్ణుఁడు) కేతనంబు నకుం గుదురుగాఁ బెనుపొనరం గావించిన పీఠంబు నడుగున నొదింగిన. ద్రోణ. 4.236.

.. పంక్తి, పార్శ్వము.

ఆ. ఆలుబిడ్డలు లేనియట్టి త్రిమ్మరి యగు కొయ్యగాక, కుదుటఁ గూడు వెట్టి, కుడుచువారలిట్టి క్రొవ్విదంబులు సేయఁజొచ్చుటిచ్చగించి చూతు రయ్య. ఉద్యో. 2.9.

**కుద్దాలము** సం. వి. అ. పుం.

గుద్దలి (భూమిని చీల్చునది.)

ఆ. ... అఱువది వేవురు, నొక్క మొగిన గ్రొచ్చి రుదధిలోన జలధి పంక మగ్న సత్త్వముల్ నిశిత కుద్దాలహతి విదారితములు గాఁగ. అర. 3.61.

**కునికిలి** దే. వి. ఔప.

జత్రు ప్రదేశము - మూఁపులయొక్క సంధియెముకలు.

ఆ. వెండిపింజఁ బొలుచు వెడఁద యమ్మున మిత్త్రి,సేన ధరణినాథు శిరముఁ ద్రుంచి,వాడి నారసము సువర్మని కునికిలి, నాటె నయ్యమర్త్య నాథ సుతుఁడు. కర్ణ. 1.175.

శ్లో. మిత్రసేనస్య చిచ్ఛేద క్షురప్రేణ మహారథః, సుశర్మాణం సుసంక్రుద్ధో జత్రుదేశే సమాహరత్. సం. భార. కర్ణ. 28.26.

**కునుకు** దే. అ. క్రి.

నిద్రచేతూఁగు, తూలు, కూరుకుపాటు చెందు.

వ. ... నిద్రా పరవశత్వంబున దివియలవారును హీనప్రయత్నులై నందమంబు గవియం దొడంగె నట్టి యెడం గునికి కునికి యాయుధంబులు పడవిడుచు వారును ... ద్రోణ. 5.267.

**కుపతిత్వము** సం. వి. అ. న.

చెడు రాచఱికము - వక్రమార్గమున వచ్చిన పరిపాలనము.

ఉ. (కుబేరుఁడు ముచుకుందునితో) నాకును నీకు నేటికి రణంబొన

రింపఁగ నేను బంప సీ,చేకముఖం
బుగా ధరణి యేలుము నావుడు నవ్వి
యవ్విభుండీ కుపతిత్వ మొల్ల నొరు
నీగి మహత్త్వకరంబె విద్విషదీ్పకర
మద్భుజార్జితమ పెంపొనరంగభజింతు
దిశ్పతీ. శాంతి. 2.325.

**కుపితత్వము** సం. వి. అ. న.
కోపము.
చం. కినియుట మాను మేలె మునికిం
గుపితత్వము. అశ్వ. 3.35.

**కుపితము** సం. విణ. (అ. ఆ. అ.)
కోపగించినది, క్రుద్ధము.
వ. .. ఆ సర్వగ్రామణి కుపిత
చిత్తుండై. శాంతి. 6.580., ఉద్యో.
1.7.
వ. ... తత్ప్రదేశంబు దొల్లి విశ్వా
మిత్రు నాశ్రమంబతండు పసిష్ఠునెడఁ
దపోవిషయ మత్సరంబునఁ గుపి
తుండై. శల్య. 2.168.
కం. కుపితుఁడగువాని వ్రతమును,
జపమును దేవార్చనంబు శ్రాద్ధ
క్రియయుం, దపమును దానము
యజనము, నపగతములు గాఁగఁజేయు
నంతకుఁ దలఁకన్. శాం. 5.554.
(కుపితుఁడు = కోపి, క్రుద్ధుఁడు.)

**కుప్ప** దే. వి.
రాశి, ప్రోగు, గుట్ట.
ఉ. అప్పుడు కర్ణసైన్య మమరాధిప
నందనుఁ జుట్టుముట్టఁ దే,రుప్పర
వీథిమై వలయమొప్ప వెసం బఱపించి
క్రీడి పెన్,గుప్పలుగా రథావలిని
ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం,
దప్పక ధానుసూను మెయిదాఁకఁగ
నేయుచు నుల్లసిల్లినన్. విరా. 5.88;
అశ్వ. 4.107; శాంతి. 2.438.

**కుప్పఁగూర కుప్పఁగూరలు కుప్పం గూరలు** దే. క్రి. విణ. (√ కుప్ప.)
కుప్పనఁగూర, కుప్పకుప్పలుగా,
ప్రోగుప్రోగులుగా.
చం. ఎడగని యబ్బలంబు గడు
నేడైఱఁ గిట్టి మహాస్త్ర శస్త్రముల్,
గడువడిఁ గుప్పఁగూరఁగఁ జలం
బునఁ బైఁదొరఁగింప. ద్రో. 3.152.
గీ. నీవు భీష్మున కలికినఁ గోపదేను,
గలుగ వెలిపేల యతనిపైఁ గవియు
మెయిది,కాని మదీయ బాణంబులఁ
గుప్పఁగూర పఱపి కూల్చెద నీతనిఁ
బటురయమున. భీష్మ. 3.335.
చం. హిమగిరి సానుదేశమున నెక్కు
డు వైభవ ముల్లసిల్ల యజ్ఞము దగ,
జేసి భూమిసుర సంఘములెల్లను దృప్తి
బొంద హేమమొసఁగెఁ గుప్పఁగూర
లుసమగ్ర కుయుహలుఁడై కనత్సు,
వర్ణమయ గృహక్రియోపకరణ ప్రక
రంబులనిచ్చె భక్తితోన్. అశ్వ. 1.31
వ.... ఇవ్విధంబున వివిధ వ్యూహం
బులగు బహుయోధయూథంబులు గురి
సిన యనేకాస్త్ర శస్త్రంబులు నానా
ప్రకారంబులఁ గుప్పంగూరలుగాఁ
దొరఁగిన. విరా. 5.207.

**కుప్పనఁగూరలు కుప్పఁగూర** క్రి.విణ.
(√ కుప్ప).
కుప్పకుప్పలుగా, ప్రోగుప్రోగులుగా.
కం. అప్పుడు గురుతనయాద్రిం,
గప్పఁగ వజ్రోపమాన కాండములు

వెసం, గుప్పనఁగూర వఱప నరుఁ,
దప్పరుసఁడనమున కోర్చి యతఁడు
పెనంగన్. కర్ణ. 2.298.
ఉ. అప్పుదు నీవు సూడఁగ ననంత
ములై ఖచరేంద్ర సైన్యముల్, గప్పె
ననేక సాయక నికాయములన్ వడి
నన్ను నేనునుం, గుప్పనఁగూరవేసి
రిపుకోటి వధించితి నంతలోన న,న్నా
వ్వరికించె సైన్యతతి యొక్కఁడనై
గణభూమి సొచ్చితిన్. ఆర. 6.7.

**కుప్పలుగొను** దే.అ.క్రి. ($\sqrt{\ }$కుప్ప)
కుప్పలుగాఁగూడు, ప్రోగులగు,
గుట్టలవదు.
వ. .. మడువులు గట్టు నెత్తురులను
గుప్పలుగొను కండలను బెనంగొను
ప్రేవులను బెనుతిట్టలగు నెమ్ములను.
సౌప్తి. 1.177.
కం. అప్పరుసునఁ బెరిగిన నృపు,
లిప్పుడు భారత రణోపహృతులై
పలువుర్, గుప్పలుగొనఁ బడిరనికిం,
దప్పిన వాఁడొకడొకండ ధరనం
తంతన్. శాంతి. 2.96.

**కుప్పించు** దే. అ. క్రి.
దూఁకుటకు ముందు కాళ్ళు కదియఁ
బట్టి నేలనదుముచు ఊపిరిపట్టు.
తే. అసురనాథుండు నలసత యదర
నీక్షి యావులించిన నత్తఱి నమర
విభుఁడు,దన శరీరంబు సంకుచితంబు
సేసి,కదు జవంబునఁ గుప్పించి
వెదలనుఱికె. ఉద్యో. 1.125.

**కుప్పెకోల** దే. వి. (కుప్పె+కోల)
బాణవిశేషము. క్షుద్రకము (అలుగు
బాణము అని. బ్రౌ. ని)
సీ. కవిసిన నతఁడు వికర్ణు రథ్యం
బులఁ గూల్చి యాతనిపయిఁ గుప్పె
కోల, లిరువదినాటింప భీష్మ. 2.393.
వ. .. సైన్యంబు తఱిమి మన మొన
నుఱుము చేయం డొడంగిన
ద్రోణుండు మార్కొని యిరువదేను
కుప్పెకోలల నతనిచేత నేటులువడి.
ద్రోణ. 3.270.
శ్లో॥ సాత్యకిః పంచవింశత్యా క్షుద్ర
కాణాం సమార్పయత్. సం. భార.
ద్రోణ (శ. ర.)

**కుప్యము** సం. వి. అ. న.
బంగారు వెండిగాక తక్కిన లోహము.
సీ. ... అష్టమి వాణిజ్య పుష్టుఁడు
వసు,గజధర్మ విష్ణుచిత్తజ తిథులం
దేక,శత జంతువులను గోచయముఁ
గుప్యములును బ్రహ్మవర్చస్వి పుత్ర
కులును ధనము గలవాఁడు... అను.
అను. 3.161.

**కుబేరుఁడు** సం. వి. అ. పుం.
ధనదుఁడు, విద్యాధర యక్ష కిన్నర
కింపురుష గంధర్వ గుహ్యకులకు
అధిపతి.
వ. (కృష్ణార్జునులు స్వప్నమున) కైలా
సంబు గని యందు సరస్సరోవర
సుందరంబును బుష్ప లతా భూషి
తంబును రమ్యతరు సంతాన కాంతం
బును నయిన కుబేర విహార స్థానంబు
సూచుచు. ద్రోణ. 2.361., ఉద్యో.
1.197.
(ఈతఁడు కుత్సితమైన శరీరము
గలవాఁడు. ఇతఁడు విశ్రవసునకు
ఇలబిలయందుఁబుట్టినవాఁడు; నరవాహ

నము గలవాఁడు. పార్వతీదేవి శాపము వలన పచ్చనైన యొక కన్నుగల వాఁడు. ఇనుపబ్బనెడి ఉమ్ముఁడు గల వాఁడు. శంకరుని సఖుఁడు. అని అమ. రావణునకు సవతితల్లి కొడుకు. మూఁడు కాళ్ళు ఎనిమిది పండ్లును మెల్ల కన్నును గల వికృతదేహము గలవాఁడు అని సూ. ఆ. ని.)

**కుబ్జ** సం. వి. ఆ. స్త్రీ.
మఱుగుజ్జు. దుందుభి, ఒకానొక గంధర్వస్త్రీ.
మ. .. పటమేచ్చి...దుందుభి యను గంధర్వ కామినిం బిలిచి నీవు కుబ్జ రూపంబున మంథర యను పేర భూ లోకంబున నుద్భవించి నీ నేర్చు విధంబున దేవకార్యంబుల నిర్వహింపు మని. ఆది. 6 291.

**కుబ్జము** సం. విణ. (అ. ఆ. అ.)
మఱుగుజ్జు అయినది, గూనుగలది.
కం. అంటెపురము చుట్టతిరుగ, బెంత యుఁ గీడంతకంటె నెగ్గు గడీయో, పొంత చర కుబ్జ వామన, కాంతాదుల లోపి పొందుకలిమి పటునకున్. విరా. 1.131.
వ...కౌంతేయులు .. దాస దాసీ కుబ్జ వామన గణంబులం గైకొని యధిక ప్రమద సమద చేష్టితంబుల నుల్ల సిల్లిరి. శల్య. 2.349.

**కుభృత్తు** సం. వి. త్. పుం.
భూమిని ధరించునది, కొండ.
ఉ. అగ్గపు నందనుండు హరిణావలిఁ గాంచి కుభృత్తటంబు వే,డిగ్గ స్ఫురిత్ప్రభ చాడ్పునఁ గదిసింది మగం టిమి యుల్లసిల్లఁగా, డిగ్గి పట్టెను. సౌప్తి. 1.180.

**కుమతి** సం. వి. ఇ. పుం.
చెడుబుద్ధి గలవాఁడు, దుర్మార్గుఁడు.
తే. కూటికై ద్రోణ భీష్మలు గుమతి యనక,యనుసరింతురు ధృతరాష్ట్రుఁ డును దనూజు, తృష్ణ మానినవాఁడు రాధేయు బోటి,తులువలెల్లను నతని సద్బుద్ధి యండ్రు. ఉద్యో.1.106,286.

**కుమారకుఁడు** సం. వి. అ. పుం.
1. కుమారుఁడు. పుత్రుఁడు.
ఉ. దేవకుమారకుండ యగు...దేజము చందము సూడ. విరా. 5.302,.
2. కౌరవ్య సర్పజాతివాఁడు. ఆది. 2.212.

**కుమారధార** సం. వి. ఆ. స్త్రీ.
ఒకతీర్థము. ఇది పితామహ సరమునఁ బుట్టినది ఇందు స్నానము చేసి త్రిరాత్రోపవాసము చేసినవారు బ్రహ్మహత్యాది దోషముక్తులగుదురు. ఆర. 2 275.

**కుమారపట్టము** సం. వి. అ. పుం.
యౌవరాజ్యము.
ఉ. రాజ్యము భారమెల్ల ధృతరాష్ట్రుని యందు వెలుంగుచుండఁ ద,త్పుత్రుఁ గుమారపట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు పొందవుల్, పుత్రుఁడు దండ్రి చిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా,మ్రాజ్యముగాఁ దలంతు దనుకంపమెం దముకున్ ధరాధిపా. ఉద్యో. 3 342.

**కుమార మాతృకలు** సం. వి. ఆ. స్త్రీ.
వీరు ఏడుగురు 1) హవిష 2) కాళి

3) కౌశిక 4) ఉద్ధత 5) శారిక 6) ఆర్య 7) వైధాత్రి. వీరిని 'సప్త మాతృకలు' అనియు నందురు. దేవేంద్రుఁడు కుమారస్వామి శౌర్య ధైర్య పరాక్రమాదులు విని తన ఉంద్రపదవి మెప్పుడపహరించునో యని యాతని సమయించి ప్రియంబు సేయుడని ఈ సప్తమాతృకలను బంపెను. వీరు వెళ్ళి ఘోరంబుగా కుమారస్వామిపై నడరి యాతని తేజోవిశేషమునకు భయమంది యతని శరణుసొచ్చి "మేము లోకమాతలము. మాయందు నీవు మాతృభావము సేయ నర్హుండవు" అని ప్రార్థించిరి. ఆతఁడు వారి నభినందించి యనుగ్రహించెను.

పిమ్మట ఈ కుమార మాతృకలు "మమ్ము జగత్త్రయంబునకు మాతలుగాఁ జేయుము. తొల్లి మాతృకలకంటె మేమెక్కుడువారము గావలయు సర్వలోకము తొల్లిటి మాతృకలను గొలువక మమ్మే కొలువ వలయును అని కుమారస్వామిని ప్రార్థించిరి. అందులకు కార్తికేయుఁడు నవ్వి తొల్లి మాతృకల గొప్పతనము మాన్పుట న్యాయముకాదు. మఱొండు వరము గోరుఁడిచ్చెదననెను. వారు జగముల శిశువుల నెల్లప్పుడు పీడించునటుల వరమిమ్మనిరి. కుమారస్వామి కీడు సేయఁ గోరుచున్నారు. ఇది న్యాయమా ? అయినను ఇచ్చెద నన్నాఁడ గాన నట్లే వరమిచ్చితిని. మీకు మ్రొక్కినను కొల్చినను వేడినను దయతో శిశువుల రక్షింపుఁడు. పదియాఱేడుల ప్రాయము వచ్చువఱకే నరులను బాధింపుఁడు. మీకు రక్షకుఁడుగా నా యంశమున బుట్టినవాని నొకని నిత్తునని తన శరీరమునుండి బంగరు రంగుగల యొక పురుషుని బుట్టించెను. వాఁడు స్కందాపస్మారమను పేరి గ్రహమై కుమార మాతృకా రక్షకుఁడయ్యెను. ఆది సప్త మాతృకలు: 1) బ్రాహ్మి 2) మాహేశ్వరి 3) కౌముది 4) వైష్ణవి 5) వారాహి 6) ఇంద్రాణి 7) చాముండి – వీరికన్న చిన్నలగుటచే వారిని కుమార మాతృకలనిరి. అర. 5.214; 245 మొ. 252.

**కుమార విద్యాధరుఁడు** సం.వి.అ.పుం.
కుమారుఁడైన విద్యాధరుఁడు; రాజ రాజ నరేంద్రుఁడు.
కం. విమలాదిత్య తనూజుఁడు,విమల విచారుఁడు గుమార విద్యాధరుఁడు, త్తమ చాళుక్యుఁడు వివిధాగమ విజితశ్రముఁడు తుహినకరుఁ డురు కాంతిన్, ఆది. 1.4.

**కుమార విషయము** సం. వి. అ. పుం.
కుమారదేశము. దీని ప్రభువు శ్రేణిమంతుఁడు. భీమసేనుఁడు పూర్వ దిగ్విజయ యాత్రాకాలమున నీతని జయించి యపరిమిత ధనములు గ్రహించెను. సభా. 1.243.

**కుమార వీరాశ్రమము** సం. వి. అ. పుం. న.
ఒక తీర్థము. ఇచ్చట ఒక్క మాసము వసియించిన నశ్వమేధ ఫలము లభించును. అర. 2.275.

**కుమారాయుతము** సం. విశ.(అ.ఆ.అ]
కుమారుఁడుగ నయినది.

ఉ. ... కుమారాంచిత శక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె. ఆది. 5.6.

**కుమారి** సం. వి. ఈ. స్త్రీ.

1. కూఁతుఁరు.

ఆ. ఒక్క మారి చతురయగుట యొంటిపద్దెనమునెడఁ బ్రమాదమున నెఱింగి, యుగ్గడింప నొల్లకునికి యెఱుఁగని, యదియపోలె నుండె నాత్మ నొచ్చి. ఉద్యో. 4.374.

2. కన్య, పెండ్లికాని పడుచు.

ఉ. భారతవర్షిలో విదిన భక్తిఁ బరించిన శ్రీయు నాయువున్. ..గల్గు... సుపుత్రుని గాంచు సద్వరున్, గారవమొప్పఁగాఁ బడయు గర్భిణియున్ వరుసం గుమారియున్. స్వర్గ. 90.

3. కేకయరాజు కూఁతురు, భీమసేనుని (పాండురాజు కుమారుఁడు కాదు) భార్య. ఆది. 4.113.

**కుమారిక** సం. వి. ఆ. స్త్రీ.

కూఁతురు.

వ. ... మత్స్య మహీవల్లభుండు మనంబలర సంభ్రమ మొగంబు సూచి కుమారిక నలంకరించుకొని చెప్పనిన. విరా. 5.354.

**కుమారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

భూమియందు పద్మఘుచిదలె నుండుదుఁ డైనవాఁడు, యువకుఁడు.

కం. ఆ యమ్ముదితయుఁ దానును, జని యలసినకతైఱంగు సముచితముగఁ జెప్పిన నక్కుమారవరుఁ డిట్లనియెం బాంచాలిలోద నల్లన నగుచున్. విరా. 4.17.

వ. (ఉత్తర బృహన్నలతో)...నీవును నా పలుకులు గుఱుచ సేయక నీ పెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తర కుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలఁగవలయు... అనిన. విరా. 4.29. (ఉత్తర కుమారుడు—కుమారుఁడైన యుత్తరుఁడు. విరా. 5.399).

వి. అ. పుం.

1. శిశువు. అయిదేండ్ల లోపలి బాలుఁడు. (సూ. ఆ. ని.)

సీ. ధృతరాష్ట్ర సఖుఁడైన యధిరథుండను సూతుఁడు ... ఏకతమున, నప్పెట్టె దెఱచి యొప్పునప్పుడు. ఆ. విమల హేమ కవచుఁ గనక కుండల ధరు, ననుపమాన తేజు ఘనుఁ గుమారు గని మనంబులోన ననయంబు విస్మయుఁడై, బొనరఁ గ్రుచ్చి యెత్తికొని ముదమున. అర. 7.349.

2. ఆదరార్థకము.

(భీష్ముఁడు దుర్యోధనునితో)

కం. మెద యెఱుగఁ జేతి కైదువు, వడ నిను నీవెఱుఁగకున్నభంగిఁ గనియుఁ గవ్వడి యుపేక్షించునటె చె,ప్పెడు కొలఁదియె వాని కరుణ పెంపు కుమారా. విరా. 5.216.

(భీష్ముఁడు ధర్మరాజుతో)

ఆ. భక్తిగలవు నాకుఁ బ్రజ్ఞాన ఘనుఁ డవట్లపుడ నీవు యోగ్యుఁడవు కుమార, సదుపదేశమునకు. శాంతి. 4 263.

3. పెద్దవారు చిన్నవారిని సంబోధించు శబ్దము.

(దుర్యోధనుఁడు దుశ్శాసనునితో భీష్ముని గురించి)
అ. ఎల్లవారిఁ గాచు నితఁడని యెప్పుడుఁ దలఁతు మితనిఁ గావవల యుటేమి,యని యెంచెదేని వినుమిందు అకు నిది,వినఁగ వలయునట్టి పని కుమార. భీష్మ. 1.77.
4. కుమారస్వామి.
(చూ. ఆర. 5.193. మొ. 239వఱకు; ఆది. 3.76; సం. భార. ఆది. 67; శల్య. 2.175 మొ. 193 వ, చూ. చివరి సంపుటము అనుబంధము.)

**కుమారుతనము** వి.
లేత వయస్సు. ముప్పది సంవత్సరముల వఱకు నుండు వయస్సు. అయిదు సంవత్సరముల వఱకుండు వయస్సు లనియు, పదునాఱు సంవత్సరముఁ వఱకు నుండు వయస్సు అనియుఁగూడఁ జెప్పుదురు. ఇక్కడ ముప్పది సంవత్సరముల వఱకుండు వయస్సు యుక్తముగాఁ గనఁబడుచున్నది.
(భీష్ముఁడు కృష్ణునితో)
చం. ముదుకపడైన నాదు బలముం జలమున్ వివిధాస్త్ర శస్త్ర సంపద యును బోయి నీ గురుఁడు భార్గవుచే విను మాంపిలి నా,పెదిరినవారు పెక్కండల నేమయిరో యెఱుఁగున్ జగంబు నా,ముదిమియు నీ కుమారుతనమున్ వరుసన్ విజయుంచెదెం గెదున్. ఉద్యో. 4 246.

**కుముదము** సం. వి. అ. పుం. న.
కైరవము, తెల్ల గలువ.

కం. పరమ శమ నిరత సంయమి, వర మానస కుముద హాస వర్ధన చంచచ్చరణ నఖ చంద్రికా వి,స్ఫురణా చిత్రప్రకార శోభాభ్యుదయున్. విరా. 1.35.

**కుముదాక్షుఁడు** సం, వి. అ. పుం.
కద్రువకొడుకు,సర్పజాతివాఁడు ఆది. 2.4.

**కుముదుఁడు** సం. వి. అ. పుం
1. కద్రువకొడుకు, సర్పజాతివాఁడు. ఆది,. 24.
ఇతఁడు బలరాముఁడు శరీరము విడుచు సప్పుడతనిని సేవింపవచ్చును. మౌస. 76
2. ఒక వానరవీరుఁడు.
కం. అఱువది కోటులు గపివరు,లు అరి జగద్భీషణము నొకట నువ్వెత్తు గొనం,బడిగొన్న యట్లు నడచఁగ, నడిచి కుముదుఁ డెదురుదెంచి నృపవరు గనియెన్. ఆర. 7.36.
3. కుమారస్వామి సైన్యములోని ఒక సైనికుఁడు,
వ. ... అద్భుతంబుగఁ జిత్రాభరణ వర్మాయుధ ధరులును వివిధ ప్రకారులు నగు గజకర్ణ నికుంభ కుముదాదులైన సైనికులు మెఱసి యుల్లసిల్లిరి. శల్య. 2.183.

**కుమ్మరి** దే. వి.
కుండలు చేసి జీవించువాఁడు.
కం. విను మృత్పిండము చేసి సాధనము వగుటఁ జేసి సన్న దంపింపం గా,జను ననవుడు గుమ్మరి కోలను

సారెఁబోలితం దలఁచి చూడుమెదన్. అను. 1.16.

**కుమ్మరికోల** దే. వి.
కుమ్మరివాఁడు సారెత్రిప్పు కట్టె. చూ. కుమ్మరి.

**కుమ్మరిసారె** దే. వి.
కుమ్మరి కుండలు చేయుటకుపయోగించు చక్రము.
తే. ధాత్రి కుమ్మరిసారె విధమునఁ దిరిగె. ఉద్యో. 4.116.

**కుయి** దే. వి.
1. రక్షణము,
వ. (విరటుఁడు) కుమారుండు భీష్మ ద్రోణ కర్ణ కృపాశ్వత్థామాది యోధ వీరులు బెరసిన మూఁకలతోడ నడచి యుత్తరంబునఁ బసులఁ బట్టిన నతండు బృహన్నల సారథింగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాద వేదనా దోదూయమాన మానసుండగుచు. విరా. 5.233.
2. మొఱ, ఆర్తధ్వని.
ఆ. అనదనైతి నిచట నాలి కుయ్యాలింపుఁ, దకట మీరు గలుగ నాక్రమించి నన్నుఁగట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక భంగపఱచువారు. విరా. 3.19.

**కుయివోవు** దే.అ. క్రి. (కుయి+పోవు)
రక్షకముగా పోవు.
(చూ. కుయి, 1వ ఉదా.)

**కుయిగాఁచను** దే. అ. క్రి. (కుయి+చేను)
రక్షకముగాఁ దోవు.
చం. అసమున మీఁదెఱుంగక మహాగ్రహ వృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడ యొంటి సనుట యేడ నాకిది కడింది విచారము పుట్టె. విరా. 5.234.

**కుయ్యాలించు** దే. అ. క్రి.
మొఱ విను. (చూ. కుయి. 2వ ఉదా.)

**కుయ్యి** దే. వి. కూయి.
మొఱ, ఆర్త ధ్వని.

**కురంగ దేశము** సం. వి. అ. పుం.
ఒక దేశము.
వ. గంధమాదన సంగతయైన యింద్రతోయయుం గురంగ దేశ గతయగు కరతోయయుం ద్విరాత్రోపవాసోపేత స్నాతకులకు నశ్వమేధ ఫలంబు గలుగంజేయు. అను. 2.73.

**కురంగము** సం. వి. అ. పుం.
జింక, ఇంచుకంత యెఱుపువన్నె గల పెద్ద యిఱ్ఱి. "కురంగ ఈషత్తామ్రః స్యాద్ధరిణాకృతికో మహాన్,"
వ. ఇట్లు శినిపుంగవుండు సింగంబు వాదివిన కురంగంబుఁ గాచు చందంబున ధృష్టద్యుమ్ను రక్షించి తొలంగఁగొనిపోయె. ద్రోణ. 3.126.

**కురకుఁడు** సం. వి. అ. పుం.
కద్రువకొడుకు. సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కురరి** సం. వి. ఈ. స్త్రీ.
ఆఁడు గొఱ్ఱె.
వ...అప్పుడు పాంచాలియుసుభద్రయుఁ జిత్రాంగదయు నులూపియు సపుత్రయగు నుత్తరయు [illegible] గల యట్టి మగువలుం గురరీనిచయ నాదం

బుల చంపంబు దోఁప నాక్రంపనంబు సేసిరి. ఆశ్ర. 1.142.

కం. తనయుఁ బళువఱిచి తద్వపుఁ, గొని వేల్చినఁ జూచి యార్త కురరీ నాదం,బున నేడ్చిరి కడు నదలుగ, పసుపక్ష్యలు నూప్పడును సుత స్నేహమునన్. ఆర. 3.215.

**కురవకము** సం. వి. అ. పుం.
ఎఱ్ఱ గోరింట.
వ. దేవయాని యా వనంబునఁ గన్యా కలుం దానును ..నవ వికచ కుసుమ కుమార నికర భరిత సహకార కుర వక వకుళాశోక తమాల సాలచ్ఛాయా శీతల సికతా తలంబున నిష్ట వినో దంబుల మన్న యవసరంబున. ఆది. 3.155

**కురియించు** దే.స. క్రి. ($\sqrt{\phantom{x}}$ కురియు)
కురియఁజేయు, వర్షించు.
వ. అని స్తుతియించి పర్జన్య ప్రసాదం బున మహావృష్టి గొడుకుల పయిం గురియించి యయ్యురగుల విగత సంతాపులంజేసి కద్రువ. ఆది. 2.47; ఆర. 3.206.

**కురియు** దే. అ. క్రి. వర్షించు,
సీ. వలసిన యప్పుడ వానలు కురి యుట సస్యసమృద్ధి ప్రశస్తమయ్యె. ఆది. 5.3.

కం. అత్తఱిఁ బాషాణంబులు,నెత్తురు నెమ్ములను గురిసె నిష్ఠుర నినదా, యత్తమయ నభము; పిడుగుల మొత్తం బులు వడియె నగరమున నెల్లెడలన్. ఉపో. 4.160.

సీ. వరుస నేసుంగులు కురిసిన దాని ధారావళి దగు కలయంపి గాఁగ. విరా. 3.74.

వ. అవ్వాయుసుతుండు సావమి యెఱింగి భూపతి పెనంగు భంగియుఁ గనుగొని మెచ్చి సురప్రకరంబులు పుష్పవర్షంబులు గురియ. శల్య. 2.267.

కం. ఈరసమునఁ గదిసి శరా,సార ముపైఁ గురియ నీవు సక్రోధుఁడవై పేరురమున వెస నాటిన,తోరంబగు నారసమునఁ ద్రుళ్ళి కెడసెనే. కర్ణ. 3.38.

ఆ. ... అగ్గలముగఁ గురియు తేని యలకుఁ గొంకు. విరా. 2. 304.

స. క్రి.
వర్షింపఁజేయు, కురియించు.
కం. నందినియు ... అంగ విక్షేపం బున నంగారవృష్టిఁ గురియుచు. ఆది 7.106.

వ. అవ్వాయుసుతుండు సావమి యెఱింగి భూపతి పెనంగు భంగియుఁ గనుంగొని మెచ్చి సురప్రకరంబులు పుష్పవర్షంబు గురియ. శల్య. 2.267.
తే. జోడులొక్కట వాలంప సోన గురియ. ... విరా. 3.168.

తే. ఒండొరుల దోయిళుల నినుపొంపఁ జేయు,నక్షత ప్రకరంబు లనో క్ష మస్తకములఁ బోసిరి మంచావు కల్ప లతలు విరులు గమియ నొండొంటిపై గురియుచున్న. విరా. 5.397.
(దట్టముగా రాల్చు అని భావము)
వ హవ్య కవ్యంబులకు నతిథి పూజ నంబులకు నిజాహారంబులకు సద్వి

జావలి సంతోషింప నింపారు పాలు వారికిం గురియుదుము (ఇటు ఎక్కువ గానిచ్చు అని భావము). అను.3.69; ఆది. 4.157.

**కురుఁడు** సం. వి. ఉ. పుం.
కౌరవ వంశమునందలి యొక రాజు-సంవరణునకు తపతికిఁ బుట్టినవాఁడు. పాండవులకు ధార్తరాష్ట్రులకు మూలపురుషుఁడు. ఇతని పేరనే కురుక్షేత్ర మేర్పడినది. ఆది. 4.112; శల్య. 2.214.
(చూ. కురుక్షేత్రము)

**కురుకుమారుఁడు** సం. వి. అ. పుం.
1. గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకు. వీరు నూర్వురు: 1) దుర్యోధనుఁడు 2) దుశ్శాసనుఁడు 3) దుస్సహుఁడు 4) దుశ్శలుఁడు 5) జలసంధుఁడు 6) సముఁడు 7) సహుఁడు 8) విందుఁడు 9) అనువిందుఁడు 10) దుర్ధర్షుఁడు 11) సుబాహువు 12) దుష్ప్రధర్షణుఁడు 13) దుర్మర్షణుఁడు 14) దుర్ముఖుఁడు 15) దుష్కర్ణుఁడు 16) కర్ణుఁడు 17) వివింశతి 18) వికర్ణుఁడు 19) శలుఁడు 20) సత్త్వుఁడు 21) సులోచనుఁడు 22) చిత్రుఁడు 23) ఉపచిత్రుఁడు 24) చిత్రాక్షుఁడు 25) చారుచిత్రుఁడు 26) శరాసనుఁడు 27) దుర్మదుఁడు 28) దుర్విగాహుఁడు 29) వివిత్సుఁడు 30) వికటాననుఁడు 31) ఊర్ణనాభుఁడు 32) సునాభుఁడు 33) నందుఁడు 34) ఉపనందకుఁడు 35. చిత్రబాహుఁడు 36) చిత్రవర్మ 37) సుకర్మ 38) దుర్విమోచనుఁడు 39) అయోబాహువు 40) మహాబాహువు 41) చిత్రాంగుఁడు 42) చిత్రకుండలుఁడు 43) భీమవేగుఁడు 44) భీమబలుఁడు 45) బలాకి 46) బలవర్ధనుఁడు 47) ఉగ్రాయుధుఁడు 48) సుషేణుఁడు 49) కుండధారుఁడు 50) మహోదరుఁడు 51) చిత్రాయుధుఁడు 51) నిషంగి 53) పాశి 54) బృందారకుఁడు 55) దృఢవర్మ 56) దృఢక్షత్రుఁడు 57) సోమకీర్తి 58) అనూదరుఁడు 59) దృఢసంధుఁడు 60) జరాసంధుఁడు 61) సదుఁడు 62) సువాక్కు 63) ఉగ్రశ్రవుఁడు 64) ఉగ్రసేనుఁడు 65) సేనాని 66) దుష్పరాజయుఁడు 67) అపరాజితుఁడు 68) కుండశాయి 69) విశాలాక్షుఁడు 70) దురాధరుఁడు 71) దృఢహస్తుఁడు 72) సుహస్తుఁడు 73) వాతవేగుఁడు 74) సువర్చసుఁడు 75) ఆదిత్యకేతువు 76) బహ్వాశి 77) నాగదత్తుఁడు 78) అగ్రయాయి 79) కవచి 80) క్రథనుఁడు 81) కుండుఁడు 82) ధనుర్ధరుఁడు 83) ఉగ్రుఁడు 84) భీమరథుఁడు 85) వీరబాహువు 86) అలోలుపుఁడు 87) అభయుఁడు 88) రౌద్రకర్మ 89) దృఢరథాశ్రయుఁడు 90) అనాధృష్యుఁడు 91) కుండభేది 92) విరావి 93) ప్రమథుఁడు 94) ప్రమాథి 95) దీర్ఘరోముఁడు 96) దీర్ఘబాహువు 97) వ్యూఢోరువు 98) కనకధ్వజుఁడు 99) కుండాశి 100) విరజసుఁడు. ఆది. 5.107.

సంస్కృతము వావిళ్ళవారి ప్రతిఆది. 117లో కుమారులు నూర్వురని చెప్పి

106 పేర్లిచ్చియున్నది. వారు 1. సత్యసంధుఁడు (60. జరాసంధుఁడు తర్వాత) 2. కుండధారుఁడు (81. కుండుడు తర్వాత) 3. వీరుఁడుఁ 84. భీమరథుఁడు తర్వాత) 4. చిత్ర కుండలుఁడు (95. విరావి తర్వాత) 5. వీర్యవంతుఁడు (92. దీర్ఘరోముని తర్వాత) 6 మహాబాహువు (96. దీర్ఘ బాహువు తర్వాత).ఇందుమహాబాహువు 40వాఁడుగ వచ్చియున్నాఁడు. నామ పరిగణనమున సంస్కృత భారతము కలుషితమైన దనక తప్పదు.

2 గాంధారీ ధృతరాష్ట్రి పుత్రులతో జోడుగా తిరుగు ఒకానొక రాజ కుమారుఁడు. చూ. చిత్రరథుఁడు. 1వ అర్థము.

**కురుక్షేత్రము** సం. వి. అ. న. ఒక పుణ్యక్షేత్రము. కౌరవ పాండవ సంగ్రామ మిచ్చట జరిగినది. ఇది ఇప్పటి ఢిల్లి ప్రాంతమునఁ గలదు. ఇది నైమిశారణ్యమున మూఁడు పుష్కరములతోఁ గూడియున్నది. ఈ కురుక్షేత్రమున నున్నవారిని స్వర్గలోకవాసులని యందురు.ఇయ్యది దృషద్వతికి ఉత్తరమున సరస్వతికి దక్షిణమునసున్నది. ఆ కురుక్షేత్ర శమంత పంచకములు నడుమ రామ హ్రదము నడుమ బ్రహ్మ యుత్తరవేది యనబడునట్టి కురుక్షేత్రము మెట్టిన వారికిఁ గురుక్షేత్రమునకుఁ బోయెద మనినవారికిఁ గురుక్షేత్రమున వసి యించెదమని తలంచిన వారికి సర్వపాపక్షయమయి తదనంతరమున విష్ణుస్థానమున విష్ణువునర్చించిన నశ్వమేధఫలము కలుగును. ఆది. 2.257, 258,259. పూరు వంశీయుఁడైన సంవరణునకు తపతియను దాని యందు కురుఁడను మహారాజు జన్మిం చెను. ఈతఁడు పరమతపస్వియఁట, ఇతఁడొకనాఁడు ఇప్పటి యీ కురు క్షేత్ర భూమిని దున్నుచుండెను. అప్పుడు ఇంద్రుఁడు వచ్చి యేల దున్నుచుంటివని యడిగెను. ఇచ్చట పుట్టిన జనులందఱు మరణానంత రము స్వర్గమునకరుగ వలయునని దున్నుచుంటిననెను. దేవేంద్రుఁడు నవ్వి గేలిసేయుచుఁ బోయెను. కురుఁడు తన పనిని వదలలేదు. పలు మారా దేవపతి వచ్చి పరిహాస వాక్య ములు పల్కుచు బోవుచుండెను. కురుఁడు తన నిష్ఠ వదలక యెల్లపుడు దున్నుచునే యుండెను దేవతలందఱు ప్రేరేప దేవేంద్రుఁడు కురుని యొద్దకు వచ్చి యతనితో 'ఈ పుణ్యక్షేత్ర మున నిరాహారులై దేహంబు విడచిన వారలకును ఇందు యుద్ధము చేసి వీర ప్రకారమున మృతిఁ జెందిన సమస్తజంతువులకును సురలోకప్రాప్తి కలిగెడు' మని పల్కి నిజస్థానమునకుఁ బోయెను. పోవుచు ఈ కురుక్షేత్ర మందలి ధూళి గాలికెగసి వచ్చి శరీర మున సంటుకొనెనేని యా నరుని పాపములన్నియు నశించి మరణా నంతరము ఉత్తమ గతులు ప్రాప్తిం చునని పల్కెను.

కురుఁడు దున్నుటచే నాఁటినుండి ఈ భూమికి కురుక్షేత్రము అను పేరు

వచ్చెను. కల్కి. 2.215, 216, 217.
చూ. కురుజాంగలము.

**కురుజ** దే. వి.
ఇది 'గురుజ'గా నిఘంటువులు తెల్పుచున్నవి. సం.మున ఈ తావున 'గురుజ' శబ్దమే కలదు. మఱి పాఠాంతరములు కూడ లేవు. ఆనందవారి ప్రతిలో 'కురుజ' అనియుఁ బాఠాంతరము 'గురిజ' అనియుఁ గలదు. సూ. ఆ. ని. దీనిని 'గురిజ'గానే గ్రహించినది. గురిగెంజ కూరగాయగా, ఎచ్చట ఆంధ్రదేశమునఁ గానరాదు. మఱే దేశమునైనఁ గలదేమో. ఆకులంములు తిను ఋషిపుంగవులు వాడెడివారేమో తెలియదు. 'కురుజ'కూడ ఒక కూరాకు దినుసైనటులను గాన్పింపదు. ఇంకను ఇది విచార్యము (చూ. గురుజ)

**కురు జనపదము** సం. వి. అ. పుం.
కురుదేశము.
వ. కురుజనపదంబు చుట్టం బాంచాల చేది ... మగధ దేశంబులు సుభిక్షంబులు. విరా. 1.62.

**కురుజాంగలము** సం. వి. అ. న.
1. కురుక్షేత్రము. ఇది కామ్యక వనమునందలి ఒక ప్రదేశము.
సీ. ... కురుజాంగలంబునఁ బరిమనిష్ఠ. ఆ. నశ్వమేధ ముఖములైన రాజార్హ యజ్ఞములు పెక్కు సేసె... సుహోత్రుఁడు ద్రోణ. 2.198, ఉద్యో. 1.228.
2. కామ్యక వనమునందలి ఒక ప్రదేశము.
(మైత్రేయుఁడు ధృతరాష్ట్రునితో)
చం. ... కామ్యక వనంబను మహా విపినంబుననున్న పాండవేయుల కడ నుండి వచ్చితిఁ గురూత్తమ నీసుతు నిన్నుఁ జూడఁగన్.
వ. ఏనట్లు తీర్థ దర్శనార్థంబు పరిభ్రమింపుచుఁ గురుజాంగలంబునకరిగి యందుఁ గురుకులోత్తములైన పాండుపుత్రులఁ జూచితి. అర. 1 94,95.
చూ. జాంగలము.

**కురుతీర్థము** సం. వి. అ. న.
ఒక పుణ్యక్షేత్రము. ఇది తైజసమను తీర్థమునకుఁ దూర్పునఁ నుండును. దీనిని జూచినవారికి స్వర్గద్వారము తెఱవఁబడును అర. 2.267.

**కురుదేశము** సం. వి. అ. పుం.
కౌరవరాజ్య ప్రదేశము.
కం. .. కురుదేశాహ్లాదన,మును నగుచు నార్భకంబు మోపెదలించెన్. విరా 1.170.

**కురునాథుఁడు, కురుపతి, కురురాజు**
1. దుర్యోధనుఁడు. విరా. 3.123; విరా 4.11; విరా. 5.55.
1. ధృతరాష్ట్రుడు. కల్కి. 2.360.

**కురుపితామహుఁడు** సం. వి. అ. పుం.
భీష్ముఁడు.
ఆ. కురుపితామహుండు గురుబుద్ధి నెంత్రాదు,లకును మాననీయుఁ డకుటిలాత్మ, కుండు పరశురాము కోదండ విద్యాది సుగుణములఁ దనెల్ల. శాంతి. 1.336.

**కురుబలము** సం. వి. అ. న.
కౌరవ సేన.

చం. కురుబల మేగుదెంచెనదె గోవుల
విట్టుల బట్టు. విరా. 4.20.

**కురులు** వి.
శిరోజములు. తలవెండ్రుకలు, ముం
గురులు, అలకములు.
సీ. ఇందుబింబము మీది కందు చందం
బున,గురులు నెమ్మొగమున నెరసి
యుండ. విరా. 2.138.

**కురువిషయము** సం. వి. అ. పుం.
కౌరవ దేశము.
(సన్న్యాసిరూపము ధరించి ధర్మ
రాజు విరటునితో)
కం. ద్విజుఁడఁ గురువిషయ జాతుఁడ.
విరా. 1.191.

**కురువు** సం. వి. ఉ పుం.
కురు అను పేరు గలిగిన భూమి.
సీ. కురు భూము లుత్తర కురువుల
కంటెను,సభిక లక్ష్మీయుక్తి నలిగ
యిల్లె. ఆది. 5.3.

**కుఙ్కురము** సం. వి. అ. పుం.
కుక్క.
సీ. ... అఖిల జంతువులను నచట
నచట, వసియించి సుఖముండు వాని
లోనొక్క కుర్కుర మెప్డు భక్తిమైఁ
గొలిచి తిరుగు. శాంతి. 3.92.

**కుఱంగలి** దే. వి. ఇ.
సమీపము, చేరువ.
వ. అనిన గంధర్వుండు పెద్దయుం
బ్రొద్దు విచారించి యిచ్చోటఁ గుఱం
గట నుత్కచంబను పుణ్యతీర్థంబు
నం దపంబు సేయుచున్నవాని
ధౌమ్యుండను బ్రాహ్మణుని. ఆది.
7.156.
విణ.
సమీప స్థలము, చేరువైనది.
వ. ... ప్రభాసంబను తీర్థంబునకుఁ
జని యందులకు ద్వారవతిపురంబు
కుఱంగలి యని విని. ఆది 8.163.

**కుఱు** దే. క్రి. విణ. (క. త. కుఱు;
వృత్తియందు కుఱుచే శబ్దముయొక్క
చ కారము లోపింపఁగా ఏర్పడిన
రూపము.)
కొంచెముగా
కం. వలపలి దిక్కున నున్నది
గంగాఁ దుఱుమిడి కుఱుమాపుడు
బట్టం,బలవడఁ గట్టి జఠర వల్కల
మున నెవ్వఁగు జన్నుగవ గప్పి
చగన్. విరా. 1.291.

**కుఱుకు** దే. వి.
ప్రోగు, రాశి, గుట్ట.
మ. కుఱుకుల్గట్టె ఘటాంగసంఘములు
రజశ్శోణిత ప్రవాహంబుపై పఱ
చెన్ నెత్తురు ధూళికోటి విహరింపన్
బ్రస్తుతింపన్ సురల్. ద్రోణ. 4.83.
వ. ప్రోవులు గొనియున్న ప్రేవుల
వలన లావుగల యంచపిండు పేరాఁ
కలి నటమటింప బెఱికినఁ గుఱుకులు
గట్టిన మృణాళ నాళంబులనొప్పు
కమలాకరోద్దేశంబులఁ గ్రేవసేయు
ప్రదేశంబులును. విరా. 3.236.
కుటిగణుటకును. గొడుగులు పఱి
యలు గుఱుకులు గొనుటన్. స్త్రీ.2.3.

**కుఱుకులు గట్టు, కుఱుకులు గొను**
దే. అ క్రి.
ప్రోవులుగా నేర్పడు, గుట్టపడు.

**కుఱుచ** దే. విణ. (వృత్తియందు దీనికి
కొన్నియెడల అంత్యవరలోపము.చూ,
కుఱు).

హ్రస్వము. పొట్టిది; చిన్నది
సీ. కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును
గడకొన్న చఱటులు మఱి చుంచు
తలలు నమర. ... ఆది. 1.300.
కం. ఇన్నగమునందు గాండివ,
మున్నది యదిగాని మధ్యజోద్రేక
విలాసోన్నతకోర్వవు పెద్దయు,
నన్నువలీ విండ్లు గుఱుచ లలఁతి
బలంబుల్. విరా. 4.105.
తే... కుఱుచ తూపు, ... బొద్దుండు
పలువుర నమయఁ జేసె. కర్ణ. 2.229;
శాంతి. 2.206.

**కుఱుచసేయు** దే. స. క్రి.
త్రోసివేయు, తక్కువపఱచు
వ. ... నీవును నా పంపున గుఱుచ
నేయక నీ పెంపునుం బ్రకటంబుగా
నయ్యుత్తరకుమారునకు దయంబు
గడప నెయ్యకొని. విరా. 4 29.

**కురపాల్ (లు)** దే. వి.
కొంచెముగా పాలు.
కం. కడు నర్మిలిఁ గ్రేపుం జను,
గుడుపఁ దొడఁగె నొక్క సురభి గుఱు
పాల్బొరయుంటచు వత్సవక్త్ర ఫేనము,
సుడిగాలిం దగిలి పడియె సొదపై
ననఘా. శాంతి. 3.517.

**కుఱుమాపుడు** దే. విశ.
కొంచెముగా మాసినది. చూ. కుఱు.

**కుఱువు** దే. వి.
ఊరువు, తొడ.
వ. అక్కోమలి యొక్కనాఁడు దన
కుఱువు దలయంపిగాఁ గృష్ణాజినాస్త
రణంబున నిజనాథుండు నిద్రితుండై
యున్న యవసరంబున ... ఆది.
2.157.
వ. ... మఱి యదియునుంగాక శ్రీ
భాగంబైన డాపలి కుఱువెక్కక
పుత్రభాగంబై పుత్రారోహణ
యోగ్యంబైన నా వలపలి కుఱు
వెక్కితి గావున నా పుత్రునకు భార్య
వగుమనిన. ఆది. 4.138.
వ. ఒక్కనాఁ డబ్బాలకు కుఱువు
పీఁటఁ బెట్టెన. ఆర. 3.210.

**కుఱ్ఱ** దే. విశ.
చిన్నది, లేఁత వయస్సు గలది (కొన్ని
చోట్ల సమాసోత్తర పదంబుగా నుప
యోగింపబడును).
(చూ. అల్లుఁగుఱ్ఱ, కొడుకుఁగుఱ్ఱ,
తమ్ముఁగుఱ్ఱ.)
వి.
బాలుఁడు, పిల్లవాఁడు.
సీ. ... మేసను జెన్ను
... యెప్పుడు పొదసూపె
దింకఁ గుఱ్ఱ. ద్రోణ. 2.337.
కం. నీ చక్కదనము నేనే, ...
గలుగఁ గందురా రాచుఱ్ఱా. పారాం.
భీష్మ. 3.155.
విశ.
చిన్నవాఁడు, లేఁతవయసు వాఁడు.
తే. ... నీకేల రాధ, కొడుకితండను
చక్కని కొడుకుఁగుఱ్ఱ. ఉద్యో.4.59;
ద్రోణ. 4.136.

**కుఱ్ఱి** దే. వి. పాడియావు, ఆవు.
మత్త ... నాలుగేన్పాడి కుఱ్ఱుల నీఁదె
పిదికి, పాలుద్రావుచు నుండఁగాన్.
ఆది. 5.248.
చం. ... రాజ్యముం, గొనుమను నయ్య
యిచ్చిపిపి పట్టె. ఆది. 7.101.

**కులంపునము** సం. వి. అ. న.

ఒక పుణ్యతీర్థము. ఇచ్చట స్నానము చేసినవారి కులము పవిత్రమగును. ఆర. 2 263.

**కులకన్యక** సం. వి. ఆ స్త్రీ.
తల్లిదండ్రుల యధీనమునందున్న యవివాహితయగు బాలిక.
కం. కులకన్యలకు వేడుకఁ దలవీడుల బరులతోడి రగుమాటలు ... గునే గురుజనములు కాక తెలుఁగువారు పురుషార్థనిధీ. అను. 1.51.

**కులకాంత** సం వి. ఆ. స్త్రీ.
ధర్మపత్ని.
కం. నా కులకాంతలనెల్లను,నీకుం బనిసేయఁ బనిచి నెయ్యంబున నే,నీ కనుసన్నన మెలఁగెద విరా. 2.124

**కులక్షయము** సం. వి అ. పుం.
వంశనాశనము.
వ. కావునఁ బాండవులతోడి భండనంబునఁ గులక్షయము ... తప్పదు. ... 2.201.

**కులగురుడు** సం. వి. ఉ. పుం.
వంశమునందుఁ బెద్ద.
వ.... తన్నుం బరివేష్టించినం గులగురుండగు నమ్మందాకినీ నందనుండు వారినదరింపించి కొలిపించుకొని యుండె. భీష్మ. 3.419.

**కులఘ్నుఁడు** సం. విణ. (అ. ఆ.అ.)
వంశఘాతకుఁడు, వంశమును నాశనము చేయువాఁడు.
కం. కులనాశనము సేసినఁ దత్కుల ధర్మములడఁగు నష్ట కులధర్ముల కుం గలుగును దుస్సంకరము,కులఘ్నులేఁగుదురు నరక కూపంబులకున్. భీష్మ. 1.187.

**కులజ** సం. విణ. (అ. ఆ. అ.)
గొప్ప కులమునఁ బుట్టినది; గొప్ప కులమువి.
కం. పతిహితయగుటయు భామిను,లతి ధనవతులయ్యుఁ గులజలయ్యును ననలం,కృతలయ్యెదు మాంగల్య రహితలయ్యెడుఁ గృపణవృత్తిఁ దెయ్యు మొదలుగాన్. ఆది. 4.229.
సీ, ... తులువ పిమ్మట నిన్ను దూషించు పతుకుల,పతులు నిజముగాఁ గొనుట. అను. 4.384.

**కులజనుఁడు** సం. వి. అ. పుం.
వంశమునందు పెద్ద, ...
వ. .. సుయోధనుండు సింహాసనాసీనుండై యున్నఁ జూచి తల్లిచిత్తంబున గర్హించుచు నపనెదె... కులజన చిత్త ప్రకారంబును ... బల పరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెలుగుపదం జెప్పి. ఉద్యో. 3.388.

**కులట** సం. వి. ఆ స్త్రీ.
కులము విడిచి పోవునది. అసతి, ఱంకులాలు.
సీ. ... కులటయన్నమును వనితోపజీవనశీలు నన్నంబు అభోజ్యమండ్రు. శాంతి. 1.322.

**కులదూషకుఁడు** సం.విణ. (అ.ఆ.అ.)
వ. పుంసూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు. ఆర. 1.50.

**కులధర్మము** సం. వి. అ. పుం.
వర్ణాచారవిధి.
సీ. జాతిధర్మములుఁ దేశజధర్మములుగులధర్మములును,గుణధర్మములును గాయంబు వికృతులఁ గాల పర్యయముల వచ్చు నాపద్ధర్మ వర్తన

ము. అ. గాంగేయు ధర్మసుతునకై దు
గంప్ప అను. 52.6.

**కులపతి** సం. వి. ఇ. పుం.
పదివేల శిష్యులను అన్నదానాదులచేఁ బోషించి యధ్యయనము చేయించు బ్రహ్మర్షి.
వ. కులపతి సన్నిధియగుట నిలాత లంబునఁ గూర్చున్న యజ్ఞసేనాధు సమీపంబున నాసీనుండై (ఇచ్చట వంశమునకు మూల పురుషుఁడు అను నర్థమును జెప్పవచ్చును.) శల్య. 2.380.
కం. ఎనిమిదవ దినమునఁ గుసుమం,బుల బూజించెఁ జేసి యర్ఘ్యమును గోవును నాకులపతికి నిచ్చె. శాంతి. 6.268
అను. 2 334.
శ్లో॥ మునీనాం దశసాహస్రం యోఽన్నదానాది పోషణాత్, అధ్యాపయతి విప్రర్షిరసౌ కులపతిః స్మృతః (వాచ)

**కులపర్వతము** సం. వి. అ. పుం.
కులశైలము.
సీ. ... కులపర్వతములు గూర్చి యొండొండిలోఁ దాఁకంగ పేకిమై బిన్నయాన. విరా. 2. 34.
అవి ఏవి 1) మలయము 2) శక్తి మంతము 3) వింధ్యము 4) పారి యాత్రము 5) మహేంద్రము 6) ఋక్ష వంతము 7) సహ్యము. భీష్మ. 1.34.
శ్లో. మహేన్ద్రో మలయస్సహ్యః శుక్తి మాన్ ఋక్షవానపి వింధ్యశ్చ పారి యాత్రశ్చ సప్తైతే కులపర్వతాః. సం. భార. భీష్మ. 9.10,11.
తిక్కనగారు ఇందలి గంధమాదన మును వదలి ఋక్షవంతమును దీసి కొనుటకు ఈ క్రింది శ్లోకమాధారమేమో ఇది కొన్ని భారతప్రతుల యందుండ వచ్చును
శ్లో॥ మహేంద్రో మలయః సహ్యః శక్తిమాన్ ఋక్షపర్వతః వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః

**కులపాలిక** సం. వి. ఆ. స్త్రీ.
కులస్త్రీ, మంచి కులమును శీలమును గల యాఁడుది.
వ. ... బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజ మహిషిం గని రక్కులపాలికా తిలకంబు కులకం బలం చెఱఁగిన మేనితో మాననీయ చరిత్రుండగు నద్దేవకీపుత్రు సంభా వించి. అశ్వ. 3.163.

**కులపాంసనుఁడు** సం. విశ. అ. పుం.
వంశమును జెడఁగొట్టువాఁడు, దుర్మా ర్గుఁడు.
సీ. .. ఇక్కులపాంసను నిట్టులేను, గదిసియుఁ గ్రమ్మఱఁ గిరిపురంబు నకుఁ బోనిత్తునే, ధృతరాష్ట్రుడింత వగలఁ ఆ. బొగులువాఁడుగాక పోడి మితో నుండు,వాఁడె శల్య. 2.242. విరా. 2.175.

**కులపుత్రుఁడు** సం. వి. అ. పుం.
ఉదాత్తమైన కులమునఁ బుట్టి ఉత్తమ శీల స్వభావాదులు గలవాఁడు.
కం. కులపుత్రులైన సద్భృ,త్యుల కును సత్కారమర్థితోఁ జేయుదె వా,రలు నీరణస్తవమున ని,మ్ములఁ గృతము దలంచి ప్రాణములు విడుతు రనిన్. సభా. 1.38.

**కులబ్రాహ్మణుఁడు** సం. వి. అ. పుం.

పితృ పితామహ క్రమమన వచ్చిన విప్రుఁడు. ఇచ్చట బ్రాహ్మణ శబ్దము చేత నేఁడు మనకుఁ గనఁబడు వైదికకర్మములు చేయించు పురోహిత నామక బ్రాహ్మణులను స్ఫురింపఁజేసి దెచ్చుకొని నన్నయ యట్టివాఁడని తలంపరాదు. ఇక్ష్వాకు వంశీయులకు వసిష్ఠునివలె నన్నయ చాళుక్యులకు పురోహితుఁడు మంత్రియునై యుండ వచ్చును. గంటమొకచేత ఖడ్గమొక చేతఁ బట్టు బ్రాహ్మణులు అమాత్య శబ్దముచేతను గంటము పురోహితత్వ మువహించు బ్రాహ్మణులు కులబ్రాహ్మ ణ శబ్దముచేతను మంత్రులు పిలువఁ బడిరేమో.

సీ. తన కులబ్రాహ్మణు ననురక్తు, ఆ నిత్య సత్యవచను మత్యమరాధిపా చార్యు సుజను నన్నపార్యుఁ జూచి. ఆది 1.9.

**కులభేదము** సం. వి. అ. పుం.

కులద్వేషము.

కం. నీదెసఁ గోపింతునె కుల,భేద ముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱు పం,గాదని కినియుదు లేదన,రాదలఁ తును నిన్ను నిష్ఠురంపుఁ బలుకులన్. భీష్మ. 3.443.

**కులము** సం. వి. అ. న.

1. జాతి, తెగ.

వ. .. బక్షికుల ప్రకరానేకభంగి విరుతాకర్ణనంబులను వినోదించుచు (పక్షికులము = పక్షిజాతి· పలురక ములైన పక్షులు) విరా. 1.147.

ఉ. ఇయ్యరవిందగంధి కులమేమి. విరా. 2.40.

(కులము = బ్రాహ్మణక్షత్రియాదులలో ఏ జాతి అని అర్థము)

2. సజాతీయ ప్రాణిసమూహము.

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రకుల భీషణ రోషుఁడు విరా. 1.177.

సీ. ... వాలఖిల్యాది మునీంద్రులు సిద్ధులు శాఖలఁ జెందియుండు విహ గంబుల విధమున వసింతురు. శాంతి. 6.598.

3. వంశము.

కం. నాచిత్తము తాదృశకులకు,గోచ రమే యస్మదీయ కులజన సంశి,ష్టా చార మహిమ యట్టిది,యె విరా. 3.327

వ. అని పలికి తమ కులంబు పేర హవ్యుని కొడుకుల చేత సంచిన విధంబు. అను. 1.127.

**కులమువాఁడు** వి.

సజాతీయుఁడు, తన కులమునకుఁ జెందినవాఁడు.

ఉ. కంసుఁడు నిట్లు తండ్రిమది గందెదు వానిమెచ్చి ధర్మవి,ధ్వం సము సేసినం,గులమువారలు నాకెతీఁ గింప నేను దు,ర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాఁటసి ద్రుంచి. ఉద్యో 3.379.

**కులసతి** సం. వి. ఈ. స్త్రీ.

మంచి కులమును శీలమును గల ఆడుఁది, కులపాలిక.

కం. కులసతుల గఱువచందము, దొలఁగగ నిట్టునికేఁదగునె తోయజ వదనా. విరా. 2.150.

**కులస్త్రీ** సం. వి. ఈ. స్త్రీ.

మంచికులమును శీలమును గల యాఁడుది, కులసతి.

వ. ... నన్ను ననురక్తు ననువ్రతుఁ దలఁపక యన్యాపేక్షంబున స్వయం వరంబు రచియించుట యిది కులస్త్రీ ధర్మంబు గాదు. ఆర. 2.210.

**కులాంగన** సం. వి. ఆ. స్త్రీ.
కులస్త్రీ పతివ్రత.
ఉ... ఈ, యెవ్వరు చూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన ... ద్రౌ. ఉద్యో. 3.110.
2. ఇల్లాలు, గృహిణి.
చం. అరిగె మగండు సచ్చిన కులాంగనయున్ శశి గ్రుంకినట్టి శర్వరియును బోల్పఁ బట్టగుచు. ... మాస. 98.

**కులాచలము** సం. వి. అ. పుం. (కుల + అచలము)
కులపర్వతము. అశ్వ. 1.57. (చూ. కులపర్వతము)

**కులాద్రి** సం. వి. ఇ. పుఁ. (కుల + అద్రి),
కులపర్వతము. ద్రోణ. 1.273 (చూ. కులపర్వతము).

**కులిశము** సం. వి. అ. పుం. న.
ఇంద్రుని చేతి ... ఆయుధము; పర్వతముల ఱెక్కలు ఛేదించి స్వల్పముగాఁ జేయునది. వజ్రాయుధము (చూ. వజ్రాయుధము).
ఆ. కూలె నగ్గజంబు కులిశ చండాహతిఁ బడు మహానగంబు భంగి దోఁప. విరా. 5.194.
2. గుద్దలి (కుం క్ష్మాం ... లేశయతీతి. భూమిని స్వల్పముగాఁ జేయునది. 'కులిశ' అలీప్సా భావే).
మాలిని. పరశు కులిశ కుంత ప్రాస ... ద్యత్పరిఘ కణప చక్ర ప్రస్ఫురద్బాహు సేనా పరివృతుఁ డయి. ఆది. 2 96.

**కులీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఉత్తమ కులమునఁ బుట్టినవాఁడు.
ఆ...నేను మీకు వేఁడిదాఁకు, నట్లుగాఁ జరింప నస్మత్కులీనుల, కధిక దుఃఖ కారినై తిఁగాని. ఆశ్ర. 1.93.

**కులూతము** సం. వి. అ. పుం.
ఒక దేశము. దీనిరాజు క్షేమమూర్తి.
వ. అమ్మహావీరు నాలోకించి కులూత దేశాధీశుం డయిన క్షేమధూర్తి నిజ బలంబులం బురికొల్పికొని. కర్ణ. 1.77.

**కుల్య** సం. వి. ఆ. స్త్రీ.
ఒక తీర్థస్థలము.
తే. కుల్యయందుఁ ద్రిరాత్రంబు ... శౌచియై యఘమర్షణ జపము సేసి, యశ్వమేధ ఫలముఁ బొందు ననఘ. నరుఁడు. అను. 2.87

**కుల్యము** సం. వి. అ. న.
అష్టద్రోణ పరిమాణముగల రాశి.
కం. ఘృత నదులును నోదన పర్వత ములు దధికుల్యములు నవారిత పూరిత బహువిధోపదంశోన్నత పుంజంబులును తత్క్షణంబునఁ గురిసెన్. ఆది. 7.96.

**కువ** దే. వి.
కువ్వ, కుప్ప.
కం. వివిధాస్త్ర కోవిదుఁడు వాసవి వాని రథంబుఁ బార్షిసారథుల మహిం, గువలు వడ నేసె. ఆది. 6.82.

**కువలయము** సం. వి. అ. న.

నల్లగలువ.
సీ. ... మేచక నవ కువలయ, వర్ణం
బునకు సరివచ్చు కాంతిఁ,జెలువైన
తనువునఁ,బొలుచు నన్నళినాయతాక్షి
మాద్రీదేవి యగ్రతనయ. తే. పత్ని.
ఆశ్ర. 2.44.
పుం. న.
భూమండలము,
కం. చోరులచేఁ జెడకుండం, గ్రూరు
లచేఁ జావకుండఁ గువలయ జనులన్
జారులచేఁ బడకుండ ధ,రారమణుండు
నేర్పు గలిగి రక్షింపఁదగున్. శాంతి.
2 387; ఆది. 2 224.

**కువలాశ్వుఁడు** సం. వి. అ. పుం.
ఇక్ష్వాకు వంశము వాఁడు. ఈతఁడు
మధు కైటభుల పుత్రుఁడైన దుంధుడు
అను వానిని సంహరించుటవలన
దుంధుమారుఁడు అని పేరుపొందెను.
చూ. ఆది. 4.373. మొ. 390.వ.

**కువలు వఁడు** దే. అ. క్రి.
కుప్పలు కూలు, తెగిపడు, చచ్చు.
చూ. కువ.

**కుశ** సం. వి. అ. పుం. న.
దర్భ.
చం. అతఁడు సమిత్కుశాభిహర
ణార్థము గానకు నేగియుండఁగా.
శాంతి. 2.81.
కౌశతే కుంశ్యతి వా కుశం,శిజ్
న్వప్నే శోతనూకరణే. భూమియం
దుండునది లేక భూమినల్పముగాఁ
జేయునది కుశము.
ఇది వరిదుబ్బు వలెఁ బెరుగును. దీని
రేకుల కొనలు వాడిగా సన్నముగా
నుండును. ఇవి రెండడుగుల వఱకును
పెరుగును. దీని వేళ్ళు సన్నని వట్టి
వేళ్ళ వలె నుండును. వేళ్ళు ఔషధము
లకు మిక్కిలి యుపయోగములు. దీని
గడ్డి శుభాశుభ కర్మలకు మిక్కిలి
తఱచుగా నుపయోగించును. దీనికి
చిన్న వెన్నుండును. కుంచ వంటి
తెల్లని పూవును పూయును. ఈ గడ్డిని
పశువులు కూడ మేయును.

**కుశచీరము** సం. వి. అ. న.
దర్భవస్త్రము.
వ. ... కుశ చీరచ్ఛాయా సుందరుం
డును గలహప్రియుండును. శల్య.
2.218.

**కుశద్వీపము** సం. వి. అ. పుం. న.
ఒకదీవి. భీష్మ. 1.27. చూ. ద్వీపము.

**కుశపీఠము** సం. వి. అ. పుం.
దర్భాసనము.
చం. . . శతయూపుఁడాదిగా,ముని
వరులేఁగుదెంచినఁ బ్రమోదమునం
గుశపీఠ రాజిపై,నునుపఁగఁ బంచె
గాథ వినయోక్తుల నా ధృతరాష్ట్రుఁ
డందఱన్. ఆశ్ర. 2.67., అర.2.236

**కుశముష్టి** సం. వి. ఇ. పుం. స్త్రీ.
దర్భలు గలిగిన పిడికిలి, పిడికెడు
దర్భలు.
సీ.... పోకున్నఁ, గుశముష్టి నుజ్జ్వల
విశిఖ వృష్టి.
ఆ. గురిసి నరుఁడు సేనఁ గూల్చి
యాతని భంగ,పెట్టి పట్టి విడిచె.
ఉద్యో. 3.287.
సీ. వేదాంత విదులను మోదించునట్టిది
జపకర్మ మత్యంత శౌచశాలి,యై
కుశాస్తీర్ణ సమావనీతలమున గుశ

అవిస్థలమునకు 'కుశస్థలము' అనియు 'ఇంద్రప్రస్థ' మనియుఁగూడఁ బేళ్లున్న వని వ్రాసిరి. రెండవ సంపుటములో కుశస్థలము కన్యాకుబ్జ దేశమనిరి. ఇందేది సత్యమో ఆ నిఘంటుకారులకే యెఱుక. కుశస్థలము మాత్రము ఇంద్రప్రస్థముగాదు. అని సంస్కృతాంధ్ర భారతములు చెప్పుచున్నవి.

ఇంద్రప్రస్థములోనుండి రాజసూయ యాగము చేయ సంకల్పించిన యుధిష్ఠిరుని యొద్దకు శ్రీకృష్ణుఁడు వచ్చెను.

వ. అయ్యుధిష్ఠిరు సందేశంబున దాశార్హుండును దద్దర్శనోత్సుకుండయి ద్వారవతి గదలి యతిత్వరిత గతిం జని నిరంతర ప్రయాణంబుల నింద్రప్రస్థ పురంబునకు వచ్చె. సభా. 1.100.

శ్లో॥ ఇంద్రప్రస్థ పురం యయౌ॥ వ్యతీత్య దేశాన్వివిధాన్ త్వరావాన్ క్షిప్రవాహనః ఇంద్రప్రస్థ గతం పార్థమభ్యగచ్ఛ జ్జనార్దనః సం. భార. సభా. 13.43, 44.

ఈ సందర్భముననే శ్రీకృష్ణుఁడు జరాసంధుని వధించుట ప్రథమ కర్తవ్యమని చెప్పుచు.

''ఏమును వానితోడి వైరంబు బలవంతంబైన నమ్మథుర నుండనొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతక పర్వతంబున సుఖంబున్నవారము (సభా. 1.117.) అని చెప్పెను.

శ్లో॥ పలాయామో భయాత్తస్య ససుత జ్ఞాతి బాంధవాః, ఇతిసంచిత్య సర్వేస్మ ప్రతీచీం దిశమాశ్రితాః॥ కుశస్థలీం పురీం రమ్యాం రైవతేనోపశోభితామ్. తతో నివేశం తస్యాం చ కృతవంతో వయం నృప. సం. భార. సభా. 14. 50,51.

ఇంద్రప్రస్థము వచ్చిన శ్రీకృష్ణుఁడు జరాసంధుని బాధినుండి తప్పించుకొనుటకు తాము కుశస్థలము చేరినారమని చెప్పెను.

దీనినిబట్టి కుశస్థలము ఇంద్రప్రస్థము కాదు అని స్పష్టపడుచున్నది.

రైవతక పర్వతము ద్వారకకు సమీపమునందున్నటులను యాదవులు రైవతకాచల యాత్రా మహోత్సవములు జరుపుచుండునట్లును గలదు. అశ్వా. 3.119.

**కుశానలము** సం. వి. అ. పుం.
ధర్భాగ్ని.
సీ. తీవ్ర కుశానల దీప్తాకృతియుఁ గనత్కనక మత్స్యంబులుఁ గలుగు ధనువు. విరా. 4.123.

**కుశావర్తము** సం. వి. అ. న.
ఒక పుణ్యతీర్థము. ఇచ్చట స్నానము చేసిన పాతకములు హరించును. అను. 2.74.

**కుశాస్తరణము** సం. వి. అ. న.
దర్భల పఱపు. (పఱచిన దర్భలు)
తే. పితృకరంబునఁ బిండంబు పెట్టు మనదు, శాస్త్ర మంచితమగు కుశాస్తరణముననఁ బెట్టఁజెప్పు నట్లగుటచేఁ బెట్టఁ జేత,నని మనంబునఁ దలఁచి వంచనము సేసి. అను. 3.130.

**కుశాస్తీర్ణము** సం. వి. అ. న.
దర్భల పఱపు (పఱచిన దర్భలు)
చూ. కుశముష్టి 2వ ఉదా.

**కుశిక తనూజుఁడు** సం. వి. అ. పుం.
ఇంద్రుఁడు.
కం... అపవమునకు సఫమున.పను గాలము సూవె కర్త కుశికతనూజా. శాంతి. 4.130.

**కుశికుఁడు** సం. వి. అ. పుం.
గాధిచంద్రి. విశ్వామిత్రుని పితామహుఁడు. శాంతి. 2.68.
(చరిత్రకై చూ. అను. 2.291 మొ· 331వ.)
2. ఇంద్రుని తండ్రి. శాంతి. 4.430.

**కుశేశయము** సం. వి. అ. న.
ఒక పుణ్యతీర్థము. ఇందు స్నానము చేసిన నెల్ల పాపములు తొలఁగును. అను. 2.72.

**కుష్ఠము** సం. వి అ. పుం. న.
వ్యాధివిశేషము. అను 3 175.
ఇది మహారోగములలోఁ జేరినది. ఇది మహాసామాన్య భేదములు. అందు మహాకుష్ఠములు ఏడు, క్షుద్ర కుష్ఠములు పదునొకండు. మహాకుష్ఠములు అసాధ్యములు సాంక్రామికములు. క్షుద్రకుష్ఠములు చికిత్సకు లొంగును. ఈ కుష్ఠములు వంశ పారంపర్యముగ రావచ్చును. స్వార్జితముగ రావచ్చును. ఎట్లు వచ్చినను కుష్ఠము తాఁజేసిన పాప కర్మముల వలన గాని తానొనరించిన మిథ్యా విహారముల వలనగాని రావచ్చును.
శ్లో॥ సాధూనాం వధాత్ స్వహరణాద్యైశ్చ సేవితైః పాప్మభిః కర్మభిస్సద్యః ప్రాక్తనైః ప్రేరితామలాః. ... కుష్ఠముపార్జితమ్ (వాగ్భటుఁడు)
శ్లో॥ పరుషం భాపతేత్యర్థం సత్ప గోపయుతో భవేత్. "గురుతల్పగ దోషాచ్చ గవిమైథున దోషతః దుశ్చర్మాప్స్యాదసౌ కుర్యాత్. (చింతామణి) ఆలోపతీ వైద్యులు ఈ పదునెనిమిదింటిలో రక్తజ క్రిములవలనఁ గలిగిన కుష్ఠమునే లెప్రసి (Leeprosy) అని పిలుచుచున్నారు.

**కుష్ఠి** సం. విః. (న్. నీ. న్.)
కుష్ఠరోగము గలవాఁడు. అను. 2.56

**కుసుమ బాణుఁడు** సం. వి. అ. పుం.
మన్మథుఁడు, పూలు బాణములుగాఁ గలవాఁడు.
తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు,గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, పోసి చేసి చైతన్య సంపుటము దగ ఘటించిరో కాక యిట్టి చేడియలు గలరె. విరా. 2.27.

**కుసుమము** సం. వి. అ. పుం. న.
పువ్వు.
కం. విను కుసుమంబుల వాసిం,చిన నొప్పుని కంపు విడిచి చెందును సౌరభ్య నిరూఢిం దిలలు. శాంతి. 5.418.

**కుసుమ సాయకుఁడు- కుసుమాయుధుఁడు,కుసుమాస్త్రుఁడు**సం.వి.అ.పుం
మన్మథుఁడు, పుష్పబాణుఁడు.
ఉ. ... శయ్యకుఁ దెచ్చెదం గుసుమ సాయకు పూనికి నేఁడ తీర్చెదన్. విరా. 2.245.
చం. ... ధృతిఁ గోలుపుచ్చె కుసుమాయుధుఁడు. విరా. 2.2

చం.... ఎడసేసిచే౯ కుసుమాస్త్రుఁడు
సైపఁడు నన్నుఁ బావకా. అర.5.201

**కుసుమితము** సం. విణ. (అ. ఆ. అ.)
పువ్వులు పూచినది.
వ. .. పెనుగాలిం జిక్కువడిన కుసు
మిత కాశవనంబునుం బోలు చక్కు
ట్లును. భీష్మ. 3.248, శ్రీ. 2.153.

**కుసూలము** సం. వి. అ. పుం.
ధాన్యము పోసెడు గాదె, పౌణక.మొ.
సీ. .. అయ్యుదిత విజ్ఞానామృత
స్వరూపునకు నాతండు దొఱఁగ. తే.
గాఢకుడ్య కుసూలాదికంబు చంద
మొప్పు. శాంతి. 5.616.

**కుహరము** సం. వి. అ. న.
గుహ, వివరము.
వ. ... సముదిత సాంద్రసం
రావంబు రోదసీ కుహరంబు నిండిన.
విరా. 4.265.
చ. ... గాండివ క్వణనము. రోదసీ
కుహర కర్పరముం బగిలింప
నుగ్రతన్. విరా. 5 30., శాంతి.
6.423.

**కుహూరుఁడు** సం. వి. అ. పుం.
క్రోధవశ గణాంశ భవుఁడు. ఆది.
3.80.

**కుళింగము** సం. వి. అ. పుం.
ఒక దేశము. భీష్మ. 140.

**కుళిందము** సం. వి. అ. పుం.
ఒక దేశము. ఈదేశాధిపతి ధర్మరాజు
నకు వశగతుఁడై రాజసూయమునఁ
గానుకలర్పించెను.
వ. మేరు మందర మధ్య దేశ
వాసులయిన కుళింద పారద బెంకణ
కోంకణ ... వశగతులై. సభా.
2.113.

**కుళీరము** సం. వి. అ. పుం.
కర్కటకము. ఎంద్రి.
స్రగ్ధర.. లీన నానా కుళీర వ్యాఘ్రోగ్ర
గ్రాహ మీనావళుల నెసఁగి దుర్వార
వారోఘ గంభీ,రాలంఘ్య ప్రాణవేగం
బగుచు...నుగ్రంబగు జలనిధి నంతం
తటం గంటిమంతన్. అర. 7.16.

# కూ

**కూ**
కూయి, మొఱ్ఱ.
ఆ. అకట యాడుఁబాయు నాల కూ
యును లాఁతి.వారికై నసరయ వలయు
ననిన,నన్నుఁ గీచకుండు దన్నంగ
నెట్టులు, చూడనేర్చె ధర్మసూనుఁ
డపుడు. విరా. 2.177.

**కూకఁటి** దే. వి.
చిన్న శిఖ, పిల్ల జుట్టు.
ఆ. వాఁడియైన క త్తి...
గొని,పగతుఁ... చెక్కులెగయ
గొఱిగి,నరులకెల్లఁ జూడ నవ్వగు
నట్లుగాఁ,గలయ నైదు గూఁకటుల
నొనర్చె. అర. 6.250.
శ్లో॥ ఏవ ముక్త్వా సతా స్తస్య పంచ
చక్రే వృకోదరః, అర్ధచంద్రేన బాణేన
సం. భార. అర. 271.9.

**కూఁతు** దే. వి. కూఁతురు.
'కూఁతు' శబ్దమునకు ప్రథమైక వచన
మున 'రు'వర్ణము నిత్యముగా వచ్చును
మిగిలిన ప్రథమా బహువచనమునుండి
అన్ని విభక్తులయందును రాదు.
1. ఆఁడు శిశువు, బాలిక.

వ. అంత మేము శిష్యగణంబులం గూడ ... చని యమ్మాలినీపులినతలంబున శకుంత రక్షితయైన కూఁతును .. ఎత్తికొనివచ్చి శకుంత రక్షిత యగుటంజేసి శకుంతల యను నామంబిడి కరంబు గారవంబునఁ బెనిచితిమి. ఆది. 4.48.

2. పుత్రిక, కొమార్త.

సీ. పడసిరి పలువురఁ గొడుకు గూఁతుల. ఆది. 3.51.

ఆ. రాచకూఁతు మీఁద రాగంబు పుట్టుట, నాకుఁ జెప్పవైతి నీకు, శాప మిత్తు. శాంతి. 1.242.

సీ. ... కాశీపతి కూఁతులు, కన్యలు ముగ్గురు గలుగుటయును. ఉద్యో. 4.273.

**కూఁతు కూఁతురు** దే.వి.

మనుమరాలు; దౌహిత్రి.

వ. హోత్రవాహనుండను రాజర్షి... దాని జన్మప్రకారంబును దద్వృత్తాంతంబును విని తన కూఁతు కూఁతురగుట యెఱింగి. ఉద్యో. 4.288.

**కూఁతురు**

(దీనికి ప్రథమైక వచనమునందే భాంత ప్రయోగములు గలవు).

పుత్రిక, కొమార్త.

గీ. ఆ తనూజుల కంపటం బుజన్మై లతాంగి దుశ్శల యను కూఁతురపర బుట్టె. ఆది. 5.108; అను. 4.174.

సీ. ద్రౌపది యనఁగ ద్రుపదునికిఁ గూతురై. స్వర్గ. 1.58.

2. స్త్రీ; ఆఁడుది.

కొడుకు గాంచు రావకహాపురద్దానికి నట్టిపనికి నుచితమైన సమయ మెదవె

దడయుటింక నొప్పదు. ఉద్యో. ఆది. 3.148.

**కూజితము** సం. వి. అ. న.

అవ్యక్త ధ్వని.

సీ. కలహంస కూజిత కలనాద మొసఁగ నా, పాలికి నేడొక్క బ్రహ్మ చారి. ఆ. వచ్చి పోయె. ... ఆర. 3.103.

**కూటము**[1] దే. వి.

1. కొలువుకూటము, సభాభవనము.

కం. అలుకుఁడు మృగమదమున ముగ్గులు పెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గో, డలు పూయుఁడు మణిదామక, ములు గట్టుఁడు పెద్ద కూటమున సొంపారన్. ఉద్యో. 3.152; శాంతి. 1.371.

**కూటము**[2] సం. వి. అ. పుం. న.

1. ప్రోగు, రాశి.

ఆ. .. క్రిమి, కీట రక్త మాంస కూట కుణప, ఘోర విధము శాత దారుణ చంచు వా, యస రవాన్వితం బునయ్యెఁ బథము. స్వర్గ. 1.17.

2. అగ్రము, కొన. చూ. కూటస్థుఁడు 1వ అర్థము.

3. పర్వత శృంగము, కొండకొమ్ము. (చూ. కూటస్థుఁడు 2వ అర్థము).

**కూటస్థుఁడు** సం. వి. అ. పుం.

1. కూటమందు (అగ్రమందు) ఉండు వాఁడు. వంశమునకు మూలపురుషుఁడు

వ. ... అతనికి సూర్యుండును నత్రికి సోముండును నుదయించి రాజవంశం బులకుఁ గూటస్థులైరి.

2. కూటమువలె(పర్వతశృంగమువలె) నిర్వికారముగా నుండువాఁడు. పరమాత్మ.

కం. హేతురహితుఁడ వకర్తవు,భూత స్రష్టవు సమస్త భోక్తవతత్త్వంబై తత్త్వముగగుదు జగన్నేతవు కూటస్థుఁడవును నీవ ముకుందా. శాంతి. 4.241.

**కూటువ** దే. వి.

ప్రోగు, గుంపు. (చూ. కూటువమూఁక)

**కూటువ మూఁక** దే. వి. (కూటువ + మూఁక)

ప్రోత్సాహపఱచి యక్కడక్కడ వెదకితెచ్చి ప్రోగుచేసిన పిఱుఁదము

చం. అడవుల కొండలంబడి మహాపద రూపఱి చన్నవారి నిప్పుడు గొనివచ్చి కృష్ణుఁడొక ప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చినం,బొడుతురె పాండునందనులు భూవర యేటికి నింత భీతి. ఉద్యో. 2.208.

**కూడ** అవ్య. ద్రు. ('కూడు' ధాతువు యొక్క తుమున్నాద్యర్థక చూపము)

1. సహార్థకము.

మ. ... చూర్ణంబు గావింతు నొక్కొక్క నిమేషంబున దేవ దానవులతోఁగూడం [illegible]. ఉద్యో. 4.424.

కం. భీమునిఁ దత్సోదరులను,భూమీశ్వర యిపుడ పట్టి పొరిపుచ్చెద ను,ద్దామత ద్రుంగెదఁ [illegible] మిత్రగణంబులో సుతులతోఁగూడన్. ద్రోణ. 5.210.

2. సముచ్చయార్థకము.

ఉ. ... ఇ,ద్ధాత్రిఁ బ్రసిద్ధికెక్క బల దర్పసమగ్రుఁడవైన నీవు నీ,మిత్రులు గూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్. విరా. 5.203.

**కూడంగట్టు** | **కూడఁగట్టు** దే. స. క్రి. (కూడన్ + కట్టు)

కలిసికట్టుగా బంధించు.

వ. ధర్మజ భీమార్జున నకుల సహదేవులు దమ తమ సమస్తాయుధంబులుఁ గూడంగట్టి యిందుఁ బెట్టినవారు. విరా. 4.108.

**కూడంబట్టు** | **కూడఁబట్టు** దే. స. క్రి. (కూడన్ + పట్టు)

కలిపి పట్టుకొను.

ఆ. ఎత్తికొని చనఁగ నిమ్మగునట్లుగా, మెదలుచున్న [illegible] రెంటిఁ గూడఁబట్టె నవియుఁ గూడి యొండొంటితోఁ, జక్కనంటె రెండు నొక్కడయ్యె. సభా. 1.147.

**కూడంబడు** | **కూడఁబడు** దే. అ. క్రి. (కూడన్ + పడు-స్వార్థమున)

కూడు, చేరు.

వ. పాండవులు నవ్వనంబున ననేక మృగంబుల వధియించి యందఱు నొక్కయెడం గూడంబడి యాశ్రమాభిముఖులై వచ్చునెడఁ దమ్ములఁ జూచి ధర్మజుఁ [illegible]. ఆర. 6.193.

ఉ....మును వోయెడునప్పుడు సెప్పు కొన్న సంకేతపు, జోటఁ గూడఁబడి దేవముఁ బొందుచుఁ జాలుంపెఱున్. విరా. 3.72.

**కూడంబాఱు** | **కూడఁబాఱు** దే అ. క్రి. (కూడన్ + పాఱు. స్వార్థమున)

కలిసికొను, ఏకమగు.
వ. బంధుజనంబులు గూడంబాటి కీచకశవంబుఁ గనుంగొని విరా. 3.6.
వ. నీవిటవచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రులుం గూడంబాటి తమలో నిశ్చయించిన తెఱంగు. ఉద్యో. 3.235.
ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున కరిగి సురవరేణ్యుఁడడఁగియుండె నమరులెల్లఁ గలఁగి యన్యోన్య పీడన భయముఁ బొంది కూడఁబాఱి. ఉద్యో. 1.142.

**కూడంబెట్టు** | **కూడఁబెట్టు** దే. స. క్రి. (కూడన్ + పెట్టు)
సమావేశము చేయు, ఒకచోఁగూర్చు.
వ.... తొల్లి దుర్యోధనుండు **మాతోడి** యీసునం జేసి పెక్కండ్రు, రాజులను బ్రముక్కడి మూఁకలనుం గూడఁబెట్టి ధనంబు వ్యయపెట్టి భూమియు బండారంబునుం బాడుచేసె. ఆశ్వ. 1.14.
**శా. తోడంబుట్టిన భీమ** పార్థుల మహాదోర్దర్పముల్ లాతుఁలై లోడంచుం బెఱవారి దుర్బలుల నెందున్ నచ్చి దైన్యంబునం, గూడంబెట్టెదు ... ఉద్యో. 3.334.

**కూడఁగఁదెచ్చు** దే.స. క్రి. (కూడఁగన్ + తెచ్చు).
కదియఁజేర్చు, దింపఁజేయు.
చం. ... జల్లనం జెదరు దెంపము గూడఁగఁదెచ్చి నన్నుఁ గేవలమున ముట్టనెవ్వరికి వచ్చుననుం గలఁగుచు వెనుంబడున్. విరా. 2.104.

**కూడఁగముట్టు** దే. స. క్రి. (కూడఁగన్ + ముట్టు)
తఱుముకొనివచ్చు.
మ... ఆతండవినీతి సేసినను జేయీకేను మత్స్యావనీశుని యాస్థానము దిక్కు వే చనిన నచ్చోఁ దీవ్రకోపంబున,న్వెనుకం గూడఁగముట్టి పట్టికొని తన్నెం బల్కులింకేటికిన్. విరా. 2.158.

**కూడఁద్రోచు** దే. స. క్రి. (కూడన్ + త్రోచు)
ప్రోగు చేయు,కుప్ప చేయు,
వ. కశ్యపుఁడు నా భస్మచయంబు గూడఁద్రోచి తనమంత్ర తంత్రశక్తిం జేసి యెప్పటియట్ల వృక్షంబుగాఁ జేసిన. ఆది. 2.192.

**కూడఁబోవు** దే. స. క్రి. (కూడన్ + పోవు.)
సమీపించు.
శా. (భీష్మద్రోణులు దుర్యోధనునితో) ఈ కౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యేపొప్పదెందుం దుదిన్,శోకంబొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁబోవే నృపా. ఉద్యో. 4.24.

**కూడముట్టు** దే. స. క్రి. (కూడన్ + ముట్టు)
తఱుముకొనివచ్చి కలిసికొను.
(ద్రౌపది తన భంగపాటు చెప్పుచు భీమునితో)
తే. పాఱుతెంచిన యక్కులపాంసనుండు, గోపమదరంగ వెనుకన కూడముట్టె,నట యెఱుంగుదు **నీవు** మీయన్న పెద్దతనముఁ **జూచితివే** మందు ననిలతనయ. విరా. 2.175.

వ. ముహూర్తమాత్రంబునఁ గూడ ముట్టి యమ్మృగంబు సమయించి ఆర. 4.339.

**కూడవచ్చు** దే. స. క్రి. (కూడన్ + వచ్చు - స్వార్థమున)
చేరవచ్చు.
**తే.** ... అమ్మహాభాగుఁడప్పు,డోడ కోడకుమని నన్నుఁ గూడవచ్చి. విరా. 5.286.

**కూడవైచు** దే. స. క్రి. (కూడన్ + వైచు).
ప్రోగు చేయు.
**తే.** ... ఆప్రొద్దు సమిధలు సాల గూడ,వైచి యనలంబుఁ గూర్చి యవ్వనిత. ఉద్యో. 4.368.

**కూడికొను** దే. అ. క్రి. (√ కూడు[2]
1. చేరుకొను, కలసికొను, ఏకమగు.
వ. ... బహు ప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేత స్థలంబు నం గూడికొని మా వర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట దివ్య చిత్తంబున నవధరించినభంగి సేయు వారమై. విరా. 3.87; సౌప్తి. 1.90.
కం. వేడుక పుట్టిన జూదం,బాడె నె ధర్మజుఁడు వారలందఱుఁ దమలోఁ, గూడికొని పిలిచి బలిమిన,యాడి కప టజయము గొనుటయది దగవగునే. ఉద్యో. 1.25.
[తామందఱు ఒక కట్ట కట్టుకొని]
2. స్నేహము చేయు.
వ. .. అమ్మాత్సర్యంబున నక్కర్ణుండు మీయెడ నీసు గలవాఁడయి దుర్యోధనుం గూడికొనియె. శాంతి. 1.18.

శ్లో॥ స సఖ్యమకమరోద్యాత్తే రాజ్ఞా దుర్యోధనేన చ. సం. భార. శాంతి. 2.8.

**కూడిమను** దే. అ. క్రి. [√ కూడు[2]
కలసి మెలసి బ్రదుకు.
ఉ. ... ధర్మజుఁడు... పూన్కి దగ. దీర్చియుఁ గూడి మనంగఁ గోరెడిన్. ఉద్యో. 3.281.

**కూడిముట్టు** దే. స. క్రి. (√ కూడు[2]
తఱుముకొని వచ్చి యెదిరించు.
ఆ. కూడిముట్టిఁ గ్రీడి కురువంశమున కెల్ల,మూలకందమీ నృపాలుఁడితని, నిచటఁ గాచికొనుట యెల్ల పౌరుష ములుఁ జేత నిలిచి లావు సేయవలయు విరా. 5.199.

**కూడియుండు** దే. అ. క్రి. [కూడు[2]]
చుట్టు చేరు, పరివేష్టించు.
ఆ. చెలఁగి లేవనేర్చు చిఱుతక దానిఁ గ్ర,వ్యాద ఘోర మృగములు లశనబుద్ధిఁ, బట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు, కొని శకుంతలతతులు గూడియుండె. ఆది. 4.46.

**కూడు[1]** దే. వి. ఔ.
అన్నము, తిండి.
కం. పేరు వలలుండు గూడుం జీర యు నిడి సాకతంబు సేసినఁ జాలుం గోరిన వంటకములు నా,నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్. విరా. 1.219.
తే. కుడుచునెడ వాని పెనుప్రేలు కూటిలోన, దునిసి పడియున్న ఆది. 7.259.
ఆ. ఆలు బిడ్డ లేని యట్టి త్రిమ్మరి

యగు,కొయ్యఁగాక కుదుటఁ గూడుపెట్టి కుడుచు వారలిట్టి క్రొవ్విడంబులు సేయఁజొచ్చుటిచ్చగించిచూతురయ్యం ఉద్యో. 2.9.

**కూడు2** దే. అ. క్రి.

1. గుమిగూడు, ప్రోగగు, సంఘీభవించు.

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు మీ,రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనలఁ గూర్చుఁడు. విరా. 3.126.

2. తగు, యుక్తమగు.

ఉ. రాజగృహంబు కంటె ప్రఘనమ ముగా నిలు గట్టఁగూడదు. విరా. 1.123.

చం. వికటుఁడు సూచుచుండ పదివేవుర ముందట నట్లు ద్రోవ నొ,క్కరుడును గాదు గూడదనఁగల్గెనె. విరా 2.257.

పద్మకము. కొడుకు పల్కు విని కూడదు నాక దురాత్ముఁడై కడఁగి మీకు నపకారము సేసి ధరిత్రి వె,ల్వడఁగఁ బంచెఁ గడు బాపమతిన్ ధృతరాష్ట్రుఁడు. ఆది. 6.227.

3. కలసియుండు.

వ. సుశర్మయుఁ నేలినవాని పనిఁబూని జోడు పక్కెర కైదువు బిరుదు గూడి ప్రదేశం బాపోశనంబు గొనం దమకించు తన బలంబు గజిబిజి యుడిపి కొని. విరా. 3.131.

4. తోడ్పడు, సాయపడు.

ఉ. దేవకుమారకుండయగుఁ దేజము చందము సూడ నాతఁడీ, గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడిన యంతెయు కాదు నాకు సం,భావన సేయు వత్సలతభంగులఁ దా మన వంశమంతయుం,గావను బ్రోవనుం దలఁపు గల్గుట దెల్లము సేసె. విరా. 5.302.

5. ఏకమగు, ఒకటిగానగు.

ఆ. చాపములును దొనలు వర్మములు నసి ముద్గరా,ద్యాయుధములఁ గూడ నతఁడు గట్టె. విరా. 1.172.

స. క్రి.

పొందు, చెందు.

కం. బాడబ దహనుఁడనై వడి,నేడు సముద్రములు జలములేఁ గ్రోలుదు నీ,రేడు జగంబులు విలయము గూడెడునెడఁ దజ్జలంబు గొనకొని విడుతున్. అర. 4.271.

2. కలుపు, సంకలితము సేయు.

మ. ... విరాటపర్వమట యుద్యోగాదులుం గూడఁగాఁ బదియేనింటి ... విరా. 1.7.

స. క్రి., అ. క్రి.

చేరు, కలియు.

కౌరవపతి ముట్టనదరినంత సేనల తనిఁ గూడె. విరా. 5 289.

చం. .... ఎడ గలుగంగఁబోయెఁ బసులిప్పుడ కూడుచమన్న నాతఁడున్,నదపఁదొడంగుఁడున్. విరా. 4.171., విరా. 1.172.

ఉ .. నీచు సుయోధనుఁ డట్టివానిలో బొచ్చెము లేక గూడి మనఁబోవక పోవఁగరాదు నాకు. ఉద్యో. 3.46.

సీ... మనమెంత, దఱిమిన మృగము ఒడ్డయు జవంబు గలదు రథ్యంబులు గడుకొని కూడంగఁజాలవు. అర. 4.338.

[కూడు = సమీపించు. దగ్గఱ]
2. రమించు, సంభోగించు.
కం. ... లోపాముద్రం జూచి మునీంద్రుఁడు మన్మథ,గోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దివిరెన్. అర. 2.331.

**కూడుగూర-కూడుగూరలు** దే. వి.
అన్నమును, కూరలును.
తే. ఏను వంటలవాఁడనై యా నరేంద్రుఁ,గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్తమునకును వచ్చిన చందంబునన యొనర్చి నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి. విరా. 1.76.
సీ. తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై ఫల మూల మధు మాంసములును మేలికూడు గూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి యావహించుచు. శాంతి.3.177

**కూడు వెట్టు** దే. అ.క్రి.
తిండిపెట్టి పోషించు.
ఉ.... వి,భాజిత రాజ్యతంత్రములు పాలన సేయుదు నేన వీటికిన్,రాజనఁగా నెపంబిడి విరాటునకుం దగఁ గూడు వెట్టుదున్. విరా. 2.254.

**కూడు సీర** దే. వి.
కూడును గుడ్డయును,అన్నవస్త్రములు.
కం. వినుము గుణవంతుఁడొక్కఁడు, ధనవంతండైనయొక్క ధరణీనాథుం, దన కూడుసీరకై కాం,చనమడిగి. శాంతి. 3.164., శాంతి. 4.32.

**కూన** వై. వి. (సం. కుణకః)
పశుపక్ష్యాదుల శిశువు - శిశువు.
కం. పులి గూనలఁ దిను చందము, గలిగిన నంతటను నిలుచుఁగాక ధనంబుల్,గలుగునె మీఁదం గావున,జలగ దిగిచినట్లు గొనఁగజను నిల సొమ్ముల్. శాంతి. 2.303.

**కూపము** సం. వి. అ. పుం.
1. నూయి.
వ. ... సరిస్వతీజలంబు తత్కూపంబున నుద్గతంబై యా సవనపతి నుద్ధరించె. శల్య. 2.155., శాంతి. 2.284., శాంతి. 5.128.
2. ఒక పుణ్యతీర్థము.
వ. గంగమడువున నొక్క కూపంబున మూఁడు కోట్ల తీర్థంబులు సన్నిహితంబులయి యుండు నందుఁ గృతస్నానులయినవారికి సర్వతీర్థ స్నానఫలంబగు. అర. 2.267.

**కూబరము** సం. వి. అ. పుం. న.
బండి నొగ,యుగంధరము.
చం. .. గ్ర,క్కున నతఁడొల్లబోయి రథకూబరమూఁతగ నిల్చె సోలుచున్. విరా, 5.176.

**కూయి** దే. వి.
కుయి, కుయ్యి, కూ.
1. ఆర్తి సందేశము,భయ వార్త.
వ. ... నేఁడు కొందఱు పసులం బట్టిరని కూయి వచ్చిన. విరా. 4.29.
2. సాహాయ్యము.
వ. .. మత్స్యనగరంబునఁ గొంతే యులున్నవారని శంకించి వారలు గూయివచ్చినం గినుటకుంగాదె యిట్లు నిశ్చయించి చేసినపనికి నిపుడు విచారంబేల. విరా. 4.185.
3. రక్షణము.
చం. అసమున మీఁదెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం, బసు

లకుఁ గూయుగా జనియెఁ గాపఁడు. విరా. 5.234.

**కూయు** దే. అ. క్రి.

అఱచు.

కం. మానెనఘోషబె నక్కలు కూసెన్ విరా. 4.86.

చం. ... శుక కోకిల భృంగతతుల్ వనంబులం,దెడనెడఁ బల్కఁ గూయ సొనియించఁగ మ్రోయఁగఁ ద్విరావముల్. ఉద్యో. 2.111.

**కూర** దే. వి.

శాకము (తోటకూర వంకాయ మొదలగునవి)

ఉ. ... మేన్,గాజియపెట్టిత్తున నాడి కంబుగ వండుదు నెల్ల గూరలు. విరా. 1.77.

తే. వింతకూరలు గుడుపున వేడ్క సేయు,భంగి సంగ్రామమున నూత్న భంగులెకఁడఁ, గౌతుకము సేయు. శల్యా. 2.93.

**కూరఁగ నాటు** దే. ఆ. క్రి.

లోతుఁగా దిగఁబడునట్లు గ్రుచ్చు.

ఉ.... కడునొప్పెడు మేనులు వాఁడి కైదువుల్,గూరఁగ నాటినం బుడమిఁ గూలుటకక్కట యోర్వవచ్చునే. ఉద్యో. 3.268.

**కూరదిను** దే. అ. క్రి.

కందమూలములు భక్షించు.

సీ. ... ఇంక నెన్నాళ్ళుపుంచెదె, గొంతి వనంబునఁ గూరదినుచు. ఆశ్ర. 2.15.

**కూరగాయలు** దే. వి.

కూరలు, కాయలు (తోటకూర మొదలగు ఆకుకూరలు), వంకాయ మొదలగు కాయకూరలు)

ఆ. బియ్యములును నేయుఁ బెరుఁగును గూరగాయలును వంట కట్టియలును గడ్డి,కవణములును బెల్లుగా నొడఁ గూర్చె. ఉద్యో. 1.93.

**కూర యసరు** దే. వి.

శాక రసము ఆకు పసరు.

సీ... ఒక్కనాఁడ త్రపస్వి వ్రేల్నాటి దర్భ. ఆ. గంటిఁ గ్గూర యసరు గాఱిన న్రరించె నతఁడు, శల్యా.2.160

శ్లో. పురా మంకణకస్సిద్ధః కుశాగ్రే ణేతి విశ్రుతమ్. క్షతః కిల కరే రాజం స్తస్య శాకరసోఽస్రవత్. సం.భార, శల్యా. 40.39.

**కూరాకు** దే. వి.

కూరకుఁ బనికివచ్చు ఆకు.

కం. ... నేనడవులకున్, మరలం బోయెద నచటం, దిరిగెదఁ గ్గూరాకు గోసి తినియెద. భీష్మ. 2.8.

**కూరాకు గోసి తిను**

తినుటకుఁ బనికివచ్చు ఆకులను ఏఱి త్రుంచి తిను. (చూ. కూరాకు).

**కూరిమి** }
**కూర్మి** } దే. వి. (√ కూర్చు)

1. ప్రేమ. స్నేహము, వాత్సల్యము.

కం. హరి యొకఁడు నీనాకండవుఁ, బరమాప్తులు గలిమి నరుఁడు భారవుఁ బనికిం,జొరనలుకఁడు నీ కూరిమి హొరపొచ్చెము గాక యుండఁ బోవఁగ వలదే. ద్రోణ. 3.285.

చం. తన మునుపడ్డ బన్నములుఁ దమ్ముని పైఁగల కూర్మి పేర్మి నీ,జన పతి సైపకున్నె. ఉద్యో. 2.102.

2. స్త్రీకి పురుషుని మీఁదఁగాని పురుషునకు స్త్రీమీఁదఁగాని యుండు అనురాగము.

కం. వారిజలోచన నీపైఁ గూరిమి గల మగని వెదకికొను మొరు ననఁడే. ఉద్యో. 1.350.

విశ. కూరిమి గలది; ప్రియము.

సీ. ... మల్లన సిద్ధనామాత్యుల, కూరిమి తమ్ముండు గుంటూరు విభుఁడు,కొమ్మనదండనాథుఁడు. విరా. 1.10.

చం, .. సమీరు కూర్మినందనుఁడు. విరా. 2.332.

**కూడు**1 దే. అ. క్రి.

1. కలుగు.

కం. .. ఈ ప్రబంధమందలి కథినాథునిగా నే పురుషునిఁ జేర్కొనువాఁడనొ యను తలఁపు గూరిన మదితోన్. విరా. 1.8.

కం. ... శోకము,గూరన్ గద్గదిక నెలుగు గుత్తుకఁ దగులన్. భీష్మ. 2.364., శాంతి. 3.98.

2. చొచ్చు, తూఱు, దిగఁబడు.

ఉ.... కడు నొప్పెడి మేనులు వాఁడికై దువుల్,గూరఁగ నాటినం బుడమిఁ గూలుటకక్కట యోర్వవచ్చునే. ఉద్యో. 3.268.

స. క్రి.

పొందు.

అ. ఎల్లవారు నెఱుకలెడలి చొక్కిక్కని,ద్రాతిశయము టూరినట్టులైరి. విరా. 5.208.

కం. గంగాసుత గురు కర్ణుల,సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నారం గనియు నీ తనయులా,సంగూరిరి వారిఁ జంపు శల్యుండనుచున్. శల్య. 1.110.

చం. .. కైకొనుమన్న నతండు ప్రీతినె,క్కొన భుజియించు వెండి యను గూరఁదతృప్తి. అశ్వ.4.233.

**కూరు**2 దే. అ. క్రి.

నిద్రించు.

గీ. కూరు మొన పెట్టినట్టులు గొంద ఱుజ్జ్వలాయుధములు గంకటములు నమరనున్నఁ జూచి చావనివానని చూడు చేర,నరుగకున్నవి కంక గృధ్రాదులలికి. స్త్రీ. 2.20.

(కూరు మొన = నిద్రించు సేన)

**కూరుకొను-కూర్కొను** దే. స. క్రి.

క్రుకుక్కు.

సీ. . .ఏను శంతనుసుతుండు, గురుఁడునువిదురుండుఁగూర్కొనికూర్కొని చెవులఁ బోయమె సవిశేష. గీ. కాక్య వచనముల. స్త్రీ. 1.142.

**కూరు మొన పెట్టినట్టులు**

నిద్రింౘు సేన పట్టుకొనినయట్లు. చూ. కూరు2.

**కూరుచు-కూర్చు** దే. స. క్రి.

1. చేర్చు. అంటియుంపజేయు.

కం. అని తలఁచుచు నచ్చట నొక, వననిధిఫేనంబుఁ జూచి వాసవుఁ డార్ద్రం,బును శుష్కంబును గాదిది, యనుచుం గులిశమునఁ గూర్చి యధిక రయమునన్. ఉద్యో. 1.1396.

సీ. ... ఇన్నియును సంకలితములుగ,నంచిత క్షేత్రజ్ఞునందుఁ గూర్చినవాఁడు. ... శాంతి. 2.8;

తే. ... ప్రాపు ప్రాణంబువెవుడ, నన్ను కూర్చి యేరెంతు నీ సన్ని ధనక. శాంతి 3.332.

2. సంఘాతము చేయు, సంఘటన చేయు.

ఉ. అసల వచ్చి పాదల కన్నీటి కోర్చి లతాంగిఁ గూర్చి కాకి,వెడమాట లన్ మరలింతు. విరా. 2.78.

ఆ. ఇంత కలిసేలి యెమ్మెయినై నను నాప్ప నలవరించి కూర్పుటి డుకె. విరా. 2.80.

3. మిత్రులుగాఁ జేయు,మైత్రిచేఁ గలుపు.

ఉ...కాక సహించి పాండవులఁ గౌర వులం బిలిచి కూర్పు సేఁపునన్. ఉద్యో. 3.75.

4. సంపాదించు, కూడఁబెట్టు, నిలువ చేయు

సీ. .. పాపపిప్పియు బొంకియు ధనము గూర్చి,చెల్ల పాపములకు నెక్కుడు. శాంతి. 5 2.8

గీ. .. కొంపకట్టము వారిక కూర్చి యిచ్చితి. ... ఆది. 7.133.

ఆ. వికచ దొంగి,చక్రమునయందు శక్తి పంచన పొంకర్చి ధనము కూర్చియుదయ ఆది. 5.105.

5. జతము, ఏకము చేయు.

సీ. పంపడు నునుఁగాంతి కందేర్చి కూర్చి బా,సనకుఁ దెచ్చిన యట్లు గొమరు మీరెఁ. విరా. 2.52.

6. సిద్ధపఱచు, ప్రోగుచేయు.

చం. మనబలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్దమంబుగా, మనమును గూర్చి. విరా. 3.108.

ఆ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రి గర్తులు దాడికిఁ గూడువారు మీ, రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనలఁ గూర్పుఁడు. విరా. 3.127,

7. పొందించు, చెందఁజేయు.

ఉ. .. విప్రునకుదాత్త ధనంబొడఁ గూడునేని సం,తానముఁ గూర్ప నర్థు లకు ధర్మనిరూఢతఁ బంచిపెట్టు దు,ర్మాన విదూరుఁడై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశ దీపకా. శాంతి 2.223.

గీ. దండ్యు దండింపకుండుటయుఁ దుష్టు దండ,నంబు గూర్చుట విప్రుమనంబు నొచ్చు,నట్టి పనిసేఁత సూ హింస ధరణిపతికి. ... అను. 5 66.

8. సంధించు.

కం. అనవుడు నవ్వీరుఁడు స.య్యన నరదము డిగ్గి నియతుఁడై ధనురా చా,ర్యుని సంస్మరించి చాపము,గొని మంత్రముతోఁడ శరము గుణమునఁ గూర్చెన్. 2.63.

9. కలిగించు, కావించు, చేయు, సమ కూర్చు.

కం. కలపములు గూర్ప బహువిధ, తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలుపు,వ్వులు గట్టికట్టి మోద్వఁగఁ,

పలముదుపఁగ సరులు గ్రువ్వ,దద్దయు నేర్తున్. విరా, 1.320.

సీ. కలపంబులఖీఁవ గంధంబులుగఁ గూర్చి తనువున నలదుదు ననువు గాఁగ విరా. 1.107.

10. ప్రేమించు. చూ. కూర్చువాఁడు.

1. ఇష్టుఁడగు, ప్రియపడు.

కం. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీవొక్కరూప యసదృశ ధర్మా,వారుఁదవు రాజునకుం, గూరుతు గలమేమి యిట్లనుటకుం జెపుమా. ఉద్యో. 3.217.

మ. హరిమేనల్లుఁడు గొంతి కూర్చు మనుమం డస్మత్తనూజుండు, ద్రోణ. 2.236.

కం. ధనలుబ్ధుల మ్రుచ్చులఁ గూర్చ నివారలఁ బగఱవలని వారల ధృతి చాఁ బాపల దుర్జనులం,బసుపవుగా రాచకార్య భారము దాల్పన్. సభా. 1.40.

వ. కృష్ణుండు నీకుం గూర్చు నీకుం బరమాప్తుండైన సంజయు నతని పాలికిం బుచ్చితది లెస్స. ఉద్యో. 2.325, అను. 1.274.

చం. ... ఇక్కురువిభుఁ డింతసేపు గడుఁ గూర్చి విలాపము సేసె వారి కిన్. ఆర. 5.355.

2. పొదుపు. జోడించు.

ఉ. కూర్చుట నూత్న రత్నమునకుం గనకంబునకుం దగున్. విరా. 1.28

3. ఉపకరించు.

ఆ. ... పనికిఁ జాలఁ గూర్తునేను. విరా. 1.101.

**కూర్చికొను** } (చూ. కూర్చుకొను.)
**కూర్చుండఁబడు** } దే. అ. క్రి.

($\sqrt{}$ కూరుచుండు.స్వార్థమున'పడు') కూలఁబడు, చతికిలఁబడు.

ఆ. వలుఁద నారసంబు వక్షంబు దూఱంగ,నేయుటయును బాండవేయుఁ డార్తిఁ గూరి నిలువలేక కూర్చుండఁ బడి సూతు,నరద మెగువు తోలఁగ ననియె నధిప. కర్ణ. 2.381.

గీ. ఇంత పాపంబు సేయంగ నెత్తి కొందు,మయ్య రాజ్యలోభంబుననఖిల బంధు,జనుల వధియింపఁ దొడగితి మని రథంబు, మీఁదఁ గూర్చుండఁ బడియెఁ జేయూఁదికొనుచు. భీష్మ. 1.188.

**కూర్చుండు** దే.అ క్రి. ($\sqrt{}$ కూరుచు) ఉపవిష్టుఁడగు, ఆసీనుఁడగు.

కం. ... తనకునర్హంబగు నెడఁ గూర్చుండి. విరా. 1.121.

కం. చని ధర్మసుతుఁడు సింహాసన మున భీమాదులాత్మ సముచిత రుచి రా,సనముల సభాస్థలిం గడు,కొని పంచాగ్నులనుబోలెఁగూర్చున్నంతన్. విరా. 5.316.

**కూర్చుకొను** } దే.స క్రి.($\sqrt{}$ కూరుచు
**కూర్చికొను** }

వెంటఁ బెట్టుకొను.

వ. ... తమ్ములం గూర్చుకొని తమ యంతవట్టును నొక్కట విరాటు నకుఁ బొడసూపిన. విరా. 3.219.

2. ప్రోగు చేసికొను.

కం. కళలుం గాష్ఠలు లోనుగఁ,గల చిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం,బుల వధ్దించు నాతని,వల నల

పడఁ దొడఁగి దాఁక వట్టుఁగఁ జేయున్ శాంతి. 4.443.

కం. నానాదేశంబుల బలు,మానిసులం గూర్చికొని సమత్సర బుద్ధిం, దానే మనియెడు సుయ్యోధను,నూనం దలఁపని తెలుఁగు సూతము చెపుమా. ఉద్యో. 2.223. విరా. 3.146.

కూడు, సంకలనము చేయు.

సీ. రెండవ జోటి నొక్కండు దధిమాస మిశ్రితాన్నములెల్లఁ గూర్చికొనఁ బడిమూఁడు పాయసములు దప్పక యున్నదితోడను నింపె. విరా. 4.232.

4. (తెక్కలు) ముడుచుకొను.

వ...వింతమానిసి మెలంగి ముసుంగు పుచ్చి కట్టు మేలుకని యెఱకలు వాదల విదిర్చి కూర్చికొని కలగొనంబడుకు పులుఁగుల మెలుంగులవలన విరా. 2.240.

**కూర్పుకోలు-కూర్చికోలు** దే. వి. (కూర్చుకొను) కూర్చుకొనుట, కలియ గట్టుకొనుట.

చం. నరవరుఁడేము సంగరమునం బరకుఁ బ్రియముం గదక్కటా,బరవస మేది వచ్చెఁ బడపన్ వినియున్ మముఁ గూర్చికోలు దు,స్తరమను బుద్ధి నిప్పటికి శత్రుల కన్నొడఁగం బలంచి యీ,వెరవున డాఁగ...పృథివీపతి మద్దెనిట్టు హెంధునే. శల్య. 2.17.

**కూర్పువాఁడు** దే.వి. (√ కూర్చు) ప్రియుఁడు, ఇంకు మగఁడు.

వ. పింగళయను వేశ్య దన కూర్పు వాఁడు రాక వాచ్చి పెద్దయుం,ప్రొద్దు పోవు నంతకునుండి వాఁడు రాకుండుటయును. శాంతి. 4.16.

**కూర్పనివాఁడు** దే.వి. (√ కూర్చు) ఇష్టము కానివాఁడు. అప్రియుఁడు.

కం. ధనలుబ్ధుల ప్రముచ్చులఁ గూ,ర్పనివారలఁ బగఱవలని వారల ధృతి చా,లనివారల దుర్గములం,బనుపవుగా రాచకార్య భారము దాల్పన్. సభా. 1.40.

**కూర్పరము** సం. వి. అ. పుం. మోఁచేయి.

వ. .. బకావరజుండు దస్సినం బవమానపౌత్రుండు పదపైచి తాను మీఁదై తాను కూర్పర ముష్టి ఘాతంబులు నిర్ఘాత పాతంబులుం బోల్కిఁ బ్రయోగించి నొప్పించి ద్రోణ. 3.268.

**కూర్మనఖరము** సం. వి. అ. పుం. ఒక విధమైన బాణము (ఇది తాఁబేటి గోటివలె నుండుటచే దీనికీపేరు వచ్చి యుండవచ్చును.)

కం. ఇంతయుఁ గనుగొనియును శత్రుంతపుఁ డోసరిలకాజి దోహల మలరం,గౌంతేయుతోఁ దలఁపడి, వింతలయిన కూర్మనఖర విశిఖము లేసెన్. విరా. 5.75.

వ. ... విజృంభించి భల్లాంజలిక క్షుర ప్రకూర్మనఖర ప్రభృతి బాణ వేటికా వితానంబుల వెగడుపఱచిన. ద్రోణ. 2.39.

**కూర్మము** సం. వి. అ. పుం.

2. తాఁబేలు, కచ్ఛపము.

సీ. బహు పదాతి దుర్భర భారమద

రిన,నురగ కూర్మంబు లొండొంటిఁ బొంద. విరా. 3.156.

2. శ్రీ మహావిష్ణుని దశావతారము లలో ద్వితీయావతారము.

ఉ. నీ వలమూఁపులావు మును నేల వహించిన నాగ కూర్మగో,త్రావని భృద్దిశాకరుల కారయ నూఁఁటపట్టు గాదె. విరా. 2.193.

**కూర్మరాజు** సం. వి.

శ్రీ మహావిష్ణుని దశావతారములలో రెండవ అవతారము.

వ. ...అందఱు నప్పర్వతంబు దెచ్చి సముద్రంబులో వైచి దాని క్రింద నాధారంబుగాఁ గూర్మరాజు నియమించిరి. ఆది. 2.11.

**కూర్మ వ్యూహము** సం. వి. అ. పుం.

తాఁబేటి యాకారమునుఁ బన్నిన మొగ్గరము. భీష్ముఁడు తన యెనిమిదవ నాఁటి యుద్ధమున దీనిని తీర్చెను. దీనిఁ [illegible] ధృష్టద్యుమ్నుఁడు శృంగాటక వ్యూహము పన్నెను. భీష్మ. 3.69.

**కూర్మి** చూ. కూరిమి.

**కూలఁదన్ను** దే. స. క్రి.

పరిత్యజించు, విడనాడు.

తరలము. కడఁగి బుద్ధిబలంబునందఁ యకంటకంబుగఁ జేసి యేఁ బుడమి రాజ్యము సర్వముం దగ బుచ్చియిచ్చిన నిమ్ములం,గుడువనేరక దీని నిచ్చటఁ గూలదన్ని శరీరమున్, విడుతుఁగాకని నిశ్చయించెదు వెఱ్ఱివైతె నరేశ్వరా. అర. 6 32.

శ్లో॥ మయా హృతాం శ్రియం స్ఫీతాం మోహాదపహాయ కిమ్, త్వమబుద్ధ్యాద్య నృపతే ప్రాణానుత్స్రష్టు మర్హసి. సం. భార. ఆర. 2.503. (వావిళ్ళ).

**కూలఁద్రోచు** దే. స.క్రి.

పడఁగొట్టు.

ఆ. పల్లవ ప్రసూన ఫలభరితంబగు, మ్రాను గూలఁద్రోఁచు మత్తగజము, పోల్కి వివిధ రత్న భూషితుం,డైన సూతుఁగూల్చె ననిలసుతుఁడు. విరా. 2.52.

**కూలవేయు** దే. స. క్రి.

పడవేయు, చంపు.

వ. అతని యరదంబు గుఱ్ఱంబులం గూలనేసిన. భీష్మ. 2.78.

**కూలము** సం. వి. అ. న.

గట్టు, ఒడ్డు.

వ. . . సరస్వతి యత్తపస్వి తన చేరువ నొకప్పుడు జపయుక్తుండై యుండఁ గూలాపహరణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొనిపోయిన. శల్య. 2.170., శాంతి. 5.184.

**కూలవైచు** దే. స. క్రి.

1. [illegible]

సీ. ... [illegible] వలచినయప్పుడు గొనిపోవు నవలీలఁ గూలవైచు. విరా. 2.15.

2. చంపు.

తే. ... వానిగజముఁ, గూలవైచిన నాతండు నేలకుఱికె. భీష్మ. 2.115.

**కూలద్రేయు** దే. స. క్రి.

మ. . ఉన్మదుఁడా భీముఁడు నన్నునిం దొడరినన్వజ్రప్రహారంబు వెట్టి

దమై తాఁకిన గూలు పర్వతము
మాడ్కిం గుంభినిం గూలవ్రే, సెద
నా కోర్కిగదా గదారణము వచ్చెం
బెద్ద కాలంబునన్. ఉద్యో. 2.218.

**కూలహ** సం. వి. ఆ. స్త్రీ.

ఒకానొక నది.

**తే.** త్రిశిఖరంబను పేరి ధాత్రీధరము
ను,పొంతమున రుద్రకల్పితంబైన
కూల,హాభిధాన కల్లోలిని శోభితోప
కంఠయై యొప్పుఁ డత్తీర కాననమున.
అను. 3.62.

**కూలు** దే. అ. క్రి.

1. పడు, క్రిందఁబడు.

మ. ... దాని మగలన్ వజ్రాహతిం
గూలు శైలనికాయంబన మద్భుజా
సమద లీలన్ గీటడంగించెదన్. విరా
2.75; ద్రోణ. 4 83.

తే. సింహబలుఁ డత్యుగ్రుఁడై చిగురు
బోఁడి,పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు
గదురం,నొడిచి తలపట్టి తిగిచి మహో
గ్రవృత్తిఁ. గొంకు కొసరించుకయు
లేక కూలఁదాఁచె. విరా. 2.128.

2. చచ్చు, మరణించు.

ఉ. కూలెడివారె పాండవులు ఘో
రపుఁ బోర నొకండొకండ యీ,చా
లెడు వారలెల్ల మును చావఁ గ్రమం
బున సేనలన్నియుం గూలగఁ గౌర
వుల్ పిదపఁ గూలుదురింతియకాక
నోరిచే,బేల వృథాభిమానమున నిన్ని
యుఁ బ్రేలెదు సూతనందనా. ఉద్యో.
2.271; ఉద్యో. 3.268.

3. విఱిగిపడు.

వ. .. బలుగాలిం గూలు తరువు
పోలికిం బడిన యగ్రజు నాలోకించి
యనువిందుండు. ద్రోణ. 3.147;
ద్రోణ. 3 95.

**కూల్చు** / **కూలుచు** దే. స. క్రి. (√కూలు)

1. పడఁగొట్టు.

సీ. కులపర్వతంబులు గూల్చి యొం
డొంటితోఁ దాఁకంగ పీకమైఁ దన్ని
యాడ. విరా. 2.134.

కం. వాలమ్ములు పది మేనం,గిలిం
చిన నాతఁడతని కేతనము ధరం,
గూలిచి. చాపము ద్రుంచిన. ద్రోణ.
1.197.

2. పోఁగొట్టు. కూలద్రోయు.

ఆ. కుండతోడి పాలు గూల్చినఁ గిని
యక, [illegible] నా సముజ్జ్వలా
త్ముఁడు. అశ్వ. 4.276.

3. చంపు, వధించు.

చం. ... తదీయ సారథిన్,బలువిడిఁ
గూల్చి రథ్యముల ప్రాణములుం గొని
రుగ్రమూర్తులై. విరా. 3.199.

ఆ. .. బొంకు మాటలాడి గురుని,
గూల్పనేర్చినట్టి క్రూరాత్ముఁడేగతిఁ
బోవువాఁడు సెపుమ బుధవరేణ్య.
శాంతి. 1.199.

## కృ

**కృకలాసత్వము** సం. వి. అ. న.

తొండరూపము.

**కృకలాసము** సం. వి. అ. పుం.

సరటము, తొండ, ఊసరవెల్లి.

వ. ... ఇక్ష్వాకుపంబునకు వచ్చిన
యపరక్షణంబునం గృకలాసంబులకు

లేని మేను పెంపావహిల్లిన. అను. 2.435.

**కృచ్ఛ్రము** సం. వి. అ. పుం. న.

1. సాంతపనాది వ్రతము.

సీ. .... బ్రహ్మహత్య కిల్బిషంబు దొఱంగుఁ గృచ్ఛ్రముల్ నడిపిన నాఱు వత్సరములు. శాంతి. 1.304.

శ్లో॥ త్ర్యహం త్ర్యహం ప్రాతస్త్ర్యహం సాయంస్త్ర్యహ మద్యాదయాచితమ్. త్ర్యహం పరంచ నాశ్నీయాత్, ఇతి విధినా ఏకైక కృచ్ఛ్రో ద్వాదశ దినాత్మకో జ్ఞేయః మాసే మాసే ఇతి తస్మైవాదేశః సప్తాహమ్ ప్రాతః సప్తాహమ్ సాయం సప్తాహమయాచితమ్ సప్తాహమనశనమ్ విషమేషు మాసేషు స ఏవాష్టౌ క్రమేణ సమేషు మాసేషు ప్రకార ఏవమ్ వర్షత్రయ మితి ద్వితీయః॥

ఇది రెండువిధములుగా మతాంతరములు గలవు. 1) మూఁడు దినములు పగళ్లను మూఁడు దినములు రాత్రులను భోజనముచేసి మూఁడు దినములయాచిత పదార్థములభుజించి పిమ్మట మూఁడు దినములు నిరుపవాసముండవలెను. ఇది ద్వాదశ దినాత్మకమైన కృచ్ఛ్రము. ప్రతి మాసముననిట్లు చేయ దలచుకొన్నన్ని సంవత్సరములు చేయవలెను. 2) ఏడుదినములు పగళ్ళను ఏడు దినములు రాత్రులను భోజనము చేసి ఏడు దినముల యాచిత పదార్థములను భుజించి తదుపరి ఏడు దినములు నిరుపవాపముండవలెను. ఇట్లు 28 దినములకొక ఆవృత్తి యగును. ఇట్లు బేసి మాసములందుఁగాని సరి మాసములందుఁగాని క్రమముగా ఎనిమిది పర్యాయములు (8 × 28 ది) మూఁడు సంవత్సరములు చేయవలయును.

2. అపాయము, ఆపద, విపత్తు,

కం. జ్వలనంబు వాయువశమునఁ, దొలఁగుడు జీవనము మాకు దొరకొను కృచ్ఛ్రంబుల సంశయయుత కార్యంబులు గర్తవ్యములు నియతములు వర్తిమ్ముల్. ఆది. 8.310.

**కృతకము** సం. విణ. (అ. ఆ. అ.)

నిజము కానిది, కపటమైనది.

కం. .. గూఢమతి నుండుద మింద ఱముఁ బురోచను కృతకము, నెఱి నేర్పడునంతకును వినీతాత్ములమై. ఆది. 6.159.

వ. . . కానీనుండు దరహసితాననుండగుచుఁ గృతక భూసురు నుపలక్షించి యిట్లనియె. అర. 7.365.

**కృతకాద్రి** సం. వి. ఇ. పుం,

క్రీడించుట కొఱకు నిర్మింపఁబడిన పర్వతము, చేఁత గట్టు, క్రీడాపర్వతము.

సీ. కృతకాద్రి కందర క్రీడా గృహాంగణ,వివిధ రత్నోపల వేదికలను. ఆది. 4.216.

**కృతకృత్యత** సం. వి. ఆ. స్త్రీ.

కృతార్థత, ధన్యత.

చం. నిన్ను మిక్కిలియగు భక్తిం గొల్చి కృతకృత్యలఁ బొందుదు మట్లు చేయవే. విరా. 1.203; శాంతి.1 385.

**కృతకృత్యుఁడు** సం. విశ. (అ.అ.ఆ.) విహిత కార్యమును జేసినవాఁడు, కృతార్థుఁడు, ధన్యుఁడు.

కం. పతిమదికి నింతయెక్కిన,యతివ గదా పుణ్యవతి ప్రియాలాపములీ,గతి వినఁగాంచితి జన్మము,గృతకృత్యం బయ్యె నాకు గెలిచితి జమునిన్. శాంతి. 3.311.

వ. కృతకృత్యులమైతిమి ప్రొద్దునుం జాలవ్రాలె. శల్య. 2.332.

వ. ... పవనతనయుండట్లు సని మహానస మందిరంబు పరిసరంబున శరీర ప్రక్షాళనము సేసికొని యను లేపంబున న్నసగంధంబుడిపికొని కృతకృత్యుండై. విరా. 3.2.

**కృతఘ్నత** సం. వి. ఆ. స్త్రీ. చేసిన మేలు మఱచిపోవుట.

తే. . నాకుఁ గృతఘ్నత నెఱపి దొల్లి,యెగ్గు సేసినవారి జయింపఁ బోదు. విరా. 1.198.

కం. అరయ మిత్రద్రోహము దారుణ మగు పాతకము గృతఘ్నతకంటెన్, పైఁ ఎము గొని ఏపఁచపడ్యు, నారెండు దెఱఁగులవారి నాప్తులనైనన్. శాంతి. 3.525.

**కృతఘ్నుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) చేసిన మేలు మఱచువాఁడు.

చం. ... అట్టిదా,తకుఁ దుదిఁ గీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పుట్టక కవళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశ వర్ధనా. ఉద్యో. 2.77.

కం.. ..బ్రహ్మ,ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకు లేద. శాంతి. 3.524.

**కృతజ్ఞత**
చేసిన మేలు జ్ఞప్తియందుంచుకొనుట.

సీ. .. నీకు నెయ్యంబు వాటించు నేర్పు కృతజ్ఞత యనునవి లేవు. కర్ణ. 2.262.

**కృతనిశ్చయుఁడు** సం.విశ.(అ.ఆ.అ) చేయఁబడిన నిశ్చయము గలవాఁడు' నిశ్చయము చేసికొన్నవాఁడు.

వ. మారుత సుతుండును గృతనిశ్చయుండై యుండె. విరా. 2.292.

**కృతపడు** మి.అ.క్రి. (కృతము+పడు)

1. గతించు, కడచు,

వ. ... దేవా వినుము వగచినం గృతపడిన కార్యంబు గ్రమ్మఱం బొడమునే డెందంబు గుందు నంతియకాక. కర్ణ. 1.226., శాంతి. 1.42.

(శ్లో॥ అతిక్రాంతం హి యత్కార్యం చింతయా చ వినశ్యతి. సం. భార. కర్ణ. 32.31.)

2. చచ్చు, మరణించు.

కం. పనిచి కృతపడిన గాంగే,యుని దెస యుమ్మలిక నాతఁడుల్లము నానా, ఘనతర చింతాభర మొం,దినఁ గుందుచునుండఁ గొన్ని దినంబులకున్, ద్రోణ. 1.6.

శ్లో॥ నిహతం పితరం శ్రుత్వా ధృతరాష్ట్రో జనాధిపః, లేభేన శాంతిం కౌరవ్యశ్చింతాశోక పరాయణః, సం. భార. ద్రోణ. 1.5.

**కృతపుణ్యుఁడు** సం. విశ. (అ.ఆ.అ).

పుణ్యము చేసినవాఁడు. పుణ్యాత్ముఁడు
కం. కృతపుణ్యుఁడు సుశ్లోకుఁడు ధర్మతనూజుఁడు, శోకోత్తరు శల్యుఁదా గెలుచువాఁడధిపా. ఉద్యో.2.231.

**కృతప్రజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ అ.) కృతబుద్ధి, పండితుఁడు. ప్రాజ్ఞుఁడు.
కం. గురునిఁ గృతప్రజ్ఞుని ధర్మరతు వయోవృద్ధు లోకమాన్యు దయాఘన్, సురతటినీసుతు వంచనఁ బురుషోత్తమ చంప బుద్ధిపుట్టదు నాకున్. భీష్మ. 3.304.

**కృతబుద్ధి** సం. విణ. (ఇ. ఇ. ఇ).
కృతప్రజ్ఞుఁడు; శిక్షితమైన బుద్ధి గలవాఁడు. పండితుఁడు. ప్రాజ్ఞుఁడు.
కం. కృతమెఱుఁగుట పుణ్యము. సన్మతి దానికి సమముసేఁత మధ్యమము మఱి తత్కృతమున కగ్గలముగసత్కృతి సేయుట యుత్తమంబుకృతబుద్ధులకున్. ఆది, 6.241.

**కృతమతి** సం. విణ. (ఇ. ఇ. ఇ).
1. పండితుఁడు, ఆచార్యుఁడు.
సీ. ఆచార్యుఁడని వినయమునఁబూజించితే కృతమతుల్ ద్రోణుండుఁ గృపుడునుండ. సభా. 2.11.
2. వి. నిశ్చితమైన బుద్ధి.
చం. ... పోరికిం, గృతమతిన్ మఱి చొచ్చి సరిత్సుతాదులన్, వెరవునఁ గీటడంచెఁ దన విక్రమమెందుఁ బ్రసిద్ధికెక్కఁగన్. శల్యా. 2.345.

**కృతము** సం. విణ. (అ. ఆ. అ.)
1. చేయఁబడినది.
వ. ... అమ్మల్లపయుంపు నరపతి యనుమతె వడసి కృత పరికర బంధుండై యరుగుడెంచి. విరా. 2.14.
వ. .. కృతంబైన నెద్దానికి నాశము లేకుండు. శాంతి. 5.524.
2. అభ్యస్తము, అలవాటు చేయఁబడినది.
(చూ. కృతాస్త్రుఁడు)
వి. అ. న.
ఉపకారము, చేసిన మేలు.
కం. కృత మెఱుఁగుదు రుపకారవ్రతమున వర్తింతురెపుడు వదలరు కరుణాన్వితులీ నరపతికి శుభప్రతిపాదకులగుదురేమి భంగులనైనన్. విరా. 3.63.
కం. కృతమెఱుఁగుట పుణ్యము స, న్మతి దానికి సమముసేఁత మధ్యమము మఱి తత్కృతమున కగ్గలముగ సత్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్. ఆది. 6.341.
2. కృత్యము, చేఁత, పని.
కం. శరనిధి పరివృత విశ్వంభరఁగల భూపతులు పాండుపతి కృతమునఁగిం, కరులై ప్రతిసమ కల్పిత, కరులై రది మొదలుగాఁగఁ గౌరవ్యులకున్. ఆది. 5.40.
3. సత్కారము.
కం. కులపుత్త్రులైన సచ్ఛృత్యులకును సత్కారమర్థితోఁ జేయువారలు నీ ప్రస్తవమున నిమ్ములఁ గృతము దఱచి ప్రాణము విడుతురనిన్. సభా. 1.38.
4. తాఁజేసిన పాప పుణ్య రూప కర్మము.

ఆ. ఒడలికోఁద గృతము వెడలిపో
వునె యిది,తెలియవలయు నాకు నల
ఘుపుణ్య. ఆర. 4. 169.

**కృతయుగము** సం. వి. అ. న.
తొలి యుగము(యుగములు నాలుగు:
1. కృతము 2. ద్వాపరము 3. త్రేత
4. కలి) 17,28,000 మానుష
సంవత్సరములు. కృతయుగ
మునకు సంధ్య లక్షయు
నెనిమిది వేలు. సంధ్యాంశంబుగూడ
నంతియే.ఈయుగమున రాజు ధర్మము
నాలుగు పాళ్లు నడిపించును శాంతి.
1.369; శాంతి. 2.288;శాంతి. 5.46;
శాంతి. 5.51,52.

**కృతవర్మ-కృతవర్ముఁడు** సం. వి.
న్. పుం.
యాదవ వంశీయుఁడగు నొకానొక
క్షత్రియ వీరుఁడు.
అశ్వపతి యంశమునఁ బుట్టినవాఁడు.
ఆది. 3.80, విరా. 5.375.

(చూ.చివరిసంపుటము. అనుబంధము)
(చూ. అంధకుఁడు - ...
విడూరథుండును విదూరథునికి
అనియు నతనికి భోజుండు భోజునికి
హృదికుండునుం గలిగిరి అందు
హృదికునికి దేవమీఢుండు శతధనువు
కృతవర్మ యను కొడుకులు గలి
గిరి. దేవమీఢునకు శూరుడు శూరునకు
మారిష యందు వసుదేవుఁడు
జన్మించిరి. ఆంధ్రభాగవతము -
నవమస్కంధము. 714.

**కృతవీర్యుఁడు** సం. వి. అ. పుం.
చంద్రవంశీయుఁడగు ఒక రాజు;
ఈతని కూఁతురు భానుమతి. ఈమె
భర్త అహంయాతి. ఆది. 4.2.
ఈతఁడు భృగువంశీయుల యాజకత్వ
ముతోఁ బెక్కు క్రతువులు చేసి అనంత
ధనరాసులు వారికి దానమిచ్చెను.
దానము పట్టినవారు గతించిన పిదప
వారి వంశీయులు ధనలుబ్ధులై యా
ధనమును భూమియందుదాఁచిరి. ఆది.
4.2., ఆది. 7.132.

**కృతశౌచము** సం. వి. అ, న.
ఒక పుణ్యతీర్థము. ఇందు స్నానము
చేసిన పుండరీకము చేసిన ఫలము
గలుగును. ఆది. 2.259.

**కృతస్థితి** సం. విశ. (ఇ)
నిలుకడ చేసికొన్న వాఁడు.
ఉ. ...అనా,తంకుఁ డుదంకుడన్ముని
గృతస్థితియై మరుభూమి యందు
ని,శ్శంకమతిన్ వసించి ... అచ్యు
తున్ మనః,పంకజవేదిపై నిడి తపం
బొనరించె. ..ననేక వర్షముల్. ఆర.
4.374.

**కృతహస్తుఁడు** సం. విశ. (అ.ఆ.అ).
చేతినేర్పు గలవాఁడు, గుఱితప్పక
యేయువాఁడు. విలువిద్య యందు
నేర్పరి.
క. మనసిజ రాగంబునఁ బెనఁగిన
యిట్టివి లేడిఁ జూచి కృతహస్తుఁడు
పెల్చన యేనమ్ముల నారెం,టిని
ద్రెళ్ళఁగనేసెఁ గడు కఠినహృద
యుఁడై. ఆది. 5.49.
శా. ద్రోణాచార్య పిఱుంద నొప్పి

కృతహస్తుల్ ... ధర్మజ ప్రముఖులై
జ్యేష్ఠానుపూర్వంబుగాన్. ఆది. 6.9.

**కృతాంజలి** సం. విణ. (ఇ. ఇ. ఇ.)
దోసిలి ఒగ్గినవాఁడు, చేమోడ్చిన వాఁడు.

వ...దేవా యేను వాసుదేవుని శరణు సొచ్చి బ్రదుకువాఁడ ననుచుఁ గృతాంజలి యగుటయు. ఉద్యో. 2.331.

**కృతాంతుఁడు** సం. వి అ. పుం.
యముఁడు.

కం. ... నరుఁడు గింక ద్రవ్య,త్వ తిరోహితాత్మహిత సం,స్మృతియైనఁ గృతాంతుఁడతనిఁ జేర్చుఁ దన పురిన్. శాంతి. 6.383.

**కృతాకృతము** సం. విణ. (అ.ఆ.అ.)
(కృతము + అకృతము)
చేయఁదగినదియుఁ, జేయఁగూడనిది యునైనది.

కం. కృతమిది యకృతంబిది యది, కృతాకృతంబనుచు. శాంతి. 5,383.

**కృతాత్ముఁడు** సం.విణ. న్.(ఆ.న్.న్.)
1. శిక్షితమగు మనస్సు గలవాఁడు, మనస్సును లోఁబఱచుకొన్న వాఁడు, మనో నిగ్రహము గలవాఁడు.

సీ. నీవు సెప్పిన మహనీయ వాక్య నికాయ, మతిగహనం బకృతాత్ముల కును ... గ్రమ్మఱఁ దెలయవచ్చి యుండదు. అశ్వ. 2.97.

2. దోషరహితుఁడు, నిర్మలమైన మనస్సుగలవాఁడు.

కం. క్రతుపరులు నన్ను తగ సంస్తుతించి ఫలమందఁగంద్రు దోషయుతులు స,మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ములగుదురు మదీయ కీర్తన పరులై. ఆశ్వ. 3.40.

**కృతార్థత** సం. వి. ఆ. స్త్రీ.
నెఱవేర్చుకొన్న కోరిక గల్గియుండు ధన్యత.

ఉ. ... నా,పుట్టు కృతార్థతం బొరసె బుణ్యచరిత్రుఁడనైతి. విరా. 1.27; విరా. 3.34.

**కృతార్థత్వము** సం. వి. అ. న.
కృతార్థత. సార్థకత, సఫలత, ధన్యత

మ. .. క్రోధము కృతార్థత్వంబు నొందె. విరా. 2.284.

వ. ... కృష్ణునకు నత్యుత్తమ వస్తు విస్తార మహోదారంబగు నుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొందె. అశ్వ. 4.212

**కృతార్థీకృతము** సం. విణ. (అ.ఆ.అ.)
కృతార్థము చేయఁబడినది. సఫలము గావింపఁబడినది.

వ. .. బృహద్రథుండు వచ్చి ... ఏడ్చుచున్న కొడుకుం జూచి కృతార్థీకృత లోచనుండయ్యె. సభా. 1-149.

**కృతార్థీభూతము** సం. విణ. (అ.ఆ.అ.)
కృతార్థీకృతము. సఫలము గావింపఁ బడినది.

మ. దివిజాధీశ్వరు పాలిసం జని కృతార్థీభూత చేతస్కుఁడై. ఉద్యో. 1.189; శాంతి. 5.187.

**కృతార్థుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
1. నెఱవేర్చుకొన్నకోరిక గలవాఁడు; ధన్యుఁడు.

వ. భక్తవత్సలుండగు హరిహర నాథుండు నీదెస దయాళుండై యుని

కింజేసి నిన్నుం గృతార్థునిఁ జేయం గార్యార్థియయి. విరా. 1.11.
చం. ...నా మనోరథంబు నెరయ సంఘటించి సుడిపుంగవ నన్నుఁ గృతార్థుఁ జేయవే. అర. 5.189.
2. నెఱవేర్చుకొన్న పని గలవాఁడు, కృతకృత్యుఁడు.
కం. పాండవులం బాంచాలురఁ జండ భుజా విభవ మెసఁగ సమయించి కృతార్థుఁడనయి పెంపుఁ దేజము గందును దక్కొండు లేదు కార్యము దలఁపన్. సౌప్తి 1.19.
వ. ఇమ్మెయిఁ గృతార్థుండయిన దివ్యాస్త్రంబు. ద్రోణ. 1.257.

**కృతాస్త్రుఁడు** సం.విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁబడిన అస్త్రవిద్య గలవాఁడు, అస్త్రవిద్యయందు ఆఱితేఱిన వాఁడు.
సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండవని నిన్ను నెఱుఁగుదు. కర్ణ. 2.262.

**కృతాహారుఁడు** సం. విణ. (అ.ఆ.అ.) ఆహారము తీసికొన్నవాఁడు. భోజనము చేసినవాఁడు.
వ....ఇట్లు కృతాహారుండైన హరికిఁ జందన చర్చాద్యర్చనంబు లాచరించి. ఉద్యో 3.233.

**కృతి** సం. వి. ఇ. స్త్రీ.
1. చేయుట.
చం. ఒకరుని జంపితేని సకలోర్వియు గైకొనుమంట నీవు మున్,శకునిక మాయజూదమున సంపదలెల్లఁ బ్రయోదశాబ్ద భో,గ్యకృతి నమర్చు యొప్పి నటులైనది. శల్య. 2.145.
2. కృత్యము, పని.
కం. రథమవితథమైనను సా,రథి పని నెఱపిన మహాస్త్రరాజి విధికృతిన్, వృథ గానున్నను గర్ణునిఁ,బ్రథనంబున గెల్వ దేవపతికిన్ వశమే. కర్ణ. 1.43.
కం. తన యంశమైన కనకము,విను కుంతీదేవికిచ్చె వేదవ్యాసుం,డనఘా యదియంతయు న,ప్వినుతచరిత ధర్మకృతుల వినియోగించెన్. అశ్వ. 4.203.
3. ప్రబంధము, గ్రంథము
ఉ. ... అం,దాదిఁదొడంగి మూఁడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు వి,ద్యాదయితుండొనర్చె మహాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. విరా. 1.6. (చూ. 8.)
4. రచన.
కం. పారాశర్యుని కృతియయి,భారత మను పేరఁ బరఁగు పంచమ వేదం,బు. విరా. 1.17.
5. ఉష్మపులలో నొకఁడు. అను. 3.192,

**కృతినాథుఁడు** సం. విణ. అ. పుం. కృతికి అధిపతి, కృతిపతి.
ఉ. ఇట్టి పదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి. విరా. 1.27.

**కృతిపతిత్వము** సం. విణ. అ. న. కృతినాథుఁడుగా నుండుట.
తే. .. క్లేశ,ఱెచ్చ మర్థించి వచ్చితిఁ దిక్కాశర్మ. విరా. 1.18.

**కృతుఁడు** సం. వి. అ. పుం. ఉష్మపులలో నొకఁడు. అను. 3.19 2.

**కృత్తము** సం విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.

వ. ... గుత్తుల కొలందిచేఁ గృత్తంబులయి పడియున్న పాదంబుల వలనం గెందలిరుల సెజ్జల చందంబులగు చోట్లును. విరా. 3.236.

**కృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. రైభ్యుఁడు అవక్రీతుని సంహరించుటకై జట పెఱికి హోమము చేయఁగా బుట్టిన సుందరాంగి. ఇంకొక జట పెఱికి హోమము చేయఁగా బుట్టిన రాక్షసునకు ఈమెను భార్యగా నిచ్చెను. ఆర. 3. 265-272.

2. మారణహోమమున అభిచార క్రియ వలనఁ బుట్టిన రక్కసి. వృషాదర్భి యను రాజు ఆఁకలిగొని శవభక్షణమునకై పూనిన సప్తర్షులకు బహువిధ ధాన్యములు వాహనములు గ్రామములు బహుమతి నిచ్చెదమనఁగా వారు ప్రతిగ్రహణము విషముగా భావింతుమని యంగీకరింపరైరి. అంతనా మహీపతి మంత్రులచేఁ గొన్ని కృత్రిమ వన ఫలములు ఋషుల కిమ్మని పంపెను. వారు ఆ ఫలము హేమగర్భకంబులగుట యెఱింగి స్వీకరింప నిరాకరించిరి. భూపతి యటుపై నాగ్రహాదగ్రుఁడై కృత్తి యను మారణహోమమును వేల్చి ఒక రక్కసిని బుట్టించి సప్తర్షులఁ జంప నాజ్ఞాపించెను. ఆ రక్కసి సప్తర్షులు వచ్చునొక సరస్సు ఒడ్డునఁ గావలియుంచెను కొలను నందలి తామరతూండ్లను పెఱికికొని భక్షింపఁదలఁచిన మునిపుంగవులా కొలనులోనికి దిగఁబోవుచుండ ఆ రక్కసి వారించి వారి నామధేయాదు లడిగెను. అప్పుడా సప్తర్షులఁ జేరియున్న శునస్సఖుఁడను పరివ్రాజకుడు బ్రహ్మదండ నిభంబగు నిజహస్తగత దండంబున దాని శిరస్సు వ్రయ్యలు సేసి భస్మము గావించెను. అను 3.212. మొ. 222వ.

3. (మృగాదుల) తోలు, చర్మము. చూ. కృత్తివాసుఁడు.

**కృత్తిక** సం. వి. ఆ. స్త్రీ.

1. వీరు ఆర్వురు పుత్రార్థినులై కుమారస్వామికి నొక్కపెట్ట పాలిచ్చినవారు, కాన వీరు కుమారస్వామికి తల్లులైరి. అతఁడు కార్తికేయుఁడయ్యెను. శల్యా. 2.176.

2. అశ్విన్యాదుల యందు మూఁడవ నక్షత్రము.

వ. .... నిస్త్రింశమునకు గృత్తిక యధిదేవత గురుండు రుద్రుండు ... శాంతి. 3.449.

**కృత్తికాంగారము** సం. వి. అ. న. ఒక పుణ్యతీర్థము దీనిని సేవించిన కిల్బిషములు దొలఁగి స్వర్గము లభించును. అను. 2.77.

**కృత్తికామఘము** సం. వి. అ. న. ఒక పుణ్యతీర్థము. దీనిని దర్శించిన దురితములు తొలఁగును. ఆర.2.271.

**కృత్తికాశ్రమము** సం. వి. అ. న. ఒక పుణ్యతీర్థము ఇచ్చట నియమపూర్వకముగా స్నానము చేసి పితృతర్పణము చేసిన పుణ్యు కొలువున నానందము పొందును. అను.2.78.

**కృత్తివాసుఁడు** సం. వి. న్. అ. పుం.
తోలుదాలుపు; శివుఁడు.

ఆ. ... కృత్తివాసుఁడు సురశ్రేణి క్రతువు నియతిఁ జేయునెడను, నరుగు దెంచె. సౌప్తి. 2.121. (చూ. 123, 125).

**కృత్యము** సం. విశే. (అ. ఆ. అ.)
చేయఁదగినది.

వ. దేవతలకుం గృత్యంబయినదానిఁ దత్ప్రత్యక్షంబున వింటి. స్త్రీ. 1.72.

వ. ... కృత్యంబులు కృతంబులైన మదీయ ప్రకృతిన పొందుదురు. శాంతి. 6.388; శల్య. 1.49.

ఆ. అద్దురాత్ముఁ గృపణు నాత్మీయ కార్యత, త్పరుని నధికరాగ పరవ శాత్ముఁ, దొడరి వాలి చనిన త్రోవనే యని చిర, మ్మెల తడయ మనకు నింక నిచట. అర. 7.3. (చూ.6).

**కృపసేయు** మి. అ. క్రి.
దయగనఁబఱచు, అనుగ్రహము చూపు.

కం. అడవులఁ బెద్దియు గాలం, బిడుమలఁ గుడిచితిమి మాకు నిది దఱియని యిప్పుడు వచ్చితిమి విపన్నుల యెడ గృపసేయుటయు లెస్స యూరలుగ కుఁడీ. విరా. 5.123.

వ. ఈ యధర్మంబునకు వెఱతు నీవు నామీఁదఁ గృపసేయుము ద్రోణ. 2.169.

వ. అద్దేవుండు వత్సలుండయి వారలతోడం గూడి విహరించుచుండు నామీఁదం గృపసేసి క్షేత్రజ్ఞ ప్రకారంబు సకలంబును దేటపడ ననుగ్రహించి. శాంతి. 6.467.

**కృపాచార్యుఁడు** సం. వి. అ. పుం.
కృపుఁడు; అశ్వత్థామ మేనమామ, కౌరవ పాండవుల ప్రథమాచార్యుడు; ఏకాదశ రుద్రాంశమునఁ బుట్టినవాఁడు. విరా. 3.104; ఆది. 3.80; ఆది. 5.185. మొ 192 (జన్మవృత్తాంతము, చరిత్రకై చూ. చివరి సంపుటము అనుబంధము).

**కృపాణము** సం. వి. అ. న.
కత్తి.

దీనికి 1) అసి 2) విశసనము 3) ఖడ్గము 4) తీక్ష్ణధారము 5) దురాసదము 6) శ్రీగర్భము 7) విజయము 8) ధర్మపాలనము అను నామములు గలవు. శాంతి. 3.449.

**కృపాయితము** సం. విశే. (అ.ఆ.అ.)
దయ గలిగించునది, దయనీయము.

కం. ... కృపాయితమై శ్రీ,పర్వము పదునొకండగు పర్వము నా వెలయు సుకవి పండిత సభలన్. ఆది. 1.55

**కృపాలుఁడు, కృపాళుఁడు** సం.విశే. (ఉ). కనికరము గలవాఁడు.

వ. కొందఱు దమవారిం గానక కన్నీళ్ళు నించుచు నాలింగన రోదన ప్రముఖంబులైన కరుణా భాషణంబులగు నవస్థా విశేషంబులం బొందువారలం గృపాళురై యాలోకించుచు. కర్ణ. 2.317.

కం. ... దేవా, యూలలనకుఁ దగు వరుఁడె, గృ,పాలుఁడవై యొసఁగుము నినుఁ బద్మజుఁడనియెన్. అర.5.191

**కృపావిధేయుఁడు** సం. విశే.
(అ.ఆ.అ.) దయకు లొంగినవాఁడు

చం. పరమ కృపావిధేయ. విరా. 2.363.

**కృపి** సం. వి. ఈ. స్త్రీ.
కృపాచార్యుని చెల్లెలు. ద్రోణాచార్యుని భార్య. ఉద్యో. 4 420.
(చూ. జననము. ఆది. 5.185. మొ. 192వ.

**కృపుఁడు** సం. వి అ. పుం.
చూ. కృపాచార్యుఁడు.

**కృమి** సం. వి. ఇ. పుం.
క్రిమి, పురుగు.
కం. జనవర కృమి గర్దభ ముఖ,జన నంబులఁ బొంది నరక సంవాసముఁ. జెందు నధిక పాపాత్ముండగు, మను జుఁడు కర్మ సవిశేష మహిమ దెలిపె దన్. అను. 4.258.

**కృశత** సం. వి. ఆ. స్త్రీ.
కృశత్వము, కార్శ్యము, బక్కచిక్కపోవుట.
కం. దారిద్ర్యముచేఁ గుందుచు,నేరిని నడుగంగఁ బోవకెంతయుఁ గృశతం, గూరిన విప్రునకుర్వర,వారని దయ నీగి ఫలము వాగ్గోచరమే. అను. 2.353; ఆశ్ర. 1.172.

**కృశము** సం. విశ. (అ. అ. అ).
క్షీణించినది.
ఉ. . ఆ,వీరభటావళుల్ బహుళ విక్రమ కౌతుకపైన నీ శరా,సారము లన్ బదల్పఁడఁ గృశంబగుటెప్పుడు నీకుఁ దోపదే. కర్ణ. 3.118.
కం. . సైన్యమ్మదియును నీచేత గృ,శమ్మయ్యెడుఁ జుమ్మ వలదు శంకింపం. శల్యాగన్. 2.31.
2. సన్నము. బక్కచిక్కినది.
వ. .. అతి స్థూలకాయులుఁ గృశ మూర్తులు. సౌప్తి. 1.116.

**కృశానుఁడు** సం. వి. ఉ. పుం.
అగ్ని.
ఉ. నేరక చేర నొక్కనిన నీఱుగఁ జేయఁ గృశానుఁడిద్ధ ధా,త్రీరమణాగ్ని గాల్చు నతితీవ్రత వంశమునెల్లశాంతి. 1.93., ఉద్యో. 2.187.

**కృశీకృతము** సం. విశ. (అ. ఆ. అ.)
కృశించునట్లు చేయఁబడినది.
వ. నియమ కృశీకృత శరీరంబుతోఁ బండ్రెండు వర్షంబులశేష వ్రతంబులు సలిపిన తపోనిధానంబవు. ఆర. 1.120.

**కృశీభూతము** సం. విశ. (అ. ఆ. అ.)
కృశించినది.
వ. .. అనవరతోపవాస కృశీభూత శరీరుల. ఆది. 2 84.

**కృశుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
కృశించినవాఁడు.
వ. ... అమ్మహాత్ముండు గోపించి యఱుగు దెవులు గొనుమని శాపం బిచ్చిన నయ్యోషధినాథుఁడు నానాఁటికి గృశుండయ్యె. శల్య. 2.148; 149.
2. ఆఁకలి గొన్నవాఁడు.
సీ. .. విప్రుని గృశు,నామంత్రితు జేసి యచఁడు గుడువవచ్చినఁ బెట్టమి. అను. 2.68.
వి. అ. పుం.
ఒకానొక ముని.
కం. తన జనకు నఱుతఁ బవనా,శన శవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షి,

జ్జనపాలు చనుట కృశుఁడను,మునె
వలన నెఱింగి కోప మూరా ...
ఆది. 2.169.

2, ఐరావత కులసంభవుఁడైన సర్ప
శ్రేష్ఠుఁడు. జనమేజయుని సర్పయాగ
మున హోమగుండమునఁ బడెను ఆది
2.212.

**కృశోదరి** సం. విణ. ఈ. స్త్రీ.
సన్నని నడుము గలది; స్త్రీ
వ, అప్పుడా కృశోదరి వృకోదరు
కడకుంజని సమయు ... ననవుడు.
విరా. 2.322.

**కృషి** సం. వి. ఇ. స్త్రీ.
కరిసనము, సేద్యము.
చం. వెరవున లావునం గృషికి వేయు
విధంబుల మేలొనర్చినన్, దాని కొను
నే ఫలంబు దఱితోఁ దగు వర్షము లేక
యున్న. ఉద్యో. 3 82.

**కృషిభాగి** సం. విణ న్ పుం.
సేద్యము చేసి జీవించువాఁడు.
సీ. ... సప్తమిఁ గృషిభాగి, యష్టమి
వాణిజ్యవృష్టుఁడు ... అను. అను.
3.161.

**కృష్ణ** సం. వి. ఆ. స్త్రీ.
1. ద్రౌపది.
సీ. కడిమిమై సౌగంధికమున యక్షుల
మడ,మడఁచి కృష్ణకు బువ్వులట్లు
దెచ్చె. విరా. 1.74.
ఈమెకు జన్మకాలమున ఆకాశవాణి
ఈ పేరు పెట్టెను, ఆది. 7.20.
(చూ. ద్రౌపది.)
2. పరావసుని భార్య, రైభ్యుని
కోడలు.

ఉ. ... ఆ,రామమునందుఁ జూచె
మునిరాజకుమారుఁడు రైభ్యు కోడలిం
దామరసాక్షిఁ గృష్ణ యను దానిఁ బరా
వసు భార్య, ... అర.3.262.

**కృష్ణద్వైపాయనుఁడు** సం.వి.అ.పుం.
వేదవ్యాసుఁడు
శా. ... కృష్ణ ద్వైపాయనుఁ డర్థి
లోకహిత నిష్ఠంబూని కావించె ధ,ర్మా
ద్యైకస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన
యామ్నాయమున్. విరా. 1.3. చూ.
వ్యాసుఁడు.

**కృష్ణ భుజగము** సం. వి. అ. పుం.
నల్లత్రాచు.
ఉ. ... మై,నాడఁగనేసెఁ గృష్ణ భుజ
గావలిఁ బోలిన నారసంబులన్. భీష్మ.
3.113.

**కృష్ణము** సం. విణ. (అ. ఆ. అ.)
నల్లనిది.
వ. వినుము జీవావస్థలు ఛాయలై
యుండుఁ గృష్ణంబును ధూమ్రంబును
హరితంబును ... రక్తం
బును శుక్లంబును నైనవి యాఱు
గలవు. శాంతి. 5.412.
కం. అర్కు నుదయాస్తమయము
లందుఁ గృష్ణ,కాంతి ఘోర కబంధం
బు గప్పఁ జూచ్చె. భీష్మ. 1.11,
వి. అ. పుం.
1. నలుపు.
ఉ ... చాయయుఁ గృష్ణంబు గావున
గృష్ణుఁడనియు. శాంతి. 6.432.
2. బహుళపక్షము.
వ. ఈ కృష్ణ చతుర్దశినాటి రాత్రి

పురోచనుండు లక్కయిలు దహనంబు
వరికొల్పు. ఆది. 6.157.

**కృష్ణమృగము** సం. వి. అ. పుం.
లేడి, హరిణము, నల్లయిఱ్ఱి.
వ. ... ఆ కృష్ణమృగంబు నాయిచ్చు
దివ్యదృష్టిం గనుగొను మే చెప్పినట్లు
సేసిన నిన్న ఘనంబెంచువారై యప్సరః
...గంధర్వులును వీరె విమా
నంబుల నేతెంచిన వారనుటయు.
శాంతి. 5.362,
ఉ. కృష్ణమృగ చర్మ కృతాంబర
కృత్యు...సాత్యవతేయుఁ గొల్చెదన్.
భీష్మ. 1.71.

**కృష్ణవర్త్ముఁడు** సం. వి. న్. పుం.
నల్లని మార్గము గలవాఁడు, అగ్ని.
కం. ఆ కృష్ణవర్త్ముఁడుజ్జ్వల,భీకర
జిహ్వలదరఁ బేర్చెన. శల్య. 1.362.

**కృష్ణవేణి** సం, వి. ఈ. స్త్రీ.
కృష్ణానది.
వ. గంగయుఁ దుంగభద్రయు వేత్ర
వతియు వేదవతియుఁ గృష్ణవేణియుఁ
బెన్నయు. భీష్మ. 1.38.

**కృష్ణశబలము** సం. వి. అ. న.
నలుపు గలిసిన చిత్రవర్ణము గలది.
వ. .. పంద్రెండు కాళ్ళును కృష్ణ
శబల వర్ణంబును గల మహాగజంబా
నూతిదరినున్న తరువుఁ జేరంజనుదేర
స్త్రీ. 1.47.

**కృష్ణశిల** సం. వి. ఆ. స్త్రీ.
ఇనుము.
వ. ... శ్లేష్మంబున స్ఫటికంబును
చిత్తంబున మరకతంబును వాతంబుని
గృష్ణశిలయు నఖంబుల ...

స్నాయుసంచయనంబు నంబ్రవాళం
బునుం బుట్టె. ఆర. 5.172.

**కృష్ణసర్పము** సం. వి. అ. పుం.
నల్లత్రాఁచు.
ఆ. ... కృష్ణసర్పంబు బోని పటు
కృపాణంబున నఱకె. కర్ణ. 3.234.

**కృష్ణాజినము** సం. వి ఆ. న.
నల్ల యిఱ్ఱితోలు జింకచర్మము.
తే. .. శతదళ భవుండు లసిత
కృష్ణాజినంబును నసమ సమర,జయ
ము నొసఁగిరి ప్రీతినా షణ్ముఖునకు
శల్య. 2 184.

**కృష్ణుఁడు** సం. వి అ. పుం.
దేవకీ వసుదేవుల కుమారుఁడు, శ్రీమ
న్నారాయణుని దశావతారములలో
ఎనిమిదవ యవతారము.
కం. అనుటయు దరహసితము మో,
మునకుఁ దొడవుగాఁగఁ బలుకు ముద్ది
య యేఁ గృష్ణునిదేవి సత్యభామకుఁ
బనిసేయుదుఁ దొల్లి పిదపఁ బాంచాలి
కడన్. విరా. 1.3.5., శాంతి. 6.432.
(చూ. కృష్ణుఁడు - చివరి సంపుటము
అనుబంధము).
2. అర్జునుఁడు
వ, భద్రమూర్తులైన రుద్ర విరించులు
నాకు నొసంగిన కృష్ణుండను నేకా
దశ నామంబు...నొసంగిరి. విరా.
4.149.
3. వేదవ్యాసుఁడు.
కం. ఆ యమునా ద్వీపమున న,మే
యుఁడు గృష్ణుండు పుట్టి మెయిఁగృష్ణ
ద్వైపాయనుఁడనఁ బరఁగిన వచశ్శ్రీ
యుతుఁడు పదంబు వలనఁ జిత్తము
నిలిపెన్. ఆది. 3.45.

## క్ష్మా

**క్ష్మాప్తి** సం. వి. ఇ. స్త్రీ.
విభజనము, విభాగము.
సీ. ... అతని వంశమునవారతి ధన లుబ్ధులై,కృతవీర్యుని ధనమెల్ల క్ష్మాప్తి సేసి .. ఆది. 7.132.

**క్ష్మాప్తిసేయు** మి. స. క్రి.
విభజించు. పంచికొను.
సీ. ... అతని వంశమువారతి ధన లుబ్ధులై కృతవీర్యు ధనమెల్ల క్ష్మాప్తి సేసి. ఆది. 7.132.

## కె

**కెంగేలు** దే. వి. (కెంపు+కేలు),
ఎఱ్ఱఁదనము గల చేయి.
సీ....కిసలయహస్త కెంగేల నేపాటు క్రొమ్మించను లేమేఁక మిగుల బర్వె. విరా. 2.37.
సీ. కెంగేలు గేలితో గీలించి నెయ్యంపు మాటలఁ దగు మఱుమాటలాడ్త విరా 2.310.

**కెంఛాయ** దే. వి. (కెంపు+ఛాయ)
ఎఱ్ఱని కాంతి.
తే. పుండరీకంబు లుద్దండ పుండరీక చారుభంగి లేమించు కెంఛాయ నొప్పె భీష్మ. 2.22., విరా. 2.240.

**కెందమ్మి** దే. వి. (కెంపు+తమ్మి).
ఎఱ్ఱ తామర.
వ. .... కెందమ్మి రేకుల వలనం దొరంగు జలకణంబుల పోలె. ఆది. 4.77.

**కెందలిరు** దే. వి. (కెంపు+తలిరు)
ఎఱ్ఱని చిగురు, లేఁజిగురు.
వ. కెందలిరు సెజ్జల చందంబులగు చోట్లును. విరా. 3 236.

**కెందామర** దే. వి. (కెంపు+తామర)
ఎఱ్ఱని తామర, కెందమ్మి.
కం. నరుఁడలుక వొడమియు సుస్థిరుఁడై తన యెఱ్ఱసెరల చెలువునఁ గెందామరలం దెగడెడు గన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టులనియె నరేంద్రా. ఉద్యో. 2.132.

**కెందూళి** దే. వి. (కెంపు+దూళి)
ఎఱ్ఱని దుమ్ము.
వ.. తురంగమ ఖురాదులం దూలిన కెందూళియుఁ బైపయి నెగయ విరా. 5.60.

**కెంపారు** దే. అ. క్రి.
ఎఱ్ఱనగు.
తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు,తెఱగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁడి,మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్రహించెఁ, బల్లవాలంబి మత్తేభలీల. విరా. 5.399.

**కెంపు** దే. వి.
1. పద్మరాగ మణి.
వ. కెంపుసొంపు సంపాదించి యకాల సంధ్యా నావహించిన. విరా. 5.40.
2. ఎఱుపు, రక్తిమ
సీ. పదతలంబుల కెంపు పరఁగిన తలము కుంకుమ లిప్తమైన చందము

వహింప ... విరా. 1.308, విరా. 5.103., శాంతి. 4.97.

కం. ఇనుఁడు తనకడకు నేతెం,చిన రాగముఁ బొందుటది యుచితమనగాఁ గెం,పున మెఱసి పశ్చిమాశాం,గన జనసంభావనముల గౌరవమందెన్. విరా. 2.3 8.

విణ.

(వృత్తియందు మీఁది వర్ణములు వైకల్పికముగా లోపించి 'కె' యనునది మిగులును. దానికిఁ గొన్నియెడల నుగాగమమును గొన్నియెడల పరనుగు హల్లునకు ద్విత్వము నగును. ఉదా.-కెంగేలు, కెంజాయ, కెమ్మోవి. మొ).

ఎఱ్ఱనైనది.

చం. మేటివిల్లు వే,కొని కనుదోయి కెంపుగ నకుంఠిత విక్రమమొప్పఁ ద్రుంచె నా,తని ఘన కార్ముకంబు. కర్ణ. 1.163., భీష్మ. 3.375, శల్య. 2.19.

(కెంపుగన్ = ఎఱ్ఱనైనది కాఁగా).

**కెంపెక్కు** దే. అ. క్రి.

ఎఱ్ఱఁబాఱు.

ఉ. (సూర్యాస్తమయ వర్ణనము) చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు వి,ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం,పెక్కుచువచ్చె దీవియల యేడ్తెఱ సోయగమందె. విరా. 2.319.

**కెడ** దే. వి.

పార్శ్వము, ప్రక్క.

గీ. కృపుఁడు వృషసేనుఁడును వారి కెడనకూడి పార్థు తనువున దూపులు వఱపిరి. ద్రోణ. 4.303. (ఇది పరుషముగా శ. ర పాఠము. కాని సరళాదిగా నేఁటి ముద్రిత ప్రతులు)(చూ. గెడ. శ.ర; కెడ = పార్శ్వ, గెడ = జత. అని).

**కెడఁగూడు** దే. అ.క్రి. (√ కెడ)

1. కూడు, గుంపగు.

సీ. ... కోర్కులు గెడఁగూడుకొని పారమెఱ్ఱిన చిత్తఁజుఁబాయుఁ జిగుపలౌత్త. విరా. 5.102.

2. ప్రక్కఁజేరు, పార్శ్వము.

కం. కెడగూడ దీని సిడము మొదలి పయిం బెట్టి కాల్చు టుచితం బని యన్. విరా. 3.12.

**కెడయు** దే. అ. క్రి.

విఱిగిపడు, పడు, కూలు.

కం. కూలెడు గుఱ్ఱంబులు ధర,ద్రావెడు నేనుఁగులుఁ గెడియు రథములునై. భీష్మ. 3.353.

2 వ్రాలు, డొల్లు.

సీ. . కీలుఁగావెచలింపఁ గెడసిన బొమ్మల కైవడిఁ బటు తురంగవ్రజంబు తే. . . నొక్క, వెట్ట వెస డొల్లె. ద్రోణ. 3.62.

3. చచ్చు, మరణించు.

కం. ఊరసమునఁ గదిసి శరా,సారము పైఁగురియ నీవు సక్రోధుఁడవై, పేరురమున వెస నాటిన తోరంబగు నారసమనఁ ద్రుళ్ళి కెడసెనే. కర్ణ. 3.38.

స్రగ్ధరం. ... వాఁడుం గెడసెను వదనోత్కీర్ణ కీలాల ధారా,పంక ప్రాగ్భా

రమగ్నాపతన విఘటిత ప్రాణులై
యాహవోర్విన్. ఆది. 7.91

**కెమ్మోవి** దే. వి. (కెంపు, మోవి)
ఎఱ్ఱని క్రింది పెదవి.
సీ. .... అంగుళంబులవల్ల నలకలు
గబళించి, కెమ్మోవియాని యొక్కెంతుఁ
గాయ్వు. విరా. 2.310.

**కెరలు** దే. అ. క్రి.
1. విజృంభించు, చెలరేఁగు.
వ. .. కుంతిభోజ తనూజు లొక్క
పెట్ట పదమువ్వురతనిం బొదివినఁ
బదుమూఁడు మేటి మాపులం గీటడంచి
కెరలి ఉమ్మచండంబున గర్జిల్లి ఘటో
త్కచుం గంధసింధురంబుఁ బోని కోలం
దేరిపై ద్రెళ్ళ మూర్ఛిల్ల నేసిన. ద్రోణ.
5.84.
వ. (దుర్యోధనుఁడు) ఇట్లు నిశ్వా
సంబు నిగుడ నొడలు పొంగఁ బటు
కశాఘాతంబునం గెరలు శూకలా
శ్వంబు చందంబునఁ గెరలి జల
స్తంభంబు చీపికొని. గదాదండ ము
విపులాంస పీఠంబున సమర్చుకొని
వెడలె. శల్య. 2.95.
మహాస్రగ్ధర. కృపుఁడున్ హార్దిక్యుఁడు
వాకిట నిలిచి .. దుర్వార .. ముగఁ
గెరలి క్రవ్యాదులోనాఁ గుచరిత నిరతిం
గ్రూరతా ధుర్యులై నన్ సౌప్తి. 2.9.
2. ప్రకోపించు, అతిశయించు, పొంగు
గీ. కుడుపుమైఁ గుడ్చు దినదిద్రఁ
గూరు సురతపరత నొందుఁ బెల్లయా
సపడు విమూఢుఁ, డది ... బాధించు
దోపత్రయంబు గెరలి. అప్ప. 1.1.6
3. కోపించు, మండిపడు.
వ. .. అప్పాండవ సేనాపతి పరివార
సామర్థ్యంబున రథ్యవంతుండయి
వాయవ్యాస్త్రంబున నయ్యంప పరం
పరఁ బరిహరించు సేసి తదీయ
చక్ర రక్షకులం దెగటార్చి యార్చి
నం గెరలి యగ్గురుసుందనుండు తత్స
హచరుల నుఱుమాడి. కర్ణ. 2.323.
5. ప్రవర్తిల్లు, రేఁగు.
వ. ఇత్తెఱంగున గెలుపోటయు లేక
యయ్యిరువురుఁ బోరుటయు నత్తఱిం
గెరలి సందడి కయ్యంబు కతంబున
... మాని యగ్గురు పార్థులు పాంచాల
కౌరవ బలంబులపై దఱిమిరి. ద్రోణ.
1.300.

**కెరలు వొడుచు** దే. అ. క్రి.
దుముకు, గంతులిడు.
వ. . . పసులు వెసం దిరిగి మున్ను
వివ్వచ్చుండు వచ్చిన జాడ గైకొని
దక్షిణ దిశకుఁ గెరలు వొడుచుచుం
కెడలం దాటిన. విరా. 4.365.

**కెరల్చు** దే స. క్రి,
కెరలించు, రేఁగఁజేయు
ప్రకోపింపఁజేయు, ఉద్రేకింపఁ జేయు.
సీ. ... అన్యులఁ బనిఁబంచు నప్పుడ
మ్మద్దియ,పలుకుల తీపు గోర్కులఁ
గెరల్చు. అను. 5.48.

**కెలను** దే. వి. ఔ. (దీనికి బహువచన
మున నిత్యముగా బిందుపూర్వక 'క'
('కు') వచ్చును).
1. పార్శ్వము, ప్రక్క.
కం. కెలకులఁ బిటింది దెసయుం,
గలయం బరికించి తన యఖండిత
బాహా,బల గర్వమ యచ్చట ముం,

గలిగా మదమత్త భద్రగజ సదృశ గతిన్. విరా. 2.326.

2. సమీపము, దాఁపు.

వ. (భీముఁడు) గద యల్లార్చి పేర్చి వ్రేటుగొనిన మెడకెలను దాఁకి నీ కొడుకు మహాపవన పతితంబగు సాలంబు పోలికిం గూలినం గని ధర్మ పుత్రముఖులు ప్రమోదంబు నొందిరి. (శల్య. 2.267).

దిక్కు, దెస.

చం. కురిసెఁ బ్రచండవృష్టి ఘన ఘోషము లెల్ల కెలంకులన్, భయంకరములుగా. అర. 3.297.

4. చుట్టుప్రక్కలు.

గీ. సులభాభిధాన యగు నొక,లలన విమలయోగ ధర్మలంపటు జనకుం, గెలన విని య,తని బోధము, కొలఁది పరీక్షింపఁ దనకు కోర్కి వొడమినన్. శాంతి. 6.170.

ఆ. ఆపులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ జలుపవలయు నృపతి గొలువున్న యెడల బా,హిరములైనఁ గెలని కెగ్గలగుట. విరా 1.137.

**కెలనము** దే. వి.

కార్యము, కృత్యము, పని.

వ. పాండవులం బరిమార్చు పని నేఁడ చేయక మఱచేసిన రారాజు నిర్గత ప్రాణుఁడైన నా కెలసంబెవ్వఁడె కెక్కెడు సౌప్తి. 1.24.

ఉ ... వా,రేమయిరేమి మా కెలస మెక్కె నెఱుంగుము మమ్ము ముప్వురన్. సౌప్తి. 1.231.

వ. ... రఘుకులేశ్వరుండయిన రామదేవుండు నా కెలసము మెచ్చి. అర. 3.330.

2. అక్కఱ - కావలసిన పని, కృత్యము.

ఉ. ... ఏను నీ,చుట్టమునై భుజాబలము సొంపున నీ కెలసంబు దీర్చెదం,జట్టన నన్నుఁ బంపుము భృశంబుగ నెయ్యది కార్యమిత్తఱిన్. అర. 5. 228.

## కే

**కేక** సం. వి. ఆ. స్త్రీ.

నెమలి కూఁత.

సీ. . చారు మయూర కేకారుత కలితంబు,లగుచు నొప్పారు క్రీడాచలములు. అను 2.318.

**కేకయము** సం. వి. అ. పుం.

ఒక దేశము. భీష్మ. 1.40.

**కేకయ రాజు**

కేకయ దేశపు రాజు, సుదేష్ణతండ్రి బృహత్క్షత్రుఁడు (చూ బృహత్క్షత్రుఁడు)

**కేకయసుత** సం. వి. ఆ. స్త్రీ.

సుదేష్ణ. విరటుని భార్య.

కం. ... చనియెం గేకయసుతాసు చారికల బడిన్. విరా. 1 306.

**కేకయుఁడు** సం. విఱ. అ. పుఁ.

కేకయ దేశస్థుఁడు.

కం. కేకయ సాల్వులు దోడుగ,నా కీచకుఁడాజి నన్ను నపజితుఁ జేసెన్. విరా. 3.118.

2. కేకయదేశపు రాజు.

వ. శల్య కేకయ ధృష్టకేతు జరా

సంధతనయ ప్రభృతులయిన భూపతు
లకును. ఉద్యో. 1-37.

**కేకిసలాడు** దే. అ. క్రి.
పరిహాసము చేయునపుడు కేకలు
వేయుచు చప్పటులు కొట్టు.
తే. వృష్ణిభోజాంధకులు కురువీర
యిట్లు,రేఁగి మద్యపానంబొనరించి
తాము మదముఁ బొంది కేకిసలాడుచు
బొందువడని పలుకులెసఁగంగఁ దిరిగి
నవ్వులు సెలంగ...మౌస. 41.

**కేతకి** సం. వి. ఈ. స్త్రీ.
మొగలి.
(ఇంద్రప్రస్థ పుర వర్ణనము)
చం. సరళ తమాల తాల హరిచందన
చంపక నారికేళ కే,సర కదళీ లవంగ
పనస క్రముకార్జున కేతకీ లతా,గరు
ఘనసార సాల సహకార మహీరుహ
రాజ రాజి సుం,దర వన నందనా
వళుల దత్పుర బాహ్యములొప్పఁ
జూడఁగన్. ఆది. 8.78.
వీనిలో రెండు రకములు కలవు: 1.
తెల్లపూవుల మొగలి (సితకేతకి - ఇది
మగది) 2. బంగారు రంగుగల పూవు
గలది (స్వర్ణకేతకి-ఇది ఆఁడుది). ఇది
సముద్రప్రాంతములలో విస్తారముగా
పెరుగును. ఇది రమారమి రెండు
నిలువుల యెత్తు వఱకును బెరుగును.
ఆకులు పొడవుగా అనాసయాకులను
బోలి ముండ్లు గలిగియుండును. దీని
కాయలును అనాస కాయలవలె
నుండును. కాని కాయకు గదులుం
డును. కాయపండిన ఎఱ్ఱగా నుండును.
దీనికి రూళ్ళకఱ్ఱల వంటి యూడలు
దిగును. వీనినుండి నారదీసి నులక
నేయుదురు. పుష్ప దళములు బాకుల
వలె నుండును. వీనిని స్త్రీలు దల
యందుఁ దాల్తురు.

**కేతన** వి.
తిక్కనామాత్యుని పెదతండ్రి.
కేతన- మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమి తమ్ముండు. విరా. 1.10.

**కేతనము** సం. వి, అ. న.
ధ్వజము.
చం. ... త్రిగర్తనాథు కే,తనమున
చక్కటిన్ మన రథంబు వేసం జన
నిమ్ము. విరా. 3.179.

**కేతుమంతుడు** సం. వి. త్. పుం.
కిరాత రాజు, నిషాదాధిపతి.
తె. అదరెఁ గాళింగ నాయకుండగు
శ్రుతాయు, వునకుఁ దోడయి వీఁకమై
దన నిషాద సైన్యమును దాను భీముపై
సరభసముగఁ గేతుమంతుండు ఫణి
రాజకేతుఁ డలర. భీష్మ. 2.60.
2. అమితాజుఁడై పుట్టినవాఁడు.
వ. ... కేతుమంతుండమితాజుఁడై
పుట్టి. ఆది. 3.80.

**కేతుమాలా వర్షము** సం.వి.అ.పుం.న.
మేరువునకుఁ బడమట నుండు దేశము.
భీష్మ. 1.25.

**కేతువర్మ** సం. వి. న్. పుం.
సూర్యవర్మని తమ్ముఁడు. త్రిగర్తాధి
పతి. ఇతఁడు తన సోదరులతోఁ గలిసి
యాగాశ్వ రక్షణమునకు వచ్చిన
యర్జునునితోఁ బోరి యోడిపోయి
శరణుఁజొచ్చెను. విరా. 4.45.

**కేదారము** సం. వి. అ. పుం. న.
1. వరిమడి.

వ. ... వెడపదనికి రొంపి గలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన వేదారంబు తెలుంగు దోఁచుటకు నీడై చతుర హలికుండు ... వల్గునాశుగ సంతాడన విశీర్ణ శత్రుశేఖర వజ్ర వ్రణంబుల వలనను సంగ్రామం బఖిరామంబయ్యెను. యోరప్రకారం బయ్యె, విరా. 5.60.

2. మడి, పొలము.

వ. ... నిరతిశయ సాంద్ర చంద్రాతప స్నపన శీతల సమీర వాహ్యమాన వినిద్ర కుముద కేదార సౌరభ్య నిర్భరంబులు నతిదీర్ఘ యామంబులునైన శారద యామినులు. అర. 7.2.

3. ఒకానొక పుణ్యక్షేత్రము. దీనిని దర్శించిన బ్రహ్మలోకము సంప్రాప్తమగును. అర. 2.263.

**కేయూరము** సం. వి. అ. న.

భుజ శిరస్సున నుండునది, అంగదము, భుజకీర్తి.

వ. ... కుంభసంభవు బలంబు సరభసంబుగా నతని కర్ణంబు సొచ్చిన విస్వచ్ఛందు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబులగు బాహుదండంబులను సకుండలంబులగు కర్ణపాశంబులను సకిరీటంబులగు శిరోభాగంబులను భూభాగంబలంకరించి యప్పుడావహిల్లిన రుధిర సాగరంబునకు రత్నాకరత్వం బలవరించె. విరా. 5.133; భీష్మ. 3.88.

**కేరడము** దే. వి. ($\sqrt{\ }$ కేరు)

1. వక్రోక్తి, వంకరమాట, పరిహాసము, గేలి.

తే. .. కేరడము లాడుచుండురేనిఁ గవియు పాండవ బాణాన్ని గాదు సువ్వె,తమ్ముఁ దమ లోభమను చిచ్చు దరికొనంగఁ దెగినవారయి పోదురింతియ తలంప. ఉద్యో. 1.353.

**కేరళము** సం. వి. అ. పుం.

దక్షిణ భారతమునందలి యొక దేశము.

సహదేవుఁడు దక్షిణ దిగ్విజయము సేయునపుడు ఈ దేశపు రాజును జయించెను.

భారతకాలమున నిది సమస్త వస్తు సంపత్సంపాదనంబులయిన గుణవిశేషంబుల వెలసి పురుషార్థంబులగు ధర్మార్థ కామంబులకుఁ గారణమై కమనీయ మగుచుండెను.

అశ్వమేధ యాగాశ్వ రక్షణమునకై చను అర్జునుఁడీ దేశాధీశు ననాయాసమున వశగతుని జేసికొనియెను. సభా. 1.261., భీష్మ. 1.40., అశ్వ.4.113

**కేరు** దే. అ. క్రి,

ఉత్సాహపడు.

అ. అనుచుఁ జూచుఁ గేరు నమ్మోగ్ధ పలుకులు వినఁగఁ గోరు. (పారాం) విరా. 2.45.

**కేలి, కేళి** సం.వి.ఇ.పుం. (ఇ.ఈ.స్త్రీ.)

1. ఆట, క్రీడ.

తే. ... భవదీయ సైన్యంబు బడలువడఁగ, లీల నిస్సంభ్రమముండయి కేలి సలిపె, గాలిచాలప్డు గగనచరాలి వొగడ. భీష్మ. 2.222.

కం. జలనిధి హిమవద్భూధర,కలిత జనన కేళికౌతుక వ్యక్తావ్యక్త లలిత

సౌందర్య స్ఫుర,దలము తను త్రీస
నాథ హరిహరనాథా. విరా. 1.40.
విరా. 3.169.
2. రతి, స్త్రీపురుషుల కలయిక
సీ. (తరుణులుఁబతులు) తే. కేలి సలి
పిరి భవన దీర్ఘికల. విరా. 2.238.
(సం. ము)
సీ. సొగయించు నీకేళిఁ దగిలి యానం
దంబుఁ జెందఁగానని మది గుందుట
యును. విరా. 2.118., విరా.2.310,
3. పరిహాసము.
తే. ఇట్టి కష్టపుఁ గేలికై యిట్లుసేయఁ
బ్రతినవట్టుట దగదె యిప్పలుకు నీవు
వినఁగ నితఁడాడ నిమ్మహీ విభుఁడు
ధర్మ,వంతుఁడగుఁగాక చంపన
వలయుఁ గృష్ణ. కర్ణ. 3.69.

**కేలు** వై. వి. ఔ. అనౌ. (సం. కులి౯).
హస్తము, చేయి.
చం. ... ఉగ్ర మృగనాథునైనను
గిట్టిముట్టి బె,ట్టిదముగఁ గాలఁ గేలను
గఁపింది మగంటిమి యుల్లసిల్లఁ
బట్టుదు. విరా 1.83.
ఉ. ... కేల్ దనకేల నమర్చి. ఆను
2.456.
సీ. కెంగేలు దన కేలులోఁ గీలించి
నెయ్యంపు మాటలఁ దగు మఱుమాట
లాడు. విరా. 2.310.

**కేలు దలమోడ్చు** అ. క్రి.
చేతులు శిరముపై ముకుళించు (మొక్కు)
ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గల
వల నా,లింగనంబు సేసి యంగక
ములఁబులక లెగయ కేలు దలమోడ్చి.
ధర్మజు నాననమున దృష్టి యదర
విలిపె. ... విరా. 5.341.

**కేలుమొగుచు** దే. అ. క్రి. (√ కేలు)
చేతులు ముకుళించు, నమస్కరించు.
కం. అని కేలు మొగిచి మ్రొక్కెన.
ఆది. 5.20.

**కేలుమొగుడ్చు** దే.అ.క్రి. (√ కేలు)
కేలు మొగుచు, నమస్కరించు.
వ. .. కేలు మొగిడ్చి ఫాలతలంబు
నం గదియించిరి. ఉద్యో. 2.121.

**కేలుమోడ్చు** దే. అ. క్రి. (√ కేలు)
కేలు మొగుచు, నమస్కరించు.
వ. ... అమ్మునిపాలికి సూరిజన
సమేతంబుగాఁ జని పరివేష్టించియుండి
కేలు మోడ్చి. శాంతి. 6.271.

**కేవలత్వము** సం. వి. అ. న.
1. మఱియొకదానితోఁ గూడియుండ
కుండుట.
ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ బరి
కించు జీవుండు, పరము గాంచునపుడు
ప్రకృతి సగుణాతా నిరూఢి యడఁగి
తన్మయత్వము నొంది,జీవకేవలత్వ
సిద్ధి యొలయు. శాంతి. 6.58; 145.
2. ఏకత్వము.
తే. తగులు వాసి షడ్వింశకత్వమునఁ
గలయఁ,దనకు మునులేని కేవలత్వ
ముశు నిర్మలత్వ శుచితా స్వతంత్రతత్వ
సత్త్వపరత,లొందుఁ దద్ధర్మ సమ
వాయమొలసి యధిప. శాంతి. 6.62.

**కేవల పదము** సం. వి. అ. న.
కైవల్యము, మోక్షము(చూ. కేవలము-
2వ అర్థము.)
కం. ఇది సాంఖ్యానము దీనిని,మది
కలవడఁ జేసికొనుచు మఱవక గురు
ని,ర్మదుఁడై కొలువఁగఁ గేవల,

పదము నతని కరుణపెంపు ప్రకటము సేయున్. అను. 3.323.

**కేవలము** సం. విశ. (అ. ఆ. అ.) సామాన్యము.

చం. .. జల్లనం జెదరు డెందము గూడఁగదెచ్చి నన్నుఁ గేవలమున ముట్ట నెవ్వరికి వచ్చుననుం గలగున్ వెనుంబడున్. (కేవలమునన్. సామాన్యముగా) విరా. 2.104.

2. ఏకము, అద్వితీయము.

కం. కేవల సూతులతోడనే - (మఱె వ్వరు లేరని భావము).

తే. ... దానఁ, బరమమున కేవలము నగు పదము గలిగి యేన నీవను నైక్యంపు బెఱుక వొడముఁ,గాత గమనాగమనములు గ్రాఁగిపోవ ... శాంతి. 4.243.

(కేవలమునగు పదము. అద్వితీయమైన పదము. అట్టి పదము మఱియొకటి లేదు- అని భావము.)

3. కారణము లేనిది, అవ్యాజము.

కం. జ్ఞానము కేవలకృప న,జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం,గా నది సకల ధరిత్రీ,దానంబునకంటె నధికతర ఫలదమగున్. శాంతి.4.255 (కృపకుఁ గారణము లేదు. కృప తప్ప మఱియొక కారణము లేదు. అని భావము).

4. అచ్చము. మఱియొక దానితో గూడనిది.

సీ. ... ఒక్క యశ్వంబు గాంచితి మవ్వధూటి, గేవల ధవళంబునా విని యొద్దారమునకు నేనదె నల్లఁదనము గంటి-తే. వెనుకదెస నన్న వాదయ్యె. అను. 1.193.

**కేవలాంగుఁడు** సం. విశ. అ. పుం. శరీరమాత్రము గలవాఁడు.

తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి, కేవలాంగుఁడై నిర్మలభావ యుక్తిఁ,దపము గృహముననేనియుఁ దత్పరతఁ జ,రించి సంసార జలధి దరించు నరుఁడు. శాంతి. 6.239. (కేవలాంగుఁడు = శరీరము నిలఁబడు టను మాత్రమే చూచుకొనువాఁడు)

**కేవలుఁడు** సం. విశ. అ. పుం, సామాన్యుఁడు.

కం. ... ఉ,ద్దామ భుజాబలయుతుం డితఁడు కేవలుఁడే. ఉద్యో. 1.30· 2.22.

**కేశపాశము** సం. వి. అ. పుం. కేశ సమూహము.

వ. కాంతారధూళి మలినాంగుండును జటీభూత కేశపాశుండును దిగంబరుం డునునగు విదురుండు. ఆశ్ర. 2.59.

**కేశభారము** సం. వి. అ. పుం. కేశముల మొత్తము, పెద్ద మొత్తము గానున్న శిరోజములు.

వ. ... రథంబు డిగ్గనుఱికి లంబ కేశభారుండును. విరా. 4.73.

**కేశము** సం. వి. అ. పుం.

1. తలవెండ్రుక.

తే. అంబుదంబులు గేశంబులందు నదులు సర్వతను సంధులందును జలధులుదరదేశమున యందున్నట్టి దేవదేవుఁ గొలుతుఁ దోయాత్మ దేవకి కొడుకుఁ గృష్ణు. శాంతి. 2.33.

2. వెంట్రుక.

వ....కాలాంతకుండు దక్షుని యజ్ఞంబున కలిగిననది భీతిఁ బఱతెంచి నా యురస్థ్సలంబు నొందిన మదీయ కేశంబులు ముంజనిభంబు లగుటంజేసి ముంజకేశుండను పేరు గలిగె. శాంతి. 6.441., విరా. 1.165.

**కేశవుఁడు** సం. వి. అ. పుం.

కృష్ణుఁడు, విష్ణువు.

**ఉ.** వారల జూచి కేశవుఁడు వచ్చిన కార్యము సెప్పుఁడన్న ఉద్యో. **2.69.**

సూర్యకాంతులు, చంద్రకాంతులు, అగ్నిజ్వాలలు కేశసంచయ మగుట చేత కేశవుఁడను పేరు వచ్చెను.

(ప్రశస్తాః కేశాస్సన్త్యస్య కేశవః- మంచి వెంట్రుకలు గలవాఁడు. అథవా శోభనాః కేశాః యస్య సః).

కం. ఇనరశ్మలు జంద్రాంశులు,నన లశిఖలుఁ గేశ సంచయము నాకుం గా,వునఁ గేశవాభిధానం,బునఁ గొని యాడుదురు నన్ను బ్రబుద్ధ జనంబుల్. **శాంతి. 6.426.**

(కేశినమసురం సంహతవానితి- కేశి యను నసురుని జంపినవాఁడు.)

(శ్లోక ఇతి బ్రహ్మణోనామ ఈశోఽహం సర్వదేహినాం,ఆవాం తమంశే సంభూతా తస్మాత్కేశవ నామవానితి. బ్రహ్మ రుద్రులు ఈయనయందు జనించిరి. గనుక కేశవుఁడు అను పేరు వచ్చెను. -హరివంశము)

**కేశాకేశి** సం. అవ్య.

ఒండొరులు జుట్టు జుట్టు పట్టుకొని చేయునది. (పోట్లాట, యుద్ధము).

వ. ... అయ్యిరుదెఱంగుల వారికిం గేశాకేశియగు సమరంబయ్యె. ఆర. 7.70.

**కేశి** సం. వి. న్. పుం.

ఒక రాక్షసుఁడు; దనువునకు కశ్యపునకుఁ బుట్టినవాఁడు. ఈతఁడు దేవసేన యను అరిష్టనేమిప్రజాపతి కూఁతును అపహరించుకొని పోవుచుండ దేవేంద్రుఁడితనితోఁ బోరి యోడించి విడిపించెను. ఆది. **3.63.,** ఆర. 5.178.

**కేశిని** సం. వి. ఈ. స్త్రీ.

1. దమయంతిదాసి; బాహుకునియొద్దకిమెను దమయంతి దూతిగాఁ బంపెను. ఆర. **2.185.**

2. ఒక దేవాంగన.

కుమారస్వామి యొద్దకుఁ బోవు శివునితోఁగూడఁ బోవుచున్న దాక్షాయణిఁ గొల్చుచు నీమెయు నేగెను.

**కేసరము** సం. వి. అ. పుం. న.

పుప్పొడి గలది; కింజల్కము.

మ. ... గ్రద్దపొందెదలి పీఁకం గేసరంబుల్ గద,ల్కొనఁ దోడ్తో మధువుచ్చి పేరెలమిఁ బొల్పుం జెందెనంభోజముల్. ఉద్యో. **2.210.**

పుం.

వకుళము, పొగడ.

చం. సరళతమాల....కే,సర కదళీ లవంగ .... మహీరుహ రాజ రాజి సుం,దర నవనందనావళుల. ఆది. 8. 78.

కేసరి సం. వి. న్. పుం.

1. హనుమంతుని తండ్రి.

వ .. హనుమంతుఁడు భీమునిం జూచి నగుచు నేను కేసరిక్షేత్రంబున వాయుభట్టారకునకుం బుట్టినవాఁడ. అర. 3.330.

2. సింహము.

ఉ. కేసరివిక్రముండు కపికేతనుఁడు. విరా. 5.82.

**కేళిక** సం. వి. అ. స్త్రీ.

తే. ... ఇత్తుషార నగంబునకేను వచ్చి,కంటి రమణీయ కేళికావనంబు. అను. 4. 416.

# కై

**కై** దే. ప్ర. కయి (కు-ఐ-) ఇది ఉభయ యతుల లోనిది; చతుర్థీవిభక్తి ప్రత్యయము - కొఱకు.

(క) ప్రయోజనమును దెలుపును.

గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి,జూదమాడెదు నీతోఁడ. సభా 2.174.

వ. .. దేవకుండను భూవల్లభుండు తన పుత్రికి దేవకికి స్వయంవర మహోత్సవం బాచరించిన నవ్వసుదేవునకై నయ్యాదవాన్వయ జాతుం డగు శిని యవ్వనితఁ బరాక్రమంబున దేరం గూడిన రాజలోకంబు దొడరి పోరంజాలక నిలిచిన. ద్రోణ.4.275.

కం.... పాండవులకై కొంత సమర, కేలి వేడుకఁ జలుపుట పోలదొక్కొ. భీష్మ. 1.163. (ఇట 'పక్షమున' అని భావము)

కం. దుర్భరమగు నినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై నిర్భర విధ్వంస దశావిర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే విరా. 1.222.

(నాకై = నాకు నేనే స్వయముగా- అని భావము).

మ. ...విలసచ్ఛాయ సుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్. విరా. 2.136.

ఆ. అరివిమర్ది యితనికై వగపేటికిఁ బుణ్యలోకమునకుఁ బోయె. స్త్రీ.2.35.

**కైకేయి** సం. వి. ఈ. స్త్రీ.

కేకయరాజు కూఁతురు.

1. సుదేష్ణ- విరటుని భార్య, ఉత్తరుని తల్లి.

వ. ... కన్యకా పరివృతయై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదర మరణ శోకాతురయగు కైకేయి కడకుం జనునప్పుడు. విరా. 3.54.

2. సుమన.

తే. సుమన యనియెడు కైకేయి యమరపురము,నందు శాండిలిఁ గని భవ్యమైన దివ్య,పదవి యే వర్తనమునఁ జొప్పడియె నీకు, నతివ చెప్పుము నాకని యడిగె నధిప. అను. 4.356.

3. అజామీఢుని భార్య.

సీ. అయ్యజామీఢునకుఁ గైకేయియు గాంధారియు,ఋషయు నను ముప్వురు స్త్రీలకు-కం. బలయుతులు నూట యిరువది నలువురు సుతులుద్భవిల్లిరి. ఆది. 4.110,111.

దశరథుని మూఁడవ భార్య, భరతుని తల్లి.

వ. అందుఁ గౌసల్యకు రాముండును గైకేయికి భరతుండు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును, జని యించిరి. అర. 6.269.

**కైకొను** దే. స. క్రి.

స్వీకరించు, గ్రహించు, తీసికొను.

ఉ. ... కావున దీనియందిడుట కార్యము గైదువులెల్ల ... ఎచ్చో వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. విరా. 1.166.

ఉ. ... ఆ సుదేష్ణకుం,గన్నుల సన్నలం బనులు గైకొని వారక చేయుచుండుటన్, మున్నటులున్న పాణితలముల్ బలుగాయలుగాచెఁ గాచెఁ జూచితే. విరా. 2.221.

చం. వనిత మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్కనేఁటి నీ,కని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొనుము. విరా. 2.334.

చం. ... వేఱ యొ,క్కని నుపదర్శ నంబునకుఁ గైకొనుమారసి నీవు నావుడున్. అశ్వ. 1.41; సభా. 1.288.; సభా. 2.266.

2. లక్ష్యపెట్టు, సరకుసేయు, పాటించు, ఆదరించు.

శా. .. మహాత్ముఁ డా సరకు సేయండచ్యుతున్ మమ్మతం,దేలా కైకొను నా సుయోధను ... దిగ్గెది యూహింపఁగన్. ఉద్యో. 2.145.

మ. ఉయ నా యాచినమాట గైకొనవు సంతాపంబు లెచ్చుం జుమీ,స్వయ మెట్లుం దుది నీకు. .. ఉద్యో. 4.47.

తే. తప్పు సేసితిరిట్టులు దగునె వీర, లేమి గతిఁ బల్కినను నదియెల్ల మనము, గైకొనవలయుఁ గాకిట్లు గాదు గూడ,దని నిషేధించుటొప్పునె మనుజనాథ. విరా. 5.275.

మ. మన సేనఁ గలఁగంగఁ జేయును మదిన్ మందాకినీనందనుండు ననుం గైకొనకున్నవాఁడితని యాటోపం బడంగించెదన్. భీష్మ. 2.31.

కం. .. ని,ర్ధనుని నిజప్రజయును గైకొనదు విరోధులును సరకుగొనరు కుమారా. శాంతి. 3.173.

3. సమ్మతించు, అంగీకరించు, ఒప్పుకొను.

కం. అని నిశ్చయించి పలికిన,విని కేకయరాజపుత్రి విభుతలఁపు మనం, బునకుఁ బ్రియంబగుటయుఁ గైకొని యా పని యట్ల చేతకుం బూనెఁదగన్. విరా. 3.33.

కం. తగుమాట లాంబికేయుం,డగునని కైకొనునె యెన్నఁడైనను గొడుకున్, మగఁటిమి గలఁడనియెడు న,మ్మిగఁ జూచుచునుండు విషము ద్రిమింగెన యేనిన్. ఉద్యో. 1.315.

కం. అమరులు విమల శ్రద్ధా,సమేత ములు గాని తాపసత్వము గ్రతుమ, త్త్వముఁ గైకొనరు. శాంతి. 5.244.

కం. అని చెప్పిన విని యగుఁ బో, మ్మని కైకొని ధర్మతనయుఁ డందఱు మును ని,ట్లనపాయత వర్తిల్లుద,మని

తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. విరా. 1.114.

4. ఆక్రమించు, వశపఱచుకొను.

కం. కోపోద్రేకంబున నతఁడా పాం
చాలపతిమీఁద నతులిత సైన్యాటోప
మున వచ్చి పురి పరిఖా పరిసర తల
ముచుట్టుఁ గైకొని విడిసెన్. ఉద్యో. 4.379.

కం. మఱియుఁ బ్రాకారంబుపైనున్న
గదా పరిఘ కుంత ప్రముఖంబులు
గైకొని లంకామధ్యంబున వైవం
దొడంగిన. ఆర. 7.67.

5. పెండ్లియాడఁగోరు, వరించు.

కం. వినుము మనోవాక్కాయములన
మూఁడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున మనమున
గైకొన్న భర్త మానందగునే.

వ. సత్యవంతుఁ డెట్టివాఁడైన నగుం
గాని యే నింక నొరుల వరియింప
నొల్ల. ఆర. 7.182-123.

6. భావించు. ఎంచు

సీ. ... అతి ఘోరమగు నఖిల జ్ఞాతి
వధ మొనరించుట వలన నధిక,
గుణుని సౌభద్రునిఁ గులభూషణంబు
బాంచాలీ తనూజ పంచకముఁ గోలు-
తే-పోకఁజేసియు, గెల్పు గెల్పుగ
మదీయ, బుద్ధి గైగొనదయ్యెడు.
శాంతి. 1.6.

7. ధరించు, తాల్చు.

ఆ. వివిధ దుర్నిరూప వేషముల్
గైకొని,నిఖిల దిశలయందు నిపుణ
వృత్తి నెఱుఁగునట్టుగా ననేకులఁ
బుచ్చిన,నెల్లి నేఁటిలోన నెఱుఁగఁ
బడరె. విరా. 3.93.

వ. ... భీముండు నిగిడించు హేమ
లిప్త నారాచధారల గగనలక్ష్మి
కనకాభరణంబుల చెన్ను చేకొనియె.
ద్రోణ. 4.232., భీష్మ. 3.105.

కం. అంతవునంతకు నీదగు,కాంతా
రూపంబు నేను గైకొనియెద ని,శ్చిం
తమున మగుడఁ జనుమని, యింతికిఁ
బురుషత్వమిచ్చె నెంతయు వేడ్కన్.
ఉద్యో. 4.388.

(శ్లో॥ స్త్రీలింగం ధారయిష్యామి తవేదం పార్థివాత్మజే. సం. భార. ఉద్యో. 193.5)

8. అనుభవించు.

తే. అల్పపుణ్యుండు తొలి తొలి యమ
రతా సుఖంబు గైకొని మఱియు దుఃఖ
ముల నొందు,భూరిపుణ్యుండు మును
ఘోర నిరయ,యాతనల నొంది వెండి
సౌఖ్యంబులొందు. స్వర్గ. 39. (కయి
కొని అని కొన్ని ప్రతులు)

9. పట్టు, అనుసరించు.

తే. ... పసులు సన్న,జాడఁ గైకొని
యమ్మత్స్య జనవిభుండు.

వ. ఇట్లు చేని కూడముట్టిన. విరా.
3.158; విరా. 3.124.

వ. మాధవుండును ... కఱెనగరంబు
పెందెరువు గైకొని వాడుమిగి చతురత
త్వంబునఁ దురంగంబుల పటుత్వం
బున నత్యంత సమీచీనంబైన యానం
బున మనంబలరం జని చని. ఉద్యో.
3.145.

10. పూను, అవలంబించు.

కం. చనుటయు ద్రౌపది యతనిం,
గనియుం గానని విధంబు గైకొని
చిత్తం,బున దెపరకె తన ముంచమె,

పని వెరవున నుండె భీముపలుకుల యూఁతన్. విరా. 2.248.

సీ. ....అత్యుగ్రుఁడగు హిడింబాసురు వచ్చినచోటఁ గైకొన్న నిష్ఠురతతోడ .. సౌప్త. 2.39.

11. పొందు, చెందు.

వ. పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును దోడన యరుగుదేరం గదలి శుభ నిమిత్తంబులు గైకొనుచుం జని. విరా.1.147

సీ. ... ఉల్లంబు సరసత దెల్లంబుగా లీలఁ గైకొన్నగాదె పంకరుహనయన. విరా. 2.45.

12. పోషించు, ఏలుకొను.

కం. దుర్భరవగు నిను గర్కుటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై,నిర్భర విధ్వంస దశా,విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా. 1.322; చూ. 328.

13. కొలుచు, సేవించు.

ఉ. మమ్ము జగత్త్రియంబునకు మాతలగా నొనరింపు మిష్టు ము,న్నిమ్ముల నొప్పు మాతృకలకెక్కుడు గావుత మేము సర్వలో,కమ్ములు దొంటి మాతృకలఁ గైకొనకుండుటయుం బ్రియంబుతో, మమ్మనిశంబు గొల్చుటయు మాకు వరంబుగ నిమ్ము షణ్ముఖా. ఆర. 5.246.

14. ఎన్నుకొను, నిర్ణయించు, నియమించు.

కం. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం,బునకుం గైకొనుట మేలు భూసురునిం గైకొని యరసి కాఁడనిన నా,తని యమ్మలకంబు సెఱచు ధార్మికునైనన్. అను. 3.182.

15. రక్షించు, కాపాడు.

(ధర్మనందనుఁడు సాత్యకితో).

కం. కురుబలము సొచ్చి నీదగు, దర్పంబు సూపి నయ్యన జని గైకొని నా యుల్లము, పరితాపము దీర్పవే నృపాలురు మెచ్చన్. ద్రోణ. 3.290.)

(శ్లో. అర్జునస్య పరిత్రాణం కర్తవ్య మితి సంయుగే. సం. భా. ద్రోణ. 110.89.)

కం. కని కౌరవపతి దుశ్శా,సనుతో నిట్టు, లనియెఁ గంటె శాంతనవునిపై, ఘనసేన ద్రోచెఁ జని కై,కొనుఁ డీవును సౌబలుఁడు నకుంఠిత వృత్తిన్. భీష్మ. 3.237,

(శ్లో. ఛాదితః పాండవైః శూరైః స్సమంతాత్ భరతర్షభ, తస్య కార్యం త్వయా వీర రక్షణం సుమహాత్మనః. సం. భా. భీష్మ. 106.3.)

**కైకోలు** దే. వి. కయికోలు (√ కైకొను) కైకొనుట, గ్రహించుట.

కం. లాభంబు ధర్మముఖ్యముగా, భరపడి మార్గశుద్ధి గనుఁగొని కైకో, ల్గా భూవరునకు నిహపర శోభనములు సేఁత చెప్పు శ్రుతివాక్యంబున్. శాంతి. 2.410.

**కైజీతగాఁడు** దే. విణ. (కైజీతము + కాఁడు)

బత్తెము తీసికొని పనిచేయువాఁడు. భృతకుఁడు, భృతక యోధుఁడు.

ఆ. కాననంబుబలముఁ గైజీతగాంద్రు
నున్నైనయట్టి బలములాఱు నరసి.
ఆశ్ర. 1.73.

**కైజీతము** దే. వి.

బత్తెము; భృతి. (చూ. కైజీతగాఁడు)

**కైటభుడు** సం. వి. అ. పుం.

ఒక రాక్షసుఁడు.

ప్రళయకాలయందు క్షీరసాగరమున యోగనిద్రాంతి పొందియున్న శ్రీ మహావిష్ణువు మేలుకాంచి లోకములు సృజింపఁ దలచెను. మున్నాతని యందు లయించియున్న మూఁడు గుణములలో సత్త్వగుణము వలన బ్రహ్మ యాతని నాభికమలమునఁ బుట్టెను. సృష్టికార్యమునకు బూనిన బ్రహ్మ తొలుత వేదములు సృజించెను. విష్ణువునందలి మిగిలిన రెండు గుణములగు - రాజసము, తామసము అనువాని వలన మధువు, కైటభుఁడు అను నిద్దఱు రాక్షసులు పుట్టిరి. వారు దురహంకారులై బ్రహ్మదేవుని నుండి వేదములపహరించి రసాతలమున దాఁచి కాపాడుచుండిరి. బ్రహ్మదేవుఁడు మొరపెట్ట విష్ణువు హయగ్రీవావతార మెత్తి పాతాళమునకుఁ బోయి ఓంకారనాదము చేసెను. అది మధు కైటభులు విని రోసముతో ఆ ధ్వని వచ్చి నదెసకుఁ బరుగిడి వచ్చిరి. అంతలో హయగ్రీవుఁడు మఱొక ఒక్కన బర్విడి వేదములు తెచ్చి బ్రహ్మకిచ్చి యేమియు ఎఱుఁగనటుల సముద్ర జలముపైఁ బరుండి యుండెను. దానవులు వేదములు కోల్పోవుట గ్రహించి యపహరించిన వానికై తిరిగి తిరిగి చివరకు నారాయణుని గాంచి యుద్ధమునకు బిల్చిరి. వెన్నుఁడు వారి నిర్వుర సంహరించెను. శాంతి.6.479 మొ. 488వ.

విష్ణుమూర్తి కర్ణములనుండి మధు కైటభులు పుట్టిరని కొన్నిటఁగలదు.

**కైతవము** సం. వి. అ. న.

1. జిత్తు, ఉపాయము.

వ. (ద్రోణుఁడు) తన్నుం గదిసినం గని యయ్యజాతశత్రుండు వెండియుఁ గైతవంబున రణంబునకుం దొలఁగం బాఱిన.

2. కపటము, మోసము.

దుర్యోధనుండు శకుని కైతవంబున మాయాద్యూతంబున ధర్మరాజుం బరాజితుం జేసి. ఆది. 3.17.

**కైదువు** దే. వి.

ఆయుధము.

ఉ. కావున దీనియందిడుట కార్యము గైదువులెల్ల. విరా. 1.166.

కం. దురమునఁ గైదువుఁ గొని తనుఁ బొరిగొన నేతెంచునట్టి పురుషుని వేదాంత రహస్యవేదినయినను, బొరిగొనినను గిల్బిషంబు వొందరు వత్సా. శాంతి. 1.295.

**కైదువుఁ బెట్టినవాఁడు**

ఆయుధమును క్రిందఁబెట్టిన వాఁడు. ఇఁక నీతో యుద్ధము చేయలేను, ఓడిపోయితిని నన్ను కొట్టకుము, దయ చూపుము-అని తెలుపుటకై యోధుఁడు చేతియందలి యాయుధమును క్రిందఁ

పెట్టుసు అడ్డివానిపైఁ బ్రతియోధుఁడు సామాన్యముగా చేయి చేసికొనఁడు.
వ. జోడు పుచ్చినవానిని గైదువుఁ బెట్టినవానిని యేటుఁ బోటుఁ దక్క సమరంబు సేయమానుదు. భీష్మ. 3.302

**కైపు** దే. వి.
ప్రౌఢత్వము, రూఢి.
మ. ... సంధియేలయగు నంచున్ మున్న కైపెక్కనట్టి తలఁపప్పార్థ నీకు గల్గినది గాండీవంబు దివ్యాస్త్ర సంతతియుం బెట్టినయట్ల యుండ మము జెందం దాపరాదో కదే. ఉద్యో. 3.72.

**కైపెక్కు** దే. అ. క్రి.
రూఢిచెందు, దృఢమగు. (చూ. కైపు)

**కైరవము** సం. వి. అ. న.
తెల్ల కలువ.
వ. ... కమల కైరవోత్పలాకీర్ణంబగు కొలని ననుకరించు ప్రదేశంబులు నునై. భీష్మ. 3.248.

**కైరాతము** సం. విశ. (అ. ఈ అ.)
కిరాత సంబంధిమైనది. కిరాతచరిత్ర.
ఇది. ... ఇంద్రకీలాధిగమనంబును గైరాతంబును అన్నది ప్రథమాశ్వాసము. అర. 1.401.

**కైలాపుత్రుఁడు** సం వి. అ. పు.
కద్రువకొడుకు - సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కైలాసము** సం. వి. అ. పు.
వెండికొండ (ఇది శివునికి ఉనికిపట్టు)
వ. ... కైలాస శిఖరాకారంబగు సౌధంబున. ఉద్యో. 3 209.
వ. ... మయుండును బూర్వోత్తర దిశాభిముఖుండై పోయి కైలాసంబు నుత్తరంబున మైనాక శైలంబునందు హిరణ్య శృంగంబున. సభా. 1.8.

**కైవడి** దే. వి.
మాదిరి, విధము, పోలిక, రీతి, ప్రకారము.
ఆ. ... ప్రౌఢవనిత కైవడి ముద్దియ, ముద్దుపుట్టఁ దనకు మ్రొక్కుటయును. విరా. 1.246.
సీ. .. కంబుకంధర చెన్ను కైవడి తలపోయు. విరా. 2.292.
ఆ. అతని మేను కుంతియట్టుల కైవడి యరియ నేను జూచి యాత్మ నెద్ది, కారణంబొ యిట్లుగాననుచుండుదు, నేమి సేయువాఁడ నింకఁ జెపుమ. శాంతి. 1.12.

**కైవల్యదము** సం. వి. అ. న.
మోక్షము నిచ్చునది.
కం. కేవల నిష్కర్మత మోక్షావహ మగునేని గిరులు నవనీజములున్, భూవర ముక్తం బడయంగా వలవదె యదవినునికి కైవల్యదమే. శాంతి. 1.68.

**కైవల్యము** సం. వి. అ. న.
మోక్షము.
కం. కావున గృహస్థవృత్తిన్, నీవతి లోలుఁడవుగాక నెఱిఁ జేయుము రక్షా విధి ధరణీప్రజకుం, గైవల్యము దాన నీకుఁ గలుగుం జులకన్. శాంతి. 5.466, శాంతి. 1.68.
కం. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము, ప్రజ్ఞయ నాకంబనంగఁ బ్రజ్ఞయ

చువ్వే, ప్రజ్ఞయ కైవల్యంబును ప్రజ్ఞా సాధ్యములుగాని పనులుం గలవే. శాం. 4.68.

**కైవారము** దే. వి.
స్తోత్రము, పొగడ్త.
తే. శౌర్యవైభవ ప్రాభవ శౌచము లకు, నొరులకైనఁ గైవారమై యుల్ల సిల్లు, నొక్కరునికవి యెల్లను నిక్క మట్టె, యెందుఁ గలుగునె యర్జును నీడువాఁడు. విరా. 2.204.

**కైవారము సేయు** దే. స. క్రి.
పొగడు, స్తుతించు.
కం. ... సంజయ, కైవారము సేసె దీవు కౌంతేయుల ... ఉద్యో. 2.227.

**కైసేయు** దే. అ. క్రి.
అలంకరించుకొను.
కం. (కీచకుఁడు) కైసేసె మదవి కారోల్లాసంబున మేను వొంగ. విరా. 2.329.

కం. వేగినఁ గౌరవ సేనలు, వేగమ కైసేసి యనికి వెడలె. భీష్మ. 2.274.
కం. లలన యిలువాడి నాథుఁడు, వల చిన చవివంటకములు వండి యిడి తనుం, గలయఁ దలంచిన మెయికొని యెలమిం గైసేసి హృదయమీవలయు శివా. అను. 5.290.
స. క్రి.
అలంకరించు.
ఆ. పడయరాని యాయువొదలికిఁ గలి గినఁ బాపకృతుల దాని బదటి గలుప, నగునె పుణ్యవిధి సమాచరణములఁ గైసేయ వలయుఁగాక చెలువు మిగుల. శాంతి. 5.480.

(ఇక్కడ సార్థకము చేయు అని భావము).

## కొ

**కొంక నక్క** దే. వి. (కొంకు + నక్క పిఱికి నక్క).
చిన్నజాతి నక్క, క్షుద్ర జంబుకము.
ఉ. చీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలు గొంకనక్కలున్. అశ్వ. 2.117.

**కొంకు** దే. అ. క్రి.
1. భయపడు, జంకు.
మ. ... అంతటి వానిం గొని ధర్మ సూతి సమరోత్సాహంబుమై నెత్తి వచ్చుటకుం గొంకునె వీఁపు సక్క నయి నిల్చుంగాక మీ సైన్యముల్. ఉద్యో. 2.174.
ఆ. ... కురియు తేనియలకుఁ గొంకు. విరా. 2.304.
2. సంకోచించు, వెనుదీయు.
కం. పనివంపఁగాని యొకతనుఁ బని సేయనెఱుంగ నన్నుఁ బనిగొనుచెవఁ దాం, డుని యగ్రమహిషి గొంకుచుఁ బనిగఱపెడు చందముననఁ బనుచు దెఱుఁగవే. విరా. 2.119.
ఉ. ఇట్టిది క్రూరకర్మమని యించుక కొంకక లంకయింటఁ జిచ్చొట్టితి మాయజూదమున నుత్తమ ధర్మజుఁ దూలఁబుచ్చితి. శల్య. 2.134.
కం. తన యగపాటొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సమయభంగ మగు టకు భీముండును గొంకుచుఁ జప్పుడు సే, యనిగూఢ విమర్ద నప్రహారములఁ దగన్. విరా. 2.345.

కం. పతి దనకు నేమి యిచ్చిన, నతి
ముదమునఁ బొందవలయు నాత్మజుఁ
డైనన్,మఱిఁ గొంకక యేకాంతస్థితి
నేకాసనత నున్కి సెట్ట ప్రమదకున్.
అము. 5.284.

వి.
భయము, జడుపు, బెదరు.

ఆ. తలఁకు పుట్టెఁ గొంకు కొలఁదికి
మీఱె వెన్నాటు దోఁచె ముట్టుపాటు
దొదరె, వెఱఁగుపాటు దనికె. విరా.
2.106.

2. సంకోచము.

కం. తెలవ యొడఁబాటు మాటం,బఱి
వోయిన గొఁకుతోడ బ్రాహ్మణఁగొని
క,న్నఱఁగగునెద కునరిగె. అను.1.74.

3. సందేహము.

చం. వనగజ మంబుజాకర మవారణఁ
జొచ్చి కలంచి యాడఁగా, మనమునఁ
గొంకులేక కృపమాలిన బోయలు
ముట్టి చంపు చా,డ్పున. ద్రోణ.
2.124.

**కొంకు కొనరు** దే. వి. (కొంకు+
కొసరు)
భయమును సందేహమును.
(సంకోచము, జంకు. ఈ రెండు సమా
నార్థకములని. సూ. ఆ. ని.)

గీ. సింహబలుఁ డత్యుగ్రుడై చిగురు
బోడి పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు
గదుర,నొడిసి తంపట్టి తిగిచి
మహోగ్రవృత్తిఁ గొంకు కొసరించు
కయు లేక కూలఁదాఁచె. విరా. 2.128.

**కొంకువెట్టు** దే. అ. క్రి. (√ కొంకు)
భయపడు, జంకు, వెనుదీయు.

సీ. ... యుధామన్యుఁడెఱిఁగి కదఁగి
చనుదెంచి రాక్షసుఁడని తలంచియుఁ
గొంకు,వెట్టక పెనుగద బెట్టువ్రేయ.
సౌప్తి. 1.169.

**కొంకువోవు** దే. అ. క్రి. (√ కొంకు)
1. భయపడు, జంకు, వెనుదీయు.

వ. అని శంకించియుఁ గొంకువోవక
యజ్జగన్నాథు వచనంబునకు నన్య
థాత్వంబేల గలుగునని యద్దేవునిం
దలంచి. శల్య. 1.284.

2. మెలికలు తిరుగు.

చం. కుడిచిన పశ్లైరంబును నకుంఠిత
హర్షముతోడఁ నిచ్చినం,గడు ముద
మంది యెత్తికొని గాఢభరంబున
మార్చి మోవ....నె,క్కుడు వెస నేగు
దెంచెఁ గని కొక్కెర సమ్మదమంద
మత్తికిన్. శాంతి. 3.495.

3. (శీత బాధాదులచే) కొంకరలు
పోవు, వంకరయగు.

చం. ... ఆపదం, బొఁదయక యుండ
జేయుము ప్రభూతపు సీతునఁ గొంకు
వోయెడున్. శాంతి. 3.313.

**కొంగు** దే. వి.
చెఱఁగు, చేలాంచలము.

సీ. ఇట్టి కర్ణునిఁ గొంగున నగ్ని
దాఁచి,నట్టులు డాఁచితో యమ్మ
చెపుమ. స్త్రీ. 2.138.

**కొంచు** దే. అ. క్రి.
భయపడు, సంకోచించు.

సీ. .... కొంచక నీటిలో ముంచుచు
నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁబెట్టు.
ఆది. 5,168. (పాఠాం.)

**కొంచెపు నగవు** దే. వి.

చిఱునవ్వు.
వ. ... పాంచజన్యధరుండు ...
కొంచెపు నగవున నెమ్మొగంబొప్ప
నప్పుడమిఱేని నాలోకించి యిట్లనియె.
శాంతి. 2.11.

**కొంచెపు వాఁడు** దే. వి.
బలము తక్కువవాఁడు, అల్పుఁడు.
(సూ. ఆ. ని).
కం. పోరఁ బరిమార్తుఁ గొంచెపు,
వారై యున్నెడన యని యవశ్యముఁ
గడకన్. ఉద్యో. 1.14.

**కొంచెము** వై. విణ. (సం. కించిత్).
1. కొంచెపుటశనంబు గొనుచు సంగ
మంబులఁ బాసి యింద్రియముల పఙ్గఁ
జనమి. శాంతి. 6.38.
వ. కొంచెంబు పెద్ద యన లేదు. సమ
రంబున జయంబు దైవాధీనంబు.
భీష్మ. 1.14.

**కొంట** దే. వి. కొనుట (అనుప్రయుక్త
మైన 'కొను' ధాతువునకు వచ్చు
రూపము).
(క్రైకొంట, పుచ్చికొంట మొ.)
ఉ. ... పాండునృపాలు పాలు
గై,కొంటయ చాలునన్న. ఉద్యో.
3.59.
చం. ... పరిశాంతి యొనర్చికొంట
యున్. అను. 5.31.
చం. .. అతని సొమ్ము పుచ్చు
కొంటయును మదర్థముంగొనుట
డాఁపక చెప్పితి నిక్కమింతయున్.
అను 5.6.

**కొండ** దే. వి.
1. పర్వతము.
సీ. .. ఎవ్వని గుణలత లేదు
వారాసుల, కడపటి కొండపై గలయఁ
బ్రాకు. విరా. 2.181.
కం. ... ఘన వజ్రతనులు దాఁకిరి,
తనరఁగ నట కొండ కొండఁ దాఁకిన
భంగిన్. ఆది. 8.111.
2. గొప్పది, ఘనము.
చం. ... ఎక్కుడు సిరి యిచ్చి
యొక కొండఁగ మన్చిన నీవు
సావఁగా,నొడలిటు నోమితిన్ గురు
కులోత్తమ యేనొక సేవకుండనే.
సౌప్తి. 1.224.

**కొండ చిలువ** దే. వి.
కొండల యందుండు పెద్ద పాము,
గోనసము.
కం. ఇది యొక చాపము, విస్మయ
మొదవించుచుఁ గొండచిలువ యొకొ
నాఁ దగియున్నది. విరా. 4.118.

**కొండముచ్చు** దే.వి. కొండముచ్చు.
నల్లని ముఖముగల పెద్ద కోఁతి.
ఉ. కూడిన కొండముచ్చులను
గ్రోఁతుల నుగ్రత ముట్టి కిన్కఁ
జెం,దాడెద. అర. 7.111.

**కొండిక** దే. విణ.
చిన్న, కొద్ది వయస్సుగల.
వ. ... కొండికవాని శర్మిష్ఠాపుత్త్రుఁ
బూరుం బిలిచి (పాఠాం.) ఆది.
3.195.
వ. పెద్దవారుండఁ గొండికవానికి
వివాహంబగుట ధర్మవిరుద్ధంబు.
(పాఠాం.) ఆది. 7.212.
మం. శర్మిష్ఠ రాచకూఁతురు కొండిక
యధి. ఆది. 3.148. (పాఠాం.)

ఆ. పరశురాముఁడాది పురుషమూర్తి, పంచశరాహితుండు గొండిక యయ్యెఁ,బెద్ద గుణములందు,బెద్ద యయ్యె. ఆది. 3.70. (పాఠాం.)

**కొండియము** దే. వి. కొండెము.

చాడి, ఇతరులపై లేనిపోని నేరములు చెప్పుట, పైశున్యము.

సీ. .. గురుజనంబుల, నిందించుటా గమనింప తదీయ విక్రయ విధి తద్వి లేఖనము గొండియము గీ...ఆర్య కోటి, నిరయ హేతువుగఁ జెప్పు నృప వరేణ్య. అను 2.61.

తే. పాపములు గొండియముఁ గ్రూర భాషణంబు. అను. 4 61.

**కొండియుఁడు** దే. వి.

కొండెములు చెప్పువాఁడు, చాడీలు చెప్పువాఁడు.

ఉ. క్రూరుఁడు లోభియన్ శఠుఁడుఁ గొండియుఁడున్ జడుఁడున్ గృతఘ్నుఁడున్... జేరువనున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా. శాంతి. 3.469.

**కొండుక** దే. విణ.

కొంచెము, చిన్న, చిన్నవాఁడు.

వ. దేవర దివ్యచిత్తంబున నన్నుం దలంచిన దానం జేసి బృంహితుండ నయ్యెను గొండుక ప్రాయంబువాఁడునుం బోలె నయితి. శాంతి. 2.145.

కం. అని పలికి హరి కిరీటిం, గనుఁగొని కొండుకవు నీవు నాకును సకుఁడ,మును గోరఁ బాడి యనవుఁడు,. విని కృష్ణుని గోపికానిమె పిలుచుఁ బెంచెమిన్.ఉద్యో. 1.76.

మ. .. అర్జును కొండుకనాఁటి పరాక్రమ గుణసంపదలు వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పె. ఆది. 5.259.

వ. .. చిత్రాంగదుండు బాల్యమున గంధర్వ నిహతుండయిన వానికిం గొండుకవాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుఁ జేసి. ఆది. 4.113.

కం. అకటకట యుత్తరుఁడు గొండుక కాంభోజుఁడునుం గడున్ బాలుడు వా,లిక కైదువులాడిన నే,లకొఱగి యొప్పెరభిమన్యు లక్ష్మణుల క్రియన్. స్త్రీ. 2.84.

**కొండుననాఁడు** దే. వి. ఔ.

చిన్నప్పుడు, బాల్యమున.

వ. ... సత్యవతి దొల్లి కొండుకనాఁడు చన కన్యయై యున్న కాలమునఁ బరాశరుండు నన్నుఁ గామించుటయు. ఆది. 4.239.

**కొండుకవాఁడు** దే సర్వ.

చిన్నవాఁడు.

వ. చిత్రాంగదుండు బాల్యంబున గంధర్వ నిహతుండయిన వానికిం గొండుకవాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి. ఆది. 4.103.

**కొండుకాఁతఁడు** దే. సర్వ.

చిన్నవాఁడు. యువకుఁడు.

తే. రాజపుత్త్రుండు బలియుండు రాజసుండు, గొండుకాతండు వేడుక గొనుచు నరిగె,నశ్వములఁ గ్రమ్మ ఱగ నిత్తునను విచార,మెవ్విధంబున నతనికి నేల కలుగు. అర. 4.342.

**కొండొక** దే. విణ. కౌండుక.

1. చిన్నవాఁడు. చిన్నది.

వ.. .కురువిభుండు గురుపుత్త్ర కృప కర్ణ కృతవర్మ బృహద్బల సౌబల సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునుబ్బునం గొండొక పెద్ద యనక పిడుగు చందంబునన్ గర్జిలి యుఱికిన. ద్రోణ. 2.87.

కం. అకటకట యుత్తరుఁడు కొం,డొక కాంభోజుందునుం గడున్ బాలుఁడు. స్త్రీ. 2 84.

2. కొంచెము, అల్పము.

కం. ద్యూతజ్ఞులదెసఁ గొండొక ప్రీతియుఁ గలదు. విరా. 1.207.

వ. ... కొండొకయు నుపేక్ష లేక. విరా. 3.88.

వ. అని యొదంబడిచి కొండొక కాలం బెడవలికి కొని యింద్రాణియు మగుడం జనుదెంచె (కొండొక కాలము = కొంచెము కాలము, కొంత కాలము) ఉద్యో. 1.166.

గీ. బాలుడొక్కఁడు కొండొక కోల సేతఁ బట్టుకొని. ఆది. 6 260.

క్రి. విణ.

ఇంచుక, కొంచెము.

కం. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొవ్వని జనంబులు నా, చేతి ధనమెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. విరా. 1.196.

వ. ... కౌంతేయాగ్రజుండు గురు బలంబు గనుగొని కొండొక విన్ననై విప్వచ్చు నాలోకించి. భీష్మ. 1.124.

వ. అనిన నదియు, గొండొక లజ్జించి కోర్కి పెంపున సిగ్గు దొలంగంద్రోచి ప్రకట కౌతూహల తరళితాంతరంగ యగుచుఁ దండ్రి కిట్లనియె. అర. 7.177.

2. కొంచెము సేపు, కొంచెము దూరము.

వ. అని పలికి కొండొక విచారించి. విరా. 2.276.

వ. ఏనును భక్తిమయంబగు దండ ప్రణామంబాచరించి కొండొక దొలంగి. విరా. 1.13.

**కొండొక నవ్వు** దే వి.

చిఱునవ్వు, మందహాసము.

గీ. అనినఁ గొండొక నవ్వొలయంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె, నేను గలుగంగ నీకేమి. విరా 5.114.

**కొంత** సర్వ. (చూ. కొంచెము-కొంచెము + అంత).

ఇంచుకంత.

కం. .. ధర్మపుత్త్రునితో ని,ట్లని చెప్పె నాతనికి బు,ట్టిన యుత్తలపాటు గొంత డిందుపడంగన్. విరా. 1.99.

కం. కౌంతేయుల బారింబడ,నింతియ సిరి చాలు రాజ్యమొల్లను దార్తై,పొంత ననుఁ బెట్టుకొని యొక,కొంత యొసఁగి రేని నట్టి కూడేమిటికిన్. శల్య.2.13.

మ. ... భుజ బలాటోపంబుమై నొండొరున్, మిగులం జాలక కొంత సేపు వడి మేమేఁ బోరిరుగ్రాకృతిన్. విరా. 2.343.

సీ. ... మున్నును వీరలు మువ్వుర

కదఁకల, కొలఁదు లే నెఱుఁగుదుఁ
గొంత కొంత. విరా. 3.152.

**కొంతేసి** కొంత చొప్పున (ఒక పరిమితిని దెలుపును).

వ. ... ఇందులోన సంధ్యలును సంధ్యాంశంబులు నను పేళ్ళఁ గొంతేసి కాలంబు సెల్లు. శాంతి. 5.47.

తే. ఒటము నియతుఁడై కొంతేసి కాలములఁ శరీర ధర్మావిరోధిగా రేయుఁ బగలు.ప్రాణ సంయమనము నడపంగ వలయు,దాన చిత్తంబు దనువు శుద్ధత వహించు. శాంతి. 6.115.

**కొందఱు** స. బ. ('కొంత' శబ్దమునకు మహన్మహత్యర్థక రూపము).

కొంత సంఖ్య గలవారు.

●. . . కొందఱకైన నిష్టు కృపకుం దఱిగాదటె యేమి సెప్పుదున్. విరా. 2.142.

మ. మును నీవెన్నితి విక్రమాఢ్యులని మమ్ముం గొందఱన్. ద్రోణ. 2.294.

వ. . . . అప్పుడందులోనం గొందఱు గొందఱు నివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన. మహా. 19.

**గొందలంపడు** / **గొందలపడు** దే అ. క్రి. (కొందలము + పడు).

కలఁతపడు, సంక్షోభించు.

(సైంధవుని మాటలు). కం. పెదవులు దడుపుచుఁ గాళ్ళున్, గుదివడ వడఁకుచు మనంబు గొందలపడఁగా, నిది యేటి మాటలాడెదఁదుదిఁ బార్థుఁడు గానకుండ దొలఁగన వలయున్. ద్రోణ. 2.292.

చం. తలరు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చుఁ గొందలపడుఁ దల్లడంబఁదరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు వి,చ్చల విడిఁబేర్చు నెవ్వగల సందడి డెందము గంది చేద్పడున్. విరా. 2.293.

2. సందడిగొను, తఱచగు.

తే. అనుచుఁ గొందలపడు కోర్కులగ్గలించి,చిట్టుముట్టాడుచుండ నచ్చెలువ చెలువుఁ, దగిలి తనయిచ్చఁ బాఱు చిత్తంబు పజ్జ నరిగి యిట్లను నక్కీచకాధముండు విరా. 2.85.

3. పరితపించు.

వ. ...నీ సైనికులు డప్పియు నిదురయుం గదిరి మేనులలయం గొందలం పడి రెల్లవారికి నా త్రియామ సహస్ర యామ యయి తోఁచె. ద్రోణ. 5.267.

**కొందల పఱుచు** దే. స. క్రి.

(√ కొందలపడు) కలఁత పెట్టు.

కం. ... విభుండమానుష తేజో, ధనుఁడగు సహదేవుఁ గనుం,గొని యిట్లను వగలు మిగిలి కొందల పఱుపన్. విరా. 1.97.

**కొందలపాటు** దే. వి. (√ కొందలపడు) కలఁత, సంక్షోభము.

సీ. .. అందంద కదిరెడు కొందలపాటుచేఁ దలకుచుఁ నునికికి నిలుకడయును. విరా. 2. 315.

1. విహ్వాలత్వము, భయాదులచే అవయవాదులు స్వాధీనము తప్పుట.

కం. అన విని తగుమాటల నా,తని గొందలపాటు పాండుతనయుండు గ్రమం,బున డిందుపఱిచి. విరా. 4.178.

కం. క్రందున మేను సిదియునను, కొందలపాటొంది ప్రాణ గొడ్డమగుటఁ ద.ప్పందొలఁగఁ జాతెదను. అను. 4 320.

**కొందలము** దే.వి. (√ కొందలపడు)

1. సంక్షోభము, కలఁత.

చం. కినుకకుఁ జాలకెంతయును గీడ్పడి నా పడుపాటులెల్ల వ,మ్మునఁ గలయంగ నిట్టలొక మూర్ధునిచేఁ దుదిబోయి **కోలుపో**,యెనె యభిమానమన్వగపు నే డ్రైఅ డెందము కొందలంబుఁ బొం,దిన ధృతిమాలి యేఁ బలికితిం దగ వెల్ల నెఱింగియుండియున్. విరా. 2.186.

మ. కలఁగెం దోయధి స ప్తకంబు గిరి వర్గంబెల్ల నూటాడె సం,చలతం బొందె వసుంధరా వలయమాశా చక్రమల్లాడెఁ గొం,దలమందెం ద్రిద శేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె. విరా. 4.172.

ఉ. ఎందున నెవ్వరుం బడని యెంతయు గష్టముపాటు వచ్చినం,గొందలమంది పాండువిభు కోడలు దవ్వుల నున్న నన్ను,గో,విందుఁడ కావుమంచుఁ బలవించుట యూఁగఁగఁరాని ...యెప్పుడున్ మదిన్. ఉద్యో. 2.129.

2. పరితాపము, దుఃఖము.

వ. ..తన్మాంసంబాహారంబు గొనుట కఱు దారుణుండగు దానవుండతనిం బట్టికొనిన సాంత్వన భాషణంబులు ప్రయోగించువాఁడయి యవ్విప్రుండు గలంకయుఁ గొందలంబును లేని డెందంబుతో నద్దానవు నాననంబు గనుంగొనిన. అను. 4.381.

తే. దెసలు గలయంగఁ జూచుచుఁ దిక్కు దనకు,నెవ్వరును లేమి వెగ దందు నెంత దవ్వు,ననిన నడవికిఁ గడలేమియును మృగవ్రజంబు పొదువుటయును గొందలంబు సేయు. స్త్రీ. 1.46., భీష్మ. 2.157.

3. బాధ.

చం. ... తనకుఁ దోడ్పడు వారలు లేక నన్ మదిం,దలఁపఁడె యత్తఱిన్ రిపువధంబునకెయ్యెము తండ్రి యేను గొం,దలమునఁ బొందకుండ నని తా బలుమాఱును జీరకుండునే. ద్రోణ. 2 247.

**కొంపోవు** చూ. కొనిపోవు.

**కొక్కెర** దే. వి.

పెద్ద కొంగ, మహాబకము.

వ. ఒక్క మహాబకంబు వచ్చి నదిపద్మభవునకుం బ్రసాదపాత్రంబైన నాళీజంఘుండును రాజధర్ముండును నను పేళ్ళం బరఁగు నా కొక్కెరకు నమ్మఱ్ఱి నివాసంబై యుండు. శాంతి. 3.478.

**కొట్టము** వై. వి. కొట్టాము (సం.గోష్ఠక ప్రా. గొట్ఠం)

గోవులు ఏనుగులు గుఱ్ఱములు మొదలగు వాని నుంచెడి సాల.

సీ. .పొడువైన మువ్వంచఁ బొలుచు నట్టుగ నేనుఁగులకు గుఱ్ఱములకుఁ గొట్టములును. ఉద్యో. 1.93.

**కొట్టిన తిండికాఁడు** దే. వి. జాతీ.

తినఁదగిన పదార్థములలో ఏది పట్టిన అది మిక్కుటముగాఁ దినువాఁడు.

అడిచేడెక లింఁడిపోరు. లింఁడిపని తప్పు మఁటాకమ యేది పట్టనివాఁడు (వివేక విహీనుఁడు-అని భావము).

కం. విను కొడుకుగన్న పేముఁ,కొని కొట్టిన లింఁడికాఁడు కుపితుఁడఁడఁ డా, జనపతి వంశము ధర్మజు ననుపమ శీలంబు నెఱుఁగుపడదె యట్లుండెన్. ఉద్యో. 1.56.

**కొట్టు** దే. స. క్రి.

1. వెడలఁగొట్టు, పాఱఁదోలు.

ఆ. మృగము నరయ ముచ్చు రేవ గలును గొట్టి,నేస్తఁ బసికిఁ జాలఁగూర్తు నేను. విరా. 1.101.

2. దంచు.

సీ. పసపు బోఁట గొట్టినపిలఁ గొన్నింటిఁ జిఱుసగ్గుగాఁ బొడిసేసి చేసి. విరా. 5.35.

3. పరిపాకము బొందు, ఉడికేఱు. (చూ. కొట్టిన పెండికాఁడు).

**కొదవలి** దే. వి. ఔ. అనౌ.

లవిత్రము కక్కులు గలిగి వక్రాకారమై గట్టి మున్నగునవి కోయుట కుపయోగించు నొకానొక పనిముట్టు.

గీ. నొంపమేమిఁ దెగవెట్టలమగ నొలయు వైరాగ్యపసు కొదవలిన కాని. శాంతి. 4.192.

**కొడుకు, కొడుకు** దే. వి.

పుత్రుఁడు

చం. ... కొంతి ముద్దుసేయు కొడుకు. విరా. 1.98.

చం. ... ఈ, కొడుకు వోకకున్ మనము గుంటెడు నిన్ గని యూఱడిల్లెదన్. విరా. 2.23.

చం. ... చూపరే పవను కొడుక్కను నింద్రసుతుండు మాద్రినందనులును నున్నచోటు సుఖదంబయినన్ సుఖహీనమేనియున్. మహా. 70.

వీరు పన్నిరువురు (చూ. పుత్రుఁడు).

2. మగ శిశువు, బాలుఁడు.

ఆ. ఘన భుజుఁడు రాధ యనుదాని పతి యొక్క,సూతుఁడరుగుదెంచి రత్న,పుంజ భరితమయిన మంజసలో నున్న,కొడుకు దానితోన కొనుచు వచ్చి. ఆది. 5.31.

వ.... సాత్వతియు నబ్బాలుఁ బలదేవు చేతికి నెత్తుకొన నిచ్చి తదనంతరంబ నారాయణు చేతికిచ్చిన.

కం. అక్కొడుకు నబ్జనాభుం,డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁ జూడన్, గ్రక్కున నొక్కట నడఁగెను,మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నున్. సభా. 2.56;57,

**కొడుకుఁ గుబ్బ** దే. వి.

కుబ్జవాఁడైన కొడుకు (ఆదరమును దెలుపును).

గీ. ధర్మతనయాదులైన నీ తమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగు విభుఁడ,వేలమీ లోకమెల్ల నీకేల రాధ,కొడుకితండను తక్కువ వాసమునఁబట్ట ఉద్యో. 4.59.

**కొడుకుఁజూలు** దే. వి. మగ శిశువును గర్భియున్న గర్భము.

ఆ. గొంతి కడుపునందుఁ గొడుకుఁ జూలై నీవు దోఁపకుండవైతి, తోఁచినట్టి పిండ మెడలియైనఁ బిడప దిగండడచియ్యె. నింత పుట్టవట్టులైన. కర్ణ. 3.66.

**కొడుకుఁదనము** దే. వి.

పుత్రత్వము.

తే. కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁ దనముఁ గాంచి భీష్ముని నాజిరంగ మునఁ జంపు,నట్టి యుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁదప్పదిది యని రుద్రుండు సెప్పి చనియె. ఉద్యో. 4 370.

**కొదమ** దే. వి.

పశుపక్ష్యాదుల పిల్ల, శిశువు.

సీ. త్రాళ్ళఁ బట్టింపంగఁ దఱిమైన కొదమల సంచు లెఱింగి శిక్షించు నేర్పు. విరా. 1.95.

కం. కదిసి లక్ష్మణునిం బులి,కొద మను సింగంపుఁ గొదమ గొదకొను చెలం,బొదువుగతిఁ గిట్టి మోదము, మదము నెలర్పంగ నింద్రు మను మఁడు కడిమిన్. ద్రోణ. 2.89., అశ్వ. 3.217.

లేడికొదమ;- కర్ణ. 3.205, గాడిద కొదమ. అను. 1.89.

1. తరుణము, పడుచుది (పశుపక్ష్యాదికము).

సీ. గోడిగజాతిలోఁ గొదమ పెంటుల నేర్చి మావుల హత్తించు మార్దవంబు. విరా. 1.95. (కొదమ తుమ్మెద. విరా. 5.60).

2. తీక్ష్ణమైనది.

ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ,పతి రయమునఁ దేరువఱపి భీముఁ బొదివి పిడుగుఁగొదమ వోని నారసము బి,ట్టేసె నది యతండు వ్రేసెఁ దునియ. భీష్మ. 2.65., ద్రోణ. 2.118.

**కొదమ పెంటి** దే. వి.

పశుపక్ష్యాదులలో పడుచుది, కట్టుకారు వచ్చిన ఆఁడు జంతువు.

సీ. గోడిగజాతిలోఁ గొదమ పెంటుల నేర్చి మావుల హత్తించు మార్ద వంబు. విరా. 1.95.

**కొన** దే. వి.

చివర, అగ్రము.

ఆ. వెలవాలు [illegible] నల్లన నల్లార్చు నొర్లగండ్లయందుఁ జొచ్చి సుడిసి,తిరిగి వేసఁబోక తెమ్మెర లెలఁదీఁగ కొనల వ్రాలుచున్న ననలఁ ద్రోచు. ఉద్యో. 2.112.

2. వృక్షాదుల చివరకొమ్మ, అగ్రశాఖ

సీ. నెగసిన కొనలేచి నింగి యంటం తను నవులఁ ద్రోవఁగఁ జనరాదువాని. విరా. 1.162.

చం. ... ఉగ్రత మహాబలు రాకకు నోర్వఁజాల నా,చని నొకభంగి గెల్తు నని తాఁ దలపోసి హరించె నాకులుం గొనలును జొంపముల్ నిడుప కొమ్మలు రే యగుడున్ దియంబు నన్. శాంతి. 3.394.

**కొనకొను** ఇది సకశాదిగనే భాండారోదాహరణములు గనిపించుచున్నవి. శ.ర 20.3.201 కొనకొనుగాఁ జూపు చున్నది. కాని అదియు గొనకొను గానే కన్పించుచున్నది. (చూ. గొనకొను.)

1. యత్నించు.

వ. అమ్మెయి [illegible] గొనకొని యయ్యైరిం గొఱుకఁ [illegible] యెదిరిఁగి [illegible]

వ. అగునే యిట్లు కృతార్థుఁడ,వగు నీకురి గొఱుకట్టు రాలస్యము సేఁ,త

గటా కృతఘ్నతకు నెల,వగుటొప్పునె
కొఱకు కడఁక నద్రోహుఁడవై.
శాంతి. 3 2.0:211.

**కౌనటి** దే. విణ.
కురూపి.
తే. రూపవిహీనులు దారు రూపు గలిగి
తొలుమేనఁ గౌనటులఁ బలికినారు.
అను. 5.83.

**కౌనటివాఁడు** దే. వి.
కురూపి -కౌనటి.
తే. .. రూపసి వలనఁ గౌనటి,వార
సూయలు సేయుచు రీరసమున,నింత
యెఱుఁగంగ వలవదే యావు గొడుక.
శాంతి. 3.70.

**కొనలు నిగుడు** దే. అ. క్రి.
(√ కొనలు + నిగుడు).
కొనలొత్తు, వర్ధిల్లు, అతిశయించు.
తే. స్వర్గముననున్న రాజులుఁ జక్ర
వర్తు,లును యథోచితచ్ఛత్రంబులును
నిజార్హ,చామరంబులుఁ జెలువొందఁ
జారులీలఁ గొలిచియుఁడిరి వేడ్కలు
గొనలు నిగుడ. విరా. 4 240.
ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజ
బుద్ధి,నెఱిఁగి యతని యున్నయెడకు
వచ్చి పరమభక్తి మ్రొక్కి ధరణీ
సురేశ్వరుఁ గుశలమడిగి ప్రియము
గొనలు నిగుడ. ఆర. 5.28.

**కొనిపోక** దే. వి.
తీసికొని పోవుట.
వ. అమ్మునియుఁ దన హోమధేను
వుం గానక వనంబెల్లఁ గలయరోసి
తన యోగదృష్టిం జూచి దాని వసు
వులు గొనిపోక యెఱిఁగి ఆర.
4.159.

**కొనిపోవు; కొంపోవు** దే. స. క్రి.
(కొని + పోవు).
తీసికొనిపోవు.
తే. ... అడ్డసాలలు గలవు నాకభి
మతముగ,వాని గొనిపోయి చూపుదు
వరుసతోడ. విరా. 1.72.
వ. ... సుభద్రాభిమన్యులం బాంచాలి
పాలికిం గొనిపోవ నభ్యంతర జనం
బుల నియోగించి. విరా. 5.377.
2. సాహాయ్యముగాఁ దీసికొనిపోవు.
చం. విగటుఁడు దక్షిణంబునకు వీరుల
సారథులన్ నిజాజికై పురి గలవారి
నెల్లఁ గొనిపోయిన. విరా. 4.77.
3. బలాత్కారముగాఁ దీసికొనిపోవు.
ఉ. అంగజరాగ మత్తుఁడగు నన్నుకు
నిమ్మెయినైనఁ బ్రీతి సే,యంగల
వాఁడమీ జరభి యాతనితోడన తీఱుఁ
గాక యం,చుం గొనిపోయి దైన్యమున
సూతుని పీనుఁగుమీఁదఁ బాండు
పు,త్రాంగనఁ బెట్టి కట్టిరి దయాపరి
వర్జిత చిత్తవృత్తులై. విరా. 3.16.
మ. ... కౌరవులు గోవర్గంబు గొం
పోవఁగాఁ,గని యేఁ గ్రమ్మఱి రిత్త
వోదునె భయోత్కంపంబు నీకేటికిన్.
విరా. 4.68; విరా. 3.139.
సీ. ... నీవు గర్భంబుసొచ్చి,నప్పటి
నుండియు నన్వేషణము సేయుఁ గొని
పోవుటకు మృత్యువని యెఱుంగుము.
శాంతి. 4.23.

**కొనియాట** దే. వి. (√ కొనియాడు)
కొనియాడుట.
1. పొగడ్త, పొగడుట.
ఉ. .... అ,త్యాదర వృత్తి మీరు విజ

యాశ ననుం గొనియాటఁ జేసియుం, గాదనకియ్యకొంటి. ద్రోణ. 1.73.

కం. నకుల సహదేవ నయకళా, ప్రకళా వేదిత్వమునకు జనులనురాగా, ధికులై మిమ్ముం గొనియా, టకు నాతఁడు మనసు గీడ్పడం జింతిల్లున్. శాంతి. 1.17.

2. ఆదరించుట.

సీ. తల పంగ నాద్యమై తనరు ధర్మమ యెప్డుఁ గొనియాట నాస్తిక గోష్ఠిఁ జనమి. గీ. ఇన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత. అర. 5.44.

**కొనియాడు** దే. స. క్రి.

1. మెచ్చు, పొగడు, స్తుతించు.

ఉ. ... స, మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్. విరా. 1.15

కం. అనుసరించు, ఆచరించు, అవలంబించు.

కం. తన పలుకు లోకమెల్లను గొనియాడఁగఁ దగిన లోకగురుఁడు. ఆది. 7.246.

2. కాపాడు, రక్షించు, పోషించు.

గీ. ... అతని పుత్రకులు దాని, నెంగిళులు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి కర్ణ. 2.54.

కం. వినుమగ్గోవిందుఁడు సఖుఁ, డును బంధుఁడుఁ గార్యకర్మ రుఁడునై నిన్నుం గొనియాడుచుండ దురితం, బను పేరును గలదె నీకు ననఘచరిత్రా. శాంతి. 3.48.

కం. విను భక్తియు వెఱపుఁ గలిగి, యనుజన్ములు పెద్ద వాని నారాధింపన్ జనవర యతండు తమ్ములఁ గొని యాడన్ సిరికిఁ బట్టగుదురుజ్జ్వలులై. అను. 4.132.

3. ఇది శతవృద్ధ మా జనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు సే, యుదుము కులప్రయుక్తమగుచున్న సనాతన ధర్మ మిత్తెఱంగ దహన కర్మ మెల్ల మదిగానిదిగా మును నిశ్చయించి మా, మొదలిటి వారొనర్చు విధముం గొనియాడితి మేము నియ్యెడన్. విరా. 1.179.

కం. అనిన నతఁడిట్టి ధర్మము, కొనియాడక వ్రతములొండుగోరి నడపఁగాఁ బని యేమి. శాంతి. 6.504.

కం. అది దురిత నిరాసము న, భ్యుదయానందంబుఁ జేయుఁ బుణ్య యశస్సుం, పద నిచ్చు నూర్ధ్వలోక, ప్రద మగుదానిఁ గొనియాడు భరతవరేణ్యా. అను. 3.343.

( కొనియాడు = ఆచరించు ).

తథా చకార సతతం త్వమప్యేవం సదాఽచర. సం. భార. అను. 154. -25. (నిర్ణయ).

4. గౌరవించు, ఆదరించు, పాటించు.

చం. ... నీ గురువు బొల్లి తగం గొనియాడు మెట్లు సె, ప్పెనటుల భక్తిమై నడపు. విరా. 1.252.

సీ. కుంతీమహాదేవి కోడండ్రలోపల నగ్గలంబుగఁ గొనియాడఁ బరగి. విరా. 2.216.

5. భజించు, సేవించు, కొలుచు.

కం. ... నీవు నివ్విధముల జనములం, గొనియాడుము వారలు శో, భనము

లోనంగుదురఘంబు, బాపుదురు.
కృపన్. అను. 2.136.
6. తలపోయు.
కం. విధివశమున వచ్చిన కీ,డథ
ములు గొనియాడి వ్రేఁగులై విపుల
భవాంబుధి మునుఁగుదురు. అను.1.9.
శ్లో॥ కోహ్యాత్మానం గురుం కుర్యాత్
ప్రాప్తవ్యే సతి చింతయన్, ప్లవంతే
ధర్మలఘవో లోకేంభసి యథా ప్లవాః
మజ్జంతి పాపగురవః శస్త్రం స్కన్న
మివోదకే. అను. 1.22.23.
7. అభినందించు.
తే. ... దరుల, చవులు గొనియాడ
నేరని జాడిపొందు హృదయమున
కింపుసేయమి నెఱుకగలుగు,వారు
దీని సుఖంబుగాఁ గోరరెందు. విరా.
2 70.
8. అనుభవించు.
చం. ... వి,చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ
దగు చందమునం గొనియాడు మున్న
తిన్. విరా. 3.95.
9. నొక్కి పలుకు.
కం. (శ్రీకృష్ణుఁడు సంజయునితో)
నెట్టన సభలో నేవుర, కట్టెదుర
నరాతిదనము గాకెంతయు వా,రెట్టి
దుడుకులో ద్రౌపది నట్టుల పడిచెడిదె
జూచమాడరె యెందున్.
వ. అనవుడు సంజయుండు దేవా నీ
చిత్తంబున నిడి దీని నింత గొనియాడిన
గర్జంబొదఁగూడునే యనిన వాసు
దేవుం డిట్లనియె. ఉద్యో. 1.344;345.
10. వితర్కించు.
తే. ... పోనిమ్ము పుణ్య,పాప చింత
యింకేటికిఁ బద్మనాభ.
వ. అనుటయు నట్లుకాక దీని నింత
గొనియాడనేల యని యతండు భీమ
సేన పక్షపాతంబున నతని చింత
గీటునం బుచ్చె. శల్య. 2.310,
11. కావించు, ఒనరించు, చేయు.
కం. తన ధనమిది యని యూఱడి,
మనఁ బరిణయమాది యైన మహితో
త్సవముల్, గొనియాడ నెవ్వరికి
వ,చ్చునె జనపాలుండు లేనిచో నిర్భ
యతన్. శాంతి. 2.267.
12. పూను, వహించు.
వ. నీవతి క్రోధనుండవగుటయు
నెఱుంగుదు ... క్రోధంబు గొని
యాడుట లగ్గు గాదని యిట్లనియె.
ఆర. 5.22.
వ. కావున బుద్ధి గలవారికిఁ గ్రోధము
గొదుయాడం దగదు.ఆది. 3.148.

**కొనివచ్చు** దే. స. క్రి. (కొని + వచ్చు)
తెచ్చు,
తీసికొనివచ్చు.
వ. .... అడవినుండి వన్యఫలముల్
గొనివచ్చి విభాండకుండు గొడుకుం
జూచి యిట్టేల చింతాపరుండవై యగ్ని
హోత్రంబు వేల్వక కాలాతిక్రమణంబు
సేసెదనినఁ దండ్రికి ఋశ్యశృంగుం
డిట్లనియె. ఆర. 3.102.
చం॥ వినుతయశుండు పాండునృప
వీరుఁడు దిగ్విజయంబు సేసి పెం,
పునఁ గొనివచ్చి యిచ్చిన యపూర్వ
మహాధనరాశి పేర్మివా,రని విభవంబు
తోడ ధృతరాష్ట్రుఁడు సేసె శతాశ్వ
మేధముల్. ఆది. 5.42., ఆది.6 92.

**కొను** దే. స. క్రి.

1. పట్టుకొను.

తరళము ... ఏను తీర్థంబులీ సముద్ర తటంబునన .. వీనినెప్పుడు నాడ నో,డుదురు సన్మనులిందుఁ గోల్మొ సళుల్ గొనున్ వడిన్ జొచ్చుడున్. ఆది. 8.148.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలది వియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁబాటి, నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నా కల,కలమెఱింగి కీచక వ్రజంబు. విరా. 3.4.

2. పెసికొను, తీసికొనిపోవు.

వ. .. అగ్నిహోత్రంబులఁ దోడన కొని వర్తిల్లు భూసురోత్తములు తమ్ముం బరివేష్టించియుండ. విరా. 1.46.

చం. అశుచియుఁ గష్టుఁడున్ లఘువునైన నిజాగ్రజు మేనితోడ ని,త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జను నింతిఁ గొంచు గ,ర్కశమతిఁ గీచకుల్ విరా. 3.17.

సీ. ... ననుఁబెట్టి నాయెడఁ గొనుచు జనిరి. ఉద్యో. 3.183.

కం. చని సంప్రార్థించి యతనిఁ,గొని రుద్రునిఁ గాంచి నీ సఖుండీతఁడు వ,చ్చిన కార్యము గృపతోడను,విను మని దండంబు తెఱఁగు వినిపించెఁ ధగన్. శాంతి. 3.117.

ఆ. కరులఁ దురగములను నరదంబులను గొని,యరుగుదెంచెఁ గృష్ణుఁ డనిన. మౌస. 115.

3. ధనాదులు ప్రతిగ్రహించు, పరిగ్రహించు, స్వీకరించు.

తే. కపిల యిచ్చిన వానిన కాడు, నిజము, కొన్నవాని బున్నా ప్రపుపుగఁ జేయు. అను. 3.103.

కం విసుమిచ్చెదనని యీమియుఁ, గొనియెదనని పలికి పిదపఁ గొనకునికియు న,క్కానృతంబుల సత్యవ్రత, మునకుం దొలఁగంగ మనకు భూవర తగునే. శాంతి. 4.150.

తే. ప్రపవుఁ సేఁత సేయించుట క్రతులు గాథ,నియతిఁ జదువు చదివించు యుపు ధనము,పెంకొపుట షట్కర్మంబు లింత వట్టు సక్షత్రియంబు లంద్రు ధరామయులకు. శాంతి. 5.81.

4. లోఁగొను, ఇముడ్చుకొను.

తే. ఎన్నఁడును మున్ను వారలయేప్ప నోపఁ,గానమెప్డు సముద్రంబులోన బుట్టి,వైవ, గొన్నంత నొనుఁగాక వారి గెల్వ,మాకు శక్యంబె చవిగాని మాట లేల. భీష్మ. 2.282.

5 అంగీకరించు, స్వీకరించు, గ్రహించు.

కం. కొలువుగొన నొల్లకుండుట, గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మేలే, వలసినకడ కేగెద. విరా. 1.224.

వ. . నావలనం బ్రయోజనంబు గొనవలయునేని నొండుమాటలు దక్షిపసులం బరికింప నియోగింపుము. విరా. 1.286.

తే. పితృ పితామహ గురులమై ప్రీతిఁ గోరు,చున్న యట్టి మా పరమ హితోష

దేశ,వాక్యములు విని దుర్జన వచన రచనఁ గొనక బంధులతోఁ గూడి మనుము. ఉద్యో. 3.347.

వ. ... భండనంబు వలదని యెన్ని భంగులం జెప్పినం బాండవులకుం గీడు దలంచి యప్పలుకులు గొనవైతివి. కర్ణ. 1.226.

శ్లో॥ గృహ్ణీషే నచ తన్మోహాద్వచనం విశాంపతే. సం. భార. కర్ణ. 32;33.

6. పనిగొను, తోడ్పాటుచేసికొను.

చం. ... ఈ,యనఁగొని పార్థుని యహంకృతి మాన్పుము ధీరమానసా. కర్ణ. 1.315.

7. లక్ష్యము పెట్టు, సరకుసేయు (భీముఁడు పడిపోవు సమయమునలో. ధర్మజుఁడన్న మాటలు).

చం. ... భవదీయమైన భో,జనమతి మాత్ర ముద్ధతిఁ బ్రచండుఁడవై భుజశక్తి నెవ్వరిం,గొనక కదంగి రజ్జు పలుకుల్ గడు పెక్కులు వల్కు చెప్పు. మహా. 1.44.

కం. .. కొనరు బుధులమాట నాస్తికులు వినయనిధీ. శాంతి. 6.225.

సీ. ... వాయుతనూజుఁ దశ్వత్థామ సచ్చెఁజుమ్మని కుంభజునితోడ నాడుటయును నమ్మాటగొనక ధర్మాత్మజు నవ్వార్త యాచార్యుఁడేర్పడ నడుగుటయును. ద్రోణ. 5.328., ద్రోణ. 2.254.

8. అపహరించు, హరించు.

కం. ఆమిషమని డాసిఁగొనఁగా మది సమకట్టి యొక్క ఖగమా ఖగమున్, వ్యోమమునఁ దాఁక దివి సం,గ్రామంబా రెంటికయ్యెఁ గడు రిభసమునన్. ఆది. 3.29.

కం... కపటమున నొవ్వని జనంబులు నా,చేతి ధనమెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. విరా. 1.196.

శా.....గం,ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా. విరా. 2.55; విరా. 3.199.

కం. ... అప్పడఁతి యో,యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁడీ, పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీని యసువు గొనియెద ననియెన్. అను. 1.7.

చం. .... వధూటి వధించుట విప్రు నర్మముం గొనుట యనంగ గల్గునివి గూడి సమంబగు నాకుఁ జూడ భ,క్తు ననపరాధునిన్ విడుచు దోషముతో. మహా. 58.

9. అవలంబించు, వహించు, పూను.

ఆ. ... తాల్మి గొనఁగలేక యలందురి,తనువు నింద్రియములు మనము ధృతియుఁ, దన వశంబుగాక తల్లడపడి సింహ,బలుఁడు విషమబాణు బారిఁ బాతె. విరా. 2.315.

కం. వినుమప్పలుకులు పాటిగఁ గొని దుర్యోధనునితోడఁ గొంటిని బగము,న్ను నిజంబుగ నెఱుఁగను వీఁ,డని రాధేయునకు వెఱచునని యేనిన్నున్. కర్ణ. 3.60.

(కొంటిని బగ = విరోధము వహించితిని.)

10. ఆకర్షించు, రంజించు

కం. పెఱవారలు దమ మెలఁగెడు,
తెఱఁగులు దొరఁకొన్న వింత తెరువుల
నేర్పుల్, మెఱయుచుఁ బతిచిత్తము
గొన,నొఱపు గలిగి మాన్యవృత్తి
నుండుదురు దగన్. విరా. 2.21.

11. అభ్యాసముగాఁ జేసికొను, అను
సరించు.

వ. .. భూపాలుండింత జేల యగునే
యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తివచ్చు
చున్నాఁడని యడుగు చున్నాఁడు.
ఉద్యో. 2.169.

కం. తమ తమ దేశంబులకై, మిముఁ
గొని పాండవుల గెలుచు మెయికోలున
భూ,రమణులు గొందఱు వచ్చిరి.
భీష్మ. 1.31.

12. పెండ్లి చేసికొను.

తే. బక మహాసురు నిర్జించి బ్రాహ్మ
లకుఁ బ్రీతి గావించెఁ గిమ్మీరు పేర
డంచి,వనము నిష్కంటకము సేసె
ఘను హిడింబుఁ గూల్చి యాతని చెలి
యలిఁ గొనియె నితఁడు. విరా.5.324

13. భుజించు, తిను.

కం. విను మధురాహారంబులు,గొను
టయుఁ బెక్కండ్రు నిద్ర గూరిన
యెడ మే,ల్కని యునికియు, గార్యా
లోచనముఁ దెరువునడచుటయును జన
దొక్కనికిన్. ఉద్యో. 2.38;56.

వ. ... (దుర్యోధనుఁడు) ధృత
రాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చట
బదివేవురు భూసురులు పసిండి పళ్లె
రంబులం బాయసాహారంబులు గొనుట
మొదలుగాఁగ లక్ష్మి పెంపుగ్గడించి
.. శాంతి. 3.129.

కం. తనుయాత్రకుగా నశనము గొను
బూర్ధముగాఁ గొనండు. శాంతి. 5.321;

14. త్రాగు, అను.

తే. మాలకరి పుష్పములు గోయు
మాడ్కిఁ దేటి.పుష్పుఁదేనియఁ గొని
యెడు పోల్కి. ఉద్యో. 2.57.

15. పొందు.

ఆ. ... నిన్ను నాఁడ,కొలుచునెడ
ననుజ్ఞగొననె నీచములగు, పనులఁజేసె
జాలకునిఁ జెప్పి. విరా. 2 96.

తే....నెదురు, గండకుఁ డంగఁ గొను
నది కార్యఫలము, బొగ్గంకుఁ బోలె
మొదలంటఁ బొడువఁ జనదు. ఉద్యో.
2.57.

16. ఇది పెక్కుపట్ల విశేష్యముల
కనుప్రయుక్తమై "పొందు,
ప్రాపించు" అను నర్థములతో శబ్దపల్లవ
క్రియగా ఏర్పడుచున్నది.

భయముగొను. అర. 2.84; చవి
గొను. ఉద్యో. 3.35.

17. వశపఱచుకొను, ఆక్రమించు,
స్వాధీన పఱచుకొను.

సీ. ... అభయంబు వేఁడిన నందజుఁ
గృపఁ గాచి యేచి యీ పెన్నేల
యెల్లఁ దాన,కొని యథేష్టముగ
పెక్కొనరించి. శాంతి. 1.238.

కం....విజయం,బునకునయి తపము
సేయనె,మును తత్పుతు క్షితిముఁ
గొననె మూఁడు జగములన్. శాంతి.
5.403.

18. వెలకుఁ దీసికొను, విలుచు.

కం. ఏమమ్మెదమనినఁ బ్రాఫెప,యో
మనుజాధీశ కొనుట యొప్పెప తెఱు

పిం,దేమియును నెగ్గులేదీ, ఘనసీసుడు
కోర్కి దీర్పఁబడ్చెము ప్రీతిన్.
అశ్వ. 4.195.

19. పరిమాయించు, చంపు.

కం. ఒరిసిపు వెస నా,బోతుం,బులి
గొనినం బసులు వాలు పోలెం
గ్రోధో,జ్జ్వలుఁడగు పార్థుఁడు కర్ణుని,
బొలియించిన నిడు సైన్యములు వెఱఁ
బఱచెన్. కర్ణ. 3.372.

20. ఆక్రమించు, పొదువు, క్రమ్ము.

వ. ... పాండవ బలంబుల నుఱు
మాడి పేరడవి గొని కాల్చు పొనుంగు
వడిన కార్చిచ్చు తెవడిం గదిసి
యమ్మహారథుండు. ద్రోణ. ..321.

21. పెఱుఁగు, పెరిగికొను.

ఉ. ... ఒజ్జ వాడుప్పకం జెప్పుచు వీరి
బుద్ధిగొని చేయుము కార్యము నీకు
రక్షగా,నిప్పుడిమేల్పడుదు గలఁ
డిచ్చె శుభంబని చూపెఁ గృష్ణునెన్.
ఉద్యో. 4.114.

22. పొందు, తలఁచు.

కం. అది టిపి గ్రుంకుడుగాఁగని,మద
మెసకంబెసఁగ నార్చి మన సైన్యం
బుల్,వాడలెఁ బలమ్మెత్తి హర్షా,న్వద
మతి సింధుపతి యపుడు పదమవ
సూచెన్. ద్రోణ 4.316.

కం. తన మనమలు పాండుతనయు,
లని సేతకు వేడ్క సేయుటాత్మఁ
గని దమం,బున వారు మెఱయరని
వచ్చినప్రియ శశి పూర్వశైల శిఖరం
బెక్కెన్. విరా. 3.198.

23. పరిహరించు.

ఉం. అనలాస్త్రమప్డు పక్షముఁగొనిన
పిడించఁ బ్రోడు గూలెఁ గుతలంబుద్రు
వన్,ఘను వాని జూచి హాహాస్వనము
లెసఁగ సాళ్వసేన సంక్షోభించెన్
ఆర. 1.162.

24. కొట్టు, వ్రేయు.

మ.... భీమ పార్థులును గోకొమ్మంచు
నొక్కుమ్మడిం. భీష్మ. 3.318.

25. నాఁటు, కాఁడు.

చం. ఒక బలు తూపురంబుగొని
యుచ్చి చనం గరమల్గి యేయుడున్.
ద్రోణ. 5.173.

అ. క్రి.

పనికివచ్చు. చెల్లు, సాగు.

ఆ. కడెల బుద్ధులిచటఁ గొనవు నెట్టన
ఘన, దోర్బలంబు మెఱసి తొడర
వలయు,నతడు గాండీవమున నడ్డ
సాళులు వైవ,దురుల సంపవాన
గురియుఁగాని. విరా. 4.167.

ఇది సకర్మక క్రియందు ఆత్మనే పదార్థమునందును అకర్మక క్రియలకు స్వార్థమునందును అనుప్రయుక్త మగును. చంపికొను-ఉద్యో. 4.207; రతిమికొను-విరా. 3.155; ముట్టి కొని-ఉద్యో. 1.46.

ఈ ధాతువునకు ఈ క్రింది విశేష రూపములు గనదడుచున్నవి.

కోన్. కర్ణ. 1.83. (పాఠాం); కొంచు విరా. 5.151; ఉద్యో. 3.97, కొన్న- ద్రోణ. 5.166; శాంతి. 1.202; కొందు-ఆశ్ర. 1.175; విరా.1.135. చూచికొందము- మౌస. 173.

కొంద్రు-కొందురు; శాంతి. 2.255; కొమ్ము-ఉద్యో. 3.97; కోకొమ్ము-

విణ.
మనోహరము, మనోజ్ఞము. చక్కనిది
కం. ... హయరత్నము త,ద్విమ
లోదధి తీరంబునఁ గొమరుగ నే
కతను యిచ్చ గ్రుమ్మరుచున్నన్.
ఆది. 2.26.

**కొమరుఁడు** వై. వి. (సం. కుమారః).
కొమారుఁడు, కొడుకు.
ఆ. రాచకొమరు లెల్లఁ జూచుచు
నుండిరి. ఆది. 5.207. (పాఠాం).

**కొమరు మిగులు**
అందగించు, ఒప్పు, చెన్నొందు.
సీ. చందురు నునుఁగాంతి కందేర్చి,
కూర్చి బాగునకుఁ దెచ్చినయట్లు
గొమరు మిగిలి. విరా. 2.52; విరా.
4.26.
తే. మహిత లావణ్యమున సుకుమార
మైన,యంగమును బూర్ణచంద్ర నిభాన
నంబు గ్రొత్త పెంపుగ నెంతయుఁ
గొమరు మిగిలి,చెన్నుఁ దలకట్టునై
పడియున్నఁ జూచి. ద్రోణ. 2. 30.

**కొమారుఁడు** వై. వి. (సం. కుమారః)
కుమారుఁడు, కొడుకు, పుత్రుఁడు.
చం. ... అయ్యెడరు రాచకొమారుల
కోర్చునట్టిదే. ఉద్యో. 1.348.

**కొమ్మ** దే. వి.
1. ఆఁడుది, స్త్రీ.
కం. నాకొలువు వారకార,న్నాకేశుం
గొలుచు నంగనలలో నైనన్, లేకు
నికి నాకుఁ దెల్లం,బాకొమ్మకు నీడు
వోల్ప నయ్యెడు సుదతుల్. విరా.
2.66.
2. శాఖ.
చం. .... తాఁ దలపోసి హరించె
నాకులుం,గొనలును జొంపముల్
నిడుదకొమ్మలు రేయగుడున్ రయం
బునన్. శాంతి. 3.394; ఉద్యో.
1.355.

**కొమ్మన** వి.
తిక్కన తండ్రి; భాస్కరమంత్రి
తనయుఁడు; అన్నమాంబాపతి; కేతన
మల్లన సిద్దనలకు తమ్ముఁడు;
గుంటూరు విభుఁడు.
సీ. .. మజ్జనకుండు కొమ్మన దండ
నాథుఁడు. విరా. 110.

**కొమ్ము** దే. వి.
పశుశృంగము, విషాణము.
సీ. అమల సువర్ణ మయములగు
కొమ్ములఁ గొమరారు పశువులు
గోటులు. ద్రోణ. 2.199.
కం. ధనువు దునిమి కొమ్ములు ముఱి
సిన వృషభము చందమగుడు. కర్ణ.
1.162.
సీ. ... గోవుతోఁ బెరిఁగెడు కొమ్ము
లట్లు. శాంతి. 5.375.
2. ఏనుఁగు దంతము.
వ. ... ఇభంబులు వాడివి నేలతో
వ్రేసియుఁ జమరియుఁ దూలవైచియుఁ
గొమ్ముల గ్రుచ్చియెత్తియు. భీష్మ.
1.266.
ఉ. కొన్నిఁటి హస్తముల్ సదియుఁ
గొన్నిటి గొమ్ములుదుమ్ము దూళిగా ..
ఏనికవేఁటలాడగన్. భీష్మ. 2.211.
కం. కొమ్ములఁ గ్రుమ్మియు ... నర
దమ్ముల నేనుఁగులు పీటతాఁకము
సేసెన్. ద్రోణ. 1.275.
సీ. ... కొమ్ములు నఱికి యంకుశ

ములు దునిమి తొం,డములు ఖండించి కుంభములు వ్రచ్చి. కర్ణ. 1.140.

3. బాలచంద్ర రేఖయందలి రెండు కొనలలో ఒకటి.

కం. మన మొనఁ గని దృష్టద్యుమ్నున కిట్లనుఁ బన్నుబంపు మోహర మర్ధేం దుని చందంబున ...

వ. అనిన విని యతండట్ల చేసినం బాండ్య మగధ బల పరివృతుండై భీమసేనుండు దక్షిణ శృంగంబున నిలిచె ... సకల లోకంబులకు రక్ష కుండైన రాజీవాక్షుం డెవ్వానికి రక్షణం బొనర్చు నట్టి రథికశ్రేష్ఠుండు డాపలి కొమ్మునం బన్నె ... భీష్మ. 2.97;98.

4. విల్లు మొదలగువాని కొన.

కం. గొడుగునను వింటికొమ్ముల, సిడమున నరదంబు నందు సెలలవిసి కడున్,వడి నిగిడెడు చాడ్పున న,వ్విడమిడి దెస నమ్ములదరె వసు ధాధీశా. ద్రోణ. 4.222.

5. బండిపోలుగట్టు యొక్క కొన

వ. ... కర్ణుండతి నిశిత క్రూర నారాచ జాలంబులు గృష్టార్జునుల మీఁదం గురిసి వెగడుపఱచి యర దంబు పిఱిందికొమ్ము క్రిందికి మూపు సొనిపి లావుననెత్తిన. కర్ణ. 3.357.

**కొయ్య** దే. వి.

స్తంభము, గుంజ.

సీ. ... మార్గముఁ గ్రంపనడిచి కొయ్యలు ప్రాఁతి, చెఱచుట నరకంబు సేయునంద్రు. అను. 2. 62.

ఖిణ.

మొద్దు, మూర్ఖుఁడు, పెదకట్టె. పెడ సరకట్టె.

ఆ. ఆలు బిడ్డ(కలేనియట్టి త్రిమ్మరి యగు, కొయ్యగాక కుదుటఁ గూడు వెట్టి, కుడుచువారలిట్టి క్రొవ్వి దంబులుసేయఁ, జొచ్చుటిచ్చగించి చూతురయ్య. ఉద్యో. 2.9.

**కొయ్యకోల** దే. వి.

దండకాష్ఠము; మొన అలుగువలె నుండిన కఱ్ఱ.

సీ. ...ఆ సువ్రతపరుఁడు దీ,ర్ఘముఖ కాష్ఠము గొని త్రవ్వఁ దొడఁగె.

తే. దాని సైరింపఁజాలక ధరణి దలరె విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య, కోలఁ ద్రవ్వినమాత్రఁ బాతాళ యాన,మేల సిద్ధింపనేర్చు మునీంద్ర వినుము. అశ్వ. 3.105.

**కొఱ**[1] దే. వి.

మేలు, మంచి, శ్రేయస్సు.

ఆ. ... రాజు శయ్యఁ జచ్చుట గొఱ గాదుగాన యొడఁగాదు పోర. శాంతి. 2.120.

2. ప్రయోజనము, ఉపయోగము.

వ. ... ఇంకనిట్టి మాటలాడితేనిఁ బ్రాణంబుల కొఱ యొల్లవు కర్ణ.2.46.

కం. అఱ పొఱడు కుఱచ చేతులు నొఱవ శరీరంబు గలిగి యొరులకుఁ జూడం, గొఱకాకుండియు మన్మథు, నొఱపులఁ బడియెడు నితండు యువ తీప్రీతిన్. అర. 2.134.

కం. విను దార పుత్ర మిత్రులు,సనిరి కొడుకు, మున్ను చనిన జన్మంబుల నీ,కును వారు వారలకు నీ,వును మఱి

పుట్టువు లేఁ గొఱయపుటు గల్గెనొకో, శాంతి. 6.240.

విణ.

ప్రయోజనకారి, ఉపయోగకరము, పనికివచ్చునది.

చం. ఒక ఋషిచేత నాయుధ సమ
త్కరమెల్లను సప్రయోగమం, త్రక
ముగ నభ్యసించి సమరంబునకుం
గొఱయైనవాఁడ. విరా. 3.170.

తే. అధమవృత్తి సుయోధనుం దంత
కంటె నేముఁ గొఱగాము మాచేత
నింకఁ పుట్టె. అశ్వ. 4.47.

2. ప్రియము, మనోహరము.

కం... నీకున్, మదవక మాయట్టివాని
మాటలు గొఱయే. సభా. 2.190.

3. అర్హము, యుక్తము.

కం. చెలిమియు సంభాషణమును,
ఒలిమి వివాహంబుఁ బ్రోష్ఠఁజా(?)యుఁ
దమయం, తల వారితోన తగు నధి.
కుల హీనుల తోడనైనఁ గొఱగా
దధిపా. ఉద్యో. 2 46.

4. సమర్థము, చాలినది.

చం. ఒక ఋషిచేత నాయుధ సము
త్కరమెల్లను సప్రయోగ మంత్రిక
ముగ నభ్యసించి సమరంబునకుం
గొఱయైనవాఁడ. విరా. 3.170.

**కొఱ²** దే. వి. కొఱత.

అల్పము, శేషించినది. కొనకువచ్చినది.

వ. ... కొఱప్రాణంబులంతో నొఱలు
నర తురగ ద్విరదంబులను. కర్ణ.
2.317.

**కొఱంత-కొఱఁత** దే. వి.

1. తక్కువ, లోపము.

ఆ. ఎల్ల చుట్టములును దల్లియుఁ
దోడును జెలియుఁ బరిజనంబు జెలువ
నీకు,గురువ యింకనొక్క కొఱఁతయు
లేదిందుఁ,జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున.
విరా. 1.253.

2. లోపము.

కం. మునిగోష్ఠి వలని కొఱఁతయె,
విను భవదీయాంతరంగ వృత్తి కలు
షయై,నిను సంశయాత్మునిఁగా, నొన
రించుచు నున్నయది సముజ్జ్వలతేజా.
శాంతి. 6.149.

2. దోషము, తప్పు, అపరాధము.

తే. అనిన సంజయుఁడిట్లను నకట
కొడుకు,మీఁదఁ దప్పు పెట్టెదవు నీ
మీఁది కొఱఁత,నీకుఁ గానంగవచ్చునె
నీవెఱుంగ,కుంద బఱచెనె యాతండు
పాండుసుతుల. ఉద్యో. 4.186.

వ. ... పుత్ర నిర్విశేషుండగు నిజ
ప్రియసఖ్యుని నగ్గించుట గురునకుం
గొఱంతయె. విరా. 4.195.

వ. . ఆ శకుని యాడి యుధిష్ఠిరుం
డోడ్డిన యొడ్డిమియు గెలుచుచువచ్చెఁ;
నట్లగుట నాతనియందుఁ గొఱంత
లేదు. ఉద్యో. 1.22.

తత్రాపరాధః శకునేర్న కశ్చిత్. సం.
భార. ఉద్యో. 2.11.

3. తరువాయి, శేషము.

వ. .. ఇటమీఁద నియమాచరణంబు,
నకు నొక్క సంవత్సరంబు గొఱంత
గలదు. విరా. 1.313., విరా.2.235.

వ. ...ఈ పదుమూఁడవ యేటి
కొఱంత గలుగం బార్థుండు దన్నెఱిం

గించికొనియె నేని నెప్పటియట్ల వన వాసంబునకుం జనవలయు. విరా. 4.185.

సీ. ... అన్న నీవింతేల యడలెదు కాలపర్యయము నుడుపవశమె యెవ్వ రికిని వార్తల కొఱఁతఁ జెప్పుము .. మాస. 197.

విణ.

1. చేయవలసిన పని, మిగిలియున్న పని.

(ద్రౌపది భీమునితో) కం. నాకొఱఁతఁ దీర్చి వచ్చితి,నీకొఱఁతయ యింక సూతునిం దెగఁజూడన్,లోకము వంచింపను దగు,చీకటి రేయొదవ నేమి సేసెదొ చెపుమా. విరా, 2.271

2. తక్కువ, న్యూనము, అల్పము. గీ. .. కెరలి పండ్రెండు వాలమ్ము లేసి,పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి,కొఱఁతగా నూఱు శరముల నుఱక నొంచె. కర్ణ. 3.331.

2. మిగిలిన వాఁడు, శేషించిన వాఁడు వ. ... ఎల్ల పనులును జక్కనయ్యె రాజొక్కరుండు గొఱంత యాతం దభిమాని మనలంగని సరకుగొనండు. విరా. 5.187.

**కొఱఁత** దే. వి.

కొఱ్ఱు, శూలము. (చూ. కొఱఁత నుఱుకు).

**కొఱంత పఱచు; కొఱఁతపఱచు** దే. స. క్రి. (కొఱఁత+పడు).

తక్కువపడు, న్యూనమగు, హీన మగు.

తక్కువపఱచు, న్యూనము చేయు.

వ ... అయ్యుత్తరకుమారునకు రథంబు గడప నెయ్యాడె యియ్యా పదఁ దలఁగవలయు నెట్టొకండడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంతపఱుపక యనిన యమ్ముద్దిమ పలుకులు ముద్దుసేసి. విరా. 4.29.

**కొఱఁతనుఱుకు** దే. వి. జాతి.

కొఱ్ఱుమీఁదికి దుముకువాఁడు. తన ప్రాణముమీదికిఁ దాను తెచ్చుకొను వాఁడు. సాహసకృత్యము చేయువాఁడు (అకార్యముచేయువాఁడు-అని.శ.ర.).

వ. .. నీ చెప్పెడి ధర్మంబులు కౌర వులకుం జెప్పవలదా? వారలుగదా మీఁదెఱుంగక కొఱంతనుఱుకులై చెడు తెరువునం బోయెడు వారు. ఉద్యో. 1.343. (చూ. స్త్రీ. 1.17.) (కొఱఁతనుఱుకు = సాహసికుఁడు - అనిసూ. అ. ని.)

**కొఱఁతపడు** దే. అ. క్రి. (కొఱఁత+పడు).

1. తక్కువపడు, తఱుఁగు, తగ్గు.

కం. మఱియును నొక్క విశేషం బెఱింగించెద నతని యున్నయెడ గోధనమున్ మెఱుఁగెక్క పాడినేమిం, గొఱఁతవడక యుండఁ జేసి కురియు చునుండున్. విరా. 3.104.

కం. ... విక్రమలీలం,గొఱఁతవడ నీక కర్ణుఁడు, మెఱుఁగులవడు శక్తి సురలు మెచ్చఁగ వైచెన్. విరా. 5.100.

సీ. ... కేకయపతులు నాది - తే. యైన బంధులు మిత్రులు నగ్గలికలఁ గొఱఁతవడియెడు వారె.ఉద్యో.1.268

2. మిగులు, శేషించు.

కం. ప్రళయాంతకుండు బడబానల
మును మ్రుచ్చవును వెదిరినం గొఱఁత
వడన్, నిలిపినను నిలుపు మార్కొని
చెలఁగిన నరుశరము లనవశేషము
సేయున్. విరా. 4.196.

**కొఱఁతపెట్టు** దే. స. క్రి. (కొఱఁత + పెట్టు).

కొదువచేయు, మిగిలించు, మిగుల్చు.

కం. కంకుఁడు ధర్మసుతుఁడు వల,
లాంకుఁడు భీముండు కవలు హయ
శిక్షక గో,కింకరులు సెప్పదొడఁగితి,
నింకిఁ గొఱఁతపెట్టనేల యే నర్జును
డన్. విరా. 4.134.

(కొఱఁత పెట్టనేల = దాఁచుకొనుట యెందుకు—అని భావము).

**కొఱకు** దే. ద్రు. (కొఱ[1] + కు. చతుర్థీ విభక్తి యందు వచ్చు ప్రత్యయము).

కై, కోసము (ఉద్దేశ నిమిత్తాద్యర్థములను దెలుపును).

కం. జ్ఞానంబు వడయుటకు వాఙ్మన,
సములు సునియతములు గావింతురు
స,మ్మానిత శాంతికొఱకు వి,జ్ఞానం
బున నాత్మనియతి సల్పుదురు బుధుల్.
శాంతి. 5.90; శాంతి. 4.98.

కం. మీ తండ్రి కుఱికి నఱికిన
హేతియ నీకొఱకు నునిచితిపుడ
నఱుకుదున్. కర్ణ. 2.329.

**కొఱకొఱ** దే. వి.

కోపము.

కం నరు నద్దెసగలవారిని, గురుబల
ముఖ్యసెడఁ బొగడి కొఱకొఱ
గాఁగన్,గురుని గురుతనయు మ,ద్రే
శ్వరు నను నేమిటికిఁ గానివారిం
జేయున్. ద్రోణ. 5.105.

**కొఱగామి** దే. వి. (√ కొఱ[1])

1. అకార్యము, దుష్ట కృత్యము, చెడ్డ పని, కొంటె చేష్ట.

సీ. ధార్తరాష్ట్రుల కీడు దలఁపక
సైంధవు కొఱగాము లెల్లను మఱచి
తండ్రి,లేని యీ శిశువుపై మానితం
బైన నీ యక్కటికంపుఁ జూపదరఁ
జేయుము. అశ్వ. 4.47; ఉద్యో. 3.172.

2. దౌష్ట్యము, చెడ్డతనము.

కం. ఎఱుగుదు నేను సుయోధను,
కొఱగామియు నతనితోడఁ గూడిన
నృపులందఱుఁ బగ మనమున నిడి
కాని యఱిమిటయును సంధి పొసఁగ
దనియు మహాత్మా. ఉద్యో. 3.237.

శ్లో॥ దౌరాత్మ్యం ధార్తరాష్ట్రస్య క్షత్రి
యాణాంచ వైరితాం, సర్వమేత
దహం జానన్ క్షత్తః ప్రాప్తోద్య కౌర
వాన్. సం. భార. ఉద్యో. 93.5.

3. దోషము, లోపము, తప్పు, నేరము

కం ఇక్కొఱగాముల లోపల.
నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ.
ఉద్యో. 2.21.

శ్లో॥ కచ్చిదేతై ర్మహాదోషై ర్న స్పృ
ష్టోసి నరాధిప. సం. భా. ఉద్యో. 32.13.

4. కృతఘ్నత.
సీ. చూచితే లక్ష్మణ సుగ్రీవు-కొఱ
గామి,యమ్మెయిఁ దన పగ యడఁచి
మనము,కపిరాజ్యమిచ్చినఁ గైకొని
యింద్రియ సుఖముల నెంతయుఁ
జొక్కి నేఁడు,మన దిక్కు దలఁ
పఁడు. ఆర. 7.3.

**కొఱప్రాణము** వి.
కుట్టుసురు, కొనయూపిరి.
వ. ... అప్పుడు గొఱప్రాణంబులతో
నొఱలు నర తురంగ ద్విరదంబులను.
కర్ణ. 2.317.

**కొఱయగు** చూ. కొఱ.

**కొఱలు** దే. అ. క్రి.
కోపించు, దూషించు.
కం. పిఱుదం గురు ధరణీపతి, నఱ
చేతం బ్రాణములు ఘనారాతి బలం,
బుఱని తెగువ ముందటఁ బె,న్గొఱలుట
చిత్తమునఁ బెట్టుకొని విహరించెన్.
స్త్రీ. 2.87.
స. క్రి.
కోరు, అభిలషించు.
కం. ఎఱిఁగెడు వారికినైనను,గఱపక
తక్కరుచితప్రకారము శుభముం,
గొఱలు హితులట్లగుట నం,దఱకును
జెప్పంగ వలయుఁ దగియెడు బుద్ధుల్.
విరా. 1-116.
2. పొందు, పడయు.
కం. ఆసవమునకని నీదు ని,వాసము
నకు దివములో నవశ్యంబును నే,నా
సుదతిం బుత్తెంతు ని,జాపక్తి ఫలింపఁ
గొఱలుమభిమత కేళిన్. విరా. 2.81.
కం. గురు నలుక నాకు నస్త్రు,స్ఫురణ
మెదలె నంద్రుడు జనులు బొంకది
పూజా, పరతమెయి నమ్మనీస్వరు,
కరుణ దొఱలి మగుడఁ బడయఁ
గాంచితిఁ బ్రీతిన్. ఉద్యో. 2.266.
సీ. ... శాంతిఁ గొఱలి విప్ర-తే-
కులము దైవ స్వరూపంబగుట మనం
బునందు దృఢముగ నిల్పి తదాశ్రయ
మున, వెలయువాఁడవైనను మేలు.
అను. 5.353; ఆర. 5.81.
చం. ... సనా,తనమగు మోక్షముం
గొఱలి తా విడుచున్ గృహధర్మ
వర్గమున్. శాంతి. 5.310.
(కోరు- అభిలషించు-అని సూ.ఆ.ని)
శ్లో॥ తేషాం గతిం పరాం ప్రాప్య
గార్హస్థ్యే కిం ప్రయోజనమ్. సం.భార.
శాంతి. 5.31.

**కొఱవి** దే. వి.
కొఱవచ్చు, అలాతము, ఉల్ముకము,
మండుచున్న కట్టె.
కం. కొఱవియుఁ గొఱవియుఁ దాకిన,
తెఱఁగున నర్జునుఁడు సురనదీ
సూనుఁడుఁ జూపఱు వొగడఁ దాకు
టయు. భీష్మ. 1.288.
వ. ... అర్జునుండు ప్రకాశార్థంబును
రక్షణార్థంబునుఁగా నొక్క కొఱవి
సేతఁబట్టుకొని ముందఱంబోవ. ఆది.
7.37.
కం. కొఱవి ద్రిప్పిన యొప్పున
మెఱసెఁ బార్థు, గాండివము వాలుఁ
దూపుల గనియనంగ. ఆర. 6.226;
విరా. 2.103.

**కొఱవిగొని తల గోఁకికొను** దే.జాతీ.
బుద్ధిపూర్వకముగా కీడు తెచ్చుకొను.

తే. ధరణి మఱియును బెక్కు విధం
బులందు, బ్రహ్మవిదులైన బ్రాహ్మణ
ప్రభుల మహిమ.వినమె యెఱింగి
యెఱింగి సద్విపులచరిత,కొఱవిగొని
పెట్టనే తల గోఁకి కొనఁగ. ఆర.5.19.

**కొఱవోవు** దే. అ. క్రి. (కొఱ[1]+పోవు)
మూర్ఛవోవు.

కం. వినుమమ్మయి నిర్దేశం,బున
నవ్వాగ్దేవి మూర్ఛవోయిన యట్లే,మిని
బలుకకుండి పవపడ,విస్మయం బున
నజుని శరణు వేఁడె లతాంగీ. వ.
అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మ
మాటకుం గొఱవోయిన వాణి యేమిటం
దేఱెనని యడిగిన. అశ్వ. 2.21;22.

**కొఱసంది** వి.
మర్మస్థానము, ఆయుపుపట్టు.
కం. . పిడికిటఁ గొఱసం,ది గడు
బెడిదముగఁ బొడిచెం, ఒగతుఁడు
గనుమిడిసి నేలఁబడె తన్నికొనన్.
విరా. 2.351.

**కొఱుకు** దే. స. క్రి.
కఱచు, దంతనము చేయు, పంటితో
ఛేదించు.

కం. ఉరె బ్రెమ్మఁగొఱికి యిప్పుడ,
వెరవారగఁ నీకు నేను విడుగర సేయం
దొరకొనుట నీదు భాగ్యం,బు. శాంతి.
3.205; అను. 5.27.

**కొఱుతనుఱుకు** దే. అ. ($\sqrt{\ }$ కొఱ్ఱు)
కొఱఁతనుఱుకు. లరార్యము చేయు.
(అని. శ. ర.)
కొఱ్ఱుమీఁదికి దుముకు, తన చావు
తనకు తెలియకుండ సాహస కృత్యము
చేయు.

ఆ. కొఱుత నుఱుకుఁగాని కొడుకెన్న
డును గార్యతంత్రములకుఁ జొరఁడు.
స్త్రీ. 1.17.

**కొఱ్ఱు** దే. వి. ఔ.
1. ముల్లు. ఇనుఁపముల్లు,
కం. సొలయక తూనిఁగలం గొ,ఱ్ఱుల
బెట్టితి నీవు నీ చిఱుతకాలము. ఆది.
4.270.

2, శూలము, వధసాధన విశేషము.
చూ కొఱుతనుఱుకు. (కొఱుతన్-
కొఱ్ఱునందు).

**కొలంకు-కొలఁకు** దే. వి.
కొలను. సరస్సు.
సీ. కొలఁకుల కెలకులఁ గూడి క్రీడిం
చుచుం,డెడు నంచతండంబు నడ
బెడంగు. అను, 1.181.
కం. కావునఁ జెఱువులు నూతులు,
బావులుఁ గొలఁకులును నెపుడుఁ బౌర
వవర్యా, కావింపవలయు. అను.
2.384.
2. గుంట.
వ. ... పాంచాలి...యపాంగములఁ
దొరఁగు కన్నీరు చెవుల కొలంకులు
నింద నెవ్వగలు నివ్వటిల్లం దల
పోయుచుండి విరా. 2.163.

**కొలంది-కొలఁది** దే. వి.
1 పతిమాణము, మితి.
కం. జంబూద్వీప విష్కంభంబు
కొలఁది యెనుబదివేలు నాలుగునూఱు
యోజనంబులు భీష్మ. 1.27.
కం. ... అతని బోధము కొలఁది
పరీక్షింపఁ దనకుఁ గోర్కి వొడమి
నన్. శాంతి. 6.170.

ఆ. నిద్రపెంపు నిద్ర నిగ్రహించుట
యును, గొలఁది మీఱు కుడుపుఁ గుడు
వమియును. అను. 5.263.
సీ. ... దుష్టజనుల, దండించునెడ
వారి తప్పుల కొలఁదులు మదిఁ దూచి
చూచి తన్మాత్ర దండ,మాచరింపుము.
ఆశ్వ. 1.60.
2. మేర, అవధి.
కం. తలఁపఁగ రిపులకు నిమ్మగు,
కొలఁది గడచివచ్చితిమి యకుంఠిత
బాహా,బలము నెఱపఁ దఱియయ్యెను.
విరా. 4.93.
గీ. లస్తకంబున కొలఁదిఁ లక్ష్మ
ణుఁడు, వెడఁద యమ్ముల నభిమన్యు
విల్లు దునియ,నేసి యార్చిన. భీష్మ.
2.86.
వ. ... గుప్తుల కొలఁదికి గృత్తంబు
లయి పడియున్న పాదంబుల వలనం
గెందలిరుల సెజ్జల చందంబులగు
చోట్లును. విరా. 3.236; స్త్రీ. 1.35.
3. శక్తి, సామర్థ్యము, శక్తితార
తమ్యము.
ఆ. ఇట్లు దొరలు నొవ్వ నేత్తెఱఁ దన
చేతి,కొలఁది సూపి క్రీడి సెలఁగి.
విరా. 5 66.
వ. నీ కొలంది గంటి మగపడితివింక
నెందుఁ బోవవచ్చు. శల్య. 2.60.
కం. తన కొలఁది యెఱుంగని
యమ్మనుజాధము నిపుడ పట్టి
మర్దింపక త,క్కనఁ గాదు వీని
రాజ్యము,నిను నంతయుఁ జేరుఁగా
కనియె ధర్మజుతో. విరా. 5.312.
కం. కొలఁది యెఱుంగక కృష్ణులఁ,
గలన గెలుతు ననియెదవు. కర్ణ.2.35.
చం. కొలఁది యెఱుంగకిట్టి పలుకుల్
పలుకందగుఁగాదు నాక. ఆది. 5.203.
4. స్థితి, అవస్థ.
వ. .. సంజయుం డమ్మనుజపతి
కిట్లను వగచు కొలంది కడచనియె.
ధీరుండవై వార్తలవధరింపుము.శల్య.
1.109.
చం. ఇతఁడు గదారణంబునకు నీ
కొలఁదిన్ నిను బిల్చినన్ మరు,త్పతి
సుతుఁ గోరినం జిఱుతతమ్ములలో
నొకనిన్ వరించినన్, మతిసెడిరొక్కొ
వీరలనుమాటకుఁ బాత్రముగాదె. శల్య.
2. 114.
కం. బల విక్రమ ఘనులగు దొర,
లలిగిన మన సేన మేదినీశ్వర విను
క,న్నులు సెడినట్టున్నది యీ,కొలఁ
దిం బొరిగొనుట నరునకున్ సుకర
మగున్. శల్య. 1.51.
5. విధము, తెఱఁగు, రీతి.
కం. నా కొడుకుల కెక్కుడి బ్రదు,
కేకొలఁదిఁ దలంప నిప్పుడెన్నిన వీరా
నీకంబు నోర్వవచ్చునె,యీ కూడిన
సైనికులకు నేమనువాఁడన్. ఉద్యో.
2.235.
కం...లో,కుల చిత్తమును వ్రేఁగగు
కొలఁది మనన్ గొంతి పెద్దకొడుకు
నకమరున్. విరా. 2.190.
6. ప్రమాణము.
వ. ... వీరలిందఱు కుదర దహన
క్రియాకరణ యోగ్యంబగు చేరు పున
మేది కొలఁదిగా నిప్పుని సేయుదము.
స్త్రీ. 2. 172.
7. తోడ్పాటు.

వ. .. పితృ భ్రాతృ పుత్త్ర పౌత్త్ర సఖి సుహృత్సహాయులుం దెగిరందు వగపునకుం బనిగాని వారలు గలరే యేది కొలందిగా వగచెదందఱకు నగ్ని కార్యంబు నిర్వర్తింప దనవారలకుం దిలోదక ప్రదానంబు సేయను వలయు. స్త్రీ. 1.7.

(ఏది కొలందిగా-ఎవరు బ్రదికివచ్చి యిప్పుడీ శోకము మాన్ప సహాయ పడుదురని భావము).

శ్లో॥ కం శోచసి మహారాజ నాస్తి లోకే సహాయతా. సం. భార. స్త్రీ. 1.6.

విణ.

1. పరిమాణము గలది.

కం. మెడ యొఱగఁ జేతికై దువు,వడ నిను నీవెఱుఁగకున్న భంగిఁ గనియుఁ గ,వ్వడి యూరకుండునటె చె,ప్పెడు కొలఁదియె వాని కరుణ పెంపు కుమారా. విరా. 5.2;6.

2. శక్యము, సాధ్యము, తరము.

ఆ. తారకములు వృష్టిధారలు లెక్కింప,వచ్చుఁగాని యతని యిచ్చు గోవులెన్నఁ గొలఁదిగాదు సన్నుతి పాత్రమా,శిబికి|నుర్వీనునికి సెల్లినెట్లు. ద్రోణ. 2.200.

కం. మనలను దానవులను గడ,చిన యవి భుజబలము లస్త్రశిక్షా విధముల్ గానియూఁ గొలఁదిగా,దీతని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్. 5.167., విరా. 5.216.

వ. .... తమకు మమ్ము గెలువం గొలఁదిగాదు. ఉద్యో. 1.377.

చం. దళిత విరోధి యిట్టిదని దాని తెలంగెఱుఁగంగ బ్రహ్మకుం, గొలఁది యె తానవాఙ్మనస గోచర మద్భుత రూపము. సభా. 1.80.

3. అంతలో, ఇంతలో, ఆలోపల, ఈలోపల- అనునర్థములను స్ఫురింపఁ జేయును.

కం. అనుచుఁ బటుశక్తి న,ప్పార్థుని వైచిన నది యతండు దునుమాడుఁడు గాం,తనపుఁడు వాలుం బలకయుఁ గొని యరదము డిగ్గఁజూచు కొలఁదిఁ బెలుచన్. భీష్మ. 3.405.

చూచుకొలఁది = చూచునంతలో, చూచులోపల.

వ. ... అట్లు జనమేజయుండు సర్ప యాగ కర్మానుష్ఠానంబుల యెడ వైశంపాయను వలన నివ్వినుతేతిహా సంబు విని విస్మితుండును బ్రమోద భరితుండును నయ్యె నక్కొలఁదిఁ దదీయ యాజకులు యజన సమాపన విధి యనుష్ఠించిరి. స్వర్గ. 79.

(అక్కొలఁది-అంతలో, ఆలోపల)

వ. ... కౌరవపతి తనవారి నెలుం గెత్తి కర్ణునకుఁ దోడ్పడుండని పనిచె నక్కొలఁదికిం గిరీటికోపాటోపంబున.

ఉ. తురగవ్రాతముఁ గూల్చి సూతు తనువుం దున్మాడి. ద్రోణ. 4.301; 302.

(అక్కొలందికి = అంతలో - ఆ లోపలనే.

శ్లో॥ యత్నాద్రక్షేత రాధేయం నా హత్వా సమరేఽర్జునమ్, నివర్తిష్యతి రాధేయ ఇతి మా ముక్తవాన్ వృషః

గొంని కద్దపడన్ వెసవచ్చె. అను. 1.231; అను. 3.220.

ఆ. ఒకటి కొలనిలోన నుండు నొక్కటి కొండ,మీఁద సంచరించు. అను. 1.225.

**కొలిపించు** | **కొల్పించు** దే.స.క్రి.(√ కొలుచు) కొలువఁజేయు

1. సేవింపఁజేయు.

వ. ... నన్ను నాకర్షించి కొలిపించు కొని పీఁదె విజయం చేయుచున్న వాఁడు. విరా. 1.11.

తే. .. మూర్ధాభిషిక్త వర్గంబు దనదు చరణయుగ్మంబు గొలిపింపఁజాలు సార్వభౌము పదవికిఁ దగియెడు భంగి వాఁడు. విరా. 1.186.

వ. ...కులగురుండగు నమ్మందాకినీ నందనుండు వారి నభినందించి కొలి పించుకొని యుండె. భీష్మ. 3.420.

వ. ... ఇప్పింఛంబున సుఖిం జేసి నను గొలిపించుకొని మఱియు దవ్వు సని యాకాశంబునకెగసిన. అను. 1.369.

2. పరివేష్టింపఁజేయు

వ. ... ఇరుదెఱంగుల వారటం దత్కాల ప్రకాంత స్వాంతులై యన్యోన్య విషయ రోషంబులు దక్కి తన్నుం బరివేష్టించినం గులగురుం డగు నమ్మందాకినీ నందనుండు వారి నభినందించి కొలిపించుకొనియుండె. భీష్మ. 3.421.

**కొలుచు¹** | **కొల్చు** దే. వి.

ధాన్యము.

కం. కుడువక పెట్టక శూద్రుఁడు,కడు నెక్కుడు గూర్చినట్టి కనకముఁ గొలు చుం,బుడమిపతి ధర్మకృతులకు,నిడు నట సగము గొని మేదినీశ్వరవర్యా. శాంతి. 3.432.

కం. కొలుచపహరించు నన్నరుఁ డెలుకయుఁ బందియును నైన యీ దు,ర్జననంబుల బొందునంతఁ బాపము వొలియక యాతనికిఁ గుక్కపుట్టువుఁ గల్గున్. అను. 4.261; అను. 5.104 సౌప్తి. 1.31; శాంతి. 2.284.

**కొలుచు²** దే. స. క్రి.

ఉపాసించు, ధ్యానించు.

ఉ. .... సూరి చే,తోరుచిరాబ్జ బోధన రతుండగు దివ్య పరాశరాత్మజాం, ఘోరుహమిత్రుఁ గొల్చి. ఆది. 1.22.

ఉ. .... పరతత్త్వముఁ గొల్చెద నిష్ట సిద్ధికిన్. విరా. 1.1.

2. ఆరాధించు.

వ. నరుఁడగ్ని దేవుఁ దనకును,వరదు నిగాఁ గొలిచినాఁడు. ఉద్యో. 2.257.

కం. సన్న్యాసివేషమున రా,జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి సభ్యత్వమునన్ మాన్యుఁడనై పుణ్యకథా, విన్యాస మొనర్తు నతని వేడుకకుఁ దగన్. ... విరా. 1.69.

ఆ. గురుని గురుతనూజుఁ గొలిచి యయ్యిరువుర, నెమ్మి వడసెఁ దనదు నేర్పుపేర్మి. ఆది. 3.110.

3. కొలువునకుఁ గుదురు, సేవసేయ నొప్పుకొను.

ఆ. ఎవ్వరేని యింటికెద్దియే నొకటికి, నన్నుఁబంపఁదగునె నిన్ను నాఁడ,

కొలుచునెడ ననుజ్ఞగొననె. నీచము లగు, పనులకేను జాలకునికి సెప్పి. విరా. 2.86.

6. కొలువునఁ గూర్చుండు.

వ. ... (సంజయుఁడు) మఱునాఁడు ధర్మతనయు నొడ్డోలగంబున్న సమయంబు వేచి సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతఁడుం బ్రియపూర్వకంబుగా నాదరించి సమీపంబున నునిచికొనినం గొలిచియుండి యతనికిట్లనియె. ఉద్యో 1.272.

7. ఉపయోగపడు, ఫలించు, పనికి వచ్చు, చెల్లు, సాగు.

ఉ. మాయలు గల్గు దుష్టులకు మాయపు భంగులె మందుగాక ని,ర్మాయత నల్లసిల్లెడు పరాక్రమ లీలలు గొల్చునెట్లు, శల్య. 2,52.

('కొల్పు'. అని. సూ. ఆ. ని. పాఠము.)

**కొలుపు** } దే. అ. క్రి.
**కొల్పు** }

1. పురికొల్పు.

కం. అలిగి దశార్ణాధీశుఁడు, కొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము. భీష్మ. 3.151.

చం. మగధమహీశుఁ డేచి యభిమన్యునిపై దరిఁగొల్పె. భీష్మ. 2 209.

శ్లో॥ మాగధోఽథ మహీపాలో గజమైరావతోపమమ్, ప్రేక్షయామాస సమరే సౌభద్రస్య రథం ప్రతి. సం. భార. భీష్మ. 2.46.

2. కలిగించు, ఉద్భవించు, పుట్టించు.

కం. ప్రకృతి గుణంబులఁ గొని బహు వికృతపు రూపముల నట్లు వెల్లిగొలిపె. శాంతి. 6.51.

**కొలువిచ్చు** దే. అ. క్రి.

సభదీర్చు, సభచేయు.

వ. ... దుర్యోధనుండప్పుడు గొలువిచ్చియుండి యశ్వత్థామ లోనగు దొరలం గలయం గనుగొని. కర్ణ. 1.47.

వ. ... విరాటుండును వెడలివచ్చి బయలి కొలువిచ్చుటంజేసి తదాస్థానంబు సేరఁబోవునప్పుడు. విరా. 1.184.

(బయలి కొలువిచ్చు = బహిరంగసభ చేయు).

సీ. ... అక్రూరుకుల శ్రేష్ఠుఁడుర్వి, నెడనెడ బ్రుంగుడు వడియున్న రాజులు సనుదెంచి కను నవసరము వేచి,యునికి కృపునిచేత విని పూని తొడికట్టి కొలువిచ్చి ... కానికల్గె కొని. శాంతి. 1.346.

**కొలువు** } దే. వి. ($\sqrt{\ }$కొలుచు[2])
**కొల్వు** }

సేవ, పరిచర్య.

చం...ఏవపుగొలువైన నాకు నిలువన్ మది గొల్చెదుగాన నిన్ను భూ,మిపతులలోన సాధుజన మిత్త్రుఁడునా విని కొల్వవచ్చితిన్. విరా. 1.197.

2. ఆస్థానము, రాజసభ.

సీ. కొలువులోపల నిన్ను కోపమగ్గలిం,చెను, దలఁకక నిలిచిన ధైర్య మహిమ. విరా. 2.360.

కం. అలయక యందఱుఁ జెప్పం, గల యంతయుఁ జెప్పిరతఁడు గట

కటఁబడి యఁ,క్కొలువు వెదలిపోయెన్. ఉద్యో. 4.80.

వ. చని ధృతరాష్ట్రుని మందిరంబు బ్రవేశించి లోపలి కొలువున గాంధారి యుం గోదండ్రుడును విదురుండును మఱియును ఏగు చుట్టంబులును బరివేష్టింప శల్య. 1.8.

(లోపలి కొలువు = సౌధాంతర్భాగము నందుండు కొలువుకూటము)

3. సేవ.

చం. ...నీ,కసుగుణమైన యాసనము నాసనముల్ రుచిరాతపత్రముం,జన వరికొల్వు నిచ్చెద గజవ్రజముం బరి కింపు పెంపుతోస్. విరా. 1.220.

చేనవరి కొల్వు = అధికారిగాఁజేయు సేవ.

ఉ. కావున మేలు సేయదె జగజ్జన కోటికి రాజనాజ్ఞమైఁ,బోవుట యాలెం దగిన పూజలఁ దృప్తునిఁజేఁత దేవసం భావనఁ గొల్వు. శాంతి. 2.260.

4. ఆరాధనము, పూజనము.

ఆ. ... విప్రుల కొల్వు,కల్పవృక్ష సేవ కరణి యధిప. అను. 2.155.

5. ఆస్పదము, స్థానము, కుదురు.

తే. సర్వజన సమ్మతుండగు గర్వ ముడిగి,క్రోధమడఁచి. శోకమునకుఁ గొలువుఁగాఁడు. అర. 7.451.

**కొలువుండు-కొల్వుండు** దే. అ. క్రి.

ఆస్థానమునందుండు, సభ చేయు.

ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీ వనంబు గుప్తవర్తనములు గాఁగఁ, జలుపవలయు నృపతి కొలువున్న యెడల బా,హ్యములైనఁ గెలనికెగ్గు లగుట. విరా. 1.137.

తే. ... అవ్విరటుఁడుత్తరుండు దోఁజనుదెరఁ గొల్వుండుబుద్ధి. విరా. 5.317.

**కొలువుకూటము** దే. వి.

ఆస్థాన మండపము, సభా మందిరము

వ. ... తారందఱు విరాటు కొలువు కూటంబునకు. బోయి బయలు మెఱసి యుండువారుగా నిశ్చయించి. విరా. 5.314.

కం. ... కురురాజేతెంచె కొలువు కూటంబునకున్. ఉద్యో. 4.137.

**కొలువుకొను** దే. అ. క్రి.

సేవ చేయించుకొను, పనిగొను.

కం. కొలువు గొననొల్లకుండుట,గలి గినఁ బొమ్మనుట యంతకంటెను మేలు. విరా. 1.224.

**కొలువు వడయు** దే. అ. క్రి.

సేవాధికారమును పొందు.

కం. నీపాలికి వచ్చి నిఖిల,గోపాలక వృత్తిఁ గొలువు వడసి తం,త్రీపాలుఁ డనఁగ. విరా. 5.327.

**కొలువువారు** దే. వి.

సేవించు జనము (ఇచ్చట రమింపఁ జేయు స్త్రీలు).

కం. నా కొలువు వారకాన న్నా కేశుం గొలుచు నంగనలలోనైనన్ లేకునికి నాకుఁ దెల్లం,బాకొమ్మకు నీడువోల్ప నయ్యెడు సుదతుల్. విరా. 2.66.

(కొలువువారు = అంతిపురము వారు).

**కొలువు విరియు** దే. అ. క్రి.

సభ చాలించు.

వ. ... ధర్మనందనుండు ... సర్వ

సన్నాహంబులు సమకట్టుమని పనిచి
కొలువు విరిసి చనియె. ఉద్యో.
4.210.

**కొలువు సేసికొను** దే. అ. క్రి.

సేవ చేయుటకై అనుమతి పొందు, సేవ యిప్పించుకొను.

కం. కని కొలువు సేసికొని మ్రాలి
నినాఁ జని. విరా. 1.106.

**కొల్పివచ్చు** దే. స. క్రి.

వెంటనేతెంచు.

ఉ. అతని తమ్ముఁడైన మదిరాశ్వుఁడు
కర్ణ ఝళంఝళా సముద్ధూత బలోత్థ
రేణు పరిధూసరితాంబరమైన వారణ,
వ్రాతము గూర్చిరాఁ గడఁగి వచ్చె
సముజ్జ్వల హేమవర్మ నిర్యాత రుచి
చ్ఛటా పటల రంజిత హేతి మహోగ్ర
సైన్యుడై. విరా. 3.146.

**కొసరి తిండి** దే. వి.

కోరి కోరి తినుట; 'ఇచ్చినది చాలదు, ఇంకగావలెను. ఇంకఁగావలెను.' అని కోరికోరి యనుభవించుట.

సీ. .. అర్థులు కొసరితించియు ధన
గుప్తిమీది-తే- భరముఁ దమ లోవిరో
ధులై పట్టి మనసుఁ, జిక్కు వఱుపంగ.
శాంతి. 6.200.

**కొసరు** దే. స. క్రి.

ఇచ్చినదానికన్న పెచ్చుగా నడుగు. చూ. కొసరి తిండి.

వి.

సందేహము- సంకోచము- జంకు. (ఈ యర్థమున 'కొంకు' పదముతోఁ గూడి కన్పట్టుచున్నది).

తే. ఒడిచి తలపట్టి తిగిచి మహోగ్ర
వృత్తిఁ గొంకు కొసరించుకయు లేక
కూలఁదాచె. విరా. 2.128.

## కో

**కో¹** దే. వి.

(యుద్ధాదులందు) ఉత్సాహసూచకముగాచేయు అఱపునకు అనుకరణము.

కం. ఏయుఁడు పొడువుం, దడువుఁడు
వ్రేయుఁడనుచు వారు జాహ్నవీతనయు
గడున్, డాయుఁడు మన సైనికులున్,
కో యని తలపడ్డఁ బోరు ఘోరం
బయ్యెన్. భీష్మ. 3.409.

**కో²** ($\sqrt{}$ కొను) కొన్నిపట్ల 'కొను' ధాతువునకు ఆదేశముగా వచ్చునది.

చం. ఉఱక సమీరసూనుఁడు దదుగ్ర
ధనుర్ధళనంబొనర్చి యే, డైఱఁ గరి
నొంప నాతఁడు గడిఁది మగంటిమి
నొండు వింటనున్మొఱుగులు గ్రమ్ముకో
నతని మేన్గడునొంచి. కర్ణ. 1.83.
(పాఠాం.)

మ. ...భీమ పార్థులను గోకొమ్మంచు
నొక్కుమ్మడిన్, గవియన్. భీష్మ.
3.318.

**కోంకణము** సం. వి. అ. పు.

ఒక దేశము. భీష్మ. 1.40. (ఇది సహ్యాద్రికిని సముద్రమునకును నడుమ నున్నది. (సూ. ఆ. ని.)

**కోఁత** దే. వి. ($\sqrt{}$ కోయు) కోయుట. ఛేదనము, ఖండనము.

కం. వెడగోఁతల నెత్తురొలుకఁ బడఁ
ద్రోచిన వచ్చి కుక్కపదుపు వెసు

కకున్, జడిసెఁ గుశింపగొల్లక. శాంతి. 3.508.

**కోకనదము** సం. వి. అ. న.

1. చక్రవాకములపు కూయునట్లు చేయునది, చెంగలువ, ఎఱ్ఱకలువ.

2. చెందామర, ఎఱ్ఱతామరపూవు.

'రక్తాబ్జై రక్తకుముదే బుధైః కోకనదం స్మృతమ్.''

కం. ... మనం, పేకాస్యములం దగు లదు, కోకనద దళాంబు బిందు గుణ మొనరంగస్. శాంతి. 5.229.

**కోకము** సం. వి. అ. పుం.

జక్కవ, చక్రవాకము.

వ. . . ఇవ్వనంబు బక బలాక కారండవ సారస రమ్య మధుకర సౌమ్య సరోవర సంకులంబును. ఆర. 1.201.

**కోకాముఖము** సం. వి. అ. న.

ఒకానొక పుణ్యస్థలము. అను. 2.87.

**కోకిలము** సం. వి. అ. పు.

పికము, కోయిల. వీనికి జ్వరము వచ్చిన కన్నుజబ్బు వచ్చును.

చం. ... శుక కోకిల భృంగరవుల్ వనంబులం,పెదనెడఁ బల్క, గూయ సొగియింపఁగ మ్రోయఁగఁ దద్విరామముల్. ఉ. 2.111.

వ. ... కోకిలంబులకు నేత్రరోగం బును. శాంతి. 5.443.

**కోకిలాదేవి** సం. వి. ఈ. స్త్రీ.

ద్రుపదుని భార్య.

వ. సౌత్రామణి యయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదుఁడు పుత్రకామేష్టి సేసిన. ఆది. 7.16.

**కోకొమ్ము** (కొనుము+కొనుము)

కొట్టుము, కొట్టుము.

మ. .. భీమ పార్థులును గోకొమ్మంచు నొక్కుమ్మడిం గవియం బాండవసేన యుబ్బి. భీష్మ. 3.318.

**కోట** వై. వి. (సం. కోటః; ప్రా. కొట్ట-కోట)

1. చుట్టును గట్టి ప్రాకారము గలిగి రాజవాస స్థానమగు పురము.

సీ. కోట యేమఱకెప్డు పాటించి గడ్తయు ఖాణంబు గొల్చును గట్టియలును,నేయి నూనియయును నానాయుధమ్ములు నౌషధములు నాభీల యంత్రములుఁ గూప,ములు లోనుగా నందు వలయువాని, సమగ్రములుగ సంపాదించి. శాంతి. 2.284.

2. కోటవంటిది. కోటవంటివాఁడు, రక్షణ సాధనము.

కం. నమ్మము వెఱవకు మేనును దమ్ములునుం గోట నీకుఁ దాత్పర్యమ్మై, నిమ్మేటి మగలు సూరెల, నెమ్మి నిలువ నింద్రుఁడైన నీకెదురగునే. ద్రోణ. 2.295.

కం. అలఘుబలుఁడు శైనేయుఁడు, గలుగఁగఁ బాండవులఁ గెలువఁగా వచ్చునె వా,రలకతఁడు గోట యంద్రు రిపులు చాటెఁ దగఁగ నెఱపు భుజ గర్వంబున్· ద్రోణ. 3.288.

**కోటరము**[1] దే. వి. (√ కోడలు).

కోడంట్రికము, కోడలితనము.

చం. అరయమిఁజేసి కోడలనపప్పుడు దాసిగఁ జేసె నమ్మహా, పురుషుని పాలికన్ బతుకు వోవఁగ వీరలతోన యేను జె,చ్చెరఁ జని కోటరంబు దగ

జేయుదునో యటుగాక పాడిమై, వర
వుడ మోపి చేయుదునో వారికి మాధవ
నిశ్చయింపుమా. ఉద్యో. 3.102.

**కోటరము2** సం. వి. అ. పుం. న.
చెట్టుతొఱ్ఱ.
వ. అమ్మహీరుహంబు కోటరంబున వసియించి యుండునది యొక్క కపోతంబు దన వల్లభ యెటయేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి. శాంతి. 3.309.

**కోటి** దే. వి.
నూరు లక్షలు.
వ. ... నివాతకవచులనియెడు దైతేయుల మాతలి సారథికంబగు నైంద్ర స్యందనం బెక్కి యొక్కండన మూఁడు కోట్ల నిర్జించితి. విరా. 4.149
ఆ. ధర్మలబ్ధమైన ధనము పాతిక యేని బహుళ ఫలము నిచ్చుఁ బాప వృత్తి, పార్జితంబు కోటియైన నిష్ఫల మంద్రు, దానశాస్త్ర విదులు. శాంతి. 5.492.

**కోటి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.
1. సముదాయము, సమూహము.
ఉ. ....నా, నేర్చినభంగిఁ జెప్పి వర ణీయుఁడనయ్యెద భక్తకోటికిన్. విరా. 1.28.
ఆ. బభ్రువాహనునకుఁ బరమ విశేషంబు మెఱయ గారవించి మేలి వస్తు, కోటులొసఁగి ప్రీతిగూరిన మనముతో, నతని దత్పురమునకరుగఁ బనిచె. అశ్వ. 1.208.
2. వింటికొప్పు.
చం. గుణమున లస్తకంబునను గోటి యుగంబునఁ గేల దార భీషణముగ నుప్పతిల్లి రభసంబుగ రేఁగిన మాడ్కిఁ దీవ్ర మార్గణ ...ంబు లొక్కట నరాతి బలంబులఁ గప్పె. విరా. 5.3.
వ. ... అమ్మేటి మగండు గాండీవంబు మౌర్వి కోటిఁబాసిపో, నేసిన. కర్ణ. 3.348.
3. జాతి, తరగతి, శాఖ.
తే. అధ్యయనమున మస్తకంబంటుట యును,నిద్రయును నశుచిత తోడ నింద్యకోటి,శిరముఁ గ్రోకంగఁవగ దిరుసేత మస్తకంబు తైలంబు బూయఁగాఁ గాదు మేన. (నింద్య కోటి = నింద్యములజాతిలోఁ జేరినవి) అను.4.102.

**కోటికాస్యుఁడు** సం. వి. అ. పుం.
సైంధవుని చెలికాఁడు.
తే. ... కందర్ప,దర్ప గోచరాత్ముఁడై నిజసఖుఁ గోటికాస్యుఁడను నృపాత్మజుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి. అర. 6.146.

**కోటితీర్థము** సం. వి అ. న.
ఒక పుణ్యస్థలము.
వ. దీనియందు స్నానము చేసిన అశ్వమేధఫలము గల్గును. అర. 2.248.
వ. ఇచ్చటఁ గుమారు నర్చించిన రాజసూయ ఫలంబు గల్గును.

**కోటికుఁడు** సం. వి. అ. పుం.
వాసుకికుల సంభవుఁడు, జనమేజయుని సర్పయాగమున హోమకుండమునఁ బడినవాఁడు. అది. 2.212.

**కోటీరము** సం. వి. అ. పుం.
కిరీటము, బొమిడికము.

తే. ... వీర కోటీర మణిఘృణి వేష్టి తాంఘ్రి,తఁడు కేవల మర్త్యుఁడే ధర్మసుతుఁడు. విరా. 2.191.

**కోట్లాఁడు** దే. అ. క్రి.
దెబ్బలాడు, పోట్లాడు.
తే. పుట్టములలోన నొప్పమి పుట్టి నప్పు,డడ్డపడి వారితోడఁ గోట్లాడి యైన, దాని నుడుపఁగఁ జొరకున్న వానిఁ గ్రూరకర్ముఁడని చెప్పుదురు కర్మకాండ విదులు. ఉద్యో. 3.242.

**కోడలు** దే. వి. ఔ. (కోడలు+ఆలు-శ. ర.) (బహు. కోడండ్రు, కోడండ్రురు.)
కొడుకుయొక్క భార్య, స్నుష.
కం. తనయులు గోడలు సేమం, బున నున్నారు. ఉద్యో. 3.204.
సీ. .. పార్థివ ప్రభుఁడైన పాండు మహీపతి కోడలనయి. ఆర. 1.'36.
వ. ... భృగుండు కోడలికిట్లనియె. ఆర. 3.135.
సీ.. కుంతీమహాదేవి కోడండ్రలోపల, నగ్గలంబునఁ గొనియాడఁ బరఁగి. విరా. 2.216.
తే. గొంతి కోడండ్రురెల్లను గురువ రేబ్బ, యెత్తినడుగులనున్నవారు. ఆశ్ర. 2.25.
కం. సుందరి ... ప్రభ,యంద భ్ఘర్చితవు నీవ. సభా. 2.257.

**కోడి** వై. వి. (సం. కుక్కుటః ప్రా. కుక్కుడో).
కుక్కుటము. ఆహారమునకుగాను మాంసము, గ్రుడ్డుల సరఫరా చేయు ఒకజాతి పెంపుడు పక్షి.
ఉ. పాములుఁ దేళ్లనుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్ళులుం జీమలు.. అశ్వ. 2.117.

**కోడియ** దే వి. కోడె.
కోడెదూడ, గిత్త, వత్సతరము.
సీ. .. లంకియతోన గండుమీఁటి, పాఱె నక్కోడియల్. శాంతి. 4.40.

**కోడె** దే. వి. కోడియ.
కాడికి మరపఁదగిన మగ దూడగిత్త, ఎద్దు, వృషభము.
వ. ... (మంకి) యివ్విధంబునం గోడెలు సచ్చినం బుట్టిన నిర్వేదం బున. శాంతి. 4.54.

**కోణనాసికుఁడు** సం. వి. అ. పుం.
కద్రువకొడుకు, సర్పజాతివాఁడు. ఆది. 2.4.

**కోణము** సం. వి. అ. పుం.
మూల.
కం. ... కోణ,వ్యాయామ గతుల వలయములై యుండం దిరిగి కలఁచు నరిసైన్యంబున్. భీష్మ. 1.269.

**కోదండము** సం. వి. అ. న.
విల్లు, ధనుస్సు.
కం. చక్కని చిక్కని మేనులు, నిక్కోదండములునైన నెఱుఁగరె మనమీ,చక్కటి నిలుతమె శస్త్రము. లొక్కెడ దాఁచుటకు వేష యోజన ములకున్. విరా. 1.157.

**కోపనుఁడు** సం. విశ. (అ. ఆ. అ).
కోపస్వభావము గలవాఁడు.
సీ.... మదీయ, జనకునికడకుఁ గోప నుడైన దుర్వాసుఁ, డన్మహాముని వచ్చె...ఆశ్ర. 2.95; ఆది. 4.37.

**కోపపరుఁడు** సం. విఱ. (అ. ఆ. అ).
కోపనుఁడు, కోపస్వభావము గల వాఁడు, కోపి.
ఉ. ... ఉగ్రగతం, బమ్మిన యట్టి కోపపరుపాలికి ఖామలు వోవనోదరే. ఆది. 4.38.

**కోపము** సం. వి. అ. పుం.)
క్రోధము, కినుక.
కం. అను నప్పలుకులకయ్యం,గన కోపము గదిరి. విరా. 2.54.

**కోపి** సం. విఱ. (న్. నీ. న్.)
మిక్కుటమగు కోపము గలవాఁడు.
ఆ. ... శృంగియన్, వాఁడు భృంగి సముఁ డవంధ్యకోపి. ఆది. 2.168.

**కోపించు** సం. అ. క్రి.
కోపగించు.
ఆ. కొడుకుపాటు చూచి కోపించి కాళింగ,పతి రయమునఁ దేరు వఱపి. భీష్మ. 2.65.
కం. ఇడుమలఁ బదుమూఁడేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చె బలువిడి నీక,వ్వడి. ... విరా. 4.253.
స. క్రి.
కినియు
వ. ఆ జమదగ్నిం బితృదేవతలు కోపించి.

**కోపితుఁడు** సం. విఱ. (అ. ఆ. అ).
కోపింపఁ జేయఁబడిన వాఁడు. కోపము వచ్చునట్లు చేయఁబడిన వాఁడు.
ఉ. ... కళింగుఁడు... నాటనేసినం, గోపితుఁడై కడంగి...భీముఁడుద్ధతిన్. భీష్మ. 2.73.

**కోపు** దే. వి.
(వింటియొక్క) కొప్పు, కొన, కోటి.
వ. ... కర్ణుండు నిశ్చేష్టితుండగు సహదేవు [illegible]...[illegible]కోపునం గడుపు వొడిచి నవ్వుచు .. పొమ్మని పలికి పోయె. ద్రోణ. 5.161.
2. విధము, రీతి, రూపు.
ఉపేంద్ర. ... ఇది తల్ల నే సం,స్మరించి యీ కోపు నమర్చి కొంటిన్. స్త్రీ. 1.136.
3. మోపు.
తె. బిసములాదట నంచఱుఁ బెఱికి రొంపి,వోవ నీటఁ దెమల్చి కోపుగ నమర్చి. అను. 3.223.
(మోపుగనమర్చి – పాఠము; కోపుగ నమర్చి-పాఠాంతరము.)

**కోమటి** దే. వి. (వైకృతము అని శ. ర., కార్పటిక శబ్దభవమని సూ. ఆ. ని. ఇది ముడిపెట్టిన రకముగాఁ గన్పించుచున్నది.)
వైశ్యుఁడు, మూఁడవ కులమువాఁడు.
వ. ... ఆ కోమటికొడుకు లక్కా కంబునకు వానిఁ జూపి యిట్లనిరి. కర్ణ. 2.55.
చం. . . కొనుఁడు పరార్థ్య రత్నములు గోరినవానిన యిత్తుమ న్తెఱం, గునఁ బచరింతురంగడులఁ గోమటు లప్పురి సిద్ధరత్నముల్. ఆది. 8.73.
వ. కొంచఱు కోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జన. శాంతి. 3.473.

**కోమలము** సం. విఱ. (అ. ఆ. అ.)
మృదువు, మెత్తనిది.
చం. కడుఁ పసిబిడ్డ వీఁడొకటి గాద

వున నెఱుగండు ముందరె,య్యెడ
నొక పాటెఱుంగఁడెద యెంతయుఁ
గోమలము. విరా. 2.213.

**కోమలి** వై. వి.
చక్కదనము గల ఆఁడుది.
మ. ... కందర్ప దర్ప గోచరుండైన
కీచకుండు నిజసోదరి వలన నక్కో
మలి కలరూపు దెలియఁడలంచి.
విరా. 2.38.

**కోయు** దే. స. క్రి.
1. (పూలు, పండ్లు మున్నగునవి)
త్రుంచు.
కం. చనుఁ జనదని చూడక యం,దని
మ్రాఁకుల పండ్లు గోయఁడిలఁచుట
హితవే. విరా. 2.58.
ఆ. కోరి తోటవాఁడు కుసుమఫలంబులు
గోయునట్లు రాజు గొనఁగ వలయు,
నవ్వనములు నఱికి యంగారములు
సేయు భంగియైన భూమి పాడుగాదె.
శాంతి. 2.300.
2. ఛేదించు, నఱుకు, ఖండించు.
ఉ. .. నేను దు,ర్మాంసముఁ గోయు
వైద్యుని క్రమంబున నాతనిఁ ద్రుంచి
యన్వయో, త్తంసముఁ జేయనే. ఉద్యో.
3.376.
చం. ... ఇంక నేమనిన పాఱుఁడ
నాలుక గోయుదుం జుమీ. ద్రోణ.
5.103.
తే. ... నేలకు లంఘించి మెఱుఁగు
మెఱచి,నట్లు సని ఒలగోయుటకప్ప
ళించి,యెగిరె నగ్గురు తేరిపైకేపు
మెఱయ. ద్రోణ. 4. 101.

**కోర** దే. వి.
కల్లు త్రాగెడు గిన్నె, చషకము.
చం. ...మదవిహ్వల భావము సేయఁ
జాలి యింపొనరిన యాసవంబులు
సముత్సుకతం గనకంపు గోరలం,
గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి
యాదవులు. మౌస. 39.
విణ.
పెద్ద (చూ. కోరమీసము. కోరదౌడ)

**కోరకము** సం. వి. అ. పుం. న.
మొగ్గ.
వ. ... (దేవయాని) యవ్వనంబునఁ
గన్యకలుం దానును ... నవ వికచ
కుసుమ సుకుమార కోరక నికర భరిత
సహకార కురవక వకుళాశోక తమాల
సాలచ్ఛాయా శీతల సికతా తలంబున
నిష్ట వినోదంబులనున్న యవసర
మున. ఆది. 3.155.

**కోరదౌడ** దే. వి. (√ కోర)
పెద్దదియు సోగదియు నగు దౌడ
చప్పిదౌడ, లోనికణఁగినదౌడ(బ్రౌ.)
సీ. ఆ రేయి గల నెల్లవారును గోరం
దౌడలును నల్లని మేను గల నెలంత,
యొక్కత యిలు సొచ్చి యువిదల
నడిచి కానిపోవ. మౌస. 25.

**కోరమీసము** దే. వి. (√ కోర).
పెద్దదై పొడుగైన మీసము (శ. ర.);
సూక్ష్మాగ్రము గల మీసము (బ్రౌ.).
ఆ. మనుజరక్త సిక్త తనువును గోరం
మీ,సములు వృత్త లోచనములు.
అశ్వ. 3.87.

**కోరిక - కోర్కి** దే. వి. (√ కోరు)
1. వాంఛ, ఇచ్ఛ, అభిలాషము.

కం. నీ కోరిక యప్రతిహత,మే
కార్యము గోరి వచ్చి తెలిఁగింపుము.
ద్రోణ. 2.161.
చం. ... ఇత్తెఱంగు గోర్కికిఁ గత
మేమి పాండవుల గెల్చి ధరన్
సగమీఁ దలంచితే. ద్రోణ. 1.109.
1. వాంఛితార్థము, అభీష్టార్థము.
కం. నా కోర్కి పిదపఁ జెప్పెద,
లోకనుతా యొకటి యడుగ లోల
త్వము చి,త్తాకలితమయ్యె. శాంతి.
6 596.
సీ .. చెలువ నీకు. ఆ. నిత్తు వరము
వే డుమయ్యది కోరికి యనియె,
నటఁడు మీ ప్రియంబుకంటె, నన
మిగులు కోర్కియును గలదే నాకు,
నంటిఁ గాని యొకఁడు నడుగనైతి.
ఆశ్ర. 2 85.

**కోరికొను** దే. స. క్రి. (√ కోరు)
(స్వార్థమున కొను).
కోరు, ఎన్నుకొను.
ఉ. ... మీవలపెట్టులట్ల తగ నీవును,
నీతడు, గోరికొండొగిన్. ఉద్యో.
1.72.

**కోరు** దే. స. క్రి.
1. అభిలషించు.
వ. ... బ్రహ్మానంద స్థితిం గోరి
సర్వాలింగిత మహీతలంబుగ
నమస్కారంబు సేసిన నజ్జగన్నా
థుండు. విరా. 1.22.
కం. కోరిన వంటకములు నా,నేరిమిఁ
దగఁ నెఱపి కొలుతు నిర్మల భక్తిన్.
విరా. 1.2.9.
2. (రతిక్రీడకు) వాంఛించు,
కామించు, వరించు.
సీ. తనుఁ గోరి యూర్వశి దాన వచ్చి
ననైన, లోలుండు గాఁడను మేలి
మాట. విరా. 2.204.
తే. ... నీరసాకార సైరంధ్రిఁ గోరఁ
దగునె. విరా. 2.64.
వి.
వంట మున్నగు వానియందలి భాగము,
పాలు-వంతు.
ఉ. వైరుల జంపి భూప్రజకు వర్ధ
నముం గలిగించి పాడిమైఁ, గోరరి
గొంచు సద్వ్యయము గోరి యొనర్చుట
రాజధర్మ విస్తారముగా ఒలారికి వచ
స్పతి సెప్పుట యప్రసిద్ధమే. భీష్మ.
3.309.

**కోఱ** వి. (ఖరుశబ్ద భవమని సూ. ఆ.ని.)
పల్లు, దంష్ట్ర.
గీ....వాసుకి కోఱలు వెఱుకఁ గదఁగి
నట్లుగాదె. విరా. 4.213.
తే. ... నిర్జింపవచ్చుఁ గోఱలెల్లఁ
బుచ్చిన నురగంబులేమి సేయు.
ఉద్యో. 3 391.
2. పొడుగైన ప్రక్కపన్ను. ఉద్యో.
3.391. (చూ. కోఱదౌడ).

**కోఱడము** దే. వి.
తిరస్కారము, ధిక్కారము.
తే. ... అమ్మెయిఁ జని యొక్క
ప్రోవుగట్టి, వేఱ యంతంత నుండిరి
కోఱడమున. ఉద్యో. 3.374.

**కోఱదౌడ** దే. వి.
కోఱలు గలిగిన దౌడ. ప్రక్క
దంష్ట్రలు గల దౌడ.
వ. ... వాదరిఁ జిక్కిన యెముక

తునకలు గోఱదౌడల కై వడి గలిగి రుధిరాసవ [illegible] నాభీలంబగు నసిపట్టిక ఘోరాకారయైన రాక్షసి పగతుర నడఁగించుటకుఁ దనకుం దోడు వచ్చిన తెఱంగున మెఱయ. సౌప్తి. 1.177.

**కోల** దే వి.

1. చేతికఱ్ఱ, కఱ్ఱ, బెత్తము.

సీ. బాలుఁడొక్కండు కొండొక కోల సేతఁ బట్టుకొని. ఆది. 6.260.

చం. ... అయ్యురగ వల్లభు రజ్జునఁ గట్టి తెచ్చి య,మ్మగువకుఁ జూపి దీని దల క్రుంగఁగ మోఁదెదఁ గోల. అను. 1.6.

2. బాణము.

కం. . కాయముల సపాటం,బునఁ బదియుఁ బదేను నుచ్చిపోయెం గోలల్. విరా. 5.32.

కం. విందుని సారథి నాక కో,లం దునిమిన వాహనములు గలగంబడి. భీష్మ. 3.33.

వ.... ఒక కోలఁ గృతవర్మయుగము నొంచి. భీష్మ. 1.272.

3. కఱకుట్లు కాల్చుటకుపయోగపడు శూలము, ఇనుప శలాక, వంటకట్టెలు (శ. ర).

సీ. చట్టువంబొక చేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి సురియతోఁ బిగియ ద్రిండు,గట్టిన నునుఁజేల కప్పెంత యును జెన్నుసేయంగ వాపడేచేత యందు, వెడిచంపుఁ గోలలు వెడఁ గౌంద. విరా. 1.211

నేలకుఁ గోలకుఁ దెచ్చు (కొందఱను నేలఁబడవైచు, కొందఱను బాణములతో కొట్టు)పలువిధముల శోధపెట్టు, (క్రింది మీఁదు చేయు = శ.ర; బ్రౌ)

కం. నకులుఁడు సహదేవుండును, బ్రకట భుజాస్ఫురణమున నరాతి బలము నే,లకుఁ గోలకుఁ దెత్తురు నో,రికి వచ్చినయట్లులాడిరే యిబ్బంగిన్. కర్ణ. 3.88.

గీ. కోలుమసఁగి గురుండు పాంచాల సేన,నేలకును గోలకును దెచ్చె. ద్రోణ. 5.301. (కోలకుఁదెచ్చు = బాణమునకు గుఱిసేయు).

**కోలదివియ** దే. వి. (√ కోల)

కాగడా, దివిటి, ఉల్క(కఱ్ఱకు పై భాగమునఁ గల యినుప సలాకకు చమురులోఁ దడిపిన వంటను తగిలించి మండించి పట్టుకొను దివిటి, గుడ్డలతో చేతితోఁ బట్టుకొనుటకు వీలైన లావుతో పొడుగుగాఁ జుట్టి పై భాగమును ఆముదముతో దడిపి వెలిగించి పట్టుకొను దివిటి).

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోల దివియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁబాఱి, నృత్తశాలఁ జొచ్చిరి. విరా. 3.4.

"సహసైవ సమాజగ్మ రారాయోల్కా సహస్రశః" సం. భార. విరా 22.94

**కోలశైలము** సం. వి. అ. పుం.

ఒక కొండ; సహదేవుఁడు దక్షిణ దిగ్విజయ యాత్ర చేయునపుడు ఇచ్చట నివసించువారిని వశగతులఁ జేసి కొనెను. సభా. 1.260.

**కోలాహలము** సం. వి. అ. పుం.

కలకలము అలబలము, పెద్ద రొద.
సీ. దెసలు బీటలు వాఱ దివురు చింద
ముల కోలాహలంబులకుఁ గలఁగఁ
బడక. విరా. 4.62.
2. ఒకానొక కొండ.

ఈ కోలాహల పర్వతము శుక్తిమతి యను నదిని గామించి దానికడ్డంబు పడెను. ఆ సమయమున శుక్తిమతి సమీప ప్రదేశమును బాలించు యుప రిచర వసువను మహారాజు కాలితో ఆ పర్వతమును దొలఁగఁద్రోసెను. ఆ శుక్తిమతికి కోలాహల సమాగమ మున వసుపదుఁడను కొడుకును గిరిక యను కూతును బుట్టిరి. వారిద్దఱను తనకుపకారము సేసిన వసువున కిచ్చెను. వసువు వసుపదుని సేనాపతి గను గిరికను భార్యగను స్వీకరించెను ఆది. 3.26.

**కోలు1** దే. వి. (కొను)
1. అనుప్రయుక్తమైన 'కొను' ధాతు వునకు భావార్థక రూపము.
ఉ....ఆ, మారులెకన్ జయంబొసఁగె
మాల విధాత్రుఁడు వాని గెల్పుకో,లేరికి
సమ్మతంబగునె యిట్టిది దీనను బెంపు
గల్గునే. సౌప్తి. 1.219.
2. కొల్ల.
కం. మున్నును నేఁ గాగణముగ,
నన్ని యిడుమ లనుభవించి రనుజులు
పిరిం,గన్నారఁ జూతుఁగాని జ,గ
న్నుత భీష్మునకుఁ గ్గోలుగా నీఁజాలన్.
భీష్మ. 3.279.

**కోలు2** క్రి. విశ.
మిక్కిలి (చూ. కోలు మసఁగు)
విశ.
పెద్ద.
చం. అదియునుగాక కోలుపులినై నను
గారెనుపోతునైన ..బట్టుదు నడగంగ
మాత్స్యుఁడు గడున్ వెఱఁగందుచుఁ
బిచ్చలింపఁగన్. విరా. 1.83.
తరల ... పీనినెన్నఁడు నాదనో,డు
దురు సన్మనులిందు గోల్మొసఖల్
గొనున్ వడిఁ జొచ్చుడున్. ఆది.
8.148.

**కోలుతల** | **కోల్లల** దే. వి. (కోలు2 + తల)
1. ఎదుట నిలిచి చేయు యుద్ధము-
యుద్ధము.
వ ...ఎదుట శకుని కడంగి యోధవరు
లతో మీరు కోల్లలసేయుండేను బెడ
ముట్టున దాఁకి ధర్మనందనాదుల సమ
యించెదనంచు సముద్ధతిం గదిసె.
శల్య. 1.337.
శ్లో॥ యుద్ధ్యధ్వమగ్రతో యావత్
పృష్ఠతో హన్మి పాండవాన్. సం.
భార. శల్య. 22.26.
ఆ. అతఁడు వదిన వేఁడి యాసేనఁ
గోల్లల,సేయ నొకఁడు గేమి సిద్ధము.
ఉద్యో. 2.219.
శ్లో॥ భీమసేనే నిహతే కోన్యో యుధ్యేత
భారత, పరేషాం తన్మమా చక్ష్వ
యది వేత్థ పరంతప.॥ సం. భార.
ఉద్యో. 55.61.
కం. భూరి బలఘోరమగు నా,భూరమ
ణుని కోలుతలకుఁ బోవక భీష్మ,స్ఫార
బలము ద్రోణుని దో,స్సారంబును

నచ్చి నీదు సైన్యము పెనఁగెన్. భీష్మ. 2.109.

కం. తలలను గుదములు వక్షస్థలముల ఒక్కసమున దొడలఁ జరణంబుల నయ్యల గప్పెడు సాత్యకితో ల్తల కోర్వక సైన్యము గలగం బడియెన్. ద్రోణ. 4 5.

కం. పులికిఁ బసులు వాటినక్రియ, నలవుఁ జలము సిగ్గు విడిచి యిట్లా క్కని కో ల్తల కోర్వక విరిగెన, పుత్రుల నేమని విందు రోయక యింకన్. ద్రోణ. [illegible]

"యాదృశం కృతవాన్ యుద్ధం శినే ర్నప్తా మహాయశాః."

సం. భార. ద్రోణ. 121.10.

2. ఎగురుట, గంతు.

చం. అలిగి యతండు వేపొక శరా సనమెత్తి రథమ్ము ఘోటకమ్ముల నిలఁ గూలనేయఁ బొలివోవని ధైర్యము పేర్మి వాఁడుసుం బలకయుఁ గొంచు మాద్రిసుతుష్ట ధరిత్రికి దాఁటి బెట్టు గో ల్తలఁ జని చక్సహాయ భట దారుణ కేళి యొనర్చి పేర్చినన్. కర్ణ. 3.233.

శ్లో॥ తతో హతాశ్వాదవరుహ్య యానా దాదాయ చర్మాకుల మిక్రచంద్రం, ఆకార సంకాశ మసిప్రగృహ్య పోధూయమానః ఖగవచ్చచార. సం. భా. కర్ణ. 85,26.

**కోలుతల సేయు** దే. అ. క్రి.
**కో ల్తల సేయు**

1. యుద్ధసన్నాహము చేయు, యుద్ధ మునకు సన్నాహము చేయు.

వ. సుశర్మ తమ్ముండు సంగడం బుగాఁ గో ల్తలసేసి రథ సమూహం బుతో విరాటుప్రాంతంబు నెదురుకొని. విరా. 3.182.

2. యుద్ధము చేయుటకు ప్రోత్సహించు.

గీ. ఉన్నచోటన కదలక యున్న ద్రోణ,భీష్ములును గోలుతల సేయఁ బెఱిగి సేన,చంద్రోదయుదయింపఁ బెరి గిన శరధియట్లు తోడుతోడుతఁ బొం గారె చూడనొప్పె. భీష్మ. 2.117.

3. యుద్ధమునకుఁ గవియు.

వ. పాండవాగ్రజుండు పాంచాల పురస్సరుండై యవ్వలనిచం ద్రావ్వ లరం గో ల్తలసేసె. భీష్మ. 3.152.

4. (సేనలను) నడపు.

కం. సమరథుఁడు నీసుత లక్ష్మణ, కుమారకుండేచి మొనలఁ గో ల్తల సేయున్,మిమునెల్ల మిగులు భుజ, గర్వము ముదము గలఁడు కొనఁ దరాతుల నధిపా. ఉద్యో. 4.224.

శ్లో॥ లక్ష్మణ స్తవ పుత్రశ్చ తథా దుశ్శాసనస్య చ యుద్ధానాం చ విశే షజ్ఞా ప్రణేతారౌ చ సర్వశః. సం. భార. ఉద్యో. 166. 14. 15.

**కోలుపడు - కోల్పడు** దే. అ. క్రి. (కోలు + పడు.)

1. హింసింపఁబడు.

కం. ద్రోణాచార్యుని యుగ్రపు,బాణం బులకోర్చి యుదఁడు పడునంతకు న,క్షీణ ధృతి నసమ సమర క్షోణి నిలిచి కర్ణుచేతఁ గోల్పడియెంగదే. కర్ణ. 3.24. (పారాం.)

2. పోఁగొట్టుకొను, కోలుపోవు.

చం. తమ సగఁబాలు గోలుపడి దానిన యిప్పుడు గోరు వీరికిన్, సముచిత వృత్తినిచ్చి తమ సామున సంతస మంది యున్కి యు,క్తము ధృతరాష్ట్రి సూనునకు దాన నపాయము లేక యుండు. ఉద్యో. 1.19.

కం. బలవంతుఁడు పైనెత్తిన, బల హీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ,ము,చ్చిల వేచువాఁడుఁ గాఁమా,కుల చిత్తుఁడు నిద్రలేక ప..డుపరఫెూ. ఉద్యో. 2.21.

చం. అమరనదీ తనూజు సమరావని గోల్పడి నాదు యోధవ,ర్గము మఱి యెవ్వరిం గాని పరాక్రమ,దుర్దమ పాండుపుత్ర సై,న్యమునకు మార్కొ నం దలఁచె. ద్రోణ. 1.9., శాంతి. 3.145.

చం. ... నిన్నునుం, బుడమిని దమ్ముఁ గోల్పడిరి పౌత్రి భవత్పతు లైన పాండవుల్. సభా. 2.214.

**కోలుపుచ్చు - కోల్పుచ్చు** దే. స. క్రి. (√ కోలుపోవు) కోలుపోవఁ జేయు.

1. పోఁగొట్టు, హరించు.

చం. అనవుడుఁ గీచకుఁడు హృదయం బునఁ బొంగి లతాంగితోడ ని,ట్లను ధృతిఁ గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁ డేటి విచార మిట్టు వేఁ,పచనునె. విరా. 2.263.

తే. మిగిలి యప్పాండవాగ్రజు మగటి మియును, జలముఁ గోల్పుచ్చి తూలఁ బోఁబలికి మెఱసె,నధిప య.. వీఁకమై నడ్డపడఁగఁ గడఁగు నద్దెస యోధుల గర్వమడఁచి. కర్ణ. 2 142.

2. చంపు.

కం. నను ధీ గురుని సూతసు, తుని భూరిశ్రవుఁ జయద్రథుం జక్కటి ద,ప్పని యనిఁ గోల్పుచ్చుఁగ వ,చ్చునె నీకు,గపటశూర సుచరిత దూరా. శల్య. 2.327; ఆశ్ర. 1.69.

ఉ. ఏమఱి రక్ష సాలని మృగేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు సం,గ్రామము లోనఁ గన్కలిగి కావకదక్కిన నా శిఖండిచే, నీమనుజేంద్రుఁ గోల్పడమె. భీష్మ. 1.80.

**కోలుపులి** | దే. వి.
**కోల్పులి** |

పెద్దపులి.

చం. ... కోలుపులినైనను గా...నైన... కడింది మగం టిమి యుల్లసిల్లఁ బ,ట్టుదు నదఁగంగ మాత్సుఁడు ... వెఱఁగందుచుఁ బిచ్చలింపఁగన్. విరా. 1.83.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్ళకు, నుఱుకు తెఱఁగునఁ దఱియఁ జొచ్చి. ఉద్యో. 2.139.

**కోలుపోక** దే. వి. (√ కోలుపోవు). పోఁగొట్టుకొనుట.

ఉ. పంకజనాభ మా పడినపాటులు రాజ్యము గోలుపోకయుం, గింకకు మూలమై కడఁగి గెల్వ ... నీఁ దలంచి యీ వంకకు వ్రాలి భక్తజన వత్సలతన్ రథచోదకుండవై, తింకట మమ్ముఁగావుమని యేటికిఁ జెప్పఁగ మాటిమాటికిన్. ద్రోణ. 3. 3.

సీ. ... అధిక, ... ప్రమని ... బాంచాలి తనూజ

పంచకముఁ గోలు-తే-పోకఁజేసియుఁ
గెల్పు గెల్పుగ మదీయ,బుద్ధి గైకొన
దయ్యె. శాంతి. 1.6. అను. 4.386.

**కోలుపోవు-కోలోప్పవు** దే. స. క్రి.
(కోలు + పోవు) కోలుపడు.
1. పోఁగొట్టుకొను.
వ. అతని కడనుండి యమ్మహీపతి
యత్తాపస ముఖ్యునకు నిజవృత్తాంతం
బెఱింగించి కొడుకు గుణంబులగ్గించి
వానిం గోలుపోవుటంజేసి విజయంబు
ప్రియంబు సేయకున్నది. ద్రోణ.
2.158.

మ. అరయం దప్పొకయింత నావలన
లేదాధర్మపుత్రుండు జూదరివెంటం
దమకించి సౌబలుని చేతన్ భూమి
గోల్పోయి ము,ష్కరుఁడై వెండియు
నొడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె
నే,తెరువైనం దమ యిచ్చతోఁ బడియె
నింతేకాక యేఁ బూటయే. ఉద్యో.
8.358.

1. చెడు.
చం. కినుకకుఁ జాలకెంతయును
గీడ్పడి నా పడుపాటులెల్ల వ,మ్మునఁ
గలయంగ నిట్టులొక మూర్ఖునిచే దుదిఁ
బోయి కోలుపో,యెనె యభిమానమన్వ
గపు నేత్రఱ డెందము గొందలంబుఁ
బొం,దిన ధృతి మాఱి యేఁ ఇఱెంతెం
దగవెల్ల నెఱింగి యుండియున్.
విరా. 2.186.

గీ. ఇట్టులగుట యెఱింగి యెల్ల
భంగుల రహ,స్యంబు కోలుపో
యట్లుగాఁగ, నడరు నీదు కోర్కికను
రూప మెట్టిదె, యట్టి భోగఫలం నమభ
విం పు. 2.262.
(రహస్యము కోలుపోనియట్లు - రహ
స్యము ఒయల్పడకుండునట్లు.)
చం. తనియుట మాను మేలె మునికిన్
గుపితత్వము శాంతవృత్తి నా,యను
నయ మాదరింపు విను మల్పతపం
బుల చేత గోలుపో,దునె మఱి యట్లు
గాక యతి దుష్కరమైన తపంబు
సంచితం,బనఁదగు బ్రహ్మచర్యమును
నాఱడిపోవె కటా శపించినన్. అశ్వ.
3.35.
శ్లో॥ న చ మాం తపసాల్పేన శక్తో
భవితుం పుమాన్. సం. భార. అశ్వ.
53.24.

2. క్షీణించు, అడఁగు, నశించు.
తే. సింహబలుఁడు గంధర్వులచేత
నొక్క,సతికై గా నిట్లు ఘోరంపుఁ
జావు సచ్చె,నకట రిత్తకు రిత్త
మత్స్యావనీశు, లావు గోల్పోయె సూత
కులంబు వాలిసె. విరా. 3.70;
శల్య. 2.116.

3. భంగపడు.
కం. ద్రోణాచార్యుని యుగ్రపు,బాణం
బులకోర్చి యతఁడు పడునంతకు
న,క్షీణ ధృతి నసమ సమర,క్షోణి
నిలిచి కర్ణుచేతఁ గోల్పోయెఁగదే. కర్ణ.
3.24.

4. చచ్చు.
ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి,
నగుచు నినుఁడు గూలినను
భవిత్రి, పఱియలైన మేరువాఱఁగినఁ
గర్ణుచే, నీవు గోలుపోవుటేల కలుగు.
కర్ణ. 3.259.

శ్లో॥ పతేద్దివాకరః స్థానాత్ శుష్యేదపి మహోదధిః, మగ్నివియాన్నత్వామ్ హన్యాత కర్ణో ధనంజయ. సం. భార. కర్ణ. 88.106. 259.

**కోలుమసంగు** | **కోలుమసఁగు** } (కోలు² + మసఁగు) దే. అ. క్రి.

కసిమసఁగు, మిక్కిలి విజృంభించు, అతిశయించు.

సీ. .... కోలు మసంగెడు గోర్కుల, వెసువెం..., ........ నూఱట యును. విరా. 2.315.

తే. కోలుమసఁగి గురుండు పాంచాల సేన, నేలకును గోలకునుదెచ్చె. ద్రోణ 5.301.

చం. కుపిత యుగాంత రుద్రుగతిఁ గోలుమసంగిన వాఁడు భీష్ము, డేచి పటు భుజాబలంబు విలసిల్లఁగ మార్కొనకున్కి యొప్పునే. భీష్మ. 2.138.

**కోలె** అవ్య. ద్రు.

1. మొదలుకొని, ఉండి.

సీ. గోగ్రహణంబునఁ గోలె. ఉద్యో. 3.92.

సీ. జననుత దాని వత్సంబు నిన్నటఁ గోలె నుడుగక యఱచుచు నున్న యదియు. ఆది. 8.118.

గీ. ... పుట్టినకోలెను. విరా. 1.74. (పుట్టినది మొదలు కొని.)

2. వఱకు, దనుక.

వ. దాని శరీర సౌగంధ్యంబు యోజ నంబునం గోలె జనులకు నేప్పుడు నట్లుగాఁ బ్రసాదించిన. ఆది. 3.41. (యోజనంబునం గోలె = యోజనంబు వఱకు.)

**కోలెముక** | **కోలెమ్ము** } దే. వి. (కోల + ఎముక; కోల + ఎమ్ము).

వెన్నెముక, కశేరుక.

ఉ. .. కొన్నిటి నప్పళించు కోలెముకల్ నుఱమాడు నిట్టుల, య్యన్నిటి నయ్యులూకము రయంబెసఁగన్వధి యించె. సౌప్తి 1.18.

ఆ. .. నేలఁబెట్టి వాని కోలెమ్ముఁ బల్లన, విఱిచి నడుము ద్రుంచి వీచి వైచె ఆది 6.218.

**కోల్కొను** దే. అ. క్రి. (కోలు²)

ఒప్పుకొను, అంగీకరించు.

ఉ. . . బంధువర్గమున్, ఘోరముగా వధించుటకుఁ గోల్కొనకున్నది బుద్ధి మీరు ని, ర్ధారణసేయుఁడీ హితము ధర్మము నయ్యెడు వృత్తమెట్టిదో. ఉద్యో. 4.90.

**కోల్పడిపోవు** దే. అ.క్రి. (కోల్పడు + స్వార్థమున పోవు).

కోల్పడు, పోగొట్టుకొను.

తరల. పురుషసింహులు పాండు భూవరపుత్రులక్కట మోదముం, బొరయనేర్తురె నిన్నుఁ గోల్పడి పోయి పుష్కరలోచనా. స్త్రీ. 2.79.

**కోల్పాటు** దే. వి. (కోలు + పాటు)

చావు, మరణము.

శా. ...వహ్ని య, త్యంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాఖుల్ వడం కాడినం, గుంటీసూనుని చేతఁ గర్ణునకనిం గోల్పాటు వాటిల్లునే. కర్ణ 3.275.

**కోల్మొసడి** దే. వి. (కోలు + మొసడి) పెద్ద మొసలి,
తరలము ... ఓసినెన్నఁడు నాడ నో,డుదురు సన్మునులిందు. గోల్మొ సడుల్ గొనున్ వడిఁ జొచ్చుడున్. ఆది. 8.148.
(సం. ము - ప్రారాం. ఆనంద పాఠము)

**కోల్మొసలి** దే. వి. (కోలు + మొసలి) పెద్ద మొసలి.
తరలము...ఓసి నెన్నఁడు నాడనో. డుదురు సన్మునులిందుఁ గోల్మొసలుల్ గొనున్ వడిఁ జొచ్చుడున్. ఆది. 8.148.
(సం. ము. పాఠము).

**కోవిదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పండితుఁడు, విద్వాంసుడు. ఇది యది యను నియమము లేక సర్వము నెఱిగినవాఁడు.
ప్రహరణ...వృత్తము. ఇది యిటు లగుటల్లెఱిఁగి పలికె నా,విదురుఁడు సభఁ గోవిదులు వొగడఁగా. శ్రీ. 1.185.
కింనా మనవాత్తీతి కోవిదః-అమ.
2. నిపుణుఁడు, కుశలుఁడు.
వ. హితుఁడవు మతిమంతుండవు, చతురవచన కోవిదుండవు సమ యజ్ఞుఁడ వు,న్నత వంశవర్ధనుఁడ వం,గితవేదివి నెచ్చెలివి సుకృతివట్ల గుటన్. ఉద్యో. 1.63.

**కోశము** సం. వి. అ. పుం.న.
2. ఒఱ.
ఆ. పొందవాగ్రగజంపుఁ బవన పుత్రుఁడు నకు,లుండుఁ దదనుసంభ వుండుఁ బట్టు,నవి కుమార యగ్గ వాజిన కోశ మహాశరంబు పార్థ నదియె. చూవె. విరా. 4.123.
2 బొక్కసము, ధనరాశి.
వ. స్వామ్యమాత్య రాష్ట్ర దుర్గ కోశ సుహృద్బలంబులు మొదలగు వానికిఁ బ్రబోధకంబులగు...శాంతి. 2.203.
3. వస్తి, మూత్రాశయము.
సీ. కోశమశ్మరిని శర్కరను బా,ధి తుడఁగు నడఁపక్కడ గన్య. ఆ. మహిషి గోవుఁ దురగి మదనాతురత మున్ను, గవిసినాఁడు. అను 5.99.
4. పంచకోశములలో నేదేనొకటి.
1) అన్నమయము 2) ప్రాణమయము 3) మనోమయము 4) విజ్ఞానమయము 5) ఆనందమయము.

**కోష్ఠము** సం. వి. అ. పుం.
1. అంతరాధి లోపతిభాగము.
శ్లో॥ స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్య చ,హృదుండుకః పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే... సుశ్రు. చికిత్సా. 2. అ. 12 శ్లో॥.
1. ఆమాశయము (అన్నకోశము) 2. అగ్న్యాశయము 3. పక్వాశయము 4. మూత్రాశయము 5. రక్తాశయము 6. హృదయము 7. ఉండుకము 8. పుప్ఫుసము. ఇవి ఎనిమిది యిమిడి యుండు మధ్యకాయమునకు కోష్ఠమని పేరు.
సీ. కోష్ఠమునందు వహ్ని పవనుండు బయలను. శాంతి. 5.602.
3. సామగ్రులుంచెడి కొట్టు.

వ. ... ఘృత లవణ తైల తండుల ధాన్యాది సమస్త వస్తు విస్తృతంబయి కోష్ఠాగారంబు సకల సంకల్ప సిద్ధి కరంబై కల్పద్రుమంబు ననుకరించు చున్నది. సభా. 1.272.

**కోసలము:** సం. వి. అ. పుం.
ఒకానొక దేశము. భీష్మ. 1.40.
అశ్వమేధాశ్వము వెంటఁజను అర్జునుఁడీ దేశవాసులను జయించెను. అశ్వ. 4.110.

కోసలదేశమునకు రాజు బృహద్బలుఁడనియు నాతని పూర్వదిగ్విజయంబు సలుపు భీమసేనుఁడు ఓడించి వానిచేత నపరిమిత ధనంబులు గొనెననియు సభాపర్వము ప్రథమాశ్వాసము 230 వచనము దెల్పుచున్నది. అదే పర్వము అదే ఆశ్వాసము 235 వచనములో ఉత్తర దిగ్విజయము సేయు అర్జునుఁడు కోసలపతిచేత విచిత్ర వస్తు వాహన నివహంబులు గొనినటులఁ గలదు.

దీనినిబట్టి కోసలదేశము హస్తినాపురమునకు తూర్పునను ఉత్తరమునను వ్యాపించి యుఁడెననియు ఆ ప్రదేశమునకంతయు నొక్కఁడే రాజుఁ కాఁడనియుఁ బెక్కండ్రు గలరనియుఁ దెలియఁదగియున్నది. భీముఁడు అయోధ్యాపురాధిపతి దీర్ఘయజ్ఞుని జయించి ధనంబులు గొన్నట్లును గలదు. (సభా. 1.243.)
ఇతఁడు సమరమున; దుర్యోధను పక్షమునఁ బోరాడెను. ఉద్యో. 4.225.

ఆనాఁడు కోసలదేశమన్నారుగాని ఈ నాటి వ్యవహారమునుబట్టి కోసలప్రదేశ్ అనవలసివచ్చును. ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా, ఉత్తరకోస్తా, దక్షిణ కోస్తా, రాయలసీమ - అని ప్రత్యేకించి చెప్పుటయున్నట్లే ఆనాఁడు ఉత్తర కోసల, దక్షిణకోసల, తూర్పుకోసల, పశ్చిమకోసల, మధ్యకోసల - అను భేదములతో నుండవచ్చును. రామాయణ కాలములోనే కోసలదేశము ఉత్తరకోసలము, దక్షిణకోసలము - అని రెండు భాగములుగా వ్యవహరింపఁబడి యున్నరి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ కంతకు హైదరాబాదు ముఖ్యపట్టణమైనట్టు లప్పుడు మొత్తము కోసలకు అయోధ్య ముఖ్యపట్టణమై యుండును.

**కోహలుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక ముని. ఈతఁడు జనమేజయుని సర్పయాగమున సదస్యుడుగా నుండెను. ఆది. 2.210.

## కౌ

**కౌండిన్యుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక ముని. జనమేజయ సర్పయాగమందు ఒక సదస్యుఁడు. ఆది. 2.210.

**కౌంతేయుఁడు** సం. వి. అ. పు.
కుంతికొడుకు 1) యుధిష్ఠిరుఁడు, 2) భీముఁడు, 3) అర్జునుఁడు, 4) నకులుఁడు, 5) సహదేవుఁడు, (చూ. కుంతీసుత మధ్యముఁడు.)
వ. వివిధ ప్రకారంబులయిన బహు

ప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేత స్థలంబునం గూడుకొని మా వర్తించిన తెఱంగు దేవరకు నెఱిం గించి యట దివ్యచిత్తంబున నవధరిం చిన భంగి సేయువారమై చనుదెంచి తిమి. విరా. 3.87.

**కౌఁగిటఁ జేర్చు** దే. స. క్రి. కౌఁగిలించు.
కం. అన వినుచుఁ దేరు డిగి గ్ర,క్కునఁ గౌఁగిటఁ జేర్చె విరటు కొడుకును గుంతీతనయుండు. విరా. 4.152.

**కౌఁగిలి** దే. వి. ఇ.
1. కవుంగిలి. భుజాంతరము, బుజ ముల నడిమి ప్రదేశము.
సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁజేర్చు కొడుక. శల్య. 1.18.
చం. ... ఆ,పతియును జిక్కఁజేర్చె గరుపాఱెడు మేనును హర్షబాష్ప సం,ప్లుతమగు నాననంబునయి పుత్రుని బెద్దయుఁ బ్రొద్దు గౌఁగిటన్. విరా. 5.271.
శుద్ధవిరాటివృత్తము...ఉచ్చె నవ్విభుం డల్లం గౌఁగిట నా నృపాలకున్. శ్రీ. 1.125.
కం. ... మ్రొక్కి య,తని కౌఁగిలి వడసె సమ్మదము దళుకొత్తన్. విరా. 5.340.
2. ఆలింగనము, ఆశ్లేషము.
కం. పదపడి నయమున మెయి మెయి గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం. అను. 2.14.
సీ. పచములఁపంబునఁ గుదియించి క్రమమున, నిఱిసిన కౌఁగిట నింపొ నర్తు. విరా. 2.310.

**కౌఁగిలించు** దే. స.క్రి. ($\sqrt{}$ కౌఁగిలి) కవుఁగిలించు.
1. ఆలింగనము చేయు, ఱొమ్మునఁ జేర్చు.
సీ. ... కదిసిన యట్లైనఁ గౌఁగిలింప గడంగి యారసి బొంకైనఁ గలఁత నొందు. విరా. 2.301.
చం. ....చిక్కఁగఁ గౌఁగిలించి వా,రి నయన వారిచేఁ దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. ఆశ్ర. 2.35.
సీ. ... సైనిక నికర వక్షస్థ్సల పరి లిప్త కాశ్మీర దీప్తులఁ గౌగిలించి.
గీ. బాల్య రమణీయుఁడగు చిత్ర భానుఁడొప్పె. శల్య. 1.116.

**కౌఁగిలించుకొను** (కౌఁగిలించు + కొను. స్వార్థమున.) కౌఁగిలించు, ఆలింగ నము సేయు, ఱొమ్మున జేర్చుకొను.
వ. . . కొడుకులఁ గౌఁగిలించుకొని. ఆది. 6.144.
వ. ... కర్ణుని గౌఁగిలించుకొని నాతో బద్ధసఖ్యుండవయి. ఆది. 6.35.

**కౌఁదీఁగ** / **కౌఁదీఁగె** దే. వి.
తీఁగెవలె సన్ననైన నడుము.
సీ. ... పాలిండ్లు దనువెడ ప్రాలింపఁ జెన్నొందు నసఁదు గౌఁదీఁగె యల్లాడు చుండ. విరా. 4. 26.
సీ. . . అన్నువ కౌఁదీఁగ యందంబు మదినిల్పు జఘన చక్రంబుపైఁ జలుపు దృష్టి. ఆది. 3.38.

**కౌశేయకము** సం. వి. అ. పుం.

కుక్షికి దగ్గరగా తోలుతిత్తిలో ఉంచు కొనఁబడినది.

ఖడ్గము, కత్తి.

సీ. ... కౌక్షేయక, క్షురికాది శస్త్రంబు లురగకులము. ద్రోణ. 2.128.

కుక్షౌ చర్మనిర్మిత కోశే భవః కౌక్షేయకః.

చర్మనిర్మితమై కుక్షిప్రాయమైన యొరలో నుండునది. అమ.

**కౌక్షేయము** సం. వి. అ. పుం.

కౌక్షేయకము.

ఖడ్గము, కత్తి.

స్రగ్ధర. కౌక్షేయ హేలాభ్యసన లసిత బాహార్గళా భీషణుండై. సౌ ప్తి. 2.5.

**కౌటిల్యము** సం. వి. అ. న.

కుటిలత్వము, కపటము.

తే. ... [illegible] సాధ్య వస్తుసంచ యనములుడిగి యతి సంచరించు. అశ్వ. 2.174.

**కౌణపుఁడు** సం. వి. అ. పుం.

వాసుకికుల సంభవుఁడు. సర్పజాతి వాఁడు. ఇతఁడు జనమేజయుని సర్ప యాగమున హోమకుండమునఁ బడెను. ఆది. 2.212.

**కౌతుకము** సం. వి. అ. పుం.

కోరిక, ఇచ్ఛ.

కం. అని రచనా కౌతుకమున,మనమ లరఁగ. విరా. 1.8.

2. సంతోషము.

కం. జలనిధి హిమవద్భూధర,కలిత జనన దేవీకౌతుక వ్యక్తావ్యక్తి లలిత సౌందర్య స్ఫుర,దలఘు తను శ్రీ సనాథ హరిహరనాథా. విరా. 1.40.

**కౌతుకి** సం. విశే. (న్. నీ. న్).

కౌతుకము గలవాఁడు.

తే. సమర కౌతుకియైన యజాత శత్రుఁడు. భీష్మ. 1.152, అను. 5.284?

**కౌతూహలము**

కం. అతనితో నొక్కొకమరి, కౌతూ హల వృత్తికిం దగం దొడఁగి మృదు, ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్షశిల్ప ప్రౌఢిన్. విరా. 1.71; శాంతి. 2.180.

**కౌతూహలి** సం. విశే.

కౌతూహలము గలవాఁడు.

కం. చనుదెంచి మల్లవర్గము,గని మై వెఱుగంగ నిలిచెఁ గౌతూహలియై. విరా. 2.11.

**కౌత్సుఁడు** సం. వి. అ. పుం. ఒక మహర్షి. జనమేజయుని సర్పయాగము నందు ఉద్గాతగా నున్నవాఁడు. ఆది. 2.210.

**కౌను** దే. వి.

నడుము, మధ్యము.

సీ. ... పాలిండ్లు దనువెడ బ్రాలింపఁ జెన్నొందు నసదుఁగౌఁదీఁగె యల్లాడు చుండ. విరా. 4.26.

సీ. ... అన్నువ కౌఁదీఁగ యుంచంబు మదినిల్పు జఘన చక్రంబుపైఁ జలుపు దృష్టి. ఆది. 3 38.

**కౌపీనము** సం. వి. అ. న.

గోఁచి.

మ. [illegible] జన్నిదంబు శిఖ యుం గౌపీనమున్ ధాతు వస్త్రము దండంబును గుండియుం గుశపవి

త్రంబున్ గడున్ వృద్ధభావము సం
ధిల్లఁ ద్రిదండి వేషధరుఁడై వచ్చెన్.
అర. 6.336.

**కౌబేర తీర్థము** సం. వి. అ. న.
ఒకానొక పుణ్యస్థలము. ఇచ్చట కుబే
రుఁడు తపంబు సేసి ధనాధిపత్యంబు
మొదలైన వరంబులు వడసెను.
శల్య. 2.195.

**కౌబేరము** సం. విశే. (అ. ఈ. అ.)
కుబేర సంబంధమైనది.
సీ. ... కౌబేర దిగ్విజయార్థముగ్ర
ప్రతాపాగ్ని వెలుఁగఁ జని (కౌబేర
దిక్కు = ఉత్తరపు దిక్కు) సభా.
1.228.
కం. ... కౌబేరాస్త్ర మర్థినిచ్చెఁ
గుబేరుఁడు విజయునకు. అర.
1.340
(కౌబేరాస్త్రము = కుబేరుఁడు అధిదేవ
తగాఁ గల బాణము.)

**కౌమారము** సం. వి. అ. న.
అయిదేండ్ల వఱకునుండు వయస్సు
అని కొందఱు, మూఁడవ సంవత్స
రము మొదలు ఎనిమిదవ సంవత్స
రము వఱకుండు వయస్సు అని
కొందఱు, పదునాఱు సంవత్సరముల
వఱకుండు వయస్సు అని కొందఱు,
ముప్పది సంవత్సరముల వఱకుండు
వయస్సు అని కొందఱు సూ.ఆ.ని.
వ. ... అట్లని నయ్యీశ్వరు పతుల
యందును త్రిలోకసంగమంబునను
నాకుఁ గౌమారంబును [illegible]
సిద్ధియుఁ గామభోగేచ్ఛయు సౌభాగ్యం
బునుం బ్రసాదింపవలయు. ఆది.
7.263.
(ఇచ్చట పదునాఱు సంవత్సరముల
వయస్సు [illegible]ది.)

**కౌమారి** సం. వి. ఈ. స్త్రీ.
సప్తమాతృకలలో ఒకతె.
సీ....కౌమారిసుతుఁడు శ్రీధర్ముఁడు.
. విష్ణుఁడు దండమై యావహిల్లు.
శాంతి. 3.110.

**కౌమారిసుతుఁడు** సం. వి. అ. పుం.
విష్ణువు. (చూ. కౌమారి.)

**కౌముది** సం. వి ఈ. స్త్రీ.
కుముదములకు ప్రకాశముఁ జేయునది,
వెన్నెల.
సీ. .. కౌముదిఁ దన నీడఁ దూటు
సూచిన నొక్క యేట మరణ
మొలయునండ్రు. అను. 3 304.

**కౌమోదకి** సం. వి. ఈ. స్త్రీ.
విష్ణుని గద. దీనిని అగ్నిదేవుఁడు
విష్ణువునకిచ్చెను. ఆది. 8.254.

**కౌరవుఁడు** సం. వి. అ. పుం.
కురువంశమునఁ బుట్టినవాఁడు.
తే. కౌరవాన్వయజాతులై గారవమునఁ
బెరిగినట్టి మీరొండొక నరుని గొలిచి
మసలి వర్తిల్లి మానావమానములకు,
నోర్చి యడఁకువతోడన యునికి
యరిది. విరా. 1.118.

**కౌరవ్యుఁడు** సం. వి. అ. పుం.
కురువంశము వాఁడు.
వ. ... మందాకినీ నంబరుపయిం
గవియు పాండవ సైన్యములను నతని
కట్టెదుర [illegible] జూచునెడ
సురలకు నిమిషత్వంబు సార్థకంబయ్యె.
ద్రోణ. 3.337.

మ. ...మన యర్జున ద్విపము క్రోధా
వేశ దుర్దాంత దర్పవిలాసోద్భట
భంగి నేపదరి కౌరవ్యాంబుజశ్రేణిం
జిక్కువడం జేయదె యొక్క ప్రేల్మి
దెన....విరా. 1.56.
(ఇక్కడ కౌరవ్య శబ్దము ధార్తరాష్ట్ర
లకు మాత్రమే చెందును. కౌరవ
కౌరవ్య శబ్దములు రెంటను జాతి
వాచకములై తలుచు ధార్తరాష్ట్రుల
యందే వర్తించుచున్నవి).
2. కద్రువ కొడుకు, సర్పజాతివాడు.
ఆది. 2.4.
3. నాగరాజు. ఐరావత కులసంభ
వుడు. ఉలూచితండ్రి (చూ. ఐరా
వతుడు.) ఆది. 8.130.

**కౌశము** సం. విశ. (అ. ఆ. అ.)
కుశ సంబంధమైనది.
వ. కౌశ బృసీ సమాసీనుండును జప
పరుండునునైన యా సంయమివరు
నాలోకించి. అను. 2.323.

**కౌశలము** సం. వి. అ. న.
నేర్పరితనము.
వ. ఏమిరువురము నొండొరులకు
బాహుబల విలాసంబును విక్రమ క్రీడా
కౌశలంబును బ్రకటించుట యుచితంబు
గాదె. విరా. 4.204.
చం. ... భీముడంతె గదయందలి
కౌశలమెక్కుడి మహీశ్వరునకు భీము
మేన నసహ్యమె యిక్కడి. శల్య.
2.116; 269.

**కౌశిక** సం. వి. ఆ. స్త్రీ.
కుమార మాతృకలలో నొకతె. అర.
5.245.

**కౌశిక చిత్రసేనులు** కౌశికుడు + చిత్ర
సేనుడు.
హంస డిభకులు - హంసుడు (కౌశి
కుడు), డిభకుడు (చిత్రసేనుడు).
హంసడిభకులు కౌశికచిత్రసేనులను
పేరులతో మహా సేనాన్వితులై జరా
సంధునకు వామ దక్షిణ భుజంబులుం
బోలె సర్వసాధన సమర్థులయి వర్తిల్లు
దురు. సభా. 1.112.

**కౌశికము** సం. వి. అ. పుం.
గ్రుడ్లగూబ.
వ. ... నిద్రావశంబులైన యవ్వాయ
సంబుల వివిధంబులగు వధంబుల
గీటడంచి యా కౌశికంబు శత్రువులం
బొడ్చివి సమయించిన మేటి మగని
మాడ్కి మోదంబు నొందినం గని
యశ్వత్థామ డు. సౌప్తి. 1.19.

**కౌశికహ్రదము** సం. వి. అ. పుం.
ఒకానొక తీర్థస్థలము. ఇందు స్నానము
చేసినవారికి అశ్వమేధము చేసిన
ఫలము గలుగును. అర. 2.275.

**కౌశికి** సం. వి. ఈ. స్త్రీ.
ఒక నది.
తే నందకౌశికి యనియెడు నదులం
బెక్కు వ్రతము లొనరించి. ద్రోణ.
2.172.
మృత్యుదేవత యీ నదిమొద్దున
వాయువాహారంబుగా నతి దుష్కర
వ్రతంబులచేత వర్షము లాచరించెను.
శాంతి. 5.207.

**కౌశికివాలము** సం. వి. అ. న.
ఒకానొక తీర్థస్థలము.
ఇచ్చట మౌనవ్రతముతో అనాహార

దీక్ష వహించి ఉపవసెమొక్క దిన
ములున్న పరమగతి నొందుదురు.
ఆను. 2.81.

**కౌశికీ దృషద్వతీ సంగమము** సం.వి.
అ. న.
ఒక పుణ్యతీర్థము. ఇచ్చట స్నానము
చేసిన మనుజులు సర్వపాప విముక్తు
లగుదురు. ఆర. 2.263.

**కౌశికుఁడు** సం. వి. అ. పుం.

1. ఇంద్రుఁడు.

ఉ. కాయజుఁ గ్రేణిసేయుననఁ గౌశికు
మీఱు ననంగ విభ్రమ,శ్రీయును
బెంపునుం గలుగజేసి విధాతృఁడు
పేడిఁ జేసెనే. విరా. 1.234.

2. కుశికుని కొడుకు గాధి- విశ్వా
మిత్రుని తండ్రి.

సీ. ... కుశికుఁడింద్రు, మెచ్చించి
జగముల మేటినాఁ దగు పుత్త్రు వేడిన
జనసన్నిషక కుద్భవమ్మయి కౌశికుఁ
డిమ్మహి గాధి నామమ్మునఁ బరఁగె.
శాంతి. 2.68.

3. కుశిక వంశమునఁ బుట్టినవాఁడు.
విశ్వామిత్రుఁడు.

చం. అనిమిష కాంతయున్. నవ
లతాంత విభూషణ లీల నల్ల న,ల్లన
వనకేళి లాలస విలాసగతిం జనుదెంచి
ముందటం గనియె మునీశ్వర ప్రవరుఁ
గౌశికు. ఆది. 4.41.

4. ఒక ముని.

ఇతఁడు నిరంతర జపతత్పరుఁడు,
యముఁడు కాలుఁడు మృత్యువు నీతని
బరీక్షించిరి.

శం. నారద దేవల కౌశిక,పారాశర్యాది
మునుల పలుకుల భీష్మోదార వచన
ముల నిను నఘ,దూరా యేనెఱిఁగి
యుండుదును సకలముగన్. అశ్వ.
3.11; ఉద్యో. 4.363.

5. ఒక బ్రాహ్మణుఁడు, నిరంతరజప
తత్పరుఁడు. యముఁడు కాలుఁడు
మృత్యువు నీతని బరీక్షించిరి. ఇక్ష్వాకు
మహారాజునకు నీతనికి సంవాదము
జరిగెను. తుదకు నిక్ష్వాకునితోఁ గూడ
బ్రహ్మపద ప్రాప్తి నొందెను. (చూ.
శాంతి. 4.133 మొ 170 వఱకు.)

6. ఒక బ్రాహ్మణుఁడు.

ఈతఁడొక్క విశిష్ట గ్రామమున కనతి
దూరమువ సరిత్సంగమ పుణ్యక్షేత్ర
మున వసియించి సత్యము పలుకు
వాఁడనని వ్రతము పట్టి సత్యవాది
యనఁ బ్రసిద్ధుడయి తపము సేయు
చుండెను. ఒక్కనాఁడు దొంగలు
కొందఱు తఱుముకొని రాఁగా జనులు
పరుగిడి వచ్చి యీ బ్రాహ్మణుని
యాశ్రమము సమీపమునందలి పొదల
యందు దూఱిరి. అంత వెన్నడి వచ్చు
ముచ్చులీ తపోధను కడ కేతెంచి
జనులెందుఁ బోయిరని యడిగిరి.
సత్యవ్రతము పట్టిన యాతఁడు తన
కసత్యంబు వాటిల్లునను శంకతో
జనులు దాఁగియున్న పొదలఁ
జూపెను. ఆ తెక్కలికాండ్రా జనులఁ
జంపి వారియొద్ద గల ధనమును దీసి
కొనిపోయిరి. హింసాకరంబగు
సత్యంబు ధర్మంబు గాదు గావున ఆ
ముని నరకలోక గతుండయ్యెను కర్ణ
3 78.

2. ఒక బ్రాహ్మణుఁడు.
ఈతఁడు తల్లిదండ్రులకొక్కఁడే కొడుకు. వృద్ధులైన తల్లిదండ్రులఁ బరిత్యజించి వారి యనుమతి లేకయే సంతతాధ్యయనము చేయుచుండెను. తనపై రెట్టవేసిన కొక్కెరను దృష్టి మాత్రము చేతనే హతమార్చెను. పతి శుశ్రూష యందుండి యొక పతివ్రత తనకు భిక్షము పెట్ట ... చేసినదని యామెపైఁ గోపించి పలికెను. ఆతనికా సతీతిలకము క్రోధము వలని చెఱుపును వివరించి యాతనిచే మఱియు టకుఁ గొక్కెరను గానని హెచ్చరించెను. "మిథిలానగరంబునకుఁ బొమ్ము. అందు జితేంద్రియుండును. సత్యవాదియు మాతాపితృ భక్తుండును నయిన ధర్మవ్యాధుఁడు అను కిరాతుఁడు గలఁడు. అతఁడు నీకఖిల ధర్మంబుల నెఱిఁగించు" నని పల్కెను. అంతట తెలివిఁ దెచ్చుకొని కౌశికుఁడు ధర్మవ్యాధు ... చేఁ ధర్మోపదేశము పొందెను. ఆర. 5.7. మొ. 145 వ.

**క్రాశేయము** సం. వి. అ. న.
పట్టుబట్ట.
సీ. ... పీత కౌశేయ సంవీతయూర్తి-
ఆ. అమ్మురారిఁ గని. శాంతి. 2.3.

**కౌసలము** సం. వి. అ. పుం.
ఒకానొక దేశము ఈ దేశవాసులు పాండవుల పక్షమునఁ బోరిరి. కర్ణ. 2.154.

**కౌసల్య** సం. వి. ఆ. ఈ.
1. పూరుని భార్య.
వ. యయాతికిఁ బుత్రుండయిన పూరుండు సకల మహీరాజ్యంబు సేయుచు వంశకర్త యయినవానికిఁ గౌసల్య యనుదానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధ త్రయంబుఁ జేసి ప్రఖ్యాతినొందె. ఆది. 4.2.
2. అంబిక, అంబాలిక.
వ. ఇట్లు పాండురాజు దిగ్విజయంబు సేసి తదుపార్జితంబులైన యపరిమిత ధనంబులఁ దెచ్చి ధృతరాష్ట్రు నను మతంబున భీష్మనకు సత్యవతికిం దమ తల్లులైన కౌసల్యలకు విదురునకు సుహృజ్జనులకు బ్రాహ్మణులకు నిచ్చి- ఆది. 5.41.
3. దశరథుని పెద్దభార్య-శ్రీరాముని తల్లి.
వ. అందుఁ గౌసల్యకు రాముండును గైకేయికి భరతుండును సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును జనియించిరి. అర. 6.269.
ఈమె పూర్వజన్మమున స్వాయంభువ మనువు భార్య, సుశీల. మందరము.

**కౌసల్యుఁడు** సం. వి. అ. పుం.
కోసలదేశపు రాజు - వసుమనుఁడు. ఈతఁడు వామదేవునిచే ధర్మప్రకారము ను ... శాం. 2.407.

**కౌసుమము** సం. వి. అ. న.
మకరందము, పూఁదేనె.
వ. కౌసుమక్షౌద్రపాత్రంబులను ... ఇచ్చిరి. సభా. 2.118.

**కౌస్తుభమ్** చూ. కిమ్.

**కౌస్తుభము** సం. వి. అ. పుం.
విష్ణుమూర్తి వక్షస్థలమునందలి మణి.

వ. కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా. విరా. 1.11.

# క్ర

**క్రంచఱ** క్రచ్చఱ. క్రి. విఙ. ద్రు. (క్రంచు+అఱన్.)
ఎదలెగకుండ.
**సీ.** క్రంచఱ నీరిలో ముంచుచు నెత్తుచుఁ గాఁరించి తీరంబు సేఁ బెట్టు. ఆది. 5.166.

**క్రంత**[1] దే. వి.
పెండ్లికొడుకువారు పెండ్లికూతునకుఁ దీసికొనిపోవు ప్రధాన ద్రవ్యము.
వ. ... అభిమన్యునకు శృంగారంబు సేయించి ... మణిగణంబులు నంబర నికరంబులుఁ బుష్పపుంజంబులు ఫల ప్రచయంబులు లోనుగాఁగల యోగ్య వస్తువుల విస్తరిల్లిన క్రంత నడవ.

**క్రంత**[2] వై. వి. (సంగర్త.)
1. సందు, త్రోవ.
వ. ... క్రంతల నెఱకటంపు చోట్ల మానవకోట్ల పిడుగు తిట్టఁగుచుండ. సౌప్తి. 1.197.
2. రంధ్రము, బెజ్జము, చిల్లి.
చం. విక్షుటపుఁ జావు సంప మది వేడుక పుట్టినఁ బట్టి పట్టి మస్తకమును దీర్ఘ భుజాగ్రములఁ బాపయుగంబు మేనిలోనికిఁ జొర నుగ్గుగాఁ దుటిమి సించిన గ్రంతల తిత్తియైన కీచకు ధరణీస్థలిం జదిపి చప్పుడు ముద్దగఁ జేసెఁదుష్టుడై. విరా. 2 353.

**క్రంతల తిత్తి** వి.
చిల్లుల తోలుసంచి – (చూ. పుంటే.)

**క్రందారు** దే. అ. క్రి.
సమ్మర్దమగు.
మహాస్రగ్ధర .. నలిం గ్రందారఁ బైపై నురవడిఁ గవియన్ హుంకృతా భీల భంగిన్, సౌప్తి. 1.201.

**క్రందు** అ. క్రి.
1. ధ్వని గలుగు, మ్రోత పుట్టు.
వ. .. కృతవర్మ కృప ద్రౌణి దుర్యోధనులును శకునియుఁ దత్సోదరులు గొందఱును గ్రందం దఱిమి దుర్వార విశిఖ వర్షంబుల వారలం గప్పినం గని. కర్ణ. 3 235.
2. విలపించు.
తే. ... కృతఘ్ను నుగ్ర కంటక సముదయము మీఁదఁ గ్రంద నదిమియు దుఃఖములఁ బెట్టు,తెలుఁగు లెన్ని యన్నింటను బలుతురధిప. అను. 4 265.
వి.
2 పెద్ద మ్రోఁత.
సీ. సిరిఁ బాసియుమ నొక్క చింత యును లేక వీచుల క్రందడంచిన జలధివోలె...శాంతి. 4.412.
కం. ... మ్రోఁలం దిరిగెడు క్రవ్యాదుల,క్రందున నీ వీనులిపుడు కటకటఁ బడవే. ద్రోణ. 2.335; శల్య. 1.152.
3. సందడి, సమ్మర్దము.
చం. అదకువ లేమి పల్కి యురియాడుట నొండొరుఁ గూడ కుండుటన్, బుడిబుడి మాటలుండుటను బోవుచు వచ్చుచుఁ గ్రందు గ్రమ్మఱం బడుటను దెల్లమైన మును పన్నుగ

దాఁ బరికించి యున్కి నప్పుడు హరి బుట్టు స్కంధము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. ఉద్యో. 3.393., సౌప్తి. 1.197.

సీ. ఉత్సవ సందర్శనోత్సుకులై పోయి కడుఁ బెద్ద ప్రొద్దయ్యెఁ గొడుకు లేల, మసలిరొ కౌరవుల్ విసువక వైరంబు గావించు పాపస్వభావు లెటఁ గి, క్రందునఁ జంపిరొ. ఆది. 7.209.

4. సంకులము, గొడవ.

కం. పొందైన లెస్స విరసపుఁ గ్రంద య్యెదు చందమైన రాజులనెల్లన్, ముందఱ రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁబంపుఁడొయ్యనపిచపన్. ఉద్యో. 1.45.

వ. అట్టి క్రందున జయద్రథుండు ద్రౌపదిని దిగవిడిచి రథంబు డోలు కొని పఱచె. అర. 6.237.

శ్లో॥ తస్మిన్ సంకులే సైన్యే ద్రౌపదీ మవతార్యతామ్ సం. భార. 276.33 (వావిళ్ల).

వ. ... తమ పాసిన కందువలు రోసి యెత్తిన మెడలును బచరించిన చూడ్కులు వేడ్కలం గ్రందైన దెందంబులుం గలిగి మెలంగుచు నొండొంటి బిట్టు గాంచి యొదవు సమ్మదంబునం బొదలు మేనులు బెర యించి పరమానందంబునం జొక్కుచు జక్కవలు గలసి పొలసి నలరేఁగ బెలంగుచు. విరా. 2.240.

6. ఉపద్రవము.

తే. ఒడ[illegible]ఁ బగతుఁ బరవస మున, నిత్తెఱఁగునఁ గలుగు క్రందెల్ల నోర్చి, నిల్చి గెల్చిన సత్కీర్తి నెగ డుఁగాక. విరా. 4.62.

7. అతిశయము, ఆధిక్యము.

కం. .... ప్రస్పందిత పాతక రవ ముల, క్రందున ధర్మజుఁడు మేలు కనియె నరేంద్రా. ద్రోణ. 3 6,

కం. తలఁపులు గ్రందుగఁ బొడ ముట, గలగనుటేమఱుట భ్రమలు గదురుట జాడ్యం, బలసత యను నీ భావం, బులు దామసకోటి యంద్రు బుధులు నరేంద్రా. శాంతి. 4.352.

8. ఒత్తిడి, త్రొక్కుడు.

కం. క్రందున మేను సిదియునను, కొందఱపహసించి ప్రాణగొడ్డమగుటఁ ద, ప్పం దొలఁగఁ బాఱెదను ముని. బృందారక యనదె ప్రాణభీతి దలం పన్. అను. 4 320.

9. భయము.

తే. నీవు నామీఁద వేడుక నెఱయు నిష్ఠ, తోడఁ దలఁచుట మామక స్థూల రూప, దర్శివై యుండుదని నన్ను ప్రియపడిరప్ప, గారవించిన ననలంబు క్రందువాసె. అను. 1.368; చూ. 365.

10. గుంపు, మొత్తము.

మ. అదె నక్తంచరు లింపుసందున మహోగ్రాకారులై క్రందుగా మెదలం జొచ్చిరి. అర. 7.254.

చం. ఇదె యొక పిన్నవాఁడదరి యెక్కుడు మూఁకలఁ గ్రందు దోలె డుం, గదుపుల వెల్చు గోపకుని కైవడి. ద్రోణ. 2.11.

11. ఒక్కుమ్మడి.

సీ. విందానువిందులు గ్రందుగ వెసఁ
గుంతిభోజుని నాఁడి పుత్రుఁడాఁకి.
భీష్మ. 1.266.
ఉ. ఈసునఁ దాను దమ్ములు నరేం
ద్రుఁడు గ్రందుగ సౌమదత్తికిన్,
బాసటయై కడంగె. భీష్మ 2.231.
వ. ... అప్పటి యాచార్య ప్రభృతి
యోధులును నీ కొడుకులలోనఁ గొంద
ఱును గ్రందుగం దఱిమి యనేకాస్త్ర
శస్త్ర పరంపరలం బొదివిన. ద్రోణ.
2.32.

12. భేదము, అన్యోన్య ద్వేషము.
పౌరవు.

కం. అందులకు ... నృప,నందను
లెల్లను ముదంబునం బోషింపఁ జేపట్టఁగం,
దమలోఁ గలహంబును, గ్రందును
లేకున్న వారు గడు నెయ్యమునన్.
ఆర. 2 32.

ఆ. సూతపుత్ర యితఁడు నాతలఁ
బెద్ద మో,పెత్తి నమ్మియున్న యిట్టి
చోటఁ, గ్రందు సేయ నాకుఁ గాదని
సైరించి, యున్న బ్రదికితింక నూర
కుండు. ఉద్యో. 4 252.

శ్లో॥ సముద్యతోయం భారో మే సుమ
హాన్ సాగరోపమ, మిథో భేదేన
కార్యస్తేన జీవసి సూతజ. సం. భార
ఉద్యో. 167. 31.

**క్రందుఁగయ్యము-క్రందుకయ్యము** వి.
సంకుల యుద్ధము, దొమ్మి జగడము.
తే. క్రందుఁగయ్యంబు లోన నరాతి
భయద,బాహు విక్రమ సీవిట్లు పాద
చారి వగుట వలదని కేకయ నరద

మెక్క బనిచె భీముని బాంచాలపతి
సుతుండు. భీష్మ. 2.380.
వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున
దొరల మొత్తంబు లొక్కదెసకుం
దార్కొనిన నుభయ బలంబులు నుర
వడించి కలయన్ బెరసినం గ్రందు
కయ్యంబయ్యె కర్ణ. 1.186.

**క్రందుకొను** అ.క్రి. (క్రందు+కొను)
1. కవియు, తలపడు.
వ. ... తక్కిన బలంబులు నంతకు
మున్ను కౌంతేయు దెస మరలి చూచు
చుం బాఱుచునికిం జేసి యేలినవాఁడ
ఱుమటయును దొరలు తెగి తిరుగుట
యుఁగని తెంపుసేసి కూడికొని రభ
సంబునం జుట్టుముట్టి యతనిపైఁ
గ్రందుకొన నడరె. విరా. 5.207.

2. తఱచగు. నెలకొను, ఆవరించు
కొను.
తే. క్రందుకొను సర్వధర్మ వికల్ప
ములను, వెడల విడిచి దృఢంబుగ
నేనొకండ, శరణముగ నాశ్రయిం
పుము సకల దురితములకుఁ దొలఁ
గింతు నిన్నుఁ బ్రమోదమంద. భీష్మ.
1.224.

3. గగ్గోలుపడు, కలవరపడు.
చం. కనుఁగొని సైన్యముల్ విఱిగి
క్రందుకొనన్ వెసఁ బాఱ నాపగా,తన
యుఁడు సేననాఁగి. భీష్మ. 3.135.
తే. క్రందుకొని యిట్లు మాతంగ
ఘటలు విఱుగ. భీష్మ. 3.221.
కం. . సొచ్చెద భేరీరవ బృంహిత
హేషా ఖై,రవ కౌరవసేనఁ గలఁగి
క్రందుకొనంగన్. ద్రోణ. 3.301.

4. ఆకీర్ణమగు, క్రిక్కిరియు
వ. పంచ శిరంబులును నగనిభంబులు నగు నాగంబులనేకంబు లవ్వనంబు నం గ్రందుకొనం దిరుగుచుండె. స్త్రీ. 1.47.
శ్లో॥ పంచశీర్షధరై ర్నాగై శ్శైలైరివ సమున్నతైః నభస్ప్రక్షై ర్మహాఘోరైః పరిక్షిప్తమ్ మహావనమ్. సం. భార. స్త్రీ. 5.9.
5. ఉవ్వెత్తుగఁగొను, ఒక మొత్తముగాఁ బట్టు.
కం. ... ఇవురం,బాతె మడువంత వేడుక,కాఋలు జాలరులు సొచ్చి క్రందుకొనంగన్. కం. వెరవున నూఁతల నెత్తెలఁ గరములఁ బట్టి సంతసముం,బొరయుచు ద్రాళ్ళం గ్రువ్వఁగ,గని మూహించి మదిఁ బ్రాప్తంబు ...
కం. ఇందొక త్రాడు గఱచి యే,నొం దంగాఁ గ్రుచ్చినట్లు యుండెద వీరి క్రందుకొనుట మానంగ న,మంధత నది యెదలవిచి మడువు దఱిసెదన్. శాంతి. 3.192; 193; 194.
6. కలుగు.
వ. ఇట్లు నిలచిన యవ్వేదవ్యాస మునీశ్వరుం గాంచి జలవిహారంబు సలువు నయ్యప్సరోజనంబులు సిగ్గు నగ్గలిక గ్రందుకొన నందఱు నంబరంబులు ధరియించిరి. శాంతి. 6.336.
7. గుమికూడు, ఒకటిగా చేరు.
కం. గగనమున సురవిమానము,ల గణితములై గ్రందుకొనియె. ఆర. 4.406.

**క్రందుడోలు** స. క్రి.
గుంపుగా కూడఁగల్పి తోలు.
చూ. క్రందు-10వ అర్థము 2వ ఉదా.
**క్రందుపఱుపు** స.క్రి.(√ క్రందుపడు)
ఒక మొత్తముగా త్రోలు.
సీ. రథ దంతి హయ భటరాజి కత న,నతి విషమంబైన యా నేల నవి హత,గతి నరదంబులు గ్రందు పఱపి ఆ. వారు సేసిరాహవము ద్రోణ. 2.71.
**క్రందుపాటు** వి. (√ క్రందుపడు)
సమ్మర్దము, క్రందు.
తే. ఇవ్విధంబునఁ గ్రందుపాటింత యైన, భీష్మకడఁక నీ సైన్యంబు ఖేదముఱిమిఁ జేసి యా సేనయును నష్ట సిక్కువడక,పోరె నేమని చెప్పదుఁ గౌరవేంద్ర. భీష్మ. 2.103.
**క్రందుసేయు** (క్రందు + చేయు)అ.క్రి.
భేదము పుట్టించు.
చూ. క్రందు 12వ అర్థము 2వ ఉదా.
**క్రంప** దే. వి.
కంప.
సీ...మార్గము గ్రంపనడచి కొయ్యలు ప్రాఁతి,చెఱచుట నరకంబు సేయు నంద్రు. అను. 2.62; అను. 2.235.
**క్రంపనడుచు** దే. అ. పుం.
ముండ్లకంప త్రొక్కు.
సీ. ... మార్గము గ్రంప నడిచి కొయ్యలు ప్రాతి చెఱచుట నరకంబు సేయునంద్రు. అను. 2.62.
**క్రంపయగ్ని** దే. వి.
ముండ్లకంప వలనఁ గలుగు మంట; గడ్డిమంట.

కం. అని పంపె భరద్వాజుం,డను
మఱియు హవిస్సు గ్రంపయగ్ని నిడుట
యొ,జ్జ నధఃకరించి చదువుట యను
నివి సరియౌ బిసాపహరణంబుఁ జేసెన్.
అను. 3 235.
"ఉపాధ్యాయ మధఃకృత్వా ఋచోఽ
ధ్యేతు యజూంషి చ జుహోతు చ స
కక్షాగ్నౌ బిససైన్యం కరోతి యః.
సం.భార. అను. 93. 124. (వావిళ్ళ)
142.68. (నిర్ణయ).

**క్రక్కించు** దే.స.క్రి. (√ క్రక్కు)
క్రక్కునట్లు చేయు, కడుపులోనున్నది
వెలిపుచ్చు, వెడలించు,
ఉ. ... బా,ధించి మనుష్య మాంస
ములు దించును గ్రొవ్వితి వానినెల్ల,
గ్ర,క్కించెద. ఆది. 6.294.
సీ. ... సభలో సుయోధనుఁ, బంచి
యాడించిన పరుసములును గ్రక్కించి
(ప్రతిఫలము అనుభవింప జేసి యని
భావము) (కక్కించి. అని. సం.ము)
కం. ... తనయుం,గ్రక్కించెద
నిపుడ పట్టి కండలు దిందున్
ద్రోణ. 5.74.
(తనయుని జంపినందులకుఁ బ్రతి
ఫలముగా నిన్నును సంహరించెద.
అని భావము.)
ఆ. కుడువనిచ్చు తఱియుఁ గురువర
క్రక్కించు,నవసరంబు నెఱిఁగి యరి
నృపాలు,నీవు ధీరవృత్తి నిడుఁద్రాటఁ
బోనిమ్ము (క్రక్కించు నవసరంబు =
దండించు సమయము అని భావము)
ఆశ్ర. 1.72.

**క్రక్కు** దే. స. క్రి.
కక్కు.
కడుపులోనిది వెలిపుచ్చు, వెడలించు.
కం. ద్విరదము లొఱగెడివియు
నె,త్తురు గ్రక్కుచుఁ గూలెడివి గదు
పులై కలయం,దిరుగుడు వడియెడి
వియు భువి,బొరలెడివియు నయ్యెఁ
బవనపుత్రు మునుమునన్. భీష్మ.
2.213.
మ. గదలన్యోన్య సమాహతిన్ మిడు
గుఱుల్ గ్రక్కంగ సారించుచున్.
ద్రోణ. 1.185.
కం. అలుగుల పడి ఖాండవమునఁ,
గల యాశీవిష మహోరగములెల్ల,
విషాగ్నులు గ్రక్కుచు. ఆది. 8.267.
కం. నలు దొల్లి యాక్రమించిన,కలి
కర్కోటక విషంబు గ్రక్కుచు
నొడలన్ వెలువడి. అర. 2.178.

**క్రచ్చఱ** క్రి. విఱ.ద్రు. క్రంచఱ(క్రచ్చు
+అఱన్. ఇది ...... లోనిది)
1. శీఘ్రముగా.
చం. తఱియగు ...... రిపు నుద
గ్రత సైంచుట నీతి నీవు నా,కఱపిన
యట్ల చేయుము తగం జని యాతనిఁ
గాంచి దన్ను నే,తెఱగుననైనఁ బొం
దఁగ మదిం దలఁపోఁతయ కర్గదేని
క్ర,చ్చఱ మునివర్గ వాహనుఁడవై
......... దీడెదున్. ఉద్యో.
1.176.
2. అమోఘముగా, నిష్ఫలముగాకుండ
ఉ. ఇచ్చెద శక్తి నీకు వినుమేర్పడ
నాజి మదీయ శత్రులం గ్రచ్చఱఁ
జంపిచంపి యది గ్రమ్మఱి చేతికి
వచ్చుచుండు. అర. 7.369.

3. ఎల్లప్పుడు, సదంతము.
చం. ఎఱిఁగితి నేను నిన్ను విబుధేంద్రుండ వీవు జగత్త్రయంబు గ్రచ్చఱ భవదీయ రక్షణమునంద వెలుంగుచునుండు. అర. 7.366.
4. అనాలోచితముగా, లెలివి తక్కువగా.
ఉ. క్రచ్చఱ నొక్క రక్కసుఁడ కాఁడు సురాసురులెల్ల నొక్కఁడై, వచ్చిన నీవ చూడఁగ నకార్య బలోన్నతిఁ జేసి వాలిలన్, ద్రవచ్చి వధింతుఁ గాక. ఆది. 6.199.
5. ఇది సందర్భానుసారముగా సవిలాసముగా మున్నగు నర్థముల నిచ్చును.
ఉ. క్రచ్చఱ వేఁటవచ్చి యిట కణ్వమహామునిఁ జూచిపోవఁగా,వచ్చితిమి. ఆది. 4 27.

**క్రచ్చు** దే. వి.
ధాన్యాదుల యందలి [illegible] పదార్థము (పొల్లు. మొ).
తే. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జుఁ, గొలుచులమ్ముచోఁ గ్రచ్చులు గలిపి ... పూర్వభవమున లాభంబుఁ బొందినారు. అను. 5.104.

**క్రచ్చుకొను** దే. అ. క్రి.
చిక్కుకొను.
తే. రాఘవ..బు తొడుసునఁ గ్రచ్చుకొన్న మనసుతో నుండ కెన్న దోమరల యింద్రియముల నిర్జించి సత్త్వాదులఁ పులఁ ద్రోచి, యేను శాంతి సుఖంబున కెలయుటనఘ. శాంతి. 5.395.

**క్రతు పురుషుడు** సం. వి. అ. పుం.
యజ్ఞ పురుషుఁడు, విష్ణువు.
వ. ... ఇక్ష్వాలుఁడు యాదవుండైన వసుదేవునకుఁ గంసానుజయైన దేవకి యందు జన్మించినవాఁడితని నీవు క్రతుపురుషుండని కొనియాడుటకు గరంబేమి యని యడిగిన.అను.1.164

**క్రతుమత్త్వము** సం. వి. అ. న.
యజనము.
కం. అమరులు విమల శ్రద్ధా,సమేతములుగాని తాపసత్వముఁ గ్రతుమత్త్వముఁ గైకొనరు. శాంతి.5.244.

**క్రతువు** సం. వి. ఉ. పుం.
1. యజ్ఞము.
కం. . క్రతు భూషణ మణికి లోక రక్షా మణికిన్. విరా. 1.34.
2. సప్త బ్రహ్మమానసపుత్రులలో నొకఁడు (వారు: 1 .మరీచి 2. అత్రి 3. అంగిరసుఁడు. 4. పులస్త్యుఁడు 5. పులహుఁడు. 6. క్రతువు. 7. దక్షుఁడు. శాంతి. 4.206.
ఈతఁడు తొలి యైదుగురుతోడను వసిష్ఠునితోడను (దక్షునకు మాఱుగా వసిష్ఠుఁడు చెప్పఁబడెను.) అనేక వర్షములు విష్ణుపద్దేశించి తపస్సు చేసి ధర్మశాస్త్ర కరణ ప్రవణుఁ డయ్యెను. శాంతి. 6.359. ఈతఁడు తోడి ఆర్గురతోఁబాటు సాంఖ్యయోగములకుఁ బ్రవర్తకు [illegible] (ఇచ్చటను దక్షునకు మాఱు వసిష్ఠుఁడు చెప్పఁబడెను) శాంతి. 6.410.

**క్రథనుఁడు** సం. వి. అ. పుం.
1. దేవేంద్రుని భటుఁడు.
కం. తలరఁగ పేఱుఁ క్రథన ప్రలిహ

ప్రరుజాశ్వ కృంత పద నఘల,ను ర,క్షులఁ గలిశ నిశాత నఖా,వలిఁ బక్షీంద్రుండు వచ్చి వందఱలాడెన్. ఆది. 2.100.

(ఇట 'క్రథన' అనుచో 'క్ర' వర్ణమును దేలఁబలుక వలయును, లేనిచో గణభంగము. రేణుక్రథన అని. సం. ము. పాఠము. రేణుకమథన, రేణుకకుదర, రేణుకకుంత అనునవి పాఠాంతరములు.)

2. కురు కుమారుఁడు.

గాంధారీ ధృతరాష్ట్రుల 80వ కొడుకు (చూ. కురుకుమారుఁడు).

**క్రథుఁడు** సం. వి. అ. పుం.

క్రోధ గణాంశ భవుఁడు. ఆది 3.80. ఈతఁడు దుర్యోధను పక్షమునఁ బోరాడెను. ద్రోణ. 4.66.

**క్రన్న-క్రన్నన** క్రి. విణ. ద్రు.

1. శీఘ్రముగా

తరల. తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రులదైన భీ,కర పరస్పర కోపవేగము గ్రన్నఁబాచి విపత్తి సా,గర నిర్ధమగ్నుల నుద్ధరించె....నిజేశుల. సభా. 2.268.

2. పిమ్మట.

తే. మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటువడియెనో నన్ను మున్నోటువడి విభుండు, గ్రన్నఁ దన్నోటువడి యెనో యన్న నాకు, నెఱుఁగఁ జెప్పుము దీని నీవెఱుఁగుదేని. సభా. 2.209.

3. మరల

ఆ. ఇన్నరేంద్రుచేత మున్ను గృహీతమై, యున్న నా కరంబు క్రన్న నింక,నొరుల కర్హ మగునె. ఆది. 3.168.

**క్రన్నన-క్రన్న**

శీఘ్రముగా, చయ్యన.

కం. విను నీవు దడయుటకు మీ, జననియు జనకుండుఁ గరము సంతాప భరం,బునఁ బొందుదు రింతకుఁ గ్రన్నన వారికి సంతసంబొనర్పవె యధిపా. అర. 7.256.

**క్రమము** సం. వి. అ. పుం.

1. వరుస.

చం. ... ఏమి గతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై నహితుల కప్రభేద్యమగు నా పదుమూడఁగు నేడు మత్పితా,మహులు చరించిరంతయుఁ గ్రమంబున నాకెఱుగంగఁ జెప్పుమా. విరా. 1.44.

తే. ప్రణవపూర్వకమగు నమఃపదము పొంద,షడ్గుణైశ్వర్య వాచక సర్వవసన,నిర్వచన శబ్దములు గ్రమనిష్ఠమెయిఁ జ,తుర్థిఁ గూర్పంగ మంత్రంబు దోఁచు బెరసి. శాంతి. 4.213.

2. మెల్లమెల్ల, తిన్నన (ఒక్కసారిగాఁ గాకుండ,వెంటనే గాకుండ).

వ. నీవుం గ్రమంబున నొడంబడుట భావించుకొని వానికి నర్తనశాల సంకేత ప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము. విరా. 2.235.

3. న్యాయము, ధర్మము, అనుసరింప వలసిన పద్ధతి.

చం. కనుఁగొని యప్డు గ్రోత్రియగు

కౌతుకవృత్తి మునింగి పల్లటిల్లిన ధృతితోఁ గ్రమంబరయలేని మనంబు చలింప నచ్చటన్,జనులెడయాట గాంచునెడి సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ,జనియె విధాతృ లుబ్ధక వశం బునఁ బోవు మృగంబు చాడ్పునన్. విరా. 2.247.

కం. దానికి ధీరుఁడనై యమ్మానవతీ ప్రార్థనం గ్రమంబొనరఁగ సంతా నము వడసితి నెదలో,దీనికి నలు గంగఁ దగునె దివ్య మునీంద్రా. ఆది. 3.189.

కం. ఆ పాపాత్ముల నీచవ్యాపార క్రమము వారలందఱు మృత్యు ప్రాపి తులైన తెఱంగును, నీ పలుకుల నెఱుఁగవలయు నెలఁతుక చెపుమా. విరా. 3.46.

5. పద్ధతి-ప్రకారము, విధము.

ఉ. కంసుఁడు నిట్లు తంత్రిమది గం దెడు చంద మొనర్చి ధర్మ విధ్వం సము సేసినం గులమువారలు నాకెఱి గింప నేను దుర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వయోత్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్.ఉద్యో. 3.379.

6. నడక, గతి.

సీ... వక్రయానము వలయక్రమంబు .... ఆ. లోనుగాఁగనెట్టులైనను మీ కోరినట్లు పఱచి మేటి యంచయైన దానినిపుడ గెలుతు. కర్ణ. 2.61.

7. జరుగుట, నడచుట.

ఉం. ఏమమప్పుడ గాలక్రమమును డప్పియు రోగములును ముదిమియు లేవు. 2.465.

కం. ఒక విధమగు వేదపాఠము 1-2; 2-3; 3-4-ఇట్లు పదములు చేదు వుట (చూ. వేదము).

చం. ద్విజవరులం గుమారుల నతి ప్రియ దర్శనులైనవారి,ఋగ్యజుష పదక్రమంబులు చెయన్ గుణియిం చుచు వచ్చువారిన,గ్గజపుర వల్ల భుండు గని. ఆది. 2.195.

**క్రమించు** సం. స. క్రి. క్రమియించు. చంపు.

సీ. .. ఆ చక్రధరుని,జరయను రాక్షసి వెరవునఁ బట్టి క్రమించుఁ జిండని చెప్పి. మౌస. 10.

**క్రముకము** సం. వి. అ. పుం. పోఁకచెట్టు

కం. కలువడములు మణి తోరణ, ములుఁ గట్టిరి క్రముకకాండ మోచా స్తంభంబులు నాటిరి. విరా. 5.382.

**క్రమ్మన** దే. అవ్య. శీఘ్రముగా.

ఉ. ద్రోవది బంధుసంఘయిన క్రొమ్ము డి గ్రమ్మన విడ్చి వెంట్రుకల్, డా-వలచేతఁ బూని. ఉద్యో. 3.114. (ఇక్కడ 'క్రమ్మన'అని. సం. ము).

ఉ. తమ్ముల నిన్నుఁ గేసవుఁరెమ్ముని ద్రౌపది యన్నదమ్ములం గ్రమ్మన గీటడంచెద నొకండన యేనిదె వచ్చి. శల్య. 2.86. (ఇక్కడ 'క్రమ్మన' సం. ము. పాఠాం.)

**క్రమ్మఱ** దే. అవ్య. ప్ర.

(√ క్రమ్మఱు).
పునఃశ్శబ్దము. మరల.
ఉ. ... ఎచ్చో పనియించినం బెడపఁ
జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొననే.
విరా. 1.66.
వ. ..వగచినం గృతిపడిన రాక్షసుఁ
గ్రమ్మఱం బొడమునే. కర్ణ. 1.226;
మౌస. 15.

**క్రమ్మఱంబడు** దే. అ. క్రి.
మరలు.
చం. అడకువ లేమి పల్కి యురి
యాడుట నొండొరుఁ గూడకుండుటన్
బుడిబుడి మాటలాడుటను బోవుచు
వచ్చుచు గ్రందు గ్రమ్మఱం, బడుటను
దెల్లమైన మును వన్నుగఁ దాఁ బరి
కించి .... ఉద్యో. 3.393.

**క్రమ్మఱఁదెంచు** దే.స.క్రి. (క్రమ్మఱన్ + తెంచు).
మరలించు.
చం. ...పార్థుఁడను బుద్ధిఁ గలంగఁగ
బెట్టు గిట్టి సంగరమున నోర్చి యేఁ
బనులఁ గ్రమ్మఱఁదేరకయున్న నన్ను
ఘూ,వరుఁడు సుహృజ్జనంబుఁ బరి
వారముఁ జిత్తములందు మెత్తురే.
విరా. 4.11.

**క్రమ్మఱి** దే. అవ్య. (√ క్రమ్మఱు)
పునరర్థకము, క్రమ్మఱ, మరల,
తిరిగి.
వ. ఇంక దైవాంబకాని యొందు శర
ణంబు లేదని యప్పరమ పతివ్రత
తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవ
నున్న యవసరంబున. ఆది. 4.103.
వ. అప్పుడును గృతార్థుండై క్రమ్మఱి
నిజ పురంబునకు వచ్చి తన యుద్ధఁ
భార్యలకు నప్పండు సమంబుగా విభ
గించి పెట్టిన. సభా. 1.143.
వ. గరుత్మంతుండు క్రమ్మఱి వచి
యమ్మునితో. ఉద్యో. 3.318.

**క్రమ్మఱించు-క్రమ్మఱుచు** దే.స.క్రి.
(√ క్రమ్మఱు).
మరలించు, త్రిప్పు, వెనుకకుఁ ద్రిప
కం. చిత్తము పసిఁ గ్రమ్మఱిం
జిడిముడి పడఁగన్. విరా. 4.40.
తే. గతములయిన కార్యంబులు గ్రవ
ఱింపరాదు. మౌస. 138.
ఉ. ... విప్రుఁ దోపు నో, పంద
శాంతుడయ్యె నరపాలుఁడు శాప
గ్రమ్మఱింపఁగన్. ఆది. 1.100
ఆది. 4.206.
సీ. రోషారుణాక్షుల యచులును ని
దూర కాంతియు రవిదీప్తిఁ గ్రమ
ఱింప. విరా. 3.167. (ఇట ఔపమ
ద్యోతకము).

**క్రమ్మఱు** దే. అ. క్రి.
నివర్తిల్లు, మరలు, మరలివచ్చు
మరలిపోవు.
తే. విని మురాంతకుఁడేండు శాం
నవు కడకు, నరుగఁ జూచిన వాఁడ
యాత్మ నెఱిఁగి, క్రమ్మఱంగ నేటి
చెదుగాక యనిన, యన్నదిసూ
తొంటి వాక్యములు దలఁచి. భీష్మ
3.289.
ఆ. తనకుఁ దాన కలఁడు జననం
నప్పుడు, మరణమునను సుగతి న
కమునను, దల్లి దండ్రి దక్కనె
బంధులు శరీరంబు ననుగమిం

క్రమ్మఱుదురు. అను. 4 250.
మ. పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం, బిఱు వోవున్ ... క్రమ్మఱిచూచుం జెవి దార్చి నిల్చు ... మాయామృగం బమ్ముఁడన్. అర. 6 327.
ఉ. అమ్మొన సొచ్చు చొప్పు తెలి యన్ వినె నంతియకాని యిమ్ములం, గ్రమ్మఱు భంగి వాఁడు వినఁగానఁడు. ద్రోణ. 2.235.

**క్రమ్మఱుచు-క్రమ్మఱించు**
మరలించు, త్రిప్పు.
ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు వేగయి హొల్చు పొల్తిపై నెక్కొను చూడ్కిఁ గ్రమ్మఱుప నేరక యూరక నిల్చె. విరా. 2.23.
ఉ. ... ధర్మనందనుఁడు గ్రమ్మఱి చెన్. యదువీర కోపముల్ అర. 3.170. (ఉపశమిల్ల జేయు అని భావము).

**క్రమ్మఱుదెంచు** (క్రమ్మఱు + తెంచు)
కవియు, మార్కొను.
ఉ. ఇమ్మెయి సూతనందనుఁడు యేడ్తె ఱకోడిన యోధవీర సంఘమ్ములఁ బాండవాగ్రజుఁడు గన్గొని పేర్కొని పేరెలుంగునం, గ్రమ్మఱుదెంచు కౌరవ నికాయము గర్వమడం పుమన్న. కర్ణ. 2.198.

**క్రమ్మించు** దే. స. క్రి. క్రమ్మఁజేయు. (√ క్రమ్ము)
వ్యాపింపఁజేయు, పరఁగించు.
కం. తొమ్మిది తొమ్మిది వాలిక, యమ్ముల మున్నేసి పటు శరాసారము పైఁ, గ్రమ్మించిన మనదెసఁ దూ,ర్యమ్ములునుం గీర్తనములు నార్పులుఁ జెలఁగెన్. ద్రోణ. 3.207.

**క్రమ్ము** దే. అ. క్రి.
వ్యాపించు, ప్రసవించు, స్రవించు, కాఱు.
చం. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగముద్ద నరఁగ సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ ...భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై విరా. 2.133.
కం. నిలిచి మహాస్త్రం బెఱమం,టలు గ్రమ్మ,గఁ బెలుచ నేయుటయు భీష్మ. 3.117.
మ. గద తీలంగొని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు,న్మద యానంబునఁ గిట్టి ఘోటకములన్ ద్రుంచెంచి. కర్ణ. 3.204
తే. రమణి పొరిఁబొరిఁ గన్నీరు క్రమ్మఁ జుట్టు,మెలఁగి కాకుల గ్రద్దల దొలఁగ నడుచు,చున్నయది. స్త్రీ. 2.64.

2. కవియు, పైఁబడు, పడు.
కం. పతి పురికొలిపిన నమవస,నతి శయముగఁ బొంగు జలధియన గ్రమ్మిన యు,ద్ధత బలము నిలిపె నమ్మా,రుతి సెలియలి కట్ట క్రియ నిరూఢస్థితియై. భీష్మ. 2.217.
మ. .. అబ్బలములుం బోకేచి క్రమ్మంగ నె,త్తుటఁ దేల్చెం బొరి మార్చె నాతఁడదరం ద్రుంచెన్ మథించెం గడున్.
3. అమకొను. ప్రాపగు, ఆధారమగు

ఆ. కుడువనిచ్చు తఱియుఁ గురువరి
క్షక్కించు,నవసరంబు నెఱిఁగి
యరిన్నృపాలు,నీవు ధీరవృత్తి నిడుఁ
ద్రాటఁ దోఁమ్ము క్రమ్మ కపిల
యనఁగాఁ గ్రమ్మి చెఱపు. ఆశ్ర.
1.72.

**క్రమ్ముడెంచు** దే. అ.క్రి. (క్రమ్మ + లెంచు - ప్రేష్ఠమున)
క్రమ్మ.
1. వ్యాపించు.
సీ. ... బంధులకగపడ్డఁ బాయు నన్వ
యమను,కలఁకమైఁ జెమటలు గ్రమ్మ
దేర. విరా. 2.70.
2. స్రవించు, కాఱు.
తే. అంతరంగంబు నిండి రెండలువు
లందు, వెడలు సంతోష పూరంబు
విధము దోఁపఁ,గన్నుఁగవ సమ్మ
దాశ్రులు గడలుకొనుచు,గండ పుల
కాంకురములతో గ్రమ్ముదేర. విరా.
5.240.
3. త్రోసికొని వచ్చు.
చం. కనుఁగొని దర్పమంథముగా
నతఁడిట్లనుఁ బాండవాగ్రజన్ము,నకు
వడిం బెనంగఁగ సమం బవనాత్మజుఁ
జూచు వేడ్కని,జ్జనతతి యంతకంత
కిటు నందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్ము
డెంచునో యుపవేశ నిశ్చలతఁ
జూచిన మేలఖిల ప్రియంబుగన్.
శల్య. 2.231.
4. ఉబుకు.
తే. గాఢ సంస్పర్శ భంగులు గలుగు
నట్టి, హోమ సమయ కృత్యంబుల
నొంటివి సౌఖ్యరసము పెన్నట్ట పొరిఁ
బొరిఁ గ్రమ్ముదేర,సమ్మదాంబుధిఁ
దేలిరి సతియుఁ బతియు. విరా.5.402.
5. కలుగు, ఉప్పొంగు.
తే. శోకవేగ సంతప్తుఁడై సొలసి
వ్రాల,సంభ్రమమ్మునఁ బట్టిరి సాత్య
కియును,గవలు భీమసేనుండును గర
తలముల సుమ్మలికము నెమ్మనములఁ
గ్రమ్ముదేర. సౌప్తి. 2.11.

**క్రమ్మన** దే. అవ్య.
చూ. క్రమ్మన.

**క్రయ్య** దే. వి. కయ్య.
చిన్న కాలువ.
ఆ. అధికబలము గెల్చి యవనీపతులు
గొంద,అతి విహీన రిపుల యాక్రమ
మున, మడిసిరకట జలధి వెడలి
సన్నపుఁ గ్రయ్య మునిఁగి రూప
డంగు జనుల మాడ్కి. సౌప్తి.
2.17.
శ్లో. ఇంద్రోపమాన్ పార్థివ పుత్ర
పౌత్రాన్ పశ్యావిశేషేణ హతాన్
ప్రమాదాత్, తీర్త్వా సముద్రం వణి
జస్సమృద్ధాః మగ్నాః నద్యామివ హేల
మానాః. సం. భా. సౌప్తి. 10.23.

**క్రవ్యాదము** సం. వి. అ. పుం.
మాంసమును తిను జంతువు (పులి,
గ్రద్ద. మొ).
వ. అప్పుడర్జునుండు ... రక్తనదీ
ప్రవాహంబు భవదీయ సేనామధ్యం
బునం బఱపి బేతాళ క్రవ్యాదాది
భూతంబుల నోలలార్చె. భీష్మ.
2.166.

**క్రవ్యాదుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

మాంసము దినువాఁడు. రాక్షస భూత పిశాచాదులు.

వ. ఇవ్విధంబున వివిధ వికారాననంబులు బహుభంగి కరపాదంబులు గలుగు నపరిమిత క్రవ్యాదులు గలిసి మేదో మాంస మస్తిష్క మజ్జంబు లానుచుం జవియైనవానిఁ బుత్త్ర మిత్త్ర కళత్త్రాదుల కొసంగుచు ... ననేక ప్రకారంబుల విహారంబు సలుపుచు నుల్లసిల్లిరి. సౌప్తి. 1.202.

కం. వందిజనంబులు మాగధ,బృందంబులు సంస్తుతింపఁ బెంపొందుచు క్రమ్మో,లం దిరిగెడు క్రవ్యాదుల క్రందున నీ పసులిపుడు గటకటఁబడవే. ద్రోణ. 2.335.

## క్రా

**క్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.)
ఆక్రమింపబడినది.
ఉ. భాంతదపుంజనేక బలసంతతి... సముజ్జ్వల శాత సాయక, క్రాంత పరీత నిర్మథిత కంపిత పాతిత మూర్తిఁ జేసి. భీష్మ. 3.246.

**క్రాంతాత్ముఁడు** సం. వి. న్. పుం.
క్రాంతదేవుఁడు, నారాయణుఁడు.
కం. వామన రూపంబున నుద్దామ బలున్ బలినడంచి త్రైలోక్యాక్రాంతి, క్రామితఁ బేర్చిన యద్భుత, ధాముం గ్రాంతాత్ముఁ దలఁతు దామోదరునిన్. శాంతి. 2.43.

**క్రాంతి** సం. వి. ఈ. స్త్రీ.
అడుగిడుట. పాదవిక్షేపము.
సీ. ... భూమితోయముల బలము, గోకులుండుగ్ గ్రాంతి యుపేంద్రుని యందును నర్థంబు లోభమును .. గరంబు. అ. దగులు. శాంతి.5.602.
2. ఆక్రమించుట, వశము సేసికొనుట
కం. అంతయును దివ్యదృష్టి, క్రాంతి యగు మురాంతకుండు గనుఁగొన నమ్మూర్త్యాక్రాంతము గలపికొనియె న,నంతుఁడు దన పరమమూర్తి యందు నరేంద్రా. మౌస. 1.79.

**క్రాంతుఁడు** సం. వి. అ. పుం.
త్రివిక్రముఁడు, విష్ణువు.
కం. వామన రూప మున నుద్దామ బలున్ బలి నడంచి త్రైలోక్యాక్రాంతి, క్రామితఁ బేర్చిన యద్భుత,ధామం గ్రాంతాత్ముఁ దలఁతు దామోదరునిన్. శాంతి. 2.43.

**క్రాఁగిపోవు** దే. అ. క్రి.
నశించు.
తే. ఏను దీవను సైన్యంపు బెఱుక వాదముఁగాత గమనాగమనము గ్రాఁగిపోవ శాంతి. 4.243.

**క్రాఁగు - కాఁగు** దే. అ. క్రి.
నశించు.
తే. ఏన నీవను నైక్యంపు బెఱుక వాదముఁగాత గమనాగమనము గ్రాఁగిపోవ శాంతి. 4.243.

**క్రాఁగు - కాఁగు** దే. అ. క్రి.
1. దగ్ధమగు, కాలు, తపించు, మండు
ఉ. కొటపకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దు,ర్వార భవత్ప్రతాప శిఖిఁ గ్రాఁగె మదిన్ వగపేల దీనికిన్. శాంతి. 1.93.
చం. ... పాండునందనులకు ధర్మ

మూర్తులకు ధర్మమెఱుగక యిట్టు లెగ్గు సేసిన ధృతరాష్ట్రజాధము నశేష సుహృత్సుత బంధు దాహ సూచనమయి లక్క యిల్లతి కృశాను శిఖాహతిఁ గ్రాఁగె గ్రక్కునన్. ఆది. 6.162.

తే. నాదు గురుకోపాగ్నిచే నీదు దేవ, గణ విభుత్వ మహోన్నతి గ్రాఁగి పోదె. అను. 2.201.

వ. అప్పథంబునఁ బాంధవ్రాతజాడ్యు సని చని యారంగ్రాఁగిన నూనియ వోలెం బెరలుచున్న జలంబులు గలిగి ...వైతరణి యను పేరఁ బరఁగిన యేఱును... జూచి. స్వర్గ. 18.

సీ. ... నా వివేకమున కానందింపఁ గనిన యంగన యెట్లు నిలువునఁ గ్రాఁగకుండు. విరా. 2.335.

2. పాయు, తొలఁగు, నశించు.

ఆ. కడుఁ బ్రసిద్ధమిదియుఁ గర్కోట కుని దమయంతిఁ బుణ్యమూర్తియైన నలుని, సుచరిత్రుఁడైన ఋతుపర్ణుఁ గీర్తింపఁ, గలిభయంబులెల్ల గ్రాఁగు నధిప. అర. 2 231.

తే. క్షత్రవధనైన పాపంబు గ్రాఁగ వలయు గడగి సద్గతియును నాకుఁ బడయవలయు. అర. 2.262.

చం. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగు. శాంతి. 3. 124.

**క్రాఁచు-కాఁచే** దే. స. క్రి.

($\sqrt{\ }$ క్రాఁగు.)

1. దహించు, కాల్చు, తపింపఁజేయు.

సీ. పటపటబగు చటచ్చట రవం బెసఁగంగ మ్రాఁకుఁ బొదలును గ్రాఁచికొనుచు. గీ. .. పరఁగె, నద్భుతోద్భవంబైన మహానలంబు. ఆశ్ర. 2.151.

కం. ఏనమరేంద్రుఁడ నాదగు, మానము గామశిఖి గ్రాఁచె మానిని దడయం, గా నేల నన్నుఁ దగ సన్మానింపుము నీకు సిగ్గుమాటింకేలా. అను. 2.198.

చం. ... కౌరవకులముఖ్య యుమ్మలిక గ్రాఁచితె చిత్తము బ్రీతిఁ బొందెనే. ... శాంతి. 1.4.

2. నశింపఁజేయు, పోఁగొట్టు, అడఁచు.

తే. పరశురాముని శాపంబు బాణశక్తి, గ్రాఁప బ్రాహ్మణ శాపంబు రథము సిక్కు, వఱుప గాండీవధరు చేతి మెఱుఁగుటమ్ము మన్నిగొనియెనె యో కర్ణ మగలరాజ. స్త్రీ. 2.90.

ఉ. ..వావిరిఁ జెప్పఁగావలసె వాలిన దుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్. శాంతి. 1.115.

సీ. ... కౌంతేయులపుడు తే. దయ దలిర్పంగ దుస్సలఁ దలఁచి యలుక గ్రాఁచి మందల విడిచిరిగాక. స్త్రీ. 2.95.

ఉ. కావునఁ గామరోషములఁ గ్రాఁచుచు నాశ్రమకోటి గాఁచుచున్. శాంతి. 2.252.

3. చంపు,

గీ. విప్రు కడుపులోనున్న యవ్వీరు ననుజుఁ, బిలిచె రమ్మని వాతాపి ప్రియ ముతోడ, జీవితుండయి వాఁడు సెచ్చెరను విప్రు, కడుపు వ్రచ్చుచు

బవడి క్రాఁచె విప్రు. అర. 2.323.
(అప్పు మొదలగువానిని) తీర్చు.
. ... గృహస్థ, ధర్మ మాశ్రయ
ంద్రు లక్కిన మూఁటికిఁ గావున
విపూని దైవ పితృ. తే. కంబులైన
ణంబులఁ గ్రాఁచు వడుగు,నాఁటి
వవడి ఋషుల ఋణమ్ము దీర్చి,
చ్చి కాన కాషాయపక్వతఁ బ్రబుద్ధిఁ
ంది మఱి యుత్తమాశ్రమ మొందు
ప్పు. శాంతి. ?.80.
పీడించు.
ం. ... పోం నిశాచరులన్ బడల్ప
న్,ఘన భుజదండ చండహతిఁ
ఁచిన నుక్కఱి రక్కసుల్ కుబేరు
కెత్తిఁగింపఁ జాఱిరి సరోష వృకో
ర భీమకర్మముల్. అర. 3.367.

**ఁడు** సం. వి. అ. పుం.
రుకుమారుఁడు.
తఁడు గాంధారీ ధృతరాష్ట్ర పుత్రు
లో 80వ కుమారుఁడు, క్రథనుఁడు
వచ్చును. ఈతఁడు భీముచే మర
ంచెను. కర్ణ. 2.216.

ు దే. అ. క్రి.
చలించు, కదలు.
. ... పొలయు మలయానిలంబునం
ాలు మవ్వంపుఁ దీవలఁ గడివోయి
ఁగిన విరుల వలన మీనకేతన
ణశాలలం బోని లతామండపంబు
ను. విరా. 2.240.
. సంచరించు, తిరుగు.
ం. నేలకు నల్లెడు పొడుపునఁ
ాలుచు మును మెఱయు గురుని రథ
క్రమ ల,క్కాలంబున సమర జయ
శ్రీ లోపము దెలియ నంటసిలఁడిమె
నృపా. ద్రోణ. 5.317.
సీ. ఏనుఁగు నెక్క పెక్కేనుఁగు
లిరుగడ,రాఁ బురవీథులఁ గ్రాలఁ
గలదె. విరా. 5.204.
చం. .. మత్స్య మహీరమణుండు
సారథిఁగనుఁగొని యల్ల గట్టిమొనఁ
గ్రాలుచునున్న త్రిగర్తనాథ కేతన
మున చక్కటిన్ మన రథంబు వెసన్
జననిమ్ము నావుడున్. విరా. 3.179.
వ. మన మూఁకల నడుమం బవం
తుల పిండులోనం గ్రాలెడు విలా
సియుఁ బోలె విలసిల్లుచు. ద్రోణ.
8.166.
4. ఒప్పు, ప్రకాశించు.
ఉ. ... సర్వపయోనిధుల్ నిరాకులా,
కారతఁ గ్రాలెడుం గులనగంబులు
నిశ్చలరూఢిఁ జాలనొప్పారెడు. అర.
7.243.
(ధర్మజుఁడు శ్రుతాయువును జాఱఁ
ద్రోలుట).
ఉ. ... తత్తనువు రక్తమయంబుగఁ
జేయ వాఁడు భీ,తుండయి పాఱె
నీబలము దూలఁగ నబ్బలముప్పి క్రాల
గాన్. భీష్మ. 3.40.
సీ.. ...స నెలడీఁగ లీలఁ గ్రాలుచు
వింర,మెఱవంబు దలకొనఁ జేరి నిలిచి.
విరా. 2.64; విరా. 4.177.
కం. .... దొరలు ద,ర్పము పల్లవింప
వెడలిరి, తమ తమ కేతువులు గ్రాల
ధరణీనాథా. భీష్మ. 1.88.
కం. ఆలోనన భోజపతిన్,వాలమ్ముల
గొదవి రెల్లవారలు దానం,దూలకతఁడు

బలు విలుగొని, క్రాలుచు నా భీమ ముఖ్య రథికుల నొంచెన్. ద్రోణ. 4.29.

**క్రాల్గన్ను** దే. వి. ఔ.
చంచల నేత్రము, తరళ నయనము.
సీ. పలుకుల ముద్దును కలికి క్రాల్గన్నుల, తెలిప్పను వలుద చన్నుల బెడంగు. ఆది. 3.27.

## క్రి

**క్రించు** దే. విణ.
అల్పుఁడు, నీచుఁడు.
తే. పాడి మానిసులంద్రు నిన్నాలు నొకనిఁ, బొదివిరిస్సిరొ పెక్కండ్రు ప్రోడలడియు, మగటిమియె క్రించు పనికిట్లు దెగినయప్పుడుల్లములు వారలకు, నెట్టులుండు నొక్కొ. శ్రీ. 2.76

**క్రించుపని** దే. వి.
నీచకార్యము. నీచపుఁబని.
చూ. క్రించు.

**క్రింద** దే. వి. ఔ.
1. అధోభాగము, దిగువ.
కం. .... భూరిశ్రవసుఁ, దనూన బల మొప్ప దానవాంతకు ననుజన్మునిఁ బట్టి పుడమిపై వైచినఁ, గ్రిందై యోపినంత సేయుచుండెన్. ద్రోణ. 4.264.
చం. ...ఎక్కడఁ జనుము శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలగలాఁడ వీ భవంబున తుదిఁ గ్రూర కాకచయముల్ దొలువన్ నరకాధివాసివై. శాంతి. 3.348.
తే. ఒకటి యడిగెదఁ గృప చిగురొత్త జెప్పు, వలయు మీరు మా యింటికి వచ్చి యొక్క, ప్రక్క క్రిందుగ నిరువదియొక్క దినములనఘ నిద్రించి తది మొదలైన నీదు. అను. 2.329.
సీ. రౌరవంబనఁగ ధరాస్థలిక్రింద. అను. 5.170.
2. పూర్వకాలము.
వ. .. వీరలు తమ తమ పుణ్యాచారంబులం జేసి క్రిందం బదితరంబుల వారిని మీఁదం బది తరంబుల వారిని దమ్ము నుద్ధరింతురు. ఆది. 3.221.

**క్రిందుపడు** దే. అ. క్రి. (√ క్రిందు)
అడుగునఁబడు.
వ. క్రిందుపడం దొరఁగిన గాత్ర ఖండంబులును. ద్రోణ. 2.60.

**క్రిక్కిఱియించు** దే. స. క్రి. (క్రిక్కు + ఇఱియు + ఇంచు.)
ఎడము లేకుండఁజేయు, నించుంచు.
ఉ. తక్కటి వారలుం గని ముదంబలరారఁగఁ గౌఁగిలించుచున్, మ్రొక్కుచు నాదటం దనదు మోముపయిం దని వోని చూడ్కులం, క్రిక్కిఱియించు చుంబొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్రుఁడ, య్యెక్కుడు మాటకోరువక యిట్లను నర్హ జనంబుతోఁ దగన్. విరా. 5.265.

**క్రిక్కిఱియు** దే అ. క్రి.
దట్టముగా వ్యాపించు, నిండు, ఎడము లేకుండ నిండు.
కం. మతిముఁటే చీకటి యప్పుడు, నతిముటె భటు లుడుగ కదరి యని సేయంగా, నెఱసి తమ మెల్లయెడఁ

గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచిరింతను
నంతన్. విరా. 3.195.
కం. మెఱసి యుదయించు గ్రహముల
తఱచు ప్రభలఁ గ్రేణి సేసి దశ
దిశలం గ్రి,క్కిఱిసి వెడలె నా విం
ద్లన్, మెఱుఁగులు నృపతనయ దృష్ట
మిఱుమిట్లు గొనన్. విరా. 4.114.,
విరా. 3.215.

**క్రిమి** సం. వి. ఇ. పుం. కృమి.
పురువు.
తే. .... వారలఁ గుక్కలు గఱచుఁ
గ్రిములు, దొలుచు గ్రద్దలు నొప్పించుఁ
దుండనిహతి. అను. 5.170; అశ్వ.
2.117.

**క్రియ** సం. వి. ఆ. స్త్రీ.
1. చేయుట.
మ. మదిరాశ్వుండు గడంగి యన్నకు
బలోన్మాదంబు రెట్టింప స,ప్రవర
జ్యాలతికా క్రియా సమభిహార క్రీడనం
బప్పుడొ,ప్పిదమై యోగ వియోగ
సంధులు నిరూపింపంగ ధాకుండఁ
గ,ర్దదశోపాంతము వింతసేయ నడ
రెన్. విరా. 3.174.
2. చేష్ట, వ్యాపారము, కార్యము, పని
సీ. .. ధర్మమయ క్రియా తత్ప
రత్వంబును. విరా. 1.67.
కం. పురుషుఁడన వేఱొకండే, పురు
షోత్తముఁడైన యేన పురుషోత్త
మతా,స్ఫురణకుఁ బురుషత్వంబను
మెరమెర గలదదియ కాదె మెయికొను
క్రియకున్. భీష్మ. 1.199.
కం. అలసులు ధనహీనులునై,సొలసి
క్రియలు విడుతురది విసూత్రత
దానం,గలదే సద్గతి వేదం,బులు
విడిచి యఘంబు పరతఁ బోవరె
తంద్రీ. శాంతి. 5.314.
3. ఉదాత్తానుదాత్త స్వరిత స్వర
విధానము.
చం. ద్విజవరులం గుమారుల నతి
ప్రియదర్శనులైన వారి ఋ,గ్యజుష
పదక్రమంబులు క్రియన్ గుణియిం
చుచు వచ్చువారి. ఆది. 2.195.
3. వృత్తము, ప్రవర్తనము.
సీ. సత్య క్షమా దమ శౌచ దయా
తపో,దాన శీలంబు లెందేని కాన,నగు
నట్టివాఁడు బ్రాహ్మణుఁడగు... యగ్గుణ
ములివియు, క్రియ శూద్రునందుఁ గల్గిన
నతండుత్తమ ద్విజుఁడుగా నేర్చు
నేనిజము విడిచి. అర. 4.128.
5. విధము.
సీ. ఎలదీఁగఁ గప్పిన లలిత పరా
గంబు క్రియ మేన మేదినీ రేణువొప్ప.
విరా. 2 138.
కం. కరి కరి గిరి గిరి నంభో,ధర
మంభోధరముఁ బెలుచఁ దాఁకిన
క్రియఁ దాఁకిరి. కర్ణ. 3.277.
(ఈ యర్థము తెనుఁగుననే కలదు.)
6. దక్షుని కూఁతురు - ధర్ముఁడను
మనువు భార్య.
వ .. దక్షుఁడపుత్రుండు గావునఁ
బవిత్రీకరణంబు సేసి యందుఁ గీర్తి
లక్ష్మి ధృతి మేధా పుష్టి శ్రద్ధా క్రియా
బుద్ధి లజ్జా మతులను వనితలఁ బదుం
డ్రను ధర్ముండను మనువునకిచ్చె.
ఆది. 3.61.

**క్రియగొను** దే. అ. క్రి.

కిటుక, ఒనగూడు.
కం. ఉడుగక మేమహితము బలి, చెదు వారము నీవు హితవు క్రియ గొనఁగాఁ బల్కెడువాఁడవు. ఆది. 8.40.

**క్రియావంతుఁడు** సం.విణ.
(త్. వతీ. త్.)
పనియందు పూన్కి గలవాఁడు. క్రియాసక్తుఁడు.
కం. సంతత గృహమేధి ఫలం, బంతయుఁ బడయంగ నోపు నసుగుణ భార్యా,వంతుండగువాఁడు క్రియా వంతుఁడు దాంతుండు బుత్త్రివం తుండు నగున్. ఆది. 4.82.

# క్రీ

**క్రీ** దే. విణ.
(వృత్తియందు 'క్రిందు'శబ్దము నందలి 'ందు' వర్ణము లోపించి లుప్త శేషంబునకు దీర్ఘము వచ్చిన రూపము). క్రిందిది. చూ. క్రీఁదొడ, క్రీనీడ.

**క్రీఁదల** దే.వి. (క్రిందు + తల).
తలగడ, తలక్రింది ఎత్తుగాఁ బెట్టుకొను మెత్త, దిండు.
తే. తనకుఁ గ్రీఁదల యని భవత్తన యులకు నెఱుఁగఁ జెప్పిన వారు గడంగి మెత్తఁ,దనము గల తల గడలు దేఁ ననుమఁయును జూచి చిఱు నవ్వుతో సవ్యసాచిఁ బలికె. భీష్మ. 3.420.

**క్రీఁదొడ** దే. వి.
క్రిందితొడ, తొడ అడుగుభాగము.
తే. వికృతాతి ఘోర రూప,మళకమని యెడు నొక కీట మద్దినేంద్ర తనయు క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ. శాంతి. 1.21.

**క్రీడ** సం. వి. ఆ. స్త్రీ.
పాచికలు మున్నగువానితో ఆడు ఆట. ఖేలనము
కం. ద్యూతక్రీడకుఁ గొండొక,నేతుం గపటమున నొవ్వని జనంబులు నా, చేతి ధనమెల్లఁ గొని పరిభూతి యొన ర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. విరా. 1.196.
2. లీల, విలాసము.
మ. వనితావేషము గల్గియున్నయది చెల్వం బాడుచందంబు గా,దు నిరూ పింప మహానుభావతయు నిర్దోషత్వ మున్ రాజసం,బును శోభిల్లెడు నెవ్వఁ డేనొక జగత్పూజ్యుండు గ్రీడార్థ మి,ట్లొనరం దాల్చిన రూపు గావలయు ... విరా. 1.231; శాంతి. 4 206
3. రతి
తే. క్రీడదెసఁ గౌతుకంబురియా ద రతుల,చవులు గొనియాడ నేరని జారపొందు, హృదయమునకింపు సేయమి నెఱుక గలుగు,వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. విరా 2.70.

**క్రీడనము** సం. వి. అ. న క్రీడ.
1. ఆట, ఖేలనము.
చం. తనయుఁడొకండు వాఁడు గుణ ధాముఁడు క్రీడనవాంఛ సాంద్ర కా,ననమునకేగి కీడుపడినం దదవం జనుదెంచి యెందుఁ గా,నన మది యాశ ద్రిప్పికొనకన్ వెగపందుచు వచ్చినాఁడ. శాంతి. 3.158.

2. లీల, విలాసము.

మ. మదిరాక్షుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప స,ప్రదర జ్యాలతికా క్రియా సమభిహార క్రీడనం బప్పుడొా,ప్పెదమై యోగ వియోగ సంధులు నిరూపింపంగ రాకుండ ..నడరెన్. విరా. 3.173.

సీ. ... కీర్తిధనార్జన క్రీడనంబు. విరా. 1.67.

**క్రీడాగృహము** సం. వి. అ. న.

కేళీగృహము.

వ. .. దుర్యోధనుండు నిజ భృత్య జనులు నక్కొలని దరిం గ్రీడా గృహంబులు నిర్మింప నియోగించిన. అర. 5.380.

**క్రీడాఘాతము** సం. వి. అ. పుం.

ఆటవోలెఁ జంపుట-లీలావధ.

శా. ... త్రిగర్తేశుండు చేవీచుడుం గ్రీడాఘాత నిరూఢి నాశ్వికులు వారిం దున్మి తూఁటాడినన్. విరా. 3.132.

**క్రీడాచలము** సం. వి. అ. పుం.

క్రీడకొఱకు ఏర్పఱుపఁబడిన పర్వతము.

సీ. .. చారుమయూర కేకారుత కలితంబు,లగుచు నొప్పారు క్రీడాచలములు. అను. 2.318.

**క్రీడి** వై. వి. (సం కిరీటి-ప్రా. కిరీడి)

అర్జునుఁడు.

చం. ... క్రీడి మనంబున మెచ్చునట్టి నే,ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కిన సూతవృత్తిమై,నని సడిసన్న యేడ్తెఱ బృహన్నలకుం గలపంబు జానసా. విరా. 4.15.

**క్రీడించు** సం. అ. క్రి.

ఆట్లాడు.

కం....మృదు ద్యూతంబునఁ గ్రీడింతు జేతోముద మొదవ నక్షశిల్ప ప్రౌఢిన్. విరా. 1.71.

2. విహరించు.

సీ. .... కొలకుల కెలఁకులఁ గూడి క్రీడించుచుండెడు నంచతండంబు నడ చెడఁగు. అను. 1.181.

కం. ఆడుచుఁ బాడుచు గణములు, గూడి చరింపంగ గిరిజకుం బ్రియముగఁ దా,వేడుక నమ్మృడుఁ డెప్పుడుఁ గ్రీడించుచునుండు మునులు గీర్తింపంగన్. అను, 2.4.

3. రమించు.

కం. పలువురు క్రీడింతురు భూ,వల యాధిప యాయ మంచివారును గలరు. అను. 2.218.

**క్రీతము** సం. విశ. (అ. ఆ. అ).

కొనఁబడినది. (చూ. క్రీతుఁడు).

**క్రీతుఁడు** సం. విశ. అ. పుం.

తల్లిదండ్రుల నుండి కొనఁబడిన పుత్రుఁడు (వీఁడు ద్వాదశ పుత్రులలో నొకఁడు. చూ. పుత్రుఁడు). అను. 2.254.

**క్రీనీడ** దే. వి. (క్రింద+నీడ)

క్రిందినీడ.

కం. ఇమ్మెయి నలంగి యొక వృ,క్షమ్మున క్రీనీడ నిలిచి చనుదెంచుట నా,కిమ్మఱి దదయ వలసెనని,యమ్ముద్దియ సెప్పెఁ జెమట యడరఁగ మేనన్. అను. 3.258.

# క్రు

**క్రుంకించు** దే. స. క్రి. (√ క్రుంకు)
క్రుంకఁజేయు.
అ స్తమింపఁజేయు.
తే. అసుఁ గ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి. విరా. 2.314.

**క్రుంకు** దే. అ. క్రి.
మునుఁగు, స్నానము చేయు.
చం. ఇటు తగునే సుయోధన .... ఏమిటిఁ గ్రుంకితి నీళ్ళను చావు దప్పునే. శల్య. 2.54.
కం. అవనీశ యశ్వమేధము,నవభృథ మున నీరఁ గ్రుంకి యన్నుఁడు శుద్ధిం డగుఁ జాఫుఁడైనఁ ద,ద్వ్ర్రత విశేష ము లోకపూజితంబై పడడె శాంతి. 1.305.
సీ. భార్గవ చ్యవనుండు భాగీరథీ యమునలు గూడునెడ ... కేగి యల మునిష్ఠఁ గ్రుంకి సుస్థిరుఁడయి. అను. 2 258.
2. అ స్తమించు.
కం. మాయరవి యేల క్రుంకదొ,కో యనుఁ గ్రుంకఁబోయెడుఁ జూ యిప్పుడ యను. విరా. 2.312.
సీ. .... మీరలిక్కడ భయంబు, దక్క యేడ్చుచునుండఁ దగనిదె క్రుంకెడుఁ బ్రొద్దు రాక్షసులును భూత ములుఁ బి. తే శాచములు వచ్చి తిన నిపుడేచి వచ్చు. శాంతి. 3.366.
3. అడఁగు, దాఁగు.
కం. అటులఁ బునఁ గ్రుంగిన న,ద్భుత ముగ దివమునకు నెగసిపోయిన బగ తున్,హతుఁజేయక మగుడము. అర. 6.241.
ఆ. నడవు సమరమునకు వెడ జంక బోదింకఁ దప్పఁగ్రుంకలేదు తటికిఁ జోరుము. ఉద్యో. 4.191.
(తప్పఁగ్రుంకు = తప్పించుకొను)

**క్రుంగు** దే. అ. క్రి.
వంగు, క్రిందికొదుగు, పొట్టిదగు.
ఆ. ... వానిమెడ గ్రుంగ బిడికటఁ బొడిచె నసుర ముడిఁగి పడియెఁ బుడమి. అర. 3.396.
(మల్లయుద్ధ వర్ణనము) సీ. ... బలు విడి వాఁడు పైనడరిన జరగక యవనిఁ గ్రుంగి నిలుచు. ... విరా. 2.15.
2. దిగఁబడు.
కం పలుదెస మంటలు ప్రబ్బఁగ, సలఘు స్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబున్,జలజాక్షుఁడు గని పంచాం, గుళ మాత్రము రథము ధరణిఁ గ్రుంగనదుముడున్. కర్ణ 319; 351.
సీ. క్రమ్మిగ్రుంగక ... ఒప్పుచోటు రథములనేల. శాంతి 3 6.

**క్రుచ్చు** దే. స. క్రి.
ఈ పదమును శ. ర. కారుఁడు గ్రహింపలేదు. నాతఁడు సరళాదిగ 'గ్రుచ్చు' అని గ్రహించెను. సూ. ఆ. ని. వారును 'కూర్చు' అను నర్థమొక్కటియే వ్రాసి 'వా క్రుచ్చు' చూడుమని వదలిరి. వారి మతమునను ఇది 'గ్రుచ్చు'గనే కనఁబడుచున్నది. "క్రుచ్చు", "గ్రుచ్చు" – రెండు పదములు గనఁబడుచున్నవి. కాని

(ఱొమ్మున ఱొమ్ముతోఁ బొడుచు)

**క్రుయ్యు** దే. అ. క్రి. 'కృశ్' అను సంస్కృత శబ్దమునుండి పుట్టిన పని కొందఱు. కాని అది కృతకముగాఁ గన్పించును) కృశించు, తగ్గు, క్షీణించు.

కం. అయ్యంగరాజుతోడం,గయ్యము సేయుచును దుర్ముఖ ప్రాణంబుల్, సయ్యనఁ దొమ్మిది యమ్ములఁ గ్రుయ్యక దయ్యక యతండు గొనియె నరేంద్రా. ద్రోణ. 4.198.

2. వెనుదీయు.

చం. .. అంపఱకన్ని రూపులై,తనువులు సించుచున్ హయవితానము నొంచుచుఁ గేతుదండ ఖం,డన మొనరించుచుం బెనఁగె దయ్యక క్రుయ్యకతండు గండునన్. కర్ణ. 3.169.

# క్రూ

**క్రూర** సం. వి. ఆ. స్త్రీ.

దక్షుని కూఁతురు; కశ్యపుని భార్య. 'విశ్వా' అని మూలమునఁ గలదు.

**క్రూరత** సం. వి. ఆ. స్త్రీ.

క్రూరత్వము, కనికరము లేనితనము, కఠినత్వము.

ఉ. సూతులు ... ద్రౌపది ... తమ చేఁ దవుచున్నఁ గాంచి సం,జాత మహోగ్ర కోపులయి చారువిలోచనఁ బట్టి క్రూరతన్. విరా. 3.11.

సీ. ఉపలాక్ప్రకటితి దార్లి సమయంబు దమలోనఁ జేసి క్రూరతయు ముచ్చిమియు ఒక్క, సైపక యిట్టి దుర్జనుల నందఱును గూడి శాసించువారుగాఁ జూచి. శాంతి. 2.257.

**క్రూరత్వము** సం. వి. అ. న.

కనికరము లేనితనము, కఠినత్వము.

కం. వెడపనికి నాలిఁ జంపం, గొడుకుఃబనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం,గడవంబడునొకొ పని యని,కడు వెసఁజనుదెంచె నక్షకణములు దొరఁగన్. శాంతి. 5.281.

**క్రూరము** సం. విశ. (అ. ఆ. అ.)

1. కనికరము లేనిది, కఠినము.

ఉ ... ధర్మముం, దక్కుట కోర్వఁజాలుదునె ధర్మజు తమ్ములు క్రూరకర్ములే. భీష్మ. 3 306.

2. ఉగ్రము, భయంకరము.

శా. .... గాండీవ ని,ర్ముక్త శరావలీ దళిత శత్రువ్రాతముల్. విరా. 5 38.

సీ. క్రూర దానవుఁడు భూచారి నిర్జర కాంతఁ, బొదువ రయమ్మునఁ బోవు భంగి. విరా. 2.128.

సీ. ... కృపుని నాలోకించి క్రీడి తద్వక్షఃస్థలంబునఁ గ్రూర భల్లంబు నాట. విరా. 5.150.

కం. క్రూరములగు సూతసుతుని, నారాచములొడలఁ జెక్కు నాటిన. కర్ణ. 3.23.

**క్రూరుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

కనికరము లేనివాఁడు, కఠినుఁడు.

వ. క్రూరుండగు కొడుకుఁ గనుట కోర్వననుటయు. శాంతి. 2.71, 178.

# క్రే

**క్రే** (వృత్తియందు 'క్రేవ' శబ్దమునకు తుదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము) ఉదా. క్రేఁగన్ను.

**క్రేంకారము** సం. వి. అ. పుం.
చిఱుగంటల ధ్వని.
వ. ... ఊర్వశి యర్జున సంగమ కాంక్షంజేసి చంద్రికా ధవళ దుకూలంబు గట్టి . . మణిమయ భూషణాలంకృతయై, కటి కలాప కింకిణీ క్రేంకారంబును మదనాజ్ఞా వాద్యఘోషంబునుం బోలె మ్రోయుచుండ మందగమనంబునఁ బురందరనందను మందిరంబున కరుగుదెంచిన. ఆర. 1.358.

**క్రేఁగన్ను** దే.వి.ఔ. (క్రేవ+కన్ను)
నేత్రాంచలము, కడకన్ను, కటాక్షము
కం. వెనుకదెస వచ్చి కదిసియుఁ,దన రథము దొలంగనిచ్చి తటిఁ జడుట కొల్లని తలఁపు క్రేగంటన మనలం జూచుచుఁ గడచి యట నడచెన్. విరా. 4.258.
వ. ధనంజయుండును దనకు దుర్యోధన సైంధవులగ్గంబై యున్నను క్రేఁగంటం జూచుచు గాంగేయుపై నడరె. భీష్మ. 3.53.
సీ. ... హరి యా భోజపతిమీఁదఁ గడునెఱ్ఱనైన క్రేఁగంటిఁ చూడ్కి,నిగిడించి సక్రోధమగు మానసంబుతో. మౌస. 45.

**క్రేడించు** దే. స. క్రి. క్రేవించు.
ఉపేక్షించు, అలక్ష్యము చేయు.
తే. భీష్మునకుఁ దోడుపడువారి బెట్టుదాఁక నతఁడు ఫల్గును నేఁబది శిత శరముల,నేసి పేర్చినఁ గౌరవులెల్ల నార్వ,నుఱక యాతఁడు గురుసేనఁ దఱియఁ జొచ్చె. వ. ఇట్లు క్రేడించి గాంగేయు డించి గాండీవి తన యరదంబు రయంబున. భీష్మ. 2 37;38.
అ. క్రి.
తొలఁగు.
కం. ... విప్రుతోడ మెయికొని పో,రిట్లచ్చుపడ నేటికని వి,వ్వచ్చుఁడు క్రేడించి యొండు వలనికి నడచెన్. భీష్మ. 2.307.
కం. ఓడితిమె మేము రణమునఁ గ్రిడికఁ క్రేడించి రాక గెలుపే యతఁ డెచ్చో డాఁగిపోయెనాకొ మా,తోడి బవరమిట్లు తాను దొలఁగిన దెగునే. ద్రోణ. 1.374.

**క్రేణి చేయు-క్రేణిసేయు** దే. స. క్రి.
1. హేళనము చేయు, పరిహాస మొనరించు.
ఉ. ఆయత బాహులున్ వెడఁదయైన సమున్నత వక్షమున్ సరో,జాయత లోచనంబులుఁ బ్రసన్న ముఖంబునుదాత్తరేఖయుం,గాయజుఁ గ్రేణిసేయు నన (మించునని భావము). విరా. 1.234.
2. పురుడించు, పోలు.
వ. ... ప్రోవులు గొనియున్న ప్రేవుల వలన లావుగల యంచపిండు పేరాఁకలి నటిముటిం బెటి ౹౹ గుటుకులు గట్టిన మృణాళ నాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణి సేయు

ప్రదేశంబులును. విరా. 3.236.
వ. ... గాంగేయుండు .. సందర్శనీయ గభస్తి వితానుండగు నస్తమయ భానుం గ్రేణి సేయుచు. శాంతి. 2.19.
తే. రూప విభ్రమముల నప్సరోజనంబుఁ గ్రేణి సేయు వారాంగనా శ్రేణి. శాంతి. 6.269.

**క్రేపు** దే. వి.
దూడ, వత్సము.
వ. ... నాచేతం గ్రేపులు పురాజెంచుటం జేసి కొండొక కాలంబునన కదుపులం బెనుతు. విరా. 1.286.
కం. అరి మిగులఁగొనుట క్రేఁపులఁ, బొ రిమాలం బిదికినట్లు భూవర. శాంతి. 2.389.

**క్రేవ** దే. వి.
ప్రక్క, పార్శ్వము (వృత్తియందంత్యవర్ణ లోపము. చూ. క్రే.)
వ. ... కయ్యంబు కలరూపంతయుఁ గనుఁగొనుటకు మింటి క్రేవనున్న వెరవుగాదను పరుసున సవిత్రుండు చక్కని మింటికిం జనుదెంచె. భీష్మ. 3.345.
ఉ. ... కెం,పెక్కిన కంటిక్రేవ చెలువెక్కుడు సేయఁగ గ్రీడి కృష్ణుతోన్. భీష్మ. 2.30. (కంటి పార్శ్వము, కంటికొన.)

**క్రేళ్ళు** దే. వి. బ.
గంతులు, పర్వులు (చూ. క్రేళ్ళు దోలు, క్రేళ్ళుఱుకు, క్రేళ్ళువాఱు)

**క్రేళ్ళుదోలు** దే. స. క్రి. (క్రేళ్ళు + తోలు)
పరుగులెత్తించు.
వ. అని పలికి సమర ప్రకారంబునం దేరు క్రేళ్ళు దోలి పాంచాలబలంబు పయి నడరె. భీష్మ. 3.368.

**క్రేళ్ళుఱుకు** దే. అ. క్రి. (క్రేళ్ళు + ఉఱుకు)
1. ఎగిరిపడు.
సీ. కేళిమై నొక్కటఁ గ్రేళ్ళుఱికెడు వాలుగు సోగల నేలుదెంచి. విరా. 2.83.
2. ఉఱుకు, దూకు.
కం. అలోనం గురుధరణీ,పాలుఁ డడరి వ్రేయుటయును బవన సుతుని మై, సోలె నది గానఁడాపతి కేలివిభ్రమము దోఁపఁ గ్రేళ్ళుఱికె నృపా. శల్య. 2.275.

**క్రేళ్ళువాఱు** దే. అ. క్రి. (క్రేళ్ళు+పాఱు),
గంతులు వేయు.
తే. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ నుఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్ళువాఱు,నా వృకోదరుపై గవియంగఁ జేయు,వీచె సేనకుఁ గాళింగవిభుఁడు గడఁగి. భీష్మ. 2.70.
2. పరుగెత్తు, పాఱు.
ఉ....సూతు డు దెగన్ హరులోటటి గ్రేళ్ళు వాఱఁగాన్. ద్రోణ. 4.125.
శ్లో॥ తస్య సూతే హతే తేఽశ్వా రథమాదాయ విద్రుతాః. సం. భార. ద్రోణ. 125.70.

# క్రో

**క్రొ** దే. విశ. (వృత్తియందు 'క్రొత్త' శబ్దముయొక్క లుప్తశేష రూపము. చూ. క్రొత్త)

**క్రౌంచే** వై. వి. (సం. క్రౌంచః; ప్రా. కొంచ).
క్రౌంచపక్షి; సజాతీయ పక్షులతోఁ జేరి ఒక వరుసగట్టి పోవునట్టి కుటిల మైన పక్షి. కొంగజాతిలోఁ జేరినది. ("క్రుంచ గతి కౌటిల్యాల్పీభావయోః-పం క్తిరూపముగాఁ బోవునది, లేక కుటిలమై యుండునది. అని. అమ.)

**క్రొక్కారు** దే. వి. (క్రొత్త+కారు) వర్షాకాలము.
సీ. . . పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతి పూరించు క్రొక్కారు మెఱుఁగులఁ నుక్కడించి. విరా. 2 83.

**క్రొత్త** (వృత్తియందు మీఁదివర్ణము వికల్పముగా లోపించి 'క్రొ'అనునది మిగులును;దీనికి హల్లుపరమగునపుడు కొన్ని యెడల 'ను'గాగమంబును కొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వ మును వచ్చును. ఉదా. క్రొక్కారు, క్రొత్తావి, క్రొమ్మావి మొ.
దే. విశ.
1. అపూర్వము, నూతనము.
చూ. క్రొత్త తావి.
2. ప్రథమమైనది.
చూ. క్రొత్త కాన్పు.
చం. కనుఁగొని యష్టు గ్రొత్తియగు కౌటకవృత్తి మునింగి పల్లటిల్లిన ధృతితోఁ గ్రమంబుఁయలేని మనంబు చలింప. విరా. 2.247.
తే. అమ్మకుందుఁడు క్రొత్తయై యడలు దీపడు దెందమలఁపంగఁ జెలియలిమందిరమున,కరిగి పురపురఁ బొక్కెడు నా సుభద్ర గాంచి యిట్లను నెంతయు గారవమున. ద్రోణ.2.821.
వ. . . . అప్పేముడి పలుకులు విని గాంధారిచే గుంతికిం బాంచాలికి సుభద్రకు మఱియునుం గల యంగ నలకుం జిత్తంబుల నెవ్వగలు గ్రొత్తలయ్యె. ఆశ్ర. 2 89; విరా. 2,221; అశ్వ. 2.216.
3. ప్రథమమైనది, మొట్టమొదటిది.
ఉ. చిత్తము వచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నా లతాంగి య,చ్చొత్తిన యట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయకున్కి దా,నత్తఱిఁ గ్రొత్త కాన్పగుట నష్టము వొచ్చిన సిగ్గుపెంపు న,న్నుత్తలమందఁ జేయుచునె తల పోసి చెఱుఁగొఁద్యెదున్. విరా 2.84.
క్రి. విశ.
సీ. ... గుహలలోన నుండుచు దంప కములకు వంటకములకును తే. భోజన ములకుఁ దఱియైన ప్రొద్దు గడపి, భిక్షఁగొనుఁ బ్రీతి మన్నన పెద్దపెట్టు నట్టియెడఁ దక్క క్రొత్తగా నరుగు యతి ని,రంతరంబు నాత్మారాముఁడై చరించు. శాంతి. 5. 393.
అపూర్వత, నూతనత్వము.
ఉ. ఆఱు రసంబులం జవులు యంచుల క్రొత్తలు వుట్ట నిచ్చలు వేఱొక భంగిఁ బాకములు విన్ననువొప్పఁగఁ

జేసి చేసి న,స్మిఱఁగ బానిసీని నొక నిన్ బురిఁ గాననియట్లుగాఁగ మేన్, గాఱియ వెట్టెమైన నాడికంబున వం డుదు నెల్ల గూరలున్. విరా 1.77.

**క్రొత్త కాన్పు** దే. వి.
మొట్టమొదటి సారిగాఁ జూచుట. ప్రథమ సందర్శనము.
(చూ. క్రొత్త. రెండవ అర్థము.)

**క్రొత్తడి** దే. వి.
మగనాలు, సాధ్వి, పతివ్రత.
చం. కొడుకులకంటె నయ్యెఁపిన కోడలికెక్కుడు గూర్తుఁ గోడలుం, గొడుకులు సేయు భక్తికట కోటి మడుంగులు భక్తి నాకు నెప్పుడుఁ దగఁ జేయుచుండునది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ,త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి పొక్కితిన్. ఉద్యో. 3.187.

**క్రొత్తతావి** దే. వి. (క్రొత్త+తావి)
అపూర్వమైన వాసన.
తే. ద్రుపదనందన పరిభవ దుఃఖము నకు,నుల్లమున దురపిల్లుచునున్న నరసి,వేఁడి నిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్త,తావి మూఁతులు విచ్చు నెత్తమ్మి విరుల. విరా. 2.236.

**క్రొత్తముట్టు** దే. వి. (క్రొత్త+ముట్టు)
వడుక నారంభించునప్పుడు ఏకున నుండి పురి లేకుండ చాఁగఁ దీసి కడపనకంటించెడు నూలు-నూలు పోగు.
సీ కళ్ళాలఁ బదిలంబుగాని గుఱ్ఱం బులఁ గొత్తముట్టున కెయ్యకొలుపు వెరవు. విరా. 1.95.

**క్రొత్తసేయు** దే. స. క్రి.
1. మెఱుఁగు పెట్టు.
సీ. ... చక్రవాకద్వయ సంతతి యెఱకల కొమరారు కెంజాయఁ గ్రొత్త సేసి. ఉద్యో. 2.114.
2. పునశ్చరణము చేయు (మంత్రము సిద్ధియగు వఱకు పునః పునః పఠనము చేయు.)
వ. .... అచ్యుతుండు... యవ్విజయు వీక్షించి ఘలపెఁపుఁ బరమ సాధనంబైన పాశుపతంబు నీకుం బ్రస్ఫుట పరిజ్ఞానంబయిన నీవు జయద్రథ వధం బవశ్యంబును జేయుదు వమ్మహాస్త్రంబు కలిమి సమంత్రక ముష్టిక స్థానక విజ్ఞానంబుగాఁ గ్రొత్త సేసి కొనుట మేలు తదర్థంబుగా నద్దేవు జిత్తంబున నిలిపి సభక్తిక ధ్యానంబు సేయుమనవుడు. ద్రోణ. 2. 361.

**క్రొత్తావి** దే. వి. (క్రొత్త+తావి)

**క్రొమ్మావి** దే. వి. (క్రొత్త+మావి)
క్రొత్త మామిడిచెట్టు. లేమామిడి.
తే. ఉచ్చిపోయిన యేటుల నొలుకు శోణి,తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ, జిగురుఁ దఱచునఁ గెంజాయ మిగిలి చెలువు,వడయు క్రొమ్మావి చాడ్పున భార్గవుండు. ఉద్యో. 4.321.

**క్రొమ్మించు** దే. వి. (క్రొత్త+మించు)
నూత్న కాంతి.
సీ. ... ఒసలయ హస్త కెంగేల నేపారు క్రొమ్మించను లేయెండ మిగులఁ బర్వ. విరా. 2.37.

**క్రొమ్మెఱుఁగు** దే. వి. (క్రొత్త+మెఱుఁగు).
క్రొత్త కాంతి.
చం. తఱిమి వికర్ణుడప్పు తనుఁ దాఁకిన నా యభిమన్యుఁడగ్గి బిట్టుఱ విలు ద్రుంచి సారథివడం దురగంబులఁ జావనేసి క్రొమ్మెఱుఁగులతోడఁ దద్ధ్వజము మేదినిఁ గూలఁగజేసి యంగముల్,గిఱికొన బాణముల్ నినిచె. భీష్మ. 2.402.

**క్రొవ్వడగించు** దే స.క్రి. (క్రొవ్వు+అడఁగించు).
1. నాశనము చేయు, దహింపఁజేయు.
కం. శరజిహ్వా భీకరుఁడగు,నరుఁ డను శిఖి నిగుడఁజేసి నారాయణ దు,ర్భర పవనుఁడింక బంధుర,కురు సేనా కాననంబు క్రొవ్వడగించున్. ద్రోణ. 1.43.
2. మదముడుగఁ జేయు.
ఉ. ... అది నాకు నశక్యమె కర్ణ శల్యులం,గ్రొవ్వడగించుట. కర్ణ. 3.262.

**క్రొవ్వడఁచు** దే. ప్రేర... (క్రొవ్వు+అడఁచు).
మదమడఁగఁ జేయు.
కం. దవ్వని చూడకు మార్తుర, క్రొవ్వడఁచెద. ద్రోణ. 3.394.

**క్రొవ్వడరు** దే. అ. క్రి. (క్రొవ్వు+అడరు).
మదమెక్కు.
ఉ. బాసట లేదు క్రొవ్వడర బంటు తనంబునఁ జాపలేనియుఁ,బాసిన చోట వాయు. విరా. 5.280.

**క్రొవ్వఱు** దే. అ. క్రి. (క్రొవ్వు+అఱు).
1. నిరుత్సాహపడు.
కం. ఎవ్వరు వినఁగను దీర్చెఁ,క్రొవ్వుదు ఁని యెఱుఁగఁడకట నామెదురెదుకన్ వివ్వచ్చుఁ జూపి సేనలు,గ్రొవ్వఱఁ బలుపలుకులిట్లు ద్రోణుఁడు వలికెన్. విరా. 4.189.
2. మదమడఁగు.
కం. హరితలఁపొప్పదు భీష్ముని, గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం,గర ముత్సహించుచున్నాఁ డరయ నతని వచనరచన నంతయుఁ దెలిసెన్. ఉద్యో. 3.389.

**క్రొవ్వఱుగు** దే. అ. క్రి. (క్రొవ్వు+అఱుగు)
మదమడఁగు.
సీ. ... అద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగదేఁ జూతుగాకని తలసూపక యడఁగు వారు. విరా. 3.37; విరా. 4.71.

**క్రొవ్వాడి** దే. విశ. (క్రొత్త+వాడి)
మిక్కిలి వాడియైనది.
తే. తునిమి తోడన క్రొవ్వాఁడి దొడ్డ నారసంబు భీముని వక్షస్థలంబు దూఱ,నేయుటయు. భీష్మ. 3.126.

**క్రొవ్వాడిమి** దే.వి. (క్రొత్త+వాడిమి)
మిక్కిలి పదును,నైశిత్యము.
తే. మరుఁడు దోడ్తోడఁ దేఁకుపమాలి కదిసి,తూపుగముల క్రొవ్వాడిమి సూప. అను. 1.48.

**క్రొవ్విదము** దే.వి. (క్రొవ్వు+ఇదము)
దుష్కార్యము, దుశ్చేష్ట.
ఆ. తలఁబిడ్డలు లేనియట్టి త్రిమ్మరి

యగు,కొయ్యగాక కుదుటఁ గూడువెట్టి కుపచువా లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చుటచ్చగించి చూతు రయ్యా. ఉద్యో. 2.9.

**క్రొవ్వు** దే. అ. క్రి.

గర్వించు, మదించు.

ఉ. .... ఉక్కిని మనంబు గీడు పరికించునె క్రొవ్వినఁ జేటు దప్పునే. విరా. 3.7.

సీ. వినుము దంభోద్భవుఁడను రాజు దనకెదురెవ్వరు లేరంచు క్రొవ్వి నరుఁడు,నారాయణుండను వారలు గంధమాదనమను నగమునఁ దపము సేయ,వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన. ఉద్యో. 3.287.

సీ. ...ఒక కాకి యతని పుత్త్రకు దాని. తే. కెంగిపు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి, క్రొవ్వి కడు మీఱి యెట్టి పక్షులు దన్నుఁ బోలవని యెడు దుర్మానమునఁ దృణీకరించి. కర్ణ. 2.54; ఆది. 6.294.

2. బలియు, అతిశయించు.

ఉ. ... లావునం, గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుఁడైన శిఖండి. భీష్మ. 2.11.

వ. . . ఇమ్మహాబకంబు శరీరంబు గ్రొవ్వియున్నది. శాంతి. 3 497.

వి.

1. శరీరమునందలి సప్తధాతువులలో నొకటి. మేదస్సు. ఇది మాంసము నుండి పుట్టును. దీనివలన ఎముకలు ఏర్పడును.

శ్లో॥ రసాద్రక్తం, రక్తాన్మాంసం మాంసాన్మేద స్తతోఽస్థిచ. అస్థ్నో మజ్జా తతశ్శుక్రం శుక్రాద్గర్భః ప్రజాయతే. అష్టాంగహృదయము. శారీర. 3 అధ్యా. 62,63.

సీ. ... బడుగులనైనను బాటించి పరికించి,గోమున మైఁ గండక్రొవ్వు దేఱ. విరా. 1.101.

కం. కరికచ్ఛపముల పెన్నెత్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడు దుష్టిగఁ బక్షీశ్వరుఁడాని యధిక బల బంధురుఁడై యమృతమునకేగె దుర్దాంత గతిన్. అను. 1.247,

తే. వాయువంగంబులందు దుర్వ్యాప్తి గదిరి,నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెఱచు,సందు లెడలించు. అశ్వ. 1.178.

సీ. ... క్రొవ్వు దెమలిచి నమలుచు నెముకయూట చవిగొని యానుచు. స్త్రీ. 2.9; అను. 2.379.

కం. ఇవ్విధమున నాయితమై,క్రొవ్వె లరారంగ నిలిచి కురు పాండవులం, దెవ్వరు మును గడఁగిరి. భీష్మ. 1.232.

కం. విన్వచ్చు నొవ్వు నెంతయు. గ్రొవ్వున భీష్ముండు గడఁగు కోల్తలయుఁ. భీష్మ. 3.259.

కం. ఇవ్విధమున శినివీరుని,క్రొవ్వు చెఱిచి పాండు పుత్త్రకుల బాణంబుల్ నివ్వటిలనీక నలువుర,నవ్వీరుఁడు నొవ్వనేసె నద్భుత భంగిన్. శల్య. 1.228.

3. పుష్టి, బలుపు.

అ. ... ఆఁ,కొని ముసిండి దినినఁ గ్రొవ్వులావుఁ, గలుగునయ్య. ఉద్యో. 3.333.

కవిరాజ విరాజితము ... కాలము ముట్టి రుజన్ జర నెవ్వగ పై,కొన దొరకొల్పి క్రమంబున నంగము క్రొవ్వును జెల్వును బాపి ప్రయో,జన రహితంబుగఁ జేసి యపాత్రపుఁ జావొనరించుఁ గురుప్రవరా. శ్రీ. 1.55.

4. విజృంభణము, అతిశయము.

కం. అంతకంతకు నివ్వటిల్లు నా కర్ణు క్రొవ్వున నివ్వెఱపడిన నవ్వీ రుండు గోవులందోలు కోల్పులి కైవడి గౌంతేయ బలంబులం బఱప. కర్ణ. 3. 172.

7. మదోక్తులు, గర్జనములు. రజ్జులు (బడాయి కొట్టుటలు).

చం....తగు ముని ఘోషయాత్రను బదంపడి గోగ్రహణంబునందుఁ బే,రు గొనిన నీకు నిట్లనుట క్రొవ్వులు దిక్కుమ సాలునిన్నియున్. ద్రోణ. 5.99.

శ్లో. బహుశః కత్థసే కర్ణ కౌరవస్య సమీపతః సం. భార. ద్రోణ. 158.14

శ్లో. తావత్ గర్జసి రాధేయ యావత్ పార్థం న పశ్యసి. ద్రోణ. 558.20.

**క్రొవ్వెద** దే.వి. (క్రొవ్వు + వెద) కబరి, కొప్పు.

సీ. ... తఱివేచి వెనువెంటఁ దగులు కామాంధకాఠము లీలఁ గ్రొవ్వెడి గొమరు మిగుల. విరా. 4.26.

# క్రో

**క్రోఁతి** దే. వి.

వానరము, కోఁతి.

కం. ... ఎరకై వెరవునఁ గాకులుఁ బరువడిఁ జీకాకుపఱుచు భంగి నలఁచుచున్. ద్రోణ. 1.258.

ఉ. ... కూడు గూరలా,కోమలు లాఁగఁగా గడఁగి క్రోఁతులకన్నియు బంచివెట్టి రు,ద్దామ విహారలీల వసుధావర యాదవు లేమిసెప్పుదున్. మౌస. 37.

ఉ. కూడిన కొండముచ్చులను గ్రోఁతులనుగ్రత ముట్టికన్కఁ జెండాడెద. ఆర. 7.110.

**క్రోడము** సం. వి. అ. పుం.

1. పంది.

సీ. ... క్రీడాచరాడుఁడై క్రోడంబు నకుఁగాఁగఁ, జెనఁగి చిక్కినక్రితిలో చనునికంటె. ... కర్ణ. 2.24.

2. లోపలి భాగము.

వ. అఖిల గగన క్రోడ పీడనంబు సేయుచున్నదాని ఋశ్యమూక శైలంబుఁ జేరి...ఆర. 6.368.

**క్రోడాడు** దే. స. క్రి.

కోరాడు

(ఏనుఁగు, వృషభము, లేడి మున్నగునవి కొమ్ములతోఁ బొడుచు).

మ. ... నిల్చు మలయున్ మట్టాడు గ్రోడాడు నే,మఱినట్లుండుఁ దృణంబు మేయు మలయున్ మాయామృగం బిమ్ములన్. ఆర. 6.327.

**క్రోడాత్ముఁడు** సం. విణ. న్.

వరాహావతారమెత్తిన వాఁడు, విష్ణువు
కం. వారాహరూపమునఁ జెం,పారిన
దంష్ట్ర నొకట నవని సగిరి కాఁ,తా
రంబుగ నెత్తిన యా,శౌరిం గ్రోడా
త్ముఁదలఁతు సమ్యగ్భక్తిన్. శాంతి.
2.41.

**క్రోధ** సం. వి. ఆ. స్త్రీ.
దక్షుని కూతుఁరు. కశ్యపుని భార్య.
ఆది. 3.61.

**క్రోధకీర్తి** సం. వి. ఇ. పుం.
సుపర్ణుండు క్రోధకీర్తియై పుట్టె. ఆది.
3.80.

**క్రోధజము** సం. వి. అ. న.
కోపము వలనఁ గలిగినది-వ్యసనము,
వాక్పారుష్యము, దండపారుష్యము.
వ. .. క్రోధజంబులగు వాక్పారుష్య
దండపారుష్యంబులును దగులక
... శాంతి. 2.285.

**క్రోధన, క్రోధనుఁడు** సం. విణ.
(అ. ఆ. అ.)
కోపము గలది, కోపము గలవాఁడు.
సీ.... పైశాచి క్రోధన భర్తృపుత్రుల
యందు నిఃస్నేహ గృహకార్య నిపుణ
గాదు. అను. 5.299.
కం. వినుమలసుండును గర్వియు,
ననర్థభాషియును మత్సరాపేక్షుఁడుఁ
గ్రోధనుఁడును గావలవదు శ,క్త్యను
రూపతఁ జేయవలయు నాతిథ్యంబున్.
శాంతి. 5.454.
వ. నీ వతిక్రోధనుండ వగుటయు
నెఱుంగుదు నీ కోపంబున నొక్క
కొక్కెర పెహంబుణ్యం గాదె.
ఆర. 5.22, అశ్వ. 4.277.

**క్రోధము** సం. వి. అ. పుం.
కోపము, కినుక, ఇష్టార్థప్రాప్తికి నిరో
ధము గలిగినప్పుడేర్పడు మనోవికా
రము. ఇది పరుల దోపములచే వృద్ధి
పొందును. ఓర్పుచే నశించును.
మ. ... మన యర్జునద్విపము క్రోధా
వేశదుర్దాంత ద,ర్ప విలాసోద్భట
భంగి నేపడరి కౌరవ్యాంబుజ శ్రేణిఁ
జి,క్కుపడం జేయదె యొక్క వ్రేల్మి
డిన. విరా. 1.56.
సీ. మానలోభములఁ గామక్రోధములఁ
బాసి సర్వజంతుప్రజ సముఁడ
వగుచు. శాంతి. 2.210.
సీ. పరుల దోషంబునఁ బ్రభవించుఁ
గ్రోధమక్షీణ క్షమాయుక్తిఁ జేసి
పొలియు. శాంతి. 3.421.
శ్లో॥ లోభాత్క్రోధః ప్రభవతి పర
దోషై రుదీర్యతే. సం. భార. శాంతి.
163.7.

**క్రోధలిప్త బృందారకులు** సం.వి.బ.
ఒక తెగకుఁ జెందిన రాజులు. వీరు
దుర్యోధను పక్షంబునఁ బోరాడిరి.
ద్రోణ. 2.94.

**క్రోధవశ గణము**
క్రోధకు కశ్యపునకుఁ బుట్టిన సంతా
నము. ఆది. 3.65.

**క్రోధవశుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక రాక్షస సేనాధిపతి. ఈతనిని
రావణుఁడు కపివీరులపైకిఁ బంపెను.
విభీషణుఁడీతని సంహరించెను. ఆర.
7.70;71.

**క్రోధాత్ముఁడు** సం. విణ. న్. పుం.

క్రోధస్వరూపము గలవాఁడు. పరశు రాముఁడు.
ఆ. పరశురాముఁడనఁగ భవ్యుండు జమదగ్ని,కుద్భవించి యిరువదొక్క-మాఱు, మనుజపతులనెల్లఁ దునిమిన క్రోధాత్ము నధికభక్తి శార్ఙ్గి నాశ్ర యింతు ... శాంతి. 2.44.

**క్రోధి** సం. విణ. (న్. నీ. న్).
కోపము గలవాఁడు.
తే. (దుర్యోధనుఁడు) బరుల యున్నతి సయిరింప నోపఁ డధిక,బలుఁడు క్రోధి శూరత్వ సంపన్న బుద్ధి, బుద్ధిసెప్పిన వినియెడు ప్రోడగాఁడు. స్త్రీ. 179.
కం. ... క్రోధిగాఁ దపస్వికిఁ జన్నే· ఆది. 2.173.
వి.
ప్రభవాది అఱువది సంవత్సరము లలో 38వ సంవత్సరము.

**క్రోధుఁడు** సం. వి. అ. పుం.
1. సర్పశ్రేష్ఠుఁడు; బలరాముఁడు శరీరఁబు విడుచునప్పుడు సేవింపవచ్చిన వారిలో ఒకఁడు. మౌస. 77.
2. రాహువంశమునఁ బుట్టినవాఁడు· ఆది. 5.158.
3. రుజస్కరుని కొడుకు. అర. 5.158.
4. మృగి, మృగమంద మొదలగువారి తండ్రి. ఆది. 3.71.

**క్రోయు** దే. స.క్రి.
(సర్పము వహ్ని మొ. జిహ్వలు చాఁచు).
కం. నాలుకలు గ్రోయుచు విష, జ్వాలలు నిగుడంగ నుగ్ర సర్ప ద్వయ మా,భీలాకృతి నుండఁగ... ద్రోణ. 2.371.
(కృష్ణుఁడు కుంతితోననిన మాట).
తే. నాలుకలు గ్రోయు నర్జునానలము దళిసి,యెర గొనంగని సంతృప్తి యెసకమెసఁగు. ఉద్యో. 4.12.

**క్రోలు** దే. స. క్రి.
త్రాగు, పానము చేయు.
సీ. అలరు తేనియ గ్రోలి యన్ను సోలంబుల మురియు తేఁటెల నును మ్రోఁత యింపు. అను. 1.181.
చం. ... విషమెత్తి క్రోలి యది యంగము నారటపెట్ట నన్యులం గిని సినయట్లు. ద్రోణ. 4.209.
చం. .. అసవంబులు సముత్సుకతం గనకంపుఁ గోరలం, గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి యాదవులు ... మౌస. 39.
తే. ... నెత్తురెత్తికొని క్రోలు క్రూ రాత్ములెచటనైన,నెన్నఁడేనియుఁ గలిగిరే. స్త్రీ. 1.162.
వి.
ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి (భారతము ఆసక్తితో విని–అని భావము).విరా.1.39•
చం. ... నీ,వదన సరోజ సౌరభ మవారణ నన్నును గ్రోలనిమ్ము. (ఇచ్చట 'ఆఘ్రాణించు'అని భావము) విరా. 2.121.
చం. పొలఁతుక కాంతి యింత పొలివోవఁగనీకెసలాఁరఁ దార ని,శ్చలత గదంగి క్రోలికొనఁ జాలుటఁ గీచక ముఖ్యలోచనం,బులు 'నయనం ప్రథా

న'మను పూర్వవచస్స్థితి తప్పకుం
డగా నెలమి వహించెఁ దక్కఁగల
యింద్రియ వర్గము ధిక్కరించుచున్.
విరా. 2.35.

(ఇచ్చట 'ఆస్వాదనముతో చూచు'
అని భావము).

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రముల యర్థము
లారఁగఁ గ్రోలి తత్త్వసం,వేద సుధా
రసంబున చవిం జిరసౌఖ్యము బొంద
నేరక. శాంతి. 1.141.

(ఇచ్చట 'అభ్యసించు' అని భావము)

చం. ... నెనడును గ్రోలి భూతములు
నిక్కుచు నీల్గుచుఁ బొక్కుచుండఁ
గాన్. ద్రోణ. 2.312. (ఇట 'తిను'
'మ్రింగు' అని భావము)

మ. చతురంగంబుల నొక్కపెట్ట
వివిధాస్త్ర జ్వాలలం గప్పఁగా,నతి
వేగంబున మ్రింగెఁ గ్రోలె ఘనమా
యన్ రూపడంగించె ద్రోణ. 3 167
(నీరువలె త్రాగెనని భావము).

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ
బాఱె తివుటమై నునుఁగాంతి తీపు
గ్రోలు. సుందరీ రత్నంబు చూపు.
విరా. 5.395.

(ఇచ్చటను 'ఆస్వాదనముతో చూచు'
అని భావము).

వి.

క్రోవి, గొట్టము.

వ. అమలగతిఁ గడముఁ గ్రోలుగ,
నమరిచి మానిత ఉపో మయాధిక
శక్తిన్,ధమనక్రియ నొనరించిన,
నమిత గుణా చెప్పఁ బట్టలయ్యెడు
ధానన్. అశ్వ. 1.21.

**క్రోవి** దే. వి.

భూమిలోపల నీళ్ళు వచ్చుటకేర్పఱ
చిన మార్గము సొన, ఊట కాలువ.

చం. కొలఁకుల వాఁగులన్ నదులఁ
గ్రోవుల బావుల నిర్ఝరంబులం,గల
యఁగ రోసి రోసి. అర. 4.332.

**క్రోవి** వై. వి. (సం. కురవకః)

కురవకము. ఎఱ్ఱ గోరింట.

మానిని. ఏచి తనర్చి తలిర్చిన
క్రోవుల. ఆది. 4.20.

**క్రోశము** సం. వి. అ. పుం.

కోసు. కూఁత వినిపించు దూరము.
$\frac{1}{4}$ యోజనము. రెండుమైళ్ళు. సుమారు
$3\frac{1}{2}$ కిలోమీటర్లు. వేయిదండముల పరి
మితి అని కొందఱు; రెండువేల దండ
ముల పరిమితి అని కొందఱు. రెండు
వేల విండ్లపట్లు కొలఁది. (శ. ర.)

శ్లో॥ హస్తై శ్చతుర్భి ర్భవతీహ
దండః క్రోశస్సహస్ర ద్వితయేన చ
తేషాం. (లీలావతి) ఆ. ని.

గవ్యూతిలో సగము. ఇరువది నాలుగు
అంగుళము లొక హస్తము; ఎనిమిది
వేల హస్తములొక క్రోశము.

శ్లో। చతుష్కాధిక వింశత్యా అంగు
ళైర్హస్త ముచ్యతే. సహస్రైరష్టభి
ఖ్యాతం హస్తకై క్రోశ మాత్రకమ్.
అమరము.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ
దానరదంబుల తోడఁ గ్రోశమాత్ర
మ్మొకచోటి కల్లఁజని. విరా. 1.58.

# క్రౌ

**క్రౌంచద్వీపము** సం. వి. అ. పుం. న.
క్రౌంచము అను పేరుగల ఒకానొక దీవి. ఇది సప్తద్వీపములలో నొకటి (సప్తద్వీపములు: జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము. శాల్మలము, పుష్కరము).
ఇది జంబూద్వీపమునకు ఎనిమిది రెట్లుండును. భీష్మ. 1.27.
చూ. ద్వీపము.

**క్రౌంచము** సం. వి. అ. పుం.
కొంచెపిట్ట. (భూ. క్రొంచె)
సీ. ... అన్నఁ దిట్టిన క్రౌంచమై పుట్టు.... అను. 4.263.
2 ఒకానొక పర్వతము.
కం. బలికొదుకు బాణుఁడనియెడు, బలవదసుర వల్లభుండు బాధించు నమర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయ బలిష్ఠుఁడయి జగములెల్ల భయముం బొందెన్. శల్య 2.190; అర.5.207
3. ఒకానొక ద్వీపము (చూ.క్రౌంచ ద్వీపము).
4. భీష్ముఁడు తన రెండవనాటి యుద్ధమునఁ బన్నిన వ్యూహము. (చూ. వ్యూహము). భీష్మ. 2.20;25.

**క్రౌంచారి** సం. వి. ఇ. పుం.
వాడియగు బాణమున, క్రౌంచ పర్వతమును ఛేదించినవాఁడు. కుమారస్వామి
వ. ... సకల భూతగణంబులుం బఱతెంచి క్రౌంచారిం బరివేష్టించె. అర. 5.214.

**క్రౌర్యము** సం. వి. అ. న.
క్రూరభావము. క్రూరత్వము, నిర్దాక్షిణ్యము.
కం. ఇంత యెఱుంగక సైన్యము, ఎంతయుఁ దలల చీరలెఱుఁగక మోహాక్రాంతంబులయ్యెఁ బని దెగుఁ గౌంతేయుఁడు సొరఁడుగాని క్రౌర్యంబుసకున్. విరా. 5.215.
కం. జనపతియుఁ గృపప్రముఖులుఁ, గనుఁగొన నిట్లనిలసుతుఁడు గ్రౌర్యమొదల్ గై,కొనినట్లు పేర్చి దుశ్శాసనుఁ జంపుటఁ జూచి రోషసంరంభమునన్. కర్ణ. 3.227.

# క్లి

**క్లిష్టము** సం. విశ. (అ. ఆ. అ.)
క్లేశము నొందినది, నొవ్వునొందినది, ఉపవాసాదులచే కృశించినది.
వ. ... ద్వాదశ వార్షిక వ్రత క్లిష్టులై యున్న కృష్ణంగాన మునీంద్రులు... వచ్చిన. అను. 4 397.

**క్లిష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
(చూ. క్లిష్టము.)

# క్లీ

**క్లీబుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
పుంస్త్వము లేనివాఁడు, మగతనము లేనివాఁడు.
వ. . సవ్యసాచి నిక్షిప్తాయుధంబైన శమీవృక్ష సమీపంబున కరుగు నవసరంబునం గ్లీబ రూపచ్ఛన్నుండయ్యును బ్రస్ఫురణ విశేష భీషణుండగు నతనిం గనుఁగొని. విరా. 4.85.

తే. (దైవపిత్ర్యములకు) క్లీబుఁ గుష్ఠి దేవలకు ... వేదవిక్రయు విడువ వలయు. అను. 2.56.

## క్లే

**క్లేదము** సం. వి. అ. పుం.

ఆర్ద్రత, తడి.

వ. ... తదీయ చర్మాస్థి శ్రేణులు దటంబులై తనరం బ్రభూత రక్త మేదః క్లేదంబులేకై పాటి చర్మఖ్యాతి యనుపేరం బరఁగె. అను. 3.86., ఆశ్వ. 4.252.

**క్లేశము** సం. వి. అ. పుం.

1. దుఃఖము.

తే. వినుము ప్రజ్ఞాధిరూఢుఁడై వనట దక్కి,సంసృతి క్లేశపరుల భూస్థలిఁ జరించు,వారి సచలంబుపై నున్న వాఁడు సూచు,నట్ల చూచుట సూవె నేర్పుమల హృదయ. శాంతి. 1.129.

2 వ్యథ, బాధ, కష్టానుభవము.

కం. కావున మీపడిన యర,ణ్యావాస క్లేశమునకు నజ్ఞానవిధిన్ సేవకులరైన దానికి,నోవకుఁడీ మీరు లఘుమనో వృత్తులరై. ఉద్యో. 1.208.

## క్వ

**క్వణత్** సం. శత్ర.

ధ్వని సేయుచున్న.

చం. క్వణదనుకింకిణీ కలిత కాంచన కాంచి కలాపమున్. ఎఱ. 8.178.

**క్వణనము** సం. వి. అ. న.

చిఱుగంటలు మొదలగువాని ధ్వని, మ్రోఁత.

మ. ... కింకిణీ, క్వణన వ్యావృత హేషితస్వనములున్. విరా. 3.159.

కం ..రథనేమి క్వణనంబు. శల్య. 1. 128.

## క్వా

**క్వాణము** సం. వి. అ. పుం.

ధ్వని, మ్రోఁత.

శా. బాణజ్వాలలు బెట్టు పర్వ గగన ప్రక్షోభణ జ్వాలతా,క్వాణ స్ఫూర్తి చటచ్చటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని ... వెలుఁగొందెఁ. కర్ణ. 2.184.

## క్ష

**క్షణము** సం. వి. అ. పుం.

1. 4/5 సెకండు. అతి సూక్ష్మకాలము.

2. ఒక గడియలో 6వ వంతు కాలము, ఇది సుమారు 4 నిముసము లగును.

"క్షణః తే తు ముహూర్తో ద్వాదశా స్త్రియామ్. ఘటికా ద్వయం ముహూర్తః. (అమ.)

ఉ. ఖేదము దక్కుమీ క్షణమ కీచకు దండితుఁజేసి నీకు నాహ్లాద మొనర్తు నేనని నయంబునఁ గేకయరాజపుత్రి. విరా. 2.160.

2. ఉత్సవము.

మ. ప్రణుత శాస్త్ర గుణంబు విక్రమము దర్పంబేర్పడన్ విక్రమ క్షణ దానంబొనరింపుము. అర. 1.253.

**క్షణికము** సం. విశ. (అ. ఆ. అ.)

నశ్వరము, క్షణకాలముండునది.

కం. మతిఁ దలఁపఁగ సంసారం,బతి
చంచల మెండమావులట్టుల సంప,
త్ప్రతతులతి క్షణికంబులు,గత
కాలము మేలు వచ్చుకాలము కంటెన్.
ఆది. 5.159.

**క్షణియించు** సం. స. క్రి.
(భోజనమునకు రమ్మని) ప్రార్థించు.
వ. అయ్యా నీ వతిథివి. మాయింటం
గృతభోజనుండవై పొమ్మని క్షణి
యించిన. ఆది. 1.99.

**క్షతజము** సం. వి. అ. న.
గాయమునుండి పుట్టినది, నెత్తురు,
రక్తము.
శా. . సంగ్రామాగ్ని కాజ్యాహు
తుల్గా వైరిక్షతజంబు ప్రేల్చి.
శాంతి. 1.181.

**క్షతము** సం. విశ. (అ. ఆ. అ.)
గాయపడినది, చీల్పఁబడినది, బాధిం
పఁబడినది, కొట్టఁబడినది.
వ. ఇట్లు విరథుండును విశిఖక్షత
దేహుండునై యతండేదుపెకిఁగినట్లు
నీదు మఱందియగు వృషకు నర
దంబు మీఁదికరిగె. భీష్మ. 3.30.
వి. అ. న.
గాయము, గంటి.
కం. క్షతములఁ బెల్లు దొరఁగు శోణి
తము. విరా. 3.191.
చం. క్షతమున ముక్కునం జెవులఁ
గన్నుల నొక్కెడు రక్తమంగ
మాప్లుతముగఁ జేయఁగా నతఁడు
బోరగిలం బడియెన్. శల్యా. 1.285.
2. అపాయము, కీడు.
తే. బ్రాహ్మణ క్షతత్రాణ తత్పరతఁ

జేసి, క్షత్రియాభిధానంబు రంజకము
నెల్ల,ప్రజకుఁ జేయుట కతమున రాజ
నామ,మును బ్రవర్తిల్లె నా నృపాలు
నకు నధిప. శాంతి. 2 215.

**క్షతి** సం. వి. ఇ. స్త్రీ.
గాయము, గంటి.
ఉ .. అత్తఱిన్ సహ,స్రాక్ష తనూజ
సారథి రథాశ్వ చయ ధ్వజముల్
పరాస్త్ర క్షతిలేక యుప్పెఁ గురు
సైన్యము వెక్కసమంది చూచెలన్.
విరా. 5.57., ఉద్యో. 4.385.

**క్షత్త్రదేవుఁడు** సం. వి. అ. పుం.
పాంచాలుఁడు: మహారథులలోఁ జేరిన
వాఁడు. ఉద్యో. 4 265.
ఈతఁడు లక్ష్మణునిలోడ యుద్ధము
చేసెను. ద్రోణ. 1.165.
ఈతఁడు శిఖండి కొడుకై నట్లును
దుర్యోధనుని కొడుకగు లక్ష్మణునిచే
జచ్చినట్లును సంస్కృతమున గలదు.

**క్షత్త్రధర్ముఁడు** సం. వి. న్. పుం.
పాంచాలుఁడు; ఇతఁడు సాత్యకితోఁ
జేరి ద్రోణునితోఁ బోరెను. ద్రోణ.
2.4.
(ఈతఁడు ధృష్టద్యుమ్నుని కొడుకై
నట్లును అర్థరథులతోఁ జేరినవాఁడై
నట్లును ద్రోణాచార్యునిచే వధింపఁ
బడినటులను సంస్కృత భారతమునఁ
గలదు.)

**క్షత్త్రబంధుఁడు** సం. వి ఉ. పుం.
ఒకానొక రాజు
ఆ. క్షత్రబంధుఁడనఁగఁ గలఁడొక్క
నరపతి. అను. 4.46.

**క్షత్త్రము** సం. వి. అ. న.

క్షత్రియ వర్ణము. రాచే కులము.

ఆ. క్షత్రమునకుఁ బట్టు బ్రాహ్మంబు,బ్రాహ్మణునకు యోని రాజుగాన,యుభయ వర్ణనంబు నొం దొంది విడువమి,వెలుఁగు రెండు మాయు విడిచెనేని. శాంతి. 2.314.

ఆ. క్షత్రధర్మమింత కష్టమగునె. ఉద్యో. 3.15., శాంతి. 6.388.

వ తొల్లి జమదగ్నిసుతుండయిన రామునిచేత ధాత్రి యపగత క్షత్త్రం బయిన. సభా. 1.109.

2. క్షాత్రము, క్షత్రియత్వము.

వ. .... అప్పరమేష్ఠి వారలతో భృగు కుశిక వంశంబులకు బ్రహ్మ క్షత్రం బులు దడంబడి సంకరంబు వాటిల్లు నని చెప్పె. అను. 2.331; శాంతి. 2.312.

**క్షత్త్రివర్మ | క్షత్త్రివర్ముఁడు** సం. వి. న్. పుం.

ఈతఁడు ద్రోణునితో యుద్ధము చేసి మరణించెను.

వ. ... సాత్యకి ధృష్టద్యుమ్న... క్షత్రధర్మ క్షత్రవర్మలును ... యక్కుంభసంభవుం దలపడిన .... ద్రోణ. 2.4.

ఆ. క్షత్రవర్మ గురుని చాపంబు ద్రుంచిన,వేఱ యొక్క దొడ్డవిల్లు రియము,మెఱయఁ గొని యతండు మెఱుఁగులు గిఱికొను,నారసమున వాని నామమడఁచె. ద్రోణ. 4.124.

**క్షత్త్రాత్ముఁడు** సం. వి. న్. పుం.

క్షాత్రమే స్వరూపముగాఁ గలవాఁడు; శ్రీరాముఁడు.

కం. క్షత్త్రాత్ముఁ గొలుతు దశరథ, పుత్రున్ శ్రీరాముఁ దనఁగఁ బొలిచిన దేవున్. శాంతి. 2.45.

**క్షత్త్రియుఁడు** సం. వి. అ. పుం.

క్షత్రియ జాతియందుఁ బుట్టిన వాఁడు; రాచవాఁడు.

ఉ. క్షత్రియుఁడోడునే తగదు కౌరవ రాజ యొకండ నేఁ బృథా,పుత్రుల లోనఁ జిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగ. విరా. 5.203.

2. విణ.

తే. బ్రాహ్మణులను అపాయమునుండి రక్షించువాఁడు.

తే. బ్రాహ్మణ క్షత త్రాణ తత్పరతఁ జేసి, క్షత్త్రియాభిధానంబ. శాంతి. 2.215.

క్షతాత్ త్రాయతే క్షత్త్రః తస్యాపత్యం క్షత్త్రియః

**క్షపణము** సం. వి. అ. న.

నాశనము.

ఉ. శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు ననేకజన్మ పాప క్షపణంబునన్ వెలుఁగు భారత సంహితకెల్లఁ బుండరీ కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్న మానవుం,దక్షయ పుణ్య లోకముల యందు రమించు నిరామయ స్థితిన్. స్వర్గ. 91.

**క్షపితము** సం. విణ. (అ. ఆ. అ.)

త్రోసివేయఁ బడినది.

శిఖరిణి. .తపస్స్వాధ్యాయాది క్షపిత మల చిత్త ప్రకలితా, స్త్రీ. 1.187.

**క్షపితుఁడు** సం. విణ. (అ. ఆ. అ).

కృశించిన వాఁడు.

కం. జప నియమ స్వాధ్యాయ,
ప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మ
ణులు జనాధిప శూద్రులు విపుల
తపః క్షపితులు గాఁగలరు వినవె
కలికాలమునన్. అర. 4.289.

**క్షమ** సం. వి. ఆ. స్త్రీ.

1. ఓర్పు, అపకారులయందు సైతము కోపము జనింపకుండుట. ప్రియాప్రియ సంఘటనలయందుఁ గలుగు ఓరిమి.

కం. క్షమియించు వానిఁ గని చాలమి
వెట్టుదురైనను దలంప ననూన,క్ష
మయ కడు మెఱయు తొడవు, త్తమ
రూపము గోరువారు దాల్తురు దానిన్.
ఉద్యో. 2.40., అర 1.223.

తే.....ఏను శాంతి,దాంతి సత్య క్షమా
భూతదయలఁ జెంది,నాఁడ లోభాదు
లొందవు నన్ను నింక. శాంతి.4.52;
శాంతి. 3.417.

2. సామర్థ్యము.

కం. అమరాధిపుఁ డమృతము గొని,
యమరావతి కరిగి తొంటియట్టుల
సుస్థానమున నవిచలిత రక్షా,క్ష
ముఁడై రక్షించుకొని సుఖస్థితినుండెన్.
ఆది. 2 120.

3. భూమి.

వ.... ఆసన్న క్షమాసీనుండై జనక జననాథ సంవాదవిధంబు విన్నవించి విశేష సమ్మదం బావహించె. శాంతి. 6.295.

కం. ... పాండు క్షమారమణు పెద్ద
కొడుకు కౌరవముఖ్యా. అశ్వ.4.211.

**క్షమత** సం. వి. ఆ. స్త్రీ.

సమర్థత.

కం. తమ జాతికిఁ దగు కర్మ,క్షమ
తలు లేకున్నయట్టి జనములు గపిలా,
సమధిక పూజన తద్దానము లొన
రింతురవి వాచు నా దురితములన్.
అను. 3.100.

**క్షమము** సం. వి. అ. త్రి.

చాలినది, సమర్థమైనది.

చం. అనవుడు మత్స్య భూరమణుఁ
డాతనికిట్లను నెట్లు శూద్రుఁగా,నెనుఁ
దలఁపంగవచ్చు ధరణీభరణ క్షమ
మూర్తివీవు. విరా. 1.220.

చం. ... భూ,ధర వహన క్షమం
బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వ
యం,బురుగుణ సంపదం బెరిఁగి
యొప్పె సమస్త జగత్ప్రసిద్ధమై. ఆది.
3 88., అర. 1.223.

**క్షమాధరము** సం. వి. అ. పుం.

కొండ.

మ...అప్పాఁపతూ,పు రయంబుగ్రము
గాఁగ బిట్టదరి దంభోళి ప్రభగ్న
క్షమా,ధర శృంగాకృతిగా హరించె
బహురత్న స్ఫీత రశ్మిచ్ఛటా,స్ఫురి
తంబైన కిరీటమున్ విజయునొప్పం
దేజముం గుందఁగన్. కర్ణ. 3.321.

**క్షమావంతుఁడు** సం. వి. (త్. తీ. త్.)

ఓర్పు గలవాఁడు, సహనశక్తి గలవాఁడు.

వ... వర్ణంబులు నాలుగింటి మీఁదను మేదినీశ్వరుండు దయ గలుగవలయు గేవల క్షమావంతుండగుటకు సాదుచేనుంగు చందంబై యుండు. శాంతి. 2.177.

**క్షమి** సం. విశే. (న్).
ఓర్పుగల వాఁడు.
కం. క్షమగల వానికిఁ బృథ్వీ,సము
నకు నిర్భాజు విజయ సంసిద్ధిపరున్,
క్షమియైన వాని భుజ వి,క్రమము
గడున్ వెలయు సర్వకార్య క్షమమై. ఆర. 1.223.

**క్షమించు, క్షమియించు** సం. స. క్రి.
సహించు, ఓర్చు.
కం. క్షమియించు వారిఁ గని చా,లమి
వెట్టుదురైనను దలంప ననూన,
క్షమయ కడు మెఱయు తొడ,వుత్తమ
రూపము గోరువారు దాల్తురు దానిన్. ఉద్యో. 2.40; ఆది. 7.143.
2. మన్నించు, తప్పు సైరించు, ఓర్పు వహించు.
కం. క్షమియింప వలయు నొకఁ
డెఱుఁ,గమి నేమేసన్న. విరా. 4 225
కం. క్షమియింప నెవ్వరము విరా. 4.227.
వ. ... నీవు రాక బసన్నుండవై క్షమింపుమనిన. ఆర. 3.195.

**క్షయము** సం. వి. అ. పుం.
1. నాశనము.
చం. అఖిల ఉపద్రయంబు జయాప
జయంబులు రెండునుం దుదిన్ సుఖ
ముటుగాని యా పనికిఁ జొత్తురె
యుత్తములు. ఉద్యో. 1.296.
కం. అంబుజనాదు రికొడుకై,సాంబుఁడు
గను యాదవ క్షయాపాదన క,ల్యం
బగు ముసలము. మౌస. 9.
2. ఇల్లు, గృహము.
చం. ... హంసుఁడు నా డిభకుండు నంతక, క్షయగతులైన నిష్ఠ గత
గర్వమునన్ మగధేశ్వరుండు ని,శ్చ
యమతి నున్నవాఁడు నిజసంక్షయ
కాల విశంకితాత్ముఁడై. సభా.1.160.

**క్షరణము** సం. వి. అ. న.
నశించుట.
మాలిని. క్షరణ రహిత వృత్తి. భీష్మ. 3 454.

**క్షరత్** సం. శత్ర.
స్రవించుచున్న, కాఱుచున్న.
మాలిని ... మథ్యమానేందు బింబ,
క్షరదమృత వికారోత్సారణానంద
రూపా. శల్య. 2.422.

**క్షరము** సం. విశే. (అ. ఆ. అ.)
1. నశించునది, నాశనము.
తే. క్షరము నక్షరమును నీవ కర్త
యును వి,కర్తయును నీవ యాద్యంత
గతులు నీవ,యొక్కఁడై వెలిఁగెడు
పురుషోత్తమాభి,ధాన వాచ్య వినమ్ర
వాత్సల్య కల్య. శాంతి. 2.10.
వి. అ. న.
2. నశించునటువంటిది, వినాశిజడము.
ఇట్టివి సర్వభూతములగు స్థావర
జంగమముల యొక్క శరీరములందుఁ
గల నాశన భావము.
తే. క్షరము నక్షరము ననంగలవు
రెండు మూర్తులాత్మ;కఫిం భూతము
లను బూన్వ, మెలయు మృతమన
దివమునముండు నమృత,మనఁగ నప
రంబు రెండినిగను బుధుండు. శాంతి. 5.111.
3. ఇరువదినాల్గు తత్వములు.
కం. క్షరమంద్రదు దాని వలనను, క్షరి

యించిన తత్త్వములను జనవత్సల
య,య్యిరువది నాల్గింటిని దర,తరమ
విభాగించి చెప్పెదం దెలియంగన్.
శాంతి. 6.6.
కం. క్షర మయ్యిరువదినాలుగు,నర
నాథా యక్షరంబునకు నెయ్యెడలన్,
క్షరభావము లేదయ్యక్షరము విలాస
ములు సూవె క్షరతత్త్వమ్ముల్.శాంతి.
6 9.

**క్షరితము** సం. విణ. (అ. ఆ. అ).
స్రవించినది, కారినది.
సీ. క్షరిత ... శార్దూల
చర్మంబు,పరిధాన కరణి విభాసిత
ముగ. సౌప్తి. 1.9.

**క్షరియించు** సం. అ. క్రి.
పుట్టు, కలుగు.
కం. క్షరమంత్రుడు దానివలనను,క్షరి
యించిన తత్త్వములను జనవత్సల
య,య్యిరువదినాల్గింటిని దర,తరమ
విభాగించి చెప్పెదం దెలియంగన్.
శాంతి. 6.6.

## క్షా

**క్షాంతి** సం. వి. ఇ. స్త్రీ.
ఓర్పు, క్షమ.
కం. స్మృతి సౌఖ్య క్షాంతి శ్రీ,ధృతి
కీర్తులు గలుగు దుర్మతియుఁ గ్రోధము
లుబ్ధతయును మాత్సర్యము లేవతి
పుణ్యత విష్ణుభక్తులైన జనులకున్.
అను. 5.32.

**క్షాంతుఁడు** సం. విణ. (అ. ఆ. అ).
ఓర్పుగలవాఁడు, సహించువాఁడు.
శా. ... నీకొక్కరుండె జెల్లెన్ సహిం
పంగ వి,ఖ్యాత క్షాంతులు లేరె ధార్మి
కులు నిక్కంబిట్టిరే యెప్పుడున్. ఆం.
4.157.

**క్షాత్త్రము** సం. విణ. (అ. ఈ. అ.)
క్షత్త్రియునకు సంబంధించినది.
వ. ... ఉత్తమ క్షాత్త్రసరణి సాధితంబైన భూవలయంబు పాలింపుము.
శాంతి. 1.222.
వ. .. క్షాత్త్రంబయిన చరువు మీ
యల్లికిచ్చి బ్రాహ్మణుని దాని నీవు
పుచ్చుకొనుము. అను. 1.110.
వి. అ. న.
క్షత్త్రియ ధర్మము.
ఉ. క్షాత్రసమగ్రు లాత్మనుత గౌరవ
దీప్తులు వర్ణనీయ సౌ,భ్రాత్రులుదాత్త
దైవబల భవ్యులు దివ్యసమానులా
పృథా,పుత్రులు.
2.ఒక విధమగు వివాహము-వధూవరు
లిర్వురొకరి నొకరు గోరి నిశ్చలమగు
పరస్పరానురాగము గలిగియుండుట
చూచి చేయు వివాహము; ప్రేమవివా
హము. తల్లిదండ్రులు అంగీకరించి
చేసిన అది క్షాత్రమను వివాహమగును.
ఉ. క్షాత్రమంత్రము బుధులు గన్య
పురుషుఁ గోర,నతఁడు గన్యకపేక్ష
నాసచేయ,నచలమగు పరస్పరాను
రాగము గని,ప్రమద మెసఁగఁ జేయు
పరిణయంబు. అను. 2.222.
(ఇతర స్థలములందుఁ జెప్పఁబడిన
అష్టవిధ వివాహములలో దీని పేరు
గానరాదు. చూ. వివాహము).

**క్షాళనము** సం. వి. అ. న.
కడుగుట.

కం. పంకజభవ సన్నిభుఁడఘ పంక
క్షాళన మహా తపస్స్ఫలియుఁడనా,తంక
మతి పైలశిష్యుఁడు,దంకుండను ముని
వడుఁడు. ఆది. 1.91.

కం. మేలై యున్నది జలము వి,శాల
నయన చెమట యొడలఁ జయ్యన
దేహక్షాళన మొనరింపుమనిన. అర.
4.329.

## క్షి

**క్షితి** సం. వి. ఇ. స్త్రీ.
భూమి, నేల.
తే. మణిమయోరగ రుచిజాల మహిత
మైన, పడగవాఁడు కురు క్షితిపతి.
విరా. 5.4.

**క్షితిజము** సం. వి. అ. పుం.
చెట్టు, భూమినుండి పుట్టినది.
ఉ. ... వసంత పుష్ప భరిత క్షితిజ
ప్రకరంబు. ఆర. 3.262.

**క్షితిపతి** సం. వి. ఇ. పుం.
రాజు, నేలఱేఁడు. (చూ. క్షితి.)

**క్షితిపాలుఁడు** సం. వి. అ. పుం.
రాజు, నేలఱేఁడు.
మ. ... పాండు క్షితిపాలు కోడ
లనఁగా ... పొగడ్తగంటి. విరా.
2.2.7.

**క్షితిపుఁడు** సం. వి. అ. పుం.
రాజు, నేలఱేఁడు.
ఉ. .... ద్రుపద క్షితిపాత్మజ. విరా.
4.184.

**క్షితిభృత్తు** సం. వి. త్. పుం.
కొండ.
కం. అటనికి సరిత్సముద్ర,క్షితిభృద్ద్వీ
పములు గేలికిం బట్టు. శాంతి. 5.595.

**క్షితిరుహము** సం. వి. అ. పుం.
చం. ... ప్రభంజనుఁ డేఁగుదెంచి
యీ,క్షితిరుహముం గనుంగొని.
శాంతి. 3.396.

**క్షితీశుఁడు** సం. వి. అ. పుం.
రాజు, నేలఱేఁడు.
తే. తాను జొచ్చిన కతన మత్స్య
క్షితీశు,నింట నిమ్మెయిఁ గ్రొత్త
యొప్పెసకమెసఁగ. విరా. 1.308.

**క్షిప్తము** సం. విశ. (అ. ఆ. అ.)
1. త్రోయఁబడినది, విసరి వైవఁ
బడినది.
కం. ఒరుఁడయ్యేనేని మామక,శరా
సన క్షిప్త దీప్త సాయకపంక్తిం బరి
మార్చెద. విరా. 4.102.
మ. ... కపి ప్రకర సైన్య క్షిప్త
శైలాకృతిన్. అర. 1.185.
2. ఛేదింపఁ బడినది.
మ. ... శక్తిం బూన్చి మంత్రించి
యు,ద్ధత తేజుండు ప్రహస్తు వైచిన
వెసం దత్ప్రాకార సంపాత పా,టిత
వక్షుండయి కూలె వాఁడు శతకోటి
క్షిప్త శైలాకృతిన్. అర. 7.84.

**క్షిప్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ).
1. త్రోయఁబడిన వాఁడు.
వ. నా శరీరంబు ప్రవేశించి సుఖం
బున శయనింపుమని తన వదనంబు
వివృతంబుగాఁ జేసిన నేనును బలా
త్కారి క్షిప్తుండుం బోలెఁ బరవశుం
డనై తన్మార్గంబున నతని యుద
రంబుఁ బ్రవేశించి యుండు. అర.
4.256.

2. ఉంపఁబడినవాఁడు.

వ.. . నిజధర్మ క్షిప్తుండును విద్వాంసుండును శాంతుండును నగు పురోహితునకు సర్వసంపదలును సమర్పించి జనపతి... యుభయ లోకంబులనుం బెంపు వహించు. శాంతి. 2.302.

## క్షీ

**క్షీరము** సం. వి. అ. పుం. న.

దుగ్ధము, పాలు.

ఉత్సాహ. జపాపుష్ప క్షీరచ్ఛవి కిరణ సంసర్జన ధురా స్త్రీ. 1,187. భీష్మ. 1.27.

**క్షీరాంబుధి** సం. వి. ఇ. పుం.

పాల కడలి, పాల సముద్రము.

కం. భూరి భవత్కారుణ్య,క్షీరాంబుధి లోన నాదు తుచ్ఛ చిత్తంబును వి,స్తారమహితముగ నునిచితి. విరా.1.20.

**క్షీరోదకవృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

పాలును నీరును కలియు విధము. క్షీరోదక న్యాయము.

కం. క్షీరోదకవృత్తి మనము,వారలునుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్. ఉద్యో. 1.263.

## క్షు

**క్షుతము** సం. వి. అ. న.

తుమ్ము.

కం. ... సక్షుతుఁడైనన్. ఆ. అట్టి యెడలఁ దనకు నాచమనము దొర, కొనకయున్న సూర్యుఁగనుచుఁ బ్రణవకలనతోడఁ గూడ వలచెవి ముట్టుట, శుచిత నిచ్చునంద్రు సూరిజనులు. అను. 4.116; శాంతి. 3.116.

**క్షుతుఁడు** సం. వి. అ. పుం.

1. బ్రహ్మదేవుని గర్భమునుండి తుమ్ముటవలనఁ బుట్టి ఋత్విజుఁడైన వాఁడు.

సీ. అజుఁడధ్వరము సేయంగఁ దలంచి ఋత్విజు నాత్మసదృశుని వెదకి యెందు,గానక తానొక్క గర్భంబు ధరియించి వేయేండ్లకును దుమ్మి వెలువరించె. క్షుత సంభవతఁ జేసి క్షుతుఁడను పేరిటఁబరఁగెడు నా ప్రజాపతియు ఋత్విజుండుగఁ గ్రతువొనర్చుచునుండ. శాంతి. 3.116.

2. ప్రజాని కొడుకు. ఇక్ష్వాకుని తండ్రి. అశ్వ. 1.17.

**క్షుత్తు** సం. వి. ధ్. స్త్రీ.

బుభుక్ష, ఆఁకలి.

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి, యతిథి వచ్చినఁ బ్రియమున నతని దప్పి,వోవునట్లుగ సముచిత భోజనంబు, వెట్టుటెల్ల పుణ్యములకుఁ బెద్ద తలఁప. అను. 5.33.

**క్షుద్రము** సం. విశే. (అ. ఆ. అ.)

నీచమైనది, హేయమైనది.

కం.... నెత్తురెత్తి త్రావుట భీముం,డు గడున్ ఘోరము సేసెను,మగలకతిక్షుద్రవృత్తమా పొగడొసఁగున్. స్త్రీ 2.63; శల్య. 2.41; శాంతి. 5.276.

ఆ. క్షుద్ర జంతువులకు. శాంతి. 5.276.

వ. . . . క్షుద్ర జనంబులకు మఱు వెట్టం దలంచి. వి. 1.178.

**క్షుద్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
హీనుఁడు, తెలివి లేనివాఁడు.
కం. సారంబు లేని ధర్మా,చారంబున మునుఁగు మాదృశ క్షుద్రులకుఁ,దీరం బిట్టిది యని తెలి,వార భవాదృశుల తగుదురర్మిలిఁ జెప్పన్. అను. 5.416.

**క్షుధ** సం. వి. అ. స్త్రీ.
ఆఁకలి.
వ. ... కళ్యాపాదుఁడు నతి క్షుధార్తులై యాహారం బన్వేషించునెడ ... అను, 3.209.

**క్షుభితము** సం. విణ. (అ. ఆ. అ.)
కలఁత పెట్టఁబడినది, సంక్షోభింపఁ జేయబడినది.
కం. అభిమన్యు ద్రుపదసుత, ప్రభృతు లతనితోన మెలఁగి బడలు వడఁగ న,య్యిభచయము [illegible], క్షుభితముగాఁజేసిరేపు [illegible]రంగన్. భీష్మ. 2.212.

**క్షుభ్యమాణము** సం. విణ. (అ.ఆ.అ.)
క్షోభ పెట్టఁబడుచున్నది.
సీ. .. నాగ నక్రమకర కుల క్షుభ్యమాణమైన తద్బాధకోపనియడి వోలె నుచ్చ భీమ. ఆ. [illegible] నీరధి యొద్దకు. అర. 3.38.

**క్షుబ్ధము** సం. విణ. (అ. ఆ. అ.)
కలఁత [illegible].
మ. .... తత్సైన్యముల్ రాజుమూఁక నతిక్షుబ్ధముగాఁగఁ జేయుటయు ప్రసుక్కఁబడ్డ చిత్తంబుతోన్. శాంతి. 2.319.

**క్షురప్రము** సం. వి. అ. పుం.
గుఱ్ఱపు లాడమువలె అర్ధచంద్రాకార మగు అలుఁగు గల బాణము; ఒక రక మైన అర్ధచంద్ర బాణము.
వ. .. భల్లాంజలిక క్షురప్ర కూర్మ నఖర ప్రభృతి బాణ వేణికా వితానం బుల వెగడు పఱచిన. ద్రోణ. 2.39.

**క్షురము** సం. వి. అ. పుం.
1. ఒక రకమైన బాణము.
ఉ. ...భీమ దృఢక్షురప్రచయ భిన్న తనుండుగఁ జేసె. భీష్మ. 2.309.
2. బాణ విశేషము.
వ. ... అప్పాండవ వీరుండు .. పటు భల్లంబున నతి నిశిత క్షుర ప్రముఖంబున శిత ప్రదరంబున శాత క్షురికా ముఖంబున దీప్త చంద్రాంబ కంబున [illegible] నారాచంబునఁ గ్రూర బాణంబున నక్కుమార సప్తకంబు సమవర్తి సమీపంబునకనిచిన. భీష్మ. 3.73.

**క్షురిక** సం. వి. అ. స్త్రీ.
కత్తి, చురకత్తి, సురియ.
వ. ... కుంత క్షురికాదులఁ గూలం బొడుచుచు. భీష్మ. 2.172.
2. ఒక రకమైన బాణము.
వ... పటు భల్లంబున నతి [illegible] ప్రముఖంబున శిత ప్రదరంబున శాత క్షురికా ముఖంబున దీప్తార్ధ చంద్రాంబ కంబున ఖర నారాచంబునఁ గ్రూర [illegible] నక్కుమార సప్తకంబు

సమవర్తి సమీపంబునకనిచిన. భీష్మ. 3.23.

## క్షే

**క్షేత్రజుఁడు** సం. వి. అ. పుం.
ద్వాదశ పుత్రులలో నొకఁడు. భర్త యనుజ్ఞచేత, భర్త లేనిచో అధికారము గల మరియొకరి యాజ్ఞచేత, భార్యకు అర్హుడైన మఱొకరివలనఁ బుట్టిన వాఁడు.

తే. ధర్మపథమునఁ బనిచిన దనదు పత్ని,యర్హపురుష సంగతిఁ గన్న యాత్మజుండు, క్షేత్రజుండనఁగా నిజపుత్ర భావ,మొందు ధర్మ ప్రపంచాభివందితాత్మ. అను. 2.245.

వ. ... సత్యవతి కృష్ణద్వైపాయను నియోగించి ఋతుమతియు శుచిస్నాత యునై యున్న యంబిక కడకుం జని క్షేత్రజుండైన వాఁడు సుపుత్రుఁడు గావున ధర్మ్యంబైన విధానంబున నీవు రాజ్య ధురంధరుండైన కొడుకుం బడసి భరతవంశంబు నిలుపుము, ఆది. 4.252.

**క్షేత్రజ్ఞుఁడు** సం. వి. అ. పుం.
పరమాత్మ, జీవుఁడు, పురుషుఁడు.

సీ. .. ఇన్నియును సంకలితముగ. నంచిత క్షేత్రజ్ఞునందుఁగూర్చినవాఁడవీ పరమ ధ్యానమేమి కతన. తే. నాలసె నొకో. శాంతి. 2.8.

కం. క్షేత్రజ్ఞుండనఁగ నిఖిల,గాత్ర వ్యాప్తత్వ మహిమ గలిగి సమీరా సూత్రణమున జీవుండును,గోత్రమునై సర్వ వర్తనుం బరముండున్. శాంతి. 4.93.

వ. క్షేత్రంబన నవ్యక్తంబనం బ్రకృతియనం బ్రధానంబనం బరఁగు తత్త్వంబొక్కటియ చాలిన సత్త్వంబు నంద్రు జీవుండా క్షేత్రంబు నెఱిఁగెడి వాఁడు గావున క్షేత్రజ్ఞుఁడును నవ్యక్త పురంబున వసియించుటం జేసి పురుషుండు నన వెలుంగు శాంతి. 6.43.

**క్షేత్రము** సం. వి. అ. న.
1. స్థానము, ఉనికిపట్టు.

కం. శత్రునృప కాలకూటము,మిత్రామృత వృష్టి బుధ సమీహిత సిద్ధి, క్షేత్రము సజ్జన సంస్తుతిపాత్ర మితఁడు మాద్రిపొలుతపట్టి నరేంద్రా. విరా. 5.326.

2 భూమి, నేల.

సీ. అర్కుని యుదయంబు నస్తమయము,నగునట్టి పొలిమేరలైన మహాక్షేత్రమంతయు నొక్కండె యనుభవించి (మాంధాతృఁడు) ద్రోణ 2.204.

కం. ఏకరసమయ క్షేత్రము,నేకౌషధి రసమయంబయిన యట్లు. శాంతి. 4.195.

3. దేహము, శరీరము.

కం. సువ్యక్త క్షేత్రంబున,నవ్యక్తాకృతి నిరూఢి నాసీనుండై,ధన్మత నుఁబెను క్షేత్రాత్మ వ్యపదిష్టుఁ బ్రణుతింతు పాపోపహరిన్. శాంతి. 2.27.

4. భార్య.

వ. ఇవ్విధంబున నుత్తమ క్షత్రియ క్షేత్రంబులందు ధర్మమార్గంబున

**క్షోభము** సం. వి. అ. పుం.
వ్యాకులత, కలఁత, గగ్గోలు.
శా. పక్షివ్యాకులముం బరేత నిలయో పాంతోత్థమున్ డాకినీ రక్షోభూత పిశాచ గోచరము దుర్గంధంబునై చూడఁ జిత్తక్షోభం బొనరించు నట్లగుట జెంతం జేరరారీ శమీ,వృక్షం బెవ్వరికిం. విరా. 1.164; విరా. 3.142.
(దుర్యోధనుఁడు ద్రోణుని దూఱ నాడుట),
కం. ఈభంగి నీవదంగుట, మా భాగ్యముగాక యింక మాటలు వలదీ, క్షోభం బెట్టుటుడుగుఁ జెపు,మా భవదీయబల శౌర్యమతులకుఁ దగగాన్. ద్రోణ. 4.165.

**క్షోభితము** సం. విణ. (అ. ఆ. అ.)
కలఁత పెట్టఁబడినది.
వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును బ్రీతుండై గాండీవ విక్షేప క్షోభిత నభోభాగుండగుచుఁ గానీనుపై నానా నిశిత విశిఖంబులు నినిచె. విరా. 5.96.

## క్షౌ

**క్షౌద్రము** సం. వి. అ. న.
తేనె.
వ. ... కుళింద పారద బర్బర, తురుష్క టెంకణ కోంకణాధి పతులు ... కౌసుమ క్షౌద్ర పాత్రంబులను .. ఇచ్చిరి. సభా. 2.113.

**క్షౌమము** సం. విణ. (అ. ఈ. అ).
పట్టు సంబంధమైనది (వస్త్రము).
వ. ... మున్న తెప్పించిన చందనాగురు ఖండ క్షౌమ వసన కస్తూరికా కుంకుమ ఘృత తైల ప్రభృతులగు వలయు వస్తువులా ధౌమ్య ముఖ్యుల కొప్పించిన. స్త్రీ. 2.172.
నారచీర,
సీ. .... అయ్యుధిష్ఠిరుఁడును నమ్మరున్నదీతనయు పుణ్య,గాత్రంబును స్నానకలితంబు నుత్తమ క్షౌమావృతంబు నుజ్జ్వ,లాభరణ భూషితంబుగా నధికభక్తిఁ జేసిరి. అను. 5.469.

**క్షౌరకుఁడు** సం. వి. అ. పుం.
మంగలి.
వ. ... పురిఁగల వైశ్య శూద్ర శిల్పి కర్మార తక్షక క్షౌరక స్వర్ణకారక రజకాదు లమ్మహీపతి బలసి చనిరి. స్త్రీ. 1.104.

## క్ష్మా

**క్ష్మా** సం. వి. ఆ. స్త్రీ.
నేల.
తే. గగన పవన తేజో జల క్ష్మా గుణములు, సూవె శబ్దాదికంబును. శాంతి. 5.164.

**క్ష్మాజము** సం. వి అ. పుం.
చెట్టు.
మ. వలలుండెక్కడఁ జూచె నొండెడ నసేవ్య క్ష్మాజముల్ పుట్టవే. విరా. 2.136.

**క్ష్మానాయకుఁడు** సం. వి. అ. పుం.
రాజు.

కం. ఏనమ్రహాసుభావుల, మేనల్లుఁడ వారలార మిత్రులు శత్రుక్ష్మానాయక గర్వితమో, భానులు బంధు హిత కార్య పరతంత్రాత్మల్. విరా. 5.128.

**క్ష్మాపాలుఁడు** సం. వి. అ. పుం.
రాజు.
స్రగ్ధర ... క్ష్మాపాల శ్రేణీ విశాలాం ఒక కుముదవనీ బాంధవాయత్త చంద్ర శ్రీలీలా గాఢకాంతి స్మిత వదన రుచిస్ఫీతు నాగేంద్ర కేతున్. విరా. 3.78.

# ఖ

**ఖ** సం. వి. అ. పుం.
1. ఆకాశము.
(దీనికి భారతమున వ్యస్త ప్రయోగము గానరాదు.)
చూ. ఖతలము, (ఖగము, ఖద్యోతము)
2. శూన్యము, సున్న (గణితము)
తే. ఖద్వయిరు గుణంబులు. శాంతి. 5.46.

**ఖండన** సం. వి. ఆ. స్త్రీ.
ఛేదించుట. నఱకుట.
ఉ. శిక్షిత చిత్రసంగర విశేములం బ్రతిహేతి ఖండనా,దక్షత పెంపు సొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ,స్రాక్ష తనూజ సారథి రథాశ్వచయ ధ్వజముల్ పరాస్త్ర శ,స్త్ర క్షతి యొప్పెఁ గురుసైన్యము వెక్కసమంది బెగ్గలన్. విరా. 5.57.

**ఖండనము** సం. వి. అ. న.
నఱకుట, ఛేదించుట.

వ. ... అందిరుదెఱంగుల యోధులు నన్యోన్య ధ్వజ భంజనంబును ... మిథః కోదండ ఖండనంబును జేయుచుండం. భీష్మ. 3.345.

**ఖండ పరశువు** సం. వి. ఉ. పుం.
విష్ణువు.
వ. ... రుద్రుండు రౌద్రాకారంబున నయ్యజ్ఞంబు వెనుకొని నాపయిం గవిసిన నొక్క యిషీక పరశురూపంబుగా నభిమంత్రించి యతనిపయిం బ్రయోగించిన నతండు దాని ఖండితధారంబు సేయుటంజేసి ఖండపరశువను నభిధానంబు గలిగె నను.... శాంతి. 6.441.

**ఖండము** సం. వి. అ. పుఁ. న.
1. భాగము (భూభాగము).
కం. తొమ్మిది ఖండములై వ,ర్షమ్ములనం జాల నొప్పెసగు జంబూద్వీ,పమ్మున జనపదములు విను,మమ్మహితాంశములు దెలియ ననువర్ణింతున్. భీష్మ. 1.24.
ఆ. ... కడచి వచ్చె భరత ఖండమునకు. శాంతి. 6.261.
(భరతఖండము = భరతదేశము)
2. ముక్క, తునక.
తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ,శస్త్ర ఖండ జాలంబులఁ జాల నొప్పె, బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు, దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవవోలె. భీష్మ. 3.162.
3. తెంపు, విచ్ఛిత్తి.
సీ. .. ఆత్మ - ఆ - నాత్మయందకని యనామయత్వముఁ బొంది,ఖండ

రహితమగు సుఖమున మునిఁగి,
యుండువాఁడ భూసురోత్తమ చెప్పవే,
యనిన నతనికిట్టులనియె నతఁడు.
శాంతి. 6.550.

**ఖండ శర్కర** సం. వి. ఆ. స్త్రీ.
కండచక్కెర, పులకండము, పటిక
బెల్లము.
(భీముఁడు దుశ్శాసనుని రక్తము చవి
చూచుచు అన్నమాటలు.)
తే. తల్లిచన్నుల పాలేను త్రావనెట్టు,
లాననే పలు తెఱఁగుల తేనియలును,
ఖండశర్కర తోడి దుగ్ధంబులనుభ,
వింపఁ బడవె యవియునింత యింపు
గావు. కర్ణ. 3.216.

**ఖండించు** సం. క్రియ.
ఖండములు చేయు.
మ. ... ఈ భూజము వంటకట్టియ
లకై ఖండింపఁగా నేటికిన్. విరా.
2.136; ద్రోణ. 3 242.

**ఖండితము** సం విణ. (అ. ఆ. అ.)
1. ఖండింపఁ బడినది, నఱకఁ
బడినది.
ఆ. అర్జునాస్త్ర ఖండితాతపత్ర ధ్వజ,
చామరములు గాలిఁ జదలఁ దూలఁ.
విరా. 5.54.
2. విఱుగఁగొట్టఁ బడినది.
మ. తన కోదండము ఖండితంబ
గుడుఁ గ్రోధంబార మందాకినీ,తన
యుండష్టు సటా విలుంచన సముద్య
త్క్రోధ సింహాకృతిన్,ధనువాం
డుద్ధత లీల నెత్తికొని యస్త్రశ్రేణిఁ
బర్వించె. 5.173.
3. చెఱుపఁబడినది, నాశనము చేయఁ
బడినది.
కం. .... ధర్మము, ఖండితమై
మొదలుకొని [?]రకార్యంబులకున్.
శాంతి. 2.200.
4. మొక్కవోయినది, కుంఠితము.
వ. ... ఆ రుద్రుండు రౌద్రాకారం
బున నయ్యజ్ఞంబు వెనుకొని నాపయిం
గవిసిన నొక్క యిషీక పరశు
రూపంబుగా నభిమంత్రించి యతని
పయిం బ్రయోగించిన నతండు దాని
ఖండితధారంబు సేయుటంజేసి ఖండ
పరశువను నభిధానంబునుం గలిగె
ననుటయు. శాంతి. 6.441.

**ఖండీభూతము** సం. విణ. (అ. ఆ.అ.)
తునియలైనది, ముక్కలైనది.
శా. గాండీవంబు గుణంబు ఘోర రవ
మాకాశంబునం బర్వ వేదండ స్యందన
ఘోటకంబులు మహాస్త్ర క్రూర పాతం
బుల, ఖండీభూతములున్విదారితములు
న్భగ్నంబులుంగా సముద్దండుండై
యదరం గలంగి పఱచెం తత్సైన్య
సంతానమున్. ద్రోణ. 4.306; కర్ణ.
2.282.

**ఖగము** సం. వి. అ. పుం.
పక్షి (ఆకాశమునఁ బోవునది).
తే. ఖగములకు జీవనంబనఁ గలదె
సంగ్రహించినట్టిది యాఁకలికేమియైన
మాకు దొరకొన్నఁ దిందుము. శాంతి.
3.321.

**ఖగముఖుఁడు**
ఒక ముని ముఖ్యుఁడు. సహస్రపాదుఁ
డను మునిముఖ్యుని స్నేహితుఁడు.

సహస్రపాదుని డుండుభమ్ము గమ్మని శపించినవాఁడు. ఆది. 1.156.

**ఖచరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఆకాశమునందు సంచరించువాఁడు. దేవతా జాతివాఁడు.
కం. సుర గరుడ ఖచర విద్యా ధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో, నర యుఁగ నొక్కత వగుదు. విరా. 1.314.
కం. సుర గరుడ ఖచర విద్యా,ధర ఖేచరు లంబరంబుదాత్త ధ్వని సం, భరితముగఁ బొగడి ర,మ్యమ్మరహరు దివ్య ప్రసవ వించితార్చన తోడన్. కర్ణ. 3.320.
(ఇచ్చట సమానార్థక ప్రతిపాదకములైన 'ఖచర', 'ఖేచర' శబ్దములు రెండు నుపయోగింపఁబడుటచే 'ఖేచరులు ఖచరులు' అను వారికి కొలఁది శాఖాభేద ముండియుండునని తలంప వలసి యున్నది- బ్రాహ్మణులలో నాఁడు భేదము వలె. లేదా 'ఖచర' శబ్దమునకుఁ బాఠాంతరమైన(సం.ము) సిద్ధ శబ్దము యుక్తమనియైనఁ దలంపవలసి యున్నది. మూలమునందీ దేవతాజాతి వివరము గానరాదు. శ్లో॥ తతోఽంతరిక్షే సుమహాన్నినాద స్సంపూజనార్థం మధుసూదనస్య. దివ్యాశ్చవాచస్సహసా బభూవుర్దివ్యాని పుష్పాణ్యథ సింహనాదాః. సం.భార. కర్ణ. 91.35.

**ఖచితము** సం. విణ. (అ. ఆ. అ.)
చెక్కఁబడినది, పొదుగఁబడినది. తాఁపఁబడినది.
వ. ... ఖచిత కాంచన బిందు సందోహంబగు సన్నాహంబు వెట్టికొని .. విరా. 3.144.

**ఖచియించు** సం. స. క్రి.
చెక్కు, పొదుగు, తాచు.
కం. ఖచియించిన వజ్రంబుల,రుచులను బొలుపారు సేవిరులు బెరయంగన్. ఉద్యో. 4.123.

**ఖట్వాంగ ధరుఁడు** సం. వి. అ. పుం.
శివుడు.
సీ. స్థాణు నుగ్రుని శివు .... శూల ఖట్వాంగధరు .... సౌప్తి. 1.112.

**ఖట్వాంగము** సం. వి. అ. పుం.
శివుని యాయుధవిశేషము.
సీ. స్థాణు నుగ్రు శివు...శూల ఖట్వాంగధరు. సౌప్తి. 1.112.
2. కపాలము చివరఁగల కఱ్ఱ. కపాల దండము (యోగులు యోగినులు ధరింతురు).
సీ. వినుము కర్మము దెల్పుచును గపాలంబున నెత్తిన బైక్షాన్న మేక కాల,మశనంబు గొనుచు ఖట్వాంగ చిహ్నము బ్రహ్మచర్యంబునై యథశ్శయన మాచరించుచు నిట్లు పండ్రెండు వర్షంబులు వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య,కిల్బిషంబు దొఱంగు. శాంతి. 1.304.

**ఖడ్గము** సం. వి. అ. పుం.
1. కత్తి.
సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి. విరా. 1.211.
బ్రహ్మ లోకముల రక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా

దీనిని గల్పించెను. బ్రహ్మ యీ ఖడ్గమును దైత్య సంహరణార్థము శివున కిచ్చెను. శివుఁడు విష్ణువున కొసఁగెను. విష్ణువు మరీచికిచ్చెను. మరీచి భార్గవునకు భార్గవుండనేక మునులకు మును లింద్రునకు నింద్రుండు లోకపాలురకు నిచ్చెను. క్రమముగా మను ప్రభృతులైన మానవేంద్రులు దీనిని బొంది నిజ సంతతికి నిచ్చుచు వచ్చిరి. అందు దుష్యంతుఁడు భరతునకిచ్చెను. ఆ భరత వంశంబునందు ఖడ్గ సంప్రదాయము గలిగివచ్చెను. ఒక ముని అనుగ్రహింప ద్రోణుఁడధిగమించి కృపునకిచ్చెను. కృపునిచేతఁ బాండవులేవురుపడసిరి. దీనికి నక్షత్రము కృత్తిక. అగ్ని అధిదేవత. గురుఁడు రుద్రుఁడు. దీనికి1)అసి,2)విశసనము, 3) ఖడ్గము, 4) తీక్ష్ణధారము, 5)దురాసదము, 6) శ్రీగర్భము, 7) విజయము, 8) ధర్మపాలము అని నెనిమిది పూజ్యనామములు గలవు. ఇది ఆయుధములలోఁ బ్రధానమైనది. శాంతి. 3.442; మొ. 450 వ.

(ఖడ్గము ఇచ్చుట అనఁగా ఖడ్గమంత్రమును సాంగన్యాస కరన్యాసముగా నుపదేశించుట అని అర్థము. ఆ మంత్రసిద్ధి పొందినఁగాని ఖడ్గము పనిచేయదు; ఉపయోగింప శక్తి రాదు.)

2. యుద్ధ వ్యాపారము.

కం. దుర్యోధను నింటం దగు,కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా,తుర్యంబు మెఱయు కర్ణుని, యార్యత్వము నెల్లచన్న యది మే నెమ్మిన్. ఉద్యో. 1.281.

3. ఖడ్గమృగము.

తే. గొఱియనంబుడు ఖడ్గంబునెఱచి గండ,మృగమునందలి పలలంబు మేఁకమాంస,మొక్కడొకటికి ఫలమున నెక్కుడంద్రు, పితృ సమర్చన విదులైన పెద్దలధిప. అను. 3.167.

(ఖడ్గమృగము, గండమృగము ఒక్కటిగఁ. శ. ర. చెప్పుచున్నది గాని పై పద్యమునుబట్టి రెండును వేఱువేఱని పై పద్యము దెలుపుచున్నది. బహుశః ఈ రెండును ఒకే జాతికిఁ జెంది ఈషద్భేదము గల జంతువులేమో.)

**ఖతలము** సం. వి. అ. న.

ఆకాశము ('తలము' అర్థరహితము. ప్రదేశము అని భావము.)

కం. మృతిఁ బొంది రాక్షసుండై, ఖతలంబుననుండి పలుకు. శాంతి. 1.23.

**ఖద్యోతము** సం. వి. అ. పుం.

మిడుఁగుఱు పురుగు (ఆకాశమునందుఁ బ్రకాశించునది.)

తే. గొంతికొడుకును దేవకికొడుకు మనము, గనియెదము దినకర ని శాకరులఁ బోలె,వెలుఁగనయ్యెడ ఖద్యోత విలసితంబు తోడిదగుఁగాక నీ పెంపు దోఁపఁగలదె. కర్ణ. 2.86.

**ఖద్వయర్తు గుణంబులు** సం. సమ.

3600. శాంతి. 5.46.

**ఖనకుఁడు** సం. విణ. (అ. నికా. అ).

1. త్రవ్వెడు వాఁడు.

వ. అట హస్తిపురంబున విదురుండు

దుర్యోధను దుర్మంత్రంబంతయు నిమ్ముగా నెఱింగి కడు విశ్వాసి నొక్కఁ ఖనకు నతికుశలుం బాండవుల పాలికిం బుత్తెంచిన. ఆది.6.158.

**ఖననము** సం. వి. అ. న.

త్రవ్వుట.

తే. ... ఖనన మథనముల నెట్లు జలముఁ, జిచ్చుఁబుట్టు నమ్మెయి నరుచేష్ట దైవ,యోగమున సిద్ధిఁ బొందు. అను. 5.155.

**ఖని** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

రత్నములు పుట్టెడు చోటు-గని, స్థానము.

సీ. ... మహిత విభవ,ఖనియగు శిశుపాల తనయుండు దోర్దర్ప ధుర్యుండు. ఉద్యో. 4.109.

సం. వి. ఇ. పుం.

గర్గవంశమునఁ బుట్టినవాఁడు. ఒకానొక తపస్వి. ఈతఁడు పరమ తపమున నొక కన్యఁ బడసి పెంచి దివమునకేగెను. శల్య. 2 208.

**ఖనీనేత్రుఁడు** సం. వి. అ. పుం.

వివింశతి కొడుకు. అశ్వ. 1.18.

**ఖరకరుఁడు** సం. వి. ఆ. పుం.

తీక్ష్ణమైన కిరణములు గలవాఁడు. సూర్యుఁడు.

కం. ఖరకిరణ తాపమున నురు,తర దవదాహమున శోషితములైన వనాం, తర తరుతతి. అర. 4.134.

**ఖరము** సం. విశ. (అ. ఆ. అ.)

గట్టిది, కఠినమైనది, పదునైనది.

వ. ... యుధిష్ఠిరానుజాతి నిష్ఠుర భల్ల భజ్యమాన బలవదరాతి ఖరాస్త్ర నిస్వనంబుల వలనను. విరా. 5.60.

చం. కలిసి ఖరంబులైన మునికాళ్ళను వ్రేయఁగ. అను. 1.232.

2. వాడిమి గలది.

వ. ... అప్పాండవవీరుండు రోషాతిభీషణుండై ... ఖరనారాచంబునఁ గ్రూర బాణంబున నక్కుమార సప్తకంబు సమవర్తి సమీపంబున కనిచిన. భీష్మ. 3.23.

3. తీక్ష్ణము.

కం. ఖరుఁడు ఖరతేజుఁడవనీ,సుర పరిభవకారి. అర. 6.275.

4. గాడిద, వేసడము, కంచర గాడిద.

సీ. .... ఉష్ట్ర ఖరి గోహయంబుల యందులో నొక్కటి చందమొంది. తే. యడఁగి యున్నాఁడు. శాంతి. 4.387.

సీ శకల ఖరోష్ట్ర ఘోటక కుంజరంబుల,నేకసహస్రంబు లెలమి సంఘటించి భారంబు లెత్తించి .. అశ్వ. 3.156.

**ఖరి** సం. వి. ఈ. స్త్రీ.

ఆఁడుగాడిద.

కం. తురగియు, నుష్ట్రియు ఖరియును, గురిసిన దుగ్ధములు నింద్య కోటి గణితముల్, ధరణీసురాది జనుల,ప్పొరుపునఁ బోయిన నఘంబుఁ బొందుదురధిపా. శాంతి. 1 321.

**ఖరుఁడు** సం. వి. అ. పుం.

1. రావణుని సవతితల్లి కొడుకు; శూర్పణఖ యన్న.

వ అతండు (విశ్రవసుఁడు) వారలకుఁ బుత్త్రోదానంబు సేసిన నందు

బుహ్పోత్కటకు రావణ కుంభకర్ణు లును మాలినికి విభీషణుండును పాకకు ఖరుండును శూర్పణఖ యను రాక్షసయు మిథునంబై ప్రభవించిరి. ఆర. 6.273.
(చూ. విశ్రవసుఁడు.)
2. ఒకానొక రాక్షసవీరుఁడు. వీనిని రావణుఁడు కపిసేనల పైకిఁ బంపెను. విభీషణుఁడీతని చునుమాడెను. ఆర. 2.20;21.
యాజ్ఞవల్క్యునకు ముగ్గురు కొడుకులు పుట్టిరి వారు 1) చంద్రకాంతుఁడు, 2) మహామేధుఁడు, 3) విజయుఁడు. ఈ ముగ్గురు బ్రాహ్మణోత్తములు. శివ శాపముచే బ్రహ్మవిత్తములైన ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరుఁడు అనువారు జన్మించిరి. వారి శిష్యులు పదునాలుగు వేవురు రాక్షసులైరి. కావున వారి వాక్యములు బాహ్య దృష్టికిఁ బరుషములైనను వాస్తవము నకు సౌమ్యములే శ్రీమద్రామాయ ణము. 19 సర్గ. షండమము. 320. ప. వ్యాఖ్య.

**ఖర్వటము** సం. వి. అ. పుం.
కొండదొన నాశ్రయించి యుండెడు పల్లె పమ్మరి, పద్రంగి లోనగు వారుండెడు పల్లె (అని కొందఱు) (శ. ర.) ఒక ప్రక్క గ్రామమును ఒక ప్రక్క నగరమును గలదిగాను నదీ గిరి సమాశ్రయము గలదిగాను నుండు గ్రామభేదము. (సూ. ఆ. ని.)
చం ఆ రాజు నగ్నిదేవుఁడు, గారవ మున నడుగ నతఁడు గడుఁబెంపున నా,హారముగ నిచ్చె గిరి నగరా,రణ్య గ్రామ ఖర్వటాదు లతనికిన్. శాంతి. 2.75.

**ఖలుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)
క్రూరుఁడు, దుష్టుఁడు.
చం ఎఱుఁగవుగాక రాఘవు సుదీర్ఘ సుశాఖల రూఢి .. న,క్కఱ మది నీకు నిత్తెఱఁగుఁ గాదన కేటఁ సొక్క బుద్ధిఁగాఁ,గఱపినవాఁడు చేటు నకుఁ గాలము చేరెనొ కాక యిమ్మె యిన్. ఆర. 6.320

# ఖా

**ఖాండవ గృహము** సం. వి. అ న.
ఖాండవమునకు ఉనికిపట్టు
కం. పాండుసుతుఁడంత నానా,కాండ సహస్రము నేసి ఘనముగఁ జేసెన్, ఖాండవగృహము నఖండా,ఖండల ధారలకుఁ దూఱఁగాకుండంగన్. ఆది. 8.271
పాండవులు హస్తినాపురమునుండి వెడలిన తరువాత నివసించిన చోటు-ఇంద్రప్రస్థము (చూ.ఇంద్రప్రస్థము)
కం. నెమ్మిఁ జని ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముఁ జేసి ఆది. 8.67

**ఖాండవము** సం వి. అ. న.
కురుక్షేత్రమునకు పడమటి యొక అడవి పేరు. ఇంద్రుని యొక్క యొకానొక వనము కృష్ణార్జునుల సాహాయ్యమున అగ్నిదేవుఁడు దీనిని దహించి తన అజీర్ణవ్యాధిని బోఁగొట్టుకొనెను. (వివ రమునకై చూ. ఆది. 8.250. మొ. 281. వ.)

**ఖాణము** వై. వి

గుఱ్ఱము మొదలగువానికి బెట్టెడి యులవలు లోనుగాఁగల భక్ష్యము, దాణా.
కం. మునుదివ్యాస్త్రబలంబున, జనియించిన వీరిలోన స మూలంబై యొనరిన ఖాదనము మేపెం, దనివు సనం దుకగ ములకు చర్వమెలర్పన్. ద్రోణ 3.165.

**ఖాతము** సం. వి. అ. న.
త్రవ్వుట.
వ. ... వసుమతీఖాత గర్వితులైన సగరసుతులు. ఆ. 1.375.
సం. విణ. (అ. ఆ. అ.)
త్రవ్వఁబడినది.
వ. .. అంశుమంతుం డాక్షణంబ చని సగరసుత ఖాత ద్వారంబున సముద్రంబు సొచ్చి. అర 3 69

**ఖాదనము** సం. వి. అ. న.
తినుట.
వ... పిండుగట్టి నిశాచరుఁ నలిరేగి రక్తపానంబును, మాంస ఖాదనంబును జేయుచు. ద్రోణ. 2..37

**ఖాది** సం. విణ. (న్. నీ. న్)
తినునది.
తే. జనునె కమల సుగంధి కాసారకేళి, కలువ శవఖాదియైన సృగాలము నకు. అర. 6.201.

**ఖాదిరము** సం. విణ. (న్. నీ. న్)
చంద్ర సంబంధమైనది.
వ. ... ఖాదిరంబులాఱును. .. శ్లేష్మాతక తరు కల్పితం బొకండును గా నిరువదియొక్క యూపంబులు. ఆశ్వ. 4..80.

**ఖాద్యము** సం. విణ. (అ. ఆ. అ.)
తినఁదగినది, భక్ష్యము, భోజ్యము.
వ. ... కీచకుండు ముదిత హృదయుండయి నిజ సదనంబునకుం జని వివిధ పదార్థసంపూర్ణంబులగు సముచిత ఖాద్యంబులు సమకట్టి. విరా. 2 82
2. మేఁత, దాణా మొ
వ. ... పార్థుండు నిజరథంబు సవిశేష కల్పితంబు సేయించి రథ్యంబుల జలపాన ఖాద్య బాదనంబులం ప్రబలంబులఁ గావించి పూన్పించి. కర్ణ. 8..12.

## ఖి

**ఖిన్నము** సం. విణ. (అ. ఆ. అ.)
ఖేదము నొందినది, దుఃఖము నొందినది.
వ కౌంతేయాగ్రజుండు. . ..పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు బ్బెనియె విరా. 1.102
తే అటుల యిది భవన్మాత పెత్తా ధ్వగమన, ఖిన్నయైనది. ఆర.3 306.

## ఖు

**ఖురము** సం. వి. అ. పుం.
గొరిజ, గిట్ట.
సీ. ... తురగ ఖురోద్ధూత ధూళి పర్వెడసిన, వననిధి వండలి వండు గాఁగ విరా 3..57, శాంతి 5.443.

## ఖే

**ఖేచరుఁడు** సం. వి, అ. పుం.

పేవలుజూపికి వెండిరవాడు (ఆకాశ మునందు సంచరించు వాడు).
ఉ. ... మేటి మగలంపుక వారణలేక పేచరుల్,వెక్కసపుడ నొచ్చియుఁ జలింపక పోరిరి. పెక్కు భంగులన్. విరా. 3.168
(చూ. ఖచరుఁడు)

**ఖేటకము** సం. వి. అ. న.
డాలు,పలక, కేడెము.
ఉ. ఖడ్గము ఖేటకంబు నుద్దంచితఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయముల్లసిల్లఁగన్. విరా. 5.151.
ఉ. కోపమెలర్ప ఖేటకముఁ గ్రొత్త కృపాణముఁ గొంచు. ద్రోణ. 2.95.

**ఖేటము** సం. వి. అ న ఖేటకము
పలక, కేడెము
వ. ... ఆ ధృష్టద్యుమ్నుండు గడి గొనినఁ మిగెయల గావించెఁ ... వాఁడును గొనివచ్చి యుష్టీపలంబు సారథి తురంగంబుల యంగంబుల వ్రయ్య నేయఁ ... ఖేట పాట సంబు సేసి ... జంత కాండంబులు ... ద్రోణ 5 32,

**ఖేదనము** సం. వి అ న
దైన్యము, విన్నఁబోవు, దుఃఖము.
ఆ. ... తమోగుణము లప్రకాశ మోహ బహుతరాఽస వాద ప్రమాద మౌర్ఖ్య ... ఖేదనములు. శాంతి 6.98

**ఖేదము** సం. వి. అ. పుం
1. దైన్యము, విన్నఁబోవు, దుఃఖము, వగపు.
వ. ... (ధర్మజుఁడు) అనిలతనయు నిరీక్షించి తత్కాల జనితంబయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్ప జలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పులడంచి ధైర్యంబవలంబించి యిట్లనియె. విరా. 1.73, కర్ణ. 2.58.
2. పరిశ్రమము, మిక్కిలి అలపు.
వ. .. ... ... ... ... ... వేదంబున నుప్తుండైన వాని సర్వాంగ ... ... సర్పంబులం బట్టి కఱపించిన నాతండు వజ్రమయ దేహుండు గావున ... అది 3.13.

**ఖేలగమన** సం. విశ. (అ. ఆ. అ.)
విలాసయుక్తమైన నడక గలది.
తే. అబల యిది భవన్మాత ... ధ్వగమన, విన్నయైనది గజరాజ ఖేలగమన, దీనికెత్తికొని నడుమెమ్ము మా ... సుతుని ... మించెనప్పుడు ఆ. 3 3..

**ఖేలత్** సం. క్రి.
... క్రీడించుచున్న
... ప్రస్వర —. ... చూలా సౌ ప్తి 1.238.

**ఖేలన** సం. వి. అ. స్త్రీ ఖేలనము
క్రీడ, ఆట, విలాసము
ఉ గోత్ర మహా మహీధర నికుంజ ములన్ విపినంబులం గురు, క్షేత్ర మునం బ్రకామగతి ఖేలన నొప్పి మహాహ్వ సేనుఁడై,ధాత్రిఁ ... మించు...లక్షకుఁడు మాకుఁ ... ఎయ్యెడున్. ఆది. 1.107

**ఖేలనము** సం. వి అ న

క్రీడ, ఆట.

చం. మునివర శాపసంభవదమోఘ
గతిన్ ముసలంబు సాదృతం,బును
నతిదారుణంబు నగు భూరి సముద్భట
శక్తి ఖేలనం,బున ముసలత్వ విస్ఫు
రణముం గలిగించె. ... మౌస. 55.

**ఖేలము** సం. విణ. (అ. ఆ. అ.).
విలాస యుక్తము.
(చూ. ఖేలగమన).

## ఖ్యా

**ఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ),
ప్రసిద్ధము, వాసికెక్కినది.
ఉ. ఈతఁడ జాతశత్రుఁడు ... అర్క
సుతాంప సంపద,ఖ్యాత చరిత్రుఁడీ
చిఋత గద్దియకుం దగఁడే నరేశ్వరా.
విరా. 5 321.

**ఖ్యాతి** సం. వి. ఇ స్త్రీ.
ప్రసిద్ధి, వాసి.
కం. పాతివ్రత్యము గలిగిన,నాతి
యనఁగ దైవమన జనస్తుత వేశే,
యాలత ధర్మార్థ సుఖ,ఖ్యాతులు
సద్భార్యవలనఁగాదే కలుగున్ అను.
2.2 9, అశ్వ. 1.221.

2. మహత్తత్త్వము, (వేదాంత)
జ్ఞానము.
సీ. అవ్యక్తమున మహత్తత్త్వముద
యించు,నది బుద్ధి మతి ధృతి ఖ్యాతి
సంవి,దుపలబ్ధి నామంబు లొంది
యెందును గని,విని చని కావించి.
విభుతనొప్పు. అశ్వ. 2.135.

## గ

గంగ సం. వి ఆ. స్త్రీ.
భాగీరథి. హిమవత్పర్వతము నుండి
ప్రవహించుచున్న యొకానొక నది
భగీరథుఁడు దీనిని ఆకాశమునుండి
భూమికి తెప్పించెను ఆకాశమున
నుండి శంభుని శిరస్సుపైఁ బడెను.
అందుండి శీతాద్రిపైఁ బడెను.
అందుండి భూమిపైఁ బడెను. అందుండి
పాతాళమునకుఁ బ్రవహించెను
వం. గంగయుఁ దుంగభద్రయు ...
తామ్రపర్ణియు నను మహానదులు
మఱియు ననేక నదీద్వీపంబులును
గలిగి... భీష్మ. 1.38.
చూ గంగాదేవి.

గంగపట్టి మి వి.
గంగాదేవి కొడుకు భీష్ముఁడు.
తరువోజ పరమ హితంబుగఁ బలి
కిరి గంగ,పట్టియు విదురుండు. స్త్రీ
2 52, అశ్వ 1.134

గంగపుత్రుఁడు సం వి
గంగకొడుకు, భీష్ముఁడు.
వ. అని యిట్లుతుల స్తోత్రంబునఁ
బూజించి గంగపుత్రుఁడు మదిలో,న
నమః కృష్ణాయ యనుచు,వినఁబడి శిర
స్కుఁడయి మ్రొక్కె విశ్రుత భక్తిన్
శాంతి 2 56.

గంగమడుపు వి.
ఒకానొక పుణ్యతీర్థము.
వ ... గంగమడుపున నొక్క
నదూపంబు మూడు కోట్ల తీర్థంబులు

యఁగఁ గూరిమిఁ బాత్రమగుదుర యైనన్, దురమునఁ జుట్టఱికం...నుఁ గడసిడి కొనుచేల... ద్రోణ. 5.123.
సీ. గరుసులు గదవంగ గదలి యల్లల్లన, యొత్తుచు నెడముల నుత్తరించి.
ఆ. ... ఉగ్రభంగిగాఁ బయోనిధు లొక్కట బెల్లురేఁగి జగము వెల్లి వొడిచె. ఆర. 4.228.
(సైంధవుఁడు ద్రౌపదితో నన్న మాటలు).
కం. వినుమదియఁగాక జగమున, వనితా రత్నంబు లెల్లవారికి భోగం, బున యెడ సాధారణము లౌ, కని ధనమని గరుసు గలదె కరినిభగమనా. ఆర. 6.172.

**గర్గస్రోతము** సం. వి. స్. న.
బలరాముఁడు సేవించిన యొకానొక పుణ్య తీర్థము. ఇచ్చట గర్గుఁడు సన్ముని సేవితుఁడై చిరకాలము వసించెను. శల్య 2 157.

**గర్గుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక ఋషి. ఈతఁడు చిరకాలము సన్మునిసేవితుఁడై నివసించిన కారణమున ఆ స్థలము గర్గస్రోతము అను పుణ్యతీర్థమని పేరొందెను. శల్య. 2.156.
ఈతఁడు వైన్యునకు పట్టాభిషేకమును సాంవత్సరికుఁడుగ నుండి నడపెను. శాంతి 2.211.

**గర్జ** సం. వి. ఆ. స్త్రీ.
మేఘ ధ్వని, ఉఱుము.
మ. విలసద్గాండివ చాలనోద్ధతి కన ద్విద్యుల్లతా కేలగా, నలఘు స్ఫార కపిధ్వజ ధ్వని సముద్యద్గర్జ చందంబుగా, జలదాకాంత నొందెఁ దేరు... విరా. 4.251.

**గర్జత్** సం. శత్ర.
గర్జించుచున్న.
కం. గర్జద్గుణుఁడై పగతుర, జర్జరి తాంగులుగఁ జేసె .. నిర్జరవర నందనుఁడు నిమిషార్ధమునన్. విరా. 5.37.

**గర్జన** సం. ఆ. స్త్రీ.
గర్జనము.
ఆ. మండలప్రచార మహితాకృతులు గర్జనలుగఁ బొలిచి మాఱుమలసి ఱంకె, లెసఁగఁ బోరి కమరి యేపారు వృషభ యుగంబునట్లు వారు గవిసి రధిప. శల్య. 1.172.

**గర్జనము** సం. వి. అ. న.
మేఘధ్వని వంటి ధ్వని.
తే. ప్రళయ భైరవ సహస్ర గర్జనోదగ్ర తర్జనుఁ దర్జునుండు. విరా. 4.243.
2. కాఱు, ప్రల్లదము.
చం. అనుడు నెదిర్చి నీ తనయుఁ డాతని కిట్లను నేల రిత్త గర్జనములు గానవే పటు భుజాకలితోగ్ర గదా సముద్భటున్, నను నిటురమ్ము సూపుము రణంబున నీదు బలంబుఁ జేవయున్, మనమిటు చేరి నిల్చి వెదమాటల యాడుచు నున్కి యొప్పునే. శల్య. 2.126.
3. అట్టహాసము, ఱంకె.
వ. ... భీమసేనుండును దుర్యోధనుండును.
సీ. అఖిల గర్జన శోభితదేహులై,

యుద్భట వృషముల యొప్పుఁ దాల్చి
శల్య. 2.231-232.
(భీమ దుర్యోధనుల విషయమున అట్టహాసము, వృషభము విషయమున అంకె).

**గర్జాయతము** సం. విణ. (అ. ఆ. అ.)
గర్జగాఁ జేయఁబడినది.
కం. సాయపడు రథచయంబులు,
సాయకహతిఁ జెదరుఁ బ్రళయ జల
ధర పటుగ,ర్జాయత తర్జనలీలఁ బ,లా
యితమగు పాండుసుత బలంబు
నరేంద్రా. ద్రోణ. 1.143.

**గర్జించు** సం. అ. క్రి.
మేఘధ్వని పోలిన ధ్వని సేయు.
వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున నంగణంబు సొచ్చి. విరా. 2.14.

**గర్జితము** సం. వి. అ. న.
గర్జ, ఉఱుమువంటి ధ్వని.
ఉ. ..మౌ,ర్వీకృత గర్జితంబు పృథివీ
వియదంతర మెల్ల నిండ. విరా.3.171

**గర్జిలు(ల్లు)**
1. ఉఱుము ఉఱిమినట్లు పెద్ద ధ్వని సేయు, అఱచు.
వ. కురు విభుండు ... సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునుబ్బునం గొండొక పెద్ద యనక పిడుగు చందంబునన్ గర్జిలి యుఱికిన.ద్రోణ. 2 87.
2. మ్రోగు, ధ్వనించు.
శా. భీముండుం గవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో,ద్దామ
స్ఫీత రుచుల్ వెలుంగ .. ,.. శంఖములు గర్జిల్లంగఁ బూరించుచున్·
భూమీశుం గని యగ్రభాగమున—
ఉద్యో. 4.126.
3. సింహనాదము సేయు.
కం. వల్లెయని రాజనందను,లెల్లరు
సమకట్టి రథము లెక్కి దిశల్ భే,ది
ల్లఁగ గర్జిల్లి నిశా,తోల్లసిత కృపాణ
కార్ముకోద్యత కరులై. ఆది. 6.64.

**గర్తి** దే. వి.
ఆలు, భార్య.
చం. వినుమొక బ్రాహ్మణుండు కుల
వృత్తము పెంపుఁ దొఱంగి బోయ
దా,ని నొకత గర్తిఁ జేసికొని. శాంతి. 3.472.
గర్త (గరత) అని సూ. అ. ని. పాఠము. 'ఆలి' పాఠాంతరమని యందుఁ దెల్పఁబడెను. సం.ము.న 'ఆలి' పాఠముగా సీయఁబడినది. పాఠాంతరము క్రింద 'గర్తి' యీయఁబడినదిగాని 'గర్త' యీయఁబడలేదు.

**గర్దభము** సం. వి. అ. పుం.
గాడిద.
కం. జనవర కృమి గర్దభ ముఖ,జన
నంబులఁ బొంది నసిక సంవాసముఁ
జెం,దు నధిక పాపాత్ముండగు, మను
జుఁడు. అను. 4.258

**గర్ధించు** సం. అ. క్రి.
పేరాసపడు.
సీ. ... లోభంబ యది ....ధర్మంబు
గలఁచి నరునిఁ బ్రయిమాలి యేమిటి
కయినను గర్ధించు వానిగా సమకట్టు.
శాంతి. 3.399.

**గర్వదాసుఁడు** సం. వి. అ. పుం.

పుట్టినది మొదలు ఇతరులకు ఊడిగము సేయువాఁడు.

తీ. ... అసంతానుఁడగుట గర్భ, దాసుఁడగుట దరిద్రత్వ తప్తుఁడ గుటఁ జెందుఁ దూఁడులకట్ట ముచ్చిలిన కష్ట,నరునికని పల్కె బకుసఖ నాముఁ డధిప. అను. 3 245.

**గర్భపాతము** సం. వి. అ. పుం.

గర్భస్థ పిండము జాఱిపడుట.

వ. గాంధారి యుధిష్ఠిరు జన్మంబు విని మన్యుతాపంబున నుదరతాడ నంబుఁ జేసికొనిన గర్భపాతంబగుడు. ఆది. 5.98.

(నాలుగు మాసముల పిదప గర్భము చెడిపోవుట అని సూ. ఆ. ని. అర్థము. సాధారణ స్త్రీ విషయము ఇచట యుక్తమనిపింపదు. గర్భపాతంబునకు గాంధారి గర్భంబుదాల్చి యొక్క సంవత్సరము నిండెను. ఆది 5 98. దీనినిబట్టి తెలియునదేమన సాధారణ స్త్రీకి నాల్గవమాసము గర్భస్థ పిండ మెంత వృద్ధిపొంది యుండునో సంవత్సరమైనను గాంధారీ గర్భస్థపిండ మంతే వృద్ధిపొంది యుండెనని యూహింపవలసి యున్నది.

**గర్భమగు** అ క్రి.

పిండోత్పత్తియగు.

(కణ్వుఁడు శకుంతలతో) తే. తల్లి నీ కులగోత్ర సౌందర్యములకుఁ దగిన పతిఁ గంటి దానికి దగఁగ గర్భ మయ్యె. ఆది. 4.61.

"శుక్ర శోణితం గర్భాశయస్థం ఆత్మ ప్రకృతి వికార సమ్మూర్ఛితం గర్భ ఇత్యుచ్యతే" సుశ్రుత శారీరము.

(కుంతి సూర్యునితో) ఆ. నాకు గర్భ మైన నా తల్లిదండ్రులు జుట్టములును నన్ను జూచి నగరె. ఆది. 5.24.

**గర్భము** సం. వి. అ. పుం.

1. కుక్షి, కడుపు.

సీ. ... అదితిగర్భమున నవతారమై వామనాకారమున హరి యడఁగుట యును. విరా. 1.54.

2. లోపలి భాగము.

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుత బాహాగర్వ దుర్వార సంరంభం బోర్వక డాఁగి యుండె నట రారాజు. శల్య. 2.58.

3. గర్భాశయము.

ఆ. మూత్రమునఁ బురీషమున నూనుచును గర్భమునఁ బ్రవర్తనమ్ముఁ బొంది వెడలి, సంతతానుబంధ సంసార దుఃఖ నిమగ్నుఁడగుచు నుండు మానవుండు. శాంతి. 4.292.

(ఇచ్చట గర్భాశయమున మలమూత్రములుండునని చెప్పట పొసఁగని విషయము చూ. అమేధ్యము).

4. పిండము.

శుక్ర శోణితములు గర్భాశయమునఁ జేరు సమయమున కర్మప్రేరితుఁడైన జీవుఁడు ప్రకృతితోఁ గూడ నందుఁ జేరును. అప్పుడు అది కరుడుగట్టి చైతన్యావస్థను బొందును. దానినే గర్భమందురు.

వ. తేజోమయంబైన యా గర్భంబు గంగ హిమవన్నగము మీఁద సము

తప్రవిష్టుండు సేసిన. శల్య. 2.176; విరా. 1.263.
(చూ. గర్భమగు.)

**గర్భవాస గుప్తి** సం. వి. ఇ. స్త్రీ.
కడుపులో దాఁగియుండుట.
తే. చాల దుస్తరమైన యజ్ఞాతవాస
సంవత్సరంబు భవద్గర్భవాస గుప్తి
వలనఁ గడపితిమి సుఖావాప్త చిత్త,
వృత్తినేము నిర్భయులమై విందులట్లు.
విరా. 5.344.
(కడుపులోనున్న బిడ్డ ఎవ్వరికిఁ గాన రాకుండ ఎంత సురక్షితముగా నుండునో అట్లే మేము ఎవ్వరికిఁ దెలియరాకుండ మీ యింట నున్నార మనియు తల్లి బిడ్డను కడుపులోఁ బెట్టుకొని రక్షించునట్లు మీరు మమ్ము లను దగ్గఱకుఁ దీసి రక్షించితిరనియు భావము).
శ్లో॥ ఉషితాః స్మో మహారాజ సుఖం తవ నివేశనే, అజ్ఞాతవాస ముషితాః గర్భవాస ఇవ ప్రజాః. సం. భార. విరా. 71.10.

**గర్భవాసము** సం. వి. అ. పుం.
1. గర్భమునందుండుట.
వ. .... గర్భవాసంబను నరకంబు భేదంబు గలదె. అను. 1.309.
2. గర్భము.
చం. చిరముగ గర్భవాసమునఁ జెంది పుత్ర చిరంబుగాఁగ నిన్నరసె గదయ్య తల్లి యనయంబును నేఁ బను పంగఁ బూనియున్. శాంతి. 5.285.

**గర్భవ్యూహము** సం. వి. అ. పుం.
మధ్యభాగము (లోపలి భాగము) నున్న మొగ్గరము. ద్రోణుఁడు తన నాలవనాఁటి యుద్ధమున పద్మవ్యూహ మును శకట వ్యూహమునకు పశ్చి మార్ధమున గర్భవ్యూహముగా పన్నెను. ద్రోణ. 3.21. (చూ. వ్యూహము).

**గర్భాధానము** సం. వి. అ. న.
గర్భము కలిగించుట.
వ. ... గర్భాధానవేళయందును బిండావస్థయందును, ప్రసూతిమాత్రం బున బాల్యంబునను యౌవనంబునం ప్రౌఢత్వ సమయంబున వార్ధకంబునం గర్భానురూపంబగు నాశంబు శరీ రంబునకు సంప్రాప్తంబగు. శ్రీ. 1.35.
వ. అని యొడంబఱిచి సూర్యుండు తత్సమాగమంబునం ప్రీతుండయి దానికి గర్భాధానంబుసేసి గగనంబున కరిగె. ఆర. 7.339, శాంతి. 5.315.
(చూ. గర్భిమగు.)

**గర్భిణి** సం. వి. ఈ. స్త్రీ.
అంతర్వత్ని, చూలాలు, కడుపుతో నున్నస్త్రీ. తెలంగాణాలో పొట్టతో నున్నదని యందురు.
కం. విను గర్భిణి ప్రజఁ బ్రదుకున, కనురూపములైన యట్టి యాహారం బుల్ గానుగతి. శాంతి. 2.179, స్వర్గ. 90.

**గర్భితము** సం. విశే. (అ. ఆ. అ).
అంతర్గతము.
కం. .. యోగిజన క్షేమసమీహా గర్భిత దివ్యచిత్త హరహర నాథా. శల్య. 1.1.

**గర్వము** సం. వి. అ. పుం.

1. ప్రభావ శ్రీ బల కులీనతాదులచే జనించు మనోవికారము.

కం. ఆజగవ శార్ఙ్గాలంకృత,భుజగర్వ నిరస్త దైత్య ఛూమస్తుత్యా విరా. 1.39.

2. అహంకారము, స్వాభిమానము.

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర,ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పుతుల్. విరా. 3.55.

**గఱి** వై. వి. (సం. గరుల్. క. గఱి). బాణమున కిరుప్రక్కలఁ గట్టిన ఱెక్కలు లేక ఈకెలు.

కం. గురు శరములు సితపక్ష,స్ఫురణంబున నంచపిండు పోలుపు వహించెన్,నరు బాణతతి ఘనావలి, కరణి మిగుల నొప్పె నల్ల గఱుల చెలువునన్. విరా. 5.130.

**గఱువ** వై. విణ. (సం. గురుః). గౌరవము గలది, మర్యాద గలది

కం. పలుపోకలఁ బోవుచు వి,చ్చలవిడి నాట్యంబు సూపు చా,ద్పున నిచటం,గులసతుల గఱువచందము దొలఁగఁగ నిట్టునికి దగునె తోయజవదనా. విరా. 2.150.

వ. ... జూదరియాలికి గఱువతనం బెక్కుడియది. విరా. 2.153.

2. గాంభీర్యము గలది, గంభీరము.

గీ. ధీరయై యిట్లు సమ్మదపూరమునకు, గఱువతనమను బలితంపు గట్టు వెట్టి, వెలఁది యెఱుఁగనియది వోలె వికృతిలేక యల్ల నెప్పటియట్టుల యరుగుటయును. విరా. 3.56

3. పెద్ద, వృద్ధుఁడు, గొప్పవాఁడు. (కర్ణుఁడు వికర్ణునితో నన్న మాటలు).

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు,బేల నీకుఁ జెప్పనేల వలసెఁ, జిఱుతవానికింత గఱువతనం బిది, చన్నె వృద్ధజనములున్న చోట. (సూ. ఆ. ని. పాఠము). సభా. 2.228.

శ్లో॥ త్వం తు కేవల బాల్యేన ధార్తరాష్ట్ర విదీర్యసే,యద్బ్రవీషి సభామధ్యే బాలః స్థవిరభాషితమ్. సం. భార. సభా. 90.30.

**గఱ్ఱు** దే. వి.

త్రేఁచుట యందలి ధ్వనికనుకరణము.

ఆ. ఇల్వలుండు నను జు నెప్పటి క్రియఁ బిల్వ,నెఱిఁగి దాని నమ్మునీశ్వరుండు,గడుపుఁ దడవికొనుచుఁ గఱ్ఱనఁ ద్రేఁచిన, నసుర తీర్థమయ్యె నా క్షణంబ. ఆర. 2.342.

**గలిబిలి** దే. వి.

కలఁత, గగ్గోలు.

నలఁగుడు (గజిబిజి. శ.ర. పాఠము)

సీ. ... రాజిత బహువిధ రథసమూహముఁ జొచ్చి గలిబిలి యగునట్లు గలఁచి కలఁచి విరా. 5.56.

**గవయము** సం. వి. అ. పుం.

గురుపోతు, వృషభము.

సీ. ...పశువుఁ జేయ,విప్రులు పట్టరా వెఱసొచ్చి యొదిగెడు గవయంబు చాడ్పున గర్ణభీతి, నల్లల నుడుకుచు. కర్ణ. 3.33.

**గవయుఁడు** సం. వి. అ. పుం.

శ్రీరామునకుఁ దోడ్పడిన యొక వానరవీరుఁడు.

కుఁడు గజునితోఁ గలిసి రెండు వందల కోట్ల కోఁతుల సైన్యముతో శ్రీరాముని జేరెను. అర. 7.35.

**గవాక్షుఁడు** సం. వి. అ. పుం.
శకుని తమ్ముఁడు. సోదరులగు శుకాదులతో గలిసి ఇరావంతునితోఁ బోరాడి యాతనిచేఁ జచ్చెను. భీష్మ. 3.91.

**గవాజినము** సం. వి. అ. న.
గోచర్మము, ఆవుతోలు.
ఆ. ... అగ్గవాజిన కోశ మహాశరంబు పార్థునదియ చూవె. విరా. 4.123.

**గవాధ్యక్షుఁడు** సం. వి. అ. పుం.
ఆవుల మందికధిపతి, ఆల కాపరుల కధిపతి.
వ. ... కౌరవబలంబగుట యొఱింగి జెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచు బురంబున కరుగుదెంచి. విరా. 4.4.
"గోపాధ్యక్షో భయత్రస్తో రథ మాస్థాయ సత్వరః. సం. భార. విరా. 35.7.

**గవిజాతుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక ముని. నహుషుని యొద్దకు వచ్చి గోబ్రాహ్మణులకు కులమొకండనియు బ్రహ్మ రెండు విధములుగా నొనర్చెననియుఁ జెప్పెను. అను. 2.272,273.

**గవుసెన** దే. వి. గౌసెన.
పైన తొడుగు వస్త్రము, గలీబు.
తే. తనువు గవుసెనఁ బెట్టి పుచ్చిన విధమున నరుగుదే వచ్చునే యదియ యక్కజంబు అశ్వ. 4.160.
(గలీబు తొడిగి తీసిన వస్తువునకు వలె శరీరము చెక్కు చెదరకుండ నున్నదని భావము).

**గవ్యము** సం. విణ. (అ. ఆ. అ).
గో సంబంధమైనది. పాలు మొదలగునవి.
[పంచ గవ్యములు - 1. ఆవుపాలు 2. పెరుగు 3. నేయి 4. పంచితము (గోమూత్రము) 5. పేడ.]
కం. తిల పాయస ఘృతములు పితృ, కలనములకు నుత్తమములు గవ్యంబు మహాఫలము. అను. 3.165.

**గవ్యూతి** సం. వి. ఇ. స్త్రీ.
రెండుక్రోసులు (చూ. కోను.)
వ, ... భారద్వాజుండును ద్వాదశ గవ్యూతి దీర్ఘంబును బంచ గవ్యూతి విస్తృతంబునుగా శకట వ్యూహంబు సమకట్టి. ద్రోణ. 3.31.

**గహనత్వము** సం. వి. అ. న.
చొరరాని తనము, దుష్ప్రవేశత్వము.
వ. ... ఆంబికేయుండు సంసార దుఃఖ బహుళతయును దద్గహనత్వంబును నెఱిఁగింపు మనుటయు నవ్విభునకు విదురుం డిట్లనియె. స్త్రీ. 1.35.

**గహనము** సం. విణ. (అ. ఆ. అ.)
1. దుర్లభము, పొందరానిది.
వ. దేవా నాకిష్టంబైన వరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్ర లాభంబనిన నదియేమి గహనంబు దానిన యిచ్చెదఁ బుణ్యలోకంబులు దేవప్రాంబును సర్వ కామంబులు వేఁడుమనిన నర్జునుం డిట్లనియె అర. 1.293.

మాలిని – ... సుగమ గహన భూమా. అను. 3.347.

2. తెలిసికొన శక్యము గానిది, దుర్బోధము, దురవగాహము.

వ. ... అమ్మహాత్ముండు తన పూర్వ వృత్తంబు దలంచునో తలంపకుండునో దాని నిశ్చయం బతిగహనంబు. శాంతి. 5.613.

సీ. నీకు సెప్పిన మహనీయ వాక్యనికాయ,మతిగహనం బకృతాత్ములకు. అశ్వ. 2.97.

వి. అ. న.

అరణ్యము, దుర్గమ ప్రదేశము, దట్టమైన అడవి.

వ....ఈ గుల్మలతా గహనంబు సొచ్చిరని చూపి చెప్పిన. కర్ణ. 3.78.

వ. ... వినుము చెప్పెద నా దుర్గంబు సంసార గహనంబు వాలుమృగంబులు దెక్కలికాఱురులు రోగంబులు కామిని జర. స్త్రీ. 1.52.

వ. ... సంసారంబు దుఃఖబహుళంబని యెఱింగి తద్రూపగహనంబు గడచి. స్త్రీ. 1.35.

సీ. ... అసత్యోపచారంబు గహన దాహము నన్యకర్మ కృతియు ...

తే. ... పాపంబులందురు బుధజనములు. శాంతి. 1.293.

**గహ్వరము** సం. వి. అ. పుం.

గుహ.

వ. ... తన వదన గహ్వరంబుఁ దెఱచి. ఆర. 1.107.

**గళత్** సం. శత్ర.

స్రవించుచున్న, జాఱుచున్న.

సీ. కర శీకరంబులు గరట గళద్దాన తోయంబులును ధరాధూళి గ్రుంగ. విరా. 3.168.

**గళము** సం. వి. అ. పుం.

కుత్తుక.

వ. ... క్రౌంచ వ్యూహంబమర్చి గళంబు శూరసేన పరివృతుండై సుయోధనుండును. భీష్మ. 2.344.

మ....ఉదగ్రోద్ధతిఁ ద్రుంచె దద్గళము రక్తాంబు ప్రసారంబుగన్. మౌస.48.

**గళితము** సం. విశ. (అ. ఆ. అ.)

1. జాఱినది.

వ. ... కిరీటి శరపాటవ పరిస్ఫోటిత రిపుకపాల గళిత మస్తిష్క పలల పంకంబునను. విరా. 5.60.

చం. ... రక్కసుం,డని వెఱఁగందువారు గళితాయుధులయ్యెదు వారు. కర్ణ. 3.217.

2. స్రవించినది.

కం. తనువున శితశరములు వడిఁ జొనిపి యతండతని గళిత శోణితుఁ జేసెన్. కర్ణ. 1.162; శాంతి.3.339.

## గా

**గాంగము** సం. విశ. (అ. ఈ. అ).

1. గంగకు సంబంధించినది.

వ. ... దానిచుట్టునుం బార్థివంబులు హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నగు కుంభంబు లొనర్చి వానను గాంగంబులగు జలంబులునిచి. శాంతి. 1.373.

2. గంగానదీ తీరంబునఁ గలది, గంగా సంబంధమైనది.

తరలము - కనియె ముందట నమ్మ
హీపతి గాంగ సైకత భూములన్. ఆది
4, 164.

**గాంగేయుఁడు** సం. వి. అ. పుం.

1. గంగాపుత్రుఁడు, భీష్ముఁడు.

తే. ద్రోణ గాంగేయ భానుమత్సూను
కృప సుశర్మ దుశ్శాసనులు సర్వ
సైన్యపతులు నార్కురకము గొలువ.
విరా. 3 76

2. కుమారస్వామి.

మ. అయ్యగ్నిభవుండు గాంగేయుం
డును శరజన్ముండును గార్తికేయుం
డును నయ్యె. శల్య. 2.176.

కం. శరవణము నందుఁ బొలుపుం,
బొరసిన గాంగేయుఁడేఁ బోల్పఁగ
ననువై, శరతల్పంబునఁ దేజో,భరి
తుఁడు గాంగేయుఁడొప్పెఁ బంక
జనాభా. స్త్రీ. 2.114.

**గాండివధరుఁడు** సం. వి. అ. పుం.

గాండివమును ధరించినవాఁడు, అర్జు
నుఁడు.

చం. ... నిజశంఖములొత్తిరి శార్ఙ్గ
ధరుఁడు గాండివధరుఁడున్. ద్రోణ.
3.191; స్త్రీ. 2.90.

**గాండివము** సం. వి. అ. పుం

గాండీవము, అర్జునుని విల్లు.

కం. ... వివరించి, గాండివముం గొని
పోయితిమేని సుయోధనునకు నగ
పాటు నిశ్చితంబూహింపన్. విరా.

**గాండివి** సం. వి. న్. పుం.

గాండీవి - గాండీవము గలవాఁడు.

కం. తమ చెమ యొద్ది ఎలంబులు,
క్రమవికశములైన దొరలు గాండివిపై
నుగ్రముగఁ బఱువుఁగ వాలిఁడు,
సమరోల్లాసమున దివ్యశర తత్ప
రుఁడై. విరా. 5.65.

**గాండీవధన్వుఁడు** సం. వి. న్. పుం.

గాండీవము ధనుస్సుగాఁ గలవాఁడు;
అర్జునుఁడు.

**గాండీవము** సం. వి. అ. పుం.

అర్జునుని విల్లు. గాండివము

కం. గాండీవధన్వునాహవ పాండి
త్యము. ఉద్యో. 1.237.

వ. ...ఆ కట్టు విడిచి యందు గాండీ
వంబు పుచ్చుకొని తత్ప్రభావము
నెప్పటియట్ల బంధింపుము. విరా.
4.108.

గాండీవము అర్జునునకు లభించిన
విధము :- కృతయుగమున కణ్వ
మహర్షి నిష్ఠానియతితోఁ బెక్కేండ్లు
తపస్సు చేయ నతనిపై పెద్ద పుట్ట
పెరిఁగెను. అప్పుడయందొక వేణువు
(వెదురుగడ) పుట్టి మహిమ్నితమైన
యెత్తు లావు నుండునట్లు పెరిగెను.
బ్రహ్మ ఆ కణ్వునికిఁ బ్రత్యక్షమై వర
మిచ్చెను. అతని మీఁదఁ బెరిఁగియున్న
వెదురును దానాసించి తీసికొని మూఁడు
ఖండములుగఁ జేసెను. మొదటిది
యగు అగ్రఖండముతో గాండివమును,
మధ్య ఖండముతో శార్ఙ్గము అను ధను
స్సును, చివరి ఖండముతో పినాక
మను చాపమును గావించెను. శార్ఙ్గ
మును శ్రీ మహావిష్ణువు కొనఁగెను.
పినాకమును శివుని కిచ్చెను.

గాండివమును దనయొద్దనే యుంచుకొని వేయి సంవత్సరములు ధరించెను. తర్వాత దానిని విధాత ప్రజాపతికిచ్చెను. ప్రజాపతి దానిని అయిదు వందల మూఁడు సంవత్సరాల వఱకు దనయొద్ద నుంచుకొని ఇంద్రునకిచ్చెను. ఇంద్రుఁడు దానిని ఏఁబది సంవత్సరములుంచుకొని సోముఁడను మహారాజునకిచ్చెను. సోమ మహారాజు అయిదు వందల సంవత్సరములుంచుకొని వరుణునకిచ్చెను. వరుణుఁడు వంద సంవత్సరములు దానిని ధరించి యుంచుకొనెను. కృష్ణార్జునులం గని ఖాండవ దహనార్థంబు ప్రార్థించిన అగ్ని దేవునకు అర్జునుఁడు. "నా భుజబల శీఘ్ర సంధానములకుఁదగిన ధనువును సర్వవహన రథాశ్వములును కృష్ణునకు నాయుధములును ఇపుడులేని కారణమున ఈ మహాకార్యమునకు పూనుకొనలేకపోవు చున్నా"రిమనెను. అగ్నిదేవుఁడప్పుడు వరుణుని దలఁచి యాతని దనను సన్నిహితుని జేసికొని తొల్లి సోముఁడతనికిచ్చిన గాండివమును అక్షయ తూణీరంబులును గంధర్వహయములు పూనిన రథమును నర్జునునకును చక్రము గద శ్రీకృష్ణునకు నిమ్మని పంచి యిప్పించెను.

గాండీవము సుర నాగ గరుడ యక్ష సిద్ధ కిన్నర కింపురుషాదులకు అజేయము, అఛేద్యము, ప్రసిద్ధికము. ఇతరాయుధములను భేదింప దక్షతగలది.

సర్వలోక మనోజ్ఞము, దివ్యము. ఇది అర్జునునియొద్ద 65 సంవత్సరములుండెను.

పాండవులు మహాప్రస్థానము చేయుచు పూర్వసముద్రతీరంబు సేరినపుడు అగ్నిదేవుఁడు భీషణాకారమున వారి యెదుట నిలిచి 'అర్జునా గాండివముపై మమకారము వదలఁజాలక వెంట దీసికొని వచ్చుచున్నావు. కృష్ణుని చక్రమెన్నఁడో దివమునకేగెను నీవేల గాండీవమును విడువవు. దేవకార్యమునకుఁగా దానిని వరుణునిచేత నీకిప్పించితిని. ఆ పని ముగిసినది. తిరిగి ఆ ధనుశ్శ్రేష్ఠ మమ్మహానుభావున కప్పగింపుము' అనెను. అర్జునుఁడు సరే యని యా విషయము సోదరులకుఁ జెప్పి గాండివమును సముద్రమునందుంచెను. అగ్ని యంతర్ధానము సేసెను. గాండీవమునకు కోశము (గలీబు) గోచర్మము.

**గాండీవి** సం. వి. న్. పుం. గాండివి. గాండీవము గలవాఁడు, అర్జునుఁడు. వ. ... పాండవాగ్రజుండు గాండీవి చేతి విల్లుపలక్షించి యిట్లనియె. విరా. 1.157.

**గాంధర్వగ్రహము** సం. వి. అ. పుం. నిద్రించినప్పుడుగాని మేల్కొని యున్నప్పుడుగాని నరుఁడు భ్రాంతాత్ముఁడై గంధర్వులను జూచినయెడల నది గాంధర్వగ్రహము. ఆర. 5.254.
శ్లో॥ స్వాచారం సురభిం హృష్టం నర్తనకారణమ్, స్నానోద్యాన రుచిర వస్త్ర మాల్యానులేపనం, శృంగారలీలాభిరతం గంధర్వాభ్యుపేతం వదేత్.
తా॥ గాంధర్వ గ్రహము సోఁక మను

జుఁడు మంచి యాచారముల నవలం బించువాఁడును, సుగంధచందనాదులను ధరించువాఁడును; సంతోష సహితుండును, గానము చేయువాఁడును. నృత్యములను జేయువాఁడును, స్నానము చేయుటయందు ప్రీతిగలవాఁడును, ఉద్యాన వనమునందిచ్ఛ గల వాఁడును, ఎఱ్ఱని వస్త్రములు ఎఱ్ఱని చందనము వీనిని ధరించుట యందధిః ప్రీతి కలవాఁడును, శృంగార లీలలయందాసక్తి కలవాఁడునై యుండును. అష్టాంగహృదయము. ఉత్తరస్థానము 18. 1.

**గాంధర్వము** సం. వి. అ. పుం.

1. వధూవరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము.

కం. కన్ను మనంబును దనిసినఁ, గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా,యన్ను నతనికిచ్చుట. అను. 2.223.

(చూ. వివాహము).

2. సంగీత విషయికమగు ఒక ఉపవేదము.

సీ. ...గాంధర్వ...ః గామతంత్రంబులో,నుగ శాస్త్రముల నెల్ల, దగిన భంగి ... ఆ ... నలవరించి. అను. 4 124.

3. గంధర్వుఁడు అధిదేవతగాఁ గల యొకానొక యస్త్రము.

వ. .... ఇంద్రాది దేవతల వలన నైంద్రాగ్నేయ యామ్య రాక్షస వరుణ వాయవ్య కుబేర గాంధర్వ వైశాచ బ్రాహ్మ్యంబులనం బరఁగు దివ్యాస్త్రంబులు వడసి. అర. 4.52.

**గాంధర్వ విద్య** సం. వి. ఆ. స్త్రీ.

గంధర్వ విద్య; సంగీత విద్య; పదునెనిమిది విద్యలలో నొకటి (చూ. విద్య),

తే. వైద్య కోదండ గాంధర్వ విద్య లర్థశాస్త్రమగు నీతి.విద్య తత్సహిత వృత్తి వెలయఁగాఁ బదునెనిమిది విద్య లభవుఁ డేర్పరించె జగత్త్రియ హితము పొంది. శాంతి. 3.119.

**గాంధర్వి** సం. విశ. (ఇ. ఈ. ఇ).

గంధర్వ సంబంధమైనది.

వ. ... ఆ సౌభద్రుండు భద్రగజంబు బరిగోలల పోట్లం గనలు కైవడిం గినిసి గాంధర్వియైన మాయ గావించె. ద్రోణ. 2 85.

**గాంధారము** సం. వి. అ. పుం,

ఒకానొక దేశము. అర్జునుఁ డుత్తర దిగ్విజయంబు సేయునపుడీ దేశపు రాజును వశము సేసికొని విచిత్ర వస్తు వాహన నివహంబులు గొనెను. భారత కాలమున ఈ దేశపురాజు తొలుత సుబలుఁడు, తర్వాత నాతని కొడుకు శకుని. సభా. 1.235; భీష్మ. 1.40.

**గాంధార రాజు** సం. వి. అ. పుం.

గాంధారదేశపు రాజు, శకుని. ఉద్యో. 1.22; ఉద్యో. 3.253.

**గాంధారి** సం.వి.ఈ స్త్రీ.

1.గాంధారదేశపు రాజు (సుబలుఁడు) కూతురు; ధృతరాష్ట్రుని భార్య; దుర్యోధనుని తల్లి, మతి యను

వేల్పునంశమునఁ బుట్టినది. విరా. 4.149; ఆది. 5.9.
(చూ. అనుబంధము)

2. అజామీఢుని భార్య. చూ. ఆది. 4.110.

3. ఒక దేవాంగన. ఈమె ఈశ్వరుఁడు కుమారస్వామి యన్న భద్రవటము సేర నరుగునప్పుడు విద్య, సావిత్రి, కేశిని యను లోడి దేవాంగనలతోఁ గలిసి దాక్షాయణి సేవించుచు, బోయెను. ఆది.1.264.

**గాంధారుఁడు** సం. వి. అ. పుం. శకుని.

సీ...విభుఁడు సహోదరులును గర్ణ, గాంధారులును ప్రియబాంధవులును సముచిత వాహన సైన్య సమేతులై, కొలువంగ వెడలె. అర. 5.373.

ఉ. క్రూరుఁడు దార్తరాష్ట్రుఁడతి కుత్సితుఁడెంతయు బాపబుద్ధి గాం,ధారుఁడు పెక్కు మాయలకుఁ దావలము. అర. 2. 409

**గాంధారేయుఁడు** సం. వి. అ. పుం. గాంధారి కొడుకు, దుర్యోధనుఁడు.

వ ... అమ్మువ్వురు మునీంద్రులు సెప్పిన హితోపదేశంబుల దెస ననాదరంబు సేసి గాంధారేయుండు రాధేయుం గనుంగొని చేయప్పళించి నవ్వి పిలిపింప వెఱ్ఱులగుదురే యని పలికి వారల నవలోకించి. ఉద్యో. 3 324.

**గాంభీర్యము** సం. వి అ. న. క్రోధ శోకాదులచే వికారము నొందకుండుట.

తే. అయ్యుధిష్ఠిరు గాంభీర్య మతని ధైర్య,మరయ నొండెవఁ గలుగునె. విరాట. 2.189.

**గాడిద** వై. వి. (సం. గార్దభః) గాలి గాఁడు. ఖరము.

ఉ. గాడిదరూపు దాల్చి యెముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం, బాడెదు శక్ర. శాంతి. 4.96.

సీ. ... చిత్రలలిత, గతి నొప్పు నేనూఱు గాడిదలను.. . అరణమిచ్చె. వామనుండు. ఆది. 8.221.

**గాడ్పు** దే. వి. గాడుపు. వాయువు, గాలి.

సీ ... చల్లని గాడ్పు. ఆది. 4.23.

సీ. ... నాసిక వేఁడిగాడ్పు నిగుడ. విరా. 2.137.

**గాడ్పుచూలి** దే. వి. (గాడ్పు + చూలి) భీముఁడు.

ఆ. గాడ్పుచూలి పిఱుఁదఁ గావంగ నర్జును,నోర్వ నమరులైన నోపరు. ఆది. 8.23.
('గాడ్పుచూలు' అని పాఠాం).

**గాడ్పుపట్టి** దే. వి. (గాడ్పు + పట్టి) భీముఁడు.

ఆ. ... ఇట్టి పాఱ గాడ్పుపట్టిచే దుశ్శాస,నాదులెల్ల బాధితాత్ములైరి. ఆది. 5.166.

**గాఢత** సం. వి. ఆ. స్త్రీ. దార్ఢ్యము.

ఆ. నీకుఁజూడ ముష్టినెలవు నాకర్షణ, గాఢతయును బాణగతియుఁ దొంటి యట్లొ యొండు భంగియై తోఁచెనో

నాకు నున్న రూపు సెప్పవన్న పార్థ. ద్రోణ. 3.198.

**గాఢము** సం. విణ. (అ. ఆ. అ).

1. దట్టమైనది.

వ, ... నీవు దొల్లి రచియించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి. విరా. 1.11.

2. బిగుతైనది.

కం. ... ద్రిండు గాఢముగఁ గట్టి. విరా 4.165.

3. మిక్కుటమైనది, అధికము.

కం. .. తగు దీ,వనలిచ్చె నతండు గాఢ వాత్సల్యమునన్. విరా. 1.144.

చం. ... ఉపన్యసించిన వచఃప్రక రంబు మహార్థగాఢము. శాంతి. 1.273.

కం. వెడలునెడ గాఢపీడం బడి. స్త్రీ. 1.37.

**గాణిక్యము** సం. వి. అ. న.

గణికల సమూహము, వేశ్యా సమూహము.

మ. మద మాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం,పదలోలిం గొనివచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించి. .. ధర్మజు. సభా. 1.18.

**గాత్రము** సం. వి. అ. న.

1. కళేబరము, శరీరము.

వ. ... అవయవ భేదంబు లడంగు నట్లుగాఁ దుత్తునియలై పడియున్న గాత్రంబుల వలనం గృతాంత మహానస శాలల పగిది నొప్పు పట్లును. విరా. 3.236.

కం. క్షేత్రజ్ఞుండనఁగ నిఖిల,గాత్ర వ్యాప్తత్వ మహిమ గలిగి.

మ. ... ఉర్వీనాథ యీ పుత్రగాత్ర పరిష్వంగ సుఖంబు సేకొనుము. ఆది. 4 90.

2. అవయవము, అంగప్రత్యంగములలో నొకటి.

మ. ... భల్లమ్ము లొక్కుమ్మడిం, బరఁగం జేయుము, కర్ణు గాత్రములలోఁ బార్థుండ .... కర్ణ. 3.280.

సీ. ... పద ప్రభృతి గాత్రంబుల ... శాంతి. 6.327.

**గాథ** సం. వి. ఆ. స్త్రీ.

కథ.

వ. ... తొల్లి కశ్యపగీతలైన గాథల యందీ యర్థంబు వినంబడు ఆర. 1.224.

**గాదిలి** దే. విణ.

ప్రేమ పాత్రము.

వ. ఇవ్విధంబునం దన గాదిలికూఁతు నుపలాలించి.

కం. గాదిలి తనయుఁడ నేఁ,గాదనకి క్కురుకులాగ్రగణ్యుని నిమ్మె మదినిఁ గూర్చితి. అశ్వ. 4.74; ఆది. 4.235.

**గాధి** సం. వి. ఇ న్. పుం.

విశ్వామిత్రుని తండ్రి.

జహ్నుని కొడుకు అజహ్నుఁడు; అజహ్నుని సుతుఁడు పల్లవుఁడు; పల్లవుని కుమారుఁడు కుశికుఁడు; కుశికుఁడు తపస్సు చేసి యింద్రుని మెచ్చించి జగముల మేటి యనఁదగు పుత్రుని వేడెను. ఆ యింద్రు డనుగ్రహమున కుశికునకు గాధి జన్మించెను. ఈతఁడు తనకూఁతురు సత్యవతిని

ఋచీకుఁడను మహర్షికిచ్చెను. శాంతి. 2.68.

**గానము** సం. వి. అ. న.
సంగీతము, పాట.
వ. ... మాగధ మంజుల గానంబులు వీనులం బొరయ.... భీష్మ. 3.169.
2. పాడుట.
సీ. ...సామ గాన సంయుక్త వదను. ఆ. సూచి. స్త్రీ. 2.123.
3, స్తోత్రపాఠము.
వ. ... మాగధగానంబులు చెలంగ ... విరా. 5.389.

**గామి** సం. విణ. (న్. సీ. న్.)
సమాసాంతముల నుపయోగింపఁబడి 'పోవునది' 'పొందునది' మొదలగు నర్థముల నిచ్చును.
ఉ. .... సలిలగామివి గమ్మ. ఉద్యో. 1.187.
(నీటిలోనికిఁ దోయిన వాఁడవు-నీటి యందు ప్రవేశించిన వాఁడవు).
సీ. ... శీఘ్రగామి... ఆశ్ర. 2.34.
(వేగముగాఁ బోవువాఁడు).
వ. ... సంసారసాగర గామినియునై ఘోరప్రకార యగుచు నకృతాత్ము లకుం గడవరానియట్టి లోభవాహిని సత్యతీర్థంబున నుత్తరించి. శాంతి. 5.184.
(సంసారమను సాగరమును బొందు నది).

**గాము** వై. వి. (సం. గ్రహః).
దయ్యము, పిశాచము.
ఆ. అనుచుఁ బెలుచ నొంప నచ్చటి జనము,గలఁగి యపుడు మేలుకాంచి చూచి, ఘోరము దోఁపఁ గడిఁది బలుగా ముగాఁ దమ యుల్లములఁ దలంచి యొదిగియుండ. సౌప్తి. 1.157.

**గాయకుఁడు** సం. విణ. (అ. యికా.అ.)
పాట పాడువాఁడు.
వ. ...గాయక పాఠక వాంశిక వైణి కాది వినోదపాత్రంబులు నప్పర మేశ్వరుం గానవచ్చి. ఉద్యో. 3.232.

**గాయత్రి** సం. వి. ఈ. స్త్రీ.
1. దేవతా విశేషము.
కం. వసుధామక గాయత్రీ వసంత ములు సత్య గో సువర్ణంబులు నేక సముద్భవంబులని తాపన వస్త్యల చేత విందుఁ బావన చరితా. అను. 3.110.
2. ఆఱు అక్షరముల ఛందస్సు.
సీ. .. ఛందములకు గాయత్రి యగ్గ లము అశ్వ. 2.161.
3. ద్విజులు సంధ్యోపాసనమందు జపించు మంత్రవిశేషము.
వ. గాయత్రీస్థానంబునం ద్రిరాత్రంబు గాయత్రిజపంబుఁ జేసిన వారికి జన్మ దుఃఖములు లేవు. ఆర 2.278.

**గాయత్రిజపము** సం వి. అ. పుం.
గాయత్రీ మంత్రమును జపించుట.
(చూ. గాయత్రి-మూఁడవ అర్థము.)

**గాయము** దే. వి.
కత్తి, బాణము మొదలగువాని తాఁకున గల్గు క్షతి. నఱుకు,
కం. తన దృష్టియు ముష్టియుఁ దగు ననువున మున్నెత్తి యేయు నతఁ డప్పుడు డించిన గాయముల నపా

టంబున బదియుఁ బదేను నుచ్చిపోయెం
గోలల్. విరా. 5.32.
(ఆనందవారి పాఠము 'కాయము';
పాఠాంతరముగ 'గాయము' లేదు.
సం.ము.పారాం. గాయము లేదు.

**గారవము.** వై. వి (సం.గౌరవము.
ప్రా. గారవం)
1. గారవము, ఆదరము.
కం. సైరంధ్రీ వేషంబునఁ జేరుదు
నంతఃపురంబు చెంతకు నన్నా
భూరమణుదేవి యెంతయు, గారవ
మునఁ బిలువ నంపగా వినయమునన్.
విరా. 1.102.
ఆ. అతని దమకునెల్ల నాధిపత్యము
సేయు,వానిఁగా వరించువారు గాఁగ,
నిశ్చయించి కూడ నెమ్మిమైఁ
జనుదెంచి కాంచి యిట్టులనిరి
గారవమున. శాంతి. 3.129.
2. ప్రేమ, అనురాగము,వాత్సల్యము.
కం. ఆ రాజు మాదెసం గల,
కారుణ్యము కతమునను సుఖంబున
నిట్లు, న్నారము నినుఁ బుత్తెంచిన,
గారవమున నాదు మది వికాసము
బొందెన్. ఉద్యో. 1.226.
విణ.
ప్రియము.
చ.కమల వనంబుపొంత నునుగాడ్పొక
యించుక యాదరించుఁ జిత్తము
నకు దానఁ దల్లడము దన్కుటయుం
జని గారవంపు జాతముకడ నిల్చు.
విరా. 2.303.
గారవించు. స. క్రి (గారవము)
1.గౌరవము చేయు.
చం. ....నీ గురువుఁబొత్తి తగఁ
గొనియాడు మెట్లుసెప్పె నటుల
భక్తిమై నడపు పెంపెసలారఁగఁ
గూడు గూర చందన కుసుమాదులున్
నడపి తప్పక యారసి గౌరవింపు.
విరా.1.252.
వ .. అతనికి సత్కారము సేసి
గారవించి. ద్రోణ. 3 9.
2. ఆదరించు.
గీ. నాకు బ్రాణంబు ప్రాణమై నన్ను
దన్ను,కాఁగ భావించి యా దేవి
గారవించు. విరా.1.316.
చం. అనవుడు నక్క రాఁబనిచి
యప్పులి గౌఁగిట జేర్చి బాష్పముల్,
గనుఁగవఁ గ్రమ్మగన్ బలుకులం
దగ బెద్దయు గారవించినన్. శాంతి.
3.24.
3. లాలించు, బుజ్జగించు, ఓదార్చు.
కం. ... వాసవాచార్యుండున్.
వ. పరమాదరంబున నద్దేవిని గార
వించి నిన్ను నహుషు దుర్వినయంబు
బొరయకుండ నరయువాఁడ...నని
యూరడించిన. ఉద్యో. 1.152.

**గారాబము.** దే. విణ.
అనుఁగు, ప్రియము.
వ...నేనును వనవాసంబున నానేర్చు
విధఁబున మీకునెల్లను గారాబమైన
తమ్ముని నమ్మెయిం బదికించుకొని
వచ్చిన. (పాఠాం.) విరా. 2. 215.

**గారాబు.** దే. విణ.
గారాబము. ప్రేమ, ప్రియము
3. కొడుకుఁ బొడగానకర్జునుఁ డడిగెనేని
వానితో నింక నేమనుభాఁడ హరికి,

నతని గారాబు చెలియలి
కధికదుఃఖమేను చేసితి వగవంగ
నేమి గలదు. ద్రోణ. 2.140.
ఆ...సుభద్ర గారాబుపట్టి. ద్రోణ.
2.238; స్త్రీ. 2.127.

**గారాము.** దే. వి.

1. గొప్పతనము

కం. పారాశర్యాది మునులు,నీ
రాజన్యులును వినికి యెంతకు లేదీ,
గారాము నాకు బెంమోదార పదావాప్తి
గాదె ధర్మతనూజా. అను. 4 394.
సీ... మారేడు పండుల గారాము
సెఱచు నీ యెల చన్నుగవ వేడుకల
నొనర్చె. అను. 1.50.

2. ఆదరము.

కం. ఆ రాజు సేయు నెయ్యము,
గారామును జెప్పెదీవు గడుఁ దీపు
లుగా. ఉద్యో. 1.340.

3. మరియాద, గౌరవము.

ఆ. ... విగత నాథలైన మగువల
గారామును సెడక యుండునట్లు
నడపికొనుచు. మౌస. 175.

4. అనుఁగు, ప్రియము.

వ. .... నేనును వనవాస కాలంబున
నా నేర్చు విధంబున మీకు నెల్లను
గారామైన తమ్ముని నమ్మెయిం బరి
కించికొని వచ్చితి. విరా. 2.215.
సీ...భూరిశ్రవసుండు నీదు గారాపుఁ
బట్టి. స్త్రీ. 2.127. (శ. ర. పారము)

**గార్గ్యుఁడు** సం. వి. ల పుం.
ఒకానొక ఋషి. అను. 4 237.

**గార్దభము** సం. వి. అ. పుం.
గర్దభము, గాడిద.
ఆ... గార్దభ రూప,ధారణైక నిపుణ
దానవేంద్ర. శాంతి. 4.391.

**గార్దభి** సం. వి. ఈ. స్త్రీ.
ఆఁడు గాడిద.
వ. ఆ గార్దభి దన కొదమతో వీఁడు
చండాలుండు ప్రచండ స్వభావుండు
గాకుండునే, అను. 1.90.

**గార్హపత్యము** సం. వి. అ. పుం.
గృహపతితో నిత్యము కూడి యుండు
నది; అగ్నిహోత్రభేదము; శ్రౌతాగ్ను
లలో నొకటి (శ్రౌతాగ్నులు మూఁడు:
1. గార్హపత్యము. 2. ఆహవనీయము
3) దక్షిణాగ్ని).
కం. విను గార్హపత్యమను న,య్యా
నలము విహరింపఁబడి తదాహవనీ
యంబన వెలుఁగు నట్ల వెలుఁగును,జన
కుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతి
తోడన్. ఆది 4 87.

**గార్హస్థ్యము** సం. వి. అ. న.
గృహస్థ ధర్మము, గృహస్థాశ్రమము.
కం. విను మోక్షము గార్హస్థ్యంబునఁ
గాదని [illegible] చెచటఁ బురుషుం
డెవ్వండు నిరూపించి పలికె స,ర్వ
నిధానము గృహము వేదవాక్య ఫలజ్ఞా.
శాంతి. 5 3 3.

**గాలఁగాడు** దే. వి. (గాలము + కాఁడు)
గాలము వేసి చేపలు పట్టువాఁడు.
సీ ... పాప నిర్ముక్తుఁడై మతి యోగ
మాచరింపఁగ యోగ్యుఁడగు నరుండు.
...గీ. మనసు వట్టుట ముఖ్యపుటనువు
దానికామిషము గాలగానికెట్లట్ల. అను.
5 256.

**గాలము** దే. వి.

దేఁపలను బట్టుటకు ఉక్కు కమ్మితో వంకరగాఁ జేసిన సాధనము, బడిశము (దీని భేదములు: ఉంటగాలము, గోరు గాలము. మొ. ఇది గోరుగాలము).

ఉ. దక్కెను రాష్ట్రమంచు నకటా యిటు దమ్ముని భాగమీక నీ వెక్కటి మ్రింగఁ జూచెదది యెట్లనుగున్ విను మీను లోలతన్, గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగినవాడ్పు సూవె యిట్లుక్కువుఁడైన నీ కొడుకు నుల్లము నున్నటు లాదఁగూడునే. ఉద్యో. 2.52.

కం. వల యురి యోదము గాలము, గలిగికదా మృగముఁ బక్షి గజము ఝషము దక్షులు పట్టుదురు. శాంతి. 4.181.

**గాలవాత్మజుఁడు** సం. వి. అ. పుం.

గాలవుని పుత్రుఁడు (ఇతని పేరేమో ఆంధ్ర సంస్కృత భారతముల రెండింటను గానరాకున్నది.సం.భా.న 'గాలవ సంభవ', 'గాలవి' యను పదములు గలవు. ఆంధ్రమున గాలవాత్మజుఁడు అని కలదు. గర్గవంశ వర్యుండగు ఖని యను తపోధనుఁడు పరమ తపమునఁ బొందిన ఒక కన్యక వివాహము పరిత్యజించి వృద్ధ యయ్యెను. పాణిగ్రహణము సేయని వనితకు పుణ్యలోకము లేదని యా వృద్ధకన్యక యీ గాలవాత్మజుని వివాహము చేసికొని యొక్క రాత్రి మాత్రము గడపి దివంబునకేగెను. వారు గడిపిన స్థలమొక పుణ్య తీర్థ మాయెను. శల్య. 2.207. మొ. 21 వ.

**గాలవుఁడు** సం. వి. అ. పుం.

1. విశ్వామిత్రుని శిష్యుఁడు, మహర్షి. (చరిత్రకై చూ. ఉద్యో. 3.305 మొ. 321 వ.)

2. ఒక మహాద్విజుఁడు. నారదుని వలన శాస్త్రతత్త్వము తెలిసికొనెను. శాంతి. 5.447; మొ. 4568 వ.

వీరిద్దఱ వేఱు వేఱనుటకుఁగాని ఒక్కరనుటకుఁగాని సరియగు నాధారములు గానరాకున్నవి; కాని ఒక్కరే కావచ్చునని యూహపడవచ్చును.

**గాలి** దే. వి.

వాయువు.

తే. .... కాయలాకులు నీళ్ళను గాలి యనుభవించి యున్న మునీంద్రులు వెఱ్ఱివారె. శాంతి. 1.124.

**గాలిగొను** దే అ. క్రి. (గాలి+కొను)

గాలివాఱు, గాలిచే తడియాఱు.

వ. .. తిత్తొలిచి గాలిగొన వైచిన కుక్కకడిమంబు గనుంగొని. శాంతి. 3 285.,

**గాలిచూలు** దే. వి. (గాలి+చూలు)

భీముఁడు.

తే. తుంగమడువున నాడు మాతంగ విభుని,భంగి భవదీయ సైన్యంబు బడలువడఁగ, లీల నిస్సంభ్రమముం డయి కేలి సలిపె గాలిచూలపు గగనచరాలి వొగడ. భీష్మ. 2.222.

**గాసి** దే. వి.

బాధ. వ్యథ, క్లేశము.

కం. స్త్రీ సంతోషించుటెఱుం,గాసపడని మనసు గలుగు నట్టి యధముఁడి,చ్చో సడిఁగొనుఁ జని యచ్చో,

గాసింబడు జముని భటులు గాజియ
వెట్టన్. అశ్వ. 4.228.
విణ.
1. నష్టము, నశించినది, చెడినది.
గీ. ... బేహార మాడు,టయును
గోరక్ష గావించుటయును మొదలు,
గాఁగ బ్రతికెడు తెరువులు గాసి గావె.
శాంతి. 2.255.
గీ. కర్ణ శకుని దుశ్శాసనుల్ ఘనులు
గాఁగఁ, దలఁచి వారలఁ గొని మమ్ము
గెలుచువాఁడ,వై మనంబున శంకింప
కట్టు కీడు, చేసి తాపూఁపుదప్పిన
గాసి యైతి. శల్య. 2.59.
2. వ్యర్థము, పనికి మాలినది.
చం. ... నీదగు సహాయతఁ గౌరవ
సేన రూపుమా,పుట యవలీల నాకు,
ననుఁ బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే,
కటకట నా పరాక్రమము గాసిగఁ
జక్రము చేతనంటితే. భీష్మ. 2.161.

**గాసిబడు** దే. అ. క్రి. (√ గాసి)
1. బాధపడు, వ్యథచెందు. (చూ. గాసి-మొదటి ఉదా.)
2. చెడు.
కం. .... ఆ సురపతి విప్రులనలుఁ.
గాసిఁబడదె తెలచి పడ సెఁగాదె నయ
నముల్. అను. 5.68.

**గాసిఁబెట్టు** దే. స. క్రి. (√ గాసి).
దుఃఖపెట్టు, శ్రమపెట్టు, బాధపెట్టు
కం. ఆ సభ నమ్మెయి నీ దు,శ్శాస
నుఁడ పాండుపుత్రసతిఁ గ్రూరా
త్ముండై సంక లేక పెద్దయుఁ గాసిం
బెట్టంగ. స్త్రీ. 2.57.
కం. ఆసాసల వచ్చితి ననుఁ,గాసిం
బెట్టి యడి యడవిఁ గలసెను. మృగ
యా,వ్యాసక్తుఁడు వగచుం ఒన,
యేసిన మృగ మనఘ తప్పి యేగు
టకుఁ గడున్. శాంతి. 3.153.

**గాసియగు** దే. అ. క్రి.
1 వ్యథచెందు, క్లేశపడు.
వ. ... తమవారిం దామ యెదిరి
పొడుచువారును మఱియు ననేక ప్రకా
రంబులగు వికల సంచారంబుల గాసి
యగు వారును నగుటయుం గని
గాంచిపి. ద్రోణ. 5.267.
వ. ఏకాదశాక్షౌహిణీ భర్త యున్నించు
మానవతులు గాసి యగుచురే శల్య.
2.22.
2. నాశనమగు, చెడు.
తే. ... భూపతి లేకున్న మంద్రె
జనము,లధిక కృషి సేయుటయును
బేహారమాడు,టయును గోరక్ష గావిం
చుటయును మొదలు,గాఁగ బ్రదికెడు
తెరువులు గాసిగావె. శాంతి. 2.255.
3. చిందఱ వందఱ యగు, కల
గుండు వడు.
కం. వడిఁ బొదివి భీముఁడార్చినఁ,
జెద విఱిగిన సేననేమి సెప్పు దుఁ
దన దొం,చడి దాన చదిసె వెనుకొను
కడిఁదిమగల చేత గాసిగాదె నరేంద్రా.
కర్ణ. 2.354.
4. భంగపడు, పరాజయమొందు.
ఆ. ఆతఁడు నగుచు భృగుల యడు
గులకెఱఁగి మహాత్మ దీన నేఁ స్వతార్థ
వృత్తి, నైతిఁ బగతునిట్లు జాతికం
దెడఁబాపి, గాసిగాఁగఁ జేయఁ గంటిఁ
గాన. అను. 1.130.

తే. కాశిరాజ కన్యకలకుఁగా బెనంగి,
వానిచే గాసియైరి భూవరులు పలువురు.
అను. 5.475.

5. కీడ్పడు.

వ. అట్లు గాసియై కోపించి నీ కొడుకు పురికొల్ప .. బలంబులు...సాత్యకిం జుట్టుముట్టిన. ద్రోణ. 4.82.

తే. కర్ణ శకుని దుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ, దలఁచి వారలఁగొని మమ్ము గెలుచువాఁడ,వై మనంబున శంకింప కట్లు కీడు,చేసి తాపూఁపు దప్పిన గాసియైతి. శల్య. 2.59.

**గాసిలు** దే. అ క్రి. (√ గాసి)
శ్రమపడు, ఉయాసపడు. కష్టపడు. బాధపడు.

కం. వాసవనందనుఁ డెంటయు, గాసిలి యున్నాఁడు మనల,గని యించుకయుం, దా సైరణసేయఁడు. విరా. 4.230.

కం. ముని యట్లు నెమ్మిఁ గాంచినఁ, గని యతఁడాఁకొనుటఁ జేసి గాసిలి యెచ్చోఁ,గనువాఁడనొ తగు భక్ష్యం, బనుచుండఁగ వచ్చితివి ప్రియంబుగ ననుడున్. అశ్వ. 3.88.

కం. ఈసును రోసముఁ గల దు,శ్శా సను నొప్పించి పఱచి చతురంగము లన్, గాసిలఁజేయుచు నట్లు,ల్లాస ముతో మెలఁగఁగాఁ దలంచె యొరుల కున్. ద్రోణ 2.139.

# గి

**గింజ** దే. వి.
బీజము, విత్తనము, విత్తు,

వ. .... ఉంఛవృత్తి పరాయణుండై పాద్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్క గింజయకాఁ దూమెడు వడ్లు సమకూర్చి. అర. 6.115.

**గిరి** సం. వి. ఇ. పుం.
కొండ.

మ. కలఁగెం దోయధి సప్తకంబు గిరి వర్గంబెల్ల నూటాడె. విరా. 4.172.

**గిరిక** సం. వి. ఆ. స్త్రీ.
శుక్తిమతి కోలాహలుల కూఁతురు - వసురాజు భార్య. ఆది 3 26.
(చూ. 1. ఉపరిచర వసువు, 2. వసువు.)

**గిరికొను** గిఱికొను. భీష్మ. 2.132.
దీనిని ఆనంద. సం. ము. ప్రతులు లఘురేఫ యుక్తముగాఁ జూపుచున్నవి. లఘురేఫమైనచో అలఘు లఘు రేఫముల మైత్రి యంగీకరింపవలసి యుండును. అంతియగాక గిఱి - వలయాకారపు రేఖ; "గిఱికొను — చుట్టుకొను- సరిపోవుచున్నది.

'వాఁడు గీచిన గిఱి దాఁటఁడు.' అని వ్యవహారమును గలదు. కాన ఇది అలఘు రేఫము గల పదమే యై యుండుననుట సమంజసము. తి. వ. ప్ర. కోశము వారీ పదము సీతావున అలఘురేఫ యుక్తముగనే చూపిరి.

చుట్టుకొను.

కం. ఉఱక ఘటోత్కచుఁ బుంబులు గిఱి కొన నర్దేయుటయును, గినుక గది రినన్,మెఱుఁగారు నారసమ్ములు,పఱ

చుగ నించితి గదంగి తద్గాత్రమునన్. ఉద్యో. 4.320.

**గిరికొలుపు - గిరికొల్పు** (ఇదియు సం. ము. న అలఘు రేఫముగనే యున్నది. 'గిరికొను' వలె ఇదియు అలఘు రేఫయుక్తమే అనుట యుక్తము గానోపు)
(చూ. గిఱికొలుపు-)

**గిరిజ** సం. వి. ఆ. స్త్రీ.
కొండకూఁతురు. పార్వతి.
కం. శ్రీ గిరిజా సమవాయ. శల్య. 1.1.

**గిరిభేది** సం. విణ. (న్. సీ. న్.)
ఇంద్రుఁడు - (కొండలను భేదించిన వాఁడు.)
వ. . . గిరిభేది ొకీఓంటొసంగె... విరా. 4.149.

**గిరివ్రజము** సం. వి. అ. న.
ఒక పట్టనము (ఇది మగధ దేశము నందలిది; జరాసంధుని రాజధాని. ఇది అలకాపట్టనమును బోలి యుండెను. గోంథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రి అను నైదు పెద్దకొండలు దీనిని శూరభటుల వలెఁ గాచి చుట్టు నుండును. దానవచేసి యీ పురమునకు గిరివ్రజము అనుపేరు వచ్చెను.) సభా. 1.172, 73, 74, 75.

**గిరిశల్యము** సం వి. అ. పుం.
గిరి కంటకము, వజ్రము.
సీ. శకుని కైతవము దుశ్శాసను చేసిన దుష్కర్మమును గర్ణు తులువ తనము, దుర్యోధనుని దైన దుర్ణయంబును జిత్తమున గిరిశల్యముల్ వోలె నలఁప. అర. 5. 335.

**గిరిశుఁడు** సం. వి. అ. పుం.
గిరీశుఁడు, శివుఁడు.
సీ. స్థాణు నుగ్రుని శివు శర్వు నీశానుని భద్రప్రదుని శంభు రుద్రు గిరిశు. సౌ ప్తి. 1.112.

**గిరీశుఁడు** సం. వి. అ. పుం.
శివుఁడు.
కం. గిరిజయు గిరీశుఁడును నోం, దొరువులకై తపమొనర్చి. అను. 3 141.

**గిఱికొను - గిఱిగొను** దే. స. క్రి.
($\sqrt{}$ గిఱికొను).
1. చుట్టుకొను, పరివేష్టించు, గిరికొనఁ జేయు, క్రమ్ముకొనఁజేయు.
కం. మఱియును శరశతకము మెయిఁ గిఱికొలిపిన వృష్ణివరుఁడు గినియఁగ లేకే,పటి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీ తనయులుబ్బు మిగిలి నరేంద్రా. ద్రోణ.3 271; ద్రోణ.5.63.
కం. మఱియు నతని మెయి బాణము, లఱువది గిఱిగొలుప నా బృహత్క్షత్త్రుఁడే, దైఱ సూతు నొంప నాతం,డఱి ముఱి నారాచతతుల నవ్విభుఁ బొదివెన్. ద్రోణ. 4 114; ద్రోణ. 5.138.

**గిఱుపు** దే. స. క్రి.
1. (కన్ను) గీటు.
చం. ... అతఁడుం,దెఱపి యొకింత గాంచి ఘన తీవ్ర శరంబున నారిఁ ద్రుంచి క,న్గిఱిపిన మాత్రలోన నతనిం బటు భాణ చతుష్కయుగ్మ

మే, డైఱఁ దొడి మౌర్వి గ్రమ్మఱ ఘటించు నెడన్ వడినేసి యార్చినన్. విరా. 5.141.

(కన్గిఱిపిన మాత్రలోన = ఱెప్పపాటు లోపల).

2. బాలక్రీడా విశేషము. ఒకరినొకరు జుట్టు తల మోకాళ్ళు బుజములు మొ. వానిని పట్టుకొని యెత్తి కుదియ వైచుట లేక గిరాటు కొట్టించుట.

కం. గిఱుపునెడఁ నేయునెడ వడిఁ, బఱచునెడం బెనఁగునెడ నపార బలంబుల్, మెఱయునెడ భీమునకు నం, దొఱుఁ గిడ్పడఁదొడగిరుద్ధతులు రాజసుతుల్. ఆది. 5.164.

శ్లో॥ జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంసు వికర్షణే, ధార్తరాష్ట్రాన్ భీమసేనః సర్వాన్ పరిమర్దతి. హర్షాత్ప్రక్రీడమానాం స్తాన్ గృహ్య రాజన్నిలీయతే శిర స్సువినిగృహ్య తాన్ యోధయామాస పాండవః. కరేషు చ నిగృహ్యైనాన్వినిహత్య బలాద్బలీ,చ కర్ష క్రోశతో భూమౌ ఘృష్ట జాను శిరోఽంసకాన్. సం. భార. ఆది. 128- 16, 17, 19.

# గీ

గీ అవ.

నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడిత శబ్దము యొక్క ఆద్యక్షరమునకు వచ్చెడి ఆదేశము.

కం. మఱితురె యాడిన మాటలు, పిఱుసని పోఁదగునె మీకు బెదరిక యెదురై తఱుముఁడు భీమ్మని గిమ్మని నెఱు(?)కె మున్నేను గమ్మనేలా పెఱవన్. భీష్మ. 2.150.

**గీటడంగించు-గీటడఁగించు** దే.స.క్రి. (√ గీటడఁగు) చంపు, నశింపఁ జేయు.

చం. అని ధృతరాష్ట్రి నందనుల నందఱ గీటడగించి వేఁడి యాపక కడకమ్మ తుంబనుపు నంటటి కార్య విశేష మేమి గన్గెనో మునినాథ యా నృపతికిన్. శల్య. 2.357.

సీ. ... ఉరవడిఁ దఱిమి యా రాధేయుఁ గీటడఁగింతము. కర్ణ. 3.173.

మ...అతండా సేనలం గాచనొ,క్కరుఁడుం గీటడఁగించు నీ బలముంన్ గాండీవి దుర్దాంతుఁడై. ఉద్యో.4.258

**గీటడఁగు** దే.అ.క్రి. (గీటు+అడఁగు) చచ్చు, నశించు.

సీ. ... యాదవులెల్లను నమ్మున లము,నద్భుతశక్తి గీటఁడగుదురు. మౌస. 108.

సీ. .. సౌబలుఁడు గీటడఁగె ను,లూకుండు మడిసె. శల్య. 1.9.

**గీటడఁచు** దే. స. క్రి. గీటడఁగించు. చంపు.

గీ. మేటి మగని ఘటోత్కచు గీటడఁపఁడె,యిట్టి జెట్టికిఁ బోర జావెట్టిఛంగి నయ్యె. కర్ణ. 1.42.

**గీటు** దే. వి.

1. అనాదరము, ఉపేక్ష. (చూ. గీటు నఁబుచ్చు)

2 గర్వము, మదము.

(చూ. గిటడఁగించు, గిటడఁగు =
గిటడఁచు.)

**గిటునఁబుచ్చు** దే. స. క్రి.

1. అనాదరించు, ఉపేక్షించు.

వ. అని తలంచుచుఁ గీచకుని మాటలు గిటునంబుచ్చి యొండు పలుకుల జర పిన...విరా. 2.42.

వ. ... వీఁడు సంయమివరు మాట గిటునంబుచ్చి తన వలసినట్లు సేయు వాఁడమ్మె సౌప్తి. 2.79; శాంతి. 4.140.

2. పోఁగొట్టు.

వ. ... అతండు భీమసేన పక్షపాతం బున నతని చింత గిటునంబుచ్చె. శల్య. 2.310.

**గీత** సం. వి. అ. స్త్రీ.

ఆధ్యాత్మిక తత్త్వవిషయమై ప్రశ్నో త్తర రూపముననుండు గ్రంథము.
(పరాశర గీత, హంసగీత, అంబరీష గీతలు మొ.)

**గీతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పలుకఁబడినది, చెప్పఁబడినది.

కం. పరమమగు నీ వ్రతమునకం, గిర సుఁడు దర్శకుఁడు దత్సుగీతవిధ మునన్, నరులెవ్వరు దర్శకులగు, దురు వారిం బొరయ వేమి దుఃఖ ములు నృపా. అను. 4.158.

2. గానము చేయఁబడినది. పాడఁ బడినది.

కం. .. వసుధాజన గీత కీర్తి వాసవమూర్తి. ఆది. 5.260.

మాలిని. .. మంత్ర గీతాధిరాజ్యా. ఉద్య. 5.484.

వి. అ. న.

గానము, పాట.

కం. విశ్రుత వాద్యంబులు మం, ఱుశ్రుతి గీత సంగతులు సద్భా, వాశ్రయములుఁ దజ్జన్య ర,సాశ్రయములునైన యభిన యంబు లెఱుఁగుదున్. విరా. 1.241.

తే. ....వారాంగనా శ్రేణి గీత,నృత్య నిరతి నారాధింప నిర్విశేష,యోజి తేంద్రియుఁడై యతఁడుండె నధిప. శాంతి. 6.269.

**గీయమానుఁడు** సం. విణ. (అ.ఆ.అ).

నుతింపఁ బడుచున్నవాఁడు.

వ. గంధర్వ కిన్నర గీయమానుండ గుచు జనునప్పుడు. అర. 1.349.

**గీర్వాణుఁడు** సం. వి. అ. పుం.

దేవత, వేల్పు.

శా...మత్పతుల్ గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్బలం వెసం గిట్టి గం, ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా. విరా. 2.55.

కం. నలినంబులు జాజులునుం,దుల సీదళములుఁ బ్రభూత తోషము గీర్వా ణులకుం జేయును. అను. 4.6.

**గీఱించు** దే. స. క్రి.

నాటించు, నాటునట్లు చేయు.

కం. ఆఱమ్ములతని మేనం, దూఱంగా నేసి నాల్గు తురగాంగములన్ గీఱిం చిన. ద్రోణ. 4.13.

**గీఱియుండు** దే. అ. క్రి.

నాటుకొని యుండు, పాదుకొనిపోవు.

సీ. పాంచాలి నవమాన పఱచిన తెఱఁ గును, నయ్యంతి వెనుకరా నడవిఁ

గలయ,ధర్మజు చన్ను చందంబును మది గీఱి,యుండక మఱపెట్టులోలసె నీకు. ఆశ్ర. 1.118.

**గీఱు** దే. అ. క్రి.

1. నాటు, గ్రుచ్చుకొను, పొడుకొను.

చం. ... ద్రౌపది నింత కాల మ,ప్పులకు లలంచుచుండె మదిఁ బాయవు గీఱిన యమ్ములట్ల. కర్ణ. 3.36.

ఉ. .. వృకోదరుండు పదితూవులు పాములు పుట్టలోనికిం, దూఱిన యట్లుగాఁ బ్రబల దోర్బల మేర్పడ చేయ నెమ్ములన్,గీఱిన మూర్ఛ వచ్చి యొఱగెన్. భీష్మ. 2.398.

సీ. పాంచాలి నవమాన పఱచిన తెఱఁగును,నయ్యెంతివెనుక రానడవిఁ గల య,ధర్మజు చన్నుచందంబును మది గీఱి,యుండక మఱపెట్టులోలసె నీకు. ఆశ్ర. 5.138.

స. క్రి.

(గోరు మొదలగు వానితో) గీకు.

వ. తన యంగుష్ఠంబు వ్రేలం గీఱిన నందు భస్మంబు గారిన నా సంయమి సిగ్గుపడి. శల్య. 2.161.

2. భేదించు, వ్రచ్చు.

ఉ. ... వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం దూఱిన యట్లు గాఁ బ్రబల దోర్బలమేర్పడ నేయ నెమ్ములన్ గీఱిన మూర్ఛ వచ్చి యొఱ,గెం బలచె రుధిరంబు గ్రమ్మఁగన్. భీష్మ 2.398.

# గు

**గుంట** వి. కుంట

గొయ్యి, గుంత.

సీ. ... బ్రహ్మకులాధికారతఁ గవసి శూద్రుఁడు నరకపుగుంట పడ్డాడు. అను. 4.263.

**గుంటూరు** దే. వి.

ఆంధ్రప్రదేశమున సముద్ర ప్రాంతమందు కృష్ణా, ప్రకాశము మండలములకు నడుమనున్న యొక మండలమునకు ముఖ్యనగరము. ఆ మండలమంతయు ఈ నగరము పేరుతోడనే గుంటూరు జిల్లా అని పిలువఁబడుచున్నది. తిక్కనసోమయాజి గారైన కొమ్మనామాత్యుఁడీ నగరమునకు విభుఁడుగ నుండెను. విభుఁడనగ కరణము అని కొందఱు వ్యాఖ్యానింతురు. కరణము గావచ్చును, లేదా పరిపాలకుడు గావచ్చును లేదా పరిపాలకుడు కరణము రెండును గావచ్చును. దీనినిబట్టి తిక్కనగారి జన్మస్థలము గుంటూరు అని తోఁచెడిని. విరా. 1.10.

**గుండియ** దే. వి.

గుండెకాయ, హృదయము

(చూ. గుండె.)

**గుండు** దే. వి.

1. ఉత్తమాంగము

వ. గోడిగలకై దండపాత కలహంబులం దెరలు గుండ్ల గ్రుంగుచునను. సౌప్తి. 1.197.

2. గుండ్రని పెద్ద రాయి, పర్వతము.

(చూ. గుండ్లు దేలి పెండ్లు మునుఁగు.)

**గుండె** (గుండియ) దే. వి.

1. గుండెకాయ, హృదయము.

గీ. ... ద్రోణుని పాటు వినియు, వేయి పఱియలై పోవదు రాయి గాఁగ, నోపు నా గుండె యేమని యుమ్మలింతు. ద్రోణ. 1.80.

కం. నిజ సింహనాదమున న,గ్గజములు గుండియలు వగిలి కలగుండు వడన్, విజయాగ్రజుఁ డిట్లేచి. భీష్మ. 2.207.

2. ధైర్యము.

సీ. పాండుపుత్రుల బహిఃప్రాణంబు నుత్తమ శీలసమగ్రఁ బాంచాల తనయఁ, గొనిపోవునంతటి గుండె గల్గెనె విమోహాంధ మానసుఁడైన సైంధవునకు. ఆః. 6.197.

**గుండెకాయ** దే. వి.

హృదయము, గుండె.

తే. ... దొడ్డ నారసమున గుండె కాయ వగుల బెట్టేయుటయు. ద్రోణ. 3.95.

"చిచ్ఛేద హృది బాణేన పృథుధారేణ పాండవః" సం. భార. ద్రోణ. 82.71.

**గుండ్లు దేలి బెండ్లు మునుఁగు** — జాతీయము.

మునిఁగి పోవలసిన గుండ్లు (పెద్ద పెద్ద బాళ్లు లేక పర్వతాలు, శిలలు.) మునిఁగిపోక పైకిఁ దేలినవి. తేలవలసిన బెండ్లు మునిఁగినవి. బలవంతులపై బలహీనులు పరాక్రమించి మించినపుడీ లోకోక్తి వాడుదురు. సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ గురుసైనికులు కృష్ణార్జునులఁ జేరి పరాక్రమించిరని చెప్పుచు ఈ లోకోక్తి వాడెను.

వ. పొదివిన యగ్గురుప్రాపున భవదీయ సైనికులు గొందఱా కృష్ణులం జేరి పరాక్రమించుట గుండ్లు దేలి బెండ్లు మునిఁగి నట్లయ్యె. ద్రోణ. 3.67.

**గుంపు** దే. వి.

సమూహము, గుమి.

చం. కరి తురగాది ఘట్టనయు గాలియు నోంపదె యొంటినున్న య, త్తరువు ననేక భూరుహ వితానము గుంపయి పేర్చి బాధలం బొరయునె. ఉద్యో. 2.88.

వ.... ఇచ్చటి ప్రజ మూఁడు గుంపులయ్యె. ద్రోణ. 3.120.

**గుంపులు గట్టు** దే. అ. క్రి. (గుంపులు + కట్టు).

గుంపులగు, గుమికూడు.

వ. ఇవ్విధంబున విషమంబగు రణభూ భాగంబునం జరియింపం జతురులుగాక రథిక జనులంతంత గుంపులు గట్టిరి. భీష్మ. 2.137.

కం. .... పెఱబలంబు పురికొనక వెఱం దెరలుచు గుంపులు గట్టుచుఁ గురుపతి సైన్యంబు పొంతకుం జనుచుండెన్. ద్రోణ. 1.244.

**గుంపులు గొను** దే. అ. క్రి. (గుంపు + కొను).

గుంపులుగాఁ జేరు.

కం. ... కుంతీతనయుఁ డనిఁ దనివి సనక గుంపులు, గొని యున్నెడలం రసెఁ గలయఁ గురు సైన్యమునన్. విరా.

5.177., ద్రోణ. 3.120.

**గుంపులు సేయు** దే. అ. క్రి. (గుంపు + చేయు).
గుంపులుగాఁ గూర్చు.
కం. పాయవడ జొచ్చు గుంపులు, సేయును మలఁకిలఁ జరించి చించును ...అరిసైన్యంబున్. భీష్మ 1.269.

**గుగ్గిలము** వై. వి. (సం. గుగ్గులః)
గుగ్గులువృక్షపు బంక.
తే. సల్లకీజాత నిర్యాసమెల్ల దేవ, తలకు మేలంతకంటె గుగ్గిలము లెస్స. అను. 4.12.

**గుచ్ఛము** సం. వి. అ. పుం.
1. తోఁక మొదలగువాని వెంట్రుకల కుచ్చు.
ఉ. ... చటుల వేగ సముచ్ఛ్రిత పుచ్ఛ గుచ్ఛ వి,స్ఫోటిత దిగ్విభాగుఁ డగుచుం జనుదెంచె సుషేణుఁ డత్తఱిన్. ఆర. 7.37.
2. సమూహము.
మ. కులిశ ప్రస్ఫురణాపహాసన విభా గుచ్ఛంబులం గల్గి. కర్ణ. 3.358.

**గుజగుజ** దే. వి.
గుసగుస. (చూ గుజగుజలాడు — గుజగుజలు వోవు.)

**గుజగుజలాడు** దే. అ. క్రి. (గుజగుజలు + ఆడు.)
గుసగుసలాడు.
తే. ... సభవారలందఱు నంతనంత, నల్లనల్లన గుజగుజ లాడుచుండిరి. విరా. 2.146

**గుజగుజలువోవు** దే. అ క్రి. (గుజగుజలు + పోవు)
గుసగుసలు పోవు, తమలోఁ దాము బయటికి స్పష్టము గాకుండునట్లు రహస్యముగా మాటలాడుకొను.
కం. వలలుని దెస మాలిని చూ,డ్కులం తెలఁగెదఁ బొందుఁ దెలిపెదుం గంటిరె వీ,రలు వచ్చిన సమయంబున,దలఁ పగ నొక్కటియ యుబ్బి,ధం బెట్లొక్కొ.
వ. అనుచుం గలదు లేదని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవుచుండుదురు. విరా. 2.201.

**గుజ్జు** వై. వి. (సం. కుబ్జః, ప్రా. కుజ్జో, హిం. గుజ్జు).
1. పొట్టివాఁడు. వామనుఁడు.
గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు, గుజ్జు. అను. 5.104.
(ఈ యర్థమున మఱుగుజ్జువాఁడు అని వ్యవహారము).
2. కోడెదూడ.
సీ. మంకినాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు; శిక్షింపవలయు నట్టి, గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి యుండ లంకయతోన గండు మీఱి. శాంతి. 4.40.
సీ. ... గుజ్జులమరిన ఒంటియు. అను. 2.379.

**గుటిక** సం. వి ఆ. స్త్రీ.
1. ఉండ, మాత్ర.
సీ....ఘన రసాయన గుటికా ప్రయోగంబున దేహతాపంబు వర్తిల్లెనిందు. ఆర. 4.363.
2. గుండ్రని పదార్థము.

సీ. హరి హర బ్రహ్మ మహాను భావంబు లొక్కటిగాఁగఁ గరఁగిన గుటిక యనఁగ. విరా. 2.241.

**గుట్ట** వి.
రాశి, కుప్ప.
చం. పసరపుఁటెంప ప్రోవులును బంఁదుల దొక్కలు గుక్కగుట్టలున్, ముసుఁగు పడంగ భూమితలముం దఱచారఁగఁ గప్పుచున్. శాంతి. 3.284

**గుట్టు** వై. వి. (సం. గూఢమ్).
మర్మము, రహస్యము.
ఆ. ... లో,గుట్టుచేటు లేనియట్టి నృపతి,వలన మత్సరంబు వలదు. ఆశ్ర. 1.71.

**గుడము** సం. వి. అ. పుం.
బెల్లము.
తరలము: పలు దెఱంగుల పిండి వంటలుఁ బప్పుఁగూడును నేతికుండలు గుడంబు దధిప్రపూర్ణ ఘటంబులుఁ గొనివచ్చి యా. ఆది 6.288.

**గుడాకేశుఁడు** సం. వి. అ. పుం.
గుడాకా = అలసత్వమును, ఈశుఁడు = శాసించువాఁడు.
అనఁగా సోమరితనమును అణఁచువాఁడు. గుడా = తర్జన్యంగుష్ఠాగ్ర సంయోగ వలయ పరిమితి గల, కేశుఁడు = జుట్టుగలవాఁడు. గుడా = జెముడువలె మిక్కుటముగాఁ బెరిగిన, కేశుఁడు = జుట్టుగలవాఁడు. (సూ. అ. ని.)
అర్జునుఁడు.
వ. అనిన గుడాకేశు పలుకులకు హృషీకేశుఁడు భీష్మ ద్రోణ ప్రముఖ యోధవీరులు గనుంగొనుచుండ నత్తెఱంగున రథోత్తమంబు నిలిపి. భీష్మ. 1.180.

**గుడి** దే. వి.
దేవాలయము.
కం. .. తా,మతిఁ దలఁచెనేని బరిశాం,తతనున్నను గుడియు గుహయుఁ దగు మందిరముల్. శాంతి. 5.595.

**గుడిసె** వై. వి. (సం. కుటీరః.)
ఆకుటిల్లు, కుటీరము, స్తంభములు గోడలు వెన్నుగాడియు లేకుండ తృణాదులతో నిర్మించిన చిన్న యిల్లు.
తే. అనుడు వాఁడు శుశ్రూషకుఁడై వసించె,గుడిసె యొకదెసఁ గావించుకొని ముదమున. అను. 1.276.

**గుడుసు** దే. విశ.
గుండ్రము, వర్తులము.
వ. ఇట్లేయు నా సూతనందనుని విల్లు విదుర్పు దోఁపక గుడుసువడుటఁ జక్రాకృతిఁ బొలుచు ననలశిఖల చెలువు దాల్చె. ద్రోణ. 4.232.
వ. ... గాండీవంబు దివియకయును గుడుసువడియెడు. ఉద్యో. 2.146; కర్ణ. 3.41.

**గుడుసువడు** దే. అ. క్రి. (గుడుసు+పడు).
గుండ్రమగు, వర్తులాకారముగ నగు (చూ. గుడుసు).

**గుడ్లూరు** దే. వి.
ప్రకాశము మండలమునందలి కందుకూరు ఉపమండలము (తాలూకా) నకుఁ జెందిన యొక గ్రామము. ఇది

ఎఱ్ఱనగారి నివాసస్థలము, ఇచట అతి పురాతనమైన శివాలయము గలదు. ఇటీవల దేవాలయావరణమునందు ఎఱ్ఱనగారి విగ్రహమును బ్రతిష్ఠించిరి.
సీ. .. గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడు ధర్మైకతత్వ రాత్ముఁ తే. దెఱ్ఱనార్యుండు. ఆర. 7.470.

**గుణకేశి** సం. వి. ఈ. స్త్రీ.
దేవేంద్రుని సారథియైన మాతలి కూతురు; ఆర్యకుఁడను భుజంగపతికి మనుమఁడును చికురుని కుమారుఁడు నగు సుముఖుని భార్య. గరుత్మంతుఁడు చికురుని జంపి యొక నెలలో సుముఖుని జంపుదునని ప్రతినపట్టెను. మాతలి దేవేంద్రుని బ్రార్థించెను. అతఁడు విష్ణుమూర్తితోఁ జెప్పి సుముఖుని దీర్ఘాయుష్మంతుని జేసెను. ఉద్యో. 3.291,292.

**గుణము** సం. వి. అ. పుం.
గౌనము, వస్తుధర్మము.
ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁ బతివ్రతాగుణా, స్పందిత వర్తనం బరమ సాధ్వినినిందితశీలఁ గీచకుం,డెందును నెట్టియంగనల నెవ్వరుఁ జేయని యట్లు సేయఁగాఁ గొందలకైన నిప్పు కృపకుం దఱిగాదటె యేమి చెప్పుదున్. విరా. 2.142.
ఉ. ... శూరగుణ ప్రతిభాస. విరా. 3.21.
2. మంచి గుణము,
వ. గుణవంతుల గుణములు నిర్గుణుఁడెఱుఁగమి దెల్ల పేష్ప గుణహీనుఁడవీ,గుణమితనియఁడుఁ గలదని గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్. కర్ణ. 2.44.
3. ప్రకృతిగుణము: 1. సత్త్వము, 2. రమస్సు, 3. తమస్సు.
చం. .. గుణతత్త్వ వికార నియత్యభేద్య ... విరా. 2.363.
కం. అగు నీ తత్త్వము సత్త్వాది గుణత్రయ వికృతి కత్యతీతంబై. శాంతి. 4.94; శాంతి. 6.33.
ఆ. అదిని ధనరహితుఁడగు నిరంజనుఁ జెంది గుణము వెడల విడిచి. శాంతి. 5.175.
4. స్వభావము, ధర్మము.
కం. లోకంబెల్లను నేఁ జిత్రాకారము గాఁగఁ జూతునట్లగుట మనం,బే కార్యములం దగులదు,కోరదు దకాంబు బిందుగుణ మొనరంగన్. శాంతి. 5.229.
5. మంచి
తే. ధనము కలిమియు లేమియుఁ దాసునందు, నిలిపి యెత్తంగ ములు సూపె నిర్ధనత్వ,మెక్కుడై వాని దిక్కున నెట్టులన్న విను గుణదోషముల భంగి విస్తరింతు. శాంతి.4.33.
(గుణ దోషములు - మంచి చెడ్డలు)
(పంచ గుణములు 1. శాంతి, 2. దాంతి, 3. ఉపరతి 4. తితిక్ష 5. సమాహితము).
షడ్గుణములు (రాజనీతి గుణములు): 1) సంధి 2) విగ్రహము 3) యానము

4) ఆసనము 5) ద్వైధము 6) ఆశ్రయము. శాంతి. 6.197.

7. లౌమ్మిది గుణములు: 1) స్తంభము 2) అతిమానము 3) హర్షము- ఈ మూఁడు సాత్త్వికములు; 4) క్రోధము 5) సంరంభము 6) శోకము- ఈ మూఁడును రాజసములు; 7) మోహము 8) తంద్ర 9) స్వప్నము- ఈ మూఁడును తామసములు. అశ్వ. 2.83 ఐశ్వర్యాది (ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. ఇవి భగవంతుని గుణములు); శబ్దాది (శబ్దము, స్పర్శము, రూపము, రసము గంధము. ఇవియైదు భూతగుణములు); కావ్యగుణములు: శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థ దీవపము, ఔదార్యము. శాంతి, ఓజస్సు, సమాధి-అని పది.

వ. అల్లెత్రాడు, మౌర్వి.

వ. ... పేడితనంబు దాల్చి బాహుల దీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖ వలయంబులును మాటుసేసికొని విరాటు కడకుం జని. విరా. 1.87; విరా. 5.30.

8. ఆవృత్తి, రెట్టి, మడుఁగు.

ఆ. అస్థి గలిగి హీనమగు జంతువైనఁ దద్ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణ జంతు,వునకు నలుమడించుకొనునది నరమాత్ర,హింస యష్టగుణ కృతిహఁ బాయు. అను. 3.298, ఆది. 1.80.

10. యుక్తము, తగవు.

ఆ ఏను మంత్రశక్తి యెఱుఁగక కోరెతిఁ,గన్యకిదియు గుణము గాదు. ఆది. 5.24.

సీ. ... అస్మాదృశులకు ధర్మాను బంధులకిట్టి క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ. అర. 1.222.

**గుణవతి** సం. విణ. (త్. తీ త్).

మంచి గుణములు గలది.

కం. సతియును గుణవతియుఁ బ్రజావతియు నను(వతయునైన వనిత నవ జ్ఞా,న్విత దృష్టిఁ జూచు నతిదు,ర్మతి కహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. ఆది. 4.81.

**గుణవంతుఁడు** సం. విణ. (త్.తీ.త్.)

మంచి గుణములు గలవాఁడు.

వ. అదియును సాళ్వపతియైన ద్యుమత్సేను కొడుకు సత్యవంతుండు రూపవంతుండనియును గుణవంతుండనియును విని. అర. 7.173; కర్ణ. 2.44.

**గుణహీనుఁడు** సం. విణ. (అ. ఆ.అ.)

మంచి గుణములు లేనివాఁడు.

కం. గుణవంతుల గుణములు నిర్గుణుఁడెఱుఁగమి దెల్లమీవు గుణహీనుఁడవీ,గుణమితని యందుఁ గలదని, గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్. కర్ణ. 2.44.

**గుణి** సం. విణ. (న్. నీ. న్.)

గుణము గలవాఁడు.

కం. చేసినదానికి మాఱుగఁ జేసిన పగ యంతతోడఁ జెడుఁగాక గుణుల్,డాసిన నమ్మేలు విడిచి, దోసము బట్టుదురె యెట్టి తుచ్ఛులుఁ జతురా. శాంతి. 3.254.

**గుణితము** సం. విణ. (అ. ఆ. అ).
(గణిత.) హెచ్చు చేయఁబడినది (సంఖ్య).
సీ. ... తత్ప్రతన మూఁట. ఆ. గుణితమైనఁ జమువగున్. ఆది. 1.80

**గుణిత్వము** సం. వి. అ. న
గుణిభావము, గుణము గలిగి యుండుట.
కం. ఏ విధమునఁ జూచినను మహీశ్వరుని,గుణి,త్వావేశము పొరయఁదు. శాంతి. 6.33.

**గుణియించు** సం. స. క్రి.
1. (గణిత) హెచ్చుసేయు.
సీ. ... తద్గణము త్రిగుణితమైన, వాహినియగు దాని వడి మూఁట గుణియింపఁ బృతనాఁ బరఁగు తత్ప్రతన మూట.
ఆ. గుణితమైన, జమువగున్. ఆది. 1.80.
2. వల్లెవేయు, ఉచ్చరించినదే మఱల మఱల నుచ్చరించు.
చం. ద్విజవరులం గుమారుల నతిప్రియ దర్శనులైనవారి ఋ,గ్యజుష పదక్రమంబులు క్రియన్ గుణియించుచు వచ్చువారి న,గ్గజపురవల్లభుండు గని గ్రక్కున డాయఁగఁ బిల్చి. ఆది. 2.194.
వ. .. కౌశికుండను బ్రాహ్మణుండు ... ఒక్కనాఁడు గ్రామ సమీపంబునందొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండ. అర. 5.7.
శ్లో॥ స వృక్షమూలే కస్మింశ్చిద్వేదానుచ్చారయన్ స్థితః. సం. భార. అర. 205. 2 (వావిళ్ళ).

**గుణోత్తర** సం. విణ. (అ. ఆ. అ.)
ఉత్తమ గుణములు గలది.
చం. మఱచితె యా సభన్ భువనమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ,పఱచిన పాటుఁ బాండవులఁ బల్కిన వల్కులు. ద్రోణ. 4.91.

**గుత్తి** వై.వి. (సం. గుచ్ఛః, ప్రా. గుత్తీ, క. గుత్తు. త. కొత్తు)
1. పువ్వులు మొదలగువాని గుచ్ఛము.
చం. మొల్ల గుత్తులను నుయ్యెలలొప్పఁగ నెక్కి యూఁగె న,ల్లల దళినీ కులంబు...అర. 4.138.
2. చీలమండ.
వ. గుత్తుల కొలందికిఁ గృత్తంబులయి పడియున్న పాదంబుల వలనం గెంచలిరుల సెజ్జల చందంబులగు చోట్లును. విరా. 3 236.

**గుదము** సం. వి. అ. న.
పాయువు, ముడ్డి.
కం. గుదతలము నొవ్వఁదోమినఁ గదురును రోగంబు. అను. 3.278.
సీ. ... గుద వస్తితలము లాస్పదములుగా వహ్ని పరిగతుండగుచు నపానుడుఁదు. అర. 5.101.

**గుది** దే. వి.
ఆకులు లోనగువాని దండ.
చం. కరముననున్న శూలమునఁ గ్రమ్మ మెఱుంగులు శత్రుసైన్యశ్రీ,కరములుగా గజాశ్వ భట కాయములన్ గుది గ్రుచ్చినట్లుగాఁ జెరువుచు

వచ్చు వానిఁ గురుసింహుఁడు సూచి. భీష్మ. 3.108.

కం. అని యొక గుదిమీల నడుమ, నెనయంగాఁ దూఱి కఱచి యిరు దౌడలఁ ద్రా,ఁడౌనరఁగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁప మూర్ఛఁ జెందిన భంగిన్. శాంతి. 3.195.

2. గుత్తి.

వ. ... అనేక ప్రకారంబులగు క్రూర శరంబులఁ జతురంగంబులం దుని యలుం బఱియలుం దుమురులుం గుదులునై బడలువడం జేయుచుఁ. భీష్మ. 1.138; కర్ణ. 2.317.

**గుదివడు** దే. అ. క్రి. (గుది + పడు)

1. గుది వేసినట్లగు, బద్ధమగు, కట్టువడు.

మ... చెదంబాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్,గుదివడ్డం బెగడొందియున్.

ఆ. నాగపాశ బంధనంబుల గుదివడి, వారు వివిధబాణ దారితాంగులై రథం బుల విడిచి కర్ణ. 2.234; సౌప్తి. 1.197.

2. కుంటువడు.

వ. .. ఇట్లమ్మొత్తంబు గమనంబు గుదివడుచు మందంబై చెల్ల ధృత రాష్ట్రుండు గొండొక యెడగలుగం జనియె. ఆశ్ర. 1.157.

**గుద్దలి** వై. వి. ఔ. (సం. కుద్దాలః).

వేళ్ళు మొదలగునవి పెల్లగించెడి సాధనము, కుద్దాలము.

వ. ... కురుకులంబునకు గుద్దలి గొని దుర్ద్యూతంబు నీవ తొడరితి దాన నింతలు పుట్టె. శల్య. 2.328.

**గునకము బండి** దే. వి.

బాట బండి, సవారి బండి, గూఁడు బండి.

వ. ద్రౌపదీ ప్రముఖ వధూ జనంబుల నుం దక్కనుం గల భరతభార్యల నందలంబులను గునకబండ్లను నిడి కొనిరండని యంతఃపురాధికారుల నబ్బూరమణుండు నియమించిన... ఆశ్ర. 2.28.

**గుప్తము** సం. విశ. (అ. ఆ. అ).

గూఢము, దాఁపఁబడినది, రహస్యముగా నుంపఁబడినది.

వ. అనినం బాంచాలి సంచలిత స్వాంతయై నిజాంతర్గతంబున నతని తీవ్ర క్రోధంబు గుప్త సాధనంబునకు బాధ కంబగునని బోధింపం దలంచి యిట్లనియె. విరా. 2.285.

కం. సురతంబు గుప్తమగుటయు, గురుశుశ్రూషయును బ్రహ్మకుల భజనము నాయురవాప్తిఁ జేయు. శాంతి. 4.119.

సీ. అన విని బలి దేవతాధీశుతో నీకు నా విభవంబు గానంగరాదు, గుప్తమై యున్నది గుహయందు, నాకిచ్చపుట్టిన నప్పుడ వొలిచి తోఁచు. శాంతి. 4.392.

2. రక్షితము. కావఁబడినది.

కం. అమృతంబు దుర్లభం బ,య్యమరులకేనియు నతిప్రయత్నంబున గుప్తము సేసియుండు వాసవుఁడు. అను. 1.214.

**గుప్తవర్తనము** సం. వి. అ. న.
చాటుపని, రహస్య కార్యము.
ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీ
వనంబు గుప్త వర్తనములు గాఁగఁ,
జలుపవలయు నృపతి గొలువున్న
యెడల బాహిరములైనఁ గెలనికెగ్గు
లగుట. విరా. 1.137.

**గుప్తి** సం. వి. ఇ. స్త్రీ
1. రక్షణము, కాపాడుట.
సీ. .... పావకుఁడు మొఱఁగి ... ఆ.
యరిగి తనదు గుప్తి యర్థించి గోవుల
నాశ్రయించె నవియు నగ్ని గోప
నంబు సేసె. అను. 3 101.
ఆ. .... ఇంక సురలకైన శంకింతునే
భవద్బాహు వప్రగుప్తి బలుపు గలుగ.
విరా. 4.162; విరా. 1.180.
సీ ....ధర్మమున నుపార్జి. ఆ. తంబు
లైన యట్టి ద్రవ్య సంచయములఁ,
దృప్తిసేసి దేహగుప్తి నడపి. అను.
3.291.
2. దాఁచుట.
తే. ... నిజపాప గుప్తి యకృత్యి
మరయ. శాంతి. 4.118.
తే. వాహనాసన శయ్యా నివాసము
లును,భోజ్య గంధ మాల్యాంబర
భూషణములు, గుప్తియును నరపతికి
నెక్కుడుగ వలయునను తలంపుతో
మనుట భూజనుల గుణము. శాంతి.
2.262.

**గుప్పించు** దే.స.క్రి. (గుప్పు + ఇంచు.
స్వార్థమున)
1. గుప్పు (బాణాదుల నధికముగా)
ప్రయోగించు.
మ. కల్పాంత భైరవ భీమాకృతి
నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పిం
చినన్. భీష్మ. 3.318.
ఉ. ...కోపించి శితాస్త్రముల్ గవలు
భీముఁడు సాత్యకియుంగడంకగుప్పిం
చిన వానిఁ ద్రుంచి శరపీడిత దేహాల
జేసె వారలన్ శల్య. 1.192.

**గుబ్బతిలు** దే. అ. క్రి.
ప్రజ్వలించు, మండు.
కం. విను చల్లని మాటలతో, మునిఁగి
యలుక గుబ్బతిలు సముద్ర జలము
తోనరయుంచి యాఱజెప్పుదు,గన
గనమను బాడబాగ్ని కరణి నరేంద్రా.
శాంతి. 3.263

**గుమి** దే వి గుంపు (చూ. గుములు
గట్టు).

**గుమురు** దే. వి.
గుంపు (చూ. గుమురు గట్టు)

**గుమురు గట్టు** దే. అ. క్రి.
గుంపులుగాఁ జేరు.
కం హయముల మసల్పు మీఁద,న్నియు
బంధులు నెడలు సంచలింప గుమురు
గట్టి యెదురు సూతురు వారికిఁ
బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ
బోవలయున్. విరా. 5 223.

**గుముఁడులు గొను** దే. అ. క్రి
గుంపులు గూడు.
కం. ఆ దేవుడు వాంచబు,నే
డిక్కులఁ బోవకుండ నెయిది భయం
బాపాదించుచు నలి నాఁగెం,గోపం
దము నారి సాఁచి గుముఁడులు గొనఁ
గన్. సౌప్తి. 2.125.

**గుములు గట్టు** దే. అ. క్రి.

సంపులుగాఁ జేరు.

వ. ... కురుపతి వీటి జనంబులు గిరీటి పరాక్రమ ప్రకారంబులం దమదెస నానా దేశంబుల చతురంగంబులు వొలిసిన పెల్లును నంతంతం గసముగఁగట్టి చెప్పుకొనుచుండ. భీష్మ. 2.177.

**గుమ్మడి** వై. వి. (సం. కూశ్మాండః). కూశ్మాండము.

ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవ రేఖకాంతియుం, జుమ్మరయంగఁ గర్మఫల శోభన సంపద. శాంతి. 5.128.

**గురుఁడు** సం. వి. అ. పుం.

1. ద్రోణుఁడు.

కం. గురుఁడొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ జాపధరుం, డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలండింకఁ గలుగు ననరాదెందున్. విరా. 5 128

ఆచార్యుఁడు.

కం. తన తనయుకంటె నెమ్మన,మున నాకుం గూర్చు భావమున గురులకు మా,ర్కొనియెదము రాచధర్మం,బున కీడునఁ జేసి యింత పుట్టఁగ వలసెన్ విరా. 5.120.

2. బృహస్పతి

వ. అని సముచితంబుగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుండయి నిజ రూపంబు వహించి. జంభారి. ఉద్యో. 1.190.

3. పెద్దవాఁడు, తండ్రితో సమానుఁడు.

కం. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు, గురుఁ డిరువుర యెడయు దీర్పఁగోరి గురులకున్ గురుఁడనగు నేన చేసెదఁ బరమ ప్రార్థనము దీనిఁ బాటింపు తగన్. ద్రోణ. 3 289.

4. తండ్రి.

వ. తదనంతరంబ లోకగురుండగు నా హరిచేత ననుజ్ఞాతుండై. కర్ణ. 1.307.

5. వేదవ్యాసుఁడు.

చం. శిరమున నర్ఘ్యపాత్ర గొని చెచ్చెర వచ్చి ప్రియంపెలర్ప న,గ్గురుసుతుఁ గాంచి యంతిపురికోటకు లోనగు నొక్క సౌమ్య మందిరమున కమ్మనిం గొనుచు. శాంతి. 6.266. (గురుసుతుఁడు = వేదవ్యాసుని కుమారుఁడు - శుకుఁడు).

**గురుతల్పగుఁడు** సం. వి. అ. పుం.

గురుని భార్యతో సంగమించువాఁడు.

కం. గురుతల్పగు భ్రూణహనున్, నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నుని బెలుచన్. ధరణి వెడలనడచవలయు శరీర నిగ్రహము సేయజనదెయ్యేడలన్. శాంతి. 2.176; శాంతి.1.307

**గురుజ** దే. వి,

ఒకజాతి కూరాకుచెట్టు. ఉత్తుండి.

ఆ. కఱియ జీలకఱ్ఱ కఱివేము గురుజయిం, గువ ప్రవర్ధనీయకోటి యగుట. అను. 3.189. (చూ. కురుజ).

**గురుతార** సం. వి. అ. స్త్రీ.

పుష్యమి.

సీ.... గురుతార నధిప సువర్ణము.... మేలు దానమునకు అను. 2 378.

**గురుత్వము** సం. వి. అ. న.

గురుభావము.

గౌరవము, పెద్దఱికము. గొప్పతనము
చం..... గురుత్వము ప్రభుత్వమునుం గల పెద్దవారి మాఁటగానమి యా సుయోధను కడన్ నిలువన్ మనమెల్ల గారవంబునఁ గురువృద్ధ పల్కుఁ దలఁపుం జనవుం జననిచ్చిన మెచ్చరే జనుల్. ఉద్యో. 3.24.
కం. అగు నీ తత్త్వము సత్త్వాది గుణత్రయ వికృతి కత్యతీతంబై పూర్వ గురుత్వంబునకుం జనవిగ తత్వంబునకు నెలవు విమల విచారా. శాంతి. 4.94.
2. ఆధిక్యము.
చం. ... యక్కుమారు రుచిరమూర్తి కిన్ గుణగురుత్వ విభూతికి సీడు గాఁగ నిమ్మరసి యుదాత్తమైన పద మన్న నతండు ప్రియం బెలర్పఁగన్. శల్య. 3.182.
3. ఆచార్యత్వము.
సీ. ...భార్గవుండెవ్వనిఁ బరమ శిష్యుఁ డుగాఁగ బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె. శాంతి. 2.12.

**గురుదక్షిణ** సం. వి. అ. స్త్రీ.
గురువునకిచ్చు కానుక (విద్యాభ్యాసము ముగించుకొని).
స్నాతకుఁడై గృహస్థాశ్రమము స్వీకరింప గురువుచే ననుజ్ఞ పొంది గురుకులమును వదలి పోవునపుడు గురువునకు సమర్పించు కానుక.
వ. ... విశ్వామిత్రుపాల విద్యాభ్యాసంబు సేసి గాలవుండను ముని కుమారుండు గురుదక్షిణ యేమి సమర్పింతునని యడిగిన. ఉద్యో. 3.306.

**గురుద్రోహి** సం. విణ. (న్. ఈ.న్.)
గురువునకు ద్రోహము చేయువాఁడు.
ఆ. ఇట్లు సేయనైతినేని గురుద్రోహి, గతికి బ్రహ్మఘాతిగతికిఁ బోవువాఁడ నధిప. ద్రోణ. 2.279.

**గురుముఖము** సం. వి. అ. న.
గురువు ద్వారము, గురువు నోరు.
కం. గురుముఖమునఁ బడయక దుష్కర తపమునఁ జేసి వడయఁ గాఁబడు విద్యల్ పరమార్థము మదమును మత్సరమును గావించు నెట్టి సాధులకైనన్. అర. 3.256.
(గురుశుశ్రూష చేసి ఆయన బోధింపఁగా).

**గురువు** సం. వి. ఉ. పుం.
ఒజ్జ, ఉపాధ్యాయుఁడు.
చం. .... నీ గురువుఁ బొత్తి తగం గొనియాడు మెట్లు సెప్పె నటుల భక్తిమై నడవు. విరా. 1.252; విరా. 4.27.
కం మానవపతి నీవెక్కడి దానవు నీవనియెనేని ద్రౌపది సమ్మానంబు నరసి మెలఁగుదునా నగఖల నృత్య గురువు నన్నఁగల వాఁడన్. విరా. 1.90.
2. దర్పము, అతిశయము.
కం. బలవిక్రమములు మెఱయఁగఁ దలఁపడి రథ దంతి హయ పదాతి చయంబుల్, గలను సుడివడఁగఁ దామరకొలనేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ జొచ్చెన్. విరా. 3.183.
3. ఉత్తమ ప్రాణి.
ఆ. క్షుద్ర జంతువులకు గురులకు

నెమ్మెయిఁ, దలప నొక్క రూప తల్లి వలయు. శాంతి. 5.276.

4. తండ్రి.

కం. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు, గురుఁడిరువుర యెదరు దీర్పఁగోరి గురులకున్ గురుఁడనగు నేన చేసెదఁ బరమ ప్రార్థనము దీని బాటింపు తగన్. ద్రోణ 3.289.

విణ.

1. గొప్పది.

చం. .... గురు కార్యవర్తనములున్ రుచియింపక యుండునేని గో,ధనము లకెల్ల రక్షణము దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. విరా. 1.287. అను. 2.387.

2. అధికము, మిక్కుటము.

కం. గురువుగ నాహారమెపుడుఁ గొనఁ దేచవులన్. అను. 4 207.

**గురువులు వాఱు** దే. అ. క్రి. (గురువులు + పాఱు).

పరుగెత్తు.

వ. ... పాడుచు, నాడుచు బొబ్బలిడుచు నపుడు గఱచుచు ద్రు,ళ్ళుచు గురువులు వాఱుచు. సౌప్తి. 1.116.

2. అతిశయించు, విజృంభించు.

కం. నరుఁడును రాధేయుఁడు నొం,డొరువులతోఁ బెనఁగు వేడ్క యుల్లంబులలో, గురువులు వాఱఁగ నిలిచిరి. ద్రోణ. 1.135.

**గురును** దే. వి.

మర్మస్థానము, ఆయువుపట్టు.

కం... తురఁగముల సూతుఁ జంపినఁ గురుపతి పొలివోక యతని గురుసున వేయన్. ద్రోణ. 5.185.

**గురుసుతుఁడు** సం. వి. అ. పుం.

1. వ్యాసుని కుమారుఁడు- శుకుఁడు.

చం. శిరమున నర్ఘ్యపాత్రగొని చెచ్చెర వచ్చి ప్రియంబెలర్ప న,గ్గురుసుతుఁ గాంచి యంతిపురితోటకు లోనగు నొక్క సౌమ్య మం,దిరమునకమ్మునిం గొనుచు. శాంతి. 6.266.

2. ద్రోణుని కుమారుఁడు, అశ్వత్థామ.

కం. గురుసుతుఁడొక్కరుఁడును సుస్థిరుఁడై తద్బాణనిహతిఁ దెరలక. ద్రోణ, 5.70.

**గురుస్థానము** సం. వి. అ. న.

గురుపీఠము; ఏది చెప్పిన దానిని భక్తితో నంగీకరింపవలసిన గౌరవనీయమైన వ్యక్తి.

వ. (కృష్ణుఁడు ద్రుపదునితో) అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మాకెల్లరను గురుస్థానంబు. ఉద్యో.1.43.

**గుఱి** దే. వి.

1. లక్ష్యము.

చం. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే,డై ఱనడితేరఁ గాంచి చనుదెంచి యలంబుసుఁ డమ్మహాసురుం,గుఱియుగఁ జేసె శాత శరకోటికి. ద్రోణ. 3.262.

2. గుఱుతు, చిహ్నము.

సీ. గుఱియైన చెలువున నెఱపిన లోకరక్షణమున గరళంబు చాయ దోఁప. విరా. 1.12.

3. దృష్టాంతము, నిదర్శనము.

కం. లోకంబుతోడి వారుగ,మీకుం జనునయ్య మగఁటిమికి గుఱిగానే

నాకెదరైన యెడం దగు,జేకొని యది
మీరు చక్కఁజేయుట యరయన్.
విరా. 5.201.
ఆ. గాలవుండు గుఱియశాఁడె మనకు.
ఉద్యో. 3.305.
4. పరిమితి, మేర, అవధి.
కఁ. ... అద్దిది,గోవు దదీయ మహి
మకున్ గుఱి గలదే. అను. 3.92.
5. సాక్షి.
కం. అనిమిషనాథ సుగుప్తమ,యిన
యమృతము దెచ్చి మీకు నిచ్చితి నస్మ,
జ్జననీ దాస్యము వాసెను,దినకర పవ
నాగ్ని తుహినదీప్తులు గుఱిగాన్.
ఆది. 3.119, (పాఠాం).
6. తీరు, పద్ధతి, విధము.
ఆ. నీ తనూభవుండు నెఱి గుఱి
యెఱుఁగమి,యెఱిఁగి యెఱిఁగి యతని
కేల చెప్ప,మన యుపేక్షవలన విను
నాఁటి జూదంబు,నేఁడు గయ్యమయ్యె
నృపవరేణ్య. భీష్మ. 2.355.

**గుఱించి** దే.(గుఱి + ఇంచు = గుఱించు) ఉద్దేశించి.
ఇది పదమా? అపదమా! అనునదొక సమస్య. దీనిని ద్వితీయావిభక్తి ప్రత్యయములలోఁ జేర్చి నిన్, నున్, లన్, కూర్చి, గుఱించి' అని చెప్పువాడుక యున్నది. విభక్తి ప్రత్యయములన్నియు పదములనుండియే యేర్పడిన రూపములని విమర్శకుల అభిప్రాయము. శ.ర. కారుఁడు 'గుఱించు = ఉద్దేశించు' అని యిచ్చి 'గుఱించి' ఉదాహరణమిచ్చినాఁడు. 'గుఱిచి' అనునది 'కూర్చి' ప్రత్యయమునకు పర్యాయ పదముగఁ జెప్పినాఁడు. 'గుఱించి' అనుదానికి భిన్నార్థములు చూపినాఁడు గాని 'గుఱిచి'కి లేదు. సూ. ఆ.ని కారులు 'గుఱించు' నుండి 'గుఱించి' 'కూరిచి'అను ప్రత్యయము లేర్పడినటులను 'గుఱి'నుండి'గుఱించి 'గుఱియించు' రూపములేర్పడి క్రియా రూపము అందినట్లును చూపి యున్నారు. 'గుఱిచి' అనునదియు 'కూరిచి' అను నర్థముతో 'గుఱించు' నుండి యేర్పడినదా యని సూచించినారు. సూ.ఆ.ని. కారుల విభజనము కన్న శ.ర. కారుని విభజనమే· యుక్తముగఁ గన్పించుచున్నది· 'గుఱి + ఇంచు' 'గుఱించు' అయి 'గుఱించి'అయినది (గుఱి = లక్ష్యము ఉద్దేశము) భారతమున 'గుఱించి' 'గుఱిచి' అను రెండును పర్యాయ పదములుగనే వాడఁబడినవి.
చం. ... యతపోధనుం దెదఁగాంచి
దయానురక్తి న,వ్వనిత గుఱించి
యిట్లను భవన్మతి నొందిన కోర్కె
సెప్పుమే,నసఘచరిత్ర దాని ఫల
మందఁగఁ జేసి యలంతఁ బాపెదన్.
ఆశ్ర. 2.93.
సీ. తారకాఖున కొక్క తనయుండు
హరి యన జనియించి వారిజాసను
గుఱించి తపము సేయంగ. కర్ణ.
1.264.
వ. ... భగీరథుండు ... ఈశ్వరు
గుఱించి పెద్దగాలంబు తపంబు
సేసిన. ఆర. 3.81; అర. 4.52.

**గుఱిచి** దే అవ.

కూర్చి ప్రత్యయమునకు పర్యాయము (కూర్చు ప్రత్యయము కూర్చు ధాతువునుండి యేర్పడిన రూపమే కావచ్చును.)

తే. ... మృదుని గుఱిచి దపమొన రించె నగ్గిరితటమున. అను. 2.8.

ఆ. నేలఁ గూలి మ్రానువోలె నిట్లున్న యి,ప్పాపకర్ము గుఱిచి పాడితెఱఁగు, తేటపడఁగ మాటలాడ నేల. శల్య. 2.323.

తే. ఆతఁ డారణ్యకోద్గీతమైన వాక్య, సంచయము విష్ణుగుఱిచి పఠించె. శాంతి. 6.362.

ఆ. ... అ,ప్పాండవులను గుఱిచి బహు విధంబులగు నిమిత్తములు నయంబునఁ జూచితి,నెగ్గులేదు వారి కెల్ల లగ్గు. ఆది. 7.23.

చం. మనసు నుదానవాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా,త్మని వలనన్ భవద్వచనమున్ జనతానుభవంబు చొప్పయై,నను విను కార్యమున్ గుఱిచినం దగ వాగను వర్తనంబుసే,యన వలసెన్ మనంబు నకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్. (గుఱిచినన్ = గుఱిచియైన యెడల, కూర్చినచో) అశ్వ. 2.170.

(చూ. గుఱించి.)

**గుఱుకొను**[1] దే. అ. క్రి.

(ఇది క్త్వార్థముగానే ప్రయోగము లందుఁ గనఁబడుచున్నది.)

1. యత్నించు, పూను, పట్టుదల పట్టు.

చం. గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁజేసిన వీరవర్గమున్, నఱికెద. శల్య. 1.86.

కం. ... ఎఱుకలకెల్లన్, మెఱుఁ గిడుట మమ్ము మువ్వురి, గుఱుకొని యొకఁడుగ నెఱింగికొనుట దలంపన్. అశ్వ. 2.163.

కం. మఱియును నొకనాఁడెవ్వరు, నెఱుఁగకయుండంగఁ గౌరవేంద్రుఁడు ధర్మం,బెఱుగక విషమన్నముతో, గుఱుకొని పెట్టించె గాడ్పుకొడుకున కలుకన్. ఆది. 5.178.

(గుఱుకొని = బుద్ధిపూర్వకముగా—కావలయునని-అని భావము).

2. అతిశయము.

కం. ఉఱుముచు మెఱుముచుఁ బిడు గులు, వఱలఁగ నలుగడలఁ బడ నివారిత వృష్టుల్,గుఱుకొని కురి యఁగఁ బంచెను, మఱియును నయ్యె నలుమీఁద మఘవుండలుకన్. ఆది. 8.270.

ఆ. క్రోధవర్జితుండు గుఱుకొని తేజం బు,దాల్చి దేశ కాల తత్త్వమెఱిఁగి. అర. 1.222.

3. అభిలషించు, కోరు.

సీ. ... శంతనుఁ డతనిచే సంతర్పి తుండయ్యె,గుఱుకొని మీదైన కుశల మడిగె. అర. 4.35.

4. కొన్నియెడల వాక్యాలంకారముగఁ గూడ నుపయోగించును.

కం. గుఱుకొని కార్యాకార్యము, లెఱు గక దుశ్చరితుఁడై యహితుఁ డగు నేనిన్,మఱవక గురునైనను జనులెఱు

గంగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్. ఆది. 6.102.

కం. మఱచునొకొ మఱవకుండియు, నెఱుఁగక యుండునొకొ యనలుఁ దెలిఁగియు నెడ నే,మఱునొకొ పుత్రులఁ గావఁగ గుఱుకొని నమ్మం గఁదగునె. (గట్టిగా నమ్మవచ్చును. అని భావము).

సీ. ఇంద్రసేనుండను నిక్కుమారకు నింద్ర,సేన యన్కూఁతుఁ జెచ్చెరన తోడు. తే. కొని విదర్భకరిగి గుఱు కొని మద్బంధు, జనుల యొద్దఁ బెట్టి చట్ట రమ్మ. ఆర. 2.64.

(గుఱుకొని = భద్రముగా,జాగ్రత్తగా అని భావము).

**గుఱుకొను²** దే. అ.క్రి. (గుఱ్ఱు + కొను = గుఱు + కొను).

గుఱ్ఱుపెట్టు.

ఆ. కోమలాంగి యిపుడు గుఱుకొని పాంసుల,స్థలమునందు నిద్ర దగిలి నదియు. ఆర. 2.36.

**గుఱుతు** దే. వి.

ఆనవాలు, చిహ్నము.

ఆ. నాదు గుఱుతు సెప్పి వా రెవ్వ రనినను,జెంద నారమందు సెప్పె ననుము. ఆశ్వ. 1.45.

**గుఱుము** దే. వి.

బీజము; గింజ.

కం. జీవుఁడు శుక్లచ్ఛాయా భావితుఁ డై నపుడు విష్ణు [illegible] గా వెరవరియగుఁ దద్గతి,భావ మొసఁగు గుఱుము లేని పండగు నెలవున్. (సం. ము. పాఠము. ఆనందపాఠము గుఱుమ.) శాంతి. 5.421.

సీ. ... కొందఱు పండులఁ గొఱికి కొందఱు గన్న గుఱుముల గువ్వల తెఱఁగు దోఁప నప్పటి కప్పటి కాన నంబున వైచికొని. అను. 5.28.

**గుఱ్ఱము** దే. వి.

అశ్వము.

ఆ. ... గుఱ్ఱములకు వలయు,తెఱఁగు లెల్లఁ జాల నెఱుఁగుదు. విరా. 1.94.

**గుల్మము** సం. వి. అ. పుం. న.

1. బోదెలేని తీఁగ.

వ. ... బహుప్రకార పాదప గుల్మ లతావలోకనంబునను. విరా. 1.147.

2. పొద.

ఆ. ... కురియు తేనియలకుఁ గొంకు లతా గుల్మ తరు సమీపములకు నరిగి యరిగి. విరా. 2.304.

వ. .... తనకసత్యంబు వాటిల్లునను శంక నీ గుల్మ లతా గహనంబు సొచ్చిరని చూపి చెప్పిన నత్తెక్కలి కాండ్రు వారలం జంపి ధనమ్ముగొని రమ్మని తద్వచన దోషంబున నరక ప్రాప్తుండయ్యె. కర్ణ. 3.78.

3. రోగవిశేషము. హృదయమునకును నాభికిని మధ్యప్రదేశమున గ్రంథివలె (పిండాకారముగ) పుట్టి సంచరించుచు నైనను, కదలక రాయివలెనైనను ఉండి అప్పుడప్పుడు వృద్ధిపొందుచు తగ్గుచు నుండు స్వభావము కల్గి యుండు దానిని గుల్మమందురు.

శ్లో. హృన్నాభ్యోరన్తరే గ్రన్థిః సంచారీ యది వాఽచలః వృత్తశ్చ

యాఽపచయవాన్ స గుల్మ ఇతి కీర్తితః. మాధవ నిదానము.
"పిణ్డితశ్చావతిష్ఠతే" చరకము.
చం. జ్వరమున గుల్మపీడ నతి సారమునన్ ... నిరంతరాతురులగు వారు నిర్దయతఁ దొల్లి వినోదముగాఁగ జీవులం, దరమిడి చంపినారు. అను. 5.103.

4. పనము.
వ. ... అతఁడు గుల్మాంతరితుం డగుచుం దోఁచుచుఁ బోవంబోవ. ఆశ్ర. 2.59.
శ్లో॥ ప్రవిశంతం వనం ఘోరం లక్ష్యా లక్ష్యం క్వచిత్ క్వచిత్. సం. భార. ఆశ్ర. 28.20.

5. మూఁడు సేనాముఖములును తొమ్మిది రథములును దొమ్మిది యేనుఁగులును ఇరువదేడు గుఱ్ఱములును నలువదేవురు కాల్వురును గల సేన.
సీ. వరరథమొక్కండ్రు వారణ మొక్కండు తురగముల్ మూఁడు కాల్వురును నేవురను సంఖ్య గలయది యగుఁ బత్తి యది త్రిగుణంబైన సేనాముఖంబు దీని త్రిగుణంబు గుల్మంబు దీని ముమ్మడుగగు గణము. ఆది. 1.80.

**గుల్లపఱచు** దే. స. క్రి.
అవమాన పఱచు.
సీ. ... రారాజు నొక్కరునిఁ బొందు, తనయులు దమవారుఁ దారును బెక్కండ్రు గూడి చుట్టునుముట్టి గుల్ల పఱచిరి. సౌప్తి. 1.27.

**గువ్వ** దే. వి.
కపోత భేదము. అడవి పావురము (శ. ర.) దీని భేదములు : కురుకుట గువ్వ, పొద గువ్వ, పచ్చ గువ్వ, చిటి గువ్వ, రాగువ్వ, ఎలుకొంత గువ్వ (బ్రౌను.)
చం. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దన యంగకంబుల,య్యనల శిఖా కలాపమున నల్లన యల్లన కాచి శీతబా,ధన ముదుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలి సాల దోఁచెఁ దోఁ,చిన నెఱిఁగించె గువ్వకది సేయు నుపాయము లేక యాత్మలోన్. శాంతి. 3.319; అను. 5.28.

**గుహ** సం. వి. ఆ. స్త్రీ.
1. కొండయందలి బిలము, బిలము.
శా. సింగంబున్న గుహానికేతమున కున్ శీఘ్రంబునన్ వచ్చు మాతం గంబుం బురుడించుచున్. విరా. 2.330.
సీ. ... దారుణ ధ్వనులగు తర్జన లీలలఁ,బరఁగు పర్వత గుహా ప్రతి రవముల. శల్య. 2.255.

2. హృదయము.
కం. గుహయందు నిహితమనియెదు, మహనీయ బ్రహ్మపదము మహిత దమత్వోపహితుండగు వానికి స,న్నిహితంబని చెప్పుదురు మనీషి జనంబుల్. శాంతి. 3.409.

3. బుద్ధి, మనీష.
కం. కామక్రోధాద్యములగు,నీ మానస వికృతులుడిపి యేకాంత గుహారాముఁ డవై నిను వెదుకుట,సూ మేలొండెల్ల నుడుగు సులభవివేకా. శాంతి. 4.30.
కం. విను నూఱుంచులఁ బంద్రెం,

దనుపమ ధారలునై నిజా,స్యము
విశ్వం,బును బొదువఁ దిరుగు కాలం,
బను చక్రము దురవబోధమది
యడఁగు గుహన్. శాంతి. 5.152.

4. మూల ప్రకృతి.

సీ. అన విని బలి దేవతాధీశుతో నీకు
నా విభవంబు గానరాదు గుప్తమై
యున్నది గుహయందు నా కిచ్చ
పుట్టిన నప్పుడ పొలిచి తోఁచు.
శాంతి. 4.392.

5. పాతాళము.

సీ. గోవన మహి యది గుహలోనఁ
బడకుండఁ జెంది యెత్తుటను
గోవిందుఁడనియు. శాంతి. 6.432.

**గుహకుఁడు** సం. వి. అ. పుం.
సౌవీర కుమారులు పన్నిరువురలో
ఒకఁడు, తన సోదరులతోఁ గలసి
సైంధవు పక్షమున నర్జునునితోఁ
బోరాడి మరణించెను. ఆది. 6.232;
233.

**గుహువు** సం. వి. ఉ. పుం.
అంగిరసునకు శివ యనుదానికిఁ
గూఁతురు. అర. 5.153.

**గుహ్యక శరము** గుహ్యకుఁడు (యక్షు
లలో నొక జాతివాఁడు) అధిపతిగాఁ
గల బాణము. గుహ్యకాస్త్రము. ఇది
వాయవ్యాస్త్రమునకు వ్యతిరేకాస్త్రము.
కం. మరుదప్రమేయ గుహ్యక,శర
మున వారించెనతఁడు. ఉద్యో.4.325.

**గుహ్యకుఁడు** సం. వి. అ. పుం.
దేవతలలో నొక జాతికిఁ జెందిన
యక్షులలోని ఒక తెగవాఁడు.
కం. రక్షః పిశాచ గుహ్యక,యక్షా
దులు బాధపెట్టు నవనీనాథుస్, దక్ష
పురోహిత మంత్ర సురక్షా సంస్కార
విధి విరహితుండైనన్. శాంతి. 2.307.
ఉ. యక్షుఁడెఱింగి వచ్చి యిటులాడి
చావఁగనేల చెప్పు మ,జ్ఞాక్షి భవన్మ
నోరుజకు నాపద మేసొనరింతు నన్ను
పా,లాక్షుఁడు దక్క నొక్కకును నా
పని సేయఁగరాదు నాదు చి,త్తశక్తి
పుం,స్త్వమేను దగఁ దాల్చిక మానవు
గుహ్యకోత్తమా. ఉద్యో. 4.385.

**గుహ్యము** సం. విశే. (అ. ఆ. అ.)
రహస్యమైనది.

వ. ... అత్యంత గుహ్యంబులగు
నర్థంబులు పురాణుండయ్యును
గుమారుండగు సనత్సుజాతుండు దెలు
పనోపు. ఉద్యో. 2.102.

మ. అతిగుహ్యంబిది నీవు భూరికృప
నీ యధ్యాత్మముం గానఁజేసితి నాకి
మ్మెయి విన్కిఁ గొంత భ్రమ వాసెన్.
భీష్మ, 1.206.

వి. అ. న.
రహస్య విషయము.

సీ. కురువర యిది దేవగుహ్యంబు
మునివరుఁడైన వేదవ్యాసుఁడతుల
కరుణఁ జెప్పినయది. స్వర్గ. 65.

2. ఉపస్థేంద్రియము (రహస్యావ
యవము).

సీ. నరనాథ యుత్క్రమణ ప్రదేశం
బులు పాద జంఘా జాను పాయు
గుహ్యములు. శాంతి 6.124.

3. గుదము, ముడ్డి.

కం. .... కడుగ వలయు గుహ్య
మల్పక మృదాకలసన్. అను. 3.280.

**గుళిక** సం. వి. ఆ. స్త్రీ.
1. గుండ్రని పదార్థము, ఉండ, మాత్ర, గోలీ.
సీ. నలువ చెందొవల తేకులకు నన్నువు వెట్టఁగోరి కావించిన గుళిక యనఁగ. ద్రోణ. 5.275.
2. (కను) గ్రుడ్డు.
సీ. .. లోచన గుళికల నొలిచి మ్రింగుచును. స్త్రీ. 2.9.

## గూ

**గూఁడు** దే. వి. ఔ.
కులాయము, పక్షిగృహము.
సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁడై యుండఁ బిచ్చికలు గూడు,గావించె తన్మస్తకంబున. శాంతి. 5.224.
సీ. ... పిల్లలై వర్తించి ...యిగ్గూఁట వసియింప. శాంతి. 5.224; 226.

**గూఢచారుఁడు** సం. వి. అ. పుం.
చారుఁడు, వేగులవాఁడు- ప్రణిధి.
మహాస్రగ్ధర .... దనుజతతి యాటోపమున్ గూఢచారుం,దను దృష్టిం జూచి రానిట్లను. శాంతి. 2.434.

**గూఢజుఁడు** సం. వి. అ. పుం.
గూఢోత్పన్నుఁడు. ఎవనికిఁ బుట్టినదియుఁ దెలియకుండ ఒకనికి పరభార్యయందుఁ బుట్టినవాఁడు. ఇతఁడు ద్వాదశ పుత్రులలో నొకఁడు.
(చూ. పుత్రుఁడు.)
"గృహే ప్రచ్ఛన్న ఉత్పన్నో గూఢజస్తు సుతః స్మృతః". యజు.
తే ఎవ్వనికిఁ బుట్టెనేనియు నెఱుఁగకుండ నొక్కనికిఁ బరభార్య యందు దయమైన,సూనుఁ డా భార్యగలవాని సుతుఁడు వాని, పేరు గూఢజుఁడనఁ బడుఁ గౌరవేంద్ర. అను. 2.248.

**గూఢమందిరము** సం. వి. అ. న.
రహస్య గృహము, లోపలిభవనము.
తే. జనక ముఖ బంధు చిత్తవంచనము నడపి,గూఢమందిరాంతరమునఁ గొడుకుఁ గంటి. ఆశ్ర. 2.103.

**గూఢము** సం. విణ. (అ. ఆ. అ.)
1. రహస్యమైనది, పైకిఁ దెలియనిది.
కం. తన యగపాటొరు లెఱుఁగుదు, రని, సూతుఁడు సమయ భంగమగుటకు భీ,ముండును గొంకుచుఁ జప్పుడు సే,యని గూఢ మర్దన ప్రహారములఁ దగన్. విరా. 2.345.
చం. అనలము గూఢ యత్నమున నయ్యెడకుం గొనివచ్చి దానిఁ జయ్యన వెలుగొందఁ జేయుటయు. విరా. 2.355.
2. దాఁగియున్నది, మఱుగుపడి యున్నది.
కం. ... చతురోక్త రీతి య,తని గూఢ క్రోధవహ్ని దరికొల్పంగన్. విరా. 2.270.
వ. ... గూఢంబులగు విష్ణునామంబుల నిర్వచనంబులు. శాంతి. 6.418.
(గూఢములు = అంతరార్థము గలవి).

**గూఢవృత్తి** సం. వి. ఇ. స్త్రీ.
రహస్యమైన నడవడి. అజ్ఞాతవాసము.
ఉ. ... నీవు నల్కమెయిఁ జేసిన యా పని గూఢవృత్తికిన్. దవ్వగు

నేని యియ్యభిమతం బొదగూడియు
నిష్ఫలంబగున్. విరా. 2.286.

**గూఢోత్పన్నుఁడు** సం. వి. అ. పుం.
గూఢజుఁడు.
వ. .... కర్ణుండు గూఢోత్పన్నుండు.
ఆది. 3.54.

**గూనివాఁడు** దే. వి. (√ గూను)
గూను గలవాఁడు.
గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు
గుజ్జు. అను. 5.104.

**గూను** దే. వి. ఔ.
వీఁపుమీఁద వంపుగానున్న భాగము.
(చూ. గూనివాఁడు).

**గూబ** వై. వి. (సం. ఘూకః).
గ్రుడ్లగూబ.
తే. గ్రువ్వ గ్రద్ద దివ్వారుపుబ్రువ్వు
గూబ,యిల్లు సొచ్చిన శాంతి సేయింప
వలయు. అను. 4.119.
తే. ... చంద్రకుండను గూబపులుఁ
గు,హాలికుఁడను ముంగియు నంత
నంతఁ దోఁచె. శాంతి. 3 203.
కం. ముంగికి గూబకు నగపడి,యం
గంబులు వడకుచున్నయవి నాకు...
శాంతి. 3.206.

# గృ

**గృత్సమదుఁడు** సం. వి. అ. పుం.
వీతహవ్యుని కొడుకు. అను. 1.132.

**గృధ్రకూటము** సం. వి. అ. పుం.
ఒక పర్వతము. ఇచ్చట పరశురాముని
బాణినుండి తప్పించుకొని బృహద్రథ
కులజాతుఁడైన భూరి యను పేరుగల
వాఁడు గోలాంగూలములు రక్షించుట
వలన దాఁగియుండెను. శాంతి. 2.92.

**గృధ్రకేతనము** సం. వి. అ. న.
ఘటోత్కచుని టెక్కెము.
వ. . . అసురవరుం డరుణంబగు
తన యరదంబెక్కి గృధ్ర కేతనంబు
గ్రాల. ద్రోణ. 5.207.

**గృధ్రము** సం. వి. అ. పుం.
గద్ద.
సీ. ... ఘోర గృధ్రము సుకుమార
నాగాంగనఁ,బటుగతి నొడియంగఁ
బాఱు కరణి విరా. 2.128.

**గృహదాహకుఁడు** సం.విశ.(అ.ఆ.అ.)
ఇల్లు తగులఁబెట్టువాఁడు.
కం. గరదుని గృహదాహకు...జంపి
పుణ్యుఁడగు నృపుఁడనఘా. శాంతి.
1 95.

**గృహదాహము** సం. వి. అ. పుం.
ఇల్లు తగులఁబెట్టుట.
సీ. అర్జునుఁ జంపుదు మతనికోడిలి
మేని, గోవధంబును...గృహదాహంబు
జనుల నెట్టి. ఆ. గతులఁ బుచ్చు నట్టి
గతులు వాటిలు. ద్రోణ 1.221.

**గృహదాహి** సం. వి. (న్) పుం.
ఇల్లు తగులఁబెట్టు వాఁడు.
సీ. ... గృహ,దాహి కుష్ఠము గల
తనువు నాతఁడు. అను. 3.175.

**గృహదేవత** సం. వి ఆ. స్త్రీ.
ఇలువేలుపు.
వ. ... అభ్యంతర నివాసంబు సొచ్చి
గృహదేవతలం బూజించి. శాంతి.
1.360.

**గృహ దైవతము** సం. వి. అ. న.

ఇలువేలువు.
(పుంలింగముగ మమ్మట ప్రయోగము కావ్యప్రకాశయందుఁ గలదు.)
కం. ఉపహార సమర్చకుఁడగు, సుపు రుషు గృహదైవతములు శుభములఁ గూర్చున్. అను. 4.28.

**గృహ ధర్మము** సం. వి. అ. పుం.
గృహస్థుని విధి: గార్హస్థ్యము.
కం. జ్ఞాతివధ మట్లు సేసియు,నీతనిఁ గొల్చుటకుఁగాఁగ నీ గృహధర్మో, పేతత్వముఁ బొరసితి ... శాంతి. 1.377.

**గృహనీతి** సం. వి. ఇ. స్త్రీ.
గృహస్థ ధర్మము.
సీ. .. గృహనీతి విద్యకు గృహము ... భార్యయచూవె. ఆది. 4.84.

**గృహపతి** సం వి. ఇ. పుం.
గృహస్థుఁడు.
కం. అతిథిజనులు దమ తమ వాంఛి తము లనుభవించునట్లు సేయం, గనినం గృతకృత్యతఁ బొందరె గృహపతియును గృహిణియును ధర్మ భారము వలనన్. అను. 1.67.

**గృహపాలకుఁడు** సం.విశ.(అ.ఆ.అ.)
ఇంటి కావలివాఁడు.
వ. ... భరద్వాజుండు ..గృహపాల కుండైన శూద్రువలన నంత వృత్తాం తం బెఱింగి నిహతుండైన పుత్రుం జూచి దుఃఖితుండై. అర. 3.272.

**గృహప్రవేశము** సం. వి. అ పుం.
నూతన గృహమునఁ బ్రవేశించుట.
వ. ...(పాండుసుతులు)...పుణ్యాహ వవ పురస్సరంబుగా గృహప్రవేశంబు సేసిరి. ఆది. 6.149.

**గృహభారము** సం. వి. అ. పుం.
గృహస్థ ధర్మము; ఇంటిపనుల చక్క దిద్దుట.
చం. ... అప్పుడఁతుక యెట్టులోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁ గన్. శాంతి. 1.202.

**గృహిణి** సం. వి. ఈ. స్త్రీ.
ఇల్లాలు, భార్య.
వ... పతికి ననువ్రత యగుట గృహి ణికి ధర్మంబు... అను. 5.289.

**గృహీతము** సం. విశ. (అ. ఆ. అ).
1. గ్రహింపఁబడినది, స్వీకరింపఁ బడినది,
వ. ... పౌష్య మహారాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై. ఆది. 1.93.
2. తీసికొనఁబడినది.
వ. ... అతండు సారథి సముప నీతంబైన రథంబు సాదరంబుగానెక్కి గృహీత శరాసనుండై విక్రమించె. అర. 6.220.
3. ఆక్రమింపఁబడినది.
వ. ... ఇప్పంచతీర్థంబు లిప్పుడు నూతేండ్లం గోలె నుగ్రగ్రాహ గృహీ తంబులయి దుర్జన గృహీతంబులయిన రాజుల విభవంబులుం బోలె సాధుజన వర్జితంబులయి యుండు. ఆది. 8.149
4. పట్టుకొనఁబడినది.
వ. .. ఎవ్వరిడేని మీచేత గృహీ తుండయి మీయున్న జలాశయంబుల మిమ్ము వెలువరించు నాతఁడ మీకు

శాపమోక్ష కారణుండగుననిన ...
ఆది. 8.160., అర. 4.115.

5. చెఱగొని పోఁబడినది.

ఉ. ఆ విభు కాంత గాదె జనకాత్మజ రావణుచే గృహీతయై పోవదె. అర. 6 266.

# గె

**గెద** దే వి.

1. కడ, సమీపము, పార్శ్వము.

కం. విను ప్రద్యుమ్నాది భవ, త్తనయుల గెడనైన నేకతంబున నేకా, సనమున నుండుట దూష్యం,బని యెఱుఁగుము సతులచరిత లతిదుష్కరముల్. అర. 5.320.

కం. కల నీలకంఠ కోలా,హల లీలలు సెందె రాజహంస కులములం దిలకించె సప్తపర్ణా,వలి విగళిత కుసుమ కుటజ వాటికల గెడన్. అర. 4.145.

2. జత.

సీ. వక్షస్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావు గెడల వాగెలు ధరించి, నాగలపై హరి యొప్ప. ఉద్యో. 4.125.

ఉ. ఏము ను బాండునందనులు నేక కులంబునఁ బుట్టి యొక్కచో,నేమొకఁడైనఁ జేసి గెడనెప్డు చరించిన యట్టివారము. ఉద్యో. 2.239.

**గెదగూడు** దే. అ. క్రి. (గెద + కూడు)
జతగూడు, జతయగు.

కం. ... పాపపుం బడవగు నిది గాదె యితనిఁ బొడవడఁగించెన్, గెడ గూడ దీని సీతని,యొదలిపయిం బెట్టి కాల్చుటుచితఁ బరయన్. విరా. 3.12.

**గెదనిగుడు** దే.అ.క్రి. (గెద + నిగుడు)
ప్రక్కలకు ప్రసరించు.

వ.... ఎడనెడ నష్టపడు కురువీరులం జిఱునగవు గెడనిగుడ మెఱుంగువాలమ్ములఁ దొలంగ జడియుచు. విరా. 5.187.

**గెలి** దే. వి.
అపహాసము, ఎగతాళి.

కం. ఈ గెలి వెలార్చెద బా,హా గర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ,భాగమునఁ గూల్చి. శల్య. 2.100. (చూ. శల్య. 2.98.)

శ్లో॥ అస్యావహాసస్య ఫలం ప్రతి భోక్ష్యథ పాండవాః, గమిష్యథ హతాస్సద్యః సపాంచాలా యమక్షయమ్. సం. భార. శల్య 33.47.

**గెలిపించు** దే. స. క్రి. (√ గెలుచు)
గెలువఁజేయు, జయింపఁజేయు.

ఉ. ... ఇతఁడకాఁడె వెసన్ గెలిపించె నన్నునిన్. విరా. 3.228.

వ. ... ఇతండు గొమకితండు లాఁతియని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి. ఉద్యో. 2.68.

**గెలుచు** | **గెల్చు** | దే. స. క్రి.
జయించు.

వ.. ధర్మసూనుండు ... ఒక్కొక్కమాటు మధుర ప్రసంగంబుగా నాడెన నెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ములకొసంగుచుండు. విరా. 2.2

కౌరవులనందఱ గెల్చె మరిల్చె గోవులన్. విరా. 5.244

తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప నీవుదక్క నిందొక్కరు నీవ యరసి, చెప్పుమా కలఁడేని రక్షింపుమమ్ముఁ, బూని పట్టంబు దాల్పుము పొడిచి గెలుము. ఉద్యో. 4.146.

సీ....మునులును సురలును ముదము బొంది,గెలు గెలుమంచు నగ్గింప నయ్యుగ్రుఁడు దెగవాపి యేసిన. కర్ణ 1.293.

సీ. ...కాటుకకొండ పొలుపు గెలుచు నాతని మేఁను (ఇట ఔపమ్య వాచకము). ద్రోణ. 3.259; కర్ణ. 3.152

2. పోఁగొట్టు, నశింపఁజేయు.

తే. విందు నారాయణ పరాయణుండు పాత,కముల గెలిచి వెలుంగుటె కాదు తన్ను,నాశ్రయించిన వారికి నతులమైన, వెలుఁగు నొసఁగంగఁ జాలుట వేధచేత. అను. 4.374.

అ. క్రి.

వెడలు, బహిర్గతమగు, నిర్గమించు.

వ. ... ఇరుమెయిన్ గెలిచిన కుంతశురికాదులును. భీష్మ. 1.267.

**గెలుపు** | **గెల్పు** దే. వి. (√ గెలుచు)

జయము.

కం. చావును నోవును మన యోధావలికన్ గెలుపు నుబ్బు నావలికిని నీ,చే వినియెద. భీష్మ. 2.199.

ఉ....గెల్పు నుతింపఁగ రాజపుత్రుఁడ,య్యేక్కుడు మాటకోరువక యిట్లను సర్వజనంబుతోఁ డగన్. విరా.5.264.

**గెలుపుకొను** దే. స. క్రి. (గెలుపు+కొను) గెలుచు;

జయించు.

కం. క్రీడికి మును మనమందఱు, నోడుటెఱుఁగు దన్నులును ఘటోత్కచుఁడుఁ దగం,దొడుపడ బంధు నృపతులుఁ,గూడి నడవ మనకు గెలుపు గొన నెట్టులగున్. ద్రోణ. 5.102.

**గెల్పుకోలు** దే.వి. (√ గెలుపుకొను)

జయము పొందుట.

ఉ. ... మారుతికిం జయంబొసఁగె మాలవిధాతృఁడు వానిగెల్పుకో,లేరికి సమ్మతంబగునె యిట్టిది దీనను బెంపు గల్గునే. సౌ ప్తి. 1.219.

**గెళవు** దే. వి.

ఖడ్గము.

కం. నేరిమిమై గెళవున శిని,వీరుం డిరువఱియగాఁగ విందుని ద్రేసెన్. కర్ణ. 1.94. (చూ. కర్ణ. 1.92).

# గే

**గేదగి** వై.వి. (సం. కేతకి. కం.గేదిగి) పచ్చపువ్వుల మొగలి.

మాలిని :- .... పూచిన మంచి యశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదగులన్. ఆది. 4.20.

**గేలి** దే.వి. ('కేళి'శబ్ద భవమని కొందఱు) అపహాసము, పరిహాసము, ఎగతాళి.

కం. ఈ గేలి వెలార్చెద బా,హా గర్వము మెఱయ మిమ్ము నందఱను మహీభాగమునఁ గూల్చి .. శల్య. 2.100. (సూ. ఆ. ని. పాఠము).

ఆనంద సం. ము పాఠము. ఈగెలి

వేలార్చెద. సం. ము. 'గేలి' పాఠాంతరముగాఁ గూడ లేదు.

**గేలిగొను** స. క్రి. (గేలి + కొను).
అపహాస్యము చేయు, పరిహసించు.
సీ. ... ఇంద్రుఁడు సనుదెంచి యేల యిచట, దునియెదవనిన నమ్మను జాధిపతి తన,కోర్కి నెప్పిన గేలిగొనుచుఁ జనియె. శల్య. 2.215;కర్ణ. 2.67.
శ్లో॥ అపహాస్య తతః శక్రో జగామ త్రిదివం పునః. సం. భార. శల్య. 54.7.

**గేలిచేయు** స. క్రి. (గేలి + చేయు).
గేలిగొను.
ఉ. సీరి యనారతంబుఁ దన శిష్యుల లోపల నెల్ల నిన్ను దు,ర్వార పరాక్రమాధ్యుఁడని వర్ణన సేయుట గేలిచేసి యా,మారుతికిం జయంబొసఁగె మాలవిధాత్రుఁడు. సౌ ప్తి. 1.219.

**గేహము** సం. వి. అ. న.
గృహము, ఇల్లు.
చం. .... ముదంబునఁ గీచకముఖ్యుఁడాత్మగేహమునకుఁ బోయె. విరా. 2.269.

## గై

**గైరికము** సం. వి. అ. పుం న.
కొండయందుఁ బుట్టినది, పర్వతధాతు విశేషము, జేగుఱు.
ఇది 1) పాషాణగైరికము 2) స్వర్ణగైరికము అని రెండు విధములు.
వ. ... వివిధాయుధ వ్యాపార ఘోర విచేష్టిత విగళిత రక్త సిక్తంబులగు నంగంబుల యచలత్వంబున గైరిక గిరిద్వయంబు చందంబున నొప్పిరి. ద్రోణ. 5 207.

**గైరికాచలము** సం. వి. అ. పుం.
గైరిక పర్వతము.
మ. పెలుచన్ గోత్రుల నొత్తి యగ్గజముఁ దాబేలున్ వసంజేది మూ,ర్చలనొందన్ వెసనెత్తి మేఘయుగళీరక్తోల్లసద్గైరికా,చల వైహాయసకేళి యోయన నభస్సంచారియై. అను. 1.235.

## గొ

**గొంటు** దే. ప్ర.
కలది, కలవాఁడు - అను నర్థమును దెలుపును.
(చూ. తెవులుగొంటు).

**గొంతి** వై.వి. (సం. కుంతీ; కం. కొంతి)
పాండురాజు పెద్దభార్య, ధర్మజ భీమార్జునుల తల్లి.
చం...గొంతి ముద్దుసే,యు [illegible]. విరా. 1.98. (చూ. కుంతి).

**గొంది** దే. వి.
కొండయొక్క చిన్న మఱుగుచోటు, మూల.
క. పులి నమలెడు మాంసము వెర, వలవడఁ దా నపహరించి యానక్కకు ని,మ్ముల నిల్వం గావించిన నిలయంబున గొందిఁ బెట్టి నేర్పారంగన్. శాంతి. 3.62.

**గొజుగు** దే. వి.
గొడుగు, ఛత్రము.
సీ...గొజుగుల నీడ పైనడరఁ జెన్నగు

మోము పొరిఁ బర్వ పెంధూళి గ్రుంగె నేడు. ద్రోణ. 2 239.
శ్లో॥ చత్రచ్ఛాయా సముచితం తస్య సద్వదనం శుభమ్. నూనమద్య రజో ధ్వ స్తం రణేరేణుః కరిష్యతి. సం. భార. ద్రోణ. 72.42.43.
'గొడుగు' అనియే సం. ము. తి. ప్ర. కో.

**గొడిగరాయి** దే. వి.
గులకజాయి.
అక్కడ ... ఇత్తరుణి,చరణతలం బులు గొడిగరాలపైఁ జనుచునికిఁ జేసి పరుసంబులై కడు నెఱ్ఱనైనవి. అర. 3.299.

**గొడుగు** దే. వి.
ఛత్రము, ఆతపత్రము.
చం. అనినఁ బ్రశాంతుఁడై తపను నా భృగుముఖ్యుఁడు ప్రీతి గారవించినఁ బ్రమదంబునన్ గొడుగుఁ జెప్పులు మానవవృత్తిఁ దెచ్చి య,మ్మునికతఁ బెట్టె. అను. 3.263.
వ. ... కొండొక దవ్వ వెన్నడిం దఱిమి బిరుదులతోడి గొడుగులు నడి యాలంబులతోడి సిడంబులును వైపిం చుకొని. విరా. 5.221.

**గొడ్డలి** వై. వి. ఔ. (సం. కుఠారః).
చెట్లు మున్నగువానిని నఱకెడి సాధనము.
కం. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగిన మ్రానఁ జిగురు వొడమ. ఉద్యో. 2 61.
తే.... కత్తి గొడ్డలి యడుగ నేఁ గట్టి యలకు. విరా. 1,78.

**గొడ్డు** దే. వి.
గొడ్డు, సంతతిలేని పశువు.
వ...ఆఁబోతు పంచితంబు మార్కొని నను బైగాలి పీచినను గొడ్డునకైనఁ జూలు నిలుచు. విరా. 1.289., అను. 2.402.

**గొడ్డుపోయిన వాఁడు** దే. వి.
పౌరుషము లేనివాఁడు.
వ. మఱియు దుశ్శాసనుఁడు వీర లందఱును గొడ్డుపోయిన వారలు పౌరుషంబు గల మానిసి యిందెవ్వం డనియె. ఉద్యో. 1.352.

**గొడ్డుపోవు** దే. అ. క్రి.
1. పౌరుష హీనమగు.
వ. ... అతని చెప్పినట్లు పెద్దగాలం బేని పీరలు గొడ్డుపోయిరిగాక. ఉద్యో. 1.352.
2. నపుంసకుఁడుగా నగు, షండుఁ డుగా నగు.
చం. మును మును గొడ్డువోయిరని ముష్కరతం జెడ నాడినట్టి దు,ర్జనుల ననిం గడంగి ధృతరాష్ట్ర తనూజుల బంధువర్గ మి,త్రనికర సైన్యకోటి సహితంబుగ గీటడఁగింపఁగంటి మిం,క నమరలోకమైన నరకంబయి నన్ సరి మాకు నారయన్. శల్య. 2.285.
శ్లో॥ యేనః పురా షండతిలానవోచన్ క్రూరా రాజ్ఞో ధృతరాష్ట్రస్య పుత్రాః తేజో హతా సగణా స్సానుబంధాః కామం స్వర్గం నరకం వా పితామహః సం. భార. శల్య. 60.12.

**గొద**1 వై. వి. (సం. ఘుధా).

చూ. గొదగొను[1]

**గొద[2]** దే. వి.

అతిశయము, త్వర (చూ.గొదగొను[2])

**గొదగొను[1]** | అ. క్రి. (√ గొద).
**గొదకొను** |

ఆఁకలిగొను.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్ళకు నుఱుకు తెఱంగునఁ దఱియఁజొచ్చి. ఉద్యో. 2.139.

**గొదగొను[2]** దే. అ. క్రి.

విజృంభించు, అతిశయించు, చెలరేఁగు

కం. కదిసిన బలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగనీక గాండీవి వెసం, బొదివి యట కడపె నవియును గొదగొని తమ పొలము సొచ్చెగోపాలురతోన్. విరా. 4.272.

చం. గొదగొని ధార్తరాష్ట్రులతిఘోర విధంబునఁ జుట్టుముట్టినన్. భీష్మ. 2.467.

వ. .... అబ్బలుమగండు గదాహస్తుండయి గొదకొన వాఁడును గదగొని. ద్రోణ. 5.217.

కం. కదిసిన లక్ష్మణువిం బులి,కొచమను సింగంపుఁగొదమ గొదగొని లీలం,బొదువుగతి. ద్రోణ. 2.89. సం. ము. పా).

(గొదగొను—అని ఆనందపాఠము)

2. త్వరపడు.

వ. ... రేయింటి యాఁకటి పెల్లున గొదగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు. విరా. 2.240.

**గొనకొను** దే. అ. క్రి,

1. సమ్మతించు.

చం. జననము దెల్పి యేఁ బిలువ సత్యము సుమ్మర కుంతిభాషణం,బి తనుజత్వ జాత కృప నంబుజమిత్రుఁడు వల్కె నేమిటన్,గొనకొన నేరదయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి యట్టి కర్ణునకయి నీకు నేటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రకా. శాంతి. 1.39.

కం. దారాపేక్షం గష్ట,ప్రారంభముఁ బూని యిహమునందుఁ బరమునన్, వారని సంక్లేశంబుల, గూరు నడండు దానిఁ జేయఁ గొనకొంద్రె బుధుల్. శాంతి. 6.242.

ఉత్సాహ వృత్తము:— వినుము నారదుండు దీని వినఁగఁ జెప్పె ధర్మనం, దనున కతని మనము కరుణ దవిలియున్కి హింసకున్,గొనకొనంగఁ జొరమి నతఁడు గురుకులంబు తోడి పొం,దునక పడదె జగము మెచ్చఁ దొరఁగి పెక్కు భంగులన్. శ్రీ.: 85, ఉద్యో. 2.246.

2. ఉద్యమించు, పూను.

కం. అనుటయు నతండు వినియును, విననిచెవులు సేసి మగుడ విక్రమము నకున్,గొనకొని యేమియుఁ బలుకక, చనియె శినిప్రవరు పజ్జ సమరంబునకున్. ద్రోణ. 4.95.

చం. .. సధర్మ వృత్తికిన్,గొనకొన దేని విన్కి మునికుంజర యేల. శాంతి. 6.243; శాంతి 2.420.

3. ఉత్సహించు.

కం, తన తన శంఖంబును దక్కను గల దొరలెల్ల ననికి గొనకొని పూరిం

చిన వివిధ తూర్యనాదం,బును జెలఁగె
నభంబు దిశలుఁ బూర్ణంబులుగాన్.
భీష్మ. 1.175.
చం. ... పరిచారము నీవును నీదు
పత్నియున్,గొనకొని చేయఁగా
వలయు. అను. 2.295.

**గొఱుగు** దే. స. క్రి.
క్షౌరము సేయు.
ఆ. వాడియైన కత్తివాతి యమ్మునఁ
గొని,పగతు శిరము చెక్కులెగయ
గొఱిగి,నరులకెల్లఁ జూడ నవ్వగు
నట్లుగాఁ, గలయ నైదు కూఁకటుల
నొనర్చె. అర. 6 250.

**గొల్ల** దే. వి.
గొల్లవాఁడు, ఆలకాఁపరి.
తే. తొఱఁగు వోకుండ మెకములు
గలవకుండఁ,బాఁడి తఱుఁగకయుండ
నాపాటి గొల్ల,లిచ్చమెచ్చ నీదృష్టిక
నెక్కఁ గదుపుఁనరయనేర్తు నన్నేలు
ధరణినాథ. విరా. 1 279.

**గొల్లతనము** దే. వి.
గోపభావము.
ఉ. ఎక్కడి మాట గొల్లతనమించుక
యేమియు లేదు నీవసన్ విరా.
1.281

## గో

**గోఁకు** దే. స. క్రి.
గీఁకు, గీఱు.
గీ. .. శిరము గోకఁగఁ దగదిరు
సేత. అను. 4.102. (సూ. ఆ ని. పాఠము.)

**గోకర్ణము** సం. వి. అ. పుం.
దక్షిణ దేశమందలి ఒక శివక్షేత్రము.
అర్జునుఁడు అశ్వమేధ హయము
ననుగమించుచు ఈ ప్రాంతమునఁ
బ్రవర్తించెను. అశ్వ. 4.113.
అర్జునుఁడు తీర్థయాత్ర చేయునపుడీ
తీర్థస్థలమును సేవించెను. ఆది.
8.163.
ఇందు స్నానము జేసినవారికి జాతి
స్మరణము గల్గును. అర. 2 275.
ఇది పరమేశ్వరునకు నివాసస్థానము.
ఇచ్చట శ్రీరాముని వలనఁ బరాభ
వము పొంది ప్రవ్రజనము పొందిన
మారీచుఁడు తపస్సుచేసెను. అర.
6.317.

**గోకింకరుఁడు** సం. వి. అ. పుం.
గోవుల పరిచారకుఁడు.
కం. .. కవలు హయశిక్షక గోఁకిం
కరులు. విరా. 4.134.

**గోకులము** సం. వి. అ. న.
ఆవుల మంద; ఆవుల సమూహము.
గీ. ... గోవులు సుట్టుఁ దేకువ సెడి
తిరిగి నన్,సంకటవెట్టినఁ బంకజాక్షి,
కోపించి చూడ సంతాపాకులత్వంబుఁ
బొందె గోకులము. అను 4.433;
అను. 3.59.

**గోగ్రహణము** సం. వి. అ. న.
ఆలమందలను పట్టుకొనుట.
కం. బహుశాస్త్రమి నీతఁడు సన్నహ
నముతోఁ బసులఁ బట్టు నవమిని మన
గోగ్రహణమని నిశ్చయించిన,నహి
కేతను పలుకులకు మహాహ్లాదమునన్.
విరా. 3.128.

**గోఘృతము** సం. వి. అ. న.

కం. ఆ చంద మెందు గలపది, గోచ
రమే యిచ్చుటకును గొనుటకుఁ దగు
మై,సూచి యడుగుండు పథదం,బై
వెల్లెడునట్లుగా బ్రియంబున నిత్తున్.
కర్ణ. 1.260.

కం. దారిద్ర్యముచేఁ గుందుచు,నేరిని
నడుగంగఁ బోవకెంతయుఁ గృశతం,
గూరిన విప్రునకుర్వం,నారని దయ
నీఁగిఫలము వాగ్గోచరమే. అను. 2.353.

కం. ఆ చర్మణ్వతి యనునది,గోచ
రమే వర్ణనమునకు. అను. 5.62.

వి. అ. పుం.

1. విషయము.

వ. ఇలులుభయ ప్రకారంబులు వాని
యందు ధర్మాధర్మౌషధి వన రక్షో
జనాది విషయంబైన శ్రౌతబలి యేను
మున్ను నిర్దేశించినయది యిప్పుడు
సెప్పినయది పశు పక్షి చండాల
ప్రభృతి గోచరంబగు స్మార్తబలి.
అను. 3.340.

2. ఇంద్రియార్థము. ఇంద్రియములచే
గ్రహింపఁబడు విషయము (రూప
రసాదు).

కం. విను నారాయణ పరములు,జన
నాయక వేదములును జన్మంబులుఁ
దక్కిన పుణ్య సమారంభము,లును
రసముఖ గోచరంబులును భూతము
లున్. శాంతి. 6.492.

3. స్థానము.

వా. ... డాకినీ,రక్షో భూత పిశాచ
గోచరము మర్గస్థంబునై చూడఁ జి,త్త
క్షోభం బొనరించునట్లగుటఁ జెంతం
జేరరాదీ శమీవృక్షం బెవ్వరికి. విరా.
1.164.

**గోచర్మము** సం. వి. న్. న.
భూపరిమాణ భేదము.

శ్లో॥ దశహస్తేన వంశేన దశవంశాన్
సమంతతః, పంచగాభ్యధికాన్ దద్యా
దేతద్గోచర్మ చోచ్యతే. బృహస్పతి.

కం. వినుమర్త్యుఁడైన విప్రున కసభూ
గోచర్మమాత్ర యగు మేదిని నిచ్చినఁ
బోనియట్టి పాపము,నిను పొడువునఁ
జెదని తపము నెందును గలవే. అను.
2.355.

**గోడ** వై. వి. (సం. కుడ్యమ్. క.గోడె).
భిత్తి.

సీ. ... అంగంబు నునుఁగాంతి యడ
రిన గోడలు,వేదులు మణిమయ
విధమునొందు. విరా. 1.308.

**గోడి** విశే. ఒత్తగెడవు. ఒక ప్రక్క
క్రిందికొఱఁగి వెండవప్రక్క పైకి
లేచినది. (చూ. గోడివడు.)

**గోడిగ** వై. వి. (సం. ఘోటికా).

సీ. గోడిగ జాతితోఁ గొనము పెం
టుల నేర్చి మావుల హత్తించు మార్గ
వంబు. విరా. 1.95.

**గోడివడు** దే. అ. క్రి.
ఒత్తగెడవగు. ఏటవాలగు.

గీ. ... గోగణము మంగలిగ నేల
గోడివడఁగ, నడచు కౌరవరాజ
సైన్యంబు గనియె. విరా. 4.50.

**గోడు** దే. వి.
దుఃఖము, పరితాపము.

కం. పరమ మునీంద్ర సమర్పుల,
కురుధీయల మా మనముల గోడుగ

వ్రేత, గొల్లది, గోపస్త్రీ.
తే. వెన్నలను గోపికా చిత్తవృత్త
ములును,నరసి ముచ్చిల నేర్చిన హరి
యితండె. ఉద్యో. 3.175.

**గోవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
గోవులను రక్షించువాఁడు.
కం. మున్నుగల గోపవర్గము,నిన్నుం
గని కొలిచి భక్తి నీ పని సేయన్.
విరా. 1.288.

**గోపురము** సం. వి. అ. న.
పురద్వారము - గవను.
చం. హరితనయుండు పార్థుఁడు
ఏయంబున సంచలి నాహవక్రియా,
వికతుంఁ జేసి యప్పురము వీథుల
వేదుల రమ్యహర్మ్య గోపురముల...
ఖాండవమయంబులఁ జేసె నీసునన్.
ఆది. 8.201; కర్ణ. 1. 263.

**గోప్రతారము** సం. వి. అ. న.
ఒకానొక పుణ్యతీర్థము. ఇది శ్రీరా
ముఁడు స్వర్గతుఁడైన సరయూప్రదేశ
మున నున్నది. ఇచ్చట స్నానము
చేసిన అశ్వమేధ ఫలము దక్కును.
ఆర. 2.278.

**గోభవనము** సం. వి. అ. న.
ఒకానొక పుణ్యతీర్థము. ఇచ్చట
స్నానము చేసిన గోసహస్ర సమృద్ధి
లగుదురు. ఆర. 2.263.

**గోమతి** సం. వి. ఈ. స్త్రీ.
1. ఒకానొక పుణ్యనది. ఇది నైమిశా
రణ్యమునఁ గలదు. శాంతి. 6.555.
దీని తీరములు దేవతలకు, ఋషులకు,
యజ్ఞభూములు. ఈ నదియందు
స్నానము చేసిన అశ్వమేధఫలము
దక్కును. ఆర. 2.273.
2. గోస్తోత్రము. దీనిని గోసమూహము
నడుమ నిలిచి జితేంద్రియుఁడై జపిం
చినఁ బవిత్రుఁడగును. అను. 3.49.

**గోమయము** సం. వి. అ. పుం. న.
1. ఆవుపేడ.
కం. .... గోమయయుత,వీసుతోఁబు
స్నాన మతి పవిత్రం బనఘా. అను.
3.33.
2. ఎద్దుపేడ.
వ. అయ్యుదంకుండు ... ఏమం
బొక్క మహోక్షంబు నెక్కి యొక
పెంచు వాని నొక్క దివ్యపురుషుం
గని వాని పన్నిన వృషభ గోమయ
భక్షణంబు సేసి ... ఆది.
1.93.

**గోమాత** సం. వి. ఆ. స్త్రీ.
గోలోకమున ముఖ్యమైన గోవు.
వ. గోలోకంబున ముఖ్యంబులగు
గోమాతలంతయు నెఱిఁగి. అను.
3.80.

**గోమాయువు** సం. వి. ఉ. పుం.
గోవులను పోఁదోలునది. నక్క,
నక్క.
వ. అనుటయు నాపగానందనుం డేత
త్ప్రయోజనంబైన వ్యాఘ్ర గోమాయు
సంవాదంబును నితిహాసంబు గలవా
కర్ణింపుమని యుపన్యసించె. శాంతి.3.53.

**గోము** దే. వి.
సౌకుమార్యము, మార్దవము.
సీ. .. బహుగుణంబైనను ...
పరికించి గోమునబ్బై ...
దేహ. విరా. 1 101.

ఉం. గోమునఁ బెరిగిన వాఁడు మ,హా మానోదగ్ర చిత్తుఁ డగుటను సం, గ్రామంబున కలఁకఁడు,ద్దామ భుజా వీర్య దుర్మద స్ఫురితుండౌ. ద్రోణ. 3 191.

**గోముఖము** సం. వి. అ. పుం. న. వాద్య విశేషము.
వ. ... శంఖ భేరీ పణవ గోముఖ ప్రముఖ తూర్యంబులు దిక్కులు పిక్కటిల్లఁ జెలంగె. శల్య. 2.185.

**గోముఖుఁడు** సం. వి. అ. పుం. క్రోధ గణాధిప సంభవుఁడు ఆది. 3.80.

**గోయజనము** సం. వి అ న. గోయజ్ఞము. అను. 2.469.

**గోయజ్ఞము** సం. వి. అ. పుం. గోవులను దానము చేయుట - గోయజనము.
ఉం. ... గోయజ్ఞములుసేసి ఏధి నడపె నింద్రుఁ డమలచరిత్రా. అను. 2.472

**గోరక్షకుఁడు** సం వి ఇ (అ. క్షిత్రా. అ) గోవులను రక్షించువాఁడు.
కం. విను కర్షకులును వణిజులు, ననఘా గోరక్షకులు ధరాధిపనకున్, ధన మొదఁగూడెడు చోటుల, ననేక విధములకు నెల్ల నాద్యస్థలముల్. శాంతి. 2.39.

**గోరథము** సం. వి. అ. పుం. ఒక పర్వతము, గిరివ్రజము చుట్టు నున్న యైదు పర్వతములలో నొకటి.
ఉం. గోరథమును ఋషభము, వైహారము ఋషిగిరియుఁ జైత్యకాద్రియు ననఁగా, భూగిరులేను దీనికి,శూర ఘటులు ప్రోలుఁగావి చుట్టును నుండున్.
వ. దాననచేసి యిప్పురంబు గిరివ్రజంబు నాఁ బరఁగె. సభా. 1.174, 175.

**గోరసము** సం. వి. అ పుం. ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి.
వ. ..సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంకల్పించిన సమయంబున సముపార్జితంబులగు పదార్థంబు లన్నియు నన్నుల వశంబు సేయుచు వారలకు గోరసంబులు మిక్కిలి సలుపు చుండు. విరా. 2 2, అను. 5.55.

**గోరు** దే. వి. ఔ. ఇది 'గీఱు' అను ధాతువునుండి యేర్పడి యుండ వచ్చునేమో గాని సంస్కృత 'ఖుర' శబ్దము నుండిగాని, ప్రాకృత 'ఖోరు' శబ్దము నుండిగాని పుట్టినదని చెప్పుట సంస్కృతమునందలి మిక్కిలిమార్పు యుండవచ్చును.
బహు. గోళులు, గోళ్ళు, గోళ్లు.
నఖము.
ఆ. సుతుని మాట సరకుగొనమి దుష్టులలి పెట్టి పుడక గోరు పిసుకఁ ద్రిప్పఁ గఱవ మరగు టుడియ కాలాస్తమయ సమయమునఁ భానుఁ జూచు చాయుచుండు. అను 4.90
సీ. గోటఁ బోఁజినమాడ్కిఁ గొన్నిటిఁ జిక్కఁ నొడఁబాయఁగా వ్రయ్యల వాపి పాపి. విరా 4 35.
మ. పెలుచన్ గోళుల నొత్తి యగ్గజముఁ దాఁకెలున్ ఘనాభ మూర్ఛం బొరలన్ వెసనెత్తి అను. 1.235.

బులు పరుసన నాటనేసియు. ఉది 6 28.

వ. ... కపిల యనుదానిఁ నమృతం బును ... బ్రాహ్మణు లను ఘృతాచీ మేనకాపంబయిన యప్సరసలను బుట్టిరి. ఆది. 8.65

సీ. ... గోవృషముకు గుట్టెడువాఁడు ... ఘాతియగు ... నధో గతి కరుగువారు. అను. 2.62.

స్త్రీ.

1. ఆవు.

వ. ఒక భార్గవునకు ... నొక్క మహిమ్మ ... సౌజన్యంబునను గోనక్కుర యొసం గిన నమ్మునిఁ తన గోవు నయ్యోషధి మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయునై యొక్క వృషభంబు పొందుపదసి గర్భిణియై ... అను 3.63.

2. భూమి.

సీ. ... మహి యది ... జెంది యెత్తుటను గోవించుఁ ... శాంతి. 6.432

పుం. స్త్రీ.

... ణము

కం. గోవులు సూర్యుని యుత్తుల, గోవుల ... గోదానపరుల్, ... సూర్యనప్రపరై వెలుఁ గుదురిట్ల చెప్పు నాగమ ... అను. 2.461.

**గోవృషము** సం. వి అ. పుం.

1. శ్రేష్ఠమైన ఎద్దు. ... ఇక్కడ 'గో' శబ్దము వృషభ వాచ కము. వృషభశబ్దము శ్రేష్ఠవాచకము. ఇది కృపుని ధ్వజచిహ్నము.

సీ. కనక గోవృష సాంద్ర కాంతి పరిస్ఫుట,ధ్వజ సముల్లాసంబువాఁడు కృపుఁడు. విరా. 5.4; ద్రోణ. 3.233

2. ఒకానొక దేశము ఈ దేశాధిపతి ధర్మజుని రాజసూయమునకు వచ్చెను. సభా. 1.283.

# గౌ

**గౌణము** సం. విశే. (అ. ఈ. అ.) గుణ సంబంధమైనది

**గౌతమ గోత్రము** సం. విశే. గౌతమఋషి సంప్రదాయము. తిక్కన గారి గోత్రము ... జనకమహారాజ గోత్రమును ఈ గోత్రమునకు ఋషులు. (1) అంగీరసుఁడు, (2) ఆయాస్యుఁడు. (3) గౌతముఁడు.

సీ. మజ్జనకుండు సమ్మాన్య గౌతమ గోత్ర మహితుండు భాస్కరమంత్రి ... విరా. 1.10.

**గౌతమి** సం వి. ఈ. స్త్రీ.

1. గౌతమవంశమునఁ బుట్టినది. ద్రోణుని భార్య, కృపాచార్యుని చెల్లెలు – కృపి, అశ్వత్థామ తల్లి.

2. ఒక బ్రాహ్మణ స్త్రీ (చూ. గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు సంవాదము) అను. 1.5. మొ. 42 వఱకు.

**గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు సంవాదము** సం. వి. అ పుం.

ఒక ఇతిహాసము. యుద్ధానంతరము పశ్చాత్తాపపడు ధర్మజునకు భీష్ముఁడీ

